## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120035038,2990100051686

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

కవిరాజ శిఖామణి

నన్నెచోడదేవకృత

# కుమారసంభవము

(సంజీవని వ్యాఖ్యా సమేతము)

ప్రథమ భాగము

(1-6 ఆశ్వాసములు)

వ్యాఖ్యాత

డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావు,
ఎం.ఎ., పిహెచ్.డి.

రాజమహేంద్రవరము




తెలుగు విశ్వవిద్యాలయము

పబ్లిక్ గార్డెన్స్ నాంపల్లి

హైదరాబాదు-4

1994

# విషయ సూచిక

ఆచార్య పేర్వారం జగన్నాథం
ఉపాధ్యక్షులు

తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాద్

# ముందు మాట

తెలుగులో ఉన్న కొన్ని కావ్య ప్రబంధాలు అచ్చమైన తెలుగు పదాలతో, మాండలికపద ప్రయోగాలతో విలసిల్లుతున్నాయి. కొన్ని ప్రబంధాలు క్లిష్టమైన పదాలతో ఉండి ఇప్పటికి పాఠకులకు అర్థతాత్పర్యాలు తెలియని పరిస్థితి కొనసాగుతున్నది. వాటికి ఇంతవరకు వివరణతోడి వ్యాఖ్యానాలు వ్రాయనందున, ప్రముఖ కావ్య ప్రబంధాలు సాహిత్యాభిమానులకు దురవగాహంగా మిగిలిపోయినాయి. వాటిని అధ్యయనం చేయడానికి ఇప్పుడున్న తెలుగు నిఘంటువులు చాలవు. ప్రబంధాల అంతరార్థాన్ని అవగాహన చేసుకోవడం దుస్సాధ్యంగా ఉంటున్నది. అర్థవివరణలతో సహా కావ్యార్థాన్ని తెలుసుకోగల పండితులు దేశంలో కొందరే ఉన్నారు. వారు ఈ కావ్య ప్రబంధాలకు సరళమైన శైలిలో కావ్య పఠనాసక్తిని పెంపొందించే విధంగా వ్యాఖ్యానాలు విరచింపగల సమర్థులు. అట్టి పండితుల సహాయ సహకారాలతో తెలుగులోనే క్లిష్టమైన ప్రబంధాలకు వ్యాఖ్యానాలు రచించే ప్రణాళికను 'వ్యాఖ్యాలహరి' పేరుతో తెలుగు విశ్వవిద్యాలయం ఇటీవల చేపట్టింది, వ్యాఖ్యానాలు అవసరమున్న కావ్యాలను ఉపసంఘం ద్వారా ముందుగా ఎంపిక చేసి వాటికి వ్యాఖ్యానం వ్రాయగల పండితులను ఎంపిక చేయడం జరిగింది. ఇట్లా దేశంలో ఉన్న సుప్రసిద్ధ పండితులకు వారు వ్యాఖ్యానాలను వ్రాయగల ప్రబంధాలను కేటాయించి అర్థ తాత్పర్యాలతో సహా, వ్యాఖ్యానాలు రచింపవలసినదిగా కోరినాము. వారు దయతో అంగీకరించినారు. వారికి తెలుగు విశ్వవిద్యాలయం కృతజ్ఞతాభివందనాలు సమర్పిస్తున్నది.

మా కోరికను మన్నించి డా. జొన్నలగడ్డ మృత్యుంజయరావు గారు నన్నెచోడుని 'కుమార సంభవం' కావ్యానికి సరళవ్యాఖ్యానం రచించి ఇచ్చినారు.

దానిని రెండు భాగాలుగా ప్రచురిస్తున్నాం. ప్రస్తుతం 6 అశ్వాసాలు గల మొదటి భాగాన్ని పాఠకుల ముందుంచుతున్నాం.

ఇది పాఠకుల మన్ననలకు పాత్ర మవుతుందని ఆశిస్తున్నాం. మేము ఇదివరకే ఈ ప్రణాళిక క్రింద ప్రచురించిన కాశీఖండం జనామోదాన్ని పొందింది. భీమేశ్వర పురాణము. శివరాత్రి మాహాత్మ్యము ప్రచురణలకు సిద్ధంగా ఉన్నవి. అంతేకాక తెలుగు విశ్వవిద్యాలయం ఇటీవల అలబ్ధ అముద్రిత గ్రంథ ముద్రణ ప్రణాళికలను చేపట్టి సుప్రసిద్ధ కావ్యాలను ప్రచురించి పాఠకలోకానికి అందిస్తున్నది. వాటి ప్రయోజనాన్ని గురించి పలువురు ప్రముఖులు శ్లాఘించినారు.

ఇట్లాగే వరుసగా క్లిష్టమైన తెలుగు కావ్య ప్రబంధాలకు వ్యాఖ్యానాలు వివరింపజేసి పాఠకుల ముందుంచుతామని మనవిచేస్తున్నాను. రసజ్ఞలోకం సమాదరిస్తుందని ఆశిస్తున్నాను.

భావ. కార్తిక పూర్ణిమ
తేది : 18-11-94.

(పేర్వారం జగన్నాథం)

# పీఠిక

ఆంధ్ర కావ్యములలో నన్నెచోడుని కుమారసంభవమువలె విద్వద్విమర్శకుల తర్జనభర్జనలకు గుఱియైన కావ్య మింకొకఁడు లేదనిన అతిశయోక్తి కాదు. ఆ తర్జన భర్జనలన్నియు నన్నెచోడుని కాలమునుగూర్చియే. కాని తత్కావ్యస్థ విషయమునుగూర్చి యంతగాఁబట్టించుకొన్నవారు పెక్కురు లేరు. అల్పసంఖ్యాకు లున్నను వారు తమకై తాము తత్కావ్యమునందలి కతిపయ పద్యములకు సుష్ఠుపాఠములను నిర్ణయించుకొని యర్థ నిర్ణయము చేయ యత్నించిరే కాని, మను వసుచరిత్రాది కావ్యములకు వలెఁ బ్రతి పదార్థ తాత్పర్య విశేషాంశములతోఁ గూడిన సమగ్ర వ్యాఖ్య వ్రాపి లోకమునకుఁ దెల్లముసేయు ప్రయత్నమును జేయరైరి. శ్రీ నేలటూరి వేంకట రమణయ్య, శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య ప్రభృతు లొకరిద్ద ఱట్టిపనికిఁ బూనినను నది నాలుగైదాశ్వాసముల దాఁటిపోలేదు. అట్టి యతిజటిలమైన కావ్యమును వ్యాఖ్యానించు భాగ్యము నాకుఁగలిగినందుల కానందించుచు, నా భాగ్యమును నాకుఁగలిగించిన తెలుఁగు విశ్వవిద్యాలయమువారి కనేక కృతజ్ఞతాభివందనముల నర్పించుచున్నాను.

నన్నెచోడుని కాలమునుగూర్చి యెన్ని తర్జనభర్జనలు జరగినను, నే యొక్కరును నిందనుక నాతని కాలమును గచ్చితముగాఁ దేల్చినవారు లేరు. ఈ గ్రంథమును దొలుత వెలుఁగులోనికిఁ దీసికొనివచ్చిన శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగా రతఁడు క్రీ.శ. 940 ప్రాంతమువాఁ డనియు, నందుచే క్రీ.శ. 1026 ప్రాంతమువాఁడును, నాదికవి యని యెల్లరచే నంగీకరింపఁబడినవాఁడును నగు నన్నయకంటెఁ బూర్వుఁడై యాదికవి యనఁదగినవాఁడనియు నిర్ణయించిరి. శ్రీ వీరేశలింగము పంతులుగారు క్రీ.శ. 1150-70 ప్రాంతమునసుండి యుండునని నిర్ధారణము చేసిరి. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు క్రీ.శ. 1120 ప్రాంతమువాఁడని నిర్ణయించిరి. శ్రీ శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారు 'తిక్కన కనంతర మఱువది డెబ్బది సంవత్సరములవఱకుఁ జోడరాజుల శాసనములు కనుపట్టుచున్నవి కావునఁ త్రయోదశశతాబ్ది చతుర్థపాదమో, చతుర్దశ శతాబ్ది ప్రథమపాదమో నన్నెచోడునిచే వెలసియుండు'నని నిర్ణయించిరి. శ్రీ చాగంటి శేషయ్యగారు నన్నెచోడుని కాలము క్రీ.శ. 1028-1078 అయి యుండు నని యభిప్రాయపడిరి.

ఈ పండితులలో యథార్థ నిర్ణయమునే మనసునందుంచుకొని కొందఱును, నన్నెచోడు నెట్లయినను నన్నయ భట్టారకునకుఁ బూర్వపువానినిగాఁ జేయవలయునని కొందఱును, నన్నయకుఁ గొంచెముకాలము తరువాతివానినిగాఁ జేయవలయునని కొందఱును దమ వాదోపవాదములను సాగించినట్లు కనుపట్టుచున్నది.

ఈ కవి కాలనిర్ణయమునకు గ్రంథమున మనకు లభించిన యాధారములు మూఁడు.

1. ఇతఁడు కరికాలచోడుని వంశములోని వాఁడనుట,

2. తండ్రి పాకనాటిలోని యిరువదియొక్క వేయిటి కధీశుఁడైన చోడబల్లి యనియుఁ, దాను టెంకణాదిత్యుఁడ ననియుఁ, దల్లి హైహయాన్వయ సంజాతయైన శ్రీదేవి యనియుఁ జెప్పికొనుట.

3, జంగమ మల్లికార్జునదేవుని శిష్యుఁడననిచెప్పికొని తన గ్రంథము వాతనికే కృతి యిచ్చుట.

నన్నెచోడుఁడు నన్నయకంటె మిక్కిలి పూర్వుఁడని సిద్ధాంతముచేయుటలో శ్రీ మానవల్లి రామకృష్ణకవిగా రుదాహరించిన యుపపత్తులు రెండు తెగలకుఁ జెంది యున్నవి. మొదటిది శాసనప్రమాణము. రెండవది భాషాప్రాచీనత.

1, శాసన ప్రమాణము : ఆయన పేర్కొన్న శాసనములు మూఁడు.

కుడుంబాలూరుశాసనము : ఈ శాసనములో క్రీ.శ. 900_950 నడిమి కాలమున నున్న విక్రమకేసరి యనునొక చోళరాజు మల్లికార్జునుఁడనెడి యొక యోగిని గౌరవించి యాయనపేర నొక మఠమును గట్టించినట్లు కలదఁట.

బీచుపల్లి శాసవము : ఈ శాసనములోఁ జోడబల్లిదేవుఁ డనెడి యొకరాజు క్రీ.శ. 902 వ సంవత్సరములోఁ గృష్ణాతీరమున విశ్వనాథదేవాలయమునకు భూదాన మిచ్చిన ట్లున్నదఁట.

పేరులేని మఱియొక శాసనము : నన్నెచోడుఁడను నొకరాజు పశ్చిమ చాళుక్యులతోడి యుద్ధమున క్రీ.శ. 940 వ సంవత్సరములో నిహతుఁడయినట్లు కలదఁట.

ఈ మూఁడు శాసనములలోని పేర్లును గ్రంథములోని తండ్రికొడుకులయు, గురుశిష్యులయుఁబేర్లతో సరిపోవుచున్నవి. కనుక నా ముప్వురే యీ ముప్వురనియు క్రీ.శ. 940 లో యుద్ధమునఁ జనిపోయిన నన్నెచోడుఁడే యీ గ్రంథకర్తయనియుఁ గవిగారి సిద్ధాంతము.

## ఖండనము

ఈ సిద్ధాంతము సూక్ష్మవిమర్శనమునకు నిలుచునది కాదు. చోళరాజులలోఁ జోడబల్లి, నన్నెచోడుఁడు ననుపేర్లు గలవారు పెక్కురు గలరు. అట్లే శైవ మఠాధిపతులలో మల్లికార్జునుఁడను పేరు గలవారును జాలమంది కలరు. అందుచే శాసనము లందుఁ బేర్కొనఁబడిన యీ ముప్వురిపట్ల గ్రంథమునఁ బేర్కొనఁబడినవారికిఁగల సంబంధము - అనఁగాఁ బితాపుత్త్ర సంబంధముగాని, గురుశిష్య సంబంధము గాని స్థాపితమగువఱకు వారే వీ రనుట పొసఁగదు.

అట్టి సంబంధమును స్థాపింపఁగల శాసనములు రెండు మాత్రమే కలవు.

1. పెద చెరుకూరు శాసనము : నన్నెచోడుని కాలనిర్ణయ విషయమున నీ శాసనమునకుఁగల ప్రాధాన్యము మఱి దేనికిని లేదు. దీనిని వేయించినవాఁడు మల్లిదేవుఁడను చోళరాజు. ఆ గ్రామమున వేంచేసియున్న భీమేశ్వర స్వామికి బరిదపూండి యను గ్రామము నీ చోళరాజు దానమిచ్చుట యీ శాసనవిషయము. ఆ దాన మప్పటి కాకతీయ చక్రవర్తి యగు గణపతిదేవుని పుణ్యప్రాప్తి కొఱకు నీఁబడినట్లు కలదు. కావున నీ శాసనము క్రీ.శ. 1198-1260 నడుమఁ బాలించిన గణపతిదేవుని నాఁటిది. అది యాతని చరమదశలో వ్రాయఁబడినదని కూడఁ దెలియుచున్నది. దీని కాధారము పెదచెరుకూరు రెండవ శాసనము. అదియు నీ మల్లిదేవునిదే. ఇందు గణపతిదేవుని ప్రశంస లేదు. గణపతిదేవుని యంత్యకాలమున నతని సామంతులు స్వతంత్రు లయినటు లైతిహ్యము గలదు. అది చారిత్రక సత్యము. దాని నీ శాసనముతో సమన్వయింపఁగా మొదటి శాసనమునాఁటికి సామంతుఁడై యుండిన మల్లిదేవుఁడు రెండవ శాసనమునాఁటికి స్వతంత్రుఁ డాయెనని యనుమేయము. కాఁగా నీ మొదటి శాసనము క్రీ.శ. 1250 ప్రాంతమునఁబుట్టియుండవచ్చును. అం దీ మల్లిదేవుని వంశవృక్ష మిటు లున్నది.




ఈ వంశములోఁ జోడబల్లి కుమారుఁడు నన్నెచోడుఁ డొకఁడు గలఁడు. అతఁ డీ శాసనదాతకైదు తరములవాఁడు. పురావస్తు పరిశోధన శాఖ వారి సూత్రము ప్రకార మొక్కొక్క తరమునకు 25 సంవత్సరముల చొప్పున లెక్కించుచుఁ బోఁగా, నన్నెచోడుఁ డీతనికి 125 సంవత్సరముల పూర్వుఁడు. అనఁగా క్రీ. శ. 1125 ప్రాంతము వాఁడు. ఈ శాసనముతప్పఁ జోడరాజుల శాసనములలోఁ జోడబల్లి నన్నెచోడులకుఁ బితాపుత్ర సంబంధమును నిరూపించు శాసనమే లేదు.

2. కొప్పరపు శాసనము : దీని దాత చోడబల్లి. ఈతఁడు సోమేశ్వరమను గ్రామమును ధృతకాలాముఖ వ్రతుఁడును, తత్త్వవేత్తయు నగు మల్లికార్జునున కర్పించిన ట్లిందుఁ గలదు. క్రీ. శ. 1115 లోఁ జోడబల్లిచే సత్కృతుఁడైన మల్లికార్జునయోగి క్రీ. శ. 1125 - 30 ప్రాంతమున నన్నెచోడునిచేత గ్రంథప్రదానరూపమున సత్కృతుఁడగుట చూడఁగా నీ ముప్పురు పురుషులకును గ్రంథమున సూచింపఁబడిన సంబంధమే కలదని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. క్రీ. శ. 1115 ప్రాంతముననే తండ్రితోఁ బరిచయము గల మల్లికార్జునయోగి యీ కవికి గురువగుటయు సంగతముగనే యున్నది. ఇంతకంటెఁ బ్రబలాధారము దొరకి, యీ సిద్ధాంతమును బూర్వపక్షము చేయువఱకు నిదియే నిజ మనుకొనవలయును.

2. భాషా ప్రాచీనత :

ఇఁక భాషాప్రాచీనత యను విషయమున శ్రీ రామకృష్ణకవిగారు వ్రాసిన వాక్యము లివి – 'నన్నెచోడుఁడు నన్నయకంటెఁ బూర్వుఁ డని కుమార సంభవము నందలి వ్యాకరణ చ్ఛందో విశేషాత్మకాపూర్వపద ప్రయోగములు సహస్ర ముఖముల ఘోషించుచున్నవి.'

పయి సిద్ధాంతమున కీ క్రిందివి యుదాహరణము లగును.

1. ఛందో విశేషములు : పూర్ణార్ధ బిందుప్రాసము — దీర్ఘముమీఁది యరసున్నను నిండుసున్నచేసి సిద్ధపూర్ణానుస్వార పూర్వకాక్షరముతోఁ బ్రాసమును జెల్లించుట,

పోండిగ నగజ తపశ్శిఖి
మూండు జగంబులను దీవ్రముగఁ బర్విన బ్ర
హ్మాండము గాఁచిన కాంచన
భాండముక్రియఁ దాల్చెఁ దత్ప్రభాభాసితమై. 6-157

వీండేమి సేయుఁ బంచిన
వాం డుండఁగ నిక్కమునకు వధ్యుఁడు గా నా
ఖండలుఁడు గాక యేసిన
వాం డుండఁగ నేమిసేయు వరశర మనిలోన్.–మొదలగునవి, 10-155

నన్నయ గాని. తదర్వాచీనులుగాని యిట్టిప్రాసము నెక్కడను వాడియుండ లేదు. ఇట్టి ప్రాసమైత్రి నన్నయకుఁ బూర్వముండి యుండును. కావున నన్నె చోడుఁడు నన్నయకుఁ బూర్వుఁడు గావలయును. 'ఇది పూర్ణార్ధబిందుప్రాసముగాదు; కవి యీ శబ్దములను బూర్ణబిందుయుతములుగనే వాడె' నందురా, యప్పుడును నన్నెచోడుఁడు నన్నయకుఁ బూర్వుఁడే యగును. పూర్వమొకప్పుడు పూర్ణమై యుండిన బిందువు పిమ్మట ఖండబిందు వయినట్లు భాషాచరిత్రమునుబట్టి తెలియుచున్నది. నన్నయ నాఁటికే యర్ధబిందువు లయినవాని నీ కవి పూర్ణబిందువులుగా వాడినాఁడుగాన నిది యాతని ప్రాచీనతకే తార్కాణ మని శ్రీ మానవల్లివారి వాదము.

2. వ్యాకరణ విశేషములు :

వైరిపదము : తెలుఁగు విభక్తిప్రత్యయము చేరని కేవలసంస్కృత శబ్దముతో వికృతి శబ్దము సమసించుట వైరిపద మనఁబడును.

వాని కురియు ననేకాస్త్రవర్ష మెల్ల
నశ్రమమున విఖండించి యరద సూత
రథ్య కోదండ కేతన రాజితోడ
వర కిరీటంబు దెగి నేల నురుల నేసె. 12.52

చ. పుడమిపుఁడున్ ధనాఢ్యుఁడును భూరిబలుండును శౌర్యవంతుఁడున్
గడు దృఢపాణియున్నయినఁగాని యొడంబడ దశ్వమేధ మెం
దడరఁగఁజేయఁ దన్మఖమునందుల పుణ్యఫలంబు లందఁగా
నడుగడు గశ్వమేధమను నాజ్ఞిమొనంజని చావుసేగియే. 11.44

ఇది యీ గ్రంథమునఁ బెక్కుచోట్లఁ గలదు. ఈ వైరిపదము ప్రాచీన సంప్రదాయమునఁ గలదు. నన్నయయుఁ గఱకంఠుఁడు, ప్రాణగొడ్డము మున్నగు ప్రయోగములను జేయఁగా వానిని లాక్షణికు లనింద్యగ్రామ్యములుగా నంగీకరించిరి. వీనిని శివకవులు విశేషముగా వాడియుండిరి, ప్రాచీనకాలమున నివి విశేషముగా వాడుకలోనుండి క్రమముగాఁ దఱిగిపోయినవనియు. నన్నయ తననాఁటికి వ్యవహార మున రూఢమునై యుండుటచే వీనిని మాత్రమే ప్రయోగించెననియు గ్రహింపవల యును, నన్నయ ప్రయోగించిన వైరిపదములు కొలఁది. కుమారసంభవమున నవి కొల్లలు. నన్నయ ప్రయోగించినవి రూఢములు. నన్నెచోడునివి కల్పితములు. కావున వైరిపదము నింద్యముగాఁ బరిగణింపఁబడని కాలమున అనఁగా నన్నయకుఁ బూర్వ మీ గ్రంథము రచింపబడి యుండవలయును. ఇది కవిగారి వాదము.

3. ఈతఁడు కర్ణాటపదములను దన గ్రంథమున విరివిగా వాడియుండెను. ఉదా. వెంచలు = సరస్సులు. కొలవేళలు = వట్టివేళ్లు, కండవడము = తెర; ఇట్టి పదము లనేకములు. ఈ పదములనుబట్టి యాంధ్రకర్ణాటములు బాగుగా విడివడని కాలమున నీతఁ డుండియుండునని కవిగారివాదము. నన్నయకుఁ బూర్వ మీ పదములు కర్ణాటాంధ్రములందు సామాన్యముగా వాడఁబడుచుండె ననియుఁ, గావున నీ పదము

లను వాడిన నన్నెచోడుఁడు నన్నయకుఁ బూర్వుఁడే యయియుండవలయుననియుఁ గవిగారి వాదము.

4. క్రౌంచపద వృత్తము. ఈ వృత్తమును వాడుటలో నన్నెచోడుఁడు కర్ణాటలక్షణమును బాటించెననియు. నందువలన నితఁడు నన్నయకుఁ బూర్వుఁడనియు వీరి మతము. ఈతని క్రౌంచపదమునఁ బ్రతిపాదమును రెండు భాగములుగాఁ గంద సీసములందు వలె విభజింపఁబడి, కందమునవలెఁ బూర్వార్ధమునఁ బ్రాసముమ, ద్వితీయార్ధమున విశ్రమము మాత్రమే కూర్పఁబడియుండెను.

చంచల నాస్వాదించుచు లేఁదూం డ్లకరువు ప్రియులకు నలఁచుచు మై

5. అశ్రుత పూర్వశబ్దములు, అర్థములు :

1. కుందు ధాతువునకు 'కుందిల్లు' అను రూపము,

'వనటం గుందిల్లి చింతించుచున్',

2. సమూహము అను నర్థమున 'సమూహి'.

'శారద నీరద సమూహి చాడ్పునఁ బోలెన్',

3. గ్రహ శబ్దమునకుఁ దద్భవముగ 'గాము' గాక 'గ్రాము'.

'పఱతెంచి మగుడఁ బెట్టిన
నఱిముఱి వలి గ్రాము వట్టిన ట్లనలుఁడు మై',

4. పరభాగ శబ్దమునుండి 'పరభాగిల్లు' = అతిశయిల్లు అను నామధాతువును నిష్పన్నము చేయుట,

'ఉమా మహేశ్వరుల పురోభాగంబునం బరభాగిల్లుచు'. 10-112

ఇట్టివే కావడించు, ఎంగిలించు అను ధాతువులు

'ప్రమథగణము దక్షుఁ బడఁగొట్టి కట్టుచుఁ,
గాలుఁ జేయు బడియఁ గావడించి' 2-84

మొన లావులించి వాసనచల్లఁ బసిగొవి
లేఁ దేఁటి గము లెంగిలింపకుండ. 3-108

5. వెంటఁబడు, వెంబడించు - అను నర్థమున 'వెనుదెంచు'
'దిగ్గజేంద్రంబు వెనుదెంచెఁ దెరల గుహుఁడు,'

6. అలు అనుదానికి బహువచన రూపము. 'అందురు.'

బేటము = అనురాగము, కేనము = అసూయ, మేలిల్లు = శ్రేష్ఠము, కంఢ వడము = తెర, కొలవేరు = వట్టివేరు, గోమిని = లక్ష్మి, తలతంత్రము = సేన,

ఇవిగాక యసంఖ్యాకములైన కన్నడపదములు, తమిళపదములు విచ్చలవిడిగా వాడఁబడినవి. 'కరికాల చోడుఁ' డనుటకుఁ 'గరికాలచోడు' అని ప్రయోగించుట.

'జలధి మహీపతి మొలనూలుగాఁ జుట్టి.
పాలించెఁ గలిఁ గరికాలచోడు'

ఇట్టి విశేషరూపములు నన్నయ భారతములోఁగాని, తరువాతి గ్రంథములలోఁగాని కానరాకపోవుటకుఁ గారణము నన్నయనాఁటికిఁ దెలుఁగుభాష యన్ని విధముల సుపరి ష్కృతమై నియతి చెందినదనియు, నన్నెచోడునినాఁటి కట్టి సంస్కారము జరుగ లేదనియుఁ, దెలుఁగు సోదరభాషలైన ద్రావిడ కన్నడములతోఁ బూర్తిగా విడివడక యా భాషల పదములను, నర్థములను గొంతవఱకు వాడుకొనుచున్న కాలములో నీ గ్రంథము రచింపఁబడినదనియు రామకృష్ణకవి వాదము.

## ఖ ం డ న ము

1. పూర్ణార్ధబిందు ప్రాసము: ఈ ప్రాసమును బూర్వకవులుగూడ ముఖ్యముగా శివకవులు వాడినారు. శివకవులేకాక నాచన సోముఁడు సైత మీప్రాసమును వాఁడి నాఁడు. ఉదా :—

'ఎంచినప్రేమ నీ పదక మిమ్మని రుక్మిణి మున్ను వేఁడుడున్,
నోఁచినవారి సొమ్ములవి నోమనివారికి వచ్చునే యిలన్ ?'
కావున నిది ప్రాచీనతకు నిదర్శనముగాదు,

2. వైరిపదమును శివకవులు బాహాటముగా వాడినారు. పాల్కురికి సోమనలో నిట్టివి పెక్కులు గానవచ్చును. అంతమాత్రమునఁ బాల్కురికి సోమన నన్నయకుఁ బూర్వుఁడని చెప్పఁగలమా ?

3. కర్ణాట పదములు : వీనినిగూడ శివకవులు విరివిగా వాడినారు, శైవమతము నకుఁ గర్ణాటమే ప్రాధాన్యము వహించినది, తన్మతానుయాయులగు కవులందఱును గర్ణాటపదములను స్వేచ్ఛగా వాడిరి. ఇదియుఁ బ్రాచీనతకు లక్షణముగాదు.

4. క్రౌంచపద వృత్తము : ఈ వృత్తమును నన్నెచోడుఁడు వాడుట యాతని ప్రాచీనతను స్థాపింపదు సరిగదా, యది యాతని యర్వాచీనతనే స్థాపించును, నన్నయ తనకుఁ బూర్వము వాడుకలోనున్న వృత్తములను దన గ్రంథమున నుపయోగించుకొనియే యున్నాఁడు. అక్కర యిందుల కొక ప్రబలనిదర్శనము. నన్నయ తరువాతనే 'క్రౌంచపదము' వాడుకలోనికి వచ్చియుండును, నన్నెచోడుని కుమార సంభవమునం దక్కరలు లేకపోవుటయుఁ, గ్రౌంచపద ముండుటయు నీతఁడు నన్నయకుఁ దరువాతివాఁ డనుటను దెలుపుచున్నది. క్రౌంచపద వృత్తమునందలి మార్పు నన్నెచోడునకుఁ గల కర్ణాటభాషాపరిచయమును దెలుపును.

నన్నయకుఁ బూర్వపు శాసనములందును, నన్నయ భారతమునను గానవచ్చు మధ్యాక్కఱ యీతని కావ్యమున మచ్చున కొక్కటి యైనను లేదు, మధ్యాక్కఱ దేశి వృత్తము ; తరువోజాది దేశిచ్ఛందముల నెన్నిటినో యాదరించిన యితఁడు మధ్యాక్కఱ నాదరింపకపోవుటకుఁ గారణ మీతఁడు మధ్యాక్కఱయెడఁ గవుల కాదరము తగ్గిపోయిన కాలమున - ననఁగా నన్నయకుఁదరువాత నుండెననుటకుఁ బ్రబల నిదర్శనము.

పయి విచారణమునుబట్టి నన్నెచోడుఁడు పదునొకండవ శతాబ్దాంతిమ భాగము నందును, బండ్రెండవ శతాబ్ది ప్రథమ భాగమునను నుండియుండును.

ఇంచుమించు దేశమునందలి విద్వాంసులందఱు నిదే యభిప్రాయమునకు వచ్చియుండఁగా, నిటీవల నన్నెచోడుని గూర్చి యింకొక క్రొత్త యభిప్రాయ 'మశనిపాతము' వలె వచ్చిపడినది. అది యాతని కాలమునుగూర్చినది కాక, 'అహో ! మూలచ్ఛేదీ తవ పాణ్డితీ ప్రకర్ష' యనునట్లాతని కృతికర్తృత్వమునకే యెసరుపెట్టునట్టిది. 'నన్నెచోడుఁ డనువాఁడొకఁడు కుమారసంభవమును రచింపలేదు, మానవల్లి రామకృష్ణకవి గారే దానిని రచించి, ప్రసిద్ధికొఱకు నన్నెచోడునిపేర వెలయించినా' రనునది యీ యభిప్రాయము. ఈ యభిప్రాయమును లేవనెత్తినవారు డాక్టర్ కొర్లపాటి శ్రీరామమూర్తి, ఎం. ఏ., పిహెచ్. డి.; డి. లిట్. గారు, వారు తమ యభిప్రాయమును సిద్ధాంతీకరించు

టకు 'నన్నెచోడుని కుమారసంభవము ప్రాచీనగ్రంథమా?' యనుపేర నొక పెద్దగ్రంథమునే రచించినారు తమ వాదమున కుపోద్బలకముగా వారనే 'కోప' పత్త్రులను జూపియున్నారు.

శ్రీ శ్రీరామమూర్తిగారు తమ గ్రంథమును ప్రధానముగా నాలు భాగములుగా విభజించియున్నారు. అవి – 1. కుహనా వాదము, 2. కృతక రచనము, 2. కుటిల శృంగారము. 4. కూడలి స్థలము, 5. కృత్రిమ పాఠము, 6. కూట సృష్టి.

వీనిలోఁ 'గూటసృష్టి' యనుదానిని శ్రీ గుమ్మా శంకరరావుగారు నిశితముగా విమర్శించి శ్రీ శ్రీరామమూర్తిగారి వాదమును 'తెలుఁగు పరిశోధన' యను త్రైమాసిక పత్రిక నాలుగవదియగు ప్రథమ వార్షిక ప్రత్యేకసంచికలో ఖండించియున్నారు.

డా. రావుగారి ఖండనము సారాంశమిది.

1. మానవల్లివారు తమ దగ్గఱనున్న ప్రతినే తంజావూరి గ్రంథాలయములో దొంగచాటుగాఁ జేర్చిరని డా. మూర్తిగారనుటలో సత్యములేదు. అదియే సత్యమని యెంచునెడ, కందుకూరివారును వావిళ్లవారును, సరిచూచిన పండితులును నసత్యమాడిరని యెంచవలసివచ్చును. అందుచే నొక్క డా. కొర్లపాటివారి మాటలలోనే నత్యము లేదనిన సరిపోవును.

2. తంజావూరి గ్రంథాలయ ప్రతిపైఁగల ముఖపత్రము నవీనమయినంత మాత్రమునఁ బ్రతి నవీనము కానక్కఱలేదు. ప్రతి ప్రాచీనమే.

3. కుమారసంభవ కావ్యములోని యెన్నో పద్యములను దరువాతి కవులనుకరించిరని మానవల్లివారనఁగాఁ, గుమారసంభవ కర్తయే వారినందఱ ననుకరించెననియు, మూలములు సహజములు కాఁగా, ననుకరణములు కృతకము లనియు డా. మూర్తిగారు నిరూపింప యత్నించిరి. ఎప్పుడును మూలముకంటె ననుకరణమే మేలురముగా నుండుట సంభవము గావునఁ గుమారసంభవకర్త పద్యములే మూలములు. అనంతర కవులవే యనుకరణములు.

4. కుమారసంభవము నందలి కతిపయ ప్రయోగములు మానవల్లి వారి కవితలోఁగూడ నున్నట్లు డా. కొర్లపాటివారు చూపఱైరి.

5. రచనాకాల నిర్ణాయకములుగా భావించిన కుమారసంభవకావ్యస్థములగు 'కరి సిర మాడ', 'ద్వాదశార్ధార్ధనయను' ఇత్యాదిగాఁ గల పద్యములకు డా. శ్రీరామ మూర్తిగారు స్వానుకూలముగాఁ గావించిన వ్యాఖ్యలను డా. శంకరరావుగారు సమర్థముగా ఖండించి వారి యాలోచన యెట్లక్రమమో నిరూపించిరి.

6. ఇఁకఁ జక్రబంధముపై డా. మూర్తిగారు చేసిన వ్యాఖ్య యెట్లు కృతకమో, విలక్షణమో, యసమర్థనీయమో, యసంభవమో, యింద్రజాలమో, దుష్టమో, యసహజమో డా. శంకరరావుగారు చక్కఁగా నిరూపించినారు. బంధకవిత్వ మక్షరబంధమేకాని, యర్థబంధము కాదని తెలియమియే డా. కొర్లపాటివారి వాదమునకు మూలమని చెప్పినారు. అంతేకాదు! డా. మూర్తిగారి పద్ధతి ననుసరించినచో నదే పద్యమునఁ గవిత్రయము వారిని, గడకు డా. కొర్లపాటివారిని సైతము నెట్లు రప్పింప వచ్చునో ప్రదర్శించినారు.

డా. శంకరరావుగారు డా. కొర్లపాటివారి వాదమును ఖండించిన తీరు మిక్కిలి సమర్థనీయముగా నుండుటచే నేను మరలఁ దత్ ఖండన వ్యాపారమునకుఁ బూనుకొనఁ దలఁచుట లేదు..

శ్రీ సూర్యదేవర రవికుమార్ అనువారు వ్యాసనుధ యను వ్యాస సంపుటిలో 'నన్నెచోడుని కుమారసంభవము ప్రాచీన గ్రంథమే' యనుపేర నొకపెద్ద వ్యాసమును రచించి డా. శ్రీరామమూర్తిగారి సిద్ధాంతమును సమర్థనీయముగా ఖండించిరి.

వారి ఖండనపద్ధతి యిటు లున్నది.

1. తంజావూరి గ్రంథాలయమునందలి ప్రతి మానవల్లివారి ముద్రితప్రతి కనుసరణమని డా. కొర్లపాటివా రనుట సరికాదు.

2. మానవల్లి రామకృష్ణ కవిగారు తెలుఁగు భాషలో నాదికవిగాఁ బ్రసిద్ధి పొందిన నన్నయభట్టుమీఁద సదభిప్రాయము లేనివా రగుటచేత నన్నెచోడుని నన్నయకంటెఁ బూర్వకవిఁగా నిరూపించి నన్నయకు నాదికవి గౌరవము నణఁచివేయు కోరికతో నన్నెచోడుని కుమారసంభవమును గూటసృష్టిచేసి రను డా. శ్రీరామమూర్తి గారి యభిప్రాయమును శ్రీ రవికుమార్ మానవల్లి కవి రచనలనుండి వారి యుపన్యాసము నించుక విపులతరముగా నుదాహరించి మానవల్లివారికి నన్నయపై నెంతమాత్ర

మును ద్వేషము లేదని నిరూపించిరి. మానవల్లివారి యుపన్యాసమునందలి కేవలము నాలుగు వాక్యములనుమాత్ర ముదాహరించి వారికి నన్నయపై ద్వేషము గల దనుట డా. కొర్లపాటివారికిఁ దగదని శ్రీ రవికుమార్‌గా రనిరి.

3. మానవల్లి వారు ప్రకటించిన వల్లభామాత్యుని క్రీడాభిరామములో 'మా కరకౌశల మెక్కడను జూపఁబడలే'దని కవి గా రన్నదానికి డా. శ్రీరామమూర్తిగారు 'కవిగారు ప్రకటించిన యితర గ్రంథములలోఁ గవిగారి కరకౌశలము గలదని చేసిన కువ్యాఖ్యను శ్రీ రవికుమార్‌గారు నిరసించిరి.

4. మానవల్లివారు 17-4-1894 వ తేదీని కుమారసంభవ కూటసృష్టికి శ్రీకారము చుట్టిరని డా. శ్రీరామమూర్తిగారి వాదము. కాని యొక సంవత్సరమునకుఁ బిమ్మట 19-5-1895లోఁ గవిగారు తమ యుపన్యాసములో నన్నయకుఁ బూర్వము విక్రమార్కచరిత్రకర్త యగు కవివల్లభుఁ డుండినట్లు పేర్కొనిరే కాని నన్నెచోడుని యూసైన నెత్తలేదు. అంచుచే డా. శ్రీరామమూర్తిగారి వ్రాఁత నత్యదూరమని శ్రీ రవికుమార్‌గారి యభిప్రాయము.

5. తమ యుపన్యాసములో గర్భ బంధకవిత్వాదులను నిరసించిన కవిగారు డా. శ్రీరామమూర్తిగా రన్నట్లు కుమారసంభవకర్త యయియుండినచో, వానిని స్వీయ కావ్యములోఁ బ్రయోగించియుండరని శ్రీ రవికుమార్‌గారు డా. మూర్తిగారి వాదమును త్రోసిపుచ్చిరి.

6. కుమారసంభవమునందలి మొదటి సర్గరలో మ,ర గణములచే 'మా,రా.' (మానవల్లి రామకృష్ణ కవి) పేరును, చక్రబంధమున మానవల్లి రామకృష్ణ కవి పేరును నెట్లో సాధించిన డా. శ్రీరామమూర్తిగారి యసాధారణపాండిత్యమునకు, ననితరసాధ్య విమర్శనపద్ధతికి, నాశ్చర్య'కరకౌశలము'నకు శ్రీ రవికుమార్‌గా రబ్బురపడుచు, నవి సత్యేతరములని కొట్టివైచిరి.

7. మగణ రగణముల కూడికతోఁ గృతిని బ్రారంభించినచోఁ గృతికర్త శీఘ్ర మరణము నొందునని తెలిసిన కవిగారాగణములతోనే కుమారసంభవమును బ్రారంభించునంతటి యవివేకులా? అవి స్వనామధేయ సూచకములని మక్కువపడి మొదలిడిరన్నను, వారు తొంబదేఁడులకుఁబైగా జీవించుట కేమందు రని శ్రీ రవి కుమార్‌గారి ప్రశ్నము.

8. మానవల్లివారు కుమారసంభవమును దామే రచించినట్లు లోకు లనుకొను మాటల కిచ్చిన సవినయ సమాధానమున డా. శ్రీరామమూర్తిగారికి నక్కవినయమే గోచరించుటకు శ్రీ రవికుమార్‌గా రాశ్చర్యపడిరి.

9. కైపు, తరవారి మున్నగు పదము లర్వాచీనములనియు, వానిని బ్రయోగించిన నన్నెచోడుఁ డర్వాచీనుఁడే యగునని డా. కొర్లపాటి వారన, విమర్శకులలో నేకాభిప్రాయము లేని పదప్రయోగములనుబట్టి కవి కాలనిర్ణయమును జేయుట ప్రామాదిక మని శ్రీ రవికుమార్‌గారు త్రోసిపుచ్చిరి. అట్లే వివిధకవులు వివిధ రీతులలో రచించిన క్రౌంచపదవృత్తమును బట్టి కూడ నన్నెచోడుని కాలమును నిర్ణయించుట తప్పని శ్రీ రవికుమార్‌గారు నిర్ణయించిరి.

10. కుమారసంభవములోని పెక్కు పద్యములు ప్రాచీనాంధ్రకవుల పద్యములను బోలియున్న వనియు, నా ప్రాచీనుల పద్యములు సహజము లనియు, వాని ననుసరించిన కుమారసంభవ పద్యములు దోషభూయిష్ఠములగుటచేఁ గృతకము లనియు డా. శ్రీరామమూర్తిగారు నిర్ణయించిరి. అ నోటితోనే వారే మానవల్లివారి మహాప్రతిభావంతమైన పద్యరచనను బ్రశంసించిరి. అట్టి ప్రతిభా సంపన్నుఁడైన కవిగారే కుమారసంభవమును రచించియుండినచో, నందలి పద్యము లట్లు రసహీనములుగా, దోషభూయిష్ఠములుగా, నపప్రయోగములతోఁ గృతకముగా నుండు టెట్లు సంభవించుః నని శ్రీ రవికుమార్‌గారు ప్రశ్నించిరి.

11. డా. శ్రీరామమూర్తిగారు కుమారసంభవము కుటిల శృంగార సంభరిత మని చెప్పిరి, మానవల్లివారు వసుచరిత్రాది మహాకావ్యములలోని శృంగారమునే యసహ్యించుకొనినట్లు వారి యుపన్యాసమునందలి వాక్యములవలన విశదమగును. శృంగారరసమునెడ నట్టి దృష్టిగల మానవల్లివారు డా. శ్రీరామమూర్తిగా రన్నట్లు కుమారసంభవ కర్త యైనచో దాని నంత కుటిల శృంగార సంభరితముగా నెట్లు రచించియుందురని శ్రీ రవికుమార్‌గారి ప్రశ్నము.

పైని శ్రీయుతులు డా. గుమ్మా శంకరరావుగారును, సూర్యదేవర రవికుమార్ గారును డా. కొర్లపాటి శ్రీరామమూర్తిగారి 'నన్నెచోడుని కుమారసంభవము ప్రాచీన గ్రంథముగాదు; అది యత్యాధునికుఁడైన మానవల్లి రామకృష్ణకవి రచించినది' యను దుర్వాదము నెట్లు నిశితముగా ఖండించిరో చూపఁబడినది.

వారు స్పృశించిన విషయములను గూర్చి యిఁక నే నేమియు వ్రాయ నక్కఱలేదు.

పయి యిరువురును డా. శ్రీరామమూర్తిగారి వాదములోని కొన్ని యంశములను విపులముగను, గొన్నిటిని సంగ్రహముగను, నిరసించిరి. ఇరువురును డా. శ్రీరామమూర్తిగారి గ్రంథమునందలి కృతక రచనమను నంశము నే కారణముననో యంతగాఁ బట్టించుకొనరైరి.

అవి కృతకములు కావని సమర్థింపవచ్చును, నే నా ప్రయత్నమును జేయుదును, కాని యా పద్యములనన్నిటిని గృతకములు కావని నిరూపించుట కిటఁ జోటు లేదు. అట్లు చేయవలయునన్న మఱియొక బృహద్గ్రంథమునే వ్రాయవలసియుండును. అవసర మగుచో నట్టి ప్రయత్నమును జేయఁగలను. అందుచే నిట మచ్చున కొండు రెండు పద్యములను మాత్రము చూపి వానివిషయమున డా. శ్రీరామమూర్తిగారు భ్రాంతిపడిన విధమును, బ్రమాదపడిన రీతిని వివరించి వాని కృతకత్వమును బరాస్తము చేసి, తత్సహజత్వమును నిరూపింప యత్నింతును.

డా. శ్రీరామమూర్తిగారు సూరన యుదయనోదయమునందలి –

అలితతి నీలముల్, ముదురుటాకులు పచ్చలు, లేఁజిగుళ్లు కెం
పులు, దళరాజి వజ్రమయముల్, కలికావళు లాణిముత్తియం
బులుగాఁ బొసంగు చంగుఁజుని బొక్కన మెల్లను నాత్మలోన నిం
పులు వొదలించె రాజునకుఁ బూచి బెడంగగు పొన్న లున్నతిన్.

అను పొన్నచెట్లను వర్ణించు పద్యము నిచ్చి. కుమారసంభవకర్త దాని ననుకరించుచు మామిడిచెట్లను వర్ణించు నీ క్రిందిపద్యమును రచించెనని చూపిరి.

మొగడలు వజ్రముల్. విరులు ముత్తెము, లింపగు నున్పుఁగెంపులేఁ
జిగురులు పద్మరాగములు, చిల్కలు వైరిజరాజి, తుమ్మెదల్
నగరివు నీలజాలములు నాఁ దనరారె వసంతవల్లభుం
డగు వలరాజు పంచమణి హర్మ్యములోయనఁ జూతభూజముల్.

ఉదయనోదయ పద్యము హృద్యముగాదని యెవ్వరు ననరు. కాని కుమార సంభవ పద్యము హృద్యము గా దనుటకు సహృదయతా లోపము కారణమనవలయును.

డా. మూర్తిగారు కుమారసంభవమునందుఁ జేసిన యాక్షేపణములను జూపి వానికిఁ దగిన సమాధానముల నిత్తును.

"ఇందు రెండు 'అన' లు. ఇది రాజునకు ఇంపుకలిగించినది కాదు. రసజ్ఞులకును ఇంపు కలిగించునది కాదు."

పద్యమునఁ బ్రకరణమునుబట్టి యెన్ని 'అన' లైన నుండవచ్చును. 'మొగడలు ........ నగరిపు నీలజాలములు నాన్, 'పంచమణి హర్మ్యములో-యన' అను చోట్లఁ గల నాన్, అనన్ అనునవి యత్యంతము నావశ్యకము లయి సముచితముగా నున్నవి. అయినను 'అనుకరించుటవలని అనర్థకము' (అనుకరించుటవలని యనర్థము), 'ఆవశ్యకము లేదు (ఆవశ్యకత లేదు), 'ఒరయూరి కధిపతిని' అన్నది మాత్రము బిరుదముకాదు, ఇదమిత్థము', 'విషయీ విషయ విపర్యయము' పుట 67 (విషయి నిషయ విపర్యయము) అనురీతిని విశేష్య విశేషణ భేదము తెలియక ఫెక్కువాక్య విన్యాసములు చేసిన వీ రా కుమారసంభవ కావ్యకర్త నధిక్షేపించుట !

"నున్పుఁగెంపులేఁజిగురులు పద్మరాగములు' అనునెడ 'కెంపు' విశేషణము ఇంపు గలిగించునది కాదు."

పద్మరాగముల వర్ణ మెఱుపు కావున 'లేఁజిగురులు' ఎఱ్ఱనివే యైనను మరల దానికి 'కెంపు' = ఎఱ్ఱని అను విశేషణముః బ్రయోగించుటచేఁ గెం పధికమై మఱింత యింపును గలిగించుచున్నది.

"మన్మథునికి నవరత్నమయ సౌధములనుగాక పంచమణి హర్మ్యములను మాత్రమే ప్రసాదించుటకు హేతువు పరికరము లయిదగుట మాత్రమే. పంచమణి హర్మ్యములు ప్రసిద్ధముకాదు."

ఏల ప్రసిద్ధముకాదు ? అయిదు మణులతో నిర్మించిన హర్మ్యము లుండఁ గూడదా ? కేవల మొక్కమణితో నిర్మించిన హర్మ్యముగూడ నుండవచ్చును, ఈ యధిక్షేపమును సూరన పద్యమునందు వీ రేల చేయలేదో ! అచ్చటను నయిదేమణులు చెప్పఁబడినవి, అంగజుని బొక్కసమున నవరత్నము లుండవలదా ?

"మామిడి మొగ్గలు వజ్రములు, మామిడి పువ్వులు ముత్యములు అనిపించుట సహజముకాదు."

ఏలకాదు ? సహజమేకాదు. సముచితమును.

"ఫలములు లేకుండఁ జిలుకలు వ్రాలుటకూడ సహజముకాదు."

ఫలరహితములైన మామిడిచెట్లనే కవి వర్ణించెనని యేల యనుకొనవలయును? చిలుకలు వ్రాలెనను టయవి సఫలము లనుటకే జ్ఞాపకము.

"వలరాజు వసంతవల్లభుఁడఁట ! వలరాజు వసంత సఖుఁడు కాని వసంత వల్లభుఁడు కాఁడు. వల్లభశబ్దము మిత్ర వాచకము కాదు."

వల్లభశబ్దమున కొక్క 'భర్త' యను నర్థము మాత్రమే కలదని వీరి భ్రాంతి. దానికిఁ బ్రియుఁడు, ఇష్టుఁడు అను నర్థములే నిజమైన యర్థములు. భర్త యెట్లును బ్రియుఁడు గనుక నా యర్థములును దరువాత వచ్చినవి. ఇష్టుఁ డన మిత్రుఁడే కదా! అందుచే వసంతవల్లభుఁ డనఁగా వలరాజే యగును.

"నీలములకు 'నగరిపు' విశేషణము ప్రాసమాత్ర ప్రయోజని."

ఇది యెంత హాస్యాస్పదము, నన్యాయకృతమునైన మాట! నగరిపు = ఇంద్ర. వీరి దృష్టిలో నీలముల కింద్ర విశేషణము వ్యర్థమన్న మాట! ఇంద్ర నీలము అను మాటయే వీరు వినలేదన నాశ్చర్యముగా నున్నది! ఒక మహాకవిని బట్టుకొని 'యీ పదము గణమాత్ర ప్రయోజని. ఇది ప్రాసమాత్ర ప్రయోజని' అని నిరసించుట సంగతమా ?

ఈ విధముగాఁ గుమారసంభవ పద్యము కృతకము గాదనియు, నత్యంతము సహజసుందర మనియు నిరూపింపఁబడినది.

ఇట్లు వీరు చూపిన ప్రతి పద్యమును సహజసుందర మని నిరూపింపనగును.

ఇప్పుడు వారు కొన్ని పద్యములలో నెడనెడ చేసిన యాక్షేపములకు సమాధానము లీఁబడును.

'బండతలయు మోఁకాలు ముడివెట్ట' (8-135) మోఁకాలికి బట్టతలకు ముడివెట్టుట అను పలుకుబడి ప్రసిద్ధము. మోఁకాలికి బండతలకు ముడివెట్టుట అను పలుకు బడి అప్రసిద్ధము.'

ఇచ్చట బండతల యనఁగా బట్టతల యనియే యర్థము. సూర్యరాయాంధ్ర నిఘంటువు బండతల యనుదానికి బట్టతల యనునర్థమునిచ్చి దాని కీ పద్యమునే యుదాహరించినది.

"అలరు పుష్పము లమ్మ లని తలంచి' 4-75) 'మెలఁతల తలవెంట్రుకలఁ బొంది కందెడు నలరుపుష్పము' అనుట హృద్యముగాదు. అంతేకాదు అలరు పుష్పము లనుట అగ్గి నిప్పు లనుట."

అలరు శబ్దమునకుఁ బూ వనియే కాక విరియు, విచ్చు, ఒప్పు అనునర్థములును గలవు. అలరుపుష్పము లనుచో అలరు ఉదంతతద్ధర్మార్థక విశేషణమై యలరునట్టి (విచ్చునట్టి) పుష్పము లను నర్థము గలిగియున్నది.

"తలిరాకునైనఁ గదల్పనోపని మందపవనుండు - ఇట్లనుట తర్కసహము గాదు."

తలిరాకులనైన ననుటచేఁ బవనుని మాంద్యాతిశయము ద్యోతితమయి, యట్టి వాఁడు పెనుప్రాపుగా నీశ్వరునిపై నెత్తిపోవు మన్మథుని యవివేకమును మఱింత స్పష్టపఱుచుచున్నది.

డా. శ్రీరామమూర్తిగారి విమర్శ పద్ధతి కింకెన్ని యుదాహరణములు చూపవల యును? కుమారసంభవమునందలి కవిత డా. శ్రీరామమూర్తిగారి 'దుర్వ్యాఖ్యా విషముచే మూర్ఛిత' యైనది.

ఇది కుమారసంభవకర్త మానవల్లి రామకృష్ణకవిగారే కాని నన్నెచోడుఁడు కాఁ డను 'మున్న కైపెక్కినట్టి తలంపుతో' వారుచేసిన విమర్శమని విజ్ఞులకుఁ దోఁపక మానదు.

'ఎన్ను - యెస్సు,' 'రిమ్మ' అను పదముల నాంగ్లభాషలోని 'Yes', Ri,m, అను పదములనుగా భావించి శ్రీ వేదాల తిరువేంగళాచార్యులుగారు నన్నెచోడు నాధునికునిగా నిర్ణయించిరని శ్రీ శ్రీరామమూర్తిగారు తమ కనుకూలురనుగా వారిని పేర్కొనిరి.

'కుమారసంభవమునందు 'యెస్' (6-21) అని యింగ్లీషుమాటను చోడుఁడు వాడినాఁడు; 'రిమ్మలు' (8-159) అనియు వాడినాఁడు. కనుక నతఁడు ఇంగ్లీషువారు మనదేశమునకువచ్చి వాళ్ళభాషను మనదేశమున ఆఁడువాళ్ళవరకు వ్యాపింపఁజేసిన తరువాతనే-అనఁగా క్రీ.శ. 1880 ప్రాంతములలోనే యుండవలసినవాఁడగును.' అని వేదాల తిరువేంగళాచార్యులుగారి అభిప్రాయము.

ఇంతకంటె హాస్యాస్పదము, నన్యాయమునైన మాట యింకొకటి యుండదు. ఎంత నవీనుఁడయినను నిటువంటి పౌరాణికమైన వస్తువును గైకొని కావ్యమును వ్రాయువాఁ డాంగ్లపదములను బ్రయోగించునా? ఒక మహాకవి యొక పదమును బ్రయోగింపఁగా, దాని యర్థము తెలియనప్పుడు నిఘంటుకారులు ప్రకరణమునుబట్టి దాని యర్థమును నిర్ణయించి యా పదమును నిఘంటువులోని కెక్కింతురు. ఈ సూత్రము ననుసరించియే ఎస్సనుపదమునకు 'తిరస్కార సూచకముగ ధ్వనిచేయుట' యను నర్థమును బండితులు నిర్ణయించిరి. రిమ్మల = రెమ్మల = ఉపశాఖలలో = అని కవిగారే యర్థము నిచ్చిరి.

ఆ పదములు కనవచ్చు తావు లివి,

తరువోజ. '....వలదని బుద్ధులు చెప్పఁ
బోయిన మా మాటఁబోవక మమ్ము
నేలిదముగఁజేసి యెస్సని వోయె (దు) 6-21

క. చెఱకునఁ బుచ్చక రిమ్మలఁ
గఱచిన రసమానరాని గతిఁ దరుణుల నెటు చే
వెఱ వాపక సంగతి కే
డ్తెఱ సేసి మనోరథములుఁ దీరునిఁ బడయన్, 8-159

ఇది మానవల్లివారి పాఠము. ఇందు మొదటిపాదమున యతిభంగమయినది. ఈ పద్యమునకు వావిళ్ళవారి ప్రతిలోఁ బాఠాంతరము గలదు.

క. చెఱకీనఁ బుచ్చ కఱిముఱిఁ
గఱచిన రసమానరాని గతిఁ దరుణులచేఁ
దఱ వాపక సంగతి కే
డ్తెఱసేసి మనోరథములు దీరుఁడు పడయున్,

ఈ పాఠమున 'రిమ్మ' గానరాదు.

ఇవిగాక శ్రీ శ్రీరామమూర్తిగారు కుమారసంభవకర్తపై నింకొక యభియోగమును మోపిరి. అది యాంగ్ల పదప్రయోగముగాక, యాంగ్ల పదబంధ భావము. ఆ.వె. 'అధిపుఁబాసినపుడ యలఁదురవలవదె

మెలుత మెట్టఁబడిన మీను వోలె,' 8-162

ఇందలి 'మెట్టఁబడిన మీను' అనునది యాంగ్లమునందలి 'Fish out of water' అనుదాని కాంధ్రీకరణమనియు, నందుచేఁ గుమారసంభవకర్త మిక్కిలి యాధునికుఁడనియు వారి వాదము. ఇది యెస్సు, రిమ్మ అను పదములకంటెను నతిముఖ్యమని వారి యభిప్రాయము.

ఈ యుపమానము తెలుఁగువారికిఁ గ్రొత్తకాదు. ఒక కుటుంబములోని యజమానుఁడు పోఁగానే, ఆ కుటుంబ సభ్యులు చెఱువులోని చేఁపలవలె బయటఁబడినారనుట తెలుఁగునాట సామాన్యముగా ననుమాట. అది యాంగ్లవాక్య భావానుసరణమని భావింపనక్కఱ లేదు.

ఒక భాషలోని భావ మింకొకభాషలో నుండఁగూడదని యేమున్నది? ప్రకరణములు తుల్యము లయినప్పు డన్నిభాషలలోను భావములు తుల్యములుగానే యుండును. అం దేమియు వింతలేదు. అంతమాత్రమున నా కవి నన్యభాషాభిజ్ఞునిగాఁ జెప్పవలను పడదు.

ఈ యుదాహరణమును జూడుఁడు.

ఆంగ్లమున at a stone's throw అను పదబంధము గలదు. దానికి ఱువ్విన ఱాయి పోవునంతదూరము అనఁగా సమీపమున అని యర్థము. His house is at a stone's throw = వాని యిల్లు ఱువ్వినఱాయి పోవునంతదూరమున -అనఁగా సమీపమున నున్నది. తెలుఁగులో 'అమ్ము వేటు దూరము' అని తత్తుల్యమయినది కలదు. 'ఱాయి' యైనను, 'అమ్ము' అయినను నొక్కటే కదా!

'వ. అమ్ము వేటు నేలకంటెను దూరంబుగాఁ జని........' వి.పు. 4-190.

ఇది యాంగ్లములోని పదబంధమునకుఁ దుల్యముగా నున్నదిగదాయని విష్ణు పురాణకర్తయగు వెన్నెలకంటి సూరన్నను (1480.90) మనదేశము నాంగ్లేయులు పరిపాలించిన కాలమునాఁటివాఁడని యనవచ్చునా? 'మెట్టఁబడిన మీను' గూడ నిట్టిదేయని గ్రహింపనగును.

కుమారసంభవము మానవల్లి రామకృష్ణకవిగారి రచన కాదనుట కింకొక బలవత్తమకారణము గలదు.

కుమారసంభవ పద్యములకు లఘుటీక వ్రాసిన మానవల్లివారు దశమాశ్వాసము నందలి 'సుజనజనైక భూషణము శూరత' అను 200 వ పద్యమునకు_ 'ఈ పద్యము లోని శ్లేషార్థము నాకు స్ఫురింపదయ్యె' నని వ్రాసిరి. వారే తత్కావ్యకర్త యయినచో నశ్లీల వ్రాయుదురు. అట్లు వ్రాయుటయును దాను గుమారసంభవ కావ్యమును రచింప లేదని లోకమును గట్టిగా నమ్మించుటకే యందురా వారి కొక నమస్కారము!

శ్రీ కొర్లపాటి వారు తమ విమర్శగ్రంథములో నన్నెచోడుని పద్యములందలి కృతకత్వమును నిరూపించుచుఁజేసిన విమర్శనమును గాకినాడ వాస్తవ్యులు పండిత విమర్శకులు శ్రీ కాశీభొట్ల సత్యనారాయణగారు పరాస్తము చేసినతీరును బరికింపుఁడు. వారి సుదీర్ఘ వ్యాసమునుండి యొకేయొక యుదాహరణము.

సురనది ఝషములు డిగ్గఁగ
శరనిధి కా శరధిలోని ఝషకము లెక్కన్
సురనది కి ల్లెడపడకయ
కురిసె మహావృష్టి గుండ్లు కూల్చినభంగిన్. 6_105

'ఎంత మహావర్షము కురిసినను ఆకాశగంగలోని చేపలు సముద్రములోనికి డిగుట సంభవ మేమోకాని సముద్రములోని చేపలు, ఆకాశగంగలోనికి ఎక్కుట అసంభవము. అందువలన ఇది కృతకము.' ఇది కొర్లపాటివారి యభిప్రాయము,

'ఈ వాక్యం వ్రాసిన పెద్దమనిషికి అసలు కవితాహృదయమే లేదంటే అబద్ధం కాదు. తొలిరాత్రి గదిలో స్తన శల్య పరీక్షనుచేస్తూంటే ఈ డాక్టర్నెందుకు కట్టు కొన్నానా అని వధు వేడ్చిందట. ఈ డాక్టరుగారిని చూచిన కవితా సరస్వతికూడా అంతే. 'నింగీ నేలా ఏక మయ్యాయి' అనే సామాన్యోక్తి కూడా తలకెక్కని ఈ

విమర్శకునకు అలంకారశాస్త్రం జోలెందుకు ? ఆకాశగంగలోని చేపలు సముద్రము లోనికి దిగుట సంభవమేమో_ అంటే అక్కడికి తా నాకాశగంగను చూచినట్లు, దానిని సిద్ధాంతీకరిస్తున్నట్లు మాట్లాడడం తమ బుద్ధివైశాల్యాన్ని ప్రదర్శించటమే. దీనికి మూలమని, సహజమని చూపబడిన ఉదయనోదయము నందలి పద్యములోని నాయిక కాళ్ళు చాపి పడుకొని ఆకాశాన్ని చూస్తూ ఏడుస్తోందేమో అనుకోవాలి. అలాకాకపోతే కంటినీరు చెవులవరకు ప్రాకటం, అవి కర్ణ పాథోనిధులు కావటం, అందుండి ఎదురెక్కిన చేపలా కన్నుండటం కుదరదు. ఈ పద్యం రుచించిన విమర్శకునకు ఆ పద్యం కృతకమైందంటే నాలుకయందున 'రుచి బొడిపులు' అరిగిపోవటమే కారణం.'

'కుమారసంభవకర్తకు సంస్కృతపదముల సరిగా నుపయోగించుటకానీ, కూర్చుటకానీ తెలియదు. నిరర్థకములు, అనర్థకములు, పునరుక్తములు.నగు పదములు. తగని వాక్యరచనలు, మాటల కక్కుఱితి, అపప్రయోగములు, చాలచోటుల నానాభాషా సాంకర్యము, అధికముగా పరభావచౌర్యము ఇత్యాదిలోపములు చాలా యున్నవి.' అను వేదాల తిరువేంగళాచార్యులవారి మాట యెంత అవిచారమూలకమో, యెంత యన్యాయమో విజ్ఞులెఱుఁగకపోరు. అయిన నొక ప్రశ్నము.

'శ్రీ మానవల్లివా రనినట్లు నన్నెచోడుఁడు నన్నయకుఁ బూర్వకాలమున నుండినవాఁడు కాఁడు. డాక్టర్ కొర్లపాటివా రనినట్లు కుమారసంభవము శ్రీ మానవల్లి వారి రచనయుఁగాదు. మీ రనినట్లు నన్నయ తిక్కనల నడిమికాలమువాఁ డయి యుండుచోఁ _ దరువాతవచ్చిన కవు లెవ్వరును దమ కావ్యములలోఁ బూర్వకవిస్తుతిలో నన్నెచోడుని బేర్కొనకుండుటకుఁ గారణమేమి ? నిజమే. అది యాలోచనీయాంశమే. అనంతర కవులలో నొక్కరు కాకపోయిన వేఱొక్క రెవ్వరయిన నట్టి మహాకవిని స్మరింపకుండుటకుఁ గారణము మృగ్యము. కాని యది కారణముగా నన్నెచోడు నత్యాధునికునిగా నిర్ణయించుట యన్యాయము. నన్నెచోడుని పదప్రయోగవైచిత్రి, విలక్షణమైన శయ్య యతఁడు ప్రాచీనకాలమువాఁడనియే ఘోషించుచున్నవి.

# కావ్య సమీక్ష

ఇఁక నీ విషయము నింతటితో నాఁపి కావ్యసమీక్షకు దొరఁకొందును. ఈ కావ్యమునఁ బండ్రెండాశ్వాసములు గలవు, ఒక్కొక్క యాశ్వాసమునందలి కథ యిది.

ప్రథమాశ్వాసము : 1, దక్షుని ప్రార్థన ననుసరించి యాదిశక్తి సతీదేవి యను పేర నతనికిఁ బుత్త్రికయై శివుని వివాహమాడుట. 2, అ దంపతులు గజరూపములను ధరించి క్రీడింపఁగా వారికి గజముఖుఁ డావిర్భవించుట, 3. దక్షుఁడు తన పుత్త్రికల నందఱను జూడనరిగి కశ్యప ప్రభృతి జామాతలచే సమ్మానితుఁ డగుట.

ద్వితీయాశ్వాసము : 1' దక్షుఁడల్లే శివునిగూడఁ జూడనేఁగఁగా నాయన తక్కిన యల్లురవలె మామను సత్కరింపకుండుట. 2. అందులకుఁ గుపితుఁడై దక్షుఁడు శివు నవమానింపఁ దలఁచి తానుజేయు యజ్ఞమున కతని నాహ్వానింపక తన కూఁతును మాత్రమే పిలిపించుట. 3, తనభర్త నాహ్వానింపమికి సతీదేవి తండ్రి నధిక్షేపింప, నతఁడు శివుని నిందించుట, అందుల కామె పట్టరానికోపమున యోగాగ్నియం దాత్మాహుతి చేసికొనుట,

4. గజాస్యుఁడు ప్రమథసహితుఁడై దక్షాధ్వరధ్వంసముఁ గావించి, దక్షుని బంధించి శివునికడకుఁ దెచ్చుట, 5, శివుఁ డతనిని క్షమించి యాగఫలము ననుగ్రహించి ప్రజాపతిగ నియమించుట,

తృతీయాశ్వాసము : 1. సతీదేవి హిమవంతునకుఁ గూఁతురై పుట్టుట, 2. హిమవంతుని కడకు నారదుఁడు వచ్చి పార్వతినిజూచి యామె యీశ్వరునకు భార్య యగునని చెప్పుట. 3, శివుఁడు తపస్సొనరింప హిమవత్పర్వతమునకు రాఁగా, హిమవంతుఁ డాతని పరిచర్యకై పార్వతిని నియోగించుట,

చతుర్థాశ్వాసము : 1. దేవతలు, తారకాసురుఁడు తమ్ముఁబెట్టు బాధలను బ్రహ్మతో మొరపెట్టుకొనఁగా నతఁడు పార్వతీ పరమేశ్వరుల కుమారుఁడు తారక సంహార మొనరింపఁగలఁడని యుపదేశించుట, 2. పార్వతీశ్వర సంయోగమును గల్పింప నింద్రుఁడు మన్మథుని నియోగించుట, 3, మన్మథుఁడు సపరివారముగా నీశ్వరుని తపోవనమున కేఁగుట, 4, వసంతుఁడు శివ తపోవనమున నకాల వసంతోదయమును గల్పించుట.

పంచమాశ్వాసము : 1. వాసంతకుసుమాలంకృతయై తన్ను సేవింపవచ్చిన పార్వతిని జూచి శివుఁడు చలించుట. 2. నిజ మనోవికారమునకుఁ గారణము మన్మథుఁడని తెలిసికొని శివుఁ డాతనిని దన మూఁడవ కంటిమంటచే భస్మీకరించుట. 3. రతివిలాపము. 4. భర్తకై విలపించు రతి నాకాశవాణి సమాశ్వాసించుట. 5. పార్వతి విరహతాపము. 6. చెలికత్తెల శిశిరోపచారములు.

షష్ఠాశ్వాసము : 1. పార్వతి తండ్రి యనుమతిని గైకొని తపోవనమున కేఁగుట. 2. ఆమె యొక మునిపల్లెనుజేరి యచ్చటనున్న జంగమ మల్లికార్జునుని యొద్ద దీక్షఁ గైకొని తపోవేషధారిణియై గంగాతీరమున నాశ్రమ మేర్పఱుచుకొని ఘోరమగు తపస్సు నాచరించుట. 3. ఒక్కొక్క ఋతువులోను బార్వతీ తపోవర్ణనము.

సప్తమాశ్వాసము : 1. శివుఁడు కపటబ్రహ్మచారి వేషమునఁ బార్వతి కడకు వచ్చి యామె తపస్సునకు మెచ్చి యామెకు సాక్షాత్కరించుట. 2. శివుఁడు కన్యావరణార్థము సప్తర్షులను హిమవంతుని చెంతకుఁ బంపుట.

అష్టమాశ్వాసము : సప్తర్షులు వివాహనిశ్చయము గావించుకొని వచ్చుట. 2. శివుఁడు పెండ్లికొడుకయి బ్రహ్మాదులతోఁ బెండ్లికిఁ దరలిపోవుట. 3. హిమవంతుఁడు మగపెండ్లివారి కెదురుసన్నాహము నెఱపుట. 4. ఆ రేయి యోషధిప్రస్థపురమున విజృంభించిన విటీ విట శృంగారక్రీడలు.

నవమాశ్వాసము : పార్వతీశ్వరుల వివాహము. 2. తుంబురునారదులగానము. 3. రంభాదుల నాట్యము. 4. దేవతల ప్రార్థనపై శివుఁడు మన్మథుని బునరుజ్జీవితుని గావించుట. 5. వసంతోత్సవము. 6. జలక్రీడలు. 7. పార్వతీ పరమేశ్వరులు కైలాసనగమున కరుగుట. 8. వారి వివిధ రతి క్రీడా వర్ణనము.

దశమాశ్వాసము : 1. పార్వతీశ్వరుల శయనమందిరము. 2. అందుఁ బ్రవేశించిన యగ్నిపై శివుఁడు నిజవీర్యమును జల్లుట. 3. అగ్ని దానిని దాల్చి శరవణ సరపి కరుగుట. 4. అరుంధతి గాక తక్కిన ఋషిపత్ను లగ్నివలన శివుని వీర్యమునుగొని గర్భవతులగుట. 5. వారు నిజ గర్భస్థ పిండములను సరోవరగర్భమునఁబెట్టి పోవుట. 6. ఆ పిండము లన్నియు నేకమయి పక్వమై కుమారుఁ డుద్భవించుట. 7. నారదుఁ డా కుమారుని తేజోవిశేషాదుల నింద్రునకుఁజెప్పఁగా నతఁడు కుమారునిపై నెత్తి వచ్చి, యోడిపోయి శివుని శరణుఁ జొచ్చుట. 8. పార్వతీ పరమేశ్వరు లా కుమారుని

దను కుమారునిగా గుఱితించి తారకాసురవధకై సురసేనా నాయకునిగా నభిషేకించుట. 9. కుమారుని క్రౌంచాచల భేదనము. 10. దేవతలు బృహస్పతి తనయుఁడగు సుమతిని దారకాసురుని కడకు రాయబారిఁగా నంపుట. 11. తారకుఁడు దూతను నిందించి వధింపఁబూనుట. 12. శుక్రకృత ధర్మోపదేశము. 13. తారకుఁడు దేవ సభకు దూత నంపుట. 14. యుద్ధనిశ్చయము, 15. శుక్రుఁడు తారకునకు రాజనీతి నుపదేశించి యుద్ధమును నివారింపఁబూనుట. 16. తారకుని నిరాకరణము.

ఏకాదశాశ్వాసము : 1. ఉభయ సైన్యములును జతురంగ బలసమన్వితములై యుద్ధభూమినిజేరి ఘోరయుద్ధముఁజేయుట.

ద్వాదశాశ్వాసము : 1. కుమారతారకులు పరస్పరము పోరుట. 2. కుమారకృత తారకాసురసంహారము. 3. దేవతల యభినందనములు. 4. విజయలక్ష్మీ శోభితుఁడగు కుమారుఁడు తల్లిదండ్రులను దర్శించుట. 5. పరమేశ్వరుఁడు కుమారున కీశ్వర తత్త్వోపదేశము చేయుట.

సతీవృత్తాంతము, గజాననోత్పత్తి, దక్షాధ్వరధ్వంసము అను వానివి విడిచి యీ కథనే పార్వతీజననాదిగాఁ గవికుల గురువైన కాళిదాస మహాకవి సంస్కృతమునఁ గుమారసంభవమును రచించెను. ఆ కాళిదాసు కావ్యమున కిది యనుకరణముగాని, యనువాదముగాని కాదు. అట్టి మహాకవి కావ్య మొకఁ డున్నప్పు డదే కావ్యమును వ్రాయఁదలఁచు కొన్నవాఁ డెంతటివాఁడైనను దాని ననువదింపకుండ నిగ్రహమును బాటించుట కష్టము. ఆ కవి కవితాప్రతిభనుండి తప్పించుకొను టంత సులభముగాదు. కాని నన్నెచోడుఁడు మిక్కిలి స్వతంత్రుఁడైన యాంధ్రమహాకవి. అతఁడు వర్ణన ప్రియుఁడు. చేసిన సుదీర్ఘ వర్ణన లన్నియు స్వకపోలకల్పితములే. కాళిదాసుశ్లోకము లలో బహు స్వల్ప సంఖ్యాకములైన వానికి - వ్రేళ్ళపై లెక్కింపఁదగిన వానికి నీతని కావ్యమున నాంధ్రీకరణ ప్రాయములు గానవచ్చును. కాళిదాసుచే శిరఃకంప మును జేయించు పద్యములును గొన్ని యీ కవి కావ్యమునఁ గలవు. మచ్చున కీ పద్యములు చూడఁదగును.

కవి కోపించెనొ? కానక
ముని గోపించెనొ? మహోగ్రముగ నుగ్రుఁడు సూ
చినఁ గాలెనొ? చూడక యట
ముని గాలెనొ? నాఁగ నిమిషమున నఱఁ గాలెన్. 5.51

గిరిసుత మైఁ గామాగ్నియు,
హరు మై రోషాగ్నియుం, దదంగజుమై ను
ద్ధుర కాలాగ్నియు, రతి మై
నురు శోకాగ్నియును దగిలి యొక్కట నెగసెన్. 5-52

మొదటి పద్యమున మన్మథుని నిమిషమాత్ర దగ్ధత యత్యద్భుతముగా వర్ణింపఁబడినది. రెండవదానిలో నాలుగగ్ను లేకమై యొక్కట నెగసిన తీ రాశ్చర్యముగాఁ జెప్పఁబడినది. ఇట్టి పద్యము లెవరిచేనైన నోహో యనిపింపకమానవు.

కాళిదాసు వర్ణనలతో నీ కవి వర్ణనలను బోల్చి చూచుచో నీతఁ డా మహాకవితో నెట్లు పోటీపడి రచించెనో స్పష్టపడఁగలదు. 'అస్మదీయానూన ప్రతిభార్ణవోదీర్ణ రుచిర వస్తు విస్తారి తోత్తమకావ్యరత్న' మని యాతఁడే వాకొనుటలోని యంతరార్థ మిదియే.

## జాను తెమఁగు

జానుతెనుఁ గను పదమును వాడిన మొదటి కవి యీతఁడే కావచ్చును. జాను తెనుఁ గనఁగాఁ దన యభిప్రాయమేమో యతఁడు స్పష్టముగాఁ జెప్పలేదు కాని, యీ పదము నతఁ డుపయోగించిన పద్యమునుబట్టి యతని యభిప్రాయమును మనము గ్రహింపవచ్చును.

చ. సరళముగాఁగ భావములు జానుదెనుంగున నింపుపెంపుతోఁ
బిరిగొన, వర్ణనల్, ఫణితి పేర్కొన, నర్థము లొత్తగిల్ల, బం
ధురముగఁ బ్రాణముల్ మధుమృదుత్వరసంబునఁ గందళింప, న
క్షరములు సూక్తు లార్యులకుఁ గర్ణరసాయనలీలఁ గ్రాలఁగాన్. కుమా. 1-35

అనుదానినిబట్టి భావములు సరళముగా వ్యక్తముచేయుట—జానుతెనుఁగు లక్షణమని యతఁ డుద్దేశించినట్లు తెలియనగును.

జానుతెనుఁ గను నీ మాటను బాల్కురికి సోమనాథుఁడు కూడఁ బ్రయోగించెను. దాని కుదాహరణముగా నతఁడొక పద్యమును వ్రాసెను.

బలు పొదతోలు సీరయును, బాఁప సరుల్, గిలుపారు కన్ను వె
న్నెల తల, సేఁదుకుత్తుకయు, నిండిన వేలుపుఁటేఱు, వల్గు పూ
సలు గల తేని లెంక వని జానుతెనుంగున సన్నుతించెదన్
వలపు మదిం దలిర్ప బసవా! బసవా! బసవా! వృషాధిపా!

ఈ పద్యమునుబట్టి జానుతెనుఁగన నచ్చతెనుఁగను భ్రాంతి పొడమవచ్చును. కాని యీ క్రింది ద్విపదలలో నా పదమున కాతఁడే లక్షణమును జెప్పెను.

ఉరుతర గద్య పద్యోక్తులకంటె
సరసమై పరఁగిన జానుతెనుంగు
చర్చింపఁగా సర్వసామాన్య మగుటఁ
గూర్చెద ద్విపదలు కోర్కి దైవార. (బసవ పురాణము)

ఆరూఢ గద్య పద్యాది ప్రబంధ
పూరిత సంస్కృత భూయిష్ఠ రచన
మానుగా సర్వసామాన్యంబు గామి
జాను తెనుఁగు విశేషము ప్రసన్నతకు. (పండితారాధ్య చరిత్ర)

సోమనాథుని యభిప్రాయములో జాను తెనుఁగన నారూఢ గద్యపద్యాది ప్రబంధ పూరిత సంస్కృత భూయిష్ఠ రచనకంటెను, ఉరుతర గద్య పద్యోక్తులకంటెను భిన్నమై, సర్వసామాన్యమై, విశేషముగాఁ బ్రసన్నమై, సరసమైన భాషయనియర్థము చేసికొన వచ్చును. సంస్కృత భూయిష్ఠముకాని రచన యచ్చతెనుఁగు కాదా? యనిన, సంస్కృత భూయిష్ఠమైన రచనవలెనే యచ్చతెనుఁగుకూడ సర్వసామాన్యము, సరసము, ప్రసన్నముకాదు, తెనుఁగువారి నిత్యవ్యవహారములో నుండు సంస్కృతముతో మేళవించినను, ఏ రచనకు సర్వసామాన్యత, సరసత, ప్రసన్నత ముఖ్యములయి యుండునో యది జానుతెనుఁగని గ్రహింపవలయును. అది 'ఉరుతర గద్య పద్యోక్తుల కంటె భిన్నమై యుండవలయు' ననుటలో సోమనాథుఁడు ద్విపద నుద్దేశించె నన వచ్చును. కాని నన్నెచోడుఁడు గద్యపద్యోక్తులతోనే రచన గావించెను. సంస్కృత పదములను మెండుగాఁ బ్రయోగించెను. అందుచే నన్నెచోడుని యభిప్రాయమున జానుతెనుఁగన సంస్కృత మిశ్రిత మయినను, గద్యపద్యోక్తులతోఁ గూడినది యయినను భావ సారళ్యముగల రచనయని చెప్పవచ్చును. అదియే సోమనాథుఁ డుద్దేశించిన సర్వసామాన్యత, సరసత, ప్రసన్నత యని చెప్పవచ్చును.

నిజమునకు జాను తెనుఁగును ప్రస్తావించిన యీ కవులిరువురి రచనలును వారు దానికిఁ జెప్పిన లక్షణమునకు లక్ష్యములు గావు. ఇరువురి రచనలును సంస్కృత భూయిష్ఠములే. ఇరువురివియును సర్వసామాన్యములుగాని, విశేషప్రసన్నములుగాని కావు. నన్నెచోడుని రచనయందు విద్వద్వరేణ్యుల నెంతయో తికమకపెట్టు పద్యము లెన్నియో కలవు. మఱి వారేల యట్టి లక్షణమును జెప్పిరన, నది యాదర్శ రచన కుండవలసిన లక్షణమనియే కాని యక్షరశః తాము పాటింతు మనుట కాదు.

## మార్గ దేశి కవిత్వములు

నన్నెచోడుఁడు మార్గ దేశి కవిత్వము లను మాటలను ప్రయోగించెను.

మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గును నిలిపి రంధ్రవిషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్.

మార్గ కుమార్గము దేశి య
మార్గము వగవంగఁ దనకు మది వదలక దు
ర్మార్గ పదవర్తు లనఁ దగు
మార్గవులం దలఁప నలవి మహి సుకవులకున్.

పూర్వము మార్గకవిత లోకమునఁ ప్రసిద్ధముగా నుండఁగా నాంధ్రదేశమునఁ జాళుక్యరాజు మొదలుగాఁ బలువురు దేశికవితను బుట్టించి రని యున్నది. కావున - చాళుక్య రాజులకుఁ బూర్వముండినది సంస్కృత కవిత్వమే కనుక మార్గ కవిత్వమనఁగా సంస్కృత కవిత్వమనియు, వా రాంధ్రదేశమునఁ బుట్టించి నిలిపినది భారతమువంటి కవిత్వము గాన దేశికవిత్వ మన నదియే యనియు నన్నెచోడుని యభిప్రాయ మయియుండునని మనము తలఁపవచ్చును. కుమార్గ మని మార్గను, నమార్గ మని దేశిని ద్రోసిపుచ్చి దుర్మార్గమును బట్టి పోవు మాఱుగవులను సుకవులు స్మరింపరాదని నన్నెచోడుని హెచ్చరిక. ఆంధ్రదేశమున దేశికవిత్వమును నిలిపిన చాళుక్యరా జాంధ్రమువ భారతమును రచింపఁజేసిన రాజరాజ నరేంద్రుఁ డనియుఁ నంతకుఁ బూర్వమే తెలుఁగుభాషకు రాజభాషగాఁ బట్టముగట్టి శాసనముల

కెక్కించిన గుణగవిజయాదిత్యుఁడనియు నభిప్రాయభేదములు గలవు. కాని సుప్రసిద్ధమైన భారతగ్రంథ రూపమున నాంధ్రదేశమున దేశికవిత్వమును నిలిపినవాఁడు రాజరాజనరేంద్రుఁడే కావునను, గుణగ విజయాదిత్యుని కాలమునాఁటికిఁ గొన్ని శాసనస్థ పద్యములుతప్పఁ జెప్పుకొనఁదగిన కవితారూపమునఁ దెనుఁగు లేదు కావునను ఈ పద్యమునఁ బేర్కొనఁబడిన చాళుక్యరాజు రాజరాజనరేంద్రుఁడే యని విశ్వసింపఁ దగును. నన్నెచోడుని కవిత్వముకూడ నన్నయాదుల కవిత్వమునే పోలియున్నది కావున నతని కవిత్వమువలెనే దేశి యని భావింపవచ్చును.

## వస్తుకవిత్వము :

నన్నెచోడుఁడు తన కుమారసంభవమున బహుపర్యాయములు ప్రయోగించిన యింకొక మాట వస్తుకవిత్వము. అతని దృష్టిలో వస్తుకవిత్వ మన నేమియో యూహింపవలసినదే కాని యిదమిత్థముగాఁ జెప్పవలనుపడదు. ఈ క్రింది పద్యమును జూచుచో నతని యభిప్రాయమువ వస్తుకవిత యననేమో తెలియవచ్చును.

మృదురీతి సూక్తులం బొదవింప మేలిల్లు
        భావమ్ము నెలమిఁ బ్రీత్యావహముగ
మెఱుఁగులఁ గన్నులు మిఱుమిట్లు వోవంగఁ
        గాంతి సుధాసూతి కాంతిఁ జెనయ
వర్ణన లెల్లచో వర్ణన కెక్కంగ
        రసములు దళుకొత్తి రాలువాఱ
దేశి మార్గంబులు దేశీయములుగా న
        లంకారములఁ దా నలంకరింప
నాదరించి విని సదర్థాతిశయమున
బుధులు నెమ్మనమున నిధులు నిలుప
వలవదే సమస్త వస్తు కవీశ్వర
నూత్న రుచిర కావ్య రత్న వీథి ? 1-66

పయి పద్యభావమునుబట్టి వస్తుకవిత్వము మృదువులై యాహ్లాదమును గలిగించు సూక్తులతోను. ప్రీతినిగలిగించు మేలయిన భావములతోను, వెన్నెల వెలుఁగు వలెఁ గన్నులు మిఱుమిట్లుగ్రమ్ము కాంత్యాది గుణములతోను, శృంగారాది రసముల

తోను, ప్రసిద్ధములయిన వర్ణనలతోను. దేశికవితారీతులతోను, నుపమాద్యలంకారముల తోను బండితు లాదరించులాగున నుండునది యని తెలియుచున్నది.

ఇతఁడు కవిస్తుతిలోఁ గొందఱను వస్తుకవులనుగా స్తుతించెను. వారిలోఁ బౌఱత నాదికవి వాల్మీకిని వస్తుకావ్యాబ్జ రవినిగాఁ బ్రశంసించెను. తరువాత వ్యాసుని, గాళి దాసుని, భారవిని, నుద్భటుని, బాణుని వస్తుకవులనుగాఁ బేర్కొనెను,

ఈతఁడు పేర్కొనిన యీ సంస్కృతకవుల కావ్యములను బరిశీలింపఁగా నవి యన్నియును గథాప్రధానములై, వర్ణనాత్మకములై, యలంకార శోభితములై యున్నట్టివే కదా! ఇతని కుమారసంభవము కూడఁ గథాప్రధానము, వర్ణనాత్మకము, అలంకార శోభితము నయి యొప్పుచున్నది. కావునఁ బయి లక్షణములతోఁ గూడినదే వస్తుకవిత యని చెప్పవచ్చును.

అయిన నొకమాట. వస్తు వర్ణనాలంకారములు లేని కావ్య మేదయిన నుండునా? అట్టిచో లోకమునఁగల కావ్యజాలమునం దంతటను వస్తుకవిత్వమే యున్నదన వచ్చునా? యనిన నట్లుకాదు. కేవలతత్త్వ ప్రతిపాదక గ్రంథములును, వేదాంత ప్రధాన గ్రంథములు నుండవచ్చును. అట్టివానిలోనిది వస్తుకవిత్వము గాదన్నమాట.

నన్నెచోడుఁ డీ గ్రంథము నింకొకచోటఁ బ్రబంధమునుగాఁ బేర్కొనెను,

'జంగమ మల్లికార్జును నిసర్గకవి స్తవనీయ ........
భంగిగ విస్తరించెదఁ బ్రబంధము సద్రసబంధురంబుగాన్. 1-48

దీనినిబట్టి యతని దృష్టిలో వస్తుకవిత్వమన్నను, బ్రబంధకవిత్వ మన్నను నొక్కటే యని భావింపవచ్చును. ఆంధ్ర సాహిత్యమున మొట్టమొదటి ప్రబంధ మిదియే యని చెప్పవచ్చును. ప్రబంధమునకు లక్షణము లేవి యని చెప్పఁబడినవో, యవి యన్నియు నిందుఁ బుష్కలముగాఁ గలవు,

## వర్ణనలు

ప్రబంధములో నష్టాదశ వర్ణన లుండవలయునని నియమము, నన్నెచోడుఁడు వర్ణనప్రియుఁడు. పదునెనిమిది వర్ణనలును బరిపూర్ణముగా నున్న తెలుఁగుకావ్య మిది యొక్కటియే యని చెప్పవచ్చును. తాను గావ్యమునఁ జేయఁబోవు వర్ణనల నీ కవి యవతారికనిలో చ్చియున్నాఁడు.

వన జలకేళీ రవి శశి
తనయోదయ మంత్ర గతి రత క్షితిప ర ణాం
బునిధి మధు ఋతు పు రోద్వా
హ నగ విరహ దూత్య వర్ణనాష్టాదశమున్.

మన్మథుఁడు పరమేశ్వరుని తపోవనమునకు వచ్చి వసంతుని బిల్చి 'యీ వాసంతికానంద దోహల మీ కాననలక్ష్మి కి' మ్మనినప్పు డీ కవి వనవర్ణనమును గావించి నాఁడు.

పార్వతీ పరమేశ్వరుల వివాహానంతరము మన్మథుఁడు పునర్జన్మము నంది నప్పుడు జనులందఱు నానందముతో జలకేళి సలిపినట్లు వర్ణింపఁబడినది.

శివుఁడు పెండ్లికై హిమవంతమునకుఁ దరలివచ్చినప్పుడు సూర్యాస్తమయ మును, నంధకారమును, జార చోరాదులను, చంద్రోదయమును వర్ణించినాఁడు. తనయో దయ వర్ణనమును గుమారోదయ సందర్భమునఁ జేసినాఁడు.

యుద్ధమునకు ముందు శుక్రుఁడు తారకునకుఁ జేసిన నీత్యుపదేశములో మంత్ర వర్ణనమును, కుమారుఁడు దేవసేనలతోఁ దారకునిపై దండెత్తి వెడలినప్పుడు గతి (యాత్రా) వర్ణనమును, పార్వతీశ్వరుల సంభోగ సందర్భమున రతి వర్ణనమును, గుమారుఁ డింద్రు నోర్చినప్పుడు క్షితిప వర్ణనమును, గుమార తారకు లొండొరులతోఁ బోరినప్పుడు యుద్ధవర్ణనమును, దక్షుఁడు తన యల్లుఁడగు వరుణుని జూడఁబోయినప్పు డర్ణవ వర్ణనమును గావించినాఁడు.

శివుని వివాహానంతరము పురజనులు వన జలకేళులు సలిపినప్పుడు స్త్రీల మధు పాన వర్ణనమును, పార్వతి తపస్సు చేసినప్పుడు ఋతుషట్క వర్ణనమును, సప్తర్షు లోషధిప్రస్థమునకుఁ బోయినప్పుడు పుర వర్ణనమును, పార్వతీశ్వరుల వివాహ సందర్భమున నుద్వాహవర్ణనమును, హిమవద్వర్ణనమున నగవర్ణనమును, మన్మథ దహనానంతరము పార్వతీ విరహవర్ణనమును, కుమారుఁడు తారకునికడకు బృహస్పతి సుతుఁడగు సుమతిని రాయబారిగాఁ బంపినప్పుడు దూత్యవర్ణనమును గావించినాఁడు.

ఈ వర్ణనలలో నీ కవి గావించిన చమత్కారములు సహృదయ హృదయా నందకరములు : మచ్చునకుఁ గొన్ని :

జలవాసులైన హరి ల
క్ష్మలు వర్ష నిశావసానమున మేల్కొని క
న్నులు విచ్చి చూచినట్టులు
జలజోత్పలరుచులు వెలసె శారదవేళన్. 6-113

శరదాగమంబు తన సుత
కురు పరితాపంబు సేయుచుండుట హిమ భూ
ధర పతి గని వానిపయిన్
బరిగొనియెనొ నాఁగఁ దుహినపటలము పర్వెన్. 6-123

మరు చేతనుండి హరు గె
ల్పరు, దుమచేనుండి గెల్వనౌనని సుమన
శ్శరములు కరముల వెలపిన
కరణిఁ గరాంగుళము లచలకన్యక కొప్పున్. 3-58

పాయక సర్వర్తుక పు
ష్పాయత గంధములు గొంచు నప్పురిఁ బగలున్
రేయును నింటింటికి మృదు
వాయువు సనుచుండు గట్టువాలును బోలెన్. 7-125

ఇ ట్లెన్నియని యుదాహరించుట ! ఈతఁడు చేసిన వర్ణనలన్నియు వివిధాలం కారములచే శోభిల్లుచుఁ గవితాపరిమళముచే గుబాళించుచుండును.

## ర స ము లు

నన్నెచోడుని కుమారసంభవము సర్వరసముల కాలవాలము.

అయినను నిందు శృంగార మంగిరసముగాను, దక్కిన వీరాదు లంగరసములు గాను బ్రపంచింపఁబడినవి. సంయోగ విప్రలంభములనెడి ద్వివిధ శృంగారములు నిందు వర్ణితము లయినవి. మొదట సతీశంకరుల సంయోగమున సంయోగశృంగారమును, సతీ మరణానంతరము పార్వతీ వివాహపర్యంతమును విప్రలంభ శృంగారమును, మరలఁ బార్వతీపరమేశ్వరుల సంయోగ శృంగారమును విస్తృతముగా వర్ణింపఁబడినవి.

ఇఁక దక్షాధ్వరధ్వంస సందర్భమున గణనాయకులు పెట్టుబాధల కోడి దేవతలు పాఱిపోయిన విధమును వర్ణించునప్పుడు హాస్యరసమును, మన్మథ దహనానంతరము రతి విలాపసందర్భమునఁ గరుణ రసమును, తారకుని రౌద్రాకారమును వర్ణించుటలో రౌద్రరసమును, కుమారుని పరాక్రమ వర్ణనలో వీరరసమును. యుద్ధభూమి వర్ణనమున బీభత్సరసమును, యుద్ధమున రాక్షసమాయకుఁ బ్రతీకారముగా మహామాయ వారి నెల్ల చీమలనువలె మ్రింగినవిధమును వర్ణించునప్పు డద్భుతరసమును, శివుఁడు కుమారునకు జ్ఞానోపదేశము చేయు సందర్భమున శాంతరసమును నీ కవి మనోహరముగా వర్ణించినాఁడు.

నన్నెచోడుని కుమారసంభవమునందలి కవితాసుందరి యుపమోత్ప్రేక్షా రూపకాది వివిధాలంకార శోభితయై, ప్రసాద మాధుర్యాది సర్వగుణ విలసితయై విరాజిల్లుచుండును.

వర్ణనావేశ పరవశుఁడై నన్నెచోడుఁ డొక్కొకతఱి నౌచిత్యము మేర మీఱిన పట్టులును గలవు. 'అనౌచిత్యా దృతే నాన్య ద్రసభఙ్గస్య కారణ' మనికదా లాక్షణికుల హెచ్చరిక ; ఎంతటి యావేశపరవశుఁడైనను గవి సంయమమును గోల్పోవక యౌచిత్యరేఖ నతిక్రమింపక ప్రవర్తిల్లుచు రససంపదను రక్షించుకొనవలయును. పార్వతీ యౌవనమును ముందు వర్ణించియుఁ దనివితీఱక యితఁడు మరల వివాహమునకు ముందామె సర్వావయవములను వర్ణించుట యనావశ్యకము. అందును నా వర్ణనను సప్తర్షులచేఁ గావింపఁజేయుట మఱియు ననుచిత మనిపించును. అత్తవారింటికిఁ గూఁతును సాగనంపునపుడు తల్లియగు మేనయుఁ గూఁతురగు పార్వతియు నొండొరులఁ గౌఁగిలించుకొను తీరుమ వర్ణించిన సందర్భమునందలి

ఉరు కుచాగ్రంబు లొండొంటి నొత్తుదేర
నెదురు కౌఁగిలింపఁగ నను వెట్టుఁగాక
కెలని కొఱఁగుచుఁ గుచతటుల్ బలిమినొత్త
నంది కే లెట కేనియు నందికొనిరి. 9-143

అను పద్య మౌచిత్యదూర మనఁ జెల్లును. ఇట్టిపట్టుల సహజముగా నుండవలసిన శోకస్థాయిక మగు కరుణమునకు భంగమయి జుగుప్స గలుగుచున్నది.

## మతము - గురువు

ఈ కృతియందలి యవతారికా పద్యములో 'అఖిల లోకములుం దగఁ గాచుచున్న వేదాంగు ననంతు విష్ణుఁ గమలాధిపు సంస్తుతిఁ దేల్తు సమ్మతిన్' అని విష్ణుస్తుతిని జేసినను, ఆ స్తుతించుటలో విష్ణుని 'పరమేశ్వరోరువామాంగమునందు ము న్నుదయమై నియమస్థితిఁ గొల్చిన వానినిగాఁ జెప్పుట నన్నెచోడుని శివభక్తితత్పరత్వమును దెలుపుచున్నది. 'శ్రీవాణీం' ద్రేత్యాది ప్రథమ పద్యమునఁగూడ విష్ణు బ్రహ్మలను శివునర్చించువారినిగనే పేర్కొనుటయు, హరిని వికచారుణాంబుజ సహస్రములను బూన్చి హరునిఁ బూజించువానినిగాఁ జేయుటయేకాక యతఁడు భ్రాంతికి లోనైనవానినిగా నిరూపించి నవ్వులపాలు చేయుటయు నీ కవి శివభక్తి పారమ్యమునకు నిదర్శనము. శివుఁడు వివాహ మంటపమునకు విచ్చేయునప్పు డా దేవున కిరు గెలంకుల డాపి మణిహేమ దండ చామరలు పెట్టువారినిగా హరి సురవల్లభులను బేర్కొనుటయు నతని శివభక్తి తాత్పర్యమునకు నిదర్శనము.

కాలాముఖ శైవవ్రత సంప్రదాయానుసారి యగు జంగమ మల్లికార్జునుఁ డీతని గురువు. ఆ గురువునకుఁ బరమశివునితో నభేదమును బాటించునంతటిది యీతని గురుభక్తి, వివాహమునకుఁ దరలివచ్చు నీశ్వరునిఁ జూడవచ్చిన పురస్త్రీ లాతని జంగమ మల్లికార్జుననిగా భావించినట్లు వర్ణించునంతటి గురుభక్తి తత్పరత యీతనిది. అయినను నన్నెచోఁడుడు శివకథను గైకొని దానినొక కావ్యమునుగా రచించినాఁడేకాని పండితారాధ్య పాల్కురికి సోమనాథులవలె నన్యమతాసహనమును జూపునట్టియు, శైవమతైక ప్రచార సాధనమయినట్టియు గ్రంథమును రూపొందించి యుండలేదు. అందుచే నన్నెచోడుఁ డెంతటి శివభక్తుఁడైనను వీరశైవుఁడు మాత్రము కాదని చెప్పవచ్చును.

## గర్భ బంధ చిత్ర కవిత్వములు

ఈ కవి యీ కావ్యమున గర్భకవిత్వమును. బంధకవిత్వమును, చిత్రకవిత్వమును రచించెను.

శివుఁడు కుమారస్వామికి జ్ఞానోపదేశము చేయుసందర్భమున నితఁడు చతుర్విధ కందమును, కందగర్భవృత్తమును రచించినాఁడు.

చతుర్విధకందము

సుజ్ఞాన యోగ తత్త్వ వి
ధిజ్ఞుల్ భవ బంధనములఁ ద్రెంచుచు భువిలో
నజ్ఞాన పదముఁ బొందక
ప్రాజ్ఞుల్ శివుఁగొల్తు రచలభావన దవులన్. 12-216.

గర్భ ద్వితీయ కందము

భవ బంధనములఁ ద్రెంచుచు
భువిలో నజ్ఞానపదముఁ బొందక ప్రాజ్ఞుల్
శివుఁ గొల్తు రచలభావన
దవులన్ సుజ్ఞానయోగ తత్త్వవిధిజ్ఞుల్.

గర్భ తృతీయ కందము

అజ్ఞాన పదముఁ బొందక
ప్రాజ్ఞుల్ శివుఁగొల్తు రచలభావన దవులన్
సుజ్ఞాన యోగ తత్త్వ వి
ధిజ్ఞుల్ భవ బంధనములఁ ద్రెంచుచు భువిలో.

గర్భ చతుర్థకందము

శివుఁ గొల్తు రచల భావన
దవులన్ సుజ్ఞాన యోగతత్త్వ విధిజ్ఞుల్
భవ బంధనములఁ ద్రెంచుచు
భువిలో నజ్ఞానపదముఁ బొందక ప్రాజ్ఞుల్.

కందగర్భ వృత్తము.

హరు మనమారఁ గొల్చు దరు దాతనిఁ గొల్చియు నాదిబోడఁ దాఁ
బొరయునె భూరిభోగ పురభూతి విభుత్వముఁ బొంది పేర్మితోఁ
బర జన దారుణోగ్ర శరపాత నియుక్త పదంబునందుఁ దాఁ
బొరయఁడు వారికోర్చి హరి భూతగణేశ్వరుఁబొందు నాత్మలోన్. 12-219

ఉద్ధృత కందము.

మనమారఁ గొల్చి డరు దా
తనిఁ గొల్చియు నాదిబోడఁ దాఁ బొరయునె భూ
జన దారుణోగ్ర శరపా
త నియుక్త పదంబునందుఁ దాఁ బొరయఁడు పో.

కుమారస్వామిచే నోటువడి పరమేశ్వరుని శరణుఁ జొచ్చినప్పు డాతనిచే నా నాగాభరణుని నాగబంధ మురజబంధములలో నీ కవి స్తుతింపఁ జేసెను.

తారకాసురుని నిర్జించిన కుమారస్వామిని దేవతలందఱును జక్రబంధమున స్తుతించుట చూడనగును.

అర్థాలంకారములనే కాక యితఁడు శబ్దాలంకారములను గూడ నీ కావ్యమునఁ బ్రయోగించినాఁడు.

పుష్కర షండములోఁ గల
పుష్కరమూలములు గబళములఁ గొనుచున్ స
త్పుష్కర తలముల మునుమిడి
పుష్కరములఁ బెటికివైచెఁ బుష్కరమునకున్. 1.94

గోపాలక విను మిప్పుడు
గోపాలకు లాది గాఁగఁ గుత్సితమతులై
గోపాలకు లెల్లను జెడి
గోపాలకు లైరి తారకున కతిభీతిన్. 4.21

మందా రార్కాలయములు
మందా రార్కావనీజ మయ మయ్యె సదా
నందన వనజా వాసము
నందన వనజాకరాభినందిత మయ్యెన్. 4.27

ముక్తా ముక్తాయుధములు
ముక్తా ముక్తాయుధౌఘములుఁ దగు సుభటుల్
ముక్తా ముక్తాసులుఁ బర
ముక్తా ముక్తాసుబంధములు నగుచు ననిన్. 11-130

ఈ శబ్దచిత్రములను నర్థచిత్రములను జూడుఁడు.

తానేల వచ్చు భూనతి
మానవపతి చరిత నీతిమార్గంబైనన్
తా నేల వచ్చు భూసతి
మానవ పతి చరిత నీతిమార్గంబైనన్. 10-181

ఈ ననియ తలఁచుఁ జాగియు
నీ ననియ తలంచు లోభి యెప్పుడు ననికిం
జా ననియ తలఁచు వీరుఁడుఁ
జా ననియ తలంచుఁ బంద సరి యెట్లగునో. 11.48

ఇతఁడు వివిధ వృత్తములను దన్నామ సార్థక్య మేర్పడునట్లు సందర్భాను కూలముగా వాడుట గమనింపఁదగినది.

ప్రథమాశ్వాసమున సతీపరమేశ్వరుల వివాహ సందర్భమున నరణ్యమున మత్తేభమున క్రీడించుటను మత్తేభవృత్తములోనే వర్ణించెను.

చతుర్థాశ్వాసమున శివుని తపస్సును భంగపఱుప మన్మథుఁడు వచ్చినప్పుడు వసంతోదయముగా మత్తకోకిలముల సంరంభము నీ కవి మత్తకోకిల వృత్తములోనే వర్ణించినాఁడు.

సప్తమాశ్వాసమునఁ గపట వటు రూపమున నేతెంచు శివునకుఁ బార్వతి చెప్పిన స్వాగతమునకు స్వాగత వృత్తమునే వాడెను,

తపస్సుచేయు మానిని యగు పార్వతిని గపటబ్రహ్మచారి మానినీవృత్తము లోనే వర్ణించెను.

అష్టమాశ్వాసమున నక్షత్రముల వర్ణనను మణిగణనికర మను వృత్తములోనే యితఁడు కావించెను.

దశమాశ్వాసమున శరవణ సరస్సునందలి క్రౌంచముల గమనములను క్రౌంచ పద వృత్తములోనే యీతఁడు రచించెను.

అందే కుమారస్వామి యుదయముచే మునులును, జనులును బొందిన యుత్సాహము నుత్సాహ వృత్తములోనే వర్ణించెను.

కవి కాలీన సాంఘిక ప్రతిఫలనము

ఏ కావ్యాదర్శము నందయినను దత్కవి కాలమునాఁటి సంఘము ప్రతిఫలించుచుండును. నన్నెచోడుని కుమారసంభవమునందును, నాతని కాలమునాఁటి సాంఘిక పరిస్థితులు ప్రతిబింబించెనని నిరూపింపవచ్చును.

యుద్ధరంగమునకుఁ బోవుటకు ముందు వీరభటులు తమతమ ప్రతాపములను బ్రకటించుటయుఁ, ద్యాగభోగనిరతు లగుటయుఁ దమతమ ప్రియురాండ్రను గడపటి సారిగా వీడుకొనుటయుఁ, బ్రియురాండ్రు భావి వియోగ భారమును సహింపలేక ప్రియులకంటె ముందే ప్రాణపరిత్యాగము చేయుటయు మున్నగు వీర శృంగార కృత్యము లన్నియు స్వయముగా క్షత్రియకుల సంజాతుఁడును, వీరుఁడునైన నన్నెచోడునకుఁ బ్రత్యక్షానుభవములోనివే యని యూహింప వచ్చును.

మఱియు రాజసేవకులకు వేతనముగాఁ బసిఁడుల ప్రోవులిచ్చుటయుఁ, బిఱికి పందలయిన యుద్ధభటులకు జొన్నలు గొలుచుటయు నా నాఁటి యాచారములయి యుండవచ్చును.

భావజ విభుఁ డలి శుక పిక
సేవక తతి కెడరు దీర జీతము సేయం
గా వెలిఁ జోపిన పసిఁడుల
ప్రోవులు నాఁ దమ్మి లెలమిఁ బూచె బెడంగై. 4-92

మునుమిడి వైరివాహముల ముట్టి పడల్పడ ద్రేపినట్టి కై
పునఁ బయికెత్తు వాహకుల పొంక మఱం దలకొంత గోపి ము
న్నొకని వడివాఱు పందలను గోవుల సూరెలఁ బోలి నూర్చు పే
ర్చునఁ బతికెత్తి కే ల్గలన జొన్నలు గొన్న ఋణంబు సీఁగుదున్. 11-42

ఒక యసాధారణ కార్యమును నిర్వహించుటకయి రాజొక సేవకుని నియోగించి నప్పుడు వానికి సమ్మానపూర్వకముగాఁ దాంబూలము నొసఁగుటయు, దాని నతఁ డంగీకార సూచకముగాఁ బరిగ్రహించుటయు నా కాలమునాఁటి రాజసేవా ధర్మములలో నొకటియై యుండునని భావింపవచ్చును.

వ. 'నాకుఁ దగిన కెలసంబు గంటి దీనికింతకు మైకొంటిఁ దాంబూలము దయ సేయు' మని వసంత సహితంబుగా వలరాజు సురరాజుచేత నపార సత్కారములు గొని వీడుకొని చనుదెంచునంత. 4-54

## వివిధ కళా శాస్త్ర పరిజ్ఞానము

కవికి వివిధ శాస్త్రములందును, గళలందును గల పరిజ్ఞానము స్వీయకావ్యము నందుఁ జోటు చేసికొనుచుండును. రామరాజభూషణుని సంగీతశాస్త్ర నైపుణ్య మాతని వసుచరిత్రమునందును, శ్రీకృష్ణదేవరాయల రాజనీతి వైశారద్య మాతని యాముక్త మాల్యదయందును గనవచ్చుట యిందులకు నిదర్శనము. నన్నెచోడునకును గవిత్వముతోపాటు చిత్రలేఖన సంగీత నాట్యాది వివిధ లలితకళల నైపుణ్యము గలదు. ఇంకను నతనికి అశ్వశాస్త్రము, గజశాస్త్రము మున్నగు శాస్త్రములందును, యుద్ధ రాజ్య తంత్రములందును విశేష పరిజ్ఞానము గలదని యీ కావ్యమునందలి యనేక నిదర్శనములను బట్టి నిరూపింపవచ్చును.

## విలక్షణ ప్రయోగములు

ఈ కవి రచనలో నన్యకవిసాధారణములుగాక విలక్షణములైన ప్రయోగములు గొన్ని కలవు.

1. ఇతఁడు భావార్థక ట వర్ణకమునకు మాఱుగా నొక్కొక్కచోడు వర్ణకమును బ్రయోగించును.

'అతి సత్త్వులఁ గూడి బలియుఁ గుడదె యరుదే' అగుట యనుటకు బదులుగా 'అగుడు' అని ప్రయోగించుట.

'దో-షారంభులు వర్జనీయు లగు డది యరుదే.' 10.46

అగుటకు అగుడు అని ప్రయోగించుట,

'హరు మనమారఁ గొల్చు డరు దాతనిఁ గొల్చియు ..........'

కొల్చుటకు మాఱుగాఁ గొల్చుడు.

2. ఒక యుపమావాచకముండఁగా దానిపై మఱియొక యుపమావాచకము నితఁడు తఱచుగాఁ బ్రయోగించుచుండును.

'శారద నీరద సమూహి చాడ్పునఁ బోలెన్.' 10.20

'మిగిలి నిగళంబు వెట్టిన పగిది వోలె. 9.68

## సమకాలిక కవులు

నన్నెచోడుని కాలమున 'తారుఁ' డను నొక కవియు, 'షణ్ముఖుఁ' డను నొక కవియు నుండిరనియు, వీ రిరువురును బరస్పరము స్పర్థతో మెలఁగెడివారనియు నన్నెచోడుఁడు షణ్ముఖుని శిష్యుఁడై యాతనియెడ నెక్కువ మక్కువ గలిగియుండె ననియుఁ, దార కవిని దారకాసురునిగాను, షణ్ముఖునిఁ గుమారస్వామినిగాను శ్లేషించి యతఁడు కొన్ని పద్యములను గుమారసంభవమున రచించెననియు నొక యైతిహ్యము గలదు. దాని కీ క్రిందిపద్యములు నిదర్శనములు.

తన జనకుఁ డురు స్థాణువు
జనని యపర్ణాఖ్య దా విశాఖుం డనఁగాఁ
దనరియు నభిమత ఫలముల
జనులకు దయ నొసఁగుచుండు షణ్ముఖుఁగొలుతున్. 1.8

అన్యతారక వితతుల నాదరించి
వెలయ సత్కవి బుధ గురు బలము వడపి
యొనర దైవజ్ఞునట్ల శుభోదయమున
దివ్య సుకృతిఁ బ్రతిష్ఠింతుఁ దిరము గాఁగ. 1.3

ఇనుఁ డుదయింపక ముందఱ
ఘనముగ వర్తించుఁ దారక ప్రభ గాక
యిృనుఁ డుదయించిన పిమ్మటఁ
గనుఁగొన లోకమునఁ దారకప్రభ కలదే? 10.152

తారకవి రచిత కృతియుం
దారక విరచిత సుకృతియుఁ దా నడఁగు సదా
చారక విబుధాలికి సువి
చారక విబుధాధినాథు షణ్ముఖుఁ గనినన్. 10-158

ఇతని కాలమున రామేశ్వరుఁడను పేరుగల యింకొక కవి యుండెనని కుమార సంభవమునందలి యీ క్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

'శ్రీ రామేశ కవీశ్వరాదు లెద నీ శ్రీపాదముల్ భక్తితో నారాధించి.... 10-90

ఈ రామేశ కవీశ్వరుఁడు శివభక్తుఁడైన యాంధ్రకవియై యుండునని శ్రీ వీరేశ లింగము పంతులుగా రభిప్రాయపడఁగా, 'నితఁ డే భాషాకవియో చెప్పఁజాల' మని శ్రీ శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగా రభిప్రాయపడిరి.

# కృతజ్ఞత

ఈ వ్యాఖ్యాన రచనలో నా కుపయోగపడిన గ్రంథములు.

1. శ్రీ మానవల్లి రామకృష్ణకవి పరిష్కృత కుమారసంభవ ప్రతి (1914)

2. నన్నెచోడుని కుమార సంభవమునందలి ప్రథమ, తృతీయ, చతుర్థాశ్వాసములకును. బంచమాశ్వాసమునఁ బదునైదవ గద్యము వఱకును శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు రచించిన వ్యాఖ్యానపు వ్రాఁతప్రతి.

3. శ్రీ బులుసు వేంకటరమణయ్య కృత లఘువ్యాఖ్యతోఁ గూడిన వావిళ్లవారి నన్నెచోడుని కుమారసంభవప్రతి.

4. శ్రీ నేలటూరి వేంకట రమణయ్యగారు నన్నెచోడుని కుమారసంభవమునందలి మొదటి నాలుగాశ్వాసములకును రచించిన వ్యాఖ్యానము.

5. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు రచించిన 'నన్నెచోడుని కుమార సంభవము - వ్యాఖ్య - విమర్శ - పాఠ పరామర్శ'

పయి గ్రంథముల రచయితలకు నా కృతజ్ఞతలు.

# కుమార సంభవము

## ప్రథమాశ్వాసము

స్రగ్ధర

శ్రీవాణీంద్రామరేంద్రార్పిత[1] మకుట మణిశ్రేణిధామాంఘ్రి[2] పద్మా
జీవోద్యత్కేసరుం డాశ్రితజనలషితాశేషవస్తుప్రదుం డా
దేవాధీశుండు నిత్యోదితుఁ డజుఁడు మహాదేవుఁ డాద్యుండు విశ్వై
కావాసుం డెప్పుడున్ మా కభిమతములు ప్రీతాత్ముఁడై యిచ్చుఁగాతన్. 1

అర్థము: శ్రీ వాణీం........కేసరుండు: శ్రీ = లక్ష్మీదేవియొక్కయు, వాణీ=సరస్వతీదేవియొక్కయు, ఇంద్ర=పతులైన విష్ణు బ్రహ్మలచేతను, అమర+ఇంద్ర=సురపతి-ఇంద్రుని-చేతను, అర్పిత=ఉంపఁబడిన మకుట=కిరీటములయందలి, మణి=రత్నములయొక్క శ్రేణి=వరుసలయొక్క ధామ=కాంతులు, అంఘ్రి-పద్మ=అడుగుఁదామరలచే, ఆజీవ = బ్రదుకు గలిగి- ఉద్యత్ = ప్రకాశించుచున్న, కేసరుండు = అకరువులు గలవాఁడును, ఆశ్రిత....ప్రదుండు: ఆశ్రిత = ఆశ్రయించిన, జన=జనులచేత, లషిత=కోరఁబడిన, అశేష=ఎల్ల, వస్తు=అర్థముల యొక్క (ను), ప్రదుండు=ఇచ్చువాఁడును, నిత్య+ఉదితుఁడు=శాశ్వతుఁడని చెప్పఁబడినవాఁడును, నిత్యమయిన వాక్కు గలవాఁడు - అనఁగా వేదములే యాతని వాక్కుట అనియేనియు, అజుఁడు=అభవుఁడును-పుట్టుక లేనివాఁడును, ఆద్యుండు=మొదటి వాఁడును, విశ్వ+ఏక+ఆవాసుండు=సర్వమునందు ముఖ్యముగా నుండువాఁడును, అగు, ఆ-దేవ+అధి+ఈశుండు=ప్రసిద్ధుఁడగు దేవతాధిపతి, మహాదేవుఁడు=ఈశ్వరుఁడు, ఎప్పుడున్, ప్రీత+ఆత్ముఁడు+ఐ=సంతోషించిన మనస్సు గలవాఁడయి, మాకున్, అభిమతములు=కోరికలు, ఇచ్చున్+కాతన్=ఇచ్చుఁగాక.

తాత్పర్యము: విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుఁడు తమ శిరస్సులను మోపఁగాఁ దత్కిరీటములందలి మణులకాంతులు తన అడుగుఁదామరలకు అకరువులుగాఁ గలవాఁడును, ఆశ్రయించిన జనులు కోరిన యెల్ల యర్థముల నిచ్చువాఁడును, శాశ్వతుఁ

1. ర్పిత. 'అర్పిత' పాఠమే సమన్వయానుకూలము. 2. వాము, కాము,

డని చెప్పఁబడువాఁడును, వేదములు వాక్కులయిన వాఁడును, పుట్టుకలేనివాఁడును మొదటివాఁడును, అన్నిటియం దుండువాఁడును అగు ఆ దేవతా ప్రభువు మహేశ్వరుఁడు సంతుష్టాంతరంగుఁడై మా కెప్పుడును గోరికల ననుగ్రహించును గాక!

విశేషములు :- కావ్యమును శ్రీకారముతోను, మగణముతోను ప్రారంభించుట మంగళప్రదము. కృత్యాది నాశీర్నమస్క్రియా వస్తునిర్దేశములలో నేదో యొక్కటి యుండవలయునను నియమము చెప్పిన నిందు ఆశీరూప మంగళాచరణము గావింపఁబడినది. కావ్యము మంగళాది, మంగళమధ్యము, మంగళాంతము గావలయు ననుటచే నిది యిట్లు మంగళాది యైనది. కావ్యాంతమున 'మంగళమహాశ్రీ' యని యుండుటచే మంగళాంత మయినది. కృతికర్తయగు నన్నెచోడఁడు శైవుఁడు. కృతిపతి శివస్వరూపుఁడగు జంగమ మల్లికార్జునుఁడు. కావ్యనాయకుఁడు శివుఁడే, కావున నీ మొదటి పద్యమునందలి శివ విశేషణము లన్నియుఁ దన్మహత్త్వ ద్యోతకములై యా దేవుని సర్వదేవతాధిపతిత్వమును స్థాపించుచున్నవి. ఇం దెచ్చటను 'అంకిత' మనుమాట లేకున్నను, 'మల్లికార్జున మునికిన్' 'నా చెప్పంబూనిన' అని యుండుటచే, నీ కృతికిఁ బతి జంగమ మల్లికార్జునుఁడే యని భావింపవచ్చును. మహాదేవుఁ 'డాశ్రితజనలషితాశేషవస్తుప్రదుఁ' డగుటచేఁ, దదాశ్రితులమే యైన మా కభిమతములు తప్పక యనుగ్రహించు ననుట. 'ఆశ్రితజ'నేత్యాది మహాదేవ విశేషణము సాభిప్రాయ మగుటచే నలంకారము పరికరము. 'అలఙ్కారః పరికర స్సాభిప్రాయ విశేషణైః'- చన్ద్రా.

వాణీ+ఇంద్ర = వాణీంద్ర, ధామ + అంఘ్రి = ధామాంఘ్రి ....... సవర్ణదీర్ఘ సంధులు- అ, ఇ, ఉ, ఋ, ఌ, లకు సవర్ణములయిన అచ్చులు పరములగునపుడు వాని దీర్ఘము లేకాదేశములగును. అమర + ఇంద్ర = అమరేంద్ర ......... గుణసంధి, అ, ఆ లకు ఇ, ఉ, ఋ, ఌ, అను నచ్చులు పరము లగునపుడు క్రమముగా ఏ, ఓ, అర్, అల్ అనునవి యేకాదేశము లగును. విశ్వ + ఏక = విశ్వైక- వృద్ధి సంధి. అ, ఆలకు ఏ, ఐలు పరము లైనచో ఐకారమును, ఓ, ఔలు పరము లైనచో ఔకారమును ఏకాదేశము లగును, నిత్యోదితుఁడు- నిత్య + ఉదితుఁడు- వద్ ధాతు క్తప్రత్యయాంత రూపము. వద్ + త- వద్‌లోని వకారమునకు సంప్రసారణము వచ్చి ఉద్ + త. ఇడాగమమయి ఉదిత = చెప్పఁబడిన.

కావ్యారంభమున స్రగ్ధరా వృత్తమును వాడి, అందు మగణముతో రగణమును గదియించుటచే నీ కవి యుద్ధమున మరణించెనని యొక కింవదంతి గలదు. దాని కాధారమీ పద్యము.

క. మగణమ్ముఁ గదియ రగణము - మగపక కృతి మొదల నిలుపువానికి మరణం
బగు నిక్కమంద్రు మడియఁడె - యగునని యిది దొల్లి వెంకణాదిత్యుం
డనిన్" అథర్వణచ్ఛందము,

కాని కాళిదాసుకూడఁ దన యభిజ్ఞాన శాకుంతలమును "యా సృష్టిః స్రష్టు రాద్యా" యని సప్గ్ధరా వృత్తముతోనే ప్రారంభించి మగణముతో రగణమును గదియించెనుగదా; అతని కట్లు జరిగె ననుమాట వినఁబడదే!

'అర్చిత' 'కామ' అను పాఠములకంటె, 'అర్పిత' 'ధామ' అను పాఠములే మే లయినవి. అన్వయ సౌలభ్యము గలవి. ఈ కవి ప్రయోగపద్ధతి ననుసరించి రేఫ సంశ్లేషమునందు రేఫమునకుఁగాక, తక్కిన వ్యంజనమునకే యతిమైత్రి పొసఁగించెను గావున 'అర్చిత' అనునదియే సరియైన పాఠమని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు.

కాతన్- అగు+డుజ్.' లూట్టు డుఙ్ఞున కెడు త వర్ణంబులు ద్రుతాంతంబు లగు', అగు + తన్. బాల. క్రియ. 26. 'లాఁతిచో సహితము కాదేశాదులు గానంబడియెడి.' బాల. క్రియ. 102 - కాతను. స్రగ్ధర- నాలుగు పాదము లుండును. ప్రతిపాదమునను మ-ర-భ-న-య-య-య- అను గణము లుండును, మొదటి యక్షరమునకును, ఎనిమిదవ, పదునేనవ యక్షరములకును యతిమైత్రి, ప్రాసనియమము గలదు. ఇం దీశ్వరు నవ్యక్త స్వరూపము వర్ణింపఁబడినది.

## ఇష్టదేవతాస్తుతి

సీ. రమణీయ శృంగార రజత పర్వతము నా
శోభిల్లు[1] శుద్ధ విస్ఫూర్తి మూర్తి
ఆ పర్వతాగ్ర హేమైక శృంగంబు నా
నమరు జటా మకుటాతి భాతి

1. సిద్ధ.

ఆ తుంగ శృంగజలాపూర్ణ[1] సరసి నాఁ
బొంగారు జాహ్నవీ భూరి వారి
ఆ నిమ్న సరసీ విహార మరాళికా
పంక్తి నా నొప్పు కపాలమాల[2]

ఆ,వె. ఆ మహామరాళికాబర్హ కాంభోజ
పుష్ప నిభ సముత్థ భోగ భోగి
సమితిఁ దాల్చి[3] పొల్చు శంకరుఁ డంబికా
ధవుఁడు మా కభీష్టదాత గాత. 2

అర్థము : రమణీయ-శృంగార-రజత-పర్వతము-నాన్ = మనోహరమైన సొగసుగల వెండికొండ (కైలాసము) యనఁగా, శోభిల్లు=ప్రకాశించు, శుద్ధ-విస్ఫూర్తి-మూర్తి=శుభ్రమైన ప్రకాశముతోడి యాకారము,

ఆ-పర్వర + అగ్ర-హేమ + ఏక-శృంగంబు-నాన్ = ఆ, (వెండి) కొండయొక్క, పయి భాగమునందలి, బంగారు, శిఖరము, అనఁగా, అమరు = ఒప్పునట్టి, జటా-మకుట + అతి-ఖాతి = జడ లనెడి కిరీటముయొక్క అధికమైన కాంతి,

ఆ-తుంగ-శృంగ-జల + ఆపూర్ణ-సరసి-నాన్ = ఆ, ఎత్తైన శిఖరమునందలి, నీటితో, బాగుగా నిండిన, సరస్సు, అనఁగా, పొంగు + ఆరు = ఉప్పొంగునట్టి, జాహ్నవీ-భూరి-వారి = గంగానదియొక్క, అధికమైన, నీరు,

ఆ-నిమ్న-సరసీ-విహార-మరాళికా-పంక్తి-నాన్ = ఆ, లోఁతయిన, సరస్సునందు, సంచారముగల (సంచరించు), ఆఁడు హంసల, వరుస యనఁగా, ఒప్పు, కపాల-మాల = పుఱ్ఱెల దండ,

1. శిలా. 2. ఠీల, 3. దార్చి.

ఆ-మహా... ...సమితిన్: ఆ-మహత్ (మహా)+ మరాళికా=ఆ గొప్పవియగు నాఁడు హంసలయొక్క, ఆబ ర్హణ + అంభోజ-పుష్ప = దెబ్బలుగల తామరపూలతో, నిభ, =సమానమై, సముత్థ=లేచిన-విప్పారిన, భోగ=పడగలు గల, భోగి=పాముల యొక్క, సమితిన్ = సమూహమును, తాల్చి = ధరించి, పొల్చు + ఒప్పునట్టి, శంకరుండు = శివుఁడు, అంబికా - ధవుఁడు = పార్వతీదేవి భర్తయైనవాఁడు, మాకున్, అభీష్ట - దాత = కోరికల యొక్క (ను) ఇచ్చువాఁడు, కాతన్ = అగుఁగాక.

తాత్పర్యము :- మనోహరమైన సొగసు గల కైలాస మనునట్లు ప్రకాశించు తెల్లని యాకారమును, ఆ కొండపై నుండు బంగారు శిఖర మనునట్లొప్పు జడల కిరీటపు అధికమైన కాంతిని, ఆ యెత్తైన శిఖరమునందలి నీటితో బాగుగా నిండిన సరస్సు అనునట్లు ఉప్పొంగు గంగ యందలి అధికమైన నీటిని, ఆ గంభీరమైన సరస్సు నందు విహరించు నాఁడుహంసల వరుస యనునట్లు ఒప్పు పుఱ్ఱెల దండను, ఆ యాఁడుహంసల దెబ్బలు గల (కాడలతోడి) తామరపూలతో సమానమై విప్పారిన పడగలు గల పాముల సమూహమును ధరించి యొప్పు పార్వతీభర్త యగు శంకరుఁడు మాకుఁ గోరికల నిచ్చువాఁడు అగుఁగాక.

విశేషములు :- ఇందు శివుని వ్యక్త స్వరూపము వర్ణింపఁబడినది. కైలాసము వెండికొండ గావున తెల్లగా నుండును, దానివలెఁ దెల్లనైనది శివుని ఆకారము. వెండి కొండపై బంగరు శిఖరము వలెఁ దెల్లని దేహము గల శివునిపై జటా కిరీటము ప్రకాశించును. ఆ కొండపై నుండు జలాపూర్ణ సరస్సువలె శివుని శిరస్సుపై గంగా నది కలదు. ఆ సరస్సులో విహరించు నంచపిండువలె శివునకుఁ గపాలమాల కలదు. ఆ యంచలు పెకలించిన తామరపూల వంటి విప్పారిన పడగలు గల పాముల సరఁడు ధరించెను. ఇట్లు కవి మొత్తము కైలాస పర్వతమువలెనే యొప్పు శివునిఁ గన్నులకుఁ గట్టించినాఁడు. అందుచే నిది శివుని వ్యక్తస్వరూప వర్ణన. సీసమునందలి యొక్కొక్క పాదమునందు నుత్ప్రేక్షాలంకారము గలదు, శంకరుఁడు = శుభములను జేయువాఁడు కావున అభీష్ట ప్రదుఁడు తప్పక అగును. శంకరుఁడను విశేష్య మిట సాభిప్రాయము గావున నలంకారము పరికరాంకురము.' సాభిప్రాయే విశేష్యే తు భవే త్పరికరాఙ్కురః'- భర్గుఁ, పర్వతము, ఆ పర్వతము శృంగము, ఆ శృంగమునందలి సరసి, ఆ సరసిలోని

యంచలు, ఆ యంచల దెబ్బలు గల తామరలు. ఇట్లు చెప్పి విడిచిన దానినే మరల గ్రహించుట రమ్యముగా నున్నది. ముక్తపదగ్రస్తచ్ఛాయ కలదు. సీసపద్యమునందలి ప్రతిపాదాంతమునను - స్ఫూర్తి మూర్తి, (మకు) టాతి ఖాతి, భూరి వారి, (క) పాల మాల అను రీతిగా ననుప్రాసము గలదు. ఆటవెలఁది పాదముల చివరఁగూడ - భోగ భోగి, దాత గాత. అనుప్రాసము గలదు. అనుప్రాసము కొఱకే యేమో 'భోగి భోగి' యను పాఠము అకాడమీ ప్రతిలో స్వీకరింపఁబడినది. కాని అర్థ సౌలభ్యముకయి యా పాఠము విడువఁబడినది.

చ. హరి వికచామలాంబుజసహస్రము పూన్చి మృగాంకునం[1] దవి
స్ఫురిత మలాసితాబ్జమని పుచ్చఁగఁ జాఁచిన చేయి చూచి చం
దురుఁ డది రాహుసావి వెఱఁ దుప్పలఁదూలఁగ జాఱుచున్న న
య్యిరువురఁ జూచి నవ్వు పరమేశ్వరుఁ డీవుత మా కభీష్టముల్. 3

అర్థము:- హరి = విష్ణువు, వికచ + అమల + అంబుజ - సహస్రము = వికసించిన, నిర్మలమైన, తామరల, వేయి, పూన్చి = సమర్పించి, మృగ + అంకున్ = లేడిచిహ్నముగాఁ గలవానిని-చంద్రుని, అందున్ = ఆ పూజాపుష్పములలో, అవిస్ఫురిత - మల + అసిత + అబ్జము = వికసింపని, మాలిన్యముచే, నల్లనైన, తామర, అని, పుచ్చఁగన్ = తొలఁగించుటకు, చాఁచిన = చాఁచినట్టి, చేయి, చూచి, చందురుఁడు = చంద్రుఁడు, అది = ఆ విష్ణుని చేయి, రాహు - సావి = రాహువని, వెఱన్ = భయముతో, తుప్పలఁదూలఁగన్ = మిక్కిలి చలింపఁగా, జాఱుచున్ + ఉన్నన్ = జాఱుచుండఁగా, ఆ + ఇరువురన్ = ఆ యిద్దఱను (విష్ణువును, చంద్రుని), చూచి, నవ్వు = నవ్వెడు, పరమ + ఈశ్వరుఁడు, మాకున్, అభీష్టముల్ = కోరికలు, ఈవుతన్ = ఇచ్చుఁగాక.

తాత్పర్యము :- విష్ణువు వికసించినవి అమలములు నైన వేయి తామరలతో శివుని శిరస్సును బూజించుచుండెను, అప్పు డతనికి శివ శిరశ్చంద్రుఁడు కనఁబడెను, మచ్చతోడి చంద్రుని జూచి యతఁడు వికసింపక మలినమై నల్లనైన తామర యని భ్రాంతినొంది, తాను అమలములైన తామరలు వైవఁగా నిది యెక్కడనుండి

---

1. ప్రా. ప్ర. కంఠ, అకా. నం

వచ్చినదను చికాకుతో దానిని దొలఁగింపఁ దనచేతిని జాఁచెను. అతని నల్లని చేతిని జూచి చంద్రుఁడు తన్ను మ్రింగవచ్చు రాహువని భ్రాంతిపడి భయముచే మిక్కిలి చలించి జాఱెను. ఇది యేదో మనము తాఁకకయే జాఱుచున్నదే యని విష్ణువును జాఱెను - వెనుదీసెను. ఇట్లు జాఱుచున్న ఆ యిరువురను- విష్ణు చంద్రులను జూచి నవ్వు పరమేశ్వరుఁడు మాకుఁ గోరికలను దీర్చుఁగాక.

విశేషములు :- తాను శివునిఁ బూజించినది అమలాంబుజములతో కాఁగా. నీ అవిస్ఫురిత మలాసితాబ్జ మెచ్చటినుండి వచ్చెనని విష్ణుని సందియము. విష్ణువునకుఁ జంద్రునియందు అబ్జభ్రాంతి. అబ్జశబ్దమునకుఁ దామరయేకాక చంద్రుఁడనియు నర్థ ముండుట గమనార్హము. చంద్రునకు నీలమేఘశ్యాముఁడగు విష్ణుని నల్లనిచేతియందు రాహుభ్రాంతి. రాహువు సర్పాకారుఁడయి నల్లగానుండును గదా! తన్ను మ్రింగ వచ్చుచున్నాఁడని రాహు వనినఁ జంద్రునకు భయము. కావుననే యతఁడు దుప్పలఁదూలి జాఱుట. శివుఁడు సర్వజ్ఞుఁడగుటచే భ్రాంతి యెఱుఁగనివాఁడు. అతఁడు విష్ణుచంద్రుల భ్రాంతిని బోఁగొట్ట సమర్థుఁడు. భ్రాంతిగ్రస్తులమైన మాకును భ్రాంతిని బోఁగొట్టి యభీష్టముల నీఁగలవాఁ డనుట. ఇందు శివుని దయాళుత, సామర్థ్యము ప్రతిపాదితములు. అలంకారము భ్రాంతిమంతము.

తుప్పలఁదూలు- తూలు + తూలు అని శబ్దరత్నాకరకారుని పదచ్ఛేదము. అప్పుడు అందదుకు ప్రభృతులలోనిదయి' అందదుకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు 'బాల-సంధి. 42 అనుదానికి లక్ష్యమగును. ఈవుతన్ = ఇచ్చుతన్. 'లాఁతిచో సహితము కాదేశాదులు గానంబడియెడి.' బాల. క్రియ. 102. అనుదానిచే ఇచ్చునకు 'ఈవు' ఆదేశము. రాహు సావి = రాహువని. సావి = (రూ) సవి. దీని కిందే ప్రయోగాంతరము- 'తన నీడ నీరిలోపలఁ, గని యది ప్రతిగజము సావి కడుకొని కోపంబునఁ దాఁకి పోరఁ జొచ్చెను.' కుమా. సం. 1,65. '......... నిర్జర వాహినీ మహా, తోయము సావి చీర యెగఁద్రోచి ....' శివరాత్రి, 4.40. చంద్రుఁడు (ప్రకృతి) - చందురుఁడు (వికృతి). రాహు + సావి- 'రాహు బాహు శబ్దంబుల కంతట వు వర్ణకలోపంబు వైకల్పికంబు, 'ఆ + ఇరువురన్-ఆ + యిరువురన్- 'సంధి లేనిచోట స్వరంబుకంటెం బరంబయిన స్వరంబునకు యడాగమంబగు.' -బాల. సంధి, 3. 'త్రికంబుమీఁది యసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు.' బాల, సమాస, 14, 'ద్విరుక్తంబగు హల్లు పరంబగునపు డాచ్చికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు.' బాల. సమాస. 13, కవి శైవుఁడగుట, విష్ణుని

శివపూజకునిగాఁ జేయుటయేగాక, యతనిని శివునకుఁ బరిహాసాస్పదునిగాఁ జేయుటయు గమనింపఁ దగినది, 'హరి స్తే సాహస్రం కమలబలి మాధాయ పదయోః' - శివమహిమ్నః 19. అని విష్ణుఁడు శివుని వేయితామరలతోఁ బూజించుట ప్రసిద్ధమే.

ఉ. వీంగు నపారసత్త్వ గుణవిస్ఫురణం బరమేశ్వరోరువా
మాంగమునందు ము న్నుదయమై నియమస్థితిఁ గొల్చి తద్దయున్
[1]లోంగొని పేర్మితో నఖిలలోకములుం దగఁ గాచుచున్న వే
దాంగు ననంతు విష్ణుఁ గమలాధిపు సంస్తుతిఁ దేల్తు సమ్మతిన్. 4

అ ర్థ ము : వీంగు = వీఁగు = విజృంభించు నట్టి, అపార-సత్త్వ-గుణ-విస్ఫురణన్ = అధికమైన సత్త్వ మనెడి గుణముయొక్క ప్రకాశముతో, పరమేశ్వర + ఉరు-వామ + అంగము + అందున్ = పరమేశ్వరునియొక్క, పెద్దదియగు, ఎడమ మేని యందు, మున్ను = పూర్వము, ఉదయము + ఐ = పుట్టి, నియమ-స్థితిన్ = నిష్ఠతో. కొల్చి = సేవించి, తద్దయున్ = మిక్కిలి, లోంగొని = లోఁగొని = వశపఱుచుకొని, పేర్మితోన్ = ప్రేమముతో, అఖిల-లోకములున్ = ఎల్లలోకములును, తగన్ = సముచితముగా, కాచుచున్ + ఉన్న = రక్షించుచున్న, వేద + అంగున్ = వేదము శరీరముగాఁ గలవానిని, అనంతున్ = అంతములేనివానిని, కమలా + అధిపున్ = లక్ష్మియొక్క, పతిని, విష్ణున్ = విష్ణుని, సమ్మతిన్ = అభిలాషతో, సంస్తుతిన్ = స్తోత్రముతో, తేల్తున్ = సంతోషపెట్టుదును.

తా త్ప ర్య ము :- విజృంభించు సత్త్వగుణస్ఫూర్తితోఁ బరమేశ్వరుని మేని యెడమభాగమునందు ముందు పుట్టి, నిష్ఠమై నతనిని సేవించి, తదనుగ్రహమున నెల్లలోకములను మిక్కిలి వశపఱుచుకొని, ప్రేమముతో సముచితముగాఁ గాచుచున్న వేదశరీరుఁడు, అనంతుఁడు, లక్ష్మీపతియు నగు విష్ణుని సమ్మతితో సంస్తుతించి సంతోషపెట్టెదను.

వి శే ష ము లు :- వీంగు, లోంగొను అనునవి వీఁగు, లోఁగొను అనువాని ప్రాచీనరూపములు. తత్ప్రయోగము నన్నెచోడని ప్రాచీనతకు నిదర్శన

---

1. లోంగిన.

మందురు. ఇప్పటి వీఁగు, లోఁగొను అనువానిని ఉంచినచో ఖండ పూర్ణ బిందు పూర్వకాక్షరములకుఁ బ్రాసమైత్రి నంగీకరింపవలసివచ్చును. త్రిమూర్తులలో విష్ణువు సత్త్వగుణ ప్రధానుఁడు. బ్రహ్మ రజోగుణప్రధానుఁడు. విష్ణువును బరమేశ్వర వామాంగమునం దుద్భవించినవానినిగను, వానిని నియమస్థితిఁగొల్చి నట్లును జెప్పుటచే విష్ణుస్తుతి వ్యాజమున శివుని మహత్త్వమే యిందుఁ బ్రతిపాదింపఁబడినట్లయినది.

విష్ణువు శివుని వామాంగమున జనించెనని యిందుఁగలదు. పాల్కురికి సోమ నాథుని పండితారాధ్యచరిత్రమునను నిట్లే కలదు.

'ఆది నీశ్వరుని వామాంగంబు చెమట

శ్రీ దయితుండు జనించిన తద్విధంబు' – పండితా. వాదప్రకరణము.

కాని బొడ్డపాటి పేరయ తన విజయవాటి మల్లికార్జున శతకమున 'దక్షిణాంగంబ యస్త్రంబుచేసి' అని విష్ణుని శివ దక్షిణాంగ జనితునిగాఁ జెప్పినాఁడు.

చ. అమిత రజోగుణ స్ఫురణ నావహమై పరమేశు దక్షిణాం
గమున జనించి భక్తిఁ జిరకాలము సద్విధిఁ గొల్చి తత్ప్రసా
దమున నజాండఖాండ[1]జని తత్త్వ సువేద కళాగమాది వి
శ్వము సృజియించి పొల్చు నజు వాగ్విభు సంస్తుతి చేసెదన్[2] మతిన్. 5

అర్థము : అమిత-రజస్ (ః)+గుణ-స్ఫురణన్=అధికమైన రజస్సనెడి గుణముయొక్క, స్ఫూర్తిచే, ఆవహము+ఐ=కలిగినదియై, పరమేశు-దక్షిణ+అంగమునన్ = పరమేశునియొక్క, కుడిమేనియందు, జనించి = పుట్టి, భక్తిన్=భక్తితో, చిర-కాలమున్=చాలకాలమును, సత్+విధిన్=మంచి నియమముతో, కొల్చి=సేవించి, తద్+ప్రసాదమునన్=ఆ శివుని యనుగ్రహముచేత, అజ+అండ-ఖాండ-జని-తత్త్వ-సువేద-కళా+ఆగమ+ఆది-విశ్వమున్=కుండవంటి బ్రహ్మాండము యొక్క పుట్టుక, చతుర్వింశతి తత్త్వములు, మంచి వేదవిద్యలు, శైవాగమములు

1. వావిళ్ల ప్రతి పాఠము-లోక. 2. చేయు సన్మతిన్.

మున్నగువానితోడి ప్రపంచమును, సృజియించి=పుట్టించి, పొల్చు=ఒప్పునట్టి, వాచ్-వాక్+విభున్=సరస్వతీదేవి భర్త, అగు, అజున్=బ్రహ్మను, మతిన్=మనస్సునందు, సంస్తుతి-చేసెదన్=స్తోత్రము చేయుదును.

తాత్పర్యము : సత్త్వగుణమున విష్ణువు శివుని వామాంగమున జనింపఁగా, అధిక రజోగుణస్ఫూర్తిచేఁ గలిగి, పరమేశ్వరుని కుడి మేనఁబుట్టి, చాలకాలము భక్తితో యథావిధి సేవించి, యతని యనుగ్రహముచే బ్రహ్మాండభాండమును, తత్త్వములు, వేదవిద్య, శాస్త్రములు మున్నగువానితోడి విశ్వమును బుట్టించి యొప్పునట్టి సరస్వతీ భర్తయైన బ్రహ్మను మనసునందు స్తుతింతును.

విశేషములు : కవి యిందును బ్రహ్మ శివుని దక్షిణాంగమునఁ బుట్టె ననియు, నతని జిరకాలము సద్విధిఁ గొలిచెననియు, నతని యనుగ్రహముననే విశ్వసృష్టిని జేసెనని యుఁజెప్పుచు బ్రహ్మస్తుతి వ్యాజమున శివుని మాహాత్మ్యమునే ప్రతిపాదించినాఁడు, కవి శైవమతాభినివేశ మిందు వ్యక్తమగుచున్నది.

పొల్చునజు-పొల్చు+అజు. 'ఉదంతమగు తద్ధర్మార్థ విశేషణమున కచ్చు పరమగునపుడు నుగాగమంబగు.' బాల సంధి. 33.

'సంస్తుతిచేతు సన్మతిన్' అను పాఠము కంటె 'సంస్తుతి చేసెదన్ మతిన్' అను పాఠము వ్రాఁత ప్రతి లిపి కనుగుణము. సుందరము. 'చేతు' నను నసాధు రూపము పరిహృత మగును.

వాగ్విభు-వాచ్+విభు-చవర్గాక్షరములకు ఝల్ వర్ణములు పరములగునపుడును, పదాంతమునందును, కవర్గాక్షరములు ఆదేశము లగును. (అనునాసికములు, అంతస్థములు తప్పఁదక్కిన హల్లులకు ఝల్ అనునది ప్రత్యాహార సంజ్ఞ.) అంతస్థములు- య ర ల వ. వాక్+విభు- అనునాసికేతర వర్గీయాక్షరములకు నాదహల్లు పరమగునపుడు ఆయా వర్గముల తృతీయాక్షరము లాదేశము లగును- వాగ్విభు. రజోగుణ- రజస్+గుణ-పదాంత సకారమునకు విసర్గాదేశము. రజః+గుణ. హ్రస్వ అకారము తరువాత వచ్చు విసర్గమునకు హ్రస్వ అకారముగాని, మృదు హల్లులు (హశ్శులు) గాని పరములగునపుడు 'ఉ' ఆదేశమయి, పూర్వమందున్న అకారముతోఁగూడి గుణ సంధియై ఓ గా మారును. రజోగుణ.

చ. అనుపమ దివ్యమూర్తి యను నంతియకాదు భవాష్టమూర్తులం
దును వరమూర్తి దాన, ప్రభతోడ జగజ్జన రాజి కెల్ల నిం
దనయముఁ దాన దృష్టి యను నంతియకాదు త్రిలోచనాదిలో
చనమును దానయైన రవి చారు నిజ ప్రభ మాకు నీవుతన్. 6

అర్థము :- అనుపమ - దివ్య - మూర్తి = సాటిలేనిదియు, అమానుషము అయినదియు నైన ఆకారము గలవాఁడు, అను + అంతియ - కాదు = అనునంత మాత్రమే కాదు, భవ+ అష్ట -మూర్తులందును = శివుని యొక్క ఎనిమిది మూర్తుల లోను, తాను + అ = తానే, వర - మూర్తి = శ్రేష్ఠమైన మూర్తి, ప్రభతోడన్ = కాంతితో, జగత్ +జన -రాజికిన్ = లోకమునందలి జనులయొక్క వరుసకు, ఎల్లన్ = అంతకును, ఇందున్, అనయమున్ = ఎల్లప్పుడును, తాన = తానే, దృష్టి = చూపు, అను + అంతియ-కాదు, త్రిలోచన + ఆది - లోచనమును = ముక్కంటియొక్క (మూఁడు కన్నులలో) మొదటిదైన, కన్నును, తాను + అ, ఐన, రవి = సూర్యుఁడు, చారు - నిజ - ప్రభన్ = మనోహరమైన, తనదైన, వెలుఁగును, మాకున్, ఈవుతన్ - ఇచ్చుఁగాక.

తాత్పర్యము :- నిరుపమానము, అమానుషమునైన ఆకారము గల వాఁ డనునంతమాత్రమే కాదు - శివుని యెనిమిది మూర్తులలోను దానే శ్రేష్ఠమైన మూర్తి. తన వెలుఁగుతో లోకమునందలి ప్రాణికోటి కంతకును దానే యెల్లప్పుడును దృష్టి యనునంత మాత్రమే కాదు- ముక్కంటియైన శివునకుఁ గల మూఁడుకన్నులలో మొదటి కన్నయిన వాఁడును దానేయైన సూర్యుఁడు మాకుఁ దనదైన వెలుఁగు నిచ్చుఁగాక.

విశేషములు :- త్రిమూర్తులను స్తుతించిన పిమ్మట సూర్యుని స్తుతించుటకు సూర్యుఁడు శివుని యష్టమూర్తులలో నొకఁడగుటయే కారణము. తన వంశమునకు మూలపురుషుఁ డగుటయు నింకొక కారణము. భవాష్ట మూర్తులు -పంచభూతములు (పృథివి, నీరు, తేజస్సు, వాయువు, ఆకాశము), సూర్యుఁడు, చంద్రుఁడు, యజమానుఁడు. త్రిలోచనాదిలోచనము - త్రిలోచనుని కన్నులు-సూర్యుఁడు, చంద్రుఁడు, అగ్ని, వానిలో మొదటిది సూర్యుఁడనుట. 'చారు నిజప్రభ' యనుట లోకమున వ్యక్తి

ముగాఁ గానవచ్చు మండుటెండ కంటె సౌమ్యమయిన ప్రభ యింకొకటి కలదనియు, సూర్యుఁడు దానిని ప్రసన్నుల యెడలఁ బ్రసాదించుననియుఁ దెల్పుటకు. 'రాజికెల్ల నెం-దనయము' అని కవి పాఠమేని, సూర్యకాంతి భూలోకముననే కాక యూర్ధ్వలోకముల కన్నింటికింగూడఁగలదని తెల్పు టగును,' వే. ప్ర. శా.

జగజ్జన = జగత్ + జన - సకార తవర్గములకు శవర్ణచవర్గములతో పూర్వమందైనను, పరమందైనను కూడిక గలుగునపుడు క్రమముగా శవర్ణ చవర్గ వర్ణములాదేశమగును. శ్చుత్వసంధి. అంతియ = అంత + ఎ = అంత + ఇయ -

చ. తను వసితాంబుదంబు, సితదంత ముఖం[1] బచిరాంశు, వాత్మగ
ర్జన మురుగర్జనంబుఁ, గర సద్రుచి శక్ర శరాసనంబునై
చన మదవారివృష్టి హితసస్యసమృద్ధిగ నభ్రవేళ నాఁ
జను గణనాథుఁ గొ[2]ల్తు ననిశంబు నభీష్టఫల[3]ప్రదాతగాన్. 7

అర్థము :- తనువు = శరీరము, అసిత + అంబుదంబు = నల్లని మేఘము, సిత-దంత- ముఖంబు = తెల్లని దంతము నగ్రము, అచిర + అంశువు= మెఱపు, ఆత్మ- గర్జనము – తనయొక్క, ధ్వని, ఉరు-గర్జనంబున్ = గొప్పది యగు మేఘధ్వనియును, కర-సత్ + రుచి = తొండముయొక్క, మంచి, కాంతి, శక్ర- శరాసనంబున్ = ఇంద్రధనుస్సును, ఐ = అయి, చనన్ = ఒప్పఁగా, మద-వారి- వృష్టిన్- మదజలమనెడు వర్షముచే, హిత-సస్య- సమృద్ధి + కన్ = మేలనెడు పంటయొక్క పుష్కలత్వము కాఁగా, అభ్ర-వేళ = వర్షాకాలము, నాన్ = అనఁగా, చను = ఒప్పునట్టి, గణనాథున్ = విఘ్నేశ్వరుని, అభీష్ట-ఫల- ప్రదాత+ కాన్ = కోరిన ఫలముల నిచ్చువాఁడుగా, అనిశంబున్ = ఎల్లప్పుడును, కొల్తున్= సేవింతును.

తాత్పర్యము :- శరీరము నల్లని మేఘమును, తెల్లని దంతము నగ్రము మెఱపును, తాను జేయు ధ్వని గొప్ప యుఱుమును, తుండకాంతి ఇంద్రధనుస్సును అయి

---

1. వా. ప్రతి. ముఖగం. 2. వా. ప్రతి. డెప్పు. 3. వా. ఫలంబు మా కిలన్.

యొప్పఁగా మదజల వర్షముచే భక్తుల మేలనెడు సంట పెంపొంద వర్షాకాల మన నొప్పు గణపతిని గోరిన యర్థముల నిచ్చువానినిగా నెల్లప్పుడును సేవింతును.

విశేషములు:- "సితదంతయుగంబు" అనుదానికి 'సితదంతముఖంబు' అని శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారి సవరణ. వినాయకుఁ డేకదంతుఁడుగదా- 'దంతాగ్రము నోరుమూసినపుడు గానరాక తెఱచినపుడు గానవచ్చును. అందుచే నచిరాంశు సామ్యము సుందరముగా నుండును. నీలమేఘమే తనువు, మెఱపే తెల్లని దంతముకొన, ఉఱుమే గర్జ, ఇంద్రధనువే తొండముకాంతి- ఇట్లు వర్షాకాలపు లక్షణములన్నియు గణపతి యందుండుటచే నతనిని వర్షాకాలముతో రూపించుట జరగినది. వర్షాకాలము సస్య సమృద్ధిని గలిగించునట్లు, గజముఖుఁడు మదజలమనెడు వర్షముచే భక్తులకు హితమును గలిగించును. ఇట్లు ఉపమేయోపమానముల కభేదము చెప్పఁబడుటచే నలంకారము రూపకము. 'విషయ్యభేద తాద్రూప్యరఞ్జనం విషయస్య యత్ రూపకమ్.' చన్ద్రా,

కొల్తున్. కొలుచు- 'ఆచ్ఛికంబులం బదమధ్యంబుల నలఘరల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు.' బాల. ప్రకీర్ణ. 17. కొల్చు. తద్ధర్మాదులందు లాట్టగు- బాల. క్రి.5. కొల్చు + లాట్టు. లకారంబునకు దుడ్రూవురునుముఙ్గగు, బాల. క్రి. 8. కొల్చు+ను (ఉత్తమ పురుషైక వచనము) లాట్టు ముఙ్గు పరంబగునపుడు దుగాగమం బగు. బాల. క్రి. 22. కొల్చు +దు +ను- దువర్ణంబుతోడ దుగ్ధకారంబు తకారంబగు. కొల్తును. బాల. క్రియ. 108. అవసానంబునందు ద్రుతస్వరంబునకేని ద్రుతంబునకేని లోపంబు బహుళంబుగా నగు.. బాల, సంధి. 20. కొల్తున్.

క. తన జనకుఁ డురుస్థాణువు
జనని యపర్ణాఖ్య దా విశాఖుం డనఁగాఁ
దనరియు నభిమతఫలముల
జనులకు దయ నొసఁగుచుండు షణ్ముఖుఁ గొలుతున్. 8

అర్థము : తన జనకుఁడు=తన తండ్రి (శివుఁడు) ఉరు-స్థాణువు=గొప్ప వాఁడగు ఈశ్వరుఁడు, పెద్దమ్రోడు, జనని=తల్లి (పార్వతి), అపర్ణా + ఆఖ్య = అపర్ణ యను పేరు గలది, (అపర్ణ యనఁగాఁ బార్వతి), పర్ణములు లేనిది, తాన్ = తాను (కుమారస్వామి), విశాఖుండు = కుమారస్వామి, శాఖలు లేనివాఁడు, అనఁ

గాన్, లేనరియున్ = ఒప్పియును, జనులకున్ = మనుష్యులకు, అభిమత - ఫలము లన్ = కోరిన ఫలములను, కోరిన పండ్లను, దయన్ = దయతో, ఒసఁగుచున్ + ఉండు = ఇచ్చుచుండు, షణ్ముఖున్ = ఆఱు మొగములు గలవానిని - కుమార స్వామిని, కొలుతున్ = సేవింతును.

తాత్పర్యము:- తన తండ్రి గొప్పవాఁడగు స్థాణువు (శివుఁడు) - పెద్ద మ్రోడు. తల్లి అపర్ణ (పార్వతి) - పర్ణములు లేనిది. తాను విశాఖుఁడు (కుమార స్వామి) - శాఖలు లెనివాఁడు. ఏంత యేమన ఒక స్థాణువునకును, అపర్ణకును బుట్టిన వాఁడయి, తాను విశాఖుఁడై కుమారస్వామి తన భక్తజనులకు దయతోఁ గల్పవృక్షము వలెఁ గోరినఫలములను నొసఁగుచుండుట. అట్టి ఆఱు మొగముల సామిని భజింతును.

విశేషములు:- స్థాణు వనఁగా నీశ్వరుఁడును, మ్రోడును, 'స్థాణూ రుద్ర ఉమాపతిః', ప్రళయేఽపి తిష్ఠతీతి స్థాణుః- ప్రళయమునందు నుండువాఁడు - శివుఁడు- అమరము, అపర్ణయనఁగాఁ బార్వతియు, పర్ణములు లేనిదియు, 'అపర్ణా పార్వతీ దుర్గా మృడానీ చండి కాంబికా.' తపసి పర్ణానా మప్యనశనా దపర్ణా. తపస్సునందుఁబర్ణములను గూడ భుజింపనిది - పార్వతి - అమరము. విశాఖుఁడనఁగాఁ గుమారస్వామియు, విగత శాఖుఁడనియును. 'బాహులేయ స్తారకజి ద్విశాఖ శ్శిఖివాహనః' - వినా పక్షిణా - మయూరేణ శాఖతి వ్యాప్నోతీతి విశాఖః. పక్షియైన నెమలిచేఁ దిరుగువాఁడు- కుమార స్వామి - అమరము. ఫలము = లాభము, పండు, ఇట్లు అర్థద్వయము గల శబ్దము.ల నుపయోగించుటచే నలంకారము శ్లేషము. 'నానార్థసంశ్రయ శ్శ్లేషః' - చన్ద్రా. స్థాణువు, అపర్ణ, విశాఖ అయినది అభిమత ఫలముల నొసఁగు ననుట విరోధము. కాని ఆ శబ్దములకు శివుఁడు, పార్వతి, కుమారుఁడు అను నర్థములు చెప్పుటచే నా విరోధమున కాభాసత్వ మేర్పడుచున్నది కావున నలంకారము విరోధాభాసము. ఆభాసత్వే విరోధస్య విరోధాభాస ఉచ్యతే - చన్ద్రా. ఇందు విభావనాలంకారమును గలదు. 'విభావనా వినాపి స్యా త్కారణం కార్య జన్మచేత్- చన్ద్రా.

దీనిని బోలి సంస్కృతమున నింతకంటెఁ జమత్కృతి గల శ్లోక మున్నది.

స్థాణు ర్భవాన్ మూల విహీన ఏవ
పుత్రో విశాఖో జననీ త్వపర్ణా,
పరోపనీతైః కుసుమై రజస్రం
ఫల త్యభీష్టం కి మిదం విచిత్రమ్ -(ప్రసంగరత్నావళ్యదాహృతము.)

షణ్ముఖ - షట్ + ముఖ - అనునాసిక హల్లులు పరములగునప్పుడు వర్గములందలి మొదటి నాలుగక్షరములకును ఆ వర్గమునందలి అనునాసికాక్షరము వికల్పముగా నాదేశమగును - షణ్ముఖ, అనునాసిక సంధి.

క. హరుఁ డాదిగ సకల చరా
చర మయ జీవాళి నెల్ల సతతముఁ గామా
తురులుగ వశగతిఁ[1] జేసిన
మరుఁ డీవుత మఖిలవశ్యమతి మత్కృతికిన్. 9

అర్థము :- హరుఁడు = ఈశ్వరుఁడు, ఆదిగన్ = మొదలుగా, సకల - చర + అచర - మయ-జీవ + ఆళిన్ + ఎల్లన్ = అన్ని జడములు అజడములు అను వానితో నిండిన ప్రాణుల వరుస నంతను, సతతమున్ = ఎప్పుడును, కామ + ఆతురులుగన్ = కామముచేఁ పీడింపఁబడినవారినిగా, వశ - గతిన్ + చేసిన = లోఁబఱుచుకొనిన, మరుఁడు = మన్మథుఁడు, మత్ + కృతికిన్ = నా కావ్యమునకు, అఖిల - వశ్య - మతిన్ = ఎల్లరను వశపఱుచుకొనఁదగిన బుద్ధిని, ఈవుతన్ = ఇచ్చుఁగాక.

తాత్పర్యము :- ఈశ్వరుఁడు మొదలుకొని జడములు అజడములునైన యెల్ల జీవులను ఎల్లప్పుడును గామపీడితులనుగాఁజేసి వశపఱుచుకొను మన్మథుఁడు నా కావ్యమునకు ఎల్లరను వశపఱుచుకొనఁగల తెలివి నిచ్చుఁగాక.

విశేషములు :- మన్మథుఁడు హరునే కామాతురునిగాఁ జేసినవాఁడు. ఆ వృత్తాంతమును వర్ణించునదియే యీ కావ్యము. హరునే యట్లొనరింపఁగలవాని కితర జీవు లొకలెక్కలోనివారు కారు. మరుఁడు అందఱను వశగతిఁ జేసినవాఁడు గావునఁ గవి తన కావ్యమున కా గుణమునే అనుగ్రహింపుమని యతనిని వేఁడికొనుచున్నాఁడు. స్మరుఁడు (ప్రకృతి) - మరుఁడు (వికృతి). ఈవుతన్ + అఖిల = ఈవుత మఖిల- ఎడు త లద్రుతంబున కచ్చు పరంబగునపుడు మకారం బగు. బాల, క్రియ 28.

1. వశగతి

చ. ముని మను జాసు రాహి సురముఖ్యులు మున్నుగ సర్వజీవులం
దన వశ మర్థిఁజేసి మను దర్పకు నోర్చిన వీతరాగిఁ జి
ద్ఘనతను నీశు నాత్మ సుభగస్థితి మైమెయి నర్ధనారిఁ జే
సిన నగజాత మత్కృతిని జేకొని తత్సుభగత్వ మీవుతన్. 10

అర్థము: ముని - మనుజ + అసుర + అహి - సుర - ముఖ్యులు = మునులు, మనుష్యులు, రాక్షసులు, నాగులు, దేవతలు అను వారిలోఁ బ్రధానులు, మున్నుగన్ = మొదలుగా, సర్వ - జీవులన్ = ఎల్లప్రాణులను, తన - వశము = తన అధీనము, అర్థిన్ = సమర్థతతో, చేసి, మను = ఉండునట్టి, దర్పకున్ = మన్మథుని, (గర్వితుని)· ఓర్చిన = ఓడించిన, (ఆర్చిన) అనుచోఁగాల్చివైచిన యని యర్థమగును. వీత - రాగిన్ = పోయిన ప్రేమము గలవాఁడు - ప్రేమరహితుఁడు, అగు, ఈశున్ = ఈశ్వరుని, చిత్ + ఘన-తనున్ = జ్ఞానమనెడి గొప్ప శరీరము గలవాఁడును, ఆత్మ - సుభగ-స్థితిన్ = తనయొక్క, మంచి ప్రేమము యొక్క, ఉనికి చేత, మైమెయిన్ = అనాయాసముగా, శరీరమును శరీరమునఁ జేర్చి యనియేని, అర్ధ - నారిన్ = సగము స్త్రీగల వానినిగా, చేసిన = చేసినట్టి, నగ - జాత = కొండకూఁతురు - పార్వతి, మత్ + కృతిని = నా కావ్యమును, చేకొని = ఆదరించి, తద్ + సుభగత్వము = ఆ సౌభాగ్యమును, ఈవుతన్ = ఇచ్చుఁగాక, పార్వతి వలె నీ కృతియు సౌభాగ్యము గలిగి శివప్రియ యగుఁగాక యనుట.

తాత్పర్యము :- మునులు, మనుజులు, రాక్షసులు, నాగులు, దేవతలు అను వారిలోఁ బ్రధానులు మొదలుగా నెల్ల ప్రాణులను గోరి తన వశము చేసికొను మన్మథు నోడించిన రాగరహితుఁడగు నీశ్వరుని జ్ఞానాధిక్యముచేఁ దన సౌభాగ్యముచేత నర్ధనారీశ్వరునిగాఁ జేసినట్టి పార్వతి నా కావ్యము నాదరించి యా సౌభాగ్యము ననుగ్రహించుఁగాక.

విశేషము :- పార్వతి తన ప్రేమముచేతనే శివుని సగము మేనిని హరించెను. '(సాఽదః) సమాదిదేశైకవధూం భవిత్రీం - ప్రేమ్ణా శరీరార్ధహరాం హరస్య' - కుమార సం. 1-50. ఇందు మన్మథుని యాధిక్యమును, పిమ్మట నతని

నోర్చెనని పరమేశ్వరుని యాధిక్యమును దెలిపి, పార్వతి తన సౌభాగ్యముచే నట్టి పరమేశ్వరుని సైతము నర్ధనారిఁ జేసెనని తెల్పుటచే పార్వతి సౌభాగ్యాతిశయమ్ము వ్యజ్యమాన మగుచున్నది.

ఓర్చిన - ఓడు + చు 'ఆదోడుకూడుల డకారంబునకుం జుక్కు పరంబగు నపుడు రేఫంబగు' బాల. క్రియ. 80; ఓరుచు. 'అచ్చికంబులం బదమధ్యంబుల నలడరల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు.' బాల. ప్రకీర్ణ 17 - ఓర్చు. 'ఉన్న కలజి నవర్ణకంబులు భవద్భావిశతృ క్త్వవదర్థంబు లందగు.' బాల, క్రియ. 46 - ఓర్చిన. చిత్ + ఘన = చిద్ఘన, 'అనునాసికాంతస్థ వర్ణములు తప్పఁ దక్కిన పదాంతగత హల్లులకు (ఝల్లులకు) మృదుహల్లులు (హశ్శులు) కాని, అచ్చులు కాని పరము లగునపుడు ఆ హల్లుల వర్గమునకుఁ జెందిన తృతీయ వర్ణ మా దేశముగా వచ్చును. తద్ + సుభగత్వము - అనునాసికాంతస్థభిన్నములైన హల్లులకు (ఝల్లులకు) కఠిన హల్లులు (ఖరులు) పరములగునపుడు వాని వర్గములందలి ప్రథమ వర్ణములు (చరులు) ఆదేశముగా వచ్చును. తత్సుభగత్వము. వీతరాగిన్ - బహు వ్రీహిని మరల మత్వర్థీయమును బ్రయోగించుట యిందు విశేషము.

క. వేదాగమ రూపమున మ
హాదేవు నపారగుణ మహాసంస్తుతి సం
పాదిత యగు భారతి నేఁ
డాదిగ మత్కృతికి నెలయునదిగాక దయన్. 11

అర్థము :- వేద + ఆగమ- రూపమునన్ = వేదములు, శివాగమములు అనువాని రూపముచే, మహాదేవు = ఈశ్వరునియొక్క, అపార-గుణ- మహత్ (మహా) - సంస్తుతి-సంపాదిత = అమితములైన గుణములయొక్క- గొప్పదియగు స్తోత్రమును సంపాదించినది. అగు, భారతి = సరస్వతి, నేఁడు + ఆదిగన్ = నేఁడు మొదలుకొని, దయన్ = దయతో, మత్ + కృతికిన్ =, నా కావ్యమునకు, ఎలయునది + కాక = ఉన్ముఖ యగుఁగాక.

తాత్పర్యము :- వేదములు, శివాగమములు, అనువాని రూపమున మహా దేవుని అపారములైన గుణముల స్తోత్రమును సంపాదించినదియగు భారతి నేఁడు మొదలుగా నా కావ్యమునకు దయతో నున్ముఖురా లగుఁగాక.

విశేషము :- భారతి వేదరాశియునను, శివాగమ భాగములను మహాదేవుని అపారగుణములను స్తోత్రముచేయు ననుట.

మహాదేవ + అపార- 'షష్ఠీ సమాసమునం దుకార ఋకారముల కచ్చుపరమగునపుడు నుగాగమం బగు.' బాల. సంధి. 34. మహాదేవు నపార 'మహాదేవు' అనునది అపారగుణ మహా సంస్తుతి సంపాదిత అను సిద్ధసమాసము మధ్యమున నున్న పదముతో నన్వయించుచున్నది. 'కొన్నియెడల సిద్ధసమాస మధ్యగత పదంబులతోఁ దద్భిన్న పదంబుల కన్వయంబు చూపట్టెడి.' ప్రౌఢ. సమాస. 35.

నన్నయ 'హరిహరాజ గజాననార్క షడాస్య మాతృ సరస్వతీ గిరిసుతాదిక దేవతాతతికిన్ నమస్కృతి' చేయఁగా నితఁడు తదనుసారిగా నాయా దేవతలను విడివిడిగా స్తుతించినాఁడు.

## గురుప్రశంస

ఆ. వె. అన్య దైవ వితతి నర్థించి[1] కొలుపు తా
డిడి ఫలంబు గొనుట పడయఁగనెడి[2]
సద్య[3] మిష్టఫలదు జంగమ మల్లికా
ర్జునునిఁ గొలుపు మొసరు మునుఁగఁ గొనుట. 12

అర్థము :- అన్య-దైవ- వితతిన్ = (జంగమ మల్లికార్జునుని కంటె) వేఱయిన దేవతల సమూహమును, అర్థించి = కోరి, కొలుపు = కొలుచుట, తాడు + ఇడి = తాటిమొక్క పెట్టి-నాటి, ఫలంబు + కొనుట = పండును అనుభవించుట, పడయన్ + కనెడి = పొందఁగలిగెడు, సద్యము = వెంటనే, ఇష్ట-ఫలదున్ = కోరిన ఫలముల నిచ్చునట్టి, జంగమ మల్లికార్జునునిన్, కొలుపు = కొలుచుట, మొసరున్ = పెరుఁగును, మునుఁగన్ + కొనుట = (అన్నము) (చేయి) మునుఁగునట్లు గ్రహించుట-సమృద్ధిగా (పూర్ణముగా- సూ.ని.) గ్రహించుట, మొసరున్ = మునరుతేనెను, మునుఁగన్ = మునుఁగచెట్టునందు,, కొనుట = పడయుట. అని శ్రీ వేటూరి ప్రభా

1. వా. చు, 2. సా. పడయనెంచు, 3. వా. సద్వరిష్టఫలదు.

కప శాస్త్రిగారు మఱియొక యర్థమును జెప్పిరి. కాని విగ్రుపము నర్థముగల పదము-మునగ కాని మును(గ కాదు. అందుచే నది పొస(గదు.

తాత్పర్యము :- ఇతర దైవతములను గోరి కొలుచుట తాటివెంక పాఁతి, అది మొలచి పెద్దచెట్టయి ఫలించిన పిమ్మట దాని ఫలమును అనుభవించుట వంటిది. చిరకాలసాధ్య మనుట, కోరినవెంటనే ఫలముల నొస(గు జంగమ మల్లికార్జునుని సేవ యన్నము (చేయి) మును(గునట్లు సమృద్ధిగాఁ బెరు(గును గొనుటవంటిది.

విశేషములు :- కొలుపు- కొలుచు ధాతు కృదంతరూపము. 'పువర్ణకంబు పూ య్వాదుల కగు.' బాల. కృ. 11. తాడిడి- తాడు + ఇడి లేక తాడి + ఇడి-తాడు = తాడి = తాళవృక్షము. సద్యము- సద్యస్, ఈ శబ్దము సకారాంతమైనను సలోపము వచ్చిన రూపము తెలు(గున వాడ(బడినది. 'ఆద్యంతంబును నీ యన, సద్య కథ వినంగఁ గనినవారికిఁ బాయున్, సద్యంబ బ్రహ్మహత్యా, పద్యము మొదలైన పాపవర్గం బెల్లన్, భార. స్వ. 86. అన్యదైవ వితతి నర్చించి కొలుపు తాడిడిఫలంబు గొనుట, జంగమ మల్లికార్జునుని కొలుపు మొసరు మును(గఁ గొనుట. ఇందుఁ బూర్వోత్తరార్ధముల సదృశము లయిన వాక్యార్థముల కైక్యారోపము చేయ(బడినది. కావున నిదర్శనాలంకారములు. 'వాక్యార్థయో స్సదృశయో రైక్యారోపో నిదర్శనా.' చన్ద్రా. మొత్తము పద్యమునం దితరదైవతములకంటె శివుని కాధిక్యము చెప్ప(బడినది గావున వ్యతిరేకాలంకారము.'వ్యతిరేకో విశేష శ్చే దుపమేయోపమానయోః.' చన్ద్రా.

వ. అని సద్భక్తియుక్తి నిశ్చయించి 13

అర్థము : అని, సత్+భక్తి-యుక్తిన్=మంచి భక్తితో(గూడుకొనినట్లుగా, నిశ్చయించి = నిర్ణయించి.

తాత్పర్యము : అని సద్భక్తితో నిర్ణయించి. - పయి పద్యముతో నన్వయము.

క. శ్రీ పీఠంబున నిడుకొని
శ్రీ పాదుకలందు[1] బ్రౌలి సేవించెద నేఁ
బాపహతి(జేసి పుణ్యం
బాపాదింపంగ మల్లికార్జునదేవున్. 14

---

[1] సా ష్టనిచ్చి.

అర్థము : శ్రీ-పీఠంబునన్ = శోభాయమానమగు నాసనముపై, ఇడుకొని =ఉంచి, శ్రీపాదుకల + అందున్ = దివ్యములైన పాదరక్షల యందు, వ్రాలి= పడి, ఏన్ = నేను, పాప-హతిన్ + చేసి =పాపముల నాశనమును గావించి, పుణ్యంబు, ఆపాదింపఁగన్ = కలిగించుటకు, మల్లికార్జునదేవున్ = జంగమ మల్లికార్జునదేవుని, సేవించెదన్.

తాత్పర్యము : శ్రీపీఠమునం దిడు తన దివ్యములైన పాదుకలపైఁబడి నేను పాపములను బోకార్చి పుణ్యములను గలిగింప జంగమ మల్లికార్జునదేవుని సేవింతును.

మ. అమలజ్ఞాన సుదీపవర్తిఁగొని వృద్ధాచారుఁడై వేదశా
స్త్రములందున్న సదర్థమెల్లఁగొని విద్వత్ప్రీతిఁ గావించువా
ని మహాత్ముం డనఁబొల్చు పుణ్యనిధి వాణీముఖ్యు సర్వజ్ఞు జం
గమలింగంబగు మల్లికార్జును సదాకల్యాణుఁ గీర్తించెదన్. 15

అర్థము :- అమల-జ్ఞాన-సు-దీప-వర్తిన్ = స్వచ్ఛమైన జ్ఞానమనెడి మంచి దివ్వెయొక్క వత్తిని, కొని, వృద్ధ + ఆచారుఁడు + ఐ = పెద్దల ఆచారములు గలఁవాడయి వేద-శాస్త్రములందున్, ఉన్న, సత్ + అర్థము = మంచి విషయము, సత్సంపద, ఎల్లన్ = సర్వమును, కొని = గ్రహించి, విద్వస్ (త్) + ప్రీతిన్ = (దానితో) పండితుల సంతోషమును, కావించు = చేయు, వానిన్, మహత్ (మహా) + ఆత్ముండు, మహాత్ముఁడు, అనన్, పొల్చు = ఒప్పు, పుణ్య-నిధిన్ పుణ్యరాశియు, వాణీ-ముఖ్యున్ = వాగ్దేవికిఁ బ్రధానుఁడైనవాఁడును, సర్వజ్ఞున్ = అన్నియుఁదెలిసినవాఁడును, జంగమ-లింగంబు = సంచరించు శివుఁడైనవాఁడును, అగు, మల్లికార్జునున్ = మల్లికార్జునుని, సదా - కల్యాణున్ = నిత్యమంగళుని, కీర్తించెదన్ = పొగడుదును.

తాత్పర్యము :- నిర్మలజ్ఞాన మనెడు దీపపు వత్తిని గొని పెద్దల యాచారము ననుసరించువాఁడయి వేదశాస్త్రములందలి సద్విషయము నెల్ల గ్రహించి విద్వాంసులకుఁ బ్రీతి గావించువాఁడును, మహాత్ముఁ డన నొప్పు పుణ్యరాశియు, వాగ్దేవికిఁ బ్రధానుఁడైనవాఁడును, సర్వజ్ఞుఁడును, సంచరించు శివుఁడైన వాఁడును, నిత్యమంగళుఁడును అగు మల్లికార్జునుని స్తుతించెదను.

విశేషములు :- అమలజ్ఞాన సుదీపవర్తి - అమలజ్ఞాన మనెడి సుదీపము యొక్క వర్తి - రూపకము. ఇట నిధి జ్ఞానము. నిధి నెఱుఁగఁగోరువారు దివ్యోప సాయముగాఁ గొని, పెద్దలు తెలిపిన యాచారములఁ బాటించి యన్వేషింతురు. అప్పుడు వారికి సదర్థము (నిధి) లభించును. దానితో వారు విద్వత్ప్రతి చేయుదురు.

వ. అని యిష్టదేవతా నమస్కారమ్ము చేసి సమస్త దేవతాస్వరూపం
బైన మదీయ గురు చరణారవిందంబు లభినందించి, 16

అర్థము :- అని, ఇష్ట-దేవతా-నమస్కారమ్ము = ఇష్టమైన దేవతల నమస్కారము, చేసి, సమస్త-దేవతా-స్వరూపంబు = ఎల్లదేవతల స్వరూపము, ఐన, మదీయ-గురు-చరణ + అరవిందంబులు = నా వాఁడైన, గురువుయొక్క, తామరల వంటి పాదములు, అభినందించి = పూజించి.

తాత్పర్యము :- అని యిష్టదేవతలకు నమస్కరించి, యెల్లదేవతల స్వరూప మయిన నా గురుదేవుఁడయిన జంగమ మల్లికార్జునుని అడుగుఁదామరల నర్చించి- తరువాతి పద్యముతో నన్వయము.

## కవిస్తుతి

క. కవితామృతోదయాంబుధిఁ
గవి సజ్జనకనకు వస్తుకావ్యాబ్జ రవిన్
గవితారంభంబుల స
త్కవు లభినందింతు రాదికవి వాల్మీకున్. 17

అర్థము :- సత్ + కవులు = మంచి కవులు, కవితా + ఆరంభంబులన్ = కావ్య ప్రారంభ సమయములందు, కవితా + అమృత + ఉదయ + అంబుధిన్ = కవిత్వమనెడి, అమృతము యొక్క, పుట్టుకకు, సముద్రుఁడైనవాఁడును, కవి- సత్ + జన - కనకున్ = కవి పండిత జనులలో బంగారమైనవాఁడును, వస్తు - కావ్య + అబ్జ - రవిన్ = కథాప్రధానములైన కావ్యములనెడి తామరలకు సూర్యుఁడైన వాఁడును, ఆది కవిన్ = మొదటి కవియైనవాఁడును, అగు, వాల్మీకున్ = వాల్మీకుని, అభినందింతురు = ప్రశంసింతురు.

తాత్పర్యము :- కవితామృత మదయమందిన సముద్రుండును, కవులలోను, సజ్జనులలోను బంగారమయినవాఁడును, కథాప్రధానములైన కావ్యములనెడి పద్మములకు సూర్యుఁడయినవాఁడును, ఆదికవియైనవాఁడును అగు వాల్మీకిని గావ్యారంభము లందు సత్కవులభినందింతురు.

విశేషములు :- కవితామృతోదయాంబుధి, కావ్యాబ్జ-అనుచోటుల రూపకాలంకారము. 'సత్' శబ్దమునకుఁ బండితుఁడని యర్థము - 'విద్వాన్ విపశ్చి ద్దోషజ్ఞ స్సన్ సుధీః కోవిదో బుధః - పాపం శ్యతీతి సన్' - పాపముఁ జెఱుచువాఁడు - అసురము. సత్ + జన = సజ్జన - శ్చుత్వసంధి. 'వాల్మీకః' అని అకారాంతపులింగ రూపమును గలదు. దాని తత్సమ రూపము వాల్మీకుఁడు. వల్మీకము = పుట్ట. దాని నుండి పుట్టినవాఁడు వాల్మీకుఁడు. వస్తు కావ్యము - వస్తు వనఁగా నితివృత్తము (కథ) ఇతివృత్తమునకుఁ (గథకుఁ) బ్రాధాన్యము గల కావ్యమని యర్థము. ఈ కవి వాల్మీకిని, భారవిని, గాళిదాసుని వస్తుకవులనుగాఁ బేర్కొనెను గనుక నితని దృష్టిలో వస్తుకవు లనవెవరో తెలిసికొనవచ్చును. వారి కవిత వస్తు కవిత యన్నమాట.

క. వేదాంత భారత పురా
ణాదులు సేయు డొక పేర్మియని చనఁ బొగడం
గా దెడ్డ నజుఁడు నోపని
వేదము లేర్పఱిచె [1]ననిన వేదవ్యాసున్. 18

అర్థము :- అజుఁడున్ = బ్రహ్మ కూడ, ఓపని = చాలని - చేయలేని. వేదములు, ఏర్పఱిచెన్ = విభజించెను. అనినన్ = అనినచో, వేదవ్యాసున్, వేదాంత-భారత - పురాణ + ఆదులు = ఉపనిషత్తులు, మహాభారతము, అష్టాదశ పురాణములు మున్నగునవి, చేయుడు = చేఁత, ఒక - పేర్మి = ఒక గొప్ప, అని, ఎడ్డన్ = ఎడఁదలో, పొగడన్ + చనన్ + కాదు = ప్రశంసింపనక్కఱలేదు.

తాత్పర్యము :- బ్రహ్మసైతముఁజేయలేని వేదవిభజనమును జేసె నన్నచో వేదవ్యాసుని వేదాంతములు, మహాభారతము, అష్టాదశ పురాణములు మున్నగు వానిని రచించుట యొక గొప్పయని మనస్సులోఁ బ్రశంసింప నక్కఱలేదు.

1. ముద్రిత ప్రతి - సంప్రదా.

విశేషములు :- వేదాంతాదులను రచించుట కంటె వేదవిభజనము కష్టతర మగుట. అది బ్రహ్మకుఁగూడఁ జేతఁగాని పని. వేదవిభజనమునే చేసినప్పుడు, వేదాంతాది రచన మొక గొప్పయా యనుటచే నలంకారము కావ్యార్థాపత్తి. 'కైముత్యే నార్థ సంసిద్ధిః కావ్యార్థాపత్తి రిష్యతే.' చంద్రా. చేయుడు = చేయుట. భావార్థక ట వర్ణమునకు బదులుగా డు వర్ణకమును బ్రయోగించుట నన్నెచోడుని పద్ధతి.

క. భాసురమతి వాల్మీకి
వ్యాసాదులు చనిన జగతి వర కవితా సిం
హాసన మెక్కి కవీంద్రుల
దాసులఁగా నేలెఁ గాళిదాసుఁడు పేర్మిన్. 19

అర్థము :- వాల్మీకి-వ్యాస + ఆదులు = వాల్మీకి, వ్యాసుఁడు మొదలగు వారు, చనిన- జగతిన్ = అధిష్ఠించి విడిచిపోయిన వేదిక మీఁద, పేర్మిన్ = గొప్పతనముతో, భాసుర-మతి = ప్రకాశించు బుద్ధిగల, కాళిదాసుఁడు, వర-కవితా-సింహాసనము = ఉత్తమమైన కవిత్వమనెడి సింహాసనము, ఎక్కి = అధిష్ఠించి, కవి + ఇంద్రులన్ = కవిశ్రేష్ఠులను, దాసులన్ + కాన్ = దాసులనుగా, ఏలెన్ = పాలించెను.

తాత్పర్యము :- ప్రకాశించు బుద్ధిగల కాళిదాసుఁడు వాల్మీకివ్యాసాదు లధిష్ఠించి విడిచిన వేదికమీఁద నుత్తమకవిత్వమనెడి సింహాసనము నధిష్ఠించి కవిశ్రేష్ఠులను దాసులనుగా నేలెను.

విశేషములు :- వ్యాస వాల్మీకుల తరువాతనే కాళిదాసుఁ డనుట. కాళిదాసుఁడు ఋతుసంహారము, రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము అను శ్రవ్యకావ్యములను, విక్రమోర్వశీయము, మాళవికాగ్నిమిత్రము, అభిజ్ఞాన శాకుంతలము అను దృశ్యకావ్యములను రచించిన మహాకవి. కవీంద్రుల దాసులఁగా నేలె-తక్కిన కవిశ్రేష్ఠులందఱుఁ గాళిదాసుని కవితారాజ్యాధినేతృత్వము నంగీకరించి యతని ననుసరించినవారే యనుట.

క. భారవియు, వస్తుకవితను
భారవియును బరఁగి రుదయపర్వతశిఖరా
గ్రారోహ ణేంద్రకీల న
గారోహణ వర్ణనల జనారాధితులై. 20

అర్థము :- భా-రవియున్ = కాంతిచేత, సూర్యుఁడును, వస్తుకవితను = కథాప్రధాన కవిత్వముచేత, భారవియును = భారవి యను పేరుగల కవియును, ఉదయపర్వత-శిఖర + అగ్ర + ఆరోహణ + ఇంద్రకీల-నగ + ఆరోహణ-వర్ణనలన్ = తూర్పుకొండయొక్క, కొమ్ము యొక్క, కొనయొక్క, ఎక్కుట ఇంద్రకీల పర్వతము నెక్కుట యొక్క వర్ణనలచేత, జన + ఆరాధితులు = జనులచేఁ బూజింపఁబడినవారు, ఐ, పరఁగిరి = ఒప్పిరి.

తాత్పర్యము :- కాంతిచేత సూర్యుఁ డుదయపర్వత శిఖరాగ్రము నారోహించి జనారాధితుఁడై పరఁగెను. అట్లే వస్తుకవిత్వముచే భారవి యను కవి ఇంద్రకీల, పర్వతారోహణమును వర్ణించి జనారాధితుఁడై పరఁగెను.

విశేషములు :- సూర్యునకుఁ గాంతి యెట్టిదో, భారవి యనుకవికి వస్తుకవిత యట్టి దనుట. సూర్యుఁ డుదయపర్వత శిఖరారోహణమును జేయఁగా, భారవి తన కిరాతార్జునీయకావ్యమున నింద్రకీల పర్వతారోహణ వర్ణన గావించెను, తమ తమ పనులచే నిరువురును జనారాధితులై పరఁగిరి. భారవి-ఒక సంస్కృతకవి. ఇతఁడు కిరాతార్జునీయ మనుకావ్యమును సంస్కృతమున రచించెను. 'భారవే రర్థగౌరవమ్' అని యితఁ డర్థగౌరవమునకుఁ బ్రసిద్ధుఁడు. అలంకారము యథాసంఖ్యము.

క. క్రమమున నుద్భటుఁడు కవి
త్వము మెఱయఁ గుమారసంభవము సాలంకా
రము గూఢవస్తుమయ[1] కా
వ్యముగా హరలీల చెప్పి హరు మెచ్చించెన్. 21

అర్థము :- ఉద్భటుఁడు=ఉద్భటుఁడను పేరుగల కవి, క్రమమునన్ =వరుసగా, కవిత్వము, మెఱయన్=ప్రకాశింపఁగా, కుమారసంభవము, స+అలంకార

1. వా. గూఢ.

మున్ = అలంకారశాస్త్రసహితముగను, గూఢ-వస్తు-మయ - కావ్యముగాన్ = గూఢము వస్తుమయము-కథాప్రధానమునైన కావ్యముగను, హరలీల = హరలీల యను నొక కావ్యమును, చెప్పి = రచించి, హరున్ = శివుని, మెచ్చించెన్ = మెప్పించెను. శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి పాఠము 'గూఢ' కాక 'గూడ' అనునది. అట్టిచో- అలంకారము + కూడన్ = అలంకారము కూడునట్లుగాను, వస్తుమయమైన కావ్యము గాను 'హరలీల' అనుకావ్యమును రచించెనని చెప్పవలయును. కేవల వస్తుమయము- కథాప్రధానముగాఁగాక, అలంకారయుక్తముగాఁగూడ 'హరలీల' చెప్పెనని భావము. కాని ఉద్భటుఁ డనునతఁ డొక యలంకార గ్రంథమును రచించె ననుట ప్రసిద్ధము.

తాత్పర్యము :- ఉద్భటుఁ డనునతఁడు క్రమముగాఁ గవిత్వము మెఱయు నట్లు కుమారసంభవమును, అలంకారసహితముగను, గూఢము, వస్తుమయము నగు నట్లును హరలీల యను కావ్యమును రచించి శివుని మెప్పించెను.

విశేషములు:- ఉద్భటుఁడు అలంకార శాస్త్ర గ్రంథమును రచించిన మిక్కిలి ప్రాచీనుఁడైన కవి. ఇతఁడు కాశ్మీరము నేలిన జయాపీడుఁ డను రాజునాస్థానమున సభాపతిగా క్రీ. శ. 779-813 లో నుండెను. గూఢ మనఁగా ధ్వనిమయముగా నని చెప్పవలయును. అతఁడు హరలీల యను కావ్యమును సాలంకారముగను ధ్వనిమయము గను, వస్తుమయముగను రచించి హరుని మెప్పించెనని భావము,

క. కరములు దునుముడుఁ బరముని
వరదునిగాఁ గొలిచి కవితవలననె మగుడం
గరములు వడసి జగంబునఁ
బరఁగె మహాకవి యనంగ బాణుఁడు పేర్మిన్. 22

అర్థము :- కరములు = చేతులు, తునుముడున్ = నఱికినంతనే, పరము నిన్ = ఉత్కృష్టుఁడైన శివుని, వరదునిగాన్ = వరముల నిచ్చువానినిగా, కొలిచి = సేవించి, మగుడన్ = మరల, కవితవలననె = కవిత్వమువలననే, కరములు, పడసి = పొంది, బాణుఁడు, జగంబునన్ = లోకమునందు, పేర్మిన్, = గౌరవ ముతో, మహాకవి = గొప్పకవి, అనంగన్, పరఁగెన్ = ఒప్పెను.

తాత్పర్యము :- చేతులు ఖండించినంతనే ఉత్కృష్టుఁడగు శివుని వరముల నొసఁగువానిఁగాఁ గొలిచి మరలఁ గవిత్వమువలననే చేతులు పొంది బాణుఁడు లోకము నందు గౌరవమొప్ప మహాకవి యనఁబరఁగెను.

విశేషములు :- ఈ బాణుఁడెవరు ? కవులలోఁ బరిగణింపఁబడినవాఁడు గనుక భట్టబాణుఁడా ? లేక బలిచక్రవర్తి కొడుకు బాణుఁడా ? 'బాణోచ్ఛిష్టం జగత్సర్వ' మని యున్నది కావున 'మహాకవి' యనఁబరఁగినవాఁడు భట్టబాణుఁడే కావచ్చును. కాని బలిచక్రవర్తి కొడుకు బాణుఁడుకూడ మహాభక్తుఁడు. అతని చేతులను శ్రీకృష్ణుఁ డుషాపరిణయ సందర్భమునఁ దునుమఁగా నతఁడు శివునెదుట నృత్యము చేసి అభంగ వృత్తములతో స్తుతింప శివుఁడు కరముల ననుగ్రహించె నఁట. భట్టబాణుని పక్షమునఁగూడ-

'చేతులు రెండును దునుమ మహాతాత్పర్యమున మిమ్ము నర్చించి జగ
త్ప్రాతముగ మగుడఁ బడయఁడె, ఖ్యాతిగ నీచేత భట్టబాణుఁడు రుద్రా'

అని శివతత్త్వసారము 39-6 లోఁ బండిత మల్లయ్య చెప్పెను. బాణుఁడు తన శివభక్తిని నిరూపించుకొనుటకయి చేతులు నఱకుకొని 'శివకర శివకర' యను నుపక్రమముగల గద్యమును రచించి శివునిచే మరలఁ గరములు పడసెనని సోమనాథుఁడు పండితారాధ్యచరిత్రమునఁ జెప్పినాఁడు. అందుచే నీ యిరువురిలో నే బాణుఁడైనఁ గావచ్చును.

తునుముదున్- 'ఆనంతర్యంబున డువర్ణకంబు ద్రుతాంతం బగు' బాల. క్రియ. 42. కరములు వడసి-కరములు + పడసి. 'ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళముగా నగు.' బాల. సంధి. 13.

క. మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశకవితఁ బుట్టించి తెనుం
గున[1] నిలిపి రంధ్రవిషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్. 23

1 గున్న.

అర్థము :- మును=పూర్వము, మార్గకవిత - మార్గకవిత్వము - అనఁగా వ్యాస వాల్మీకి కాళిదాసాదుల కేవల సంస్కృత కవిత్వము లేదా నన్నయాదుల సంస్కృత సాహిత్య సంప్రదాయానుసారి భారతాదిక కవిత్వము, లోకంబునన్ = లోకమునందు, వెలయఁగన్ = ప్రకాశింపఁగా, చాళుక్య-రాజు - మొదలుగన్ = చాళుక్యవంశపురాజు (రాజరాజనరేంద్రుఁడు) మొదలుకొని, పలువుర్=పలువురు- అనేకులు, చనన్=తగునట్లు, అంధ్ర-విషయంబునన్=ఆంధ్రదేశమునందు, దేశి-కవితన్= దేశి కవిత్వమును అనఁగా రగడలు, అక్కరలు,ద్విపదలు మున్నగు దేశిచ్ఛందోరీతులలో రచింపఁబడిన కవిత్వమును, పుట్టించి, తెనుంగునన్=తెనుఁగు బాసయందు, నిలిపిరి.

తాత్పర్యము :- పూర్వము లోకమునందు మార్గకవిత్వము ప్రకాశించుచుండఁగా నాంధ్రదేశమునఁ జాళుక్యరాజులు మొదలుకొని పలువురు దేశి కవిత్వమును బుట్టించి యందుఁ దెనుఁగుబాసను నిలిపిరి.

విశేషములు:- మార్గ దేశి కవితలవిషయమున నభిప్రాయభేదములు గలవు. మార్గకవిత యనఁగా వ్యాస వాల్మీకి కాళిదాసాదుల కేవల సంస్కృతకవిత్వ మనియు, దేశికవిత యనఁగా నన్నయాద్యాంధ్రకవుల కవిత్వ మనియు నొక యభిప్రాయము, మార్గకవిత యనఁగా సంస్కృత సాహిత్యము ననుసరించి సంస్కృత వృత్తములతోఁ గూడిన భారతాది రచనారీతి యనియు, దేశికవిత యనఁగా రగడలు, అక్కరలు, ద్విపదలు మున్నగు కేవల దేశిచ్ఛందోరీతులలో రచింపఁబడిన కవిత్వ మనియు వేఱొక యభిప్రాయము. దీని తరువాతిదైన 'సురవరుల'నిత్యాది పద్యమున (25వ పద్యము) నీ కవి పురాణకవిసంఘము, నుత్తమ మార్గ సత్కవీశ్వరులను, దేశిసత్కవుల'నని మువ్విధములవారిని పేర్కొనుటచే - పురాణకవు లనఁగా వ్యాస వాల్మీకి కాళిదాసాది కేవల సంస్కృతకవు లనియు, ఉత్తమమార్గ సత్కవీశ్వరు లనఁగా సంస్కృతచ్ఛందోరీతులలో భారతాది రచనలు చేసిన నన్నయాది కవులనియు, దేశి సత్కవులనఁగా దేశిచ్ఛందోరీతులలో - రగడలు, ద్విపదలు మున్నగువానిలోఁ గవిత్వమును జెప్పిన సుకవులనియు నీ రెండవతెగవారి యభిప్రాయము. కాని పరిశీలింపఁగా మొదటి యభిప్రాయమే - అనఁగా మార్గకవిత కేవల సంస్కృత కవిత్వమనియు, దేశికవిత నన్నయాదుల భారతాదికము వంటి కవిత్వమనియు ననుట సమంజస మని తోఁచుచున్నది. ఏలయనఁ జాళుక్యరాజులు తెనుఁగున నిలిపినది భారతమువంటి కవిత్వమునుగాని కేవల దేశిచ్ఛందోరీతులలో రచింపఁబడిన కవిత్వమును గాదు. వారి నాఁటికిఁ గేవల సంస్కృత

కవిత్వము వ్యాప్తిలో నుండెను. అదియే మార్గకవిత్వము. చాళుక్య లాంధ్రదేశ పరిపాలకులై తెనుఁగున భారతమును రచింపఁజేసిరి. అందుచే వారు తెనుఁగున నిలిపినది అట్టి కవిత్వము. అదియే దేశికవిత్వమని తలఁప నగును. 'చన సత్యాశ్రయునిఁ దొట్టి చాళుక్యనృపుల్' అను పాఠము తంజావూరిప్రతిలో లేదు, అందు 'చనఁజాళుక్య రాజు మొదలుగఁ బలువుర్' అను పాఠము గలదు. కావున నది స్వీకృతము. 'ఇందు-చాళుక్యరాజు అనఁగా నిప్పటికి రాజనరేంద్రునకుఁ బూర్వపుఁ దెలుఁగు గ్రంథములు తెలియరాలేదు కావున నాతఁడే యిందు స్మరింపఁబడినవాఁడనఁజెల్లును ఒండె పద్య రచనలు కొన్ని గుణగవిజయాదిత్యుని నాఁటఁగలవు గాన ఆతఁడేని కాఁదగును. తత్పూర్వ గ్రంథములు దొరకునంతదాఁక నీ యర్థ మిట్లే కుదుర్కొనఁ గలదు.' (శ్రీ వే, ప్ర. శా.).

పలువుర్-పలువురు - 'పదాంతంబులయి యసంయుక్తంబులయిన ను లు రు ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు.' బాల. ప్రకీర్ణ, 16. ఇందు ను రు ల కుత్వలోపంబు ప్రాయికంబుగ హల్పరకంబులకుఁ జూపట్టెడు.' అని చిన్నయ చెప్పెను. ప్రాయికముగా ననుటచే నిట్టి యవసాన వరక రు వర్ణములకును క్వాచిత్కముగా నుత్వలోపము గలదని తెలియుచున్నది,

చ. సురవరులం గ్రమంబున వచోమణిసంహతిఁ బూజ చేసి మ
ద్గురు చరణారవిందములకుం దగ సమ్మతిఁజేసి కొల్చి వి
స్తరమతులం బురాణకవి సంఘము నుత్తమ మార్గ సత్కవీ
శ్వరులను దేశిసత్కవుల సంస్తుతిఁజేసి మనోముదంబునన్. 24

అ ర్థ ము :- సుర - వరులన్=దేవతాశ్రేష్ఠులను, క్రమంబునన్ = వరుసగా, వచస్ (శ) + మణి-సంహతిన్ = మణుల వంటి వాక్కుల సమూహముతో, పూజ-చేసి - పూజించి, మత్ + గురు - చరణ + అరవిందములకున్ = నాయొక్క-గురువైన జంగమ మల్లికార్జునుని యడుగుఁదామరలకు, తగన్ = తగునట్లు, సమ్మతిన్ + చేసి=అభిలాషతో, కొల్చి=సేవించి, మనస్ (శ) + ముదంబునన్= మనస్సంతోషముతో, వి స్తర - మతులన్ = అధికమైన బుద్ధిగలవారు, అగు, పురాణ-కవి - సంఘమున్ = పూర్వ కవుల సమూహమును, ఉత్తమ - మార్గ - సత్ + కవి + ఈశ్వరులను = శ్రేష్ఠులైన మార్గ సుకవివరులను, దేశి - సత్ + కవులన్= దేశి సుకవులను, సంస్తుతిన్ + చేసి = ప్రశంసించి.

తాత్పర్యము :- దేవతాశ్రేష్ఠులను క్రమముగా వాగ్రత్నసముదాయముతోఁ బూజించి, నా గురువైన జంగమ మల్లికార్జునుని పాదపద్మములను సముచితముగాఁ గోరి సేవించి, యధికమతిమంతులగు పూర్వకవుల సమూహమును, ఉత్తములైన మార్గ సత్కవివరులను, దేశి సుకవివర్యులను మనస్సంతోషముతో సంస్తుతించి - తరువాతి వచనముతో నన్వయము.

విశేషములు :- పురాణ కవి సంఘము .... దేశి సత్కవులన్ - పూర్వులైన మార్గకవివరులను - అనఁగా సంస్కృత కవిశ్రేష్ఠులను,పూర్వులైన దేశికవి వర్యులను - అనఁగా నాంధ్రకవిశ్రేష్ఠులను.

వచస్ + మణి, మనస్ + ముదము - పదాంతమందలి సకార మేదైన వర్ణము పరమైనప్పుడును, అవసానమందును విసర్గముగా మాఱును. - వచః + మణి, మనః + ముదము - హ్రస్వ అకారము తరువాత వచ్చు విసర్గమునకు హ్రస్వ అకారము గాని, మృదు హల్లులు (హశ్శులు) కాని పరములగునపుడు ఉ ఆదేశముగా వచ్చి పూర్వమందున్న అకారముతోఁగూడి గుణసంధి ననుసరించి ఓ గా మాఱును. వచ + ఉ + మణి = వచోమణి, మన + ఉ + ముదంబు = మనోముదంబు.

వ. మఱియు 25

క. గుఱు తెఱిఁగి వస్తు చయమున
కొఱగెడు నా దీపవర్తియును బోలె నిజ
మ్మెఱిఁగి కృతి[1] వస్తు సమితికి
వఱలఁగ మదినొఱగు విబుధవర్గముఁ దలఁతున్. 26

అర్థము :- గుఱుతు + ఎఱిఁగి = గుర్తుపట్టి, వస్తు - చయమునకున్ = (తైలకర్పూరాది) వస్తువుల సమూహము వైపు, ఒఱగెడు = వంగునట్టి, ఆ - దీప- వర్తియును + పోలెన్ = ఆ దీపపు వత్తి (జ్వాల) వలె, నిజమ్ము + ఎఱిఁగి = నిజము తెలిసికొని, కృతి - వస్తు - సమితికిన్ = కావ్యములందలి కథల సమూహము నకు, వఱలఁగన్ = ఒప్పునట్లు, మదిన్ = మనస్సుతో, ఒఱగు = వంగునట్టి, విబుధ - వర్గమున్ = పండితుల సమూహమును, తలఁతున్.

1. కృత.

తాత్పర్యము :- వస్తువును (విధిని) గుఱించి దానిపైపు బ్రొగ్గునట్టి దీపపు వత్తివలె, నిజమెఱిగి కావ్యమునందలి యితివృత్తమున కభిముఖమగు పండితుల సమూహమును స్మరింతును.

విశేషములు :- కావ్యమునందలి వస్తువుపైఁ గవికిఁగల ప్రీతి గమనింపఁ దగినది. దీపపువత్తి (జ్వాల) వస్తువు = పదార్థముపైపే బ్రొగ్గునట్లు, పండితులు గూడఁ గావ్యవస్తువుపై = కథపై- ఇతివృత్తముపై బ్రొగ్గుఁజూపుదురు. అలంకార మువమ- నిధులు కలచోట దీపశిఖ యథోముఖమగునని నిధిశాస్త్రము.

వ. మఱియు దోషగ్రాహులగు కుకవి వరాకులం బరిహరించితి నెట్లనిన 27

అర్థము :- మఱియున్, దోష- గ్రాహులు = తప్పులనే పట్టువారు, అగు, కుకవి- వరాకులన్ = నీచులైన దుష్కవులను, పరిహరించితిన్ = విడిచితిని, ఎట్లు+ అనినన్ = ఏ రీతిగా ననఁగా.

తాత్పర్యము :- మఱియు నేను దప్పులనే పట్టువారయిన నీచ దుష్కవులను రోసితిని. ఏ విధముగా ననఁగా- పయి పద్యముతో నన్వయము.

విశేషములు :- కుకవిః - కుత్సితః కవిః, వరాకుఁడు = నీచుఁడు. కుకవి వరాకులు = వరాకులైన కుకవులు- విశేషణోత్తరపద కర్మధారయము.

క. మార్గ కుమార్గము దేశి య
మార్గము వగవంగఁ [1] దమకు మది వదలక దు
ర్మార్గ పదవస్తు లనఁదగు
మార్గవులం దలఁప నలఁతి మహి సుకవులకున్. 28

అర్థము :- వగవంగన్ = ఆలోచింపఁగా, తమకున్ = మార్గవులకు, మార్గ = మార్గ కవిత్వము, కు- మార్గము = చెడురీతి, దేశి = దేశికవిత్వము,

---

1. వదలంగ.

అమార్గము = కానిత్రోవ. అనఁగా నసాధ్యపుగు త్రోవ, మదిన్ = మనసునందు, వదలక = విడిచిపెట్టక, దుర్మార్గ-పద- వర్తులు = మార్గకవిత్వమును చెడ్డదని రోసి, దేశికవిత్వము సాధ్యపడక పాడుత్రోవనుబట్టి యుండువారు, అనన్ + తగు = అన నొప్పునట్టి, మార్గవులన్ = మాఱు + కవులన్ = కవివేషధారులను, తలఁపన్ = = స్మరించుటకు, మహిన్ = భూమియందు, సుకవులకున్ = మంచికవులకు, అల్లఁతి = తక్కువతనము.

తాత్పర్యము :- కవులుగాకున్నను, కవులవలెఁ బైకిఁగనుపట్టువారికి మార్గ కవితారీతి చెడ్డది. దేశి కవితాపద్ధతి చేతఁగానిది. మఱి వారు రెంటిని గాక దుర్మార్గము ననుసరించి వర్తిలువారు. అట్టి మార్గవులను- కవి వేషధారులను స్మరించుట సుకవు లకు న్యూనత, ఈ పద్యమునకు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రులవారి వ్యాఖ్య యిటు లున్నది. మార్గకున్ = సంస్కృత (ప్రధాన) కవితకు, దేశియ= దేశభాషా (ప్రధాన) కవితా రచనయే, మార్గము = బాట, సంస్కృత రచనమో, సంస్కృత భాషామయమయిన రచనమో చేయుటకుముందు దేశిరచన నలవఱుచుకోవలెను. ద్వారమున నా సంస్కృతరచన చేయవలెను. ఇదీ సరియైన మార్గము- ఈ, మార్గము = త్రోవ, వగవంగన్ = అర్థించుటకు - అపేక్షించు విషయమున, తమకున్ = కుకవులకు, మది వదలక = మనోవైముఖ్యము తొలఁగక. మనసు చొరక (కాన) దుర్మార్గ పదవర్తులు దుర్మార్గమునఁ బదములను (అడుగులను) సాగించువారు- చెడ్డ దయిన మార్గ-సంస్కృత, పద-శబ్దములందు, వర్తులు = వర్తించువారు, అనఁదగు అనట్టి) మార్గవులన్ = మాఱట పశువులను, మాఱుకవులను, అనఁగా మాయ కవులను (ఇమిటేషన్ కవులను), సుకవులకున్, మహిన్, తలఁపన్, అలఁతి = తల్పము - తుచ్ఛము.

తాత్పర్యము :- సంస్కృత కవితా రచనము, ఒండె, సంస్కృత శబ్ద ప్రధాన కవితా రచనము చేయఁగోరువారు ముందు దేశిరచనలో నారితేరవలెను, అట్లు దేశిత్రోవను చనుటకు మనసొల్లక వంకరటింకరలుగా కలుకుగా నుండు దుర్మార్గ మున. పదములు ప్రయోగింపఁబోవు వారు కుకవులు, పశుప్రాయులు - వారిని దలఁపరాదు.

గీ. చెనసి గుణమైన దోషంబు చేయనేర్చుఁ
గుకవి కృతులందు దోషంబు గుణము సేయ
నేరఁ డది యట్ల దొంతులు సేరి నాయి
దోర్వ నేర్చుఁగా కది యేమి[1] సేర్వ నేర్చు ? 29

అర్థము :- కుకవి, కృతులందున్ = కావ్యములయందు, చెనసి = ఎదిరించి, గుణము + ఐనన్ = గుణమునైనను, దోషంబు, చేయన్ = చేయుటకు, నేర్చున్ = సమర్థుఁడగును, దోషంబున్ = దోషమును, గుణము + చేయన్ + నేరఁడు = గుణముచేయఁజాలఁడు, అది, అట్లు + అ = అట్లే, నాయి = కుక్క) చేరి = సమీపించి, దొంతులు = దొంతరలు, దోర్వన్ + నేర్చున్ + కాక = పడఁగొట్టఁగలదు గాక, అది = కుక్క, ఏమి, చేర్పన్ + నేర్చున్ = వరుసగాఁ బెట్టఁగలదు ?

తాత్పర్యము :- కుకవి కావ్యములందు గుణమునైనను దోషముగాఁ జేయఁగలఁడు గాని దోషమును గుణముగాఁ జేయఁజాలఁడు, అది యట్లే, కుక్క దొంతరను బడఁగొట్టఁగలదు కాని దొంతరగాఁ బెట్టలేదు గదా !

విశేషములు :- ఇందు ఉపమానోపమేయ వాక్యముల వేఱు వేఱగు ధర్మములకు బింబ ప్రతిబింబ భావ ముండుటచే నలంకారము దృష్టాంతము. 'చేద్బింబ ప్రతిబింబత్వం దృష్టాన్త స్త దలఙ్కృతిః' యన్నారు.

ఇట్టిభావము గల పద్యమే కొఱవి గోపరాజకృత సింహాసనద్వాత్రింశికలోఁగలదు.

........ ఎల్లెడం,

ద్రోవసరాక కుక్కలకు దొంతులు వేర్పఁగ నేర్పు గల్గునే ? 1-16.

గీ. నెఱయ రసవంతమగు కృతి కెఱఁగనేర
రల్పరసకృతి కెఱఁగుదు రలుపు లెల్లఁ,
జెఱకు విడిచిన రసమున కెఱఁగి రాక
పిప్పి కరిగెడు నీఁగల పెల్లు వోలె. 30

1. వా. సేర్పు నేర్ప,

అర్థము :- చెఱకు-విడిచిన-రసమునకున్ = చెఱకు పిండఁగా వచ్చు రసమునకు, ఎఱిఁగి-రాక = ఆసక్తి చూపలేక, పిప్పికిన్, అరిగెడు = పోయెడు, ఈఁగల-పెల్లు + పోలెన్ ఈఁగలగుంపువలె, అలుపులు + ఎల్లన్ = అల్పులైన వా రందఱును, నెఱయన్ = నిండుగా, రసవంతము + అగు = రసవంతమైన, కృతికిన్ = కావ్యమునకు, ఎఱఁగన్ + నేరరు = అభిముఖులు-ప్రవణులు కారేరు. ఆసక్తిఁ జూపలే రనుట, అల్ప-రస-కృతికిన్ = నీరసమైన కావ్యమునకు, ఎఱఁగుదురు.

తాత్పర్యము :- ఈఁగలగుంపు చెఱకును బిండఁగా వచ్చు రసము నాస్వాదింపలేక పిప్పిపై మూఁగునట్లు, అల్పులు బాగుగా రసవంతమగు కావ్యము నాస్వాదింపఁజాలక నీరసమైన కావ్యము నాస్వాదింతురు.

విశేషములు :- అలంకార ముపమ. అల్పులు (ప్రకృతి) - అలుపులు (వికృతి). ఈఁగలు రసమునకేల యెఱఁగఁజాలవు? రసముపై నవి వ్రాలకుంతఁ గాఁపరులు గట్టికట్టుదిట్టము చేయుటచేఁ గావచ్చును. లేదా యవి రసములోఁ బడి మరణింపునే కాని దాని నాస్వాదింపలేకపోవచ్చును. పిప్పిపై వ్రాలుటకు వాని నెవరును వారింపరు కావున నవి యథేచ్ఛముగా వ్రాలును. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రుల వారు ఈ పద్యము నందలి మూఁడవ పాదము నిట్లు సవరించిన నుపమానోపమేయములకు సక్రమ నిర్వాహము కుదురు ననిరి. 'నెఱయ రసమున్న చెఱకున కెఱఁగి రాక.' నెఱయ రస వంతమగు కృతి = నెఱయ రసమున్న చెఱకు; అల్పరస కృతి = పిప్పి.

వ. కావున 31

తాత్పర్యము :- అందుచేత - పయి పద్యముతో నన్వయము.

గీ. తజ్జ్ఞనం దెఱ్ఱనగు కవితా విశేష
మజ్ఞునం దేమి యెఱుఁగంగ నగు? సమస్త
కనక వర్ణోత్కర మ్మొక్రరగంట నొరసి
చూచి కా కెఱ్ఱవచ్చునె సుద్దఱాత? 32

అర్థము :- తద్ + జ్ఞ + అందున్ = బాగుగాఁ దెలిసినవానియందు - విద్వాంసునందు, ఎఱ్ఱన్ + అగు = ఎఱుఁగనగు - తెలియవచ్చునట్టి, కవితా

విశేషము, అజ్ఞునందున్ = తెలియనివానియందు, ఏమి + ఎఱుఁగంగన్ + అగున్ = ఏమి యెఱుఁగఁగలఁడు ? సమస్త - కనక - వర్ణ + ఉత్కరమ్ము = ఎల్ల బంగారపుఁజాయల సమూహము, ఒరగంటన్ = గీటుజాతితో, ఒరసి = రాచి, చూచి కాక = చూచుటచేఁగాక, సుద్ద - జాతన్ = సున్నపుజాతితో, ఎర్గన్ + వచ్చునె = తెలియనగునా ?

తాత్పర్యము :- విద్వాంసుఁడు తెలియనగు కవితా విశేషము అజ్ఞునకేమి తెలియును ? ఏమియుఁ దెలియదనుట. బంగరు చాయ మంచిదో కాదో గీటుజాతితో రాచిచూచినఁ దెలియనగునుగాని సుద్దజాతితో రాచినచోఁ దెలియనగునా ? తెలియరా దనుట.

విశేషములు :- ఉపమానోపమేయ వాక్యముల వేఱు వేఱగు ధర్మములకు బింబ ప్రతిబింబ భావముండుటచే నలంకారము దృష్టాంతము. ఒరగల్లు-నికషోపలము. ఒరగంటన్-ఒరగల్లు+చేతన్-టివర్ణంబు కొన్నింటి యంతాక్షరంబున కాదేశంబును గొన్నింటి కంతాగమంబును గొన్నింటికిం బర్యాయంబున రెండును బ్రాయికంబుగ నగు,' ఒరగ + టి + చేతను. బాల, ఆచ్ఛిక, 31, 'పదాద్యంబగు హ్రస్వంబుమీఁది టి వర్ణంబునకు ముందు పూర్ణబిందు వగు' బాల. ఆచ్ఛిక. 33, ఒరగంటి+చేతను, 'ఔపవిభక్తికంబుల తృతీయా సప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు, బాల, ఆచ్ఛిక, 38, ఒరగంటి+అను. 'అంద్వవగాగమంబులం దప్ప నపదాదిస్వరంబు పరంబగునపు డచ్చునకు సంధి యగు,' బాల. సంధి. 11. ఒరగంటను. తద్+జ్ఞ - సకార తవర్గములకు శవర్గ చవర్గములతోఁబూర్వమందైనను బరమందైనను గూడిక గలుగునపుడు క్రమముగా శవర్గ చవర్గ వర్ణము లాదేశమగును- తజ్జ్ఞ, ఎఱుఁగు-' ఆచ్ఛికంబులం యుపధ్యంబుల న ల డ ర ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు,' బాల. ప్రకీర్ణక. 17 'అలఘురేఫము లుప్తాచ్కమగుచో లఘురేఫంబగు.' ప్రౌఢ. ముక్త. 2. ఎర్గు. జాయి + చేతను - 'విభక్తి పరంబగునప్పుడు గోయి ప్రభృతుల తుది యక్షరంబు తివర్ణంబగు.' బాల. ఆచ్ఛిక. 35. జాతి + చేరను, తృతీయ కత్వ మాదేశమై (బాల, ఆచ్ఛిక. 38), అపదాది స్వర సంధి (బాల. సంధి. 11.) జరుగఁగా 'జాతన్' అగును.

వ. అది యెట్లనిన. 33

తాత్పర్యము :- అది యే ప్రకార మనఁగా- తరువాతి పద్యము నన్వయము:

గీ. అన్యతారక[1] విక్రుతుల నాదరించి
వెలయు[2] సత్కవి బుధగురు బలము వడసి
యొనర దైవజ్ఞు నట్ల శుభోదయమున
దివ్యసుకృతిఁ బ్రతిష్ఠింతుఁ దిరముగాఁగ, 34

అర్థము ;- అన్య - తారక-విక్రుతులు = ఇతరములగు నక్షత్రముల చెడుగులను- విరోధియైన, అసత్కవియైన, తార కవికృతులు = తారుఁడను కవి రచించిన కబ్బములను, అనాదరించి = గర్హించి, వెలయు = ఒప్పునట్టి, సత్ + కవి-బుధ-గురు-బలము = మంచి, శుక్రుడు, బుధుఁడు, గురుఁడు అను గ్రహములయొక్క బలము - సుకవులయొక్కయు, పండితులయొక్కయు, గురువులయొక్కయు బలము, వడసి = పొంది, ఒనరన్ = ఒప్పునట్లు, దైవజ్ఞు + అట్లు + అ = జ్యోతిష్కుని వలెనే, శుభ + ఉదయమునన్ = మంగళకరమగు ఉదయకాలమున - మంగళకరమైన ఆరంభము నందు, దివ్య-సుకృతిన్ = గొప్ప సత్కార్యమును - ఉత్కృష్టమైన సత్కావ్యమును, తిరము + కాఁగన్ = స్థిర మగునట్లు, ప్రతిష్ఠింతున్ = నెలకొలుపుదును.

తాత్పర్యము ;- ఇతర నక్షత్రముల చెడుగుల ననాదరించి, శుక్ర, బుధ, గురు గ్రహములు బలము గలిగియుండఁగా, మంగళకరమగు ఉదయకాలమునందు జ్యోతిష్కుఁడు దివ్యమైన శుభకార్యమును స్థిరముగాఁ బ్రతిష్ఠించునట్లు, నేనును శత్రువైన తారుఁ డను కవి కావ్యముల ననాదరించి, సుకవులయు, బుధులయు, గురువులయు ననుగ్రహమును బొంది శుభోదయకాలమున దివ్యమైన కావ్యమును బ్రతిష్ఠింతును.

విశేషములు ;- తారక, కవి, బుధ, గురు, ఉదయ, సుకృతి. అను శబ్దములకుఁగల యర్థద్వయము ననుసరించి అలంకారము శ్లేషము. నేను దైవజ్ఞునట్లు దివ్యమైన కృతిని బ్రతిష్ఠింతు ననుటచే నలంకార ముపమ. 'ఈ పద్యమువలన నన్నెచోడునికాలమున నొక యసత్కవి తారుఁ డనువాఁ డుండెనని యేర్పడును. ఇక్కడ రెండర్థములు పొసఁగి తీరవలెను గాన ఒక యర్థమున "తారకవి" యుండక తప్పదు. 'తతులు' నీరసము, అర్థాననుగుణము నని వ్రాఁతప్రతిలో నున్నను నేనై 'కృతులు' అని మార్చినాఁడను.' శ్రీ వే. ప్ర. శా.

దైవజ్ఞునట్ల-దైవజ్ఞ + అట్ల. షష్ఠీసమాసమునం దుకార ఋకారముల కచ్చు పర మగునప్పుడు నుగాగమంబగు. బాల. సంధి. 34. తిరము (వికృతి)- స్థిరము (ప్రకృతి)

1. వ్రా. అన్యతారకవిరతులను. 2. వా. యు.

## కావ్యప్రశస్తి

చ. సరళముగాఁగ భావములు జానుఁదెనుంగున నింపు పెంపుతోఁ
బిరిగొన, వర్ణనల్ ఫణితి పేర్కొన, నర్థము లొత్తగిల్ల, బం
ధురముగఁ బ్రాణముల్ మధు మృదుత్వ రసంబునఁ గందళింప న
క్షరములు సూక్తు లార్యులకుఁ గర్ణరసాయనలీలఁ గ్రాలఁగాన్. 35

అర్థము :- భావములు, సరళము+కాఁగన్ – అకృత్రిమముగా, జాను+తెనుంగునన్=స్పష్టముగాఁ దెలియు తెనుఁగున, ఇంపు-పెంపుతోన్=మాధుర్యాతిశయముతో, పిరిగొనన్=పెనఁగొనఁగా, వర్ణనల్, ఫణితి = వాక్కు, పేర్కొనన్ = ప్రసిద్ధినొందఁగా, అర్థములు, ఒత్తగిల్లన్=అంటియుండఁగా, ప్రాణముల్=కావ్యజీవములు, బంధురముగన్ = ఒప్పుగా. మధు - మృదుత్వ-రసంబునన్ = తేనెయొక్క మృదుత్వముతోడి రసముచే, కందళింపన్=అంకురింపఁగా. అక్షరములు, సూక్తులు=(సు+ఉక్తులు)=మంచిమాటలు, ఆర్యులకున్=పండితులకు, కర్ణ-రసాయన-లీలన్=వీనుల విందగు విధమున, క్రాలఁగాన్=ఒప్పఁగా. ('దివ్యసుకృతిఁ బ్రతిష్ఠింతు') నని పూర్వపద్యముతో నన్వయము.

తాత్పర్యము :- భావములు సహజములుగా స్పష్టమై యందఱకుఁ దెలియు తెనుఁగునఁ బెనఁగొనఁగను. వర్ణనలు, వాక్కు ప్రసిద్ధములుగా, అర్థము లంటియుండఁగను, కావ్యజీవము లొప్పుగా మృదుమధురముగా నంకురింపఁగను, అక్షరములు, సూక్తులు పండితులకు వీనులవిందగునట్లు ఒప్పఁగను- ప్రతిష్ఠింతునని పూర్వ పద్యముతో నన్వయము.

విశేషములు :- జానుఁదెనుఁగు = స్పష్టముగాఁదెలియు తెనుఁగు. ఈ మాటను పాల్కురికి సోమనాథుఁడుకూడ వాడియుండెను. 'ఉరుతర గద్య పద్యోక్తుల కంటె, సరసమై పరఁగిన జానుఁదెనుంగు, చర్చింపఁగా సర్వసామాన్య మగుట' బస. పు. 1-81 పం. 'జానుఁదెనుఁగు విశేషము ప్రసన్నతకు' పండితా. దీక్షా. 6 పా. జానుఁదెనుఁగన అచ్చతెనుఁగు కాదు. అందఱకు సుబోధమై యుండు తెనుఁగని యర్థము. నన్నెచోడుఁ డీ పద్యమునఁ గవిత్వ మెటు లుండవలయునో చెప్పినాఁడు.

సీ. మృదురీతి సూక్తులిం పొదవింప మేలిల్లు
భావమ్ము నెలమిఁ బ్రీత్యావహముగ
మెఱుఁగులఁ గన్నులు మిఱుమిట్లు వోవంగఁ
గాంతి సుధాసూతికాంతిఁ జెనయ
వర్ణన లెల్లచో వర్ణన కెక్కంగ
రసములు దళుకొత్తి రాలువాఱ
దేశి మార్గంబులు దేశీయములుగా న
లంకారములఁ దా నలంకరింప

ఆ. వె. నాదరించి విని సదర్థాతిశయమున
బుధులు నెమ్మనమున[1] నిధులు నిలుప
వలవదే సమస్త[2] వస్తుకవీశ్వర
సూత్న రుచిర కావ్య రత్న వీథి? 36

అర్థము :- సమస్త .... వీథి: సమస్త = ఎల్ల, వస్తు-కవి + ఈశ్వర = వస్తువు ప్రధానముగా నుండునట్లు రచించు కవిశ్రేష్ఠులయొక్క, నూత్న = క్రొత్తవియు,. రుచిర = మనోహరములు, (అగు), కావ్య-రత్న=రత్నములవంటి కావ్యములయొక్క, వీథి = వరుస _ బంగారు, వెండి, నవరత్నములు మొదలయిన యెల్ల వస్తువులతో, రచితమైన, రుచిరకావ్య మనెడి రత్నాల బజారు,

సూక్తులు = మంచిమాటలు, మృదు-రీతిన్ = మృదువుగా, ఇంపు = ఆహ్లాదము, ఒదవింపన్ = కలిగింపఁగను, మేలిల్లు = శ్రేష్ఠముగు, భావమ్మున్= భావముకూడ, ఏలమిన్ = వికాసముతో, ప్రీతి + ఆవహముగన్ = ఆనందమును గలిగించునట్లుగను,

కాంతి = 'కాంతి' యను గుణము, మెఱుఁగులన్ = మెఱుపులతో, కన్నులు, మిఱుమిట్లు + పోవంగన్ = చీఁకట్లు క్రమ్ముకొనఁగా, సుధా-సూతి = చంద్రుని యొక్క, కాంతిన్ = వెలుఁగును, చెనయన్ =పోలఁగను,

1. అ, 2. ముద్రితప్రతి. రచింప వరకవీశ్వరునకు.

వర్ణనలు, ఎల్లచోన్ = అన్ని యెడలను, వర్ణనకున్ + ఎక్కంగన్ = పొగడ్త కెక్కఁగను, రసములు = శృంగారాదులు, తళుకొత్తి (తళుకు+ఒత్తి)= మిక్కిలి యొప్పి, రాలు వాఱన్ = ప్రవహింపఁగను,

దేశి-మార్గంబులు = దేశి, మార్గ అను కవితా రీతులు, దేశీయములు + కాన్= దేశ్యములు గాఁగను, అలంకారములన్ = ఉపమాదులతో, తాను, అలంకరింపన్ = అందగింపఁగను,

బుధులు = పండితులు, ఆదరించి = మన్నించి, విని, సత్ + అర్థ + అతిశయమునన్ = మంచి యర్థములపెంపుచే, నెమ్మనమునన్ (నెఱ +మనము) = నిండు మనస్సునందు, నిధులు-నిలుపన్ = పదిలపఱుపఁగా, వలవదే = వలదా ?

తా త్ప ర్య ము :- ఎల్ల వస్తుకవిశ్రేష్ఠుల నూతనములు, మనోహరములునైన కావ్యశ్రేష్ఠముల పంక్తి-సూక్తులు మృదువుగా నాహ్లాదము గలిగింపను, మేలైన భావములు ప్రీతి గలిగింపఁగను, కాంత్యాదిగుణములు తమ కాంతులతోఁ గన్నులు మిఱుమిట్లు గ్రమ్మ వెన్నెల వెలుఁగును బోలఁగను, వర్ణనలు అన్నియెడలను బ్రసిద్ధి నొందఁగను, శృంగారాది రసములు మిక్కిలి యొప్పి ప్రవహింపఁగను, దేశి మార్గ కవితారీతులు దేశీయములై ఉపమాద్యలంకారములతో నలంకరింపఁగను, పండితుఁ లాదరించి విని మంచి అర్థముల పెంపునఁ దమ మనస్సులందుఁ బదిలపఱుచుకొనఁ గను వలదా ? వలయు ననుట.

'ఈ పద్యమునఁ గావ్యము రత్నవీథిగా రూపింపఁబడినది. ఆ బజారులో వస్తువులఁ జూడఁ గొనఁ గోరువారికి అక్కడి సూక్తులు ఇంపొదవింపవలయును. వానిని జూపువారు మృదువుగా మర్యాదౌచితితో మాటలాడవలయును. కావ్యభాషకూడ మృదు మధురముగా నుండవలెను, భాషయేకాక భావముగూడ ప్రీతిని గొలుపు నదిగా నుండవలయును. ఆ యా రత్నాదుల మెఱుఁగుపెట్టుటలు పూఁతమెఱుఁగులు గాక నిజముగా వస్తువులందుఁ జేర్పఁదగినవై కన్నులకు మిఱుమిట్లు గొల్పునవిగా నుండవలయును. కావ్యపు మెఱుఁగులు గూడ అర్థమయినవై యోచించి చూచుచోఁ గన్నులకు మిఱుమిట్లు గొల్పవలయును. రత్నాదుల కాంతి చంద్రకాంతిని మించు చున్నట్లుండవలయును. కావ్యమునఁ గాంతి యను కావ్యప్రాణము చల్లఁగా, హాయిగా వెన్నెల వలె నుండవలెను. వణిజులు చేయు రత్నాభరణాదివర్ణనలు మెప్పఁదగినవై

యుండవలయును, కావ్యమందలి అష్టాదశవర్ణనలు ప్రశస్తముగా నుండవలయును, ఆ యా వస్తువిశేషము లుంచు ప్రదేశములకు మార్గములు అందమయినవిగా నుండ వలయును. కావ్యమున దేశి రచన మార్గరచన హృద్యములు కావలయును, విపణ్యలంకారములు - కావ్యాలంకారములు అలంకరింపవలయును.'

విశేషములు :- మిఱుమిట్లు- మిట్లు + మిట్లు. 'అందదుకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు'. బాల. సంధి. 42. నెమ్మనము = నెఱ + మనము, 'అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి' బాల-సంధి. 39.

చ. పరగు[1] సువర్ణ బంధ మృదుభావము గల్గియు లోను జూడఁగాఁ
బొరపగుఁ[2] జిత్రరూపమును బోలె నసత్కవి కావ్య మిమ్మహిన్
బరగు సువర్ణబంధ మృదుభావ విశేషము లోన[3] వెల్పటన్
సరియగు రత్నపుత్రికయు సత్కవి కావ్యము నొక్కరూపమై. 37

అర్థము :- ఇమ్మహిన్ - ఈ + మహిన్ = ఈ భూమి యందు, అసత్ + కవి - కావ్యము = కుకవియొక్క కావ్యము, పరగు = ఒప్పునట్టి, సువర్ణ - బంధ - మృదు - భావము=తగిన యక్షరముల కూర్పువలని మృదుత్వము - మంచిరంగుల కూర్పు తోడి మృదుత్వము, కల్గియున్ = కలిగినప్పటికిని, లోను + చూడఁగాన్ = లోపలఁజూడఁగా, చిత్ర - రూపమును + పోలెన్ = చిత్తరువు నందలి ఆకృతి వలె, పొరపు + అగున్ = విపరీతముగా నుండును, సువర్ణ - బంధ- మృదు-భావ విశేషము = అక్షరముల సముచితమైన కూర్పువలని మార్దవాతిశయము, - బంగరు కూర్పువలని మార్దవాతిశయము, లోనన్ = లోపలను, వెల్పటన్ = బయటను, సరి = సమానము, అగు, = అగునట్టి, రత్న-పుత్రికయున్ = రతనాల బొమ్మయును, సత్ + కవి - కావ్యమున్=సుకవియొక్క కావ్యమును, ఒక్క - రూప + ఐ = ఒక్క విధముగనే యుండి, పరగున్ = ఒప్పును.

---

1. వా. సా. పరఁగ, 2. వా. సా. బొరపగు చిత్రరూపమును బోలె. 3. లొప్పు దెల్యలన్,

తాత్పర్యము :- కుకవి కావ్యము పైకి మంచి యక్షరముల కూర్పువలని మార్దవము గలిగియున్నట్లు కనుపట్టియుఁ, బైకి మంచి రంగుల కూర్పువలని మృదుత్వము గలిగియు లోన వేఱుగా నుండు చిత్తరువునందలి ఆకృతి వలె, విపరీతముగా నుండును. అక్షరముల సముచితమైన కూర్పువలని మార్దవాతిశయము - బంగారు కూర్పువలని మృదుత్వాతిశయము లోపలను వెలుపలను సమానముగా నుండు రతనాల బొమ్మయు, సుకవి కావ్యము నొక్కవిధముగనే యుండి యొప్పును.

విశేషములు :- అసత్కవి కావ్యము చిత్రరూపముతోను, సత్కవి కావ్యము రత్నపుత్రికతోను బోల్పఁబడినవి కావున నలంకారము ఉపమ. అది 'సువర్ణ బంధ .... విశేషము' నందలి వర్ణ శబ్దమునకుఁగల యర్థద్వయముచే నగు-శ్లేషాలంకారముతోఁ గూడియున్నది. 'పరగు'ను సానుస్వారముగా శ. ర. గ్రహించెను. కాని నిర్ధారక ప్రయోగములు లేవు.

ఉ. అక్కజమై మహార్థ నివహంబు సదుక్తులు మెచ్చఁజూచినన్
గ్రుక్కిదమైన సత్కృతి యగుర్వగుఁ గా కిలఁ జీకు లావుకం
ద్రొక్కినయట్లు నోటికొలఁదుల్ పురికొల్పఁగ నందులోన నొ
క్కొక్కఁడు సక్కనైనఁ గృతియుం గృతి యందురె? వాని మెత్తురే? 38

అర్థము :- అక్కజము+ఐ=ఆశ్చర్యకరమయి, మహత్ (మహా)+అర్థ-నివహంబు=గొప్ప విషయములయొక్క సమూహము, సత్+ఉక్తులు = మంచి మాటలు, మెచ్చన్+చూచినన్ = ప్రశంసనీయముగా, క్రుక్కిదము+ఐన=నిండినది యగు, సత్+కృతి = మంచికావ్యము, ఇలన్=భూమియందు, అగుర్వు+అగున్+కాక = శ్రేష్ఠమయినది యగును గాని, చీకు = గ్రుడ్డివాఁడు, లావుకన్=పూరేడు పిట్టను, త్రొక్కిన + అట్లు = అదిమిన విధముగా, నోటి-కొలఁదుల్ = నోటికి వచ్చినన్ని, పురికొల్పఁగన్ = ప్రేరేపింపఁగా, అందులోనన్ = ఆ మాటలలో, ఒక్క+ఒక్కఁడు=ఒక్కటొక్కటి, చక్కన + ఐనన్ = బాగుగా నున్నను, కృతియున్=అట్టి కావ్యమును, కృతి+అందురె = కావ్య మందురా? అన రనుట, వానిన్ = ఆ కృతికర్తను, మెత్తురే = ప్రశంసింతురా? ప్రశంసింప రనుట.

తాత్పర్యము :- ఆశ్చర్యకరమగు విధమున గొప్ప విషయముల సమూహమును, సూక్తులను ప్రశంసనీయముగా నిండియున్న సత్కావ్యము శ్రేష్ఠమగును

గాని గ్రుడ్డివాఁడు పూరేడుపిట్ట నదిమినట్లు నోటికి వచ్చిన విధమున సహజముగా నా యువపూవులలో నొక్కటొక్కటి బాగుగా నున్నను ఆ కృతిని కృతి యందురా? ఆ కృతి కర్తను మెత్తురా? మెచ్చరనుట.

విశేషములు :- అగుర్వు=అధికము, శ్రేష్ఠము. ఇందే "పుష్పవృష్టి సైఁ, గురిసెఁ బురారిసూతికి నగుర్వుగ" కు. సం. 12-193. 'అగుప్పఁగ' అను పాఠముకంటె నిది మేలు, చీకు లావుకం ద్రొక్కినయట్లు - అలంకార మునమ. ఒక్కొక్కఁడు సక్కనైనన్-ఒక్కొక్కఁడు + చక్కనైనన్ - గసడదవాదేశము. ఆ కూఁతలలో నొక్కొక్కటి ప్రత్యేకముగా బాగుగా నున్నను, సమంజసముగా బాగుగా నుండకున్నచో నా కృతి కృతి యనిపించుకొన దనుట. లావుక (సము)- 'లావు కన లావక మొప్పును -' ఆం. భా. 2. 97. లావకము - పూరేడుపిట్ట. లావుక (వికృతి) లావకము (ప్రకృతి). లావుక పిట్ట. అందును గ్రుడ్డివాఁడు దానిని ద్రొక్కినచో నది నోటికి వచ్చినట్లు కూయును. అట్టి కూఁతలు గల కృతి యనుట.

క. చతురోక్తుల నుతపద బహు
గతుల నలంకార భావ కాంతిరసార్థో
న్నతిఁ గృతి నతిరసికులు వర
సతిగతి నెఱిఁగింపవలదె సౌభాగ్యమునన్? 39

అర్థము :- అతి-రసికులు = మిక్కిలి సరసులైనవారు-కవులు, కృతిన్ = కావ్యమును, చతుర + ఉక్తులన్ = నేర్పుతోడి మాటలతోను, నుత - పద-బహు - గతులన్ = పొగడఁబడిన మాటలయొక్క పెక్కురీతులతోను - పొగడఁబడిన అడుగులయొక్క పెక్కురీతులైన గమనములతోను, అలంకార - భావ - కాంతి - రస + అర్థ + ఉన్నతిన్ = ఉపమాద్యలంకారములు, రత్యాది స్థాయిభావములు, కాంత్యాది గుణములు, శృంగారాది రసములు, అర్థములు అనువాని యౌన్నత్యము తోను, - భూషణములు, ప్రేమము, కాంతి, రసములు, అర్థములు అనువాని పెంపు తోను, వర - సతి - గతిన్ = ఉత్తమురాలయిన పతివ్రత విధమున, సౌభాగ్యము నన్=సుభగత్వముతో - మాంగల్యముతో, ఎఱిఁగింపన్ + వలదె = చెప్ప వలదా?

తాత్పర్యము :- మిక్కిలి సరసులైన కవులు నేర్పుతోడి మాటలతోను, పొగడఁబడు నడుగుల పెక్కు నడలతోను, భూషణములు, అనురాగము, కాంతి,

రసము, అర్థము అనునాని యున్నతితోను గూడి సౌభాగ్యవతియగు నుత్తమ పతివ్రతను వలెఁ, మధురములైన మాటలతోను, పదముల వివిధ గతులతోను, ఉపమాద్యలంకారములు, రత్యాది స్థాయిభావములు, శాంత్యాది గుణములు, శృంగారాది రసములు, అర్థములు సమసాని పెంపుతోను గూడి సుభగమైయుండునట్లు కావ్యమును జెప్పవలదా? చెప్పవలయును ననుట,

విశేషములు :- కృతిని పరసతిగతి నెఱిఁగింపవలదె యని కృతిని పరసతితోఁ బోల్చుటవలన నలంకారము నుపమ. అది శ్లేషానుప్రాణితము. చతుర + ఉక్తులు = చతురోక్తులు-గుణసంధి. పద-కృత్యర్థమున శబ్దము లనియు, సత్యర్థమున నడుగు లనియు నర్థద్వయము - శ్లేషము. సౌభాగ్యము - సుభగస్య భావః.

మ. పదబంధంబుల నగ్గలించి, బుధశబ్దభ్రాజియై, సద్గుణా
స్పదమై, దుష్కవి హృత్సరోజ వనముల్ భంజించుచున్, భూరి స
మ్మద లీలన్ విలసిల్లి సత్కృతి జగన్మాన్యప్రభావంబునన్
మదనాగంబును బోలెఁ గ్రాలవలదా మా ఱెందు లే కున్నతిన్? 40

అర్థము :- సత్ + కృతి = సత్కావ్యము, పద-బంధంబులన్ = (కృతిపక్షమున) శబ్దముల కూర్పులతో (మదగజపక్షమున) అడుగుల కట్టులతో, అగ్గలించి = అతిశయించి, బుధ-శబ్ద-భ్రాజి + ఐ = (కృ.ప.) పండితుల శబ్దములతోఁ బ్రకాశించునది యయి - (గ.ప.) గొప్ప ఘీంకృతి ధ్వనితోఁ బ్రకాశించునదియయి, సత్ + గుణ + ఆస్పదము + ఐ = (కృ. ప.) మాధుర్యాదులైన యుత్తమ (కావ్య) గుణములకుఁ జోటయి, (గ.ప.) మంచి త్రాళ్ళకు స్థానమయినదయి, దుష్కవి-హృత్ + సరోజ-వనముల్ = (కృ. ప.) కుకవుల యొక్క, హృదయములనెడి తామరతోఁపులు భంజించుచున్ = నాశనము చేయుచు, భూరి-సమ్మద-లీలన్ = (కృ. ప.) అధికమైన సంతోషము యొక్క విలాసముతో, (గ. ప.) అధికమైన మదము యొక్క విలాసముతో, విలసిల్లి = ప్రకాశించి, జగత్ + మాన్య-ప్రభావంబునన్ = లోకముచే గౌరవింపఁదగిన మహిమతో, మద-నాగంబును + పోలెన్ = మదగజమువలె, మా ఱు + ఎందున్ - లేక = ప్రతి యెచ్చటను లేక, ఉన్నతిన్ = గొప్పతనముతో, గ్రాలన్ + వలదా = ఒప్పవలదా?

తా త్ప ర్య ము :- సత్కావ్యము మదగజమువలె - శబ్దముల కూర్పులతో నతిశయించి- అడుగుల బంధనములతో నతిశయించి, పండితుల శబ్దములచేఁ బ్రకాశించి-గొప్పఘీంకృతులచేఁ బ్రకాశించి, మాధుర్యాద్యుత్తమ కావ్యగుణములకు స్థానమయి - మంచి త్రాళ్ళకుఁ జోటయి, సుకవుల హృదయము లనెడి పద్మములను భగ్నము చేయుచు, మిక్కిలి సంతోషముతో - అధిక మదముతో, విలసిల్లి, లోకముచే గౌరవింపఁదగిన ప్రభావముతో, నెందును బ్రతిలేక ఔన్నత్యముతో నొప్పవలదా? ఒప్పవలయు ననుట.

వి శే ష ము లు :- శ్లేషానుప్రాణితమైన ఉపమ. హృత్సరోజ = హృదయము లనెడి సరోజములు-రూపకము.

సత్ + గుణ-హాశ్శు (మృదుహల్లు) పరమగు చుండఁగా ఝల్లునకుఁ దృతీయ వర్ణాదేశము.సద్గుణ. హృద్ + సరోజ = హృత్సరోజ- ఖరులు (కఠినహల్లులు) పరమగుచుండఁగా ఝల్లులకు చరులు (వర్గప్రథమాక్షరములు) ఆదేశమగును జగత్ + మాన్య-రహలుతప్ప మిగిలిన పదాంతగత హల్లులకు (యరులకు) అనునాసికము పరమగుచో వానికి సంబంధించిన అనునాసిక వర్ణము వైకల్పికముగా నాదేశమగును. జగన్మాన్య, జగద్మాన్య.

క. ముదమునఁ గవికృత కావ్యము
నదరున విలుకాని పట్టినమ్మును బర హృ
ద్భిదమై తల యూఁపును, బెఱ
యది కావ్యమె చెప్పఁ? బట్ట నదియున్ శరమే ।  41

అ ర్థ ము :- ముదమునన్ = సంతోషముతో, కవి - కృత - కావ్యమున్ = కవి రచించిన కావ్యమును, అదరునన్ = భయముతో, విలుకాని - పట్టిన + అమ్మును = విలుకాఁడు పట్టిన బాణమును, పర - హృద్ + భిదము + ఐ = ఇతరుని హృదయమును భేదించునదియై, శత్రువు హృదయమును భేదించునదియై, తల + ఊఁపును = (సంతోషముతో) శిరః కంపనమును జేయించును. పెఱ + అది = అటు లూఁపింపనిది, చెప్పన్ = చెప్పుటకు, కావ్యము + ఎ = కావ్యమా ? పట్టన్ = పట్టుటకు, అదియున్ = తాల్చినట్టిదియును, శరము + ఏ = బాణమా ?

తా త్ప ర్య ము :- సుకవి కావ్యము సంతోషమును గూర్చియు, విలుకాఁడు పట్టిన శరము భయము గొలిపియు, పఠిత హృదయమును - శత్రువు హృదయము

ఖేదించును. అట్లు శిరఃకంపము చేయింపనిచో నా కావ్యము కావ్యమా? ఆతఁడు పట్టిన బాణము బాణమా? కాదనుట.

విశేషము :- సత్కవి కావ్యము మదమునను, విలుకాని పట్టినమ్ము అదరునను పరహృద్విద్ధమై తలయూఁపింపనిచో- ఇందు వర్ణ్యమగు కావ్యమునకును, అవర్ణ్యమగు అమ్మునకును తలయూఁపించుట యను నేకధర్మాన్వయము చెప్పఁబడినది గనుక నలంకారము దీపకము. 'వదన్తి వర్ణ్యావర్ణ్యానాం ధర్మైక్యం దీపకం బుధాః. చన్ద్రా.

విలుకాని పట్టినమ్ము. విలుకాఁడు పట్టినమ్ము 'ధాతుజ విశేషణ భావార్థక పూర్వ వ్యవహితావ్యవహిత కర్తృ పదప్రథమకుఁ దఱచుగ యొక్కషష్ఠి యగు.' ప్రౌఢ. కారక. 15. విలుకానియొక్క పట్టినయమ్ము.' యొక్కకు లోపంబు బహుళంబు.' ప్రౌఢ. కారక. 16. విలుకాని పట్టినమ్ము, పట్టిన + అమ్ము = పట్టినమ్ము. 'అత్తునకు సంధి బహుళముగా నగు.' బాల, సంధి, 4. పట్టిన + అది = పట్టినది - అత్వసంధి. కావ్యము కావ్యమే? శరము శరమే? యని పౌనరుక్త్య మున్నను, కావ్యము శ్రేష్ఠమైన కావ్యము, శరము శ్రేష్ఠమైన శరము కాదని తాత్పర్యభేద ముండుటచే నలంకారము లాటానుప్రాసము. 'శబ్దార్థయోః పౌనరుక్త్యం యత్ర తాత్పర్య భేదవత్, స కావ్యే తార్పర్యవిదాం లాటానుప్రాస ఇష్యతే,

ఈ పద్యమునకు మూల మనఁదగు సంస్కృతశ్లోక మొండు గలదు.
'కిం కవే స్తేన కావ్యేన కిం కాణ్డేన ధనుష్మతః।
పరస్య హృదయే లగ్నం న ఘూనయతి యచ్ఛిరః॥'

క. ఓలిన కడచన నఱువది
నాఁగు విద్యలను నేర్పు నైసర్గికమై
వాలిన సుకవులకుం గా
కేల తరమె కృతులు చెప్ప నెవ్వరికైనన్? 42

అర్థము :- ఓలిన్ + అ = బాగుగా, కడచనన్ = సమగ్రముగా, అఱువది-నాఁగు - విద్యలను = అఱువది నాలుగు కళలందును, నేర్పు, నైసర్గికము + ఐ = స్వాభావికముగా, వాలిన = అతిశయించిన, సుకవులకున్ + కాక = సుకవులకుఁగాక, ఎవ్వరికిన్ + ఐనన్ = మఱియెవ్వరికైనను, కృతులు-చెప్పన్ = కావ్యములు రచించుటకు, ఏల-తరము + ఎ = ఎందులకు సాధ్యపడును?

తాత్పర్యము :- చతుష్షష్టి కళలందును నేర్పు బాగుగా స్వాభావికమై యతిశయించిన సుకవులకే గాని యట్టి నైపుణ్యములేని యితరుల కెవ్వరికిని గావ్యములు రచింప సాధ్యపడదు.

వ. ఆదీ యెట్లనిన. 43

తాత్పర్యము ; అది యే విధముగా ననిన - పయి పద్యముతో నన్వయము.

క. వన జలకేళీ రవి శశి
తనయోదయ మంత్ర[1] గతి రత క్షితిప రణాం
బునిధి మధు ఋతు పురోద్వా
హ నగ విరహ దూత్యవర్ణ నాష్టాదశమున్. 44

అర్థము ;- వన-జల-కేళీ=ఉద్యానవనక్రీడ, జలక్రీడ, రవి=సూర్యుఁడు, శశి=చంద్రుఁడు, తనయ+ఉదయ=పుత్త్రజననము, మంత్ర=ఆలోచనము, గతి=యాత్ర,రత=సంభోగము, క్షితిప=రాజు, రణ=యుద్ధము, అంబునిధి=సముద్రము, మధు=మధుపానము, ఋతు=ఋతువులు, పుర= పురము, ఉద్వాహ=వివాహము, నగ=కొండ, విరహ=ఎడఁబాటు, దూత్య = దౌత్యము-రాయబారము, అనువాని, వర్ణన+అష్టాదశమున్=వర్ణనల పదునెనిమిదింటిని.

తాత్పర్యము :- 1. వనక్రీడ, 2. జలక్రీడ, 3. సూర్యుఁడు 5. పుత్త్రోత్పత్తి, 6. మంత్రము (రాజకీయమైన ఆలోచన), 7. గతి (యాత్ర), 8. రతిక్రీడ, 9. ప్రభువు, 10. యుద్ధము, 11. సముద్రము, 12. మద్యపానము, 13. ఋతువులు, 14. పురము, 15. వివాహము, 16. పర్వతము, 17. ఎడఁబాటు, 18. దౌత్యము, (రాయబారము) అను పదునెనిమిది వర్ణనలును- తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : ఈ వర్ణనల సంఖ్యలో మతభేదములు గలవు. అప్పకవి పదునెనిమిది కాక ఇరువదిరెండు వర్ణనలు కావ్యమున నుండవలయునని చెప్పినాఁడు.

వ. పరిపూర్ణంబై దశప్రాణంబుల సప్రాణంబై నవరస భావ భరితంబై షట్త్రింశదలంకారాలంకృతంబై రమణీయంబైన దివ్య కథారంభంబున కభిముఖుండనై 45

1. ముద్రి. ప్ర. కరి.

అర్థము :- (అష్టాదశ వర్ణనలతో) నిండినదయి, దశ-ప్రాణంబులన్ = పది గుణములతో, సప్రాణంబు + ఐ = ప్రాణవంతమై- సజీవమయి, నవ-రస-భావ-భరితంబు + ఐ = తొమ్మిది రసములతోను, భావములతోను, నిండినదయి, షట్-త్రింశత్ + అలంకార + అలంకృతంబు + ఐ = ముప్పది యాఱు అలంకారములతో అలంకరింపఁబడినదయి, రమణీయంబు + ఐన = మనోహరమైన, దివ్య- కథా + ఆరంభంబునకున్ = దేవ సంబంధమైన, కథయొక్క ప్రారంభమునకు, అభిముఖుఁడను + ఐ = ఉన్ముఖుఁడ నయి.

తాత్పర్యము :- పదునెనిమిది వర్ణనలతో నిండినదయి, పది కావ్య గుణములతో సజీవమయి, తొమ్మిది రసములతోను భావములతోను నిండినదయి, ముప్పది యాఱు అలంకారములచే నలంకరింపఁబడిన దయి మనోహరమైన దివ్య కథను ప్రారంభించుట కున్ముఖుఁడ నయి. పయి పద్యముతో నన్వయము.

విశేషములు :- దశ-ప్రాణములు దశగుణములు-శ్లేష, ప్రసాదము, సమత మాధుర్యము, సుకుమారత, అర్థవ్యక్తి, ఔదార్యము, ఓజస్సు, కాంతి, సమాధి. షట్త్రింశదలంకారములు-దండి కావ్యాదర్శము ననుసరించినది. నవరసములు-శృంగారము, హాస్యము, కరుణము, రౌద్రము, వీరము, భయానకము, బీభత్సము, అద్భుతము, శాంతము- ఇది భట్టోద్భటుని మతము; భరతుని మతమున రసము లెనిమిది. వానిలో 'శాంతము' లేదు.

ఉ. పూని మహాగ్రహార వరపుత్త్ర[1] సమున్నతి దేవతాల యో
ద్యాన తటాక సత్కృతి నిధానము లాశశితారకంబు సు
స్థానములై మహిం బరగు జంగమ మల్లయ పేర సప్తసం
తానము లొప్ప నిల్పుదు[2] ముదంబునఁ దత్ప్రభునాజ్ఞ పెంపునన్. 46

అర్థము :- మహత్ (మహా) + అగ్రహార = గొప్ప అగ్రహారము, వర-పుత్త్ర-సమున్నతి = శ్రేష్ఠుఁడైన పుత్త్రునియొక్క ఔన్నత్యము, దేవతా + ఆలయము = దేవాలయము, ఉద్యాన = విహారార్థమైన తోఁట, తటాక = చెఱువు, సత్ + కృతి = సత్కా-

1. పుర.

వ్యము, నిధానములు=నిధి యను నేడును, ఆ-శశి-తారకంబున్=చంద్రుఁడు, నక్షత్రములు నుండునంత వఱకును, ఫూని=బాగుగా, సుస్థానములు+ఐ=మంచి స్థానములు గలవయి, మహిన్=భూమియందు, పరగున్=ఒప్పును, (నేడు), జంగమ మల్లయ-పేరన్ = జంగమమల్లికార్జునుని పేర, తద్+ప్రభు+ఆజ్ఞ-పెంపునన్=ఆ స్వామి యాన యొక్క గొప్పతనముచేత, సప్త-సంతానములు=ఏడు సంతతులు, ఒప్పన్=ఒప్పునట్లు, ముదంబునన్=సంతోషములో, నిల్పుదున్.

తాత్పర్యము :- అగ్రహారము, పుత్త్రుఁడు ,దేవాలయము, ఉద్యానవనము, సరస్సు, సత్కావ్యము, నిధి యనునవి యేడును చంద్రుఁడు, నక్షత్రములు ఉండు నంతవరకును భూమియందు సుస్థిరములై యుండును. అట్టి సప్త సంతానములను జంగమమల్లికార్జునుని పేర నా స్వామి యాన చొప్పున సంతోషముతో నిలుపుదును.

విశేషములు:- సప్తసంతానములు-క. తనయుఁడు చెఱువును గావ్యంబు నిధానము గుడి వనంబు భూదేవస్థాపనమును నను నియ్యేడును, జను శాస్త్రము, లందు సప్త సంతతు లనఁగన్" అప్ప. ఆ శశి తారకంబు-మర్యాదాభివిధులందుఁ బదాదియందు "ఆఙ్" వచ్చును. మర్యాదా=అవధి. ఇచట మర్యాదయందు 'ఆఙ్' వచ్చెను, అవ్యయీభావ సమాసము, శశితారకలు ఉండునంతవఱకును, తద్ + ప్రభు-అనునాసికాంతస్థ భిన్నములైన హల్లులకు (ఝల్లులకు) కఠిన హల్లులు (ఖరులు) పరము లగు నపుడు వాని వర్గములందలి ప్రథమ వర్ణములు (చరులు) ఆదేశము లగును-తత్ప్రభు. ప్రభు+ఆజ్ఞ. షష్ఠీసమాసమునందుకార ఋకారముల కచ్చు పరమగునపుడు నుగాగమం బగు,' ప్రభు న్నాజ్ఞ. బాల, సం. 34. ఆజ్ఞ (ప్రకృతి)-ఆన (వికృతి).

వ. అందు నుత్కృష్ట సంతానంబు కృతియ కా నిశ్చయించి. 47

అర్థము :- అందున్=ఆ సప్త సంతానములలో, ఉత్కృష్ట-సంతానంబు=ప్రశస్తమైన సంతతి, కృతి + అ = కావ్యమే, కాన్=అగునట్లు, నిశ్చయించి=నిర్ణయించి.

తాత్పర్యము :- ఆ సప్త సంతానములలోఁ బ్రశస్తమైన సంతానము కావ్యమే యని నిర్ణయించి - మఱి పద్యముతో నన్వయము.

విశేషములు :- 'గీ. సప్త సంతానములలోఁ బ్రశస్తిఁగాంచి, ఖిలము గాకుండు నది ధాత్రిఁ గృతియ కాన.' మను, 1. 14.

ఉ. జంగమ మల్లికార్జును నిసర్గ కవిస్తవనీయ సూక్తి యు
క్తిం గొనియాడి తత్కరుణ[1]ఁ గేనములేక కనురక్తయైన భా
షాంగనఁ దక్కనేలిన మహత్త్వము లోకమునం బ్రసిద్ధిగా
భంగిగ విస్తరించెదఁ బ్రబంధము సద్రసబంధురంబుగాన్. 48

అర్థము :- జంగమ మల్లికార్జునున్, నిసర్గ .... యుక్తిన్ : నిసర్గ = సహజులైన, కవి = కవులచే, స్తవనీయ = స్తుతింపఁదగిన, సు + ఉక్తి = మంచి మాటల యొక్క, యుక్తిన్ = కూడికతో, కొనియాడి = ప్రశంసించి, తద్ + కరుణన్ = ఆతని దయచేత, కేనము - లేక = కొఱఁత లేక, అనురక్త + ఐన = అనురాగము గలది యగు, భాషా + అంగనన్ = వాగ్దేవిని (సరస్వతిని), తక్కన్ + ఏలిన = మిక్కిలి పరిగ్రహించిన, మహత్త్వము = గొప్ప తనము, లోకమునన్ = లోకము నందు, ప్రసిద్ధి + కాన్ = ప్రసిద్ధముగా, భంగిగన్ = ఒప్పుగా, సత్ + రస - బంధురంబు + కాన్ = మంచి రసములచే నొప్పినదిగా, ప్రబంధమున్ = కావ్యమును, విస్తరించెదన్ = సవిశేషముగాఁ జెప్పెదను.

తాత్పర్యము :- జంగమ మల్లికార్జునుని సహజ కవులు గొనియాడు సూక్తులచేఁ బ్రశంసించి, ఆతని దయచేత, ఉత్తమ కవితయందుఁ గొఱఁతలేక అనురాగము గలిగియుండు వాగ్దేవిని మిక్కిలి వశపఱచుకొనిన గొప్ప తనము లోకమునఁ బ్రసిద్ధముగా, సద్రసములతో నొప్పునట్లు ప్రబంధమును జక్కఁగా విశేషించి చెప్పెదను.

విశేషములు :- కేనము = కొఱఁత. ఇందే ఉ .... గాంగేయుఁడుఁ దారకాసురుఁడుఁ గేనములేక నని సేసి రీసునన్.' కు. సం. 12. 145. కేనము - కేణ (కన్నడము)

---

1. సా. తత్కరుణ.

సీ. శరధి నీరులు పయోధరములు కొనివచ్చి
కురిసి వారిధియందుఁ గూర్చినట్లు,
చేనఁ బండిన విత్తు చేనికే ఫలకాంక్షఁ
బేర్మిఁ గ్రమ్మఱ వెదవెట్టునట్లు,
రోహణాచలపతి కూహించి వరరత్న
సంచయంబున విభూషించు నట్లు,
తీర్థాళి కర్థిఁ దత్తీర్థోదకంబుల
నెసకంబుగా నర్ఘ్య మిచ్చినట్లు,

ఆ. నింగి ముట్టియున్న జంగమ మల్లయ
వరమునందుఁ గనిన వస్తుకవితఁ
దగిలి వారియంద నెగడింతు రవికి దీ
పమున నర్చ లిచ్చు పగిది వోలె. 49

అర్థము :- శరధి-నీరులు = సముద్రజలములు, పయోధరములు = మేఘములు, కొనివచ్చి = తీసికొని, కురిసి = వర్షించి, వారిధియందున్ = సముద్రమునందు, కూర్చిన + అట్లు + అ = కలిపిన విధముగనే,

చేనన్ = చేనియందు, పండిన, విత్తు = ధాన్యము, ఫల-కాంక్షన్ = పంటయందలి కోరికతో, పేర్మిన్ = ఆసక్తితో, క్రమ్మఱన్ = మరల, వెద + పెట్టు + అట్లు + అ = విత్తు నట్లే.

రోహణ + అచల-పతికిన్ = రోహణమను పర్వత రాజమునకు, ఊహించి = ఆలోచించి, వర-రత్న-సంచయంబునన్ = శ్రేష్ఠములైన మణుల సమూహముతో, విభూషించు + అట్లు + అ = అలంకరించు విధముననే,

తీర్థ + ఆళికిన్ = పుణ్యప్రదములైన రేవుల వరుసకు, అర్థిన్ = కోరికతో, తత్ + తీర్థ + ఉదకంబులన్ = ఆ రేవులందలి జలములను, ఎసకంబుగాన్ = అధికముగా, అర్ఘ్యము + ఇచ్చిన + అట్లు + అ = పూజార్థమిచ్చినట్లుగనే,

నింగి-ముట్టి + ఉన్న = ఆకాశమునంటు - ఉన్నతమగు, జంగమ మల్లయ్య = జంగమ మల్లికార్జునునియొక్క, వరము + నందున్ = వర ప్రభావముచేత, కనిన = పొందిన, వస్తు-కవితన్ = వస్తుప్రధానమైన కవిత్వమును, రవికిన్ = సూర్యునకు, దీపమునన్ = దీపముతో, అర్చలు + ఇచ్చు-పగిది + పోలెన్ = పూజలొసఁగు విధమున, తగిలి = ఆసక్తితో, వారి + అందున్ + అ = ఆ జంగమ మల్లికార్జునులయందే, నెగడింతున్ = ప్రవర్తిల్లఁజేయుదును.

తాత్పర్యము :- సముద్రోదకములను మేఘములు తీసికొని మరల వర్షించి సముద్రమునందే కలిపినట్లును, చేనిలోఁ బండిన గింజలను ఫలకాంక్షతో మరలఁ జేనియందే విత్తునట్లును, రోహణాద్రిరాజమునకు శ్రేష్ఠములయిన రత్నముల సమూహముల నలంకారము చేసినట్లును, పుణ్యతీర్థములకు ఆ పుణ్యతీర్థములందలి జలములతోనే అర్ఘ్యమిచ్చినట్లును, ఉన్నతమగు జంగమ మల్లికార్జుని వర ప్రభావమునఁ గనిన వస్తుకవిత్వమును, సూర్యునకు దీపములతోఁ బూజలిచ్చునట్లు, ఆసక్తితో నా జంగమ మల్లికార్జునులవారికే అర్పింతును.

విశేషములు :- జంగమ మల్లికార్జునుల వర ప్రభావమునఁ దాను గనిన వస్తు కవిత్వమును మరల వారికే అర్పించుటకు వివిధోపమానములు చెప్పఁబడినవి కావున నలంకారము మాలోపమ. రవికిన్ = సూర్యునకు - వేవెలుఁగునకు ఒక్క చిఱు దివ్వెతో నర్ఘ్యమిచ్చునట్లు మహాప్రభావ సంపన్నుమగు జంగమ మల్లికార్జునుల వరము వలనఁ గనిన వస్తుకవిత్వమును వారికే సమర్పింతు ననుట, రోహణాచలము - సింహళమునందలి యొక పర్వతము, ఇది వివిధ రత్నములకు నిలయము. పగిది, పోలె రెండును సమానార్థకములే, ఇట్లు ఒక ఉపమావాచకముపై నింకొక దానిని ప్రయోగించుట యార్ష లక్షణము.

చ. గురువున, కిష్టదైవమునకుం, బతికిం గృతి చెప్పి పుణ్యమున్,
వరమును, దేజముం బడయవచ్చు జగంబుల; నిశ్చయంబు; మ
ద్గురువును, నిష్టదైవమును, గూర్చు నిజేశుఁడుఁ దాన; నాకుఁ గా
కొరునకు నిట్లు నేకులునె యొక్కట లాభము లెన్ని యన్నియున్ ? 50

అర్థము :- జగంబులన్ = లోకములందు, గురువునకున్, ఇష్ట - దైవమునకున్, పతికిన్ = ప్రభువునకును, కృతి - చెప్పి = కావ్యము నంకితమిచ్చి, పుణ్యమున్, వరమును, తేజమున్ = తేజస్సును, పడయన్ + వచ్చున్ = పొందవచ్చును, నిశ్చయంబు = ధ్రువము, మత్ + గురువును = నా గురువును, ఇష్ట - దైవమును- కూర్చు = ఇష్టుఁడైన, నిజ + ఈశుఁడున్ = నా ప్రభువును, తాను + అ = తానె, జంగమ మల్లికార్జునుఁడే, ఇట్లు, నాకున్ + కాక = నాకుఁ దప్ప, ఒరునకున్ = ఇతరునకు, ఒక్కటన్ = ఒక్కదాని చేతనే, లాభములు, ఎన్ని = ఎన్ని లాభములు పొందవీలగునో, అన్నియున్ = అన్నిలాభములును, చేకుఱునె = లభించునా ?

తాత్పర్యము :- లోకమున గురునకును, ఇష్టదైవమునకును, ప్రభువునకును గావ్యము నంకిత మిచ్చి పుణ్యమును, వరమును, తేజస్సును బొందవచ్చును. నిశ్చయము. ఇట్లు వేఱువేఱువారికిఁ గావ్యమును సమర్పించి వేఱువేఱు లాభములను బడయవచ్చును. కాని నా విషయమున నాకు గురువును, ఇష్టదైవమును, ప్రభువును శ్రీ జంగమ మల్లికార్జునుల వారే. ఒక్క శ్రీవారి నర్పించుట వలననే ఉన్న లాభము లన్నియును నాకు లభించుచున్నవి. ఇట్లు నాకుఁగాక యితరులకు సాధ్యముగాదు.

విశేషము లు :- దీనిచేఁ గృతికర్త యగు నన్నెచోడునికి జంగమ మల్లికార్జునులయెడఁగల భక్త్యతిశయము తెలియుచున్నది. అలంకారము యథాసంఖ్యము.

వ. అని యిట్లు మహోత్సాహంబున దివ్యకల్పం బుపకల్పించు మహాకవి ముఖ్యుండ. 51

అర్థము :- అని, ఇట్లు, మహత్ (మహా) + ఉత్సాహంబునన్ = అధికమైన ఉత్సాహముతో, దివ్య-కల్పంబు = దేవతా సంబంధమైన రచనను, ఉపకల్పించు = నిర్మించునట్టి, మహత్ (మహా) - కవి - ముఖ్యుండన్ = మహాకవిశ్రేష్ఠుఁడను.

తాత్పర్యము :- అని యీవిధముగా నేను గొప్ప యుత్సాహముతో దేవ సంబంధమైన రచనను - కావ్యమును నిర్మించు మహాకవిశ్రేష్ఠుఁడను.

## కృతి కర్తృ వంశ వర్ణనాదికము

సీ. కుతలంబు నడుకొనఁ గొలకొండగా నిల్పి
శరనిధి గ్రొచ్చిరి సగర సుతులు;
మిన్నులపైఁ బాఱుచున్నయే ఱిలఁదెచ్చి
వారాశి నించె భగీరథుండు;
గోత్రాచలము లెత్తికొని వచ్చి కడచన్న
రత్నాకరముఁ గట్టె రాఘవుండు;
జలధి మహీసతి మొలనూలుగాఁ జుట్టి
పాలించెఁ గలిఁ గరికాలచోడు.

ఆ. వరుస నిట్లు సూర్యవంశాధిపతు లంబు
నిధియ మేర గాఁగ నిఖిల జగము
నేలి చనిరి వారి కెనవచ్చు సుశ్లోక
ధనుఁడ నన్నెచోడ జనవిభుండ. 52

అర్థము:- సగర సుతులు = సగరచక్రవర్తి కొడుకులు, కుతలంబు = భూతలముయొక్క, నడుకొనన్ = మధ్యభాగమును, కొలకొండగాన్ = త్రవ్విన నేలలోఁతు తెలిసికొనుటకు విడిచిన దిబ్బగా, నిల్పి, శరనిధిన్ = సముద్రమును, గ్రొచ్చిరి = త్రవ్విరి.

భగీరథుఁడు, మిన్నులపైన్ = ఆకాశముపై, పాఱుచున్ + ఉన్న = ప్రవహించుచున్న, ఏఱు = నది-ఆకాశగంగను-మందాకినిని, ఇలన్ + తెచ్చి = భూమికిఁదెచ్చి, వారాశిన్ = సముద్రమును, నించెన్ = నిండించెను.

రాఘవుండు = రఘువంశము వాఁడైన రాముఁడు, గోత్ర + అచలములు = కుల పర్వతములు, ఎత్తికొనివచ్చి, కడచన్న = అపారమైన, రత్న + ఆకరమున్ = సముద్రమును, కట్టెన్,

కరికాలచోడు= కరికాలచోడుఁడు, జలధిన్ = సముద్రమును. మహీ-సతి= భూమి యనెడు స్త్రీయొక్క, మొల-నూలు + కాన్ = మొలనూలు + అగునట్లు, చుట్టి, కలిన్ = కలియుగమునందు, పాలించెన్ = ఏలెను.

ఇట్లు, వరుసన్ = క్రమముగా, సూర్య-వంశ + అధిపతులు = సూర్యవంశపు రాజులు, అంబునిధి + ఆ = సముద్రమే, మేర = హద్దు, కాఁగన్ = అగునట్లు, నిఖిల-జగమున్ = ఎల్లలోకములను, ఏలి = పాలించి, చనిరి = పోయిరి, వారికిన్ = ఆ పోయిన వారికి, ఎన-వచ్చు = సాటివచ్చునట్టి, సుశ్లోక-ధనుఁడన్ = మంచికీర్తియే ధనముగాఁ గలవాఁడను, నన్నెచోడ-జనవిభుండన్ = నన్నెచోడుఁ డను రాజను.

తాత్పర్యము :- సగరచక్రవర్తి కొడుకులు భూమధ్యభాగమును గోలు చుటకైన దిబ్బగా నిల్పి సముద్రమును ద్రవ్విరి. భగీరథుఁడు ఆకాశమునఁ బ్రవహించు చున్న యేటిని మందాకినిని భూమికిఁ దెచ్చి సముద్రమున నింపెను. శ్రీరాముఁడు కులపర్వతముల నెత్తికొని వచ్చి యపారమగు సముద్రమును బంధించెను. కలికాల మునఁ గరికాలచోడుఁడు సముద్రమును భూమి యనెడు స్త్రీకి మొలనూలుగాఁ జుట్టి పాలించెను. ఇట్లు క్రమముగా సూర్యవంశపు రాజులు సముద్రమే హద్దుగా నెల్లలోకము నేలిరి. అట్టివారికి సాటివచ్చు సత్కీర్తిధనుఁడను నేను నన్నెచోడ ప్రభువను.

విశేషములు :- సగర సుతులు-సగర చక్రవర్తికి సుమతియందుఁ బుట్టిన యఱువదివేవురుకొడుకులు. తండ్రి యశ్వమేధ యాగమున విడిచిన యాగాశ్వము సముద్రమునఁ బ్రవేశింప, వీరు దాని నన్వేషించుటకు సముద్రమును ద్రవ్విరి. భగీరథుఁడు, సగర చక్రవర్తి మునిమనుమఁడు, సగరుని కొడుకైన అసమంజసుని పుత్త్రుఁడగు అంశుమంతుని కుమారుఁడు, కపిలుని కోపాగ్నిచే భస్మీభూతులైన తన పితృదేవతల కుత్తమగతులు కల్పించుటకై యీశ్వరుని గూర్చి తపస్సుచేసి దివిజగంగను భూమికిఁ గొనివచ్చి వారి భస్మరాశులపైఁ బ్రవహింపఁజేయ వారు సద్గతులను బొందిరి, గంగా జలముచే సముద్రము నిండెను. రాఘవుఁడు-శ్రీరాముఁడు. లంకలో రావణుఁడు చెఱఁ బెట్టిన తన భార్యను సీతను గొనిరా సముద్రమును గులపర్వతములతో బంధించెను. కలియుగమునఁ గరికాలచోడుఁడు భూసతికి సముద్రము మొలనూలిఁగాఁజేసి యేలెను. అనఁగా సముద్రపర్యంతమైన భూమినేలె ననుట. నన్నెచోడుని వంశమునకు మూల పురుషుఁడు కరికాలచోడుఁడు, కరికాలచోడుఁడు సూర్యవంశము వాఁడగుటఁ దజ్జనితుఁ

విశేషములు :- హైహయాన్వయాంబర శశిరేఖ - అనుచో నలంకారము రూపకము,

క. కలువొన్న విరులఁ బెరుఁగఁగ,
గలుకోడి రవంబు దిశలఁ గలయఁగఁ జెలఁగన్
బొలుచు నొరయూరి కధిపతి
నలఘు పరాక్రముఁడఁ దెంకణాదిత్యుండన్. 54

అర్థము :- కలువొన్న=ఒక జాతి పొన్నచెట్టు - జాతిపొన్న, విరులన్= పూవులతో, పెరుఁగన్ వృద్ధిపొందఁగా, కలుకోడి=ఒకజాతి కోడి-జాతికోడియొక్క, రవంబు=ధ్వని-కూఁత, దిశలన్=దిక్కులందు, కలయఁగన్=అంతటను,చెలఁగన్= మ్రోయఁగా, పొలుచు=ఒప్పునట్టి, ఒరయూరికిన్ = ఒరయూ రనెడి పురమునకు, అధిపతిన్=ప్రభుఁడను, అలఘు-పరాక్రముఁడన్ = తక్కువకాని-అధికమైన, పరాక్రమము గలవాఁడను, తెంకణ+ఆదిత్యుండన్=దక్షిణదేశమునకు సూర్యునివంటి వాఁడను.

తాత్పర్యము :- జాతిపొన్నచెట్టు పూలతో వృద్ధి చెందఁగను, జాతికోడి కూఁత దెసల మాఱుమ్రోయఁగను ఒప్పునట్టి ఒరయూరను పురమునకు నేను ప్రభుఁ డను; అధిక పరాక్రమవంతుఁడను. దక్షిణదేశమునకు సూర్యునివంటివాఁ డను నర్థమిచ్చు 'తెంకణాదిత్యుఁ'డను బిరుదు గలవాఁడను.

విశేషములు :- ఈ ఒరయూరు నేఁడు తమిళనాడు రాష్ట్రమున తిరుచినా పల్లికి సమీపమున నున్న-చీరలకుఁ బ్రసిద్ధమైన ఒరయూరే, తానే ఒరయూరి కధిపతి నని యితఁడు కంఠోక్తిగాఁ జెప్పికొనుచుండఁగా, అది వంశపారంపర్యముగా వచ్చిన బిరుదమేకాని నిజముగా నొరయూరి ప్రభువు కాఁడని కొంద ఱేల సందేహింతురో!

క. పాత్రుఁడ, నసదృశ కాశ్యప
గోత్రుఁడ, సచ్చరిత నుభయకుల శుద్ధుండన్,
మిత్రాన్వయ శేఖరుఁడఁ, బ
విత్రీకృత దేహుఁడను వివిధ యజ్ఞములన్. 55

అర్థము :- పాత్రుఁడన్ = యోగ్యుఁడను, అసదృశ-కాశ్యప-గోత్రుఁడన్ = సాటిలేని కాశ్యప గోత్రుఁడను, సత్ + చరితన్ = మంచినడవడిచేత, ఉభయ-కుల-పవిత్రుఁడన్ = పితృమాతృ వంశములను రెండింటిని బవిత్రముచేసినవాఁడను, మిత్ర + అన్వయ-శేఖరుఁడన్ = సూర్యవంశమునందు శ్రేష్ఠుఁడను, వివిధ-యజ్ఞములన్ = పెక్కు యజ్ఞములచేఁ, పవిత్రీ-కృత-దేహుఁడను = పావనముచేయఁబడిన శరీరము గలవాఁడను.

తాత్పర్యము :- నేను యోగ్యుఁడను. సాటిలేని కాశ్యపగోత్రుఁడను. సచ్చరిత్రమునచేఁ బితృమాతృ వంశములు రెంటిని బవిత్రముచేసినవాఁడను, సూర్య వంశమువారిలో శ్రేష్ఠుఁడను. వివిధ యజ్ఞము లొనరించుటచేతఁ బవిత్రముగాఁజేయఁ బడిన శరీరము గలవాఁడను.

విశేషములు :- సత్+చరిత-సకార తవర్గములకు శవర్గ చ వర్గములతో పూర్వమందైనను బరమందైనను కూడిక గలుగు నపుడు క్రమముగా శవర్గ చవర్గ వర్ణము లాదేశమగును - సచ్చరిత.

వ. ఇట్లు విశిష్ట గుణ గణాలంకృతుండనై నెగడు నస్మదీయానూన ప్రతిభార్ణ వోదీర్ణ రుచిర వస్తు విస్తారితోత్తమ కావ్యరత్న విభూషణం బమృతాంశుభూషణావతారంబై విలసిల్లు జంగమ మల్లికార్జునదేవు నిఖిల జన శిరో విభూషణామల దివ్య శ్రీపాదంబు లాకల్పాంత స్థాయిగా విభూషించు టశేషజగజ్జేగీయమానంబు. 56

అర్థము :- ఇట్లు, విశిష్ట-గుణ-గణ + అలంకృతుండను + ఐ = గొప్ప గుణములయొక్క సమూహముచేత నలంకరింపఁబడినవాఁడనై, నెగడు = ఒప్పు, అస్మదీయా.......... విభూషణము : అస్మదీయ = నాదైన, అనూన = తక్కువ కాని (గొప్పదైన), ప్రతిభా = ప్రతిభయనెడి, అర్ణవ = సముద్రమునందు, ఉదీర్ణ = పుట్టిన, రుచిర = మనోహరమైన, వస్తు = వస్తువుచేత-కథచేత, విస్తారిత = విస్తరింపఁజేయఁబడిన, ఉత్తమ = శ్రేష్ఠమయిన, కావ్య = కావ్య మనెడి, రత్న-విభూషణంబు=రత్నాలంకారము, అమృత + అంశు-భూషణ + అవతారంబు+ ఐ = చంద్రుఁ డలంకారముగాఁగల శివునియొక్క అవతారమయి, విలసిల్లు =

ప్రకాశించు, జంగమ మల్లికార్జున-దేవు = జంగమ మల్లికార్జున స్వామియొక్క. నిఖిల........ పాదంబులు; నిఖిల = ఎల్ల, జన=జనులయొక్క, శిరస్+విభూషణ = శిరోఽలంకారము, అమల = నిర్మలము, దివ్య=దివ్యము, అగు, శ్రీ పాదంబులు= శోభాకరములైన పాదములు, ఆ-కల్ప + అంత-స్థాయిగాన్ = ప్రళయకాలము వఱకు నుండునదిగా, విభూషించుట = అలంకరించుట, అశేష = సర్వ, జగత్ + జేగీయమానంబు = లోకములచే గానముచేయఁబడుచున్నది.

తా త్ప ర్య ము :- ఈ విధముగా గొప్ప సుగుణముల సమూహములచే నలంకరింపఁబడినవాఁడనై యొప్పు నా అనల్పమైన ప్రతిభ యనెడి సముద్రమునం దుత్పన్నమైన మనోహరమైన కథచేత విపులీకరింపఁబడిన ఉత్తమకావ్యమనెడి రత్నాలంకారము-శివావతారుఁడై విలసిల్లు జంగమ మల్లికార్జున దేవుని ఎల్ల జనుల శిరోఽలంకారములు, నిర్మలములు, దివ్యములు నైన శ్రీ పాదములను శాశ్వతముగా నలంకరించుట యెల్ల జగములచే గానము చేయఁబడుచున్నది.

వి శే ష ము లు ;- నెగడు + అస్మదీయ - ఉదంతమగు తద్ధర్మార్థ విశేషణమున కచ్చు పరమగునపుడు నుగాగమంబగు. నెగడు నస్మదీయ. బాల. సం. 33, నెగడు నస్మదీయా నూన....విభూషణంబు-ఇందు నెగడు అను ధాతుజ విశేషణము అస్మదీయా దిగాఁ గల సిద్ధసమాసము నందలి 'అస్మదీయ' యను పద మొక్కదానితో నన్వయించు చున్నది- 'కొన్ని యెడల సిద్ధ సమాస మధ్యగత పదంబులతోఁ దద్భిన్న పదంబుల కన్వయంబు చూపట్టెడి.' ప్రౌఢ. సమాస. 35. ప్రతిభార్ణవ = ప్రతిభ యనెడి అర్ణవ. కావ్య రత్న విభూషణంబు - కావ్యమనెడి రత్నవిభూషణము - రూపకములు. జగత్ + జేగీయమానంబు- 'అనునాసికాంతస్థ వర్ణములు తప్ప మిగిలిన పదాంత గత హల్లులకు (ఝల్లులకు) మృదుహల్లులు (హశ్శులు) కాని, అచ్చులు కాని పరములగు నపుడు ఆ హల్లుల వర్గమునకుఁజెందిన తృతీయ వర్ణమాదేశమగును, జగద్ + జేగీయమాన. 'సకార త వర్గములకు శవర్గ చవర్గములతో పూర్వమందైనను పరమందైనను కూడిక గలుగునపుడు క్రమముగా శవర్గ చ వర్గ వర్ణము లాదేశమగును. జగజ్జేగీయమానంబు.

చ. రవికులశేఖరుండు కవిరాజశిఖామణి కావ్యకర్తస
త్కవి భువి నన్నెచోడుఁ డటె! కావ్యము దివ్యకథం గుమార సం
భవ మటె! సత్కథాధిపతి భవ్యుఁడు జంగమ మల్లికార్జునుం
డవిచలితార్థయోగధరుఁ డట్టె! వినం గొనియాడఁ జాలదే! 57

అర్థము :- కావ్య-కర్త=కావ్యమును రచించినవాఁడు. భువిన్=భూమి యందు, రవి-కుల-శేఖరుండు=సూర్యవంశశ్రేష్ఠుఁడును- కవిరాజ శిఖామణి=కవిశ్రేష్ఠులలోఁ దలమానికమైనవాఁడు, సత్+కవి=మంచికవి, నన్నెచోడుఁడు+అటె=నన్నెచోడుఁడట, కావ్యము, దివ్య-కథన్=దేవతా సంబంధి కథయందు, కుమారసంభవము+అటె=కుమారసంభవమట, సత్+కథా + అధిపతి = (అ) మంచి కథకు నాయకుఁడు, భవ్యుఁడు=తగినవాఁడు, (అగు) జంగమమల్లికార్జునుండు, అవిచలిత=అర్థ-యోగ-ధరుఁడు+అట్టె=నిశ్చలమైన అర్థమనెడి యోగమును ధరించినవాఁడటె, వినన్=వినుటకును, కొనియాడన్=ప్రశంసించుటకును, చాలదే= సమర్థము గాదా- అగు ననుట,

తాత్పర్యము :- కావ్యమును రచించినవాఁడు సూర్యవంశ శ్రేష్ఠుఁడును, కవిరాజ శిఖామణియును, సత్కవియును అగు నన్నెచోడుఁడట, కావ్యము దివ్యకథలలోఁ గుమారసంభవమట, కథానాయకుఁడు-కృతిభర్త యోగ్యుఁడగు జంగమమల్లికార్జునుఁడు నిశ్చలార్థ మనెడి యోగమును ధరించినవాఁడట! ఇఁక, దానిని వినను, ప్రశంసింపను యోగ్యము కాదా ! అగు నని భావము.

విశేషములు :- కావ్యము దివ్యకథయగు కుమారసంభవము. కవి కవిరాజ శిఖామణి, కృతిభర్త-నిశ్చలమైన అర్థయోగమును ధరించిన జంగమ మల్లికార్జున దేవుఁడు-ఇన్ని సల్లక్షణములు పట్టిన యీ కావ్యము ప్రశంసనీయ మనుట,

వ. కావునం బరమశ్రీ నగోత్తుంగ మణిశ్రీ సంగత మల్లికార్జున దేవ[1]తాత్మకంబైన తేజంబు జగంబులం బ్రత్యక్షంబై ప్రవర్తిల్లుట జంగమ మల్లికార్జున [1]దేవుండై, ప్రాణాయామాది షడంగోపాంగ

1. వా. పా. దేవతాకంబై.

సకల యోగిజనారాధితుం డగుటం బరమయోగీంద్రుండై, న్యాయ వైశేషికాది షట్తర్క కర్కశుం డగుటం బరవాది భయంకరుండై, జన్మమరణాది దుఃఖార్ణవోత్తీర్ణ స్తూయమానమానసుం డగుటనుం బర మానంద హృదయుండై, ఘోర సంసార పారావారోత్తరణ కారణా నూన వైరాగ్య నిరతుం డగుట సమ్యగ్జ్ఞాన స్వరూపుండై, వేద తదంగ శాస్త్ర పురాణేతిహాసాగమాది సకల కళా స్వరూపాపార వాణీ ధరుం డగుట నిఖిల విద్యాగురుండై, సకలజనాభీష్ట విమల జ్ఞానానూన ఫలప్రదాయకుం డగుటం బరమ స్వరూపుండై, సమస్త విద్వజ్జన మనో మానసకేళీలాలసుం డగుటం బరమహంస స్వరూపుండై, యత్యుత్తమ పురుషార్థ ప్రవర్తితుం డగుటం బురు షోత్తముండై, నిఖిల ముముక్షు జనైకధ్యేయాత్మకుం డగుటం బర బ్రహ్మ స్వరూపుండై, నిస్త్రైగుణ్యపదార్థ ప్రవర్తితుం డగుట గుణ గణాతీతుండై, సద్భక్త జనాత్మాలోకనైక హేతుభూతుం డగుట మునిజనముఖమణిముకురుండైన జంగమ మల్లికార్జున దేవునకు. 58

అర్థము :- కావునన్ = కాఁబట్టి, పరమ - శ్రీ నగ + ఉత్తుంగ - మణి- శ్రీ = గొప్పది యగు శ్రీశైలము నందలి, యెత్తయిన, మణుల సంపదతో, సంగత = కూడుకొన్న, మల్లికార్జున దేవతా + ఆత్మకంబు + ఐన = మల్లికార్జున దేవుని స్వరూపమైన, తేజంబు = తేజస్సు, జగంబులన్ = లోకములందు, ప్రత్యక్షంబు + ఐ = ఎదుటఁ దోఁచిన దయి, ప్రవర్తిల్లుటన్ = ఉండుటచేత, జంగమ మల్లికార్జున- దేవుండు + ఐ, ప్రాణాయామ + ఆది - షట్ + అంగ + ఉపాంగ - సకల యోగి-జన + ఆరాధితుండు = ప్రాణాయామము మున్నగు ఆఱంగములు, ఉపాంగములు గల, ఎల్ల యోగిజనులచేఁ బూజింపఁబడినవాఁడు, అగుటన్ = అగుటచే, పరమ- యోగి + ఇంద్రుండు + ఐ = మహాయోగి శ్రేష్ఠుఁడయి, న్యాయ - వైశేషిక + ఆది - షట్ + తర్క - కర్కశుండు = న్యాయము, వైశేషికము మున్నగు ఆఱు తర్కములచేఁ గఠినుఁడు అనఁగా న్యాయాదులైన ఆఱు తర్కములను క్షుణ్ణముగాఁ జదివినవాఁడనుట, అగుటన్ = అగుటచే, పరవాది - భయంకరుండు + ఐ =

* త్రువులైన వాదించువారికి వెఱపుఁగొలుపువాఁడయి, జన్మ = పుట్టుట, మరణ = చచ్చుట, ఆది = మొదలగు, దుఃఖ + అర్ణవ = దుఃఖమనెడి సముద్రమును, ఉత్తీర్ణ = దాఁటినట్టియు, (అందుచేతనే), స్తూయమాన = పొగడఁబడుచున్న, మానసుండు = మనస్సు గలవాఁడు, అగుటన్ = అగుటచేత. పరమ + ఆనంద-హృదయుండు + ఐ = మిక్కిలి సంతోషముతోఁగూడిన హృదయము గలవాఁడయి, ఘోర .... నిరతుండు : ఘోర = భయంకరమైన. సంసార - పారావార = సంసారమనెడి సముద్రము యొక్క, ఉత్తరణ = దాఁటుట అనెడి, కారణ = కారణముచేత, అనూన = తక్కువకాని, వైరాగ్య = వైరాగ్యమునందు, నిరతుండు = ఆసక్తి గలవాఁడు, అగుటన్, సమ్యచ్(క్) + జ్ఞాన - స్వరూపుండు + ఐ = లెస్సయైన జ్ఞానము యొక్క స్వరూపము గలవాఁడయి, వేద .... ధరుండు : వేద = నాలుగు వేదములు, తద్ + అంగ = వాని యంగములు, శాస్త్ర = ఆఱు శాస్త్రములు, పురాణ = పదునెనిమిది పురాణములు. ఇతిహాస = భారతాది పూర్వచరిత్ర ప్రతిపాదక గ్రంథములు. ఆగమ = ఆగమములు, ఆది = మొదలుగాఁగల, సకల = ఎల్ల, కళా = కళల యొక్క, స్వరూప = స్వరూపమయిన, అపార = అనంతమయిన, వాణీ = వాక్కు యొక్క, ధరుండు = తాల్చినవాఁడు, అగుటన్, నిఖిల - విద్యా - గురుండు + ఐ = ఎల్ల విద్యలకును గురుఁడయి, సకల = ఎల్ల, జన = మనుష్యులచేత, అభీష్ట = కోరఁబడిన, విమల = నిర్మలమైన, జ్ఞానమనెడి, అనూన = తక్కువ కాని, ఫల = ఫలముయొక్క, ప్రదాయకుండు = ఇచ్చువాఁడు, అగుటన్, పరమ - స్వరూపుండు + ఐ = ఉత్కృష్టమైన జ్ఞానము గలవాఁడయి, సమస్త = ఎల్ల. విద్వస్ (త్) + జన = విద్వాంసులైన జనులయొక్క, మనస్ + మానస = మనస్సులనెడి మానస సరస్సులందు, కేళీ = క్రీడలయందు, లాలసుండు = అధిక వాంఛగలవాఁడు, అగుటన్, పరమహంస - స్వరూపుండు + ఐ = ఉత్తమ పదము నొందిన సన్న్యాసి యొక్క - గొప్ప అంచయొక్క. స్వరూపము గలవాఁడయి, అతి + ఉత్తమ = మిక్కిలి శ్రేష్ఠమయిన, పురుష + అర్థ = పురుషార్థమైన మోక్షము నందు, ప్రవర్తితుండు = ప్రవర్తించినవాఁడు, అగుటన్, పురుష + ఉత్తముండు + ఐ = పురుష శ్రేష్ఠుఁడు అయి, విష్ణువయి, నిఖిల - ముముక్షు - జన + ఏక - ధ్యేయ + ఆత్మకుండు = ఎల్ల మోక్షకాంక్షులగు జనులకు ముఖ్యముగా, ధ్యానింపఁదగిన ఆత్మ గలవాఁడు, అగుటన్, పరబ్రహ్మ - స్వరూపుండు + ఐ = పరబ్రహ్మ యొక్క స్వరూపము గలవాఁడయి, నిస్త్రైగుణ్య-పదార్థ-ప్రవర్తితుండు = త్రిగుణములు

(సత్త్వరజస్తమములు) లేని పదార్థమునందు వర్తించువాఁడు, అగుటన్, గుణ - గణ+ అతీతుండు + ఐ = గుణముల యొక్క సమూహము కంటె వేఱయిన వాఁడయి, సత్ + భక్త = మంచి భక్తులైన, జన = జనుల యొక్క, ఆత్మ + ఆలోకన= మనస్సులయొక్క దృష్టులకు, ఏక=ప్రధానమైన, హేతు - భూతుండు=కారణమైన వాఁడు, అగుటన్, ముని - జన = మునుల సమూహము యొక్క, ముఖ = ముఖములకు, మణి - ముకురుండు = రత్న దర్పణము, ఐన, జంగమ మల్లికార్జున దేవునకు.

తాత్పర్యము : కావున గొప్పది యగు శ్రీశైలమునందలి మణి సంపదలతోఁ గూడిన మల్లికార్జున దేవుని స్వరూపమయి లోకములందుఁ బ్రత్యక్షమయి ప్రవర్తిల్లుట చేత జంగమ మల్లికార్జున దేవుఁడయి, ప్రాణాయామము మున్నగు షడంగములు ఉపాంగములు గల యెల్ల యోగులచేఁ బూజితుఁడగుటచేఁ బరమయోగి శ్రేష్ఠుఁడయి, న్యాయము, వైశేషికము మున్నగు నాఱు తర్క శాస్త్రములను బాగుగాఁ జదివిన వాఁడగుటచేఁ బరవాది భయంకరుఁడయి, పుట్టుట గిట్టుట మున్నగు దుఃఖములనెడి సముద్రములను దాఁటి పొగడఁబడుచున్న మనస్సు గలవాఁడగుటచేఁ బరమానంద హృదయుఁడయి, భయంకర సంసార సముద్రమును దాఁటఁ గారణమైన వైరాగ్యమునం దాసక్తి గలవాఁడగుటచే సుజ్ఞాన స్వరూపుఁడయి, వేదములు, తదంగములు, శాస్త్రములు, పురాణములు, ఇతిహాసములు, ఆగమములు మున్నగు ఎల్ల విద్యల స్వరూపమైన అనంత వాక్కును ధరించినవాఁడగుటచే ఎల్ల విద్యలకును గురువయి, ఎల్ల జనులును గోరు నిర్మల జ్ఞాన మనెడి గొప్ప ఫలము నిచ్చువాఁడగుటచేఁ బరమ జ్ఞాన స్వరూపుఁడయి, ఎల్ల విద్వాంసుల మనస్సులనెడి మానస సరస్సులందు విహరించు కోరిక గలవాఁడగుటచే, పరమహంస స్వరూపుఁడయి, అత్యుత్తమమైన పురుషార్థమగు మోక్షమునందుఁ బ్రవర్తించువాఁడగుటచేఁ బురుషోత్తముఁడయి, ఎల్ల మోక్షకాంక్షి జనులకుఁ బ్రధానమైన ఆత్మ గలవాఁడగుటచేఁ బరబ్రహ్మ స్వరూపుఁడయి, త్రిగుణ రహిత పదార్థమునందుఁ బ్రవర్తిల్లువాఁడగుటచే గుణగణమున కతీతుఁడై, సద్భక్తులైన జనుల ఆత్మాలోకనమునకు ముఖ్యకారణమైనవాఁడగుటచే మునిజనుల ముఖములకు మణి దర్పణము అగు జంగమ మల్లికార్జున దేవునకు - పయి గద్యముతో నన్వయము.

విశేషములు : ప్రాణాయామము - ప్రాణవాయువును-నాసికా ముఖములందు సంచరించు దానిని మంత్ర పూర్వకముగా నిరోధించుట. ఇది యోగాంగములగు

అష్టాంగములలో నొకటి. అవి యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సమాధి. వైశేషికము - షడ్దర్శనములలో నొకటి. అవి. న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ, మీమాంసా, వేదాంతములు. కొందఱు యోగమునకు మాఱుగా పాణినీయమును దర్శనముగా గ్రహించిరి.

దుఃఖార్ణవ - దుఃఖమనెడి అర్ణవ - రూపకము. సంసార పారావార - సంసార మనెడి పారావార - రూపకము. పారావార - 'సముద్రోఽబ్ధి రకూపారః పారావార స్సరిత్పతిః' పారం వృణోతీతి పారావారః - దరిని గప్పునది - సముద్రము-అపారము. జ్ఞానానూన ఫల - జ్ఞానమనెడి అనూన ఫల - రూపకము. విద్వస్ + జన-శ్వసంత శబ్దములకు అసర్వనామస్థాన హలాది ప్రత్యయములు పరములగు నపుడును, నపుంసక లింగమునందు ప్రథమైక వచన ప్రత్యయము పరమగునపుడును సకారమునకు దకారా దేశ మగును. విద్వద్ + జన - సకార తవర్గములకు శవర్గ చవర్గములతో పూర్వ మందైనను పరమందైనను కూడిక గలుగునపుడు క్రమముగా శవర్గ చవర్గ వర్ణము లాదేశమగును. విద్వజ్జన. సమ్యచ్+జ్ఞాన-చవర్గాక్షరములకు ఝల్ (అనునాసికములు, అంతస్థములు తప్ప తక్కిన హల్లులు) పరమగునపుడును, పదాంతమునందును కవర్గాక్షరములు ఆదేశ మగును, సమ్యక్ + జ్ఞాన - అనునాసికాంతస్థ వర్ణములు తప్ప మిగిలిన పదాంత గత హల్లులకు (ఝల్లులకు) మృదు హల్లులు (హశ్శులు) కాని, అచ్చులు కాని పరమగునపుడు ఆ హల్లుల వర్గమునకుఁజెందిన తృతీయ వర్ణ మాదేశ మగును - సమ్యగ్జ్ఞాన. మనో మానస - మనస్సనెడి మానస - రూపకము. అతి + ఉత్తమ - యణాదేశసంధి - ఇ ఉ ఋ ఌ వర్ణములకు అసవర్ణము లయిన అచ్చులు పరములగునపుడు యణ్ణులు (య్, వ్, ర్, ల్) ఆదేశములగును - అత్యుత్తమ. పురుషోత్తముఁడు - విష్ణువు, పురుషులలో నుత్తముఁడు - శ్లేషము. ముముక్షు-మోక్ష మిచ్ఛుః - ముముక్షుః - మోక్షమును గోరువాఁడు, జన + ఏక - వృద్ధిసంధి - అ ఆ లకు ఏ ఐ లు పరములగునపుడు ఐ కారమును, ఓ ఔ లు పరములగునపుడు ఔ కారమును ఏకాదేశమగును - జనైక, త్రైగుణ్య-త్రిగుణానాం భావః-సత్త్వ రజస్తమో గుణములు - త్రిగుణములు. వాని భావము త్రైగుణ్యము. ముని జనముఖ మణి ముకురుండు - మునిజన ముఖములకు మణిముకురమైనవాఁడు-రూపకము. పురుషోత్తముండై, పరబ్రహ్మ స్వరూపుండై-అనుచో శ్లేష సామర్థ్యముచే జంగమ మల్లికార్జును నకు విష్ణు బ్రహ్మలతో నభేదము సాధింపఁబడినది. అలంకారము శ్లేషము.

## షష్ఠ్యంతములు

క. శ్రీ కంఠమూర్తి, కమల
శ్లోకున, కనఘునకు, మితవచోనిధికి, సుధీ
లోకస్తుతునకు, విజ్ఞా
నాకారున, కమితమతికి, నచలాత్మునకున్. 59

అర్థము: శ్రీకంఠ - మూర్తికిన్ = శివ స్వరూపునకు, అమలశ్లోకునకున్ = నిర్మలమైన కీర్తి గలవానికి, అనఘునకున్ = పాపము లేని వానికి, మిత - వచస్ - నిధికిన్ = మితములైన వాక్కులకు నిధానమైన వానికి, సుధీ - లోక-స్తుతునకున్ = పండితుల సమూహముచేఁ బొగడఁబడు వానికి, విజ్ఞాన + ఆకారునకున్ = విజ్ఞానము రూపుగాంచిన వానికి, అమిత - మతికిన్ = అధికమైన బుద్ధి గలవానికి, అచల + ఆత్మునకున్ = చలింపని మనస్సుగల వానికి.

తాత్పర్యము: శివ స్వరూపుఁడును, నిర్మలమైన కీర్తి గలవాఁడును, పాప రహితుఁడును, మిత వచన నిధియును, పండిత సమూహముచే స్తుతింపఁబడు వాఁడును, విజ్ఞాన స్వరూపుఁడును, అమితమైన బుద్ధి గలవాఁడును, చలింపని ఆత్మగలవాఁడును అగు జంగమ మల్లికార్జుననకు.

విశేషములు: షష్ఠ్యంతములు - షష్ఠీవిభక్తితో నంతమగునవి. ఇవి కృతి భర్తృ విశేషణములయి యుండును.

శ్రీకంఠ - 'ఉగ్రః కపర్దీ శ్రీకంఠ శ్శితికంఠః కపాలభృత్' - శ్రీః విషః కణ్ఠే యస్య సః - శ్రీకణ్ఠః - విషము కంఠమందుఁగలవాఁడు - శివుఁడు - లేదా కాలకూట ధరణజా శ్రీ శ్శోభా కణ్ఠే యస్య సః - కాలకూటమును ధరించుటవలనఁ గలిగిన శ్యామశోభ కంఠమందుఁ గలవాఁడు శివుఁడు - అమరము.

క. సద్గురుఁడనఁ జను నఖిల జ
గద్గురునకు, సంతతోపకారికి, ముని వి
ద్వద్గురునకుఁ, గవి బుధహిత
మద్గురున, కపారధర్మమతికిన్, - యతికిన్. 60

అర్థము: సత్ + గురుఁడు = మంచి గురువు, అనన్ + చను = అనఁదగునట్టి, అఖిల - జగత్ + గురునకున్ = ఎల్ల లోకములకు గురువైన వానికిని, నిత్య + ఉపకారికిన్ = నిత్యము ఉపకారము చేయువానికిని, ముని - విద్వన్ + గురునకున్ = మునులైన విద్వాంసులకు గురువైన వానికి, కవి-బుధ-హిత - మత్ + గురునకున్ = కవులకు, బుధులకు హితుఁడనైన నా గురువునకు, అపార - ధర్మ - మతికిన్ = అనంతమైన ధర్మబుద్ధి గలవానికి, యతికిన్.

తాత్పర్యము: ఉత్తమ గురుఁ డనఁదగు సర్వలోక గురుఁడును, నిత్యోపకారుఁడును, ముని విద్వాంసులకు గురువైనవాఁడును, కవులకు, బుధులకు హితుఁడనైన నాకు గురువైనవాఁడును, అపారమైన ధర్మబుద్ధి గలవాఁడును, యతియును నగు జంగమ మల్లికార్జునునకు.

క. సంగా సంగ విదూరున,
కంగజ హర మూర్తి, కభిజనాభరణునకున్,
గంగా జల నిభ కీర్తికి,
జంగమ మల్లయకు విబుధ సంస్తుత్యునకున్. 61

అర్థము: సంగ + అసంగ - విదూరునకున్ = రాగద్వేష రహితునకును, అంగజ - హర - మూర్తికిన్ = మన్మథ సంహారకుఁడగు శివుని మూర్తియైన వానికి, అభిజన + అభరణునకున్ = కీర్తి నగగాఁ గలవానికి, గంగా - జల - నిభ-కీర్తికిన్ = గంగాజలముతో సమానమైన (తెల్లని) కీర్తి గలవానికి, విబుధ - సంస్తుత్యునకున్ = పండితులచే లేదా దేవతలచే మిక్కిలి పొగడఁదగిన వానికి, జంగమ మల్లయకున్ = జంగమ మల్లికార్జునునకు.

తాత్పర్యము: సంగా సంగములు లేని వాఁడును, శివమూర్తియు, కీర్తి భూషణుఁడును, గంగోదకమువలెఁ దెల్లని కీర్తి గలవాఁడును, దేవతలచేఁ బొగడఁదగు వాఁడును, అగు జంగమ మల్లికార్జునునకు.

క. అక్షయ మూర్తికి, నాశ్రిత
రక్షణ దక్షునకు, ధర్మ రతి మతికిఁ, గళా
దక్షునకు. నమితునకు, శుభ
లక్షణ లక్షితున, కిహలలాటేక్షునకున్. 62

అర్థము : అక్షయ - మూర్తికిన్ = నాశనములేని ఆకారము గలవానికి, ఆశ్రిత - రక్షణ - దక్షునకున్ = ఆశ్రయించిన వారియొక్క రక్షణమునందు సమర్థుఁడైన వానికి, ధర్మ - రతి - మతికిన్ = ధర్మమునం దాసక్తి గల బుద్ధి గల వానికి, కళా - దక్షునకున్ = కళలయందు సమర్థుఁడైన వానికి, అమితునకున్ = అధికుఁడైన వానికి, శుభ - లక్షణ - లక్షితునకున్ = మంగళకర లక్షణములకు లక్ష్యమైన వానికి, ఇహ - లలాట + ఈక్షునకున్ = భూలోక శివుఁడైన వానికి.

తాత్పర్యము : అక్షయమైన మూర్తి గలవాఁడును, ఆశ్రయించిన వారి రక్షణమందు సమర్థుఁడైనవాఁడును, ధర్మమునం దాసక్తి గల బుద్ధి గలవాఁడును, కళలయందు నేర్పుగలవాఁడును, అధికుఁడును, శుభ లక్షణములకు లక్ష్యభూతుఁడైన వాఁడును, భూలోక శివుఁడైనవాఁడును అగు జంగమ మల్లికార్జునునకు.

క. కుంద దరహాస సురకరి
చందన నీహార హార శరదంబుద పూ
ర్ణేందు నిభ కీర్తి పరున, క
నిందిత గుణ నిధికి, నధిక నిర్మల మతికిన్. 63

అర్థము : కుంద = మొల్లలు, దరహాస = చిఱునవ్వు, సుర-కరి = దేవ గజము - ఐరావతము, చందన = మంచి గంధము, నీహార = మంచు, హార = ముత్యాల పేరు, శరద్ + అంబుద = శరత్కాల మేఘము, పూర్ణ + ఇందు = నిండు చంద్రుఁడు, - అను వానితో, నిభ = సమానమైన, కీర్తి - పరునకున్ = కీర్తిచే నధికుఁడైనవానికి, అనిందిత-గుణ - నిధికిన్ = నిందింపఁబడని గుణములకు నిధియైన వానికి, అధిక - నిర్మల - మతికిన్ = మిక్కిలి స్వచ్ఛమైన మనస్సు గల వానికి.

తాత్పర్యము : మొల్లలు, చిఱునవ్వు, ఐరావతము, మంచి గంధము, మంచు, ముత్యాల పేరు, కలహంసము, నిండు చంద్రుఁడు అనువానితో సమానమైన (తెల్లని) కీర్తిగలవాఁడును, సద్గుణనిధియైనవాఁడును, మిక్కిలి నిర్మలమైన మనస్సుగలవాఁడును అగు జంగమ మల్లికార్జునునకు.

క. సత్త్వాది గుణ విభూతికి,
సత్త్వ దయాళునకు, నధిక సంతుష్టునకున్,
దత్త్వ ప్రకాశ మతికిం,
దత్త్వ ఫలప్రదున, కాత్మ తత్త్వజ్ఞునకున్. 64

అర్థము ; సత్త్వ + ఆది - గుణ - విభూతికిన్ = సత్త్వము మున్నగు గుణముల సంపద గలవానికి, సత్త్వ - దయాళునకున్ = ప్రాణులయెడ దయ గల వానికి, అధిక - సంతుష్టునకున్ = మిక్కిలి సంతోషించు వానికి, తత్త్వ - ప్రకాశ-మతికిన్ = తత్త్వముచేఁ బ్రకాశించు మనస్సుగల వానికి, తత్త్వ-ఫల - ప్రదునకున్= తత్త్వమనెడి ఫలము నిచ్చువానికి, ఆత్మతత్త్వజ్ఞునకున్ = ఆత్మ తత్త్వము నెఱిఁగిన వానికి.

తాత్పర్యము : సత్త్వము మున్నగు గుణముల సంపద గలవాఁడును, సత్త్వములయెడ దయ గలవాఁడును, మిక్కిలి సంతుష్టుఁడైన వాఁడును, తత్త్వముచేఁ బ్రకాశించు మనస్సుగలవాఁడును, తత్త్వమనెడి ఫలము నొసఁగు వాఁడును, ఆత్మతత్త్వము నెఱిఁగినవాఁడును అగు జంగమ మల్లికార్జునునకు.

క. శుంభద్గుణ గణ నిలయున,
కంభోధి గభీరునకు, మితాలాపునకున్,
జంభారి భోగ భాగిక,
నంభోజాక్షునకు, సజ్జనాభరణునకున్. 65

అర్థము : శుంభత్ + గుణ - గణ - నిలయునకున్ = ప్రకాశించుచున్న, గుణముల సమూహమునకు స్థానమయిన వానికి, అంభోధి - గభీరునకున్ =

సముద్రమువలె గంభీరుఁడైన వానికి, మిత + ఆలాపునకున్=తక్కువ మాటాడు వానికి, జంభ + అరి - భోగ - భాగికిన్ = జంభుఁడను వాని శత్రువైన ఇంద్రుని యొక్క భోగములు పొందు వానికి, అంభోజ+అక్షునకున్=తామరలవంటి కన్నులు గల వానికి, సత్ + జన + ఆభరణునకున్=సుజనులు అలంకారముగాఁ గలవానికి.

తాత్పర్యము : సద్గుణముల సమూహమునకు స్థానమైనవాఁడును, సముద్రము వలె గంభీరుఁడైనవాఁడును, మితముగా మాటలాడు వాఁడును, ఇంద్ర భోగములు పొందిన వాఁడును, తామరల వంటి కన్నులు గలవాఁడును, సుజనులకు ఆభరణము అయిన వాఁడును అగు జంగమ మల్లికార్జుననకు,

క. వినుత బ్రహ్మర్షికి, న
త్యనుపమ సంయమికి. సజ్జనాభరణునకున్,
మనుజాకార మహేశున,
కనుపమ చరితునకు, మల్లికార్జున మునికిన్. 66

అర్థము : వినుత - బ్రహ్మర్షికిన్=విశేషముగాఁ బొగడఁబడిన బ్రహ్మర్షియైన వానికి, అతి + అనుపమ - సంయమికిన్ = మిక్కిలి సాటిలేని మునియైన వానికి, సత్ + జన + ఆభరణునకున్ = సుజనులు ఆభరణముగాఁ గలవానికి, మనుజ + ఆకార-మహేశునకున్ = మనుష్యుని రూపమున నున్న పరమేశ్వరునకు, అనుపమ - చరితునకున్ = సాటిలేని నడవడిగలవానికి, మల్లికార్జున - మునికిన్ = జంగమ మల్లికార్జునుఁ డను మునికి.

తాత్పర్యము : విశేషముగాఁ బొగడఁబడిన బ్రహ్మర్షియైనవాఁడును, మిక్కిలి సాటిలేని మునియైనవాఁడును, సుజనులు ఆభరణముగాఁగలవాఁడును, మనుష్యరూప శివుఁడైన వాఁడును, సాటిలేని చరితము గలవాఁడును, అగు మల్లికార్జునుఁ డను పేరు గల మునికి - తరువాతి గద్యము నందలి 'నా చెప్పం బూనిన' అనుదానితో నన్వయము.

వ. పరమభక్తియుక్తి నావర్జిత హృదయుండనై సకల భువన భవనా
వతార కారణుండైన పరమేశ్వరునవతారం బగుటయుం దదం
శావతారంబుగా వ్యావర్ణించి నా చెప్పం బూనిన దివ్యకథా సూత్రం
బెట్టి దనిన. 67

అర్థము: పరమ - భక్తి - యుక్తిన్ = ఉత్కృష్టమైన భక్తితోఁగూడుట చేత, ఆవర్జిత - హృదయుండను + ఐ = వశీకృతమైన హృదయము గలవాఁడనై, సకల - భువన - భవన + అవతార - కారణుండు + ఐన = ఎల్ల లోకములనెడి భవనములయొక్క ఆవిర్భావమునకు హేతు వయిన, పరమేశ్వరు + అవతారంబు = పరమేశ్వరుని యొక్క అవతారము, అగుటయున్, తద్ + అంశ + అవతారంబుగాన్ = ఆతని అంశము యొక్క అవతారముగా, వ్యావర్ణించి = విశేషముగా వర్ణించి, నా - చెప్పఁగన్ + పూనిన = నేను జెప్పఁబూనిన, దివ్య - కథా - సూత్రంబు = దేవతా సంబంధమైన కథ యనెడు సూత్రము, ఎట్టిది + అనినన్ = ఎట్టి దనఁగా.

తాత్పర్యము: ఉత్కృష్టమైన భక్తితోఁగూడియుండుటచే వశీకృతమైన హృదయము గలవాఁడనై యెల్ల భువనము లనెడి భవనముల అవతారమునకుఁ గారణుఁడైన పరమేశ్వరుని యవతారమగుటచేఁ దదంశముగా మిగుల వర్ణించి నేను జెప్పఁబూనిన దివ్యకథ యనెడి సూత్ర మెట్టి దనఁగా - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు; పరమేశ్వరు + అవతారంబు _ 'షష్ఠీ సమాసమునం దకార బహుళాకారముల కచ్చుపరమగునపుడు సుగాగమంబగు.' బాల. సంధి. 34. పరమేశ్వరు నవతారంబు. నా చెప్పంబూనిన - నేను జెప్పఁబూనిన _ 'ధాతుజ విశేషణ భావార్థక వ్యవహితావ్యవహిత కర్తృ పద ప్రథమకుఁ దఱచుగ యొక్క షష్ఠి యగు.' ప్రౌఢ. కారక. 15. నా యొక్క చెప్పం బూనిన. 'యొక్కకు లోపంబు బహుళంబు' - ప్రౌఢ. కారక. 16. నా చెప్పంబూనిన.

## కథారంభము

మహాస్రగ్ధర

సతి జన్మంబున్, గణాధీశ్వరు జననము, దక్షక్రతు ధ్వంసముం, బా
ర్వతి జన్మంబున్, భవోగ్రవ్రతచరితయు, దేవద్విషత్క్షోభమున్, శ్రీ
సుత సంహారమ్ము, ధాత్రీభృత్సుత తపము, నుమాసుందరోద్వాహమున్, ద
ద్రతిభోగంబుం, గుమారోదయము, నతఁ డరిం దారకుం బోరఁ గెల్వున్[1]. 68

1. పా. గెల్వున్, గెల్వన్.

అర్థము: సతి - జన్మంబున్ = సతీదేవి పుట్టుకయును, గణ + అధి + ఈశ్వరు - జననమున్ = గణపతి యొక్క పుట్టుకయును, దక్ష-క్రతు-ధ్వంసమున్= దక్షుని యొక్క, యజ్ఞము యొక్క, నాశనమును, పార్వతి - జన్మంబున్ = పార్వతి యొక్క పుట్టుకయును, భవ + ఉగ్ర - వ్రత - చరితయున్ = ఈశ్వరుని యొక్క, భయంకరమైన, తపస్సు యొక్క, వృత్తాంతమును, దేవ - ద్విషత్ - క్షోభమున్ = దేవతల శత్రువైన తారకుని వలని, బాధయును, శ్రీ - సుత - సంహారమ్మున్ = లక్ష్మి కొడుకైన మన్మథుని వధయును, భూభృత్ + సుత - తపమున్ = కొండ కూఁతురైన పార్వతి యొక్క తపస్సును, ఉమా - సుందర + ఉద్వాహమున్ = పార్వతి యొక్క, మనోహరమైన, పెండ్లియును, తద్ + రతి - భోగంబున్ = పార్వతీశ్వరుల యొక్క సంభోగ సౌఖ్యమును, కుమార + ఉదయమున్ = కుమారస్వామి జననమును, అతఁడు = కుమారస్వామి, అరిన్ = శత్రువును, తారకున్ = తారకుని, పోరన్ = యుద్ధమునందు, గెల్వన్ = గెలుచుటయును.

తాత్పర్యము: సతీదేవి పుట్టుకయును, విఘ్నేశ్వరుని పుట్టుకయును, దక్షుని యజ్ఞనాశనమును, పార్వతి పుట్టుకయును, ఈశ్వరుని ఘోర తపస్సును, దేవతల శత్రువగు తారకాసురుని వలని యుపద్రవమును, మన్మథ సంహారమును, పార్వతి తపమును, పార్వతి కనువిందైన పెండ్లియును, పార్వతీశ్వరుల సంభోగ సౌఖ్యమును, కుమార జననమును, అతఁడు యుద్ధమునఁ దారకాసురుని గెల్చుటయు - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు: గెల్వ - గెలుచు ధాతు కృదంతరూపము. మహాస్రగ్ధర - నాలుగు పాదము లుండును. ప్రతిపాదమునను సతతనసరరగ అను గణము లుండును. మొదటి యక్షరమునకును, దొమ్మిదవ యక్షరమునకును, పదునాఱవ యక్షరమునకును యతిమైత్రి, ప్రాసనియమము గలదు.

వ. అనం బరగు సకలావయవములం బరిపూర్ణంబైన దివ్య కావ్యాంగనా సృష్టికిం బ్రధాన సృష్టికర్తయైన. 69

అర్థము: అనన్ = అనఁగా, పరగు = ఒప్పునట్టి, సకల + అవయవ ములన్ = ఎల్ల అంగములచేతను, పరిపూర్ణంబు = నిండినది, ఐన, దివ్య-కావ్య+

అంగనా - సృష్టికిన్ = దివ్యమైన కావ్యమనెడి స్త్రీ యొక్క సృష్టికి, ప్రధాన-సృష్టి-కర్త + ఐన = ముఖ్యమగు సృష్టికర్తయైన.

తాత్పర్యము : అనఁగా నొప్పునట్టి యెల్ల యంగములతోను నిండిన దివ్య కావ్యమనెడి స్త్రీ సృష్టికిఁ బ్రధానసృష్టికర్తయైన - తరువాతి పద్యముతో నన్వయము.

సీ. విధి నియమంబున విశ్వంబు సృజియింప
దక్ష ప్రజాపతిఁ దలఁచి మఱియుఁ
బ్రకృతి స్వరూపమై పరగు మహామాయఁ
ద్రైలోక్యమాత నాధారశక్తి
భావించి సద్విధి నావహించుడు రూప
లావణ్య గుణ హావ భావకాంతి
సుందరాకార విస్ఫురణతోఁ బ్రత్యక్ష
మై "యేమి వలతు నీ వడుగు" మనిన,

ఆ. "నాకుఁ బుత్త్రివై పినాకికిఁ బత్నివై
మిథునచరితఁ దగిలి మీరు లోక
జననములకు బీజశక్తులై యుండంగ
వరముఁ గరుణ నొసఁగవలయు దేవి !" 70

అర్థము : విధి = బ్రహ్మ, నియమంబునన్ = నియమముతో, విశ్వంబున్ = విశ్వమును, సృజియింపన్ = సృష్టించుటకు, దక్ష - ప్రజాపతిన్ = దక్షుఁడను ప్రజాపతిని, తలఁచి, మఱియున్,

ప్రకృతి - స్వరూపము + ఐ = ప్రకృతి యొక్క ఆకారమయి, పరగు = ఒప్పునట్టి, మహత్ (మహా) - మాయన్ = మహామాయను, త్రైలోక్య -మాతన్ = ముల్లోకములకుఁ దల్లియైనదానిని, ఆధారశక్తిన్ = ఆధార శక్తిని, భావించి, సత్ + విధిన్ = మంచి నిష్ఠతో, ఆవహించుడున్ = ఆవాహనము చేసినంతనే,

రూప - లావణ్య - గుణ - హావ - భావ - కాంతి - సుందర + ఆకార - విస్ఫురణతోన్ = సౌందర్యము, కాంతివిశేషము, సుగుణములు, మనోవికారము, భావము, కాంతి, అందమైన రూపము అనువాని ప్రకాశముతో, ప్రత్యక్షము + ఐ = ఎదురఁ దోఁచినదయి, నీవు, ఏమి, వలతు (వు)=కోరుదువు, అడుగుము+అనినన్,

దేవి = దేవీ! నాకున్, పుత్రివి + ఐ = కూఁతురవయి, పినాకికిన్ = పినాక మనెడి ఆయుధము గలవానికి - శివునకు, పత్నివి + ఐ=భార్యవయి, మీరు, మిథున - చరితన్ - రతిక్రీడ యందు, తగిలి=ఆసక్తి గలిగి, లోక-జననములకున్= లోకముల పుట్టుకలకు, బీజ - శక్తులు + ఐ = బీజము, శక్తి అయి, ఉండంగన్, కరుణన్ = దయతో, వరమున్, ఒసఁగవలయుఁ = ఈవలయును.

తాత్పర్యము : బ్రహ్మ నియమముతో విశ్వమును సృజింప దక్ష ప్రజాపతిని దలఁచెను. అంత నతఁడు ప్రకృతియై యొప్పునట్టియు, మహామాయయైనట్టియు, ముల్లోకములకుఁ దల్లియు నైన ఆధారశక్తిని భావించి మంచి నిష్ఠతో నావాహనము చేసెను. వెంటనే ఆమె సుందరాకారముతోను, కాంతి విశేషముతోను, హావభావముల తోను గూడినదయి యెదురఁ బ్రత్యక్షమై 'నీ కేమి కావలయునో కోరుకొ'మ్మనెను. అందుల కతఁడు 'దేవీ! నీవు నాకుఁ గూఁతురవై, శివునకు భార్యవయి, మీరు రతి క్రీడలఁదగిలి లోకముల యుద్భవములకు బీజ శక్తులయి యుండునట్లు దయతో నాకు వరము నీవలయును.'

వ. అని యమ్మహాదేవివలన లబ్ధవరప్రసాదుఁడై యనేక విధ జప ధ్యాన సంస్తోత్రాదులం బరమేశ్వరుఁ బ్రత్యక్షంబు సేసి 71

అర్థము : అని, ఆ + మహత్ (మహా) - దేవి వలనన్ = ఆ మహాదేవి వలన, లబ్ధ - వర - ప్రసాదుఁడు + ఐ = పొందఁబడిన వరము యొక్క అను గ్రహము గలవాఁడయి - వరము పొందిన వాఁడయి, అనేక - విధ - జప - ధ్యాన - సంస్తోత్ర + ఆదులన్=పెక్కు-రీతులైన జపములు, ధ్యానము, సంస్తుతులు మున్నగు వానిచేత, పరమేశ్వరున్, ప్రత్యక్షంబు + చేసి = ప్రత్యక్షముచేసికొని.

తాత్పర్యము : అని యా మహాదేవివలన వరమును బొంది పెక్కు-రీతులైన జపములు, ధ్యానము, సంస్తుతులు అనువానిచేఁ బరమేశ్వరుని బ్రత్యక్షము చేసికొని - తరువాతి పద్యముతో నన్వయము

శా. "దేవాధీశ! సమస్తముం బడయ నుద్దేశించి మున్ భక్తి నీ
దేవిన్ సర్వపదార్థమూర్తి నిఖిలస్త్రీరత్నమున్ నీకు నే
నావాహించితి; మీరు సన్మిథున చర్యాసక్తి మైకొన్న నా
కే విశ్వోదయ కార్యసిద్ధి యగు వాణీంద్రామరేంద్రార్చితా! 72

అర్థము: దేవ + అధి + ఈశ = దేవాధినాథా! వాణీ+ఇంద్ర+అమర + ఇంద్ర + అర్చితా = వాణీభర్తయగు బ్రహ్మచేతను, దేవేంద్రునిచేతను బూజింపఁబడువాఁడా! సమస్తమున్ = అంతను, పడయన్ = పొందుటకు, ఉద్దేశించి=తలఁచి, మున్ = ముందుగా, భక్తిన్ = భక్తితో, ఈ - దేవిన్, సర్వ - పదార్థ-మూర్తిన్= ఎల్ల పదార్థముల రూపమైన దానిని, నిఖిల - స్త్రీ - రత్నమున్ = ఎల్లస్త్రీలలో మణి వంటి దానిని, నీకున్, నేను, ఆవాహించితిన్ = ఆవాహనము చేసితిని, మీరు, సత్ + మిథున - చర్యా + ఆసక్తిన్ = దాంపత్య క్రీడ యందలి కోరికను, మైకొన్నన్= సమ్మతించుచో, నాకున్, ఈ, విశ్వ + ఉదయ - కార్య సిద్ధి = లోకసృష్టి యను కార్యము నెఱవేఱుట, అగున్.

తాత్పర్యము: 'బ్రహ్మేంద్రులచేఁ బూజింపఁబడు నోదేవాధినాథా! అన్నిటినిఁ బొందఁగోరి నేను ముందుగా భక్తితో నీ దేవిని సర్వ వస్తు స్వరూపిణియైన దానిని నిఖిల స్త్రీలలో శ్రేష్ఠురాలిని నీ కావాహనము చేసితిని. మీరు దంపతులై రతిక్రీడ నంగీకరించుచో నా కీ విశ్వసృష్టికార్యము ఫలించును.'

ఈ పద్యమున నున్నట్లే మొదటి పద్యమునఁగూడ 'శ్రీ వాణీంద్రామరేంద్రార్చిత ....' అనునదియే సరియైన పాఠముగాని, 'శ్రీవాణీంద్రామరేంద్రార్పిత....' అనునది సుష్ఠు పాఠముగాదని శ్రీనిడుదవోలు వేంకటరావుగారి యభిప్రాయము. చూ. వావిళ్ల ప్రతి - శ్రీ నిడుదవోలు వారి పీఠిక.

వ. అనినం బరమేశ్వరుండు సద్భక్తి యుక్తి కసురక్తుఁడై సతీ రత్నంబగు సతిం బరిగ్రహించి తనకుం జతుర్విధ భూతగ్రామ సృష్టికర్తగా వరంబిచ్చిన 'మహాప్రసాదం'బని. 73

అర్థము: అనినన్ = అని దక్షుఁ డనఁగనే, పరమేశ్వరుండు, (అతని), సత్ + భక్తి - యుక్తికిన్ = మంచి భక్తి కలిమికి, ప్రీతుఁడై, సతీ-రత్నంబు+అగు

సతిన్ = స్త్రీలలో శ్రేష్ఠురాలయిన సతీదేవిని, పరిగ్రహించి=స్వీకరించి, తనకున్= దక్షునకు, చతుర్విధ - భూత - గ్రామ - సృష్టి - కర్తగాన్ = జరాయుజ, అండజ, స్వేదజ, ఉద్భిజములనెడి నాలుగు విధములైన, ప్రాణుల సమూహముయొక్క సృష్టికిఁ, గర్త యగునట్లు, వరంబు, ఇచ్చినన్, మహాప్రసాదంబు, అని.

తాత్పర్యము: అని దక్షుఁడు కోరఁగనే పరమేశ్వరుఁడు వాని సద్భక్తికి సంతోషించి, స్త్రీరత్నమగు సతీదేవిని భార్యనుగా స్వీకరించి, యతనికి నాలుగు రీతులైన ప్రాణికోటిని సృష్టి చేయ వరమిచ్చెను. అతఁడు మహాప్రసాదమని, తరువాతి పద్యముతో నన్వయము.

సీ. దక్షుండు తత్క్రియా దక్షత జగములఁ
ప్రకటింపఁదలఁచి యేఁబండ్ర సుతలఁ
బడసి వారలలోనఁ బదుమువ్వు రువిదల
గారవంబున నిచ్చెఁ గశ్యపునకు;
జీవితేశ్వరునకు జీవితైశ్వర్యలు
నాఁ బదుండ్రను బరిణయము సేసె;
నెలమిత్తో మఱి యిర్వదేడ్గుర సుదతుల
సురుచిరంబుగ సుధాసూతి కిచ్చె;

తే. వరుస నిట్లు దగిన వరులకుఁ గూఁతుల
నిచ్చి సతియుఁదాను నిచ్చ మెచ్చి
తన్నుఁగన్న యా విధాతకంటెను దాన
శేషఁ గాంచె నఖిల సృష్టిలోన. 74

అర్థము: దక్షుండు, తద్ + క్రియా - దక్షతన్ = సృష్టికార్యమునందలి సామర్థ్యమును, జగములన్ = లోకములందు, ప్రకటింపన్ + తలఁచి=తెలుపనెంచి, ఏఁబండ్ర - సుతలన్ = ఏఁబదిమంది కూఁతులను, పడసి=పొంది, వారలలోనన్, పదుమువ్వురు + ఉవిదలన్=పదుమూవురు స్త్రీలను, కశ్యపునకున్, గారవంబునన్= ప్రీతితో, ఇచ్చెన్.

జీవిత + ఈశ్వరునకున్ = యమునకు, జీవిత + ఐశ్వర్యలు + నాన్ = ప్రాణేశ్వరులనఁగా, పదుండ్రను = పదిమందిని, పరిణయము + చేసెన్ = పెండ్లి చేసెను.

చెలిమితోన్ = ప్రీతితో, మఱి - ఇర్వది + ఏడ్గుర - సుదతులన్ = తక్కిన యిరువదియేడుగురు స్త్రీలను, సురుచిరంబుగన్ = బాగుగా, సుధా - సూతికిన్ = చంద్రునకు, ఇచ్చెన్.

ఇట్లు, వరుసన్ = క్రమముగా, తగిన - వరులకున్, ఇచ్చి, సతియున్ + తానున్ = భార్యయును దానును, ఇచ్చన్ = మనసునందు మెచ్చి, తన్నున్, కన్న, ఆ - విధాత కంటెను = ఆ బ్రహ్మకంటెను, తాను + అ = తానే, అఖిల-సృష్టిలోనన్ = ఎల్లసృష్టిలోను, శేషన్ = ఉత్కర్షమును, కాంచెన్ = పొందెను.

తాత్పర్యము: దక్షుఁడు సృష్టికార్య సామర్థ్యమును లోకములకుఁ దెలుపఁ గోరి యేఁబదిమంది కూఁతులను బొంది, వారిలోఁ బదుమువ్వురను గశ్యపునకుఁ బ్రీతితో నిచ్చెను. యమునకుఁ బదిమందిని జీవితేశ్వరులనుగా నొసంగెను. తక్కిన యిరువదియేడుగురు పుత్రికలను జంద్రునకిచ్చి పెండ్లిచేసెను. ఇట్లు క్రమముగాఁ దగిన వరులకుఁ గూఁతుల నిచ్చి, భార్యయును దానును మనసునందు సంతసించి, తన్నుఁగన్న యా బ్రహ్మకంటెను ఎల్లసృష్టిలోను తానే వైశిష్ట్యమును గాంచెను.

విశేషములు: సతియుఁ దాను .... శేషఁగాంచె - 'ఆత్మార్థం బభిహితం బగుచోఁ ద్విలింగ సంఖ్యాభిధాయి వచనంబు ధాతు విశేషణంబుల కగు.' బాల. క్రియా. 120. సుదతి - 'సు' శబ్దమునకుఁ బరమైన 'దంత' శబ్దమునకు బహువ్రీహి యందు 'దతృ' ఆదేశమగును. సుదత్ - దీని స్త్రీలింగరూపము సుదతీ. శోభనాః దన్తాః యస్యాః సా - సుదతీ. మంచి దంతములు గల స్త్రీ - శేష - ఉత్కర్షము - సూ.వి.

## సతీ పరమేశ్వరుల విహారము

వ. అంతట నప్పరమేశ్వరుండు దాక్షాయణీ మనోహరాకార నవయౌవన భావ హావ విలాస విభ్రమ సౌందర్యగుణంబుల కంతకంత కనురక్తుండై. 75

అర్థము: అంతటన్ = పిమ్మట, ఆ + పరమేశ్వరుండు, దాక్షాయణీ=దక్షుని కూఁతురైన సతీదేవియొక్క, మనోహర + ఆకార - నవ - యౌవన - భావ - హావ - విలాస - విభ్రమ - సౌందర్య - గుణంబులకున్ = సుందరమైన రూపము, క్రొత్తజవ్వనము, భావములు, మనోవికారములు, విలాసము, విభ్రమము, సౌందర్యము, గుణములు అను వానికి, అంతకున్ + అంతకున్ = క్రమ క్రమముగా, అనురక్తుండు + ఐ = అనురాగము గలవాఁడయి.

తాత్పర్యము: అంత నా పరమేశ్వరుఁడు సతీదేవి మనోహరాకారము, నవయౌవనము, భావహావములు, విలాస విభ్రమములు అనువానిచేఁ గ్రమక్రమముగా నామెయం దనురాగముగలవాఁడయి - తరువాతి పద్యముతో నన్వయము.

క. మాటలఁ జెయ్వుల బేటం
బేటముగా నలవరించె నెసఁగఁగ సతి లా
లాట తట నయనుఁ డింపగు
కూటముల కపూర్వ సురత గుణ కోవిదుఁడై. 76

అర్థము: లాలాట - తట - నయనుఁడు = లలాటతటమునందుఁ గన్ను గలవాఁడు - శివుఁడు, అపూర్వ - సురత-గుణ-కోవిదుఁడు + ఐ = అపురూపమునైన, రతిక్రీడలందు నేర్పుగలవాఁడయి, సతిన్ = సతీదేవిని, మాటలన్ = మాటలతోను, చెయ్వులన్ = చేఁతలతోను, బేటంబేటముగాన్ = అత్యంతానురాగముతో, ఇంపు + అగు = మనోహరములైన, కూటములకున్ = సంగమములకు, ఎసఁగఁగన్ = అతిశయముగా, అలవరించెన్ = అలవడఁజేసెను.

తాత్పర్యము: ఫాలాక్షుఁడగు శివుఁడు అబ్బురమైన రతిక్రీడలయందు నేర్పరియై మాటలతోను, జేఁతలతోను అత్యంతానురాగముగునట్లు మనోహరములైన సంగమములకు సతీదేవిని అతిశయముగా నలవడఁజేసెను.

వ. ఇట్లయ్యిరువురు నన్యోన్యానురాగాతిరేకంబునం గామ కేళీ లాలసు లగుచు. 77

అర్థము : ఇట్లు, ఆ+ఇరువురున్=ఆ సతీపరమేశ్వరులిద్దఱును, అన్యోన్య+అనురాగ+అతిరేకంబునన్ = పరస్పర ప్రేమ విజృంభణముచే, కామ-కేళీ-లాలసులు = రతిక్రీడయం దాసక్తి గలవారు, అగుచున్.

తాత్పర్యము : ఈ విధముగా నా యిరువురును బరస్పర ప్రేమాతిశయముచే మన్మథక్రీడయం దాసక్తిగలవారగుచు - తరువాతి పద్యముతో నన్వయము.

సీ. కలహంస కలరవాకలిత నిర్ఝరముల,
సారసారావాబ్జ షండములను,
రోలంబ రుతి లతాందోలంబులను, శుక
మంజుల స్వన పుష్ప మండపములఁ,
గలకంఠ రణిత మాకంద వనములఁ, బా
రావత ధ్వని మందిర స్థలములఁ,
గేకి కల ధ్వాన గిరి కందరంబుల,
లావుక నినద లీలాతలముల,

తే. నప్పటప్పటి కనురాగ మగ్గలింపఁ,
గామరస మంతకంతకుఁ గడలుకొనఁగ,
నలి రమించిరి కైలాసనగముమీఁదఁ
బరమ సుఖలీల నా జగత్పతియు సతియు. 78

అర్థము : ఆ-జగత్+పతియున్, సతియున్ = లోకేశుఁడైన ఆ శివుఁడును, సతీదేవియును,

కలహంస-కల-రవ+ఆకలిత-నిర్ఝరములన్=రాయంచల అవ్యక్తమధురధ్వనులతోఁ గూడిన సెలయేఱులందును, సారస+ఆరావ+అబ్జ-షండములను=బెగ్గురుపక్షుల ధ్వనులు గల తామరపూల సమూహములందును,

రోలంబ-రుతి-లతా+ఆందోలంబులను=తుమ్మెదలయొక్క, ధ్వనుల తోడి, తీఁగల ఊయెలలందును, శుక-మంజుల-స్వన-పుష్ప-మండపములన్=చిలుకల, మనోహరములైన, ధ్వనులతోడి, పూలమండపములందును,

కలకంఠ - రణిత - మాకంద - వనములన్ = కోకిలల కూఁతలతోడి మామిడి తోఁటలందును, పారావత - ధ్వని - మందిర-స్థలములన్ = పావురముల, కూఁతల తోడి, మందిర స్థలములందును,

కేకి - కల - ధ్వాన - గిరి - కందరంబులన్ = నెమిళ్లయొక్క, అవ్యక్త మధురములైన ధ్వనులతోడి, కొండగుహలందును, లావుక-నినద-లీలా-తలములన్ = పూరేడు పిట్టల ధ్వనులతోడి విలాస ప్రదేశములందును,

అప్పటప్పటికిన్ = నానాఁటికి, అనురాగము = ప్రేమము, అగ్గలింపన్ = అతిశయింపఁగా, అంతకంతకున్ = క్రమక్రమముగా, కామ - రసము = శృంగార రసము, కడలుకొనఁగన్ = అతిశయింపఁగా, పరమ - సుఖ - లీలన్ = అత్యధిక మైన సౌఖ్యముగల విలాసముతో, కైలాస - నగము - మీఁదన్ = కైలాస పర్వతముపై, నలిన్ = ఉత్సాహముతో, రమించిరి = సంభోగించిరి,

తాత్పర్యము : ఆ జగదీశ్వరుఁడును సతీదేవియును రాయంచల అవ్యక్త మధుర ధ్వనులతోఁగూడిన సెలయేఱులందును, బెగురుపక్షుల ధ్వనులు గల తామరతోఁపు లందును, తుమ్మెదల ఝంకారములతోడి ఆవెయూయలలందును, చిలుకల మనోహర ధ్వనులతోడి పూలమంటపములందును, కోకిలల కూఁతలతోడి మామిడితోఁటలందును, పావురముల ధ్వనులుగల మందిరములందును, నెమిళ్ల కూఁతలతోడి కొండగుహలందును, పూరెడుపిట్టల కూఁతలతోడి విలాస ప్రదేశములందును నానాఁటికి అనురాగ మతి శయింపఁగా, శృంగార రసము క్రమక్రమముగా నధికము కాఁగా కైలాసపర్వతముపై మిక్కిలి సుఖము గలుగునట్లు ఉత్సాహముతో సంభోగించిరి.

విశేషములు: అప్పటప్పటికిన్-అప్పటికిన్ + అప్పటికిన్- 'ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగా నగు'. బాల. సంధి. 41,- అప్పటి + అప్పటికిన్ - 'అచ్చున కామ్రేడితంబు పరంబగునపుడు సంధి యగుచుగ నగు,' బాల. సంధి. 10, అప్పటప్పటికిన్ - (రూపాం.) అప్పటి కప్పటికిన్, రోలంబః - 'ఇన్దిన్దిర శ్చఞ్చరీకో రోలమ్బో బమ్బరశ్చ సః' - లాతీతి రోలమ్బః - మ్రోయునది-తుమ్మెద - అమరము, పారావత - 'పారావతః కలరవః కపోతః' - పారేణ బలేన అవతీతి పారావతః - బలముతోఁ బోవునది, పావురము. అమరము, కేకి - 'శిఖావల శ్శిఖీ కేకీ మేఘనాదానులాస్యపి.' కేకారవోఽస్యాస్తీతి - కేకారవము గలది - నెమలి, అమరము,

క. ఈ విధమున శివశక్తులు
భావజ కేళీ విలోల భావంబుల నా
పోవక విహరించిరి నా
నా విధములఁ దగిలి రజత నగ పార్శ్వములన్. 79

అన్వయము: ఈ - విధమునన్ = ఈ రీతిగా, శివ - శక్తులు = శివుఁడును శక్తియును, భావజ - కేళీ - విలోల - భావంబులన్ = మన్మథక్రీడలచే, మిక్కిలి చలించు, మనస్సులతో, నానా - విధములన్ = పెక్కురీతుల, తగిలి = ఆసక్తి వహించి, రజత - నగ-పార్శ్వములన్ = వెండికొండ (కైలాసము) యొక్క దరులందు, ఆపోవక = తృప్తిఁ జెందక, విహరించిరి = క్రీడించిరి.

తాత్పర్యము: శివుఁడును - సతియును ఈ విధముగా మన్మథక్రీడలచే మిక్కిలి చలించు మనస్సులతో ననేకవిధముల నాసక్తి వహించి కైలాసపర్వత దరులందుఁ దనివిసనక క్రీడించిరి.

వ. తదనంతరంబున. 80

తాత్పర్యము: తద్ + అనంతరంబునన్ = ఆ తరువాత-తరువాతి పద్యముతో నన్వయము.

సీ. అనురక్తి గడికొమ్ము గొని మేయు సల్లకీ
కబళన కాషాయ గంధములును,
సల్లకీ పల్లవ సౌరభ్యమున కను
బలమైన మదగంధ పరిమళంబు,
మద గంధమునకుఁ దుమ్మెదపిండు సూఱెల
బలసి ఘూర్ణిల్లు పే రులివు పెల్లు,
వలిగితి చెవిపెట్టి యాలించి విని సోలి
పరవశులై యుండు భద్రకరులు,

తే. భద్రకరులైన యూథాధిపతులు గావఁ
గలిసి సుఖలీల విహరించు కలభ కరిణి
గజ గణంబులఁ బొలుపొందు గజవన ప్ర
భాతిఁ[1] గని మెచ్చుతో జగత్పతియు సతియు. 81

అర్థము ; అనురక్తిన్ = అనురాగముతో - ప్రీతితో, గడికొమ్మ = చేరువనున్న చెట్టు కొమ్మను, కొని = పట్టుకొని, మేయు, సల్లకీ - కబళన - కాషాయ- గండములును = అందుగుయొక్క, మ్రింగుటచే, కషాయ (ఎఱుపు) వర్ణముగల గండ స్థలములును (చెక్కిళ్లను)

సల్లకీ - పల్లవ - సౌరభ్యమునకున్ = అందుగుఁజిగురులయొక్క, పరిమళ మునకు, అనుబలము + ఐన = తోడయిన, మద - గంధ-పరిమళంబున్= మదజల సంబంధమైన వాసనయు,

మద-గంధమునకున్ = మదము (జలము) యొక్క వాసనకు, తుమ్మెద - పిండు - తుమ్మెదల గుంపు, సూరెలన్ = పార్శ్వములందు, బలసి = చుట్టి, ఘూర్ణిల్లు = మ్రోయు, పేరు+ఉలివు - పెల్లున్=పెద్ద ధ్వని యొక్క ఆధిక్యమును,

అలి- గీతి = తుమ్మెదల గానము , చెవి - పెట్టి = చెవియొగ్గి, ఆలించి - విని = శ్రద్ధగా విని, సోలి = ఒరగి, పరవశులు + ఐ = ఒడలు తెలియనివై, ఉండు, భద్రకరులు = భద్రజాతి గజములు,

భద్రకరులు + ఐన = భద్రగజములగు, యూథ + అధిపతులు + ఏనుఁగుల గుంపునకు నాయకులు, కావన్ = కాచుచుండఁగా, కలిసి, సుఖలీలన్ = సౌఖ్యముతో, విహరించు = క్రీడించు, కలభ - కరిణి - గజ - గణంబులన్ = గున్నలైన ఆఁడేనుఁగులయు, (మగ) ఏనుఁగులయు, సమూహములతో, పొలుపు + ఒందు = ఒప్పునట్టి గజ - వన - ప్రభాతిన్ = ఏనుఁగుల అడవి యొక్క గొప్ప కాంతిని, కని = చూచి, జగత్ + పతియున్, సతియున్ = లోకేశ్వరుఁడైన శివుఁడును, సతి దేవియు, మెచ్చుతోన్ = ప్రశంసతో.

తాత్పర్యము ; ప్రీతితోఁ జేరువనున్న కొమ్మను బట్టుకొని మేయు అందుగు (చిగురుల) ను దినుటవలన నెఱ్ఱనైన చెక్కిళ్లను, అందుగుఁజివురుల పరిమళమునకుఁ

1. వా. భా.

చోటయిన మదజలసంబంధి పరిమళమును, మదజల పరిమళమునకుఁ దుమ్మెదల గుంపులు ప్రక్కలఁజేరి చేయు నాద ఆధిక్యమును, తుమ్మెదల నాదమునకుఁ జెవి యొగ్గి విని విని ప్రీతి పారవశ్యమునుఁజెందు భద్రజాతి గజములును, భద్రజాతి గజముల యూథపతుల జాయలుగావఁ గలిసి సుఖముతో విహరించు గున్నలైన ఆఁడేనుఁగులయు, మగయేనుఁగులయు సమూహములతో నొప్పు నేనుఁగులయడవి కాంతిని జూచి జగత్పతియైన శివుఁడును, సతీదేవియు మెచ్చుతో - తరువాతి వచనముతో నన్వయము.

విశేషములు: 'గండములను' అను వా. ప్రతి పాఠము కంటె 'గండములును' అను సా. ప్రతి పాఠమే మే లనిపించినది. మదగంధ పరిమళంబు - ఇందుఁ బునరుక్తి లేకుండ గంధశబ్దమునకు సంబంధమను నర్థము చెప్పఁబడినది. ఆలించి, విని-రెండును సమానార్థకములు. అందుచే 'శ్రద్ధగావిని' యని యర్థముచెప్పఁబడినది. భద్రకరులైన యూథాధిపతులుగావ- కాఁగ అనుచో అన్వయము తృప్తిగాలేదు. కావున 'కావ' అను పాఠము స్వీకరింపఁబడినది. 'మెచ్చుతో జగత్పతియు సతియు' అను సా. ప్రతిపాఠము స్వీకరింపఁబడినది. 'మెచ్చుతా జగత్పతియు సతియు' అను వా. ప్రతిపాఠము 'మెచ్చుఁదా జగత్పతియు సతియు' అని యుండవలయును. మార్పు లెక్కువగాఁజేయుటకు బదులు 'మెచ్చుతో' అనుపాఠమే సరియైనదని తోఁచినది, పరవశులై యుండు భద్రకరులు-ఇట కరులయందు మహత్త్వారోపము చేయఁబడినది. లేనిచో పరవశములై అని యుండవలయును.

వ. తద్విశేషంబు లాలోకించుచున్నంత. 82

అర్థము: తద్ + విశేషంబులు = ఆ గజవనమునందలి విశేషములు, ఆలోకించుచున్ + ఉన్న + అంతన్ = చూచుచుండఁగాఁ దరువాత.

తాత్పర్యము: ఆ గజవనమునందలి విశేషములు చూచుచుండఁగా, నంత - తరువాతి పద్యముతో నన్వయము.

క. జంగమ కుత్కీలంబు ల
నంగ, మహీతల ఘనాఘనంబులు నా, ను
త్తుంగ తను నీలరుచి మా
తంగము లభిరామ మయ్యెఁ దద్వనభూమిన్. 83

అర్థము : తద్ + వన - భూమిన్ = ఆ యడవియందు, మాతంగములు = ఏనుఁగులు, జంగమ - కుత్కీలంబులు = నడగొండలు, అనంగన్, మహీతల - ఘనా - ఘనంబులు = భూమియందలి వర్షాకాలపు మేఘములు, నాన్ = అనఁగా, ఉత్తుంగ - తను = మిక్కిలి యెత్తైన శరీరముతోను, నీల - రుచిన్ = నల్లని కాంతితోను, అభిరామము + అయ్యెన్ = మనోహర మయ్యెను.

తాత్పర్యము : ఆ యేనుఁగుల యడవిలో నేనుఁగులు చలించుకొండ లను నట్లును. భూమియందుండు వర్షాకాలపు మేఘములో అనునట్లును, ఎత్తయిన శరీరము చేతను, నల్లని కాంతిచేతను మనోహరముగా నుండెను.

విశేషములు : అలంకార ముత్ప్రేక్ష. గజముల యుత్తుంగ తనుత్వముచేతఁ గుత్కీలములతోఁ బోలిక. వాని నీలరుచిచేత ఘనాఘనములకుఁ బోలిక.

మాతంగము లభిరామ మయ్యె. 'స్త్రీ సమంబులగు విశేషణంబులయు మువర్ణ కాంత విశేషణంబులయు బహువచనంబున కేకవచనంబు బహుళంబుగా నగు.' బాల, కారక 20. మాతంగ - 'సిన్ధుర స్సామజః కుమ్భీ మాతఙ్గశ్చ మదావళః' మతఙ్గా దృషే ర్జాతో మతఙ్గజః - మతంగుఁ డను ఋషివలనఁ బుట్టినది-ఏనుఁగు- అమరము.

గీ. ఉగ్రభాను కరాహతి కోడి పాటి
వచ్చి తరు వన దుర్గంబు సొచ్చియున్న
తిమిర పటలంబు నాఁ గాననమునఁ గలయ
నిండి ఘూర్ణిల్లుచుండె వేదండ ఘటలు. 84

అర్థము : ఉగ్ర - భాను - కర + ఆహతికిన్ = తీక్ష్ణమైన. సూర్యుని యొక్క, కిరణములయొక్క దెబ్బకు, ఓడి = జంకి, పాటి - వచ్చి = పరువిడి వచ్చి, తరు - వన - దుర్గంబు = చెట్లతోడి యడవి యనెడి దుర్గమును, చొచ్చి + ఉన్న = ప్రవేశించి యున్న, తిమిర - పటలంబు - నాన్ = చీఁకటుల గుంపు అనఁగా, వేదండ - ఘటలు = ఏనుఁగుల గుంపులు, కాననమునన్ = అడవియందు, కలయన్ + నిండి = అంతటను నిండి, ఘూర్ణిల్లుచున్ + ఉండెన్ = ఘీంకరించుచుండెను.

తాత్పర్యము : సూర్యుని తీక్ష్ణ కిరణముల దెబ్బకు జంకి పారిపోయి వచ్చి దరిని యను మిగ్గినును ప్రవేశించిన చీఁకట్ల గుంపో యనునట్లు అడవిలో నేనుఁగుల్ల గుంపులు అంతట నిండి ఘీంకరించుచుండెను.

విశేషములు : అలంకార ముత్ప్రేక్ష - వేదండ - వేద + అండ - ఇది శకంధ్వాది గణములోనిది, పరరూపసంధి జరగినది, సవర్ణదీర్ఘ సంధి కాదు. ఏనుఁగు సామవేదమునుండి పుట్టినది కావున సామజము - వేదండము అనఁబడుచున్నది,

వ. అందు మంద్ర మృగ భద్రజాతి గిరిచర నదీచరోభయచర దేవా
సురాంశ కలభ రేణు ధేను వామన[1] భిక్ష పోతి కాది వన్యగజయూథంబు
లందు. 85

అర్థము : అందున్ + అ = అందే, మంద్ర - మృగ - భద్రజాతి - గిరిచర - నదీచర - ఉభయచర, దేవ + అసుర + అంశ, కలభ, రేణు-ధేను-వామన-భిక్ష - పోతిక - ఇవి యన్నియు వివిధ గజ భేదములు - ఆది = మున్నగు, వన్య-గజ - యూథంబుల + అందున్ = అడవి యేనుఁగుల గుంపులందు.

తాత్పర్యము : ఆ యడవియందే మంద్రము, మృగము, భద్రజాతి, గిరిచరములు, నదీచరములు, ఉభయచరములు, దేవాంశములు, అసురాంశములు, కలభములు, రేణువులు, ధేనువులు, వామనములు, భిక్షములు, పోతికలు మున్నగు నడవి యేనుఁగుల గుంపులందు - తరువాతి పద్యముతో నన్వయము.

శా. గండారన్ మదసౌరభంబునకు బింకం బెక్కఁ, గ్రోధాగ్నికిం
గొండాటంబుగ దానసంపదకు నాఘోషంబుగాఁ, దీయమా
చండాలి వ్రజ గీతరావముల కుత్సాహంబుతో నొక్క వే
దండస్వామి మదంబు సేసెఁ గరిణీధామంబు లట్టాడఁగాన్. 86

అర్థము : మద-సౌరభంబునకున్ = మదజలముయొక్క పరిమళమునకు, గండము + ఆరన్ = ముగతలము నిండఁగా, క్రోధ + అగ్నికిన్ = కోపమునెడి

1. ము. ప్రతి. వమన,

అగ్నికి, బింకంబు + ఎక్కన్ = బిగు వతిశయింపఁగా, దాన-సంపదకున్ = మద జలమనెడి సంపదకు, కొండాటంబుగన్ = స్తుతిగా, తీయము + ఐ = ప్రియ మగు, చండ + అలి-వ్రజ-గీత-రావములకున్ = మిక్కిలి చుఱుకుగల, తుమ్మెదల, గుంపుయొక్క, గానముయొక్క, ధ్వనులకు, ఆఘోషంబుగాన్ = ప్రకటనముగా, ఒక్క-వేదండ-స్వామి = ఒక గజరాజు, కరిణీ-ధామంబులు = ఆఁడేనుఁగుల సమూహ ములు, అహ్లాదఁగాన్ = తహతహపడఁగా, ఉత్సాహంబుతోన్, మదంబు + చేసెన్ = మదించెను.

తాత్పర్యము: మద పరిమళమునకు మగతనము ప్రకాశింపఁగా, కోపమనెడి అగ్నికి బిగు వతిశయింపఁగా, మదజల సంపదకు స్తుతిగా, ప్రియమగు తుమ్మెదలగుంపు గానధ్వనులకుఁ బ్రకటనముగా నొక గజరాజు ఆఁడేనుఁగులు తహతహపడఁగా నుత్సాహముతో మదించెను.

విశేషములు: క్రోధ + అగ్ని-క్రోధ మనెడి అగ్ని-రూపకము.

వ. మఱియు నొక్కయెడ. 87

తాత్పర్యము: మఱియు నొక చోట - తరువాతి పద్యముతో నన్వయము.

క. కరి మద గంధమునకు మధు
కరములు పిండుకొని ముసరి కటతటముల భా
సుర మయ్యె నగతటంబులఁ
బరువడి మొగు లెఱఁగి పేరఁబడిన విధమునన్. 88

అర్థము: కరి-మద-గంధమునకున్ = ఏనుఁగుయొక్క మదజల పరిమళము నకు, మధుకరములు = తుమ్మెదలు, పిండుకొని = గుమిగూడి, కట-తటములన్ = చెక్కిళ్ల ప్రదేశములందు, ముసరి = వ్యాపించి, నగ-తటంబులన్ = కొండదరులందు, పరువడిన్ = అధికముగా. మొగులు = మేఘము, ఎఱఁగి = వ్రాలి, పేరఁబడిన విధమునన్ = దట్టమైనరీతిగా, భాసురము + అయ్యెన్ = ప్రకాశించెను.

తాత్పర్యము: ఒక ఏనుఁగు మదజల పరిమళమునకుఁ దుమ్మెదలు గుమికూడి దాని చెక్కిళ్ల ప్రదేశములందు ముసరి ప్రకాశించెను-అది కొండ దరులందు మేఘము అధికముగా దట్టమయినట్లుండెను.

విశేషములు: అలంకార ముపమ. కటతటములు నగతటములవలె నున్న వనఁగా నా యేనుఁగులు కొండలవలె నున్నవని భావము. మధుకరములు నల్లగా నుండును. అందుచేతనే నల్లని మేఘములకుఁ బోలిక.

పేర్కొనుట - 'పడుజీ కొను లొకానొకచో స్వార్థంబునం దనుప్రయుక్తంబు లగు.' బాల. క్రియ. 109. మధుకరములు భాసురమయ్యె - 'స్త్రీ సమంబులగు విశేషణంబులయు మువర్ణకాంత విశేషణంబులయు బహువచనంబున కేకవచనంబు బహుళంబుగా నగు.' బాల. కారక. 20.

మ. కరిణీబృందముఁ బాసి యొక్క మదనాగం బద్రిరత్నోరు కం
దర సంక్రాంత నిజప్రఘాతిఁ బ్రతివేదండంబకాఁ జూచి దు
ర్ధర రోషంబునఁ బోరుచుండె నతిమాత్సర్యంబునం దా మహే
శ్వరు శైలేంద్రముతోడ నీలగిరి వెల్పం బోరున ట్లున్నతిన్. 89

అర్థము: ఒక్క - మద-నాగంబు=ఒక మత్తేభము, కరిణీ-బృందమున్= ఆఁడేనుఁగుల గుంపును, పాసి = విడిచి, అద్రి - రత్న + ఉరు - కందర - సంక్రాంత - నిజ - ప్రఘాతిన్=కొండయొక్క, మణి మయములైన, పెద్ద, గుహల యందుఁ, దోఁచిన, తనదైన, పోలికను - ప్రతిబింబమును, ప్రతి వేదండంబు+అ- కాన్ = మాఱు ఏనుఁగే యనఁగా. చూచి, నీలగిరి = నల్లని కొండ, తాన్=తాను, మహేశ్వరు - శైల+ఇంద్రముతోడన్=పరమేశ్వరుని పర్వతరాజమగు కైలాసముతో, వెల్పన్ = అధికముగా, పోరు + అట్లు = పోరాడు విధమున, ఉన్నతిన్ = ఉన్నతితో, దుర్ధర-రోషంబునన్ = దుర్భరమైన కోపముతో, అతి-మాత్సర్యంబునన్= మిక్కిలి అసూయతో, పోరుచున్ + ఉండెన్.

తాత్పర్యము: ఒక మదగజము ఆఁడేనుఁగుల గుంపును వీడి కొండ మణిమయ గుహయందుఁ దోఁచిన తన ప్రతిబింబమును జూచి మాఱేనుఁగని భ్రమించి,

నల్లనైన కొండ పరమేశ్వరుని కైలాసపర్వతముతోఁ బోరువిధమున నధికమైన యసూయతో మిక్కిలి దుర్భరమైన కోపమునఁ బోరుచుండెను.

విశేషములు : ఏనుఁగునకుఁ దన ప్రతిబింబమునందుఁ బ్రతిగజభ్రాంతిగాన నలంకారము భ్రాంతిమంతము. నీలగిరి కైలాసముతోఁ బోరునట్లు మదనాగము తన ప్రతిబింబముతోఁ బోరుచుండె ననుటచే నుపమాలంకారమును.

మ. కరపాద స్తన రోమ కూప కట సత్కర్ణాక్షి కోశాలి శీ
కర మేఘా తతసిక్య ఘర్మజల రంగద్దాన సంపూర్ణ సా
గర సీధూన్మద సన్నుతాష్టమదముల్ గ్రమ్మం దదష్టాంగ బం
ధురమై సింధుర మొప్పుచుండె నలిగీతుల్ వించు సోలంబునన్. 90

అర్థము : కర - పాద - స్తన - రోమకూప - కట-సత్ + కర్ణ + అక్షి - కోశ + అలి = తొండము, పాదములు, స్తనములు, రోమ రంధ్రములు, చెక్కిళ్లు, మంచి చెవులు, కన్నులు, వృషణములు అనువానినుండి క్రమముగా, శీకర, మేఘ, ఆతత - సిక్య - ఘర్మ - జల, రంగత్ + దాన, సంపూర్ణ-సాగర, సీధు, ఉన్మద, = శీకరము, మేఘము, అధికమైన సిక్యము, చెమట నీరు, ఒప్పుచున్న మదజలము, విండిన సాగరము, సీధువు, ఉన్మదము అనెడి, సన్నుత + అష్ట - మదముల్ = పొగడఁబడు నెనిమిది విధములైన మదములు, క్రమ్మన్ = వ్యాపింపఁగా, సింధురము = ఏనుఁగు, తద్ + అష్ట + అంగ - బంధురము + ఐ = ఆ యెనిమిది అవయవము లతో నొప్పినదయి, అలి -గీతుల్ = తుమ్మెదల గీతములు, వించున్ = వినుచు, సోలంబునన్ = పారవశ్యముతో, ఒప్పుచున్ + ఉండెన్,

తాత్పర్యము : తొండము, పాదములు, స్తనములు, రోమరంధ్రములు, చెక్కిళ్లు, చెవులు, కన్నులు, వృషణములు అనువానినుండి క్రమముగా శీకరము, మేఘము, సిక్యము, ఘర్మజలము, దానము, సాగరము, సీధువు, ఉన్మదము అనెడి యెనిమిది విధములైన మదములు వ్యాపించుచుండఁగా నొకయేనుఁగు ఆ యెనిమిది అవయవములతో నొప్పుచున్నదయి తుమ్మెదల గానమును వినుచుఁ బారవశ్యముతో నొప్పుచుండెను.

విశేషములు: కరము (తొండము) నుండి శీకరము, పాదములనుండి మేఘము, స్తనములనుండి సిక్యము (శిక్యము), రోమకూపములనుండి ఘర్మజలము, కటములనుండి దానము, కర్ణములనుండి సాగరము, అక్షులనుండి (సీధువు), కోశముల నుండి ఉన్మదము అను మదములు ఏనుఁగునకు స్రవించును.

అలంకారము యథాసంఖ్యము. స్వభావోక్తి. రంగత్ + దాన = రంగద్దాన- ములకు హల్లు పరమగుచుండఁగాఁ దృతీయ వర్ణాదేశము, సోలము = పారవశ్యము. 'పొచ్చెము లెక్కుడు సేయంగ, సోల మడరి' - నిర్వ. 8. 80.

వ. తదవసరంబున ఘర్మాంశు కరాహతి కులికి తదీయాప్త బంధులైన యరవిందంబుల కలిగి దండింపం జొచ్చునట్లు వేదండంబులు కమల షండంబుల కరుగుదెంచి మహోత్సాహంబున. 91

అర్థము: తత్ + అవసరంబునన్ = ఆ సమయమున, ఘర్మ + అంశు- కర + ఆహతికిన్ = సూర్యునియొక్క కిరణములయొక్క దెబ్బకు. ఉలికి = భయపడి, తదీయ + ఆప్త-బంధులు + ఐన = ఆతని అనుఁగుఁజుట్టములైన, అరవిందంబులకున్ = తామరలకు, అలిగి = కోపించి, తామరలపైఁ గోపించి యనుట, దండింపన్ = శిక్షించుటకు, చొచ్చు + అట్లు = పూనువిధమున, వేదండంబులు = ఏనుఁగులు, కమల-షండంబులకున్ = తామరల సమూహములకు, అరుగుదెంచి=వచ్చి, మహత్ (మహా) + ఉత్సాహంబునన్ = గొప్పఅభిలాషతో,

తాత్పర్యము: ఆ సమయమున సూర్యకిరణముల తాపమునకు భయపడి సూర్యుని యనుఁగుఁజుట్టములైన తామరలపైఁగోపించి వానిని శిక్షింపఁబూను విధమున నేనుఁగులు తామరలకడ కరుదెంచి గొప్ప యుత్సాహముతో-తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు: ఒకఁ డపకారము చేసినప్పుడు వాని నేమియుఁజేయఁజాలని స్థితిలో బాధితుఁడు అపకారిబంధువులను బాధింపఁబూనుట లోకమున నున్నదే. ఇచ్చట సరిగా నదియే జరిగినది. ఏనుఁగులకు సూర్యునివలన బాధ గలిగినది. కాని యవి సూర్యు నేమియుఁజేయఁజాలక తద్బంధువులైన తామరలపై నెత్తిపోయెను.

అలంకారము ప్రత్యనీకము. 'ప్రత్యనీకం బలవతశ్శత్రోఃపక్షేపరాక్రమః'- చన్ద్రా. వేదండములు కమలషండముల కరుగుదెంచుటకుఁ గారణము వానిపై నలుగుట కాకున్నను, అది కారణముగా నుత్ప్రేక్షింపఁబడినది కావున హేతూత్ప్రేక్షాలంకారము.

దండి కావ్యాదర్శమునందలి యీక్రింది శ్లోకము ఇందలిభావమున కాకరము. 'మధ్యందినార్క సంతప్తః సరసీం గాహతే గజః, మన్యే మార్తాండగృహ్యాణి పద్మాన్యుద్ధర్తు ముద్యతః.'

గీ. కొలను వన్యేభములు చొచ్చి కలయఁ గలఁపఁ
బులుఁగు లుండక వెలువడి పోయెఁ; బోక
తగదె? మాతంగ దూషితం బగు సరోవ
రంబు సద్ద్విజ వర్జనీయంబు గాదె?. 92

అర్థము : వన్య + ఇభములు = అడవియేనుఁగులు, కొలను = సరసు, చొచ్చి = ప్రవేశించి, కలయన్=అంతటను, కలఁపన్=కలఁగింపఁగా, పులుఁగులు= పక్షులు, ఉండక = ఆ సరస్సున నుండక, వెలువడి పోయెన్ = బయటికిఁ బోయెను. పోక = పోవుట, తగదె = తగదా? తగునని భావము, మాతంగ = ఏనుఁగులచే- చండాలురచే. దూషితంబు = నిందింపఁబడినది- మైలపఱుపఁబడినది, అగు, సరోవరంబు = కొలను, సత్ + ద్విజ = మంచి పక్షులచే-ఉత్తమ బ్రాహ్మణులచే, వర్జనీయంబు + కాదె = విడువఁదగినది కాదా? అగు ననుట.

తాత్పర్యము ; అడవి యేనుఁగులు కొలనిఁ బ్రవేశించి దానినంతను గలఁచివైవఁగా నందుండి పక్షులు వెడలిపోయెను, అట్లు పోవుట సహజమే కదా! మాతంగ దూషితమైన కొలను సద్ద్విజులకు విడువఁదగినదియే కదా!

విశేషములు : ఇందు వన్యేభములు కలఁచివైవఁగాఁ బులుఁగులు కొలని నుండి వెడలె నను విశేషాంశము మాతంగ దూషితమైన కొలను సద్ద్విజవర్జనీయము కదా యను సామాన్యాంశముచే సమర్థింపఁబడినది కావున నలంకార మర్థాంతర న్యాసము. 'ఉక్తి రర్థాన్తరన్యాస స్స్యాత్ సామాన్య విశేషయోః'- చన్ద్రా. ఇందు మాతంగ, ద్విజ శబ్దములు శ్లిష్టములగుటచే శ్లేషాలంకారమును, 'నానార్థ సంశ్రయ శ్శ్లేషః' చన్ద్రా. అర్థాంతరన్యాసము శ్లేషానుప్రాణితము.

వన్య + ఇభ = వన్యేభ - గుణసంధి; కలఁపన్ - కలఁగు ధాతువు ప్రేరణార్థకరూపము కలఁచు; దానికి 'నుజీ' పరమగుచుండఁగా కలఁచు + నుజీ పత్వాదేశము, పులవు - (రూపాం.) పులుఁగు. సత్ + ద్విజ - ఝల్లునకు హల్లు పరమగుచుండఁగాఁ దృతీయ వర్ణాదేశము. సద్ద్విజ; పులుఁగు - పులువు 'అపవాద్యంబయి యసంయుక్తంబయిన గకారంబునకు వకారంబు విభాష నగు.' బాం-అచ్చిక. 27.

వ. త దవసరంబున, 93

తాత్పర్యము : ఆ సమయమున - తరువాతి పద్యముతో నన్వయము.

క. పుష్కర షండములోఁ గల
పుష్కర మూలములు కబలములఁ గొనుచున్ స
త్పుష్కర తలముల మునుమిడి
పుష్కరములఁ బెటికివైచెఁ బుష్కరమునకున్, 94

అర్థము ; 92 వ పద్యము నందలి 'వన్యేభములు' కర్త.

పుష్కర షండములోన్ = తామరల సమూహముగల సరస్సులో - లేదా జల సమూహములో, కల = ఉన్న, పుష్కర మూలములు = తామరల దుంపలు, కబలములన్ = ముద్దలను (గా), కొనుచున్, సత్ + పుష్కర - తలములన్ = మంచినీటి ప్రదేశము నుండి, మునుమిడి = వరుసపెట్టి, పుష్కరములన్ = తొండముల కొనలతో, పుష్కరమునకున్ = ఆకాశమునకు, పెటికివైచెన్ = త్రుంచి యెగురవేసెను.

తాత్పర్యము : జల సమూహము (సరస్సు) లోఁగల తామరదుంపలను గొనుచు నా వన్యేభములు జలముల నుండి తుండాగ్రములతో ఆకాశమునకు ఎగుర వైచెను.

విశేషములు : ఇందుఁ బుష్కర శబ్దము వివిధార్థములతోఁ బ్రయుక్తమైనది. కావున నలంకారము శ్లేషము. పుష్కరం కరిహస్తాగ్రే వాద్యభాండముఖే

జలే, వ్యోమ్ని ఖడ్గఫలే పద్మే తీర్థౌషధి విశేషయోః' అమరము. పుష్కరము = ఏనుఁగు తొండము కొన, మద్దెల మున్నగు వాద్యముల ముఖము, నీరు, ఆకాశము, కత్తి వాఁదర, పద్మము, తీర్థభేదము, ఓషధి విశేషము. ఇంకను 'ద్వీపే సర్పే పుష్కర స్స్యాత్' ఇతిశేషః, అమరము, అలంకారము యమకము. కం, సమవర్ణయుగాధికమై యమరిన్గ నియమ్ముంబు యమక మగుఁ గృతులందు. కా. సం. 4.78

క. తన నీడ నీరి లోపలఁ
గని యది ప్రతిగజము సావి కడుకొని కోపం
బునఁ దాఁకి పోరఁ జొచ్చెనొ
యన నొక కరి నీరిలో రయంబునఁ గ్రుంకెన్. 95

అర్థము ; ఒక-కరి = ఒక యేనుఁగు, తన - నీడ = తనప్రతిబింబము. నీరిలోపలన్, కని = చూచి, అది, ప్రతి - గజము - సావి = శత్రుగజమని, కడుకొని = పూని, కోపంబునన్ = కోపముతో, తాఁకి = ఎదిర్చి, పోరన్ + చొచ్చెనొ = యుద్ధము చేయఁబూనెనో, అనన్ = అనఁగా, నీరిలోన్, రయంబునన్ = శీఘ్రముగా, క్రుంకెన్ = మునిఁగెను.

తాత్పర్యము : ఒక యేనుఁగు తన ప్రతిబింబమును నీటఁజూచి యది శత్రు గజమని భ్రాంతి చెంది కోపముతో దానిని దాఁకి యుద్ధము చేయఁబూనెనా యనునట్లు నీట వేగముగా మునిఁగెను.

విశేషములు : కరికిఁ దన ప్రతిబింబమునందుఁ బ్రతిగజభ్రాంతి కావున భ్రాంతిమదలంకారము. కరి నీటఁ గ్రుంకుటకుఁ బ్రతిగజ మనుకొనుట కారణము కాదు. కారణము కానిదానిని గారణముగా నుత్ప్రేక్షించుటచే హేతూత్ప్రేక్షాలంకారము.

గీ. కరుల దానంబులకు మధుకరము లెఱఁగి
కుంజరమ్ములు నీరిలోఁ గ్రుంకి యున్న
మీఁద సుడియుచునుండెఁ దుమ్మెదలు వాయ
కుదధి కెఱఁగిన నీల నీరదము లనఁగ. 96

అర్థము: మధుకరములు = తుమ్మెదలు, కరుల - దానంబులకున్ = ఏనుఁగుల మదజలములకు, ఎఱఁగి = వ్రాలి, కుంజరమ్ములు = ఏనుఁగులు, నీరిలోన్, క్రుంకి + ఉన్నన్ = మునిఁగియున్నను, తుమ్మెదలు, పాయక = విడువక, మీఁదన్, ఉదధికిన్ = సముద్రమునకు, ఎఱఁగిన = వ్రాలిన, నీల - నీరదములు = నల్లని మేఘములు, అనఁగన్, సుడియుచున్ + ఉండెన్ = తిరుగుచుండెను.

తాత్పర్యము: ఏనుఁగుల మదజలములచేఁ దుమ్మెద లాకృష్టములై వానిపై వ్రాలెను. ఏనుఁగులు నీటిలోఁ గ్రుంకినను, దుమ్మెదలు వానిని వీడక, సముద్రముపై వ్రాలిన నల్లని మేఘములో యనునట్లు నీటిపైఁ దిరుగుచుండెను.

విశేషములు: అలంకార ముత్ప్రేక్ష. కుంజర - 'మతఙ్గజో గజో నాగః కుఞ్జరో వారణః కరీ.' 'కుఞ్జౌ కుమ్భాధోగర్తౌ వస్య స్త ఇతి కుఞ్జరః' కుంజము లనఁగా కుంభస్థలములకు దిగువ నుండు గుంతలు. అవి గలిగినది - ఏనుఁగు, తుమ్మెదలు + పాయక = తుమ్మెదలు వాయక - గసడదవాదేశము, బాల. సం. 13.

వ. తత్ప్రస్తవంబున. 97

అర్థము: తద్ + ప్రస్తవంబునన్ = ఆ సమయమున.

తాత్పర్యము: అట్లు ఏనుఁగులు విహరించు సమయమున - తరువాతి పద్యములో నన్వయము.

విశేషములు: తద్ + ప్రస్తవము - ఝల్లులకు (అనునాసికాంతస్థ భిన్నములైన హల్లులకు) ఖరులు (కఠిన హల్లులు) పరమగునపుడు వాని వర్గము లందలి ప్రథమ వర్ణములు (ఖరులు) ఆదేశముగా వచ్చును. తత్ప్రస్తవము.

సీ. కడిపోవ నొడళులు గడిగి నవాశ్వత్థ
వల్కల రసములు వఱలఁ బూసి,
ధాతిలో నతి మృదుధాతురాగంబులు
గొమరారఁ గుంభస్థలములఁ బూసి,
నల్లరితాశోక పల్లవ నివహంబు
కర్ణావతంసంబుగా రచించి,
మానితంబగు నవమాలికా స్తబకముల్
బురుజలుగాఁ గంఠముల నమర్చి,

ఆ. కరము వేరవు మెఱసి కరిణులుఁ దారును
నభినవంబుగా మదాంధ గంధ
సింధురములు మెఱయ శృంగారములు చేసి
కామకేళి సలుపఁ గాతరిల్లె. 98

అర్థము : కడివోవన్ (కడి + పోవన్) = వాసనపోవునట్లు, ఒడళులు = శరీరములు, కడిగి, నవ + అశ్వత్థ - వల్కల - రసములు = క్రొత్త రావి చెట్టు పట్టల రసములు, వఱలన్ = ఒప్పునట్లు, పూసి = అలఁది.

ధాతితోన్ = కాంతితో, అతి - మృదు - ధాతు - రాగంబులు = మిక్కిలి మెత్తని గైరికాది ధాతువుల యెఱ్ఱని రంగులు, కొమరారన్ (కొమరు + ఆరన్) = అందముగా, కుంభ - స్థలములన్ = కుంభస్థలములందు, పూసి.

సత్ + లలిత + అశోక - పల్లవ-నివహంబు = మిక్కిలి మనోహరము లయిన అశోకవృక్షముల చివురుల సమూహము, కర్ణ + అవతంసంబు + కాన్ = చెవి యలంకారముగా, రచించి,

మానితంబు + అగు = శ్రేష్ఠమగు, నవమాలికా - స్తబకముల్ = విరజాజి పూల గుత్తులు, బురుజలు + కాన్ = చిఱుగజ్జెలుగా. కంఠములన్, అమర్చి,

కరమున్ = మిక్కిలి, వెరవు = నేర్పు, మెఱసి, కరిణులున్ = ఆఁడేనుఁగులును, మద + అంధ - గంధ - సింధురములు = క్రొవ్వుచేఁ గన్నులు గానని మత్త గజములు, తారును = తామును, అభినవంబుగాన్ = క్రొత్తగా, మెఱయన్ = ప్రకాశించునట్లు, శృంగారములు - చేసి = సింగారించుకొని, కామ - కేళి = మన్మథ క్రీడ, చలుపన్ = చేయుటకు, కాతరిల్లెన్ = ఉత్సహించెను.

తాత్పర్యము : దుర్గంధము పోవునట్లు మేను గడిగి, క్రొత్తరావిచెట్ల పట్టల రసము లొప్పుగాఁ బూసి, మిక్కిలి మృదువులైన గైరికాదిధాతువుల యెఱ్ఱని రంగులు అందముగాఁ గుంభస్థలములందు అలఁది. మిక్కిలి మనోహరములగు నశోక పల్లవముల సమూహములు కర్ణభూషణములుగా రచించి, అందమైన విరజాజిపూల గుత్తులు బురుజలుగాఁ గంఠములు ధరించి మిక్కిలి నేర్పు మెఱయ మదముచేఁ గన్నులుగానని మొనుఁగులును, ఆఁడేనుఁగులును సింగారించుకొని రతిక్రీడ సలుప నుత్సహించెను.

విశేషము లు : ఇందుఁ దివ్యకర్కులగు నేనుఁగుల శృంగారము వర్ణింపఁ బడినది కావున నిది శృంగార రసాభాసము, దాని లక్షణము :

'ఏకత్రైవానురాగశ్చే త్తిర్య ఙ్మ్లేచ్ఛగతోఽపి వా
యోషితో బహుసక్తిశ్చే ద్రసాభాస స్త్రిధా మతః' ప్ర.రు.

ఇందు సతీశ్వరులు గజరూపములు ధరించుట కిది ప్రేరకముగాన నావశ్యక మయ్యెను. 'బురుజ' ఈ మాట కర్థము తెలియలేదు. 'చిఱుగజ్జె' లను పూర్వవ్యాఖ్యలోని యర్థమున కాకరమేమో యెఱుఁగరాదు. కంఠముల నమర్చునవి హారము లగునుగాని గజ్జె లెట్లగునో!

ఒడలు + లు = 'బహువచనము పర ంబగునపు డసంయుక్తంబులయి యుపాంత్యంబులయిన డ-ల-ర-ల కలఘు లకారంబు బహుళంబుగా నగు.' బాల, అచ్చు, 13, ఒడళులు, బురుజలుగాఁ గంఠముల నమర్చి-మువిభక్తియతి.

వ. ఇట్లనేకప్రకారంబుల శృంగారంబు నేసి కామకేళీ లాలసులై కరి కరేణువు లత్యంతానురక్తి నొండొంటి నడరం దొడంగె నంత నందు. 99

అర్థము : ఇట్లు, అనేక-ప్రకారంబులన్ = పెక్కు విధములుగా, శృంగారంబు + చేసి = సింగారించుకొని, కామ-కేళీ-లాలసులు + ఐ = మన్మథక్రీడ యందుఁ దగిలినవారయి, కరి - కరేణువులు = మగ ఏనుఁగులును, ఆఁడేనుఁగులును, అత్యంత + అనురక్తిన్ = మిక్కిలి అనురాగముతో, ఒండు + ఒంటిన్ = ఒకదాని నొకటి, అడరన్ + తొడంగెన్ = అతిశయింప నారంభించెను, అంతన్, అందున్,

తాత్పర్యము : ఈ విధముగాఁ బెక్కురీతుల సింగారించుకొని మన్మథక్రీడ యందుఁ దగిలి మగయేనుఁగులును, ఆఁడేనుఁగులును మిక్కిలి యనురాగముతోఁ బరస్పరము మెఱ నారంభించెను, అంత వానిలో-తరువాతి పద్యముతో నన్వయము,

శా. బేటంబేటముగా నిభంబు కరిణిం బ్రేమంబుతోఁ జేరి లా
లాటం బొత్తు; లలాటపట్టమునఁ గేలంగేలు వేష్టించుఁ; గ్రి
గ్గోటన్ మే యొరయున్; వరాంగమును సోఁకుం;బుష్కరాగ్రంబునం
దాటోపం బొనరించుఁ గూడఁ బ్రియఁ గామాసక్తి నాసక్తమై. 100

అర్థము : బేటంబేటముగాన్ = అత్యంతానురాగముతో, ఇభంబు = ఏనుఁగు. కరిణిన్ = పిడియేనుఁగును, ప్రేమంబుతోన్, చేరి, లాలాటంబు = నుదురు, ఒత్తున్, లలాట - పట్టమునన్ = ఫాల ఫలకమునందు, కేలన్ = తొండముతో, కేలు = తొండము, వేష్టించున్ = చుట్టును, క్రిగోటన్ = క్రిందుగోరితో, మే = శరీరము, ఒరయున్ = రాయును, పుష్కర + అగ్రంబునందున్ = తొండముకొనతో, వర + అంగమును = శ్రేష్ఠమయిన శరీరమును, సోఁకున్ = తాఁకును, కామ + ఆసక్తిన్ = కోరికయందలి తమకముతో, ఆసక్తము + ఐ = తగిలినదయి, ప్రియన్ = ప్రియురాలిని (పిడియేనుఁగును), కూడన్ = కూడుటకు - సంభోగించుటకు, ఆటోపంబు + ఒనరించున్ = సంభ్రమించును.

తాత్పర్యము : మగయేనుఁగు పిడియేనుఁగు నత్యంతానురాగముతో సమీపించి నుదుటి నొత్తును. ఫాలఫలకమునఁ దొండముతోఁదొండమును జుట్టును, క్రిగోటితో శరీరమును గీఱును. తొండము కొనతో దాని శరీరమును దాఁకును. ప్రియురాలిని గూడ నది మన్మథోద్రేకమున సంరంభించును.

విశేషములు : అలంకారము స్వభావోక్తి. 'స్వభావోక్తి స్స్వభావస్య జాత్యాదిస్థస్య వర్ణనమ్.'- చన్ద్రా. క్రిగోటన్ - క్రింది + గోటన్ = సమాసంబునం బ్రాఁతాముల తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగా నగు. బాల. సంధి. 36. క్రి + గోటన్. బహుళగ్రహణముచేఁ గ్రింద శబ్దమునకు లుప్తశేషమునకు దీర్ఘంబు- క్రీగోటన్. క్రీగోరు + నన్ - 'టి వర్ణంబు గొన్నింటి యంతాక్షరంబున కాదేశంబును, గొన్నింటి కంతాగమంబును, గొన్నింటికిం బర్యాయంబున రెండును బ్రాయికంబుగ నగు. బాల. ఆచ్ఛిక, 31. క్రీగోటి + నన్. ఔపవిభక్తికముల తృతీయా సప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు. బాల. ఆచ్ఛిక. క్రీగోటి + అన్. 'అంద్వవగాగమంబులం దప్ప నపదాది స్వరంబు పరంబగునపు డచ్చునకు సంధియగు,

వా. సంధి.॥ స్త్రీ.సా.రే. పుష్కరాగ్రంబునందునన్-పుష్కరము నఁగా గజతుండాగ్రము. దానిపై మకరం అగ్రశబ్ద మునాదశ్యకము, మే-మై, మెయి, మయి. (రూపాం.)

మ. హృదయాహ్లాదముతోడఁ బాయక సదానేక ప్రకారంబులన్
మదనాసక్తిఁ బెనంగుచున్న విలసన్మత్తేభ విక్రీడితం
బది దాక్షాయణి చూచి కౌతుక రతైకాలీన భావాభిలా
ష దృగత్యుజ్జ్వలదీధితుల్ పఱపె నీశానాననాబ్జంబుపైన్. 101

అర్థము : హృదయ+ఆహ్లాదముతోడన్=మనస్సంతోషముతో. పాయక = విడువక, సదా = ఎల్లప్పుడును, అనేక - ప్రకారంబులన్ = పెక్కు విధములుగా, మదన + ఆసక్తిన్ = మన్మథక్రీడ యందలి కోరికతో, పెనంగుచున్ + ఉన్న= సంభోగించుచున్న, విలసత్ + మత్త + ఇభ - విక్రీడితంబు + అది = ఒప్పుచున్న మదించిన యేనుఁగుల యొక్క ఆ విశేషమైన క్రీడ, దాక్షాయణి = దక్షుని కూఁతురైన సతీదేవి, చూచి, కౌతుక .... దీధితుల్, కౌతుక = వేడుకతోడి, రత = సంభోగమునందు, ఏక = ముఖ్యముగా, ఆలీన = మిక్కిలి తగిలి యున్న, భావ= హృదయమునందలి, అభిలాష = కోరికతోడి, దృశ్ (క్) = చూపుయొక్క, అతి + ఉజ్జ్వల = మిక్కిలి ప్రకాశముగల, దీధితుల్ = కాంతులు, ఈశాన + ఆనన + అబ్జంబు పైన్ = ఈశ్వరుని ముఖపద్మముపై, పఱపెన్ = వ్యాపింపఁజేసెను,

తాత్పర్యము : మనస్సంతోషముతో విడువక యెల్లప్పుడు ననేకవిధములుగా సంభోగించుచున్న మదగజముల రతిక్రీడను జూచి సతీదేవి వేడుకతోఁగూడిన యా రతిక్రీడయందే లగ్నమైన మనస్సునందలి కోరికతోడి దృష్టికాంతులను ఈశ్వరుని ముఖపద్మముపైఁ బఱపెను.

విశేషములు : హృ .... .... .... సదానేక - అనుచో యతిభంగమైనదని తలంచి 'సదానైక' యని పూర్వవ్యాఖ్యలో మార్పుగావింపఁబడినది. కాని యది వ్యాఖ్యాత భ్రాంతిమాత్రమే. 'సదానేక' అని యున్నను యతిభంగము కాలేదు. నిత్యసమాస మగుటచే అనేక లోని 'ఏ' కుఁగాని 'నే' యను విశిష్టవర్ణమునకుఁగాని యతిమైత్రి పొసఁగును. అప్పుడు 'హృ' అనుదానికి 'ఏ' తో ఋత్వసంబంధవళి చొప్పున యతి

పై త్రిచెల్లి నిద్దష్టమగును, 'ఏనముం ద్రాఁట మోచువాఁ డనేకప కీటికా ........, పిడిపో సీని కవుంగిలింతలు నస్తైక విలాసములం జెలంగఁగాన్.' విలసత్ + మత్తేభ = 'రహలుతప్ప మిగిలిన పదాంతగతహల్లులకు (యమ్రులకు) అనునాసికవర్ణము పరమగుచో వానికి సంబంధించిన అనునాసికవర్ణము వైకల్పికముగా ఆదేశమగును.' విలసన్మత్తేభ, విలసద్మత్తేభ, దృశ్ + అతి = దృక్ + అతి - ఝల్లనకు అచ్చు పరమగుచుండఁగాఁ దృతీయవర్ణాదేశము - దృగతి, అతి + ఉజ్జ్వల - యణాదేశసంధి - అత్యుజ్జ్వల, మత్తేభముల విక్రీడితమును మత్తేభవిక్రీడితముననే వర్ణించుట గమనింపఁ దగినది, ఒకవృత్తమున దాని నామము నిమిడ్చి రచించుట ముద్రాలంకారమగును. దీనిని దొలుతఁ బ్రవేశపెట్టినవాఁడు నన్నెచోడఁడే,

వ. తదవసరంబునం బరమేశ్వరుండు నిజజీవితేశ్వరి కన్నెఱింగి దానికి సమ్మతించినం గని సంతోషించి. 102

అర్థము: తద్ + అవసరంబునన్ = ఆ సమయమున, పరమేశ్వరుండు, నిజ - జీవిత + ఈశ్వరి = తనదైన ప్రాణేశ్వరి యగు సతీదేవియొక్క, కన్ను + ఎఱింగి = మనోఽభిప్రాయముతెలిసి, దానికిన్, సమ్మతించినన్, (సతి), కని, సంతోషించి.

తాత్పర్యము: ఆ సమయమునఁ బరమేశ్వరుఁడు తనప్రాణేశ్వరియగు సతీదేవి మనోఽభిప్రాయము నెఱిఁగి దాని కంగీకరింపఁగా నామె సంతోషించి – .... తరువాతి పద్యముతో నన్వయము.

క. సతి కరిణి యగుడుఁ ద్రిజగ
త్పతి కరియై కూడె; సతులు భావించిన యా
కృతిఁ గూడ నేర్పు కాదే
యతిశయముగ నింగితజ్ఞులకు (గు) ఫలమెందున్ ? 103

అర్థము: సతి = సతీదేవి, కరిణి = ఆఁడేనుఁగు, అగుడున్ = అయినంతనే, త్రిజగత్ + పతి = మూఁడులోకములకుఁ బ్రభువు - ఈశ్వరుఁడు, కరి + ఐ = (మగ) యేనుఁగయి, కూడెన్ = సంభోగించెను, ఎందున్ = ఎచ్చటనైనను,

ఇంగితజ్ఞులకున్ = ఇతరుల యభిప్రాయము నెఱుఁగువారికి, ఫలము, అతిశయమునన్ = అధికముగా, సతులు = భార్యలు, భావించిన = ఇష్టపడిన, ఉత్కంఠన్ = ఆతురముతో, కూడన్ = సంభోగించుటకు, నేర్చు + అ = నేర్చె, కాదే = కాదా ! లేదా ఇంగితజ్ఞులు + అగు - ఫలము = ఇంగితజ్ఞులగు దాని ఫలము .... .... అని చెప్పనగును,

తాత్పర్యము; సతీదేవి పిడియేనుఁగు కాఁగానే యీశ్వరుఁడు మగ యేనుఁగయి దేహమును గూడెను, ఎంతైనను ఇతరుల మనోఽభిప్రాయముల నెఱుఁగువారికిఁ దమ భార్యలు కోరిన యాతురముతో వారిని గూడఁగలుగుటయేకదా అధికమగు ఫలము !

విశేషములు ; ఇందు విశేషాంశము సామాన్యాంశముచే సమర్థింపఁబడినది కావున నలంకార మర్థాంతరన్యాసము. అగుడున్ - 'అనంతర్యంబున డువర్ణకంబు ప్రయోగంబగు,' బాల.క్రియ. 42

గీ. ఆదిమూర్తులు శివశక్తు లచలమతులు
హరుఁడు సతియును సురతార్థులై విహీన
తరములగు మృగరూపముల్ దాల్చి రనినఁ
గామ మాయల నెవ్వారు నేమి కారు ! 104

అన్వయము : ఆది-మూర్తులు = ఆది స్వరూపులు, శివ శక్తులు = శివుఁడును శక్తియును, అచల - మతులు = నిశ్చల మనస్కులు (అగు), హరుఁడున్- సతియును = ఈశ్వరుఁడును, సతీదేవియును, సురత + అర్థులు + ఐ = రతిని కోరినవారలై, విహీన - తరములు + అగు = మిక్కిలి నీచములైన, మృగ - రూపముల్ = పశువుల రూపములను, తాల్చిరి + అనినన్ = తాల్చి రనఁగా, కామ , మాయలన్ = మన్మథుని మాయలచేత, ఎవ్వారున్ = ఎవ్వరయినను, ఏమి - కారు ?

తాత్పర్యము ; ఆది స్వరూపులు, శివశక్తులు, నిశ్చల మనస్కులు నైన శివుఁడును, సతియును రతిక్రీడ కొఱకు మిక్కిలి నీచమునైన పశువుల రూపములను ధరించిరనఁగా, ఇఁక మన్మథుని మాయలచే నెవరేమి కారు ? ఎవరైనను ఏమైనను చేయుదు రనుట.

విశేషములు : ఆది స్వరూపులు, అచల మనస్కులు నైన సతీశ్వరులే రతినిమిత్తము విహీన మృగరూపములను ధరించి రనఁగా, నిఁక మన్మథుని మాయలచే నెవరేమి గారనుటచే నలంకారము కావ్యార్థాపత్తి. 'కైముత్యే నార్థ సంసిద్ధిః కావ్యార్థాపత్తి రిష్యతే' యన్నారు.

క. హరుఁడును సతి రతిఁ దనుపఁగ
భరమై గజకేళిఁ గూడి పడసెను సుఖ; మిం
కొరు లెట్లు నేర్తు రొక మెయిఁ
గరణంబులు పెక్కు లేక కాంతలఁ దనుపన్? 105

అర్థము : హరుఁడును = ఈశ్వరుఁడు సైతము, సతిన్ = భార్యను, సతీదేవిని, రతిన్ = సంభోగమునందు, తనుపఁగన్ = తృప్తిపఱుచుటకు, భరము + ఐ = కష్టమయి, గజ-కేళిన్ = ఏనుఁగు క్రీడతో, కూడి = సంభోగించి, సుఖము, పడసెను = పొందెను, ఇంకన్, ఒరులు = ఇతరులు, కరణంబులు = సాధనములు, పెక్కు = అనేకము, లేక, ఒక మెయిన్ = ఒక్క దేహముతో, కాంతలన్ = భార్యలను, తనుపన్ = తృప్తి పఱుప, నేర్తురు = ఏరీతిగా సమర్థులగుదురు ?

తాత్పర్యము : ఈశ్వరుఁడు కూడ రతిలో భార్యను తృప్తి పఱుచుట కష్టమై యేనుఁగు రూపుధరించి సంభోగించి రతిసౌఖ్యమును బొందె ననఁగా నిఁక నితరులు పెక్కుసాధనములు లేనివారు ఒక్క దేహముతోఁ దమ భార్యలను రతిలోఁ దృప్తిపఱుప నెట్లు సమర్థులగుదురు ? కారని భావము,

విశేషములు :- అలంకారము కావ్యార్థాపత్తి.

వ. ఇట్లు పరమేశ్వరుండును సతీదేవియు సామజకేళీలాలసులై విహరించినంత సద్యోగర్భంబున. 106

అర్థము : ఇట్లు, పరమేశ్వరుండును, సతీదేవియున్, సామజ-కేళీ - లాలసులు + ఐ = ఏనుఁగుల రతిక్రీడలయందుఁ గోరిక గలవారయి, విహ

క్రీడించిన + అంతన్ = క్రీడింపఁగా, సద్యస్ (ః) + గర్భంబునన్ = వెంటనే వచ్చిన చూలున.

తాత్పర్యము : ఇట్లు పరమేశ్వరుఁడును, సతీదేవియు గజరతిక్రీడయందాసక్తి గలవారయి క్రీడింపఁగా సతికి వెంటనే యైన చూలున - తరువాతి పద్యమునకు నన్వయము,

విశేషములు ; సద్యస్ + గర్భ - పదాంత సకారమునకు విసర్గ మాదేశము కాఁగా సద్యః + గర్భ, హ్రస్వ అకారము తరువాత వచ్చు విసర్గము నకు హ్రస్వ అకారము కాని, మృదుహల్లులు (హశ్శులు) కాని పరము అగు నప్పుడు ఉ ఆదేశముగా వచ్చి పూర్వమందున్న అకారముతోఁగూడి గుణసంధి సంభవించి ఓ గా మారును, సద్య + ఉ + గర్భ = సద్యోగర్భ.

# గజాననోత్పత్తి

క. పురుషాకారముఁ, బటుమద
కరి వదనముఁ, గుబ్జ పాద కరములు, లంబో
దరము, హరినీల వర్ణముఁ
గర మొప్పఁగఁ దాల్చి విఘ్నకరుఁ డుదయించెన్. 107

అర్థము : పురుష + ఆకారమున్ = పురుషుని రూపమును, - పటు - మద - కరి - వదనమున్ = మిక్కిలి మదించిన యేనుఁగు మోమును, కుబ్జ - పాద - కరములున్ = పొట్టివైన కాళ్లను, చేతులును, లంబ + ఉదరమున్ = వ్రేలాడు పొట్టయును, హరి - నీల - వర్ణమున్ = ఇంద్రనీలమణి వర్ణమును, కరము = మిక్కిలి, ఒప్పఁగన్, తాల్చి = ధరించి, విఘ్నకరుఁడు = విఘ్నేశ్వరుఁడు, ఉదయించెన్ = పుట్టెను.

తాత్పర్యము: పురుషుని రూపమును, మిక్కిలి మదించిన యేనుఁగు మోమును, పొట్టివైన కాళ్ళుచేతులును, వ్రేలు పొట్టయు, నింద్రనీలమణి వర్ణమును మిక్కిలి యొప్పఁగా ధరించి విఘ్నేశ్వరుఁడు పుట్టెను.

వ. ఇట్లు దాక్షాయణికిని సకల భువన భవనాధీశ్వరుండైన పరమేశ్వరు
నకును గణాధీశ్వరుం డుదయించిన మహోత్సాహంబున. 108

అర్థము ; ఇట్లు, దాక్షాయణికిని = సతికిని, సకల=ఎల్ల, భువన-భవన = లోకములయొక్క పుట్టుకకు, అధి + ఈశ్వరుండు + ఐన=ప్రభువైన, పరమేశ్వరునకును,గణ + అధి + ఈశ్వరుండు = గణపతి, ఉదయించినన్ = పుట్టఁగా, మహత్ (మహా) + ఉత్సాహంబునన్.

తాత్పర్యము : ఇట్లు సతీదేవికిని, సర్వలోక ప్రభువగు నీశ్వరునకును గణపతి పుట్టఁగా. గొప్ప వేడుకతో - తరువాతి పద్యముతో నన్వయము.

మ. సురవాద్యంబులు మ్రోసె; దిగ్వదనముల్ శోభిల్లె; గంధర్వ కి
న్నర గేయంబులు మించె; దేవ గణికల్ నర్తించి రింపారఁగాఁ;
గురిసెం బువ్వులవాన; దేవరవముల్ ఘూర్ణిల్లె; నా దివ్య సిం
ధుర యూథంబు మదంబు సేసె గణనాథుం డుర్వి జన్మించినన్. 109

అర్థము : గణనాథుండు=గణపతి, ఉర్విన్=భూమియందు, జన్మించినన్= పుట్టఁగా, సుర - వాద్యంబులు = దేవతల దుందుభులు మున్నగు వాద్యములు, మ్రోసెన్ = మ్రోఁగెను, దిశ్ (క్) + వదనముల్ = దిక్కుల ముఖములు, శోభిల్లెన్ = ప్రకాశించెను, గంధర్వ - కిన్నర - గేయంబులు = గంధర్వులయు, కిన్నరులయు గీతములు, మించెన్ = అతిశయించెను, ఇంపు + అరఁగాన్ = సంతోషము నిండఁగా, దేవ గణికల్ = దేవవేశ్యలు - అప్సరసలు, నర్తించిరి = నాట్యము చేసిరి, పువ్వుల - వాన, కురిసెన్, దేవ - రవముల్ = దేవతల ధ్వనులు, ఘూర్ణిల్లెన్ = మ్రోఁగెను, ఆ - దివ్య - సింధుర - యూథంబు = ఆ దేవగజముల గుంపు, మదంబు + చేసెన్ = మదించెను.

తాత్పర్యము: విఘ్నేశ్వరుఁడు భూమిలోఁబుట్టఁగా దేవదుందుభులు మ్రోసెను, దిఙ్ముఖములు ప్రకాశించెను. గంధర్వులు, కిన్నరులు పాడిరి. అప్సరసలు మనోహరముగా నాట్యము చేసిరి.పుష్పవృష్టి కురిసెను. దేవతల ధ్వనులు మ్రోసెను. దేవగజముల సమూహము మదించెను.

వ. తదవసరంబున హరి పరమేష్ఠి పురందరాద్యఖిల దేవర్షి రాజర్షి ప్రముఖాఖిల జగజ్జనంబులు రజతాచలంబున కరుదెంచి మహోత్సవము సేయుచుండి; రంతఁ దదీయప్రార్థితుండై పరమేశ్వరుండు గణనాథునకు శివగణ సురగణాది సమస్త గణాధిపత్యాఖిల క్రియారంభాధిపత్యంబులతో యువరాజ పట్టంబుఁ గట్టి పరమానంద రసాబ్ధి నోలలాడుచుండె; నంత నక్కడ దక్షప్రజాపతి సకల జగజ్జనంబుల నిర్మించి సంతోషిత హృదయుండై యొక్క-నాఁడు. 110

అర్థము : తద్ + అవసరంబునన్ = ఆ సమయమున, హరి .... జనంబులు, హరి = విష్ణువు, పరమేష్ఠి = బ్రహ్మ, పురందర = ఇంద్రుఁడు, ఆది = మున్నగు, అఖిల = ఎల్ల, దేవ + ఋషి = దేవర్షులు, రాజ + ఋషి = రాజర్షులు, ప్రముఖ = మొదలైన, అఖిల = ఎల్ల, జగత్ + జనంబులు = లోకములందలి జనులు, రజత + అచలంబునకున్ = వెండికొండకు - కైలాసమునకు, అరుదెంచి = వచ్చి, మహత్ (మహో) + ఉత్సవము = గొప్ప వేడుక, చేయుచున్ + ఉండిరి, అంతన్, తదీయ - ప్రార్థితుండు + ఐ = వారిచేఁ గోరఁబడినవాఁడయి, పరమేశ్వరుండు, గణనాథునకున్ = గణపతికి, శివ - గణ = ప్రమథ గణములయు, సుర - గణ = దేవతా గణములయు, సమస్త = ఎల్ల, గణ = గణములయు, ఆధిపత్య = ప్రభుత్వము, అఖిల = ఎల్ల, క్రియా + ఆరంభ + ఆధిపత్యంబులతోన్ = పనుల ప్రారంభ ప్రభుత్వములతో, యువరాజ - పట్టంబు + కట్టి = యౌవరాజ్య పట్టాభిషేకము చేసి, పరమ + ఆనంద - రస + అబ్ధిన్ = గొప్ప ఆనందరసమనెడి సముద్రమునందు, ఓలలు + ఆడుచున్ + ఉండెన్ = క్రీడించుచుండెను, అంతన్, అక్కడన్, దక్ష ప్రజాపతి, సకల - జగత్ + జనంబులన్ = ఎల్ల లోకములందలి జనులను, నిర్మించి = పుట్టించి, సంతోషిత + హృదయుండు + ఐ = సంతోషపెట్టఁబడిన హృదయము గలవాఁడయి, ఒక్కనాఁడు.

తాత్పర్యము : ఆ సమయమున విష్ణు బ్రహ్మేంద్రాదులు, ఎల్లదేవర్షి రాజర్షులు, ఎల్లలోకముల జనులు, కైలాసమునకు వచ్చి గొప్ప వేడుక చేయుచుండిరి. అంత వారిచేఁ బ్రార్థితుఁడై పరమేశ్వరుఁడు గణపతికిఁ బ్రమథ దేవతాది సర్వగణముల

ఆధిపత్యముతోను, ఎల్ల క్రియల ఆరంభాధిపత్యములతోను యౌవరాజ్యపట్టాభిషేకముఁ గట్టి, పరమానందరస సముద్రమునఁ గ్రీడించుచుండెను. అంత నక్కడ దక్షప్రజాపతి యెల్ల జగములందలి జనులను బుట్టించి సంతోషించిన హృదయము గలవాఁడై, ఒక నాఁడు - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు: ఆది + అఖిల = ఆద్యఖిల - యణాదేశసంధి. దేవ + ఋషి = దేవర్షి, రాజ + ఋషి = రాజర్షి - గుణ సంధులు, ఆనంద రసాబ్ధి - ఆనంద రసమనెడి అబ్ధి - రూపకాలంకారము. జగత్ + జనములు = జగద్ + జనములు - జగజ్జనములు,

క. జలజార్యంతక కశ్యప
కులభామినులై నెగడ్త కుం జని బహు పు
త్త్రులఁ బడసి పేరుకొను కూఁ
తులఁ జూడఁగ నరిగె నతి కుతూహలబుద్ధిన్. 111

అర్థము; పయి గద్యమునందలి దక్షప్రజాపతి కర్త.

జలజ + అరి = తామరల విరోధియగు చంద్రుని యొక్కయు, అంతక = యముని యొక్కయు, కశ్యప = కశ్యపుని యొక్కయు, కుల - భామినులు + ఐ = కులస్త్రీలయి. నెగడ్తకున్ + చని = ప్రసిద్ధి కెక్కి. బహు - పుత్త్రులన్ = అనేక కుమారులను, పడసి = పొంది, పేరుకొను = కీర్తివహించు, కూఁతులన్ = పుత్త్రి కలను, చూడఁగన్ = చూచుటకు, అతి - కుతూహల - బుద్ధిన్ = మిక్కిలి కోరికగల మనస్సుతో, అరిగెన్ = వెడలెను,

తాత్పర్యము; దక్షప్రజాపతి చంద్రునకు, యమునకుఁ, గశ్యపునకు భార్యలయి ప్రసిద్ధి వహించు కూఁతులను జూడ మిక్కిలి వెడుకపడి వెడలెను.

విశేషములు: జలజారి + అంతక = జలజార్యంతక - యణాదేశసంధి, నెగడ్త - నెగడు ధాతు కృదంతరూపము,

వ. చని నిజాగమన ప్రయోజనంబు కశ్యపున కెఱింగించి పుచ్చిన. 112

అర్థము: పని, నిజ + ఆగమన - ప్రయోజనంబు = తనదైనరాక యొక్క ఉద్దేశము, కశ్యపునకున్, ఎఱింగించి - పుచ్చినన్ = తెలుపఁగా,

తాత్పర్యము: వెడలి తన వచ్చిన పనిని గశ్యపునకుఁ దెలుపఁగా-తరువాతి పద్యముతో నన్వయము.

మ. విని సంతోషముతోడ సంభ్రమముతో వేగంబునం బ్రీతితో
మునిసందోహముతోడ శిష్యతతితో మూర్తంబులై కొల్చు వే
ద నినాదంబులతోడ సంతత మహోత్సాహంబుతో వచ్చె ము
న్కొని తాత్పర్యముతోడఁ గశ్యపుఁడు దక్షుం గాన సద్భక్తితోన్. 113

అర్థము: కశ్యపుఁడు, విని, సంతోషముతోడన్, సంభ్రమముతోన్ = గాబరాతో, వేగంబునన్, ప్రీతితోన్, ముని - సందోహముతోడన్ = మునుల యొక్క సమూహముతో, శిష్య - తతితోన్ = శిష్యులయొక్క సమూహముతో, మూర్తంబులు + ఐ = రూపుగాంచినవయి, కొల్చు = సేవించు, వేద - నినాదంబుల తోడన్ = వేదములయొక్క ధ్వనులతో, సంతత-మహత్ (మహా)+ఉత్సాహంబుతోన్ = ఎడతెగని గొప్ప పూనికతో, తాత్పర్యముతోడన్ = ఆసక్తితో, సత్+భక్తితోన్ = మంచి భక్తితో, మున్కొని = ఎదురఁబడి, దక్షున్ = దక్షుని, కానన్ = చూచుటకు, వచ్చెన్.

తాత్పర్యము: కశ్యపుఁడు విని సంతోషముతోను, సంభ్రమముతోను, వేగముతోను, ప్రీతితోను, మునుల సమూహముతోను, శిష్యుల సమూహముతోను, మూర్తిమంతములైన వేదముల నాదములతోను, ఎడతెగని మహోత్సాహముతోను, ఆసక్తితోను, సద్భక్తితోను ఎదురేఁగి దక్షునిఁ జూడ వచ్చెను.

వ. ఇట్లు సకళత్రంబుగాఁ జనుదెంచి సర్వాంగీణప్రణాముండై నిజ మందిరమునకుఁ దోడ్కొని చని యర్ఘ్యపాద్యాది విశేషార్చనల నర్చించి మణి కనకాది వస్తునిచయంబునం బూజించిన కశ్యప ప్రజా పతి భక్తి యుక్తి కావర్జిత హృదయుండై దక్షుం డాతని వీడ్కొని ధర్మరాజావలోకన కుతూహలపరుండై చని ముందట. 114

అర్థము: ఇట్లు, సకళత్రంబుగాన్ = భార్యా సహితముగా, చనుదెంచి = వచ్చి, సర్వాంగీణ - ప్రణాముండు + ఐ = సాష్టాంగ నమస్కారము గలవాఁడయి, నిజ - మందిరమునకున్ = తనదైన యింటికి, తోడ్కొని - చని = తీసికొని వెడలి, అర్ఘ్య - పాద్య + ఆది - విశేష + అర్చనలన్ = పూజా ద్రవ్యములు, పాద ప్రక్షాళనార్థమైన జలము మున్నగు విశేషములైన పూజలతోఁ బూజించి, మణి - కనక + ఆది - వస్తు - నిచయంబునన్ = రత్నములు, బంగారము మున్నగు, వస్తువుల, సమూహముతో, పూజించిన = పూజించినట్టి, కశ్యప - ప్రజాపతి - భక్తి - యుక్తికిన్ = కశ్యప ప్రజాపతియొక్క భక్తిమత్త్వమునకు, ఆవర్జిత - హృదయుండు + ఐ = ఆకృష్టమైన హృదయము గలవాఁడయి, దక్షుండు, ఆతనిన్ = ఆ కశ్యపుని, వీడ్కొని = వీడి, ధర్మరాజ + అవలోకన - కుతూహల - పరుండు + ఐ = యముని జూచుటయందలి వేడుక యందాసక్తి గలవాఁడయి, చని, ముందటన్ = ఎదుర.

తాత్పర్యము: ఇట్లు భార్యా సహితుఁడై వచ్చి, సాష్టాంగ నమస్కారము చేసి, తన యాశ్రమమునకుఁ దీసికొనిపోయి, అర్ఘ్యము, పాద్యము మున్నగు విశేష పూజలఁ బూజించి, రత్నములు, బంగారము మున్నగు వస్తువుల సమూహముతోఁ బూజ చేసిన కశ్యపుని భక్తికి వశమైన హృదయము గలవాఁడయి దక్షుఁడు ఆతనిని వీడి యముని జూడ వేడుక గలవాఁడయి పోయి ముందట - తరువాతి పద్యముతో నన్వయము.

మహాస్రగ్ధర

ఘనబృందానేక దేశాగత పథిక జనౌఘప్రపాపాంగు, నుగ్రా
శని భీతాద్రోరు శైలాశ్రయు, నిఖిల నదీ స్వామిఁ, జంద్రాప్సరశ్రీ
జనకుం, గల్లోల మాలా చలిత నిజతటక్ష్మాజరాజీ విలాసుం
గనియెం దక్షుండు రత్నాకరు నిఖిల మహీ కామినీ మేఖలాభున్. 115

అర్థము; దక్షుండు (కర్త) ఘన....పాంగున్ : = మేఘములయొక్క, బృంద = సమూహ మనెడి, అనేక = పెక్కు, దేశ = దేశములనుండి. ఆగత = వచ్చిన, పథిక = బాటసారులయిన, జన = జనులయొక్క, ఓఘ = సమూహమునకు,

ప్రాపా=జలిపందిరియనెడి, అపాంగున్=కడకన్నులుగలవాఁడును, ఉగ్రా..... శ్రయున్: ఉగ్ర = భయంకరమైన, అశని = వజ్రాయుధమువలన, భీత = భయపడినవయి, ఆర్త = దుఃఖమునొందిన, శైల = కొండలకు, ఆశ్రయున్ = ఉనికిపట్టయిన వాఁడును, నిఖిల .... .... స్వామిన్: నిఖిల = ఎల్ల, నదీ = నదులకును, స్వామిన్ = భర్తయైనవాఁడును, చంద్రా .... .... జనకున్: చంద్ర = చంద్రునకును, అప్సరస్ = అచ్చరలకును, శ్రీ = లక్ష్మికి, జనకున్ = తండ్రియైన వాఁడును, కల్లోల .... .... విలాసున్: కల్లోల = పెద్దయలలయొక్క, మాలా = వరుసలచేత, చలిత = కదలిన, నిజ = తనదైన, తట = ఒడ్డునందలి, క్ష్మాజ = చెట్లయొక్క, రాజీ = వరుసయొక్క, విలాసున్ = విలాసము గలవాఁడును, నిఖిల .... .... లాభున్; నిఖిల = ఎల్ల, మహీ = భూమియనెడు, కామినీ = స్త్రీకి, మేఖలా = మొలనూలియొక్క, ఆభున్ = శోభ గలవాఁడును, అగు, రత్న + ఆకరున్ = సముద్రుని, కనియెన్ = చూచెను.

తాత్పర్యము ; దక్షుఁడు మేఘముల గుంపనెడు పలు దేశములనుండి వచ్చిన బాటసారులకుఁ జలిపందిరియైన కడకన్నులుగలవాఁడును, భయంకరమైన వజ్రాయుధము వలని భయమున దుఃఖితములైన పర్వతముల కాశ్రయమైనవాఁడును, ఎల్లనదులకు భర్తయైన వాఁడును, చంద్రుఁడు, అచ్చరలు, లక్ష్మియనువారికిఁ దండ్రియైనవాఁడును, పెద్దయలల వరుసలచేఁ జలించిన తీరస్థవృక్ష పంక్తుల విలాసము గలవాఁడును, సకల భూమియనెడు కామినికి మొలనూలి శోభగలవాఁడును, అగు, రత్నాకరుని జూచెను.

విశేషములు: ఘనబృందా .... .... పాంగు. = ఘనబృందమనెడి .... .... పథికజనౌఘము - రూపకము. ప్రపాపాంగున్ - ప్రప యనెడు అపాంగము గలవానిని - రూపకము, మహీకామిని - రూపకము, ఘనబృందా ........ పాపాంగున్ అను విశేషణముచే సముద్రుని దానగుణము, 'ఉగ్రాశని .... .... శ్రయు' అను విశేషణముచే సముద్రుని ఆర్తరక్షా పరాయణత్వము, 'నిఖిలనదీస్వామి' అనువిశేషణముచే సముద్రుని దక్షిణనాయకత్వము, 'చంద్రా.... .... జనకు' అనువిశేషణముచే నతని అభిజనమును, 'నిఖిలమహీకామినీమేఖలాభున్' అను విశేషణముచేతను, 'రత్నాకరున్' అను విశేషణముచేతను నతని ఆఢ్యత్వము తెలియుచున్నవి. ఛందస్సు - చూడు, 1.68 వ పద్యమును వ్యాఖ్య.

వ. కని యమ్మహాఋషి మహాపరుష వజ్రి వజ్రపాత భీతాయాత క్షోణీధర పక్ష విక్షేప క్షుభితానేక నక్ర చక్ర తిమి తిమింగిల తద్గిల కుంభీర కుంభీనసా ద్యనేక జలచర కులాకులిత లులితాలోల కల్లోలా నూన ఫేనాయమాన శుక్తిముక్తాఫలాభిరామంబై నయ్యది యని మెచ్చి మఱియును విశేషించుచు. 116

అర్థము ; కని = చూచి, ఆ + మహత్ (మహా) ఋషి = ఆ గొప్ప ఋషియైన దక్షుఁడు, మహాపరుష.........రామంబు: మహత్ (మహా) + పరుష = మిక్కిలి క్రూరమైన, వజ్రి - వజ్ర = ఇంద్రుని వజ్రాయుధముయొక్క, పాత = పాటువలన, భీత = భయపడినవయి, ఆయాత = వచ్చిన, క్షోణీధర = పర్వతముల యొక్క, పక్ష = ఱెక్కలయొక్క, విక్షేప = ఆడించుటచే, క్షుభిత = కలఁగిన, అనేక = పెక్కు, నక్ర = మొసళ్లయొక్క, చక్ర = సమూహములు, తిమి = నూఱు యోజనముల పొడుగుగల చేఁపలు, తిమింగిల = తిమిని మ్రింగెడు చేఁపలు, తద్గిల = తిమింగిలమును మ్రింగెడు చేఁపలు, కుంభీర = మొసళ్లు, కుంభీనస = పాములు, ఆది = మున్నగు, అనేక = పెక్కు, జలచర = నీటి జంతువుల యొక్క, కుల = సమూహముచే, ఆకులిత = కలఁతపెట్టఁబడినవై, లులిత = కదలినవైన, ఆలోల=అంతటఁ జలించు, కల్లోల = అలలచేత, అనూన = తక్కువ కాని, ఫేనాయమాన = నురుగు అగుచున్న, శుక్తి = ముత్తెపుఁజిప్పలందలి, ముక్తాఫల = ముత్యములచేత, అభిరామంబు = మనోహరము, ఐన + అది = ఐనది, అని, మెచ్చి, మఱియును, విశేషించుచున్ = వర్ణించుచు.

తాత్పర్యము; దక్షుఁడు సముద్రమును జూచి యది మిక్కిలి క్రూరమైన యింద్రుని వజ్రాయుధపాతమువలన భయపడివచ్చిన పర్వతముల ఱెక్కల ఆర్పులచేఁ గలఁగిన పెక్కు మొసళ్ల. సమూహములు. తిములు. తిమింగిలములు. తిమింగిలగిలములు, అను పెక్కు జలచరముల అలజడిచేఁగలఁగి చలించిన అలలచే నురుగగుచున్న శుక్తు లందలి ముత్యములచే మనోహరమైనది యని ప్రశంసించి యింకను వర్ణించుచు - తరువాతి పద్యముతో నన్వయము,

విశేషములు : ఇంతపెద్దసమాసము సముద్రము గాంభీర్యాయతత్వములను సూచించును.

క. శరనిధి రత్నంబులు దివి
కరిగెనొ యని తారకముల నతులోర్మి కరో
త్కరములు తెమల్చి తెచ్చిన
పరుసున నవ విపుల ఫేనపంక్తులు వెలుఁగున్. 117

అర్థము : శరనిధి-రత్నంబులు=సముద్రమునందలి రత్నములు, దివికిన్ = ఆకాశమునకు, అరిగెనొ = వెడలెనో, అని, తారకములన్ = నక్షత్రములను, అతుల + ఊర్మి - కర + ఉత్కరములు = సాటిలేని, అలలనెడి, చేతుల, సమూహములు, తెమల్చి = వెదకి, తెచ్చిన - పరుసునన్ = తెచ్చిన విధమున, నవ - విపుల - ఫేన - పంక్తులు = క్రొత్తవియు, సమృద్ధములునైన నురుగుల గుంపులు, వెలుఁగున్ = ప్రకాశించును.

తాత్పర్యము : సముద్రములోని రత్నములు ఆకాశముమీఁదికిఁ బోయెనో యని నక్షత్రములను సముద్రుని అలలనెడి చేతుల సమూహములు వెదకి తెచ్చిన విధమునఁ గ్రొత్తవియు, సమృద్ధములునైన నురువుల పంక్తులు ప్రకాశించును.

విశేషములు : ఊర్మికరములకు నక్షత్రములందు రత్నభ్రాంతి, కావున భ్రాంతిమంత మలంకారము, ర్మి-కరములు - ఊఊర్ములనెడి కరములు - రూపకాలంకారము, ఫేన పంక్తులు ఊర్మికరములు తారకములను దెమల్చి తెచ్చెనొ యను నట్లుండెనవుటచే నలంకార ముత్ప్రేక్ష. సముద్రుఁడు తన రత్నములన్నియుఁబైకిఁ బోఁగా వానిని మరలఁ దన యలలచేతులతోఁ బెదకి తెచ్చుకొనినట్లు నురువు లుండె ననుట.

క. వనధిఁగల నగము లన్నియు
ననిమిషపతిమీఁద నడువ నని యెగసెనొకో
యన నాకాశముఁ దాఁకఁగఁ
దనరఁగ నత్యున్నతోర్మితతి విలసిల్లెన్. 118

అర్థము : వనధిన్ = సముద్రమునందు, కల = ఉన్నట్టి, నగములు = కొండలు, అన్నియున్, అనిమిష - పతి - మీఁదన్ = దేవతాభర్తయైన ఇంద్రునిపైకి, నడువన్ + అని = దండెత్తుటకని, ఎగసెన్ + ఒకో=లేచెనా, అనన్=అనఁగా, అతి + ఉన్నత + ఊర్మి - తతి = మిక్కిలి, యెత్తైన, అలల. సమూహము, ఆకాశమున్ = ఆకాశమును, తాఁకఁగన్ = తాఁకుసట్లు, తనరఁగన్ = ఒప్పుగా, విలసిల్లెన్ = ప్రకాశించెను.

తాత్పర్యము : ఇంద్రుఁడు తమఱెక్కలను వజ్రాయుధముతోఁ దెగఁగొట్టి నందులకుఁ గొండల కింద్రునిపైఁగోపము, ఆ కసిఁదీర్చుకొనుటకు సముద్రమునందలి కొండలన్నియు నింద్రునిపై దండెత్త లేచెనా యనునట్లు సముద్రమునందలి మిక్కిలి యెత్తైన అలల గుంపు ఆకాశమునంటుచు నొప్పెను.

విశేషములు : సముద్రమునందలి యలలు కొండలవలె నత్యున్నతము లని భావము. కొండల వంటి అలలు ఆకాశము నంటుటకు ఇంద్రునిపైఁగల కోపము హేతువు కాదు, పైకిలేచుట అలల స్వభావము, హేతువు కానిదానిని హేతువుగాఁ జెప్పుటచే నలంకారము హేతూత్ప్రేక్ష. అలలకును ఆకాశమునకును సంబంధములేదు, సంబంధము లేనిపట్టుల సంబంధమున్నట్లు వర్ణించుటచే సంబంధాతిశయోక్తియు.

చ. ఉడుగని నీరిలోనఁబడియుండఁగ నోపక బాడబాగ్ని వె
ల్వడి వరతీర భూరుహకులంబులపై మొగిఁ గప్పునట్లు దం
దడి నరుణ ప్రవాళక లతల్ తరుసంహతిమీఁదఁ బర్వ చె
ల్వడరి తటాటవుల్ తనరు నబ్ధి బహిర్గత రత్నదీప్తులన్. 119

అర్థము : ఉడుగని = తగ్గని, నీరిలోనన్ = నీటిలోపల, పడి + ఉండఁగన్ + ఓపక = పడియుండలేక, బాడబ + అగ్ని = బడబాగ్ని, వెల్వడి (వెలువడి)= వెలికివచ్చి, వర - తీర - భూరుహ - కులంబులపైన్ = శ్రేష్ఠమైన యొడ్డులందలి చెట్లసమూహములపై, మొగిన్ = పూనికతో, కప్పు + అట్లు = కప్పు విధమున, దందడిన్ = మొత్తముగా, తరు-సంహతి - మీఁదన్ = చెట్ల సమూహముమీఁద, అరుణ-ప్రవాళక - లతల్ = ఎఱ్ఱని పగడపుఁదీఁగలు, పర్వ (పరువు) = వ్యాపించు

పట్టి, వెల్వు (వెలువ) = విధము, అడరి = అతిశయించి, తట + అటవుల్ = తీరమునందలి అడవులు, అబ్ధి - బహిః + గత - రత్న - దీప్తులన్ = సముద్రమునకు వెలుపల వ్యాపించిన రత్నములయొక్క కాంతులతో, తనరున్ = ఒప్పును.

తాత్పర్యము : ఎప్పటికిని తగ్గని నీటిలోపల నుండఁజాలక బడబాగ్ని వెలికివచ్చి యొడ్డుననున్న చెట్ల సమూహములపై వ్యాపించునట్లు, చెట్లగుంపులపై నెఱ్ఱని పగడపుఁదీఁగెలు దట్టముగా వ్యాపించువిధమొప్పఁ దీరస్థారణ్యములు సముద్రమునకు వెలుపల వ్యాపించిన రత్నముల కాంతులతో నొప్పెను.

విశేషము : సముద్రగర్భమున నుండు నగ్నికి బడబాగ్నియని పేరు. అది బడబ (ఆఁడుగుఱ్ఱము) ఆకారమున నుండును గనుక దానికి బడబాగ్ని, బాడబాగ్ని యనిపేరు. అగ్నికి నీరు శత్రువు, బడబాగ్ని ఎంతకాలమని శత్రువైన నీరిలో నడఁగి యుండఁగలదు? అందుచే నది పైకివచ్చి తీరభూరుహకులములపైఁ బర్వెనా యనునట్లు ఎఱ్ఱని పగడపుఁదీఁగలు దట్టముగాఁ జెట్లపై వ్యాపించెను. అది సముద్రమునకు వెలుపల వ్యాపించు రత్నకాంతులతోఁ దీరస్థారణ్యము లొప్పినట్లుండెను. ఎఱ్ఱని పగడముల కాంతిచేతనే యడవులు సముద్రబహిర్గత రత్నకాంతులతో నొప్పెను. రత్నముల యెఱ్ఱని కాంతులు వ్యాపించిన యడవులు, సముద్రమున నడఁగియుండఁజాలక పైకివచ్చిన బడబాగ్నిచేఁ గప్పఁబడినట్లుండెను.

బడబాగ్ని వెలితరుభూరుహకులంబులపైఁగప్పునట్లు, అబ్ధిబహిర్గతరత్నదీప్తులన్ దీరాటవుల్ తనరు - అలంకార ముత్ప్రేక్ష. బహిస్ + గత - బహిః + గత - పదాంత సకారమునకు విసర్గాదేశము, అ, ఆలు తప్ప మిగిలిన అచ్చుల తరువాత వచ్చు విసర్గమునకు అచ్చులుగాని మృదుహల్లులుగాని పరములగునపుడు రేఫ మాదేశమగును. బహిర్గత.

గీ. వనధి నీరల్లఁ గొనిపోవఁ గని సహింప
కబ్ధి తటి గిట్ట పట్టిన నరుగ నోప
కోలి దొంతులు గొని పడియున్న కారు
మొగుళు లనఁ బూచి తటభూమి మొగళు లమరె. 120

అర్థము; వనధి - నీరు = సముద్రముయొక్క నీరు, అల్లన్ = మెల్లఁగా, కొనిపోవన్ = తీసికొనిపోవఁగా, కని = చూచి, సహింపక = ఓర్వక, అబ్ధి - తటి సంద్రపుటొడ్డు, గిట్ట-పట్టినన్ = ఆ మేఘముల గిట్టలను - వానకాళ్ళను పట్టుకొనఁగా, అరుగన్ + ఓుక = వెడలఁజాలక, ఓలిన్ = క్రమముగా, దొంతులు + కొని = అధికమయి, పడి + ఉన్న, కారు - మొగుళులు = నల్లని మబ్బులు - వర్షాకాలపు మేఘములు, అనన్ = అనునట్లు, మొగిళులు = మొగలులు - గేదఁగులు, పూచి = పుష్పించి, తట - భూమిన్ = తీరభూమియందు, అమరెన్ = ఒప్పెను.

తాత్పర్యము: సముద్రపునీటిని మెల్లఁగాఁగొనిపోవుచుండఁగా సంద్రపుటొడ్డు చూచి, యోర్వక, మేఘముల సమూహము గిట్టలను పట్టుకొనఁగా, వెడలలేక వరుసగా దొంతరలయి పడియున్న నల్లనిమబ్బులనఁగాఁ దీరభూమిని గేదఁగులు పుష్పించి యొప్పెను.

విశేషములు: క్రమక్రమముగాఁ దననీటిని హరించుకొనిపోవు మేఘములను జూచి సముద్రపుటొడ్డు సహింపలేక వాని గిట్టలను బట్టుకొనఁగా దొంతరలై పడియున్న ఆ మేఘములా యనఁ దీరముల మొగళ్ళు లున్నవనుటచే నలంకారముత్ప్రేక్ష.

మొగులు + లు, 'బహువచనంబు పరంబగునపు డసంయుక్తంబులై యుదంతంబు లయిన డ లర ల కలఘులకారంబు బహుళంబుగా నగు, మొగుళులు. బాల. అచ్చిక. 13. మొగళులు - మొగలి + లు = 'ఇత్తునకు బహువచనంబు పరంబగునపు డుత్వంబగు' బాల, తత్సమ, 45. మొగలులు. పయి - అచ్చిక 13 చే మొగళులు, రూపాం. మొగలులు, మొగళ్లు. మొగులు (వికృతి) - మేఘము (ప్రకృతి). మొగుళులు - (రూపాం) మొగులులు, మొగుళ్లు, మొగిలులు, మొగిళులు, మొగిళ్లు, మొయిలులు, మొయిళులు, మొయిళ్లు, మొయులులు, మొయుళులు, మొయుళ్లు.

క. సురగిరి కర్ణికగా వి
స్తరితములగు మండలములు దళములుగా న
వ్వారిదమిక్కఁబోలి క్రాలుచు
శరనిధిలో నిఖిలధరణిచక్రము వొలుచున్. 121

అర్థము: సుర - గిరి = దేవతల కొండ - మేరువు, కర్ణిక + కాన్ = తామరదుద్దుగా, విస్తరితములు = వ్యాపించినవి, అగు, మండలములు = దేశములు, దళములు, + కాన్ = రేకులుగా, ఆ + విరి - తమ్మిన్ = ఆ వికసించిన తామర పువ్వును, పోలి, క్రాలుచున్ = ఒప్పుచు, శరనిధిలోన్ = సముద్రములో, నిఖిల - ధరణీ - చక్రము = ఎల్ల, భూవలయము, పొలుచున్ = ఒప్పును.

తాత్పర్యము ; మేరుపర్వతము దుద్దుగాను, వ్యాపించిన దేశములు రేకులుగాను వికసించిన తామరపువ్వువలె సముద్రమునందలి యెల్ల భూవలయము నొప్పును.

విశేషములు: ధరణీచక్రము విరిదమ్మివోలెఁ బొలుచుననుటచే నలంకార ముపమ. సురగిరి కర్ణికయు, మండలములు దళములుగా. నయ్యెననుటచే నా యుపమ రూపకానుప్రాణితము. చక్రము + పొలుచున్ - చక్రమువొలుచున్ - గసడదవాదేశము, బాల. సంధి. 13.

క. హరిఁ దన గర్భమునఁ జరా
చరమయవిశ్వంబు దాల్చి చనువాని సితే
తరమణి వోలె ధరించిన
శరనిధిపెంపేరికైనఁ జనునే పొగడన్? 122

అర్థము : తన - గర్భమునన్ = తన కడుపులో. చర + అచర-మయ - విశ్వంబు = జడములు, అజడములు అనువానితో నిండిన విశ్వము, తాల్చి = ధరించి, చను - వానిన్ = ఒప్పు వానిని, హరిన్ = విష్ణువును, సిత + ఇతర - మణి + పోలెన్ = నల్లని మణి వలె - ఇంద్రనీలమణివలె, ధరించిన = తాల్చిన, శరనిధి - పెంపు = సముద్రము గొప్పతనము, ఏరికిన్ + ఐనన్ = ఎవ్వరికైనను, పొగడన్ = ప్రశంసించుటకు, చనునే = శక్యమగునా?

తాత్పర్యము: తన కడుపులోఁ జరాచరమయమగు విశ్వమును ధరించిన విష్ణువును ఇంద్రనీలమణివలెఁ దాల్చిన సముద్రము గొప్పతన మెవరికైనను బొగడఁ దరమా? కాదనుట.

విశేషములు : అలంకార మువమ. షణి వోలె - షణి + పోలె - గసడ దవాదేశము. బాల. సంధి, 13.

వ. అని యనేకవిధ రత్న నికరాకరంబైన రత్నాకరాశేషవిశేషంబులు బహుప్రకారంబుల విశేషించుచు ధర్మాధర్మ ఫలభోగాస్పదంబైన ధర్మరాజపురంబున కరిగె నంత. 123

అర్థము : అని, అనేక - విధ - రత్న - నికర + ఆకరంబు = పెక్కు - రీతులైన, రత్నములయొక్క, సమూహమునకు, స్థానము ఐన, రత్నాకర + అశేష - విశేషంబులు = సముద్రముయొక్క, ఎల్ల, ప్రత్యేకతలు, విశేషించుచున్ = స్తుతించుచు. ధర్మ + అధర్మ - ఫల - భోగ + ఆస్పదంబు = ధర్మములు, అధర్మములు అను వాని యొక్క, ఫలములయొక్క, అనుభవములకుఁజోటు, ఐన, ధర్మరాజ - పురంబు నకున్ = యముని ప్రోలికి, అరిగెన్, అంతన్,

తాత్పర్యము : అని పెక్కురీతులైన రత్నముల సమూహమునకు స్థానమైన సముద్రము ప్రత్యేకతలను అనేకవిధముల, స్తుతించుచు దక్షుఁడు ధర్మాధర్మముల ఫలముల అనుభవమునకుఁ జోటయిన యముని పురమునకు వెడలెను. అంత - తరువాతి పద్యముతో నన్వయము,

ఉ. అర్మిలితో నగస్త్యముని యాదిగ దివ్యమునీంద్రులున్, మహా
ధర్మ సమేతులై పితృపితామహవర్గముఁ, బ్రేతయూథముం,
గర్మములున్, జరారుజలుఁ, గాలములుం దనుఁ గొల్చి పొల్చి రా
ధర్ముఁడు వచ్చె లోకగురు, దక్షుఁ, గళాగమదక్షుఁ గానఁగాన్. 124

అర్థము : అగస్త్య - ముని + ఆదిగన్ = అగస్త్యుఁ డను ముని మొదలుగా. దివ్య - ముని + ఇంద్రులున్ = దేవసంబంధమైన మునిశ్రేష్ఠులును, మహత్ (మహా) + ధర్మ - సమేతులు + ఐ = గొప్పదియగు ధర్మముతోఁగూడిన వారయి. పితృ - పితామహ - వర్గమున్ = తండ్రులయుఁ, దాతలయు సమూహమును, ప్రేత,

యూథమున్ = నరకమందుండు జీవభేదముల సమూహమును, కర్మములున్ = పుణ్య పాపముల కర్మములను, జరా - రుజలున్ = ముసలితనము, రోగములును, కాలములున్, తనున్ = తన్ను, కొల్చి = సేవించి, పొల్చి = ఒప్పి, రాన్ = రాఁగా, ధర్ముఁడు = యముఁడు, లోక - గురున్ = లోకములకు గురువైనవాఁడును, కళా + ఆగమ - దక్షున్ = కళలయందును, శాస్త్రములందును సమర్థుఁడైనవాఁడును, అగు, దక్షున్ = దక్షుని, కానఁగాన్ - చూచుటకు, అర్మిలిన్ = ప్రీతితో, వచ్చెన్.

తాత్పర్యము: అగస్త్యుఁడు మున్నుగాఁగల దివ్యులైన మునిశ్రేష్ఠులును, మహాధర్మసహితులై పితృపితామహుల సమూహమును, ప్రేతముల సమూహమును, పుణ్యపాపములైన కర్మములును, జరా వ్యాధులును, కాలములును దన్నుఁగొలిచి రాఁగా యముఁడు లోకగురుఁడును, గళాశాస్త్రములందు సమర్థుఁడును అగు దక్షునిఁ జూడఁ బ్రీతితో వచ్చెను.

విశేషములు: కొల్చి - పొల్చి, దక్షున్ - కళాగమ దక్షున్ - అలంకారము అనుప్రాసము.

వ. ఇట్లెదురువచ్చి భార్యా సమేతంబుగా వినయ వినమితోత్త మాంగుండై కశ్యపుకంటె విశేషార్చనలం బరితోషితుంజేసిన ధర్మ రాజు వీడ్కొని చంద్రమండలంబున కరిగిన. 125

అర్థము: ఇట్లు, ఎదురువచ్చి, భార్యా - సమేతంబుగాన్ = భార్యలైన ధూమోర్ణ, విజయ యనువారితోఁగూడి. వినయ - వినమిత - ఉత్తమాంగుండు = అడఁకువతో మిక్కిలి వంపఁబడిన శిరస్సు గలవాఁడు, అయి, కశ్యపు - కంటెన్, విశేష + అర్చనలన్ = అధికములయిన పూజలచేత. పరితోషితున్ = సంతోష పెట్టఁబడినవానిని, చేసిన = చేసినట్టి, ధర్మరాజున్ = యముని, వీడ్కొని = వీడి, చంద్ర - మండలంబునకున్, అరిగినన్ = వెడలఁగా.

తాత్పర్యము: ఈ విధముగా నెదురువచ్చి తన భార్యలగు ధూమోర్ణ, విజయ యనువారితోఁగూడి యడఁకువతో శిరస్సు వంచి కశ్యపునికంటెను అధికము

లైన పూజలతో సంతుష్టునిగాఁజేసిన యముని వీడి దక్షుఁడు చంద్రమండలమునకు వెడలఁగా - తరువాతి పద్యముతో నన్వయము,

చ. కువలయబాంధవుండు హిమ గో నికరావృతుఁజేసి మామ కు
త్సవ మొనరంగ ముందటఁ బథశ్రమ మార్చుచువచ్చెఁ దారకా
నివహ నిజౌషధీ కుముదినీ పరివేష్టితుఁడై సుధా సము
ద్భవుఁ డమలాంగుఁ డెంతయు ముదంబున దక్షునిఁగాన నెమ్మితోన్. 126

అ ర్థ ము : తారకా - నివహ - నిజ + ఓషధీ - కుముదినీ-పరివేష్టితుఁడు= నక్షత్రముల సమూహము, తనవైన ఓషధులు, కలువతీఁగ అనువానిచేఁ జుట్టఁబడిన వాఁడయి - కూడినవాఁడయి, సుధా - సముద్భవుఁడు = అమృతముతోఁబుట్టినవాఁడు, అమల+అంగుఁడు=నిర్మలమైన శరీరము గలవాఁడు, అగు, కువలయ-బాంధవుండు= కలువ చుట్టము - చంద్రుఁడు, హిమ - గో - నికర+ఆవృతున్=చల్లని కిరణముల సమూహముచే నావరింపఁబడినవానినిగా, చేసి, మామకున్ = మామయైన దక్షునకు, ఉత్సవము = సంతోషము. ఒనరంగన్=కలుగఁగా, పథ-శ్రమము=మార్గాయాసము, ఆర్చుచున్ = పోఁగొట్టుచు, దక్షునిన్, కానన్ = చూచుటకు, నెమ్మితోన్=ప్రీతితో, ఎంతయున్ - ముదంబునన్ = మిక్కిలి సంతోషముతో, ముందటన్ - వచ్చెన్ = ఎదురు వచ్చెను.

తా త్ప ర్య ము : అమృతముతోఁ బుట్టినవాఁడును, నిర్మలమైన శరీరము గలవాఁడును, అగు, కువలయముల చుట్టమైన చంద్రుఁడు తారకల సమూహము, తనయోషధులు, కుముదిని అనువానితోఁ గూడినవాఁడయి, చల్లని కిరణముల సమూహముచే నావరింపఁబడినవానినిగాఁజేసి మామకు సంతోషమును గలుగఁజేసి మార్గాయాసము నపనయించి. ప్రీతితో, నెంతయు సంతోషముతో దక్షునిఁజూడ నెదురువచ్చెను.

వి శే ష ము లు : గో - 'స్వర్గేషు పశు వా గ్వజ్ర ది జ్నేత్ర ఘృణి భూ జలే లక్ష్య దృష్ట్యా స్త్రియాం పుంసి గౌః' అమరము. గోశబ్దమునకు స్వర్గము, బాణము, పశువు, వాక్కు, వజ్రాయుధము, దిక్కు, నేత్రము, కిరణము, భూమి, నీరు అను నర్థములు గలవు, నిజ + ఓషధీ = నిజౌషధీ - వృద్ధిసంధి.

వ. ఇట్లెదురువచ్చి కశ్యప ధర్మజుల కంచెె విశేషార్చనలు గావించిన సుధాకరు వీడ్కొని సతీ పరమేశ్వరావలోకనార్థియై యనేక దివ్య ఋషి పరివేష్టితుండై చనుదెంచి. 127

అర్థము : ఇట్లు, ఎదురు వచ్చి, కశ్యప ధర్మజుల కంచెెన్, విశేష + అర్చనలు = అధికమైన పూజలు, కావించినన్ = చేయఁగా, (దక్షుఁడు), సుధాకరున్ = అమృతకిరణుని - చంద్రుని, వీడ్కొని = వీడి, సతీ - పరమేశ్వర + అవలోకన + అర్థి + ఐ = సతీదేవీపరమేశ్వరులఁ జూడఁగోరినవాఁడయి, అనేక - దివ్య - ఋషి - పరివేష్టితుండు = పెక్కండ్రు దివ్యమునులచేఁ జుట్టఁబడినవాఁడు, ఐ, చను దెంచి = వచ్చి,

తాత్పర్యము : ఈ విధముగా నెదురువచ్చి చంద్రుఁడు కశ్యప ధర్మరాజుల కంచెెను నధికముగాఁ బూజింపఁగా, దక్షుఁడు చంద్రుని వీడి. సతీ పరమేశ్వరులను జూడఁగోరి, పెక్కురు దివ్యమునులతోఁ గూడినవాఁడయి వచ్చి - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : దివ్య + ఋషి - అకారాద్యచ్చులకు ఋకారము పరమగు నేని సంధి వికల్పము. గుణసంధి యగుచో దివ్యర్షి, కానిచో దివ్యఋషి.

క. ధరణీధరుఁ, బార్థివ శే
ఖరు, సంయుత రాజవంశ కమలార్కు, రథ
ద్విరద హయ భట పరీవృతు,
నరపతిగతిఁ బొలుచు రజతనగపతిఁ గనియెన్. 128

అర్థము: దక్షుఁడు కర్త. ధరణీ-ధరున్ = ధరణిని ధరించువాఁడును-రాజును, పర్వతమును, పార్థివ-శేఖరున్ = రాజశ్రేష్ఠుఁడును, పృథా(భూ)సంబంధమైన శిఖరము తోఁగూడినవాఁడును, సంయుత-రాజ-వంశ-కమల + అర్కున్ = కూడుకొన్న రాజ వంశములనెడి పద్మములకు సూర్యుఁడును-సూర్యవంశమువాఁడును, మేలయిన వెదురు లనెడి పద్మములకు సూర్యుఁడును, రథ-ద్విరద-హయ-భట- పరీవృతున్ = రథములు, ఏనుఁగులు, గుఱ్ఱములు, బంటులు అనువానితోఁగూడిన వాఁడును, తినిశవృక్షములతోను,

నాగకేసరవృక్షములతోను, (అడవియేనుఁగులతోను), ఆటవికభటులతోను, గుఱ్ఱములతోను గూడినవాఁడును, అగు, నరపతి-గతిన్ = రాజువిధమున, పొలుచు = ఒప్పునట్టి, రజత-నగ-పతిన్ = వెండికొండతేనిని, కైలాసమను పర్వతశ్రేష్ఠమును, కనియెన్ = చూచెను.

తాత్పర్యము: భూమిని భరించువాఁడును-రాజును, పర్వతమును, రాజశ్రేష్ఠులతోఁగూడుకొన్నవాఁడును, పృథివీ (భూ) సంబంధమైన శిఖరములతోఁగూడుకొన్నవాఁడును, రాజవంశములనెడి పద్మములకు సూర్యుఁడైనవాఁడును, శ్రేష్ఠములైన వెదురులనెడి పద్మములకు సూర్యుఁడైనవాఁడును. రథ. గజ. తురగ, పదాతులతోఁగూడినవాఁడును, తినిశవృక్షములతోను. నాగకేసరవృక్షములతోను. (అడవి యేనుఁగులతోను), ఆటవికభటులతోను, గుఱ్ఱములతోను గూడినవాఁడును అగు కైలాసపర్వతరాజును జూచెను.

విశేషములు: శ్లేషానుప్రాణితమైన ఉపమ. రాజవంశకమలార్క-అనుచో రూపకము.

వ. కని తదీయమాహాత్మ్యంబున కాశ్చర్యహృదయుండగుచుం దద్గిరిపాలకానుజ్ఞాతుండై పరమేశ్వరాస్థానంబున కరిగి. 129

అర్థము: కని = చూచి, తదీయ- మాహాత్మ్యంబునకున్ = దానిగొప్పతనమునకు, ఆశ్చర్య-హృదయుండు=ఆశ్చర్యముతోఁగూడిన హృదయముగలవాఁడు, అగుచున్, తద్ + గిరి-పాలక + అనుజ్ఞాతుండు + ఐ = ఆ కొండను రక్షించువానిచే అనుమతింపఁబడినవాఁడయి, పరమేశ్వర + ఆస్థానంబునకున్ = పరమేశ్వరుని యొక్క కొలువునకు, అరిగి = వెడలి.

తాత్పర్యము: దక్షుఁడు కైలాస పర్వతమును జూచి, దాని గొప్పతనమున కచ్చెరువందుచు నా గిరిని రక్షించువాని యనుమతితోఁబరమేశ్వరుని కొలువునకేఁగి- ద్వితీయాశ్వాసమునందలి రెండవ పద్యముతో నన్వయము.

## ఆశ్వాసాంతము

ఉ. మారమదప్రహారు, గుణమండనమండితు, సుందరాంగు, దు
ర్వార భవాబ్ధిపారగు, సువర్ణ సవర్ణ శరీరు, సజ్జనా
ధారుఁ, గవీంద్రగాయకబుధస్తుతుఁ, గాశవికాసహాస ది
క్పూరితచారుకీర్తి, మునిపుంగవు, జంగమ మల్లికార్జునున్. 130

అర్థము: మార-మద-ప్రహారున్ = మన్మథునియొక్క గర్వమును హరించినవాఁడును, గుణ-మండన-మండితున్ = సుగుణములనెడి అలంకారములచే, నలంకరింపఁబడినవాఁడును, సుందర + అంగున్ = అందమైన శరీరము గలవాఁడును, దుర్వార-భవ + అబ్ధి-పారగున్ = వారించుటకు శక్యముకాని సంసారమనెడి సముద్రము యొక్క తీరమును బొందినవాఁడును, సువర్ణ-సవర్ణ-శరీరున్ = బంగారముతో సమానమైన శరీరముగలవాఁడును. సత్ + జన + ఆధారున్ = సుజనులకు ఆధారమైనవాఁడును, కవి + ఇంద్ర-గాయక-బుధ-స్తుతున్ = కవిశ్రేష్ఠులచేతను, గాయకుల చేతను, పండితులచేతను బొగడఁబడువాఁడును, కాశ-వికాస-హాస-దిశ్ (క్)-పూరిత-చారు-కీర్తిన్ = తెల్లపూల వికాసమువలెను, నవ్వువలెను, దిక్కులందు నిండిన, మనోహరమైన, కీర్తిగలవాఁడును, ముని-పుంగవున్ = మునిశ్రేష్ఠుఁడును, అగు, జంగమ మల్లికార్జునున్.

తాత్పర్యము: మన్మథుని గర్వ మడఁచినవాఁడును, గుణములనెడి అలంకారములచే నలంకరింపఁబడినవాఁడును, అందమైన శరీరముగలవాఁడును, వారించుటకు శక్యముగాని సంసారసముద్రమును దాఁటినవాఁడును, బంగరుచాయతో సమానమైన చాయగల శరీరము గలవాఁడును, సుజనుల కాధారమైనవాఁడును, కవిశ్రేష్ఠులచేతను, గాయకులచేతను, పండితులచేతను నుతింపఁబడువాఁడును, తెల్లపూల వికాసమువలెను, నవ్వువలెను దిక్కుల నిండిన మనోహరమైన కీర్తిగలవాఁడును, మునిశ్రేష్ఠుఁడును అగు జంగమ మల్లికార్జునుని-134వ పద్యములోని 'పొగడఁదగు' నను క్రియతో నన్వయము.

విశేషములు: ఆశ్వాసాంత పద్యములు కృతిభర్త నుద్దేశించినవి సాధారణముగా సంబోధనాంతములుగా నుండుట ఆచారము. కాని యిందు ద్వితీయాంతములుగా నుండుట విశేషము. ఇందు జంగమ మల్లికార్జుననకును శివునకును అభేదము చెప్పఁబడుట గమనింపఁదగినది.

క. భవ మరణాంభః పూరిత
భవ సాగర తరణ సేతు పద్ధతిఁ, జేతో
భవ నిశిత కుసుమ బాణో
ద్భవ రాగ విముక్తుఁ, గమలభవ కులతిలకున్. 131

అర్థము ; భవ .... పద్ధతిన్ భవ = పుట్టుక, మరణ = చావుఅనెడి, అంభస్ (ః) = నీటిచేత, పూరిత = నిండిన, భవ = సంసారమనెడి, సాగర = సముద్రముయొక్క, తరణ = దాఁటుటకు, సేతు = వంతెనయొక్క, పద్ధతిన్ = మార్గము అయినవాఁడును, చేతస్ (ః) + భవ - నిశిత - కుసుమ - బాణ+ఉద్భవ-రాగ-విముక్తున్ - మనసిజునియొక్క (మన్మథునియొక్క), వాఁడియైన, పుష్పబాణములవలనఁబుట్టుకగల, అనురాగమునుండి విడుపుగలవాఁడును, కమల-భవ - కుల తిలకున్ = తమ్మిచూలి (బ్రహ్మ) యొక్క వంశమునందు - బ్రాహ్మణ వంశమునందు శ్రేష్ఠుఁడును, అగు, జంగమ మల్లికార్జునుని పొగడఁదగున్.

తాత్పర్యము ; జననమరణములనెడు నీటితో నిండిన సంసారసముద్రమును దాఁట సేతుమార్గమైనవాఁడును, మన్మథుని వాడియైన పుష్పబాణములనుండి పుట్టిన అనురాగమునుండి విముక్తిఁబొందినవాఁడును, బ్రహ్మవంశ - బ్రాహ్మణవంశ శ్రేష్ఠుఁడును అగు జంగమ మల్లికార్జునుని, (పొగడఁదగును.)

చ. గత మద మత్సరేంద్రియవికార మమత్వ సమస్త సంగతా
గత వసులోభ మోహ భయ కల్మష దుర్వ్యస నాసదీషణా
త్రితయ మనోజ మార్గణుఁ, బ్రదీపితు, నిర్మలినాంతరంగు, నా
నత మునినాథ మస్తు, సుజనస్తుతు, జంగమ మల్లికార్జునున్. 132

అర్థము : గత .... మార్గణున్; గత = పోయిన, మద = గర్వము, మత్సర = అసూయ, ఇంద్రియ - వికార = ఇంద్రియ వికారము, మమత్వ = అహంకారము, సమస్త - సంగత + ఆగత=ఎల్ల సంగతములు, ఆగతములు (తెచ్చి పెట్టుకొన్నవి, వచ్చినవి). వసు-లోభ = ధనాశ, మోహ = మోహము, భయ = వెఱపు, కల్మష = పాపము, దుర్వ్యసన = చెడ్డఅలవాట్లు, అసత్ + ఈషణా - త్రితయ = చెడ్డవియైన ధనేషణ. దారేషణ, పుత్త్రేషణ అను మూఁడును, మనోజ -

మార్గణున్ = మన్మథబాణములు గలవాఁడును, ప్రదీపితున్ ప్రకాశించువాఁడును-నిర్మలిన + అంతరంగున్ = స్వచ్ఛమైన మనస్సు గలవాఁడును, ఆనత - ముని, నాథ-మస్తున్= వంపఁబడిన, మునిశ్రేష్ఠులయొక్క శిరస్సులు గలవాఁడును, సుజన - స్తుతున్=మంచివారిచేఁ బొగడఁబడువాఁడును, అగు, జంగమ మల్లికార్జునున్=జంగమ మల్లికార్జునుని, (పొగడఁదగున్,)

తాత్పర్యము : మదము, మాత్సర్యము, ఇంద్రియవికారము, మమత్వము ఎల్ల సంగతాపదోషములు, ధనాశ, మోహము, భయము. కల్మషము, దుర్వ్యసనములు, చెడ్డవియగు ధనేషణ, దారేషణ పుత్రేషణ అను మూఁడును, మన్మథబాణములు నశించిన వాఁడును, ప్రకాశించువాఁడును, స్వచ్ఛమనస్కుఁడును, శిరసువంచిన మునిశ్రేష్ఠులచే నమస్కరింపఁబడువాఁడును, సజ్జనులచే స్తుతింపఁబడువాఁడును అగు జంగమ మల్లికార్జునుని. (పొగడఁదగును)

క. అక్షయ నిఖిల కళాగమ
దక్షు, మహోదారు, ధీరుఁ, దత్త్వజ్ఞు, లలా
టాక్ష జనితోగ్ర శిఖి ముఖ
భక్షిత పంచేషుదేహుఁ, బరమోత్సాహున్. 133

అర్థము : అక్షయ....దారున్; అక్షయ=నాశనములేని, నిఖిల = సమస్తమైన, కళా=కళలయందును, ఆగమ=శాస్త్రములందును, దక్షున్ = సమర్థుఁడును మహత్ (మహో)+ఉదారున్=మిక్కిలి గొప్పవాఁడును, ధీరున్=ధైర్యవంతుఁడును, తత్త్వజ్ఞున్=తత్త్వము తెలిసినవాఁడును, లలాట....దేహున్: లలాట+అక్ష= నొసటి కంటినుండి, జనిత=పుట్టిన, ఉగ్ర = తీక్ష్ణమైన, శిఖి = అగ్నియొక్క, ముఖ = కొనచేత, భక్షిత = భక్షింపఁబడిన, పంచ + ఇషు = అయిదుబాణములు గలవాని-మన్మథునియొక్క, దేహున్ = శరీరముగలవాఁడును, పరమ + ఉత్సాహున్ = గొప్ప పూనిక గలవాఁడును, అగు, జంగమ మల్లికార్జునుని, (పొగడఁదగున్).

తాత్పర్యము : నాశనములేని యెల్ల కళలయందును, శాస్త్రములందును సామర్థ్యముగలవాఁడును మహోదారుఁడును, ధీరుఁడును, తత్త్వజ్ఞుఁడును, నొసటి

కంటి మంట కొనచే మన్మథుని శరీరమును భక్షించినవాఁడును, పరమోత్సాహుఁడును అగు జంగమ మల్లికార్జునుని, పొగడఁదగున్,

మాలిని. విగత సకల రాగద్వేషు, నిర్ముక్త దోషున్,
త్రిగుణ పథ చరత్వాతీతుఁ, బ్రజ్ఞా సమేతున్,
సగుణు, నచలు, మోక్షాసక్తు, సంసారముక్తున్,
బొగడఁదగుఁ దురాషాడ్భోగి, నిర్వాణ యోగిన్. 134

అర్థము : విగత - సకల-రాగ - ద్వేషున్ = పోయినయెల్ల రాగద్వేషములు గలవాఁడును, నిర్ముక్త-దోషున్=విడువఁబడిన పాపములు గలవాఁడును, త్రిగుణ - పథ-చరత్వ + అతీతున్ = సత్త్వరజస్తమోగుణముల మార్గమున నడచుటచే, నతిక్రమించినవాఁడును, ప్రజ్ఞా-సమేతున్=బుద్ధితోఁ గూడుకొన్నవాఁడును, సగుణున్= శబ్దాదిగుణములు గలవాఁడును, అచలున్ = నిశ్చలుఁడును, మోక్ష + ఆసక్తున్ = మోక్షమునందుఁ గోరికగలవాఁడును, సంసార-ముక్తున్ = సంసారమునుండి విడువఁబడినవాఁడును, తురాషాహ్ (ట్)+భోగిన్=ఇంద్రుని భోగములవంటి భోగములు గలవాఁడును, నిర్వాణ - యోగిన్ = మోక్షసన్న్యాసి యైనవాఁడును, అగు, జంగమ మల్లికార్జునుని, పొగడన్ + తగున్ = పొగడఁదగును,

తాత్పర్యము : ఎల్ల రాగద్వేషములు నశించినవాఁడును, దోషరహితుఁడును, త్రిగుణరహిత మార్గమున నడచుటచే నతీతుఁడైనవాఁడును, ప్రజ్ఞానముతోఁ గూడినవాఁడును, సగుణుఁడును, స్థిరమైనవాఁడును, మోక్షమునందుఁ గోరిక గలవాఁడును, సంసారమునుండి విడువఁబడినవాఁడును, ఇంద్రభోగములు గలవాఁడును, మోక్షసన్న్యాసియును అగు జంగమ మల్లికార్జునుని ప్రస్తుతింపఁదగును,

విశేషములు : ద్వేషు - దోషు, (అ) తీతు - (స) మేతు, (అ) సక్తు, ముక్తు, భోగి - యోగి- అంత్యానుప్రాసము. తురాషాహ్ - 'సంక్రన్దనో దుశ్చ్యవనస్తురాషా ణ్మేఘవాహనః' 'తురం శత్రువేగం సహత ఇతి తురాషాట్' శత్రువేగమును సహించువాఁడు, ఇంద్రుఁడు. అమరము,

తురాషాహ్ + భోగి-హకారమునకు ఝల్లు (అనునాసికాంతస్థ వర్ణములు తప్ప మిగిలిన హల్లులు) పరమగునపుడును, పదాంతమందును, ఢకారాదేశమగును,

తురాషాఢ్ + భోగి. ఝల్లులకు మృదుహల్లులు (హళ్ళులు) కాని, అచ్చులుకాని పరములగునపుడు ఆ హల్లుల వర్గమునకుఁ జెందిన తృతీయవర్ణ మాదేశమగును. తురాషాడ్భోగి.

మాలినీ వృత్తమున నాలుగుపాదములందును, ప్రతిపాదమునను న, న, మ, య, య అనుగణము లుండును, 1-9 అక్షరములకు యతిమైత్రి, ప్రాసనియమము గలదు.

# గద్యము

ఇది శ్రీమజ్జంగమ మల్లికార్జునదేవ దివ్యశ్రీపాదపంకజ భ్రమరాయమాణ కవిరాజ శిఖామణి నన్నెచోడ ప్రణీతంబైన కుమారసంభవం బను కథయందుఁ బ్రథమాశ్వాసము.

అర్థము : ఇది, శ్రీమత్ + జంగమ మల్లికార్జున దేవ = శ్రీమంతుఁడైన జంగమ మల్లికార్జునదేవునియొక్క, దివ్య = దివ్యములైన, శ్రీపాద-పంకజ = శోభాకరములైన పాదములనెడి పద్మములకు, భ్రమరాయమాణ = తుమ్మెదగా నగుచున్న, 'కవిరాజశిఖామణి' అను బిరుదుగల, నన్నెచోడ - ప్రణీతంబు = నన్నెచోడునిచే రచింపఁబడినది, ఐన, కుమారసంభవంబు, అను, కథ + అందున్, ప్రథమ + ఆశ్వాసము = మొదటి యాశ్వాసము.

తాత్పర్యము :ఇది శ్రీ జంగమ మల్లికార్జున దేవుని దివ్యములైన శ్రీపాదములనెడి పద్మములకుఁ దుమ్మెదగా నగుచున్న 'కవిరాజశిఖామణి' యను బిరుదు గల నన్నెచోడుఁ డనువానిచే రచింపఁబడిన కుమారసంభవ మనెడి కథయందు మొదటి యాశ్వాసము.

విశేషములు : శ్రీపాద పంకజ భ్రమరాయమాణనన్నెచోడ - రూపకము. శ్రీమత్ + జంగమ - ఝల్లునకు హళ్ళు పరమగుచుండఁగాఁ దృతీయవర్ణాదేశము. శ్రీమద్ + జంగమ - తవర్గాక్షరములకు చవర్గాక్షరములు పరమైనచో చవర్గవర్ణము లాదేశమగును.

# కుమార సంభవము

## ద్వితీయాశ్వాసము

క. శ్రీకంఠమూర్తిఁ బుణ్య
శ్లోకు, మహాభాగు, నిఖిల లోకారాధ్యున్,
నాకేశభోగి, సత్య గు
ణాకరు, నచలాత్ము, మల్లికార్జునదేవున్. 1

అర్థము: శ్రీకంఠ-మూర్తిన్ = శివ స్వరూపుఁడును, పుణ్య-శ్లోకున్ = పవిత్రమైన యశస్సుగలవాఁడును, మహాభాగున్ = మహానుభావుఁడును, నిఖిల - లోక + ఆరాధ్యున్ = ఎల్లలోకములచేతఁ బూజింపఁదగినవాఁడును, నాక + ఈశ - భోగిన్ = స్వర్గప్రభువగు నింద్రుని భోగములు గలవాఁడును, సత్య-గుణ + ఆకరున్ = సత్యమనెడి గుణమునకు స్థానమైనవాఁడును, అచల + ఆత్మన్ = స్థిరమైన మనస్సు గలవాఁడును, అగు, మల్లికార్జున దేవున్ = జంగమ మల్లికార్జున స్వామిని.

తాత్పర్యము; శివస్వరూపుఁడును, పవిత్రయశస్కుఁడును, మహానుభావుఁడును, సకలలోక పూజితుఁడును, ఇంద్రభోగియును, సత్యమనెడి గుణమునకు స్థానమైనవాఁడును, స్థిరమైన మనస్సు గలవాఁడును అగు మల్లికార్జునదేవుని.

విశేషములు: ఆశ్వాసాదిపద్యములు కృతిభర్తృ సంబోధనాంతములుగా నుండుట యాచారము, కాని యిందు ద్వితీయాంతములుగా నుండుట విశేషము.

మ. అతి నీలాభ్రవిలంబియై[1] పొలుచు నీహారాద్రియుంబోలె స
త్సుతు సామోద్భవవక్త్రి నెత్తికొని సంతోషంబుతోఁ జూచుచున్
సతి నవ్వించుచు నవ్వుచున్న పరమున్ సర్వేశు దక్షప్రజా
పతి కాంచెన్ సితహాస[2] భా విచలిత బ్రహ్మాండభాండోదరున్. 2

1. వ్రా. ప్ర. సీతాద్రి. 2. వ్రా. ప్ర. హసిత ప్రభా.

అ ర్థ ము ; అతి-నీల + అభ్ర-విలంబి + ఐ = మిక్కిలి నల్లనైన మేఘము యొక్క వ్రేలాడుట గలదియై. పోలుచు = ఒప్పునట్టి, నీహార + అద్రియున్ + పోలెన్ = మంచుఁగొండవలె, సత్ + సుతున్ = మంచి కొడుకు, అగు. సామ + ఉద్భవ-వక్త్రున్ = ఏనుఁగుముఖమువంటి ముఖముగలవానిని-గజాననుని, ఎత్తికొని, సంతోషంబుతోన్, చూచుచున్, సతిన్ = సతీదేవిని, నవ్వించుచున్, నవ్వుచున్ + ఉన్న, పరమున్ = గొప్పవానిని, సర్వ + ఈశున్ = సర్వేశ్వరుని-శివుని, సిత-హాస-భా-విచలిత-బ్రహ్మాండ-భాండ + ఉదరున్ = తెల్లని, నవ్వుయొక్క, కాంతిచేత, మిక్కిలి చలించిన, భాండముల వంటి బ్రహ్మాండములు కుక్షిలోఁగలవానిని, దక్ష-ప్రజాపతి, కాంచెన్,

తా త్ప ర్య ము : మిక్కిలి నల్లని మేఘము వ్రేలాడుచున్న మంచుఁగొండ వలెఁ గొప్పదైన గజానను నెత్తికొని సంతోషముతోఁజూచుచు, సతీదేవిని నవ్వించుచుఁ దాను నవ్వుచున్నగొప్పవానిని, సర్వేశ్వరుని, తెల్లని నవ్వుకాంతిచేత మిక్కిలి చలించిన బ్రహ్మాండభాండములు కడుపులోఁగలవానిని దక్షప్రజాపతి చూచెను.

వి శే ష ము లు : గజానను నెత్తికొన్న శివుఁడు నల్లనిమేఘము వ్రేలాడు మంచుఁగొండవలె నున్నాఁడు. మేఘము నలుపు, గజాననుఁడు నలుపు, మంచుఁగొండ తెలుపు. శివుఁడు తెలుపు. కుక్షిస్థములైన బ్రహ్మాండభాండములు కదలుచున్న వనఁగా నది అట్టహాసమన్నమాట. అలంకార ముపమ.

వ. కని సర్వాంగాలింగితమహీతల పునఃపునః ప్రణామ సంస్తోత్రాది సత్కారంబులు చేయక దురభిమానంబున నహంకరించియున్న దక్షునింగని విరూపాక్షుం డాక్షేపించి విముఖుండైనం గని దక్షుండు తన యల్లురందఱు చేసిన సత్కారంబులను మొదలియల్లుండైన పరమేశ్వరుండు సేయమికి మనఃక్షుభితుండై క్రమ్మఱ నిజనివాసంబున కరిగి తద్వృత్తాంతం బాత్మేశ్వరి కెఱింగించి మనఃఖేదంబున నున్న దక్షప్రజాపతికిఁ దద్ధర్మపత్ని యిట్లనియె, 3

అర్థము : కని = చూచి, సర్వాం........ ....సత్కారంబులు: సర్వ =ఎల్ల, అంగ = అవయవములచే, ఆలింగిత = కౌఁగిలింపఁబడిన, మహీ-తల = భూతలము గల, పునః-పునః = మరల మరల, ప్రణామ = నమస్కారములు, సంస్తోత్ర = సంస్తుతులు. ఆది = మున్నగు, సత్కారంబులు = మన్ననలు, చేయక, దురభిమానంబునన్ = దుర్గర్వముతో, అహంకరించి=గర్వించి, ఉన్న = ఉన్నట్టి, దక్షునిన్, కని, విరూపాక్షుండు = వికారముగల కన్నులు గలవాఁడు-శివుఁడు, ఆక్షేపించి = తిరస్కరించి, విముఖుండు + ఐనన్ = పెడమొగము గలవాఁడుకాఁగా, దక్షుండు, కని = చూచి, తన, అల్లురు, అందఱు-చేసిన = అందఱునుజేసిన, సత్కారంబులను, మొదలి + అల్లుండు + ఐన, పరమేశ్వరుండు, చేయమికిన్ = చేయకుండుటకు, మనస్ (ః) + క్షుభితుండు + ఐ = మనసు కలఁగినవాఁడయి, క్రమ్మఱన్ = మరల, నిజ-నివాసంబునకున్ =తనదైనగృహమునకు, అరిగి, తద్ + వృత్తాంతంబు, ఆత్మ + ఈశ్వరికిన్ = ప్రాణేశ్వరికి-భార్యకు, ఎఱింగించి, మనస్ (ః) + ఖేదంబునన్ = మనోవిచారముతో, ఉన్న, దక్ష-ప్రజాపతికిన్, తద్ + ధర్మపత్ని = ఆతని భార్య, ఇట్లు + అనియెన్.

తాత్పర్యము : చూచీ సాష్టాంగ నమస్కారములు, స్తోత్రములు చేయక దుర్గర్వమున గర్వించియున్న దక్షునిఁజూచి యీశ్వరుఁడు తిరస్కరించి పెడమొగము గలవాఁడయ్యెను. దక్షుఁడు అది చూచి తన యల్లురందఱును జేసిన మర్యాదలు తన మొదలియల్లుఁడగు పరమేశ్వరుఁడు చేయకుండుటకు మనసు కలఁగ మరలఁ దన గృహమునకేఁగి జరిగిన వృత్తాంతమును భార్యకుఁజెప్పి మనోవిచారముతోనున్న దక్షప్రజాపతితో ఆతని భార్య యిట్లు పలికెను.

గీ. 'తల్లిదండ్రులఁ బూజించి తగ వెఱింగి
మన్న పాదవైననే యుత్తమామ లనియుఁ
[1]బ్రియ మెఱుంగు; నం దిచ్చిన బిడ్డ మనకుఁ
బాసె నని యుండుఁడింక నా పలుకులేల ?' 4

[1] ము.ప్ర. నాఁడిచ్చిన.

అర్థము : తల్లిదండ్రులన్, పూజించి, తగవు = ధర్మము, ఎఱింగి, మన్న = మనినట్టి-జీవించినట్టి, పొడవు = ఉన్నతుఁడు, ఐననే = అయిననే. అత్తమామలు + అనియున్, ప్రియము = మరియాద, ఎఱుంగున్ = తెలియును, అందున్ = అక్కడ, ఇచ్చిన, బిడ్డ, మనకున్-పాసెన్ = మనలను వీడెను-మనది కాదు, అని, ఉండుఁడు + ఇంకన్, ఆ-పలుకులు + ఏల?

తాత్పర్యము ; 'తల్లిదండ్రులను బూజింపవలయునను ధర్మము నెఱిఁగిన యున్నతుఁడయిననే యత్తమామలను గౌరవింపవలయునని యెఱుఁగఁగలఁడు. శివునకుఁ దల్లిదండ్రులు లేరుగావున నతనికిఁ దల్లిదండ్రులను బూజించుటయే తెలియదు. ఇఁక నత్తమామలను బూజింపవలయునను ధర్మ మతనికెట్లు తెలియును? అచ్చోట నిచ్చిన బిడ్డ మనది కాదని యూరకుండవలయును. అల్లుఁడు గౌరవింపలేదను పలుకు లెందులకు?'

## దక్షయజ్ఞము

వ. అనిన వెండియు నవమానానలోద్దీపిత మనస్తాపంబు సహింపనోపక తదపకారంబునకుం బ్రత్యపకారంబు సేయ నుద్యుక్తుండై యిట్లనియె. ౫

అర్థము : అనినన్ = అని భార్య పలుకఁగా, వెండియున్ = మరల, అవమాన + అనల + ఉద్దీపిత - మనస్ + తాపంబు = పరాభవమనెడి అగ్నిచేత ఎక్కువచేయఁబడిన, మనస్ + తాపంబు = మనస్సునందలి సంతాపము, సహింపన్ = ఓర్చుటకు, ఓపక = సమర్థుఁడు గాక, తద్ + అపకారంబునకున్ = అతఁడు చేసిన యపకారమునకు, ప్రతి + అపకారంబు = మా అపకారము, చేయన్ = చేయుటకు, ఉద్యుక్తుండు = పూనినవాఁడు, ఐ, ఇట్లు + అనియెన్.

తాత్పర్యము : అని భార్య యనఁగనే యింకను బరాభవమనెడి అగ్నిచేత నెక్కువచేయఁబడిన మనస్తాపమును సహింపఁజాలక యా యపకారమునకుఁ బ్రత్యపకారముఁ జేయఁబూనినవాఁడయి యిట్లు పలికెను.

విశేషములు : అవమానానల - అవమానమనెడి అనలము - రూపకాలంకారము. ప్రతి + అపకారము - ప్రత్యపకారము - యణాదేశసంధి.

తరువోజ

భువనంబు లన్నియుఁ బుట్టించు కశ్యపుఁడు, వానిఁ గై కొని ప్రోచు చంద్రుండు.
నవయవంబుల వాని నడఁచు ధర్ముంతు నతిభక్తి నా కిచ్చి రర్చన లర్థి
నివి; వారిలోనఁ దా నే పెద్ద[1] పొంది యీశానుఁ డేఁ దనయింటికిఁ జన్న
నవమాన్యుఁ జేసె ? నా యల్లురు నేనునై తన్నుఁ జేయుదు నాగమబాహ్యు, 6

అ ర్థ ము : భువనంబులు = లోకములు, అన్నియున్. పుట్టించు = పుట్టించునట్టి, కశ్యపుఁడున్, వానిన్ = ఆ భువనములను, కైకొని = స్వీకరించి, ప్రోచు = రక్షించునట్టి, చంద్రుండున్ = చంద్రుఁడును, అవయవంబులన్ = అవయవములతో, అంతర్భాగములతోఁగూడ - సంపూర్ణముగా ననుట, వానిన్ = ఆ భువనములను. అడఁచు = నశింపఁజేయునట్టి, ధర్ముండున్ = యముఁడును. అతి-భక్తిన్=మిక్కిలి భక్తితో, అర్థిన్ = కోరికతో, నాకున్, అర్చనలు - ఇవి = ఈ పూజలు, ఇచ్చిరి, వారిలోనన్ = ఆ కశ్యపచంద్రధర్ములలో, ఈశానుఁడు = ఈశ్వరుఁడు, తాను, ఏ-పెద్ద - పొంది = ఏమిగొప్పతనమును బొంది, ఏన్ = నేను, తన + ఇంటికిన్, చన్నన్ = వెడలఁగా, అవమాన్యున్ = అవమానింపఁదగినవానినిగా, చేసెన్, నా+ అల్లురున్ + ఏనున్ + ఐ=నా తక్కిన అల్లురును, నేనును, ఒక్కటయి,తన్నున్= ఈశ్వరుని, ఆగమ - బాహ్యున్ = వేదములకు వెలియైనవానినిగా, చేయుదున్.

తా త్ప ర్య ము : భువనముల నన్నిటిని బుట్టించు కశ్యపప్రజాపతియును, ఆ భువనములను అంగీకరించి రక్షించు చంద్రుఁడును, వాని నంతర్భాగములతో నడఁచు ధర్ముఁడును. అతిభక్తితోఁ గోరి నా కీ యర్చన లిచ్చిరి. వారిలోఁ దా నే ఘనత పొందీ యీశ్వరుఁడు, నేను దనయింటికి వెడలఁగా న న్నవమానించెను ? నేను దక్కిన యల్లురను గూడి యతని నాగమబాహ్యునిగాఁ జేయుదును.

వి శే ష ము లు : ఏ పెద్ద పొంది = ఏ గొప్పతనము-ఘనత పొంది-సూ. వి.

1. వాఁడె

చన్నన్ = చనినన్ - 'పద్యాదుల నవర్ణకంబున కత్వంబును గడహల్లునకు ద్విత్వంబును విభాష నగు.' బాల. క్రియ. 51. అల్లురు - 'పగతాదుల బహువచన లకారంబునకు రేఫం బగు.' బాల. ఆచ్ఛిక. 5. నా యల్లురు నేను నై తన్నుఁ జేయుమను అని కాక చేయుడుము అనుట సరియైనఁదగునేమో !

తరువోజ-నాలుగుపాదము లుండును. ప్రతిపాదమునను మూఁ డింద్రగణములు, నొక సూర్యగణము, పరల మూఁ డింద్రగణములు నొక సూర్యగణము నుండ వలయును. మొదటి యక్షరమునకును, మూఁడవగణము మొదటి యక్షరమునకును, అయిదవగణము మొదటి యక్షరమునకును, ఏడవగణము మొదటి యక్షరమునకును యతిమైత్రి. ప్రాసనియమము గలదు.

వ. అని విచారించి కృతనిశ్చయుండై మహాధ్వరప్రారంభాభిముఖుండై
చతుర్దశభువనాంతరానేకజనంబుల రావించినం దదీయాజ్ఞా ప్రేరితులై. 7

అర్థము : అని, విచారించి = ఆలోచించి, కృత - నిశ్చయుండు + ఐ = చేయఁబడిన నిశ్చయముగలవాఁడై - నిశ్చయించుకొన్నవాఁడై, మహత్ (మహా) + అధ్వర - ప్రారంభ + అభిముఖుండు + ఐ = గొప్పయజ్ఞముయొక్క పూనికకు సిద్ధపడినవాఁడయి, చతుర్ + దశ - భువన + అంతర + అనేక - జనంబులన్ = పదునాలుగులోకములందలి పెక్కండ్రు జనులను, రావించినన్ = రప్పింపఁగా తదీయ + ఆజ్ఞా-ప్రేరితులు + ఐ = ఆతనిదైన ఆనచేఁ బ్రేరేపింపఁబడినవారయి.

తాత్పర్యము : అని యాలోచించి నిశ్చయించుకొన్నవాఁడయి గొప్ప యజ్ఞమును బ్రారంభించుటకు సిద్ధపడి పదునాలుగు భువనములందలి పెక్కండ్రు జనులను రప్పింపఁగా వారు అతని యాజ్ఞచేఁ బ్రేరేపింపఁబడినవారయి. తరువాతి పద్యముతో నన్వయము,

సీ. హరి పితామహ పురందర లోకపా లార్క
వసు రుద్ర సురవైద్య వరమునీంద్ర
చారణ గరుడ ప్రజాపతి కిన్నర
గంధర్వ రాక్షస ఖచర సిద్ధ
సాధ్య సు రాహి పిశాచ మరు ద్గ్రహ
విద్యాధరో ప్సరో విప్ర మనుజ
ది క్కుల శైల నదీ సాగ రాగమ
ధర్మ వేద పురాణ తర్క శాస్త్ర

తే. నిచయ మాది గాఁగ సచరాచరాత్మకం
బగు పదార్థ మెల్ల నా క్షణంబ
తగు విభూతి మెఱసి దక్షప్రజాపతి
యజ్ఞమునకు వచ్చె నతి ముదమున. 8

అర్థము : హరి = విష్ణువు, పితామహ = బ్రహ్మ, పురందర = ఇంద్రుఁడు, లోక - పాల = లోకపాలకులు, అర్క = సూర్యుఁడు, వసు = ఎనమండ్రు వసువులు, రుద్ర = ఏకాదశ రుద్రులు, సుర - వైద్య = దేవతలవైద్యులైన అశ్వినీదేవతలు, వర = శ్రేష్ఠులైన, ముని + ఇంద్ర = మునిశ్రేష్ఠులును,

చారణ = చారణులు, గరుడ = గరుడులు, ప్రజాపతి = ప్రజాపతులు, కిన్నర = కిన్నరులు, గంధర్వ = గంధర్వులు, రాక్షస = రాక్షసులు, ఖచర = ఖేచరులు, సిద్ధ = సిద్ధులు.

సాధ్య = సాధ్యులు, సుర = దేవతలు, అహి = నాగులు, పిశాచ = పిశాచులు, మరుత్ = మరుత్తులు, గ్రహ = గ్రహములు, విద్యాధర = విద్యాధరులు, అప్సరస్ = అచ్చరలు, విప్ర = బ్రాహ్మణులు, మనుజ = మనుష్యులు,

దిశ్ (క్) = దిక్కులు, కుల-శైల = కులపర్వతములు, నదీ = నదులు, సాగర = సముద్రములు, ఆగమ = శాస్త్రములు, ధర్మ = ధర్మములు, వేద = దములు

పురాణ = పురాణములు, తర్క = తర్కశాస్త్రము, శాస్త్ర-నిచయము=శాస్త్రముల సమూహము, ఆది - కాఁగన్ = మొదలుగాఁగల, స-చర + అచర + ఆత్మకంబు = చరములు, అచరములు అనువానితోఁ గూడినది, అగు, పదార్థము + ఎల్లన్ = వస్తుసమూహమంతయు, ఆ - క్షణంబు + ఆ = ఆ క్షణమే, తగు = తగునట్టి, పేర్మి = ఐశ్వర్యము, మెఱసి = ప్రకటించి, అతి - ముదమునన్ = మిక్కిలి సంతోషముతో, దక్ష - ప్రజాపతి = దక్షప్రజాపతియొక్క, యజ్ఞమునకున్, వచ్చెన్.

తాత్పర్యము : విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుఁడు, లోకపాలురు, సూర్యుఁడు, వసువులు, రుద్రులు, అశ్వినీదేవతలు, శ్రేష్ఠులైనమునీంద్రులు, చారణులు, గరుడులు, ప్రజాపతులు, కిన్నరులు, గంధర్వులు, రాక్షసులు, ఖచరులు, సిద్ధులు, సాధ్యులు, దేవతలు, నాగులు, పిశాచులు, మరుత్తులు, గ్రహములు, విద్యాధరులు, అప్సరసలు, విప్రులు, మనుష్యులు, దిక్కులు, కులపర్వతములు, నదులు, సముద్రములు, ఆగమములు, ధర్మములు, వేదములు, పురాణములు, తర్కశాస్త్రము, శాస్త్రముల సమూహము మున్నుగాఁగల చరములు, అచరములు అనువానితోఁగూడిన సర్వపదార్థమును ఆ క్షణమే ఉచితమైన ఐశ్వర్యమును బ్రకటించుచు మిక్కిలి సంతోషముతో దక్షప్రజాపతి యజ్ఞమునకు విచ్చేసెను.

విశేషములు:పితామహ - 'బ్రహ్మాత్మభూః సురజ్యేష్ఠః పరమేష్ఠీ పితామహః'- పితౄణాం పితా - తండ్రులకుఁ దండ్రి-బ్రహ్మ- అమరము. పురందర - 'వృద్ధశ్రవాః సునాసీరః పురుహూతః పురందరః' - 'పురు భూయిష్ఠం హూయతే యజ్ఞేషు' యజ్ఞము లందు మిక్కిలి పిలువఁబడువాఁడు - లేదా 'పురు నామానం అసురం హతవా నితి వా' - పురువనెడి రాక్షసునిఁ జంపినవాఁడు లేదా పురాణి అరీణాం దారయతీతి పురందరః-శత్రుపురములను నశింపఁజేయువాఁడు - ఇంద్రుఁడు. అర్కులు=పండ్రెండుగురు, వసువులు = ఎనమండ్రు, రుద్రులు = పదునొకండుగురు, సురవైద్యులు = ఇద్దఱు, గ్రహములు = తొమ్మిది, దిక్కులు = ఎనిమిది, కులశైలములు = ఏడు, మహేంద్రము, మలయము, సహ్యము, శుక్తిమంతము, గంధమాదనము, వింధ్యము, పారియాత్రము, సాగరములు = ఏడు, లవణ, ఇక్షు, సురా, సర్పిస్ (నేయి), దధి, క్షీర, జల సముద్రములు. వేదములు = నాలుగు - ఋక్కు, యజుస్సు, సామము, అథర్వము, పురాణములు=పదునెనిమిది- బ్రాహ్మము, పాద్మము, వైష్ణవము, శైవము

భాగవతము, నారదీయము, మార్కండేయము, ఆగ్నేయము, భవిష్యత్తు, బ్రహ్మకైవర్తము, లైంగము, వారాహము, స్కాందము, వామనము, కౌర్మము, మాత్స్యము, గారుడము, బ్రహ్మాండము, శాస్త్రములు = ఆఱు. తర్క, వ్యాకరణ, ధర్మ, మీమాంసా, వైద్య, జ్యోతిషములు.

వ. తదనంతరంబ నిజ కులపాలికా సమన్వితులై కశ్యప యమ చంద్రులు తమ తమ విభవంబులు మెఱసి మహోత్సాహంబునం జనుదెంచి; రంత నఖిల భువనాధీశ్వ రాకీర్ణంబై, కనక రౌప్యాది సమస్త వస్తు సంపూర్ణంబై, యతి రమణీయంబగు నిజ పురోత్సవంబు గని పరమానందహృదయుండై దక్షప్రజాపతి బృహస్పతి దత్త ముహూర్తంబునం గ్రతుదీక్షితుండై పటు పటహ పణవ భంభ తుత్తుంభ మృదంగ శంఖ కాహళ కాంస్య వేణు వీణా తత వివంచికా ఘన సుషిరా ద్యాతోద్య ధ్వానంబుల నధఃకరించి మంగళ పాఠక పఠనానూన గాన వేదాశీర్వాదాది నాదంబులు నిర్మథ్యమాన సముద్రఘోషంబు నధఃకరించి మ్రోయు ఘనగర్జన రవంబులుం బోలె రోదసీ వివరాపూరితంబులై మహాధ్వని చెలంగుచుండ. 9

అర్థము ; తద్ + అనంతరంబు + అ = ఆ పిమ్మటనే, నిజ - కుల పాలికా - సమన్వితులు + ఐ = తమ కులస్త్రీలతోఁ గూడినవారయి, కశ్యప యమ చంద్రులు = కశ్యపుఁడును, యముఁడును, చంద్రుఁడును, తమ - తమ - విభవంబులు = తమ తమ యైశ్వర్యములు, మెఱసి = ప్రకటించి, మహత్ (మహా) + ఉత్సాహంబునన్ = గొప్ప పూనికతో, చనుదెంచిరి = వచ్చిరి.

అంతన్, అఖిల - భువన + అధి + ఈశ్వర + ఆకీర్ణంబు + ఐ = ఎల్ల లోకముల ప్రభువులచే వ్యాప్తమయి, కనక-రౌప్య + ఆది - సమస్త - వస్తు - సంపూర్ణంబు + ఐ = బంగారము, వెండి మున్నగు నెల్ల వస్తువులతో, నిండినదయి, అతి - రమణీయంబు = మిక్కిలి మనోహరము, అగు, నిజ-పుర + ఉత్సవంబు = తన దైన నగరముయొక్క వేడుక, కని, పరమ + ఆనంద - హృదయుండు + ఐ = గొప్ప సంతోషముతోఁగూడిన హృదయము, గలవాఁడయి, దక్షప్రజాపతి, బృహస్పతి-

దత్త - ముహూర్తంబునన్ = బృహస్పతిచేతఁ పెట్టఁబడిన ముహూర్తమునందు, క్రతు - దీక్షితుండు + ఐ = యజ్ఞమునందు దీక్ష వహించినవాఁడయి,

పటు .... ధ్వానంబులన్ : పటు=పెద్దదియగు, పటహ=తప్పెట, పణవ = చర్మవాద్యవిశేషము, ఝంఝ = ఝంఝమను వాద్యవిశేషము, తుత్తుంభ = తుత్తుంభ మనుపేరుగల వాద్యము, మృదంగ = మద్దెల, శంఖ, కాహళ = బాకా, కాంస్య= కంచు వాద్యము, వేణు=పిల్లనగ్రోవి, వీణా, తత=వీణలోనగువాద్యవి. విపంచికా = వీణ, ఘన=కంచుతాళమువంటి వాద్యవి. సుషిర=బెజ్జములుగలవాద్యవిశేషము, ఆది= మున్నుగాఁగల, ఆతోద్య = వాద్యిత్రము - తతము, ఆనద్ధము, సుషిరము, ఘనము అను వాద్యచతుష్టయము, అనువానియొక్క. ధ్వానంబులన్=ధ్వనులను, అధఃకరించి= క్రిందుచేసి, మంగళ .... నాదంబులు : మంగళ = శుభకరములగు, పాఠక = చదువువారియొక్క, పఠన = చదువుటయందలి, అనూన = తక్కువకాని, గాన = గానముతోడి, వేద + ఆశీర్వాద = వేదాశీస్సులు, ఆది = మున్నగు, నాదంబులు= ధ్వనులు, నిర్మథ్యమాన = మథింపఁబడుచున్న, సముద్ర = సముద్రముయొక్క, ఘోషంబున్ = ధ్వనిని, అధఃకరించి = తిరస్కరించి, మ్రోయు = ధ్వనించు, ఘన-గర్జన-రవంబులున్ + పోలెన్ = మేఘముల ఉఱుముల ధ్వనులవలె, రోదసీ - వివర + ఆపూరితంబులు + ఐ = భూమ్యాకాశముల నడిమి ప్రదేశపు టవకాశము నందు అంతట నిండినవయి. మహత్ (మహా) + ధ్వని=పెద్ద ధ్వని. చెలంగుచున్+ ఉండన్ = మ్రోయుచుండఁగా.

తాత్పర్యము ; ఆ పిమ్మటనే తమభార్యలతోఁ గూడినవారయి కశ్యపుఁడు, యముఁడు, చంద్రుఁడు తమ తమ యైశ్వర్యములు ప్రకటించి గొప్ప పూనికతో వచ్చిరి. అంత నెల్ల లోకపాలకులతో వ్యాపించినదయి, బంగారు వెండి మున్నగు నెల్ల వస్తువు లతో నిండినదయి, మిక్కిలి మనోహరమగు తన నగరము వేడుకను·జూచి, మిక్కిలి సంతోషించినవాఁడయి దక్షుఁడు బృహస్పతి నిర్ణయించిన ముహూర్తమున యజ్ఞదీక్ష వహించి, పటహ, పణవ, ఝంఝ, తుత్తుంభ, మృదంగ, శంఖ, కాహళ, కాంస్య, వేణు, వీణా, తత, విపంచికా, ఘన, సుషిరములు మున్నగు నాతోద్యధ్వనులను గ్రిందుపఱిచి మంగళపాఠకులు పఠించు వేదాశీర్వాదములు. మథింపఁబడుచున్న సముద్రఘోషమును గ్రిందుచేసి మ్రోయు నుఱుముల చప్పుడులవలె భూమ్యాకాశముల

నడిమి ప్రదేశమున నిండినవై గొప్పధ్వని మ్రోయుచుండఁగా - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : పటహాది వాద్యధ్వనులను గ్రిందుచేయు మంగళపాఠకులు పఠించు వేదాశీర్వాదములు మథింపఁబడుచున్న సముద్రఘోషమును గ్రిందుపఱుచు నుఱుముల చప్పుడులవలె నున్న వనుట. అలంకార ముపమ.

క. బ్రహ్మరథ మెక్కి విష్ణు
బ్రహ్మామరపాది దేవ పరివృతుఁడై యా
బ్రహ్మఋషినుతుఁడు దక్ష
బ్రహ్మ లసద్యాగమంటపంబున కరిగెన్. 10

అర్థము : ఆ - బ్రహ్మ+ఋషి - నుతుఁడు = ప్రసిద్ధులైన, బ్రహ్మర్షులచేఁ బొగడఁబడువాఁడగు, దక్ష-బ్రహ్మ = దక్ష ప్రజాపతి, బ్రహ్మ-రథము=బ్రాహ్మణులు మోయురథము, ఎక్కి, విష్ణు - బ్రహ్మ + అమరప+ఆది - దేవ - పరివృతుఁడు+ ఐ= విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుఁడు మున్నగు దేవతలతోఁ గూడినవాఁడయి, లసత్ + యాగ - మంటపంబునకున్ = ప్రకాశించుచున్న యజ్ఞమంటపమునకు, అరిగెన్ = వెడలెను.

తాత్పర్యము : ప్రసిద్ధులైన బ్రహ్మర్షులచేఁ బొగడఁబడు దక్షప్రజాపతి బ్రాహ్మణులుమోయురథము నెక్కి విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుఁడు మొదలుగాఁగల దేవతలతోఁ గూడినవాఁడయి యజ్ఞమంటపమున కేతెంచెను.

విశేషములు : అమరప - అమరాన్ పాతీతి అమరపః - అమరులను బాలించువాఁడు - ఇంద్రుఁడు, బ్రహ్మ + ఋషి - అకారాద్యచ్చులకు 'ఋ' కారము పరమగునేని సంధి వికల్పము. బ్రహ్మఋషి - బ్రహ్మర్షి. లసత్ + యాగ = ఝల్లులకు హశ్శులు పరము లగునపుడు తృతీయవర్ణాదేశము. లసద్యాగ

వ. ఇట్లధికతర విభూతితో ధర్మపత్నీసమేతుఁడై యజ్ఞోపకరణద్రవ్యాద్యనేకద్రవ్య పరిపూర్ణంబై నానావిధాలంకృతంబై యతిరమణీయంబైన

యజ్ఞశాల ప్రవేశించి యజమానస్థానంబు నలంకరించుచుండెఁ; నంత విధి విహిత విధానంబుగ ఋత్విగ్గణంబులు త్రికుండంబుల జాతవేదాహ్వానంబు చేసి యథాక్రమంబున హోమంబు చేయందొడంగి రంత నక్కడ. 11

అర్థము : ఇట్లు, అధికతర - విభూతితోన్ = మిక్కిలిగొప్పదియగు. సంపదతో, ధర్మపత్నీ - సమేతుండు + ఐ = భార్యాసహితుఁడయి, యజ్ఞ + ఉపకరణ - ద్రవ్య + ఆది + అనేక - ద్రవ్య - పరిపూర్ణంబు + ఐ = యజ్ఞసాధనములైన వస్తువులు మున్నగు పెక్కు పదార్థములతో నిండినదయి, నానా- విధ + అలంకార + అలంకృతంబు + ఐ = పెక్కు రీతులైన అలంకారములచేత, అలంకరింపఁబడినదయి, అతి - రమణీయంబు = మిక్కిలి రమ్యము, ఐన, యజ్ఞశాల, ప్రవేశించి, యజమాన - స్థానంబున్ = యజ్ఞకర్తయొక్క స్థానమును, అలంకరించుచున్ + ఉండెన్. అంతన్, విధి - విహిత - విధానంబుగన్ = వేదోక్తపుగురీతిని, ఋత్విజ్ + గణంబులు = యాజకుల సమూహములు, త్రి - కుండంబులన్ = మూఁడు కుండములందు, జాతవేద + ఆహ్వానంబు చేసి = అగ్ని నాహ్వానించి, యథాక్రమంబునన్ = క్రమము నతిక్రమింపక, హోమంబు, చేయన్ + తొడంగిరి = చేయమొదలిడిరి. అంతన్, అక్కడ.

తాత్పర్యము : ఇట్లు మిక్కిలి అధికమైన సంపదతో భార్యాసహితుఁడై యజ్ఞసాధనములతో నిండినదయి, పెక్కురీతులైన అలంకారములచే నలంకరింపఁబడినదయి, మిక్కిలి మనోహరమైన యజ్ఞశాలను బ్రవేశించి దక్షుఁడు యజ్ఞకర్తృస్థానము నలంకరించుచుండెను. అంత వేదోక్తప్రకారమున యాజకసమూహములు మూఁడుకుండములందు అగ్ని నాహ్వానించి క్రమముఁ దప్పక హోమముచేయ నారంభించిరి. అంత నక్కడ- తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : ఆది + అనేక = ఆద్యనేక- యణాదేశసంధి, ఋత్విజ్ + గణ . చవర్గాక్షరములకు ఝల్ వర్ణములు (అనునాసికములు, అంతస్థములు తప్ప తక్కిన వర్ణములు) పరమగునపుడును. పదాంతమునందును కవర్గాక్షరములు ఆదేశము లగును, ఋత్విక్ + గణ - ఝల్లులకు హశ్శులు పరములగునపుడు తృతీయ వర్ణాదేశము- ఋత్విగ్గణ. జాతవేదస్ : 'కృపీటయోని ర్జ్వలనో జాతవేదా స్తనూనపాత్ - జాతః

వేదాః యస్మాత్ సః జాతవేదాః - ఇతనివలన వేదములు పుట్టినవి. - అగ్ని, అమరము. యథాక్రమము - క్రమ మనతిక్రమ్య - క్రమము నతిక్రమింపక - అవ్యయీభావ సమాసము. జాతవేదస్ + ఆహ్వానము = జాతవేద ఆహ్వానము కావలయునే కాని జాతవేదాహ్వానమగుట విచార్యము. హ్రస్వ - అకారము తరువాత వచ్చు విసర్గము, హ్రస్వ - అకారభిన్నమైన అచ్చుపరమగునపుడు లోపించును. విసర్గము లోపింపఁగా నన్నిహితమైన యచ్చులకు సంధి లేదు.

క. తన విభవము దక్షుఁడు త్రిణ
యను దేవికిఁ జూపి మెఱయ నని ముందఱ పం
చిన వనితలు కైలాసం
బునకు నరిగి కనిరి సకలభువనాధీశున్. 12

అ ర్థ ము : దక్షుఁడు. తన - విభవమున్ తనయైశ్వర్యమును, త్రిణయను - దేవికిన్ = ముక్కంటి (శివుని) భార్యకు - సతికి, చూపి, మెఱయన్ + అని = ప్రకాశించుటకని. ముందఱ = ముందుగా, పంచిన = పంపినట్టి, వనితలు = స్త్రీలు, కైలాసంబునకున్, అరిగి, సకల - భువన + అధి + ఈశున్ = ఎల్లలోకముల ప్రభువును - శివుని, కనిరి = చూచిరి.

తా త్ప ర్య ము : దక్షుఁడు తన యైశ్వర్యమును ముక్కంటిభార్యయైన సతీదేవికిఁ జూపి వారిని బరిహసించుటకై ముందుగాఁ బంపిన స్త్రీలు కైలాసమున కేఁగి యెల్ల లోకముల ప్రభువగు శివునిఁ జూచిరి.

వి శే ష ము లు : త్రిణయన, త్రినయన రూపములు రెండును గలవు. ముందఱ + పంచిన - గసడదవాదేశము. బాల. సంధి. 13. ముందఱ వంచిన.

వ. కని సర్వాంగీణ ప్రణామలై నిజాగమనప్రయోజనం బెఱింగించి
పరమేశ్వరానుజ్ఞాతలై సతీదేవిం దోడ్కొని దివ్యవిమానారూఢలై
మనోజవంబునం జనుదెంచి రంత. 13

అర్థము : కని = చూచి, సర్వాంగీణ - ప్రణామలు + ఐ = సాష్టాంగ నమస్కారము గలవారయి. నిజ + ఆగమన - ప్రయోజనంబు = తమదైన రాకకు ఫలము, ఎఱింగించి = తెలిపి, పరమేశ్వర + అనుజ్ఞాతలు + ఐ = పరమేశ్వరునిచే ననుమతింపఁబడినవారయి, సతీ - దేవిన్, తోడ్కొని = తీసికొని, దివ్య - విమాన + ఆరూఢలు + ఐ = దేవసంబంధమైన విమానము నెక్కినవారయి, మనస్ (ః) + జవంబునన్ = మనోవేగముతో, చనుదెంచిరి = వచ్చిరి, అంతన్.

తాత్పర్యము : చూచి సాష్టాంగదండప్రణామముచేసి తాము వచ్చిన పని తెలిపి పరమేశ్వరుని యనుమతిఁ బొంది సతీదేవిని దోడ్కొని దివ్యవిమానము నధిరోహించి మనోవేగముతో వచ్చిరి. అంత-తరువాతి పద్యముతో నన్వయము.

క. ఆతత మణి రుచి నభ ము
ద్ద్యోతింపఁగ, నతులగతి రయోద్గత రుచి ను
ర్వీతల మద్రువఁగ, నుల్కా
పాతం బను కడఁకఁ దత్సభాసదు లులుకన్. 14

అర్థము : ఆతత - మణి - రుచిన్ = అధికమైన, మణులకాంతిచేత, నభము = ఆకాశము, ఉద్ద్యోతింపఁగన్ = మిక్కిలి ప్రకాశింపఁగా, అతుల - గతి - రయ + ఉద్గత - రుచిన్ = సాటిలేని గమనముయొక్క వేగమువలన వెలువడిన కాంతిచేత, ఉర్వీతలము = భూతలము, అద్రువఁగన్ = అదురఁగా, తద్ - సభాసదులు = ఆ దక్షుని సభలోనివారు, ఉల్కా - పాతంబు = కొఱకచ్చుయొక్క పడుట, అను కడఁకన్ = అను యత్నముతో - తలఁపుతో, ఉలుకన్ = భయపడఁగా -

తాత్పర్యము : అధికమైన మణుల కాంతిచే నాకాశము మిక్కిలి ప్రకాశింపఁగను, సాటిలేని గమనవేగమువలన వెలువడిన కాంతిచే భూతలము అదురఁగను- దక్షుని సభలోనివారు ఉల్క పడినదేమో యని భయపడఁగను - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు ; అ్రదువ(గన్ - ఇందు 'అ' గురువు కాదు. అదురుచు- 'చుక్కరక రు వర్ణంబునకు ముందఱి దువర్ణంబు నుత్వంబునకు లోపంబు విభాష నగు నగుచో( దత్పూర్వంబు గురువు కాదు.' బాల. ప్రకీర్ణ. 20. అ్రదుచు - 'తుమర్థభావ లక్షణంబులందు నుజీ యగు.' బాల. క్రియ. 40. అ్రదుచు + నుజీ - 'అగమాన్య చకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరంబగునపుడు ప వ లగు.' బాల. క్రియ. 88. అ్రదువు + నుజీ 'జీత్తు పరంబగునపు డుత్వంబున కత్వంబగు' బాల. క్రియ. 20. అ్రదువను - 'నుజ్యంతంబగు నగు ధాతువు క్రియావిశేషణంబుల కప్రయుక్తం బగు నుజీకి విభాష నగు,' బాల. క్రియ. 115, 'దానికి హ్రస్వంబు విభాష నగు.' బాల. క్రియ. 116. అ్రదువ(గను. ఉల్కాపాతం బను కడ(కన్ - అలంకారము భ్రాంతి మంతము,

క. జా నఱి పశుపతి నుఱక వి
తాన మహారంభు(డైన దక్షుం డను న
జ్ఞానికి మునుకొని వచ్చు వి
మానం బన నమరి సతి విమానము వచ్చెన్. 15

అర్థము : జాను + అఱి=ఒప్పుతప్పి, పశుపతిన్ = ఈశ్వరుని, ఉఱక= గణింపక, వితాన - మహత్ (మహా) + ఆరంభు(డు = యజ్ఞముయొక్క గొప్ప పూనికగలవా(డు, ఐన, దక్షుండు + అను + అజ్ఞానికిన్ - దక్షు( డను తెలివిమాలిన వానికి, మునుకొని = ముందుగా, వచ్చు విమానంబు + అనన్ = వచ్చెడి యవమా నమో యనునట్లు. అమరన్ = ఒప్పు(గా, సతి - విమానము = సతీదేవియొక్క విమానము, వచ్చెన్.

తాత్పర్యము : ఒప్పు తప్పి యీశ్వరుని లక్ష్యపెట్టక యజ్ఞము నారంభించిన దక్షు(డనెడి యజ్ఞానికి ముందు రానున్న యవమానమో యనునట్లు సతీదేవి విమానము వచ్చెను,

విశేషములు : అలంకార ముత్ప్రేక్ష. అను + అజ్ఞానికిన్ 'ఉదంతమగు తద్ధర్మార్థవిశేషణమున కచ్చు పరమగునపుడు నుగాగమం బగు.' అను నజ్ఞానికిన్. బాల. సంధి. 33, వితానము - (నానా.) యజ్ఞము, చాందిని, దిండు, సమూహము, అదను.

## సతీదక్షుల వివాదము

వ. వచ్చి ముఖమంటపోపకంఠంబున విమానావతరణంబు సేసిన దాక్షాయణికిం జంద్రరేఖ[1] ననేకవిద్యుల్లేఖానికరంబునుం బోలె శివగణికా సహస్రంబు పరివేష్టించి. 16

అర్థము : వచ్చి, ముఖ - మంటప+ఉపకంఠంబునన్ = ద్వారమండపమునకు సమీపమున, విమాన + అవతరణంబు + చేసిన = విమానమునుండి దిగిన, దాక్షాయణికిన్ = దక్షునికూఁతురైన సతికి, చంద్ర - రేఖన్ = చంద్రకళను, అనేక - విద్యుత్ + లేఖా - నికరంబునున్ + పోలెన్ = పెక్కు మెఱపుతీఁగల సమూహము వలె, శివగణికా - సహస్రంబు = శివునివేశ్యల వేయి-వేవురు శివవేశ్యలు, పరివేష్టించి = చుట్టి - పరివేష్టింప అని యుండుట లెస్స - చుట్టఁగా.

తాత్పర్యము : వచ్చి ద్వారమండపమునకు దగ్గఱగా విమానమును దిగిన సతీదేవిని జంద్రకళను పెక్కుమెఱపుతీఁగల సమూహమో యనునట్లు వేవురు శివవేశ్యలు చుట్టుముట్టఁగా - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : అలంకార ముత్ప్రేక్ష. మంటపము (వికృతి) - మండపము (ప్రకృతి) - కొందఱు మంటపమును సంస్కృతపదముగా వాడిరి. ఇచ్చట సశ్లేషరగినది. విద్యుత్ + లేఖా - తవర్గ వర్ణములకు లకారము పరమగుచోఁ బరసవర్ణమాదేశమగును. విద్యుల్లేఖా.

సీ. కన దపాంగావలోకన దీప్త లుత్ఫుల్ల
కమలపుష్పోపహారములు గాఁగ,
నలస దోదూయమా నామోద నిశ్వాస
పవనంబు లగరు ధూపములు గాఁగ,
మహనీయ జాజ్వల్యమాన భూషామల
రత్నప్రభాతు లారతులు గాఁగ,
మణిమయ మంజీర ఝణఝణత్కారాది
రుతము లింపారు సంస్తుతులు గాఁగ,

1. వా. ప్ర. చంద్రరేఖావృతానేక.

ఆ. అభవమూర్తియైన యాగాధిపతి కర్చ
లిచ్చు కరణి వినుతు లెసకమెసఁగ
నెలమి జన్నసాల కేతెంచి రా సభా
సదులు కౌతుకమున సంభ్రమించి. 17

అర్థము : కనత్ + అపాంగ + అవలోకన - దీప్తులు = ప్రకాశించుచున్న, క్రీఁగంటిచూపుల కాంతులు, ఉత్ఫుల్ల-కమల-పుష్ప + ఉపహారములు + కాఁగన్ = వికసించిన తామరపూల కానుకలు కాఁగా,

అలస - దోధూయమాన + ఆమోద - నిశ్వాస - పవనంబులు = మెల్లఁగాఁ జలించుచున్న పరిమళవంతములైన నిట్టూర్పుగాలులు, అగరు-ధూపములు + కాఁగన్ = మంచిగంధపుఁబొగలు కాఁగా,

మహనీయ - జాజ్వల్యమాన - భూషా + అమల - రత్న - ప్రభాతలు = కాంతిమంతముగాఁ బ్రకాశించుచున్న, అలంకారముల, నిర్మలమైన, మణుల విశేష ప్రకాశములు, ఆరతులు + కాఁగన్ = హారతులు కాఁగా,

మణి - మయ - మంజీర-ఝుణఝుణత్కార + ఆది - రుతములు = రత్నములతో నిర్మింపఁబడిన, కాలియందెల ఝుణఝుణ అను మున్నగు ధ్వనులు, ఇంపు + అగు = మనోజ్ఞమైన, సంస్తుతులు + కాఁగన్ = స్తోత్రములు కాఁగా,

అభవ - మూర్తి + ఐన = శివుని యష్టమూర్తులలో నొక మూర్తి యగు, యాగ + అధిపతికిన్ = యజమానునకు, అర్చలు = పూజలు, ఇచ్చు - కరణిన్ = ఇచ్చు విధమున, వినుతులు = స్తోత్రములు, ఎసకము + ఎసఁగన్ = అతిశయింపఁగా,

ఆ - సభాసదులు = ఆ సభలోనివారు, కౌతుకమునన్ = వేడుకతో, సంభ్రమించి = వేగిరపాటుచెంది, ఎలమిన్ = సంతోషముతో, జన్నసాలకున్ = యజ్ఞశాలలోనికి, ఏతెంచిరి = వచ్చిరి.

తాత్పర్యము : ప్రకాశించుచున్న క్రీఁగంటిచూపులకాంతులు వికసించిన తామరపూల కానుకలు కాఁగా, మందముగాఁ జలించుచున్న పరిమళవంతమైన

నిట్టూర్పుగాలులు మంచిగంధపు బొగలు కాఁగా, కాంతిమంతముగాఁ బ్రకాశించుచున్న అలంకారముల నిర్మలములైన మణులకాంతులు హారతులు కాఁగా, రత్ననిర్మితములైన కాలియందెల ఝణఝణలు మున్నగు ధ్వనులు మనోజ్ఞములైన సంస్తుతులు కాఁగా, అష్టమూర్తియైన యీశ్వరుని మూర్తులలో నొక మూర్తి యగు యజమానునకుఁ బూజలిచ్చునట్లు స్తోత్రము లతిశయింపఁగా, నా దక్షుని సభలోనివారు వేడుకతో వేగపడి ప్రీతితో యజ్ఞశాలలోఁ బ్రవేశించిరి.

విశేషములు : సీసపద్యపాదము లన్నింటను అలంకారము రూపకము. ఆటవెలఁదిలోని 'అభవమూర్తి .... మెసఁగ' అనుదానియందు అలంకార ముపమ. యజ్ఞశాల (ప్రకృతి) - జన్మసాల (వికృతి) అభవమూర్తులు - పంచభూతములు, సూర్యచంద్రులు, యజమానుఁడు,

వ. ఇట్లు చనుదెంచు పరమేశ్వరు మహాదేవిం గని హరిపరమేష్ఠి పురందరాద్యఖిలసభాసదు లాలోకనమాత్రఁ బ్రస్తుతించుచు మస్తక న్యస్త కరకమలముకుళు లగుచుండ వచ్చి వినయంబున దక్ష ప్రదత్త మహాసనాసీనయై జగజ్జనకుండైన నిజజనకు మహత్త్వ విభుత్వంబునకు మెచ్చుచు సురవరులనెల్లను రావించి పరమేశ్వరు రావింప భయస్థుండై నిజపుత్త్రి స్నేహంబున రావించె నని సంతోషించి సతీదేవి దక్షునకుఁ బ్రియసంభాషణభావంబున నిట్లనియె. 18

అర్థము : ఇట్లు, చనుదెంచు = వచ్చునట్టి, పరమేశ్వరు - మహాదేవిన్ = పరమేశ్వరుని భార్య యగు సతీదేవిని, కని = చూచి, హరి - పరమేష్ఠి-పురందర + ఆది + అఖిల - సభాసదులు = విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుఁడు మొదలుగాఁగల యెల్లసభ్యులు, ఆలోకన - మాత్రన్ = చూచుటతోడనే, ప్రస్తుతించుచున్ = స్తోత్రము చేయుచు, మస్తక - న్యస్త - కర - కమల-ముకుళులు = శిరస్సులందు, ఉంపఁబడిన, తామరమొగ్గలవంటి చేతులుగలవారు, అగుచున్ + ఉండన్, (సతి), వచ్చి, వినయంబునన్ = అణఁకువతో, దక్ష - ప్రదత్త + మహాత్ (మహా) + ఆసన + ఆసీన + ఐ = దక్షునిచే నొసఁగఁబడిన యున్నతాసనమునందుఁ గూరుచున్నదయి, జగత్ +

జనకుండు = లోకపిత, ఐన, నిజ - జనకు = తన తండ్రియొక్క, మహత్త్వ - విభుత్వంబునకున్ = గొప్పతనముతోడి ప్రభుత్వమునకు, మెచ్చుచున్, సుర-వరులన్ = దేవతాశ్రేష్ఠులను, ఎల్లను, రావించి, పరమేశ్వరున్, రావింపన్, భయస్థుండు + ఐ = భయపడినవాఁడయి, నిజ - పుత్రిన్ = తనకూఁతును, స్నేహంబునన్ = ప్రీతితో, రావించెన్, అని, సంతోషించి, సతీదేవి, దక్షునకున్, ప్రియ-సంభాషణ-భావంబునన్ = ప్రీతిపూర్వక సంభాషణముతో, ఇట్లు + అనియెన్.

తాత్పర్యము : ఇట్లు వచ్చు సతిని జూచి విష్ణుబ్రహ్మేంద్రాదులైన యెల్ల సభ్యులును జూచుటతోడనే స్తోత్రముచేయుచు, శిరస్సున నంజలి ఘటింప, నామె దక్షుఁడొసఁగిన యున్నతాసనమున వినయముతోఁ గూర్చుండి, లోకపితయైన తనతండ్రి మహాప్రభుత్వమునకు మెచ్చుచు, దేవతల నందఱను రావించి యీశ్వరుని రావింప వెఱచి పుత్త్రిప్రేమమునఁ దన్ను మాత్రము రావించె నని సంతోషించి దక్షునితోఁ బ్రీతి పూర్వకముగా నిట్లు పలికెను.

విశేషములు : పరమేష్ఠి - 'బ్రహ్మాత్మభూః సురజ్యేష్ఠః పరమేష్ఠీ పితామహః' - పరమే ఉత్కృష్టే పదే బ్రహ్మలోకాఖ్యే తిష్ఠతీతి పరమేష్ఠీ - ఉత్కృష్ట స్థానమం దుండెడువాఁడు - బ్రహ్మ - అమరము, జగత్ + జనకుఁడు - ఋల్లునకు హల్లు పరమగుచుండఁగాఁ దృతీయవర్ణాదేశము - జగద్ + జనకుఁడు. తవర్గాక్షరము లకు చవర్గాక్షరములు పరములైనచోఁ జవర్గాక్షరము లాదేశము లగును. జగజ్జనకుఁడు.

గీ. [1]హరి పితామహ దివిజేశ్వరాది దిగధి
పతుల సుర ముని ద్విజుల రాఁ బనిచి వరదు
నభవుఁ బరమేశు రావింపవైతి నీవు
దలఁచి పిలిచిన భక్తవత్సలుఁడు రాఁడె? 19

అర్థము : హరి - పితామహ - దివిజ + ఈశ్వర + ఆది - దిశ్ (క్) + అధిపతులన్ = విష్ణువును, బ్రహ్మను, ఇంద్రుఁడు మొదలగు దిక్పాలురను, సుర - ముని - ద్విజులన్ = దేవతలను, మునులను, బ్రాహ్మణులను, రాన్ + పనిచి = రావించి,

1, గా:దె.

వరదున్ = వరములు నిచ్చువానిని, అభవున్ = ఈశ్వరుని, పరమేశున్ = పరమేశ్వరుని, రావింపవు + ఐతి = రావించినవాఁడవుకావు, నీవు, తలఁచి, పిలిచినన్, భక్త-వత్సలుఁడు = భక్తులయెడ వాత్సల్యము గలవాఁడు, అగు శివుఁడు, రాఁడె = రాకుండెడివాఁడా? తప్పక వచ్చియుండెడివాఁ డనుట.

తాత్పర్యము: 'విష్ణుని, బ్రహ్మను, ఇంద్రాదిదిక్పాలురను, దేవతలను, మునులను, బ్రాహ్మణులను రావించి వరదుఁడును, అభవుఁడును అగు పరమేశ్వరుని రావింపవైతివి. నీవు తలఁచి పిలిచినచో భక్తవత్సలుఁడైన శివుఁడు, రాకుండెడివాఁడా?'

విశేషములు: దిశ్ + అధిపతులు - 'దిశ్' శబ్దమునందలి శవర్ణమునకు అచ్చులును, హల్లులును పరము లగునపుడు గకార మాదేశ మగును, దిగ్ + అధిపతులు-దిగధిపతులు. రావింపవైతి-వచ్చు-'సర్వంబునకుం బ్రేరణంబునం దించుక్కగు.' బాల, క్రియ. 70. వచ్చు + ఇంచు - 'ఇంచు క్చు క్పుగాగమంబులు పరము లగునపు డాగమాదేశలోపంబులు పెక్కుదెఱంగులం గానంబడియెడి.' బాల. క్రియ, 77. రావించు. 'వ్యతిరేకంబున లజీ యగు' - బాల. క్రియ. 7. రావించు + లజీ - 'ఆగమాన్య వికారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరంబగునపుడు ప వ లగు.' బాల. క్రియ. 88. రావింపు + లజీ. 'ఇత్తు పరంబగునపు డుత్వంబున కత్వంబగు.' బాల. క్రియ. 20. రావింప + లజీ. 'లకారంబునకు డు ఱు వు రు ను మున్నగు.' - బాల. క్రియ, 8. మధ్యమపురుషైకవచనమున - రావింపవు. 'భూతంబున లజీకి లిడంతంబగు నగుధాతు వనుప్రయుక్తం బగు.' బాల, క్రియ. 114. రావింపవు + ఐతివి (అగుధాతు లిట్ మధ్యమపురుషైకవచనము) 'ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధి యగు.' బాల. సంధి. 1. రావింపవైతివి. 'లిట్లోట్టుల వకారంబునకు లోపంబు విభాష నగు.' బాల. క్రియ, 24. రావింపవైతి + ఇ. 'మధ్యమపురుష క్రియలయం దిత్తునకు సంధి యగు.' బాల, సంధి. 7. రావింపవైతి.

వ. అనినం బరమేశ్వరుఁ డను పలుకు సహింపక దక్షుం డాక్షేపించి. 20

తాత్పర్యము: అని సతి పలుకఁగా పరమేశ్వరుఁ డను మాట సహింపక దక్షుఁ డధిక్షేపించి . తరువాతి పద్యముతో నన్వయము.

శా. 'ఈ లక్ష్మీశ్వరుఁ, డీ జగజ్జనకుఁ డీ యింద్రాది దిక్పాలు, రిం
దీ లేఖావళి, యిమ్మునీశ్వరగణం, బీ విప్రసంఘంబు, వే
దాలంకారులు; వీరిలోనికి విరుద్ధాచార కంకాల కా
పా లో గ్రాహి జటాజి నాస్థి ధరుఁ డా భస్మాంగి రా నర్హుఁడే?' 21

అ ర్థ ము : ఇందున్=ఇచ్చట - ఈ సభలో, ఈ-లక్ష్మీ + ఈశ్వరుఁడు = ఈ లక్ష్మీపతి - విష్ణువు, ఈ - జగత్ + జనకుఁడు = ఈ లోకపిత - బ్రహ్మ, ఈ + ఇంద్ర + ఆది - దిశ్(క్) + పాలురు = ఈ యింద్రుఁడు మున్నగు దిక్పతులు, ఈ లేఖ + ఆవళి =ఈ దేవతలయొక్క సమూహము. ఈ + ముని+ ఈశ్వర - గణంబు = ఈముని శ్రేష్ఠుల సమూహము, ఈ + విప్ర-సంఘంబు = ఈ బ్రాహ్మణుల సమూహము, వేద + అలంకారులు = వేద మలంకారముగాఁ గలవారు, వీరిలోనికిన్, విరుద్ధా చార .... ధరుఁడు, విరుద్ధ = విపరీతమైన,ఆచార = నడవడిగలవాఁడును, కంకాల= అస్థిపంజరమును, కాపాల = పుఱ్ఱెలను. ఉగ్ర + అహి = భయంకరసర్పములను, జటా = జడలను, అజిన = లేడిచర్మమును. అస్థి = ఏముకలను, ధరుఁడు = ధరించినవాఁడును, అగు, ఆ - భస్మ +అంగి= ఆ బూది శరీరమునందుఁ గలవాఁడు అగు ఈశ్వరుఁడు, రాన్ + అర్హుఁడే = వచ్చుటకు యోగ్యుఁడా ?

తా త్ప ర్య ము : 'ఈ సభలో నీ విష్ణువు, ఈ జగత్పితయైన బ్రహ్మ, ఈ యింద్రుఁడు మున్నగు దిక్పాలకులు, ఈ దేవతల సమూహము, ఈ మునిశ్రేష్ఠుల సమూహము, ఈ బ్రాహ్మణుల సమూహము, వేదము అలంకారముగాఁ గలవారుగలరు. వీరిలోనికి విపరీతమైన ఆచారము గలవాఁడును. అస్థిపంజరమును. పుఱ్ఱెలను, భయంకర సర్పములను, జడలను, చర్మమును ఎముకలను ధరించువాఁడును, బూది శరీరమునఁ బూసికొనువాఁడును అగు ఆ శివుఁడు వచ్చుటకు యోగ్యుఁడా?' - కాఁ దనుట,

వి శే ష ము లు ; జగత్ + జనకుఁడు = జగద్ +జనకుఁడు=జగజ్జనకుఁడు, చూడు పూర్వవ్యాఖ్య. 18, దిశ్ + పాల = దిశ్ శబ్ద శ వర్ణమునకు ఛ్రులు (కఠిన హల్లులు) పరము లగునపుడు కకార మాదేశమగును - దిక్పాల + లు. 'అదంతంబయి దీర్ఘ పూర్వలోపధంబయిన మహత్తుమీఁది విభక్తిలకారంబునకు రేఫం బగు,' బాల, తత్సమ, 38, దిక్పాల + లు - 'పుంలింగంబయి, మహద్వాచకంబయిన నామంబు

వుడి యత్వంబున కుత్వం బగు.' బాల, తత్సమ, 21. దిక్పాలురు, లేఖ - ప్రాణినాం శుభాశుభఫలం లిఖ స్తీతి- లేఖాః, ప్రాణుల శుభాశుభ ఫలమును వ్రాసెడువారు - దేవతలు - అమరము, భస్మాంగి-కర్మ ధారయము పై మత్వర్థీయ ప్రత్యయములు రావని కొందఱుపదేశము. కాని సుకేశి - హిరణ్యకేశి వంటి భాషోదాహరణములు గలవు-

వ. అనిన విని నవఘనాఘనధ్వని వినిన కమలలక్ష్మియుం బోలె నుదరిపడి లగ్గ నోసి దాక్షాయణి దక్షున కిట్లనియె. 22

అర్థము ; అనినన్, విని, నవ - ఘనా - ఘన-ధ్వనిన్=తొలకరి మేఘము ధ్వనిని, వినిన, కమల - లక్ష్మియున్ + పోలెన్ + పద్మమనెడి లక్ష్మివలె, ఉదరి పడి = అదరిపడి, లగ్గ - నోపి = మిక్కిలి బాధపడి, దాక్షాయణి=దక్షునికూఁతురు- సతి, దక్షునకున్, ఇట్లు + అనియెన్.

తాత్పర్యము : అని దక్షుఁడు పలుకఁగా విని క్రొక్కారు మొగిలు చప్పుడు వినిన పద్మమనెడి లక్ష్మివలె నదరిపడి మిక్కిలిబాధపడి సతీదేవి దక్షున కిట్లు పలికెను.

విశేషములు : అలంకార ముత్ప్రేక్ష.

మ. 'త్రిజగన్నాథుఁ, బవిత్రగాత్రుఁ, గ్రతుమూర్తిం, బాత్రు సత్పూజ్యుఁడే
యజినాభీలకపాలశల్యధరుఁ డీ యజ్ఞాదులం దంటి; వీ
ద్విజ దేవాదులకుం గపాల కవ చాస్థివ్రాతముల్ మేనులన్
నిజమై యున్నవి రుద్రచిహ్నా లివె; వీనిం బుచ్చి రా నేర్చిరే?' 23

అర్థము : త్రిజగత్ + నాథున్ = ముల్లోకములకుఁ బ్రభువును, పవిత్ర - గాత్రున్ = పావనమైన శరీరముగలవానిని, క్రతు - మూర్తిన్ = యజ్ఞస్వరూపుని, పాత్రున్ = అర్హుని, ఈ - అజిన + ఆభీల - కపాల - శల్య - ధరుఁడు = ఈ చర్మము, భయంకరమైన పుఱ్ఱెలు, ఎమ్ములు, తాల్చినవాఁడు, ఈ - యజ్ఞ+ఆదులం దున్ = ఇట్టి యజ్ఞములు మున్నగువానియందు, సత్ + పూజ్యుఁడే = బాగుగాఁ బూజింపఁదగినవాఁడా ?-లేక పండితులచే-మంచివారిచేఁ బూజింపఁదగినవాఁడా? అంటివి, ఈ-ద్విజ-దేవ + ఆదులకున్ = ఈ బ్రాహ్మణులు, దేవతలు మున్నగువారికిఁగూడ, కపాల - కవచ + అస్థి - వ్రాతముల్ = పుఱ్ఱెలు, చర్మములు, ఎముకలు అనువాని సమూహములు, మేనులన్=శరీరములందు, నిజము+ఐ, ఉన్నవి, రుద్ర-చిహ్నాలు= ఈశ్వరుని గుఱుతులు, ఇవె,వీనిన్, పుచ్చి = విడిచి, రాన్ + నేర్చిరే=రాఁగలిగిరా

తాత్పర్యము : "ముల్లోకములకు అధిపతియైనవాఁడును, పవిత్రమయిన శరీరముగలవాఁడును, యజ్ఞస్వరూపుఁడును, యోగ్యుఁడు నైన శివుని. 'ఈతోలు భయంకరములైనపుర్రెలు ఎముకలు దాల్చిన యీతఁడు ఇట్టి యజ్ఞములు మున్నగువానియందు పూజింపఁదగినవాఁడా ?' యని పలికితివి. కాని యీ బ్రాహ్మణులు దేవతలు మున్నగువారికిఁగూడఁ బుఱ్ఱెలు, చర్మములు, ఎముకలసమూహములు శరీరములందు నిజముగా యున్నవి. ఇవి రుద్రచిహ్నములే కదా ! వారు వానిని దీసిపెట్టి రాఁగలిగిరా ?" లే దనుట.

విశేషములు : దాక్షాయణి వాక్చమత్కారము ప్రశంసనీయముగా నున్నది. 'ప్రతిమనుష్యునకును గపాలాదు లుండునేకదా ! పైఁగా నవి తీసివేయరానివి, అవి యన్నియు రుద్రుని చిహ్నములే. వా రందఱును ఆహూతు లయినప్పుడు వానిని దాల్చినాఁడని శివు నేల పిలువకుంటి' వనిః యామె యభియోగము.

చిహ్న - చిహ్నము రూపద్వయము గలదు. చిహ్న (ము) (ప్రకృతి) - చిన్నె (వికృతి) అంటివి. అను ధాతువు 'భూతంబున లిట్టగు,' బాల. క్రియ, 3, అను + లిట్, 'లకారంబునకు డు ౙు వు రు ను ము ఙ్గు' - బాల. క్రియ. 8. అను + వు 'లిట్టు వుఙ్ఙు పరంబగునపుడు తి వర్ణకం బగు,' బాల. క్రియ, 18. అను + తి + వు. - 'తి దు ట లు పరంబులగునపు డన్వాదుల' నుస్థానంబున సున్నయు నుండు డులోపంబును విభాష నగు,' బాల. క్రియ. 58, అంతి + వు. 'ఇట బిందువుమీఁది త దలకు నిత్యవైకల్పికంబు లయి ట డ లగు.' బాల. క్రియ, 59, అంటి + వు. 'ఇకారంబుమీఁది కు ను వు క్రియా విభక్తుల యుత్వంబున కిత్వం బగు.' బాల. తత్సమ. 26, అంటివి. ద్విజ - (నానా:) బ్రాహ్మణుఁడు, పక్షి; దంతము.

గీ. 'వీరి కెల్లను దేవతా విభవ మొసఁగు
చున్న పరమేశు రావింప నొల్ల నవియె;
దింక నీ యజ్ఞఫలము నీ కిచ్చు నట్టి
పెద్ద లెవ్వ రీ వచ్చిన పేళ్లయందు ?' 24

అర్థము : వీరికిన్. ఎల్లను, దేవతా-విభవము=దివ్యత్వసంపద, ఒసఁగుచున్ + ఉన్న = ఇచ్చుచున్న, పరమేశున్=ఈశ్వరుని, రావింపన్=రప్పించుటకు, ఒల్లన్= అంగీకరింపను, అనియెదు = అందువు, ఇంకన్. నీ - యజ్ఞ ఫలమున్ = నీవు

చేయుచున్న యజ్ఞముయొక్క ఫలమును, నీకున్, ఇచ్చు + అట్టి, పెద్దలు, ఈ - వచ్చిన - పేళ్లయందున్ = ఇచ్చటికి వచ్చిన పేళ్లలో-వచ్చిన వారిలో ననుట, ఎవ్వరు?

తాత్పర్యము: 'ఈ వచ్చినవారి కందఱకును దివ్యత్వసంపదనిచ్చు పరమేశ్వరుని నీవు రావింప నంగీకరింప వందువు. మఱి నీ యజ్ఞఫలమును నీ కిచ్చునట్టి గొప్పవారు ఈ వచ్చినవారిలో నెవరు?' ఎవరును లే రనుట.

విశేషము 'లు: అనియెదు - అనుధాతువు, 'తద్ధర్మాదులందు లాట్టగు.' బాల. క్రియ. 5. అను + లాట్. 'లకారంబునకు డు ఱు వు రు ను ము ల్గు.' అను + వు (మధ్యమపురుషైకవచనము), 'లాట్లు రుల్లు పరంబగునపు డెదగాగమంబును ప్రథమ ను వర్లంకంబు పరంబగునపు డెడు గెడి గాగమంబులును బహుళంబుగా నగు.' బాల. క్రియ. 23. అను + ఎద + వు. 'గురువిరహితంబు లయి యయాంతంబులయిన యేకస్వర ద్విస్వరంబుల యించుగ్వక్రంబుల కియుడాగమంబు విభాష నగు.' బాల. క్రియ. 50. అను + ఇయ్ + ఎద + వు - 'అంద్వవగాగమంబులందప్ప నపదాది స్వరంబు పరంబగునపు డచ్చునకు సంధి యగు.' బాల. సం॥ అనియెదవు 'లిఙ్గాట్టుల వకారంబునకు లోపంబు విభాష నగు,' బాల. క్రియ. 24. అనియెద + ఉ. అంద్వవగాగమ సంధిచే అనియెదు, పేళ్లు - పేరు శబ్దము బహువచనరూపములు పేరులు, పేర్లు, పేళులు కాని పేళ్లు కాదు. కాని బహుప్రయుక్తమగుటచే నీతఁడు నట్లు ప్రయోగించినాఁ డనవలయును, పేడిశబ్దమునకు బహువచనము పేళ్లు కావచ్చును. కాని యది యెంత వఱకు సమంజస? మనునది ఆలోచనీయము. పేళ్లు = నపుంసకులు.

సీ. 'ధరణీతలంబెల్ల నరదంబు. చంద్రార్క
బింబముల్ చక్రముల్, పృథుజవాశ్వ
ములు వేదములు, పగ్గములు చతుస్స్వరములు,
ప్రణవంబు గసగోల, బ్రహ్మ సూతుఁ,
డగపతి విల్లు, పన్నగపతి గొనయంబు,
హరి గోల, గఱి గరు, డనల మమ్ము.
పవనంబు వేగంబు, దివిజ గణంబులు
నెరవులై, యాశుండు పురము లేయఁ

తే. దలఁచినంతన భోరనఁ దమకుఁ దార
వచ్చి కెలసంబు సేసినవారె కారె ?
వీరిఁ బట్టి పరేశుని విడుతు ననఁగ
వలదు నీ కీశుఁ డేలినవాఁడు కాఁడె ?' 25

అర్థము : ధరణీ - తలంబు + ఎల్లన్ = భూతలమంతయు, అరదంబు = రథము, చంద్ర + అర్క - బింబముల్ = చంద్రుని సూర్యుని మండలములు, చక్రముల్ = ఆ రథము చక్రములు, పృథు - జవ + అశ్వములు = అధికవేగము గల గుఱ్ఱములు, వేదములు, పగ్గములు, చతుః + స్వరములు = నాలుగు స్వరములు, (ఉదాత్తము, అనుదాత్తము, స్వరితము, ప్రచయము), ప్రణవంబు = ఓంకారము, కస + కోల = కొరడాకఱ్ఱ, బ్రహ్మ, సూతుఁడు = రథము తోలువాఁడు,

అగపతి = కొండలఱేఁడు - మేరువు, విల్లు, పన్నగ - పతి = పాఁపఱేఁడు- వాసుకి, గొనయంబు = వింటిత్రాడు, హరి = విష్ణువు, కోల = బాణము, గఱి = బాణపుఱెక్క, గరుడి = గరుత్మంతుఁడు, అనలము = అగ్ని, అమ్ము = బాణము,

పవనంబు = వాయువు, వేగంబు, దివిజ-గణంబులు- వేల్పుల సమూహములు, ఎరవులు = పరివారము, ఐ, ఈశుండు, పురములు=రాక్షసుల మూఁడు పురములు, ఏయన్ = కొట్టుటకు, తలఁచిన + అంతన్ + అ = తలఁచినంతనే, భోరనన్= శీఘ్రముగా, తమకున్ + తారు + అ = తమంతఁదామే, వచ్చి. కెలసంబు=సేవ, చేసిన - వారు + ఎ - కారు + ఎ = చేసినవారే కారా ?

వీరిన్ + పట్టి = వీరిని బట్టుకొని, పరేశునిన్=పరమేశ్వరుని, విడుతున్ + అనఁగన్ - వలదు = విడిచిపెట్టెద ననరాదు, నీకున్, ఈశుఁడు, ఏలినవాఁడు = ప్రభువు, కాఁడె = కాఁడా ?

తాత్పర్యము : 'భూతలమంతయు రథముగా, చంద్రసూర్యులు చక్రములుగా, వేదములు మంచివేగముగలగుఱ్ఱములుగా, ఉదాత్తానుదాత్త స్వరిత ప్రచయము లనెడి నాలుగు స్వరములను పగ్గములుగా. ఓంకారము కొరడాకఱ్ఱగా, బ్రహ్మ సారథిగా;

మేరువు విల్లుగా, వాసుకి అల్లెత్రాడుగా, విష్ణువు బాణముగా, గరుడుఁడు బాణపు టెక్కెగా, అగ్ని బాణముగా, వాయువు వేగముగా, దేవతల సమూహములు పరివారముగా, ఈశ్వరుఁడు త్రిపురములను గొట్టనెంచఁగనే శీఘ్రముగాఁ దమంతఁదాముగా వచ్చి సేవించినవారు కారా వీరు అందఱును? అట్టివీరిని బట్టుకొని పరమేశ్వరుని విడుతు ననరాదు. నీ కీశ్వరుఁడు ప్రభువు కాఁడా?'

విశేషములు: త్రిపురాసుర సంహారకార్యమున నీశ్వరునకైన సాధన సామగ్రి యంతయు నిందు వివరింపఁబడినది. అరదము (వికృతి) - రథము (ప్రకృతి), పగ్గము (రూ.) ప్రగ్గము, (వికృతి) - ప్రగ్రహము (ప్రకృతి), కస (వికృతి) - కశ (ప్రకృతి), గొనయము (వికృతి) - గుణము (ప్రకృతి) - గొనము (రూ.), పురము (ప్రకృతి) - ప్రోలు (వికృతి), భోరన - (రూ.) బోరన,

క. 'నెఱయఁగ నిది కాదె నీ
యెఱుఁగమి? నీ దేవగణము నేలినవానిం
గొఱగాఁ డని కైకొన కిం
దఱిఁ దెచ్చితి వీర లీశు దాసులు గారే?' 26

అర్థము: నెఱయఁగన్ = వెలయఁగా, నీ + ఎఱుఁగమి = నీ అజ్ఞానము, ఇది, కాదే = కాదా?, నీ - దేవ - గణమున్ = నీ దేవతల, సమూహమును, ఏలిన - వానిన్ = పాలించువానిని, కొఱ - కాఁడు + అని = పనికిమాలినవాఁడని, కైకొనక = లక్ష్యపెట్టక, ఇందఱిన్ = ఇంతమందిని, తెచ్చితి (వి), వీరలు=వీరు. ఈశు = శివునియొక్క, దాసులు + కారే = దాసులు కారా?

తాత్పర్యము: 'నీ యజ్ఞానము ఇదికాదా? నీ దేవతల సమూహము నేలిన వానిని బనికిమాలినవాఁడని గణింపక యింతమందిని దీసికొని వచ్చితివి. వీర లందఱును శివుని కింకరులు కారా?' అగుదు రనుట.

విశేషములు: నీ యెఱుఁగమి-నీవు ఎఱుఁగమి - 'ధాతుజవిశేషణ భావార్థక పూర్వావ్యవహి తావ్యవహిత కర్తృపదప్రథమకుఁ దఱచుగ యొక్క-షష్ఠి యగు,' నీ

యొక్క ఎఱుఁగమి. ప్రౌఢ. కారక. 15. 'యొక్కకు లోపంబు బహుళంబు' ప్రౌఢ కారక. 16. నీ యెఱుఁగమి.

వ. అని పరమేశ్వరు సమస్తసురాధీశ్వరుల కధీశ్వరుండుగాఁ బలికిన విని దక్షుండు సహింపక. 27

అర్థము : అని, పరమేశ్వరున్, సమస్త - సుర + అధి+ఈశ్వరులకున్= ఎల్ల దేవతాప్రభువులకు, అధీశ్వరుండు + కాన్ = ప్రభువుగా. పలికినన్, విని, దక్షుండు, సహింపక.

తాత్పర్యము : అని సతి పరమేశ్వరు నెల్లదేవతాశ్రేష్ఠులకును అధినేతగాఁ బలుకఁగా విని దక్షుఁడు ఓర్వక - తరువాతి పద్యముతో నన్వయము.

ఉ. 'అన్నిన యట్ల యిమ్మునిసురాధిపులం జెడనాడుచున్న నీ
యున్నతికంటె నాకు మొగమోడి సహించిరిగాక వీరిలో
నెన్నిన నిన్ను రుద్రుని సహింతురె దేవత ?' లన్న నల్కతోఁ
గన్నుల నిప్పు లొల్కు హరు గాదిలి దక్షునిఁ జూచి యిట్లనున్. 28

అర్థము ; అన్నిన + అట్లు+అ= మదించినదానివలె, ఈ + ముని-సుర+ అధిపులన్ = ఈ మునిశ్రేష్ఠులను, దేవతాశ్రేష్ఠులను, చెడన్ + ఆడుచున్+ఉన్న= నిందించుచున్న. నీ + ఉన్నతికంటెన్ = నీ గొప్పతనముకంటె, నాకున్, మొగమోడి = మోమోటపడి, సహించిరి + కాక = ఓర్చిరి కాని, వీరిలోన్, ఎన్నిన = నిందించిన, నిన్నున్, రుద్రునిన్, దేవతలు, సహింతురె, అన్నన్ = అనఁగా, అల్కతోన్ = కోపముతో, కన్నులన్, నిప్పులు. ఒల్కు = రాలునట్టి, హరు - గాదిలి = ఈశ్వరుని భార్య - సతి, దక్షునిన్, చూచి, ఇట్లు, అనున్.

తాత్పర్యము : 'మదించినదానివలె నీ మునిపతులను, దేవతాశ్రేష్ఠులను నిందించుచున్న నీ గొప్పతనమును నా మొగముచూచి సహించిరి గాని వీరిని నిందించిన నిన్నును, రుద్రుని దేవతలు సహింతురా?' యనఁగాఁ గోపముతోఁ గన్నుల నిప్పులు రాల సతి దక్షునిఁ జూచి యిట్లు పలికెను.

విశేషములు: హరు గాదిలి - హరుని భార్య. గాదిలి = భార్య యని సూ. ని. ఈ యుదాహరణమునే యిచ్చినది.

సీ. 'నీకంటె హరి బుద్ధి లేకయె నిజనేత్ర
 కమలంబు పూన్చి చక్రంబు వడసెఁ?
పరమేష్ఠి నీకంటెఁ బరువిఁడియే శిర
 మొప్పించి నిత్యుఁడై యున్నవాఁడు?
మఘవుండు నీకంటె మరులైయె క్రతుతతి
 నర్చించి దేవేంద్రుఁడై వెలింగె?
నిఖిల దేవాలియు నీకంటె నవివేకు
 లయియె సేవించి భోగాత్ము లైరి?

తే. వీర లిందఱికంటెను వెరవు మిగుల
నెఱుక నీ కిప్డు డెందుండి దొఱకిపడియె?
నగణితైశ్వర్యు శివుఁ బరమాత్ము నెఱిఁగి
యెఱిఁగి దూషింప నీకు నో రెట్లు లాడె?' 29

అర్థము: హరి=విష్ణువు, నీకంటెన్, బుద్ధిలేకయె. నిజ-నేత్ర-కమలంబు = తనదైన కనుదమ్మిని, పూన్చి = సమర్పించి, చక్రంబు = సుదర్శనాయుధమును, వడసెన్ = పొందెను?

పరమేష్ఠి=బ్రహ్మ, నీకంటెన్, పరువిఁడియే (పరువు + ఇఁడి) = గౌరవ హీనుఁడయియే, శిరము, ఒప్పించి = అర్పించి, నిత్యుఁడు + ఐ = శాశ్వతుఁడై, ఉన్నవాఁడు?

మఘవుండు = ఇంద్రుఁడు, నీకంటెన్, మరులైయె=మరుఁ బయ్యె (సూ. ని పాఠము)=అజ్ఞానము అయి యే, క్రతు-తతిన్=యజ్ఞసమూహమునందు, అర్చించి = పూజించి, దేవేంద్రుఁడు + ఐ = దేవతలకు భర్తయై. వెలింగెన్ = ప్రకాశించెను?

నిఖిల - దేవ + ఆలియున్ = ఎల్ల దేవతల సమూహమును, నీకంటెన్, అవివేకులు + అయియె = జ్ఞానశూన్యులయియే. సేవించి, భోగ + ఆత్ములు = సౌఖ్యవంతులు, ఐరి ?

వీరలు + ఇందఱికంటెను, వెరవు - మిగులన్ = నే ర్పతిశయింపఁగా, ఎఱుక = జ్ఞానము, నీకున్, ఇప్పుడు, ఎందున్ + ఉండి, దొఱకిపడియెన్ = లభించెను ? తొఱకి పడియెన్ = దిగివచ్చెను, (మా, రా. కవి పాఠము)

అగణిత + ఐశ్వర్యున్ = లెక్కలేనంత ఐశ్వర్యము గలవాఁడు అగు. శివున్ = శివుని. పరమ + ఆత్మన్ = మహాత్ముఁడైనవానిని, ఎఱిఁగి ఎఱిఁగి, దూషింపన్ = నిందించుటకు, నీకున్, నోరు, ఎట్టులు + ఆడెన్ = ఎట్లు వచ్చెను ?

తాత్పర్యము : 'నీకంటె విష్ణువు బుద్ధిలేనివాఁడయియే తన నయనపద్మమును శివునికిచ్చి సుదర్శనమును పొందెనా ? బ్రహ్మ నీకంటె గౌరవహీనుఁ డయియే తన శిరస్సు నర్పించి శాశ్వతుఁడై యున్నాఁడా ? ఇంద్రుఁడు నీకంటె నజ్ఞాని యయియే యజ్ఞములందుఁ బూజించి దేవేంద్రుఁ డయి ప్రకాశించెనా ? దేవత లందఱును నీకంటె వివేకరహితులయియే సేవించి సౌఖ్యవంతులయిరా ? వీరి యిందఱికంటెను నీకు ఇప్పుడు తెలివి యెందుండి యూడిపడినది ? లెక్కింపరాని యైశ్వర్యము గలవాఁడును, పరమాత్ముఁడును అగు శివుని తెలిసితెలిసి దూషించుటకు నీకు నో రెట్లు వచ్చెను ?'

విశేషములు : 'నీకంటెహరి .... పడసె,' విష్ణువు శివుని వేయితామరలతోఁ బూజింపఁబూని, అం దొక్కటి తక్కువ కాఁగా, తన నేత్రపద్మమునే పెఱికి శివునకు సమర్పించెను. అందులకుఁ బ్రతిఫలముగా నతఁడు సుదర్శనాయుధమును బొందెను. 'పరమేష్ఠి .... యున్నవాఁడు.' బ్రహ్మకు మొదట నైదుశిరస్సు లుండెడివి. అతఁడును, విష్ణువును ఆధిక్యముకొఱకుఁ బోరాడుచుండఁగా శివుఁడు వచ్చి వారిని వైరము మానుఁ డనెను. విష్ణువు మానినను బ్రహ్మ పంచమశిరము మానక శివుని దూషించెను. శివుఁడు కాలభైరవుని బుట్టించి యాతని పంచమశిరస్సును ఖండింపు మనియెను. బ్రహ్మ భయపడి తన పంచమశిరము శివుని దగ్గఱ పడునట్లును, ఆ కపాలముతో శివుఁడు భిక్షాటనము చేయునట్లును గోరెను, శివుఁ డనుగ్రహించెను.

పరువిఁడి - పరువు + ఇఁడి. 'ముక్కు లోనగు వానికిం ద దభావద్యోతకం బయి మతుబర్థంబునం దిఁడి వర్ణకం బగు.' బాల. తద్ధిత. 24. పరవిడి = వాచాటుఁడు అని మా. రా. కవి పాఠము. ఐయె = అయి + ఎ = యడాగమముచే అయియె, 'అచ్చికంబులం దయి యవులకు వక్రతమంబులు బహుళంబుగా నగు.' బాల. క్రియ. 103. - ఐయె. అగణిత + ఐశ్వర్య = అగణితైశ్వర్య - వృద్ధిసంధి.

క. 'వాదున నీ హరి వేధయుఁ[1]
గాదే యురులింగమూర్తి కడ గానక నాఁ[2]
డాదిగ వెదకెద ? రట్టి మ
హాదేవుఁ డపూజ్యుఁ డనఁగ నగునే నీకున్ ?' 30

అర్థము: ఈ - హరి - వేధయున్ + కాదె = ఈ విష్ణువును, బ్రహ్మయును, గాదా, వాదునన్ = వాదముతో, ఉరు - లింగ - మూర్తి = గొప్పదియగు లింగము స్వరూపముయొక్క, కడ = అంతు, కానక = కనుఁగొనలేక, నాఁడు + ఆదిగన్ = అప్పటినుండియు, వెదకెదరు, అట్టి, మహాదేవుఁడు, అపూజ్యుఁడు + అనఁగన్ = పూజింపఁదగనివాఁ డన, నీకున్, అగునే ?

తాత్పర్యము: 'ఈ విష్ణువును బ్రహ్మయుఁ గదా వాదమున శివలింగము నంతమును గనుఁగొనలేక యప్పటినుండియు వెదకులాడుచున్నారు ? అట్టి మహాదేవుఁడు, పూజార్హుఁడు కాఁడన నీకు భావ్యమా ?'

విశేషములు: శివలింగము నాద్యంతములు చూడ బ్రహ్మ హంసరూపమునఁ బైకివెడల, విష్ణువు వరాహరూపమునఁ గ్రిందికి వెడలెను. కాని వారు ఇప్పటికిని గృతకృత్యులు కాలేక వెదకుచునేయున్నా రనుట. వాదు (వి.) - వాదము (ప్ర.)

1. వ్రాఁతప్ర - ల, 2. వా. ప్ర. నే.

చ. 'హరుఁ జెడనాడి వీరిఁ గొనియాడెదు పెద్దయు నీవు చూడఁగా
గరళము మ్రింగి. త్రైభువనకంటకులైన గజాసురాదులం
బరువడి నోర్చి, విశ్వము శుభస్థితి నిల్పినవాఁడు తొల్లి నీ
హరియె? పితామహుండె? దివిజాధిపుఁడే? సురలే? మునీంద్రులే?' 31

అర్థము ; హరున్ = ఈశ్వరుని, చెడన్ + ఆడి = నిందించి, వీరిన్, పెద్దయున్ = మిక్కిలియును. కొనియాడెదు = ప్రశంసింతువు, నీవు, చూడఁగాన్, గరళము = హాలాహలము, మ్రింగి, త్రైభువన - కంటకులు = ముల్లోకములకు శత్రువులు, ఐన, గజ + అసుర + ఆదులన్ = గజాసురుఁడు మొదలగు వారిని, పరువడిన్ = శీఘ్రముగా, ఓర్చి = ఓడించి, విశ్వమున్ = విశ్వమును, శుభ-స్థితిన్ = శుభమైనయునికియందు, నిల్పినవాఁడు, తొల్లి = పూర్వము, నీ - హరి + ఎ = నీ విష్ణువా ? పితామహుండు + ఎ = బ్రహ్మయా ?, దివిజ + అధిపుఁడు + ఏ = దేవేంద్రుఁడా ? సురలు + ఏ = దేవతలా ?, ముని + ఇంద్రులు + ఏ = ముని శ్రేష్ఠులా ?

తాత్పర్యము: 'ఈశ్వరుని దూలనాడి వీరిని మిక్కిలి ప్రశంసింతువు. నీవు చూచుచుండఁగా హాలాహలమును మ్రింగి, ముల్లోకములకు శత్రువులైన గజాసురుఁడు మున్నగువారిని శీఘ్రముగా నోడించి లోకమును శుభస్థితియందు నిల్పినవాఁడు ఈశ్వరుఁడుగాక నీ విష్ణువా, బ్రహ్మయా, సురేంద్రుఁడా, దేవతలా. మునిశ్రేష్ఠులా ?' ఎవరును గారనుట.

విశేషములు : క్షీరసముద్రమును దేవదానవులు అమృతముకొఱకు మథించినపుడు తొలుత హాలాహలము పుట్టి లోకములను గాల్పనుండఁగా, నీశ్వరుఁడు దానిని మ్రింగి కంఠమున నుంచెను. గజాసురుఁడు - మహిషాసురుని కుమారుఁడు. ఇతఁడు దేవతలను హింసించుచుండ నీశ్వరుఁ డితనిని శిక్షింపవచ్చెను. అంత నితఁడు వానితో 'నీచేతఁ జావవలయుననియే నే నిట్లు చేయుచున్నాను. నేను జచ్చినపిమ్మట నా చర్మమును నీవు ధరింపు'మన శివుఁడట్లే చేసెను. త్రైభువన - త్రయాణాం భువనానాం సమాహారః-త్రైభువనమ్. - సమాహారద్విగుసమాసము. నీ హరియె .... నీవు గొప్పవారనిచెప్పు హరియా .... అని దెప్పిపొడుచుట.

మ. 'హరు నిర్మించిన వేదమార్గములు గా కీ యాగముల్ సేయఁగా
వెరవొం డెయ్యది ? సద్విధిం గ్రతుసమాప్తిం బొందినన్ మిట్టి నా
వరదుం డొక్కఁడు దక్కఁ దత్ఫలము లెవ్వం డీ సమర్థుండు నీ
సురసంఘంబుల లోన?' నంచు సతి దక్షుం దూలఁబోఁ బల్కుచున్. 32

అర్థము: హరు - నిర్మించిన = శివుఁడు ఏర్పఱిచిన, వేద-మార్గములు + కాక = వైదికపద్ధతులుగాక, ఆ - యాగముల్, చేయఁగాన్, వెరవు = ఉపాయము, ఒండు = ఇంకొకటి, ఎయ్యది = ఏది ?, సత్ + విధిన్ = మంచివిధితో, క్రతు-సమాప్తిన్ = యజ్ఞపూర్తిని, పొందినన్ = పొందినను, మిట్టి = మీఱి, నా - వరదుండు = నా వరమునిచ్చువాఁడు - భర్త, ఒక్కఁడు + తక్కన్ = ఒక్కఁడు తప్ప, తత్ + ఫలములు = ఆ యజ్ఞఫలములు. ఈన్ = ఇచ్చుటకు, నీ - సుర - సంఘంబులలోనన్ = నీ దేవతల సమూహములలో, ఎవ్వండు, సమర్థుండు ?, అంచున్, సతి, దక్షున్, తూలన్ +పోన్ + పల్కుచున్ = తూలనాడుచు.

తాత్పర్యము ; 'శివుఁడు ఏర్పఱిచిన వేదమార్గములుగాక ఆ యజ్ఞములుచేయుటకు మఱియొక యుపాయమేది ? ఒకవేళ యథావిధిగా యజ్ఞము సమాప్తమయినను, నా భర్త తప్ప నీ దేవతాసమూహములో మఱియొక్కఁ డెవ్వఁ డా యజ్ఞఫలము నొసఁగఁజాలును ?' అని సతి దక్షుని నిందించుచు - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : హరు - నిర్మించిన - హరుఁడు నిర్మించిన. 'ధాతుజవిశేషణభావార్థక పూర్వవ్యవహితావ్యవహిత కర్తృపద ప్రథమకుఁ దఱచుగ యొక్కషష్ఠి యగు.' ప్రౌఢ. కారక. 15. హరుయొక్కనిర్మించిన, 'యొక్కకు లోపంబు బహుళంబు.' ప్రౌఢ. కారక. 16, హరునిర్మించిన. తనభర్త వరదుఁడు కావుననే యజ్ఞఫలము నీఁగలుగుననుట.

'వెరవొండెయ్యది సద్విధిం గ్రతుసమాప్తిం బొందినన్'-అనుపాఠముగాక, వన్నెచోసేఁడు పవలకు యతిమైత్రిని పాటింపలేదుకావున 'తెరువొండెయ్యది....

సమాప్తిం బొందినన్' అనునదియే సరియైన పాఠమనియు, అదియే ప్రకరణానుగుణము
ననియు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు. చూడు వా. ప్రతిపీఠిక.

వ. ఇట్లు పరమేశ్వరు వేదకర్తయు సకలకర్మఫలదాతయుఁగాఁ బల్కిన
దక్షుండు దుర్మదంబున సహింపక వెండియు నిట్లనియె. 33

అర్థము: ఇట్లు, పరమేశ్వరున్, వ.క ర్తయున్ = వేదములుచేయువాఁడును. సకల-కర్మఫల-దాతయున్ = ఎల్ల కర్మములయొక్క ఫలముల నిచ్చువాఁడును, కాన్ = అగునట్లు, పల్కినన్, పలుకఁగా, దక్షుండు, దుర్మదంబునన్ = దుర్గర్వముతో. సహింపక = ఓర్వక, వెండియున్ = మరల, ఇట్లు + అనియెన్.

తాత్పర్యము: ఇట్లు సతి పరమేశ్వరుని వేదకర్తనుగా. నెల్లకర్మముల ఫలముల నొసఁగువానినిగాఁ బలుక, దక్షుఁడు దుర్గర్వముతో సైఁపక మఱియు నిట్లు పలికెను.

ఉ. 'ఎన్నఁడుఁ దొల్లి చర్మములు నెమ్ములు భూతియుఁ దాల్చి తాపసుల్
జన్నములందుఁ జొత్తురె విచారములేక ? సురేశ్వరాదులం
బన్నములాడి నీ మగని పక్షము పల్కెదుగాక బేల ! నీ
కొన్న మరుల్ జగజ్జనులు గొందురె ? వ్రాత్యులఁ బూజ్యులందురే?' 34

అర్థము: ఎన్నఁడున్ = ఎప్పుడైనను, తొల్లి = పూర్వము, తాపసుల్ = మునులు, విచారము-లేక = ఆలోచనలేక, చర్మములున్ = తోళ్లను. ఎమ్ములున్ = ఎముకలును, భూతియున్ = బూదియును, తాల్చి = ధరించి.జన్నములందున్ = యజ్ఞములలో, చొత్తురె = ప్రవేశింతురా ? సుర + ఈశ్వర + ఆదులన్ = దేవతల ప్రభువు-ఇంద్రుఁడు మున్నగువారిని, బన్నములు + ఆడి = నిందావాక్యములు పలికి, నీ-మగని-పక్షము + పల్కెదు + కాక = నీ భర్త మాట మాటాడుదువు కాని, బేల = వెఱ్ఱిదాన !, నీ-కొన్న-మరుల్ = నీవుపొందినఅనురాగము, జగత్ + జనులు = లోకమునందలిజనులు, కొందురె ? = పూనుదురా ?, వ్రాత్యులన్ = నీచులైనవారిని, పూజ్యులు = పూజింపఁదగినవారు, అందురే ?

తాత్పర్యము : 'పూర్వ మెప్పుడైనను మునులు తోళ్లను, ఎముకలను, బూదిని దాల్చి యజ్ఞములందు సంకోచములేక ప్రవేశించిరా? దేవేంద్రాదులను నిందించి నీ మగని పక్షమును వహింతువు కాని, యో వెఱ్ఱిదానా! నీవు నీ మగనిపైఁ బూనిన వలస్త్ర లోకమునందలి జనులు పూనుదురా? నీచులైనవారిని బూజనీయు లందురా?' అని భావము.

విశేషములు : చొత్తురె-చొచ్చుధాతువు. 'తద్ధర్మాదులందు లాట్టగు.' బాల. క్రి.6.చొచ్చు+లాట్.'లంకారంబునకు డు ౙు వు రును ముఙ్గగు.' చొచ్చు+రు. బాల. క్రియ.8. 'లాట్టు రుఙ్ఙు పరంబగు నపుడు దుగాగమంబగు.' చొచ్చు+దు + రు.బాల. క్రియ.22. 'చువర్ణంబుతోఁడ ద్దు గారంబు తకారంబగు.' బాల.క్రియ. 108. చొత్తురు. చొత్తురు+ఎ, 'అంద్వవగాగమంబులందప్ప నపదాదిస్వరంబు పరంబగునపు డచ్చునకు సంధి యగు,' చొత్తురె. బాల.సంధి.11. పక్షము+పల్కెదు. 'ప్రథమమీఁది పరుషములకు గ స డ ద వ లు బహుళముగానగు, పక్షమువల్కెదు, బాల.సంధి.13.పల్కెదవు, 'లిడ్లాట్టుల వకారంబునకు లోపంబు విభాషనగు.' పల్కెద+ఉ. బాల.క్రియ. 24. అపదాదిస్వర సంధిచే(బాల.సంధి.11)వల్కెద.కొన్న-కొనిన-'పద్వాదులనవర్ణకంబున కత్వంబును గడ హల్లునకు ద్విత్వంబును విభాషనగు.' బాల.క్రియ.51. జగత్+జనులు-జగద్+జనులు, జగజ్జనులు. కొందురె-కొను+దు+రు+ఎ-'తి దు ట లు పరంబులగునపు డన్వాదుల మస్థానంబున సున్నయు నుండు డు లోపంబును విభాషనగు,' బా.క్రి.58.కొందురు+ఎ-అపదాదిస్వరసంధి. బాల. సంధి. 11,

వ. అనిన విని సతీదేవి కోపోద్దీపితచిత్తయై. 35

అర్థము: అనినన్=అని.దక్షుఁడనఁగా, విని, సతీదేవి, కోప+ఉద్దీపిత-చిత్త+ఐ=కోపముచేత, మిక్కిలిప్రజ్వలించిన, మనస్సుగలదియై.

తాత్పర్యము : అని దక్షుఁడు పలుకఁగా సతీదేవి విని కోపముచేఁ బ్రజ్వలించు మనస్సుగలదియై -తరువాతి పద్యముతో నన్వయము,

చ. 'అఱిముఱి రుద్రు నెంతచెడనాడెదు ? సోమముఁ ద్రాగియున్కి మై
యెఱుఁగక బిట్టెదో ? కలయ నిమ్మఖధూమము గప్పికొన్నఁ దు
త్తుఱుగొని ప్రేలెదో ? ముదిసి దుర్మతివై కడు విభ్రమించి మై
మఱచితొ ? కాలకాలు నజమస్తకసంహరు నిట్లు పల్కెదే !' 36

అర్థము : అఱిముఱి=అనాలోచితముగా, రుద్రున్=శివుని, ఎంత,చెడన్+అడెదు=ఎంతగా నిందింతువు, సోమమున్=సోమరసమును, త్రాగి+ఉన్కిన్=త్రాగియుండుటచేత, మై=ఒడలు, ఎఱుఁగక, బిట్టెదు+ఓ=గర్వించెదవో, కలయన్=అంతటను, ఈ+మఖ-ధూమము=ఈ జన్నపుఁబొగ, కప్పికొన్నన్=క్రమ్ముకొనఁగా, తుత్తుఱు + కొని = కలుషిత మయి, గొంతుకట్టుకొని (సూ. రా. కవి.) ప్రేలెదో, ముదిసి = ముసలివాఁడవయి, దుర్మతివి + ఐ=దుర్బుద్ధి వయి, కడున,=మిక్కిలి విభ్రమించి=మిక్కిలి భ్రాంతిఁజెంది, మై - మఱచితొ=ఒడలు మఱచితివో, కాల-కాలున్=యమునకు యముఁడైన వానిని- శివుని. అజ- మస్తక-సంహరున్ = బ్రహ్మశిరస్సును ఖండించినవానినిగూర్చి, ఇట్లు, పల్కెదే- (పల్కెదవు + ఏ) = ఇట్లు మాటాడుదువా ?

తాత్పర్యము : 'అనాలోచితముగా రుద్రు నెంత నిందించితివి ? సోమరసమును ద్రాగియుండుటచే నొడలుతెలియక గర్వింతువా ? ఈ జన్నపుఁబొగ యంతట వ్యాపించి వికలమనస్కుఁడ వయి ప్రేలెదవో ! ముసలితనమున దుర్బుద్ధిగలిగి మిక్కిలి భ్రాంతిఁ జెంది యొడలు మఱచితివో ! యమునకు యముఁడైనవానిని, బ్రహ్మపంచమశిరస్సును ఖండించినవానిని ఈ రీతిగా నిందింతువా ?'

విశేషములు ; బిట్టు ధాతువు సూ.ని.లోఁ గానరాలేదు. ప్రకరణము ననుసరించి యర్థము చెప్పఁబడినది. చెడనాడెదు, బిట్టెదో, ప్రేలెదో, మఱచితితో, -పల్కెదే అన్నిటను ట్లిడ్లాట్టుల వకారమునకు లోపము (బాల.క్రియ.24,)

మ. 'అమృతాంభోధి మథింప మందర మనంతాహీశుఁ దేఁ బంచె, శై
లముఁ దాల్పన్ హరిఁ బంచె,మీఁద నజు నిల్వం బంచె, వాసుక్యుఁ గ
వ్వము త్రాడై గిరిసుట్టఁబంచె,వడిఁ దివ్వంబంచె దేవాసురౌ
ఘము, సర్వేశుఁడు రాజుగాఁడె? యెఱుఁగంగా రాదె నీ కెమ్మెయిన్ ? '37

అర్థము: సర్వ+ఈశుఁడు=సకలాధీశుఁడైన యీశ్వరుఁడు, అమృత+అంభోధిన్=క్షీరసముద్రమును, మథింపన్=చిలుకుటకు, అనంత+అహి+ఈశున్=శేషుఁ డను నాగరాజును, మందరము=మందరపర్వతము, తేన్=తెచ్చుటకు, పంచెన్=ఆదేశించెను, హరిన్=విష్ణువును, శైలమున్=కొండను, తాల్పన్=వహించుటకు, పంచెన్, అజున్=బ్రహ్మను, మీఁదన్=ఆ కొండమీఁద. నిల్వన్, పంచెన్, వాసుక్యున్=వాసుకేయుని,(వాసుకిని,)కవ్వము-త్రాడు+ఐ=తరిత్రాడయి,గిరి=కొండ, చుట్టన్=చుట్టుటకు, పంచెన్, దేవ+అసుర+ఓఘమున్=దేవతలయు, రాక్షసులయు సమూహమును, వడిన్=వేగముగా, తివ్వన్=లాగుటకు, పంచెన్, (అట్టి యతఁడు), రాజు,కాఁడే, నీకున్, ఏ+మెయిన్=ఏ విధముగను,ఎఱుఁగంగాన్, రాదె=తెలియరాదా?

తాత్పర్యము: 'క్షీరసముద్రమును మథింప మందరపర్వతమును దీసికొని రా శేషుఁ డను నాగరాజును ఆదేశించెను. హరిని గొండను దాల్పఁ బంచెను. అది యిటునటు దొలఁగకుండ దానిపై బ్రహ్మ నుండఁ బంచెను. వాసుకిని గవ్వపుఁ ద్రాడయి కొండను జుట్టఁ బంచెను. దానిని వడిగాఁ ద్రిప్ప దేవాసురసమూహమును బంచెను. అట్టి సర్వేశ్వరుఁడు రాజు కాఁడా ? నీ కాతఁ డే విధముగను తెలియరాఁడా?'

విశేషములు: వాసుక్యుఁడు-వసుకుఁ డనువాని కొడుకు-వాసుకి, గిరి+చుట్టన్- 'ప్రథమమీఁది పరుషములకు గ స డ ద వ లు బహుళముగా నగు.' బా.సం.13-గిరి సుట్టన్. దేవ+అసుర-సవర్ణదీర్ఘసంధి, దేవాసుర+ఓఘము=దేవాసురౌఘము = వృద్ధిసంధి. సర్వ+ఈశుఁడు=సర్వేశుఁడు-గుణసంధి. ఏ+మెయిన్=ఎమ్మెయిన్-త్రికసంధి. తిగుచు+చుజీ=తివ్వన్. 'తిగుచు ధాతువు నన్నంతరూపములు తివ్వఁ దివ నగును.' ప్రౌఢ.క్రియ.20.

సీ. 'విశ్వంబు కావింప విశ్వాత్ముఁడై యష్ట
తనువులు సేకొని తనరు వాని,
నురులింగరూపమై హరివేధలకుఁ దన
కడ గానరాకున్న పొడవువాని,
శరణార్థులకు దయావరము లీ నైశ్వర్య
మూర్తి సేకొనియున్న కీర్తివాని.
వార కనేకావతారముల్ హరి కురు
కల్పంబు లజునకుఁ గఱపువానిఁ

తే. దా నచింత్యుఁ డనంతుఁ డనూనదాన
నిరతుఁ డక్షయుఁ డన నున్న పరముఁ బరమ
యోగి నిశ్చల నిర్మల యోగ బుద్ధి
నెఱుఁగఁగా కీశు మహిమ నీ కెఱుఁగ లావె ?' 38

అర్థము ; విశ్వంబు, కావింపన్, విశ్వ+ఆత్ముఁడు+ఐ=సర్వాత్ముఁడై, అష్ట-తనువులు=ఎనిమిది శరీరములు (పంచభూతములుఁ సూర్యచంద్రులు, యజమానుఁడు), చేకొని=స్వీకరించి, తనరువానిన్=ఒప్పువానిని.

ఉరు-లింగ-రూపము+ఐ=పెద్ద లింగము నాకారమయి, హరి-వేధలకున్=విష్ణువునకును, బ్రహ్మకును. తన, కడ=అంతము, కాన-రాక+ఉన్న=కనఁబడని యట్టి, పొడవు-వానిన్=రూపము గలవానిని,

శరణ+అర్థులకున్=శరణు గోరువారికి, దయా-వరములు=అనుగ్రహముతోడి వరములు, ఈన్=ఇచ్చుటకు, ఐశ్వర్య-మూర్తి=ఈశ్వరభావముయొక్క స్వరూపము, చేకొని+ఉన్న=స్వీకరించియున్న, కీర్తివానిన్=కీర్తి గలవానిని.

వారక=తప్పక, అనేక+అవతారముల్=పెక్కవతారములు, హరికిన్=విష్ణువునకు, ఉరు-కల్పంబులు= గొప్ప సంకల్పములు, అజునకున్=బ్రహ్మకు, కఱపువానిన్=బోధించువానిని,

తాను, అచింత్యుఁడు=చింతింపరానివాఁడు, అనంతుఁడు=అంతములేనివాఁడు, అనాస-దాన-నిరతుఁడు=లెక్కింపరాని దానమునందు ఆసక్తి గలవాఁడు, అక్షయుఁడు=నాశనములేనివాఁడు, అనన్, ఉన్న, పరమున్=ఉత్కృష్టుని, పరమ-యోగిన్=గొప్పయోగిని, నిశ్చల-నిర్మల-యోగ-బుద్ధిన్=స్థిరము, స్వచ్ఛము నైన యోగముతోడి మనస్సుతో, ఎఱుఁగన్+కాక=తెలియుటకు శక్యముకాని. ఈశ-మహిమ=ఈశ్వరుని గొప్పతనము, నీకున్, ఎఱుఁగన్=తెలియుటకు, లావె=తరమా?

తాత్పర్యము: 'లోకమును సృజింప విశ్వాత్ముఁడై యెనిమిది శరీరములు స్వీకరించి యుండువాఁడును, గొప్ప లింగము నాకారమయి విష్ణువునకు బ్రహ్మకుఁ దన అంతు తెలియరాని రూపము గలవాఁడును, శరణన్నవారికి దయతో వరము లిచ్చుట కీశ్వరరూపమును గైకొన్న కీర్తి గలవాఁడును, విష్ణునకుఁ బెక్కవతారములును, బ్రహ్మకు గొప్ప సంకల్పములును దప్పక బోధించువాఁడును, చింతింపరానివాఁడును- ఇంతటివాఁడని ఊహింప శక్యముగానివాఁడును, అంతము లేనివాఁడును, గొప్ప దాన గుణమునం దాసక్తి గలవాఁడును, నాశనరహితుఁడును అన నొప్పు పరముని=ఉత్కృష్టుని, గొప్ప యోగిని నిశ్చలము, నిర్మలము నైన యోగబుద్ధితో నెఱుఁగ శక్యముగాని, యీశ్వరుని మహిమ నీకుఁ దెలియశక్యమా;' శక్యము కాదని భావము.

వ. అనిన విని దక్షప్రజాపతి పశుపతి వేదబాహ్యుం డని తన పట్టిన ప్రతినయ పట్టి క్రాలుచు వెండియు ననేకప్రకారంబుల దూషించు చున్న విని సతీదేవి హరి పరమేష్ఠి పురందర బృందారక ముని బృందంబుల వేదంబుల ననిలంబులం జూచి 'పరమేశ్వరుండు మఖం బులం దపూజ్యుండే?' యనిన విని భయంబున నడునడునడుంకుచు దక్షు నిరాకరించి సమస్త లోకాగమంబులకుం గర్తయుం గర్మఫల ప్రదాతయు మఖప్రయోగాద్యఖిల పూజాస్థానంబులయందు నీశ్వ రుండు పూజ్యుండుగాఁ బ్రతిష్ఠించి బ్రహ్మవిష్ణువు లిట్లనిరి. 39

అర్థము: అనినన్, విని, దక్షప్రజాపతి, పశుపతి=ఈశ్వరుఁడు, వేద-బాహ్యుండు=వేదములకు వెలియైనవాఁడు, అని, తన పట్టిన=తాను పట్టిన, ప్రతిన+అ=ప్రతిజ్ఞయే, పట్టి=పట్టుకొని, క్రాలుచున్=ఒప్పుచు, వెండియున్=మఱియును,

అనేక-ప్రకారంబులన్ = పెక్కురీతుల. దూషించుచున్+ఉన్నన్=నిందించుచుండ. విని, సతీ-దేవి, హరి-పరమేష్ఠి-పురందర-బృందారక, ముని-బృందబులన్=విష్ణువును. ఇంద్రుని, దేవతలయు మునులయు సమూహములను, వేదంబులన్=వేదములను. అనలంబులన్=అగ్నులను, చూచి, పరమేశ్వరుండు, మఖంబులందున్=యజ్ఞములందు. అపూజ్యుండు+ఏ=పూజింపఁదగనివాఁడా, అనినన్, విని, భయంబునన్=వెఱపుతో, నడునడు నడుంకుచున్=నడునడమని వణఁకుచు, దక్షున్=దక్షుని, నిరాకరించి= కాదని. సమస్త-లోక+ఆగమంబులకున్=ఎల్లలోకముల రాకకు, కర్తయున్=చేయు వాఁడును-ఎల్లలోకములను నిర్మించువాఁడును, కర్మ-ఫల-ప్రదాతయున్=పుణ్యపాప కర్మముల ఫలముల నిచ్చువాఁడును, మఖ-ప్రయోగ+ఆది+అఖిల-పూజా-స్థానంబుల యందున్=యజ్ఞముల నాచరించుట మున్నగు నెల్ల గౌరవస్థానములందును. ఈశ్వరుండు, పూజ్యుండు+కాన్=పూజింపఁదగినవాఁడుగా, ప్రతిష్ఠించి=స్థాపించి. బ్రహ్మవిష్ణువులు, ఇట్లు+అనిరి.

తాత్పర్యము : అని సతీదేవి పలుకఁగా దక్షుఁడు విని యీశ్వరుఁడు వేదము లకు వెలియైన వాఁడను తన పూర్వపక్ష పీఠిక యింకను పెక్కురీతుల నిందించు చుండఁగా, విని సతీదేవి విష్ణుని, బ్రహ్మను, ఇంద్రుని, దేవతలను, మునులను, వేదములను, అగ్నులను జూచి 'పరమేశ్వరుఁడు యజ్ఞములందుఁబూజింపరానివాఁడా?' యని యడుగ, బ్రహ్మ విష్ణువులు భయమున వణఁకుచు, దక్షునిఁ గాదని, యీశ్వరుఁడు సమస్తలోకములకు సృష్టికర్తయు, కర్మ ఫలముల నిచ్చువాఁడును, యజ్ఞాదులైన యెల్ల గౌరవ స్థానములందుఁ బూజనీయుఁడును, అని స్థాపించి యిట్లు పలికిరి.

విశేషములు : నడునడు-నడుఁకుట= వణఁకుట యందలి యనుకరణము, ఆది+అఖిల=ఆద్యఖిల-యణాదేశ సంధి-ఇ, ఉ, ఋ, ౡ లకు అసవర్ణములైన అచ్చులు పరము లగునపుడు వరుసగా య్, వ్, ర్, ల్ వర్ణములు ఆదేశము లగును.

క. 'ఏ మాదిమూర్తి దక్షిణ
వామాంగములందుఁ బుట్టి వారక జననో
ద్దామ పరిపాలనాది మ
హా మహిమలు వొందఁగంటి మా శివు కరుణన్.' 40

అర్థము: ఏము=మేము, ఆ-శివు-కరుణన్=ఆ శివుని దయచేత, ఆది. మూర్తి=మొదటిమూర్తియొక్క, దక్షిణ-వామ+అంగముల+అందున్=కుడి ఎడమ మేనులందు, పుట్టి, వారక=తప్పక, జనన=సృష్టి, ఉద్దామ=గొప్ప, పరిపాలన+ఆది. మహత్ (మహా) - మహిమలు=పరిపాలించుట మున్నగు గొప్ప ప్రభావములు, పొందన్+కంటిమి=పొందఁగలిగితిమి.

తాత్పర్యము: 'మేము ఆ శివుని దయచే మొదటి మూర్తి కుడి యెడమ భాగములందుఁ బుట్టి సృష్టిచేయుట, బాగుగాఁ బరిపాలించుట మున్నగు గొప్ప మహిమలు పొందఁగలిగితిమి.'

విశేషములు: బ్రహ్మ విష్ణువులు క్రమముగా దక్షిణ వామాంగములందు, అని క్రమమును జెప్పుటచే యథాసంఖ్యాలంకారము.

## సతీదేవి దహనము

వ. అని యందఱుం బ్రత్యేకంబ యివ్విధంబునం బలికిన విని దక్షుం డందఱ నాక్షేపించి 'మీరు భిక్షువలని భయంబున దాక్షాయణి పక్షంబునం బలికినం గర్మబాహ్యుండైన పాషండుండు పూజ్యుం డగునే?' యని యెవ్వరిం గైకొనక మీఁదులేక పలికిన సతీదేవి కోపోద్దీపిత హృదయయై. 41

అర్థము: అని, అందఱున్, ప్రత్యేకంబు + అ = ఒక్కొక్కరే, ఈ + విధంబునన్, పలికినన్ = పలుకఁగా, విని, దక్షుండు, అందఱన్, ఆక్షేపించి, మీరు భిక్షువలని = మొదటి భిక్షువైన శివుని వలని, భయంబునన్, దాక్షాయణి-పక్షంబునన్= సతి వైపున. పలికినన్ = పలికినచో, కర్మ - బాహ్యుండు = యజ్ఞాది కర్మములకు వెలిపైనవాఁడు, ఐన, పాషండుండు = వేదబాహ్యుఁడు, పూజ్యుండు, అగునే, అని, ఎవ్వరిన్, కైకొనక = లెక్కచేయక, మీఁదు - లేక=ఎదురులేక, పలికినన్= పలుకఁగా, సతీదేవి, కోప+ ఉద్దీపిత - హృదయ + ఐ = కోపముచేత, మండిన హృదయము గలదియై,

తాత్పర్యము: అని యందఱును ప్రత్యేకముగా నీ విధమునఁ బలుకఁగా దక్షుఁడు విని, యందఱ నధిక్షేపించి, మీరు ఆదిభిక్షువైన శివునివలని భయమున సతి కనుకూలముగాఁ బలికినను, 'యజ్ఞాదికర్మములకు వెలియైన వేదబాహ్యుఁడు పూజ సేయుఁదగునా?' యని యెవ్వరిని లెక్కచేయక, ఎదురులేక పల్కఁగా, సతీదేవి కోపమున మండుచున్న హృదయము గలదియై,

తే. ........................................

.... దక్ష నాహుతి గొన నెగయునట్లు
నడరి మేనిలోఁ దనరు కోపాగ్ని ధూమ
సమితి ముడివడి వదనరంధ్రముల వెడలె. 42

అర్థము: ఈ పద్యము వా, ప్రతిలో 41 వ గద్యముననే గద్యముగా నున్నది.

దక్ష + ఆహుతి = దక్షుఁ డొనరించు నాహుతిని, కొనన్=గ్రహించుటకు, నెగయు + అట్లున్ = ఎగురు విధమునను, అడరి =విజృంభించి, మేనిలోన్ = శరీరమునందు, తనరు = ఒప్పునట్టి, కోప + అగ్ని =కోపమనెడి అగ్నియొక్క, ధూమ-సమితి = పొగల గుంపు, ముడి + పడి=వ్యాపించి, వదన-రంధ్రములన్ = ముఖరంధ్రములనుండి, వెడలెన్ = వెలికివచ్చెను.

తాత్పర్యము; దక్షుఁ డొనరించు నాహుతిని గ్రహించుటకుఁ బైకి వచ్చునట్లు, విజృంభించి శరీరములో నొప్పు కోపమనెడి యగ్ని పొగల గుంపు వ్యాపించి ఆమె ముఖరంధ్రములనుండి పైకి వెడలెను.

విశేషములు: దక్ష నాహుతిగొన నెగయునట్లు - అలంకార ముత్ప్రేక్ష. కోపాగ్ని - కోపమనెడి యగ్ని - రూపకము,

దక్ష+ఆహుతి - 'షష్ఠీసమాసమునం దుకార ఋకారముల కచ్చు పరమగు నపుడు నుగాగమంబగు,' బాల. సంధి- 34. దక్షునాహుతి. నెగయు + అట్లు-'ఉదంత

మగు లద్ధర్మార్థ విశేషణమున కచ్చు పరమగునపుడు సుగాగమం బగు.' బాల. సంధి. 33. వదనరంధ్రముల వెడలె - వదనరంధ్రములవలన నుండి వెడలె. 'అపాయ భయ జుగుప్సా పరాజయ ప్రమాద గ్రహణ భవన త్రాణ విరా మాంతర్ధి వారణంబు లైదాన నగు దానికి వలన వర్ణకం బగు.' బాల. కారక. 9. 'ఉండి పదం బొకానొకచో వలన వర్ణకంబున కసుప్రయుక్తంబగు.' బాల. కారక. 10. 'ఉండి శబ్దము పరం బగు నప్పుడు వలనకు ద్వితీయా సప్తములు ప్రాయికంబుగ నగు.' బాల. కారక. 11. 'వలన కాదేశంబగు ద్వితీయా సప్తముల మీఁది యుండికి లోపంబు బహుళంబుగా నగు' ప్రౌఢ. కారక. 11.

ఆ. అధిపుఁ బలుకఁ బలుక నదరి యాకాశంబు
దాఁకి సతి మనమునఁ దరతరంబ
మాన కగ్నిలోన మలఁగ నే వోసిన
మాడ్కిఁ గోపవహ్ని మండి యెగసె. 43

అర్థము: అధిపున్ = భర్తను, పలుకన్ + పలుకన్ = నిందింపఁగా నిందింపఁగా, కోపవహ్ని = కోపమనెడి అగ్ని, అదరి = అతిశయించి, ఆకాశంబు - తాఁకి = మిన్నంటి - విజృంభించి, మానక = విడువక. అగ్నిలోనన్ = అగ్నిలో, మలఁగన్ = ప్రజ్వలింపుటకు, నే + వోసిన - మాడ్కిన్=నేయి పోసిన విధమున, సతి-మనమునన్ = సతీదేవి మనస్సునందు, తరతరంబు + అ=మిక్కిలి, మండి, ఎగసెన్ = మీఁదికి వ్యాపించెను.

తాత్పర్యము: భర్తను నిందింపఁగా నింధింపఁగాఁ గోపాగ్ని మిన్నంటి, ప్రజ్వలింపుట కగ్నిలో నేయి పోసిన విధమున, సతి మనస్సున మిక్కిలి మండి యెగసెను.

విశేషములు; కోపవహ్ని = కోపమనెడి వహ్ని-రూపకాలంకారము, అగ్ని లోన మలఁగ నే వోసిన మాడ్కి మండి యెగసె-అలంకార ముపమ. తన భర్తను ఓడువరేవనిచే సతి మనమునఁ గోపవహ్ని యుండెను, అతనిని మిక్కిలి నిందించుటచే వది నేయి పోసినట్లు ఇంకను మండి యెగసెను.

నేయి, నెయ్యి, నే - రూపాంతరములు, 'నే' యను రూపము ప్రథమైకవచన మందును, సమాసమునందును గాన్పించుచున్నది. - సూ. ని, నే + వోసిన - నే

వోసిన - గ స డ ద వాదేశము - బాల. సంధి, 13. మనము - మనస్సు - మనసు, రూపాంతరములు, 'సాంతంబుల తుది సకారంబునకు లోపంబు బహుళంబుగా నగు,' బాల, తత్సమ. 80. మన. 'అమహన్నపుంసకముల కదంతంబులకు ముపర్ణకం బగు.' మనము. బాల. తత్సమ. 39.

క. తన పతిఁ జెట్టలు పలికిన
జనకుం గని కోపవహ్ని సతి దేహము భో
రన మండె భానుఁ గని కెం
పున మండెడు సూర్యకాంతపుత్త్రిక పోలెన్. 44

అర్థము ; తన - పతిన్ = తన భర్తను, చెట్టలు = నిందలు, పలికిన = పలికినట్టి, జనకున్ = తండ్రిని - దక్షుని, కని = చూచి, కోప - వహ్నిన్ = కోప మనెడి యగ్నిచేత, సతి - దేహము = సతీదేవి మేను, భానున్ = సూర్యుని, కని, కెంపునన్ = ఎఱ్ఱఁదనముతో - కైఁపునన్ అని పాఠాంతరము గలదు. అప్పుడు - విజృంభణముతో, మండెడు = మండునట్టి, సూర్యకాంతపుత్త్రిక + పోలెన్=సూర్య కాంతమణిమయమైన బొమ్మవలె, భోరనన్ = శీఘ్రముగా, మండెన్.

తాత్పర్యము : తన భర్తను నిందించిన తండ్రిని జూడఁగా సతీదేవి శరీరము కోపాగ్నిచే - సూర్యునిఁజూడ నెఱ్ఱగాఁ (మిక్కిలిగా) గాలిపోవు సూర్యకాంతిమణి మయమైన బొమ్మవలెఁ - గాలిపోయెను.

విశేషములు : అలంకారము ముపమ. కోపవహ్ని = కోపమనెడి వహ్ని - రూపకము. పుత్త్రిక + పోలెన్ - గసడదవాదేశము-పుత్త్రికవోలెన్. బాల. సంధి. 13.

ఆ. అధిపుఁ జెట్టలాడె నని దక్షుఁ గని సతి
కదరు కోపవహ్ని నొడలు గాలెఁ;
వగవ నట్టె[1] యెట్టి వారికిఁ బ్రియ నిరా
కరులఁ గాంచి యొడలు గాలకున్నె? 45

1. సా. ప్రతి. నట్ల.

అర్థము : అధిక్షేపన్ = భర్త్సను, చెట్టలు + ఆడెన్ = నిందించెను, అని వీక్షన్ = వీక్షని, కని = చూచి, సతికిన్ = సతీదేవికి, అడరు = అతిశయించునట్టి కోప - వహ్నిన్ = కోపమనెడి అగ్నిచే, ఒడలు = శరీరము, కాలెన్, వగవన్ = చింతింపఁగా, అట్టు + ఎ = అట్లే, ఆలోచింపఁగా నది యట్లే యగు ననుట, ఎట్టి వారికిన్ = ఎంతటివారికైనను, ప్రియ - నిరాకరులన్ = ఇష్టులను నిరాకరించు వారిని, కాంచి = చూచినచో, ఒడలు = మేను, కాలక + ఉన్నె = కాలకుండునా? తప్పక కాలునని భావము,

విశేషములు ; కోపవహ్ని-రూపకము, ఇందు విశేషాంశము సామాన్యాంశముచే సమర్థింపఁబడుచున్నది కావున నలంకార మర్థాంతరన్యాసము. కాంచి = కాంచినచో - 'ఒక్కొకచో ధాత్వర్థకాసమాపకక్రియ హేత్వర్థకంబు నగు.' ప్రౌఢ, క్రియా. 15, ఉన్నె - ఉండునె - 'ఒకానొకచోఁ దద్ధర్మార్థకంబులగు నుండు, చను, మొదలగునవి ప్రశ్నార్థకై కాలవాచకంబు లగునపుడు వాని కడ యచ్చులకు లోపంబు విభాష నగు. అగుచో నుండు డకారంబునకు నకారంబగు - ఉండు + ఎ = ఉన్నె. ప్రౌఢ. క్రియ, 2.

చ. పోలయు నశోకవల్లి విరిపువ్వుల గుత్తులమీఁదఁ గ్రాలు కెం
దలిరులొ నాఁగ మైఁ నడరి దండడి వహ్నిశిఖాకలాపముల్
గలగొనఁ బ్రేలి దూలికొని కాలె రయంబున లక్కబొమ్మ న
గ్గల మగు వహ్ని చుట్టుకొని కాలు రయంబున నిస్తుషంబుగాన్. 46

అర్థము : పోలయు = ఒప్పునట్టి, అశోక-వల్లి - విరి - పువ్వుల - గుత్తల మీఁదన్ = అశోకలతయొక్క వికసించిన పూలగుత్తులపై, క్రాలు = ప్రకాశించునట్టి, కెంపుటలిరులు + ఐ (కెంపు+తలిరులు) = ఎఱ్ఱని చిగురులో, నాఁగన్ = అనునట్లు, మైన్ = శరీరమునందు, వహ్ని-శిఖా-కలాపముల్ = అగ్నిజ్వాలల సమూహములు, దండడిన్ = అధికముగా, అదరి = విజృంభించి, కలగొనన్ = వ్యాపింపఁగా, ప్రేలి = వేఁగి బ్రద్దలయి, తూలి - కొని = వ్రాలి - లక్క బొమ్మన్ = లక్కతోఁ జేయఁబడిన బొమ్మను, అగ్గలము + అగు = అధికమైన, వహ్ని = అగ్ని, చుట్టుకొని, నిస్తుషంబుగాన్ = ఊఁకగూడ లేకుండునట్లుగా, కాలు - రయంబునన్ = కాలునట్టి వేగముతో, రయంబునన్ = వడితో, కాలెన్,

తాత్పర్యము : అశోకలత పూచిన పూలగుత్తులపైఁ బ్రకాశించు నెఱ్ఱని చిగురులో యన సతీదేవి శరీరమున అగ్నిజ్వాలల సమూహములు మిక్కిలి యెక్కువగా వ్యాపింపఁగాఁ బ్రేలి వ్రాలి లక్కబొమ్మను అధికమగు నిప్పు చుట్టుకొని ఊఁకకూడ లేకుండునట్లుగాఁ గాలెడి వేగముతో వడిగాఁ గాలెను.

విశేషములు : అశోకవల్లి....కెందలిరులో నాఁగ....అలంకార ముత్ప్రేక్ష, లక్కబొమ్మ నగ్గలమగు .... నిస్తుషంబుగన్-అలంకార ముపమ. కాలు రయంబున-కాలె రయంబున - 'రయంబున' అనునది పునరుక్తమయినది. రయంబునన్ అను దానికి పూర్వవ్యాఖ్యలో నున్న 'అట్లు' అను నర్థము కానరాదు. అందుచే లక్కబొమ్మ కాలు వేగముతో - సతి మేను వేగముతోఁ గాలె నని యర్థము చెప్పఁబడినది. తూలి కొను = వ్రాలు, పడు. 'కొను' స్వార్థమునఁ బ్రయుక్తము.

కెందలిరులు - కెంపు+తలిరులు - 'సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చు మీఁది వర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు.' కె + తలిరులు. బాల. సంధి. 36, 'లుప్తశేషంబునకుం బరుషములు పరము లగునపుడు నుగాగమంబగు. బాల. సంధి, 37. కె+ను+తలిరులు. పిమ్మట ద్రుతకార్యము, బాల. సంధి. 16.17. కెందలిరులు.

వ. త దవసరంబున. 47

అర్థము : తద్ + అవసరంబునన్ = ఆ సమయమునందు. తరువాతి పద్యముతో నన్వయము.

క. ఘోరన నుడుగక చెలఁగు త్ర
యీరవముల పెల్లు సెడి మహీసుర ముని బృం
దారక తతి దెస నురు హా
హారవములు సెలఁగెఁ దన్మఖాగారములన్. 48

అర్థము : తద్ + మఖ + అగారములన్ = ఆతని (దక్షుని), యజ్ఞ గృహములందు. మహీసుర - ముని - బృందారక-తతి-దెసన్ = బ్రాహ్మణులయు, మునులయు, దేవతలయు సమూహము విషయమున, ఘోరనన్ = ఎక్కువగా, ఉడుగక =

మానస, చెలఁగు = మ్రోయు, త్రయీ - రవముల - పెల్లు = ఋగ్యజుస్సామము లనెడి మూఁడు వేదముల ఘోషాతిశయము, చెడి = పోయి, ఉరు-హాహా-రవములు = గొప్ప హాహాకారములు, చెలఁగెన్ = మ్రోసెను.

తాత్పర్యము : దక్షుని యజ్ఞవాటికలలో బ్రాహ్మణులును, మునులును, దేవతలును ఋగ్యజుస్సామము లనెడు మూఁడు వేదములను పఠించుట మాని అధికముగా హాహాకారములు చేయఁదొడఁగిరి.

విశేషములు : తద్ + మఖ = య్రరులకు (రహలు తప్ప మిగిలిన పదాంతగత హల్లులకు) అనునాసిక వర్ణము పర మగుచో వానికి సంబంధించిన అనునాసిక వర్ణము వైకల్పికముగా ఆదేశ మగును. - తన్మఖ - తద్మఖ, పెల్లుసెడి = పెల్లు + చెడి, రవములు సెలఁగె .... రవములు + చెలఁగెన్ - గసడదవాదేశములు. బాల. సంధి - 13. త్రయి -ఋగ్యజుస్సామము లనెడు మూఁడువేదములు.

వ. అంతక మున్న కృతాంతాంతకుండు తద్వృత్తాంతంబంతయు నారదు వలన విని సకల భువన సంహారకారణాఖీల కాలాగ్ని రుద్రోద్రేకంబు నభినయించువాఁడునుం బోలెఁ గోపానలోద్దీపితావేష్టితాతిభయంకరాకారంబు దాల్చిన. 49

అర్థము : అంతకున్ + అ - మున్న = అంతకుముందే, కృతాంత + అంతకుండు = యమాంతకుఁడు - శివుఁడు, తద్ + వృత్తాంతంబు + అంతయున్ = ఆ వృత్తాంత మంతయును, నారదువలనన్, విని, సకల .... రుద్రోద్రేకంబునన్, సకల = ఎల్ల, భువన = లోకములయొక్క, సంహార + నాశనమునకు, కారణ = హేతువయిన, ఆఖీల = భయంకరమైన, కాల + అగ్ని = ప్రళయ సమయమునందలి అగ్నియొక్కయు, రుద్ర = ఏకాదశరుద్రులయొక్కయు, ఉద్రేకంబున్ = ఆవేశమును, అభినయించువాఁడునున్ + పోలెన్ = నటించువాని విధమున, కోప + అనల + ఉద్దీపిత + ఆవేష్టిత + అతి - భయంకర + ఆకారంబు = కోపమనెడి అగ్నిచే మిక్కిలి ప్రకాశించు నావేశపూరితమగు మిక్కిలి భయంకరమైన రూపము; దాల్చినన్ = ధరింపఁగా.

తాత్పర్యము : అంతకుముందే శివుఁడు వృత్తాంతమునంతను నారదునివలన విని యెల్ల భువనముల నాశనమునకుఁ గారణమయిన ప్రళయాగ్నిరుద్రుల యావేశము గలవాఁడో యనఁ గోపాగ్నిచేఁ బ్రజ్వలించు నతిభయంకరాకారమును దాల్చెఁగా . తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : వాఁడునుం బోలె-'కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి,' బాల. సంధి. 21, కోపానల . రూపకము. కోపమనెడి అనల.

మహాస్రగ్ధర

వివిధాస్త్రానీకజాతావిరల బహు లసద్విస్ఫులింగాగ్నియుం, ద
త్పవమానాహార వక్త్ర ప్రకటిత విష విభ్రాజితోగ్రానలంబున్,
సవికారాత్మాతికోపోజ్జ్వలతర విపుల జ్వాలియుం గూడి పర్వెన్
భవ ఫాలాభీల నేత్రోద్భవ శిఖి శిఖలన్ బద్మజాండంబు దాఁకన్. 50

అర్థము : వివిధా .... గ్నియున్ : వివిధ = అనేక విధములైన, అస్త్ర = అస్త్రములయొక్క, అనీక = సమూహమునుండి, జాత = పుట్టిన, అవిరల = అధికమైన, బహు = మిక్కిలి, లసత్ = ప్రకాశించుచున్న, విస్ఫులింగ = నిప్పు కణములతోడి, అగ్నియున్ = అగ్నియును, తత్పవమానా .... నలంబున్ : తద్ = ఆ, పవమాన + ఆహార = వాయు వాహారముగాఁ గలవాని - పాములయొక్క, వక్త్ర = ముఖముల నుండి, ప్రకటిత = బయలువెడలిన, విష = విషమనెడి, విభ్రాజిత = ప్రకాశించు, ఉగ్ర = భయంకరమైన, అనలంబున్ = అగ్నియును, సవికారా .... జ్వాలియున్ : స - వికార = వికారముతోఁ గూడిన, ఆత్మ = తన యొక్క, అతి=అధికమైన, కోప = కోపమనెడి, ఉజ్జ్వలతర మిక్కిలి ప్రకాశించు, విపుల = విస్తారమైన, జ్వాలియున్ = అగ్నియును, భవ .... శిఖలన్ : భవ = ఈశ్వరుని యొక్క, ఫాల = నొసటియందలి, అభీల = భయంకరమైన, నేత్ర = కంటినుండి, ఉద్భవ = పుట్టుకగల-పుట్టిన, శిఖి=అగ్నియొక్క, శిఖలన్=జ్వాలలతో, కూడి = కలిసి, పద్మజ + అండంబు=బ్రహ్మాండము, తాఁకన్=స్పృశించునట్లు, పర్వెన్ = వ్యాపించెను.

తాత్పర్యము: అనేకవిధములయిన అస్త్రసముదాయమునుండి పుట్టిన మిక్కిలి ప్రకాశించు నిప్పుకణములతోడి అగ్నియును, సర్పముఖములనుండి వెలువడు విషమనెడి భయంకరాగ్నియును, దనకోపమనెడి ప్రకాశించు నగ్నియును శివుని నొసటి కంటి నుండి పుట్టిన అగ్నిజ్వాలలతోఁగూడి బ్రహ్మాండమును స్పృశింప వ్యాపించెను.

విశేషములు: అస్త్రజాతాగ్ని, సర్పముఖప్రకటితాగ్ని, నిజకోపాగ్ని - ఈ మూఁడగ్నులును శివుని ఫాలోద్భవాగ్నితోఁ గూడినవి. ఇందొక్కొక్కటియే బ్రహ్మాండమును దాఁక సమర్థములు, అన్నియుఁ గూడిన వేఱ చెప్పవలయునా? ఫాల-భాల - రూపాంతరములు, జ్వాలలు గలది జ్వాలి = అగ్ని. మహాస్రగ్ధర లక్షణమునకు పూర్వవ్యాఖ్య చూచునది.

వ. తదవసరంబునన్ = ఆ సమయమున - తరువాతి పద్యముతో నన్వయము. 51

చ. ఖురపదఘట్టనన్ ధరణి గ్రుంగ, ఫణీంద్రుఁడు నుగ్గునుగ్గుగాఁ,
బరువడి [1]సుర్వులం దెరలి పాఱఁ బయోనిధులుం గులాద్రులుం
[2]బొరిఁబొరిఁ ద్రుంగ, శృంగహతిఁ బొంద దివంబు నజాండమున్, మహే
శ్వర వృషభంబు నా క్షణమ వచ్చెఁ ద్రిలోకభయంకరాకృతిన్. 52

అర్థము: ఖుర - పద - ఘట్టనన్ = గిట్టలతోడి కాళ్ల రాయిడిచే, ధరణి = భూమి, క్రుంగన్ = అడఁగఁగా, ఫణి + ఇంద్రుఁడున్ = సర్పరాజగు ఆదిశేషుఁడును, నుగ్గునుగ్గు + కాన్ = పిండిపిండికాఁగా, పయోనిధులున్ = సముద్రములును, పరువడిన్ = వేగముగా, సుర్వులన్ = సుడుఁగులతో, తెరలి = పొంగి, పాఱన్ = ప్రవహింపఁగా, కుల + అద్రులున్ కులపర్వతములును, పొరిఁబొరిన్ = అత్యంతము, త్రుంగన్ = తునుకలు కాఁగా, దివంబున్ = స్వర్గమును, అజాండమున్ = బ్రహ్మాండమును, శృంగ - హతిన్ = కొమ్ముల దెబ్బను, పొందినన్ = పొందఁగా, మహేశ్వరు - వృషభంబు = శివుని యెద్దు, త్రిలోక - భయంకర + ఆకృతిన్ = ముల్లోకములకు భయము గలిగించు రూపముతో, ఆ క్షణము + అ = ఆ నిముసమునందే, వచ్చెన్.

1. సా. ప్రతి, సూప్పులం. 2 సా. ప్రతి. దుంగ,

తాత్పర్యము : గిట్టలతోడి పాదముల త్రొక్కుడిచే భూమి అడఁగఁగా, సర్పరాజగు నాదిశేషుఁడు పిండిపిండికాఁగా, సముద్రములు వేగముగా నురుగులతోఁ బొంగి ప్రవహింపఁగా, కులపర్వతములు మిక్కిలి తునుకలు కాఁగా, స్వర్గమును, బ్రహ్మాండమును కొమ్ముల దెబ్బను బొందఁగా మహేశ్వరుని వాహనమైన యెద్దు ముల్లోకములకు వెఱపు గలిగించు రూపముతో నా క్షణమే వచ్చెను.

విశేషములు: కులాద్రులు - మహేంద్రము, మలయము, సహ్యము, శుక్తిమంతము, గంధమాదనము, వింధ్యము, పారియాత్రము అని యేడు.

వ. అంతఁ బుష్పదంత భృంగిరిట ఘంటాకర్ణ మహాకర్ణ విభోగ వీర
శంకర వీరభద్ర రుద్ర గణాధినాథు లొండొరులఁ గడవ నుద్రేకించి. 53

అర్థము : అంతన్, పుష్పదంతుఁడు, భృంగిరిటుఁడు, ఘంటాకర్ణుఁడు, మహాకర్ణుఁడు, విభోగుఁడు, వీరుఁడు, శంకరుఁడు, వీరభద్రుఁడు, రుద్రుఁడు, అను, గణ + అధినాథులు = గణాధిపతులు, ఒండొరులన్ = ఒకరినొకరు, కడవన్ = అతిశయించునట్లు, ఉద్రేకించి = విజృంభించి.

తాత్పర్యము ; పిమ్మటఁ బుష్పదంతుఁడు, భృంగిరిటుఁడు, ఘంటాకర్ణుఁడు, మహాకర్ణుఁడు, విభోగుఁడు, వీరుఁడు, శంకరుఁడు, వీరభద్రుఁడు, రుద్రుఁడు అను గణనాయకులు ఒకరినొకరు అతిశయించునట్లు విజృంభించి. తరువాతి పద్యముతో నన్వయము,

మ. 'హరి మర్దింతుమొ, బ్రహ్మఁ బట్టుదుమొ, యింద్రాద్యష్టదిక్పాలురం
బరిమారన్ వధియింతుమో, త్రిదశులన్ భంజింతుమో. లోకసం
హరణం బిప్పుడ చేయ నెత్తుదుమొ విశ్వాధీశ్వరుం డీశుఁ డె
వ్వరిపై నల్గెనొ చూడుఁ' డంచుఁ బ్రమథవ్రాతంబు రౌద్రాకృతిన్. 54

అర్థము : హరిన్ = విష్ణువును, మర్దింతుమొ = చిదుకఁగొట్టుదుమో, బ్రహ్మన్ = బ్రహ్మను, పట్టుదుమొ = బంధింతుమో, ఇంద్ర + ఆది + అష్ట- దిశ్ (క్) + పాలురన్ = ఇంద్రుఁడు మున్నగు నెనమండ్రు దిక్పాలకులను, పరి

హరిన్ + పట్టినట్లు, వధియింతుమో = చంపుదుమో, త్రిదశులన్ = దేవతలను, హింసింతుమో = సంహరింతుమో, ఇప్పుడు + అ = ఇప్పుడే, లోక - సంహార కరంబు = లోకసంహారము. చేయన్, ఎత్తుదుమొ = దండెత్తిపోవుదుమో, విశ్వ+ అధి + ఈశ్వరుండు = విశ్వేశ్వరుఁడు, అగు. ఈశుఁడు, ఎవ్వరిపైన్, అగ్గెనో = కోపించెనో, చూడుఁడు, అంచున్, ప్రమథ. వ్రాతంబు = ప్రమథుల సమూహము, ఘోర + ఆకృతిన్ = భయంకరమైన రూపముతో.

తాత్పర్యము : 'విష్ణువును మర్దింతుమో, బ్రహ్మను బంధింతుమో ఇంద్రుఁడు మున్నగు నెనమండ్రు దిక్పాలకులను జంపుదుమో, దేవతలను సంహరింతుమో, ఇప్పుడే లోకనాశనమునుజేయ దండెత్తిపోవుదుమో విశ్వేశ్వరుఁడైన యీశుఁ డెవ్వరిపై, గోపించెనో చూడుఁ' డనుచుఁ బ్రమథగణము భయంకరాకారముతో వెడలి గర్జించె నన్వయము,

విశేషములు : అష్టదిక్పాలురు - ఇంద్రుఁడు, అగ్ని, యముఁడు, వరుణుఁడు, వాయువు, నిరృతి, కుబేరుఁడు, ఈశానుఁడు అని ఎనమండ్రు,

దిక్పాలురు - దిక్పాల + లు - 'అదంతంబయి దీర్ఘపూర్వలోపధంబయిన మహత్తుమీఁది విభక్తి లకారంబునకు రేఫం బగు' దిక్పాల + రు. బాల. తత్సమ, 38, 'పుంలింగంబయి మహద్వాచకంబయిన నామంబు తుది యత్వంబునకుత్వంబగు.' బాల తత్సమ, 21, దిక్పాలురు.

వ. సంక్షోభించి విరూపాక్షుండు దక్షు నాక్షేపించు టెఱింగి పొంగుచు నతి రభసంబునం బరమేశ్వరు ముందఱికి వచ్చి మహాబ్రహ్మప్రళయ వ్యవసాయంబునకు. నురుతరాఘాతసంప్లవోపక్రమంబునకు, ననేక బ్రహ్మాండఖండ విఖండన వ్యాపారంబునకు నే మేమ చాలుదు మనుచున్న గణంబులందు గణముఖ్యులు దలతల మని వెడలి విన్నవించి. 55

అర్థము : సంక్షోభించి = కలఁతపడి, విరూపాక్షుండు = వికృతములైన కన్నులు గలవాఁడు - శివుఁడు, దక్షున్, ఆక్షేపించుట = తిరస్కరించుట, ఎఱింగి,

పొంగుచున్ = గర్వించుచు, అతి-రభసంబునన్=మిక్కిలి కోపముతో, ముందటికిన్, వచ్చి, మహత్ (మహా) + బ్రహ్మ - ప్రళయ - వ్యవసాయంబునకున్ = గొప్పది యగు బ్రహ్మప్రళయమునకైన ప్రయత్నమునకును, ఉరుతర - ఆభీల - సంప్లవ+ ఉపక్రమంబునకున్ = మిక్కిలి గొప్పదియగు పంపుట గల మునుఁగుటయొక్క ఆరంభమునకును, అనేక - బ్రహ్మాండ - ఖండ - విఖండన-వ్యాపారమునకున్= పెక్కు బ్రహ్మాండభాగములను ముక్కలుగాఁ జేయు పనికిని, ఏము + ఏము+అ = మేముమేమే, చాలుదుము=సమర్థులము, అనుచున్+ఉన్న, గణంబుల+అందున్= ప్రమథులందు, గణ - ముఖ్యులు = ప్రమథులలోఁ బ్రధానులు, తలతలమని = తొలఁగుము తొలఁగుము అని, వెడలి, విగుర్వించి = గర్వించి.

తాత్పర్యము: (ప్రమథులు) కలఁగి ముక్కంటి దక్షుని దిరస్కరించుటెఱిఁగి పొంగుచు. మిక్కిలి కోపమునఁ బరమేశ్వరు నెదుటికి వచ్చి మహాబ్రహ్మప్రళయమును గావింపను, సర్వనాశనమును గలిగించు మహాప్రళయమును నారంభింపను, బ్రహ్మాండ ఖండనము నొనరింపను మేమే చాలుదు మనుచున్న ప్రమథగణములలోఁ బ్రధానులు తొలఁగుము తొలఁగు మని వెడలి గర్వించి - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు: తలతలమని - తలము - తలఁగుము. 'ఏలాచు మొదలగు వానికి ముత్తు పరంబగునపుడు కడవ్రాయి బహుళంబుగ లోపించు.' బాల. క్రియ. 101. తలము + తలము - 'ఆమ్రేడితంబు పరంబగునపుడు మధ్యమ ము ముజ్జులకు లోపంబు విభాష నగు.' తలతలము బాల. సంధి. 49.

చ. 'జలజభవాండ మంతయును జర్జరితం బగుచుండ వ్రచ్చి, మున్
గులగిరు లుర్వీమీఁద వడిఁ గూలఁగఁ ద్రోచి, జగంబు లబ్ధులం
గలిపి, మహాబ్ధు లన్నియును గంజభవాండము మేర కక్కఁడన్
వెలువడఁ జల్లి, రౌద్రగతి విశ్వము నిప్పుడ సంహరించెదన్.' 56

అర్థము: జలజభవ+అండము=బ్రహ్మాండము, అంతయును, జర్జరితంబు=తునియలుచేయఁబడినది, అగుచున్ +ఉండన్=అగుచుండఁగా. వ్రచ్చి=ఛేదించి, మున్= ముందుగా, కుల - గిరులు = కులపర్వతము లేడును, ఉర్వీమీఁదన్ = భూమిపై, వడిన్ = వేగముగా, కూలఁగన్ = కూలునట్లు, ద్రోచి, జగంబులు = లోకములు, అబ్ధులన్=సముద్రములందు, కలిపి, మహత్ (మహా) + అబ్ధులు+అన్నియును =

మహాసముద్రము లన్నియును, కంజభవ + అండము - మేరకున్ = బ్రహ్మాండము వఱకు, ఉప్పొంగగన్, వెలువడన్ = అక్కడనుండి వెలువడునట్లు. చల్లి, రౌద్ర-గతిన్ = భయంకరమగు విధమున, ఇప్పుడు + అ = ఇప్పుడే, విశ్వమున్ = ప్రపంచమును, సంహారించెదన్ = నశింపఁజేయుదును,

తాత్పర్యము : 'బ్రహ్మాండమంతయుఁ దూంట్లు పడునట్లు ఛేదింతును, కుల పర్వతములు భూమిపైఁబడి కూలునట్లు త్రోయుదును, లోకములు సముద్రములందుఁ గలుపుదును, మహాసముద్రము లన్నియును బ్రహ్మాండము వఱకును వెలువడునట్లు చల్లి విశ్వము నిప్పుడే భయంకరముగా సంహారింతును,'

క. 'పంకజనాభాద్యమరులఁ
బొంకం బఱఁ బట్టి తెత్తు భూరిబలమునం
గింక జగంబుల మ్రింగుచు
శంకర ! యేఁ గలుగ నీకుఁ జనునే యలుగన్ ?' 57

అర్థము : కింకన్ = కోపముతో, జగంబులన్ = లోకములను, మ్రింగుచున్, భూరి - బలమునన్ = అధికమైన బలముతో, పంకజనాభ + ఆది + అమరులన్ = విష్ణువు మొదలగు దేవతలను, బొంకంబు = గర్వము, అఱన్ = పోవునట్లు, పట్టి - తెత్తున్ = బంధించి తీసికొనివత్తును, శంకర = ఓ శివా !, ఏన్ = నేను, కలుగన్ = ఉండఁగా, నీకున్, అలుగన్ = కోపింపఁగా, చనునే = తగునా ?

తాత్పర్యము : 'నేను లోకములను గోపమున మ్రింగుచు, నధికబలముతో విష్ణుమొదలగు దేవతలను గర్వము పోవ బంధించి తెత్తును. శంకరా ! నే నుండఁగా నీవు కోపింపఁదగునా ?' అని యనుట.

విశేషములు : పంకజనాభ - పంకజము నాభియందుఁ గలవాఁడు - విష్ణువు, బహువ్రీహి సమాసము. బహువ్రీహి సమాసమందు 'నాభి' శబ్దముయొక్క 'ఇ' కారమునకు బహుళముగా అప్రత్యయాదేశము వచ్చును. పంకజనాభ + ఆది = పంకజనాభాది - సవర్ణదీర్ఘసంధి, పంకజనాభాది + అమరులన్ = పంకజనాభాద్యమరులన్ - యణాదేశసంధి, కినుక-కిన్క, కింక (రూపాంతరములు).

గీ. 'ఎలుకతోడి కోపమున ని ల్లేర్చునట్లు
దక్షుపై నల్గి జగమెల్ల నీ క్షణంబ
సంహరింపంగఁ దలఁచుట సన్నె ? వానిఁ
బట్టి తెచ్చెద వడి నన్నుఁ బనుపు దేవ !' 58

అర్థము : దేవ !, ఎలుకతోడి - కోపమునన్ = ఎలుకమీఁది కోపముతో, ఇల్లు, ఏర్చు + అట్లు = కాల్చు విధమున, దక్షుపైన్, అల్గి = కోపించి, జగము + ఎల్లన్ = లోకమంతయు, ఈ క్షణంబు+అ=ఈ క్షణముననే, సంహరింపంగన్ = నశింపఁజేయ, తలఁచుట, చన్నె = చనునా ? తగునా ;, వానిన్, పట్టి. తెచ్చెదన్, వడిన్, నన్నున్, పనుపు = పనుపుము - ఆజ్ఞాపింపుము.

తాత్పర్యము : 'ఎలుకపైఁ గోపమున నిల్లు కాల్చు విధమున, దక్షునిమీఁది కోపమున లోకమునంతను నీ క్షణమే నశింపఁజేయ నెంచుట నీకుఁ దగునా ? దేవా ! వానిని బట్టి తెత్తును. వేగముగా నన్నుఁ బంపుము.'

విశేషములు : ఎలుకతోడి కోపమున నిల్లేర్చునట్లు .... అలంకారము ఉపమ. ఏర్చు + అట్లు - 'ఉదంతమగు తద్ధర్మార్థవిశేషణమున కచ్చు పరమగునపుడు నుగాగమంబగు,' బాల, సంధి. 33, ఏర్చునట్లు. చన్నె - చనునె. 'ఒకానొకచోఁ దద్ధర్మార్థకంబులగు నుండు, చను, చేరుకొనులు ప్రశ్నార్థకైకార పరకంబు లగునపుడు వాని కడ యచ్చులకు లోపంబు విభాష నగు. అగుచో నుండు డకారంబునకు నకారంబగు.' ప్రౌఢ. క్రియ. 2, పనుపు - పనుపుము. 'మధ్యమపురుష ముపర్ణకంబునకు హలవసానంబులు పరంబు లగునపుడు లోపము విభాష నగు.' బాల, సంధి. 47.

షయి పాట లన్నియుఁ బ్రమథు లొక్కొక్కరే యన్నవి. కావుననే యంచటి క్రియ లేకవచనమున నున్నవి.

వ. అని యనేకప్రకారంబులం బ్రత్యేకంబ పలుకుచున్న గణాధిపతుల వారించి గణాధీశ్వరుండు పరమేశ్వరున కభిముఖుండై ప్రళయకాల నీలఘనాఘనంబునుం బోలె మహాధ్వని గర్జిల్లుచు. 59

అర్థము : అని, అనేక - ప్రకారంబులన్ = పెక్కురీతుల, ప్రత్యేకంబు + ఆ = వేర్వేఱే, పలుకుచున్ + ఉన్న = పలుకుచున్నట్టి, గణ + అధిపతులన్ = గణనాయకులను, వారించి = ఆఁపి, గణ + అధి + ఈశ్వరుండు = గణపతి, పరమేశ్వరునకున్, అభిముఖుండు + ఐ = ఎదురయి, ప్రళయ - కాల - నీల - ఘనా - ఘనంబునున్ + పోలెన్ = ప్రళయసమయమునందలి నల్లని వర్షాకాలపు మేఘము వలె, మహాత (మహా) + ధ్వనిన్ = గొప్ప ధ్వనితో, గర్జిల్లుచున్ = ఉఱుముచు.

తాత్పర్యము : అని పెక్కురీతుల వేఱువేఱుగాఁ బలుకుచున్న గణనాయకులను వారించి గణపతి పరమేశ్వరున కభిముఖుఁడై ప్రళయకాలమునందలినల్లని వర్షాకాల మేఘమువలె, మహాధ్వనితో నుఱుముచు - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : ప్రళయకాల నీలఘనాఘనంబునుంబోలె-అలంకార ముత్ప్రేక్ష

ఉత్సాహ 'బలిమిఁ బిట్టు కలిగి పాశుపతము దొడుగ నేటి ? క
గ్గలిక ములుకకాయ కెత్తు గల్లు గొనఁగ నేల ? ము
న్నెలుక వేఁట కుఱుముతిండి యేల ? నీకు నలుగఁగాఁ
దలపు గలదె ? నన్నుఁ బనుపు దక్షుఁ బట్టి తెచ్చెదన్.' 60

అర్థము : పిట్టుకని + అలిగి = పట్టుపెఁ గోపించి, బలిమిన్ = బలముతో, పాశుపతము = పాశుపతాస్త్రము, తొడుగన్ + ఏటికి = వింట సంధించుట యెందులకు ? పిచ్చుకపై బ్రహ్మాస్త్రము వేయనేల ? యనుట. అల్పుని దండింప నింతయత్న మేల ? అని భావము. అగ్గలికన్ = అధిక్యముతో, ములుక కాయకున్ = కంటకికి, ముల్లుపండుకు, ఎత్తు + కల్లు = ఎత్తు రాయి - ఎత్తునకయి పెట్టుకొను రాయి. కొనఁగన్ + ఏల ? = తీసికొను టెందులకు ? సులభముగా నందుఁబాటులోనున్న దానికై యెత్తు కొఱకు రాయి పెట్టుకొననేల ? యనుట. వృథాప్రయత్నమని భావము, మున్ను = ముందుగా, ఎలుక - వేఁటకున్ = ఎలుకను వేఁటాడుటకు, ఉఱుముతిండి = ఉఱుముపక్కి (ఉఱుము రోనగువానిని దిను పక్కి), ఏల?, నీకున్, అలుగఁగాన్ = కోపించుటకు, తలఁపు + కలదె = స్థానముకలదా? ఆవశ్యకత యున్నదా? లేదనుట, నన్నున్, పనుపు = పనుపుము - పంపుము, దక్షున్, పట్టి, తెచ్చెదన్.

తాత్పర్యము: 'చిన్నపిట్టకై గోపించి పాశుపతాస్త్రమును వింట సంధింపనేల? క్రిందనే యుండు ములగవంకాయను గోయుట కెత్తు టాయి కొననేల? ఎలుకను వేటాడుట కుడుపకుక్క యెందులకు? నీ కోపమున కిట స్థానము లేదు, నన్నుం బంపుము, దక్షుని బంధించి తీసికొనివత్తును.'

విశేషములు: అలంకారము దృష్టాంతము - మొదటి మూఁడుపాదము లందును మూఁడు దృష్టాంతములు గలవు. 'చేద్బిమ్బప్రతిబిమ్బత్వం దృష్టాన్త స్తదలఙ్కృతిః' చన్ద్రా. ములుక - ములక=కంటకి, వార్తాకము, ములగవంగ (సూ.ని.) 'కంటకి చను ములుక యన' ఆం,భా?.59, ఉఱుము = ఉడుము, ఉఱుముతిండి - ఉడుములను దిను కుక్క - ఉడుప కుక్క, పనుపు - పనుపుము - హల్లు పరమగుచుండ మధ్యమపురుష మువర్ణక లోపము, బాల. సంధి. 47.

ఉత్సాహ వృత్తము - నాలుగుపాదము లుండును. ఒక్కొక్క పాదమున నేడు సూర్యగణములు నొక గురువు నుండును. మొదటి గణము మొదటి యక్షరమునకును అయిదవగణము మొదటియక్షరమునకును యతిమైత్రి, ప్రాసనియమము గలదు.

వ. అస్మదీయ జననీ పరాభవం బింతయుం గావున నవశ్యంబుగ నిప్పని నాకు దయసేయవలయు నని పన్నువడం బలుకుచున్న గణాధీశ్వరు తెగువ యెఱింగి దక్షాధ్వరధ్వంసంబు చేసి దక్షుం బట్టి తెమ్మని పరమేశ్వరుండు నియమించిన మహాప్రసాదం బని వీడుకొనియె నంత నా క్షణంబ. 61

అర్థము; ఇంతయున్ = ఇదియంతయును, అస్మదీయ - జననీ - పరాభవంబు = నా తల్లి(సతి) యవమానము, కావునన్ అవశ్యంబుగన్ = తప్పక, ఈ + పని = దక్షబంధన మను నీ పని, నాకున్, దయ + చేయవలయున్, = అనుగ్రహింపవలయును, అని, పన్నువడన్ = ఒప్పునట్లు, పలుకుచున్ + ఉన్న, గణ + అధి + ఈశ్వరు = గణపతియొక్క, తెగువ = సాహసము, ఎఱింగి, దక్ష + అధ్వర - ధ్వంసంబు = దక్షయాగనాశనము, చేసి, దక్షున్, పట్టి- తెమ్ము + అని, పరమేశ్వరుండు, నియమించినన్ = ఆజ్ఞాపింపఁగా, మహత్(మహా) + ప్రసా

దంబు = గొప్ప యనుగ్రహము, అని, వీడుకొనియెన్ = వీడెను, అంతన్, ఆ - క్షణంబు + అ = వెంటనే.

తాత్పర్యము: 'ఇది యంతయు నా తల్లి యగు సతీదేవికైన యవమానమే. కావున దక్షుని బట్టితెచ్చు నీ పనిని దప్పక నా కనుగ్రహింపుము,' అని యొప్పుగాఁ బలుకుచున్న గణపతి సాహసము నెఱిఁగి దక్షయజ్ఞనాశనము చేసి దక్షుని బట్టితెమ్మని పరమేశ్వరుఁడు నియోగింపఁగా మహాప్రసాద మని యతఁడు వీడెను. అంత నా క్షణమే తరువాతి పద్యముతో నన్వయము.

ఉ. స్థూలసమున్నతాంగులు, చతుర్భుజ ఫాలతలాక్ష శూల కా
పాల కఠోర కార్ముక కృపాణ ధరుల్, ప్రమథాధినాథు, లా
భీలపరాక్రముల్, నిఖిల భీకరమూర్తులు వచ్చి రోలిఁ గం
కాలసమేతులై భువనకంపముగా గణనాథు పాలికిన్. 62

అర్థము: స్థూల - సమున్నత + అంగులు = లావయిన, ఎత్తయిన శరీరములు గలవారును, చతుః + భుజ, ఫాలతల + అక్ష - శూల - కాపాల - కఠోర - కార్ముక - కృపాణ - ధరుల్ = నాలుగుభుజములు, నొసటికన్నులు, శూలములు, కపాలములు, కఠినములైన విండ్లు, ఖడ్గములు ధరించినవారును, ఆభీల - పరాక్రముల్ = భయంకరమైన పరాక్రమము గలవారును, నిఖిల - భీకరమూర్తులున్ = ఎల్లరకు వెఱపు గలిగించు నాకారములు గలవారును, అగు, ప్రమథ + అధినాథులు = ప్రమథనాయకులు. కంకాల - సమేతులు + ఐ = అస్థిపంజరములతోఁ గూడినవారయి, గణ - నాథు - పాలికిన్ = గణపతి యొద్దకు, ఓలిన్ = క్రమముగా, భువన - కంపము + కాన్ = లోకములు చలించునట్లు, వచ్చిరి.

తాత్పర్యము: లావయినట్టియు మిక్కిలి యెత్తయినట్టియు శరీరములు గలవారును, నాలుగుభుజములు, నొసటి కన్నులు. శూలములు. పుఱ్ఱెలు, కఠినములైన విండ్లు. ఖడ్గములు ధరించినవారును, భయంకర పరాక్రమము గలవారును, ఎల్లరకు వెఱపుగొలుపు రూపములు గలవారును అగు ప్రమథనాయకులు అస్థిపంజరములతోఁ గూడినవారయి లోకము లదరునట్లు గణపతి యొద్దకు వరుసగా వచ్చిరి.

వ. తదవసరంబున దేవగణాధీశ్వరి నిఖిల శాకినీ డాకినీ కూశ్మాండ యోగినీ గణ పరివృతయై. 63

అర్థము : తద్ + అవసరంబునన్ ఆ సమయమున, దేవ-గణ + అధి + ఈశ్వరి = మహాకాళి, నిఖిల .... పరివృతయై ; నిఖిల=ఎల్ల, శాకినీ = యక్షిణులు, డాకినీ = పిశాచస్త్రీలు, కూశ్మాండ = పిశాచములు, యోగినీ = దుర్గ పరిచారికలు, అనువారియొక్క, గణ = సమూహముతో, పరివృత + ఐ = కూడుకొన్నదయి.

తాత్పర్యము : ఆ సమయమున దేవగణముల కధీశ్వరి యైన మహాకాళి ఎల్ల శాకినులు, డాకినులు, కూశ్మాండులు, యోగినులు ననువారి సమూహములతోఁ గూడిన దయి - తరువాతి పద్యముతో నన్వయము.

క. లోకాలోకములోఁ గల
చీఁకటి యెల్ల నొకపొడవు చేకొనియెనొ నా
నాకాశ మడరి వచ్చె మ
హాకాళి మహాభయంకరాకారముతోన్. 64

అర్థము : లోకాలోకములోన్ = చక్రవాళపర్వతములో, కల = ఉన్న, చీఁకటి + ఎల్లన్ = చీఁకటియంతయు, ఒక - పొడవు = ఒక రూపము, చేకొని యెనొ=స్వీకరించెనో, నాన్=అనఁగా, మహాకాళి, మహత్ (మహా) - భయంకర+ ఆకారముతోన్ = మిక్కిలి పెద్ద గొలుపు రూపముతో, ఆకాశము + అడరి - విజృంభించి - ఆక్రమించి, వచ్చెన్,

తాత్పర్యము : చక్రవాళ పర్వతములోఁ గల చీఁకటి యంతయు నొక రూపమును ధరించెనో యనునట్లు మహాకాళి మిక్కిలి భయంకరమైన ఆకారముతో నాకాశమంతయు నాక్రమించి వచ్చెను.

విశేషములు ; అలంకార ముత్ప్రేక్ష. లోకాలోకము - చక్రవాళ పర్వతము. దీనికిఁ జీఁకటికొండ యనియుఁ బేరు. దీని కొక పార్శ్వమున సూర్యకిరణస్పర్శ

ముండును. ఒక పార్శ్వమున నుండదు. చీఁకటిరో నర్ధానుస్వార మున్నదను విషయమున రెండు పక్షములు గలవు, ఉండు నను మతమున నిది ఖండాఖండప్రాసమగును. శ. ర. సబిందుకముగాను, చి. ని. నిర్బిందుకముగాను గ్రహించెను. సబిందుక మనుటకు భారతేతర ప్రాచీన గ్రంథములు కొన్ని నిర్ధారకములుగాఁ గలవు.

వ. ఇ ట్లఖిల గణ పరివృతుండై గణాధీశ్వరుం డతిరయంబున దక్ష ప్రజాపతిపైఁ బరిగొని దక్షాధ్వరావాసంబు గని కోపించి నిజగణంబు లకుం జేయివీచిన నా క్షణంబ. 65

అర్థము: ఇట్లు, అఖిల - గణ-పరివృతుండు+ఐ=ఎల్ల ప్రమథగణములతోఁ జుట్టఁబడినవాఁడయి, గణ + అధి + ఈశ్వరుండు =గణపతి, అతి-రయంబునన్= మిక్కిలి వేగముతో, దక్ష - ప్రజాపతిపైన్, పరిగొని=దండువెడలి, దక్ష+అధ్వర + ఆవాసంబు = దక్షుని యజ్ఞవాటిక, కని = చూచి, కోపించి, నిజ - గణంబులకున్= తనవైన ప్రమథగణములకు, చేయి - వీచినన్ = చేసన్న చేయఁగా, ఆ-క్షణంబు+ అ = ఆ క్షణమే,

తాత్పర్యము ; ఇట్లు ఎల్ల గణములతోఁ గూడినవాఁడయి గణపతి మిక్కిలి వేగముతో దక్షప్రజాపతిపై దండువెడలి యతని యజ్ఞవాటికను జూచి కోపించి తన గణములకుఁ జేసన్న చేయఁగా నా క్షణమే - తరువాతి పద్యముతో నన్వయము.

సీ. క్రతు రక్షకులఁ దాఁకి కనుకనిఁ బోఁ దోలి,
చూపఱ విదిశలు సొరఁగఁ దోలి,
వడి జన్నసాల నివాసంబు గొని వేది
కలు గ్రొచ్చి గుండముల్ గవియఁద్రోచి.
ఋత్విగ్గణంబులఁ జత్వాలమునఁ బాఁతి,
బలిమి సదస్యుల నలియ మోఁది,
యుపదర్శి మెడ నుల్మి యూపంబుతోఁ గట్టి
పరిచారకులఁ బట్టి బారిసమర్చి,

ఆ. వహ్ని జిహ్వ రెండు వ్రయ్యలుగాఁ గోసి,
పరిజనముల నేలపాలు చేసి,
యా క్షణంబ ముట్టి దక్షాధ్వరం బశ్ర
మమునఁ జెఱిచి యార్చెఁ బ్రమథగణము. 66

అర్థము: ప్రమథ - గణము = ప్రమథుల సమూహము, (కర్త). క్రతు - రక్షకులన్ = యజ్ఞమును గాపాడువారిని, తాఁకి, కనుకనిన్ = సంభ్రమముతో, పోన్ + తోలి = పోవునట్లు తోలి, - తఱిమి, చూపఱన్ = చూచువారిని, ఏదిశలు = మూలలు, చొరఁగన్ = చొచ్చునట్లు, తోలి,

వడిన్ = వేగముతో, జన్న - సాల = యజ్ఞశాల, నివాసంబు + కొని = స్థానముగా నేర్పఱుచుకొని, వేదికలు = అరుఁగులు, గ్రొచ్చి = త్రవ్వి, గుండములన్ = కుండములు, కవియన్ + త్రోచి = పడఁద్రోసి,

ఋత్విజ్ + గణంబులన్ = ఋత్విజుల సమూహములను, చత్వాలమునన్ = హోమాగ్ని కొఱకు కేర్పఱిచిన గోతియందు, పాఁతి, సదస్యులన్ = యజ్ఞ సహాయకు లగు ఋత్విజులను, బలిమిన్ = బలముతో, నలియన్ + మోఁది = నలఁగఁగొట్టి,

ఉపదర్శి = యజ్ఞకార్య పర్యవేక్షకుని యొక్క, మెడన్, సుత్తి = మెలిపెట్టి, యూపంబుతోన్ = యజ్ఞపశువును గట్టఁబాఁతిన కొయ్యతో, కట్టి, పరిచారకులన్ = సేవకులను, పట్టి, బారిసమరి = హింసించి,

వహ్ని - జిహ్వన్ = అగ్ని నాలుకను, రెండు - వ్రయ్యలుగాన్ = రెండు చీలికలుగా, కోసి, పరిజనములన్ = పరివారమును, నేలపాలు - చేసి = నేలఁ బడ, గొట్టి, దక్ష + అధ్వరంబు = దక్షుని యజ్ఞము, ఆ - క్షణంబు + అ = ఆ క్షణమే, ముట్టి = ఆవరించి, అశ్రమమునన్ = అనాయాసముగా, చెఱిచి = చెడఁగొట్టి, ఆర్చెన్ = అఱచెను.

తాత్పర్యము: ప్రమథుల సమూహము యజ్ఞరక్షకులను దాఁకి సంభ్రమముతోఁ బాఱఁద్రోలి, చూచువారిని మూలలకుఁ బోఁద్రోలి, వేగముగా యజ్ఞశాలను స్థానముగా నేర్పఱుచుకొని వేదికలు త్రవ్వి, గుండములను బడఁద్రోసి, ఋత్వి

స్థానాహానమును హోమాగ్ని కేర్పఱిచిన గోతియందుఁబాఁతి, యజ్ఞసహాయకులగు ఋత్విక్కులను బలముగాఁ జిదుకఁగొట్టి, యజ్ఞకార్య పర్యవేక్షకుని మెడ నులిమి యూప స్తంభమునకుఁ గట్టి, పరిచారకులను బంధించి హింసించి, అగ్ని నాలుకను రెండు చీలికలుగాఁ గోసి, పరిజనమును నేలఁబడవైచి, దక్షయజ్ఞము నా క్షణముననే ఆవరించి అనాయాసముగాఁ జెఱిచి యఱచెను.

విశేషములు ; కుండము (ప్రకృతి) - గుండము (వికృతి). ఋత్విజ్ + గణము - పదాంతాక్షరములకు ఝల్ (అనునాసికములు, అంతస్థములు తప్పఁదక్కిన హల్లులు) పర మగునపుడును, పదాంతమునందును కవర్గాక్షరము లాదేశము లగును. ఋత్విగ్గణము. గ్రొచ్చు - ఇది పరుషాదిగాఁ గూడ నున్నదని శ. ర. చత్వాలము = A hole in the ground prepared for an oblation or for the sacrificial fire, Apte. ప్రయ్యు - కృదంతము-వ్రయ్యు. 'అవర్గకంబు గీత్వాదుల కగు.' బాల. కృ. 18. చెఱచి - 'చెఱుపునకుం జుక్కుగాగమంబులును డా కలఘురేఫంబు నగు.' బాల. క్రి. 81. చెఱుచు. 'సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకం బగు.' [1] బాల. క్రి. 38. చెఱుచు+ఇ. 'ఇత్వంబుగాని యెత్వంబుగాని కూడుచో ననాద్యంబయిన యుత్వంబున కిత్వం బగు.' బాల. క్రి. 85. అపదాదిస్వరసంధి - బాల, సంధి, 11. చెఱిచి.

వ. అట్టి సంకులంబున. 67

అర్థము : ఆ దొమ్మి యుద్ధమున - తరువాతి పద్యముతో నన్వయము.

ఉ. ఆ యవనీసురామరచయం బురుసత్త్వుల నుగ్రులన్ మహా
కాయులఁ దద్గణాధిపులఁ గాంచుచు మీఁదికి మీఁద జీవముల్
పోయిరి కొంద, ఱోడి చెడిపోయిరి కొందఱు, చుట్టుముట్టినం
గూయిడఁ జొచ్చి రక్కడఁగి కొంద ఱలందురి భీతచిత్తులై 68

అర్థము : ఆ + అవనీసుర + అమర - చయంబు = ఆ బ్రాహ్మణులయు, దేవతలయు సమూహము, ఉరు-సత్త్వులన్ = గొప్ప బలముగల వారును, ఉగ్రులన్ = భయంకరులును, మహత్ (మహా) - కాయులన్ = గొప్ప శరీరము గలవారును, అగు, తత్ + గణ + అధిపులన్ = ఆ గణనాయకులను, కాంచుచున్ = చూచుచు, కొందఱు,

మీఁదికిన్ - మీఁదన్ + జీవముల్ + పోయిరి = పయిప్రాణములు పయినే కోల్పోయిరి. చుట్టుముట్టినన్, కొందఱు, ఓడి, చెడిపోయిరి = నశించిరి, కొందఱు, భీత-చిత్తులు + ఐ = భయపడిన మనస్సులు గలవారయి, అలందురి = కలఁతఁజెంది, ఉక్కు + అడఁగి = బలము నశించి, కూయిడన్ + చొచ్చిరి = భయముచే నఱవఁజొచ్చిరి.

తా త్ప ర్య ము : ఆ బ్రాహ్మణులయు దేవతలయు సమూహము గొప్ప బలము గలవారును, భయంకరులును, పెద్ద శరీరములుగలవారును అగు ఆ ప్రమథనాయకులను జూచుచుఁ గొందఱు పయిప్రాణములను పయినే కోలుపోయినవా రయిరి. ప్రమథులు చుట్టుముట్టఁగా గొందఱు ఓడి నశించిరి. కొందఱు భయపడిన మనస్సులు గలవారయి కలఁతఁజెంది, బలము నశించి మొఱపెట్టఁగాఁజొచ్చిరి.

వ. ఇట్లతిభీషణశాసనులైన గణాధీశ్వరుల కవిదల కబ్బగింపక సురవరు లతిసంభ్రమంబునం బరిమొగంబు దప్పం గనుకనిం జను నవసరంబున. 69

అ ర్థ ము ; ఇట్లు, అతి - భీషణ-శాసనులు + ఐన = మిక్కిలి భయంకరమైన ఆజ్ఞగలవారగు, గణ + అధి + ఈశ్వరుల = గణనాయకులయొక్క, కవిదలకున్ = తాఁకుడుకు, అబ్బగింపక = సహింపక, సుర - వరులు = దేవతాశ్రేష్ఠులు, అతి - సంభ్రమంబునన్ = మిక్కిలి వేగముతో, పరిమొగంబు + తప్పన్ = సేనాముఖము తప్పునట్లు, కనుకనిన్ = సంభ్రమముతో, చను + అవసరంబునన్ = పోవు సమయము నందు.

తా త్ప ర్య ము ; ఇట్లు మిక్కిలి భయంకరమైన ఆజ్ఞగల ప్రమథనాయకుల తాఁకుడు కోర్వక దేవతాశ్రేష్ఠులు మిక్కిలి వేగమున సేనాముఖము దప్పించి పోవు సమయమునందు - తరువాతి పద్యముతో నన్వయము.

ఆ. వాహనంబు నెక్క వచ్చి భయంబున
వడఁకి నేలఁ బడ్డ వనజగర్భుఁ
గమిచికొని మరాళకము వాఱెఁ జెందమ్మిఁ
గఱచికొని రయమునఁ బఱచినట్లు. 70

అర్థము : వాహనంబున్ – తన వాహనమైన హంసను, ఎక్కన్+వచ్చి= ఎక్కఁబోయి, భయంబునన్ = భయముతో, వడఁకి, నేలన్ + పడ్డ=నేలపైఁబడిన, వనజ - గర్భున్ = తమ్మిచూలిని-బ్రహ్మను, కమిచికొని=పట్టుకొని, మరాళకము = హంస, చెందమ్మిన్ (చెన్ను+తమ్మిన్) =కెందామరను, కఱచికొని, రయమునన్= వేగముతో, పఱచిన + అట్లు = పరువెత్తు విధమున, పాఱెన్ = పరువెత్తెను.

తాత్పర్యము : తన వాహనమైన హంస నెక్కఁబోయి భయమున వణఁకి నేలపైఁ బడిన బ్రహ్మను హంస పట్టుకొని కెందామరను నోటఁగఱచికొని వేగముగాఁ బాఱినట్లు పాఱెను.

విశేషములు ; అలంకార ముపమ. మరాళకము - మరాళము - స్వార్థమున క ప్రత్యయము.

చెందమ్మి-చెన్ను + తమ్మి - 'సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబు లెల్ల లోపంబు బహుళంబుగా నగు.' బాల. సంధి. 36. చె + తమ్మి. 'లుప్తశేషంబునకుం బరుషములు పరము లగునపుడు సుగాగమంబగు.' బాల. సంధి. 37. చె + సు + తమ్మి. 'ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళము లగు.' బాల. సంధి. 16. చె + సు+దమ్మి, 'ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాష నగు.' చెందమ్మి. బాల. సంధి. 17.

ఆ. గరుడి నడుము మెడయుఁ గాలను గేలను
ఇఱికికొనుచుఁ జక్రి వెఱచి పఱచె
ఘర్మజలము లొడలఁ గ్రమ్మంగ వర్షేంద్ర
చాప జలద భాతిఁ జదలఁ బొదల. 71

అర్థము : చక్రి = సుదర్శనమను చక్రము గలవాఁడు - విష్ణువు, గరుడి = గరుత్మంతునియొక్క, నడుమున్, మెడయున్, కాలను+కేలను=కాలియందును, చేతియందును, ఇఱికికొనుచున్ = బిగియఁబట్టుకొనుచు, ఘర్మ - జలములు = చెమట నీరు, ఒడలన్ = శరీరమునందు, క్రమ్మంగన్=వ్యాపింపఁగా, వర్ష+ఇంద్రచాప.

జలద - భాతిన్ = వర్ష సమయమునందు ఇంద్రధనుస్సుతోడి, మేఘము విధమున, చదలన్=ఆకాశమునందు, పొదలన్=ఒప్పఁగా, వెఱచి=భయపడి, పఱచెన్=పాఱెను.

తాత్పర్యము : విష్ణువు తన వాహనమైన గరుత్మంతుని నడుమును, మెడను, కాళ్లను, కేలను బిగియఁబట్టి, భయపడి, చెమటనీరు మేనఁ గ్రమ్మ, వర్ష సమయమున నింద్రధనుస్సుతోడి మేఘమువలె ఆకాశమున నొప్పఁగాఁ బాఱెను.

విశేషములు : ఇందు గరుడి యింద్రధనుస్సుతోను, విష్ణువు మేఘముతోను బోల్పఁబడిరి. కావున నలంకార ముపమ. 'భాతి' కి విధమను నర్థము తెనుఁగుననే కనఁబడుచున్నది. (సూ. ని.) నడుము - మెడయు, కాలను - గేలను, వెఱచి-పఱచె, చదలఁ - బొదలె - ఛేకానుప్రాసము.

ఆ. వేఁటకాఱు ముట్టి వెనుకొనఁగా శ్వేత
నగము చఱికిఁ దారు నమిలివోలె
నభ్రగజము మీఁదికా సహస్రాక్షుండు
ప్రాఁకి పాఱెఁ బ్రమథరాజి యార్వ. 72

అర్థము : వేఁటకాఱు = వేఁటకాండ్రు, ముట్టి=తాఁకి, వెనుకొనఁగాన్ = వెన్నాడఁగా, శ్వేత - నగము - చఱికిన్=వెండికొండ (కైలాసము) చఱియమీఁదికి, తారు = పోవునట్టి, నమిలి + పోలెన్ = నెమలివలె, ప్రమథ - రాజి = ప్రమథ గణము, ఆర్వన్ = అఱవఁగా, ఆ-సహస్ర + అక్షుండు=ఆ వేయి కన్నులవాఁడు - ఇంద్రుఁడు, అభ్ర - గజము - మీఁదికిన్ = ఆకాశమునందు సంచరించు నేనుఁగు - (ఐరావతము) మీఁదికి, ప్రాఁకి, పాఱెన్.

తాత్పర్యము : వేఁటకాండ్రు తాఁకి వెన్నాడఁగా వెండికొండ చఱియమీఁదికిఁ బోవు నెమలివలెఁ, బ్రమథగణములు అఱవఁగా నా వేయికన్నులవేల్పు వెల్ల యేనుఁగు మీఁదికిఁ బ్రాఁకి పాఱెను.

విశేషములు : అలంకార ముపమ. ప్రమథులు-వేఁటకాండ్రు, అభ్రగజము-శ్వేతనగము, సహస్రాక్షుఁడు - నమిలి - ఇవి ఉపమేయోపమానములు. అభ్రగజము-

శ్వేతనగము రెండును తెలుపే. ఇంద్రుఁ డనక సహస్రాక్షుఁడనుట చిత్రవర్ణములైన పెక్కు కన్నులుగల నమిలితోడి పోలికకు. నమిలి నమలి, నమ్మి, నమ్మిలి, నెమలి, నెమిలి, నెమ్మి, నెమ్మిలి యనురూపములు. పఱి - పఱియ (రూపాం.)

పేఁటకాలు - పేఁట కా + లు. 'కాప్రత్యయంబుమీఁది బహువచన లకారంబునకు లఘ్వలఘురేఫంబులకు లఘురేఫంబునకు ముందు పూర్ణబిందుపూర్వక డకారంబగు.' బాల. అవ్య. 7. పేఁటకాండ్రు, పేఁటకాలు.

ఆ. ఇక్కు ముట్టి చక్కి నెక్కంగ మఱచి సం
భ్రమముఁ బొంది పిఱుఁదఁ బ్రమథగణము
లార్వఁ బోతుమీఁద నడ్డంబు పడి యుప్పుఁ
బెటికవోలె వెఱచి పఱచె జముఁడు. 73

అన్వయము : పిఱుఁదన్ = వెనుక, ప్రమథ - గణములు, ఆర్వన్ = అఱవఁగా, జముఁడు = యముఁడు, ఇక్కు = నడుము, ముట్టి = పట్టుకొని, చక్కిన్ = తన వాహనమైన దున్నపోతును, ఎక్కంగన్ - మఱచి = ఎక్కుట మఱచిపోయి, సంభ్రమమున్ + పొంది = భయపడి, పోతు మీఁదన్, ఉప్పు + పెటిక + పోలెన్ = ఉప్పుగోనె వలె, అడ్డంబుపడి = అడ్డముగాఁబడి. వెఱచి = భయపడి, పఱచెన్ = పాఱెను.

తాత్పర్యము : వెనుకఁ బ్రమథులు తఱిమి యఱవఁగా యముఁడు భయపడి తన వాహనమైన దున్నపోతును నడుము పట్టుకొని యెక్కురీతిని మఱచి దానిపై నుప్పుగోనెవలె నడ్డముగాఁ బడి పాఱెను.

విశేషములు : అలంకార ముపమ. స్వభావోక్తి.

ఉప్పుఁబెటిక - ఉప్పు + పెటిక. 'సమాసంబుల నుదంతంబులగు స్త్రీసమంబులకుం బుంప్రులకుం బరుష సరళంబులు పరంబులగునపుడు నుగాగమం బగు.' బాల, సంధి. 25. ఉప్పు + ను + పెటిక. ద్రుతకార్యము. బాల, సంధి. 16,17. ఉప్పుఁబెటిక - ఉప్పుఁబెటిక + పోలె - గసడదవాదేశము - బాల. సంధి. 13. ఉప్పుఁబెటిక వోలె. యముఁడు (ప్రకృతి) - జముఁడు (వికృతి).

గీ. ఉరుతరాబ్ధీశుఁ డయ్యును నోడి పాఱె
వరుణుఁ డలుకుచు నోడిక వాఁగువోలెఁ;
గలుము లెడరైన నేమియు నిలువ వనుట
తగ భయాతురుఁడై నోరఁ దడియు లేక. 74

అర్థము: కలుములు = సంపదలు, ఎడరు + ఐనన్ = భంగపడఁగా, ఏమియున్, నిలువవు, అనుట, తగన్ = ఒప్పఁగా, వరుణుఁడు, ఉరుతర + అబ్ధి + ఈశుఁడు = మిక్కిలి గొప్పవియగు సముద్రముల కధిపతి, అయ్యును = అయినను, అలుకుచున్ = భయపడుచు, భయ + ఆతురుఁడు + ఐ - భయముచేఁ బీడితుఁడయి, నోరన్ = నోటియందు, తడియున్ + లేక = తడికూడ లేక, ఓడికన్ = ప్రవహించుటచే, వాఁగు + పోలెన్ = సెలయేఱు వలె, ఓడి - పాఱెన్ = వెఱచి పఱచెను.

తాత్పర్యము: సంపదలు పోయినచో నేమియు నిలువవనుట సరిపడునట్లు వరుణుఁడు తాను సముద్రముల కధిపతియైనను భయముచే - ప్రవాహముచే సెలయేఱు వలె, నోరఁ దడికూడ లేక, ఓడి పాఱెను.

విశేషములు: ఓడికవాఁగువోలె - అలంకార ముపమ, కలుము లెడరైన నేమియు నిలువ వనుట తగన్ - విశేషము సామాన్యాంశముచే సమర్థింపఁబడుటచే నర్థాంతరన్యాసము. ఉరుతరాబ్ధీశుఁ డయ్యును-నోరఁ దడియులేక-ఇందలి చమత్కారము ప్రశంసనీయము- ఓడి = భయపడి - వరుణుఁడు జలాధిదేవుఁ డగుటచే 'స్రవించి' యనియు స్వారస్యము.

క. తన యెక్కిన మానిసిఁ దా
నసయము నెక్కంగ మఱచి యాతనిఁ దన మూఁ
పున నిడికొని పఱచె భయం
బున ధనపతి తన్నుఁ బిఱుఁద భూతము లార్వన్. 75

అర్థము: ధనపతి = కుబేరుఁడు. తన్నున్, పిఱుఁదన్ = వెనుక, భూతములు = పిశాచగణములు, ఆర్వన్ = బొబ్బరింపఁగా, భయంబునన్ = భయముతో, తన +

ఎక్కిన - మానిసిన్ = తా నెక్కిన మనుష్యుని, తాను, అనయమున్ = అత్యంతము, ఎక్కించగన్ - మఱచి = ఎక్కుట మఱచి, అతనిన్ = తన వాహనమైన అతనినే తన- భుజాగ్రమునన్ = తన భుజమునందు, ఇడికొని = ఉంచుకొని, పఱచెన్ = పాఱెను.

తాత్పర్యము: కుబేరుఁడు నరవాహనుఁడు. అతనిని దఱుముచు వెనుకఁ బ్రమథగణములు బొబ్బరింపఁగా నతఁడు భయమునఁ దా నెక్కుమనుష్యు నెక్కుట మఱచి యాతనినే తన భుజమున నెక్కించుకొని పఱచెను.

విశేషములు: 'కిన్నరేశో వైశ్రవణః పౌలస్త్యో నరవాహనః' - కుబేరుఁడు. అమరము.

తన యొక్కిన - 'ధాతుజ విశేషణ భావార్థక పూర్వవ్యవహితావ్యవహిత కర్తృపద ప్రకృతికకుఁ దఱచుగ యొక్కషష్ఠి యగు.' ప్రౌఢ. కారక. 15. తనయొక్క-యొక్కిన. 'యొక్కకు లోపంబు బహుళంబు' - ప్రౌఢ. కారక. 16. తన యొక్కిన.

వ. తదవసరంబునఁ బ్రజాపతి నికరంబు దక్షప్రజాపతిం బరిమొగంబుఁ
దప్పించుకొని బ్రహ్మాండఖండంబున కరిగిన గణాధీశ్వరు లెల్ల
కడను శోధించి దక్షుం డున్న పట్టెప్పట్లను గానక కాందిశీకులై
కనుకనిం జని సకలభువనాధీశ్వరులపైఁ బరిగొని. 76

అర్థము: తద్ + అవసరంబునన్ = ఆ సమయమునందు, ప్రజాపతి - నికరంబు = ప్రజాపతుల సమూహము, దక్షప్రజాపతిన్, పరిమొగంబున్ = సామ్ముఖ్యమును, తప్పించుకొని = తప్పునట్లు చేసి, బ్రహ్మాండ ఖండంబునకున్ = బ్రహ్మాండ భాగమునకు, అరిగినన్ = వెడలఁగా, గణ + అధి + ఈశ్వరులు = ప్రమథనాయకులు, ఎల్ల కడలను = ఎల్ల దిక్కులను, శోధించి = వెదకి, దక్షుండు, ఉన్న, పట్టు = చోటు, ఎప్పట్లను (ఏ + పట్లను) = ఎక్కడను, కానక, కాందిశీకులు + ఐ = ఏ దిక్కునకుఁ బోవలెనో యెఱుఁగనివారయి, కనుకనిన్ = సంభ్రమముతో, చని, సకల-భువన + అధి + ఈశ్వరులపైన్ = ఎల్లలోకముల ప్రభువులపై, పరిగొని = కవిసి - పడి.

తాత్పర్యము: ఆ సమయమునఁ బ్రజాపతుల సమూహము దక్షప్రజాపతిని ఎదుట లేకుండఁజేసి బ్రహ్మాండభాగమున కరుగఁగాఁ, బ్రమథనాయకు లన్ని దిక్కు-

లను వెదకి దక్షుఁ డున్నచోటు నెక్కడను గానక యే దిక్కునకుఁ బోద మనువారలు సంభ్రమముతోఁ జని యెల్లలోకముల ప్రభువుంపై దండెత్తి - తరువాతి పద్యముతో నన్వయము.

క. వల విచ్చినట్లు జగములఁ
గల విప్పును గలయ నొక్క కవిఁ జని కోలా
హలముగ సురాసురోరగ
కులముల నా గణము ముంచికొని వచ్చి వడిన్. 77

అర్థము : ఆ - గణము = ఆ ప్రమథగణము, వల - విచ్చిన + అట్లు = వల అంతటను బఱచినట్లు, జగములన్ = లోకములందు, కల = ఉన్న, విప్పును = వైశాల్యమును, కలయన్ = అంతటను, ఒక్క - కవిన్ = ఒక్కపెట్టున, చని, కోలాహలముగన్ = పెద్ద రొద యగునట్లు, సుర + అసుర + ఉరగ-కులములన్ = దేవతలయు, రాక్షసులయు, నాగులయు సమూహములను, ముంచికొని = ఆక్రమించుకొని, వచ్చి, వడిన్ = వేగముగా.

తాత్పర్యము : ఆ ప్రమథగణము వలను బఱచినట్లు లోకములం దంతటను ఒక్కపెట్టఁ జని పెద్దరొద యగునట్లు దేవతలయు, రాక్షసులయు, నాగములయు గుంపులను ఆక్రమించుకొని వచ్చి వేగముగా - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : అలంకార మూహ్యము. కవి = పెట్టు - ఈ శబ్దము ఒక్క-శబ్ద పూర్వకముగానే కనుపట్టుచున్నది. - సూ. ని.

చ. ముని మను జాసు రాహి సురముఖ్యుల వీఁపుల తోలు లెత్తఁగా
మును గుదిగట్టి మోపియును, ముందల కట్టులు గట్టి కొట్టియున్,
జనఁ బెడకేలు గట్టియును, జర్మపటంబులు డిగ్గ నొల్చియున్,
జెనసి మసంగి కారసము నేసిరి తత్ప్రమథాధినాయకుల్. 78

అర్థము : తద్ + ప్రమథ + అధినాయకుల్ = ఆ ప్రమథనాయకులు, ముని - మనుజ - అసుర + అహి - సుర-ముఖ్యుల = మునులు, మనుష్యులు, రాక్షసులు,

నాగులు, దేవతలు అనువారిలో శ్రేష్ఠులయొక్క, వీఁపుల-తోళులు=వీఁపుల చర్మములు, ఎత్తఁగాన్ = ఊడఁగా, మును గుది గట్టి మోపియును = ముందు గుదిబండఁగట్టి వహింపఁజేసియును, ముందలకట్టులు (ముందు + తలకట్టులు) = తలల ముందు భాగములు, కట్టి. కొట్టియున్, చనన్ = ఒప్పఁగా, పెడ - కేలు = పెడచేతులు, కట్టియును, చర్మ పటంబులు = వస్త్రముల వంటితోళ్లు, డిగ్గన్ + ఒల్చియున్ = ఊడునట్లు ఒలిచియును, చెనసి=తాఁకి, మసంగి = చెలరేఁగి, కారసము+చేసిరి= విరసము నాపించిరి.

తాత్పర్యము : ఆ ప్రమథనాయకులు మునులను, మనుజులను, రాక్షసులను, నాగులను, దేవతలను వీఁపుల చర్మము లూడఁదీసియు, గుదిబండఁ గట్టి వహింపఁ జేసియు, తలల ముందు భాగములు కట్టి కొట్టియును, పెడచేతులు కట్టియును, చర్మము లొలిచియు విజృంభించి విరసము చేసిరి.

చ. ఖలుఁ డని వజ్రి చేయి విఱుగంగ వడిం బడ మోఁది రెత్తి దో
ర్బలమునఁ దాఁకి; యజ్ఞు తల పందల యెత్తిరి తద్గణాధిపుల్;
కలుషముతోడ ముట్టి భగు క న్నొకఁ డచ్చినవుచ్చి రుగ్రులై;
బలువిడిఁ జుట్టి పూషు మునిపండులు డుల్లఁగ వ్రేసి రీసునన్. 79

అర్థము; తత్ + గణ + అధిపుల్ = ఆ ప్రమథనాయకులు, ఎత్తి = దండెత్తి, దోస్ (ః) + బలమునన్ = భుజబలముతో, తాఁకి, ఖలుఁడు=దుష్టుఁడు, అని, వజ్రి = ఇంద్రునియొక్క, చేయి, విఱుగంగన్ = విఱుగునట్లు, వడిన్ = వేగముగా, బడన్ + మోఁదిరి = పడబాఁదిరి, యజ్ఞు = యజ్ఞపురుషునియొక్క, తల - పందల + ఎత్తిరి = తలపుత్తె ఊడఁగొట్టిరి, కలుషముతోడన్=కోపముతో, ముట్టి = తాఁకి, భగు = భగుఁ డను నాదిత్యునియొక్కకన్ను, ఒకఁడు=ఒకదానిని, ఉగ్రులు + ఐ = భయంకరు లయి, అచ్చిన + పుచ్చిరి = ఊడఁదీసి విసరివేసిరి ఈసునన్ = కోపముతో, బలువిడిన్=పరాక్రమముతో, చుట్టి=చుట్టుముట్టి, పూషు= పూషుఁ డను నాదిత్యునియొక్క, ముని పండులు = ముందటి పండ్లు, డుల్లఁగన్+ వ్రేసిరి=రాలఁగొట్టిరి.

తాత్పర్యము : ఆ ప్రమథనాయకులు దండెత్తి భుజబలముతోఁ దాఁకి దుర్మార్గుఁడని యింద్రుని చేయి విఱుగునట్లు వేగముగాఁ బడ బాఁదిరి. యజ్ఞపురుషుని

తలపుత్తె నూడఁగొట్టిరి. భయంకరులై కోపముతోఁ దాఁకి భగుని యొక్క కన్ను పెకలించిరి. కోపముతో బలము మెఱయఁ దాఁకి పూషుని ముందటిపండ్లు రాలఁగొట్టిరి.

విశేషములు: దోర్బలము - దోస్ + బలము. పదాంత సకారమునకు విసర్గాదేశము. దోః + బలము. 'అ ఆ లు తప్ప మిగిలిన అచ్చుల తరువాత వచ్చు విసర్గమునకు అచ్చులు కాని, మృదుహల్లులు కాని పరము లగునపుడు రేఫ మాదేశ మగును. దోర్బలము. పందల = పుత్తె. ఈశబ్దము నీ కవి యొకఁడే ప్రయోగించెను.- సూ. ని. అచ్చనవుచ్చు - ఇది నిఘంటువులందుఁ గానరాలేదు.

స్రగ్ధర

కోపోద్రేకంబునం జేకొన కజు హరితోఁ గూడ బంధించి, దేవా
శాపా లేంద్రాదులం దత్క్షణమ పరిభవాసక్తులం జేసి, దక్షుం,
బాపాచారున్, వధా ద్యాపదల కరుహుఁ, దద్బ్రహ్మబంధున్, దురాత్మున్
జూపుం డెచ్చోట నంచున్[1] సురలను బ్రమథుల్ చుట్టి దండించి రల్కన్. 80

అర్థము: ప్రమథుల్, కోప + ఉద్రేకంబునన్ = కోపావేశముతో, చేకొనక = మన్నింపక, అజున్ = బ్రహ్మను, హరితోస్ = విష్ణువుతో, కూడన్ = కూడునట్లు, బంధించి = కట్టి, దేవ + ఆశాపాల + ఇంద్ర + ఆదులన్ = దేవతలు, దిక్పాలురు, ఇంద్రుఁడు మున్నగు వారిని, తద్ + క్షణము + అ = ఆ క్షణముననే, పరిభవ + ఆసక్తులన్ = అవమానమునఁ దగిలినవారిని, చేసి, పాప + ఆచారున్ = పాప కార్యములను జేసినవాఁడును, వధ + ఆది + ఆపదలకున్ = చంపుట మున్నగు నాపదలకు, అరుహున్ = తగినవాఁడును, తద్ + బ్రహ్మబంధున్ = ఆ నింద్యబ్రాహ్మణుఁడును, దురాత్మున్ = దుష్టుఁడును, అగు, దక్షున్ = దక్షుని, ఎచ్చోటన్ (ఏ + చోటన్) = ఎక్కడ, చూపుండు, (ఎచ్చోటిఁ డంచున్ అనుపాఠమునకు - ఎచ్చటివాఁ డనుచు), అంచున్ = అనుచు, సురలను = దేవతలను, చుట్టి = చుట్టుకొని, అల్కన్ = కోపముతో, దండించిరి = శిక్షించిరి.

తాత్పర్యము: ప్రమథులు కోపావేశముతో మన్నింపక బ్రహ్మను విష్ణువుతోఁ జేర్చి బంధించి దేవతలను, దిక్పాలురను, ఇంద్రాదులను వెంటనే అవమానపఱిచి పాప

1. టిఁ డంచున్.

దర్పుఁడును, వధాదుల కర్హుఁడును, నింద్యబ్రాహ్మణుఁడును, దుష్టుఁడును అగు దక్షుని ఎచ్చట నున్నాఁడో చూపుఁ' డనుచుఁ గోపముతో దేవతలను జుట్టుముట్టి దండించిరి.

విశేషములు: స్రగ్ధరాలక్షణమునకు 1-1 పద్యవ్యాఖ్యఁ జూచునది. వధ+ఆది = వధాది, - సవర్ణదీర్ఘసంధి. వధాది + ఆపదలకున్ = వధాద్యాపదలకున్ - యణాదేశసంధి. 'అర్హున్' అనుటకు 'అరుహున్' అని ప్రయుక్తము. అల్క-అలుగు ధాతువు. 'కవర్గకం బలుగ్వాదుల కగు.' బాల. కృ. 3. అలుగు + క. 'ఇటం గృత్క-గ ర ప వేయుడు పరంబు లగునపుడు క గ చ య వ లకు లోపం బగు.' బాల. కృ. 2, అయిక. 'అచ్చికంబులం బదమధ్యంబుల నలడరల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు.' బాల. ప్ర. 17. అల్క.

వ. త దవసరంబున 'శివద్రోహుండైన దక్షుం డను నిద్దురాత్మునకై
మహోగ్రాక్ష గణాగ్రణులచే విగ్రహంబు వడు టేమిపని?' యని
సురముని జనంబు లొండొరులం గడవ. 81

అర్థము: తద్ + అవసరంబునన్, శివ-ద్రోహుండు=శివునకు ద్రోహము చేసినవాఁడు, ఐన, దక్షుండు, అను, ఈ + దురాత్మునకై = ఈ దుర్మార్గునికొఱకు (మనము), మహోగ్రాక్ష - గణ + అగ్రణులచేన్=మహేశ్వరుఁడు (ఉగ్రములైన కన్నులుగలవాఁడు = ఈశ్వరుఁడు), ప్రమథముఖ్యులు అనువారితో, విగ్రహంబు + పడుట = విరోధపడుట, ఏమి - పని = ఏమి ప్రయోజనము, అని, సుర - ముని - జనంబులు = దేవతల, మునుల సమూహములు. ఒండొరులన్ = ఒకరి నొకరు, కడవన్ = అతిశయించునట్లు.

తాత్పర్యము: ఆ సమయమున శివునకు ద్రోహముచేసిన దక్షుఁ డను నీ దుష్టునకై మహేశ్వరునితోడను, ప్రమథముఖ్యులతోను విరోధించుటవలన నేమి ప్రయోజన మని దేవతలును, మునులును ఒకరినొక రతిశయించునట్లు - తరువాతి పద్యముతో నన్వయము.

క. కనుగీఁటి చూపువారును,
గనుమఱచెడి పట్టుఁ జూపఁ గడఁగెడు వారుం,
గని కడపి పుచ్చువారును,
గనుమఱుపడువారుఁ, బరులఁ గనుఁగొనువారున్. 82

అర్థము : కనుగీఁటి చూపువారును = కనుసన్నచేసి దక్షుఁడున్నచోటు చూపు వారును, కను మఱచెడి పట్టున్ = కనుమఱుఁగైన స్థానమును, చూపన్=చూపుటకు, కడఁగెడువారున్ = ప్రయత్నించువారును, కని = చూచి, కడపి పుచ్చువారును = ఉపేక్షించువారును, కనుమఱుపడువారున్=కనుచాటగువారును, పరులన్=ఇతరులను, కనుఁగొనువారున్ = చూచువారును,

తాత్పర్యము : కనుసన్నచేసి దక్షుఁడున్నచోటు చూపువారును, అతఁడు డాఁగిన కనుమఱుఁగైన చోటిని జూప యత్నించువారును, కని ఉపేక్షించువారును, కనుచాటగువారును, ఇతరులను జూచువారును - తరువాతి పద్యముతో నన్వయము,

వ. త దవసరంబున నతిభయభ్రాంతుండై కన్నవారలక మ్రొక్కుచు స్రుక్కుచు లోఁగుచు డాఁగుచు గోమేధిక సదనంబులో బెదరి చూచు చున్న దక్షునిం గని గణముఖ్యు లెఱింగి పట్టుకొని. 83

అర్థము: తద్ + అవసరంబునన్ = ఆ సమయమున, అతి - భయ - భ్రాంతుండు+ఐ=మిక్కిలి భయముచే భ్రాంతినొందినవాఁడయి, కన్నవారలకున్ + అ = తన్నుఁజూచినవారలకే, మ్రొక్కుచున్ = నమస్కరించుచు, స్రుక్కుచున్ = భయపడుచు, లోఁగుచున్ = క్రుంగుచు, డాఁగుచున్ = దాఁగికొనుచు, గోమేధిక - సదనంబులోన్ = యజ్ఞశాలలో, బెదరి = భయపడి, చూచుచున్+ఉన్న, దక్షునిన్, కని, గణ - ముఖ్యులు = ప్రమథనాయకులు, ఎఱింగి = తెలిసి, పట్టుకొని.

తాత్పర్యము : ఆ సమయమున మిక్కిలి భయముచే భ్రాంతినొందినవాఁడయి తన్నుఁ జూచినవారలకే నమస్కరించుచు. భయపడుచు, క్రుంగుచు, దాఁగికొనుచు యజ్ఞశాలలో బెదరిచూచుచున్న దక్షునిఁ జూచి ప్రమథనాయకులు తెలిసి పట్టుకొని - తరువాతి పద్యముతో నన్వయము,

ఉ. వీండె ఖలుండు దక్షుఁ డను వీఱిఁడి పాఱుఁడు; వీఁడు సర్వ వ
ధ్యుం; డెడ సేయకుండు; శివదూషకు నాలుక గోసి యుప్పు నిం
పుండు; త్రపుద్రవం బొడలఁ బూయుఁడు; లోహము గాఁచి నోరఁ బో
యుండు; దురాత్ము చర్మపట మొల్వుఁడు; కన్నులు మీఁటుఁ
డుక్కఱన్. 84

అర్థము : వీండె = వీఁడే, ఖలుండు = దుర్మార్గుఁడు, దక్షుఁడు + అను, వీఱిఁడి - పాఱుఁడు = దక్షుఁ డను పేరుగల అవివేకియైన బ్రాహ్మణుఁడు, వీఁడు, సర్వ - వధ్యుండు = ఎల్లరకును వధింపఁదగినవాఁడు, ఎడ + చేయకుండు = ఆలస్యము చేయకుఁడు, శివ - దూషకు = శివుని నిందించువానియొక్క, నాలుక + కోసి, ఉప్పు, నింపుండు = కూరుఁడు, త్రపు-ద్రవంబు = సీసపు ద్రవమును, ఒడలన్ = మేనియందు, పూయుఁడు, లోహమున్ = ఇనుమును, కాఁచి, నోరన్ = నోటియందు, పోయుండు, దురాత్మ = దుర్మార్గునియొక్క, చర్మ - పటము = వస్త్రమువంటి తోలును, ఒల్వుఁడు, ఉక్కఱన్ (ఉక్కు + అఱన్) = బలము నశించునట్లు, కన్నులు, మీఁటుఁడు = పీఁకివేయుఁడు.

తాత్పర్యము : 'ఈతఁడే దుష్టుఁడు. దక్షుఁ డను నవివేకిబ్రాహ్మణుఁడు. వీఁ డెల్లరకును వధింపఁదగినవాఁడు. జాగుసేయకుఁడు, శివుని దూషించు వీని నాలుకను గోసి యుప్పు కూరుఁడు. సీసమును గరఁగించి యా ద్రవమును మేనఁ బూయుఁడు. ఇనుమును గాఁచి నోటియందుఁ బోయుఁడు. ఈ దుర్మార్గుని చర్మము నొలువుఁడు. వీని బలము నశించునట్లు కన్నులను బెఱికివేయుఁడు.'

విశేషములు : 'వీఁడె' అనుటకు 'వీండె' అను పూర్ణబిందు సహిత రూపమును బ్రయోగించుట నన్నెచోడుని ప్రాచీనతకు నిదర్శన మందురు. త్రపుః - 'త్రపుః పిచ్చటం రఙ్గ వఙ్గే' త్రపతే అగ్ని సన్నిధౌ ద్రవతీతి త్రపుః-అగ్నిసమీపమందు సిగ్గుపడునది. అనఁగాఁ గరఁగునది - తగరము, సీసము. అమరము.

ఒల్వుఁడు - ఒలుచు + లోట్. 'ఆశీ శ్శాప సంప్రార్థన విధులందు లోట్టగు' బాల. క్రియ. 6. 'లోడాదంబునకు డు బ్రువు రను మ్ముణ్ణగు.' బాల. క్రియ. 8

ఒలుచు + రు (మధ్యమపురుష బహువచనము). 'యుష్మద్ధ్యమ పురుషలకు ముజ్ఞు లగు.' బాల. క్రియ. 29. ఒలుచు + డుజ్ - 'మధ్యమము ముజ్ఞులు ముజ్ఞు నాఁబడు' బాల. క్రియ. 31. 'ముజ్జీత్తులు ముత్తు నాఁబడు.' బాల. క్రియ. 86. ఒలుచు+ముత్తు. 'ఆగమాన్యచకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరం బగునపుడు ప వ లగు.' బాల. క్రియ. 88. ఒలువు + డుజ్. 'జిత్తు బిందుపూర్వం బగు.' బాల. తత్సమ. 19. ఒలువుఁడు. 'అచ్ఛికంబులం బదమధ్యంబుల న ల డ రల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు. బాల. ప్రకీర్ణ. 17. ఒల్వుఁడు.

వ. అని యనేక ప్ర రంబులం బలుకుచు నారకోచితదండంబుల దండించి
నిజాధీశ్వరుండైన గణాధీశ్వరున కొప్పించి తన్నియోగంబున. 85

అర్థము : అని, అనేక - ప్రకారంబులన్ = పెక్కు విధముల, పలుకుచున్, నారక + ఉచిత - దండంబులన్ = నరకలోకమునకుఁ దగిన శిక్షలతో, దండించి= శిక్షించి, నిజ + అధి+ ఈశ్వరుండు + ఐన = తమ ప్రభువయిన, గణ + అధి+ ఈశ్వరునకున్ = గణపతికి, ఒప్పించి = అర్పించి, తద్ +నియోగంబునన్=అతని యాజ్ఞచే -

తాత్పర్యము : అని పెక్కురీతులఁ బలుకుచు నరకలోకమున కర్హమైన శిక్షలతో శిక్షించి, తమ ప్రభువైన గణపతి కర్పించి వాని యాజ్ఞచేత - తరువాతి పద్యముతో నన్వయము,

విశేషములు : తద్ + నియోగము = తన్నియోగము-అనునాసిక సంధి.

ఆ. ప్రమథగణము దక్షుఁ బడఁగొట్టి కట్టుచుఁ
గాలుఁజేయు బడియఁ గావడించి
మను మృగంబు గట్టికొని వచ్చు బలు వేఁట
కాఁడువోలె వచ్చి కనిరి శంభు. 86

అర్థము : ప్రమథ-గణము, దక్షున్, పడన్+కొట్టి, కాలున్, చేయున్=చేయియును, కట్టుచున్, బడియన్ = కట్టతో, కావడించి = కావడిలోఁ బెట్టి, మను-మృగంబున్=

జీవన్మృగమును - బ్రదికియున్న లేడిని, కట్టికొని వచ్చు, బలు-వేఁటకాఁడు + పోలెన్ = బలిష్ఠుఁడైన వేఁటకాండ్రవలె, వచ్చి, శంభున్ = శివుని, కనిరి = చూచిరి.

తాత్పర్యము: ప్రమథులు దక్షునిఁ బడఁగొట్టి, కాలుసేతులు కట్టి పెద్ద దుడ్డు కఱ్ఱతోడి కావడిలోఁ బెట్టి, బ్రదికియున్న లేడిని గట్టుకొని వచ్చు బలవంతులైన వేఁని కాండ్రవలె వచ్చి శివునిఁ జూచిరి.

విశేషములు: మను - మృగంబు = ఒకజాతి జింక, దీనికంటె దక్షుట జీవగ్రాహముగాఁ బట్టుకొనిరి కావున 'మను' అనుదానికి బ్రదికియున్న అనునర్థమే సముచితమని తోఁచినది.

వేఁట - 'కా క త్తియ వర్ణకంబులు పుం స్త్వస్త్రీత్వంబుల మతుబర్థంబునం దాటాదుల కగు.' బాల. తద్ధిత, 11. వేఁటకా. 'లువర్ణంబు బహువచనంబు.' బాల. తత్సమ. 12. 'కా ప్రత్యయంబుమీఁది బహువచనలకారంబునకు లఘ్వలఘురేఫంబులును లఘురేఫంబునకు ముందు పూర్ణబిందుపూర్వక డకారంబు నగు.' బాల. అచ్చిక. 7. వేఁట కాండ్రు - వేఁటకాఁడు - అలంకార ముపమ.

వ. తదవసరంబున. 87

అర్థతాత్పర్యములు: తద్ + అవసరంబునన్ = ఆ సమయమునందు. తరువాతి పద్యముతో నన్వయము.

సీ. ఉరుశోకరసవార్ధి యుప్పొంగె నన మేన
ఘర్మాశ్రు జలములు గడలుకొనఁగఁ,
గడిసన్న తమ్మిఁ బోఁ కడరెనో యన దీన
వదనంబుపై నెఱుల్ సెదరి తూల,
ముఖలక్ష్మి భీతిఁ దమోవీథిఁ జొచ్చె నా
జాలియ విరివేణి వ్రేలుచుండఁ,
గవ వాసి యలఁదురు కలహంసరుతము నా
నాక్రందనారావ మతిశయిల్లఁ

ఆ. దొడరఁ నడుగు లిడుచు దుఃఖాతిశయమునఁ
దల్లడిల్లుచున్న దక్ష ధర్మ
పత్ని వచ్చి పురుషభైక్షంబు వేఁడుచు
జాలి దవుల నభవు ంమోలఁ బడియె. 88

అర్థము: ఉరు - శోక - రస - వార్ధి=గొప్ప దుఃఖరస మనెడి సముద్రము, ఉప్పొంగెన్ + అనన్=ఉప్పొంగెనా యనునట్లు, మేనన్=శరీరమునందు, ఘర్మ + అశ్రు - జలములు = చెమటనీరును, కన్నీరును, కదలుకొనఁగన్ = వ్యాపింపఁగను,

కడి + చన్న = సువాసనపోయిన, తమ్మిన్=తామరపువ్వునందు, పాఁకు= నాఁచు, అడరెనో + అనన్ = వ్యాపించెనో యనునట్లు. దీన - వదనంబుపైన్ = దుఃఖితమైన ముఖముమీఁద, నెఱుల్ = వెంట్రుకలు, చెదరి, తూలన్=చలింపఁగను

ముఖ - లక్ష్మి = ముఖమనెడు లక్ష్మి, భీతిన్=భయముతో, తమస్ (ః) + వీథిన్ = చీఁకటి వీథియందు, చొచ్చెన్+నాన్=ప్రవేశించెనా యనునట్లు, జాలియ=, యజ్ఞము సేయునపుడు సోమిదమ్మ తలపై నుంచుకొను వల, విరి - వేణిన్=విరిసిన-విప్పారిన జడయందు, వ్రేలుచున్ + ఉండన్ = వ్రేలాడుచుండఁగను,

కవ + పాసి = జతవిడిచి, అఱఁదురు = దుఃఖించు, కలహంస=రాయంచ యొక్క, రుతము - నాన్ = ధ్వనియో యన, ఆక్రందన + ఆరావము = రోదన ధ్వని, అతిశయిల్లన్ = అధికము కాఁగను,

తొడరన్ = తొట్రుపడునట్లు, అడుగులు + ఇడుచున్=అడుగులు వేయుచు దుఃఖ + అతిశయమునన్=శోకాధిక్యముచే, తల్లడిల్లుచున్+ఉన్న=బాధపడుచున్న, దక్ష - దర్మపత్ని = దక్షుని కులసతి, వచ్చి, పురుష - భైక్షంబున్=భర్తృభిక్షమును, వేఁడుచున్ = కోరుచు, జాలి+తవులన్=దుఃఖము కలుగఁగా, అభవు-మ్రోలన్ = శివుని యెదుట, పడియెన్.

తాత్పర్యము ; శోకరస మనెడి సముద్రము పొంగెనా యనునట్లు శరీరమునఁ జెమటనీరును, కన్నీరును వ్యాపింపఁగను, సువాసన యెడలిన తామరపై నాఁచు వ్యాపించెనో యనునట్లు దీనముఖముపై శిరోజములు చెదరి పడఁగను, ముఖమనెడి

లక్ష్మి భయపడి చీఁకటి వీథిలోఁ బ్రవేశించెనా యనునట్లు జాలియ విప్పారిన వ్రేణి యందు వ్రేలుచుండఁగను, జంటను బాసి దుఃఖించు రాయంచ కూఁతయా యనునట్లు రోదన ధ్వని యతిశయిల్లఁగను, తొట్రుపడ నడుగులిడుచు దుఃఖాతిశయమునఁ దల్లడిల్లుచున్న దక్షునిభార్య వచ్చి భర్తృభిక్షను గోరుచు శోకించుచు శివుని సమక్షమునఁ బడియెను.

విశేషములు: సీసపద్యమునందలి ప్రతిపాదమునను ఉత్ప్రేక్షాలంకారము గలదు. స్వభావోక్తి.

వ. ఇట్లనాథవృత్తి ననన్యశరణ్యయై శరణువేఁడు దక్షాంగనం గని
కరుణాకరుండైన పరమేశ్వరుండు కారుణ్యదృష్టిం జూచిన కన్నెఱింగి, 89

అర్థము: ఇట్లు, అనాథ-వృత్తిన్ = దిక్కులేని వర్తనముతో, అనన్య-శరణ్య+ ఐ- మఱియొకరు శరణుపొందఁదగినవారు లేనిదయి, శరణు-వేఁడు= రక్షణము కోరు, దక్ష+ అంగనన్= దక్షుని భార్యను. కని=చూచి, కరుణా+ ఆకరుండు= దయకు స్థానమైనవాఁడు, ఐన, పరమేశ్వరుండు, కారుణ్య-దృష్టిన్= దయతోడి చూపుతో, చూచిన-కన్ను+ ఎఱింగి= చూచిన జాడ తెలిపి,

తాత్పర్యము: ఇట్లు దిక్కులేనిదయి, శివునికంటె వేఱెవ్వరును శరణుపొందఁదగినవారు లేనిదయి, రక్షణము కోరు దక్షుని భార్యను జూచి దయామయుఁడైన పరమేశ్వరుఁడు దయాదృష్టితోఁ జూడవలయునను నాతని యింగిత మెఱిఁగి - తరువాతి పద్యముతో నన్వయము,

చ. హరి కమలాసనాదు లభయం బభయంబు భయాతురార్తిసం
హర! కరుణాత్మ! విశ్వభువనాధిప! మా కని చక్కఁ జాఁగ ని
ర్జరపతి మ్రొక్కియున్నఁ గని శంకరుఁ డంతన తద్దయారసా
భరిత విశాలనేత్ర శతపత్రదళంబులఁ గప్పె నందఱన్. 90

అర్థము: హరి- కమలాసన+ ఆదులు= విష్ణువు, బ్రహ్మ మున్నగువారు, భయ+ఆతుర +ఆర్తి-సంహర =వెఱపుచేఁబీడింపఁబడువారి బాధను బోఁగొట్టువాఁడా!, కరుణా+ఆత్మ=దయాహృదయా, విశ్వ-భువన+అధిప=ఎల్లలోకములకుఁ బ్రభువైన

వాఁడా! ఈశ్వరా! మాకున్, అభయంబు+అభయంబు=శరణు శరణుఅని, చక్కన్+ చాఁగన్= సాష్టాంగ నమస్కారము చేయఁగా, నిర్జర-పతి =దేవతల ప్రభువు-ఇంద్రుఁడు, మ్రొక్కి+ఉన్నన్= నమస్కరించియుండఁగా, కని=చూచి, శంకరుఁడు=శివుఁడు, అంతన్+అ = వెంటనే, తద్+ దయా-రస+ ఆభరిత-విశాల-నేత్ర-శతపత్ర-దళంబులన్=ఆ కరుణారసముతోఁ బూర్ణములైన తామరరేకులవలె విశాలములైన కన్నులతో, అందఱన్=ఎల్లరను, కప్పెన్-

తాత్పర్యము : విష్ణువు, బ్రహ్మ మున్నగువారు 'భయార్తుల భయమును బోఁగొట్టు వాఁడా! దయాహృదయా! సర్వలోకప్రభూ! మాకు శరణు శరణు' అని సాష్టాంగ నమస్కారము చేయఁగా. ఇంద్రుఁడు మ్రొక్కియుండఁగాఁ జూచి శంకరుఁడు వెంటనే తన దయారసపూరిత దృగబ్జదళములతో నెల్లరను గప్పెను,

విశేషములు ; చక్కఁజాఁగి యను పాఠముకంటె, సా. ప్రతిలోని 'చక్కఁజాఁగ' అనుపాఠము అన్వయసౌగమ్యము గలిగియుండుటచే నది స్వీకృతము.

వ. ఇట్లు పరమేశ్వర దయావలోకనామృత రస ప్రవాహాపగత భయసంతాపహృదయులైన సురవరులం దఖిల సురజ్యేష్ఠుండైన సురజ్యేష్ఠుఁడు కరకమల ముకుళ విన్యస్త మస్తకుండై సమస్త వేదస్తుతులం బ్రస్తుతించి చతుర్ముఖుండు పంచముఖున కభిముఖుండై 91

అర్థము : ఇట్లు పరమేశ్వర ....హృదయులు ; పరమేశ్వర=పరమేశ్వరుని యొక్క, దయా=దయతోఁ గూడిన, అవలోకన=చూపులనెడి, అమృత-రస=అమృత రసముచేత, అపగత = పోయిన, భయ-సంతాప=భయము, పరితాపము అనువానితోఁ గూడిన, హృదయులు=హృదయములు గలవారు, ఐన, సుర-వరులన్=దేవతాశ్రేష్ఠులను, అఖిల-సుర-జ్యేష్ఠుండు=ఎల్లదేవతలలోఁ బెద్దవాఁడు, ఐన, సుర-జ్యేష్ఠుండు= బ్రహ్మ, కర ....మస్తకుండు+ఐ= కర-కమల-ముకుళ=తామరమొగ్గలవంటి చేతుల చేత, విన్యస్త=ఉంపఁబడిన, మస్తకుండు+ ఐ=శిరస్సు గలవాఁడయి, సమస్త-వేద-స్తుతులన్=ఎల్లవేదములయొక్క స్తోత్రములచేత, ప్రస్తుతించి = పొగడి, చతుర్ముఖుండు=బ్రహ్మ, పంచ-ముఖునకున్-= అయిదుమొగములు గలవాఁడు అగు శివునకు, అభిముఖుండు+ ఐ=ఎదు రయి,

తాత్పర్యము : ఇట్లు ఈశ్వరుని దయాదృష్టి లనెడి అమృత రసప్రవాహము చేత హృదయములందు భయసంతాపములు పోయినవారయిన దేవతాశ్రేష్ఠులను ఎల్ల సురలకుఁ బెద్దవాఁడైన బ్రహ్మ పద్మముకుళములవంటి హస్తములను శిరస్సుననుంచి సర్వవేదములందలి స్తోత్రములచేతను నుతించి అయిదుమొగముల వేల్పగు శివున కభిముఖుఁడయి-తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు ; సురజ్యేష్ఠుఁడను కర్త యొకఁ డుండఁగా మరలఁ చతుర్ముఖుఁ డను నింకొక కర్త యనావశ్యకము.

చ. తనరఁ గ్రియాతిదక్షుఁ డగు దక్షుఁడు తత్క్రతువల్లభుండు, స
న్మునితతి ఋత్విజుల్, సురసమూహి సదస్యులు, తత్ఫలంబు నిం
దనిశమునిచ్చు నీ వడఁచి తట్టె మఖం బిది కర్త భక్తిమైఁ
దనరని యజ్ఞమైనఁ దుదిఁ దా నభిచారము గాకపోవునే? 92

అర్థము: తనరన్-ఒప్పునట్లుగా, క్రియా+అతి- దక్షుఁడు=యజ్ఞాది విధు లందు మిక్కిలి సమర్థుఁడు, అగు దక్షుఁడు, తద్+క్రతు - వల్లభుండు=ఆ యజ్ఞము యొక్క యజమానుఁడు, సత్+ముని-తతి=యోగ్యులగు మునులయొక్క సమూహము, ఋత్విజుల్=యాజకులు, సుర-సమూహి=దేవతలసమూహము, సదస్యులు = యాగ సదస్సునందు సభ్యులు, తద్ + ఫలంబులు=ఆ యజ్ఞముయొక్క ఫలము= ఇందున్ = ఇక్కడ, అనిశమున్ = ఎల్లప్పుడును, ఇచ్చు, నీవు, మఖంబు + ఇది=ఈ యజ్ఞము, అడఁచితి (వి) + అట్టె = నశింపఁ జేసితి వఁట, కర్త లు యజమానునియొక్క, భక్తిమైన్=శ్రద్ధతో, తనరని=ఒప్పని, యజ్ఞము+ఐనన్ = యజ్ఞమయినచో, తుదిన్ = చివరకు, తాను, అభిచారము = అనర్థకరము కాకపోవునే = కాకుండునా?

తాత్పర్యము : యజ్ఞాదివిధులందు మిక్కిలి సమర్థుఁడగు దక్షుఁడు ఆ యజ్ఞమునకు యజమానుఁడు. యోగ్యులైన మునుల సమూహము యజ్ఞనిర్వాహకులగు ఋత్విక్కులు, దేవతల సమూహము యజ్ఞసదస్యులు. ఆ యజ్ఞఫలముల నెల్లప్పుడు

నొసఁగు నీవు ఆ యజ్ఞమును నశింపఁజేసితివఁట। యజమానునకుఁ గ్రతుఫలదాత వైన నీయందు భక్తి శ్రద్ధలు లేనిచో, నా యజ్ఞము చివరకు అనర్థహేతుకము కాకుండునా? తప్పక అగు నని భావము,

విశేషములు : ఈ పద్యము పుష్పదంతకృత మగు శివమహిమ్నః స్తోత్రము నందలి యీ దిగువ శ్లోకమున కించుమించుగా నాంధ్రీకరణ మగుట చూడనగును.

> క్రియాదక్షో దక్షః క్రతుపతి రధీశ స్తనుభృతా
> మృషీణా మార్త్విజ్యం శరణద సదస్యాః సురగణాః,
> క్రతుభ్రేష స్త్వత్తః క్రతుఫల విధాన వ్యసనినో
> ధ్రువం కర్తుః శ్రద్ధావిధుర మభిచారాయ హి మఖాః.

మూల శ్లోకమునందలి పదములే పద్యమునందును బ్రయుక్తము లగుట చూడ నగును. క్రియాదక్షః - క్రియాతిదక్షుఁడు, సదస్యాః సురగణాః - సుర సమూహి సదస్యులు, కర్తుః - కర్త (యొక్క), అభిచారాయ-అభిచారము,

సన్ముని = సత్ + ముని - అనునాసికసంధి, సమూహి = సమూహ మను టకు సమూహి యని శైవకవుల కృతులయందే ప్రయుక్తము. 'ద్వి. పస గొని, సకల భక్త సమూహి చూడ' - బస. పురా. 205 పు, 26 పం- అడఁచితట్టె - అడఁచి తివి+ అట్టె - 'లిఙ్గాటుల వకారంబునకు లోపంబు విభాష నగు' బాల, క్రియ. 16. అడఁచితి+ఇ+అట్టె. అపదాదిస్వరసంధి, బాల, సంధి,॥, అడఁచితి+అట్టె, 'మధ్యమ పురుషక్రియలయ్యం దిత్తునకు సంధి యగును,' బాల. సంధి. 7. అడఁచితట్టె, భక్తి మైన్-'జడపదంబులమీఁది జోడకు మెయి మై లు వికల్పంబుగ నగు.' ప్రౌఢ. శబ్ద. 18.

వ. అదియునుంగాక సకల భువన స్వామి యైన నిన్నుం గులస్వామి యని తలంపక సంబంధ బంధు కృత్యంబున నితరజన సామాన్యుం డని యెల్లిదించి. 93

అర్థము : అదియునున్ + కాక, సకల - భువన - స్వామి = ఎల్ల లోక ములయొక్క ప్రభువు, ఐన, నిన్నున్, కుల - స్వామి = కుల దైవము, అని,

తలంపక, సంబంధ - బంధు - కృత్యంబునన్ = వివాహ సంబంధముచే_అల్లుఁ డను చుట్టఱికమ్ముచేత, ఇతర - జన - సామాన్యుండు = ఇతరులైన జనులవలెనే సాధారణమైనవాఁడు, అని, ఎల్లిదించి = ఎల్లిదము (అవమానము) చేసి,

తాత్పర్యము : అదియును గాక ఎల్లలోకములకుఁ బ్రభువవైన నిన్నుఁ గుల దైవమని యెంచక అల్లుఁడనెడి చుట్టఱికమువలన నితరజనులతో సమానుఁడ వని యవమానించి - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : అదియునుంగాక - 'కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి,' బాల. సంధి. 21. ఎల్లిదించి - ఎల్లిదము అను నామమునకు ధాతుత్వ వివక్షయం దించుగాగమ మయినది, 'సంస్కృతంబున కంగలాదుల కించుక్కగు,' బాల. క్రియా. 63. ఎల్లిద + ఇంచు, అపదాది స్వరసంధి బాల. సంధి. 11, ఎల్లిదించు.

క. బంధుఁ డని నిన్నుఁ దలఁచి స
బంధుం డయి పడుట తనకుఁ బాడియె మఱి ని
ర్బంధుఁ డగు నిన్నుఁ గనియు స
బంధుండై దక్షుఁ డునికి పాడియె దేవా ! 94

అర్థము: దేవా! = ప్రభూ ! . బంధుఁడు + అని = చుట్ట మని - అల్లుఁడ వని, నిన్నున్, తలఁచి = భావించి, సబంధుండు + అయి = చుట్టములతోఁ గూడిన వాఁడయి, పడుట = పతనము చెందుట, తనకున్, పాడియె = ధర్మమే, నిన్నున్, బంధుఁడు=సంసారబంధనములతోఁ గూడిన వాఁడు, అని, తలఁచి. సబంధుండు+ అయి=బంధములతోఁ గూడినవాఁడయి, పడుట, తనకున్ = దక్షునకు, పాడియె, మఱి=కాని, నిర్బంధుఁడు=బంధరహితుఁడు అగు, నిన్నున్, కనియున్=చూచియును, సబంధుండు+ఐ = బంధసహితుఁడయి. దక్షుఁడు, ఉనికి = ఉండుట, పాడియె = ధర్మమా?

తాత్పర్యము ; దేవా! నీలోకేశ్వరత్వము మఱచి నిన్ను అల్లునిగనే భావించి తాను బంధుసహితుఁడై పతితుఁ డగుట ధర్మమేయగును. నీవు సంసారబంధము గల్లవాఁడవని యెంచి తాను బంధసహితుఁడై పతనముఁ జెందుట దక్షునకు ధర్మమే యగును. కాని

బంధరహితుఁడ వయిన నిన్నుఁ జూచియుఁ దాను బంధయుక్తుఁ డయి యుండుట దక్షునకు ధర్మమా?- ధర్మము కాదనుట

విశేషములు; సబంధుఁడు- బంధు సహితుఁడు, బంధసహితుఁడు నను నర్థద్వయముచే శ్లేషాలంకారము. మీఁదివచనమునందలి 'చతురానను చతురోక్త' లనుటకు-ఆతని ఉక్తిచాతుర్య మిదియే.

వ, అనిన చతురానను చతురోక్తులకుం బరమేశ్వరుండు ప్రహృష్ట మనస్కుండై దక్షు నీక్షించి దాక్షాయణిపైఁ బ్రణయభావా కలిత హృదయుండై యున్న గంగాధరు నింగితం బెఱింగి పద్మయోని వెండియు ని ట్లనియె. 95

అర్థము; అనిన=అనినట్టి, చతుర్ (ః)+ఆనను=చతుర్ముఖునియొక్క, చతుర+ఉక్తులకున్=నేర్పుతోడి మాటలకు, పరమేశ్వరుండు, ప్రహృష్ట-మనస్కుండు+ఐ=మిక్కిలి సంతోషించిన మనస్సుగలవాఁడయి, దక్షున్, ఈక్షించి=చూచి. దాక్షాయణిపైన్= సతీదేవిపై, ప్రణయ-భావ+ఆకలిత-హృదయుండు + ఐ=ప్రేమభావముతోఁ గూడిన హృదయము గలవాఁడయి, ఉన్నన్=ఉండఁగా, గంగాధరు+ ఇంగితంబు=శివుని యభిప్రాయము, ఎఱింగి, పద్మయోని=పద్మము జన్మస్థానముగాఁ గలవాఁడు-తమ్మిచూలి-బ్రహ్మ, వెండియున్=మరల, ఇట్లు, అనియెన్.

తాత్పర్యము; అని పలికిన చతుర్ముఖుని ఉక్తిచాతుర్యమునకుఁ బరమేశ్వరుఁడు సంతోషించి దక్షునిఁజూచి, సతీదేవియెడఁ బ్రేమభావముతో నుండఁగా. శివు నభిప్రాయమును సతిమృతికి దక్షుఁడే కారణ మనుదానిని తెలిసి బ్రహ్మ మరల శివునితో నిట్లు పలికెను.

క, 'ఆ నెపమున ద్రోహమునకు
వానిన కా దరసి యతని వంశం బెల్లన్
గానువునఁ బెట్టి యార్చిన
నేనియుఁ జాలః దిది పెద్దయే దక్షునకున్?' 96

అర్థము ; ఆ నెపమున-ద్రోహమునకున్ = ఆ విధమైన ద్రోహమునకు, వానిన్ + అ-కాదు = ఆ దక్షునే కాదు, అరసి = చూచి, అతని, వంశంబు + ఎల్లన్ = ఆతనివంశము నంతను, గానువునన్ — గానుఁగులో, పెట్టి, ఆర్చినన్ + ఏనియున్ = ఆడించినప్పటికిని, చాలదు = సరిపోదు, ఇది = ఈ శిక్ష, దక్షునకున్, పెద్ద + ఏ = ఎక్కువా?

తాత్పర్యము ; 'ఆ విధమైన ద్రోహమునకు ఆ దక్షు నొక్కనినే కాదు -వెదకి యతని కులమునంతను గానుఁగులోఁబెట్టి యాడించినను జాలదు. దక్షున కీ శిక్ష యెక్కువయా!' కాదనుట.

విశేషములు : గానువు-గానుఁగు, గాన్గు, గానుఁగ (రూపాం,) ఆర్చినన్- ఆడు ధాతువు, 'ముగాగమం బాచ్ఛికంబున కనంయుక్తన ల డ రాంతంబునకుం బ్రేరణంబున బహుళంబుగా నగు' ఆడు + చు. బాల. క్రియ. 73. 'ఆ దోడు కూడుల డకారంబునకుం జుక్కు పరం బగునపుడు రేఫంబగు.' బాల. క్రియ. 80, ఆరుచు. 'ఆచ్ఛికంబులం బద మధ్యంబుల న ల డ ర ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు.' బాల. ప్రకీర్ణ. 17, ఆర్చు. 'చేదర్థంబునందు వృత్తంబగు భావలక్షణంబునందు నవర్ణకంబు ప్రమతాంతం బగు,' ఆర్చు + నన్. బాల. క్రియ. 41, 'భూతంబునం ఙిగాగమం బగు' ఆర్చు + ఇనన్ బాల. క్రియ. 17, అపదాదిస్వరసంధి. బాల, సంధి. 11. ఆర్చినన్.

ఆ. ఎంత ద్రోహుఁ డయ్యు నితఁడు వధార్హుఁడే?
యభవ! నీవు[1] దీని నవధరింపు;
మవని "బ్రాహ్మణో న హన్తవ్య" యను పలు
కేప నిలుపకున్న నేల నిల్చు[2]? 97

అర్థము : అభవ = ఈశ్వరా! ఎంత ద్రోహుఁడు + అయ్యున్ = ఎంతటి ద్రోహి యయినను, ఇతఁడు = ఈ దక్షుఁడు, వధ + అర్హుఁడే = వధింపఁదగినవాఁడా?

1. పా. ప్రతి. నీని నీవ. 2. వా. ప్రతి. తప్పు.

నీవు, దీనిన్ = ఈ విషయమును, అవధరింపుము = చిత్తగింపుము, అవనిన్ = భూమియందు, బ్రాహ్మణః + న- హన్తవ్య ః= బ్రాహ్మణుఁడు చంపఁదగినవాఁడు కాఁడు, అను, పలుకు, ఈవు, నిలుపక + ఉన్నన్ = నిలుపకపోయినచో, ఏల_నిల్చున్=ఎందులకు నిలుచును? నిలువ దనుట.

తాత్పర్యము: 'ఈశ్వరా! ఎంతటి ద్రోహి యైనను, ఈ దక్షుఁడు వధింపఁదగిన వాఁడా? ఈ విషయమును నీవు బాగుగా నాలోచింపుము, భూమియందు బ్రాహ్మణుఁ డెట్టి పాపకర్ముఁ డైనను జంపఁదగినవాఁడు కాఁడను మాట యున్నది కదా; దానిని నీవే నిలుపకున్నచో నది యేల నిలుచును?' నిలువదని భావము.

విశేషములు : ద్రోహి యనుటకు ద్రోహుఁ డని ప్రయోగింపఁబడినది, పాపి- పాపుఁడు వలె. బ్రాహ్మణో న హన్తవ్యః + అను - 'విసర్గంబున కనుకరణంబున లోపం బగు.' బాల. సంధి. 50. బ్రాహ్మణో న హన్తవ్య + అను, 'సంధిలేనిచోట స్వరంబుకంటెం బరం బయిన స్వరంబునకు యడాగమం బగు.' బాల. సంధి. 3. బ్రాహ్మణో న హన్తవ్య యను.

వ. అని పరమేశ్వరు ననుమతంబునం బ్రజాపతి బంధమోక్షంబు సేసి యమృతాత్మకు శ్రీపాదంబులపైఁ బెట్టినఁ దదీయ స్పర్శంబున దక్షుండు తత్క్షణంబ సచేతనుండై భక్త్యావేశంబునం బ్రణుతింప నభిముఖుండై. 98

అర్థము : అని, పరమేశ్వరు + అనుమతంబునన్ = పరమేశ్వరునియొక్క అనుమతిచే, ప్రజాపతి - బంధ - మోక్షంబు + చేసి = దక్ష ప్రజాపతి యొక్క బంధములను విప్పి, అమృత + ఆత్మకు = అమృతస్వరూపుఁడైన ఈశ్వరుని యొక్క, శ్రీపాదంబులపైన్ = దివ్యములైన పాదములమీఁద, పెట్టినన్ =

పెట్టఁగా, తదీయ-స్పర్శంబునన్ = ఆతనిదైన తాఁకుచేత, దక్షుండు, తద్ + క్షణంబు + అ = ఆ క్షణమే, సచేతనుండు + ఐ = సజీవుఁడయి, భక్తి + ఆవేశంబునన్ = భక్తియొక్క ఉద్రేకముచేత, ప్రణుతింపన్ = ప్రస్తుతించుటకు, అభిముఖుండు + ఐ = ఎదుటయినవాఁడయి,

తాత్పర్యము : అని బ్రహ్మ పరమేశ్వరుని అనుమతి చొప్పున దక్షుని బంధవిముక్తుని జేసి యమృతస్వరూపుఁడైన యీశ్వరుని దివ్యపాదములపైఁ బెట్టఁగా నాతని స్పర్శముచే దక్షుఁడు ఆ క్షణమే ఒడలు తెలిసి భక్త్యుద్రేకముతో శివుని బ్రస్తుతించుట కభిముఖుఁడై - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు: పరమేశ్వరు + అనుమతంబునన్ - 'షష్ఠీసమాసంబునం దుకార ఋకారంబుల కచ్చు పరంబగునపుడు నుగాగమంబగు.' బాల, సంధి, 34. పరమేశ్వరు ననుమతంబునన్. తద్ = క్షణము - అనునాసికాంతస్థభిన్నములైన హల్లులకు (ఝల్లులకు) కఠినహల్లులు (ఖ్రులు) పరమగునపుడు వానివర్గము లందలి ప్రథమ వర్ణములు (చ్రులు) ఆదేశములగును, తత్‌క్షణము, భక్తి + ఆదేశము - ఇ ఉ ఋ ౡ లకు అసవర్ణములైన అచ్చులు పరములగునపుడు క్రమముగా య్, వ్, ర్, ల్ (యణ్ణులు) ఆదేశము లగును - యణాదేశసంధి.

లయగ్రాహి

'ఫాలతల విస్ఫురిత లోలతర భాసుర వి
    శాల భయదాసుర కరాళ నయనాగ్ని
జ్వాల లొకొ? పింగళ జటాళి యొకొ? నా బెరసి
    తూలి, దివి భూషణ చయాలుళితదీర్ఘ
వ్యాళ నికరం బొకొ? కరాళియొకొ? నాఁ దనర
    క్రాలి, వర నృత్య పరిలోలుఁ డగు శ్రీకం
కాలధరు, నుజ్జ్వలకపాలధరు, సన్నిశిత
    శూలధరు, నీశ్వరు, దయాళు నుతియింతున్.' 99

అర్థము: ఫాలతల....జ్వాలలొకొ : ఫాల - తల = నొసటి యందు, విస్ఫురిత = తోఁచుచున్నవియు, లోలతర = మిక్కిలి చలించునట్టియు, భాసుర= ప్రకాశించుచున్నట్టియు , విశాల = విరివియైనట్టియు, భయద = భయము గలిగించు నట్టి, అసుర - కరాళ =రాక్షసులకు భయంకరము లయినట్టియు, నయన + అగ్ని- జ్వాలలు + ఒకొ = కంటి మంటలా? పింగళ - జటా + ఆళి + ఒకొ = పింగళ వర్ణము (గోరోచనపువర్ణము) గల, జడలయొక్క వరుసయా? నాన్ = అనునట్లు, పెరసి = వ్యాపించి, తూలి = చలించి, దివిన్ = ఆకాశమునందు, భూషణ - చయ = అలంకారములమొత్తమయి, ఆలుళిత = కదలిన, దీర్ఘ = పొడవైన, వ్యాళ - నికరంబు + ఒకొ = పాముల సమూహమా? కర + ఆళి + ఒకొ = చేతుల మొత్తమా? నాన్ అనునట్లు, తనరి = ఒప్పి, క్రాలన్ = ప్రకాశింపఁగా, వర- నృత్య=మేలైన నాట్యమునందు, పరిలోలుఁడు=మిక్కిలి యాసక్తి గలవాఁడు, అగు, శ్రీ - కంకాల - ధరున్ = శ్రీకరమైన అస్థిపంజరమును దాల్చినవాఁడును, ఉజ్జ్వల - కపాల - ధరున్ = ప్రకాశించు పుఱ్ఱెలను ధరించినవాఁడును, సన్నిశిత = మిక్కిలి వాఁడియైన, శూల - ధరున్, శూలాయుధమును దాల్చినవాఁడును, దయాళున్ = దయాస్వభావుఁడును, (అగు) ఈశ్వరున్, నుతియింతున్ = స్తుతింతును.

తాత్పర్యము: 'నొసటఁ దోఁచునట్టియుఁ, జలించునట్టియుఁ, బ్రకాశించునట్టియు, విరివియైనట్టియు, ఘోర రాక్షస భయంకరము లయినట్టియు కంటి మంటలా? పింగళవర్ణముగల జడల సమూహమా యన వ్యాపించి చలించి, ఆకాశమున నలంకారములై కదలు పొడవైన పాముల మొత్తమా? చేతుల మొత్తమా? యననొప్పి ప్రకాశింపఁగా, మేలయిన నాట్యమునందు మిక్కిలి యాసక్తి గల శ్రీకంకాలధరుఁడును, కపాల ధరుఁడును, శూలధరుఁడును దయాస్వభావుఁడును అగు నీశ్వరుని స్తుతింతును.

విశేషములు : అలంకారము సందేహము, లయగ్రాహి - నాలుగు పాదము లుండును. ఒక్కొక్కపాదమున ముప్పదితొమ్మిది మాత్రలుండును. ముప్పది యక్షరము లుండును. భ, జ, స, న ,భ, జ, స, న, భ, య గణము లుండును. 1- 9- 17 - 25 స్థానములఁ బ్రాసయతి చెల్లవలయును. ప్రాసనియమము గలదు,

లయగ్రాహి

'ఉర్వర చలింపఁ, గులపర్వతచయం బదరఁ,
బర్వ భువి నంబునిధు, లౌర్వశిఖి యాడన్,
బూర్వసుర నాగ సుర పూర్వదిగధీశ యమ
వార్విభు ధనేశ్వరుల గర్వము లడంగన్,
సర్వగణముఖ్యులును, సర్వగణ భూతములు
నార్వ, నహిభూషణము లార్వ, దిశలం గం
ధర్వతతి పాడఁగ, నపూర్వనటనాదిగురు,
సర్వగతు, సర్వమయు, శర్వు నుతియింతున్.' 100

అర్థము: ఉర్వర = భూమి, చలింపన్ = వణఁకఁగా, కుల - పర్వత -చయంబు = కులపర్వతముల సమూహము, అదరన్ = అదరఁగా, అంబునిధులు = సముద్రములు, భువిన్=భూమియందు, పర్వన్ = వ్యాపింపఁగా, ఔర్వ - శిఖి= బడబాగ్నిఁ ఆడన్=ఆడఁగా, పూర్వ సుర - నాగ-సుర-పూర్వ - దిశ్ + అధి + ఈశ - యమ - వార్విభు, ధన + ఈశ్వరుల = రాక్షసులయు, నాగులయు, దేవతలయు, ప్రాగ్దిశాధిపతియైనయింద్రునియొక్కయు, యమునియొక్కయు, జలప్రభువైన వరుణునియొక్కయు, ధనపతియైన కుబేరునియొక్కయు, గర్వములు, అడంగన్ = నశింపఁగా, సర్వగణ - ముఖ్యులును = ఎల్ల గణనాయకులును, సర్వ - గణ - భూతములున్ = ఎల్ల గణములందలి పిశాచములును, ఆర్వన్ = అఱవఁగా, అహి - భూషణములు = సర్పాలంకారములు, ఊర్వన్ = ఊర్పులు పుచ్చఁగా, దిశలన్= దిక్కులందు, గంధర్వ - తతి = గంధర్వుల సమూహము, పాడఁగన్, అపూర- నటన +ఆది - గురున్ = అపూర్వమైన నటనమునకు మొదటి గురువైనవాఁడును, సర్వ - గతున్ = అన్నిటిని బొందినవాఁడును, సర్వ - మయున్ = అన్నిట నిండినవాఁడును, అగు, శర్వున్ = ఈశ్వరుని, నుతియింతున్,

తాత్పర్యము : 'భూమి చలింపఁగను, గులపర్వతము లేడును అదరఁగను, సముద్రము లేడును భూమిపై వ్యాపింపఁగను, బడబాగ్ని యాడఁగను, రాక్షసుల, నాగుల, దేవతల, ఇంద్రుని, యముని, వరుణుని, కుబేరుని గర్వము లడఁగఁగను, ఎల్ల

గణాధీశ్వరులును, ఎల్ల భూతగణములును ఆర్వఁగను. సర్పాభరణములు ఊర్పులు పుచ్చఁగను, దిశల గంధర్వుల సమూహము పాడఁగను అపూర్వ నటనముచేఁతకు మొదటి గురువైనవాఁడును, సర్వమును బొందినవాఁడును, అన్నిట నిండినవాఁడును. అగు నీశ్వరుని స్తుతింతును.'

విశేషములు : ఊర్వన్ - ఊర్చు + నుజీ. 'తుమర్థ భావలక్షణంబులందు నుజీ యగు' బాల. క్రియ. 40, 'ముజీత్తులు ముత్తు నాఁబడు' బాల. క్రియ. 86. 'ఆగమాన్యచకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరం బగునపుడు ప వ లగు.' ఊర్వన్, బాల, క్రియ. 88.

లయగ్రాహి

'తాళరుతి గీతిరుతి మేలి తత వాద్యరుతి
చాల రసవంత మయి యోలి నులియం, ద
త్తాలగతి మెట్టుచును గేలఁ జరు లిచ్చుచును
జాలి యనురాగమునఁ గ్రాలుచు సుఖాబ్ధిం
దేలుచును మే మఱచి వ్రాలుచును గెత్తుచును
లోలగతి నేత్ర భుజ చాలనతోఁ బ్రే
తాలయమునందు సుఖలీల నెఱసంజ నను
కూలగతి నాడు శివు శూలి నుతియింతున్.' 101

అర్థము: తాళ-రుతి=తాళధ్వని, గీతి-రుతి=గీతధ్వని, మేలి - తత - వాద్య - రుతి=మేలయిన వీణాదివాద్యధ్వని, చాలన్=మిక్కిలి, రసవంతము+అయి, ఓలిన్=క్రమముగా, ఉలియన్= ధ్వనింపఁగా, తద్ + తాల - గతిన్ = ఆ తాళముల కనుగుణమగు విధమున, మెట్టుచును = అడుగులువేయుచు, కేలన్ = చేతులతో, చరులు + ఇచ్చుచును = చఱపులు చఱచుచు, చాలి = తగియుండి, అనురాగమునన్ = ప్రేమముతో, క్రాలుచును = ఒప్పుచును, సుఖ - అబ్ధిన్ = సుఖమనెడి సముద్రమునందు, తేలుచును, మే - మఱచి ఒడలు తెలియక, వ్రాలుచును = తూలుచును, గెత్తుచును = గంతులువేయుచు, లోల - గతిన్ = చలించు విధమున, నేత్ర - భుజ - చాలనలతోన్ = కన్నులయు, భుజములయు, కదలించు

టలతో, ప్రేత + ఆలయమునందున్ = శ్మశానభూమియందు, సుఖ - లీలన్ = సుఖముగా, సెఱ - సంజన్ = నిండైన సంధ్యాసమయమునందు, అనుకూల - గతిన్ = తగిన విధముగా, ఆడు = నృత్యముచేయునట్టి, శూలిన్ = శూలము ఆయుధముగాఁగలవాఁడు (అగు), శివున్ = శివుని, నుతియింతున్ = పొగడుదును.

తాత్పర్యము : 'తాళధ్వని, గీతిధ్వని, మేలయిన వీణాదివాద్యధ్వని మిక్కిలి ఘనవంతమై నినదింపఁగా, నా తాళమునకు ననుగుణముగా నడుగులు వేయుచుఁ, జేతులతోఁ జఱపులు చఱచుచు, ప్రేమతో నొప్పుచు, సౌఖ్యాంబుధిలోఁ దేలుచు, పై పుఱచి సోలుచు, గంతులువేయుచు, కన్నుల భుజముల కదలించుటలతో శ్మశాన భూమియందు సుఖముగా సంధ్యావేళ ననుకూలమైన రీతితో నృత్యముచేయు శూలాయుధుని శివుని నుతింతును.

విశేషములు; సుఖాబ్ధి - సుఖ మనెడి అబ్ధి - రూపకము అలంకారము. స్వభావోక్తి, చరులు, గెత్తు శబ్దములు నిఘంటువులలోఁ గానరావేమి.

లయహారిణి

'కఱ గళము ఘనఘనము తెఱఁగనఁగ, నుఱికలును
గఱడియలు త్రిపుదలును గిఱిడియలుఁ బెల్లై
యుఱుము లన వడిఁ జెలఁగఁ, గొఱ నెలయుఁ దనురుచులు
మెఱుఁగు లన దశదిశల మెఱవఁ, దలమీఁదన్
వఱలు సురనది దొలఁకి నెఱిఁ జినుకులను గురియఁ
దఱిమికొని తొలుమొగులు తఱి యనఁగ, నృత్యం
బొఱ వమరు లలితగతి మెఱయు శివుఁ డజుఁ డమరుఁ
డుఱుఫలము లొసఁగు నని యెఱిఁగి నుతియింతున్.' 102

అర్థము : కఱ - గళము - నల్లని కంఠము, ఘన - ఘనము - తెఱఁగు = దట్టమగు మేఘముయొక్క విధము, అనఁగన్, ఉఱికలును, - కఱడియలున్ - త్రిపుదలును - కిఱిడియలున్ = ఆ పేళ్లుగల వాద్యములును, పెల్లు + ఐ = అధికమయి, ఉఱుములు + అనన్, వడిన్ = వేగముగా, చెలఁగన్ = ధ్వనింపఁగా, కొఱ-

నెలయున్ = చంద్రకళయును, తను - రుచులున్ = శరీరకాంతులును, మెఱుఁగులు + అనన్, దశ - దిశలన్ = పది దిక్కులందును, మెఱవన్ = ప్రకాశింపఁగా, తల - మీఁదన్, వఱలు = ఒప్పునట్టి, సుర - నది = దేవనది - ఆకాశగంగ, తొలఁకి = చింది, నెఱిన్ = అందముగా, చినుకులను, కురియన్, తఱిమికొని = వేగముగా, తొలు - మొగులు - తఱి + అవఁగన్ = తొలకరి సమయము అనునట్లు, నృత్యంబు, ఒఱపు + అమరు = అందమై యుండు, లలిత - గతిన్ = మనోహరమైనవిధమున, మెఱయు = ప్రకాశించు, అజుఁడు = పుట్టుకలేనివాఁడు, అమరుఁడు = మృత్యువులేనివాఁడు, అగు, శివుఁడు, ఉఱు - ఫలములు = తగినఫలములు, ఒసఁగున్ + అని = ఇచ్చునని, ఎఱిఁగి, నుతియింతున్.

తాత్పర్యము : 'నల్లని కంఠము దట్టమైనమేఘమనఁగను, ఉఱికలు, కఱడియలు, త్రిపుదలు, కిఱిడియలు అను వాద్యవిశేషము లధికమై ఉఱుము లనునట్లు ధ్వనింపఁగను, చంద్రకళయు, శరీరకాంతులు మెఱుఁగులనఁ బదిదిక్కులందును బ్రకాశింపఁగను, తలమీఁదనున్న ఆకాశగంగ తొనఁకి చినుకులను గురియఁగను, తొలకరి సమయమో యన నృత్య మమరు శివుఁడు, అజుఁడు అమరుఁడు నైనవాఁడు సముచితములైన ఫలము లొసఁగునని తెలిసి వానిని నుతింతును.'

విశేషములు : అలంకార ముత్ప్రేక్ష, ఇందు శివుఁడు తొలకరిమేఘమువలె నుత్ప్రేక్షింపఁబడినాఁడు. అతని కంఠనైల్యము మేఘనైల్యముగను, వివిధవాద్యధ్వనులు మేఘ నినదముగను, చంద్రకళయు శరీరకాంతులును మెఱపులుగను, శిరస్సుమీఁది గంగానది చిలుకు చినుకులు మేఘము కురియు వానచినుకులుగను, నృత్యసమయము తొలకరి సమయముగను, శివుఁడు మేఘముగను నుత్ప్రేక్షింపఁబడెను, పద్యము చాలవఱ కచ్చతెనుఁగు మాటలతోనిండియుండుట గమనింపఁదగినది.

లయహారి (ణి) లక్షణము, నాలుగుపాదము లుండును, ప్రతిపాదమునను ముప్పదితొమ్మిదిమాత్రలుగల ముప్పదియేడు వర్ణము లుండవలయును. ప్రతిపాదమునను పదునొకండు నగణములు, ఒక సగణము దానిపై నొక గురువు నుండవలయును. 1 - 11 - 21 - 31 స్థానములఁ బ్రాసయతి చెల్లవలయును, ప్రాసనియమము గలదు,

లయగ్రాహి.

కరనికర ముురు విటపవరము లనఁ, గరతలము
లరుణరుచిఁ దలిరు లనఁ, గరజములు పుష్పో
త్కర మనఁగ, వనరుహజ హరి దనుజ ముని మనుజ
సుర గగనచర భుజగ గరుడ గణ యక్షే
శ్వరుల కతిదయ నొసఁగు వరఫలము లనిశమును
భరిత మయి మధుసమయ సురవరమహీజ
స్ఫురణ కెన యనఁ, దనరు వరదు, హితనటనరతుఁ,
బరమపరుఁ, బరమగురుఁ, బరము నుతియింతున్. 103

అర్థము : కర - నికరము=చేతుల మొత్తము, ఉరు - విటప - వరములు= మేలైన గొప్ప కొమ్మలు, అనన్, కర - తలములు = అఱచేతులు, అరుణ - రుచిన్ = ఎఱ్ఱని కాంతిచే, తలిరులు = చిగుర్లు, అనన్, కరజములు = గోరులు, పుష్ప + ఉత్కరము= పూల సమూహము, అనఁగన్, వనరుహజ .... యక్షేశ్వరులకున్, వనరుహజ = బ్రహ్మ, హరి = విష్ణువు, దనుజ = రాక్షసులు, ముని = మునులు, మనుజ = మనుష్యులు, సుర = దేవతలు, గగన - చర = ఖేచరులు, భుజగ = నాగులు, గరుడ = గరుత్మంతుఁడు, గణ = ప్రమథగణములు, యక్ష + ఈశ్వరులకున్ = కుబేరుఁడు అనువారికి, అతి దయన్=మిక్కిలి దయతో, ఒసఁగు = ఇచ్చునట్టి, వర - ఫలములు = వరము లనెడి పండ్లు, అనిశమును = ఎల్లప్పుడును, భరితము + అయి = నిండి, మధు - సమయ - సుర - వర - మహీజ - స్ఫురణకున్=వసంతకాలమునందలి కల్పవృక్ష స్ఫూర్తికి, ఎన = సాటి, అనన్, తనరు = ఒప్పునట్టి, వరదున్ = వరముల నొసఁగు వాఁడును, హిత నటన - రతున్ = ప్రియమగు నాట్యమునం దాసక్తుఁడును, పరమ - పరున్= పరాత్పరుఁడును, పరమ - గురున్ = ఉత్కృష్టుఁడైన గురువును, పరమున్ = గొప్పవాఁడును - అగు శివుని, నుతియింతున్ = స్తుతింతును.

తాత్పర్యము : చేతులమొత్తము మేలయిన గొప్పకొమ్మ లనఁగను, అఱచేతు లెఱ్ఱని కాంతిచేఁ జివురు లనఁగను, గోరులు పూలమొత్త మనఁగను, బ్రహ్మ, విష్ణువు, రాక్షసులు, మునులు, మనుష్యులు, దేవతలు, ఖేచరులు, నాగులు, గరుత్మంతుఁడు, ప్రమథగణములు, కుబేరుఁడు ననువారికిచ్చు వరములనెడి ఫలములు

ఎప్పుడును నిండి వసంతకాలకల్పవృక్షమును స్ఫురింపఁజేయు వరదుఁడును, నాట్యరతుఁడును, పరాత్పరుఁడును, పరమగురువును, పరముఁడును అగు శివుని స్తుతింతును.

విశేషములు : అలంకారము రూపకానుప్రాణితోపమ.

క. 'సుర పానలాంతకాసుర
వరుణానిల ధనద రుద్ర వందిత చరణున్,
ధరణీ జల వహ్ని మరు దం
బర రవి సోమాత్మమూర్తిఁ, బరము నుతింతున్.' 104

అర్థము : సురపా .... చరణున్ : సురప = ఇంద్రుఁడు, అనల = అగ్ని: అంతక = యముఁడు, అసుర=నిరృతి. వరుణ=వరుణుఁడు, అనిల = వాయువు ధనద = కుబేరుఁడు, రుద్ర = ఈశానుఁడు - అనువారిచేత, వందిత = నమస్కరింపఁబడిన, చరణున్ = పాదములు గలవాఁడును, ధరణీ .... మూర్తిన్ : ధరణీ= భూమి, జల = నీరు, వహ్ని = అగ్ని, మరుత్ = వాయువు, అంబర = ఆకాశము, రవి, = సూర్యుఁడు, సోమ = చంద్రుఁడు, ఆత్మ - మూర్తిన్ = యజమానుఁడు అనువారి స్వరూపము గలవాఁడును, అగు, పరమున్ = గొప్పవానిని-శివుని నుతింతున్ = పొగడుదును.

తాత్పర్యము : 'ఇంద్రాగ్ని యమ నిరృతి వరుణ వాయు కుబేరేశాను లనెడి అష్టదిక్పాలురచే నమస్కరింపఁబడు పాదములు గలవాఁడును, పృథివ్యప్తేజో వాయ్వాకాశ సూర్య చంద్ర యజమాను లనెడి అష్టమూర్తుల స్వరూపమైనవాఁడును అగు పరమేశ్వరుని నుతింతును.'

విశేషములు : మరుత్ + అంబర - అనునాసికాంతసవర్ణములు తప్ప మిగిలిన పదాంతగతహల్లులకు (ఝల్లులకు) మృదుహల్లులు (హాళ్ళులు) కాని. అచ్చులు కాని పరము లగునపుడు ఆ హల్లుల వర్గమునకుఁ జెందిన తృతీయవర్ణ మాదేశముగా వచ్చును, మరుదంబర.

వ. అని యనేకప్రకారంబులం బరమభక్తియుక్తిం బ్రస్తుతింప దక్షునకుం ద్ర్యక్షుండు ప్రత్యక్షంబై తదీయాధ్వరఫలంబు సఫలంబుగాఁ బ్రసాదించి దక్షుం బ్రజాపతి నియోగంబునంద నియోగించి. 105

అర్థము : అని, అనేక - ప్రకారంబులన్ = పెక్కువిధముల, పరమ - భక్తి - యుక్తిన్ = గొప్పభక్తితోడి కూడికతో, ప్రస్తుతింపన్ = నుతింపఁగా, దక్షునకున్, త్ర్యక్షుండు = ముక్కంటి - ఈశ్వరుఁడు, ప్రత్యక్షంబు + ఐ = ఎదురఁదోఁచినవాఁడయి, తదీయ + అధ్వర - ఫలంబు = ఆతనిదైన యజ్ఞముయొక్క ఫలము. సఫలంబుగాన్ = ఫలవంతమగునట్లు, ప్రసాదించి = అనుగ్రహించి, దక్షున్, ప్రజాపతి - నియోగంబు నందున్ + అ = ప్రజాపతి పదవియందే, నియోగించి = ఏర్పాటుచేసి.

తాత్పర్యము : అని పెక్కువిధముల బరమభక్తితోఁ బ్రస్తుతింపఁగా దక్షునకు ముక్కంటి ప్రత్యక్షమై వాని యజ్ఞమును ఫలవంతముగా ననుగ్రహించి, దక్షునిఁ బ్రజాపతిపదవియందె నియమించి - తృతీయాశ్వాసములోని మొదటి వచనముతో నన్వయము.

ఉ. ధర్మచరిత్రతా కలిత తత్త్వమయాధిక దీప్తి దీపికా
నిర్మలిన ప్రభాపటల నిర్గళితాఖిలలోకపూరితో
త్కర్మ తమిస్రుఁడ, డర్థిజన కల్పమహీరుహ కల్పుఁడ, డూర్జితాం
తర్ముఖముఖ్యుఁ, డత్యధిక దర్పక దర్పహరుండు సన్మతిన్. 106

అర్థము, ధర్మ .... తమిస్రుఁడు: ధర్మ - చరిత్రతా = ధర్మవర్తనముతో, కలిత = కూడిన, తత్త్వ - మయ = తత్త్వపూర్ణమైన, అధిక - దీప్తి = ఎక్కువ కాంతితోడి, దీపికా = దీపముయొక్క నిర్మలిన = స్వచ్ఛమైన, ప్రభా - పటల = కాంతుల సమూహముచేత, నిర్గళిత = పోయిన, అఖిల - లోక - పూరిత = ఎల్ల లోకములందు నిండిన, ఉత్కర్మ = పాపములనెడి, తమిస్రుఁడు = చీఁకట్లుగలవాఁడును, అర్థి - జన - కల్పమహీరుహ - కల్పుఁడు = యాచకులైన జనులకుఁ గల్పవృక్షముతో సమానుఁడును, ఊర్జిత + అంతర్ముఖ - ముఖ్యుఁడు = ప్రసిద్ధులైన అంతర్ముఖులలోఁ బ్రధానుఁడును, అతి + అధిక - దర్పక - దర్ప - హరుండు = మిక్కిలి

యెక్కువైన మన్మథుని గర్వమును నశింపఁజేసినవాఁడు, సత్ + మతిన్ = మంచి మనస్సు గలవాఁడును.

తాత్పర్యము : ధర్మవర్తనముతోఁ గూడిన తత్త్వపూర్ణమైన యధిక కాంతితోడి దీపపు స్వచ్ఛకాంతిచేఁ బోగొట్టఁబడిన యెల్లలోకములందు నిండిన పాపములనెడి చీఁకట్లు గలవాఁడును, అర్థిజనులకుఁ గల్పవృక్షమైనవాఁడును, అంతర్ముఖవరేణ్యుఁడును, అత్యధికమైన మన్మథుని గర్వము నణఁచినవాడును, మంచి మనస్సుగలవాఁడును. ఇవి యన్నియుఁ గృతిభర్తయైన జంగమమల్లికార్జునుని విశేషణములు.

విశేషములు : రూపకాలంకారము, కల్ప - ఈ ప్రత్యయము ఈషదసమాప్తిని సూచించును. కల్పమహీరుహమున కించుక తక్కువయైనవాఁడని యర్థము. అంతర్ముఖ = బాహ్యవిషయములను విడిచి పరమాత్మయందుఁ బ్రవేశించిన చిత్తము గలవాఁడు. సన్మతియున్ - అనుటకు సన్మతిన్ - సముచ్చయార్థమునందు ను శబ్దము యువర్ణ విరహితముగా నైనది. 'నామసర్వనామంబులకును గళలగు నవ్యయంబులకును గడపల సముచ్చయార్థవిశేష పాదపూరణములయందు ను శబ్దంబు తఱచుగ నగు. కళలగు ననుదంత శబ్దంబులమీఁద నయ్యది యువర్ణపూర్వకంబుగ విభాష నగు'. ప్రౌఢ. శబ్ద. 116

క. ఇష్టానిష్టవిముక్తుఁడ
భీష్టఫలప్రదుఁడు, సన్మునీంద్రారాధ్యం,
డష్టతను పరమ తనుమయుఁ,
డష్టార్ధ ముఖాన్వయాబ్జ హరితేజమునన్. 107

అర్థము : ఇష్ట + అనిష్ట - విముక్తుఁడు = రాగద్వేషములనుండి విడువఁబడినవాఁడు - రాగద్వేషరహితుఁడు, అభీష్ట - ఫల - ప్రదుఁడు = కోరిన ఫలముల నొసఁగువాఁడు, సత్ + ముని + ఇంద్ర + ఆరాధ్యుండు = ఉత్తములైన మునిశ్రేష్ఠులచేఁ బూజింపఁదగినవాఁడు, అష్ట - తను - పరమ - తను - మయుఁడు = శివునియొక్క ఉత్కృష్టమైన శరీరముతోఁ గూడినవాఁడును, తేజమునన్ = తేజస్సునందు, అష్ట + అర్ధ - ముఖ = చతుర్ముఖునియొక్క - బ్రహ్మ

యొక్క, అన్వయ = వంశమనెడి - బ్రాహ్మణవంశ మనెడి, అబ్జ = తామరపూవు నకు, హరి = సూర్యుఁడైనవాఁడును.

తాత్పర్యము : రాగద్వేష రహితుఁడును, అభీష్టఫలప్రదాతయును, సన్ముని శ్రేష్ఠులకుఁబూజసేయుఁడును, శివుని గొప్పశరీరముతోఁ గూడినవాఁడును - శివ స్వరూపుఁడును, తేజస్సునందు బ్రాహ్మణ వంశమనెడి తామరపువ్వునకు సూర్యుఁడైన వాఁడును,

విశేషములు : అలంకారము రూపకము. 'యమానిలేన్ద్రచన్ద్రార్క విష్ణు సింహాంశు వాజిషు శు కాహి కపి భేకేషు హరిః. అమరము. హరి శబ్దము వీని యన్నిటి యందును వర్తించును.

చ. భవ మరణాతురాంబునిధిపారుఁడు, ఘోరమహోగ్ర సత్వ సం
భవ గత సాగరోత్తరణ బంధుర భూచర సేతు భూత స
త్ప్రవిమలితాత్మతత్త్వ పద పారగుఁ, డాదిమునీశ్వరుండు స
త్కవి గమకిప్రశంసితుఁ, డకారణమిత్రుఁడు, పాత్రుఁ.
డిమ్మహిన్. 108

అర్థము : భవ....పారుఁడు : భవ=పుట్టుక, మరణ= చావు అనెడి, ఆతుర=బాధలనెడి, అంబునిధి=సముద్రముయొక్క, పారుఁడు=అవలియొడ్డు గల వాఁడు-చావుపుట్టుక లనెడు సముద్రమును దాఁటినఁ వాడనుట, ఘోర....పారగుఁడు: ఘోర=భయంకరములు, మహత్ (మహో)+ఉగ్ర = మిక్కిలిక్రూరములు నైన, సత్వ=జంతువులయొక్క, సంభవ=పుట్టుకను, గత=పొందిన, సాగర = సముద్రముయొక్క, ఉత్తరణ = దాఁటుటకు, బంధుర = ఒప్పిదమైన , భూ - చర = భూమియందుఁ, జరించువారికి, సేతు - భూత = వంతెన - యైన, సత్ + ప్రవిమలిత = మిక్కిలి నిర్మలముగాఁ జేయఁబడిన, ఆత్మ - తత్త్వ = పరమాత్మతత్త్వము గల, పద = పాదములచే, పారగుఁడు = అవలియొడ్డును ముట్టినవాఁడును, ఆది-ముని + ఈశ్వరుండు = ఆదిమునులలో శ్రేష్ఠుఁడును, సత్ + కవి - గమకి - ప్రశంసితుఁడు = ఉత్తములైన కవులచేతను, గాయకులచేతను ప్రశంసింపఁబడిన, వాఁడును, అకారణ - మిత్రుఁడు = కారణములేకయే హితుఁడైనవాఁడును,

ఈ + మహిన్ = ఈ భూమియందు, పాత్రుఁడు = అర్హుఁడైనవాఁడును, - జంగమ మల్లికార్జునుని విశేషణములు.

తాత్పర్యము : జనన మరణ బాధ లనెడు సముద్రమును దాఁటినవాఁడును, మిక్కిలి భయంకరములు క్రూరములు నైన జలజంతువులుగల సముద్రమును దాఁటుటకు భూచరులకు వంతెనయైన మిక్కిలినిర్మలముగాఁ జేయఁబడిన పరమాత్మతత్త్వముగల పాదములచేఁ బారమును బొందినవాఁడును, ఆదిమునీశ్వరుఁడును, సత్కవిగాయకులచేఁ బ్రశంసింపఁబడినవాఁడును, అకారణమిత్రుఁడును, ఈ భూమియందు అర్హుఁడును - జంగమమల్లికార్జునుని విశేషణములు,

విశేషములు : అలంకారము రూపకము. గమకి = గమకము(స్వర విశేషము) గలవాఁడు = గాయకుఁడు,

క. రమణీ రమణీయ సురూ
ప మయాంగజ శస్త్ర వజ్రపంజర నిభ స
ద్విమల శివయోగ తత్పరుఁ,
డమలచరిత్రుండు మల్లికార్జునుఁ డెలమిన్. 109

అర్థము: రమణీ .... తత్పరుఁడు: రమణీ = స్త్రీలయొక్క, రమణీయ అందమైన, సురూప - మయ = సౌందర్యరూపమైన, అంగజ - శస్త్ర = మన్మథుని బాణములకు, వజ్ర - పంజర - నిభ = వజ్రనిర్మితమైన పంజరముతో, సమానమైన, సత్ + విమల - శివయోగ-తత్పరుఁడు = మిక్కిలి నిర్మలమైన శివధ్యానయోగమునందు ఆసక్తిగలవాఁడు, అమల - చరిత్రుండు = నిర్మలమైన నడవడి గలవాఁడు, మల్లికార్జునుఁడు, ఎలమిన్ = సంతోషముతో.

తాత్పర్యము : స్త్రీల మనోహరమైన సౌందర్యమనెడి మన్మథాస్త్రములకు అభేద్యమైన వజ్రపంజరమువంటి నిర్మలమైన శివధ్యానయోగమునం దాసక్తి గలవాఁడును, స్వచ్ఛమైన నడవడిగలవాఁడును అగు జంగమమల్లికార్జునుఁడు సంతోషముతో,

విశేషములు : అలంకారము రూపకానుప్రాణితోపమ.

మాలిని. విశదయశుఁడు, ముక్తోద్వేగుఁ, డస్పృష్టరాగుం,
డశుభగతి నివృత్తుం, డార్యుఁ, డార్యౌఘవర్యుం
డశనిధర విలాసాయత్తుఁ, డధ్యాత్మచిత్తుం,
డి శర కమలినీ పూర్ణేందుఁ, డానందుఁ డెందున్. 110

అర్థము : విశద - యశుఁడు = నిర్మలమైన కీర్తిగలవాఁడును, ముక్త + ఉద్వేగుఁడు = విడువఁబడిన ఉద్రేకము గలవాఁడును, అస్పృష్ట - రాగుండు = తాఁకఁబడని రాగము గలవాఁడును - విరాగియును, అశుభ - గతి - నివృత్తుండు = అశుభమైన పోకడనుండి మఱలినవాఁడును, ఆర్యుఁడు = పూజ్యుఁడును, ఆర్య + ఓఘ - వర్యుండు = ఆర్యుల సమూహమునందు శ్రేష్ఠుఁడును, అశనిధర - విలాస + ఆయత్తుఁడు = వజ్రి (ఇంద్రుని) భోగములకు వశమైనవాఁడును, అధ్యాత్మ - చిత్తుండు = ఆత్మస్వరూపజ్ఞానముగల మనస్సు గలవాఁడును, ఇ - శర - కమలినీ - పూర్ణ + ఇందుఁడు = మన్మథునియొక్క, బాణమైన, తామరతీగకు, నిండు చంద్రుఁడైనవాఁడును, ఎందున్, ఆనందుఁడు = ఆనందించువాఁడును.

తాత్పర్యము : నిర్మలినమైన కీర్తి గలవాఁడును ఉద్రేకరహితుఁడును, రాగమును స్పృశింపనివాఁడును, అశుభగతినుండి మరలినవాఁడును, ఆర్యుఁడును, ఆర్యుల సమూహములో శ్రేష్ఠుఁడును, ఇంద్రభోగముల కధీనమైనవాఁడును, ఆత్మస్వరూపజ్ఞానముగల మనస్సు గలవాఁడును, మన్మథాస్త్రములగు తామరలకు నిండుచంద్రుఁడైన వాఁడును, ఎందైన నానందించువాఁడును - కృతిభర్త యగు జంగమ మల్లికార్జునుని విశేషణములు.

విశేషములు : ఇ శర కమలినీ పూర్ణేందుఁడు_రూపకాలంకారము, ఇ = మన్మథుఁడు - దీనికిఁ దెలుఁగున వ్యస్తప్రయోగము లేదు. (సూ.ని.) మాలినీ లక్షణమునకు చూడు పూర్వవ్యాఖ్య - 1 - 134.

గద్య

ఇది శ్రీమజ్జంగమ మల్లికార్జునదేవ దివ్య శ్రీపాద పంకజ భ్రమరాయమాణ కవిరాజశిఖామణి నన్నెచోడదేవ ప్రణీతం బైన కుమారసంభవంబను కథయందు ద్వితీయాశ్వాసము.

అర్థ తాత్పర్య విశేషములు ప్రథమాశ్వాసాంతగద్యకు వలెనే.

మ. ఇది శ్రీజొన్నలగడ్డ వంశమణియౌ మృత్యుంజయాఖ్యుండు స
మ్మద మొప్పారఁ గుమారసంభవము శ్రీమన్నన్నెచోడాఖ్యవి
ద్వదధీశోక్తము శాబ్దికార్థ వివిధ స్వారస్య తాత్పర్యముల్
చదు రొప్పన్ వచియించి మన్చు విలసత్ సంజీవనీవ్యాఖ్యయౌ.

# కుమారసంభవము

## తృతీయాశ్వాసము

క. శ్రీకంధర పరతత్త్వా
లోకన తత్పరుఁడు, నిశ్చలుం, డఖిల సుధీ
లోకాభీష్టద కల్పా
నోకహుం డగు మల్లికార్జునుండు నెగడ్తన్. 1

అర్థము : మల్లికార్జునుండు = జంగమ మల్లికార్జునుఁడు, నెగడ్తన్ = ప్రసిద్ధితో, శ్రీ కంధర - పర - తత్త్వ + ఆలోకన - తత్పరుఁడు = గరళ కంఠుఁడైన శివునియొక్క పరతత్త్వముయొక్క చూచుటయం దాసక్తి గలవాఁడును, నిశ్చలుండు = స్థిరుఁడును, అఖిల - సుధీ - లోక + అభీష్టద - కల్ప + అనోకహుఁడు = ఎల్లవిద్వత్సమూహముయొక్క కోరికల నిచ్చునట్టి కల్పవృక్షమైనవాఁడు, అగున్.

తాత్పర్యము : జంగమ మల్లికార్జునుఁడు ప్రసిద్ధితో శివుని పరతత్త్వమును దర్శించుటయం దాసక్తి గలవాఁడును, స్థిరుఁడును, ఎల్ల విద్వల్లోకమునభీష్టముల నిచ్చునట్టి కల్పవృక్షమును అగును.

విశేషములు : సుధీలోకా.... కల్పానోకహుఁడు - రూపకము. 'అనోకహము.అనోకహః కుట స్సాలః పలాశీ ద్రు ద్రు మాగమాః' అనసః శకటస్య అకం గమనం హన్తీతి అనోకహః. బండియొక్క గమనమును ఆఁపునది - చెట్టు - అమరము.

వ. సకల భువనాధీశ్వరుండైన పరమేశ్వరుండు హరి పరమేష్ఠి పురంద రాద్యఖిల సురవర పరివృతుండై నిఖిల కులాచల ప్రభావ

1 సా. ప్రతి. విదిత.

విచిత రజత శిఖరి శిఖర మణి రమ్యహర్మ్యతలాలంకృతోత్తుంగ
సింహాసనాసీనుండై భృంగిరిటి పరిహాస పేశలాలాప హాస్యాలాప
వ్యాకులిత లలిత హాస్యరస రసాయన పూరితాస్థానమందిరుండై
పరమానందంబున నుండె నంత నక్కడ. 2

అర్థము : సకల - భువన + అధి + ఈశ్వరుండు = ఎల్ల లోకములకును ప్రభువు, ఐన, పరమేశ్వరుండు, హరి - పరమేష్ఠి - పురందర + ఆది + అఖిల - సుర - వర - పరివృతుండు = విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుఁడు, మున్నగు నెల్ల దేవతాశ్రేష్ఠులచేఁ జుట్టఁబడినవాఁడు, ఐ, నిఖిల .... సీనుండై : నిఖిల = ఎల్ల, కుల + అచల = కులపర్వతములయొక్క, ప్రభావ = మహిమతోను, విచిత = పరిశీలింపఁబడిన, కూడిన, రజత - శిఖరి = వెండికొండ (కైలాసము) యొక్క, శిఖర = శృంగమనెడి, మణి = మణులచే. రమ్య = అందమైన, హర్మ్య - తల = ప్రాసాదమునందలి, అలంకృత = అలంకరింపఁబడిన, ఉత్తుంగ = మిక్కిలి యెత్తైన, సింహాసన + ఆసీనుండు + ఐ = సింహాసనమునందుఁ గూరుచున్న వాఁడయి, భృంగిరిటి = భృంగిరిటి యనుపేరుగల శివపరిచారకునియొక్క, పరిహాస = నవ్వులాటతోఁ గూడిన, పేశల = మృదువైన, ఆలాప = మాటల చేతను, హాస్య + ఆలాప = హాస్యపుసంభాషణములచేతను, వ్యాకులిత = మిక్కిలి నిండిన, లలిత = మనోహరమైన, హాస్యరస = హాస్యమనెడి రసము అను రసాయనముతో, పూరిత = నింపఁబడిన, ఆస్థాన - మందిరుండు = కొలువుభవనము గలవాఁడు, ఐ, పరమ + ఆనందంబునన్ = మిక్కిలి సంతోషముతో, ఉండెన్, అంతన్, అక్కడన్.

తాత్పర్యము : ఎల్లలోకములకుఁ బ్రభువైన పరమేశ్వరుఁడు విష్ణు బ్రహ్మేంద్రాదులైన యెల్ల దేవతలచేతను బరివేష్టితుఁడై సర్వకులపర్వతముల ప్రభావముతోఁ గూడిన వెండికొండ శిఖర మనెడి మణిరమ్యహర్మ్యమునం దలంకరింపఁబడిన ఉన్నతసింహాసనమునఁ గూరుచున్నవాఁడయి భృంగిరిటి చేయు పరిహాససంభాషణము లందలి హాస్యరసముతోడి రసాయనముతో నిండిన కొలువుకూటము గలవాఁడయి మిక్కిలి ఆనందముతో నుండెను. అంత నక్కడ - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : రజత శిఖరి శిఖర మణి రమ్య హర్మ్యతల .... రూప కము. భృంగిరిటి - (రూపాం) భృంగిరిట.

సీ. రోహణాచల మను రూఢిగా కం దింత
మహనీయ రత్న సామగ్రిగలదె?
వింధ్యాద్రితో సురల్ విరస మెత్తిరిగాక
గ్రహచక్ర మది యింత గడచియున్నె?
హాటకరుచియ కా కమరేంద్రుగిరి కింత
పరమౌషధీప్రభా భాతి యెత్తె?
హరుఁ దర్థపతి చెల్మి కం దుండెఁగా కింత
రమ్యమే వసియింప రజతశైల?

తే. మఱఁదు తనవిద్య మెఱయఁ గులాద్రు లొండ్లు
వడసెఁ గా కుర్వి తాల్పంగ భరమె దీని?
కనఁగ నగచక్రవర్తి మాహాత్మ్య వైభ
వాలయం బగు పేర్మి హిమాలయంబు. 3

అర్థము : రోహణ + అచలము రోహణ పర్వతము (లంకలోని పర్వత విశేషము), అను, రూఢి = ప్రసిద్ధి, కాక, అందున్ = ఆ కొండయందు, ఇంత = ఇంతటి, మహనీయ - రత్న - సామగ్రి = గొప్పది యగు, రత్నములయొక్క సముదాయము, కలదె = ఉన్నదా?

వింధ్య + అద్రితోన్ = వింధ్యపర్వతముతో, సురల్ = దేవతలు, విరసము ఎత్తిరి + కాక = ద్వేషము వహించిరి కాని, అది = ఆ వింధ్యపర్వతము, గ్రహ - చక్రము = గ్రహవలయము, ఇంత = హిమవత్పర్వతమంత, కడచి + ఉన్నె = అతిక్రమించియుండునా?

హాటక - రుచి + అ - కాక = బంగరు కాంతియే కాని, అమర + ఇంద్రు - గిరికిన్ = దేవేంద్రుని పర్వతమునకు - మేరుపర్వతమునకు, ఇంత = ఇంతటి,

+రమ + ఓషధీ - ప్రభా - భాతి = గొప్ప ఓషధుల కాంతియొక్క తళతళ, ఎత్తె = సమానమా?

హరుఁడు = ఈశ్వరుఁడు, అర్థపతి - చెల్మికిన్ = కుబేరునితోడి స్నేహము నకు. అందున్ = కైలాసమునందు, ఉండెన్ + కాక = ఉండెనుగాని, రజత - శైలము = వెండికొండ - కైలాసము. వసియింపన్ = నివసించుటకు, ఇంత, రమ్యమే = అనుకూలమా?

అజుఁడు = బ్రహ్మ, తన-విద్య = తన సృష్టివిద్య, మెఱయన్ = ప్రకా శింపఁజేయుటకై, కుల + అద్రులు = కులపర్వతములు, ఒండ్లు = ఇతరములు, పడసెన్ = పొందెను, కాక = కాని, దీనికిన్ = ఈ కొండకు హిమవత్పర్వతము నకు, ఉర్వి = భూమిని, తాల్పంగన్ = ధరించుటకు, భరమె = బరువా?

అనఁగన్, హిమ + ఆలయంబు = మంచుకొండ, మాహాత్మ్య - వైభవ + ఆలయంబు = గొప్పతనముతోడి ప్రభుత్వమునకు స్థానము, అగు - పేర్మిన్ = అగునట్టి గౌరవముతో, నగ - చక్రవర్తి = పర్వతరాజు.

తా త్ప ర్య ము : రోహణ పర్వత మను పేరేకాని, ఆ పర్వతమున హిమవ త్పర్వతమున నున్నంత రత్నముల సముదాయము కలదా? వింధ్యపర్వతమును దేవతలు ద్వేషించిరి కాని ఆ కొండ గ్రహావలయమును హిమవత్పర్వత మంత యతిక్రమించి యుండునే? మేరుపర్వతమునకు బంగారుకాంతియే కలదు కాని దానికింతటి పరమౌష ధుల కాంతి యేది? ఈశ్వరుఁడు కుబేరునితోడి మైత్రిచే నందు నివసించెనుగాని కైలా సము హిమవంతమునంతగా నివాసయోగ్యమా? బ్రహ్మ తన సృష్టివిద్య ప్రకాశింపఁగా నితర కులపర్వతములను సృజించెను గాని భూభారమున కిది యొక్కటి చాలదా? అనునట్లు హిమాలయము గొప్పతనముతోడి ప్రభుత్వమునకు నిలయ మనెడిగౌర వముచేఁ బర్వతచక్రవర్తి.

వి శే ష ము లు : ఇందు వర్ణ్యమైన హిమాలయమునందు నగచక్రవర్తి త్వము నారోపించుటకై యితరపర్వతములను గా దనుటచే నపహ్నవాలంకారము: 'శుద్ధాపహ్నుతి రన్య స్యారోపార్థో ధర్మనిహ్నవః స ఏవ యుక్తిపూర్వ శ్చే దుచ్యతే

హేత్వపహ్నుతిః' - చన్ద్రా. హిమవత్పర్వత నగచక్రవర్తిత్వము అను సమర్థనీయాంశము సమర్థింపఁబడినది కావునఁ గావ్యలింగాలంకారము. సమర్థనీయ స్యార్థస్య కావ్యలిఙ్గం సమర్థనమ్' - చన్ద్రా.

మెఱయ = మెఱయింప - 'కరఁగు మెఱ య్యాదు లంతర్భావితప్రేరణంబులు, ప్రౌఢ. క్రి.34

చ. సురవర వాహినీధరుఁడు, శుభ్ర శరీరవిభాసి, నీలకం
ధర పరిశోభితుండు, గుణధాముఁడు, తుంగతనుండు భూధరా
భరణుఁ డుమాసమన్వితుఁ, డపార విభూతి సమేతుఁడై మహే
శ్వరుఁడునుబోలె నొప్పు హిమవంతుఁ డనంత మహత్త్వ సంపదన్ 4

అర్థము : సుర-వర - వాహినీ-ధరుఁడు = దేవతాశ్రేష్ఠుల నదిని-ఆకాశగంగను, ధరించినవాఁడు. శివ హిమవంతు లిరువురును గంగను ధరించినవారే, శుభ్ర - శరీర - విభాసి = తెల్లని శరీరముచేఁ బ్రకాశించువాఁడు - శివుని మేనివర్ణము తెలుపు. హిమవంతుఁడును సతతహిమాచ్ఛాదితుఁ డగుటచేఁ దెలుపే. నీల కంధర - పరిశోభితుండు = నల్లనికంఠముచేఁ బ్రకాశించువాఁడు - శివుఁడు. నల్లని మేఘములచే లేదా నెమళ్లచేఁ బ్రకాశించువాఁడు హిమవంతుఁడు, గుణ-ధాముఁడు = సుగుణములకు స్థానమయినవాఁడు, ఇది ఉభయత్ర సమానమె, తుంగ-తనుండు = ఎత్తయిన శరీరము గలవాఁడు - ఇదియును శివ హిమవంతుల కుభయులకును దుల్యమె, భూధర + ఆభరణుఁడు = కొండ (కైలాసము) ఆభరణముగాఁ గలవాఁడు లేదా భూధర = భూమిని ధరించు పాములు, ఆభరణుఁడు = ఆభరణములుగాఁ గలవాఁడు - శివుఁడు, కొండలకు ఆభరణమైనవాఁడు-హిమవంతుఁడు, ఉమా-సమన్వితుఁడు = ఉమతోఁ (పార్వతితోఁ) గూడినవాఁడు - శివుఁడు, ఉమతోఁ (కూఁతురుగావున) గూడినవాఁడు, అపార - విభూతి - సమేతుఁడు + ఐ = అధికమైన భస్మముతోఁగూడినవాఁడు - శివుఁడు, అధికమైన యైశ్వర్యముతోఁ గూడినవాఁడు హిమవంతుఁడు, అయి, హిమవంతుఁడు, అనంత - మహత్త్వ - సంపదన్ = అపారమైన గొప్పతనమనెడి సంపదతో, మహేశ్వరుఁడును + పోలెన్ = పరమేశ్వరుని, విధమున, ఒప్పున్,

తాత్పర్యము : శివుఁడు గంగాధరుఁడు, అట్లే హిమవంతుఁడును గంగాధరుఁడే. శివుఁడు తెల్లని శరీరముచేఁ బ్రకాశించువాఁడు. అట్లే హిమవంతుఁడును నిరంతర హిమాచ్ఛాదితుఁ డగుటచేఁ దెల్లనివాఁడు. శివుఁడు నీలకంధర (కంఠ) ముచేఁ బ్రకాశించువాఁడు. హిమవంతుఁడును నీలకంధర (మేఘ)ములచేఁ బ్రకాశించువాఁడు, లేదా నీలకంఠముల (నెమళ్ల) చేఁ బ్రకాశించువాఁడు. ఇరువురును సద్గుణములకు నిలయమైన వారే. ఇరువురును తుంగతనులే. శివుఁడు భూధరము (కైలాసపర్వతము) ఆభరణముగాఁ గలవాఁడు. హిమవంతుఁడు భూధరకులమునకు ఆభరణమైనవాఁడు - పర్వతశ్రేష్ఠుఁ డనుట. భార్య యగుటచే శివుఁ డుమాసమన్వితుఁడు. కూఁతు రగుటచే హిమవంతుఁ డుమాసమన్వితుఁడు. శివుఁడు అపారమైన విభూతి (భస్మము) తోఁ గూడినవాఁడు. హిమవంతుఁడు అపారమైన విభూతి (సంపద.) తోఁగూడినవాఁడు, ఇట్లు హిమవంతుఁ డనంతమైన మహత్తరసంపదచే మహేశ్వరునివలె నొప్పును.

విశేషములు : అలంకారము శ్లేషానుప్రాణితమైన ఉపమ. హిమవంతమున నెమళ్లు గల వనుటకు - 'నట నానుకూల పరిఫుల్ల కలాప కలాపిజాలమున్. - మనుచ. 2 - 3

సీ. హేమాద్రి విస్తార మెంత? సప్తాశ్వుండు
నిచ్చలు నోరల వచ్చు నట్టె;
తారాచలము వ్రేఁకఁదన మెంత? వింశతి
బాహునిచే నెత్తువడియె నట్టె;
పెరిఁగిన వింధ్యాద్రి పెంపెంత? కలశజుం
డెడగాల మెట్టిన నడఁగె నట్టె;
నెగడు మందరగిరి నిలు పెంత? కఱభోగి
దిర్చిన జిఱ్ఱునఁ దిరిగె నట్టె;

తే. యనఁగ విస్తారమున వ్రేఁకఁదనమునందుఁ
బెంపునందును నిలుపునఁ బెఱ నగముల
నుఱక తనలోన నవ్వుచు నున్న కరణి
వెలుఁగు శీతాద్రి ప్రాలేయ విమల రుచుల. 5

అర్థము : హేమ + అద్రి = బంగారు కొండ - మేరువు యొక్క, విస్తారము = విరివి, ఎంత = ఏమాత్రము, సప్త + అశ్వుండు = ఏడుగుఱ్ఱములు గలవాఁడు - సూర్యుఁడు, నిచ్చలున్ = నిత్యమును, ఓరలన్ - వచ్చున్ + అట్టె = ప్రక్కలను వచ్చునఁట.

తార + అచలము = వెండికొండ (కైలాసము)యొక్క ప్రేంకఁదనము = దుర్భరత్వము, ఎంత, వింశతి-బాహునిచేన్ = ఇరువది చేతులుగల (రావణుని)చేత, ఎత్తు + పడియెన్ + అట్టె = ఎత్తుటను బొందెనఁట - ఎత్తఁబడెనఁట - బలహీన మయ్యెనఁట.

పెరిఁగిన = వృద్ధిపొందినట్టి, వింధ్య + అద్రి వింధ్యపర్వతముయొక్క పెంపు = వృద్ధి - గొప్పతనము, ఎంత, కలశజుండు = కుండయందుఁబుట్టినవాఁడు - అగస్త్యుఁడు, ఎడ + కాలన్ = ఎడమకాలితో, మెట్టినన్ = తన్నఁగా, అడఁగెన్ + అట్టె = క్రుంగెనఁట.

నెగడు = ఒప్పునట్టి, మందర - గిరి = మందరపర్వతముయొక్క, నిలుపు = స్థైర్యము - నిలుకడ, ఎంత, ఫణి - భోగి = నల్లత్రాచు - వాసుకి, తిర్చినన్ = త్రిప్పఁగా, జిఱ్ఱనన్, తిరిగెన్ + అట్టె = తిరిగెనఁట.

అనఁగన్, విస్తారమునన్ = విరివియందును, ప్రేఁకఁదనము నందున్ = బరువునందును, పెంపునందును = గొప్పతనమునందును, నిలుపునన్ స్థైర్యమునందును, పెఱ - నగములన్ = ఇతరపర్వతములను, ఉలుక = లక్ష్యపెట్టక, తనలోనన్, నవ్వుచున్ + ఉన్న-కరణిన్ = వానిని దనలోఁ బరిహసించుచున్నవిధమున, శీత + అద్రి = మంచు కొండ - హిమవత్పర్వతము, ప్రాలేయ - విమల - రుచులన్ = మంచుయొక్క నిర్మలములైన కాంతులతో, వెలుఁగున్ = ప్రకాశించును,

తాత్పర్యము : మేరుపర్వతము విరివి యేపాటిది? సూర్యుఁడు నిత్యము దాని పార్శ్వముల నంటి వచ్చునఁట. కైలాసము దుర్భరత్వ మేపాటిది? రావణునిచే నది యెత్తువడెనఁట. పెరిఁగిన వింధ్యపర్వతము పెంపే మాత్రము? అగస్త్యుఁడు దాని

నెడమకాలఁ దన్నఁగా నడఁగెనఁట, మందరపర్వతము స్థైర్య మే పాటిది? ఒక నల్లని పాఁపపురుగు (వాసుకి), త్రిప్పఁగా జుట్టునఁ దిరిగెనఁట, ఇట్లు విరివియందును, బరువు నందును, పెంపునందును స్థైర్యమునందును ఇతరపర్వతములను దనలోఁ బరిహసించు చున్నదా యనునట్లు హిమవత్పర్వతము మంచు తెల్లనికాంతులతోఁ బ్రకాశించును.

విశేషములు : మేర్వాదుల విస్తారాదులను నహేతుకముగా నపహ్నవించుటచే నలంకారము హేత్వపహ్నుతి. పెఱనగముల నుఱక తనలోన నవ్వుచు నున్న కరణి....ఉత్ప్రేక్ష. (సీసపాదములందలి ఒక్కొక్కదానికి సరిపడునట్లు ఎత్తుగీతియందుఁ గ్రమముగా ఒక్కొక్కగుణముఁ జెప్పుటచే నలంకారము యథాసంఖ్యము.) నవ్వుచు- నవ్వు తెలుపని కవిసమయము. మంచు తెలుపు గావున దానితోఁ గూడినహిమవంత మితరపర్వతములను నవ్వుచున్నట్లే యుండును. ఎత్తువడు = ఎత్తుట గలిగియుండు. భంగపడు - కలశజుఁడు = అగస్త్యుఁడు, (నానా.) ద్రోణుఁడు, ఎడగాలన్ అనాయాసముగా ననుట. కఱభోగి = నల్లత్రాచు - ఒక చిన్నపాఁపపురుగని చులుకఁదనము. ప్రాలేయ - 'అవశ్యాయ స్తు నీహార స్తుషార స్తుహినం హిమం ప్రాలేయం మిహికా చ.' ప్రళయా చ్ఛరదంతా దాగత మితి ప్రాలేయమ్. శరత్కాలాంతమున వచ్చునది - మంచు - అమరము. పెరిఁగిన వింధ్యాద్రి పెం పెంత కలశజుం డెడగాల మెట్టిన నడఁగెనట్టె - వింధ్యపర్వతము గర్వించి సూర్యగమనము నడ్డునంతగాఁ బెరిఁగిపోవుచుండ, దేవతల ప్రార్థనమున నగస్త్యుఁడు దాని నడఁచెను. నెగడు మందరగిరి నిలుపెంత .... దేవదానవులు అమృతము కొఱకు క్షీరసముద్రమును ద్రచ్చఁబూని మందరపర్వతమును గవ్వముగాఁజేసి దానికిఁ ద్రాడుగా వాసుకినిఁజేసి త్రిప్పిరి. ఒక చిన్న పాఁపపురువుచేఁ ద్రిప్పుట నందిన మందరపర్వతము స్థైర్య మే పాటి దనుట. తారాచలము ....ఈశ్వరుఁడు - పార్వతీసమేతుఁడై కైలాసమున నుండఁగా, రావణుఁడు దానిని వ్రేలికొనతో నెత్తెను. అట్టిచో దానిదుర్భరత్వ మే పాటి దనుట.

చ. సురపుర రమ్య హర్మ్య మణి శుభ్ర తలాగ్ర విలాస హాసియై
యురు కనకాగ్రశృంగమున నొందిన తారకపంక్తి శీతభూ
ధరపతి చూడఁజూడ విదితంబగు నిర్మలినాంగభాతితో.
నురగ ఫణాగ్రరత్న రుచిరోరు కపర్ద ధ రేశ్వరాకృతిన్. 6

అర్థము : శీత - భూధర - పతి - = హిమవత్పర్వతరాజు, చూడన్ + చూడన్ = చూడఁగాఁజూడఁగా ఉరు - కనక - అగ్ర-శృంగమునన్ = గొప్పదియగు బంగారు కొనగల శిఖరమునందు, ఒండిన = కలిగిన, తారక - పంక్తిన్ = నక్షత్రముల వరుసతో, సుర .... హాసియై: సుర - పుర = దేవతల నగరమైన అమరావతియందలి, రమ్య = అందమైన, హర్మ్య = మేడలయొక్క, మణి = రత్నములచే, శుభ్ర = నిర్మలమైన, తల = ప్రదేశముయొక్క అగ్ర = కొనయొక్క, విలాస = అందమును, హాసి = పరిహసించునది, ఐ,నిర్మలిన + అంగ - భాతితోన్ = స్వచ్ఛమైన శరీరము యొక్క కాంతితో, ఉరగ .... రాకృతిన్: ఉరగ - పాములయొక్క, ఫణా = పడగల యొక్క, అగ్ర = కొనలయందలి, రత్న = మణులయొక్క. రుచిర = మనోహరమైన, ఉరు = గొప్పదియగు, కపర్ద = జటాజూటమును, ధర = ధరించినట్టి, ఈశ్వర = శివునియొక్క, ఆకృతిన్ = ఆకారముతో, విదితంబు + అగున్ = తెలియఁబడినది - ప్రసిద్ధమైనది యగును.

తాత్పర్యము : హిమవత్పర్వతరాజము పెద్దదియగు బంగారు కొనగల శిఖరమునందలి నక్షత్రకాంతితో నమరావతియందలి రమ్యములైన హర్మ్యముల రత్న శుభ్ర తలాగ్రముల విలాసమును బరిహసించునదై, స్వచ్ఛమైన దేహకాంతితోఁ బాముల పడగలకొనలందలి మణులచే మనోహరమైన పెద్దజటాజూటమును ధరించిన యీశ్వరుని యాకారముతోఁ జూడఁగాఁ జూడఁగా నొప్పెను.

విశేషములు : హిమవత్పర్వత శిఖరము స్వర్ణమయము. అది నక్షత్రమండలమువఱకు వ్యాపించెను. నక్షత్రములకాంతితో నది యమరావతియందలి రమ్య హర్మ్యముల రత్నశుభ్రములైన ప్రదేశముల కొనలను బరిహసించుచుండెను. మఱియు నది తన స్వచ్ఛమైన దేహకాంతితో - భూషణములైన సర్పముల పడగలందలి మణులకాంతులచే మనోహరమైన పెద్దజటాజూటమును ధరించిన శివుని యాకారము గలిగి యొప్పెను, హిమవంతుఁడు శివునిఁ బోలియుండెను. హిమవంతుఁడు నిర్మలినాంగుఁడు. అట్లే శివుఁడును నిర్మలినాంగుఁడే. హిమవంతుని కనకాగ్రశృంగము శివుని జటాజూటమును బోలియుండెను. శివుని జటాజూటము పాముల పడగలందలి మణులచే నొప్పినట్లే, హిమవంతుని ఆ శృంగముగూడ నక్షత్రముల కాంతితో నొప్పుచుండెను. నక్షత్రమండలమువఱకు వ్యాపించిన ఆ కనకాగ్రశృంగము నక్షత్రముల కాంతిచే

నమరావతియందలి రమ్యహర్మ్యముల మణిశుభ్రతలాగ్రవిలాసమును బరిహసించు చుండెను.కనకాద్రి యనఁగా మేరువు.దాని ప్రసక్తి యిట అనావశ్యకముగావున కనకాద్రి యను పాఠముగాక కనకాగ్ర అనుపాఠమే స్వీకరింపఁబడినది. అలంకారము సంబంధాతిశయోక్తి – 'సంబన్ధాతిశయోక్తి స్స్యా దయోగేయోగకల్పనమ్' - చన్ద్రా. కపర్ద - కపర్దో ఽ స్య జటాజూటః – శివుని జటాజూటమునకుఁ గపర్ద మనిపేరు - అమరము, నిర్మలినాంగభాతితో .... కపర్ధధరేశ్వరాకృతిన్ – అలంకార మిదియు.

తే. శీతగిరిమీఁద మదకరుల్ సీవరించు
నెలుఁగు నవ ఘనారవ మని యెసఁగి యాడు
నమ్మిపదుపులు గడునొప్పు నగవిభునకు
బలసి పట్టిన పింఛాతపత్ర భాతి. 7

అ ర్థ ము : శీత - గిరి - మీఁదన్ = మంచుకొండమీఁద.మద - కరుల్ మద గజములు. సవరించు = సీత్కారముచేయు. ఎలుఁగున్ = ధ్వనిని. నవ - ఘన + ఆర వము = క్రొత్త మేఘముల ధ్వని. అని. ఎసఁగి = విజృంభించి. ఆడు = నృత్యము చేయునట్టి. నమ్మి - పదుపులు = నెమళ్లగుంపులు. నగ-విభునకున్ = పర్వతరాజునకు. బలసి = పరివేష్టించి. పట్టిన. పింఛ + ఆతపత్ర - భాతిన్ = పింఛము లనెడి గొడు గుల విధమున. కడున్ = మిక్కిలి. ఒప్పున్.

తా త్ప ర్య ము : హిమవత్పర్వతముమీఁద మదపుటేనుఁగులు సీత్కారము చేయఁగా, నా ధ్వనిని క్రొమ్మొయిళ్ల ధ్వనియనిభ్రమించి విజృంభించి నృత్యముచేయు నెమిళ్ల గుంపులు ఆ పర్వతరాజునకుఁ బరివేష్టించి పట్టిన పింఛములనెడి గొడుగుల విధమున మిక్కిలి యొప్పెను.

వి శే ష ము లు : హిమవంతుఁడు నగవిభుఁడు (పర్వతరాజు) అని చెప్పఁ బడుటచే, వానికి ఆతపత్రమును బట్టుటయను రాజోపచారము వర్ణింపఁబడినది. నెమిళ్లు మేఘధ్వనిని వినినంతనే యుత్సాహమున నృత్యముచేయును. వాని కేనుఁగుల సీత్కార ధ్వనియందు మేఘధ్వనిభ్రాంతి, అందుచే నలంకారము భ్రాంతిమంతము. పింఛాతపత్ర - రూపకాలంకారము, నమ్మి పదుపులు పింఛాతపత్రభాతిఁ గడు నొప్పును. ఉపమవలె నున్నను నిది యుత్ప్రేక్షయే యని చెప్పవలయును. నమ్మి - నెమ్మి - నమలి - నెమలి

నమిలి - నెమలి - రూపాంతరములు, ఘన - ఆకారాంతస్త్రీలింగ మయినచో వర్షాకాలము. అకారాంతపుంలింగ మయినచో మేఘము, విశేషణ మయినచో గొప్పది.

తె. శిశిరభూమీధరోద్దామ శిఖర మణులఁ
గదిసి తారాగణంబులు గలిసియున్న
మణిగణాన్వేషణులు కీడు మణులు సావి
పాయఁ ద్రొతు రం దవి గనుపట్టకున్న. 8

అర్థము : శిశిర .... మణులన్: శిశిర = చల్లని, భూమీధర = కొండ - హిమవత్పర్వతముయొక్క, ఉద్దామ = అధికమైన, [1]శిఖర = శిఖరములందలి, మణులన్ = మణులను, కదిసి = సమీపించి, తారా - గణంబులు = నక్షత్రముల సమూహములు, కలిసి + ఉన్నన్ = కూడియుండఁగా, మణి - గణ + అన్వేషణులు = మణుల సమూహములను వెదకువారు, అందున్ = ఆ మణులలో, అవి = తారలు, కనుపట్టక + ఉన్నన్ = తక్కువకాంతి కలవగుటచేఁగనఁబడకపోఁగా, కీడు - మణులు - సావి = కృత్రిమములైన మణు లని, పాయన్ + త్రోతురు = తొలఁగఁద్రోయుదురు.

తాత్పర్యము : హిమవత్పర్వతపు గొప్ప శిఖరములందలి మణులను సమీపించి వానితో నక్షత్రముల సమూహములు కలిసియుండఁగా మణులను వెదకువారు ఆ మణులలో నక్షత్రములు తక్కువకాంతి గలవగుటచేఁ గనఁబడకపోఁగా, నవి కృత్రిమ మణులని వానిని దొలఁగఁద్రోయుదురు.

విశేషములు : హిమవత్పర్వతశిఖరములు నక్షత్రమండలమును దాఁటి యున్నవని భావము. సంబంధాతిశయోక్త్యలంకారము. మణిగణాన్వేషణులకుఁ దారాగణమునందు మణిభ్రాంతి కావున నలంకారము భ్రాంతిమంతము.

త్రోచుధాతువు. త్రోచు + లాట్టు-తద్ధర్మాదులందు లాట్టగు.' బాల.క్రియ.5. త్రోచు + లాట్టు.' లకారంబునకు దుఙ్రువురునుమ్ములగు.' ప్రథమపురుష బహువ

1. పా. మతి। సేవరించు.

చనమున - త్రోచు + రు. 'లాట్టు రుఙ్లు పరంబగునపుడు ముగాగమంబగు.' బాల. క్రియ. 22 త్రోచు + దు + రు. 'చువర్ణంబుతోడ దుగ్ధకారంబు తకారంబగు.' బాల. క్రియ. 108. త్రోతురు.

తే. సన్నుతంబుగ నా హిమవన్నగంబు
కాంచనాద్రీంద్రు మెచ్చదు కంపు లేని
కనకరుచి యేల యని చంపకప్రసూన
పరిమళాకీర్ణ సౌవర్ణభాతి మిగిలి. 9

అర్థము : ఆ - హిమవత్ + నగంబు = ఆ హిమవత్పర్వతము, చంపక - ప్రసూన - పరిమళ + ఆకీర్ణ - సౌవర్ణ - భాతి = సంపఁగి పూలయొక్క, సువాసనతో, వ్యాపించిన, బంగరు, కాంతి, మిగిలి = అతిశయించి, సన్నుతంబుగన్ = పొగడఁబడినదిగా, బాగుగా. కంపు = పరిమళము, లేని, కనకరుచి = బంగరు కాంతి, ఏల = ఎందులకు, అని, కాంచన + అద్రి + ఇంద్రున్ = శ్రేష్ఠమగు బంగరు కొండ (మేరువు) ను. మెచ్చదు = ప్రశంసింపదు.

తాత్పర్యము : హిమవత్పర్వతమునఁ జంపక వృక్షములు గలవు. ఆ పూవుల పరిమళముతో వ్యాపించిన బంగరుకాంతి యతిశయించి అది పరిమళములేని వట్టి బంగరుకాంతి యెందులకని బంగరుకొండను (మేరువును) బాగుగా మెచ్చదు.

విశేషములు: మేరువు బంగరుకొండగావున బంగరుకాంతు లీనుచుండును. కాని దానికిఁ బరిమళ ముండదు. హిమవంతమున సంపఁగి వృక్షము లుండును. సంపఁగి వర్ణము బంగారువర్ణమును బోలియుండును. అంతేకాదు కాంచనశబ్దమునకు బంగారమనియే కాక సంపఁగి యనియు నర్థము గలదు. కావున, హిమవంతమునకు సంపఁగి తావితోపాటు బంగరుకాంతు లుండును. ఆ కారణముననే హిమవంతము సువాసనా రహితమగు వట్టి బంగరుకాంతిగలమేరువును మెచ్చ దనుట. 'కంపు' శబ్దము కావ్యములలో సుగంధ మను నర్థమునను బ్రయుక్తమయినది. 'కంపు రూపుఁ దెలుపుఁ గలిగి యకంటక, భూరుహాదులందుఁ బుట్టె నట్టి, పుష్పముల .... భార, అను. 4.5. నేఁటి వాడుకలో మాత్రము దుర్గంధమునకే పరిమితమయినది. హిమవంతము మేరువును

మెచ్చుమికి అది వాసనారహిత మగుట కారణముగాదు. కారణముకానిదానిని గారణముగాఁ జెప్పుటచే నలంకారము హేతూత్ప్రేక్ష.

తే. విలసి తోత్తుంగ శశికాంతశిలలఁ గదిసి
యరుగు శశిఁ గని శిల లెల్లఁ గరఁగి పెరిఁగి
తెరలి పఱతెంచు వఱ్ఱోడిఁ దేలి పాఱు
నుడుగణేశుండు వెండి పేరోడ వోలె. 10

అర్థము: విలసిత + ఉత్తుంగ - శశికాంత - శిలలన్ = ప్రకాశించినట్టియు, మిక్కిలి యెత్తయినట్టియుఁ జంద్రకాంతపుఱాలను, కదిసి = చేరి, అరుగు = పోవునట్టి, శశిన్ = చంద్రుని, కని = చూచి, శిలలు + ఎల్లన్ = చంద్రకాంతశిల లన్నియు, కరఁగి, పెరిఁగి = పెద్దదయి, తెరలి = పొంగి, పఱతెంచు = ప్రవహించునట్టి, వఱ్ఱోడిన్ = ప్రవాహమునందు, ఉడు - గణ + ఈశుండు = నక్షత్రముల సమూహమునకుఁ బ్రభువు - చంద్రుఁడు, వెండి - పేరు + ఓడ + పోలెన్ = వెండితో నిర్మితమైన పెద్దయోడవలె, తేలి - పాఱున్ = తేలి కొట్టుకొనిపోవును.

తాత్పర్యము: హిమవత్పర్వతముపైఁ జంద్రకాంతశిలలు గలవు. చంద్రుఁ డాకాశమునఁ బయనించుచు వానిని జేరెను. చంద్రునిఁ జూడఁగనే ఆ శిలలన్నియుఁ గరఁగి పెద్దయేఱయి పొంగి పాఱుచుండెను. ఆ ప్రవాహమునఁ జంద్రుఁడు వెండితోఁ జేయఁబడిన పెద్దయోడవలెఁ దేలి కొట్టుకొనిపోవుచుండెను.

విశేషములు: చంద్రకాంతశిలలు హిమవంతమునఁ జంద్రమండలమును దాఁటియున్నవగుటచే సంబంధాతిశయోక్త్యలంకారము. ఉడుగణేశుఁడు వెండిపేరోడ వోలెఁ దేలిపాఱు - ఉపమవలె నున్నను ఉత్ప్రేక్షయనిచెప్పుటయే యుచితము. వఱ్ఱోడి, వఱ్ఱాడి, వఱ్ఱాఁడి - రూపాంతరములు.

పేరోడ = పేరు + ఓడ, 'కర్మధారయంబునందుఁ బేర్వాదిశబ్దముల కచ్చు పరంబగునపుడు టుగాగమంబు విభాషనగు. బాల. సంధి. 29. టుగాగమము రానిచో, ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధియగు. పేరోడ. టుగాగమముగుచో - పేరుటోడ,

తే. సలలితంబగు శశికాంత శిలల రుచులు,
నింద్ర నీలోపలద్యుతు లెనసి వెడలఁ
బక్షులెల్ల సితాసిత పక్షయుగళ
సహితమై చూడనొప్పు మాసములవోలె. 11

అర్థము : సలలితంబు + అగు = మనోహరమయిన, శశికాంత - శిలల = చంద్రకాంతపుఱాలయొక్క, రుచులన్ = కాంతులును, ఇంద్రనీల + ఉపల - ద్యుతులున్ = ఇంద్రనీలమణుల కాంతులును, ఎనసి = కూడుకొని, వెడలన్ = పైకివ్యాపింపఁగా, పక్షులు + ఎల్లన్ = పక్షులన్నియును, సిత + అసిత - పక్ష- యుగళ - సహితము + ఐ = తెల్లని,నల్లని, ఱెక్కలజంటతోఁగూడినవయి, మాస ముల + పోలెన్ = నెలలవలె, చూడన్ + ఒప్పున్ = చూడఁదగియుండును.

తాత్పర్యము : హిమవంతమునఁ జంద్రకాంతశిలలును, ఇంద్రనీలమణు లును - రెండునుగలవు. మనోహరములైన చంద్రకాంతశిలలకాంతులును, ఇంద్ర నీలమణుల కాంతులును గూడి వ్యాపింపఁగా, నచ్చటి పక్షులన్నియును దెల్లని నల్లని ఱెక్కల జంటలతోఁగూడి మాసములవలెఁ జూడనొప్పును.

విశేషములు : చంద్రకాంతశిలల కాంతులు తెల్లఁగను, ఇంద్రనీల మణుల కాంతులు నల్లగనునుండును. పక్షికి రెండు ఱెక్కలుండును. ఒక ఱెక్క చంద్ర కాంతశిలల కాంతులతోఁ దెల్లగను, రెండవది ఇంద్రనీల మణులకాంతులతో నల్లగను అయి, శుక్లపక్షము, కృష్ణపక్షమునను రెండుపక్షములుగల మాసమువలె నున్నవి. ఇట్లు ఒక్కొక్క పక్షి యొక్కొక్క మాసమువలెనుండును. పక్షము = ఱెక్క, పదునైదు దినముల కాలము. శ్లేషానుప్రాణితమైన ఉపమాలంకారము, యథాసంఖ్యము - శశి కాంత - ఇంద్రనీల - సితాసిత. శశికాంత శిలలరుచులచేఁ దెల్లగను, ఇంద్రనీల ద్యుతు లచే నల్లగను బక్షములు మాఱెననుటచే నలంకారము తద్గుణము. 'తద్గుణ స్స్వగుణ త్యాగా దన్యదీయ గుణగ్రహః.' చన్ద్రా.

సలలితంబు .... రుచులు.' పక్షులు .... సహితము.' 'త్రిసమంబులగు విశేష ణంబులయు, మువర్ణకాంత విశేషణంబులయు బహువచనంబున నేకవచనంబు బహు ళంబుగా నగు' బాల, కారక, 20.

ఆ. నెగసి సుడిసి తావి మిగులుచుఁ దరులతా
కలిత పుష్ప రజము గాలిఁ దూలి
పొలుచు నగవిభునకుఁ బొంబట్టుచేల నా
కసము మేలుకట్టు గట్టినట్లు. 12

అర్థము: తరు - లతా - కలిత - పుష్ప - రజము = చెట్లయందును, తీఁగలయందును, ఉన్న, పుప్పొడి, గాలిన్ = గాలిచేత, తూలి = చలించి, నెగసి= పైకిలేచి, సుడిసి = వ్యాపించి, తావి = పరిమళము, మిగులుచున్ = అతిశయించుచు, నగ-విభునకున్=పర్వతరాజునకు-హిమవంతునకు, ఆకసము=ఆకాశము, పొంబట్టు = (పొన్ను + పట్టు)- చేలన్ = బంగారు పట్టుబట్టతో, మేలుకట్టు = చాందినీ, కట్టిన + అట్లు = కట్టినవిధమున, పొలుచున్ = ఒప్పును.

తాత్పర్యము: హిమవంతముమీఁది చెట్లయుఁ, దీఁగలయుఁ బుప్పొడి గాలిచేఁ జలించి, పైకెగిరి, వ్యాపించి, పరిమళ మతిశయించుచు, నా కొండలఱేనికి ఆకాశము బంగారుపట్టుబట్టతోఁ జాందినీ కట్టెనా యనునట్లు ఒప్పును.

విశేషములు: పుప్పొడి బంగరువన్నెగలదగుటచే 'పొంబట్టు చేలమేలుకట్టు' అనుట, అలంకార ముత్ప్రేక్ష.

పొంబట్టు - పొన్ను + పట్టు. 'సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగా నగు.' పొ + పట్టు. బాల. సంధి. 36. లుప్తశేషంబునకుం బరుషములు పరము లగునపుడు ముగాగమం బగు.' పొ+ ము + పట్టు. బాల. సంధి. 37. ద్రుతకార్యములు - బాల. సంధి. 16, 17. పొంబట్టు, చేలము (ప్రకృతి) - చేల (వికృతి)

తే. పాయక గిరితటమునన మేయుచుండు
నున్నత ద్విరదేంద్రంబు లొప్పుఁ జూడఁ
బర్వతాధీశుఁ దగుట నప్పర్వతంబు
బలసి కులగిరుల్ కొలువున్నభంగి వోలె. 13

అ ర్థ ము : పాయక = విడువక, గిరి - తటమునన్ + అ = కొండ చఱియయందే, మేయుచున్ + ఉండు, ఉన్నత - ద్విరద + ఇంద్రంబులు = ఎత్తయిన గజశ్రేష్ఠములు, పర్వత + అధి + ఈశుఁడు = పర్వతరాజు, అగుటన్ = అగుటచే, ఆ + పర్వతంబున్ = ఆ పర్వతమును, బలసి = పరివేష్టించి, కుల - గిరుల్ = కులపర్వతములు, కొలువు + ఉన్న - భంగి + పోలెన్ = కొలువున్నరీతివలె, చూడన్ + ఒప్పున్.

తా త్ప ర్య ము: హిమవత్పర్వతపుఁ జఱియలందే విడువక మేయుచుండునట్టి యెత్తయిన గజేంద్రములు హిమవంతుఁడు పర్వతప్రభువగుటచే వానిని బరివేష్టించి కులపర్వతములు కొలువుదీర్చినవా యనునట్లు చూడనొప్పును.

వి శే ష ము లు : అలంకార ముత్ప్రేక్ష, ద్విరద - 'దన్తీ దన్తావళో హస్తీ ద్విరదో ఒనేకపో ద్విపః.' ద్వౌ రదా వస్య ద్విరదః, రెండు దంతములు గలది - ఏనుఁగు - అమరము.

సీ. సవిలాసగతిఁ గ్రాలు జంగమ లతలలో
        నడపాడు నురగకన్యకల చెలువు,
    వెలుఁగొందు మణిపుత్త్రికల గెడ విహరించు
        వర నిధానాధిదేవతల చెన్ను,
    సాను సంగత మేఘ సౌదామనులఁ గూడి
        పొలసాడు ఖచరాంగనల బెడంగు,
    మందార చందన నందన సంగతి
        నెలసిన వనదేవతల నయంబు,

ఆ. మనసు లురులుకొల్ప మండనాంగానోక
    హములఁ బొంది చూచు నమర సిద్ధ
    చారణాది వర కుమారాంగ భూషణ
    ద్యుతుల హిమనగేంద్ర మతిశయిల్లు.

అర్థము : స - విలాస - గతిన్ = ఒయ్యారముతోఁ గూడిన విధమున, క్రాలు = ఒప్పునట్టి, జంగమ - లతలలోన్ = చలించు తీఁగలలో, నడపాడు = సంచరించునట్టి, ఉరగ - కన్యకల - చెలువున్ = నాగకన్యల అందమును,

వెలుఁగొందు (వెలుగు + ఒందు) = ప్రకాశించునట్టి, మణి - పుత్రికల - కెడన్ = రత్నాలబొమ్మలప్రక్క, విహరించు = తిరుగునట్టి, వర - నిధాన + అధి దేవతల = శ్రేష్ఠములైన. నిధుల అధిష్ఠాన దేవతాస్త్రీలయొక్క, చెన్నున్ = అందమును,

సాను - సంగత - మేఘ - సౌదామనులన్ = చఱియలందుఁ గూడుకొన్న మేఘములందలి విద్యుల్లతలను, కూడి, పొలసాడు = సంచరించు, ఖచర + అంగ నల = ఖేచరస్త్రీల, బెడంగున్ = అందమును,

మందార - చందన - నందన - సంగతిన్ = మందారము, చందనము అను వానితోడి ఉద్యానవనముల కలయికచే, ఎలసిన = ఒప్పిన, వనదేవతల = వనదేవతల యొక్క, నయంబున్ = అందమును,

మనసులు = మనస్సులు, ఉరులుకొల్పన్ = వశపఱుచుకొనఁగా, మండన + అంగ + అనోకహములన్ = అలంకరణోపాయములైన చెట్లను పొంది, చూచు, అమర - సిద్ధ - చారణ + ఆది - వర - కుమార + అంగ - భూషణ - ద్యుతులన్ = దేవతలు, చారణులు, మున్నగు, శ్రేష్ఠులైన, యువకులయొక్క శరీరములందలి, అలంకారములయొక్క కాంతులతో, హిమ - నగ + ఇంద్రము = హిమవత్పర్వత శ్రేష్ఠము, అతిశయిలున్ = మించును,

తాత్పర్యము : విలాసముతో నొప్పు చలించు తీఁగలలో సంచరించు నాగకన్యల యందమును, ప్రకాశించు రతనాల బొమ్మలప్రక్క విహరించు నిధ్యధిష్ఠాన దేవతాస్త్రీల యందమును, చఱియలనున్న మేఘములందలి విద్యుల్లతలతోఁగూడి సంచరించు ఖేచరస్త్రీల యందమును, మందారములు చందనవృక్షములు అనువానితోడి ఉద్యానముల సాంగత్యముననున్న వనదేవతల యందమును, మనస్సులను వశపఱుచు కొనఁగా నలంకరణోపాయములైన వృక్షములపైనుండి చూచునట్టి అమరులు

సిద్ధులు, చారణులు మున్నగువారి యువకుల శరీరములందలి యలంకారముల కాంతులతో హిమవత్పర్వతరాజ మతిశయిల్లును.

విశేషములు: సౌదామని - 'తడిత్సౌదామనీ విద్యుచ్చఞ్చలా చపలా అపి.' సుదామ్నా ఐరావతేన సహ వర్తత ఇతి సౌదామనీ - సుదామ మనఁగా నైరావతము. దానితోఁగూడి యుండునది - మెఱుపు, అమరము, అనోకహము - అనోకహః కుట స్సాలః పలాశీ ద్రు ద్రుమాగమాః - అనసః శకటస్య అకం గమనం హన్తీతి అనోకహః. బండి గమనమును అఁపునది - చెట్టు, అమరము. మండనాంగానోకహములు - జైనసంప్రదాయమున భోగభూమియం దుండువారికిఁ గల్పవృక్షములు వలసిన పదార్థము లిచ్చుచుండునని ప్రసిద్ధి. వానిలో భూషణాంగవృక్ష మిట్లు వర్ణితము.

'తులాకోటిక కేయూర రుచకాంగద వేష్టకాన్
హారాన్ మకుటభేదాంశ్చ సువతే భూషణాంగకాః.'

ఈ సంప్రదాయము పంపాదికన్నడకవుల జైనకావ్యములలో వర్ణితము. వాని నుండియే నన్నెచోడుఁ డీ విషయమును గ్రహించియుండును.

చ. అరుదుగఁ జంద్రకాంతనిలయంబులలో విహరింతు రర్థిఁ దా
రరయఁగ నెల్లవారికి బయల్పడి తోఁపఁగ; నందు కొంద ఱ
చ్చెరువుగ నింద్రనీలరుచి చీఁకటిలో రమియింతు రొప్పు న
త్యురుతరలీలతో బయల నుండియు నెవ్వరుఁ గానకుండఁగన్. 15

అర్థము: తారు = వారు, అరయఁగన్ = చూడఁగా, ఎల్లవారికిన్ = అందఱకును, బయల్పడి - తోఁపఁగన్ = బయలుపడికనఁబడునట్లు, అరుదుగన్ - ఆశ్చర్యకరముగా, చంద్రకాంత - నిలయంబులలోన్ = చంద్రకాంత గృహములలో, అర్థిన్ = కోరికతో, విహరింతురు = క్రీడింతురు, అందున్ + అ = అందే - ఆ హిమవత్పర్వతమునందే, కొందఱు, అచ్చెరువుగన్ = ఆశ్చర్యముగా, బయలన్ + ఉండియు = బయటనుండికూడ, ఎవ్వరున్, కానక + ఉండఁగన్ - చూడకుండు లాగున, ఒప్పు = ఒప్పునట్టి, అతి + ఉరుతర - లీలతోన్ = మిక్కిలి గొప్పదియగు

విలాసముతో, ఇంద్రనీల - మణి - చీఁకటిలోన్ = ఇంద్ర నీలమణులకాంతి యను చీఁకటిలో, రమియింతురు = సంభోగింతురు.

తాత్పర్యము : ఆ హిమవత్పర్వతమునందలి చలువఱాతియిండ్లలో నంద ఱును బయలుపడ కనఁబడినట్లు ఆశ్చర్యకరముగా వారు విహరింతురు. కొందఱు ఆ పర్వతమునందే బయటనుండియు నెవ్వరికిని గనఁబడకుండులాగున మిక్కిలి విలాస ముతో నాశ్చర్యకరముగా నింద్రనీలమణుల నల్లనికాంతి యనెడి చీఁకటిలో సంభోగింతురు.

మ. సరసచ్ఛత్ర మహీరుహావళి నిజచ్ఛత్రాళిగా నొప్ప ఖే
చరరాజన్యులు బాల పల్లవ లసచ్ఛత్రావళిం బొల్చు నా
మరుఁ గ్రేడింతురు లీల జంగమలతామధ్యంబునం గ్రాలు త
ద్వరకాంతల్ వనలక్ష్మి చె న్నుఱరు నా వర్తింతు రం దిమ్ములన్. 16

అర్థము : ఖేచర - రాజన్యులు = గగనచరు లనెడి రాజులు, సరస + ఛత్ర - మహీరుహ + ఆవళి = అందమైన, ఎండనుండి కాపాడు, చెట్ల, వరుస, నిజ - ఛత్ర + ఆళి + కాన్ = తమ పైని రాజలాంఛనమగు గొడుగుల వరుసగా, ఒప్పన్ = ఒప్పఁగా, బాల - పల్లవ - లసత్ + ఛత్ర + ఆవళిన్ = లేఁజివురు లనెడి ప్రకాశించు గొడుగులవరుసతో, పొల్చు = ప్రకాశించునట్టి, ఆ - మరున్ = ఆ మన్మథుని, క్రేడింతురు = పరిహసింతురు, లీలన్ = విలాసముతో, జంగమ - లతా - మధ్యంబునన్ = చలించు తీఁగెల నడుమ, క్రాలు = ఒప్పునట్టి, తద్ + వర - కాంతల్ = ఆ ఖేచరుల స్త్రీలు (భార్యలు,) వన - లక్ష్మి = వనమనెడి లక్ష్మియొక్క, చెన్ను = అందమును, ఉఱరు = లక్ష్యపెట్టరు, నాన్ = అనునట్లు, అందున్ = ఆ పర్వతమునందు, ఇమ్ములన్ = సుఖముగా. వర్తింతురు = ఉందురు.

తాత్పర్యము : ఆ హిమవత్పర్వతమునందు గగనచరు లనెడి రాజులు అందమైనట్టియు, ఎండనుండి కాపాడునట్టియు వృక్షముల వరుస తమగొడుగుల వరు సగా నొప్పుచుండఁగా లేఁజివురు లనెడి గొడుగుల వరుసతో నొప్పు నా మన్మథుని

1. సా. ప్రతి. వచు.

బరిహాసింతురు. చలించు తీఁగలనడుమ విలాసముతో నొప్పు వారి ప్రియురాండ్రు వనలక్ష్మి యందమును లక్ష్యపెట్ట రనునట్లు సుఖముగా వర్తిల్లుదురు.

విశేషములు : ఖేచరు లనెడి రాజులకు ఎండనుండి కాపాడు చెల్లే రాజ చిహ్నమగు గొడుగులు. వానితో వారు లేఁజివురు లనెడి గొడుగులతో నొప్పు మన్మథుని లక్ష్యపెట్టరు. వారి ప్రియురాండ్రు సైతము విలాసమున వనలక్ష్మిని లక్ష్యపెట్టరు. అలంకారము రూపకము,ఉత్ప్రేక్ష.

మ. కలయం గిన్నరగీతిఁ గూడ మృదురేఖం బాడు మత్తాళిసం
కులముల్; కింపురుషాంగనాతతి యెలుంగుల్ వించు భావించి మా
తెలుఁగుల్ నింపుగ నిచ్చుఁ గోవిలలు; దేవేంద్రాంగనా మంజుభా
షలతోడం దగు మాఱుమాట లెలమిన్ సంధించుఁ జిల్కల్ మొగిన్. 17

అర్థము : మొగిన్ = ఉత్సాహముతో, మత్త + అళి - సంకులముల్ = మదించిన, తుమ్మెదల, గుంపులు, కలయన్ = అంతటను, కిన్నర - గీతిన్ = కిన్నరులపాటను, కూడన్ = కూడునట్లు, అనుసరించునట్లు, మృదు-రీతిన్ = మెత్తగా, పాడున్; కింపురుష + అంగనా - తతి = కింపురుషస్త్రీల సమూహముయొక్క, ఎలుంగుల్ = కంఠధ్వనులు, వించున్ = వినుచు, భావించి, కోవిలలు = కోకిలలు, మాఱు + ఎలుఁగుల్ = ప్రతిధ్వనులు, నింపుగన్ = నిండుగా, ఇచ్చున్; చిల్కల్ = చిలుకలు, దేవ + ఇంద్ర + అంగనా = దేవతాశ్రేష్ఠులయొక్క స్త్రీలయొక్క, మంజు = మనోహరమునైన, భాషలతోడన్ = వాక్కులతో, తగు = తగినట్టి, మాఱు - మాటలు = ప్రతివచనములు, ఎలమిన్ = సంతోషముతో, సంధించున్ = కూర్చును.

తాత్పర్యము : మదించిన తుమ్మెదల గుంపులు కిన్నరులపాట ననుస రించునట్లు[1] మృదువుగాఁ బాడును. కోకిలలు కింపురుషస్త్రీల కంఠధ్వనులు విని

1. వా. ప్రతి. భావించు.

నిండుగాఁ బ్రతిధ్వనుల నిచ్చును. చిలుకలు దేవతాస్త్రీల మనోహరములైన వాక్కులకుఁ దగినరీతిని బ్రతిధ్వనులను బ్రీతితోఁ గూర్చును.

విశేషములు: వా. ప్రతి. లోని 'భావించు' అను పాఠముకంటె, సా. ప్రతిలోని 'భావించి' యను పాఠము అన్వయయోగ్యముగా నున్నది. కింపురుషాంగనా తతి యెలుంగులు, దేవేంద్రాంగనామంజుభాషలు అనునట్లే, కిన్నరాంగనల గీతి యని యున్నచో బాగుగా నుండెడిది. అప్పుడు కిన్నరీగీతి యని స్త్రీలింగశబ్ద ముండవలయును. కాని కిన్నరగీతి యని పుంలింగశబ్ద మున్నది. కోవిల - కోవెల శబ్దమే కాని 'కోవిల' శబ్దము నిఘంటువులఁ గానరాదు. కోవిలలు అనుదానికి బదులు కోవెలలు అనియున్నను ఛందోభంగము కాదుగదా! కోకిలము (ప్రకృతి) - కోయిల, కోవెల, కోగెల (వికృతులు.)

సీ. ఉరు తమః పటలంబు నుక్కాప ట్టిది యని
  నెఱి నిరుల్గొను నింద్రనీల రుచులుఁ,
బున్నమ వెన్నెల ప్రోదిప ట్టిది యని
  కాంతంబు లగు శశికాంత రుచులు,
వెలుఁగొందు రేయెండ వీడుఁబ ట్టిదియని
  రాజితం బగు పద్మరాగరుచులుఁ,
గ్రొక్కారు మెఱుఁగుల యిక్కప ట్టిది యని
  తార ముక్తాఫల తరళ రుచులుఁ,

తే. బచుర మాఘవోద్యానంబు పసిమి కెల్ల
నాటప ట్టిది యని గరుడాండరుచులు
మెచ్చి చూచుచు వేమఱుఁ బిచ్చలింతు
రమరకన్యక లతుల హిమాచలమున. 18

1. పా ప్రతి. హార.

అర్థము : అమర - కన్యకలు = దేవతాస్త్రీలు, అతుల - హిమాచలము నన్ = సాటిలేని హిమవత్పర్వతమునందు, ఇది = ఈ చోటు, ఉరు - తమస్(ః) + షట్పలంబు + ఉక్కిపట్టు = గొప్పదియగు చీఁకటిగుంపుయొక్క స్థానము, అని, నెఱిన్ = పూర్ణముగా, ఇరుల్ + కొను + ఇంద్రనీలరుచులున్ = చీఁకట్లను జేయు నింద్రనీలమణుల కాంతులును,

ఇది, పున్నమ - వెన్నెల - ప్రోదిపట్టు = పున్నమ వెన్నెలల పోషణస్థానము, అని, కాంతంబులు + అగు = మనోహరములయిన, శశికాంత - రుచులున్ = చంద్రకాంతశిలల కాంతులును,

ఇది, వెలుఁగొందు (వెలుఁగు + ఒందు) = ప్రకాశించునట్టి, రేయెండ = లేఁతయెండయొక్క, వీడుఁబట్టు = (వీడు + పట్టు) స్థానము, అని, రాజితంబు + అగు = ప్రకాశించునట్టి, పద్మరాగ - రుచులున్ = పద్మరాగమణుల కాంతులును,

ఇది, క్రొక్కారు (క్రొత్త + కారు) - మెఱుఁగుల - తొలకరిమెఱుపుల, ఇక్కపట్టు = స్థానము, అని, తార - ముక్తాఫల - తరళ - రుచులున్ = నిర్మలము లయిన, ముత్యములయొక్క, ప్రకాశించు కాంతులును,

ఇది, ప్రచుర - మాధవ + ఉద్యానంబు - పసిమికిన్ + ఎల్లన్ = అధిక మైన, వసంతోద్యానముయొక్క, పచ్చఁదనమువకంతకును, ఆటపట్టు = స్థానము, అని, గరుడాండ - రుచులున్ = గరుడపచ్చల కాంతులును,

మెచ్చి, చూచుచున్, వేమఱున్ = పలుమాఱులు, పిచ్చలింతురు = ఆనందింతురు.

తాత్పర్యము : గొప్పది యగు హిమవత్పర్వతమునందు దేవతాస్త్రీలు ఈ చోటు దట్టమైన చీఁకటిగుంపునకు స్థానమని నిండుగాఁ జీఁకట్లను జేయు నింద్రనీల మణుల కాంతులను, ఇది పున్నమివెన్నెలను బోషించు స్థానము అని మనోహరము లయిన చంద్రకాంతశిలల కాంతులను, ఇది ప్రకాశించు లేఁతయెండకు స్థానమని ప్రకాశించు పద్మరాగ మణుల కాంతులను, ఇది తొలకరిమెఱుపులకు స్థానమని నిర్మలములైన ముత్యముల తళతళమను కాంతులను, ఇది అధికమైన వసంతో

ద్యానప్రచ్ఛదనమునకు స్థానమని గరుడపచ్చల కాంతులను ప్రశంసించి చూచుచు పలుమారు ఆనందింతురు.

విశేషములు: హిమవత్పర్వతమున నింద్రనీలమణులు, చంద్రకాంతశిలలు పద్మరాగమణులు, ముత్యములు, గరుడపచ్చలుగలవు గావున నందు వేర్వేరుకాలము లలోనగు చీకట్లు, వెన్నెలలు, లేయెండ, తొలకరిమెఱపులు, పసిమి ఒకేకాలమునఁ గలుగుచున్నవి. కావుననే దేవతాకన్య లా యా చోటులను జూచి ప్రశంసింతు రనుట. ఇంద్రనీలమణులు నల్లనివి కావునఁ జీకట్ల సీమను, చంద్రకాంతశిలలు తెల్లగానుండును గావునఁ బున్నమవెన్నెలల సీమను. పద్మరాగమణుల కాంతులు ఎఱ్ఱగానుండి లేయెండ కాంతుల సీమను, ముత్యాలు తొలకరిమెఱపులవలెనే తళతళ కాంతులను వ్యాపింపఁ జేయును. గరుడపచ్చలు పచ్చనివై వసంతోద్యానపుఁబసిమిని బ్రసరింపఁజేయును. చేమఱు - ఒకమారు చూచిన వారికిఁ దృప్తి లేదు.

క్రొక్కారు - క్రొత్త + కారు, 'క్రొత్తశబ్దమున కాద్యక్షరశేషంబునకుం గొన్నియెడల మగాగమంబునుం గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు, బాల. సంధి. 38.

వ. అని వర్ణింపఁదగిన వర్ణనలం గడచి సకల గుణమణి గణంబులు నిజ ఘన మణి గణంబులతో బన్నసరంబులై వెలుంగ నజాండ కరండ పూరిత కర్పూర పాలీ శలాకయుం బోలెఁ దేజరిల్లు ప్రాలేయ కుత్కీల చక్రవర్తి నిఖిల స్త్రీ రత్నంబైన మేనక నిజాగ్రమహిషిగాఁ బరమసుఖలీలఁ బ్రవర్తిల్లుచుండు నంతఁ బరమేష్ఠి వరప్రసాదంబున. 19

అర్థము :- అని, వర్ణింపన్ + తగిన, వర్ణనలన్ = వర్ణనలను, కడచి = అతిక్రమించి, సకల - గుణ-మణి - గణంబులున్ = ఎల్ల గుణములనుగల మణుల సమూహములను- నిజ-ఘన-మణి- గణంబులతోన్ + తనవైన, గొప్పవియగు, మణుల, సమూహములతో, బన్నసరంబులు + ఐ = వలువిధములగు మణులు గ్రుచ్చిన హారములయి, వెలుంగన్ = ప్రకాశింపఁగా, అజాండ .... శలాకయుం

బోలెన్: అజాండ-కరండ = బ్రహ్మాండమనెడు బరిణెయందు, పూరిత = నిండిన, కర్పూర-పాలీ-శలాకయున్ + బోలెన్ = కప్పురపుబ్రోవునందలి చిన్నకడ్డవలె, తేజరిల్లు = ప్రకాశించునట్టి, ప్రాలేయ - కుత్కీల - చక్రవర్తి = హిమవత్పర్వతరాజు, నిఖిల-స్త్రీ-రత్నంబు = ఎల్ల యింతులలో మణివంటిది - శ్రేష్ఠురాలు, ఐన, మేనక = మేనక, నిజ + అగ్ర-మహిషి + కాన్ = తనదైన పట్టపురాణిగా, పరమ-సుఖ-లీలన్ = మిక్కిలి సౌఖ్యముతోడి విలాసముతో, ప్రవర్తిల్లుచున్ + ఉండన్, అంతన్, పరమేష్ఠి - వర - ప్రసాదంబునన్ + బ్రహ్మయొక్క వరమనెడి అనుగ్రహముచేత.

తాత్పర్యము ; అని వర్ణించుట కెన్ని వర్ణన లున్నవో అన్నిటిని అతిక్రమించి, ఎల్లగుణములును గల మణుల సమూహములు తన గొప్పవియగు మణుల సహాయముతో రకరకములమణులు గ్రుచ్చిన హారము లయి ప్రకాశింపఁగా, బ్రహ్మాండమనెడి బరిణెయందు నిండిన కప్పురపుఁబ్రోవునందలి చిన్నపుడకవలె నొప్పునట్టి హిమవత్పర్వతప్రభువు ఎల్ల యింతులలో మణివంటిదైన మేనక తన పట్టపురాణిగా మిక్కిలిసౌఖ్యముతోఁ బ్రవర్తిల్లుచుండును. అంత బ్రహ్మవరమున - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : అజాండ - కరండ - రూపకము. అజాండమనెడికరండము. అజాండకరండ .... శలాకయుంబోలె - ఉత్ప్రేక్ష - రూపకానుప్రాణితము. కాళిదాసు కుమారసంభవమున హిమవంతుని భార్య మేన యనియే కలదు. 'మేనాం మునీనా మపి మాననీయామ్,' కుమార 1.18. కాని యిందు మేనక యని కలదు.
1 . 18.

క. మేనకకు నా హిమాద్రికి
మైనాక నగంబు పుట్టె మణి కనక మయూ
ఖానూన భాస హాసిత
భానుద్యుతి. విదిత దివిజపతి గిరి పేర్మిన్. 20

అర్థము : మేనకకున్, ఆ హిమ + అద్రికిన్ = ఆ హిమవత్పర్వతమునకు, మణి .... ద్యుతి: మణి = రత్నములయు, కనక = బంగారముయొక్కయు,

మయూఖ = కిరణములచే, అనూన= తక్కువకాని, భాస =ప్రకాశముచేత, భాసిత= వెగతాళిచేయఁబడిన, భాను = సూర్యునియొక్క, ద్యుతి = కాంతిగలది, అయి, విదిత - దివిజ - పతి - గిరి - పేర్మిన్ = తెలియఁబడిన - ప్రసిద్ధమైన, ఇంద్రుని యొక్క కొండ - మేరువుయొక్క - గొప్పతనముతో, మైనాక - నగంబు = మైనాక మను పేరుగల కొండ, పుట్టెన్.

తాత్పర్యము : మేనకకును, ఆ హిమవంతునకును మణుల సువర్ణముల కిరణముల అధికమైన కాంతిచేఁ బరిహసింపఁబడిన సూర్యకాంతిగలదియై ప్రసిద్ధమైన మేరుపర్వతపు గొప్పతనముతో మైనాకపర్వతము పుట్టెను.

వ. ఇట్లుదయించిన మైనాక నగంబు కులిశి కులిశ పాత భీతిం బయోనిధి నిమగ్నంబై న నపగత పుత్త్రావలోకన సుఖతత్పరులై చింతించి. 21

అన్వయము : ఇట్లు, ఉదయించిన = పుట్టిన, మైనాక పర్వతము, కులిశి - కులిశ - పాత - భీతిన్ = వజ్రి (ఇంద్రుని) యొక్క, వజ్రాయుధముయొక్క పాటువలని, భయముతో, పయోనిధి -నిమగ్నంబు=సముద్రమునందు మునిఁగినది,ఐనన్ = కాఁగా, అపగత-పుత్త్ర + అవలోకన-సుఖ-తత్పరులు + ఐ = పోయిన, కొడుకుయొక్క, చూచుటవలని సుఖమునం దాసక్తి గలవారయి, - కొడుకును జూచుటవలని సౌఖ్యము పోయి. అం దాసక్తి గలవారయి, చింతించి = దుఃఖించి.

తాత్పర్యము : ఇట్లు పుట్టిన మైనాకపర్వతము ఇంద్రుని వజ్రాయుధము పడునేమో యను భయమున సముద్రమున మునుఁగఁగా కొడుకు ముఖదర్శన సౌఖ్యము పోవుటచే నం దాసక్తి గలవారయి-తరువాత పద్యముతో నన్వయము.

విశేషములు : కులిశి = కులిశముగలవాఁడు-కులిశః అస్య అస్తి ఇతి కులిశీ-ఇంద్రుఁడు.

క. వారిరువురు సద్విధి శ
 క్త్యారాధన సేసి రతిశయ స్థిరభక్తిం
 గోరిక వదలక తమ కడు
 పార సతీదేవి కూఁతురై జన్మింపన్. 22

అర్థము : వారు + ఇరువురున్ = ఆ మేనకాహిమవంతు లిద్దఱును, సత్ + విధిన్ = మంచి నియమముతో, అతిశయ-స్థిర-భక్తిన్ = మించిన, నిలుకడ గల భక్తితో, కోరిక, వదలక, తమ కడుపారన్ = తమ కడుపునిండుగా, సతీదేవి కూఁతురు + ఐ, జన్మింపన్ = పుట్టుటకు, శక్తి + ఆరాధన + చేసిరి = శక్తి యొక్క పూజ చేసిరి,

తాత్పర్యము : ఆ మేనకాహిమవంతు లిరువురును మిక్కిలి స్థిరమైన భక్తితోఁ, గోరికను వీడక, తమ కడుపునిండుగా సతీదేవి కూఁతురయి పుట్టునట్లు శక్తి నారాధించిరి,

వ. ఇట్లు పరమభక్తియుక్తి నారాధించినం గరుణించి నిజదేహ విదాహ కరంబైన కోపానలంబునకుఁ బరమేశ్వరు వియోగానలంబునకు శిశిరోపచారంబు సేయందలంచినదియునుంబోలె హిమవంతంబునకుం జనుదెంచి దాక్షాయణి ప్రత్యక్షంబై వారి కోరిన వరంబు దయసేసి పరము దేహార్థంబు మెయిమెయిఁ గయికొనం దలంచి పరమపవిత్ర క్షేత్రంబైన మేనకాదేవి గర్భంబునం దవతరించె నంత మేనకకుఁ గ్రమక్రమంబున. 23

అర్థము : ఇట్లు, పరమ-భక్తి - యుక్తిన్ = గొప్పభక్తితోడి కూడికతో, ఆరాధించినన్ = పూజింపఁగా. కరుణించి = దయఁబూని నిజ-దేహ - విదాహ- కరంబు = తనదైన శరీరముయొక్క కాలుటను జేసినది. ఐన, కోప + అనలంబునకున్ + కోపమనెడి అగ్నికిని, పరమేశ్వరు = ఈశ్వరునియొక్క, వియోగ + అనలంబునకున్ = విరహమనెడి అగ్నికిని, శిశిర + ఉపచారంబు = చలువఁజేయు సేవ, చేయన్ + తలంచిన + అదియును + పోలెన్ = చేయఁ గోరినదా యనువట్లు. హిమవంతంబునకున్, చనుదెంచి = వచ్చి,దాక్షాయణి = సతి, ప్రత్యక్షంబు + ఐ = ఎదుటఁ దోఁచినదయి, వారి-కోరిన = వారు కోరినట్టి వరంబును, దయ + చేసి = ప్రసాదించి. పరము = గొప్పవాఁడైన యీశ్వరుని యొక్క, దేహ + అర్థంబు = మేని సగము. మెయిమెయిన్ = అనాయాసముగా.

తలయికొనన్ = తలసికొన, తలంచి = ఎంచి, పరమ-పవిత్రక్షేత్రంబు + ఐన = మిక్కిలి పావనమైన క్షేత్రము, ఐన = అయిన. మేనకా-దేవి-గర్భంబునన్ = మేనకాదేవియొక్క కడుపునందు, అవతరించెన్, అంతన్, మేనకయున్, క్రమక్రమంబునన్ = మెల్లమెల్లఁగా.

తాత్పర్యము : ఇట్లు గొప్పభక్తితో నారాధింపఁగా, దయఁబూని, తన శరీరమును గాల్చినట్టి కోపమనెడి అగ్నికిని, పరమేశ్వరుని విరహమనెడి అగ్నికిని శీతలోపచారము చేయ నెంచెనా యనుదానివలె సతి హిమవంతమున కరుదెంచి ప్రత్యక్షమయి వారు కోరిన వరము ననుగ్రహించి గొప్పవాఁడైన శివుని శరీరమునం దర్ధభాగము ననాయాసముగా స్వీకరింప నెంచి మిక్కిలి పావనమైన మేనకాదేవి గర్భమునందుఁ బ్రవేశించెను. అంత మేనకకుఁ గ్రమక్రమముగా- తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : నిజదేహ ........ దలంచినదియుంబోలె - అలంకారము హేతూత్ప్రేక్ష.

వారికోరిన.'ధాతువిశేషణ భావార్థక పూర్వవ్యవహితావ్యవహిత కర్తృపద ప్రథమకుఁ దఱచుగ యొక్కషష్ఠి యగు.' ప్రౌఢ. కారక. 15. 'యొక్కటి లోపంబు బహుళంబు' ప్రౌఢ. కారక 16, కోపానలము, వియోగానలము-రూపకములు.

ఉ. తోరము లయ్యెఁ జన్నుఁగవతోన తొడల్; తనుకాంతితోన తె
ల్లారె విలోకనంబులు; కుచాగ్రతలంబులతోన యారు గ
ప్పారెఁ; గచంబుతోన వళు లల్లన డిగ్గఁబడం దొడంగె; శృం
గరముతోన జా ల్పడరె గర్భవిలాసము మందహాసమున్. 24

అర్థము : తొడల్ = తొడలు, చన్నుఁగవ-(చన్ను+కవ)+తోన్+అ= చనుదోయితోపాటు, తోరములు + అయ్యెన్=స్థూలములయ్యెను; విలోకనంబులు = చూపులు, తను - కాంతి-తోన్ + అ=శరీరకాంతితోపాటు, తెల్లారెన్ (తెల్లు+ఆరెన్) = తెల్లనయ్యెను, ఆరు = నూఁగారు, కుచ + అగ్ర-తలంబులతోన్ + అ = చన్నులమొనలతోపాటు, కప్పారెన్ (కప్పు + ఆరెన్) = నలుపెక్కెను.

వళులు = కడుపుమీఁది ముడుతలు, కచంబులోన్+అ=రలవెంట్రుకలతోపాటే, అల్లనన్ = మెల్లఁగా, దిగ్గఁబడన్ + తొడంగెన్ = పోఁజొచ్చెను, గర్భ-విలాసమున్, =చూలుయొక్క అందమును, మంద-హాసమున్ = చిఱునగవును, శృంగారముతోన్ + అ = శృంగారముతోపాటే, పొల్చు + అడరెన్ = అంద పతిశయించెను.

తాత్పర్యము : గర్భవతియగు మేనకకుఁ దొడలు చనుదోయితోపాటే స్థూలము లయ్యెను. చూపులు మేనికాంతితోపాటే తెల్లనయ్యెను. నూఁగారు చనుమొనలతోపాటే నల్లనయ్యెను. కడుపుమీఁది ముడుతలు కేశములతోపాటే అడఁగఁజొచ్చెను. చూలు అందమును, చిఱునగవును శృంగారముతోపాటే అందగించెను.

విశేషములు: అలంకారము సహోక్తి. 'సహోక్తి స్సహభావశ్చే ద్భాసతే జనరఞ్జనః' చన్ద్రా.

ఉ. ఆ ధవళాయతాక్షి విషమాక్షు సదాశివు నిచ్చ మెచ్చ నా
రాధన సేయఁగోరు; నుడురాజశిఖామణిఁ జూడఁ దారభూ
మీధర మెక్కఁగోరు నెడ; మేనక మానక భక్తియుక్తి గం
గాధరుఁ గొల్వఁగోరు మది;గౌరి మనంబున కోర్కి గూడఁగాన్.25

అర్థము : గౌరి-మనంబున - కోర్కి = సతీదేవియొక్క మనస్సునందలి కోరిక, కూడఁగాన్ = కలియఁగా, ఆ-ధవళ +ఆయత+అక్షి=తెల్లనివియు, దీర్ఘములును అయిన కన్నులుగల ఆ మేనక, విషమ + అక్షున్ = బేసికంటివానిని (శివుని), సదాశివున్ = పరమేశ్వరుని, ఇచ్చన్ = మనస్సునందు, మెచ్చన్ = ప్రశంసింపఁగా, ఆరాధన + చేయన్ + కోరున్ = పూజింపఁగోరును; ఉడు-రాజశిఖా-మణిన్ నక్షత్రేశుఁడగు చంద్రుఁడు తలమానికముగాఁ గలవానిని-ఈశ్వరుని, చూడన్=చూచుటకు, ఎడన్=మనస్సునందు, తార-భూమీధరము = వెండికొండ-కైలాసమును, ఎక్కన్ + కోరున్=ఎక్కఁగోరును, మేనక, మానక = వదలక, భక్తియుక్తిన్ = భక్తితోఁగూడునట్లు గంగా-ధరున్ = గంగనుధరించినవానిని-శివుని, కొల్వన్+ కోరున్ = సేవింపఁగోరును.

తాత్పర్యము : సతీదేవి మనస్సునందలి కోరిక ననుసరించి, ఆమెను గర్భమున ధరించిన మేనకయు శివుని నిచ్చమెచ్చి యారాధింపను, శివునిఁ జూచుటకుఁ గైలాస మెక్కను, భక్తితో శివునిఁ గొలువను మనస్సునఁ గోరును.

విశేషములు : గర్భస్థశిశువు కోరికల కనుగుణముగాఁ దల్లికిఁగూడ నట్టి కోరికలే కలుగుట ప్రసిద్ధము. మనంబునకోర్కి. 'కొన్నియెడల సప్తమీతత్పురుషము వందు నపష్ఠంబు నగు.' ప్రౌ.సమాస. 37 37

సీ. తపసకొత్తు మిన్నేటి తరఁగలఁ గ్రమ్మి క్రొ
న్నురుపులఁ గురులపై విరులఁ బెనుప,
మెఱుఁగుల గ్రిక్కొను కొఱనెలఁ గేతకి
దళములతో వేణి నెలపుకొలుపఁ,
జెలువొందు పులితోలుఁ జిత్రితాంబరవస్త్ర
కాంచిదామకముతోఁ గటి నమర్పఁ,
దలతల వెలుఁగు వే దలల రత్నము లొప్పు
నహినాథ మణిహారయష్టితోడఁ,

తే. గదియ సురమునం దెడఁ గోరు గర్భపంజ
రమున వసియించియును నిజ రమణుఁడైన
యీశు నర్ధాంగ మెక్కటి యెక్కనెత్తు
నగజ కోర్కులఁ బెనఁగి మేనకయు నెలమి. 26

అర్థము : గర్భ-పంజరమునన్ = మేనకా గర్భ మనెడి పంజరమునందు వసియించియును = ఉన్నను, నిజ-రమణుఁడు + ఐన = తన భర్త యగు, ఈశు + అర్ధ + అంగము = ఈశ్వరుని సగము శరీరము, ఎక్కటి = ఒక్కతెయే, ఎక్కన్ = ఎక్కుటకు, ఎత్తు = కోరునట్టి, అగజ - కోర్కులన్ = సతీదేవి కోరికలతో, పెనఁగి = కూడి, మేనకయున్ + మేనకకూడ, ఎలమిన్ = ప్రీతితో,

తళుకొత్తు = ప్రకాశించునట్టి, మిన్నేటి - తరఁగలన్ = ఆకాశముయొక్క అలలయందు, క్రమ్మ = వ్యాపించు, క్రొన్నురువులన్ (క్రొత్త + నురువులన్) = క్రొత్త నురుఁగులచే, కురులపైన్ = శిరోజములమీఁద. విరులన్ = పూవులను, పెనుపన్ = వృద్ధిపొందింపఁగను,

మెఱుఁగులన్ = కాంతులతో, క్రిక్కిఱియు = నిండియుండు, కొలనెలన్ = చంద్రకళను, కేతకి - దలముతోన్ = మొగలి ఱేకులతో, వేణిన్ = జడయందు, నెలవుకొలుపన్ = పెట్టఁగను,

చెలువొందు(చెలువు + ఒందు) = ఒప్పునట్టి, పులితోలున్ = పులితోలును, చిత్రిత + అంబర - వస్త్ర - కాంచి దామకముతోన్ = చిత్రవర్ణములు గల వస్త్రము నందలి బంగారుమొలనూలితో, కటిన్ = మొలయందు, అమర్పన్ = ధరింపఁగను,

తలతల - వెలుఁగు = తళతళమని ప్రకాశించునట్టి, వేదలలన్ (వే+ తలలన్) = వేయి తలల (పడగల) యందు; రత్నములు, ఒప్పు = ఒప్పునట్టి,అహి - నాథున్ = సర్పరాజును - వాసుకిని, మణి - హార - యష్టితోడన్ = రత్నాల హారపుఁబేటతో, ఉరమునన్ = వక్షమునందు, కదియన్ = కూడఁగా - కూర్పఁగా ఎడన్ = మనస్సునందు, కోరున్.

తాత్పర్యము : మేనకా గర్భమనెడి పంజరమునం దుండియును దన భర్తయైన యీశ్వరుని సగముమేని నొకతెయే యాక్రమింపఁగోరు సతీదేవి కోరికల ననుసరించి మేనకయుఁ బ్రీతితో - నీశ్వరుని తలపైనుండు నాకాశగంగ యలలందు వ్యాపించు క్రొన్నురుఁగులచేఁ దన శిరోజములపైఁ బూవులను వృద్ధిపొందింపను, శివుని శిరస్సునందుఁగాంతులతో నిండియుండు చంద్రకళను మొగలిపూఱేకులతో జడయందు నిలుపఁగను, ఈశ్వరుని శరీరమున నొప్పు పులితోలును జిత్రవర్ణములుగల వస్త్రము నందలి బంగారుమొలనూలితో మొలయందుఁ దాల్పఁగను, శివుని అవయవములందుఁ దళతళ ప్రకాశించు వేయిపడగలమణులొప్పు వాసుకిని దన మణిహారపుఁబేటతో వక్షమున ధరింపను - గోరును.

విశేషములు: క్రొన్నురువులు - క్రొత్త + నురువులు. 'క్రొత్త శబ్దమున కాద్యక్షరశేషంబునకుం గొన్నియెడల నుగాగమంబునుం గొన్నియెడల మీఁదిహల్లునకు

ద్విత్వంబు నగు' బాల. సంధి. 38. గర్భ పంజరము - గర్భమనెడి పంజరము - రూపకము. ఈశు + అర్ధాంగము - 'షష్ఠీసమాసమునం దుకార ఋకారముల కచ్చు పరమగునపుడు నుగాగమంబగు' బాల. సంధి. 34. ఈశునర్ధాంగము, ఎత్తు + అగజ = 'ఉదంతమగు తద్ధర్మార్థవిశేషణమున కచ్చు పరమగునప్పుడు నుగాగమం బగు,' బాల. సంధి. 33.

## పార్వతి జననము.

క. తరుణ విధూదయమునకుం
బరిపూర్ణంబగు సుధాబ్ధి పగిదిన నా సుం
దరికిఁ గ్రమంబున గర్భము
పరిపూర్ణం బయ్యె నిష్టఫలసంపదతోన్. 27

అర్థము : తరుణ - విధు + ఉదయమునకున్ = నిండుచంద్రుని పొడుపునకు, పరిపూర్ణంబు + అగు = నిండునట్టి - పొంగునట్టి, సుధా + అబ్ధి - పగిదినన్ = క్షీరసముద్రము విధమున. ఆ - సుందరికిన్ - ఆ అందగత్తెకు - మేనకకు, ఇష్ట - ఫల - సంపదతోన్ = కోరినఫలములనెడి సంపదతో, క్రమంబునన్ = కాలక్రమమున, గర్భము = చూలు, పరిపూర్ణంబు + అయ్యెన్ = నిండెను.

తాత్పర్యము : నిండుచంద్రుని పొడుపునకుఁ బరిపూర్ణమైన పాలసంద్రము విధమున మేనకకు పార్వతీజననరూపమైన ఇష్టఫలసంపదతోఁ గ్రమముగాఁ జూలు పరిపూర్ణ మయ్యెను.

విశేషములు : అలంకార ముపమ.

వ. త దవసరంబున శుభముహూర్తంబున. 28

అర్థతాత్పర్యములు : ఆ సమయమునందు శుభముహూర్తమున - తరువాతి పద్యములో నన్వయము.

సీ. వేలావనమునందు విలసిల్లు విద్రుమ
వల్లిక యుదయించు వడువు వోలెఁ
బూర్వదిక్సతి కతిస్ఫురణతో నుత సుధా
కర రేఖ యుదయించు కరణివోలెఁ,
త్రిదివంబునందు సమ్మద మొందఁ గల్ప ల
తాంకుర ముదయించునట్లు వోలె,
దేవతానదికి శోభావహమ్ముగ హేమ
రాజీవ ముదయించు రమణ వోలె,

ఆ. వర విదూర[1]భూమి వైదూర్య[2] ముదయించు
తెలుఁగు వోలె దిశలు తేజరిల్ల
మానినీ లలామ మేనక కుదయించె
రాజవదన శైలరాజకన్య. 29

అర్థము : వేలా - వనమునందున్ = సముద్ర తీరమునందలి వనములో, విలసిల్లు = ప్రకాశించునట్టి విద్రుమ - వల్లిక = పవడపుఁదీఁగ, ఉదయించు - వడువు + పోలెన్ = పుట్టురీతివలెను,

పూర్వ - దిశ్ (క్) + సతికిన్ = తూర్పుదిక్కనెడి స్త్రీకి, అతి - స్ఫురణ తోన్ = మిక్కిలి, ప్రకాశముతో, నుత - సుధాకర - రేఖ = పొగడఁబడిన చంద్ర కళ, ఉదయించు - కరణి + పోలెన్ = పుట్టురీతివలెను,

త్రిదివంబునందున్ = స్వర్గమునందు, సమ్మదము + ఒందన్ = సంతోషము గలుగునట్లు, కల్ప - లతా + అంకురము = కల్పలతయొక్క మొలక, ఉదయించు + అట్లు + పోలెన్,

1. వా. ప్రతి. దూ. 2. వా. ప్రతి. దూ.

దేవతా - నదికిన్ = ఆకాశగంగకు, శోభా + ఆవహమ్ముగన్ = ఒప్పు గలుగునట్లు, హేమ - రాజీవము = బంగరుతామర, ఉదయించు, రమణ + పోలెన్ = పుట్టు విధమువలెను,

వర - విదూర - భూమిన్ = శ్రేష్ఠమైన విదూరపర్వతమునకుఁ జెంగటి భూమియందు, వైదూర్యము = వైదూర్యమనెడి రత్నము, ఉదయించు తెఱఁగు + పోలెన్ - పుట్టు విధమువలెను, దిశలు = దిక్కులు, తేజరిల్లన్ = ప్రకాశింపఁగా, మానినీ - లలామ - మేనకకున్ = శ్రేష్ఠురాలగు స్త్రీ యయిన మేనకకు, రాజ - వదన = చంద్రునివంటి ముఖముగలది యగు, శైల - రాజ - కన్య = పర్వతరాజగు హిమవత్పుత్రిక - పార్వతి, ఉదయించెన్ = పుట్టెను,

తాత్పర్యము : తీరోద్యానమునందుఁ బవడపుఁదీగ పుట్టునట్లును, తూర్పు దిక్కనెడు స్త్రీకి మిక్కిలి ప్రకాశముతోఁ జంద్రకళ పుట్టునట్లును, స్వర్గమునందు సంతోషమును గలిగించునట్లు కల్పలతిక మొలకపుట్టునట్లును, ఆకాశగంగకు శోభ గలిగించునట్లు బంగరుఁదామర పుట్టునట్లును, విదూరపర్వతప్రాంతభూమియందు వైదూర్య రత్నము పుట్టునట్లను స్త్రీరత్నమైన మేనకకుఁ జంద్రముఖి యగు పార్వతి పుట్టెను.

విశేషములు : అలంకార ముపమ, ఉపమలు పెక్కులు గలవు కావున మాలోపమ, అన్నిచోట్లను ఇవార్థక శబ్దములపై మరల నివార్థక శబ్దములు గలవు. వడువు వోలె, కరణివోలె, అట్లువోలె, రమణవోలె, తెఱఁగువోలె - ఇది నన్నెచోడుని పద్ధతి. విద్రుమవల్లిక, సుధాకరరేఖ అనునుపమానములలో లింగసామ్యము గలదు. కాని కల్పలతాంకురము, హేమరాజీవము, వైదూర్యము అనువానిలో ఉపమేయమ్ములింగము (స్త్రీ) కంటె భేదించినవి. వరవిదూరభూమి వైదూర్య ముదయించు తెఱఁగు వోలె. ఇది కాళిదాసునను గలదు.

'తయా దుహిత్రా సుతరాం చకాసే స్ఫురత్ప్రభామణ్డలయా సవిత్రీ,
విదూరభూమి ర్నవమేఘశబ్దా దుద్భిన్నయా రత్నశలాక యేవ, కుమార. 1 - 24

విదూరపర్వతప్రాంతభూమియందు నవమేఘశబ్దమువలన రత్నము మొలచును,

మ. వివిధామోదవిమిశ్రితానిల మొగిన్ వీచెన్; మరుద్దుందుభుల్
డివిరెన్; ఘోరనఁ బుష్పవృష్టి గురిసెన్;దేవాంగనాగాన ము
త్సవలీలన్ వినిచెన్; సమస్తభువనోత్సాహంబు సంధిల్లె; ది
గ్వివరంబుల్ వెలిఁగెన్; నిధుల్ దెఱచె నుర్విం గౌరి జన్మించినన్. 30

అర్థము : ఉర్విన్ = భూమియందు, గౌరి = పార్వతి, జన్మించినన్ = పుట్టఁగా, వివిధ + ఆమోద - విమిశ్రిత + అనిలము = నానాప్రకారములైన పరిమళములతోఁ గూడిన వాయువు, ఒగిన్ = చక్కఁగా, వీచెన్: మరుత్ + దుందుభుల్ = దేవతలయొక్క భేరులు, తివిరెన్ = మ్రోసెను, ఘోరనన్ = ఘోరుమని - అధికముగా, పుష్ప - వృష్టి = పూలవాన, కురిసెన్, దేవ + అంగనా- గానము = దేవతాస్త్రీల గానము, ఉత్సవ లీలన్ = సానందముగా, వినిచెన్ = వినిపించెను, సమస్త - భువన + ఉత్సాహంబు = ఎల్ల లోకముల వేడుక, సంధిల్లెన్ = కలిగెను, దిశ్ (క్) + వివరంబుల్ = దిక్కులయొక్క రంధ్రములు. వెలిఁగెన్ = ప్రకాశించెను, నిధుల్, తెఱచెన్ = బయలుపడెను.

తాత్పర్యము: పార్వతి భూమియందు జన్మించినంతనే నానావిధములైన పరిమళములతోఁగూడిన వాయువు వీచెను. దేవతల భేరీనినాదము మ్రోసెను. పూలవాన ఘోరనఁ గురిసెను, దేవతాస్త్రీల గానము సానందముగా విననయ్యెను. ఎల్లలోకము లందును వేడుక గలిగెను, దిక్కుల తెఱపులు ప్రకాశించెను. నిధులు బయలుపడెను.

విశేషములు : పార్వతి పుట్టినప్పుడు గలిగిన శుభశకునము లిందు వివరింపఁబడినవి.

మరుత్ + దుందుభుల్ – దుల్లునకు హాళ్ళు పరమగుచుండఁగాఁ దృతీయ వర్ణాదేశము. దిశ్ + వివరంబుల్ - దిక్ + వివరంబుల్ - దిగ్వివరంబుల్,

కాళిదాసు కుమారసంభవమునఁ బార్వతి జన్మదిన మిట్లు వర్ణింపఁబడినది.
ప్రసన్నదిక్ పాంసువివిక్తవాతం శఙ్ఖస్వనానంతరపుష్పవృష్టి,
శరీరిణాం స్థావరజఙ్గమానాంసుఖాయ తజ్జన్మదినం బభూవ, 'కుమారసం 1, 23

వ. అంత హిమవంతుం డంతఃపురసహితం బనంత సంతోష రసాపూరి తాంతరంగుం డగుచు నిజోత్సవంబుతోన పురోత్సవంబు నొనర్చుచు, దీనానాథ విద్వజ్జనంబుల నపార వసు ధారాసారంబులం దేల్చుచు, నమందానందుం డగుచు నుండె; నంతం బార్వతి శరచ్చంద్రరేఖ యుంబోలె సకల జన నయనేందీవరానందకరంబై వెలుంగుచుం గ్రమక్రమంబున. 31

అర్థము: అంతన్, హిమవంతుండు, అంతఃపుర - సహితంబు = అంతిపురముతోఁగూడ, అనంత - సంతోష - రస + ఆపూరిత + అంత రంగుండు = అంతములేని సంతోషరసముతో బాగుగా నిండిన మనస్సుగలవాఁడు, అగుచున్, నిజ+ఉత్సవంబు+తోన్+అ = తన ఆనందముతోనే, పుర+ఉత్సవం బున్ = నగరమునఁ బండువును, ఒనర్చుచున్ = చేయుచు, దీన + అనాథ-విద్వస్ (ద్)+జనంబులన్ = దీనులను, దిక్కులేనివారిని, పండితులైన జనులను, అపార-వసు-ధారా + ఆసారంబులన్ = అధికమైన ధనముయొక్క ప్రవాహములయొక్క జడులచే, తేల్చుచున్ = సంతోషపెట్టుచు, అమంద-ఆనందుండు = తక్కువకాని ఆనందము గలవాఁడు-అధికమైన ఆనందము గలవాఁడు, అగుచున్. ఉండెన్, అంతన్, పార్వతి, శరత్+చంద్ర-రేఖయున్+పోలెన్ = శరత్కాలమునందలి చంద్రకళవలె, సకల-జన-నయన+ఇందీవర+ఆనందకరంబు+ఐ = ఎల్ల జనులయొక్క కన్ను లనెడి నల్లకలువలకు ఆనందమును గలిగించునదియై, వెలుంగుచున్ = ప్రకాశించుచు, క్రమక్రమంబునన్ = మెల్లమెల్లఁగా.

తాత్పర్యము: అంత హిమవంతుఁడు రాణివాసముతోఁగూడ కడలేని సంతోషరసముతో నిండిన మనస్సుగలవాఁ డగుచు, తన వేడుకతోపాటు నగరము నందును వేడుకచేయుచు, దీనులను, దిక్కుమాలినవారిని, విద్వాంసులను అధికధన ప్రవాహములచే నానందింపఁజేయుచు, అధికమైన ఆనందము గలవాఁ డగుచుండెను. అంతఁ బార్వతి శరత్కాల చంద్రకళవలె నెల్లజనుల కనుఁగలువలకు ఆనందమును గలిగించునదియై ప్రకాశించుచుఁ గ్రమక్రమమున- తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు: అంత హిమవంతుం డంతఃపుర .... డగుచు- పూర్ణబింబు పూర్ణ త్వాల పునఃపునరావృత్తిచే నను ప్రాసాలంకారము, సంతోషసూచకము,

విద్వస్+జనంబులు = 'క్వసంతశబ్దములకు అసర్వనామ హలాదిప్రత్యయములు పరములగునపుడును, నపుంసకలింగమునందు ప్రథమైకవచనప్రత్యయము పరమగునపుడును సకారమునకు దకారాదేశమగును. విద్వద్ + జనంబులు-సకార తవర్గములకు శవర్గ చవర్గములతో పూర్వమందైనను పరమందైనను కూడిక గలుగునపుడు క్రమముగా శవర్గ చవర్గవర్ణము లాదేశ మగును-విద్వజ్జనంబులు, శరచ్చంద్ర-శరత్+చంద్ర, పయి సూత్రమే. పార్వతి శరచ్చంద్రరేఖయుంబోలె - ఉపమాలంకారము. నయనేందీవర - నయనములనెడి ఇందీవరములు - రూపకము. చంద్రుఁడు కలువల కానందమును గలిగించును.

సీ. పరమేశు మన ముద్దపరి ముట్టి సాధింప
నెత్తిన గతిఁ దల యెత్తఁ దొడఁగె,
హారు నూరుపీఠంబునం దుండు వెర విట్టి
దను గతిఁ గూర్చుండ నను వడసె,
నొక ధాత్రి తనుఁ దాల్ప నోప దన్ గతి ధాత్రి
పై నిజధాత్రి చే పట్టి నిలిచెఁ,
గలహంస కుల మంద గమనంబు నయ మిట్టి
దని చూపు గతి నడపాడఁ దొడఁగె,

ఆ. రాజకీరములకు రసవంతముగఁ బల్కు
మెలపు దెలుపు కరణిఁ బలుకఁ గఱచె,
హిమనగేంద్రు నింట నీడితైశ్వర్యంబు
పెరుఁగునట్టు లగజ పెరుఁగఁదొడఁగె. 32

అర్థము. అగజ=పార్వతి, పరమేశు-మనము = పరమేశ్వరుని మనసును ఉద్దపరి = మిక్కిలి, ముట్టి = తాఁకి, సాధింపన్ = సాధించుటకు. ఎత్తిన-గతిన్ = ఎత్తిన విధమున. తల, ఎత్తన్ + తొడఁగెన్ = ఎత్త నారంభించెను.

హరు + ఊరు-పీఠంబునందున్ = ఈశ్వరుని తొడ యనెడి పీఠమునందు. ఉంతు, వెరవు = ఉపాయము, ఇట్టిది- అను-గతిన్=అనువిధమున, కూర్చుండు+అనువు = కూర్చుండునట్టి రీతి, పడసెన్ = పొందెను.

ఒక-ధాత్రి = ఒకభూమి-ఒకతల్లి యని యర్థాంతరము, తనున్ = తన్ను, తాల్పన్ = తాల్చుటకు, ఓపదు = చాలదు, అన్ + గతిన్ = అను విధమున, ధాత్రిపైన్ = భూమిమీఁద, నిజ-ధాత్రి = తన దాది, చే పట్టి = చేయిపట్టుకొని, నిలిచెన్.

కలహంస-కుల-మంద-గమనంబు - నయము = రాయంచల గుంపుయొక్క- మెల్లని, నడకయొక్క-, విధము, ఇట్టిది + అని - చూపు-గతిన్ = ఈ రీతిది అని చూపు విధమున, నడవాడన్ + తొడఁగెన్ = నడవ నారంభించెను.

రాజ - కీరములకున్ = రాచిలుకలకు, రసవంతముగన్ = సరసముగా, పల్కు-మెలపు = పలుకునట్టి నేర్పు, తెలుపు-కరణిన్=తెలుపువిధమున, పలుకన్ + కఱచెన్ = పలుక నేర్చెను.

హిమ-నగ + ఇంద్రు + ఇంటన్ = హిమవత్పర్వతరాజు నింటియందు, ఈడిత+ఐశ్వర్యంబు = పొగడఁబడిన సంపద, పెరుఁగు+అట్టులు = వృద్ధిపొందు విధమున, అగజ=పార్వతి, పెరుఁగన్+తొడఁగెన్ = పెద్దది కాఁజొచ్చెను.

తాత్పర్యము : పార్వతి పరమేశ్వరుని మనస్సును మిక్కిలి గ్రహించి సాధించుట కెత్తెనా యనునట్లు తల యెత్తఁదొడఁగెను. ఈశ్వరుని తొడపై నుండు విధ మిది యని తెలుపుటకా యనునట్లు ఆమె కూర్చుండు రీతిని గాంచెను, ఒక తల్లి తన్ను వహింపలే దను విధమున నామె ధాత్రిపైఁ దన దాదిచేయి పట్టుకొని నిలిచెను. రాయంచల మందగమనము రీతి యిట్లుండు నని చూపుటకో యన నామె నడవఁ దొడఁగెను. రాచిలుకలకు సరసముగాఁ బలుకు నేర్పును దెలుపుటకా యనునట్లు ఆమె పలుకనేర్చెను. హిమవత్పర్వతరాజు నింట నైశ్వర్యము పెరుఁగునట్లు ఆమె పెద్దది కాఁజొచ్చెను.

విశేషములు :- పద్యమునందలి ప్రతిపాదమునను హేత్వాక్షేపాలంకారముగలదు, ఒకధాత్రి యనుచో శ్లేషము.

కూర్చుండు+అనువు- 'ఉదంతమగు తద్ధర్మార్థ విశేషణమున కచ్చు పరంబగు నపుడు నుగాగమం బగు.' బాల. సంధి. 33. కూర్చుండు ననువు. అన్‌గతి-అను+గతి-'అను, కొను లోనగు ధాతుజవిశేషణముల యంత్యోకారమునకు హల్లు పరంబగు నపుడు లోపంబు వైకల్పికంబు.' ప్రౌఢ. సంధి. 13. చే-చేయి రూపాంతరము హిమనగేంద్రు+ఇంట-'షష్ఠీసమాసమునం దుకార ఋకారముల కచ్చు పరమగునపుడు నుగాగమం బగు.' బాల. సంధి. 34. హిమనగేంద్రునింట. ఈడిత+ఐశ్వర్యంబు= వృద్ధి సంధి. అ ఆలకు ఏ ఐలు పరము లగునపుడు ఐకారమును, ఓ ఔలు పరము లగునపుడు ఔకారమును ఏకాదేశమగును. ఈడితైశ్వర్యంబు-

మ. స్ఫురదాలోకన దీప్తు లంగణములం బొల్పొందఁగాఁ జూచుచున్.
దరహాసద్యుతు లాననాంబుజముపైఁ దళ్కొత్తఁగా నవ్వుచున్.
చరణాంభోరుహరాగదీధితు లిలన్ సంధిల్లఁ దట్టాడు న
గ్గిరిరాజాత్మజ తల్లిదండ్రు లనురాగిల్లన్ మదిన్ దాదితోన్. 33

అర్థము : ఆ+గిరి-రాజ+ఆత్మజ = ఆ కొండలఱేని కూఁతురు-పార్వతి, తల్లిదండ్రులు = జననీజనకులు-మేనకా హిమవంతులు, మదిన్ = మనస్సునందు, అనురాగిల్లన్ = అనురాగము నొందఁగా, దాదితోన్, స్ఫురత్+ఆలోకన-దీప్తులు = ప్రకాశించుచున్న, చూపుల, కాంతులు, అంగణములన్ = చుట్టుపట్టుల ప్రదేశములందు పొల్పు+ఒందఁగాన్ = ఒప్పునట్లుగా, చూచుచున్, దర-హాస-ద్యుతులు=చిఱు నవ్వుకాంతులు, ఆనన+అంబుజముపైన్=ముఖపద్మముమీఁద, తళ్కొత్తఁగాన్= ప్రకాశింపఁగా, నవ్వుచున్, చరణ+అంభోరుహరాగ- దీధితులు= పాదపద్మముల యెఱ్ఱని కాంతులు, ఇలన్=నేలపై, సంధిల్లన్ = ఏర్పడఁగా, తట్టాడున్ = తప్పటడుగులు వేయుచు నడచును.

తాత్పర్యము : ఆ కొండలఱేనికూఁతురు తల్లిదండ్రులు మనస్సున ననురాగము నొందఁగా దాదితోఁ బ్రకాశించు చూపులకాంతులతో నంగణముల నొప్పుగాఁ

జూచుచు, చిఱునవ్వుకాంతులు ముఖపద్మముపైఁ బ్రకాశింపఁగా నవ్వుచు, పాదపద్మములు యెఱ్ఱని కాంతులు నేలపై నేర్పడఁగాఁ దప్పటడుగులు వేయుచు నడుచును,

విశేషములు: తల్లి-తండ్రి- 'ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గసడదవ లగు' తల్లిదండ్రులు, బాల, సం, 15, అనురాగిల్లన్ - 'రంజాదుల యించు క్పకారంబునకు నబిందుకంబున కప్రేరణంబున ద్విరుక్తలకారం బగు' బాల, క్రియ. 71, అనురాగ + ఇంచు = అనురాగ + ఇల్లు, అపదాదిస్వర సంధి, (బాల. సంధి, 12)చే అనురాగిల్లు, 'తుమర్థ భావలక్షణంబులందు నుఙీ యగు' బాల-క్రియ,40 అనురాగిల్లు+నుఙీ, 'ఙీత్తు పరంబగునపు డుత్వంబున కత్వం బగు.' బాల,క్రియ,20 అనురాగిల్లన్. అగ్గిరిరాజాత్మజ, ఆ+గిరిరాజాత్మజ, 'త్రికంబుమీఁది యసంయుక్తహల్లునకు ద్విత్వంబు బహుళంగా నగు,' బాల. సమాస, 14 ఆ+గ్గిరిరాజాత్మజ, 'ద్విరుక్తం బగు హల్లు పరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు' బాల, సమాస. 13. అగ్గిరిరాజాత్మజ.

క. గిరిసుత తొలుపలుకుల సు
స్వర మొదవఁగ 'నోం నమశ్శివాయ స దాస్మ
ద్వరదాయ నమః శంకర
శరణు మహాదేవ నీవ శర'ణనఁ జొచ్చెన్. 54

అర్థము : గిరి-సుత=కొండకూఁతురు- పార్వతి, తొలు-పలుకులన్=మొదటి మాటలతో - చిన్ననాఁటిమాటలతో, సు-స్వరము = మంచి యెలుఁగు, ఒదవఁగన్+కలుగఁగా, ఓం నమః + శివాయ = శివునకు నమస్కారము అను పంచాక్షరీ మంత్రమును, సదా = ఎల్లప్పుడును, అస్మద్+వరదాయ=నా వరదునకును, నమః= నమస్కారము, శంకర, శరణు, మహాదేవ, నీవు+అ = నీవే, శరణు, అనన్+చొచ్చెన్=అనఁ దొడఁగెను.

తాత్పర్యము : పార్వతి శైశవమువందలి పలుకులతో మంచి కంఠధ్వని కలుగఁగా ఓం నమశ్శివాయ - అస్మద్వరదాయ సదా నమః' అనియు, శంకరా! శరణు. మహాదేవా! నీవే శరణు' అనియుఁ బలుక నారంభించెను,

విశేషములు : 'ఓం నమశ్శివాయ' 'సదాస్మద్హృదాయ నమః' అను, రెండును సంస్కృతవాక్యములు, ఈ రెండును వ్యస్తముగా నున్న 'అనన్' అను దానితో ననుకరింపఁబడినవి, శంకర! శరణు. మహాదేవ ! సీవ శరణు' అనునవి తెలుఁగువాక్యములే. 'నమశ్శివాయ' అనునది శివపంచాక్షరీమంత్రము, 'ఓం'తోఁ గూడు కొన్నది కావున షడక్షరి యగును.

వ. మఱియు శైశవ క్రీడా వినోదంబులయందు. 35

అర్థము : మఱియున్, శైశవ-క్రీడా-వినోదంబుల+అందున్ = బాల్యమునందలి ఆటల వేడుకలందు,

తాత్పర్యము : మఱియును బాల్యక్రీడలందలి వేడుకలందు-రఘువాతి పద్యముతో నన్వయము,

చ. తరుణులు చిల్క-బొమ్మలును దంతపుబొమ్మలు మేలిగాజు బ
న్నరులును మ్రాని చొప్పికలు నల్గడ నోలిన పేర్చి లీల చే
కుర బొమరిండ్లఁ జేయనగు కూళ్లను వండుచు బొమ్మపెండ్లి మా
సరముగఁ జేసి యాడ నగజాత శివార్చన సేయు నయ్యెడన్. 36

అర్థము : తరుణులు = స్త్రీలు-చెలికత్తెలు, చిల్క-బొమ్మలును = చిలుకల బొమ్మలును, దంతపుబొమ్మలున్ = దంతములతోఁ జేసిన బొమ్మలును, మేలి-గాజు-బన్నరులును = మంచి గాజుతోఁ జేసిన బన్నసరులును-పలువిధములగు మణులు గ్రుచ్చిన హారములును, మ్రాని-చొప్పికలున్ = కొయ్య బొమ్మలును, నల్గడన్ = నాలుగు ప్రక్కలను, ఓలిన్+అ = వరుసగా, పేర్చి = అమర్చి, లీల = అందము, చేకురన్ = కలుగఁగా బొమరిండ్లన్ = బొమ్మరిండ్లయందు, చేయన్+అగు = చేయనగు, కూళ్ళను = కూడులను, వండుచున్, బొమ్మ-పెండ్లి = బొమ్మల పెండ్లి, మాసరముగన్ = అధికముగా, చేసి, ఆడన్, నగ-జాత = కొండ కూఁతురు-పార్వతి, అయ్యెడన్. (ఆ+ఎడన్) = ఆ సమయమున, శివ+అర్చన = శివుని పూజ, చేయున్.

తాత్పర్యము ; పార్వతి చెలికత్తెలు చిలుకలబొమ్మలును, దంతపు బొమ్మలును, మేలి గాజుపూసలు గ్రుచ్చిన హారములును, కొయ్యబొమ్మలును

నాలుగు వైపుల నందముగా నమర్చి బొమ్మరిండ్లలోఁ జేయు కూడులు వండుచు బొమ్మలపెండ్లిండ్లు విశేషముగాఁ జేసియాడఁగాఁ, బార్వతి యా సమయమున శివ పూజఁ జేయును.

విశేషములు ; దంతపుబొమ్మ - దంతము+బొమ్మ-'కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బుంపు లగు' బాల, సంధి. 32. నల్గడ-నలుగడ-'పదాంతంబులయి యసంయుక్తంబులయిన ను లు రు ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు' బాల. ప్రకీర్ణ, 16. నలు+కడలు- 'ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుగా నగు మిశ్రంబునకుఁ గాదు,' బాల, సమాస. 18. అ+ఎడ-యడాగమము- బాల. సంధి. 3 అ+యెడ-త్రికసంధి, బాల. సమాస. 14, 13 అ+య్యెడ=అయ్యెడ.

వ. ఆ సుకుమారి కౌమారంబునందు. 37

అర్థ తాత్పర్యములు: ఆ-సుకుమారి=ఆ అందమైన స్త్రీ-పార్వతి, కౌమారంబునందున్=బాల్యమునందు-ఆ సుకుమారి యగు పార్వతి బాల్యమునందు-తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు :- కౌమారము-అయిదేండ్లవఱకు నుండు వయస్సు. మూఁడు మొదలెనిమిదేండ్లవఱకు నుండు వయస్సని కొందఱును, పదునాఱు వత్సరములవఱకు నుండు వయస్సని కొందఱును,ముప్పదేండ్లవఱకు నుండు వయస్సని మఱికొందఱును.

సీ. హరు మ్రోల నద్భక్తి నాడుచోటన నాట్య
విషయమ్ము లన్నియు వెలయఁ గఱచె,
లీల నీశ్వరు నంకమాలిక ల్పాడుచో
గీతభేదంబుల రీతు లెఱిఁగె,
శివురూపు పల్మఱుఁ జిత్రించి చూచుచో,
వినుతంబుగాఁ జిత్రవిద్య వడసె,
శశిమౌళిఁ జిత్రపూజలు సేయుచోటఁ బ
త్రచ్ఛేద కుసుమబంధములు నేర్చె,

ఆ. మఱియు నఖిలలోకమాన్యంబు లగు విద్య
లెల్ల నివ్విధమున నెసకమెసఁగ
నభ్యసించె నీశ్వరార్చనా బలమున
హరుఁడు గురుఁడు గాఁగ నగతనూజ. 38.

అర్థము : అగ - తనూజ = కొండ కూఁతురు - పార్వతి, హరుఁడు = ఈశ్వరుఁడు, గురుఁడు, కాఁగన్, ఈశ్వర + అర్చనా - బలమునన్ = శివపూజ వలని బలముచేత,

హర - మ్రోలన్ = శివుని సమక్షమున, సత్ + భక్తిన్ = మంచి భక్తితో, ఆడు - చోటన్ + అ = ఆడుచోటనే, నాట్య - విషయమ్ములు = నాట్యమునకు సంబంధించిన సంగతులు, అన్నియున్, వెలయన్ = ప్రకటముగా, కఱచెన్ = నేర్చెను.

లీలన్ = అందముగా, ఈశ్వరు + అంకమాలికల్ = శివస్తోత్రములు, పాడు చోన్ = పాడునప్పుడు, గీత-భేదంబుల - రీతులు = వివిధగీతముల ప్రకారములు, ఎఱిఁగెన్ = నేర్చెను.

శివు - రూపు = శివుని యాకారము, పల్మఱున్ = పలసారులు, చిత్రించి= వ్రాసి, చూచుచోన్ = చూచునప్పుడు, వినుతంబుగాన్ = పొగడఁబడినదిగా, చిత్ర- విద్య = చిత్రలేఖన, విద్య, పడసెన్ = పొందెను.

శశి - మౌళిన్ = చంద్రుఁడు శిరమునఁ గలవానిని - శివుని, చిత్ర - పూజలు = చిత్రవర్ణములపూలతోఁ జేయు పూజలు, చేయుచోటన్, పత్ర + ఛేద - కుసుమ - బంధములు = ఆకులముక్కలతోను, పూలతోను మాలలు కట్టుటలు, నేర్చెన్.

మఱియున్, ఈ + విధమునన్, అఖిల - లోక-మాన్యంబులు = ఎల్లలోకము లందును ఆదరింపఁదగినవి, అగు, విద్యలు + ఎల్లన్ = విద్య లన్నియు, ఎసక మెసఁగన్ - ఎసకము + ఎసఁగన్ = ఒప్పుగా, అభ్యసించెన్ = నేర్చెను.

తాత్పర్యము : పార్వతి, శివుఁడు గురువుగా, శివపూజాబలమున, శివుని యెదుట నృత్తములో నాడుచోటనే నాట్యసంబంధివిషయము లన్నియు నేర్చెను. శివస్తోత్రములు చక్కఁగాఁ బాడుచో గీతభేదముల రీతు లెఱిఁగెను. శివుని రూపును బలుమాఱులు లిఖించి చూచుచోఁ జిత్రలేఖనవిద్యను జక్కఁగా నేర్చెను. శివునిఁ జిత్రవర్ణముల పూలచేఁ బూజించుచోఁ బత్రఖండములతోను, పూలతోను మాలలు గ్రుచ్చుట నేర్చెను. ఇంకను నీ రీతిగా నామె లోకములందెల్ల నాదరింపఁదగు విద్యల నెల్లఁ జక్కఁగా నభ్యసించెను.

విశేషము : ఈశ్వర + అంకమాలికల్ - 'షష్ఠీసమాసమునం దుకార ఋకారములకు నచ్చు పరమగునపుడు నుగాగమం బగు.' బాల. సంధి. 34 మాలికల్ + పాడుచో. 'ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళముగా నగు.' బాల. సంధి. 13. మాలికల్బాడుచో. పత్ర + ఛేద - పత్రచ్ఛేద - హ్రస్వమునకుఁ బరమైన ఛకారము ద్విరుక్తమగును. ఇవ్విధమున-ఈ+విధమున-త్రికసంధి, బాల. సమాస, 14, ఈ + వ్విధమున. బాల. సమాస, 13. ఇవ్విధమున,

వ. మఱియుం గౌమారానంతరంబున లేఁదీఁగెకు మవ్వం బెక్కు-నట్లు,
పువ్వునకుఁ దావి వొందునట్లు, చిత్రరూపంబునకు మెఱుంగెక్కు-
విధంబున నిఖిల జన మనోఽభిరామం బగుచు. 39

అర్థము : మఱియున్, కౌమార + అనంతరంబునన్ = కౌమారదశ దరువాత, లేఁదీఁగెకున్ (లేఁత + తీఁగెకున్), మవ్వంబు = మృదుత్వము, ఎక్కు + అట్లు = కలుగువిధమున, పువ్వునకున్, తావి = వాసన, పొందు + అట్లున్ = కల్గుగు విధమున, చిత్ర - రూపంబునకున్ = చిత్తరువునందలి యాకారమునకు, మెఱుంగు = కాంతి, ఎక్కు - విధంబునన్, నిఖిల - జన - మనస్ (ః) + అభిరామంబు = ఎల్ల జనుల మనస్సులకు మనోహరము, అగుచున్,

తాత్పర్యము: మఱియును గౌమారదశ దాఁటిన పిమ్మట, లేఁతతీఁగకుఁ గోమలత్వము గలుగునట్లును, పువ్వునకుఁ బరిమళ మబ్బునట్లును, జిత్రగతరూపమునకుఁ గాంతి కలుగునట్లును నెల్లజనుల మనస్సులకును బ్రీతిగా. తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : అలంకారము మాలోపమ. ఈ సందర్భమునఁ గాళిదాసు కుమారసంభవశ్లోకము అరయఁదగినది. 'అసంభృతం మణ్డన మఙ్గయష్టే రనాసవాఖ్యం కరణం మదస్య, కామస్య పుష్పవ్యతిరిక్త మస్త్రం బాల్యాత్పరం సాథ వయః ప్రపేదే. కుమార, 1 - 31

మనోఽభిరామము - మనస్ + అభిరామము, సకారమునకు విసర్గాదేశము - మనః + అభిరామము - హ్రస్వ అకారముతరువాత వచ్చు విసర్గమునకు హ్రస్వ అకారముకాని, మృదుహల్లులు (హశ్శులు) కాని పరము అగునపుడు 'ఉ' ఆదేశముగా వచ్చి పూర్వమందున్న అకారముతోఁగూడి గుణసంధియై ఓ గా మాఱును. మన + ఉ + అభిరామము - మనోఽభిరామము, లేఁదీఁగె - లేఁత + తీఁగె-ప్రాఁతాదిసంధి, బాల. సంధి, 37, 16, 17. 'నిఖిలజనమనోఽభిరామ' యగుచు అని యుండుట లెస్స.

చ. మలఁపఁగనున్న కల్పలత, మన్మథు నారి నమర్పనున్న కో
మలతర పుష్పబాణ, మహిమద్యుతిఁ జూడఁగనున్న పద్మకు
ట్మల, మలరంగనున్న మధుమంజరి నా మదజృంభితాంగ దో
హల రుచి నొప్పె గౌరి నవయౌవనసంగమలీల డాయఁగాన్. 40

అర్థము : గౌరి = పార్వతి, నవ - యౌవన - సంగమ - లీల = నూత్న యౌవనము యొక్క కూడికవలని విలాసము, డాయఁగాన్ = సమీపింపఁగా, మలఁపఁగన్ + ఉన్న = పుష్పింపనున్న, కల్పలత, మన్మథు - నారిన్ = మన్మథునియొక్క వింటి త్రాటియందు, అమర్పన్ + ఉన్న = అమర్చుటకు సిద్ధముగా నున్న, కోమలతర - పుష్ప - బాణము = మిక్కిలి మృదువైన పూవుటమ్ము, అహిమ - ద్యుతిన్ = వేఁడికాంతులుగలవానిని - సూర్యుని, చూడఁగన్ + ఉన్న, పద్మ - కుట్మలము = తామర మొగ్గ, అలరంగన్ + ఉన్న = వికసింపనున్న, మధు - మంజరి = మనోహరమైన పూలగుత్తి, నాన్ = అనునట్లు, మద - జృంభిత + అంగ - దోహల - రుచిన్ = యౌవనమదముచే, అతిశయించిన, మేని, యుత్సాహమువలని కాంతితో, ఒప్పెన్,

తాత్పర్యము : పార్వతి నూతనయౌవనవిలాసము సమీపింపఁగాఁ బుష్పింపనున్న కల్పలత యనఁగను, మన్మథుని వింటి యల్లెత్రాటియం దమర్పనున్న

మృదుతరమైన పూవుటమ్మనఁగను, సూర్యుని జూడనున్న తామరమొగ్గ యనఁగను, వికసింపనున్న సుందరపుష్పగుచ్ఛ మనఁగను, యౌవనమదవిజృంభణముతోడి మేని యుత్సాహపుఁగాంతితో నొప్పెను.

విశేషములు : అలంకార ముపమ. ఉపమలు పెక్కు లుండుటచే మాలోపమ, ఉపమానము లన్నిటియందును వికసనసంసిద్ధత చూడనగును, ఉపమేయమైన పార్వతియందును యౌవనసంసిద్ధతయే కలదు.

వ. ఇట్లభినవమధుసంగతిం దనరు ప్రద్యుమ్నునుద్యానంబునుంబోని యౌవనమదాభ్యుదయంబున. 41

అర్థము : ఇట్లు, అభినవ - మధు - సంగతిన్ = నూత్నవసంతాగమముచే, తనరు = ఒప్పునట్టి, ప్రద్యుమ్ను + ఉద్యానంబునున్ + పోని = మన్మథోద్యానము వంటి, యౌవన - మద + అభ్యుదయంబునన్ = యౌవనమువలని మదము వృద్ధిచే,

తాత్పర్యము : ఇట్లు నూతనవసంతాగమముచే నొప్పునట్టి మన్మథోద్యానము వంటి యౌవనమదాభ్యుదయమున - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : అలంకార ముపమ. ప్రద్యుమ్నునుద్యానంబు = ప్రద్యుమ్న + ఉద్యానంబు-షష్ఠీసమాసమునందుకార ఋకారముల కచ్చు పరమగునపుడు నుగాగమం బగు. బాల, సంధి, 34.

## పార్వతీ యౌవన వర్ణనము.

క. మెలుపును గెంపును సుస్థితిఁ
దలిరులయందేని లేదు తమ కుమ వలనన్
నిలుకడ యగు నని తత్పద
తలముల నెలసె ననఁ బాదతలములు వొల్చున్. 42

అర్థము : మెలుపును = మృదుత్వమును, కెంపును, = ఎఱుపును, సుస్థితిన్ = మంచినిలుకడతో, తలిరులయందున్ + ఏని = చిగురులయందయినను

లేదు, తమకున్, ఉమవలనన్ = పార్వతివలన, నిలుకడ + అగున్ = స్థిరత్వ అగును, అని, తద్ + పద - తలములన్ = ఆమె అఱకాళ్లను, ఎలసెన్ = చేరెను, అనన్ = అనునట్లు, పాద - తలములు = అఱకాళ్లు, పొల్చున్ = ఒప్పును.

తాత్పర్యము : మృదుత్వమును, ఎఱుపును 'దమకు నిలుకడ చివురులం దయినను లేదు, తమకుఁ బార్వతివలన నిలుకడ కలుగు' నని యామె పదతలములను జేరెనా యనునట్లు ఆమె పాదతలము లొప్పును.

విశేషములు : మృదుత్వారుణత్వములకుఁ దలిరులయందు స్థిరత్వ ముండదు. తలిరులు ముదిరినచో నవి నశించును. అందుచే నవి పార్వతి యఱకాళ్లను జేరె నని భావము, చివురులవలెఁ గొంతకాలమే కాక పార్వతి యఱకాళు లెప్పటికి మృదుత్వారుణత్వములను గలిగియుండె ననుట. హేతువుకాని దానిని హేతువుగా నూహించుటచే నలంకారము హేతూత్ప్రేక్ష.

తద్ + పద - అనునాసికాంతస్థభిన్నములైన హల్లులకు (యల్లులకు) కఠిన హల్లులు (ఖరులు) పరమగునపుడు వాని వర్గములందలి ప్రథమ వర్ణములు (చరులు) ఆదేశములగును- తత్పద, పాదతలములు + పొల్చున్ - 'ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళముగా నగు' బాల. సంధి. 13 - పాదతలములువొల్చున్,

'దేవతానాం రూపం పాదాఙ్గుష్ఠప్రభృతి వర్ణ్యతే, మానుషాణాం కేశా దారభ్యేతి ధార్మికాః' అనుటచేఁ గవి దేవతామూర్తి యగు పార్వతి యంగవర్ణనను బాదతల ములనుండి కచపర్యంతము ముప్పదియొక్క పద్యములోఁ గావించుచున్నాఁడు.

క. సరస ప్రవాళములపై
సరసిజరాగమణు లోలి సంధిల్లెనొ, సుం
దర రాగ లతా కందాం
కురములొ నా నుంగుటములు కోమలి కమరున్. 43

అర్థము : సరస-ప్రవాళములపైన్ = లేఁజివురులపై, సరసిజ-రాగ-మణులు = పద్మరాగమణులు, ఓలిన్ = క్రమముగా, సంధిల్లెనో = కూడెనో;

సుందర-రాగ-లతా-కంద + అంకురములో = అందమైన ఎఱ్ఱనితీఁగయొక్క దుంప యొక్క మొలకలో, నాన్ = అనఁగా, కోమలికిన్ = చక్కఁదనముగల యింతికి, పార్వతికి, ఉంగుటములు = అంగుటములు- బొటనవ్రేళ్ళు, అమరున్ = ఒప్పును.

తాత్పర్యము : లేఁతవి యగు చివురులపైఁ బద్మరాగమణులు కూడెనో, లేక మనోహరములైన అనురాగలత దుంప మొలకలో యనునట్లు పార్వతికి బొటనవ్రేళ్ళు ఒప్పును.

విశేషములు : ప్రవాళ శబ్దమునకుఁ బగడమనియు నర్థము గలదు. సరసములైన పగడములపైఁ బద్మరాగమణులు కూడెనో యనియుఁ జెప్పవచ్చును. ఆమె పాదములు సరస ప్రవాళముల (చిగురుల, పవడముల) వలెను, అందలి అంగుష్ఠములు పద్మరాగమణులవలెను నున్నవని భావము. అలంకార ముత్ప్రేక్ష. సుందరరాగలతా కందాంకురములో - అలంకార ముత్ప్రేక్ష. ఆమె యంగుష్ఠములు పద్మరాగమణులా, రాగలతా కందాంకురములా-అని సందేహించుటచే సందేహాలంకారమును. ఉంగుటము- అంగుటము రూపాంతరములు, ఉంగుటము (వికృతి) - అంగుష్ఠము (ప్రకృతి).

క. అరుణాంబుజ దళములలోఁ
బరఁగు తటిత్త్విషలు నించి పై నభ్రకముల్
పొరలెత్తి కదియ మూసిన
కరణి నుమాదేవి పద నఖంబులు వెలుఁగున్. 44

అర్థము: అరుణ + అంబుజ - దళములలోన్ = ఎఱ్ఱ తామర రేకులలో, పరఁగు = ఒప్పునట్టి, తటిత్ + త్విషలు = మెఱుపుల కాంతులు, నించి=నిండించి- పైన్ = మీఁద, అభ్రకముల్, పొరలు+ఎత్తి = పొరలుతీసి, కదియన్-మూసిన, కరణిన్ = కూడునట్లు మూఁతపెట్టిన విధమున, ఉమా - దేవి = పార్వతీదేవి, పద- నఖంబులు = కాలిగోరులు, వెలుఁగున్ = ప్రకాశించును.

తాత్పర్యము: ఎఱ్ఱతామర రేకులలో మెఱుపుల కాంతులు నిండించి వాని పై నభ్రకపుఁబొరలను మూఁతపెట్టినట్లు పార్వతి కాలిగోరులు ప్రకాశించును.

విశేషములు : అలంకార ముత్ప్రేక్ష.

తటిత్-'తటిత్సౌదామనీ విద్యుచ్చఞ్చలా చపలా అపి,' ప్రథయా తమాంసి తాడయ తీతి తడిత్-తటిత్, అంధకారమును బోఁగొట్టునది- మెఱపు- అమరము. త్విష-'స్యుః ప్రభా రు గ్రుచి స్త్విడ్భా భా శ్ఛవి ద్యుతి దీప్తయః,' - త్విషతే త్విట్. కాంతియుక్తమైనది-ప్రకాశించునది.కాంతి. అమరము.

క. తన నీచయోని [1]విడనగు
నని సకళత్రమును నుమ పదారాధన కొం
దిన విష్ణు కమఠరూపమొ
యనఁ దగి మీఁగాళు లగజ కందం బొందున్. 45

అర్థము : తన = తనయొక్క, నీచ-యోనిన్ = హీనమైన జన్మమును, విడన్ + అగున్ + అని = విడువ వీలగు నని - తాను నీచమైన జన్మమును (తాఁబేటిరూపును) విడుచుటకు వీలు గలుగునని, స-కళత్రమును = భార్యాసహిత ముగా, ఉమ=పార్వతియొక్క, పద + ఆరాధనకున్ = అడుగులయొక్క పూజకు, ఒందిన = చేరిన, విష్ణు = విష్ణునియొక్క. కమఠ - రూపమొ = తాఁబేటిరూపమో, అనన్ = అనునట్లు, తగి = ఒప్పి, అగజకున్ = పార్వతికి, మీఁగాళులు = పాదో పరిభాగములు, అందంబు + ఒందున్ = అందగించును.

తాత్పర్యము : తన హీనమైన జన్మమును వీడుటకు వీలగునని భార్యా సహితముగాఁ బార్వతి పాదపూజకుఁ జేరిన విష్ణుని తాఁబేటిరూపమో అనునట్లొప్పి పార్వతి మీఁగాళ్లు అందగించును.

విశేషములు : అలంకార ముత్ప్రేక్ష. మీఁగాళ్ళను దాఁబేటితోఁ బోల్చుట కవి సమయము.

సకళత్రమయిన కమఠ రూపమనుట రెండుమీఁగాళ్ళకును బోలిక సిద్ధించుట కొఱకు. మీఁగాళులు-మీఁదు + కాళులు 'సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు' బాల. సంధి. 36. మీ + కాళులు, 'లుప్తశేషంబునకుం బరుషములు పరము లగునపుడు నుగాగమంబగు.' బాల. సంధి.37

1. వా. ప్రతి.' పడుచే.లని

మీ +ను + కాళులు, 'ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళము లగు.' మీ + ను + గాళులు, బాల, సంధి. 16, 'ఆదేశసరళములకు ముందున్న ద్రుతము నకు బిందుసంశ్లేషములు విభాషనగు.' మీఁగాళులు. బాల. సంధి. 17. కాళులు. కాలు + లు, 'బహువచనము పరంబగునపు డసంయుక్తంబులయి యుదంతంబు లయిన డ-ల-ర-ల కలఘులకారంబు బహుళంబుగా నగు.' బాల-ఆచ్ఛిక. 13. కాళులు, కాళ్లు, కాలులు రూపాంతరములు.

క. సిందూర పిండములొ, మరు
కందుకములొ, సత్ప్రవాళకఫలంబులొ నా
నందములై రాగ లతా
కందము లన మడమ లచలకన్యక కొప్పున్. 46

అర్థము : సిందూర-పిండములొ = చెందిరపుముద్దలో, మరు = మన్మథునియొక్క, కందుకములొ = బంతులో. సత్ + ప్రవాళక - ఫలంబులొ = మేలయిన పవడపుఁబండ్లో, నాన్ = అనఁగా, అందములు + ఐ = సుందరము లయి, రాగ-లతా-కందములు = ఎఱ్ఱని తీఁగయొక్క దుంపలు, అనన్ = అనఁగా, అచల - కన్యకకున్ = కొండ కూఁతునకు -పార్వతికి, మడమలు = చీలమండక్రింది భాగములు - పార్ష్ణులు, ఒప్పున్,

తాత్పర్యము : చెందిరపుముద్దలో, మన్మథుని బంతులో, మేలయిన పగడపుఁబండ్లో యన సుందరములయి ఎఱ్ఱని తీఁగ దుంప లనఁ బార్వతి మడమ లొప్పును.

విశేషములు ; అలంకార ముత్ప్రేక్ష, సందేహము.

క. అతనుం డోఁపని శివు వశ
గతుఁ జేయ భవాని మదను కవ దొన లోకో
న్నతి నాఁచికొనియెనో యను
గతిఁ జిఱుదొడ లమరు ప్రీహిగర్భాభములై. 47

అర్థము : అతనుండు = అనంగుఁడు - మన్మథుఁడు, ఓఁపని = చాలని- మన్మథుఁడు సాధింపలేని యనుట, శివున్ = శివుని, వశ - గతున్ = లోఁబడిన వానినిగా, చేయన్ = చేయుటకు, భవాని = పార్వతి, మదను = మన్మథునియొక్క- కవ-దొనన్ = అంపపొదుల జంటను, లోక + ఉన్నతిన్ = లోకమునందలి గొప్ప తనముతో, ఆఁచికొనియెనో = అపహరించెనో, అను-గతిన్ = అను విధమున, చిఱు + తొడలు = పిక్క-లు-జంఘలు, వ్రీహి - గర్భ + ఆభములు + ఐ =వరి పొట్టలవంటి వయి, అమరున్ = ఒప్పును.

తాత్పర్యము : మన్మథుఁడు సాధింపలేని శివునిఁ దాను వశపఱుచుకొనఁ బార్వతి లోకోన్నతితో నతని యంపపొదుల జంట నపహరించెనా యనునట్లు వరిపొట్ట లను బోలిన పిక్క-లు పార్వతి కొప్పును.

విశేషములు : మన్మథుఁడు తన యంపపొదుల జంటచే సాధింపలేని శివునిఁ దాను సాధింపఁ బార్వతి దానినే తన పిక్క-ల రూపమునఁ గైకొనె ననుట. అదే తూణములజంట యనెడి తన జంఘలచే శివుని సాధింప నెంచె ననుటచే మన్మథుని కంటెఁ బార్వతి సమర్థతర యని తెలియుచున్నది. అలంకార ముత్ప్రేక్ష. వ్రీహి గర్భాభములు - అలంకార ముపమ.

దొన-(వికృతి) - తూణము (ప్రకృతి) . భవాని - భవుని భార్య - పార్వతి. 'తస్య స్త్రీ' వాని యాఁడుది యను నర్థమున అకారాంత పుంలింగ 'భవ' శబ్దమునకు భవానీ' రూప మగును, ఇట్లే ఇంద్రాణీ, వరుణానీ, శర్వాణీ.

క. స్మర మందిరమ్ము శోభా
కరముగ మెఱుఁగారు పసిఁడి కంబము లనఁగొఁ
గర మొప్పు నగ తనూజకుఁ
గరభోరులు వొలుచు మదన కరి కర లీలన్, 48

అర్థము : స్మర-మందిరమ్ము = మన్మథుని ఆలయము, శోభా-కరముగన్ = శోభిల్లునట్లుగా, మెఱుఁగారు = ప్రకాశించునట్టి, పసిఁడి-కంబములు = బంగరు స్తంభ ములు, అనఁగాన్, అగ-తనూజకున్ = కొండకూఁతునకు - పార్వతికి, కరభ +

ఊరులు = కరభములవంటి తొడలు-మనికట్టు మొదలు చిటికెనవ్రేలి మొదటిదాఁకఁ గల చేతి వెలుపలి భాగమునకుఁ గరభ మనిపేరు. స్త్రీ తొడను కరభముతోఁ బోల్చుట కవిసమయము, పొలుచు = ఒప్పునట్టి, మదన - కరి-కర-లీలన్ = మన్మథుని యేనుఁగుయొక్క తొండము విధమున, కరము + ఒప్పున్ = మిక్కిలి యొప్పును. 'కర మొప్పు' అనుదానిని అగతనూజకు విశేషణము చేసి, 'పొలుచు' అను దానిని సమాపకక్రియగాఁ జేసియు నన్వయింపవచ్చును,కరమొప్పు - అగతనూజకున్ = మిక్కిలి యొప్పునట్టి పార్వతికి, కరభోరులు, మదనకరికరలీలన్. పొలుచున్ అని యైనను అన్వయింపనగును.

తాత్పర్యము : మన్మథుని భవనము శోభిల్లుటకుఁ బెట్టఁబడిన ప్రకాశించు బంగరు కంబములా యనఁ బార్వతికి మన్మథుని యేనుఁగుతొండములవంటి కరభము లను పోలు తొడలు మిక్కిలి యొప్పును.

విశేషములు : పార్వతి తొడలు పసిఁడికంబములవలెను, కరభముల వలెను ఏనుఁగు తొండములవలెను నున్నవని భావము. మదన కరి కర లీలన్ - అలంకార మువమ, పసిఁడికంబము లనఁగాఁ గర మొప్పున్ - అలంకార ముత్ప్రేక్ష.

కరభ - మణిబన్ధా దాకనిష్ఠం కరస్య కరభో బహిః-అమరము, కరే భాతి కరభః - కరమందుఁ బ్రకాశించునది. కరము-(నానా) తొండము, చేయి, చేయునది; (తెలుఁగు)-మిక్కిలి, స్మరుఁడు (ప్రకృతి)-మరుఁడు (వికృతి).

క. గురు కుచ వహన భరంబునఁ
బొరిఁబొరిఁ బేద కవు నడిగిపోఁబోయినఁ ద
ద్భర వహనమునకు భరవడు
కరణిని జఘనంబు సతికి ఘనమై యమరున్. 49

అర్థము : గురు-కుచ - వహన - భరంబునన్ = పెద్దవి యగు స్తనముల యొక్క మోయుటయొక్క అతిశయముచేత, పొరిఁబొరిన్ = క్రమక్రమముగా, పేద - కవును = సన్నని నడుము, అడిగిపోన్ + పోయినన్ = అడిగిపోవనుండఁగా, తత్ + భర - వహనమునకున్ = ఆ స్తనములయొక్క బరువుయొక్క మోఁతకు,

భరపడు - కరణిన్ = పూఁటపడు విధమున, జఘనంబు = మొల, సతికిన్ = పార్వతికి, ఘనము + ఐ = గొప్పది యై - పెద్దదియై, అమరున్ = ఒప్పును.

తాత్పర్యము : పెద్దవియైన స్తనముల మోఁత ఆధిక్యముచే సన్నని నడుము క్రమక్రమముగా నఱిగిపోఁబోఁగా వానిబరువును మోయుటకుఁ దాను పూఁటపడినట్లు పార్వతి మొల పెద్దదియై యొప్పును.

విశేషములు : స్త్రీ కుచములు పెద్దవిగాను, నడుము సన్ననిదిగాను, జఘనము పెద్దదిగాను వర్ణింపఁబడును. అలంకార ముత్ప్రేక్ష.

జఘనము - స్త్రీ శ్రోణి పురోభాగము - జఘనం పురః - అమరము. హన్యతే పురుషేణ తాడ్యత ఇతి జఘనమ్. పురుషునిచేఁ బీడింపఁబడునది - స్త్రీ మొల ముందరిచోటు. శ్రోణి పశ్చాద్భాగమునకును జఘన మనిపేరు, కవును - (సూపాం.) కౌను. భరపడు - భరము + పడు-'పడ్వాదులు పరంబు లగునపుడు మువర్ణకంబునకు లోప పూర్ణబిందులు విభాష నగు,' బాల. సంధి. 46.

భరపడు = పూఁచిపడు, ఒకరు చేయవలసిన పని తాను జేసెదనని పూను. పేదది, క్రమక్రమముగా నఱిగిపోవుచున్నది యగు కౌను పనిని నేను జేయుదు నని జఘనము పూఁటపడె ననుట.

క. కనుఁగొన నీశ్వరు దృగ్రుచు
లను విపుల వహిత్రముల నపాంగజలాబ్ధిం
జనఁ దిగిచి ముంచు సుడి యిది
యనఁదగి యావర్తనాభి యద్రిజ కొప్పున్. 50

అర్థము: కనుఁగొనన్ = చూడఁగా, ఈశ్వరు = శివునియొక్క, దృశ్(క్)+రుచులు = చూపుల కాంతులు, అను = అనెడి, విపుల - వహిత్రములన్ = పెద్ద ఓడలను, అపాంగ - జల + అబ్ధిన్ = క్రీఁగన్ను లనెడి జలార్ణవమునందు చనన్ = పోవుచుండఁగా, తిగిచి = లాగి, ముంచు = మునుఁగఁజేయునట్టి, సుడి, ఇది

అనన్, తగి = ఒప్పి, ఆవర్త - నాభి = నీటిసుడివంటి నాభి, అద్రిజకున్ = కొండ కూఁతునకు-పార్వతికి, ఒప్పున్.

తాత్పర్యము : పరమేశ్వరుఁడు చూడఁగా నతని చూపులకాంతు లనెడి పేరోడలు దన్నుఁగన్ను లనెడి జలార్ణవములోఁ దేలియాడును. వానిని దిగలాగి ముంచినట్టి సుడియె యది యనఁదగి పార్వతి నీటిసుడివంటినాభి యొప్పును.

విశేషములు : పార్వతీపరమేశ్వరులు పరస్పరము వీక్షించుకొనుచుండఁగా అతని నేత్రకాంతులు ఆమె క్రీఁగంటిచూపులయందుఁ దేలియాడుచుఁ దటాలున నామె బొడ్డుమీఁదికిఁ బ్రసరించుటను సముద్రమునందుఁ బయనించెడి పెద్దయోడలను దనలోని కాకర్షించి ముంచెడి సుడిగుండముతోఁ బోల్చుచున్నాఁడు కవి.

దృగ్రుచు లను విపులవహిత్రములన్ - రూపకాలంకారము, అపాంగజలాబ్ధిన్ అనునదియు రూపకమే. మొల్త మిఁద నుత్ప్రేక్ష. అది రూపకానుప్రాణితము.

దృశ్ + రుచులు - దృక్ + రుచులు, ఝల్లు నకు హాశ్వ పరమగుచుండఁగాఁ దృతీయవర్ణాదేశము,దృగ్రుచులు, ఆవర్త నాభి - ఆవర్తమువంటి నాభి. నాభ్యావర్త మని యుపమానోత్తరముగా నుండవలయును. 'ఉపమానోత్తరపదంబులు గలవు కాని విపరీతంబులు సిద్ధంబులు లేవని యెఱుంగునది,' బాల. సమాస. 3.

క. మారు మఖ వేది మధ్యమొ,
యా రతి యద్దంబుపిడియొ యన నెంతయుఁ బొ
ల్పారుఁ గడు నలికమై సుకు
మారికి మధ్యంబు సింహమధ్యము వోలెన్. 51

అర్థము : మారు = మన్మథునియొక్క, మఖ - వేది - మధ్యమొ = యజ్ఞవేదికయొక్క నడిమి భాగమో, ఆ - రతి = ఆ రతిదేవియొక్క, అద్దంబు = అద్దముయొక్క, పిడియొ,అనన్, కడున్ = మిక్కిలి, నలికము+ఐ=సన్నని దయి, సుకుమారికిన్ = సుందరికి-పార్వతికి, మధ్యంబు=నడుము, సింహ - మధ్యము + వోలెన్ = సింహముయొక్క నడుమువలె, ఎంతయున్ = మిక్కిలి, పొల్పారున్ (పొల్పు + ఆరున్) = ఒప్పును.

తాత్పర్యము : సుందరాంగియైన పార్వతికి నడుము సింహము నడుమువలె మన్మథుని యజ్ఞవేది నడిమిభాగమో, ఆ రతి అద్దము పిడియో అన సూక్ష్మమయి మిక్కిలి యొప్పును.

విశేషములు : సింహ మధ్యము వోలెన్ - ఉపమ. మారుమఖవేది మధ్యమొ, ఆ రతి యద్దంబు పిడియొ - ఉత్ప్రేక్ష, సందేహము.

క. ఉదరము పలుచఁదనంబున
హృదయాంభోజాతనాళ మేర్పడి కొ
ప్పొదవి వెలిఁ దోఁచెనో యన
సుదతికి నూఁగారుఁదీఁగె సుందర మయ్యెన్. 52

అర్థము : ఉదరము = నడుముయొక్క, పలుచఁదనంబునన్ = సూక్ష్మత్వముచేత, హృదయ + అంభోజాత- నాళము = హృదయమనెడి పద్మముయొక్క- కాడ, ఏర్పడి = బయల్పడి, తనకున్, ఒప్పు + ఒదవి = అందము గలిగి, వెలిన్ + తోఁచెన్ = బయటికిఁ గనఁబడెనో, అనన్ = అనునట్లు, సుదతికిన్ = స్త్రీకి- పార్వతికి, నూఁగారుఁదీఁగె = తీఁగవంటి రోమావళి, సుందరము + అయ్యెన్= అందముగా నుండెను.

తాత్పర్యము: నడుము సూక్ష్మముగా నుండుటచేత నందుఁబుట్టిన హృదయమనెడి పద్మముకాడ బయల్పడి పైకిఁ గనఁబడుచున్నదా యనునట్లు పార్వతికి తీఁగవంటి రోమావళి సుందరముగా నుండెను.

విశేషములు : అలంకార ముత్ప్రేక్ష.

పలుచఁదనము- 'పలుచ + తనము - ఉదంత స్త్రీసమంబులకును బుంపులకు నదంతగుణ వాచకంబులకును దనంబు పరంబగునపుడు నుగాగమంబగు.' బాల. సంధి. 35. పలుచ + ను + తనము, 'ద్రుత ప్రకృతికముమీఁది పరుషములకు సరళము లగు.' బాల. సంధి. 16. పలుచ + ను + దనము. 'ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందుసంశ్లేషములు విభాష నగు.' బాల, సంధి. 17. పలుచఁదనము.

నూఁగారుఁదీఁగె - నూఁగారు + తీఁగె- 'సమాసంబుల నుదంతంబులగు స్త్రీ సమంబుల కుం బుంప్రులకుం బరుషసరళంబులు పరంబులగు నపుడు నుగాగమం బగు' బాల. సంధి. 25. నూఁగారు + ను + తీఁగె. ద్రుతకార్యము - బాల. సంధి. 16. 17. నూఁగారుఁదీఁగె, నూఁగారుఁదీఁగె-తీఁగెవంటి నూఁగారు - ఉపమానోత్తరపద కర్మ ధారయము.

క. పొరి దలముం గొను జవ్వన
సిరి కుచముల కెక్క నడవఁ జేసిన కార్త
స్వర సోపానము లన ము
త్తరఁగలు దగు నంగజాబ్ధి తరఁగలు వోలెన్. 53

అర్థము: పొరిన్ = [illegible]ముగా, దలమున్ + కొను = అధికమగు, జవ్వన - సిరి = యౌవనమనెడి లక్ష్మి, కుచములకున్ = స్తనముల పైకి, ఎక్కన్ = ఎక్కుటకు. నడవన్ + చేసిన = నడచునట్లు చేసిన, కార్తస్వర సోపానములు = బంగరు మెట్లు, అనన్ = అనఁగా, ముత్తరఁగలు (మూఁడు + తరఁగలు) = మువ్వళులు-వళిత్రయము, అంగజ + అబ్ధి-తరఁగలు + పోలెన్ = మన్మథుఁ డనెడి సముద్రపు టలలవలె, తగున్ = ఒప్పును.

తాత్పర్యము ; నానాఁటికి అధిక మగుచున్న యౌవనలక్ష్మి స్తనముల మీఁదికి ఎక్కుటకు నడచుట కేర్పఱిచిన బంగారు మెట్లన వళిత్రయము పార్వతికి మన్మథ సముద్ర తరంగములవలె నొప్పెను.

విశేషములు: అంగజాబ్ధి-అంగజుఁడనెడి అబ్ధి-రూపకము. అంగజాబ్ధి తరఁగలు వోలెన్-ఉపమాలంకారము, జవ్వనసిరి-జవ్వన మనెడి సిరి-రూపకము. జవ్వనము + సిరి = జవ్వనపు సిరి అని యుండనగును. జవ్వనసిరి....సోపానము లన-ఉత్ప్రేక్ష. అది రూపకానుప్రాణితము.

ముత్తరఁగలు-మూఁడు + తరఁగలు- 'సమానాధికరణం బగు నుత్తరపదంబు పరంబగునపుడు మూఁడు శబ్దము డు వర్ణంబునకు లోపంబును మీఁది హల్లునకు ద్విత్వంబు నగు' మూ + త్తరఁగలు. బాల. సమాస, 17. 'ద్విరుక్తంబగు హల్లు పరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు.' ముత్తరఁగలు, బాల.

సమాస. 13. 'ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుగా నగు మిశ్రంబునకుఁ గాదు.' బాల. సమాస. 18. చే ముత్తరఁగ కావలసియుండఁగా నిట ముత్తరఁగలు అని బహువచనాంతముగాఁ బ్రయోగింపఁబడినది. తరఁగ (వికృతి)-తరంగము (ప్రకృతి)

క. ఆంధ్రీ స్తనాపహాసులు
సంధృత మధుపాబ్జ ముకుళ సదృశము లతి నీ
రంధ్రములు కుచము లఖిల పు
రంధ్రీ జన తిలక మచలరాజాత్మజకున్. 54

అర్థము ; అఖిల-పురంధ్రీ-జన-తిలకము = ఎల్ల స్త్రీల సమూహము నందు శ్రేష్ఠురాలు, అగు, అచల-రాజ+ఆత్మజకున్ = కొండలఱేని కూఁతునకు-పార్వతికి, కుచములు = స్తనములు, ఆంధ్రీ-స్తన+అపహాసులు = ఆంధ్రస్త్రీల స్తనములను బరిహసించునవి, సంధృత-మధుప+అబ్జ-ముకుళ-సదృశములు = బాగుగా ధరింపఁబడిన తుమ్మెదలు గల తామరమొగ్గలతో సమానములు, అతి-నీరంధ్రములు = మిక్కిలి యెడము లేనివి,

తాత్పర్యము : ఎల్ల యింతులలో శ్రేష్ఠురాలగు పార్వతి స్తనములు ఆంధ్రస్త్రీల స్తనములను బరిహసించునవి. కొనలఁ దుమ్మెదలను ధరించిన తామరమొగ్గలను, బోలినవి, నడుమఁ గొంచెముకూడ నెడము లేనివి. కుచము లబ్జముకుళములు. వాని నల్లని చూచుకము లా తామరమొగ్గలపై వ్రాలు నల్లని తుమ్మెదలు.

విశేషములు : సంధృత....సదృశములు-అలంకార ముపమ.

నిర్+రంధ్ర-రేఫమునకు రేఫము పరమగునపుడు లోపము గలుగును.అప్పుడు పూర్వమందుండు అ, ఇ, ఉ అను హ్రస్వములు దీర్ఘము లగును - నీరంధ్ర- అఖిల పురంధ్రీజనతిలక మచలరాజాత్మజకున్-'ఒకానొకచో విశేషణంబుల షష్ఠికిం బ్రథమ విభాష నగు.' బాల. కారక. 27.

ఇందుఁ బూర్ణబిందుపూర్వక దకారరేఫ సంయుక్తమునకుఁ బూర్ణబిందు పూర్వక 'ధృ'తోఁ బ్రాసము కూర్పఁబడినది. సంయుతాసంయుతప్రాసము.

తే. రలబు లమర్కింద జడ్డకై క్రాలు ప్రాలు
ప్రాసవర్ణంబులై ఫానిఁ బాసియైనఁ
గూడి యైనను దెలి యడుగులను నిలుచు-
సంధయుతాసంయుత ప్రాస సంజ్ఞఁ దనరి. (అప్పకవీయము.)

క. కేళీవర్త్మము లన, రతి
కేళీ సదనంబు లనఁగఁ, గింశుక కళికా
మూలము లనఁ, గామ లతా
మూలము లన గౌరి బాహుమూలము లమరున్. 55

అర్థము :- గౌరి-బాహుమూలములు=పార్వతి చంకలు, కేళీ-వర్త్మములు+అనన్=మన్మథ క్రీడలకు మార్గము లనఁగను. రతి-కేళీ-సదనంబులు+అనఁగన్=రతిదేవి క్రీడాగృహములు అనఁగను, కింశుక - కళికా-మూలములు + అనన్ = మోదుగు మొగ్గలకు మాతృకలు అనఁగను, కామ-లతా-మూలములు + అనన్=కామ మనెడి తీఁగయొక్క వేరులు అనఁగను, అమరున్=ఒప్పును.

తాత్పర్యము :- పార్వతి చంకలు మన్మథక్రీడా మార్గము లనఁగను. రతిదేవి క్రీడాగృహము లనఁగను, మోదుగు మొగ్గలకు మాతృక లనఁగను, కామ లతకు వేరులు అనఁగను అమరును.

విశేషములు :- అలంకార ముపమ. కామ లతా మూలములు=కామమనెడి లతయొక్క మూలములు-రూపకాలంకారము.

వర్త్మము-అయనం వర్త్మ మార్గాధ్వ పన్థానః పదవీ సృతిః. వర్తన్తే అనేనేతి వర్త్మ.దీనిచేత నడచెదరు-మార్గము. అమరము. (నానా.)కను తెప్ప.

క. శివు నంగయష్టి నిఱియఁగ
నవిరళముగఁబట్టి ప్రాఁక నని కడునెమ్మిన్
నివుడు నవ కల్పలతికల
పవిదిని మృదు బాహాలతలు పార్వతి కొప్పున్. 56

అర్థము :- పార్వతికిన్, మృదు-బాహా-లతలు = తీఁగలవంటి కోమలము లయిన చేతులు, శివు+అంగ-యష్టిన్=శివుని యొక్క కఱ్ఱవంటి శరీరమును, ఇఱియఁగన్=అంటియుండునట్లు, అవిరళముగన్=అధికముగా, పట్టి=పట్టుకొని, ప్రాఁకన్+అని=ప్రాఁకుటకని, కడున్+నెమ్మిన్=మిక్కిలి మైత్రితో, నివుడు=నిగుడునట్టి, చాఁగునట్టి, నవ-కల్ప-లతికల-పవిదిని=నూతన కల్పలతల విధమున, ఒప్పున్.

తాత్పర్యము:- శివుని దేహయష్టి నంటియుండునట్లు గట్టిగాఁ బట్టుకొని ప్రాఁకుటకొఱకు మిక్కిలి మైత్రితోఁ జాఁగునట్టి కల్పవృక్షపుఁ గ్రొందిఁగల విధమునఁ బార్వతికిఁ గోమలములైన లతలవంటి బాహువు లొప్పును.

విశేషములు:- శివుని యంగము యష్టి (కఱ్ఱ) వంటిది. పార్వతి బాహువులు కల్పలతల వంటివి. లత కఱ్ఱనంటి ప్రాఁకునట్లు పార్వతి బాహువులు శివుని యంగమునంటియుండు ననుట. అలంకారము ఉత్ప్రేక్షానుప్రాణితోపమ.

నివుడు-నిగుడు, పవిది-పగిది రూపాంతరములు 'అపదాద్యం బయి యసంయుక్తం బయిన గకారంబునకు వకారంబు విభాష నగు,' బాల, అచ్చిక, 27. శివు+అంగ-యష్టి సమాసమునం దుకార ఋకారముల కచ్చు పరమగునపుడు నుగాగమం బగు.' 'బాల. సంధి. 34.

క. రుచిరాశోక దల ద్యుతి
నచలజ కరతలము లొప్పు నతిశయ రాగో
పచిత రతిరాజ పల్లవ
రచితోభయ మేఘడంబరంబుల వోలెన్. 57

అర్థము : అచలజ-కర - తలములు = పర్వతపుత్త్రియొక్క అరచేతులు, రుచిర + అశోక-దళ-ద్యుతిన్ = మనోహరము లయిన అశోకపు పూరేకులయొక్క కాంతిలో, అతిశయ.... డంబరంబులపోలెన్; అతిశయ = అధికమైన, రాగ = ఎఱ్ఱఁదనముతో, ఉపచిత = కూడిన, రతిరాజ = మన్మథునియొక్క, పల్లవ=చిగురు టాకులచేత, రచిత = కూర్పఁబడిన, ఉభయ=రెండు, మేఘడంబరంబుల+పోలెన్= గొడుగులవలె, ఒప్పున్.

తాత్పర్యము : అశోకపుష్పదళములవలె నెఱ్ఱనికాంతులు గలిగి పార్వతి అరచేతులు ఎఱ్ఱని చిగురుటాకులతోఁ గూర్పఁబడిన మన్మథుని జంటగొడుగులవలె నుండెను.

విశేషములు : మేఘడంబరము = గొడుగు, మేఘమువలె వ్రేలాడుచుండునది. ఈయర్థమున నీ పదము కన్నడమునందు విశేషముగాఁ బ్రయుక్తమయినది. నన్నె చోడునిచె మఱియొక ప్రయోగము-'కరులపై మేఘడంబరములో సంధ్యానురాగ మేఘాడంబరమ్ములొక్కొ'-11-77.

క. మరుచేత నుండి హరు గె
ల్వరు; దుమ చే నుండి గెల్వ నౌ నని సుమనః
శరములు కరముల నెలసిన
కరణిఁ గరాంగుళము లచలకన్యక కొప్పున్. 58

అర్థము : మరు - చేతన్ + మన్మథునిచేతియందు, ఉండి, హరున్, = శివుని, గెల్వ = గెల్చుట. అరుదు = అశక్యము, ఉమ - చేన్ = పార్వతి చేతి యందు, ఉండి, గెల్వన్ + ఔన్ = గెల్వనగును, అని, సుమనస్ + శరములు = పుష్పబాణములు, కరములన్ = చేతులందు, ఎలసిన - కరణిన్ = చేరిన విధమున, కర + అంగుళములు = చేతివ్రేళ్లు, అచల - కన్యకకున్ = కొండ-కూఁతునకు. పార్వతికి, ఒప్పున్,

తాత్పర్యము ; 'మన్మథుని చేత నున్నచో శివుని జయించుట యసాధ్యము. పార్వతి చేతి నున్నయెడల శివుని గెలుచుట సులభమని పుష్పబాణము లామె చేతు లందుఁ జేరిన విధమునఁ జేతివ్రేళ్లొప్పును,

విశేషములు : అలంకార ముత్ప్రేక్ష.

సుమనస్ (నానా.) దేవత, పుష్పము, విద్వాంసుఁడు, మాలతి. గోధుమ. గెల్వు-గెల్చు కృదంతరూపము. తారకుం బోర గెల్వన్ అని ప్రథమాశ్వాసమున నితనిదే ప్రయోగాంతరము,

క. వరదము లగు కల్పలతాం
కురములొ, విషమాస్త్ర నిశిత కోరక విశిఖో
త్కరమొ యనఁ గరజములు సుం
దరి కగు నరుణోత్పలాగ్రదలముల పోలెన్. 59

అ ర్థ ము : వరదములు = వరముల నిచ్చునవి, అగు, కల్ప - లతా + అంకురములొ = కల్పలతయొక్క మొలకలో, విషమ + అస్త్ర - నిశిత - కోరక - విశిఖ + ఉత్కరమొ = మన్మథునియొక్క వాఁడియైన మొగ్గలనెడి బాణముల సమూహమో, అనన్, కరజములు = చేతిగోర్లు, అరుణ + ఉత్పల + అగ్ర -దల ముల-పోలెన్ = ఎఱ్ఱకలువ కొనఱేకుల వలె, సుందరికిన్ = అందగత్తెకు పార్వతికి, అగున్.

తా త్ప ర్య ము : అందగత్తె యగు పార్వతికి - వరముల నిచ్చు కల్పలత అంకురములో, మన్మథుని వాఁడిమొగ్గలబాణముల సమూహమో యనఁగాఁ జేతి గోరులు ఎఱ్ఱకలువ కొనఱేకులవలె నొప్పును,

వి శే ష ము లు : అరుణోత్పలాగ్రదలముల పోలెన్ - అలంకార ముపమ, కల్పలతాంకురములొ, విషమాస్త్ర .... విశిఖోత్కరమొ - అలంకారము సందేహము.

క. వినుతరుచిఁ బొల్చు నానన
మను నాదర్శంబు పిడియొ యతి మృదులీలం
జను పోఁకబోదెయో యన
ఘనరుచి నగసుతకుఁ గంబుకంధర మమరున్. 60

అ ర్థ ము : వినుత - రుచిన్ = పొగడఁబడిన కాంతితో, పొల్చు = ఒప్పునట్టి, ఆననము + అను + ఆదర్శంబు = ముఖమనెడి అద్దముయొక్క, పిడియొ, - అతి-మృదు-లీలన్ = మిక్కిలి మృదువైన రీతితో, చను = ఒప్పునట్టి, పోఁక-బోదెయో =

పోఁక్రమాని బోదెయో, అనన్, నగ - సుతకున్ = కొండ కూఁతునకు - పార్వతికి, ఘన - రుచి = గొప్ప కాంతి గలది, అగు, కంబు - కంధరము = శంఖమువంటి కంఠము, అమరున్ = ఒప్పును.

తాత్పర్యము: మంచి కాంతితో నొప్పు ముఖమనెడి అద్దముపిడియో, మిక్కిలి మృదువైనపోఁక్రమాని బోదెయో యనునట్లు పార్వతికి గొప్పకాంతి గల శంఖమువంటి కంఠ మొప్పును.

విశేషములు: అలంకారము సందేహము. ఉత్ప్రేక్ష.

కంబుకంధరము - ఇందు కంబు వుపమానము. కంధర ముపమేయము. ముఖపద్మ మనురీతి ఉపమానపూర్వపదకర్మధారయములే కాని, విపరీతములు సిద్ధము లుండవు. పూర్వముగూడ (50వ పద్యములో) ఆవర్తనాభి యని యిట్టిదే యీ కవి ప్రయోగించెను.)

క. అమృతోద్భవు లగు మీలో
నమరదు పగ యని సుధాకరాబ్జములకుఁ గూ
టము దన ముఖమునఁ జేసెనొ
యుమ యన వదనాంశు గండ యుగ గతి వొల్పున్. 61

అర్థము: అమృత + ఉద్భవులు = పాలనుండి, నీటినుండి పుట్టుక గల వారు, అగు, మీలోన్, పగ = విరోధము, అమరదు = తగదు, అని, ఉమ = పార్వతి, సుధాకర + అబ్జములకున్ = చంద్రునకును, తామరకును (చంద్రుఁడు క్షీరసముద్రమునుండి పుట్టెను. అబ్జము - నీటినుండి పుట్టెను. అప్ = నీటినుండి, జ = పుట్టినది - తామర.) కూటము = పొందు, తన, ముఖమునన్ = ద్వారమున, మోముచేత, చేసెనొ, అనన్ = అనునట్లు, వదన + అంశు - గండ - యుగ-గతి = ముఖకాంతి, చెక్కిళుల జంటయొక్క తీరు, పొల్చున్ = ఒప్పును.

తాత్పర్యము ; చంద్రునకు పద్మమునకు విరోధము, ఇరువురును అమృతోద్భవులే, చంద్రుఁడు అమృతము = క్షీరమునుండి పుట్టినవాఁడు, పద్మముగూడ

అమృతము = నీటినుండి పుట్టినదే, ఇట్లు ఏకోద్భవులగు మీ కిరువురికిని విరోధము తగ దని పార్వతి వానికిఁ దన ముఖమున (ద్వారమున, మోమున) సఖ్యము చేసెనో యనునట్లు ఆమె ముఖకాంతియు, చెక్కిళ్లజంటయు నొప్పును.

విశేషములు : అలంకార ముత్ప్రేక్ష. అది శ్లేషానుప్రాణితము. అమృతము = క్షీరము, నీరము, ముఖము=ద్వారము, మోము అని శ్లేషము. ఆమె ముఖము చంద్రునివలెను, గండయుగము శోభనవలెను నున్నవని భావము.

క. మానితమగు గుడరసమున
నూనిన తుండీర ఫలమొ, యొగిఁ దేనెతెలెన్
నాని మృదువైన పవడమొ
నా నద్రిజ తోఁపు మోవి నయమై యొప్పున్. 62

అర్థము : మానితము + అగు = మన్నింపఁబడినది యగు, గుడ - రస మునన్ = బెల్లపుఁబాకమునందు, ఊనిన = తాల్చిన, తుండీర - ఫలమొ = దొండ పండో, ఒగిన్ = బాగుగా, తెనె తెలెన్ = తేనె నింపిన పాత్రమునందు, నాని, మృదువు + ఐన = మెత్తనయిన, పవడమొ = పగడమో, నాన్ = అనునట్లు, అద్రిజ = కొండకూఁతురైనపార్వతియొక్క, తోఁపు - మోవి = ఎఱ్ఱని పెదవి, నయము + ఐ = బాగయి, ఒప్పున్.

తాత్పర్యము : మంచి బెల్లపుఁబాకమున నుంచిన దొండపండో, తేనెయందు బాగుగా నాని మెత్తనైన పగడమో యనునట్లు పార్వతి యెఱ్ఱని పెదవి సుందరమయి యొప్పును.

విశేషములు : అలంకారము సందేహము, ఉత్ప్రేక్ష.

తేనెతలన్ = తేనెయందు, 'తల' సప్తమ్యర్థక మిచ్చునని సూ.ని. తేనె తెలెన్ అని పాఠాంతరము. తెలె యన భోజనపాత్రము. సూ.ని. 'తేనెతల', అను పాఠమునే గ్రహించెను. తొప్పమోవి-ఇది సూ.నిగృహీత పాఠము. తోఁపు మోవి యని పా.

సా. ప్రతులందుఁ గలదు, పవడము , పగడము (రూపాం.) (వికృతి) - ప్రవాళము (ప్రకృతి)

క. కులిశ ద్యుతి కెన, ముక్తా
ఫల తరల విభాతితోడఁ బ్రతి యనఁ, దుహినా
చల తనయకు గౌరికిఁ దల-
తల వెలుఁగుచు శిఖర రుచిర దశనము లొప్పున్. 63

అర్థము : కులిశ - ద్యుతికిన్ = వజ్రము కాంతికి, ఎన = సాటి, ముక్తా ఫల - తరల - విభాతితోడన్ = ముత్యముయొక్క, చంచలమైన, కాంతితో, ప్రతి = సాటి, అనన్, తుహిన + అచల - తనయకున్ = మంచుకొండ కూఁతురు, అగు, గౌరికిన్ = పార్వతికి, తలతల - వెలుఁగుచున్ = తళతళ ప్రకాశించుచు, శిఖర - రుచిర - దశనములు = మల్లెమొగ్గవలె మనోహరమైన దంతములు, ఒప్పున్.

తాత్పర్యము : వజ్రము కాంతికిని, ముత్యముల చంచలమగు కాంతికిని సాటియనఁ బార్వతికిఁ దళతళ ప్రకాశించుచు మల్లెమొగ్గలవలె మనోహరమైన దంతము లొప్పును.

విశేషములు : అలంకార ముపమ. శిఖర = అరేబియాదేశపు మల్లెమొగ్గ యని సూ.ని. శిశిరరుచిర - యని పాఠాంతరము. శిశిర=మంచువలె (తెల్లఁగా) మనోహరములయిన అని అర్థము చెప్పనగును కాని శిఖరరుచిర, మేలు.

క. వదనాంబుజ మను వాణీ
సదనము మణి భిత్తి యుగళ సంకాశములై
మదన కర ముకుర యుగ రుచి
ముదితకు మృదుతర కపోలములు చెలువొందున్. 64

అర్థము : వదన+ అంబుజము = ముఖపద్మము, అను, వాణీ - సదనము= సరస్వతీవిలయముయొక్క, మణి - భిత్తి - యుగళ - సంకాశములు + ఐ = మణులచే నిర్మింపఁబడిన గోడల జంటతో సమానము, ఘు మదన - కర - ముకుర

యుగ - రుచిన్ = మన్మథునియొక్క చేతి యద్దముల జంటయొక్క కాంతితో, ముది తకున్ = స్త్రీకి - పార్వతికి, మృదు - తర - కపోలములు = మిక్కిలి కోమలము లయిన చెక్కిళ్లు, చెలువు + ఒందున్ = అందగించును.

తాత్పర్యము : ముఖపద్మ మనెడి వాగ్దేవీనిలయము మణిమయములైన గోడలజంటతో సమానము లయి, మన్మథుని చేతి యద్దములజంట కాంతితోఁ బార్వతి మృదుతర కపోలము లందగించును.

విశేషములు : వదనాంబుజ మను వాణీసదనము - రూపకము, వాణీ సదన .... సంకాశములై - అలంకార ముపమ.

క. మనసిజ వారిధిఁ గట్టిన
కనకాచలసేతు వనఁగఁ గమలానన కాం
చన కర్ణిక నా నయనా
నన మధ్యమునందు గౌరి నాసిక యొప్పున్. 65

అర్థము : మనసిజ - వారిధిన్ = మన్మథుఁడనెడి సముద్రమునందు, కట్టిన = కట్టినట్టి, కనక + అచల - సేతువు = మేరుపర్వతమనెడి వంతెన, అనఁ గన్, కమల + ఆనన, - కాంచన - కర్ణిక - నాన్ = పద్మమువంటి ముఖముయొక్క బంగారుదుద్దు అనునట్లును, నయన + ఆనన - మధ్యమునందున్ = కన్నులకును ముఖమునకును నడుమ, గౌరి = పార్వతియొక్క, నాసిక = ముక్కు, ఒప్పున్.

తాత్పర్యము ; పార్వతి ముక్కు మన్మథుఁ డనెడి సముద్రమునందుఁ గట్టిన మేరుపర్వత మనెడి సేతు వనఁగను, ముఖమనెడి పద్మము బంగరు దుద్దు అనఁ గను కన్నులకును, ముఖమునకును నడుమ నొప్పును.

విశేషములు : మనసిజవారిధిన్ = మనసిజుఁ డనెడి వారిధిని - రూపకా లంకారము, కనకాచల - సేతువు = కనకాచలమనెడి సేతువు - రూపకాలంకారము, మనసిజవారిధిఁ గట్టిన .... సేతువనఁగన్, కమలానన కాంచన కర్ణిక నా .... అలంకార ముత్ప్రేక్ష. అది రూపకానుప్రాణితము.

క. తెలి మొగమునందు లోలా
క్షుల పొలపం బమరు నా చకోరము లతులా
మల శశిబింబములోఁ బడి
వెలలక చెలరారుచుండు విధమున సతికిన్. 66

అర్థము : సతికిన్ = స్త్రీకి - పార్వతికి, తెలి - మొగమునందున్ = నిర్మలమైన ముఖమునందు, లోల + అక్షుల = చంచలములయిన కన్నులయొక్క, పొలపంబు = ప్రకాశము, ఆ - చకోరములు = ఆ వెన్నెలపులుఁగులు, అతుల + అమల - శశి - బింబములోన్ = సాటిలేని నిర్మలమగు చంద్రుని బింబమునందు, పడి, వెలలక = వెడలక, చెలరారుచున్ = ఒప్పుచు, ఉండు విధమునన్ = ఉండు రీతిని, అమరున్ = ఒప్పును.

తాత్పర్యము : పార్వతి నిర్మలమైన ముఖమునందలి చంచలములయిన కన్నుల ప్రకాశము వెన్నెలపులుఁగుల జంట మిక్కిలి నిర్మలమైన చంద్రబింబములోఁ బడి వెడలక ఒప్పుచుండు విధమున నొప్పును.

విశేషములు : అలంకార ముత్ప్రేక్ష. పార్వతి ముఖము శశిబింబము వలెను, లోలాక్షులు చకోరములవలెను నున్న వని భావము. చకోరములకు వెన్నెల యనినఁ బరమప్రీతి. వానికి వెన్నెలపులుఁగు లని పేరు. అవి చంద్రబింబములోఁ బడి వెడలకుండుటకు వానికి వెన్నెలయందుఁ గల యాప్రీతియే హేతువు. వెలలు - వెడలు రూపాంతరము.

క. [1]హారము, లాశ్రిత భాషా
సారము, లాసకల వస్తు సంపూర్ణాలం
కారంబులు, శ్రీ వర్ణా
కారంబులు చెవులు సుకవి కావ్యము వోలెన్. 67

1. సా.ప్రతి. సారము

అర్థము : చెవులు = పార్వతిచెవులు, సుకవి - కావ్యము + పోలెన్ = సత్కవియొక్క కావ్యము వలె, హారములు = మనోహరములు (సారములు = సారవంతములు), - (ఇది ఉభయత్ర సమానము). ఆశ్రిత - భాషా - సారములు = ఆశ్రయించిన భాషయొక్క సారము గలవి, (ఇదియు నుభయత్ర సమానమే). ఆ - సకల - వస్తు - సంపూర్ణ + అలంకారంబులు = (కావ్య.) సమస్తమైనవస్తుకవిత్వ ముతో నిండిన శబ్దార్థాలంకారములు గలవి, (చెవులు) ఎల్లబంగారుతో సంపూర్ణము లైన అలంకారములు గలవి, శ్రీ - వర్ణ + అకారంబులు = (కావ్య.) శ్రీ యను వర్ణముయొక్క పిలుపుగలవి, (చెవులు) శ్రీ అను వర్ణమువంటి యాకారము గలవి.

తాత్పర్యము : పార్వతి చెవులు సుకవి కావ్యమువలె - మనోహరములు, ఆశ్రయించిన వాక్సారముగలవి, ఎల్ల వస్తుకవిత్వమునందు నిండిన శబ్దార్థాలంకారములు గలవి - ఎల్ల బంగరుతో నిండిన భూషణములు గలవి, శ్రీయనువర్ణము తోడి ఆరంభము గలవి - శ్రీయనువర్ణము నాకారము వంటి యాకారము గలవి.

విశేషములు : ఉపమాలంకారము. శ్లేషానుప్రాణితము.

క. ఆ ముఖలక్ష్మికిఁ బెట్టెడు
చామర లన, దృఙ్మరీచి జలనిధి లహరీ
స్తోమ మనఁ, బొలుచు నగజకుఁ
గాము ధనుఃఖండ భాతిఁ గటి వంక బొమల్. 68

అర్థము : అగజకున్ = పార్వతికి, కటి - వంక - బొమల్ = నల్లనివి, వంకర యైనవి అగు కనుబొమలు, ఆ - ముఖ - లక్ష్మికిన్ = ఆమె ముఖ మనెడి లక్ష్మికి, పెట్టెడు, చామరలు = వింజామరములు, అనన్ = అనునట్లును, దృక్ (క్) + మరీచి - జలనిధి - లహరీ - స్తోమము = చూపులయొక్క కాంతి కిరణము లనెడి సముద్రపు టలల సమూహము, అనన్ = అనునట్లును, కాము - ధనుస్ (ః) + ఖండ - భాతిన్ = మన్మథునియొక్క వింటి భాగముల విధమున. పొలుచున్ = ఒప్పును.

తాత్పర్యము : పార్వతికి నల్లనివి, వంకర యైనవి యగు కనుబొమలు, మన్మథుని వింటి భాగముల విధమున, నామె ముఖలక్ష్మికిఁ బెట్టిన వింజామరము లనునట్లును, చూపుల కాంతికిరణము లనెడి సముద్రపు టల లనునట్లును నొప్పును.

విశేషములు: ముఖలక్ష్మి-ముఖమనెడి లక్ష్మి - రూపకాలంకారము.-చామర లన, లహరీస్తోమ మనఁ బొలుచు-ఉత్ప్రేక్ష. కాము దనుఃఖండ భాతి - ఉపమ,

చామర - చామరా అను ఆకారాంత స్త్రీలింగశబ్ద తత్సమ రూపము. దృశ్+మరీచి - దృక్ + మరీచి - రహలుతప్ప మిగిలిన పదాంతగత హల్లులకు (యరులకు) అనునాసికవర్ణము పరమగుచో వానికి సంబంధించిన అనునాసికవర్ణము వైకల్పికముగా నాదేశ మగును. దృఙ్మరీచి, దృగ్మరీచి. - అనునాసిక సంధి. దృఙ్మరీచి జలనిధి- దృఙ్మరీచు లనెడి జలనిధి - రూపకము.

క. కొఱ నెల సుధారసంబునఁ
గఱ వోవఁగ నొరసి కడిగి కౌముదితోఁ గ్రొ
మ్మెఱుఁగుల విదల్చికొని పై
మెఱుఁగిడు నట్లొప్పు నగజ మృదునిటలరుచుల్. 69

అర్థము: అగజ = పార్వతియొక్క, మృదు - నిటల రుచుల్ = కోమలమైన నొసటి కాంతులు, కొఱ నెలన్ = చంద్రకళను, సుధా - రసంబునన్ = అమృత ద్రవముతో, కఱ = నలుపు, పోవఁగన్ = పోవునట్లు, ఒరసి = రాపి, కడిగి, కౌముదితోన్ = వెన్నెలతో, క్రొమ్మెఱుఁగులన్ (క్రొత్త + మెఱుఁగులన్) = నూతన కాంతులను, విదల్చికొని = చల్లుకొని, పైన్ = మీఁద, మెఱుఁగు + ఇడు + అట్లు = మెఱుఁగుపెట్టునట్లు, ఒప్పున్.

తాత్పర్యము: పార్వతి కోమలమైన నొసటి కాంతులు - చంద్రకళను అమృతద్రవమున నలుపు పోవునట్లు రాపి, కడిగి, వెన్నెల క్రొత్త మెఱుఁగులు చల్లుకొని పైని మెఱుఁగుపెట్టినట్లు ఒప్పును.

విశేషములు: అలంకార ముత్ప్రేక్ష.

క్రొమ్మెఱుఁగులు - క్రొత్త + మెఱుఁగులు - 'క్రొత్తశబ్దమున కాద్యక్షర శేషంబునకుం గొన్నియెడల ముగాగమంబునుం గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు.' బాల. సంధి. 38.

క. అప్పొలఁతి కురులు శివు మన
సొప్పఁటి తనుఁ దగులఁబెట్టు నురు లన నెఱులై
కప్పారి కొదమతుమ్మెద
లుప్పయనము సేసినట్టి యొఱపున నొప్పున్. 70

అర్థము: అప్పొలఁతి (ఆ + పొలఁతి) = ఆ-స్త్రీ - పార్వతియొక్క, కురులు = వెంట్రుకలు, శివు-మనసు = శివునియొక్క మనస్సు, ఒప్పు + అఱి = ఒప్పుచెడి - నిశ్చలత్వము గోల్పోయి, తనున్ = తన్ను, తగులన్ + పెట్టు = తవులునట్లు చేయునట్టి - తనయం దాసక్తి గలవానినిగాఁ జేయునట్టి, ఉరులు=ఉచ్చులు, అనన్ = అనునట్లు, నెఱులు + ఐ = చక్కనివయి, కప్పారి (కప్పు + ఆరి) = నలుపెక్కి, కొదమ - తుమ్మెదలు = పిల్లతుమ్మెదలు, ఉప్పయనము + చేసిన + అట్టి = బసచేసినట్టి, ఒఱపునన్ = విధమున, ఒప్పున్,

తా త్ప ర్య ము : ఆ పార్వతి శిరోజములు శివుని మనస్సు నైశ్చల్యమును గోలుపోయి తనయం దాసక్తి గలవానినిగాఁ జేయునట్టి యుచ్చు లనునట్లు సుందరములయి, నలుపెక్కి పిల్లతుమ్మెదలు పయనించుచు బసచేసినవిధమున నొప్పును,

వి శే ష ము లు ; అలంకార ముత్ప్రేక్ష.

తగులఁబెట్టు + ఉరులు - 'ఉదంతమగు తద్ధర్మార్థ విశేషణమున కచ్చు పర మగునపుడు నుగాగమం బగు.' బాల. సంధి. 33. తగులఁబెట్టు నురులు. ఉప్పయనము-(ప్రయాణ మాఁపుట - బసచేయుట. ఇంకను విచార్యము,) (ప్రయోగాంతరము లేదని సూ. ని,) కన్నడము - ఉప్పయణ = యుద్ధప్రయాణమునకై చేయు బస,

క, చమరీతతియుఁ గలాపులు
నుమ కేశ తమాల తరు లతోగ్రాటవిలో
రమియింపఁగఁ దగు ననఁ దగి
నెమ మగు హరి నవ్య నీల చల దలి సమమై, 71

అర్థము: చమరీ - తతియున్ = ఆఁడు చమరమృగముల గుంపును, కలాపులన్ = నెమిళ్లను, ఉమ = పార్వతియొక్క, కేశ - తమాల - తరు - లతా + ఉగ్ర + అటవిలోన్ = శిరోజములనెడి చీఁకటిమ్రాఁకులతోను దీఁగలతోను భయంకరమైన అడవిలో, రమియింపఁగన్ = క్రీడించుటకు - విహరించుటకు, తగున్ + అనన్ + తగి = తగు ననఁగా నొప్పి, హరి-నవ్య-నీల-చలత్ + అలి-సమము + ఐ = క్రొత్త యింద్రనీలములతోను, చలించుచున్న తుమ్మెదలతోను సమానమయి, సమము + అగున్ = ఒప్పును.

తాత్పర్యము: పార్వతి కేశపాశము చమరీమృగముల గుంపును, నెమళ్లను అది యనెడి చీఁకటిమ్రాఁకులతీఁగలచే భయంకరమైన అడవిలో విహరింపఁదగియుండు నన నొప్పి క్రొత్త యింద్రనీలమణులకును, చలించు తుమ్మెదలకును దుల్యమయి సుందరముగా నుండును.

విశేషములు: ఉమ కేశపాశము చీఁకటిమ్రాఁకులతీఁగలచే భయంకరమైన అరణ్యమువలె నుండి చమరీమృగములును, నెమిళ్లను విహరింప యోగ్యముగా నున్నదనుట. శిరోజములను చమరీవాలములతోను, కలాపి కలాపముతోను బోల్చుట కవిసమయము. చీఁకటిమ్రాఁకుల తీగలచే నుగ్రమైన యడవి యననేల యన, చీఁకటిమ్రాఁకులవలెనే శిరోజములు నల్లగా నుండును. హరి నవ్య నీల - నవ్య శబ్దము హరి నీల - శబ్దముల నడుమ నున్నది, హరి నీలములు నలుపు, క్రొత్తవి యింకను నలుపు, అళులుకూడ నలుపే. హరి నవ్యనీల చలదలి సమమై - అలంకార ముపమ, కేశ తమాల తరులతోగ్రాటవిలో - కేశములనెడి తమాలతరులతోగ్రాటవి- రూపకాలంకారము. మొత్తముమీఁద నుత్ప్రేక్ష. ఇందు తగి, అగు, అను క్రియలకుఁ గర్తలుగా ఉమకేశములను అధ్యాహార్యము చేసికొనవలయును.

క. స్మరకలహంబునఁ బతి దెస
గిరిసుత పిఱుఁదైన నక్షకేళి మహేళున్
మరుఁడుతగిలించి గెలువఁగఁ
గర మమరిన నెత్తపలకగతి వీఁ పొప్పున్. 72

అర్థము: ప్రణయ - కలహంబునన్ = ప్రణయకలహముచే, గిరి-సుత= కొండ కూఁతురు - పార్వతి, పతి - దెసన్ = భర్తనుండి, పిఱుఁదు + ఐనన్ = వెనుకకుఁ దిరుగఁగా, మరుఁడు = మన్మథుఁడు, మహేశున్ = మహేశ్వరుని, అక్ష-కేళిన్ = ద్యూతక్రీడయందు, తగిలించి = ఆసక్తినొందఁజేసి, గెలువఁగన్ = జయింప, కరము = మిక్కిలి, అమరిన = ఒప్పినట్టి, నెత్తపలక - గతిన్ = జూదమాడుట కుపయోగించు పలకవలె, వీఁపు + ఒప్పున్ = వీఁపు అందగించును.

తాత్పర్యము: పార్వతి ప్రణయకలహమున భర్తనుండి వెనుకకుఁ దిరిగి యుండఁగా, మన్మథుఁడు శివుని ద్యూతక్రీడయందాసక్తి గలవానినిగాఁజేసి గెలుచుటకు మిక్కిలి యొప్పిన నెత్తపలకవలె నామె వీఁపు అందగించును.

విశేషములు: అలంకార ముత్ప్రేక్ష, వీఁపును నెత్తపలకతోఁ బోల్చుట కవిసమయము.

వ. అని యనేకప్రకారంబుల వర్ణింపందగిన వర్ణనల కమరి. 73

అర్థము: అని, అనేక - ప్రకారంబులన్ = పెక్కురీతుల, వర్ణింపన్ + తగిన, వర్ణనలకున్, అమరి=ఒప్పి.

తాత్పర్యము: ఈ రీతిగాఁ బెక్కువిధముల వర్ణనీయ వర్ణనలకొప్పి- తరువాతి పద్యముతో నన్వయము.

సీ. మధు సమాకలితమై మవ్వమారిన మారు
నవలత నా మేన నవక మెక్కెఁ,
దరణి చే సోఁకినఁ దావి పొంపిరిపోవు
తమ్మి నాఁ దగు సుగంధంబు సుడిసె,
మది శరత్సంగతి మత్తిల్లి క్రాలు రా
యంచ నా మద మందయాన మమరె,
దాలిమి రసనేవ సోలి ముద్దాడు రా
చిలుక నా పెడ దొక్కుఁబలుకు లొప్పె.

తే. మరుఁడు శృంగారలక్ష్మిఁ జిత్తరువు నెరయ
వ్రాసి తెమ్మెర లాయువు వోసినట్లు
సుందరాకృతిఁ ద్రైలోక్యసుభగ యయ్యె
శైలనందన యౌవన సంగమమున. 74

అర్థము : శైల-నందన = కొండ-కూఁతురు-పార్వతి, యౌవన - సంగమమునన్ = జవ్వనముతోడి కూడికచే -

మధు- సమాకలితము + ఐ = వసంతునితోఁ గూడినదయి, మవ్వమారిన = కోమలమయిన, మారు-నవ-లత-నాన్ = మన్మథుఁడనెడి క్రొత్త తీఁగ, అనునట్లు, మేనన్ = శరీరమునందు, నవకము + ఎక్కెన్ = మృదుత్వ మతిశయించెను.

తరణి - చే - సోఁకినన్ = సూర్యుని, చేయి (కిరణము), తాఁకఁగా, తావి = పరిమళము, పొంపిరివోవు - (పొంపిరి + పోవు) = అతిశయించు, తమ్మి - నాన్ = తామర యనునట్లు, తగు = ఒప్పునట్టి, సుగంధంబు=సువాసన, సుడిసెన్ = వ్యాపించెను.

మది = మనస్సు, శరద్ + సంగతిన్ = శరత్కాల సాంగత్యముచే, మతిలి = మదించి, క్రాలు = సంచరించు, రాయంచ-నాన్ = రాజహంసము అనఁగా, మద-మంద-యానము = మదమువలని మెల్లని గమనము, అమరెన్ = ఒప్పెను,

దాలిమి-రస-సేవన్ = దానిమ్మపండు రసముయొక్క ఆస్వాదముచే, సోలి= పరవశించి, ముద్దాడు (ముద్దు + ఆడు) = ముద్దుగాఁబలుకు, రాచిలుక-నాన్ = రాజకీర మన, వెడ దొక్కుఁ బలుకులు = ఇంచుక అవ్యక్తమధురములైన మాటలు, ఒప్పెన్.

మరుఁడు = మన్మథుఁడు, శృంగార-లక్ష్మిన్ = శృంగార మనెడి లక్ష్మిని, చిత్తరువు=చిత్రపటము, నెరయన్=నిండుగా, వ్రాసి=లిఖించి, తెమ్మెరలు=దక్షిణ

మారుతము, ఆయువు+పోసిన+అట్లు=ఊపిరిపోసినట్లు - ప్రాణముపోసినవిధమున, సుందర+ఆకృతిన్=అందమయిన ఆకారముతో, త్రైలోక్యసుభగ = ముల్లోకము ళందును, అందమయినది, అయ్యెన్,

తాత్పర్యము: పార్వతి యౌవనవతి కాఁగా-వసంతునితోఁగూడినదై కోమల మైన మన్మథుఁడనెడి క్రొత్తతీఁగయా యనునట్లు ఆమె మేన మృదుత్వ మతిశయించెను. సూర్యకిరణము సోఁకఁగాఁ బరిమళ మతిశయించు తామరయా యనునట్లు ఆమె మేన సుగంధము వ్యాపించెను. శరత్కాలము రాఁగా మదించి సంచరించు రాయంచయా యనునట్లు ఆమెకు మందగమన మొప్పెను. దానిమ్మపండు రసము నాస్వాదించుటచేఁ బరవశించి ముద్దుగాఁబలుకు రాచిలుకయా యనునట్లు ఆమె అవ్యక్తమధురముగా మాట లాడఁదొడఁగెను. మన్మథుఁడు శృంగారమనెడి లక్ష్మిని చిత్రపటమున లిఖించి దక్షిణ మారుతము నూపిరిపోసెనా యనునట్లు ఆమె సుందరాకారముతోఁ త్రిలోకసుందరి యయ్యెను.

విశేషములు: మారు నవలత-మారుఁడనెడి నవలత-రూపకము. మార నవలత యని యున్నచో బాగుగానుండెడిది. పద్యమునందలి పాదము లన్నింటను నలంకార ముత్ప్రేక్ష. 'మరుఁడు శృంగారలక్ష్మి.........వోసినట్లు - రూపకానుప్రాణి తోత్ప్రేక్ష. 'దాలిమి-వా.ప్రతిలో 'దా'కు ముం దరసున్న గలదు, అప్పుడు తాలిమియై అర్థము పొసఁగదు. సూ.ని.లో 'దాళిమి' గలదు. దాడిమి=దాళిమి=దాలిమి.'లడయో రభేదః.'

యౌవనము (ప్రకృతి)-జవ్వనము (వికృతి). అయువు వోసినట్లు-ఆయువు+ పోసినట్లు-గసడదవాదేశము బాల. సంధి.13. చిత్తరువు (వికృతి)-చిత్రము (ప్రకృతి).

క. మెఱుఁగుల కచిరత, శశికిం
గఱయును, మణి కనకములకుఁ గాఠిన్యము, లేఁ
బొఱకుం గాష్ఠము దక్కఁగ
మెఱుఁగెల్లను వచ్చి గిరిజ మేనన నిల్చెన్. 75

అర్థము: మెఱుఁగులకున్=మెఱపులకు. అచిరత=అచిరత్వమును-క్షణికత్వ మును-అచిరద్యుతి యనఁగా మెఱపు, శశికిన్=చంద్రునకు, కఱయును=మచ్చయును,

మణి-కనకములకున్=మణికిని, బంగారమునకును, కాఠిన్యము=గట్టితనము, లేఁబొటు
కున్ (లేఁత+పొటు)=లేఁతపొటుకు-చిగురుటాకునకు, కాష్ఠమున్=కఱ్ఱయును, (ఈనె
యును), లక్కఁగన్=పోఁగా, మెఱుఁగు+ఎల్లను=కాంతి యంతయు, వచ్చి, గిరిజ,
మేనన్+అ=పార్వతి మేనియందే, నిల్చెన్.

తాత్పర్యము: మెఱుఁగులకు క్షణికత్వము, చంద్రునకు మచ్చయును,
మణికిని కనకమునకును గఠినత్వమును, లేఁజిగురుటాకునకు ఈనెయును బోఁగా
మిగిలిన మెఱుఁగంతయు వచ్చి పార్వతి మేనియందే నిలిచెను.

విశేషములు: మెఱుఁగు మున్నగువానికిఁ గాంతి యున్నది గాని యొక్కొక్క
దాని కొక్కొక్క దోషము గలదు. వాని మెఱుగు లన్నియు నాత్మదోషవిరహితములై
పార్వతి మేనిఁ జేరె ననిభావము. పొటు=చిగురుటాకు.

మవ్వంపుఁబొటులు - నన్నెచోడుని ప్రయోగాంతరము (9-113), లేఁబొటు=
లేఁత + పొటు - ప్రాఁతాదిసంధి బాల.సంధి. (36), ముగాగమము (37), ద్రుత
కార్యము (16,17).

చ. తలతలఁ బ్రజ్వరిల్లు సితధామ కలంకముఁబాచి వక్త్రమం
డలరుచి పర్వె దిక్కులఁ గడల్కొని చూపఱు సంచలించి బి
ట్టులుకఁగ వాణియు న్నెరసి యొండొక భంగి సురంగ మయ్యెఁ; జూ
పులు పొలపంబు గైకొనియె భ్రూలత లంతకుఁ జెన్ను వింతగాన్. 76

అర్థము: వక్త్ర-మండల-రుచి=ముఖమండలముయొక్క కాంతి, దిక్కు
లన్=దిక్కులయందు, కడల్కొని=వ్యాపించి, చూపఱు=చూచువారు, సంచలించి=
మిక్కిలి చలించి, బిట్టు=మిక్కిలిగా, ఉలుకఁగన్=భయపడఁగా, తలతల=తలతల
మని, ప్రజ్వరిల్లు = ప్రకాశించునట్టి, సితధామ-కలంకమున్=తెల్లనికిరణములు గల
వాఁడగు చంద్రుని మచ్చను, పాచి=తొలఁగించి, పర్వెన్=వ్యాపించెను, వాణియున్=
మాటయును-కంఠస్వరమును, నెరసి=నిండుఁదనమునొంది, ఒండొకభంగిన్=ఒకరీతిగా,
సురంగము=అందమయినది,అయ్యెన్, భ్రూలతలు=బొమతీవలు , అంతకున్=మును

పటికంచెను, చెన్ను=అందము, వింత+కాన్=క్రొత్తదిగా, చూపులు, పొలుపంబు=కాంతి, కైకొనియెన్=గ్రహించెను.

తాత్పర్యము: పార్వతి ముఖమండలకాంతి చంద్రునిలోని కళంకమును గూడ తొలఁగించి దిక్కుల వ్యాపించెను, అది చూచి చూపఱు దిగ్భ్రమ చెందిరి. ఆమె కంఠస్వరముగూడ నింపుఁదనము బొంది యొకవిధమైన యందమును సంతరించుకొనెను, బొమతీవలకు మునుపటికంటె నొక వింతయంద మేర్పడఁగా నామె చూపులు కాంతిమంతము లయ్యెను.

విశేషములు : సురంగము=అందము. దీనికి నన్నెచోడునివే ప్రయోగాంతరములు-అపాంగావలోకనంబు సురంగంబై-5-120./ పసిండి యాయుధంబున సురియ సురంగంబుగా-9-25.

వ. మఱియును. 77

సీ. శశిబింబ మణి హేమ సౌదామనీ చయో
త్కర కాంతు లన్నియు నరసి తెచ్చి,
నవ లతా పుష్ప పల్లవ బిస కోమల
విభవంబు లన్నియు వెదకి తెచ్చి,
కర్పూర చందన కాశ్మీర మృగమ దా
మోదంబు లన్నియు మూంచి తెచ్చి,
పరివాదినీ శుక పరపుష్ట మధుక రా
రావంబు లన్నియు రాచి తెచ్చి,

ఆ. హావ భావ రూప లావణ్య సారముల్
త్రిభువనముల నేర్చి తెచ్చి నేర్పు
సూపఁదలఁచి యాఁడు రూ పజుఁ డొనరించె
నని నుతింప నొప్పు నగతనూజ. 78

అర్థము : అజుఁడు=బ్రహ్మ.

శశిబింబ......కాంతులు; శశిబింబ=చంద్రబింబముయొక్కయు, మణి= మణులయొక్కయు. హేమ = బంగారముయొక్కయు, సౌదామనీ = మెఱపుల యొక్కయు, నికర = సమూహమునయొక్క, ఉత్కర = సమూహముయొక్క. కాంతులు, అన్నియున్, అరసి=వెదకి, తెచ్చి,

నవ......విభవంబులు; నవ=క్రొత్తవియగు, లతా = తీఁగలయొక్కయు, పుష్ప=పూవులయొక్కయు, పల్లవ = చివురులయొక్కయు, బిస = తామరతూండ్ల యొక్కయు, కోమల=మృదువులైన, విభవంబులు సంపదలు, అన్నియున్, వెదకి, తెచ్చి,

కర్పూర......మోదంబులు: కర్పూర=కప్పురముయొక్కయు, చందన = మంచిగంధముయొక్కయు, కాశ్మీర=కుంకుమపువ్వుయొక్కయు, మృగమద=కస్తూరి యొక్కయు. ఆమోదంబులు=పరిమళములు, అన్నియున్, మించి=యత్నించి, తెచ్చి,

పరివాదినీ......రావంబులు: పరివాదినీ = ఏడుతంతుల వీణెలయొక్కయు, శుక=చిలుకలయొక్కయు, పరపుష్ట=కోకిలలయొక్కయు, మధుకర = తుమ్మెదల యొక్కయు, ఆరావంబులు=ధ్వనులు, అన్నియున్, రాచి=విచారణచేసి, తెచ్చి,

హావ .... సారముల్ : హావ = భ్రూనేత్రాదివికారములచేఁ గొంచెము తెలియఁదగిన మనోవికారముయొక్కయు, భావ=మనోఽభిప్రాయములయొక్కయు, రూప = అందముయొక్కయు, లావణ్య=కాంతివిశేషములయొక్కయు, సారముల్ = సంపదలు, త్రిభువనములన్ = ముల్లోకములయందును, ఏర్చి = ఎన్ని, తెచ్చి, నేర్పు, మీఱన్ + పేర్చి, ఆఁడురూపు=స్త్రీ రూపము, ఒనరించెన్=చేసెను, అని, నుతింపన్ = పొగడునట్లు, అగ - తనూజ = కొండ - కూఁతురు - పార్వతి, ఒప్పున్.

తాత్పర్యము : చంద్రబింబము, మణులు, బంగారము, మెఱపులు అనువాని సమూహముయొక్క కాంతు లన్నియుఁ బరిశీలించి తెచ్చియు, క్రొత్తతీఁగలు, పూవులు, చివురులు, తూండ్లు అనువాని మృదుసంపద లన్నియు, వెదకితెచ్చియు, కర్పూరము, మంచి

గంధము, కుంకుమపుప్వు, కస్తూరి అనువాని పరిమళము లన్నియుఁ బూనితెచ్చి, ఏడు తంతులవీణలు, చిలుకలు, కోకిలలు, తుమ్మెదలు అనువాని ధ్వనులన్నియు విడాక చేపితెచ్చి, హావములు, భావములు, రూపము, లావణ్యము అనువాని నిగ్గులు ముల్లోకములందును ఎన్ని తెచ్చి, తన నైపుణ్యమును జూపనెంచి బ్రహ్మ స్త్రీరూపమును జేసెనని పొగడునట్లు పార్వతి యొప్పును.

విశేషములు: పార్వతి దేహకాంతి, మార్దవము, పరిమళము, కంఠస్వరము, హావభావాది మనోవికారములు ముల్లోకములందును శ్రేష్ఠములై యున్న వనుట. అలంకారము హేతూత్ప్రేక్ష.

వ. మఱియు నఖిల లావణ్య పుణ్యాధిదేవతయు, నశేష సౌభాగ్య లక్ష్మియు, నపార గుణ మణి గణ భూషణానర్ఘ నాయక మణియు, నిఖిల భర్తృదారికా విమల ముక్తాఫల హార తరల సరసీరుహ రాగ రత్నంబునుం బూర్ణయౌవనాలంకృతయునై యొప్పుచున్న పార్వతిం జూచి హిమవంతుఁ డనంత సంతోష రసాపూరితాంత రంగుండై. 79

అర్థము: మఱియున్, అఖిల - లావణ్య - పుణ్య + అధిదేవతయున్ = ఎల్ల సౌందర్యము అనెడి పుణ్యమునకు అధిష్ఠాన దేవతయు, అశేష - సౌభాగ్య - లక్ష్మియున్ = ఎల్ల వైభవములకు లక్ష్మియు, అపార .... మణియున్: అపార = అనంతములైన, గుణ = సద్గుణము లనెడి, మణి = మణులయొక్క, గణ = సమూహముగల, భూషణ = అలంకారములందు, అనర్ఘ = అమూల్యమయి, నాయక మణియున్ = హారమధ్యమణి యైనదియు, నిఖిల .... రత్నంబునున్: నిఖిల = ఎల్ల, భర్తృదారికా = రాజకుమారికలనెడి, విమల = స్వచ్ఛమైన, ముక్తాఫల - హార = ముత్యాలపేరునందలి, తరల = నాయకమణి యైన, సరసీరుహరాగరత్నంబునున్ = పద్మరాగమణియును, పూర్ణ - యౌవన + అలంకృతయున్ = నిండుజవ్వనముచే నలంకరింపఁబడినదియు, ఐ, ఒప్పుచున్ + ఉన్న, పార్వతిన్, చూచి, హిమవంతుఁడు, అనంత - సంతోష - రస + ఆపూరిత + అంతరంగుండు + ఐ = అంతములేని సంతోషరసముచేత బాగుగా నింపఁబడిన మనస్సు గలవాఁడయి.

తాత్పర్యము : మఱియును సర్వసౌందర్యము లనెడి పుణ్యములకు అధిష్ఠాన దేవతయు, ఎల్ల వైభవములకు లక్ష్మియు. అపారమైన సుగుణము లనెడి మణుల సమూహముగల యలంకారమునందలి అమూల్యమైన మధ్యమణియైనదియు, రాజకుమారిక లనెడి నిర్మలమైన ముత్యాలహారములో నాయకమణియైన పద్మరాగమణియైనదియును, నింటుజవ్వనముచే నలంకరింపఁబడినదియు నయి యొప్పుచున్న పార్వతిని జూచి హిమవంతుఁ డపారసంతోషముచే నిండిన మనస్సు గలవాఁడయి - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : అలంకారము రూపకము.

క. పేద నిధానము గన్న
ట్లాదరితమునం దనూజ నగ్గించుచు నా
హ్లాదమునఁ దగిన వరుఁ డిం
ద్రాది సురులలోన నెవ్వఁ డగునో యనుచున్. 80

అర్థము : పేద = పేదవాఁడు, నిధానము = నిధిని, కన్న + అట్లు = చూచిన విధమున, ఆదరితమునన్ = ఆదరముతో, తనూజన్ = కూఁతును, అగ్గించుచున్ = పొగడుచు, ఆహ్లాదమునన్ = సంతోషముతో, తగిన - వరుఁడు = యోగ్యుఁడయిన పెండ్లికొడుకు, ఇంద్ర + ఆది - సురులలోనన్ = ఇంద్రుఁడు మున్నగు దేవతలలో, ఎవ్వఁడు, అగునో, అనుచున్.

తాత్పర్యము : పేదవాఁడు పెన్నిధిని జూచిన విధమునఁ గూఁతు నాదరమ్మునఁ గొనియాడుచు. సంతోషముతో, నింద్రాదిదేవతలలో నీమెకుఁ దగిన పెండ్లికొడు కెవ్వఁ డగునో యనుచు - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : వ్రాఁతప్రతులలో ఇంద్రాదిసురలలోన అని కలదు. సురశబ్దము సంస్కృతసమాసమున ఋతుల్యము గా దనుటచే (బాల.తత్సమ.60) ఇంద్రాది సురులలోన, అని మార్పఁబడినది. పేద నిధానము గన్నట్లు ...., అలంకార ముపమ.

వ. దోలాయమానమానసుం డగుచున్నయెడ. 81

అర్థము : దోలాయమాన = ఊయలవలె నగుచున్న, మానసుండు = మనస్సుగలవాఁడు, అగుచున్ + ఉన్న + ఎడన్ = అగుచుండఁగా.

తాత్పర్యము : మనస్సు ఊయెలవలె నూఁగులాడుచుండఁగా - తరువాతి పద్యముతో నన్వయము.

## నారదాదేశము

చ. గొనకొని సామగానమునకున్ మెఱుఁగిచ్చు జతిస్వరంబులం
దెనకొని మ్రోయ వీణె మొరయించుచు రాగరసప్రవాహమో
యనఁగఁ బిశంగజూటరుచు లంబుదమార్గమునందుఁ బర్వ భో
రనఁ జనుదెంచె నారద మహాముని తద్గిరిపాలు పాలికిన్. 82

అర్థము : గొనకొని = అతిశయించి. సామగానమునకున్ = సామవేదగానమునకు, మెఱుఁగు + ఇచ్చు = మెఱుఁగుపెట్టునట్టి, జతి - స్వరంబులందున్ = గీతభేదస్వరములందు, ఎనకొని = పోటీయయి, మ్రోయన్ = మ్రోయునట్లు, వీణెన్ = వీణను, మొరయించుచున్ = వాయించుచు, రాగ - రస - ప్రవాహమో = గానమనెడిరసముయొక్క ప్రవాహమో, (ఎఱ్ఱనిద్రవముయొక్క ప్రవాహమో అని అర్థాంతరము) అనఁగన్ = అనునట్లు, పిశంగ - జూట - రుచులు = కపిలవర్ణముగల జడముడియొక్క కాంతులు, అంబుద - మార్గమునందున్ = ఆకాశమున, పర్వన్ = వ్యాపింపఁగా, నారద - మహత్ (మహా) + ముని, తద్ + గిరి - పాలు - పాలికిన్ = ఆ కొండలఱేని కడకు, భోరనన్ = శీఘ్రముగా, చనుదెంచెన్ = వచ్చెను.

తాత్పర్యము : సామగానమునకు మెఱుఁగులు దిద్దు గీతస్వరములతో వీణ వాయించుచు, సంగీతరసప్రవాహమా యనునట్లు కపిలవర్ణపు జడముడి కాంతు లాకాశమున వ్యాపింపఁగా నారదమహాముని కొండలఱేఁడగు నా హిమవంతునికడ కరుదెంచెను.

విశేషములు : నారదుఁడు సామగానమునకు మెఱుఁగులు దిద్దునట్లు గీతభేదస్వరములతో వీణను వాయించుచుండెను, రాగరసప్రవాహమో యనఁగ-ఉత్ప్రేక్ష, స్వభావోక్తి.

వ. ఇట్లు చనుదెంచు నారదమహామునిం గని యతిసంభ్రమంబున నెదురువచ్చి వినయవినమితోత్తమాంగుండై యాసన పాద్యాద్యశేషార్చనా విధి నభ్యర్చితుం జేసిన గిరిపతికి నమ్మునిపతి కరుణించి హితోపదేశంబు సేయందలంచి శివశక్తిభేదంబులు దెలిపి పార్వతీ పూర్వప్రపంచంబు విశేషించి యెఱింగించి మఱియు నాతనికి మనోనిశ్చయంబు సేయ నభిముఖుండై. 83

అర్థము: ఇట్లు, చనుదెంచు = వచ్చు, నారద-మహామునిన్, కని, అతి-సంభ్రమంబునన్ = మిక్కిలి వేగిరపాటుతో, ఎదురువచ్చి, వినయ-వినమిత-ఉత్తమాంగుండు+ఐ=అడఁకువచే వంపఁబడిన శిరస్సు గలవాఁడయి, ఆసన-పాద్య-ఆది+అశేష+అర్చనా-విధిన్=ఆసనము, పాద్యము (కాళ్లుకడుగనీరు) మొదలగు నెల్ల పూజావిధానముతో, అభి + అర్చితున్=పూజింపఁబడినవానిని, చేసినన్=చేయఁగా, గిరి-పతికిన్ = కొండల తేనికి, ఆ+ముని-పతి = ఆ మునిశ్రేష్ఠుఁడు-నారదుఁడు, కరుణించి=దయఁజూచి, హిత+ఉపదేశంబు + చేయన్+తలంచి=హితవునుపదేశింపనెంచి, శివ-శక్తి-భేదంబులు=శివునకును, శక్తికిని గల భేదములు,తెలిపి, పార్వతీ-పూర్వ-ప్రపంచంబున్ = పార్వతియొక్క పూర్వజన్మవృత్తాంతమును, విశేషించి= ముఖ్యముగా, ఎఱింగించి, మఱియున్. ఆతనికిన్=హిమవంతునకు, మనస్ (ః)+ నిశ్చయంబు+చేయన్= మనస్సు నిర్ణయమును జేయుటకు, అభిముఖుండు+ఐ= సంసిద్ధుఁడయి.

తాత్పర్యము: ఇట్లు వచ్చునట్టి నారదమహామునిని జూచి మిక్కిలి వేగిరపాటుతో నెదురువచ్చి వినయముతో శిరస్సువంచి, ఆసనము, పాద్యము మున్నగు నెల్ల పూజావిధానములచేఁ బూజితునిజేయఁగా. నా హిమవంతుని నారదుఁడు కరుణించి, హితవుఁ గఱప నెంచి, శివునకును, శక్తికిని గల భేదములు తెలిపి, పార్వతి పూర్వజన్మవృత్తాంతమును ముఖ్యముగా నెఱిఁగించి, మఱియు నతనికి మనోనిశ్చయము చేయ సంసిద్ధుఁడయి- తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు: గిరిపతికి కరుణించి- ఇందలి షష్ఠీకారకము గమనార్హము. ద్వితీయ యిప్పటి వాడుక.

క. ఈ దేవి లోకజనని మ
హాదేవున కగ్రమహిషియై పేర్మి సురేం
ద్రాదుల కర్చిత యగు నని
యాదేశము చేసి యమ్మహాముని చనియెన్. 84

అర్థము: ఈ-దేవి=ఈ పార్వతీదేవి, లోక-జనని=జగన్మాత, మహాదేవునకున్=శివునకు, అగ్ర-మహిషి+ఐ=పట్టపుదేవియై, పేర్మిన్=గొప్పతనముతో, సుర+ఇంద్ర+ఆదులకున్=దేవేంద్రుఁడు మున్నగువారికి, అర్చిత=పూజింపఁబడినది, అగున్, అని, ఆదేశము-చేసి = ఆనతిచ్చి, ఆ+మహత్ (మహా)-ముని =ఆ గొప్ప ముని-నారదుఁడు, చనియెన్=వెడలెను.

తాత్పర్యము: 'ఈ దేవి జగన్మాత. ఈమె యీశ్వరునకుఁ బట్టపుదేవియై గొప్పతనముతో నింద్రాదులచేఁ బూజింపఁబడినది యగునని యానతిచ్చి నారదుఁ డరిగెను,

క. హిమవంతుఁ డెలమిఁ ద్రైలో
క్యము నలవడ నేలినంతకంటె మనోరా
గమున నిజతనయఁ గులదై
వమ కాఁ గొనియాడుచుండె వదలక నెమ్మిన్. 85

అర్థము; హిమవంతుఁడు, ఎలమిన్=సంతోషముతో, త్రైలోక్యము = ముల్లోకములను, అలవడన్=స్వాధీనమయినట్లు, ఏలిన+అంత-కంటెన్=పరిపాలించినంతకంటెను, మనస్ (ః) + రాగమునన్=మనస్సునందలి ప్రేమముతో, నిజ-తనయన్=తన కూఁతును, వదలక=వీడక-ఉపేక్షింపక, నెమ్మిన్=ప్రీతితో, కుల దైవము + అ = కులదేవతయే, కాన్ = అగునట్లు, కొనియాడుచున్+ఉండెన్= ప్రశంసించుచుండెను.

తాత్పర్యము: హిమవంతుఁడు సంతోషముతో ముల్లోకములను బరిపాలించినంతకంటెను హృదయానురాగముతోఁ దన పుత్త్రిక యగు పార్వతిని ఉపేక్షింపక ప్రీతితోఁ గులదేవతయే అనునట్లు ప్రశంసించుచుండెను.

విశేషములు: మనస్+రాగము-పదాంత సకారమునకు విసర్గాదేశము, మనః+రాగము. హ్రస్వ అకారము తరువాతవచ్చు విసర్గమునకు హ్రస్వఅకారము కాని, మృదుహల్లులు (హశ్శులు) కాని పరమగునపుడు ఉ ఆదేశముగా వచ్చి పూర్వ మందున్న అకారముతోఁగూడి గుణసంధి ననుసరించి ఓ గా మారును. మన+ఉ+ రాగము-మనోరాగము.

పార్వతిని హిమవంతుఁ డీశ్వరుని యుపచారమునకు నియమించుట

వ. త దవసరమ్మున. 86

అర్థతాత్పర్యములు: తద్+అవసరమ్మునన్=ఆ సమయమునందు. తరువాతి పద్యముతో నన్వయము.

గీ. సతి వియోగాగ్ని మనములో సంతతంబుఁ
దగిలికొని రౌల దానికిఁ దనుపు సేయఁ
దలఁచియో - కాదు నిక్కమ తపము సేయ
వలచియో హిమగిరికి నీశ్వరుఁడు వచ్చె. 87

అర్థము: సతి-వియోగ + అగ్ని = సతీదేవితోడి విరహమనెడి అగ్ని, మనసులోన్=మనస్సులో, సంతతంబున్=ఎల్లప్పుడును, తగిలికొని = బద్ధమయి, రౌలన్=రగులఁగా. దానికిన్=ఆ అగ్నికి. తనుపు+చేయన్=చల్లఁదనము గలిగింపఁగా, తలఁచియో = ఎంచియో, కాదు, నిక్కము+అ = నిజముగనే, తపము+చేయన్, వలచియో=కోరియో, ఈశ్వరుఁడు, హిమ-గిరికిన్=మంచుకొండకు, వచ్చెన్.

తాత్పర్యము; సతీదేవివలని విరహమనెడి అగ్ని నిరంతరము మనస్సున లగ్నమయి రగులుచుండఁగా దానికిఁ జల్లఁదనము గలిగింప నెంచియో-కాక నిజముగానే తపము చేయఁగోరియో ఈశ్వరుఁడు హిమవత్పర్వతమునకు వచ్చెను.

విశేషములు: అలంకార మాక్షేపము. 'ఆక్షేప స్స్వయ ముక్తస్య ప్రతిషేధో విచారణాత్.' చన్ద్రాలోకము. మొదట నొక విషయమును జెప్పి, విచారించి, మరల దానికిఁ బ్రతిషేధము చెప్పుదు మేని ఆక్షేపాలంకారమగును.

రాలన్- రగులన్ - రవులన్ - 'ఉపాద్యంబయి అసంయుక్తంబగు గకారంబునకు వకారంబు విభాష నగు.' బాల. అచ్చిక. 27. 'అచ్ఛికంబులం దయి యవులకు వక్రతమంబులు బహుళంబుగా నగు.' బాల. క్రియ.103-రాలన్,

వ. ఇట్లు చనుదెంచి త దుపకంఠప్రదేశంబున నవతరించి. 88

అర్థము: ఇట్లు, చనుదెంచి=వచ్చి, తద్+ఉపకంఠ-ప్రదేశంబునన్=దానికి సమీపస్థలమున, అవతరించి=దిగి.

తాత్పర్యము; ఇట్లు వచ్చి దానికి దాపయినచోట దిగి-తరువాతి పద్యముతో నన్వయము.

సీ. రస రసాయన నిర్ఝర ప్రవాహానూన
గంగాప్రవాహ శీకరము లడరఁ,
దనుపార నెలరారు ఘనసార సురదారు
మందార చంపక చందనముల,
లలిత సర్వర్తుక ఫల పుష్ప పల్లవ
భరిత లతా గుల్మ తరు వనముల,
సురుచిర శశికాంత సూర్యకాంతానర్ఘ
మణి హేమమయ కుట్టిమస్థలముల,

తే. వంశ రుద్రాక్ష మాలూర కింశుకముల,
హంస కీర మయూర విహంగమముల,
ఋష్య సారంగ మృగ చమరీ మృగములఁ,
బావనంబగు దివ్య తపోవనంబు. 89

అర్థము :- రస-రసాయన........శీకరములు. రస-రసాయన=ఔషధములగు నిర్ఝర-ప్రవాహ=సెలయేఱులు గల, అనూన=తక్కువకాని, గంగా-ప్రవాహ=గంగానదీప్రవాహముయొక్క, శీకరములు=నీటిబిందువులు, అడరన్=అతిశయింపఁగా,

తనుపేర్చన్ = తృప్తియగునట్లు, ఎలరారు = పుష్పించునట్టి, ఘనసార = కర్పూరము, సురదారు = దేవదారు, మందార, చంపక = సంపఁగి, చందనములన్ = మంచిగంధము అనువృక్షములచేతను.

లలిత = అందమైన, సర్వర్తుక (సర్వ + ఋతుక) = అన్ని ఋతువులయం దుండునట్టి, ఫల = పండ్లతోను, పుష్ప = పూలతోను, పల్లవ = చివురులతోను, భరిత = నిండిన, లతా = తీఁగల, గుల్మ = పొదల, తరు – వనములన్ = చెట్ల తోఁటలచేతను.

సురుచిర .... స్థలములన్ : సురుచిర = మిక్కిలి మనోహరములైన, శశి కాంత = చంద్రకాంతశిలలతోను, సూర్యకాంత = సూర్యకాంతశిలలతోను, అనర్ఘ = అమూల్యములైన, మణి = మణులతోను, హేమ = బంగారముతోను, మయ = నిండిన, కుట్టిమ - స్థలములన్ = నెలకట్టుచోటులచేతను.

వంశ = వెదురులచేతను, రుద్రాక్ష = రుద్రాక్షవృక్షములచేతను, మాలూర = మారేడుచెట్లచేతను, కింశుకములన్ = మోదుగుచెట్లచేతను.

హంస - కీర - మయూర - విహంగమములన్ = హంసలు, చిలుకలు, నెమిళ్లు అను పక్షులచేతను.

ఋష్య - సారంగ - పృగ - చమరీ - మృగములన్ = మనుఁబోతులు, ఇఱ్ఱులు. లేళ్లు, ఆఁబుసవపుమెకములు అను పవిత్రమైన, దివ్య - తపస్ (శ) + వనంబు = గొప్ప తపోవనమును.

తాత్పర్యము : జలౌషధములగు సెలయేఱులుగల అధికమైన గంగాప్రవాహముల నీటిబిందువు లతిశయింపఁగాఁ దృప్తికరముగాఁ బుష్పించు కర్పూర దేవదారు, మందార, చంపక, చందన వృక్షములచేతను, మనోహరములైన సార్వకాలికములైన పండ్లు, పూవులు, అనువానితో నిండిన తీఁగలు, పొదలు, చెట్లు గల తోఁటలచేతను, మిక్కిలి మనోహరములైన చంద్రకాంతశిలలతోను, సూర్యకాంతశిలలతోను, అమూల్యములగు మణులతోను, బంగారుతోను నిర్మింపఁబడిన నెలకట్టులుగల ప్రదేశముల చేతను, వెదురులు, రుద్రాక్షలు, మారేడులు, మోదుగులు అను వృక్షములచేతను,

హంసములు, చిలుకలు, నెమిళ్లు అను పక్షులచేతను, కుందేళ్లు, ఇఱ్ఱులు, లేళ్లు, ఆఁడుసవరపుమెకములు అను జంతువులచేతను విచిత్రమైన విన్యాసము కలతపోవనమును. తరువాతి వచనమునందలి 'కని' అనుదానితో నన్వయము.

విశేషములు : ఋష్య – ఋశ్య (రూపాం.)

వ. కని యంత సహకార కర్పూర నారికేళ నమేరు దేవదారు మందార పారిజాత జంబూ జంబీరాశోకానోకహలతామందిరాంతరంబున హిమవంతు నిరంతరోపార్జితానంతపుణ్యఫలంబునుంబోలె నవదాత శిశిర ద్యోతిత శశికాంత శిలాతలంబు సమాధిస్థానంబుగా స్వీకరించి నంది మహాకాళాది గణముఖ్యుల నిజ నియోగంబులందు నియమించి. 90

అర్థము : కని = చూచి, అంతన్, సహకార .... రాంతరంబునన్; సహకార = తియ్యమామిడి, కర్పూరము, నారికేళ = కొబ్బరి, నమేరు = సురపొన్న, దేవదారు, మందారము, పారిజాతము, జంబూ = నేరేడు, జంబీర = నిమ్మ, అశోకము, (అను). అనోకహ = చెట్ల, లతా = తీఁగల, మందిర + అంతరంబునన్ = ఇంటి లోపలిభాగమున, హిమవంతు = హిమవంతునియొక్క, నిరంతర + ఉపార్జిత + అనంత - పుణ్య - ఫలంబున్ + పోలెన్ = ఎడతెగక, సంపాదింపఁబడిన, అంతములేని, పుణ్యముయొక్క, ఫలమువలె, (ఉండు), అవదాత - శిశిర - ద్యోతిత - శశికాంత శిలా - తలంబు = స్వచ్ఛమైన, చల్లని, ప్రకాశించు, చంద్రకాంతశిలలప్రదేశము; సమాధి-స్థానంబు - కాన్ = ధ్యానస్థలముగా, స్వీకరించి = అంగీకరించి, నంది, - మహాకాళ + ఆది - గణ - ముఖ్యులన్ = నందీశ్వరుఁడు, మహాకాళుఁడు మున్నగు ప్రమథగణప్రధానులను, నిజ - నియోగంబుల + అందున్ + అ = తమతమ విధులందే, నియమించి.

తాత్పర్యము : చూచి పిమ్మట తియ్యమామిడి, కర్పూరము, కొబ్బరి, సురపొన్న, దేవదారు, మందారము, పారిజాతము, నేరేడు, నిమ్మ, అశోకము అను వృక్షముల తీఁగల మందిరములోపలిభాగమున హిమవంతుఁడు నిరంతరము సంపాదించిన పుణ్యమునకు ఫలమో అన నున్న స్వచ్ఛము, శీతలముఅయి ప్రకాశించు చంద్రకాంతశిలా

నిర్మలమైన ప్రదేశమును ధ్యానస్థానముగాఁ జేసికొని, నంది, మహాకాళుఁడు మున్నగు ప్రమథగణశ్రేష్ఠులను దమదమ విధులందు నియోగించి - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు: హిమవంతు నిరంతరోపార్జితానంత .... బోలె - ఉత్ప్రేక్షాలంకారము, ఇందు హిమవంతు అనునది నిరంతరోపార్జితా .... ఫలంబు అను సిద్ధసమాసమధ్యగతమైన 'ఉపార్జిత' అను పదముతో నన్వయించుచున్నది. 'కొన్నిచోట్ల సిద్ధసమాసమధ్యగతపదంబులతోఁ దద్భిన్నపదంబుల కన్వయంబు చూపట్టెడి,' ప్రౌఢ. సమాస. 35.

గీ. హిమనగంబుపైఁ బొలుపొందు హేమశిఖర
మనఁగఁ దనరారు కెంజడల్ పెనఁచి కట్టి
యందుఁ జుట్టిన దివిజాపగామలప్ర
వాహ మన నహిబంధంబు వఱల బిగిచి. 91

అర్థము: హిమ - నగంబుపైన్ = హిమవత్పర్వతముమీఁద, పొలుపొందు (పొలుపు + ఒందు) = ఒప్పునట్టి, హేమ - శిఖరము = బంగారు శృంగము, అనఁగన్, తనరారు = ఒప్పునట్టి, కెంజడల్ (కెంపు + జడల్) = ఎఱ్ఱని జడలు, పెనచి = మెలిపెట్టి, కట్టి, అందున్ = ఆ హిమపర్వతమునందు, చుట్టిన = చుట్టుకొనియున్న, దివిజ + ఆపగా + అమల - ప్రవాహము + అనన్ = ఆకాశగంగానదియొక్క నిర్మలమైనప్రవాహము అనునట్లు, అహి - బంధంబు = పాఁపకట్టు, వఱలన్ = ఒప్పునట్లు, బిగిచి = బిగించి.

తాత్పర్యము: హిమవత్పర్వతముపై నొప్పు బంగరుశృంగమన నొప్పు నెఱ్ఱనిజడలను మెలిపెట్టి కట్టి, ఆ కొండయందుఁ జుట్టును బ్రవహించు నాకాశగంగావిమలప్రవాహ మన సర్పబంధమును ఒప్పుగా బిగించి - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు: అలంకార ముపమ, తెల్లని శరీరముగల శివుఁడు హిమవత్పర్వతమువలెను, అతని శిరస్సు మీఁది కెంజడలు ఆ పర్వతము మీఁది హేమశిఖరమ...

వఱెను నుండెననుట. మఱియు నతఁడు తన కెంజడలచుట్టును జుట్టిన నాగబంధము హేమశిఖరమును జుట్టి ప్రవహించెడి యాకాశగంగవలె నొప్పుచుండెననుట.

కెంజడలు - కెంపు + జడలు-'సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు.' బాల సంధి. 36 - కె+ జడలు. ఇట లుప్తశేషమునకుఁ బరుషము పరము గాకున్నను నుగాగమ మయి, ద్రుత కార్యము జరిగినట్లు భావింపవలయును. చిన్నయ దీనినే 'కెంధూళి కెంజడ లను ప్రయోగంబులు గానంబడియెడి'-బాల. సంధి. 38. అని వృత్తిలోఁ జేర్కొనియెను. పెనఁగు - ప్రేరణార్థకము పెనఁచు. 'అట్లుచుక్కాగమంబు లతంగ్వాది మాయ్వాదుల కగు నగుచో వాని కద్రువాలు లోపించు.' బాల. క్రియ. 76. బిగిచి-బిగియు ధాతు ప్రేరణార్థక రూపము. బిగియు + చు = బిగుచు. పయి 76 వ సూత్రముచేతనే బిగియు+చు అని యేర్పడఁగా, 'చుక్కువర్ణంబులు పరంబులగునపు డిత్వంబున కుత్వం బగు.' - బాల క్రియ. 75 సూత్రముచే 'బిగుచు' అని యగును. 'సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకం బగు' బిగుచు + ఇ-బాల.క్రియ. 38. 'అంద్వవగాగమంబులం దప్ప నపదాది స్వరంబు పరంబగునపు డచ్చునకు సంధి యగు,' బాల. సంధి. 11, 'ఇత్వంబుగాని యెత్వంబుగాని కూడుచో ననాద్యంబయిన యుత్వంబున కిత్వం బగు' - బాల.క్రియ. 85 - బిగిచి.

గీ. క్షీరవారాశి కెఱఁగిన కారు మొగులు
కరణి శశికాంతవేదిపై గౌరు తోలు
పఱచి విలసిల్ల నందుండి పరమపరుఁడు
పొలిచె నొగి మొగుల్పైఁ దటిత్పుంజ మనఁగ. 92

అర్థము: క్షీర - వారాశికిన్ = పాలసముద్రముమీఁదికి, ఎఱఁగిన = వ్రాలిన, కారు - మొగులు - కరణిన్ = నల్లని (వర్షాకాలపు)మబ్బువలె, శశికాంత - వేదిపైన్ = చంద్రకాంతపు టరఁగుమీఁద, గౌరు - తోలు = ఏనుఁగుచర్మము, పఱచి, విలసిల్లన్ = ప్రకాశింపఁగా, పరమ - పరుఁడు = పరాత్పరుఁడు - శివుఁడు, అందున్ = ఆ గజ చర్మముమీఁద, ఉండి, మొగుల్పైన్ = మేఘముపై, తటిత్ + పుంజము + అనఁగన్ = మెఱపుల సమూహము, అనఁగన్, ఒగిన్ = చక్కఁగా, పొలిచెన్ = ఒప్పెను.

తాత్పర్యము : పాలసంద్రముపై వ్రాలిన నల్లని మబ్బువలెఁ జంద్రకాంత మయవేదిపై నేనుఁగుతోలు పఱచి, పరమేశ్వరుఁడు దానిపైఁ గూర్చుండి మబ్బుపై మెఱుపుల గమి యమునట్లు పక్కఁగా నొప్పెను.

విశేషములు : అలంకారము ఉపమ.

గౌరు - (రూపాం.) గవ్వడు, = ఏనుఁగు. 'ఏనుఁగు హత్తి గొ రేనుఁ గేన్గు నాఁగ దంతావళ నామ మౌ.' అం.భా. 2. 194. (నానా.) కాహళి. మొగులు - మొగిలు, మొయిలు, మొయులు (రూపాం.).

సీ. పద్మాసనస్థుఁడై భావించి శోషణ
దాహన ప్లావన తర్పణముల,
దేహోదయాత్మప్రతిష్ఠలు విధియించి,
యాగమరీతి బ్రహ్మాంగ వర్ణ
విన్యాసములు దీర్చి విమలాత్మదీపంబు
ప్రణవ సంపుటముగాఁ బ్రజ్వలించి,
వడి బాహ్యవర్తన ల్విడిచి ప్రత్యాహార
గతి మన స్సంతర్ముఖమ్ము నేసి,

ఆ. తన్నుఁదానె కాంచి తనయందుఁ జేతో ల
యంబు చేసి నిశ్చలాత్మయోగ
మయ సుధామృతాబ్ధిమగ్నుఁడై వరదుండు
నిరతిశయ సమాధినిష్ఠ నుండె. 93

అర్థము : పద్మ + ఆసనస్థుఁడు + ఐ = పద్మాసనమునందున్నవాఁడు, ఐ, భావించి = ధ్యానించి, శోషణ ............ తర్పణములన్: శోషణ = ఎండుట, దాహన = కాలుట, ప్లావన=స్నానముచేయుట, తర్పణములన్ = తనుపుట అను వానిచే, దేహ + ఉదయ-ఆత్మ-ప్రతిష్ఠలు = దేహముయొక్క ఉదయము ఆత్మ యొక్క ప్రతిష్ఠలు, విధియించి = జరుగునట్లు చేసి, ఆగమ-రీతిన్ = వేదోక్త

ప్రకారముగా, బ్రహ్మాం ........ నములు: బ్రహ్మ = బ్రహ్మయొక్క, అంగ = శరీరముయొక్కయు, వర్ణ = వర్ణములయొక్కయు, విన్యాసములు = అంగన్యాస కరన్యాసములు, తీర్చి = చేసి,

విమల + ఆత్మ-దీపంబు = నిర్మలమైన ఆత్మ అనెడి దీపమును, ప్రణవ-సంపుటముగాన్ = ఓంకార మనెడి సంపుటి కాఁగా, ప్రజ్వలించి = వెలిఁగించి,

వడిన్ = వేగముగా, బాహ్య వర్తనన్ = బాహ్యచేష్టలు, విడిచి = వదలి, ప్రత్యాహార-గతిన్ = ప్రత్యాహార మనెడి పద్ధతిలో, మనస్సు = మనస్సును, అంతర్ముఖమ్ము = లోనికిఁజూచునదిగా, చేసి, తన్నున్ + తాను + ఎ కాంచి = చూచి, తనయందున్, చేతస్ (ః) + లయంబు = మనస్సుయొక్క లయము చేసి.

నిశ్చల + ఆత్మ-యోగ............మగ్నుఁడు: నిశ్చల = నిశ్చలమైన, ఆత్మ-యోగ-మయ = ఆత్మయోగవికార మయిన, సుఖ = ఆనంద మనెడు, అమృత + అబ్ధి = అమృత సముద్రమునందు, మగ్నుఁడు = మునిఁగినవాఁడు, ఐ, వరదుండు = వరముల నిచ్చువాఁడగు ఈశ్వరుఁడు, నిరతిశయ............నిష్ఠన్ : నిరతిశయ = మిక్కిలి గొప్పదయిన, సమాధి-నిష్ఠన్ = ధ్యాననిష్ఠయందు, ఉండెన్.

తాత్పర్యము: పరమేశ్వరుఁడు పద్మాసనము పైచికొని కూర్చుండి మనస్సునందు భావించి శోషణము, దాహనము, ప్లావనము, తర్పణము అను వానిచే దేహాదియాత్మ ప్రతిష్ఠలు గావించి, వేదోక్తవిధానమున అంగన్యాసకరన్యాసములను దీర్చి, ప్రణవసంపుటమునందు ఆత్మదీపమును వెలిఁగించి, బాహ్యచేష్టలు దక్కి మనస్సు నంతర్ముఖముచేసి, తన్నుఁదానే చూచి తనయందుఁ జేతోలయమును జేసెను, ఇట్లు ఆత్మయోగరూపమయిన ఆనందామృతసముద్రమునందు నిమగ్నుఁడై ధ్యాననిష్ఠలో నుండెను.

విశేషములు: అలంకారము స్వభావోక్తి. రూపకము. ఈ పద్యమునందుఁ బరమేశ్వరుని ధ్యాననిష్ఠాప్రకార మభివర్ణింపఁబడినది.

క. అధ్యాత్మమూర్తి బ్రహ్మ హ
రి ధ్యేయాత్మకుఁడు సురవరేణ్యుఁడు సకలా
రాధ్యుఁ డయి తనరు తాను స
మాధ్యవహిత లీయమాన మానసుఁ డయ్యెన్. 94

అర్థము : అధ్యాత్మమూర్తి = పరమాత్మస్వరూపుఁడు, బ్రహ్మ-హరి-ధ్యేయ + ఆత్మకుఁడు = బ్రహ్మచేతను, విష్ణువుచేతను ధ్యానింపఁదగిన ఆత్మ గలవాఁడు, సుర-వరేణ్యుఁడు = దేవతలలో శ్రేష్ఠుఁడు, సకల + ఆరాధ్యుఁడు = ఎల్లరచేతను ఆరాధింపఁదగినవాఁడు, అయి, తనరు + ఒప్పునట్టి, తాను, సమాధి + అవహిత-లీయమాన-మానసుఁడు = నిరంతరధ్యానమునందు, ఉంపఁబడినదయి లయమగుచున్న మనస్సుగలవాఁడు, అయ్యెన్.

తాత్పర్యము : పరమాత్మస్వరూపుఁడును, బ్రహ్మవిష్ణువులచేత ధ్యానింపఁదగిన ఆత్మగలవాఁడును- దేవతాశ్రేష్ఠుఁడును, ఎల్లరకుఁ బూజనీయుఁడును అయి యొప్పు తాను నిరంతరధ్యానమున నుంపఁబడినదయి అందు లీనమగుచున్న మనస్సు గలవాఁడయ్యెను.

గీ. తనకుఁ బర మొండు లే దనఁ దనరి వెలుఁగు
చుండు పరమేశ్వరుండు దా నుగ్రతపము
చేసె భక్తులు తనుఁ బ్రీతిఁ జేరవచ్చు
తెరువుఁ దాఁ దీర్చి చూపెడు తెఱఁగు వోలె. 95

అర్థము : తనకున్, పరము = ఉత్కృష్ట మయినది, ఒండు = ఒకటి, లేదు, అనన్ + తనరి = అన నొప్పి, వెలుఁగుచున్ + ఉండు = ప్రకాశించు చుండునట్టి, పరమేశ్వరుండు, భక్తులు, తనున్, ప్రీతిన్, చేరన్+వచ్చు, తెరువున్= మార్గమును, తాన్ = తాను, తీర్చి = ఏర్పఱిచి, చూపెడు, తెఱఁగు + పోలెన్ = రీతి వలె, తాను, ఉగ్ర-తపము = భయంకరమైన తపస్సు, చేసెన్.

తాత్పర్యము : తనకంటె నుత్కృష్టమైనది ఇంకొకటి లేదన నొప్పు పరమేశ్వరుఁడు - భక్తులు తన్నుఁ బ్రీతితోఁ జేరవచ్చు విధమును వారికి స్పష్టపఱుచు టకో యన ఘోరతపస్సు చేసెను.

విశేషములు: పరమేశ్వరుఁడు వరార్థులు కోరునవే సఫలీకరింపఁ బరమైనది యింకొకటి లేదు. అయినను అతఁ డుగ్రతపమును జేయుట తనకొఱకుఁ గాదు. తన భక్తులు తన్నుఁ జేరు నుపాయమును వారికిఁ దెలియఁజెప్పుటకు. అంతా యిది హేతూత్ప్రేక్ష, కాళిదాసు కుమారసంభవమున-'స్వయం విధాతా తపసః ఫలానాం, కేనాపి కామేన తపశ్చచార' కుమా, 1.57. తాను స్వయముగాఁ దపఃఫలములనిచ్చువాఁడయ్యు నేదో కామమున (కేనాపికామేన) తపస్సు నాచరించెనని చెప్పఁగా, నన్నెచోడుఁడు ఆ కామ మిదియని సముచితముగా నుత్ప్రేక్షించి చెప్పుట గమనింపఁదగినది.

ఉ. అంతకు మున్న సన్మతిఁ బురాంతకు రాకయు, వచ్చియున్న వృ
త్తాంతము మేలుగా నెఱిఁగి, యా హిమవంతుఁ డనంత సంభ్రమా
త్యంత మనోఽనురాగమున నప్పుడ వాజి వరూథ దంతి సా
మంత విలాసినీ స్వజన మంత్రి పురోహిత భృత్య యుక్తుఁడై. 96

అర్థము: అంతకున్ + మున్ను + అ = అంతకు ముందే, హిమవంతుఁడు, సత్ + మతిన్ = మంచి మనస్సుతో, పుర + అంతకు = శత్రుపురముల నంతమొందించినవాని - ఈశ్వరునియొక్క, రాకయున్, వచ్చి + ఉన్న - వృత్తాంతమున్, మేలుగాన్ = బాగుగా. ఎఱిఁగి, అనంత-సంభ్రమ + అత్యంత - మనస్ (ః) + అనురాగమునన్ = అంతములేని వేగిరపాటు, మిక్కిలి మనఃప్రీతి అనువానితో, అప్పుడు + అ = అప్పుడే, వాజి .... యుక్తుఁడై: వాజి=గుఱ్ఱములయొక్క, వరూథ = సమూహము, దంతి = ఏనుగులు, సామంత = సామంతులు. విలాసినీ = స్త్రీలు, స్వజన = బంధువులు. మంత్రి = మంత్రులు, పురోహిత = పురోహితులు, భృత్య = సేవకులు (అనువారితో), యుక్తుఁడు + ఐ = కూడినవాఁడయి,

తాత్పర్యము: అంతకుముందె హిమవంతుఁడు ఈశ్వరుని రాకనుగూర్చియు, నతఁడు వచ్చియున్న వృత్తాంతమును గూర్చియు నెఱిఁగి మిక్కిలి వేగిరపాటుతోను, మనఃప్రీతితోను వెంటనే గుఱ్ఱముల సమూహము, ఏనుఁగులు, సామంతరాజులు, స్త్రీలు, బంధువులు, మంత్రులు, పురోహితులు, సేవకులు అనువారితోఁ గూడినవాఁడయి - తరువాతి వచనముతో నన్వయము,

విశేషములు: సన్మతి - సత్ + మతి - అనునాసికసంధి - ర,హలు తప్ప మిగిలిన వర్గాక్షర హల్లులకు (వ్యంజనము) అనునాసిక వర్ణము పరమగునపో వానికి సంబంధించిన అనునాసికవర్ణము వికల్పముగా నాదేశమగును. మనోఽనురాగము = మనస్ + అనురాగము. పదాంత సకారమునకు విసర్గాదేశము. మనః + అనురాగము. హ్రస్వఅకారము పూర్వమందుండగా విసర్గమునకు హ్రస్వ అకారము గాని, మృదుహల్లులు (హశ్శులు) గాని పరము అగునపో ఉ ఆదేశముగా వచ్చి పూర్వ అకారముతో గుణ సంధియై ఓ గా మారును. మన + ఉ + అనురాగము = మనోఽనురాగము.

వ. నిజాశేష కుల కళత్ర పుత్త్ర సమేతుండై చనుదెంచి పరమేశ్వరునిం గని ముహుర్ముహుర్మహీతలాలంకృత సర్వాంగుండై నిజదేహాది సమస్త రాజ్యవిభవంబులు నీశ్వరు శ్రీపాదంబులకు నివేదించి. 97

అర్థము: నిజ + అశేష – పుత్త్ర - సమేతుండు + ఐ = తన యెల్ల కులమువారితో, భార్యలతో, కొడుకులతోఁ గూడినవాఁడయి, చనుదెంచి = వచ్చి, పరమేశ్వరునిన్, కని, ముహుః + ముహుః + మహీతల + అలంకృత - సర్వ + అంగుండు + ఐ = మాటిమాటికి భూతలము నలంకరించిన యెల్ల అవయవములు గలవాఁడయి - మాటిమాటికి సాష్టాంగనమస్కారములు చేసినవాఁడయి, నిజ - దేహ + ఆది - సమస్త - రాజ్య - విభవంబులున్ = తనదైన శరీరము మున్నుగాఁగల యెల్ల రాజ్యవైభవములను, ఈశ్వరు = శివునియొక్క, శ్రీపాదంబులకున్ = శోభాయుక్తములైనపాదములకు, నివేదించి = సమర్పించి.

తాత్పర్యము: (హిమవంతుఁడు)తన యెల్లకులమువారును, భార్యా పుత్త్రులును గూడ రా వచ్చి పరమేశ్వరునిఁ జూచి మాటిమాటికి సాష్టాంగనమస్కారములు చేసి తన శరీరము మున్నుగా నెల్ల రాజ్యవైభవములు నీశ్వరుని శ్రీపాదములకు నివేదించి - తరువాతి పద్యములో నన్వయము.

విశేషములు: ముహుర్ముహుర్మహీతల - ముహుః + ముహుః + మహీతల - అఆలు తప్ప మిగిలిన అచ్చుల తరువాత వచ్చు విసర్గమునకు అచ్చులు గాని, మృదుహల్లులు (హశ్శులు) గాని పరము అగు నపుడు రేఫ మాదేశ మగును.

క. వినుతించుచున్న గిరిపతిఁ
గని గిరిశుఁడు సన్మనమునఁ గారుణ్యాలో
కన వార్ధి సుధారస వా
రి నిమగ్నునిఁ జేసి సురవరేణ్యునిఁ జేసెన్. 98

అర్థము : వినుతించుచున్ + ఉన్న = స్తోత్రముచేయుచున్న, గిరి - పతిన్ = కొండల రేనిని, కని, గిరిశుఁడు = కొండపైఁబరుండువాఁడు శివుఁడు, సత్ + మనమునన్ = మంచి మనస్సుతో, కారుణ్య .... నిమగ్నునిన్ : కారుణ్య+ ఆలోకన = దయతోడి చూ పనెడి, వార్ధి = సముద్రమునందలి, సుధారస - వారి = అమృతరసమనెడి నీటియందు, నిమగ్నునిన్ = మునిఁగినవానిని,చేసి, సుర - వరేణ్యునిన్ = దేవతాశ్రేష్ఠుని, చేసెన్.

తాత్పర్యము : స్తోత్రము చేయుచున్న హిమవంతునిఁ జూచి ఈశ్వరుఁడు మంచి మనసుతో దయాదృష్టి యనెడు సముద్రమునందలి యమృతరస మనెడి నీట మునిఁగినవానిని జేసి దేవతాశ్రేష్ఠునిగాఁ జేసెను.

విశేషములు : గిరిశుఁడు - గిరి (కైలాసము) యందుఁ బరుండువాఁడు- శివుఁడు. సత్ + మనమునన్ - అనునాసికసంధి, కారుణ్యాలోకవార్ధి సుధారస వారి నిమగ్నుని - రూపకాలంకారము.

వ. ఇట్లచలాధీశ్వరుం డీశ్వరు కరుణామృతరసప్రవాహాప్లావితుం
డగుచు నీశ్వరారాధనానంతసంతోషితాంతరంగుండగుచు నుండు;
నంతఁ గొంతకాలంబునకు రుద్రుండు గిరీంద్రున కనేకవరంబు
లొసంగి నిజపురంబున కరుగు మని నియోగించిన. 99

అర్థము : ఇట్లు, అచల + అధి + ఈశ్వరుండు = కొండల రేఁడు - హిమవంతుఁడు, ఈశ్వరు = శివునియొక్క. కరుణా + అమృత - రస-ప్రవాహ+ ఆప్లావితుండు=దయయనెడి అమృతరసముయొక్క ప్రవాహమునందు మునిఁగినవాఁడు, అగుచున్, ఈశ్వర + ఆరాధన + అనంత-సంతోషిత + అంతరంగుండు = శివుని పూజచే నధికముగా సంతోషించిన మనసుగలవాఁడు, అగుచున్ + ఉండున్, అంతన్,

కొంత కాలంబునకున్, పురహరుఁడు = ఈశ్వరుఁడు, గిరి + ఇంద్రునకున్ = పర్వత శ్రేష్ఠునకు - హిమవంతునకు, అనేక-వరంబులు = పెక్కు వరములు, ఒసంగి= ఇచ్చి, నిజ-పురంబునకున్ = స్వనగరమునకు, అరుగుము = పొమ్ము, అని, నియోగించినన్ = నియమింపఁగా.

తాత్పర్యము: ఇట్లు హిమవంతుఁ డీశ్వరుని దయారసప్రవాహమున మునిఁగి యీశ్వరారాధనముచే మిక్కిలి సంతోషించినవాఁడయియుండఁగాఁ గొంత కాలమునకు నీశ్వరుఁడు పర్వతరాజునకుఁ బెక్కువరము లిచ్చి స్వనగరమున కరుగుమని నియమింపఁగా - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు: ఈశ్వరు కరుణామృతరసప్రవాహాప్లావితుఁడు, -' కొన్ని యెడల నిద్ధసమాస మధ్యగత పదంబులతోఁ దద్భిన్నపదంబుల కన్వయంబుచూపట్టెడి' ప్రౌఢ. సమాస. ౩౮.

క. విని కాని యెన్నఁడును నినుఁ
గని యెఱుఁగరు హరి సరోజగర్భామర స
న్మునులు; లిట్టి ని స్వరూపముఁ
గని యియ్యెడఁ బాసి పోవఁగా నోపుదునే? 100

అర్థము: హరి-సరోజగర్భ + అమర-సత్ + మునులు = విష్ణువు, బ్రహ్మ, దేవతలు, మునిశ్రేష్ఠులు. నినున్, విని కాని. ఎన్నఁడును,కని, ఎఱుఁగరు, ఇట్టి, నీ, స్వరూపమున్, కని, ఈ + ఎడన్ = ఈ చోటును, పాసి=విడిచి, పోవఁగాన్ + ఓపుదునే = పోవఁజాలుదునా ?

తాత్పర్యము: విష్ణువు, బ్రహ్మ, దేవతలు, మునివరులు, నిన్ను వినుటయే కాని యెప్పుడును జూచి యెఱుఁగరు. ఇట్టి నీ స్వరూపమును జూచి నే నీ ప్రదేశమును విడిచిపోఁగలనా? పోలే ననుట.

విశేషములు: ఈ+ఎడ, 'సంధిలేనిచోట స్వరంబుకంటెం బరంబయిన స్వరంబునకు యడాగమంబగు' బాల. సంధి. ౩. ఈ+యెడ, 'త్రికంబుమీఁది యసం

యు క్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు.' బాల. సమాస. 14. ఈ + య్యెడ, 'ద్విప్ర క్తం బగు హల్లు పరంబగునప్పు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు.' బాల. సమాస. 13. ఇయ్యెడ. సన్మునులు - సత్ + మునులు - అనునాసిక సంధి.

వ. అని కరంబులు మొగిచి దీనాననుండై యున్న వాని భక్తి యుక్తికిం
గరుణించి సకలలోకాభీష్ట ఫల వృద్ధి కేదారాత్మకుండ నగుటం
గేదారేశ్వరుం డన నిప్పురంబున వసియించెద నోడకుండు మనిన
దానికిం బ్రసాదం బని. 101

అ ర్థ ము :అని, కరంబులు = చేతులు, మొగిచి = ముడిచి, దీన + ఆన నుండు + ఐ=దీనమైన ముఖము గలవాఁడయి, ఉన్నన్, వాని, భక్తి-యుక్తికిన్= భక్తితోఁ గూడియుండుటకు, కరుణించి = దయఁజూచి, సకల........త్మకుండన్; సకల = ఎల్ల, లోక = లోకములందలి జనులయొక్క. అభీష్ట = కోరిక లనెడి, ఫల=పంటయొక్క, వృద్ధి = పెరుఁగుటగల, కేదార+ ఆత్మకుండన్ = పొలము వంటి మనస్సు గలవాఁడను, అగుటన్ = అగుటచే. కేదారేశ్వరుండు+అనన్, ఈ+ పురంబునన్, వసియించెదన్, ఓడక+ఉండుము = భయపడకుము, అనినన్, దాని కిన్ = ఆ మాటకు, ప్రసాదంబు+అని = అనుగ్రహ మని.

తా త్ప ర్య ము : అని చేతులు జోడించి దీనముఖుఁడయి యున్న వాని భక్తికిఁ గరుణించి 'సకలలోకముల అభీష్టములనెడి ఫలముల వృద్ధికి నేను గేదారాత్మకుఁడ నగుటచేఁ గేదారేశ్వరుఁ డనుపేర నీ పురమున నివసింతును. శంకింపకు 'మనిన నందులకుఁ బ్రసాద మని - తరువాతిపద్యముతో నన్వయము.

వి శే ష ము లు : 'సకల లోకాభీష్టఫలవృద్ధి కేదారాత్మకుండను'-రూపకము. ఇప్పురము - ఈ + పురము + త్రికసంధి.

సీ. ఈ బాల తన్నుఁ దా నెఱిఁగినగోలె న
నన్యశరణ్యయై యహరహంబు
నిన్న కొల్చుచు నుండు నీ విందు మా పుణ్య
ఘునఁజేసి వచ్చుట విని ముదమునఁ

జూడంగ వచ్చె నిన్ జూచినగోలె భ
క్త్యావేశమునఁ జేసి జీవ మొడలఁ
బాసిన మీ పొందు వాయనోపదు పాసి
తలరుఁ గావున నిచ్చఁ దగిన వరవుఁ

ఆ. బనులు సేయుచుండుఁ; బార్వతి యునికికి
వరద! యిచ్చగింపవలయు ననిన
నతని విన్నపమున నంతకు భక్తవ
త్సలుఁడు నెమ్మనమున సంతసించి. 102

అర్థము : ఈ-బాల, తన్నున్ + తాను + ఎఱిఁగినగోలెన్ = తనకు జ్ఞానము వచ్చినది మొదలుకొని, అనన్య-[illegible]ణ్య + ఐ = నీకంటె నితరుఁడు శరణు పొందఁ దగినవాఁడు లేనిదయి. అహ-[illegible]హంబున్ = ప్రతిదినమును,

నిన్నున్ + అ = నిన్నే, కొల్చుచున్ + ఉండున్ = సేవించుచుండును, నీవు, ఇంచుస్ = ఇచ్చటికి. మా - పుణ్యమునన్ + చేసి = మేముచేసినపుణ్యము చేత, వచ్చుట, విని, ముదమునన్ = సంతోషముతో,

నిన్ = నిన్ను, చూడంగన్ + వచ్చెన్, చూచినగోలెన్ = చూచినదిమొదలు కొని, భక్తి + ఆవేశమునన్ + చేసి = భక్తియొక్క-ఉద్రేకముచేత, జీవము = ప్రాణము, ఒడలన్ + పాసినన్ = మేనియందుండి పోయినను,

మీ - పొందు, పాసి = విడిచి, తలరున్ + కావునన్ = చలించును గావున, పాయన్ + ఓపదు = విడువఁజాలదు, ఇచ్చన్ = కోరికతో, తగిన, వరవు + పనులు = సేవాకృత్యములు, చేయుచున్ + ఉండున్, పార్వతి + ఉనికికిన్ = పార్వతి ఉండుటకు, వరద = వరములనిచ్చువాఁడా! ఇచ్చగింపవలయును, = అంగీకరింప వలయును. అనినన్, అతని-విన్న[illegible]మునన్ = అతని మనవిచేత, అంతకున్ = దానికి, భక్త-వత్సలుఁడు = భక్తులయెడ వాత్సల్యము గలవాఁడు - శివుఁడు, నెమ్మనమునన్ = (నెఱ + మనమునన్) = నిండుమనసునందు, సంతసించి,

తాత్పర్యము: 'ఈ బాల తనకు జ్ఞానము వచ్చినది మొదలుకొని నిన్నే శరణుపొందినది; ప్రతిదినమును నిన్నే కొలుచుచుండును. మేము చేసిన పుణ్యముచేత నీ విప్పటికి విచ్చేసితివని విని సంతోషముతో నిన్నుఁ జూడ వచ్చెను. చూచినవాడిగా భక్తి యుద్రేకించి, ప్రాణము పోయినను మీ పొందు విడుచుచోఁ జలించిపోవును గావున విడువఁజాలదు. కావునఁ గోరికలోఁ దగిన సేవాకృత్యములు చేయుచుండును. దయచే, పార్వతి యుండుటకు సమ్మతింపవలయు' ననిన నతని పలుకు నాలించి దానికి భక్తవత్సలుఁడైన శివుఁడు మనసులో సంతోషించి, తరువాతి వచనముతో నన్వయము.

విశేషములు: ఎఱిఁగినగోలె-ఎఱిఁగిన + కోలె- ఎఱిఁగినది మొదలుకొని. కోలె-కొలె (రూపాం.) అహరహము-అహన్ + అహన్-అహన్‌శబ్దమునందలి నకారము నకు విభక్తిప్రత్యయము పరము గానిచో, నెల్లయెడల రేఫాదేశ మగును. అహర్ + అహర్ = అహరహః, భక్తి + ఆవేశము = భక్త్యావేశము - యణాదేశసంధి. ఇ ఉ ఋ ౡ లకు అసవర్ణాచ్చులు పరములగుచోఁ గ్రమముగా య్ వ్ ర్ ల్ అనునవి ఆదేశము లగును. భక్త్యావేశమునఁజేసి' కొన్నియెడలఁ జేతవిభక్త్యర్థక వర్ణకంబులకును వలన వర్ణకంబునకును దఱచుగఁజేసి యనుప్రయుక్తం బగు.' ప్రౌఢ.కారక. 4. వరవుఁ బనులు-వరవు + పనులు-'సమాసంబుల నుదంతంబులగు స్త్రీసమంబులకుం బుంపులకుం బరుషసరళంబులు పరంబు లగునపుడు నుగాగమంబగు.' బాల, సంధి,25. వరవు + ను + పనులు. 'ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళము లగు.' బాల. సంధి. 16. వరవు + ను + బనులు. 'ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాష నగు.' బాల సంధి. 17. వరవుఁబనులు. విన్నపము (వికృతి) - విజ్ఞాపనము (ప్రకృతి). నెమ్మనము - నెఱ + మనము. 'అన్యంబులకు సహిత మిత్వాత్వంబులు కొండొకచోఁ గానంబడియెడి.' బాల,సంధి.39.

ఈ పద్యమునందలి వరద, భక్తవత్సలుఁడు అనుపదములు సాభిప్రాయములు.

వ. అదత్తప్రతివచనుం డైన దానికి మహాప్రసాదం బని యనేక
మాణిక్యకల్పలేపాంబరాలంకృతం బైన కన్యాంతఃపురంబులోన. 103

అర్థము : ఆదరత్ - ప్రతివచనుండు = ఈఁబడని సమాధానముగలవాఁడు. సమాధానమీనివాఁడు, ఐనన్ = కాఁగా, దానికిన్, మహత్ (మహా) + ప్రసాదంబు + అని = గొప్ప యనుగ్రహ మని, అనేక-మాణిక్య + ఆకల్ప-లేప + అంబర + అలంకృతంబు = పెక్కు మాణిక్యభూషణములతోను, మైపూఁతలతోను, వస్త్రముల తోను, అలంకరింపఁబడినది, ఐన, కన్యా + అంతఃపురంబుతోన్ + అ = అంతః పురకన్యలతోనే,

తాత్పర్యము : ఈశ్వరుఁడు హిమవంతునకు సమాధానము చెప్పకపోఁగా హిమవంతుఁడు ఆతని మౌనము నంగీకారముగా భావించి గొప్ప యనుగ్రహమని పెక్కు మణిభూషణములతోను, మైపూఁతలతోను, వస్త్రములతోను అలంకరింపఁబడిన అంతఃపురకన్యలతో-తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : కన్య (ప్రకృతి)-కన్నె,కన్నియ (వికృతి), అంతఃపురము (ప్రకృతి) అంతిపురము (వికృతి)

క. ఆ క్షితిధరపతి శివుఁ బ్ర
త్యక్షముగాఁ గొలుచుచుండు మని తత్పరుఁడై
శిక్షించి గౌరి నందు సు
రక్షితముగ నునిచి నిజపురంబున కరిగెన్. 104

అర్థము : ఆ-క్షితిధర-పతి = ఆ కొండల ఱేఁడు, శివున్ = శివుని, ప్రత్యక్షము గాన్ = ఎదురుగా నుండి, కొలుచుచున్ + ఉండుము + అని = సేవించుచుండుమని, తత్పరుఁడై = ఆసక్తి గలవాఁడయి, శిక్షించి = బోధించి, గౌరిన్, అందున్ = ఈశ్వరు నాశ్రమమునందు, సురక్షితముగన్ = క్షేమముగా, ఉనిచి = ఉంచి, నిజ-పురంబునకున్ = తన పురమునకు, అరిగెన్.

తాత్పర్యము : ఆ హిమవంతుఁడు 'శివునిఁ బ్రత్యక్షముగాఁ గొలుచుచుండు మని బోధించి పార్వతిని శివునాశ్రమమునందు సురక్షితముగా నుంచి తన నగరమున కరిగెను.

వ. అంతం బార్వతియు నీశ్వరారాధనాసక్తియుక్తయై భక్తియు నను రక్తియు నంతకంత కగ్గలించుచుండ. 105

అర్థము: అంతన్, పార్వతియున్, ఈశ్వర+ఆరాధన+ఆసక్తి+యుక్త+ఐ=శివపూజయం దాసక్తితోఁ గూడినదయి, భక్తియున్, అనురక్తియున్=ప్రీతియు, అంతకున్+అంతకున్=క్రమక్రమముగా, అగ్గలించుచున్+ఉండన్=అధిక మగుచుండఁగా.

తాత్పర్యము: అంతఁ బార్వతియు శివుని బూజించుటయం దాసక్తి గలదియై భక్తియు అనురక్తియుఁ గ్రమక్రమముగా అధికమగుచుండఁగా - తరువాతి పద్యములో నన్వయము.

సీ. చమరీజ బర్హా మార్జనులఁ బరీక్షించి
నయమున సమ్మార్జనంబు సేయుఁ;
గర్పూరతైలార్ద్రకస్తూరికాకర్ద
మంబుల ననులేపనంబు సేయుఁ;
గాశ్మీర మాంజిష్ఠ గరుడాండ హరినీల
ముక్తాఫలంబుల ముగ్గువెట్టుఁ;
గుసుమ పల్లవ లతా కోరకంబులఁ జిత్ర
దామంబు లొనరించుఁ దావి మిగులఁ;

తే. బుష్పమందిర మొనరించుఁ; బుణ్యవారి
సౌరభము లించు మణికలశముల నించు;
నచలపతిసుత మది నిట్టు లహరహంబు
శివున కనురక్తిఁ బరిచర్య చేయుచుండె. 106

అర్థము, చమరీజ-బర్హ-మార్జనులన్=చమరీమృగముల వాలములతోఁ జేసిన చీఁపురులతో. పరీక్షించి=చక్కఁగాఁ జూచి. నయమునన్=బాగుగా. సమ్మార్జనంబు+చేయున్=తుడుచును.

కర్పూర-తైల + ఆర్ద్ర-కస్తూరికా-కర్దమంబులన్ = కప్పురపుఁదైలముతోఁ, దడిసిన కస్తూరి పంకములతో, అనులేపనంబు + చేయున్ = పూఁతపెట్టును.

కాశ్మీర-మాంజిష్ఠ-గరుడాంశ-హరినీల-ముక్తాఫలంబులన్ = కుంకుమపువ్వు, ఎఱుపుమించినపసుపువన్నె, గరుడపచ్చలు, ఇంద్రనీలములు, ముత్యములు అనువానితో, మ్రుగ్గు + పెట్టున్.

కుసుమ-పల్లవ-లతా-కోరకంబులన్ = పూలు, చివురులు, తీఁగలు, మొగ్గలు ననువానితో, తావి-మిగులన్ = పరిమళ మతిశయింపఁగా, చిత్ర-దామంబులు = రంగు రంగుల మాలికలు, ఒనరించున్.

పుష్ప-మందిరము = పూల యిల్లు, ఒనరించున్; పుణ్య-వారిన్ = పవిత్ర జలమును, సౌరభములు + ఇంచు = పరిమళము లతిశయించు, మణి - కలశములన్ = మణిమయములైన పాత్రములను, నించున్ = నిండించును.

అచల-పతి-సుత = కొండలఱేని కూఁతురు-పార్వతి, మదిన్ = కోరికతో, ఇట్టులు, అహరహంబున్ = ప్రతిదినమును, శివునకున్, అనురక్తిన్ = అనురాగముతో-ఇష్టముతో, పరిచర్య = సేవ, చేయుచున్ + ఉండెన్.

తాత్పర్యము: చమరీమృగముల వాలములతోఁ జేసిన చీఁపురులతోఁ జక్కఁగా నూడ్చి బాగుగాఁ దుడుచును. కప్పురపుఁదైలముతోఁ దడిసిన కస్తూరీపంకములతోఁ బూఁతపెట్టును. కుంకుమపువ్వు, మాంజిష్ఠము, గరుడపచ్చలు, ఇంద్రనీలములు, ముత్యములు అనువానితో మ్రుగ్గు లిడును. పూలు, చివురులు, తీఁగలు, మొగ్గలు కూర్చి పరిమళ మతిశయించునట్లుగఁ జిత్రవర్ణముల దండలు గ్రుచ్చును. పూలతో మందిరము కట్టును. పవిత్రజలముతో సౌరభ మతిశయించు మణిమయ పాత్రములను నించును. పర్వతరాజపుత్త్రిక యీ రీతిగాఁ గోరికతోఁ బ్రతిదినమును శివున కనురాగముతో సేవ చేయుచుండెను.

విశేషములు: కాళిదాసు కుమారసంభవమునఁ బార్వతీ పరిచర్య యిట్లు వర్ణింపఁబడెను.

'అవచిత బలిపుష్పా వేది సమ్మార్గ దక్షా
నియమవిధి జలానాం బర్హిషాం చోపనేత్రీ,
గిరిశ ముపచచార ప్రత్యహం సా సుకేశీ,
నియమిత పరిఖేదా తచ్ఛిరశ్చన్ద్రపాదైః,' కుమార. 1-60

చ. పొలుపుగఁ జంద్రశేఖరు తపోవన మంగజచక్రవర్తి దో
ర్బలమున ముట్టి చూఱకొనఁ బంచిన దం డొకొ నాఁగఁ బొల్చి క
న్యలు తనుఁ గొల్చి రా నచలనందన సుందరలీల నిచ్చలుం
గొలుచుచునుండె భక్తి నహికుండల మండిత గండమండలున్. 107

అర్థము: పొలుపుగన్=ఒప్పుగా, చంద్రశేఖరు-తపస్(ః)+వనము=శివుని తపోవనమును, అంగజ-చక్రవర్తి=మన్మథుఁ డను రాజు, దోస్(ః)+బలమునన్=భుజబలముతో, ముట్టి=ముట్టడించి, చూఱకొనన్=కొల్లగొట్టుటకు, పంచిన=పంపిన, దండు+ఒకొ=సేనయా, నాఁగన్=అనునట్లు, పొల్చి=ఒప్పి, కన్యలు=పడుచులు-చెలికత్తెలు, తనున్=తన్ను, కొల్చి-రాన్=సేవించుచు రాఁగా, అచల-నందన=కొండ కూఁతురు-పార్వతి, సుందర-లీలన్=అందమగు రీతిని, నిచ్చలున్=ఎల్లప్పుడును, భక్తిన్=భక్తితో, అహి-కుండల-మండిత-గండ-మండలున్=పాములనెడు, చెవి కమ్మలతో, నలంకరింపఁబడిన, చెక్కిళ్ల ప్రదేశము గలవానిని-శివుని, కొలుచుచున్+ఉండెన్.

తాత్పర్యము: శివుని తపోవనమును మన్మథుఁడనెడి చక్రవర్తి భుజబలము తో ముట్టడించి కొల్లగొట్టుటకుఁ బంపిన సేనయా యనునట్లు ఒప్పి చెలికత్తెలు తన్నుఁ గొల్చుచురాఁగాఁ బార్వతి మనోహరముగా నిత్యమును భక్తితో సర్పకుండల ములతో నలంకరింపఁబడిన చెక్కిళ్లుగలవానిని-శివునిఁ గొల్చుచుండెను.

విశేషములు: అంగజ-చక్రవర్తి-అంగజుఁ డనెడి చక్రవర్తి - రూపకము. ముట్టిచూఱకొనఁ బంచిన దండొకొ నాఁగ-ఉత్ప్రేక్ష. అహికుండల - అహులనెడు కుండల-రూపకము. కుండల మండితగండమండలున్ - వృత్త్యనుప్రాసము.

దోస్ + బలమున. సకారాంతసకారమునకు విసర్గాదేశము. దోః + బలమున. అ ఆలు తప్ప మిగిలిన అచ్చుల తరువాత వచ్చు విసర్గమునకు అచ్చులుగాని మృదుహల్లులుగాని పరము అగునప్పుడు రేఫ మాదేశ మగును, దోర్బలమున.

సీ. మొన లావులించి వాసన చల్లఁ బసిగొని
 లేఁదేఁటి గము లెంగిలింపకుండ,
నెడ నూఱకొని వేచి సుడియు తెమ్మెరలచేఁ
 బొడము పుప్పొడి పొలివోవకుండఁ,
దరణి కూటమున మే యెరలి పద్మిని మేన
 మొలతెంచు మధుమద మొలుకకుండ.
మేల్కాని గోమిని మెలఁగి మై మురిసినఁ
 బొదిగొన్న యకరువు చెదరకుండఁ

తే. దెలిసి జక్కవ లొండొంటిఁ గలయఁ దారు
కలకలంబున రేకులు గదలకుండ,
మున్న కొనివచ్చి గణికాసమూహితోడ
గిరిజ పూజించెఁ బసిఁడితామరల వరదు. 108

అర్థము : మొనలు = కొనలు, అవులించి = విచ్చి, వాసన-చల్లన్ = పరిమళమును వ్యాపింపఁజేయఁగా, పసిగొని = ఆఘ్రాణించి, లేఁదేఁటి-గములు (లేఁత + తేఁటి-గములు) = కొదమతుమ్మెదల గుంపులు, ఎంగిలింపకుండన్ = ఎంగిలి చేయకుండను,

ఎడ - చూఱకొని = అవకాశమును జూచుకొని, వేచి, సుడియు = వ్యాపించు, తెమ్మెరలచేన్ = గాలిచే, పొడము = పుట్టునట్టి, పుప్పొడి, పొలి + పోవక + ఉండన్ = నవకము తప్పకుండను,

తరణి-కూటమునన్ = సూర్యుని సంసర్గమున, మే = శరీరము, ఎరలి = వేఁడియెక్కి, పద్మిని-మేనన్ = పద్మలత శరీరమున, మొలతెంచు = పుట్టునట్టి, మధు-మదము = మకరందమనెడి మదము, ఒలుకక + ఉండన్ = ఒలుకకుండను మున్నే.

మేల్కని = నిద్రనుండి మేలుకాంచి, గోమిని = లక్ష్మీదేవి, మెలఁగి = కదలి, మైన్ = శరీరమును, మురిసినన్ = విఱుదుకొనఁగా. పొదిగొన్న = గుత్తిగా నున్న, అకరువు = కింజల్కము, చెదరక + ఉండన్ = మున్న + అ = చెదరిపోవుటకు ముందే,

తెలిసి = (సూర్యోదయమగుటచే) తేరుకొని, జక్కవలు = చక్రవాకపక్షులు, ఒండొంటిన్ = ఒకదానితో నొకటి, కలయన్ = కలిసికొనుటకై, తారు-సమీపించు కలకలంబున్ = సందడిచేత, రేకలు = దళములు, కదలక + ఉండన్ + మున్న + అ = కదలుటకు మునుపే,

కొనివచ్చి = తీసికొనివచ్చి, గిరిజ = పార్వతి, గణికా - సమూహితోడన్ = గణికల మొత్తముతో, పసిఁడి - తామరలన్ = బంగారు తామరపూలతో, వరదున్ = కోరికలనిచ్చువాఁడగు పరమేశ్వరుని. పూజించెన్.

తాత్పర్యము : మొగ్గల కొనలు విచ్చి పరిమళము ప్రసరించినంతనే దాని నాఘ్రాణించి కొదమతుమ్మెదలు ఎంగిలిచేయుటకు మునుపే, అవకాశము చూచుకొని వేచి వ్యాపించు గాలులచే పుట్టు వుప్పొడి నవకముతప్పుటకు మునుపే, సూర్యునితోడి సంసర్గమున శరీరము వేఁడెక్కి పద్మలత శరీరమున పుట్టు మధుమదము ఒలుకుటకు మునుపే, యందుండి నిద్రించుచున్న లక్ష్మీదేవి మేలుకొని యిటునటు కదలి యొడలు విఱుచుకొనఁగా గుత్తులుగానున్న కింజల్కములు చెదరిపోవకమున్నే, సూర్యోదయ మయినంతనే తమ జంటపక్షులున్నచోటు తెలిసి చక్రవాకములు పరస్పరము గలియుటకై పోవు సంభ్రమమున రేకులు కదలిపోక మునుపే పార్వతి గణికలమొత్తముతోఁ గలిసి పోయి తీసికొనివచ్చి బంగరు తామరపూవులతోఁ బరమేశ్వరునిఁ బూజించెను.

విశేషములు : తుమ్మెదలుగూడ ముట్టని పూవులతోఁ బూజించుట శైవులకు మిక్కిలి విహితమైన కార్యము. అలంకారము స్వభావోక్తి.

ఆశ్వాసాంతము

ఉ. చారుతరావదాత నుత శాశ్వతకీర్తి రసప్రవాహ సం
పూరిత రోదసీకుహరుఁ, బుణ్యు, సనాతనమూర్తి, సజ్జనా
ధారు, సమస్తలోకజనతా నుత పాదసరోజపీఠు, శృం
గారభవారి, సర్గజన కల్పమహీజము, మల్లికార్జునున్.

అర్థము : చారు......కుహరున్; చారుతర = మిక్కిలి మనోహరము, అనవాత = నిర్మలము, నుత = పొగడఁబడినది, శాశ్వత = స్థిరము, (అగు), కీర్తి-రస = కీర్తియనెడు రసముయొక్క, ప్రవాహ = ప్రవాహముచేత, సంపూరిత= బాగుగా నింపఁబడిన, రోదసీ-కుహరున్ = భూమ్యాకాశముల మధ్యభాగము గలవాఁడును, పుణ్యున్ = పవిత్రుఁడును, సనాతన-మూర్తిన్ = శాశ్వతమయిన యాకారము గలవాఁడును, సత్ + జన + ఆధారున్ = మంచిజనుల కాధారమయినవాఁడును, సమస్త-లోక-జనతా-నుత-పాద-సరోజ-పీఠున్ =ఎల్లలోకములందలి, జనసమూహము చే, స్తుతింపఁబడిన, పాదపద్మముల పీఠము గలవాఁడును, శృంగార-భవ + అరిన్= మన్మథునకు శత్రువైనవాఁడును. అర్థి-జన-కల్పమహీజమున్ = యాచకజనులకుఁ గల్పవృక్షమైనవాఁడును-యాచకులు కోరినకోర్కెలు దీర్చువాఁడును, అగు మల్లికార్జునున్ = జంగమ మల్లికార్జునుని.

తాత్పర్యము : మనోహరము, నిర్మలము, సన్నుతము,శాశ్వతమునైన కీర్తియనెడు రసముప్రవాహముచే బాగుగా నింపఁబడిన భూమ్యాకాశమధ్య ప్రదేశము గలవాఁడును, పవిత్రుఁడును, శాశ్వతమైనమూర్తి గలవాఁడును, సుజనుల కాధారమైన వాఁడును, ఎల్లలోకములందలి జనసమూహముచే స్తుతింపఁబడిన పాదపద్మముల పీఠము గలవాఁడును, మన్మథునకు శత్రువయినవాఁడును, యాచకజనుల కోరికలను దీర్చు కల్పవృక్షమైనవాఁడును, అగు మల్లికార్జునుని.

విశేషములు : కీర్తిరస – రూపకము. అర్థిజన కల్పమహీజము - రూపకము.

సజ్జన - సత్ + జన - అనునాసికాంతస్థవర్ణములుతప్ప మిగిలిన పదాంతగత హల్లులకు (ఝల్లులకు) మృదుహల్లులు (హశ్శులు) కాని అచ్చులుకాని పరమగునపుడు ఆ హల్లుల వర్గమునకుఁ జెందిన తృతీయవర్ణ మాదేశముగా వచ్చును. సద్ + జన- సకార తవర్గములకు శవర్ణ చవర్గములతో పూర్వమందైనను పరమందైనను కూడిక గలుగునపుడు క్రమముగా శవర్ణ చవర్గ వర్ణము లాదేశమగును. సజ్జన.

క. అనవరత దాన రతుఁ, బా
వనతర శుభమూర్తి, భక్తవత్సలు, జనతా
వినుత మతి క్రము, భవ సం
గ నివృత్తు, మునీంద్ర వర శిఖామణి, ననఘున్. 110

అర్థము : అనవరత - దాన - రతున్ = నిరంతరదానమునం దాసక్తి గలవాఁడును, పావనతర - శుభ - మూర్తిన్ = మిక్కిలి పవిత్రము శుభము నైన ఆకారము గలవాఁడును, భక్త-వత్సలున్ = భక్తులమీఁద దయగలవాఁడును, జనతా-వినుత-మతి-క్రమున్ = జనసమూహముచే బాగుగాఁ బొగడఁబడిన బుద్ధియొక్క సామర్థ్యము గలవాఁడును, భవ - సంగ - నివృత్తున్ = సంసారముతోడి సంబంధమునుండి మరలినవాఁడును, ముని + ఇంద్ర-వర-శిఖామణిన్ = మునిశ్రేష్ఠులలోఁ దలమానికమైన (శ్రేష్ఠుఁడైన) వాఁడును, అనఘున్ = పాపరహితుఁడైనవాఁడును అగు జంగమ మల్లికార్జునుని,

తాత్పర్యము : నిరంతరదానమునం దాసక్తిగలవాఁడును, పావనతరము శుభము నైన మూర్తి గలవాఁడును, భక్తవత్సలుఁడును, జనులు నుతించు బుద్ధివైభవము గలవాఁడును, సంసారసంగతినుండి మరలినవాఁడును, మునిశ్రేష్ఠులలోఁ దలమానిక మైనవాఁడును, పాపరహితుఁడును అగు జంగమ మల్లికార్జునుని.

ఉ. సత్యవిలాసు, నాదిముని, సచ్చరితుం, గవి గాయకాది సం
స్తుత్యు, ననూన దాన నిరతుం, గరుణాకరు, సజ్జనాంబుజా
దిత్యు, వినిర్జితాంగభవుఁ, దీర్ణ భవార్ణవు, శేముషీ సురా
మాత్యు, సదాత్మ యోగిజనమండను, జంగమమల్లికార్జునున్. 111

అర్థము : సత్య - విలాసున్ = సత్యముయొక్క చక్కఁదనము గలవాఁడును, ఆది - ముని - సచ్చరితున్ = ఆద్యులైన మునులయొక్క మంచి నడవడి గలవాఁడును, కవి - గాయక + ఆది - సంస్తుత్యున్ = కవులు, గాయకులు మున్నగు వారిచే లెస్సగాఁ బొగడఁదగినవాఁడును, అనూన - దాన - నిరతున్ = తక్కువకాని (అధికమైన) దానమునందు ఆసక్తి గలవాఁడును, కరుణాకరున్ = దయను జేయు వాఁడును, (దయకు గనియైనవాఁడును). సత్ + జన + అంబుజ + ఆదిత్యున్ = సుజనులనెడి పద్మములకు సూర్యుఁడైనవాఁడును (సుజనులను సంతోషపెట్టువాఁడును), వినిర్జిత + అంగభవున్ = జయింపఁబడిన మన్మథుఁడు గలవాఁడును, తీర్ణ - భవ + అర్ణవున్ = దాటఁబడిన సంసారసముద్రముగలవాఁడును, శేముషీ - సుర + అమాత్యున్ = బుద్ధియందు దేవమంత్రి (బృహస్పతి) యైనవాఁడును, సత్ + ఆత్మ-యోగి-జన-మండనున్ = మంచి మనస్సుగల యోగిజనుల కలంకారమైనవాఁడును, అగు జంగమమల్లికార్జునున్,

తాత్పర్యము : సత్యము చక్కగా గలవాఁడును, ఆద్యులైన మునుల మంచి నడవడి గలవాఁడును, కవులు గాయకులు మున్నగువారిచే మిక్కిలి స్తుతింపఁదగిన వాఁడును, అధికమైన దానగుణమునం దాసక్తి గలవాఁడును, కరుణకు గనియైనవాఁడును, సుజను లనెడి పద్మములకు సూర్యుఁడైనవాఁడును, జయింపఁబడిన మన్మథుఁడు గలవాఁడును, (మన్మథుని జయించినవాఁడును), సంసారసముద్రమును దాఁటిన వాఁడును, బుద్ధియందు బృహస్పతి యైనవాఁడును, మంచిమనస్సుగల యోగిజనులకు అలంకారమైనవాఁడును అగు జంగమ మల్లికార్జునుని.

విశేషములు : సజ్జనాంబుజాదిత్య - రూపకము. తీర్ణభవార్ణవు - రూపకము, శేముషీసుధామాత్య - రూపకము.

క. ధీమణి, నాశ్రితజన ర
క్షామణిఁ, గవి గమకి వాగ్మి గాయక నట చిం
తామణి, సన్ముని గణ చూ
డామణి, నిహలోక వర నిటలతట నయనున్. 112

అర్థము : ధీమణిన్ = బుద్ధియనెడిమణిగలవాఁడును, ఆశ్రిత-జన-రక్షా-మణిన్ = ఆశ్రయించిన జనుల రక్షణమందు మణియైనవాఁడును, కవి - గమకి - వాగ్మి - గాయక-నట-చింతామణిన్ = కవులు, గమకులు (స్వరవిన్యాసము గలవారు) వక్తలు, గానముచేయువారు, నట = నటులు, అనువారికిఁ చింతామణి (కోరిన కోరికలుదీర్చువాఁడు) అయినవాఁడును, సత్ + ముని-గణ-చూడామణిన్ = మంచి మునుల సమూహమునకుఁ దలమానికమైనవాఁడును (వారిలో శ్రేష్ఠుఁడును అనుట.) ఇహ-లోక-వర-నిటల-తట-నయనున్ = భూలోకమునందు శ్రేష్ఠుఁడైన నొసటికంటి వాఁడును (శివుఁడును) అగు జంగమమల్లికార్జునుని.

తాత్పర్యము : బుద్ధి యను మణి గలవాఁడును, ఆశ్రితజనులరక్షణము నందు మణియైనవాఁడును, కవులు, గమకులు, వక్తలు, గాయకులు, నటులు అనువారికిఁ గోరిన కోరికలు దీర్చు చింతామణి యైనవాఁడును, సన్మునిగణమునకుఁ దలమానికమైనవాఁడును, ఈ లోకమున శ్రేష్ఠుఁడైన శివుఁడైనవాఁడును అగు జంగమ మల్లికార్జునుని.

విశేషములు: కవి గమకి వాగ్మి ప్రశంస లమితమాహాత్మ్యము సముచ్చరించి చేయఁబడెను. ఈ పరిగణనమును తెలుఁగులో నిరంకుశప్రవేశమును జేయుచేము.

వనమయూరము

మేరునగధీరు, నిరమిత్త్రు, సుచరిత్రున్,
వారిధి గభీరు, నిరవద్యు, జనవంద్యున్,
చారుతరమూర్తి, నతిశాంతు, గుణవంతున్,
మారహరు, సర్వజనమాన్యు, మునిమాన్యున్. 113

అర్థము: మేరు-నగ-ధీరున్ = మేరుపర్వతమువలె ధీరుఁడైన వాఁడును, నిరమిత్త్రున్ = శత్రువులులేనివాఁడును, సుచరిత్రున్ = మంచినడవడి గలవాఁడును, వారిధి-గభీరున్ = సముద్రమువలె లోఁతయినవాఁడును. నిరవద్యున్ = అనింద్యుఁడును, జన-వంద్యున్ = జనులచే నమస్కరింపఁదగినవాఁడును, చారు-తర-మూర్తిన్ = మనోహరమైన రూపము గలవాఁడును, అతి-శాంతున్ = మిక్కిలి శాంతము గలవాఁడును, గుణవంతున్ = మంచిగుణములు గలవాఁడును, మార-హరున్ = మన్మథుని హరించినవాఁడును, సర్వ-జన-మాన్యున్ = ఎల్లజనులచే గౌరవింపఁదగినవాఁడును, ముని-మాన్యున్ = మునులచే మన్నింపఁదగినవాఁడును అగు జంగమ మల్లికార్జునుని.

తాత్పర్యము: మేరుపర్వతమువలె ధైర్యము గలవాఁడును, శత్రువులు లేనివాఁడును, మంచి నడవడి గలవాఁడును, సముద్రమువలె గంభీరుఁడును, అనింద్యుఁడును, జనులచే నమస్కరింపఁదగినవాఁడును, మనోహరమైన రూపము గలవాఁడును, మిక్కిలి శాంతగుణము గలవాఁడును, గుణవంతుఁడును, మన్మథుని హరించినవాఁడును (శివుఁడైనవాఁడును), జనులకందఱకును గౌరవింపఁదగినవాఁడును, మునులకు సమ్మానింపఁదగినవాఁడును - అగు జంగమ మల్లికార్జునుని,

విశేషములు: అంత్యప్రాసము. వనమయూరము - నాలుగు పాదము లుండును. ప్రతిపాదమునను భ-జ-స-న-గగ అను గణము లుండును. మొదటి

యక్షరమునకును తొమ్మిదవయక్షరమునకును యతిమైత్రి చెల్లవలయును. ప్రాస నియమము గలదు.

గద్యము

ఇది శ్రీమజ్జంగమ మల్లికార్జునదేవ దివ్యశ్రీపాదపంకజ భ్రమరాయమాణ కవిరాజశిఖామణి నన్నెచోడదేవ ప్రణీతంబయిన కుమారసంభవం బను కథయందుఁ దృతీయాశ్వాసము

దీనికి వ్యాఖ్య ప్రథమాశ్వాసాంత గద్యమునకువలెనే.

మ. ఇది శ్రీ బొన్నలగడ్డ వంశమణియౌ మృత్యుంజయాఖ్యుండు స
మ్మదమెప్పారఁ గుమారసంభవము శ్రీమన్నన్నెచోడాఖ్య వి
ద్వదధీశోక్తము శాబ్దికార్థ వివిధస్వారస్య తాత్పర్యముల్
చదురొప్పన్ వచియించి మన్చు విలసత్ సంజీవనీ వ్యాఖ్యయౌ.

# కుమార సంభవము

## చతుర్థాశ్వాసము

క. శ్రీమ దశేష మునీంద్ర
గ్రామణి, నుత చరితు, విగత కల్మషు. శివత
త్త్వామల మతిప్రకాశు, ద
యామృత సరసీశు, మల్లికార్జునదేవున్. 1

అర్థము : శ్రీమత్ + అశేష - ముని + ఇంద్ర - గ్రామణి - నుత-చరితున్=శ్రీమంతులైన ఎల్ల మునిశ్రేష్ఠులలో ముఖ్యులైనవారిచేతఁ బొగడఁబడిన నడవడిగలవాఁడును, విగత-కల్మషున్=పోయిన పాపముగలవాఁడును, శివ-తత్త్వ + అమల-మతి-ప్రకాశున్= శివుని తత్త్వముచే నిర్మలమైన మనస్సుయొక్క ప్రకాశము గలవాఁడును, దయా+అమృత-సరసీశున్ = దయ యనెడి అమృతమునకు సముద్రుఁడైనవాఁడును, (అగు) మల్లికార్జునదేవున్ = జంగమ మల్లికార్జున దేవుని.

తాత్పర్యము : ఎల్ల మునిశ్రేష్ఠులును గొనియాడు మంచి నడవడి గలవాఁడును, కల్మషము (పాపము) లేనివాఁడును, శివతత్త్వమువలనఁ బ్రకాశించు మనస్సుగలవాఁడును, దయ యనెడి యమృతమునకు సముద్రుఁడైనవాఁడును అగు జంగమ మల్లికార్జున దేవుని.

విశేషములు : దయామృత సరసీశు-రూపకము.

వ. ఇట్లు పార్వతి పరమభక్తియుక్తిం దగిలి నిరంతర శుశ్రూషాతత్పర యగుచుండె నంత. 2

అర్థము : ఇట్లు, పార్వతి. పరమ-భక్తి-యుక్తిన్ = గొప్ప భక్తితోడి కూడికతో, తగిలి = ఆసక్తి వహించి, నిరంతర - శుశ్రూషా-తత్పర = ఎడతెగని సేవయందు ఆసక్తిగలదై, అగుచున్ + ఉండెన్, అంతన్.

తాత్పర్యము ; ఈ విధముగాఁ బార్వతి గొప్పభక్తితో నాసక్తి వహించి యెడతెగని సేవయందుఁ దత్పర యగుచుండెను. అంత - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : శుశ్రూషా = విన నిచ్ఛ. శ్రోతుమిచ్ఛా. సేవ. (నానా.)

క. వినుతింపఁ గామసుఖసా
ధన మగు నా గౌరిఁ జంద్రధరుఁడు తపస్సా
ధనముగఁ జరించె; నుత్తము
లనయము విపరీతచరితు లైనను జనదే ? 3

అర్థము ; వినుతింపన్ = పొగడఁగా, కామ-సుఖ-సాధనము + అగు = కామభోగములకు సాధనము అగు, ఆ-గౌరిన్ = ఆ పార్వతిని, చంద్ర-ధరుఁడు = చంద్రుని ధరించినవాఁడు-శివుఁడు, తపస్ + సాధనముగన్ = తపస్సునకు సాధన మగునట్లు, చరించెన్ = ప్రవర్తింపఁజేసెను. ఉత్తములు = శ్రేష్ఠులైనవారు. అనయమున్ = మిక్కిలి, విపరీత-చరితులు = విరుద్ధ వర్తనులు, ఐనను = అయినప్పటికిని, చనదే = తగదా ?

తాత్పర్యము : శివుఁడు సన్నుతముగాఁ గామభోగసాధనమగు పార్వతిని దపస్సాధనముగాఁ జేసికొనెను. ఉత్తములైనవారు మిక్కిలి విరుద్ధవర్తనులైనను దగదా ? తగు ననుట,

విశేషములు : ఉత్తముఁడైన శివుఁ డిప్పుడు తపస్సు నాచరించువేళఁ గామసుఖసాధనమగు నొక కన్యను దపస్సాధనముగాఁ జేసికొనుటయే యాతఁడు విపరీతచరితుఁ డగుట, అయినను అతని కది తగు ననుట.

విశేషాంశము సామాన్యాంశముచే సమర్థింపఁబడుచున్నది, కావున నర్థాంతరన్యాసాలంకారము.

ఇంద్రాదిదేవతలు తారకాసురునివలని బాధలను బ్రహ్మకుఁ దెలుపుట.

వ. ఇట్లు పరమేశ్వరుండు తపోవృత్తిం దగిలి జగద్వ్యాపారంబు లారయకునికింజేసి తారకాసురుం డను ఘోరాసురుం డేచి హరి పరమేష్ఠి పురందరాదుల కజేయుండై సకలజగజ్జనంబుల కనేకోప ద్రవంబులు చేయం దొడంగిన. 4

అర్థము: ఇట్లు, పరమేశ్వరుండు, తపస్ (ః)+ వృత్తిన్ = తపస్సు చేయుటయందు, తగిలి = ఆసక్తిగలవాఁడయి, జగత్+వ్యాపారంబులు = లోక కార్యములు, ఆరయక + ఉనికిన్ + చేసి = చూడకపోవుటచేత, తారక + అసురుండు + అను, ఘోర + అసురుండు = తారకుఁ డను భయంకర రాక్షసుఁడు, ఏచి = విజృంభించి, హరి- పరమేష్ఠి - పురందర+ ఆదులకున్ =విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుఁడు మొదలగువారికి, అజేయుఁడు + ఐ = జయింపరానివాఁడయి, సకల- జగత్ +జనంబులకున్ =ఎల్ల లోకములందలి జనులకును, అనేక+ఉపద్రవంబులు = పెక్కు కీడులు, చేయన్ + తొడంగినన్ = చేయ నారంభింపఁగా.

తాత్పర్యము: ఇట్లు పరమేశ్వరుఁడు తపోనిమగ్నుఁడై లోకకార్యములు గమనింపకపోవుటచేతఁ దారకుఁ డను భయంకరరాక్షసుఁడు విజృంభించి విష్ణుబ్రహ్మేంద్రాదులకు జయింపరానివాఁడయి యెల్లలోకములవారికి ననేకహానులు చేయ నారంభింపఁగా.-తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు; తపోవృత్తి-తపస్ + వృత్తి-తపః + వృత్తి-తపోవృత్తి. జగద్వ్యాపారము - జగత్ + వ్యాపారము. ఘోరాసురుఁడు = ఘోర+అసురుఁడు- సవర్ణదీర్ఘ సంధి. జగజ్జనములు - జగత్ + జనములు. అనేకోపద్రవములు= అనేక+ ఉపద్రవములు - గుణసంధి.

క. వాని పటు దండముల కమ
రానీకము లబ్బగింప కపగత రాజ్య
శ్రీ నిలయులై పితామహుఁ
గానఁగఁ జని రెండుఁ బొందు గానక భీతిన్. 5

అర్థము : వాని = ఆ తారకుని యొక్క, పటు-దండములకున్ = తీవ్రమైన శిక్షలకు, అమర + అనీకములు = దేవతల సమూహములు, అబ్బగింపక = సహింపక, అపగత - రాజ్య-శ్రీ-నిలయములు + ఐ = పోయిన రాజ్యసంపద, నివాసము గల వారయి, ఎంటున్ = ఎచ్చటను, పొందు = శరణము, కానక, భీతిన్ - భయముతో, పితామహున్ = బ్రహ్మను, కానఁగన్ + చనిరి = చూడఁబోయిరి.

తాత్పర్యము : ఆ తారకాసురుని తీవ్రశిక్షలకు దేవతలు సహింపక రాజ్య సంపద. నివాసము గోలుపోయి యెచ్చటను దిక్కులేక భయముతో బ్రహ్మను జూడ నేఁగిరి.

విశేషములు : అబ్బగించు-ఈ పద మీ గ్రంథమునందే వ్యతిరేక క్త్వార్థకము గానే కనిపించుచున్నది - సూ. ని.

వ. తదవసరంబున. 6

అర్థ తాత్పర్యములు : ఆ సమయమున - తరువాతి పద్యముతో నన్వయము.

సీ. మొగిఁ దముఁ బడసిన మునుల మూర్తుల మీఱి
ధర్మశాస్త్రములు మూర్తములు తనర,
మణి దీధితుల పెంపు మాయించి సాలోక్య
ముక్తులు తనుతేజముల వెలుంగ,
వాణి వీణారుచి వారించి సామగా
నంబుల రుతులు తియ్యంబుఁ బెంప,
మృగమదాదుల తావి మగిడించి సుడిసి ని
జాననాంబుజగంధ మతిశయిల్లఁ,

తే. జామరగ్రాహిణీ కర చారు రత్న
రుచుల వెలుఁగఁజేయక పాశరుచులు పొలయఁ,
గనకమయ పద్మ కర్ణికాగ్రమున విశ్వ
కర్త సుఖలీలఁ బేరోలగమున నుండె. 7

అర్థము : మొగిన్ = పూనికతో, తమున్ = తమ్ముఁ, పడసిన = పొందిన, మునుల - మూర్తులన్ = మునులరూపములను, మీఱి = అతిక్రమించి, మూర్తములు = రూపుధరించినవి, అగు, ధర్మశాస్త్రములు, తనరన్ = ఒప్పఁగా,

మణి - దీధితుల - పెంపు = మణుల కాంతులయొక్క అధిక్యము, మాయించి = నశింపఁజేసి, సాలోక్య - ముక్తులు = సాలోక్యముక్తి నొందినవారు, తను - తేజములన్ = మేని తేజస్సులతో, వెలుఁగన్ = ప్రకాశింపఁగా,

వాణీ - వీణా - - రుచిన్ = సరస్వతియొక్క, వీణయొక్క, కాంతిని, ('రుచి' కాక 'రుతి = ధ్వని' అయి యుండునా?) వారించి = అడ్డగించి - తిరస్కరించి, సామ - గానంబుల = సామవేదగానములయొక్క, రుతులు = ధ్వనులు, తియ్యంబున్ = మాధుర్యమును, పెంపన్ = వృద్ధిపొందింపఁగా,

మృగమద + ఆదుల = కస్తూరి మున్నగువానియొక్క, తావిన్ = పరిమళమును, పగిడించి = పరలఁజేసి - తిరస్కరించి, సుడిసి = వ్యాపించి, నిజ + ఆనన + అంబుజ - గంధము = తనదైన ముఖపద్మముయొక్క పరిమళము, అతిశయిల్లన్ = మించఁగా,

చామర - గ్రాహిణీ - కర - చారు - రత్న - రుచులన్ = వింజామరలను గొను స్త్రీల చేతుల- మనోహరమైన రత్నముల కాంతులను, వెలుఁగన్ + చేయక = ప్రకాశింపనీక - వానిప్రకాశమును మించి యనుట, పాళ - రుచులు = కుండలముల కాంతులు, పొలయన్ = వ్యాపింపఁగా,

విశ్వ-కర్త = విశ్వస్రష్ట-బ్రహ్మ, కనక - మయ-పద్మ - కర్ణికా + అగ్రమునన్ = బంగరు తామరయొక్క దుద్దు కొనయందు, సుఖ - లీలన్ = సుఖముగా, పేరు + ఓలగమునన్ = నిండు కొలువునందు, ఉండెన్,

తాత్పర్యము : తమ్ముఁ బొందిన మునుల ఆకారములను మించి ధర్మశాస్త్రములు రూపుగాంచినవై యొప్పఁగను, మణులకాంతుల ఆధిక్యమును మాపి సాలోక్యముక్తినొందినవారు తమ మేనుల తేజస్సుతోఁ బ్రకాశింపఁగను, సరస్వతీ వీణారావమును దిరస్కరించి తన సామవేదగానధ్వనులు మాధుర్యమును బెంపఁగను, కస్తూరి మున్నగు వాని పరిమళమును దిరస్కరించి తన ముఖపద్మగంధ మతిశయిల్లఁ

గను, చామరగ్రాహిణుల కరములందలి రత్నముల కాంతులను బ్రకాశింపనీక తన కుండలముల కాంతులు వ్యాపింపఁగను విశ్వస్రష్ట బంగరు చామర దుద్దు కొనయందు సుఖముగా నిండుకొలువుండెను,

వి శే ష ము లు : పేరు + ఓలగము - 'కర్మధారయంబునందుఁ బేర్వాది శబ్దముల కచ్చు పరంబగునపుడు టుగాగమంబు విభాష నగు' బాల, సంధి. 29, పేర్మ టోలగము, పేరోలగము,

వ. ఇట్లు శతానందుండు సదానంద కందళిత హృదయారవిందుం డగు చున్నంత బృందారకబృందంబు కాందిశీకులై కంది తదీయాసనార వింద మకరందంబుల కెఱఁగు నలిసందోహంబునుంబోలె నెఱఁగి నానావిధ స్తుతి రవంబు లులియ నభయ మభయ మనుచున్న దేవేంద్రాదిగణంబులం గని విరించి కరుణించి భయోడక లెండని. 8

అ ర్థ ము : ఇట్లు, శతానందుండు = బ్రహ్మ, సదా + ఆనంద - కందళిత హృదయ + అరవిందుండు + అగుచున్ + ఉన్న + అంతన్ = ఎల్లప్పుడును ఆనందముచే వికసించిన హృదయపద్మము గలవాఁడగుచున్నంత, బృందారక - బృందంబు = దేవతల సమూహము, కాందిశీకులు + ఐ = ఏ దిక్కునకుఁ బోదు మని యనుకొనువారయి, కంది = దుఃఖించి, తదీయ + ఆసన + అరవింద - మకరందంబులకున్ = ఆతనిదైన పీఠమగు పద్మముయొక్క మకరందమునకు, ఎఱఁగు = వ్రాలునట్టి, అలి - సందోహంబునున్ + పోలెన్ - తుమ్మెదల సమూహమువలె, ఎఱఁగి = వ్రాలి, నానా-విధ- స్తుతి- రవంబులు = పెక్కురీతు లయిన స్తోత్రధ్వనులు, ఉలియన్ = మ్రోయఁగా, అభయము అభయము= రక్షణము రక్షణము, అనుచున్ + ఉన్న, దేవేంద్ర + ఆది - గణంబులన్ = దేవేంద్రుఁడు మున్నగువారి సమూహమును, కని, విరించి = బ్రహ్మ, కరుణించి, ఓడక = భయపడక, లెండు, అని,

తా త్ప ర్య ము: ఇట్లు బ్రహ్మ నిత్యానందముచే వికసించిన హృదయ పద్మము గలవాఁడగుచుండఁగా దేవతాసమూహము దిక్కుతోఁచక దుఃఖించి బ్రహ్మ ఆసనమైన పద్మము మకరందములకు వ్రాలు తుమ్మెదలగుంపువలె వ్రాలి పెక్కురీతు

లయిన స్త్రీత్వములు ప్రోయంగా అభయ మనియు మనుమన్న పేరఁ బ్రౌఢ మున్నారు
వారిని జూచి బ్రహ్మ దయఁబూని భయపడకుఁ డెం డని. పలికెను పద్యములో
నన్వయము.

విశేషములు: తదీయాననారవిందమకరందంబుల వెడఁగు సం
సందోహంబునుంబోలె నెఱఁగి నానావిధస్తుతిరవంబు లలియ - యీవరాను
ప్రాణితోత్ప్రేక్ష.

విరించి - 'ధాతాబ్జయోని ద్రుహిణో విరిఞ్చిః కమలాసనః' - విరచయతి
భూతాని విరిఞ్చిః 'భూతములను సృజించువాఁడు రేక విధిః పక్షిభిః హంసైః విహ్యతే
ఉహ్యత ఇతి - హంసలచేత వహింపఁబడువాఁడు - బ్రహ్మ - అమరము.

క. మీ కింత వంది కంది భ
యాకులతం బొంది నిర్గతైశ్వర్యులరై
రాకకుఁ గారణ మేమి? త్రి
లోకాహిత దనుజతతికి లోఁబడరు గదే? 9

అర్థము: మీకున్, ఇంత, వంది = దుఃఖించి, కంది = బాధపడి.
భయ + ఆకులతన్ + పొంది = వెఱపువలని కలఁత పొంది, నిర్గత + ఐశ్వర్యు
లరు + ఐ = పోయిన సంపద గలవారయి, రాకకున్ = వచ్చుటకు, కారణము +
ఏమి, త్రిలోక + అహిత - దనుజ - తతికిన్ = ముల్లోకములకు శత్రువులైన
రాక్షససమూహమునకు, లోఁబడరు + కదే = వశపడరుగదా!

తాత్పర్యము: మీ రింతగా దుఃఖించి బాధపడి భయముచేఁ గలఁతచెంది
యైశ్వర్యమును గోలుపోయి వచ్చుట కేమి కారణము? ముల్లోకములకుఁ గంటకులైన
రాక్షసులకు వశపడరుగదా?

విశేషములు: నిర్గతైశ్వర్యులరు-నిర్గత+ఐశ్వర్యులరు-వృద్ధిసంధి. అ ఆ
లకు ఏ ఐ లు పరములగునపుడు ఐకారము, ఒ ఓ ఔ లు పరము లగునపుడు ఔకార
మును ఏకాదేశ మగును. 'ప్రథమాంతంబులగు యుష్మదస్మద్విశేషణంబుల కేకవచనంబున
వు ను లును బహుత్వంబున రు ము లు నంతాగమంబులు ప్రాయికంబుగ నగు.' 'ఈ
యాగమంబులు పరంబులగునప్పు డుత్వంబున కత్వం బగు.' బాల. కారక. 33, 34.

వ. అని తమవచ్చిన కార్యస్వరూపంబున కనురూపంబుగా నానతి
యిచ్చిన వాక్పతికి బృహస్పతి నిటలతట ఘటిత కరకమల ముకుళపుట
విలసితుండై తారకాసురు బారింబడి తమ బ్రదికివచ్చిన వృత్తాంతం
బెల్ల నెఱింగించి వాని దోష విశేషంబులు విజ్ఞాపింపందలంచి
యి ట్లనియె. 10

అర్థము : అని, తమవచ్చిన = తాము వచ్చిన, కార్య-స్వరూపంబునకున్ = పనియొక్క స్వరూపమునకు, అనురూపంబుగాన్ = తగినరీతిని, ఆనతి + ఇచ్చిన = సెలవిచ్చిన, వాచ్ (క్) + పతికిన్ = సరస్వతి భర్తకు - బ్రహ్మకు, బృహస్పతి, నిటల - తట - ఘటిత - కర - కమల - ముకుళ - పుట - విలసితుండు + ఐ = ఫాలప్రదేశమునందుఁ గూర్పఁబడిన తామరమొగ్గలదొప్పలవంటి చేతులతోఁ బ్రకాశించు వాఁడయి - నమస్కరించినవాఁడయి, తారక + అసురు - బారిన్ + పడి = తారకాసురునకుఁ జిక్కి, తమ - బ్రదికివచ్చిన - వృత్తాంతంబు + ఎల్లన్ = తాము బ్రదికివచ్చిన విషయ మంతయు, ఎఱింగించి = తెలిపి, వాని = తారకునియొక్క, దోష - విశేషంబులు = తప్పుల వివరములు, విజ్ఞాపింపన్ + తలంచి = విన్నవింపఁ దలఁచి, ఇట్లు + అనియెన్.

తాత్పర్యము : అని తామువచ్చినపనికిఁ దగినరీతిని సెలవిచ్చిన బ్రహ్మకు బృహస్పతి నమస్కరించి తారకాసురునకుఁ జిక్కి తాము బ్రదికిబయటఁబడిన వృత్తాంతమెల్లఁ దెలిపి ఆ రక్కసుని దుండగముల వివరములు విన్నవింపనెంచి యిట్లు పలికెను.

విశేషములు : తమ వచ్చిన - తమ బ్రదికి వచ్చిన - ధాతుజవిశేషణ కోవార్తిక పూర్వవ్యవహి తావ్యవహిత కర్తృపద ప్రథమకు దఱచుగ యొక్క షష్ఠి యగు' ప్రౌఢ. కారక. 15. తాము + వచ్చిన, తాము + బ్రదికివచ్చిన - తమయొక్క వచ్చిన. తమయొక్క బ్రదికివచ్చిన - 'యొక్కకు లోపంబు బహుళంబు.' ప్రౌఢ. కారక. 16. విజ్ఞాపించు (ప్రకృతి) - విన్నవించు (వికృతి).

సీ. వేళ్లతోడుతఁ గల్పవృక్షముల్ పెఱికించి
కొనిపోయి తన కుపవనముఁ జేసెఁ,
గనకాద్రిఁ గొనిపోయి తన కెక్కి యాడ ని
జారామభూమిఁ గ్రీడాద్రిఁ జేసె,
నమరారి తనపేరి యచ్చులు వెట్టించి
సురధేనుసమితిఁ గీలరము సేసె,
గరుడోరగామరతరుణుల నందఱఁ
జేకొని తన విలాసినులఁ జేసె,

ఆ. వేద విహిత వృత్తి విప్రుల నుడిచెఁ ద
త్సుతులఁ బురుషభక్తి సలుపు డుడిచెఁ,
బుణ్యకర్మ ముడిచె, భువి నిట్లు నిఖిలాప
కారకుండు బలిమిఁ దారకుండు. 11

అర్థము : నిఖిల + అపకారకుండు = ఎల్లరకు అపకారము చేయువాఁడు, అగు, తారకుండు, బలిమిన్ = బలముతో, భువిన్ = భూమియందు, ఇట్లు = ఈ విధముగా -

కల్పవృక్షముల్, వేళ్లతోడుతన్ = సమూలముగా, పెఱికించి = పెకలించి, కొనిపోయి = తీసికొనిపోయి, తనకున్, ఉపవనమున్ + చేసెన్ = ఉద్యానవనముగా చేసికొనెను.

కనక + అద్రిన్ = బంగరుకొండను - మేరువును, కొనిపోయి, తనకున్, ఎక్కి + ఆడన్, నిజ + ఆరామ - భూమిన్ = తనదైన ఉద్యాన ప్రదేశమున, క్రీడా + అద్రిన్ = విహారపర్వతమును, చేసెన్.

అసుర + అరి = దేవతలకు శత్రువు - తారకుఁడు, తన పేరి, అచ్చులు = ముద్రలు, పెట్టించి = వేయించి, సుర - ధేను - సమితిన్ = దేవతల ఆవుల సమూహమును - కామధేనువులను, కీలరము + చేసెన్ = మందగా జేసెను.

గరుడ + ఉరగ + అమర - తరుణులన్ = గరుడ నాగ దేవతా యువతులను, అంపటన్, చేకొని = తీసికొనిపోయి, తన - విలాసినులన్ = భోగస్త్రీలనుగా, చేసెన్.

వేద - విహిత - వృత్తిన్ = వేదములందు విధింపఁబడిన అనుష్ఠానమును, విప్రులన్ = బ్రాహ్మణులను, ఉడిపెన్ = మానిపించెను.

తత్ + సతులన్ = ఆ బ్రాహ్మణుల భార్యలను, పురుష - భక్తి + సంతుష్టము = భర్తలకు భక్తి చేఁత, ఉడిపెన్ = ఉడిగించెను.

పుణ్య - కర్మము = పుణ్యకార్యమును, ఉడిపెన్ = నశింపఁజేసెను.

తాత్పర్యము : వేల్పులకు అపకారము చేయువాఁడైన తారకాసురుఁడు భూమియందు బలము నుపయోగించి కల్పవృక్షములను వేళులతోఁ బెకలించి తన యుద్యానమున నాటించెను. మేరువును గొనిపోయి తా నెక్కియాడుటకుఁ దన యుద్యానవనమున విహారపర్వతమునుగాఁ జేసెను. తనపేరుగల ముద్రలు వేయించి కామధేనువులను దన యాలమందగాఁ జేసెను. గరుడ, నాగ, దేవతాయువతుల నెల్లఁ గొనిపోయి తన భోగస్త్రీలనుగాఁ జేసెను. బ్రాహ్మణులను దమ వేదవిహితానుష్ఠానములను మానునట్లు చేసెను. వారి యిల్లాండ్రను పతిభక్తిని ఉడుగునట్లు చేసెను. పుణ్యకార్యములను జెడఁగొట్టెను.

విశేషములు : వేళ్ళతోడుతన్ - వేఱు శబ్దమునకు వేఱులు- వేళ్లు, వేఱులు అను రూపములే గాని వేళ్ళు అనురూపము బాలవ్యాకరణముచే సిద్ధింపదు, 'ఒకానొకచోఁ దోడకుఁ దోడుత యని రూపాంతరమును గలదు' ప్రౌఢ.కారక. 8. కీలరము- కీలారము, కిలరము కిలారము, కీలరు-రూపాం. ఉడుచు-ఉడు ప్రేరణరూపము, ఉడుపు-ఉడుగు ప్రేరణరూపము. 'అట్లు చుప్పగాగమునంబు అడంగ్వాది మాయ్వాదుల తగు నగుచో వాని కడవ్రాలు లోపించు' బాల, క్రియ, 76, ఉడుచు - ఉడుపు - ఉడిగించు - (రూపాం.) చిన్నయసూరి ఉడుగు ధాతువును మాయ్వాదులలోఁ బఠించి, దానికి ఉడుపు అను ప్రేరణార్థకరూపమునే సాధించెను. కాని దానికి ఉడుచు అను ప్రేరణరూపముగూడఁ బ్రామాణికప్రయోగములందుఁ గనుపట్టుచున్నది, 'వాదిత్ర శబ్దంబు లుడిచి' - భార. ఆది. 6-15. 'ఒక్కట నిఖిలంబు నుడిచి యదఁచు.' నృసిం. 1-65.

మ. తన తేజం బహిమాంశువై, తన మహత్త్వం బా వసుస్తోమమై,
తన కోపోన్నతి రుద్రులై, తన మహోత్సాహంబు సిద్ధాదులై,
తన చె న్నశ్వినులై వెలుంగఁ, దన దోర్దర్పంబు దిక్పాలురై
తన, గీర్వాణ నియోగముల్గాని నిజేచ్ఛన్ దాన పాలించెడున్. 12

అర్థము : తారకుఁడు-కర్త,తన-తేజంబు, అహిమాంశువు + ఐ = సూర్యుఁడయి - సూర్యుని యుద్యోగమగు కాంతినిచ్చుటను దన తేజస్సే చేయఁగా. అనుట, ఇట్లే అన్నిట గ్రహించునది, తన - మహత్త్వంబు = తనగొప్పతనము, ఆ - వసు - స్తోమము + ఐ = ఆ వసువుల సమూహము - అష్టవసువులు, అయి, తన-కోప + ఉన్నతి = తన కోపాతిశయము, రుద్రులు + ఐ, తన మహత్ (మహో) + ఉత్సాహంబు. సిద్ధ + ఆదులు + ఐ = సిద్ధులు మున్నగువారయి, తన - చెన్ను = తన అందము, అశ్వినులు + ఐ = అశ్వినీదేవత లయి, వెలుంగన్= ప్రకాశింపఁగా, తన - దోస్ (ః) + దర్పంబు = తన భుజబలగర్వము,దిశ్ (క్)+ పాలురు + ఐ = దిక్పాలకు లయి, దనన్ = తగఁగా, గీర్వాణ- నియోగముల్ = దేవతల విధులను, కాని, తాను+అ=తానే, నిజ+ఇచ్ఛన్ = తన యిష్టప్రకారము, పాలించెడున్,

తాత్పర్యము ; తారకాసురుఁడు తన తేజస్సు సూర్యుఁడయి. తన మహత్త్వమష్టవసువులయి, తన కోపాతిశయము రుద్రులై, తన మహోత్సాహము సిద్ధులు మున్నగువారయి; తన యంద మశ్వినీదేవతలయి, తన భుజబలగర్వము దిక్పాలకు లయి యొప్పఁగా దేవతల విధుల నిట్లు తానే కొని తన యిష్టప్రకారము పాలించును.

విశేషములు : సూర్యుఁడు తేజోనిధి. వసువులు మహిమాన్వితులు, రుద్రులు కోపిష్ఠులు. సిద్ధాదు లుత్సాహవంతులు. అశ్వినులు అందమయినవారు. దిక్పాలకులు బలసంపన్నులు. ఇట్లు వారివారి యుద్యోగముల నతఁడు తన వేర్వేఱువానిచేఁ జేయించుచుండె ననుట.

దిక్పాలురు-దిశ్ + పాలురు-దిక్ + పాలురు. 'అదంతంబయి దీర్ఘపూర్వ లోపధంబయిన మహత్తుమీఁది విభక్తి లకారంబునకు రేఫంబగు.' బాల. పర్సమ. 38. దోర్దర్పంబు - దోస్ + దర్పంబు - దోః + దర్పంబు - దోర్దర్పంబు.

క. అనిమిష పురముల నెల్లం
దన బలునాయకుల నిల్పఁ దలఁచినవాఁడై
దనుజేంద్రుఁడు గోల్కొన నీ
కనిశముఁ బోఁదోలుచుండు నమరగణంబున్. 13

అర్థము : దనుజ + ఇంద్రుఁడు = రాక్షసశ్రేష్ఠుఁడు. అనిమిష-పురములన్ + ఎల్లన్ = దేవతాపురముల నన్నిటను, తన- బలు_నాయకులన్ = తన బలముగల నాయకులను, నిల్పన్ = నిలుపుటకు, తలఁచినవాఁడు + ఐ = ఎంచినవాఁడయి, అమర-గణంబున్ = దేవతల సమూహమును, కోల్కొనన్ + ఈక = స్వస్థతనంద నీక, అనిశమున్ = ఎల్లప్పుడును, పోన్ + తోలుచున్ + ఉండున్ = పోవఁద్రోలు చుండును.

తాత్పర్యము : తారకాసురుఁడు దేవతల నగరములం దన్నిటను దన బలముగల నాయకులను నిలుపనెంచి దేవతలను దేఱుకొననీక యెల్లప్పుడును దఱిమి వేయుచుండును.

విశేషములు : అనిమిషులు = నిమిషము (ఱెప్పపాటు) లేనివారు - దేవతలు. అనిమిషము-చేఁప.

క. ఇలఁ జిత్రము తారక కర
తల సంగతమైన ఘోరతరవారి సొరన్
నిలు పగుఁ దనుఁ జొరక కడరినఁ
దలమునుక యగు న్విరోధితతి కబ్జభవా ! 14

అర్థము : అబ్జ-భవా ! = తమ్మిచూలి-బ్రహ్మ ! ఇలన్ = భూమియందు చిత్రము = ఆశ్చర్యము. ఇలన్ = భూమియందు, విరోధి-తతికిన్ = శత్రుసమూహము నకు, తారక-కరతల_ సంగతము + ఐన = తారకాసురుని యఱచేతనున్నదియగు, ఘోర-తరవారి = భయంకర ఖడ్గము (ను), చొరన్ = ప్రవేశింపఁగా,-శరణుచొచ్చుచో, నిలుపు + అగున్ = బ్రతు కగును. తనున్ = తన్ను, చొరక = ప్రవేశింపక, శరణుచొరక, అడరినన్ = విజృంభించినచో, తలమునుక + అగున్ = తలమునుఁగుట అగును,

తాత్పర్యము : ఇక్కడ ఆశ్చర్యము ; తారకుని కరతలమందలి ఘోర తరవారిని తలఁచినచో శత్రువులకు బ్రదుకగును, ప్రతిపక్షులు, తలఁచినంత విజృంభించుచో వారికి ఆ ఖడ్గము తల మునుఁగుట యగును.

విశేషములు ; ఘోరతరవారి - ఘోరమైన తరవారి (ఖడ్గము). విరోధి తతికిఁదలమునుక యగు ననుచున్నాఁడు గావున ఘోరతర-వారి = ఘోరతరమైన వారి (జలము)అను స్వారస్యమును జెప్పవచ్చును, అలంకారము సభంగశ్లేషము, ఇటఁ జిత్ర మేమన- నీటిని జొచ్చుచోఁ దలమునుక కావలయును, చొరకున్నచో నిలుపు గావలయును, కాని యిట ఘోరతర - వారిని జొచ్చుచో నిలుపయి, ఘోర తరవారిని జొరకున్నచోఁ దలమునుక యగు ననుట, ఇట్లు విపరీతముగా నగుటయే చిత్రము, ఇ ట్లేర్పడిన విరోధము ఘోర-తరవారి అని విఱుచుచోఁ బోవుచున్నది, కావున నలంకారము విరోధాభాసము, 'ఆభాసత్వే విరోధస్య విరోధాభాస ఉచ్యతే' యన్నారు.

చ. పలుమఱుఁ దారకుండు సురపాలపురంబులు గాల్చ ధూమ పం
క్తులు పయిఁ గప్పుచున్నఁ బెను ధూపటమై పొగ సోఁకి కందెఁ దా
నల రవి; వానితోడి వగ నబ్జుఁడుఁ గందఁగ, నీ యలంతి వీ
రులె మొగపెట్టి నా సురవిరోధికి నోడినవార పోరులన్. 15

అర్థము : తారకుండు, పలుమఱున్ = పెక్కుపర్యాయములు, సుర-పాల-పురంబులు = దేవప్రభువుల నగరములు, కాల్చ = దహించు, ధూమ-పంక్తులు= పొగలయొక్క వరుసలు, పయిన్ = తనమీఁద, కప్పుచున్ + ఉన్నన్ = కప్పుచుండఁగా, పెను-ధూపటము + ఐ = గొప్పదియగు ధూప పటము - పొగ యనెడు వస్త్రము అయి, పొగ- సోఁకి, అల-రవి = ఆ సూర్యుఁడు, తాన్ = తాను, కందెన్ = కంది పోయెను, వానితోడి - వగన్ = ఆతని రీతిగనే, అబ్జుఁడున్ = చంద్రుఁడును, కందఁగన్ = కందిపోఁగా, మొగపెట్టన్ = ఎదుర్కొనుటకు, ఈ + అలంతి వీరులె = ఈ యల్ప వీరులా ? నాన్ = అనునట్లు, పోరులన్ = యుద్ధములందు, ఆ-సుర-విరోధికిన్ = దేవతలకు శత్రువగు ఆ తారకాసురునికి, ఓడిన-వారు + అ = ఓడి పోయినవారే.

తాత్పర్యము : తారకాసురుడు పెక్కుమారులు దేవతాప్రభువుల పురము లను గల్పించెను. అప్పుడు వెలువడిన పొగమొత్త మొక ధూప పటముగా నలు దిక్కులం గప్పంగా సూర్యుండు కందిపోయెను. అటనిరీతిగనే చంద్రుడును గంది పోయెను. 'ఈ యుల్లిపిడుల తారకు నెదుర్కొనువారు?' అనునట్లు వారు యుద్ధము నందు తారకాసురున కోడిపోయినవారే యైరి.

విశేషములు : అలంకార మతిశయోక్తి, ఉత్ప్రేక్ష.

మొగిపెట్టు = ఎదుర్కొను - దీని కిందే ప్రయోగాంతరము- 'కట్టెదురం దాండ్రి వడంజెట్ట మొగిపెట్టు.' 12-173. ధూపటము-ధూపపటము - ధూపరూప పట మని భావము.

తే. పోరం దన కోడి పాఱు నీహారరోచిం
బట్టుకొని పోయి దానవప్రభుండు పిఱికి
వారికెల్లను నోగులవానిం గాంగ
నురముపై జీడి నిఱ్ఱి యచ్చొత్తి విడిచె. 16

అర్థము : దానవ-ప్రభుండు = రాక్షసరాజు - తారకుండు, పోరన్ = యుద్ధమునందు, తనకున్.ఓడి=ఓడిపోయి, పరువెత్తు=పాఱు,నీహార-రోచిన్=మంచు కిరణములుగలవానిని-చంద్రుని, పట్టుకొనిపోయి = తీసికొనిపోయి, పిఱికివారికిన్+ ఎల్లను = పిఱికివారందఱిలోను, ఓగులవానిన్ + కాంగన్ = అధమునిగా, ఉరము పైన్ = రొమ్ముమీంద, జీడిన్= జీడితో, ఇఱ్ఱి+అచ్చు + ఒత్తి = లేడిముద్రవేసి, విడిచెన్.

తాత్పర్యము: తనతోడియుద్ధమున నోడిపోయి పాఱిపోవు చంద్రుని బంధించి కొనిపోయి తారకుండు పిఱికివారందఱిలోను అధముండుగా రొమ్ముపై లేడి ముద్రవేసి విడిచెను.

విశేషములు : జీడి నిఱ్ఱి యచ్చొత్తి - పిఱికివారందఱిలోను నధముం డెవ్వండన వెంటనే గుఱుతించుటకు వీలుగా. ఇఱ్ఱి పిఱికిజంతువు కనుక నిఱ్ఱి

ముద్రించుట, చంద్రునిలోని మచ్చ నిద్రించుచున్నది. కావునే వాని యొక్క ముఖము చంద్రుఁడు, చంద్రునిలోని మచ్చ చేత యనుటచేఁ గొంతమాత్ర మాహించి చెప్పు చున్నాఁడు గావున నుత్ప్రేక్షాలంకారము.

క. ఆలమున నసురు చిచ్చును
గాలియుఁ గొని కవియు నసుటు గల; దెదిరి రిపుల్
గాలుదురు వీనిఁ గనుకనిఁ;
దూలుదు రెందేని నర్కతూలము వోలెన్. 17

అర్థము : ఆలమునన్ = యుద్ధమునందు, అసురుఁడు = రాక్షసుఁడు, చిచ్చును = అగ్నిని, గాలియున్, కొని, కవియున్ = ఎదిరించును, అసుట, కలదు, రిపుల్ = శత్రువులు, వీనిన్ = వానిని, ఎదిరి = మార్కొని, కనుకనిన్ = సంభ్రమముతో, కాలుదురు = కాలిపోవుదురు; అర్కతూలము + పోలెన్ = జిల్లేడు దూదివలె, ఎందేనిన్ = ఎందున్ + ఏనిన్ = ఎచ్చటనైనను. తూలుదురు = ఎగిరిపోవుదురు.

తాత్పర్యము : రాక్షసుఁడు యుద్ధమున అగ్ని వాయు సాయమునఁ గలిసి నసుట లోకమునఁ గలదు, కావుననే శత్రువులు వానికి నెదిరించినప్పుడు కాలిపోవు టయు, అర్కతూలమువలె నెందైనఁ దూలిపోవుటయుఁ గలుగుచున్నది.

విశేషములు : అర్కతూలము వోలెన్ - ఉపమాలంకారము. చిచ్చును గాలియుఁగొని - కాలుదురు - తూలుదురు - క్రమము పాటింపఁబడినదికావున యథాసంఖ్యము, అసురు చిచ్చును గాలియుఁ గొని కవియు ననె సామాన్యాంశము వానికి నెదిరించిన రిపులు కాలుదురు తూలుదురు అను విశేషాంశముచే సమర్థింపఁ బడినది కావున నర్థాంతరన్యాసాలంకారమును. అసుర- అసుర శబ్దము వైకల్పికముగా స్త్రీతుల్యమగును, బాల. తత్సమ.60.

క. సుర గరు డోరగ విద్యా
ధర పురవర సతులతోడ దనుజేశ్వరు కిం
కరులు రమింతురు; దోషా
చరులకు వెలి లోపు గలదె చతురాననుఁడా? 18

అర్థము : చతురాననుఁడా ! (చతుః + ఆననుఁడా), నాలుగుముఖములు గలవాఁడా !, సుర - గరుడ + ఉరగ- విద్యాధర - పుర - వర - సతులతోడన్ = దేవతల, గరుడుల, నాగుల. విద్యాధరుల పురశ్రేష్ఠములందలి స్త్రీలతో, దనుజ + ఈశ్వరు - కింకరులు = రాక్షసశ్రేష్ఠుఁడగు తారకుని భటులు, రమింతురు = సంభోగింతురు, దోష+ఆచరులకున్=తప్పులు చేయువారికి, దోషా-చరులకున్= రాత్రులందుఁ దిరుగువారికి - నిశాచరులకు - రాక్షసులకు, వెలి-లోపు = వెలి, తన యనునది, కలదె = ఉన్నదా?

తాత్పర్యము ; ఓయి బ్రహ్మ ! తారకాసురుని సేవకులు దేవతల, గరుడుల, నాగుల, విద్యాధరుల నగరములందలి స్త్రీలతో సంభోగింతురు, తప్పు చేయువారికి - నిశాచరులకు వెలి, తన యను భావము గలదా; లే దనుట.

విశేషములు : విశేషాంశము సామాన్యాంశముచే సమర్థింపఁబడుటచే నర్థాంతరన్యాసాలంకారము, దోషాచర శబ్దమున శ్లేషము.

క. ఇప్పుడు నీ కే మిన్నియుఁ
జెప్పిన నందేమి దనుజుఁ జేకొని దయతో
నెప్పుడు వర మిచ్చితి నీ
వప్పుడ మది నీడవిడిచితమరుల నెల్లన్. 19

అర్థము: ఇప్పుడు, నీకున్. ఏము = మేము, ఇన్నియున్ = ఇవి యన్నియును - తారకునిచే మేము పడు బాధలన్నియును, చెప్పినన్ = చెప్పినచో, అందున్ + ఏమి ? = దానివలనఁ బ్రయోజన మేమి ? నీవు, దయతోన్, దనుజున్ = రాక్షసుని - తారకుని, చేకొని = ఆదరించి, ఎప్పుడు, వరము + ఇచ్చితివి + అ = వరమునిచ్చితివో, అప్పుడు + అ = అప్పుడే, అమరులన్ + ఎల్లన్ = దేవతల నందఱను, మదిన్ = మనస్సునందు, ఈడవిడిచితి (వి) = దిగవిడిచితివి - ఉపేక్షించితివి.

తాత్పర్యము : ఇప్పుడు నీకు మే మివియన్నియుఁ జెప్పి యేమి ప్రయోజనము ? నీవు రాక్షసు నాదరించి దయతో నెప్పుడు వరమిచ్చితివో, అప్పుడే దేవతల నెల్లఁ మనసులో నుపేక్షించితివి.

విశేషములు; ఇచ్చితివి + అ, ఈడవిడిచితివి + అమరులన్ - 'లిఙ్గాదుల వకారంబునకు లోపంబు విభాష నగు,' బాల. క్రియ. 14. ఇచ్చితి + ఇ + అ, అపదాదిస్వరసంధి - బాల. సంధి. 117 చే ఇచ్చితి, ఈడవిడిచితి + అమరులన్, 'ప్రథమపురుషక్రియలయం దిత్తునకు సంధి యగును,' బాల. సంధి, 7 ఈడవిడిచి తమరులన్.

క. కాలవశంబున దనుజుఁడు
కాలునిఁ గీడ్పఱిచెఁ; బలిమిఁ గాలుని నోర్చెన్;
గాలుని తేజ మడంచెన్;
గాలుఁడ తా నయ్యె నెల్లకడలను పేర్మిన్. 20

అర్థము : కాల - వశంబునన్ = కాలమువలన లోఁబడి, దనుజుఁడు = రాక్షసుఁడు - తారకాసురుఁడు, కాలునిన్ = యముని, కీడ్పఱిచెన్ = కీడుపడఁజేసెను - లొంగఁదీసెను, బలిమిన్ = బలముతో, కాలునిన్ = యముని, ఓర్చెన్ = ఓడించెను, కాలుని - తేజము = యముని తేజస్సును, అడంచెన్ = అణఁగునట్లు చేసెను, తాను, పేర్మిన్ = గొప్పతనము, ఎల్ల - కడలను = అన్నిదిక్కులను, కాలుఁడు + అ = యముఁడే, అయ్యెన్.

తాత్పర్యము : తారకాసురుఁడు కాలమహిమచే యముని లొంగఁదీసికొనెను. బలముతో యముని నోడించెను. యముని తేజస్సు నడఁచెను. అతఁడు గొప్పతనముతో నన్నిదిక్కులను యముఁడే అయ్యెను.

విశేషములు : తారకుఁడు యముని గీడుపఱుపఁగలుగుట కాలమహిమ వలన. యముని గీడుపఱుచుటయే కాక ఓడించుటయే కాక, యముని తేజస్సును గూడఁ దారకుఁ డడఁచెను. అంతేకాదు తాను గాలుఁడే అయ్యెను.

కీడుపడు - 'అచ్చికంబులం బదమధ్యంబుల నలడరల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు,' బాల. ప్రకీర్ణ 17. కీడ్పడు, 'పడునకుం జుక్కాను డా కలఘురేఫంబు నగు' బాల. క్రియ, 82. కీడ్పఱుచు. దీని లిట్టు ప్రథమ పురుషైకవచన రూపము - కీడ్పఱిచెన్. ఓర్చెన్ - 'ఆ దోడు కాదుల దకారంబునకుం జుక్కా పట్టిగునప్పుడు రేఫంబగు,' బాల. క్రియ, 80.

క. గోపాలక ! విను మిప్పుడు
గోపాలకు లాదిగాఁగఁ గుత్సితమతులై
గోపాలకు లెల్లను జెడి
గోపాలకు లైరి తారకున కతి భీతిన్. 21

అర్థము : గోపాలక = వాక్పాలకుఁడవగు ఓ బ్రహ్మా !, వినుము, ఇప్పుడు, గో - పాలకులు + ఆది - కాఁగన్ = దిక్పాలకులు మొదలుగా, గోపాలకులు + ఎల్లను = దేవత లందఱును, కుత్సిత - మతులు + ఐ = కీడుపడిన మనస్సులు గలవారయి, చెడి, అతి - భీతిన్ = మిక్కిలి భయముతో, తారకునకున్, గోపాలకులు = ఆవులను గాచువారు, ఐరి,

తాత్పర్యము : వాక్పాలకుఁడవైన ఓ బ్రహ్మా! వినుము. ఇప్పుడు దిక్పాలకులు మొదలుగాఁ గల దేవతలందఱును మనస్సులు కలఁగి చెడి మిక్కిలి భీతితోఁ దారకునకుఁ బశుపాలకులైరి.

విశేషములు : ఇందు గో శబ్దమునకుఁ గల వివిధార్థములు తెన్నుగా నుపయోగించుకొనఁబడినవి. 'స్వర్గేషు పశు వాగ్వజ్ర దిఙ్నేత్ర ఘృణి భూ జలే లక్ష్య దృష్ట్యా స్త్రియాం పుంసి గౌః' అమరము. గోశబ్దము స్వర్గమునకు, బాణమునకు, పశువునకు, వాక్కునకు, వజ్రాయుధమునకు, దిక్కునకు, నేత్రమునకు, కిరణమునకు, భూమికి, నీళ్ళకుఁ బేరు. అలంకార మనుప్రాసము. ఇందుఁ జతుష్ప్రాసము గలదు.

ఐరి - అగుధాతువు, 'ధాతంబున లిట్టగు' బాల. క్రియ. 3. అగు + లిట్టు, 'లకారంబునకు డు ఱు వు రు ను ము ళ్లగు' బాల. క్రియ. 8. ప్రథమపురుష బహువచన మగుటచే - అగు + రు. 'ధాతంబునం దిగాగమం బగు.' బాల. క్రియ. 17. అగు + ఇ + రు. 'అగు పోవుల కద్ర్వాల కిద్వ్యక్రంబులు పరంబు లగునపుడు యకారం బగు' బాల. క్రియ. 99. అయు + ఇ + రు. 'అంత్యవగాగమంబులం దప్ప నపదాదిస్వరంబు పరం బగునపు డచ్చునకు సంధి యగు.' బాల. సంధి. 11. అయి + రు. 'ఇకారంబుమీఁది కు ను వు క్రియావిభక్తుల యుత్వంబున కిత్వం బగు' బాల. తత్సమ. 26. అయిరి. 'అచ్చికంబులం దయి యవులకు వ్యత్యయంబులు బహుళంబుగా నగు.' బాల. క్రియ. 103. ఐరి.

క. విషధరుఁడు హరియుఁ దక్కఁగ
విషధర సుర గరుడ యక్ష విద్యాధర ఖ
ద్విషధర పథచరు లాదిగ
విషధరు లై రిప్డు దసురవీరు నగళ్లన్. 22

అర్థము : విషధరుఁడు = విషమును ధరించినవాఁడు - శివుఁడు, హరియున్ = విష్ణువును, తక్కఁగన్ = తప్ప, విషధర .... .... చరులు : విషధర = నాగులు, సుర = దేవతలు, గరుడ = గరుడులు, యక్ష = యక్షులు, విద్యాధర = విద్యాధరులు, ఖద్ + విషధర - పథచరులు = ఆ మేఘమార్గము (ఆకాశము) న సంచరించువారు - ఖేచరులు, ఆదిగన్ = మొదలుగా, ఇప్డు, అసుర - వీరు - నగళ్లన్ = రాక్షసవీరుఁడైన తారకుని యంతఃపురములలో, విషధరులు = జలవాహకులు - నీళ్లు మోయువారు, ఐరి.

తాత్పర్యము : ఈశ్వరుఁడు, విష్ణువు తప్పఁ దక్కిన నాగ సుర గరుడ యక్ష విద్యాధర ఖేచరులు మున్నుగాఁ దారకుని యంతఃపురములో నీళ్లకావిళ్లు మోయువారైరి.

విశేషములు ; ఇందు విషధరశబ్దము వివిధార్థములలోఁ బ్రయుక్తమగుట చూడనగును. విషధర = పాము, శివుఁడు, మేఘము, నీళ్లమోయువాఁడు. నగళ్లు - నగరులు, నగళులు. నగర్లు (రూపాం.) 'నగళ్లు' రూపము బాలవ్యాకరణ సాధ్యము గాదు.

సీ. మృదునెద్దుఁ గాని గాడ్పుమృగము బండఁగిఁజేసి
యెలయించి నెలలోని యిఱ్ఱి నేయు,
గౌరివాహనము దిగ్గజముల కుసికొల్పి
విడిచి సింహముఁ బట్టి వేఁటలాడు,
హరిఁ ద్రోచికొనిపోయి గరుడుంచు డేగ గా
విడుచు భేరుండాది విహగములకు,
జముపోతుఁ దెచ్చి ఖాన్కఁరు తేరిమావుల
నెగిచి నుగ్గాడ ద్రేయించి చూచు

ఆ. చండు రేయుఁ బగలు నొండు వినోదముల్
విడిచి సురలమీఁది వేఁటఁ దగిలి
తారకుండు రిపు విదారకుం డనివార్య
విక్రముండు దనుజ చక్రవర్తి. 23

అర్థము : రిపు - విదారకుండు = శత్రువులను హింసించువాఁడును, అనివార్య - విక్రముండు = అడ్డగింపరాని పరాక్రమము గలవాఁడును, దనుజ - చక్రవర్తి = రాక్షస చక్రవర్తియు, అగు, తారకుండు, రేయున్ +పగలున్ = రాత్రియును, పగలును, ఒండు - వినోదముల్ = ఇతరములైన వేడుకలు, విడిచి, సురల మీఁది = దేవతలపై, వేఁటన్ = వేఁటయందు - దేవతలను వేఁటాడుటయందు, తగిలి = ఆసక్తిగలవాఁడయి -

మృడు + ఎద్దున్ = శివుని వాహనమగు నెద్దును - కొని, గాడ్పు - మృగమున్ = వాయువు వాహనమగు జింకను, బండఁగిన్ + చేసి = దీముఁ జేసి, నెలలోని = చంద్రునిలోనున్న, ఇఱ్ఱిన్ = లేడిని, ఎలయించి = తీసికొనిపోయి, ఏయున్ = కొట్టును.

గౌరి - వాహనమున్ = పార్వతి వాహనమును - సింహమును, దిశ్ (క్)+ గజములకున్ = దిక్కులందలి యేనుఁగులపైకి, ఉసికొల్పి = ప్రేరించి, విడిచి, సింహమున్, పట్టి = బంధించి, వేఁటలు + ఆడున్ = వేఁటాడును.

హరిన్ = విష్ణువును, త్రోచికొనిపోయి = నెట్టుకొనిపోయి, గరుడుండు = అతని వాహనమగు గరుత్మంతుఁడు, దేగ+ కాన్ = డేగగా, భేరుండ + ఆది - విహగములకున్ = భేరుండము మున్నగు క్రూర పక్షులకు, విడుచున్,

జము - పోతున్ = యముని వాహనమగు దున్నను, తెచ్చి, భాస్కరు - తేరి- మావులన్ = సూర్యుని రథము గుఱ్ఱముల నేడింటిని, ఎగిచి = లేవఁగొట్టి, నుగ్గాడన్ = వధించునట్లు చేయించి - చూచుచున్ + ఉండున్ = కొట్టించి చూచు చుండును,

తాత్పర్యము : శత్రువులను హింసించువాఁడును, అగ్గింపరాని చరిత్రము గలవాఁడును, రాక్షసప్రముఖుఁడు నగు రావణుఁడు దేవతలయొక్క వేఁటపిట్టలను పట్టిపెట్టి, దేవతలను వేఁటాడుటయం దాసక్తుఁడయి శివునివాహన మగు వృషభమును గొని వాయువు వాహనమగు మృగమును దీమునఁ బెట్టి వెంబడించికొని పోయి చంద్రునిలోని జింకను గొట్టును. గౌరివాహనమగు సింహమును విఘ్నజముల పైకి ఉసికొలిపి పిడిచి సింహమును బట్టి వేఁటాడును. విష్ణువును నెట్టుకొనిపోయి అతని వాహనమగు గరుత్మంతుఁడు డేగగా భేరుండము మున్నగు భయంకరపక్షులకు విడుచును. యముని వాహనమగు దున్నను తెచ్చి సూర్యరథాశ్వములను వేఁటగొట్టి నుగ్గగు నట్లు కొట్టించి చూచుచుండును.

విశేషములు : భేరుండము - రెండు తలలును, మూఁడు కన్నులును గల పక్షివిశేషము-గండభేరుండము. మావు = గుఱ్ఱము. 'పరగు నిట్లయి వావా వావురను వారువము జక్కి తత్తడి మావు గుఱ్ఱ మన' .... ఆం.నా.2.198. రేయి, రెయి, రే. (రూపాం.) బంతఁగి = దీము. వేఁటకాఁడు మనుష్యాదులను బట్టుకొనుటకై పెంచిన మృగము.

మృదునెద్దు - మృదు + ఎద్దు. 'షష్ఠీసమాసమునం దుకారాంతశబ్దముల కచ్చు పరమగునపుడు నుగాగమంబగు.' బాల. సంధి. 34.

క. ఇన శశి తేజంబుల జగ
మనిశము విధి నడపు టెంత యని వాని మహిన్
జననీక తారకప్రభఁ
జన నడపెడి మిమ్ము మిగిలి సామర్థ్యమునన్. 24

అర్థము : విధి - బ్రహ్మ, ఇన - శశి - తేజంబులన్ = సూర్యచంద్రుల తేజస్సులతో, జగము = లోకమును, అనిశమున్ = ఎల్లప్పుడును, నడపుట = ప్రవర్తింపఁ జేయుట, ఎంత + అని = ఏమి గొప్ప యని, వానిన్ = ఆ సూర్యచంద్రుల తేజస్సులను, మహిన్ = భూమియందు, జననీక - జనన్ + ఈక = పోనీక,

సామర్థ్యమునన్ = సమర్థతయందు, మిమ్మున్ = సృష్టికర్తలగు మిమ్ము. మిగిలి = అతిక్రమించి. తారక - ప్రభన్ = తారకుని తేజస్సుతో - నక్షత్రకాంతితో, జగన్ = ప్రపంచమును. నడపెడిన్ = నడపును.

తాత్పర్యము : బ్రహ్మ సూర్యచంద్రుల తేజస్సులతో లోకమును ఎల్లప్పుడును నడపుట యేమి విశేషమని తారకుఁడు వారితేజస్సులను భూమిని జనసీక సామర్థ్యమున సృష్టికర్తలగుమిమ్ము మించి తారక ప్రభతో- తారకాసురునితేజస్సుతో, నక్షత్రకాంతితో లోకమును నడపును.

విశేషములు : సూర్యచంద్రుల ప్రభకంటె నక్షత్రముల ప్రభ తక్కువ, తారకప్రభతోనే జగమును నడపుచుఁ దారకుఁడు బ్రహ్మదేవునే మించె ననుట. తారక ప్రభతో జగమును నడపుట యసాధ్య మగుటచే విరోధ మేర్పడుచున్నది. తారకపదమునకు తారకాసురుఁడను నర్థము చెప్పుచో నా విరోధమున కాభాసత్వమేర్పడును. కావున నలంకారము విరోధాభాసము. అది శ్లేషానుప్రాణితము.

క. కోపించి సురల వెలువడఁ
త్రోపించె సురారి; బలిమి ధూర్జటి నీళ్లన్
మోపించె; విష్ణుఁ బసులన్
గాపించెను; మీకు నొరయుగడ దాపించెన్. 25

అర్థము : సుర + అరి= దేవతలకు శత్రువగు - రాక్షసుఁడగు తారకుఁడు, సురలన్=దేవతలను, కోపించి=కోపపడి, వెలువడన్=వెలువడునట్లు, త్రోపించెన్= గెంటించెను, దేవతలు గగనచరు లగుట యిట్లు చమత్కరింపఁబడెను. బలిమిన్ = బలవంతముగా, ధూర్జటిన్ =శివుని, నీళ్లన్ - మోపించెన్ నీళ్లు=మోయునట్లు చేసెను_ శివుఁడు గంగను నెత్తిపై మోయువాఁ డగుట యిట్లు చమత్కరింపఁబడెను, విష్ణున్= విష్ణువును, పసులన్ = పశువులను, కాపించెన్ = కాయునట్లు చేసెను, విష్ణువు కృష్ణావతారమున గోపాలకుఁ డగుట యిట్లు చమత్కరింపఁబడెను, మీకున్, ఒరయుగడ = ఒరయిక - రాపిడి - కష్టము, దాపించెన్ = సమీపింపఁజేసెను.

తాత్పర్యము : తారకాసురుఁడు దేవతలపైఁ గోపముతో వారిని బాధింపఁ గడఁగెను. శివునిచే నీళ్లు మోయించెను. విష్ణునిచేఁ బాహువులను గాయించెను. ఎంతఁ గష్టము చేయవచ్చెను.

విశేషములు : మోపించు - మోయించు (రూపాం.)

మ. హరుఁ డా దైత్యునకోడి చన్న నతి వాయంగాక మోక్షార్థమై
పరుసంబైన తపంబు సేయఁదొడఁగెన్? విష్ణుండు తద్బాహు భీ
కర దండాహతి దీర్ఘనిద్ర చనియెం గాకెంతకాలంబు సా
గర మధ్యంబున నిద్రసేయునె జగత్కల్యాణ కాంక్షాత్ముఁడై? 26

అర్థము ; హరుఁడు = ఈశ్వరుఁడు, ఆ - దైత్యునకున్ = ఆ రాక్షసునకు - తారకునకు, ఓడి = పరాజితుఁడయి, చన్న = పొందిన, నతి = నింద. వాయన్ + కాక = పోఁగొట్టుకొనుటకుఁగాక. మోక్ష + అర్థమై - ముక్తికొఱకా పరుసంబు + ఐన = ఘోరమైన, తపంబు = తపస్సు, చేయన్ + తొడఁగెన = చేయ నారంభించెనా? విష్ణుండు, తత్ + బాహు - భీకర - దండ + ఆహతిన్ =, ఆతని (ఆ తారకుని) చేతియందలి, భయంకరమైన, కఱ్ఱయొక్క దెబ్బచే, - ఆతని బాహువనెడి భయంకరదండాహతిచే నని మొనఁ జెప్పవచ్చును, దీర్ఘ - నిద్ర = చిర కాలపు నిద్ర - మరణము, చనియెన్ + కాక = పొందెనుగాని, జగత్ + కల్యాణ - కాంక్ష + ఆత్ముఁడు + ఐ = లోకకల్యాణమునందలి కోరిక గలవాఁడయి - ఇంత - కాలంబు = ఇంత సుదీర్ఘకాలము, సాగర - మధ్యంబునన్ = సముద్రము నడుమ, నిద్ర + చేయునె = నిద్రించునా ?

తాత్పర్యము : ఈశ్వరుఁడు తారకాసురునిచేఁ బరాజితుఁ డయినాఁ డన్న నిందను పోఁగొట్టుకొనుటకే గాని మోక్షము నిమిత్తమా ఘోరమైన తపముచేయుట ? విష్ణువు తారకుని బాహువనెడి భీకరదండముచే దెబ్బతిని దీర్ఘనిద్ర పొందెనుగాని లోక కల్యాణకాంక్షతో నింతకాలము సముద్రమధ్యమున నిద్రపోవునా ?

విశేషములు : తద్బాహుభీకరదండాహతి .... రూపకము. తద్బాహు వనెడి భీకరదండము నాహతి. దీర్ఘనిద్ర = పెద్ద నిద్దుర - మరణము.

క. మందారార్కాలయములు
మందారార్కావనీజమయ మయ్యెఁ; సదా
నందన వనజావాసము
నందన వనజారాధినందిత మయ్యెన్. 27

అర్థము : మంద + ఆర + అర్క + ఆలయములు = శని, అంగారక, సూర్యగ్రహ నివాసములు, మందార + అర్క + అవనీజమయము (లు) = ఉమ్మెత్త, జిల్లేడు చెట్లతో నిండినవి, అయ్యెన్, సదా = ఎల్లప్పుడును, నందన - వనజ + ఆవాసము = నందనోద్యానమునందలి పద్మములకు నిలయమయిన సరోవరము, నందన - వనజ + అరి - అభినందితము = కప్పలకును, తుంగముస్తలకును, నిలయముగా నుతింపఁబడినది, అయ్యెన్.

తాత్పర్యము : శని, అంగారక, సూర్యగ్రహముల నిలయము లుమ్మెత్త జిల్లేడుచెట్లతో నిండిన వయ్యెను. ఆ నందనోద్యానమునందలి పద్మములకు నిలయమైన సరస్సు కప్పలకును, తుంగముస్తలకును నిలయముగా నుతింపఁబడిన దయ్యెను.

విశేషములు : అలంకారము శ్లేషము, అర్క - సూర్య, అర్కపర్ణ (జిల్లేడు) 'అర్కోఽర్కపర్ణే స్ఫటికే రవౌ తామ్రే దివస్పతౌ — విశ్వప్రకాశః

సీ. అనిమిషపతి పుర మనిమిషాస్పద మయ్యె,
నసలు ప్రోలెల్లను నసలమయము.
ప్రేతాధిపతి వీడు ప్రేతసంగతము, వ
లాశను నెలవు పలాశయుతము,
వనధిపు నగరంబు వనచరాకీర్ణంబు,
మారుతాలయము భీమారుతంబు,
కనకాధిపతి వీడు కనకోద్గతంబు, శి
వావాస మెల్ల శివాన్వితంబు,

ఆ. సేసెఁ గానఁ దారకాసురుదెస విప
రీతవృత్తి లేక రిత్తమాఱు
లేటి కనిన నా సురేశరామాత్యు వ
క్రోక్తి విని సరోజయోని నగుచు. 28

అర్థము ; అనిమిష - పతి - పురము = దేవతల ప్రభువైన ఇంద్రుని నగరము అమరావతి, అనిమిష + ఆస్పదము = దేవతల నిలయము, అయ్యెన్, అనలు - ప్రోలు + ఎల్లన్ = అగ్ని పురమంతయు, అనల - మయము = అగ్నితో నిండినదిగాను,

ప్రేత + అధిపతి - వీడు = ప్రేతములకు (పీనుఁగులకు) ప్రభువు అగు యమునియొక్క పట్టణము, ప్రేత - సంగతము = పీనుఁగులతోఁ గూడినదిగాను, పల + అశను - నెలవు = రాక్షసుని (నిరృతి) యొక్క (మాంసము ఆహారము గాఁగలవాఁడు - రాక్షసుఁడు). స్థానము. పలాశ - యుతము = మోదుగుచెట్లతోఁ గూడినది గాను,

వనధి + ఈశు = సముద్రాధిపతియొక్క, - వరుణునియొక్క, నగరంబు = పురము. వనచర + ఆకీర్ణంబు = వనచరములలో - శరభమృగములతో - లేదా వన - మనఁగా నీరు - జలచరములతో, వ్యాప్తమయినదిగాను, మారుత + ఆలయము = వాయువు నిలయము, భీమా + రుతంబు = కొరడాల ధ్వని గలది - దుర్గాదేవి గర్జనలు (?) గలది గాను

కనక + అధిపతి - వీడు = బంగారమునకు (ధనమునకు) అధిపతి యగు కుబేరునియొక్క పట్టణము, కనక + ఉద్గతంబు = ఉమ్మెత్తల మొలకలుగలదిగాను, శివ + ఆవాసము + ఎల్లన్ = ఈశానుని నిలయమంతయు, శివా + అన్వితంబు = నక్కలతోఁ గూడినదిగాను,

చెసెన్ + కానన్ = చేసెను గావున, తారక + అసురుదెసన్ = తారకాసురుని విషయమున, విపరీత - వృత్తి - లేక = వైరుధ్యము లేక, రిత్త - మాఱులు = వ్యర్థములైన నిందలు, ఏటికన్ = ఎందులకు, అనినన్ = అనఁగా, ఆ - సుర +

ఈశ్వర + అమాత్య = దేవేంద్రుని మంత్రి యగు ఆ బృహస్పతియొక్క, వక్ర + ఉక్తిన్ = వక్రోక్తిని - వంకరమాటను. విని, సరోజ - యోని = తమ్మిచూలి - బ్రహ్మ. నగుమన్ = నవ్వెను.

తాత్పర్యము : 'అనిమిషపతియైన దేవేంద్రుని పుర మనిమిష నిందు వమయ్యెను. అగ్నిదేవుని పురమెల్ల నగ్నిమయముగను, యముని నగరము ప్రేత యుక్తముగను, నిర్ఋతి పురము మోదుగుచెట్లతోఁ గూడుకొనినదిగను, వరుణుని పట్ట నము పన్నగములతోఁ గూడుకొనినదిగాను, వాయుదేవుని యాలయము ఘీంకారములతోఁ గూడినదిగాను, కుబేరుని పీ డుమ్మెత్తలు మొలచినట్లుగను, ఈశానుని యావాస మంతయు నక్కలతోఁ గూడినదిగాను దారకుఁడు చేసెను. కావున నరని విషయమున వైరుధ్యములేని వ్యర్థమైన నింద లేటికి?, అనఁగా ఆ బృహస్పతి వక్రోక్తిని బ్రహ్మ విని నవ్వెను - తరువాతి గద్యముతో నన్వయము.

విశేషములు : బృహస్పతి పలుకులు వక్రోక్తులని కవియే సూచించినాఁడు గావున నిందు వక్రోక్త్యలంకారము గలదని భావింపవచ్చును. దాని లక్షణము: 'వక్రోక్తి శ్లేషకాకుభ్యా మపరార్థప్రకల్పనమ్' అన్నారు. శ్లేషముచేఁ గాని కాకుస్వరముచేఁగాని యర్థాంతరము కల్పించినయెడల వక్రోక్త్యలంకార మగును. ఇం దనిమిషాస్పద మనుచో శ్లేషముగలదు, అనిమిష శబ్దమునకు దేవత, చేఁప యని రెండర్థములు గలవు, ఇట్లే పలాశశబ్దమునకు రాక్షసుఁడు, మోదుగు నని యర్థద్వయము గలదు, అట్లే కనక శబ్దమునకు ధనమనియు, నుమ్మెత్త యనియు రెం డర్థములు. శివాన్విత మనుచో శివ+ అన్వితము అనిగాక శివా + అన్వితము అని విడఁదీసి యర్థము చెప్పవలయుటచే నచ్చటను సభంగశ్లేషము గలదు. ఈ రీతిగా వక్రోక్త్యలంకారము గలదని చెప్పవచ్చును. మఱియు నరకాసురునిదెస రిత్తమాటలుగాక, విపరీతవృత్తి గలవని కవియే సూచించు చున్నాఁడు. కావుననిందు బృహస్పతి యుక్తులకు సామాన్యార్థమును గాక తద్విరుద్ధార్థమును జెప్పవలయు ననుట. ఇందు దిక్పాలకుల పురములను జెప్పుటలోఁ గ్రమమును పాటించుట గమనింపఁదగియున్నది.

వ. నిజ వరప్రభావంబునఁ దారకుండు ప్రబలుం డగుటకు సంతోషించియు నిఖిల జగ దపకారుం డగుటకుం గోపించి తద్వధోపాయంబు విచారించి కని.

అర్థము ; నిజ - వర - ప్రభావంబునన్ = తనదియగు వరముయొక్క, మహిమచేత. తారకుండు, ప్రబలుండై = మిక్కిలి బలము గలవాఁడు, అగుటకున్, సంతోషించియున్, నిఖిల - జగత్ + అపకారుండు = ఎల్లలోకముల కపకారము గలవాఁడు - ఎల్లలోకములకు అపకారము చేయువాఁడు, అగుటకున్, కోపించి, తత్ + వధ + ఉపాయంబున్ = ఆతని వధకు ఉపాయమును, విచారించి = ఆలోచించి కని = కనుఁగొని.

తాత్పర్యము : తన యిచ్చిన వరము మహిమచేఁ దారకుఁడు మిక్కిలి బలముగలవాఁ డగుటకు బ్రహ్మ సంతోషించియు, నతఁడు లోకముల కన్నిటికి నపకారము చేయుచుండుటకుఁ గోపించియు నాతని వధింప నుపాయము నాలోచించి, కనుఁగొని - తరువాతి పద్యముతో నన్వయము.

చ. వెలయ నుమామహేశ్వరుల వీర్యమునం దుదయించునట్టి దో
ర్బలకలితుండు గాని సురపాలకవిద్విషుఁ దారకాసురున్
గెలువఁడు పోరిలోఁ; మకరకేతనుఁ బంపుఁడు; వారికిం దప
శ్చలనము సేసి మైవడిఁ బ్రసంగము సేయు జగద్ధితంబుగాన్. 30

అర్థము : వెలయన్ = ఒప్పునట్లుగా, ఉమా - మహేశ్వరుల = పార్వతీ పరమేశ్వరులయొక్క, వీర్యమునందున్ = వీర్యమువలన, ఉదయించు + అట్టి = పుట్టునట్టి, దోస్ (ః) + బల - కలితుండు = భుజబలముతోఁ గూడినవాఁడు, కాని, సుర - పాలక - విద్విషున్ = దేవేంద్రుని శత్రువగు, తారక + అసురున్ = తారకుఁడను రాక్షసుని, పోరిలోన్ = యుద్ధములో, గెలువఁడు = జయింపఁడు, మకర - కేతనున్ = మొసలి ధ్వజచిహ్నముగాఁ - గలవానిని - మన్మథుని, పంపుఁడు, (అతఁడు) వారికిన్ = పార్వతీపరమేశ్వరులకు, తపస్ + చలనము = తపోభంగము, చేసి, మైవడిన్ = అనుకూల్యముతో, జగత్ + హితంబు + కాన్ = లోకములకు మేలగునట్లు, ప్రసంగము + చేయున్ = ప్రకృష్టమయిన సంగమమును జేయును.

తాత్పర్యము : ఉమాగర్భమున నొప్పునట్లుగా క్షరితమైన పరమేశ్వరుని వీర్యమువలనఁ బుట్టు భుజబలసంపన్నుఁడు గాని యింద్రశత్రువగు తారకాసురుని యుద్ధ

మున గెలువఁజాలఁడు. మీరు మన్మథుని వారికడకుఁ బంపుఁడు. అతఁడు వారిలోపస్పృష్ట భగ్నముచేసి వాని కిరువురికిని లోకోపకారార్థముగా సంగమమును గలిగించును.

విశేషములు : వీర్యము మహేశ్వరునిది. అది ఉమాగర్భానికిష్టమైనది యనుటకు ఉమామహేశ్వరుల వీర్య మనఁబడినది.

దోస్ + బల - పదాంతసకారమునకు విసర్గాదేశము - దోః+బల. అ ఆ లు తప్ప మిగిలిన అచ్చుల తరువాత వచ్చు విసర్గమునకు అచ్చుగాని, మృదుహల్లులుగాని పరములగునపుడు రేఫ మాదేశ మగును. దోర్బల. జగద్ధితము-జగత్ + హితము -వర్గముల మొదటి నాలుగక్షరముల (ఝయ్యుల) కంటె పరమగు హకారమునకు పూర్వసవర్ణాదేశము (ఆ వర్గములకుఁ జెందిన చతుర్థవర్ణాదేశము) వైకల్పికముగానగును. జగత్ + ధితము, జగత్ + హితము. అనునాసికాంతస్థ వర్ణములు తప్పమిగిలిన పదాంతహల్లులకు (ఝల్లులకు) మృదు హల్లులు (హశ్శులు) గాని అచ్చులుగాని పరము లగునపుడు ఆహల్లులవర్గముకుఁ జెందిన తృతీయవర్ణ మాదేశముగావచ్చును. జగద్ధితము, జగద్హితము, తపశ్చలనము-తపస్ + చలనము. పదాంత సకారమునకు విసర్గాదేశము. తపః + చలనము. ఊష్మ పరకములు గాని చ ఛ, ట ఠ, త థలు పరము లగు నపుడు విసర్గము సకారముగా మాఱి చ ఛలు పరమగునపుడు శ్చుత్వమును, ట ఠలు పరమగునపుడు ష్టుత్వమును బొందును. తపశ్చలనము.

వ. అని తమకుం గరుణించి చతుర్ముఖుండు హితోపదేశంబు చేసిన దానికి మహాప్రసాదం బని వీడుకొని. 31

అర్థము : అని,తమకున్ = తమ్ము, కరుణించి = దయఁజూచి, చతుర్ముఖుండు = నాలుగుమోములవాఁడు - బ్రహ్మ,హిత + ఉపదేశంబు + చేసినన్ = మేలుగలిగించు మాట ఉపదేశింపఁగా, దానికిన్, మహత్ (మహా) + ప్రసాదంబు+ అని = గొప్పయనుగ్రహము అని, వీడుకొని = సెలవు పుచ్చుకొని.

తాత్పర్యము : అని తమ్ము దయఁదలఁచి బ్రహ్మ హితవు నుపదేశింపఁగా దానికి మహాప్రసాదమని వారిని వీడ్కొని-తరువాతి పద్యముతో నన్వయము.

క. తమ కప్పుడు త్రిభువన రా
జ్యము చేకుఱినంతకంటె సంతోషముతో
నమరతతి గొల్చి చనుదే
నమరేంద్రుఁడు వచ్చెఁ బేర్మి నమరావతికిన్. 32

అర్థము : తమకున్, అప్పుడు, త్రిభువన - రాజ్యము = ముల్లోకముల రాజ్యము, చేకుఱిన + అంతకంటెన్ = లభించినదానికంటె, సంతోషముతోన్, అమర - తతి = దేవసమూహము, కొల్చి = సేవించి, చను + తేన్ = రాఁగా, అమర + ఇంద్రుఁడు = దేవేంద్రుఁడు, పేర్మిన్ = గౌరవముతో, అమరావతికిన్, వచ్చెన్.

తాత్పర్యము : దేవతల కప్పుడు ముల్లోకములరాజ్యము లభించినదానికంటె సంతోషము గలుగఁగా వారు సేవించుచురాఁగా నింద్రుఁడు సగౌరవముగా నమరావతి కరుదెంచెను.

విశేషములు : చేకూరు - చేకుఱు, దీర్ఘపూర్వకమగు లఘురేఫము హ్రస్వపూర్వక మగుచో నలఘురేఫం బగు, చను + తేన్. 'అభ్యాగతి నపుగ్వాదుల కయ్యది (తెంచుధాతువు) యనుప్రయుక్తంబగు నగుచో గువర్ణంబు విభాషను లోపించు,' బాల. క్రియ. 111. చను + తెంచు 'ఉత్వంబుపయిని దాని తకారంబు దకారంబు కాఁగా (110 చే) చనుదెంచు, 'తుమర్థభావలక్షణంబులందు నుజీ యగు.' బాల. క్రియ. 40. చనుదెంచు + నుజీ. 'ముజ్జీత్తులు ముత్తు నాఁబడు.' బాల. క్రియ. 86. 'అద్దానికి ముత్తుపరంబగునపుడు తే చేరు లగు.' బాల. క్రియ. 113. చనుదేన్, చనుదేరన్.

## ఇంద్రాదులు పార్వతీపరమేశ్వరుల సంయోగమునకు మన్మథునిఁ బ్రోత్సహించుట

వ. ఇట్లు వచ్చి పచ్చవిల్తు రావింపం బుచ్చినం దదాజ్ఞాప్రేరితుండై
కుసుమాయుధుఁ డా క్షణంబ కదలి. 33

అర్థము: ఇట్లు, వచ్చి, పచ్చవిల్తున్ = చెఱకువింటివానిని-మన్మథుని, రావింపన్ + పుచ్చినన్ = రాఁబంపఁగా, కుసుమ + ఆయుధుఁడు = పుష్పబాణుఁడు .

మన్మథుఁడు, తద్ + ఆజ్ఞా - ప్రేరితుండు + ఐ = ఆతని ఆదేశముచేఁ బ్రేరింపఁ బడినవాఁడయి, ఆక్షణంబు + అ= తత్క్షణమే, కదలి.

తాత్పర్యము : ఇట్లు వచ్చి మన్మథుని రావింపఁగా నతఁడు వానియాజ్ఞచేఁ బ్రేరేపింపఁబడినవాఁడయి తత్క్షణమే కదలి - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : పచ్చవిల్తుఁడు - పచ్చని విల్లు కలవాఁడు - బహువ్రీహి సమాసము. 'బహువ్రీహిని సమాసాంతకార్యంబులుం గానంబడియెడి.' బాల.సమాస. 22. పచ్చవిలుతుఁడు : ఆచ్ఛికంబులం బదమధ్యంబుల న ల డ ర ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు.' పచ్చవిల్తుఁడు.బాల. ప్రకీర్ణ. 17. రావింపంబుచ్చినన్ - వచ్చు ధాతువు. 'సర్వంబునకుం బ్రేరణంబునం దించుక్కగు.' బాల.క్రియ.70. వచ్చు + ఇంచు. 'ఇంచు క్కు క్కుగాగమంబులు పరంబులగునపు డాగమాదేశ లోపంబులు పెక్కు-దెఱంగులం గానంబడియెడి.' బాల.క్రియ.77-రావించు. 'తుమర్థభావ లక్షణంబులందు నుజీ యగు.' బాల.క్రియ. 40. రావించు + నుజీ. 'ముజ్జీత్తులు ముత్తు నాఁబడు.' బాల.క్రియ. 88. 'ఆగమాన్యచకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరంబగునపుడు ప వ లగు.' బాల.క్రియ. 88. రావింపన్. పోవు ధాతువు. 'సర్వంబు నకుం బ్రేరణంబునం దించుక్కగు.' బాల.క్రియ.70. పోవు + ఇంచు. 'ఇంచు క్కు క్కుగాగమంబులు పరంబు లగునపు డాగమాదేశలోపంబులు పెక్కు-దెఱంగులం గానంబడియెడి.' బాల.క్రియ.77. పుచ్చు.' చేదర్థంబునందు వృత్తంబగు భావలక్షణంబు నందు నవర్ణకంబు ద్రుతాంతం బగు.' బాల.క్రియ.41. పుచ్చు + నన్.'భూతంబునం దిగాగమం బగు.' పుచ్చు + ఇ + నన్. బాల.క్రియ.17. 'అంద్వవగాగమంబులం దప్ప నపదాదిస్వరంబు పరంబగునపు డచ్చునకు సంధి యగు.'బాల.సంధి.11. పుచ్చినన్. రావింపన్ + పుచ్చినన్. 'ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళము లగు.' బాల.సంధి.16. రావింపన్ + బుచ్చినన్. 'ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాష నగు.' బాల.సంధి.17. రావింపంబుచ్చినన్. అ క్షణంబ - అనుటకు అక్షణంబ అని నన్నెచోడుఁడు పలుచోట్లఁ బ్రయోగించెను. 4-82 11-76.

ఉ. పూవులతేరు జక్కవలు పూన, వసంతుఁడుఁ దాను నెక్కి-, కీ
రావళి కోకిలాళి మలయానిలముం దనుఁగొల్చి పొల్చి రాఁ
గా, వర మీనకేతనము గ్రాల, నలివ్రజ శంఖ కాహళా
రావములుం జెలంగ నమరావతికిం జనుదెంచె నున్నతిన్. 34

అర్థము: పూవుల - తేరు = పుష్పరథము, జక్కువలు = చక్రవాకములు, పూనన్ = వహింపఁగా, వసంతుఁడున్, తానున్, ఎక్కి, కీర + అవళి = చిలుకల వరుస, కోకిల + ఆళి = కోకిలముల వరుస, మలయ + అనిలమున్ = మలయ పర్వతమునుండి వచ్చు గాలియును - దక్షిణపు గాలియును, తనున్ + తన్ను, కొల్చి = సేవించి, పొల్చు = ఒప్పు, రాఁగాన్, వర - మీన - కేతనము = శ్రేష్ఠమయిన చేఁపయను ధ్వజచిహ్నము, క్రాలన్ = ఒప్పఁగా. అలి - వ్రజ - శంఖ - కాహళా + ఆరావములన్ = తుమ్మెదలగుంపు అనెడి శంఖములయు, కాహళ (పెద్దఢక్క) లయు ధ్వనులు, చెలంగన్ = మ్రోయఁగా. ఉన్నతిన్ = గొప్పతనముతో, అమరావతికిన్, చనుదెంచెన్ = వచ్చెను.

తాత్పర్యము: పుష్పరథమును చక్రవాకములు వహింపఁగా, దానిపై వసంతుఁడును దానును ఎక్కి, చిలుకలు, కోకిలములు, మలయవాయువు తన్ను సేవించి వచ్చుచుండఁగా, మత్స్యధ్వజము ఒప్పఁగా, తుమ్మెదలగుంపనెడి శంఖములయు, కాహళలయు ధ్వనులు మ్రోయఁగా మన్మథుఁడు గొప్పతనముతో నమరావతి కరుదెంచెను.

విశేషములు: జక్కవలు, వసంతుఁడు, కీరములు, కోకిలములు, మలయవాయువు, తుమ్మెదలు మన్మథుని పరివారము, వసంతుఁ డాతని మిత్రుఁడు. అలివ్రజమనెడి శంఖకాహళ లనుటచే రూపకాలంకారము.

వసంతుఁడు దాను నెక్కి .... అమరావతికిం జనుదెంచె ....' ఆత్మార్థం బభిహితం బగుచోఁ దల్లింగసంఖ్యాభిధాయి వచనంబు ధాతువిశేషణంబుల కగు.' బాల. క్రియ. 120

వ. ఇట్లు శృంగారయోని శృంగారరసప్రవాహంబు మేరదప్పి కప్పిన ట్లప్పురంబు సొత్తెంచునప్పు డతిసంభ్రమంబునఁ బుష్పాయుధుం గనుంగొని. 35

అర్థము: ఇట్లు, శృంగారయోని = మన్మథుఁడు, శృంగార-రస-ప్రవాహంబు = శృంగారమనెడిరసముయొక్క ప్రవాహము, మేర + తప్పి = హద్దుమీఱి, కప్పు + అట్లు = వ్యాపించువిధమున, ఆ + పురంబు = ఆ నగరము - అమరావతి చొత్తెంచు + అప్పుడు = ప్రవేశించు సమయమున, అతి - సంభ్రమంబునన్ = మిక్కిలి వేగిరపాటుతో, పుష్ప + ఆయుధున్ = పూవుటమ్ములవానిని, మన్మథుని కనుంగొని = చూచి,

తాత్పర్యము: ఇట్లు మన్మథుఁడు శృంగారరసప్రవాహము హద్దుమీఱి వ్యాపింపఁజేసినట్లు ఆ పురమును ప్రవేశించినపుడు మిక్కిలి సంరంభముతో మన్మథుని జూచి - రతిపతి పద్యమునకు నన్వయము.

విశేషములు: శృంగారయోని - శృంగారయోనిః శ్రీపుత్రః కూర్పకారాతిః. శృంగారమునకుఁ గారణమైనవాఁడు - మన్మథుఁడు, అమరము.

చొత్తెంచు - చొచ్చు ధాతువు, 'తెంచుధాతు వగ్వాదుల కనుప్రయుక్తం బగు.' బాల. క్రియ.110. చొచ్చు + తెంచు. 'అయ్యది పరంబగునపుడు చువర్ణంబు లోపించు.' బాల. క్రియ.112. చొచ్ + తెంచు. (చొచ్ + చు = చొచ్చు), ఒక హల్లునకు విజాతీయమగు హల్లుతో సంయోగ మెప్పుడునప్పు డా హల్లు పరహల్లుగా మాఱునని నిర్దేశానుసారముగ గ్రహింపఁదగును. కాన చకారము పరహల్లుగా మాఱి చొత్ + తెంచు = చొత్తెంచు సిద్ధించును. చొత్తెంచు + అప్పుడు - 'ఉదంతమగు తద్ధర్మార్థ విశేషణమున కచ్చు పరమగునపుడు నుగాగమం బగు.' బాల.సంధి.33. చొత్తెంచు నప్పుడు. శృంగార - రస = శృంగారమనెడి రస - రూపకము.

ఆ. పడఁతు లెల్లఁ గామపరవశలై; రది
తగు; మనోజుఁ జూచి మగలు గరముఁ
బ్రీతిఁ దగిలి గండపెటంబు కొని సుర
పురి జనంబు లెల్ల విరలి గొనిరి. 33

అర్థము: పడఁతులు + ఎల్లన్ = స్త్రీలందఱును, కామ - పరవశలు = మన్మథునకు లోఁబడినవారు, ఐరి=అయిరి, అది, తగున్ = ఒప్పును, మనోజున్ = మన్మథుని, చూచి, మగలున్ = పురుషులుకూడ, కరమున్ = మిక్కిలి, ప్రీతిన్ = ప్రేమముతో, తగిలి = ఆసక్తినొంది, గండపెటంబు = పురుషులయం దనురాగము, కొని = పూని, (ఇట్లు), సుర - పురి - జనంబులు + ఎల్లన్ = అమరావతియందలి జనులందఱును, విరలి + కొనిరి = వలపుగొనిరి.

తాత్పర్యము: మన్మథుఁ డమరావతికి వచ్చినప్పుడు స్త్రీ లందఱును మన్మథపరవశ్యము చెందిరి. అది యొప్పును. కాని అతనినిఁ జూచి పురుషులుగూడ

యొక్క-ప్రేమయుతో ఆసక్తి వహించి పురుషులం దనురాగము వహించిరి. ఇట్లు ఆ పురమునందలి జనులెల్లయును వలపు వహించిరి.

విశేషములు: స్త్రీలు కాముకులగుట సహజమే కావున నది యొప్పును, కాని పురుషులు పురుషులపై ననురక్తి వహించుట విశేషము. విరలి - విరాళి, జనంబులు - అమరావతి గాన దేవతలని భావము.

వ. ఇట్లఖిల జన సమ్మోహనాకారుం డగు సమ్మోహనాయుధుండు వజ్రా
యుధు నాస్థానరంగంబు దఱియం జొత్తెంచి. 37

అర్థము: ఇట్లు, అఖిల-జన-సమ్మోహన + ఆకారుండు = ఎల్ల జనులకు మోహమును బుట్టించు రూపము గలవాఁడు, అగు, సమ్మోహన + ఆయుధుండు = సమ్మోహన మనెడి ఆయుధము గలవాఁడు-మన్మథుఁడు, వజ్ర + ఆయుధు = వజ్ర మాయుధముగాఁ గలవాని (ఇంద్రుని) యొక్క, ఆస్థాన - రంగంబున్ + కొలువు ప్రదేశమును, తఱియన్+చొత్తెంచి=ప్రవేశించి.

తాత్పర్యము: ఇట్లు ఎల్లజనులకు మోహమును బుట్టించు సౌందర్యము గలవాఁడగు మన్మథుఁడు ఇంద్రుని కొలువుకూటమును బ్రవేశించి- తరువాతి పద్యముతో నన్వయము.

వజ్రాయుధు నాస్థానరంగంబు-వజ్రాయుధు + ఆస్థానరంగంబు- 'షష్ఠీసమాసము నం దుకార ఋకారముల కచ్చు పరమగునపుడు నుగాగమం బగు.' బాల.సంధి.34.

శా. రంభాద్యప్సర ఓఘ లాస్య రస పూర స్ఫార నే త్రామలో
జ్జృంభాంభోజ సహస్ర భోగఫల భాసిం దారకోన్మాలనా
రంభాయత్త సుచిత్తు నిర్జరధునీ రాజీవ మాలాధరున్
జంభారాతిఁ బురందరుం గని మనోజాతుండు ప్రీతాత్ముఁడై 38

అర్థము: రంభా .... భాసిన్: రంభా = రంభ. ఆది = మొదలుగాఁగల. అప్సరస్(ః)=అచ్చరలయొక్క- ఓఘ-సమూహముయొక్క-. లాస్య-రస = నాట్యమనెడి. రసముయొక్క-, పూర=ప్రవాహముచే. స్ఫార=విస్తరించిన, నేత్ర=కన్ను లనెడి

అమల = నిర్మలములైన, ఉజ్జృంభ = బాగుగా వికసించిన, అంభోజ = పద్మముల యొక్క, సహస్ర = వేయిటియొక్క, భోగ = సౌఖ్యమనెడి, ఫల = ఫలముచే, భాసిన్ = ప్రకాశించువాఁడును, తారకో....సుచిత్తస్; తారక = తారకాసురునియొక్క, ఉన్మూలన = నాశనమనెడి. ఆరంభ = ప్రయత్నమునకు, ఆయత్త = అధీనమైన, సు-చిత్తస్ = మంచి మనస్సుగలవాఁడును, నిర్జర,,ధుని = నిర్జర-ధునీ = దివ్యగంగయందలి, రాజీవ = తామరల, మాలా ధరస్ = దండలను దాల్చినవాఁడును, జంభ + అరాతిన్ = జంభుఁడను రాక్షసునకు శత్రువైనవాఁడును, అగు, పురందరున్ = ఇంద్రుని, కని, మనోజాతుండు = మనసిజుఁడు-మన్మథుఁడు, ప్రీత + ఆత్ముఁడు + ఐ = సంతోషించిన మనస్సు గలవాఁడయి.

తాత్పర్యము : మన్మథుఁడు-రంభ మున్నగు నప్సరల సమూహముయొక్క నృత్య మనెడి రసము ప్రవాహముచే విస్తరించిన కన్ను లనెడి నిర్మలములైన మిక్కిలి వికసించిన వేయిపద్మముల సౌఖ్య మనెడి ఫలముచేఁ బ్రకాశించువాఁడును, తారకనాశనప్రయత్నమున కధీనమైన మనస్సు గలవాఁడును, ఆకాశగంగానదియందలి తామరల మాలలను దాల్చినవాఁడును, జంభుఁ డను రాక్షసునకు శత్రువైనవాఁడును అగు దేవేంద్రుని జూచి సంతోషించినవాఁడయి-తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : రంభాదుల నాట్యమే యగు రసప్రవాహమున విస్తరించిన నేత్రములే యగు వేయిపద్మములచేఁ బ్రకాశించువాఁడు-రూపకాలంకారము. పురందర-'వృద్ధశ్రవాః సునాసీరః పురుహూతః పురందరః'-పురాణి అరీణాం దారయతీతి-పురన్దరః-శత్రుపురములను వ్రక్కలించినవాఁడు-ఇంద్రుఁడు, అమరము.

రంభా + ఆది = రంభాది-సవర్ణదీర్ఘసంధి. రంభాది + అప్సరస్ = రంభాద్యప్సరస్-యణాదేశసంధి. అప్సరస్ + ఓఘ = అప్సరః + ఓఘ-పదాంతసకారమునకు విసర్గాదేశము, హ్రస్వ అకారము తరువాత వచ్చు విసర్గము హ్రస్వాకారభిన్నమైన అచ్చు పరమగు నపుడు లోపించును, అప్సరఓఘ. అంభోజ సహస్ర-ఇంద్రుఁడు సహస్రాక్షుఁడు. నేత్ర + అమల + ఉజ్జృంభ-నేత్రామలోజ్జృంభ-సవర్ణదీర్ఘ, గుణసంధులు.

తే. తన్నుఁగని యనిమిషులైరో మున్న యైరొ
నాఁగ ననిమిషదృష్టిని నాకి సమితి
దగిలి కనుఁగొన వారి చిత్తములు తనకు
నెఱుఁగ నమరేశునకును రతీశుఁ డెఱిఁగె. 39

అర్థము : తన్నున్+కని=తన్నుఁజూచి, అనిమిషులు=ఱెప్పపాటు లేనివారు, ఐరో=అయిరో, మున్ను+అ = మున్దే, ఐరో, నాఁగన్ = అనునట్లు, అనిమిష-దృష్టిని= ఱెప్పపాటులేని చూపులో, నాకి-సమితి=దేవతల గుంపు, తగిలి=ఆసక్తితో, కనుఁగొనన్=చూడఁగా, వారి-చిత్తములు = వారి మనస్సులు, తనకున్, ఎఱఁగన్= అభిముఖములు కాఁగా, రతి + ఈశుఁడు = రతి భర్త - మన్మథుఁడు, అమర = ఈశునకును=దేవప్రభునకు-ఇంద్రునకు, ఎఱఁగెన్=నమస్కరించెను.

తాత్పర్యము : తన్నుఁజూచి దేవతలు ఱెప్పపాటులేనివారయిరో లేక తన్నుఁజూచుటకుముందే ఱెప్పపాటు లేనివారయిరో కాని దేవతల సమూహము ఱెప్ప పాటులేని చూపుతో నాసక్తి వహించి చూడఁగా, వారి మనస్సులు తన కభిముఖములు కాఁగా మన్మథుఁ డింద్రునకు నమస్కరించెను.

విశేషములు : నిమిషము = ఱెప్పపాటు. అది లేనివారు అనిమిషులు - దేవతలు, నాకి-నాకః అస్య అస్తీతి నాకిన్- నాకము గలవాఁడు-దేవుఁడు, అలంకార ముత్ప్రేక్ష.

వ. ఇట్లు సురరాజు వలరాజు సుందరాకారంబుఁ గని ముదితహృదయుం డగుచు సముచితాసన తాంబూలదాన సన్మానాదులం బ్రహృష్ట మనస్కుం జేసిన సురపతికి రతిపతి నిజ భుజా కలిత పుష్ప కోదండకౌశలోన్నతి నెచ్చి మహోత్సాహంబున ని ట్లనియె. 40

అర్థము : ఇట్లు, సుర-రాజు = దేవతలప్రభువు-ఇంద్రుఁడు, వలరాజు = (వలపు + రాజు) = మన్మథునియొక్క, సుందర + ఆకారంబున్ = మనోహర రూపమును, కని=చూచి, ముదిత-హృదయుండు = సంతోషించిన హృదయము గల వాఁడు, అగుచున్, సముచిత .... సన్మానాదులన్; సముచిత=తగిన, ఆసన=పీఠము, తాంబూల=తాంబూలము, దాన=ఇచ్చుట, అను, సన్మాన = గౌరవము, ఆదులన్= మున్నగువానిచేత, ప్రహృష్ట-మనస్కున్=మిక్కిలి సంతోషించిన మనస్సుగలవానిని, చేసినన్ = చేయఁగా, సుర-పతికిన్ = ఇంద్రునకు, రతి-పతి = రతిదేవి భర్త - మన్మథుఁడు. నిజ....లోన్నతిన్; నిజ=తనదైన. భుజా = భుజమునందు, కలిత = ధరింపఁబడిన, పుష్ప-కోదండ=పువ్వువింటియొక్క, కౌశల=నేర్పుయొక్క, ఉన్నతిన్=

గొప్పతనముచేత, ఎచ్చి = విజృంభించి, మహత్ (మహా) + ఉత్సాహంబునన్ = గొప్ప యుత్సాహముతో, ఇట్లు, అనియెన్.

తాత్పర్యము ; ఇట్లు ఇంద్రుఁడు మన్మథుని మనోహరరూపమును జూచి సంతోషించి, అతనిని సముచితముగా ఆసనము, తాంబూలము మున్నగు గౌరవములచే సంతుష్టుని జేయఁగా, నింద్రునకు మన్మథుఁడు తనభుజమునందలి పూవింటి నేర్పు పెంపుచే విజృంభించి మహోత్సాహముతో ని ట్లనియెను.

మన్మథుని ప్రతిజ్ఞ

మ. అతినిష్ఠాపరులై సురేంద్రవిభవాప్త్యాసక్తి నుగ్రాధిక
వ్రతముల్ చేకొని ధీరులై నడతు మన్వా రెవ్వ రైనన్ శుభ
స్థితి నెందేనియుఁ గల్గినం బనుపు నన్ శీఘ్రంబ పుష్పాస్త్రసం
హతి విచ్ఛిన్నమనస్కులన్ విషయమాయాగ్రస్తులన్ జేసెదన్. 41

అర్థము : అతి-నిష్ఠా-పరులు + ఐ = అధికనిష్ఠయందు దాసక్తిగలవారయి, సుర+ఇంద్ర-విభవ+ఆప్తి+ఆసక్తిన్ = దేవేంద్రవైభవముయొక్క ప్రాప్తియందలి కోరికతో, ఉగ్ర + అధిక - వ్రతముల్ = భయంకరములైన పెక్కు వ్రతములు, చేకొని, = స్వీకరించి - చేసి, ధీరులు + ఐ = ధైర్యవంతులమయి, నడతుము, అన్ + వారు = అనువారు, ఎవ్వరు + ఐనన్, శుభ-స్థితిన్ = శుభమైన ఉనికితో, ఎందున్ + ఏనియున్ = ఎచ్చటనైనను, కల్గినన్ = ఉన్నచో, నన్ = నన్ను, శీఘ్రంబు + అ = వెంటనే, పనుపు = పంపుము, పుష్ప + అస్త్ర-సంహతిన్ = పూవుటమ్ముల దెబ్బచే, విచ్ఛిన్న - మనస్కులన్ = విఱిగిన మనస్సుగలవారినిగను, విషయ - మాయా - గ్రస్తులన్ = ఇంద్రియములనెడి మాయచే లోఁగొనఁబడిన వారినిగను, చేసెదన్.

తాత్పర్యము : మిక్కిలి నియమపరులయి దేవేంద్రవైభవమును బొందఁగోరి తీవ్రవ్రతములుచేసి ధైర్యముతోఁ బ్రవర్తించుచునువా రెవరైన శుభములతో నెచ్చట నైన నున్నచో నన్ను వెంటనే పంపుము. నేను పూవుటమ్ముల దెబ్బచే వారిని కలఁగిన మనస్సుగలవారినిగను. ఇంద్రియములనెడిమాయలకుఁ జిక్కినవారినిగను జేసెదను.

విశేషములు: విధవ + ఆప్తి = విధవాప్తి. సవర్ణదీర్ఘసంధి. విధవాప్తి + ఆసక్తి = విధవాప్త్యాసక్తి. యణాదేశసంధి. ఇ ఉ ఋ ౠ లు అసవర్ణములైన అచ్చులు పరము లగునపుడు క్రమముగా య్, వ్, ర్, ల్ అనునవి ఆదేశము లగును. ధీయుతై - ధీయుతలమై - 'ప్రథమాంతంబులగు యుష్మదస్మద్విశేషణంబుల కేకత్వంబున వు ను లును, బహుత్వంబున రు ము లు నంతాగమంబులు ప్రాయికంబుగ నగు.' బాల. కారక. 33. 'ఈ యాగమంబులు పరంబు లగునపు డుత్వంబున కత్వంబగు.' బాల. కారక. 34. ధీయుతలు + ము. ధీయుతల + ము + ఐ అని కావలసియుండఁగా నట్లు కామికి ప్రాయికశబ్దము శరణము. అన్వాయ = అను + వాయ 'అను కొను లోనగు ధాతుజవిశేషణముల యంత్యాకారమునకు హల్లు పరంబగునపుడు లోపంబు వైకల్పికంబు.' ప్రౌఢ. సంధి. 13. పనుపు + ము + నన్ = పనుపు నన్. 'మధ్యమ పురుష మువర్ణకంబునకు హలవసానంబులు పరంబు లగునపుడు లోపము విభాష నగు.' బాల. సంధి. 47. నన్ - నన్ను - 'ఉకారంబు క్రింది ఉకారంబునకుం బది ను లు ం క్రింది న ల ల కు లోపంబు బహుళంబుగ నగు.' బాల. ప్రకీర్ణ. 7. నను, 'పదాంతంబులయి యసంయుక్తంబులయిన న ణ ల ల ద్విత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు.' బాల. ప్రకీర్ణ. 16. నన్.

ఇది కాళిదాసు కుమారసంభవమునందలి శ్లోకమునకు సన్నిహితముగా నుండుట చూడనగును.

కే నాభ్యసూయా పదకాఙ్క్షిణా తే
నితాన్తదీర్ఘై ర్జనితా తపోభిః,
యావద్భవ త్యాహితసాయకస్య
మత్కార్ముక స్యాస్య నిదేశవర్తీ॥ కుమా. 3. 4.

సంస్కృత శ్లోకమునకుఁ దెలుఁగుపద్య మించుక విస్తరణముగా నున్నది.

క. పరమపతివ్రతలై సుర
పురమును సాధింప నున్న పుణ్యస్త్రీ లె
వ్వరు గలరు చూపు చూతాం
కుర శరహతిఁ దివులుమకుఁ గొలిచెద నాజ్ఞన్. 42

అర్థము: పరమ - పతివ్రతలు + ఐ = గొప్ప సాధ్వులయి, సుర - పురమును = దేవతల నగరమును-అమరావతిని, సాధింపన్ + ఉన్న = సాధింపఁబోవు, పుణ్య - స్త్రీలు + ఎవ్వరు + కలరు = పవిత్రస్త్రీలు ఎవ రున్నారు?, చూపు = చూపుము, వారిన్, చూత + అంకుర - శర - హతిన్ = మామిడిచిగురుటంపదెబ్బచే, తిరుఖుఁపుపుఖ్రు + కొని పెదన్ = వెట్టి వలపు పుట్టించి బాధించెదను.

తాత్పర్యము: పరమసాధ్వులయి దేవతల నగరమగు నమరావతిని సాధింపఁబోవు పుణ్యాత్మలగు స్త్రీ లెచ్చట నున్నారు? చూపుము. వారిని మావిచివురు టంపదెబ్బచే వెఱ్ఱివలపు పుట్టించి బాధింతును.

విశేషములు: చూపుము + చూతాంకుర....మధ్యమపురుషమువర్ణకము నకు హల్లు పరమగుచుండఁగా లోపము. బాల, సంధి. 47. చూపు చూతాంకుర ....

క. అనుపమ రూప యౌవన మహాగుణవైభవలీల నెవ్వరిం
గనుఁగొని మెచ్చకున్న వరకన్యక గల్గిన దానిఁ జెప్పు నీ
పనిచినవాని వేలగొని పైఁబడఁజేసెద; నీవు తన్నుఁ గ
ల్చిన నొరుఁ దాను గల్చి చను చేడియ గల్గినఁ జూపు తెచ్చెదన్. 48

అర్థము: అనుపమ - రూప - యౌవన - మహత్ (మహా) - గుణ - వైభవ - లీలన్ = సాటిలేని సౌందర్యము, పడుచుఁదనము అనెడి గొప్ప గుణము లనెడి సంపదయొక్క విలాసముచే, ఎవ్వరిన్ = ఎవ్వరినైనను, కనుఁగొని = చూచి, మెచ్చక + ఉన్న = ఇష్టపడని, వర - కన్యక = శ్రేష్ఠురాలయిన పడుచు, కల్గినన్ = ఉన్నచో, దానిన్ = ఆమెను, చెప్పు = చెప్పుము, నీ - పనిచినవాని = నీవు పంపినవానియొక్క, వేల + కొని = దాస్యముచేసి, పైన్ + పడన్ + చేసెదన్ = మీఁదఁబడునటు చేసెదను, నీవు, తన్నున్, కల్చినన్ = మోహింపఁగా, తాను, ఒరున్ = ఇంకొకరిని, కల్చి = మోహించి, చను = వర్తిల్లు, చేడియ = స్త్రీ, కల్గినన్ = ఉన్నయెడల, చూపు = చూపుము, తెచ్చెదన్.

తాత్పర్యము: తన సాటిలేని సౌందర్యము యౌవనము అను విశిష్టగుణముల వైభవముచే నెవరినైనను జూచి మెచ్చకుండు యువతి యున్నచోఁ జెప్పుము,

ఆమె నీ పంపినవానికి దాస్యము చేసి మీఁదఁబడునట్లు చేసెదను. నీవు మోహింపఁగాఁ దా నింకొకరిని మోహించు స్త్రీ యున్నచోఁ జూపుము తెచ్చెదను.

విశేషములు : ఈ పద్యము

'కా మేకపత్నీవ్రత దుఃఖ శీలాం
లోలం మన శ్చారుతయా ప్రవిష్టామ్,
నితమ్బినీ మిచ్ఛసి ముక్తలజ్జాం
కణ్ఠే స్వయంగ్రాహ నిషక్తబాహుమ్.' కుమార.3-7.

అను కుమారసంభవ శ్లోకమునకు దగ్గఱగా నున్నది.

చెప్పు నీపనిచిన, చూపు తెచ్చెదన్ - షష్ఠ్యుత్పురుషమువర్ణకమునకు హల్లు పరమగుచుండఁగా లోపము. బాల. సంధి.47 నీ పనిచినవాని-నీవు పనిచినవాని-'ధాతుజ విశేషణ భావార్థక పూర్వ వ్యవహితావ్యవహితకర్తృపదప్రథమకుఁ దఱచుగ యొక్క షష్ఠి యగు,' ప్రౌఢ.కారక. 15. నీయొక్కపనిచినవాని - 'యొక్కకు లోపంబు బహుళంబు.' ప్రౌఢ.కారక16, నీ పనిచినవాని. కలుచు = ప్రేమించు-ఈ యర్థమున నన్నెచోదుని ప్రయోగాంతరములు- 7-20, 8-145, 8-151, 8-163. వేల= దాస్యము- ఇతనివే ప్రయోగాంతరములు -6-17,10-164.

చ. వలయు జనాలి నెల్ల మును వశ్యులఁ జేసితిఁ బుష్పబాణకౌ
శలమున;శూర్పకాది రిపు సంహతినోర్చితిఁ దీవ్రసాయకా
వలిఁ; ద్రిజగంబులందు వశవర్తులు భీతులు గాని నాకు న
గ్గల మెరు లెందు లేరు; విను కౌశిక! నేర్పున విక్రమంబునన్. 44

అర్థము : కౌశిక = ఇంద్రా!, విను = వినుము, వలయు - జన + ఆలిన్ + ఎల్లన్ = కావలసిన జనుల సమూహమునంతను, పుష్ప - బాణ - కౌశలమునన్ = పూవుటమ్ములనేర్పులో, మును = పూర్వము, వశ్యులన్ = వశపడినవారినిగా, చేసితిన్, తీవ్ర - సాయక + ఆవలిన్ = తీవ్రములైన - భయంకరములైన బాణముల వరుసచే, శూర్పక + ఆది - రిపు - సంహతిన్ = శూర్పకుఁడు మున్నగు శత్రువుల సమూహమును, ఓర్చితిన్ = ఓడించితిని, త్రిజగంబుల + అందున్ = మూఁడు లోకములందును, నేర్పునన్ = నేర్పునందును, విక్రమంబునన్ = పరాక్రమము

పరమతపోనిధి పరమేశు డుగ్రాక్షు
డైన నపారశౌర్యంబు వెలయ,
మఱియు నమర్త్యాహిమర్త్యాధిపతు లెంత
శుచులయ్యు నాయుధశూరులైన,

ఆ. నీ క్షణంబ సతుల కెఱఁగింతుఁ బుష్పాస్త్ర
కౌశలమున నదియుఁగాక పోర
నీవు దక్క నీకు నెఱఁగింతు నత్యుగ్ర
బాణశక్తిఁ దన్నుఁ బంపు దేవ! 45

అర్థము : నసున్ + కన్న - జనకుండు = నన్నుఁగన్నతండ్రి, జల శాయి = నీటఁ బరుండువాఁడు, హరి = విష్ణువు, చక్రి = సుదర్శనమనుచక్ర మాయుధముగాఁ గలవాఁడు, ఐనను, స్వామి - కార్యంబు + కాఁగన్ = ప్రభువ వగు నీ పనికయి, (ఎఱుఁగింతు ననుక్రియతో నన్వయము.)

వేద - జపుండు + ఐన = వేదపఠనముచే మంచుఁడు అయిన, విధి = బ్రహ్మ, పాశ - సంయుక్తుడు = పాశమనెడి శస్త్రముతోఁ గూడినవాఁడు (బ్రహ్మదేవుని శస్త్రమునకును, వరుణుని శస్త్రమునకును పాశ మని పేరు.), ఐనను, నాదు మాహాత్మ్యము = నా మహిమ, అమరన్ = ఒప్పఁగా .... ఎఱుఁగింతున్.

పరమ - తపస్ (స్) + నిధి = గొప్ప తపస్సునకు నిధి, (అగు), పరమేశుఁడు = ఈశ్వరుఁడు, ఉగ్ర + అక్షుఁడు = భయంకరమైన నేత్రముగలవాఁడు, ఐనన్ = అయినను, అపార - శౌర్యంబు = (నా) అధికమైన పరాక్రమము, వెలయన్ = ప్రకాశింపఁగా, .... ఎఱుఁగింతున్,

మఱియున్ = వారేకాక యింకను, అమర్త్య + అహి - మర్త్య + అధిపతులు = దేవతల, నాగుల, మనుష్యుల ప్రభువులు, ఎంతె - శుచులు = పరిశుద్ధులు, అయ్యున్ = అయినను, ఆయుధ - శూరులు + ఐనన్ = సాయుధులైన పరాక్రమవంతులైనను.

పుష్ప + అస్త్ర - కౌశలమునన్ = పూవుటమ్ములందలి నేర్పుచే, ఈ క్షణంబు + అ = ఇప్పుడే, సతులకున్ = స్త్రీలకు, ఎఱుఁగింతున్, = లొంగునట్లు చేయుదును.

అదియున్ + కాక, పోరన్ = యుద్ధమునందు, ఈసు + తక్కన్ = కోపముడుగునట్లు, అతి + ఉగ్ర - బాణ - శక్తిన్ = మిక్కిలి భయంకరమైన బాణముల శక్తితో. నీకున్, ఎఱఁగింతున్ = నమస్కరింపఁజేయుదును, దేవ = ప్రభూ!, తన్నున్ = నన్ను, పంపు = పంపుము.

తాత్పర్యము : క్షీరసముద్రశయనుఁడును, నన్నుఁగన్న తండ్రియుఁ, జక్రియు నగు విష్ణుని స్వామికార్యముగను, వేదజుఁడైన బ్రహ్మ పాశాయుధసంయుక్తుఁడైనను నా మహిమ మెప్పఁగను, పరమతపోనిధి యగు పరమేశ్వరుఁ డుగ్రాక్షుఁడైనను నా మహాపరాక్రమము వెలయఁగను, మఱియు దేవ నాగ మనుష్యాధిపతు లెంత పరిశుద్ధులైనను, వారిని ఈ క్షణమే నేను నా పూవుటమ్ముల నేరుపున స్త్రీలకు వశపడునట్లు చేయుదును, అదియునుగాక యుద్ధమున నతిభయంకరములైన నా బాణముల శక్తిచేఁ గోపముడిగి వారు నీకు నమస్కరించునట్లు చేయుదును, దేవా! నన్నుఁ బంపుము.

విశేషములు : నన్నుఁ గన్నతండ్రినిఁగూడ స్త్రీలకు వశపడునట్లు చేయుటలో నా స్వామికార్యపరత్వము తెలియు ననుట. పరమేష్ఠి పాశాయుధయుక్తుఁడైనను వాని నట్లు చేయుటలో నా మహిమ తెలియు ననుట. పరమేశ్వరుఁ డుగ్రాక్షుఁడు, పైఁగాఁ బరమతపోనిధి. అట్టివాని నట్లు చేయుటలోఁ దన యపారశౌర్యము ప్రకటమగు ననుట.

నాదు మాహాత్మ్యము - నా + మాహాత్మ్యము. 'యుష్మదస్మదాత్మోక్తంబుల కుత్తరపదంబు పరంబగునపుడు దుగాగమంబు విభాష నగు.' నాదు మాహాత్మ్యము. బాల.సమాస.11. ఉగ్ర + అక్షి - దేహావయవార్థకములైన అక్షి, సక్థిన్ శబ్దముల తుది యచ్చునకును హల్లుతోఁగూడిన తుది యచ్చునకును అ అను ప్రత్యయ మాదేశముగా వచ్చును. ఉగ్రాక్షుఁడు. ఈసు - (వికృతి) - ఈర్ష్య (ప్రకృతి). తన్ను = నన్ను. ఇట్టి ప్రయోగము ప్రాచీనకవులలోఁ గలదు. 'వాని నగతినైనఁ దనకుఁ దెమ్మనిన' -రంగ. ఆరణ్య. తనకు = నాకు. పంపు దేవ - పంపుము దేవ, హల్లుపరముగా మధ్యమపురుష మువర్ణక లోపము. బాల. సంధి.47.

క. వెరవున భుజశౌర్యంబున
సురవల్లభ! పనుపు! నీవ చూడఁగఁ బరమే
శ్వరునైన నోర్తుఁ; బెఱ సుర
నర ఫణి దివిజాధిపతులు నా కెదురుదురే!

అర్థము : సుర-వల్లభ = దేవపతి : ఇంద్రా! పనుపు=పనుపుము-పంపుము, నీవు + అ = నీవే, చూడఁగన్ = చూచుచుండఁగా, వెరవునన్ = ఉపాయము నను, భుజ-శౌర్యంబునన్ = బాహు పరాక్రమమునను, పరమేశ్వరున్ + ఐనన్ = పరమేశ్వరుఁడైనను, ఓర్తున్ = ఓడింతును, పెఱ = ఇతరులైన, సుర-నర-ఫణి-దివిజ + అధిపతులు = దేవతల, మనుష్యుల, నాగుల, దివిజుల ప్రభువులు, నాకున్ = నన్ను, ఎదురుదురే = ఎదిరింతురా !

తాత్పర్యము : దేవేంద్రా ! నన్నుఁ బంపుము. నేను నీవే చూచుచుండఁగా నా యుపాయముచేతను, బాహు పరాక్రమముచేతను పరమేశ్వరుడైన నోడింతును. ఇతరులైన దేవ మనుష్య నాగాధిపతులు న న్నెదిరింపఁగలరా ? ఎదురలేరనుట.

విశేషములు : పనుపుము + దేవ-హల్లు పరమగుచుండఁగా మధ్యమ పురుష మువర్ణకలోపము. పనుపు దేవ, బాల. సంధి. 47. ఓర్తున్ - ఓడు + చు = ఓర్చు. చూడు పూర్వపద్య 'ఓర్చితిన్' వ్యాఖ్య. 'తద్ధర్మాదులందు లాట్టగు.' బాల. క్రియ. 5. ఓర్చు + లాట్. 'లకారంబునకు దు ఱు వు రు ను ముణ్ణగు.' బాల. క్రియ. 8. ఉత్తమ పురుషైకవచనమున-ఓర్చు + ను-' లాట్టు దుఞ్ఞు పరంబగునపుడు దుగాగమం బగు.' బాల. క్రియ. 22. ఓర్చుదును. 'చువర్ణంబుతోడ దుగ్దకారంబు తకారం బగు.' బాల. క్రియ. 108. ఓర్తును. 'అవసానంబునందు ద్రుతస్వరంబునకేని ద్రుతంబునకేని లోపంబు బహుళంబుగా నగు.' బాల. సంధి. 20. ఓర్తున్.

పరమేశ్వరునైన నోర్తును, పెఱవారు నా కెదురుదురే యనుటచే నలంకారము కావ్యార్థాపత్తి, 'కైముత్యే నార్థసంసిద్ధిః కావ్యార్థాపత్తి రిష్యతే,' చన్ద్రా. నా కెదురుదురే నన్ను నెదురుదురే అనుటకు, 'షష్ఠీస్థానికంబగు కువర్ణకం బొక్కొకచో ద్వితీయాది విభక్తులకు మాఱుగాఁ దత్తదర్థంబులం జూపట్టెడి.' ప్రౌఢ. కారక. 13. ఇచట ద్వితీయకు షష్ఠి.

సుర.... పతులు - సుర అని యుండఁగా- మరల దివిజ అని యుండుట అనా వశ్యకము, అది 'దితిజ' కానోపునా ?

వ. అని నెనరు ముట్టం బూనిన కుసుమాయుధు పూనికి వజ్రాయుధుండు ఘనంబుగ మెచ్చి తారు తారకాసురుచేతం బరాజితులై పరమేష్ఠి మఱువుఁ

జొచ్చిన విధంబును, విధి తద్వధ కుపాయం బయ్యుమామహేశ్వ
రుల వీర్యసంభవుండైన కుమారుండగునని హితోపదేశంబు సేయు
టయు నెఱింగించి హరిగిరిజలు నైష్ఠికానుష్ఠానులై హిమవంతంబున
నున్నవారు వారికి సంగమంబు సేసి జగద్ధితంబు చేయు మిది
యనన్యవిషయంబు నీ వలనన కాని యొరునకు సాధ్యంబు గాదు
కావున నిన్నుం బ్రార్థించితి మెట్లనిన. 47

అ ర్థ ము : అని, నెనరు = ప్రీతి, ముట్టన్ = కలుగ, పూనిన = కడఁ
గిన, కుసుమ + ఆయుధు - పూనికి = పుష్పబాణుని - మన్మథుని ప్రయత్నము,
వజ్ర + ఆయుధుండు = వజ్ర మాయుధముగాఁ గలవాఁడు - ఇంద్రుఁడు, ఘనంపఱిచి
(ఘనము + పఱిచి) = అధికముచేసి, - దృఢపఱిచి, తారు = తాము, తారక + అసురు
చేతన్, పరాజితులు + ఐ = ఓడింపఁబడినవారయి, పరమేష్ఠి = బ్రహ్మయొక్క,
మఱువున్ + చొచ్చిన - విధంబును = శరణుఁజొచ్చిన రీతియు, విధి = బ్రహ్మ,
తద్ + వధకున్ = అతని వధమునకు, ఉపాయంబు, ఆ + ఉమా - మహేశ్వరుల =
ఆ పార్వతీపరమేశ్వరుల, వీర్య - సంభవుండు = వీర్యమువలనఁ బుట్టినవాఁడు, ఐన,
కుమారుండు = కుమారస్వామి, అగున్ + అని, హిత + ఉపదేశంబు, చేయుట
యున్, ఎఱింగించి = తెలిపి, హరగిరిజలు = హరుఁడును, గిరిజయును, నైష్ఠిక + అనుష్ఠా
నులు + ఐ = నియమముతోడి ఆచరణము గలవారయి, హిమవంతంబునన్, ఉన్న
వారు, వారికిన్, సంగమంబు + చేసి = కూడిక చేసి, జగత్ + హితంబు (జగద్ధి
తంబు) - లోకశ్రేయము, చేయుము, ఇది, అనన్య - విషయంబు = ఇతరులది కాని
విషయము, నీవనలన్ + అ = నీవనలనే, కాని, ఒరునకున్ = ఇతరునకు, సాధ్యంబు
+ కాదు, కావునన్, నిన్నున్, ప్రార్థించితిమి, ఎట్లు + అనినన్,

తా త్ప ర్య ము : అని ప్రీతితోఁ బూనిన మన్మథుని పూనికను ఇంద్రుఁడు
దృఢపఱిచి తాము తారకాసురునిచే నోటమి పొంది బ్రహ్మను శరణుచొచ్చిన విధమును,
బ్రహ్మ అతని వధ కుపాయము ఆ పార్వతీపరమేశ్వరుల వీర్యమువలనఁ బుట్టు కుమార
స్వామి యగు నని హిత ముపదేశించుట తెలిపి, పార్వతీపరమేశ్వరులు నియమపరులై
హిమవత్పర్వతమున నున్నారు, వారికిఁ గలయిక కావించి లోకమునకు మేలు చేయుము,
ఇది నీకేగాని యితరులకు సాధ్యముగాని పని కావున నిన్నుఁ బ్రార్థించితిమి. ఎట్లనిన-
తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు: నెనరు, 'పేర్మి యుర్మిలి మక్కువ కూర్మి నెమ్మి, నెనరు వాంఛి గారాము నెయ్య మింపు. ప్రేమంబి యనుంగు మక్కువం బ్రియమునకును నామధేయంబు లయ్యె' - ఆం.నా.శే. కుసుమాయుధుడు ప్రాణికిని దాను వస్త్రాయుధుఁ డగుచుఁ జేలనే మనసు సై నని స్వారస్యము.

ఘనంపఁజిచి-ఘనము+పఁజిచి- 'పద్యాదులు పరంబులగునపుడు మువర్ణకంబునకు లోపపూర్ణబిందులు విభాష నగు.' బాల.సంధి.48.వర్ణ-రూపాం, పధము, ఇది చరిత్రాదుల లోనిది. 'చరిత్రాదుల మువర్ణకంబునకు లోపంబు బహుళంబుగా నగు.' బాల.తత్సమ. 58, అయ్యుమా.... అ+ఉమా-యడాగమము. బాల.సంధి.3. త్రికసంధి. బాల.సమాస. 14, 13. అయ్యుమామహేశ్వరుల వీర్యసంభవుండు.' కొన్నిచోట్ల సిద్ధసమాసమధ్య గతపదంబులతోఁ దద్భిన్నపదంబుల కన్వయంబు చూపఁబడెడి.' ప్రౌఢ.సమాస.35. హర గిరిజలు - హరుఁడును, గిరిజయును- ద్వంద్వము. భావపరిణామదృష్టితో నిట హరగిరిజ లని ద్వంద్వముచేయుట సముచితము. జగద్ధితము - జగత్ + హితము, వర్గముల మొదటి నాలుగక్షరముల (ఝయ్యల) కంటెఁ బరమగు హకారమునకుఁ బూర్వసవర్ణాదేశము (ఆ వర్గములకుఁ జెందిన చతుర్థవర్ణాదేశము)పై కల్పికముగా నగును. జగత్ + ధితము, జగత్ + హితము. అనునాసికాంతస్థవర్ణములుతప్ప మిగిలిన పదాంత గత హల్లులకు (ఝల్లులకు) మృదుహల్లులు (హశ్శులు) కాని, అచ్చులుకాని పరమగునపుడు ఆ హల్లుల వర్గమునకుఁ జెందిన తృతీయవర్ణ మాదేశముగా వచ్చును. జగద్ధితము, జగద్హితము. అనన్యవిషయము-అన్యవిషయము కానిది. నఞ్ తత్పురుషము. మణుఁగు- మణువు. 'అపదాద్యంబయి యసంయుక్తంబయిన గకారంబునకు వకారంబు విభాష నగు' బాల. అచ్చిక,27.

మ. ధర నత్యుత్తములైన ధీరుల మనస్తాపంబు పాపన్ మహా
పురుషానీకమ యోపుఁగాక మహి నల్పుం డోపునే? యుద్ధరా
ధర నైదాఘ నితాంత దాహ ముడుపన్ ధారాధరానర్గళో
త్కర ధారావళిఁగాక యార్ప నగునే గండూషతోయంబులన్? 48

అర్థము: ధరన్ = భూమియందు, అతి + ఉత్తములు + ఐన = మిక్కిలి శ్రేష్ఠులయిన, ధీరుల = ధైర్యవంతుల, మనస్ + తాపంబు = మనోవ్యథ, పాపన్ = పోఁగొట్టుటకు, మహత్ (మహా) + పురుష + అనీకము + అ = గొప్ప

పురుషుల సమూహమే, ఓర్వన్ + కాక = సమర్థమగునుగాని, మహిన్ = భూమి యందు, అల్పుండు = నీచుఁడు, ఓర్వనే = సమర్థుఁడగునా? కాఁడనుట, అబ్దాధర .... దాహము = ఆ + ధరాధర = ఆ కొండలయందలి, నైదాఘ = నిదాఘ (వేసవి) సంబంధమైన, నితాంత = అధికమైన, దాహము = తాపము, ఉడుపన్ = పోఁగొట్టుటకు, ధరాధర.... ధారావళి : ధారాధర = మేఘములయొక్క, అనర్గళ = అడ్డులేని, ఉత్కర = సమూహముయొక్క, ధారా + ఆవళిన్ = ప్రవాహముల వరుసచేత, కాక, గండూష - తోయంబులన్ = పుక్కిటి నీళ్లతో, ఆర్పన్ + అగునే = ఆర్పుట సాధ్యమా ? సాధ్యము గాదనుట.

తాత్పర్యము : ఉత్తములగు ధీరుల మనస్తాపమును బోఁగొట్టుటకు మహాపురుషులే చాలుదురుగాని అల్పులకు సాధ్యము గాదు. కొండలయందలి గ్రీష్మతాపమును మహామేఘముల జలప్రవాహముచే సాధ్యమగునుగాని పుక్కిటిజలములచే నార్పసాధ్యపడునా ? సాధ్యపడదని భావము.

విశేషములు : అలంకారము దృష్టాంతము. 'చేద్బింబప్రతిబింబత్వం దృష్టాంతస్తదలంకృతిః' చన్ద్రా. అతి + ఉత్తములు = అత్యుత్తములు-యణాదేశసంధి.

వ. అని తన్ను నగ్గించుచున్న సురవల్లభుం జూచి రతివల్లభుండు విజృంభించి. 49

అర్థము : అని, తన్నున్, అగ్గించుచున్ + ఉన్న = పొగడుచున్న, సురవల్లభున్ = సురపతిని - ఇంద్రుని చూచి, రతి- వల్లభుండు=రతిపతి-మన్మథుఁడు, విజృంభించి.

తాత్పర్యము : అని తన్నుఁ బ్రశంసించుచున్న యింద్రుని జూచి మన్మథుఁడు విజృంభించి - తరువాతి పద్యముతో నన్వయము.

చ. 'పరము తపం బడంచి మఱి పార్వతియం దనురక్తుఁజేయు మా
యిరువురకుం గుమారుఁ డుదయించిన మా పగ దీఱునంచు న
చ్చెరువుగ నన్నిదొంతులును జెప్పఁగ నేటికి? వానిపై సురే
శ్వర! ననుఁబంపు మీ క్షణమ చంపెద మీ పగదీఱఁ దారకున్.' 50

అర్థము: పరము - తపంబు = శ్రేష్ఠుని (ఈశ్వరునియొక్క), తపస్సు, అడంచి = అణఁచి, మఱి = అంతేగాక, పార్వతియందున్, అనురక్తున్ = అనురాగము గలవానినిగా, చేయుము, ఆ + ఇరువురకున్ = ఆ యిద్దఱకును, కుమారుఁడు = కొడుకు-కుమారస్వామి, ఉదయించినన్ = పుట్టినచో, మా-పగ = మా విరోధము, తీఱున్, అంచున్, అచ్చెరువుగన్ = ఆశ్చర్యముగా, అన్ని దొంతులను = అన్ని వాక్పరంపరలను, చెప్పఁగన్ + ఏటికిన్, సుర+ఈశ్వర = దేవపతీ - ఇంద్రా !, వానిపైన్ = వానిమీఁదికి, ననున్ = నన్ను, పంపుము. మీ - పగ, తీఱన్, తారకున్, ఈ - క్షణము + అ = ఇప్పుడే. చంపెదన్.

తాత్పర్యము: 'ఈశ్వరుని తపస్సు భంగపఱిచి వానిని పార్వతియం దనురక్తునిగాఁ జేయుము. ఆ యిద్దఱకుఁ గుమారుఁడు పుట్టినచో మా పగ తీఱును. అని ఆశ్చర్యముగా నన్నిపలుకులు చెప్పనేటికి? దేవేంద్రా! ఆ తారకునిమీఁదికి నన్నుఁ బంపుము. మీ పగ తీఱునట్లు వాని నిప్పుడే చంపెదను.'

క. తారకు నోర్వఁగ, వేఱ కు
మారకుఁ బడయంగ సంగమము సేయను మున్
వారలపైఁ బంపనినాఁ
డా రిపుపైఁ బంపు మాతఁ డధికుఁడె నాకున్? 51

అర్థము: తారకున్ = తారకుని, ఓర్వఁగన్ = ఓడించుటకును, వేఱు + అ = వేఱే, కుమారకున్, పడయంగన్ = పొందుటకు, సంగమము - చేయను = పొందుచేయుటకును, మున్ = ముందు, వారలపైన్ = పార్వతీశ్వరులపైకి, పంపని నాఁడు = పంపనిచో, ఆ - రిపు - పైన్ = ఆ శత్రువుపైకి - తారకునిమీఁదికి, పంపుము, అతఁడు, నాకున్ = నాకంటె, అధికుఁడు + ఎ = గొప్పవాఁడా?

తాత్పర్యము: తారకాసురు నోడింపఁ గుమారునిఁ బొందునట్లు కూర్పుటకుఁ బార్వతీశ్వరులపైఁ బంపక ఆ శత్రువగు తారకునిమీఁదికే నన్నుఁ బంపుము. అతఁడు నాకంటె నధికుఁడా యేమి? కాఁ డనుట. అనఁగా, తారకాసురు నోడించుటకుఁ గుమారునిఁ బుట్టింపఁ బార్వతీశ్వరులకు సంగమము చేయుమని నన్నుఁ బంపనేల? నన్నుఁ దారకునిమీఁదికే పంపినచో నే నాతనిని గెలువలేనా? నాకంటె వాఁడు గొప్ప

వాఁడా? అని భావము. తారకుని సోఁపుటకుఁ గుమారస్వామి పుట్టుటయు, సతికిఁ బుట్టుటకుఁ బార్వతీశ్వరులకు సంగతి గలిగించుట - ఇట్టి చుట్టు పద్ధతియేల? నన్నే వానిపైఁ బంపినచో నేను వానిని మట్టుపెట్టలేనా? నాకంటె వాఁ డధికుఁడా? యనుట.

విశేషములు: నాకున్ అధికుఁడె, నాకంటె నధికుఁడె - పంచమ్యర్థమున షష్ఠికము, ప్రౌఢ. కారక, 13. ఓర్వఁగన్ - ఓడు ధాతువు. ఓడు + చు - బాల. క్రియ. 73. ఓర్చు - బాల. క్రియ. 80. ఓర్చు. బాల. ప్రకీర్ణ. 17. ఓర్చు + నుజీ. బాల. క్రియ. 40. ఓర్చు + నుజీ. బాల, క్రియ, 20. బాల, క్రియ, 86. ఓర్వను - బాల. క్రియ. 88. ఓర్వఁగన్ - బాల. క్రియ. 115.

వ. అనిన సురేంద్రుండు 'నీ కసాధ్యం బెందును లే దైనను బరమేష్ఠి వచనం బలంఘనియం బగుట నిదియ మనకుఁ గర్తవ్యంబు. దీని కొడంబడవలయు' నని ప్రార్థించిన నప్పని గైకొని 'నా కిది యేమి గహనం?' బని దర్పకుండు దర్పించి. 52

అర్థము: అనినన్ = అని మన్మథుఁడు పలుకఁగా, సుర + ఇంద్రుండు = దేవేంద్రుఁడు, నీకున్, అసాధ్యంబు = సాధింపరానిది, ఎందును, లేదు, ఐనను, పరమేష్ఠి = బ్రహ్మయొక్క, వచనంబు = మాట, అలంఘనీయంబు = దాఁటరానిది, అగుటన్ = అగుటచే, ఇది + అ = ఇదియే, మనకున్, కర్తవ్యంబు = చేయఁదగినది, దీనికిన్, ఒడంబడవలయును = అంగీకరింపవలయును, అని, ప్రార్థించినన్, ఆ + పని, కైకొని, నాకున్ + ఇది, ఏమి, గహనంబు = గగనము-దుర్లభము, అని, దర్పకుండు = మన్మథుఁడు, దర్పించి = గర్వించి.

తాత్పర్యము: అని మన్మథుఁ డనఁగా, నింద్రుఁడు 'నీ కసాధ్యమైనది లేదు, అయినను బ్రహ్మ మాట దాఁటరానిది కావున మన కిదియే కర్తవ్యము. దీని నంగీకరింపు' మని ప్రార్థింపఁగా, మన్మథుఁడు ఆ పనిని గైకొని 'నా కిదియేమి దుర్లభ?' మని గర్వించి - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు: దర్పకుఁడు - 'కన్దర్పో దర్పకో౽నఙ్గః కామః పఞ్చశరః స్మరః' 'కుత్సితో దర్పో యస్య సః కన్దర్పః' - కుత్సితమైన దర్పము గలవాఁడు.

యున్నట్టిది - అపహ్నవము. అలంకారము పరికరాంకురము - 'సాభిప్రాయే విశేష్యే తు భవేత్ పరికరాంకురః' వస్తా. దర్పకుఁ డను విశేష్యము సాభిప్రాయమైనదికనుక పరికరాంకురాలంకారము.

తే. శూలి చేకొన్న తపమెల్ల నాలి సేసి
యతని దేహంబునందు సా మాలిఁ జేసి
కామకింకరుఁ జేసి నా కడిమి నెఱపఁ
గంటి నీ ప్రస్తవము దీర్పఁగంటి నెలమి. 53

అర్థము : శూలి = శూలముగలవాఁడు - శివుఁడు, చేకొన్న = కైకొన్న, తపము + ఎల్లన్ = తపమునంతను, ఆలి + చేసి = నాలిచేసి = పరిహాసముచేసి, అతని - దేహంబు + అందున్ = అతని శరీరమునందు, సామ + ఆలిన్ + చేసి = సగము స్త్రీని (భార్యను) జేసి, కామ - కింకరున్ + చేసి = కోరికలకు-మన్మథునకు - దాసునిగాఁజేసి, నా-కడిమి = నా పరాక్రమము, నెఱపన్ + కంటిన్ = ప్రకటింపఁగంటిని, నీ - ప్రస్తవము = నీ యవసరము, ఎలమిన్ - సంతోషముతో, తీర్పన్ + కంటిన్ = తీర్పఁగంటిని - నెఱవేర్పఁగంటిని.

తాత్పర్యము: 'శివుఁడు పూనిన తపమునంతను పరిహాసముచేసి, యతని శరీరమున సగము స్త్రీని (భార్యను) జేసి, కోరికలకు దాసుఁడైనవానినిగాఁ జేసి నా పరాక్రమమును ప్రకటించుకొనుట కవకాశము లభించినది. నీ యవసరమును ప్రీతితోఁ దీర్పఁగలిగితిని.'

విశేషములు: సామాలిన్ = సామ + ఆలిన్ = సగము + ఆలు + న్. 'అర సామ సగము సవము నాఁగ నర్థాహ్వయంబులౌ.' ఆం. నా. సం. మానవవర్గ. ఆలు-స్త్రీ, భార్య. ప్రస్తవము = ప్రయోజనము, కార్యము. ఇతనిదె ప్రయోగాంతరము. 11-135.

వ. 'నాకుం దగిన కెలసంబుఁ గంటి దీని కింతకు మైకొంటిఁ దాంబూలంబు దయసేయు' మని వసంతసహితంబుగా వలరాజు సురరాజుచేత నపారసత్కారంబులు గొని వీడుకొని చనుదెంచునంత నిక్కడ. 54

అర్థము : నాకున్, తగిన, కెలఁకంబున్ = పనిని, కంటిన్ = పొందితిని. దీనికిన్, ఇంతకున్, మెకొంటిన్ = అంగీకరించితిని, తాంబూలంబు, దయ + చేయుము + అని = ఇమ్మని, వసంత - సహితంబుగాన్ = వసంతునితోఁ గూడికొని, వలరాజు = మన్మథుఁడు, సుర - రాజుచేతన్ = దేవపతి-ఇంద్రునిచేత, అపార-సత్కారంబులు = ఎన్నో గౌరవములు, కొని = పొంది, వీడుకొని = సెలవుపుచ్చుకొని, చనుదెంచు + అంతన్ = వచ్చునంత, ఇక్కడన్.

తాత్పర్యము : 'నాకుఁ దగిన పనిని గంటిని. దీని కంతకు నంగీకరించితిని, తాంబూలమును దయచేయు' మని వసంతునితోఁగూడి మన్మథుఁడు ఇంద్రునిచే నెన్నియో సమ్మానములు పొంది రాఁగా, ఇక్కడ. తరువాతి పద్యముతో నన్వయము.

చ. రతి మతిఁ దల్లడిల్ల పతి రాకయె వార్చుచు నంతకంత క
ద్భుతములు దుర్నిమిత్తములు పుట్టుచు నోలి నిజాంగసంగతో
ర్జిత భయదాసురాద్యశుభచేష్టల కెంతయు వెంగలించి దుః
ఖిత యగుచున్నచో మకరకేతన మంబరవీథిఁ గ్రాలఁగన్. 55

అర్థము : రతి = మన్మథునిభార్య, మతిన్ = మనస్సునందు, తల్లడిల్లి = కలఁగి, పతి - రాక + ఎ = భర్త రాకయే, వార్చుచున్ = ఎదురుచూచుచు, అంతకున్ + అంతకున్ = క్రమక్రమముగా, అద్భుతములు = ఆశ్చర్యకరములు, దుర్నిమిత్తములు = అపశకునములు, పుట్టుచున్, ఓలిన్ = క్రమముగా, నిజ + అంగ - సంగత + ఊర్జిత - భయద + అసుర + ఆది + అశుభ-చేష్టలకున్ = తనదైన శరీరమునందుఁ గలిగిన, ఎక్కువైన, భయంకరములయిన అసురములు (అసుర=రాక్షస) సంబంధమైనవి, మున్నగు అమంగళకరములైన పనులకు, - తన శరీరమునఁ గలిగిన అపశకునములకు, ఎంతయున్ = మిక్కిలి, వెంగలించి = యుక్తి లేనిదయి, దుఃఖిత = దుఃఖించినది, అగుచున్ + ఉన్నచోన్ = అగుచున్నప్పుడు, మకర - కేతనము = మొసలి టెక్కెము, అంబర-వీథిన్ = ఆకాశవీథిలో, క్రాలఁగన్ = ఒప్పఁగా.

తాత్పర్యము : రతిదేవి మనస్సునందుఁ గలఁతజెంది, భర్త ఆగమనమున కెదురుచూచుచుఁ, గ్రమక్రమముగా నచ్చెరువు గలిగించు నపశకునములు పుట్టుచుఁ

చూచినఁ గలుగు వెఱపుఁ గొలుపు అశుభములైన అమంగళములను మిక్కిలి యుక్తిలేనివని భావింపుచున్న, [illegible] [illegible] నొప్పుచుండఁగా. [illegible] పక్షముతో నున్నదియును.

క. అలి గానము, మదకోకిల
కలనాదాతోద్యమును, శుకస్వన ఘన మం
గల పాఠరవము ఘోరనఁ
జెలఁగఁగ రతిఁగానవచ్చెఁ జిత్తజుఁ డెలమిన్. 56

అర్థము: అలి - గానమున్ = తుమ్మెదల సంగీతమును, మద - కోకిల - కల - నాద + ఆతోద్యమును = మదించిన కోకిలలయొక్క అవ్యక్తమధురమైన ధ్వని యనెడు వాద్యమును, - శుక - స్వన - ఘన - మంగల-పాఠ - రవమున్ = చిలుకల ధ్వనులనెడు గొప్ప శుభకరములైన పఠనముయొక్క ధ్వనియు, ఘోరనన్ + చెలఁగఁగన్ = ఎక్కువగా శబ్దింపఁగా, చిత్తజుఁడు = మన్మథుఁడు, ఎలమిన్ = ప్రీతితో, రతిన్, కానన్ + వచ్చెన్ = చూడ వచ్చెను,

తాత్పర్యము: తుమ్మెదల సంగీతము, మత్తకోకిలముల ధ్వనులనెడి వాద్యమును, చిలుకల పలుకులనెడి మంగళపాఠముల ధ్వనియు శబ్దింపఁగా మన్మథుఁడు ప్రీతితో రతిని జూడవచ్చెను,

విశేషములు: అలులు, కోకిలములు, శుకములు మన్మథుని పరివారము లోనివి. వాని ధ్వనులు సంగీతముగను, మంగళవాద్యములుగను నుండె ననుట.

క. పతిఁ జూచి రతి నిజాంత
ర్గతఖేదం బెలమి మఱపుగా నిడి కాలో
చిత వచనాంతరముల 'సుర
పతి కడు వెస నిన్ను నేమి పని రాఁ బనిచెన్'? 57

అర్థము: రతి, పతిన్ + చూచి = భర్తను జూచి, నిజ + అంతర్గత - ఖేదంబు = తనదైన మనసులోని దుఃఖము, ఎలమిన్ = సంతోషముతో, మఱపు గాన్ + ఇడి=దాఁచి, కాల + ఉచిత - వచన + అంతరములన్ = సమయమునకుఁ

దగిన వేఱుమాటలతో. సురపతి = ఇంద్రుఁడు, కడున్ = వేసన్ = మిక్కిలి శీఘ్రముగా, నిన్నున్, పిలుపనిన్ = పంపుకొఱకు, రాన్ +పనిచెన్ = పిలిపించెను.

తాత్పర్యము : రతి భర్తమాటవిని తన మనస్సులోని దుఃఖము గానరాకుండ సంతోషమును నటించి సమయోచితమైన వేఱు మాటలతో - 'ఇంద్రుఁ డంత శీఘ్రముగా నిన్నెందులకుఁ బిలిపించెను?'

వ. అని తఱమి యడుగుచున్న రతి ముఖవికారంబు గని మనసిజుండు మనంబునం గుసురుకొనుచుఁ జిఱునవ్వు నవ్వుచు ని ట్లనియె. 58

అర్థము: అని, తఱమి - అడుగుచున్ + ఉన్న = నిర్బంధించి (మఱిమఱి) అడుగుచున్న, రతి - ముఖ - వికారంబు = రతిదేవియొక్క ముఖమునందలి మార్పు, కని = చూచి, మనసిజుండు = మన్మథుఁడు, మనంబునన్ = మనస్సులో, కుసురు కొనుచున్ = ఉపేక్షించుచు, చిఱు - నవ్వు, నవ్వుచున్, ఇట్లు + అనియెన్,

తాత్పర్యము : అని మఱిమఱి యడుగుచున్న రతి మోము మార్పుచూచి మన్మథుఁడు మనస్సులో నుపేక్షవహించుచుఁ జిఱునవ్వు నవ్వుచు నిట్లు పలికెను.

విశేషములు: తఱమి=నిర్బంధించి,' ఇట్లంగున నూరార్చి యింతిఁదఱమి యల్లనల్లన దోకొని' - నిర్వ. ఆ. 9. కుసురుకొను = ఉపేక్షించు - కుసూర్ (త)= ఉపేక్ష, అలక్ష్యము.

చ. 'బెదరుచు నంతరంగమున భీతికిఁ గండవడంబుసుట్టి ప
ల్కెదు; పొరపొచ్చెమున్, వెఱపుఁ, గేనముఁ జెయ్వుల కోలి నెత్తువె
ట్టెదు; వడి మోవియుం గరువటిల్లెడు; నీ మది నింత దల్లడం
బొదవు డిదేమి కారణమొ యుగ్మలి! నా కెఱిఁగింపు మేర్పడన్.' 59

అర్థము : బెదరుచున్=భయపడుచు, అంతరంగమున - భీతికిన్=మదిలోని వెఱపునకు, (అంతరంగమునన్ బెదరుచున్ అనియే నన్వయింపవచ్చును.) కండవడంబు +చుట్టి = పెరపైచి - తప్పిపుచ్చు యనుట, పల్కెదు =పల్కెదవు, పొరపొచ్చెమున్= కపటమును, వెఱపున్ = భయమును, కేనమున్ = వంచనమును, చెయ్వులకున్ =

దానికిన్, మెయికొని = అంగీకరించి, వచ్చితిన్, అనినన్, విని, రతి, ఉదరిపడి = అదరిపడి, ఉల్లంబునన్ = మనసునందు, తల్లడిల్లుచున్ = కలఁగుచు,

తాత్పర్యము : అనిన దివ్యములు, అంతరిక్షములు, భూసంబంధములు, అవయవసంబంధములు మున్నగు పెక్కు అపశకునములు నిష్కారణముగనే పుట్టుట తెలియఁజేసి, దీనముఖి యగుచు, 'నీవు పోయి వచ్చినపని తెలుపు'మనిన 'నెక్కువ విశేషము లేదు. ఆ పార్వతీపరమేశ్వరుల తపస్సున కాటంకము గలుగఁజేయు'మనిన దానికి సమ్మతించి వచ్చితి'ననిన విని రతి యదరిపడి మనస్సునఁ గలఁతచెందుచు. తరువాతి పద్యముతో నన్వయము,

విశేషములు: నీ పోయివచ్చిన కార్యంబు - నీవు పోయి వచ్చిన కార్యంబు 'ధాతుజవిశేషణ భావార్థక పూర్వవ్యవహి తావ్యవహిత కర్తృపద ప్రథమకుఁ దఱచుగ యొక్కషష్ఠి యగు.' ప్రౌఢ.కారక. 15, నీయొక్కపోయివచ్చినకార్యంబు, 'యొక్కకు లోపంబు బహుళంబు'-ప్రౌఢ.కారక. 16. నీ పోయివచ్చిన కార్యంబు. ఆ+ ఉమా.... ఆ + యుమా. యడాగమము, బాల, సంధి, 3. అయ్యుమా.... త్రికసంధి. బాల.సమాస. 14.13. తపోభంగము - తపస్ + భంగము - పదాంతసకారమునకు విసర్గాదేశము. తపః + భంగము. హ్రస్వ అకారము పూర్వమందుఁగల విసర్గమునకు హశ్శు పరమగు చుండఁగా 'ఉ' ఆదేశము. గుణసంధి- తపోభంగము- ఉమామహేశ్వరులు - ఉమయును, మహేశ్వరుఁడును - ద్వంద్వము, మెయికొను - మేకొను - మయికొను - మైకొను - రూపాం.

సీ. మన కులదైవ మన్ మన్నన లేదేనిఁ
త్రిభువనారాధ్యుఁ డన్ తెంక లేక,
పరమయోగాత్ముఁ డన్ భక్తి లేదేనియు
సర్వేశ్వరుం డను శంక లేక,
యజశిరోదళనుఁ డన్నదరు లేదేనియుఁ
గాలారి యను నోటకండ లేక,
విషమాంబకుం డను వెఱపు లేదేనియుఁ
బ్రళయాగ్నిరుద్రుఁ డన్ భయము లేక,

ఆ. పంచె నట్టి యుగ్రుపైఁ నిన్ను నది మీఁదఁ
బోయి తనకు లగ్గఁబోయి లగ్గ
వచ్చునే ప్రధానవైరాన మరణంబు
ధ్రువ మనంగ వినఁడె దివిజవిభుఁడు ? 61

అర్థము : మన-కుల-దైవము, అన్ = అను, మన్నన = గౌరవము, లేమి + ఎనన్ = లేకున్నను, త్రిభువన + ఆరాధ్యుఁడు = ముల్లోకముల (వారి) చేతను, పూజింపఁదగినవాఁడు, అన్ = అను, తెంక = సందేహము, లేక.

పరమ-యోగ + ఆత్ముఁడు = గొప్ప సమాధిగల మనస్సుగలవాఁడు, అన్ = అను, భక్తి, లేమి + ఎనయున్, సర్వ + ఈశ్వరుండు = సర్వమునకుఁ బ్రభువు, అను, శంక = జంకు లేక,

అజ-శిరస్ (శ్) ఛేదనుఁడు = బ్రహ్మ శిరస్సును ఖండించినవాఁడు - అన్ + అదరు- లేమి అన్న + అదరు = అన్న భయము, లేమి+ఎనియున్, కాల + అరి = యమునకు శత్రువు- మృత్యుంజయుఁడు, అను+ఉలుకంత = అనెడి భయము, లేక, విషమ + అంబకుండు = వేసికంటివాఁడు - త్రినేత్రుఁడు అను, వెఱపు = భయము, లేమి + ఎనయున్. ప్రళయ + అగ్ని-రుద్రుఁడు = ప్రళయకాలమునందలి అగ్నివలె భయంకరుఁడు, అన్, భయము, లేక.

అట్టి, ఉగ్రుపైన్ = శివునిపైకి - భయంకరునిమీఁదికి, నిన్నున్, పంచెన్ + పంపెను. (పంచెనట్టి యుగ్రుపైన్ = శివునిపైఁ బంపెనఁట), అది-మీఁదన్ + పోయి = ఆ పనిమీఁదఁ బోయి, తనకున్ = ఆ యింద్రునకు, లగ్గన్ + పోయి = మేలుచేయఁబోయి. లగ్గు + అ = లగ్గ-మేలె, వచ్చునె = వచ్చునా ? రావనుట, దివిజ-విభుఁడు = దేవేంద్రుఁడు, ప్రధాన-వైరానన్ = ముఖ్యులతోడివిరోధముచే, మరణంబు = చావు, ధ్రువము = నిశ్చయము, అనంగన్, వినఁడె ?

తాత్పర్యము : శివుఁడు మన కులదైవమనెడి గౌరవములేకున్నను, నతఁడు ముల్లోకములకు నారాధ్యుఁ డను సందేహమయినను లేకుండ, నతఁడు గొప్ప సమాధిగల మనస్సుగలవాఁడనెడి భక్తి లేకున్నను, సర్వేశ్వరుఁడనెడి శంకలేకుండ, బ్రహ్మశిరస్సును ఖండించినవాఁ డను భయములేకున్నను, నతఁడు యమునకు

క. నినుఁ జూచిన కన్నులఁ సుర
వనితలు తనుఁ జూడకున్న వాసవుఁ డలుకం
జని చా నని పంచినఁ జాఁ
జనునే యాతని చలంబు సాధ్యము గాఁగన్ ? 64

అర్థము : నినున్ = నిన్ను, చూచిన - కన్నులన్ = చూచినకన్నులతో, సుర - వనితలు = దేవతాస్త్రీలు, తన్నున్ = తన్ను, చూడక + ఉన్నన్ = చూడక పోవుటచే, వాసవుఁడు = ఇంద్రుఁడు, అలుకన్ = కోపముతో, చని = పోయి. చాన్ + అని = (నీవు) చచ్చుట కని, పంచినన్ = ఆజ్ఞాపించినచో, ఆతని - చలంబు = ఆ యింద్రుని పట్టుదల, సాధ్యము + కాఁగన్ = సాధ్యమగునట్లు - నెఱవేఱునట్లు, చాన్ + చనునె = చావఁదగునా ?

తాత్పర్యము : నిన్నుఁ జూచినకన్నులతో దేవతాస్త్రీ లింద్రుని జూడక పోవుటచే నతఁ డలిగి, నీవు చచ్చుటకని పంపఁగా, నాతనికోరిక నెఱవేఱునట్లు నీవు చావఁదగునా? తగదని భావము.

విశేషములు : చాన్, చచ్చు ధాతువు. 'తుమర్థ భావలక్షణంబులందు నుఙా గుగు.' బాల.క్రియ.40, చచ్చు + నుఙా. 'ముజ్జీవులు మువ్వు నాఁబడు.' బాల.క్రియ.86. 'చావు నోవులు చచ్చు నొచ్చులం దగు,' బాల.క్రియ.94, చావు + నుఙా. 'జీత్తు పరంబగు నపుడు వాని పూర్వవర్ణంబు విభాషను లోపించు,' బాల.క్రియ.95. చాను (న్).

చ. త్రిదశులు విల్చి పంపు డొకతేజముగాఁ గొని దేవదేవు నె
ల్లిదముగఁ జేసి యింత గొని లేవడి లేచెదు; ప్రాణగొడ్డ మా
డెదు; మది నోటకంత నెడి డెప్పతికంబులు సేసె; దిట్టి క్రొ
వ్విదములుదక్కఁ; మీ పలుకు విష్ణుఁడు లక్ష్మియు విన్న మెత్తురే? 65

అర్థము : త్రిదశులు = దేవతలు, విల్చి = విలిచి - పిలిచి, పంపుడు = పంపుట, ఒక. తేజము + కాన్ = ఒక ఘనతగా, కొని = తలఁచి, దేవదేవున్ = దేవతలకు దేవుఁడైన శివుని, ఎల్లిదముగన్ = అసమర్థునిగా, చేసి, ఇంత + కొని = ఇంచుక కొని, లేవడిన్ = దారిద్ర్యముతో, లేచెదు = లేచెదవు-బయలుదేఱుదువు, ప్రాణ

గొడ్డము = ప్రాణాంతకము (గా), ఆడెదు = పలికెదవు, మదిన్ = మనస్సునందు. ఓటకంద = భయము, చెడి = పోయి, దెప్పుడికంబులు = ఆపత్తులు, చేసెదు = చేసెదవు, ఇట్టి, క్రొవ్విదములు = దుశ్చేష్టలు, తక్కువము = విడువము, ఈ పలుకు = ఈ మాట, విష్ణుడున్, లక్ష్మియున్ = నీ తండ్రియును, తల్లియును, విన్నన్ = విన్నచో, మెత్తురే = ప్రశంసింతురా?

తాత్పర్యము : దేవత లాహ్వానించి పంపుట ఒక ఘనతగా నెంచి, దేవదేవుఁడైన యీశ్వరు నసమర్థునిగా నెంచి. స్వల్పముసుగొని దారిద్ర్యముతో లేచెదవు. ప్రాణాంతకములైన మాటలు పలికెదవు. మనస్సున భయములేక యాపత్కరముగాఁ బ్రవర్తింతువు. ఇట్టి దుశ్చేష్టలు మానుము. ఈ మాట నీ తండ్రి విష్ణువును, నీ తల్లి లక్ష్మియును విన్నచో మెత్తురా? మెచ్చ రని భావము.

విశేషములు : త్రిదశులు-అమరా నిర్జరా దేవా స్త్రిదశా విబుధా స్సురాః. త్రిదశపరిమాణం వయో యేషాం తే = ముప్పదేండ్లకు లోఁబడిన వయస్సు గలవారు. దేవతలు, విల్చు - విలుచు = పిలుచు. 'వెలయు విలిచె ననఁగఁ బిలిచె ననుట.' ఆం. భా.3-184 ఇంతగొని లేవడి లేచెదు - అంత తృప్తికరముగా లేదు. ప్రాణగొడ్డము - అనింద్యగ్రామ్యమని చిన్నయ, తద్భవము (ప్రాణకుట్టకశబ్దభవము) అని ప్రౌఢవ్యాకరణము, లేచెదు = లేచెదవు, ఆడెదు = ఆడెదవు - 'లాట్టువర్ణమునకు లోపము - బాల.క్రియ.24. అపవాదిస్వరసంధి - బాల.సంధి.11, పంపుదు = పంపుట, భావార్థకటవర్ణకమునకు డువర్ణమును వాడుట యితనిలోఁ బెక్కుచోట్లఁ గలదు.

తే. హరుఁడు నెప మగ్గి చూచుడు నాక్షణంబ
యఖిలజగములు సంహార మగు రయమున;
నట్టి యుగ్రుపై నడెవోయె దకటః లగ్గ
మేలు మే లెంత మీ లెంత మీలఁ ద్రాగు? 66

అర్థము ; హరుఁడు = ఈశ్వరుఁడు, నెపము + అగ్గి = ఏదో నెపమునఁ గోపించి, చూచుడున్ = చూచినంతనే, ఆక్షణంబు + అ = వెంటనే, రయమునన్ = వేగముగా, అఖిల - జగములున్ = ఎల్ల లోకములును, సంహారము + అగున్ = నశించును, అట్టి + ఉగ్రుపైన్ + అడె = అట్టి యుగ్రుని (శివుని,భయంకరుని)

మీఁదికా, పోయెదవు = దండెత్తుదువు, అకట !, లగ్గ = మిక్కిలి, మేలు మేలు = బాగు బాగు; (విపరీతార్థకము.) ఎంత - మీలు = ఎంతటి చేఁపలు, ఎంత - మీలన్ = ఎంతటి చేఁపలను, ద్రాగున్ = మ్రింగును?

తాత్పర్యము : 'హరుఁ డేదేని నెపమునఁ గోపించి చూచినంతనే యెల్ల లోకములును వేగముగా నశించును.అయ్యో! అట్టి యుగ్రునిమీఁదికా నీవు దండెత్తి పోయెదవు; మిక్కిలి మేలు మేలు; చేఁపలను మ్రింగుచేఁప లెంతటివై యుండవల యును? ఈశ్వరుని గెలువఁబోవు నీ వెంతటివాఁడ వయి యుండవలయును? నీ కంతటి సామర్థ్య మేదీ? యనుట.

విశేషములు : 'హరుఁడు' శబ్దప్రయోగ మిట సార్థకము. అలంకారము పరికరాంకురము. సాభిప్రాయే విశేష్యే తు భవే త్పరికరాఙ్కురః చన్ద్రా. ఉగ్రుపైన్. భయంకరునిపై - శివునిపై. 'ఉగ్ర'అను శివుని విశేషణ మిట సాభిప్రాయముగాఁ బ్రయుక్తము గావున నలంకారము పరికరము. 'అలఙ్కారః పరికర స్సాభిప్రాయ విశేషణైః.' చన్ద్రా.

పోయెదు - పోయెదవు- లాట్టు వకారమునకు లోపము, అపదాదిస్వరసంధి. లగ్గ = మిక్కిలి. ఈ యర్థమున నీ శబ్దము ఈ గ్రంథముననే పెక్కుచోట్లఁ బ్రయుక్త మైనది, (సూ,ని.) 'కొ నసియాడు లగ్గ నమ్మెలఁతకు' - కు.సం.5,133.' అగిరినందనం గని లగ్గ బెగ్గిలి.' - కు,సం,5.132. - మీను (ఏకవ.) - మీలు (బహువ.)' బహు వచనంబు పరంబగునపుడు చేను పేను మీను శబ్దంబుల నువర్ణంబు లోపించు.' బాల. అచ్చిక.20.

క. కనుకిట్టిన నిట్టిక నమ
లిన విధమున దేవతావలికిఁ బూనితి నే
నని రుద్రు నుఱక పైఁజని
చెనయుట శిఖిశిఖల మిడుత చెనయుట గాదే; 67

అర్థము : కను - కిట్టినన్ = కన్నుగిఁటినంతనే, - ప్రోత్సహించినంతనే. ఇట్టికన్ = ఇటుకను, నమలిన - విధమునన్, నేను+ అని, దేవతా + ఆవలికిన్ = దేవతల సమూహమునకు, పూనితి = పూనితివి, రుద్రున్ = శివుని, ఉఱక = లక్ష్యపెట్టక,

పైన్ + పడి = దండెత్తిపోయి, పెనయుట = ఎదిరించుట, శిఖి - శిఖలన్ = అగ్ని జ్వాలలయు, మిడుత, పెనయుట + కాదే? = ఎదిరించుటకాదా? - అనఁగనుట,

తాత్పర్యము : కనుగీఁటినంతనే - ప్రేరేపించినంతనే యుఱుకను నపలిన విధమున దేవతలపనికి నేనని పూనితివి, రుద్రుని లెక్కచేయక యెదిరించుట అగ్నిజ్వాలలపై మిడుత దుముకుట కాదా!

విశేషములు : కనుకిట్టినన్ - కనుసన్న చేసినంతనే - ఎక్కువగాఁ జెప్పనక్కఱలేకయే - ఇంచుక సూచించినంతనే యనుట. ఇట్టిక నపలిన విధమున - ఆ కార్యము తనకు లాభములేనిది, దుష్కరము అని యెంచకయే. రుద్రు నెఱుక .... గాదే, అలంకారము నిదర్శనము. 'వాక్యార్థయో స్సదృశయో రైక్యారోపో నిదర్శనా'- చంద్రా. ఉపమానవాక్యార్థమునకు ఉపమేయవాక్యార్థమునకు ఐక్యారోపణము చేసినచో నిదర్శనాలంకార మగును. ఇట్టిక - ఇటిక, ఇటుక, ఇష్టిక (వి) - ఇష్టకా (ప్ర). రుద్రున్ - విశేష్యము సాభిప్రాయ మగుటచే నలంకారము పరికరాంకురము. 'సాభిప్రాయే విశేష్యే తు భవే త్పరికరాఙ్కురః' - చంద్రా.

వ. అని పరమేశ్వరు నెఱింగించి తను భంగించుచున్న రతిం గనుంగొని. 68

అర్థము : అని, పరమేశ్వరున్, ఎఱింగించి = పరమేశ్వరుఁ డెంతటివాఁడో తెలియఁజెప్పి, తనున్ = తన్ను, భంగించుచున్ + ఉన్న = నిరుత్సాహపఱుచుచున్న, రతిన్, కనుంగొని.

తాత్పర్యము ; అని పరమేశ్వరుని గొప్పతనమును స్పష్టపఱిచి తన్ను నిరుత్సాహపఱుచుచున్న రతిని జూచి - తరువాతి పద్యముతో నన్వయము.

ఉ. 'ఏ నలరమ్ము లొడ్డఁ బరమేశ్వరుచిత్తము గౌరిచిత్తమున్
దానఁ గరంగి కూడు; మఱి దానికి సందియ మేల? పెండియుం
బూనెద మూఁడులోకములఁ బుట్టని పూనికి; వారి మేనులన్
మానుగఁ గూర్తు నొక్కటిగ మార్గణకౌశలనావ మేర్పడన్, 69

అర్థము : నేను - నేను, అలరమ్ములు (అలరు + అమ్ములు) = పుష్పబాణములు, ఒఱన్ = ప్రయోగింపఁగా, పరమేశ్వరు - చిత్తమున్ = శివుని మనస్సును, గౌరి - చిత్తమున్ = పార్వతి మనస్సును, దానన్ = దానిచే (ఆ నా ప్రయోగముచే,) కరంగి, కూడున్ = కలియును, మఱి = ఇఁక, వెండియున్ = మరల, దానికిన్ = నా బాణప్రయోగముచే వారి మనసులు కూడు ననుటకు, సందియము + ఏల = సందేహమేల?, మూఁడు - లోకములన్ = ముల్లోకములందును, పుట్టని - పూనికిన్ = ఇంతవఱకును గలుగని ప్రయత్నమును, పూనెదన్, మార్గణ - కౌశల - భావము = బాణప్రయోగనైపుణ్యము, ఏర్పడన్ = స్పష్టపడునట్లు, వారి - మేనులన్ = వారి శరీరములను, మానుగన్ = ఒప్పునట్లు, ఒక్కటిగన్ ఒక్కటియగునట్లు, కూర్తున్ = కలుపుదును,

తాత్పర్యము : 'నేను పుష్పబాణములను బ్రయోగింపఁగాఁ బరమేశ్వరుని చిత్తమును, పార్వతి చిత్తమును గరఁగి కలియును. దానికిఁక సందేహమక్కఱలేదు, నేను ముల్లోకములందును ఇంతదనుకఁ బుట్టని పనికిఁ బూనెదను, అది యేమన నా బాణప్రయోగనైపుణ్యము స్పష్టపడునట్లు నేను వారి శరీరములను ఒక్కటిగాఁ గలుపుదును,

విశేషములు : అలరమ్ములు - అలరు + అమ్ములు. 'కర్మధారయంబునందుఁ జేర్వాదిశబ్దముల కచ్చు పరంబగునపుడు టుగాగమంబు విభాష నగు,' బాల. సంధి.29. టుగాగమ మయినచో అలరుటమ్ములు. కానిచో, అలరు + అమ్ములు - 'ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధి యగు,' బాల.సం. 1. అలరమ్ములు.

ముందు వారి చిత్తములను, తరువాత వారి మేనులను ఒక్కటిగాఁ గూర్తుననుట.

తే. జగము లెల్లను నా యాజ్ఞ మిగులకునికిఁ
గనియు వినియు నెఱుంగుదు వనజనేత్ర!
యింత భయమునఁ బొంద నీ కేల మది భు
జంగభూషణు నొకపోటుగొంగఁజేసి? 70

అర్థము : వనజ - నేత్ర - తామరలవంటి కన్నులు గలదానా! రతీ! జగములు + ఎల్లను = లోకము లన్నియు, నా + ఆజ్ఞన్ = నా ఆనను, మిగులక +

దాటన్ = అతిక్రమింపకుండుటకును, వినుము = ఆలకింపుము, వినుమన్ = వినుము, వెఱుంగుదు = వెఱుఁగుదువు, మదిన్ = మనస్సునందు, శివుని భావించుటన్ = మాటలు ఆడి వినుటవలనఁ దెలిసినది, శివుని, ఒక - పోటుగాండన్ + చేసి = ఒక పోటుగాఁడైన విరోధి యని యెంచి, నీకున్, ఇంత - భయమునన్ + పొందన్ = భయపడనేల?

తాత్పర్యము: రతీ! లోకములన్నియు నా యాజ్ఞ నతిక్రమింపవు నీవు కనియు, వినియు నెఱుఁగుదువు. నీవు మనస్సున శివు నొక పోటుగాఁడైనవిరోధినిగా భావించి యింతగా భయపడనేల?

విశేషములు: వెఱుంగుదు (వు) - లాద్యు వకారమునకు లోపము. బాల. క్రియ.24. అపవాదిస్వరసంధి. బాల.సంధి.11. భయమునఁబొందన్-భయమును బొందన్ అనుటకు.

వ. అని మనసిజుండు మీఁదులేక పలికిన విని రతి పరమేశ్వరుమాహా త్మ్యంబు దలంచి వెండియు నిట్లనియె. 71

అర్థము: అని, మనసిజుండు = మన్మథుఁడు, మీఁదు - లేక = లక్ష్యముఁ లేక, పలికినన్, విని, రతి, పరమేశ్వరు - మాహాత్మ్యంబు = పరమేశ్వరుని గొప్ప తనము, తలంచి = భావించి, వెండియున్ = మరల, ఇట్లు + అనియెన్.

తాత్పర్యము: అని మన్మథుఁడు తనకంటె నధికుఁడులేనియట్లు పలుకఁగా విని రతి పరమేశ్వరుని గొప్పతనము భావించి మరల నిట్లు పలికెను.

విశేషములు: మనసిజుఁడు - అలుక్సమాసము.

చ. అతనికి శరాసనంబు కనకాచల, మిక్షుశరాసనంబు నీ;
కతనికి నమ్ము శాశ్వత, మంటినఁ గందెడు పూవుటమ్ము నీ;
కతఁడు పురాపహారి, విరహాతుర పాంథజనాపహారి నీ;
వతనికి నీకు హస్తిమశకాంతర మెమ్మెయి నెన్నిచూచినన్. 72

అర్థము: అతని - శరాసనంబు=శివుని విల్లు, కనక + అచలము = బంగారుకొండ - మేరువు, మిక్కిలి దృఢమైన దనుట, నీకున్, ఇక్షు - శరాసనంబు=

చెఱకువిల్లు, అల్పబలమైనదనుట. అతనికిన్ = శివునకు, అమ్ము = బాణము, పాశుపతము-అప్రతిహత మనుట. నీకున్, అంటినన్ = తాఁకినచో, కందెడు = కంది పోవునట్టి, పూవుటమ్ము (పూవు+అమ్ము) = పుష్పబాణము. మృదుల మనుట. అతఁడు = శివుఁడు, పుర + అపహారి = త్రిపురములను నాశనముచేసినవాఁడు, మహాపరాక్రమ వంతుఁ డనుట, నీవు, విరహ + ఆతుర - పాంథ - జన + అపహారి = ఎడఁబాటుచే బాధపడు బాటసారులైన (విరహులైన) జనులను క్షయింపఁజేయువాఁడవు, నిర్వీర్యుఁడ వనుట. ఎమ్మెయిన్ (ఏ + మెయిన్) = ఏ విధముగను, ఎన్ని - చూచినన్ = గణించిచూచినను, అతనికిన్ = శివునకును, నీకున్, హస్తి - మశక + అంతరము = ఏనుఁగునకును, దోమకునుగల భేదము - అతఁ డేనుఁగువంటివాఁడు, నీవు దోమవంటివాఁడ వనుట.

తాత్పర్యము: శివుని విల్లు మేరువు. నీకు విల్లు చెఱకు, అతనికిఁ బాశుపతము బాణము. నిన్నుఁ దాఁకినఁ గందిపోవుపువ్వు బాణము. అతఁడు త్రిపురాంతకుఁడు, నీవు ఎడఁబాటుచే బాధపడువారిని క్షీణింపఁజేయువాఁడవు. ఏ విధముగా నెన్నిచూచినను, అతనికిని నీకును ఏనుఁగునకును దోమకును గలభేదము.

విశేషములు: అతనికి నీకు హస్తిమశకాంతరము. - యథాసంఖ్యము, ఎమ్మెయి-ఏ + మెయి. త్రికసంధి. బాల,సమాస. 14.13. నీవు విరహాతురపాంథ జనాపహారి. 'ప్రథమాంతంబులగు యుష్మదస్మద్విశేషణంబుల కేకత్వంబున వు సులును బహుత్వంబున రు ములు నంతాగమంబులు ప్రాయికంబుగ నగు.' బాల.కారక.33.అను సూత్రముచే .... జనాపహారి + వు - 'ఇకారంబుమీఁది ను ను వు క్రియావిభక్తుల యుత్వంబున కిత్వంబగు.' బాల,తత్సమ. 26. అనుసూత్రముచే ....... జనాపహారివి అని కావలసియుండఁగా 33 - సూత్రమునందలి ప్రాయికగ్రహణముచే రక్షితమగు చున్నది. పూవుటమ్ము - పూవు + అమ్ము-'కర్మధారయంబులం దుత్తున కచ్చు పరంబగునపుడు టుగాగమం బగు,' బాల.సం.28.

తే. ఈశుఁ దలఁచు మహాత్ముల హృదయములను
గాఁడ నోపని నీ పుష్పకాండ నికర
మతని భేదింప నోపునే యంగజన్మ!
తమ కసాధ్యుల సాధింపఁ దలఁప నగునె? 73

విశేషములు : అబల - స్త్రీ అనియు బలములేనిదనియు. అబలాశబ్దము సాభిప్రాయమగుటచే నలంకారము పరికరము. ఇంతయైన అలుకకే వణంకు నీవు ఉగ్రుని మహాకోపమున కెట్లు నిలువఁగల వనుట, అలంకారము కావ్యార్థాపత్తియును, చూచుటను చూచినంతనే - చూచినవిమ్మట వ్యవధిలేకుండఁగనే-అని ఆనంతర్యార్థకప్రయోజనము. నే నాఁటదానను, అబలను - అతఁడుగ్రుఁడు, నాది యించుక అలుకతోడిచూపు. అతనిది ఉగ్రలోచనము. నిప్పులు గ్రక్కునట్టిది. ఈ భేదములు మన్మథునిది దుస్సాహసమని తెలుప సమర్థము లగుచున్నవి. శివుని కుగ్రశబ్దమును ప్రయోగించుటయు సాభిప్రాయమై పరికరాంకురాలంకార మగుచున్నది. ఉగ్రు + ఉగ్ర-ఉగ్రునుగ్ర. 'షష్ఠీ సమాసమునం దుకార ఋకారముల కచ్చు పరమగునపుడు నుగాగమంబగు.' బాల,సంధి.34

సీ. కొని బాలురైనను దిని పిప్పి యుమిసెడు
 చెఱకువి ల్లనినమ్మి చేతఁబట్టి,
మెలఁతల తలవెండ్రుకలఁ బొంది కందెడు
 నలరుపుష్పము లమ్ము లని తలంచి,
తలిరాకులైనఁ గదల్పనోపని మంద
 పవనుండు నొక పెనుప్రాపు గాఁగ,
నబలలు సోపిన నాకాశమునఁబాఱు
 నలి శుకములు మూలబలము గాఁగ,

తే. నెంత వేసవి ముట్టిన నెండఁ గమరు
నను వసంతుండు దగు సహాయంబు గాఁగఁ,
గాకిపిల్లల కోడు పికములఁ బోటు
మగలుగా నుగ్రుపైఁ బోవఁదగునె మదన? 75

అర్థము: మదన = మన్మథుఁడా! బాలురు + ఐనను = చిన్నపిల్లవాం డ్రయినను, కొని = పట్టుకొని, తిని, పిప్పి, ఉమిసెడు, చెఱకు, విల్లు+అని, నమ్మి, చేతన్ + పట్టి,

మెలఁతల = స్త్రీలయొక్క, తలవెండ్రుకలన్ = శిరోజములను, పొందీ = కూడి, కందెడు = నలఁగిపోయెడు, అలరు-పుష్పములు=విచ్చు పువ్వులు, అమ్ములు= బాణములు, అని, తలంచి,

గ్రీష్మము వచ్చును. కాకిపిల్లలకే జంకిపోవునది మేటి మాలబలము లనుట. ఇట్టి సాధన సామగ్రితో దండెత్తిపోవునది యుగ్రునైకి. ఉగ్రశబ్దము సాభిప్రాయమై పరికరాంకు రాలంకార మగుచున్నది.

పాలు + అలికరములు - పాలునలికరములు - 'ఉదంతమగు తద్ధర్మార్థవిశేషణమున కచ్చు పరమగునప్పుడు నుగాగమం బగు.' పాలు నలి కుకములు_బాల.సంధి. 33,తలిరాకులు - తలిరు + ఆకులు - 'కర్మధారయంబునందుఁ బేర్వాదిశబ్దములకచ్చు పరంబగునప్పుడు టుగాగమంబు విభాషనగు' బాల.సంధి.29.

చ. చిరముగ నొల్వువడ్డ నరసింహునికంటెను బెద్దవే? శిరం
 బురలఁగ నాటువడ్డ జలజోద్భవుకంటెను బెద్దవే? పెనుం
 గరిగొనఁ గాల్పువడ్డ జముకంటెను బెద్దవె? నీవు విశ్వసం
 హరు నుఱ కెత్తిపోయి కలహంబున నోర్వఁగ నీ యలంతియే? 76

అర్థము: చిరముగన్ = బహుకాలముగా, ఒల్వు+పడ్డ=తోలు ఒలువఁబడిన. నరసింహునికంటెను, పెద్దవే = గొప్పవాఁడవా? శిరంబు=తల, ఉరలఁగన్ = దొరలునట్లు, ఆటు + పడ్డ = దెబ్బ తినిన, జలజ + ఉద్భవు కంటెను= తమ్మిచూలి (బ్రహ్మ)కంటెను, పెద్దవే, పెనుంగరిగొనన్ = మిక్కిలి యతిశయించునట్లు, కాల్పు + పడ్డ = కాలిన, జముకంటెను= యమునికంటెను, పెద్దవె, నీవు, విశ్వ - సంహరున్ = విశ్వమునే సంహరించువానిని - శివుని, ఉఱక = లక్ష్యపెట్టక, ఎత్తిపోయి=దండెత్తి, కలహంబునన్=యుద్ధమునందు, ఓర్వఁగన్ = ఓడించుటకు, నీ + అలంతియే = నీ తరమా?

తాత్పర్యము: పరమేశ్వరునిచే నెప్పుడో తోలు ఒలువఁబడిన నరసింహుని కంటెను నీవు గొప్పవాఁడవా? శిరస్సు నేల దొరలునట్లు దెబ్బతిన్న బ్రహ్మకంటెను గొప్పవాఁడవా? అతిశయముగాఁ గాలిపోయిన యమునికంటెను గొప్పవాఁడవా? నీవు జగత్సంహారుమీఁదికి దండెత్తిపోయి యుద్ధమున నతని నోర్చుట నీకు శక్యమా? కాదనుట.

విశేషములు: ఒల్వువడ్డనరసింహుని .... విష్ణువు నరసింహరూపమున నున్నప్పుడు శివుఁడు శరభరూపుఁడై యతని నెదిరించి, సంహరించి, యతని చర్మము నొలిచి కంకాళమును ధరించెనని ఉత్తరనారసింహపురాణకథ, శిరం బురలఁగ నాటువడ్డ

విశేషములు : గరళం బభ్యవహారము - దేవదానవు లమృతముకొఱకు క్షీరసముద్రమును మథింపఁగా నందుండి పుట్టిన హాలాహలమును లోకక్షేమముకయి యీశ్వరుఁడు మ్రింగెను. పాశుపతము, కాలాముఖము, వామనము, భైరవము, మహా వ్రతము - అనునవి శైవాగమభేదములు. అందు మహావ్రతమునం దాచరింపఁదగిన నియమములు, చిహ్నములు ఈ పద్యమునఁ బేర్కొనఁబడినవి. విశ్వసంహరు వర్తించు - 'ధాతుజవిశేషణ భావార్థక పూర్వవ్యవహితావ్యవహిత కర్తృపదప్రథమకుఁ దఱుచుగ యొక్కషష్ఠి యగు' ప్రౌఢ.కారక,15. విశ్వసంహరునియొక్కవర్తించు, 'యొక్కకు లోపంబు బహుళంబు.' ప్రౌఢ.కారక, 16. విశ్వసంహరు వర్తించు మహావ్రతోపహతి - 'కొన్నియెడల సిద్ధసమాసమధ్యగతపదంబులతోఁ దద్భిన్న పదంబుల కన్వయంబు చూపట్టెడి.' ప్రౌఢ.సమాస.35. 'విశ్వసంహరు' అను శివ విశేషణము సాభిప్రాయమై పరికరాలంకార మగుచున్నది.

వ. అనిన విని "బలపరాక్రమాతిధైర్య శౌర్య మంత్ర తంత్ర ధ్యాన ధారణైశ్వర్యాద్యశేషదివ్యశక్తు లెంతవిశేషంబు లయ్యును జంద్ర కాంతోపలంబులు చంద్రకిరణస్పర్శనంబునఁ గరంగునట్లు లతి కోమలం బైన కామశక్తికి లోపై మృదుభావంబునం బొందు నిది జగంబునం దనుభవసిద్ధం బది యెట్లనిన. 78

అర్థము : అనినన్ = అని రతి యనఁగా, విని = మన్మథుఁడు విని, బల .... శక్తులు : బల, పరాక్రమ, అతిధైర్య, శౌర్య, మంత్ర, తంత్ర, ధ్యాన, ధారణ + ఐశ్వర్య, ఆది = మొదలగు, అశేష=సమస్తమునైన, దివ్య-శక్తులు = గొప్ప శక్తులు. ఎంత - విశేషంబులు=ఎంతగొప్పవి, అయ్యును=అయినను, చంద్ర కాంత+ఉపలంబులు=చంద్రకాంతశిలలు, చంద్ర-కిరణ-స్పర్శనంబునన్ = చంద్రుని యొక్క, కిరణములయొక్క, తాఁకిడిచేత, కరంగు + అట్లు = కరఁగు రీతిని, అతి - కోమలంబు = మిక్కిలి మృదువు, ఐన, కామశక్తికిన్ = మన్మథునిశక్తికి, లోపు + ఐ = లోపడి, మృదు - భావంబునన్ = మార్దవమును, పొందున్, ఇది, జగంబునన్=లోకమునందు, అనుభవ - సిద్ధంబు = అనుభవముచే నేర్పడినది, అది, ఎట్లు + అనినన్,

తాత్పర్యము : అని రతి యనఁగా మన్మథుని పత్ని 'బలము, పరాక్రమము, గొప్పధైర్యము, శౌర్యము, మంత్రము, తంత్రము, జ్ఞానము, ధారణ, ఐశ్వర్యము మున్నగు సర్వవిద్యాశక్తులు ఎంతగొప్పవియైనను, చంద్రకాంతశిలలు చంద్రకిరణములు సోఁకఁగనే కరఁగువిధమున, మిక్కిలి కోమలమైన మన్మథశక్తికి లోపడి మార్దవమును బొందును. ఇది లోకమున ననుభవముచే నేర్పడినది. అది యెట్లనఁగా - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : చంద్రకాంతోపలంబులు చంద్రకిరణస్పర్శనంబునఁ గరంగునట్టులు - అలంకారము ఉపమ. ధారణ + ఐశ్వర్య - వృద్ధిసంధి. అ ఆ లకు ఏ ఐలు పరము లగునపుడు ఐకారమును, ఓ ఔలు పరములగునపుడు ఔకారమును ఏకాదేశము అగును. ధారణైశ్వర్య. ఆది + అశేష - యణాదేశసంధి. ఇ ఉ ఋ ౠ లకు అసవర్ణములైన అచ్చులు పరము లగునపుడు య్ వ్ ర్ ల్ అనునవి ఆదేశము లగును - ఆద్యశేష. చంద్రకాంత + ఉపలంబులు = గుణసంధి. అ ఆ లకు ఇ ఉ ఋ ౠలు పరములగునపుడు వరుసగా ఏ ఓ అర్ అల్ అనునవి ఏకాదేశములగును. చంద్రకాంతోపలంబులు. కరంగు + అట్టులు - 'ఉదంతమగు తద్ధర్మార్థవిశేషణమున కచ్చు పరమగునపుడు నుగాగమం బగు.' బాల.సంధి.33. కరంగునట్టులు.

తే. అదిమిపట్టినఁ గరులైనఁ బదియునట్టి
కడిఁదిబలులగు మగలొత్తి కౌఁగిలింపఁ
గుసుమకోమలు లగు సతుల్ కొసరుచునికి
గనియు నెఱుఁగవె విపరీతకామశక్తి? 79

అర్థము : అదిమి - పట్టినన్ = నొక్కిపట్టినచో, కరులు + ఐనన్ = ఏనుఁగులయినను, పదియు + అట్టి = నలఁగిపోవునట్టి, కడిఁది - బలులు + అగు = మిక్కిలి బలముగలవారగు, మగలు = పురుషులు, ఒత్తి = నొక్కి-దగ్గ, కౌఁగిలింపన్ = కౌఁగిలింపఁగా, కుసుమ-కోమలులు + అగు = పువ్వువలె మృదువులైన, సతుల్ = స్త్రీలు, కొసరుచున్ + ఉనికి = మఱిమఱి కావలయు ననుచుండుట, కనియున్ = చూచియు, విపరీత - కామ - శక్తి = వ్యత్యస్తమైన మన్మథబలము, ఎఱుఁగవె = ఎఱుఁగవా?

తాత్పర్యము : వారు నాలుగుసార్లు పట్టినచో నేనుఁగులైన నలిఁగిపోవునట్టి గొప్పబలముగల పురుషులు దగ్గఁ గౌఁగిలింపఁగాఁ బూవువలె మృదువులగు స్త్రీలు మఱి మఱి కావలయు ననుచుండుట చూచియు విపరీతమైన మన్మథశక్తి తెలియదా?

విశేషములు : అపిమినప్పుడు ఏనుఁగులనైన నలఁగఁగొట్టునది పురుషుల బలము. అట్టి బలముగలవారు స్త్రీలను బిగియారఁ గౌఁగిలించినప్పుడు వారు ఏనుఁగుల వలెఁగాక, కుసుమకోమలులైనను నలఁగరు సరిగదా ఇంకను అట్టిది కావలయునని కోరుచుందురు, దానికిఁ గారణము మన్మథుని బలము. అదియే దాని వైపరీత్యము. కడిఁదిబలులు - బహువ్రీహి కాదు. విశేషణపూర్వపద కర్మధారయము - మిశ్రసమాసము, బలముగలవాఁడు బలి. దాని బహువచనము బలులు, కడిఁదియైన బలులు-కడిఁది బలులు. అపిమి పట్టినఁ గరులైనఁ జదియునట్టి కడిఁది బలులు - కడిఁదిబలులు అపిమి పట్టినఁ గరులైనఁ జదియునట్టి - 'కర్మాదులకుఁ బ్రాధాన్యవివక్షయందు ధాతువిశేషణంబులు కర్తృతోడంబోలె వానితోడ సమసించు.' బాల.సమాస.26. కోసరు చునికి - కోసరుచున్ + ఉనికి - 'ప్రథమేతర విభక్తి శత్రర్థకచువర్ణంబులందున్న యుకారమునకు సంధి వైకల్పికముగా నగును.' బాల. సం.2.

వ. దానికిం గారణం బేమి యందేని. ౪౮

అర్థము : దానికిన్, కారణంబు, ఏమి, అందు (వు) + ఏని = అందువేని.

తాత్పర్యము : దానికిఁ గారణ మే మందువేని - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు ; అందేని - అందువు+ఏని. అనుధాతువు. 'తద్ధర్మార్థములందు లొట్టగు.' అను + లొట్టు, బాల.క్రియ.5 'లకారంబునకు డు ద్రు వు రు ను ము లగు.' బాల.క్రియ. 8. మధ్యమపురుషైకవచనము - అను + వు. 'లొట్టు రుఙ్గు పరంబగునపుడు మకారాగమం బగు.' బాల.క్రియ,22. అనుదువు. 'తి దు టలు పరంబు లగునపు డన్వాదుల నుస్థానంబున నున్నయు నుండు డు లోపంబును విభాష నగు.' బాల. క్రియ.23, అందువు. 'లిఙ్లొట్టుల వకారంబునకు లోపంబు విభాష నగు.' బాల.క్రియ,24. అందు+ఏ. 'అన్వాదివగాగమంబులం దప్ప నపదాదిస్వరంబు పరంబగునపు డచ్చునకు సంధి యగు.' అందు. బాల.సంధి.11. 'ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధి యగు.' బాల. సంధి. 1. అందేని.

క. ఆరయఁగా స్త్రీపురుషా
కారములై చిత్తవృత్తి గలిగినఁ జాలున్
వా రెల్లఁ గామపశులని
వారని నియమించి నాకు వర మజుఁ డిచ్చెన్. 81

అర్థము : ఆరయఁగాన్ = పరికింపఁగా, స్త్రీ - పురుష + ఆకారము లు + ఐ = స్త్రీయొక్కయు, పురుషునియొక్కయు ఆకారములుగలవి యయి, చిత్త - వృత్తి = మనోవ్యాపారము, కలిగినన్ = ఉన్నచో, చాలున్ = సరిపోవును, వారు + ఎల్లన్ = వారందఱును, కామ - పశులు = మన్మథునిచే లోఁబడువారు, అగు వారు, అని, నియమించి = ఏర్పాటుచేసి, నాకున్, అజుఁడు = బ్రహ్మ, వరము, ఇచ్చెన్.

తాత్పర్యము : చూడఁగా స్త్రీపురుషుల ఆకృతిగలవయి మనోవ్యాపారము గలిగియున్నచోఁ జాలును. వారందఱును మన్మథపశువులగుదురని యేర్పాటుచేసి నాకు బ్రహ్మ వరమిచ్చెను.

వ. అని యాదిసృష్టికిని గారణంబైన కామతత్త్వమహత్త్వంబుఁ దెలిపి రతి నొడంబఱిచి రతీశ్వరుండు పరమేశ్వరుపైఁ బోవ నుద్యుక్తుం డగుడు నక్షణంబ. 82

అర్థము : అని, ఆది - సృష్టికిని = తొలిసృష్టికిఁగూడ, కారణంబు + ఐన, కామ - తత్త్వ - మహత్త్వంబున్ = మన్మథుని స్వరూపముయొక్క గొప్పతనమును, తెలిపి, రతిన్, ఒడంబఱిచి = సమ్మతింపఁజేసి, రతి + ఈశ్వరుండు = రతిభర్త - మన్మథుఁడు, పరమేశ్వరుపైన్, పోవన్ = దండెత్తిపోవుటకు, ఉద్యుక్తుండు = ప్రయత్నించినవాఁడు - సిద్ధపడినవాఁడు, అగుడున్ = అయినంతనే, ఆ - క్షణంబు + అ = అప్పుడే,

తాత్పర్యము : అని తొలిసృష్టికిఁగూడఁ గారణమైన మన్మథస్వరూప మహిమను దెలిపి రతిని సమ్మతింపఁజేసి మన్మథుఁడు పరమేశ్వరునిపైకి దండెత్తిపోవ నుద్యమించినంత ఆ క్షణమే - తరువాతి పద్యముతో నన్వయము,

విశేషములు : అగుడున్ - అగుధాతువు, బాల. క్రి. 42. 'ఆనంతర్యంబున డువర్ణకంబు ద్రుతాంతం బగు.' అగుడున్. అవుడున్, ఔడున్, కావుడున్ (రూపాం.)

కామవశులగుటకు స్త్రీ పురుష లయినంతమాత్రమునఁ జాలదు. వారికిఁ జిత్తవృత్తి గూడ నుండుట ముఖ్యము. వసంతుఁడు చిత్తజుఁడుగదా! అక్షణంబ-ఆక్షణంబ అనుటకు - నన్నెచోడుఁడు దీనిని చెక్కుచోట్లఁ బ్రయోగించెను - 4 - 33, 11 - 76

సీ. పంకరుహంబులు బండికండులు, చన్ప
        కంబులు నొగ, లుత్పలంబు లిరుసు,
    కరవీరములు బలు గాఁడి, జాదులు సనుఁ
        గొయ్య, లశోకముల్ గోడి పీఁట,
    సిందువారంబులు సీలలు, గేతకుల్
        మెట్టులు, మొల్లలు మెట్ట గుదెలు,
    పొగడలు పలుపులు, పున్నాగములు పగ్గ
        ములు, సహకారముల్ పూను గాఁడి

తే. కురవకానీక మాలంపుఁగోల, కైర
    వములు మునుకోల, కోకముల్ వాహనములు
    గా వసంతుండు సూతుఁడై పూవుఁదేర
    నెరయఁ గుసుమాయుధంబులు నినిపి తెచ్చె. ౮౩

అర్థము : పంకరుహంబులు = తామరపుష్పములు, బండి - కండులు = బండి కట్టులు, చన్పకంబులు = సంపెఁగలు, నొగలు = బండికాఁడికట్టుఁగట్టులు - యుగంధరములు, ఉత్పలంబులు = కలువలు, ఇరుసు,

కరవీరములు = గన్నేరుపూవులు. బలు + కాఁడి = బలమైన కాఁడి, జాదులు = జాజిపూలు, చను + కొయ్యలు = బండి చట్టమునకు రెండుప్రక్కలను నాటెడు కొయ్యలు, అశోకముల్, కోడిపెఁట = బండి పోలుగట్టుచివరఁ గ్రింద ఎత్తుగా నుంచెడు మోపుడుకొయ్య - అనుకర్షము,

సిందువారంబులు = వావిలిపూలు, సీలలు = మేకులు, కేతకుల్ = గేదఁగులు- మొగలిపూలు, మెట్టులు = బండి యిటునటుఁ గదలకుండ బండిక్రిందఁ గట్టెడు తట్టలు, మొల్లలు = మొల్లపూలు, మెట్ట గుదెలు,

పొగడలు = పొగడపూలు. పలుపలు = పశువుల మెడఁ గట్టెడు త్రాడులు. కలుగులు, పున్నాగములు = సురపొన్నలు, పగ్గములు. సహకారకుల్ - తీయమామిడులు. పూను + కాఁడి = ఎద్దు మున్నగు వాని మెడమీఁద నుంచు బండి మున్నగువాని కాఁడి.

కురవక + అనీకము=ఎఱ్ఱగోరంటల సమూహము, అలంపుఁగోల=ముల్లు దంతము, కైరవములు = తెల్లకలువలు, మునుకోల = మునికోల - కొరడా - కఱ్ఱ, కోకముల్ = చక్రవాకములు, వాహనములు = గుఱ్ఱములు, కాన్ = కాఁగా, వసంతుండు, పూవుఁదేరన్ = పుష్పరథమునందు, సూతుఁడు + ఐ = సారథియై, నెరయన్=నిండుగా, కుసుమ + అమ్ముఁబులు = పూవుటమ్ములు నినిచి=నింపి, తెచ్చెన్.

తాత్పర్యము: పద్మములు బండి కల్లులుగను, సంపెంగలు నొగలుగను, కలువలు ఇరుసుగను, గన్నేరులు బలమైనకాఁడిగను, జాజిపూలు బండిపట్టమునకు రెండుప్రక్కల నాటెడు కొయ్యలుగను, అశోకములు బండిపోలుగట్టుచివరఁ గ్రింద ఎత్తుగా నుంచెడు మోపుడుకొయ్యగను, వావిలిపూలు సీలలుగను, గేదఁగులు మెట్లుగను, మొల్లలు మెట్టు గుదెలుగను, పొగడలు పలుపులుగను, పున్నాగములు పగ్గములుగను, తీయమామిడులు కాఁడులుగను, కురవకములు అలపుఁగోలలుగను, తెల్లకలువలు మునికోలగను, చక్రవాకములు గుఱ్ఱములుగను కాఁగా వసంతుఁడు పుష్ప రథముపై సారథియై నిండుగాఁ బూవుటమ్ములు నింపి తెచ్చెను.

విశేషములు: ఒక రాజకవి కిట్లు బండి వివిధావయవము లన్నియుఁ దెలియుట విశేషము.

పూవుఁదేరన్ - పూవు + తేరు + అందున్ = 'సమాసంబుల నుదంతంబు లగు స్త్రీసమంబులకుం, బుంపులకుం బరుషసరళంబులు పరంబు లగునపుడు నుగాగమం బగు.' బాల. సంధి. 25. పూవు + ను + తేరు + అందున్. 'ద్రుతప్రకృతికము మీఁది పరుషములకు సరళము లగు' బాల. సంధి. 16. పూవు + ను + దేరు + అందున్. 'ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందుసంశ్లేషములు విభాష నగు.' బాల. సంధి. 17. పూవుఁదేరు + అందున్. 'బొంవిభక్తికంబుల ప్రతియా సప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు.' బాల.అచ్చిక, 38. పూవుఁదేరు +

అన్. 'అంద్వగాగమంబులందప్ప నపదాదిస్వరంబు పరంబగునపు డచ్చునకు సంధి యగు.' బాల.సంధి.11. పూవుఁదేరన్. నినిపి-నినుప ధాతువు నిఘంటువులఁ గానరాదు. నినుప విశేష్యముగానే కనవచ్చుచున్నది. నింపు ధాతువు గలదు. కండులు - కల్లు + లు - 'బౌపవిభక్తికంబులి లిఙ్గ్ సల ఉవర్ణంబులకు బహువచనంబు పరంబగునప్పుడు పూర్వవర్ణలోపపూర్వక ద్విత్వంబు బహుళంబుగా నగు.' బాల.అచ్చిక.16.

వ. అంత రతిసమేతంబు పుష్పాయుధుండు పుష్పరథారూఢుండై నిజ సామ్రాజ్యవిభవైశ్వర్యంబులతో నతిరయంబున హిమవంతంబున కరిగి పరమేశ్వరు తపోవనంబు సొత్తెంచెఁ దత్ క్షణంబ. 84

అర్థము : అంతన్, రతి - సమేతంబు=రతితోఁ గూడినవాడై, పుష్ప + ఆయుధుండు = పూవులు బాణములుగాఁ గలవాఁడు - మన్మథుఁడు, పుష్ప - రథ+ ఆరూఢుండు + ఐ = పూవుఁదేరెక్కినవాఁడయి, నిజ - సామ్రాజ్య - విభవ + ఐశ్వర్యంబులతోన్ = తనదైన సామ్రాజ్యముయొక్క వైభవముతోను, ఐశ్వర్యము తోను, అతిరయంబునన్ = మిక్కిలి వేగముతో, హిమవంతంబునకున్, అరిగి, పరమేశ్వరు = పరమేశ్వరునియొక్క, తపస్ (ః) + వనంబు, చొత్తెంచెన్ = ప్రవేశించెను, తద్ + క్షణంబు + అ = ఆ క్షణమే.

తాత్పర్యము: అంత మన్మథుఁడు రతి సహితుఁడై పూవుఁదేరి నెక్కి తన సామ్రాజ్యవైభవైశ్వర్యములతో మిక్కిలి వేగమున హిమవంతమున కేఁగి పరమేశ్వరుని తపోవనమును బ్రవేశించెను. ఆ క్షణమే - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు ; పుష్పరథారూఢుఁడు - పుష్పరథమును ఆరూఢుఁడు (ఆరోహించినవాఁడు) - ద్వితీయా తత్పురుషము. తపస్ + వనము = తపః + వనము - తపోవనము. చూడు పూర్వవ్యాఖ్య. చొత్తెంచె- చొచ్చు + తెంచె-చూడు పూర్వవ్యాఖ్య.

మ. వలరా జామనిఁ బిల్చి 'వేగమెయి నీ వాసంతికానంద దో
హల మీ కాననలక్ష్మి కిమ్మనుడు నాహ్లాదంబుతో నెయ్యు మ
గ్గలమైయుండ వసంతకుండు దమపైఁ గన్నిడ్డఁ గారాకు గెం
ధలిరాకయ్యెనొ నాఁ చలిర్చె పడిఁ గాంతారాంతరోర్వీజముల్. 85

అర్థము : వలరాజు = వలపు + రాజు = మన్మథుఁడు, ఆమనిన్ = వసంతుని, పిల్చి, వేగమెయిన్ = వేగముగా, నీ వాసంతిక + ఆనంద + ఉత్సాహము = నీయొక్క, వసంతసంబంధమైన ఆనందోత్సాహమును, ఈ వనశ్రీకిన్ = ఈ వనలక్ష్మికి, ఇమ్ము, అనుడున్ = అనినంతనే, వసంతుండు = వసంతుఁడు, ఆహ్లాదంబుతోన్ = సంతోషముతో, నెయ్యము = స్నేహము, అగ్గలము + ఐ = అధిక మయి, ఉండఁగన్ = ఉండఁగా, తనపైన్, కన్ను + ఇడన్ = కన్నువెట్టఁగా, కారాకు = పండుటాకు, కెందలిరాకు = ఎఱ్ఱని చివురాకు, అయ్యెనా, నాన్ = అనఁగా, వడిన్ = వేగముగా, కాంతార + అంతర + ఉర్వీజములు = వనము లోపలి చెట్లు, తలిర్చెన్ = చివురించెను.

తాత్పర్యము : మన్మథుఁడు వసంతుని, పిలిచి 'శీఘ్రముగా నీ వనలక్ష్మికి నీ వాసంతానందోత్సాహము ని' మ్మనినంతనే యతఁడు సంతోషముతో స్నేహ మధికముకాఁగాఁ దనపైఁ గన్నువెట్టఁగా పండుటాకు కెందలిరాకయ్యెనా యనునట్లు వేగముగా వనమునందలిచెట్లు చివురించెను.

విశేషములు : వేగ - (వికృతి) - వేగము (ప్రకృతి) - వేగమెయిన్. 'జడపదంబులమీఁది తోడకు మెయి పై లు వికల్పంబుగ నగు.' ప్రౌఢ.శబ్ద.18. నెయ్యము (వికృతి) - స్నేహము (ప్రకృతి). కెందలిరాకు-కెంపు + తలిరు + ఆకు, 'సమాసంబునం బ్రాంతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగా నగు.' బాల.సంధి, 36. కె + తలిరు + ఆకు. 'లుప్తశేషంబునకుం బరుషములు పరములగునపుడు నుగాగమం బగు.' బాల.సం.37 కె + ను + తలిరు + ఆకు. ద్రుతకార్యము (బాల.సంధి.16,17) చే కెందలిరు + ఆకు. 'కర్మధారయంబునందుఁ బేర్వాదిశబ్దముల కచ్చు పరంబగునప్పుడు టుగాగమంబు విభాష నగు' బాల.సంధి.29. కెందలిరాకు, కారాకు కెందలిరాకయ్యెనో నాన్-అలంకారము ఉత్ప్రేక్ష, ఇడన్-'ఇవ్వాదుల నవర్ణకంబున కత్వంబును గడహల్లునకు ద్విత్వంబును విభాష నగు.' బాల.క్రియ.51.

క. తన సూ డగు ధనదదిశాం
గన నిముఁ డొడఁగూడఁ బోక గని యామ్యదిశాం
గన నొచ్చి వెచ్చనూర్చెనొ
యన శిశిర విముక్త దక్షిణానిల మెసఁగెన్. 86

అర్థము : తన - సూడు + అగు = తన శత్రువగు, ధనద - దిశా + అంగనన్ = కుబేరుని దిక్కగు ఉత్తర దిక్కనెడుస్త్రీని, ఇనుఁడు=సూర్యుఁడు, భర్త, ఒడఁగూడనన్+పోక = కలియఁబోవుట, కని = చూచి, యామ్య - దిశా + అంగన= దక్షిణదిక్కనెడు స్త్రీ, నొచ్చి = బాధపడి, వెచ్చన్ + ఊర్చెనో = వేఁడిగా నిట్టూర్చెనో, అనన్, శిశిర - విముక్త - దక్షిణ + అనిలము = శిశిరర్తువుచే - చల్లఁదనముచే - విడువఁబడిన, దక్షిణపు గాలి - మలయమారుతము, ఎసఁగెన్ = అతిశయించెను.

తాత్పర్యము: అంత ఉత్తరాయణము వచ్చుటయు, మలయమారుతమువీవఁ దొడఁగుటయు జరిగెను. అప్పుడు సూర్యుఁడు దక్షిణాయనకాలమును విడిచి ఉత్తర దిక్కునకుఁబోవఁదొడఁగఁగానే, దక్షిణదిక్కు మలయమారుతమును ప్రేరణచేసెను, అది - ఒక నాయకుఁడు తన నాయికయగు దక్షిణదిగంగనను విడిచి, కుబేరుని (ధనవంతుని) దిక్కనెడు ఉత్తర దిగంగనను గూడఁబోవుట చూచి దక్షిణదిక్సతి బాధపడి వేఁడినిట్టూర్పు విడిచెనా యనునట్లుండెను.

విశేషములు : తన సూడు=దక్షిణదిక్సతికి సపత్నిగావున నుత్తర దిక్సతి పగతురాలు. ధనద-దిశాంగన-కుబేరదిక్కు-ఉత్తరదిక్కు, ఉత్తరదిక్కనెడుస్త్రీ-ధనవంతుఁడైన అన్యుని స్త్రీ. ఇనుఁడు=సూర్యుఁడు-నాయకుఁడు. యామ్య=యమసంబంధమైన, దక్షిణదిక్కు, వెచ్చనూర్చెనో. -వేఁడిగా నిట్టూర్చెనో శిశిరర్తువుపోయి వసంతము రాఁగానే గాలి చల్లఁదనములేక యించుక వేఁడిగా నుండును. ధనద - ఇనశబ్దములలో నలంకారము శ్లేషము, దిశాంగన - దిశ యనెడు అంగన - రూపకము. వీనిచే నుత్ప్రేక్షాలంకార ముత్థాపితమైనది. ప్రస్తుతమైన - దక్షిణాయనము ముగిసి ఉత్తరాయణము వచ్చె నని చెప్పినప్పు డప్రస్తుతమైన తన నాయికనువిడిచి యన్యనాయికయం దాసక్తుఁడైన యొక నాయకుని వృత్తాంతము తెలియుచున్నది. కావున సమాసోక్తియు. ఈ పద్యము భావము కాళిదాసకుమారసంభవమునందలి శ్లోకముభావము ననుసరించినది -

'కుబేరగుప్తాం దిశ ముష్ణరశ్మౌ
గన్తుం ప్రవృత్తే సమయం విలఙ్ఘ్య,
దిగ్దక్షిణా గన్ధవహం ముఖేన
వ్యలీక నిశ్వాస మి వోత్ససర్జ.' కుమా.3.25.

వ. మలయసమీరణాభిహతి క్ష్మాఁకుల నాకులు డుల్లిడుల్లి, క్రొ
మ్మొల్లకలు సాఁగిసాఁగి, విరిమోసులఁ గెందలి రొత్తియొత్తి, ము
కుళములు క్రమ్మిక్రమ్మి, కుసుమంబులు వాసనకెక్కియెక్కి, గు
త్తులుగొని పండిపండి, వినుతుల్ దగ నారము లొప్పె నామనిన్. 87

అర్థము : మలయ - సమీరణ + అభిహతిన్ = మలయమారుతము యొక్క (దక్షిణానిలము) దెబ్బచేత, క్ష్మాఁకులన్ = చెట్లయందు, ఆకులు డుల్లి డుల్లి = రాలిరాలి, క్రొమ్మొల్లకలు (క్రొత్త + మొలకలు) = నూతనాంకురములు, సాఁగి సాఁగి = మిక్కిలి వ్యాపించి, విరి - మోసులన్ = పూలమొక్కలయందు, కెందలిరు (కెంపు+తలిరు) = ఎఱ్ఱనిచివురు, ఒత్తి-ఒత్తి = మిక్కిలి దట్టమై, ముకుళములు = మొగ్గలు, క్రమ్మి - క్రమ్మి = మిక్కిలివ్యాపించి, కుసుమంబులు = పువ్వులు, వాసనకున్ = పరిమళమునకు, ఎక్కి - ఎక్కి - పరిమళము అతిశయించి, గుత్తులు + కొని, పండి - పండి = గుత్తులుగా మిక్కిలి పండి, వినుతుల్ = పొగడ్తలు, తగన్ = ఒప్పుఁగా, ఆమనిన్ = వసంతమున, ఆరములు = ఆరామములు, ఒప్పెన్.

తాత్పర్యము : మలయమారుతపుదెబ్బచేఁ జెట్లయం దాకులు రాలి రాలి, నూతనాంకురములు సాఁగిసాఁగి, పూలమొలకలఁ జివురాకులు ఒత్తియొత్తి, మొగ్గలు క్రమ్మిక్రమ్మి, పూవులు వాసన యెక్కియెక్కి, గుత్తులు పండిపండి వసంతమునఁ బొగడ్తకుఁ దగినట్లు ఆరామము లొప్పెను.

విశేషములు : డుల్లిడుల్లి, సాఁగిసాఁగి మున్నగు ద్విరుక్తులు అత్యంతార్థమున నైనవి. 'అత్యంతార్థంబునందు నగు.' ప్రౌఢ.శబ్ద. 112. క్ష్మాఁకులు-క్ష్మాజ + లు.' కలస్వాముల నువర్ణంబు తుడుగు; బహువచనము పరంబగునపుడు నిత్యముగా నగు.' బాల.ఆచ్ఛిక.18. క్ష్మా + కుజ్ + లు - 'చిత్తు బిందుపూర్వం బగు.' బాల. తత్సమ.19. క్ష్మాఁకులు. క్రొమ్మొల్లకలు - క్రొత్త + మొలకలు - 'సమాసంబునం బ్రాంతాముల తొలియచ్చుమీఁది వర్ణంబులెల్ల లోపంబు బహుళంబుగా నగు.' బాల. సంధి. 36. క్రొ + మొలకలు. 'క్రొత్తశబ్దమున కాద్యక్షరశేషంబునకుం గొన్నిచోట్ల నుగాగమంబునుం గొన్నిచోట్ల మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు.' బాల.సంధి.38. క్రొమ్మొల్లకలు. ఆరము (వికృతి)-ఆరామము (ప్రకృతి) ఈ శబ్దమున కిందే ప్రయోగాంతరము - 5 - 82.

క. ఛోరన నంకుర పల్లవ
కోరక పుష్ప ఫల వితతిఁ గొమ రమరి మనో
హారములై సారములై
యారామము లొప్పె మధు సమాగమ వేళన్. 88

అ ర్థ ము : మధు - సమాగమ - వేళన్=వసంతాగమసమయమున, ఆరామములు = వనములు. ఛోరనన్ = శీఘ్రముగా (బోరనన్), అంకుర - పల్లవ - కోరక - పుష్ప - ఫల - వితతిన్ = మొలకలయు, చివురులయు, మొగ్గలయు, పూవులయు, పండ్లయు సమూహముతో, కొమరు = అందము, అమరి = ఒప్పి, మనస్ (ః) + హారములు + ఐ = మనస్సును హరించునవియై - మనసు నాకర్షించునవియై, సారములు + ఐ = శ్రేష్ఠములయి, ఒప్పెన్.

తా త్ప ర్య ము : వసంతాగమసమయమున శీఘ్రముగా మొలకలయు, చివురులయు, మొగ్గలయు, పూవులయు, ఫలములయు సమూహముతో, సుందరములయి మనస్సును హరించునవియై శ్రేష్ఠములై వనము లొప్పెను.

వి శే ష ము లు : ఆరామము లొప్పె మధుసమాగమవేళన్ - ప్రాదియతి.

సీ. వేదన విరహులు నేదలు నేడీ సంధి
లెడలంగఁ బల్లొకు లెడలెఁ దరుల;
దొగిల్లు కవల మేఁదీగలఁ బులకంబు
లంకురింపఁగఁ దరు లంకురించె;
సమ్మదంబునఁ గామిజనుల చిత్తంబులు
చిగురొత్తఁ దరులందుఁ జిగురు లొత్తె;
రతి దోహలముల దంపతుల ముఖాబ్జముల్
వికసిల్ల వికసిల్లె విరులు తరుల;
ఆ. నెలమిఁ జిలుకపిండు తొలుమేనఁ జేసిన,
తపము పండఁ బండెఁ దరు వనంబు;
లువిద లింపు మిగుల నోయల పాటలు
పాడ మధు మదమునఁ బాడె నళులు. 89

అర్థము : విరహులు = వియోగులు, వేదనన్ = బాధచే, వేదలు + వెడి = అలసట లతిశయించి, సంధులు = కీళ్లు, ఎడలంగన్ = సడలఁగా, తరువున్= చెట్లనుండి, పల్లాకులు = ఎండుటాకులు, ఎడలెన్ = రాలెను.

రాగిల్లు = అనురక్తినొందు, కవల = దంపతులయొక్క, మేఁదీగలన్ = తీగెలవంటి మేనులందు, పులకంబులు=గగురు, అంకురింపఁగన్=పుట్టఁగా, తరులు= చెట్లు , అంకురించెన్ = మొలకెత్తెను.

కామి - జనుల - చిత్తంబులు=కాముకులైన జనుల మనస్సులు, సమ్మదంబునన్ = సంతోషముతో, చిగురు + ఒత్తన్ = పల్లవింపఁగా - సంతసింపఁగా, తరులందున్ = చెట్లయందు, చిగురులు + ఒత్తెన్ = చివురులు కలిగెను,

రతి - దోహలములన్ = సంభోగోత్సాహములచేత, దంపతుల, ముఖ + అబ్జముల్ = తామరలవంటి ముఖములు, వికసిల్లన్ = వికాసమునొందఁగా, తరులన్, విరులు = పూలు, వికసిల్లెన్ = వికసించెను.

ఎలమిన్ = ప్రీతితో, చిలుక - పిండు = చిలుకల గుంపు, తొలి - మేనన్= పూర్వజన్మమున, చేసిన, తపము, పండన్ = ఫలింపఁగా, తరు-వనంబులు = చెట్లతోఁటలు, పండెన్.

ఉవిదలు = యువతులు, ఇంపు - మిగులన్ = ఆనంద మతిశయింపఁగా, ఓయల - పాటలు, = శృంగారపుఁబాటలు, పాడన్. అలులు = తుమ్మెదలు, మధు- మదమునన్ = పూఁదేనె (మద్యము) వలని - క్రొవ్వుచే, పాడెన్,

తాత్పర్యము : వియోగులు విరహవేదనచే నలసట యతిశయించి కీళ్లు సడలఁగాఁ జెట్లనుండి పండుటాకులు రాలెను. అనురక్తులైన దంపతుల మైఁదీవలందు గగురుపాటు పుట్టఁగాఁ జెట్లు మొలకలెత్తెను. కాముకజనుల మనస్సులు సంతోషమునఁ బల్లవింపఁగాఁ జెట్లయందుఁ జివురులు గలిగెను. సంభోగోత్సాహములచే దంపతుల మోముఁదామరలు వికసింపఁగాఁ జెట్లయందుఁ బూలు వికసించెను. చిలుకలగుంపు ప్రీతితోఁ బూర్వజన్మమునందుఁ జేసిన తపము ఫలింపఁగాఁ జెట్లతోఁటలు పండెను. యువతు లానందాతిశయముతో నోయలపాటలు పాడఁగా, మధుమదముతోఁ దుమ్మెదలు పాడెను.

విశేషములు : సేద (వికృతి) - స్వేదము (ప్రకృతి). సేదలు సెడి - చెడు ధాతువు తుమున్నంత మయినప్పుడు 'మిక్కిలి' యనునర్థము నిచ్చును. (సూ.ని) అందుచే నిటc దుమున్నంతముగా నున్నను అతిశయించి యను నర్థము చెప్పcబడినది. అలంకారము సహోక్తి. తరులు - తరువులు - 'వువర్ణకేతర విభక్తి పరమగుచో నుకారాంతంబులకు బహుళంబుగా గోశబ్దంబునకు నిత్యంబుగా వుగాగమంబగు.' బాల. తత్సమ.49. పల్లాకు లెడలెc దరుల - తరులవలన నుండి పల్లాకు లెడలె- 'ఉండిశబ్దము పరంబగు నప్పుడు వలనకు ద్వితీయాసప్తములు ప్రాయికంబుగ నగు' - బాల. కారక. 11. వలన కాదేశంబగు ద్వితీయాసప్తములమీcది యుండికి లోపంబు బహుళంబుగా నగు, ప్రౌఢ.కారక. 11.

క. మదను తలిరెల్లులో యనc
బొదిగొని కెందలిరు లెసcగె భూరుహములపై;
నొదవెడు రాగాంబుధి బు
ద్బుదములు నా నెసcగె ముకుళములు తోరములై. 90

అర్థము : మదను = మన్మథునియొక్క, తలిరు + ఎల్లులో + అనన్ = చివురుగొడుగులో యనcగా, భూరుహములపైన్ = చెట్లమీcద, పొదిగొని = చుట్టుకొని. కెందలిరులు (కెంపు + తలిరులు) = ఎఱ్ఱని చివురులు, ఎసcగెన్ = అతిశయించెను, ఒదవెడు = పుట్టునట్టి, రాగ + అంబుధి-బుద్బుదములు - నాన్ = అను రాగమనెడి సముద్రముయొక్క బుడగలు అనcగా, ముకుళములు = మొగ్గలు, తోరములు + ఐ = ఎక్కువయి, ఎసcగెన్ = ఒప్పెను.

తాత్పర్యము : మన్మథుని చివురుగొడుగులో యనునట్లు చెట్లపై నంతటను ఎఱ్ఱనిచివురు లతిశయించెను. అనురాగమనెడి సముద్రపు బుడగలో యనునట్లు మొగ్గలు అధికముగా నొప్పెను.

విశేషములు : మదను .... .... భూరుహములపై - ఉత్ప్రేక్ష. ఒదవెడు ........ బుద్బుదములు నాన్ - ఉత్ప్రేక్ష. రాగాంబుధి = రాగమనెడి అంబుధి యనుటచే రూపకానుప్రాణితము. తలిరెల్లులు - తలిరు + ఎల్లి + లు = 'కర్మధారయంబునందుc బేర్వాదిశబ్దముల కచ్చు పరంబగునపుడు టుగాగమంబు విభాష నగు.'

బాల. సంధి. 29. 'ఉత్తున కచ్చు పరంబగునప్పుడు సంధి యగు' బాల. సంధి. 1. చలిరెల్లి + ఉ. 'ఇత్తునకు బహువచనంబు పరంబగునప్పు ద్విత్వం బగు.' బాల. ప్రత్యయ. 45. చలిరెల్లులు, కెంపచిరులు - కెంపు + చిరులు 'సమాసంబులం బ్రాఁతమల తొలియచ్చుమీఁది వర్ణంబులెల్ల లోపంబు బహుళంబుగా నగు.' బాల. సంధి. 54. కె + చిరులు. 'లుప్తశేషంబునకుం బుంపులు పరంబగునప్పుడు నుగాగమం బగు.' బాల. సంధి. 37. కె + ను + చిరులు - ద్రుతకార్యముచే (బాల. సంధి. 16, 17) కెంచదిరులు, తోరము (వికృతి) - స్థూలము (ప్రకృతి).

ఉ. పొన్నలు పూచెఁ, బొన్న లొగిఁ బూవకముందఱఁ బూచె గోఁగు, లా
పొన్నలుఁ గొండగోఁగులును బూవకముందఱఁ బూచె బూరువుల్,
పొన్నలుఁ గొండగోఁగులును బూరువులు న్నొగిఁ బూవకుండఁగా
మున్న వనంబునం గలయ మోదుగు లొప్పుగఁ బూచె నామనిన్. 91

అర్థము : ఆమనిన్ = వసంతమునందు, పొన్నలు = పున్నాగములు, పూచెన్, పొన్నలు, ఒగిన్ = క్రమముగా, పూవకముందఱన్ = పూచుటకు ముందు, గోఁగులు=కొండగోఁగులు - కర్ణికారములు, పూచెన్, ఆ - పొన్నలున్, కొండగోఁగులును, పూవక - ముందఱన్, బూరువుల్ = బూరుగులు . శాల్మలులు, పూచెన్, పొన్నలున్, కొండగోఁగులును, బూరువులున్, ఒగిన్, పూవక + ఉండఁగాన్, మున్న + అ = ముందే, వనంబునన్ = వనమునందు, కలయన్ = అంతటను, మోదుగులు = కింశుకములు, ఒప్పుగన్, పూచెన్.

తాత్పర్యము : వసంతమునఁ బొన్నలు పూచెను. పొన్నలు పూచుటకు ముందు కొండగోఁగులు పూచెను. పొన్నలును, కొండగోఁగులును పూచుటకు ముందు బూరువులు పూచెను. పొన్నలును కొండగోఁగులును, బూరువులును పూచుటకుముందు వనమునందంతటను మోదుగులు పూచెను.

విశేషములు : మోదుగులు, బూరువులు, కొండగోఁగులు, పొన్నలు- ఇది అవి పూచిన క్రమము. అన్నిటికంటెఁ జివరఁ బూచినవానితో మొదలిడి క్రమముగా మొదటఁ బూచినవానిని జెప్పిన పద్ధతి రమ్యముగా నున్నది.

పూవక, పూచు ధాతువు. 'కజీ వ్యతిరేక క్త్వార్థంబునం దగు.' బాల. క్రియ, 39. పూచు + కజీ, 'ముజ్జీత్తులు ముత్తు నాఁబడు,' బాల. క్రియ. 86. 'ఆగమానృతశాఠంబులి కద్విరుక్తంబులకు ముత్తు పరంబగునప్పుడు ప వ లగు' బాల. క్రియ. 88. పూవు + కజీ, 'జీత్తు పరంబగునప్పు డుత్వంబున కత్వంబగు.' బాల. క్రియ. 20. పూవక. పూవక ముందలి, 'కజీ వర్ణకంబు పురార్థయోగంబున విభాషను భావంబునం దగు.' బాల. క్రియ. 36.

క. భావజవిభుఁ డలి శుక పిక
సేవకతతి కెడరు దీర జీతము సేయం
గా వెలిఁ బోసిన పసిఁడుల
ప్రోవులు నాఁ దమ్మి లెలమిఁ బూచె బెడంగై. 92

అర్థము : భావజ - విభుఁడు = మన్మథుఁడను రాజు, అలి - శుక - పిక - సేవక - తతికిన్ = తుమ్మెదలు, చిలుకలు- కోకిలములు అనెడి సేవకుల సమూహము నకు, ఎదరు - తీరన్ = కష్టము తీఱునట్లు, జీతము + చేయంగాన్ = వేతన మిచ్చుటకు, వెలిన్ = బయట, పోసిన—పోసినట్టి. పసిఁడుల - ప్రోవులు - నాన్ = బంగరుల రాశులు అనఁగా, తమ్ములు = తామరలు, ఎలమిన్ = ప్రీతితో, బెడంగు + ఐ = అందమయి, పూచెన్ = వికసించెను.

తాత్పర్యము : మన్మథుఁ డనెడి ప్రభువు తుమ్మెదలు, చిలుకలు, కోకిలములు అను సేవకుల సమూహమునకుఁ గష్టము తీఱునట్లు వేతన మిచ్చుటకు బయటఁ బోసిన బంగరురాశులో యనఁ దామరలు ప్రీతితో నందముగా వికసించెను.

విశేషములు : అలంకార ముత్ప్రేక్ష, అది - భావజ - విభుఁడు - భావజుఁ డనెడి విభుఁ డనుటచేతను, అలి - శుక - పిక - సేవక తతికిన్ - అలులు, శుకములు, పికములు అను సేవకతతికి అనుటచేతను రూపకానుప్రాణితము.

క. నలి మొగ్గలు విరిపువ్వులు
సలలితమయి చూడనొప్పెఁ జనుపక మత్యు
జ్జ్వలరుచి రేవగ లాఱక
వెలిఁగెడు నుద్దీప దీపవృక్షము వోలెన్. 93

అర్థము: నలిన్ = ఒప్పుగా, మొగ్గలు, వికచ-పుష్పములు = వికసించిన పుష్పములు, సలలితము + అయి = మనోహరమయి, చసుపకము - సంపఁగిచెట్టు, అతి + ఉజ్జ్వల-రుచిన్ = మిక్కిలి ప్రకాశించు కాంతితో, రేపగలు = రే + పగలు = రేయుంబవళ్లు, ఆఱక = ఆఱిపోవక, వెలిఁగెడు = ప్రకాశించునట్టి, ఉద్దీప-దీప-వృక్షము + పోలెన్ = వెలుఁగునట్టి దీపమనెడి వృక్షమువలె, చూడన్, ఒప్పెన్,

తాత్పర్యము: మొగ్గలు. వికసించిన పుష్పములు మనోహరమయి, చంపక వృక్షము మిక్కిలి ప్రకాశించుకాంతితో రేయుంబవళ్లు ఆఱిపోవక వెలుఁగు దీపమనెడి వృక్షమువలెఁ జూడ నొప్పెను,

విశేషములు: దీప వృక్షము - దీపమనెడి వృక్షము - రూపకము, రూపకాను ప్రాణితమైన ఉత్ప్రేక్ష, చసుపకము (వికృతి) - చంపకము (ప్రకృతి) అతి+ఉజ్జ్వల- అత్యుజ్జ్వల - యణాదేశసంధి.

తే. పొలిచె మధువేళఁ గంకేళి పూచి భృంగ
పరివృతమ్మై మనోజుండు పాంథతతికి
నాభిచారంబు వేల్చు కుండాంతరమునఁ
దగిలి కామాగ్ని పొగలతో నెగయునట్లు. 94

అర్థము; మధు, వేళన్ = వసంతసమయమున, కంకేళి = అశోకము, పూచి = పుష్పించి, భృంగ-పరివృతమ్ము + ఐ = తుమ్మెదలచేఁ జుట్టుకొనఁబడినదయి, మనోజుండు = మన్మథుఁడు, పాంథ-తతికిన్ = విరహుల సమూహమునకు. అభిచారంబు-వేల్చు = శత్రుమారణ వశీకరణాదులకు సాధనముగా హోమముచేయునట్టి, కుండ + అంతరమునన్ = గుండములోపల, తగిలి = సక్తమయి, కామ + అగ్ని = మన్మథుఁడనెడి అగ్ని, పొగలతోన్, నెగయు + అట్లు = పైకి వచ్చునట్లు, పొలిచెన్ = ఒప్పెను.

తాత్పర్యము: వసంతసమయమున అశోకవృక్షము పుష్పించి తుమ్మెదలతోఁ జుట్టుకొనఁబడినదయి, మన్మథుఁడు వియోగిజనుల హింపింప హోమముచేయు కుండము లోపలనుండి మన్మథుఁడనెడి అగ్ని పొగలతోఁ బైకి వచ్చుచున్నదా యనునట్లు ఒప్పెను.

విశేషములు : అలంకారము ఉత్ప్రేక్ష. అశోకము పూచి యెఱ్ఱగా నగ్ని వలెను, దానిని జుట్టుకొన్న తుమ్మెదలు నల్లనిపై పొగలవలెను నుండెను. కామాగ్ని - కాముఁడనెడి అగ్ని - రూపకము. రూపకానుప్రాణితోత్ప్రేక్ష. కుండము (ప్రకృతి)- గుండము (వికృతి) = నిప్పుల గుంట.

క. విరహుల హృదయంబులు జ
ర్జరితంబులు చేసి మరుఁడు శరశస్త్రము లా
సురవృత్తిఁ బెఱికి పట్టిన
కరణిం గర మొప్పె నయణ కరవీరంబుల్. 95

అర్థము : మరుఁడు = మన్మథుఁడు, విరహుల - హృదయంబులు = వియోగుల హృదయములను, జర్జరితంబులు + చేసి = తూంట్లు పడినవిగాఁజేసి, శర - శస్త్రములు = బాణములను, శస్త్రములను, ఆసుర - వృత్తిన్ = రాక్షసముగా - క్రూరముగా, పెఱికి = ఊడలాగి, పట్టిన, కరణిన్ = విధమున, అయణ - కరవీరంబుల్ = ఎఱ్ఱ గన్నేరులు అనెడు కత్తులు, కరము + ఒప్పెన్ = మిక్కిలి ఒప్పెను.

తాత్పర్యము : మన్మథుఁడు వియోగిజనుల హృదయములను చిల్లులుపడఁ జేసి, అందు గ్రుచ్చుకొన్న అస్త్రశస్త్రములను గ్రూరముగా నూడఁబెఱికి పట్టినవిధమున నెఱ్ఱగన్నేరులు అనెడి కత్తులు మిక్కిలి యొప్పెను.

విశేషములు : అలంకారము ఉత్ప్రేక్ష. కరవీరములు = గన్నేరులు, కత్తులు - శ్లిష్టరూపకము. మరుఁడు (వికృతి) - స్మరుఁడు (ప్రకృతి)

క. నునుపగు నలిగానము విని
వనదేవత కరము మెచ్చి వానికి నొసఁగం
జనఁ బైఁడుల విడియలు పు
చ్చిన విధమునఁ బొన్న లెలమిఁ జెలువుగఁ బూచెన్. 96

అర్థము : నునుపు + అగు = మనోహరమైన, అలి-గానము = తుమ్మెదల సంగీతము, విని, వన - దేవత, కరమున్ = మిక్కిలి, మెచ్చి, వానికిన్ =

క. మారు జయలక్ష్మి. మలయ స
మీరునిపైఁ బూఁత, మధుసమృద్ధికి నురు శృం
గారం బనఁదగు నన సహ
కారముఁ గురవకముఁ గర్ణికారముఁ బూచెన్. 98

అర్థము : మారు - జయ లక్ష్మి = మన్మథుని విజయమనెడు లక్ష్మి, మలయ - సమీరుని పైన్ = మలయానిలుని పై, పూఁత = అంగరాగము, మధు - సమృద్ధికిన్ = వసంతుని సమృద్ధికి, ఉరు - శృంగారంబు = గొప్ప యలంకారము, అనన్ + తగున్ + అనన్ = అనఁదగునట్లు, సహకారమున్ = తీయమామిడియును, కురవకమున్ = ఎఱ్ఱగోరంటయును, కర్ణికారమున్ = కొండగోఁగును, పూచెన్ = పుష్పించెను

తాత్పర్యము : మన్మథుని విజయలక్ష్మి, మలయానిలుని పైఁబూఁత, వసంతుని మాధుర్యమున కలంకారముగా నుండునన, తీయమామిడియు, ఎఱ్ఱ గోరంటయుఁ, గొండగోఁగును బూచెను.

విశేషములు : అలంకారము యథాసంఖ్యము. సహకారము పూచుట మారు జయలక్ష్మివలెను, కురవకముపూఁత మలయానిలుని మైపూఁతవలెను, గర్ణికారము పూచుట వసంతుని కలంకారమువలెను నుండెనని భావము.

చ. మొగడలు వజ్రముల్, విరులు ముత్తెము, లింపగు నున్పుఁగెంపు లేఁ
జిగురులు పద్మరాగములు, చిల్కలు వైరిజరాజి. తుమ్మెదల్
నగరిపునీలజాలములు, నాఁ దలరారె వసంతవల్లభుం
డగు వలరాజు పంచమణిహర్మ్యములో యనఁ జూతభూజముల్. 99

అర్థము : మొగడలు = మొగ్గలు, వజ్రముల్, విరులు = పూలు, ముత్తెములు = ముత్యములు, ఇంపు + అగు = ప్రియమగు, నున్పు + కెంపు = మనోహరమైన యెఱుపుగల, లేఁజిగురులు (లేఁత + చిగురులు), పద్మరాగములు = పద్మరాగమణులు, చిల్కలు = చిలుకలు, వైరిజ-రాజి = వైడూర్యములయొక్క సమూహము, (గరుడపచ్చల సమూహము) తుమ్మెదల్, నగ-రిపు-నీల- జాలములు = ఇంద్రనీలమణుల సమూహములు, నాన్ = అనఁగా, చూత - భూజముల్ = మామిడి

తాత్పర్యము: ఆమ్రవృక్షమునందలి అంకురములు, పల్లవములు, మొగ్గలు, పూవులు, ఫలములు మన్మథునకు - ఉన్మాదమును గలిగించునట్టియు మత్తుగలిగించునట్టియు, మోహమును బుట్టించునట్టియు, అధికతాపమును గలిగించునట్టియు, వశము చేసికొనునట్టియు అస్త్రములు.

విశేషములు: అలంకారము ఉత్ప్రేక్ష.

హ్యాజ్జనునకు = హ్యాస్ + జనునకు. సకార తవర్గములకు శవర్గ చవర్గములతో పూర్వమందైనను పరమందైనను కలయిక గలుగునపుడు క్రమముగా శవర్గ చవర్గ వర్ణములు ఆదేశము అగును. యథాసంఖ్యాలంకారమును. అంకురములు ఉన్మాదనాస్త్రములు, పల్లవములు మదనాస్త్రములు, కోరకములు మోహనాస్త్రములు, పుష్పములు సంతాపనాస్త్రములు, ఫలములు వశీకరాస్త్రములు అని క్రమాన్వయము.

సీ. పలఁ(దెపు కారాకు లలితాస్థి చయముగా.
సోలుకొమ్మలు పలుకేలు గాఁగ,
వాల పల్లవములు వ్రేలు కెంజెడలుగాఁ,
బెనఁగు తీగలు వొడ్డ ఫణులు గాఁగఁ,
గలకంఠ నికరంబు గళమున కప్పుగాఁ,
బుప్పొడి మేని విభూతి గాఁగ,
ఫలములు వరదానఫలములుగా, నలి
మాలికల్ రుద్రాక్షమాలికలుగ,

ఆ. శంభుమూర్తిఁ దాల్చి సహకార భూరుహ
చక్రవర్తి నవ వసంతవేళ
నతిశయిల్లుచుండె నక్కడఁ గని మది
నుదరిపడి మనోజుఁ డోసరింప. 101

అర్థము: పలఁ(దెపు = వివర్ణమగు, కారాకు = పండుటాకు, లలిత + అస్థి-చయము + కాన్ = అందమైన ఎముకల ప్రోవు కాఁగా, సోలు - కొమ్మలు = వాలు కొమ్మలు, పలు - కేలు + కాఁగన్ = పెక్కు చేతులు కాఁగా,

సంధి,19) అనుసూత్రమునచే కెంజెడలు అనియేర్పడును, జడయను శబ్దమేగాని, జెడ యనునది నిఘంటువులం గానరాదు. పెనఁగు తీగలు ద్రొక్క ఫణులు గాఁగ. సర్వలకుఁ బ్రాసమైత్రి సమనింపఁదగినవి. శివుఁ డెప్పటనో యుందు ననుకొనుచుండఁగా ఎదుటఁ గలమామిడిచెట్టే శివుఁడుగాఁ గనఁబడునరికి మన్మథుఁ డులికిపడి యోసరిల్లెను. గళ మున కష్టు - 'షష్ఠీతత్పురుషంబులందు నగాగమంబు విభాష నగు.' ప్రౌఢ,స.సమా, 1.

చ. అలరుల మందహాసమున, నన్నిన షట్పద మంజుగీతి, రా
చిలుకల ముద్దుమాటలను, జెందలిరాకుల రాగలీలఁ, గో
కిల నినదంబులన్, బరిహి కేశభరంబున, ముక్త పర్ణ మే
ఖల నభిరామమయ్యె సహకారలతాంగి మధుప్రసంగతిన్. 102

అర్థము; సహకార-లతా + అంగి = తియమామిడి చెట్టనెడు స్త్రీ, మధు -ప్రసంగతిన్ = వసంతునితోటి సాంగత్యముచే, అలరుల - మంద - హాసమునన్ = పూవుల చిఱునవ్వుచేతను, అన్నిన = మత్తిల్లిన, షట్పద - మంజు - గీతిన్ = తుమ్మెదల మనోహర సంగీతముచేతను, రాచిలుకల - ముద్దుమాటలను = రాజకీర ముల ముద్దు పలుకులచేతను, చెందలిరాకుల - రాగ - లీలన్ = ఎఱ్ఱని చివురుటాకుల యొఱుపుచేతను, కోకిల - నినదంబులన్ = కోకిలల కూజితధ్వనులచేతను, బరిహి - కేశ -భరంబునన్ = బర్హి (నెమలి)కేశపాశముచేతను, ముక్త - పర్ణ - మేఖలన్ = విడువఁ బడిన పండుటాకులనెడి మొలనూలిచేతను, అభిరామము + అయ్యెన్ = మనో హర మయ్యెను.

తాత్పర్యము : తియమామిడి యనెడు స్త్రీ వసంతాగమమున పూల చిఱు నవ్వులచేతను, మదించిన తుమ్మెదల మనోహరసంగీతముచేతను, రాచిలుకల ముద్దు మాటలచేతను, కెంజివురుటాకుల యెఱ్ఱఁదనముచేతను, కోకిల కూజితముల ధ్వనుల చేతను, నెమిల్ల కేశపాశముచేతను, విడువఁబడిన పండుటాకుల గలగల లనెడి మొలనూలి సవ్వడుల చేతను మనోహర మయ్యెను.

విశేషములు : అలంకారము రూపకము. చెందలిరు = చెన్ను + తలిరు. (ప్రాఁతాదిసూత్రము (బాల.సంధి.36.) చే - చె+తలిరు, లుప్తశేషమునకుఁ బరుషము పరముగా (బాల.సంధి.37) నుగాగమము, పిమ్మట ద్రుతకార్యము (బాల. సంధి,16.17)

బిగి చెందలిరు ఏర్పడును. చెందలిరు = ఎఱ్ఱని లలిరు. 'చెన్నెఱ్ఱణము స్వార్థత్తి గోవార్థకంబు.' (చిన్నయ.) బర్హి (ప్రకృతి) - బరిహి (వికృతి) బరిహి శబ్దము విభుంజువులం గానరాదు.

క. తలిరెల్లిఁ, బూవుటమ్ములఁ,
బలసిన పిక కీర భృంగ పరివారముతో
వలరాజుఁ బోలి మామిడి
సలలితగతి నుత వసంత సంగతి నొప్పెన్. 103

అర్థము : మామిడి, నుత - వసంత - సంగతిన్ = పొగడఁబడిన వసంత సాంగత్యముచేత - వసంతమురాకచే, తలిరెల్లిన్ = (తలిరు + ఎల్లిన్) = చిగురనెడు గొడుగుతోను. పూవుటమ్ములన్ (పూవు + అమ్ములన్) = పూలనెడు బాణముంతోను, బలసిన = చుట్టుకొనియున్న, పిక - కీర - భృంగ - పరివారముతోన్ = కోకిలలు, చిలుకలు, తుమ్మెదలు అనెడి పరివారముతోను, వలరాజున్ = మన్మథుని, పోలి, సలలిత-గతిన్ = మనోహరమైన విధమున, ఒప్పెన్.

తాత్పర్యము : మామిడి వసంతాగమమున చివురనెడు గొడుగుతోను. పూవులనెడు బాణములతోను, బలసియున్న కోకిలలు, చిలుకలు, తుమ్మెదలు అను పరివారముతోను మన్మథునిబోలి మనోహరముగ నొప్పెను.

విశేషములు : మామిడి వలరాజును బోలె ననుటచే మామిడికి రాజచిహ్నములు గలవనుట. అవి ఛత్రము, అమ్ములు, పరివారము. మామిడిరాజువానికిఁ జిగురే యెల్లి, పూవులే అమ్ములు, పిక కీర భృంగములే బలసియుండు పరివారము. అలంకార మిచట, అది రూపకానుప్రాణితము. తలిరెల్లి ప్రథమాంతముగాఁ గాక, తృతీయార్థక విభక్త్యంతముగానున్న అన్వయము సుకరముగా నుండును గావున 'తలిరెల్లిఁ బూవుటమ్ముల' అని మార్పఁబడినది. తలిరు + ఎల్లి - 'కర్మధారయంబునందుఁ బేర్వాది శబ్దముల కచ్చు పరంబగునపుడు టుగాగమంబు విభాష నగు.' బాల, సంధి. 29. 'ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధి యగు.' బాల. సంధి. 1. పూవు + అమ్ము - 'కర్మధారయంబునం దుత్తున కచ్చు పరంబగునపుడు టుగాగమం బగు.' బాల. సంధి. 28. పూవుటమ్ము.

చ. మలయసమీర మర్థి సుకుమార లసత్సహకార నందనా
వలి నలిఁ జొచ్చుఁ, జుట్టుకొనివచ్చుఁ; గుజాలికి మెచ్చు; నీరికల్
వెలుపొనరించుఁ: గెందలిరు పెంచు, ననల్ విరియించుఁ, దావి న
ర్మిలిఁ గబళించు; నాదట రమించుఁ; దమిన్ విహరించు నామనిన్. 104

అర్థము ; ఆమనిన్ = వసంతమునందు, మలయ - సమీరము = మలయానిలము - దక్షిణపుగాలి, అర్థిన్ = కోరికతో, సుకుమార .... వలిన్ : సుకుమార = అందమైన, లసత్ = ప్రకాశించుచున్న, సహకార = తీయమామిడి, నందన + ఆవలిన్ = వనసముదాయమును, నలిన్ = ఉత్సాహముతో, చొచ్చున్ = ప్రవేశించును, చుట్టుకొనివచ్చున్, కుజ + ఆలికిన్ = చెట్ల వరుసకు. మెచ్చున్, ఈరికల్ = మొలకలు, వెలుపు + ఒనరించున్ = వెడలుపుచేయును, కెందలిరు = ఎఱ్ఱని చిగురు(ను), పెంచున్ = వృద్ధిపొందించును, ననల్ = మొగ్గలను, విరియించున్ = వికసింపఁజేయును, అర్మిలిన్ = ప్రీతితో, తావిన్ = పరిమళమును, కబళించున్ = మ్రింగును, ఆదటన్ = ప్రేమముతో, రమించున్ = క్రీడించును, తమిన్ = ఆసక్తితో, విహరించున్.

తాత్పర్యము : మలయానిలము వసంతమున మనోహరములైన తీయమామిడి వనములను ఉత్సాహముతోఁ బ్రవేశించును. వానిని జుట్టుకొనివచ్చును. అందలి చెట్లను మెచ్చును, మొలకలను వెడలుపొనరించును. కెంజివురులను బెంచును, మొగ్గలను విరియునట్లు చేయును. తావిని లోఁగొనును. ప్రీతితోఁ గ్రీడించును. ఆసక్తితో విహరించును.

విశేషములు : కెందలిరు = కెంపు + తలిరు. ప్రాంతాదిసూత్రముచే (బాల. సంధి. 36.) కె + తలిరు, లుప్తశేషమునకుఁ బరుషము పరమగుగా నుగాగమమయి (బాల. సంధి. 37.) కె + ను + తలిరు = ద్రుతకార్యము (బాల. సంధి. 16, 17) చే కెందలిరు అగును. కుజాలికి మెచ్చు - ద్వితీయకు షష్ఠి.

చ. అలు లొడఁగూడుఁ, బింతుగొని యాడు, మృదుధ్వనిఁ బాడు, నోలి దొం
తులుగొని పాఱు, జొంపములు దూఱు, సుగంధముమీఱు పువ్వుగు
త్తులపయి మూఁగుఁ, బుప్పొడులఁ ద్రోవ్వడిం దనివోవు, మంజరుల్
వెలువడ నేఁగు, దర్పమున వీఁగు, మదిన్ నలిరేఁగు నామనిన్. 105

అర్థము : ఆమనిన్ = వసంతమునందు, మున్ = ముందు, పొలుపు = ఉల్లాసము, అతిశయింపన్ = అతిశయింపఁగా, దంపతులు, పొంగన్ = ఆనందింపఁగా, వియోగులు = విరహులు, క్రుంగన్ = బాధపడఁగా, చిలుక - పిండు = చిలుకల గుంపు, చెలఁగుచున్ = మిక్కిలి ఉత్సహించుచు, పాఱి, ఒక్కొకటిన్ = ఒకదాని నింకొకటి, పిల్చి = పిలిచి, వనంబులు = తోఁటలు, దూఱి = ప్రవేశించి, ఎలఁజొంపన్ = చిగురును, త్రొక్కి, కెందలిరులు (కెంపు + తలిరులు) = ఎఱ్ఱని చివురులు, ఎక్కి = ఇష్టమయి, కెలంకులన్ = పార్శ్వములను, నిక్కి - చూచి, కాయలు, కని, క్రూనిపండ్ల-రసము = చెట్టుపండ్లయందలి రసము, ఆని = త్రావి, ముదంబునన్ + ఊని = సంతోషమును పొంది, పల్కెన్.

తాత్పర్యము : వసంతమున దంపతులు ఉల్లాస మతిశయింప ఆనందింపఁగను, విరహులు క్రుంగిపోవఁగను, చిలుకలగుంపు మిక్కిలి యుత్సహించుచుఁ బాఱి, ఒకదానినొకటి పిలిచి, తోఁటలు చొచ్చి, చిగురుల నదిమి, ఎఱ్ఱని చివురుల నిష్టపడి, పార్శ్వములను మెడలెత్తి చూచి, కాయలు గని, చెట్ల పండ్లరసముఁ గ్రోలి, సంతోషమును బొంది పలుకును.

అలంకారము : ఇందుఁ జిలుకల చేష్టలను సహజసుందరముగా వర్ణించుటచే నలంకారము స్వభావోక్తి. 'స్వభావోక్తి స్స్వభావస్య జాత్యాదిస్థస్య వర్ణనమ్.' చన్ద్రా, కెందలిరులు - కెంపు + తలిరులు-చూడు పూర్వవ్యాఖ్య, కెలంకులు - కెలను + లు, 'కలన్వాదుల నువర్ణంబు కుక్కగు; బహువచనము పరంబగునపుడు నిత్యముగా నగు' బాల.ఆచ్ఛిక.18. కెల + కుక్ + లు - 'జిత్తు బిందుపూర్వంబగు' కెలంకులు. బాల. తత్సమ. 19. ఈ పద్యమునందునుగల అనుప్రాసము గమనార్హము .

చ. గుములుగట్టి. యీరికలుగుట్టి, ప్రవాళమువట్టి, కింకతో
నమలక్రమింగి, మొగ్గలఁ బెనంగి, విరుల్ గని, పొంగి, పూఁపలు
త్తమ మని చావి, యుద్ధవడిఁ ద్రావికొను న్నెలమావియందుఁ గూ
రిమి వడిఁజేయు నామనిని రేయుఁబవల్ వడిఁ గూయుఁ గోవిలల్.107

అర్థము : కోవిలల్ = కోకిలములు, ఆమనిని = వసంతమునందు. గుములు + కట్టి = గుంపులుకూడి, ఈరికలు = మొలకలు, కుట్టి = పొడిచి, ప్రవా

మత్తకోకిల 'మెత్త మెత్తన క్రాలెదీవు సమీరణుండ! మనోభవుం
డెత్తకుండఁగ వేగకాడఁగనెత్తు; మెత్తక తక్కినన్,
జత్తు సుమ్ము వసంతుచే' నని చాటునట్లు చెలంగె నా
మత్తకోకిల లారమిం గడు మాసరంబగు నామనిన్. 108

అర్థము : కడున్ = మిక్కిలి, మాసరంబు + అగు = మనోజ్ఞమగు, ఆమనిన్ = వసంతమునందు, ఆరమిన్ = ఆరామమున, ఆ - మత్త - కోకిలలు = ఆ మదించిన కోకిలలు, సమీరణుండ! = ఓ వాయువా!, ఈవు = నీవు, మెత్త మెత్తన = మందమందముగా, క్రాలుదు (వు) = సంచరింతువు, మనోభవుండు = మన్మథుఁడు. ఎత్తక + ఉండఁగన్ = దండెత్తకుండ, ఎత్తుము = దండెత్తుము, ఎత్తక - తక్కినన్ = ఆ విధముగా నీవు దండెత్తకపోయినచో, వసంతుచేన్ = వసంతునిచేత, చత్తు (వు) - సుమ్ము = చత్తువు సుమా, అని, చాటు + అట్లు = చాటు రీతిని, చెలంగెన్ = ధ్వనించెను - కూసెను.

తాత్పర్యము : మిక్కిలి మనోజ్ఞమగు వసంతమున ఆరామములో నా మత్తకోకిలములు 'మలయానిలుఁడా! నీవు మందమందముగా సంచరింతువు. మన్మథుఁడు నీపై దండెత్తకుండఁగనే నీవు వేగముగా నతనిపై దండెత్తుము. అట్లు దండెత్తకపోయినచో నీవు వసంతునిచేఁ జత్తువుసుమా!' యని ప్రకటించుచున్నవా యను నట్లు కూసెను.

విశేషములు : అలంకారము ఉత్ప్రేక్ష. మత్తకోకిలముల కూజితమును మత్తకోకిలచ్ఛందముననే వర్ణించుట గమనార్హము. వసంతమున వాయువు మందమందముగా వీచుననియు, కోకిలలు కూయుననియు, మన్మథవసంతులు విజృంభింతురనియు నభిప్రాయము. క్రాలుదు (వు), చత్తు (వు) - లాట్లు వకారమునకు లోపము. (బాల. క్రియ. 24.) ఆరమి = ఆరామము. ఆరమి, మత్తకోకిల - నాలుగు పాదము లుండును. ప్రతిపాదమునను ర, స, జ, జ, భ, ర అను గణము లుండును. మొదటి యక్షరమునకును, పదునొకండవ అక్షరమునకును యతిమైత్రి. ప్రాసనియమము గలదు.

సీ. ఆరగ్వధార్క జంబీర కర్కోల మం
దార చందన నారికేర సింధు
వార కంకేళి ఖర్జూర శాల్మలి ఘన
సార చంపక బీజపూర దేవ
దారు సల్లకి కరవీర గుగ్గులు పీత
సార పున్నాగ నమేరు కర్ణి
కార ధాత్రీ త్వచిసార పటల సహ
కార భల్లాతక పారిజాత

తే. భూరుహారూఢ పిక రాజకీర మద మ
యూర మధుకర మృదు మధురారవములఁ
జారుతరమైన భూరి కాంతార మహిమ
గారవించుచుఁ జనుదెంచె మారుతంబు. 109

అర్థము : ఆరగ్వధ = రేల, అర్క = జిల్లేడు, జంబీర = నిమ్మ, కర్కోల = తక్కోలపుఁజెట్టు, మందార = మందారవృక్షము, చందన = చందనము, నారికేర = కొబ్బరి, సింధువార = వావిలి, కంకేళి = అశోకము, ఖర్జూర = ఖర్జూరము, శాల్మలి = బూరుగు, ఘనసార = కర్పూరము, చంపక = సంపెఁగ, బీజపూర = మాదీఫలము, దేవదారు = దేవదారువు, సల్లకి = అందుగు, కరవీర = గన్నేరు, గుగ్గులు = గుగ్గిలము, పీతసార - వేగిస - ఊడుగు, పున్నాగ = సురపొన్న, నమేరు = సురపొన్న - రుద్రాక్ష, కర్ణికార = కొండగోఁగు, ధాత్రీ = ఉసిరిక, త్వచిసార = వెదురులయొక్క, పటల = సమూహము, సహకార = తియమామిడి, భల్లాతక = జీడి, పారిజాత = పారిజాతము. అను, భూరుహ = చెట్లను, ఆరూఢ = ఎక్కిన, పిక = కోకిలములు, రాజకీర = రాచిలుకలు, మద-మయూర = మదించిన నెమళ్లు, మధుకర = తుమ్మెదలు, అనువానియొక్క, మృదు = మెత్తని, మధుర = తీయని, ఆరవములన్ = ధ్వనులచేత, చారుతరము = మనోజ్ఞము, ఐన, భూరి - కాంతార - మహిమన్ = పెద్దదైన - వనముయొక్క - గొప్పతనమును, గారవించుచున్ = ఆదరించుచు, మారుతంబు = వాయువు, చనుదెంచెన్ = వచ్చెను.

తా త్ప ర్య ము : జేల, జిల్లేడు, నిమ్మ, తక్కోలము, మందారము, చందనము, కొబ్బెర, వావిలి, అశోకము, ఖర్జూరము, బూరుగు, కర్పూరము, సంపెఁగ, మాది ఫలము, దేవదారువు, అంమగు, గన్నేరు, గుగ్గిలము, వేగిస, (ఊడుగు), పొన్న, సురపొన్న, రుద్రాక్ష, కొండగోఁగు ఉసిరిక, వెదురు, తియమామిడి, జీడి, పారిజాతము అను చెట్లనెక్కిన కోకిలములు, రాచిలుకలు, పదించిన నెమళ్లు, తుమ్మెదలు అనువాని మృదుమధురమైన ధ్వనులచే మనోజ్ఞమైన వనము మహిమ నాదరించుచు వాయువు వీతెంచెను.

వి శే ష ము లు : సర్వత్ర ప్రాసనీసము.

క. మధుసంగమునఁ ద్రిలోకీ
వధు వనురాగమునఁ గామవశగతిఁ జేతో
విధుర విధి నడరె; నట్టిద;
మధుసంగతి జనులు రాగమయు లగు టరుదే? 110

అ ర్థ ము ; త్రిలోకీ - వధువు = లోకత్రయసమాహార మనెడు స్త్రీ, మధు-సంగమునన్ = వసంతునితోడి కూడికచేత- వసంతము వచ్చుటచేత, అనురాగమునన్ = అనురక్తితో, కామ-వశ-గతిన్ = మన్మథునకు లోపడిన విధమున- కోరికలకు లోపడిన విధమున. చేతస్ ( : ) + విధుర- విధిన్ = మనోవిచారస్థితితో, అడరెన్ = అతిశయించెను, అట్టిది + అ = అది యటువంటిదే, జనులు, మధు - సంగతిన్ = వసంతాగమముతో - మద్యసాంగత్యముతో. రాగ-మయులు = అనురాగముతో నిండిన వారు, - అగుట = అగుట, అరుదే = ఆశ్చర్యమా ? కా దనుట,

తా త్ప ర్య ము : ముల్లోకముల సమాహారమనెడి స్త్రీ వసంతునితోడి సంగమమున - వసంతకాలాగమమున అనురాగముతో మన్మథునకు లోపడినదయి, - కోరికలకు లోపడినదయి మనోవిచారము గలిగియుండెను. అది యట్టిదే. వసంతసాంగత్యముచే - మద్యసంగతిచే జనులు అనురక్తియుక్తులగుట - మాత్సర్యపూరితులగుట ఆశ్చర్యమా ? - కా దనుట.

వి శే ష ము లు : అలంకారము శ్లేషానుప్రాణితరూపకము. విశేషము సామాన్యముచే సమర్థింపఁబడుటచే అలంకారము అర్థాంతరన్యాసము. త్రిలోకీ-

త్రయాణాం లోకానాం సమాహారః - త్రిపద్యాది ద్విగుసమాసము. చేతోవిధుర - చేతస్ + విధుర - సకారాంతసకారమునకు విసర్గాదేశము. చేతః + విధుర, హ్రస్వ అకారము పరమైనప్పుడు విసర్గమునకు హ్రస్వ అకారముగాని, మృదువ్యంజనము (హశ్శు) గాని పరములగునపుడు ఉ ఆదేశముగా వచ్చి పూర్వమందున్న అకారముతో గూడి గుణసంధివలన ఓ గా మారును. చేత + ఉ + విధుర - చేతోవిధుర. అనుపదే = అను + పదే. భావార్థ ఉపర్గకమునకు ను వర్ణాదేశము గ కవి పెట్టుకొల్లఁ జేసెను.

సీ. నెలఁతల పరిమళ నిశ్వాసపవనంబుఁ
దలఁపించె దక్షిణానిల విలాస;
మింతుల దరహాసకాంతి సంభావనఁ
గావించెఁ జంద్రప్రభావిభాతి;
రమణుల రక్తాధరభ్రాంతి నొదవించె
లాలితాశోక ప్రవాళ లీల
వనితల మంజుల స్వనశంకఁ బుట్టించెఁ
గలకంఠ మదకీర కలరవంబు;

ఆ. కామినీ విలోల కర్ణాంత విశ్రాంత
లోచనప్రశంస లోలబుద్ధిఁ
బడసె దలిత పత్ర పద్మ విభ్రమము వి
యోగులందు మధుసమాగమమున. 111

అర్థము: మధు - సమాగమమునన్ = వసంతము రాకచే. వియోగుల + అందున్ = విరహులయందు,

దక్షిణ + అనిల-విలాసము = దక్షిణమునుండి వీచుగాలి (మలయానిలము) యొక్క విలాసము, నెలఁతల = స్త్రీలయొక్క, పరిమళ నిశ్వాస - పవనంబున్ = సుగంధముతోడి నిట్టూర్పుగాలిని, తలఁపించెన్ = దలఁపునకు వచ్చునట్లు చేసెను,

చంద్ర-ప్రభా-విభాతి = చంద్రునికాంతి (వెన్నెల) యొక్క ప్రకాశము. ఇంతుల = స్త్రీలయొక్క, దర-హాస-కాంతి-సంభావనన్ = చిఱునగవు కాంతియొక్క తలఁపును, కావించెన్.

లాలిత + అశోక-ప్రవాళ-లీల = మనోహరమైన అశోక పల్లవములయొక్క, విలాసము, రమణుల = స్త్రీలయొక్క. రక్త + అధర-విభ్రాంతిన్ = ఎఱ్ఱని క్రిందిపెదవియొక్క విభ్రమమును. ఒదవించెన్ = పుట్టించెను.

కలకంఠ-మద - కీర-కల-రవంబు = కోకిలములయొక్కయు. మదించిన చిలుకలయొక్కయు, అవ్యక్తమధురధ్వని, వనితల = స్త్రీలయొక్క, మంజుల-స్వన-శంకన్ = మనోహరమైన ధ్వనియొక్క సందేహమును, పుట్టించెన్.

దలిత - పత్ర-పద్మ-విభ్రమము = వికసించినఱేకులుగల తామరల విలాసము, కామినీ.... బుద్ధిన్: కామినీ = స్త్రీలయొక్క, విలోల=చంచలములగు, కర్ణ+అంత-విశ్రాంత = చెవులకొనల విశ్రమించిన-చెవుల కొనలవఱకు విస్తరించిన, లోచన= కన్నులయొక్క, ప్రశంస = పొగడ్తయందు, లోల = ఆసక్తమైన, బుద్ధిన్ = తలఁపును, పదపెన్= పొందెను - కలిగించెను.

తాత్పర్యము : వసంతసమయమున వియోగులకు మలయానిల విలాసము స్త్రీల సురభిళనిశ్వాసవాయువును స్ఫురింపఁజేసెను. వెన్నెలకాంతి స్త్రీల చిఱునగవు కాంతిని తోఁపించెను. మనోహరమైన అశోక పల్లవము లీల స్త్రీల యెఱ్ఱని క్రిఁదిపెదవిభ్రాంతిని పుట్టించెను. కోకిలములయు, మదించిన చిలుకలయు అవ్యక్తమధురధ్వని స్త్రీల మనోహరకంఠధ్వనిశంకను బుట్టించెను, వికసించిన ఱేకులుగల తామరల విలాసము స్త్రీల చంచలములు, చెవులకొనలవఱకు వ్యాపించినవి అగు కన్నులని ప్రశంసించుబుద్ధిని గలిగించెను,

విశేషము లు : అలంకారము ఉత్ప్రేక్ష, భ్రాంతిమంతము.

క. సోలుచు సమ్మదరసమునఁ
గ్రాలుచు వనపాలబాలికలు నవ లతికాం
దోలముల వేడ్క సలుపుచు
నాలతు లొగిఁ జేసి పాడి రభినవలీలన్. 112

అర్థము : కరి = మగయేనుఁగు, అర - మేపి = సగము తిని. కరిణికిన్ = ఆఁడేనుఁగునకు; ఉల్లంబు = మనస్సు. పల్లవింపన్ = చివురింపఁగా, పల్లకీ - పల్లవము = అంకురుఁజివురు, ఇచ్చెన్.

మృగము = మగలేడి, మృగికిన్ = ఆఁడులేడికి, చిత్తము = మనస్సు, అంకురింపఁగన్ = మొలకెత్తఁగా-ఆనందింపఁగా, నవ్యు-దర్భ + అంకురంబులు = చిగురించు దర్భల మొలకలు, కబళించి = తిని-కొఱికి, అర్థిన్ = కోరికలో, ఇచ్చెన్.

హంస = మగ యంచ, హంసికిన్ = అంచపెట్టకు, మొగములన్ = ముఖము లందు, ఎలమి = సంతోషము, మిగులన్ = అతిశయింపఁగా, నోర్నోరన్ = నోటిలో నుండి నోటిలోనికి. ఎల-తూఁడు = లేఁదూఁడు, పెక్కు-వన్ = ఎక్కువగా, ఇచ్చెన్.

భృంగము = మగతుమ్మెద, భృంగికిన్ = ఆఁడుతుమ్మెదకు, వికసితముగన్ = వికాసముగలుగునట్లు-ఆనందముగలుగునట్లు, వికసిత + అబ్జ-మధువు = వికసించిన తామర యందలి మకరందము, లాన్-త్రావి = తాను త్రాగి, దయన్ = ఆదరముతో, ఇచ్చెన్.

కిన్నరుఁడు, కిన్నరి - వీనులన్ = కిన్నరాంగన చెవులందు, రాగ - రసము = గానరసము, మేనన్ = శరీరమున, రాగము = అనురక్తి, ఎసఁగన్ = అతిశయింపఁగా, క్రోల్చెన్ = పాడెను,

(ఇట్లు) మధు - విడంబనమునన్ = వసంతుని మాయచే, మగలును - మగువలున్ = పురుషులును, స్త్రీలును, మదన - పరవశమునన్ = మన్మథపారవశ్యముతో, విరతి - కొనిరి = మోహపడిరి,

తాత్పర్యము : మగయేనుఁగు పిడియేనుఁగునకు హృదయానందము గలుగ నంకురుచిగురును దాను సగము తిని మిగత నిచ్చెను. మగలేడి ఆఁడులేడికి మనస్సు సంతోషింపఁగాఁ జివురించు దర్భలమొలకలను దాను దిని మిగిలినవి కోరికతో నిచ్చెను. మగ యంచ పెంటి యంచకు ముఖముల వికాస మతిశయింపఁగా లేఁదూఁటిని నోటి లోనుండి నోటిలోనికి ఎక్కువగా నందిచ్చెను. మగతుమ్మెద ఆఁడుతుమ్మెదకు వికాసము గలుగ వికసించిన తామరతేనెను దాను గొంత త్రావి యాదరముతో నిచ్చెను. కిన్నరుఁడు కిన్నరాంగన చెవులందు గానరసము, మేన ననురాగము అతిశయింప గానము చేసెను. వసంతుని మాయచే పురుషులును స్త్రీలును మన్మథపారవశ్యమునొంది మోహము నొందిరి.

అర్థము : ఆమనిని = వసంతమునందు, ఎలమిన్ = సంతోషముతో, విపుల + ఆరామంబుల = విస్తారములైన యుద్యానములయొక్క, పొల్పు - పొలుపు = అందమును, చూచి, రాగ + ఉత్కటము + ఐ = అనురాగ మతిశయించి, కాముఁడు = మన్మథుఁడు, రతిన్ = రతిని, కని = చూచి, తాను = తాను సైతము, కామ + ఆతురుఁడు + ఐ = కోరికచేఁ పీడితుఁడయి, మనస్ (ః) + వికారమున్ = చిత్త వికారమును, పొందెన్.

తాత్పర్యము ; వసంతమున విశాలములైన యుద్యానముల యందమును సంతోషముతోఁజూచి, యనురాగ మతిశయింప, మన్మథుఁడు సైతము రతిదేవిని జూచి కామపీడితుఁడయి చిత్తవికృతిని బొందెను.

విశేషములు : ఎల్లరకును మనోవికారమును బుట్టించు మన్మథుఁడే వసంతమునఁ గామాతురుఁడై మనోవికారమును బొందె ననుటచే వసంతుని శక్తి యెంతటిదో తెలియుచున్నది.

పొలుపు - పొల్పు - పదమధ్య 'ల' యందలి యుత్వమునకు లోపము. బాల. ప్రకీర్ణక. 17. విపుల + ఆరామము = విపులారామము, కామ + ఆతురుఁడు = కామాతురుఁడు - సవర్ణదీర్ఘ సంధులు. రాగ + ఉత్కట = రాగోత్కట - గుణసంధి. మనోవికారము - మనస్ + వికారము - మనః + వికారము - మన + ఉ + వికారము - మనోవికారము - విసర్గసంధి.

సీ. లత్తుకరసమున జొత్తిల్లఁ బదతల
మ్ముల నరచేతుల మోవిఁబూసి,
నవకుసుమంబుల నానా విధంబుల
తొడవులు రచియించి తొడివి వేడ్క,
రాజీవ పుష్ప పరాగంబుఁ గబళించి
పిలసిల్లు సీమంతవీథిఁ బోసి,
యరవిరి సురపొన్న యకరువు వరుసతో
నలకలఁ జిన్నిపువ్వులికి కలయ,

పాపటను బోసి. సగము విచ్చిన సురపొన్నపూల కేసరములతో ముంగురులయందుఁ జిన్నిపువ్వు చెరివి, పుప్పొడిని రాల్చి నిక్కుచనుదోయిపైఁ బోసి, యంద మతిశయించునట్లు రతి నలంకరించి, వచ్చినపనిని మఱచి, ప్రీతితోఁ జూచుచుండెను.

విశేషములు : అలక్తక (వికృతి) - లాక్ష (ప్రకృతి). పీఁగుఁజన్నుఁగవ = పీఁగు + చన్ను + కవ. 'సమాసంబుల నుదంతంబులగు స్త్రీ సమంబులకుం, బుంపులకుం బరుషసరళంబులు పరంబు లగునపుడు నుగాగమం బగు.' పీఁగు + ను + చన్ను + ను + కవ, బాల. సంధి. 25. 'ద్రుతప్రకృతికముమీఁది పరుషము లకు సరళము లగు.' బాల. సంధి. 16. పీఁగు + ను + జన్ను + ను + గవ. 'ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందుసంశ్లేషములు విభాష నగు.' బాల. సంధి, 17. పీఁగుఁజన్నుఁగవ. అలంకారము స్వభావోక్తి.

వ. ఇట్లఖిల భువన భవనాపూరితంబై సకల జనానందకరంబై యతి
రమణీయంబైన వసంతోత్సవంబునం దత్కాలోచిత క్రీడా పరవ
శుండై కంతుండు బెదరి నిజాగమనప్రయోజనంబు దలంచి
యక్షణంబ. 116

అర్థము: ఇట్లు, అఖిల - భువన - భవన + ఆపూరితంబు + ఐ = ఎల్ల లోకము లనెడి యిండ్లయం దంతట నిండినదయి, సకల-జన + అనందకరంబు + ఐ = ఎల్ల జనులకు నానందమును గూర్చునదియై, అతి- రమణీయంబు + ఐన = మిక్కిలి సుందరమైన. వసంత + ఉత్సవం బునన్, తద్ + కాల + ఉచిత- క్రీడా- పరవశుండు + ఐ = ఆ కాలమునకుఁ దగిన యాటలచే నొడలు తెలియనివాఁడయి. కంతుండు = మన్మథుఁడు, బెదరి. నిజ + ఆగమన- ప్రయోజనంబు = తనదైన రాకవలని ప్రయోజనమును, తలంచి, అక్షణంబు + అ = వెంటనే.

తాత్పర్యము : ఇట్లు ఎల్లభువనములనెడి భవనములందంతటను నిండినదయి. జనులకందఱు కానందమును గూర్చునదయి మిక్కిలి మనోహరమైన వసంతోత్సవము నందు ఆ కాలమునకుఁ దగిన క్రీడలచే నొడలుతెలియనివాఁడయి మన్మథుఁడు భయ పడి తన వచ్చినపనిని దలఁచి. వెంటనే - తరువాతి పద్యముతో నన్వయము.

మ. దళితాంభోజదళాంగుళీతలతనుత్రాణంబులం, గోమలే
క్షుల సచ్చాపము, నబ్జసూత్రగుణమున్, జాతాంకురాశోక ప
ట్మల జాతిప్రసవాస్త్ర పూర్ణశరధుల్, మంత్రించి వశ్యాక్షతా
ముల సన్నాహము సేసి, మారుఁడు జగత్క్షోభంబు సంధిల్లఁగాన్. 117

అర్థము ; మారుఁడు = మన్మథుఁడు, దళితాం .... .... ప్రాణంబులన్: దళిత = వికసించిన, అంభోజ = పద్మములయొక్క, దళ = రేకు లనెడి, అంగుళీ-తల = వ్రేళ్ల, తనుత్రాణంబులన్ = కవచములను, కోమల + ఇక్షు = మనోహరమైన చెఱుకనెడి, సత్ + చాపమున్ = మంచి విల్లును, అబ్జ-సూత్ర-గుణమున్ = తామరతూఁటిదారమనెడి అల్లెత్రాటిని, జాతాం .... శరధుల్: జాత + అంకుర = మామిడి మొలకలు, అశోక-పుష్ప = అశోకపుష్పములమొగ్గలు, జాతి-ప్రసవ = జాజిపూలు అనెడి, అస్త్ర = బాణములతో, పూర్ణ = నిండిన, శరధుల్ = అమ్ముల పొదులను, మంత్రించి, వశ్య + అక్షత + ఆములన్ = వశముచేసికొనుటకైన అక్షతలు మున్నగువానిచే, సన్నాహము = యుద్ధప్రయత్నము, చేసి, జగత్ + క్షోభంబు = లోకవ్యాకులత, సంధిల్లఁగాన్ = కలుగఁగా.

తాత్పర్యము : మన్మథుఁడు వికసించిన తామర రేకులనెడి వ్రేళ్లకవచము లను, చెఱకనెడివిల్లును, తామరతూఁటిదారమనెడి యల్లెత్రాటిని, మామిడిమొలకలు, అశోకపుష్పముల మొగ్గలు, జాజిపూలు అనెడిబాణములతో నిండిన అమ్ములపొదు లను, మంత్రించిన వశీకరణాక్షతలను - అనువానితో లోకములు కలఁగునట్లు యుద్ధప్రయత్నము చేసి - తరువాతి వచనముతో నన్వయము.

విశేషములు : అలంకారము రూపకము. శరధి = అమ్ములపొది. (నానా.) సముద్రము.

---

1. వా. ప్రతి. శిరస్త్రాణంబులం.

వ. ఇట్లసమశరుండు సమరసన్నద్ధుండై సకలజనంబులు నభినవ వసంతోత్సవంబున ననురాగరసపూరితహృదయులై పరవశులై యున్నం గని హరగిరిజల కంతకుం దమయంతన సంగమం బగు. నా వచ్చిన కెలసంబు వసంతువలనన తీరకున్నె యని పరమేశ్వరావాసంబున కనతిదూరంబుగాఁ జని ముందట. 118

అర్థము : ఇట్లు, అసమ-శరుండు = బేసిసంఖ్యగల (అయిదు) బాణములు గలవాఁడు - మన్మథుఁడు, సమర-సన్నద్ధుండు + ఐ = యుద్ధసంసిద్ధుఁడయి, సకల-జనంబులున్ = ఎల్లజనులును, అభినవ- వసంత + ఉత్సవంబునన్ = నూతన వసంతోత్సవమునందు, అనురాగ-పూరిత- హృదయులు + ఐ = ప్రేమపూర్ణములైన హృదయములు గలవారయి, పరవశులు + ఐ = ఒడలుతెలియనివారయి, ఉన్నన్ = ఉండఁగా, కని = చూచి, హర - గిరిజలకున్ = శివునకును, పార్వతికిని, అంతకున్, తమ + అంతన్ + అ = స్వయముగానే - తన ప్రయత్నము లేకయే, సంగమంబు = కలయిక, అగున్, నా వచ్చిన - కెలసంబు = నేను వచ్చిన పని, వసంతు-వలనన్ + అ = వసంతునివలననే, తీరక + ఉన్నె = నెఱవేఱకుండునా, అని, పరమేశ్వర + ఆవాసంబునకున్ = శివుని స్థానమునకు, అనతి దూరంబుగాన్ = కొలఁది దూరముగా, చని, ముందటన్ = ఎదుర.

తాత్పర్యము : ఈ రీతిగా మన్మథుఁడు యుద్ధమునకు సంసిద్ధుఁడై యెల్లవారును నూతన వసంతోత్సవమునందుఁ బ్రేమపూరితహృదయములు గలవారయి యొడలుతెలియనిస్థితిలో నుండుట చూచి, 'శివునకును బార్వతికిని దన ప్రయత్నము లేకయే కలయిక గలుగును. నేను వచ్చిన పని వసంతునివలననే నెఱవేఱకుండునా?' యని పరమేశ్వరుఁడున్నచోటి కించుకదూరముగాఁ బోయి, ఎదుట - మీఁది పంచమాశ్వాసమునందలి పద్యముతో నన్వయము.

విశేషములు : నా వచ్చిన, నేను వచ్చిన. 'ధాతుజవిశేషణ భావార్థక పూర్వ వ్యవహితావ్యవహిత కర్తృపద ప్రథమకుఁ దఱచుగ యొక్కషష్ఠి యగు.' ప్రౌఢ. కారక. 15. నాయొక్కవచ్చిన. 'యొక్కకు లోపంబు బహుళంబు.' ప్రౌఢ. కారక. 16. నా వచ్చిన. వచ్చిన కెలసంబు - 'కర్మాదులకుఁ బ్రాధాన్యవివక్షయందు ధాతుజ విశేషణంబులు కర్తతోడంబోలె వానితోడ సమసించు.' బాల. కారక. 26.

అనునాసికాంతస్థభిన్నములైన హల్లులకు (ఝల్లులకు) కఠినహల్లులు (ఖరులు) పరము లగునప్పుడు వాని వర్గములందలి ప్రథమవర్ణములు (చరులు) ఆదేశముగా వచ్చును.

క. దీపిత విమల జ్ఞాన సు
దీపిత సుఖ దళిత మోహ తిమిరాపహర
వ్యాపారు, సర్వ సుజన ద
యాపరు, నచలాత్ము, మల్లికార్జునదేవున్. 120

అర్థము : దీపిత .... వ్యాపారున్: దీపిత = ప్రకాశించిన, విమల = నిర్మలమైన, జ్ఞాన = జ్ఞానముచేత, సుదీపిత = మిక్కిలి ప్రకాశింపఁజేయఁబడిన, సుఖ = సౌఖ్యముచే, దళిత = చీల్పఁబడిన - నశింపఁజేయఁబడిన, మోహ-తిమిర = అజ్ఞానమనెడిచీఁకటిని, అపహర = పోఁగొట్టునట్టి, వ్యాపారున్ = పనిగలవాఁడును, సర్వ - సుజన - దయా-పరున్ = ఎల్ల మంచివారియెడను దయగలవాఁడును, అచల+ ఆత్మున్ = చలింపని మనస్సుగలవాఁడును, అగు, మల్లికార్జునదేవున్ = దేవుఁడైన జంగమమల్లికార్జునుని - కృతిపతిని.

విశేషములు ; అలంకారము రూపకము.

మహాస్రగ్ధర

శివధర్మార్థప్రవీణున్, సితయశుఁ, ద్రిజగత్సేవ్యు, వేదాంతవేద్యున్
భవఘావాఘౌఘదూరున్, బ్రవిమలగుణు, నభ్రాంతచేతస్కు, సంగో
ద్భవ దాణాఘోరతాపాపహరు, నచలు, నిష్పాపు, నీశాంఘ్రితోయో
ద్భవసద్భృంగాయమానోత్తమహృదయు, మహోత్సాహు, నానంద
దేహున్. 121

అర్థము : శివ - ధర్మ + అర్థ - ప్రవీణున్ = శివధర్మములయొక్క అర్థమునందు నేర్పరియైనవాఁడును, సిత - యశున్ = తెల్లనికీర్తిగలవాఁడును, త్రిజగత్ + సేవ్యున్ = ముల్లోకములవారిచే సేవింపఁదగినవాఁడును, వేదాంత -

1. వా. ప్రతి నిర్పృగ్ను.

క. దురిత ఘనాఘన మారుతు,
నరిషడ్వర్గాటవీదవానలుఁ, గర్మాం
బురుహ సుధాకరు, భవసా
గర కుంభజు, దివ్యమునిశిఖామణి, ననఘున్. 122

అర్థము: దురిత - ఘనా-ఘన - మారుతున్ = పాపములనెడి వర్షాకాలపు మేఘములకు వాయువైనవాఁడును, అరి - షట్ + వర్గ + అటవీ - దవ + అనలున్ = శత్రువులైన ఆఱుగురి సమూహము (కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము) అనెడి అడవికిఁ గార్చిచ్చు అయినవాఁడును, కర్మ + అంబురుహ - సుధాకరున్ = కర్మములనెడి పద్మములకుఁ జంద్రుఁడైనవాఁడును, భవ-సాగర - కుంభజున్ = సంసారమనెడి సముద్రమునకు అగస్త్యుఁడైనవాఁడును, దివ్య - ముని - శిఖామణిన్ = దేవమునులలోఁ దలమానికమైనవాఁడును (శ్రేష్ఠుఁడును,) అనఘున్ = పాపములేనివాఁడును - అగు జంగమమల్లికార్జునుని.

తాత్పర్యము: పాపములనెడి వర్షాకాలపు మేఘములకు వాయువైనవాఁడును, కామాదులగు ఆఱుగురు శత్రువులనెడి యడవికిఁ గార్చిచ్చు అయినవాఁడును, కర్మములనెడి పద్మములకుఁ జంద్రుఁడైనవాఁడును, సంసారమనెడి సముద్రమునకు అగస్త్యుఁడైనవాఁడును, దేవమునులలోఁ దలమానికమైనవాఁడును, పాపరహితుఁడును అగు జంగమమల్లికార్జునుని.

విశేషములు: అలంకారము రూపకము.

వసంతతిలకము

సాహిత్యవేది, గుణశక్తు, వివేకయుక్తున్,
మోహాదిదోషపథముక్తు, బుధానురక్తున్,
మాహేశ్వరప్రకరమాన్యు, సదా వదాన్యున్,
దేహేంద్రియౌఘజయధీరు, సుమేరుసారున్. 132

అర్థము: సాహిత్య - వేదిన్ = సారస్వతము తెలిసినవాఁడును, గుణ-శక్తున్ = గుణములచేత సమర్థుఁడైనవాఁడును, వివేక - యుక్తున్ = వివేకముతోఁ

# కుమారసంభవము

## పంచమాశ్వాసము

శ్రీ భాషాశ్రిత సన్నుత
ద్బాభాసిత విమలవదనపంకరుహుఁ, దపః
శ్రీ భామా విభు, గుణర
త్నాభరణాభరణు, మల్లికార్జునదేవున్. 1

అర్థము : శ్రీ .... పంకరుహున్ : శ్రీ = శోభాయుక్తమైన, భాషా = వాక్కునకు, ఆశ్రిత = ఆశ్రయమైనది, సన్నుత = మిక్కిలి పొగడఁబడినది. సత్ + నుత = పండితులచేఁ బొగడఁబడినది, బాభాసిత = మిక్కిలి ప్రకాశించినది, విమల = నిర్మలమయినది, అగు, వదన — పంకరుహున్ = పద్మమువంటి ముఖము గలవాఁడును, తపస్ + శ్రీ - భామా - విభున్ = తపస్సు అనెడు లక్ష్మీదేవికిఁ బ్రభువైనవాఁడును, గుణ .... భరణున్ : గుణ - రత్న + ఆభరణ = గుణములనెడు, రత్నభూషణములు, ఆభరణున్ = ఆభరణములుగాఁ గలవాఁడును, అగు, మల్లికార్జునదేవున్ = కృతిభర్తయగు జంగమ మల్లికార్జునదేవుని.

తాత్పర్యము ; శ్రీకరమైన వాక్కునకు ఆశ్రయమయినది, పండితులచేఁ బొగడఁబడినది, మిక్కిలి ప్రకాశించినది, నిర్మలమయినది అగు ముఖపద్మము గల వాఁడును, తపోలక్ష్మికిఁ బ్రభువైనవాఁడును, సద్గుణములనెడు రత్నభూషణములు అలంకారములుగాఁ గలవాఁడును అగు కృతిభర్త జంగమమల్లికార్జునదేవుని,

విశేషములు : తపః శ్రీభామా - రూపకము. గుణరత్నాభరణ - రూపకము.

చ. అమరఁగ నింద్రియాళి విషయంబులతో విషయంబు లన్నియుం
గ్రమమున గాడ్పులం దడఁచి, గాడ్పులఁ గూర్చి మనంబునందు, సం
యమమతిఁ దన్మనం బొనర నాత్మనియమం దొడఁగూర్చి, యాత్మయో
గమునఁ జలింపకున్న శివుఁ గాంచె మనోజుఁడు దవ్వుదవ్వులన్. 2

అర్థము : ఇంద్రియ + ఆళి = ఇంద్రియముల వరుస, విషయంబులతోన్ = ఇంద్రియగోచరమగు శబ్దాదికముతో, అమరఁగన్ = ఒప్పియుండఁగా, విషయంబులు + అన్నియున్ = ఇంద్రియార్థము లన్నియును, క్రమమునన్ = క్రమముగా, గాడ్పులందున్ = వాయువులందు, అడఁచి = అణఁచివైచి, గాడ్పులన్ = వాయువులను, మనంబునందున్ = మనస్సునందు, కూర్చి = చేరునట్లుచేసి, నియమ-మతిన్ = నియమముతోఁగూడిన బుద్ధితో, తత్ + మనంబు = ఆ మనస్సు, ఒనరన్ = ఒప్పునట్లు, ఆత్మనియందున్ = పరమాత్మయందు, ఉండఁగూర్చి = ఉండునట్లుచేసి, ఆత్మ-యోగమునన్ = పరమాత్మధ్యానమునందు, నిలుచు + ఉన్న = కదలకున్న, శివున్ = ఈశ్వరుని, మనోజుఁడు = మన్మథుఁడు, దవ్వు దవ్వులన్ = దూరదూరమున, కాంచెన్ = చూచెను.

తాత్పర్యము : ఇంద్రియములు ఇంద్రియగోచరమగు శబ్దాదికముతో ఒప్పియుండఁగా, ఆ యింద్రియార్థముల నన్నిటిని వాయువులం దణఁచివైచి, ఆ వాయువులను మనస్సునందుఁ గూర్చి, నియమబుద్ధితో ఆ మనస్సును పరమాత్మయందుండు నట్లుచేసి, పరమాత్మధ్యానమునఁ గదలకున్న పరమేశ్వరుని మన్మథుఁడు దూరదూరముననే చూచెను.

విశేషములు : ఆత్మ- ఆత్ముఁడు 'ఆత్మేమనిజంతంబులకు, నాంతంబులగు మనుజసంజ్ఞలకు స్త్రీత్వంబు బహుళంబుగా నగు.' బాల. తత్సమ. 77.

క. హరుఁ గని ప్రాణము లుల్లని
విరిసిన మెయిమఱచి పచ్చవిల్తుఁడు దగఁ జి
త్తరువున వ్రాసిన కాముని
కరణి నచైతన్యవృత్తిఁ గదలక నిల్చెన్. 3

అర్థము : పచ్చవిల్తుఁడు = పచ్చనివిల్లు గలవాఁడు - చెఱకువిల్లు గలవాఁడు— మన్మథుఁడు, హరున్ = శివుని, కని = చూచి, ప్రాణము, ఉల్లు + అని = ఉల్లుమని, విరిసినన్ = పోఁగా, మెయి-మఱచి = ఒడలు మఱచి, తగన్ = ఒప్పునట్లు, చిత్తరువునన్ = పటమునందు, వ్రాసిన, కాముని - కరణిన్ = మన్మథుని విధమున, అచైతన్య-వృత్తిన్ = నిర్జీవమైన వర్తనముతో, కదలక, నిల్చెన్.

తా త్ప ర్య ము : మన్మథుఁడు శివునిఁజూడఁగనే ప్రాణముపోయినంతపనియై, ఒడలు మఱచి, చిత్రపటమునఁ జిత్రింపఁబడిన మన్మథుని విధమున జీవములేక కదలక నిలిచెను.

వి శే ష ము లు ; అలంకారం ముత్ప్రేక్ష. పచ్చవిల్తుఁడు - పచ్చనివిల్లు గలవాఁడు- బహువ్రీహి. 'బహువ్రీహిని సమాసాంతకార్యంబులుం గానంబడియెడి.' బాల. సమాస. 22.

వ. ఇట్లు నిలిచి యా క్షణంబ రతిప్రబోధితుండై త్రిణయను సమాధి వైకల్యంబు సేయ నుపక్రమించి నిజమూలబలంబుల నవలోకించిన. 4

అ ర్థ ము : ఇట్లు, నిలిచి, ఆ- క్షణంబు + అ = వెంటనే, రతి- ప్రబోధితుండు + ఐ = రతిచే మేల్కొలుపఁబడినవాఁడయి, త్రిణయను = త్రినేత్రుని- (శివుని) యొక్క-, సమాధి- వైకల్యంబు = ధ్యానభంగము, చేయన్, ఉపక్రమించి= పూని, నిజ - మూల - బలంబులన్ = తనపైన ప్రధానసేనలను, అవలోకించినన్ = చూడఁగా.

తా త్ప ర్య ము : ఈ రీతిగా నిలిచి ఆ క్షణమే రతిచే మేలుకొలుపఁబడినవాఁడయి ముక్కంటి ధ్యానమును భంగపఱుపఁబూని తన మూలబలములను జూడఁగా- తరువాతి పద్యముతో నన్వయము.

వి శే ష ము లు : త్రి + నయను- త్రిణయను, త్రినయను - రెండురూపములను గలవు. త్రిణయను సమాధివైకల్యంబు - సమాధివైకల్యమను షిద్ధసమాసము నందలి యేకదేశమైన సమాధిశబ్దముతో 'త్రిణయను' శబ్దము మన్వయించుచున్నది. •కొన్నియెడల షిద్ధసమాస మధ్యగతపదంబులతోఁ దద్భిన్నపదంబుల కన్వయంబు చూపట్టెడి.' ప్రౌఢ. సమాస. 35.

మ. అలి ఝుంకారముఁ, గీచకస్వనముఁ, గీరాలాపముల్, మత్తకో
కిల నాదంబులు, శారికా రవములుం, గేకీ నినాదంబులుం
గలయన్ భోరన మంజుగానములతో గంధర్వగీతంబు ల
గ్గలమై భోరన మ్రోసె వీక్ష్వరు లతాగారంబు ఘూర్ణిల్లఁగన్. 5

వనచరములకున్ = అడవియందుఁ జరించు పశుపక్ష్యాదులకు, జిహ్వా - స్తంభ - గతి - స్తంభ - మనస్ ( ః ) - స్తంభములు + కన్ = నాలుక పడిపోవుట, గమన మాఁగిపోవుట, మనస్సు నిలిచిపోవుట అగునట్లు, నంది, హస్త - సంజ్ఞన్ = చే సన్నను, ఒనర్చెన్ = చేసెను.

తాత్పర్యము : ఈశ్వరుని ధ్యానమునకు విఘ్నము గలిగించునవియై మ్రోయు వనచరములకు నాలుక, గమనము, మనస్సు స్తంభించునట్లు నంది చేసన్న గావించెను.

విశేషములు ; సంస్కృత కుమారసంభవమునందును 'నన్దీ ముఖార్పితైకాఙ్గుళిసంజ్ఞయైవ, మా చాపలా యేతి గణాన్ వ్యనైషీత్' అని కలదు. కుమార. సం. 3,41

వ. అంతం ద దాజ్ఞాప్రభావంబున. 8

అర్థము : అంతన్ = తరువాత, తద్ + ఆజ్ఞా - ప్రభావంబునన్ =ఆతని (నంది) ఆనయొక్క మహిమచే.

తాత్పర్యము : అంత నంది యాజ్ఞాశక్తిచే-తరువాతి పద్యముతో నన్వయము.

క. మెలఁగక మృగములు, విహగము
లులియక, లేఁబొలలఁ జిగుళు లొత్తక, మలయా
నిలుఁడు సలింపక, నెలవుల
నలవడి వన మమరెఁ జిత్రితాటవి వోలెన్. 9

అర్థము : మృగములు = జంతువులు, మెలఁగక = చరింపక, విహగములు = పక్షులు, ఉలియక = ధ్వనిచేయక, లేఁబొలలన్ (లేఁత + పొలలన్)= లే మొలకలందు, చిగుళులు = చివుర్లు, ఒత్తక = బయలుదేఱక, మలయ + అనిలుఁడు = మలయపవనుఁడు - దక్షిణపు గాలి, చలింపక = కదలక, నెలవులన్ = ఉన్నచోటులందే, అలవడి = ఉండి, వనము=అడవి, చిత్రిత + అటవి+పోలెన్= చిత్తరువున లిఖింపఁబడిన అడవివలె, అమరెన్ = ఒప్పెను.

తాత్పర్యము : జంతువులు చరింపక, పక్షులు ధ్వనిచేయక, లేమొలకలఁ జివురులు బయలుదేఱక, మలయపవనుఁడు కదలక ఉన్నచోటులందే ఉండుచు నా వనము చిత్తరువున లిఖింపఁబడినదా యనునట్లు ఒప్పెను.

విశేషములు: అలంకారము ఉత్ప్రేక్ష. లేఁజొంపంబు (లేఁజిగుళ్ళ) తొట్రుపాటు సమాధిభంగకారణముగాఁ జెప్పుట గమనింపఁదగినది.

చిగుళులు - చిగురు + లు. 'బహువచనము పరంబగునపు డసంయుక్తంబులయి యుదంతంబులయిన డ - ల - ర ల కలఘు లకారంబు బహుళంబుగా నగు,' బాల. ఆచ్ఛిక. 13, చిగుళులు. మలయానిలుఁడు సలింపక - మలయానిలుఁడు + చలింపక. 'తెనుఁగులమీఁది సాంస్కృతిక పరుషములకు గ స డ ద వలు రావు.' బాల.సంధి. 14. ఇచ్చట 'చలింపక'లోనిది సాంస్కృతికపరుషమైనను సాదేశమగుట విశేషము. మలయానిలుఁడు చలింపక యన్నను నిర్బాధమే. కాని యన్ని ప్రతులందును నిట్లే యుండుటచే మార్పలేదు.

'నిష్కమ్పవృక్షం, నిభృత ద్విరేఫం
మూకాణ్డజం, శాన్త మృగ ప్రచారమ్,
తచ్ఛాసనాత్ కానన మేవ సర్వం
చిత్రార్పితారమ్భ మి వావతస్థే.'

అను కాళిదాస కుమారసంభవ శ్లోకమునకు (3- 42) ఇది అనుకరణము.

వ. అంత మనసిజుండు త్రినయనాభిముఖుం డగుడును. 10

అర్థము: అంతన్, మనసిజుండు = మన్మథుఁడు, త్రినయన + అభిముఖుండు = ముక్కంటి కెదురైనవాఁడు, అగుడును = అయినంతనే.

తాత్పర్యము: అంతట మన్మథుఁడు ముక్కంటివైపు తిరిగినంతనే - తరువాతి పద్యముతో నన్వయము.

క. మృడుపై ముంగలి సని తల
పడి మలయానిలుఁడు పోరు భరమై మదనుం
బడలువడఁ బఱచు క్రియఁ దడఁ
బడ ధూళియు గాడ్పు వీచెఁ బ్రతికూలంబై. 11

అర్థము : మలయ + అనిలుఁడు = మలయపవనుఁడు - దక్షిణపు గాలి, మృడుపైన్ = ఈశ్వరునిమీఁదికి, ముంగలి + చని = ముందున్నవాఁడయి పోయి, తలపడి = డీకొని, పోరు = యుద్ధము. భరము + ఐ = అతిశయమై. మదనున్ = మన్మథుని, బడలువడన్ - బడలు + పడన్ = శ్రమపడునట్లు, పఱచు - క్రియన్ = బాధపెట్టువిధమున, ధూళియున్ = దుమ్మును, గాడ్పున్ = గాలియును. తడఁబడన్ = తొట్రుపడునట్లు, ప్రతికూలంబు + ఐ = అననుకూలమయి, వీచెన్.

తాత్పర్యము : మలయపవనుఁడు శివునిపైకి ముందు వెడలి, యతనితో డీకొని, యుద్ధము దుర్భరముకాఁగా, మన్మథుఁడు శ్రమపడునట్లు దుఃఖపెట్టువిధమున, దుమ్మును గాలియుఁ దొట్రువడఁ బ్రతికూలముగా వీచెను.

విశేషములు : అలంకార ముత్ప్రేక్ష. గాలి ప్రతికూలముగా వీచుట దుశ్శకునము.

వ. ఇట్లు సద్యోమరణసూచకంబులగు నపశకునంబులు గని మనంబునం గుసురుకొనుచుం జనిచని. 12

అర్థము : ఇట్లు, సద్యస్ (ః) + మరణ - సూచకంబులు + అగు = తత్క్షణమృతిని సూచించునవి యగు, అపశకునంబులు = దుశ్శకునములు, కని, మనంబునన్, కుసురు + కొనుచున్ = అలక్ష్యముచేయుచు, చని చని = పోయి పోయి,

తాత్పర్యము : ఈ రీతిగాఁ దత్క్షణమృతిని సూచించునట్టి యపశకునములు చూచి మనస్సున నలక్ష్యముచేయుచుఁ బోయి పోయి - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : సద్యస్ + మరణ - పదాంతసకారమునకు విసర్గాదేశము. సద్యః + మరణ, హ్రస్వ అకారపూర్వక విసర్గమునకు హ్రస్వఅకారముకాని, మృదు హల్లులు (హశ్శులు) కాని పరములగునపుడు ఉకారాదేశము. పూర్వ అకారముతోఁ గూడి గుణసంధియు నయి సద్య+ఉ+మరణ - సద్యోమరణ అగును, అగు నపశకునంబులు - అగు + అపశకునంబులు. 'ఉదంతమగు తద్ధర్మార్థవిశేషణమున కచ్చు-పరమగునపుడు నుగాగమం బగు.' బాల.సంధి.33, అగు నపశకునంబులు, కుసురుకొను ఇతనిదే ప్రయోగాంతరము - 4 - 55.

క. లోఁగుఁ దరమైన పొదరుల;
నాఁగిన శకునంబ తలఁచు నడుగడుగునకున్;
డాఁగఁ గెల నరయుఁ బ్రాణము
లీఁగుట కొడఁబడక మదనుఁ డెంతయు భీతిన్. 13

అర్థము : మదనుఁడు = మన్మథుఁడు, ప్రాణములు, ఈఁగుటకున్ = పోఁగొట్టుకొనుటకు, ఒడఁబడక = ఇష్టపడక, ఎంతయున్ = మిక్కిలి, భీతిన్ = వెఱపుతో, తరము + ఐన = దట్టమైన, పొదరులన్ = పొదలందు, లోఁగున్ = అడఁగును, అడుగు + అడుగునకున్ = మాటిమాటికిని, ఆఁగిన = అడ్డగించిన, శకునంబు + అ = శకునమే, తలఁచున్, డాఁగన్ = డాఁగికొనుటకు, కెలను = పార్శ్వము, అరయున్ = వెదకును.

తాత్పర్యము : మన్మథుఁడు ప్రాణములు పోఁగొట్టుకొనుట కిష్టపడక గొప్ప వెఱపుతో దట్టమైన పొదలలో నడఁగును - మాటిమాటికిని దన్నడ్డగించిన దుశ్శకునమునే తలఁచును, డాఁగికొనుటకుఁ బ్రక్కల నరయును.

క. తరు గుల్మాదుల మఱువునఁ
దరతరమ చలించి గడికిఁ దారుచుఁ బురసం
హరు నెయిదఁజొచ్చెఁ గాముఁడు
కరివైరికిఁ జొచ్చు వేఁటకాఁడును బోలెన్. 14

అర్థము ; కాముఁడు = మన్మథుఁడు, కరివైరికిన్ = ఏనుఁగునకు శత్రువగు సింహమునకు, చొచ్చు = కడఁగు, వేఁటకాఁడును + పోలెన్ = వేఁటకాని విధమున, తరు-గుల్మ + ఆదుల = చెట్లు పొదలు మొదలగువానియొక్క, మఱువునన్ = మఱుఁగున, తరతరము + అ = క్రమముగా, చలించి, గడికిన్ = సమీపమునకు, తారుచున్ = పోవుచు, పుర - సంహరున్ = త్రిపురములను నశింపఁజేసినవానిని, శివుని, ఎయిదన్ + చొచ్చెన్ = వెంటాడఁబూనెను.

తాత్పర్యము : మన్మథుఁడు సింహమును వేఁటాడు వేఁటకాని విధమునఁ జెట్లు పొదలు మొదలగువాని చాటునఁ గ్రమముగాఁ గదలి దరిఁజేరుచు శివుని వెంటాడఁ బూనెను.

వి శే ష ము లు : అలంకార ముపమ.

వ. ఇట్లెట్టకేనియుం బరమేశ్వరావాసంబు సొత్తెంచి దహనాంబకు దృష్టిఁ దప్పించి కెలనం దమాలలతావేష్టితాశోకసహకారంబు నోలంబు గొని త్రినయనుం గనుంగొని. 15

అ ర్థ ము : ఇట్లు, ఎట్టకేనియున్ = ఎట్టకేలకు. పరమేశ్వర + ఆవాసంబు= శివుఁడున్నచోటు, చొత్తెంచి = ప్రవేశించి, దహన + అంబకు - దృష్టిన్ = అగ్ని నేత్రుని - శివుని చూపును, తప్పించి = తప్పునట్లుచేసి - శివున కెదురుగా నుండక, కెలనన్ = పార్శ్వమున, తమాల - లతా - వేష్టిత + అశోక - సహకారంబున్ = చీఁకటిమ్రానితీవచేఁ జుట్టుకొనఁబడిన అశోకవృక్షముయొక్క తోడ్పాటును, ఓలంబు+ కొని = చాటుచేసికొని, త్రినయనున్ = ముక్కంటిని - శివుని, కనుంగొని = చూచి,

తా త్ప ర్య ము : ఇట్లు ఎట్టకేలకు శివుఁ డున్నచోటు ప్రవేశించి యతని కెదురుగా నుండక పార్శ్వమునఁ జీఁకటిమ్రానితీవ యల్లుకొనిన అశోకవృక్షమును జాటు చేసికొని ముక్కంటిని జూచి- తరువాతి పద్యముతో నన్వయము.

వి శే ష ము లు : చొత్తెంచు = చొచ్చు + తెంచు, 'తెంచుధాతు వగ్వాదుల కనుప్రయుక్తం బగు.' బాల. క్రియ. 110, 'అయ్యది పరంబగునపుడు చువర్ణంబు లోపించు.' బాల, క్రియ, 112, చొచ్ + తెంచు- ఒకహల్లునకు విజాతీయమగు హల్లుతో సంయోగ మేర్పడునప్పు డా హల్లు పరహల్లుగా మాఱునని నిర్దేశానుసార ముగ గ్రహింపఁదగును. కాన చకారము పరహల్లుగా మాఱి చొత్ + తెంచు = చొత్తెంచు అగును.

మ. స్ఫురదాధార సరోజపీఠ హృదయాంభోజాత రంధ్రార్పిత
స్మరణాయత్త సముత్థితోజ్జ్వలతరాత్మజ్యోతిరిద్ధాంగరు
క్స్ఫురస స్ఫాటిక హర్మ్య మధ్య కనకస్తంభంబొ నాఁ బర్వు న
త్యురుజూటాకృతి నున్న శంభుదెస వో నుల్కెన్ మనోజుం డెదన్. 16

అర్థము : స్ఫురదాధార .... స్తంభంబో : స్ఫురత్ = ప్రకాశించుచున్న. ఆధార - సరోజ - పీఠ = మూలాధారపద్మమనెడి పీఠమునందలి, హృదయ + అంభోజాత = అనాహత పద్మము (చక్రము) వంటి హృదయముయొక్క, రంధ్ర = రంధ్రమునందు అర్పిత = అర్పింపఁబడిన, స్మరణ + ఆయత్త = స్మరణమునకు అధీనమైన, సముత్థిత = బాగుగా లేచిన, ఉజ్జ్వలతర = మిక్కిలి ప్రకాశించునట్టి, ఆత్మ-జ్యోతిః=ఆత్మ యను తేజస్సుచే, ఇద్ధ=ప్రకాశించిన, అంగ-రుచ్ (క్)=శరీర కాంతి యనెడి, సరస=వికాసముగల, స్ఫాటిక=స్ఫటిక శిలామయమైన, హర్మ్య= భవనము నందలి, మధ్య=నడుమనున్న, కనక - స్తంభంబో-నాన్ = బంగారుకంబమో అనఁగా, పర్వు = వ్యాపించునట్టి, అతి + ఉరు - జూట + ఆకృతిన్ = మిక్కిలి గొప్పది యగు జడముడి రూపముతో, ఉన్న, శంభు - దెస=ఈశ్వరునివైపు, పోన్ = పోవుటకు, మనోజుండు = మన్మథుఁడు, ఎదన్ = హృదయమునందు, ఉల్కెన్ = భయపడెను.

తాత్పర్యము : ప్రకాశించుచున్న మూలాధారపద్మమనెడి పీఠమునందలి హృదయపద్మరంధ్రమునం దర్పింపఁబడిన స్మరణాధీనము. సముత్థితము. ఉజ్జ్వల తరము నైన ఆత్మజ్యోతిచేఁ బ్రకాశించు దేహకాంతి యను సరసము. స్ఫటికశిలా మయము నైన హర్మ్యమునడుమ బంగారుకంబమా యన వ్యాపించు మిక్కిలి గొప్ప జడముడిరూపముతో నున్న శివునివైపు పోవ మన్మథుఁడు హృదయమున భయపడెను.

విశేషములు : అలంకారము రూపకానుప్రాణితమైన ఉత్ప్రేక్ష.

దెసవోన్ - దెస + పోన్ - గసడదవాదేశము.

వ. ఇట్లున్న పరమేశ్వరు శాంతరూపంబు తనకుం గ్రూరరూపంబైనం
గని వనంబుఁ జొర నుల్కి వన్యేభంబున కోజవిడి నడ్డంబు సేర్చి
సొత్తెంచు హాస్తిపకోత్తముండునుం బోలె మరుండు గౌరి రాకయ
వార్చుచునుండె నంత నిజేశ్వరు కన్నెఱింగి రతి మతి నిట్లని తలంచె. 17

అర్థము : ఇట్లు, ఉన్న, పరమేశ్వరు=శివునియొక్క, శాంత -రూపంబు= కామాదివికారముల క్షోభలేని యాకారము, తనకున్, (మన్మథునకు,) క్రూర - రూపంబు = క్రూరమైన ఆకారము, ఐనన్ = కాఁగా, కని, వనంబున్ = తపో

వనమును, చొరన్ = చొచ్చుటకు, ఉల్కి = భయపడి, వన్య + ఇభంబునకున్ = అడవియేనుఁగునకు, ఓజ = క్రమముగా, పిడిన్ = ఆఁడేనుఁగును, అడ్డంబు + చేర్చి = అడ్డముగాఁబెట్టి, చొత్తెంచు = ప్రవేశించు, హాస్తిపక + ఉత్తముండునున్ + పోలెన్ = శ్రేష్ఠుఁడైన మావటివానివలె, మరుండు = మన్మథుఁడు, గౌరి = పార్వతి యొక్క, రాక + అ = రాకయ = రాకనే, వార్చుచున్ + ఉండెన్ = వేచి యుండెను, అంతన్, నిజ + ఈశ్వరు = తనభర్తయొక్క, కన్నెఱింగి (కన్ను + ఎఱింగి) = అభిప్రాయ మెఱిఁగి, రతి, మతిన్ = మనసునందు, ఇట్లు + అని = ఈ రీతిగా, తలంచెన్ = తలపోసెను,

తాత్పర్యము : ఇట్లున్న శివుని శాంతాకారము తనకుఁ గ్రూరరూపము కాఁగాఁ జూచి, ప్రవేశింప భయపడి అడవియేనుఁగునకు ఆఁడేనుఁగు నడ్డముగాఁ బెట్టి వచ్చు మావటివానివిధమున మన్మథుఁడు గౌరి రాకను వేచియుండెను. అంతఁ దనభర్త యభిప్రాయ మెఱిఁగి రతి మనసులో నిట్లు తలంచెను.

విశేషములు : వన్యేభంబున కోజవిడి .... హాస్తిపకోత్తముండునుం బోలె - అలంకార ముపమ.

క. కామినులు లేక లోకులఁ
గామునికె ట్లగు మనోవికారులఁ జేయన్?
గామవికారము లేకయుఁ
గామినులకు జనుల నెట్లు గలిపింప నగున్? 18

అర్థము: కామినులు = స్త్రీలు, లేక, లోకులన్ = జనులను, మనస్ (ః) + వికారులన్ = మనోవికారము గలవారినిగా, చేయన్ = చేయుటకు, కామునికిన్ = మన్మథునకు, ఎట్లు + అగున్ = ఎట్లు సాధ్యపడును? సాధ్యపడ దనుట, కామ- వికారము = మన్మథ వికారము, లేకయున్ = లేకుండఁగనే, కామినులకున్ = స్త్రీలకు, జనులన్ = జనులను. ఎట్లు, కలిపింపన్ + అగున్ = వలపింప సాధ్య పడును? - సాధ్యపడ దనుట.

తాత్పర్యము: స్త్రీలు లేకుండ లోకులను మనోవికారము గలవారినిగాఁ జేయుటకు మన్మథునకు సాధ్యపడదు. మన్మథవికారము లేకుండ స్త్రీలకు జనులను వలపింప సాధ్యపడదు.

విశేషములు: కామినులులేక కామునకును, కాముఁడులేక కామినులకును లోకులకు వలపుఁబుట్టింప సాధ్యము గాదు. కామినీకాము లిట్లు పరస్పరాశ్రయులనుట. కలిపింపన్ - కలుచు (= వలచు) ధాతువు ప్రేరణతుమున్నంతరూపము. కలుచు - 'సర్వంబునకుం బ్రేరణంబునం దించుక్కగు.' బాల. క్రియ.70. కలుచు + ఇంచు, 'ప్రేరణేంచుక్కు పరంబగునపుడు చకారంబు పకారంబున కగు.' బాల. క్రియ. 87. కలుపు + ఇంచు. 'అంద్వవగాగమంబులం దప్ప నపహాదిస్వరంబు పరంబగునపు డచ్చునకు సంధి యగు.' బాల.సంధి.11. 'ఇత్వంబుగాని యెత్వంబుగాని కూడుచో ననాద్యంబయిన యుత్వంబున కిత్వం బగు.' బాల. క్రియ.85. కలిపించు.' తుమర్థభావలక్షణంబులందు నుజీ యగు.' బాల. క్రియ. 40. కలిపించు + నుజీ. 'అగమాన్య చకారంబుల కద్విరుక్తంబులకు నుత్తు పరంబగునపుడు ప వ లగు.' బాల. క్రియ.88, కలిపింపన్.

వ. అని కాముక కామినీ జనంబు లితరేతరాశ్రయంబుల కా భావించుచుండె నంత. 19

అర్థము; అని, కాముక - కామినీ - జనంబులు = కాముఁడును, కామినులును, ఇతర + ఇతర ఆశ్రయంబులు + అ = పరస్పరాశ్రయులే - ఒకరిపై నొకరాధారపడువారు, కాన్ = అగునట్లు, భావించుచున్ + ఉండెను = తలపోయుచుండెను, అంతన్.

తాత్పర్యము: అని రతి కాముఁడును గామినులును పరస్పరాశ్రయులే యని తలపోయుచుండెను. అంత - తరువాతి పద్యముతో నన్వయము.

సీ. కరవీర రచిత నూపురములు చెలువొందఁ
గాంచన పుష్ప మేఖలలు గట్టి,
పున్నాగమయ హారములు వెట్టి నవకర్ణి
కార శోభిత కటకములు వెలుఁగ,

గేసర రాజీవ కేయూరములు దొడి,
రాజీవ కర్ణపూరము లమర్చి,
తిలకాభినుతహేమతిలకంబు లుప్పొంగఁ,
జంపకమాలికాసమితిఁ దాల్చి,

ఆ. మధు లతాంత మయ విమండన మండిత
లైన కన్యకాచయంబు నడుమఁ
బొలిచె నద్రితనయ పుష్పితజంగమ
లతల నడుమఁ గల్పలతయుఁ బోలె. 20

అర్థము : కర వీర - రచిత - నూపురములు = గన్నేరుపూలతో, నిర్మింపఁబడిన అందెలు, చెలువొందన్ (చెలువు + ఒందన్) = ఒప్పఁగా, కాంచన - పుష్ప - మేఖలలు = సంపఁగి (ఉమ్మెత్త) పూల మొలనూళ్లు, కట్టి,

పున్నాగ - మయ - హారములు = పొన్నపూలతోఁ జేయఁబడిన హారములు. పెట్టి = ధరించి, నవ - కర్ణికార - శోభిత - కటకములు = క్రొత్త కొండగోఁగు పూలతో నొప్పిన కడియములు, వెలుఁగన్ = ప్రకాశింపఁగా,

కేసర - రాజీవ - కేయూరములు = పొగడలు, తామరలు - అకరువులతోడి తామరపూలు అనెడి బాహుపురులు, తొడి = ధరించి, రాజీవ - కర్ణపూరములు = తామరపూలనెడి చెవికమ్మలు, అమర్చి = పెట్టి.

తిలక + అభినుత - హేమ - తిలకంబులు = బొట్టుగుపూలతో నొప్పిన. బంగరు బొట్టులు, ఉప్పొంగన్ = అతిశయింపఁగా, చంపక - మాలికా - సమితిన్ = సంపెఁగదండల సమూహమును, తాల్చి = ధరించి,

అద్రి - తనయ = కొండ కూఁతురు - పార్వతి, మధు - లతాంత - మయ - విమండన - మండితలు = ఇప్పపూలతోఁ జేయఁబడిన అలంకారములచే నలంకరింపఁబడినవారు, ఐన, కన్యకా - చయంబు - నడుమన్ = కన్నియల సమూహము నడుమ, పుష్పిత - జంగమ - లతల = పుష్పించిన సంచరించు తీవలయొక్క, నడుమన్ = నడుమను, కల్ప - లతయున్ + పోలెన్ = కల్పవృక్షపుఁదీగవలె. పొలిచెన్ = ఒప్పెను.

తాత్పర్యము : పార్వతి - గన్నేరుపూల అందెలు ఒప్పఁగను, ఉమ్మెత్త పూల మొలనూలులు కట్టి, పొన్నపూలహారములు ధరించి, క్రొత్తకొండగోఁగు పూలతోఁ బ్రకాశించు కడియములు ఒప్పఁగా, పొగడలు, తామరలు అనెడి బాహుపురులు తొడిగి, తామరపూలనెడి చెవికమ్మలు పెట్టి, బొట్టుగుపూలతో నొప్పిన బంగరు బొట్టులు అతిశయింపఁగా, సంపెఁగదండల సమూహమును ధరించి, ఇప్పపూల ఆభరణములచే నలంకరింపఁబడిన కన్యకాసమూహమునడుమఁ బుష్పించిన సంచరించుతీవల నడుమనున్న కల్పవృక్షపుఁదీఁగవలె నొప్పెను.

విశేషములు ; కవి పార్వతిని తత్రత్యములయిన పూలతోడనే అలంకరింపఁబడినదానినిగా వర్ణించుట గమనింపఁదగినది. అలంకారము స్వభావోక్తి. పుష్పమేఖలలు, రాజీవకేయూరములు, రాజీవకర్ణపూరములు అనుచోట్ల రూపకము. కల్పలతయుఁబోలె - ఉపమ. కాళిదాసుకూడ తన కుమారసంభవమున నిదే సందర్భమున పార్వతి నిట్లే వర్ణించుట చూడనగును.

అశోక నిర్భర్త్సిత పద్మరాగ, మాకృష్ట హేమద్యుతి కర్ణికారమ్,
ముక్తాకలాపీకృత సిన్దువారం, వసన్తపుష్పాభరణం వహన్తీ,
ఆవర్జితా కించి దివ స్తనాభ్యాం, వాసో వసానా తరుణార్కరాగమ్,
పర్యాప్తపుష్పస్తబకావనమ్రా, సంచారిణీ పల్లవినీ లతేవ,
స్రస్తాం నితమ్బా దవలమ్బమానా పునఃపుః కేసరదామకాఞ్చీమ్,

కుమార.సం.3.53.54.55.

వ. ఇట్లకాలవసంతలతాంతాపచయకేళీలాలసయై ప్రాలేయకుత్కీలాత్మజ యా క్షణంబ. 21

అర్థము : ఇట్లు, అకాల - వసంత - లతాంత+అపచయ - కేళీ - లాలస+ఐ= అసమయమైన వసంతర్తువునందలి పూలను గోయుట యనెడి క్రీడయం దాసక్తి కలదయి హిమవత్పర్వతపుత్రిక ఆ క్షణమే.

తాత్పర్యము : ఇట్లు పార్వతి అకాలవసంతర్తుపుష్పములను గోయు క్రీడయం దాసక్తిగలదయి యాక్షణమే - తరువాతి పద్యముతో నన్వయము.

క. అతిసంభ్రమమునఁ ద్రిజగ
త్పతి నర్చనసేయఁ దలఁచి పరిమళ మంద
స్మిత కుసుమ మృదుల పల్లవ
తతిలో మే లేఱికొని ముదం బొదవు మదిన్. 22

అర్థము : అతి - సంభ్రమమునన్ = మిక్కిలి గౌరవముతో, త్రిజగత్ + పతిన్ = ముల్లోకముల యేలిక యగు శివుని, అర్చన + చేయన్ + తలఁచి = పూజింపఁదలఁచి, పరిమళ - మంద - స్మిత = సువాసనతోడి చిఱునవ్వుఁగలది-పార్వతి, కుసుమ - మృదుల - పల్లవ - తతిలోన్ = పూలయు, మెత్తని చివురులయు సమూహమున, మేలు = మంచివి, ఏఱికొని, ముదంబు = సంతోషము, ఒదవు - మదిన్ = పుట్టునట్టి మనస్సుతో-

తాత్పర్యము : సుగంధముతోడి చిఱునవ్వుగల పార్వతి మిక్కిలి గౌరవముతో ముల్లోకములయేలికయగు శివునిఁ బూజింపఁదలఁచి పూలలోను, మెత్తని చివురులలోను మంచివి యేఱుకొని సంతోషించు మనస్సుతో - తరువాతి పద్యముతో నన్వయము.

సీ. మెలపారు నెలమావి తలిరుల నొకకొన్ని
రమణీయమగు చంపకములు వొదివి,
లాలితాశోకపల్లవముల నొకకొన్ని
కమనీయమగు కుర్వకములు వెట్టి,
మానరంపు టరంటిమోసుల నొకకొన్ని
కొమరారు కర్ణికారములు నించి,
తరుణాంబుజాతపత్రంబుల నొకకొన్ని
యమరిన సరసోత్పలములు సుట్టి,
ఆ. చెలువ లెల్ల నొంటు చిగుళులుఁ బువ్వులుఁ
గలయఁ దాల్చి పొల్చి బలసి రాఁగ,
శైలరాజతనయ చనుదెంచె నందన
వనము గాఁపువచ్చు వడువ వోలె. 23

అర్థము : మెలపారు = మెత్తనగు. ఎల - మావి - తలిరులన్ = లేమామిడి చివురులందు, ఒక - కొన్ని, రమణీయము + అగు = అందమైన, చంపకములు = సంపెఁగలు, పొదివి = కప్పి.

లాలిత + అశోక - పల్లవములన్ = మనోహరములైన, అశోకపుఁజివురులందు, ఒక - కొన్ని, కమనీయము + అగు = మనోహరమయిన, కురవకములు = ఎఱ్ఱగోరంటపూలు, పెట్టి, మానరంపుటరంటి = మానరము + అరంటి = మనోజ్ఞములైన అరఁటిమొవ్వులలో, ఒక - కొన్ని, కొమరారు - కొమరు + ఆరు = అందమైన, కర్ణికారములు = కొండగోఁగుపూలు, నించి = నిండించి,

తరుణ + అంబుజాత - పత్రంబులన్ = లేఁదామరపాకులందు, ఒక-కొన్ని, అమరిన = ఒప్పిన, సరస + ఉత్పలములు = అందమైన కలువలు, చుట్టి,

చెలువలు + ఎల్లన్ = స్త్రీలు (చెలికత్తెలు) అందఱును, ఒందు-చిగుళులున్ = వేఱు చివురులును, పువ్వులున్, కలయన్ = బాగుగా, తాల్చి = ధరించి, పొల్చి = ఒప్పి, బలసి - రాఁగన్ = పరివేష్టించి రాఁగా.

శైల - రాజ - తనయ = కొండలతేని - హిమవంతుని కూఁతురు-పార్వతి, నందన - వనము = నందనమనెడివనము, కాఁపు - వచ్చు = కాఁపురమువచ్చు, వడువు + అ - పోలెన్ = విధమునే పోలునట్లు, చనుదెంచెన్ = వచ్చెను.

తాత్పర్యము : పార్వతి మెత్తనైన లేమావిచిగురులలో నొకకొన్ని అందమైన సంపెఁగలు కప్పి, మనోహరములైన అశోకవృక్షపుఁజివురులలో ఒకకొన్ని రమణీయములయిన యెఱ్ఱగోరంటపూలు పెట్టి, అందమైన అరఁటిమొవ్వులలో నొకకొన్ని సుందరములైన కొండగోఁగుల నిండించి, లేఁదామరపాకులలో నొకకొన్ని ఒప్పిన సుందరములైన కలువలను చుట్టి, చెలికత్తెలందఱును వేఱు చివురులు, పువ్వులు బాగుగాఁదాల్చి ఒప్పి పరివేష్టించిరాఁగా, నందనవనము కాఁపురమువచ్చుచున్నదా యనువిధమున వచ్చెను.

విశేషములు: అలంకారము స్వభావోక్తి, ఉత్ప్రేక్ష.

ఉ. ఆ లలితాంగి, భూషిత లతాంత విభూషణజాలగాత్ర, హం
సాలస మందయాన, వికచామల కోమల నీరజాస్య, బా
లాలికులాళి నీలకుటిలాలక, లోల విశాలనేత్ర, కు
త్కీలతనూజ వచ్చె మరుదీమము పోలెఁ బినాకి పాలికిన్. 24

అర్థము : ఆ - లలిత + అంగి = ఆ మనోహరమైన శరీరముగలది, భూషిత - లతాంత - విభూషణ - జాల - గాత్ర = అలంకరింపఁబడిన పుష్పాభరణముల సమూహముతోడి అవయవములు గలది, హంస + అలస - మంద - యాన = అంచలవలె అలసము, మందము నైన గమనము గలది, వికచ + అమల - కోమల - నీరజ + ఆస్య = వికసించిన, నిర్మలమైన, మనోహరమైన తామరపూవువంటి ముఖముగలది, బాల + అలి - కుల + ఆళి - నీల - కుటిల + అలక = కొదమ తుమ్మెదల గుంపుల వరుసలవలె నల్లనివి, వంకరయైనవి యైన ముంగురులు గలది, లోల - విశాల - నేత్ర = చంచలములు, విరివియైనవి యైన కన్నులుగలది, అగు, కుత్కీల - తనూజ = కొండకూఁతురు - పార్వతి, మరు - దీమము + పోలెన్ = మన్మథుని దీమము వలె, (దీమము - పశుపక్ష్యాదులను బట్టుకొనుటకై యేర్పఱిచిన పశు పక్ష్యాదికము), పినాకి - పాలికిన్ = శివుని (పినాక మనునాయుధముగలవాఁడు) దగ్గఱకు, వచ్చెన్.

తాత్పర్యము : మనోహరమైన శరీరము గలదియు, పూవులచే నలంక రింపఁబడిన అవయవములు గలదియు, అంచవలె మందమైన గమనముగలదియు, విరిసినది, నిర్మల మయినది, అందమైనది అగు పద్మమువంటి ముఖముగలదియు, కొదమ తుమ్మెదలగుంపువలె నల్లనివి, వంకరయైనవి యగు ముంగురులు గలదియు, చంచల ములు, విరివియైనవి అగు కన్నులు గలదియు అగు ఆ పార్వతి మన్మథుఁ డను వేఁటకాఁ డేర్పఱిచిన దీమమువలె శివుని దగ్గఱకు వచ్చెను.

విశేషములు : అలంకారము రూపకానుప్రాణితోత్ప్రేక్ష. హంస+అలస- మందయాన - అలస, మంద అనునని రెండును సమానార్థకములే. అట్లే, బాల + అలి + కుల + ఆళి - నీల - కుటిల + అలక - అను సమాసములో కుల ఆళి శబ్ద ములు సమానార్థకములు. పినాకి - 'పినాకీ ప్రమథాధిపః' పినాక ఇతి ధను రస్యాస్తీతి పినాకీ, పినాకమనెడివిల్లు గలవాఁడు - శివుఁడు, మన్మథుఁ డనువేఁటకాఁడు శివుని వశ పఱుచుకొన నేర్పఱిచిన దీమమా యనునట్లు పార్వతి వచ్చె ననుట.

వ. అంతం బరమేశ్వరుండు తుర్యావస్థితంబులైన మనఃప్రాణంబులు జాగ్రదవస్థావ్యవస్థితంబులు చేసి సంప్రసన్నుండైన కన్నెఱింగి గౌరి నందిమహాకాలానుజ్ఞాతయై లతామందిరాంతరంబున కరిగి హరచరణసరసీరుహంబులకుం బుష్పాంజలి యిచ్చి కృతాంజలి యైన. 25

అర్థము : అంతన్, పరమేశ్వరుండు, తుర్య + అవస్థితంబులు = నాలవదియగు సమాధ్యవస్థయందు - బ్రహ్మమునందున్నవి, ఐన, మనఃప్రాణంబులు = మనస్సును, ప్రాణమును, జాగ్రత్ + అవస్థా - వ్యవస్థితంబులు = మేలుకొన్న స్థితియందున్నవి, చేసి, సంప్రసన్నుండు = మిక్కిలి ప్రసన్నత నొందినవాఁడు, ఐన - కన్నెఱింగి = అయిన జాడతెలిపి, గౌరి = పార్వతి, నంది - మహాకాల + అనుజ్ఞాత + ఐ = నందీశ్వరుఁడు, మహాకాలుఁడు అనువారిచే ననుమతింపఁబడినదయి, లతా - మందిర + అంతరంబునకున్ = తీవెయింటిలోపలికి, అరిగి = వెడలి, హర - చరణ సరసీరుహంబులకున్ = శివుని పాదపద్మములకు, పుష్ప + అంజలి = పూలదోయిలి, ఇచ్చి, కృత + అంజలి = నమస్కరించినది, ఐనన్ = కాఁగా,

తాత్పర్యము ; అంత శివుఁడు జాగ్రత్స్వప్నసుషుప్తులనెడి మూఁడవస్థలకంటె భిన్నమై నాల్గవదియగు సమాధ్యవస్థయందున్న - బ్రహ్మమునందున్న మనస్సును ప్రాణమును మేలుకొలిపి సుప్రసన్నుఁడైన జాడతెలిసి పార్వతి నంది మహాకాలుఁడు అనువారి అనుమతిని గైకొని తీవెయింటిలోపలి కరిగి, శివుని పాదపద్మములకు పూలదోయిలి సమర్పించినది కాఁగా- తరువాతి పద్యముతో నన్వయము.

ఉ. ఆ వనజాస్య హస్తతలజారుణదీప్తులఁ గూడివచ్చు పు
ష్పావలిమీఁద నీశు తనుజామలరోచులు గప్పి యొప్పె సం
ధ్యావిరళోద్గతప్రకటితారుణదీప్తులలోనఁ బొచ్చు తా
రావళిమీఁదఁ బర్వు నమృతాంశు కరప్రకరాభిరామమై. 26

అర్థము : ఆ - వనజ + ఆస్య = తామరవంటి ముఖముగల ఆ పార్వతి యొక్క, హస్త - తలజ = అఱచేతులనుండి పుట్టిన, అరుణ - దీప్తులన్ = ఎఱ్ఱని కాంతులతో, కూడి - వచ్చు = కలిసివచ్చునట్టి, పుష్ప + ఆవలి - మీఁదన్ = పూల

వరుసపై. ఈశు = ఈశ్వరునియొక్క, తనుజ + అమల-రోచులు = శరీరమునుండి పుట్టిన నిర్మలములయిన కాంతులు, కప్పి = క్రమ్మి, సంధ్యా.... ....లోనన్: సంధ్యా= సంజయందు, అవిరళ = పలుచనకాని - దట్టముగా, ఉద్గత = పైకివెడలినవైన, ప్రకటిత = ప్రకటింపఁబడిన. అరుణ = ఎఱ్ఱని, దీప్తులలోనన్ = కాంతులలో, పొల్చు = ప్రకాశించు, తారా + ఆవళిమీఁదన్ = నక్షత్రముల వరుసపై, పర్వు= ప్రసరించునట్టి, అమృత + అంశు - కర - ప్రకర = చంద్రుని కిరణములయొక్క సమూహమువలె, అభిరామము + ఐ = మనోహరమయి, ఒప్పెన్.

తాత్పర్యము : ఆ పార్వతి శివునకుఁ బుష్పాంజలి సమర్పించునప్పుడు, ఆమె అఱచేతుల యెఱ్ఱని కాంతులతోఁ గూడిన పుష్పములపై నీశ్వరునిమేని నిర్మల కాంతులు క్రమ్మి సంధ్యాసమయమునందు సాంద్రములైన యెఱ్ఱనికాంతులలోఁ బ్రకాశించు నక్షత్రములపైఁ జంద్రకిరణములు ప్రసరించునట్లు మనోహరమై యొప్పెను.

విశేషములు : పార్వతి యఱచేతుల యెఱ్ఱనికాంతులు సంధ్యారుణ కాంతులవలెను, పుష్పములు నక్షత్రములవలెను, ఈశ్వరుని మేని నిర్మలకాంతులు చంద్రకిరణములవలెను నున్నవని భావము. అలంకారముపమ.

'వనజాస్య' అను పదము 'హస్తతలజారుణదీప్తులు' అను సిద్ధసమాసమునందలి 'హస్తతల' అను నేకదేశముతో నన్వయించుచున్నది. అట్లే 'ఈశు' అను పదము 'తనుజామలరోచులు' అను సిద్ధసమాసమునందలి 'తను' అను నేకదేశముతో నన్వయించుచున్నది. 'కొన్నియెడల సిద్ధసమాస మధ్యగత పదంబులతోఁ దద్భిన్నపదం బుల కన్వయంబు చూపట్టెడి.' ప్రౌఢ. సమాస. 35.

వ. తదవసరంబున. 27

అర్థ తాత్పర్యములు: తద్ + అవసరంబునన్ = ఆ సమయమున - తరువాతి పద్యముతో నన్వయము.

చ. మరునభివృద్ధి, పుష్పశర మండన, మంగజ రాజ్యలీల, శం
బరరిపు శక్తి, చిత్తభవు పట్టము, మారు మదేభ, మిందిరా
వర సుతు నాజ్ఞ, కాము కరవా, లసమాయుధు దర్ప, మా రతీ
శ్వర జయలక్ష్మి నాఁ బొలిచి శైలజ నిల్చె మహేశు ముందటన్. 28

అర్థము: శైలజ = కొండకూఁతురు - పార్వతి. మరు + అభివృద్ధి = మన్మథుని పెంపు. పుష్ప - శర - మండనము = సుమాస్త్రుని (మన్మథుని) అలంకారము. అంగజ - రాజ్య - లీల = మన్మథుని రాచఱికపు విలాసము. శంబర - రిపు - శక్తి = శంబరాసురవిరోధి (మన్మథుని) శక్తి. చిత్తభవు - పట్టము = మనసిజుని (మన్మథుని) రాజ్యము. మారు - మద + ఇభము = మన్మథుని మదించిన యేనుఁగు. ఇందిరా - వర - సుతు + ఆజ్ఞ = లక్ష్మియొక్క శ్రేష్ఠుఁడైన కుమారుని (మన్మథుని) ఆనతి. కాము - కరవాలు = మన్మథుని కత్తి. అసమ + ఆయుధు - దర్పము = విషమబాణుని (మన్మథుని) గర్వము. ఆ . రతి + ఈశ్వర - జయలక్ష్మి = ఆ రతి భర్త (మన్మథుని) జయలక్ష్మి. నాన్ = అనునట్లు. పొలిచి = ఒప్పి. మహేశు = ఈశ్వరునియొక్క. ముందటన్ = ఎదుర. నిల్చెన్.

తాత్పర్యము: పార్వతి మన్మథుని అభివృద్ధి, అతని అలంకృతి, అతని రాచఱికపు విలాసము, అతని శక్తి, అతని పట్టము, అతని మత్తేభము, అతని ఆనతి, అతని కత్తి, అతని దర్పము, అతని జయలక్ష్మి యన నొప్పి శివునియెదుర నిలిచెను.

విశేషములు: పార్వతి పలువస్తువులతో నుపమింపఁబడుటచే మాలోపమ. ఆ వస్తువులన్నియు మన్మథసంబంధులే యగుట గమనింపఁదగినది. కరవాలు (వికృతి) -కరవాలము (ప్రకృతి.) మరు నభివృద్ధి - మరు + అభివృద్ధి, సుతునాజ్ఞ - సుతు + ఆజ్ఞ- 'షష్ఠీ సమాసమునం దుకార ఋకారముల కచ్చు పరమగునపుడు నుగాగమం బగు.' బాల.సంధి.34.

వ. అంతం గంతుండు నిజవశ్యాధిదేవత ప్రసన్నంబైనంతియ సంతోషించి యద్దేవికిం గామాధికారంబు సేసి పరమేశ్వరున కెఱింగించి పక్కఁగొన నేయుదునని తలంచి గౌరి హృదయం బున్మదనాస్త్రంబున భేదించిన నాక్షణంబ. 29

అర్థము: అంతన్, కంతుండు = మన్మథుఁడు. నిజ - వశ్య + అధిదేవత = తనదైన వశీకరణమనెడి అధిదేవత. ప్రసన్నంబు + ఐన + అంతియ - ప్రసన్నురాలయినంతే, సంతోషించి, ఆ + దేవికిన్ = ఆ దేవతకు, కామ + అధికారంబు + చేసి = కోరిక యను నధికారమునిచ్చి. పరమేశ్వరునకున్, ఎఱింగించి, పక్క + కొనన్ = ప్రీఁటలువాఱునట్లు, ఏయుదున్ - కొట్టుదును, అని, తలంచి, గౌరి - హృద

యంబు = పార్వతి హృదయమును, ఉన్మదన + అస్త్రంబునన్ = ఉన్మదనమనెడి యస్త్రముచే, భేదించినన్ - భేదింపఁగా, ఆ - క్షణంబు + అ = వెంటనే.

తాత్పర్యము : అంతట మన్మథుఁడు తన వశీకరణ శక్తి యను నధిదేవత ప్రత్యక్షమైనంతే సంతోషించి, యా దేవతకుఁ గామాధికారము నిచ్చి, పరమేశ్వరున కెఱిఁగించి బీఁటలువాఱునట్లు కొట్టుమనని తలఁచి పార్వతి హృదయమును ఉన్మదన మను నస్త్రముచే భేదింపఁగా నా క్షణమే - తరువాతిపద్యముతో నన్వయము.

మ. అలికాగ్రంబునఁ గ్రాలి యాడె బొమ; లాహ్లాదింపఁ గన్గోనలన్
దలఁకెన్ సమ్మదవారి; మోవి యదరెన్; దన్వంగి మై నొత్తె ము
త్పులకల్; కంపముఁగూడె నూర్పు; లెలమిం బొందెన్ మనం; బాత్మలో
నొలసెన్ రాగము; మోమునం దొలసె గండోల్లాసహాసప్రభల్. 30

అర్థము ; అలిక + అగ్రంబునన్ = నొసటిపై, బొమలు = కనుబొమలు, క్రాలి + ఆడెన్ = చెదరియాడెను, ఆహ్లాదింపన్ = సంతోషింపఁగా, కన్ + కోనలన్ = కంటితుదలందు, సమ్మద - వారి = హర్షాశ్రువులు, తలఁకెన్ = తొనఁకెను, మోవి = పెదవి, అదరెన్ = చలించెను, తను + అంగి (తన్వంగి) = సన్నని శరీరముగలది - స్త్రీ - పార్వతియొక్క, మైన్ = శరీరమునందు, ముద్ + పులకల్ = సంతోషమువలని గగుర్పాటు, ఒత్తెన్ = పుట్టెను, ఊర్పులు = శ్వాసములు, కంపమున్ = వణఁకును, కూడెన్ = కలిసెను, మనంబు = మనస్సు, ఎలమిన్ = సంతోషమును, పొందెన్, ఆత్మలోన్ = మనసులో, రాగము = ప్రేమము, ఒలసెన్ = ప్రవేశించెను, మోమునన్ = ముఖమునందు, గండ + ఉల్లాస - హాస - ప్రభల్ = చెక్కిళ్లయందలి సంతోషముతోడి నవ్వుల కాంతులు, పొలసెన్ = వ్యాపించెను.

తాత్పర్యము: కనుబొమలు ఆమెనుదుటఁ జెదరియాడెను. సంతోషింపఁగాఁ గనుతుదలందు హర్షాశ్రుజలము తొనఁకెను. పెదవి యదరెను. శరీరమున సంతోషము వలని గగుర్పాటు గలిగెను. శ్వాసములు కంపమును గూడెను. మనస్సు సంతోషమును బొందెను. ఆత్మలో ననురాగము ప్రవేశించెను. చెక్కిళ్లయందలి యుల్లాసముతోడి నవ్వుల కాంతులు ముఖమునఁ బ్రసరించెను.

విశేషములు: మన్మథుఁడు మదనాస్త్రముచేఁ బార్వతిహృదయమును భేదింపఁగనే యామెకు అనురాగోదయమై అశ్రువు, రోమాంచము, వేపథువు మున్నగు సాత్త్వికభావములు గలిగెను.

కన్గొనలు = కన్ను + కొనలు - 'అకారంబు క్రింది బకారంబునకుం దుది నులు క్రింది నలలకు లోపంబు బహుళంబుగ నగు.' బాల. ప్రకీర్ణ.7. కను + కొనలు. 'పదాంతంబులయి యసంయుక్తంబులయిన ను లు రు ల ముప్వంబునకు లోపంబు బహుళంబుగ నగు.' బాల. ప్రకీర్ణ.16. కన్ + కొనలు. 'ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళము లగు' బాల.సంధి.16. కన్గొనలు. తను + అంగి = తన్వంగి. యణాదేశ సంధి. ఇ ఉ ఋ ౡ లకు అసవర్ణములయిన అచ్చులు పరములగునపుడు య్ వ్ ర్ ల్ అనునవి క్రమముగా ఆదేశము లగును. ముద్ + పులకలు - అనునాసికాంతస్థభిన్నములైన హల్లులకు (ఝల్లులకు) కఠినహల్లులు (ఖరులు) పరములగునపుడు వాని వర్గములందలి ప్రథమవర్ణములు (చరులు) ఆదేశము లగును. ముత్పులకలు. గండ + ఉల్లాస - గుణసంధి. అ ఆ లకు ఇ ఉ ఋ ౡలు పరములగునపుడు వరుసగా ఏ ఓ అర్ అల్ అనునవి యేకాదేశము లగును. గండోల్లాస.

వ. ఇట్లు మదనప్రేరితయై. 31

అర్థము: ఇట్లు, మదన - ప్రేరిత + ఐ = మన్మథునిచేఁ బ్రేరేపింపఁబడినదయి.

తాత్పర్యము: ఇట్లు మన్మథునిచేఁ బ్రేరింపఁబడినదయి - తరువాతి పద్యముతో నన్వయము.

క. ప్రణుతాపాంగవిలోలే
క్షణదీప్తుల నగజ గలయఁ గప్పిన నసమే
షణుఁ డుత్పలదళములఁ బూ
రణ సేసిన కరణి నతివిరాజితుఁ డయ్యెన్. 32

అర్థము: అగజ + పార్వతి, ప్రణుత + అపాంగ - విలోల + ఈక్షణ - దీప్తులన్ = మిక్కిలి నుతింపఁబడిన క్రీఁగన్నులయొక్క మిక్కిలి చంచలములైన

చూపుల కాంతులను, కలయన్ = అంతను, కప్పినన్ = కప్పఁగా, అసమ + ఈక్షణుఁడు = బేసికన్నులవాఁడు - శివుఁడు, ఉత్పల - దళములన్ = కలువఱేకులను, పూరణ + చేసిన - కరణిన్ - పూరించిన విధమున, అతి - విరాజితుఁడు + అయ్యెన్ = మిక్కిలి ప్రకాశించినవాఁడయ్యెను.

తాత్పర్యము : పార్వతి మిక్కిలి సుందరములైన క్రీఁగన్నుల చంచల దృష్టులను అంతటను గప్పఁగా, నీశ్వరుఁడు కలువఱేకులను పూరించినవిధమున మిక్కిలి ప్రకాశించెను.

విశేషములు : అలంకార ముత్ప్రేక్ష.

వ. మఱియును. 33

ఉ. ఆ లలితస్మితాస్య లలితామల కోమల చంచలాలసా
లోల విశాల సంస్ఫురిత లోచన దృష్టిరసప్రవాహ మం
దోలిన పర్వి వెల్లిగొని యొక్కటఁ గ్రక్కున ముంచి మీఁదికిం
దేలఁగ నెత్తెఁ జుట్టె హరుఁ ద్రిప్పులఁబెట్టె మనోజుఁ డుబ్బఁగాన్. 34

అర్థము : ఆ - లలిత - స్మిత + ఆస్య = ఆ - మనోహరమైన నవ్వు మొగముగల పార్వతియొక్క, లలితా .... ప్రవాహము; లలిత = మనోహరములు, అమల = నిర్మలములు. కోమల = సుందరములు, చంచల = చలించునవి, అలస= మందములు, ఆలోల = చంచలములు, విశాల = పెద్దవి, సంస్ఫురిత = మిక్కిలి ప్రకాశించునవి, అగు, లోచన = కన్నులయొక్క, దృష్టి = చూపులనెడి, రస-ప్రవాహము = జలప్రవాహము - శృంగారరసప్రవాహము, అందున్ = అచ్చట, ఓలిన్ + ఆ= క్రమముగా, - నిండుగా, పర్వి = వ్యాపించి, వెల్లి + కొని = ప్రవహించి, మనోజుఁడు = మన్మథుఁడు, ఉబ్బఁగాన్ = సంతోషింపఁగా, హరున్ = ఈశ్వరుని, ఒక్కటన్ = ఒక్కమాఱుగా, క్రక్కునన్ = శీఘ్రముగా, ముంచి, మీఁదికిన్ = పైకి, తేలఁగన్ + ఎత్తెన్ = తేలునట్లు ఎత్తెను, చుట్టెన్ = చుట్టుకొనెను, త్రిప్పులన్ + పెట్టెన్ = చిక్కులఁబెట్టెను.

తాత్పర్యము : ఆ సుందరమైన నవ్వుమొగముగల పార్వతి లలితములు, నిర్మలములు, కోమలములు, చంచలములు, మందములు, ఆసక్తములు, విశాలములు,

ప్రకాశవంతములగు అగుకన్నుల చూపులనెడి శృంగారరసప్రవాహము అచ్చట నిండుగాఁ బ్రవహించి, వెల్లువకట్టి, మన్మథుఁడు సంతోషింపఁగా నీశ్వరు నొక్కమాఱుగా శీఘ్రముగా ముంచి పైకిఁదేల్చెను, చుట్టుముట్టెను, చిక్కువఱిచెను.

విశేషములు : దృష్టిరసప్రవాహము = దృష్టియనెడి రసప్రవాహము-రూపకాలంకారము. 'ఆ లలితస్మితాస్య....దృష్టిరసప్రవాహము'-ఇందలి సమాసవచనబదము లాలంకారికపరిభాషకు సంబంధించినవి - వా. ప్రతి పీఠిక - శ్రీనిడుదవోలు వేంకటరావుగారు.

వ. ఇట్లు త్రినయనుం దన నయనవాగురులకు లోపుసేయుచు. 35

అర్థము : ఇట్లు, త్రినయనున్ = ముక్కంటిని - శివుని, తన, నయన-వాగురులకున్ = కన్నులనెడి - చూపులనెడి, వలలకు, లోపు + చేయుచున్ = లోపడునట్లు చేయుచు.

తాత్పర్యము : ఈ విధముగా బార్వతి ముక్కంటిని దనచూపులనెడి వలలలోఁ జిక్కువడునట్లు చేయుచు - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : నయన వాగురులు - నయనములనెడి వాగురులు - రూపకాలంకారము.

సీ. నగరాజతనయ పన్నగరాజధరు మ్రోల
నిలువుడు మదనుఁ డేటలవి నిలిచె;
నెలనాఁగ కరిబొమల్ వొలయింప నెత్తుడుఁ
జిత్తజుఁ డించువి ల్లెత్తుకొనియె;
హరిణాక్షి లసదపాంగాలోకనము నూలు
కొలుపుడు న మ్మరిగొలిపె మరుఁడు;
పతి నెఱ నూరఁ బార్వతి సూచు నుఱుచూడ్కు
లాడుడు నలరమ్ము లాడె నీళుఁ;

ఆ. గంతుఁ డేయఁదొడఁగె నంత నీశ్వరునకు
నచలవృత్తిఁ జలుపు నాత్మ విమల
యోగభావ మెడపి రాగోత్కటంబున
గౌరియందు నిలిపెఁ గన్ను, మనము. 36

అర్థము : నగ - రాజ - తనయ = పర్వతరాజపుత్రి - పార్వతి, పన్నగ-రాజ - ధరు = పాముఁతేనిని దాల్చినవాని - శివుని, మ్రోలన్ = ఎదుర, నిలువుడున్ = నిలిచినంతనే, మదనుఁడు = మన్మథుఁడు, ఏటలవి - నిలిచెన్ = ఏటునకు అందునంటరూపమున నిలిచెను, పార్వతి నిలిచినంతనే మన్మథుఁడును నిలిచె ననుట. అన్నిట నిట్లే గ్రహించునది.

ఎలనాఁగ = స్త్రీ - పార్వతి, కరి - బొమల్ = నల్లని కనుబొమలు, పొలయింపన్ = ప్రసరింపఁజేయునట్లు, ఎత్తుడున్ = ఎత్తినంతనే, చిత్తజుఁడు = మనోజుఁడు - మన్మథుఁడు, ఇంచు - విల్లు = చెఱకువిల్లు, ఎత్తుకొనియెన్ = ఎత్తెను.

హరిణ + అక్షి = లేడికన్నులవంటి కన్నులుగలది - పార్వతి, లసత్ + అపాంగ + ఆలోకనమున్ = ప్రకాశించుచున్న క్రీఁగంటిచూపును, నూలుకొలుపుడున్ = ప్రసరింపఁజేసినంతనే. మరుఁడు = మన్మథుఁడు, అమ్ము = బాణము, అరిన్ + కొలిపెన్ = నారియందుఁదొడిగెను.

పతి = భర్త, నెఱన్ + ఊరన్ = పూర్తిగా ఆసక్తిగలవాఁడగునట్లు, పార్వతి-చూచు, ఉఱు + చూడ్కులు = ఒప్పిన చూపులు, ఆడుడున్ = ప్రసరించినంతనే, అలరు + అమ్ములు = పుష్పబాణములు, ఈశున్ = ఈశ్వరుని, ఆడెన్ = నాటుకొనెను.

కంతుఁడు = మన్మథుఁడు, ఏయన్ + తొడంగెన్ = కొట్ట నారంభించెను.

అంతన్, ఈశ్వరునకున్, అచల - వృత్తిన్ = నిశ్చలమైన వర్తనముతో. చలుపు = చేయునట్టి, ఆత్మ - విమల - యోగ - భావము = తనదైన నిర్మలమైన తపస్సమాధి, ఎడపి = పోఁగొట్టి, రాగ+ఉత్కటంబునన్ = అనురాగాతిశయమున, కన్ను, మనము = మనస్సు, గౌరి + అందున్ = పార్వతిపై, నిలిపెన్ = నిలుచునట్లు చేసెను.

తాత్పర్యము : పార్వతి శివుని యెదుట నిలిచినంతనే, మన్మథుఁ డేటున కందునంతదూరమున నిలిచెను. పార్వతి నల్లనికనుబొమ లెత్తినంతనే, మన్మథుఁడు చెఱకువింటి నెత్తెను. ఆమె క్రీఁగంటిచూపును బ్రసరింపఁజేసినంతనే, మన్మథుఁడు బాణమును వింటఁదొడిగెను. భర్త పూర్తిగా నాసక్తి గలవాఁడగునట్లు ఆమె చూపులు ప్రసరింపఁజేసినంతనే, మన్మథుని పూవుటమ్ములు ఈశ్వరుని నాటుకొనెను. మన్మథుఁ డీశ్వరు నేయఁదొడఁగినంతనే, యీశ్వరుఁడు నిశ్చలతఁ జేయు తపస్సమాధిని భంగపఱిచి అనురాగాతిశయమునఁ బార్వతియందుఁ గన్ను, మనస్సు నిలిపెను.

విశేషములు : అలంకారము సహోక్తి. ఎలనాఁగ కరిబొమల్ వాలయింప నెత్తుడుఁ జిత్తజుఁ డించువి ల్లెత్తుకొనియె. - పార్వతి కనుబొమలు మన్మథుని యించువింటివలె నున్నవను నౌపమ్యము గ్రహించునది. అట్లే ఆమె 'లసదపాంగావలోకనము' నకును, 'అమ్మ'నకును ఔపమ్యము సిద్ధించుచున్నది. అట్లే ఆమె 'ఉఱుచూడ్కులు' 'మన్మథుని అలరమ్ముల'వలె నున్నవని గ్రహింపఁదగును.

లసదపాంగ - లసత్ + అపాంగ - ఋల్లనకు అచ్చుపరమగుచుండఁగాఁ దృతీయవర్ణాదేశము. చూచు + ఉఱు = చూచునుఱు, చలుపు + ఆత్మ - చలుపునాత్మ, 'ఉదంతమగు తద్ధర్మార్థవిశేషణమున కచ్చు పరమగునపుడు నుగాగమం బగు' బాల. సంధి.33. అలరు + అమ్ములు = అలరమ్ములు. 'కర్మధారయంబునందుఁ బేర్వాదిశబ్దముల కచ్చు పరంబగునపుడు టుగాగమంబు విభాష నగు,' బాల.సంధి. 29. 'ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధి యగు' బాల.సంధి.1. అలరమ్ములు. టుగాగమ మగుచో అలరుటమ్ములు, నిలుచుడున్ అనుటకు నిలువుడున్ అనుట విశేషము.

క. గిరిజ లలితాంగములు పొరిఁ
బొరిఁ గనుఁగొని సొగసి, యుసుకబొమ్మలు జలముల్
దెరలఁగ విరిసినగతిఁ బొది
విరిసి మహేశ్వరు మనంబు వికలం బయ్యెన్. 37

అర్థము : గిరిజ = పార్వతియొక్క, లలిత + అంగములు = మనోహరములైన అవయవములు, పొరిఁబొరిన్ = మాటిమాటికి, కనుఁగొని = చూచి, సొగసి = పరవశత్వముచెంది, మహేశ్వరు - మనంబు = ఈశ్వరుని మనస్సు, జల

ముల్ = నీళ్లు, తెరలఁగన్ = పొఱఁగా, ఇసుక - బొమ్మలు = ఇసుకతో నిర్మింపఁబడిన బొమ్మలు, విరిసిన - గతిన్ = విచ్చినరీతిని, పొదివిరిసి = బిగిచెడి - ధైర్య హీనమయి, వికలంబు + అయ్యెన్ = కలఁత చెందెను.

తా త్ప ర్య ము : పార్వతి మనోహరావయవములను మాటిమాటికిఁ జూచి, పరవశమయి, యీశ్వరుని మనస్సు నీళ్లు పొఱఁగనే యిసుకతోఁజేసిన బొమ్మలు విచ్చి పోవు విధమున బిగిచెడి కలఁగెను.

వి శే ష ము లు : అలంకార ముపమ.

గీ. వరదు ముఖదీప్తి వెడలి పార్వతి ముఖంబు
ప్రీతి విలసిల్లెఁ గలయఁ బేర్చిందు లెసఁగి,
వెలఁదివెన్నెలఁ దెలుపారి విరిసి మీఁద
మంచు పేరిన చెందొవ మాడ్కి వోలె. 38

అ ర్థ ము : వరదు = వరములనిచ్చువాని - భగవంతుని - ఈశ్వరునియొక్క, ముఖ - దీప్తి = ముఖకాంతి, వెడలి = వెడలుటచే. పార్వతి - ముఖంబు = పార్వతి మోము. కలయన్ = అంతటను. పేర్చిందులు=చెమట బొట్టులు, ఎసఁగి= అతిశయించి, ప్రీతిన్ = అనురాగముతో, వెలఁది - వెన్నెలన్ =స్వచ్ఛమైన వెన్నెల చేత, తెలుపారి = తెల్లనయి. విరిసి = వికసించి, మీఁదన్ = పైని, మంచు, పేరిన = అతిశయించిన, చెందొవ (చెన్ను + తొవ) = ఎఱ్ఱకలువ, మాడ్కి + వోలెన్ = విధమున, విలసిల్లెన్ = ప్రకాశించెను.

తా త్ప ర్య ము : ఈశ్వరుని ముఖకాంతి వ్యాపించుటచేఁ బార్వతి మోము అంతటను జెమటబొట్టు లతిశయించి, - స్వచ్ఛమైన వెన్నెలచేఁ దెల్లనయి. వికసించి, పైని మంచుకురిసిన యెఱ్ఱకలువవిధమునఁ బ్రీతితోఁ బ్రకాశించెను.

వి శే ష ము లు : అలంకార ముపమ. పార్వతి ముఖము చెందొవవలెను, వరదు ముఖదీప్తి వెలఁదివెన్నెలవలెను, పేర్చిందులు మంచువలెను ఉండెనని తెలియ వలయును.

చెందొవ.చెన్ను+తొవ 'సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు.' బాల.సంధి.36. చె + తొవ.' లుప్తశేషంబునకుం బరుషములు పరములగునపుడు నుగాగమం బగు.' బాల.సంధి 37. చె+ను + తొవ. 'ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళము లగు.' బాల.సంధి.16. చె+ను+దొవ. 'ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందుసంశ్లేషములు విభాష నగు.' బాల. సంధి. 17, చెందొవ. చెందొవ = ఎఱ్ఱకలువ. 'చెన్నుశబ్దము వృత్తిని శోణార్థకంబు,' బాల.సంధి.37, వృత్తి.

క. మెఱుఁగు లగు వాఁడిచూడ్కులు
నెఱఁకులు గాఁడఁగొన నగజ నెరవిడిఁ జూడం
దెఱపిగొనుకతనఁ గా కెదఁ
బెఱనాఁ డమ్మరుశరంబు భేదించు హరున్. 39

అర్థము: మెఱుఁగులు + అగు = తీక్ష్ణములగు, వాఁడి = పదనైన, చూడ్కులు = చూపులు, నెఱఁకులు = ఆయువుపట్టులు, కాఁడఁగొనన్ = గ్రుచ్చుకొనునట్లు, అగజ = పార్వతి, నెరవిడిఁజూడన్ = నిండుగాఁ జూడఁగా, తెఱపి-కొను - కతనన్ + కాక = సందేర్పడినకారణమునఁగదా. పెఱనాఁడు = ఇంకొక దినమున, ఆ + మరు - శరంబు = ఆ మన్మథుని బాణము, హరున్ ఈశ్వరుని. ఎదన్ = హృదయమును, భేదించున్ = బ్రద్దలుచేయును.

తాత్పర్యము: పార్వతి తన తీక్ష్ణములు. నిశితములు నైన చూపులు శివుని ఆయువుపట్టులను గ్రుచ్చుకొనునట్లు నిండుగాఁ జూడఁగా సందేర్పడినకారణముచేతఁ గదా ఇంకొకనాఁడు ఆ మన్మథుని బాణము హరుని హృదయమును భేదించును.

విశేషములు: అలంకార ముత్ప్రేక్ష, నెఱను-ఏకవచనము. నెఱఁకులు - బహువచనము, 'కలన్వాదుల నువర్ణంబు కుఙ్గు బహువచనము పరంబగునపుడు నిత్యముగా నగు.' బాల.అచ్చి.18 నెఱ + కుఙ్ + లు, 'ఙిత్తు బిందుపూర్వం బగు.' బాల.తత్సమ.19. నెఱఁకులు. ఎదఁ బెఱనాఁ డమ్మరుశరంబు భేదించు హరున్ - 'క్రియాన్వయంబున రెండుపదంబులకు స్వస్వామిసంబంధంబు గలచో సంబంధి పదంబు షష్ఠికి ద్వితీయ యగు.' ప్రౌఢ.కారక. 23. పెఱనాఁడు - 'కాలాధ్వములకుం బ్రాయికంబుగాఁ బ్రథమ యగు.' బాల.కారక.25.

వ. మఱియు నత్యాసక్తి ననురాగిల్లి. 40

అర్థము : మఱియున్, అతి + ఆసక్తిన్ = మిక్కిలికోరికతో, అను రాగిల్లి = అనురాగమునొంది.

తాత్పర్యము : మఱియును పార్వతి మిక్కిలికోరికతో ననురాగముచెంది. తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : అతి + ఆసక్తి - అత్యాసక్తి - యణాదేశసంధి. అనురాగిల్లు + అనురాగ + ఇంచు - 'సంస్కృతంబున కంగలాపుల కించు క్కగు.' బాల. క్రియ.63. 'రంజాదుల యించుక్పకారంబునకు సబిందుకంబున క్రేపేరణంబున ద్విరుక్తలకారం బగు.' బాల. క్రియ.71. అనురాగ + ఇల్లు. 'అంద్వవగాగమంబులం దప్ప నపదాదిస్వరంబు పరంబగునపు డచ్చునకు సంధి యగు.' బాల.సంధి.11. అనురాగిల్లు.

సీ. ఎలనారు కనుఁగవ బొలయించుఁ గ్రేవల
నెఱిగొని మెఱుఁగులు తుఱఁగలింపఁ,
గ్రొవ్విరి చిఱునవ్వు నవ్వు వాతెఱకాంతి
రంగిల్లి సితరుచుల్ తొంగలింపఁ,
గుదుటఁ గ్రక్కదరినఁ గదియించు గుదువిల్లు
సుడిసి ముత్తరఁగఁటఁ గడలుకొనఁగ,
సోలంబు నెఱనూరు సొగియు నుంజెమటపై
వదలి మేఁదీఁగ మవ్వంబు మిగుల

ఆ. నొత్తలించుఁ, దఱుమ నూఁకించుఁ, దాలిమి
కగ్గలించు, నెఱయ నప్పలించు
మదనశర విభిన్న హృదయాబ్జయై మహా
దేవుఁ జూచి గౌరిదేవి తివుట. 41

అర్థము : గౌరిదేవి = పార్వతీదేవి, మదన - శర - విభిన్న - హృదయ + అబ్జ + ఐ = మన్మథుని బాణములచే విశేషముగా భేదింపఁబడిన తామరవంటి హృదయముగలదియై, తివుటన్ = కోరికతో, మహా - దేవున్ = శివుని, చూచి.

ఎలరారు = ప్రకాశించు, కనుఁగవ = కనుదోయి, బొలయించు = ప్రసరింపఁ జేయునట్టి, ప్రేవలన్ = పార్శ్వములందు, నెఱిగొని = అందమయి, మెఱుఁగులు = కాంతులు, తుఱఁగలింపన్ = అతిశయింపఁగా,

క్రొవ్విరి (క్రొత్త + విరి) = క్రొత్తపూవుయొక్క, చిఱు-నవ్వున్ = ఇంచుకైన వికాసమును, నవ్వు = పరిహసించు, వాతెఱ-కాంతిన్ = పెదవికాంతిచేత, రంగిల్లి = ప్రకాశించి, పిత - రుచుల్ = తెల్లని కాంతులు, తొంగలింపన్ = ప్రకాశింపఁగా,

కుదుటన్ = మొదట, క్రక్కదరినన్ = మిక్కిలి చలింపఁగా, కదియించు = బిగించు, గుజ - విల్లు = గుడుసు - విల్లు - గుండ్రనివిల్లు, సుడిసి = చుట్టుకొని - క్రమ్మి, ముత్తరఁగలున్ (మూఁడు + తరఁగలు) = మూఁడువళులును, కడలుకొనఁగన్ = కలుగఁగా,

సోలంబు = పరవశత్వము. నెఱన్ + ఊరు = నిండుగా స్రవించు నట్టి, సొగియు = ఆనందపడు, నుంజెమటపైన్ (నునుపు + చెమట) = లేఁజెమటపై, వదలి, మేఁదీఁగ (మే + తీఁగ) = దేహలత, మవ్వంబు = మృదుత్వము, మిగులన్ = అతిశయింపఁగా,

ఒత్తలించున్ = ఒత్తరించున్ = వెడలఁగొట్టును, సమీపింపఁజూచును. తఱుమన్ + ఊఁకించున్ = తఱుముటకుఁ బూనును, తాలిమికిన్ = సహనమునకు, అగ్గలించున్ = అతిశయించును. నెఱయన్ = పూర్ణముగా, అప్పలించున్ = ఆక్రమించును,

తాత్పర్యము : పార్వతి మన్మథబాణములచే విశేషముగా భేదింపఁబడిన హృదయము గలదియై, కోరికతో శివునిఁజూచి, కనుదోయి ప్రసరింపఁజేయుకాంతులు పార్శ్వములందు అతిశయింపఁగను. క్రొంబూవు నీషద్వికాసమును బరిహసించు పెదవి కాంతిచేఁ బ్రకాశించి తెల్లనికాంతులు వెలుఁగొందఁగను, మొదట మిక్కిలి చలింపఁగా బిగించు గుండ్రనివిల్లు చుట్టుకొని మూఁడువళు లేర్పడఁగను, పారవశ్యముచే నెక్కు

వగాఁబట్టు లేఁజెమటపై వదలి దేహలత మృదుత్వము మీఱఁగను, వెడలఁగొట్టును, తఱుమ నుంకించును. ఓరిమిపట్టలేకపోవును. పూర్ణముగా నాక్రమించును.

వ. ఇట్లు మదనపరవశ యగుచున్న పార్వతి ముఖాలంకారంబు గనుం
గొని పొగిసి యా క్షణంబ. 42

అర్థము : ఇట్లు, మదన - పరవశ =మన్మథునకు లోనైనది, అగుచున్ + ఉన్న = అగుచున్నయట్టి. పార్వతి, ముఖ + అలంకారంబు = మొగముకై సేఁత, కనుంగొని, పొగిసి = ఆనందపడి, ఆ - క్షణంబు + అ = వెంటనే,

తాత్పర్యము: ఇట్లు మన్మథునకు లోనగుచున్న పార్వతి మోము కై సేఁతను జూచి శివుఁ డానందపడి వెంటనే - తరువాతి పద్యముతో నన్వయము.

ఉ. ఆ రుచిరాననాబ్జ దరహాస విలాస వికాస భాసి నీ
హారకరాతిభాతి నమలాంగ శరీర తుషారదీప్తి కాం
తోరునగంబు సమ్మదరసోత్కట ఘర్మజలంబు పర్వి పొ
ల్పారె హిమాచలంబు నమరాధిపవాహిని గప్పినట్టిదై. 43

అర్థము : ఆ రుచిరాననాబ్జ ........ భాతిన్ : ఆ - రుచిర = ఆ మనోహరమైన, ఆనన + అబ్జ = ముఖచంద్రునియొక్క, దర - హాస - చిఱునవ్వుయొక్క, విలాస = చక్కఁదనముయొక్క, వికాస = వికసనమువలె, భాసి= ప్రకాశించునట్టి, నీహార - కర + అతి - భాతిన్ = చంద్రుని మిక్కిలికాంతిచే - వెన్నెలచే, అమలాంగ .... నగంబు : అమల + అంగ = నిర్మలమైన (తెల్లని) శరీరముగలవానియొక్క, శరీర = మే ననెడి, తుషార - దీప్తి - కాంత = చంద్రకాంతపు, ఉరు- నగంబు = పెద్దకొండ, సమ్మద .... జలంబు - సమ్మద - రస = సంతోషరస మనెడి, ఉత్కట = అధికమైన, ఘర్మ - జలంబు = చెమటనీరు, పర్వి = వ్యాపించి, హిమ + అచలంబున్ = హిమవత్పర్వతమును, అమర + అధిప - వాహిని= ఇంద్రనది - అకాశగంగ, కప్పిన + అట్టిది + ఐ = క్రమ్మిన విధముననై, పొల్పారెన్ = ఒప్పెను.

తాత్పర్యము : పార్వతి ముఖచంద్రుఁడు కాయు చిఱునవ్వు అనెడి వెన్నెల కాంతిచే శివుని శరీరమనెడి చంద్రకాంతశిలాపర్వతము, సంతోషరసము అనెడి చెమట నీరు వ్యాపించి, హిమవత్పర్వతమును ఆకాశగంగ కప్పినట్లు ఒప్పెను.

విశేషములు : పార్వతి ముఖము చంద్రబింబమువలె నున్నది. అందలి చిఱునవ్వు వెన్నెలవలె నున్నది. వెన్నెలకాంతిచే శివుని శరీరమనెడి చంద్రకాంతశిలా పర్వతము సంతోషరసమనెడి చెమటనీరు వ్యాపించి హిమవత్పర్వతమును ఆకాశగంగ కప్పినట్లుండెను. అలంకారము రూపకానుప్రాణితమైన ఉపమ.

వ. మఱియుం గనుబేటంబైనఁ దావగొనక. 44

అర్థము : మఱియున్, కనుబేటంబు = కనుకలివలని అనురాగము. ఐనన్ = కాఁగా, తావ - కొనక = తాళలేక.

తాత్పర్యము : మఱియును గనుకలిచే ననురాగమునుబొంది శివుఁడు తాళ లేక - తరువాతి పద్యముతో నన్వయము.

సీ. పులకాంకురంబులు దలలెత్తి మేను కం
పింపఁ గోమలిఁ గౌఁగిలింపఁ దలఁచు;
రాగోత్కటమున సైరణలేక మానినిఁ
గాయ్వునఁ బైవడి కవయఁదలఁచు,
లలితాంగి యవయవంబులు సూచి మదిఁ దని
వోవక చూడ్కులఁ ద్రావఁదలఁచు;
నధరోష్ఠ మదరంగ నంతఃస్మితాంశులు
దలుకొత్త నేమేనిఁ బలుకఁదలఁచుఁ;

తే. దన మహత్త్వంబుఁ దలఁపక తరుణిపొందు
వడయఁ గీడ్పడి తేఁకువ వాపఁదలఁచు;
భావజాస్త్రాభిహతి మహాదేవుఁ డొక్క
ప్రేలిమిడిఁ బెంపునెడి కడు విరలిగొనియె. 45

అర్థము : శివుఁడు కర్త.

పులక + అంకురంబులు = గగ్గురుల మొలకలు, తలలు + ఎత్తి = పొటమరించి, మేను = శరీరము, కంపింపన్ = వడఁకఁగా, కోమలిన్ = సుందరాంగిని-పార్వతిని, కౌఁగిలింపన్ + తలఁచున్.

రాగ + ఉత్కటతమునన్ = అనురాగాతిశయమున, సైరణ-లేక = ఓర్పులేక, మానినిన్ = స్త్రీని - పార్వతిని, కాయ్యువనన్ = కాంక్షతో, పైపడి, కవయన్ = కూడ, తలఁచున్.

లలిత + అంగి = సుందరాంగి - పార్వతియొక్క, అవయవంబులు, చూచి మదిన్ = మనస్సునందు, తనివోవక - (తని + పోవక) = తృప్తిఁజెందక, చూడ్కులన్ = చూపులతో. త్రావన్ + తలఁచున్.

అధర + ఓష్ఠము = క్రిందిపెదవి, అదరంగన్=కంపింపఁగా, అంతస్(ః)+ స్మిత + అంశులు = లోని నవ్వు వెలుఁగులు, తలుకొత్తన్ = ప్రకాశింపఁగా. ఏమి + ఏని=ఏమయినను. పలుకన్ + తలఁచున్.

తన - మహత్త్వంబున్ =తన గొప్పతనమును, తలఁపక, తరుణి -పొందు= యువతియైన పార్వతిపొందు, పడయన్ = పొందుటకు, కీడ్పడి = తక్కువపడి, తేఁకువ = భయము, పాపన్ + తలఁచున్ = పోఁగొట్టుకొన నెంచును.

మహాదేవుఁడు, భావజ + అస్త్ర + అభిహతిన్ = మన్మథుని బాణముల దెబ్బచే, ఒక్క - వ్రేలిమిడిన్ = ఒక్క చిటికలో, పెంపు + చెడి = ఆధిక్యము నశించి, కడున్. విరలి + కొనియెన్ = మోహము నొందెను.

తాత్పర్యము : శివుఁడు గగ్గురుల మొలకలు పొటమరించి శరీరము వడఁకఁ బార్వతిని గౌఁగిలింపఁగోరును. అనురాగాతిశయమున ఓర్పునశించి యామెను గాంక్షతోఁ బైపడి కూడఁగోరును. ఆమె మనోహరావయవములు చూచి మనసునఁ దృప్తిఁజెందక చూపులతోఁ ద్రావనెంచును. క్రిందిపెదవి యదర లోనగవువెలుఁగులు ప్రకాశింప నేమయినను బలుకఁగోరును. అతఁడు తన గొప్పతనము నెంచక యువతి పొందుఁ గాంచుటకుఁ దక్కువతనమునొంది భయమును బోఁగొట్టుకొన నెంచును. ఇట్లు మహాదేవుఁడు మన్మథాస్త్రముల దెబ్బచే నొక్కచిటికలోఁ బెంపుచెడి మోహపడెను.

విశేషములు: ఎంత మహాదేవుఁడైనను మన్మథాస్త్రహతిచే సామాన్యుని వలెనే ప్రవర్తించుననుట కిట్లు వర్ణింపఁబడినది. అధరోష్ఠము = అధర + ఓష్ఠము- సమాసమున అకారాంతపదములకు ఓతుః, ఓష్ఠః అను పదములు పరములగునపుడు వృద్ధ్యాదేశము వైకల్పికము. వృద్ధి రానపుడు పరరూప మేకాదేశమగును.

వ. ఇట్లచలాత్ముండు చంచలాకులితహృదయుండై నిర్నిమిత్తంబ
మనోవికారం బగుటకు నేమి కారణంబో యని నలుగడలుం బరికించి
చూచునప్పు డసమాంబకు దృష్టిగోచరుండై. 46

అర్థము: ఇట్లు, అచల + ఆత్ముండు = నిశ్చలమైన ఆత్మకలవాఁడు -శివుఁడు, చంచల + ఆకులిత - హృదయుండు + ఐ= చంచలము, కలఁగినది యైన హృదయము గలవాఁడయి, నిర్నిమిత్తంబు + అ = కారణము లేకుండఁగనే, మనస్ (ః) + వికారంబు = మానసికమైన మార్పు, అగుటకున్, ఏమి, కారణంబు + ఓ, అని, నలుగడలున్ = నాలుగుదిక్కులును, పరికించి, చూచు + అప్పుడు, అసమ + అంబకు = (అసమాంబకుఁడు అని ప్రథమాంతము గా నుండుట అన్వయసుకరముగా నుండును.) మన్మథుఁడు, దృష్టి - గోచరుండు+ ఐ = కంటఁబడినవాఁడయి.

తాత్పర్యము: ఇట్లు నిశ్చలమనస్కుఁడగు శివుఁడు చంచలము, ఆకులితము నైన మనస్సుగలవాఁడయి, నిష్కారణముగాఁ దనకు మనోవికారము ఏలగలిగెనో యని నాలుగుదిక్కులు చూచినప్పుడు మన్మథుఁడు కంటఁబడినవాఁడయి - తరువాతి పద్యముతో నన్వయము.

తే. నవ తమాల లతా తతి నడుమఁ బుష్ప
చాప మండనహస్తుఁడై శంబరారి
తనరె నీలాభ్రపటలమధ్యమున నింద్ర
చాపహస్తుఁడై వెలుఁగు పర్జన్యులీల. 47

అర్థము: శంబరారి (శంబర + అరి) = శంబరుఁ డను రాక్షసునకు శత్రువైనవాఁడు - మన్మథుఁడు, నవ - తమాల - లతా-తతి - నడుమున్ = క్రొత్తదైన చీఁకటిమ్రాని తీఁగలగుంపు నడుమ, పుష్ప-చాప- మండన - హస్తుఁడు+ఐ=పూవిలు

అను అలంకారము చేతియందుఁగలవాఁడయి, నీల+అభ్ర - పటల - మధ్యమునన్= నల్లని మెఘముల గుంపు నడుమ, ఇంద్ర - చాప-హస్తుఁడు + ఐ = ఇంద్రధనుస్సు చేతియందుఁగలవాఁడయి, వెలుఁగు = ప్రకాశించు, పర్జన్య - లీలన్ = ఇంద్రుని విధమున, తనరెన్ = ఒప్పెను.

తా త్ప ర్య ము : మన్మథుఁడు క్రొత్త చీఁకటిమ్రాని తీవలగుంపునడుమఁ బూవిల్లనెడి యలంకారమును జేతఁ దాల్చి, నల్లనిమేఘముల నడుమ నింద్రధనుస్సును జేతఁదాల్చి వెలుఁగునింద్రునివలె నొప్పెను.

వి శే ష ము లు : అలంకార ముపమ.

# మ న్మ థ దా హ ము

వ. అంతకాంతకుండు కంతుం గనుంగొని కోపించి ప్రళయకాలాగ్ని రౌద్రోద్రేకంబునం బెరిఁగి దహనాంబకంబు విచ్చి చూచిన. 48

అ ర్థ ము : అంతక + అంతకుండు = యముని అంతమొందించినవాఁడు-శివుఁడు, కంతున్ = మన్మథుని, కనుంగొని = చూచి, కోపించి, ప్రళయ - కాల+అగ్ని- రౌద్ర + ఉద్రేకంబునన్ = ప్రళయసమయమునందలి అగ్నియొక్క క్రోధాతిశయమున, పెరిఁగి = వృద్ధిచెంది, దహన + అంబకంబున్ = అగ్నినేత్రమును, విచ్చి = విప్పి, చూచినన్ = చూడఁగా.

తా త్ప ర్య ము: శివుఁడు మన్మథుని జూచి కోపించి ప్రళయసమయమునందలి యగ్ని విజృంభణముతోఁ బెరిఁగి యగ్నినేత్రమును దెఱచి చూడఁగా - తరువాతి పద్యముతో నన్వయము.

వి శే ష ము లు : ఇచ్చట 'అంతకాంతకుఁ' డను విశేష్యము సాభిప్రాయము, అంతకునే అంత మొందించినవానికిఁ గంతుఁ డెంత ? యని భావము. అలంకారము పరికరాంకురము. 'సాభిప్రాయే విశేష్యే తు భవేత్పరికరాఙ్కురః, - చన్ద్రా. కావ్యార్థాపత్తియు. 'కైముత్యేనార్థసంసిద్ధిః కావ్యార్థాపత్తి రిష్యతే.' చన్ద్రా. అంబకము = (నానా.) కన్ను, బాణము.

చ. పొగయక రాఁజ కొక్కమొగి భోరన మంటలు విస్ఫులింగముల్
నెగసి రయంబునం గలయ నిండి ఛటచ్ఛట భుగ్భుగ ద్ధగ
ద్ధగ యని మండి పంచశరు దగ్ధము సేయుచ యా క్షణంబులో
మగిడి పురారినేత్రశిఖి మల్చె మహాశనిపాతభీమమై. 49

అర్థము: పుర + అరి - నేత్ర - శిఖి = త్రిపురములకు శత్రువగు ఈశ్వరునియొక్క కంటిమంట, పొగయక = పొగచిమ్మక, రాఁజక = రగులు కొనక, ఒక్క మొగిన్ = ఒక్కపెట్టున, భోరనన్ = శీఘ్రముగా, మంటలు, విస్ఫులింగముల్ = మిడుఁగుఱులు, నెగసి = పైకి లేచి, రయంబునన్ = వేగముతో, కలయన్ = అంతటను, నిండి, ఛట + ఛట = ఛట ఛట యనుధ్వనితో, భుగ్ భుగత్ = భుగ భుగమనుచు, ధగత్ + ధగ + అని = ధగధగ అని, మండి, పంచశరున్ = అయిదుబాణములు గలవానిని - మన్మథుని, దగ్ధము + చేయుచున్ + అ = కాల్చుచునే, ఆ - క్షణంబులోన్ = అప్పుడే, మహత్ (మహా) + అశని - పాత - భీమము + ఐ = గొప్ప పిడుగుపాటువలె భయంకరమయి, మగిడి = మరలి, మల్చెన్ = ఉపశమిల్లెను.

తాత్పర్యము: శివుని కంటిమంట పొగలు చిమ్మక, రగులుకొనక ఒక్కపెట్టున శీఘ్రముగా మంటలు, మిడుఁగుఱులు పైకిలేచి వేగముగా అంతటనునిండి ఛటఛట, భుగభుగ, ధగధగ యని మండి మన్మథుని గాల్చుచునే, ఆ క్షణములోనే గొప్ప పిడుగుపాటువలె భయంకరమై తిరిగివచ్చి ఉపశమిల్లెను.

విశేషములు: మహాశనిపాతభీమమై - అలంకార ముపమ. ఛటఛట, భుగభుగ, ధగధగ - మండుటలోని ధ్వన్యనుకరణ శబ్దములు, ప్రకరణసముచితమైన శబ్దప్రయోగమూచేఁ గవి మన్మథదాహమును బఠితల కన్నులకుఁగట్టించినవిధ మతి హృద్యము.

చేయుచ - చేయుచున్ + అ = 'ప్రథమేతరవిభక్తి శత్రర్థమవర్ణంబులందున్న యుకారమునకు సంధి వైకల్పికముగా నగును.' బాల.సంధి.2. ఇది సంధియైన రూపము. సంధి కానిచో 'చేయుచున' అగును.

క. నిటలాక్ష వహ్ని కడు ను
త్కటమై తరతరము మీఁదఁగప్పిన మదనుం
డిట యట మెదలఁగనేరక
పటుతరశిఖిశిఖలఁ గాలి భస్మం బయ్యెన్. 50

అర్థము : నిటలాక్ష - వహ్ని = నొసటికంటియగ్గి, కడున్ = మిక్కిలి, ఉత్కటము + ఐ = ఉగ్రమయి, తరతరము = క్రమముగా, మీఁదన్ + కప్పినన్ = పయిని గ్రమ్మఁగా, మదనుండు = మన్మథుఁడు, ఇట - అట = ఇటునటు, మెదలఁగన్ + నేరక = కదలఁజాలక, పటు - తర - శిఖి - శిఖలన్ = తీవ్రతరములైన అగ్నిజ్వాలలచే, కాలి, భస్మంబు + అయ్యెన్ = బూడిద అయ్యెను.

తాత్పర్యము : నొసటికంటి యగ్గి మిక్కిలి ఉగ్రమయి క్రమక్రమముగాఁ బైని గ్రమ్మఁగా మన్మథుఁడు ఇటునటు కదలలేక తీవ్రతరాగ్నిజ్వాలలచేఁ గాలి బూది యయ్యెను.

విశేషములు: నిటలాక్షవహ్ని - బహువ్రీహిసమాసమయినచో నిటలాక్షవహ్ని అనియుండును. అప్పుడు శివునివహ్ని అని యర్థము. అట్లుగాక నిటలమునందలి కంటి వహ్ని అని తత్పురుషమయినచో నిటలాక్షివహ్ని అని యుండనగును. ఇట, అట - ఇచ్చటఁ గళలుగా వాడఁబడినవి.

క. కని కోపించెనొ, కానక
మును కోపించెనొ, మహోగ్రముగ నుగ్రుఁడు చూ
చినఁ గాలెనొ, చూడక యట
మును గాలెనొ, నాఁగ నిమిషమున నఱఁ గాలెన్. 51

అర్థము : ఉగ్రుఁడు = శివుఁడు, మహత్ (మహా) + ఉగ్రముగన్ = మిక్కిలి భయంకరముగా, కని = చూచి, కోపించెనొ, కానక - మును = చూడక ముందు, కోపించెనొ, చూచినన్ = చూచినపిమ్మట, కాలెనొ, చూడక + అట - మును = చూచుటకుముందు, కాలెనొ, నాఁగన్ = అనఁగా, నిమిషమునన్ = తెప్పపాటుకాలములో, అఱన్ = నశించునట్లు, కాలెన్.

తాత్పర్యము: ఉగ్రుఁడు మిక్కిలి భయంకరముగాఁజూచి కోపపడెనో, చూడకముందు కోపపడెనో, చూచినపిమ్మట మన్మథుఁడు కాలెనో, చూచుటకుముందు కాలెనో యన నతఁడు తెప్పపాటుకాలములో నశించునట్లు కాలెను.

విశేషములు: ఉగ్రుఁడు సాభిప్రాయ విశేష్యము గావున నలంకారము పరికరాంకురము. కాలుట యను కార్యము ముందును, చూచుట యను కారణము తరువాతను జరిగినట్లు సందేహించుటచే సందేహానుప్రాణితమైన అత్యంతాతిశయోక్త్యలంకారము. 'అత్యన్తాతియోక్తి స్స్యా త్పౌర్వాపర్యవ్యతిక్రమే - చన్ద్రా. అఱన్-అఱు ధాతు తుమున్నంతరూపము.

క. గిరిసుత మేఁ గామాగ్నియు,
హరు మే రోషాగ్నియుం, దదంగజు మేను
ద్ధురకాలాగ్నియు, రతి మే
నురు శోకాగ్నియును రగిలి యొక్కట నెగసెన్. 52

అర్థము: గిరి-సుత-మైన్ = కొండకూఁతురైన పార్వతి శరీరమున, కామ + అగ్నియున్ = మన్మథాగ్నియును, హరు - మైన్ = శివుని శరీరమున, రోష + అగ్నియున్ = కోపమనెడి అగ్నియును, తద్ + అంగజు - మైన్ = ఆ మన్మథుని శరీరమున, ఉద్ధుర = తీవ్రమైన, కాల + అగ్నియున్ = ప్రళయాగ్నియును, రతి - మైన్ = రతి శరీరమున, ఉరు - శోక + అగ్నియును = గొప్ప దుఃఖమనెడి అగ్నియును, రగిలి = రాఁజుకొని, ఒక్కటన్ = ఒక్కమాఱుగా, నెగసెన్ - ఎగసెన్ = పైకి లేచెను.

తాత్పర్యము: పార్వతి శరీరమున మన్మథాగ్నియు, ఈశ్వరుని శరీరమునఁ గోపాగ్నియు, ఆ మన్మథుని శరీరమునఁ దీవ్రమైన కాలాగ్నియు, రతి శరీరమున గొప్ప దుఃఖాగ్నియు రాఁజుకొని యొక్కమాఱుగాఁ బైకిలేచెను.

విశేషములు: కామాగ్ని, రోషాగ్ని, శోకాగ్ని - రూపకములు.

చ. అనలశిఖాలిఁ గాంచి యభయం బభయం బని దేవతల్ నభం
బునఁ జెలరేఁగి చీఱుటకుమున్న మనోభవు నీఱుచేసి పో
యినఁ గని దిక్పతుల్ సురలు నింద్రుఁడు శోకభయార్తులై మరుం
బనవుచుఁ బాఱి రొండొరుల పట్టులు గానక భీ వికారులై. 53

అర్థము : అనల - శిఖా + ఆలిన్ = అగ్నిజ్వాలల వరుసను, కాంచి= చూచి, అభయంబు + అభయంబు = శరణు శరణు, అని, దేవతల్, నభంబునన్ = ఆకాశమున, చెలరేఁగి=విజృంభించి, చీఁకుటకున్+మున్ను +అ=పిలుచుటకుముందే, (శివుఁడు,) మనోభవున్ = మనసిజుని - మన్మథుని. నీఱు - చేసి = బూదిచేసి, పోయినన్ = పోఁగా, కని, దిశ్ (క్) + పతుల్ = దిక్పాలకులు, సురలు = దేవతలు, ఇంద్రుఁడు, శోక - భయ + ఆర్తులు + ఐ = దుఃఖముచేతను, భీతిచేతను పీడితులయి, మరున్ = మన్మథునిగూర్చి, పనవుచున్ = పేర్కొని దుఃఖించుచు, భీ-వికారులు + ఐ = భయమువలన వికృతి చెందినవారయి, ఒండొరుల-పట్టులు= ఒక్కొక్కరి స్థానములు. కానక, పాఱిరి = పరువెత్తిరి.

తాత్పర్యము : అగ్నిజ్వాలలవరుసను జూచి శరణుశరణని దేవతలు ఆకాశమున విజృంభించి పిలుచుటకుముందే యీశ్వరుఁడు మన్మథుని బూదిచేసిపోఁగా, దిక్పాలకులు, దేవతలు, ఇంద్రుఁడు చూచి దుఃఖముతోను, వెఱపుతోను పీడితులై, మన్మథుని పేర్కొని యేడ్చుచు భయముచే వికృతిని పొందినవారయి, యొక్కొక్కరి స్థానములు కానక పాఱిపోయిరి.

విశేషములు : నీఱు - బూడిద, నీరు = జలము.

వ. తదనంతరంబు. 54

అర్థతాత్పర్యములు : తద్ + అనంతరంబు + అ = ఆ పిమ్మటనే - తరువాతి పద్యముతో నన్వయము.

క. తన నగసుతపై రాగము
మనసిజుపై ద్వేషముం గ్రమంబున నైనం
జనియెఁ దప ముడిగి ; శివుఁ డెడ
పని రాగద్వేషములఁ దపము సెడు దరుదే ? 55

అర్థము : తనకున్, అగ - సుత - పైన్ = కొండకూఁతుపై - పార్వతిపై, రాగమున్ = ప్రేమమును, మనసిజుపైన్ = మన్మథునిమీఁద, ద్వేషమున్ =కోపమును, క్రమంబునన్ = వరుసగా, ఐనన్ = కాఁగా, శివుఁడు, తపము, ఉడిగి =

మాని, చనియెన్ = పోయెను, ఎడపని = విడువని, రాగ - ద్వేషములన్ = రాగము చేతను, ద్వేషముచేతను, తపము, చెడుడు = చెడుట, అరుదే = ఆశ్చర్యమా?

తాత్పర్యము : తనకుఁ బార్వతిపై ననురాగము, మన్మథునిపైఁ గోపము క్రమముగాఁ గాఁగా, శివుఁడు తపముమాని పోయెను. విడువని రాగద్వేషములచేఁ దపము భంగపడుట ఆశ్చర్యమా? కా దనుట.

విశేషములు : విశేషమును సామాన్యముచే సమర్థించుటచే నలంకార మర్థాంతరన్యాసము. భావార్థక టవర్ణకమునకు బదులుగా డువర్ణమును ప్రయోగించుట యీ కవికిఁ బరిపాటి.

వ. ఇట్లు గిరిశుండు రజతగిరి కరిగిన గిరిజ హరవిరహతాపంబునం బరవశయై పడియుండె నంత నంతవృత్తాంతంబు హిమవంతుం డెఱింగి రయంబునం జనుదెంచి యా క్షణంబున. 56

అర్థము : ఇట్లు, గిరిశుండు = కొండపై (కైలాసమున) పరుండువాఁడు-ఈశ్వరుఁడు, రజత-గిరికిన్ = వెండికొండకు - కైలాసమునకు, అరిగినన్ = వెడలఁగా, గిరిజ = పార్వతి, హర - విరహ - తాపంబునన్ = ఈశ్వరునితోడి ఎడఁబాటువలని దుఃఖముచే, పరవశ + ఐ = ఒడలుతెలియని దయి, పడి + ఉండెన్, అంతన్, అంత-వృత్తాంతంబున్, హిమవంతుండు, ఎఱింగి, రయంబునన్ = వేగముగా, చనుదెంచి= వచ్చి, ఆ - క్షణంబునన్.

తాత్పర్యము : ఇట్లు శివుఁడు కైలాసమున కేఁగఁగాఁ, బార్వతి శివవియోగ బాధచే నొడలు తెలియక పడియుండెను. అంత నంతవృత్తాంతమును హిమవంతుఁ డెఱిఁగి వేగమే వచ్చి ఆ క్షణమునందు-తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : గిరిశుఁడు - గిరౌ శేతే ఇతి గిరిశః - గిరి యందుఁ బరుండు వాఁడు - శివుఁడు. 'భూతేశః ఖణ్డపరశు ర్గిరీశో గిరిశో మృడః.' అమరము.

తే. కీలు ప్రిదిలి తటిల్లత నేలఁబడిన
బరవసంబున శారదాభ్రంబు మగుడ
నెత్తికొనిపోవుగతి నుమ హిమనగేంద్రుఁ
డెత్తుకొని నిజపురమున కేఁగె నంత. 57

అర్థము: అంతన్ = కీలు - ప్రిదిలి = అతుకు ఊడి, తటిల్లత (తటిత్ + లత) = మెఱపుఁదీఁగ, నేలన్ + పడినన్ = నేలపైఁబడఁగా, శారద + అభ్రంబు = శరత్కాలపుమేఘము, మగుడన్ = మరల, బరవసంబునన్ = పట్టుదలతో, ఎత్తికొని - పోవు - గతిన్ = ఎత్తుకొనిపోవు విధమున, హిమ - నగ + ఇంద్రుఁడు = హిమవత్పర్వతశ్రేష్ఠుఁడు, ఉమన్ = పార్వతిని, ఎత్తుకొని, నిజ - పురమునకున్ = తన పురమునకు, ఏఁగెన్.

తాత్పర్యము: అంత అతుకు ఊడుటచే మెఱపుఁదీఁగ నేలఁబడఁగా దానిని శరన్మేఘము మరలఁ బట్టుదలతో నెత్తుకొనిపోవు విధమున పర్వతశ్రేష్ఠుఁడగు హిమవంతుఁడు ఉమను ఎత్తుకొని తన నగరమున కరిగెను.

విశేషములు; అలంకారము త్ప్రేక్ష. శరత్కాలమునఁ బుట్టినది శారదము.

'దుహితర మనుకమ్ప్య మద్రి రాదాయ దోర్భ్యామ్
సురగజ ఇవ బిభ్రత్ పద్మినీం దన్తలగ్నామ్'.

అని కాళిదాసు, సాధారణముగా నన్నెచోడుఁడు కాళిదాసుచెప్పినభావము నెచ్చటను ఆంధ్రీకరింపఁడు. అట్టి రమ్యభావమునే వేఱొకదానిని స్వతంత్రించి చెప్పును. హిమవంతుఁడు మంచుచేఁ గప్పఁబడి తెల్లగానుండుటచే నతనికి శారదాభ్రముతోఁ బోలిక, పార్వతి హిమవత్తనూజ కావున నభ్రసంగతతటిల్లతతో నామెకుఁ బోలిక.

తటిల్లత - తటిత్ + లత = తవర్గ వర్ణములకు లకారము పరమగుచో పర సవర్ణము ఆదేశమగును.

## రతివిలాపము

వ. ఇట్లు రతి పతి నగ్నిశిఖలు గప్పుడు భయరసావేశంబునం దల్లడిల్లి. 58

అర్థము: ఇట్లు, రతి, పతిన్ = భర్తను, అగ్ని - శిఖలు = అగ్నిజ్వాలలు, కప్పుడున్ = క్రమ్మినంతనే, భయ - రస + ఆవేశంబునన్ = భయరసోద్రేకముచే, తల్లడిల్లి = కలఁగి.

తాత్పర్యము: ఇట్లు రతి తనభర్తను అగ్నిజ్వాలలు క్రమ్మినంతనే భయాతిశయముచేఁ గలఁగి - తరువాతి పద్యముతో నన్వయము.

క. పరవశయై పడి రతి చె
చ్చెరఁ దెప్పిఱి లేచి చూచి శిఖిపొడవు నిజే
శ్వరు పొడవుఁ గాన కచ్చటఁ
బురుషాకృతి నున్న భస్మపుంజముఁ గాంచెన్. 59

అర్థము : రతి, పరవశ + ఐ = ఒడలుతెలియనిదయి, పడి, చెచ్చెరన్ = శీఘ్రముగా, తెప్పిఱి = తేఱుకొని, లేచి, చూచి, శిఖి - పొడవు = అగ్నిజాడ, నిజ + ఈశ్వరు - పొడవున్ = తనభర్త యాకృతిని, కానక = చూడక, అచ్చటన్, పురుష + ఆకృతిన్ = పురుషుని ఆకారముతో, ఉన్న, భస్మ - పుంజమున్ = బూదిరాశిని, కాంచెన్.

తాత్పర్యము : రతి యొడలుతెలియనిదయి పడి వెంటనే తెప్పిఱిల్లి లేచి చూచి అగ్నిజాడగాని, తనభర్త ఆకారముగాని చూడక అచ్చటఁ బురుషుని యాకారమున నున్న బూదిరాశిని జూచెను.

విశేషములు : 'అచ్చటఁ, బురుషాకృతినున్న భస్మపుంజముఁ గాంచెన్'- కాళిదాసీయమునను ఇట్లే కలదు, 'దదృశే పురుషాకృతి క్షితౌ హర కోపానల భస్మ కేవలమ్.'

వ. కని కలవలించుచు. 60

అర్థ తాత్పర్యములు : కని = చూచి, కలవలించుచున్ = కలవరించుచు- కలఁతనొందుచు- చూచి కలఁతనొందుచు . తరువాతి పద్యముతో నన్వయము.

తరువోజ. కాయజుఁ డా యగ్నిఁ గాలెనొ! నెఱయఁ
గాలంగ నెడ యెద్ది? కడు భీతిఁ బాఱి
పోయెనో? ననుఁ బెట్టి పోవునే? కడచి
పోయిన నీ భస్మపుంజ మెక్కడిది?
మాయయో యిది? యని మది యులుఁ బొదల
మ్రాఁకుల చెట్టుల మఱువునఁ గలయ
నా యింతి భ్రమఁగొని యడలడి సంశ
యాకులచిత్తయై యాత్మేశు రోసె. 61

61

అర్థము ; కాయజుఁడు = అంగజుఁడు - మన్మథుఁడు. ఆ + అగ్నిన్ = ఆ యగ్నియందు, కాలెనొ, నెఱయన్ = పూర్తిగా, కాలంగన్ = కాలుటకు, ఎడ = వ్యవధి, ఎద్ది = ఏది?, కడున్ + భీతిన్ = మిక్కిలి భయముతో, పాఱిపోయెనో. ననున్, పెట్టి = దిగవిడిచి, పోవునే, కడచి - పోయినన్ = పాఱిపోయినచో, ఈ. భస్మపుంజము = ఈ బూడిదప్రోవు, ఎక్కడిది ? ఇది, మాయయో, అని, మది = మనస్సు, అఱన్ = సందేహముతో, పొదల, మ్రాఁకుల = పెద్దచెట్లయొక్క, మఱువునన్ = చాటున, కలయన్ = అంతటను, ఆ + ఇంతి = ఆ స్త్రీ (రతి), భ్రమ + కొని = భ్రాంతిగొని, అడలడిన్ = దుఃఖముతో, సంశయ + ఆకుల-చిత్త + ఐ = సందేహముచేఁ గలఁగిన, మనస్సుగలదయి, ఆత్మ + ఈశున్ = తన భర్తను, రోసెన్ = వెదకెను.

తాత్పర్యము : 'మన్మథుఁడు ఆ యగ్నిలోఁ గాలెనో ? పూర్తిగాఁ గాలిపోవుటకు అవకాశమేది ? మిక్కిలి భయమునఁ బాఱిపోయెనో ? నన్ను విడిచిపెట్టిపోవునా ? విడిచిపోయినచో నీ బూదిరాశి యెక్కడిది ? ఇది మాయయో ?' అని మనస్సందేహముతోఁ బొదల, చెట్ల మాటున నంతటను ఆమె భ్రాంతితో, దుఃఖముతో, సందేహముతోఁ గలఁగిన మనస్సుతోఁ దన భర్తను వెదకెను.

అలంకారము హేత్వపహ్నవము.

విశేషములు : మ్రాఁకులు - మ్రాను + లు, 'కలన్వాదుల నువర్ణంబు కుజ్జగు, బహువచనము పరంబగునపుడు నిత్యముగా నగు.' బాల, ఆచ్ఛిక. 8. మ్రా + కుజ్ + లు 'జిత్తు బిందుపూర్వం బగు.' బాల, తత్సమ. 19. మ్రాఁకులు. తరువోజ లక్షణము: నాలుగుపాదము లుండును. ప్రతిపాదమునను మూఁ డింద్రగణములు, ఒక సూర్యగణము, మరల మూఁ డింద్రగణములు, ఒక సూర్యగణము ఉండవలయును, మొదటిగణము మొదటియక్షరమునకును, మూఁడవగణము మొదటి యక్షరమునకును. మరల నైదవగణము మొదటి యక్షరమునకును, ఏడవగణము మొదటి యక్షరమునకును యతిమైత్రి. ప్రాసనియమము గలదు.

వ. వెండియు నన్వేషించి ప్రలాపించుచు. 62

అర్థతాత్పర్యములు ; వెండియున్ = మరల, అన్వేషించి = వెదకి, ప్రలాపించుచున్ = ఏడ్చుచు - మరల వెదకియేడ్చుచు - తరువాతి పద్యముతో నన్వయము.

తే. నన్ను నొరయంగఁ బాడియే నాథ! యిచటఁ
బొడవుసూపక డాఁగితి పొదలలోన
నిన్నుఁబాసి జీవింతునే నిమిషమైనఁ
గామరహితంబుగా రతి గలదె యెందు? 63

అర్థము : నాథ, ఇచటన్, నన్నున్, ఒరయంగన్ + పాడియే=పరీక్షించుట న్యాయమా? పొడవు + చూపక = ఆకారమును జూపక, పొదలలోనన్, డాఁగితి = దాఁగుకొంటివి, నిన్నున్, పాసి = విడిచి, నిమిషము + ఐనన్, జీవింతునే = బ్రదుకుదునా?, ఎందున్ = ఎచ్చటనైనను, రతి = రతిదేవి, సంభోగసౌఖ్యము, కామ-రహితంబుగాన్ = మన్మథుఁడు లేకుండ, కోరికలేకుండ, కలదె?

తాత్పర్యము : 'నాథా! నన్ను ఇచ్చటఁ బరీక్షించుట న్యాయమా?' నీవు నాకుఁ గనఁబడక పొదలలో డాఁగుకొంటివి. నేను నిన్ను విడిచి ఒకనిమిషమైనను బ్రదుకఁగలనా? ఎచ్చటనైనను గామవిరహితముగా రతి యుండునా?

విశేషములు : అలంకారము శ్లేషానుప్రాణితమైన అర్థాంతరన్యాసము.

డాఁగితి = డాఁగితివి. 'లిడ్లాట్టుల వకారంబునకు లోపంబు విభాష నగు.' బాల.క్రియ.24. డాఁగితి+ఇ. 'అంద్వవగాగమంబులందప్పు నపదాదిస్వరంబు పరంబగు నపు డచ్చునకు సంధి యగు.' బాల.సంధి.11, డాఁగితి.

క. రతిహితుఁడ వనఁగ నెప్పుడు
రతిసంగతి నుండుదీవు; రతి నిప్పుడు దుః
ఖితఁజేసి పోయి తక్కట!
రతి వంచనచేసి పోక రసికుల గుణమే! 64

అర్థము : ఈవు = నీవు, రతి - హితుఁడవు = రతిదేవికి - సంభోగానందమునకు, ఇష్టుఁడవు, అనఁగన్, ఎప్పుడున్. రతి - సంగతిన్ = రతిదేవితోఁ గూడ, ఆనందముతోఁగూడ, ఉండుదు = ఉండుదువు, అక్కటా! = అయ్యో! ఇప్పుడు, రతిన్ = రతిదేవిని - రతియందు, దుఃఖితన్ + చేసి = దుఃఖించినదానినిగాఁ జేసి, పోయితి = పోయితివి, రతిన్ = రతిని - సంభోగమునందు, వంచన- చేసి= మోసగించి, పోక = పోవుట, రసికుల - గుణమే = సరసులయినవారి లక్షణమా?

తాత్పర్యము : నీవు రతికి హితుఁడవనఁగా నెప్పుడును రతితోనే యుందువు. అయ్యో! ఇప్పుడు రతిని దుఃఖితురాలినిజేసి పోయితివి. ఇట్లు రతిని వంచించిపోవుట సరసులైనవారి లక్షణమా? కా దనుట.

విశేషములు : అలంకారము శ్లేషము. అర్థాంతరన్యాసము. రతి వంచనచేసి- ఇట రతిన్ అనుదానికి మన్మథభార్యార్థమున 'రతిని' అని ద్వితీయార్థమును, సంభోగార్థమున 'రతి యందు' అని సప్తమ్యర్థమును జెప్పనగును.

ఉండుదు-ఉండుదువు. లాద్వకారలోపము, బాల.క్రియ. 24. అపదాదిస్వరసంధి. బాల.సంధి.11. పోక - పోవు ధాతువు. 'కవర్ణకం బలుగ్వాదుల కగు.' బాల.కృ.3. పోవు+క. 'ఇటం గృత్కృ గతప వేములు పరంబు లగునపుడు కగచయ వలకు లోపంబగు.' బాల. కృ.2. పోక, పోయితి - లిద్వకారలోపము, అపదాదిస్వర సంధి. పోయితక్కట. పోయితి + అక్కట, 'మధ్యమపురుషక్రియలయం దిత్తునకు సంధి యగును.' బాల.సంధి.7. పోయితక్కట.

తే. అబలఁ, గడు నెడ యెఱుఁగని యాఁటదాన,
మెలఁత, నతిభీత నన్ను నమ్మించి తెచ్చి
కాననంబులోఁ గన్నులుకట్టి కాడు
పఱిచి నీ కిట్లు పోఁజన్నె భావజన్మ? 65

అర్థము : భావజన్మ = మనసిజుఁడా! మన్మథుఁడా!, అబలన్ = స్త్రీని - బలహీనను, కడున్ = మిక్కిలి, ఎడ = లోకవ్యవహారము, ఎఱుఁగని = తెలియని, ఆఁట దానన్ = ఆఁడుదానను, మెలఁతన్ = స్త్రీని, అతి - భీతన్ = మిక్కిలి భయపడినదానను, నన్నున్, నమ్మించి, తెచ్చి, కాననంబులోన్ = అడవిలో, కన్నులు - కట్టి = కన్నులుకప్పి- మోసగించి, కాడుపఱిచి = క్షోభపెట్టి, ఇట్లు. పోన్ = పోవుటకు, చన్నె = చనునె- తగునే?

తాత్పర్యము: మన్మథా! నేను అబలను. వ్యవహారజ్ఞానమేమాత్రము లేని యాఁడుదానను. మిక్కిలి భయపడినదానను. నన్ను నమ్మించి తెచ్చి యడవిలోఁ గన్నులుగప్పి క్షోభపెట్టి, యిట్లు పోవుట నీకుఁ దగునా? తగ దనుట.

విశేషములు ; మన్మథుఁడు తన్ను విడిచిపోఁగూడమికి అబలను, కడు నెడ యెఱుఁగని యాఁటదానను, అతిభీతను అనువానిని గారణములుగాఁ జెప్పి సమర్థించుటచే నలంకారము కావ్యలింగము, 'సమర్థనీయ స్యార్థస్య కావ్యలిఙ్గం సమర్థనమ్.' చన్ద్రా.

పోఁజన్నె - పోన్ + చన్నె - పోవుధాతువు, 'తుమర్థ భావలక్షణంబులందు నుజీ యగు' బాల, క్రియ.40, పోవు + నుజీ. 'ముజ్జీత్తులు ముత్తు నాఁబడు.' బాల. క్రి. 86. 'పోవునకు దుజ్మత్తులు ముజ్జుం బరంబులగునపుడు వులోపంబుం బొదపదలును విభాష నగు. బాల, క్రియ.98. పోను + చన్నె. చనునె - చను + ఎ. 'ఒకానొకచోఁ దద్ధర్మార్థకంబులగు నుండు. చను, చేరుకొనులు ప్రశ్నార్థకై కారపరకంబు లగునపుడు వాని కడయచ్చులకు లోపంబు విభాష నగు.' ప్రౌఢ.క్రియ.2. చన్నె, పోను + చన్నె- ద్రుతకార్యము. బాల.సంధి. 16,17. పోఁజన్నె. కాననము (ప్రకృతి)- కాన (వికృతి).

వ. అని ప్రలాపించుచు మగుడం జనుదెంచి పుష్పకోదండ పల్లవ చ్ఛత్ర మకరకేతనంబుల నచ్చుపడియున్న మరు భస్మాకారంబుఁగని త్రినయన నయనానలాహతుం డగుట నిశ్చయించి శోకపరవశయై పడి మెల్లన చేతరించుచు. 66

అర్థము : అని, ప్రలాపించుచున్ = దుఃఖముతోఁ గేకలువేయుచు, మగుడన్ = మరల, చనుదెంచి = వచ్చి, పుష్ప-కోదండ, పల్లవ + ఛత్ర - మకర - కేతనంబులన్ = పూవిల్లు, చివురుగొడుగు, మొసలిటెక్కెముులతో, అచ్చుపడి + ఉన్న = ముద్రపడియున్న, మరు భస్మ + ఆకారంబున్ = మన్మథుని బూది రూపును, కని, త్రినయన - నయన + అనల + ఆహతుండు = ముక్కంటి కంటి మంటచేఁ గొట్టఁబడినవాఁడు, అగుటన్, నిశ్చయించి, శోక - పరవశ + ఐ = దుఃఖముచే నొడలుతెలియనిదయి, పడి, మెల్లన, చేతరించుచున్ = చైతన్యముకలది యగుచు.

తాత్పర్యము ; అని దుఃఖముతోఁ గేకలువేయుచు రతి మరలవచ్చి పూవిల్లు, చివురుగొడుగు, మొసలిటెక్కెము అనువానితో ముద్రితమైన మన్మథుని బూది రూపును జూచి ముక్కంటి కంటిమంటచేఁ జచ్చినవాఁడని నిశ్చయించి మెల్లఁగాఁ జైతన్యము గలదియగుచు - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : పల్లవచ్ఛత్ర - పల్లవ + ఛత్ర - 'హ్రస్వమునకుఁ బరమైన ఛకారము ద్విరుక్త మగును' పల్లవచ్ఛత్ర.

మ. ప్రణుతాంగోద్గత ఘర్మకంకణములన్ బాహాద్వయాకీర్ణ కం
కణముల్ చోరన ధారుణిం దొరఁగ నాకంపించుచున్ లేచి భూ
షణరత్నప్రభతోన పర్వుచు సితాక్షద్యోతు లందంద ది
గ్గణికాక్షుల్ మిఱుమిట్లుపోవఁ బొలయంగాఁ జూచు విభ్రాంతయై. 67

అర్థము : ప్రణుత + అంగ + ఉద్గత - ఘర్మ - కంకణములున్ = మిక్కిలి నుతింపఁబడిన, అవయవములనుండి, పైకివచ్చిన, చెమట నీటిబిందువులును, బాహు-ద్వయ + ఆకీర్ణ - కంకణముల్ = రెండుచేతులనుండి విసరివేయఁబడిన, కడియములును, చోరన=శీఘ్రముగా, ధారుణిన్ = నేలపై, తొరఁగన్ = పడఁగా, ఆకంపించుచున్ = మిక్కిలి వడఁకుచు, లేచి, భూషణ-రత్న - ప్రభ - తోన్ + అ= అలంకారములందలి రత్నములకాంతితోనే, పర్వుచున్ = వ్యాపించుచు, సిత+ అక్ష-ద్యోతులు = తెల్లనైన యింద్రియముల కాంతులు, అందంద = మిక్కిలి, దిక్ (క్) + గణికా + అక్షుల్ = దిక్కులనెడి వేశ్యల కన్నులు, మిఱుమిట్లు+ పోవన్ = మిఱుమిట్లుగొనఁగా - చెదరఁగా, విభ్రాంత + ఐ = మిక్కిలి భ్రాంతిఁ జెందినదయి, పొలయంగాన్ + చూచున్ = ప్రసరించునట్లు చూచును.

తాత్పర్యము : మిక్కిలి నుతింపఁబడిన అవయవములనుండి పైకి వెడలిన చెమటనీటిబొట్టులును, రెండుచేతులనుండి జాఱిపడిన కడియములును, వెంటనే నేలపైఁబడఁగా రతి మిక్కిలి కంపించుచు లేచి, యలంకారములందలి రత్నముల కాంతితోనే వ్యాపించుచుఁ దెల్లనైన యింద్రియములకాంతులు మిక్కిలిగా దిక్కులనెడి వేశ్యల కన్నులు మిఱుమిట్లుగొనునట్లు విశేషముగా భ్రాంతినొందినదయి ప్రసరించునట్లు చూచును.

విశేషములు : అలంకారము స్వభావోక్తి.

మిఱుమిట్లు - మిట్లు + మిట్లు 'అందుకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు.' బాల. సంధి. 42.

క. ఏ యెడఁ బతిఁ బొడగానక
హా యని యెలుఁగెత్తి దిక్కు లద్రువఁగ నఱచున్,
గూయిడు, మొఱయిడుఁ, బలుమఱు
వా యుడుపక చీఱు, నేడ్చు, వడి వాపోవున్. 68

అర్థము : రతి - కర్తృపదము, ఏ + ఎడన్ = ఎచ్చటను, పతిన్ = భర్తను, పొడగానక = కానక, హా + అని, ఎలుఁగు + ఎత్తి = కంఠమెత్తి - బిగ్గఱఁగా, దిక్కులు, అద్రువఁగన్ = అదరఁగా, అఱచున్, కూయి + ఇడున్ = (కూ + ఇడున్ - సూ - ని. ౪) = భయదుఃఖాదులచే నఱచును, మొఱ+ఇడున్= మొఱపెట్టును, పలుమఱున్ = చాలసారులు, వా + ఉడుపక = నోరుకట్టక, చీఱున్ = పిలుచును. ఏడ్చున్, వడిన్ = వేగముతో, వాపోవున్ = దుఃఖించును.

తాత్పర్యము : రతి యెచ్చటను భర్తను గానక హా యని బిగ్గఱగా దెసలు అదరునట్లు అఱచును. కూయిడును. మొఱపెట్టును. పలుమాఱులు నోరుకట్టక పిలుచును, ఏడ్చును. వడిగా వాపోవును.

విశేషములు : అద్రువఁగన్ - అద్రుచు - 'చుక్పరక రువర్ణంబునకు ముందఱి దువర్ణంబు నుత్వంబునకు లోపంబు విభాష నగు నగుచోఁ దత్పూర్వంబు గురువు గాదు.' బాల. ప్రకీర్ణ. 20. అద్రుచు. 'తుమర్థ భావలక్షణంబులందు నుజీ యగు,' బాల. క్రియ. 40. అద్రుచు + నుజీ. 'ముజీత్తులు ముత్తు నాఁబడు.' బాల. క్రియ. 36. 'ఆగమాన్య చకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరంబగునపుడు పవ లగు.' బాల. క్రి, ౩౩ అద్రువు+నుజీ. 'జీత్తు పరంబగునపు డుత్వంబున కత్వంబగు.' బాల. క్రియ. 20. అద్రువన్ + కాను, 'నుజ్యంతంబగు నగుధాతువు క్రియావిశేషణంబుల కనుప్రయుక్తం బగు నుజీకి విభాష నగు.' బాల. క్రియ. 115, అద్రువన్+ కాను. 'దానికి హ్రస్వంబు విభాష నగు.' బాల, క్రియ. 1 16. అద్రువన్ + కను. ద్రుతకార్యము - బాల. సంధి. 16, 17. అద్రువఁగన్.

వ. తదనంతరంబ. 69

అర్థతాత్పర్యములు : తద్ + అనంతరంబు+ అ = ఆ పిమ్మటనే. తరువాతి పద్యముతో నన్వయము.

సీ. 1. ఉలియు నిట్టూర్పుల కలకలంబులతోన
యార్తరవంబు మి న్నద్రువఁజెలఁగ,
దండడిఁ దొరుఁగు ప్రేర్బిందులతోడన
కన్నీరు తారలఁ గడలుకొనఁగ,
నిరుగడఁ బొదివిచ్చి విరియు వేనలితోన
మోహాంధతమసంబు ముంచుకొనఁగ,
వెడ బీటవాఱి నెవ్వడవడు మోవితో
ముడిఁగి వాడినయెల్గు వడఁకుచూప,

తే. తలము లెద మోఁదఁ బెరిగిన తారహార
ఛాతితో మోమువెన్నెల పలకఁబాఱ,
బిట్టు వెసఁదాఁకు చిచ్చుఱపిడుగువోలె
నడలు రతిఁ దాఁక మెయి ముచ్చముడిఁగి పడఁగ. 70

అర్థము : ఉలియు = ధ్వనించు, నిట్టూర్పుల (నిడు + ఊర్పుల) = దీర్ఘనిశ్వాసములయొక్క, కలకలంబులతోన్ + అ = కలకలధ్వనులతోపాటే, ఆర్తరవంబు = రోదనధ్వని, మిన్ను = ఆకాశము, అద్రువన్ = అదరునట్లు, చెలఁగన్ = ధ్వనింపఁగను.

దండడిన్ = అధికముగా, తొరుఁగు = స్రవించునట్టి, ప్రేర్బిందులతోడన్ + అ = చెమటబొట్టులతోపాటే, కన్నీరు, తారలన్ = కంటినల్లగ్రుడ్డులయందు, కడలుకొనఁగన్ = అతిశయింపఁగను.

ఇరుగడన్ = రెండుప్రక్కలను, పొదివిచ్చి = చెదరి, [1]విరియు = విప్పారు, వేనలితోన్ + అ = కేశపాశముతోపాటే, మోహ + అంధతమసంబు = మూర్ఛయను చీఁకటి, ముంచుకొనఁగన్ = అతిశయింపఁగను.

వెడ = కొంచెము, బీటవాఱి = పగిలి, నెవ్వడవడు (నెఱ + వడ + పడు) = మిక్కిలి తాపమునుబొందు, మోవితోన్ = పెదవితో, ముడిఁగి = క్షీణించి, వాడిన = శుష్కించిన, ఎల్గు = కంఠధ్వని, వడఁకుచూపన్ = వణఁకఁగను.

1. వా. ప్రతి. పొలయు.

తలములు = చేతులు. ఎదన్ = గుండెమీఁద, మోఁదన్ = బాదఁగా, పెరిగిన = త్రెగిపోయిన, తార - హార - భాతితోన్ = ముత్యాలపేరికాంతితో, మోము- వెన్నెల = ముఖకాంతి, పలకఁబాఱన్ = తెల్లఁబాఱఁగను.

బిట్టు - వెసన్ = మిక్కిలి వేగముతో, తాఁకు = మీఁదఁబడునట్టి, చిచ్చుఱ పిడుగు + పోలెన్ = అగ్గిపిడుగువలె, అడలు = శోకము, రతిన్ = రతిని, మెయి = శరీరము, ముచ్చముడిఁగిపడఁగన్ = మిక్కిలి ముడిఁగికొనఁగా, తాఁకున్ = తగులును.

తాత్పర్యము : ధ్వనిచేయు నిట్టూర్పుల కలకలధ్వనులతోపాటే రోదన ధ్వని ఆకాశ మదరునట్లు శబ్దింపఁగను, అధికముగాఁగాఱు చెమట బిందువులతో పాటే కనుగ్రుడ్లఁ గన్నీరు నిండఁగను, రెండుప్రైపులను విప్పారి చెదరు కేశపాశము తోపాటే మూర్ఛయను చీఁకటి వ్యాపింపఁగను, ఇంచుక బీటవాఱి యధికతాపమునొందు పెదవితోపాటే క్షీణించి ఖుష్కించిన కంఠస్వరము వడఁకఁగను, చేతులు గుండెపై బాదఁగాఁ ద్రెగిపోయిన ముత్యాలపేరి కాంతితో ముఖకాంతి తెల్లఁబాఱఁగను, మిక్కిలి వేగముతోఁబడు నగ్గిపిడుగువలె శోకము రతిని శరీరము మిక్కిలిముడిఁగికొనఁ దాఁకును.

విశేషములు : అలంకారము సహోక్తి. 'సహోక్తి స్సహభావశ్చే ద్భాసతే జనరఞ్జనః' - చన్ద్రా. స్వభావోక్తి. 'స్వభావోక్తి స్స్వభావస్య జాత్యాదిస్థస్య వర్ణనమ్,' చన్ద్రా.

నిట్టూర్పు - నిడు + ఊర్పు - 'కుఱు చిఱు కడు నడు నిడు శబ్దముల ఱడల కచ్చు పరంబగునపుడు ద్విరుక్తటకారం బగు.' బాల.సంధి.12 నిట్టు + ఊర్పు 'ఉత్తున కచ్చుపరంబగునపుడు సంధి యగు,' బాల.సంధి.1. నిట్టూర్పు. అద్రువన్-చూడు పూర్వపద్యవ్యాఖ్య, మోహాంధతమసంబు - మోహమనెడి అంధతమసంబు - రూప 'ము. నెవ్వడ - నెఱ + వడ - 'అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి.' బాల.సంధి.39. ముచ్చముడుఁగు - ముడుఁగు + ముడుఁగు -అందదుకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు.' బాల.సంధి 42.

వ. ఇట్లు చలచలంబగు నడలడింబడి కదలి పతి వలను గనుంగొని 71

అర్థము : ఇట్లు, చలచలంబు = మిక్కిలి చలించునది. అగు, అడలడిన్ = దుఃఖమున, పడి, కదలి, పతి - వలను = భర్తదిక్కు, కనుంగొని.

తాత్పర్యము : ఇట్లు మిక్కిలి చలించు దుఃఖమునఁబడి కదలి భర్త వైపు చూచి - తరువాతి పద్యముతో నన్వయము.

చ. సలలిత సాంద్ర కుంకుమము చన్నులపై మెయిఁ బ్రీతి నాకు నీ
వలఁదిన చందనంబు తడి యాఱదునేనియు నంగజన్మ! నీ
విలసిత చారు రూప తను విభ్రమ సంపద లీ క్షణంబులోఁ
బొలుపఱఁ గాలి యాఱె నహిభూషణు కోప దవానలాహతిన్. 72

అర్థము : అంగజన్మ = ఓయి అంగజుఁడా! - మన్మథుఁడా!, చన్నుల పైన్, సలలిత - సాంద్ర - కుంకుమము = మనోహరము, దట్టమునైన కుంకుమము, మెయిన్ = శరీరమునందు, ప్రీతిన్ = ప్రేమముతో, నాకున్, నీవు, అలఁదిన = పూసిన, చందనంబు = మంచిగంధము, తడి - అఱదు నేనియున్ = తడియాఱక పోయినను, నీ - విలసిత - చారు - రూప - తను - విభ్రమ - సంపదలు = నీ ప్రకాశించునట్టియు, మనోహరమయినట్టియు సౌందర్యము, శరీరవిలాససంపదలు, ఈ-క్షణంబులోన్, అహి-భూషణు = సర్పములు ఆభరణములుగాఁగల శివునియొక్క, కోప - దవ + అనల + ఆహతిన్ = కోపమనెడి కార్చిచ్చుయొక్క దెబ్బచే, పొలుపు + అఱన్ = ఒప్పు నశింపఁగా, కాలి, ఆఱెన్.

తాత్పర్యము ; ఓయి మన్మథుఁడా! నాకు నీవు ప్రేమముతో స్తనముల పై నలఁదిన మనోహరము, దట్టమునైన కుంకుమము, శరీరమున నలఁదిన మంచి గందము తడియాఱకపోయినను, నీ ప్రకాశించునట్టియు, మనోహరమయినట్టియు రూపము, శరీర విలాససంపదలు ఈ క్షణములో శివుని కోపమనెడి కార్చిచ్చుచే నొప్పు నశించునట్లు కాలి యాఱిపోయెను.

విశేషములు ; కోప దవానల = కోపమనెడి దవానల-రూపకము.

గీ. గిరిజ నోడఁగూర్చ వరదుచే వరము పడయ
నోపుఁ బొమ్మని నమ్మి యే నున్నచోట
నెట్టి విడుమర వచ్చె నీ కెట్టి చావు
సంభవించెనె మనసిజ చక్రవర్తి! 73

అర్థము ; మనసిజ - చక్రవర్తి = ఓయి మన్మథసార్వభౌమా ! గిరిజన్ = పార్వతిని, ఒడఁగూర్చి = సంధించి, వరముచేన్ = శివునిచేత, వరము, పడయన్ + ఓపున్ + పొమ్ము = పొందఁగలఁడు లెమ్ము' అని, నమ్మి, ఏను, ఉన్నచోటన్ = ఉండఁగా, ఎట్టి, విడుమర = ఎడఁబాటు, వచ్చెన్ = కలిగెను, నీకున్, ఎట్టి, చావు, సంభవించెనె.

తాత్పర్యము : ఓయి మన్మథసార్వభౌమా ! పార్వతిని సంధానపఱిచి శివునిచే వరము పొందఁగలఁడులెమ్మని నమ్మి నే నుండఁగా నెట్టి వియోగము సంభవించెను ! నీ కెట్టి చావు గలిగెను ?

సీ. ప్రీతిని వినుకలి పేటంబు గొనియున్న
వెలఁదుల పేటంబు వృథయ కాఁగఁ,
గర మర్థి నినుఁ జూచి కనుకలిఁ గలిచిన
పడఁతుల కల్పు నిష్ఫలము కాఁగఁ,
దివుటతో నిను డాసి కవయంగఁగోరెడు
వనితల కోరికి వమ్ము కాఁగ,
ననురక్తి నినుఁగూడి మనఁగంటి మంటి నే
నను రతి మనుపు మాయంబు కాఁగ,

తే. జగములందు నీ ప్రాపుచే నెగడి నెఱయఁ
బలుఁడైన వసంతకు ప్రాపు చెడఁగఁ,
దగునె వలరాజ! నీ కింత తెగఁదలంచి
వరము కోపాగ్నిలోఁ బడి యెరిసిపోవ? 74

అర్థము ; వలరాజ = మన్మథుఁడా !

ప్రీతిని = ఇష్టముతో, వినుకలిన్ = వినుటచే, పేటంబు = ప్రేమము, కొని - ఉన్న = పొందియున్న, వెలఁదుల = స్త్రీలయొక్క, పేటంబు = అనురాగము వృథ + అ- కాఁగన్ = వ్యర్థమేకాఁగా,

కరము + అర్థిన్ = మిక్కిలి కోరికతో, నినున్ + చూచి, కనుకలిన్ = చూపుచే. కలిచిన = వలచిన, పడఁతుల = స్త్రీలయొక్క, కల్మి = ప్రేమము, నిష్ఫలము - కాఁగన్ = వ్యర్థము కాఁగా.

తివుటతోన్ = కోరికతో, నినున్, డాసి = సమీపించి, కవయంగన్ = కూడుటకు, కోరెడు, వనితల = స్త్రీలయొక్క, కోరికి, వమ్ము - కాఁగన్ = వ్యర్థము కాఁగా,

ఏను = నేను, అనురక్తిన్ = అనురాగముతో. నినున్, కూడి. మనన్ + కంటిన్ = బ్రదుకఁగలిగితిని, మంటిన్ = బ్రదికితిని. అను, రతి = రతిదేవి యొక్క, మనువు = జీవనము, మాయంబు + కాఁగన్ = నశించిపోఁగా,

జగములందున్, నీ - ప్రాపుచేన్ = నీ యండచే, నెగడి = వృద్ధిపొంది, నెఱయన్ = బాగుగా, ప్రబలుఁడు + ఐన = బలవంతుఁడైన, వసంతకు - ప్రాపు = వసంతుని దిక్కు, చెడఁగన్ = నశింపఁగా,

ఇంత, తెగన్ + తలంచి = నశింపఁగోరి, పరము = శివునియొక్క, కోప + అగ్నిలోన్ = కోపమనెడి అగ్నిలో, పడి, ఎరిసిపోవన్ = కాలిపోవ, నీకున్, తగునె ?

తాత్పర్యము ; ఓయి మన్మథుఁడా ! వినికిచే వలపుగొనియున్న స్త్రీల వలపు వ్యర్థమగునట్లును, కోరికతో నిన్నుఁజూచుకొని చూపుచే వలచిన స్త్రీలవలపు నిష్ఫలమగునట్లును, కోరికతో నిన్ను సమీపించి కూడఁగోరెడి స్త్రీలకోరిక వమ్మగునట్లును, నిన్ను అనురాగముతోఁగూడి మనఁగలిగితి నను రతి మనువు నశించునట్లును, లోకములో నీ యండవలన మిక్కిలి బలవంతుఁడైన వసంతుని దిక్కు నశించునట్లును, నీవు ఈశ్వరుని కోపమనెడి అగ్నిలోఁబడి కాలిపోవఁదగునా ?

విశేషములు : వలరాజు - వలపు + రాజు, కోపాగ్ని - కోప మనెడి అగ్ని-రూపకము.

ఉ. తప్పనదారులేసి పెఱ తాపసులన్ వెఱపించునట్లు నీ
వప్పరమేశు నేయు టనయంబు భరంబనిచెప్పఁజెప్ప నా
చెప్పుట యాఁడుకర్జమని చేకొన కొయ్యనవచ్చి; తీశు పెం
పిప్పు డెఱింగితే కడవ నేచిన నీకిది యింత పెద్దయే? 75

అర్థము ; తప్పనదారులు + ఏసి=తప్పుదారులు పట్టించి, పెఱ - తాపసులన్ = ఇతర మునులను, వెఱపించు + అట్లు = భయపెట్టునట్లు, నీవు, ఆ + పరమేశున్ = ఆ శివుని, ఏయుట = పట్టించుట, అనయంబున్ = మిక్కిలి, భరంబు = కష్టము, అని, చెప్పన్ + చెప్పన్ = చెప్పఁగాఁ జెప్పఁగా, నా-చెప్పుట, ఆఁడు-కర్జము = ఆఁడుదానిపని, అని, చేకొనక = గ్రహింపక, ఒయ్యనన్ = ఒప్పుగా, వచ్చితి (వి), ఈశు- పెంపు = ఈశ్వరుని గొప్పతనము, ఇప్పుడు, ఎఱింగితే (ఎఱింగితివి + ఏ), కడవన్ + ఏచినన్ = తప్పుకొన విజృంభించినచో, నీకున్, ఇది, ఇంత, పెద్దయే = అసాధ్యమా ?

తాత్పర్యము : తప్పుదారులు పట్టించి యితర మునులను భయపెట్టునట్లు ఆ పరమేశ్వరుని పట్టించుట మిక్కిలి కష్టమని నేనెంతచెప్పినను ఆఁడుది చెప్పుటయా యని కైకొనక తగుదునమ్మా యని వచ్చితివి. ఈశ్వరుని గొప్పతన మిప్పుడు నీకుఁ దెలిసినదా ? నీవు తప్పుకొన విజృంభించినచో నీ కిది యింత అసాధ్యమా ?

విశేషములు : కర్జము (వికృతి) - కార్యము (ప్రకృతి). వచ్చితీశు- వచ్చితివి + ఈశు . లిద్వకారమునకు లోపము, బాల. క్రియ. 24, అపదాదిస్వర సంధి. బాల. సంధి. 11, మధ్యమపురుషేకారసంధి. బాల. సంధి. 7, అట్లే - ఎఱింగితే - ఎఱింగితివి + ఏ.

మత్తకోకిల

ఇందిరాప్రియపుత్త్ర! సద్వినుతేక్షుకార్ముకహస్త! గో
విందనందన! రూపసద్గుణవిశ్రుతా! వలరాజ! నీ
సుందరాకృతి నాకు నిప్పుడు చూపనొల్లక డాఁగ నీ
వెందుఁబోయితి చెప్పవే రతి కేది దిక్కు? మనోభవా! 76

అర్థము : ఇందిరా-ప్రియ-పుత్త్ర = లక్ష్మి అనుఁగుఁగొడుకా!, సత్ + వినుత + ఇషు - కార్ముక - హస్త = బాగుగాఁ బొగడఁబడు చెఱకువిల్లు చేతియందుఁ గలవాఁడా !, గోవింద - నందన = విష్ణుని పుత్త్రుఁడా, రూప - సద్గుణ - విశ్రుతా! = సౌందర్యముచేతను, మంచిగుణములచేతను, ప్రసిద్ధుఁడా!, వలరాజ = మన్మథుఁడా, నీ - సుందర + ఆకృతిన్ = నీ సుందరమైన రూపమును, నాకున్, ఇప్పుడు, చూపన్ + ఒల్లక = చూపుట కంగీకరింపక, డాఁగి, నీవు, ఎందున్ = ఎచ్చటికి, పోయితి = పోయితివి ?, చెప్పవే, మనోభవా ? = మన్మథా!, రతికిన్, దిక్కు, ఏది?,

తాత్పర్యము : లక్ష్మీదేవి అనుఁగుఁగొడుకా ! చేత మంచిచెఱకువిల్లు దాల్చినవాఁడా! విష్ణుని పుత్త్రుఁడా ! రూపముచేతను, మంచిగుణములచేతను బ్రసిద్ధుఁడా! వలరాజా ! నీవు నీ సుందరాకారమును నా కిప్పుడు చూపనొల్లక దాఁగికొని యెచ్చటికిఁ బోయితివో చెప్పుము. రతి కిఁక నేది దిక్కు ?

విశేషములు : మత్తకోకిల లక్షణము-నాలుగు పాదము లుండును. ప్రతి పాదమునను ర, స, జ, జ, భ, ర అను గణము లుండును. మొదటి యక్షరమునకును పదునొకొండవ అక్షరమునకును యతిమైత్రి. ప్రాసనియమము గలదు.

ఉ. నీ పరిరంభణంబు ధరణీపరిరంభణమయ్యె; సమ్మదా
రోపిత శుష్కరోదనము రోదన మయ్యెఁ; రతిక్రియారసా
లాపము లాత్మచేష్టిత విలాసము లయ్యెఁ; మనోజ! నేనియుం
జూపవు నిన్ను; నన్నారసిచూచుడో! నా కిది దప్పఁజూచుడో! 77

అర్థము : మనోజ = మన్మథా !, నీ- పరిరంభణంబు = నీ కౌఁగిలి, ధరణీ - పరిరంభణము = భూమిని గౌఁగిలించుకొనుట, అయ్యెన్. నిన్నుఁగౌఁగిలించుటకు బదులు నేలను గౌఁగిలించుకొంటి ననుట, సమ్మద + ఆరోపిత - శుష్క - రోదనము = సంతోషముతోఁ దెచ్చుకొనఁబడిన వట్టియేడుపు - ప్రణయకలహమునఁ దెచ్చుకోలు ఏడుపు, రోదనము = నిజమైన యేడుపు, అయ్యెన్, రతి-క్రియా-రస+ ఆలాపములు = సంభోగక్రియలును, రసవంతమైన మాటలును, ఆత్మ చేష్టిత - విలాసములు = మానసికములైన చేష్టల విలాసములు - అయ్యెన్, రతిక్రియలును,

శృంగారరస భాషణములును కేవల మానసికలీల లయ్యెనమట, నేనియున్ = అయినను, నిన్నున్, చూపవు, నన్నున్, ఒరసి - చూచుడో = పరీక్షించి చూచుటయో!, నాకున్. ఇది, తప్పన్ + చూచుడో = అనాదరించుటయో!

తాత్పర్యము : మన్మథా! నిన్నుఁ గౌఁగిలించుకొనుటకుబదులు నేనిప్పుడు నేలనుగౌఁగిలించుకొంటిని. ప్రణయసమయమునందలి వట్టియేడుపు నిజమైన యేడు పయ్యెను. సంభోగక్రియలును, శృంగారరసభాషణములును కేవల మానసిక విలాసము లయ్యెను. అయినను నిన్నుఁ జూపవు. ఇది నీవు నన్నుఁ బరీక్షించుటయా లేక ఉపే క్షించుటయా?

గీ. తగిలి నా జీవమునకు నాధారమైన
నీవు ననుఁబెట్టిపోఁజన్నె భావజన్మ?
కట్ట యవియుడు నీరులు కల్వ వాసి
బయలువడ డించిపోయిన భంగి వోలె. 78

అర్థము : భావజన్మ = మనసిజుఁడా!, తగిలి = ఆసక్తిగలిగి, నా - జీవము నకున్ = నా బ్రదుకునకు, ఆధారము + ఐన, నీవు, కట్ట = గట్టు, అవియుడున్ = త్రెగిపోయినంతనే, నీరులు, కల్వ = కలువ, పాపి = నశించి, బయలు + పడన్ = బయటఁబడునట్లు, డించిపోయిన - భంగి + పోలెన్ = దిగవిడిచిపోయిన విధమున, ననున్ = నన్ను, పెట్టి = విడిచిపెట్టి, పోన్ + చన్నె = పోఁదగునా?

తాత్పర్యము : మన్మథా! నన్నంటియుండి నా మనుగడ కాధారమమైన నీవు, కట్ట త్రెగినంతనే నీరు కలువ నశించి బయలుపడ దిగవిడిచిపోవు విధమున నన్ను విడిచిపెట్టి పోఁదగునా?

విశేషములు : అలంకార ముపమ, ఈ పద్యము కాళిదాస కుమారసంభవ శ్లోకమున కించుమించు తెనుఁగు.

క్వ ను మాం త్వ దధీన జీవితాం
వినికీర్య క్షణ భిన్న సౌహృదః,
నలినీం క్షతసేతు బన్ధనో
జలసఙ్ఘాత ఇ వాపి విద్రుతః, కుమార.సం.4 - 6.

భంగివోలె.-ఒక ఉపమావాచకము పై నింకొక ఉపమావాచకమును నన్నెచోడుఁడు తఱచుగాఁ బ్రయోగించును.

ఉత్సాహ. పోరి చూచి సత్తకన్నుఁ బొత్తకన్ను నింగితా
కారముల నెఱుంగు దీవు కావలుండవై యహం
కారవృత్తి నీశు నల్క కన్నెఱింగి తప్పఁ బో
నేరవైతి కాలమైన నేర్పు సెప్పు సేయునే? 79

అర్థము: సత్తకన్నున్ (సంతకన్నున్ -పాఠాం.) =నిలుకడలేని కన్నును, పొత్తకన్నున్ (పొంతకన్నున్ - పాఠాం.) = పొందికగల కన్నును, పోరి - చూచి= పరిశీలించి, ఇంగిత + ఆకారములన్ =మనోఽభిప్రాయమును, రూపమును, ఈవు= నీవు, ఎఱుంగుదు (వు). కావలుండవు + ఐ= గర్వముగలవాఁడవయి, అహంకార- వృత్తిన్ = అహంభావవర్తనముతో. ఈశు + అల్క - కన్నెఱింగి = ఈశ్వరుని యొక్క కోపము యొక్క జాడ తెలిసి, తప్పన్ + పోన్ + నేరవు + ఐతి (వి)= తప్పించుకోలేకపోయితివి. కాలము + ఐనన్ = పోఁగాలము వచ్చినచో, నేర్పు = తెలివి, చెప్పు + చేయునే - చెప్పినట్లు చేయునా? - చేయ దనుట.

తాత్పర్యము: అన్నివిధములఁ బరిశీలించి నీవు మనోరూపములను తెలిసి కొనఁగలవాఁడవు. అయినను నీవు గర్వివయి, అహంభావముతో నీశ్వరుఁ డెంతటి క్రోపముగలవాఁడో తెలిసియు, అతనినుండి తప్పించుకోలేకపోయితివి. పోఁగాలము దాపురించుచో, తెలివి చెప్పినట్లు చేయదుగదా!

విశేషములు: సత్తకన్ను, పొత్తకన్ను అననేమో విచార్యము. పొంత పొందుధాతువు కృదంతము. వందు - వంత, చెందు-చెంత ఇట్లే. -వా.ప్రతిపీఠిక- శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు. అలంకారము - విశేషాంశము సామాన్యాంశముచే సమ ర్థింపఁబడుచున్నది కావున అర్థాంతరన్యాసము. చెప్పు - చెప్పుధాతువు కృదంతము. 'ఉవర్ణకం బడుక్త్వాదుల కగు.' బాల.కృ.21. చెప్పు + ఉ - అపదాదిస్వరసంధి. బాల. సంధి.11.

ఉ. అక్కట! వేల్పులార! కుసుమాయుధు నాఱడిచావు చూచి మీ
రెక్కడ మాయమైతి, రసమేక్షణ! మన్మథు నీఱు సేసి నీ
వెక్కడ పోయితయ్య! పొడ వెవ్వరుఁ జూపర కానలోన; నే
నెక్కడ సొత్తు; నాకు దెస యెయ్యది నా వలరాజ! చెప్పవే! 80

అర్థము ; అక్కట = అయ్యో!, వేల్పులార = దేవతలారా! కుసుమ + ఆయుధు + ఆఱడి - చావు = పుష్పబాణుని (మన్మథుని) వ్యర్థమైన చావు, చూచి, మీరు, ఎక్కడ, మాయము + ఐతిరి, అసమ + ఈక్షణ = బేసికంటివాఁడా! ఈశ్వరా!, మన్మథున్, నీఱు + చేసి = భస్మముచేసి, నీవు, ఎక్కడ, పోయితి (వి) + అయ్య, కానలోనన్ = అడవిలో, ఎవ్వరున్, పొడవు = (మన్మథుని) రూపు (జాడ,) చూపరు + అ = చూపుటలేద, నేను, ఎక్కడ, చొత్తున్ = పోవుదును, నా వలరాజ = నా మన్మథా! నాకున్, దెస = దిక్కు, ఎయ్యది, చెప్పవే = చెప్పుమా,

తాత్పర్యము : అయ్యో! దేవతలారా! మన్మథుని రిత్తచావు చూచి మీ రెక్కడ మాయమైతిరి? ఈశ్వరా? మన్మథుని బుగ్గిచేసి నీ వెక్కడ పోయితివి? ఈ యడవిలో నెవ్వరును మన్మథునిజాడ చెప్పువారే లేరు. నే నెక్కడ పోవుదును! మన్మథా ! నాకు దిక్కెవ్వరో చెప్పుము.

విశేషములు : పోయితయ్య - పోయితివి + అయ్య. 'తద్ధర్మభూత క్రియ లార్యాద్యర్థపరకంబులయి ప్రశ్నార్థకంబు లగు.' ప్రౌఢ.క్రియ.3. లిద్వకారము నకు లోపము (బాల.క్రియ.24.) అపదాదిస్వరసంధి. (బాల.సంధి.11.) మధ్యమ పురుషేకారసంధి. (బాల.సంధి.7). కుసుమాయుధునాఱడిచావు - కుసుమాయుధు + ఆఱడిచావు. 'షష్ఠీసమాసమునం దుకార ఋకారముల కచ్చు పరమగునపుడు నుగాగమం బగు.' బాల.సంధి.34.

వ. అని యనాథవృత్తి దీనానన యగుచు భీతిం గాంతారాంతరంబు గనుంగొనునప్పుడు. 81

అర్థము : అని, అనాథవృత్తిన్ = నాథుఁడులేని వర్తనముతో - దిక్కులేని వర్తనముతో, దీన + ఆనన = దీనమైనముఖముగలది, అగుచున్, భీతిన్ = భయ

ముతో, కాంతార + అంతరంబు = అడవినడిమిభాగము, కనుంగొను + అప్పుడు = చూచునప్పుడు.

తాత్పర్యము: అని దిక్కులేనివర్తనమున దీనమైనముఖముగలది యగుచు భయముతో నడవి నడిమిప్రదేశమును జూచుసమయమున - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు: చెప్పవే. చెప్పుధాతువు. 'ఆశీశ్శాపసంప్రార్థనవిధులందు లూట్టగు.' బాల,క్రియ.6. చెప్పు + లూట్టు. 'లకారంబునకు డు డ్రు వు రు ము ముజ్ఞగు.' బాలక్రియ.8. చెప్పు + వు. 'లూణ్మధ్యమ వు రు లకు ముడుజ్ఞు లగు.' బాల.క్రియ.29. చెప్పుము. 'మధ్యమ ముడుజ్ఞులు ముజ్జు నా(బసు.' బాల.క్రియ.31. 'సంప్రార్థనంబుల ముజ్జున కదాదులు విభాష ననుప్రయుక్తంబు లగు.' బాల.క్రియ.33. చెప్పుము + ఏ. 'ఎదాదు లనుప్రయుక్తంబు లగునపుడు ముజ్జునకు వుజీ రుజీ యగు.. బాల,క్రియ.34 చెప్పు + వుజీ + ఏ - జీత్తు పరంబగునపు డుత్వంబున కత్వంబగు. బాల.క్రియ.20. చెప్పవు + ఏ' 'అంద్వవగాగమంబులం దప్ప నపదాదిస్వరంబు పరంబగునపు డచ్చునకు సంధి యగు,' బాల.సంధి.11. చెప్పవే.

సీ. మేలిల్లు నీలతమాలముల్ ధూమసం
హతులనఁ దనరు నత్యసితభాతి,
శోభిల్లు షష్పితాశోకంబు లెసఁగు తీ
వ్రానల మనఁ దగు నరుణరుచులఁ.
బొలుపారఁ బూచిన పొన్నలు సనుఁ గాలి
యాఱిన నీ అన నమలదీప్తి,
శివు కోపశిఖి శిఖల్ చిత్తజు నేర్చి త
త్పరివారమగు శుకపరభృతాలి

ఆ. సమితిఁ గూర్చికొని వసంతుండు వనములోఁ
జొచ్చియున్నఁ గాంచి చుట్టుముట్టి
యొలసి కాల్పఁ గాలుచున్నట్టి వయ్యె నా
రములు శోకదృష్టి రతికిఁ జూడ.

అర్థము : శోక - దృష్టిన్ = దుఃఖముతోడి చూపుతో, చూడన్ = చూడఁగా, రతికిన్, మేలిల్లు = ఒప్పునట్టి, నీల - తమాలముల్ = నల్లని చీఁకటిమ్రాఁకులు, అతి + అసిత - భాతిన్ = మిక్కిలి నల్లని కాంతితో, ధూమ - సంహతులు = పొగలగుంపులు. అనన్. తనరున్ = ఒప్పును.

శోభిల్లు = ప్రకాశించునట్టి, పుష్పిత + అశోకంబులు = పూచిన అశోక వృక్షములు, అరుణ - రుచులన్ = ఎఱ్ఱనికాంతులతో, ఎసఁగు = అతిశయించు, తీవ్ర + అనలము = తీక్ష్ణమైన అగ్ని, అనన్ + తగున్.

పొలుపారన్ (పొలుపు + ఆరన్) = ఒప్పారఁగా, పూచిన - పొన్నలు, అమల - దీప్తిన్ = స్వచ్ఛమైన (తెల్లని) కాంతితో, కాలి - ఆఱిన - నీఱు + అనన్ = కాలి ఆఱిపోయిన బూడిదయనఁగా, చనున్ = ఒప్పును.

ఆరములు = ఆరామములు, శివు - కోప - శిఖి - శిఖల్ = శివునికోపమనెడి, అగ్నిజ్వాలలు, చిత్తజున్ = మన్మథుని, ఏర్చి = కాల్చి, తద్ + పరివారము + అగు = అతని పరివారమైన, శుక - పరభృత + ఆలి - సమితిన్ = చిలుకల, కోకిలల వరుసల సమూహమును, కూర్చికొని, వసంతుండు, వనములోన్, చొచ్చి + ఉన్నన్ = ప్రవేశించియుండఁగా, కాంచి, చుట్టుముట్టి, ఒలసి = వ్యాపించి, కాల్పన్ = కాల్పఁగా, కాలుచున్ + ఉన్న + అట్టి । అవి = కాలుచున్నట్టివి, అయ్యెన్.

తాత్పర్యము : ఏడ్పుచుఁజూచు రతికి ఒప్పునట్టి నల్లనిచీఁకటిమ్రాఁకులు మిక్కిలి నల్లనికాంతితోఁ బొగలగుంపు లన నొప్పును. ప్రకాశించు పూచిన అశోక వృక్షములు ఎఱ్ఱనికాంతులతో అతిశయించు తీక్ష్ణమైనఅగ్ని యనఁదగును. అందముగాఁ బూచిన పొన్నచెట్లు నిర్మలమైన (తెల్లని) కాంతితోఁ గాలియాఱిపోయిన బూడిద యనఁజనును, ఆరామములు - శివుని కోపానలజ్వాలలు మన్మథునిఁగాల్చి, యతని పరివారమగు చిలుకలు,కోకిలలు అనువానిని గూర్చికొని వసంతుఁడు వనములోఁ జొచ్చి యుండుట చూచి, చుట్టుముట్టి, వ్యాపించి, కాల్పఁగాఁ, గాలుచున్నట్టివి అయ్యెను.

విశేషములు : మొదటి మూఁడుపాదములందును అలంకార ముత్ప్రేక్ష. కోప - శిఖి - రూపకము. శివుకోపశిఖిశిఖల్ .... కాలుచున్నట్టివయ్యె నారములు - ఇదియు నుత్ప్రేక్ష, రూపకానుప్రాణితము. కాలుచున్నట్టివి_కాలుచున్ + ఉన్న =

కాలుచున్న - 'ప్రథమేతరవిభక్తి శత్రర్థ చువర్ణంబులందున్న యుకారమునకు సంధి వైకల్పికముగా నగును,' బాల.సంధి.2. అట్టి + అవి = అట్టివి. 'అది యవి శబ్దంబుల యత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగ నగు.' బాల.సంధి.45. కాలుచున్న + అట్టివి - 'అత్తునకు సంధి బహుళముగా నగు.' బాల.సంధి4. కాలుచున్నట్టివి.

వ. అనిశముఁ గ్రమ్ము పుష్పమధు వశ్రుజలంబుగఁ గొమ్మలెక్కి ఘో
రనఁ జెలరేఁగు పక్షిరవ మార్తరవంబుగ, మీఁద నోలిమూఁ
గిన యలిమాలికల్ వివృతకేశభరంబుగఁ, జుట్టునుండి పే
ర్చున రతితోడ సంబెరము చూపు విధంబునఁ బొల్చె భూజముల్. 83

అర్థము ; అనిశమున్ = ఎల్లప్పుడును, క్రమ్ము = వ్యాపించు, పుష్పమధువు = పూఁదేనె, అశ్రు - జలంబుగన్ = కన్నీరుగా, కొమ్మలు + ఎక్కి - ఘోరనన్ = ఘోరు + అనన్ = ఘోరుమన, చెలరేఁగు = విజృంభించు, పక్షి-రవము = పక్షులధ్వని. ఆర్త - రవంబుగన్ = దుఃఖధ్వనిగా, మీఁదన్ = పైని, ఓలిన్ = వరుసగా, మూఁగిన, అలి - మాలికల్ = తుమ్మెదల వరుసలు, వివృత-కేశ - భరంబుగన్ = విప్పారిన కేశపాశముగను, భూజముల్ = చెట్లు, చుట్టున్ + ఉండి = చుట్టుఁజేరి, పేర్చునన్ = అతిశయముగా, రతితోడన్, సంబెరము = సానుభూతి, చూపు - విధంబునన్, పొల్చెన్ = ఒప్పెను.

తాత్పర్యము : ఎల్లప్పుడును వ్యాపించు పూఁదేనె కన్నీరుగను, కొమ్మలెక్కి ఘోరుమని విజృంభించు పక్షులధ్వని దుఃఖధ్వనిగను, పైని వరుసలుగా మూఁగిన తుమ్మెదల వరుసలు విప్పారిన కేశపాశముగను, చెట్లు చుట్టునుజేరి మిక్కిలిగా రతితో సానుభూతి చూపుచున్నవా యనునట్లు ఒప్పెను.

విశేషములు : రూపకానుప్రాణితోత్ప్రేక్షాలంకారము.

వ. ఇట్లు నిస్సహాయయైన రతి మతి నిరంతరానంతశోకరసం బుత్కంటై
వెలివిరియం దొడంగిన. 84

అర్థము : ఇట్లు, నిస్సహాయ = దిక్కులేనిది, ఐన, రతి, మతిన్ = మనస్సునందు, నిరంతర + అనంత - శోక - రసంబు = ఎడతెగని, అంతులేని

దుఃఖరసము, ఉత్కంఠంబు + ఐ = ఉవ్విళ్ళూరినదియై, వెలివిరియన్ + తొడంగిన్ = పొంగ నారంభింపఁగా.

తాత్పర్యము : ఇట్లు అసహాయయైన రతి మనస్సురో నెడతెగని అంతులేని దుఃఖరసమూరి పొంగ నారంభింపఁగా - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : శోకరసంబు = శోకమనెడి రసము-రూపకము.

తే. తలఁకి కనుఁగవఁ గన్నీరు ధార లొలుక
మేనఁ బేర్చిందు లురులంగ మెలఁత పొలిచెఁ
గీలు ప్రిదిలిన జలధార లోలిఁ గలయఁ
గ్రమ్మి చెదరెడు ధారాగృహమ్ము వోలె. 85

అర్థము : మెలఁత = స్త్రీ (రతి), తలఁకి = దుఃఖించి, కనుఁగవన్ = కనుదోయినుండి, కన్నీరు, ధారలు + ఒలుకన్ = ధారలుగాఁగాఱఁగా, మేనన్ = శరీరమునుండి, పేర్చిందులు = చెమటబొట్టులు, ఉరులంగన్ = స్రవింపఁగా, కీలు = మర, ప్రిదిలినన్ = సడలఁగా, జల - ధారలు = నీటిధారలు, ఓలిన్ = క్రమముగా, కలయన్ = అంతటను, క్రమ్మి = వ్యాపించి, చెదరెడు = చెదరునట్టి, ధారా-గృహమ్ము + పోలెన్ = ధారాయంత్రమువలె, పొలిచెన్ = ఒప్పెను.

తాత్పర్యము : రతి దుఃఖించుటచే నామెకనులజంటనుండి కన్నీరు ధార లొలుకఁగను, శరీరమునుండి చెమటబొట్టులు స్రవింపఁగను, మర సడలఁగా జల ధారలు క్రమముగా నంతటను గ్రమ్మి చెదరెడు ధారాయంత్రమువలె నొప్పెను.

విశేషములు ; అలంకార ముపమ.

తే. మెఱసి క్రొవ్వేణి వెంటిపై నెఱసి పొలయ
నడలు దరికొని వావిరి సఱచుచుండెఁ
గాన నెల్లఁ జెలంగ గ్రక్కదల మదము
దగిలి కేకించు పురినమ్మి పగిది వోలె. 86

అర్థము : క్రొవ్వేణి (క్రొత్త + వేణి) = క్రొత్తజడ, మెఱపి = ప్రకాశించి. వెంటిపైన్ = వెన్నుమీఁద-వీపుపై, నెఱపి = చెదరి, పొలయన్ = వ్యాపింపఁగా, (రతి), అడలు = దుఃఖము, దరికొని = విజృంభించి, కొనన్ + ఎల్లన్=అడవియందంతటను, చెలంగన్ = మ్రోయఁగా, గ్రక్కదలన్ = అదరఁగా, మదము + తగిలి = మత్తెక్కి, కేకించు = క్రేంకారారవము చేయు, పురి-నమ్మి-పగిది + పోలెన్ - పురిగల నెమలి విధమున- వావిరిన్ = అత్యంతముగా, అఱచుచున్ + ఉండెన్ = రోదించుచుండెను.

తాత్పర్యము : రతి జడ చెదరి వీపుపై వ్యాపింపఁగా, దుఃఖము విజృంభించి, అడవియందంతటను మ్రోయ నదరునట్లు మత్తెక్కి క్రేంకారారవముచేయు పురిగల నెమలివిధమున మిక్కిలి రోదించెను.

విశేషములు : అలంకార ముపమ. ఇందు ఉపమేయోపమానములకు లింగభేదము గలదు. రతి ఆఁడుది. పురినమ్మి మగది. అఱచుటపఱకే ఔపమ్యము. మఱియు రతి యఱచుట దుఃఖాతిశయముచే. నమ్మి యఱచుట మదాతిరేకమున.

క్రొవ్వేణి-క్రొత్త + వేణి. ప్రాఁతాదికార్యముచే (బాల, సంధి. 36) క్రొ + వేణి. 'క్రొత్తశబ్దమున కాద్యక్షరశేషంబునకుం గొన్నియెడల నుగాగమంబునుం గొన్నియెడల మీఁది హల్లునకు ద్విత్వంబు నగు' వేణి తత్సమ మగుట గమనించునది. 'సమాసమందుఁ దత్సమంబు పరంబగునపుడును నుమాగమాదులు గానంబడియెడి' ప్రౌఢ-సంధి, 12. వెన్ను ఔపవిభక్తికము గావున టివర్ణమంతాదేశమయిపది. (బాల. అచ్చిక 31. పదాంత్యమగు హ్రస్వముమీఁదిది గావునఁ బూర్ణబిందుపూర్వకముగా నైనది. వెంటిపై- గ్రక్కదలు- కదలు + కదలు- 'అందుకు ప్రకృతులు యథా ప్రయోగంబుగ గ్రాహ్యంబులు,' బాల. సంధి. 42. కేకించు - కేకా శబ్దభవము కేక. దానిపై నించుక్కు వచ్చి నామధాతువేర్పడినది.

వ. ఇట్లపారఘోరకాంతారాంతరాపూరితంబై చెలంగు రతి రోదనధ్వని వసంతకు చెవులం జిలికిన నులికిపడి యద్దెస యాలించి విని. 87

అర్థము : ఇట్లు, అపార-ఘోర - కాంతార + అంతర + ఆపూరితంబు + ఐ = మితిలేని, భయంకరమైన, అడవిలోపల నెల్ల నిండినదయి, చెలంగు =

శబ్దించు, రతి = రతియొక్క, రోదన - ధ్వని = ఏడుపుధ్వని, వసంతకు = వసంతుని, చెవులన్, చిలికినన్ = ప్రవేశింపఁగా, ఉలికిపడి = భయపడి, ఆ + దెస = ఆపైపు, ఆలించి - విని = బాగుగా విని.

తాత్పర్యము : ఇట్లు మితిలేనట్టియు, భయంకరమయినట్టియు నడవిలోపలి ప్రదేశమంతయు నిండినదయి ధ్వనించు రతి యేడ్పు వసంతుని చెవులఁబడఁగా భయపడి, యాపైపు శ్రద్ధగా విని - తరువాతి పద్యముతో నన్వయము.

తే. రతి యెలుంగగు నది వలరాజు పేరు
సెప్పి పనవెడు నది యేమి చిత్ర ముగ్రు
నెయిదఁ దడ వెద్ది ? మరుఁడు దండెత్తిపోవఁ
బోవ నడుమను బిందంబు పుట్టెనొక్కొ 88

అర్థము : అది = ఆ ధ్వని, రతి, ఎలుంగు = కంఠధ్వని, అగున్, వలరాజు = మన్మథుని, పేరు + చెప్పి, పనవెడున్ = ఏడ్చెడును, అది, ఏమి, చిత్రము = ఆశ్చర్యము, ఉగ్రున్ = శివుని, ఎయిదన్ = సమీపింప, తడవు + ఎద్ది = వ్యవధి యేది : మరుఁడు = మన్మథుఁడు. దండెత్తి పోవన్ + పోవన్ = దండెత్తి పోఁగాఁబోఁగా, నడుమను = మధ్యముననే, బిందంబు = ఆపద, పుట్టెన్ = ఒక్కొ = పుట్టెనాయేమి ?

తాత్పర్యము : అది రతి కంఠధ్వని యగును. మన్మథుని బేర్కొనుచు దుఃఖించెడును. అదేమివింత?. మన్మథుఁ డుగ్రుని సమీపింప నెడమేది? అతఁడు శివునిపై దండెత్తిపోఁగా నడుమనే యపాయము పుట్టెనా యేమి ?

విశేషములు : బిందము భేదశబ్దభవము.

వ. అనుచు నతిసంభ్రమంబునం బఱతెంచిన వసంతకుం గనుంగొని
రతి మతి నడలు నూర్మ్మడించినఁ దావగొనక. 89

అర్థము : అనుచున్, అతి-సంభ్రమంబునన్ = మిక్కిలి వేగముగా, పఱతెంచిన = పరువెత్తుకొని వచ్చిన, వసంతకున్ = వసంతుని, కనుంగొని = చూచి, రతి, మతిన్ = మనస్సునందు, అడలున్ = శోకమును, ఊర్మ్మడించినన్ =

ఊఱడించినన్ (సూ. ని. పాఠము) = ఓదార్పఁగా. తావగొనక = స్థైర్యము నొందక - నిలుపోపక,

తాత్పర్యము : అనుచు మిక్కిలి వేగముతోఁ బరువిడి వచ్చిన వసంతునిఁ జూచి రతిదేవి మనస్సునందు శోకము నోదార్పఁగా, నిలుపోపక-తరువాతి పద్యముతో నన్వయము.

**తే.** అలిగి పూవైన నలఁప లే దబల దాను
శోక బలమునఁ జోఁకినచోటఁ దోలు
తెరలి జర్జరమై పోవఁ గరతలములు
మీఁది కందంద రతి యెత్తి మోఁదికొనియె. 90

అర్థము : అబల = స్త్రీ - రతి, తాను, అలిగి = కోపించి, పూవు + ఐనన్ = పూవునుసైతము, నలఁపన్ + లేదు = నలఁగఁగొట్టఁజాలదు - రతి అంత సౌకుమార్యముగలది యనుట. శోక - బలమునన్ = దుఃఖబలముచేత, చోఁకిన - చోటన్ = తాఁకినచోట, తోలు = చర్మము, తెరలి = ఊడిపోయి, జర్జరము + ఐ = పోవన్ = శిథిలమయిపోఁగా, రతి, కర - తలములు = అరచేతులు, మీఁదికిన్ = పైకి, అందంద = మాటిమాటికి, ఎత్తి, మోఁదికొనియెన్ = బాఁదుకొనెను.

తాత్పర్యము : అబలయగు రతి కోపముచేఁ బూవునైనను నలఁపఁజాలని సౌకుమార్యవతి, శోకబలముచేఁ దాఁకినచోటనెల్లఁ దోలూడిపోయి శిథిలమగునట్లు అఱచేతులు మాటికి మీఁదికెత్తి బాఁదుకొనెను.

విశేషములు : కోపముతోఁ బూవునైన నలఁపలేని అబల రతి, అతి సుకుమార. అట్టి యామె అఱచేతులతో బాఁదుకొనినపుడు తోలూడిపోవుటకు శోక బలమే కారణమనుట. అలంకారము స్వభావోక్తి. అతిశయోక్తి.

**వ.** అంత వసంతుం డనంత శోకాకులిత హృదయుండై మూర్ఛిల్లిపడి, క్రమ్మఱ సచేతనుండై తన్నుందాన సవరించుకొని తనయడుగులం బడి విలాపించుచున్న రతి ననేకోపాయంబుల సంతరించి యూఱడం బలికిన నడలు డిందువడి నిజాధీశ్వరు నెచ్చెలియైన వసంతకుం గనుంగొని. 91

అర్థము : అంతన్, వసంతుండు, అనంత-శోక + ఆకులిత - హృదయుండు + ఐ = అంతములేని దుఃఖముచేఁ గలఁగిన హృదయముగలవాఁడయి, మూర్ఛిల్లి పడి, క్రమ్మఱన్ = మరల, సచేతనుండు + ఐ = తెలివివచ్చినవాఁడయి, తన్నున్ + తాను + అ = తన్నుఁదానే, సవరించుకొని, చక్కఁబఱుచుకొని, తన - అడుగులన్ + పడి = తన పాదములమీఁదఁబడి, విలాపించుచున్ + ఉన్న = ఏడ్చుచున్న, రతిన్, అనేక + ఉపాయంబులన్ = పెక్కు ఉపాయములతో, సంతరించి= చక్కఁబఱిచి, ఊఱడన్ + పలికినన్ = ఊఱటచెందునట్లు పలుకఁగా, అడలు = శోకము, డిందు + పడి = ఉపశమించి, నిజ + అధి + ఈశ్వరు = తన భర్త యొక్క, నెచ్చెలి = మిత్రుఁడు, ఐన, వసంతకున్, కనుంగొని,

తాత్పర్యము : అంత వసంతుఁ డంతులేనిశోకముచేఁ గలఁగిన హృదయము గలవాఁడయి, మూర్ఛిల్లి, మరలఁ దెప్పఱిల్లి, తన్నుఁదానే చక్కఁబఱుచుకొని, తన పాదములపైఁబడి యేడ్చు రతి ననేకోపాయములచేఁ జక్కఁబఱిచి యూఱట చెందునట్లు పలుకఁగా నామె శోక ముపశమిల్లి తన భర్తమిత్రుఁడైన వసంతునిఁజూచి- తరువాతి పద్యముతో నన్వయము,

ఆ. ప్రాణవల్లభుండు భస్మపుంజముగ నా
యెదురఁ జూడఁజూడ నెరిసిపోక
కనియు నొడలఁబాసి చనదయ్యె నగ్గడి
జీవ మింక నేమి సేయుదాన? 92

అర్థము : ప్రాణ - వల్లభుండు = ప్రియమైనభర్త, భస్మ - పుంజముగన్= బూదిరాశియగునట్లు, నా + ఎదురన్, చూడన్ + చూడన్ = చూచుచుండఁగా, ఎరిపి + పోక = కాలిపోవుట, కనియున్ = చూచియును, అగ్గడి - జీవము = సిగ్గులేనిప్రాణము, ఒడలన్ = శరీరమును, పాసి = విడిచి, చనదు + అయ్యెన్ = పోదాయెను, ఇంకన్, ఏమి, చేయుదానన్.

తాత్పర్యము : ప్రాణప్రియుఁడు బూదిదయగునట్లు నా యెట్టయెదుటఁ జూచుచుండఁగాఁ గాలిపోవుట చూచియు సిగ్గులేనిప్రాణము శరీరమును విడిచి పోదాయెను, ఇంకేమిచేయుదును ?

విశేషములు ; పోక = పోవుట, పోవుధాతువు. 'కవర్ణకం బలుగ్వాదుల కగు.' బాల. కృ. 3, పోవు + క. 'ఇటం గృత్కగతపవేములు పరంబులగునపుడు తగచ్ఛయవలకు లోపంబగు,' బాల. కృ. 2. పోక, అగ్గడి యనుశబ్దమునకు సూ.ని.లో ముందటఁ, అగ్రభాగము అను నర్థము లీఁబడినవి. అప్పుడు 'జీవము అగ్గడి నొడలఁబాపి చనదయ్యె' నని యన్వయము - ప్రాణము ముందట మేను విడిచిపోదాయె నని భావము. 'పిగ్గులేని' అనునర్థము మా. రా. ప్రతిలో నీఁబడినది.

తే. అంత వొచ్చెంబులేని నెయ్యమునఁగూడి
యున్న పతిఁ బాసి తెగువ లేకున్నదాన
నేను మొదలుగ, నింక నొండేల ?, యాఁడు
వారు చిక్కని డెందంబువారు జగతి. 93

అర్థము : అంత + పొచ్చెంబు = అంత కపటము లేని, నెయ్యమునన్ + కూడి + ఉన్న + స్నేహముతోఁ (ప్రేమముతో) గూడియున్న. పతిన్ = భర్తను, పాపి = విడిచి, తెగువ - లేక + ఉన్నదానన్ = సాహసము (మరణము) లేకున్న దానను, ఇంకన్, ఒండు + ఏల? = మఱియొకమాటయేల? జగతిన్ = లోకమున ఏను- మొదలుగన్ = నేను మొదలుకొని, ఆఁడువారు = స్త్రీలందఱును, చిక్కని - డెందంబు - వారు = కఠినమైన హృదయము గలవారు.

తాత్పర్యము : అంత నిష్కపటమైన ప్రేమముతోఁ గూడియున్న భర్తను విడిచి సాహసముచేయకున్నదానను. ఇఁక వేఱుమాట యేల? లోకమున నేను మొదలు గాఁగల యాఁడువారందఱును గఠినహృదయలు.

విశేషములు : 'అంత నొచ్చెంబు' అనుపాఠము గలదు. 'నొచ్చె' మను పదములేదు. పొచ్చెము, ఒచ్చెము గలవు. ఒచ్చెమయినచో నుగాగమ మెట్లువచ్చినది? అందుచే అంతవొచ్చెమనుపాఠమే స్వీకృతము, స్నేహము (ప్రకృతి) - నెయ్యము (వికృతి), తెగువ = సాహసము. దాతృత్వము. సాహసమనఁగా నిక్కడ మరణ మని భావము, ఎక్కు (ఎక్కు - ఎగు + వ) దిగువ (దిగు + వ) లవలె నిదియు తెగు (=చచ్చు) ధాతుకృదంతమా ? తెగువ=చావు, ఆఁడువారు చిక్కని డెందంబు వారు.-'న విదీర్యే, కఠినాః ఖలు స్త్రియః' - కాళిదాసు కుమారసంభవము, కుమార.4.5.

వ. అని తన్నుఁదాను నిరాకరించుచుం బతిసహవృత్తిలేదేనిం గులపా
లికా ధర్మవృత్తినైనం బురుషుతోడం బరలోకంబున కరుగవలయు
నవశ్యం బగ్నిప్రవేశంబు సేయుదునని రతి మరణనిశ్చయంబు
సేసిన. 94

అర్థము : అని, తన్నున్ + తాను, నిరాకరించుచున్ = త్రోపివుచ్చుచు, పతి - సహ - వృత్తి = భర్తతోడివర్తనము, లేదు + ఏనిన్ = లేకపోయినచో, కులపాలికా - ధర్మ - వృత్తిన్ + ఐనన్ = కులస్త్రీయొక్క ధర్మవర్తనముచేనైనను, పురుషుతోడన్ = భర్తతో, పర - లోకంబునకున్, అరుగవలయున్, అవశ్యంబు = తప్పక, అగ్ని - ప్రవేశంబు, చేయుదును + అని, రతి, మరణ - నిశ్చయంబు + చేసినన్ = చచ్చుటకు నిర్ణయింపఁగా.

తాత్పర్యము : అని తన్నుఁదాను ద్రోసిపుచ్చుచు, 'భర్తతోడిజీవనము లేకున్నను, కులస్త్రీధర్మము ననుసరించియైనను మగనితోఁ బరలోకమున కరుగవలయును, తప్పక అగ్నిప్రవేశము చేయుదు'నని రతి చచ్చుటకు నిర్ణయింపఁగా - తరువాతి పద్యముతో నన్వయము.

క. ఆకాశవాణి మృదురుతు
లాకాశమునందుఁ జెలఁగ 'నంగజు దయతో
నీకిచ్చు నిక్కువముగఁ ద్రి
లోక హితార్థమ్ముగాఁ ద్రిలోచనుఁ' డనినన్. 95

అర్థము : ఆకాశవాణి, మృదు - రుతులు = మృదువులైనధ్వనులు, ఆకాశమునందున్, చెలఁగన్ = ధ్వనింపఁగా, త్రిలోచనుఁడు = ముక్కంటి, నిక్కువముగన్ = నిజముగా, త్రి - లోక - హిత + అర్థమ్ముగాన్ = ముల్లోకములకు మేలు అగునట్లు, దయతోన్, నీకున్, అంగజున్ = మన్మథుని ఇచ్చున్, అనినన్,

తాత్పర్యము : ఆకాశవాణి మృదుధ్వను లాకాశమున ధ్వనింపఁగా, 'ముక్కంటి నిజముగా ముల్లోకముల మేలుకొఱకు నీకు దయతో మన్మథు నిచ్చు' నని పలుకఁగా-తరువాతి గద్యముతో నన్వయము.

వ. సంభ్రమించి వియత్తలంబు గనుంగొని యాలించి మఱుమాటలేమికిం దురపిల్లుచు నుగ్రు కోపానలాహతుండయ్యును గ్రమ్మఱునే యను చున్నదానికి గగనసరస్వతి నిశ్చయంబుగ వెండియు నిట్లనియె. 96

అర్థము : సంభ్రమించి = వేగపడి, వియత్ + తలంబున్ = ఆకాశ ప్రదేశమును, కనుంగొని = చూచి, ఆలించి = విని, మఱు - మాట = మఱియొక మాట, లేమికిన్ = లేకపోవుటకు, దురపిల్లుచున్ = విచారించుచు, ఉగ్రు - కోప+ అనల + ఆహతుండు + అయ్యును = శివుని కోపాగ్నిచేఁ గొట్టఁబడినవాఁడు సైతము, క్రమ్మఱునే = తిరిగివచ్చునా?, అనుచున్ + ఉన్నదానికిన్ = అనిపలుకుచున్న రతికి, గగన - సరస్వతి = ఆకాశవాణి, నిశ్చయంబుగాన్ = నిశ్చయ మేర్పడునట్లు వెండియున్ = మరల, ఇట్లు + అనియెన్.

తాత్పర్యము : వేగిరపాటుతో నాకాశము చూచి విని మఱియొక మాట లేకుండుటకు విచారించుచు 'నుగ్రుని కోపాగ్నిచే దగ్ధుఁడైనవాఁడుఁగూడఁ దిరిగి వచ్చునా;' యని సంశయించుచున్నరతికి నిశ్చయముగలుగునట్లు ఆకాశవాణి మరల నిట్లనియెను.

విశేషములు : లేమి - కలుగు ధాతువు. 'వ్యతిరేకభావంబున మిఁజీయగు.' బాల.క్రియ.37. కలుగు + మిఁజీ. 'కలుగున కస్త్యర్థంబునకు లజీ మి క ని వడి వర్ణకంబులు పరంబు లగునపుడు లే యగు.' బాల.క్రియ.106. లేమి. లేమి - వ్యతి. కలిమి.

ఉ. 'అట్టి మహోగ్రకోపదహనాంబకుఁడట్టె దయాగుణంబు దాఁ
బుట్టి మనోజు నిచ్చునటె; పోలదు నాఁజన; దభ్రపంక్తిలోఁ
బుట్టె నిరమ్మదాగ్నియును, భూరితరామృతవృష్టి దీని చో
ప్పెట్టిది నాఁగ నెవ్వరికి నీశ్వరుతత్త్వ మెఱుంగఁబోలునే? 97

అర్థము ; అట్టి = అటువంటి, మహత్(మహో) + ఉగ్ర - కోప - దహన + అంబకుఁడు + అట్టె - మిక్కిలి భయంకరమైనకోపముగల అగ్నినేత్రుఁడు (శివుఁడు) అట;, దయా - గుణంబు = దయ యను గుణము, తాను, పుట్టి, మనోజున్ = మన్మథుని, ఇచ్చున్ + అటె = ఇచ్చునట; నాకున్, పోలదు =

సరిపడదు, నాన్ = అనఁగా, చనదు = తగదు, అభ్ర పంక్తి - లోన్ మేఘముల వరుసలో, ఇరమ్మద + అగ్నియును = మేఘజ్యోతి యను నగ్నియును. భూరితర + అమృత - వృష్టి (యును) = మిక్కిలి జల వర్షమును, పుట్టెన్, దీని - చొప్పు = దీని విధము, ఇట్టిది - నాఁగన్ - ఇటువంటిది యనఁగా, ఎవ్వరికిన్ = ఎవరికైనను, ఈశ్వరు తత్త్వము = భగవంతుని నిజస్వరూపము, ఎఱుంగన్ + పోలునే = తెలియ నగునా ?

తాత్పర్యము : 'అంతటి మహాభయంకర కోపముగల అగ్నినేత్రుఁడట; దయపుట్టి మన్మథు నిచ్చునట; ఇది నాకు సరిపడదు అనరాదు. మేఘపంక్తిలో మేఘజ్యోతి యనునగ్నియు, అధికతరమైన జలవర్షము - అన్యోన్యవిరుద్ధములైన యీ రెండును బుట్టినవి దీని విధ మిట్లుండునన ఈశ్వరుని తత్త్వము ఎవ్వరికిని తెలియ రాదు.'

విశేషములు : అలంకారము దృష్టాంతము. 'చే ద్బిమ్బప్రతిబిమ్బత్వం దృష్టాన్త స్తదలఙ్కృతిః.' చన్ద్రా. అర్థాంతరన్యాసము, విశేషము సామాన్యముచేత సమర్థింపఁబడినది. భూరితరామృతవృష్టి - భూరితరామృతవృష్టియును - 'నామ సర్వ నామంబులకును గళలగు నవ్యయంబులకును గడపల సముచ్చయార్థవిశేషపాదపూర ణంబులయందు ను శబ్దంబు తఱచుగ నగు. కళలగు నసుదంత శబ్దంబులమీఁద నయ్యది యువర్ణపూర్వకంబుగ విభాష నగు' ప్రౌఢ. శబ్ద.116. ఇరమ్మదము - 'మేఘ జ్యోతి రిరమ్మదమ్; 'ఇరయా జలేన మాద్యతి దీప్యతే ఇతి ఇరంమదః' ఇర యనఁగా జలము. దానిచేత వృద్ధిఁబొందునది - వజ్రాగ్ని. అమరము. అమృత = నీరు. అప్సుచ ఘృతామృతే' అమృతశబ్దము నీళ్లకును. అమృతమునకును పేరు. అమరము.

వ. అనిన నట్టి దివ్యవచనంబులు విని నమ్మి రతి మరణపరిచ్ఛేదంబు విచ్ఛేదంబుచేసి పతిం దలంచి కమలించి. 98

అర్థము; అనినన్, అట్టి, దివ్య-వచనంబులు = దేవసంబంధములయిన మాటలు, విని, నమ్మి, రతి, మరణ - పరిచ్ఛేదంబు = మరణ నిశ్చయము, విచ్ఛేదంబు - చేసి = ఖండితముచేసి - విరమించి, పతిన్, తలంచి, కమలించి = కంది.

తాత్పర్యము : అని ఆకాశవాణి పలుకఁగా ఆ దివ్యములైన మాటలు విని నమ్మి రతి తన మరణనిశ్చయమును విరమించి భర్తను దలఁచి కంది - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : కమలించి = ఇందలి ఇంచుక్కన కేమియర్థమో ఇంచుక్క స్వార్థమున సంస్కృతమునకును, అంగలాగులకును మాత్రమే వచ్చును. కమలు ధాతువుగదా : దానిపై నించుక్కచేరి ప్రేరణార్థకమయి కమలఁజేయు అను నర్థము వచ్చును.

క. కరువునఁ బూరితమై లో
హరసము లోఁగాలునట్టు లంగజ శోకో
ద్ధురశిఖి రతి తను విమ్మగఁ
గరఁగియుఁ బొడ వఱక లోనఁ గాలుచునుండెన్. 99

అర్థము : లోహ - రసము = కరఁగిన యినుపద్రవము, కరువునన్ = పోఁతపోయు అచ్చులో, పూరితము + బ = నిండినదయి, లోన్ = లోపల, కాలు + అట్టులు = కాలువిధమున, రతి - తనువు = రతియొక్క శరీరము, అంగజ - శోక + ఉద్ధుర - శిఖిన్ = మన్మథుని కొఱకైన దుఃఖమనెడి అధికమైన అగ్నియందు, ఇమ్ముగన్ = ఒప్పుగా, కరఁగియున్, పొడవు + అఱక = రూపు నశింపక, లోనన్ = లోపల, కాలుచున్ + ఉండెన్.

తాత్పర్యము : ఇనుము కరఁగినద్రవము అచ్చులో నిండినదయి లోపలఁ గాలు విధమున. రతిదేవిశరీరము మన్మథుని కొఱకైన దుఃఖమనెడి అధికమైనఅగ్నిచేఁ గరఁగియు రూపుచెడక లోపలఁ గాలుచుండెను.

విశేషములు : రూపకానుప్రాణితమైన ఉపమ.

వ. ఇట్లెడ యుడుగని యడలడిం బడి. 100

అర్థము: ఇట్లు, ఎడ = హృదయము, ఉడుగని = మానని, అడలడిన్ = దుఃఖమున, పడి (ఎడ + ఉడుగని = విరామములేని.)

తాత్పర్యము ; ఈ రీతిగా రతి హృదయము దుఃఖమునుబొంది - నిర్విరామమైన దుఃఖమునుబొంది - తరువాతి పద్యముతో నన్వయము.

సీ. అలమట నెడియుండె నిలువమ చిత్తంబు
మూర్ఛిల్లి వెడఁబాసి పోవ దొండె
నూఱటఁ గొనియుండె నాఱదు శోకాగ్ని
పొరిమాలఁ గాని కాలిపోవదొండె
ఘర్మాశ్రుజలము లొక్కట కట్టుకొనవొండెఁ;
బొడవంతయుఁ గరంగిపోవ దొండెఁ
బర్వ నిట్టూర్పులు పట్టునఁ బడవొండె;
బొం దిమ్ముగాఁ బాసిపోవ దొండె;

తే. నిట్టి కడలేని దుఃఖాబ్ధిఁ బెట్టి ముంపఁ
దలఁచియో కాక పోనీక బలిమి నాడు
ప్రాణ మొదలిలో నాకాశవాణి దెచ్చి
మగుడః జెఱబెట్టె నని రతి మఱుఁగుచుండె. 101

అర్థము : అలమట = దుఃఖము,చెడి = పోయి, చిత్తంబు = మనస్సు, నిలువదు + ఒండెన్ = నిలువనైన నిలువదు, మూర్ఛిల్లి = మూర్ఛచెంది, వెడఁబాపి - పోవదు + ఒండెన్ = విడిచిపోవనైనఁ బోవదు.

శోక + అగ్ని = దుఃఖమనెడి అగ్ని. ఊఱటఁగొని = విరామమునొంది, ఆఱదు + ఒండెన్ = ఆఱిపోవనైన అఱిపోవదు, పొరిమాలన్ + కొని = నశించి, కాలిపోవదు + ఒండెన్ = కాలిపోవనైనఁ గాలిపోదు,

ఘర్మ + అశ్రు - జలములు = చెమటనీరు, కన్నీరు, ఒక్కట = ఒక్కమాఱుగా, కట్టుకొనవు + ఒండెన్ =ఆఁగనైన ఆఁగవు, పొడవు + అంతయున్ = శరీర మంతయు, కరంగి - పోవదు + ఒండెన్ = కరఁగిపోవనైనఁ గరఁగిపోవదు.

పర్వ = వ్యాపించు, నిట్టూర్పులు (నిడు + ఊర్పులు) = దీర్ఘ నిశ్వాసములు, పట్టునన్ + పడవు + ఒండెన్ = నిలువనైన నిలువవు, బొంది = దేహము,

ఇమ్ముగాన్ = చక్కఁగా, పాసిపోవదు + ఒండెన్ = విడిచిపెట్టిపోవనైనఁ బోవదు.

ఇట్టి - కడ - లేని = ఇట్టి అంతులేని. దుఃఖ + అబ్ధిన్ = దుఃఖమనెడి సముద్రమునందు. పెట్టి. = పడవైచి, ముంపన్ + తలఁచియో → ముంచివేయఁ గోరియో, కాక, పోన్ + ఈక = పోవనీక, బలిమిన్ = బలవంతముగా, ఆకాశవాణి, నాదు - ప్రాణము = నాప్రాణము, ఒడలిలోన్ = శరీరములో, తెచ్చి, మగుడన్ = మరల, చెఱన్ + పెట్టెన్ = బంధించెను, అని, రతి, మఱుఁగుచున్ + ఉండెన్ = సంతపించుచుండెను.

తాత్పర్యము : 'మనస్సు దుఃఖముపోయి నిలువనైన నిలువదు. మూర్ఛ చెంది విడిచి పోవనైనఁబోవదు. దుఃఖమనెడి అగ్ని విరమించి ఆఱనైన నాఱదు. నశించి కాలిపోవనైనఁగాలిపోదు. చెమటనీరు, కన్నీరు ఒక్కమాఱుగా ఆఁగనైన నాఁగవు, మేనెల్లఁ గరఁగిపోవనైనఁ గరఁగిపోదు. తఱచైన నిట్టూర్పులు నిలువనైన నిలువవు. బొంది విడిచి పోవనైనఁబోదు, ఇట్టి అంతులేని దుఃఖసముద్రమునఁ బడవైచి ముంచివేయఁగోరియే ఆకాశవాణి నా ప్రాణమును బోనీక బలవంతముగా శరీరములోనికిఁ దెచ్చి మరల బంధించెను' అని రతి సంతపించుచుండెను.

విశేషములు : శోకాగ్ని, దుఃఖాబ్ధి రూపకములు. ఇట్టి కడలేని దుఃఖాబ్ధిఁ బెట్టి ముంపఁదలఁచియో కాక బలిమి నాదు ప్రాణ మొడలిలో నాకాశవాణి దెచ్చి మగుడఁ జెఱఁబెట్టె.' ఉత్ప్రేక్ష 'పర్వు, నిట్టూర్పులు పట్టునఁ బడవొండె బొంది మ్ముగా ....' అది పొంది' కాక 'బొంది' (= శరీరము) అయియుండును. అట్టిచో 'ఒండె'కుఁ బిమ్మట అరసున్న ఉండరాదు. నిట్టూర్పు = నిడు + ఊర్పు. 'కుఱుచిఱు కడు నడు నిడు శబ్దముల ఱ డల కచ్చు పరంబగునపుడు ద్విరుక్త టకారంబగు.' బాల. సంధి. 12. నిట్టు + ఊర్పు. 'ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధి యగు.' బాల, సంధి. 1. నిట్టూర్పు, చిత్తము నిలువకుండుట, శోకాగ్ని ఆఱకుండుట. ఘర్మాశ్రుజలములు కట్టువడకుండుట, నిట్టూర్పు లాఁగకుండుట అను దేహబాధ లుడుగకుండుట కంటె దేహమే పోవుట లెస్స యనిభావము. నాదు ప్రాణము - నా + ప్రాణము. 'యుష్మదస్మదాత్మార్థకంబుల కుత్తరపదంబు పరంబగునపుడు దుగాగమంబు విభాష నగు,' బాల. సమాస. 11.

వ. అంత వసంతకుం డక్కుసుమకోమలి నూరార్చి 'కుసుమాయుధు
పునరవతారంబునకు నుద్యోగింపు' మని మైవడి నూలుకొలిపి. 102

అర్థము : అంతన్, వసంతకుండు, ఆ + కుసుమ - కోమలిన్ = పూవు వలె మనోజ్ఞాంగాలయిన రతిని, ఊరార్చి = ఓదార్చి. కుసుమ + ఆయుధు = పుష్ప బాణుని - మన్మథునియొక్క. పునః + అవతారంబునకున్ = పునర్జన్మమునకు, ఉద్యోగింపుము = ప్రయత్నింపుము, అని, మైవడిన్ = సమ్మతితో, నూలుకొలిపి = అంగీకరింపఁజేసి.

తాత్పర్యము : అంత వసంతుఁడు రతి నోదార్చి 'మన్మథుని పునర్జన్మము నకుఁ బ్రయత్నింపు' మని అందులకు సమ్మతింపఁజేసి - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : పునర్ + అవతారము = పునరవతారము, పునర్ - రేఫాంతావ్యయము, నూలుకొలుపు - నూలుకొను ప్రేరణరూపము.

చ. 'అమిత సురాసురేంద్రవరు లాదిగ నెవ్వనిఁ గొల్చి తత్ప్రసా
దమున నభీష్టముల్ వడసి తద్దయుఁ బేర్మి వెలుంగుచున్నవా
రమరఁగ నీవు నాతని దయాపరు నీశ్వరు భక్తియుక్తి సం
యమమతిఁ గొల్చుచుండు కమలానన! నీకు నభీష్టసిద్ధిగాన్. 103

అర్థము : కమల + ఆనన ! = పద్మముఖీ ! రతీ ! అమిత - సుర + అసుర + ఇంద్ర - వరులు = పెక్కండ్రు శ్రేష్ఠులైన దేవతలు, రాక్షసులు, అదిగన్ = మున్నుగా, ఎవ్వనిన్ = ఏ యీశ్వరుని. కొల్చి = సేవించి, తద్ + ప్రసాదమునన్ = ఆతని యనుగ్రహమున, అభీష్టముల్ = కోరికలు, పడసి = పొంది, తద్దయున్ + పేర్మిన్ = మిక్కిలి గొప్పతనముతో, వెలుంగుచున్ + ఉన్నవారు = ప్రకాశించు చున్నవారో, అమరఁగన్ = ఒప్పునట్లు, నీవున్ = నీవుకూడ, ఆతనిన్, దయా - పరున్ = దయయందాసక్తి గలవానిని, ఈశ్వరున్ = శివుని, నీకున్, అభీష్ట - సిద్ధి + కాన్ = కోరిక నెఱవేఱఁగా, భక్తి - యుక్తిన్ = భక్తితో, సంయమ - మతిన్ = నియమముతోడి మనస్సుతో, కొల్చుచున్ + ఉండు = సేవించుచుండుము.

తా త్ప ర్య ము : 'పద్మముఖీ? పెక్కండ్రు దేవతాశ్రేష్ఠులును. రాక్షసశ్రేష్ఠులును మున్నుగాఁగలవారు ఎవ్వనిని సేవించి యాతని యనుగ్రహమునఁ గోరికలు పొంది మిక్కిలి గొప్పతనముతోఁ బ్రకాశించుచున్నారో. నీవును దయామయుఁడైన అ యీశ్వరుని నీ కోరిక సిద్ధించునట్లు భక్తితో, నియతచిత్తముతో సేవించుచుండుము.

వి శే ష ము లు : తద్ + ప్రసాదము - 'అనునాసికాంతస్థ భిన్నములైన హల్లులకు (ఝల్లులకు) కఠినహల్లులు (ఖర్రులు) పరములగునపుడు వాని వర్గము లందలి ప్రథమవర్ణములు (చర్రులు) ఆదేశము లగును.' తత్ప్రసాదము. కొల్చుచుండుము + కమలానన-'మధ్యమపురుషమువర్ణకంబునకు హలవసానంబులు పరంబులగునపుడు లోపము విభాష నగు,' కొల్చుచుండు కమలానన. బాల, సంధి. 47.

వ. అని హితోపదేశంబు సేసినం గైకొని రతి నిరతిశయభక్తిం బరమేశ్వరారాధనంబు సేయుచుండె నట గిరిజ శిశిరోపచారంబుగా నెచ్చిఁటి కన్యాంతఃపురావర్తియగుచు నంతకాంతకు నిజాంతరంగంబునం జింతించుచుండు నంత నంతకంత కగ్గలించుచు. 104

**అ ర్థ ము :** అని, హిత + ఉపదేశంబు + చేసినన్ = హిత ముపదేశింపఁగా, కైకొని = స్వీకరించి, రతి- నిరతిశయ - భక్తిన్ = అధికమైన భక్తితో, పరమేశ్వర + ఆరాధనంబు = ఈశ్వరపూజ, చేయుచున్ + ఉండెన్. అటన్ = అక్కడ, గిరిజ = పార్వతి, శిశిర + ఉపచారంబుగాన్ = తాప ముపశమించునట్లు శీతలక్రియలు కాఁగా, ఎచ్చిఁటి = తెలిసికొని, కన్యా + అంతఃపుర - అవర్తి = కన్యల అంతిపురమునందే తిరుగునది, అగుచున్, అంతక + అంతకున్ = యముని నంతమొందించినవానిని - శివుని. నిజ + అంతరంగంబునన్ = తనదైన మనస్సునందు. చింతించుచున్ + ఉండున్ = ధ్యానించుచుండును, అంతన్, అంతకున్ + అంతకున్ = క్రమక్రమముగా, అగ్గలించుచున్ = అతిశయించుచు-

తా త్ప ర్య ము : అని హిత ముపదేశింపఁగా స్వీకరించి రతి యధికభక్తితోఁ బరమేశ్వరునిఁ బూజించుచుండెను. అక్కడ పార్వతి తాప ముపశమిల్ల శీతలక్రియలు జరుగఁగాఁ దెలిసికొని కన్యాంతఃపురమునందే యుండుచు, శివుని ధ్యానించుచుండెను. అంతఁ గ్రమక్రమముగా నతిశయించుచు - తరువాతి పద్యముతో నన్వయము.

చ. తలఁపుల తిట్ట, భావముల తానక, మాసల పుట్టినిల్లు కో
ర్కుల నెలవీడు, పల్వగల కూట, మవస్థల జన్మదేశ, ము
మ్మలికల[1] పేఁట, వేదనల[2] మంద, మనోభవు[3] వేఁటపట్టు, మూ
ర్ఛల సహవాస మన్విరహసంతతతాపము వొందెఁ బార్వతిన్. 105

అర్థము : తలఁపుల - తిట్ట = ఆలోచనల గుట్ట, భావముల - తానకము = భావముల నెలవు, ఆసల-పుట్టిన + ఇల్లు = కోరికలపుట్టినయిల్లు, కోర్కుల - నెలవీడు = కోరికల ఉనికిపట్టగు పురము, పల్ + వగల - కూటము = పెక్కుచింతల, చావడి - (స్థానము), అవస్థల జన్మ-దేశము = బాధలు పుట్టినదేశము, ఉమ్మలికల = దుఃఖముల, పేఁట = నగరము, (అంగడి), వేదనల - మంద = బాధల పల్లె, మనోభవు - వేఁట - పట్టు = మన్మథుని వేఁటాడుచోటు, మూర్ఛల - సహవాసము = మూర్ఛల, కలిసియునికి, అన్ = అను, విరహ - సంతత - తాపము = ఎడఁబాటు వలని నిరంతర తాపము, పార్వతిన్, పొందెన్.

తాత్పర్యము : తలఁపుల గుట్ట, భావముల నెలవు, ఆశల పుట్టినిల్లు, కోరికల ఉనికిపట్టు, పలుచింతల చావడి, బాధల పుట్టినదేశము, దుఃఖముల పేఁట, వేదనల పల్లె, మన్మథుని వేఁటాడుచోటు, మూర్ఛల సహవాసము అనెడి విరహనిరంతరతాపము పార్వతిని బొందెను.

విశేషములు : ఒక్క విరహతాపమునే యనేకవిధములుగా నుల్లేఖించుటచే నలంకార ముల్లేఖము. ఆస (వికృతి) - ఆశ (ప్రకృతి), పేర్మి - పేరు, 'పేర్వాదుల కిమివర్ణకంబగు' పేరు + ఇమి. బాల, తద్ధిత. 5. 'అంద్వవగాగమంబులం దప్ప నపదాదిస్వరంబు పరంబగునపు డచ్చునకు సంధి యగు.' బాల.సంధి.11. పేరిమి, 'లాఁతియచ్చునకు సహిత మొకానొకచో నుడి నడుమలోపంబు గానంబడియెడి.' బాల.ప్రకీర్ణ 18 - పేర్మి. అన్విరహ - అను + విరహ - 'అను కొను లోనగు ధాతుజవిశేషణముల యంత్యోకారమునకు హల్లు పరంబగునపుడు లోపంబు వైకల్పికంబు.' ప్రౌఢ. సంధి. 13.

---

1. వా. ప్రతి. పెంట. 2. వా. ప్రతి.మందు. 3. వా. ప్రతి. వేఁటమంద.

వ. ఇట్లుల్లంబున నడరు నాయల్లకభరంబునం దురపిల్లుచు. 106

అర్థము : ఇట్లు, ఉల్లంబునన్ = మనసునందు, అడరు = అతిశయించునట్టి, ఆయల్లక - భరంబునన్ = విరహమువలనఁగలుగు తహతహయొక్క అతిశయముచే, దురపిల్లుచున్ = దుఃఖించుచు.

తాత్పర్యము : ఇట్లు మనసున విజృంభించు విరహోత్కంఠచే దుఃఖించుచు - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : అడరు నాయల్లక - అడరు + ఆయల్లక - 'ఉదంతమగు తద్ధర్మవిశేషణమునకచ్చు పరంబగునపుడు నుగాగమంబగు.' బాల.సంధి.33. భరంబునం దురపిల్లుచు - భరంబునన్ + దురపిల్లుచు_'వర్గయుక్సరశములు పరము లగునపుడొకానొకచో ద్రుతమునకుఁ బూర్ణబిందువును గానంబడియెడి' బాల.సంధి. 19.

చ. అలులకు నుల్కుఁ మందమలయానిలుఁ డన్న భయంబునొందుఁ గో
యిలలకు బెగ్గలించుఁ, గడునేచిన మామిడి సూడనోడు, రా
చిలుకల కల్కుఁ, గాముఁ డనిచెప్పినఁ దల్లడమందు, నిండువె
న్నెలఁ గని సొమ్మఁబోవు, ధరణీధరనందన కామవేదనన్. 107

అర్థము : ధరణీధర - నందన = కొండకూఁతురు - పార్వతి, కామ - వేదనన్ = మన్మథబాధచే, అలులకున్ = తుమ్మెదలకు, ఉల్కున్ = భయపడును, మంద - మలయ + అనిలుఁడు + అన్నన్ = మెల్లఁగా వీచు మలయ పర్వతపుగాలి యన్నచో, భయంబున్ + ఒందున్ = వెఱచును, కోయిలలకున్, బెగ్గలించున్ = బెదరును, కడున్ = మిక్కిలి, ఏచిన = విజృంభించిన, మామిడి = మామిడిచెట్టు, చూడన్ = చూచుటకు, ఓడున్ = వెనుదీయును, రాచిలుకలకున్, అల్కున్ = భయపడును. కాముఁడు + అని - చెప్పినన్ = మన్మథునిపేరు చెప్పినచో, తల్లడము + అందున్ = కలఁతచెందును, నిండు - వెన్నెలన్, కని, సొమ్మఁబోవున్ =మూర్ఛిల్లును.

తాత్పర్యము : పార్వతి మదనతాపముచేఁ దుమ్మెదలకు భయపడును. మందమలయపవనుఁ డన్నచో భీతిల్లును, కోకిలములకు బెదరును. బాగుగాఁ బూచిన

మామిడిని జూడవెఱచును. రాచిలుకలకు భయముచెందును. మన్మథునిపేరుచెప్పి నంతనే గలఁతచెందును. విందువెన్నెలను జూచి మూర్ఛిల్లును.

క. వగచిన చిత్తము, నలఁదురి
మొగిచిన కనుఁగవయు, నుదుట మోపిన కేలున్,
వెగచిన కంఠము, నుడుగక
నెగసిన నిశ్వాసతతియు నీరజముఖికిన్. 108

అర్థము : నీరజ - ముఖికిన్ = పద్మముఖికి - పార్వతికి, వగచిన - చిత్తమున్ = దుఃఖించిన మనస్సును, అలఁదురి = ఏడ్చి, మొగిచిన = మూసిన, కను + కవయున్ = కనులజంటయును, నుదుటన్ = నొసటియందు, మోపిన - కేలున్ = ఉంచినచేయియును, వెగచిన - కంఠమున్ = వెక్కుచు ధ్వనించు కంఠమును, ఉడుగక = మానక, నెగసిన = బయలువెడలిన, నిశ్వాస - తతియున్ = నిట్టూర్పుల సమూహమును.

తాత్పర్యము : పద్మముఖియైనపార్వతికి దుఃఖితమనస్సును, ఏడ్చి మూసిన కనుదోయియును, నొసటనుంచిన చేయియును, వెక్కుకంఠమును, బయలు వెడలిన నిట్టూర్పులును (ఆయెను).

విశేషములు ; అలంకారము స్వభావోక్తి.

తరువోజ వెలడు నిట్టూర్పుల వెస నుచ్ఛలించు
వెలుపున నగలు నెవ్వేఁగు వలినను
లెలరార నెఱకల నెగయ నుంకించు
నెలమి ఱక్కవబోద లివి నాఁగఁబోలు ;
బలువిడిగొని జాఱుబాష్పోదకముల
బాల కన్గవ వేఁడి వరవాఱు లొప్పు
దలఁపించెఁ; గెంగేలుఁదమ్మిపైఁ దోడి
తమ్మి నాఁ దగి మోముఁదమ్మి పొల్పారె. 109

అర్థము : వెలడు = పైకి వచ్చునట్టి, నిట్టూర్పులన్ (నిడు + ఊర్పులన్) = దీర్ఘనిశ్వాసములచే, వెసన్ = శీఘ్రముగా, ఉచ్చలించు - మీఁదికెగయు, వెలుపునన్ విస్తారముచే, అగలు = పగులు, నెవ్వీఁగు = మిక్కిలినిక్కు, కంపించు వలి + చనులు = చల్లనిచన్నులు, ఎలరారన్ = ఒప్పఁగా. ఎఱకలన్ = ఱెక్కలతో. నెగయన్ = ఎగురుటకు, ఉంకించు = పూను, ఎలమి = పెంపుతోడి, జక్కవ - బోదలు + ఇవి = చక్రవాకపక్షులపిల్లలు ఇవి, నాఁగన్ + బోలున్ = అన నొప్పును.

బలువిడి + కొని = అతిశయించి - ఎక్కువగా, జాలు, బాష్ప + ఉదకములన్ = కన్నీళ్లతో, బాల = పార్వతియొక్క, కన్గవ = (కను + కవ) = కనుదోయి, వేఁడి - వరవాళులొప్పు (వేఁడి వరవాళుల + ఒప్పు)= వేఁడినీటిప్రవాహముల యొప్పును, తలఁపించెన్ = స్ఫురింపఁజేసెను.

తమ్మిపైన్ = తామరపువ్వుమీఁద, తోడి - తమ్మి - నాన్ = తోడి తామర పువ్వు అనఁగా, తగి = ఒప్పి, కెంగేలు (కెంపు + కేలు) = ఎఱ్ఱనిచేయి మోముఁదమ్మిన్(మోము + తమ్మిన్) = ముఖపద్మమునందు, బొల్పారెన్ (పొల్పు + ఆరెన్) = అందగించెను.

తాత్పర్యము : బహిర్గతములగు దీర్ఘనిశ్వాసములచే వేగముగా మీఁది కెగయునట్టియు, విస్తారముచేఁ బగులు, మిక్కిలి కంపించు చల్లని చన్నులు, ఱెక్కలతో నెగురుటకుఁబూను చక్రవాకపక్షుల పిల్లలను బోలుసు. అధికముగా జాలు కన్నీటితోఁ బార్వతి కనుదోయివేఁడినీటిప్రవాహముల యొప్పును దలఁపించెను. ఒక తామరపువ్వుమీఁద నింకొక తామరపు వ్వుండువిధమున ఆమె ఎఱ్ఱనిచేయి ముఖపద్మము నందుఁ బొల్పారెను.

విశేషములు : అలంకారము స్వభావోక్తి. అది ఉపమాప్రాణితము. నిట్టూర్పు - నిడు + ఊర్పు - ద్విరుక్తటకారాదేశము (బాల.సంధి.12). నిట్టు + ఊర్పు - ఉకారసంధి. బాల. సంధి. 1.; నెవ్వీఁగు-నెఱ+వీఁగు, వరవాళు లొప్పు. వరవాళుల + ఒప్పు - అకారసంధి. బాల.సంధి.4. కెంగేలు - కెంపు + కేలు - ప్రాఁతాదిసంధి. బాల.సంధి.36., కె + కేలు - నుగాగమము (బాల.సంధి.37). ద్రుతకార్యము. బాల. సంధి. 16,17. మోముఁదమ్మి-మోము + తమ్మి - ఉదంతస్త్రీ

సమమునకుఁ బరుషము పరముగా నుగాగమము. బాల.సంధి.25, ద్రుతకార్యము-బాల. సంధి.16, 17. ఇది తరువద అనిసా.ప్రతియందుఁ గలదు. తరువోజయని వా.ప్రతి యందును, మా.రా. ప్రతియందును గలదు. తరువదకును, తరువోజకును భేదమేమియుఁ గనుపట్టలేదు. తరువోజ లక్షణము. నాలుగుపాదము లుండును, ఒక్కొక్క పాదమున మూఁడింద్రగణములు నొకసూర్యగణము. మఱల మూఁడింద్రగణములు నొక సూర్యగణము నుండును, మొదటిగణము మొదటియక్షరమునకును, మూఁడవగణము మొదటియక్షరమునకును, మఱల నాల్గవగణము మొదటియక్షరమునకును, ఏడవ గణము మొదటియక్షరమునకును యతిమైత్రి, ప్రాసనియమము గలదు.

సీ. ఎలమి ముఖాంభోజ మలరు నొక్కొకమాటు;
పలవంత నప్పుడ వంది కందు;
నెలరాయ కనుఁగవ పొలయు నొక్కొకమాటు:
కన్నీరు లప్పుడ కలయఁ గప్పుఁ;
బులకలు మైఁదీఁగఁ బొలయు నొక్కొకమాటు;
ముచ్చిరి యప్పుడ ముచ్చముడుఁగుఁ;
బేర్పుండు లొడలిపైఁ బేర్చు నొక్కొక్కమా;
టప్పుడ మీఁదఁ గామాగ్ని నెగయు;

తే. మనసులోఁ గూడి యొక్కొకమాటు సూచుఁ;
జూచి పొదగాన కప్పుడ సొమ్మసిల్లు ;
నొనర భావజహరుల సంయోగవృత్తి
తగి యెఱుంగక యుండు నా నగతనూజ. 110

అర్థము : ఒక్కొకమాటు = ఒక్కొక్కసారి, ఎలమిన్=సంతోషముతో, ముఖ + అంభోజము = పద్మమువంటి ముఖము, అలరున్=వికసించును, అప్పుడు +అ = వెంటనే, వలవంతన్ = మన్మథవ్యథచే, వంది = సంతాపించి. కందున్= వివర్ణత నొందును.

ఒక్కొకమాటు, ఎలరారు - (ఎలరు + ఆరు) = ఒప్పునట్టి, కను + కవ = కన్నులజంట, పొలయున్ = ప్రకాశించును, అప్పుడు + అ, కన్నీరులు = బాష్ప జలములు, కలయన్ = అంతటను, కప్పున్ = క్రమ్మును.

ఒక్కొకమాటు, మైదీఁగన్ = (మై + తీఁగన్) = దేహలతయందు - తీఁగవంటి దేహమునందు, పులకలు = గగ్గురులు, పొలయున్ = వ్యాపించును, అప్పుడు + అ, ముచ్చిరి = దుఃఖించి, ముచ్చముడుఁగున్ = మిక్కిలి ముడుఁగును.

ఒక్కొకమాటు, ఒడలిపైన్ = శరీరమునందు, పేర్చిందులు = చెమట బొట్టులు, పేర్చున్ = అతిశయించును, అప్పుడు + అ, మీఁదన్ = పైని - దేహముపై, కామాగ్ని (కామ + అగ్ని) = మన్మథుఁడనెడి అగ్ని, నెగయున్ = బయలుదేఱును.

ఒక్కొకమాటు, మనసులోన్, కూడి, చూచున్, చూచి, పొడగానక = కనఁబడక, అప్పుడు + అ, సొమ్మసిల్లున్ = మూర్ఛిల్లును.

ఆ - నగ - తనూజ = ఆ కొండ కూఁతురు = ఆ పార్వతి, ఒనరన్ = ఒప్పునట్లు, భావజ - హరుల = మన్మథునియొక్కయు, ఈశ్వరునియొక్కయు, సంయోగ-వృత్తి = కూడియునికి, తగి, ఎఱుంగక + ఉండున్ = పారవశ్యము నొందును.

తాత్పర్యము ; పార్వతికి ఒక్కొక్కమాటు సంతోషముతో ముఖపద్మము వికసించును. వెంటనే మన్మథవ్యథచే సంతప్తమయి వివర్ణమగును. ఒక్కొక్కమాటు ఒప్పెడు కనుదోయి ప్రకాశించును, వెంటనే కన్నీరు అంతట నిండును. ఒక్కొక్కమాటు దేహలతనిండ గగ్గురు వ్యాపించును. వెంటనే దుఃఖముతో మిక్కిలి ముడుఁగును. ఒక్కొక్కమాటు శరీరమునఁ జెమటబొట్లు అధికమగును, వెంటనే దేహముపై మన్మథాగ్ని పైకిలేచును, ఒక్కొక్కమాటు భావమునఁ జూచును. చూచి కనఁబడమి వెంటనే మూర్ఛిల్లును. ఇట్లు మన్మథుఁడును, ఈశ్వరుఁడును గూడియునికి తగి ఆ పార్వతి పారవశ్యము నొందును.

విశేషములు : ఇందు భావజ హరుల పరస్పర విరోధమునకుఁ దగిన సాత్త్విక వికారములు వర్ణింపఁబడెను. ముఖాంభోజము = అంభోజము వంటి

ముఖము, మైఁదీఁగ = తీఁగవంటి పై - ఉపమిత సమాసములు, కామాగ్ని - కామ మనెడి అగ్ని - రూపకము. ముచ్చముడుఁగు - ముడుగు + ముడుఁగు - 'అందదుకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు.' బాల. సంధి. 42, భావజహరులు - భావజుఁడును, హరుఁడును - ద్వంద్వము.

క. భావజ శరహతి జీవము
పోవఁగ వచ్చుటయు నగజ పురహరు నెదలో
భావించి తెలిసి మగుడు, శు
భావహు శివుఁ దలఁప మృత్యుహర మగు టరుదే! 111

అర్థము : భావజ - శర - హతిన్ = మన్మథబాణముల దెబ్బచే, జీవము = ప్రాణము, పోవఁగన్ + వచ్చుటయున్ = పోవ సిద్ధపడియు, అగజ = పార్వతి, పుర-హరున్ త్రిపురములను హరించినవానిని - శివుని, ఎదలోన్ = హృదయములో, భావించి = తలఁచి, తెలిపి, మగుడున్ = (ప్రాణము) మరలును, శుభ + ఆవహున్ = శుభకరుని. శివున్ = శివుని, తలఁపన్ = స్మరింపఁగా, మృత్యు - హరము = చావులేకుండుట, అగుట, అరుదే = ఆశ్చర్యమా ?

తాత్పర్యము : మన్మథ బాణహతిచేతఁ బ్రాణము పోవనుండియుఁ బార్వతి శివుని హృదయములో భావింపఁగాఁ దెలిపి యది మరలివచ్చును. మృత్యుంజయుఁడయి శుభావహుఁడైన శివుని స్మరింప మృత్యువు హరించుట ఆశ్చర్యమా ? కాదనుట.

విశేషములు : విశేషము సామాన్యముచే సమర్థింపఁబడుటచే నలంకార మర్థాంతరన్యాసము.

వ. ఇట్లసాధారణంబైన రణరణకవ్యథ కబ్బగింపక పొలయుచు. 112

అర్థము : ఇట్లు, అసాధారణంబు + ఐన = సాధారణముకాని - విశిష్టమైన, రణరణక - వ్యథకున్ = మన్మథబాధకు విరహబాధకు, అబ్బగింపక = ఓర్వక, పొలయుచున్ = మిక్కిలి యలసట నొందుచు.

తాత్పర్యము : ఇట్లు అసామాన్యమైన మన్మథవ్యథకుఁ దాళలేక మిక్కిలి యలసట నొందుచు - తరువాతి పద్యముతో నన్వయము.

మ. ఇదిగాకేమి వియోగతాప మనఁగా, నిట్లేర్చుఁగాకేమి కౌ
ముది ? యోషిత్తతి కింత బెట్టిదుఁడె కాముం ? డంగనా రాజికిన్
హృదయాధీశులఁ బాసియున్న విరహంబింత నేచుదే ? యింత తు
మ్మెదరుం జిల్కకు గండుఁగోయిలకు మేల్మేలంచు విభ్రాంతయై 113

అర్థము : వియోగ-తాపము + అనఁగాన్ = విరహతాప మనఁగా, ఇది-కాక + ఏమి? = ఇదికాక మఱేమి? ఇదియే యనుట. కౌముది = వెన్నెల, ఇట్లు, ఏర్చున్ + కాక + ఏమి = దహించునకదా ! కాముండు = మన్మథుఁడు యోషిత్ + తతికిన్ = స్త్రీజనమునకు, ఇంత, బెట్టిదుఁడు + ఎ = విర్దయుఁడా, అంగనా - రాజికిన్ = స్త్రీలసమూహము నకు, హృదయ + అధి + ఈశులన్ = ప్రాణేశ్వరులను, పాసి + ఉన్నన్ = విడిచియున్నచో, విరహంబు = వియోగము, ఇంత + ఏచుదే = ఇంతగా బాధించుటయా ? తుమ్మెదకున్, చిల్కకున్, గండుఁగోయిలకున్ (గండు + కోయిలకున్) = కోకిలమునకు. ఇంత = ఇంతయా ? ఇంతపొగరా ? యనుట. మేల్మేలు (మేలు + మేలు) = బాగుబాగు, అంచున్, విభ్రాంత + ఐ = విభ్రమము చెందినదయి.

తాత్పర్యము : విరహతాపమనఁగా ఇట్టిది యౌనేకదా ! వెన్నెల యిట్లు దహించునేకదా ; స్త్రీజనమునకు మన్మథుఁ డింతక్రూరుఁడా ? స్త్రీలు ప్రాణేశ్వరులను విడిచియున్నచో వియోగ మింతబాధించునా? తుమ్మెదకుఁ, జిల్కకు, గండుఁగోయిలకు ఇంత పొగరా ? అనుచుఁ గలవరపడినదయి - తరువాతి వచనముతో నన్వయము.

విశేషములు : కోకిలము (ప్రకృతి)-కోయిల, కోవెల (వికృతి). గండుఁ గోయిల = పుంస్కోకిలము, గండు + కోయిల - 'సహసంబుల నుదంతంబులగు స్త్రీసమంబులకుం బుంపులకుం బరుషసరళంబులు పరంబు లగునపుడు నుగాగమం బగు.' బాల. సంధి. 25. ద్రుతకార్యము (బాల, సంధి. 16, 17.) గండుఁగోయిల, తుమ్మెదలు, చిలుకలు, గండుఁగోయిలలు మన్మథుని పరివారము. చిల్క - చిలుక - 'అచ్చికంబులం బదమధ్యంబుల న ల డ ర ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు. బాల. ప్రకీర్ణక, 17. మేల్మేలు-మేలు + మేలు - 'పదాంతంబులయి యసం

యుక్తంబులయిన ను లు రు ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు.' బాల. ప్రకీర్ణక. 16

వ. కళవళించి పరమేశ్వరుం దలఁచి మనంబున నువ్విళ్లూరుచు. 114

అర్థము : కళవళించి = కలఁతపడి, పరమేశ్వరున్, తలఁచి, మనంబునన్ = మనస్సునందు, ఉవ్విళ్లూరుచున్ = తహతహపడుచు,

తాత్పర్యము : కలఁతపడి, యీశ్వరుని స్మరించి మనస్సునఁ దహతహపడుచు - తరువాతి పద్యముతో నన్వయము,

సీ. సురనది నురువులు జూటాంతరంబునఁ
క్రొవ్విరిజాదుల కొమరు గాఁగఁ
బావకాంబకరుచి ఫాలతటంబునఁ
గాశ్మీర మయతిలకంబు గాఁగ
గరళాసితప్రభ గళమున వ్రాసిన
కస్తూరి పత్రభంగంబు గాఁగ
భాసురంబగు నిజ పాండురాంగద్యుతి
సదమల చందనచర్చ గాఁగఁ

తే. జారుతరమైన సహజ శృంగారరూప
విభవ సౌభాగ్య సంపద విస్తరిల్లు
నా మహాదేవుతోఁ జిత్తమార వెలసి
కలిసి రమియింప నెన్నఁడు గాంతు నొక్కొ. 115

అర్థము : సుర - నది - నురువులు = ఆకాశగంగ నురుఁగులు. జూట + అంతరంబునన్ = జడముడిలోపల, క్రొవ్విరి (క్రొత్త + విరి) = క్రొత్తగా వికసించిన, జాదుల = జాజిపూల, కొమరు = అందము, కాఁగన్.

పావక + అంబక - రుచి = అగ్నినేత్రముయొక్క కాంతి, ఫాల - తటంబునన్ = నొసటిప్రదేశమున, కాశ్మీర - మయ - తిలకంబు = కుంకుమపు బొట్టు-కాఁగన్,

గరళ + అసిత - ప్రభ = విషముయొక్క నల్లని, కాంతి, గళమునన్ = కంఠమునందు, వ్రాసిన = లిఖించిన, కస్తూరి - పత్రభంగంబు = కస్తూరితో వ్రాసిన మకరికాపత్రము కాఁగన్.

భాసురంబు + అగు = ప్రకాశించునట్టిది యగు, నిజ - పాండుర + అంగ ద్యుతి = తనదైన తెల్లని శరీరకాంతి, సత్ + అమల - చందన - చర్చ = మిక్కిలి నిర్మలమైన గంధపుఁబూఁత, కాఁగన్.

చారు - తరము + ఐన = మిక్కిలి మనోహరమైన, సహజ - శృంగార - రూప - విభవ - సౌభాగ్య - సంపద = స్వభావసిద్ధమైన శృంగారరూపముయొక్క వైభవము. సౌభాగ్యము అనెడి సంపద, విస్తరిల్లు = వ్యాపించునట్టి, ఆ - మహా దేవు తోన్ = ఆ శివునితో, చిత్తమారన్ (చిత్తము + ఆరన్) = మనసార, వెలపి = ప్రకాశించి, కలిపి = కూడి, రమియింపన్ = కవయుటకు, ఎన్నఁడు = ఎప్పుడు, కాంతున్ + ఒక్కొ = చూతునో.

తా త్ప ర్య ము : తలమీఁది ఆకాశగంగ నురుఁగులు జడముడిలోని క్రొత్తగా విరిసిన జాజిపూల యందము పంతరించుకొనఁగను. అగ్నినేత్రకాంతి నుదుటదిద్దిన కుంకుమపుబొట్టు కాఁగను. విషపు నల్లనికాంతి కంఠమున వ్రాసిన మకరికాపత్రము కాఁగను, ప్రకాశించు తన తెల్లనిదేహకాంతి స్వచ్ఛమైన మంచిగంధపుఁబూఁత కాఁగను మిక్కిలి మనోహరమైన సహజ శృంగారరూపవైభవము గల ఆ శివునితో మనసార నెన్నఁడు రమింపఁగందునో !

వి శే ష ము లు : అలంకారము రూపకము. క్రొవ్విరి - క్రొత్త + విరి - 'సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగా నగు.' బాల.సంధి.36. క్రొ + విరి - 'క్రొత్తశబ్దమున కాద్యక్షరశేషంబునకుం గొన్నియెడల నుగాగమంబునుం గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు.' బాల. సంధి. 38. క్రొవ్విరి.

వ. అని గద్దించి కాలుకొనక లీలోద్యానంబున కేకాంతంబునఁ జని విరహ
దహనదాహంబు సహింపనోపక. 116

అర్థము: అని, గద్దించి, = అదలించి. కాలుకొనక = నిలువక, లీలా+ ఉద్యానంబునకున్ = క్రీడావనమునకు, ఏకాంతంబునన్ = ఒంటరిగా, చని, విరహ - దహన - దాహంబు = వియోగమనెడి యగ్నితాపము. సహింపన్ + ఓపక = ఓర్వఁజాలక,

తాత్పర్యము: అని యదలించి నిలువక క్రీడోద్యానమునకు ఒంటరిగాఁ బోయి వియోగమనెడి యగ్నితాపము నోర్వక - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు: విరహ - దహన - విరహమనెడి దహన రూపకము. కాలుకొను = కాలుమోపు - నిలుచు.

తే. రుచిర శశికాంత రచిత సరోవరంబు
నెలఁత సొచ్చిన మెయివేఁకి నీరులెల్ల
నింకె; వదనేందురుచి శిలలెల్లఁ గరఁగి
నిండెఁ దోడ్తోన కొల నతనుండు విసువ. 117

అర్థము: రుచిర - శశికాంత - రచిత - సరోవరంబున్ = మనోహరమైన, చంద్రకాంతశిలలతో, నిర్మింపఁబడిన సరస్సును. నెలఁత = స్త్రీ - పార్వతి, చొచ్చినన్ = ప్రవేశింపఁగా, మెయి-వేఁకిన్ = శరీరతాపముచే నీరులు + ఎల్లన్ = జలము లన్నియు, ఇంకెన్, తోడ్తోన్ + అ=వెంటనే, అతనుండు = మన్మథుఁడు, విసువన్ = విసువుచెందఁగా, వదన + ఇందు - రుచిన్ = ముఖమనెడు చంద్రుని కాంతితో, శిలలు + ఎల్లన్ = చంద్రకాంతపుఱాలు అన్నియును, కరఁగి, కొలను = సరస్సు, నిండెన్.

తాత్పర్యము: మనోహరములైన చంద్రకాంతశిలలతో నిర్మింపఁబడిన సరస్సు పార్వతి ప్రవేశింపఁగా, నామె శరీరతాపముచే నందలి నీరులన్నియు నింకిపోయెను, కాని మరల వెంటనే మన్మథుఁడు విసువుచెందఁగా, నామె ముఖమనెడి చంద్రునికాంతిచే నా చంద్రకాంతశిలలు కరఁగి కొలను నిండెను.

వి శే ష ము లు: సంబంధాతిశయోక్త్యలంకారము. 'సంబన్ధాతిశయోక్తి స్స్యాదయోగే యోగకల్పనమ్,' చన్ద్రా. అరనుండు విసువ — మన్మథుఁడు విసువుకొనుట యెందులకనఁగా. నామెను సంతప్తురాలినిజేయు తనప్రయత్నమున విఫలుఁడయినందులకు, వదన + ఇందు = రూపకము.

వ. అంతం దనుసంతాపంబు వాపనోపక పరమేశ్వరురూపు చిత్రించి చూచిననైన నూఱట యగునోయని చిత్రసాధనంబులు గొని వలక ఘట్టించి మెఱుంగిడి త్రివటించి తిట్టంబు కొలఁదికిందెచ్చి ఋజ్వాగతంబున రేఖ నూల్కొలిపి పత్రక బిందుక నిమ్నోన్నతాపాంగ మానోన్మానంబు లలవఱిచి సలక్షణంబుగాఁ జిత్రించి వన్నువ గొలిపి కందెఱ తెఱచిన. 118

అర్థము: అంతన్, తను - సంతాపంబు = మేనివేఁడిమి, పాపన్ + ఓపక = పోఁగొట్టుకొనలేక, పరమేశ్వరు - రూపు, చిత్రించి, చూచినన్ + ఐనన్ = చూచుటచేతనైనను, ఊఱట = స్వస్థత, అగునో, అని, చిత్ర - సాధనంబులు = రూపచిత్రణోపకరణములు, కొని, పలక = చిత్రఫలకము, ఘట్టించి= స్థిరముగానుండునట్లుచేసి, మెఱుంగు+ఇడి = మెఱుఁగుపెట్టి, త్రివటించి=మూఁడు సమభాగములుగాఁజేసి, తిట్టంబు-కొలఁదికిన్ + తెచ్చి = చిత్రప్రారంభమునందు స్థూలాకారముప్రాసి, ఋజ్వాగతంబునన్ = చిత్రశాస్త్రమున రేఖలువ్రాయునైదుమార్గములలో నొకటియైన దీనిచే, రేఖన్=గీఁతను, నూల్కొలిపి=సరిచేసి,పత్రక-బిందుక - నిమ్నోన్నత - అపాంగ - మాన + ఉన్మానంబులు = ఈ పేర్లు గల లేఖనమార్గములు, అలవఱిచి = చేసి, సలక్షణంబుగాన్ = లక్షణయుక్తముగా, చిత్రించి = లిఖించి, వన్నువ + కొలిపి = వర్ణము ఉండునట్లుచేసి, కందెఱ= గవు సెన, తెఱచినన్ = తీయఁగా,

తా త్ప ర్య ము: అంత మేనితాపమును బోఁగొట్టుకొనలేక యీశ్వరుని రూపమును జిత్రించి చూచుటవలననైనను స్వాస్థ్యము గలుగునేమోయని చిత్రమువకు వలయు నుపకరణములు తీసికొని, చిత్రఫలకమును స్థిరముగా నుండునట్లుచేసి, మెఱుఁగుపెట్టి, మూఁడుసమభాగములుచేసి, స్థూలాకారము వ్రాసి ఋజ్వాగతమనెడిరేఖామార్గ

మున రేఖను సరిచేసి, పత్రకము, బిందుకము, నిమ్నోన్నతకము, అపాంగము, మానము, ఉన్మానము అను రేఖనమార్గములు సరిచేసి, లక్షణమునకు సరిపోవునట్లు లిఖించి వర్ణము వేసి, గవుసెన తెయఁగా - తరువాతిపద్యమునతో నన్వయము.

విశేషములు : ఋజ్వాగతము - చిత్రశాస్త్రమున రేఖలు వ్రాయు పంచ మార్గములలో నొకటి, తక్కినవి: అర్ధఋజువు, సాచి, ద్వ్యర్ధాక్షి, పార్శ్వాగతము. చిత్రపటరూపములు మనలఁజూచు దృష్టిభేదములఁ జూపురేఖలే యీ యైదును. పత్రక. బిందుక, నిమ్నోన్నత, మాన, నీలక, ధూమ్రావర్త్తక, ఉద్వర్త్తన, చిత్రప్రవర్త్తనము లను నెనిమిదియు. క్రమముగా సకల, స్వస్తిక, సర్వతోభద్రి, కళిక, కంటిక, త్రిభంగ, శిశునిరీక్షణ, వర్ధమానము లను నెనిమిదివిధములగు చిత్రరూపములకు రేఖన మార్గములు.

చ. కలకల నవ్వునట్లు, తమకంబునఁ గన్గవ విచ్చి భ్రూలతల్
వొలయఁగఁ జూచునట్లు, తనివోవఁగఁ దెల్చియుఁ గౌఁగిలింపఁ జే
తులు పచరించున, ట్లడటుతో రతికేళికి నప్పలించున
ట్లెలమి నటించుచుండె సతి కీశ్వరురూ పెదురం బ్రసన్నమై. 119

అర్థము : ఈశ్వరు - రూపు = ఈశ్వరుని ఆకారము, సతికిన్ = స్త్రీకి - పార్వతికి, ఎదురన్, ప్రసన్నము + ఐ = సరియైనదయి, కలకల - నవ్వు + అట్లు = కలకల నవ్వునట్లును, తమకంబునన్ = తహతహతో, కన్గవ (కను + కవ) = కనులజంట, విచ్చి = విప్పి, భ్రూ - లతల్ = తీఁగలవంటిబొమలు, పొలయఁగన్ = పొసఁగఁగా, చూచు + అట్లు - చూచునట్లును, తనివోవఁగన్ = తృప్తి తీఱఁగా, తెల్చియున్ = తేర్చియు, కౌఁగిలింపన్ = కౌఁగిలించుటకు, చేతులు, పచరించు + అట్లు = చాఁచునట్లును, అడటుతోన్ = ఉద్రేకముతో, రతి - కేలికిన్ = సంభోగ క్రీడకు, అప్పలించు + అట్లు = ఉత్సహించునట్లును, ఎలమిన్ = ఇంపుగా, నటించుచున్ + ఉండెన్ = తోఁచుచుండెను.

తాత్పర్యము : ఈశ్వరునిరూపము పార్వతి కెదుటఁ బ్రసన్నమయి, కలకల నవ్వునట్లును, తహతహతోఁ గనుదోయి విప్పి బొమతీవలు పొసఁగఁజూచునట్లును, తృప్తి తీఱఁ దేర్చియుఁ గౌఁగిలించుకొనుటకుఁ జేతులు చాఁచునట్లును, ఉద్రేకముతో సంభోగక్రియకు ఉత్సహించునట్లును ఇంపుగా వర్తిలుచుండెను.

విశేషములు ; ఈ పద్యము పింగళిసూరనకృత ప్రభావతీప్రద్యుమ్నము నందలి యీ క్రిందిపద్యమును స్ఫురింపఁజేయుచున్నది.

చ. కలకల నవ్వినట్ల తెలిగన్నుల నిక్కము చూచినట్ల తోఁ
బలుకఁ గడంగినట్ల కడు భావగభీరత లబ్బినట్ల పెం
పొలయఁ దనర్చి జీవకళ యుట్టిపడన్ శివ వ్రాసినట్టి యా

చెలువునకాభిముఖ్యము భజింపఁ దలంకెను దాను బోటియున్. ప్రభా. 1.138. ఇదియును పార్వతి చిత్తరువునవ్రాసిన ప్రద్యుమ్నునిరూపవర్ణనము. భ్రూలతల్ = లతలవంటిభ్రువులు - ఉపమిత సమాసము, తెల్చి - తెలుపుధాతుక్త్వార్థరూపము, అలంకారము స్వభావోక్తి.

వ. అంత నంతయు నిక్కంబ కాఁదలంచి లజ్జించి మే యోసరించుచు నపాంగావలోకనంబు సురంగంబై పొలయం దదాసక్త యగుచు నంత నక్కడం జతురిక యను ప్రియవయస్య కన్యాంతఃపురంబునం దగసుతం గానక లీలోద్యానంబునం దన్వేషించుచు వచ్చి వచ్చి. 120

అర్థము : అంతన్, అంతయున్, నిక్కంబు + అ = నిజమే, కాన్ = అగునట్లు, తలంచి, లజ్జించి = సిగ్గుపడి, మే = శరీరము. ఓసరించుచున్ = తొలఁగఁజేయుచు, అపాంగ + అవలోకనంబు = క్రీఁగంటిచూపు. సురంగంబు + ఐ = ప్రకాశమయి, పొలయన్ = వర్తిలఁగా, తద్ + ఆసక్త = ఆతనియందు శివుని యందుఁ, గోరికగలదై, అగుచున్ + ఉండన్ = అగుచుండును, అంతన్, అక్కడన్, చతురిక, అను, ప్రియ - వయస్య = అనుఁగుఁజెలి, కన్యా + అంతఃపురంబునందున్, అగ - సుతన్ = కొండకూఁతును-పార్వతిని, కానక = చూడక, లీలా + ఉద్యానంబు నందున్ = క్రీడోపవనమునందు. అన్వేషించుచున్ = వెదకుచు, వచ్చి - వచ్చి.

తాత్పర్యము : అంతఁ దానుజూచునదియంతయు నిజమేయని తలఁచి, సిగ్గుఁజెంది, శరీరము అపసరిల్లఁజేయుచుఁ, గ్రీఁగంటి చూపు ప్రకాశమయి వర్తిలఁగా శివునియందుఁ గోరికగలది యగుచుండెను. అంత నక్కడఁ జతురిక యను ననుఁగుఁ జెలి కన్యాంతఃపురమునఁ బార్వతిని గానక క్రీడావనమున వెదకుచు వచ్చివచ్చి. - తరు వాతి పద్యముతో నన్వయము.

సీ. జలజాతముల కింత చన వెవ్వరిచ్చిరి
దరహాసరుచిఁబొల్చు తావిఁ బెనఁగ?
హిమరుచి కీ మెయి యెందుండి వచ్చె ని
తాంత సుధాపూర్ణకాంతిఁ దనర?
మలయానిలుం డింత చలిమిరితోఁ గ్రాలి
నడపాడు నోజ యెన్నండు వడసె?
రాజకీరము లింత రసవంత మగుమాట
చొప్పు లేరీతి నెచ్చోటఁ బడసెఁ?

తే. దగు నెఱింగితిఁ బ్రాలేయ నగ తనూజ
మదనవేదనఁ దన్నుఁ దా మఱచియున్న
యవసరంబుల నా బాల యవయవముల
చెలువు గిల్కొడుకొనిరి గావలయు నేఁడు. 121

అర్థము : దర - హాస - రుచిన్ = చిఱునవ్వుకాంతితోఁ బొల్చు = ఒప్పు. తావిన్ = పరిమళముతో, పెనఁగన్ = కూడియుండుటకు. జలజాతములకున్ = పద్మములకు, ఇంత = ఇంతటి, చనవు = పరిచయము, ఎవ్వరు, ఇచ్చిరి?

నితాంత - సుధా - పూర్ణ - కాంతిన్ = అధికమైన, అమృతముతో నిండిన కాంతితో, తనరన్ = ఒప్పుటకు, హిమ - రుచికిన్ = చల్లని కిరణములు గలవానికి - చంద్రునకు. ఈ - మెయి = ఈ రీతి, ఎందున్ + ఉండి = ఎచ్చటినుండి, వచ్చెన్.

మలయ + అనిలుండు = మలయపవనుఁడు - దక్షిణపుగాలి, ఇంత, చలిమిరితోన్ = శైత్యముతో, క్రాలి = ఒప్పి, నడపాడు + ఓజ = సంచరించు విధము, ఎన్నండు = ఎప్పుడు, పడసెన్ = పొందెను.

రాజ - కీరములు = రాచిలుకలు, ఇంత, రసవంతము + అగు - సరసములగు - మాట - చొప్పులు = మాటరీతులు, ఏ రీతిన్ = ఏ విధముగా, ఎచ్చోటన్ (ఏ + చోటన్) = ఎచ్చట, పడసెన్.

తగున్ = అవును, ఎఱింగితిన్ = తెలిసికొంటిని.

ప్రాలేయ - నగ - తనూజ - మంచుఁగొండ కూఁతురు - పార్వతి, మదన - వేదనన్ = మన్మథబాధతో. తన్నున్ + తాన్ = తన్నుఁదాను, మఱచి + ఉన్న + అవసరంబులన్ = మఱచియున్న సమయములందు, ఆ - బాల = ఆ కన్య - పార్వతి యొక్క, అవయవముల = అవయవములయొక్క, చెలువు = అందము, నేఁడు, గిల్మాడుకొనిరి కావలయున్ = అపహరించిరికాఁబోలును.

తాత్పర్యము : పద్మములకుఁ జిఱునవ్వుకాంతితో నొప్పు పరిమళముతోఁ గూడియుండుట కింతపరిచయ మెవ్వరిచ్చిరి? చంద్రునకు అధికమైన అమృతముతో నిండినప్రకాశముతో నొప్పుటకు ఈ రీతి యెందుండి వచ్చెను? మలయవాయువు ఇంత శైత్యముతో నొప్పి సంచరించు విధ మెప్పుడు పొందెను? రాచిలుక లింత రసవంతము లైన మాటరీతు లే విధముగా నెచ్చటఁబొందెను? అవును. తెలిసికొంటిని! హిమవత్పర్వతపుత్త్రి, మన్మథతాపముచే మైమఱచియున్న సమయములందు ఆమె యవయవముల అందమును నేఁ డపహరించియుండవలయును.

విశేషములు : అలంకార ముత్ప్రేక్ష- ప్రాలేయ - 'ప్రాలేయం మిహికా చ. ప్రళయా చ్ఛరదంతాదాగత మితి ప్రాలేయమ్' - శరత్కాలాంతమున వచ్చునది - మంచు - అమరము. గిల్మాడు, గిల్బాడు - గిలుబాడు = అపహరించు - అనువదియే కాని 'గిల్మాడు' నిఘంటువులఁ గనుపట్టదు.

వ. అనుచు గిరిజ హరునం దాసక్త యగు డెఱింగినదై చంచలించుచు నరుగుదెంచి శశికాంత సరోవరతీర కర్పూర లతామందిరంబున విందుశేఖరు సుందరాకారంబు చిత్రించుచున్న గిరినందనం గని డాయం జనుదెంచి చతురిక సమంచితాలాపంబులఁ దన్నుంగలిసికొని యమ్మెలంతం గనుంగొని. 122

అర్థము : అనుచున్, గిరిజ = పార్వతి, హరునందున్, ఆసక్త + అగుడు = కోరికగలది యగుట, ఎఱింగినది + ఐ = తెలిసినదయి, చంచలించుచున్ = మిక్కిలి చలించుచు, అరుగుదెంచి = వచ్చి, శశికాంత - సరోవర - తీర - కర్పూర - లతా - మందిరంబునన్ = చంద్రకాంత శిలానిర్మితమైన సరస్సుయొక్క ఒడ్డునందలి

కప్పురపుఁదీవయింట. ఇందుశేఖరు = చంద్రుఁడు శిరోభూషణముగాఁ గలవాని - (శివుని) యొక్క, సుందర + ఆకారంబు = అందమైనరూపము, చిత్రించుచున్ + ఉన్న = గీయుచున్న, గిరి - నందనన్ = కొండకూఁతును - పార్వతిని, కని. డాయన్ + చనుదెంచి = సమీపింపవచ్చి, చతురిక, సమంచిత + ఆలాపంబులన్= ఒప్పిన మాటలతో, తన్నున్ = ఆమెను, కలిసికొని. అ + మెలంతన్ = ఆ స్త్రీని- పార్వతిని, కనుంగొని - చూచి.

తాత్పర్యము : అనుచుఁ బార్వతి యీశ్వరునియందుఁ గోరికగలదియగుట తెలిపినదయి చతురిక మిక్కిలి చలించుచు వచ్చి చంద్రకాంత శిలానిర్మితమైన సరస్తీరమునందలి కప్పురపుఁదీవయింట నీశ్వరుని సుందరరూపమును జిత్రించుచున్న పార్వతినిజూచి సమీపించి సమంచితములైన పలుకులతో నామెను గలిసికొని చూచి - తరువాతి పద్యముతో నన్వయము.

సీ. ఎలమి నీ మైఁదీఁగె నెలకొన్న సుకుమార
వాసంతలక్ష్మి పొం దొసరించి,
మరిగి నీ జిహ్వామసుంజరి విహరించు
భాషాశుకంబులఁ బాఱఁజోఁపి,
సంధిల్లు నీ ముఖచంద్రుతో రమియించు
దరహాస చంద్రికఁ బొరపుచేసి,
నెఱిలేక నీతోడినీడయై కెడఁగూడి
పరఁగిన నన్నింత యెరవుసేసి,

తే. వచ్చి యీ వనలక్ష్మితో నిచ్చమెచ్చి
చెలిమిగొనియుండుటయుఁగాక చిత్తమునకుఁ
గన్నుఁగవకూఁతగా నహికటకురూపు
చిత్ర మిడి చూచె దిదియేమి చిత్ర మబల! 123

అర్థము : అబల = ఓ యింతీ! పార్వతీ!

ఎలమిన్ = ఇంపుతో, నీ - మై + తీఁగెన్ = నీ దేహలతయందు, నెలకొన్న = పాదుకొనిన, సుకుమార = కోమలమైన, వాసంత - లక్ష్మీ - పొందు = వసంత శోభయొక్క పొందు, ఓసరించి = విడిచి,

మరిగి = మచ్చికపడి, నీ - జిహ్వా - సుమంజరిన్ = నీ నాలుకయనెడు మంచిపూలగుత్తియందు, విహరించు, భాషా - శుకంబులన్ = వాక్కులనెడు చిలుకలను, పాఱఁజోఁపి = పాఱఁద్రోలి,

సంధిల్లు = సమకూడునట్టి, నీ ముఖ - చంద్రుతోన్ = నీ ముఖమనెడి చంద్రునితో, రమియించు = క్రీడించు, దర - హాస - చంద్రికన్ = చిఱునవ్వనెడు వెన్నెలను, పొరపుచేసి = భిన్నముచేసి,

నెఱి - లేక = పాడిలేక, నీతోడి - నీడ + ఐ, కెలఁగూడి = ప్రక్కనుండి, పరఁగిన = ఒప్పిన, నన్నున్, ఇంత, ఎరవు + చేసి = అన్యముగా భావించి,

వచ్చి, ఈ వనలక్ష్మితోన్ = ఈ వనమనెడి లక్ష్మితో, ఇచ్చన్ - మెచ్చి = ఇష్టపడి, చెలిమి + కొనిఉండుటయున్ + కాక = స్నేహముగలిగియుండుటయే కాక, చిత్తమునకున్ = మనస్సునకును, కన్నుఁగవకున్ = కనుదోయికి, ఊఁత గాన్ = ఆధారముగా, అహి - కటకు - రూపు - చిత్రము = పాములు కడియములుగాఁగలవాని (శివుని) ఆకారముయొక్క చిత్తరువు. ఇడి = ఉంచి, చూచెదు = చూతువు, ఇది - ఏమి - చిత్రము = ఇ దేమి వింత?

తాత్పర్యము: పార్వతీ! నీ దేహలతయందు నెలకొన్న కోమల వసంత శోభ పొందు విడిచి, నీ నాలుకయనెడుపూలగుత్తిని మరిగి విహరించు వాక్కులనెడు చిలుకలను బాఱఁద్రోలి, నీ ముఖమనెడు చంద్రునితోఁ గ్రీడించు చిఱునవ్వనెడు వెన్నెలను భిన్నముచేసి, నీతోడునీడయై ప్రక్కనుండునన్ను పాడితప్పి ఇంతవేఱుచేసి, వచ్చి, యీ వనలక్ష్మితో నిష్టపడి, స్నేహముగలిగియుండుటయేకాక మనసునకుఁ గనుదోయికి పునిరూపపుఁజిత్తరువు నాధారముగాఁజేసి చూతువు, ఇదేమి వింత!

విశేషములు: మైఁదీఁగ = మై అనెడుతీఁగ - రూపకము. వాసంత = వసంతసంబంధమయినది, జిహ్వా - సుమంజరి = జిహ్వఅనెడుసుమంజరి, భాషా - శుకంబులు = భాషయనెడుశుకములు, ముఖచంద్రుఁడు ముఖమనెడుచంద్రుఁడు, దర

హాస - చంద్రిక - దరహాసమనెడుచంద్రిక - రూపకములు. చూచెదిది = చూచెదవు + ఇది. లాట్టు వకారమునకు లోపము (బాల.క్రియ.24). అసదాదిస్వరసంధి. బాల.సంధి. 11. ఉత్వసంధి. బాల.సంధి.1. రూపు (వికృతి) - రూపము (ప్రకృతి) చిత్రము = (నానా.) చిత్తరువు. ఆశ్చర్యము.

వ. ఇదియంతయు హరువలని విరహవ్యంజకం బగుచున్నయది యనిన
నగజ నెచ్చెలిం గనుంగొని. 124

అర్థము : ఇది + అంతయున్, హరువలని = ఈశ్వరునితోడి, విరహ - వ్యంజకంబు = ఎడఁబాటును స్పష్టపఱుచునది. అగుచున్ + ఉన్న + అది. అనినన్, అగజ = పార్వతి. నెచ్చెలిన్ = చెలికత్తెను. కనుంగొని.

తాత్పర్యము: 'ఇదియంతయును ఈశ్వరునితోడియెడఁబాటును స్పష్టపఱుచు చున్నది' అనినఁ బార్వతి చెలికత్తెనుజూచి - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు: హరువలని విరహవ్యంజకంబు - 'కొన్నియెడల సిద్ధ సమాస మధ్యగత పదంబులతోఁ దద్భిన్న పదంబుల కన్వయంబు చూపఁబడెడి'. ప్రౌఢ. సమాస. 35.

ఉ. ఆ దరహాస వాస లలితాస్యరుచుల్ దలుకొత్త నప్పు డా
హ్లాదముతోడఁ జూచి చవినప్పటి సమ్మదరాగలీల నాఁ
డాదిగఁ బాయ కీశుఁ డెద నప్పటి కప్పటి కొక్కభంగి న
న్నాదటఁ గూడియుండ విరహవ్యథ నా దెసఁ బొందనేర్చునే ? 125

అర్థము : ఆ - దర - హాస - వాస - లలిత + ఆస్య - రుచుల్ = ఆ యీశ్వరునియొక్క, చిఱునవ్వునకు ఆస్పదమైన, మనోహరమైన, ముఖముకాంతులు. తలుకొత్తన్ = ప్రకాశింపఁగా. అప్పుడు = శివునిసేవించు సమయమున. ఆహ్లాదము తోడన్ = సంతోషముతో. చూచి, చవిన + అప్పటి = చవినవాఁటి, సమ్మద - రాగ - లీల = సంతోషముతోడి అనురాగవిలాసము. నాఁడు + ఆదిగన్ = ఆ దినము మొదలుకొని. పాయక = విడువక. ఈశుఁడు. ఎదన్ = నా హృదయము నందు. అప్పటికిన్ + అప్పటికిన్ = నానాఁటికి. ఒక్క - భంగిన్ = ఒక్కరీతిగా.

నన్నున్, ఆదటన్ = ప్రీతితో, కూడి + ఉండన్ = కలిసియుండఁగా. విరహ - వ్యథ = ఎడఁబాటువలనిబాధ, నా - దెసన్ = నా విషయమున, పొందన్ + నేర్చునే = పొందఁగలుగునా.

తా త్ప ర్య ము : ఆ శివుని చిఱునగవుతోడి మనోహరముఖకాంతులను అతనిని సేవించు సమయమున సంతోషముతోఁ జూచి నేర్పడిన అనురాగము నాఁడు మొదలుకొని విడువక, ఈశ్వరుఁడు నా హృదయములో నానాఁటికి ఒక్కరీతిగాఁ బ్రీతితోఁ గూడియుండఁగా. నాకు విరహబాధ యేలకలుగును ?

వి శే ష ము లు : అప్పటికప్పటికిన్ - అప్పటికిన్ + అప్పటికిన్ - 'ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగా నగు.' బాల. సంధి. 41. ఇచ్చట విభక్తికి లోపము రాలేదు. 'అచ్చున కామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱచుగ నగు,' బాల, సంధి. 10. అప్పటికప్పటికిన్.

వ. అని కప్పి పల్కఁబోయి బయల్పడఁబల్కి వెలవెలఁబాఱుచు దన బహిఃప్రాణయైన ప్రియవయస్యపై నల్లన వ్రాలుడు. 126

అ ర్థ ము : అని, కప్పి = మఱుఁగుపఱిచి. పల్కన్ + పోయి, బయల్పడన్ + పల్కి = బయలుపడునట్లుపలికి, వెలవెలఁబాఱుచున్ = తెల్లఁబోవుచు. తన- బహిస్ (ః) + ప్రాణ = తనవెలుపలి ప్రాణమైన, ప్రియ - వయస్య - పైన్ = అనుఁగుఁజెలిమీఁద, అల్లవన్ = మెల్లఁగా, వ్రాలుడున్ = వ్రాలినంతనే-

తా త్ప ర్య ము ; అని పార్వతి తనలోని వియోగబాధను మఱుఁగుపఱిచి పలుకఁబోయి, బయలుపడునట్లు పలికి, తెల్లఁబోవుచుఁ దన వెలిప్రాణమైన అనుఁగుఁజెలి చతురికపై మెల్లఁగా వ్రాలినంతనే - తరువాతి పద్యముతో నన్వయము.

వి శే ష ము లు : బహిఃప్రాణ - బహిస్ + ప్రాణ - పదాంత సకారమునకు విసర్గాదేశము.

ఆ. ఉవిద మానసమున నుహ్వాంగి వలరసం
బొక్కపెట్టు తఱిమి పుక్కిఁదంబు
గాఁగ నిండి తాల్మిక ట్టవిసెనొ యన
వెడలె నశ్రువారి వెల్లిగొనుచు. 127

అర్థము : ఉవిద - మానసమునన్ = యువతియైన పార్వతియొక్క మనస్సునందు, వల - రసంబు (వలపు + రసంబు) = వలపనెడి రసము, ఉప్పొంగి, ఒక్కపెట్టు = ఒక్కమాఱుగా, తఱిమి = విజృంభించి, పుక్కిఁదంబు + కాఁగన్ = క్రిక్కిఱియునట్లు. నిండి, తాల్మి - కట్టు = ఓర్పు అనెడు గట్టు, అవిసెనొ + అనన్ = తెగెనా యనునట్లు అశ్రు - వారి = కన్నీరు, వెల్లి + కొనుచున్ = ప్రవాహము కట్టి, వెడలెన్ = పైకివచ్చెను.

తాత్పర్యము : పార్వతి మనస్సులోఁ బ్రేమరస ముప్పొంగి యొక్కమాఱుగా విజృంభించి, క్రిక్కిఱియునట్లు నిండి, సహనమనెడి గట్టుతెగెనా యనునట్లు కన్నీరు ప్రవాహముకట్టి బయలువెడలెను.

విశేషములు : అలంకార ముత్ప్రేక్ష. తాల్మి - కట్టు = తాల్మియనెడు కట్టు - అను రూపకమువలన రూపకానుప్రాణితము.

వ. అంతం జతురిక చతురోక్తుల నగజ ననునయించుచు. 128

అర్థము : అంతన్, చతురిక, చతుర + ఉక్తులన్ = నేర్పుతోడి మాటలతో, అగజన్ = పార్వతిని. అనునయించుచున్ = ఊఱడించుచు.

తాత్పర్యము : అంతఁ జతురిక నేర్పుతోడి మాటలతోఁ బార్వతిని ఊఱడించుచు - తరువాతి పద్యముతో నన్వయము.

మ. తగదే పోలదె చాలదే యమరదే త్రైలోక్యపూజ్యంబు నీ
తగులం బీశ్వరుమీఁద నట్టి యిది యేతన్మాత్రమే కన్యకా
సుగుణం బెమ్మెయి దూషితం బగునె సంశుద్ధాత్ము సర్వాత్ము స
ర్వగతుం జిత్తమునందుఁ గోరు డిదిసద్వంద్యం బనింద్యం బిలన్. 129

అర్థము : ఈశ్వరుమీఁదన్ = శివునిపై. నీ - తగులంబు = నీ ప్రేమము తగదే, పోలదె, చాలదే, అమరదే. త్రైలోక్య - పూజ్యంబు = ముల్లోకము లచేఁ బూజింపఁదగినది, అట్టి, ఇది, ఏతద్ + మాత్రమే = ఈపాటిదా ?. కన్యకా- సుగుణంబు = కన్యయొక్క మంచిగుణము, ఏ + మెయిన్ = ఏ విధముగను, దూషితంబు + అగునె = నిందింపఁబడినది యగునా?, ఇలన్ = భూమియందు, సంశుద్ధ + ఆత్మన్ = మిక్కిలి పవిత్రమైన ఆత్మగలవాఁడును, సర్వ + గతున్ = అంతటను వ్యాపించినవాఁడును, అగు, సర్వాత్మున్ = ఈశ్వరుని, చిత్తమునందున్ = మనసునందు, కోరుడు + ఇది = ఇట్లు కోరుట, సత్ + వంద్యంబు = మంచి వారికిఁ బూజింపఁ దగినది. అనింద్యంబు = నిందింపరానిది.

తాత్పర్యము : ఈశ్వరునిపై నీకుఁగల ప్రేమము మిక్కిలి తగినది కాదా; అది ముల్లోకములకుఁ బూజనీయమైనది. అది యీపాటిదికాదు. కన్యాత్వ మేవిధముగను నిందితముకాదు. మిక్కిలి పవిత్రమైన ఆత్మగలవాఁడును, అంతటను వ్యాపించినవాఁడును అగు నీశ్వరుని గోరుట ఇలలో మంచివారు పూజింపఁదగినది అనవద్యమైనది.

విశేషములు : తగదే పోలదె చాలదే యమరదే - ఇట్లు సమానార్థకములను బెక్కిటిని బ్రయోగించుట అత్యంతముప్రశంసనీయమని పలుకుట.

ఏతన్మాత్రమే - ఏతద్ + మాత్రమే - అనునాసికసంధి. 'రహలుతప్ప మిగిలిన పదాంతగతహల్లులకు (యఁరులకు) అనునాసిక వర్ణము పరమగుచో వానికి సంబంధించిన అనునాసికవర్ణము వైకల్పికముగా ఆదేశమగును.' ఏతన్మాత్రమే - పక్షమున ఏతద్మాత్రమే, సద్వంద్యము - సత్ + వంద్యము - 'అనునాసికాంతస్థవర్ణములుతప్ప మిగిలిన పదాంతగతహల్లులకు (ఝల్లులకు) మృదుహల్లులు (హశ్శులు)కాని అచ్చులుకాని పరములగునపుడు ఆ హల్లుల వర్గమునకుఁజెందిన తృతీయవర్ణ మాదేశ మగును.' కోరుడు = కోరుట - భావార్థకటవర్ణకమునకు డువర్ణమును వాడుట యీ కవికిఁ బరిపాటి.

వ. అని సంబోధించుచు నంత నా చెలువకు విరహం బతిక్రాంతం బగు
దెంచు దెఱింగి నగజం గనుంగొని చతురిక నిపుణికాది సఖీ
జనంబులఁ దోడ్తెచ్చి శిశిరోపచారంబులు సేయించి విరహపరితాపంబు
పుచ్చివైచెద నోడకుండు మని పోవ నిశ్చయించి. 130

అర్థము : అని, సంబోధించుచున్ = తెలియఁజెప్పుచు, అంటన్, ఆ - చెలువకున్ = ఇంతికి - పార్వతికి, విరహంబు = ఎడఁబాటు, అతిక్రాంతంబు = మించినది, అగుదెంచుడు = అగుట, ఎఱింగి, నగజన్ = పార్వతిని, కనుంగొని= చూచి, చతురిక, నిపుణికా+ఆది - సఖీ - జనంబులన్ = నిపుణిక మున్నగు చెలికత్తెలను, తోడ్తెచ్చి = తీసికొనివచ్చి, శిశిర + ఉపచారంబులు = శీతలోపచారములు, చేయించి, విరహ - పరితాపంబు = వియోగమువలనిసంతాపము, పుచ్చివైచెదన్ = పోఁగొట్టెదను, ఓడక + ఉండుము = భయపడకుండుము. అని, పోవన్ = పోవుటకు, నిశ్చయించి,

తాత్పర్యము : అని తెలియఁజెప్పుచు, పిమ్మటఁ బార్వతికి వియోగబాధ దుస్సహ మగుట యెఱిఁగి 'ఆమెను జూచి చతురిక నిపుణిక మున్నగుచెలులను దీసికొని వచ్చి శీతలోపచారములు చేయించి నీ విరహతాపము నుడిపెదను. భయపడకు' మని పోనిశ్చయించి - తరువాతి పద్యముతో నన్వయము.

ఉ. "ఆడెడు నమ్మిఁ గన్గొనకుమమ్మ ! బయల్పడ నాడు చిల్కతో
నాడకు మమ్మ ! తేఁటిగెడ నాళతి సేయకుమమ్మ ! వెన్నెలం
జూడకుమమ్మ ! తెమ్మెరలఁ జోఁకకుమమ్మ ! తలిర్చు మావి క్రీ
నీడకుఁ బోకుమమ్మ !" యని నెచ్చెలికత్తెకుఁ జెప్పె సమ్మతిన్. 131

అర్థము : అడెడు - నమ్మిన్ = నృత్యముచేయు నెమలిని, కన్గొనకుము+అమ్మ = చూడకు తల్లీ, బయల్పడన్ + ఆడు = వెల్లడిగాఁ బలుకు, చిల్కతోన్, ఆడకుము + అమ్మ = పలుకకు తల్లీ. తేఁటి + కెడన్ = తుమ్మెదప్రక్క, ఆళతి + చేయకుము + అమ్మ = రాగాలాపము చేయకు తల్లీ ! వెన్నెలన్ + చూడకుము + అమ్మ, తెమ్మెరలన్ = దక్షిణపుగాలిని, - చల్లగాలిని, చోఁకకుము+అమ్మ = తాఁకకు తల్లీ. ! తలిర్చు - మావి - క్రీనీడకున్ = చిగిరించుమామిడిక్రింది నీడకు, పోకుము + అమ్మ = పోవకు తల్లీ! అని, నెచ్చెలికత్తెకున్ = ప్రియ వయస్యకు, సమ్మతిన్ = మంచిమనస్సుతో, చెప్పెన్,

తాత్పర్యము : 'పార్వతీ! నర్తించునెమలిని జూడకుము, వెల్లడిగా మాటాడు చిలుకతోఁ బలుకకుము. తుమ్మెదప్రక్క రాగాలాపము చేయకుము.

వెన్నెలను జూడకుము. చల్లగాలిని స్పృశింపకుము. చిగిర్చిన మామిడిచాయకుఁ బోవకుము,' అని చతురిక చెలికత్తెకు సమ్మతితోఁ జెప్పెను.

విశేషములు : కన్గొనకుమమ్మ - 'సంప్రార్థనంబుల ముజ్జున కదాదులు విభాష ననుప్రయుక్తంబు లగు.' బాలక్రియ.33. అళతి - (రూపాం.) అలతి. క్రీనీడ - క్రిందు + నీడ. 'సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చుమీఁదివర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగా నగు.' బాల.సంధి.36. క్రి + నీడ, క్రీఁగడుపు, క్రీఁగాలు, క్రీఁదొడ - ఇత్యాదులం గ్రిందు శబ్దమునకు లుప్తశేషంబునకు దీర్ఘంబు బహుళ గ్రహణముచేత నని యెఱుంగునది, క్రీనీడ.

వ. చని నిపుణికాది సఖీజనంబులకుం దద్వృత్తాంతం బెఱింగించిన నుదరిపడి యందఱుం జనుదెంచి మదనవేదనం బరవశయై యున్న యగ్గిరినందనం గని లగ్గ బెగ్గిలి. 132

అర్థము : చని = పోయి, నిపుణికా + ఆది - సఖీ - జనంబులకున్ = నిపుణిక మున్నగు చెలికత్తెలకు, తద్ + వృత్తాంతంబు, ఎఱింగించినన్ = తెలుపఁగా, ఉదరిపడి = ఉలికిపడి, అందఱున్, చనుదెంచి = వచ్చి, మదన - వేదనన్ = మన్మథబాధచే, పరవశ + ఐ = ఒడలుతెలియనిదయి, ఉన్న, ఆ + గిరి-నందనన్ = ఆ కొండకూఁతును - పార్వతిని, కని, లగ్గన్ + బెగ్గిలి = మిక్కిలిభయపడి.

తాత్పర్యము : వెడలి నిపుణిక మున్నగు చెలికత్తెలకు ఆ వృత్తాంత మెఱిఁగింపఁగా నులికిపడి యెల్లరును వచ్చి విరహబాధచే నొడలుతెలియకున్నపార్వతిని జూచి మిక్కిలి భయపడి తరువాతి పద్యముతో నన్వయము.

చ. అలకలఁ జిన్నిపూ వలికినంతన మోముసెమర్చుఁ జన్నుఁగ్రే
వల మృదుపత్రభంగములు ప్రాయుడుఁ గొ నసియాడు లగ్గ ని
మ్మెలఁతకు ; మాధవీకుసుమమేఖలఁ గట్టుటయున్ వడంకు నూ
రులు ; నిజమింత కోమలి మరుప్రసవాస్త్రిహతిం జలింపదే ! 133

అర్థము : ఇమ్మెలఁతకున్ (ఈ + మెలఁతకున్) = ఈ యింతికి - పార్వతికి, అలకలన్ = ముంగురులందు, చిన్ని - పూవు. అలికిన + అంతన్ +

అ = చెరివినంతనే, మోము, చెమర్చున్ = చెమరించును - స్విన్నమగును, చన్ను + క్రేవలన్ = స్తనపార్శ్వములందు. మృదు - పత్రభంగములు = సుందరములైన మకరికాపత్రములు, వ్రాయుడున్ = వ్రాపినంతనే, కౌను = నడుము. లగ్గన్ = మిక్కిలి, అసియాడున్ = చలించును, మాధవీ - కుసుమ - మేఖలన్ = బండిగురివెందపూలమొలనూలిని, కట్టుటయున్ = కట్టఁగా, ఊరులు = తొడలు, వడంకున్ = చలించును, నిజము + ఇంత = ఇంతయు నిక్కువము, కోమలి = సుందరి - పార్వతి, మరు - ప్రసవ + అస్త్ర - హతిన్ = మన్మథుని పుష్పబాణముల దెబ్బచే. చలింపదే = కంపింపదా ?

తాత్పర్యము : ఈ పార్వతికి ముంగురులఁ జిన్నిపూవు చెరివినంతనే ముఖము స్విన్నమగును, స్తనపార్శ్వముల సుందరములైన మకరికాపత్రములు రచింపఁగనే నడుము మిక్కిలివడఁకును. బండిగురివెందపూలమొలనూలిని గట్టినంతనే తొడలు చలించును, ఇంతయు నిజముగా, నీమె మన్మథుని పూవుటమ్ములదెబ్బచేఁ జలింపదా :

వ. అని మెత్తమెత్తన తడుముచు. 134

అర్థతాత్పర్యములు : అని, మెత్తమెత్తన=మృదువుగా, తడుముచున్= స్పృశించుచు - అని మృదువుగా స్పృశించుచు - తరువాతి పద్యముతో నన్వయము.

సీ. మృదురీతి నూర్పుఁదెమ్మెరలు నూల్కొలుపవే,
తెలువ ! నీ లేఁతమైఁదీఁగె యొలయ,
నధరారుణద్యుతి నభ్యుదయింపవే
పొలఁతి ! నీ యాననాంభోజ మలర,
దరహాసచంద్రికాస్ఫురణ పూరింపవే
రమణి ! నీ నయనోత్పలములు పొలయ,
భాషామృతముఁ గర్ణపథములఁ జొనుపవే
చెలువ ! నీ జీవంబు చేతరింప

ఆ. వెలఁది ! నీవ నీకు వెజ్జవై వలవంత
యవయవములఁ దీఱ నవయవముల
వలను మెఱయ కేల వలరాజుచలము సా
ధ్యమ్ము చేసెదమ్మ ! తలిరుబోఁడి. 135

అర్థము : తెలివ = ఇంతీ! పార్వతీ, నీ - లేఁత - మై + తీఁగె = లేఁతయైన నీ దేహలత, ఒలయన్ = ఒప్పఁగా, - ఇష్టపడఁగా, మృదు - రీతిన్ = మృదువైనవిధముగా. ఊర్పు + తెమ్మెరలు = నిట్టూర్పుగాలి, నూల్కొలుపవే = ప్రసరింపఁజేయవా ?

పొలఁతి = ఇంతీ, ! నీ - ఆనన + అంభోజము = నీ ముఖపద్మము. అలరన్ = వికసింపఁగా, అధర + అరుణ - ద్యుతిన్ - క్రిందిపెదవి యెఱ్ఱనికాంతిని. క్రింది పెదవియనెడి సూర్యునికాంతిని, అభ్యుదయింపవే = పుట్టింపవా ;

రమణీ = ఇంతీ! నీ - నయన + ఉత్పలములు = నీ కన్నుఁగలువలు, పొలయన్ = వికసింపఁగా, దర - హాస - చంద్రికా - స్ఫురణ = చిఱునగవనెడి వెన్నెలయొక్క ప్రకాశము, పూరింపవే = నింపవా ?

చెలువ = ఇంతీ!, నీ - జీవంబు = నీ ప్రాణము, చేతరింపన్ = చైతన్యము కలదియగునట్లు. భాషా + అమృతమున్ = వాక్కు అనెడి అమృతమును, కర్ణ పథములన్ = చెవులత్రోవలను, చొనుపవే = ప్రవేశపెట్టవా ?

వెలఁది = ఇంతీ!, నీవు + అ = నీవే, నీకున్, వెజ్జవు + ఐ = చికిత్సకురాలవయి, అవయవములన్ = అంగములందు, వలవంత = మన్మథవ్యథ, తీఱన్ = పోవునట్లు, అవయవములన్, వలను - మెఱయక = తగినట్లు ప్రకాశింపఁ జేయక, తలిరుబోఁడి = చిగురువంటిమేనుగలదానా ! పార్వతీ, వలరాజు - చలము = మన్మథుని పంతము, ఏల = ఎందులకు, సాధ్యమ్ము - చేసెదవు + అమ్మ = నెఱవేఱు నట్లుచేసెదవు ?

తాత్పర్యము ; పార్వతీ ! లేఁతదైన నీ దేహలత ఒప్పునట్లు మృదువుగా నిట్టూర్పుల చల్లగాలిని ప్రసరింపఁజేయవా ? నీ ముఖపద్మము వికసించునట్లు క్రిఁదెదవి యెఱ్ఱనికాంతిని బుట్టింపవా ? నీ కనుఁగల్వలు వికసించునట్లు చిఱునవ్వు వెన్నెలల స్ఫూర్తిని గలిగింపవా ? నీ ప్రాణము చైతన్యవంత మగునట్లు వాగమృతమును జెవులఁ జొనుపవా ? ఇట్లు నీకు నీవే వైద్యము చేసికొని, నీ అవయవములందలి మన్మథవ్యథ తీఱ నీ యవయవములను ప్రకాశింపఁజేయక, మన్మథుని పంతము నేల చెల్లింతువు ?

విశేషములు: ఊర్పు(దెమ్మెరలు, మై(దీ(గె, అధరారుణ, ఆననాంభో జము, దరహాసచంద్రిక, నయనోత్పలములు - రూపకములు.

వ. అనుచు నందఱు నొండొరులం గనుంగొని 136

అర్థతాత్పర్యములు : అనుచు నందఱును ఒకరినొకరు చూచుకొని - తరువాతి పద్యముతో నన్వయము.

చ. తలిరులు మొగ్గలున్ వికసితప్రసవంబులు( దెండు మీరు, శీ
తలికలు( బిక్క_మూలములు( దామరతూ(డులు( దెండు మీరు, చెం
గలువలు( దోవకామలును గంజదళంబులు( దెండు మీర, లీ
చెలువకు శీతలక్రియలు సేయుద మింకెడ సేయ నేటికిన్? 137

అర్థము : మీరు, తలిరులు = చివురులు, మొగ్గలున్, వికసిత - ప్రసవంబులున్ = వికసించిన పువ్వులును, తెండు = తీసికొనిరండు, మీరు, శీతలికలున్ = వట్టివేరులును, పిక్క_ - మూలములున్ - ఒకానొక చెట్టువేరులును, తామర - తూ(డులున్ = మృణాళములును, తెండు, మీరలు - మీరు, చెంగలువలున్ (చెన్ను + కలువలున్) = ఎఱ్ఱకలువలును, తోవకామలును = కలువకా(డలును, కంజ - దళంబులున్ = తామరపాకులును. తెండు. ఇంకన్ + ఎడ + చేయన్ = ఇంక నాలస్యము చేయ, ఏటికిన్ = ఎందులకు. ఈ - చెలువకున్ = ఈ యింతికి - పార్వతికి. శీతల - క్రియలు = శీతలోపచారములు, చేయుదము.

తాత్పర్యము : పార్వతికి శీతలోపచారములు చేయుదము. ఇంక నాలస్యము చేయుటెందులకు? మీరు చివురులును, మొగ్గలును, విరిసినపూలును దెండు, మీరు వట్టివేరులును, పిక్క_చెట్టు వేరులును, తామరతూండ్లును దెండు. మీరు ఎఱ్ఱకలువలును, గలువకా(డలును, తామరపాకులును దెండు.

వ. అని యందఱు నొండొరులకు మీఱిన ట్లనేక శిశిరోపకరణ ద్రవ్యంబులు తత్క్షణంబ కొనివచ్చి తమలోన. 138

అర్థము : అని, అందఱున్ = చెలికత్తె లందఱును, ఒండొరులకున్ - మీఱిన + అట్లు = ఒకరి నొకరు మించినట్లు, అనేక - శిశిర + ఉపకరణ -

ద్రవ్యంబులు = పెక్కు శీతలోపచారవస్తువులు, తద్ + క్షణంబు + అ = ఆ క్షణముననే, కొనివచ్చి, తమలోనన్,

తాత్పర్యము : అని చెలికత్తె లందఱును ఒకరినొకరు మించునట్లు పెక్కు శీతలోపచార సాధనములను దీసికొనివచ్చి తమలో – తరువాతి పద్యముతో నన్వయము,

సీ. పువ్వులు తొడిమలు పుచ్చు । నయంబునఁ
చివుళుల కొమలు సిదుము ; లేఁత
తూఁడుల గంటులు తుదలకు ముఱువు । చెం
గలువల పై రేకు లొలువు ; మరఁటి
మోసుల వీజనంబులు సేయు । కొలఁది వే
ళ్లిరవుగాఁ గూర్చి చామరలు సేయు ।
తొవపువ్వుకొమలతో లిమ్ముగాఁ బుచ్చు ।
పిక్కమూలంబుల పెనఁగు వాపు ।

ఆ. చందనంబు రాచి సన్నియఁ బెట్టు చెం
గావి మన్ను నీరఁ గలపి తేర్పు ।
కప్పురంబు దూలిగాఁ జేసి వడివెట్టు
మనుడుఁ గడఁగి ప్రియవయస్య లెల్ల. 139

అర్థము ; పువ్వుల - తొడిమలు = పూలవృంతములు. పుచ్చు (ము) = త్రుంపుము. నయంబునన్ = నేర్పుతో, చివుళుల - కొమలు = చివురులకొఁడలు, చిదుము (ము) = త్రుంపుము,

లేఁత - తూఁడుల - గంటులు = లేఁదూఁడులగనుపులు (వేరులు), తుదలకున్-కొనలకు- ముఱు (రు) వు (ము) = గిల్లుము, చెంగలువల (చెన్ను + కలువల) = ఎఱ్ఱకలువలయొక్క, పై రేకులు = మీఁదిరేకులు, ఒలువుము.,

అరఁటి - మోసులన్ = అరఁటిమొవ్వులతో, వీజనంబులు = వీవనలు, చేయు (ము), కొలఁదివేళ్లు = కొలవేరులు - వట్టివేరులు, ఇరవుగాన్ = ఒప్పుగా. కూర్చి, చామరలు చేయు (ము) = వింజామరములు చేయుము.

తొవ - పువ్వు - కొమల - తోలు = కలువపూలకాఁడల - పట్ట (త్వక్కు), ఇమ్ముగాన్ = బాగుగా, పుచ్చు (క్రి) = తొలఁగింపుము, పిక్క మూలంబుల = పిక్కచెట్ల వేరులయొక్క, పెనఁగు = మెలి,పాపు = పోఁగొట్టుము, చందనంబు = మంచిగందము, రాచి, సన్నియఁబెట్టు(ము) = సన్నెకంటిపై నూఱుము, చెంగావి (చెన్ను + కావి) - మన్ను = మనోజ్ఞమైన యెఱ్ఱని మన్ను, నీరన్ = నీటియందు కలపి = కలిపి. తేర్పు(ము), కప్పురంబు = కర్పూరము, దూలి + కాన్ = దుమ్ముగా, చేసి, వడివెట్టుము = మెలిపెట్టుము, అనుడున్ = అనినంతనే, ప్రియవయస్యలు = అనుఁగుఁజెలులు, ఎల్లన్ = అందఱును, కడఁగి = పూని.

తాత్పర్యము : 'పూలతొడిమలు త్రుంపుము. చివురుల కాఁడలు నేర్పుతోఁ జిదుముము. లేఁదూఁడుల వేరులు చివరలకు గిల్లుము, ఎఱ్ఱకలువల మీఁదిరేకులు ఒలువుము, అరఁటిమొవ్వులతో వీవనలు చేయుము, వట్టివేరులు ఒప్పుగాఁగూర్చి వింజామరములు చేయుము. కలువపూలకాఁడల పట్టలు బాగుగాఁ దొలఁగింపుము. పిక్కచెట్ల వేరుల మెలి పోఁగొట్టుము. మంచిగందము సన్నెకంట నూఱుము, చెంగావిరంగు మన్ను నీటియందుఁ గలిపి తేర్పుము. కర్పూరమును దుమ్ముగాఁజేసి మెలిపెట్టుము.' అనివంతనే అనుఁగునెచ్చెలు లందఱును బూని - తరువాతి గద్యముతో నన్వయము.

విశేషములు : ముఱు (రు) వు ధాతువు నిఘంటువులఁ గనఁబడలేదు. చామర - ఆకారాంత స్త్రీలింగశబ్దము, 'చామరా చామరం వాలవ్యజనం రోమగుచ్ఛకమ్' ఇతి రభసః (అమరసుధ), తొవ - తొగ - తోవ - (రూపాం,) పుచ్చు, చిదుము, చేయుమున్నగువానిలోని మువర్ణక లోపమునకు - 'మధ్యమపురుష ముపర్ణకంబునకు హలవసానంబులు పరంబులగునపుడు లోపము విభాషనగు.' బాల. సంధి. 49. కప్పురము (వికృతి) - కర్పూరము (ప్రకృతి)

వ. అవి యన్నియు నవయవంబులుగా నమర్చి శిశిరవీర్యమంత్రంబుల నభిమంత్రించి, 140

అర్థము : అవి + అన్నియున్ = తొడిమలు, చివురులు మున్నగు నా వస్తువులన్నియును. అవయవంబులు + కాన్, అమర్చి = కూర్చి. శిశిర - వీర్య - మంత్రంబులన్ = చలువచేయుటకైన మంత్రములను, అభిమంత్రించి = పఠించి - సంస్కరించి.

తా త్ప ర్య ము ; తొడిమలు- చివురులు మున్నగు నా వస్తువుల నన్నిటిని అవయవములుగాఁగూర్చి చలువచేయుటకైన మంత్రములతో సంస్కరించి _ తరువాతి పద్యముతో నన్వయము.

ఉ. చందన కర్దమంబు, ఘనసార రజః ప్రసరంబు, శీతలుల్,
గెందలిరుల్, ప్రసూనములు. గేసరముల్, కుముదోత్పలాబ్జ త
త్కంద మృణాళపత్ర ఘన ధాతు తుషార ఘనోపలాంబువుల్
నాందగు శీతలోపకరణంబుల నర్చనలిచ్చి సిద్ధికిన్. 141

అ ర్థ ము : చందన - కర్దమంబు = మంచిగందపుఁబంకము, ఘనసార - రజస్ ( ః )+ ప్రసరంబు = కప్పురపుఁబొడుల సమూహము, శీతలుల్ = వట్టివేరులు, కెందలిరుల్ (కెంపు + తలిరుల్) ఎఱ్ఱనిచివురులు, ప్రసూనములు = పువ్వులు కేసరముల్ = అకరువులు, కుముదో .... లాంబువుల్: కుముద = తెల్లకలువలు, ఉత్పల = కలువలు, అబ్జ = తామరలు, తద్ = వానియొక్క, కంద = దుంపలు, మృణాల = తూండ్లు, పత్ర = ఆకులు, ఘన = గొప్పవియగు, ధాతు = గైరికాది ధాతువులు, తుషార = మంచు, ఘన + ఉపల = పెనుతాలు, అంబువుల్ = నీరులు, నాందగు (నాన్ + తగు) = అననొప్పు, శీతల + ఉపకరణంబులన్ = శీతలోపచార సాధనములచే, సిద్ధికిన్ = సత్ఫలితమునకు, అర్చనలు = పూజలు, ఇచ్చి -

తా త్ప ర్య ము : మంచిగందపుఁబంకము, కప్పురపుఁబొడులు. వట్టివేర్లు, ఎఱ్ఱని చివురులు, పూలు, అకరువులు, తెల్లకలువలు, కలువలు, పద్మములు. వాని దుంపలు, తూండ్లు, ఆకులు, గొప్ప గైరికాదిధాతువులు, మంచుపెనుతాలు, నీరు అననొప్పు శీతలోపచారసాధనములచే సత్ఫలితమునకయి పూజలుచేసి - తరువాతి గద్యముతో నన్వయము.

వి శే ష ము లు : కెందలిరులు - కెంపు + తలిరులు - సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చుమీఁదివర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగా నగు.'బాల,సంధి. 36- కె + తలిరులు, 'లుప్త శేషంబునకుం బరుషములు పరములగునపుడు నుగాగమం బగు.'బాల,సంధి.37 కె+ను+తలిరులు. 'ద్రుత ప్రకృతికముమీఁది పరుషములకు సరళము లగు.'బాల.సంధి,16, కె+ను + దలిరులు. 'ఆదేశసరళములకుముందున్న ద్రుతమునకు

బిందుసంశ్లేషములు విభాష నగు.'బాల,సంధి.17, కెందలిరులు. నాన్ + తగు - ద్రుతకార్యముచే నాఁదగు అనురూపమొక్క-టే కావలసియుండఁగా (దీర్ఘముమీఁదసాధ్య పూర్ణములేదు). నాందగునని పూర్ణబిందుసహితరూపమును బ్రయోగించుట నన్నెచోడుని ప్రాచీనతకు నిదర్శన మందురు.

వ. విరహాగ్నిదాహంబునఁ దల్లడిల్లుచున్న గౌరిం గనుంగొని. 142

అర్థము ; విరహ + అగ్ని - దాహంబువన్ = వియోగమనెడి అగ్నివలని తాపముచే, తల్లడిల్లుచున్ + ఉన్న = కలవరపడుచున్న, గౌరిన్ = పార్వతిని కనుంగొని = చూచి,

తాత్పర్యము : వియోగాగ్నిచేఁ దపించుచు 'బాధపడుచున్నపార్వతిని జూచి- తరువాతి పద్యముతో నన్వయము'

విశేషములు : విరహాగ్ని – విరహమనెడి అగ్ని - రూపకము,

తే. అలిగి మరునేర్చు హరుఁడుఁ దా నట్టి సాహ
సాత్ము నొడఁగూర్చి యా యంబుజాక్షి నింత
విరహవేదనఁ బెట్టెడు విధి కడంగి
మొసలి తా దండగుండము ముంచునట్లు. 143

అర్థము : హరుఁడున్ = శివుఁడును. అలిగి = కోపించి, మరున్ = మన్మథుని, ఏర్చున్ = దహించును, తాను = విధి, అట్టి, సాహస + ఆత్మన్ = మన్మథునిఁగాల్చునంతటిసాహసవంతుని, ఒడఁగూర్చి = చేసి, ఆ + అంబుజ + అక్షిన్ = ఆ పద్మనేత్రను - పార్వతిని, విధి = దైవము, కడంగి = పూని, మొసలి, తాన్, దండ-గుండమున్ = తనకాధారమైనగుండమునే, ముంచు+అట్లు = ముంచురీతిని, ఇంత, విరహ - వేదనన్ = వియోగబాధను, పెట్టెడున్ = కూర్చును

తాత్పర్యము : శివుఁడు కోపించి మన్మథుని దహించును, విధి శివునట్టి సాహసవంతునిఁజేసి యా పార్వతి నింత వియోగవ్యథపాలుచేయును, ఇది యెటు లున్నదన్న. మొసలి తనకాధారమైన నీటిగుండమునే ముంచునటులున్నది,

విశేషములు: మన్మథుఁడు మనసిజుఁడు. మన్మథుఁ డాధేయము. మనస్సు ఆధారము, ఆధేయమైన మన్మథుఁడు తన కాధారమైన మనస్సునే ముంచును. అట్లే మొసలి ఆధేయము, గుండము ఆధారము, ఆధేయమైన మొసలి తనకాధారమైన గుండమునే ముంచునట్లు మనసిజుఁడు తనకాధారమైన మనస్సును ముంచెనని భావము. అలంకార ముత్ప్రేక్ష.

ఇందు 'మొసలి తా దండగుండము ముంచునట్లు' అనునది సరియైన పాఠము గాదనియు, అది 'ముసలి తా దండగుండము ముంచునట్లు' అని యుండనగు ననియు శ్రీ నిడదవోలు వేంకటరావుగారి యభిప్రాయము - చూడు వావిళ్లవారిప్రతిలోని నిడదవోలువారి పీఠిక. 'ఇది వీరశైవ సంప్రదాయకమగు సమ్మరి గుండయ్యకథకు సంబంధించినది. గుండయ యను భక్తుఁడొక్కఁడు తన యింటికి వచ్చుచుండఁగా మార్గములో నొకవేశ్య మేడపైనుండి యాతనిపై నెంగిలినీళ్లను జల్లెను. అవి యొక మానిసిపై బడెనని గ్రహించి యామె క్రిందికి వచ్చి యాతనిని స్నాతునిగావించి మృష్టాన్నఁ తృప్తుని జేసి చందనతాంబూలాదికముల నొసఁగి పంపివైచెను. ఇంటికి వచ్చిన యతని విని భార్య యనుమానించి తన్ను ముట్టుకొనవలదని వారించెను. అట్లు వా రిరువురు నెనుబదేండ్లు ముదుసలు లగువఱకును గలియకయే యుండిరి. ఈశ్వరుఁడు వారిభక్తిని బరీక్షింపఁదలఁచి యొక మహేశ్వరుఁడై యొక కప్పెరను దాఁచుఁడని చెప్పియిచ్చి తానే దాని నదృశ్యముచేసెను. శివుఁడు మరల దాని నిమ్మనఁగా వా రదియెట్లుపోయి నదో తమకుఁదెలియదనిరి. శివుఁ డంగీకరింపక వారి నా దండనున్న యొక గుండమున మునిఁగి ప్రమాణము చేయుఁడనెను. వా రట్లు చేయఁగా నీశ్వరుఁడు మెచ్చి వారికి పురల యౌవనమును బ్రసాదించెను. ఈ పద్యమున హరుఁడు మదుని సంహరించి పార్వతీ దేవికి విరహతాపమును సంఘటింపుట చూడఁగా మొదలు విరహావస్థలేని ముసలి దంపతులకుఁ దిరిగి యౌవనమును గలిగించి విరహావస్థ నొందించినటు లున్నదనియు, 'దండగుండము మునుఁప' అని దీనిని పాల్కురికి సోమనాథుఁడు బసవపురాణము 4 వ ఆశ్వాసమునఁ దిరునీలకంఠుని కథయందు వాడెననియు, జక్కనయు విక్రమార్క చరిత్ర (5-169) లో 'చామ చన్నులతోడ సరివత్తుమని కోకములు దండగుండావ మునిఁగెనేని' అని యీ కథనే సూచించె' ననియు శ్రీ నిడదవోలు వేంకటరావుగారి వచనము.

వ. అని విధి నుల్లాపించుచు నక్కుసుమకోమలి నల్లనల్లన తడమికొని వచ్చి. 144

అర్థము : అని, విధిన్ = బ్రహ్మను, ఉల్లాపించుచున్ = దూషించుచు, ఆ + కుసుమ - కోమలిన్ = పూవువలెమనోజ్ఞురాలైనఆమెను అల్లనల్లన - మెల్ల మెల్లఁగా, తడమికొనివచ్చి = నిమురుచువచ్చి.

తాత్పర్యము : అని దైవమును దూషించుచు, నా పార్వతిని మెల్లమెల్లఁగా నిమురుచు వచ్చి - తరువాతి పద్యముతో నన్వయము.

సీ. హిమధామ ధాతు మిశ్రము లగు శశికాంత
జలములు వాసించి జలకమార్చి,
శీతాద్రి కందర ధాతురంజిత మగు
గైరికాంబరములు గట్టనిచ్చి,
ఘనసార పాంసు సంగత మగు నామోద
మలయజ పంకంబు గలయ నలఁది,
కోమల బిసతంతుగుణరోపితము లగు
నమల కర్పూరహారములు వెట్టి,

తే. సహజశైత్యాభినవపుష్పసమితిఁ దుఱిమి
తరుణ పల్లవ కర్ణావతంసకంబు
లిడి విదాహంబు వాపి మే యెలమి నవక
మెసఁగఁజేసిరి తనుపారు పసదనములు. 145

అర్థము : హిమధామ - ధాతు - మిశ్రములు = చంద్రుఁడనెడు ధాతువుతోఁ గలపినవి, అగు, శశికాంతజలములు = చంద్రకాంతశిలలనీరులు, వాసించి = పరిమళింపఁజేసి, జలకము + ఆర్చి = స్నానముచేయించి,

శీత + అద్రి - కందర - ధాతు - రంజితము = మంచుకొండగుహలందలి గైరికాదిధాతువులచే, నెఱ్ఱనైనవి అగు, గైరిక + అంబరములు = జేగుఱు వస్త్రములు, కట్టన్ + ఇచ్చి = తాల్పఁజేసి,

ఘనసార - పాంసు - సంగతము = కప్పురపుఁబొడితోఁగూడినది, అగు, ఆమోద - మలయజ - పంకంబు=పరిమళవంతమైన చందనకర్దమమును, కలయన్+ అలఁది = అంతటను బూసి,

కోమల - బిస - తంతు - గుణ - రోపితములు = మృదువులైన తూఁటి దారములచే గ్రుచ్చఁబడినవి, అగు, అమల - కర్పూర - హారములు - నిర్మలము లైన కప్పురపుదండలు, పెట్టి,

సహజ - శైత్య + అభినవ-పుష్ప-సమితిన్=స్వభావసిద్ధమైన చల్లఁదనముగల క్రొత్త పూలసమూహమును, తుఱిమి = చెరివి, తరుణ - పల్లవ - కర్ణ + అవతంస కంబులు=లేఁజివురుల కర్ణాభరణములు, ఇడి = పెట్టి, విదాహంబు = విశేషమైన తాపము, పాపి = పోఁగొట్టి, తనుపారు = (తనుపు + ఆరు) = చల్లనైన, పపదనములన్ = అలంకారములచే, మే + ఎలమి - నవకము = శరీరపువికాస మును, మృదుత్వమును, ఎసఁగన్ + చేసిరి = అతిశయింపఁజేసిరి,

తాత్పర్యము : చంద్రధాతుమిశ్రములగు చలుచఁజాతినీరులు పరిమళవంత ములుచేసి స్నానమాడించి, హిమవత్పర్వతగుహలందలి గైరికాదిధాతువులచే నెఱనైన జేగుఱువస్త్రములను దాల్పఁజేసి. కప్పురపుఁబొడితోఁగూడిన పరిమళచందనపంకము నంతటను బూసి, మృదువులైన తూఁటిదారములచే గ్రుచ్చఁబడిన నిర్మలములైన కప్పు రపుదండలు పెట్టి, ప్రకృతిసిద్ధమైన చల్లఁదనముగల క్రొంబూలను జెరివి, లేఁజివురుల కర్ణాభరణములను బెట్టి ఆమె విశేషతాపమును బోఁగొట్టి, చల్లని అలంకారములచే దేహ మృదుత్వము నతిశయింపఁజేసిరి.

విశేషములు : అర్చి-అడుధాతువు, 'ముగాగమం బాచ్ఛికంబున కసంయుక్త నలడరాంతంబునకుం బ్రేరణంబున బహుళంబుగా నగు' బాల,క్రియ,73.అడు + చు, 'ఆ డోడు కూడుల దకారంబునకుం జుక్కు పరంబగునపుడు రేఫంబగు,' బాల.క్రియ.80. అ రుచు. 'అచ్ఛికంబులం బదమధ్యంబుల న ల డ ర ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు,' బాల,ప్రకీర్ణ.17. అర్చు. 'సమానాశ్రయంబులం బూర్వకాలం బునం దివర్ణకం బగు.' బాల. క్రియ.38, అర్చు + ఇ, 'అంద్వవగాగమంబులందప్ప నపదాదిస్వరంబు పరంబగునపు డచ్చునకు సంధి యగు.' బాల,సంధి.11. అర్చి,

వ. తదనంతరంబ. 146

అర్థతాత్పర్యములు : తద్ + అనంతరంబు + అ = ఆ తరువాతనే, తరువాతి పద్యముతో నన్వయము,

చ. మరుఁ బ్రణుతించి, మందపవమానుఁ దలంచి, వసంతుఁ గొల్చి చం
దురునకు మ్రొక్కి, చూతనవతోయజసంహతిఁ దెల్చి, శారికా
పరభృత చంచరీక శుక బర్హిణ పంక్తికిఁ దృప్తిచేసి సు
స్థిర విరహాధిదేవతలఁ జిత్తమునం గొనియాడి భక్తితోన్. 147

అర్థము : మరున్ = మన్మథుని, ప్రణుతించి = మిక్కిలిపొగడి, మంద-పవమానున్ = మెల్లని వాయువును, తలంచి = స్మరించి, వసంతున్ = వసంతుని, కొల్చి, = సేవించి, చందురునకున్ = చంద్రునకు, మ్రొక్కి, చూత - నవ-తోయజ - సంహతిన్ = మామిడులయు, నూతనపద్మములయు సమూహమును, తెల్చి = స్తుతించి,. శారికా - పరభృత - చంచరీక - శుక - బర్హిణ - పంక్తికిన్ = గోరువంకలయు, కోకిలములయు, తుమ్మెదలయు, చిలుకలయు, నెమళులయు వరుసకు, తృప్తి - చేసి = తనుపుచేసి, సుస్థిర - విరహ - అధిదేవతలన్ = శాశ్వతులైన వియోగాధిష్ఠానదైవములను, చిత్తమునన్ = మనస్సునందు, భక్తితోన్, కొనియాడి = ప్రశంసించి.

తాత్పర్యము : మన్మథుని గొనియాడి, మలయవాయువును స్మరించి, వసంతుని సేవించి, చంద్రునకు మ్రొక్కి, మామిడుల క్రొందామరల సమూహమును స్తుతించి, గోరువంకలయు, కోకిలములయు, తుమ్మెదలయు, చిలుకలయు, నెమళులయు సమూహమును దనిపి సుస్థిరులైన వియోగాధిష్ఠానదైవతములను మనమున భక్తితోఁ బ్రశంసించి - తరువాతి పద్యముతో నన్వయము,

సీ. ఎలమావిజొంపముల్ బలసిన నెత్తమ్మి
కొలనిలోపలి దూబ నెలమిఁ బొదలి,
పెనఁగప్పి యొప్పిన యనఁటులలోపలి
చందన కర్పూర సహితవారి

ఘోరనఁ దొరఁగెడు ధారాగృహంబులో
విలసిల్లు శశికాంతవేదిమీఁదఁ
దనుపారు పువ్వులఁ దలిరుల నెడఁగొల్పి
పాటించి తీర్చిన పాన్పుమీఁద

ఆ. శైలతనయ నునిచి సఖు లోలిఁ దేలిన
ధాతుజలము లొడలఁ దడిపి తడిపి
కమల నవ దళములఁ గదళీదళమ్ముల
వీజనములు చేసి వీచి వీచి. 148

అర్థము : ఎలమావి - జొంపముల్ = లేఁతమామిడిగుబురులు, బలసిన = చుట్టియున్న, నెత్తమ్మి కొలనిలోపలి = తామరలసరస్సులోనున్న దూలన్ = దిబ్బ మీఁద, ఎలమిన్ = సంతోషముతో, పొదలి = ఒప్పి.

పెనఁగప్పి = దట్టమై, ఒప్పిన, అనఁటులలోపలి = అరఁటిచెట్లలోనున్న, చందన -.కర్పూర - సహిత - వారి = మంచిగంధము, కప్పురము అనువానితోఁగూడిన నీరు,

ఘోరనన్ + తొరఁగెడు = శీఘ్రముగాఁ బ్రవహించు, ధారా - గృహంబు లోన్ = జలయంత్రగృహములో, విలసిల్లు = ఒప్పు, శశికాంత - వేదిమీఁదన్ = చంద్రకాంతపుటరఁగుపైని, తనుపారు (తనుపు + ఆరు) = చల్లనగు, పువ్వులన్ = పువ్వులను. తలిరులన్ = చివురులను, ఎడఁగొల్పి = పఱచి. పాటించి = చక్కఁ బఱిచి, తీర్చిన = సవరించిన, పాన్పుమీఁదన్ = శయ్యపై,

శైల - తనయన్ = కొండకూఁతును - పార్వతిని, ఉనిచి = ఉంచి, సఖులు = చెలికత్తెలు, ఓలిన్ = క్రమముగా. తేలిన, ధాతు ....జలములు = గైరికాది ధాతువులతోఁ గూడిననీరు, ఒడలన్ = శరీరమునందు, తడిపి తడిపి = మిక్కిలి తడిపి. కమల - నవ - దళములన్ = తామరల క్రొత్తరేకులతోను, కదళీ దళమ్ములన్ = అరఁటియాకులతోను, వీజనములు = వీవనలు, చేసి. వీచి - వీచి = మిక్కిలి విసరి.

తాత్పర్యము : లేఁతమామిడి గుబురులు చుట్టియున్న పద్మాకరములోని దిబ్బమీఁద దట్టమై యొప్పిన అరఁటిచెట్లలో నున్న చందన కర్పూరసహితజలము ప్రవహించు ధారాగృహములో నొప్పు చంద్రకాంత శిలావేదికపైఁ జల్లనిపువ్వులను, జివురులను బఱచి సరిచేసినపాన్పుపైఁ బార్వతినుంచి చెలికత్తెలు గైరికాదిధాతువులతో శరీరమును దడిపితడిపి తామరతేకులతోను అరఁటి యాకులతోను వీవనలుచేసి మిక్కిలి విసరి - తరువాతి పద్యముతో నన్వయము.

క. కొలవేళులు నెలఁదూఁడులుఁ
దలిరులు నీహారవారిఁ దడిపి నయమునన్
గులిరుగొన మేన నొత్తిరి
లలనలు పార్వతికి శీతలక్రియ వెలయన్. 149

అర్థము ; లలనలు = స్త్రీలు - చెలికత్తెలు, కొలవేళులన్ = (కొలఁది వేళులన్) వట్టివేరులును, ఎలఁదూఁడులున్ = లేఁదూండ్లును, తలిరులున్ = చివురులును, నీహార - వారిన్ = మంచునీట. తడిపి, నయమునన్ = నేర్పుతో, పార్వతికిన్, శీతల - క్రియ = శీతలోపచారము, వెలయన్ = ఒప్పునట్లు, కులిరు + కొనన్ = చల్లనగునట్లు, మేనన్ = శరీరమున, ఒత్తిరి = అదిమిరి.

తాత్పర్యము : చెలికత్తెలు పార్వతికి శీతలోపచారము ఒప్పునట్లు వట్టివేరులను, లేఁదూండ్లను, జివురులను మంచునీటఁ దడిపి నేర్పుతోఁ జల్లనగునట్లు శరీరమున నదిమిరి.

వ. అంత నొక్కించుక యుల్లంబు చల్లనై గిరిజ కన్నులుమూసినం గని సతు లొండొరువులం బదరికొని కెలంకుల కోసరించి రయ్యవసరంబున. 150

అర్థము : అంతన్, ఒక్కించుక (ఒక్క + ఇంచుక) = ఒకకొంచెము. ఉల్లంబు = మనస్సు, చల్లన + ఐ, గిరిజ = పార్వతి, కన్నులు, మూసినన్ = మూయఁగా. కని = చూచి. సతులు = స్త్రీలు - చెలికత్తెలు, ఒండొరువులన్ = ఒకరి నొకరు, పదరికొని = తొందరపెట్టి, కెలంకులకున్ = ప్రక్కలకు, ఓసరించిరి = తొలఁగిరి, అయ్యవసరంబునన్ = (ఆ + అవసరంబునన్) ఆ సమయమునందు.

తాత్పర్యము: అంత నించుక మనసు చల్లఁబడి పార్వతి కన్నులు మూయఁగాఁ జూచి చెలికత్తె లొకరినొకరు తొందరపెట్టి పార్శ్వములకుఁ దొలఁగిరి. ఆ సమయమున - తరువాతి పద్యముతో నన్వయము.

చ. ఉదరెడు మోవి; ముత్పులక లొత్తెడు; నూరులుఁ గేలుఁ జన్నులుం
గదలెడు, మేన. బెంజెమట గ్రమ్మెడు: నూర్పులు నీగ్గెడున్; ముదం
బొదవఁ బ్రియుం గలం గవయుచున్నది; యిత్తటి నేల నిద్ర దె
ల్పెద?' రని యంతరంగగతి భేదము దెల్పె విదగ్ధ ముగ్ధలన్. 151

అర్థము; మోవి = పెదవి, ఉదరెడున్ = అదరును, ముద్ + పులకలు = ఆనందమువలనిగగ్గురులు. ఒత్తెడున్ = హెచ్చును, ఊరులున్ = తొడలును, కేలున్ = చేతులును, చన్నులున్, కదలెడున్ = చలించును, మేనన్ = శరీరమునందు, పెంజెమట (పెను + చెమట) = ఎక్కువ చెమట, క్రమ్మెడున్ = వ్యాపించును, ఊర్పులున్ = శ్వాసములును, నీగ్గెడున్ = తగ్గును, ముదంబు = సంతోషము, ఒదవన్ = కలుగఁగా, ప్రియున్, కలన్ = కలయందు, కవయుచున్ + ఉన్నది = కూడుచున్నది, ఇత్తటిన్ (ఈ+తటిన్) = ఈ సమయమున. ఏల- నిద్ర - తెల్పెదరు = నిద్రలేపెదరేల?, అని, విదగ్ధ = నేర్పరియైన చెలి, ముగ్ధలన్ = ముద్దరాండ్రకు, అంతరంగ - గతి - భేదము = మనస్సుయొక్క గమనముయొక్క, మార్పు తెల్పెన్.

తాత్పర్యము: 'పెదవి యదరుచున్నది. ఆనందమువలన గగుర్పాటు హెచ్చెడును. తొడలును, చేతులును, స్తనములును చలించుచున్నవి. శరీరమునఁ జెమట యెక్కువయ్యెను. శ్వాసములు తగ్గెను. సంతోషము గలుగునట్లు కలలోఁ బ్రియుని గూడుచున్నది. ఈమెనేల నిద్రలేపెదరు?' అని యొక నేర్పరియైనచెలి ముద్దరాండ్రయిన చెలికత్తెలకు ఆమె మనోగతి పరిణామము తెలిపెను.

వ. అంత నగజ గల నిక్కువంబ కా భావించి బెదరి లేచి పతిం
గానక. 152

అర్థము: అంతన్, నగజ (అగజ) = పార్వతి, కల = స్వప్నము, నిక్కువంబు + అ = నిజమే, కాన్ = అగుట, భావించి = తలఁచి, బెదరి = భయపడి, లేచి, పతిన్ = ప్రియుని, కానక,

తాత్పర్యము : అంతఁ బార్వతి కల నిజమేయని భావించి బెదరి లేచి ప్రియునిఁ గానక - తరువాతి పద్యముతో నన్వయము.

ఉ. ఉమ్మలికమ్మునన్ సొలసి యుస్సని మెల్లన వ్రాలుఁ బాన్పుపైఁ,
గ్రమ్మన లేచి నిల్చి పతిఁ గానక విభ్రమ మంది చిత్తతా
పమ్మున నేలమీఁదఁబడి ప్రాణము నిల్పక తల్లడంబునన్
సొమ్మలువోవుఁ దన్ సఖులు చూచి భయంపడఁ గామవేదనన్. 153

అర్థము : (పార్వతి కర్తృపదము) తన్ = తను - తన్ను, సఖులు = చెలికత్తెలు, చూచి, భయంపడన్ = భయపడఁగా, కామ - వేదనన్ = మన్మథ బాధతో. ఉమ్మలికమ్మునన్ = దుఃఖముతో, సొలసి = పరవశయై, ఉస్సు + అని = ఉస్సురని, పాన్పుపైన్ = శయ్యమీఁద, మెల్లనన్, వ్రాలున్ = ఒఱగును, క్రమ్మనన్ = శీఘ్రముగా, లేచి, నిల్చి, పతిన్ = ప్రియుని, కానక = చూడక, విభ్రమము + అంది = తొట్రుపాటుచెంది, చిత్త - తాపమ్మునన్ = మనస్తాపముచే, నేల మీఁదన్ + పడి, ప్రాణము - నిల్పక, తల్లడంబునన్ = కలవరముతో, సొమ్మలు + పోవున్ = మూర్ఛిల్లును.

తాత్పర్యము : పార్వతి తన్నుఁ జెలికత్తెలు చూచి భయపడఁగా మన్మథ తాపముతో దుఃఖపరవశయై ఉస్సురని పానుపుపై మెల్లఁగా నొఱగును. వెంటనే లేచి ప్రియునిఁగానక తొట్రుపాటుచెంది మనస్తాపముచే నేలపైఁబడి ప్రాణముండఁబట్టలేక కలవరముతో మూర్ఛిల్లును.

విశేషములు : ఇందు అనంగదశలలో మూర్ఛ యను దశ వర్ణింపఁ బడినది. అనంగదశలు పది. అవి -

దృఙ్మనస్సఙ్గ సఙ్కల్పా జాగరః కృశతాఽరతిః,
హ్రీత్యాగోన్మాద మూర్ఛాన్తా ఇ త్యనఙ్గదశా దశ.

తన్ - తన్ను - 'అకారంబు క్రింది అకారంబునకుం దుది ను లు ల క్రింది న ల లకు లోపంబు బహుళంబుగా నగు.' 'బాల. ప్రకీర్ణక, 7. తను. 'పవాంతంబులయి యుపంయు క్తంబులయిన ను లు రు ల యత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు.' బాల. ప్రకీర్ణక, 16. తన్.

వ. తదవసరంబున సఖీజనంబులు తల్లడిల్లి. 154

అర్థము : తద్ + అవసరంబునన్ = ఆ సమయమున, సఖీ - జనంబులు = చెలికత్తెల సమూహములు, తల్లడిల్లి = కలఁతఁజెంది.

తాత్పర్యము : ఆ సమయమునఁ జెలికత్తెలు కలఁతఁజెంది - తరువాతి పద్యముతో నన్వయము.

సీ. పరితాపవేదనాపరవశంబునఁ దూలి
నెలసిన చిత్తంబు నెలవుకొనఁగ,
నుమ్మలికమ్మున వెమ్మ నంగజవహ్ని
దురపిల్లునుల్లంబు మరులుకొనఁగ,
వలవంత వరువట్టు వట్టిన నాలుక
తల ముద్దుమాటలు మెలఁగియాడ,
నలరమ్ము నెఱనూర నాడిన వెస సొమ్మ
సిల్లిన జీవి సంజీవి కాఁగఁ,

ఆ. గోర్కి కోర్కి వీనిఁ గొలగొనఁ దనుఁగూడ
వగచుచున్న వగలు వగలఁగూడఁ
బరముఁ డెన్నఁడొక్కొ ప్రత్యక్షమై తన
రూపు శైలసుతకుఁ జూపు నెలమి. 155

అర్థము : పరితాప - వేదనా - పరవశంబునన్ = మన్మథతాపమువలని బాధచేనైన పారవశ్యముచేత, తూలి = చలించి, నెలసిన = ఉన్న. చిత్తంబు = మనస్సు. నెలవుకొనఁగన్ = స్థిరపడఁగను,

ఉమ్మలికమ్మునన్ = దుఃఖముచే, వెమ్మ = తప్తమగు, అంగజ - వహ్నిన్ = మన్మథాగ్నిచే, దురపిల్లు = దుఃఖించు, ఉల్లంబు = మనస్సు, మరులుకొనఁగన్ = వలపుచెందఁగను.

వలవంతన్ = మన్మథవ్యథచే, వరువట్టు + పట్టిన = దప్పిగొన్న, నాలుక - తలన్ - నాలుకకొనపై, ముద్దుమాటలు = ముద్దులు గులుకుమాటలు, మలఁగి + ఆడన్ = మరలి పలుకఁగను,

అలరమ్ము (అలరు+అమ్ము) =పూవుటమ్ము, నెఱను+ఊరన్+ఆడినన్= మర్మస్థానమున నాటఁగా. వెసన్ = శీఘ్రముగా. సొమ్మసిల్లిన - జీవి = మూర్ఛపోయిన ప్రాణి, సంజీవికాఁగన్ = బ్రదుకఁగను,

కోర్కికోర్కి = నీ ప్రతివాంఛయు. వీనిన్, చిత్తము = ఉల్లము, నాలుక, జీవి అనువానిని, కొలఁగొనన్ = కొల్లగొనఁగా, తనున్ = తన్ను - శివుని, కూడన్ = కూడుటకు, వగచుచున్ + ఉన్న = చింతించుచున్న, వగలు = చింతలు-దుఃఖములు, వగలన్ + కూడన్ = దుఃఖములను బొందఁగా, శివుఁడు ప్రత్యక్షమైనచో నిందనుక నాతనిని జూడ నామె పడువగలకే వగలుగలుగునని భావము, పరముఁడు = శివుఁడు (ఉత్కృష్టుఁడు), ఎన్నఁడు + ఒక్కొ = ఎప్పుడోకదా !, ప్రత్యక్షము + ఐ = ఎదుటఁదోఁచినవాఁడయి, తన - రూపున్ = తన ఆకారమును. శైల - సుతకున్ = కొండ కూఁతునకు - పార్వతికి, ఎలమిన్ = సంతోషముతో, చూపున్,

తాత్పర్యము : పరితాపవేదనవలని పారవశ్యముచేఁ జలించిన చిత్తము కుదుటఁబడఁగను, దుఃఖముచే రాఁజుకొను మన్మథాగ్నిచే దుఃఖించు మనస్సు వలపుఁ జెందఁగను, మన్మథవ్యథచేఁ బిడుచఁబాఱిపోయిననాలుక ముద్దులుగులుకుమాటలు పలుకఁగను, పూవుటమ్ము మర్మస్థానముల నాటఁగా మూర్ఛిల్లినప్రాణి ప్రాణవంతము కాఁగను, ప్రతివాంఛయు నా చిత్తాదులను గొల్లఁగొనఁగా నతనిని గూడుట కింతవఱకు వగచువగలకు వగపేర్పడఁగను, పరమశివుఁడు పార్వతి కెప్పుడు ప్రత్యక్షమై తన రూపమును సంతసముతోఁ జూపునోకదా !

విశేషములు : వేదనాపరవశంబున - వేదనాపారవశ్యమున నని యుండ వలయును, వెమ్ము + అంగజ - 'ఉదంతమగు తద్ధర్మార్థవిశేషణమున కచ్చు పర మగునపుడు నుగాగమంబగు'. బాల. సంధి. 33. వెమ్మునంగజ.

వ. అనుచు నత్తరుణి నెత్తి మెత్తన శశిరతల్పంబునం బెట్టిన. 156

అర్థము : అనుచున్. ఆ + తరుణిన్ = ఆ యువతిని. ఎత్తి = లేవనెత్తి. మెత్తనన్ = మెల్లఁగా. శిశిర - తల్పంబునన్ = చల్లని పాన్పుపై. పెట్టినన్ = పెట్టఁగా.

తాత్పర్యము : అనుచు నా యువతియగు పార్వతిని లేవనెత్తి మెల్లఁగాఁ జల్లని పాన్పుపైఁ బరుండఁబెట్టఁగా - తరువాతి పద్యముతో నన్వయము.

క. ఎలఁదూఁడులు గోలలు, విరు
లలుగులు, నవధాతుజలము లరుణాంబువులై,
పొలిచె సతి మారు నలర
మ్ముల పాన్పున నున్నకరణి మూర్ఛాగతయై. 157

అర్థము : ఎల - తూఁడులు = లేఁ దూఁడులు. కోలలున్ = బాణములును, విరులు = పూలు, అలుగులున్ = బాణాగ్రములును, నవ - ధాతు - జలములు = క్రొత్తవియగు గైరికాదిధాతువుల జలములు. అరుణ + అంబువులు + ఐ = రక్తములు, అయి, సతి = స్త్రీ - పార్వతి. మూర్ఛాగత + ఐ = మూర్ఛ పొందినదయి, మారు + అలరు + అమ్ముల - పాన్పునన్ = మన్మథుని పూవు టమ్ముల సెజ్జమీఁద, ఉన్న - కరణిన్ = ఉన్నవిధమున. పొలిచెన్ = ఒప్పెను.

తాత్పర్యము : లేఁదూఁడులు బాణములును, పూలు బాణాగ్రములును, గైరికాదిధాతు మిశ్రజలములు రక్తములును అయి, పార్వతి మూర్ఛిల్లి మన్మథుని పూవుటంపసెజ్జపై నున్న విధమున నొప్పెను.

విశేషములు : రూపకానుప్రాణితమైన ఉత్ప్రేక్ష. మారు నలరు - మారు + అలరు. 'షష్ఠీసమాసమునందు ఉకార ఋకారముల కచ్చు పరమగునపుడు నుగాగమం బగు.' బాల. సంధి. 34. మారునలరు. అలరమ్ము - అలరు + అమ్ము. 'కర్మధారయంబునందుఁ బేర్వాది శబ్దముల కచ్చు పరంబగునపుడు టుగాగమంబు విభాషనగు.' బాల. సంధి. 29. ఇందు టుగాగమము రాక, ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధి యగు,' బాల. సంధి. 1. చే అలరమ్ము సిద్ధించినది.

వ. అంత. 158

క. రే తల డెందము తల సం
ప్రీతిగ హిమవారిధార వెట్టుచు మలయో
ద్ధూతరజం బళికాళుల
జేతుల నొరయుదురు సొమ్మసిల్లిన చోటన్. 159

అర్థము : రే-తల = రాత్రిప్రారంభమున. సొమ్మసిల్లినచోటన్ = మూర్ఛపోయినప్పుడు. డెందముతలన్ = ఱొమ్మునందు, సంప్రీతిగన్ = మిక్కిలి యిష్టముతో, హిమ-వారి-ధార = మంచునీటిధార - పన్నీటిధార, పెట్టుచున్. మలయ+ఉద్ధూత - రజంబు = మలయపర్వతమునుండి యెగుర గొట్టబడిన ధూళి(ఉద్ధూత కాక ఉద్భూత అయియుండును.) మలయపర్వతమునుండి పుట్టిన చందనధూళి - అళికాళులన్ = అళికాళ్ళయందును, చేతులన్ = చేతులందును, ఒరయుదురు = రాచెదరు.

తాత్పర్యము : పార్వతి మూర్ఛిల్లినప్పుడు (సఖులు) రాత్రిప్రారంభమున ఱొమ్మునందు మంచినీటిధార పెట్టుచు, నళికాళ్లను, జేతులను మలయజరజము రాచెదరు.

వ. ఇట్లందఱు నక్కెత్తికొనక చేయు శిశిరోపచారం బగజ కుష్ణోపచారంబులైనం దన సఖులం బదరుచుఁ దనువాసపడి దిశలు గలయం గనుంగొని యెందు నుపాశ్రయంబు గానక కలవరించుచు. 160

అర్థము : ఇట్లు, అందఱున్ = చెలికత్తెలెల్లరును, నక్కు + ఎత్తికొనక - విసుపుచెందక, చేయు, శిశిర + ఉపచారంబు = శీతలక్రియ, అగజకున్ = పార్వతికి. ఉష్ణ + ఉపచారంబులు = వేడిచేయు క్రియలు, ఐనన్ = కాఁగా, తన-సఖులన్ = తనచెలులను, పదరుచున్ = కోపించుచు, తనువు + ఆసపడి = బ్రదుకాశించి, దిశలు = దిక్కులు, కలయన్ + కనుంగొని = అంతటను జూచి, ఎందున్ = ఎచ్చటను, ఉపాశ్రయంబు = ఆధారము, కానక, కలవరించుచున్ = మైమఱచి పలుకుచు - (కళవళించుచు ?)

తాత్పర్యము : ఇట్లు చెలికత్తెలెల్లరును విసుపుచెందక చేయు శీతలోపచారములు పార్వతి కుష్ణోపచారములుకాఁగా నామె చెలులను గోపించుచు బ్రదుకాశపడి

దిక్కులెల్లఁజూచి, యెచ్చటను ఆశ్రయము కానక, ప్రేమఁబిలుచుచు - తరువాతి పద్యముతో నన్వయము.

క. మలయానిలునకుఁ గదలీ
దళముల వీచిరొకో వేఁకి దనుకఁగ? నా మై
నలఁదెదు మలయజకర్దమ
మలఁదిరొకో యుడుకులేవ నమృతాంశుపయిన్, 161

అర్థము: మలయ + అనిలునకున్ = మలయపర్వతమునుండి వీచు వాయువునకు - దక్షిణపుగాలికి, వేఁకి = వెచ్చన, తనుకఁగన్ = కలుగఁగా, కదలీ - దళములన్ = అరఁటియాకులతో, వీచిరి + ఒకో = వీచిరాయేమి? నా - మైన్ + అలఁదెడు - మలయజ - కర్దమము = నా శరీరమునఁ బూయుచందనపంకము, అమృత + అంశు - పయిన్ = అమృతకిరణుని (చంద్రుని) పై, ఉడుకు = వేఁడిమి, లేవన్ = లేచునట్లు - పుట్టునట్లు, అలఁదిరి + ఒకో = పూసిరాయేమి?

తాత్పర్యము: దక్షిణపుగాలికి ఇంకను వేఁడిపుట్టునట్లు అరఁటియాకులతో విసరిరా యేమి? నా శరీరమునఁ బూయు మంచిగంధమును జంద్రునిపై నింకను వేఁడిపుట్టి తాపకరుఁడగునట్లు పూసిరా యేమి?

విశేషములు: మలయానిలము సామాన్యులకుఁ జల్లఁదనము గలిగించినను విరహులకుమాత్రము తాపకరమగును. అట్లే అరఁటియాకులతో వీచుటయు సామాన్యులకుఁ జల్లన గలిగించినను, విరహులకుమాత్రము తాపకారకమగును, 'నాకు మొదలే తాపకరమగు మలయానిలమును తాపకారకమగు అరఁటియాకువీవనలచే వీచి మఱింత తాపకరముగ నెవరైనఁ జేసిరాయేమి? అట్లే విరహులకుఁ దాపకరుఁడగు చంద్రునిపై - మఱింతతాపకరుఁ డగునట్లు, తాపకారణమగు చందనపంకము నెవరైనఁ బూసిరా యేమి? అనుట. లేనిచో మలయానిలుఁడును, చంద్రుఁడును ఇప్పు డింత దుస్సహతరులగుటకుఁ గారణమేమి యనుట.

లేవన్ - లేచు ధాతు తుమంతరూపము. మలయానిల చంద్రులు మఱింత తాపకరులగుటకుఁ గదళీదళవీజన చందనచర్చలు క్రమముగాఁ గారణములు గాకున్నను గారణములుగా నూహించుటచే హేతూత్ప్రేక్ష. అనంగదశలు పదింటిలో నిది ఉన్మాద మనెడి దశ, కలవరించుచు - ఇది కళవళించుటయే, కళవళించుట ఉన్మాదలక్షణమే.

సీ. చివురెల్లఁ గసినొత్తి తొవరాకు గుత్తుక
దెక్కొని కోయిల వెక్కుచుండఁ,
బూవెల్ల విడిగొల్చి పుప్పొడి ముక్కున
కగ్గలమై యలుల్ దగ్గుచుండఁ,
దని పండ్లరసమెల్లఁ ద్రావి రసాధిక
మై చిల్క లెల్లఁ గ ట్టజిమికొనఁగ,
మలయానిలం బేచి మ్రానెల్ల నుగ్గు గా
వించి లా వఱి వీఁపు విఱిగి కూల,

తే. వలవదే దైవమా యిట్లు వనముఁ దాఁకఁ
బోరి తమలోన సరిపోకపోయెనేని
బలము సాధనములుఁ జెడి చలమునెడక
కాముఁ డెక్కటి వచ్చి న న్నేమిసేయు ? 162

అర్థము : చివురు + ఎల్లన్ = వనములోని చివురంతయు. కసిన్ + ఒత్తి = కసితో (కోపముతో) నాక్రమించి. తొవరాకు (తొవరు + ఆకు) = ఎఱ్ఱని యాకు - చిగురాకు. కుత్తుక = గొంతు. డెక్కొని = దెక్కపట్టి. కోయిల, వెక్కుచున్ + ఉండన్ = వెక్కిళ్లు ఏర్పడుచుండఁగా - వలవదే ? అను సమాపక క్రియతో నన్వయము.

పూవు + ఎల్లన్ = వనమునన్న పూవులంతయును, విడిగొల్చి = విడు నట్లుచేసి, పుప్పొడి, ముక్కునన్. అగ్గలము + ఐ = అధిక మయి. అలుల్ = తుమ్మెదలు, దగ్గుచున్ + ఉండన్ = దగ్గుచుండఁగా - వలవదే ?

తని - పండ్ల - రసము + ఎల్లన్ = పరిపక్వములైన పండ్లరస మంతయును, త్రావి = త్రాగి, రస + అధికము + ఐ = రసము ఎక్కువయై, చిల్కలు + ఎల్లన్ = చిలుకలన్నియు, కట్టజిమికొనఁగన్ (కడు + అజిమికొనన్) = మిక్కిలి అజిమిరోగము (అజీర్ణరోగము) గలదియగుచుండఁగా - వలవదే ?

మలయ + అనిలంబు = మలయ వాయువు. ఏచి = విజృంభించి, మ్రాను+ ఎల్లన్ = చెట్టంతయును-వనములోనిచెట్లన్నియు, నుగ్గు + కావించి = ముక్కలుచేసి - పొడిచేసి, లావఱి = లావు + అఱి = బలముపోయి, పేఁపువిఱిగి = నడుము విఱిగిపోయి. కూలన్ - వలవదే = వలదా ? - ఈ పయిని జెప్పినవన్నియును జరగిన బాగుగా నుండునని విరహిణియగు పార్వతి ఆకాంక్ష.ఏలయన ?

దైవమా = భగవంతుఁడా!. ఇట్లు, వనమున్ = అడవియును, తారున్ = తామును - కోకిలాదులును, పోరి, తమలోనన్ = తమలోఁదమకు, సరిపోక పోయెన్+ ఏని = సరిపడకుండునెడల, కాముఁడు = మన్మథుఁడు, బలమున్, సాధనములున్, చెడి = నశించి, చలము = పంతము, చెడక, ఎక్కటిన్ = ఒంటరిగా, వచ్చి, నన్నున్ ఏమి + చేయున్ = ఏమియుఁజేయఁజాలఁ డనుట.

తాత్పర్యము ; వనములోని చివురంతయుఁ గోపముతో నాక్రమించి, ఎట్టనియాకు గొంతున కడ్డుపడి డెక్కపడి కోకిల వెక్కిళ్లు విడుచుచో బాగుగానుండును. ఉన్నపూవంతయు విడునట్లుచేసి పుప్పొడి ముక్కున కధికమై తుమ్మెదలు దగ్గుచున్నచో బాగుగానుండును. పరిపక్వఫలముల రసమంతయుఁ ద్రావి రస మెక్కువమై చిలుక లన్నియు మిక్కిలి అజీర్ణరోగగ్రస్తములగుచో బాగుగానుండును. మలయవాయువు విజృంభించి వనములోని చెట్టంతయుఁ బొడిచేసి దుర్బలమై నడుమువిఱిగికూలుచో బాగుగానుండును. ఇట్లు వనమును, మన్మథపరివారమగు కోకిలాదులును దమలోఁ దాము పోరి, ఒకరికొక్కరు సరిపడక వర్తిలుచో, మన్మథుఁడు బలమును, సాధనము లును గోలుపోయి, ఏకాకియై, పంతముండినమాత్రము, నన్నేమిచేయఁగలఁడు? ఏమియుఁ చేయఁజాలఁ డనుట.

విశేషములు : మన్మథుఁడు సపరివారుఁ డయినప్పుడే తనకు బాధాకరుఁడు. అతని పరివారమైనకోకిలాదులకు ఏవోవిధముగ బాధగలిగిచెడినచో, నతఁ డేకాకియై, త న్నేమియుఁజేయఁజాలఁ డనుట. ఇది యంతయు విరహిణియగు పార్వతి స్వానుకూలకాంక్ష. చివురు. పూవు, రసము, మ్రాను - అనునవి జాత్యేకవచనములు.

ఉ. కంతుఁ డనంగుఁ, డమ్ము లనఁగా విరు, లింతుఁడు తా సుధాంగుఁడ
త్యంతహిమంబు చంద్రి కనయం బిపు డా లయమూర్తి కల్కమై
నింతబలంబుఁ గ్రొవ్విరుల కింత ప్రచండతయున్, సుధాత్మునం
దింతబలంబు, శైత్యమున కింత విదాహకరంబుఁ గల్గునే? 163

అర్థము : కంతుఁడు = మన్మథుఁడు, అనంగుఁడు = శరీరమేలేనివాఁడు, అమ్ములు = బాణములు, అనఁగాన్, విరులు = పూలు, విచ్చిపోవునట్టివి, ఇందుఁడు = చంద్రుఁడు. తాన్ = తాను, సుధా + అంగుఁడు = అమృతమయమైన దేహముగలవాఁడు - ద్రవరూపుఁడు - దార్ఢ్యములేనివాఁ డనుట, చంద్రిక = వెన్నెల, అనయంబున్ = ఎప్పుడును, అత్యంత - హిమంబు = మిక్కిలి చల్లనిది, ఇపుడు, ఆ - లయ - మూర్తికిన్ = ఆ నష్టరూపుఁడైన మన్మథునకు, అల్కమైన్= కోపముతో, ఇంత - బలంబు, అంగమేలేనివాని కింత బల మెట్లుగలుగు ననుట, క్రొవ్విరులకున్ (క్రొత్త + విరులకున్) = క్రొంబూలకు, ఇంత - ప్రచండతయున్ = ఇంతటి తీక్ష్ణతయును, సుధా + ఆత్మ + అందున్ = అమృతస్వరూపునందు. చంద్రునందు, ఇంత - బలంబున్, శైత్యమునకున్ = చల్లఁదనమునకు, ఇంత-విదాహకరంబున్ = ఇంతటి విశేషదాహకరత్వమును, కల్గునే = కలుగునా ? కలుగ వనుట.

తాత్పర్యము : చూడఁగా మన్మథుఁడు దేహమే లేనివాఁడు. బాణములో విరులు, విచ్చిపోవు స్వభావముగలవి. చంద్రుఁడు అమృతమయుఁడు. ద్రవరూపుఁడు- ఏమాత్రము దార్ఢ్యములేనివాఁ డనుట, వెన్నెల చూడ నెల్లప్పుడును ఎంతో చల్లనిది. లయమూర్తి - నష్టరూపుఁడు - అయిన ఆ మన్మథునకు ఇప్పుడు ఇంతబలమును, క్రొంబూల కింతటితైక్ష్ణ్యమును, సుధాత్మున కింతటిశక్తియును, వెన్నెల కింతటి విదాహకరత్వమును గలుగునా ? కలుగ వనుట.

విశేషములు ; అనంగుఁడు, విరులు, సుధాంగుఁడుఁ హిమము అను శబ్దములు వరుసగా మన్మథుఁడు, అమ్ములు, ఇందుఁడు, చంద్రిక అనువాని దౌర్బల్యమును సమర్థించునవి యగుటచే నలంకారము కావ్యలింగము- చంద్రిక + అనయంబు = చంద్రికనయంబు - అత్వసంధి. 'బహుళగ్రహణముచేత స్త్రీవాచక తత్సమ సంబోధ నాంతంబులకు సంధిలేదు,' బాల. సంధి. 4. అయినను అర్థసౌలభ్యమునకై యీ యనిష్టసంధిని సమ్మతింపవలసి వచ్చినది. 'చంద్రిక-నయంబు' అనునది అన్వయయోగ్యముగా లేదు. లయమూర్తి లయమును (నాశనమును) పొందిన మూర్తిగలవాఁడు-మన్మథుఁడు, క్రొవ్విరులు - క్రొత్త + విరులు - 'సమాసంబునం బ్రాఁతాదుల తొలి యచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగా నగు,' బాల, సంధి, 36. క్రొ + విరులు 'క్రొత్త శబ్దమున కాద్యక్షరశేషంబునకుం గొన్నియెడల నుగాగమంబునుం గొన్ని

యెడల మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు.' బాల. సంధి. 38. క్రొవ్విరులు. నాల్గవపాదమున 'శైత్యమున' కనిగాక, 'చంద్రిక'కని యుంట లెస్స యని తోఁచుచున్నది. 'విదాహకరంబు' - విదాహకరత్వమని భావము.

వ. అని లగ్గ బెగ్గలించి భయాకులహృదయ యగుచున్న గిరిరాజ
నందనం బ్రియసఖులెల్ల సంతరించుచు. 164

అర్థము: అని, లగ్గన్ = మిక్కిలి, బెగ్గలించి = భయపడి, భయ + ఆకుల - హృదయ = వెఱపుచేఁ గలఁతనొందిన హృదయముగలది, అగుచున్ + ఉన్న, గిరి - రాజ - నందనన్ = కొండలఱేని కూఁతును - పార్వతిని, ప్రియ - సఖులు = అనుఁగుఁజెలులు, ఎల్లన్ = ఎల్లరును, సంతరించుచున్ = చక్కఁబఱుచుచు.

తాత్పర్యము: అని మిక్కిలిభయపడి, భయముచేఁ గలఁగిన హృదయముగలది యగుచున్న పార్వతిని అనుఁగుఁజెలు లెల్లరుఁ జక్కఁబఱుచుచు - తరువాతి పద్యముతో నన్వయము.

సీ. బాల! నీ వేనలి కాలోరగం బని
మలయానిలంబు నీవలన రాదు.
కమలాస్య! నీ కనుంగవ చకోరము లని
వెన్నెల సోరదు నీయున్న యెడకు.
నబల! నీ యెలుఁగు పికారావ మని నీకుఁ
జూతమ్ము కొమ్మ లెచూప వెఱచుఁ
జపలాక్షి! నీ ముక్కు చంపక మను భీతి
నలులు నీ పొదగని యలయఁబాఱు

ఆ. వనిత! నీకుఁ బ్రాణవల్లభుండై మది
నొలసి శివుఁడు పాయకుండు నరియ
పేద మరు శరములు నీదెస రా నోడు;
వీని కేల నీవు వెఱచెదమ్మ? 165

అర్థము : బాల = అమ్మాయీ!, నీ - వేనలి = నీ జడ, కాల+ఉరగంబు = నల్లని త్రాచు, అని, మలయ + అనిలంబు=దక్షిణపుగాలి, నీవలనన్ = నీ వైపునకు, రాదు,

కమలాక్షి + ఆస్య = తామరవంటి ముఖము గలదానా! పార్వతీ!, నీ - కనుంగవ (కను + కవ) = నీ కన్నుల జంట, చకోరములు+అని=వెన్నెలపులుఁగులని, వెన్నెల, నీ + ఉన్న+ ఎడకున్ = నీ వున్నచోటికి, చొరదు = ప్రవేశింపదు.

అబల = ఇంతీ! పార్వతీ!, నీ - ఎలుఁగు = నీ కంఠధ్వని, పిక + ఆరావము = కోకిలధ్వనిగలది, అని, నీకున్, చూతమ్ము = మామిడి, కొమ్ములు - చూపన్ = ఎదిరింప, వెఱచున్ = భయపడును - కొమ్మలుచూపవెఱచు ననియు. కొమ్ము = కొమ్మ.

చపల + అక్షి =చంచలములైనకన్నులు గలదానా. పార్వతీ!, నీ - ముక్కు చంపకము = సంపెఁగ, అను - భీతిన్ = అనెడు భయమున, అలులు = తుమ్మెదలు, నీ - పొడ + కని = నీ రూపుఁజూచి, అలయన్ + పాఱున్ = అలసిపోవునట్లు పాఱిపోవును.

వనిత = ఇంతీ! నీకున్, శివుఁడు, ప్రాణ - వల్లభుండు + ఐ=ప్రాణసమానమైనప్రియుఁడయి. మదిన్ = మనస్సును, ఒలసి = ప్రవేశించి, పాయక + ఉండున్ + అని + ఆ = వీడకుండుననియే, పేద - మరు - శరములు - పిఱికివైన మన్మథబాణములు. నీ - దెసన్= నీవైపు, రాన్ + ఓడున్ = వచ్చుటకు జంకును. వీనికిన్ = ఈ మలయానిలాదులకు, నీవు, ఏల, వెఱచెదు + అమ్మ (వెఱచెదవు+అమ్మ) = భయపడుదువమ్మా!

తాత్పర్యము : 'బాలా! నీ జడ కాలసర్పమని మలయానిలము నీ దిక్కునకు రాదు. (సర్పమునకును వాయువునకును విరోధము, సర్పము వాయువును దినును. వాయువునకు నీ వేనలియందు సర్పభ్రాంతి గలిగి నీవైపు రా దనుట.) పద్మముఖీ! నీ కనుదోయి చకోరపక్షులని వెన్నెల నీవున్నచోటికి రాదు, (వెన్నెలకును చకోరములకును విరోధము, చకోరములు వెన్నెలను భక్షించును. వెన్నెలకు నీ కనుదోయియందుఁ జకోరభ్రాంతిగలిగి, భయమేర్పడి, నీవున్నచోటికి రాదనుట). అబలా! నీ కంఠ

స్వరము కోకిలకంఠధ్వనియని మామిడి నీకు ఎదురుతిరుగ వెఱచును. (మామిడికిఁ గోకిలమునకు విరోధము. కోకిలములు మామిడిచివురులను మేయును. మామిడికి నీ యెలుఁగునందుఁ గోకిలకంఠభ్రాంతిగలిగి భయపడి నీ కెదురుతిరుగ దనుట). చంచలాక్షీ! నీ ముక్కు సంపెఁగ యని తుమ్మెదలు నిన్నుఁజూచినంతనే పాఱిపోవును. (తుమ్మెదలకును సంపెఁగకును విరోధము. తుమ్మెదలకు నీ ముక్కునందు ఁజంపక భ్రాంతిగలిగి భయముచే నిన్నుఁజూడఁగనే పాఱిపోవు ననుట). వనితా! నీకు శివుఁడు ప్రాణప్రియుఁడై నీమనస్సును జొచ్చి విడువకుండుననియే పిఱికివైన మన్మథశరములు నీవైపు రా నోడును (మన్మథునకు శివునకు విరోధము ప్రసిద్ధమే). కావున నీ వీ మలయానిలాదుల కేల వెఱతువు? అవి వేఱువేఱు కారణములచే నీజోలికి రా వనుట.

విశేషములు: మలయానిలమునకుఁబార్వతి వేనలియందు సర్పభ్రాంతి. వెన్నెలకు ఁబార్వతి కనుఁగవయందుఁ జకోరభ్రాంతి. మామిడికిఁబార్వతి యెలుఁగునందుఁ బికధ్వనిభ్రాంతి. తుమ్మెదలకుఁ బార్వతి ముక్కునందుఁ జంపకభ్రాంతి. అందుచే నలంకారము భ్రాంతిమంతము. వీనికి నీవు వెఱవఁబనిలే దను సమర్థనీయాంశము సమర్థింపఁబడుటచేఁ గావ్యలింగాలంకారమును.

వ. అని యనేకప్రకారంబుల బుజ్జగించుచున్నంత నక్కోమలికి విరహ తాప మతిక్రాంతమగుట గని భయస్థలై యిది మనచేతం దెగ దింతయు హిమవంతున కెఱింగింప వలయునని చని పర్వతాధీశ్వరుం గని తద్వృత్తాంతంబు విన్నపంబుసేసి వెండియు నిట్లనిరి. 166

అర్థము: అని, అనేక - ప్రకారంబులన్ = పెక్కువిధముల, బుజ్జగించుచున్ + ఉన్న + అంతన్ = అనునయించుచుండఁగా, ఆ + కోమలికిన్ = ఆ సుందరాంగికి - పార్వతికి. విరహతాపము = వియోగమువలని తాపము, అతిక్రాంతము = మితిమీఱినది, అగుట, కని, భయస్థలు + ఐ = వెఱచినవారయి, ఇది, మనచేతన్, తెగదు = అణఁగదు, ఇంతయున్ = ఇది యంతయును, హిమవంతునకున్, ఎఱింగింపన్ + వలయున్ = తెలుపవలయును, అని, చని = పోయి, పర్వత + అధి + ఈశ్వరున్ = పర్వతాధిపుని, కని, తద్ + వృత్తాంతంబు = ఆ విషయము, విన్నపంబు + చేసి = విన్నవించి - మనవిచేసి, వెండియున్ = మరల, ఇట్లు + అనిరి.

తాత్పర్యము : అని పెక్కువిధముల ననునయించుచుండఁగా నా పార్వతికి విరహతాపము మితిమీఱుట చూచి. వెలఁచినవారయి, 'యిది మనచే నణఁగదు. ఇంత యును హిమవంతునకుఁ దెలుపవలయు' నని పోయి పర్వతరాజున కా వృత్తాంతము విన్నవించి మరల నిట్లనిరి.

చ. మనసిజుఁ డా విలాసవతి మానధనం బెడ సూఱగొన్న క్రం
దునఁ గుటిలాలకద్యుతులఁ దుమ్మెద, లంగవిభాతిఁ దీఁగ, లా
నన కిరణాళి రాజు, చిఱునవ్వు వెలుంగు సితాబ్జముల్, విలో
కనరుచు లుత్పలల్ మగుడఁ గైకొనియెం దమ యచ్చువాటినన్. 167

అర్థము : మనసిజుఁడు = మన్మథుఁడు, ఆ - విలాసవతి-మాన - ధనంబు = ఆ ఒయ్యారి (పార్వతి) యొక్క మానమనెడిధనము. ఎడ - చూఱగొన్న - క్రందునన్ = కొల్లగొన్నసందడిలో, తమ + అచ్చు + పాటినన్ = తమ పాచిక పాఱఁగా, - తమ ముద్ర కానరాఁగా, తుమ్మెదలు కుటిల + అలక - ద్యుతులన్ - వంకరయైన ముంగురుల కాంతులను, తీఁగలు, అంగ - విభాతిన్ = శరీరకాంతిని, రాజు = చంద్రుఁడు, ఆనన - కిరణ + ఆళిన్ = ముఖ కిరణముల వరుసను, సిత + అబ్జముల్ = తెల్ల తామరలు, చిఱు - నవ్వు - వెలుంగున్, ఉత్పలల్ = (ఉత్పలాల్) = కలువలు, విలోకన - రుచులు = చూపుల కాంతులు, మగుడన్ = మరల, కైకొనియెన్ = గ్రహించెను.

తాత్పర్యము : మన్మథుఁడు ఆ సౌందర్యవతి మానమనెడిధనమును గొల్ల గొట్టిన సందడిలో, తమ పాచికపాఱఁగా - తమ ముద్ర కనఁబడఁగా, తుమ్మెద లామె వంకరముంగురుల కాంతులను, తీఁగలు ఆమె శరీరకాంతిని. చంద్రుఁడు ముఖకిరణ రాశిని, తెల్లఁదామరలు చిఱునగవువెలుఁగులను, కలువలు చూపులకాంతులను దిరిగి కైకొనెను,

విశేషములు ; ఒక పెద్దదొంగ ఒకయింటఁ బెద్ద దొంగతనమును జేయఁగా. ఆ సందడిలోఁ దదనుచరులు చిన్నచిన్న దొంగతనములు చేయునట్లు, మన్మథుఁడను గజదొంగ పార్వతి మానధనమును గొల్లగొట్టఁగా, చిల్లరదొంగలగు తుమ్మెదలు మున్నుగునవి ఆమె ముంగురులకాంతులు మున్నగువానిని, వానియందుఁ దమ

గుఱుతులు కనఁబడినందువలన, మరలఁగ్రైకొనెను. పార్వతి ముంగురులు తుమ్మెదల వలెను, శరీరము తీఁగవలెను, ముఖము చంద్రునివలెను, చిఱునవ్వు తెల్లతామరవలెను, చూపులు కలువలవలెను నున్నవని భావము.

చ. తనరు మృణాళముల్ ముదిరి తామరకాఁడలు కర్కశంబులై
యనయములై నభంగి మృదులాంగమునన్ బులకాళి పేర్చి మా
రునిదొనయమ్ము లొక్కమొగి రోమమురోమముఁ దప్పకుండ నా
టినక్రియ నుండు నింతి మెయి దెక్కొని చిత్తవికారచేష్టలన్. 168

అర్థము: తనరు = ఒప్పునట్టి, మృణాళముల్ = తామరతూండ్లు, ముదిరి = లేఁతఁదనము, వీడి, తామర - కాఁడలు = తామరకాఁడలు, కర్కశంబులు + ఐ = కఠిన ములయి - మృదువులుగానివయి, అనయములు = అయము (శుభము) కానివి ఐన - భంగిన్ = అయిన విధమున, మృదుల + అంగమునన్ = మెత్తని శరీరము నందు, పులక + ఆళి = గగ్గురులయొక్క పరుస, పేర్చి = అతిశయించి, మారుని = మన్మథునియొక్క, దొన + అమ్ములు = అంపపొదిలోని బాణములు, ఒక్క - మొగిన్ = ఒక్కపెట్టున, రోమము రోమమున్ = ప్రతిరోమమును, తప్పక + ఉండన్ = విడువకుండునట్లు, నాటిన - క్రియన్ = గ్రుచ్చుకొన్న విధమున, చిత్త వికార - చేష్టలన్ = మనోవికారములంటి చేష్టలచేత, ఇంతి - మెయిన్ = పార్వతి శరీరమున దెక్కొని = నెలకొని, ఉండున్,

తాత్పర్యము: ఒప్పునట్టి తూండ్లు ముదిరి తామరకాఁడలు కఠినములయి అయము (శుభము) లేనివయినవిధమునఁ బార్వతికి మనోవికారపుఁజేష్టలచే మెత్తని శరీరమున గగుర్పాటు అతిశయించి మన్మథుని అంపపొదిలోని బాణము లొక్కపెట్టున వెంట్రుకవెంట్రుకతప్పకుండునట్లు గ్రుచ్చుకొనెనా యనురీతిని నెలకొనియుండెను,

విశేషములు: తనరు మృణాళముల్ .... బులకాళిపేర్చి - అలంకార ముపమ, పులకాళిపేర్చి .... నాటినక్రియ - అలంకార ముత్ప్రేక్ష.

క. ధారాగృహమున నుండిన
నీ రెంతయు నింకెఁ గొలని నీరులలో నం
భోరుహ కదళీవన సహ
కారంబులు గలయఁ గోడుగమరులువోయెన్. 169

అర్థము : ధారా - గృహమునన్ = జలయంత్రగృహమున, ఉండిన, నీరు, ఎంతయున్ = మిక్కిలి, ఇంకెన్, కొలని - నీరులలోన్ = సరస్సునందలి జలములలో, అంభోరుహ - కదళీ - వన - సహకారంబులు = తామరలు, అరటులు, తీయమామిడులు, కలయన్ = అంతటను, కోడు - కమరులు + పోయెన్ = వాడి వత్తలయ్యెను.

తాత్పర్యము : జలయంత్రగృహమునందలినీరు మిక్కిలి యింకిపోయెను. సరస్సునందలి జలములలోని తామరలు, అరటులు తీయమామిడులు అంతటను వాడివత్తలయ్యెను.

క. విరహానలమున డెందము
దరికొని మదినున్నవిభునిఁ దాఁకునో యని చె
చ్చెర దాని నార్పుక్రియ నెదఁ
దరుణి విగళితాశ్రుధారఁ దడుపుచునుండెన్. 170

అర్థము : విరహ + అనలమునన్ = వియోగాగ్నిచే, డెందము = హృదయము, దరికొని = మండి, మదిన్ = మనస్సునందు, ఉన్న, విభునిన్ = ప్రియుని, తాఁకునొ = స్పృశించునో, అని, చెచ్చెరన్ = శీఘ్రముగా, దానిన్ = ఆ మంటను, ఆర్పు - క్రియన్ = ఆర్పువిధమున, తరుణి = యువతి - పార్వతి, ఎదన్ = వక్షమును, విగళిత + అశ్రు = ధారన్ = కారిన కన్నీటిప్రవాహముచే, తడుపుచున్ + ఉండెన్.

తాత్పర్యము : వియోగాగ్ని హృదయమును మండించి యందున్న ప్రియుని స్పృశించునేమోయని శీఘ్రముగా నా మంటనార్పువిధమునఁ బార్వతి తాఁగార్పు కన్నీటి ధారచే వక్షమును దడుపుచుండెను.

విశేషములు : అలంకారము ఉత్ప్రేక్ష, విరహానలము - విరహమనెడి అనలము - రూపకము. రూపకానుప్రాణితమైన హేతూత్ప్రేక్ష.

క. రేలుం బగలును మొగమున
ఁ బ్రేలుచుఁ బతి పాయకున్న బ్రేఁగుననో, లో
దాలివలవంతనో య
బ్బాలిక మొగమెత్త; దలసభావన నుండున్. 171

అర్థము : అబ్బాలిక (అ + బాలిక) = ఆ బాల, రేలున్ = రాత్రులును, పగలును, మొగమునన్ = ముఖమునందు, ప్రేలుచున్, (కనులకుఁగట్టినట్లుండుచు) పతి = ప్రియుఁడు, పాయక + ఉన్న - ప్రేఁగుననో = విడువకుండుటవలనిభారము చేతనో, లో - దాలి - వలవంతన్ + ఓ = లోదాలియైన - మనస్సునందలి నిప్పుల గుంటయైన, మన్మథవ్యథచేతనో, మొగము, ఎత్తదు, అలస - భావనన్ + ఉండున్ = మాంద్యముతోఉండును - ఉత్సాహము లేకుండును.

తాత్పర్యము : రేయుంబవళ్లు ముఖమున ప్రేలాడుచుఁ బ్రియుఁడు విడువ కుండుటవలనిభారముచేతనో, మనసులోని దాలి (నిప్పులగుంట) యైన మన్మథ వ్యథచేతనో ఆ బాల ముఖము పయికెత్తక. ఉత్సాహరహితయై యుండును.

విశేషములు : అలంకారము హేతూత్ప్రేక్ష. మొగమున ప్రేలుచు - కను లకుఁగట్టినట్లుండుచు - 'మొకమున ప్రేలుచున్నయవి ముప్పురమూర్తులు నంచు నార్తుఁడై.' ఉ,హరి.2, లోదాలివలవంత - లోపలియగ్నివలెనున్న మన్మథవ్యథ.

సీ. పరితాప శిఖి శిఖల్ దరికొని వపములోఁ
గార్చిచ్చులై కొని కాలుచుండు,
నుడుగక వెడలు నిట్టూర్పులు జగములఁ
బ్రళయానిలంబులై పర్వి నెగయు,
భోరనఁ దొరఁగు కన్నీరు వారాశికి
నేఱులై వెసఁగూడి పాఱుచుండు,
వగఁగూడి కడుఁగంది వందిన మైఁదీఁగ
కప్పున దెసలఁ జీఁకటులు కవియుఁ

తే. ప్రాణ వల్లభుఁ డెడ నున్కిఁ బ్రాణ మొడలఁ
బాయ దింతియ చెప్పంగ వేయు నేల ?
యా పరోక్షాన్యవృత్తి విరహానలంబు
దలఁప వినఁ జూడఁ గడు నద్భుతంబు దేవ ! 172

అర్థము ; పరితాప - శిఖి - శిఖల్ = సంతాపమనెడి అగ్నియొక్క జ్వాలలు, దరికొని = విజృంభించి, వనములోన్ = అడవిలో, కార్చిచ్చులు + ఐ = దావాగ్నులయి, కొని + వ్యాపించి, కాలుచున్ + ఉండున్ = దహించుచుండును.

ఉడుగక = మానక, వెడలు = పైకివచ్చు, నిట్టూర్పులు (నిడు+ఊర్పులు) దీర్ఘనిశ్వాసములు, జగములన్ = లోకములందు, ప్రళయ + అనిలంబులు + ఐ = ప్రళయకాలమునందలి అగ్ను లయి, పర్వి = వ్యాపించి, నెగయున్ = పైకిలేచును.

ఘోరనన్ = ఘోరుమని, తొరఁగు = ప్రవహించు, కన్నీరు, వారాశికిన్ = సముద్రమునకు, ఏఱులు + ఐ = ప్రవాహము లయి, వెసన్=శీఘ్రముగా, కూడి = కలిసి ఒక్కటియై, పాఱుచున్ + ఉండున్ = ప్రవహించుచుండును.

వగన్ + చింతతో, కూడి. కడున్ = మిక్కిలి, కంది = దుఃఖించి. వందిన= వాడిన, మైఁ దీఁగ = దేహలతయొక్క. కప్పునన్ = నలుపుచే. దెసలన్ = దిక్కులందు, చీఁకటులు, కలియున్ = ఆక్రమించును.

దేవ = ప్రభూ !, (హిమవంతుని సంబుద్ధి).

చెప్పంగన్ = చెప్పుటకు, వేయున్ + ఏల = వేయేల ? - పెక్కుమాటలు చెప్పనేల ?

ప్రాణ - వల్లభుఁడు = ప్రాణప్రియుఁడు, ఎడన్ = హృదయమునందు, ఉన్కిన్ = ఉండుటచే, ప్రాణము, ఒడలన్ = మేనియందుండి, పాయదు = పోదు, ఇంతియ = ఇంతే.

ఆ - సరోజ + ఆస్య. పైన్ = ఆ పద్మముఖిపై, విరహ + అనలంబు = వియోగమనెడి అగ్ని, తలఁపన్ = భావించుటకు, వినన్ = వినుటకు, చూడన్ = చూచుటకు, కడున్ = మిక్కిలి, అద్భుతంబు = ఆశ్చర్యము.

తాత్పర్యము : సంతాపాగ్నిజ్వాలలు విజృంభించి వనములో దావాగ్నులై వ్యాపించి కాలుచుండును. మానక బయల్వెడలు నిట్టూర్పులు లోకములందుఁ బ్రళయ కాల వాయువులై వ్యాపించి పైకిలేచును. భోరుమని ప్రవహించు కన్నీరు సముద్రము నకు నదులై శీఘ్రముగాఁగూడి ప్రవహించుచుండును. చింతతోఁగూడి మిక్కిలి దుఃఖ ముచే వాడిపోయినదేహలత నలుపుచే దిక్కులందుఁ జీఁకటులు ఆక్రమించును. ప్రభూ! పలు పలుకులేల ? ప్రాణప్రియుఁడు హృదయమున నుండుటచేఁ బ్రాణము మేనినుండి పోదు. ఇంతే. ఆ పద్మముఖిపై వియోగాగ్ని తలఁపను, వినను, జూడను మిక్కిలి ఆశ్చర్యకరము.

విశేషములు : వనములోని దావాగ్నులు పార్వతీ విరహతాపాగ్ని జ్వాలల వలనఁ గలిగినవే యనుట. జగములందలి ప్రళయవాయువు లామె నిరంతర నిశ్వాసముల వలన నేర్పడినవే యనుట. సముద్రమునఁ గలియు నదు లామె దుఃఖాశ్రువులవలన నైనవే యనుట. దిక్కులందలి చీఁకటు లామె దుఃఖమ్లానదేహలత నలుపే యనుట - నాల్గు పాదములందు నలంకారము సంబంధాతిశయోక్తి. ప్రాణవల్లభుఁ డెడనున్కి.... బాయదు - అలంకార ముత్ప్రేక్ష. పరితాప శిఖి. = పరితాపమనెడి శిఖి. విరహానలము = విరహమనెడి అనలము - రూపకములు.

ఒడలఁ బాయదు - ఒడలి వలనఁ బాయదు. 'ఉండి పదం బొకానొకచో వలన వర్ణకంబున కనుప్రయుక్తం బగు,' బాల, కారక. 10. ఒడలి వలననుండి పాయదు. 'ఉండి శబ్దము పరంబగునపుడు వలనకు ద్వితీయాసప్తములు ప్రాయికంబుగ నగు.' బాల. కారక. 11. ఒడలియందుండి పాయదు. 'ఔపవిభక్తికముల తృతీయాసప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు.' ఒడలనుండి పాయదు. 'వలన కాదేశంబగు ద్వితీయాసప్తములమీఁది యుండికి లోపంబు బహుళంబుగా నగు.' ప్రౌఢ. కారక. 11. ఒడలఁబాయదు.

వ. అనిన విని హిమవంతుం డదరిపడి మేనకాసహితం బతిసంభ్రమం బునం జనుదెంచునంత నిట పార్వతియును. 173

అర్థము: అనినన్, విని, హిమవంతుండు, అదరిపడి = ఉలికిపడి, మేనకాసహితంబు = మేనకతోఁగూడ, అతి - సంభ్రమంబునన్ = మిక్కిలి వేగిరపాటుతో, చనుదెంచు + అంతన్ = వచ్చునంత, ఇట = ఇక్కడ. పార్వతియును.

తాత్పర్యము: అని చెలులు చెప్పఁగా విని హిమవంతుఁ డులికిపడి మేనకతోఁగూడ మిక్కిలివేగమున వచ్చునంత నిక్కడఁ బార్వతియును - తరువాతి యాశ్వాసమునందలి రెండవ వచనముతో నన్వయము.

మ. జగదారాధ్యు, నసాధ్యు, సాధ్యు, విమలాచారున్, మహోదారు, స
ర్వగు, సర్వేశు, ననీశు, నీశు, సుగుణావాసుం, జగత్త్రాసుఁ, దత్
త్రిగుణాతీతు, నజాతు, జాతు, వృషవర్ధిష్ణుం, గ్రియాజిష్ణు, లో
క గురున్, దృశ్యు, నవశ్యు, వశ్యు, వివిధాకల్పున్, సుజల్పున్,
మహిన్. 174

అర్థము: మహిన్ = భూమియందు, జగదారాధ్యున్ (జగత్ + ఆరాధ్యున్) = లోకముచేఁ బూజింపఁదగినవాఁడును, అసాధ్యున్ = సాధింపరానివాఁడును, సాధ్యున్ = సాధింపఁదగినవాఁడును, విమల + ఆచారున్ = పవిత్రమైన నడవడి గలవాఁడును, మహా (మహత్) + ఉదారున్ = మిక్కిలి గొప్పవాఁడును. సర్వగున్ = అన్నింటియం దుండువాఁడును, సర్వ + ఈశున్ = అన్నింటికిని ప్రభువైనవాఁడును. అనీశున్ = ప్రభువులేనివాఁడును - స్వతంత్రుఁడును. ఈశున్ = ప్రభువైనవాఁడును, సుగుణ + ఆవాసున్ = మంచిగుణములకు స్థానమైనవాఁడును, జగత్ + త్రాసున్ = లోకభయంకరుఁడును, తద్ + త్రిగుణ + అతీతున్ = ఆ సత్త్వరజస్తమోగుణముల నతిక్రమించినవాఁడును, అజాతున్ = పుట్టనివాఁడును, జాతున్ = పుట్టినవాఁడును, వృష - వర్ధిష్ణున్ = ధర్మముచే వృద్ధిపొందుశీలము గలవాఁడును, క్రియా - జిష్ణున్ = పనులయందు జయించు స్వభావముగలవాఁడును, లోక - గురున్ = లోకములకు గురువైనవాఁడును, దృశ్యున్ = దర్శింపఁదగి = వాఁడును, అవశ్యున్ = లోఁబడని వాఁడును, వశ్యున్ = లోఁబడినవాఁడును, వివిధ + ఆకల్పున్ = పెక్కువిధములైన ఆభరణములు గలవాఁడును, సుజల్పున్ = బాగుగా మాటలాడువాఁడును - అగు కృతిపతిని - జంగమమల్లికార్జునదేవుని.

తాత్పర్యము : జగత్తుచే నారాధింపఁదగినవాఁడును, అసాధ్యుఁడును, సాధ్యుఁడును, విమలమైన నడవడిగలవాఁడును, మిక్కిలి గొప్పవాఁడును, అన్నిట నుండువాఁడును, అన్నిటికిని ప్రభువైనవాఁడును, దనకుఁ బ్రభువొకఁడు లేనివాఁడును, ప్రభుపైనవాఁడును, సుగుణములకు స్థానమైనవాఁడును, జగత్తునకు భయంకరుఁడును, సత్త్వరజస్తమోగుణముల నతిక్రమించువాఁడును, పుట్టుక లేనివాఁడును, పుట్టినవాఁడును, ధర్మముచే వృద్ధిపొందువాఁడును, పనులయందు జయించు శీలముగలవాఁడును, లోకములకు గురువైనవాఁడును, దర్శింపఁదగినవాఁడును, లోఁబడనివాఁడును, లోఁబడినవాఁడును, వివిధములైన ఆభరణములు గలవాఁడును, బాగుగా మాటలాడు వాఁడును - అగు కృతిపతిని శ్రీజంగమ మల్లికార్జునదేవుని -

విశేషములు : అలంకార మనుప్రాసము,

క. సుజ్ఞానామల తత్త్వ వి
ధిజ్ఞుఁ, గళాభిజ్ఞు, భారతీరమణుఁ, ద్రిలో
కజ్ఞు, నయజ్ఞు, సుధీనిధి,
నజ్ఞానవిముక్తు, సుచరితాభరణాంకున్. 175

అర్థము : సుజ్ఞాన + అమల - తత్త్వ - విధిజ్ఞున్ = మంచి జ్ఞానమనెడు నిర్మలమైనతత్త్వముయొక్క విధి నెఱిఁగినవాఁడును. కళా + అభిజ్ఞున్ = కళల నెఱిఁగినవాఁడును, భారతీ - రమణున్ - వాక్ప్రియుఁడును, త్రిలోకజ్ఞున్ = మూఁడు లోకముల తెలిసినవాఁడును, నయజ్ఞున్ = నీతి నెఱిఁగినవాఁడును, సుధీ - నిధిన్ = మంచి తెలివికి నిధియైనవాఁడును, అజ్ఞాన - విముక్తున్ = అజ్ఞానమునుండి విడువఁ బడినవాఁడును, సుచరిత + ఆభరణ + అంకున్ = మంచిచరితమనెడి ఆభరణము గలవాఁడను బిరుదు గలవాఁడును అగు కృతిపతిని శ్రీజంగమమల్లికార్జున దేవుని -

తాత్పర్యము : సుజ్ఞానమనెడు నిర్మలతత్త్వవిధము నెఱిఁగినవాఁడును, కళల నెఱిఁగినవాఁడును, వాక్ప్రియుఁడును, త్రిలోకముల నెఱిఁగినవాఁడును, నీతి

నెఱిఁగినవాఁడును, మంచి తెలివికి నిధియైనవాఁడును, అజ్ఞానమువలన విముక్తుఁడైనవాఁడును, సుచరితాభరణుఁ డనెడి బిరుదు గలవాఁడును అగు కృతిపతిని శ్రీజంగమ మల్లికార్జునదేవుని.

విశేషములు :అలంకార మనుప్రాసము.

మ. కరుణామిత్రు, నమిత్రు, మిత్రు, నుతలోకజ్ఞుం, గళాభిజ్ఞు, సా
గరగంభీరు, నదూరు, దూరగతజాఘన్యున్, జగన్మాన్యు, భూ
సురవంశాద్యు, నభేద్యు, భేద్యు, సుమనశ్శుద్ధున్, మనశ్శుద్ధు, వి
స్తరితశ్లోకు, నలోకు, లోకు, శివసంసక్తున్, విముక్తున్, మహిన్, 176

అర్థము : మహిన్. కరుణా - మిత్రున్ - దయకు మిత్రుఁడైనవాఁడును, అమిత్రున్ = మిత్రుఁడుకానివాఁడును, మిత్రున్ = మిత్రుఁడైనవాఁడును, నుత - లోకజ్ఞున్ = పొగడఁబడిన లోకజ్ఞానముగలవాఁడును, కళా + అభిజ్ఞున్ = కళలు దెలిసినవాఁడును, సాగర - గంభీరున్ = సముద్రమువలె లోఁతయినవాఁడును, అదూరున్ = దూరములేనివాఁడును, దూర - గత - జాఘన్యున్ = దవ్వైన నైచ్యము గలవాఁడును, జగత్ + మాన్యున్ = లోకములకు మాన్యుఁడైనవాఁడును, భూసుర - వంశ + ఆద్యున్ = బ్రాహ్మణవంశమున కాద్యుఁడైనవాఁడును, అభేద్యున్ = భేదింపరానివాఁడును, భేద్యున్ = భేదింపఁదగినవాఁడును, సుమనస్ (ః) + శుద్ధున్ = మంచిమనస్సుచేఁ బవిత్రుఁడును, (దేవతవలెఁ బవిత్రుఁడైనవాఁడును). మనస్ (ః) - శుద్ధున్ = మనస్సుచే శుద్ధుఁడైనవాఁడును, విస్తరిత - శ్లోకున్ = విస్తరించిన కీర్తి గలవాఁడును, అలోకున్ = లోకములు లేనివాఁడును, లోకున్ = లోకములు గలవాఁడును. శివ - సంసక్తున్ = శివునితోఁగూడినవాఁడును, విముక్తున్ = విడువఁబడినవాఁడును అగు కృతిపతిని శ్రీ జంగమ మల్లికార్జున దేవుని.

తాత్పర్యము : దయకు మిత్రుఁడైనవాఁడును, అమిత్రుఁడును, మిత్రుఁడును, పొగడఁబడిన లోకజ్ఞుఁడును. కళల నెఱిఁగినవాఁడును, సముద్రగంభీరుఁడును. దవ్వుకానివాఁడును, నైచ్యమునకు దవ్వయినవాఁడును, లోకములకు మాన్యుఁడైన

వాఁడును, బ్రాహ్మణవంశమున కాద్యుఁడైనవాఁడును, భేదింపరానివాఁడును, భేదింపఁ దగినవాఁడును, మంచిమనస్సుచేఁ బవిత్రుఁడైనవాఁడును, (దేవతవలెఁ బవిత్రుఁడైన వాఁడును). మనస్సుచే శుద్ధుఁడైనవాఁడును, వ్యాపించిన కీర్తిగలవాఁడును, లోకములు లేనివాఁడును, లోకములు గలవాఁడును, శివునితోఁ గూడినవాఁడును, విడువఁబడిన వాఁడును - అగు కృతిపతిని - శ్రీ జంగమమల్లికార్జునదేవుని.

విశేషములు : అలంకార మనుప్రాసము,

క. లోకాలోకన కీర్తి
శ్రీకాంతాకాంతు, విబుధశేఖరు, దురితా
నోకహ కుఠారు, సకల క
ళా కల్పాకల్పు మల్లికార్జునదేవున్. 177

అర్థము : లోకాలోకన - కీర్తి - శ్రీ - కాంతా - కాంతున్ = చక్రవాళ పర్వతమువఱకు వ్యాపించిన, కీర్తియనెడు, లక్ష్మీదేవికి, భర్తయైనవాఁడును, విబుధ - శేఖరున్ = దేవతలలోఁ దలమానికమైనవాఁడును (శ్రేష్ఠుఁడును), దురిత + అనోకహ - కుఠారున్ = పాపములనెడి చెట్లకు గొడ్డలియైనవాఁడును, సకల - కళా + ఆకల్ప + ఆకల్పున్=ఎల్ల కళలనెడు ఆభరణములకు ఆభరణమైనవాఁడును అగు, మల్లికార్జునదేవున్ = కృతిభర్తయగు శ్రీజంగమ మల్లికార్జునదేవుని,

తాత్పర్యము : చక్రవాళపర్వతమువఱకును వ్యాపించిన కీర్తియనెడు లక్ష్మికి భర్తయైనవాఁడును, దేవతలలోఁ దలమానికమైనవాఁడును, పాపము లనెడు చెట్లకు గొడ్డలియైన వాఁడును, ఎల్ల - కళలనెడు అభరణములకు ఆభరణమైనవాఁడును, అగు శ్రీ జంగమ మల్లికార్జునదేవుని.

విశేషములు : లోకాలోక (న) - 'లోకాలోక శ్చక్రవాళః' 'అస్యా భ్యన్తరం సూర్యకిరణైః ప్రకాశ్యతే న బాహ్య మితి ప్రకాశాప్రకాశతయాలోక్యతే న లోక్యత ఇతి చ లోకాలోకః' ఈ పర్వతముయొక్క లోపలిపార్శ్వము సూర్యకిరణ ములచేతఁ బ్రకాశించును. వెలుపలిపార్శ్వము ప్రకాశింపదు గనుక కొంత చూడఁబడు నదియు, కొంత చూడఁబడనిదియు నగుటచే లోకాలోకము - అమరము. దురితానో

కహాకుతారు - దురితములనెడి అనోకహములకుఁ గుఠారమైనవాఁడు - రూపకము.
కీర్తి శ్రీ కాంతా కాంత - కీర్తియనెడు శ్రీకాంతకు కాంతుఁడైనవాఁడు - రూపకము.

మాలిని. అమలపరమయోగాయత్తు, సంశుద్ధచిత్తున్,
గమల విశిఖ రమ్యాకారు, దుస్సంగదూరున్
శమిత విషయుఁ, దత్త్వాసక్తు, సంసారముక్తున్,
శమ దమ నియతాత్మున్, శాంతు, వాక్ఛ్రీసుకాంతున్. 178

అర్థము : అమల - పరమ - యోగ + ఆయత్తున్ = నిర్మలము, ఉత్కృష్టము అయిన యోగమునకు వశమైనవాఁడును. సంశుద్ధచిత్తున్ = మిక్కిలి పవిత్రమైన మనస్సుగలవాఁడును, కమల - విశిఖ - రమ్య + ఆకారున్ = పద్మములు బాణములుగాఁ గలవాని (మన్మథుని) వలె సుందరమైన రూపముగలవాఁడును, మనస్ + సంగ - దూరున్ = చిత్తముయొక్క సంగమునకు దవ్వైనవాఁడును, శమిత - విషయున్ = శమించిన ఇంద్రియవాంఛలు గలవాఁడును, తత్త్వ + ఆసక్తున్ = భగవత్ప్రతిపాదక విషయమునందు ఇష్టముగలవాఁడును, సంసార - ముక్తున్ = సంసారబంధమునుండి విడువఁబడినవాఁడును, శమ - దమ - నియత + ఆత్మున్ = శాంతము, ఇంద్రియనిగ్రహము అనువానిచే నియమింపఁబడిన ఆత్మగలవాఁడును, శాంతున్ = శాంతగుణముగలవాఁడును, వాచ్ (క్) + శ్రీ - సుకాంతున్ = వాక్కు లనెడు సంపదచేత మిక్కిలి మనోహరమైనవాఁడును . అగు కృతిపతిని శ్రీ జంగమ మల్లికార్జునదేవుని -

తాత్పర్యము : నిర్మలము, ఉత్కృష్టము నైన యోగమునకు వశమయిన వాఁడును, మిక్కిలి పవిత్రమైన మనస్సుగలవాఁడును, మన్మథుని ఆకారమువలె రమ్యమైన ఆకారముగలవాఁడును, మనస్సంగమునకు దవ్వైనవాఁడును, శమించిన ఇంద్రియవాంఛలు గలవాఁడును, భగవత్ప్రతిపాదక విషయమునం దాసక్తిగలవాఁడును. సంసారబంధమునుండి విడువఁబడినవాఁడును, శాంతము, ఇంద్రియనిగ్రహము అనువానిచే నియమింపఁబడినవాఁడును. శాంతుఁడును, వాక్సంపదచేత మిక్కిలి మనోహరమైనవాఁడును అగు కృతిపతిని శ్రీ జంగమమల్లికార్జున దేవుని.

విశేషములు : వాక్ఛ్రీ = వాచ్ + శ్రీ = వాక్ + శ్రీ.

## గద్యము

ఇది శ్రీమజ్జంగమ మల్లికార్జునదేవ దివ్య పాదపంకజ భ్రమరాయమాణ కవి రాజశిఖామణి నన్నెచోడదేవప్రణీతంబైన కుమారసంభవంబను కథయందుఁ బంచమాశ్వాసము.

దీనికి వ్యాఖ్య ప్రథమాశ్వాసాంత గద్యమునకు వలెనే,

మ. ఇది శ్రీ జొన్నలగడ్డ వంశమణియౌ మృత్యుంజయాఖ్యుండు స
మ్మద మొప్పారఁ గుమారసంభవము శ్రీమన్నన్నెచోడాఖ్య వి
ద్వదధీశోక్తము శాబ్దికార్థ వివిధస్వారస్య తాత్పర్యముల్
చదురొప్పన్ వచియించి మన్చు విలసత్ సంజీవనీవ్యాఖ్యయౌ.

---

# కుమారసంభవము

## షష్ఠాశ్వాసము

శ్రీవాణీవరు, నఖిలక
ళావిదు, నఘరహితు, నిహాలలాటేశుఁ, ద్రిత
త్త్వావిష్కృతమతి, నఖిల శు
భావహు, నణిమాదిగుణగణాలంకారున్. 1

అర్థము : శ్రీ - వాణీ - వరున్ = శోభాయుక్తమైన వాక్కుచేత శ్రేష్ఠుఁడైనవాఁడును, అఖిల - కళా - విదున్ = ఎల్ల కళలు తెలిపినవాఁడును, అఘ - రహితున్ = పాపములేనివాఁడును, ఇహ - లలాట + ఈశున్ = భూలోకశివుఁడును, త్రి - తత్త్వ + ఆవిష్కృత - మతిన్ = సత్త్వము, రజస్సు, తమస్సు అను మూఁడుతత్త్వములచేత ఆవిష్కరింపఁబడిన బుద్ధిగలవాఁడును, అఖిల - శుభ + ఆవహున్ = ఎల్ల శుభములను గలిగించువాఁడును, అణిమ + ఆది - గుణ - గణ + అలంకారున్ = అణిమము మున్నగు అష్టైశ్వర్యములనెడు గుణములయొక్క సమూహము అలంకారముగాఁ గలవాఁడును అగు కృతిపతిని శ్రీ జంగమమల్లికార్జునుని.

తాత్పర్యము : శోభాయుక్తమగువాక్కులచే శ్రేష్ఠుఁడును, సకలకళాకోవిదుఁడును, పాపరహితుఁడును, భూలోకేశ్వరుఁడును, సత్త్వాదితత్త్వత్రయముచే నావిష్కృతమైన మతిగలవాఁడును, సర్వశుభావహుఁడును, అణిమము మున్నగు నెనిమిది యైశ్వర్యము లలంకారములుగాఁ గలవాఁడును అగు కృతిపతిని శ్రీ జంగమమల్లికార్జున దేవుని.

విశేషములు : అణిమ - అష్టైశ్వర్యములలో నొకటి - దీనివలన మిక్కిలి సూక్ష్మాకారమొంది సర్వత్ర పోవుటకు శక్తిగలుగును, తక్కిన యైశ్వర్యములు - మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము.

వ. పరమేశ్వరుం దపోమహిమ నర్చించి మెచ్చించి నిజాధీశ్వరుండుగాఁ బడయుదు నని తపోవనంబునకుం బోవనిశ్చయించి కన్యాంతః పురంబునకుం జనుదెంచె నంత హిమవంతుం డరుగుదెంచి విరహాన లార్తిం దీవ్రకరాహతేందురేఖయుంబోలె వివర్ణయై యున్న హైమ వతిం గని నెమ్మనంబునం దల్లడిల్లుచు. 2

అర్థము : పరమేశ్వరున్, తపస్ (ః) + మహిమన్ = తపస్సుయొక్క ప్రభావముచే, అర్చించి = పూజించి, మెచ్చించి, =మెప్పించి, నిజ + అధి + ఈశ్వరుండు + కాన్ = తనభర్తగా, పడయుదున్ + అని = పొందుదునని, తపస్ (ః) + వనంబునకున్ = తపస్సుకొఱకైన వనమునకు, పోవన్, నిశ్చయించి, కన్యా + అంతఃపురంబునకున్ = కన్నియల అంతిపురమునకు, చనుదెంచెన్ = వచ్చెను. అంతన్, హిమవంతుండు, అరుగుదెంచి = వచ్చి, విరహ + అనల + ఆర్తిన్ = వియోగమనెడి అగ్నివలని పీడచే, తీవ్రకర - ఆహత - ఇందురేఖయున్ + పోలెన్= తీక్ష్ణకిరణుని (సూర్యుని) చేఁ గొట్టఁబడిన చంద్రకళవలె, వివర్ణ + ఐ = పాలిపోయిన దయి, ఉన్న, హైమవతిన్ = పార్వతిని, కని = చూచి, నెమ్మనంబునన్ (నెఱ+ మనంబునన్) = నిండుమనస్సునందు, తల్లడిల్లుచున్ = కలఁతచెందుచు.

తాత్పర్యము : పరమేశ్వరునిఁ దపఃప్రభావముచేఁ బూజించి మెప్పించి తనభర్తనుగాఁ బొందుదునని తపోవనమునకుఁ బోవ నిశ్చయించి పార్వతి కన్యాంతః పురమునకు వచ్చెను. అంత హిమవంతుఁడు వచ్చి వియోగాగ్నిచే సూర్యునిచేఁగొట్టఁ బడిన చంద్రకళవలెఁ గాంతిహీనయైయున్న యామెనుజూచి నెమ్మనమునందుఁ గలఁతఁ జెందుచు - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : తపోమహిమ - తపస్ + మహిమ - పదాంతసకారమునకు విసర్గాదేశము - తపః + మహిమ. హ్రస్వఅకారము తరువాతవచ్చు విసర్గమునకు హ్రస్వ అకారముకాని, మృదుహల్లులు (హశ్శులు) కాని పరములగునపుడు ఉ ఆదేశముగా వచ్చి పూర్వమందున్న అకారముతోఁగూడి గుణసంధి ననుసరించి ఓ గా మాఱును. తప + ఉ + మహిమ-తపోమహిమ. ఇట్లే తపోవనము. తీవ్రకరాహతేందురేఖయుంబోలె- అలంకార ముపమ, నెమ్మనము - నెఱ + మనము. 'అన్యంబులకు సహిత మిక్కా ర్యంబులు కొండొకచోఁ గానంబడియెడి.' బాల.సంధి.39

తే. పుడికి వైచిన మవ్వంపుఁ బొఱయుఁబోలె
వాడి సొమరుచు మేఁదీఁగ వంది కంది
వెలఁది నీవింత వగఁగూరి విన్నఁబాఱి
యునికి దుఃఖాబ్ధి మ మ్మిడి యునికి కాదె! 3

అర్థము : వెలఁది = అమ్మాయీ!, పుడికివైచిన = త్రుంచివైచిన, మవ్వంపుఁబొఱ (ర) యున్ + పోలెన్ = మృదువైన పయిపట్ట విధమున, మేఁదీఁగ (మే + తీఁగ) = లతవంటి మేను. వాడి = మ్లానమయి, సొమరుచున్ = వెలవెలఁబాఱుచు, వంది = వివర్ణమయి, కంది = తేజోహీనమయి, నీవు, ఇంత, వగన్ + కూరి = దుఃఖించి, విన్నఁబాఱి = వికాసముచెడి, ఉనికి = ఉండుట, మమ్మున్, దుఃఖ + అబ్ధిన్ = దుఃఖమనెడు సముద్రమున, ఇడి + ఉనికి కాదె = పెట్టియుండుట కాదా!

తాత్పర్యము : అమ్మాయీ! త్రుంచివైచిన మృదువైన పయిపట్టవలె దేహలత వాడిపోయి వెలవెలఁబాఱుచుండ నీ వింతదుఃఖమునొంది వికాసముచెడి యుండుట మమ్ము దుఃఖసముద్రమున ముంచుట కాదా? - అగు ననుట.

విశేషములు : అలంకారము రూపకము.

మవ్వంపుఁబొఱ - మవ్వము + పొఱ - 'కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బుంపు లగు' బాల. సంధి. 32, మవ్వంపు + పొఱ 'సమాసంబుల నుదంతంబు లగు స్త్రీసమంబులకుం బుంపులకుం బరుషసరళంబులు పరంబులగునపుడు నుగాగమం బగు.' బాల. సంధి. 25. మవ్వంపు + న్ + పొఱ. 'ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళములగు.' బాల. సంధి. 16. మవ్వంపు + న్ + బొఱ. 'ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందుసంశ్లేషములు విభాష నగు.' బాల. సంధి. 17. మవ్వంపుఁబొఱ. పొఱ - ఈ యర్థమున నీ గ్రంథమునమాత్రమే శకటరేఫ యుక్తముగాఁ గనుపట్టుచున్నది. దుఃఖ+అబ్ధి-సవర్ణదీర్ఘసంధి దుఃఖమనెడి అబ్ధి-రూపకము.

వ. అని యనేకప్రకారంబులఁ దన్ను సంతరించుచున్నం బార్వతి విజాభిప్రాయం బచలాధీశ్వరున కెఱింగింపు మని చతురిక కెఱింగించిన. 4

అ ర్థ ము : అని, అనేకప్రకారంబులన్ = పెక్కువిధములు. తన్నున్, సంతరించుచున్ + ఉన్నన్ = ఓదార్చుచుండఁగా, పార్వతి, నిజ + అభిప్రాయంబు= తన తలఁపు, అచల + అధి + ఈశ్వరునకున్ = పర్వతాధిపతికి - హిమవంతునకు, ఎఱింగింపుము + అని, చతురికకున్ , ఎఱింగించినన్.

తా త్ప ర్య ము : అని పెక్కురీతులఁ దన్ను ఓదార్చుచుండఁగాఁ బార్వతి తనతలఁపుఁ బర్వతరాజునకుఁ దెలుపుమని చతురికకుఁ జెప్పఁగా - తరువాతి పద్యముతో నన్వయము.

క. కడలేని విరహవేదన
నిడుగడ పడుచుండుకంటె నీ భర మెల్లన్
మృడు నెయిదఁ దపోవర్తన
నొడలేర్చెద నరిగి దారుణోగ్రాటవులన్. 5

అ ర్థ ము : కడ - లేని = అంతములేని, విరహ - వేదనన్ = వియోగము వలని బాధచే, ఇడుగడ + పడుచున్ + ఉండుకంటెన్ = కష్టపడుచుండుటకంటె. ఈ - భరము + ఎల్లన్ = ఈ భారమంతయు, మృడున్ = శివుని, ఎయిదన్ = పొందుటకు, దారుణ + ఉగ్ర + అటవులన్ = భయంకరములైన అడవులందు, అరిగి =వెడలి. తపోవర్తనన్ = తపస్ (స్) + వర్తనన్=తపస్సుచేఁతచే, ఒడలు + ఏర్చెదన్ = శరీరమును దపింపఁజేయుదును.

తా త్ప ర్య ము : అంతములేని వియోగబాధచేఁ గష్టపడుచుండుటకంటె, శివునిఁబొందుటకు భయంకరాటవుల కేఁగి తపస్సుచేసి మేను తపింపఁజేసెదను.

వి శే ష ము లు : 'ఈ భర మెల్లన్' అనుదానికిఁ బద్యమున నన్వయ మంత సుగమముగా లేదు. దారుణోగ్ర - దారుణ + ఉగ్ర - గుణసంధి. దారుణోగ్రాటవులు - దారుణోగ్ర + అటవులు - సవర్ణదీర్ఘసంధి. అటవి (ప్రకృతి) - అడవి (వికృతి)

వ. అని విన్నపంబు సేసి 'పీడ్కొని చన నిశ్చయించినది' యని చతురిక పలికిన విని తీవ్రానలాహతిని, నవనీతపిండంబునుంబోలె శోకానలాహతిం గరంగుచు హిమవంతుం డనేకప్రకారంబుల ననునయించుచుఁ బ్రియనందననెత్తి కౌఁగిటికిం దిగిచికొని. 6

అర్థము : అని, విన్నపంబు + చేసి = మనవిచేసి. పీడ్కొని, చనన్ = పోవుటకు, నిశ్చయించినది, అని, చతురిక, పలికినన్, విని, తీవ్ర + అనల + ఆహతిని = తీవ్రమైన అగ్నియొక్క దెబ్బచే, నవనీత - పిండంబునున్ + పోలెన్= వెన్నముద్దవలె, కరంగుచున్, హిమవంతుండు, అనేకప్రకారంబులన్ = పలురీతుల, అనునయించుచున్ = ఓదార్చుచు, ప్రియ - నందనన్ = అనుఁగుఁ గూఁతును, ఎత్తి, కౌఁగిటికిన్, తిగిచికొని = తీసికొని.

తాత్పర్యము : అని మనవిచేసి 'పీడ్కొని యేఁగ నిశ్చయించినది.' అని చతురిక పలుకఁగా విని తీవ్రమైన అగ్నిదెబ్బచే వెన్నముద్దవలెఁ గరఁగుచు హిమవంతుఁడు పెక్కువిధములనోదార్చుచు ననుఁగుఁగూఁతు నెత్తి కౌఁగిటఁ జేర్చికొని.-తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : తీవ్రానలాహతిని .... కరంగుచు _ అలంకార ముపమ.

చ. వలవదు తల్లి! నీకుఁ దగువాని వయోగుణరూపవంతు నీ
వలచినవానిఁ జేసెద; నవశ్యము నీవు తపంబు సేయఁ బోఁ
దలఁపకుమమ్మ; చిత్తపరితాపము సేయకుమమ్మ మాకుఁ; గో
మలి! వనదుర్గవాసము ప్రమాదమగున్ దగ దాఁడువారికిన్. 7

అర్థము : వలవదు - తల్లి = వలదమ్మా!, నీకున్, తగువానిన్ వయస్ (సు) + గుణ - రూపవంతున్ = యౌవనము, సుగుణములు, అందము గలవానిని, నీ - వలచినవానిన్ = నీవు కోరినవానిని. అవశ్యమున్ = తప్పక, చేసెదన్ = పెండ్లిచేసెదను, నీవు, తపంబు + చేయన్ + పోన్ = తపమొనరింపఁబోవ, తలఁపకుము+అమ్మ! = ఎంచకుమమ్మా, కోమలి = ఇంతీ, మాకున్!

చిత్త - పరితాపము = మనస్సంతాపము, చేయకుము + అమ్మ. వన - దుర్గ-వాసము = అడవియందలి కష్టపుఁద్రోవలో నివసించుట, ప్రమాదము = అపాయము, అగున్, ఆఁడువారికిన్, తగదు,

తాత్పర్యము : వలదమ్మా! నీకుఁ దగినవానిని యౌవనవంతుఁడు, గుణవంతుఁడు, సౌందర్యవంతుఁడు అగువానిని నీవు కోరినవానిని దప్పక నీకు వివాహము గావించెదను. తపముచేయఁ బోనెంచకుమమ్మా! మాకు మనస్సంతాపమును గూర్పకుమమ్మా! కోమలీ! అడవులలో నివసించుట అపాయకరము. ఆఁడువారికిఁ దగదు.

విశేషములు : కాళిదాసు తన కుమారసంభవమున నీ మాటలను దల్లియగు మేనచేఁ గూఁతునకుఁ జెప్పింపఁగా, నీ కవి తండ్రిచేఁగూడఁజెప్పించెను.

నీ వలచినవాని - నీవు వలచిన వాని-'ధాతుజవిశేషణ భావార్థక పూర్వవ్యవహితావ్యవహిత కర్తృపదప్రథమకుఁ దఱచుగ యొక్క-షష్ఠి యగు'. ప్రౌఢ.కారక.15. నీ యొక్క-వలచినవాని. 'యొక్క-కు లోపంబు బహుళంబు.' ప్రౌఢ.కారక.16. నీ వలచిన వాని. వయస్ + గుణ - వయః + గుణ - వయోగుణ. చూడు వచనము 2.

వ. అదియునుంగాక. 8

అర్థతాత్పర్యములు ; సులభములు.

విశేషములు: అదియునున్ + కాక = అదియునుం గాక. 'కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి.' బాల.సంధి.21.

క. దొర యెఱిఁగి కోరవలదే
స్మరహరునకు నీకు హస్తిమశకాంతర మా
పరమునకు నీకుఁ బర్వత
పరమాణ్వంతరము తలఁపఁ బతి యెట్టు లగున్ ? 9

అర్థము : దొర = సామ్యము, ఎఱిఁగి, కోరన్ + వలదే, స్మర - హరునకున్ = మన్మథుని హరించినవానికి - శివునకు, నీకున్, హస్తి - మశక + అంతరము = ఏనుఁగునకును, దోమకును గల వాసి, ఆ పరమునకున్ = ఆ ఉత్కృ

ష్టునకును, నీకున్, పర్వత - పరమ + అణు + అంతరము = కొండకును అతి సూక్ష్మాణువునకును గల వాసి, తలఁపన్ = ఆలోచింపఁగా, పతి = భర్త, ఎట్టులు + అగున్.

తాత్పర్యము : సామ్యమెఱిఁగి కోరవలదా ? ఆ శివునకును నీకును ఏనుఁగునకును దోమకును గల వాసి, ఆ ఉత్కృష్టునకును నీకును గొండకును బరమాణువునకును గల వాసి, చూడఁగా నతఁడు నీకు భర్త యె ట్లగును ?

విశేషములు : అలంకారము విషమము, యథాసంఖ్యము. దొర - 'సరి యుద్ది ప్రతి దిస్సు సవతు పోలిక దొర జత యనఁగా సదృశమున కెసఁగు'. సాం.ని. పరమ + అణు = పరమాణు - సవర్ణదీర్ఘ సంధి. పరమాణు + అంతరము = పరమాణ్వంతరము - యణాదేశసంధి 'ఇ ఉ ఋ ౠ లకు అసవర్ణములయిన అచ్చులు పరములగునపుడు క్రమముగా య్, వ్, ర్, ల్, లు ఆదేశము లగును.

ఆ. చిఱుత వెదిరి నిన్ను నెఱుఁగవు గాన నీ
యర్థి కారణముగ ననియె దబల,
వాసవాదు లతని దాసులుఁగాఁ గాన
నేను మామ గాఁగ నేల కూడు ? 10

అర్థము : అబల ! = ఇంతీ !, చిఱుతవు = చిన్నదానవు, ఎదిరిన్, నిన్నున్, ఎఱుఁగవు, కానన్ = కావున, నీ - అర్థి - కారణముగన్ = నీ కోరిక కారణముగా, అనియెదు = అనియెదవు, వాసవ + ఆదులు = ఇంద్రుఁడు మున్నగువారు, అతని-దాసులున్ = అతని దాసులుకూడ, కాన్ = అగుటకు, కానరు = చాలరు, ఏను = నేను, మామ, కాఁగన్ = అగుటకు, ఏల, కూడున్ = సంభవించును !

తాత్పర్యము : ఇంతీ ! నీవు చిన్నదానవు, ఎదిరిని నిన్నుఁ గానవు. నీ కోరిక ననుసరించి పలుకుదువు. ఇంద్రాదులు అతని దాసులుగానైనఁ గానోపరు, అట్టిచో నేను అతనికి మామగా నగుట యెట్లు సంభవించును ?

విశేషములు : అలంకారము కావ్యార్థాపత్తి.

వ. అనుచుండె మఱియు మేనక బాష్పాకులితలోచన యగుచు. 11

అర్థము : అనుచున్ + ఉండెన్, మఱియున్, మేనక, బాష్ప + ఆకులిత - లోచన = కన్నీటిచేఁ గలఁగిన కన్నులుగలది, అగుచున్.

తాత్పర్యము : అనుచుండెను. మఱియును మేనక కన్నీటిచేఁ గలఁగిన కన్నులుగలది యగుచు-తరువాతి పద్యముతో నన్వయము.

క. పూవోపూవో యని చే
రేవినఁ గందు నని యొసరిల్లెదు; నా మై
జీవంబు నిలుచునే ? నినుఁ
బో విడిచి మహోగ్రదుర్గముల పాల్పడఁగాన్, 12

అర్థము : పూవో పూవో, అని, చేన్ = చేతితో, రేవినన్ = రేఁగినన్= రేఁపినచో, కందున్ + అని = కందిపోవునని. ఒసరిల్లెదున్ = తొలఁగుదును. నినున్ = నిన్ను, మహత్ (మహో) + ఉగ్ర - దుర్గముల - పాల్ + పడఁగాన్= మిక్కిలి భయంకరములైన దుర్గమప్రదేశములపాలగుటకు, పోన్ + విడిచి, నా - మైన్ = నా మేన, జీవంబు = ప్రాణము, నిలుచునే ?

తాత్పర్యము : పూవో పూవో యని చేతితో రేఁపినంతమాత్రముననే కంది పోవునని తొలఁగుదును. నిన్ను మహాభయంకరదుర్గములపాలుగాఁ బోవిడిచి నా మేనఁ బ్రాణము నిలుచునా ? నిలువ దనుట.

విశేషములు : పూవో పూవో యనునది తెలుఁగుజాతీయము. నిన్నుఁ బోవిడిచి నా మై జీవంబు నిలుచునే-ఇట విడిచి యను క్త్వార్థమునకుఁ జేదర్థకత. విడిచి = విడిచినచో.

సీ. తలిరాకుకంటెను మెలపారు పదుగులు
ధరమీఁద మోపుడుఁ దెరలిపోవుఁ
గ్రొవ్విరితొవకంటెఁ గోమలంబగుమోము
రేయెండ ముట్టిన నోయుఁ దద్ద

దవనంపుఁబొరకంటె నవకంపుమెయిదీఁగె
వడగాలి సోఁకుడు వాడు లగ్గ
నాదిగర్భేశ్వరి వంటినఁ గందెదు
నెలకన్నెఱుంగవునేని ముంద

తే. ఉన్న యునికినె వెలువడ నుత్సహింపఁ
దలఁచితేనియు నిది తుదిఁదాఁక నెట్లు
నెయిదనేరదు కాన నీ వింద యుండి
కోర్కె నేకుఱ సర్వేశుఁ గొలువు మబల! 13

అర్థము : తలిరాకుకంటెను (తలిరు + ఆకు) = చివురాకుకంటెను, మెలపారు + అడుగులు = మృదువుసైన పాదములు, ధర - మీఁదన్ = నేలపై, మోపుడున్ = మోపినంతనే, తెరలిపోవున్ = కాలిపోవును.

క్రొవ్విరి (క్రొత్త + విరి) - తొవకంటెన్ = క్రొత్తగా విరిసిన కలువ కంటెను, కోమలంబు + అగు = సుందరమైన, మోము, రేయెండ = వెన్నెల, ముట్టినన్ = తాఁకినచో, తద్దన్ = మిక్కిలి, నోయున్ = నొచ్చును.

దవనంపుఁబొర (దవనము + పొర) కంటెన్ = దవనము పైపట్టకంటెను, నవకంపు - మెయి - తీఁగె = మృదువైన దేహలత, వడగాలి = వేఁడిగాలి, సోఁకుడున్ = సోఁకినంతనే, లగ్గన్ = మిక్కిలి, వాడున్ = వాడిపోవును.

ఆదిగర్భేశ్వరివి = పుట్టిననాఁటఁగోలె శ్రీమంతురాలవు, అంటినన్ = తాఁకినచో, కందెదు = కందెదవు - వాడుదువు. ముందరన్ = ముందు, నెలకన్నెఱుంగవు నేనిన్ = అచంద్రంపశ్యవు - చంద్రునిఁగూడ జూచియెఱుఁగవు.

ఉన్న + ఉనికినె = ఉన్నట్లుండఁగనే, వెలువడన్ = బయటికివచ్చుటకు, ఉత్సహింపన్ + తలఁచితి (వి) + ఏనియున్ = ఉత్సాహపడఁగోరినదానవయినను, ఇది = ఈకార్యము, తుదిఁదాఁకన్ = నెఱవేఱుటకు, ఎట్లున్ = ఏ విధముగను, ఎయిదన్ + నేరదు = సాగఁజాలదు, కానన్ = కావున, అబల = ఇంతీ!

నీవు, ఇందున్ + అ = ఇందే. ఉండి, కోర్కె = కోరిక, చేకుఱన్=సిద్ధించుటకు, సర్వ + ఈశున్ = సర్వేశ్వరుని, కొలువుము = సేవింపుము.

తా త్ప ర్య ము : చివురాకుకంటెను మృదువులైన పాదములు నీవి. వానిని నేలపై మోపినంతనే కాలిపోవును. క్రొత్తగా విరిసిన కలువకంటెను గోమలమైన నీ ముఖము వెన్నెల తాఁకినచో మిక్కిలి నొచ్చును, దవనము పైపట్టకంటెను నవకమైన నీ దేహలత వడగాడ్పు సోఁకినంతనే మిక్కిలి వాడిపోవును. నీ వాదిగర్భేశ్వరివి. అంటినఁ గందిపోవుదానవు. ముందు అచంద్రదంపశ్యవు. ఉన్నట్లుండఁగనే బయటికి రా నుత్సాహముఁజూపఁగోరితివేనియు నీ కార్య మెట్లును జివరకు సిద్ధింపనేరదు, కావున నీ విందేయుండి కోరికనెఱవేఱ సర్వేశ్వరు సేవింపుము.

వి శే ష ము లు : తలిరాకు - తలిరు + ఆకు - 'కర్మధారయంబునందుఁ బేర్వాదిశబ్దముల కచ్చు పరంబగునపుడు టుగాగమంబు విభాష నగు' బాల.సంధి.29. ఇది టుగాగమము రాక ఉత్వసంధి జరగిన రూపము. క్రొవ్విరి = క్రొత్త + విరి, తొవ = తొగ (రూ.), దవనంపుఁబొర = దవనము + పొర - పుంప్వాదేశ, నుగాగమ, ద్రుతకార్యములు. నవకంపుమెయిఁదీఁగె - నవకము + మెయిఁదీఁగె - పుంప్వాదేశము. కందెదు-కందెదవు. లాద్వకారమునకు వైకల్పికలోపము, అపదాదిస్వరసంధి. నేని = ఏని - అప్యర్థకము. 'నీవును జూచితట్టిసభనేని వినంబడ దే యుగంబులన్'- నన్నయ.భార.సభా.2.95. తలఁచితేనియు - తలఁచితివి + ఏనియు - లిద్వకారమునకు వైకల్పికలోపము, మధ్యమపురుషేకారసంధి. కోర్కె-కోరికె, కోరికి, కోర్కి, కోరిక-(రూపాం), కోర్కె సేకుఱ = కోర్కె + చేకుఱ - గసడదవాదేశము.

వ. అని మేనక కూఁతు ననునయంబునం బట్టుకొలుపుచుండె నంత నంతిపురంబునం గల వృద్ధకంచుకిప్రౌఢాంగనలుఁ దమ బలిమియుం గలిమియు మెఱయుచు నగజ భంగించుచు నగ్గించుచు. 14

అ ర్థ ము : అని, మేనక, కూఁతున్, అనునయంబునన్ = ఓదార్పుతో. పట్టుకొలుపుచున్ + ఉండెన్ = పట్టువఱుచుచుండెను, అంతన్, అంతిపురంబునన్= అంతఃపురమునందు, కల = ఉన్న, వృద్ధకంచుకిప్రౌఢ + అంగనలున్ = వృద్ధకంచుకులైన జాణలగు స్త్రీలు, తమ, బలిమియున్ = శక్తియును, కలిమియున్ =

వంపదయు, మెఱయుచున్ = మెఱయించుచు, అగజన్ = పార్వతిని, భంగించుచున్= మందలించుచు, అగ్గించుచున్ = పొగడుచు.

తాత్పర్యము: అని మేనక పుత్రిక నోదార్పుతోఁ బట్టువఱుచుచుండెను. అంత నంతఃపురమునందలి వృద్ధకంచుకులైన జాణలగు స్త్రీలు తమ శక్తి యుక్తులను ప్రదర్శించి పార్వతిని మందలించుచు, పొగడుచు . తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు: పట్టుకొలుపు - పట్టుకొను ప్రేరణరూపము - అంగీకరింపఁ జేయు. మెఱయుచు - మెఱయించుచు - అంతర్భావితప్రేరణము.

క. ఆలవు బేలవు కడుఁ గొమ
రాలవు కోమలివి ముద్దరాలవు దగ మం
చాలవు బేలవు గా కిది
కాలమె తపమున కపారకాంతారములన్? 15

అర్థము: ఆలవు = స్త్రీవి, బేలవు = అమాయికురాలవు, కడున్ = మిక్కిలి, కొమరాలవు = సుందరివి, కోమలివి = సుకుమారవు, ముద్దరాలవు = బేలవు - ముగ్ధవు. తగము = అనర్హులము, అంచున్ = అని, ఆలవు - బేలవు + కాక = అమాయికురాలవు గాకపోవుచో, అపార - కాంతారములన్ = పారము (మితి)లేని, అడవులలో, తపమునకున్, ఇది, కాలమె = సమయమా?

తాత్పర్యము: స్త్రీవి, అమాయికురాలవు మిక్కిలి సుందరాంగివి. సుకుమారవు, బేలవు. ఈ పనికిఁ దగము అనుచు, బేలవైన స్త్రీవి గాక, అపారములైన అడవులలోఁ దపస్సుచేయుట కిది యదనా? కా దనుట,

విశేషములు: తగ మం చాలవు - తగన్ - మంచి + ఆలవు = మంచిస్త్రీవి - అనియా విభజనము? తగము + అంచున్ + ఆలవు అనియా విభజనము? అన్వయ మించుక క్లేశకరముగ నున్నది. తగదుంజాలవు అను పాఠమును గనుపట్టుచున్నది.

ఆ. ఇడ్డ బొట్టు వోలె నింటిలో నుండక
యాఁడుదాన వింత యడరి బాస
నడవిలోనఁ దపము వడఁబోదు నను నింత
జఱభితనము లెందుఁ గఱచి తీవు ? 16

అర్థము : ఇడ్డ - బొట్టు + వోలెన్ = పెట్టిన బొట్టువలె, ఇంటిలోన్, ఉండక, ఆఁడుదానవు, ఇంత, అడరి = విజృంభించి, బాసన్ = ప్రతిజ్ఞతో. అడవిలోనన్, తపము+పడన్+వోదున్=తప మొనరింపఁబోవుదును, అను, ఇంత=ఇంతటి, జఱభితనములు = తెగువలు, ఈవు = నీవు, ఎందున్ = ఎక్కడ, కఱచితి (వి)= నేర్చితివి ?

తాత్పర్యము : పెట్టినబొట్టువలె నింటియందుఁ గుదురుగా నుండక, ఆఁడుదానవు, ఇంత విజృంభించి, ప్రతిజ్ఞచేసి, యడవిలోఁ దపస్సుచేసెద నను నింతటి తెగువ నీ వెందునేర్చితివి ?

విశేషములు : ఇడ్డ = ఇడిన - 'పద్యాదుల నవర్ణకంబున కత్వంబును గడహల్లునకు ద్విత్వంబును విభాష నగు' ; 'బాల. క్రియ.51, ఇడ్డ బొట్టు వోలె-పెట్టిన బొట్టువలె-స్థిరముగా - జాతీయము. తపము వడన్ = తపము + పడన్ = తపముఁ బూనన్, జఱభి = తెగువగలది - 'తన వర్ణకంబు త్వార్థంబునందగు.' బాల.తద్ధిత.1. కఱచితి + వి+ ఈవు - లిద్వకారమునకు వైకల్పికలోపము - అపదాదిస్వరసంధి, మధ్యమపురుషైకారసంధి.

సీ. హరిఁ దెత్తుమే నీకు నమ్మాడువడియుండఁ ?
పరమేష్ఠిఁ దెత్తుమే బంటుఁజేసి ?
దేవేంద్రుఁ దెత్తుమే నీ వేలఁ గొనియుండ ?
సురగేంద్రుఁ దెత్తుమే యురులుగొలిపి ?
శశిఁ దెత్తుమే నీకు సంబవు లిడియుండ ?
ధననాథుఁ దెత్తుమే దాసుఁజేసి ?
రవిఁ దెత్తుమే నీకు రమణుండుగా ? నల
కూబరుఁ దెత్తుమే కోలుకొలిపి

తే. మదనసంహరుఁ డొక్కఁడు మాకు నెలసి
వచ్చు రాఁ డవుఁగా కెట్టివారినైన
నొరుల నొకవ్రేలిమిడిఁదిరుల్ మరులు కొలిపి
తివియమే దేవి ! నీ యట్టి దీము గలుగ ? 17

అ ర్థ ము : దేవి = దేవీ ! పార్వతీ !

నీకున్, అమ్ముడు + పడి + ఉండన్ = అమ్ముడుపోయియుండునట్లు, హరిన్ = విష్ణువును, తెత్తుమే = తీసికొనివత్తుమా ?

బంటున్ + చేసి = సేవకునిగాఁజేసి, పరమేష్ఠిన్ = బ్రహ్మను, తెత్తుమే ?

నీ - వేలన్ + కొని + ఉండన్ = నీ దాస్యము నంగీకరించియుండునట్లు, దేవ + ఇంద్రున్, తెత్తుమే ?, ఉరులు + కొలిపి = వలలోవైచి, ఉరగ+ఇంద్రున్ = నాగరాజును, తెత్తుమే ?

నీకున్, సంబివులు = పాదరక్షలు, ఇడి + ఉండన్ = ఇచ్చుటకు, శశిన్ = చంద్రుని, తెత్తుమే ?. దాసున్ + చేసి = దాసునిగాఁజేసి, ధన - నాథున్ = కుబేరుని, తెత్తుమే ?

నీకున్, రమణుండు + కాన్ = ప్రియుఁడుగా, రవిన్ = సూర్యుని, తెత్తుమే? కోలుకొలిపి = ప్రోత్సాహపఱిచి, నలకూబరున్, తెత్తుమే ?

మదన - సంహరుఁడు = మన్మథుని సంహరించినవాఁడు - ఈశ్వరుఁడు, ఒక్కఁడు, మాకున్, ఎలపి = వశపడి, వచ్చున్ - రాఁడు + అవున్ + కాక = రావచ్చును, రాకపోవచ్చునుగాక, నీ + అట్టి = నీవంటి, దీము = దీమము, ఎర, కలుగన్ = కలుగఁగా, ఒరులన్ = ఇతరులను - శివేతరులను, ఎట్టివారిన్ + ఐనన్, ఒక - వ్రేలిమిడిన్ = ఒక చిటికెలో, తిరుల్మరులుకొలిపి = వెఱ్ఱిప్రేమమును బుట్టించి, తివియమే = ఆకర్షింపమా ?

తా త్ప ర్య ము : దేవీ ! నీకమ్ముడువడియుండునట్లు విష్ణువును దెత్తుమా ? సేవకునిగాఁజేసి బ్రహ్మను దెత్తుమా ? నీకు దాస్యమొనరింప దేవేంద్రునిఁ దెత్తుమా ?

పశపఱుచుకొని నాగరాజును దెత్తుమా? నీకుఁ బాదరక్షలు మోయఁ జంద్రునిఁ దెత్తుమా? నీకు దాసునిగాఁజేసి కుబేరునిఁ దెత్తుమా? నీకుఁ బ్రియుఁడగునట్లు సూర్యునిఁ దెత్తుమా? ప్రోత్సాహపఱిచి నలకూబరునిఁ దెత్తుమా? ఈశ్వరుఁ డొక్కఁడు మాకు వశపడి రావచ్చును, రాకపోవచ్చునుగాక। నీవంటి యెర యుండఁగా నిఁక నితరులనెట్టి వారినైనను ఒక చిటికెలో వెఱ్ఱిప్రేమమును గలిగించి ఆకర్షింపమా?

వి శే ష ము లు : తెత్తుమే - తెచ్చు ధాతువు. 'తద్ధర్మాదులందు లాట్టగు' బాల.క్రియ.5. తెచ్చు+లాట్టు, 'లకారంబునకు డు ద్రు వు రు ను ముఙ్ఞగు.' బాల.క్రి.8. ఉత్తమపురుషబహువచనమున-తెచ్చు+ము. లాట్టు రుఙ్ఞు పరంబగునపుడు దుగాగమం బగు.' బాల.క్రియ.22.తెచ్చు+దు+ము. 'చువర్ణంబుతోడ దుగ్దకారంబు తకారంబగు' బాల. క్రియ.108. తెచ్ + చుద్+ఉ + ము - తెచ్ + త్ + ఉ + ము - చ త ల సంయోగము విజాతీయముగాన నిర్దేశానుసారముగ చకారము తకార మగును. తెత్తుము. 'తద్ధర్మభూతక్రియ లార్థ్యాద్యర్థపరకంబులయి ప్రశ్నార్థకంబులగు' ప్రౌఢ.క్రి.3. తెత్తుము+ ఏ - 'ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధియగు' బాల.సంధి, 1.తెత్తుమే. దీము - దీమము (రూపాం), పశుపక్ష్యాదులను వశముచేసికొనుటకై యేర్పఱిచిన పశుపక్ష్యాదికము.

వ. అని యనేకప్రకారంబులఁ దన్ను సిబ్బితిపడం బలుకుచున్నవారి నందఱం గటాక్షించి చూచి కోప రసభరితాకుంచితభ్రూలతారక్త నయనాస్ఫురితాధర యగుచు గిరినందన పరిచ్ఛేదించి. 18

అ ర్థ ము : అని, అనేక - ప్రకారంబులన్ = పెక్కు విధముల, తన్నున్, సిబ్బిద్ధి + పడన్ = అనునయించునట్లు (?), పలుకుచున్ + ఉన్న - వారిన్ + అందఱన్, కటాక్షించి - చూచి = క్రీఁగంటితోఁజూచి, కోప .... తాధర : కోప - రస = క్రోధమనెడిరసముతో, భరిత = నిండిన, ఆకుంచిత = వంపఁబడిన, భ్రూ - లతా = బొమతీవలు, ఆరక్త - నయన = ఎఱ్ఱనికన్నులు, ఆస్ఫురిత + అధర = 'చలించిన క్రిందిపెదవి గలది, అగుచున్, గిరి - నందన = కొండకూఁతురు - పార్వతి పరిచ్ఛేదించి = భాగించి (?)

తా త్ప ర్య ము : అని పెక్కువిధములఁ దన్ను అనునయించునట్లు పలుకుచున్నవారినందఱను గ్రీఁగంటఁజూచి క్రోధరసముతోనిండి వంపఁబడినబొమ

తీవలు, ఎఱ్ఱనైన కన్నులు,చలించిన క్రిందిపెదవి గలది యగుచుఁ బార్వతి విభజించి - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : వారి సందఱం గటాక్షించి చూచి .... నయనాస్ఫురితాధర యగుచు - అలంకారము స్వభావోక్తి.

చ. చెవుడుపడంగ నల్గడలఁ జీఱుచు నన్నొకవెందుచేసి మీ
రివి యివి యంచు బుజ్జనము లిన్నియు నెన్నఁగ నేల ? నాకు నీ
భవమున నీశ్వరుండ పతి. ప్రాణము దేహముఁ జిత్తవృత్తులున్
శివపదపంకజార్పణము సేసితిఁ, బాసితి మీకు నింతతోన్. 19

అర్థము : చెవుడు - పడంగన్ = చెవు డేర్పడునట్లు, నల్గడలన్ = (నలు + కడలన్) = నాలుగు దిక్కులను, చీఱుచున్ = పిలుచుచు, నన్నున్, ఒక, వెందు = తమకు వశపడుటకై తుమ్మెదలు మధ్యనుంచి పాడెడు పురుగును, చేసి, మీరు, ఇవి, అవి, అంచున్, బుజ్జనములు = ఉపలాలనములు, ఇన్నియున్, ఎన్నఁగన్ + ఏల ? = పలుకు టెందులకు ?, నాకున్, ఈ - భవమునన్ = ఈ పుట్టువున, ఈశ్వరుండు + అ = ఈశ్వరుఁడే, పతి, ప్రాణమున్, దేహమున్ = శరీరమును, చిత్త - వృత్తులున్ = మనోవ్యాపారములును, శివ - పద - పంకజ + అర్పణము = శివుని పాదపద్మముల కర్పణము, చేసితిన్, ఇంతతోన్ = ఇంతటితో, మీకున్, పాసితిన్ = మిమ్ము వీడితిని.

తాత్పర్యము : చెవు డేర్పడునట్లు నాలుగుదిక్కులను బిలుచుచు నన్నొక వెందుచేసి మీరు ఇవి యని యిన్నిబుజ్జగింపుమాటలు పలుక నేల ? నాకీ పుట్టువున నీశ్వరుఁడే భర్త. నేను నా ప్రాణమును, శరీరమును, మనోవ్యాపారములను శివపాద పద్మముల కర్పణముచేసితిని, ఇంతటితో మిమ్ము విడిచితిని.

వ. అని తెగం బలికిన మాఱువలుక నోడి గిరినందన తపోవనంబునకుం బోవుట కందఱు సమ్మతించి. 20

అర్థము : అని, తెగన్ + పలికినన్ = ఖండితముగాఁ బలుకఁగా, మాఱు + పలుకన్ + ఓడి = అడ్డుచెప్పుటకు జంకి, గిరినందన = పార్వతి, తపస్ (స) + వనంబునకున్, పోవుటకున్, అందఱున్, సమ్మతించి = అంగీకరించి.

తాత్పర్యము : అని నిశ్చితముగాఁ బలుకఁగా నందఱును అడ్డుచెప్పుటకు జంకి పార్వతి తపోవనమున కేఁగుట కంగీకరించి-తరువాతి పద్యముతో నన్వయము,

తరువోజ. "బాలవు ; నీకు నిప్పటఁగోలె నీ త
పం బిది గైకొని పారమేదింపఁ
బోలదు వల"దని బుద్ధులు చెప్పఁ
బోయిన మా మాటఁ బోవక మమ్ము
నేలిదముగఁ జేసి యెస్సని వోయె
దేని, నక్కడ నీవ యెఱుఁగుదు ; నిన్ను
వాలాయముగ నాఁగవచ్చునె ? యింత
వలవంతతన మాఁడువారికిఁ దగునె ?" 21

అర్థము ; బాలవు - చిన్నపిల్లవు, నీకున్, ఇప్పటన్ + కోలెన్ = ఇప్పటినుండియు, ఈ - తపంబు, ఇడి, కైకొని = అంగీకరించి, పారము + ఏదింపన్ = ఆవలిదరిని బొందించుట, పోలదు = జరుగదు, వలదు, అని, బుద్ధులు. చెప్పన్ + పోయినన్ = చెప్పఁబోఁగా, మా - మాటన్ + పోవక = మా మాటననుసరింపక, మమ్మున్, ఏలిదముగన్ + చేసి = చులుకనచేసి, ఎస్సని + పోయెదు + ఏనిన్ = నిరాకరించిపోవుదువేని, అక్కడన్, ఈవు + అ = నీవే, ఎఱుఁగుదు (వు), నిన్నున్, వాలాయముగన్ = బలవంతముగా, ఆఁగన్ + వచ్చునె = ఆఁపశక్యమా?, ఆఁడువారికిన్, ఇంత, వలవంతతనము = మన్మథవ్యథ, తగునె ?

తాత్పర్యము : చిన్నపిల్లవు, నీ కిప్పటినుండియు నీ తపముఁబూని చివరి వఱకు సాధించుట జరుగదు, వద్దని బుద్ధులుచెప్పఁబోఁగా మా మాట వినక మమ్ముఁ జులుకనచేసి నిరాకరింతువేని అట నీకే తెలియును. నిన్ను బలవంతముగా నాఁపఁదరమా? ఆఁడువారి కింత మన్మథవ్యథ తగదు,

వ. అనుచుండి రంత హిమవంతుండు నారదాదేశమ్ముఁ దలంచి. 22

అ ర్థ ము : అనుచున్ + ఉండిరి, అంతన్, హిమవంతుండు, నారద + ఆదేశమ్మున్ = నారదుని ఆజ్ఞను, తలంచి,

తా త్ప ర్య ము : అనుచుండిరి. అంత హిమవంతుఁడు నారదుఁ డానతిచ్చిన విధమును స్మరించి - తరువాతి పద్యముతో నన్వయము.

క. హరిణాక్షి తపోబలమునఁ
బరమేశ్వరుఁ గూడఁబడయుఁ; బరమార్థం, బ
త్యురుతర తపమునకు సవి
స్తరశివయోగంబ కాదె తగు ఫల మెందున్ ? 23

అ ర్థ ము : హరిణ + అక్షి = లేడికన్నులవంటికన్నులుగలది - పార్వతి, తపస్ (ః) + బలమునన్ = తపశ్శక్తిచేత, పరమేశ్వరున్ = శివుని, కూడన్ + పడయున్ = పొందఁగలదు, పరమ + అర్థంబు = తప్పదు, ఎందున్, అతి + ఉరుతర - తపమునకున్ = మిక్కిలిగొప్పతపస్సునకు, తగు - ఫలము, సవిస్తర - శివ - యోగంబు + అ - కాదె = సవిస్తరముగా శివునితోఁ గూడుటయే కదా !

తా త్ప ర్య ము : పార్వతి తపశ్శక్తిచేఁ బరమేశ్వరునిఁ బొందఁగలదు. తప్పదు, ఎచ్చటనైనను మిక్కిలిగొప్పతపమునకుఁ దగినఫలము శివునితో సవిస్తరముగాఁ గూడుటయే కదా !

వి శే ష ము లు: విశేషము సామాన్యముచే సమర్థింపఁబడుటచే నలంకారము అర్థాంతరన్యాసము.

వ. అని నిశ్చయించి నిజతనయ తపోవనంబునకుం జనుట కొడంబడియె నంతఁ బార్వతి జననీజనకాదివృద్ధజనంబుల వీడుకొని మహాహర్షంబున నిజనివాసంబునకుం జనుదెంచి గమనోద్యోగంబు సేయుచు. 24

అర్థము : అని, నిశ్చయించి, నిజ - తనయ = తనదైనకూఁతురు-పార్వతి, తపస్ (ః) + వనంబునకున్, చనుటకున్ = పోవుటకు, ఒడంబడియెన్ = అంగీకరించెను, అంతన్, పార్వతి, జననీ - జనక + ఆది - వృద్ధ - జనంబులన్ = తల్లి తండ్రి మున్నగు పెద్దవారిని, వీడుకొని = వీడి, మహత్ (మహా) + హర్షంబునన్ = గొప్ప సంతోషముతో, నిజ-నివాసంబునకున్ = తనదైన ఉనికిపట్టునకు, చనుదెంచి = వచ్చి, గమన + ఉద్యోగంబు = పోవయత్నము, చేయుచున్.

తాత్పర్యము ; అని నిశ్చయించి తన కూఁతురు తపోవనమునకుఁ బోవుట కంగీకరించెను. అంతఁ బార్వతి తల్లిదండ్రులు మున్నగు పెద్దలను వీడ్కొని మిక్కిలి సంతోషముతోఁ దన నివాసమునకు వచ్చి, పోవుటకు యత్నముచేయుచు- తరువాతి పద్యముతో నన్వయము,

మ. హరిణీ ! వచ్చెదె కానకుం దపము సేయంబోద మంచున్ మృగిం
బురుడున్; మామిడి, నీవు గ్రమ్మఱెదె నన్ బోఁజోపి యంచు న్నవా
జిరచూతంబును గౌఁగిలించుకొను, నా చే వాయుడుంగాక మ
ద్గురువృత్తస్తన సంగతిం దొఱఁగితే ఘోషావతీ ! నీ వనున్. 25

అర్థము : హరిణీ ! అఁడులేడీ ! తపము + చేయన్ + పోదము, కానకున్ అడవికి, వచ్చెదె = వత్తువా ? అంచున్, మృగిన్ = ఆఁడులేడిని, పురుడున్ = నిమురును, మామిడి = ఓమామిడీ, నన్ = నన్ను, పోన్ + చోపి = పోవనంపి, నీవు, క్రమ్మఱెదె = మరలిపోవుదువా ? అంచున్, నవ + అజిర - చూతంబునున్ = ముంగిటనున్న క్రొమ్మావిని, కౌఁగిలించుకొనున్, ఘోషావతీ = ఓ వీణా ? నీవు, నా చే + పాయుడున్ + కాక = నా చేయి వీడుటయేకాక, మత్ + గురు - వృత్త స్తన - సంగతిన్ = నా పెద్దవియు, వర్తులములు నగు కుచముల సాంగత్యమును. తొఱఁగితే (తొఱఁగితివి + ఏ) = విడిచితివా ?, అనున్.

తాత్పర్యము : 'హరిణీ ! తపము చేయఁబోవుదము, అడవికి వత్తువా ;' అని యాఁడులేడిని నిమురుచు నడుగును. 'మామిడీ ! న న్నంపి నీవు మరలుదువా ?' యని ముంగిటనున్న క్రొమ్మావిని గౌఁగిలించుకొనును, 'వీణా ! నీవు నా చేతినుండి తొలఁగుటకాక పెద్దవియు, వర్తులములు నగు నా కుచముల సాంగత్యమును విడిచితివా ?' యనును,

విశేషములు: పురుడు - ప్రేమముతో సమత్వముచూపు. నిమురు. విశేష్యమైనపుడు - జాతాశౌచము, స్పర్థ, పోలిక. పోదము - పోవు ధాతువు. 'ఆశీర్వ్యాపసంప్రార్థనవిధులందు లూట్టగు.' బాల. క్రియ. 6. పోవు + లూట్టు- 'లకారంబునకు డు ణ్రు వు రు ను ముణ్ణగు. బాల. క్రియ. 8. పోవు + ము. 'ఉభయ ప్రార్థనంబున దుగాగమంబున కత్వంబగు.' బాల. క్రియ. 36. లూట్టునకు దుగాగమము విధింపఁబడ లేదు కాని యీ సూత్రమున అత్వమును విధించిన సామర్థ్యముచే దుగాగమము, ఉత్వమున కత్వము రెండును నగును, పోవుదము. 'పోవునకు దుణ్మత్తుల ముణ్ణం బరంబు లగునపుడు వు లోపంబుం బొద పదలను విభాష నగు.' బాల. క్రియ. 98. పోదము. చేయి, చే (రూపాం.) మత్ + గురు - అనునాసికాంతస్థ వర్ణములతప్ప మిగిలిన పదాంతగత హల్లులకు (ఝల్లులకు) మృదుహల్లులు (హశ్శులు) కాని అచ్చులు కాని పరములగునపుడు ఆ హల్లుల వర్గమునకుఁ జెందిన తృతీయవర్ణ మాదేశముగా వచ్చును. మద్గురు. వచ్చెదె - వచ్చు ధాతువు. 'తద్ధర్మాదులందు లాట్టగు.' బాల. క్రియ. 5. వచ్చు+లాట్టు. 'లకారంబునకు డు ణ్రు వు రు ను ముణ్ణగు.' బాల. క్రియ. 8. వచ్చు+వు. 'లాట్టు రుణ్ణు పరంబగునపు డెదగాగమంబును ప్రథమ నువర్ణకంబు పరంబగు నపు డెడు గెడి గాగమంబులును బహుళంబుగా నగు.' బాల. క్రియ. 38. వచ్చు + ఎద + వు- 'అంద్వవగాగమంబులం దప్ప నపదాదిస్వరంబు పరంబగునపు డచ్చునకు సంధి యగు' బాల. సంధి. 11, వచ్చెద + వు. 'లిడ్లాట్టుల వకారంబునకు లోపంబు విభాష నగు,' బాల. క్రియ. 24. వచ్చెద + ఉ. అపదాది స్వరసంధి. బాల. సంధి. 11. వచ్చెదు + ఎ = వచ్చెదె. పార్వతి వీణకు 'ఘోషావతి' యనిపేరు.

వ. మఱియును. 26

తే. చెలువ తన చెల్మికత్తెలఁ బిలిచి, "నాకుఁ
గూర్చుగుమ్మలు నెవ్వ రీ కొమ్మలందు
వారు నేకాని రక్షింపవలయు వీని
బ్రాఁతిగా" నని యందఱఁ బట్టువఱిచి. 27

అర్థము: చెలువ = స్త్రీ - పార్వతి, తన - చెల్మికత్తెలన్, పిలిచి, నాకున్. ఈ కొమ్మల + అందున్ = ఈ యింతులలో - మీలో, కూర్చు - గుమ్మలు =

అనుఁగుఁజెలులు, ఎవ్వరు ?, వారు, వీనిన్, బ్రాఁతిగాన్ = ప్రీతిగా, చేకొని = స్వీకరించి, రక్షింపవలయున్, అని, అందఱన్, పట్టువఱిచి = వశపఱుచుకొని.

తాత్పర్యము ; పార్వతి తన చెలికత్తెలను బిలిచి 'మీలో నాకు అనుఁగుఁజెలు లెవ్వరో, వారు వీనిని బ్రీతితో స్వీకరించి రక్షింపవలయు' నని యందఱను అనునయముతో వశపఱుచుకొని-తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు: చెల్మికత్తె - చెలి, 'పేర్వాదుల కిమి వర్ణకం బగు,' బాల. తద్ధి. 5, చెలి + ఇమి. అపదాదిస్వరసంధి, బాల. సంధి. 11. చెలిమి 'లాఁతి యచ్చునకు సహిత మొకానొకచో నుడి నడుమ లోపంబు గానంబడియెడి.' బాల. ప్రకీర్ణ. 18. చెల్మి. 'కా కత్తియవర్ణకంబులు పుంస్త్వస్త్రీత్వంబుల మతుబర్థంబునం దాటాదుల కగు.' బాల. తద్ధిత. 11. చెల్మికత్తె, బ్రాఁతి - ఇది సానుస్వారమనియు, నిరనుస్వారమనియు నభిప్రాయభేదములు గలవు. భారతాదిప్రయోగములు నిరనుస్వారమనుటకు నిర్ధారకములు. (సూ. ని.). గుమ్మలు నెవ్వరు - ఇందు 'గుమ్మలు' అనుదానిచివర నువర్ణమునకుఁ బ్రయోజనము గనుపట్టదు.

ఉ. "ఈ కలహంసిఁ బెంపు మదినేమఱ కీవు ; మయూరపోతముం
జేకొని పెంపు మీవు ; కవ చిల్కలఁ బెంపుము నీవు ; పెంపు మీ
కోకిల నీవు ; పెంపు మెలగోరఁట నీ; వెద మెచ్చఁ గొల్చి యే
నా కఱకంఠుఁ దోడ్కొని రయమ్మునఁ గ్రమ్మఱివచ్చునంతకున్." 28

అర్థము : ఏను = నేను, ఆ - కఱకంఠున్ = ఆ గరళకంఠుని - శివుని, ఎదన్ హృదయమునందు, మెచ్చన్ = మెచ్చుకొనునట్లు కొల్చి = సేవించి, తోడ్కొని = వెంటఁదీసికొని, రయమ్మునన్ = శీఘ్రముగా, క్రమ్మఱి = తిరిగి, వచ్చు+అంతకున్=వచ్చు నంతవఱకు, ఈవు = నీవు, ఈ - కలహంసిన్ = ఈ రాజహంసిని, మదిన్ = మనస్సునందు, ఏమఱక = పరాకులేక, పెంపు = పోషింపుము, ఈవు, మయూర - పోతమున్ = నెమలిపిల్లను, చేకొని = స్వీకరించి, పెంపుము, నీవు, కవ - చిల్కలన్ = చిలుకల జంటను పెంపుము, నీవు, ఈ - కోకిలన్, పెంపుము, నీవు, ఎల - గోరఁటన్ = లేఁత గోరఁటను, పెంపుము,

తాత్పర్యము: "నేనా గరళకంఠుని, అతఁడు మదిలో మెచ్చుకొనునట్లు కొలిచి, వేగముగాఁ దీసికొనివచ్చునంతలో నీ పీ కలహంసిని బరాకులేక పెంపుము, నీ పీ నెమలిపిల్లను ఆదరించిపెంపుము, నీ పీ చిలుకలజంటను బెంపుము. నీ పీ కోకిలను బెంపుము. నీవు లేఁతగోరఁటను బెంపుము".

విశేషములు: పెంపు మది = పెంపుము + మది. 'మధ్యమపురుష మువర్ణకంబునకు హలవపానంబులు పరంబులగునపుడు లోపము విభాష నగు.' బాల.సంధి.47. కళకంఠుఁడు - 'ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు.' బాల. సంజ్ఞా.23, చిన్నయ దీనిని గ్రామ్యమనఁగా, నిది గరకంఠశబ్దభవమనియు, బహువ్రీహి యనియుఁ బ్రౌఢవ్యాకరణకర్త.

వ. అని నియమించుచున్నతఱిం బ్రియవయస్యలైన రాజనందనలు
తమ యందఱకు వగ కల్గినకన్నెఱింగి. 29

అర్థము: అని, నియమించుచున్ + ఉన్న - తఱిన్ = నియమించునున్న సమయమున, ప్రియ - వయస్యలు = అనుఁగుఁజెలులు, ఐన, రాజనందనలు = రాచకూఁతులు, తమ + అందఱకున్, వగ = దుఃఖము, కల్గిన కన్నెఱింగి = కలిగిన జాడయెఱ్ఱిఁగి,

తాత్పర్యము: అని నియమించుచున్న సమయమున ననుఁగుఁజెలులైన రాచకూఁతులు తమకందఱకు దుఃఖము కలిగిన జాడ తెలిసి - తరువాతి పద్యముతో నన్వయము,

సీ. 'పొలయించి నీ చూపు నలఁతులఁ గనఁగోరి
కొనిచూచు రాలేటికొదమ లివియుఁ
గడు మృదురీతి నీ నడపాడుగతికి రా
నని గ్రాలి నడచు రాయంచ లివియు
భావించి నీ ముద్దుఁబలుకుల మెయివడి
బలవడఁ గఱచు రా చిలుక లివియుఁ
బాటించి నీ కేశపాశంబు మీఁదికిఁ
బొదివెంచు రానమ్మిపదుపు లివియుఁ

ఆ. దరుణి! వీని నింత మఱపించి ననుపారఁ
బెనిచి నీవు ననఁగి పెనఁగి పెరిఁగి
'నేఁటి కెడఁద నింత నిర్మోహివై తెగ
విడిచెదమ్మ! మమ్ము విడిచె దేని?' 30

అర్థము ; తరుణి = ఓ యువతీ - పార్వతీ!

రాలేటి కొదమలు + ఇవియున్ = మేలైన ఈ జింకపిల్లలును, పొలయించి= ప్రసరింపఁజేసి, నీ - చూపు + అలఁతులన్ = నీ కన్నుల పరిమితులను, కనన్ + కోరికొని = చూడఁగోరి, చూచున్.

రాయంచలు + ఇవియున్ = ఈ రాజహంసములును, కడున్ = మిక్కిలి, మృదు - రీతిన్ = అందమైనవిధమున, నీ - నడపాడు - గతికిన్ = నీ నడచురీతికి, రాన్ + అని = వచ్చుటకని, క్రాలి = ఒప్పి, నడచున్.

రాచిలుకలు + ఇవియున్ = ఈ రాజకీరములును, భావించి = తలఁచి, నీ- ముద్దు + పలుకుల - మెయివడిన్ = నీ ఇంపైన పలుకులవిధమును, బలవడన్ = బలపడన్ = బలపడునట్లు, కఱచున్ = అభ్యసించును.

రా - నెమ్మి - పదుపులు + ఇవియున్ = ఈ రాచనెమలి (మేలైన నెమలి) గుంపులు, పాటించి = ప్రమాణముగాఁగొని, నీ - కేశ - పాశంబు - మీఁదికిన్ = నీ శిరోజముల సమూహముమీఁదికి, పొదివెంచున్ = పురివిచ్చును,

వీనిన్ = ఈ లేటికొదమలు మున్నగువానిని, ఇంత - మఱపించి = స్నేహముచే మరిగియుండునట్లుచేసి, ననుపారన్ = ప్రీతితో, పెనిచి = పెంచి, నీవున్, అనఁగి - పెనఁగి = కలసి మెలసి, పెరిఁగి. నేఁటికిన్ = ఈ నాఁటికి, ఎడఁదన్ = హృదయమునందు, ఇంత, నిర్మోహివి + ఐ = ప్రేమములేనిదానవయి, మమ్మున్, విడిచెదు + ఏనిన్ (విడిచెదవు + ఏనిన్) = విడిచిన విడుతువుగాక, తెగన్ = బంధము తెగిపోవునట్లు, విడిచెదు +అమ్మ (విడిచెదవు + అమ్మ) = విడుతువా?

తాత్పర్యము : యువతీ! పార్వతీ! ఈ రాజింకపిల్లలు తమ చూపులను బ్రసరింపఁజేసి నీ కన్నులపరిమితులను జూడఁగోరును. ఈ రాయంచలును సుందరమైన నీ గమనవైఖరికి సరివచ్చునట్లు నడచును. ఈ రాచిలుకలును ఎంచి నీ ముద్దుపలుకుల

రీతిని గట్టిగా నభ్యసించుము. ఈ రాచనెమలిగుంపులును నీ కేశపాశమును బ్రమాణముగాఁగొని దానిపైఁ బురివిచ్చును. ఇట్టి వీనిని ఇంత స్నేహముచే మరిగియుండునట్లు చేసి, ప్రీతితోఁ బెంచి, నీవును వానితోఁ గలపిమెలపి పెరిఁగి, యిప్పుడు హృదయమున నింత నిర్మోహివయి మమ్ము విడిచిన విడుతువుగాక, బంధము తెగిపోవునట్లు విడుతువా?

విశేషములు : అలంకారము ఉత్ప్రేక్ష. లేటి = లేడి. నమ్మి - నమలి, నెమలి. నెమ్మి (రూపాం.)

వ. అని యందఱకు వగపు పుట్టించి మనసు గుదియంబలుకుచున్న చెలికత్తెలం గనుంగొని నగజ నగుచు వారి నందఱిం బౌరజనంబు తోన వీడుకొలిపి చతురికాద్యాప్త సఖీజన పరివృతయై చని తపోవన ప్రవేశంబు సేసి. 31

అర్థము ; అని, అందఱకున్. వగపు = దుఃఖము, పుట్టించి = కలిగించి, మనసు, కుదియన్ = క్రుంగునట్లు, పలుకుచున్ + ఉన్న, చెలికత్తెలన్, కనుంగొని, నగజ = పార్వతి, నగుచున్ = నవ్వుచు, వారిన్ + అందఱిన్. పౌర - జనంబు తోన్ + అ = పురజనులతోనే, వీడుకొలిపి = వీడుకొనఁజేసి. చతురికా + ఆది + ఆప్త - సఖీజన - పరివృత + ఐ = చతురిక మున్నగు ప్రియసఖీసమూహముచేఁ జుట్టఁబడినదయి, చని, తపస్ (ః) + వనప్రవేశంబు + చేసి = తపోవనమును బ్రవేశించి.

తాత్పర్యము : అని యందఱకును దుఃఖము గలిగించి మనసు క్రుంగునట్లు పలుకుచున్న చెలికత్తెలను జూచి పార్వతి నవ్వుచు, వారినందఱను బురజనులతోపాటే పంపివైచి చతురిక మున్నగు నునుఁగుఁజెలులతోఁగూడి తపోవనమును బ్రవేశించి - తరువాతి పద్యముతో నన్వయము.

క. గిరినందన గిరి నందన
తరు గుల్మ లతా నదీ నద ప్రాకట ని
ర్ఝర సరసీ పులిన తలాం
తరముల విహరించుచును ముదం బొదవ మదిన్. 32

అర్థము : గిరి - నందన = కొండకూఁతురు - పార్వతి, గిరి ........ తరములన్ : గిరి = కొండలయందలి, నందన = ఉద్యానములలోని, తరు = చెట్ల, గుల్మ = పొదల, లతా = తీఁగల, నదీ = నదుల, నద = నదముల, ప్రాకట= ప్రసిద్ధమైన,నిర్ఝర - సరసీ = దివ్యసరస్సుల, పులిన - తల = ఇసుకప్రదేశముల, అంతరములన్ = లోపలిభాగములందు, మదిన్ = మనస్సునందు, ముదంబు = సంతోషము, ఒదవన్ = కలుగునట్లు, విహరించుచును = క్రీడించుచును.

తాత్పర్యము : పార్వతి కొండలయందలి యుద్యానవనములలోని చెట్ల, పొదల, తీఁగల, నదీనదముల, దివ్యసరస్సుల, యిసుకతిన్నెలయందు మనసునకు సంతోషముగలుగునట్లు విహరించుచు - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : నది- నదము - పడమటినుండితూర్పునకుఁబ్రవహించునట్టిది నది, తూర్పునుండి పడమటికిఁ బ్రవహించునట్టిది నదము.

సీ. అరుణాంఘ్రితలదీప్తి నవనీతలం బెల్లఁ
బద్మరాగస్థలభాతి నొనర,
వదనేందుకాంతి దిగ్వదనకైరవములఁ
గాలచంద్రాతపలీల నెనయ,
నధరారుణద్యుతి నారణ్యతరులతా
సమితి పల్లవితవిభ్రమముఁ బడయఁ,
దనులత సుడియు నెత్తావి గైకొని సమీ
రుఁడు గంధవహుఁ డను రూఢిఁ దనర,

ఆ. వఱలు నయనరుచుల వనమయూరములు వి
ద్యుల్లతావలోకనోత్సవంబుఁ
బొరయ నరుగుదెంచెఁ దరువనస్థలి సువి
రాజితముగ శైలరాజతనయ. 33

అర్థము : శైల - రాజ - తనయ = కొండలఱేని కూఁతురు - పార్వతి, అరుణ + అంఘ్రి - తల - దీప్తిన్ = ఎఱ్ఱని పాదతలముల కాంతిచే, అవనీ -

తలంబు + ఎల్లన్ = భూతలమంతయు, పద్మరాగ - స్థల - భాతిన్ = పద్మరాగ ప్రదేశము విధమున. ఒనరన్ = ఒప్పఁగను,

వదన + ఇందు - కాంతిన్ = ముఖమనెడి చంద్రునికాంతితో, దిక్ (క్) + వదన - కైరవములు = దిక్కులయొక్క ముఖములనెడు కలువలు, అకాల - చంద్ర + ఆతప - లీలన్ = అకాలపు వెన్నెలవిలాసమును. ఎనయన్ = పొందఁగను.

అధర + అరుణ - ద్యుతిన్ = క్రిందిపెదవియొక్క యెఱ్ఱని కాంతిచే, ఆరణ్య - తరు - లతా - సమితి = అడవియందలి చెట్ల తీఁగల సమూహము, పల్లవిత - విభ్రమమున్ చిగిర్చినదనెడు విభ్రాంతిని, పడయన్ = పొందఁగను,

తనులత = తీఁగవంటి దేహము, సుడియు = ప్రసరించు, నెత్తావి (నెఱ + తావి) = పరిమళము. కైకొని = గ్రహించి. సమీరుఁడు = వాయువు, గంధవహుఁడు = పరిమళమును మోయువాఁడు, అను, రూఢిన్ = ప్రసిద్ధితో, తనరన్ = ఒప్పఁగను,

వఱలు = ప్రకాశించునట్టి, నయన - రుచులన్ = కన్నులకాంతులచే, వన - మయూరములు = అడవినెమళులు, విద్యుత్ + లతా + అవలోకన + ఉత్సవంబున్ = మెఱపుఁదీఁగలను జూచుటయందలి వేడుకను, పొరయన్ = పొందఁగను,

తరు - వన - స్థలి = చెట్లతోఁడి వనప్రదేశము, సు - విరాజితముగన్ = మిక్కిలి ప్రకాశింపఁగను, అరుగుదెంచెన్ = వచ్చెను.

తాత్పర్యము : ఎఱ్ఱని పాదతలములకాంతిచే భూతలమంతయుఁ బద్మరాగ ప్రదేశమట్లు ఒప్పఁగను, ముఖచంద్రకాంతిచే, దిఙ్ముఖములనెడి కలువలు అకాలపు వెన్నెలవిలాసమును పొందఁగను, క్రిందిపెదవి యెఱ్ఱనికాంతిచే నడవిలోనిచెట్ల తీఁగల సమూహము చిగిరించినదనుభ్రాంతిని పొందఁగను, దేహలత ప్రసరింపఁజేయుపరిమళమును గ్రహించి వాయువు గంధవహుఁ డను ప్రసిద్ధితో నొప్పఁగను, ప్రకాశించు కన్నుల కాంతులచే నడవినెమళ్లు మెఱపుఁదీఁగలను జూచుటయందలివేడుకను పొందఁగను, చెట్లతోఁడి వనప్రదేశము మిక్కిలిప్రకాశింపఁగను పార్వతి వచ్చెను.

విశేషములు : వదనేందుకాంతి దిగ్వదనకైరవములు రూపకము. విద్యుత్ + లతా = విద్యుల్లతా - తవర్గవర్ణములకు లకారము పరమగుచోఁబరసవర్ణము ఆదేశమగును.

వ. త దవసరంబున. 34

అర్థతాత్పర్యములు : తద్ + అవసరంబునన్ = ఆ సమయమున తరువాతి పద్యముతో నన్వయము.

ఉ. పాయక వేరువెల్లఁకియుఁ బండులు నొండులుఁ గూరగాయలుం
గోయుచు నుక్కునం బులుల గోళులుఁ దోళులుఁ గొంచుఁ బేర్చునం
గూయఱఁ జంపి యేనుఁగుల కొమ్ములు నెమ్ములుఁ గొంచుఁ గానలో
నేయెడఁ దారయై పొలుచు నెఱుకులు మొఱుకులు నేకపాదులున్ 35

అర్థము : పాయక = విడువక, వేరు - వెల్లఁకియున్ = వేరుదుంపయును, పండులున్ = పండ్లును, ఒండులున్ = అన్యములును (?) కూర + కాయలున్, కోయుచున్, ఉక్కునన్ = బలముతో, పులుల - గోళులున్ = పులుల గోరులును, తోళులున్ = పులిచర్మములును, కొంచున్ = తీసికొనుచు, పేర్చునన్ = అతిశయముతో, కూయి + అఱన్ = కూఁత రాకుండునట్లు, చంపి, ఏనుఁగుల - కొమ్ములున్ = ఏనుఁగుల దంతములును, ఎమ్ములున్ = ఎముకలును. కొంచున్, కానలోన్ = అడవిలో, ఏ + ఎడన్ = ఎందును, తారు + ఆ + ఐ = తామే యయి, పొలుచు = ఒప్పునట్టి, ఎఱుకులున్ = ఎఱుకులును. మొఱుకులున్ = మొఱకులనెడి ఆటవిక జాతులును, ఏకపాదులున్ = ఏకపాదులనెడి ఆటవికులును.

తాత్పర్యము : వేరుగడ్డలును, పండ్లును, గూరగాయలును, విడువక కోయుచు, బలముతోఁ బులులగోరులును, చర్మములును గొనుచు, అతిశయముతో నేనుఁగులను అఱవకుండఁ జంపి వాని దంతములును, ఎమ్ములను గొనుచు నడవిలో నెందును దామే యయి యొప్పు నెఱుకువాండ్రును, మొఱకువాండ్రును. ఏకపాదులును-తరువాతి వచనముతో నన్వయము.

విశేషములు : వెల్లఁకి = గడ్డ, దుంప, ఇది 'వేరు' శబ్దపూర్వకముగనే ప్రయోగములఁ గానఁబడుచున్నది. కూర + కాయ • 'ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గ స డ ద వ ల గు.' బాల. సంధి. 15. కూరగాయలు, గోళులు - గోరు + లు. 'బహువచనము పరంబగునపు డసంయుక్తంబులయి యుదంతంబులయిన డ ల ర ల కలఘు లకారంబు బహుళంబుగా నగు'. బాల ఆచ్ఛిక. 13. గోళులు. ఇట్లే తోలు + లు - తోళులు. ఎఱుకు - ఎర్కు, మొఱకు - మొర్కు, 'అలఘురేఫము లూప్తాచ్కమగుచో లఘురేఫం బగు.' ప్రౌఢ - ముక్త. వి. 2 పంతులు - ఒంతులు, గోళులు - తోళులు, కొమ్ములు - ఎమ్ములు, ఎర్కులు - మొర్కులు - అనుప్రాసము.

వ; అను నాటవికజనంబు లయ్యపూర్వస్త్రీరూపంబులు చూచి తదవలోకన కుతూహలపరులై కూడం జనుదెంచి రంత. 36

అర్థము : అను, ఆటవిక - జనంబులు = అడవిజనులు = కిరాతులు. ఆ + అపూర్వ - స్త్రీ - రూపంబులు = తా మంతకుమునుపు చూడని స్త్రీల యాకారములు. చూచి, తద్ + అవలోకన - కుతూహల - పరులు + ఐ = వారినిజూచుట యందలి వేడుకయం దాసక్తి గలవారయి, కూడన్ = వెంట, చనుదెంచిరి = వచ్చిరి. అంతన్

తాత్పర్యము : అనెడి కిరాతులు ఆ యపూర్వ స్త్రీరూపములు చూచి వారిని దర్శించుటయందలి వేడుకయందు ఆసక్తిగలవారయి వెంటవచ్చిరి. అంత-తరువాతి పద్యముతో నన్వయము.

సీ. పటిచుంచుఁదలలును బఱుదులు దబ్బర
మిడిసిన గ్రుడ్డులుఁ బడఁకి చెవులుఁ
గందుఁబండ్లుఁ బటికిగడ్డంబులును నఱ
పొఱఁడులు నంటురూపులునుఁ గుఱుచ
కోంజేతులు నిటికిగోళ్లను నొక్కుఁ బ్ర
క్కలు బొక్కిత్రొమ్ములు కఱకుఁద్రొండి
కడుపులు మురివి ప్రమోఁకాళులుఁ బొరలెత్తి
నెఱసిన యడుగులుఁ గుఱులు గట్టి

ఆ. వరకు వెత్తియున్న పరువంపు టొడళులు
నడవిలోనఁ గలయ మొడుచు రేఁగి
గదరు వలచు కంపుఁ గాళిమచ్ఛాయయుఁ
గలుగు నెఱుకుముసుఁడిఁ గనిరి సతులు. 37

అర్థము ; సతులు - స్త్రీలు. పటి - చుంచు + తలలును = చింపిరిజుత్తు గల తలలును, పఱ (ఱ) దులున్ = గఱుకులును, దబ్బఱ = భయంకరములును, అగు, మిడిపిన - గ్రుడ్డులున్ = పయి కుబికిన కనుగ్రుడ్డులును, పడఁకి (కు) - చెవులున్ = గుహలవంటి (పెద్దవియైన) చెవులును.

కందు + పండ్లున్ = నల్లని దంతములును, పటికి - (క) గడ్డంబులును = బిరుసైన గడ్డములును, అఱపొఱడులున్ = సగము గూనులును. అంటు - రూపులున్ = అపరిశుద్ధమైన ఆకృతులును, కుఱుచకోంజేతులు = పొట్టివియు, గొట్టముల వంటివియు నగు చేతులును (?), ఇటికి - గోళ్లును = ఇఱుకైన గోరులును. నొక్కు + ప్రక్కలున్ = లోపలికిఁబోయిన ప్రక్కలును, బొక్కి - తొమ్ములున్ = గుంటలుపడిన వక్షములును, కఱకు + త్రొండి - కడుపులున్ = కఱకైన. లోఁతునకుఁబోయిన కడుపులును, మురివి - మోఁకాళులున్ = వంకరలైన మోఁకాళ్లును, పొరలెత్తి నెఱపిన - అడుగులున్ = లేచిన పొరలుగలవి యగు పాదములును, కుఱులు - కట్టి = మచ్చలేర్పడి (?) వరకులెత్తియున్న = కాయలుగాచియున్న (?), పరుసంపుటొడళులున్ - (పరుసము + ఒడళులున్) = కఠినమైన శరీరములును,

అడవిలోనన్, కలయన్ = అంతటను, మొడుచురేఁగి = మొత్తముగరేఁగి (?), గదరువలచుకంపున్ = (గదురు ?) = దుర్గంధమువేయుకంపును, కాళిమ + ఛాయయున్ = నల్లని రంగును. కలుగు, ఎఱుకు - ముసుఁడిన్ = ఎఱుకువాండ్ర సమూహమును, కనిరి = చూచిరి,

తాత్పర్యము : పార్వతియు నామె చెలికత్తెలును - చింపిరిజుత్తుగలతలలును, గఱుకులును భయంకరములును అగు మిడిగ్రుడ్డులును, గుహలవంటి చెవులును, నల్లని దంతములును, బిరుసైన గడ్డములును, సగముగూనులును, అపరిశుద్ధములైన ఆకారములును, పొట్టివియు, గొట్టములవంటివియునైన చేతులును, ఇఱుకైన గోరు

లును. లోపలికిఁ బోయిన ప్రక్కలును, గుంటలుపడిన బొమ్మలును, కఱకైన, లోఁతునకుఁబోయిన కడుపులును, వంకరలైన మోఁకాళ్లును. పొరలులేచిన యడుగులును, మచ్చలేర్పడి కాయలుగాచియున్న మొఱటు శరీరములును, అడవిలో నంతటను మొత్తముగ రేఁగిదుర్గంధముగొట్టుకంపును, నల్లని దేహకాంతియుఁ గలుగు నెఱుకు వాండ్ర సమూహమును' జూచిరి.

విశేషములు : అఱపొఱడు - 'అఱపొఱడు కుఱుచచేతులు' - నన్నయ. భార. అర.2.134. పరుసంపుటొడళులు - పరుసము + ఒడళులు - 'కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బుంపు లగు.' బాల. సంధి.32. పరుసంపు + ఒడళులు - 'కర్మధారయంబులం దుత్తున కచ్చు పరంబగునపుడు టుగాగమం బగు.' బాల. సంధి. 28. కాళిమచ్ఛాయ - కాళిమ + ఛాయ - 'హ్రస్వమునకుఁ బరమైనఛకారముద్విరుక్తమగును.'

వ. అట్టి వికృతాకారంబులు గని విస్మితులగుచుండి రంత. 38

అర్థము : అట్టి. వికృత + ఆకారంబులు = వికృతములైనరూపములు, కని = చూచి, విస్మితులు + అగుచున్ + ఉండిరి = ఆశ్చర్యపడుచుండిరి, అంతన్.

తాత్పర్యము : అటువంటి వికృతములైనరూపములు చూచి ఆశ్చర్యపడుచుండిరి.

మ. చమరీవాలములున్ మయూరవరపింఛవ్రాతముల్ గండశృం
గములున్ సూకర వేణు నాగ ఘన ముక్తాజాలముల్ ఋక్ష చ
ర్మములున్ సింహ నఖంబులున్ మధువులున్ మాంసంబులున్ దాల్చి రౌ
ద్రముతోవచ్చు పుళిందులం గనిరి కాంతారాంతరాళంబులన్. 39

అర్థము : సతులు - కర్త అధ్యాహార్యము.

చమరీ - వాలములున్ = ఆఁడుసవరపుమెకములతోఁకలును, మయూర - వర - పింఛ - వ్రాతముల్ = నెమళ్ల శ్రేష్ఠములైన పింఛముల సమూహములను,

గండ - శృంగములన్ = పెద్ద కొమ్ములును. సూకర - వేణు - నాగ-ఘన-ముక్తా - జాలముల్ = వరాహములనుండి, వెదురులనుండి. ఏనుఁగులనుండి పుట్టిన గొప్ప ముత్యముల సమూహములు, ఋక్ష - చర్మములున్ = ఎలుఁగుగొడ్డుల తోళ్లను, సింహ - నఖంబులున్ = సింహముల గోరులును. మధువులున్ = మద్యములును, మాంసంబులున్, తాల్చి, రౌద్రముతోన్ = భయంకరత్వముతో, వచ్చు, పుళిందులన్= కిరాతులను, కాంతార + అంతరాళంబులన్=అడవి లోపలి ప్రదేశములందు, కనిరి = చూచిరి,

తాత్పర్యము: పార్వతియుఁ జెలికత్తెలును అడవిలోపలిభాగములందు ఆఁడు నవరపుమెకపుఁలతోఁకలును. నెమళ్ల మేలైన పింఛముల సమూహములును, పెద్దకొమ్ములును, వరాహముల కోఱలనుండి, వెదురులనుండి, ఏనుఁగులనుండి పుట్టిన ముత్యముల సమూహములును, ఎలుఁగుగొడ్లతోళ్లను, సింహముల గోరులను. మద్యములను. మాంసములును దాల్చి భయంకరులై వచ్చుకిరాతులను జూచిరి,

విశేషములు ; సూకర వేణు నాగ ఘన ముక్తా జాలముల్ - సూకరాదుల నుండి ముత్యములు పుట్టు ననుటకు - 'కరీంద్ర జీమూత వరాహ శంఖ మత్స్యాహి శుక్త్యుద్భవ వేణుజాని ముక్తాఫలాని ప్రథితాని లోకే. తేషాం తు శుక్త్యుద్భవ మేవ భూరి.'

వ. అం దాటవికబలాధీశ్వరుఁ డచలాధీశనందన యగు టెఱింగి యతి
సంభ్రమమున. 40

అర్థము : అందున్, ఆటవిక - బల + అధి + ఈశ్వరుఁడు = కిరాత సైన్యముల ప్రభువు. అచల + అధి + ఈశ - నందన = పర్వతరాజగు హిమవంతుని కూఁతురు. అగుట ఎఱింగి, అతి - సంభ్రమమునన్ = మిక్కిలి వేగిరపాటుతో.

తాత్పర్యము : అందుఁ గిరాతసైన్యములప్రభువు ఆమె పర్వతరాజుకూఁతురగుట తెలిపి మిక్కిలి వేగిరపాటుతో - తరువాతి పద్యముతో నన్వయము.

తే. దర్పితేభారి నఖరక్షతప్రకోష్ఠుఁ,
డిభ విషాణాహతోరస్కుఁ, డభయుఁ, డుగ్ర
కోల దంతాగ్ర భిన్న జంఘుండు, శబర
నాథుఁ డేతెంచి శైలకన్యకకు మ్రొక్కె. 41

అర్థము : దర్పి .... ప్రకోష్ఠుఁడు. దర్పిత = మదించిన, ఇభ + అరి= ఏనుగులశత్రువు లైన సింహములయొక్క, నఖర = గోరులచేత, క్షత = గాయపడిన, ప్రకోష్ఠుఁడు = ముంజేతులు గలవాఁడును, ఇభ - విషాణ + ఆహత + ఉరస్కుఁడు = ఏనుఁగుల దంతములచేఁ గొట్టఁబడిన రొమ్ము గలవాఁడును, అభయుఁడు = భయములేనివాఁడును, ఉగ్ర - కోల - దంత + అగ్ర + భిన్న - జంఘుండు = భయంకరములైన వరాహముల కోఱలకొనలచే ఛేదింపఁబడిన పిక్కలు గలవాఁడును, అగు, శబర - నాథుఁడు = కిరాతరాజు, ఏతెంచి = వచ్చి, శైల - కన్యకకున్ = పర్వతపుత్త్రికకు - పార్వతికి, మ్రొక్కెన్.

తాత్పర్యము : గర్వించిన సింహముల గోరులచే గాయపడిన ముంజేతులు గలవాఁడును, ఏనుఁగు దంతములచేఁ గొట్టఁబడిన రొమ్ముగలవాఁడును, భయములేని వాఁడును, భయంకరములైన వరాహముల కోఱలచే ఛేదింపఁబడిన పిక్కలుగల వాఁడును అగు కిరాతప్రభువు వచ్చి పార్వతికి నమస్కరించెను.

42
వ. తదనంతరంబ

అర్థతాత్పర్యములు : ఆ తరువాతనే.

సీ. హరినీలమణులకు నాయువు వచ్చె నాఁ
గమనీయమగు తనుకాంతి లెసఁగ,
మెఱుఁగుఁదీఁగలు గండుమీలపై నెలసె నా
దృగ్పాసురద్యుతుల్ తేజరిల్లఁ
జమరీ సుకేశ పాశములఁ దుమ్మెదపిండు
తగిలె నాఁ గుటిల కుంతలము లమరఁ,
గాంచన కుంభముల్ కరికుంభ కర్కశ
మెనసె నాఁ బాలిండ్లు పొనరి తనరఁ

తే. పాపవశమున శాపంబు పడి విహీన
జనులసంగతికర్హమై పొనరఁ గన్న
యమరసతులొకో యన దర్శనార్హలైన
యెఱుకులేమలఁ గాంచె శైలేంద్రతనయ. 43

అర్థము : హరినీలమణులకున్ = ఇంద్రనీలమణులకు, ఆయువు-వచ్చెన్ + నాన్ = ప్రాణము వచ్చెనా యనునట్లు, కమనీయము + అగు = మనోహరమైన, తను - కాంతులు = శరీరకాంతులు, ఎసఁగన్ = అతిశయింపఁగను.

మెఱుఁగు + తీఁగలు = విద్యుల్లతలు, గండు మీలపైన్ = మగచేఁపలపై, ఏలసెన్ + నాన్ = వ్యాపించెనా యనునట్లు, దృక్ (క్) + భాసుర - ద్యుతుల్ = చూపుల ప్రకాశించు కాంతులు, తేజరిల్లన్ - ప్రకాశింపఁగను.

చమరీ-సుకేశపాశములన్ = ఆఁడు సవరపుమెకముల కేశ సమూహములందు, తుమ్మెద - పిండు = తుమ్మెదల గుంపు, తగిలెన్ + నాన్ = ప్రాలెనా యను నట్లు, కుటిల - కుంతలములు = వక్రములైన శిరోజములు, అమరన్ = ఒప్పఁగను,

కాంచన - కుంభముల్ = బంగారు కుండలు, కరి కుంభ - కర్కశము = ఏనుఁగు కుంభస్థలము కార్కశ్యము (కాఠిన్యము), ఎనసెన్ + నాన్ = పొందెనా యనునట్లు, పాలిండ్లు = స్తనములు, పొనరి తనరన్ = ఒప్పుచుండఁగను.

పాప - వశమునన్ = పాపమునకు లోనగుటచే, శాపంబు - పడి = శాప మును బొంది, విహీన - జనుల - సంగతికిన్ = తక్కువ జాతి జనుల సాంగత్యము నకు, అర్హము + ఐ = తగి, పొనరన్ + కన్న = ఒప్పిన, అమర - సతులు + ఒకో + అనన్ = దేవతాస్త్రీలా యనునట్లు, దర్శన + అర్హలు = చూడఁదగిన వారు, ఐన, ఎఱుకు - లేమలన్ = ఎఱుకతలను, శైల + ఇంద్ర - తనయ = పర్వత శ్రేష్ఠుఁడైన హిమవంతుని కూఁతురు - పార్వతి, కాంచెన్ = చూచెను.

తాత్పర్యము : ఇంద్రనీల మణులకుఁ జైతన్యము వచ్చెనా యనునట్లు మనోహరములైన నల్లని దేహకాంతులు ఒప్పఁగను, విద్యుల్లతలు గండుమీలపై వ్యాపించెనా యనునట్లు చూపుల భాసురములైన కాంతులు ప్రకాశింపఁగను, ఆఁడు

నవరపుమెకముల మేలైన కేశసముహములందుఁ దుమ్మెదలగుంపు వ్రాలెనా యను నట్లు వక్రములైన శిరోజము లొప్పఁగను, బంగారు కుండలు ఏనుఁగుల కుంభస్థలముల కాఠిన్యమును బొందెనా యనునట్లు స్తనము లొప్పుచుండఁగను, పాపకర్మములు చేయుటచే శాపమును బొంది తక్కువజాతి స్త్రీల సాంగత్యమునకుఁ దగినవారైన దేవతాస్త్రీలవలెఁ జూడఁదగియున్న యెఱుకతలను బార్వతి చూచెను.

విశేషములు: అలంకార ముత్ప్రేక్ష, మీలు - మీను + లు, 'బహు వచనంబు పరంబగునపుడు చేను పేను మీను శబ్దంబుల ను వర్ణంబు లోపించు.' బాల. ఆచ్చిక. 20. కరి కుంభ కర్కశము - కరికుంభ కర్కశత్వము - కార్కశ్యము అని యుండనగును.

చ. వర తరు కోట రాహి ఫణ వర్గముఁ దేనులుసావి తద్వనే
చరియలు రాఁపఁబోవుచు భుజంగఫణావలిగా నెఱింగి చె
చ్చెరఁ బెడఁబాసి పోవునెడఁ జెల్వుగఁ బూచిన కాఁదపూవు ల
య్యెరగని డాయనోడుదు రహివ్రజశంక విభీతచిత్తులై. 41

అర్థము: తద్ + వనేచరియలు = ఆ బోయతలు, వర - తరు - కోటర + అహి - ఫణ - వర్గమున్ = మేలైన చెట్ల తొఱ్ఱలందలి పాముల పడగల సమూహమును, తేను (నె)లు - సావి = తేనె లని, రాఁపన్ + పోవుచున్ = (రాఁపన్ ?) రేఁపఁబోవుచు, భుజంగ - ఫణా + ఆవలి + కాన్ = పాముల పడగల వరుసగా, ఎఱింగి, చెచ్చెరన్ = శీఘ్రముగా, పెడఁబాసి = విడిచి, పోవు + ఎడన్ = పోవునప్పుడు, చెల్వుగన్ = అందముగా, పూచిన = పుష్పించిన, కాఁదపూవులు = వనపుష్ప విశేషములు, అయ్యెరగని - అయ్యెఱఁ గని = ఆ వ్యసన మునఁ గని, అహి - వ్రజ - శంకన్ = పాముల సమూహమనెడి అనుమానముతో, విభీత - చిత్తు (త్త)లు + ఐ = భయపడిన మనస్సులు గలవారయి, డాయన్ + ఓడుదురు + సమీపింప జంకుదురు.

తాత్పర్యము: ఆ బోయతలు చెట్లతొఱ్ఱలందలి పాముల పడగలసమూహ మును తేనెలని భ్రమించి రేఁపఁబోయి, పాముల పడగలని తెలిపి, శీఘ్రముగా వీడి పోవునప్పుడు, అందముగాఁ బుష్పించిన కాఁదపువ్వులను జూచి పాములగుంపు లనెడి యనుమానముతో భయపడిన మనస్సులుగలవారయి సమీపింప జంకెదరు.

వి శే ష ము లు : పాములపడగలను జూచి తేనెలనియు, కాఁదపువ్వులను పాములగుంపు లనియు బోయతలు భ్రమించి రనుటచే నలంకారము భ్రాంతిమంతము. తేనులు - తేనెలు ? తేనియ కలదు గాని 'తేని' కానరాదు. తద్వనేచరియలు - వనేచరీ శబ్దమునకుఁ దత్సమ బహువచనరూపము - వనేచరులు - వనేచరియలు ఏమి ?, రాఁపఁబోవుచు - రాపఁబోవుచు ? రేఁపఁబోవుచు ?, వికీతచిత్తులై - ఇది పుంలింగ విశేషణము. ఇచ్చటఁ గర్త వనేచరియలు స్త్రీలు కావున 'విభీతచిత్తలై' యనియుండుట సముచితము, కాఁదపూవులు - వనపుష్పవిశేషములు. ఇవి వర్షర్తువునఁ బుష్పించును.

ఉ. జీఱికకల్లుఁ ద్రావి మదసింధురగామిను లన్ని కేరియల్
వాఱుచు గౌఁడుగీతములు పాడుచుఁ బొల్పుగఁ గ్రాలియాడుచున్
గోఱడమాడుచుం బతులకున్ వశవర్తులుగాక మేరకున్
మీఱుచు వన్నె కాంతలు రమింతురు తద్విపినాంతరంబునన్. 45

అ ర్థ ము : మద - సింధుర - గామినులు = మదించిన యేనుఁగులవలె నడచువారు (అగు), వన్నె - కాంతలు = విలాసవతులు, ('వన్యకాంతలు' - పాఠాంతరము - ఆటవికస్త్రీలు), జీఱికకల్లున్ = జీఱికచెట్టుకల్లును, త్రావి, అన్ని = మదించి, కేరియల్ + పాఱుచున్ = కేరింతలుకొట్టుచు, గౌఁడు - గీతములు = కల్లుగీసెడువారి పాటలు, పాడుచున్, పొల్పుగన్ = చక్కఁగా, క్రాలి = ఒప్పి, ఆడుచున్, కోఱడము + ఆడుచున్ = ప్రతికూల వచనములు పలుకుచు, పతులకున్ = భర్తలకు, వశ - వర్తులు - కాక = లోఁబడియుండక, మేరకున్ - మీఱుచున్ = హద్దుమీఱుచు, తద్ + విపిన + అంతరంబునన్ = ఆ యడవిలోపలి ప్రదేశమున, రమింతురు = క్రీడింతురు.

తా త్ప ర్య ము ; మదగజగామినులైన యా యాటవికస్త్రీలు జీఱిక కల్లుఁ ద్రావి, మత్తిల్లి, కేరింతలుకొట్టుచు, కల్లుగీఁతవారి పాటలు పాడుచుఁ బతులకుఁ బ్రతికూలవచనముల్ను పలుకుచు వారికి వశపడక మేరమీఱుచు ఆ యడవిలోఁ గ్రీడింతురు.

వి శే ష ము లు : అలంకారము స్వభావోక్తి. కేఱియల్ - కేరియల్. వన్నె కాంతలు - వన్యకాంతలని పాఠాంతరము. 'జీఱిక' - కల్లుతీయు నొకానొకచెట్టు.

వ. మఱియు నొక్కయెడ. 46

అర్థతాత్పర్యములు : మఱియు నొకచోట - తరువాతి పద్యముతో నన్వయము.

చ. పటికపుఱోలఁ ముల్వెదురుఁబ్రాలొగిఁ బోయుచు గౌరుకొమ్మురోఁ
కటఁ గొని దంచుచున్ శబరకామిని పెక్కులు రాగముల్ మదో
త్కటముగఁ బాడెఁ జుట్టిన మృగంబులు సోమ, మనుష్యరూప ధూ
ర్జటి మునిముఖ్యలోకగురు జంగమలింగము మల్లికార్జునున్. 47

అర్థము : శబర, కామిని = కిరాతస్త్రీ, పటికపు - ఱోలన్ = స్ఫటిక శిలానిర్మితమైన ఱోటియందు, ముల్ వెదురు + ప్రాలు = ముల్లు వెదురుబియ్యము, ఒగిన్ = లెస్సగా, పోయుచున్. గౌరు - కొమ్ము - రోఁకటన్ = ఏనుఁగుదంతపు రోఁకటితోఁ గొని, దంచుచున్, మనుష్యరూప ధూర్జటిన్ = మానవాకారుఁడైన శివుఁడును, ముని - ముఖ్య - లోకగురున్ = మునిశ్రేష్ఠుల సమూహమునకు గురుఁడైన వాఁడును. (అగు), జంగమ - లింగమున్ - మల్లికార్జునున్ = జంగమ మల్లికార్జునుని గూర్చి, పెక్కులు - రాగముల్ = అనేక రాగములు, మద + ఉత్కటముగన్ = మదాతిశయముతో, చుట్టిన - మృగంబులు = పరివేష్టించిన - చుట్టునున్న. లేడులు, సోమన్ = పరవశింపఁగా, పాడెన్.

తాత్పర్యము : కిరాతస్త్రీ పటికఱాతి ఱోటియందు ముల్లువెదురు బియ్యము లెస్సగాఁ బోయుచు నేనుఁగు దంతపు రోఁకటితో దంచుచు మనుష్యరూపమునమున్న శివుఁడును, మునిశ్రేష్ఠులగురువును అగు జంగమమల్లికార్జునునిగూర్చి చుట్టునున్న లేళ్లు పరవశించుచుండఁగాఁ బెక్కు రాగములు మదాతిశయముతోఁ బాడెను.

విశేషములు : అలంకారము స్వభావోక్తి. ప్రాలు - ప్రాయి బహువచన రూపము, ఇది బహువచనాంతముగానే ఈ యర్థమునఁ బ్రయోగింపఁబడుచున్నది. గౌరు- ఏనుఁగు 'గౌ రనంగఁ గరి యొప్పు'. ఆం.నామ.సం, పటికపు ఱోలు - పటికము + ఱోలు - 'కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బుంపులగు,' బాల. సంధి. 32. రోఁకటన్ - రోఁకలి + చేతను 'టివర్ణంబు గొన్నింటి యంత్యాక్షరం బున కాదేశం బును గొన్నింటి కంత్యాగమంబును గొన్నింటికిం బర్యాయంబున రెండును బ్రాయికం

బుగ నగు॰' బాల, అచ్చి॰ 31, రోఁకటి + చేతను, 'ఔపవిభక్తికముల తృతీయా సప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు.' బాల, అచ్చి॰ 38॰ రోఁకటి + అను 'అంద్వవగాగమంబులం దప్ప నపదాది స్వరంబు పదంబగునపు డచ్చునకు సంధి యగు' బాల. సంధి॰ 11, రోఁకటన్,

క. వేణుజ మౌక్తికములు దొడి
[1]వీనుల కింపెసఁగ నెఱుకు[2]వెలఁదులు ప్రీతిన్
వాణీధరుఁ బాడిరి గీ
ర్వాణాధిపభోగి భువనవంద్యు ననింద్యున్. 48

అర్థము : ఎఱుకు - వెలఁదులు = కిరాతస్త్రీలు, వేణుజ - మౌక్తికములు = వెదురునుండి పుట్టిన ముత్యములు, తొడి = ధరించి, గీర్వాణ + అధిప - భోగిన్ = దేవేంద్రునివలె భోగములు గలవాఁడును, భువన - వంద్యున్ = లోకములచేత నమస్కరింపఁ దగినవాఁడును, అనింద్యున్ = నిందింపఁదగనివాఁడును అగు, వాణీ-ధరున్ = వాణిని ధరించినవాఁడు - పండితుఁడు - అగు జంగమ మల్లికార్జునునిగూర్చి. వీనులకున్ = చెవులకు, ఇంపు + ఎసఁగన్ = సంతోష మతిశయించునట్లు, ప్రీతిన్ = ఇష్టముతో, పాడిరి.

తాత్పర్యము: : ఎఱుకతలు వెదురులనుండి పుట్టిన ముత్యములు ధరించి దేవేంద్రునివలె భోగియైనవాఁడును, లోకములచే నమస్కరింపఁదగినవాఁడును, నిందింపఁదగనివాఁడును అగు పండితుని - జంగమ మల్లికార్జునుని గూర్చి గానము చేసిరి.

వ. ఇట్లతి విచిత్రంబులగు శబరాలయంబులు గడచి చనిచని. 49

అర్థము : ఇట్లు, అతి - విచిత్రంబులు = మిక్కిలి ఆశ్చర్యకరములు, అగు, శబర + ఆలయంబులు = కిరాతుల గృహములు, కడచి = అతిక్రమించి, చని చని = పోయి పోయి,

---

1. గాణల. 2. ౘగన్నెలు,

తాత్పర్యము : ఇట్లు మిక్కిలి వింతలైన కిరాతుల గృహములు దాఁటి పోయి పోయి _ తరువాతి పద్యముతో నన్వయము.

చ. ఎలమిన పూరిమేసి, సెలయేఱుల నీరులు ద్రాగి, మేలి వెం
చల, నెలమావిజొంపములఁ, జల్లని నీడల నిల్చి, పొల్చి.మం
దలఁ గొని, నందిపోతులును దారును బేయలు సమ్మదంబునన్
గలసి రమించు ధేనువులఁ గాంచిరి తద్విపినాంతరంబునన్. 50

అర్థము : ఎలమిన = కనుపట్టిన, పూరి = గడ్డి, మేపి, సెలయేఱుల = సెలయేఱులందలి, నీరులు. త్రాగి, మేలి - వెంచలన్ = మేలయిన మడుఁగులందును. ఎలమావి జొంపములన్ - లేఁత మామిడిగుబురులందును, చల్లని - నీడలన్, నిల్చి, పొల్చి = ఒప్పి, మందలు + కొని = గుంపులుకూడి, నంది - పోతులును = ఎడ్లును, తారును - పేయలున్ = తామును పెయ్యలును, సమ్మదంబునన్ =సంతోషముతో, కలసి = కూడి, రమించు=క్రీడించు, ధేనువులన్ = ఆవులను, సతులు = పార్వతియు, నామెచెలికత్తెలును, తద్ + విపిన + అంతరంబునన్ = ఆ యడవి లోపల, కాంచిరి = చూచిరి.

తాత్పర్యము : కనుపట్టు గడ్డినిమేపి, సెలయేఱులందలి నీరుత్రాగి, మేలైన మడుఁగులందు, లేమావిగుబురులందుఁ జల్లని నీడల నిల్చి గుంపులుగూడి యెద్దులును బెయ్యలును సంతోషముతోఁ గూడి క్రీడించు ఆవులను బార్వతియు నామె చెలికత్తెలును ఆ యడవిలోపలిభాగమునఁ జూచిరి.

వ. తదనంతరంబ పత్రఫలపుష్పమూలనీవారకారవల్కలేధ్మకుశాహర ణార్థంబు విహరించుచున్న మునికుమారులం జూచుచు వచ్చి వచ్చి ముందటం బుష్పవాటికాంబుపరిషేచనైకలాలసలై విహరించుచున్న ఋషికుమారీసమూహంబుం గని వారి సహజ సౌందర్యరూపాతి శయంబునకు మెచ్చి శిరఃకంపంబు సేయుచు. 51

అర్థము : తద్ + అనంతరంబు + అ = ఆ తరువాతనే, పత్ర.... ణార్థంబు: పత్ర = ఆకులు, ఫల = పండ్లు. పుష్ప = పువ్వులు, మూల =

వేరులు, నీవార = నివ్వరిధాన్యము, కార = బలుసుకూర, వల్కల = నారచీరలు, ఇధ్మ = సమిధలు, కుశ = దర్భలు, అనువాని, ఆహరణ + అర్థంబు = తీసికొని వచ్చుటకు, విహరించుచున్ + ఉన్న = తిరుగుచున్న, ముని - కుమారులన్, చూచుచున్, వచ్చి, వచ్చి, ముందటన్ = ఎదుట, పుష్ప - వాటికా + అంబు పరిషేచన + ఏక - లాలసలు + ఐ = పుష్పోద్యానమును నీటితోఁ దడుపుటయందే ఆసక్తి గలవారయి, విహరించుచున్ + ఉన్న, ఋషి - కుమారీ - సమూహంబున్ = మునికన్యల సమూహమును, కని = చూచి, వారి - సహజ - సౌందర్య - రూప + అతిశయంబునకున్ = వారియొక్క సాజమైన అందముతోడి ఆకారముయొక్క గొప్పతనమునకు, మెచ్చి, శిరస్(శి) + కంపంబు + చేయుచున్ = తలయూఁపుచు.

తా త్ప ర్య ము : ఆ తరువాతనే ఆకులు, పండ్లు, పూలు, వేరులు, నివ్వరి, సమిధలు, దర్భలు అనువానిని దీసికొనిరా విహరించుచున్న మునికుమారులను జూచుచు వచ్చివచ్చి యెదుట పూలవనమును దడుపుటయందే మిక్కిలి యాసక్తిగలవారై విహరించు మునికన్యల సమూహమును జూచి వారి సహజ సౌందర్యమునకు మెచ్చి తలయూఁచుచు - తరువాతి పద్యముతో నన్వయము.

సీ. అనులేపనములు మండనములు లేకయు
భాసురాంగము లింత దేసి యగునె ?
లలితాంబరములు మేఖలలు లేకయు హారి
జఘనంబు లింత మాసరము లగునె ?
వరహారములుఁ బత్రవల్లికల్ లేకయు
వలిచన్నుఁగవ లింత చెలువ మగునె ?
భ్రూలతానటనంబు పొలపంబు లేకయు
విచలేక్షణము లింత రుచిర మగునె ?

తే. కమ్మనూనియ మెఱుఁగెక్కఁ గలయ దువ్వి
కురులు దీర్పకయును గచభరము లింత
పొలుచునే యని చూచె నా భూసురాధి
రాజకన్యలఁ బర్వతరాజకన్య. 52

అర్థము: అనులేపనములన్ = మైపూఁతలును, మండనములున్ = అలంకారములును, లేకయున్ = లేకున్నను, భాసుర + అంగములు = ప్రకాశించు నవయవములు, ఇంత, దేపి = మనోహరములు, అగునె?

లలిత + అంబరములున్ = సుందరములైన వస్త్రములును, మేఖలలున్ = మొలనూలులును, లేకయున్ = లేకున్నను, హారి - జఘనంబులు = మనోహరములైన, కటిప్రదేశములు, ఇంత, మాసరములు + అగునె = అందమైనవి యగునా?

వర - హారములున్ = మేలైన హారములును, పత్రవల్లికల్ = పత్రభంగములు, లేకయున్, వలి - చన్ను + కవలు = గుండ్రనివియగు చనుదోయులు, ఇంత - చెలువము + అగునె = ఇంత సుందరము లగునా?

భ్రూలతా - నటనంబు = బొమతీవల నాట్యముయొక్క, పొలపంబు = చలనము, లేకయున్, విచల + ఈక్షణములు = విశేషముగాఁ జలించు కన్నులు, ఇంత - రుచిరము + అగునె = మనోహరము లగునా?

కమ్మ - నూనియ = పరిమళముగల తైలము, మెఱుఁగు + ఎక్కన్ = ప్రకాశించునట్లు, కలయన్ = అంతటను, దువ్వి, కురులు = శిరోజములు, తీర్పకయును = చక్కదిద్దకున్నను. కచ - భరములు = కేశపాశములు, ఇంత - పొలుచునే = ఇంతగా నొప్పునా?

అని, పర్వత - రాజ - కన్య = పార్వతి, ఆ భూసుర + అధిరాజ - కన్యలన్ = బ్రాహ్మణశ్రేష్ఠుల - మునిశ్రేష్ఠుల కన్యలను, చూచెన్.

తాత్పర్యము: 'మైపూఁతలును, అలంకారములును లేకున్నను ప్రకాశించు నవయవము లింత మనోహరము లగునా? సుందరములైన వస్త్రములును, మొలనూలులును లేకున్నను అందమైన కటిప్రదేశము లింత అందముగా నుండునా!, మేలైనహారములును, పత్రరచనలును లేకున్నను గుండ్రనివగు చనుదోయి లింత యొప్పునా! బొమతీవల నాట్యములేకున్నను విశేషముగాఁ జలించు కన్ను లింత మనోజ్ఞము లగునా? పరిమళతైలములు మెఱుఁగెక్కునట్లు రాచి బాగుగా దువ్వి శిరోజములను జక్కదిద్దకున్నను కేశపాశము లింత యొప్పునా?' అని పార్వతి ఆ మునికన్యలను జూచెను.

విశేషములు: కారణములేకుండఁగనే కార్యము గలిగినట్లు చెప్పఁబడుటచే నలంకారము విభావన. 'విభావనా వినాపి స్యాత్కారణం కార్యజన్మ చేత్'. చన్ద్రా.

వ. తదనంతరంబ 53

అర్థతాత్పర్యములు: ఆ వెంటనే - తరువాతి పద్యముతో నన్వయము.

మ. వృతయూపాటవి, యాగ పావక శిఖావిర్భూత ధూమోత్థ రూ
షిత సంప్రాప్త మహీరుహప్రకర, ముత్క్షిప్త ప్రవర్గ్యాగ్ని రం
జిత, మభ్యర్చిత దేవతానికర, మాశ్లిష్టాగమాచార, మూ
ర్జిత పుణ్యంబు, మునీశ్వరాశ్రమముఁ గాంచెన్ గౌరి సంప్రీతితోన్. 54

అర్థము: గౌరి = పార్వతి.

వృత - యూప + అటవి = ఆవరింపఁబడిన - యజ్ఞ పశువును గట్టు కంబములుగల అడవి కలదియు, యాగ.... ప్రకరము: యాగ = యజ్ఞసంబంధమైన, పావక = అగ్నియొక్క శిఖా = జ్వాలలనుండి, ఆవిర్భూత = పుట్టిన, ధూమ = పొగలచే, ఉత్థ = వెలువడి, రూషిత = కప్పఁబడిన, సంప్రాప్త = పొందఁబడిన, - చేరువనున్న, మహీరుహ = చెట్లయొక్క, ప్రకరము = సమూహము గలదియు, ఉత్క్షిప్త - ప్రవర్గ్య + అగ్ని - రంజితము = ఎగఁజిమ్మఁబడిన ప్రవర్గ్యమను యాగ విశేష సంబంధమైన అగ్నిచేత రంగువేయఁబడినదియు, అభ్యర్చిత - దేవతా నికరము = పూజింపఁబడిన దేవతలయొక్క సమూహము గలదియు, ఆశ్లిష్ట + ఆగమ + ఆచారము = కూడికొన్న వేదవిహితమైన ఆచారములు గలదియు, ఊర్జిత - పుణ్యంబు = గొప్ప పుణ్యముగలదియు, అగు, ముని + ఈశ్వర + ఆశ్రమమున్ = మునిశ్రేష్ఠుల ఆశ్రమమును, సంప్రీతితోన్ = సంతోషముతో, కాంచెన్ = చూచెను.

తాత్పర్యము: యూపస్తంభములు గల అడవిచే నావరింపఁబడినదియు, యాగాగ్నిజ్వాలల పొగచేఁ గప్పఁబడిన సమీపవృక్ష సముదాయము గలదియు, ఎగఁజిమ్మఁబడిన ప్రవర్గ్యమను యాగము నగ్నిచే రంగువేయఁబడినదియు, పూజింపఁబడిన

దేవతల సమూహము గలదియు, పాటింపఁబడిన వేదవిహితాచారములు గలదియు, గొప్పపుణ్యముగలదియు నగు మున్యాశ్రమమును పార్వతి సంతోషముతోఁ జూచెను.

వ. కని తదీయతత్త్వ మహత్త్వంబులకు మెచ్చి వర్తించుచు. 55

అర్థము ; కని = చూచి, తదీయ - తత్త్వ - మహత్త్వంబులకున్ = ఆ మున్యాశ్రమముయొక్క స్వభావమునకును గొప్పతనమునకును, మెచ్చి, వర్తించుచున్ = ఉండుచు.

తాత్పర్యము : చూచి ఆ మున్యాశ్రమము తత్త్వమునకును, గొప్పతనమునకును మెచ్చి వర్తిలుచు - తరువాతి పద్యముతో నన్వయము.

సీ. భారతి నడపాడు పదగతు లన మెల్పు
దలకొని క్రాలు పదక్రమములు,
వాణి చేఁ బడి మ్రోయు వీణారవంబు నాఁ
గమనీయమగు సామగానములును,
భాషా కటాక్ష విభ్రమము నా మెఱుఁగారు
సదమల శబ్దార్థశాస్త్రములును,
వాగ్దేవి మంజుల వాక్యంబు లనఁగ నిం
పొదవిన సాహిత్యపదవిపొలుపు,

ఆ. రాజితంబుగా సరస్వతీ పీఠక
సదన మనఁగఁ దనరు సకలకళలు
సంతతంబు మూర్తిమంతంబులై విహ
రించుచుండు దివ్యఋషుల పల్లి. 56

అర్థము : సకల - కళలున్ = ఎల్ల విద్యలును, సంతతంబున్ = ఎల్లప్పుడును, మూర్తిమంతంబులు + ఐ = రూపుగాంచినవయి, విహరించుచున్ + ఉండు = వర్తిలుచుండునట్టి, దివ్య + ఋషుల - పల్లి = దివ్యులైన మునుల పల్లె.

భారతి = సరస్వతి, నడపాడు = సంచరించు, పద - గతులు + అనన్ = అడుగుల గమనములు అనునట్లు, మెల్పు = సౌకుమార్యము. తలకొని = కలిగి. క్రాలు = ఒప్పునట్టి, పద - క్రమములున్ = వేదమంత్రముల పదవిభాగగతులును,

వాణి = సరస్వతియొక్క, చేన్ = చేతియందు. పడి. మ్రోయు, వీణా - రవంబు + నాన్ = వీణాధ్వని యనఁగా. కమనీయము + అగు = మనోజ్ఞమైన. సామ-గానములును = సామవేదపు గానములును,

భాషా - కటాక్ష - విభ్రమము - నాన్ = వాగ్దేవియొక్క క్రీఁగంటిచూపుల యొక్క విలాసము అనఁగా, మెఱుఁగు + ఆరు = మిక్కిలి ప్రకాశించు, సదమల (సత్ + అమల) = మిక్కిలి పవిత్రమైన, శబ్ద + అర్థ - శాస్త్రములును = శబ్దములయు. అర్థములయు శాస్త్రములును,

వాగ్దేవి = సరస్వతీదేవియొక్క. మంజుల = మనోహరములైన. వాక్యంబులు. అనఁగన్, ఇంపు + ఒదవిన = మనోహరమైన, సాహిత్య - పదవి - పొలుపున్ = సాహిత్య మార్గముయొక్క ఒప్పును.

రాజితంబుగాన్ = ప్రకాశింపఁగా, సరస్వతీ - పీఠక - సదనము + అనఁగన్ = సరస్వతీ పీఠముగల ఆలయము అనఁగా, తనరున్ = ఒప్పును.

తాత్పర్యము : సకలవిద్యలును ఎల్లప్పుడును రూపుగాంచి విహరించుచుండెడు దివ్యమునులపల్లె - సరస్వతి యడుగుల గమనములో యన సౌకుమార్యము గలిగి యొప్పు వేదమంత్రముల పదగతులును- వాణిచేతియందుండి మ్రోయు వీణా నాదమోయన మనోజ్ఞములైన సామవేద గానములును, భాషాదేవి క్రీఁగంటిచూపుల విలాసమో యన మిక్కిలి ప్రకాశించు అతి నిర్మలములైన శబ్దార్థముల శాస్త్రములును- సరస్వతీదేవి మనోహరములైన వాక్కులో యన నింపొందు సాహిత్యమార్గము నొప్పును - ప్రకాశింపఁగా సరస్వతీ పీఠమునకు నిలయ మన నొప్పును.

విశేషములు ; అలంకార ముత్ప్రేక్ష. తదనుప్రాణితమైన ఉపమ.

క. ఎలుకలుఁ బిల్లులు, లేళ్లం
బులులు, మదేభములు సింహములుఁ, గప్పలుఁ బా
ములు. గువ్వలు డేఁగలుఁ, బిక
ములుఁగాకులుఁ గూడియాడు మునిపల్లి వడిన్. 57

అర్థము : ఎలుకలున్ + పిల్లులున్, వేళ్ళన్ + పులులున్, మద + ఇభము లున్ = మదపుటేనుఁగులును, సింహములున్, కప్పలున్ + పాములున్, గువ్వలున్ = పావురములును, డేఁగలున్, పికములున్ = కోకిలములును, కాకులున్, ముని పల్లె = మునులపల్లెయొక్క, వడిన్ = శక్తిచేత, కూడి + ఆడున్=కలిసి వర్తించును.

తాత్పర్యము : పరస్పర సహజవైరముగల ఎలుకలును పిల్లులును, లేళ్ళను పులులును, మదపుటేనుఁగులును సింహములును, కప్పలును పాములును, గువ్వలును డేఁగలును, కోకిలములును కాకులును మునిపల్లెశక్తిచేఁ గలిసి వర్తిలును.

వ. ఇట్టి మునిపల్లి చొత్తెంచు సవసరంబున. 58

అర్థము : ఇట్టి, మునిపల్లి, చొత్తెంచు = ప్రవేశించు, అవసరంబునన్ = సమయమున

తాత్పర్యము : ఇట్టి మునిపల్లి ప్రవేశించునప్పుడు - తరువాతి పద్యముతో నన్వయము.

చొత్తెంచు నవసరంబునన్ = చొత్తెంచు + అవసరంబునన్ - 'ఉదంతమగు తద్ధర్మార్థ విశేషణమున కచ్చు పరంబగునపుడు నుగాగమం బగు.' బాల.సం, 33

క. దూషిత కుతర్క వాదులు,
భూషిత షట్తర్కు. లఖిల బుధ వినుతులు, వి
ద్వేషిత దోషులు. సతతా
న్వేషిత సన్మార్గు, లఖిల విద్యానిపుణుల్. 59

అర్థము : దూషిత - కుతర్కవాదులు = నిందింపఁబడిన కుతర్కముతో వాదించువారుగల వారును. భూషిత - షట్ + తర్కులు = ప్రశంసింపఁబడిన ఆఱు విధములైన తర్కములు గలవారును. అఖిల - బుధవినుతులు = ఎల్ల పండితులచే విశేషముగాఁ బొగడఁబడువారును, విద్వేషిత - దోషులు = విశేషముగా ద్వేషింపఁ బడిన దోషములు గలవారును, సతత + అన్వేషిత - సత్ + మార్గులు = ఎల్లప్పుడును అన్వేషింపఁబడిన సన్మార్గముగల వారును, అఖిల - విద్యా - నిపుణుల్ = ఎల్ల విద్యలందును నేర్పుగలవారును.

తాత్పర్యము : కుతర్క వాదులను దూషించువారును, అనునిధమునైన తర్కములు గలవారిని ప్రశంసించువారును, ఎల్ల పండితులచే విశేషముగాఁ బొగడఁబడువారును, దోష (దోషము) లను విశేషముగా ద్వేషించువారును, ఎల్లప్పుడును మంచి మార్గమును వెదకువారును, ఎల్లవిద్యలందును నేర్పరులును - ఈ విశేషణములు 64 వ వచనములోని 'దివ్యర్షిగణములు' అనుదానితో నన్వయించును.

క. శిష్టాచారులు, బోధా
శ్లిష్టాత్మకు, లనఘు, లఖిలసేవ్యులు సకలా
భీష్ట విరక్తులు, మౌనులు,
స్రష్ట్రన్వయకరులు, సద్విచారులు, ధీరుల్. 60

అర్థము ; శిష్ట + ఆచారులు = మంచినడవడి కలవారు, బోధ + ఆశ్లిష్ట = ఆత్మకులు = జ్ఞానముతో విశేషముగాఁ గూడిన ఆత్మకలవారును, అనఘులు = పాపరహితులును, అఖిల - సేవ్యులు = ఎల్లరచే సేవింపఁదగినవారును, సకల + అభీష్ట - విరక్తులు = ఎల్ల కోరికలందును రక్తిలేనివారును, మౌనులు = మౌనవ్రతము గలవారును, స్రష్టృ + అన్వయకరులు - బ్రహ్మయొక్క వంశమును - బ్రాహ్మణవంశమును జేయువారును, సత్ + విచారులు = మంచి ఆలోచన గలవారును- ధీరుల్ = ధైర్యము గలవారును.

తాత్పర్యము : సదాచారులును, జ్ఞానసంపన్నులును, పాపరహితులును, సకలసేవ్యులును, సర్వాభీష్టములందును విరక్తులైనవారును, మౌనవ్రతము గలవారును, బ్రాహ్మణవంశకరులును, సద్విచారులును, ధీరులును - అగు దివ్యర్షిగణములు.

క. నిష్ఠాపరు, లురు వేదా
నుష్ఠాన సమాచరులు, మనోహరులు మహః
శ్రేష్ఠాత్మకు, లమలులు, పర
మేష్ఠి సములు, సర్వసత్త్వ మిత్రులు, పాత్రుల్. 61

అర్థము : నిష్ఠా - పరులు = నియమములందు ఆసక్తిగలవారును, ఉరు - వేద + అనుష్ఠాన - సమాచరులు = గొప్పదియగు వేదవిహితమైన అనుష్ఠానము

నాచరించువారును, మనస్ (స్) + హరులు = మనస్సును హరించువారును - మనస్సును జయించువారును. మహత్ (మహా) - శ్రేష్ఠ + ఆత్మకులు = మిక్కిలి శ్రేష్ఠమైన ఆత్మగలవారును, అమలులు = నిర్మలులును, పరమేష్ఠి - సములు = బ్రహ్మ సమానులును. సర్వ - సత్త్వ మిత్రులు = ఎల్ల సత్త్వగుణమునకును - ప్రాణులకును, మిత్రులైనవారును,

తాత్పర్యము : నిష్ఠాపరులును, వేదవిహితానుష్ఠానమును లెస్సగా నాచరించువారును, మనస్సును జయించినవారును. మిక్కిలి శ్రేష్ఠులును, నిర్మలులును. బ్రహ్మసమానులును, సకల సత్త్వమునకును - ప్రాణులకును మిత్రులైనవారును, పాత్రతగలవారును - అగు దివ్యర్షి గణములు.

క. దుష్కర్మ చరణ కుజన బ
హిష్కారపరుల్, సదా మహేశ్వర తత్త్వా
విష్కృత బుద్ధులు. సిద్ధులు,
నిష్కళ చారిత్రపరు, లనింద్యులు, వంద్యుల్. 62

అర్థము : దుష్కర్మ - చరణ - కుజన - బహిష్కార - పరుల్ = చెడు పనుల నాచరించు దుర్జనుల వెలివేతయం దాసక్తిగలవారును, సదా - మహేశ్వర - తత్త్వ + ఆవిష్కృత - బుద్ధులు = ఎల్లప్పుడును, పరమేశ్వరతత్త్వముచే నావిష్కరింపఁబడిన బుద్ధిగలవారును, సిద్ధులు = సిద్ధిపొందినవారును. నిష్కళ - చారిత్ర - పరులు = నిష్కపటమైన నడవడియందు ఆసక్తిగలవారును, అనింద్యులు = నిందింపఁదగనివారును, వంద్యుల్ = నమస్కరింపఁదగినవారును.

తాత్పర్యము : దుష్కర్మముల నాచరించు దుర్మార్గులను బహిష్కరించుటయం దాసక్తిగలవారును, ఎల్లప్పుడును బరమేశ్వరతత్త్వము నావిష్కరించు బుద్ధిగలవారును, సిద్ధిపొందినవారును, నిష్కపటమైన చరిత్రగలవారును, అనింద్యులును, నమస్కరింపఁదగినవారును - అగు దివ్యర్షిగణములు,

క. కృష్ణాజినోత్తరీయులు,
తృష్ణాచారాపహరులు, కృతకృత్యులు, శ్రీ
కృష్ణోదితార్చకులు, గత
తృష్ణాంతఃకరణపరులు, దివ్యులు, భవ్యుల్. 63

అర్థము : కృష్ణ + అజిన + ఉత్తరీయులు = నల్లని యిఱ్ఱిచర్మము ఉత్తరీయముగాఁ గలవారును. కృష్ణ + ఆహార + అపహాసులు = పాపకర్మములను హరించువారును, కృతకృత్యులు = కృతార్థులైనవారును, శ్రీకృష్ణ + ఉదిత + అర్చకులు = శ్రీకృష్ణునియందుఁ గలిగిన పూజ గలవారును - శ్రీకృష్ణుని బూజించు వారును. గత-తృష్ణా + అంతఃకరణ - పరులు = పోయిన ఆశకల అంతఃకరణము గలవారును. దివ్యులు = అమానుషులును, భవ్యుల్ = యోగ్యులును.

తాత్పర్యము : నల్లయిఱ్ఱితోలు ఉత్తరీయముగాఁ గలవారును, పాపకర్మములను హరించువారును, కృతార్థులైనవారును, శ్రీకృష్ణునిఁ బూజించినవారును, తృష్ణలేని మనస్సు గలవారును, దివ్యులును, యోగ్యులును అగు దివ్యర్షిగణములు.

వ. అనంబరఁగు దివ్యర్షిగణంబులందు. 64

అర్థము : అనన్ + పరఁగు = అననొప్పునట్టి, దివ్య + ఋషి - గణంబుల + అందున్ = దివ్యులైన మునుల సమూహములందు.

తాత్పర్యము : అననొప్పునట్టి దివ్యమునుల సమూహములందు - తరువాతి పద్యముతో నన్వయము.

సీ. వడి మోక్షమార్గంబు విడువక నడతు న
న్నతఁ డేల లోకులగతిఁ జరించు ?
ననిశంబుఁ బరమాత్మ నాత్మఁగూరెతు నాతఁ
డొరుల సంగతి నేల పొరసియుండు ?
ననుపమ ముక్త్యంగనాధీశుఁడుగఁ గోరు
నతఁ డేల కుజనుల సతుల కోఱుగుఁ ?
బరమ యోగామృత వర రస సేవనఁ
దవులువాఁ డే లొండుచవుల కెఱఁగు ?

ఆ. నోటువడు శరీర మొల్ల నన్వాఁడు దే
హేంద్రియంబు లిచ్చ లేల చలపుఁ ?
గర్మరహిత యోగ నిర్మలచరితుండు
పురుషుఁ డేల క్రియలఁ బొందు నెందు ? 65

అర్థము : ఎందున్ = ఎచ్చటను, వడిన్ = వేగముగా, మోక్ష - మార్గంబున్ = మోక్షపుఁద్రోవను, విడువక, నడతున్ = నడచెదను, అన్న + అతఁడు = అనినవాఁడు, లోకుల - గతిన్ = లోకమున సున్నవారి విధమున, ఏల = ఎందులకు, చరించున్ = తిరుగును ?

అనిశంబున్ = ఎల్లప్పుడును, పరమాత్మన్, ఆత్మన్ = మనసునందు, కూరెడు + అతఁడు = నింపువాఁడు, ఒరుల - సంగతిన్ = ఇతరుల సాంగత్యమును, ఏల, పొరసి + ఉండున్ = పొందును ?

అనుపమ - ముక్తి + అంగనా + అధి + ఈశుఁడుగన్ సాటిలేని, ముక్తియను కాంతకు భర్తయగుటకు, కోరు + అతఁడు = కోరువాఁడు, కుజనుల - సతులకున్ = భూమియందలి జనుల స్త్రీలకు, ఒఱగున్ = ఆసక్తి గలవాఁడగును ?

పరమ - యోగ + అమృత - వర - రస - సేవనన్ = ఉత్కృష్టమగు యోగమనెడి అమృతరసమును సేవించుటయందు, చవులువాఁడు = ఆసక్తివహించువాఁడు. ఒండు - చవులకున్ = ఇతర రుచులకు. ఏల, ఎఱఁగున్ = వంగును - ఆసక్తివహించును ?

ఓటు + పడు - శరీరము = భంగపడునట్టి. దేహము. ఒల్లన్ + అన్ + వాఁడు = ఇష్టపడననువాఁడు, దేహ + ఇంద్రియంబుల = శరీరము, ఇంద్రియముల అనువాని, ఇచ్చలు = కోరికలు, ఏల, చలుపున్ = చేయును?

కర్మ - రహిత - యోగ - నిర్మల - చరితుండున్ = నిష్కర్మమైన యోగముచేఁ బవిత్రమైన నడవడిగలవాఁడు, అగు, పురుషుఁడు, క్రియలన్ = కర్మములను, ఏల, పొందున్.

తాత్పర్యము : ఎచ్చటను - మోక్షమార్గమును వీడక వర్తింతుననువాఁడు లోకమునందలి వారివలె నేల చరించును ? ఎల్లప్పుడును పరమాత్మను ఆత్మలో నింపువాఁడు ఇతరుల సాంగత్యము నేల పొందియుండును ? నిరుపమమైన ముక్తికాంతకధీశుఁడు గాఁ గోరువాఁడు భూజనుల స్త్రీలయం దేల ఆసక్తిఁ జూపును ? పరమయోగమనెడి అమృతరసమును సేవించుటయం దాసక్తి గలవాఁడు ఇతరరుచుల కేల మరగును? భంగపడు శరీరము నొల్లననువాఁడు దేహేంద్రియములను, కోరికలను ఏల ఆచరించును? నిష్కర్మయోగముచే నిర్మలమైన వర్తనముగలవాఁడు కర్మముల నేల యాచరించును?

విశేషములు : అన్నతఁడు = అనిన + అతఁడు, 'పద్యాదుల సవర్ణకంబున కత్వంబును గఢహల్లునకు ద్విత్వంబును విభాషనగు.' బాల. క్రియ. 51, అన్న + అతఁడు. 'అత్తునకు సంధి బహుళముగా నగు.' బాల. సంధి. 4, అన్నతఁడు. కూరెడు నాతఁడు - కూరెడు + ఆతఁడు - 'ఉదంతమగు తద్ధర్మార్థవిశేషణమున కచ్చు పరమగు నపుడు నుగాగమంబగు.' బాల. సంధి. 33, ముక్త్యంగనా - ముక్తి + అంగనా. యణాదేశసంధి. 'ఇ ఉ ఋ ౡ లకు అసవర్ణములైన అచ్చులు పరములగునపుడు క్రమముగా య్, వ్, ర్, ల్ లు ఆదేశము లగును.' - ముక్తియనెడు అంగన - రూపకము. పరమయోగామృత - పరమయోగమనెడి అమృత - రూపకము. అన్వాఁడు - అను + వాఁడు - 'అను కొను లోనగు ధాతుజవిశేషణముల యంత్యోకారమునకు హల్లు పరంబగునపుడు లోపంబు వైకల్పికంబు.' ప్రౌఢ. సంధి. 13. దేహేంద్రియంబు లిచ్చలు = దేహేంద్రియంబుల + ఇచ్చలు - 'అత్తునకు సంధి బహుళముగా నగు.' బాల. సంధి. 4.

చ. అనయము రక్తపూరములు, నస్థులు, మేదము, మూత్రవిష్ఠలుం
దనరు జరారుజాలియును, దామసవృత్తి, భయాతురాదులుం
బెనఁగిన దుఃఖపుంజమగు ప్రేతము సొచ్చి మునింగి మర్త్యుఁ డీ
తనువునఁ బొంద రోయఁ డకటా! తా నరకస్థితి కేమి రోసెడిన్. 66

అర్థము : అనయమున్ = ఎల్లప్పుడును, రక్త - పూరములున్ = రక్త ప్రవాహములును. అస్థులున్ = ఎముకలును, మేదమున్ = మేదస్సును (సప్తధాతువులలో నొకటి), మూత్ర విష్ఠలున్ = మూత్రమును, మలమును. తనరు = కలుగునట్టి, జరా - రుజా + ఆలియును = ముసలితనమును, రోగముల వరుసయును. తామస - వృత్తి = తమోగుణము. భయ + ఆతుర + ఆదులున్ = భయము, వ్యాధి మున్నగునవియును, పెనఁగిన = కూడిన, దుఃఖ - పుంజము + అగు = దుఃఖముల సమూహము, అగునట్టి, ప్రేతము = కళేబరము. చొచ్చి = ప్రవేశించి, మునింగి, మర్త్యుఁడు = మనుష్యుఁడు, ఈ - తనువునన్ = ఈ దేహమునందు, పొందన్ = పొందుటకు, రోయఁడు + అకటా = అసహ్యించుకొనఁడఁట, తాన్ = తాను, నరక - స్థితికిన్ = నరకలోకమునందు దునికికి. ఏమి - రోసెడిన్ - ఏమి అసహ్యించుకొనును?

తాత్పర్యము : ఎల్లప్పుడును రక్తప్రవాహములును, ఎముకలును, మేదస్సును, మూత్రమును, మలమును, మునలితనమును, రోగములును, దమోగుణమును, భయమును, వ్యాధిపీడ అను వానితోఁగూడిన దుఃఖసముదాయమైన కళేబరమును జొచ్చి, మునిఁగి మనుష్యుఁడు ఈ దేహమునఁ బొందుటకు అసహ్యించుకొనఁ దనఁగా నిఁక నరకలోకమువం దునికి కేమి అసహ్యించుకొనునుః అసహ్యించుకొనఁడని భావము.

విశేషములు : అలంకారము కావ్యార్థాపత్తి. 'కైముత్యే నార్థసంసిద్ధిః కావ్యార్థాపత్తి రిష్యతే.' చన్ద్రా.

క. విని చెవుల, ముట్టి తోలం,
గని కన్నుల, నమలి నాలుకను, మూర్కొని ము
క్కునఁ బురుషుఁ డెఱుఁగు మనమా
రను శబ్ద స్పర్శ రూప రస గంధంబుల్. 67

అర్థము : పురుషుఁడు, చెవులన్ = చెవులతో, విని, తోలన్ = చర్మముతో, ముట్టి = తాఁకి, కన్నులన్ = కన్నులతో, కని = చూచి, నాలుకను = నాలుకతో, నమలి, ముక్కునన్ = ముక్కుతో, మూర్కొని = ఆఘ్రాణించి, మనమారను (మనము + ఆరను) = మనస్సు తృప్తిగా, శబ్ద స్పర్శ రూప రస గంధముల్ = శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము అనునవి, ఎఱుఁగున్.

తాత్పర్యము : మనుష్యుఁడు చెవులతో విని, చర్మముతో స్పృశించి, కన్నులతోఁ జూచి, నాలుకతో నమలి, ముక్కుతో నాఘ్రాణించి మనసార వరుసగా శబ్ద స్పర్శ రూప రస గంధముల నెఱుఁగును.

విశేషములు : తోలన్ - తోలుశబ్ద మౌపవిభక్తికముగాఁ బ్రయుక్తమైనది. ఇది దాని తృతీయైకవచనరూపము - తోలితో నని యర్థము. తోలు + చేతను - 'ఔపవిభక్తికముల తృతీయాసప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు.' బాల అచ్చిక. 38. తోలు + అను - 'అంద్వగాగమంబులం దప్ప నపదాదిస్వరంబు పరంబగు నప్పు డచ్చునకు సంధి యగు'. బాల. సంధి. 11. తోలన్. అలంకారము యథాసంఖ్యము.

క. చక్షు మదనేంద్రియములు ము
ముక్షులు మదిగెలుతు రెఱిఁగి మును శ్రోత్ర త్వ
క్చక్షు ర్జిహ్వా ఘ్రాణ స
పక్షగవా క్పాణి పాద పా యూపస్థల్. 68

అర్థము : ముముక్షులు = మోక్షమును గోరువారు. మును = ముందు. శ్రోత్ర - త్వచ్(క్) + చక్షుస్(ః) + జిహ్వా + ఘ్రాణ సపక్షగ + వాచ్(క్) + పాణి - పాద - పాయు + ఉపస్థల్ = చెవులు, చర్మము, కన్నులు, నాలుక, ముక్కు అనువానివి, వాక్కు, చేతులు, పాదములు, గుదస్థానము, రహస్యావయవము అను వానిని, ఎఱిఁగి, చక్షు - మదన + ఇంద్రియములు = కన్నులు. మన్మథవికారమును గలిగించు నింద్రియములు. మదిన్ = మనస్సునందు గెలుతురు.

తాత్పర్యము : మోక్షము నిచ్ఛించువారు ముందుగా చెవులు, చర్మము, కన్నులు, జిహ్వ, ముక్కు అనువానిని, వాక్కు, పాణులు, పాదములు, గుదస్థానము, రహస్యావయవములు తెలిసికొని చక్షువును, మన్మథుని. ఇంద్రియములను జయింతురు.

విశేషములు : సకారాంతమైన చక్షుశ్శబ్ద మిట ఉకారాంతముగాఁ బ్రయుక్త మగుట విశేషము. చక్షు ర్మదనేంద్రియములు అని యుండనగును. ముముక్షులు = మోక్షమును గోరువారు, ముచ్ ధాతు సన్నంత కర్త్రర్థకరూపము. మోక్తు మిచ్ఛన్తి ఇతి ముముక్షవః. - ముముక్షులు - ముముక్షువులు, 'వువర్ణకేతర విభక్తి పరమగుచో నుకారాంతంబులకు బహుళంబుగా గోశబ్దంబునకు నిత్యంబుగా వుగాగమం బగు.' బాల.త. 49. ఇది వుగాగమ రహితరూపము. చక్షుర్జిహ్వా - చక్షుస్ + జిహ్వా - పదాంత సకారమునకు విసర్గాదేశము. చక్షుః + జిహ్వా. అ ఆలు తప్పఁ దక్కిన అచ్చుల తరువాతవచ్చు విసర్గమునకు అచ్చులుకాని మృదుహల్లులు (హశ్శులు) కాని పరములగునపుడు రేఫమాదేశమగును. చక్షుర్జిహ్వా.

ఆ. అనుభవించి తనిసి యట మఱి విషయముల్
విడుతు నని తలంచు వెడఁగుఁదలఁపు
లఖిల శిఖి శిఖాలియం దింధనాజ్యముల్
గమియమైచి యార్పఁ గడఁగునట్లు. 6

అర్థము : అనుభవించి, తనిసి = తృప్తి నొంది, అటన్, మఱి, విషయ ముల్ = ఇంద్రియములు, విడుతున్ + అని = విడిచెదనని, తలంపు, వెడఁగు+ తలఁపులు = వెఱ్ఱి యాలోచనలు, అఖిల - శిఖి - శిఖా + ఆలి యందున్ = ఎల్ల అగ్నిజ్వాలల సమూహమునందు, ఇంధన + ఆజ్యముల్ = కట్టెలును, నేయియును, కమియన్ - పైచి = ఎక్కువగా పైచి, ఆర్పన్ + కడఁగు + అట్లు = ఆర్పఁ బూను విధము.

తాత్పర్యము : అనుభవించి, తృప్తిపడి ఆ తరువాత నింద్రియములను విడుతునని తలఁచు వెఱ్ఱి యాలోచనలు అగ్నిజ్వాలలందు అధికముగాఁ గట్టెలును, నేయియును వేసి యార్పుటకుఁ బూనునట్లు.

విశేషములు : అలంకార ముపమ. కట్టెలను, నేయియును వేసిన పిమ్మట అగ్నినార్పుట యెంతకష్టమో తృప్తిగా అనుభవించిన పిమ్మట నింద్రియము లను విడుచుటయు నంతకష్టమనుట.

చ. తలఁ కఱ నిల్చి, శాంత మెదఁ దాల్చి, మమత్వము మాల్చి, ధైర్య మి
ట్టలముగఁ బెంచి, మోహము లడంచి, యఘావలిఁ ద్రుంచి, కోర్కి య
గ్గలముగ మాన్చి, యీషణలఁ గ్రాఁచి సదాశివుఁ గొల్చి యాత్మలో
పల ననురక్తి నిశ్చలత భక్తిఁ దలంచిన ముక్తి చేకుఱున్. 70

అర్థము : తలఁకు + అఱన్ = చాంచల్యములేక, నిల్చి, శాంతము, ఎదన్ = హృదయమునందు, తాల్చి, మమత్వమున్ = నాది యను భావమును, మాల్చి = నశింపఁజేసి, ధైర్యము, ఇట్టలముగన్ = అధికముగా, పెంచి = వృద్ధి పొందించి, మోహములు = వలపులు, అడంచి = అణఁచిపైచి, అఘ + ఆవలిన్ = పాపములవరుసను, త్రుంచి = ఖండించి, నశింపఁజేసి, కోర్కి = కోరిక, అగ్గలము గన్ = అధికముగా, మాన్చి = లేకుండఁజేసి, ఈషణలన్ = కోరికలను - దారేషణ, పుత్రేషణ, ధనేషణ అనువానిని, క్రాఁచి = నశింపఁజేసి, సదాశివున్ = పరమేశ్వరుని, కొల్చి = సేవించి, ఆత్మలోపలన్ = మనసులోపల, అనురక్తి - నిశ్చలతన్ = అనురాగముయొక్క స్థిరత్వముతో, భక్తిన్=భక్తితో, తలంచిపన్ = తలఁచినచో, ముక్తి = మోక్షము, చేకుఱున్ = లభించును.

తాత్పర్యము : చాంచల్యములేక నిలిచి, హృదయమున శాంతమును దాల్చి, మమతను నశింపఁజేసి, ధైర్యము నధికముగాఁ బెంచి, పాపములను ఖండించి, కోరికలను లేకుండఁజేసి, ధనదార పుత్రేషణలను విడనాడి, పరమేశ్వరుని గొల్చి ఆత్మలో నిశ్చలమైన అనురక్తి భక్తులతో ధ్యానించినచో మోక్షము లభించును.

తరుపద. హృదయాంబుజములోన నెప్పుడుఁ బాయ
కేర్పడి వెలుఁగు మాహేశ్వర రూప
మది పరంజ్యోతి సదాభ్యాసవృత్తి
యంద చిత్తంబు లయంబు గావించు
నది భావభావ్యంబు లడఁగిన మఱి ని
జాకారుఁడగు పరమాత్ముఁడు దాన
పదిలమై నిలుచు నిర్బంధమై నిష్ప్ర
పంచమై నిర్వాణ పదవి దా నదియు. 71

అర్థము : హృదయ + అంబుజములోనన్ = పద్మమువంటి హృదయము నందు, ఎప్పుడున్, పాయక - విడువక, ఏర్పడి. వెలుఁగు = ప్రకాశించు, మహేశ్వర-రూపము = పరమేశ్వరుని రూపు, అది, పరంజ్యోతి = ఉత్కృష్టమైన జ్యోతి, సదా + అభ్యాస - వృత్తి + అందున్ + అ = నిరంతరమును అభ్యాసముచేయు ప్రవృత్తియందే. చిత్తంబున్ = మనస్సును, లయంబు + కావించునది = లీనము గావింపవలయును, భావ - భావ్యంబులు = భావమును, భావింపఁదగినదియు, అడఁగి నన్ = నశించినచో, మఱి, నిజ + ఆకారుఁడు + అగు = తనదైన ఆకారము గలవాఁడగు, పరమాత్ముఁడు, తాను + అ = తానే, పదిలము + ఐ = స్థిరమయి, నిర్బంధము + ఐ = బంధరహితమై, నిష్ప్రపంచము + ఐ = వైవిధ్యము లేనిదయి, నిలుచున్, తాను + అదియున్, నిర్వాణ - పదవి = మోక్షమార్గము,

తాత్పర్యము : హృదయపద్మములో నిరంతరమును వెలుఁగు పరమేశ్వర రూపము పరంజ్యోతి. సదాభ్యాసప్రవృత్తితో మనస్సు లీనము గావింపవలయును, భావము, భావ్యము అడఁగినచో పరమాత్ముఁడు స్వస్వరూపముతో స్థిరముగను, బంధ రహితముగను, వైవిధ్యములేకుండఁగను నిలుచును, అదియే మోక్షము.

విశేషములు: తరుపద - నాలుగుపాదము లుండును. ఒక్కొక్క పాదమునను మూఁ డింద్రగణములు, ఒక సూర్యగణము, మరల మూఁ డింద్రగణములు నొక సూర్యగణము ఉండవలయును. మొదటిగణము మొదటియక్షరమునకు, మూఁడవ గణము మొదటి యక్షరమునకు, అయిదవగణము మొదటియక్షరమునకు, ఏడవగణము మొదటియక్షరమునకు యతిమైత్రి, ప్రాసనియమము గలదు. దీని లక్షణము తరువోజ లక్షణముతో సమముగ నున్నది.

సీ. భావించి మెచ్చింపఁగా వచ్చు నంచమే
వగవ భావంబు భావ్యంబుఁ దాన;
ప్రణుతించి మెచ్చింపఁ బడయుద మంచమే
తనర శబ్దంబు నర్థంబుఁ దాన;
పూజించి మెచ్చింపఁ బోలుఁబో మ్మందమే
తగిన కర్మంబుఁ గర్తయును దాన;
కాన మనస్సు వాక్కాయ కర్మంబులు
శివునియంద నిలిపి చిత్తవృత్తిఁ

ఆ. దన్ను శివునికంటె నన్యంబు గాకుండు
టెఱిఁగి తలరకుండు టిదియె ముక్తి;
కాన మోక్షమొందు కర్మమార్గంబునఁ
బడయఁగడఁగు టెల్ల భ్రాంతి కాదె? 72

అర్థము: భావించి = భావమునందుంచి. మెచ్చింపఁగాన్ + వచ్చున్ + అందమే = సంతోషింపఁ జేయవచ్చు నందమా, వగవన్ = చింతింపఁగా, భావంబున్ - భావ్యంబున్ = భావించునదియు, భావింపఁదగినదియు, తాను + అ = తానే.

ప్రణుతించి = సంస్తుతిచేసి, మెచ్చింపన్ + బడయుదము + అందమే = మెప్పింపఁగలుగుదు మందమా, తనరన్ = ఒప్పఁగా, శబ్దంబున్ + అర్థంబున్ శబ్దార్థములు రెండును, తాను + అ = తానే.

పూజించి, మెచ్చింపవన్ + పోయిన్ + బొమ్మ = అందమే + మెప్పింపఁ దగుమ బొమ్మందమా, తగిన, కర్మంబున్ + కర్తయును = ఫలాశ్రయమును, వ్యాపారాశ్రయమును, తాను + అ.

కానన్ = కావున, మనస్సు, వాక్ + కాయ - కర్మంబులు = వాక్కును, శరీరమును, క్రియయును, శివుని + అందున్ + అ = శివునియందే, నిలిపి, చిత్తవృత్తిన్ + మనస్సునందు, తన్నున్. శివునికంటెన్. అన్యంబు = వేఱు, కాక + ఉండుట = కాకపోవుట, ఎఱిఁగి, తలరక + ఉండుడు = చలింపకుండుట, ఇదియె, ముక్తి,

కానన్, మోక్షము, ఒండు - కర్మ - మార్గంబునన్ = వేఱొక కర్మమార్గముచే, పడయన్ + కడఁగుట + ఎల్లన్ = పొందయత్నించుట అంతయును, భ్రాంతి - కాదె = భ్రమముకాదా?

తా త్ప ర్య ము : భావించి సంతోషింపఁజేయవచ్చునందమేని, భావభావ్యములు, రెండును దానే. సంస్తుతిచేసి మెప్పింపఁగలుగుడు మందమేని. సంస్తుతికి వలయు శబ్దార్థములు రెండును దానే, పూజించి మెప్పింపఁబోలు నందమేని. ఫలవ్యాపారాశ్రయములు రెండును దానే. కావున మనోవాక్కాయకర్మములు శివునియందే నిలిపి చిత్తమునఁ దాను శివునికంటె వేఱువాఁడు కాకుండుట తెలిసి చలింపకుండుటయే మోక్షము, కావున మోక్షమును వేఱొకకర్మమార్గమునఁ బొంద యత్నించుటెల్ల భ్రాంతియే.

వి శే ష ము లు : అలంకారము కావ్యలింగము. అన్నెము (వికృతి) - అన్యము (ప్రకృతి).

క. తాన సమస్తములోఁ దన
లోనన సకలంబు గనుట లోనును వెలియుం
దాన యయి తనకు వే ఱనఁ
గా నేమియు లేక తాన కలిగి వెలుంగున్. 73

అ ర్థ ము : తాను + అ = తాన - తానే, సమస్తములోన్ = అంతటను, తనలోనన్ + అ = తనలోపలనే. సకలంబున్ = అంతయును, కనుట = చూచుట

లోనును - వెలియున్ = లోపలను, వెలుపలను, తాను + అ = తానే, ఆయి, తన కున్. వేఱు + అనఁగాన్ = తనకంటె వేఱయినది అన, ఏమియున్, లేక, తాను+ అ, కలిగి = ఉండి, వెలుంగున్ = ప్రకాశించును,

తా త్ప ర్య ము : తానే అంతటను, తనలోనే అంతయును ఉండి, బహిరం తరములు తానే యయి, తనకంటె వే ఱనునది యేఽి యు లేక తానే యుండి ప్రకాశిం చును.

క. కలిగియుఁ జెప్పను జూపను
దలఁపను రా దెల్లచోటఁ దానై యెందున్
గలయఁడు సర్వగుఁడై ని
శ్చలుఁ డగు నేకాంతుఁడయ్యు సర్వాత్మఁడగున్. 74

అ ర్థ ము : కలిగియున్ + ఉండియును, చెప్పను = చెప్పుటకును, చూపను = చూపుటకును, తలఁపను = భావించుటకును, రాదు = వలనుపడదు, ఎల్ల చోటన్ = అంతటను, తాను + ఐ = తా నయి, ఎందున్ = ఎచ్చటను, కలయఁడు= కలియఁడు, సర్వగుఁడు + ఐ = అంతటను వ్యాపించినవాఁడయి, నిశ్చలుఁడు = చలింపనివాఁడు, అగున్, ఏకాంతుఁడు + అయ్యున్ = ఒంటరివాఁడయ్యును, సర్వ+ ఆత్మఁడు = సర్వస్వరూపుఁడు, అగున్.

తా త్ప ర్య ము : ఉండియును జెప్పుటకును, చూపుటకును, తలఁచుటకును వీఱుపడఁడు, అంతటను దానయి యెందును గలియఁడు, అంతటను వ్యాపించినవాఁ డయి నిశ్చలుఁడగును, ఒంటరియయ్యు, సర్వాత్మఁ డగును.

క. తలఁప నని తలఁచి యించుక
తలఁచుడుఁ దలఁపంగలేక తానును లేక
పలుకులును లేక యెప్పుడుఁ
గలిమియె పొడవైనవాఁడు కదిరి వెలుంగున్! 75

అ ర్థ ము : తలఁపన్ + అని = తలఁచుటకని, తలఁచి, ఇంచుక = కొంచెము, తలఁచుడున్ = తలఁచినంతనే, తలఁపంగన్ + లేక = తలఁపలేక.

తానను, లేక, ఆ + పలుకులును, లేక, ఎప్పుడున్, కలిమియె = ఉండుటయె, పొడవు + ఐన - వాఁడు = రూపమైనవాఁడు, కదిరి = విజృంభించి, వెలుంగున్ = ప్రకాశించును.

తాత్పర్యము : తలఁతువనిచెప్పి తలఁచి కొంచెము తలఁచినంతనే యిఁకఁ దలఁపఁజాలక, తానును, లేక, ఆ పలుకులును లేక యెప్పుడును ఉండుటయే రూపము అయినవాఁడయి విజృంభించి ప్రకాశించును.

క. తలఁపఁబడు దానితోడన
తలఁపుల మును నెఱిచి మఱచి తాఁ బరమాత్మం
దలఁచుట మఱవక నిజ మని
నిలిచిన పురుషుండు తాన నిర్వాణి యగున్. 76

అర్థము : తలఁపఁబడు - దాని - తోడన్ + అ = తలఁపఁబడు దానితోనే, తలఁపులన్ = తలఁపులను, మును = ముందు, నెఱిచి, మఱచి = ఆ తలఁపులను మఱచి, తాన్ = తాను, పరమాత్మన్, తలఁచుట, మఱవక, నిజము, అని నిలిచిన, పురుషుండు, తాను + అ, నిర్వాణి = నిర్వాణము - మోక్షముగలవాఁడు, అగున్.

తాత్పర్యము : తలఁపఁబడు దానితోనే తలఁపులను జెఱిచి, ఆ తలఁపులను మఱచి, పరమాత్మునిఁ దలఁచుట మాత్రము మఱవక, నిజమనిభావించు పురుషుఁడే మోక్షముగలవాఁ డగును.

చ. దొరకొను నింద్రజాలమునఁ దోఁచిన రూపము లింద్రజాల మం
చరయఁగలేక చూపఱకు నన్నియు నిక్కమ వోలె నైనయ
ట్లరవుగఁబారమార్థికుల కెప్పుడు ద్రవ్యము లెల్ల మిథ్యలై
నిరతముఁజూడ లోకులకు నిక్కములై చను భ్రాంతి పెంపునన్. 77

అర్థము : దొరకొను + ఇంద్రజాలమునన్ = సమర్థమగు నింద్రజాల విద్యచేత, తోఁచిన = కానవచ్చిన, రూపములు = ఆకృతులు, ఇంద్రజాలము + అంచున్ = ఇంద్రజాలమని, అరయఁగన్ + లేక = తెలిసికొనలేక, చూపఱకున్ = చూచువారలకు, అన్నియున్, నిక్కము + అ + పోలెన్ = నిజమే యను విధమున,

ఐన + అట్లు = అయినట్లు, ఇరవుగన్ = ఒప్పుగా, పారమార్థికులన్ = యథార్థము నెఱిఁగినవారికి, ఎప్పుడున్, ద్రవ్యములు + ఎల్లన్ = పదార్థము లన్నియు, మిథ్యలు + ఐ = అసత్యములయి, నిరతమున్ = ఎల్లప్పుడును, చూడన్ = చూడఁగా, లోకులకున్ = సామాన్యజనులకు, భ్రాంతి - పెంపునన్ = భ్రమాతిశయము చేత, నిక్కములు + ఐ = సత్యములయి, చనున్ = ఒప్పును.

తాత్పర్యము : సమర్థమైన ఇంద్రజాలఘుచేఁ గనుపట్టిన ఆకారములు ఇంద్రజాలమునవైనవని తెలిపికొనలేక చూచువారి కన్నియును నిజముగా భాపించునట్లు, యాథార్థ్యవిదుల కెప్పుడును వస్తువులన్నియు నసత్యములై సామాన్యులైన జనులకు మాత్రము భ్రాంత్యతిశయముచే సత్యములుగా భాపించును.

విశేషములు : అలంకార ముపమ.

వ. అని యనేకప్రకారంబుల వేదశాస్త్ర పురాణాగమ సారవృత్తాధ్యాత్మ శాస్త్రవిధి హేయోపాదేయ పదార్థంబులు నిజ శిష్యగణంబులకు విస్పష్టంబుగా వ్యాఖ్యానంబు చేయుచున్న మునిముఖ్యుల దర్శింపు చుం జని చని ముందట. 78

అర్థము : అని, అనేక - ప్రకారంబులన్ = పెక్కు రీతుల, వేద - .... పదార్థంబులు; వేద - శాస్త్ర - పురాణ + ఆగమ = వేదములు, శాస్త్రములు, పురాణములు, ఆగమములు, అనువానియందలి, సార - వృత్త = సారవంతమైన విషయము నందును, అధ్యాత్మ - శాస్త్ర = అధ్యాత్మ శాస్త్రమునందును గల, విధి = చేయవలసినది, హేయ = విడువఁదగినది, ఉపాదేయ = స్వీకరింపఁదగినది, అగు, పదార్థంబులు + విషయములు, నిజ - శిష్య - గణంబులకున్ = తమ శిష్యుల సమూహములకు, విస్పష్టంబుగాన్ = మిక్కిలి స్పష్టముగా, వ్యాఖ్యానంబు + చేయుచున్ + ఉన్న = వివరించుచున్న, ముని - ముఖ్యులన్ = మునిశ్రేష్ఠులను, దర్శింపుచున్ = చూచుచు, చని, చని, ముందటన్.

తాత్పర్యము : అని పెక్కురీతుల వేదములు, శాస్త్రములు, పురాణములు, ఆగమములు, అధ్యాత్మశాస్త్రములు అను వానియందలి చేయఁదగిన, విడువఁదగిన

స్వీకరింపఁదగిన విషయములు విస్పష్టముగాఁ దమశిష్యులసమూహములకు వివరించు చున్న మునిశ్రేష్ఠులను దర్శించుచుఁ బోయిపోయి యెదుట - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు : దర్శింపుచు - ఆగమచకారమునకు ముత్తు (ముజ్ఞీత్తులు) పరమగునపుడే పత్వాదేశము. ఇచ్చట శత్రర్థక చువర్ణకము పరమగుచున్నను చకారమునకు పత్వాదేశము వచ్చుట విశేషము. దర్శించుచున్ అనియే యుండ వలయును.

ఉ. వాసనగా శివాగమము వర్ణనకెక్కఁ ద్రయీసదర్థముల్
దేసిగ నాత్మశిష్యులకుఁ దెల్పుచు సద్విధినున్న నిష్కళా
భ్యాసమునందు లీనమగుభావము నిల్పి వెలుంగుచున్న స
ద్భూసురముఖ్యు విప్రమునిపుంగవు జంగమ మల్లికార్జునున్. 79

అర్థము : శివాగమము (శివ + ఆగమము) - శివసంబంధమైన ఆగమము, వాసనగాన్ = పూర్వజన్మ సంస్కారముగా, వర్ణనకున్ + ఎక్కన్ = ప్రసిద్ధి నొందఁగా, త్రయీ - సత్ + అర్థముల్ = వేదముల మేలైన యర్థములు, దేసిగన్ = బాగుగా, ఆత్మ - శిష్యులకున్ = తన శిష్యులకు, తెల్పుచున్ = బోధించుచు, సత్ + విధిన్ = ఉత్తమరీతితో, ఉన్న, నిష్కళ + అభ్యాసమునందున్ = సంపూర్ణమైన సాధనయందు, లీనము + అగు = తదేకాయత్తమైన, భావమున్ = మనస్సును, నిల్పి, వెలుంగుచున్ + ఉన్న = ప్రకాశించుచున్న, సత్ + భూసుర - ముఖ్యున్ = ఉత్తమ బ్రాహ్మణశ్రేష్ఠుఁడును, విప్ర - ముని - పుంగవున్ = బ్రాహ్మణమునీశ్వ రుఁడును. అగు, జంగమ మల్లికార్జునున్ = జంగమ మల్లికార్జునుని.

తాత్పర్యము : శైవాగమము పూర్వజన్మ సంస్కారవశముగా, ప్రసిద్ధి నొందఁగా. మేలైన వేదార్థములను దన శిష్యులకు బాగుగా బోధించుచు, ఉత్తమరీతి నున్న సంపూర్ణసాధనయందు తదేకాయత్తముగా భావమును నిల్పి ప్రకాశించుచున్న బ్రాహ్మణ మునిశ్రేష్ఠుఁడగు జంగమమల్లికార్జునుని - తరువాతి పద్యముతో నన్వయము.

మత్తకోకిలము.

వృక్షమూలనివాసు, నాతత వేద వేది, ననూనరు
ద్రాక్షధారి, నఘారి, నత్యమలాంగు, నున్నతమోక్షసా
పేక్షితున్, నిరపేక్షితున్, బుధవృద్ధవంద్యు, ననింద్యు, ను
గ్రాక్షపాదసరోరుహార్చకు, నాత్మవిత్తము, సత్తమున్. 80

అర్థము : వృక్ష - మూల - నివాసున్ = చెట్టుమొదలు నివాసముగాఁ గల వాఁడును, ఆతత - వేద వేదిన్ = విస్తృతమైన వేదజ్ఞానముగలవాఁడును, అనూన (న + ఊన) - రుద్రాక్ష - ధారిన్ = తక్కువకాని (గొప్పదియగు) రుద్రాక్షమాలను ధరించినవాఁడును, అఘ + అరిన్ = పాపమునకు శత్రువైనవాఁడును - అనఘుఁడును. అతి + అమల + అంగున్ = మిక్కిలి పవిత్రమైన శరీరముగల వాఁడును. ఉన్నత - మోక్ష - సాపేక్షితున్ = మిక్కిలి గొప్పదియగు మోక్షమును గోరువాఁడును, నిరపేక్షితున్ = కోరికలు లేనివాఁడును, బుధ - వృద్ధ - వంద్యున్ = పండితులైన పెద్దలచే నమస్కరింపఁదగినవాఁడును, అనింద్యున్ = నింధింపఁదగని వాఁడును, ఉగ్రాక్ష (ఉగ్ర + అక్షి) - పాద - సరోరుహ + అర్చకున్ = శివుని పాదపద్మములను బూజించువాఁడును, ఆత్మ - విద్ + తమున్ = ఆత్మజ్ఞానముగల వారిలో శ్రేష్ఠుఁడును, సత్తమున్ = సర్వోత్తముఁడును, అగు జంగమ మల్లికార్జునుని -

తాత్పర్యము : వృక్షమూలము నివాసముగాఁ గలవాఁడును, వేదవిదుఁడును, అనల్పమైన రుద్రాక్షమాలను దాల్చువాఁడును, పాపరహితుఁడును, మిక్కిలి నిర్మలమైన శరీరము గలవాఁడును, ఉన్నతమైనమోక్షమును గోరువాఁడును, కోరికలు లేని వాఁడును, పండితులైనపెద్దలచే నమస్కరింపఁదగినవాఁడును, నిందింపఁదగనివాఁడును, శివపాదపద్మపూజకుఁడును, ఆత్మజ్ఞానియును, సర్వోత్తముఁడును అగు జంగమ మల్లికార్జునుని - తరువాతి గద్యముతో నన్వయము.

వ. కని భూరిప్రీతిం బ్రణమిల్లి గురుస్థానంబుగా స్వీకరించి పార్వతి పరమభక్తియుక్తి నారాధించి తత్ప్రసాదంబును బడసి నిజాభిమతం బెఱింగించి శైవాగమవిధి దీక్షగొని పరమేశ్వరుండు రయంబునం

ప్రసన్నుండగునట్టి మంత్రధ్యానవ్రతాచారంబు లుపదేశంబుగొని
తన్నియోగంబున. 81

అర్థము : కని = చూచి, భూరి - ప్రీతిన్ = మిక్కిలి యిష్టముతో. ప్రణమిల్లి = నమస్కరించి, గురు - స్థానంబు + కాన్ = గురుస్థానీయునిగా. స్వీకరించి = గ్రహించి, పార్వతి, పరమ - భక్తి - యుక్తిన్ = గొప్పభక్తితో. ఆరాధించి = పూజించి, తద్ + ప్రసాదంబును = ఆతని యనుగ్రహమును, పడసి = పొంది, నిజ + అభిమతంబు = తనదైన కోరిక, ఎఱింగించి = తెలిపి, శైవ = ఆగమ-విధిన్ = శైవాగమముప్రకారముగా, దీక్షన్ + కొని = దీక్ష స్వీకరించి, పరమేశ్వరుండు, రయంబునన్ = శీఘ్రముగా. ప్రసన్నుండు + అగు + అట్టి = ప్రత్యక్షమగునట్టి, మంత్ర - ధ్యాన - వ్రత + ఆచారంబులు = మంత్రములు, ధ్యానము, వ్రతములు, ఆచారములు, ఉపదేశంబు + కొని = ఉపదేశముపొంది, తద్ + నియోగంబునన్ = ఆతని ఆదేశముచొప్పున,

తాత్పర్యము : చూచి అధిక సంతోషముతో నమస్కరించి గురుస్థానీయునిగా, గైకొని పార్వతి మిక్కిలిభక్తితోఁ బూజించి, యాతని యనుగ్రహమును బొంది, తనకోరిక నెఱింగించి, శైవాగమముప్రకారముగా దీక్షను స్వీకరించి, పరమేశ్వరుఁడు శీఘ్రముగాఁ బ్రత్యక్షమగునట్టి మంత్రధ్యాన వ్రతాచారముల నుపదేశముపొంది యాతని ఆదేశముచొప్పున-తరువాతి పద్యముతో నన్వయము.

సీ. పవడంపులతమీఁదఁ బ్రాలేయపటలంబు
        పర్వె నా మెయినిండ భస్మమలఁది,
    లాలితంబగు కల్పలత పల్లవించె నాఁ
        గమనీయ ధాతువస్త్రములు గట్టి,
    మాధవీలత కలిమాలికల్ ముసరె నా
        రమణ రుద్రాక్షహారములు వెట్టి,
    వరహేమలతికపైఁ బురినమ్మి యూఁగె నా
        సమ్మతంబగు నెఱిజడలు పూని,

తే. హరుఁడు మాహేశ్వరీరూపమైన చెలువ
మభినయించెనో యని మును లర్థిఁ జూడ
గురుతపశ్శక్తి మూర్తి చేకొనిన కరణిఁ
దగిలి యుమ తపోవేషంబుఁ దాల్చి పొల్చె. 82

అర్థము : పవడంపు - లత (పవడము - లత) - మీఁదన్ = పవడపుఁదీఁగపై, ప్రాలేయ - పటలంబు = మంచుసమూహము, పర్వెన్ + నాన్ = వ్యాపించెనా యనునట్లు, మెయినిండన్ = శరీరమునిండ, భస్మము + అలఁది = బూది పూసికొని,

లాలితంబు + అగు = మనోహరమైన, కల్ప - లత = కల్పవృక్షపుఁదీఁగ, పల్లవించెన్ + నాన్ = చివురించెనా యనునట్లు, కమనీయ - ధాతు - వస్త్రములు = మనోహరమైన, కావివలువలు, కట్టి = ధరించి,

మాధవీ - లతకున్ = బండిగురివెందతీఁగకు, అలి - మాలికల్ = తుమ్మెదల బారులు, ముసరెన్ + నాన్ = ముసరెనా అనునట్లు, రమణన్ = అందముగా, రుద్రాక్ష - హారములు + పెట్టి = రుద్రాక్షమాలలు తాల్చి,

వర - హేమ - లతికపైన్ = శ్రేష్ఠమైన మందారలతమీఁద, పురి-నమ్మి = పురివిప్పిన నెమలి, ఊఁగెన్ + నాన్ = ఆడెనా యనునట్లు, సన్నుతంబు+అగు= మిక్కిలి పొగడొందిననగు. నెఱి - జడలు = అందమైప జడలు. పూని = ధరించి.

హరుఁడు = ఈశ్వరుఁడు, మాహేశ్వరీ - రూపము + ఐన = మాహేశ్వరి (పార్వతి) అకారము గలది యగు, చెలువము = అందము, అభినయించెనో = నటించెనో, అని, మునులు, అర్థిన్ = కోరికతో, చూడన్, గురు - తపస్ + శక్తి = గొప్పదియగు తపస్సుయొక్క శక్తి, మూర్తి = ఆకారము, చేకొనిన - కరణిన్ = తాల్చిన విధమున, ఉమ = పార్వతి, తగిలి = ఆసక్తి వహించి, తపస్(ః) - వేషంబున్ = తపస్సునకైన వేషమును, తాల్చి = ధరించి, పొల్చెన్ + ఒప్పెను.

తాత్పర్యము : పవడపుఁదీఁగపై మంచుసమూహము వ్యాపించెనా యనునట్లు శరీరమునిండ విభూతిపూసి, మనోహరమైన కల్పవృక్షపుఁదీఁగ చివురించెనా

యనునట్లు రమణీయమైన కావివలువలుదాల్చి, మాధవీలతపైఁ దుమ్మెదలబారులు ముసరెనా యనునట్లు అందముగా రుద్రాక్షమాలలు ధరించి, మేలైన మందారలతమీఁద పురివిప్పిన నెమలి ఆడెనా యనునట్లు అందమైన జడలు పూని, మహేశ్వరుఁడు మాహేశ్వరీరూపము నభినయించెనేమోయని మునులు కోరికతోఁ జూడ, గొప్పదియగు తపశ్శక్తి మూర్తీభవించెనా యను విధమునఁ బార్వతి తపోవేషమును దాల్చి యొప్పెను.

విశేషములు : అలంకార ముత్ప్రేక్ష.

వ. తదనంతరంబ. 83

అర్థతాత్పర్యములు : ఆ పిమ్మటనే - తరువాతి పద్యముతో నన్వయము.

గీ. మేని కుంకుమరాగంబు, మెలఁత తోఁపు
మోవి తాంబూలరాగంబు మొగిన పాసి
చారుతర మయ్యెఁ జూడ నా శైలతనయ
వీతరాగంబు ప్రకటించు విధమువోలె. 84

అర్థము : మేని - కుంకుమ - రాగంబున్ = శరీరపుఁగుంకుమపు ఎఱుపును. తోపుమోవి-తాంబూల-రాగంబున్ = ఎఱ్ఱని పెదవితమ్మలపు ఎఱుపును, మొగిన్ + అ = ముందే, పాసి = విడిచి - తొలఁగిపోయి, మెలఁత = ఇంతి, ఆ - శైల - తనయ = ఆ కొండకూఁతురు - పార్వతి, వీత - రాగంబు = రాగము (ఎఱుపు, అనురాగము) పోవుటను, ప్రకటించు - విధము + పోలెన్ = తెలుపు విధమున చూడన్ = చూడఁగా, చారుతరము + అయ్యెన్ = మిక్కిలి అందగించెను.

తాత్పర్యము : ఆ పార్వతి తపశ్చరణ సమయమున మేనికుంకుమపు ఎఱుపును, ఎఱ్ఱని పెదవి తమ్మలపుఎఱుపును విడిచి, రాగత్యాగమును దెలుపుచున్నదా యనునట్లు మిక్కిలి అందగించెను.

విశేషములు : తపస్సుచేసికొను నీ సమయమున నామె మేనికి గుంకుమము నలఁదుటలేదు. తాంబూలమును సేవించుట లేదు. అందుచే నామె మేనును, మోవియు రాగములేక యుండెను. అది యీ సమయమున నామె అనురాగమును వీడెనా యనునట్లుండెను. అలంకారము శ్లేషానుప్రాణితమైన ఉత్ప్రేక్ష.

గీ. కురులతోఁగూడ విలసిల్లు గిరిజ మొగము
జడలు తాల్చినఁ గడు బెడంగ డరి పొల్చె
భృంగములు మూఁగి చెలువొందు బిసరుహంబు
పాఁకు దాల్చియుఁ గర మొప్పు భంగి పోలె. 85

అర్థము : కురులతోన్ = శిరోజములతో, కూడన్ = కూడఁగా, విలసిల్లు = ప్రకాశించు, గిరిజ - మొగము = పార్వతి ముఖము, జడలు - తాల్చినన్ = జడలు ధరించినను, భృంగములు = తుమ్మెదలు, మూఁగి, చెలువు + ఒందు = అందగించు, బిసరుహంబు = పద్మము, పాఁకు + తాల్చియున్ = నాఁచుతోఁ గూడియు, కరము = మిక్కిలి, ఒప్పు = ఒప్పునట్టి, భంగి + పోలెన్ = విధమున, కడున్ + బెడంగు = మిక్కిలి అందము, అడరి = అతిశయించి, పొల్చెన్ = ఒప్పెను.

తాత్పర్యము : ముంగురులతోఁ గూడి ప్రకాశించు పార్వతి ముఖము ఇప్పుడు తపశ్చరణ సమయమున జడలు ధరించి, తుమ్మెదలు మూఁగి అందగించు పద్మము నాఁచుతోఁ గూడియు మిక్కిలి అందగించునట్లు మిక్కిలి అందముగా నుండెను.

విశేషములు : ఈ భావము కాళిదాసునను గలదు.
యథా ప్రసిద్ధై ర్మధురం శిరోరుహై
ర్జటాభి రప్యేవ మభూత్ త దాననమ్,
న షట్పద శ్రేణిభి రేవ పఙ్కజం
సశైవలాసఙ్గ మపి ప్రకాశతే. సం.కు.సం. 5-9.
అలంకార ముపమ.

వ. ఇట్లు పార్వతి తపోలక్ష్మీ ముఖ విశేషకంబునుంబోని తపోవేషంబు దాల్చి మహోత్సాహంబున నిజగురువరానుజ్ఞాతయై యా క్షణంబ. 86

అర్థము: ఇట్లు, పార్వతి, తపస్(ః) + లక్ష్మీ - ముఖ - విశేషంబునున్ + పోని = తపస్సనెడి లక్ష్మియొక్క ముఖమునందలి మకరికాపత్రరచనను . బోలిన, తపస్(ః) + వేషంబు, తాల్చి, మహత్ (మహా) + ఉత్సాహంబునన్ = మిక్కిలి

వేడుకతో, నిజ - గురు , వర + అనుజ్ఞాత + ఐ = తన గురువర్యునిచే ననుమతింపఁబడినదయి, ఆ క్షణంబు + అ = వెంటనే.

తాత్పర్యము: ఇట్లు పార్వతి తపోలక్ష్మీ ముఖ మకరికాపత్త్రరచనను బోలిన తపోవేషమును దాల్చి, మిక్కిలి వేడుకతోఁ దన గురువర్యుని అనుజ్ఞఁ బడసి వెంటనే - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు: అలంకారము రూపకానుప్రాణితమయిన ఉత్ప్రేక్ష.

క. ఆ నగపతిసుత మదిఁ బర
మానందముతో మహేశు నారాధింపం
గా నిర వరయుచుఁ జని గం
గా నది తీరమునఁ గాంచె గౌరీవనమున్. 88

అర్థము: ఆ - నగ - పతి - సుత = ఆ కొండలతేని కూఁతురు - పార్వతి, మదిన్ = మనస్సునందు, పరమ + ఆనందముతోన్ = మిక్కిలి సంతోషముతో, మహేశున్ = పరమేశ్వరుని, ఆరాధింపంగాన్ = పూజించుటకు, ఇరవు = స్థానము, అరయుచున్ = వెదకుచు, చని = వెడలి, గంగా - నది = గంగానది యొక్క, తీరమునన్ = ఒడ్డున, గౌరీవనమున్, కాంచెన్ = చూచెను.

తాత్పర్యము: ఆ పార్వతి మనస్సున మిక్కిలి సంతోషముతో మహేశ్వరు నారాధించుటకు స్థానము నన్వేషించుచుఁ జని గంగానదీతీరమున గౌరీవనమును జూచెను.

విశేషములు: 'గౌరి తపస్సు చేసినదగుటచేతనే యది తరువాత గౌరీశిఖరమని పేరు పొందెను.' అని సంస్కృత కుమారసంభవము. 'ప్రజాసు పశ్చాత్ ప్రథితం తదాఖ్యయా, జగామ గౌరీ శిఖరం శిఖణ్డిమత్.' సం.కు.సం. 5-7.

వ. కని దాని పత్త్ర పుష్ప ఫల సమృద్ధికి మెచ్చుచు. 89

అర్థము: కని = చూచి, దాని = ఆ గౌరీవనముయొక్క, పత్త్ర - పుష్ప - ఫల - సమృద్ధికిన్ = ఆకుల, పూల, పండ్ల పెంపునకు, మెచ్చుచున్.

తాత్పర్యము: చూచి ఆ గౌరీశిఖరము పత్ర పుష్ప ఫలములు పెంపునకు మెచ్చుచు. తరువాతి పద్యముతో నన్వయము.

సీ. స్థల పద్మ మృదు రత్న దళపాదతల కాంతిఁ
గమనీయ మత్తేభ గమన లీల,
సన్నుత రంభోరు సంపద నిర్ఝర
పులిన నితంబ విస్ఫురణ పేర్మి,
మానిత మృగరాజమధ్య దేశ స్థితి
వర పయోధరభార వహనశక్తిఁ
జకిత కురంగ శాబక లోచన ద్యుతిఁ
జమరీ సుకేశ పాశ ప్రభాతిఁ

ఆ. బేరి యందె కాదు చారుతరావయ
వంబులందుఁ దమ్ముఁ వరుసఁబోలి
యునికిఁ దద్ద మరిగి యున్నట్లు యుండె నా
గౌరి వనమునందు గౌరి దేవి. 89

అర్థము: స్థల - పద్మ - మృదు - రత్న - దళ = మెట్టతామరలు, మృదువులైన రత్నఖండములనెడి, పాద - తల - కాంతిన్ = అఱికాళ్ళ కాంతిచేతను, స్థలపద్మములు, రత్నఖండములు గల ప్రదేశముల కాంతిచేతను, కమనీయ - మత్త+ఇభ - గమన - లీలన్ = మనోహరమైన మదగజగమనముయొక్క విలాసముచేతను,

సన్నుత - రంభా + ఊరు - సంపదన్ = పొగడఁబడిన అరఁటులనెడి తొడల వైభవముచేతను, రంభా + ఉరు - సంపదన్ = అరఁటుల గొప్పసంపదచేతను, నిర్ఝర - పులిన - నితంబ - విస్ఫురణ - పేర్మిన్ = సెలయేటి యిసుక తిన్నెలనెడి పిఱుఁదులయొక్క ప్రకాశాతిశయముచేతను, సెలయేటి యిసుకతిన్నెలుగల కొండనడిమి ప్రదేశముల ప్రకాశముచేతను,

మానిత - మృగ - రాజ - మధ్య - దేశ స్థితిన్ = పొగడఁబడిన సింహము నడుము అనెడు నడుముయొక్క, ఉనికిచేతను, సింహములతోడి నడిమిప్రదేశముచేతను వర-పయోధర - భార - వహన - శక్తిన్ = శ్రేష్ఠములైన స్తనముల బరువును మోయు శక్తిచేతను, మేఘముల బరువును మోయు శక్తిచేతను,

చకిత - కురంగ - శాబక - లోచన - ద్యుతిన్ = భయపడిన, లేడిపిల్ల కన్నులవంటి కన్నులకాంతిచేతను, భయపడిన లేడిపిల్లల కన్నులకాంతిచేతను, చమరీ - సుకేశ - పాశ - ప్రభాతిన్ = ఆఁడుసవరపుమెకములనెడి మేలైన శిరోజములసమూహము కాంతిచేతను, ఆఁడుసవరపుమెకముల కేశపాశకాంతిచేతను,

పేరియందున్ + ఎ = నామమునమాత్రమే, కాదు, చారు - తర + అవయవంబుల + అందున్ = మనోహరతరములైన అంగములందుఁగూడ, తన్నున్, వరుసన్ = క్రమముగా, పోలి + ఉనికిన్ = పోలియుండుటచేత, గౌరిదేవి, ఆ - గౌరీ వనమునందున్ = ఆ గౌరీవనమునందు, తద్ద = మిక్కిలి, మరిగి + ఉన్న + అట్లు + అ = పరిచితమయినట్లే, ఉండెన్,

**తాత్పర్యము :** మెట్టతామరలు, మృదురత్నఖండములు అనెడి పాదతలముల కాంతిచేతను, మెట్టతామరలు మృదురత్నఖండములు గల ప్రదేశములచేతను. మనోహరమైన మదగజ గమనముల విలాసముచేతను, సమున్నతమైన అనఁటికంబములనెడి ఊరువుల సంపదచేతను, అనఁటికంబముల గొప్ప సంపదచేతను, సెలయేటి యిసుకతిన్నెలనెడి పిఱుఁదుల ప్రకాశాతిశయముచేతను. సెలయేటి యిసుకతిన్నెలుగల కొండనడిమి ప్రదేశములచేతను, సింహము నడు మనెడి నడుముచేతను, సింహములతోడి నడిమి ప్రదేశముచేతను, మేలైన స్తనముల భారమును వహించు శక్తిచేతను, మేలయిన మేఘముల భారము వహించు శక్తిచేతను, భయపడిన లేడిపిల్ల కన్నులనెడి కన్నుల కాంతిచేతను, లేడిపిల్లల కన్నుల కాంతిచేతను, ఆఁడు సవరపు మెకములనెడి కేశ సమూహము కాంతిచేతను. చమరమృగముల కేశపాశముల చేతను, నామము నందేకాక మనోహరతరములైన అవయవములందును దన్నుఁ బోలియుండుటచే గౌరిదేవి ఆ గౌరీవనమందు మిక్కిలి పరిచితమయినట్లే యుండెను.

**విశేషములు ;** పార్వతికి స్థలపద్మములు, రత్నదళములు అనెడి పాదతలములు గలవు, ఆ తపోవనమునకును స్థలపద్మ రత్నదళములతోడి పాదతలములు గలవు

ఆమెకు మత్తేభ గమనమునుబోలిన గమనము గలదు, దానికి మత్తేభముల గమనములు గలవు. అనఁటికంబములవంటి ఊరుసంపద యామెకుఁ గలదు. దానికి అనఁటికంబముల ఉరుసంపద గలదు, ఆమెకు నిర్ఝరపులినములవంటి పిఱుఁదులు గలవు. దానికి నిర్ఝర పులినములతోడి కొండనడిమి ప్రదేశములు గలవు, ఆమెకు పయోధర = స్తనభారము గలదు. దానికి పయోధర = మేఘభారము గలదు. ఆమెకు లేడిపిల్లల కన్నులవంటి కన్నులు గలవు. దానికి లేడిపిల్లల కన్నుల శోభ గలదు. ఆమెకు చమరీమృగముల కేశపాశమువంటి కేశపాశముగలదు. దానికి చమరీమృగముల కేశపాశము గలదు. ఇట్లు గౌరి పేరియందేకాక, అవయవములందును అ గౌరీవనముతో సామ్యముగలిగి యుండె ననుట. అలంకారము శ్లేషానుప్రాణితమైన ఉపమాలంకారము.

వ. అట్లు గౌరినగంబునందుఁ బరమేశ్వరుం గోరి ఘోరతపము సేయం దొడంగి విహితస్నానార్చనా హోమాది నిత్యకర్మంబుల, శాకాహార ఫలాహార పర్ణాహార జలాహార మారుతాహార నిరాహారాది మహా తపోవ్రతంబుల, నందవాసాభ్రకవాసైక పాదాంగుష్ఠోర్ధ్వబాహూర్ధ్వ ముఖాధోముఖాగ్నిముఖ పంచాగ్ని మధ్యాద్యనేకోగ్ర తపంబులం, ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ జప సమాధులను, షడంగ యోగంబుల, మనోవాక్కాయకర్మంబుల, నతినిష్ఠానుష్ఠానంబులం బరమేశ్వరారాధన తాత్పర్యయై నిరంతరానంత తపోవృత్తిం బ్రవర్తించుచుండె నంత. 90

అర్థము : అట్లు, గౌరి - నగంబునందున్ = గౌరీపర్వతమునందు పరమేశ్వరున్, కోరి, ఘోర-తపంబు = భయంకరమైన తపస్సు, చేయన్ + తొడంగి = చేయఁబూని, విహిత ......... కర్మంబులన్ : విహిత = విధింపఁబడిన. స్నాన = స్నానము, అర్చనా = పూజ, హోమ = హోమము, ఆది = మున్నగు, నిత్య - కర్మంబులన్ = నిత్యకృత్యములచేతను, శాకాహార .... వ్రతంబులన్ : శాక + ఆహార = కాయగూరలను దినుట, ఫల + ఆహార = పండ్లను దినుట, పర్ణ + ఆహార = ఆకులను దినుట, జల + ఆహార + నీరు త్రావుట, మారుత + ఆహార = గాలిని భుజించుట - పీల్చుట, నిరాహార = ఏమియుఁ దినకుండుట, ఆది = మున్నగు, మహత్ (మహా) + తపస్ (ః) + వ్రతంబులన్ + గొప్ప తపో నియమములచేతను,

ఏక - పాద + అంగుష్ఠ + ఒకకాలిబొటనవ్రేలిపై నిలఁబడుట. ఊర్ధ్వ - బాహు = చేతులు పయికెత్తుట, ఊర్ధ్వ - ముఖ = ముఖము పయికెత్తుట, అధో - ముఖ = ముఖము క్రిందు చేయుట, అగ్నిముఖ = అగ్నివైపు ముఖము గలిగి యుండుట, పంచ + అగ్ని + మధ్య = అయిదగ్నుల నడుమ నుండుట (నాలుగుదిక్కులను నాలు గగ్నులను, పైని సూర్యుఁడును గలిగియుండుట). ఆది= మొదలగు, అనేక = పెక్కు, ఉగ్ర - తపంబులన్ = భయంకరమైన తపస్సుల చేతను, ప్రాణాయామ = ప్రాణవాయువును మంత్రపూర్వకముగా నిరోధించుట, ప్రత్యాహార = చిత్తమును, ఇంద్రియములను విషయములనుండి మరలించుట, ధ్యాన= చిత్తచాంచల్యము లేక ఏకాగ్రముగాఁ దలంచుట, ధారణ = గాలిని బీల్చి లోపల నిలఁబెట్టుట (కుంభకప్రాణాయామము), జప = మంత్రాదుల నావృత్తిచేయుట. సమాధులను = ధ్యేయమునందు ఏకాగ్రముగా మనస్సు నిలుపుట అనువానిచేతను, షడంగ యోగంబులన్ + మంత్రోచ్చారణ పూర్వకముగా ఆఱు అంగములను స్పృశించుట, చిత్తవృత్తినిరోధము అనువానిచేతను, మనస్ ( ః ) + వాచ్ ( క్ ) + కాయ- కర్మములన్ = మనస్సు, వాక్కు, శరీరము, క్రియ అను నాలుగింటిచేతను, అతి - నిష్ఠా + అనుష్ఠానంబులన్ = మిక్కిలి నియమములతో నాచరించుటచేతను, పరమేశ్వర + ఆరాధన - తాత్పర్య + ఐ = పరమేశ్వరపూజయందు ఆసక్తి గలదయి, నిరంతర + అనంత - తపస్ ( ః ) + వృత్తిన్ = ఎడతెగని, అంతులేని తపస్సు నాచరించుటయందు, ప్రవర్తించుచున్ + ఉండెన్ = వర్తిలుచుండెను.

తాత్పర్యము : అట్లు గౌరీపర్వతమున పరమేశ్వరుని గోరి ఘోరమైన తపస్సు చేయఁబూని శాస్త్రవిహితమైన స్నానము, పూజ, హోమము మున్నగు నిత్యకర్మములచేతను, శాకాహారము, ఫలాహారము, పర్ణాహారము, జలాహారము, మారుతాహారము, నిరాహారము, మున్నగు మహాతపోవ్రతములచేతను, నందవాసము, అభ్రకవాసము, ఏకపాదాంగుష్ఠము, ఊర్ధ్వబాహువు, ఊర్ధ్వముఖము, అధోముఖము, అగ్నిముఖము, పంచాగ్ని మధ్యము మున్నగు పెక్కు భయంకర తపోవిధానములచేతను, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధ్యానము, ధారణము, జపము, సమాధి అనువానిచేతను, షడంగములు, యోగము అనువానిచేతను మనస్సు, వాక్కు, శరీరము, కర్మము అనువానిచేతను, అతినిష్ఠతోను, అనుష్ఠానముచేతను, పరమేశ్వరు నారాధించుటయం దాసక్తి గలదయి, నిరంతరము, అనంతమునైన తపశ్చరణమునందుఁ బ్రవర్తించుచుండెను. అంత - తరువాతి పద్యముతో నన్వయము.

చ. అలకల పొల్పు తేఁటిగములందు, మదాలసయానలీల హం
సల కడ, వక్త్రభాతి జలజంబులపైఁ దనుకోమలంబుఁ దీఁ
గల దెస, దృగ్విలాసము మృగంబులచే నగజాత యిల్లడల్
కలయఁగఁ బెట్టె నాఁ దను వికాసము లేదెఁ దపఃప్రసంగతిన్. 91

అర్థము: నగ - జాత = కొండకూతుఁరు - పార్వతి, అలకల-పొల్పు = ముంగురుల అందము, తేఁటి - గములందున్ = తుమ్మెదల గుంపులందును, మద + అలస - యాన - లీలన్ = మదముచేత మందమైన గమనముయొక్క విలాసమును, హంసల - కడన్ = అంచల దగ్గఱను, వక్త్ర - భాతిన్ = ముఖకాంతిని, జలజంబుల పైన్ = తామరలయందును, తను - కోమలంబున్ = శరీరమార్దవమును, తీఁగల - దెసన్ = తీఁగలయెడను, దృశ్(క్) + విలాసము = కన్నుల అందము, మృగం బులచేన్ = లేళ్ళచేతను, ఇల్లడల్ = న్యాసములు - అడిగినప్పుడు తిరుగనిచ్చు పద్ధతిని ఒకరియొద్ద ధనాదికమును దాఁచుట, కలయఁగన్ + పెట్టెన్ + నాన్ = పొంచుపఱిచెనా యనునట్లు, తపస్(ః) + ప్రసంగతిన్ = తపఃకారణమున, తను - వికాసములు = మేని యందములు, ఏదెన్ = లేనిదయ్యెను.

తాత్పర్యము ; పార్వతి ముంగురుల యందమును దుమ్మెదల గుంపులందును, మదముచే మందమైన గమనము నొప్పును అంచల కడను, ముఖకాంతిని బద్మములందును, శరీరమార్దవమును లతల యెడను, కన్నులయందమును లేళ్ళయందును ఇల్లడపెట్టెనా యనునట్లు తపఃకారణమున మేని యొప్పులు లేనిదయ్యెను.

విశేషములు : అలంకార ముత్ప్రేక్ష. తిరిగి తీసికొనుపద్ధతి నొకరియొద్దఁ దనవస్తువును దాఁచుకొనుట యిల్లడ. తపస్సమయమున నాయా యంగముల యొప్పులు తన కనావశ్యకములు గావున నామె ఒక్కొక్కదానిని ఒక్కొక్క తగినదానికడ 'ఇల్లడ' పెట్టెను. తపస్సు ముగిసినవెంటనే మరలఁ దీసికొనును గావున నది యిల్లడ యైనది. తపస్సమయమున బార్వతి కాయాయియందములు లేవనియు, తపోఽనంతరము ఆమె యథాపూర్వ సౌందర్యవతి యగుననియు భావము. ఈ భావము కాళిదాసునను గలదు.

'పునర్గ్రహీతుం నియమస్థయా తయా
ద్వయేఽపి నిక్షేప ఇ వార్పితం ద్వయమ్ ।
లతాసు తన్వీషు విలాస చేష్టితం
విలోలదృష్టం హరిణాఙ్గనాసు చ,' సం.కు.సం. 5-13

సంస్కృతమున రెండవయవములనుగూర్చిమాత్రమే చెప్పఁగాఁ, దెలుఁగున నైదింటిని జెప్పి పద్యమును మనోహరతరము చేసెను.

గీ. ఉగ్రతపమునఁ దోడ్తోన విగ్రహంబు
చాల శోషించెఁ బ్రాలేయశైల తనయ
యర్ధనారిగాఁ దన దేహ మభవు మేన
నల్ప మల్పము నంటించునట్లు వోలె. 92

అర్థము : ప్రాలేయ - శైల - తనయ = మంచుకొండ కూఁతురు - పార్వతి, అర్ధ - నారి - కాన్ = సగము స్త్రీగా, తన - దేహము = తన శరీరము, అభవు - మేనన్ = శివుని శరీరమునందు, అల్పము + అల్పము + కొంచెము కొంచెముగా, అంటించు + అట్లు + అ + వోలెన్ = తగిలించు విధమును బోలు నట్లుగా, ఉగ్ర - తపమునన్ = భయంకరమైన తపస్సుచేత, తోడ్తోన్ + అ = క్రమక్రమముగా, విగ్రహంబు = శరీరము, చాలన్ = మిక్కిలి, శోషించెన్ = శోషిల్లు నట్లు - ఎండునట్లు - చేసెను.

తాత్పర్యము : హిమవత్పర్వతపుత్త్రిక సగముస్త్రీగాఁ దన శరీరమును శివుని శరీరమున నించించుకగాఁ దగిలించుచున్నదా యనునట్లు భయంకరమైన తపస్సుచేఁ గ్రమక్రమముగా శోషిల్లునట్లు చేసెను.

విశేషములు : హేతువు కానిదానిని హేతువుఁగా జెప్పుటచే అలంకారము హేతూత్ప్రేక్ష. శోషించె.... 'సంస్కృతంబున కంగలాదుల కించుక్కగు.' బాల. క్రియ.63. శుష్ + ఇంచు. 'సంస్కృతంబునకు లఘూపధంబున కించుక్కు పరంబగు నపుడు గుణంబగు.' బాల. క్రియ.66. శోష్ + ఇంచు. 'సర్వంబునకుం బ్రేరణంబునం దించుక్కగు.' బాల. క్రియ. 70. శోష్ + ఇంచు + ఇంచు. 'ఇంచుక్కు పరంబగు నపుడు రంజాదుల యించుక్కునకు లోపం బగు.' బాల. క్రియ. 72. శోష్ + ఇంచు. శోషించు. 'భూతంబున లిట్టగు.' బాల. క్రియ. 3. శోషించు + లిట్టు. 'లకారంబు నకు డు ఱు వు రు ను ముణ్ణగు.' బాల. క్రియ. 8. శోషించు + డుఙ్. 'లిడ్లాట్టుల డుఙ్ఞున కెను ను వర్ణంబు లగు.' బాల. క్రియ 16. శోషించు + ఎను. 'అంద్వవగాగ మంబులం దప్ప నపదాది స్వరంబు పరంబగునపు డచ్చునకు సంధి యగు.' బాల. సంధి. 11. శోషించె.

వ. అంత. 93

అర్థతాత్పర్యములు: అంతన్ = తరువాత - తరువాతి పద్యముతో నన్వయము.

## వర్షాకాల వర్ణనము

మ. గత సంతాపము, శీతలీకృతమహీకాంతాంగ, మత్యుద్గత
స్మిత కుందోత్కర కేతకీకుటజరాజి భ్రాజితామోద, మూ
ర్జిత వల్లీప్రకరంబు, వర్ధిత శిఖిశ్రేణీ ప్రమోదంబు ర
మ్యతరంబై కుతలం బనం బరఁగె వర్షారంభ మత్యున్నతిన్. 94

అర్థము: గత - సంతాపము = పోయిన అధికతాపముగలది, శీతలీకృత - మహీ - కాంతా + అంగము = చల్లపఱుపఁబడిన భూమియను స్త్రీయొక్క శరీరము గలది, అత్యుద్గత.... మోదము: అతి + ఉద్గత = మిక్కిలి బయల్వెడలిన, కుంద+ ఉత్కర = మొల్లల సమూహము, కేతకీ - కుటజ-రాజి = మొగలి పూలయొక్కయు, కొండమల్లెల యొక్కయు సమూహముయొక్క, భ్రాజిత = ప్రకాశించిన ఆమోదము = పరిమళముగలది, ఊర్జిత - వల్లీ - ప్రకరంబు = అధికమైన తీఁగల సమూహముగలది, వర్ధిత - శిఖి - శ్రేణీ - ప్రమోదంబు = వృద్ధిపొందింపఁబడిన, నెమళ్ళ పఱుసయొక్క, సంతోషముగలది, అగు, వర్షా + ఆరంభము = వర్షాకాలము యొక్క ఆరంభము, అతి + ఉన్నతిన్ = మిక్కిలి గొప్పతనముతో, రమ్యతరంబు + ఐ = మిక్కిలి రమణీయమయి, కుతలంబు = భూతలము, అనన్ + పరఁగెన్ = అన నొప్పెను.

తాత్పర్యము; అధికమైన తాపము పోయినదియు, చల్లపఱుపఁబడిన భూమియను స్త్రీ శరీరముగలదియు, మొల్లల, మొగలిపూల, కొండమల్లెల పరిమళము బయలువెడలినదియు, తీఁగల సమూహ మధికమయినదియు, నెమళ్ళగుంపుల సంతోషము వృద్ధిపొందించినదియు అగు వర్షాకాలారంభము రమ్యతరమై భూతలమన మిక్కిలి గొప్పతనముతో నొప్పెను.

విశేషములు: మహీ - కాంతా = భూమియనుస్త్రీ - రూపకము, రమ్యతరమై కుతల మనఁబరఁగుట సహేతుకముగా సమర్థింపఁబడినది కావున కావ్యలింగము. స్వభావోక్తి.

ఆ. దిశలఁ బొలయ మెఱుఁగుదృష్టులు, ఘుర్ఘుర
గర్జనంబు లులియ, గజప గతులు,
ఘన పయోధరములు దనరంగ జవ్వని
వోలె వచ్చె వానకాల మర్థి. 95

అర్థము: మెఱుఁగు - దృష్టులు = మెఱుపులనెడు చూపులు, దిశలన్ = దిక్కులందు, పొలయన్ = వ్యాపింపఁగను, ఘుర్ఘుర - గర్జనంబులు = ఘుర్ఘుర ధ్వనులనెడి ఉఱుములు, ఉలియన్ = ధ్వనింపఁగను, గజప - గతులున్ = గజరాజుల గమనములును, ఘన - పయోధరములున్ = గొప్ప మేఘములనెడి గొప్ప స్తనములును, తనరంగన్ = ఒప్పఁగను, వానకాలము, అర్థిన్ = కోరికతో, జవ్వని + పోలెన్ = జవరాలివలె, వచ్చెన్.

తాత్పర్యము: మెఱుపులనెడి చూపులు దిక్కుల వ్యాపింపఁగను, ఘుర్ఘుర ధ్వనులనెడి యుఱుములు ధ్వనింపఁగను, గజరాజగమనములును, ఘన స్తనములును ఒప్పఁగా వానకాలము జవరాలివలె వచ్చెను.

విశేషములు: మెఱుఁగు దృష్టులు - రూపకము. ఘుర్ఘుర గర్జనంబులు = ఘుర్ఘురములనెడి గర్జనములు - రూపకము. ఘన - పయోధరములు = మేఘములనెడి గొప్ప పయోధరములు - శ్లేష, రూపకము. జవ్వని వోలెన్ - ఉపమ. రూపకానుప్రాణితమైన ఉపమ,

మ. పరమస్నేహము హృత్సరోరుహమునం బాత్రంబు గావించి, సు
స్థిరతం బుణ్యదశం దపోగ్ని మది నుద్దీపించి, బ్రహ్మాండ క
ర్పరఖండంబున మంత్రకజ్జల మొగిన్ ఫాలాక్షుఁ గూర్పింప న
గ్గిరిరాజాత్మక పట్టె నా నమరి నింగిం బర్వె నీలాభ్రముల్. 96

అ ర్థ ము : ఆ + గిరి - రాజ + అత్మక = ఆ కొండలతేని కూఁతురు, ఫాల + అక్షన్ = నుదుటఁ గన్నుగలవానిని . శివుని, కూర్పింపన్ = కూడునట్లు చేయుటకు, పరమ - స్నేహమున్ = గొప్పప్రీతియనెడి చమురును, హృద్ + సరోరుహమునన్ = హృదయమనెడి పద్మమునందు, పాత్రంబు + కావించి = యుక్తముచేసి. సుస్థిరతన్ = మంచినిలుకడతో, పుణ్య - దశన్ = పుణ్యమనెడి వత్తిని, తపస్(ః) + అగ్నిన్ = తపస్సనెడి అగ్నిచేత. మదిన్ = మనస్సునందు, ఉద్దీపించి = ప్రకాశింపఁజేసి, బ్రహ్మాండ - కర్పర - ఖండంబునన్ = బ్రహ్మాండమనెడి కుండపెంకునందు, మంత్ర - కజ్జలము = సమంత్రకమైన కాటుక, ఒగిన్ = క్రమముగా. పట్టెన్ + నాన్ = పట్టెనా యనునట్లు, అమరి = ఒప్పి, నీల = అభ్రముల్ = నల్లని మేఘములు, నింగిన్ = ఆకాశమునందు, పర్వెన్ = వ్యాపించెను.

తా త్ప ర్య ము : ఆ కొండలతేని కూఁతురు - పార్వతి శివుని గూడునట్లు చేయుటకు అధికమైన నెయ్యమనెడి చమురును హృదయమనెడి పద్మమునందు యుక్తముచేసి, సుస్థిరతతోఁ బున్నెమనెడి వత్తిని తపస్సనెడి అగ్నితో వెలిఁగించి, బ్రహ్మాండమనెడి కుండపెంకునందు సమంత్రకమైన కాటుకను బట్టెనా యనునట్లు ఒప్పి నల్లనిమేఘములు ఆకాశమున వ్యాపించెను.

వి శే ష ము లు : రూపకానుప్రాణితమైన ఉత్ప్రేక్షాలంకారము. తపోఽగ్ని = తపస్ + అగ్ని - పదాంత సకారమునకు విసర్గాదేశము. తపః + అగ్ని, హ్రస్వమైన అకారము తరువాతవచ్చు విసర్గమునకు హ్రస్వ అకారముగాని, మృదుహల్లులు (హశ్శులు) గాని పరములగునపుడు 'ఉ' ఆదేశముగావచ్చి పూర్వమందున్న అకారముతోఁగూడి గుణసంధి ననుసరించి ఓ గా మాఱును. తప + ఉ + అగ్ని = తపో అగ్ని. పదాంత గతములైన ఏ ఓలకు హ్రస్వమైన అకారము పరమగునపు డా అకారము ఏ ఓలలో లీనమైపోవును. అదృశ్యమైన హ్రస్వ అకారమునకు సూచనగా అవగ్రహము (ఽ)నుంతురు. తపోఽగ్ని.

గీ. ధర నిదాఘవాతాహతి నెరియకుండ
విధి తమాలమంటపము గావించె ననఁగ
నొప్పె నీలాభ్రపటల మ చ్చప్పరమున
రాళు లన నెల్లదెస వానకాళు లమరె. 97

అర్థము: ధర = భూమి, నిదాఘ - వాత + ఆహతిన్ = వడగాలి దెబ్బచే, ఎరియక + ఉండన్ = కాలిపోవకుండ, నిధి = బ్రహ్మ, తమాల - మంట పము = చీఁకటిమ్రాని మండపము, కావించెన్ + అనఁగన్ = చేసెనా యనునట్లు. ఆ + చప్పరమునన్ = ఆ యాకాశమున(?), (మండపమున). నీల + అభ్ర - పటలము = నల్లనిమేఘముల సమూహము, ఒప్పెన్. రాశులు = తొాలు, అనన్ + అనఁగా, ఎల్ల - దెసన్ = అన్ని దిక్కులందును, వానకాళులు = వర్షధారలు. అమరెన్ = ఒప్పెను.

తాత్పర్యము: భూమి వడగాళి దెబ్బకుఁ గాలిపోకుండునట్లు బ్రహ్మ చీఁకటిమ్రాని మండపము నిర్మించెనా యనునట్లు ఆ యాకాశమున నల్లని మేఘముల సమూహము ఒప్పెను. దాని తొా లనునట్లు అన్ని వైపులను వర్షధార లొప్పెను.

విశేషములు: అలంకారము ఉపమ, ఉత్ప్రేక్ష. చప్పరమనఁగా మండ పమని యర్థమయినను, ఇట సందర్భానుసారముగా ఆకాశమని యర్థము చెప్పఁబడినది. అభ్రపటలము నీలము గావున, తమాల మంటపమని చెప్పఁబడినది.

క. పుడమిఁ దన యాజ్ఞ సేకొని
నడపిన దంపతులమీఁద నలి మరుఁ డింపే
ర్పడఁ బుష్పవృష్టిఁ గురిసిన
వడువునఁ దొాలువాన గురిసె వడగండులతోన్. 98

అర్థము: పుడమిన్ = భూమియందు, తన - ఆజ్ఞ, చేకొని = కైకొని, నడపిన = ఆచరించిన. దంపతుల - మీఁదన్ = దంపతులపై, నలిన్ = ఒప్పుగా, మరుఁడు = మన్మథుఁడు, ఇంపు = ఆనందము, ఏర్పడన్ = కలుగునట్లు. పుష్ప - వృష్టిన్ పూలవానను, కురిసిన - వడువునన్ = కురిపిన విధమున, తొాలువాన = తొాల కరివాన, వడగండులతోన్ = వడగండ్లతో, కురిసెన్.

తాత్పర్యము: భూమిలోఁ దన యానతిని గైకొని ఆచరించిన దంపతులపై నొప్పుగా మన్మథుఁడు సంతోషముతోఁ బూలవాన గురిసినట్లు తొాలకరివాన వడగండ్లతోఁ గురిసెను.

విశేషములు : అలంకారము ఉత్ప్రేక్ష. వడగండులు - వడగల్లు + లు - 'ఔపవిభక్తికంబుల లి వర్ణ సలలువర్ణంబులకు బహువచనంబు పరంబగునపుడు పూర్ణ బిందుపూర్వక డువర్ణంబు బహుళంబుగా నగు.' బాల. అచ్చిక. 16

చ. ఉదుటఁ దెమల్చి మ్రింగు సరసోదకబిందులమౌక్తికంబుఁ లం
గదఁ గబళించిపీల్చు; వడగండులకుం దను వోసరించుఁ; దో
యదము లదల్చి తూరు; నచిరాంశు లతాగ్రములెక్కి మెల్పునం
జదలకు నుప్పరం బెగయుఁ జాతకపోతకముల్ సెలర్చుచున్. 99

అర్థము : చాతక - పోతకముల్ = పిల్లవానకోయిలలు. ఉదుటన్ - ఉద్ధతితో, తెమల్చి = కదల్చి. సరస + ఉదక - బిందుల - మౌక్తికంబులు = సరసములైన జలబిందువుల ముత్యములు, మ్రింగున్. అంగదన్ = ఆఁకటితో. కబళించి = మ్రింగి, పీల్చున్, వడగండులకున్ = వడగండ్లకు, తనువు = శరీరము, ఓసరించున్ = తొలఁగఁజేయును, తోయదములు = మేఘములు, అదల్చి = గద్దించి, తూరున్ = ప్రవేశించును, అచిరాంశు - లతా + అగ్రములు = మెఱవుదీఁగలకొనలు, ఎక్కి. మెల్పునన్ = నేర్పుతో, చెలర్చుచున్ = విజృంభించుచు, చదలకున్ = ఆకాశమునకు. ఉప్పరంబు + ఎగయున్ = పైకెగురును.

తాత్పర్యము : పిల్లవానకోయిలలు సరస జలబిందువుల ముత్యములను దెమలించి మ్రింగును, ఆఁకటితోఁ గబళించును. పీల్చును. వడగండ్లకు మేను తొలఁగఁ జేయును. మేఘములను ద్రోసికొని ప్రవేశించును. మెఱపుఁదీఁగల కొనలనెక్కి విజృంభించి నేర్పుతో నాకాశముమీఁది కెగురును,

విశేషములు : అలంకారము స్వభావోక్తి. చెలర్చుచున్ + చెలరు ధాతువు నిఘంటువులఁ గానరాలేదు. సందర్భముననుసరించి యర్థము చెప్పఁబడినది.

క. చలిగాడ్పుల ముసరులమెయి
వలిగొని ధాత్రీపురంధ్రి వలిఁ బచ్చని కం
బలిఁ గలిచికొన్న విధమునఁ
బొలుపుగఁ జిప్పరువు గవిసె భూతల మెల్లన్. 100

అ ర్థ ము : ధాత్రీ - పురంధ్రి = భూమియనుస్త్రీ. చలిగాడ్పుల - మొసరుల - మెయిన్ = చలిగాలులు వీచుటతో. వలి - కొని = చలివైచి, గడగడలాడి. వలిన్ = చలితో. పచ్చని - కంబలిన్ = పచ్చని కంబళమును, కలిచికొన్న విధమునన్ = కప్పికొనినరీతిని, పొలుపుగన్ = అందముగా, భూతలము + ఎల్లన్, చిప్పరువు = చిప్పరలు - సాధుపాఠము = చిప్పమొక్కలు - భూస్తృణము, కవిసెన్ = వ్యాపించెను.

తా త్ప ర్య ము ; భూమియనెడుస్త్రీ చలిగాలులు వీచుటచే గడగడలాడి చలికిఁ బచ్చని కంబళము గప్పికొనెనా యనునట్లు భూతలమంతయుఁ జిప్పమొక్కలు వ్యాపించెను.

వి శే ష ము లు : అలంకార ముత్ప్రేక్ష.

క. కా రను వీరుఁడు మెఱుఁ గను
దోరసిఁ బాంథు లను రిపులఁ దునిమినఁ దద్దే
హారుణబిందులు దొరిఁగెనొ
ధారుణి నన నింద్రగోపతతి విలసిల్లెన్. 101

అ ర్థ ము : కారు + అను - వీరుఁడు = వర్షాకాలము అను వీరుఁడు, మెఱుఁగు + అను - దోస్ (ః) + అసిన్ = మెఱుపు అనెడి చేతి కత్తి చేత, పాంథులు = బాటసారులు - విరహులు, అను = అనెడి, రిపులన్ = శత్రువులను, తునిమినన్ = ఖండింపఁగా, తద్ + దేహ + అరుణ - బిందులు = వారి శరీరము నందలి రక్తపుఁజుక్కలు, ధారుణిన్ = భూమియందు, తొరిఁగెనొ = స్రవించెనో. అనన్ = అనునట్లు, ఇంద్రగోపతతి = ఆరుద్రపురుగుల సమూహము, విలసిల్లెన్ = ప్రకాశించెను.

తా త్ప ర్య ము : వర్షాకాలమనెడి వీరుఁడు మెఱుపు అనెడి చేతికత్తితో విరహులనెడి శత్రువులను ఖండింపఁగా, వారిదేహమునుండి రక్తపుఁజుక్కలు నేలపైఁ గాఱెనో యనునట్లు అరుద్రపురుగులగుంపు ఒప్పెను.

వి శే ష ము లు : రూపకానుప్రాణితమైన ఉత్ప్రేక్ష.

ఆ. సురపగోప చాప శోభితంబై యుండు
నవ పయోదవేళ దివి యు భువియు
దెసలు దీటుకొనఁగఁ దృణ ఘన నివహ సం
ఛన్నమయ్యెఁ మఱియు మన్ను మిన్ను. 102

అర్థము : నవ - పయోద - వేళన్ = తొలకరి సమయమున, దివియున్ = ఆకాశమును, భువియున్ = భూమియును, (క్రమముగా) సురపగోపచాప - శోభితంబు = ఇంద్రగోపముల (ఆరుద్ర పురుగుల) తోను, ఇంద్రధనుస్సుతోడను, ప్రకాశించునది, ఐ = అయి, ఉండున్, మఱియున్, మన్నున్ = నేలయును - మిన్నున్ = ఆకాశమును, దెసలు = దిక్కులు, దీటుఁకొనఁగన్ = నిండఁగా, (క్రమముగా), తృణ , ఘన - నివహ - సంఛన్నము, = గడ్డియొక్కయు, మేఘముల యొక్కయు, సమూహముచేత, బాగుగాఁ గప్పఁబడినది, అయ్యెన్.

తాత్పర్యము : క్రొక్కారు సమయమున ఆకాశమును, భూమియును, క్రమముగా ఇంద్రగోపములతోను, ఇంద్రధనుస్సుతోను బ్రకాశించెను. మఱియును, నేలయు. ఆకాశమును దిక్కులు నిండునట్లు గడ్డితోను, మేఘసమూహముతోను గప్పఁబడినదయ్యెను.

విశేషములు : అలంకారము యథాసంఖ్యము, స్వభావోక్తి.

శా. ఆ క్రొక్కారను రాజుముందల నిజరావానంతగేయాభ్రనా
దైకాతోద్యముఁ గూర్చి మ్రోయ సురగోపాంభోజ రాగత్విషా
నీకోద్యద్ధరిదశ్మకస్థల లసన్నృత్యోరు రంగస్థలిన్
గేకీపాత్రము లాడె భావముగ నుత్క్షిప్తాగ్ర పింఛంబులై. 103

అర్థము : ఆ - క్రొక్కారు (క్రొత్త + కారు) + అను - రాజు - మ్రోలన్ = ఆ తొలుకారు అనెడి రాజునెదుట, కేకీ - పాత్రములు = ఆఁడు నెమలు లనెడి నట్టువకత్తెలు, నిజ - రావ + అనంత - గేయ + అభ్రనాద - ఏక + ఆతోద్యమున్ = తమవైన ధ్వనులనెడి అంతులేని గీతములకు ఉఱుము లనెడి ముఖ్యమైన వాద్యిత్రమును (తతము, ఆనద్ధము, సుషిరము, ఘనము అనెడి వాద్యచతుష్టయమును),

కూర్చి = సమకూరునట్లుచేపి, మ్రోయన్ = మ్రోయఁగా, సుర....స్థలిన్ సుర గోప = ఇంద్రగోపములు (ఆరుద్రపురుగులు) అనెడి, అంభోజ - రాగ = పద్మ రాగములయొక్క ఎఱుపుయొక్క, త్విషా = కాంతులయొక్క, అనీక = సమూ హమువలన. ఉద్యత్ = పూనుచున్న, హరిత్ + అశ్మక - స్థల = గరుడపచ్చ ఱాతినేల యనెడు. లసత్ = ప్రకాశించుచున్న, నృత్య = నాట్యమునకైన, ఉరు = పెద్ద, రంగ - స్థలిన్ = రంగస్థలమునందు, ఉత్ + క్షిప్త + అగ్ర - పింఛంబులు + ఐ = పైకి విప్పారిన కొనలుగల పింఛములు గలవయి, భావముగన్ = భావయుక్త ముగ, ఆడెన్ = నాట్యముచేసెను.

తాత్పర్యము : ఆ తొలుకారు అనెడి రాజునెదుట అఁడు నెమలులనెడి నట్టువరాండ్రు తమపైన కేకారవములనెడి అంతులేని గీతములకు ఉఱుముల ధ్వను లనెడి వాద్రితమును సమకూర్చి మ్రోయఁగా, ఇంద్రగోపములనెడి పద్మరాగ కాంతుల సమూహమువలని గరుడపచ్చఱాతి నేల యనెడు పెద్ద నాట్యరంగస్థలమునందు పైకి విప్పారిన పింఛాగ్రములు గలవై భావయుక్తముగ నాట్యముచేపిరి.

విశేషములు: అలంకారము రూపకము. క్రొక్కారే రాజు. అతని యెదుట అఁడునెమళ్ళనెడి నట్టువరాండ్రు పింఛియముల కొనలెత్తి భావయుక్తముగ నాట్యము చేయుచుండిరి. ఆ నాట్యమునకు రంగస్థల మేది యన - ఇంద్రగోపములనెడి పద్మ రాగమణుల కాంతులచేనైన గరుడపచ్చఱానేల.

క్రొక్కారు = క్రొత్త + కారు 'సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చు మీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగా నగు.' బాల.సంధి. 36. క్రొ + కారు, 'క్రొత్తశబ్దమున కాద్యక్షరశేషంబునకుం గొన్నియెడల నుగాగమంబునుం గొన్ని యెడల మీఁది హల్లునకు ద్విత్వంబు నగు.' బాల.సంధి. 38. నాద + ఏక నాదైక. వృద్ధి సంధి. అ ఆలకు ఏ ఐలు పరములగునపుడు ఐకారమును, ఓ ఔలు పరము లగునపుడు ఔకారమును ఏకాదేశమగును. అంభోజ. అనుదానికి 'అంభోద' అను పాఠాంతరముగలదు. 'అంభోద' కంటె 'అంభోజ' మేలనిపించి అది స్వీకరింపఁబడినది. త్విషా - షకారాంత త్విట్ఛబ్దమేకాక 'త్విషా' అను ఆకారాంత స్త్రీలింగశబ్దముగూడఁ గలదని శబ్దరత్నాకరకారుఁడు. ఉద్యద్ధరిదశ్మక - ఉద్యత్ + హరిత్ = వర్గముల మొదటి నాల్గక్షరముల (యయ్యాల) కంటె పరమగు

హకారమునకు పూర్వసవర్ణాదేశము (ఆ వర్గములకు చెందిన చతుర్థవర్ణాదేశము) వైకల్పికముగా నగును. ఉద్యత్ + ధరిత్, ఉద్యత్ + హరిత్. అనునాసికాంతస్థ వర్ణములు తప్ప మిగిలిన పదాంతగతహల్లులకు (ఝల్లులకు) మృదుహల్లులు (హశ్శులు) కాని, అచ్చులు కాని పరమగునపుడు ఆ హల్లుల వర్గమునకుఁ జెందిన తృతీయవర్ణ మాదేశముగా వచ్చును. ఉద్యద్ధరిత్, ఉద్యద్ధ్వరిత్. ఈ సూత్రముచేతనే హరిత్ + అశ్మక హరిదశ్మక అగును. లసన్నృత్య = లసత్ + నృత్య. ర హలు తప్ప మిగిలిన పదాంతగత హల్లులకు (య్రులకు) అనునాసికవర్ణము పరమగుచో వానికి సంబంధించిన అనునాసికవర్ణము వైకల్పికముగ అదేశమగును. లసన్నృత్య-పక్షమున లసద్నృత్య. నృత్యోరు - నృత్య + ఉరు-గుణసంధి. సంయుతాసంయుత ప్రాసము.

తే. రలలు తమక్రింద జడ్డలై క్రాలు ప్రాలు, ప్రాసవర్ణంబులై వానిఁ బాసియైన।
గూడియైనను బెఱ యడుగులను నిలుచు, సంయుతాసంయుతప్రాససంజ్ఞఁ దనరి.
-అప్పకవీయము.

కేకీపాత్రము లాడె.... ఉత్క్షిప్తాగ్రపింఛంబులై - ఆఁడునెమలులకుఁ బింఛము లుండునా?

గీ. డిందమై పూచి పర్విన కుందలతల
తోన కడమలుఁ బూచెఁ దొల్వానకాల;
మెసఁగె విరహులు విరహాగ్ని నెరసి నీఱు
పొరపు గొనియున్న నిప్పులప్రోవు లనఁగ. 104

అర్థము : తొల్ + వాన - కాలము = తొలుకారువ, డిందము + ఐ = దట్టమయి (?), పూచి, పర్విన = వ్యాపించిన, కుంద - లతలతోన్ + అ = మొల్లతీవలతోపాటే, కడమలున్ - కడపలున్ = కడిమిచెట్లుగూడ, పూచెన్, (అవి), విరహులు = వియోగులు, విరహ + అగ్నిన్ = విరహమనెడి అగ్నిచేత, ఎరిపి = కాలి, నీఱు = నివుఱు, పొరపు + కొని + ఉన్న = కూడికొనియున్న, నిప్పుల - ప్రోవులు + అనఁగన్, ఎసఁగెన్ = అతిశయించెను.

తాత్పర్యము : తొలకరియందు మొల్లలు విఱుగఁబూచినవి, వానితోపాటే కడిమిచెట్లును బూచినవి. అవి - వియోగులు వియోగాగ్నిచేఁ గాలఁగానైన నివుఱు గప్పిన నిప్పులప్రోవులో యన నొప్పెను.

విశేషములు : రూపకానుప్రాణితమైన ఉత్ప్రేక్ష. వర్షాకాలమునఁ గుంద ములును, కదంబములును పూచును. కుందపుష్పములు తెల్లనై నివుఱువలెను, కదంబ ములు ఎఱ్ఱనై నిప్పులవలెను ఉండును. కడపలు - ఈ శబ్దము నిఘంటువులఁ గాన రాలేదు. కడప శబ్దమునకుఁ గడిమిచెట్టనునర్థము గలదు. (సూ.ని.) "సీ. కడవపూఁ దేనియఁ గడుపారఁగొని ప్రోసి తిరుగు లేఁదేఁటుల తెరలికయును." హరి. పూ. 9-68. గీ. కడిమి కడప యటం చనఁబడుఁ గదంబ. ము.ఆం.భా. 2-46. అది కడప లయియుండునేమో !

తొలువాన-తొల్వాన - 'పదాంతంబు లయి యసంయుక్తంబు లయిన ను లు రుల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు.' బాల.ప్రకీర్ణక. 16. తొల్వానకాలము- 'కాలాధ్వములకుం బ్రాయికంబుగాఁ బ్రథమ యగు.' బాల.కారక. 25.

క. సురనది ఝషములు డిగ్గఁగ
శరనిధి, కా శరధిలోని ఝషకము లెక్కన్
సురనది, కి ట్లెడపడకయ
కురిసె మహావృష్టి గుండ్లు గూల్చిన భంగిన్. 105

అర్థము : సురనది-ఝషములు = ఆకాశగంగానదిలోని చేఁపలు, శరనిధి కిన్ = సముద్రమునకు, డిగ్గఁగన్ = దిగఁగా, ఆ - శరధిలోని = ఆ సముద్రము నందలి, ఝషకములు = చేఁపలు, సుర - నదికిన్ = ఆకాశగంగానదికి, ఎక్కన్ = ఎక్కఁగను, ఇట్లు, ఎడపడక + అ = నిర్విరామముగనే, గుండ్లు + కూల్చిన - భంగిన్ = ఱాలు కూల్చినట్లుగా - అధికముగా, మహత్ (మహా) - వృష్టి = పెద్ద వాన, కురిసెన్.

తాత్పర్యము : ఆకాశగంగానదిలోని చేఁపలు సముద్రమునకు దిగఁగా, సముద్రమునందలివి ఆకాశగంగలోని కెక్కఁగా - ఈ రీతిగా ఎడతెగకయే ఱాలు కూల్చినట్లుగాఁ బెనువాన కురిసెను.

విశేషములు: అలంకారము సంబంధాతిశయోక్తి. 'సంబన్ధాతిశయోక్తి స్స్యా దయోగే యోగ కల్పనమ్.' చన్ద్రా.

చ. దరములు ముంపుచుం, దరులతాతతి వేఱులతోన కూలఁగా
నురువడిఁ ద్రోచుచున్, మడువు లోలిఁ గలంచుచు, నంబుజాలి సం
హరణము సేయుచున్, మదజలౌఘము గ్రమ్మ మదాంధగంధసిం
ధురమునుబోలెఁ బెల్లున నదుల్ చనుదెంచె భయంకరాకృతిన్, 106

అర్థము. నదుల్ = నదులు, దరములు = గోతులు, ముంపుచున్ = ముంచుచున్ = ముంచివైచుచు, తరు - లతా - తతిన్ = చెట్లయుఁ, దీఁగలయు సమూహమును, వేఱులతోన్ + అ = వేరులతోనే, - సమూలముగా, కూలఁగాన్ = కూలిపోవునట్లు, ఉరువడిన్ = ఉరవడితో-మిక్కిలి వేగముతో, త్రోచుచున్ = పడఁ గొట్టుచు, మడువులు = మడుఁగులు, ఓలిన్ = క్రమముగా, కలంచుచున్ = కలఁచివైచుచు, అంబుజ + ఆలిన్ = తామరల వరుసను, సంహరణము + చేయుచున్ = నాశనముచేయుచు, మద - జల + ఓఘము = ఉద్ధతితోడి జల మనెడి మదజలముయొక్క ప్రవాహము, క్రమ్మన్ = ఆక్రమింపఁగా, మద + అంధ - సింధురమును + పోలెన్ = మదముచే గ్రుడ్డిదైన ఏనుఁగువలె, భయంకర + ఆకృతిన్ = వెఱపుగొలుపు ఆకారముతో, పెల్లునన్ = అధికముగా, చనుదెంచెన్ = వచ్చెను.

తాత్పర్యము: వర్షాకాలమున నదులు గోతులను ముంచివైచుచు, చెట్లయుఁ దీఁగలయు సమూహమును సమూలముగా మిక్కిలి వేగముతోఁ గూల్చివైచుచు, మడుఁగులను గలంచివైచుచు, తామరలను నాశనముచేయుచు, ఉద్ధతితోడి జలమనెడి మదజల ప్రవాహము వ్యాపింపఁగా మదముచేఁ గన్నులుగానని యేనుఁగువలె భయంకరాకారముతో నధికముగా వచ్చెను.

విశేషములు: అలంకారములు-స్వభావోక్తి, ఉపమ.

వేఱులు - వేరు + లు. 'బహువచనము పరంబగునపు డసంయుక్తంబులై యుదంతములయిన డ-ల-ర-ల కలఘులకారంబు బహుళంబుగా నగు.' బాల.అచ్చి. 13. జలౌఘము - జల + ఓఘము - వృద్ధి సంధి. ముంపుచున్ - ముంచుచున్ అని

యుండనగు. ఆగమ చకారంబునకు నెఱసున్న మీఁదిదానికి దుక్కు పరంబగునపుడు పకారంబు విభాషనగు-బాల.క్రియ. 90. ఇచ్చట దుక్కుగాక, శత్రర్థక చువర్ణకము పరమగుటచే పత్వమురాదు. ఇచ్చట 'ముంచుచున్' అని యున్నను ఛందోభంగము కాదు.

వ. అట్టి వర్షాసమయంబునం దంభోవాసినియై గౌరి ఘోరతపంబు చేయు నవసరంబున, 107

అర్థము: అట్టి వర్షాసమయంబునందున్, అంభస్(ః) + వాసిని + ఐ = జలమునందు నివసించునదియై, గౌరి = పార్వతి, ఘోర - తపంబు = భయంకర మైన తపస్సు, చేయు + అవసరంబునన్ = చేయునప్పుడు.

తాత్పర్యము: అట్టి వర్షాకాలమునందు నీటనివసించుచుఁ బార్వతి భయంకరమైన తపస్సుచేయునప్పుడు - తరువాతి పద్యముతో నన్వయము.

విశేషములు: అంభస్ + వాసిని - పదాంత సకారమునకు విసర్గాదేశము. అంభః + వాసిని. హ్రస్వ అకారము తరువాత వచ్చు విసర్గమునకు హ్రస్వ అకారము కాని, మృదుహల్లులు (హశ్శులు)కాని పరములగునపుడు 'ఉ'ఆదేశముగా వచ్చి పూర్వమందున్న అకారముతోఁగూడి గుణసంధి ననుసరించి ఓ గా మాఱును. చేయు నవసరంబున - చేయు + అవసరంబున - 'ఉదంతమగు తద్ధర్మార్థ విశేషణమున కచ్చు పరమగునపుడు నుగాగమంబగు.' బాల.సంధి. 33.

క. అమరె నెఱిజడలపై ను
త్తమరుచి నవజలకణములు దగిలి బెడంగై
యుమ తపమున కెదమెచ్చి త
దమరులు ముత్యములనేస లలికిన భంగిన్. 108

అర్థము: నవ - జల - కణములు = తొలకరి నీటి బిందువులు, ఉత్తమ - రుచిన్ = శ్రేష్ఠమయిన కాంతితో, నెఱి - జడలపైన్ = అందమైన జడలమీఁద, తగిలి = అంటి, బెడంగు + ఐ = సుందరమయి, తద్ + అమరులు = ఆ దేవతలు, ఉమ - తపమునకున్ = పార్వతి తపస్సునకు, ఎదన్ = హృదయము

నందు, మెచ్చి = సంతోషించి, ముత్యముల - సేసలు = ముత్యములనెడి ఆశీరక్ష తలు, అలికిన - భంగిన్ = చల్లిన విధమున, అమరెన్ = ఒప్పెను.

తాత్పర్యము ; తొలకరి నీటి బిందువులు మేలయిన కాంతితోఁ పార్వతి సుందరములైన జడలపై నంటి అందమై, ఆ దేవత లామె తపస్సునకు సంతోషించి ముత్యములనెడి అశీరక్షతలు చల్లిరా యనునట్లు ఒప్పెను.

విశేషములు : అలంకార ముత్ప్రేక్ష.

వ. మఱియును. 109

చ. అడపు నవాంబుధారలు జటాటవిలోఁ బడి విభ్రమించి వె
ల్వడి చనుదెంచి రాలుగొని పక్ష్మములన్ వెడ నిల్చి మోవిపైఁ
బడి కుచఘట్టనం జెదరి పాఱి రయంబున ముత్తరంగలన్
మడుఁగులుపాఱి నాభి కెడమానక చొచ్చె ననుక్రమంబునన్. 110

అర్థము : అడరు = విజృంభించు నవ + అంబు - ధారలు = తొలకరి నీటి ప్రవాహములు, అనుక్రమంబునన్ = వరుసగా, జటా + అటవిలోన్ = జడ లనెడి అడవిలో, పడి, విభ్రమించి = విశేషముగాఁ జలించి, వెల్వడి=బయలు వెడలి, చనుదెంచి = వచ్చి, రాలు + కొని = జాఱి, పక్ష్మములన్ = కనుఱెప్పవెండ్రు కలయందు, వెడ - నిల్చి = ఇంచుకయుండి, మోవిపైన్ = పెదవిమీఁద, పడి, కుచ - ఘట్టనన్ = స్తనముల రాపుచే, చెదరి - పాఱి = చెదరి ప్రవహించి, రయంబునన్ = వేగముగా, ముత్తరంగలన్ (మూఁడు తరంగలన్) = మూఁడు వళులందును, మడుఁగులు పాఱి = మడుఁగు లగునట్లు అయి, నాభికిన్, ఎడ - మానక = చోటు విడువక - సంపూర్ణముగా ననుట, చొచ్చెన్ = ప్రవేశించెను.

తాత్పర్యము : తొలకరి నీటి ప్రవాహములు అతిశయించి క్రమముగా జడలనెడి అడవిలోఁబడి విశేషముగాఁ జలించి, బయలువెడలివచ్చి యచ్చటినుండి జాఱి, ఱెప్పవెండ్రుకలయందు ఇంచుకసేపు నిలిచి పెదవిపైఁబడి, స్తనములరాపుచేఁ జెదరి ప్రవహించి, వేగముగా మూఁడువళులందు మడుఁగులుగా నయి నాభియందు సంపూర్ణముగాఁ బ్రవేశించెను.

విశేషములు : ఈ పద్యము సంస్కృత కుమారసంభవములోని

స్థితాః క్షణం పక్ష్మసు తాడితాధరాః
పయోధరోత్సేధ నిపాత చూర్ణితాః,
వలీషు తస్యాః స్ఖలితాః ప్రపేదిరే
చిరేణ నాభిం ప్రథమోదబిన్దవః. సం.కుమార. 5-24

అను శ్లోకమునకు ఇంచుమించు అనువాదమనియే చెప్పవచ్చును. ఆ శ్లోకమునకు వ్యాఖ్యాతలు పార్వతి తపస్సునకుఁ గూర్చుండిన స్థితితోపాటు వ్యంగ్యముగ నామె సౌందర్యముగూడఁ జెప్పఁబడినట్లయినదని వ్యాఖ్యానించిరి. ఆ వ్యాఖ్యానమంతయుఁ దెలుఁగుపద్యమునకుఁగూడ సరిపోవును. - నవాంబుధారలు జటాటవిలోఁ బడె ననుట సంస్కృత శ్లోకమున లేదు. తెలుఁగున నధికము. సముచితము. నవాంబుధారలు - 'నవ' విశేషణముచే ధారల విరలత్వమును, బహువచనముచే నాతివిరలత్వమును సూచింపఁబడుచున్నది. పక్ష్మములన్ వెదనిల్చి - నిల్చి యనుటచేఁ బక్ష్మముల సాంద్రతయు, 'వెద' అనుటచే స్నైగ్ధ్యము గమ్యమానమగును. మోవిపైఁబడి - సంస్కృతమున తాడితాధరాః - అని యుండుటచే అధరమార్దవము గమ్యమానమగు చున్నది. తెలుఁగునఁగూడ 'పడి' యనియుందుటచే ఆ స్వారస్య మూహింపనగును. కుచ ఘట్టనం జెదరి పాఱి - చెదరి యనుటచే కుచముల కాఠిన్యము సూచితమగుచున్నది. ముత్తరంగలన్ మడుఁగులు పాఱి - తరఁగల నిమ్నోన్నతత్వములు తెలియును. 'నాభి కెడమానక చొచ్చె' ననియే కాని అవి తరువాత నేమయ్యినవియుఁ జెప్పఁబడలేదు. అందుచే నాభి గాంభీర్యము తెలియుచున్నది.

ఎడమానక - ఎడము + ఆనక అని విఱుచుచో యతిభంగము. కావున ఎడ-మానక అనియే ఛేదము. ముత్తరంగలన్ - మూఁడు + తరంగలన్ - 'సమానాధి కరణంబగు నుత్తరపదంబు పరంబగునపుడు మూఁడుశబ్దము డు వర్ణంబునకు లోపం బును మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు.' బాల.సమాస. 17. 'ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుగా నగు. మిశ్రంబునకుఁ గాదు.' బాల. సమాస. 18. ఇందు మిశ్రము గాకున్నను ఏకవచనము రామి విశేషము.

వ. తదనంతరంబ. 111

అర్థతాత్పర్యములు : ఆ పిమ్మటనే - తరువాతి పద్యముతో నన్వయము.

## శరత్కాల వర్ణనము

మ. దళితాంభోరుహసప్తపత్రసుమహత్కాశాసనౌఘంబు, ని
ర్గలితాంబుప్రదకేతకీకుటజకుందవ్రాత, ముద్భాసితేం
దులసన్మత్తమరాళకంబు, గతవిద్యుత్కేకిసల్లాస్య మ
గ్గలమై పర్వె జగంబులందు రుశరత్కాలంబు రమ్యాకృతిన్. 112

అర్థము: దళితాం.... నౌఘంబు: దళిత = వికసించిన, అంభోరుహ = తామరల, సప్తపత్ర = సప్తవర్ణ ? - ఏడాకులపొన్నల, సుమహత్ = మిక్కిలి గొప్పవియగు, కాశ = తెల్లపూల, అసన + ఓఘంబు = వేఁగిసపూల సమూహము గలది, నిర్గలితాంబు....వ్రాతము: నిర్గలిత = చక్కఁగా ఛేదింపఁబడిన, అంబుప్రద = మేఘముల, చక్కఁగా వికసించిన, కేతకీ = మొగలిపూల. కుటజ = కొండమల్లెల, కుంద = మొల్లల, వ్రాతము = సమూహముగలది, ఉద్భాసిత.... మరాళకంబు: ఉత్ + భాసిత = మిక్కిలి ప్రకాశించిన, ఇందు = చంద్రుఁడును, లసత్ = ప్రకాశించుచున్న, మత్త - మరాళకంబు = మదించిన హంసలుగలది, గత.... సల్లాస్యము; గత = పోయిన, విద్యుత్ = మెఱపులు, కేకి = నెమలుల యొక్క, సత్ + లాస్యము (సల్లాస్యము) = మంచి నాట్యముగలది, అగు, ఉరు శరద్ + కాలంబు = గొప్పదియగు శరదృతువు, జగంబులందున్ = లోకము లందు, రమ్య + ఆకృతిన్ = మనోహరమైన రూపముతో, అగ్గలము + ఐ = అధికమయి, పర్వెన్ = వ్యాపించెను.

తాత్పర్యము: శరత్కాలము రమణీయాకారముతో వచ్చెను. అప్పుడు పద్మములు, సప్తపత్రములు, కాశములు, వేఁగిసపూలు వికసించెను. మేఘములు చక్కఁగా ఛేదింపఁబడెను. మొగలిపూలు, కొండమల్లెలు, మొల్లలు వికసించెను. చంద్రుఁడు మిక్కిలి ప్రకాశించెను. మదమరాళములు ప్రకాశించెను. మెఱపులును, నెమళ్ళ మంచి నాట్యములును పోయెను.

విశేషములు: సప్తపత్రము - సప్తవర్ణ మయి యుండునా? అసన + ఓఘ - అసనౌఘ - వృద్ధిసంధి. సల్లాస్య - సత్ + లాస్య-తవర్గవర్ణములకు లకారము పరమగుచో వరసవర్ణము ఆదేశమగును. శరద్ + కాలము - శరత్కాలము -

అనునాసికాంతస్థ భిన్నములైన హల్లులకు (ఝల్లులకు) కగసహల్లులు (ఖరులు) పరమగునపుడు వాని వర్గములందలి ప్రథమవర్ణములు (చరులు) ఆదేశముగా వచ్చును.

క. జలవాసులైన హరి ల
క్ష్ములు వర్ష నిశావసానమున మేల్కాని క
న్నులు విచ్చి చూచినట్టులు
జలజోత్పల రుచులు వెలసె శారదవేళన్. 113

అర్థము: జల - వాసులు + ఐన = నీటియందు నివసించువారగు, హరి - లక్ష్ములు = విష్ణువును, లక్ష్మియును, వర్ష - నిశా + అవసానమునన్ = వర్షాకాల మనెడిరాత్రి ముగింపునందు, మేల్కాని = నిద్రలేచి, కన్నులు - విచ్చి = కనులు విప్పి, చూచిన + అట్టులు = చూచినవిధమున, శారద - వేళన్ = శరదృతువు నందు, జలజ + ఉత్పల - రుచులు - క్రమముగాఁ దామరలయుఁ, గలువలయుఁ గాంతులు, వెలసెన్ = ప్రకాశించెను.

తాత్పర్యము: సముద్రమున శయనించు విష్ణువును, లక్ష్మియును వర్షర్తు వనెడిరాత్రి ముగియఁగనే మేల్కాంచి కన్నులువిచ్చి చూచిరా యనునట్లు, పద్మము లయుఁ, గలువలయుఁ గాంతులు క్రమముగా నొప్పెను.

విశేషములు: హరిలక్ష్ములు - హరియును లక్ష్మియును - ద్వంద్వము. వర్షనిశా = వర్షమనెడి నిశ - రూపకము, యథాసంఖ్యము. రూపకానుప్రాణి తోత్ప్రేక్ష. శరత్సంబంధమయినది శారదము.

క. తేటెం గొలఁకులు, వే తడి
యాఱె మహీతలము, విరిసె నబ్జము, తెలిమిన్
బాఱె మరాళము, లోలిం
దీఱెను బులినములు, వెలిఁగె దిక్కులు గలయన్. 114

అర్థము: కొలఁకులు = సరస్సులు, తేటెన్ = తేటపడెను, మహీ - తలము = భూతలము, వే = శీఘ్రముగా, తడి - ఆఱెన్ = తడియాఱిపోయెను,

అబ్జములు = తామరలు, విరిసెన్ = వికసించెను, ఎలమిన్ = సంతోషముతో, మరాళములు = హంసలు, పాఱెన్ = పరువెత్తెను, ఓలిన్ = క్రమముగా, పులినములు = ఇసుకతిన్నెలు, తీఱెన్ = ఏర్పడెను, దిక్కులు, కలయన్ = అంతటను, వెలింగెన్ = ప్రకాశించెను.

తాత్పర్యము : శరత్కాలమున సరస్సులు తేఱెను. దిక్కులు భూమి తడి యాఱెను. తామరలు వికసించెను. హంసలు సంతోషముతోఁ బరువెత్తెను. క్రమముగా నిసుకతిన్నె లేర్పడెను. దిక్కులు అంతటను బ్రకాశించెను.

విశేషములు : అలంకారము స్వభావోక్తి. కొలఁకులు - కొలను + లు. 'కలన్వాదుల నువర్ణంబు కుఙ్ఙగు బహువచనము పరంబగునపుడు నిత్యముగా నగు.' బాల.ఆచ్ఛిక. 18.

సీ. కాంతల హారప్రకాశంబుతోడన
  కాశ వికాసప్రకాశ మెసఁగె;
మడఁతుల తిన్నని నడపులతోడన
  నయమున రాయంచ నడపు లడరెఁ;
బొలఁతుల కనుఁగవ పొలపంబు తోడన
  నలిఁ జకోరంబుల పొలప మెలసె;
వెలఁదుల ముఖకాంతి వెలుఁగుటతోడన
  విమలమై శశికాంతి వెలుఁగు డమరెఁ:

తే. దెఱవ లెదల కలఁక తేఱుటతోడన
యేఱులందుఁ గలఁక తేఱఁదొడఁగె;
మదనవతుల మద సముదయంబుతోడన
పంబి శారదోదయంబు తనరె.



అర్థము : కాంతల = స్త్రీలయొక్క, హార - ప్రకాశంబుతోడన్ + అ ॥ హారములయొక్క ప్రకాశముతోపాటే, కాశ - వికాస - ప్రకాశము = తెల్లయొక్క వికాసముయొక్కకాంతి, ఎసఁగెన్ = అతిశయించెను.

మడఁతుల = స్త్రీల, తిన్నని = బాగైన, నడపుల - తోడన్ + అ = నడకలతోపాటే, రాయంచ - నడపులు = రాజహంసముల నడకలు, నయమునన్ = బాగుగా, అడరెన్ = అతిశయించెను.

పొలఁతుల = స్త్రీల, కనుఁగవ (కను + కవ) = కన్నుల జంటయొక్క, పొలపంబుతోడన్ + అ = చలనముతోపాటే, నలిన్ = తగునట్లుగా, చకోరంబుల = వెన్నెలపులుఁగులయొక్క, పొలపము = చలనము, ఎలసెన్ = కలిగెను.

వెలఁదుల = స్త్రీలయొక్క, ముఖ - కాంతి = ముఖప్రకాశము, వెలుఁగుట - తోడన్ + అ = ప్రకాశించుటతోపాటే, శశి - కాంతి = చంద్రునికాంతి, విమలము + ఐ = నిర్మలమయి, వెలుఁగుడు + అమరెన్ = ప్రకాశించుట ఒప్పెను.

తెఱవ లెదల (తెఱవల + ఎదల) = స్త్రీల హృదయములయొక్క, కలఁక = కలఁగుట, తేఱుట + తోడన్ + అ = తేటపడుటతోపాటే, ఏఱుల + అందున్ = నదులందు, కలఁక, తేఱన్ + తొడఁగెన్ = తేటపడఁజొచ్చెను.

మదనవతుల = స్త్రీలయొక్క, మద - సముదయంబుతోడన్ + అ = మదముల సమూహముతోపాటే, శారద + ఉదయంబు = శరత్సంబంధమైన అభ్యుదయము, పంబి = అతిశయించి, తనరెన్ = ఒప్పెను.

తాత్పర్యము: స్త్రీల హారముల ప్రకాశముతోపాటే తెల్లపూల వికసన ప్రకాశము అతిశయించెను. స్త్రీల తిన్ననైన నడకలతోపాటే రాజహంసముల నడకలు బాగుగా నతిశయించెను. స్త్రీల కనుదోయి చలనముతోపాటే చకోరముల చలనము వ్యాపించెను. స్త్రీల ముఖకాంతితోపాటే చంద్రునికాంతి నిర్మలమై వెలుఁగనారంభించెను. స్త్రీల హృదయములు కలఁకతేఱుటతోపాటే, నదులు కలఁకదేఱఁజొచ్చెను. మదవతుల మదసముదాయముంతోపాటే శరత్కాలపుటభ్యుదయము అతిశయించి యొప్పెను.

విశేషములు: అలంకారము సహోక్తి, స్వభావోక్తి.

ఉ. చారు నిశీథినీ విమల సాంద్ర సుధాకరభాతి రోదసీ
పూరితమై దినంబుల నభోమణి దీప్తిఁ దఱంక కిమ్ముగాఁ
బేరి ఘనీభవించె ననఁ బెల్లెసఁగన్ సితమేఘ హంస పం
కేరుహ కాశ సంహతులు క్రిక్కిఱిసెన్ శరదాగమంబునన్. 116

అర్థము : శరద్ + ఆగమంబునన్ = శరత్ప్రాప్తియందు, చారు.....భాతి : చారు = మనోహరమైన, నిశీథినీ = రాత్రులయొక్క, విమల = స్వచ్ఛమైన, సాంద్ర = దట్టమైన, సుధాకర - భాతి = చంద్రునికాంతి, రోదసీ - పూరితము + ఐ భూమ్యాకాశముల నడిమిభాగము నిండినదయి, దినంబులన్ = పగళ్ళను, నభోమణి = సూర్యునియొక్క, దీప్తిన్ = కాంతిచేత, తఱంకక = తగ్గక, ఇమ్ముగాన్ = బాగుగా, పేరి = అతిశయించి, ఘనీభవించెన్ + అనన్ = గడ్డకట్టె ననఁగా, పెల్లు + ఎసఁగన్ = మిక్కిలి అతిశయించునట్లు, సిత - మేఘ - హంస - పంకేరుహ-కాశ - సంహతులు = తెల్లని మేఘములయు, హంసలయు, పద్మములయు, తెల్లుపూలయు సమూహములు, క్రిక్కిఱిసెన్ = దట్టమయ్యెను.

తాత్పర్యము : శరత్సమయమునందు మనోహరములైన రాత్రులయందలి నిర్మలము, సాంద్రమునైన చంద్రకాంతి భూమ్యాకాశముల నడిమిభాగము నిండి, పగటివేళల సూర్యకాంతిచేఁ దఱుగక బాగుగా నతిశయించి గడ్డకట్టెనా యనునట్లు తెల్లని మేఘముల, హంసల, పద్మముల, తెల్లుపూల సమూహములు మిక్కిలి అతిశయించి సాంద్రమయ్యెను.

విశేషములు : అలంకార ముత్ప్రేక్ష. తఱఁకు - ఈ శబ్దము ఒక్కపమాసంభవమునందే వివిధార్థములందుఁ బ్రయుక్తమైనది. (సూ.ని.) క్రిక్కిఱిసెన్-క్రిక్కు + ఇఱిసెన్.

శా. శ్వేతద్వీపము చంద్రబింబము, మహాక్షీరాబ్ధి తజ్జ్యోత్స్న, త
ద్భాతిం గృష్ణుఁడు తన్మృగాంకము, లసత్పద్మాలయాక్షిద్యుతుల్
ప్రీతిం జారు చకోరదంపతులు నాఁ బృథ్వీధరుంబోలి వి
ఖ్యాతిం బొల్పగు శారదాభినుతరాకారాత్రు లత్యున్నతిన్, 117

అర్థము : శ్వేతద్వీపము = తెలిదీవి, చంద్రబింబము = చంద్రమండల మును, మహత్ (మహా) క్షీర + అబ్ధి = గొప్పదియగు పాలసంద్రము. తద్ + జ్యోత్స్న = ఆ చంద్రుని వెన్నెలయును, తద్ + ఖాతిన్ = ఆ విధముగనే, కృష్ణుఁడు, తద్ + మృగ + అంకమున్=ఆ చంద్రునియొక్క లేడిచిహ్నమును-మచ్చయును, లసత్ + పద్మాలయా + అక్షి - ద్యుతుల్ ప్రకాశించుచున్న, లక్ష్మీదేవియొక్క నేత్రకాంతులు, ప్రీతిన్ = ఒప్పుతో, చారు - చకోర - దంపతులు = మనోహరములైన వెన్నెలపులుఁగుల జంటలును, నాన్ = అనఁగా, శారద + అభినుత - రాకా - రాత్రులు = శరత్సంభవములైన, పొగడఁబడిన, పున్నమరేలు, అతి + ఉన్నతిన్ = మిక్కిలి గొప్పతనముతో, పృథ్వీధరున్ = విష్ణువును, పోలి, విఖ్యాతిన్ = ప్రసిద్ధితో, పొల్పు + అగున్ = ఒప్పును.

తాత్పర్యము : తెలిదీవి చంద్రమండలమును, మహాక్షీరసముద్రము ఆ చంద్రునివెన్నెలయును, అట్లే కృష్ణుఁడు ఆ చంద్రునిలోని మచ్చయును, లక్ష్మీదేవి కన్నుల కాంతులు వెన్నెలపులుఁగుల జంటయును గాఁగా శారదరాత్రులు అత్యున్నతితో విష్ణుమూర్తిని బోలి ప్రసిద్ధికెక్కను.

విశేషములు : అలంకారము ఉపమ, రూపకము, ఉత్ప్రేక్ష.

క. నారీ సంగమ సుఖములఁ
జేరని గాంభీర్యవృత్తిఁ జేకొనక సరి
త్తీరజలంబుల మధ్యమ
వారిన్ నగునట్లు కాశవనరుచి వెలిఁగెన్. 118

అర్థము ; సరిత్ + తీర - జలంబులు + అ=నదియొడ్డుననున్న నీరులే, నారీ - సంగమ - సుఖములన్ + స్త్రీ సాంగత్యమువలని సౌఖ్యములను, చేరని = పొందని, గాంభీర్య-వృత్తిన్ = గాంభీర్యముతోడి వర్తనమును (లోఁతుగానుండుటను), చేకొనక = స్వీకరింపక, మధ్యమ - వారిన్ = నడిమి జలమును, నగు + అట్లు = పరిహసించునట్లు, కాశ-వన-రుచి = తెల్లువనములకాంతి, వెలిఁగెన్ = ప్రకాశించెను.

తాత్పర్యము : స్త్రీలు నదియొడ్డుననున్నజలములందే స్నానమాచరింతురు, నడిమిజలములందుఁ జేయరు. అందుచే నదీతీరజలములకు నారీసంగమసౌఖ్య ముండును. నడిమిజలముల కా సౌఖ్యముండదు. నదీతీరజలములు లోఁతుగా నుండవు. నడిమి జలములు లోఁతుగా నుండును. స్త్రీసాంగత్యసౌఖ్యములులేని గాంభీర్యముగల నడిమిజలములను ఆ సౌఖ్యముగల నదీతీరజలములు పరిహసించుచున్నవా యనునట్లు ఒడ్డునందలి తెల్లువనములకాంతి ప్రకాశించెను.

విశేషములు : నవ్వు తెలుపని కవి సమయము. తెల్లుపూలకాంతి తెలుపగుటచే నగునట్లున్నవని భావము. గాంభీర్య మనఁగా గంభీరభావమును లోఁతును. స్త్రీసంగతిలేని గాంభీర్యముగల నడిమిజలములను అట్టి గాంభీర్యములేకున్నను, స్త్రీసాంగత్య శోభగల నదీతీరజలములు నవ్వుచున్నవా యనునట్లు తెల్లుపూలు ప్రకాశించెను. అలంకార ముత్ప్రేక్ష.

క. శరదాగమమున శోభా
కరముగఁ గై వ్రాలఁ బండి కలమవనంబుల్
గరుసున నెలమిన తామర
విరిపువ్వుల తావి కెఱఁగువిధమునఁ బొలిచెన్ 119

అర్థము ; శరద్ + ఆగమమునన్ = శరదృతువురాకయందు, శరదృతువునం దనుట, కలమ - వనంబుల్ = వరిమొక్కలు, శోభా + ఆకరముగన్ = ఒప్పునకు నిలయమగునట్లు, కై వ్రాలన్ = బరువై వంగునట్లు, పండి, గరుసువన్= బరువుతో(?), ఎలమిన్ + అ = సంతోషముతోనే, తామర - విరి - పువ్వుల - తావికిన్ = విచ్చిన తామరపువ్వుల పరిమళమునకు, ఎఱఁగు - విధమునన్ = వ్రాలు రీతిని, పొలిచెన్ = ఒప్పెను.

తాత్పర్యము : శరదృతువునందు వరిమొక్కలు శోభాయమానముగ విఱుగఁబండి బరువుతోఁ బ్రీతిమై వికసించినతామరపూల పరిమళమునకు వ్రాలురీతిని ఒప్పెను.

విశేషములు : అలంకార ముత్ప్రేక్ష.

ఉత్సాహ. అరుణ శాలి కణిశములు శుకాలి గఱచుకొనుచు నం
బరతలమున నోలి నెగసి పాఱుఁ; దిగ్వధూచయం
బరయఁ జెలువ మెసఁగు శారదాగమమున నుత్సవో
త్కరవిభాతిఁ దోరణములు గట్టినట్టు లందమై. 120

అ ర్థ ము : శుక + అలి = చిలుకల వరుస, అరుణ - శాలి-కణిశములు = ఎఱ్ఱని వరియెన్నులు, కఱచుకొనుచున్ = నోటఁగఱచుకొనుచు, ఓలిన్ = క్రమముగా, అంబర - తలమునన్ = ఆకాశమునందు, నెగసి = ఎగిరి, దిశ్(క్) + వధూ - చయంబు = దిక్కులనెడు స్త్రీలసమూహము, అరయన్ = చూడఁగా, చెలువము = అందము, ఎసఁగు = అతిశయించు, శారద + ఆగమమున్ = శరదృతువునందు, ఉత్సవ + ఉత్కర - విభాతిన్ = వేడుకలయొక్క సమూహముయొక్క విశేష కాంతితో, తోరణములు, కట్టిన + అట్టులు = కట్టిన విధముగా, అందము + ఐ, పాఱున్ = పరువెత్తును.

తా త్ప ర్య ము : చిలుకలవరుస ఎఱ్ఱని వరియెన్నులను నోటఁగఱచుకొని ఆకాశతలమునఁ గ్రమముగా నెగిరి, దిక్కులనెడి స్త్రీలసమూహము అంద మతిశయించు శరదృతువునందు ఉత్సవము మెఱయఁ దోరణములు కట్టెనా యనునట్లు అందమై పాఱెను.

వి శే ష ము లు : అలంకారము ఉత్ప్రేక్ష. అది రూపకానుప్రాణితము. చిలుకలు పచ్చగా నుండును. అవి నోటఁగఱచుకొనిన శాలికణిశము అరుణముగా యున్నవి. కావున దిగ్వధువులు రంగురంగులతోరణములు కట్టినట్లుండును.

ఛందస్సు: ఉత్సాహ వృత్తమునకు నాలుగుపాదము లుండును. ప్రతిపాదమునను ఏడు సూర్య గణములు, నొక గురువునుండును. మొదటి యక్షరమునకును, అయిదవ గణము మొదటి యక్షరమునకును యతిమైత్రి ప్రాసనియమము కలదు. దిగ్వధూ - దిశ్ + వధూ - దిక్ + వధూ దిగ్వధూ. దిక్కులనెడి వధువులు - రూపకము. శుకాలి - ఒక్క శుకము గాదు. శుకముల బారు. కావుననే తోరణమువలె నుండెను. ఓలిన్ - అవి క్రమముగాఁ బాఱుచుండుటచేతనే తోరణములవలె నుండెననుట. ఒక్క ఉత్సవము గాక ఉత్సవోత్కరమగుటచేతనే వి - భాతి. కావుననే తోరణములు కట్టుటయును.

వ. ఇట్లఖిలమనోరంజకంబై యతిరమణీయంబైన శరత్సమయంబునం బార్వతి తత్కాలోచితంబు లనుష్ఠించుచుండు నంత. 121

అర్థము : ఇట్లు, అఖిల - మనస్(ః) + రంజకంబు + ఐ = ఎల్లర మనస్సులకును సంతోషమును గలిగించునదియై, అతి - రమణీయంబు = మిక్కిలి మనోహరము, ఐన, శరద్ + సమయంబునన్ = శరత్కాలమునందు, పార్వతి, తత్ + కాల + ఉచితంబులు = ఆ సమయమునకుఁ దగినవి, అనుష్ఠించుచున్ + ఉండు + అంతన్ = చేయుచుండునంతలో_

తాత్పర్యము : ఈ రీతిగా నెల్లరమనస్సులను సంతోషింపఁజేయునదియై మిక్కిలి మనోహరమైన శరత్కాలమునఁ బార్వతి ఆ సమయమున కుచితములైన పనులను చేయుచున్నంత - తరువాతి పద్యముతో నన్వయము.

## హేమంత వర్ణనము

ఉ. శాంత దినాధిపప్రకర చండతరత్వము, మందితాబ్జవి
క్రాంతము, వీత సప్తదల గర్వము, ధూత మరాళికాలి వి
భ్రాంతము, నిర్గతేందుకరభాసము దేశములందుఁ బర్వె హే
మంతము సంతతోపచిత మారవికార మనుక్రమంబునన్. 122

అర్థము : శాంత....తరత్వము: శాంత = శమించిన, దిన + అధిప = సూర్యునియొక్క, ప్ర - కర = ప్రకృష్టములైన కిరణములయొక్క, చండ తరత్వము = తీవ్రతరత్వము - తైక్ష్ణ్యము గలదియు, మందిత + అబ్జ - విక్రాంతము = మందముగాఁ జేయఁబడిన, తామరలయొక్క పరాక్రమముగలదియు, వీత - సప్తదల - గర్వము = పోయిన ఏడాకులరఁటుల గర్వముగలదియు, ధూత - మరాళికా + అలి - విభ్రాంతము = ఎగురఁగొట్టఁబడిన - ఆఁడుహంసల యొక్కయుఁ, తుమ్మెదలయొక్కయు సంచారముగలదియు, నిర్గత + ఇందు - కర - భాసము = పోయిన చంద్రకిరణముల ప్రకాశముగలదియు, సంతత + ఉపచిత - కుమార - వికారము = నిరంతరముగా వృద్ధిపొందింపఁబడిన మన్మథ వికారము గలదియు, అగు, హేమంతము, అనుక్రమంబునన్ = క్రమముగా, దేశముల + అందున్, పర్వెన్ = వ్యాపించెను.

తాత్పర్యము: శమించిన సూర్యకిరణ తైక్ష్ణ్యముగలదియు, తగ్గిన తామరల విజృంభణము గలదియు, అడఁగిన ఏడాకుల అరఁటుల గర్వముగలదియు, పోయిన ఆఁడుఅంచలయుఁ దుమ్మెదలయు సంచారముగలదియు, పోయిన చంద్రకిరణ కాంతి గలదియు, నిరంతరము పెంపొందిన మన్మథవికారము గలదియు అగు హేమంతము క్రమముగా దేశములందు వ్యాపించెను.

విశేషములు: అలంకారము స్వభావోక్తి, అంత్యానుప్రాసము.

క. శరదాగమంబు తన సుత
కురు పరితాపంబు సేయుచుండుట హిమభూ
ధరపతి గని వానిపయిన్
బరిగొనియెనొ నాఁగఁ దుహినపటలము పర్వెన్. 123

అర్థము: శరద్ + ఆగమంబు = శరత్తు అనువానియొక్క రాక, తన-సుతకున్ = తన కూఁతునకు - పార్వతికి, ఉరు - పరితాపంబు = గొప్ప బాధ, చేయుచున్ + ఉండుట, హిమ - భూధర - పతి = హిమవత్పర్వతమనెడి రాజు, కని = చూచి, వానిపయిన్ = ఆ శరత్తనువానిమీఁద, పరిగొనియెనొ = దండు వెడలెనో, నాఁగన్ = అనునట్లు, తుహిన - పటలము = మంచుసమూహము, పర్వెన్ = క్రమ్మెను.

తాత్పర్యము: శరత్తనువాని రాక తన కూఁతురైన పార్వతికి గొప్ప బాధను గలుగఁజేయుచుండుట చూచి హిమవంతుఁ డనురాజు వానిపై దాడివెడలెనా యనునట్లు మంచుసముదాయము వ్యాపించెను.

విశేషములు: అలంకారము హేతూత్ప్రేక్ష.

## శిశిర వర్ణనము

శా. శీతాత్యంతనిపీడనం బడి జగజ్జీవాళు లత్యార్తులై
పాతాళంబులు సొచ్చున ట్టిరవు లొప్పన్ భూగృహావాసులై
భీతిన్ వెల్వడకుండ వహ్ని మెయి కంపింపం బ్రచండార్చికిన్
జేతుల్ గ్రొవ్వెరవోవుచుండ శిశిరోచ్ఛేదంబు పర్వెన్ మహిన్. 124

అ ర్థ ము : జగత్ + జీవ + ఆళులు = జగత్తునందలి ప్రాణుల సమూహములు, శీత + అత్యంత - నిపీడనన్ = చలివలని మిక్కిలిబాధను, పడి = పొంది, అతి + ఆర్తులు + ఐ = మిక్కిలి దుఃఖించినవారయి, పాతాళంబులు + చొచ్చు + అట్టు = పాతాళములు ప్రవేశించు విధమున, ఇరవులు = ఇండ్లు, ఒప్పన్, భూ - గృహ + ఆవాసులు + ఐ = భూమిలోపలిగృహములు నివాసములుగాఁ గలవారయి, భీతిన్ = భయముతో, వెల్వడక + ఉండన్ = వెలుపలికిరాకుండఁగా, వహ్ని - మెయి = అగ్నియొక్కశరీరము, కంపింపన్ = వడఁకఁగా, ప్రచండ + అర్చికిన్ = తీక్ష్ణములయిన కిరణములుగలవానికి - సూర్యునకు, చేతుల్ = కరములు = కిరణములు, క్రొవ్వెర + పోవుచున్ + ఉంపన్ = కొంకరలు పోవుచుండఁగా, మహిన్ = భూమియందు, శిశిర + ఉచ్ఛేదంబు = చలివలని బాధ, పర్వెన్ = వ్యాపించెను,

తా త్ప ర్య ము : భూమియందుఁ జలి మిక్కిలి వ్యాపించెను. ఆ చలిబాధను భరింపలేక జగతిలోని ప్రాణులు మిక్కిలి దుఃఖించినవారయి పాతాళలోకములు చొచ్చినట్లు భూగర్భగృహములలోనికిఁ బోయి అందుండి వెలువడకుండిరి. అగ్నికే శరీరము కంపించునట్లును, సూర్యునకే కరములు కొంకరలుపోవుచున్నట్లును జలి మిక్కిలి విజృంభించెను.

వి శే ష ము లు : పాతాళంబులు సొచ్చువట్లు - అలంకార ముత్ప్రేక్ష. అగ్నిమెయి కంపింపన్ - ప్రచండార్చికిన్ జేతుల్ గ్రొవ్వెరవోవుచుండ - అలంకార మతిశయోక్తి. వహ్ని మెయిఁ గంపింపన్ - అనియున్నదానిని అర్థసౌలభ్యమునకయి 'వహ్ని మెయి కంపింపన్' అనిమార్పఁబడినది.

వ. త దనంతరంబ. 125

అ ర్థ తా త్ప ర్య ము లు : ఆ పిమ్మటనే,

తే. తనరి హేమంతమగుడుఁ బద్మంబు లడఁగి
పోవఁ బోయినఁ గొల నొక్కపువ్వు తనకు
విత్తుగా డాఁచికొనియున్న విధముపోలె
శైలసుతముఖ ముదకవాసమున నొప్పె. 126

అర్థము : తనరి = ఒప్పి, హేమంతము, అగుడున్ = అయినంతనే, పద్మంబులు = తామరలు, అడఁగిపోవన్ + పోయినన్ = నశించిపోఁబోఁగా, కొలను = సరస్సు, ఒక్క - పువ్వు, తనకున్, విత్తు + కాన్ = విత్తనముగా, దాఁచికొని + ఉన్న - విధము - పోలెన్ = దాఁచుకొనియున్నట్లుగా, శైల - సుత - ముఖము = పర్వతపుత్రిక - పార్వతి - మోము, ఉదక - వాసమునన్ = నీటియందు దునికిచే, ఒప్పెన్.

తాత్పర్యము : హేమంతము వచ్చినంతనే కొలనిలోని తామరలన్నియు నంశిపోఁబోవఁగాఁ, గొలను తన కొక్కపువ్వును విత్తనమునకై దాఁచుకొనెనా యన్నట్లు పార్వతిముఖము జలనివాసముచే నొప్పెను.

విశేషములు : అలంకారము హేతూత్ప్రేక్ష. కాళిదాసు కుమారసంభవము నందలి యీ క్రిందిశ్లోకము భావమునే యీ కవి యించుకమార్చి, క్రొత్తఅందమును గూర్చెను.

'ముఖేన సా పద్మసుగన్ధినా నిశి ప్రవేపమానాధరపత్రశోభినా,
తుషారవృష్టిక్షతిపద్మసంపదాం సరోజసన్ధాన మివాకరో దపామ్',
సం.కు.సం. 5-27

తుషారవృష్టిచే రేయి పద్మసంపదను గోల్పోయిన నీటికి పార్వతి పద్మసుగంధియు. ప్రవేపమానాధరపత్రశోభియు నగు తనమోముచే పద్మమును సమకూర్చెనా యన నొప్పుచుండెనని సంస్కృతమున నుండఁగా, హేమంతమునకుఁ బద్మములన్నియు నశింపనుండఁగాఁ, గొలను తనకు విత్తనముకొఱకుంచుకొనెనా యనునట్లు పార్వతి ముఖము జలనివాసముచే నొప్పెనని యితఁడు చెప్పెను.

వ. మఱియును. 127

చ. వనజములెల్ల మంచుఁగొని వాడినచో నొకపువ్వు నిల్చినన్
గని యలు లన్నియున్ నెలవుగా కొని దీనికి ముచ్చువచ్చునో
యను వగ మీఁదఁ బిండుకొని యడ్డమునిల్చెనొ నాఁగ నంబుజా
ననముపయిం జటావలి పెనంగి నగాత్మజ కొప్పు నత్తఱిన్. 128

**అర్థము :** అత్తఱిన్ = ఆ + తఱిన్ = ఆ సమయమున - శిశిరమున, వనజములు + ఎల్లన్ = తామరలన్నియును, మంచున్ + కొని = మంచును గ్రహించి, వాడినచోన్ = వాడినచోట, ఒక - పువ్వు, నిల్చినన్ = నిలిచినచో, నిలువఁగా, కని = చూచి, అలులు = తుమ్మెదలు, అన్నియున్, నెలవు + కైకొని = స్థానమేర్పఱుచుకొని, దీనికిన్ = ఆ ఒక్కపువ్వునకును, ముచ్చు - వచ్చునో + అను - వగన్ = ముప్పువచ్చునేమో యనుభీతితో, మీఁదన్ = పైని, పిండు - కొని = గుమిగూడి, అడ్డము - నిల్చెనొ - నాఁగన్ = తుమ్మెదల కడ్డముగా నిలిచెనో యనునట్లు, నగ + ఆత్మజకున్ = కొండకూఁతునకు - పార్వతికి, అంబుజ + ఆననము - పయిన్ = ముఖపద్మముమీఁద, జటా + ఆవలి = జడలవరుస, ఒప్పున్.

**తాత్పర్యము :** ఆ శిశిర సమయమునఁ బద్మములన్నియు మంచుచే వాడిపోయి ఒక్కపువ్వు పార్వతీముఖరూపమున నిలువఁగాఁ దుమ్మెదలన్నియును జూచి దానిపై మూఁగి, స్థానమేర్పఱుచుకొని, ముప్పుతెచ్చునేమో యనుభీతిచే, మీఁద గుమిగూడి తుమ్మెదల కడ్డమునిలిచెనా యనునట్లు పార్వతికి ముఖపద్మముపై జడలసమూహము ఒప్పును.

**విశేషములు :** అలంకారము హేతూత్ప్రేక్ష.

ఈ భావము కాళిదాసు భావమున కించుక పెంపు. మంచువానచేఁ బద్మ సంపదను గోలుపోయిన నీటికిఁ బార్వతిముఖము పద్మసంధానమును జేయుచున్నదని (కుమార, 5-27) శ్లోకమునఁ గాళిదాసుభావముకాఁగా, నన్నెచోడుఁ డా పద్మముపైఁ తుమ్మెదలు వ్రాలి దానికెక్కడముప్పుతెచ్చునోయని యామె జడలు వాని కడ్డము నిలిచెనా యనునట్లుండెనని యించుక విస్తరించుట రమ్యముగా నున్నది.

అంబుజాననము - ఆననాంబుజ మనుట. ఇట్టి ఉపమానపూర్వపదములు సంస్కృతలక్షణమునకు విరుద్ధములు, చిగురుఁగేలు, జుంటిమోవివంటి యిట్టివి తెలుఁగుననే యుండును.

వ. ఇట్లతిదుస్సహనీయ శీతోపేతంబులగు హేమశిశిరంబులందు నిరంత రోదకవాస నిరాహారాది ఘోరతపోవృత్తిం బ్రవర్తించుచుండు నంత. 129

అ ర్థ ము ; ఇట్లు, అతి - దుస్సహనీయ - శీత + ఉపేతంబులు = మిక్కిలి దుఃఖముచే సహింపఁదగిన - ఓర్వరాని, చల్లఁదనముతోఁ గూడుకొన్నవి అగు, హేమ - శిశిరంబుల + అందున్ = హేమంత శిశిరర్తువులందు, నిరంతర + ఉదక - వాస = ఎడతెగని జలనివాసముగలది, నిరాహార = భోజనములేనిది, ఆది= మొదలగు, ఘోర = భయంకరమైన, తపస్(ః) + వృత్తిన్ = తపస్సునందు వర్తనముచే, ప్రవర్తించుచున్ + ఉండు + అంతన్ = ప్రవర్తిలుచుండునంతలో.

తా త్ప ర్య ము ; ఇట్లు మిక్కిలి దుస్సహమైన చల్లఁదనముతోఁ గూడినవైన హేమంతశిశిరర్తువులందు నిరంతరము నీటనుండిచేయునట్టియు, ఆహారముతీసికొనకుండఁజేయునట్టియు మున్నగుతపస్సులందుఁ బ్రవర్తిలుచుండు నంత - తరువాతి పద్యముతో నన్వయము,

## వసంత వర్ణనము

చ. జలజల డుల్లు పర్ణముల చప్పుడు, లక్కడఁ జూడఁజూడఁబై
నెలమెడు వల్ద మోసులును, నేర్పడు కెందలిరాకుజొంపముం,
బొలుపగు మొగ్గలున్, విరియుపూవులుఁ, బూఁపలు, బ్రానిబ్రాని క
గ్గలముగఁ దాల్చెఁ జెప్ప వినఁ గాదది యెట్టివసంతవేగమో. 130

అ ర్థ ము : జలజల = జలజలమనుధ్వనితో, డుల్లు = రాలునట్టి. పర్ణముల = ఆకులయొక్క, చప్పుడులు = ధ్వనులు, అక్కడన్ = అచ్చట, చూడన్ + చూడన్=చూడఁగాఁజూడఁగా, పైన్=మీఁద, ఎలమెడు=వ్యాపించునట్టి, వల్ద - మోసులును = స్థూలమైన అంకురములును, ఏర్పడు = స్పష్టపడునట్టి, కెందలిరాకు - జొంపమున్ - (కెంపు + తలిరు + ఆకు) = ఎఱ్ఱని చివురాకుల గుబురును, పొలుపు + అగు = అందమగు, మొగ్గలున్, విరియు = వికసించునట్టి, పూవులున్, పూఁపలున్ = పూఁబిందెలును, బ్రాని - బ్రానికిన్ = చెట్టుచెట్టునకు, అగ్గలముగన్ = అధికముగా, తాల్చెన్ = ధరించెను, చెప్పన్, వినన్ + కాదు, చెప్పుటకును, వినుటకును గానిది, అది - ఎట్టి - వసంత - వేగమో = వసంతము వడి అది యెట్టిదో!

తాత్పర్యము : జలజల రాలు ఆకులచప్పుడులును, అచ్చటఁ జూడఁగాఁ జూడఁగా పైని వ్యాపించు మోసులును, ఏర్పడు కెంజివురాకుల గుబురును, సుందరములైన మొగ్గలును, విరిసెడిపువ్వులును, పూఁబిందెలును, చెట్టుచెట్టునకు నెక్కువగా నొప్పెను. చెప్పను విసను అలవికాని వసంతవేగ మెంతటిదో కదా!

విశేషములు : అలంకారము స్వభావోక్తి.

వ. అన నిఖిలభువనమనోరంజకం బగుచు. 131

అర్థము : అనన్ = అనునట్లుగా, నిఖిల - భువన - మనస్(ః) + రంజకంబు = ఎల్లలోకముల మనస్సును సంతోషపెట్టునది, అగుచున్.

తాత్పర్యము : అనునట్లుగా నెల్లలోకములవారి మనస్సులకు సంతోషము గలిగించునది యగుచు - తరువాతి పద్యముతో నన్వయము.

చ. పొలుపుగనేచి, చెల్వడరఁబూచి, బెడంగుగఁగాచి, పండ ్రమాఁ
కులు, మరుఁడేయఁ, గోయిలలు గూయ, మదాలులు ్రమోయ, రాగులన్
వలరసమందఁ, ప్రోషితులు వందఁ, గవల్ ముదమంద వచ్చె న
త్యలఘువసంత మర్వర ననంతవిభూతి నిరంతరంబుగాన్. 132

అర్థము: అతి + అలఘు - వసంతము = మిక్కిలి గొప్పదియగు వసంతము, ్రమాఁకులు = చెట్లు, పొలుపుగన్ = ఒప్పుగా, ఏచి = విజృంభించి, చెల్వు + అడరన్ = అంద మతిశయింపఁగా, పూచి=పుష్పించి, బెడంగుగన్ = అందముగా, కాచి = ఫలించి, పండన్ = పండఁగను, మరుఁడు = మన్మథుఁడు, ఏయన్ = కొట్టఁగను, కోయిలలు = కోకిలములు, కూయన్ = కూయఁగను, మద + అలులు = మదముతోడి తుమ్మెదలు, ్రమోయన్ = రొద చేయఁగను, రాగులన్ = ప్రేమికులను, వల - రసము = అనురాగమనెడి రసము - శృంగార రసము, అందన్ = పొందఁగను, ప్రోషితులు = విరహులు, వందన్ = బాధ నొందఁగను, కవల్ = దంపతులు, ముదము + అందన్ = సంతోషపడఁగను, ఉర్వరన్ = భూమియందు, అనంత - విభూతి = అంతులేనిసంపద-నిరంతరంబు+ కాన్ = ఎడతెగనిదికాఁగను, వచ్చెన్.

తా త్ప ర్య ము : మిక్కిలి గొప్పదియగు వసంతము చెట్లు ఏపుగాఁ బెరిఁగి, అందమతిశయింపఁ బుష్పించి, సుందరముగా ఫలించి, పండఁగను, మన్మథుఁడు బాణప్రయోగము చేయఁగను, గోయిలలు కూయఁగను, మదించిన తుమ్మెదలు రొద వెట్టఁగను, అనురక్తులను శృంగారరసము పొందఁగను, విరహులు బాధపడఁగను, దంపతులు సంతోషమందఁగను, భూమియం దనంతమైన సంపద యెడతెగకుండఁగను వచ్చెను,

వి శే ష ము లు : అలంకారము స్వభావోక్తి. చెల్వు - చెలువు. 'అచ్చికంబులం బదమధ్యంబుల న ల డ ర ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు.' బాల. ప్రకీర్ణక. 17. మ్రాఁకులు - మ్రాను + లు. 'కలన్వాదుల నువర్ణంబు కుఙ్గగు బహువచనము పరంబగునపుడు నిత్యముగా నగును.' బాల.అచ్చిక. 18. 'మ్రా + కుఙ్ + లు. 'ఙిత్తు బిందుపూర్వంబగు.' బాల.తత్సమ. 19. మ్రాఁకులు.

వ. అంతం బార్వతి వసంతానంతలతాంతసంతతి నంతకాంత కాక్రాంత
పూజాత్యంతహోమాదిక్రియలం బ్రవర్తించుచుండు నంత. 133

అ ర్థ ము : అంతన్, పార్వతి, వసంత + అనంత - లతాంత - సంతతిన్ = వసంతర్తువునందలి అంతులేని పూలసమూహముచేత, అంత.... క్రియలన్: అంతక + అంతక = యము నంతమొందించిన వాని (శివుని)చేత, ఆక్రాంత = ఆక్రమింపఁబడిన, పూజా = పూజలు, అత్యంత = మిక్కిలి, హోమ + ఆది = హోమములు మున్నగు, క్రియలన్ = పనులందు, ప్రవర్తించుచున్ + ఉండు + అంతన్ = నడచుచున్నంత—

తా త్ప ర్య ము : అంతఁ బార్వతి వసంతమునందలి కడలేని పూలసమూహముతో శివపూజాహోమాదికార్యముల నడచుచున్నంత - తరువాతి పద్యముతో నన్వయము.

## గ్రీష్మ వర్ణనము

చ. స్ఫురదురుదావపావకము, శోషితసింధుచయోదకంబు, సం
హరితపతంగసంఘ, మసమర్థిత మార్గిగణంబు, తప్తభూ
మిరుహకులంబు, వర్ధితసమీరవిదాహ, మశేషదగ్ధభూ
ధరనికరంబు నాఁ బటు నిదాఘము పర్వె భయంకరాకృతిన్. 134

అర్థము : స్ఫురత్ + ఉరు-దావ-పావకము = విజృంభించుచున్న గొప్ప దావాగ్నికలదియు, శోషిత - సింధు - చయ + ఉదకంబు = ఎండింపఁజేయఁబడిన నదులసమూహమునందలి జలముగలదియు, సంహరిత - పతంగ - సంఘము = సంహరింపఁబడిన పక్షులగుంపుగలదియు, అనవర్థిత - మార్గి - గణంబు = అశక్తులుగాఁజేయఁబడిన బాటసారుల సమూహముగలదియు, తప్త - భూమిరుహ - కులంబు = తపింపఁజేయఁబడిన చెట్లసమూహముగలదియు, వర్థిత - సమీర - విదాహము = వృద్ధిపొందింపఁబడిన గాడ్పుయొక్క వేఁడిమిగలదియు, అశేష - దగ్ధ - భూధర - నికరంబు = ఎల్ల దహింపఁడిన పర్వతముల సమూహముగలదియు, నాన్ = అనఁగా, పటు - నిదాఘము = తీక్ష్ణమైన వేసవి, భయంకర + ఆకృతిన్= వెఱపుఁగొలుపురీతితో, పర్వెన్ = వ్యాపించెను.

తాత్పర్యము : విజృంభించుచున్న గొప్పదావాగ్ని కలదియు, ఎండింపఁబడిన నదీసమూహజలము గలదియు, సంహరింపఁబడిన పక్షులగుంపు గలదియు, అశక్తులు గాఁజేయఁబడిన పాంథులసమూహము గలదియు, తపింపఁజేయఁబడిన చెట్లగుంపు గలదియు, వృద్ధిపొందింపఁబడిన గాడ్పువేఁడిమి గలదియు, దహింపఁబడిన యెల్ల పర్వతముల సమూహము గలదియు అనునట్లు తీక్ష్ణమైన వేసవి భయంకరాకారముతో వ్యాపించెను.

క. తలఁచిన డెందము కందును,
బలికిన నోరెల్లఁబొక్కుఁ, బ్రభ సూచిన రె
ప్పలు కమరు ననఁగఁ బటుతర
విలయానలభాతి నెండ వేసవిఁ గాఁచెన్. 135

అర్థము : తలఁచినన్ = భావించినచో, డెందము = హృదయము, కందును = నొచ్చును, పలికినన్ = పలికినచో, నోరు + ఎల్లన్ = నోరంతయు, పొక్కున్ = బొబ్బలెక్కును, ప్రభ = వెలుఁగు, చూచినన్, రెప్పలు = కను రెప్పలు, కమరున్ = కాలును, అనఁగన్, పటుతర - విలయ + అనల - భాతిన్= తీవ్రతరమైన ప్రళయాగ్ని విధమున, ఎండ, వేసవిన్ = వేసవియందు, కాఁచెన్ = తపింపఁ జేసెను.

తాత్పర్యము : భావించినచో హృదయము తపించును, పలుకునెడ నోరంతయు బొబ్బలెక్కును. వెలుఁగుచూచుచోఁ గనురెప్పలు కాలును అనునట్లు తీవ్రతర ప్రళయాగ్నివిధమువ నెండ వేసవియందుఁ దపింపఁజేసెను.

విశేషములు : అలంకార ముపమ.

మ. స్ఫురదారణ్య మహీధరోపరి సముద్భూతోగ్ర[1]దావానలో
త్కర విస్ఫార శిఖాలిఁ గూడి రవికాంతవ్రాత సంజాత దు
స్తర తీవ్రాగ్నిఁ బెనంగి వీచె వడ యా సంక్రుద్ధకాలాగ్నిరు
ద్ర రయోచ్ఛ్వాస సమేతమో [2]యని జనవ్రాతంబు
కంపింపఁగన్. 136

అర్థము : వడ = వేఁడిగాలి, స్ఫుర.........శిఖాలిన్ ; స్ఫురత్ = విజృంభించుచున్న, అరణ్య = అరణ్యసంబంధమైన. మహీధర + ఉపరి = కొండలపై, సముద్భూత = పుట్టిన, ఉగ్ర = భయంకరమైన, దావ + అనల = కార్చిచ్చులయొక్క, ఉత్కర = సమూహముయొక్క, విస్ఫార = ప్రకాశముగల, శిఖా + ఆలిన్ = జ్వాలలవరుసతో, కూడి, రవికాంత....తీవ్రాగ్నిన్ : రవికాంత= సూర్యకాంతశిలలయొక్క, వ్రాత = సమూహమునుండి, సంజాత = పుట్టిన, దుస్తర = దాఁటశక్యముగాని, తీవ్ర + అగ్నిన్ = తీక్ష్ణమైన అగ్నితో, పెనంగి= కూడి, ఆ, సంక్రుద్ధ....సమేతమో : సంక్రుద్ధ = మిక్కిలికోపించిన. కాల + అగ్ని ప్రళయాగ్నియనెడు, రుద్ర = రుద్రుని (శివుని) యొక్క, రయ = వేగముగల, ఉచ్ఛ్వాస = ఊర్పుతో, సమేతమో = కూడియున్నదా, అని, జన - వ్రాతంబు = జనుల సమూహము, కంపింపఁగన్ = వడఁకఁగా, వీచెన్ = విసరెను.

తాత్పర్యము : ప్రకాశించుచున్న అడవిలోనికొండలపైఁ బుట్టిన కార్చిచ్చుల ప్రకాశముగల జ్వాలలవరుసనుగూడి, సూర్యకాంతపుఱాల సమూహమువలనఁ బుట్టిన దాఁటుటకు శక్యముకాని తీక్ష్ణమైన అగ్నితోఁగూడి మిక్కిలి కోపించిన ప్రళయాగ్ని యనెడు రుద్రుని వేగవంతమైన ఉచ్ఛ్వాసముతోఁగూడినదో యని లోకులు కంపింపఁగా వడగాడ్పు వీచెను.

1. వ్రా.వ్రతి. జీవానలోత్కర. 2. యనుచు లోకుల్ భీతిఁ గంపింపఁగన్.

విశేషములు: అలంకారము-రూపకానుప్రాణితోత్ప్రేక్ష.

రు - ద్ర రయోచ్ఛ్వాస సమేతమో యనుచు లోకుల్ భీతిఁ గంపింపఁగన్ అను పాఠమున యతిభంగ మయినది.

తే. ఉరు నిదాఘాతపాహతిఁ గరుల తలలు
వ్రస్సి లోపలి ముత్యముల్ వరుస విరిసి
మంగలములోని ప్రేలలభంగిఁ దూలి
ప్రేలిపడఁ గాఁచెఁ గట్టెండ పిడువరించి. 137

అర్థము: ఉరు - నిదాఘ + ఆతప+ఆహతిన్ = గొప్పదియగు, వేసవి యందలి, ఎండయొక్క, దెబ్బచే, కరుల - తలలు = ఏనుఁగుల తలలు, వ్రస్సి = బ్రద్దలయి, లోపలి - ముత్యముల్ = లోనున్న ముత్తెములు,వరుసన్ =క్రమముగా, విరిసి = చెదరి, మంగలములోని = వేఁపుడు చట్టిలోని, ప్రేలల - భంగిన్ = పేలాలవలె, తూలి = చలించి, ప్రేలి - పడన్ = ప్రేలిపడునట్లు, కట్టెండ (కడు + ఎండ) = తీవ్రమైన ఎండ, పిడువరించి = పిడుగువలె అతిశయించి, కాఁచెన్ = క్రాఁగునట్లు చేసెను.

తాత్పర్యము: గొప్పదియగు వేసవియందలి యెండదెబ్బచే నేనుఁగుల తలలు బ్రద్దలయి, వానిలోనున్న ముత్యములు క్రమముగాఁ జెదరి మంగలములోని పేలాల విధమునఁ జలించి ప్రేలిపడునట్లు తీక్ష్ణమైనయెండ పిడుగువలె అతిశయించి కాఁచెను.

విశేషములు: అలంకార ముత్ప్రేక్ష.

ముత్యము - ముత్తియము, ముత్తెము రూపాంతరములు. ప్రేలలు - ప్రేలాలు పేలాలు రూపాంతరములు. కడు + ఎండ = 'కుఱు చిఱు కడు నడు నిడు శబ్దముల అడల కచ్చు పరంబగునపుడు ద్విరుక్తటకారం బగు'. బాల. సంధి. 12. కట్టు + ఎండ. 'ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధి యగు'. బాల. సంధి. 1 కట్టెండ.

క. హరి శరధిఁ గ్రుంకె, నభవుఁడు
సురనదిఁ దలఁదాల్చె, నబ్జుఁడు గ్రమ్మఱ నం
బురుహంబు సొచ్చె. నతి దు
స్తర దుస్సహ తీవ్రతర నిదాఘ భయమునన్. 138

అర్థము ; అతి........భయమునన్; అతి = మిక్కిలి, దుస్తర = దాఁటుటకు శక్యముగాని, దుస్సహ = ఓర్చుటకువీలులేని, తీవ్రతర = మిక్కిలి తీవ్రమైన, నిదాఘ - భయమునన్ = వేసవివలని వెఱపుతో, హరి = విష్ణువు, శరధిన్ = సముద్రమునందు, క్రుంకెన్ = మునిఁగెను, అభవుఁడు = శివుఁడు, సురనదిన్ = ఆకాశగంగను, తలన్ = శిరస్సునందు, తాల్చెన్ = ధరించెను, అబ్జుఁడు = బ్రహ్మ (తామరనుండి వుట్టినవాఁడు), క్రమ్మఱన్ = మరల, అంబురుహంబు + చొచ్చెన్ = పద్మమును బ్రవేశించెను.

తాత్పర్యము : మిక్కిలి దుస్తరము, దుస్సహము, తీవ్రతరము అగు వేసవివలని వెఱపున విష్ణువు సముద్రమున మునిఁగెను. శివుఁడు ఆకాశగంగానదిని శిరస్సున ధరించెను. బ్రహ్మ మరలఁ బద్మమును బ్రవేశించెను.

విశేషములు : అలంకారము హేతూత్ప్రేక్ష.

చ. అవియని గండశైల మన, నంఘ్రులతోడన యెండకున్న భూ
భవ మన, నింకి బీటగిలఁ బాఱని యేఱన, మస్తకం బొగిం
బవులని మార్గిసంఘ మనఁ బట్టుచు లోకములోన నిట్టివే
సవి గలదయ్యె నా నఖిల సాధ్వస మయ్యె నిదాఘ ముగ్రమై. 139

అర్థము : అవియని = బ్రద్దలుకాని, గండ - శైలము + అనన్ = పెద్ద కొండఱాయి, అనన్ = అనునట్లును, అంఘ్రుల - తోడన్ + అ = వేరులతోనే, ఎండక = ఉన్న, భూభవము = చెట్టు, అనన్, ఇంకి = ఇగిరిపోయి, బీటగిలన్ = బీటలువాఱునట్లు, పాఱని = ప్రవహింపని, ఏఱు + అనన్ = నది యనునట్లును, మస్తకంబు = తల, ఒగిన్ = లెస్సగా, పవులని = పగులని, మార్గి - సంఘము + అనన్ = బాటసారులగుంపు అనునట్లును, పట్టుచున్=ఆక్రమించుచు,

లోకమునన్ = లోకమునందు, ఇట్టి వేసవి - కలదయ్యె = ఇటువంటి వేసవి కలదా ? నాన్ = అనునట్లు, నిదాఘము = వేసవి, ఉగ్రము + ఐ = తీవ్రమయి, అఖిల - సాధ్వసము = ఎల్లరకు భయము, అయ్యెను.

తా త్ప ర్య ము : బ్రద్దలుకాని పెద్ద కొండయాయి అనునట్లును, వేరులతోనే ఎండకున్నచెట్టు అనునట్లును, ఇంకి బీటలువాఱునట్లు ప్రవహింపని నది యనునట్లును తల పవులని బాటసారులసమూహ మనునట్లును, ఆక్రమించుచు, లోకములో నిట్టిది గలదా యన వేసవి తీవ్రమయి సర్వభయావహ మయ్యెను.

వి శే ష ము లు : అలంకార ముపమ.

వ. ఇ ట్లతిదారుణంబైన ఘర్మదివసంబునం బార్వతి పంచాగ్ని మధ్యాగ్నిముఖాధోముఖోర్ధ్వ ముఖాదిఘోరతపంబులు సేయుచు. 140

అ ర్థ ము : ఇట్లు, అతి - దారుణంబు + ఐన = మిక్కిలి ఘోరమైన, ఘర్మ - దివసంబునన్ = వేసవిదినమున, పార్వతి, పంచాగ్నిమధ్య, అగ్నిముఖ, అధోముఖ, ఊర్ధ్వముఖ = పంచాగ్నిమధ్యము, అగ్నిముఖము, అధోముఖము, ఊర్ధ్వముఖము, ఆది = మున్నగు, ఘోర - తపంబులు = భయంకరములైన తపస్సులు, చేయుచున్.

తా త్ప ర్య ము : ఇట్లు మిక్కిలి ఘోరమైన వేసవిదినమునఁ బార్వతి పంచాగ్నిమధ్యము, అగ్నిముఖము, అధోముఖము, ఊర్ధ్వముఖము మున్నగు భయంకర తపస్సులు చేయుచు - తరువాతి పద్యముతో నన్వయము.

వి శే ష ము లు : పంచాగ్నిమధ్యతపస్సు - నాలుగు దిక్కులను నాలు గగ్నులు ఏర్పఱిచి పైని సూర్యుని జూచుచుఁజేయు తపస్సు. అగ్నిముఖము = అగ్నిని జూచుచుఁ జేయుతపము, అధోముఖము = మొగము క్రిందికిఁబెట్టి చేయు తపము, ఊర్ధ్వముఖము = ముఖముపైకిఁబెట్టి చేయు తపము.

ఉ. ఆతపభీతి నీడలు రయంబున మ్రాఁకుల క్రిందుఁదూరెనో,
యా తరులుం దృషాభిహతులై తమనీడలు తార త్రాగెనో
ఖాతి ననంగ నీడ లఱు పాదప మూలములం దడంగె గ్రీ
ష్మాతప మధ్యవాసరములందుఁ జలింపకయుండు నెండలన్. 141

అ ర్థ ము ; గ్రీష్మ + ఆతప - మధ్య - వాసరముల + అందున్ = వేసవితాపముగల మధ్యాహ్నములందు, చలింపక + ఉండు + ఎండలన్ = చలనము లేని యెండలలో, నీడలు, ఆతప - భీతిన్ = ఎండవలని భయమున, రయంబునన్ = శీఘ్రముగా, ద్రుమ - కుల - క్రిందున్ - చెట్ల క్రిందిభాగమును, తూరెనో, ప్రవేశించెనో, ఆ - తరులున్ = ఆ చెట్లును, తృషా + అభిహతులు + ఐ = దప్పిచేఁ గొట్టఁబడినవయి, భాతిన్ = వెలుఁగునందు, తమ - నీడలు, తారు + అ = తామే, త్రాగెనో, అనంగన్, నీడలు, ఉరు - పాదప - మూలముల + అందున్ = పెద్ద చెట్ల మొదళ్ళయందు, అడంగెన్ = దిగఁబడియుండెను.

తా త్ప ర్య ము : వేసవితాపముగల మధ్యాహ్నములందుఁ జలనములేని యెండలలో నీడలు ఎండవలనిభయమున శీఘ్రముగాఁ జెట్లక్రిందిభాగమును బ్రవేశించెనో, ఆ చెట్లుమ దప్పిచేఁ గొట్టఁబడినవయి వెలుఁగులో తమనీడలను దామే త్రాగివైచెనో అనునట్లు నీడలు పెద్దచెట్ల మొదళ్ళయం దడఁగియుండెను.

వి శే ష ము లు : అలంకారము హేతూత్ప్రేక్ష.

మ. పరితాపోగ్రనిదాఘవేళ శిలపైఁ బంచాగ్నిమధ్యంబునన్
బరమధ్యాన సమేతయై నిలిచి విభ్రాజిల్లె నుద్యత్తప
శ్చరణాలంకృత శైలనందన కనత్సంధ్యారుణాంభోధరో
త్కరమధ్య స్థిరకాంతకాంతియుతశీతద్యోతిరేఖాకృతిన్. 142

అ ర్థ ము : ఉద్యత్.........నందన : ఉద్యత్ = పూనుచున్న తపస్ = తపస్సుయొక్క, చరణ = చేఁతచే, అలంకృత = అలంకరింపఁబడిన, శైల - నందన = కొండకూఁతురు - పార్వతి, పరితాప + ఉగ్ర - నిదాఘ - వేళన్ = మిక్కిలి తాపముచే భయంకరమైన వేసవిసమయమున, శిలపైన్ = ఱాతిమీఁద, పంచ + అగ్ని - మధ్యంబునన్ = అయిదగ్నుల నడుమ, పరమ - ధ్యాన - సమేత + ఐ = ఉత్కృష్టమగు ధ్యానముతోఁ గూడినదయి, నిలిచి = ఉండి, కనత్.........కృతిన్ : కనత్ = ప్రకాశించుచున్న, సంధ్యా = సంధ్యాసమయము నందలి, అరుణ = ఎఱ్ఱనైన, అంభోధర + ఉత్కర = మేఘసముదాయము యొక్క, మధ్య = నడుమ, స్థిర = నిలుకడగల, కాంత = మనోహరమైన, కాంతి = ప్రకాశముతో, యుత = కూడుకొన్న, శీతద్యోతి - లేఖా + ఆకృతిన్ = చంద్రరేఖ విధమున, విభ్రాజిల్లెన్ = ప్రకాశించెను.

తాత్పర్యము : తపశ్చరణముచే నలంకరింపఁబడిన పార్వతి మిక్కిలి తాపముచే భయంకరమైన వేసవిసమయమున ఱాతిమీఁదఁ బంచాగ్నిమధ్యమున గొప్ప ధ్యానముతోఁ గూడియుండి, ప్రకాశించుసంజవేళనెఱ్ఱనైన మేఘసముదాయము నడుమ స్థిరమైనదియు, మనోహరమైనదియు నగు కాంతితోఁ గూడుకొన్న చంద్రరేఖ వలె మిక్కిలి ప్రకాశించెను.

విశేషములు : అలంకార ముపమ. పార్వతి కుపమానము చంద్రరేఖ. పంచాగ్నిమధ్యమున కుపమానము సంధ్యారుణాంభోధరోత్కరమధ్యము. ఆకృతిన్ - ఉపమావాచకము. విభ్రాజిల్లెన్ = సామాన్యధర్మము. కావున సంపూర్ణోపమ.

క. చెటచెటఁ దేలుచు నలుగడఁ
బటుతర శిఖి శిఖలు నెగయఁ బదిలముగా నం
గుటము ధర నూఁది సుస్థితిఁ
గుటిలాలక వదన మెత్తికొని రవిఁ జూచున్. 143

అర్థము : కుటిల + అలక = వంకరలైన ముంగురులుగలది - పార్వతి, చెటచెటన్ = ఛటచ్ఛటాధ్వనులతో, పేలుచున్, నలుగడన్ = నాలుగుదిక్కులను, పటుతర - శిఖి - శిఖలు = తీవ్రతరములైన అగ్నిజ్వాలలు, నెగయన్ = పైకి లేవఁగాఁ, పదిలముగాన్ = స్థిరముగా, అంగుటమున్ = బొటనవ్రేలిని, ధరన్ = నేలపై, ఊఁది = ఆని, సుస్థితిన్ = నిలుకడతో, వదనము = ముఖము, ఎత్తికొని, రవిన్ = సూర్యుని, చూచున్.

తాత్పర్యము : ఛటచ్ఛటాధ్వనులతోఁ బేలుచు నాలుగుదిక్కులను దీవ్రతరమైన అగ్నిజ్వాలలు పైకి లేవఁగా, పార్వతి స్థిరముగా నంగుష్ఠము నేలమోపి నిలుకడతో ముఖమునెత్తుకొని సూర్యునిఁ జూచును.

విశేషములు ; పంచాగ్నిమధ్యతపోవిధాన మిదియే. చెటచెట అగ్ని పేలుటయందలి ధ్వన్యనుకరణశబ్దము. 'ఛటఛట' అను పాఠమున ఛటచ్ఛట అగుటచే, మొదట గురువు అయి గణభంగమగునని యిట్లు మార్పఁబడియుండును.

క. ఖరకర కరహతి ముఖసర
సిరుహము కడు వంది కాంతి సెడ నయనేందీ
వరము లలరె గిరిజతప
స్స్థిరశక్తిని బగలు రేయి జేసెనొ యనఁగాన్. 144

అర్థము: గిరిజ = పార్వతి, తపస్ + స్థిర - శక్తినిన్ = తపస్సు యొక్క అచంచలమైన మహిమచే, పగలు, రేయి = రాత్రి, చేసెనొ+అనఁగాన్ = చేసెనా యనునట్లు-ఖరకర - కర - హతిన్ = సూర్యుని కిరణముల దెబ్బచే, ముఖ సరసిరుహము = ముఖమనెడిపద్మము, కడున్ = మిక్కిలి, వంది = వాడిపోయి, కాంతి చెడన్ = కాంతి నశింపఁగా, నయన+ఇందీవరములు = కన్నులనెడి కలువలు, అలరెన్ = వికసించెను.

తాత్పర్యము: రాత్రివేళఁ బద్మములకుఁ గాంతి యుండదు. కలువలు రాత్రి వికసించును. పార్వతి ముఖపద్మము పగలే సూర్యకిరణముల దెబ్బకుఁ గమలి కాంతి చెడియుండెను. రాత్రిగాని వికసింపని కనుగల్వలు పగలే వికసించెను. కావునఁ బార్వతి తన తపశ్శక్తిచేఁ బగటిని రేయిచేసెనా యనునట్లుండెను.

విశేషములు: అలంకారము రూపకానుప్రాణితోత్ప్రేక్ష

అది పగలయినను (ముఖ) పద్మము వికసింపకపోవుటచేతను, (కను) గలువలు వికసించుటచేతను రాత్రివలె నుండెను. పార్వతి తన తపశ్శక్తిచేఁ బగటిని రాత్రిగా మార్చెనా యనునట్లుండెనని భావము.

వ. అట్టి తపంబునందునుం బరమేశ్వరుండు ప్రసన్నుండు కామికి నగజ తపఃక్లేశంబు పరమేశున కెయిదనేరమికి నుద్వేగించుచు. 145

అర్థము: అట్టి తపంబునందునున్ = అట్టి తపస్సునందుసైతము, పరమేశ్వరుండు, ప్రసన్నుండు - కామికిన్ = ప్రత్యక్షము కాకుండుటకు, అగజ = పార్వతి, తపస్ (ః) + క్లేశంబు = తపశ్శ్రమము, పరమేశునకున్ = ఈశ్వరునకు. ఎయిదన్ + నేరమికిన్ = చేరలేకుండుటకు. ఉద్వేగించుచున్ = వ్యాకుల పడుచు.

తాత్పర్యము : అట్టి ఘోరతపస్సునందును బరమేశ్వరుఁడు ప్రత్యక్షము కాకుండుటకుఁ బార్వతి తపశ్శ్రమము ఈశ్వరునిఁ జేరలేమికి వ్యాకులపడుచు - తరువాతి పద్యముతో నన్వయము.

చ. "ఇనుము రసంబులో నుడుగ కెప్పుడు నూనినఁగాని కాదె కాం
చన ? మమరాద్రి వాయసము సంతతమున్ వసియించికాని యే
కనకము చాయగాదు చిరకాలసుసేవనఁగాని కాదె స
న్మనమున నిన్ దలంచు డొక మాత్రయ చాలదె ముక్తి కీశ్వరా?" 146

అర్థము : ఈశ్వరా !. ఇనుము, రసంబులోన్ = పాదరసములో, ఉడుగక = మానక, ఎప్పుడున్, ఊనినన్ + కాని = ఉన్ననేతప్ప, కాంచనము = బంగారము, కాదె = కాదా ? వాయసము = కాకి, అమర + అద్రిన్ = మేరుపర్వతమునందు, సంతతమున్ = ఎల్లప్పుడును- వసియించికాని = ఉండికాని. ఏ - కనకము - చాయ = ఏ బంగరుచాయ, కాదె = కాదా ? చిర - కాల - సుసేవనన్ + కాని = దీర్ఘకాలము మంచిసేవ చేయుటచేఁగాక, కాదె = కాదా ? సత్ + మనమునన్ (సన్మనమునన్) = మంచిమనస్సుతో, నిన్ = నిన్ను. తలంచుడు = ధ్యానించుట, ఒక - మాత్ర + అ = ఒక్కక్షణమే, ముక్తికిన్ = మోక్షమునకు, చాలదె = సరిపోదా ?

తాత్పర్యము : ఈశ్వరా ! ఇనుము పాదరసములో మానక ఎప్పుడును ఉన్ననేకాని బంగారము కాదా ? కాకి బంగరుకొండపై నెల్లప్పుడు నున్ననేకాని బంగరు కాంతి పొందదా ? అట్లే నిన్నుఁ జిరకాలము సేవించిననేకాని మోక్షము లభింపదా ? సద్బుద్ధితో ఒక్కక్షణము తలఁచుట సరిపోదా ? - సరిపోవునని భావము

విశేషములు : అలంకారము దృష్టాంతము, సన్మనము - సత్ + మనము- అనునాసికసంధి. 'రహలుతప్ప మిగిలిన పదాంతగత హల్లులకు (యఁరులకు) అనునాసిక వర్ణము పరమగుచో వానికి సంబంధించిన అనునాసికవర్ణము వైకల్పికముగ నాదేశమగును. సన్మనము, పక్షమున - సద్మనము,

చ. "కర మవిచారి, తద్దయు వికారి మనం, బది సారివోలెనే
తిరిగెడుఁగాని నిల్వదెటః దీనిఁ జలత్వము మాన్చి నీ పదాం
బురుహములంద సంస్మరణఁబొంద దయన్ సురబందవంద్య : సు
స్థిరముగ నిల్పుః తత్త్వవిధిఁ దెల్పుః సమస్థితి సల్పుః శంకరా!" 147

అర్థము : సుర - బృంద - వంద్య = వేల్పుల సమూహమునకు నమస్కరింపఁ దగినవాఁడా !, శంకరా ! మనంబు = మనస్సు, కరము = మిక్కిలి అవిచారి = ఆలోచనలేనిది, తద్దయున్ = మిక్కిలి, వికారి = వికారముగలది, అది, సారి + పోలెనే = చక్రమువలెనే, తిరిగెడున్ + కాని = తిరుగునుగాని, ఎటన్ = ఎచ్చటను, నిల్వదు. దయన్ = దయతో, దీనిన్, చలత్వమున్ = తిరుగుటను, మాన్చి = మానఁజేసి. నీ - పద + అంబురుహముల + అందున్ + అ = నీ పాద పద్మములందే, సంస్మరణన్ = ధ్యానమును, పొందన్ = పొందునట్లు, సుస్థిరముగన్ = మంచి నిలుకడతో, నిల్పు = నిల్పుము, తత్త్వ - విధిన్ = తత్త్వముయొక్క రీతిని, తెల్పు = తెలుపుము, సమ - స్థితి = సమత్వము, సల్పు = సల్పుము.

తాత్పర్యము : దేవతా సమూహమునకు నమస్కరింపఁదగినవాఁడా ! ఈశ్వరా ! మనస్సు మిక్కిలి ఆలోచనలేనిది. మిక్కిలి వికారముగలది, అది చక్రము వలెనే తిరుగునుగాని యెక్కడను నిలువదు. నీవు దయతో దీని తిరుగుటను మాన్చి సుస్థిరముగ నుండునట్లు నిలుపుము, తత్త్వప్రకారమును దెలుపుము. సమత్వముతో నుండునట్లు చేయుము.

విశేషములు ; అలంకార ముపమ. నిల్పు - తెల్పు - సల్పు (ము) 'మధ్యమ పురుష ము వర్ణకంబునకు హలవసానంబులు పరంబులగునపుడు లోపము విభాష నగు' బాల. సంధి, 47.

వ. అనుచుం బరమేశ్వరధ్యాన లీయమాన మానసయై దేహంబు నిరంతర తపః క్లేశంబునం జర్మాస్థిమయంబై కాష్ఠావస్థ నెయిదియుం దపోనిష్ఠ విడువ కనుష్ఠించుచు. 148

అర్థము ; అనుచున్, పరమేశ్వర - ధ్యాన - లీయమాన - మానస + ఐ = పరమేశ్వరునియొక్క ధ్యానమునందు లీనమగుచున్న మనస్సు గలదియై, దేహంబు =

శరీరము, నిరంతర - తపస్(ః) + క్లేశంబునన్ = ఎడతెగని తపస్సువలని శ్రమము చేత. చర్మ + అస్థి - మయంబు + ఐ = చర్మము, ఎముకలు అనువానితో నిండినదయి, కాష్ఠ + అవస్థన్ = కట్టియొక్క, స్థితిని, ఎయిదియున్ = పొంది యును, తపస్(ః) + నిష్ఠన్ = తపస్సునందలి నియమమును, విడువక, అనుష్ఠించుచున్ = ఆచరించుచు.

తాత్పర్యము : అనుచుఁ బరమేశ్వరుని ధ్యానమునందు లీనమగుచున్న మనస్సుగలదియై, శరీరము ఎడతెగని తపఃపరిశ్రమముచేఁ జర్మము, ఎముకలు అనువానితో నిండినదయి (మాంసములేక యనుట), కట్టవలె నయియుఁ దపోనిష్ఠ విడువక ఆచరించుచు - తరువాతి పద్యముతో నన్వయము.

క. అరగొనక శైలకన్యక
హరు మనమునఁ గోరి చేయు నత్తపమున క
చ్చెరువంది భువనముల నిది
యరుదని ముత్తెంపుసేస లలికిరి విబుధుల్. 149

అర్థము : శైల - కన్యక = కొండకూఁతురు - పార్వతి, అర + కొనక = వెనుదీయక, హరున్ = శివుని, మనమునన్ = మనస్సునందు, కోరి, చేయు, ఆ - తపమునకున్, విబుధుల్ = దేవతలు, అచ్చెరువు + అంది = ఆశ్చర్యపడి, భువనములన్ = లోకములందు, ఇది = ఇట్టితపస్సు, అరుదు + అని = వింత అని, ముత్తెంపు - సేసలు (ముత్తెము + సేసలు) = ముత్యముల అక్షతలు, అలికిరి = కురిపిరి.

తాత్పర్యము ; పార్వతి వెనుదీయక శివుని మనస్సునందుఁ గోరి చేయునట్టి అ తపస్సునకు దేవతలు ఆశ్చర్యపడి లోకములం దిట్టితపము వింతయని యామెపై ముత్యాల యక్షతలు గురిపిరి.

విశేషములు : ముత్తెంపు సేసలు - ముత్తెము + సేసలు - 'కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బుంపు లగు,' బాల. సంధి. 32.

వ. తదవసరంబున. 150

అర్థతాత్పర్యములు: తద్ + అవసరంబునన్ = ఆ సమయమున. తరువాతి పద్యముతో నన్వయము.

మ. చిర సద్బ్రహ్మతపోధనావలి తపస్తేజంబులుం బేర్మితోఁ
దిరమై పొల్పగు దేవ తాపస తపస్తేజంబులుం గౌరి సు
స్థిర భావోగ్రతపోఽగ్రతేజమున నిస్తేజంబులై యుండె న
త్యురుచండాంశుకరప్రభాప్రతిహత ద్యోతిఃప్రభాభాసమై. 151

అర్థము; చిర - సత్ + బ్రహ్మ - తపోధన + ఆవలి - తపస్ + తేజంబులున్ = బహుకాలపు సద్బ్రాహ్మణులైన మునులయొక్క సమూహము యొక్క తపఃప్రకాశములును, పేర్మితోన్ = గొప్పతనముతో, తిరము + ఐ = స్థిరమయి, పొల్పు + అగు = ఒప్పయిన, దేవ - తాపస - తపస్ + తేజంబులున్ = దేవమునులయొక్క తపఃప్రకాశములును, గౌరి - సుస్థిర భావ + ఉగ్ర + తపస్(ః) + అగ్ర - తేజమునన్ = పార్వతియొక్క, మంచినిలుకడతోడి భయంకరమైన తపస్సుయొక్క ప్రధానమైన తేజస్సుచేత, అత్యురు.........భాసమై: అతి = మిక్కిలి, ఉరు = గొప్ప, చండాంశు = తీక్ష్ణములైన కిరణములుగలవాని - సూర్యుని యొక్క, కర = కిరణములయొక్క, ప్రభా = కాంతిచేత, ప్రతిహత = కొట్టఁబడిన, ద్యోతిస్(ః) = నక్షత్రములయొక్క, ప్రభా = కాంతివలె, భాసము + ఐ = ప్రకాశించునదియై, నిస్ + తేజంబులు + ఐ = తేజోవిహీనములయి, ఉండెన్ = ఉండెను.

తాత్పర్యము: బహుకాలపు సద్బ్రాహ్మణమునుల తపఃప్రకాశములును, సుస్థిరములైన దేవమునుల తపఃప్రకాశములును పార్వతి సుస్థిరము భయంకరమునైన తేజస్సుచేత సూర్యకిరణములకాంతిచేఁ గొట్టఁబడిన నక్షత్రకాంతివలెఁ దేజోవిహీనములై యుండెను.

విశేషములు: అలంకార ముపమ. తపస్తేజము - తపస్ + తేజము - పదాంతసకారమునకు విసర్గాదేశము. తపః + తేజము. ఊష్మపరకములు కాని చఛ, టఠ, తథలు పరములగునపుడు విసర్గము సకారముగా మాఱి చఛలు పరమగునపుడు శ్చుత్వమును, టఠలు పరములగునపుడు ష్టుత్వమును పొందును. తపస్ + అగ్ర - తపః + అగ్ర - తపోఽగ్ర. అతి + ఉరు = అత్యురు - యణాదేశసంధి.

వ. మఱియును. 152

క. ధర కంపించె; నిశాకర
ఖరకర గతు లెడలెఁ; దారకంబులు డుల్లెన్;
గిరు లురిలె; శరధు లింకెం
బరమేష్ఠి చలించె; నమరపతి మది నులికెన్. 153

అర్థము : ధర - భూమి, కంపించెన్ = చలించెను, నిశాకర - ఖర - కర- గతులు = చంద్రసూర్యగమనములు, ఎడలెన్ = పోయెను, తారకంబులు = నక్షత్రములు, డుల్లెన్ = రాలెను, గిరులు = కొండలు, ఉరిలెన్ = పగిలెను: శరధులు = సముద్రములు ఇంకెన్, పరమేష్ఠి = బ్రహ్మ, చలించెన్ = వడఁకెను, అమర - పతి = దేవరాజు - ఇంద్రుఁడు, మదిన్ = మనస్సునందు, ఉలికెన్ = భయపడెను-

తాత్పర్యము :- భూమి అదరెను, చంద్రసూర్యులు గతులు తప్పిరి. నక్షత్రములు రాలెను, కొండలు పగిలెను. సముద్రము లింకెను, బ్రహ్మ వడఁకెను- దేవేంద్రుఁడు మనసునందు భయమందెను.

క. ఉరగపతి విషము గ్రక్కెను;
హరి చిత్తమునందు వందె; నగతనయ తపో
భరమున ధారుణిఁ దాల్పఁగ
భరమై కమఠంబు డిందువడి కడు నడఁగెన్. 154

అర్థము : ఉరగ - పతి = పాఁపఱేఁడు-వాసుకి, విషముఁ గ్రక్కెను, హరి = విష్ణువు, చిత్తమునందున్ = మనసునందు, వందెన్ = దుఃఖించెను, అగ - తనయ = కొండకూఁతురు - పార్వతి, తపస్ ( ః ) + భరమునన్ = తపస్సుయొక్క భారము చేత. ధారుణిన్ = భూమిని, తాల్పఁగన్ = భరించుటకు, భరము + ఐ = బరువయి, కమఠంబు = ఆదికూర్మము, డిందు + పడి = క్రుంగి, కడున్ = మిక్కిలి, అడఁగెన్ = అణఁగెను,

తాత్పర్యము : పాఁపఱేఁడు విషమును గ్రక్కెను. విష్ణువు మనస్సునందు బాధపడెను. పార్వతీ తపోభారముచే భూమిని భరింప బరువయి యాదికూర్మము మిక్కిలి క్రుంగెను.

క. వనరాశు లేడు నుప్పరి
పెనమున నీరులును బోలెఁ బెల్లున నుడిగెన్;
గనకాద్రి క్రోవిలోపలి
కనకంబును బోలె నీరుగాఁ గరఁగె వడిన్. 155

అర్థము : వనరాశులు + ఏడున్ = సప్తసముద్రములును, ఉప్పరి - పెనమునన్ = కాలిన పెనమునందు. నీరులును + పోలెన్ = జలములవలె, పెల్లువన్ = అధికముగా. ఉడిగెన్ = ఇగిరిపోయెను, కనక + అద్రి = బంగరు కొండ - మేరువు, క్రోవిలోపలి కనకంబును + పోలెన్ = మూసలోని బంగారము వలె. వడిన్ = వేగముగా, నీరుగాన్ = ద్రవముగా, కరఁగెన్.

తాత్పర్యము ; సముద్రము లేడును గాలినపెనమునందలి జలములవలె మిక్కిలి యిగిరెను. మేరుపర్వతము మూసలోని బంగారమువలె ద్రవముగాఁగరఁగెను.

విశేషములు : అలంకార ముపమ. వనరాశులేడును . లవణ సముద్రము ఇక్షు సముద్రము, సురా సముద్రము, సర్పిస్సముద్రము, దధి సముద్రము, క్షీర సముద్రము, జల సముద్రము,

క. తారకము లెల్ల రుచిరాం
గారంబుల కరణి వెలిఁగెఁ; గమలారి తమో
హారులు క్రాఁగిన రజత మ
హారజతాదర్శనంబు లనఁ దనరి రెడన్. 156

అర్థము : తారకములు + ఎల్లన్ = నక్షత్రము లన్నియు, రుచిర + అంగారంబుల - కరణిన్ = కణకణలాడు నిప్పులబొగ్గుల విధమున, వెలిఁగెన్ = ప్రకాశించెను, కమల + అరి - తమస్ (8) + హారులు = చంద్ర సూర్యులు, క్రాఁగిన = తపించిన, రజత - మహారజత + ఆదర్శనంబులు + అనన్ = వెండి బంగారముల అద్దము లనునట్లు, ఎడన్ = సమయమున, తనరిరి = ఒప్పిరి.

తాత్పర్యము : నక్షత్రములన్నియుఁ గణకణలాడు నిప్పుల బొగ్గుల విధమునఁ బ్రకాశించెను. చంద్రుఁడును. సూర్యుఁడును గ్రాఁగిన వెండి బంగారు అద్దములట్లు సమయమున నొప్పిరి.

విశేషములు ; అలంకార ముపమ.

క. పొంఁడిగ నగజ తపశ్శిఖి
మూఁడు జగంబులను దీవ్రముగఁ బర్వినఁ బ్ర
హ్మాండము గాఁచిన కాంచన
భాండముక్రియఁ దాల్చెఁ దత్ప్రభాభాసితమై. 157

అర్థము : పొంఁడిగన్ = పొఁడిగన్ = ఒప్పిదముగా, అగజ = పార్వతి యొక్క, తపస్ + శిఖి = తపస్సనెడి అగ్ని, మూండు - జగంబులను = మూఁడు లోకములందును, తీవ్రముగన్ = మిక్కిలి వేఁడిగా. పర్వినన్ = వ్యాపింపఁగా, తద్ + ప్రభా-భాసితము + ఐ = ఆ కాంతిచేతఁ బ్రకాశించినదియై, బ్రహ్మాండము, కాఁచిన = కాల్చిన, కాంచన - భాండము - క్రియన్ = బంగారుకుండ విధమున, తాల్చెన్.

తాత్పర్యము : పార్వతి తపస్సనెడిఅగ్ని ఒప్పిదముగా మూఁడులోకములందును మిక్కిలి వేఁడిగా వ్యాపింపఁగా. బ్రహ్మాండము ఆ కాంతిచేఁ బ్రకాశించినదయి కాల్చిన బంగారుకుండ విధమున నుండెను.

విశేషములు ; అలంకారము రూపకానుప్రాణితోపమ. పొంఁడిగ, మూండు - అనువాని నిట్లు పూర్ణబిందుయుక్తములుగాఁ బ్రాసస్థానమునఁ బ్రయోగించుట యీ కవి ప్రాచీనతకు నిదర్శన మందురు.

క. గిరిసుత తపః ప్రభాతికిఁ
దరతరమ చలించి రజతధరణీధర మ
చ్చెరువుగ జిఱ్ఱనఁ దిరిగెం
బురహరుతోఁగూడ వెండిబొమ్మరము క్రియన్. 158

అర్థము : గిరి - సుత - తపస్ (ః) + ప్రభాతికిన్ = పార్వతి తప ప్రకాశమునకు, రజత - ధరణీధరము = వెండికొండ - కైలాసపర్వతము, తరః తరమ = క్రమక్రమముగా, చలించి, పురహరుతోన్ + కూడన్ = శివునితోఁ గూడ, వెండి - బొమ్మరము - క్రియన్ = వెండి బొంగరము విధమున, అచ్చెరువు గన్ = ఆశ్చర్యముగా, జిఱ్ఱనన్, తిరిగెన్.

తాత్పర్యము : పార్వతి తపఃప్రకాశమునకు వెండికొండ క్రమక్రమముగాఁ జలించి యీశ్వరునితోఁగూడ వెండిబొంగరము విధమున నాశ్చర్యముగా జిఱ్ఱనఁ దిరిగెను.

విశేషములు : అలంకార ముపమ.

వ. అంత నట చని కృతాంతాంతకుండు కంతు లతాంతాస్త్ర హతాంత రంగుండై కాంతావియోగంబునం దురపిల్లుచు. 159

అర్థము : అంతన్, అట, చని, కృతాంత + అంతకుండు = యమనాశకుఁడు - శివుఁడు, కంతు = మన్మథునియొక్క, లతాంత + అస్త్ర - హత + అంతరంగుఁడు + ఐ = పుష్పబాణములచేఁ గొట్టఁబడిన మనస్సుగలవాఁడయి, కాంతా = వియోగంబునన్ = ప్రియురాలితోడి యెడఁబాటున, దురపిల్లుచున్ = దుఃఖించుచు.

తాత్పర్యము : అంత నక్కడ వెడలి శివుఁడు మన్మథుని పూవుటమ్ములచేఁ గొట్టఁబడిన మనస్సుగలవాఁడయి ప్రియావిరహమున బాధపడుచు - తరువాతి పద్యముతో నన్వయము.

సీ. "హిమవంతుఁ డింతి నాకిఁదెచ్చు డెఱిఁగియు
నా మాట లే నేల యాడనైతి?
నతఁడొండు నా నోడి యతివ నా కడనుంచి
యేఁగిన కన్నేల యెఱుఁగనైతి?
నా బాల నను(గూడ నాసించుచున్నచో
మిన్నక తపమేల పన్నికొంటి?
నెలనాఁగ నా మీఁద నెలయింప వచ్చిన
భావజుతో నేల పగయుఁగొంటిఁ?

ఆ. దరుణి వలరసంబు దటిమి పైఁబడనున్న
నెఱవెఱింగి కూడనేర కేల
బేల నైతి?" ననుచు బాలేందుధరుఁ డాత్మ
చింత విడిచి విరహచింతఁ దగిలె. 160

అర్థము : హిమవంతుఁడు, ఇంతిన్ = స్త్రీని - పార్వతిని, నాకున్, ఈన్ = ఇచ్చుటకు - వివాహము గావించుటకు, తెచ్చుడు = తెచ్చుట, ఎఱిఁగియున్, నేను, ఆ మాటలు = పెండ్లి మాటలు, ఏల, ఆడనైతిన్ = పలుక కుంటిని ?

అతఁడు = ఆ హిమవంతుఁడు, ఒండు = ఒకటి - ఒక్కమాట, నాన్ = అనుటకు, ఓడి = జంకి, అతివన్ = స్త్రీని, నా - కడన్ = నా దగ్గఱ, ఉంచి, ఏఁగిన - కన్ను = వెడలిపోయినజాడ, ఏల, ఎఱుఁగనైతిన్ = తెలియకుంటిని ?

ఆ - బాల = ఆ కన్య - పార్వతి, ననున్ = నన్ను, కూడన్ = పొందుటకు, ఆసించుచున్ + ఉన్నచోన్ = కోరుచున్నప్పుడు, మిన్నక = ఊరక, తపము, ఏల, పన్నుకొంటిన్ = కల్పించుకొంటిని ?

ఎలనాఁగన్ = స్త్రీని - పార్వతిని, నామీఁదన్ = నాపై, ఎలయింపన్ + వచ్చిన = ఉన్ముఖునిగాఁ జేయవచ్చినట్టి, భావజుతోన్ = మన్మథునితో, ఏల, పగయున్ + కొంటిన్ = వైరము వహించితిని ?

తరుణి = యువతి - పార్వతి, వల - రసంబు = అనురాగరసము తఱిమి = వెంటనంటి, పైన్ + పడన్ + ఉన్నన్ = మీఁదఁబడనుండఁగా, నెఱవు + ఎఱింగి = మార్గముతెలిసి, కూడన్ + నేరక = ఆమెను పొందలేక, ఏల, బేలన్ + ఐతిన్ = వెఱ్ఱివాఁడనైతిని.

అనుచున్, బాల + ఇందు - ధరుఁడు = చంద్రకళను దాల్చినవాఁడు - శివుఁడు, ఆత్మ - చింతన్ = ఆత్మధ్యానమును - తపస్సును, విడిచి, విరహ - చింతన్ = వియోగ దుఃఖమును, తగిలెన్ = పొందెను.

తాత్పర్యము : 'హిమవంతుఁడు పార్వతిని నాకిచ్చుటకే తెచ్చెనని తెలిపియు నేను ఆ మాటల నేల పలుకనైతిని ? అతఁడు ఒక్కమాటనైన అనుటకు జంకి పార్వతిని నా సన్నిధినుంచి వెడలినజాడను నే నేల యెఱుఁగనైతిని ? ఆ కన్య నన్నుఁ గూడుటకుఁ గోరుచుండఁగా నే నూరక యీ తపము నేల కల్పించుకొంటిని ? ఆమెను నాయందు దాసక్తి వహించునట్లు చేయఁబూనిన మన్మథునితో నే నేల విరోధపడితిని ? ఆ యువతి వల పతిశయింప నాపైఁ బడనుండఁగా మార్గమెఱిఁగి యామెను గూడలేక నే నేల వెఱ్ఱివాఁడనైతిని ?' అనుచు నీశ్వరుఁడు తపస్సుమాని విరహదుఃఖమునఁ బడెను.

మ. బొమ లల్లార్చుచు, లోచనద్యుతులఁ బైఁ బూరించుచున్, మందహా
స మరీచుల్ దళుకొత్తఁ బల్కు నొఱపుల్ సంధించుచున్, లోలభా
వము సూచించుచు నీశుముంగల నెలమిన్ వర్తింపఁజొచ్చెన్ మనో
రమణం బార్వతి రూపవిభ్రమ మహోరాత్రంబు సాన్నిధ్యమై. 161

అర్థము : పార్వతి - రూప - విభ్రమము = పార్వతియొక్క ఆకార విలాసము, బొమలు = కనుబొమలు, అల్లార్చుచున్ = ఆడించుచు, లోచన - ద్యుతులన్ = కంటి కాంతులను, పైన్ = పైని, శివునిపై, పూరించుచున్ = నిండించుచు, మంద - హాస - మరీచుల్ = చిఱునవ్వు కిరణములు, తళుకొత్తన్ (తళుకు + ఒత్తన్) = మెఱయఁగా, పల్కు + ఒఱపుల్ = మాటలయొక్క నేర్పులు, సంధించుచున్ = కూర్చుచు, లోల - భావమున్ = చంచలభావమును, సూచించుచున్ = చూపుచు, మనస్ (ః) + రమణన్ = మనఃప్రీతితో, అహోరాత్రంబు = పగలును రాత్రియును, సాన్నిధ్యము + ఐ = చేరువ నున్నదయి, ఈశు - ముంగలన్ = ఈశ్వరునెదుట, ఎలమిన్ = సంతోషముతో, వర్తింపన్ + చొచ్చెన్ = ఉండ మొదలిడెను.

తాత్పర్యము : పార్వతి ఆకారవిలాసము కనుబొమల నాడించుచు, కన్నుల కాంతులను శివునిపై నించుచు, చిఱునగవుకాంతులు మెఱయఁగా మాట నేర్పులను గూర్చుచు, చాంచల్యమును సూచించుచు ఈశ్వరునెదురఁ బగలును రాత్రియును జేరువ నున్నదయి మనఃప్రీతితో సంతోషమున నుండఁజొచ్చెను.

విశేషములు: అలంకారము స్వభావోక్తి. పల్కునొఱపుల్ - పల్కు + ఒఱపుల్ = 'షష్ఠీసమాసమునం దుకారఋకారముల కచ్చు పరమగునపుడు నుగాగమం బగు' బాల. సంధి. 34. మనస్ + రమణన్ = మనః + రమణన్ = మనోరమణన్. అహోరాత్రంబు - అహశ్చ రాత్రిశ్చ - అహోరాత్రమ్. అహ శ్శబ్దమునకుఁ బరమైన రాత్రి శబ్ద ఇ కారమునకు అప్రత్యయము వచ్చును,

చ. హరునకుఁ జూడఁగా మహిఁ జరాచరరూపము లెల్ల సమ్మతిన్
గిరిసుత రూపమై విరతఖేదముఁ జెప్పఁదొడంగె; నట్ల కా
కరయఁగ నాదిశక్తి సచరాచరరూపమ కావునన్ మహా
పురుషుల కన్నుకాన్కి యనపోహము కావు డిదేమి చోద్యమో. 162

అర్థము: మహిన్ = భూమియందు, చర + అచర - రూపములు + ఎల్లన్ = కదలునవి, కదలనివి అగు ఆకృతులన్నియును. హరునకున్ = ఈశ్వరునకు, చూడఁగాన్, సమ్మతిన్ = అంగీకారముతో, గిరి - సుత - రూపము + ఐ = పార్వతి ఆకారమయి, విరత - ఖేదమున్ = విరమించిన దుఃఖమును. చెప్పన్ + తొడంగెన్ = తెలుప నారంభించెను, అట్లు + అ - కాక = ఆ విధముగనే కాక, అరయఁగన్ = పరిశీలింపఁగా, ఆదిశక్తి = పరాశక్తి - పార్వతి, స-చర + అచర-రూపము + అ=చరములు, అచరములు అనువానితోడి రూపమే, కావునన్, మహత్ (మహా)-పురుషుల-కన్ను-కాన్కి=గొప్పవారియొక్క చూచిన చూపు, అనపోహము= అపోహము కానిది, భ్రమము కానిది, కావుడు=అగుట, ఇది + ఏమి-చోద్యమో= ఇదేమి వింతయో.

తాత్పర్యము: భూమిలో నున్న చరములు అచరములునైన స్వరూపము లన్నియు శివునకు పార్వతివలెఁ గనుపట్టుచు పార్వతీ విరహదుఃఖమును బోఁగొట్టుచుండెను. అది యట్లే. ఆదిశక్తి స్వరూపిణియగు పార్వతి సచరాచర రూపమే కావున మహాపురుషుల దృష్టి భ్రమరహితమగుట యేమి వింత? కాదని భావము.

విశేషములు: విశేషము సామాన్యముచే సమర్థింపఁబడినది కావున అలంకార మర్థాంతరన్యాసము, మహాపురుషులకన్నుకాన్కి - 'ధాతుజవిశేషణ భావార్థక

పూర్వవ్యవహితావ్యవహిత కర్తృపద ప్రథమకుఁదఱచుగ యొక్కషష్ఠి యగు.' ప్రౌఢ. కారక, 15. మహాపురుషులయొక్క కన్నుకాన్కి. 'యొక్కకు లోపంబు. బహుళంబు' 'ప్రౌఢ. కారక . 16. మహాపురుషులకన్నుకాన్కి. కాన్కి = చూపు . ఈ శబ్దము నకుఁ బ్రయోగాంతరము లేదు.

వ. తదవసరంబున. 163

అర్థతాత్పర్యములు: తద్ + అవసరంబునన్ = ఆ సమయము నందు . తరువాతిపద్యముతో నన్వయము.

సీ. ఉరు కపర్దారుణతరదీప్తు లను మృదు
నవ సహకార పల్లవ విభాతి,
నీలకంఠప్రభాజాలంబు లను సమ
దాలోల రోలంబ మాలికలును,
పాండురాంగామల బహుళ దీధితు లను
పూర్ణచంద్రాతపాకీర్ణ రుచులు,
గంగాంబుశీకరోత్కలితాహి నిశ్శ్వాస
ముల మందపవనంబుఁ బొందుచేసి.

తే. కాముఁ జంపిన పగఁ దీర్పఁ గడఁగి సూక్ష్మ
భావమునఁ జొచ్చి చిత్తతాపావహంబు
లయ్యెనొకొ నాఁగ శివుఁ డంగజాపహారి
యయ్యు విరహాగ్నిఁ బడి వేఁగు నలసినొలసి. 164

అర్థము: ఉరు . కపర్ద + అరుణతరదీప్తులు = పెద్దదియగు జడముడి యొక్క మిక్కిలి యెఱ్ఱనైన కాంతులు, అను = అనెడి, మృదు . నవ . సహకార . పల్లవ . విభాతి = మెత్తని క్రొత్త తీయమామిడిచివురుల కాంతియు,

నీల . కంఠ ప్రభా . జాలంబులు = నల్లని కంఠముయొక్క కాంతుల సమూహములు, అను = అనెడి, సమద + ఆలోల . రోలంబ . మాలికలును = మదముతోఁగూడినవి, చంచలములు అగు తుమ్మెదల వరుసలును,

పాండుర + అంగ + అమల - బహుళ - దీధితులు = తెల్లని శరీరము యొక్క నిర్మలములయిన పెక్కు కాంతులు, అను = అనెడి, పూర్ణ - చంద్రాతప + ఆకీర్ణ - రుచులు = నిండువెన్నెలయొక్క అంతట వ్యాపించిన కాంతులును,

గంగాం.........పవనంబున్ : గంగా = గంగానదియందలి, అంబు = నీటియొక్క, శీకర = తుంపరతో, ఉత్కలిత = కూడిన, అహి = పాముల యొక్క, నిశ్శ్వాసముల = నిట్టూర్పులనెడు, మంద - పవనంబున్ = మెల్లని గాలియును, పొందు - చేసి = కూడి, కామున్ = మన్మథుని, చంపిన పగన్ = చంపిన విరోధమును, తీర్పన్ = తీర్చుటకు, కడఁగి = పూని, సూక్ష్మ - భావమునన్ = సూక్ష్మరూపమున, చొచ్చి = ప్రవేశించి, చిత్త - తాప + ఆవహంబులై = మనస్తాపమును గలిగించునవి, అయ్యేన్ + ఒకో = అయ్యేనా, నాఁగన్ = అనఁగా, శివుఁడు, అంగజ + అపహారి = మన్మథ నాశకుఁడు, అయ్యున్ = అయినను, విరహ + అగ్నిన్ = ఎడఁబాటు అనెడి అగ్నియందు, పడి, అలపి సొలపి = డస్సి పరవశుఁడయి, వేఁగున్ = తపించును.

తాత్పర్యము : పెద్దదియగు జడముడి యెఱ్ఱనికాంతులనెడి మృదువులు, క్రొత్తవియు నగు తీయమామిడిచివురుల కాంతియును, నల్లని కంఠపుఁగాంతుల సమూహ మనెడి మదించినవి చలించినవి యైన తుమ్మెదలబారులును, తెల్లని శరీరపు నిర్మలములు అధికములునైన కాంతులనెడు నిండువెన్నెల వ్యాపించుకాంతులును, గంగానదినీటితుంపరతోఁగూడిన పాము నిట్టూర్పులనెడు మందవాయువును గూడి మన్మథునిఁ జంపినవైరమును దీర్చుకొనఁబూని సూక్ష్మరూపమున మనసునందుఁ బ్రవేశించి తాపమును గలిగించుచున్నవా యన శివుఁడు, మన్మథహరుఁ డయినను, విరహ మనెడి అగ్నియందుఁ బడి అలపి సొలపి తపించును.

విశేషములు : అలంకారము రూపకము. తదనుప్రాణితమైన ఉత్ప్రేక్ష. సహకారపల్లవములు, రోలంబమాలికలు, చంద్రాతపము, మందపవనము - ఇవి యన్నియు మన్మథపరివారములోనివి. తమ యజమానుఁడైన మన్మథునకు హానిఁ జేసినవాఁడుగావున నవి శివుని చిత్తమును సూక్ష్మరూపమునఁ బ్రవేశించి తాపమును గలిగించుచున్నవి. శివుఁ డంగజాపహారియయ్యు విరహాగ్నిఁబడి వేఁగు. ప్రతిబంధక మున్నప్పటికిని గార్యము కలిగినదని చెప్పుటచే విభావనాలంకారము. 'కార్యోత్పత్తి స్తృతీయా స్యాత్సత్యపి ప్రతిబన్ధకే' చన్ద్రా.

మ. అలిధమ్మిల్ల, మృణాలహస్తఁ, గమనీయావర్తనాభిన్, మహో
త్పలగంధిం, గలహంసయాన, విలసద్బంధూకరక్తోష్ఠ, ను
త్పలనేత్రం, గమలాస్య, నంగజరసాంభఃపూరఁ, దత్పార్వతీ
జలజావాసముఁ జొచ్చి యాడక మనోజాతానలం బాఱునే? 165

అర్థము : అలి - ధమ్మిల్లన్ = తుమ్మెదల వంటి కొప్పుగలదియు. మృణాల హస్తన్ = తామరతూఁడులవంటి చేతులుగలదియు, కమనీయ + ఆవర్త - నాభిన్ = మనోహరమైన సుడివంటి నాభిగలదియు, మహోత్పల - గంధిన్ = పద్మము సువాసనవంటి సువాసన గలదియు, కలహంస - యానన్ = రాయంచ నడకవంటి నడక గలదియు, విలసత్ + బంధూక - రక్త + ఓష్ఠన్ = ప్రకాశించుచున్న మంకెన పువ్వువలె నెఱ్ఱనైన పెదవి గలదియు. ఉత్పల - నేత్రన్ = కలువలవంటి కన్నులు గలదియు. కమల + ఆస్యన్ = పద్మమువంటి ముఖము గలదియు, అంగజ - రస + అంభస్ (ః) + పూరన్ = శృంగారరసమనెడి నీటితో నిండినదియు అగు, తద్ + పార్వతీ - జలజావాసమున్ = ఆ పార్వతియనెడు తామరకొలనిని. చొచ్చి = ప్రవేశించి, ఆడక = స్నానముచేయక, మనోజాత + అనలంబు = మన్మథుఁడనెడి అగ్ని, ఆఱునే = ఉపశమించునా ?

తాత్పర్యము :* తుమ్మెదలవంటి కొప్పు గలదియు. తామరతూండ్లవంటి చేతులు గలదియు, మనోహరమైన సుడివంటి నాభిగలదియు, పద్మగంధమువంటి గంధము గలదియు, రాయంచ నడకవంటి నడకగలదియు. ప్రకాశించుచున్న బంధూక పుష్పములవలె నెఱ్ఱనైన పెదవిగలదియు, కలువలవంటి కన్నులుగలదియు, పద్మము వంటి ముఖము గలదియు, శృంగార రసమనెడు నీటితో నిండినదియు, నగు ఆ పార్వతి యనెడి పద్మాకరమును జొచ్చి స్నానముచేయక మన్మథాగ్ని చల్లాఱునా - చల్లాఱదని భావము.

విశేషములు : అగ్ని చల్లాఱవలయునన్న సరఃప్రవేశము చేయవలయును. ఇచ్చట అగ్ని మన్మథుఁడు, సరస్సు పార్వతి. సరస్సునందుండునవి యన్నియుఁ బార్వతియందునున్నవి. తుమ్మెదలు. మృణాలములు, ఆవర్తము, మహోత్పలములు, కలహంసములు, బంధూకములు, ఉత్పలములు. కమలములు, అంభస్సు - ఇవి యన్నియు సరస్సులోనివి. వరుసగా ధమ్మిల్లము, హస్తములు, నాభి, గంధము

యానము, ఓష్ఠము, నేత్రములు. ఆస్యము. అంగజరనము - ఇవి పార్వతియం దున్నవి. కావుననే పార్వతి జలజావాసముగా రూపింపఁబడినది. అలంకారము రూప కము.

మహోత్పలము, 'వా పుంసి పద్మం నళిన మరవిన్దం మహోత్పలమ్' — మహచ్చ తత్ ఉత్పలం చ మహోత్పలమ్ - మహత్తైన ఉత్పలము - పద్మము- అమరము - 'ఉత్పలనేత్రి' యని యెల్లప్రతులలోను గలదు. 'అంగాదులకుఁదప్ప సంయోగోపధంబులకు జీ ప్రత్యయంబు లేమింజేసి మీననేత్రి పద్మనేత్రి ఇత్యాదు లసాధువులు'. బాల. తత్సమ 85. కావున ఛందోభంగము లేమి ఉత్పలనేత్ర అని మార్పఁబడినది.

ఉ. అత్తనుమధ్యరూపుఁ గడు నందముగాఁ గుసుమాయుధుండు నా
చిత్తమున దు రేఖగొని చిత్రము వ్రాసెనొ ? పోలుపొంద న
చ్చొత్తెనొ ? నేర్పునం గలయ నూన్చెనొ ? గా కిది తన్మనోభవో
న్మత్త వికారమో ? మదను మాయయొ ? నిక్కువమో? తలంపఁ
గాన్. 166

అర్థము : తలంపఁగాన్ = ఆలోచింపఁగా. అ + తనుమధ్య, రూపున్ = సన్నని నడుముగల ఆ పార్వతియొక్క రూపమును, కుసుమ + ఆయుధుండు = పూవులు బాణములుగాఁ గలవాఁడు - మన్మథుఁడు, కడున్ = మిక్కిలి, అందము గాన్, చిత్తమునందున్ = మనసునందు, రేఖగొని = గీఁతలచేత గుఱుతులు పెట్టు కొని, చిత్రమున్ = బొమ్మను, వ్రాసెనో = గీసెనో. పోలుపొందన్ = యథార్థ ముగా, అచ్చొత్తెనో = ముద్రవైచెనో, నేర్పునన్ = నేర్పుతో, కలయన్ = అంత టను. ఊన్చెనో = కలిగించెనో, కాక = అట్లుగాక, ఇది, తద్ + మనో - మనస్ (ః) - భవ + ఉన్మత్త - వికారమో = ఆ మన్మథుని వలని ఉన్మాదపు వికృతియో, మదను - మాయయొ = మన్మథుని మాయయో, నిక్కువమో=నిజమో.

తాత్పర్యము : భావింపఁగా నా పార్వతి రూపమును మన్మథుఁడు మిక్కిలి అందముగా మనసునందు గీఁతలచే గుఱుతుపెట్టుకొని బొమ్మగీసెనో ? యథార్థముగా నచ్చొత్తెనో: నేర్పుతో నంతటను గలిగించెనో ! అట్లుగాక ఇది ఆ మన్మథునివలని ఉన్మాదపు వికారమో ! మన్మథకృతమాయయో ! నిజమో !

విశేషములు : అలంకారము సందేహము.

వ. అని యనేకప్రకారంబులం ద్రిలోచనుండు రణరణక వ్యథాకులిత హృదయుం డగుచు నుండె నంత నగజ తపఃప్రభావం బీశాను బలాత్కారంబున నాకర్షింపం దొడంగిన. 167

అర్థము : అని, అనేక - ప్రకారంబులన్ = పెక్కురీతుల, త్రిలోచనుండు = శివుడు, రణరణక - వ్యథా + ఆకులిత - హృదయుండు = విరహబాధచే (ఉత్కంఠ, బాధ అనుదానిచే) - (మన్మథబాధచే) గలతచెందిన హృదయము గలవాడు, అగుచున్. ఉండెన్, అంతన్, అగజ - తపస్ (ః) + ప్రభావంబు = పార్వతియొక్క తపస్సుయొక్క మహిమ, ఈశానున్ = శివుని, బలాత్కారంబునన్ = బలవంతముగా, ఆకర్షింపన్ + తొడంగినన్ = లాగ నారంభింపగా.

తాత్పర్యము : అని పెక్కురీతుల ముక్కంటి విరహతాపముచే గలగిన హృదయము గలవా డగుచుండెను. అంతం బార్వతీతపఃప్రభావ మీశ్వరుని బలవంతముగా లాగనారంభింపగా - సప్తమాశ్వాస రెండవ గద్యముతో నన్వయము.

క. గుణగణరత్నభూషణుఁ, డకుత్సితచిత్తుఁడు, పూర్ణచంద్రభూ
షణ పదపంకజాత మదషట్పదుఁ, డాశ్రిత సజ్జనార్య పో
షణుఁ, డమితాభవాగమ విశారదుఁ, డీడిత సన్మునీశ్వరా
గ్రణి, శుభమూర్తి, సజ్జనశిఖామణి, ధీమణి, విశ్వసంస్తుతిన్, 168

అర్థము : విశ్వ - సంస్తుతిన్ = విశ్వముయొక్క సంస్తుతియందు, (జంగమ మల్లికార్జునుఁడు), గుణ - గణ - రత్న - భూషణుఁడు = సద్గుణముల సమూహమనెడి రత్నములు అలంకారములుగాఁ గలవాఁడు, అకుత్సిత - చిత్తుఁడు = అనిందితమైన మనస్సు గలవాఁడు, పూర్ణ - చంద్ర - భూషణ - పద - పంకజాత - మద - షట్పదుఁడు = నిండు చందురుఁడు అలంకారముగాఁ గలవాని - శివునియొక్క పాదపద్మములకు మదించిన తుమ్మెదయైనవాఁడు, ఆశ్రిత - సత్ + జన + ఆర్య - పోషణుఁడు = ఆశ్రయించిన మంచిజనుల, పూజ్యుల, పోషణముగలవాఁడు, అమిత + అభవ + ఆగమ - విశారదుఁడు = అధికమైన శైవాగమములందు నేర్పుగలవాఁడు, ఈడిత - సత్ + ముని + ఈశ్వర + అగ్రణి = పూజింపఁబడిన మునిశ్రేష్ఠులందు మొదటివాఁడు, శుభ - మూర్తి = శుభమైన ఆకారము

గలవాఁడు, సత్ + జన - శిఖామణి = మంచిజనులలోఁ దలమానికమైన వాఁడు - శ్రేష్ఠుఁడు, ధీమణి = బుద్ధియను మణి గలవాఁడు.

తాత్పర్యము : కృతిపతియగు జంగమ మల్లికార్జునుఁడు సద్గుణసమూహము అనెడి రత్నాలంకారములు గలవాఁడును, శివపాదపద్మములకు మదించిన తుమ్మెద యైనవాఁడును, ఆశ్రయించిన సజ్జనులను, ఆర్యులను పోషించువాఁడును, అమితము లైన శైవాగమములందు నేర్పరియైనవాఁడును, పూజితులైన సన్ముని శ్రేష్ఠులలో మొదటివాఁడును, శుభాకారుఁడును, సజ్జనులలోఁ దలమానికమైనవాఁడును, ధీమణి యును అని విశ్వముచేత సంస్తుతింపఁబడువాఁడు.

విశేషములు : గుణగణరత్నభూషణుఁడు - గుణగణములనెడి రత్న భూషణుఁడు - రూపకము. పూర్ణచంద్రభూషణ పదపంకజాతమదషట్పదుఁడు - పూర్ణచంద్రభూషణుని పదములనెడు పంకజాతములకు షదషట్పదుఁడు - రూపకము. శివుఁడు పూర్ణచంద్రభూషణుఁడా ? చంద్రకళాభూషణుఁడు గదా !

క. సంయమ సుచరిత్రుఁడు, వా
క్సంయమ సువ్రతరతుండు, చౌషష్టి కళా
సంయుతుఁ డనఘుఁడు, కాంతా
సంయోగ వియోగ భోగ సంత్యక్తుఁ డిలన్. 169

అర్థము : (జంగమ మల్లికార్జునుఁడు) ఇలన్ = భూమియందు, సంయమ - సుచరిత్రుఁడు = చిత్తనిరోధముతోడి మంచిచరిత్రగలవాఁడు, వాచ్(క్) - సంయమ- సువ్రత - రతుండు = వాఙ్నిగ్రహమనెడి మంచివ్రతమునందు ఆసక్తిగలవాఁడు. చౌషష్టి - కళా - సంయుతుఁడు = అఱువది నాలుగుకళలతోఁ గూడినవాఁడు, అనఘుఁడు = అఘము (పాపము) లేనివాఁడు, కాంతా - సంయోగ - వియోగ - భోగ - సంత్యక్తుఁడు = స్త్రీసంయోగవియోగములు, భోగములు అనువానిచేత విడువఁబడినవాఁడును.

తాత్పర్యము : జంగమ మల్లికార్జునుఁడు భూమియందు చిత్తనిరోధము తోడి సుచరిత్రము గలవాఁడు, వాఙ్నిగ్రహమనెడు సద్వ్రతమునం దాసక్తిగలవాఁడు, అఱువదినాలుగుకళలతోఁ గూడినవాఁడు, పాపములులేనివాఁడు, కాంతలసంయోగములు, భోగములు అనువానిచే విడువఁబడినవాఁడు - కాంతా సంయోగవియోగభోగములను విడిచినవాఁడు.

చ. గతమదమత్సరుండు, జిత కామ లతాంత శిలీముఖ వ్రజా
హత పరితాపచేతసుఁ డఘామితకంటక బంధుభూరుహా
యత నిబిడాజవంజవ మహావిపినానలుఁ, డింద్రియేభ సం
హతి మదవర్ధనోగ్రనఖరాయుధుఁ, డాత్మవిదుండు సద్విధిన్. 170

అర్థము : గత - మద - మత్సరుండు = పోయిన మదమాత్సర్యములు గలవాఁడు - మదమాత్సర్యములు లేనివాఁడు, జిత........చేతసుఁడు; జిత - కామ = జయింపఁబడిన మన్మథునియొక్క, లతాంత - శిలీముఖ - వ్రజ = పూవులనెడి బాణముల సమూహముచే, ఆహత = కొట్టఁబడిన, పరితాప - చేతసుఁడు = సంతాపముగల మనస్సుగలవాఁడును, అఘా....నానలుఁడు : అఘ = పాపములనెడి, అమిత = అధికమైన కంటకములకు, బంధు = చుట్టములైన, భూరుహ = చెట్ల చేత, ఆయత = విరివియైన, నిబిడ = దట్టమైన, ఆజవంజవ = సంసారమనెడి, మహత్ (మహా) - విపిన + అనలుఁడు = గొప్ప అడవికి అగ్నియైనవాఁడు, ఇంద్రి....యుధుఁడు : ఇంద్రియ = ఇంద్రియములనెడు, ఇభ = ఏనుఁగుల యొక్క, సంహతి = గుంపుయొక్క, మద = క్రొవ్వుయొక్క, వర్ధన = ఖండించుటకు, ఉగ్ర = భయంకరమైన, నఖర + ఆయుధుఁడు = సింహమైనవాఁడు, సత్ + విధిన్ = మంచినియమమునందు, ఆత్మ - విదుండు = ఆత్మజ్ఞానము గలవాఁడు.

తాత్పర్యము : మదమాత్సర్యములు లేనివాఁడు. మన్మథుని పూవులనెడి బాణముల సమూహముచేఁ గొట్టఁబడిన సంతాపముగల మనస్సును జయించినవాఁడు, పాపములనెడి పెక్కుముండ్లకుఁ జుట్టములైన చెట్లచే విరివియైనట్టియు, దట్టమయినట్టియు గొప్ప అడవికి అగ్నియైనవాఁడు, ఇంద్రియములనెడి ఏనుఁగులగుంపు మదమును నశింపఁజేయుటయందు భయంకరమైన సింహమైనవాఁడు, సద్విధిచే ఆత్మ జ్ఞానముగలవాఁడు.

విశేషములు : పరితాపచేతసుఁడు - బహువ్రీహి సమాసమున నుత్తర పదములుగా నున్నప్పుడు ఉరః ప్రభృతులకు క ప్రత్యయము వచ్చును. పరితాపచేతస్కుఁడు కావలసియుండఁగా నిట పరితాపచేతసుఁడని యున్నది. అలంకారము రూపకము. 'గతమదమత్సరుండు' ఇదే సమాసముతో మొదలిడు నన్నయ పద్యము. భార,ఆర. 3-36.

క. సూరిజన స్తుత కీర్తి
శ్రీరమణీ రమణుఁ, డమలచేతస్కుఁడు[1] వా
ణీ రుచిరానన తిలకుఁ, డ
పారగుణార్ణవుఁడు, సుజనబాంధవుఁ, డెలమిన్. 171

అర్థము : సూరి - జన - స్తుత - కీర్తి - శ్రీ - రమణీ - రమణుఁడు = పండితులైన జనులచేతఁ బొగడఁబడిన కీర్తిలక్ష్మి యనెడుస్త్రీకిఁ బ్రియుఁడైనవాఁడు అమల - చేతస్కుఁడు = నిర్మలమైన మనస్సుగలవాఁడు, వాణీ - రుచిర + ఆనన - తిలకుఁడు = సరస్వతిచేత మనోహరమైన ముఖముగలవారిలో శ్రేష్ఠుఁడు. అపార - గుణ + అర్ణవుఁడు = అనంతములైన గుణములకు సముద్రమైన వాఁడు, ఎలమిన్ = ప్రీతియందు, సుజన - బాంధవుఁడు = మంచివారికి బంధువైన వాఁడు,

తాత్పర్యము : విద్వజ్జనులచే నుతింపఁబడిన కీర్తిలక్ష్మికిఁ బ్రియుఁడైన వాఁడు, నిర్మలమైన మనస్సుగలవాఁడు, వాక్కుచే మనోహరమైన ముఖముగల వారిలో శ్రేష్ఠుఁడు, పెక్కుసుగుణములకు సముద్రమైనవాఁడు, ప్రీతియందు సజ్జను లకు బంధువైనవాఁడు.

విశేషములు : అమల చేతస్కుఁడు - బహువ్రీహి సమాసమున నుత్తర పదములుగా నున్నప్పుడు ఉరః ప్రభృతులకు కప్రత్యయము వచ్చును.

లలితగతి. కమలదళనేత్రుఁ డవికారుఁడు సుధీరుం
డమిత శివతత్త్వవిదుఁ డార్యుఁ డతివర్యుం
డమలిన చరిత్రుఁ డమలాత్ముఁడు మహాత్ముం
డమరగురుభాతి మతియందు నుతుఁ డెందున్. 172

అర్థము : కమల - దళ - నేత్రుఁడు = తామర రేకులవంటి కన్నులుగల వాఁడు. అవికారుఁడు = వికారములులేనివాఁడు, సుధీరుండు = మంచిధైర్యవంతుఁడు, అమిత - శివ - తత్త్వ - విదుఁడు = అధికమైన శివతత్త్వము తెలిసినవాఁడు, ఆర్యుఁడు = పూజ్యుఁడు, అతి వర్యుండు = మిక్కిలి శ్రేష్ఠుఁడు - అతిమన్మథుఁడు-

1. వాఙ్మిశ్ర ప్ర. రే.

మన్మథుని మించినవాఁడు, అమలిన - చరిత్రుఁడు = నిర్మలమైన చరిత్రముగలవాఁడు, అమల + ఆత్ముఁడు = నిర్మలమైన మనస్సుగలవాఁడు, మహాత్ముండు, = గొప్ప వాఁడు, మతి + అందున్ = బుద్ధియందు, అమర - గురు - భాతి = దేవతల గురువైన బృహస్పతి విధమువాఁడు, ఎందున్, నుతుఁడు = పొగడఁబడినవాఁడు,

తాత్పర్యము : పద్మదళములవంటి కన్నులుగలవాఁడు, వికారములేని వాఁడు, ధైర్యవంతుఁడు, అధికమైన శివతత్త్వ మెఱింగినవాఁడు, పూజ్యుఁడు. మిక్కిలి శ్రేష్ఠుఁడు - అతిమన్మథుఁడు, నిర్మలమైన చరిత్రముగలవాఁడు. నిర్మలస్వభావుఁడు, మహాత్ముఁడు, బుద్ధియందు బృహస్పతివంటివాఁడు. ఎందును పొగడఁబడువాఁడు.

విశేషములు : వర్యుఁడు, = శ్రేష్ఠుఁడు, మన్మథుఁడు. సూ.ని.

ఛందస్సు. లలితగతి - నాలుగు పాదము లుండును. ప్రతిపాదమునను న, స, న, భ, య గణములుండును, మొదటి అక్షరమునకును బదియవ యక్షరము నకును యతిమైత్రి. ప్రాసనియమము గలదు, దీనికి అప్పకవీయమున అలసగతి యని పేరుగలదు,

గద్యము ఇది శ్రీమజ్జంగమ మల్లికార్జునదేవ దివ్య శ్రీపాద
పంకజ భ్రమరాయమాణ కవిరాజ శిఖామణి నన్నెచోడ
దేవ ప్రణీతంబైన కుమారసంభవంబను కథయందు

షష్ఠాశ్వాసము

అర్థతాత్పర్యములు : ప్రథమాశ్వాసాంత గద్యమునకు వలెనే,

మ. ఇది శ్రీ జొన్నలగడ్డ వంశ మణి యౌ మృత్యుంజయాఖ్యుండు స
మ్మద మొప్పారఁ గుమారసంభవము శ్రీమన్నన్నెచోడాఖ్య వి
ద్వ దధీశోక్తము శాబ్దికార్థ వివిధస్వారస్య తాత్పర్యముల్
చదురొప్పన్ వచియించి మన్చు విలసత్ సంజీవనీవ్యాఖ్యయౌ.

---

శ్రీ అద్దేపల్లి నాగేశ్వరరావు గారిచే సరస్వతీ పవర్ ప్రెస్సు నందు ముద్రితము.
రాజమహేంద్రవరము - 1994.

కవిరాజ శిఖామణి

నన్నెచోడదేవకృత

# కుమార సంభవము

(సంజీవనీ వ్యాఖ్యా సమేతము)

## ద్వితీయ భాగము

(7-12 ఆశ్వాసములు)


వ్యాఖ్యాత

**డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావు,**

ఎం.ఏ., పిహెచ్.డి

రాజమహేంద్రవరము





**పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయము.**

**పబ్లిక్ గార్డెన్స్, నాంపల్లి, హైదరాబాదు - 14.**

**1998**

ఆచార్య నాయని కృష్ణకుమారి
ఉపాధ్యక్షులు
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం



లలిత కళాతోరణం,
పబ్లిక్ గార్డెన్స్,
హైదరాబాద్ - 500 004

# సమర్పణ

బోధన, పరిశోధన, ప్రచురణ అనే మూడు విషయాలు లక్ష్యంగా తెలుగు సాహిత్యం, భాష, చరిత్ర, కళలు - సంస్కృతి వంటి రంగాలలో కృషి సల్పడానికి 1985 వ సంవత్సరంలో తెలుగు విశ్వవిద్యాలయం ఆవిర్భవించింది పూర్వం ఉన్న ఆంధ్రప్రదేశ్ సాహిత్య, సంగీత, నాటక, నృత్య, లలిత కళా అకాడమీలు ఇందులో విలీనం కావడంవలన పైన పేర్కొన్న లక్ష్యాలతోపాటు మరెన్నో బాధ్యతలు దీనికి సంక్రమించాయి అన్ని విశ్వవిద్యాలయాలవలె కేవలం పఠన పాఠనాలతో సరిపెట్టుకునే అల్పపరిధి కాదు దీనిది మన సంస్కృతిని ప్రపంచం నలుమూలలకూ వ్యాప్తి చేయడానికి ఉద్దేశింపబడిన "సాంస్కృతిక విశ్వవిద్యాలయ"మిది ప్రచారసాధనకు పరికరమే ప్రచురణ

ప్రచురణ కార్యక్రమానికి అనుగుణంగా ఈ విశ్వవిద్యాలయం ఇప్పటికెన్నో ప్రముఖ గ్రంథాలను ప్రచురించింది వ్యాఖ్యా స్రవంతి శీర్షికన సుప్రసిద్ధ పండితులచే ప్రాచీన కావ్య ప్రబంధాలకు వ్యాఖ్యానాలు వ్రాయించి ప్రచురించింది ఇప్పటివరకు ఈ ప్రణాళికలో కుమార సంభవం, కాశీఖండం, శివరాత్రి మాహాత్మ్యం వంటి గ్రంథాలను వ్యాఖ్యా సహితంగా ముద్రించింది

తెలుగులో పేరుపొందిన ప్రాచీన ఆధునిక గ్రంథాలను

ఇంగ్లీషు, హిందీ బాషలలోనికి అనువాదం చేయించి ప్రచురించింది

తెలుగులో విజ్ఞాన సర్వస్వ సంపుటాలను తయారు చేయించే కార్యక్రమంలో 'విశ్వసాహితి'ని, 'హిస్టరీ అండ్ కల్చర్ ఆఫ్ ది ఆంధ్రాస్' అనే పేరుతో ఆంగ్లంలో ఒక సంపుటాన్ని ప్రచురించింది

ప్రాచీన ప్రౌఢాంధ్ర కావ్యాలకు వ్యాఖ్యానాలు లేకపోతే అర్థం చేసుకునే శక్తి విద్యార్థిలోకానికి నానాటికీ తగ్గిపోయే ప్రమాదం ఉంది అందుచేత విద్యార్థుల సౌకర్యార్థం అలాంటి కావ్యాలకు సమర్థులైన పండితులచేత వ్యాఖ్యానాలు రచింపజేసే ప్రణాళికను వ్యాఖ్యాస్రవంతి పేర తెలుగు విశ్వవిద్యాలయం చేపట్టింది

"కుమార సంభవం" పండ్రెం డాశ్వాసాల మహాకావ్యం మొత్తం కావ్యం వ్యాఖ్యానంతో సువిస్తృతం అయింది కాబట్టి దానిని రెండు సంపుటాలుగా ప్రకటింప తలపెట్టడమైనది మొదటి ఆరు ఆశ్వాసాలూ ఒక సంపుటంలోనూ, తరువాతి ఆరు ఆశ్వాసాలూ రెండో సంపుటంలోనూ ఉంటాయి మొదటి ఆరాశ్వాసాల సంపుటం ఇదివరకే (1994) వచ్చింది ఇప్పుడు ఇది రెండో సంపుటం ఇందులో ఏడవ ఆశ్వాసం మొదలుకొని పన్నెండవ ఆశ్వాసం వరకు వ్యాఖ్యానం సుసజ్జితమై ఉంది

ఈ క్లిష్టమైన కావ్యానికి సమగ్రమైన వ్యాఖ్యానం వ్రాసి మా కందించిన వారు శ్రీ మృత్యుంజయరావుగారు

**నాయని కృష్ణకుమారి**
ఉపాధ్యక్షురాలు

తేది 16-4-1998

# విషయ సూచిక

## సప్తమాశ్వాసము



## అష్టమాశ్వాసము

**నవమాశ్వాసము**



**దశమాశ్వాసము**

**ఏకాదశాశ్వాసము**



**ద్వాదశాశ్వాసము**

# కుమార సంభవము

## సప్తమాశ్వాసము

క	శ్రీ శ్రిత వక్షుఁడు, ముక్తి
శ్రీ శ్రిత సహజావదాత చిత్తుఁడు, వాణీ
శ్రీ శ్రిత సుముఖుఁడు, కీర్తి
శ్రీ శ్రిత దిఙ్ముఖుఁడు శేముషీనిధి పేర్మిన్

**అర్థము :** శ్రీ - శ్రిత - వక్షుఁడు = లక్ష్మికి ఆశ్రయమైన వక్షము గలవాఁడు, ముక్తి - శ్రీ - శ్రిత - సహజ + అవదాత - చిత్తుఁడు = మోక్షమనెడు లక్ష్మికి ఆశ్రయమైన సహజముగాఁ దెల్లని - (నిర్మలమైన) మనస్సు గలవాఁడు, వాణీ - శ్రీ - శ్రిత - సుముఖుఁడు = వాక్సంపదకు ఆశ్రయమైన మంచి ముఖము గలవాఁడు, కీర్తి - శ్రీ - శ్రిత - దిశ్ (క్) + ముఖుఁడు = కీర్తియనెడు లక్ష్మికి ఆశ్రయమైన దిక్కుల ముఖములు గలవాఁడు, పేర్మిన్ = గొప్పతనము నందు, శేముషీ - నిధి - బుద్ధికి నిధియైనవాఁడు,

**తాత్పర్యము .**లక్ష్మి కాశ్రయమైన వక్షముగలవాఁడు, మోక్షలక్ష్మికి ఆశ్రయమైన సహజనిర్మలమైన మనస్సుగలవాఁడు, వాక్సంపద కాశ్రయమైన ముఖము గలవాఁడు, కీర్తి లక్ష్మి కాశ్రయమైన దిక్కుల ముఖములు గలవాఁడు, పేర్మియందు బుద్ధికి నిధియైనవాడు అగు జంగమ మల్లికార్జునుఁడు

**విశేషములు :** ముక్తిశ్రీ - కీర్తిశ్రీ -- రూపకములు

**శివుఁడు కపట వటు రూపమునఁ దపఃపరాయణ యగు పార్వతి కడకు వచ్చుట**

వ	పరమేశ్వరుండు నిజమనోరథంబు సిద్ధి పొందం బార్వతికిం బ్రత్యక్షంబు గాఁ దలంచి తదీయాంతర్గతం బారయు వేఁడి నిజరూపంబు చూపనొల్లక యాక్షణంబ

**అర్థము.** పరమేశ్వరుండు, నిజమనోరథంబు = తనదైన కోరిక, సిద్ధి + పొందన్= నెఱవేఱుటకు, పార్వతికిన్, ప్రత్యక్షంబు + కాన్ + తలంచి = ఎదుఱదోఁపఁదలఁచి, తదీయ + అంతర్గతంబు = ఆమెదియగు మనస్సు, ఆరయన్ - వేఁడి = చూడఁగోరి, నిజరూపంబు = తనదైన ఆకృతి, చూపన్ + ఒల్లక చూపుట కిష్టపడక, ఆ - క్షణంబ = ఆ క్షణమే

**తాత్పర్యము.** పరమేశ్వరుఁడు తన కోరిక నెఱవేఱుటకుఁ బార్వతికిఁ బ్రత్యక్షము గానెంచి, ఆమె మనోభావమును బరీక్షింపఁగోరి, తన రూపమును జూపుట కిష్టపడక ఆ క్షణమే తరువాతి పద్యముతో నన్వయము

సీ. మెఱుఁగుఁదీఁగెలతోడి మేఘంబు నా జన్ని
దములతోఁ గృష్ణాజినము ధరించి
మకరధ్వజముతోడి మరుపచ్చవిల్లు
నా గోఁచితో మోదుగుఁగోల పట్టి
చంద్రికతోడి తుషారపుంజంబు నాఁ
దనుకాంతితో భూతిధామ మెసఁగ
వీణారవముతోడి వేదనాదంబు నా
రాగమ్ముతోడ శివాగమములు

తే. చదువుచును బ్రహ్మవర్చసపదవితోడి
దివ్యతేజంబు మొగమునఁ దేజరిల్ల
సుందరాకార మమర బాలేందుధరుఁడు
తాల్చి చనుదెంచె గిరిరాజతనయ కడకు 3

**అర్థము:** బాల+ఇందు-ధరుఁడు=చంద్రకళను ధరించిన వాఁడు - శివుఁడు

మెఱుఁగుఁదీఁగెల తోడి = విద్యుల్లతలతోఁగూడిన, మేఘంబు, నాన్ = అనఁగా, జన్నిదములతోన్ = జందెములతో, కృష్ణ + అజినమున్ = లేడి చర్మమును, ధరించి

మకర - ధ్వజముతోడి = మొసలి టెక్కెముతోఁ గూడిన, మరు - పచ్చవిల్లు- నాన్ = మన్మథుని చెఱకువిల్లు అనునట్లు, గోఁచితోన్ = కౌపీనముతో, మోదుగుఁగోల= మోదుగుదండము - ఆషాఢము, పట్టి = పట్టుకొని,

చంద్రికతోడి = వెన్నెలతోఁగూడిన, తుషార - పుంజంబు - నాన్ - మంచు సమూహము అనునట్లు, తను - కాంతితోన్ = దేహకాంతితో, భూతి - ధామము = విభూతి కాంతి, ఎసఁగన్ = అతిశయింపఁగా,

వీణా - రవముతోడి = వీణా ధ్వనితోఁగూడిన, వేద - నాదంబు = వేద ధ్వని, నాన్= అనునట్లు, రాగమ్ముతోడన్ = సంగీతముతో, శివ + ఆగమములు = ఈశ్వరాగమములు, చదువుచును,

బ్రహ్మ వర్చస - పదవి తోడి = బ్రహ్మ తేజస్సు, యొక్క విధముతోఁగూడిన, దివ్య- తేజంబు = దివ్య తేజస్సు, మొగమునన్ = ముఖమునందు, తేజరిల్లన్ = ప్రకాశింపఁగా, సుందర+ ఆకారము = అందమైన రూపము, అమరన్ = ఒప్పఁగా, తాల్చి= ధరించి, గిరి - రాజ - తనయ- కడకున్ = పర్వతప్రభు పుత్రిక - పార్వతి దగ్గఱకు, చనుదెంచెన్ = వచ్చెను

**తాత్పర్యము:** విద్యుల్లతలతోఁగూడిన మేఘమా యనునట్లు జందెములతో నల్లయిఱ్ఱితోలుఁదాల్చి, మొసలిటెక్కెముతోఁగూడిన మన్మథుని చెఱకువిల్లా అనునట్లు, కౌపీనముతో ఆషాఢదండమును బట్టుకొని, వెన్నెలతోఁగూడిన మంచుసమూహమా యనునట్లు, శరీరకాంతితో విభూతికాంతి అతిశయింపఁగా, వీణాధ్వనితోఁగూడిన వేదధ్వనియా యన సంగీతముతో నీశ్వరాగమములు చదువుచు, బ్రహ్మవర్చస్సుతో దివ్యతేజస్సు ముఖమునఁ బ్రకాశింపఁగా, అందమైనరూప మొప్పఁ జంద్రకళావతంసుఁడు పర్వతరాజపుత్రికకడకు వచ్చెను

**విశేషములు.** ఉత్ప్రేక్ష, సహోక్తి అలంకారములు బ్రహ్మవర్చస - బ్రహ్మ, హస్తి, రాజ శబ్దములకుఁ బరమైన వర్చస్ శబ్దమునకుఁ బరముగా 'అ' ప్రత్యయాగమము వచ్చును బ్రహ్మ + వర్చస్ - బ్రహ్మవర్చస

**వ ఇట్లినబింబంబు మహీతలంబున కవతరించినభంగిం దేజోమూర్తియై చనుదెంచు నభినవమునికుమారుం గని నగజ ససంభ్రమంబున నతిథి మహేశ్వరస్వరూపంబ యని తాత్పర్యభక్తియుక్తి నభ్యుత్థానాభిగమనపూర్వకంబుగా 4**

**అర్థము:** ఇట్లు, ఇన-బింబంబు = సూర్యబింబము మహీతలంబునకున్ = భూతలమునకు, అవతరించిన - భంగిన్ = దిగిన విధమున, తేజస్ + మూర్తి + ఐ = తేజస్స్వరూపుఁడయి, చనుదెంచు = వచ్చు, అభినవ - ముని - కుమారున్ = క్రొత్త మునికుమారుని, కని = చూచి, నగజ = పార్వతి, ససంభ్రమంబునన్ = వేగిరపాటుతో, అతిథి, మహేశ్వర - స్వరూపంబు + అ - మహేశ్వరుని స్వరూపమే, అని, తాత్పర్య - భక్తి - యుక్తిన్ = తత్పరత్వము, భక్తి అనువాని కూడికతో, అభ్యుత్థాన + అభిగమన - పూర్వకంబుగాన్ = లేచుట, ఎదురేఁగుట మున్నుగా,

**తాత్పర్యము .** ఇట్లు సూర్యమండలము భూతలమునకు దిగినట్లుగాఁ దేజస్స్వరూపుఁడై వచ్చు నూతన మునికుమారునిఁ జూచి పార్వతి వేగిరపాటుతో, అతిథి మహేశ్వరస్వరూపమే యనియెంచి భక్తితత్పరత్వములతో లేచుట, నెదురేఁగుట మున్నుగా తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** ఇనబింబంబు మహీతలంబున కవతరించిన భంగిన్ - అలంకార ముత్ప్రేక్ష

స్వాగత. ఆ గిరీంద్రసుత హర్షముతో శై
వాగ మోదిత విధాయతితో సు
స్వాగతాభినుత వాక్యములం ద
భ్యాగతోచిత సపర్యలఁ దన్పెన్ 5

**అర్థము :** ఆ - గిరి + ఇంద్ర - సుత = ఆ పర్వతశ్రేష్ఠుని కూఁతురు - పార్వతి, హర్షముతోన్ = సంతోషముతో, శైవ + ఆగమ + ఉదిత - విధా + ఆయతితోన్ = శైవశాస్త్రములందుఁ జెప్పఁబడిన ప్రకారముయొక్క కర్మముతో, సు-స్వాగత + అభినుత - వాక్యములందున్= సుస్వాగత ప్రశంసావాక్యములందు, అభ్యాగత + ఉచిత - సపర్యలన్= అభ్యాగతునకుఁ దగిన సేవలతో, తన్పెన్ = తృప్తిపఱిచెను

**తాత్పర్యము:** ఆ పార్వతి సంతోషముతో నీశ్వరాగమములందుఁ జెప్పఁబడిన ప్రకారముగల విధితో సుస్వాగత ప్రశంసా వాక్యముల నభ్యాగతునకుఁ దగిన సేవలతోఁ ( ఆ ముని కుమారుని) దృప్తిపఱిచెను

**విశేషములు .** అభ్యాగతుఁడు - తిథి పర్వము ఉత్సవము మొదలగు సందర్భములందు ద్రవ్యాపేక్షతో వచ్చినవాఁడు అతిథి = తిథ్యాది నిమిత్తము లేకుండ క్షుత్పిపాసానివారణార్థము వచ్చినవాఁడు భోజన సమయమున వచ్చినవాఁడు ఈ రెండుపదములకును ఈ భేదమున్నను గవులు వీని నభేదముగా వాడినారు పార్వతి శివుని స్వాగతాభినుతవాక్యములను దనుపుట స్వాగతవృత్తముననే నిబంధించుట మెచ్చఁదగినది

ఛందస్సు - స్వాగతవృత్తము - నాలుగు పాదము లుండును ప్రతి పాదముునను ర,న,భ,గగ అను గణము లుండును మొదటి యక్షరమునకును, ఏడవ యక్షరమునకును యతిమైత్రి, ప్రాసనియమము గలదు

వ ఇట్లు కృతక మునికుమారుండు సద్విధి నభ్యర్చితుండై గిరిజ రూపసౌందర్య విభ్రమ విలాసంబులు గనుంగొని మెచ్చి నిజాంతర్గతంబున 6

**అర్థము .** ఇట్లు, కృతక - ముని - కుమారుండు = కపట ముని కుమారుఁడు, సత్ + విధిన్ = మంచి విధానముతో, అభ్యర్చితుండు + ఐ = పూజింపఁబడిన వాఁడయి, గిరిజ = పార్వతి యొక్క, రూప - సౌందర్య - విభ్రమ - విలాసంబులు = ఆకారముయొక్క అందము విభ్రమము విలాసము అనువానిని, కనుంగొని = చూచి, మెచ్చి, నిజ + అంతర్గతంబునన్ = తనదైన మనస్సునందు

**తాత్పర్యము .** ఇట్లు కపట ముని కుమారుఁడు బాగైన విధానముతోఁ బూజింపఁబడినవాఁడయి, పార్వతి ఆకార సౌందర్య విభ్రమ విలాసములు చూచి మెచ్చి తన మనస్సునందు - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** అభ్యర్చితుఁడు - అభి + అర్చితుఁడు - యణాదేశ సంధి నిజాంతర్గతము - నిజ + అంతర్గతము - సవర్ణదీర్ఘసంధి

సీ భూతి పూసిన నింత పొడమెడుఁ దనుకాంతి
తొడసిన నెంత మె ర్గడరియున్నొ !
వంది కందిన నింత వఱలెడు ముఖరోచు
లెలమిన నెంత సల్లలిత మగునొ !
పొలయింపకయు నింత వెలిఁగెడుఁ జొడ్కు ల
ల్లార్చిన నెంత రమ్యంబు లగునొ !
జడలు గట్టియు నింత సక్కనైనది వేణి
దీర్చిన నెఱు లెంత దేసి యగునొ!

తే యీడ విడిచిన మేఁదీఁగె యింత నయము
గలిగియున్నది వాడికె గలిగెనేని
నెంత నవకమై యుండునొ యింతి కనుచు
శివుఁడు గిరిరాజసుత విశేషించె నర్థి. 7

**అర్థము :** ఇంతికిన్ = స్త్రీకి - ఈమెకు -

తను - కాంతి = దేహకాంతి, భూతి - పూసినన్ - విభూతి అలఁదిననే, ఇంత = ఇంతగా, పొడమెడున్ = పుట్టుచున్నది, తొడసినన్ = ప్రామినచో, ఎంత = ఎంతగా, మెర్గు + అడరి + ఉన్నో = ప్రకాశ మతిశయించియుండునో,

ముఖ - రోచులు = మోము కాంతులు, వంది = దుఃఖించి - శ్రమించి, కందినన్ = వాడిననే, ఇంత, - వఱలెడున్ = ప్రకాశించుచున్నవి, ఎలమినన్ = వికాసము నొందినచో, ఎంత, సత్ + లలితము + అగునొ = మిక్కిలి మనోహరమగునో,

చూడ్కులు = చూపులు, పొలయింపకయున్ = చలింపఁజేయకున్నను, ఇంత, వెలిఁగెడున్ = ప్రకాశించుచున్నవి, అల్లార్చినన్ = చలింపఁజేసినచో, ఎంత, రమ్యంబులు + అగునొ= సుందరము లగునో, వేణి = జుత్తు, జడలు+కట్టియున్= జడలు కట్టినప్పటికి, ఇంత, చక్కన + ఐనది = సుందరముగా నున్నది, తీర్చినన్= దిద్దినచో, నెఱులు = వెంద్రుకలు, ఎంత, దేసి + అగునొ = మనోహరము లగునో

మేఁదీఁగె = లతవంటి శరీరము, ఈడ - విడిచినన్ = ఉపేక్షించినను, ఇంత నయమ్ము + కలిగియున్నది = ఇంత బాగు కలిగియున్నది, వాడికె = పోషణము (?), కలిగెన్+ ఏనిన్ = కలిగియున్నచో, ఎంత - నవకము + ఐ = ఎంత, సుందరమయి, ఉండునో, అనుచున్, శివుఁడు, గిరిరాజ - సుతన్ = కొండలటేని కూఁతును, అర్థిన్ = కోరికతో, విశేషించెన్ = స్తుతించెను

**తాత్పర్యము :** ఈమెకు - ధేహకాంతి విభూతి అలఁదిననే యింతగాఁ బుట్టుచున్నదే, ప్రామినచో నింకెంతఁ బ్రకాశమతిశయించెడిదో! ముఖకాంతులు శ్రమించి వాడిననే యింత ఒప్పుచున్నవే, ఇఁక వికాసము నొందినచో నింకెంత మనోహరములగునో, చూపులు ప్రసరింపఁజేయకయే ఇంతగాఁ బ్రకాశించుచున్నవే, ఇఁక అల్లార్చినచో ఎంత రమణీయములగునో, జుత్తు జడలుగట్టియున్నను ఇంత చక్కఁగా నున్నదే, ఇఁకఁ దీర్చినచో నెంత మనోహరముగా నుండునో, దేహలత ఉపేక్షించిననే ఇంత బాగు గలిగియున్నదే, పోషణమేయున్నచో నింకెంత అందముగా నుండెడిదో అనుచు శివుఁడు పార్వతిని గోరికతో స్తుతించెను

**విశేషములు .** అలంకారము కావ్యార్థాపత్తి సల్లలితము - సత్ + లలితము - తవర్గ వర్ణములకు లకారము పరమగుచో పరసవర్ణ మాదేశ మగును. మేఁదీఁగె - తీఁగెవంటి మే ఉపమానోత్తరపదకర్మధారయము మెర్గు - మెఱుఁగు - 'అచ్చికంబులం బదమధ్యంబుల న ల డ ర ల యుత్వంబునకు లోపంబు

బహుళంబుగా నగు ' బాల ప్రకీర్ణక 7 'అలఘురేఫము లుప్తాచ్క మగుచో లఘు రేఫం బగు ప్రౌఢ ము ల వి సంజ్ఞ 2 మెర్గు నయము = (నానా) అందము విధము, నేర్పు, నీతి, (సం ) వాడికె పదము నిఘంటువులఁ గానరాదు అర్థము సందర్భోచితముగాఁ జెప్పఁబడినది

వనమయూరము ఈ రమణి బాల కడు నేచిన మహా కాం
తారములలోన నతిదారుణముగా నీ
ఘోరతప మిప్పటనుగోలె విరచింపన్
గారణ మదేమి యొకొ కౌతుకము సూడన్ 8

**అర్థము .** ఈ రమణి = ఈ స్త్రీ, బాల = చిన్న వయసు గలది, కడున్ = మిక్కిలి, ఏచిన = అతిశయించిన, మహత్ (మహా) + కాంతారములలోనన్ = గొప్ప అడవులలో, అతి - దారుణముగాన్ = మిక్కిలి ఘోరముగా, ఈ - ఘోర - తపము = ఈ భయంకర తపస్సు, ఇప్పటను + కోలెన్ = ఇప్పటి నుండియు, విరచింపన్ = చేయుటకు, కారణము, అది + ఏమి + ఒకొ = అది యేమయి యుండునో, చూడన్ = చూడఁగా, కౌతుకము = వేడుక

**తాత్పర్యము.** ఈ యింతి చిన్నది మిక్కిలి విజృంభించిన పెద్ద అడవులలో నతిభయంకరముగా నీ తీవ్ర తపస్సు ఇప్పటినుండి చేయుటకుఁ గారణ మేమయి యుండునో ! చూడ వేడుక

**విశేషములు.** ఛందస్సు - వనమయూరము - నాలుగు పాదము లుండును, ప్రతి పాదమునను భ - జ - స- న - గగ అను గణము లుండును మొదటి యక్షరమునకును తొమ్మిదవ యక్షరమునకును యతిమైత్రి. ప్రాసనియమము గలదు

మానిని ఆననలీల సుధాకరబింబ నవాంబురుహంబుల చెల్వగుటన్
వేనలి కృష్ణభుజంగకలాపి సవిస్తరభాసురమై చనుటం,
దా నతిబాలకి యయ్యుఁ దపం బుచితస్థితిఁ జేయుచునుండుట నీ
మానిని రూపచరిత్ర లుదారసమం బగుచున్నవి చిత్రగతిన్ 9

**అర్థము :** ఆనన - లీల = ముఖ విలాసము, సుధాకర - బింబ = చంద్రబింబముయొక్కయు, నవ + అంబురుహంబుల = క్రొత్త పద్మముల

యొక్కయు, చెల్వు = అందము, అగుటన్ = అగుటచేతను, వేనలి = జడ, కృష్ణ - భుజంగ - కలాపి - సవిస్తర - భాసురము + ఐ = నల్లత్రాచు, నెమలి అనువానివలె అధికముగాఁ బ్రకాశించునదియై,చనుటన్ = ఒప్పుటచేతను, తాను, అతి - బాలకి + అయ్యున్ = మిక్కిలి చిన్నదియైనను, తపంబు, ఉచిత - స్థితిన్ = తగిన విధముగా, చేయుచున్ + ఉండుటన్ = చేయుచుండుటచేత, ఈ మానిని = ఈ స్త్రీ యొక్క, రూప - చరిత్రలు = ఆకారమును, చరిత్రమును, చిత్ర గతిన్ = విచిత్రమైన విధమున, ఉదారసమంబు + అగుచున్ + ఉన్నవి = గొప్పదియు, సమమును అగుచున్నవి

**తాత్పర్యము.** ముఖసౌందర్యము చంద్రబింబువలెను, క్రొత్తపద్మమువలెను సుందరమగుటచేతను, జడ నల్లత్రాఁచువలెను నెమలివలెను ప్రకాశించునది యగుటచేతను, తాను మిక్కిలి చిన్నదియయ్యును సముచితముగాఁ దపస్సు చేయుటచేతను, ఈమె ఆకారము, చరిత్ర చిత్రముగా ఉదారము, సమము అగుచున్నవి

**విశేషములు.** సుధాకరబింబమునకును, పద్మములకును అన్యోన్యవిరోధము అట్లే కృష్ణభుజంగమునకును నెమలికిని అన్యోన్యవిరోధము ఆమె ముఖము చంద్రపద్మములవలె నున్నది ఆమె జడ భుజంగకలాపులవలె నున్నది అందుచేతనే 'చిత్రము' ఇట్లు ఆమె ఆకారము ఉదారమగుచున్నది ఆమె మిక్కిలి చిన్నది అయినను సముచితముగాఁ దపస్సు చేయుచున్నది అందుచేతనే ఆమె చరిత్ర సమ మగుచున్నది అలంకార ముపమ

ఛందస్సు మానిని -నాలుగు పాదము లుండును ప్రతిపాదమునను ఏడు భగణములపై నొక గురువుండును మొదటి యక్షరమునకును బదుమూఁడవ అక్షరమునకును యతిమైత్రి ప్రాసనియమము గలదు

**వ ఈ సుందరాంగి యెవ్వరి నందనయో యనుచు సంశయాకులిత హృదయుం డగుచున్న మునికుమారుం జతురిక కనుంగొని** **10**

**అర్థము.** ఈ - సుందర + అంగి =ఈ అందగత్తె, ఎవ్వరి - నందనయో= ఎవరి కూఁతురో, అనుచున్, సంశయ + ఆకులిత - హృదయుండు = సందియముచేఁ గలఁగిన హృదయము గలవాఁడు, అగుచున్ + ఉన్న = అగుచున్న, ముని-కుమారున్ = మునికుమారుని, చతురిక, కనుంగొని =చూచి.

**తాత్పర్యము :** ఈ అందగత్తె ఎవరి కూఁతురో యనుచు సందియముచేఁ గలఁగిన హృదయము గలవాఁడగుచున్న మునికుమారునిఁ జూచి - తరువాతి పద్యముతో నన్వయము

గీ **హిమనగాధీశ్వరునకు నుత్తమచరిత్ర**
**మేనకకుఁ బుత్త్రి, పార్వతి మెలఁతపేరు**
**వెలయ మైనాకభూధరు చెలియ, లమల**
**కమలదళనేత్ర వరకన్యకాలలామ** 11

**అర్థము** అమల - కమల - దళ - నేత్ర = నిర్మలములైన పద్మదళములవంటి కన్నులు గలది, అగు, వర - కన్యకా - లలామ - శ్రేష్ఠురాలయిన కన్యాతిలకము, హిమ - నగ + అధి + ఈశ్వరునకున్ = హిమవత్పర్వతరాజునకును, ఉత్తమ - చరిత్ర = మిక్కిలి మంచి నడవడిగలది, అగు, మేనకకున్, పుత్త్రి = కూఁతురు, మెలఁత - పేరు = ఇంతిపేరు, పార్వతి, వెలయన్ = ఒప్పునట్లు, మైనాక - భూధరు = మైనాకపర్వతుని యొక్క, చెలియలు= చెల్లెలు

**తాత్పర్యము** పద్మదళాక్షి యగు నీ కన్యారత్నము హిమవత్పర్వత రాజునకును, ఉత్తమచరిత్ర యగు మేనకకును గూఁతురు ఈ యింతిపేరు పార్వతి మైనాకపర్వతుని చెల్లెలు

వ అనిన నాశ్చర్యహృదయుఁ డగుచు నగజ కభిముఖుండై 12

**అర్థము .** అనినన్ = అనఁగా, ఆశ్చర్య - హృదయుఁడు = అచ్చెరువొందిన హృదయము గలవాఁడు, అగుచున్, అగజకున్ + అభిముఖుండు + ఐ = పార్వతి కెదురై

**తాత్పర్యము .** అనిన మునికుమారుఁడు ఆశ్చర్యమొంది పార్వతి కెదురయి తరువాతి పద్యముతో నన్వయము

### శివుఁడు పార్వతితో సంబాషించుట

చ. **పరము కపర్దసంగమునఁ బావనమైన సురాపగాంబువుల్**
**శిరమునఁ దాల్చి ముందఱ బ్రసిద్ధియు సిద్ధియుఁ గన్నకంటె నీ**
**పరమ తపః ప్రభావమునఁ బర్వతవల్లభుఁ డిప్పు డెంతయున్**
**నిరుపమకీర్తిమైఁ దనరి నిర్మలుఁ డయ్యె జగంబులోపలన్.** 13

**అర్థము :** పరము - కపర్ద - సంగమునన్ = ఉత్కృష్టుఁడైన శివుని యొక్క జడముడి సంగతిచే, పావనము + ఐన = పవిత్రమైన, సుర + ఆపగా + అంబువుల్ = ఆకాశగంగా జలములు, శిరమునన్ = శిరస్సునందు, తాల్చి = ధరించి, మొందలు = పూర్వము, ప్రసిద్ధియున్ = కీర్తియును, సిద్ధియున్ = పరిశుద్ధతయును, కన్నకంటెన్ = పొందినదానికంటెను, పర్వత-వల్లభుఁడు = కొండలఱేఁడు - హిమవంతుఁడు, నీ - పరమ తపస్ (ః) + ప్రభావమునన్ = నీ ఉత్కృష్టమైన తపస్సుయొక్క మహిమచేత, ఇప్పుడు, ఎంతయున్ = మిక్కిలి, నిరుపమ - కీర్తిమైన్ = సాటిలేనికీర్తితో, తనరి = ఒప్పి, జగంబు లోపలన్ = లోకమునందు, నిర్మలుఁడు = పవిత్రుఁడు, అయ్యెన్

**తాత్పర్యము .** మిక్కిలి గొప్పవాఁడయిన శివుని జటాజూటసంగతిచేఁ బవిత్రమైన ఆకాశగంగానదీజలములను శిరస్సున ధరించి పూర్వము కీర్తిని, పరిశుద్ధతను బొందినదానికంటెఁ బర్వతరాజగు హిమవంతుఁడు నీ యుత్కృష్ట తపఃప్రభావముచే నిప్పుడెంతయో నిరుపమానమైన కీర్తితో నొప్పి లోకములో నిర్మలుఁడయ్యెను

**విశేషములు .** ఈ పద్య భావము కాళిదాసునను గలదు

'వికీర్ణ సప్తర్షి బలి ప్రహాసిభి
స్తథా న గాఙ్గః సలిలై ర్దివశ్చ్యుతైః
యథా త్వదీయై శ్చరితై రనావిలై
ర్మహీధరః పావిత ఏష సాన్వయః   కు సం 5 37

సంస్కృతమున స్వర్గంగాజలములు సప్తర్షుల బలులచేఁ బ్రహసించుచున్నట్టివని చెప్పఁబడఁగా, తెలుఁగున నవి పరము కపర్ద సంగమునఁ బావనమైనవని చెప్పఁబడెను ఈ మార్పువలన గంగాజలముల కింకను నెక్కువ పావిత్ర్యము సిద్ధించినది ఏలయన నది 'పరము' కపర్దము అంత పవిత్రములైన గంగాజలములచే హిమవంతుఁడు పొందిన పవిత్రతకంటెఁ బార్వతీతపః ప్రభావముచేఁ బొందినది మహత్తర మనుటచేఁ బార్వతి తపస్సునకుఁ బ్రభావ మతిశయించినది కపర్ద - కపర్దోఽస్య జటాజూటః, అమరము - శివుని జటాజూటమునకుఁ గపర్దమనిపేరు 'మొందలు' - 'మొందల' రెండు రూపములును గలవు కన్న కంటె ' కంటె వర్ణకంబు పరంబగునపుడు విశేషణ నవర్ణకంబుమీఁది యమహత్తచ్ఛబ్దార్థమునకు లోపంబు విభాష నగు కన్నకంటె - కన్నదానికంటె ప్రౌఢ క్రియ 2 కన్న - కనిన - పద్యాదుల నవర్ణకంబున కత్వంబును గడహల్లునకు ద్విత్వంబును విభాష నగు' బాల క్రియ 51.

వ అని వెండియు నిట్లనియె 14

**అర్థము.** అని, వెండియున్ = మరల, ఇట్లు + అనియెన్

**తాత్పర్యము.** అవి మరల నిట్లు పలికెను

సీ స్వర్గార్థి యందమే స్వర్గంబు తమ హిమ
గిరి చఱులం దొక కెలన నుండు
నర్థార్థి యందమే నర్థేశుకంటెను
దన పుట్టినింటనె ధనము గలదు
పురుషార్థి యందమేఁ బురుషులు తనుఁగోరి
తప మర్థిఁ జేయంగఁ దగిన రూపు
మోక్షార్థి యందమే ముగ్ధ తా మోక్షంబుఁ
దలఁపంగనేనియుఁ దఱియుఁగాదు

గీ ముఖవికాసంబు చూడ నీ ముదితవలనఁ
గామభోగాభిలాషయ కలిగినదియ
దీనిఁ దగిలించి తగులక తాన ధైర్య
వంతుఁడై యున్న సొబగుఁ డెవ్వండొ జగతి?" 15

**అర్థము.** స్వర్గ + అర్థి = స్వర్గమును గోరునది, అందము + ఏన్ = అందమన్నచో, స్వర్గంబు, తమ, హిమ - గిరి - చరుల + అందున్= హిమవత్పర్వతపుఁ జఱియలందు, ఒక - కెలనన్ = ఒక పార్శ్వమున, ఉండున్

అర్థ + అర్థి = ధనమును గోరునది, అందము + ఏన్ = అందమన్నచో, అర్థ+ ఈశు - కంటెను = ధనపతి - కుబేరుని కంటెను, తన, పుట్టినింటనె - (పుట్టిన + ఇంటనె) = పుట్టినింటియందే, ధనము, కలదు

పురుష + అర్థి = పురుషుని (భర్తను) గోరునది, అందము + ఏన్ = అందమేని, పురుషులు = మగవారు, తనున్ = తన్ను, కోరి, తపము, అర్థిన్ = కోరికతో, చేయంగన్= చేయుటకు, తగిన - రూపు = తగిన రూపము,

మోక్ష + అర్థి = మోక్షమును గోరునది, అందము + ఏన్= అందమేని, ముగ్ధ = ఉదయించుచున్న యౌవనము గలది యగు, తాన్ = తాను, మోక్షంబున్,

తలఁపంగన్ + ఏనియున్ = తలఁచుటకైనను - దానికయి తపస్సువంటి క్రియల నాచరించుట మఱియు ననావశ్యకమనుట, తఱియున్ = సమయమును, కాదు

ముఖ - వికాసంబు = మోమునందము, చూడన్ = చూడఁగా, ఈ - ముదితవలనన్ = ఈ యింతి నుండి, కామ - భోగ + అభిలాష + అ = మన్మథ సుఖకాంక్షయే, కలిగినదియ - కలిగిన + అది + అ = కలిగియున్నట్టిదే

దీనిన్ = ఈమెను, తగిలించి = మరులుకొలిపి, తగులక = ప్రేమింపక, తాను + అ = తానే, ధైర్యవంతుఁడు + ఐ = ధైర్యముగలవాఁడయి, ఉన్న = ఉన్నట్టి, సొబగుఁడు= అందగాఁడు, జగతిన్ = జగతియందు, ఎవ్వండొ = ఎవఁడో?

**తాత్పర్యము .** ఈమె స్వర్గమును గోరి తపము చేయున్నదని యందమన్న, నది తమ హిమవత్పర్వతపుఁజఱియలయం దొక ప్రక్కనుండును డబ్బును గోరి యందమేనిఁ గుబేరునికంటెను దన పుట్టినింటనే ధన మెక్కువగాఁ గలదు భర్తనుగోరి యందమేని, పురుషులే తన్నుఁగోరి తపస్సు చేయఁదగిన రూప మామెది మోక్షమును గోరి యందమా, ఉదయద్యౌవనయగు నీమె మోక్షమును గూర్చి ఆలోచించుటకైనను సమయము కాదు ముఖసౌందర్యము చూడఁగా నీ యింతి వలన మన్మథసౌఖ్యముల ననుభవించుకోరికగలిగియున్నట్లే కనుపట్టును ఈమెను వలపించి, వలవక తానే ధైర్యవంతుఁడై యున్న అందగాఁ డీ లోకమున నెవ్వఁడో కదా !

**విశేషములు .** సంస్కృత కుమారసంభవమునఁ గపటవటు వీ భావముల తోనే పార్వతిని పృచ్ఛించినట్లున్నది

దివం యది ప్రార్థయసే, వృథాశ్రమః
పితుః ప్రదేశా స్తవ దేవభూమయః,
అ థోపయన్తార, మలం సమాధినా,
న రత్న మన్విష్యతి మృగ్యతే హి తత్ కుమార సం 5 45

'కులే ప్రసూతిః ప్రథమస్య వేధస
స్త్రిలోకసౌన్దర్య మి వోదితం వపుః,
అమృగ్య మైశ్వర్యసుఖం, నవం వయ,
స్తపఃఫలం స్యా త్కి మతఃపరం వద కుమార సం 5 41

తెలుఁగున మోక్షార్థియందమే ముగ్ధ దఱియుఁగాదు' అను భావ మధికము

**చతురిక పార్వతిని గపట వటువునకుఁ బరిచయము చేయుట**

వ అనిన మునికుమారు పరేంగితజ్ఞతకు మెచ్చి వీఁడు సామాన్యపురుషుండు గాఁడు నిజప్రకారం బెఱింగింపవలయునని చతురిక కృతకబ్రహ్మచారిం గనుంగొని **16**

**అర్థము** అనినన్ ముని-కుమారు = మునికుమారునియొక్క, పర + ఇంగితజ్ఞతకున్ = ఇతరుల అభిప్రాయము నెఱుఁగఁగలుగుటకు, మెచ్చి, వీఁడు సామాన్య - పురుషుండు = సాధారణపురుషుఁడు, కాఁడు, నిజ ప్రకారంబు = తమదైన విధము, ఎఱింగింపవలయున్ = తెలుపవలయును, అని, చతురిక, కృతక - బ్రహ్మచారిన్ = కపటవటువును, కనుంగొని = చూచి

**తాత్పర్యము .** అనఁగా మునికుమారుని ఇతరాభిప్రాయవేత్తృతకు మెచ్చి వీఁడు సామాన్యుఁడు కాఁడు మన విధమంతయుఁ దెలుపవలయునని చతురిక కపటవటువును జూచి - తరువాతి పద్యముతో నన్వయము

మ హరి నేత్రాంబుజ మంఘ్రిపీఠ, మజు మస్తాబ్జంబు సత్కేళి పం
కరుహం, బా సితరోచి జూటలతికాకల్పంబు, విశ్వంభరా
ధరవంశేశులు కర్ణకుండలము, లుద్యద్దేవతానీకముల్
పరివారంబుగ నున్న శంభుఁ దనకుం బ్రాణేశుఁగాఁ బ్రీతితోన్. **17**

**అర్థము .** హరి - నేత్ర + అంబుజము = విష్ణువుయొక్క, నయన పద్మము, అంఘ్రి - పీఠము = పాదపీఠము, అజు - మస్త + అబ్జంబు = బ్రహ్మయొక్క పద్మమువంటి శిరస్సు' - పద్మమువంటి బ్రహ్మకపాలము, సత్ + కేళి - పంకరుహంబు = మేలైన క్రీడాపద్మము, ఆ - సిత - రోచి = ఆ చంద్రుఁడు, జూట - లతికా + ఆకల్పంబు = తీఁగవంటి జడముడి యొక్క ఆభరణము, విశ్వంభరాధరవంశ + ఈశులు = పర్వతవంశ ప్రభువులు - మేరు మందరములు, కర్ణ - కుండలములు = చెవుల కుండలములు, ఉద్యత్ + దేవతా + అనీకముల్ = గొప్ప వారయిన దేవతల సమూహములు, పరివారంబుగన్ = పరివారముగను, ఉన్న = ఉన్నట్టి, శంభున్ = ఈశ్వరుని, తనకున్ = తనకు, ప్రాణ + ఈశున్ + కాన్ = ప్రాణపతినిగా, ప్రీతితోన్ = ప్రేమముతో

**తాత్పర్యము :** విష్ణు నేత్రపద్మము పాదపీఠముగను, పద్మమువంటి బ్రహ్మకపాలము క్రీడాపద్మముగాను - విలాసార్థమైన పద్మముగను, ఆ చంద్రుఁడు

తీఁగవంటి జడముడికి అలంకారముగను, పర్వతకులప్రభువులగు మేరుమందరములు కర్ణకుండలములుగను, శ్రేష్ఠులైన దేవతల సమూహములు పరివారముగను ఉన్న యీశ్వరునిఁ దనకుఁ బ్రాణేశ్వరునిగాఁ బ్రేమముతో - తరువాతి వచనముతో నన్వయము

**విశేషములు** ఇందలి శంభుని వర్ణన యంతయుఁ దత్సర్వ శ్రేష్ఠతాప్రతిపాదకముగా నున్నది విశ్వంభరాధరవంశేశులు = నాగకుల ప్రభువులు? ఉపమానుప్రాణితమైన రూపకాలంకారము

వ సన్మనంబునం గోరి ఘోరతపంబు సేయుచు 18

**అర్థము .** సత్ + మనంబునన్ = మంచి మనస్సునందు, కోరి, ఘోర - తపంబు= భయంకరమైన తపస్సు, చేయుచున్

**తాత్పర్యము.** తన మంచిమనసునఁ గోరి తీవ్రమైన తపస్సు నాచరించుచు- తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** సన్మనంబు - సత్ + మనంబు - అనునాసిక సంధి

సీ ఈ నీరజానన దాన కుదురు చేసి
వలయు బీజములెల్ల మొలవఁబెట్టి,
నిచ్చలు నిష్ఠతో నీరులు పోయంగ
నెలమితో నన్నియుఁ గలయ మొలచి
పెరిఁగి నానావిధ తరులతా గుల్మాదు
లేచి నయంబునఁ బూచి కాచి
ఫల మందెనేనియు మొలకయు మొలవ దీ
చెలువ తపఃఫలసిద్ధివలన

తే నింక నెన్నండు దయఁ బరమేశ్వరుండు
కన్ను దెఱచునో యని తన కున్నరూపు
నెఱయఁ జెప్పిన విని కేలు చఱచికొనుచు
నఱమ పాఱుండు ప్రక్కలు విఱుగ నగుచు 19

**అర్థము .** ఈ - నీరజ + ఆనన = ఈ పద్మముఖి, తాను + అ = తానే, కుదురు - చేసి = పా దొనరించి, వలయు = కావలసిన, బీజములు + ఎల్లన్ = విత్తనము లన్నియును, మొలవన్ + పెట్టి = మొలచునట్లు చేసి,

నిచ్చలున్ = ఎల్లప్పుడును, నిష్ఠతోనే = నియమముతో, నీరులు, పోయంగన్, ఎలమితోన్ = వికాసముతో, అన్నియున్ = ఆ విత్తు లన్నియును, కలయన్ = సంపూర్ణముగా, మొలచి,

పెరిఁగి, నానా - విధ - తరు - లతా - గుల్మ + ఆదులు = పలురీతులైన చెట్లు, తీఁగలు, పొదలు మున్నగునవి, ఏచి = విజృంభించి, నయంబునన్ = బాగుగా, పూచి, కాచి = కాయలు కాచి,

ఫలము + అందెన్ + ఏనియున్ = ఫలించినప్పటికిని, ఈ - చెలువ - తపస్ + ఫలసిద్ధి - వలనన్ = ఈ ఇంతి తపస్సనెడి ఫలముయొక్క సిద్ధి విషయమున, మొలకయున్ = అంకురమైనను, మొలవదు = మొలకెత్తదు

ఇంకన్, ఎన్నండు = ఎప్పుడు, పరమేశ్వరుండు, దయన్ = దయతో, కన్ను - తెఱచునో = కన్నులు విప్పునో, అని, తనకున్, ఉన్నరూపు = ఉన్న సంగతి, నెఱయన్ = పూర్ణముగా, చెప్పినన్ = చెప్పఁగా, నఱమ - పాఱుండు = కపట బ్రాహ్మణుఁడు, విని, కేలు = చేతులు, చఱచికొనుచున్ = చప్పట్లు చఱచుచు, ప్రక్కలు - విఱుగన్ = ప్రక్కలు విఱుగునట్లు, నగుచున్ = నవ్వుచును

**తాత్పర్యము.** "ఈ పద్మాక్షి తానయి పాదుచేసి వలసిన విత్తనములన్నియుఁ జల్లి, నిత్యమును నియమముతో నీరులు పోయఁగా వికాసముతో ఆ విత్తులన్నియును సంపూర్ణముగాఁ బెరిఁగి పెక్కురీతులైన చెట్లు, తీఁగలు, పొదలుగా విజృంభించి బాగుగాఁ బుష్పించి ఫలించినప్పటికిని, ఈమె తపఃఫలము సిద్ధించువిషయమున ఒక్క మొలకేనియు మొలకెత్తదయ్యెను ఇఁక నెప్పుడు పరమేశ్వరుఁడు దయతోఁ గన్నులు తెఱచునో !" అని తన కున్నవిషయము అంతయుఁ జెప్పఁగా ఆ కపట బ్రాహ్మణుఁడు విని చేతులు చఱచికొనుచుఁ బ్రక్కలు విఱుగునట్లు నవ్వుచు - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** ఈ పద్యభావము కాళిదాసునను గలదు

'ద్రుమేషు సఖ్యా కృతజన్మసు స్వయం
ఫలం తపస్సాక్షిషు దృష్ట మేష్వపి,
న చ ప్రరోహాభిముఖో2 పి దృశ్యతే
మనోరథో స్యా శ్శశిమౌలిసంశ్రయః కుమార సం 5 60

## కపట వటువు పార్వతితో శివు నధిక్షేపించుచుఁ బలుకుట

శా ఎట్టెట్టూ ! శివుఁ గల్చెనంటి నికమా ? యీ తన్వి దన్ గల్వఁగా
నట్టుల్ మెచ్చకయున్న వే తపము సేయంజొచ్చె ము న్నాతఁ డే
ముట్టుం బోలినవానిఁ గాఁ దలఁచి తా మోహించె ! దేశంబులోఁ
బుట్టం బట్టులు మాలెనే నగజ యా భూతేశ్వరుం గల్వఁగాన్ 20

**అర్థము.** ఎట్టెట్టూ = ఎట్టూ + ఎట్టూ = ఆశ్చర్య సూచకము - ఏమేమీ, ఈ తన్వి = ఈ యింతి, శివున్ = శివుని, కల్చెన్ + అంటి = వలచెనంటివి, నికమా= నిక్కమా !, తన్ = తన్ను, కల్వఁగాన్ = వలవఁగా, అట్టుల్ = ఆ విధముగా, మెచ్చక + ఉన్నన్ = మెచ్చకపోఁగా, వే = శీఘ్రముగా, తపము + చేయన్ + చొచ్చెన్= తపస్సు చేయ్యనారంభించెను, మున్ను = మొదట, ఆతఁడు = ఆ శివుఁడు, ఏ-ముట్టున్ + పోలినవానిన్ + కాన్ = ఏ విధముగాఁ దగినవానినిగా, తలఁచి = ఎంచి, తాన్ = తాను, మోహించెన్ = వలచెను? నగజ = పార్వతి, ఆ -భూత + ఈశ్వరున్= ఆ భూతనాధుని - పిశాచ ప్రభువును - శివుని, కల్వఁగాన్ = ప్రేమించుటకు, దేశంబులోన్, పుట్టన్ + పట్టులు = (వలపు) పుట్టుటకు స్థానములు, మాలెనే = నశించెనా ?

**తాత్పర్యము.** ఏమేమీ ! ఈమె శివుని వలచె నంటివి నిజమా ? త న్నాతఁ డా విధముగా మెచ్చకపోఁగా నీమె వెంటనే తపము చేయ నారంభించెను మొదట నాతఁ డేవిధముగాఁ దగినవాఁడని యెంచి యీమె యతనిని వలచెను ? పార్వతి ఆ భూతనాధుని బ్రేమించుట కిఁక దేశములోఁ బ్రేమస్థానములే నశించెనా ?'

**విశేషములు.** ఎట్టెట్టూ - ఎట్టూ + ఎట్టూ - 'అచ్చున కామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱచుగ నగు' బాల సం 10 నికము - నిక్కము - (రూపాం) అంటాతఁడే - అంటి + ఆతఁడే అను-ధాతువు, 'భూతంబున లిట్టగు' బాల క్రి 3 అను + లిట్ 'లకారంబునకు డు బు వు రు ను ము ఞ గు ' బాల క్రి 8 అను + వు 'లిట్టు వుఞ్ఞు పరంబగునపుడు తివర్ణకం బగు' అను + తి + వు 'తి దు ట లు పరంబులగునపు డన్వాదుల నుస్థానంబున నున్నయు నుండు డు లోపంబును విభాష నగు' బాల క్రి 58 అం + తి + వు 'ఇట బిందువుమీఁది త దలకు నిత్య వైకల్పికంబులయి ట డలగు బాల క్రి 59 అంటి + వు 'ఇకారంబు మీఁది కు ను వు క్రియావిభక్తుల యుత్వంబున కిత్వం బగు' బాల తత్సమ 25 అంటివి 'లిడ్లొట్టుల వకారంబునకు లోపంబు విభాష నగు' బాల క్రి 24 అంటి + ఇ 'అంద్వవగాగమంబులందప్ప నపదాదిస్వరంబు పరంబగునపు

డచ్చునకు సంధి యగు ' బాల సం 11 అంటి + ఆతఁడే - 'మధ్యమపురుష క్రియలయం దిత్తునకు సంధియగును ' బాల సం 7 అంటాతఁడే కలుచు = కల్చు 'ఆచ్చికంబులం బదమధ్యంబుల న ల డ రల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు బాల ప్రకీర్ణక 17

చ వగవఁగ నద్రిరాజు హిమవంతుఁడు తండ్రి, సురాంగనాలికిన్
మిగిలిన పేర్మిమైఁ దనరు మేనక తల్లి, సురూపసంపదన్
జగములలోన మే లనఁగఁ జాలిన పార్వతి ! నీవు భిక్షుకుం
దగిలి తపంబు సేసె దఁటె ! దైన్యము సేసెదె మేను నింతకున్ 21

**అర్థము** వగవఁగన్ = ఆలోచింపఁగా, అద్రి - రాజు = కొండలఱేఁడు అగు హిమవంతుఁడు, తండ్రి, సుర + అంగనా + ఆలికిన్ = దేవతా స్త్రీల సమూహమునకు, మిగిలిన = ఎక్కువైన - దేవతాస్త్రీలను మించిన అనుట, పేర్మి - మైన్ = గొప్పతనముతో, తనరు = ఒప్పునట్టి, మేనక, తల్లి, సురూప - సంపదన్ = మంచి సౌందర్యమనెడి సంపదయందు, జగములలోనన్ = లోకములలో, మేలు + అనఁగన్ + చాలిన = మేలయినది అన సమర్థమైన, పార్వతి = పార్వతీ, నీవు, భిక్షుకున్ = అడుగుకొనువానిని, తగిలి = కోరి, తపంబు, చేసెదు + అఁటె = చేయుదువా ? ఇంతకున్ = ఇంతకును, మేనున్ = శరీరమును, దైన్యము + చేస్దెదె + దీనమైనదానినిగాఁ జేయుదువా? ఆయాసపెట్టుదువా? - అనుట

**తాత్పర్యము.** 'ఆలోచింపఁగాఁ గొండలఱేఁ డగుహిమవంతుఁడు తండ్రి దేవతాస్త్రీలను మించిన గొప్పతనముతో నొప్పు మేనక తల్లి సౌందర్య సంపదయందు లోకములలో మేలయినది అనఁజాలిన పార్వతీ ! నీవు అడుగుకొనువానిని గోరి తపము చేయుదువా ? ఇంతకును శరీరము నాయాసపెట్టుదువా?'

సీ వారిరుహానన ! నీ రూపు గనుఁగొన్న
నలకూబరుండైనఁ గలిచి వచ్చుఁ
బొలఁతి ! నీ భోగోపభోగముల్ చూచి జం
భారాతియైననుఁ గోరి వచ్చుఁ
గోమలి ! నీ కళాకుశలత విని శత
దల సంభవుండైనఁ దగిలి వచ్చు
లలితాంగి నీ శుభలక్షణోన్నతి చూచి
పురుషోత్తముండైన మరిగి వచ్చు

తే
నిన్నుఁ గోరి తపంబులు నిష్ఠ నొరులు
సేయఁగోరుచోఁ దప మీవు సేసె దనుట
రత్నములఁ గోరి విని జనుల్ రాక, జనుల
రత్నములు గోరి పైఁబడి రాకఁబోలు 22

**అర్థము.** వారిరుహ + అనన = పద్మముఖీ ! నీ - రూపు = నీ ఆకారము (అందము), కనుఁగొన్నన్ = చూచినచో, నలకూబరుండు + ఐనన్ = నలకూబరుఁడైనను, కలిచివచ్చున్ = వలచి వచ్చును

పొలఁతి = ఇంతీ! నీ - భోగ + ఉపభోగముల్ = నీ సుఖానుభవములను చూచి, జంభ + అరాతి + ఐనను = జంభాసురునకు శత్రువు (ఇంద్రుఁడు) అయినను, కోరి, వచ్చున్

కోమలి ! నీ - కళా - కుశలతన్ = నీ విద్యా నైపుణ్యమును, విని, శతదల - సంభవుండు + ఐనన్ = పద్మమునుండి పుట్టుకగలవాఁడు - (బ్రహ్మ) ఐనను, తగిలి = ఆసక్తి వహించి, వచ్చున్

లలిత + అంగి = మనోహరమైన శరీరముగలదానా ! నీ - శుభ - లక్షణ + ఉన్నతి = నీ శుభలక్షణముల ఔన్నత్యము, చూచి, పురుష + ఉత్తముండు + ఐనన్ = విష్ణువయినను, మరిగి = ఆసక్తి గొని, వచ్చున్

ఒరులు = ఇతరులు, నిన్నున్, కోరి, తపంబులు, నిష్ఠన్ = నియమముతో, చేయన్ + కోరుచోన్ = చేయఁగోరుచో, ఈవు = నీవు, తపము, చేసెదు + అనుట = చేసెదవు అనుట, రత్నములన్, కోరి, విని, జనుల్ = జనులు, రాక = వచ్చుట మాని, జనులన్ = జనులను, రత్నములు, కోరి, పైఁబడి - రాకన్ = పైఁబడి వచ్చుటను, పోలున్,

**తాత్పర్యము .** పద్మముఖి! నీ అందమును జూచినచోఁ బురుషులలో మిక్కిలి అందగాఁడయిన నలకూబరుఁడయినను నిన్ను వలచి వచ్చును నీ భోగానుభవమును జూచి మహాభోగియైన ఇంద్రుఁడయినను నిన్నుఁగోరి వచ్చును నీ కళానైపుణిని విని విద్యాధికుఁడైన పద్మభవుఁడైనను నీయం దాసక్తివహించివచ్చును నీ శుభలక్షణముల ఔన్నత్యమును జూచి, సర్వ శుభలక్షణ సంపన్నుఁడగు విష్ణువయినను నిన్నుఁ గోరి వచ్చును ఇతరులు నిన్నుఁగోరి తపములు నియమముతోఁ జేయఁగోరుచో, నీవు తపముఁ జేయుచున్నా వనుట, రత్నములను

గోరి విని జనులు వచ్చుట గాక, రత్నములే జనులను గోరి పైఁబడి వచ్చుటను బోలును

**విశేషములు.** రత్నములఁగోరి రాకఁబోలు - ఈ భావము కాళిదాసునను గలదు 'న రత్న మన్విష్యతి మృగ్యతే హి తత్' సం కుమార సం 5-45 రాక - రాక -ఇందు మొదటి రాక వచ్చు ధాతు వ్యతిరేకక్త్వార్థరూపము, రెండవది వచ్చు ధాతు కృదంత రూపము అలంకార ముపమ

**చ జనులు విరుద్ధవేషి యగుశంకరు నేలకొ యిందుఁ డొందెఁ బా**
**వనతరుఁ డంచుఁ జిత్తముల వందఁగ, దానిపయిం ద్రిలోక శో**
**భనవగునీవు నా తపసి పాల్పడి మిక్కిలి వంత చేసెదో**
**యని యనిశంబుఁ దద్దయు భయంపడుచున్నది లోకమంతయున్ 23**

**అర్థము** పావనతరుఁడు = మిక్కిలి పవిత్రుఁడు, అగు, ఇందుఁడు = చంద్రుఁడు, విరుద్ధ వేషి = విపరీతమైన వేషముగలవాఁడు, అగు, శంకరున్ = శివుని, ఏలకొ= ఎందుచేతనో, ఒందెన్ = పొందెను - ఆశ్రయించెను, అంచున్ - అనుచు, జనులు= లోకులు, చిత్తములన్ = మనస్సులందు, వందఁగన్ = దుఃఖింపఁగా, దానిపయిన్= ఆపై, త్రిలోక - శోభనవు - ముల్లోకములందును శోభిల్లుదానవు, అగు నీవున్ = నీవు కూడ, ఆ - తపసి - పాల్పడి = ఆ మునికి (శివునకు) అధీనవయి, మిక్కిలి, వంత - చేసెదో (చెసెదవు + ఓ) = దుఃఖము గలుగఁజేయుదువో, అని, లోకము + అంతయున్ = లోకమంతయును, అనిశంబున్= ఎల్లప్పుడును, తద్దయున్ = మిక్కిలి, భయంపడుచున్ + ఉన్నది = భయపడుచున్నది

**తాత్పర్యము** మిక్కిలి పవిత్రుఁడైన చంద్రుఁడు విరుద్ధవేషధారియగు శివునేల యాశ్రయించెనని జనులు మనస్సులందు దుఃఖించుచుండఁగా, నాపైని ముల్లోకములందును శోభిల్లు నీవుకూడ నా మునికి - శివునకు అధీనవయి మిక్కిలి దుఃఖమును గలిగింతువేమో యన్ని లోకమంతయును ఎల్లప్పుడును మిక్కిలి భయపడుచున్నది

**విశేషములు.** ఈ భావము కాళిదాసు కుమారసంభవమునను గలదు

'ద్వయం గతం సంప్రత్యపి శోచనీయతాం
సమాగమప్రార్థనయా పినాకిన:,
కలా చ సా కాన్తిమతీ కలావత
స్త్వ మస్య లోకస్య చ నేత్రకౌముదీ  సం కుమారసం 5-71

సీ **పుడమియై కదలక పడియుండు నెల్లచో**
**నెఱి లేక నీర యై నెఱసి యుండు,**
**ననలుఁడై డాసినఁ గొని కాలుచుండు, వా**
**తూలుఁడై కనుకనిఁ దూలుచుండు**
**నాకాశమై చూడలేకుండుఁ బ్రాలేయ**
**ధాముఁడై పెరుఁగుచుఁ దఱుగుచుండు,**
**భానుఁడై మిన్నులపైఁ బాఱుచుండు, మ**
**హాత్ముఁ డయ్యును బొడవడఁగియుండు**

తే **నిన్ని రూపులందు నే రూపు నిజముగా**
**నెఱుఁగవచ్చు? వీని కెల్ల నొక్క**
**రూపు సేయ నెవ్వ రోపుదు ? రట్టి మా**
**యావి నీకుఁ దగుల నగునె, బేల?** **24**

**అర్థము :** పుడమి + ఐ = భూమియయి, కదలక, ఎల్లచోన్ = అంతటను, పడి+ ఉండున్, నెఱి - లేక = స్థైర్యము లేక, నీరు + అ +ఐ = నీరే యయి, నెఱసి + ఉండున్= వ్యాపించును

అనలుఁడు + ఐ = అగ్నియయి, డాసినన్ = సమీపించినచో, కొని కాలుచున్ + ఉండున్ = దహించుచుండును, వాతూలుఁడు + ఐ = వాయువయి, కనుకనిన్ = సంభ్రమముతో, తూలుచున్ + ఉండున్ = చలించుచుండును

ఆకాశము + ఐ = ఆకాశమయి, చూడన్ = చూడఁగా, లేక + ఉండున్ = లేకుండును, ప్రాలేయ - ధాముఁడు + ఐ = హిమకరుఁడయి = చంద్రుఁడయి, పెరుఁగుచున్+ తఱుగుచున్ + ఉండున్ = వృద్ధి క్షయములు పొందుచుండును

భానుఁడు + ఐ = సూర్యుఁడయి, మిన్నులపైన్ = ఆకాశముమీఁద, పాఱుచున్ + ఉండున్ = పరువెత్తుచుండును, మహాత్ముఁడు + అయ్యును = గొప్పవాఁడైనను, పొడవు+ అడఁగి + ఉండున్ = రూపుమాసియుండును

ఇన్ని రూపుల + అందున్ = ఇన్ని మూర్తులందును, ఏ - రూపు, నిజము + కాన్ = నిజమయినదిగా, ఎఱుఁగన్ + వచ్చున్, వీనికిన్ + ఎల్లన్ = ఈ రూపులన్నిటిని, ఒక్క రూపు + చేయన్ = ఏకరూపముగాఁ జేయుటకు, ఎవ్వరు, ఓపుదురు = చాలుదురు ? బేల = అమాయికురాలా! అట్టి - మాయావిన్ = అట్టి మాయలమారిని, తగులన్ = కోరఁగా, నీకున్, అగునె = తగునా ?

**తాత్పర్యము .** శివుఁడు అష్టమూర్తి అతఁడు పృథివియై యంతటను బడియుండును నిలుకడలేక నీరే యయి వ్యాపించును అగ్నియై సమీపించుచో దహించుచుండును వాయువయి సంభ్రమముతోఁ జలించుచుండును ఆకాశమయి చూడఁగా లేకుండును హిమకరుఁడయి పెరుఁగుచుఁ, దఱుగుచు నుండును సూర్యుఁడయి ఆకాశముపైఁ బరువెత్తుచుండును మహాత్ముఁడైనను నిరాకారుఁడై యుండును ఈ యెనిమిది మూర్తులందును, ఏ మూర్తి నిజముగాఁ దెలియవచ్చును? వీని నన్నిటిని ఏకరూపముగాఁ జేయుట కెవ్వరు చాలుదురు? అమాయికురాలా! అట్టి మాయలాని యం దాసక్తి వహించుటకు నీకుఁ దగునా? తగ దనుట

**విశేషములు :** ఇందు శివుని అష్టమూర్తిత్వము చెప్పఁబడినది పంచభూతములు (పృథివ్యప్తేజోవాయురాకాశములు), సూర్యచంద్రులు, యజమానుఁడు ననునవి శివుని యష్టమూర్తులు

వ **సకలకళాధరుండు జలజప్రభవుండు విరించి యుండఁ, బా**
**యక సిరిఁ దక్కనేలిన మురాంతకుఁ డుండ, సమస్త దేవతా**
**ప్రకరముఁ గొల్వ నున్న సురపాలకుఁ డుండఁగ నిట్టి మూర్ఖు భి**
**క్షుకు నపదార్థు నేమిగతిఁ గోరితి శంకరుఁ బంకజాననా !"** 25

**అర్థము :** పంకజ + ఆననా = పద్మముఖీ!, సకల - కళా - ధరుండు = ఎల్ల విద్యలను ధరించినవాఁడును, జలజ ప్రభవుండు = తమ్మిచూలియు, ఆగు, విరించి= బ్రహ్మ, ఉండన్ = ఉండఁగాను, పాయక = విడువక - ఎల్లవేళల ననుట, సిరిన్ = లక్ష్మిని, తక్కన్ + ఏలిన = తానే పాలించిన, మురా + అంతకుఁడు = మురాసురుని అంతమొందించినవాఁడు - విష్ణువు, ఉండన్ = ఉండఁగాను, సమస్త- దేవతా - ప్రకరమున్ = ఎల్ల దేవతల సమూహమును, కొల్వన్ + ఉన్న = సేవింపఁగా నున్న, సుర - పాలకుఁడు = దేవతలను బాలించువాఁడు, ఇంద్రుఁడు, ఉండఁగన్ = ఉండఁగాను, ఇట్టి - మూర్ఖున్ = ఇటువంటి, అవివేకిని, భిక్షుకున్ =

యాచకుని, అపదార్థున్ = వస్తురూపము లేనివానిని - అవాచ్యుని, శంకరున్ = శివుని, ఏమి - గతిన్ = ఏ విధముగా కోరితి = వరించితివి ?

**తాత్పర్యము** పద్మముఖీ! ఎల్ల విద్యలను ధరించినవాఁడును, పద్మభవుఁడును అగు బ్రహ్మ యుండఁగాను, ఎల్లప్పుడును లక్ష్మిని దానే పాలించు విష్ణువుండఁగాను, ఎల్ల దేవతల సమూహము సేవలనందు ఇంద్రుఁ డుండఁగాను, ఇట్టి మూర్ఖుఁడును, యాచకుఁడును, వస్తురూపము లేనివాఁడును అగు శివు నేరీతిగా వరించితివి ?

**విశేషములు .** భిక్షక - శబ్దము లేదు APTE లో భిక్షాక శబ్దము గలదు. భిక్షుక రూపమే సరియైనది అప్పుడు 'కల్పితి' అని యున్నచో యతి తప్పును. అందుచే 'భిక్షుకు నపదార్థు నేమిగతిఁ గోరితి' అనుపాఠమే మేలయినది బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుఁడు అనువారికడనున్న గుణములు శివునికడ లే వనుట బ్రహ్మ సకల కళాధరుండు - పండితుఁడు - వివేకి, శివుఁడు అవివేకి - మూర్ఖుఁడు విష్ణువు పాయక సిరిఁ దక్కనేలినవాఁడు - ధనవంతుఁడు శివుడు భిక్షుకుఁడు - యాచకుఁడు ఇంద్రుఁడు సమస్తదేవతాప్రకరము సేవల నందువాఁడు వస్తు రూపము గలవాఁడు శివుఁడు అపదార్థుఁడు - వస్తురూపము లేనివాఁడు - కోరితి- 'లిడ్లోట్టుల వకారంబునకు లోపంబు విభాష నగు' బాల క్రియ 24 కోరితి + వ్ + ఇ కోరితి + ఇ - 'అంద్వవగాగమంబులం దప్ప నపదాదిస్వరంబు పరంబగునపు డచ్చునకు సంధి యగు' బాల సం 11 కోరితి ఇట్లే కల్పితి + వి - కల్పితి

**వ అని యనేకప్రకారంబులం బరమేశ్వరు నిరాకరించుచు నితర సురవరులఁ**
**విశేషించుచున్న కృతకవిప్రు నగజ కటాక్షించుచు** **26**

**అర్థము :** అని, అనేక - ప్రకారంబులన్ - పెక్కు రీతుల, పరమేశ్వరున్ = శివుని, నిరాకరించుచున్= అనాదరము చేయుచు, ఇతర - సుర - వరులన్= అన్య దేవతా శ్రేష్ఠులను, విశేషించుచున్ + ఉన్న = స్తుతించుచున్న, కృతక - విప్రున్ = కపట బ్రాహ్మణుని, అగజ = పార్వతి, కటాక్షించుచున్ = కడగంటఁజూచుచు - అనాదరముతోఁ జూచుచు నని భావము

**తాత్పర్యము .** అని పెక్కురీతులఁ బరమేశ్వరు ననాదరించుచు నన్య దేవతా శ్రేష్ఠులను స్తుతించుచున్న కపట బ్రాహ్మణుని బార్వతి క్రీఁగంటఁ జూచుచు - తరువాతి పద్యముతో నన్వయము

**పార్వతి కపట వటువును నిరాకరించుచుఁ బలుకుట**

సీ. బ్రహ్మాండనికరంబు పరమేశు జలమూర్తి
 నుదయించు నల్పబుద్బుదము లనఁగ
భాసుర స్థూలరూపమునందుఁ బరమాణు
 సమితి నా రోమకూపముల నుండుఁ
గాలాగ్ని తనుమహోజ్వాలాభిహతిఁ దూలి
 గలగొను విస్ఫులింగమ్ము లనఁగ
నట్టి బ్రహ్మాండంబులం దొక్క బ్రహ్మాండ
 కుహరైకవాసులై కుత్సితాత్మ

తే. లనఁగ వర్తించు హరి కమలాస నామ
రేశ్వరాదులఁ దెచ్చి సర్వేశుతోడ
నెన్ని సాళులు పెట్టఁగా నెన్నె దీవు
జడుఁడ వై తెట్లు బ్రాహ్మణజాతిఁ బుట్టి ? 27

**అర్థము** . బ్రహ్మాండ - నికరంబు = బ్రహ్మాండముల సమూహము, పరమేశు - జల - మూర్తిన్ = శివుని జలరూప మూర్తియందు, అల్ప బుద్బుదములు + అనఁగన్ = చిన్న బుడగలు అనునట్లు, ఉదయించున్ = పుట్టును

(ఆ బ్రహ్మాండములు), భాసుర-స్థూల - రూపమునందున్ = ప్రకాశించు (ఒప్పునట్టి), పెద్దదియగు రూపమునందు, పరమాణు - సమితి - నాన్ = పరమాణువుల సమూహ మనునట్లు, రోమకూపములన్ = వెండ్రుకల రంధ్రములందు, ఉండున్

కాల + అగ్ని = ప్రళయాగ్ని, తను - మహత్ (మహో) - జ్వాలా + అభిహతిన్ = తేజోమూర్తి యొక్క గొప్ప అగ్ని శిఖల దెబ్బచే, తూలి = చలించి, విస్ఫులింగమ్ములు = మిడుఁగుఱులు, అనఁగన్, కలగొనున్ = వ్యాపించును

అట్టి బ్రహ్మాండంబులందున్, ఒక్క బ్రహ్మాండ కుహర + ఏక - వాసులు+ ఐ= గుహవంటి బ్రహ్మాండమునందే నివసించువారయి, కుత్సిత + ఆత్మలు = నింద్యులు, అనఁగన్, వర్తించు = ఉండు, హరి - కమల + ఆసన + అమర + ఈశ్వర + ఆదులన్= విష్ణు బ్రహ్మేంద్రులు మున్నగువారినిదెచ్చి, ఈవు, సర్వ + ఈశుతోడన్ = సర్వేశ్వరునితో, ఎన్ని + చాళులు = ఎన్ని కొండెములు, పెట్టఁగాన్= పెట్టుటకు, ఎన్నెదు - ఎన్నెదవు

బ్రాహ్మణ - జాతిన్ = బ్రాహ్మణజన్మమునందు, పుట్టి - బ్రాహ్మణ జన్మము నెత్తి, ఎట్లు = ఏ రీతిగా, జడుఁడవు + ఐతి = మందుఁడవు - బుద్ధి లేనివాఁడవు, ఐతివి ?

**తాత్పర్యము .** బ్రహ్మాండముల సముదాయము పరమేశ్వరుని జలరూప మూర్తియందుఁ జిన్నబుడగ లనునట్లు పుట్టును అవి భాసురమైన పెద్ద ఆకృతియందుఁ బరమాణువుల సమూహ మనునట్లు రోమ రంధ్రములయం దుండును ప్రళయాగ్ని అగ్నిమూర్తి మహాజ్వాలల దెబ్బచేఁ జలించి మిడుఁగుఱు లన వ్యాపించును అట్టి బ్రహ్మాండములం దొక్క బ్రహ్మాండ కుహరమునందే నివసించుచు, నింద్యాత్ము లననుండు విష్ణు బ్రహ్మేంద్రాదులను దెచ్చి సర్వేశ్వరునితో నెన్ని కొండెములు పెట్టనెంతువు? బ్రాహ్మణ జన్మము నెత్తి నీవు మందుఁ వెట్లయితివి ?

**విశేషములు .** అలంకారము ఉత్ప్రేక్ష ఎన్ని సాళులు = ఎన్ని + చాళులు = ఎన్ని కొండెములు ఎన్నె దీవు = ఎన్నెదవు + ఈవు = 'లిడ్లాట్టుల వకారంబునకు లోపంబు విభాష నగు ' బాల క్రియ 24 ఎన్నెద + ఉ + ఈవు - 'అంద్వవగాగమంబులం దప్ప నపదాదిస్వరంబు పరంబగునపు డచ్చునకు సంధియగు ' బాల సంధి 11 ఎన్నెదు + ఈవు = 'ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధి యగు ' బాల సంధి 7 ఐతెట్లు - ఐతివి + ఎట్లు - లిడ్వకార లోపము, అపదాది సర్వసంధి ఐతి + ఎట్లు = 'మధ్యమపురుష క్రియ లయం దిత్తునకు సంధి యగును ' బాల సంధి 7 ఐతెట్లు

**ఉ గంధగజాసురారిఁ బురకాయజకాలబలప్రహారి, ను**
**గ్రాంధక హారిఁ, దీవ్ర గరళాయతవహ్నివిహారి, దేవతా**
**సింధుజలౌఘధారి సుర సిద్ధ మునీంద్రగణోపకారి, ను**
**ద్బంధవిదారి నోఁ బలుక బ్రాహ్మఁడ ! నీ వధికారివే మహిన్? 28**

**అర్థము :** బ్రాహ్మఁడ = ఓయి బ్రాహ్మణుఁడా! గంధ - గజ + అసుర + అరిన్ = మదించిన గజాసురునకు శత్రువైనవాఁడును, పుర-కాయజ-కాల-బల-ప్రహారిన్ = త్రిపురములయొక్కయు, మన్మథునియొక్కయు, యమునియొక్కయు బలమును సంపూర్ణముగా హరించినవాఁడును, ఉగ్ర + అంధక హారిన్ = భయంకరుఁడయిన అంధకాసురుని హరించినవాఁడును, తీవ్ర-గరళ + ఆయత-వహ్ని - విహారిన్ = తీక్ష్ణమైన హాలాహలమనెడి విపులమైన అగ్నిని విశేషముగా

హరించినవాఁడును, దేవతా - సింధు - జల + ఓఘ - ధారిన్ = దివ్య గంగానదీ జల ప్రవాహమును ధరించినవాఁడును, సుర-సిద్ధ-ముని + ఇంద్ర - గణ + ఉపకారిన్ = దేవతలు, సిద్ధులు, మునిశ్రేష్ఠులు అనువారి సమూహమునకు మేలుచేయువాఁడును, ఉద్బంధ-విదారిన్ = గొప్పదైన కట్టును ద్రెంచువాఁడును అగు, ఈశ్వరుని, నోన్ = నొచ్చునట్లు, పలుకన్ = పలుకుటకు, నీవు, మహిన్ = భూమియందు, అధికారివి + ఏ = అధికారము - అర్హత, కలవాఁడవా ?

**తాత్పర్యము** మదించిన గజాసురునకు శత్రువైనవాఁడును, త్రిపురాసురులయు, మన్మథునిదియు, యమునిదియు బలమును హరించినవాఁడును, భయంకరుఁడైన అంధకాసురుని హరించినవాఁడును, తీక్ష్ణమైన హాలాహలమనెడి విపులమైన అగ్నిని విశేషముగా హరించినవాఁడును, దివ్యగంగాజలప్రవాహమును ధరించినవాఁడును, సురల, సిద్ధుల, మునిశ్రేష్ఠుల సమూహమునకు మేలు చేయువాఁడును, మహాబంధనమును ద్రెంచువాఁడును అగు నీశ్వరుని నొవ్వనాడుటకు ఓ బ్రాహ్మణుఁడా! నీవు భూమియం దధికారివా? కా వనుట

**విశేషములు.** అలంకార మంత్యానుప్రాసము నొచ్చు ధాతువు 'మధ్యమ ముడుజులు ముజు వాఁబడు ' బాల క్రియ 31 'ముజీత్తులు ముత్తు నాఁబడు' బాల క్రియ 86 (ముత్తు పరమగుచో) 'చావు నోవులు చచ్చు నొచ్చుల కగు ' నోవు బాల క్రియ 94 'తుమర్థ భావలక్షణంబులందు నుజీ యగు' నోవు + నుజీ బాల క్రియ 40 'జీత్తు పరం బగునపుడు వాని వువర్ణంబు విభాషను లోపించు ' బాల క్రియ 95 నోన్ బ్రాహ్మఁడ - బ్రాహ్మణుఁడ - బ్రాహ్మణ శబ్దమునకు వ్యావహారిక రూపము నిఘంటువుల కెక్కలేదు బాపఁడ = అన్నచో నిర్బాధము జలౌఘ - జల + ఓఘ - వృద్ధి సంధి

చ **హరుఁ జెడనాడి ముందఱు కృతాంతకు కన్నది యేమి? నీలకం**
**ధరు నుఱ కెగ్గులాడి మఱి దక్షుని కన్నది యేమి? విశ్వ**
**సంహరుపయి నెత్తిపోయి విషమాయుధు కన్నది యేమి? పూర్వ భీ**
**కరగతి చూచిచూచి పురఘస్మరుఁ బల్కుట నీకు బుద్ధియే? 29**

**అర్థము.** హరున్ = ఈశ్వరుని, చెడన్ + ఆడి = నిందించి, తిరస్కరించి, ముందఱు = పూర్వము, కృతాంతకు - కన్న + అది = యముఁడు పొందినది, ఏమి? నీల-కంధరున్ = కాలగళుని - ఈశ్వరుని, ఉఱక = లక్ష్యపెట్టక, ఎగ్గులు+

ఆడి = నిందలు పలికి, మఱి, దక్షుని - కన్నది + ఏమి? = దక్ష ప్రజాపతి పొందినది యేమి? విశ్వ - సంహరుపయిన్ = భువనములను హరించువాని (శివుని)పై, ఎత్తిపోయి = దండెత్తిపోయి, విషమ + ఆయుధు - కన్న + అది - ఏమి? = లయిదు బాణములు గలవాఁడు - మన్మధుఁడు పొందినది యేమి?, పూర్వ-భీకర-గతి = మునుపటి భయంకరమైన విధము, చూచి - చూచి, పుర-ఘస్మరున్ = త్రిపురహరుని-ఈశ్వరుని, పల్కుట = నిందించుట, నీకున్, బుద్ధియే = వివేకమా?

**తాత్పర్యము .** ఈశ్వరుని నిందించి పూర్వము యముఁడు పొందినది యేమి? గరళకంఠుని లక్ష్యపెట్టక నిందించి దక్షప్రజాపతి పొందినది యేమి? విశ్వసంహరుఁడగు నీశ్వరునిపై దండెత్తిపోయి మన్మధుఁడు పొందినది యేమి? మునుపటి భయంకర విధమును జూచిచూచి యీశ్వరుని నిందించుట నీకు వివేకమా? కా దనుట

**విశేషములు .** కృతాంతకు కన్నది, దక్షుని కన్నది, విషమాయుధు కన్నది - 'ధాతుజవిశేషణ భావార్థక పూర్వ వ్యవహితావ్యవహిత కర్తృపద ప్రథమకుఁ దలఁచుగ యొక్కషష్ఠి యగు' ప్రౌఢ కారక 15 'యొక్కకు లోపంబు బహుళంబు ' ప్రౌఢ కారక 16 కన్నది - కన్న + అది - 'అది యవి శబ్దంబుల యత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగ నగు' బాల సంధి 45 ముందటు - (రూపాం) ముందఱ

వ అదియునుం గాక 30

**అర్థ తాత్పర్యములు .** మఱియును - తరువాతి పద్యముతో నన్వయము

చ నిటలతటప్రచండతరనేత్ర సముత్థిత తీవ్ర పావకో
త్కట శిఖలం బురాంగభవకాలహరం బగు టేమిపెద్ద? ధూ
ర్జటి నెప మల్గి చూచిన నజప్రకరాండసహస్రకోటు లో
క్కటఁ గమరున్ మహానలము గప్పినఁ దూలకణాళిపోలె నై 31

**అర్థము .** నిటల శిఖలన్ నిటల - తట = నొసటి ప్రదేశమునందలి, ప్రచండ-తర = మిక్కిలి తీక్ష్ణమైన, నేత్ర = కంటినుండి, సముత్థిత = లేచిన, తీవ్ర = భయంకరమైన, పావక = అగ్నియొక్క, ఉత్కట = ఉగ్రములైన, శిఖలన్ = జ్వాలలచే, పుర + అంగభవ - కాల - హరంబు = త్రిపురములను, మన్మధుని, యముని నశింపఁజేసినది, అగుట, ఏమి - పెద్ద = ఏమి విశేషము? ధూర్జటి =

శివుఁడు, నెపము + అల్గి - చూచుడును = సకారణముగాఁ గోపించి చూచినంతనే, మహత్ (మహా) + అనలము = గొప్ప యగ్ని, కప్పినన్ = క్రమ్మినచో, తూల - కణ+ ఆళి-పోలెన్ + ఐ = దూది లేశముల వరుస విధమయి, అజ - ప్రకర + అండ - సహస్ర - కోటులు = వేలకోటుల సంఖ్యగల బ్రహ్మాండములు - వేయి బ్రహ్మాండముల సమూహములు, ఒక్కటన్ = ఒక్కమాటుగా, కమరున్ = కాలును

**తాత్పర్యము** నొసటనున్న తీక్ష్ణతరమైన కంటినుండి బయలువెడలిన భయంకరాగ్నితీవ్రజ్వాలలచేఁ ద్రిపురములును, మన్మథుఁడును, యముఁడును నశించు టేమివిశేషము? ఈశ్వరుఁడు సకారణముగాఁ గోపించి చూచినచో వేలకోటుల సంఖ్యలుగల బ్రహ్మాండములు మహాగ్ని క్రమ్మినచో దూదిలవముల వరుసవలెనయి యొక్కమాఱుగాఁ గాలిపోవును

**విశేషములు** . అలంకార ముపమ

**వ** **నీ వెంతవాఁడ వఖిలభువనాధీశ్వరుండైన పరమేశ్వరు దూషింప!' ననుచున్న గిరిజ పలుకులు విని కృతకమునికుమారుం డపహసించుచు 32**

**అర్థము.** అఖిల - భువన + అధీశ్వరుండు = ఎల్లలోకములకు బ్రభువు, ఐన పరమేశ్వరున్, దూషింపన్ = నిందించుటకు, నీవు + ఎంతవాఁడవు! అనుచున్ + ఉన్న, గిరిజ = పార్వతియొక్క, పలుకులు = మాటలు, విని, కృతక - ముని-కుమారుండు = కపట మునికుమారుఁడు, అపహసించుచున్ = పరిహసించుచు

**తాత్పర్యము.** ఎల్లలోకములకుఁ బ్రభువైన పరమేశ్వరుని నిందించుటకు నీ వెంతటివాఁడ?' వనుచున్న పార్వతి పలుకులు విని కపటమునిబాలకుఁడు పరిహసించుచు - తరువాతి పద్యముతో నన్వయము

**కపట వటువు బార్వతి తపఃకరణము నధిక్షేపించుట**

**చ** **తగరము వాఁడిచేసి వెడతాపసి నాకడ బీరగాఁడుగాఁ**
**బొగడెదు నీవు, మా కలుగఁబోయెదు, లోకమువారు బిక్షుకున్**
**నగసుత గల్చిపోయెనని నవ్వుదు, రాతఁడు నీకుఁ గల్వఁగాఁ**
**దగఁడని బుద్ధిసెప్పు డిది తప్పె వరానన ! నీకుఁ జూడఁగాన్ ? 33**

**అర్థము .** తగరమున్ = మెత్తనిదైన తగరమను లోహమును, వాఁడిచేసి = పదనుగలదానినిగాఁజేసి, నీవు, వెడ-తాపసిన్= = అల్పుఁడైన మునిని, నా-కడన్ =

నా దగ్గఱ, బీర-కాఁడు + కాన్ = తేజస్సుగలవానినిగా, పొగడెదు = పొగడెదవు, మాకున్ + అలుగన్ + పోయెదు =మమ్ము ద్వేషింపఁబోదువు, లోకమువారు = ప్రజలు, నగసుత = కొండకూఁతురు -పార్వతి, భిక్షుకున్ = యాచకుని, కల్చిపోయెన్ = వలచెను, అని, నవ్వుదురు = పరిహసింతురు, వర+ఆనన = శ్రేష్ఠమైనముఖముగలదానా! సుందరీ ! ఆతఁడు = ఆ శివుఁడు! కల్వఁగాన్ = వలచుటకు, తగఁడు = అర్హుఁడుకాఁడు, అని బుద్ధి + చెప్పుడు = బుద్ధి-హితముచెప్పుట, నీకున్, చూడఁగాన్ = ఆలోచింపఁగా, తప్పె = అపరాధమా!

**తాత్పర్యము .** తగరము మిక్కిలి మెత్తని లోహము అది యెన్నఁటికిని బదనెక్కదు అట్టిదానికిఁ బదను పెట్టునట్లు అల్పమునియగు నా యీశ్వరుని దేజస్సుగలవానినిగా నీవు ప్రశంసింతువు మమ్ము ద్వేషింతువు లోకమునందలి ప్రజలు పార్వతి యొకయాచకుని వలచెనని పరిహసింతురు సుందరీ! ఆ శివుఁడు నీకు వలచుటకుఁ దగఁడని హితము చెప్పుటయు నీకుఁ జూడఁగా నేర మాయెనా?

**విశేషములు .** అలంకార ముపమ బీర - కాఁడు - బీరగాఁడు 'కా కత్తియ వర్ణకంబులు పుంస్త్వస్త్రీత్వంబుల మతుబర్థంబునం దాటాదుల కగు ' బాల తద్ధిత 11 'కా కత్తియల కకారంబునకు గకారంబు కొండొకచోఁ గానంబడియెడి ' బాల తద్ధిత 12 బీరగాఁడు - బీరము గలవాఁడు

ఉ **నేరక కల్చి భిక్షుకుని నీ వొక పెద్దగఁ జేసె దింత, జం**
**భారియె భోగసంపదఁ? గృతాంతకుఁడే పటు విక్రమంబునన్ ?**
**వారిధివల్లభుండె విభవంబున? నా ధనదుండె భూరి వి**
**త్తోరు సమృద్ధి ? నీ చెనఁటి యూఁపర లేటికి నాడె దెన్నియున్? 34**

**అర్థము .** నీవు, భిక్షుకునిన్, నేరక = తెలియక, కల్చి = వలచి, ఇంత = ఇంతగా, ఒక - పెద్దగన్ + చేసెదు = ఒక గొప్పవానినిగాఁ జేసెదవు, (అతఁడు), భోగ - సంపదన్ = సౌఖ్య సంపత్తియందు, జంభ + అరియె = జంభరాక్షసునకు శత్రువైన ఇంద్రుఁడా ? పటు-విక్రమంబునన్ = తీవ్రమైన పరాక్రమమునందు, యముఁడా? విభవంబునన్ = వైభవమునందు, వారిధి - వల్లభుండె = సముద్రముల కధిపతియగు వరుణుఁడా? భూరి - విత్త + ఉరు - సమృద్ధిన్ = అధికమైన ధనముయొక్క గొప్ప సమృద్ధియందు, ఆ - ధనదుండె = ప్రసిద్ధుఁడైన కుబేరుఁడా?, ఈ-చెనఁటి + ఊఁపరలు = ఈ పనికిమాలిన వ్యర్థభాషణములు, ఎన్నియున్ = ఎన్నియైనను, ఏటికిన్ = ఎందులకు, ఆడెదు = పలుకుదువు?

**తాత్పర్యము** నీ వొక యాచకునిఁ దెలియక ప్రేమించి వాని నింతగా నొక పెద్దవానినిగాఁ జేసెదవు అతఁడు సౌఖ్యసంపత్తియందు మహాభోగియగు నింద్రుఁడా? మహాపరాక్రమమునందు యముఁడా? వైభవమునందు వరుణుఁడా? అధికమైన ధనసమృద్ధియందుఁ గుబేరుఁడా? పనికిమాలిన యీ వ్యర్థ భాషణముల నెన్నియు నేల యాడెదవు?

**వ** **మఱి యట్లుంగాక** **35**

**అర్థతాత్పర్యములు.** అదియును గాక - తరువాతి పద్యముతో నన్వయము

**సీ** **మగ లాఁడువారికి మరగి మ్రుచ్చిలి బంది**
**వట్టి కన్నంబులు వెట్టి తెరువు**
**త్రెక్కొని చని పరదేశంబు లుడుగక**
**త్రిమ్మరి వ్రేళ్లును ఋొమ్ముఁ బోయి**
**యాచకులై వేఁడి నీచుల సేవించి**
**కల మెక్కి చని నలిఁ గయ్యమాడి**
**యేనుంగునకుఁ దాడి యి ట్లెన్నియేనియుఁ**
**గష్టముల్ పడి రాక కలదు గాక**

**ఆ** **మగలఁ గోరి తొల్లి మగువలు తపములు**
**చేసి నవసి రనినచెట్ట లెందుఁ**
**గలవె? దీని కచ్చు నిలిపితి వీవ, నీ**
**వలన సతుల పురులు పాలిసెఁగాక** **36**

**అర్థము** మగలు = పురుషులు, ఆఁడువారికిన్ = స్త్రీలకు, మరగి = ఆసక్తివహించి, మ్రుచ్చిలి = వంచించి, బంది - పట్టి = బందిపోటు చేసి, కన్నంబులు + పెట్టి = కన్నము వేసి దోఁచుకొని, తెరువు-త్రెక్కొని = దారిగొట్టి, చని = పోయి, పర-దేశంబులు = దేశాంతరములు, ఉడుగక = మానక, త్రిమ్మరి = తిరిగి, వ్రేళ్లును ఋొమ్మున్ + పోయి = వ్రేళ్లును, ఋొమ్మును అఱిగిపోయి, యాచకులు + ఐ = భిక్షుకులయి, వేఁడి = అడుగుకొని, నీచులన్ = అధములను, సేవించి, కలము + ఎక్కి = ఓడనెక్కి, చని, నలిన్ = ఉత్సాహముతో, కయ్యము + ఆడి = కలహించి, ఏనుంగునకున్ + తాడి = ఏనుఁగున కెదురొడ్డి, ఇట్లు + ఎన్ని + ఏనియున్ = ఈ రీతిగా నెన్నియైనను, కష్టముల్ - పడి = కష్టము లనుభవించి, రాక - వచ్చుట, కలదు - కాక = ఉన్నది కాని,

మగలన్ + కోరి = పురుషులను గోరి, తొల్లి = పూర్వము, మగువలు = స్త్రీలు, తపములు, చేసి, నవసిరి = కృశించిరి, అనిన చెట్టలు = అనిన దారుణములు, ఎందున్ = ఎచ్చటనైనను, కలవె = ఉన్నవా?

ఈవు + అ = నీవే, దీనికిన్ = స్త్రీలు పురుషులకొఱకుఁ దపస్సు చేసి కృశించుటకు, అచ్చు - నిలిపితివి = ప్రథమ దృష్టాంతమును నిలిపితివి, నీ వలనన్ = నీ మూలమున, సతుల = స్త్రీల, పురులు = పరువు, పొలిసెన్ + కాక = నశించెనుగాక!

**తాత్పర్యము** పురుషులు స్త్రీలయెడ నాసక్తి వహించి, సంచించి, బందిపోటుతనము చేసి, కన్నము వేసి, దారిగొట్టి, దేశాంతరములు మానక తిరిగి వ్రేళ్లను, త్రొమ్మును అటిగి పోయి, భిక్షుకులయి నీచులను గొలిచి ఓడ నెక్కి పోయి, ఉత్సాహముతోఁ గలహించి, యేనుఁగునకు ఎదురొడ్డి - ఈ రీతిగా నెన్నేని కష్టము లనుభవించుట లోకమున నున్నదికాని, పూర్వము పురుషులను గోరి స్త్రీలు తపముల నాచరించి కృశించిన దారుణము లెందైనఁ గలవా? నీవే దీనికిఁ బ్రథమదృష్టాంతమును నిలిపితివి నీ వలన స్త్రీల పరువు పోయినది

**విశేషములు** వ్రేళ్లను త్రొమ్ముఁబోయి - దీనికర్థము సందర్భానుసారముగాఁ జెప్పఁబడినది

క **వసుధాధరేంద్రసుత! నీ**
**వసదృశముగ శివునిఁ గూడి యాడుట యాఁడుం**
**బసి పని, 'సమాన శీల**
**వ్యసనేషు సుసఖ్య' మనిన వచనము వినవే ?** 37

**అర్థము:** వసుధాధర + ఇంద్ర - సుత = పర్వతరాజు కూఁతురా! - పార్వతీ! నీవు, అసదృశముగన్ = సాటిలేని రీతిగా, శివునిన్ కూడి = కలిసి, ఆడుట = విహరించుట, ఆఁడున్ + పసి - పని = స్త్రీల పిల్ల చేష్ట, సమాన - శీల - వ్యసనేషు = సమానమైన స్వభావము, వ్యసనము గలవారిలో, సు-సఖ్యమ్ = మంచి స్నేహము, అనిన, వచనమున్ = మాటను, వినవే = వినలేదా?

**తాత్పర్యము**. పార్వతీ ! నీవు అసమానముగా శివునిఁ గూడి విహరించుట- శివునిఁ బెండ్లియాడుట స్త్రీల పిల్లచేష్ట మంచిస్నేహము సమానస్వభావము వ్యసనము గలవారియందే యొప్పు నను మాట నీవు వినలేదా?

**విశేషములు .** సమాన శీల    సుసఖ్యమ్ + అనిన - 'అనుకరణంబునం దహమాదుల మకారంబునకు ద్విరుక్తి విభాషనగు  బాల సంధి 53

సీ   ఎమ్ములు దొడవను నింతియ కా దందుఁ
        బెనుబాము లెడనెడఁ బెనఁగియుండు
   వాదేమి మెయిపూఁత బూది యన్నింతయ
        కా దది యొలుకుల బూది నెఱయ
   నశనంబు భిక్షాన్న మనుటయ కా దందుఁ
        గూడఁబోసిన పులికూడు మఱియు
   నేకాకియై యుండు నింతియకాదు ప్రే
        తావాసముల నుండు ననుదినంబు

తే   చూడ విరసమై నగ్నంబుతోడ నుండు
   నదియుఁగా కిరుసంజల నాడు, మరులు
   గొరగఁ గలుచుఁగా కాతనిఁగోరి తపము
   సేసె దట గౌరి! నీ వెంత చేట్ల పురులొ !                38

**అర్థము .** గౌరి = పార్వతీ! ఎమ్ములు = ఎముకలు, తొడవు + అను + ఇంతియ - కాదు = ఆభరణము అనుట మాత్రమే కాదు, అందున్ = ఆ ఎముకలలో, పెను + పాములు = పెద్దపాములు, ఎడనెడన్ = నడుమనడుమ, పెనఁగి + ఉండున్ = మెలిగొనియుండును

వాదు + ఏమి = వాదమేమి? మెయి - పూఁత= శరీరముపైఁబూఁత, బూది = బూడిద, అను + ఇంతియ-కాదు = అను నింతమాత్రమేకాదు, అది = ఆ పూఁత, నెఱయన్ = పూర్ణముగా, ఒలుకుల - బూది= కాటి బూడిద

అశనంబు = ఆహారము, భిక్షా + అన్నము = బిచ్చపుఁగూడు, అనుట + అ + కాదు = అనుటయే కాదు, అందున్ = ఆ కూటిలో, కూడన్ + పోసిన = కలియునట్లు పోసిన, పులి-కూడు = పులిసినయన్నము,

మఱియున్, ఏకాకి + ఐ = ఒంటరివాఁడయి, ఉండన్, ఇంతియ - కాదు = ఇంతెకాదు, అనుదినంబున్ = ప్రతిదినమును, ప్రేత + ఆవాసములన్ = శ్మశానభూములందు, ఉండున్

చూడన్, విరసము + ఐ = అసహ్యమయి, నగ్నంబు తోడన్ = దిగంబరత్వముతో, ఉండున్, అదియున్ + కాక, ఇరు-సంజలన్ =

ప్రాతస్సాయంసంధ్యాసమయముల రెంటను, ఆడున్ = నర్తించును, మిఱుఁ =
పిశాచము, గొరగన్ = భిక్షుకుని, కలుచున్ + కాక = వలచును గాని, అలసన్, కోరి,
తపము + చేసెదు + అట = తపస్సు చేయుదువట, నీవు + ఎంత, చేట్ల - పురులో =
నీవు ఎంత చేటులు దెచ్చు ప్రకృతివో - స్వభావముగలదానవో!

**తాత్పర్యము** గౌరీ! ఆ శివునకు ఎముకలు ఆభరణములగునంత మాత్రమే కాదు ఆ ఎముకలలోఁ బెద్దపాములు నడుమనడుమ మెలిగొనియుండును శరీరముపైఁ బూఁత నిర్వివాదముగా, బూడిద యనునింతమాత్రమేకాదు ఆ పూఁత యంతయుఁ గాటి బూడిద ఆతని ఆహారము బిచ్చపుఁగూడనుటయేకాదు ఆ కూడు పులిసిన అన్నముతోఁ గూడినది మఱియు నొంటరివాఁ డనుట మాత్రమే కాదు ప్రతిదినమును అతఁడు శ్మశానభూములం దుండును చూడఁగా నతఁడు అసహ్యముగా దిగంబరుఁడై యుండును అదియునుగాక ప్రాతస్సాయం సంధ్యాసమయములందు రెంటను దాండవము చేయును భిక్షుకునిఁ బిశాచము వలచును గాని, నీ వాతనిని గోరి తపస్సు చేయుట విడ్డూరము నీవు ఎంత చేటులు దెచ్చు స్వభావము గలదానవో!

**విశేషములు.** ఇంతియ - ఇంతె నగ్నంబుతోడన్ - నగ్నత్వము తోడన్ భావార్థమునకు మాఱుగా విశేషణము వాడఁబడినది అదియుఁగా కిరుసంజల నాడున్- మఱులు గొరగఁగలుచుఁగాక' అని విభజింపఁబడినది చేసెదట - చేసెదవు + అట - లాట్టు వకారమునకు వైభాషికలోపము బాల క్రియ 24 చేసెద + ఉ + అట - అపదాదిస్వరసంధి బాల సంధి 11 చేసెదు + అట ఉత్వసంధి బాల సంధి 1 నీ వెంత చేట్ల పురులో - నీ కృత్యములు (బింకపుఁబనులు) ఎట్టి చెట్టలను తెచ్చునోకదా! అని వావిళ్లప్రతి వ్యాఖ్యాత వ్యాఖ్యానించెను కాని యిందలి శబ్దముల కా యర్థమెట్లు పొసఁగునో తెలియదు అందుచే నీవు + ఎంత - చేట్ల పురులో - నీవు ఎంత చేటులను దెచ్చు ప్రకృతివో అని వ్యాఖ్యానింపఁబడినది పురులు - స్వభావము, ప్రకృతి (సూ ని)

క తొడవులు చివికిన యెమ్ములు
గుడిముట్టు కపాల, మిల్లు గుడి; ముడియె ద్దె
క్కుడు; గట్టువలువు దో లగు,
బడరునకై నవయ నేమి ప్రళయము వచ్చెన్? 39

**అర్థము.** తొడవులు = ఆభరణములు, చివికిన - చీకిపోయిన, ఎమ్ములు= ఎముకలు, కుడిముట్టు = భోజన పాత్రము, కపాలము = పుఱ్ఱె, ఇల్లు, గుడి =

దేవాలయము, ముడి = ముదిసిన, ఎద్దు, ఎక్కుడు = వాహనము, కట్టు - వలువు= కట్టు బట్ట, తోలు, అగున్, బడరునకున్ + ఐ = దరిద్రునకయి, నవయన్ = శ్రమించుటకు, ఏమి - ప్రళయము - వచ్చెన్ = ఏమి కొంప మునిఁగెను?

**తాత్పర్యము** శివునకు ఆభరణములు చీకిపోయిన ఎముకలు భోజనపాత్రము పుఱ్ఱె, ఇల్లు దేవాలయము, ముదిసినయెద్దు వాహనము, కట్టుబట్ట తోలు అట్టి దరిద్రునకై నీవు శ్రమపడుట కేమి కొంప మునిఁగెను?

**విశేషములు** మా రా ప్రతిలో 'ఇల్లు గుడిముడి = అని విభజించి ఇల్లు శ్మశానమని వ్రాయఁబడెను కాని 'గుడిముడి = శ్మశానము' అని నిఘంటువులఁ గానరాలేదు అందుచే ఇల్లు గుడి - ముడియెద్దు = ముసలి యెద్దు అని అర్థము చెప్పఁబడెను

సీ. **మణి భూషణ ప్రభామంజరు లెలమించి**
**తనువల్లికకు వసంతంబు సేయు!**
**సమదాంచితాంగ విభ్రమములు వెలయించి**
**శృంగారలక్ష్మికిఁ జెన్ను సేయు!**
**కాముకజనుల నీక్షణ మాత్ర నెఱిఁగించి**
**సౌభాగ్యవాము కుత్సవము సేయు!**
**కోరిక రతికళాకుశలత ప్రకటించి**
**దర్పకు రాజ్యపదస్థుఁ జేయు!**

తే. **సారసంసార మెల్ల నిస్సార మేల**
**చేయ నెత్తెదు? వలదు, నా చెప్పు సేయు!**
**తరుణి! నిను వేఁడికొని కాంతుఁ దపముఁసేయ**
**నర్థిసేయకు, మొం డేదియైనఁ జేయు!** 40

**అర్థము :** మణి - భూషణ - ప్రభా - మంజరులు = రత్నాలంకారముల కాంతులనెడు పూలగుత్తులు, ఎలమించి = వికసింపఁజేసి, తను-వల్లికకున్ = మైఁదీఁగకు, వసంతంబు + చేయు = వసంత మగునట్లు చేయుము

స-మద + అంచిత + అంగ - విభ్రమములు = గంధముతోఁ గూడినవి, ఒప్పినవి, అగు, అవయవముల విలాసములు, వెలయించి = ప్రకాశింపఁజేసి,

శృంగార - లక్ష్మికిన్ = సొగసైన వేషమనెడి లక్ష్మికి, చెన్ను +చేయు = అందమును గూర్పుము

కాముక - జనులన్ = ప్రేమించు జనులను, వీక్షణ-మాత్రన్ = చూపులోడనే, ఎఱిఁగించి = తెలియఁజేసి, సౌభాగ్య-వామకున్ = సౌందర్యమనెడు స్త్రీకి, ఉత్సవము+ చేయు = పండుగు చేయుము

కోరికన్ = కోరికతో, రతి-కళా-కుశలత = సంభోగ విద్యానైపుణ్యము, ప్రకటించి = తెలిపి, దర్పకున్ = మన్మథుని, రాజ్య - పదస్థున్ + చేయు = రాజ్యాధికారస్థానమునందు ఉన్నవానినిగాఁ జేయుము

తరుణి = ఇంతీ! సార-సంసారము + ఎల్లన్ = సారవంతమైన సంసారము నంతను, నిస్సారము = సారహీనమయినదిగా, ఏల - చేయన్ + ఎత్తెదు = ఎందులకుఁజేయఁబూనుదువు? వలదు = వద్దు, నా-చెప్పు + చేయు = నేను జెప్పునది చెయుము, నినున్, వేఁడికొని, కాంతున్ = చూతును, తపము + చేయన్ = తపము నాచరించుటకు, అర్థిన్ + చేయకుము = కోరకుము, ఒండు + ఏమి + ఐనన్ + చేయు =మఱియొకటి యేదయినను జేయుము

**తాత్పర్యము.** పార్వతీ! రత్నాలంకారముల కాంతు లనెడు పూల గుత్తులను వికసింపఁజేసి నీ మైఁదీఁగకు వసంతమగునట్లు చేయుము పరిమళవంతములైన అవయవముల విలాసములు ప్రకటించి నీ సొగసైన వేషమనెడి లక్ష్మికి అందమును గూర్పుము కాముకులను జూపులతోడనే తెలియునట్లుచేసి నీ సౌందర్యమనెడు స్త్రీకిఁ బండువు చేయుము కోరికతో సంభోగవిద్యానైపుణిని బ్రకటించి మన్మథుని రాజ్యాధికారస్థానమందుండునట్లు చేయుము సారవంతమైన సంసారమునంతను ఏల నిస్సారమయినదిగాఁ జేయఁబూనుదువు? వలదు నేనుజెప్పినట్లు చేయుము నిన్ను వేఁడికొందును తపస్సు చేయఁగోరకుము మఱియొకటి యేదయినను జేయుము

**విశేషములు .** వావిళ్లప్రతి వ్యాఖ్యాత 'పాదాంతములందలి 'చేయు' అనుదానిని ప్రథమపురుషక్రియగా వ్యాఖ్యానించెను కాని అది మధ్యమ పురుషైకవచన క్రియగనే చెప్పుట మేలనిపించినది ప్రభామంజరులు, శృంగార లక్ష్మి సౌభాగ్యవామ - రూపకములు చేయు = చేయుము 'మధ్యమపురుష మువర్ణకంబునకు హలవ సానంబులు పరంబులగునపుడు లోపము విభాషనగు' బాల సంధి 47 ఎత్తెదు

- ఎత్తైద + వు 'లాట్టువకారమునకు వైభాషికలోపము' - బాల క్రియ 24 అపదాది స్వరసంధి - బాల సంధి 11 నా - చెప్పు - నా మాట - ధాతువు విశేష్యముగాఁ బ్రయుక్తము - కృదంతము - 'ఉవర్ణకం బడుక్వాదుల కగు' బాల కృదం 21 చెప్పు + ఉ = చెప్పు - అపదాది స్వరసంధి బాల సంధి 11 ఒప్పు' లోనగువానివంటిది

చ ఎలఁబొలపోని మేను నవయించియు, రాగరసంబు నిండుఁగుం
డలొ యను వీఁగుఁజన్నుల బెడం గెడలించియు, మారు పువ్వుఁదూ
పుల నగు లోలదృగ్రుచు లపోహము పుచ్చియు, భోగవృద్ధి ని
ష్ఫలముగఁ జేసియుం, దుదిఁ దపంబున నయ్యెడిదేమి చెప్పుమా! 41

**అర్థము** ఎలఁబొలు + పోని = లేఁజిగురువంటి, మేను = శరీరము, నవయించియున్ = కృశింపఁజేసియును, రాగ-రసంబు - నిండు + కుండలొ = శృంగారరసముయొక్క పూర్ణకుంభములో అను, వీఁగు + చన్నుల = నిక్కుఁ జన్నుల యొక్క, బెడంగు = అందము, ఎడలించియున్ = పోఁగొట్టియును, మారు-పువ్వు -తూపులన్ = మన్మథుని పుష్పబాణములను, నగు =పరిహసించు, లోల - దృశ్(క్) + రుచులు = చలించు దృక్కాంతులు, అపోహము - పుచ్చియున్ = చెడఁగొట్టియును, భోగ-వృద్ధిన్ = సుఖ సమృద్ధిని, నిష్ఫలముగన్ + చేసియున్ = వ్యర్థము చేసియును, తుదిన్ = చివర, తపంబునన్ = తపస్సుచేత, అయ్యెడిది + ఏమి = అగునదియేమి, చెప్పుమా

**తాత్పర్యము** . లేఁజిగురువంటి మేనిని గృశింపఁజేసియును శృంగారరసపూర్ణకుంభములాయననున్న నిక్కుఁజన్నుల అందమును బోఁగొట్టియు, మన్మథుని పుష్పబాణములను బరిహసించు చంచలదృక్కాంతులను జెడఁగొట్టియును సుఖసమృద్ధిని వ్యర్థముగాఁజేసియును జివరకుఁ దపమువలన నగులాభ మేమో చెప్పుము

**విశేషములు** ఎలఁబొలు - ఎలపాలుయని సూని ఎలపాలువోని మేను - అలంకార ముపమ మారు పువ్వుఁదూపుల నగు - అలంకారము వ్యతిరేకము - 'వ్యతిరేకో విశేష శ్చే దుపమేయోపమానయోః' చన్ద్రా దృశ్ + రుచులు = దృక్ + రుచులు - దృగ్రుచులు నిండుఁగుండలొ - నిండు + కుండలొ, పువ్వుఁదూపులు - పువ్వు + తూపులు - 'సమాసముల నుదంత స్త్రీ సమములకుఁ బరుషములు పరములగుచుండఁగా నుగాగమము' - బాల సంధి 25 పిమ్మట ద్రుతకార్యము బాల సంధి 16, 17

వ అని యనేకప్రకారంబుల భేదించుచున్న తన్నుఁ దృణీకరించి యదత్త ప్రతివచనయై యున్న గౌరి నాక్షేపించుచు 42

**అర్థము :** అని, అనేక - ప్రకారంబులన్ = పలు విధముల, భేదించుచున్ + ఉన్న = విరోధించుచున్న, తన్నున్ = తన్ను - ఈశ్వరుని, తృణీకరించి = నిరాకరించి, అదత్త - ప్రతివచన + ఐ = సమాధానము నొసఁగనిదయి, ఉన్న, గౌరిన్ = పార్వతిని, ఆక్షేపించుచున్ తిరస్కరించుచు

**తాత్పర్యము** అని పెక్కురీతుల విరోధించుచున్న తన్నుఁదిరస్కరించి సమాధానము చెప్పుచున్న పార్వతిని నిరాకరించుచు - తరువాతి పద్యముతో నన్వయము

క పులిగూడు తిండి గొరగం
గలిచియు నో చెల్ల ! యింత గల్పించెదు శ్రీ
గలవానిఁ దగిన పురుషుం
గలిచిన నీ కన్నుదోయిఁ గను డరు దనుమా 43

**అర్థము :** పులి - కూడు - తిండి + గొరగన్ + పులిసిన అన్నమును దిను భిక్షుకుని, కలిచియున్ = వలచియు, ఓచెల్ల = బాపురే, ఇంత, కల్పించెదు = కలిగింతువు, శ్రీ + కలవానిన్ = డబ్బు గలవానిని, తగిన - పురుషున్ = నీ కర్హుఁడైనపురుషుని, కలిచిన = వలచిన, నీ- కన్నుదోయిన్ = నీకన్నుల జంటను, కనుడు = కనుట, అరుదు = అపూర్వము, అనుమా

**తాత్పర్యము .** పులిసిన కూటిని దిను భిక్షుకుని వలచియు బాపురే! ఇంత కల్పించెదవు డబ్బుగలవానిని నీ కర్హుఁడగు వానిని వలచిన నీ కన్నుల జంటను గనుట దుర్లభముగదా!

వ అని వాయోడక నెరనంటం బలికి పెక్కు దెఱంగుల నీశు దూషించుచుఁ దన్ను వికారదృష్టిఁ గనుంగొని సాభిలాషోక్తులు ప్రకటించుచున్న కృతకవిప్రు నగజ కటాక్షించి 44

**అర్థము :** అని, వాయోడక = సంకోచింపక, నెరను = మర్మమును, అంటన్ +పలికి = తాఁకునట్లు పలికి, పెక్కు - తెఱంగులన్ = అనేక విధముల, ఈశున్ = ఈశ్వరుని, దూషించుచున్ = నిందించుచు, తన్నున్, వికార - దృష్టిన్ =

వికృతపుఁజూపుతో, కనుంగొని = చూచి, స+అభిలాష+ ఉక్తులు = కోరికతోఁగూడిన మాటలు, ప్రకటించుచున్ + ఉన్న = వెలయించుచున్న, కృతక -విప్రున్ = కపట బ్రాహ్మణుని, అగజ = పార్వతి, కటాక్షించి = క్రీఁగంటఁ జూచి - అనాదరముతోఁ జూచి

**తాత్పర్యము.** అని సంకోచింపక మర్మము ముట్టఁబలికి యనేకవిధముల నీశ్వరుని నిందించుచుఁ దన్ను వికారపుఁజూపుతోఁ జూచి కోరికతోఁ గూడిన మాటలు వెలయించుచున్న కపట బ్రాహ్మణుని బార్వతి యనాదరముతోఁ గడకంటఁ జూచి - తరువాతి పద్యముతో నన్వయము

క **ఏలిదము చేసి మెచ్చక**
**తూలముగాఁ బలికి కడవ దూషించెదు, నీ**
**ప్రేలరితన మంగజహరు**
**భాలాంబకవహ్ని పాలుపడ కుడుగ దెడన్** 45

**అర్థము.** ఏలిదము + చేసి = చులుకనచేసి, మెచ్చక, తూలముగాన్ = తేలికగా, పలికి, కడవన్ = హద్దుమీఱి, దూషించెదు = నిందింతువు, నీ - ప్రేలరితనము = నీ వదరుఁబోతుతనము, అంగజ-హరు = మన్మధహరునియొక్క- శివునియొక్క, భాల + అంబక - వహ్ని = నొసటికంటి మంటయొక్క, పాలు పడక= పాలుగాక, ఎడన్ - ఉడుగదు = నడుమ నాఁగదు

**తాత్పర్యము.** శివునిఁ జులుకన చేసి మెచ్చక తేలిక చేసి పలికి మేరమీఱి నిందింతువు నీ వదరుఁబోతుతనము ఫాలాక్షుని నొసటికంటిమంట పాల్పడక తప్పదు

**విశేషములు.** ఏలిదము - ఎల్లిదము (రూపాం ) తూలము = దూది - తేలిక అని భావము, దూషించెదు - దూషించెదవు - లాద్యకారమునకు వైభాషికలోపము - బాల క్రి 24 అపదాదిస్వరసంధి బాల సంధి 11 భాలము (రూపాం) ఫాలము అంబకము (నానా) కన్ను, బాణము

వ **అని కోపించి నెఱయం దలంచి తపోభంగభీతిం దన్నుఁ దాన సంతరించుకొనుచున్న నగజం గని సఖులు కపట వటు కృతానేక విఘ్నపరంపరకు గౌరి నిశ్చలతపోభారంబునకు విస్మితు లగుచు** 46

**అర్థము:** అని, కోపించి, నెఱయన్ = బాగుగా, తలంచి, తపన్ (:) + భంగ - భీతిన్ = తపస్సుయొక్క విఘ్నమువలని భయముచేత, తన్నున్, తాను + అ =

తానే, సంతరించుకొనుచున్ + ఉన్న = సరిపెట్టుకొనుచున్న, నగజన్ = [illegible] కని, సఖులు = చెలికత్తెలు, కపట - వటు - కృత + అనేక - విఘ్న - సంచయమున్ = కృతకబ్రహ్మచారిచేతఁ జేయఁబడిన పెక్కు ఆతంకముల యొక్క సమూహము, గౌరి = పార్వతియొక్క, నిశ్చల-తపస్ + భారంబునకున్ = అచంచలమైన తపస్సుయొక్క బరువునకును, విస్మితులు + అగుచున్ = ఆశ్చర్యపడినవారగుచు

**విశేషములు :** విస్మితులగుచు - నేను జూచిన ప్రతులన్నిటి నెట్లే కలదు కాని 'విస్మితులు' అను దానికి విశేషకుడు స్త్రీలింగమైన సఖులు కావున విస్మితలగుచునని యుండవలయును

**తాత్పర్యము .** అని కోపించి బాగుగాఁ దలఁచి తపస్సు పాడుగాని భయముచేఁ దన్నుఁదానే సరిపెట్టుకొనుచున్న పార్వతిని జూచి చెలికత్తెలు కపట బ్రహ్మచారి చేసిన పెక్కు విఘ్నములకును, పార్వతి అచంచల తపోఽతిశయమునకును ఆశ్చర్యపడినవారగుచు - తరువాతి పద్యముతో నన్వయము

చ **అలఁచి విపత్ప్రయోగత మహాత్ముల ధైర్య మడంపఁజూతు, నీ**
**యలవియె ధాత్రి? బేల విది యూఱడి కాఱియ దక్కు మమ్మహా**
**ప్రళయము వచ్చినం దలరి పాడఱి క్రాఁగఁగ, వారి ధైర్య మీ**
**కులగిరులే? పయోనిధులె? కుంభినియే? నభమే? యజాండమే?** 47

**అర్థము** అలఁచి = శ్రమపెట్టి, విపద్ + ప్రయోగతన్ = ఆపదను గలిగించుటచేత, మహత్ (మహా) ఆత్ముల - ధైర్యము = గొప్ప వారి ధైర్యమును , అడంపన్ + చూతు = నశింపఁజేయఁజూతువు ధాత్రిన్ = భూమియందు, నీ + అలవి + ఎ = నీ తరమా ? బేలవు = వెఱ్ఱివాఁడవు, ఇది, ఆఱడి - కాఱియ - వృథాశ్రమము, తక్కుము = విడువుము, ఆ + మహత్ (మహా) - ప్రళయము = ఆ గొప్ప ప్రళయము, వచ్చినన్ = వచ్చినను, తలరి = చలించి, పాడఱి = పాడువడి క్రాఁగఁగన్ - నశించుటకు, వారి-ధైర్యము = ఆ మహాత్ముల ధైర్యము, ఈ - కుల - గిరులు + ఏ = ఈ కులపర్వతములా? పయోనిధులు + ఎ = సముద్రములా? కుంభిని + ఏ = భూమియా? నభము + ఏ = ఆకాశమా? అజాండము+ ఏ = బ్రహ్మాండమా?

**తాత్పర్యము .** శ్రమపెట్టి ఆపదను గలిగించుటచే గొప్పవారి ధైర్యమును నశింపఁ జేయఁజూతువు అది భూమియందు నీ తరమా? వెఱ్ఱివాఁడవు ఇది నీ వృథాశ్రమము మానుము ఆ మహాప్రళయము వచ్చినను జలించి, పాడువడి, నశించుటకు మహాత్ముల ధైర్యము ఆ కులపర్వతములా? సముద్రములా? భూమియా? ఆకాశమా? బ్రహ్మాండమా?

**విశేషములు** మహాప్రళయము వచ్చుచోఁ గులపర్వతాదులు చలించి నశింపవచ్చునుగాని, శివుని ధైర్యము నశింపదనుట బేలవిధి - బేల విది యని రాళ్ళపల్లివారి పాఠము

వ అనుచుం గృతకవిప్రు నందఱు నాక్షేపించి 48

**అర్థము** అనుచున్, కృతక - విప్రున్ = కపటబ్రాహ్మణుని, అందఱున్ = చెలికత్తె లందఱును, ఆక్షేపించి = తిరస్కరించి

**తాత్పర్యము** అని పలుకుచుఁ గపటబ్రాహ్మణు నందఱుఁ దిరస్కరించి - తరువాతి పద్యముతో నన్వయము

**కపట వటువును బార్వతి చెలులధిక్షేపించుట**

క "తఱుసంటి, తన్ను నెదిరిని
నెఱుఁగడు తనకొలఁది పుడుక నెఱుఁగఁడు, మొండీఁ
డఱజాతి, మ్రక్కు, మన్నం
గొఱఁ, డెక్కడ - నిట్టి ప్రేలుగొండులుఁ గలరే ? 49

**అర్థము** . తఱుసంటి = అజ్ఞుఁడు, తన్నున్, ఎదిరినిన్ - ఎదుటివానిని ఎఱుఁగఁడు, తన కొలఁది - పుడుకలు - తనస్థితికిఁ దగిన ప్రసంగములు, ఎఱుఁగఁడు, మొండీఁడు = మొండివాఁడు, అఱజాతి = హీనకులుఁడు, మ్రక్కు = కలుషాత్ముఁడు, మన్నం గొఱఁడు = గౌరవము లేనివాఁడు, ఎక్కడన్ = ఎచ్చటనైనను, ఇట్టి, ప్రేలు గొండులు = ప్రలాపులు, కలరే = ఉన్నారా ?

**తాత్పర్యము** . ఇతఁడు అజ్ఞుఁడు తన్నును ఎదుటివానిని ఎఱుఁగఁడు తనస్థితికిఁ దగిన ప్రసంగములు చేయుట తెలియనివాఁడు మొండివాఁడు హీనకులుఁడు కలుషాత్ముఁడు గౌరవహీనుఁడు ఎక్కడనైన నిట్టి ప్రేలరు లున్నారా? లే రనుట

**విశేషములు** . ఈ పద్య మాచ్ఛికశబ్దమయమగుట గమనింపఁదగినది మొండీఁడు - మొండి + ఈ - 'ఈ ప్రత్యయంబు కొన్నింటికి స్వార్థంబునం దగు ' బాల తద్ధిత 16 అపదాదిస్వరసంధి - బాల సం 11 మొం'డీ' 'మహత్తులగు మగాదులకుం గయిరాదులకును డుజ్ఞగు నుత్వంబు గాదు ' బాల ఆచ్ఛిక 4 మొండీ + డుజ్ - 'జిత్తు బిందుపూర్వం బగు ' బాల తత్సమ 19 మొండీఁడు

వ అనుచు గిరినందన కెడసొచ్చి మునినందనుం గనుంగొని 50

**అర్థము.** అనుచున్ గిరినందనకున్ = కొండకూఁతునకు - పార్వతికి, ఎడ + చొచ్చి= అడ్డుపడి, ముని - నందనున్ = మునికుమారుని - కపటవటువును, కనుంగొని = మాచి

**తాత్పర్యము** అనుచుఁ బార్వతి కడ్డుపడి కపటవటువును జూచి - తరువాతి పద్యముతో నన్వయము

సీ. సురవిరోధుల నోర్చి సురసేన నెల్లఁ జే
కొని కావనోపెడు కొడుకుఁ బడయ
సురరాజు మొదలుగా సురలెల్లఁ గొలువఁ బే
రోలగంబునఁ గొలువుండఁ బేర్మి
శ్రీ వాక్శచీ సురసిద్ధ విద్యాధర
దనుజాంగనల వర్ప్యుఁబనులు గొనఁగఁ
బద్మసంభవు శిరః పద్మంబు సత్కేళి
పద్మంబుగాఁ గేలఁ బట్టి యాడఁ

తే బుండరీకాక్షు లోచనపుండరీక
మంఘ్రిపీఠంబుగా మీఁద నడుగు సాఁప
నభవు దేహార్ధ మురువడి నాక్రమించి
కొనఁగఁ జువ్వె యీ తపమెత్తికొనియె నగజ 51

**అర్థము .** సుర-విరోధులన్ = దేవతల శత్రువులను - రాక్షసులను, ఓర్చి = ఓడించి, సుర-సేనన్ + ఎల్లన్ = దేవసైన్యమునంతను, చేకొని = గ్రహించి - నాయకుఁడయి, కావన్ = రక్షించుటకు, ఓపెడు = సమర్థుఁడగు, కొడుకున్ - కుమారుని, పడయన్ = పొందుటకును, సుర-రాజు = దేవాధిపతి - ఇంద్రుఁడు, మొదలుగాన్ = మున్నుగా, సురలు + ఎల్లన్ = దేవతలందఱును, కొలువన్ = సేవించుచుండఁగా, పేర్మిన్ - గొప్పతనముతో, పేరోలగంబునన్ (పేరు + ఓలగంబునన్) = నిండుకొలువున, కొలువు + ఉండన్ = కొలువుదీర్పఁగను,

శ్రీ - వాచ్ (క్) + శచీ - సుర - సిద్ధ - విద్యాధర - దనుజ + అంగనలన్- లక్ష్మి, సరస్వతి, శచీదేవి, సురల, సిద్ధుల, విద్యాధర, - రాక్షసుల భార్యలను, వర్ప్యుఁబనులు - కొనఁగన్ = దాస్యముచేయించుకొనఁగను,

పద్మసంభవు = తమ్మిచూలి - బ్రహ్మయొక్క, శిరస్ (ః) + పద్మంబు = తామరవంటి శిరస్సు, సత్ + కేళి - పద్మంబుగాన్ = మేలయిన విలాసపద్మముగా, కేలన్ = చేతితో, పట్టి + ఆడన్ = పట్టి యాడుటకును

పుండరీక + అక్షు = తెల్లఁదామరల వంటి కన్నులు గలవాని యొక్క - విష్ణువియొక్క, లోచన-పుండరీకము = తెల్లదామరవంటికన్ను, అంఘ్రి - పీఠముగాన్= పాదపీఠముగా, మీఁదన్, అడుగు+చాఁపన్ = పాదములు మోపుటకును,

అభవు = ఈశ్వరుని యొక్క, దేహ + అర్ధము = మేనిసగము, ఉరువడిన్= ఉరవడితో - మిక్కిలి వేగముతో, ఆక్రమించికొనఁగన్ + చువ్వె ఆక్రమించుకొనుటకునుజుమా, అగజ = పార్వతి, ఈ-తపము + ఎత్తికొనియెన్= ఈ తపస్సునకుఁ బూనుకొనెను

**తాత్పర్యము** రాక్షసుల నోడించి దేవసైన్యమునెల్ల గ్రహించి రక్షింపఁజాలు కుమారునిఁ బడయుటకును, ఇంద్రాదిదేవతలందఱు సేవింప నిండోలగమున గొప్పతనముతోఁ గొలువు దీర్చుటకును, లక్ష్మీసరస్వతులచేతను, సురసిద్ధ విద్యాధర రాక్షస స్త్రీల చేతను దాస్యము చేయించుకొనుటకును, బ్రహ్మ శిరఃకమలమును లీలాకమలముగాఁ జేతఁబట్టి యాడుటకును, పుండరీకాక్షుని నేత్రపుండరీకము పాదపీఠముగాఁ బై నడుగుమోపుటకును జుమా పార్వతి యీ తపమునకుఁ బూనుకొనెను

**విశేషములు .** ఓర్చి - ఓడు ధాతువు 'చుగాగమం బాచ్చికంబున కసంయుక్త న ల డ రాంతంబునకుం బ్రేరణంబున బహుళంబుగా నగు ' బాల క్రియ 73 ఓడు+చు 'అ డోడు కూడుల డకారంబునకుం జుక్కు పరంబగునపుడు రేఫం బగు ' బాల క్రియ 80 ఓరుచు 'పదాంతబులయి యసంయుక్తంబులయిన ను లు రుల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు ' బాల ప్రకీర్ణ 16 ఓర్చు 'సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకంబగు ' బాల క్రియ 38 ఓర్చు + ఇ అపదాదిస్వరసంధి - బాల సంధి 11 ఓర్చి, పేరోలగము - పేరు + ఓలగము - 'కర్మధారయంబునందుఁ' బేర్వాదిశబ్దముల కచ్చు పరంబగునపుడు టుగాగమంబు విభాష నగు' బాల సం 29 టుగాగమ మగుచో పేరుటోలగము కానిచో ఉత్వసంధిచే బాల సం 1 పేరోలగము వాక్చచీ - వాచ్ + శచీ వాక్+ శచీ - వర్గముల మొదటి నాల్గక్షరముల (ఝయ్యుల) కంటె పరమగు శవర్ణమునకు

అచ్చులుగాని, అంతస్థములుగాని, అనునాసికములుగాని, హకారముగాని (లట్టులు) పరమై యున్నపుడు ఛకారము వైకల్పికముగా నాదేశమగును వాక్ + ఛవి = వాక్ఛవి - వాక్చవి వర్ప్యంబనులు - వరవు + పనులు 'లాఁటి యచ్చునకు సహిత మొకానొకచో నుడినడుమలోపంబు గానంబడియెడి బాల ప్రకీర్ణ 18 వర్ప్య + పనులు 'సమాసమున ఉదంతస్త్రీసమంబునకుఁ బరుషము పరమగుచుండఁగా నుగాగమము' బాల సంధి 25 ద్రుతకార్యము - బాల సంధి 16,17 వర్ప్యంబనులు ఉరువడి - రూపాం ఉరవడి

**శా** **నీ యజ్ఞానత నీశు విశ్వజనకున్ నిందించె దీ విమ్మహా**
**మాయం జండిక నాదిమూర్తిఁ ద్రిజగన్మాతన్ మదాంధుండవై**
**డాయం జాచెదు పాపకర్మ! నినుఁ జూడం గూడునే కేవల**
**స్త్రీయే? పార్వతి నన్యథామతిగఁ దాఁ జింతింప నీ ప్రాప్తియే? 52**

**అర్థము**. నీ +అజ్ఞానతన్ = నీ తెలివిలేమిచేత, ఈశున్, విశ్వ - జనకున్ = జగజ్జనకుని, ఈవు, నిందించెదు = దూషింతువు, పాప-కర్మ = పాపపుఁబనులు గలవాఁడా ! ఈ +మహా-మాయన్= ఈ మహామాయను, చండికన్, ఆది-మూర్తిన్ = తొలిమూర్తిని, త్రిజగత్+మాతన్ =ముల్లోకములతల్లిని, మద+అంధుండవు + ఐ = క్రొవ్వుచేఁ గనులు గానని వాఁడవయి, డాయన్ + చూచెదు = సమీపింపఁజూతువు, నినున్, చూడన్ + కూడునే= చూడఁదగునా, కేవల స్త్రీయే= సామాన్యస్త్రీయా?, పార్వతిన్, అన్యథా-మతిగన్ = వేఱు తలఁపుతో, తాన్, చింతింపన్ = భావించుటకు, నీ-ప్రాప్తియే = నీ శక్తియా? పార్వతిని వేఱుగా భావించుటయే నీకుఁజేతనగునా? అనుట

**తాత్పర్యము**. నీవు నీ తెలివిలేమిచే జగజ్జనకుఁడగు నీశ్వరుని నిందింతువు ఈ మహామాయయు, చండికయు, ఆదిమూర్తియు, త్రిజగజ్జననియు నగుపార్వతిని గ్రొవ్వుచేఁ గన్నులుగానక సమీపింపఁజూతువు పాపకర్ముఁడా! నిన్నుఁజూచుట తగునా? ఆమె కేవల స్త్రీయా? పార్వతిని వేఱుబుద్ధితోఁ జూచుటయే నీ శక్తియా?

**విశేషములు**. నిందించెదీవు నిందించెదవు + ఈవు - లాట్టు వకారమునకు వైభాషికలోపము బాల క్రియ 24 నిందించెద + ఉ + ఈవు అపదాదిస్వరసంధి బాల సంధి 11 నిందించెదు + ఈవు - ఉకారసంధి బాల సంధి 1 నిందించెదీవు ఇట్లే చూచెదు గ్రహించునది

సీ. జ్ఞానస్వరూపమై సర్వాత్ముఁడున్నఁ దా
        జ్ఞేయ స్వరూపమై నెఱసియుండుఁ
బురుషస్వరూపమై పరమేశుఁడున్నఁ దాఁ
        బ్రకృతిస్వరూపమై పరఁగుచుండు
సూక్ష్మస్వరూపమై శుద్ధాత్ముఁడున్నఁ దా
        స్థూలస్వరూపమై తోఁచియుండు
నర్థస్వరూపమై యమలాత్ముఁడున్నఁ దా
        శబ్దస్వరూపమై జరుగుచుండు

ఆ. హరుఁడు రుద్రరూపమై యున్నఁ దా నుమా
మూర్తి దాల్చి లోకములకు హితము
సేయుచుండుఁ గాన శివశక్తి భేదంబు
తెలుఁగు నీకు జడున కెటుఁగ లావె? 53

**అర్థము .** సర్వ - ఆత్ముఁడు = శివుఁడు, జ్ఞాన - స్వరూపము + ఐ = జ్ఞానముయొక్క ఆకారమయి, ఉన్నన్ = ఉండఁగా, తాన్ = తాను (పార్వతి) జ్ఞేయ స్వరూపము + ఐ = జ్ఞేయము (తెలియఁదగినది) యొక్క ఆకారమయి, నెఱసి + ఉండున్ = వెలసియుండును

పరమేశుఁడు, పురుష - స్వరూపము + ఐ = పురుషునియొక్క స్వరూపమయి, ఉన్నన్, తాన్ = పార్వతి, ప్రకృతి - స్వరూపము + ఐ = ప్రకృతియొక్క స్వరూపమయి, పరఁగుచున్ + ఉండున్ = ఒప్పుచుండును

శుద్ధాత్ముఁడు = పరిశుద్ధమైన ఆత్మగలవాఁడు - ఈశ్వరుఁడు, సూక్ష్మ - స్వరూపము + ఐ, ఉన్నన్, తాన్, స్థూల - స్వరూపము + ఐ, తోఁచి ఉండున్

అమల + ఆత్ముఁడు = నిర్మలమైన ఆత్మగలవాఁడు - ఈశ్వరుఁడు, అర్థ - స్వరూపము + ఐ = అర్థముయొక్క స్వరూపమయి, ఉన్నన్, తాన్, శబ్ద - స్వరూపము + ఐ = శబ్దముయొక్క స్వరూపమయి, జరుగుచున్ + ఉండున్ = సాఁగుచుండును

హరుఁడు = శివుఁడు, రుద్ర - రూపము + ఐ = రుద్రుని ఆకారమయి, ఉన్నన్, తాన్, ఉమా - మూర్తి = ఉమ - పార్వతి యొక్క ఆకారము, తాల్చి = ధరించి, లోకములకున్, హితము =మేలు, చేయుచున్ + ఉండున్

కానన్ = కావున, శివ - శక్తి - భేదంబులు = శివునకు, శక్తికిఁ (పార్వతికి) గల భేదముల, తెఱఁగు = విధము, జడునకున్ = మందబుద్ధికి, నీకున్, ఎఱుఁగన్, లావె? = అలవియా?

**తాత్పర్యము** . సర్వాత్ముఁడైనశివుఁడు జ్ఞానస్వరూపమయి యుండఁగాఁ బార్వతి జ్ఞేయస్వరూపమయియుండును పరమేశుఁడు పురుషస్వరూపమయియుండఁగాఁ, బార్వతి ప్రకృతిస్వరూపమయి యొప్పుచుండును శుద్ధాత్ముఁడైన శివుఁడు సూక్ష్మస్వరూపమయి యుండఁగాఁ బార్వతి స్థూలస్వరూపమయి తోఁచియుండును పరమాత్ముఁడైన శివుఁడు అర్థస్వరూపమయియుండగాఁ బార్వతి శబ్దస్వరూపమయి జరుగుచుండును శివుఁడు రుద్రస్వరూపమయి యుండఁగాఁ, బార్వతి ఉమామూర్తిని దాల్చి లోకములకు మేలుచేయుచుండును కావున మందబుద్ధివైన నీకు శివశక్తిభేదము లెఱుఁగశక్యమా? శక్యము గాదనుట

**విశేషములు** జ్ఞానము - జ్ఞేయము, పురుషుఁడు - ప్రకృతి, సూక్ష్మము - స్థూలము, అర్థము - శబ్దము, రుద్రుఁడు - ఉమ ఈ జంటలు అవినాభావ స్థితినిదెలుపును ఇవి శివశక్తుల కుపమానములయి, వారి అవినాభావస్థితిని సూచించును అర్థ స్వరూపమై శబ్ద స్వరూపమై జరుగుచుండు 'వాగర్థా నివ సమ్పృక్తౌ' - అని పార్వతీ పరమేశ్వరులను కాళిదాసు వాగర్థములతోఁ బోల్చుట స్మరింపఁదగినది,

వ **అనుచున్న సఖులం గని గిరిజ మది నాక్షేపించుచు** **54**

**అర్థము.** అనుచున్ + ఉన్న, సఖులన్ = చెలికత్తెలను, కని = చూచి, గిరిజ= పార్వతి, మదిన్ = మనస్సునందు, ఆక్షేపించుచున్ = దూఱుచు

**తాత్పర్యము:** అని పలుకుచున్న చెలికత్తెలను జూచి పార్వతి మనసునందు దూఱుచు - తరువాతి పద్యముతో నన్వయము

చ **జలజభవాచ్యుతాది సురసంఘము లెల్లను భక్తియుక్తులై**
**కొలుచు మహేశు నీ చపల కుత్సిత విప్రుఁడు వచ్చి నోరఁ గ్రా**
**వ్యులు పలుకంగ మీరును జెవుల్ సార వించు సహించి మాఱుమా**
**టలు నొడికట్టి పల్కెద రొడంబడినట్టులు బ్రహ్మబంధుతోన్** **55**

**అర్థము** జలజ-భవ + అచ్యుత + ఆది - సుర - సంఘములు + ఎల్లను = బ్రహ్మ, విష్ణువు మున్నగు దేవతల సమూహములన్నియు, భక్తి - యుక్తులు + ఐ = భక్తితోఁ గూడినవారయి, కొలుచు = సేవించు, మహేశున్ = మహేశ్వరుని, ఈ-చపల-కుత్సిత-విప్రుఁడు = ఈ చంచలుఁడు, కపటియైన బ్రాహ్మణుఁడు, వచ్చి, నోరన్ = నోటితో, క్రొవ్వులు = పొగరుఁబోతుమాటలు, పలుకంగన్ = పలుకఁగా,మీరును = మీరుగూడ, చెవుల్, చొరన్ = ప్రవేశింపఁగా, వించున్ = వినుచు, సహించి = సైఁచి, మాఱు-మాటలు = సమాధానములు, నొడికట్టి = మాటకట్టి, ఒడంబడిన + అట్టులు = అంగీకరించినట్లు, బ్రహ్మబంధు + తోన్ = నీచబ్రాహ్మణునితో, పల్కెదరు

**తాత్పర్యము.** బ్రహ్మ, విష్ణువు మున్నగు దేవతలందఱును భక్తితోఁ గూడిన వారయి సేవించు శివుని ఈ చంచలుఁడు కపటి యైనబ్రాహ్మణుఁడు వచ్చి నోటికొలఁదిఁ బొగరుఁబోతుమాటలు పలుకఁగా, మీరును జెవులార వానిని వినుచు సహించి ప్రతివచనములు కూర్చి అంగీకరించినట్లు ఆ నీచ బ్రాహ్మణునితోఁ బల్కెదరు

**విశేషములు .** చొరన్ - చొచ్చు ధాతువు 'తుమర్థ భావలక్షణంబులందు నుజీయగు బాల క్రియ 40 చొచ్చు + నుజీ 'ముజ్జీత్తులు ముత్తు నాఁబడు ' బాల క్రియ 86 'అగు వచ్చు చొచ్చు చూచులకు ముత్తు పరంబగునపుడు కా రా చొరు చూడు లగు ' చొరు + నుజీ 'జీత్తు పరంబగునపు డుత్వంబున కత్వంబగు ' బాల క్రియ 20 చొరను వించు - వినుచు 'చువర్ణకంబు పరంబగునపు డన్వాదుల కుత్వలోపంబేని నుస్థానంబున బిందువేని విభాష నగు' బాల క్రియ 55 విన్చు - వించు ఒడికట్టి = భరించి అనుటకంటె, నొడి = నుడి, కట్టి = కూర్చి అనుట మేలేమోయని భావించి యట్లర్థము చెప్పఁబడినది

**వ. వీనిం బలికి బరమేశ్వరుం బలికించి విను దేమిపని? యని కోపావేశంబునం బరాఙ్ముఖయై చనను న్న కన్నెఱింగి, వరదుండు గౌరి నిశ్చల భక్తియుక్తికి ననురక్తుండై యాక్షణంబ ప్రత్యక్షంబై నిజస్వరూపంబు చూపిన 56**

**అర్థము.** వీనిన్ = ఈ కపట బ్రాహ్మణుని, పలికి = నిందించి, పరమేశ్వరున్= ఈశ్వరుని, పలికించి = నిందింపఁజేసి, వినుడు = వినుట, ఏమిపని?, అని, కోప+ ఆవేశంబునన్ = క్రోధావేశముతో, పరాఙ్ముఖ + ఐ = పెడమొగము పెట్టినదయి,

చనన్ + ఉన్న = పోవనున్న, కన్నెఱింగి = జాడతెలిసి, వరదుండు = వరముల నిచ్చువాఁడు - శివుఁడు, గౌరి = పార్వతియొక్క, నిశ్చల-భక్తి-యుక్తికిన్ = అచంచలమైన భక్తిగలిగియుండుటకు, అనురక్తుండు + ఐ = అనురాగము గలవాఁడయి - సంతోషించినవాఁడయి, ఆ క్షణంబు + అ = ఆ క్షణమే, ప్రత్యక్షంబు + ఐ = ఎదురఁదోఁచినవాఁడయి, నిజ-స్వరూపంబు = తనదైన స్వరూపము, చూపినన్ = చూపఁగా

**తాత్పర్యము .** 'ఈ కపటబ్రాహ్మణుని నిందించి, వానిచే నీశ్వరుని నిందింపఁజేసి వినుట యేమి పని?' అని కోపావేశమునఁ బెడమొగము గలదియై పోనున్న జాడ తెలిసి యీశ్వరుఁడు పార్వతి స్థిరభక్తియుక్తికి సంతోషించి యా క్షణమే ప్రత్యక్షమై తన స్వరూపము చూపఁగా - తరువాతి పద్యములో నన్వయము

**శివుఁడు పార్వతికి నిజ స్వరూపముతోఁ బ్రత్యక్షమగుట**

సీ. శిరమున సురసింధుశీకరావళికంటె
 నటమున్న యెగసె శీతాంశురుచులు
భాలతటాంబకోద్భాసంబునకు మున్న
 ముడివడి తనరెఁ గెంజడల చాయ
గళమున విలసిల్లు గరళంబునకు మున్న
 కాలాహిభూషణకాంతి మిగిలెఁ
బాండురాంగోన్నతప్రభకంటె ముందఱఁ
 బర్వె లిప్తామలభస్మదీప్తి

తే. కటివృతవ్యాప్తచర్మంబుకంటె మున్న
మేఖలోరగఫణములు మిగిలి వెలిఁగెఁ
బాదపీఠోరువజ్రప్రభాతి కంటె
మున్న పదనఖసంకాశ మున్నతిల్లె 57

**అర్థము .** శిరమునన్ = తలపయిని, సుర-సింధు-శీకర + ఆవళి కంటెన్ = ఆకాశగంగానదీ జలకణములవరుసకంటెను, అటమున్న = అంతకుముందే, శీత + అంశు - రుచులు = చంద్రకాంతులు, ఎగసెన్ = లేచెను

భాల- తట + అంబక + ఉద్భాసంబునకున్= నొసటికంటి ప్రకాశమునకు, మున్ను + అ = ముందే, కెంజడల (కెంపు + జడల) - చాయ = ఎఱ్ఱనిజడలకాంతి, ముడివడి = పెనఁగి, తనరెన్ + ఒప్పెను

గళమునన్ = కంఠమునందు, విలసిల్లు = ప్రకాశించు, గరళంబునకున్ - హాలాహలమునకు, మున్ను + అ, కాల - అహి - భూషణ - కాంతి = కాలసర్పములనెడు ఆభరణముల కాంతి, మిగిలెన్ = అతిశయించెను

పాండుర + అంగ + ఉన్నత - ప్రభకంటెన్ = తెల్లని శరీరపు గొప్పకాంతి కంటెను, ముందఱ + ల = ముందే, లిప్త + అమల - భస్మ - దీప్తి = పూయఁబడిన నిర్మలమైన బూదియొక్క కాంతి, పర్వెన్ = వ్యాపించెను

కటి - వృత - వ్యాప్త - చర్మంబుకంటెన్ = మొలయం దావరించి వ్యాపించిన యేనుఁగుతోలుకంటెను, మున్ను + అ, మేఖలా + ఉరగ -ఫణములు = మొలత్రాడైన పాముల పడగలు, మిగిలి = అతిశయించి, వెలిఁగెన్ = ప్రకాశించెను

పాద - పీఠ + ఉరు - వజ్ర - ప్రభాతికంటెన్ = పాదపీఠమునందలి గొప్ప వజ్రములకాంతికంటెను, మున్ను + అ, పద - నఖ - సంకాశము = కాలిగోరుల ప్రకాశము, ఉన్నతిల్లెన్ = అతిశయించెను

**తాత్పర్యము** శిరమునందలి ఆకాశగంగానదీ జలకణములకంటెను ముందే చంద్రకాంతు లెగసెను నొసటికంటి ప్రకాశమునకు ముందే కెంజడల కాంతి పెనఁగి యొప్పెను కంఠమునఁ బ్రకాశించుహాలాహలముకంటె ముందే కాలసర్పాభరణముల కాంతి అతిశయించెను తెల్లని శరీరపు గొప్ప కాంతి కంటె ముందే ఒడలికిఁ బూసికొన్న భస్మము కాంతి వ్యాపించెను మొలయందలి పాముల పడగలు మిక్కిలి ప్రకాశించెను పాదపీఠమునందలి వజ్రముల కాంతికంటెను ముందే కాలిగోరుల ప్రకాశ మతిశయిల్లెను

**విశేషములు** కెంజగలు - కెంపు + జడలు 'సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగ నగు ' బాల సంధి 36, కె + జడలు లుప్తశేషమునకుఁ బరుషములు పరములగునపుడే నుగాగమము విధింపఁబడినది కాని యిచ్చట సరళము పరమగుచుండుటచే నుగాగమప్రాప్తి కవకాశములేదు 'కెంధూళి కెంజడ లని ప్రయోగంబులం గానంబడియెడి' అనుటచే ఇచ్చట నుగాగమము సిద్ధించును కె + ను + జడలు 'వర్గయుక్పరళములు పరములగునపు డొకానొకచో ద్రుతమునకుఁ బూర్ణబిందువును గానంబడియెడి' బాల సంధి 19 కెంజడలు ఉన్నతిల్లు ఉన్నతి + ఇంచు - 'నిర్జి నామంబుల కయుగాగమంబు గలుగదు ' బాల క్రియ 65 అనుదాని జ్ఞాపకము చేత నామమగు 'ఉన్నతి' యనుదానికి ధాతుత్వవివక్షయం దించుగాగమ మగును ఉన్నతి + ఇంచు 'రంజాదుల యించుక్పకారంబునకు సబిందుకంబున

క[్]ప్రేరణంబున ద్విరుక్తలకారం బగు ' బాల క్రియ 71 ఉన్నతి + ఇల్లు -అపదాదిస్వరసంధి బాల సంధి 11 చే ఉన్నతిల్లు

వ త దవసరంబున 58

**అర్థతాత్పర్యములు .** ఆ పిమ్మట - తరువాతి పద్యముతో నన్వయము

క తరుణతర తరణి కిరణ
స్ఫురణ విడంబించు నభవు జూటాటవిలో
సురనది వొలిచె లతాంత
స్థిర కింశుకవనము నడిమి సింహిక వోలెన్ 59

**అర్థము .** తరుణతర - తరణి - కిరణ - స్ఫురణన్ = మిక్కిలిలేఁతయైన సూర్యుని కిరణముల ప్రకాశముచే, విడంబించు = అతిశయించు, అభవు = శివునియొక్క, జూట + అటవిలోన్ = అడవివంటి జడముడియందు, సుర-నది = ఆకాశగంగ, లతాంత - స్థిర - కింశుక - వనము - నడిమి - సింహిక + పోలెన్ = పూలచే నిలుకడగల మోదుగువనముమధ్యమున నున్న ఆఁడుసింగము విధమున, పొలిచెన్ = ప్రకాశించెను

**తాత్పర్యము .** బాలసూర్యుని కిరణముల ప్రకాశముచే నతిశయించు శివుని జూటాటవిలో నాకాశగంగపూలతో నిండిన మోదుగువనమునడుమనున్న ఆఁడుసింగమువలెఁ బ్రకాశించెను

**విశేషములు .** అలంకార ముపమ సింహమనక సింహిక యనుట ఉపమేయమగు 'సురనది'తో లింగసామ్యముకొఱకు

క స్ఫురిత ప్రవాళ లతికా
త్యరుణద్యుతిఁ దెగడు మృడు జటాటవిలోనం
గర మొప్పెఁ జంద్రఖండం
బరుణాంబుజవనము నడిమి హంసియ పోలెన్ 60

**అర్థము .** స్ఫురిత - ప్రవాళ - లతికా + అతి - అరుణ - ద్యుతిన్ = వికసించినపగడపుఁదీఁగలయొక్క మిక్కిలి యెఱ్ఱనికాంతిని, తెగడు = తిరస్కరించు, మృడు = శివునియొక్క, జటా + అటవిలోనన్ = అడవివంటి జడలయందు, చంద్ర

- ఖ ంబు = చంద్రకళ, అరుణ + అంబుజ - వనము - నడిమి - హంసియ + పోలెన్ = ఎఱ్ఱని తామరలతోఁపు నడుమనున్న ఆఁడు అంచవలె, కరము = మిక్కిలి ఒప్పెన్ = ఒప్పెను

**తాత్పర్యము .** వికసించిన పవడపుఁదీఁగల మిక్కిలి యెఱ్ఱనికాంతిని దిరస్కరించు శివుని అడవినిబోలిన జడలయందుఁ జంద్రరేఖ యెఱ్ఱతామరలతోఁపునడుమనున్న ఆఁడుఅంచవిధమున మిక్కిలి యొప్పెను

**విశేషములు** అలంకార ముపమ అతి + అరుణ = అత్యరుణ - యణాదేశసంధి

తే **పాండురాంగ విశుద్ధాంగభాతి నడుమ**
**నురు కపర్దారుణద్యుతు లొప్పెఁ జూడ**
**నమృతమథనార్థ మర్థి దుగ్ధాబ్ధి నడుమ**
**సురలు నిలిపిన కనకభూధరము పోలె** **61**

**అర్థము** పాండుర + అంగ - విశుద్ధ + అంగ - భాతి - నడుమన్ = తెల్లని దేహము యొక్క మిక్కిలి నిర్మలములైన అవయవముల కాంతి మధ్యమున, ఉరు - కపర్ద + అరుణ - ద్యుతులు = గొప్ప జటాజూటముయొక్క ఎఱ్ఱని కాంతులు, అమృత - మథన + అర్థము = అమృతముకొఱకైన చిలుకుట నిమిత్తము, అర్థిన్ = కోరికతో, దుగ్ధ + అబ్ధి - నడుమన్ + క్షీరసముద్రమధ్యమున, సురలు = దేవతలు నిలిపిన, కనక - భూధరము పోలెన్ = బంగారు కొండ విధమున, చూడన్ = చూడఁగా, ఒప్పెన్

**తాత్పర్యము .** తెల్లని దేహమునందలి నిర్మలమైన అవయవముల కాంతి నడుమఁ బెద్ద జటాజూటము నెఱ్ఱని కాంతులు అమృతముకొఱకు మథించుటకయి క్షీరసముద్రమధ్యమున దేవతలు కోరికతో నిలిపిన మేరుపర్వతమువలెఁ జూడనొప్పెను

**విశేషములు.** అలంకారముపమ ఈశ్వరుని జటాజూటమునకుఁ గపర్దమని పేరు 'కపర్దో ౽ స్య జటాజూటః' అమరము

చ పరము శరీరభూతిరుచి పర్వినఁ దద్వన సర్వజీవ దు
ర్భరతర చిత్తతామసము వాసిన శుద్ధమయాత్మవేదులై
యరిగిరి ముక్తి, కర్థి మదినైనఁ దలంచినఁగల్గుమోక్ష వీ
శ్వరుఁ గనుఁగంటఁ జూచి రట, వా రమృతాత్ములు కావు డొప్పదే ? 62

**అర్థము .** పరము = ఉత్కృష్టుఁడైన శివుని యొక్క, శరీర - భూతి - రుచి = దేహము నందలి భస్మము కాంతి, పర్వినన్ = వ్యాపింపఁగా, లిచ్ + వన - సర్వ - జీవ - దుర్భరతర - చిత్త - తామసము = ఆ వనమునందలి యెల్ల జీవుల భరింపశక్యముకాని మనస్సునందలి తమస్సు (చీఁకటి - అజ్ఞానము) పాసినన్ = వీడఁగా, శుద్ధ - మయ - ఆత్మవేదులు + ఐ = నిర్మలమైన ఆత్మజ్ఞానము గలవారయి, ముక్తిన్ = మోక్షమునకు, అరిగిరి = వెడలిరి, అర్థిన్ = కోరికతో, మదిన్ + ఐనన్ = మనస్సునందయినను, తలంచినన్ = తలఁచినచో, కల్గు = కలుగునట్టి, మోక్షము, ఈశ్వరున్, కనుఁగంటన్ = కనులార, చూచిరి + అట, వారు, అమృత + ఆత్ములు = అమృతమయమైన ఆత్మగలవారు, కావుడు = అగుట, ఒప్పదే = తగదా ?

**తాత్పర్యము .** ఉత్కృష్టుఁడైన శివుని దేహవిభూతికాంతి వ్యాపింపఁగా నా వనమునందలి యెల్లజీవులును మనస్సులందలి దుర్భరతమస్సు నశింపఁగా, నిర్మలమైన ఆత్మజ్ఞానముగలవారయి మోక్షము నొందిరి కోరి మనస్సులోఁ దలఁచిననే మోక్షము కలుగుచుండఁగా, నీశ్వరుని గనులారఁ జూచిరట! ఇఁక వా రమృతమయాత్ములు అగుట యేమి చోద్యము?

**విశేషములు .** అలంకారము కావ్యార్థాపత్తి 'కైముత్యే నార్థసంసిద్ధిః కావ్యార్థాపత్తి రిష్యతే ' చం(ద్రా కావుడు = కావుట - భావార్థక టవర్ణకమునకు బదులుగా డువర్ణకమును వాడుట యీ కవికిఁ బరిపాటి

వ. ఇట్లు మునికుమారుం డాక్షణంబ పరమేశ్వరుండైనం బార్వతి బిట్టులికి యెదురుకొని త న్నోసరించుచు 63

**అర్థము :** ఇట్లు, ముని - కుమారుండు, ఆ క్షణంబు + అ = వెంటనే పరమేశ్వరుండు + ఐనన్ = పరమేశ్వరుఁడు కాఁగా, పార్వతి, బిట్టు + ఉలికి = మిక్కిలి భయపడి, ఎదురుకొని = అభిముఖమయి, తన్నున్ = ఓసరించుచున్ = తన్నుఁ దొలఁగఁజేయుచు

**తాత్పర్యము** ఇట్లు మునికుమారుఁడు వెంటనే పరమేశ్వరుఁడు కాఁగాఁ బార్వతి మిక్కిలి భయపడి యతని కభిముఖముగాఁ దొలఁగుచు - తరువాతి పద్యముతో నన్వయము

క తన మనమున సంభ్రమమును
దనువున ఘర్మోదకములుఁ దనరఁగ శంభుం
గని సతి నివ్వెఱఁగై ని
ల్చెను వడఁకుచు నీర మునిఁగి లేచిన భంగిన్ 64

**అర్థము** తన - మనమునన్ = తన మనస్సునందు, సంభ్రమమును = వేగిరపాటును, తనువునన్ = శరీరమునందు, ఘర్మ + ఉదకములున్ = చెమట నీరును, తనరఁగన్ = ఒప్పఁగా, సతి = స్త్రీ - పార్వతి, శంభున్ = శివుని, కని = చూచి, నివ్వెఱఁగు (నిండు + వెఱఁగు) + ఐ = మిక్కిలి ఆశ్చర్యపడినదయి, నీరన్ = నీటియందు, మునిఁగి, లేచిన - భంగిన్ = లేచిన విధమున, వడఁకుచున్, నిల్చెను

**తాత్పర్యము.** తన మనస్సునందు వేగిరపాటును, శరీరమునఁ జెమ్మటయు నొప్పఁగాఁ బార్వతి యీశ్వరునిఁ జూచి, మిక్కిలి ఆశ్చర్యపడుచు, నీట మునిఁగి లేచినట్లు వడఁకుచు నిలిచెను

**విశేషములు .** అలంకారము ఉపమ

సీ పగలింటి కట్టెండ నొగిలిన కుముదిని
సితరోచిఁ గన్గి వికసిల్లునట్లు
వేసవి వడగాలి నోసిన లేఁదీఁగ
క్రొక్కారుఁగని మవ్వమెక్కునట్లు
ఫణివిషవహ్నిఁ జేద్పడియున్న శశిరేఖ
నెఱవిడుపునఁ గాంతి వఱలునట్లు
శాపాగ్నిఁబడి దివ్యసతి వంది శాపమో
క్షముఁగని నిజకాంతి నమరునట్లు

తే విరహతాప తపస్తాప విశిఖచయము
దాఁకి కందిన మేఁదీఁగ తత్క్షణంబు
గౌరి కాత్మేశుఁడగు నీశుఁ గనుడుఁ బ్రీతి
నెలమిఁ దొల్లింటెకంటెను జెలువ మెసఁగె 65

**అర్థము** పగలింటి - కట్టెండన్ (కడు + ఎండ) = పగటితీక్ష్ణమైన యెండచే, నొగిలిన = వాడిన, కుముదిని = కలువతీఁగ, పెలకోచిన్ = చంద్రునిన్, కని = చూచి, వికసిల్లునట్లు = వికసించువిధమున

వేసవి - వడ - గాలిన్ = వేసవికాలపు వడగాల్పుచే, నొసిన = బాధపడిన - కమలిన, లేఁదీఁగ (లేఁత + తీఁగ), క్రొక్కారున్ (క్రొత్త + కారు) = తొలకరిని, కని, మవ్వము + ఎక్కునట్లు = కోమలత్వము నందిన విధమునను

ఫణి - విష - వహ్నిన్= రాహు విషాగ్నిచే, చేడ్పడి + ఉన్న = హానిపొందియున్న, శశిరేఖ = చంద్రుని పూర్ణబింబము, నెఱ-విడుపునన్ = గ్రహణ పూర్ణమోక్షముచే, కాంతిన్ = ప్రకాశముతో, వఱలునట్లు = ఒప్పురీతిని,

దివ్య-సతి = దేవతాస్త్రీ, శాప + అగ్నిన్ = శాపమనెడి అగ్నియందు, పడి, వంది= దుఃఖించి, శాప - మోక్షమున్ = శాపముయొక్కవిడుపును, కని, నిజ-కాంతిన్ = తనదైన కాంతితో, అమరునట్లు = ఒప్పువిధమున

విరహ - తాప - తపన్ + తాప - విశిఖి - చయము = ఎడఁబాటువలని తాపము అనెడి గ్రీష్మ తాపాగ్నుల సమూహము, తాఁకి, కందిన= వాడిన, మే+తీఁగ= అంగలత, తత్+క్షణంబు + అ = ఆ క్షణమే, గౌరికిన్ = పార్వతికి, ఆత్మ + ఈశుఁడు + అగు = తన ప్రభువగు, ఈశున్ = ఈశ్వరుని, కనుడున్ = చూచినంతనే, ప్రీతిన్ = సంతోషముతో, ఎలమిన్ = వికాసముతో, తొల్లింటికంటెను= మునుపటికంటెను, చెలువము = అందము, ఎసఁగెన్ = అతిశయించెను

**తాత్పర్యము :** పగటి, తీక్ష్ణమైన యెండచేఁ గమలిన కలువతీఁగ చంద్రునిఁ జూచి వికసించునట్లును, వేసవి వడగాడ్పుచే వాడిన లేఁదీఁగ తొలకరిని జూచి కోమలత్వమును బొందినట్లును, రాహువిషాగ్నిచే హానిఁబొందియున్న చంద్రుని పూర్ణబింబము గ్రహణమోక్షమునఁ గాంతిచే నొప్పునట్లును, శాపమనెడి అగ్నిచేఁ బడి దేవకాంత దుఃఖించి శాపమోక్షమును బొంది తనదైన కాంతితో నొప్పునట్లును, విరహతాపమనెడి గ్రీష్మతాపాగ్నుల సమూహము తాఁకి కందిన దేహలత ఆక్షణమే గౌరికి నిజేశుఁడైన యీశ్వరునిఁ జూచినంతనే సంతోషముచే వికాసముతోఁ బూర్వముకంటెను అంద మతిశయించెను

**విశేషములు .** అలంకారము మాలోపమ కట్టెండ - కడు + ఎండ 'కుఱు చిఱు కడు నడు నిడు శబ్దముల ఱ డల కచ్చు పరంగునపుడు ద్విరుక్తటకారం

బగు 'బాల సంధి 12 కట్టు + ఎండ 'ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధియగు ' బాల సంధి 1 కట్టెండ క్రొక్కారు - క్రొత్త + కారు - 'సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగా నగు' బాల సంధి 36 క్రొ + కారు 'క్రొత్త శబ్దమున కాద్యక్షరశేషంబునకుం గొన్నియెడల నుగాగమంబునుం గొన్ని యెడల మీఁది హల్లునకు ద్విత్వంబు నగు ' బాల సంధి 38 లేఁదీఁగ - లేఁత + తీఁగ ప్రాఁతాది సూత్రముచే (బాల సంధి 36) లే + తీఁగ 'లుప్తశేషంబునకుం బరుషములు పరములగునపుడు నుగాగమంబగు' బాల సంధి 37 లే+ను+తీఁగ ద్రుతకార్యముచే (బాల సంధి 16, 17) లేఁదీఁగ విషవహ్ని, శాపాగ్ని, విరహతాపతపస్తాప - అనుచోట్ల రూపకాలంకారము ఫణి = (నానా) - పాము, రాహువు శశిరేఖ - చంద్రకళ గాదు ఏలన రాహువుచేఁ జేడ్పాటునందునది పూర్ణశశియేకాని శశిరేఖ కాదు మఱి యిచట రేఖ యన ఆభోగము = పరిపూర్ణత (సూ ని ) రేఖా శబ్ద ప్రయోగము గౌరి కుపమానముగా స్త్రీలింగస్వారస్యము కొఱకు తపస్ - (నానా) (నపుం ) తపస్సు, (పుం ) గ్రీష్మము కనుడున్ = ఆనంతర్యార్థకము అవ్యవధానమును సూచించును తొల్లింటి - 'టివర్ణంబు కొన్నింటి యంతాక్షరంబున కాదేశంబును గొన్నింటి కంతాగమంబును గొన్నింటికిం బర్యాయంబున రెండును బ్రాయికంబుగ నగు ' బాల ఆచ్ఛిక 31 హ్రస్వము మీఁది టివర్ణంబునకు ముందు పూర్ణబిందువు బహుళముగా నగు ' తొల్లింటి బాల ఆచ్ఛిక 32

వ తత్ప్రస్తవంబున 66

**అర్థతాత్పర్యములు .** ఆ ప్రసంగమునందు - తరువాతి పద్యముతో నన్వయము

**మ అనుశీతాచ్ఛజలంబులోఁ బొలయు మత్స్యాశంకఁ బుట్టింప లో**
**చన యుగ్మంబు, సుధాప్రచలితాబ్జభ్రాంతి సంధిల్ల నా**
**ననపద్మం, బగజాత నిల్చి గలితానందాశ్రుసుస్వేదముల్**
**తనరారం బతిఁ బ్రీతిఁ జూచె మెఱుఁగుల్ దల్కొత్తఁ గ్రేఁగన్నులన్. 67**

**అర్థము .** లోచన - యుగ్మంబు = కన్నుల జంట, అను - శీత + అచ్ఛ-జలంబులోన్ = చల్లని, నిర్మలమైన నీటిలో, పొలయు = సంచరించు, మత్స్య + ఆశంకన్ = చేఁపల భ్రాంతిని, పుట్టింపన్ = కలిగింపఁగాను, ఆనన - పద్మంబు = తామరవంటి ముఖము, సుధా - ప్రచలిత + అబ్జ - భ్రాంతి = అమృతము

తొనికిసలాడు చంద్రునియొక్క భ్రాంతిని, సంధిల్లన్ = స్పృశింపఁగాను, ఒగజాల= కొండకూఁతురు - పార్వతి, నిల్చి, గలిత + ఆనంద + అశ్రు - ఘస్వేదములన్ = జాఱిన సంతోషబాష్పములు, చెమటలు, తనరారన్ = ఒప్పఁగా, క్రేఁగన్నులన్ (క్రేవ+ కన్నులు) = క్రీఁగన్నులందు, మెఱుఁగుల్ = కాంతులు, తల్కొత్తన్ = ప్రకాశింపఁగా, పతిన్ = నాధుని, ప్రీతిన్ = సంతోషముతో, చూచెన్

**తాత్పర్యము .** కన్నులజంట చల్లనిదియు, నిర్మలమునైనపేటఁ జేఁపల భ్రాంతిని బుట్టింపఁగను, ముఖపద్మము అమృతము తొనికిసలాడు చంద్రుని భ్రాంతిని స్పృశింపఁగను, పార్వతి నిలిచి సంతోషబాష్పములు, చెమటలు జాఱఁగాఁ, గ్రీఁగన్నులలో మెఱుఁగులు ప్రకాశింపఁగా భర్తను బ్రీతితోఁ జూచెను

**విశేషములు.** అలంకారము భ్రాంతిమంతము స్వభావోక్తి క్రేఁగన్నులు - క్రేవ + కన్నులు 'సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగా నగు ' బాల సంధి 36 క్రే+కన్నులు 'లుప్తశేషంబునకుం బరుషములు పరములగునపుడు నుగాగమం బగు ' బాల సంధి 37 క్రే+ను+కన్నులు = ద్రుతకార్యము (బాల సంధి 16,17) చే క్రేఁగన్నులు సంధిల్లు - 'రంజాదుల యించుక్పకారంబునకు సబిందుకంబున కప్రేరణంబున ద్విరుక్తలకారంబగు ' బాల క్రియ 71 సంధా + ఇంచు - సంధా + ఇల్ల్ + ఉ = సంధిల్లు ।- అపదాదిస్వర సంధి - బాల సంధి 11

వ హరియును 68

చ పతిఁగని లజ్జ నాననము పాయఁగ నల్లన వాంచి సమ్మదా
మృతరసపూరితార్ద్ర వినిమీలిత లోల కటాక్ష వీక్షణా
యతసితదీధితుల్ గలయ నద్రిజ విచ్చె మహేశుమీఁద రా
జతగిరిమీఁద నున్నతి నిశాకరదీప్తులు గప్పునొప్పునన్ 69

**అర్థము:** అద్రిజ = పార్వతి, పతిన్ = భర్తను - ఈశుని, కని = చూచి, లజ్జన్ = సిగ్గుతో, ఆననము = ముఖము, పాయఁగన్ = తొలఁగునట్లు, అల్లనన్= మెల్లఁగా, వాంచి = వంచి, సమ్మదా దీధితుల్ సమ్మద + అమృత - రస = సంతోషము అనెడి· అమృతరసముతో, పూరిత = నిండినదగుటచే, ఆర్ద్ర = తడిసిన, వినిమీలిత = మూయఁబడిన, లోల = చంచలమైన, కటాక్ష - వీక్షణ = క్రీఁగంటిచూపులయొక్క, ఆయత = దీర్ఘములయిన, సిత = తెల్లని, దీధితుల్ =

కాంతులు, కలయన్ = కూడఁగా, రాజత-గిరి-మీఁదన్ = వెండికొండపై, ఉన్నతిన్= ఉన్నతిలో, నిశాకర-దీప్తులు = చంద్రుని కాంతులు, కప్పు + ఒప్పునన్ = కప్పు విధమున, మహేశుమీఁదన్ = మహేశ్వరునిపై, విచ్చెన్ = వ్యాపింపఁజేసెను

**తాత్పర్యము** పార్వతి భర్తను జూచి సిగ్గుతో ముఖము తొలఁగునట్లు మెల్లఁగా వంచి, ఆనందామృతరసముచే నిండినదగుటచేఁ దడిసిన, మూయఁబడిన, చంచలమైన క్రీఁగంటిచూపుల నిడుపులు, తెల్లనివి అగుకాంతులు కూడఁగా, పార్వతి మహేశ్వరునిపై - వెండికొండపై నున్నతితోఁ జంద్రుని కాంతులు వ్యాపించువిధమున వ్యాపింపఁజేసెను

**విశేషములు** అలంకార ముపమ మహేశునకు రాజతగిరి ఉపమానము అద్రిజ కటాక్షవీక్షణాయతసితదీధితులకు నిశాకర దీప్తులు ఉపమానము వా ప్రతిలోని 'అర్థ' కంటె 'ఆర్ద్ర' మేలనిపించుటచే నది స్వీకృతము స్వభావోక్తియు

**వ అంత నంతకాంతకుం డచలసుత చంచలాపాంగావలోకన సుధారసప్రవాహనిర్మగ్నుండై సొగియుచు 70.**

**అర్థము** . అంతన్, అంతక + అంతకుండు = యముని అంత మొందించినవాఁడు - ఈశ్వరుఁడు, అచల-సుత = పార్వతియొక్క, చంచల + అపాంగ + అవలోకన - సుధా - రస -ప్రవాహ - నిర్మగ్నుండు + ఐ = చలించు క్రీఁగంటి చూపులనెడు, అమృతరస ప్రవాహమునందు మునిఁగినవాఁడయి, సొగియుచున్ = పారవశ్యము చెందుచు

**తాత్పర్యము.** అంత నీశ్వరుఁడు పార్వతి చలించు క్రీఁగంటి చూపులనెడు అమృతరసప్రవాహమునందు మునిఁగి, పరవశుఁడగుచు - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు.** అపాంగావలోకన సుధారసప్రవాహ - రూపకము

**సీ మెలరారు క్రీఁగంటి మెఱుఁగుఁదీఁగల డుల్లు**
**కారాకులొక్కొ క్రొక్కారు మెఱుఁగు?**
**లాననకాంతి సుధాంభోధి కల్లడి**
**డిండీరమో చంద్రమండలంబు?**
**ఎసితోచితాలాప రసపూరమును గ్రమ్మఁ**
**జాలుఁగాకేమి రసాయనంబు?**
**నీలధమ్మిల్ల తమాల ప్రతానిని**
**చివుళులో నర్తించు శిఖికలాప?**

తే  మనుచు రమణీయమగు నపాంగావలోక
నాతిభాతియు వదనాంబుజాతరుచియు
వచనమాధుర్యమును నురుకచభరంబు
దేవదేవుండు తగిలి కీర్తింపఁదొడఁగె 71

**అర్థము** ( క్రొక్కారు (క్రొత్త + కారు)-మెఱుఁగులు = తొలకరి మెఱుపులు, మెలరారు - సంచరించు, క్రీఁగంటి (క్రింది + కంటి) - మెఱుఁగుఁదీఁగలన్ (మెఱుఁగు + తీఁగలన్) క్రీఁగన్నుల చూపులనెడి మెఱుపుఁదీఁగలనుండి, డుల్ల = రాలునట్టి, కారాకులు + ఒక్కో = పండుటాకులా?, అనుచున్, రమణీయము + అగు = సుందరమగు, అపాంగ + అవలోకన + అతిభాతియున్ = క్రీఁగంటిచూపుల అమితమైనకాంతిని,

చంద్ర-మండలంబు = చంద్రబింబము, ఆనన-కాంతి-సుధా + అంభోధి=ముఖకాంతియనెడు అమృతసముద్రముయొక్క, కల్లడి = పొంగు, డిండీరమో = నురుగో, (అనుచున్, రమణీయమగు), వదన + అంబుజాత - రుచియున్ = ముఖపద్మకాంతిని,

రసాయనంబు = అమృతము, లసిత + ఉచిత + ఆలాప -రస-పూరమును= ఒప్పునట్టి, తగిన, వాగ్రసప్రవాహమును, క్రమ్మన్ + చాలున్ + కాకేమి = ప్రసరింపఁజేయఁజాలునుగదా, (అనుచున్ రమణీయమగు) వచన - మాధుర్యమును = వాఙ్మాధుర్యమును,

నర్తించు - శిఖి - కలాపము = నృత్యముచేయు నెమిలిపించము, నీల-ధమ్మిల్ల - తమాల - ప్రతానిని - చివుళులో = నల్లనికొప్పు అనెడి చీఁకటి మ్రానిలతయొక్క చివురులా, (అనుచున్, రమణీయమగు) ఉరు-కచ-భరంబున్= గొప్పదియగు కొప్పును

దేవదేవుండు = శివుఁడు, తగిలి = ఆసక్తిగలిగి, కీర్తింపన్ + తొడఁగెన్ = ప్రశంసింప నారంభించెను

**తాత్పర్యము :** దేవదేవుఁడైన శివుఁడు పార్వతియొక్క సుందరమయిన క్రీఁగంటి చూపులకాంతిని తొలకరి మెఱుపో, సంచరించు క్రీఁగంటిచూపులనెడి మెఱుఁగుఁదీఁగలనుండి రాలినపండుటాకులో అనుచును ఆమె సుందరమైన ముఖపద్మకాంతిని చంద్రమండలమో, ముఖకాంతియనెడు అమృతసముద్రపు

నురుగో అనుచును, ఆమె సుందరమగు వాఙ్మాధుర్యమును అమృతమో, ఒప్పునట్టి వాగ్రసప్రవాహమును ప్రసరింపఁజేయఁజాలునో అనుచును, ఆమె సుందరమగు గొప్పకొప్పును నృత్యము చేయునెమిలి పింఛమో, నల్లని కొప్పు అనెడి చీఁకటిప్రమాని తీవచిగురులో అనుచును ఆసక్తితోఁ బ్రశంసింప నారంభించెను

**విశేషములు** అలంకారము ఉత్ప్రేక్ష, యథాసంఖ్యము ఈ పద్యాన్వయ మించుక క్లేశకరమయినది ఒక్కొక్క ఉపమేయమునకు రెండేసి ఉపమానములు

**వ ఇట్లు హార గిరిజ లధికప్రణయరసాపూర్ణసాగరంబులను నభిమానశీలంబులను నతిక్రమించుచున్న కన్నెఱింగి పరమేశ్వరునకుం జతురిక కృతాంజలియై 72**

**అర్థము .** ఇట్లు, హర - గిరిజలు = శివుఁడును, బార్వతియు, అధిక - ప్రణయ - రస + ఆపూర్ణ - సాగరంబులను = ఎక్కువైన ప్రేమమనెడిజలముతో నిండిన సముద్రములను, అభిమాన-శీలంబులనున్ = అభిమానమును, శీలమును, అతిక్రమించుచున్ +ఉన్న = దాఁటుచున్న, కన్నెఱింగి = జాడతెలిసి, పరమేశ్వరునకున్, చతురిక, కృత + అంజలి + ఐ = నమస్కరించినదయి

**తాత్పర్యము** ఇట్లు పార్వతీశ్వరులు అధికమైన అనురాగరసముతో నిండిన సముద్రములను, అభిమాన శీలములను అతిక్రమించుచున్న జాడతెలిసి చతురిక పరమేశ్వరునకు నమస్కరించినదయి - తరువాతి పద్యముతో నన్వయము

**క గిరిసుత కన్యాగుణ మా**
**దరమున మును సుప్రతిష్ఠితము సేసి లసత్**
**పరిణయ పూర్వకమున నీ**
**శ్వర! సుదతిఁ బరిగ్రహింపు సన్మార్గమునన్ 73**

**అర్థము.** గిరి - సుత-కన్యా-గుణము = పార్వతి కన్యాత్వము, ఆదరమునన్= మన్ననతో, మును = ముందు, సుప్రతిష్ఠితము + చేసి = బాగుగా స్థాపించి, ఈశ్వర= ఈశ్వరుఁడా ! లసత్ + పరిణయ - పూర్వకమునన్ + ఒప్పుచున్న వివాహపూర్వకముగా, సత్ + మార్గమునన్ = మంచి పద్ధతిని, సుదతిన్ = ఇంతిని- పార్వతిని, పరిగ్రహింపు = స్వీకరింపుము

**తాత్పర్యము :** ఈశ్వరా! ముందు పార్వతి కన్యాత్వమును మన్ననతో స్థాపించి ఒప్పునట్టి వివాహపూర్వకముగా మంచిపద్ధతిని బార్వతిని స్వీకరింపుము

**విశేషములు** పరిగ్రహింపు - పరిగ్రహింపుము - 'మధ్యమపురుషమువర్ణకంబునకు హలవసానంబులు పరంబులగునపుడు లోపము విభాషనగు ' బాల సంధి 47 సన్మార్గము - సత్ + మార్గము - అనునాసిక సంధి

వ **హిమవంతు నఖిలజగద్వినుతుం జేసి కృతార్థుం జేయవలయుననిన వరదుండు దాని కోరినవరంబు దయసేసి** 74

**అర్థము .** హిమవంతున్, అఖిల - జగత్ + వినుతున్ = ఎల్లలోకములచేఁ బొగడఁబడువానిని, చేసి, కృత + అర్థున్ = ధన్యుని, చేయవలయున్, అనినన్, వరదుండు = వరములనిచ్చువాఁడు - ఈశ్వరుఁడు, దాని - కోరిన - వరంబు = ఆమె కోరిన కోరిక, దయ + చేసి = ఇచ్చి

**తాత్పర్యము .** హిమవంతుని సర్వలోకస్తుతిపాత్రునిగాఁ జేసి ధన్యాత్ముని జేయవలయు ననఁగా వరదుఁడగు నీశ్వరుఁడు ఆమెకోరినకోరిక ననుగ్రహించి - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** దాని కోరిన - అది కోరిన - 'ధాతుజవిశేషణ భావార్థక పూర్వ్యవహితావ్యవహిత కర్తృపదప్రథమకుఁ దఱచుగ యొక్కషష్ఠి యగు ' దాని యొక్క కోరిన - ప్రౌఢ కారక 15 'యొక్కకు లోపంబు బహుళంబు' - ప్రౌఢ కారక 16 దానికోరిన

క **తమకంబున నరుగు మరా**
**ళము లంబుదరవము విని చలాచలమతి సం**
**గము వాసినట్లు నవసం**
**గమ మిరువురు వదలి చతురికావచనగతిన్** 75

**అర్థము .** తమకంబునన్ = మోహముతో, అరుగు = వెడలు, మరాళములు = హంసలు - అంచల కవ, అంబుద - రవమున్ = మేఘధ్వనిని - ఉఱుమును, విని, చలాచలమతిన్ = చలించుబుద్ధితో, సంగము = కలయిక, పాసిన + అట్లు = వీడిన విధమున, ఇరువురున్ = ఇద్దఱును - పార్వతీశ్వరులు, చతురికా - వచన - గతిన్ = చతురిక మాటనుబట్టి, నవ-సంగమము = క్రొత్తకలయిక, వదలి = వీడి

**తాత్పర్యము .** మోహముతో వెడలు సంచలజంట మేఘధ్వని వినఁగనే చలించు బుద్ధితోఁ గలయిక వీడినట్లు పార్వతీశ్వరులిద్దఱును జతురికమాట ననుసరించి క్రొత్తకలయికను వీడి - తరువాతి వచనముతో నన్వయము

**విశేషములు .** అలంకార ముపమ

వ హర గిరిజ లొండొరుల చిత్తంబులు విడుజట్లుగొని తార నీ హారాచలంబుల కరిగి రంత నంత వృత్తాంతంబును హిమవంతుం డెఱింగి నిజరాజమందిరోత్సవంబుసేయించి సమస్త రాజ్య విభవాన్వితుండై 76

**అర్థము** ·హరగిరిజలు = హరుఁడును గిరిజయు, ఒండొరుల = ఒక్కొక్కరి, చిత్తంబులు = మనసులు, విడుజట్లు + కొని = ఒకరి మనసు నొక రాకర్షించి, తార - నీహార + అచలంబులకున్ = క్రమముగా వెండి కొండకును, మంచుకొండకును, అరిగిరి, అంతన్, అంత-వృత్తాంతంబును = సర్వవిషయమును, హిమవంతుండు, ఎఱింగి, నిజ-రాజమందిర + ఉత్సవంబు = తనదైన రాజభవనపువేడుక, చేయించి సమస్త - రాజ్య - విభవ + అన్వితుండు + ఐ = సకల రాజ్యవైభవములతోఁ గూడిన వాఁడయి -

**తాత్పర్యము .** శివపార్వతు లొకరొకరిమనస్సు లాకర్షించుకొని క్రమముగా కైలాసమునకును, హిమవత్పర్వతమునకును వెడలిరి అంత హిమవంతుఁడెల్ల వృత్తాంతము నెఱిఁగి తన రాజభవనోత్సవమును జేయించి సకల రాజ్యవైభవముతోఁగూడిన వాఁడయి - తరువాతి పద్యముతో నన్వయము

క చనుదెంచి పేర్మితో నిజ
తనయం దోడ్కొని ముదమునఁ దన పురమునకుం
జని సతులఁ దపోవేషం
బనునయమున సుతకుఁ బాపుఁ డని నియమించెన్ 77

**అర్థము .** చనుదెంచి = వచ్చి, పేర్మితోన్ = కూరిమితో, నిజ-తనయన్ = తన కూఁతును - పార్వతిని, తోడ్కొని = తీసికొని, ముదమునన్ = సంతోషముతో, తన - పురమునకున్ = తన నగరమునకు - ఓషధిప్రస్థ పురమునకు, చని, సతులన్ = ఇంతులను - చెలికత్తెలను, సుతకున్ = కూఁతునకు, తపస్ + వేషంబు = తాపసవేషమును, అనునయమునన్ = ప్రార్థనముతో, పాపుఁడు = తొలగింపుఁడు అని, నియమించెన్ = ఆజ్ఞాపించెను

**తాత్పర్యము** వచ్చి కూరిమితోఁ దన కూఁతును దీసికొని సంతోషముతోఁ దనపురమునకు వెడలి తన కూఁతునకుఁ దాపసవేషమును దొలఁగింపుఁడని యామె చెలికత్తెల నాజ్ఞాపించెను

వ అంత నంతఃపురాభ్యంతరప్రౌఢకాంత లత్యంతసంతోషంబున సుగంధతైలాభ్యంగనామలకోద్వర్తనపూర్వం బపరిమిత పరిమళమిళిత హంసోదకంబుల 78

**అర్థము .** అంతన్, అంతఃపుర + అభ్యంతర - ప్రౌఢకాంతలు = అంతిపురమునందలి ప్రౌఢాంగనలు, అత్యంత - సంతోషంబునన్ = మిక్కిలి సంతోషముతో, సుగంధ - తైల + అభ్యంగన + అమలక + ఉద్వర్తన - పూర్వంబు = పరిమళవంతమైన నూనెతోడి తలంటును ఉసిరికపిండితో నలుగువెట్టుట మున్నుగా, అపరిమిత - పరిమళ - మిళిత - హంస + ఉదకంబులన్ = అధికమైన సువాసనతోఁగూడిన - ఎండకు వేఁడెక్కి, వెన్నెలకుఁ జల్లఁబడు నీరులతో

**తాత్పర్యము .** అంత నంతిపురమునందలి ప్రౌఢాంగనలు మిక్కిలి సంతోషమునఁ బరిమళవంతమైన నూనియతోడి తలంటును ఉసిరికపిండితో నలుగువెట్టుట మున్నుగా నధికమైన సువాసనతోఁగూడిన హంసోదకములతో- తరువాతి పద్యముతో నన్వయము

తే . ఒడలి భస్మరజంబు పోఁ గడిగి పుచ్చి
జడలు విచ్చినఁ గరమొప్పె శైలతనయ
కాలపరిణతి నిర్ముక్త గళిత పర్ణ
మధుకరాకీర్ణ తరులతామహిమ పోలె 79

**అర్థము .** ఒడలి - భస్మ - రజంబు = మేని బూదిపొడి, పోన్ = పోవునట్లు, కడిగి - పుచ్చి = కడిగివైచి, జడలు, విచ్చినన్ = విప్పఁగా, శైల - తనయ = కొండకూఁతురు - పార్వతి, కాల - పరిణతిన్ = కాలముయొక్క మార్పుచే, నిర్ముక్త = విడువఁబడిన, గళిత-పర్ణ = రాలిన ఆకులు గలిగినట్టియు, మధుకర + ఆకీర్ణ = తుమ్మెదలతో నిండినట్టియు, తరు-లతా మహిమ + పోలెన్ = చెట్టుతీఁగవిధము వలె, కరము + ఒప్పెన్ = మిక్కిలి యొప్పెను

**తాత్పర్యము .** మేని బూదిపొడి పోవునట్లు కడిగివైచి, జడలు విప్పఁగాఁ, బార్వతి, కాలపరిణతిచే నాకులు రాలి తుమ్మెదలు నిండిన చెట్టుతీఁగవలె మిక్కిలి యొప్పెను

**విశేషములు .** అలంకార ముపమ మహిమ = విధము - ఉపమా వాచకము

ఆ	కసటుపోవఁ దొడసి కడిగిన కనకంపుఁ
బ్రతిమవోలె నొప్పు నతివ మేను
కచభరంబు పొల్చె గవుసెన వుచ్చిన
కుసుమబాణు నీలకుంచి వోలె 80

**అర్థము** అతివ - మేను = ఇంతి (పార్వతి) శరీరము, కసటు + పోవన్ = మురికి పోవునట్లు, తొడసి = తోమి, కడిగిన, కనకము + ప్రతిమ + పోలెన్ = బంగారు బొమ్మ విధమున, ఒప్పున్, కచ-భరంబు = కొప్పు, గవుసెన = గలీబు, పుచ్చిన = తీసివైచిన, కుసుమ - బాణు = పుష్పాస్త్రుని (మన్మధుని) యొక్క, నీల - కుంచి + పోలెన్ = నల్లని కుంచెవలె, పొల్చెన్ = ఒప్పెను

**తాత్పర్యము .** పార్వతి యొడలు మాలిన్యము పోవునట్లు తోమికడిగిన బంగారు ప్రతిమవలె నొప్పెను ఆమె కొప్పు గలీబు తీసివైచిన మన్మధుని నల్లని కుంచెవలె నొప్పెను

**విశేషములు .** అలంకారములు ఉపమలు కనకంపుఁ బ్రతిమ - కనకము + ప్రతిమ - 'కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బుంపు లగు' బాల సంధి 32 కనకంపు + ప్రతిమ పుంపులకుఁ బరుషము పరమగుచుండఁగా నుగాగమము + బాల సంధి 25 కనకంపు + ను + ప్రతిమ ద్రుతకార్యము బాల సంధి 16,17 కనకంపుఁ బ్రతిమ

## సప్తర్షులు శివునికడకు వచ్చుట

వ	**అంత నట గిరిశుండు రజతగిరి కరిగి పరిణయోద్యుక్తుండై సప్తర్షులం దలంచుడుఁ దదీయస్మరణ ప్రేరితంబై మునిగణం బాక్షణంబ చనుదెంచి 81**

**అర్థము.** అంతన్, అట = అక్కడ, గిరిశుండు = శివుఁడు (కొండపైఁబరుండు వాఁడు), రజత - గిరికిన్ = వెండికొండకు - కైలాసమునకు, అరిగి, పరిణయ + ఉద్యుక్తుండు + ఐ = పెండ్లికిఁ బ్రయత్నించినవాఁడయి, సప్త + ఋషులన్ = ఏడుగురు ఋషులను, తలంచుడున్ = తలఁచినంతనే, తదీయ + స్మరణ - ప్రేరితంబు + ఐ = ఆ శివునిదైన తలఁపుచేఁ బ్రేరేపింపఁబడినదయి, మునిగణంబు = మునుల సమూహము, ఆ-క్షణంబు + అ = ఆ క్షణమే, చనుదెంచి = వచ్చి

**తాత్పర్యము :** అంత నక్కడ శివుఁడు కైలాసమునకుఁ బోయి వివాహ ప్రయత్నము గలవాఁడయి సప్తమహర్షులను దలఁచినంతనే, ఆతని తలఁపుచేఁ బ్రేరేపింపఁబడినవారయి సప్తర్షులు వెంటనే వచ్చి - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు.** సప్తర్షులు = సప్త + ఋషులు - గుణసంధి గిరిశుఁడు = గిరిపై (కైలాసముపై) శయనించువాఁడు - శివుఁడు సప్తర్షులు - మరీచి, అత్రి, అంగిరసుఁడు, పులస్త్యుఁడు, పులహుఁడు, క్రతువు, వసిష్ఠుఁడు

క కనుచూడ్కింగోలెను దం
డ నమస్కారములు సేసి డాయంజని స
న్మునితతి కరముకుళితులై
వినుతించుచు నిలిచి రఖిలవేదస్తుతులన్ 82

**అర్థము.** కను- చూడ్కిన్ + కోలెను = చూచినది మొదలు, దండ - నమస్కారములు + చేసి = సాష్టాంగ ప్రణామములు చేసి, డాయన్ +చని = సమీపింపనేఁగి, సత్ + ముని - తతి = శ్రేష్ఠులైన మునుల సమూహము, కర- ముకుళితులు + ఐ = చేతుల ముకుళితములు గలవారయి - చేతులు జోడించినవారయి, అఖిల - వేద -స్తుతులన్ = సర్వవేదస్తోత్రములతో, వినుతించుచున్ = పొగడుచు, నిలిచిరి

**తాత్పర్యము.** సప్తర్షులు శివుని దర్శించినదిమొదలు సాష్టాంగ ప్రణామములు చేసి సమీపించి చేతులు జోడించి సర్వవేదస్తోత్రములతోఁ బొగడుచు నిలిచిరి

**విశేషములు.** సత్ + ముని = సన్ముని - అనునాసిక సంధి సన్మునితతి ముకుళితులై నిలిచిరి 'మహత్సమూహార్థకశబ్దం బమహత్కార్యయుక్తంబయ్యుఁ దద్విశేషణక్రియలు మహత్కార్యయోగ్యంబులు విభాష నగు ప్రౌఢ శబ్ద 17

వ అమ్మహర్షులు పరమేశ్వరానుమతంబున నిజార్హస్థానాసీనులై కరకమలంబులు మొగిడించి 83

**అర్థము.** ఆ + మహత్ (మహా) + ఋషులు = ఆ గొప్పమునులు, పరమేశ్వర + అనుమతంబునన్ = శివుని ఆజ్ఞచే, నిజ + అర్హ-స్థాన + ఆసీనులు + ఐ = తమకుఁ దగిన స్థానములందుఁ గూర్చున్నవారయి, కర - కమలంబులు = కేలుఁదమ్ములు, మొగిడించి = ముడువఁజేసి

**తాత్పర్యము.** ఆ గొప్ప మునులు శివుని యనుమతిచేఁ దమ కుచితములైన స్థానములందుఁ గూర్చున్నవారయి కేలుఁదమ్ములు ముడిచి - తరువాతి పద్యముతో నన్వయము

క  త్రినయన! నీ వెవ్వని మన
మునఁ దగ వర్తించి తతఁడు ముక్తుండగు నీ
మనమున వర్తించితి మటె
ధనదసఖా! యేమె కామె ధన్యుల మెందున్! 84

**అర్థము** త్రినయన = ముక్కంటీ! నీవు, ఎవ్వనిన్, మనమునన్ = మనసునందు, తగన్, వర్తించితి (వి) = ఉంచితివి, అతఁడు, ముక్తుండు + అగున్ = మోక్షము నొందినవాఁడగును, ధనద-సఖా = కుబేరుని మిత్రుఁడా! నీ - మనమునన్ = నీ మనసునందు, వర్తించితిమి + అటె = ఉండితిమట, ఎందున్, ఏము + ఎ = మేమే, ధన్యులము = కృతార్థులము, కామె = కామా?

**తాత్పర్యము .** ముక్కంటీ! నీవు మనసులో నెవనిని దలఁతువో అతఁడు మోక్షము నొందినవాఁడగును కుబేరమిత్రమా! మేము నీ మనసులో వర్తిలితిమట! ఎందును ధన్యులము మేమే కామా! అగుదు మనుట

**విశేషములు** వర్తించితతఁడు - వర్తించితి + అతఁడు వర్తించితివి + అతఁడు - 'లిద్వకారమునకు వైభాషికలోపము' - బాల క్రియ 24 వర్తించితి + ఇ + అతఁడు అంద్వవగాగమసంధి బాల సంధి 11 వర్తించితి + అతఁడు - 'మధ్యమపురుషక్రియలయం దిత్తునకు సంధి యగును ' బాల సంధి 7

వ  'మమ్ము రావించిన కార్యం బానతి యి'మ్మనిన నమ్మునీశ్వరుల నీశ్వరుండు కరుణావలోకన సముచితాలాపసుధా ప్రవాహంబునం దేల్చుచు 85

**అర్థము .** మమ్మున్, రావించిన, కార్యంబు = ప్రయోజనము, ఆనతి + ఇమ్ము + అనినన్ = సెలవిమ్మనఁగా, ఆ + ముని + ఈశ్వరులన్ = ఆ మునిశ్రేష్ఠులను, ఈశ్వరుండు, కరుణా + అవలోకన = సముచిత + ఆలాప - సుధా - ప్రవాహంబునన్=దయాదృష్టికి తగిన మాటలు అనెడి అమృతప్రవాహమునందు, తేల్చుచున్ = తేలునట్లు చేయుచు

**తాత్పర్యము :** 'మమ్ము రావించిన కార్యమును సెలవి'మ్మనఁగా, నా మునీశ్వరుల నీశ్వరుఁడు దయాదృష్టికిఁ దగిన యాలాపము అనెడి అమృతరసప్రవాహమునందుఁ దేల్చుచు తరువాతి పద్యముతో నన్వయము

చ గిరిజ తపఃప్రభూతికి నకృత్రిమభక్తికి మెచ్చి దానికిన్
వర మనురక్తి నిచ్చితి, వివాహమునం దదభీష్టసిద్ధి చె
చ్చెరఁ బొనరింపఁగావలయు, శీతగిరీశ్వరు పాలికేఁగి మ
త్పరిణయకార్య మోజగొనఁ బల్కి రయంబున రండు గ్రమ్మఱన్ 86

**అర్థము** గిరిజ - తపస్ + ప్రభూతికిన్ = పార్వతి తపస్సంపదకును, అకృత్రిమ - భక్తికిన్ = నిష్కపటమైన భక్తికిని, మెచ్చి, దానికిన్ = ఆమెకు, వరము, అనురక్తిన్ = ప్రేమముతో, ఇచ్చితిన్, వివాహమునన్ = పెండ్లిచే, తద్ + అభీష్ట - సిద్ధి = ఆమె కోరిక నెఱవేఱుట, చెచ్చెరన్ = శీఘ్రముగా, పొనరింపఁగాన్ + వలయున్ = చేయవలయును, (మీరు), శీత - గిరి + ఈశ్వరు-పాలికిన్ = మంచుకొండరాయని (హిమవంతుని) కడకు, ఏఁగి,మత్ + పరిణయ - కార్యము= నా పెండ్లిపని, ఓజ + కొనన్ = సిద్ధించునట్లు, పల్కి = మాటాడి, రయంబునన్ = వేగముగా, క్రమ్మఱన్ = మరల, రండు

**తాత్పర్యము .** 'పార్వతి తపస్సంపదకును, నిష్కపటమైన భక్తికిని మెచ్చి, యామెకు వర మనురాగముతో నొసఁగితిని పెండ్లిచే నామెకోరికను నెఱవేర్పవలయును మీరు హిమవంతునికడకరిగి నా వివాహకార్యము సిద్ధించునట్లు మాటలాడి మరల వేగముగా రండు '

**విశేషములు .** రండు - వచ్చు ధాతువు 'ఆశీశ్శాపసంప్రార్థన విధులందు లూట్టగు బాల క్రియ 6 వచ్చు + లూట్ 'లకారంబునకు డు జు వు రు ను ము ఙ్గు గు' బాల క్రియ 8 మధ్యమపురుష బహువచనము గావున - వచ్చు + రు 'లూణ్మధ్యమ వు రులకు ముడుజ్జులగు ' వచ్చు + డుజ్ బాల క్రియ 29 'మధ్యమ ముడుజీలు ముజ్జు నాఁబడు ' బాల క్రియ 31 ముజ్జీత్తులు ముత్తు నాఁబడు' బాల క్రియ 86 'అగు వచ్చు చొచ్చు చూచులకు ముత్తు పరంబగునపుడు కా రా చొరు చూడు లగు ' బాల క్రియ 91 రా + డు జ్ 'ముజ్జు పరంబగునపుడు దీర్ఘంబునకు హ్రస్వంబును మువర్ణకంబునకు మాముడియు నగు ' బాల క్రియ 61 ర + డుజ్ 'జిత్తు బిందు పూర్వంబగు' బాల తత్సమ 19 రండు

వ అని తమ్ము నాప్తులంజేసి నిజాప్తకార్యం బెఱిఁగించి నియమించుటకు నమ్మునులు ప్రముదితహృదయులై మహాప్రసాదంబని వీడుకొని శుభవాచనంబులు వినుచు, శుభద్రవ్యంబులు సూచుచు, శుభశకునంబులు గైకొనుచుం దుహినాచలంబునకుం జనిచని ముందట 87

**అర్థము** అని, తమ్ముఁన్, ఆప్తులన్ + చేసి = ఇష్టులనుజేసి, నిజ + ఆప్త - కార్యంబు = తనదైన ఇష్టమైన పని, ఎఱిఁగించి = తెలిపి, నియమించుటకున్ = నియోగించుటకు, ఆ + మునులు, ప్రముదిత-హృదయులు + ఐ = మిక్కిలి సంతోషించిన హృదయము గలవారయి, మహత్ (మహా) + ప్రసాదంబు + అని, వీడుకొని = సెలవుగైకొని, శుభ-వచనంబులు = శుభకరములైన మాటలు, వినుచున్, శుభ-ద్రవ్యంబులు = శుభకరవస్తువులు, చూచుచున్, శుభ-శకునంబులు = శుభకరములైన శకునములు, కైకొనుచున్ = స్వీకరించుచు, తుహిన + అచలంబునకున్ = మంచుకొండకు-హిమవంతమునకు, చనిచని = పోయిపోయి, ముందటన్ = ఎదుట

**తాత్పర్యము** అని తమ్ముఁ హితులనుజేసి తన యిష్టకార్యము నెఱిఁగించి నియోగించుటకు ఆ మునులు సంతసించి మహాప్రసాదమని సెలవుపుచ్చుకొని శుభవచనములు వినుచు, శుభద్రవ్యములు చూచుచు, శుభశకునములు గైకొనుచు హిమవంతమునకుఁ బోయిపోయి యెదుర - తరువాతి పద్యముతో నన్వయము

చ **పరము కపర్దరాగరుచి పర్వెనొ? కాంచనశైలభాతి మైఁ**
**బొరసెనొ? కల్పవృక్షఫలభూరిరసం బొడఁగూడెనో? నదీ**
**శ్వర వర సంగ మాగమన సమ్మదరాగమొ? నాఁగ హేమ పం**
**కరుహ రజఃపిశంగరుచిఁ గ్రాలు సురాపగఁ గాంచి రమ్మునుల్** 88

**అర్థము** . అమ్మునుల్ = ఆ + మునుల్ = ఆ సప్తర్షులు, పరము = ఉత్కృష్టుఁడైన యీశ్వరునియొక్క, కపర్ద-రాగ-రుచి = జటాజూటముయొక్క ఎఱ్ఱని కాంతి, పర్వెనొ = వ్యాపించెనో, కాంచన-శైల-భాతి = బంగరుకొండ (మేరువు) కాంతి, మైన్ = మేన, పొరసెనొ = పొందెనో, కల్పవృక్ష-ఫల-భూరి-రసంబు = ఈవిమ్రాని పండ్ల అధికమైన రసము, ఒడఁగూడెనో = లభించెనో, నదీ+ ఈశ్వర-వర-సంగమ + ఆగమన-సమ్మద-రాగమొ = సముద్రునితోడి మేలయిన కలయికకొఱకు వచ్చుటయందలి సంతోషముయొక్క ఎఱుపో, నాఁగన్ = అనఁగా, హేమ - పంకరుహ-రజస్-పిశంగ-రుచిన్= బంగరు తామరల పుప్పొడి యొక్క కపిల వర్ణపుఁగాంతితో, క్రాలు = ఒప్పు, సుర + ఆపగన్ = దేవనదిని-గంగానదిని, కాంచిరి = చూచిరి

**తాత్పర్యము** ఆ సప్తర్షులు పరమేశ్వరుని జటాజూటము నెఱ్ఱని కాంతి వ్యాపించెనో, మేరు పర్వతకాంతి మేనఁ గలిగెనో, కల్పవృక్షఫలముల అధికమైన

రసము పొందెనో, సముద్రునితోడి కలయికకై వచ్చుట యందలి సంతోషపుటెఱుపో యన బంగరు తామరల పుప్పొడిదైన కపిలవర్ణపుఁగాంతితో నొప్పు గంగానదిని జూచిరి

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష, సందేహము కాంచి సన్మునుల్ అను పాఠముకంటె రాళ్లపల్లివారి 'కాంచి రమ్మునుల్' అను పాఠము మేలయినదిగాఁ గనుపట్టుటచే నది స్వీకరింపఁబడినది

మ. **కర మొప్పన్ వియదంగనా తరలముక్తాహారమో శంభు న**
**త్యురు జూటాశ్రిత సర్పకంచుకమొ, హేమోర్వీధరోద్యత్సుధా**
**కరకాంతంబొ, హిమాచలోపరిశరత్కందంబొ, భూస్త్రీసితాం**
**బరమో వారిధి తృష్ణఁ ద్రాగెడు సుధాపానంబొ నాఁగా మునుల్** 89

**అర్థము .** మునుల్ = మునులు - సప్తర్షులు, వియత్ + అంగనా-తరల-ముక్తా-హారమో = ఆకాశమనెడి స్త్రీయొక్క చలించుచున్న ముత్యాలపేరో, శంభు = శివునియొక్క, అతి + ఉరు-జూట + ఆశ్రిత-సర్ప-కంచుకమొ = మిక్కిలి పెద్దదైన జడముడిని ఆశ్రయించిన పాము కుబుసమో, హేమ + ఉర్వీధర + ఉద్యత్ + సుధాకర కాంతంబొ = మేరుపర్వతమునందుఁ బైకి లేచుచున్న చంద్రకాంతశిలయో, హిమ + అచల + ఉపరి-శరద్ + కందంబొ = హిమవత్పర్వతముపైనున్న శరత్కాలమేఘమో, భూ-స్త్రీ-సిత + అంబరమో = భూమియను నింతి తెల్లనివస్త్రమో, వారిధి = సముద్రము, తృష్ణన్ = దప్పితో, త్రాగెడు = త్రాగునట్టి, సుధా-పానంబొ = అమృత పానీయమో, నాఁగాన్ = అనఁగా, కరము + ఒప్పన్ = మిక్కిలి ఒప్పఁగా, (సురాపగఁ గాంచిరి)

**తాత్పర్యము :** మునులు ఆకాశమనెడు స్త్రీ తాల్చిన చలించు ముత్యాల పేరో, శివుని జటాజూటము నాశ్రయించిన పాము కుబుసమో, మేరుపర్వతముపైకిఁ బోవుచున్న చంద్రకాంతశిలయో, హిమవత్పర్వముపైఁగల శరత్కాలమేఘమో, భూమియను స్త్రీ ధరించిన తెల్లని వస్త్రమో, సముద్రము దప్పితోఁ ద్రాగునట్టి అమృతపానీయమో అనఁ మిక్కిలి యొప్పు (సురాపగను గాంచిరి)

**విశేషములు :** 'సురాపగఁ గాంచిరి' అను పూర్వపద్యమునందలి దానితో దీనిని బూరింపవలయును అలంకారము ఉత్ప్రేక్ష, సందేహము వియదంగనా, భూస్త్రీ అనుచోట్ల రూపకము 'హేమోర్వీధరగ్లౌసుధాకరకాంతంబొ' అను దానికంటె, 'హేమోర్వీధరోద్యత్సుధాకరకాంతంబొ' అను పాఠము మేలయినదిగాఁ గనవచ్చుటచే

నది స్వీకరింపఁబడినది 'కాంతము' అనుదానిని చంద్ర సూర్యాయశ్శబ్దముల తుదిని జేర్చుచో 'శిల' అర్థము నిచ్చును

**వ అని వర్ణించుచుం దదీయామల స్నాన పవిత్రీకృతగాత్రులై తుహినాచలంబునకుం జని తదుపకంఠంబున 90**

**అర్థము** . అని, వర్ణించుచున్, తదీయ + అమల-స్నాన-పవిత్రీకృత-గాత్రులు + ఐ = గంగానదికి సంబంధించిన నిర్మలమైన స్నానముచేఁ బవిత్రముగాఁ జేయఁబడిన శరీరములు గలవారయి, తుహిన + అచలంబునకున్ = మంచుకొండకు, చని = వెడలి, తద్ + ఉపకంఠంబునన్ = దాని సమీపమున

**తాత్పర్యము.** అని వర్ణించుచు నా గంగానదియందు నిర్మలమైన స్నానముచేఁ బావనముగాఁజేయఁబడిన శరీరములు గలవారయి హిమాచలమునకుఁ బోయి, దాని సమీపమున - తరువాతి పద్యముతో నన్వయము

**ఓషధిప్రస్థ పుర వర్ణనము**

**సీ వేదాదులగు మహావిద్యల కెల్లను**
**వనజాసనుఁడుఁ దాను నునికిపట్లు**
**శృంగారవతులగు నంగనావలి కెల్ల**
**నమరావతియుఁ దాను నాలయంబు**
**లనుపమానర్ఘ్యరత్నానీకముల కెల్ల**
**నంభోనిధియుఁ దాను నాకరంబు**
**లక్షయంబగు నసంఖ్యార్థరాసుల కెల్ల**
**నలకయుఁ దానును నిలయము లన**
**తే ` వఱలు పేర్మితో భారతవర్షమునకు**
**భూషణం బన నధికవిభూతిఁ దనరి**
**పరఁగు హిమనగాధీశ్వరు పురవరంబు**
**ప్రస్తుతం బగు నోషధీప్రస్థపురము 91**

**అర్థము** . వేద + ఆదులు + అగు = వేదములు మున్నుగాఁగల, మహత్ (మహా)-విద్యలకున్ + ఎల్లన్ = గొప్ప చదువులకెల్లను, వనజ + ఆసనుఁడున్ = తామర ఆసనముగాఁ గలవాఁడు - బ్రహ్మయును, తానున్ = తానును - ఓషధీప్రస్థపురమును, ఉనికిపట్లు = ఉండుచోట్లు

శృంగారవతులు + అగు = సౌందర్యవతులైన, అంగనా + ఆవలికిన్ + ఎల్లన్ = స్త్రీల వరుస (సమూహము) కంతకును, అమరావతియున్ = దేవతల పత్తనమైన అమరావతియును, తానున్, ఆలయంబులు = నిలయములు

అనుపమ + అనర్ఘ్య-రత్న + అనీకములకున్ + ఎల్లన్ = సాటిలేని, అమూల్యములైన, రత్నముల సమూహములకెల్లను, అంభోనిధియున్ = సముద్రమును, తానున్, ఆకరంబులు = స్థానములు

అక్షయంబు = నాశనములెనివి అగు, అసంఖ్య + అర్థ-రాసులకున్ + ఎల్లన్= లెక్కలేని ధనరాశుల కన్నిటికిని, అలకయున్ = కుబేరుని పత్తనమై అలకానగరమును, తానున్, నిలయములు = చోట్లు,

అనన్ = అనునట్లు, వఱలు-పేర్మితోన్ = ఒప్పునట్టి గొప్పతనముతో భారతవర్షమునకున్ = భారతదేశమునకు, భూషణంబు = అలంకారము, అనన్= అనఁగా, అధిక-విభూతిన్ = ఎక్కువ సంపదతో, తనరి = తగి, పరఁగు = ఒప్పునట్టి, హిమ-నగ + అధి + ఈశ్వరు-పుర-వరంబు = హిమవత్పర్వతరాజు నగరశ్రేష్ఠము, ఓషధీప్రస్థపురము = ఓషధీప్రస్థ మనుపత్తనము, ప్రస్తుతంబు + అగున్ = మిక్కిలి పొగడఁబడినది యగును

**తాత్పర్యము .** వేదములు మున్నుగాఁగల మహావిద్యలకెల్ల బ్రహ్మయును దానును స్థానములు, సౌందర్యవతులగు స్త్రీలకెల్ల నమరావతియును దానును నిలయములు, సాటిలేని అమూల్యములైన రత్నముల సమూహములకెల్ల సముద్రమును దానును స్థానములు, క్షయముగాని లెక్కలేని ధనరాశులకెల్ల నలకాపత్తనమును దానును నిలయము లనఁగానొప్పి భారతదేశమున కలంకారమన మిక్కిలి సంపదతోఁ దగి యొప్పు హిమవత్పర్వతరాజు పత్తనశ్రేష్ఠమైన ఓషధీప్రస్థపురము మిక్కిలి పొగడఁబడినది యగును

**విశేషములు .** అలంకార ముదాత్తము

**వ తత్పురవరంబునందు** **92**

**అర్థము .** తద్ + పుర-వరంబు + అందున్ = ఆ నగరశ్రేష్ఠమైన ఓషధిప్రస్థమందు

**తాత్పర్యము:** ఆ నగరశ్రేష్ఠమైన ఓషధిప్రస్థమునందు - తరువాతి పద్యముతో నన్వయము

క జల మిక్షు ఫల రసంబులు
కలు పంబురుహోత్పలములు, గరుసులు ముత్యం
బులు, మీలు మణులు సంకులు
నలి సస్యము చెఱకు రాజనపుఁబొల మెల్లన్ 93

**అర్థము** రాజనపుఁబొలము = మేలిరకపువరి పండు పొలము, ఎల్లన్ = అంతయును, జలము = నీరు, ఇక్షు-ఫల-రసంబులు = చెఱకురసములు, కలుపు = సస్యములో మొలచు గాద, అంబురుహ + ఉత్పలములు = తామరలు, కలువలు, గరుసులు = గులకఱాలు, ముత్యంబులు, మీలు = చేఁపలు, మణులు, సంకులు = శంఖములు, నలిన్ = క్రమముగా, సస్యము = పంట, చెఱకు

**తాత్పర్యము** . మేలిరకపు వరిపండుచేలలోనెల్ల నీరు చెఱకు రసము, కలుపుగడ్డి తామరలు, కలువలు, గులకఱాలు ముత్యములు, చేఁపలు మణులును, శంఖములును, పంట చెఱకు

**విశేషములు** అలంకార ముదాత్తము మీలు-మీను - 'ఉవర్ణంబు బహువచనంబు' బాల తత్సమ 12 మీను + లు 'బహుబచనంబు పరంబగునపుడు చేను పేను మీను శబ్దంబుల నువర్ణంబు లోపించు' బాల ఆచ్ఛిక 20 మీలు రాజనపుఁబొలము రాజనము + పొలము 'కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బుంపు లగు' బాల సంధి 32 రాజనపు + పొలము 'సమానంబుల నుదంతంబులగు స్త్రీసమంబులకుం బుంపు లకుం బరుషసరళంబులు పరంబులగునపుడు నుగాగమం బగు' బాల సంధి 25 రాజనపు + ను + పొలము 'ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళము లగు' బాల సంధి 16 'ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందుసంశ్లేషములు విభాషనగు' బాల సంధి 17 రాజనపుఁబొలము

చ హాలిక నితంబినీ తతి ప్రయత్నమునం దమ కాచియున్న య
క్కలమవనాళిఁ జక్రవిహగంబులు సొచ్చినఁ జోఁపిపుచ్చఁ జే
తులు చఱువంగ నెత్తుటయుఁ దుంగకుచంబులు వాని నాఁగు న
ప్పులుఁగుల యొప్పు దమ్ము వెడఁ బోలినపక్షము సేయునట్టివై 94

**అర్థము** హాలిక-నితంబినీ-తతి = కాపుఁబడఁతుల సమూహము, ప్రయత్నమునన్ = ప్రయత్నముతో, తమ-కాచి + ఉన్న = తాము రక్షించియున్న,

ఆ + కలమ-వన + ఆళిన్ = ఆ వరిచేల వరుసను,చక్ర-విహగంబులు = చక్రవాకపక్షులు, చొచ్చినన్ = ప్రవేశింపఁగా, చోఁపి-పుచ్చన్ = తఱిమివేయుటకు, చేతులు చఱువంగన్= చఱుచుటకని, ఎత్తుటయున్ = ఎత్తఁగా, తుంగ-కుచంబులు = వారి యెత్తయిన పాలిండ్లు, ఆ + పులుఁగుల +ఒప్పు = ఆ పిట్టల చక్కఁదనము, తమ్మున్, వెడన్ = అల్పముగా, పోలిన - పక్షము + చేయు + అట్టివి + ఐ = పోలిన యభిమానము గలిగినట్టివయి, వానిన్ = ఆ చక్రవాకములను, ఆఁగున్ = ఆఁపును

**తాత్పర్యము .** వరిపొలములను గాచు కాపుఁబడఁతులగుంపు పూనికతోఁ దాము రక్షించుచున్న వరిచేలలోనికిఁ జక్రవాకపక్షులు ప్రవేశింపఁగా వానిని దఱిమివేయుటకు వారు తమ చేతులు చఱచుటకయి యెత్తఁగా, వారి యెత్తయిన స్తనములు, ఆ పక్షుల చక్కఁదనము తమ్ము ఇంచుక పోలిన యభిమానముచే వాని నాఁపును

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష తమ కాచియున్న - తాము కాచియున్న- 'ధాతుజవిశేషణ భావార్థక పూర్వవ్యవహితావ్యవహిత కర్తృపద ప్రథమకుఁ దఱచుగ యొక్కషష్ఠి యగు' ప్రౌఢ కారక 15 తమయొక్క కాచియున్న 'యొక్కకు లోపంబు బహుళంబు - ప్రౌఢ కారక 16 తమకాచియున్న అక్కలమ- ఆ + కలమ - త్రికసంధి

**చ నలిఁ గమలాననల్ మృదునినాదములన్ వెడదొక్కుఁబల్కులన్**
**సొలవక చిల్కలన్ వెడలఁజోఁపు నెలుంగులుఁ దమ్మ డాయరాఁ**
**బిలుచుట కాఁగ నా చిలుకపిం డనిశంబును జేలలోన మం**
**దలుగొని పాయకుండు మదిఁ దద్వచనశ్రవణాభిలాషులై** 95

**అర్థము :** కమల + ఆననల్ = పద్మముఖులు - కాపుఁబడఁతులు, నలిన్= ఉత్సాహముతో, మృదు-నినాదములన్ = మృదువులైన ధ్వనులతో, వెడ-తొక్కు+ పల్కులన్ = ఇంచుక అవ్యక్త మధురములైన మాటలతో, సొలవక = తగ్గక, చిల్కలన్= చిలుకలను, వెడలన్ + చోఁపు + ఎలుంగులున్ = పోఁద్రోలు కంఠధ్వనులు సైతము, తమ్మున్, డాయన్ + రాన్ + పిలుచుట-కాఁగన్ = దగ్గఱకు రమ్మని పిలుచునట్లు కాఁగా, ఆ-చిలుక-పిండు = ఆ చిలుకల గుంపు, అనిశంబును= ఎల్లప్పుడును, మదిన్ = మనస్సునందు, తద్ + వచన-శ్రవణ + అభిలాషులు + ఐ = వారి మాటల వినికియందుఁ గోరికగలవయి, చేలలోనన్ =

పొలములందు, మందలు +కొని = గుంపులుకట్టి, పాయక + ఉండున్ = విడువకుండును

**తాత్పర్యము :** పొలముకాపరులగు స్త్రీలు ఉత్సాహముతో మృదువులైన ధ్వనులతోను, ఇంచుక అవ్యక్త మధురములైన కంఠధ్వనులతోను తగ్గక చిలుకలను వెడలఁగొట్టుటకైన కంఠధ్వనులుసైతమును దమ్ము దగ్గఱకు రమ్మని పిలుచునట్లు కాఁగా, నా చిలుకలగుంపు ఎల్లప్పుడును మనసులో వారి మాటలను వినుకోరికతోఁ జేలలో గుంపులుకట్టి విడువకుండును

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష సొలవక - 'సొలచు' ధాతు వ్యతిరేక క్త్వార్థ రూపము చోఁపునెలుంగులు - చోఁపు + ఎలుంగులు - 'ఉదంతమగు తద్ధర్మార్థ విశేషణమున కచ్చు పరమగునపుడు నుగాగమంబగు' బాల సంధి 33 '

సీ నిమ్మలు మాదీఫలమ్ములు నతిరమ్య
ముగఁ బండి నేలపై మోచియుండుఁ
బనసలు నీడలుఁ బండి గుత్తులుగట్టి
వారక వానిపై వ్రాలియుండుఁ
దేరు మామిళ్లను నేరేళ్లుఁ గడుఁ జెల్వ
మై పండి వానిపై నదికియుండుఁ
గ్రముకంబులును వరఖర్జూర నికరంబు
నొగిఁ బండి వానిపై నొఱఁగియుండు

ఆ నాలికేరములును దాలసమూహంబుఁ
బండి వానిఁ గప్పియుండు నొప్పి
వరుసఁ దరతరంబ వనములు సత్ఫల
రాసులై నభమ్ము రాయుచుండు. 96

**అర్థము .** నిమ్మలున్, మాదీఫలమ్ములున్ = మాదిఫలమ్ములున్ = మాతులుంగములును, అతి-రమ్యముగన్ = మిక్కిలి సుందరముగా, పండి, నేలపైన్, మోచి + ఉండున్ = ఆనియుండును

పనసలున్, ఈడలున్ = ఈడెచెట్లును (ఎఱ్ఱకిత్తలి) పండి, గుత్తులు + కట్టి, వారక = ఉడుగక, వానిపైన్, వ్రాలి + ఉండున్

తేరు మామిళ్లను = తేరువలె నడుగున గుబురుగాను, పైని పొడుగుగాను

పెరుఁగు నొకజాతి మామిడులును, నేరేళ్లున్, కడున్, చెల్వము + ఐ = అందమయి, పండి, వానిపైన్, అదికి + ఉండున్

క్రముకంబులును = పోఁకలును, వర-ఖర్జూర-నికరంబున్ = మేలయిన ఖర్జూర సమూహమును, ఒగిన్ = క్రమముగా, పండి, వానిపైన్, ఒఱఁగి + ఉండున్= వ్రాలియుండును

నాలికేరములును = నారికేలములును - కొబ్బెరలును, తాల-సమూహంబున్= తాటిచెట్ల గుంపును, పండి, ఒప్పి వానిన్, కప్పి + ఉండున్

వరుసన్, తరతరంబ = క్రమక్రమముగా, వనములు = తోటలు, సత్ + ఫల-రాసులు + ఐ = మంచి పండ్లప్రోవులు గలవయి, నభమ్మున్ = ఆకాశమును, రాయుచున్ + ఉండున్ = ఒరయుచుండును

**తాత్పర్యము .** నిమ్మచెట్లును, మాదిపలములును మిక్కిలి అందముగాఁ బండి నేలపై నానియుండును పనసలును, ఈడచెట్లును పండి గుత్తులుగట్టి ఉడుగక వానిపై వ్రాలియుండును తేరుమామిడులును, నేరేళ్లును మిక్కిలి సుందరముగాఁ బండి వానిపై నదికియుండును పోఁకలును, మేలయిన ఖర్జూరములును పండి వానిపై నొఱఁగియుండును కొబ్బెరలును, తాటిచెట్ల గుంపును పండి వానిని గప్పియుండును తోఁటలు క్రమముగా మంచి పండ్లప్రోవులు గలవయి ఆకాశము నొరయుచుండును

**విశేషములు .** 'తేరు మామిండ్లు' అనుదానికంటె తేరుమామిళ్లు అను పాఠము మేలు, సలక్షణము

**మ రసముల్ గ్రమ్ముచు వృక్షపక్వఫలముల్ రమ్యేక్షుసంఘంబుపై**
**వెసఁ బడ్డన్ వడి వ్రస్సి వాని రస మొర్విన్ వెల్లిగొంచున్ వనం**
**బొసఁగన్ దత్తరురాజిపైఁ బఱచుఁ దా రొండొంటి కాత్మీయ స**
**ద్రసమాధుర్యత చూపున ట్లురుతరారామంబు లం దందమై 97**

**అర్థము .** అందున్ = ఆ ఓషధిప్రస్థపురమందు, ఉరుతర + ఆరామంబులు= మిక్కిలి పెద్దవియైన తోఁటలు, అందము + ఐ = సుందరమై, తారు = తాము - వృక్షములును, ఇక్షు సంఘమును, ఒండు + ఒంటికిన్ = ఒకదాని కింకొకటి, ఆత్మీయ-సత్ + రస-మాధుర్యత = తమదైన మేలైన రసముయొక్క తీయఁదనము,

చూపు + అట్లు = చూపువిధమున, వృక్ష-పక్వ-ఫలముల్ = చెట్ల పండిన పండ్లు, రసముల్, క్రమ్ముచున్ = కాఱుచు, రమ్య + ఇక్షు - సంఘంబుపైన్ = రమణీయమైన చెఱకులగుంపుపై, వెసన్ = శీఘ్రముగా, పడ్డన్ = పడఁగా, వడిన్= వేగముగా, వ్రస్సి = బ్రద్దలయి, వాని-రసము = ఆ చెఱకుల రసము, ఉర్విన్ = నేలమీఁద వెల్లి + కొంచున్ = ప్రవాహము కట్టుచు, వనంబు = నీరు, ఒసఁగన్ = ఇచ్చుటకు, తద్ + తరు-రాజిపైన్ = ఆ చెట్లవరుస మీఁదికి, పఱచున్ = ప్రవహించును

**తాత్పర్యము .** ఆ ఓషధిప్రస్థపురమున మిక్కిలి పెద్దవియైనతోఁటలు సుందరమై - వృక్షములును, చెఱకుగుంపులును బరస్పరము తమతమ మేలైనరసముల తీయఁదనములను జూపునట్లు - చెట్ల పండిన పండ్లు రసములు కాఱుచు రమణీయమైన చెఱకులగుంపుపై శీఘ్రముగాఁబడఁగా, వేగముగా విఱిగి ఆ చెఱకుల రసము నేలమీఁదఁ బ్రవాహముగట్టుచు నీటినిచ్చుట కా వృక్ష పంక్తిమీఁదికిఁ బ్రవహించును

**విశేషములు** అలంకారము అతిశయోక్తి, ఉత్ప్రేక్ష మాధుర్యత - భావార్థక తద్ధితాంతముపై మరల భావార్థకప్రత్యయము మాధుర్య మనుట సలక్షణము తత్తరు - తద్ + తరు - అనునాసికాంతస్థ భిన్నములైన హల్లులకు (ఝల్లులకు) కఠినహల్లులు ( ఖర్రులు) పరమగునపుడు వాని వర్గములందలి ప్రథమవర్ణములు (చర్రులు) ఆదేశముగా వచ్చును

**తే** **ఓలిఁ దాంబూలవల్లి తమాల నీల**
**భాతిఁ దఱఁకంగఁ, బరిపక్వ పనస పూగ**
**భాసురారుణద్యుతులు పైఁ బర్వి, పొగడఁ**
**జాలు వనలక్ష్మి ప్రత్యూషవేళ వోలె** 98

**అర్థము .** ఓలిన్ = క్రమముగా, తాంబూల-వల్లి = తమ్మలపుఁదీఁగ, తమాల-నీల-భాతిన్ = చీఁకటిమ్రాని నల్లని కాంతితో, తఱఁకంగన్ = వ్యాపింపఁగా, పరిపక్వ - పనస-పూగ - భాస్కర + అరుణ ద్యుతులు = బాగుగాఁ బండిన పనసల, పోఁకల ప్రకాశించు నెఱ్ఱని కాంతులు, పైన్ = పైని, పర్వి = వ్యాపించి, వన-లక్ష్మి, ప్రత్యూష-వేళ + పోలెన్ = ఉషఃకాలమువలె, పొగడన్ + చాలున్ = పొగడఁదగియుండును

**తాత్పర్యము**.తమ్ములపుఁదీఁగ క్రమముగాఁ జీఁకటిమ్రాని నల్లని కాంతితో వ్యాపింపఁగాఁ బండిన పనసల, పోఁకల ప్రకాశించు నెఱ్ఱనికాంతులు పైని బ్రసరించి వనలక్ష్మి ఉషఃకాలము వలెఁ బొగడఁదగియుండును

**విశేషములు**. అలంకార ముపమ తఱఁకు = వ్యాపించు - ఈ ధాతు వొక్క యీ కుమారసంభవకావ్యమునందే ప్రయుక్తమయినది

**మ.** **తమ వక్త్రాధర కేశ.యాన నయనోద్దామప్రభావంబులన్**
**రమణం బోలుదు మన్నఁ దత్పురసతుల్ రాజీవ బంధూక భృం**
**గ మరాళోత్పలరాజి నూరి వెలి నల్కన్ నీరఁ ద్రోపించిన**
**ట్లమరెం దోయజషండముల్ పురవరోద్యానంబులం దందమై** 99

**అర్థము**: తమ = తమయొక్క, వక్త్ర + అధర + కేశ-యాన-నయన + ఉద్దామ-ప్రభావంబులన్ = ముఖము, క్రిందిపెదవి, తలవెండ్రుకలు, నడక, కన్నులు అనువానియొక్క, గొప్ప మహిమలను, రమణన్ = ఒప్పిదమునందు, పోలుదుము + అన్నన్ = పోలుదుమనఁగా, తద్ + పుర-సతుల్ = ఆ ఓషధిప్రస్థపురమునందలి స్త్రీలు, రాజీవ-బంధూక-భృంగ-మరాళ + ఉత్పల-రాజిన్ = తామరల, మంకెనల, తుమ్మెదల, హంసముల, కలువల సమూహమును, ఊరి-వెలిన్ = ఊరివెలుపల, అల్కన్ = కోపముతో, నీరన్ = నీటియందు, త్రోపించిన + అట్లు = త్రోయునట్లు చేసిన రీతిని, పుర-వర + ఉద్యానంబులందున్ = పురశ్రేష్ఠమునందలి ఉపవనములందు, తోయజ-షండముల్ = జలజసమూహములు, అందము + ఐ, అమరెన్ = ఒప్పెను

**తాత్పర్యము** : ఆ ఓషధిప్రస్థపురమునందలి స్త్రీలు తమ ముఖము, క్రిందిపెదవి, శిరోజములు, గమనము, కన్నులు అనువాని గొప్పప్రభావములను, ఒప్పిదమునందుఁబోలుదుమనఁగాఁ దామరల, మంకెనపూల, తుమ్మెదల, హంసముల, కలువల సమూహమును గోపముతో నూరివెలుపల నీటియందుఁ ద్రోయించినట్లు ఆ పురమునందలి ఉద్యానవనములందు జలజసమూహము లొప్పును

**విశేషములు**.అలంకార ముత్ప్రేక్ష యథాసంఖ్యము ఆ యూరి స్త్రీలకుఁ దమ వక్త్రాదులను బోలుదు మన్నందులకు రాజీవాదులపైఁ గోపము అనఁగాఁదమ

వక్త్రాదులు సాటియేలేనివని వారి గర్వము వక్త్రమును రాజీవము, అధరమును బంధూకము, కెశములను భృంగములు, యానమును మరాళము, నయనములను ఉత్పలము పోలునని క్రమాన్వయము

మ వర కార్తస్వర వస్తు నిర్మితములై, వస్త్రాంగరాగ స్ర గా
భరణానోకహ నందనాన్వితములై, పానాశనాఢ్యంబులై,
స్మరకేళీనిరతాంగనాస్పదములై, సంగీతరంగంబులై
పురబాహ్యంబులఁ గృత్రిమాచలము లొప్పుం జూడ రమ్యంబులై 100

**అర్థము .** పుర-బాహ్యంబులన్ = ఆ ఓషధిప్రస్థపురము వెలుపలి ప్రదేశములందు, కృత్రిమ + అచలములు = క్రీడాపర్వతములు, వర-కార్తస్వర-వస్తు-నిర్మితములు + ఐ = శ్రేష్ఠములైన బంగారు వస్తువులతోఁ జేయఁబడినవయి, వస్త్ర + అంగరాగ-స్రజ్ + ఆభరణ + అనోకహ-నందన + అన్వితములు + ఐ = వస్త్రములు, మైపూఁతలు, పుష్పమాలలు, అలంకారములు, వృక్షములు, ఉద్యానములు అనువానితోఁ గూడినవయి, పాన + అశన + ఆఢ్యంబులు + ఐ = త్రాగుడు, తిండి అనువానితో సమృద్ధములయి, స్మర-కేళీ-నిరత + అంగనా + ఆస్పదములు + ఐ = మన్మథక్రీడయందు మిక్కిలి యాసక్తిగల స్త్రీలకుఁ జోటయినవియు, సంగీత-రంగంబులు + ఐ = గానమునకు స్థానములయినవియునై, చూడన్ + రమ్యంబులు + ఐ = చూచుట కందమయినవయి, ఒప్పున్

**తాత్పర్యము .** ఆ ఓషధిప్రస్థనగరము వెలుపలిప్రదేశములందుఁ గ్రీడాపర్వతములు శ్రేష్ఠములైన బంగారువస్తువులచే నిర్మింపఁబడినవయి, వస్త్రములు, మైపూఁతలు, పుష్పమాలలు, అలంకారములు, వృక్షములు, ఉద్యానములు అనువానితోఁ గూడినవయి, త్రాగుడు తిండి అనువానితో సమృద్ధములయి, మన్మథక్రీడయందు మిక్కిలి యాసక్తిగల యింతులకుఁ జోటయినవయి, గానమునకు స్థానములయి చూచుటకు సుందరములయి యొప్పును

మహాస్రగ్ధర ఫలభారానమ్రచూతప్రకరవిహర దుత్పన్నకీరాళి పుంస్కో
కిలరావంబుల్ సెలంగున్ గృతకనగతటాకీర్ణ కేకీరవంబున్
గలయం దద్ఘోష మోలిం గలమవన సురక్షా పరానంతకాంతా
కుల మంజు ధ్వానమున్ సంకులముగ వరుసంగూడి చెల్వొంది మ్రోయున్ 101

**అర్థము .**ఫల రావంబుల్ ఫల = పండ్లయొక్క, భార = బరువుతో,

ఆనమ్ర =మిక్కిలివంగిన, చూత = మామిడిచెట్లయొక్క, ప్రకర = సమూహమునందు, విహరత్ = విహరించుచున్నట్టియు, ఉత్పన్న = పైకెగురుచునట్టియు, కీర + ఆళి = చిలుకల వరుసయొక్కయు, పుంస్కోకల = మగ కోకిలములయొక్కయు, రావంబుల్ = కూఁతలు, కృతక రవంబున్ కృతక-నగ = క్రీడాపర్వతముయొక్క, తట + చటియలందు, ఆకీర్ణ = వ్యాపించిన, కేకీరవంబున్ = ఆఁడునెమళ్ల ధ్వనిని, తద్ + ఘోషము = ఆ కీరముల పుంస్కోకిలముల ధ్వని, ఓలిన్ = వరుసగా, కలయన్ = కూడఁగా, చెలంగున్, మ్రోయును, కలమ ధ్వానమున్ కలమ-వన = వరిచేలయొక్క సురక్షా = మంచి రక్షణమునందు, పర = ఆసక్తిగల, అనంత-కాంతా = పెక్కండ్రు స్త్రీలయొక్క, కుల = సమూహముయొక్క, మంజు = మనోహరమైన, ధ్వానమున్ = ధ్వనియును, సంకులముగన్ = నిండఁగా, వరుసన్ = క్రమముగా, కూడి, చెల్వు + అంది = అందమునొంది, మ్రోయున్ = ధ్వనించును

**తాత్పర్యము** . పండ్ల బరువుతో మిక్కిలి వంగిన మామిడిచెట్ల సమూహమునందు విహరించుచుఁ బైకెగురు చిలుకలయు మగకోయిలలయు కూఁతలు క్రీడాపర్వతపుఁ జటియలందు వ్యాపించిన ఆఁడునెమళ్ల ధ్వనిని గూడి మ్రోయును, వరిచేలను బాగుగా రక్షించుటయం దాసక్తిగల పెక్కండ్రు స్త్రీలగుంపు చేయు మనోహరధ్వనియును నిండఁగాఁ గూడి అందమునొంది మ్రోయును

**విశేషములు** · మహాస్రగ్ధరకు నాలుగు పాదము లుండును స త త న స ర ర గ అను గణము లుండును 1 - 9 - 16 అక్షరములకు యతిమైత్రి ప్రాసనియమము గలదు

**తే** **దాన సంపదఁ గడసన్న తమకు నొరులఁ**
**గడవ సర్వస్వదానులఁ గని పురమున**
**నుండ లజ్జించి వెడలినట్లుండుఁ దనరి**
**బాహ్యతద్దేశముల మదభద్రకరులు** **102**

**అర్థము** మద-భద్ర-కరులు = మదించిన భద్ర గజములు, దాన-సంపదన్ = దాన (మదజల) సంపదయందు, కడచన్న = ప్రశస్తములైన, తమకున్, ఒరులన్ = ఇతరులను, కడవన్ = అతిక్రమించుటకు, సర్వస్వ-దానులన్ = ఉన్న యెల్లసొమ్మును దానముచేయువారిని, కని=చూచి, పురమునన్ = నగరమునందు, ఉండన్ = ఉండుటకు, లజ్జించి = సిగ్గుపడి, బాహ్య-తద్ + దేశములన్ =

వెలుపలివైన ఆ ప్రదేశములందు, తనరి = ఒప్పి, వెడలిన + అట్లు + ఉండున్ = వెడలినరీతి నుండును

**తాత్పర్యము** మదించిన భద్రగజములు దానసంపద యందుఁ బ్రశస్తములైన తమ కితరుల నతిక్రమింప నాయూరియందుఁ దమకున్న యంతసామ్మును దానముచేయు మహాదాతలను జూచి, పురమున నుండుటకు సిగ్గుపడి, నగరము వెలుపలిప్రదేశములం దొప్పి వెడలినరీతి నుండును

**విశేషములు** అలంకారము శ్లేషానుప్రాణితమైన ఉత్ప్రేక్ష దానము - ఏనుఁగు మదజలము, ఈవి దాని = దానముగలవాఁడు - దాత తద్బహువచనము దానులు

చ వర వనితాననేందురుచి వర్గములన్ మణిహేమహర్మ్య వి
స్ఫుర దురుదీప్తులన్ వెడలఁజోపినఁ జీఁకటి వాసి నిల్చెనో
పురకమలానితంబ తట భూషితమై విలసిల్లు మేచకాం
బర మొకొ నాఁగ నొప్పుఁ బురబాహ్యావృతాసితనందనావళుల్ 103

**అర్థము.** పుర నావళుల్ పుర = నగరమునకు, బాహ్యా = వెలుపల, వృత = ఆవరించిన, అసిత = నల్లని, నందన = ఉద్యానములయొక్క, ఆవళుల్= వరుసలు, వర వర్గములన్ వర = శ్రేష్ఠమైన, వనితా = స్త్రీలయొక్క, ఆనన + ఇందు = ముఖచంద్రులయొక్క, రుచి = కాంతులయొక్క, వర్గములన్= సమూహములచేతను, మణి దీప్తులన్ మణి-హేమ-హర్మ్య=రత్నమయములు, స్వర్ణమయములునైన మేడలయొక్క విస్ఫురత్ = ప్రకాశించుచున్న, ఉరు = గొప్ప, దీప్తులన్ = కాంతులచేతను, వెడలన్ + జోఁపినన్ = వెడలఁగొట్టఁగా, చీఁకటి + పాసి = చీఁకటిపోయి, నిల్చెనో, పు భూసితమై పుర-కమలా = పురలక్ష్మి యొక్క, నితంబ-తట = కటి ప్రదేశమునందు, భూషితము + ఐ = అలంకారమయి, విలసిల్లు = ప్రకాశించు, మేచక + అంబరము + ఒకొ = నల్లని చీరయా, నాఁగన్= అనఁగా, ఒప్పున్

**తాత్పర్యము .** ఆ ఓషధిప్రస్థనగరమునకు వెలుపల నావరించిన నల్లని యుద్యానముల వరుసలు - శ్రేష్ఠురాండ్రయిన స్త్రీల ముఖచంద్రుల కాంతుల సమూహములచేతను, రత్న స్వర్ణమయములైన మేడల ప్రకాశించు కాంతులచేతను వెడలఁగొట్టఁగాఁ జీఁకటి పోయి నిలిచెనా యనునట్లును (లేక), పురలక్ష్మి కటిప్రదేశమున నలంకారమై ప్రకాశించు నల్లనిచీరయా యనునట్లును నొప్పును

**విశేషములు** అలంకార ముత్ప్రేక్ష పుర కమలా - అనుచో రూపకము సందేహము ఆననేందు - అనుచో నుపమ

క **మరకత మయ వజ్ర మహో**
**స్ఫురణమెయిం దొంగలించి పొదలినభంగిన్**
**దరుగుల్మ లతా హరి ద**
**త్యురు రుచిఁ గర మొప్పు బాహ్యకోద్యానంబుల్** **104**

**అర్థము .** బాహ్యక + ఉద్యానంబుల్ = నగరము వెలుపలి ఉపవనములు, మరకత-మయ = గరుడపచ్చలతో నిండిన, వజ్ర-మహత్ (మహో) + స్ఫురణ మెయిన్ = వజ్రములయొక్క గొప్ప కాంతితో, తొంగలించి = ప్రకాశించి, పొదలిన-భంగిన్ = ఒప్పిన రీతిని, తరు-గుల్మ-లతా = చెట్లయొక్కయు, పొదల యొక్కయు, తీఁగలయొక్కయు, హరిత్ = ఆకుపచ్చని, అతి + ఉరు-రుచిన్ = మిక్కిలి గొప్ప కాంతితో, కరము = మిక్కిలి, ఒప్పున్

**తాత్పర్యము .** ఓషధిప్రస్థనగరము వెలుపలి యుపవనములు గరుడ పచ్చలతో నిండిన వజ్రముల గొప్ప కాంతితోఁ బ్రకాశించి, యొప్పినరీతిని, చెట్ల, పొదల, తీఁగల ఆకుపచ్చని కాంతితో మిక్కిలి యొప్పును

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష

క **సరసిరుహరాగ పుష్పో**
**త్కరరుచి వెలిఁబర్వునట్లు క్రముకామ్రఫలా**
**త్యరుణాబ్జశాలి వన వి**
**స్ఫురణం గరమొప్పుఁ జూడఁ బురబాహ్యంబుల్** **105**

**అర్థము** సరసిరుహ-రాగ = పద్మరాగములయొక్క, పుష్ప = పుష్పరాగములయొక్కయు, ఉత్కర = సమూహముయొక్క, రుచి = కాంతి, వెలిన్ = వెలుపల, పర్వు + అట్లు = వ్యాపించువిధమున, క్రముక = పోఁకలతోను, ఆమ్ర-ఫల = మామిడిపండ్లతోను, అతి + అరుణ = మిక్కిలి యెఱ్ఱనైన, అబ్జ = తామరపూలతోను, శాలి = ఒప్పునట్టి, వన = తోఁటలయొక్క, విస్ఫురణన్ = విశేష ప్రకాశముతో, పుర-బాహ్యంబుల్ = ఊరిబహిఃప్రదేశములు, చూడన్ = చూచుటకు, కరము = మిక్కిలి, ఒప్పున్

**తాత్పర్యము .** ఆ ఓషధిప్రస్థనగరము వెలుపలి ప్రదేశములు పద్మరాగ

పుష్పరాగముల సమూహము కాంతి వెలుపలికి వ్యాపించెనా యనునట్లు, పోఁకలతో, మామిడిపండ్లతో, మిక్కిలి యెఱ్ఱని తామరపూలతో నొప్పు తోఁటల ప్రకాశముచే మిక్కిలి యొప్పును

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష

చ శరధిసమస్తవస్తువులు శౌర్యమునం బురి సూఱగొన్నయ
ట్లురుతర రత్నవప్రనికరోన్నతి నప్పురికోట యొప్పు, నా
శరధి నిజార్థలోభమున సాహసుఁడై పురిమీఁద నెత్తి భీ
కరముగఁ జుట్టుముట్టె ననఁగాఁ బరిఖాజలవృద్ధి పొల్పగున్ 106

**అర్థము .** శరధి-సమస్త-వస్తువులున్ = సముద్రునియొక్క యెల్ల వస్తువులును, పురి = పురము - ఓషధిప్రస్థము, శౌర్యమునన్ = పరాక్రమముతో, చూఱగొన్న + అట్లు = కొల్లగొట్టిన విధమున, ఉరుతర - రత్న-వప్ర-నికర + ఉన్నతిన్ = మిక్కిలిపెద్ద - మణిమయ ప్రాకారముల - సమూహముయొక్క, ఔన్నత్యముతో, ఆ + పురి-కోట = ఆ పురమునందలి కోట, ఒప్పున్, ఆ-శరధి = ఆ సముద్రుఁడు, నిజ+అర్థ-లోభమునన్ = తన వస్తువులందలి ఆశచే, సాహసుఁడు+ ఐ = తెగించినవాఁడయి, పురి-మీఁదన్ = నగరముపై, ఎత్తి = దండెత్తి, భీకరముగన్ = భయంకరముగా, చుట్టుముట్టెన్ = చుట్టుముట్టినాఁడా, అనఁగాన్ = అనునట్లు, పరిఖా-జల-వృద్ధి = అగడ్తలయందలి నీటి పెంపు, పొల్పు + అగున్ = ఒప్పును

**తాత్పర్యము :** సముద్రుని యెల్లవస్తువులను బరాక్రమముతో నోషధిప్రస్థపురము కొల్ల గొట్టినట్లు మిక్కిలి పెద్దవియుగు మణిమయ ప్రాకారముల సమూహము నౌన్నత్యము గలిగి ఆ పురికోట యొప్పును ఆ సముద్రుఁడు తన వస్తువులందలి యాశచేఁ దెగువగలవాఁడయి ఆ పురముపై దండెత్తి భయంకరముగా నూరిని జుట్టుముట్టెనా యనునట్లు అగడ్తలందు నీటిసమృద్ధి యొప్పును

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష

క పరిఖామలజలజములలో
నురగ ఫణా మణుల దీప్తు లొగి నెగసియుఁ బై
నెరసి సితాసిత రక్తాం
బురుహంబుల పోలె నిలిచి పొలిచి వెలుంగున్ 107

**అర్థము** పరిఖా + అమల-జలములలోన్ = అగడ్తయందలి నిర్మలములైన నీరులలో, ఉరగ-ఫణా-మణుల-దీప్తులు = పాముల పడగలందలి మణుల కాంతులు, ఒగిన్ = క్రమముగా, నెగసియున్ = పయికి వ్యాపించియు, పైన్ + నెరసి = పైని నిండి, సిత + అసిత + రక్త + అంబురుహంబుల - పోలెన్ = తెల్లని, నల్లని, ఎఱ్ఱని తామరలవలె, నలిచి = ఉండి, పొలిచి = ఒప్పి, వెలుంగున్ = ప్రకాశించును

**తాత్పర్యము** . అగడ్తయందలి నీరులలోఁ బాముల పడగల మణుల కాంతులు పైకి వ్యాపించి, నిండి, తెల్లని, నల్లని, ఎఱ్ఱని తామరలవలె నుండి యొప్పి ప్రకాశించెను

**విశేషములు** అలంకార ముపమ

చ **కొలఁదికి మీఱఁ బెద్దయగు కోట తనర్చున వస్తు నంతతో**
**జ్జ్వలిత లసత్ప్రభాతి రవిచంద్రరుచుల్ సొరనేరకున్న సం**
**ధ్యలు దివసత్రియామలును దత్పురి వారజనం బెఱుంగుఁ ద**
**మ్ములము చవిన్ విహంగగతిఁ బువ్వులతావి రతిప్రసంగతిన్ 108**

**అర్థము :** కొలఁదికిన్-మీఱన్ = మితి నతిక్రమించునట్లు, పెద్ద + అగు = ఎత్తయినది యగు, కోట-తనర్చునన్ = కోటయొక్క ఔన్నత్యముచే, వస్తు-సంతత + ఉజ్జ్వలిత-లసత్ + ప్రభాతిన్ = వస్తువులయొక్క ఎడతెగని ఉజ్జ్వలముగాఁ బ్రకాశించు కాంతిచే, రవి-చంద్ర-రుచుల్ = సూర్యునియొక్కయు, చంద్రునియొక్కయు కాంతులు - కిరణములు, చొరన్ + నేరక + ఉన్నన్ = ప్రవేశింపలేకపోఁగా, తద్ + పురి-వార-జనంబు = ఆ నగరమునందలి వేశ్యల సమూహము, సంధ్యలున్ = తొలి మలి సంజలును, దివస-త్రియామలును = పగళ్లు, రాత్రులును, (క్రమముగా), తమ్ములము-చవిన్ = తాంబూలపు రుచి చేతను, విహంగ-గతిన్ = పక్షులగమనముచేతను, పువ్వుల-తావిన్ = పూలవాసనచేతను, రతి-ప్రసంగతిన్ = సంభోగమునందలి, కూటమిచేతను, ఎఱుంగున్ = తెలియును

**తాత్పర్యము** మితిమీఱునట్లు ఎత్తుగానున్న కోట ఔన్నత్యముచే నందలి వస్తువుల ఎడతెగని కాంతిచే సూర్యచంద్రుల కిరణములు ప్రవేశింపఁజాలకపోఁగా, నందలి వేశ్యలు తాంబూలపు రుచిచేఁ బ్రాతస్సంధ్యను, పక్షుల గమనముచే సాయం సంధ్యను, పువ్వుల వాసనచేఁ బగటిని, సంభోగపుఁ గూటమిచే రాత్రులను దెలిసికొందురు

**విశేషములు** అలంకారములు అతిశయోక్తి, యథాసంఖ్యము తమ్ములము చవి = తాంబూలపు రుచి దీనికిని ప్రాతస్సంధ్యకును సంబంధమేమో తెలియకున్నది అది 'చవి' గాక 'ఛవి' అయియుండునా? తమ్ములము-ఛవిన్ = తాంబూలపుఁగాంతిచే తాంబూలము నెఱ్ఱని కాంతినిబట్టి ప్రాతస్సంధ్యయు నిట్లే యెఱ్ఱనిదయి యుండునని వేశ్యలు తెలిసికొందురని చెప్పవచ్చును పక్షులు సాయంకాలములందు గూండ్లకుఁ జేరును గావున విహంగ గతిని బట్టి వారు సాయంసంధ్య నెఱుఁగుదురు పువ్వుల తావి పగటివేళలందే ప్రబలముగా నుండును అందుచే వారి తావిని బట్టి పగళ్ల నెఱుఁగుదురు రతిప్రసంగతికి సమయము రాత్రులే దివారతి యుండఁగూడదా యన నది నిషిద్ధమని భావించుకాల మది పైఁగా వారు వేశ్యలు గావున వారికడకు విటులు త మ్మొరులు చూడకుండ రాత్రులందే ప్రచ్ఛన్నముగా నేఁగుదురు కావున రతిప్రసంగతిచే వారు రాత్రుల నెఱుఁగుదురు ఇంత యేల యన నా కోటలు సూర్యచంద్రకిరణములు ప్రవేశింపలేనంత ఎత్తయినవి సూర్యచంద్రులనుబట్టియే కదా సంధ్యాదుల నెఱుఁగఁగలుగుట

క పరువడిఁ గులగిరు లిడి వా
రిరుహాసనుఁ డొనర గండరించెనొకో నాఁ
గర మమరి తత్పురంబున
నురుతరమణిహర్మ్యనికర మోలి వెలుంగున్ 109

**అర్థము.** వారిరుహాసనుఁడు = పద్మాసనుఁడు - బ్రహ్మ, పరువడిన్ = శ్రద్ధతో, కుల-గిరులు = కులపర్వతములు, ఇడి = పెట్టి, ఒనరన్ = పొసఁగునట్లు, గండరించెన్ + ఒకో - నాన్ = నిర్మించెనా యనునట్లు, తద్ + పురంబునన్ = ఆ ఓషధిప్రస్థనగరమునందు, ఉరుతర-మణి-హర్మ్య-నికరము = మిక్కిలి పెద్దవి, మణిమయములైనవి అగు మేడల సముదాయము, కరము = మిక్కిలి, అమరి = ఒప్పి, ఓలిన్ = బాగుగా, వెలుంగున్ = ప్రకాశించును

**తాత్పర్యము.** బ్రహ్మ శ్రద్ధతోఁ గులపర్వతములను బెట్టి పొసఁగునట్లు నిర్మించెనా యనునట్లు ఆ ఓషధిప్రస్థపురమునందలి మిక్కిలి పెద్దవియు, మణిమయములును నైన మేడలు మిక్కిలి యొప్పి బాగుగాఁ బ్రకాశించును

**విశేషములు.** అలంకార మతిశయోక్తి, ఉత్ప్రేక్ష 'గండరించు' కాని కండరించు కాదు గండరువు ఉన్నది కదా!

క కులగిరులు బలసి కొలువఁగఁ
బొలుపగు హేమాద్రిఁ బోలెఁ బురవరహర్మ్యా
వలి నడుమఁ గనకమయమై
యలఘుతరోన్నతిగ రాజహర్మ్యము వెలయున్ 110

**అర్థము .** కుల-గిరులు = కులపర్వతములు, బలసి = చుట్టు నుండి, కొలువఁగన్ = సేవింపఁగా, పొలుపు + అగు = అందమగు, హేమ + అద్రిన్ + పోలెన్ = బంగరుకొండ - మేరువు వలె, పుర-వర-హర్మ్య + ఆవలి-నడుమన్ = పురశ్రేష్ఠమైన ఓషధిప్రస్థమందలి, మేడల వరుస నడుమ, కనక-మయము + ఐ = స్వర్ణ నిర్మితమయి, అలఘుతర + ఉన్నతిగన్ = మిక్కిలి ఎత్తుగా, రాజ-హర్మ్యము = రాజభవనము, వెలయున్ = ప్రకాశించును

**తాత్పర్యము .** కులపర్వతములు పరివేష్టించి సేవింపఁగా నొప్పారు మేరువువలెఁ బురశ్రేష్ఠమైన ఓషధిప్రస్థమందలి మేడలవరుస నడుమ స్వర్ణ నిర్మితమయి మిక్కిలి ఉన్నతముగా రాజసౌధము ప్రకాశించును

**విశేషములు .** అలంకార ముపమ

చ. 'తన వెలుఁ గొక్కప్రొద్దు; నిజధామము వెల్గఁగఁజేయు మా వెలుం
గనిశముఁ, బర్వు ధామము లనంతము మా' కని హర్మ్యసంచయం
బున మణు లప్పురంబున 'నభోమణి ధామము దాఁటిపోవనీ'
మని రవిఁ జాఁద నెత్తె నన నంబరమంది వెలుంగు సద్రుచిన్ 111

**అర్థము .** తన-వెలుఁగు = తన ప్రకాశము, ఒక్క-ప్రొద్దు = ఒక్కకాలము - పగలు, నిజ-ధామమున్ = తనదైన స్థానమును - ఆకాశమును, వెల్గఁగన్ + చేయున్ = ప్రకాశింపఁజేయును, మా-వెలుంగు = మా ప్రకాశము, అనిశమున్ = ఎల్లప్పుడును, పర్వు-ధామములు = వ్యాపించు స్థానములు, మాకున్, అనంతము = పెక్కు, అని, హర్మ్య-సంచయంబున - మణులు = మేడల సమూహమునందలి మణులు, అప్పురంబునన్ = ఆ + పురంబునన్ = ఆ ఓషధిప్రస్థపురమునందు, నభోమణిన్ = సూర్యుని - నభస్సునందలి మణిని, ధామమున్ = ఆకాశమును, దాఁటి పోవనీము = అతిక్రమింపనీము, అని, రవిన్ = సూర్యుని, చాఁదన్ + ఎత్తెన్ + అనన్ = అధఃకరించెనన, అంబరము = ఆకాశము, అంది = తాఁకి, సత్ + రుచిన్ = మంచి కాంతితో, వెలుంగున్ = ప్రకాశించును

**తాత్పర్యము.** ఆ ఓషధిప్రస్థపురము సౌధసమూహమునందలి మణులు 'తన వెలుఁగు ఒక్క పగటి వేళ మాత్రమే అది తన స్థానమైన ఆకాశమునే ప్రకాశింపఁజేయును మా వెలుఁగో ఎల్లవేళల నుండునది అది వ్యాపించు స్థానములకు లెక్కలేదు సూర్యుని ఆకాశము నతిక్రమింపనీ'మని సూర్యు నధ కరించె నన ఆకాశము నంటి మంచికాతితో వెలుఁగొందును

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష ఇందు 'నభోమణి' నభస్సునందు మణి అని సూర్యునకుఁ 'బర్యాయముగ బ్రయుక్తమైనది విశేష్యము సాభిప్రాయ మైనందున నలంకారము పరికరాంకురము' 'సాభిప్రాయే విశేష్యే తు భవే త్పరికరాఙ్కురః' చంద్రా, తాము హర్మ్యమణులైన, సూర్యుఁడు నభమున మణి, సంబంధాతిశయోక్తియు 'సంబన్ధాతిశయోక్తి స్స్యా దయోగే యోగకల్పనమ్' అంబరము - (నానా) ఆకాశము, వస్త్రము ధామము (నానా) స్థానము, వెలుఁగు, ఆకాశము సద్రుచి - సత్ + రుచి - అనునాసికాంతస్థ వర్ణములు తప్ప మిగిలిన పదాంతగత హల్లులకు (ఝల్లులకు) మృదుహల్లులు (హశ్శులు) కాని, అచ్చులుకాని పరమగునపుడు ఆ హల్లుల వర్గమునకుఁ జెందిన తృతీయవర్ణ మాదేశముగా వచ్చును

క ఆ మాడు విండ్ల తుదిఁ గల
శామల మణు లభ్రమార్గ మడరి లసత్తే
జో మహిమఁ దనరి తారు న
భోమణు లనఁ జాలి కాంతిఁ బొదలి వెలుంగున్ 112

**అర్థము.** ఆ-మాడువిండ్ల-తుదిన్ = ఆ మేడల కొనలందు, కలశ + అమల-మణులు = ఘటాకార శిఖరములందలి, నిర్మలమయిన మణులు, అభ్ర-మార్గము = మేఘ మార్గము - ఆకాశము, అడరి = వ్యాపించి, లసత్ + తేజస్ + మహిమన్ = ప్రకాశించుచున్న కాంతియొక్క గొప్పతనమున, తనరి = ఒప్పి, తారున్ = తాముఁగూడ, నభోమణులు = నభస్సు = ఆకాశమునందలి మణులు = సూర్యులు, అనన్ + చాలి = అననొప్పి, కాంతిన్ = ప్రకాశముతో, పొదలి = ఒప్పి, వెలుంగున్ = ప్రకాశించును

**తాత్పర్యము.** ఆ మేడల అగ్రములందుఁ గలశాకారశిఖరములందలి నిర్మలములయిన మణులు ఆకాశమువఱకు వ్యాపించి, ప్రకాశించుచున్న కాంత్యతిశయమువ నొప్పి తాముసైతము నభోమణులు - నభస్సునందలి మణులు - సూర్యులు అనఁజాలి కాంతి గలిగి వెలుఁగొందును

**విశేషములు.**అలంకారము సంబంధాతిశయోక్తి మాడుపిల్లు - మాడువు + ఇల్లు - దాని బహువచనము మాడుఎండ్లులు లువర్ణంబు బహువచనంబు' బాల తత్సమ 12 మూడువిల్లు+లు 'ఔషధిశక్తికంబుల లివర్ణ సల లువర్ణంబులకు బహువచనంబు పరంబగునపుడు పూర్ణబిందుపూర్వక డువర్ణంబు బహుళంబుగా నగు బాల ఆచ్చిక 16 మాడు విండులు 'బహువచనము పరంబగునపుడు డ - ల - ట - ర - ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు ' బాల ఆచ్చిక 12 మాడువిండ్లు కావ్యలింగాలంకారమును, 'సమర్థనీయ స్యార్థస్య కావ్యలిఙ్గం సమర్థనమ్' చన్ద్రా తేజోమహిమ తేజస్ + మహిమ పదాంత సకారమునకు విసర్గాదేశము తేజః + మహిమ హ్రస్వ అకారము తరువాత వచ్చు విసర్గమునకు హ్రస్వ అకారముకాని, మృదుహల్లులు (హశ్శులు) కాని పరము లగునపుడు ఉ ఆదేశముగా వచ్చి పూర్వమందున్న అకారముతోఁగూడి గుణసంధి ననుసరించి ఓ గా మాఱును తేజోమహిమ నభోమణియు నిట్టిదే

క కనకమయ హర్మ్య పంక్తులు
ఘనమార్గం బడరియున్నఁ గల్పకుజంబుల్
గని యూడలు దిగ్గెనా యనఁ
దనరుచుఁ దత్కేతుదండతతి విలసిల్లున్ 113

**అర్థము .** కనక-మయ-హర్మ్య-పంక్తులు = స్వర్ణనిర్మితములైన సౌధముల వరుసలు, ఘన-మార్గంబు = మేఘమార్గము - ఆకాశము, అడరి + ఉన్నన్ = వ్యాపించియుండఁగా, కల్ప-కుజంబుల్ = కల్పవృక్షములు, కని = చూచి, ఊడలు- దిగ్గెనా = ఊడలు, దిగెనా, అనన్ = అనఁగా, తనరుచున్ = ఒప్పుచు, తద్ + కేతు- దండ-తతి = వాని జెండాల కఱ్ఱల సమూహము, విలసిల్లున్ = ప్రకాశించును

**తాత్పర్యము.**ఓషధిప్రస్థపురమున స్వర్ణనిర్మితములైన సౌధముల వరుసలు ఆకాశమువఱకు వ్యాపించి యుండఁగాఁ గల్పవృక్షములు చూచి ఊడలు దిగెనా యనునట్లు ఆ సౌధముల జెండాకఱ్ఱలసమూహ మొప్పును

**విశేషములు**·అలంకారముత్ప్రేక్ష తత్కేతు - తద్ + కేతు అనునాసికాంతస్థ భిన్నములైన హల్లులకు (ఝల్లులకు) కఠినహల్లులు (ఖర్రులు) పరమగునపుడు వానివర్గములందలి ప్రథమవర్ణములు (చర్రులు) ఆదేశమగును

మ కమనీయాత్మక సర్వలోహ మణి సత్కాష్ఠేష్టికా నిర్మితో
త్తమ హర్మ్యంబుల గండరించిన కపోతవ్రాతపంక్తుల్ బిడా
లము లోలిం గని, వానిమీఁది కలుకన్ లంఘించి, కాకున్నఁ ద
ద్భ్రమఁ బై నూఁగినఁ బల్కు వొండెడ గడీపారావతానీకముల్ 114

**అర్థము.** కమనీయాత్మక హర్మ్యంబులన్ కమనీయ + ఆత్మక = రమణీయములైన స్వరూపములు గల, సర్వ-లోహ-మణి-సత్-కాష్ఠ + ఇష్టికా = సకలలోహమయములు, మణిమయములునైన మంచి దూలములతోను, ఇటుకలతోను, నిర్మిత = కట్టఁబడిన, ఉత్తమ = శ్రేష్ఠములైన, హర్మ్యంబులన్ = మేడలయందు, గండరించిన = చెక్కఁబడిన, కపోత-వ్రాత-పంక్తుల్ = పావురముల సమూహముల వరుసలు, బిడాలములు = పిల్లులు, ఓలిన్ = బాగుగా, కని = చూచి, వాని-మీఁదికిన్ = ఆ కృత్రిమ కపోతములమీఁదికి, అలుకన్ = కోపముతో, లంఘించి = దుమికి, కాకున్నన్ - (కాక + ఉన్నన్) = అవి సహజ కపోతములు కాకపోఁగా, తద్ +భ్రమన్ = (ఇంకను) ఆ భ్రాంతితో, పైన్ = మీఁద, ఊఁగినన్ = చలింపఁగా, ఒండెడన్ (ఒండు + ఎడన్) = మఱియొకచోట, గడీ-పారావత + అనీకముల్ = దుర్గమునందలి(సహజ) పావురముల సమూహములు, పల్కవు = కిక్కురుమనకుండ నుండును

**తాత్పర్యము .** రమణీయములైన సకలలోహమయములైన మంచి దూలములతోను, సర్వమణిమయములైన యిటుకలతోను, నిర్మింపఁబడిన మేలయిన మేడలయందుఁ జెక్కఁబడిన (కృత్రిమములైన) పావురముల సమూహములను బిల్లులు చక్కఁగాఁజూచి వానిపైకి దుమికి, అవి (సహజ) కపోతములు కాకపోఁగా, ఇంకను భ్రాంతిపోక, పైని జలింపఁగా, ఇదియంతయుఁ జూచుచున్న వేఱుచోటి దుర్గస్థ సహజ కపోతముల సమూహములు ఆ పిల్లులు తమపై నెక్కడఁబడునో యను భయమునఁ గిక్కురుమనకుండ నుండును

**విశేషములు .** బిడాలములకు హర్మ్యములందుఁ జెక్కఁబడిన కృత్రిమ కపోతములందు సహజకపోతభ్రాంతి గావున నలంకారము భ్రాంతిమంతము పిల్లుల చేష్టలను జూచిన గడీ పారావతానీకములు నిశ్శబ్దముగానుండు ననుచో స్వభావోక్తియు గడీ-గడి-దేశ్యవిశేష్యము = దుర్గము హర్మ్యములందుఁ జెక్కిన కృత్రిమపారావతములు, బిడాలములకు సహజ పారావతము లను భ్రాంతిని బుట్టించునంత సహజత యుట్టిపడుచుండె నన్నమాట

చ గగనము దాఁకు చిత్రగతకాననసంహతి పోల్పు హర్మ్యముల్
నగములుసావి యూఁగిన మనంబులఁ బూర్ణసరోవరంబుల
న్వగ జలకేళి సల్పనని వచ్చి, యెఱింగి, వియచ్చరాంగనల్
మగుడుట సూచి నవ్వుదురు మాడువులందు రమించు దంపతుల్ 115

**అర్థము** .గగనము + తాఁకు = ఆకాశము నంటునట్టి, చిత్ర-గత-కానన-సంహతి = చిత్తరువునందు లిఖింపఁబడిన వనముల సమూహము, పోల్పు = ఒప్పునట్టి, హర్మ్యముల్ = మేడలు, నగములు-సావి = కొండలు అని, ఊఁగిన-మనంబులన్ = అవునా కాదాయని యూఁగులాడు మనస్సులతో, పూర్ణ-సరోవరంబులు + అన్ + వగన్ = నిండుసరస్సు లనెడి తలఁపుతో, జల-కేళి = జలక్రీడ స్నానము, సల్పన్ + అని = చేయుటకని, వచ్చి, ఎఱింగి = అది సరోవరముకాక, చిత్రగతకాననపంక్తి ప్రతిఫలించు నాకాశమని గ్రహించి, వియచ్చరాంగనల్ - వియత్ + చర + అంగనల్ = ఆకాశమునందు సంచరించు స్త్రీలు - దేవతాస్త్రీలు, మగుడుట = మరలిపోవుట, చూచి, మాడువుల + అందున్ = మేడలయందు, రమించు = క్రీడించు - సంభోగించు, దంపతుల్ = భార్యాభర్తలు, నవ్వుదురు = పరిహసింతురు

**తాత్పర్యము** ఆ ఓషధిప్రస్థపురమునఁ బెద్దపెద్ద మేడలు గలవు అవి గగనమును దాఁకుచున్నవి ఆ మేడల యగ్రముల నడవులు చిత్తరువున లిఖింపఁబడియున్నవి ఆకాశమున సంచరించు దేవతాస్త్రీ లా మేడలను జూచి కొండ లనుకొనిరి గగనమును గాననపంక్తి ప్రతిఫలించుచున్న సరోవరమని భ్రమించి, వా రందు స్నానము చేయఁబూని, అది సరోవరము కాదని యెఱిఁగి, తిరిగిపోయిరి మేడలయందుఁ గ్రీడించు దంపతులు వారిని జూచి పరిహసించిరి

**విశేషములు** అలంకారము భ్రాంతిమంతము తాఁకి అనుదానిని తాఁకుగా మార్చి హర్మ్యములకు విశేషణముగాఁ జేయఁబడినది వియచ్చరాంగనలకు, బ్రతిఫలిత చిత్రగత కాననపంక్తి యగు గగనమునందు సరోవరభ్రాంతి చిత్ర సంహతిఁ బోల్పు' అనికాక 'చిత్ర సంహతి' అనుదానిని 'పోల్పు'నకుఁ గర్తనుగాఁజేసి, 'పోల్పు' అనుదానిని 'హర్మ్యముల్' అనుదానికి ధాతుజవిశేషణముగాఁ జేయుటైనది అన్నిప్రతులందును 'సాగి' అనియున్నను, అది 'సావి'యయి యుండునని అన్వయసౌలభ్యమునకుఁ దలఁపఁబడినది సావి = సవి = అని ఊఁగిన మనంబుల - అది సరోవరమా కాదా యని వారి మనస్సు లూఁగులాడినవి 'వనంబుల' కంటె 'మనంబుల' అనుటయే లెస్స వియచ్చర =

నియత్ + చర-సకార తవర్గములకు శవర్ణ చవర్గములతోఁ బూర్వమందైనను బరమందైనను గూడిక కలుగునపుడు క్రమముగా శవర్ణ చవర్గ వర్ణము లాదేశమగును

తే పరమమాహేశ్వరవ్రజ విరచి తోరు
కనక మణిగణమయము లాకాశ మడరి
మానితంబులై స్వర్ణసోపానపంక్తు
లనఁగ నప్పురి నొప్పె దేవాలయములు 116

**అర్థము** పరమ - మాహేశ్వర - వ్రజ = గొప్ప శివభక్తులయొక్క సమూహముచేత, విరచిత = నిర్మింపఁబడిన, ఉరు-కనక-మణి-గణ = గొప్పవియగు బంగారు, మణుల సమూహముతో నిండినవి, అగు, దేవ + ఆలయములు = దేవునిగుడులు, ఆకాశము + అడరి = ఆకాశమువఱకు వ్యాపించి, మానితంబులు + ఐ = మన్నింపఁబడినవై, అప్పురిన్ = ఆ + పురిన్ = ఆ నగరమునందు, స్వర్ణ-సోపాన-పంక్తులు = బంగారు మెట్ల వరుసలు, అనఁగన్, ఒప్పెన్.

**తాత్పర్యము .** ఆ ఓషధిప్రస్థపురమున దేవాలయములు గొప్ప శివభక్తుల సమూహముచే నిర్మింపఁబడిన గొప్ప బంగారు, మణుల సమూహముతో నిండినవయి బంగారుమెట్ల వరుస లనఁగా నొప్పెను

**విశేషములు .** అలంకారములు సంబంధాతిశయోక్తి, ఉత్ప్రేక్ష

క పురివీధులు గనుఁగొన సుం
దరమగు ఘటయోని సమయఁద్రాగిన రత్నా
కరమ్ము లొకొ వివిధ రత్నా
కరములు నా వరమణిప్రకరభరితములై 117

**అర్థము .** వివిధ-రత్న + ఆకరములు = పలురకములైన రత్నములకు స్థానములు, అగు, పురి-వీధులు = ఆ నగరమునందలి వీధులు, వర-మణి-ప్రకర-భరితములు + ఐ = శ్రేష్ఠములైన మణుల సమూహముచే నిండినవియై, ఘట-యోని = కుంభజుఁడు - అగస్త్యుఁడు, సమయన్ = నశించునట్లు - నిశ్శేషముగా, త్రాగిన, రత్నాకరములు + ఒకొ = సముద్రములా, నాన్ = అనఁగా కనుఁగొనన్= చూచుటకు, సుందరము + అగును = అందమగును

**తాత్పర్యము .** పలురకములైన రత్నముల కాప్పదములగు నా ఓషధిప్రస్థపురవీధులు, మేలయిన మణుల సమూహముతో నిండినవై అగస్త్యుఁడు సంపూర్ణముగాఁ ద్రాగిన సముద్రములా యనునట్లు చూడనందముగా నుండును

**విశేషములు :** అలంకార ముత్ప్రేక్ష

క **వేదాచారులు, సంతత**
**వేదాధ్యయనులు, సమస్తవిద్యానిపుణుల్,**
**వేదాఖిలార్థవిదులు, మ**
**హాదేవధ్యాననిరతు, లప్పురి విప్రుల్** 118

**అర్థము.**అప్పురి-విప్రుల్ = (ఆ + పురి ) ఆ ఓషధిప్రస్థపుర బ్రాహ్మణులు, వేద + ఆచారులు = వేదములందలి నడవడి గలవారు, సంతత-వేద + అధ్యయనులు = నిరంతర వేదపఠనము గలవారు, సమస్త-విద్యా-నిపుణుల్ = ఎల్ల విద్యలందును నేర్పుగలవారు, వేద + అఖిల + అర్థ-విదులు = వేదములందలి, ఎల్ల విషయములు, తెలిసినవారు, మహాదేవ-ధ్యాన-నిరతులు = శివుని ధ్యానమునం దాసక్తి గలవారు

**తాత్పర్యము :** ఆ ఓషధిప్రస్థపురమునందలి బ్రాహ్మణులు వేదోక్తములయిన నియమములు గలవారు, నిరంతరము వేదముల నధ్యయనము చేయువారు, సర్వవిద్యలందును నేర్పుగలవారు, వేదములందలి యెల్ల విషయములు తెలిసినవారు, శివుని ధ్యానించుటయం దాసక్తిగలవారు

చ **అవిరళ నిత్యకర్మ వివిధాధ్వర వహ్నిముఖంబులన్ సదా**
**దివిజగణాళి నాహుతులఁ దృప్తులఁ జేయుచు హోమధూమ సం**
**భవ ఘనవృష్టి భూజనులఁ బాయక తృప్తులఁజేయుచున్ మహో**
**త్సవకరులై రమింతు రనిశంబు ధరామరు లప్పురంబునన్** 119

**అర్థము :**అప్పురంబునన్ = ఆ + పురంబునన్ = ఆ ఓషధిప్రస్థ పురమునందు, ధరా + అమరులు = భూసురులు, అనిశంబున్ = ఎల్లప్పుడును, అవిరళ ముఖంబులన్ = అవిరళ = అధికమైన, నిత్య-కర్మ = నిత్యకృత్యములైన, వివిధ = పలురీతులైన, అధ్వర = యజ్ఞములందలి, వహ్ని - ముఖంబులన్ = అగ్నుల ద్వారములచే, సదా = ఎల్లప్పుడును, దివిజ-గణ + ఆళిన్ = దేవతల సమూహముల వరుసను, ఆహుతులన్ = మంత్రపూర్వకములైన

వేల్పులచే, తృప్తులన్ = తనిసినవారినిగా, చేయుచున్ హోమ-ధూమ-సంభవ-ఘన-వృష్టిన్ = యజ్ఞములందలి పొగచే, పుట్టు, గొప్ప వర్షముచే, భూజనులన్ = భూమియందలి జనులను, పాయక = విడువక, తృప్తులన్ + చేయుచున్ = తృప్తినందినవారినిగాఁ జేయుచు, మహోత్సవకరులు + ఐ = మహత్ (మహా) + ఉత్సవ) = గొప్పవేడుకనుజేయువారయి రమింతురు = ఆనందింతురు

**తాత్పర్యము .** ఆ ఓషధిప్రస్థపురమునందలి బ్రాహ్మణులు ఎల్లప్పుడును అధికముగా నిత్యకృత్యముగాఁ ఒలురీతులైన యజ్ఞములను జేయుచు నందలి అగ్నుల ద్వారమున సర్వదా దేవతాసమూహములను మంత్రపూర్వకములైన వేలుములచేఁ దృప్తిపఱుచుచు, యజ్ఞములందలి పొగలచేఁ బుట్టు గొప్పవానచే భూమియందలి జనులను నిరంతరమును దనియించుచు గొప్పవేడుక చేయుచు నానందింతురు

**విశేషములు .** ధరామరులు - ఇది ధరావరులయి యుండునేమో! ధరావరులనఁగా రాజులు ఇందలి విషయము రాజులకే బాగుగా నన్వయించుచున్నది అట్లు గాక ధరామరు లన్నచో, బ్రాహ్మణులకు రెండు పద్యములు కాఁగా, రాజుల కొక్కటియైనను లేకుండఁబోవుచున్నది

క ధనదు ధనసంఖ్య నవ నిధు
లన విని 'యర్థేశనామ మతనికి నీ మే
మొనర నసంఖ్యార్థేశుల'
మని ధనపతి నుఱరు పేర్మి నప్పురి వైశ్యుల్ 120

**అర్థము** అప్పురి (ఆ + పురి) - వైశ్యుల్ = ఆ ఓషధిప్రస్థపురమునందలి కోమటులు, ధనదు = కుబేరునియొక్క, ధన-సంఖ్య = ధనములయొక్క సంఖ్య, నవ-నిధులు = తొమ్మిది నిధులు, అనన్ = అనఁగా, విని, అతనికిన్ = ఆ కుబేరునకు, అర్థేశ (అర్థ + ఈశ) - నామము = అర్థేశుఁడను పేరు - అర్థములకు ఈశుఁడు అను బిరుదు, ఈము = ఒసఁగము, ఏము = మేము, ఒనరన్ = పొసఁగఁగా, అసంఖ్య + అర్థేశులము = అసంఖ్య + అర్థ + ఈశులము = లెక్కలేనన్ని అర్థములకుఁ బ్రభువులము, అని, పేర్మిన్ = గొప్పతనముచే, ధనపతిన్ = కుబేరుని, ఉఱరు = లెక్కచేయరు

**తాత్పర్యము .** ఆ ఓషధిప్రస్థ పురమునందలి కోమటులు కుబేరుని ధనముల సంఖ్య తొమ్మిదికిఁ బరిమితములైన నిధులే యనుట విని, ఆ కుబేరునకు

అద్వైశుఁడను బిరుదు నొసఁగము మేము పొసఁగఁగా నసంఖ్యాకములైన అర్థములకుఁ బ్రభువులము' అని గొప్పతనమునఁ గుబేరుని లెక్కచేయరు

**విశేషములు** అలంకారము - అతిశయోక్తి, కావ్యలింగము కుబేరుని ననిధులు = మహాపద్మము, పద్మము, శంఖము, మకరము, కచ్ఛపము, ముకుందము, కుందము, నీలము, ఖర్వము

క నలిఁ గోటికోటి పడగలు
గలగొనఁ గట్టినను వానిఁ గావని మదిలోఁ
దలఁప రసంఖ్యార్థ ధ్వజ
ములు గట్టినవారు వైశ్యముఖ్యు లనేకుల్ 121

**అర్థము .** అసంఖ్య + అర్థ-ధ్వజములు = లెక్కలేనన్ని ధనచిహ్నములైన పడగలు, కట్టినవారు, అనేకుల్ = పెక్కండ్రు, వైశ్య-ముఖ్యులు = శ్రేష్ఠులైన కోమటులు, నలిన్ = ఉత్సాహముతో, కోటికోటి-పడగలు = కోటికోటి సంఖ్యగల ధ్వజములు, కలగొనన్ = బాగుగా, కట్టినను = కట్టినప్పటికిని, వానిన్ = ఆ ధ్వజములను, కావు + అని = సరిపడవని, మదిలోన్ = మనసులో, తలఁపరు = గణింపరు

**తాత్పర్యము .** ఆ ఓషధిప్రస్థమునందలి పెక్కండ్రు కోమటులు లెక్కలేనన్ని, ధనచిహ్నములైన ధ్వజములను గట్టినవారయి, కోటి కోటి సంఖ్యగల పడగలు గట్టినప్పటికిని అవి సరిపోవని వానిని మదిలో గణింపరు

**విశేషములు .** అలంకార మతిశయోక్తి

చ అనిశము గో సహస్రవిధి నందుల కోమటు లిచ్చు ధేనువుల్
గొని చను భూసురోత్తముల గోవుల పాదహతిన్ మహీతలం
బనయముఁ గ్రుంగి మ ట్టవిసి యప్పురిచుట్టున నూటరేఁగి బో
రన నట జాలువాఱి నదులై చను నంబుధిఁగూడఁ బెల్లునన్ 122

**అర్థము.** అందుల - కోమటులు = ఆ ఓషధిప్రస్థపురమునందలి కోమటులు, అనిశమున్ = ఎల్లప్పుడును - ప్రతిదినమును, గో - సహస్ర-విధిన్ = వేయి గోవుల (నిచ్చు) నియమముచే, ఇచ్చు = ఇచ్చునట్టి, ధేనువుల్ = ఆవులు, కొని = తీసికొని, చను = వెడలు, భూసుర + ఉత్తముల = బ్రాహ్మణశ్రేష్ఠుల, గోవుల = ఆవుల

యొక్క పాదహతిన్ = కాళ్ళ దెబ్బచే, మహీ - తలంబు = భూతలము, అనయమున్ = మిక్కిలి, క్రుంగి = అణఁగి, మట్టు + అవిసి = కుదురు, పగిలి, అప్పురి = ఆ + పురి = చుట్టునన్ = ఆ ఓషధిప్రస్థపురము చుట్టును, ఊట -రేఁగి = ఊట పుట్టి, బోరనన్ = అధికముగా, అటన్ = అక్కడ, జాలువాటి = జాలు + పాటి = ప్రవాహముగట్టి, నదులు + ఐ, పెల్లునన్ = ఉద్ధతితో, అంబుధిన్ = సముద్రమును, కూడన్ = కలియుటకు, చనున్ = పోవును

**తాత్పర్యము** ఆ పురమునందలి కోమటులు ప్రతిదినమును వేయి గోవుల నిచ్చు నియమమున నిచ్చునట్టి గోవులను బరిగ్రహించి పోవుబ్రాహ్మణశ్రేష్ఠుల గోవుల కాళ్ళదెబ్బచే భూతలము మిక్కిలి క్రుంగి, కుదురు పగిలి, ఆ పురము చుట్టును నీరూరి అధికముగాఁ బ్రవాహము గట్టి నదులయి ఉద్ధతితో సముద్రమునఁ గలియుటకుఁ బోవును

**విశేషములు .** అలంకార మతిశయోక్తి అందుల కోమటులు = అందలి కోమటులు "అందుల" పద ప్రయోగము కవి ప్రాచీనతకు నిదర్శము 'బోరన'లో 'ర' యందలి అత్వమునకును, నదులు + ఐ లోని ఐత్వమునకును స్వరప్రధానయతిగా మైత్రి చెల్లినది కాని నన్నయలో రేఫమునకే యతిమైత్రి గనవచ్చుచున్నది 'బో-రన దమయంతీ స్వయంవ-రమునకు నొప్పం జనుదెంచిరి '

క **ఎత్తిన పువ్వులు ముడుచుచుఁ**
**బొత్తిచ్చిన పన్నిదములు వాడుచుచు నత్యు**
**ద్వృత్తి గతి వీధిలో సుభ**
**టోత్తము లంగళ్ల మెఱయుచుండుదు రెలమిన్** 123

**అర్థము** సుభట + ఉత్తములు = మంచి యోధులలో శ్రేష్ఠులు, ఎత్తిన = దండలుగాఁ గట్టిన, పువ్వులు, ముడుఁచుచున్ = తుఱుముచు, పొత్తిచ్చిన పన్నిదములు = నెయ్యపుఁబందెములు, పాడుచుచున్ = ఒడ్డుచు, అతి + ఉద్వృత్తి - గతిన్ = మిక్కిలి గర్వము తోడి నడకతో, వీధిలో, అంగళ్లన్ = విపణులందు అంగడులందు, ఎలమిన్ = సంతోషముతో, మెఱయుచున్ + ఉండుదురు = ప్రకాశించుచుందురు

**తాత్పర్యము** శ్రేష్ఠులైన యోధులు దండలుగా గ్రుచ్చిన పువ్వులు పెట్టుకొనుచు, నెయ్యపుఁబందెము లొడ్డుచు మిక్కిలి గర్వపు నడకతో వీధిలోని అంగడులలో సంతోషముతోఁ బ్రకాశించుచుందురు

**విశేషములు** ఎత్తు - ఒకవిధమగు పూలదండ (సూ ని) అని ఉండుటచే దానిని ధాతువుగా నెంచి - దండగా గ్రుచ్చు అని యర్థము చెప్పఁబడినది పొత్తిచ్చిన - పొత్తు = స్నేహము కావున పొత్తిచ్చిన = నెయ్యంపు అని యర్థము చెప్పఁబడినది పన్నిదములు వొడుచుచు - పన్నిదములు + పొడుచుచు గసడదవాదేశము బాల సంధి 13 అత్యుద్వృత్తి - అతి + ఉద్వృత్తి - యణాదేశసంధి సుభటోత్తములు - సుభట + ఉత్తములు - గుణసంధి అంగళ్ళన్ - అంగడి - 'బహుత్వంబున ద్వితీయాది విభక్తులకు లడాగమంబగు బాల తత్సమ 31 అంగడి + లసు 'ఇత్తునకు బహువచనంబు పరంబగునపు డుత్వంబగు బాల తత్సమ 45 అంగడులను 'బహువచనంబు పరంబగునపుడు డ ల ట ర ల యిుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు ' బాల ఆచ్చిక 12 'బహువచనశ్లిష్టంబులయి యద్విరుక్తంబులయిన డకార లకారంబుల కలఘులకారంబు నిత్యంబుగ నగు ' బాల ఆచ్చిక 14 అంగళ్ళను ఇది సప్తమ్యర్థక ద్వితీయ 'జడంబు తృతీయాసప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు ' బాల కారక 22 అంగళ్లను = అంగళ్లయందు

చ **సురసతు లర్థిఁ దత్పురము చూడ మనంబునఁ గోరి కోటపై**
**వరుస విమానముల్ నిలిపి వచ్చిరొ నా మణిహేమభాతి న**
**ట్టిరవులు వొల్చు, నింద్రు పురి కిప్పురి మేలని యా సురాంగనల్**
**మరిగి రమించుచున్నటులు మానిను లొప్పుదు రప్పురంబునన్ 124**

**అర్థము :** సుర - సతులు = దేవతాస్త్రీలు, అర్థిన్ = కోరికతో, తద్ + పురము= ఆ ఓషధిప్రస్థపురము, చూడన్ = చూచుటకు, మనంబునన్ = మనసునందు, కోరి, కోటపైన్ = కోటమీఁద, వరుసన్ = వరుసగా, విమానముల్, నిలిపి, వచ్చిరొ, నాన్ = అనఁగా, మణి - హేమ - భాతిన్ = మణులయొక్కయు, బంగారము యొక్కయు కాంతితో, నట్టిరవులు - నట్టు + ఇరవులు = నట్టిండ్లు, పొల్చున్ = ఒప్పును, ఆ - సుర + అంగనల్ = ఆ దేవతాస్త్రీలు, ఇంద్రు పురికిన్ = ఇంద్రుని పురమైన అమరావతికంటె, ఇప్పురి - ఈ + పురి = ఈ ఓషధి ప్రస్థపురము, మేలు + అని, మరిగి = అలవాటుపడి, రమించుచున్ + ఉన్న + అటులు = ఆనందించుచున్నవిధమున - క్రీడించుచున్నవిధమున, అప్పురంబునన్ - ఆ - పురంబునన్ = ఆ ఓషధిప్రస్థపురమునందు, మానినులు = స్త్రీలు, ఒప్పుదురు

**తాత్పర్యము.** దేవతా స్త్రీలు ఆ ఓషధి ప్రస్థపురమును జూడఁగోరి కోటమీఁద

వరుసగా విమానములు నిలిపి వచ్చిరా యనునట్లు మణుల, బంగారపుఁగాంతిలో నాట్యశాలలు ఒప్పును ఇంద్రుని పురమైన అమరావతికంటె నీ పురమే మేలని ఆ దేవతాస్త్రీలు అలవాటుపడి క్రీడించుచున్నారా యనునట్లు ఆ పురమున స్త్రీ లొప్పుదురు

**విశేషములు** అలంకార ముత్ప్రేక్ష నట్టిరవులు - నట్టు + ఇరవులు - నట్టిండ్లు అప్పురము - ఆ + పురము త్రికసంధి బాలసమాస 14, 15

సీ తా నింతియై యుండఁగా నొరు నర్థించి
  హరి వేఁడె లక్ష్మి మాహాత్మ్య మెంత ?
తా నారియై యుండఁగా నజుఁ డాత్మజఁ
  గవసె భారతి నేర్పుకలిమి యెంత ?
తాఁ బత్నియై యుండఁగాఁ బరాంగన వజ్రి
  కామించె శచి సుభగత్వ మెంత ?
తాఁ గాంతయై యుండఁగాఁ గాముఁ డీల్గె మున్
  రతి శుభలక్షణోన్నతి యదెంత ?

తే తమ్ము వంచించి మును లుగ్రతపము చేసి
రప్సర స్త్రీల సోయగ మనఁగ నెంత ?
యంచు నెమ్మోయిఁ ద్రిజగంబులందు నారులఁ
గామినుల మెచ్చ రప్పురాంగనలు పేర్మి 125

**అర్థము.** తాను = లక్ష్మి, ఇంతి + ఐ = భార్యయయి ఉండఁగా, ఒరున్ = ఇతరుని, అర్థించి = కోరి, హరి = విష్ణువు (వామనుఁడై) వేఁడెన్, లక్ష్మి, మాహాత్మ్యము = గొప్పతనము, ఎంత ?

తాన్ = తాను - భారతి, నారి + ఐ = భార్యయై, ఉండఁగాన్, అజుఁడు = బ్రహ్మ, ఆత్మజన్ = కూఁతును, కవసెన్ = కూడెను, భారతి - నేర్పు - కలిమి = సరస్వతి నైపుణ్య సంపద, ఎంత ?

తాన్ = తాను - శచి, పత్ని + ఐ = భార్యయయి, ఉండఁగాన్, వజ్రి - వజ్రాయుధముగలవాఁడు - ఇంద్రుఁడు, పర + అంగనన్ = ఇతరుని - గౌతముని - భార్యను, కామించెన్ = కోరెను, శచి - సుభగత్వము = శచీదేవి సౌభాగ్యము ఎంత?

తాన్ = తాను - రతి, కాంత + ఐ = భార్యయయి, ఉండఁగాన్, కాముఁడు= మన్మధుఁడు, మున్ = మున్ను -ముందుగా, ఈల్గెన్ = చచ్చెను, రతి - శుభ - లక్షణ + ఉన్నతి = రతి దేవి యొక్క శుభ లక్షణములయొక్క ఔన్నత్యము = అది+ ఎంత ?

తమ్ముమ్న్ = అప్సరసలను, వంచించి = మోసగించి, మునులు, ఉగ్ర - తపము = భయంకరమైన తపస్సు, చేసిరి, అప్సరన్ + స్త్రీల = అచ్చరల యొక్క, సోయగము + అనఁగన్ = అందమనఁగా, ఎంత ?

అంచున్ = అనుచు, అప్పురాంగనలు = ఆ + పుర + అంగనలు = ఆ ఓషధి ప్రస్థపురమునందలి స్త్రీలు, పేర్మిన్ = గొప్పతనమునందు, ఎమ్మెయిన్ = ఏ + మెయిన్ = ఏవిధముగను, త్రిజగంబుల + అందున్ = ముల్లోకములందును, కామినులన్ + ఒరులన్ = ఇతర స్త్రీలను, మెచ్చరు

**తాత్పర్యము.** ' తాను భార్యయై యుండియు నితరుని - బలిని బ్రార్థించి విష్ణువు లక్ష్మిని - సంపదను వేఁడెను ఆమె గొప్పతన మే పాటిది ? తాను భార్యయై యుండఁగా బ్రహ్మ పుత్రికను గూడెను భార్వతి నేర్పు ఏపాటిది ? తాను భార్యయై యుండఁగా నింద్రుఁడు ఇతరుని భార్యను - గౌతముని భార్యయగు అహల్యను, కోరెను శచీదేవి సౌభాగ్య మేపాటిది ? తాను భార్యయై యుండఁగా మన్మధుఁడు ముందుగాఁ జచ్చెను ఇంక రతి శుభలక్షణౌన్నత్య మేపాటిది ? తమ్ము నిరాకరించి మునులు భయంకరమైన తపస్సులను జేసిరనఁగా నిఁక నచ్చరల అంద మేపాటిది? అనుచు ఆ ఓషధిప్రస్థపురమునందలి స్త్రీలు గొప్పతనమున ఏవిధముగను ముల్లోకములందలి ఇతరస్త్రీలను మెచ్చుకొనరు

**విశేషములు** ఒరు నర్థించి హరి వేఁడె లక్ష్మి - సాక్షా ల్లక్ష్మి తనకు భార్యయైయున్నను, విష్ణువు వామనుఁడై బలిచక్రవర్తిని పదత్రయ భూరూపలక్ష్మిని వేఁడుకొనెను అజుఁ డాత్మజఁ గవసె - బ్రహ్మకు భారతి భార్యయై యుండఁగా నతఁడు స్వపుత్రికనే కూడెను పరాంగన వజ్రి కామించె - ఇంద్రుఁడు గౌతముని భార్యయగు సహల్యను గామించెను కాముఁడీల్గె మున్ - రతికంటె ముందుగా నామె భర్తయగు మన్మధుఁడీశ్వరుని మూఁడవకంటిమంటచే దగ్ధుఁడయ్యెను తమ్ము వంచించి మును లుగ్రతపము చేసిరి - తమ తపస్సులకు విఘ్నము చేయవచ్చిన అప్సరసలను లెక్కచేయక మును లుగ్రతపములను గొనసాగించిరి ఒరులఁగామినులన్ - ఒరుఁడు - ఒరులు ఒరులు అను బహువచనాంతరూపమును మహత్త్వర్థకముగాఁగూడఁ బ్రయోగింపవచ్చును

చ కనుఁగొన సుందరాకృతులు కన్నుల పండువు, మంజుభాషణల్
విన నమృతాంబుపూరములు వీనులకుం దలఁపన్ విలాసముల్
మనసునకున్ సుఖాస్పదము, మాఱుపు లందిన మేనులందు ర
జ్జనులకుఁ గామభోగముల, జన్మఫలం బనఁ బొల్తు రంగనల్ 126

**అర్థము.**అంగనల్ = ఆ ఓషధిప్రస్థపురమునందలి స్త్రీలు, అజ్జనులకున్ = ఆ + జనులకున్ = ఆ ఓషధిప్రస్థపురమునందలి పురుషులకు, సుందర + ఆకృతులు = అందమైన ఆకారములు, కనుఁగొనన్ = చూచుటకు, కన్నుల-పండువు = కనువిందైనవి, మంజు-భాషణల్ = మనోహరములయిన మాటలు, వినన్ = వినుటకు, వీనులకున్ = చెవులకు, అమృత + అంబు-పూరములు = అమృతజలప్రవాహములు, విలాసముల్ = ఒయ్యారములు, తలఁపన్ = విచారింపఁగా, మనసునకున్ = మనస్సునకు, సుఖాస్పదము = సుఖ + ఆస్పదము = సౌఖ్యమునకుఁజోటు, కామ-భోగములన్ = మన్మథసౌఖ్యములందు, మాఱుపులు + అందిన-మేనులు =వర్తనములందిన శరీరములు, అందురు = (లోకులు) అందురు జన్మ-ఫలంబు = పుట్టువునకు ఫలమైనవారు, అనన్ = అనఁగా, పొల్తురు = ఒప్పుదురు

**తాత్పర్యము.**ఆ యోషధిప్రస్థమునందలి స్త్రీల సుందరాకారములు అందలి జనులకుఁజూడఁ గనువిందుఁగలిగించు నట్టివి వారి మనోహరాలాపములు వినుటకు వీనులకు అమృతప్రవాహము లగునట్టివి వారి యొయ్యారములు దలఁపఁగా మనస్సునకు సౌఖ్యావహమయినట్టివి మన్మథ సౌఖ్యములందు వారు వర్తనమునందిన శరీరములైనవారు ఇంతయేల? ఆచ్చటి స్త్రీలు ఆ పురుషుల పుట్టువులకు ఫలమైనవారని యంద ఱనఁగా నొప్పుదురు

**విశేషములు:**'మాఱుపులందిన మేను లందు ర-జ్జనులకుఁ గామభోగముల - అను సూ ని పాఠము అన్వయసౌలభ్యమునకు స్వీకరింపఁబడినది 'మాఱుపులందిన మేని కందు ర-జ్జనులకుఁ గామభోగములు' అనునది వావిళ్ళవారి ప్రతి పాఠము

చ అనుపమకాంతిమై సుచిరమైన మెఱుంగులొ? సోలి వీఁగ కొ
య్యన నడపాడు లేఁబొఱలొ? యాయువు వచ్చిన చిత్రరూపులో?
ఘనపదమూర్తి సేకొనిన కామ సుఖంబులొ? యంచు భావకుల్
గనుఁగొన లగ్గ నోటువడఁగాఁ గర మొప్పుదు రప్పురాంగనల్ 127

**అర్థము** అనుపమ-కాంతిమైన్ = సాటిలేని కాంతితో, సుచిరము + ఐన = మిక్కిలి చిరకాలముండునదియైన, మెఱుంగులో = మెఱుపులో, సోలి = వ్రాలి వీఁగక = చలింపక, ఒయ్యన = మెల్లఁగా, నడపాడు = (నడపు + ఆడు) = సంచరించు, లేఁబొఱలో = లేఁత పొటలో, - లేఁజివురులో, ఆయువు-వచ్చిన = ప్రాణము వచ్చిన, చిత్ర-రూపులో = చిత్తరువునందలి రూపములో, ఘనపదమూర్తి = ఆకారమును, చేకొనిన = స్వీకరించిన, కామసుఖంబులో = మన్మథసౌఖ్యములో అంచున్, భావకుల్ = భావుకులైనవారు, కనుఁగొనన్ = చూడఁగా, లగ్గన్ = మిక్కిలి, ఓటు + పడఁగాన్ = ఓడిపోఁగా, అప్పురాంగనల్ = ఆ + పుర + లంగనల్ = ఆ యోషధిప్రస్థపురస్త్రీలు, కరము = మిక్కిలి, ఒప్పుదురు

**తాత్పర్యము.** 'వీరు సాటిలేని కాంతితో మిక్కిలిచిరకాలముండు మెఱపులా? సోలి చలింపక మెల్లఁగా సంచరించు లేఁజివురులా? ప్రాణమువచ్చిన చిత్రగతరూపములా? అనుచు భావుకులు చూచి యొకరితోనొకరు పందెములు వైచికొని మిక్కిలి యోడిపోవునట్లు ఆ యోషధిప్రస్థపురమునందలి స్త్రీలు ఒప్పుదురు

**విశేషములు .** మెఱుఁగు చిరకాల ముండదు దానికి 'అచిరద్యుతి' యనిపేరు ఓషధిప్రస్థపురస్త్రీ లట్లుగాక సుచిరద్యుతులు చిరకాలముండు కాంతి గలవారు, పొఱలు (చివురులు) సోలిపోవుట, వీఁగిపోవుట అను లక్షణములు గలవి అవి నడయాడలేవు ఆ స్త్రీ లట్లుగాక సౌకుమార్యమునఁ జివురులవంటి వారయ్యు వానివలె సోలక, వీఁగక, నడపాడఁగలవారు అచ్చటి స్త్రీలు ఆకారము ధరించిన మన్మథసౌఖ్యము లన నుందురు వా రెటువంటివారనువిషయమున భావుకు లొండొరులతోఁ బందెములు వైచికొని యోడిపోవుదురు అనఁగా వారి సౌందర్యసౌకుమార్యములు వారి యూహముల కతీతముగా నుండునని భావము ఇందు 'ఘనపద' అననేమో తెలియరాలేదు

క పాయక సర్వర్తుక పు
ష్పాయత గంధములు గొంచు నప్పురిఁ బగలున్
రేయును నింటింటికి మృదు
వాయువు చనుచుండు గట్టివాలును బోలెన్ 128

**అర్థము .** పాయక = మానక, సర్వర్తుక - సర్వ + ఋతుక-పుష్ప + ఆయత-గంధములు = ఎల్ల ఋతువులందలి పూలయొక్క నిరివియైన పరిమళములు, కొంచున్ = కొనుచు = తీసికొనుచు, అప్పురిన్ (ఆ + పురిన్) =

ఆ ఓషధిప్రస్థపురమందు, పగలున్-రేయునున్= పగలును, రేయియును, మృదు-వాయువు = మందమారుతము, ఇంటింటికిన్= ప్రతి గృహమునకు, గట్టివాలును+ పోలెన్ = చందన పుష్పము లమ్మెడి స్త్రీ లేక పురుషుఁడు వలె, చనుచున్ + ఉండున్ = పోవుచుండును

**తాత్పర్యము** ఆ ఓషధిప్రస్థపురమున మందమారుతము మానక ఎల్లఋతువులందలి పూల విరివియైన పరిమళములు తీసికొనుచుఁ బగలును, రేయియును, ప్రతిగృహామునకును చందనపుష్పాదు లమ్మెడి పురుషునివలెఁ బోవుచుండును

**విశేషములు .** అలంకార ముపమ గట్టివాలు - గట్టువాలు అని శబ్దరత్నాకరము కాని భారతాదుల పెక్కు ప్రతుల పాఠమును బట్టియుఁ గన్నడమును బట్టియు 'గట్టివాలు' అని గ్రహింపఁబడినట్లు సూ ని గట్టి = పరిమళద్రవ్యముల యుండ వళ్తి - స్త్రీప్రత్యయము గట్టివళ్తి - సైరంధ్రీ జాతిస్త్రీ (సూ ని )

మ **సమదానేకపబృంహితంబు, హయహేషాఘోషమున్, గీతవా**
**ద్య మృదుధ్వానము, వేదరావము, భటోద్దండోక్తులున్ భూరిపం**
**చ మహాశబ్దరవంబుఁ గూడి సుమహత్సంక్షోభితాంభోధి నా**
**దమొ నా దిగ్బధిరీకృతంబగుచు నిత్యంబుం జెలంగుం బురిన్ 129**

**అర్థము .** పురిన్ = ఓషధిప్రస్థపురమునందు, సమద + అనేకప బృంహితంబున్ = మదముతోఁగూడిన ఏనుఁగుల ఘీంకృతులును, హయ-హేషా-ఘోషమున్ = గుఱ్ఱముల సకిలింతల ధ్వనియును, గీత - వాద్య - మృదు - ధ్వానమున్ = సంగీతము యొక్కయు, మృదంగాది వాద్యముల యొక్క మెత్తని ధ్వనియును, వేద - రావమున్ = వేద ధ్వనియును, భట + ఉద్దండ + ఉక్తులున్ = యోధుల యొక్క అధికములైన మాటలును, (ఇట్లు), భూరి పంచ - మహత్ (మహా) - శబ్ద - రవంబున్ = గొప్పవియగు వీణ, వేణువు, మృదంగము, కాహళము, శంఖము - అను నైదు గొప్ప వాద్యముల ధ్వనియును, కూడి, సు-మహత్-సంక్షోభిత + అంభోధి - నాదమొ = మిక్కిలి యెక్కువగాఁ గలఁతపెట్టఁబడిన సముద్రము యొక్క ధ్వనియో, నాన్ = అనఁగా, దిశ్ (క్) + బధిరీకృతంబు = దిక్కులు చెవుడు పడునట్లు చేయఁబడినది, అగుచున్, పురిన్ = ఓషధి ప్రస్థపురమునందు, నిత్యంబున్ = ఎల్లప్పుడును, చెలంగున్ = మ్రోయును

**తాత్పర్యము** మదపుటేనుఁగుల ఘీంకృతిధ్వనియును, గుఱ్ఱముల సకిలింతల ధ్వనియును, సంగీతవాద్యముల మృదువైన ధ్వనియును, వేదముల ధ్వనియును, యోధుల అధికమైన మాటలును, పెద్దవియగు వీణ, వేణువు, మృదంగము, కాహళము, శంఖము అను నైదువాద్యముల ధ్వనియును గూడి మిక్కిలి యెక్కువగాఁ గలఁత పెట్టఁబడిన సముద్రపు ఘోషమో యనఁగా దిక్కులు చెవులుపడునట్లు చేయఁబడుచు నోషధిప్రస్థపురమున నెల్లప్పుడును మ్రోయును

**విశేషములు .** అలంకారము ఉత్ప్రేక్ష, అతిశయోక్తియును

సీ. రాజకదంబ విరాజితంబగుఁ గాని
కంటక పార్థివోత్కరము గాదు
పద్మాలయాతిశోభన మనం జనుఁగాని
కుముదోదయాది సంకులము గాదు
శుద్ధ సువర్ణ ప్రసిద్ధాత్మ మగుఁగాని
వర చిత్ర వర్ణ సంకరముగాదు
పరమౌషధి ప్రభాభాసురం బగుఁ గాని
దుస్తృణ ద్యోతి విద్యుతము గాదు

తే వనకులంబును దత్సరోవర కులంబుఁ
జెలువ మగు హర్మ్యకులము సుక్షేత్రకులముఁ
బొలయ నిన్నింటితోఁ దాను బోలియున్న
ప్రస్తుతం బగునోషధీప్రస్థ పురము 130

**అర్థము :** ఇందు శ్లేషమూలమున నోషధిప్రస్థపురమునకు వన - సరోవర - హర్మ్య - సుక్షేత్రకులములతోఁ బోలిక చెప్పఁబడినది వన - కులంబును = వనముల సమూహమును, తద్ + సరోవర - కులంబున్ = ఆ సరస్సుల సమూహమును, చెలువము + అగు = అందమగు, హర్మ్య - కులమున్ - మేడల సమూహమును, సుక్షేత్ర - కులమున్ = మంచిపొలముల గుంపును, పొలయన్ = ఒప్పఁగా, ఇన్నింటితోన్, తాను, పోలి + ఉన్న = పోలియున్నట్టి, ప్రస్తుతంబు + అగు = మిక్కిలి కొనియాడఁబడినదియగు, ఓషధీ ప్రస్థపురము.

రాజ - కదంబ - విరాజితంబు = (ఓ.ష.) రాజుల సమూహముచేఁ బ్రకాశించునది - (వన ప ) ఒక విధమైన కడిమిచెట్లచేఁ బ్రకాశించునది, అగున్ +

కాని = అగును గాని, కంటక - పార్థివ + ఉత్కరము = (ఓషప) శత్రురాజుల సమూహముగలది - (వనప) ముండ్లతోడి భూ సంబంధమైన వాని సమూహము గలది, కాదు

పద్మ + ఆలయా + అతి - శోభనము = (ఓషప) లక్ష్మిచేత - సంపదలచేత- మిక్కిలి ప్రకాశించునది, (సరోవర ప) పద్మ + ఆలయ + అతి శోభనము - తామరలకు నిలయ మగుటచే మిక్కిలి ప్రకాశించునది, అనన్ + చనున్ + కాని = అన నొప్పును గాని, కుముద + ఉదయ + ఆది - సంకులము= (ఓషప) సంతోషహీనులగు వారి పుట్టుక మున్నగు వానిచేఁ గలవరపడినది, (సరోవర ప) పెద (పిన) గుమ్మడు నాఁచు అనువాని పుట్టుక మున్నగువానిచే నిండినది - కాదు

శుద్ధ - సువర్ణ - ప్రసిద్ధ + ఆత్మము = (ఓషప) శుద్ధులైన మంచి కులమునకుఁ జెందిన వారిచేఁ బ్రసిద్ధమైనది, (హర్మ్య ప) స్వచ్ఛమైన బంగారముచేఁ బ్రసిద్ధమైనది, అగున్ + కాని = అగును గాని, వర - చిత్ర - వర్ణ - సంకరము = (ఓషప) మేలయిన వింతలయిన కులములచే మిశ్రమైనది - కాదు (హర్మ్య ప) మేలయిన చిత్తరువులయొక్క రంగులతో మిశ్రమమైనది - కాదు

పరమ + ఓషధి -ప్రభా - భాసురంబు= (ఓషప) గొప్ప జ్యోతిష్మతుల కాంతులచేఁ బ్రకాశించునది, (సుక్షేత్ర ప) గొప్ప మందుతీఁగల మహిమచేఁ బ్రకాశించునది, అగున్ + కాని, దుస్తృణ - ద్యోతి - విద్యుతము = (ఉభయ ప) చెడు గడ్డిచే వెలుఁగునట్టిది - కాదు

**తాత్పర్యము :** వన సమూహము, సరస్సమూహము, హర్మ్య సమూహము, సుక్షేత్రకులము - అను ఇన్నింటితోఁ బోలిక గలిగి మిక్కిలి కొనియాడఁబడిన ఓషధీప్రస్థపురము - రాజుల సమూహము చేఁ బ్రకాశించునది కాని శత్రురాజుల సమూహము గలది కాదు వన సమూహము వలె గడిమిచెట్లచేఁ బ్రకాశించును గాని, ముండ్లచెట్లు గలది కాదు పద్మాలయ (లక్ష్మి)చే మిక్కిలి ప్రకాశించునది కాని సంతోషహీనుల యుదయముచేఁ గలవరపడినది కాదు సరోవరమువలెఁ దామరలకు నిలయమగుటచే మిక్కిలి ప్రకాశించును గాని గుమ్మడు, నాచు అనువానితో నిండినది కాదు శుద్ధులైన సద్వర్ణులచేఁ బ్రసిద్ధమైనది కాని వింతలైన కులముల

సంకరము గలది కాదు హర్మ్యము వలె స్వచ్ఛమైన బంగారముచేఁ బ్రసిద్ధమయినదికాని చిత్తరువుల రంగులతో మిశ్రమయినది కాదు సుక్షేత్రమువలె గొప్ప జ్యోతిష్మతుల ప్రభచేఁ బ్రకాశించునది కాని దుష్తృణముచే వెలుఁగునట్టిదికాదు

**విశేషములు .** అలంకారము - శ్లేషము

క. **ఉరుతర మణిగణ రుచి వి**
**స్ఫురితంబై వివిధ విపుల భోగాన్వితమై**
**పరమ శ్రీ సహితంబై**
**యురగాధిపుఁబోలె తత్పురోన్నతి వొలుచున్** 131

**అర్థము .** తద్ + పుర +ఉన్నతి = ఆ ఓషధిప్రస్థపురము నౌన్నత్యము, ఉరుతర - మణి - గణ - రుచి - విస్ఫురితంబు + ఐ =మిక్కిలి గొప్పవియైన మణులయొక్క సమూహముయొక్కకాంతిచే మిక్కిలిప్రకాశించునది యయి, - ఉభయపరము, వివిధ - విపుల - భోగ - అన్వితము + ఐ = పలురీతులయినవి, గొప్పవియైన సుఖములతోఁ గూడినవయి, అని పురోన్నతిపరము, పలురితులయినవి, పెద్దవియైన పడగలతోఁ గూడినవయి అని 'ఉరగాధిపుపరము', పరమ - శ్రీ - సహితంబు + ఐ = మిక్కిలి ఉత్కృష్టుఁడైన విష్ణువుతోను, శ్రీ + లక్షితోను గూడినదయి - అని ఉరగాధిపుపరము, ఉరగ + అధిపున్ + పోలెన్ = పాములతేఁడగు శేషునివిధమున, పొలుచున్ = ప్రకాశించును

**తాత్పర్యము :** ఆ ఓషధిప్రస్థపురౌన్నత్యము మిక్కిలి గొప్పవియైన మణుల సమూహము కాంతితోఁ బ్రకాశించునదియయి, పలురీతులైన గొప్ప సుఖములతోఁ గూడినదయి, ఉత్కృష్టమైన సంపదతోఁ గూడినదయి, మిక్కిలి గొప్పమణుల సమూహము కాంతులతోఁ బ్రకాశించునదియయి, పలువిధములైన విశాలములయిన పడగలతోఁ గూడినదియయి, ఉత్కృష్టుఁడైన విష్ణువుతోను, లక్ష్మితోను గూడినదయి, పాములతేఁడయిన శేషునివలెఁ బ్రకాశించును

**విశేషములు .** అలంకారము శ్లేషోత్థాపితమైన ఉపమ, భోగ = సుఖము, పాము పడగ, పరమ - శ్రీ - ఉత్కృష్టమైన సంపద -ఉత్కృష్టుఁడైన విష్ణువు, లక్ష్మి అని అర్థద్వయముచే శ్లేషము తత్పురోన్నతి వొలుచున్ = తత్పురోన్నతి + పొలుచున్ 'ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళముగా నగు ' బాల సంధి 13

### హిమవద్వర్ణనము

సీ మును మహీధేనువు చను వత్సమై కుడ్చి
వస్తు సంపూర్ణమై వలలువాఁడు
కమఠోరగేంద్ర దిగ్గజరాజి దాల్చు భూ
భార మెక్కటిఁ దాల్చి పరఁగువాఁడు
త్రైలోక్యజననియై తనరు శర్వాణికి
జనకుండు నా సడిసన్నవాఁడు
విశ్వైకగురుఁడగు నీశ్వరునకు నర్థి
మామగా నెగడిన మహిమవాఁడు

తే తుహినకర తీవ్రకర హుతవహులు వరుసఁ
బాచు తమ మోషధీప్రభాభాతిఁ దాన
పాచి విలసిల్లువాఁడు దిగ్భరిత కీర్తి
మంతుఁ డచలుండు పతి హిమవంతుఁ డతఁడు 132

**అర్థము.** మును = పూర్వము, మహీ - ధేనువు - చను = భూమియనెడు నావు పొదుఁగు, వత్సము + ఐ = దూడయయి, కుడ్చి = కుడిచి, వస్తు - సంపూర్ణము + ఐ = రత్నములు, ఓషధులు మున్నగు వస్తువులతో నిండి, వలలువాఁడు = ఒప్పువాఁడు

కమఠ + ఉరగ + ఇంద్ర - దిశ్ (క్) + గజ - రాజి = ఆది కూర్మము, పాఁపటెఁడగు అనంతుఁడు, దిక్కులందలి ఏనుఁగుల సమూహము, తాల్చు = భరించు, భూ - భారము = భూమియొక్క బరువు, ఎక్కటిన్ = ఒక్కఁడును, తాల్చి = భరించి, పరఁగువాఁడు = ఒప్పువాఁడు

త్రైలోక్య - జనని + ఐ = ముల్లోకముల తల్లి యయి, తనరు = ఒప్పునట్టి, శర్వాణికిన్ = పార్వతికి, జనకుండు - నాన్ = తండ్రియనఁగా, సడి + చన్నవాఁడు = కీర్తికెక్కినవాఁడు,

విశ్వ + ఏక - గురుఁడు + అగు = లోకమునకు ఒకే ఒక గురువైన, ఈశ్వరునకున్ = శివునకు, అర్థిన్ = కోరికతో, మామగాన్, నెగడిన = ప్రసిద్ధికెక్కిన, మహిమ - వాఁడు = గొప్పతనము గలవాఁడు

తుహినకర - తీవ్రకర - హుతవహులు = చంద్రుఁడు, సూర్యుఁడు, అగ్ని, వరుసన్, పాచు = తొలఁగఁజేయు, తమము = చీఁకటి, ఓషధీ - ప్రభా - భాతిన్=

ఓషధులయొక్క, కాంతులయొక్క, ప్రకాశముచేత, తాను + అ = తానే, పాచి = తొలఁగించి, విలసిల్లువాఁడు = ప్రకాశించువాఁడు, దిశ్ (క్) + భరిత - కీర్తి - మంతుఁడు = దిక్కులందు నిండిన కీర్తి గలవాఁడు, అతఁడు, అచలుండు = చలనము లేనివాఁడు, పతి = (పర్వత) రాజు, హిమవంతుఁడు

**తాత్పర్యము** . పూర్వము భూమి గోవుకాఁగా దాని పొదుఁగును హిమవంతుఁడు దూడయై కుడిచెను మేరువు పాలు పిదుకువాఁడయి ప్రకాశించు రత్నములను, మహౌషధులను బిదికెను ఇదియంతయుఁ బృథుమహారాజు నాజ్ఞ చొప్పున జరిగెను ఆదికూర్మము, పాఁపతేఁడు అగు అనంతుఁడు, దిగ్గజముల వరుస భరించు భూభారమును ఒక్కఁడే భరించి యొప్పువాఁడు ముల్లోకములకుఁ దల్లియైయొప్పు పార్వతికిఁ దండ్రి యనఁగాఁ గీర్తికెక్కినవాఁడు లోకైకగురుఁడైన యీశ్వరునకు మామయను ప్రసిద్ధిని వహించినవాఁడు చంద్రుఁడు, సూర్యుఁడు, అగ్ని వరుసగాఁ దమకాంతులచేఁ బోఁగొట్టు చీఁకటిని దా నొక్కఁడే తన ఓషధులకాంతులచేఁ బోఁగొట్టి ప్రకాశించువాఁడు దిక్కులందు నిండిన కీర్తిగల వాఁడు, చలనము లేనివాఁడు అతఁడు పర్వతరాజగు హిమవంతుఁడు

**విశేషములు :** మును మహీధేనువు వఱలువాఁడు ।

'యం సర్వశైలాః పరికల్ప్య వత్సం
మేరౌ స్థితే దోగ్ధరి దోహదక్షే,
భాస్వన్తి రత్నాని మహౌషధీశ్చ
పృ థూపదిష్టాం దుదుహు ర్ధరిత్రీమ్ కాళిదాసకుమార 1 - 2

ఆదికూర్మము, ఆదివరాహము, అనంతుఁడు, అష్టదిగ్గజములు, సప్తకుల పర్వతములు భూభారమును వహించుచున్నవని పురాణములు శర్వాణి - ఇంద్ర, వరుణ, భవ, శర, రుద్ర, మృడ, హిమ, అరణ్య, యవ, యనన, మాతుల, ఆచార్య శబ్దములకు ఈ ప్రత్యయమును, అంతకు ముందు ఆన్ అను నాగమమును వచ్చును శర్వ + ఆన్ + ఈ = శర్వాణీ త్రైలోక్యం - త్రయాణాం లోకానాం సమాహారః - త్రైలోక్యమ్ మూఁడు లోకముల సమాహారము సమాహారార్థకమగు ద్విగువు ఏకవచనాంతమును, నపుంసకము నగును నడిసన్న - నడి+ చన్న - నిందపోయిన - కీర్తికెక్కిన విశ్వైక - విశ్వ + ఏక - వృద్ధి సంధి అ ఆలకు ఏ ఐలు పరములగునపుడు ఐకారమును, ఓ ఔలు పరములగునపుడు ఔకారమును

ఏకాదేశములగును హుతవహుఁడు -హుతమును - హవిస్సును - వహించువాఁడు - అగ్ని పాచు - పాయుధాతు ప్రేరణార్థకరూపము - 'అట్లు చుక్కుగాగమంబు లడంగ్వాది మాయ్వాదులకగు నగుచో వాని కడవ్రాలు లోపించు' - బాల క్రి 76 పాచు - (రూపాం) పావు ఓషధి - ఓషధీ శబ్దములు రెండును గలవు దిశ్ + భరిత - దిక్ + భరిత - దిగ్భరిత చను - చన్ను - చను 'ఉకారంబుక్రింది ఉకారంబునకుం దుది ను లుల క్రింది నలలకు లోపంబు బహుళంబుగ నగు' బాల ప్రకీర్ణ 7

## సప్తర్షులు హిమవంతునితోఁ బార్వతిని శివునకిమ్మని పలుకుట

వ అని యనేక ప్రకారంబులఁ వర్ణింపందగిన వర్ణనల కెక్కి మహీరమణీ ముఖలలామంబునుంబోలె నతిరమణీయంబైన యోషధిప్రస్థపురవర ప్రభావంబు గనుంగొని మెచ్చి పిచ్చలించుచు వచ్చు మునీంద్రుల కచలేంద్రుం డెదురువచ్చి వినయవినమితోత్తమాంగుండై నిజరాజమందిరంబునకుం దోడ్కొని చని సముచితాసనపాద్యాద్యశేషార్చనా భ్యర్చితులఁ జేసి కర్పూరపాళీవిరాజితంబులగు విడియంబు లిచ్చి ముకుళితకరకమలుండై భవదీయాగమనప్రయోజనం బెఱింగించి దయసేయుం డనినగిరిపతి నమ్మునిపతులు యథోచితవచనంబులం గలపికొని. 133

**అర్థము**. అని, అనేక - ప్రకారంబులన్ = పెక్కు విధముల, వర్ణింపన్ + తగిన, వర్ణనలకున్ + ఎక్కి = వర్ణనలు వహించి, మహీ -రమణీ - ముఖ లలామంబునున్ + పోలెన్ = భూమియనెడు స్త్రీయొక్క మొగమునకు నుదుటియలంకారము విధమున, అతి - రమణీయంబు + ఐన = మిక్కిలి సుందరమైన, ఓషధి ప్రస్థ - పుర - వర - ప్రభావంబు = పురశ్రేష్ఠమైన ఓషధిప్రస్థము యొక్క గొప్పతనము, కనుంగొని = చూచి, మెచ్చి, పిచ్చలించుచున్ - ఆనందించుచు, వచ్చు = వచ్చునట్టి, ముని + ఇంద్రులకున్ = ముని శ్రేష్ఠులకు, అచలేంద్రుండు - అచల + ఇంద్రుండు - పర్వతశ్రేష్ఠుఁడు, - హిమవంతుఁడు, ఎదురు వచ్చి, వినయ - వినమిత - ఉత్తమాంగుండు + ఐ = అడఁకువచేత - వంపఁబడిన - శిరస్సు గలవాఁడయి, నిజ-రాజ - మందిరంబునకున్ = తనదైన రాజభవనమునకు, తోడ్కొని - చని = తీసికొని వెడలి, సముచిత + ఆసన - 'పాద్య - ఆది + అశేష + అర్చన (అర్చనా) + అభ్యర్చితులన్ + చేసి = అర్హములైన, ఆసనము, పాద్యము మున్నగు సమస్తమైన పూజలచేఁ బూజింపఁబడిన వారిని జేసి, కర్పూర - పాళీ -

విరాజితంబులు + అగు = కప్పురములయొక్క వరుసచేఁ బ్రకాశించునవియగు విడియంబులు = తాంబూలములు, ఇచ్చి, ముకుళిత - కర - కమలుండు + ఐ= ముడిచిన హస్తపద్మములు గలవాఁడయి, భవదీయ + ఆగమన - ప్రయోజనంబు= మీదయిన రాకకుఁ గారణము, ఎఱింగించి = తెలిపి, దయసేయుండు = విచ్చేయుఁడు అనిన, గిరి-పతిన్= కొండల ఱేనిని, అమ్మునిపతులు - ఆ + ముని-పతులు = ఆ మునిశ్రేష్ఠులు, యథోచిత - యథా + ఉచిత - వచనంబులన్ = ఔచిత్యము నతిక్రమింపని మాటలతో, కలపికొని

**తాత్పర్యము** . అని పెక్కువిధముల వర్ణింపఁదగిన వర్ణనలతో నొప్పి భూమియను స్త్రీ ముఖాలంకారమోయన మిక్కిలి సుందరమైన ఓషధి ప్రస్థపురవరము గొప్పతనమును జూచి మెచ్చి ఆనందించుచు వచ్చునట్టి మునిశ్రేష్ఠులకుఁ బర్వతశ్రేష్ఠుఁడు అగు హిమవంతుఁడు ఎదురువచ్చి వినయముచే శిరస్సు వంచి తన రాజభవనమునకుఁ దోడ్కొనిపోయి, సముచితములైన ఆసనము, పాద్యము మున్నగు సమస్తపూజావిధానములచేఁ బూజించి, కర్పూరముచే నొప్పుతాంబూలము లిచ్చి నమస్కరించి 'మీ రాకకుఁ గారణమును దెలిపి విచ్చేయుఁ' డనినకొండలఱేనిని ఆ మునీశ్వరులు సముచితములైన మాటలతోఁ గలుపుకొని - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు** . మహీ - రమణీ - మహియనెడు రమణి - రూపకము ఆది + అశేష = ఆద్యశేష - యణాదేశ సంధి యథోచిత - ఉచిత మనతిక్రమమ్య - అవ్యయీభావ సమాసము

**మ** **రజతాద్రిస్థుఁ డనాదిదేవుఁ డఖిలారాధ్యుం డసాధ్యుండు త**
**త్త్రిజగన్నాథుఁడు మమ్ము నీ కడకుఁ బుత్తేరంగ నా స్వామి క**
**ద్రిజ నీ నే మడుగంగ వచ్చితి ముమాదేవిన్ లసత్కన్యకా**
**వ్రజచూడామణి నిమ్ము శంభునకు భాస్వత్పర్వతాధీశ్వరా !** **134**

**అర్థము** . భాస్వత్ + పర్వత + అధి + ఈశ్వరా! = ప్రకాశించుచున్న కొండలఱేఁడా! రజత + అద్రి-స్థుఁడు = వెండికొండ (కైలాసము) పైనుండువాఁడు, అనాది-దేవుఁడు = మొదలులేని దేవుఁడు, అఖిల + ఆరాధ్యుండు = ఎల్లరకుఁ బూజనీయుఁడు, అసాధ్యుండు = సాధింపరానివాఁడు, తద్ + త్రిజగత్ + నాథుఁడు = ఆ ముల్లోకముల ప్రభువు - ఈశ్వరుఁడు, మమ్మున్, నీ కడకున్ = నీయొద్దకు, పుత్తేరంగన్ = పంపఁగా, ఆ-స్వామికిన్ = ఆ ప్రభువునకు, అద్రిజన్

= పార్వతిని, ఈన్ = ఇచ్చుటకు, ఏము, అడుగంగన్, వచ్చితిమి, లసత్ + కన్యకా-వ్రజ-చూడామణిన్ = ఒప్పుచున్న కన్యకల సమూహమునందుఁ దలమానికమైన (శ్రేష్ఠురాలయిన), ఉమా-దేవిన్ = పార్వతీదేవిని, శంభునకున్, ఇమ్ము

**తాత్పర్యము** 'ప్రకాశించుచున్న పర్వతప్రభూ! కైలాసముపై నుండువాఁడును, అనాదియగు దేవుఁడును, సర్వారాధ్యుఁడును, అసాధ్యుఁడును, ఆ ముల్లోకముల ప్రభువును అగు నీశ్వరుఁడు మమ్ము నీయొద్దకుఁ బంపఁగా నా ప్రభువునకుఁ బార్వతి నిమ్మని మే మడుగ వచ్చితిమి కన్యకలలో శ్రేష్ఠురాలగు నుమాదేవిని ఈశ్వరున కిమ్ము'

**విశేషములు .** పుత్తేరంగన్ = 'పుచ్చు ధాతువు 'తెంచుధాతు వగ్వాదుల కనుప్రయుక్తం బగు నగుచో నుత్వంబు పయిని దాని తకారంబు దకారం బగు' బాల క్రియ 110 పుచ్చు + తెంచు 'అయ్యది పరంబగునపుడు చువర్ణంబు లోపించు ' బాల క్రియ 112 పుత్ + తెంచు ఒక హల్లునకు విజాతీయమగు హల్లుతో సంయోగమేర్పడునప్పు డా హల్లు పరహల్లుగా మాఱునను నిర్దేశానుసారముగా గ్రహింపఁదగును కాన చకారము పరహల్లుగా మాఱి పుత్ + తెంచు = పుత్తెంచు అగును 'తుమర్థ భావలక్షణంబులందు నుజీ యగు బాల క్రియ 40 పుత్తెంచు + నుజీ ముజీత్తులు ముత్తు నాఁబడు బాల క్రియ 86 'అద్దానికి ముత్తు పరంబగునపుడు తే తేరు లగు ' పుత్తేరు + నుజీ బాల క్రియ 113 'జీత్తు పరంబగునపు డుత్వంబున కత్వంబగు ' బాల క్రియ 20 పుత్తేరను 'నుజ్యంతంబగు నగుధాతువు క్రియావిశేషణంబుల కనుప్రయుక్తంబగు నుజీకి విభాష నగు ' బాల క్రియ 115 పుత్తేరను + కాను 'దానికి హ్రస్వంబు విభాష నగు ' బాల క్రియ 116 పుత్తేరను + కను ద్రుతకార్యము (బాల సంధి 16,17) పుత్తేరంగను 'అవసానంబునందు ద్రుతస్వరంబునకేని ద్రుతంబునకేని లోపంబు బహుళంబుగ నగు ' బాల సంధి 20 పుత్తేరంగన్

వ అనిన నమ్మునిపతుల దివ్యవచనంబులు ప్రియంబున నాదరించి 135

**అర్థము.** అనినన్, అమ్మునిపతుల (ఆ + మునిపతుల) = ఆ మునీశ్వరుల, దివ్య-వచనంబులు = మంచి మాటలు, ప్రియంబునన్ = ప్రీతితో, ఆదరించి = మన్నించి

**తాత్పర్యము.** అనఁగా ఆ మునీశ్వరుల దివ్యములయిన పలుకులు ప్రీతితో మన్నించి - తరువాతి పద్యముతో నన్వయము

**హిమవంతుఁడు సప్తర్షుల మాటలకు సంతసించుట**

క విని ముత్పులకితదేహము
వినుతానందాశ్రు గళిత విమలాక్షములున్
దనరఁగ మహాప్రసాదం
బని పరమేశ్వరుని కెఱఁగి యగపతి భక్తిన్ 136

**అర్థము.** విని, ముద్ + పులకిత-దేహమున్ = సంతోషముతో గగుర్పొడిచిన మేనును, వినుత + ఆనంద + అశ్రు-గళిత-విమల + అక్షములున్ = పొగడఁబడిన సంతోషబాష్పములు రాలిన నిర్మలములైన కన్నులును, తనరఁగన్ = ఒప్పఁగా, అగపతి = పర్వతరాజు - హిమవంతుఁడు, మహత్ (మహా) + ప్రసాదంబు + అని, భక్తిన్ = భక్తితో, పరమేశ్వరునికిన్, ఎఱఁగి = నమస్కరించి

**తాత్పర్యము .** విని సంతోషముచే గగుర్పొడిచిన మేనును, సంతోష బాష్పములు రాలిన కన్నులును ఒప్పఁగా హిమవంతుఁడు భక్తితో నీశ్వరునకు నమస్కరించి - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** విమలాక్షములున్ - అక్షిన్ శబ్దము అవ్యయీభావ సమాసముననను, బహువ్రీహి సమాసముననను ఉత్తరపదమైనపుడు అకారాంత మగును కాని యిటఁ గర్మధారయ సమాసముననను అకారంత మగుట విశేషము

చ పరమున కేను దాసుఁడని పల్కఁగఁ బ్రాప్తుఁడఁగాను మత్సుతన్
హరునకు నిత్తు నా వెఱవనయ్యె సపుత్రకళత్ర మేను మీ
వరువుఁడ మిమ్ముఁ గొల్వఁగలవాఁడ నవశ్యము దీని మీరు చె
చ్చెర నొడఁగూర్చి నాకు దయసేసి కృతార్థునిఁజేయుఁ డిత్తఱిన్ 137

**అర్థము :** పరమునకున్ = గొప్పవాఁడయిన శివునకు, ఏను = నేను, దాసుఁడు + అని = సేవకుఁడనని, పల్కఁగన్ = పలుకుటకు, ప్రాప్తుఁడన్ = సమర్థుఁడను, కాను, మత్ + సుతన్ = నా కూఁతున్ను, హరునకున్ = ఈశ్వరునకు, ఇత్తున్ = ఇచ్చెదను, నాన్ = అనుటకు, వెఱవన్ + అయ్యెన్ = భయపడనయ్యెను, సపుత్ర-కళత్రము = పుత్రులతోను, భార్యతోను, ఏను = నేను, మీ-వరువుఁడన్ = దాసుఁడను, మిమ్మున్, కొల్వఁగలవాఁడన్ =

సేవింపఁగలవాఁడను, అవశ్యమున్ = తప్పక, దీనిన్ = ఈ కార్యమును, మీరు, చెచ్చెరన్ = శీఘ్రముగా, ఒడఁగూర్చి = పొసఁగించి, నాకున్, దయ + చేసి = నన్ననుగ్రహించి, ఇత్తఱిన్ = ఈ + తఱిన్ = ఈ సమయమున, కృతార్థునిన్ = ధన్యుని, చేయుఁడు

**తాత్పర్యము .** 'పరమేశ్వరున కేను దాసుఁడనని పలుకులకు సమర్థుఁడను గాను నా పుత్త్రిని శివునకు నిత్తుననుటకు భయమగుచున్నది భార్యాపుత్త్ర సహితముగ నేను మీ సేవకుఁడను మిమ్ము సేవింపఁగలవాఁడను మీరు ఈ శుభమును దప్పక శీఘ్రముగాఁ బొసఁగించి దయతొ నిప్పుడు నన్ను ధన్యాత్మునిం జేయుఁడు '

**విశేషములు .** ఏను దాసుఁడని - 'ప్రథమాంతంబులగు యుష్మదస్మ ద్విశేషణంబుల కేకత్వంబున వు నులును, బహుత్వంబున రు ములు నంతాగమంబులు ప్రాయికంబుగ నగు ' బాల కారక 33 ఏను దాసుఁడు + ను 'ఈ యాగమంబులు పరంబులగునపు డుత్వంబున కత్వంబగు ' బాల కారక 34 ఏను దాసుఁడను + అని - 'ఏను దాసుఁడనని' అని కావలసియుండఁగా, ప్రాయికగ్రహణముచే నీ ఏను దాసుఁడని అనుప్రయోగము రక్షిత మయ్యెను ఏను దాసినని వా ప్రతి, సా ప్రతులలోని పాఠము దాసి స్త్రీలింగమగుటచే బాగులేదు దాసుఁడని మా రా ప్రతి పాఠము

చ **కులముల రాజు, గోత్రమునకుం బతి, వేల్పులవేల్పు, సంపదల్**
**కలిమి కధీశుఁ, డీవి కధికారి, త్రిమూర్తుల కాదిమూర్తి, దా**
**నెలమి సమస్తలోకముల కీశ్వరుఁ డిమ్మెయి నన్ను నేలఁగాఁ**
**దలఁచిన దీన నేను గడు ధన్యుఁడఁ బుణ్యుఁడ లోకమాన్యుఁడన్ 138**

**అర్థము :** కులముల-రాజు = కులములకుఁ బ్రభువు, గోత్రమునకున్ = పర్వతమునకు (కైలాసమునకు), పతి = ప్రభువు, వేల్పుల-వేల్పు = దేవదేవుఁడు, సంపదల్-కలిమికిన్ = సంపదలు గలుగుటకు, అధి + ఈశుఁడు = ప్రభువు, ఈవికిన్ = ఔదార్యమునకు అధికారి, త్రిమూర్తులకున్ = బ్రహ్మవిష్ణుమహేశ్వరులకు ముగ్గురకును, ఆది-మూర్తి = మొదటివాఁడు, తాను, ఎలమిన్ = ప్రీతితో, సమస్త-లోకములకున్ = ఎల్ల భువనములకు, ఈశ్వరుఁడు = ప్రభువు, ఇమ్మెయిన్ (ఈ + మెయిన్) = ఈ విధముగా, నన్నున్, ఏలఁగాన్ = పాలింపఁగా, తలఁచిన-దీనన్ = తలఁచిన యీ కారణముచేత, ఏను, కడున్ = మిక్కిలి, ధన్యుఁడన్, పుణ్యుఁడన్, లోక-మాన్యుఁడన్ = జగములచే మన్నింపఁదగినవాఁడను

**తాత్పర్యము** కులములకు రాజును, కైలాసనగమునకుఁ బతియును, దేవదేవుఁడును, సంపదలు గలుగుట కధిపతియును, ఔదార్యమున కధికారియును, బ్రహ్మ విష్ణు మహేశ్వరులనెడి త్రిమూర్తులకును మొదటివాఁడును, సర్వభువనాధీశుఁడును అగు నీశ్వరుఁ డీ రీతిగా నన్నుఁ బాలింపఁదలఁచుటచే నేను గృతార్థుఁడను, పుణ్యాత్ముఁడను, లోకమాన్యుఁడను అగుచున్నాను

క ఇది నాకు నుంకు విచ్చుట
యిది మొదలుగ నన్ను నరణ మిచ్చితిఁ ద్రిజగ
ద్విదితముగ నీశ్వరున కని
ముద మొదవ శిలోచ్చయోత్తముఁడు నిశ్చితుఁడై 139

**అర్థము.** ఇది = ఈ విధముగా నన్ను నీ వనుగ్రహించుట, నాకున్, ఉంకువ = ఓలి, ఇచ్చుట, ఇది-మొదలుగన్ = ఇది మొదలుకొని, త్రిజగత్ + విదితముగన్ = ముల్లోకములందును బ్రసిద్ధమగునట్లు, ఈశ్వరునకున్ = శివునకు, నీకు, నన్నున్, అరణము + ఇచ్చితిన్ = అరణమును (యౌతకమును) ఇచ్చితిని, అని = అని పలికి, శిలోచ్చయ + ఉత్తముఁడు = పర్వతశ్రేష్ఠుఁడు - హిమవంతుఁడు, ముదము + ఒదవన్ = సంతోషము గలుగునట్లు, నిశ్చితుఁడు + ఐ = నిశ్చయించినవాఁడయి

**తాత్పర్యము.** 'ఈ విధముగా నన్ను నీ వనుగ్రహించుట నాకు నీ వరణము నిచ్చుటయే ఇది మొదలుకొని ముల్లోకములందును బ్రసిద్ధమగునట్లు ఈశ్వరుఁడవైన నీకు న న్నరణముగా నిచ్చితిని ' అని పలికి పర్వతోత్తముఁడు సంతోషము గలుగునట్లు నిశ్చయించినవాఁడయి' - తరువాతి వచనముతో నన్వయము

వ 'ఈ మునివరులకుం జూడ గౌరిం దోడ్కొని రం'డని విదగ్ధాంగనల నియమించినఁ దద్గణికానియోగంబున మణికోశంబున వెలడు మదను ఖడ్గలతికయుం బోలె నగజ నైపథ్యాగారంబు వెడలి లజ్జావనతానన యగుచు 140

**అర్థము.** ఈ-ముని-వరులకున్ = ఈ మునీశ్వరులకు, చూడన్ = చూడ వీలగునట్లు, గౌరిన్ = పార్వతిని, తోడ్కొని-రండు = తీసికొని రండు, అని, విదగ్ధ+ అంగనలన్ = ప్రౌఢలైన స్త్రీలను, నియమించినన్ = ఆజ్ఞాపింపఁగా, తద్ + గణికా-నియోగంబునన్ = ఆ ప్రౌఢాంగనల పంపుచే, మణి-కోశంబునన్-వెలడు =

మణిమయమైన ఒటునుండి, వెలువడునట్టి, మదను = మన్మధునియొక్క, ఖడ్గ-లతికయున్ + పోలెన్ = లతవంటి కత్తివలె, అగజ = పార్వతి, నైపథ్య + అగారంబునన్ = అలంకరించుకొను గృహమునుండి, వెడలి, లజ్జా + అవనత + ఆనన = సిగ్గుచే వంపఁబడిన ముఖము గలది, అగుచున్

**తాత్పర్యము** 'ఈ మునిశ్రేష్ఠులు మామాటకు వీలగునట్లు పార్వతిని దీసికొని రం'డని ప్రౌఢాంగనల నియమింపఁగా, వారి పంపున మణిమయమైన ఒటునుండి వెలువడు మన్మధుని లతవంటి కత్తియోయనఁ బార్వతి అలంకరణ గృహమునుండి వెలువడి సిగ్గుచేఁ దలవంచుకొన్నది యగుచు - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** అలంకార ముపమ

చ **తన తనుకాంతి తళ్కులు సుధారసపూరముగాఁగ దానిలోఁ**
**గనుఁగవ దీధితుల్ ఝషనికాయములై పొలయంగ, భ్రూలతల్**
**సను లహరీప్రవాహముగ శైలజ వచ్చె సభానికేతనం**
**బను మహిఁ గప్పు రాగభరితాంబుధి నా మదలీలఁ గ్రాలుచున్ 141**

**అర్థము .** తన-తను-కాంతి-తళ్కులు = తన శరీరకాంతుల తళతళలు, సుధా-రస-పూరము = అమృతరసప్రవాహము, కాఁగన్ = కాఁగా, దానిలోన్ = ఆ ప్రవాహములో, కనుఁగవ (కను + కవ)-దీధితుల్ = కన్నులజంట కాంతులు, ఝష-నికాయములు + ఐ = చేఁపలగుంపులయి, పొలయంగన్ = సంచరింపఁగను, భ్రూ-లతల్ = బొమతీవలు, చను = ఒప్పునట్టి, లహరీ-ప్రవాహము + కన్ = పెద్దయలల ప్రవాహముగను, శైల-జ = కొండకూఁతురు - పార్వతి, సభా-నికేతనంబు + అను-మహిన్ = సభామందిరము అనెడి భూమిని, కప్పు = కప్పునట్టి, రాగ-భరిత + అంబుధి-నాన్ = అనురాగముతో నిండిన సముద్రమోయనునట్లు, మద-లీలన్ = పరమానందమువలని విలాసముతో, క్రాలుచున్ = ఒప్పుచు, వచ్చెన్

**తాత్పర్యము .** తన శరీరకాంతి తళతళలు అమృతరసప్రవాహము కాఁగా, దానిలోఁ గన్నుల కాంతులు చేఁపల సమూహములయి సంచరింపఁగా, బొమతీవలు పెద్దయలల ప్రవాహముకాఁగాఁ, బార్వతి సభాస్థానమనెడి భూమిని గప్పునట్టి అనురాగభరితమైన సముద్రమో యనునట్లు పరమానందమువలని విలాసముతో వచ్చెను

**విశేషములు.** అలంకారము రూపకానుప్రాణితమైన ఉత్ప్రేక్షాలంకారము

వ ఇట్లు చనుదెంచి నిజజనకు నూరుపీఠం బలంకరించుచున్న గౌరి నమ్మునివరులు గని తదుత్తమస్త్రీలక్షణలక్షితంబగు సర్వాంగోపాంగప్రత్యేక సముదాయశోభ లుపలక్షించి చూచి ప్రముదితహృదయు లగుచు నిప్పరమేశ్వరి పరమేశ్వరు నగ్రమహిషి యగు డేమి యపూర్వం బని నిశ్చయించి పార్వతి ముద్రారోహణంబు సేసి నగపతిచేత సత్కృతులై వీడ్కొని చనుదెంచి రంత నంతకుమున్న తద్వృత్తాంతంబెల్ల నెఱింగి హరి పరమేష్ఠి పురందర ప్రముఖ సురాసురోరగసిద్ధ విద్యాధరాద్యఖిల భువన భవనాధీశ్వరు లీశ్వరాచలంబున కరిగి తదున్నతిఁ గని విస్మితు లగుచు 142

**అర్థము :** ఇట్లు, చనుదెంచి = వచ్చి, నిజ-జనకు = తన తండ్రియొక్క, ఊరు-పీఠంబు = తొడయనెడి పీఠము, అలంకరించుచున్ + ఉన్న, గౌరిన్ = పార్వతిని, అమ్మునివరులు (ఆ + ముని-వరులు) = ఆ మునిశ్రేష్ఠులు, కని, తద్ + ఉత్తమ-స్త్రీ-లక్షణ-లక్షితంబు = ఆమెయొక్క, శ్రేష్ఠురాలయిన స్త్రీయొక్క లక్షణములచేఁ జూడఁబడినది, అగు, సర్వ + అంగ + ఉప + అంగ-ప్రత్యేక-సముదాయ-శోభలు = ఎల్ల అవయవములయు, ఉపాంగములయు, వేర్వేఱు సొగసులు, ఉపలక్షించి, చూచి = బాగుగాఁజూచి, ప్రముదిత-హృదయులు = సంతోషించిన హృదయములు గలవారు, అగుచున్, ఇప్పరమేశ్వరి = (ఈ + పరమేశ్వరి) = ఈ పార్వతి, పరమేశ్వరు + అగ్ర-మహిషి = పరమేశ్వరునియొక్క పట్టపుదేవి, అగుడు = అగుట, ఏమి-అపూర్వంబు = ఏమి వింత, అని, నిశ్చయించి, పార్వతి-ముద్రా + ఆరోహణంబు + చేసి = పార్వతియొక్క, వివాహనిశ్చయ సూచకముగా సేలాలు శిరస్సుపై నుంచి (?), నగ-పతి చేతన్ = కొండలఱేనిచేత, సత్కృతులు + ఐ = సత్కరింపఁబడినవారయి, వీడ్కొని = సెలవుపుచ్చుకొని, చనుదెంచిరి = వచ్చిరి, అంతన్ = పిమ్మట, అంతకున్ + మున్ను + అ = అంతకుమునుపే, తద్ + వృత్తాంతంబు + ఎల్లన్ = ఆ వృత్తాంతమంతయు, ఎఱింగి, హరి-పరమేష్ఠి-పురందర-ప్రముఖ-సుర + అసుర + ఉరగ-సిద్ధ-విద్యాధర + ఆది + అఖిల-భువన-భవన + అధీశ్వరులు = విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుఁడు మున్నగు దేవతలు, రాక్షసులు, నాగులు, సిద్ధులు, విద్యాధరులు మొదలగు నెల్ల లోకములనెడి భవనములకుఁ బ్రభువులు, ఈశ్వర + అచలంబునకున్ = శివుని కొండకు - కైలాసమునకు, అరిగి = వెడలి, తద్ + ఉన్నతిన్ = ఆ కొండయొక్క ఔన్నత్యమును, కని = చూచి, విస్మితులు = ఆశ్చర్యపడినవారు, అగుచున్

**తాత్పర్యము .** ఇట్లు వచ్చి తన తండ్రి తొడ యను పీఠమును అలంకరించుచున్న పార్వతిని ఆ సప్తర్షులు చూచి ఆమె ఉత్తమస్త్రీలక్షణములుగల అంగముల, ఉపాంగముల శోభలను వేర్వేఱుగను, సామూహికముగను బాగుగాఁ జూచి, సంతోషించి, యీ పార్వతి పరమేశ్వరుని పట్టపుదేవి యగుట యేమి అబ్బురము? అని నిశ్చయించి ఆమె వివాహనిశ్చయసూచకముగా శిరస్సుపైఁ బేలాలనుంచి హిమవంతునిచే సత్కరింపఁబడినవారయి సెలవుపుచ్చుకొని వచ్చిరి అంత నంతకుమునుపే యీ వృత్తాంత మంతయు నెఱిఁగి విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుఁడు మున్నగు దేవతలు, రాక్షసులు, నాగులు, సిద్ధులు, విద్యాధరులు మున్నగు నెల్ల లోకముల ప్రభువులును గైలాసమునకు వెడలి దాని యౌన్నత్యమును జూచి యాశ్చర్యపడుచు - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** జనకు నూరుపీఠము - జనకునియొక్క + ఊరుపీఠము - 'షష్ఠీ సమాసంబునం దుకార ఋకారంబుల కచ్చు పరంబగునపుడు నుగాగమం బగు ' బాల సంధి 34 ఇట్లే పరమేశ్వరు + అగ్రమహిషి - పరమేశ్వరునియొక్క + అగ్రమహిషి బాల సంధి 34

క **రాజాలంకృత, మర్క వి**
**రాజిత, మురు సింహ మిధున రమ్యము, ఘన వి**
**భ్రాజిత మను పురుడుననో**
**రాజతగిరి మింటితోడ రాయుచునుండున్** **143**

**అర్థము :** ఇందుఁ గైలాసమునకు, ఆకాశమునకును శ్లేషమూలమునఁ బోలిక చెప్పఁబడినది రాజ + అలంకృతము = (కైలాస) యక్షులచే నలంకరింపఁబడినది (ఆకాశ) చంద్రునిచే నలంకరింపఁబడినది, అర్క-విరాజితము = (కైలాస) స్ఫటికముచే బ్రకాశించునది, (ఆకాశ) సూర్యునిచేఁ బ్రకాశించునది, ఉరు-సింహ-మిధున-రమ్యము = (కైలాస) గొప్పవియగు సింహదంపతులచే రమణీయమైనది, (ఆకాశ ) గొప్ప సింహ, మిధునరాశులచే రమణీయమైనది, ఘన-విభ్రాజితము = (కైలాస) అభ్రకముచేఁ బ్రకాశించునది, (ఆకాశ ) మేఘములచేఁ బ్రకాశించునది, అను = అనెడి, పురుడుననో = సామ్యముచేతనో, రాజత-గిరి = వెండికొండ - కైలాసము, మింటితోడన్ = ఆకాశముతో, రాయుచున్ + ఉండున్= పోటీపడుచుండును

**తాత్పర్యము .** ఆకాశము రాజాలంకృతము (చంద్రునిచే నలంకృతము) అర్క విరాజితము (సూర్యునిచే విరాజితము), సింహ మిథున రమ్యము (సింహ మిధున రాశులచే రమ్యము) ఘనవిభ్రాజితము (మేఘములచే విభ్రాజితము) అట్లే కైలాసమును, రాజాలంకృతము (యక్షులచే నలంకృతము), అర్కవిరాజితము (స్ఫటికముచే నలంకృతము), సింహమిధునరమ్యము (సింహదంపతులచే రమ్యము), ఘనవిభ్రాజితము (అభ్రకముచే విభ్రాజితము) ఈ సామ్యములచేఁ గాఁబోలును గైలాసము ఆకాశముతోఁ బోటీపడుచుండును

**విశేషములు** అలంకారము ఉత్ప్రేక్ష అది శ్లేషోత్ప్రాణితము

వ **అనుచుం దదారోహణోద్యుక్తు లగుచుండి రంత** **144**

**అర్థము .** అనుచున్, తద్ + ఆరోహణ + ఉద్యుక్తులు = దాని నెక్కుట కుద్యమించినవారు, అగుచున్ + ఉండిరి, అంతన్

**తాత్పర్యము .** అనుచు సప్తర్షు లా కైలాసము నారోహింప నుద్యమించిరి అంత - తరువాతి పద్యముతో నన్వయము

చ **హరి గరుడుండు, బ్రహ్మ కలహంసము, నా ఖచరేంద్రులున్ గరం**
**బురవడి నద్రిపై కెగురనోపక తత్పృథుపాదపంక్తిపై**
**నిరవుగ నిల్చి నిల్చి తుది కెయ్దిరి, ప్రోన్నతులైన వారి వి**
**స్తర వర పాదసేవ దగు సద్గతి కూఁతయ కాదె యెమ్మెయిన్** **145**

**అర్థము .** హరి-గరుడుండున్ = విష్ణువాహనమైన గరుత్మంతుఁడును, బ్రహ్మ-కలహంసమున్ = బ్రహ్మ వాహనమైన రాజహంసమును, ఆ-ఖచర-ఇంద్రులున్ = ఆ గగనచర శ్రేష్ఠులును, కరంబు = మిక్కిలి, ఉరవడిన్ = వేగముతో, అద్రిపైన్ = కొండ (కైలాసము)పైకి, ఎగురన్ = ఎగురుటకు, ఓపక = చాలక, తద్ + పృధు-పాద-పంక్తిపైన్ = దాని (కైలాసము) యొక్క పెద్దదియగు ప్రత్యంత పర్వతపంక్తిపై - దాని గొప్ప అడుగులవరుసపై, ఇరవుగన్ = స్థానముగా, నిల్చి-నిల్చి, తుదికిన్ = చివరకు-ఎట్టకేలకు, ఎయ్దిరి = ఎగిరిరి, ప్రోన్నతులు (ప్ర+ఉన్నతులు) = మిక్కిలి గొప్పవారు - మిక్కిలి ఎత్తయినవారు, ఐన-వారి = అగువారియొక్క, విస్తర-వర-పాదసేవ = అధికమైనది, మేలైనది అగు ప్రత్యంత

పర్వతములను సేవించుట - అధికమైనది, మేలయినది అగు చరణసేవ, తగు = ఒప్పునట్టి, సత్ + గతికిన్ = ఉత్తమ గతికి, ఉన్నత గమనమునకు, ఎమ్మెయిన్ = (ఏ+మెయిన్) = ఏ విధముగానైనను, ఊఁత+అ = ఆధారమే, కాదె = కాదా? - అగు ననుట

**తాత్పర్యము .** విష్ణుమూర్తి గరుత్మద్వాహనమును, బ్రహ్మ హంసవాహనమును, ఆ గగనచరులైన దేవతలును, మిక్కిలి వేగముతోఁ గైలాసముపై కెగురఁజాలక, దాని పెద్దదియగు ప్రత్యంత పర్వత పంక్తిపై - గొప్ప అడుగులవరుసపై జోటుచేసికొని నిలిచి నిలిచి యెట్టకేల కెగిరిరి మిక్కిలి ఉన్నతులైన వారి మేలయిన ప్రత్యంత పర్వత సేవ - మేలయిన చరణసేవ తగునట్టి ఉత్తమ - ఉన్నతగతికి ఏవిధముగానైనను ఆధారమగునుగదా!

**విశేషములు** అలంకారము శ్లేషోత్ప్రాణితమైన అర్థాంతరన్యాసము ఎయ్దు - (రూపాం ) ఎయిదు గరుడుండు - (పాఠాం ) గరుడండు సద్గతి - సత్+గతి అనునాసికాంతస్థవర్ణములు తప్ప మిగిలిన పదాంతగత హల్లులకు (ఝల్లులకు) మృదుహల్లులు (హశ్శులు) కాని, అచ్చులుకాని పరమగునపుడు ఆ హల్లుల వర్గమునకుఁ జెందిన తృతీయవర్ణ మాదేశముగా వచ్చును ఉరువడి (రూపాం ) ఉరవడి తత్పృథు - తద్ + పృథు - అనునాసికాంతస్థ భిన్నములైన హల్లులకు (ఝల్లులకు) కఠినహల్లులు (ఖర్రులు) పరమగునపుడు వాని వర్గములందలి ప్రథమవర్ణములు (చర్రులు) ఆదేశముగా వచ్చును ప్రోన్నతులు - ప్ర + ఉన్నతులు - గుణసంధి

వ ఇ ట్లెట్టకేనియుఁ జని తదుపరితలంబున 146

**అర్థము.** ఇట్లు, ఎట్టకేనియున్ = ఎట్టకేలకు, చని, తద్ + ఉపరితలంబునన్= దాని పయిభాగమున

**తాత్పర్యము .** ఇట్లు ఎట్టకేలకు వెడలి దాని పయిభాగమున - తరువాతి పద్యముతో నన్వయము

## కైలాస పురవర్ణనము

సీ రసరసాయన సుధారస నిర్ఝరంబులై
క్రమ్మంగ నెలరారు కల్పతరులఁ
బరుసవేదులఁ బొంది హరికాంతశిఖిఁ గ్రాఁగి
కనకంబు లగు నయస్కాంతశిలలు

సురుచి రౌషధి తృణజ్యోతిః ప్రభాలీల
మాయించి వెలిఁగెడు మణిగణముల
బహుల చింతామణి ప్రాసాద వృత భూష
ణాంబర స్నాన పానాంగరాగ

తే మాలికాంగలతానందమందిరముల
ప్రూనఁ బండులు సతులకు మరిగి యాడు
సిద్ధ విద్యాధరామర స్త్రీ సమూహ
భాసితం బగు కైలాసపర్వతంబు 147

**అర్థము** రస నిర్భరంబులై - రస = రుచిచేత, రసాయన = ఆనందపఱుచునట్టి, సుధా-రస = అమృతరసము యొక్క నిర్ఝరంబులు + ఐ = ఏఱులు గలవయి, క్రమ్మంగన్ = వ్యాపింపఁగా, ఎలరారు = సన్నగాలికిఁ గదలుచున్న, కల్ప-తరులన్ = కల్పవృక్షములను,

పరుసవేదులన్ = స్పర్శవేధులను (ఇనుమును బంగారముగాఁజేయు రసశిలావిశేషములను), పొంది = కూడి, హరికాంత-శిఖిన్ = సూర్యకాంతశిలలనెడి యగ్నియందు, క్రాఁగి = తపించి, కనకంబులు + అగు = బంగారములగు, అయస్కాంత-శిలలన్ = సూదంటుఱాలను,

సురుచిర లీలన్ సురుచిర = మిక్కిలి ప్రకాశించు, ఓషధి = ఓషధియగు, తృణజ్యోతిస్ = తృణజ్యోతియనుదానియొక్క ప్రభా-లీలన్ = కాంతుల విలాసమును, మాయించి = నశింపఁజేసి, వెలిఁగెడు = ప్రకాశించు, మణి-గణములన్ = మణుల సమూహములను,

బహుల మందిరములన్ బహుల = అనేకములైన, చింతామణి= చింతామణులతోడి, ప్రాసాద = భవనములందు, వృత = ఎన్నుకొనఁబడిన, భూషణ = అలంకారములు, అంబర = వస్త్రములు, స్నాన = స్నానము, పాన = పానము, అంగరాగ = మైపూఁత, మాలికా = దండలు, అంగలతా = మైఁదీఁగలకు, ఆనంద = సంతోషమును గలిగించు, మందిరములన్ = భవనములను, ప్రూనన్= చెట్టునందు, పండులున్ = పండ్లును, సతులకున్ = ప్రియురాంద్రకు, మరిగి = వలచి, ఆడు = క్రీడించునట్టి, సిద్ధ-విద్యాధర + అమర + స్త్రీ-విలాస-భాసితంబు=

సిద్ధులయు, విద్యాధరులయు, దేవతలయు, వారి యింతులయి విలాసములచేఁ బ్రకాశించునది, అగు, కైలాసపర్వతంబున్ = కైలాసపర్వతమును

**తాత్పర్యము** రుచిచే నానందపఱుచునట్టి యమృతరసప్రవాహములు గలిగి వ్యాపించి సన్నగాలికిఁ గదలు కల్పవృక్షములను, స్పర్శవేధులను గూడి సూర్యకాంతశిలలనెడి యగ్నియందుఁ గాలి బంగారములుగా మాఱు సూదంటుఱాలను, మిక్కిలి ప్రకాశించు తృణజ్యోతి యనునోషధికాంతుల నణఁచి వెలుఁగు మణిసమూహములను, పెక్కు చింతామణిమయభవనములందుఁ దమకువలయు నలంకారములు, వస్త్రములు స్నానపానములు, మైపూఁత, మాలికలు, మైఁదీఁగల కానందమును గలిగించు మందిరములును, వృక్షఫలములును దమ ప్రియురాండ్రకుఁ గోరి క్రీడించు సిద్ధవిద్యాధర దేవతలయుఁ దత్ప్రియలయు విలాసములచేఁ బ్రకాశించు కైలాసపర్వతమును - తరువాతి గద్యముతో నన్వయము

**వ కని దాని రమణీయ విభూతి విశేషంబునకు మెచ్చి 148**

**అర్థము** కని = చూచి, దాని = ఆ కైలాసపర్వతముయొక్క రమణీయ-విభూతి-విశేషంబునకున్ = సుందరమయిన వైభవాధిక్యమునకు, మెచ్చి

**తాత్పర్యము** . చూచి దాని సుందరమైన వైభవాధిక్యమునకు మెచ్చి తరువాతి పద్యముతో నన్వయము

**క "శిరమున సర్వాత్ముండగు**
**పరమేశ్వరుఁ దాల్చి నిల్చి పాదములఁ జరా**
**చర ధాత్రిఁ దాల్చి పరఁగిన**
**హరగిరి పెం పేరికైన నలవియె పొగడన్?" 149**

**అర్థము** :శిరమునన్ = శిరస్సునందు - శిఖరమునందు, సర్వాత్ముండు + అగు = అఖిలస్వరూపుఁడగు, పరమేశ్వరున్ = శివుని, తాల్చి = ధరించి, నిల్చి, పాదములన్ = పాదములందు, చర + అచర-ధాత్రిన్ = జంగమ స్థావరాత్మకమగుభూమిని తాల్చి, పరఁగిన = ఒప్పిన, హర-గిరి-పెంపు = కైలాసము మహత్త్వము, ఏరికిన్ + ఐనన్ = ఎవరికయినను, పొగడన్, అలవియె = శక్యమా? -- కాదనుట

**తాత్పర్యము.** 'శిరస్సునందు సర్వాత్ముఁడగు పరమేశ్వరునిఁ దాల్చి నిలిచి, పాదములందు జంగమస్థావరాత్మకమగు భూమిని దాల్చి యొప్పిన కైలాసము మహత్త్వమును బొగడ నెవరికిని శక్యముగాదు

వ అని మెచ్చి పిచ్చలించుచు 150

**అర్థము** అని, మెచ్చి, పిచ్చలించుచున్ = ఆనందించుచు

**తాత్పర్యము** అని మెచ్చి ఆనందించుచు - తరువాతి పద్యముతో నన్వయము

సీ కనకహర్మ్యములతోఁ బెనఁగిన పవడంపు
భద్రంబులది వీరభద్రపురము
ముల్లోకముల సోఁడు ముట్టెడి నవ పుష్ప
దామంబులది పుష్పదంతపురము
చారుముక్తాఫల హారోపశోభిత
కూటంబులది భృంగిరీటి పురము
పద్మరాగోన్నత ప్రాసాద దీధితు
లెసఁగినయదియ చండీశపురము

తే వజ్రలు జాంబూనదాధిక వస్తు ఖచిత
సురభివనములయది గణేశ్వరు పురంబు
విమల రుచిఁ బొల్చు గోమేధికములఁ దనరు
గోపురంబులయది నందగోపురంబు 151

**అర్థము.** వీరభద్రపురము = వీరభద్రుఁ డనుగణాధీశుని పురము, కనక-హర్మ్యములతోన్ = బంగరు మేడలతో, పెనఁగిన = కూడిన, పవడంపు-భద్రంబులది = పగడముల శుభములు గలది

పుష్పదంత-పురము = పుష్పదంతుఁడను ప్రమధుని పురము, ముల్లోకముల= (మూఁడు లోకముల) = ముల్లోకములయొక్క, సోఁడుముట్టెడి = బ్రహ్మరంధ్రమును స్పృశించునట్టి, నవ-పుష్పదామంబులది = క్రొంబూలమాలలు గలది

భృంగిరీటి-పురము = భృంగిరిటుని పురము, చారు-ముక్తాఫల-హార + ఉపశోభిత-కూటంబులది = మనోహరమైన ముత్యాల దండలచే శోభిల్లు శిఖరములుగలది

చండీశ-పురము = చండీశ్వరుఁ డనువాని పురము, పద్మరాగ + ఉన్నత-ప్రాసాద-దీధితులు = పద్మరాగమణిమయమైన, ఎత్తయిన, మేడల కాంతులు, ఎసఁగిన + అది + అ = ఒప్పునట్టిదే

గణేశ్వరు-పురంబు = గణేశ్వరుని పురము, వటలు = ఒప్పునట్టి, జాంబూనద + అధిక-వస్తు-ఖచిత-సురభి-వనముల + అది = బంగారపు పెక్కు-వస్తువులతోఁ బొదుగఁబడినదయి, పరిమళించునుద్యానములు గలది

నంద-గోపురంబు = నందుఁ డనువాని గోపురము, విమల-రుచిన్ = నిర్మలమయిన కాంతితో, పొల్చు = ప్రకాశించు, గోమేధికములన్ = గోమేధికరత్నములతో, తనరు = ఒప్పు, గోపురంబుల + అది = పురద్వారములు గలది

**తాత్పర్యము** వీరభద్రుని పురము బంగరు మేడలతోఁ గూడిన పగడముల శుభములు గలది పుష్పదంతుఁ డనువాని పురము ముల్లోకముల బ్రహ్మరంధ్రములను స్పృశించు క్రొంబూలమాలలు గలది భృంగిరిటి పురము మనోహరములైన ముత్యాల పేరులచే నొప్పు శిఖరములు గలది చండీశ్వరుని పురము పద్మరాగమణిమయములై ఉన్నతములయిన మేడల కాంతు లతిశయించునది గణేశ్వరుని పురము బంగరు వస్తువులచేఁ బొదుగఁబడినదయి పరిమళించునుద్యానములు గలది నందగోపురము నిర్మలకాంతితోఁ బ్రకాశించు గోమేధికరత్నములతో నొప్పు పురద్వారములు గలది

**విశేషములు.** భద్రంబులది - భద్రంబుల + అది 'అది యవి శబ్దంబుల యత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగ నగు ' బాల సంధి 45 ఇట్లే ధామంబులది, కూటంబులది, ఎసఁగినయది, గోపురంబులయది - ఈ రెండును అల్లోపము రాని రూపములు

**వ అనుచు నెడనెడ ననేక గణాధీశపురవరాతివిభూతి విశేష రమణీయంబులఁ గని విస్మితు లగుచు** 152

**అర్థము .** అనుచున్, ఎడనెడన్ = అచ్చట నచ్చట, అనేక-గణ + అధీశ-పుర-వర + అతి-విభూతి-విశేష-రమణీయంబులన్ = పెక్కండ్రు గణనాయకుల పురశ్రేష్ఠముల అధికవైభవాతిశయముచే రమ్యము లయినవి, కని, విస్మితులు = ఆశ్చర్యపడినవారు, అగుచున్

**తాత్పర్యము .** అనుచు అచ్చటచ్చటఁ బెక్కండ్రు ప్రమథనాయకుల పురశ్రేష్ఠముల అధికవైభవాతిశయ రామణీయకములను జూచి అచ్చెరువడుచు - తరువాతి పద్యముతో నన్వయము

మందాక్రాంత "ఫాలాభీలాంబకు నురుజటాబంధనాపీడ్యమాన
వ్యాళాధీశానన విగళితోచ్ఛ్వాస నిర్ధూత గంగా
స్థూలోర్మి శీకర సమితి పైఁ దూలి శోభిల్లుఁ జూడన్
గైలాసోర్వీధరపతికిని ముక్తాఫలచ్ఛత్రలీలన్" 153

**అర్థము .** ఫాల + ఆభీల + అంబకు = నుదుట భయంకరమైన కన్నుగలవాని (శివుని) యొక్క, ఉరు సమితి ఉరు = పెద్దదియైన, జటా = జడలయొక్క, బంధన = కట్టుటచేత - జడలనుగట్టుటచేత ననుట, ఆపీడ్యమాన= బాధింపఁబడుచున్న, వ్యాళ + అధీశ = పాఁపఱేని (శేషుని) యొక్క, ఆనన = ముఖమునుండి, విగళిత = జాఱిన - వెలువడిన, ఉచ్ఛ్వాస = ఊర్పులచే, నిర్ధూత= ఎగురఁగొట్టఁబడిన, గంగా - గంగానదియొక్క, స్థూల = పెద్దవియైన, ఊర్మి = అలలయొక్క, శీకర = తుంపరలయొక్క, సమితిపైన్ = సమూహము మీఁద, తూలి = చలించి, పడి, చూడన్ = చూడఁగా, కైలాస + ఉర్వీధర-పతికిని = కైలాస పర్వతరాజునకు, ముక్తాఫల + ఛత్ర-లీలన్ = ముత్యాల గొడుగువిధమున, శోభిల్లున్ = ప్రకాశించును

**తాత్పర్యము .** ఫాలాక్షుని జడముడిని బంధించుటచేఁ బీడింపఁబడుచున్న పాఁపఱేని ముఖమునుండి వినిర్గతములగు నూర్పులచే నెగురఁగొట్టఁబడు గంగానది పెనుగరళ్ల తుంపరలగుంపుపైఁ జలించి కైలాసపర్వతరాజునకుఁ బట్టిన ముత్యాల గొడుగువలె శోభిల్లును

**విశేషములు :** అలంకార ముత్ప్రేక్ష - అది అతిశయోక్త్యుత్థాపితము కైలాసము ఉర్వీధరపతి గావుననే వానికి ముత్యాలగొడుగుండును శీకరసమితి

వెల్లనై ముక్తాఫలచ్ఛత్రమువలెనే యుండును శివునకుఁ బెద్ద కపర్దము గలదు. ఆయన భుజగభూషణుఁడు గావున ఆ కపర్దమును బాఁపఁటెనిచే బంధించును దానివలన భుజగరాజునకు బాధ గలిగి పుచ్చు నిట్టూర్పులచే శివుని శిరస్సుపైనే ఉన్న గంగానదిలోఁ బెనుదరఁగ లేర్పడి వానినుండి తుంపరలగుంపు గలిగి కైలాసముపైఁ జుట్టును వ్యాపించి ఆ నగచక్రవర్తికిఁ బట్టిన ముత్యాలవెల్లిగొడుగో యన నొప్పును అంబకము - (నానా) కన్ను, బాణము ముక్తాఫలచ్ఛత్ర - ముక్తాఫల + ఛత్ర - హ్రస్వమునకుఁ బరమైన ఛ కారము ద్విరుక్త మగును మందాక్రాంత - నాలుగు పాదము లుండును ప్రతిపాదమునను మ, భ, న, త, త, గగ లను గణము లుండును మొదటి యక్షరమునకును బదునొకండవ యక్షరమునకును యతిమైత్రి, ప్రాస నియమము గలదు

**వ**    **అని వర్ణించుచుం జనిచని ముందట ననతిదూరంబున** **154**

**అర్థము .** అని, వర్ణించుచున్, చని-చని = పోయి పోయి, ముందటన్ = ఎదుట, అనతిదూరంబునన్ = కొలఁది దవ్వున

**తాత్పర్యము** అని విష్ణుబ్రహ్మాదులు వర్ణించుచుఁ బోయిపోయి యెదుట నించుక దవ్వున - తరువాతి పద్యముతో నన్వయము

**సీ**    **మెఱుఁగులఁ గన్నులు మిఱుమిట్లువోయెడు**
**నమల చింతామణీ హర్మ్యములను**
**దలతల వెలిఁగెడుతరలప్రభా స్ఫూర్త**
**వేది కుట్టిమతల వీధికలను**
**దేదీప్యమానమై తేజరిల్లెడు సిద్ధ**
**ఘుటికాది నవ వప్రగోపురముల**
**భాభాసితానూన పరమౌషధీలతా**
**చారుతరానేక తోరణములఁ**

**తే**    **జిత్రవర్ణాతిశయ రత్నచిత్రితాంగ**
**రంగవల్లీ బహు సురంగాంగణములఁ**
**గలిగి విశ్వంబునకుఁ దన వెలుఁగు వెలుఁగు**
**సేయుఁ దేజోమయం బగు శివు పురంబు** **155**

**అర్థము.** మెఱుఁగులన్ = కాంతులచే, కన్నులు, మిఱుమిట్లు + పోయెడు = మిఱుమిట్లుగొలుపునట్టి, అమల-చింతామణి-హర్మ్యములను = నిర్మలమైన చింతామణిమయములైన మేడలను,

తలతల = తళతళమని, వెలిఁగెడు = మెఱయునట్టి, తరల-ప్రభా-స్పర్శవేది-కుట్టిమతల-పీధికలను = చంచలమైన కాంతులుగల పరుసవేదిలో నిర్మితమైన నెలకట్టులుగల వీధులను,

దేదీప్యమానము + ఐ = మిక్కిలి ప్రకాశించుచున్నదయి, తేజరిలిల్లెడు = ప్రకాశించు, సిద్ధ-ఘుటికా + ఆది-నవ-వప్ర-గోపురములన్ = సిద్ధఘుటికలు మున్నగు క్రొత్త ప్రాకారములను, గోపురములను భా-భాసిత + అనూన తోరణములన్ భా = కాంతులచే, భాసిత = ప్రకాశించిన, అనూన = అధికమైన, పరమ + ఓషధీ-లతా = మహౌషధుల లతలనెడి, చారుతర = మిక్కిలి మనోహరమైన, అనేక = పెక్కు తోరణములన్, చిత్రవర్ణా సు రంగాంగణములన్ చిత్రవర్ణ = చిత్రములైన రంగులయొక్క, అతిశయ = ఆధిక్యముగల, రత్న = మణులచే, చిత్రిత + అంగ = చిత్రింపఁబడిన భాగములు గల, రంగవల్లీ = ముగ్గులుగల, బహు = పెక్కు, సు-రంగ + అంగణములన్ = మేలయిన రంగముల ముంగిళ్లను,

కలిగి, తేజోమయంబు + అగు = తేజస్సుతో నిండినదయిన, శివు-పురంబు = శివునిపురము, విశ్వంబునకున్, తన-వెలుఁగు = తనకాంతి, వెలుఁగు + చేయున్ = వెలుఁగు నిచ్చును

**తాత్పర్యము :** కాంతులచేఁ గన్నులు మిఱుమిట్లు గొలుపు నిర్మలములైన చింతామణి నిర్మితములగు మేడలను, తళతళమని మెఱయు కాంతులుగల స్పర్శవేదితోఁ గట్టఁబడిన నెలకట్లు గల వీధులను, దేదీప్యమానముగాఁ బ్రకాశించు సిద్ధఘుటికలు మున్నగునవిగల క్రొత్తప్రాకారములను గోపురములను, కాంతులచేఁ బ్రకాశించు పెక్కు మహౌషధుల లతలనెడి మనోహరములైన అసంఖ్యాకములైన తోరణములను, చిత్రవర్ణములచే నతిశయించు క్రొత్త మణులచేఁ జిత్రింపఁబడిన రంగవల్లులుగల రంగస్థలముల ప్రాంగణములను గలిగి తేజోమయమైన శివుని పురము విశ్వమునకుఁ దనవెలుఁగు నొసఁగును

**విశేషములు .** మిఱుమిట్లు - మిట్లు+మిట్లు - 'అందదుకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు' బాల సంధి 42 'చిత్రవర్ణాతిశయ నూత్నరత్న చిత్రి - తాంగ రంగవల్లీ సురంగాంగణములఁ' - అను పాఠమున మొదటి పాదమున యతిభంగమయినది అందుచే మా రా ప్రతిలోని పయిపాఠము స్వీకరింపఁబడినది

క కని వనజాసన హరి సుర
ప నిలింపాసురవరాహిపతు లతి మోదం
బున వచ్చి మెచ్చి తత్పురి
వినుతించుచుఁ జనిరి పురము వీథిం దఱియన్ 156

**అర్థము:** కని = చూచి, వనజ + ఆసన-హరి-సురప-నిలింప + అసురవర+ అహిపతులు = బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుఁడు, దేవతలు, రాక్షసశ్రేష్ఠులు, భుజగరాజయిన వాసుకి, అతి-మోదంబునన్ = మిక్కిలి సంతోషముతో, వచ్చి, మెచ్చి, తద్ + పురిన్ = ఆ పురమును, వినుతించుచున్ = పొగడుచు, పురము-వీథిన్ = పురవీథిని, తఱియన్ = సమీపింపఁగా, చనిరి

**తాత్పర్యము :** బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుఁడు, దేవతలు, రాక్షసశ్రేష్ఠులు, వాసుకి చూచి మిక్కిలి సంతోషముతో వచ్చి మెచ్చి యా శివునిపురమును బొగడుచుఁ బురవీథిని సమీపింపనేఁగిరి

వ ఇట్లు రమణీయంబగు రాజమార్గంబు గడచి సదాశివ ద్వారంబుఁ దూరి మహాద్వారంబునకుంజని తద్ద్వారపాలక నివారితులై నిలిచి తదనంతరంబ పరమేశ్వరు నవసరంబు వడసి నందిమహాకాళానుజ్ఞాతులై సభామందిరంబున కరిగి తన్మధ్య మణివేదికాతలంబున ధర్మాద్యష్టదళాంబుజైశ్వర్యపరిశోభితోత్తుంగ సింహాసనాసీనుండై నిఖిల గణ పరివృతుండై తమకుం బ్రత్యక్షంబై యున్న త్రిలోచనుం గని సర్వాంగీణ ప్రణామ జయజీవస్తుతిశతంబులం గరకమలకుట్మల పుట ఘటిత నిటలతట విలసితు లగుచున్నం దత్సురవరులం గని వరదుండు కరుణారసార్ద్రహృదయుండై 157

**అర్థము .** ఇట్లు, రమణీయంబు + అగు = సుందరమైన, రాజమార్గంబు = రాజవీథి, కడచి = దాఁటి, సదాశివ-ద్వారంబున్, తూరి = ప్రవేశించి,

మహాద్వారంబునకున్, చని, తద్ + ద్వార-పాలక-నివారితులు + ఐ = ఆ దౌవారికులచే నడ్డగింపఁబడిన వారయి, నిలిచి, తద్ + అనంతరంబు + అ = ఆ వెంటనే, పరమేశ్వరు + అవసరంబు = శివుని యనుమతి, పడసి = పొంది, నంది-మహాకాళ + అనుజ్ఞాతులు + ఐ = నంది, మహాకాళుఁడు అనువారిచే ననుమతింపఁబడినవారయి, సభా-మందిరంబునకున్ = కొలువుకూటమునకు, అరిగి = వెడలి, తద్ + మధ్య-మణి-వేదికా-తలంబునన్ = దాని నడిమి మణిమయమైన లంఁగునందు, ధర్మ + ఆది + అష్టదల + అంబుజ + ఐశ్వర్య - పరిశోభిత - ఉత్తుంగ -సింహాసన + ఆసీనుండు + ఐ = ధర్మము మున్నగు ఎనిమిది రేకుల పద్మసంపదచేఁ బ్రకాశించిన మిక్కిలి ఎత్తయిన, సింహాసనమునందుఁ గూరుచున్నవాఁడయి నిఖిల-గణ-పరివృతుండు + ఐ = ఎల్ల ప్రమధగణములచేఁ జుట్టఁబడినవాఁడయి తమకున్, ప్రత్యక్షంబు + ఐ, ఉన్న, త్రిలోచనున్ = ముక్కంటిని - శివుని, కని, సర్వాంగీణ-ప్రణామ-జయజీవ-స్తుతి-శతంబులన్ = సాష్టాంగ నమస్కారములు, జయింపుము, జీవింపుము అను నూర్లకొలఁది స్తోత్రములచే, కర-కమల-కుట్మల-పుట-ఘటిత-నిటల-తట-విలసితులు = తామరమొగ్గలవంటి చేదొప్పలచేఁ గూర్పఁబడిన నుదురులచే బ్రకాశించినవారు, అగుచున్ + ఉన్నన్ = అగుచుండఁగా, తద్ + సుర-వరులన్ = ఆ దేవతాశ్రేష్ఠులను, కని, వరదుండు = వరముల నిచ్చువాఁడు - శివుఁడు, కరుణా-రస + ఆర్ద్ర-హృదయుండు + ఐ = దయారసముచేఁ దడిసిన హృదయము గలవాఁడయి

**తాత్పర్యము .** ఇట్లు అందమైన రాజవీధిని దాఁటి సదాశివద్వారమును ప్రవేశించి, మహాద్వారమునకు వెడలి యచ్చటి ద్వారపాలకులచే వారింపఁబడినవారయి నిలిచి ఫాలతలముల నంజలిపుటములు ఘటింప నా దేవతాశ్రేష్ఠులను జూచి శివుఁడు దయారసార్ద్ర హృదయుఁడై - తరువాతి పద్యముతో నన్వయము

సీ     దశన సౌదామినుల్ దనర మో మలరించి
నీరజోదరుఁ దన్నుఁ జేరఁబిలిచె,
వచనామృతౌఘప్రవాహాభిషిక్తుఁగాఁ
జేయుచుఁ బరమేష్ఠి దాయఁ బిలిచెఁ

గరతలారుణదీప్తి కరరుహద్యుతులలో
సంధిల్ల నింద్రుఁ జేసన్న నునిచె
దృఙ్మరీచులు పర్వ దిగధీశ్వరుల నోలి
మన్నించి కన్నులసన్న నునిచె

తే నంత నందిమహాకాళు లఖిల సిద్ధ
సాధ్య దేవాసురేంద్రాది జనుల నెల్ల
వరుస నునిచిరి శివుఁడు దేవతల కెల్లఁ
గరుణఁ గొలువిచ్చి పేరోలగమున నుండె 158

**అర్థము** · శివుఁడు కర్త

దశన-సౌదామినుల్ = దంతముల మెఱపులు, తనరన్ = ఒప్పఁగా, మోము = ముఖము, అలరించి, = వికసింపఁజేసి, నీరజ + ఉదరున్ = పద్మము ఉదరమందుఁ గలవానిని - విష్ణువును, తన్నున్ + చేరన్ + పిలిచెన్ = తన దగ్గఱకు రమ్మనెను

వచన + అమృత + ఓఘ-ప్రవాహ + అభిషిక్తున్ + కాన్ = మాటలనెడి అమృతప్రవాహముచే నభిషేకింపఁబడినవానినిగా, చేయుచున్, పరమేష్ఠిన్ = బ్రహ్మను, దాయన్ + పిలిచెన్ = దగ్గఱకుఁ బిలిచెను

కరతల + అరుణ-దీప్తి-కరరుహ-ద్యుతులలోన్ = అరచేతులయొక్క ఎఱ్ఱనికాంతి, గోరుల కాంతులలో, సంధిల్లన్ = కూడఁగా, ఇంద్రున్, చే-సన్నన్ = చేతిసంజ్ఞచే, ఉనిచెన్ = ఉంచెను

దృఙ్మరీచులు (దృశ్ (క్) + మరీచులు = కన్నుల కాంతులు, పర్వన్ = వ్యాపింపఁగా, దిశ్(క్) + అధి + ఈశ్వరులన్ = దిక్పాలకులను, ఓలిన్ = వరుసగా, మన్నించి = ఆదరించి, కన్నుల-సన్నన్ = కంటిసంజ్ఞచే, ఉనిచెన్

అంతన్, నంది-మహాకాళులు = నంది, మహాకాళుఁడు అనువారు, అఖిల-సిద్ధ-సాధ్య-దేవ + అసుర + ఇంద్ర + ఆది - జనులన్ + ఎల్లన్ = ఎల్ల సిద్ధులు, సాధ్యులు, దేవతలు, రాక్షసశ్రేష్ఠులు మున్నగువారినందఱను, వరుసన్, ఉనిచిరి

శివుఁడు, దేవతలకున్ + ఎల్లన్, కరుణన్ = దయతో, కొలువు + ఇచ్చి, పేరు + ఓలగమునన్ = నిండు సభయందు, ఉండెన్

**తాత్పర్యము .** శివుఁడు దంతముల మెఱపు లొప్పఁగా ముఖమును వికసింపఁజేసి విష్ణువును దగ్గఱకుఁ బిలిచెను మాటలనెడి అమృతప్రవాహమునం దభిషేకించి బ్రహ్మను జేరువకుఁ బిలిచెను అరచేతుల కాంతి గోరులకాంతులలోఁ గూడఁగా నింద్రునిఁ జేసన్నచే నుంచెను కన్నుల కాంతులు వ్యాపింప దిక్పతులను క్రమముగా మన్నించి కనుసంజ్ఞచే నుంచెను అంత నందియును, మహాకాళుఁడును సిద్ధ సాధ్య దేవాసురశ్రేష్ఠులనెల్ల వరుసగా నుంచిరి శివుఁడు దేవతల కందఱకును దయతోఁ గొలువిచ్చి తాను నిండుసభను దీర్చెను

**విశేషములు** దశన సౌదామినులు - దశనములనెడి సౌదామినులు - రూపకము వచనామృత - వచనమనెడి అమృత - రూపకము దృశ్(క్) + మరీచులు - దృఙ్మరీచులు - దృగ్మరీచులు - అనునాసికసంధి దిగధీశ్వరులు - దిశ్(క్) + అధి + ఈశ్వరులు ఝల్లునకు అచ్చు పరముగాఁ దృతీయవర్ణాదేశము- సవర్ణదీర్ఘసంధి సన్న (వికృతి) - సంజ్ఞ (ప్రకృతి) పేరోలగము - పేరు + ఓలగము- 'కర్మధారయంబునందుఁ బేర్వాది శబ్దముల కచ్చు పరంబగునపుడు టుగాగమంబు విభాషనగు' - బాల సంధి 29 టుగాగమ మగుచో - పేరుటోలగము

## ఆశ్వాసాంతము

మ అరిషడ్వర్గజయుండు, తత్త్వవిదుఁ డాత్మారాముఁ డజ్ఞానసిం
ధురకుంభాగ్రవిదారణోగ్రనఖవద్దోర్దర్పవిఖ్యాత కే
సరి, దుర్వార గభీర ఘోరతర సంసారోర్వకూపార సం
తరణాత్యున్నతసేతుకల్పుఁ డఖిలాధారుండు ధీరుం డెదన్ 159

**అర్థము.** ఇది కృతి భర్తృ వర్ణనము కృతిభర్తయగు జంగమ మల్లికార్జునుఁడు- అరి-షట్+వర్గ-జయుండు = ఆర్వురు శత్రువుల సమూహమును జయించువాఁడు, తత్త్వ-విదుఁడు = తత్త్వవేత్త, ఆత్మారాముఁడు = ఆత్మయందే రమించుచు దానియందే తృప్తుఁడై యుండువాఁడు - యోగి, అజ్ఞాన కేసరి అజ్ఞాన = అజ్ఞానమనెడి, సింధుర = ఏనుఁగుయొక్క, కుంభ = కుంభస్థలముయొక్క, అగ్ర = కొనయొక్క, విదారణ = చీల్చుటచే, ఉగ్ర = భయంకరములయిన, నఖవత్ = గోరులుగల, దోస్ (దోః)+ దర్ప = భుజగర్వముచే, విఖ్యాత = ప్రసిద్ధమైన, కేసరి = సింహమయినవాఁడు, దుర్వార కల్పుఁడు, దుర్వార = అడ్డగింపరాని, గభీర = లోఁతయిన, ఘోర-తర = మిక్కిలి భయంకరమైన, సంసార =

సంసారమనెడి, ఉరు = గొప్పదియగు, అకూపార = సముద్రముయొక్క, సంతరణ = దాఁటుటకైన, అతి + ఉన్నత = మిక్కిలి ఎత్తయిన - మిక్కిలి గొప్పదియగు, సేతు - కల్పుఁడు = వంతెనతో సమానమయినవాఁడు, అఖిల + ఆధారుండు = అన్నింటికి ఆధారమయినవాఁడు ఎదన్ = హృదయమునందు, ధీరుండు = ధైర్యముఁగలవాఁడు

**తాత్పర్యము** కృతిభర్త యగు జంగమ మల్లికార్జునుఁడు కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యము లనెడి అంతశ్శత్రువుల నార్వురను జయించినవాఁడు, తత్త్వవేత్త, ఆత్మారాముఁడు, అజ్ఞాన మనెడి యేనుఁగు కుంభస్థలాగ్రమును జీల్పఁగల గోరులతో నొప్పు భుజగర్వముచేఁ బ్రసిద్ధమైన సింహ మయినవాఁడు, వారింపరానిది, లోఁతయినది, భయంకరమయినది అగు సంసారమనెడి మహాసముద్రమును దాఁటుటకైన మిక్కిలి గొప్ప వంతెనతో సమానమయినవాఁడు అన్నిటికి నాధార మయినవాఁడు ధైర్యవంతుఁడు

**విశేషములు** అజ్ఞాన సింధుర కేసరి - రూపకాలంకారము సంసారోర్వకూపార సేతు కల్పుఁడు - రూపకాలంకారము సంసారోర్వకూపార - సంసార + ఉరు = సంసారోరు - గుణసంధి సంసారోరు + అకూపార = సంసారోర్వకూపార - యణాదేశసంధి సంతరణాత్యున్నత - సంతరణ + అతి - సంతరణాతి - సవర్ణదీర్ఘసంధి సంతరణాతి + ఉన్నత - సంతరణాత్యున్నత - యణాదేశసంధి

క సకల జన వినుత గుణగణ
నికర మణి ప్రచుర రుచిర నిర్మల భూషా
ప్రకరాకల్పుఁ డనల్పుఁడు
సుకవిజనప్రణుత శివ యశోనిధి పేర్మిన్ 160

**అర్థము**. సకల జన ప్రకరాకల్పుఁడు సకల-జన = ఎల్లజనులచేత, వినుత = పొగడఁబడిన, గుణ = మంచిగుణములయొక్క గణ = సమూహములయొక్క, నికర = ప్రోవులనెడి, మణి = మణులతో, ప్రచుర = అధికమైన, రుచిర = మనోహరమైన, నిర్మల = స్వచ్ఛమైన, భూషా = భూషణముల యొక్క, ప్రకర = సమూహము, ఆకల్పుఁడు = అలంకారముగాఁ గలవాఁడు,

అనల్పుఁడు = తక్కువ కానివాఁడు, పేర్మిన్ = గొప్పతనముతో, సుకవి --- నిధి సుకవి - జన=సత్కవుల చేత, ప్రణుత = ప్రశంసింపఁబడిన, శివ - యశన్ (.) - నిధి = శుభకరమైన కీర్తికి నిధి

**తాత్పర్యము .** కృతిపతి యగు జంగమ మలికార్జునుఁడు ఎల్లజనులు పొగడు సద్గుణ సమూహములనెడి మణులతో నిండిన నిర్మలభూషణములచే నలంకరింపఁ బడువాఁడు, గొప్పవాఁడు, సత్కవులచేఁ బొగడఁబడు మంగళకరయశస్సునకు నిధానమైన వాఁడు

మ **పరమానందుఁ, డనిందితాచరణుఁ, డభ్రాంతుండు, శాంతుండు దు**
**ర్ధర సంసార సుఖోరు భూరితర కాంతారాంతరోద్భూత సం**
**కర కర్మేంద్రియ దుష్టసత్త్వభవ సంగత్యక్త సువ్యక్త భా**
**సుర బోధాత్మకుఁ డాత్మతత్త్వగతి సంశుద్ధుండు సిద్ధుం డిలన్ 161**

**అర్థము .** పరమ + ఆనందుఁడు = గొప్ప ఆనందము గలవాడు, అనిందిత + ఆచరణుఁడు = సత్కర్మాచరణము గలవాఁడు, అభ్రాంతుండు = భ్రాంతుఁడు గానివాఁడు - నిశ్చయజ్ఞానము గలవాఁడు, శాంతుండు = శమగుణ సంపన్నుఁడు, సంసారసుఖ = సంసారసౌఖ్యమనెడి, ఉరు = గొప్పదియు, భూరితర = మిక్కిలి పెద్దదియు, అగు, కాంతార + అంతర = అడవిలో, ఉద్భూత = పుట్టిన, సంకర - కర్మ + ఇంద్రియ = కూడిన కర్మేంద్రియములనెడి, దుష్ట-సత్త్వ = క్రూరజంతువులనుండి, భవ = పుట్టిన, సంగ = కలయికచే, త్యక్త = విడువఁబడిన, సువ్యక్త = మిక్కిలి స్పష్టమైన, భాసుర = ప్రకాశవంతమైన, బోధ + ఆత్మకుఁడు = జ్ఞానము గలవాఁడు, ఆత్మ-తత్త్వ - గతి - సంశుద్ధుండు = ఆత్మ తత్త్వముయొక్క విధముచే · మిక్కిలి పవిత్రమైనవాఁడు, ఇలన్ = భూమియందు, సిద్ధుండు = దేవుఁడు,

**తాత్పర్యము .** కృతిభర్తయగు జంగమ మల్లికార్జునుఁడు, పరమమైన ఆనందము గలవాఁడు, సత్కర్మాచరణుఁడు, నిశ్చయజ్ఞానసంపన్నుఁడు, శమగుణము గలవాఁడు, దుర్భరమైన సంసారసౌఖ్యములనెడి గొప్పయడవిలోఁ బుట్టిన కర్మేంద్రియములనెడి దుష్టమృగసంగముచే విడువఁబడిన జ్ఞానము గలవాఁడు, ఆత్మతత్త్వజ్ఞానముచేఁ బవిత్రమైనవాఁడు, భూలోకసిద్ధుఁడు

క అబ్దిగభీరుఁడు, సద్గుణ
లుబ్ధుఁడు, భూలోకఫాలలోచనుఁ డఖిలా
రబ్ధ విముక్తుఁడు, బోధా
లబ్ధుఁడు, మునిముఖ్య ముఖలలాముఁడు ధాత్రిన్ 162

**అర్థము** అబ్ధి - గభీరుఁడు = సముద్రము వలె లోఁతయిన వాఁడు, సత్ + గుణ = లుబ్ధుఁడు = మంచి గుణములందు, లోభముగలవాఁడు, భూలోక - ఫాలలోచనుఁడు = భూలోకమునందలి శివుఁడు, అఖిల + ఆరబ్ధ - విముక్తుఁడు = ఎల్ల ఆరంభములనుండి విడుమర గలవాఁడు, బోధ + ఆలబ్ధుఁడు = జ్ఞానము ను బొందినవాఁడు, ధాత్రిన్ = భూమియందు, ముని - ముఖ్య - ముఖ - లలాముఁడు = మునిశ్రేష్ఠుల ముఖములకుఁ దిలకమైనవాఁడు -మునిశ్రేష్ఠుఁడు

**తాత్పర్యము.** జంగమ మల్లికార్జునుఁడు సముద్రము వలె లోఁతయినవాఁడు, మంచి గుణములందు లోభముగలవాఁడు, భూలోక శివుఁడు, ఎల్ల ఆరంభములను విడిచినవాఁడు, జ్ఞానసంపన్నుఁడు, మునిశ్రేష్ఠుఁడు

వనమయూరము భూసురకులాగ్రణి, ప్రబుద్ధుఁడు, ప్రసిద్ధుం
డాసకలలోకవినుతాత్ముఁడు, మహాత్ముం
డాసురభవోత్తరణుఁ, డాద్యుఁ, డవిభేద్యుం,
డాసురగురుండు మతియందు నుతుఁ డెందున్ 163

**అర్థము .** భూసుర - కుల + అగ్రణి = బ్రాహ్మణ వంశశ్రేష్ఠుఁడు, ప్రబుద్ధుఁడు = గొప్పజ్ఞాని, ప్రసిద్ధుండు, ఆ - సకల - లోక - వినుత + ఆత్ముఁడు = ఎల్లలోకములచేఁ బొగడఁబడువాఁడు, మహాత్ముండు = మిక్కిలి గొప్పవాఁడు, ఆసుర - భవ + ఉత్తరణుఁడు = అసుర సంబంధమైన సంసారమును దాఁటినవాఁడు, ఆద్యుఁడు = మొదటివాఁడు, అవిభేద్యుండు = భేదింపరానివాఁడు, మతి + అందున్ = బుద్ధియందు, ఆ - సుర - గురుండు = దేవతల గురువైన ఆ బృహస్పతి, ఎందున్ = ఏవిషయమునను, నుతుఁడు = పొగడఁబడువాఁడు

**తాత్పర్యము :** శ్రీ జంగమ మల్లికార్జునుఁడు బ్రాహ్మణశ్రేష్ఠుఁడు గొప్ప జ్ఞాని ప్రసిద్ధుఁడు, సర్వలోకనుతుఁడు మహాత్ముఁడు ఆసురమైన సంసారమును దాఁటినవాఁడు ఆద్యుఁడు భేదింపరానివాఁడు మతియందు బృహస్పతి ఎందును బొగడఁబడువాఁడు

**విశేషములు.** ఛందస్సు వనయమూరము లక్షణమునకు నీ యాశ్వాసము నందలి ఎనిమిదవ పద్యము లక్షణమును జూచునది

**గద్యము.**

ఇది శ్రీమజ్జంగమ మల్లికార్జునదేవ దివ్యశ్రీపాదపంకజ
భ్రమరాయమాణ కవిరాజశిఖామణి నన్నెచోడదేవ
ప్రణీతంబైన కుమారసంభవంబను కథయందు సప్తమాశ్వాసము
సమాప్తము
దీనికి వ్యాఖ్య పూర్వాశ్వాసాంతగద్యములకు వలెనే

మ ఇది శ్రీ జొన్నలగడ్డ వంశమణియౌ మృత్యుంజయాఖ్యుండు స
మ్మద మొప్పారఁ గుమారసంభవము శ్రీమన్నన్నెచోడాఖ్య వి
ద్వదధీశోక్తము శాబ్దికార్థ వివిధ స్వారస్య తాత్పర్యముల్
చదురొప్పన్ వచియించి మన్చు విలసత్ సంజీవనీవ్యాఖ్యయౌ

# కుమార సంభవము

## అష్టమాశ్వాసము

క	శ్రీ మహిళా మహనీయో
ద్దామోరస్స్థలుఁడుఁ, గీర్తితశ్లోకుఁడుఁ, దే
జోమయుఁడుఁ, బుణ్యధనుఁడు, మ
హామునిముఖ్యుండు మల్లికార్జునుఁ డెలమిన్	1

**అర్థము.** శ్రీ ... స్థలుఁడున్ శ్రీ = మహిళా = లక్ష్మియను స్త్రీ చేత, మహనీయ = గొప్పదియు, ఉద్దామ = అధికమయినదియు, అగు, ఉరస్+స్థలుఁడున్= వక్షస్థలము గలవాఁడును, కీర్తిత - శ్లోకుఁడున్ - స్తుతింపఁబడిన యశస్సు గలవాఁడును, తేజోమయుఁడున్ = తేజస్సు నిండినవాఁడును, పుణ్య-ధనుఁడున్= పుణ్యమనెడి ధనము గలవాఁడును, మహత్ (మహా) - ముని - ముఖ్యుండున్ = గొప్ప మునులలో శ్రేష్ఠుఁడును, అగు, మల్లికార్జునుఁడు, ఎలమిన్ = సంతోషముతో

**తాత్పర్యము.** లక్ష్మియను స్త్రీ చేత గొప్పది యగు వక్షస్థలము గలవాఁడును, స్తుతింపఁబడిన కీర్తిగలవాఁడును, తేజస్సుతో నిండినవాఁడును, పుణ్యమనెడి ధనము గలవాఁడును, మహామునిశ్రేష్ఠుఁడును అగు మల్లికార్జునుఁడు సంతోషముతో

**విశేషములు.** గీర్తిత, దేజో అనువానిలోని ఆదేశసరళములకు ముందు బిందువు లేదు ఇందుఁ బెట్టఁబడినది గసడదవాదేశ మనుకొందమన్న అవి సాంస్కృతికపరుషములగుటచే దాని కవకాశము లేదు వాని ననుసరించియే తేజోమయుఁడు అనుదానిని ద్రుతాంతముగాఁజేసి 'పుణ్య' అనుదానిలో సరళాదేశము చేయఁబడినది ఎలమిన్ అనుదానికి దేనితోను అన్వయము లేదు పాదపూరణార్థమని తలఁపవలయును

వ	**ఇట్లు పరమేశ్వరుండు మహాదర్శనంబుండె నంత హిమవంతంబునకుఁ గూఁతంగతులు సనిన మునిగణంబు మగిడి వచ్చి తదాస్థానరంగంబుం జొచ్చి**	2

**అర్థము.** ఇట్లు, పరమేశ్వరుండు, మహోదర్శనంబు + ఉండెన్, అంతన్, హిమవంతంబునకున్, కూ(తంగతులు + చనిన = కూ(తవేటు దూరమునకు(బోయిన, (?) ముని-గణంబు = మునుల సమూహము, మగిడివచ్చి = మరలివచ్చి, తద్ + ఆస్థాన - రంగంబున్ + చొచ్చి = ఆ శివుని కొలువు కూటమును బ్రవేశించి

**తాత్పర్యము.** ఇట్లు పరమేశ్వరు(డు కొలువుదీర్చి యుండెను అంత హిమవంతమునకు( బోయిన మునుల సమూహము మరలివచ్చి యా శివుని కొలువుకూటమును బ్రవేశించి - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** కూ(తంగతులు సనిన - అర్థము కాలేదు, వావిళ్లవారి లఘుటీక ననుసరించి యర్థము వ్రాయ(బడినది

**మహాస్రగ్ధర** హరి వాణీంద్రామరేంద్రాద్యమరగణఫణీంద్రాసురేంద్రోరుజూటో
త్కర సద్రత్నాతిధామాగ్ర సితపదనఖౌఘప్రపూర్ణేందురశ్మి
స్ఫురితాంగోద్య త్సభాబ్ధి క్షుభితరవనిభస్తోత్ర సంగీతరా వా
వరితాశాత్యంతశోభావహు( గనియె మునివ్రాత మా దేవదేవున్ 3

**అర్థము:** ముని-వ్రాతము = మునుల సమూహము, హరి శోభావహున్ హరి = విష్ణువు, వాణీ + ఇంద్ర = సరస్వతి భర్తయగు బ్రహ్మ, అమర + ఇంద్ర = దేవేంద్రు(డు, ఆది = మున్నగు, అమర-గణ = దేవతల సమూహము, ఫణి + ఇంద్ర = భుజగశ్రేష్ఠు(డు, అసుర + ఇంద్ర = రాక్షసశ్రేష్ఠులు - అనువారియొక్క, ఉరు - జూట + ఉత్కర = పెద్ద జడముడుల సమూహమునందలి, సత్ + రత్న - మేలయిన రత్నములయొక్క, అతి-ధామ = ఎక్కువ కాంతిచేత, అగ్ర = అధికముగా, సిత = తెల్లనైన, పద-నఖ + ఓఘ = కాలి గోరుల సమూహము అనెడి, ప్ర-పూర్ణ + ఇందు-రశ్మి = నిండు చంద్రుని కాంతియందు, స్ఫురిత = తో(చిన, అంగశరీరముగల శివుని యొక్క, ఉద్యత్ = ఉద్యమించుచున్న - తీర్చుచున్న, సభా = కొలువనెడి, అబ్ధి = సముద్రముయొక్క, క్షుభిత-రవ = కల(కవలని ధ్వనితో, నిభ = సమానమైన, స్తోత్ర-సంగీత-రావ = స్తుతిగానధ్వనిచేత, ఆవరిత = ఆవరింప(బడిన, ఆశా = దిక్కులకు, అత్యంత = మిక్కిలి, శోభా + ఆవహున్ = కాంతిని గలిగించువా(డగు, ఆ-దేవ-దేవున్ = దేవతలకు దేవు(డైన ఆ శివుని, కనియెన్ = చూచెను

**తాత్పర్యము.** విష్ణువు, బ్రహ్మ, దేవేంద్రు(డు మున్నగు దేవసమూహము,

నాగరాజు, రాక్షసశ్రేష్ఠులు అనువారి పెద్ద జడముడులందలి మేలయిన రత్నముల అధికకాంతిచే మిక్కిలి తెల్లనైన కాలిగోరులసమూహ మనెడి నిండుచంద్రుని కాంతియందుఁ దోఁచిన శరీరము గలవాఁడగు శివుఁడు తీర్చు కొలువనెడిసముద్రము కలఁగిన ధ్వనితో సమానమైన స్తుతిగానధ్వనిచే నావరింపఁబడిన దిక్కులకు మిక్కిలి శోభను గలిగించు దేవదేవుని మునులసమూహము చూచెను

**విశేషములు** కిరీటధారులైన విష్ణుబ్రహ్మాదులు శివునిపాదములపైఁ దమ శిరసులు మోపి నమస్కరింపఁగా వారి కిరీటములందలి రత్నముల కాంతిచే నతని కాలిగోరులు మిక్కిలి తెల్లనై వెన్నెలల నీనుచుండును ఆ వెన్నెలలో శివుని శరీరము ప్రతిఫలించును అట్టి శివుఁడు తీర్చు కొలు వొక సముద్రమువలెను, ఆ కొలువున విష్ణ్వాదులు శివునిఁజేయు సంస్తుతిగానశబ్ద మా సముద్రపు ఘోషమువలెను నుండెను ఆ ధ్వని దిక్కులకు వ్యాపించుచుండెను అలంకారము సితవదనఖౌఘప్రపూర్ణేందు రశ్మి-సభాబ్ధి - అనుచోటుల రూపకము అబ్ధిక్షుభితరవనిభస్తోత్రసంగీతరావ - అనుచో ఉపమ నఖౌఘ = నఖ+ఓఘ - వృద్ధిసంధి విష్ణ్వాది దేవతలందఱిచేతను నమస్కరింపఁబడువాఁ డగుటచేతనే శివుఁడు దేవదేవుఁడు మహాస్రగ్ధర లక్షణమునకు 7 - 101 పద్యవాఖ్యను అరయునది

**వ కని ముహుర్ముహుర్మహీతలాలింగితసర్వాంగులై మస్తకన్యస్తహస్తకమలముకుళితోద్భాసితులై సమస్తవేదస్తుతులం బ్రస్తుతించుచున్న మునిస్తోమంబుఁ గరుణావకలోకనామృతాభిషిక్తులం జేసి పరమేశ్వరుండు డాయంబిలిచిన మహాప్రసాదం బనుచుం గరతలాహితాననులగుచుం దమ పోయి వచ్చిన కార్యసిద్ధిక్రమంబు సవిస్తరంబుగా విన్నపంబుసేసిన నయన కర్ణ కుండలుం డపర్ణారూపవర్ణనాకర్ణనదత్తకర్ణుం డైనకన్నెఱింగి హరి పరమేష్ఠి మునిపురందరాధీశ్వరుండైన పరమేశ్వరునకు నగజ సమస్తప్రశస్త లక్షణలక్షితాంగోపాంగవిశేషంబులు వర్ణించి వెండియు** 4

**అర్థము:** కని, ముహు సర్వాంగులై ముహుః + ముహుః = మాటిమాటికి, మహీతల = భూతలముచే, ఆలింగిత = ఆలింగనము చేసికొనఁబడిన, సర్వ + అంగులు + ఐ = ఎల్ల అవయవములు గలవారయి - సాష్టాంగ నమస్కారముచేసినవా రయి, మస్తక ద్భాసితులై మస్తక + శిరస్సులందు, న్యస్త = ఉంపఁబడిన, హస్త-కమల = కేలుఁదమ్ములయొక్క, ముకుళిత = మొగుడుటలచే, ఉత్ + భాసితులు + ఐ = మిక్కిలి ప్రకాశించినవారయి, సమస్త-

వేద-స్తుతులన్ = ఎల్ల వైదికస్తోత్రములచేతను, ప్రస్తుతించుచున్ + ఉన్న = సన్నుతించుచున్న, ముని-స్తోమంబున్ = మునుల సమూహమును, సప్తర్షులను, కరుణా + అవలోకన + అమృత + అభిషిక్తులన్ = దయాదృష్టి యనెడి అమృతముచే అభిషేకింపఁబడిన వారిని, చేసి, పరమేశ్వరుండు, డాయన్ + పిలిచినన్ = చేరువకుఁ బిలువఁగా, మహాప్రసాదంబు, అనుచున్, కర-తల + ఆహిత + ఆననులు = అఱచేతులందు ఉంపఁబడిన ముఖములు గలవారు, అగుచున్, తమ-పోయివచ్చిన = తాము వెడలివచ్చిన, కార్యసిద్ధి-క్రమంబు = పని జరగిన రీతి, సవిస్తరంబుగాన్ = సంపూర్ణముగా, విన్నపంబు + చేసినన్ = మనవి చేయఁగా, నయన-కర్ణ-కుండలుండు-పాములు (కన్నులు చెవులుగాఁ గలది - పాము) కర్ణభూషణములుగాఁ గలవాఁడు - శివుఁడు, అపర్ణా - రూప - వర్ణన + ఆకర్ణన - దత్తకర్ణుండు = పార్వతియొక్క, సౌందర్యముయొక్క వర్ణనయొక్క, వినుటకయి ఈయఁబడిన, చెవులుగలవాఁడు - పార్వతీసౌందర్యవర్ణనమును వినఁ జెవులొగ్గినవాఁడు, ఐన-కన్నెఱింగి = అయిన జాడ తెలిసి, హరి-పరమేష్ఠి-ముని-పురందర + అధి + ఈశ్వరుండు + ఐన = విష్ణువు, బ్రహ్మ, మునీంద్రులు అనువారికిఁ బ్రభువయిన, పరమేశ్వరునకున్, అగజ = పార్వతియొక్క, సమస్త-ప్రశస్త-లక్షణ + లక్షిత + అంగ + ఉపాంగ - విశేషంబులు = ఎల్ల, శ్రేష్ఠములయిన లక్షణములచేఁ జూడఁబడిన - ఉత్తమ లక్షణములు గల - అంగముల, ఉపాంగముల, విశేషములు, వర్ణించి, వెండియున్ = మఱియును

**తాత్పర్యము :** చూచి మాటిమాటికి సాష్టాంగపడినవారయి శిరసులందుఁ గేలుదమ్ములు మొగిడ్చి, ఎల్ల వేదస్తోత్రములచేఁ, బ్రస్తుతించుచున్న సప్తర్షులను దయాదృష్టి యనెడునమృతముచే నభిషేకించి పరమేశ్వరుఁడు చేరఁ బిలువ, మహాప్రసాదమని ముఖములందు హస్తతలములు ఘటించి తాము పోయి వచ్చిన కార్యము నెఱవేఱిన రీతిని విపులముగా మనవిచేయఁ బార్వతీసౌందర్యవర్ణనమును శివుఁడు వినఁగోరిన జాడ తెలిసి విష్ణుబ్రహ్మమునీంద్రులకుఁ బ్రభువైన పరమేశ్వరునకుఁ బార్వతి సర్వలక్షణసంపన్నములయిన అంగములను, ఉపాంగములను వర్ణించి - మఱియును - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** తమ పోయివచ్చిన - తాము పోయి వచ్చిన - 'ధాతుజవిశేషణ భావార్థక పూర్వవ్యవహితావ్యవహిత కర్తృపదప్రథమకుఁ దఱచుగ యొక్కషష్ఠి యగు ' ప్రౌఢ కారక 15 తమ యొక్క పోయివచ్చిన 'యొక్కకు లోపంబు బహుళంబు' ప్రౌఢ కారక 16 తమ పోయివచ్చిన

# అష్టమాశ్వాసము

## పార్వతీ సౌందర్య వర్ణనము

మ   హరినీలోపమమధ్యకేశి, శశిబిం బాస్యోష్ఠ, రాజీవకే
సర నేత్రామలగంధి, విద్రుమ లతా సద్వర్ణ తన్వంగి, సిం
ధుర కుంభాలసయానపూర్ణకుచ, సంస్తుత్యారుణాబ్జాంఘ్రికం
ధర శైలాత్మజఁ జెప్పనొప్పగు సుధాధామార్ధచూడామణీ ! 5

**అర్థము .** సుధా - ధామ + అర్ధ - చూడామణీ = అర్ధచంద్రుఁడు తలమానికముగాఁ గలవాఁడా! - ఈశ్వరా!, శైల + ఆత్మజన్ = కొండకూఁతును - పార్వతిని, హరి - నీల + ఉపమ - మధ్య - కేశి = సింహముతో సదృశమైన నడుము నీలముతో (నీలమణితో) సదృశమైన కేశములు గలది, శశి-బింబ + ఆస్య + ఓష్ఠ= చంద్రునివంటి ముఖము, దొండపండువంటి పెదవి కలది, రాజీవ - కేసర - నేత్ర + అమల - గంధి = తామరలవంటి కన్నులు గలది, కేసరముల (అకరువుల) వలె నిర్మలమయిన పరిమళము గలది, విద్రుమ లతా-సత్ + వర్ణ-తను + అంగి = పగడమువలె మేలయిన వర్ణము గలది, తీఁగవలె సన్నని మేను గలది, సింధుర - కుంభ + అలస-యాన - పూర్ణ-కుచ = ఏనుఁగువలె మందమయిన గమనము గలది - కుండలవలె నిండయిన స్తనములు గలది, సంస్తుత్య + అరుణ + అబ్జ + అంఘ్రి - కంధర = మిక్కిలి పొగడఁదగిన, ఎఱ్ఱని తామరల వంటి పాదములు గలది, శంఖమువంటి కంఠము గలది, అని, చెప్పన్ + ఒప్పు + అగున్ = చెప్పఁదగును

**తాత్పర్యము .** అర్ధచంద్రుఁడు తలమానికముగాఁ గలవాఁడా! ఈశ్వరా! పార్వతిని సింహమధ్య అనియు, నీలమణిసదృశకేశియనియు, చంద్రమణి అనియు, బింబోష్ఠి యనియు, పద్మనయన యనియు, కేసరగంధి యనియు, విద్రుమ వర్ణ యనియు, లతాతన్వంగి యనియు, గజమందగమన యనియు, కుంభపూర్ణస్తన యనియు, అరుణాబ్జాంఘ్రి యనియు, అబ్జ (శంఖ) - కంఠి యనియుఁ జెప్పఁదగును

**విశేషములు .**అలంకార ముపమ యథాసంఖ్యము అబ్జ శబ్దమున శ్లేషము నీలోపమ - నీల + ఉపమ - గుణసంధి ఆస్య + ఓష్ఠ = ఆస్యోష్ఠ - సమాసమున అకారాంత పదములకు ఓతుః, ఓష్ఠః అను పదములు పరము లగునపుడు వృద్ధ్యాదేశము వైకల్పికము ఇచ్చట వృద్ధిరాలేదు కనుక పరరూప మేకాదేశమైనది సద్వర్ణ - సత్ + వర్ణ తన్వంగి - తను + అంగి - యణాదేశసంధి

సీ. మా నటి పగలెల్ల మాయు దీ వని నిండు
వెన్నెల నగునట్లు వెలఁది నవ్వు
నచిరాంశురుచులేమి యని వాని దెసఁ దప్పఁ
జూచు భావనఁ గ్రేళ్లుసూచు నతివ
ఖగముల కీ మందగతి యేటికని రాజ
హంసలపైఁ బడునట్లు నడుచుఁ
బలువలొ చిలుకల పలువడు లుడిగింతు
నని పల్కునట్ల యింపారఁ బల్కు

తే. నా నగాత్మజ లలితరూపాతిశయ వి
లాస శుభగుణ సౌందర్య లక్షణముల
నగణితైశ్వర్య నిరుపమానాత్మ! నీక
తగు మహాదేవి గా దేవతాలలామ! 6

**అర్థము**. మాను + అటి = ఒప్పిదము పోయి, పగలు + ఎల్లన్ = పగటివేళ అంతయు, ఈవు = నీవు, మాయుదు = నశింతువు, అని, నిండు-వెన్నెలన్, నగు+ అట్లు = నవ్వునట్లు, వెలఁది = ఇంతి - పార్వతి, నవ్వున్

అచిరాంశు - రుచులు = విద్యుత్ప్రభలు, ఏమి, అని = వాని గొప్పతనమేమని, వాని - దెసన్ = వానివైపు, తప్పన్ + చూచు - భావనన్ = అనాదరము చేయు తలఁపుతో, అతివ = స్త్రీ - పార్వతి, క్రేళ్లు + చూచున్ = చంచలముగాఁ జూచును

ఖగములకున్ = పక్షులకు, ఈ - మంద-గతి = ఈ మెల్లని నడక, ఏటికిన్+ అని = ఎందులకని, రాజహంసలపైన్ = రాయంచలమీఁద, పడు + అట్లు + అ = పడినవిధముననే, నడుచున్

పలువలు + ఔ = ప్రేలరులగు, చిలుకల = చిలుకలయొక్క, పలువడులు = దౌష్ట్యములు, ఉడిగింతున్ = పోఁగొట్టుదును, అని, పల్కు + అట్లు + అ = పలుకు విధముననే, ఇంపారన్ = చక్కగా, పల్కున్

అగణిత + ఐశ్వర్య - నిరుపమాన + ఆత్మ = లెక్కలేని ఐశ్వర్యముచే సాటిలేని స్వరూపము గలవాఁడా!, దేవతా - లలామ = దేవశ్రేష్ఠుఁడా! ఆ - నగ + ఆత్మజ = ఆ కొండకూఁతురు - పార్వతి, లలిత - రూప + అతిశయ - విలాస- శుభగుణ - సౌందర్య - లక్షణములన్ = మనోహరమైన ఆకారముచేతను,

ఎక్కువయైన విలాసముచేతను, శుభ-గుణ = శుభములైన గుణములచేతను, సౌందర్యముయొక్క, లక్షణములచేతను, మహాదేవి + కాన్ = పట్టపుదేవిగా, నీకున్+ అ = నీకే, తగున్

**తాత్పర్యము** లెక్కింపశక్యముకాని యైశ్వర్యముచే సాటిలేని స్వరూపముగలవాఁడా! దేవతాశ్రేష్ఠుఁడా! పరమేశ్వరా! 'మనోజ్ఞత చెడి పగలంతయు నీవు నశింతు'వని నిండువెన్నెలను బరిహసించునట్లు పార్వతి నవ్వును క్షణమాత్రకాలమే యుండు మెఱపులకాంతు లేమి గొప్పవి యని వాని ననాదరముతోఁజూచు తలఁపునఁ బార్వతి చాంచల్యముతోఁ జూచును పక్షుల కీ మందగమన మెందులకని రాయంచలపైఁబడునట్లు - రాయంచల నతిశయించునట్లు ఆమె నడచును ప్రేలరులైన చిలుకల దౌష్ట్యములు మానుపుదునని పలుకువిధమున నామె మనోజ్ఞముగాఁ బలుకును ఆ పార్వతి మనోహరాకారముచేతను, అతిశయవిలాసముచేతను, శుభగుణములచేతను, సౌందర్యలక్షణములచేతను, మహాదేవిగా నీకే తగును

**విశేషములు** . సీసపద్యము నాలుగు పాదములందును అలంకారము హేతూత్ప్రేక్ష మాయుదీవు - మాయుదువు + ఈవు లాద్యకారలోపము - బాల క్రియ 24 మాయుదు + ఉ + ఈవు అపదాది స్వరసంధి బాల సంధి 11 మాయుదు + ఈవు = మాయుదీవు - ఉకారసంధి బాల సంధి 1

**క** **నెఱిగలుగ నాఁడునాఁటికి**
**గుఱి గడవఁగఁ బెరుఁగు జఘనకుచకచభరముల్**
**సిఱు దొడలు నడుము నఱ్ఱును**
**విఱుగక తక్కవని గిరిజ వెఱచుచు నడచున్** 7

**అర్థము** . నెఱి + కలుగన్ = ఒప్పిదమగునట్లు, నాఁడు - నాఁటికిన్ = నానాఁటికి, జఘన-కుచ-కచ-భరముల్ = పిఱుఁదుల యొక్కయు, స్తనముల యొక్కయు, కేశపాశముయొక్కయు, భరముల్ = అతిశయములు - బరువులు, గుఱి + కడవఁగన్ = లక్ష్యము నతిశయించునట్లు - మితిమీఱునట్లు, పెరుఁగున్ = వృద్ధిపొందును, చిఱు తొడలున్ = పిక్కలును, నడుమును, అఱ్ఱును = కంఠమును, విఱుగక - తక్కవు = విఱిగిపోనకమానవు, అని, గిరిజ = పార్వతి, వెఱచుచున్ = భయపడుచు, నడచున్

**తాత్పర్యము** . ఒప్పిదమగునట్లు నానాఁటికిఁ బిఱుదుల, స్తనముల,

శిరోజముల బరువులు మితిమీఱి పెరుఁగుచున్నవి క్రమముగాఁ బిఱుఁదుల బరువుచేఁ బిక్కలును, స్తనభారముచే నడుమును, కచభారముచేఁ గంఠమును విఱిగిపోవకమానవని భయపడుచుఁ బార్వతి నడుచును

**విశేషములు .** అలంకారము హేతూత్ప్రేక్ష, యథాసంఖ్యము ఆమె గమన మాంద్యము సహేతుకముగా నిరూపింపఁబడినది

చ **జలజము సావి కోకములు షట్పదముల్ పఱతెంచి తద్దయున్**
**నలి వినుతాస్యమండలము నాసికయున్ శశిబింబ చంపకం**
**బులు సవి డాయనొల్ల కతిమోహమునం బెడఁబాయనోప కా**
**కులమతి నున్నభంగిఁ గుచకుంతలవక్త్రము లొప్పు గౌరికిన్** 8

**అర్థము.** జలజము-సావి = పద్మ మని, కోకములున్ = చక్రవాకములును, షట్పదముల్ = తుమ్మెదలును, తద్దయున్ = మిక్కిలి, నలిన్ = ఉత్సాహముతో, పఱతెంచి = వచ్చి, వినుత + ఆస్య - మండలమున్ = పొగడఁబడిన ముఖబింబమును, నాసికయున్ = ముక్కును, శశిబింబ-చంపకంబులు-సవి = క్రమముగాఁ జంద్రబింబమును, సంపెఁగయును అని, డాయన్ + ఒల్లక = సమీపింప నంగీకరింపక, అతి - మోహమునన్ = మిక్కిలి మక్కువతో, పెడఁబాయన్ + ఓపక = విడిచిపెట్టఁజాలక, ఆకుల-మతిన్ = కలఁగిన బుద్ధితో, ఉన్న-భంగిన్ = ఉన్నవిధమున, గౌరికిన్ = పార్వతికి, కుచ-కుంతల-వక్త్రములు = స్తనములు, తలవెంట్రుకలు, ముఖము, ఒప్పున్

**తాత్పర్యము .** పార్వతి ముఖమును జూచి పద్మమని తలఁచి చక్రవాకములును, తుమ్మెదలును ఉత్సాహముతోవచ్చి, ముఖబింబమును, అందలి ముక్కును గ్రమముగాఁ జంద్రబింబము, సంపెఁగ అని తలఁచి, వానివలని ద్వేషముచే సమీపింప నిష్టపడక, దానియందలి మిక్కుటమైన మక్కువతో విడిచిపెట్టఁజాలక కలఁగిన బుద్ధితో నున్నవిధమునఁ బార్వతికి స్తనములు, శిరోజములు, ముఖము ఒప్పును

**విశేషములు** చక్రవాకములకును, తుమ్మెదలకును పద్మమనిన ఇష్టము పార్వతి ముఖమును జూచి అవి పద్మభ్రాంతితో నుత్సాహమునఁ బరుగుపరుగున వచ్చినవి కాని వానికి ముఖము చంద్రబింబమువలెను, అందలినాసిక సంపఁగి వలెను దోఁచెను కోకములకుఁ జంద్రబింబమన్నను, తుమ్మెదలకు సంపెఁగ యన్నను పడకపోవుటచే, సమీపింప నిష్టపడలేదు జలజభ్రాంతివీడకపోవను

ఇష్టపడలేదు ఇట్లు అవి కలఁగిన బుద్ధితోనున్నవా యనునట్లు పార్వతికిఁ గుచములు, కుంతలములు, ముఖము నొప్పును అలంకారము భ్రాంతిమంతము, హేతూత్ప్రేక్ష, యధాసంఖ్యము సావి - (రూపాం) సవి పార్వతి కుచములు కోకములవలెను, కుంతలములు తుమ్మెదలవలెను, ముఖము పద్మ చంద్రబింబములవలెను ఉన్నవని ఫలితార్థము

సీ క్రొవ్విరు లెసఁగి పూఁగొలల మో పోపక
    నవకంపు లేఁదీఁగె నెవులునట్లు
వీఁగారు చనుఁగవ వ్రేఁగునఁ గౌఁదీఁగె
    వడు వసివాళులు వాడుచుండు
విలసిల్లు నిండారు వెన్నెలలోఁ గారు
    విగ్గోరు దీఁగెలు వెలుఁగునట్లు
తెలిమోముపైఁబర్వి తొలఁకాడు చాయలో
    మెలరారు కనుఁగవ మెఋఁగు లడరుఁ

తే దావి వొంపిరివోవు నెత్తమ్మివలన
వెలయు కంపారి తెమ్మెరల్ వీచునట్లు
కమ్మవాతెఱ వాసన గలసి కలయ
సోడుముట్టుచు నూర్పులు సుడియుచుండు 9

**అర్థము .** క్రొవ్విరులు (క్రొత్త + విరులు) = క్రొత్తపూలు, ఎసఁగి = అతిశయించి, పూ గొలల (పూవు + గొలల)-మోపు = పూవుగుత్తుల భారము, ఓపక = మోయలేక, నవకంపు లేఁదీఁగె = (నవకము + లేఁత + తీఁగె) = మృదువైన లేఁత తీఁగె, నెవులు + అట్లు = బాధచెందు విధమున, వీఁగారు (వీఁగు + ఆరు) = నిక్కునట్టి, చనుఁగవ = స్తనద్వయముయొక్క, వ్రేఁగునన్ = బరువుచే, కౌఁదీఁగె (కౌను + తీఁగె) = తీఁగవంటి నడుము, పడు వసివాళులు, వాడుచున్ + ఉండున్ = మిక్కిలి వాడుచుండును

విలసిల్లు = ప్రకాశించునట్టి, నిండారు (నిండు + ఆరు)-వెన్నెలలోన్ = నిండు వెన్నెలలో, కారు = నల్లని, విగ్గోరు + తీఁగెలు = విగ్గోరనెడి లతలు, వెలుఁగు+ అట్లు = ప్రకాశించువిధమున, తెలి-మోముపైన్ = తెల్లని ముఖముపై, పర్వి = వ్యాపించి, తొలఁకాడు = ప్రకాశించు, చాయలోన్ = కాంతిలో, మెలరారు

= మనోహరమగు, కనుఁగవ = కన్నులజంటయొక్క,మెఱుఁగులు = కాంతులు, అడరున్ = అతిశయించును

తావి = పరిమళము, పొంపిరి + పోవు = అతిశయించు, నెత్తమ్మి (నెఱ + తమ్మి) వలనన్ = పద్మము నుండి, వెలయు = కలుగునట్టి, కంపారి (కంపు + ఆరి) = వాసన నిండి, తెమ్మెరల్ = దక్షిణపు గాలి, వీచు + అట్లు = వ్యాపించునట్లు, కమ్మ-వాతెఱ = పరిమళించు పెదవియొక్క, వాసన = పరిమళము, కలసి = కూడి, కలయన్ = అంతటను, సోడుముట్టుచున్ = వ్యాపించుచు, ఊర్పులు = శ్వాసములు, సుడియుచున్ + ఉండున్ = వ్యాపించుచుండును

**తాత్పర్యము** క్రొంబూలు అధికమై పూలగుత్తుల బరువును మోయలేక మృదువైన లేఁదీఁగ బాధపడువిధమున, నిక్కుచనుదోయి బరువుచేఁ దీఁగవంటి నడుము మిక్కిలి వాడుచుండును ప్రకాశించు నిండువెన్నెలలో నల్లని విగ్గొరు తీఁగెలు వెలుఁగువిధమున, తెల్లనిముఖముపై వ్యాపించి ప్రకాశించు కాంతిలో మనోహరమగు కనుదోయికాంతు లతిశయించును పరిమళమధికమగు తామర నుండి పుట్టు వాసన నిండి గాలి వీచువిధమున పరిమళించు పెదవివాసనకూడి అంతటను వ్యాపించుచు నూర్పులు ప్రసరించుచుండును

**విశేషములు.** అలంకార ముపమ క్రొవ్విరులు = క్రొత్త + విరులు పూగొల - పూవు + గొల నవకంపులేఁదీఁగె - నవకము + లేఁత + తీఁగె నెపులు - (రూపాం ) నెగులు కౌఁదీఁగె = కౌను + తీఁగె వసివాళులు - వసివాడు + లు నెత్తమ్మి - నెఱ + తమ్మి కంపు = కమ్మని వాసన తెమ్మెరలు - తెన్ + ఎరల్ - దక్షిణపు గాలి

శా **ఆ లీలాలసదృఙ్మరీచి దివిజాహారప్రవాహోరు క**
**ల్లోలానీకము పోలెఁ బొల్పెసఁగ నాలోలాతిరమ్యాసిత**
**భ్రూలాస్యాంచితమైన పార్వతి ముఖాంభోజంబు నేణాంకిత**
**ప్రాలేయద్యుతిమండలంబు నుపమింపంబోయి శంకించెదన్** 10

**అర్థము:** ఆ-లీలా + అలస - దృశ్(క్) + మరీచి = విలాసముచే మందమైన ఆ కన్నుల కాంతి, దివిజ + ఆహార = దేవతల ఆహారమైన అమృతముయొక్క, ప్రవాహ = ప్రవాహముయొక్క, ఉరు = గొప్పవియగు, కల్లోల + అనీకము + పోలెన్ = తరఁగల సమూహము వలె, పొల్పు + ఎసఁగన్ = ఒప్పుఁగా, ఆలోల + అతి-రమ్య + అసిత + భ్రూ-లాస్య + అంచితము = చంచలము, మిక్కిలి సుందరము, అసిత

= నల్లని, భ్రూ = కనుబొమలయొక్క, లాస్య = నాట్యముచే, అంచితము = ఒప్పినది, ఐన, పార్వతి-ముఖ + అంభోజంబున్ = పార్వతి ముఖపద్మమును, ఏణ + అంకిత-ప్రాలేయ-ద్యుతి మండలంబున్ = జింకచేత చిహ్నితమైన చంద్రమండలమును (తో), ఉపమింపన్ + పోయి = పోల్పఁబోయి, శంకించెదన్ = సందేహింతును

**తాత్పర్యము .** సవిలాసము, మందము నైన ఆ కన్నులకాంతి అమృతప్రవాహపుఁబెనుగరళ్లవలె ఒప్పఁగా, చంచలము, అతిసుందరము, నల్లనిది అగు కనుబొమల నాట్యముచే నొప్పు పార్వతి ముఖపద్మమును జింకతో నొప్పు చంద్రబింబముతోఁ బోల్పఁబోయి సందేహింతును

**విశేషములు .** అలంకారము సందేహము దృఙ్మరీచి-దృశ్(క్) + మరీచి - అనునాసిక సంధి

మ **మెలుపిచ్చుం దనువల్లి వల్లికకు, నా మీనాక్షి లోలాక్షముల్**
**పొలపం బిచ్చు మెఱుంగుఁదీఁగెలకు, నా పూర్ణామలద్యోతికిన్**
**దెలుపిచ్చున్ ముఖమండలంబు, దమకుం దియ్యంబు లోఁదాల్ప న**
**గ్గలమై యుండెడు వాని నొండుఁ బొగడంగా నేర మా సుందరిన్ 11**

**అర్థము.** ఆ-మీన + అక్షి = చేఁపలవంటి కన్నులుగల ఆ పార్వతియొక్క, తను-వల్లి = తీఁగవంటి మేను, వల్లికకున్ = తీఁగకు, మెలుపు = సౌకుమార్యము, ఇచ్చున్, (ఆ-మీనాక్షి) లోల + అక్షముల్ = చంచలము లయిన కన్నులు, మెఱుంగు + తీఁగెలకున్ = విద్యుల్లతలకు, పొలపంబు = కాంతి, ఇచ్చున్, (ఆ మీనాక్షి) ముఖ-మండలంబు = ముఖబింబము, ఆ-పూర్ణ + అమలద్యోతికిన్ = ఆ నిండు చంద్రునకు, తెలుపు = స్వచ్ఛత, ఇచ్చున్, ఆ సుందరిన్ = ఆ అందగత్తె (పార్వతి) విషయమున, తమకున్ = తమకంటె (పంచమ్యర్థమున షష్ఠి), తియ్యంబు= మాధుర్యము, లోన్ + తాల్పన్ = లోపల వహింప, అగ్గలము + ఐ = అధికమయి, ఉండెడు-వానిన్ + ఒండున్ = ఉండు నితరమైన దానిని, పొగడంగాన్ + నేరము= ప్రశంసింపఁ జాలము

**తాత్పర్యము .** ఆ పార్వతి దేహలత తీఁగకు సౌకుమార్యము నిచ్చును ఆ మీనాక్షి చంచలాక్షులు విద్యుల్లతలకుఁ గాంతి నిచ్చును ఆమె ముఖబింబము ఆ

పూర్ణచంద్రునకు స్వచ్ఛత నిచ్చును ఆమె విషయమున ఆమె దేహాద్యవయవముల కంటె మాధుర్యమునుదాల్చు నితరవస్తువులను బొగడఁజాలము

**విశేషములు.** తీఁగె చాల సుకుమారమయినది అట్టి దానికే సౌకుమార్యము నొసఁగు నట్టిది ఆమె దేహవల్లి విద్యుల్లతలు కాంతిమంతమయినవి అట్టివానికే కాంతినిచ్చునవి ఆమె కన్నులు పూర్ణచంద్రుఁడు తెల్లనివాఁడు అట్టివానికే తెలుపిచ్చునట్టిది ఆమె ముఖమండలము ఇట్లు ఆమె దేహాదులకు ప్రసిద్ధోపమానములయిన లతాదులే చాలనప్పుడు, ఇతరములయిన వాని నేమిపొగడఁగలము? పార్వతి దేహాద్యవయవములు నిరుపమానము లనుట అలంకారము - అతిశయోక్తి

**సీ. సల్లలితాశోకపల్లవంబులుఁ బాద**
**పల్లవంబులు నొక్కతల్లి ప్రజలొ?**
**ప్రణయాతిశయమునఁ బాయని జక్కవ**
**కవయు నెవ్వాలి సన్నుఁగవయుఁ గవయొ?**
**వలకోటఁ బెరిఁగిన వలరాజు హస్తిహ**
**స్తంబును గేశపాశంబు నెనయొ?**
**పరిమళాకీర్ణ తోయరుహంబు నానన**
**తోయరుహంబును దొరయొ తలఁప?**

**ఆ. లీలఁ బులినకేళిసోలంబుతోఁ గ్రాలి**
**నడచు నంచనడలు నడలు గెడలొ?**
**యనఁగ బాదతలముఁ, జనుకట్టుఁ, గచము, నా**
**ననము, నడపు, నద్రితనయ కమరు.** 12

**అర్థము :** సల్లలిత + అశోక-పల్లవంబులున్ = మిక్కిలి మనోహరమైన అశోకవృక్షపుఁ జివురులును, పాద-పల్లవంబులున్ = చివురులవంటి పాదములును, ఒక్క-తల్లి-ప్రజలో = ఒక తల్లి బిడ్డలా? అనఁగన్, పాదతలమున్,

ప్రణయ + అతిశయమునన్ = ప్రేమాధిక్యముచే, పాయని = ఒండొటిని వీడని, జక్కవ-కవయున్ = చక్రవాకముల జంటయు, నెవ్వాలి + చన్ను + కవయున్ = మిక్కిలి వట్రులైన స్తనద్వయమును, కవయొ = జంటయా? అనఁగన్, చనుకట్టున్,

వల-కోటన్ = వలపనెడు కోటయందు, పెరిఁగిన, వలరాజు = మన్మధునియొక్క, హస్తి = ఏనుఁగుయొక్క, హస్తంబును = తొండమును, కేశ-పాశంబున్ = శిరోజముల సమూహమును - జడయును, ఎనయొ = సమానమా, అనఁగన్, కచమున్ = కేశబంధమును,

పరిమళ + ఆకీర్ణ-తోయరుహంబును = సువాసనతో నిండిన పద్మమును, ఆనన-తోయరుహంబును = పద్మమువంటి ముఖమును, తలఁపన్ = భావింపఁగా, దొరయొ = సమానమో, అనఁగన్, ఆననమున్ = ముఖమును,

లీలన్ = విలాసముతో, పులిన-కేళిన్ = ఇసుక తిన్నెలయందలి క్రీడలో, సోలంబుతోన్ = పారవశ్యముతో, క్రాలి = ఒప్పి, నడచు + అంచ-నడలున్ = నడచునట్టి హంసల నడకలును, నడలున్, గెడలొ = సమానములో, అనఁగన్, నడపున్ = నడకయు, అద్రి-తనయకున్ = కొండకూఁతునకు = పార్వతికి, అమరున్ = ఒప్పును

**తాత్పర్యము .** మిక్కిలి మనోహరములైన అశోకవృక్షపుఁ జివురులును, ఆమె అడుగుఁజివురులును ఒక తల్లి బిడ్డలా యనఁ బాదతలములును, అనురాగాతిశయమున నొండొంటిని వీడని చక్రవాకముల జంటయు, ఆమె మిక్కిలి వట్రువలయిన స్తనముల జంటయు జతయా యన జనుకట్టును, వలపనెడి దుర్గమునఁ బెరిఁగిన మన్మధుని యేనుఁగుతొండమును ఆమె కేశపాశమును సమానములా యన శిరోజములును, పరిమళముతో నిండిన పద్మమును, ఆమె ముఖపద్మమును సమానములా యన ముఖమును, సైకతస్థల విహారమునఁ బారవశ్యముతో నడచు హంసల గమనములును, ఆమె నడకలును సమానములా యన నడకయును బార్వతి కొప్పును

**విశేషములు** అలంకారములు ఉత్ప్రేక్ష, యధాసంఖ్యము నెవ్వలి సన్ను - నెవ్వలి + చన్ను, గసడదవాదేశము - బాల సంధి 13 చన్నుఁగవ - చన్ను + కవ - సమాసమున నుదంతస్త్రీసమమునకుఁ బరుషము పరమగుచుండఁగా నుగాగమము - బాల సంధి 24 ద్రుతకార్యము - బాల సంధి 15,16 వలకోట - వలపు + కోట వలపు శబ్దమునకు సమాసమున నంత్యవర్ణలోపము - వలపనెడు కోట - రూపకము ఇట్లే వలరాజు - వలపు + రాజు ఆనన తోయరుహము - తోయరుహము వంటి ఆననము - ఉపమిత సమాసము దొర = సాటి 'దొరయు గెడ జోడు పోలిక ఉపమ కొప్పున్' కావ్యా 5 16 సొలంబుతో - అను దానికి సోలంబుతో

నని రా అ క్రృ శర్మగారి సవరణ నడచు నంచ - నడచు + అంచ - ఉదంత తద్ధర్మార్థక విశేషణమునకు అచ్చుపరముగా నుగాగమము - బాల సంధి 33 సల్లలిత - సత్ + లలిత - తవర్గ వర్ణములకు లకారము పరమగుచో పరసవర్ణ మాదేశ మగును

క **మెలుపునఁ జాయను దమలోఁ**
**గలసి యుమాదేవి యడుగుఁగవఁ బోలంగాఁ**
**దలఁచియొ దూదియు, లక్కయు**
**లలితంబుగఁ గలసి పొలుచు లత్తుక రేకుల్** 13

**అర్థము** మెలుపునన్ = సౌకుమార్యముననను, చాయను = వర్ణముననను, తమలోన్, కలసి, ఉమా-దేవి-అడుగు + కవన్ = పార్వతీదేవియొక్క పాదద్వయమును, పోలంగాన్ = పోలుటకు, తలఁచియో, దూదియున్, లక్కయున్, లలితంబుగన్ = చక్కఁగా, కలసి, లత్తుక-రేకుల్, పొలుచున్ = ఒప్పును

**తాత్పర్యము** సౌకుమార్యమున దూదియు, వర్ణమున లక్కయు ఒకదానితోనొకటి కూడి పార్వతీదేవి పాదద్వయమును బోలఁదలఁచియో అవి లలితముగాఁ గలిసి లత్తుకరేకులుగా నొప్పెను

**విశేషములు.** అలంకారము హేతూత్ప్రేక్ష అడుగుఁగవ - అడుగు + కవ- పూర్వపద్యమునందలి చన్నుఁగవ ప్రక్రియవలెనే, ఉమ - ఉ = ఓసీ! మా - (తపస్సు) వలదు అని తల్లిచేఁ జెప్పఁబడినదగుటచేఁ బార్వతికి 'ఉమ'యను పేరు వచ్చెను 'ఉమేతి మాత్రా తపసో నిషిద్ధా - పశ్చా దుమాఖ్యాం సుముఖీ జగామ ' కాళి కుమార సం 1 - 26 లత్తుక - వికృతి - అలక్తము - ప్రకృతి

క **త్ర్యంబక! నగసుత నిబిడ కు**
**చంబుల పొలు పెన్న మాకు శక్యమె? నీ డెం**
**దంబునకు వచ్చునట్టె ధ్రు**
**వంబుగ; వే ఱొండు తగిన వర్ణన గలదే?** 14

**అర్థము :** త్ర్యంబక = ముక్కంటీ! నగ-సుత = పర్వత పుత్రిక - (పార్వతి) యొక్క, నిబిడ - కుచంబుల - పొలుపు = సాంద్రములైన స్తనముల చక్కఁదనము, ఎన్నన్ = గణించుటకు, మాకున్, శక్యమె = తరమా? ధ్రువంబుగన్ = నిశ్చయముగా, నీ-డెందంబునకున్ = నీ హృదయమునకు, వచ్చునట్టె = నచ్చినదఁట, వేఱు + ఒండు = మఱియొక, తగిన,వర్ణన, కలదే!

**తాత్పర్యము.** ముక్కంటీ! పార్వతి దృఢమైన స్తనముల చక్కఁదనము వెన్న మా తరమా? నిశ్చయముగా అది నీ మనస్సునకు నచ్చిన దనఁగా, ఇఁక సముచితమైన వర్ణన మఱియొకటి కలదా? లేదనుట

**విశేషములు.** త్ర్యంబక - త్రి + అంబక - యణాదేశ సంధి

క పరమానందుని నిను సుఖ
పరవశుఁ గావింపనోపుఁ బరమార్థమునన్
ధరణీధరవర నందన
గురుజఘన విశేష మొరులకొలఁదియె పొగడన్? 15

**అర్థము.** ధరణీధర-వర-నందన = పర్వతరాజు కూఁతురు అగు పార్వతియొక్క, గురు-జఘన-విశేషము = గొప్ప మొలయొక్క పెంపు, పరమ + అర్థమునన్ = సత్యముగా, పరమ + ఆనందునిన్ = గొప్ప ఆనందముగలవానిని, నినున్, సుఖ-పరవశున్ = సౌఖ్యముచేఁ బారవశ్యము చెందినవానిని, కావింపన్ + ఓపున్ = చేయఁగలుగును, అట్టిది, పొగడన్ = పొగడుటకు, ఒరుల-కొలఁదియె = ఇతరులకు సాధ్యమా?

**తాత్పర్యము.** పార్వతి గొప్ప కటి ప్రదేశము పరమానందుఁడవైన నిన్ను సత్యముగా సుఖపరవశునిఁజేయఁగలదు అట్టిదానిని బొగడుట కితరులకు శక్యమా? - కా దనుట

**విశేషములు.** జఘనము - స్త్రీశ్రోణి పురోభాగము - స్త్రీశ్రోణి పశ్చాద్భాగము- అమరము

చ. నడు మస దింతి చన్నుల తనర్చున ముందఱు గానరాదు మా,
కడుగిడుచోటఁ గా ల్తెమలినంతన కౌనుకు బింద మయ్యెడున్;
దొడిఁబడఁజేయు మా వలన దోసము లేదని చెప్ప డాసె నాఁ
గడుబెడఁగొందు గౌరి తెలి కన్నులు వీనుల డాసి దేసియై 16

**అర్థము.** నడుము, అసదు = కృశము, ఇంతి = స్త్రీ (పార్వతి) యొక్క, చన్నుల - తనర్చునన్ = స్తనములయొక్క స్థౌల్యముచే, ముందఱు - ఎదుటి ప్రదేశము, మాకున్, కానన్ + రాదు = కనఁబడదు, అడుగు + ఇడు-చోటన్ = అడుగు మోపుచోట, కాల్ = కాలు, తెమలిన + అంతన్ + అ = తొట్రుపడినంతనే,

కౌనుకున్ = నడుమునకు, బిందము = ఆపద, అయ్యెడున్ = అగును, తొడిఁబడన్ + చేయున్ = తొట్రుపడునట్లు చేయును మా-వలనన్, దోసము = తప్పు, లేదు + అని, చెప్పన్ = చెప్పుటకు, డాసెన్ = సమీపించెను, నాన్ = అనఁగా, గౌరి = పార్వతియొక్క, తెలి-కన్నులు = తెల్లని కన్నులు, వీనులన్ = చెవులను, డాసి = సమీపించి, దేసి + ఐ = అందమయి, కడున్ = మిక్కిలి, బెడఁగు + ఒందున్= శోభిల్లును

**తాత్పర్యము.** పార్వతి ఆ కర్ణాంతనేత్ర ఆమె కన్నులు చెవులను డాయుట వాని కీ విషయమును జెప్పుటకా యని తోఁచును అది యేదనఁగా - 'పార్వతి నడుము మివులఁ గృశించినది ఆమె స్తనముల విరివిచే నెదుటి ప్రదేశము కనఁబడదు ఆమె అడుగుపెట్టు చోటఁ గాలు తొట్రుపడినంతనే ఆమె నడుమునకు ఆపద అగును తొట్రుపడఁజేయును' మావలన దోషము లేదు అనునది ఆ విషయమును జెప్పుటకా యనునట్లు ఆమె కన్నులు చెవులవఱకు వ్యాపించి మిక్కిలి శోభిల్లును

**విశేషములు .** అలంకారము హేతూత్ప్రేక్ష కావ్యలింగము కౌనుకు = కౌనునకు - 'కువర్ణకంబు పరంబగునపుడు కవిత్రయంబువారి ప్రయోగంబులందక్కఁ దక్కిన మహాకవి ప్రయోగంబులందును గొన్నియెడల నగాగమంబు చూపట్టదు' ప్రౌఢ శబ్ద 19 బిందము (వికృతి) - భిన్నము (ప్రకృతి) డాసి - దేసి - అనుప్రాసము

**క తనుమధ్య యోప దీ గురు**
**ఘనకుచభారంబు దాల్పఁగా నని యజుఁ డి**
**మ్మున నీల మణి కణిక దీ**
**ర్చిన క్రియ నూఁగారుఁదీఁగ చెలువకు నమరున్ 17**

**అర్థము:** ఈ-గురు-ఘన-కుచ-భారంబు = ఈ పెద్దస్తనముల అధికమయిన బరువు, తాల్పఁగాన్ = మోయుటకు, తను-మధ్య = సన్నని నడుము గలది-స్త్రీ-పార్వతి, ఓపదు = చాలదు, అని, అజుఁడు = బ్రహ్మ, ఇమ్మునన్ = వీలుగా, నీలమణి-కణిక = నీలమణిమయమైన సూది, తీర్చిన-క్రియన్ = అమర్చిన విధమున, చెలువకున్ = స్త్రీకి - పార్వతికి, నూఁగారు + తీఁగ = తీఁగవంటి రోమావళి, అమరున్ = ఒప్పును

**తాత్పర్యము .** 'ఈ గొప్పదియగు స్తనభారమును దాల్చుటకు నడుము సన్ననిదైన యీ పార్వతి చాలదు' అని బ్రహ్మ వీలుగా నీలమణిమయమైన కణిక నమర్చెనా యనునట్లు పార్వతికిఁ దీఁగవంటి రోమరాజి ఒప్పును

**విశేషములు** అలంకారము హేతూత్ప్రేక్షన నూఁగారుఁదీఁగ = నూఁగారు + తీగ సమాసమున ఉదంతస్త్రీసమమునకుఁ బరుషము పరమగుచుండఁగా నుగాగమము బాల సంధి 24, పిమ్మట ద్రుతకార్యము - బాల సంధి 15,16 'తనుమధ్య' అను పార్వతి విశేషణము సాభిప్రాయమగుటచే పరికరాలంకారమును

సీ అలికేశి లక్తకా దల పాదతలములు
నమృతాంశుముఖ శుక్తికాంఘ్రియుగముఁ
గంబుకంధర వ్రీహిగర్భాభజంఘలు
బిసహస్త రంభోరులసితరుచియుఁ
బూర్ణకుంభస్తన పులిన నితంబంబు
హరిమధ్య వేదిమధ్యాభినుతియుఁ
గుంభికుంభనితంబ కోకస్తనంబులు
కరభోరు మృదులతాకరయుగంబుఁ

ఆ గామశరధిజాను క్రముక కంఠంబును
గమరపాద వికచకమలముఖముఁ
బల్లవాంఘ్రితల సుబర్హిణాలకములు
నజునకైనఁ బొగడ నరిదిగాదె 18

**అర్థము .** అలి-కేశి = తుమ్మెదలవంటి కేశములుగల పార్వతియొక్క, లక్తకా-దల-పాదతలములున్ = లత్తుక రేకులుగల అడుగులును, అమృత + అంశు-ముఖ = చంద్రుని వంటి ముఖముగల పార్వతి యొక్క, శుక్తికా + అంఘ్రి-యుగమున్ = ముత్తెపుఁజిప్పల వంటి పదముల జంటయును,

కంబు-కంధర = శంఖము వంటి కంఠముగల పార్వతియొక్క, వ్రీహి-గర్భ + ఆభ-జంఘలున్ = వరిపొట్టలతో సమానములయిన పిక్కలును, బిస-హస్త = తామరతూండ్ల వంటి చేతులు గల పార్వతియొక్క, రంభా + ఊరు-లసిత-రుచియున్ = అరఁటుల వంటి తొడల ప్రకాశించు కాంతియును,

పూర్ణ-కుంభ-స్తన = నిండు కుండల వంటి స్తనములుగల పార్వతి యొక్క, పులిన-నితంబంబున్ = ఇసుక తిన్నెలవంటి పిఱుఁదును, హరి-మధ్య = సింహము

నడుము వంటి నడుము గల పార్వతి యొక్క, వేది-మధ్య + అభినుతియున్ = అరఁగు వంటి నడుము యొక్క పొగడ్తయును,

కుంభి-కుంభ-నితంబ = ఏనుఁగు కుంభస్థలములవంటి పిఱుఁదులుగల పార్వతి యొక్క కోక-స్తనంబులున్ = చక్రవాకములవంటి స్తనములును, కరభ + ఊరు = కరభము (మనికట్టు మొదలు చిటికెన వ్రేలి మొదలుదాఁకఁ గల చేతి వెలుపలిచోటు) వంటి తొడలుగల పార్వతి యొక్క, మృదు-లతాకర-యుగంబున్ = కోమలములయిన తీఁగలవంటి చేతుల జంటయును

కామ-శరధి-జాను = మన్మథుని అమ్ములపొది వంటి మోఁకాళ్లు గల పార్వతియొక్క, క్రముక-కంఠంబును = పోఁక వంటి కంఠమును, కమఠ-పాద = తాఁబేలు వంటి పాదములుగల పార్వతియొక్క, వికచ-కమల-ముఖమున్ = వికసించిన తామరవంటి ముఖమును, పల్లవ + అంఘ్రి-తల = చివురులవంటి పాదతలములుగల పార్వతియొక్క, సు-బర్హిణ + అలకములున్ = మంచి నెమలివంటి ముంగురులును, అజునకున్ + ఐనన్ = బ్రహ్మ కయినను, పొగడన్ = పొగడుటకు, అరిది + కాదె = అశక్యము కదా!

**తాత్పర్యము** . పార్వతి లత్తుకరేకులవంటి పాదతలములును, ముత్తెపుఁజిప్పలవంటి పదద్వయమును, వరిపొట్టలవంటి పిక్కలును, అరఁటుల వంటి తొడల కాంతియు, ఇసుకతిన్నెలవంటి పిఱుఁదులును, అరఁగువంటి నడుము ప్రశంసయును, చక్రవాకములవంటి స్తనములును, మృదులతలవంటి చేతుల జంటయును, పోఁకవంటి కంఠమును, వికసించిన తామర వంటి ముఖమును, నెమలివంటి ముంగురులును, బొగడుటకు బ్రహ్మకైన శక్యముగాదు

**విశేషములు** . పార్వతి విశేషణములందును ఆమె అవయవ వర్ణనను గావించుట అరయఁదగినది ఆమె విశేషణములలోని అవయవ వర్ణ్య కేశాది పాద పర్యంతముగావించి, ఆమె అవయవములను బాదాద్యలక పర్యంతముగావించుట గమనింపఁదగినది 'దేవతానాం రూపం పాదాఙ్గుష్ఠ ప్రభృతి వర్ణ్యతే, మానుషాణాం కేశాదారభ్యేతి ధార్మికాః' - దేవతయగు పార్వతిని ఈ కవి యీ ప్రబంధమున మానుషిగాఁ జిత్రించుటచే, ఇట్లు రెండువిధముల నామె యవయవములను వర్ణించుట మెచ్చఁదగినది ఈ విషయమును కవియే క్రింది వచనమున - ఆరోహిణ్యావరోహిణుల నని చెప్పుట అరయునది

వ అని యనేక ప్రకారంబుల నగజ రూప విభ్రమ సౌందర్య విలాసంబులు ఆరోహిణ్యవరోహిణుల వర్ణించుచున్న సప్తమహర్షుల వచనంబు లతను పంచబాణంబులైన ట్లిందుధరు డెందంబు భేదించిన రాగోత్కటంబునం దావగొనక పరమేశ్వరుం డప్పుడ హిమవంతంబున కరుగ నుద్యుక్తుండై ప్రయాణభేరి సటవం బంచిన నా క్షణంబ 19

**అర్థము .** అని, అనేక-ప్రకారంబులన్ = పెక్కురీతుల, అగజ-నగజ = పార్వతియొక్క, రూప-విభ్రమ-సౌందర్య-విలాసంబులు = ఆకార విలాసములు, చక్కదనపు విలాసములు, ఆరోహిణీ + అవరోహిణులన్ = క్రిందినుండి పైకిని, పాదాద్యలకపర్యంతమును - పైనుండి క్రిందికిని - కేశాదిపాదపర్యంతమును, వర్ణించుచున్ + ఉన్న, సప్త-మహత్ (మహా) + ఋషుల = ఏడుగురు మునివరుల, వచనంబులు = మాటలు, అతను-పంచ-బాణంబులు + ఐన + అట్లు = మన్మథుని యైదుబాణములయినవిధమున ఇందు-ధరు = చంద్రుని ధరించినవాఁడగు శివునియొక్క, డెందంబున్ + హృదయమును, భేదించినన్ = భేదింపఁగా, రాగ + ఉత్కటంబునన్ = ప్రేమాతిశయమున, తావగొనక = నిల్పోపక, పరమేశ్వరుండు, అప్పుడ (అప్పుడు + అ), హిమవంతంబునకున్, అరుగన్, ఉద్యుక్తుండు + ఐ = పూనినవాఁడయి, ప్రయాణ-భేరిన్ = ప్రయాణవాద్యమును, చటువన్ + పంచినన్ = మ్రోయింప నాజ్ఞాపింపఁగా, ఆ-క్షణంబు + అ = ఆ క్షణమే

**తాత్పర్యము :** అని పెక్కువిధములఁ బార్వతి సౌందర్యవిలాసములను గ్రిందినుండిపైకిని - పాదాది కేశపర్యంతమును, పైనుండి క్రిందికిని - కేశాది పాద పర్యంతమును, వర్ణించుచున్న సప్తమహామునుల మాటలు మన్మథుని పంచబాణములుగా నీశ్వరుని హృదయమును భేదింపఁగాఁ బ్రేమాతిశయమున నిల్పోపక శివుఁడు వెంటనే హిమవంతమునకుఁబోవఁ బ్రయాణభేరి మ్రోయింపఁబంప నాక్షణమే తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు :** మన్మథుని పంచబాణములు - అరవిందము, అశోకము, చూతము, నవమల్లిక, నీలోత్పలము

## శివుని హిమవన్నగ ప్రయాణము

క	భేరీరవంబు సెలఁగెన్
భోరన బ్రహ్మాండభాండపూరితమై త
త్తారాద్రిగుహల నిర్ఝర
తీరంబులఁ బెల్లుతోఁ బ్రతిధ్వను లెసఁగన్	20

**అర్థము:** భేరీ-రవంబు = భేరీధ్వని, భోరనన్ = అధికముగా, బ్రహ్మాండ-భాండ-పూరితము + ఐ = భాండమువంటి బ్రహ్మాండము నిండినదయి, తద్ + తార + అద్రి-గుహలన్ = ఆ వెండికొండ గుహలందును, నిర్ఝర-తీరంబులన్ = సెలయేటిదరులందును, పెల్లుతోన్ = ఆధిక్యముతో, ప్రతి-ధ్వనులు = మార్మ్రోఁతలు, ఎసఁగన్ = అతిశయింపఁగా, చెలఁగెన్ = మ్రోసెను

**తాత్పర్యము** భేరీధ్వని బ్రహ్మాండభాండము నిండి కైలాసపర్వతగుహలందును, సెలయేటి దరులందును అధికముగాఁ బ్రతిధ్వను లతిశయింప మ్రోసెను

వ	తదవసరంబున	21

**అర్థతాత్పర్యములు :** తద్ + అవసరంబునన్ = ఆ సమయమున - తరువాతి పద్యముతో నన్వయము

సీ	ధ్రువమండలంబు సముత్తుంగశృంగంబుల
	సంధిల్లి రత్నభూషణము గాఁగ
నక్షత్రలోకంబు నయమొందు వర లలా
	టమున మాణిక్యపట్టంబు గాఁగఁ
గనకాచలేంద్రంబు గళమునఁ గట్టిన
	కమనీయ మగుపైఁడిగంట గాఁగఁ
గులపర్వతంబులు బలసి తద్దయు రమ్య
	మగుసురగజ్జెల పగిది గాఁగ.

ఆ	ముదముతోఁ జతుస్సముద్రముల్ గాళుల
ఘర్ఘరముల పగిదిఁ గలసి మ్రోయఁ
జెలువ మెసఁగి వచ్చి నిలిచె సురాసురా
ధీశు నెదుర నా గవేశ్వరుండు	22

**అర్థము.** ధ్రువ-మండలంబు = ధ్రువనక్షత్ర మండలము, సమ్ + ఉత్తుంగ-శృంగంబులన్ = మిక్కిలి యెత్తైన కొమ్ములందు, సంధిల్లి = తగులుకొని, రత్న-భూషణము = రత్నాలంకారము, కాఁగన్

నక్షత్ర-లోకంబు, నయము + ఒందు = బాగయిన, వర-లలాటమునన్ = శ్రేష్ఠమైన నుదుట, మాణిక్య-పట్టంబు = మణి పట్టము, కాగఁన్,

కనక + అచల + ఇంద్రంబు = మేరుపర్వతశ్రేష్ఠము, గళమునన్ = కంఠమందు, కట్టిన, పైఁడి-గంట = బంగారు గంట, కాఁగన్

కుల-పర్వతంబులు, బలసి = చుట్టి, తద్దయున్ = మిక్కిలి, రమ్యము + అగు = రమణీయమగు, సురగజ్జెల = మ్రోయుచున్న గజ్జెలయొక్క, పగిది = విధము, కాఁగన్

ముదముతోన్ = సంతోషముతో, చతుస్సముద్రముల్ = నాలుగు సముద్రములును, కాళుల-ఘర్ఘరముల-పగిదిన్ = కాళ్లయందలి గజ్జెల విధమున, కలసి = కూడి, మ్రోయన్ = ధ్వనింపఁగా,

ఆ-గవేశ్వరుండు (గో + ఈశ్వరుండు) = ఆ వృషభరాజు, సుర + అసుర + అధి + ఈశు + ఎదురన్ = దేవతల రాక్షసుల ప్రభువైన యీశ్వరుని ఎదుట, చెలువము = అందము, ఎసఁగి = అతిశయించి, వచ్చి, నిలిచెన్

**తాత్పర్యము.** ధ్రువనక్షత్ర మండలము మిక్కిలి యెత్తయిన కొమ్ములందుఁ దగులుకొని రత్నాలంకారము కాఁగను, నక్షత్రమండలము మేలయిననుదుట మణిమయపట్టము కాఁగను, మేరుపర్వతము కంఠమునఁ గట్టిన రమణీయ స్వర్ణ ఘంట కాఁగను, కులపర్వతములు బలసి మిక్కిలి సుందరములైన మ్రోయుగజ్జెలు కాఁగను, నాలుగుసముద్రములును బ్రీతితోఁ గాళ్ల గజ్జెల వలెఁ గలసి మ్రోయఁగా నా వృషభరాజము సురాసురప్రభువగు శివుని యెదుట అంద మతిశయింప వచ్చి నిలిచెను

**విశేషములు :** అది సామాన్య వృషభమయినచో నతిశయోక్త్యలంకారమని చెప్పవచ్చునుగాని, అది శివుని వాహనము అగువృషభము గావున నలంకారము స్వభావోక్తియే యని చెప్పనొప్పును కులపర్వతములు - ఏడు - మహేంద్రము, మలయము, సహ్యము, శుక్తిమంతము, గంధమాదనము, వింధ్యము, పారియాత్రము

కాళులు - కాలు + లు 'బహువచనము పరంబగునపు డసంయుక్తంబులయి యుదంతంబులయిన డ - ల - ర ల కలఘులకారంబు బహుళంబుగా నగు ' బాల ఆచ్చిక 13 సురాసురాధీశునెదుర - సురాసురాధీశు + ఎదుర - 'షష్ఠీసమాసంబునం దుకార ఋకారంబుల కచ్చు పరంబగునపుడు నుగాగమం బగు ' బాల సంధి 34 గవేశ్వరుండు - గో + ఈశ్వరుండు - 'గో' శబ్దమునకు అకారాద్యచ్చులు పరమగునేని 'గవ' 'గవ్' 'గ' ఆదేశము లగును గవ + ఈశ్వరుండు - గుణసంధిచే గవేశ్వరుండు అగును గవ్ ఆదేశమయినచో గవ్ + ఈశ్వరుండు - గవీశ్వరుండు అగును గ ఆదేశమగుచో గ ఈశ్వరుండు అగును 'గ' ఆదేశమున సంధి కాదు

**వ అంతం బరమేశ్వరుండు వివాహప్రయాణప్రసాధనాలంకృతుండై 23**

**అర్థము :** అంతన్, పరమేశ్వరుండు, వివాహ-ప్రయాణ-ప్రసాధన + అలంకృతుండు + ఐ = పెండ్లికైన పయనపుఁ గైసేఁతచే నలంకరింపఁబడినవాఁ డయి

**తాత్పర్యము .** అంతఁ బరమేశ్వరుఁడు పెండ్లికైన పయనమునఁ గైసేయఁబడినవాఁ డయి - తరువాతి పద్యముతో నన్వయము

**చ ప్రకటితమేఘనాదములు పర్వఁగ ముందట, గీతవాద్యవ**
**ల్లకుల రవంబు లోలిన కెలంకుల మ్రోయఁగఁ జండి కీర్తి పా**
**రక పరనోరురావములు డగ్గఱి వెన్కొన, శంఖ కాహళా**
**ధిక నినదంబు లెల్లఁ గడు దిగ్బధిరీకృతమై చెలంగఁగాన్ 24**

**అర్థము :** ముందటన్ = ముందు, ప్రకటిత = ప్రకటింపఁబడిన, మేఘ-నాదములు = మేఘధ్వనులు, పర్వఁగన్ = వ్యాపింపఁగను, గీత-వాద్య-వల్లకుల-రవంబులు = గీతములయు, వాద్యములయు, వీణెలయు ధ్వనులు, ఓలిన (ఓలిన్+అ) = క్రమముగా, కెలంకులన్ = పార్శ్వములందు, మ్రోయఁగన్ = ధ్వనింపఁగను, చండి-కీర్తి-పారక-పరన + ఉరు-రావములు = చండి యశస్సును పఠించువారి పరనాధికధ్వనులు, డగ్గఱి = సమీపించి, వెన్కొనన్ = వెనుకనుండఁగా, శంఖ-కాహళ + అధిక-నినదంబులు = శంఖములయు, బాకాలయు, పెద్ద, ధ్వనులు, ఎల్లన్ = అన్నియును, కడున్ = మిక్కిలి, దిగ్బధిరీకృతము (దిశ్ (క్) + బధిరీకృతము) + ఐ = దిక్కులు చెవుడుపడునట్లు చేయునవి యై, చెలంగఁగాన్ = ధ్వనింపఁగా

**తాత్పర్యము .** ముందు మేఘధ్వనులు వ్యాపింపఁగను, గీతములయు, వాద్యములయు, వీణెలయు ధ్వనులు క్రమముగాఁ బార్శ్వములందు మ్రోయఁగను, చండి కీర్తిని బఠించువారి పరనాధికధ్వనులు సమీపించి వెనుకఁబడుచుండఁగా, శంఖములయు, బాకాలయు పెద్ద శబ్దములు అన్నియు దిక్కులను జెవుడుపడునట్లు చేయునవియై ధ్వనింపఁగను - తరువాతి గద్యముతో నన్వయము

వ మణి కనక నేత్ర పట్టికామయంబగు నాయగంబునం బన్నియున్న నంది నిందుశేఖరుం డెక్కుడు 25

**అర్థము .** మణి-కనక-నేత్ర-పట్టికా-మయంబు = మణులు, బంగారము, పట్టువస్త్రము అనువానితో నిండినది, అగు, ఆయగంబునన్ = చిత్రకంబళముతో, పన్ని + ఉన్న = సిద్ధపఱుపఁబడియున్న, నందిన్ = నందిని, ఇందు-శేఖరుండు = చంద్రుఁడు శిరోభూషణముగాఁ గలవాఁడు - శివుఁడు, ఎక్కుడున్ = ఎక్కినంతనే,

**తాత్పర్యము .** మణులు, బంగారము, పట్టవస్త్రము అనువానితోనిండిన చిత్రకంబళము వేసియున్న నందిని శివుఁ డెక్కినంతనే - తరువాతి పద్యముతో, నన్వయము

చ హరునకు రెండు రెండొకొ గజాజినమున్ దహనాంబకంబు నా
నురువృషభేంద్రు నెక్కుటయు నొందెఁ గటిన్ విపులాభ్రపంక్తి భా
స్కరుఁడు లలాటపట్టమున గంగయుఁ జంద్రుఁడు రెండు రెండొ నా
శిరమునఁ బొంది రబ్దపథసింధు సుధాకరు లద్భుతంబుగాన్ 26

**అర్థము .** హరునకున్ - ఈశ్వరునకు, గజ + అజినమున్ = ఏనికతోలును, దహన + అంబకంబున్ = అగ్నినేత్రమును, రెండు-రెండు+ఒకొ = రెండేసి ఉన్నవేమో, నాన్ = అనఁగా, ఉరు-వృషభ + ఇంద్రున్ = గొప్పదియగు వృషభరాజమును, ఎక్కుటయున్ = ఎక్కినంతనే, కటిన్ = మొలయందు, విపుల + అభ్రపంక్తి = విరివియైన మేఘముల వరుస, లలాట-పట్టమునన్ = ఫాలపట్టికయందు, భాస్కరుఁడు = సూర్యుఁడు, ఒందెన్ = కలిగెను, గంగయున్, చంద్రుఁడున్, రెండు-రెండు+ఒ-నాన్ = రెండేసియా యనఁగా, అద్భుతంబుగాన్= ఆశ్చర్యకరముగా, శిరమునన్ = తలయందు, అబ్ద + పథ + సింధు-సుధాకరులు = ఆకాశగంగానదియును, చంద్రుఁడును, పొందిరి = కలిగిరి

**తాత్పర్యము** ఈశ్వరునకు ఏనికతోలును, అగ్నినేత్రమును రెండేసి యున్నవా యనునట్లు అతఁడు తన వాహనమైన వృషభరాజము నెక్కఁగానే మొలయందు విరివియైన మేఘముల వరుసయును, ఫాలపట్టికయందు సూర్యుఁడును గలిగిరి అతనికి గంగయును, జంద్రుడును ఇద్దఱిద్ద ఉండిరా యనునట్లు ఆశ్చర్యకరముగా శిరస్సుపై నాకాశగంగాసుధాకరు లుండిరి

**విశేషములు.** అలంకార ముత్ప్రేక్ష ఆతని వాహనమైన వృషభము మిక్కిలి యెత్తయిన దగుటచే దానిపై నాసీనుఁడయిన ఈశ్వరుని కటిమండలమున మేఘమండలము వ్యాపించి మఱియొక ఏనుఁగుచర్మమువలె నుండెను అతని ఫాల మింకను నెత్తయి సూర్యమండలము వఱకు వ్యాపించుటచే, సూర్యుఁడు మఱియొక అగ్నినేత్రమువలె నుండెను అతని శిరస్సు ఆకాశమువఱకు వ్యాపించుటచే శిరస్సున నదివఱకుండిన గంగగాక మఱియొక ఆకాశగంగయు, చంద్రుఁడుగాక మఱియొక చంద్రుఁడు నుండినట్లు తోఁచెనని భావము ఆ వృషభేంద్ర మంతయున్నతముగా నుండె ననుట

వ **మఱియును - తరువాతి పద్యముతో నన్వయము** 27

క **జంగమ హిమవంతము నురు**
**జంగమ రజతాద్రి యెక్కి చను విధమున నో**
**జం గమనీయ గవేశు భు**
**జంగమరాట్కటకుఁ డెక్కి చనునెడ నొప్పెన్** 28

**అర్థము.** భుజంగమ-రాట్ + కటకుఁడు = నాగరాజు హస్తాభరణముగాఁ గలవాఁడు - శివుఁడు, ఓజన్ = ఉత్సాహముతో, కమనీయ-గో + ఈశున్ = అందమైన గోరాజును - నందిని, ఎక్కి, చను + ఎడన్ = వెడలునప్పుడు, ఉరు-జంగమ-రజత + అద్రి = గొప్పదియగు, చరమైన వెండికొండ, జంగమ-హిమవంతమున్ = చరమైన హిమవంతమును, ఎక్కి, చను-విధమునన్, ఒప్పెన్

**తాత్పర్యము :** శివుఁడు నంది నెక్కి వెడలునప్పుడు చరమైన గొప్ప కైలాసము చరమైన హిమవంతము నెక్కి వెడలున ట్లొప్పెను

**విశేషములు.** అలంకార ముత్ప్రేక్ష గవేశున్ = గో + ఈశున్ = గవ + ఈశున్ = గవేశున్ చూడు 22వ పద్యము ప్రతిపాదాదిని 'జంగమ' శబ్దము పునపున రావృత్తమగుటచే నను ప్రాసాలంకారము చను నెడ = చను + ఎడ 'ఉదంతమగు తద్ధర్మార్థవిశేషణమున కచ్చు పరమగునపుడు నుగాగమం బగు' బాల సంధి 33

క సురచాప వృతాసిత జల
ధర మంబరతలమునందుఁ దనరె నొకో నా
గరుడి విచిత్రాంగముపై
హరి యెక్క వెలింగె మేన హరినీలరుచుల్ 29

**అర్థము** సుర-చాప-వృత + అసిత-జలధరము = ఇంద్రధనుస్సుచే నావరింపఁబడిన నల్లని మేఘము, అంబర-తలము + అందున్ = ఆకాశప్రదేశమునందు, తనరెన్ + ఒకో = ఒప్పెనా, నాన్ = అనఁగా, హరి + విష్ణువు, గరుడి-విచిత్ర + అంగముపైన్ = గరుత్మంతుని ఆశ్చర్యకరమైన శరీరముమీఁద, ఎక్కన్ = ఎక్కఁగా, మేనన్ = శరీరమునందు, హరినీలరుచుల్ = ఇంద్రనీలకాంతులు వెలింగెన్ = ప్రకాశించెను

**తాత్పర్యము** . ఇంద్రధనుస్సుచే నావరింపఁబడిన నల్లని మేఘము అకాశప్రదేశమునందు ఒప్పెనా యనునట్లు ఆ గరుత్మంతుని ఆశ్చర్యకరమయిన శరీరముపై విష్ణు వెక్కఁగా నతనిమేన నింద్రనీలకాంతులు వెలిఁగెను

**విశేషములు** . అలంకార ముత్ప్రేక్ష

క శర దమలాభ్రముపై లస
దరుణద్యుతిబింబ ముదయ మయ్యెనొకో నా
వర రాజహంసపై నం
బురుహాసనుఁ డొప్పె రాగపూర్ణాంగముతోన్ 30

**అర్థము** శరద్ + అమల + అభ్రముపైన్ = శరత్కాలమునందలి నిర్మలమైన ఆకాశముపై, లసత్ + అరుణ-ద్యుతి - బింబము = ప్రకాశించుచున్న సూర్యుని బింబము, ఉదయము + అయ్యెన్ + ఒకో-నాన్ = ఉదయించెనా యనఁగా, వర-రాజహంసపైన్ = శ్రేష్ఠమైన రాజహంసముమీఁద, అంబురుహ + ఆసనుఁడు = బ్రహ్మ, రాగ-పూర్ణ + అంగముతోన్ = ఎఱుపుతో నిండిన శరీరముతో, ఒప్పెన్

**తాత్పర్యము** .శరత్కాలమునందలి నిర్మలమైన ఆకాశముపైఁ బ్రకాశించు సూర్యబింబ ముదయించెనా యనునట్లు శ్రేష్ఠమైన రాజహంసముమీఁద బ్రహ్మ ఎఱుపుతో నిండిన శరీరముతో నొప్పెను

**విశేషములు** .అలంకార ముత్ప్రేక్ష శారదాభ్రము నిర్మలమై రాజహంసము

వలెనే యుండును ఉదయత్సూర్యబింబము బ్రహ్మ శరీరమువలెనే రాగపూర్ణమై యుండును

తే విततరుచిఁ బొల్చు రజతపర్వతముమీఁద
నెలమిఁ బూచిన నెత్తమ్మికొలన పోలె
నమరె నైరావతముమీఁద నమరనాథుఁ
డలరు'నయనాబ్జములు వేయుఁ బొలయుచుండ 31

**అర్థము** . వితత-రుచిన్ = అధికమైన కాంతితో, పొల్చు = ఒప్పునట్టి, రజత-పర్వతము మీఁదన్ = వెండికొండపై, పూచిన-నెత్తమ్మి (నెల + తమ్మి) - కొలను + అ - పోలెన్ = వికసించిన తామరకొలనే అనునట్లు, అమర-నాథుఁడు = దేవేంద్రుఁడు అలరు-నయన + అబ్జములు = వికసించిన నేత్రపద్మములు, వేయున్ = వేయియును, పొలయుచున్ + ఉండన్ = ప్రకాశించుచుండఁగా, ఐరావతము మీఁదన్ = వెల్లయేనుఁగుపై, అమరెన్ = ఒప్పెను

**తాత్పర్యము** . అధికమైన కాంతితో నొప్పు వెండికొండపై వికసించిన తామరకొలనే యనునట్లు, దేవేంద్రుఁడు వికసించు కనుదమ్ములు వేయియు నొప్పుచుండఁగా నైరావతముపై నొప్పెను

**విశేషములు** . అలంకార ముత్ప్రేక్ష

క మారుతగతిఁ జను మణికన
కోరు విమానములమీఁద నొప్పిరి వర బృం
దారకసతు లుడువృత సం
ధ్యారుణితాంబుదతటిల్లతావలి వోలెన్ 32

**అర్థము** . వర-బృందారక-సతులు = శ్రేష్ఠురాండ్రయిన దేవతాస్త్రీలు, ఉడు-వృత-సంధ్యా + అరుణిత + అంబుద-తటిత్ + లతా + ఆవలి + పోలెన్ = నక్షత్రములచే నావరింపఁబడిన సంధ్యాసమయముచే ఎఱ్ఱగాఁజేయఁబడిన మేఘములందలి మెఱపుఁదీఁగల విధమున, మారుత-గతిన్= వాయుగమనముతో, చను = పోవు, మణి-కనక + ఉరు-విమానముల మీఁదన్, ఒప్పిరి

**తాత్పర్యము** . దేవతాస్త్రీలు-నక్షత్రములతో నావరింపఁబడి సంధ్యచే ఎఱ్ఱగాఁజేయఁబడిన మేఘములందలి విద్యుల్లతల సమూహమువలె, వాయువేగముతోఁబోవు మణికనకమయములైన పెద్ద విమానములపై నొప్పిరి

**విశేషములు** అలంకార ముపమ తటిల్లత - తటిత్ + లత - తవర్గ వర్ణములకు లకారము పరమగుచో పరసవర్ణము ఆదేశ మగును

**వ మఱియు ననేకాశ్వ రథ కరి కరేణు శిబి కాందోల మృగ ఖగ విమా నారోహకులై చతుర్దశభువనంబుల జనంబులు భూనభోంతరాపూరితంబులై పరమసుఖ లీల నిజేచ్ఛావిహారు లగుచుం జను నవసరంబున 33**

**అర్థము** మఱియున్, అనేక + అశ్వ-రథ-కరి-కరేణు-శిబికా + ఆందోల-మృగ-ఖగ-విమాన + ఆరోహకులు + ఐ = పెక్కు గుఱ్ఱములు, ఏనుఁగులు, పల్లకులు, ఊయలలు, మృగములు, పక్షులు, విమానములు అనువాని నెక్కినవారయి, చతుర్ + దశ - భువనంబుల-జనంబులున్ = పదునాలుగు లోకములందలి జనులును, భూ-నభస్(ః) + అంతర + ఆపూరితంబులు + ఐ = భూమ్యాకాశముల నడుమ నిండినవయి, పరమ-సుఖ-లీలన్ = ఉత్కృష్టమైన సౌఖ్య విలాసముతో, నిజ + ఇచ్ఛా-విహారులు = స్వేచ్ఛతోడి విహారములు గలవారు, అగుచున్, చను + అవసరంబునన్ = పోవు సమయమునందు

**తాత్పర్యము** మఱియును పెక్కు గుఱ్ఱములు, ఏనుఁగులు, ఆఁడేనుఁగులు, పల్లకులు, ఊయలలు, మృగములు, పక్షులు, విమానములు అనువాని నారోహించి, పదునాలుగు లోకములవారును మిక్కిలి సుఖముతో స్వేచ్ఛగా విహరించుచుఁ బోవుసమయమున - తరువాతి పద్యముతో నన్వయము

**చ ఉరగులు కేతుదండముల యోలములం దనురక్తి నొంది ఖే
చరు లమితాతపత్రముల చాటున దుస్సహలోలభావులై,
గరుళులు కేతనాంతముల క్రందునఁ బొందులు గాంచి లీలతో
సురతసుఖంబులంది రతిశూర్పకవైరిరసాతిరేకులై 34**

**అర్థము :** ఉరగులు = నాగులు, కేతు-దండముల + ఓలములన్ = టెక్కెపుఁగఱ్ఱల మఱుఁగులందు, అనురక్తిన్ = అనురాగమును, ఒంది = పొంది, ఖేచరులు = గగనచరులు, అమిత + ఆతపత్రముల-చాటునన్ = అధికమైన గొడుగుల మఱుఁగునను, దుస్సహ-లోల-భావులు + ఐ = సహించుటకు శక్యముకాని చంచల భావములు గలవారయి, గరుళులు = గరుడులు, కేతన +

అంతముల -క్రందునన్ = ధ్వజముల కొనల సందడియందును, పొందులు + కాంచి = కూటములు పొంది, లీలతోన్ = విలాసముతో, అతి-శూర్పకవైరి-రస + అతిరేకులు + ఐ = అమితమైన మన్మధరసా (శృంగారరసా) పరిమితత్వము గలవారయి, సురత-సుఖంబులు = రతిసౌఖ్యములు, అందిరి

**తాత్పర్యము** .నాగులు టెక్కెపు దండముల మఱుఁగులందు అనురాగమును బొందియు, గగనచారులు గొడుగుల మాటున దుర్భరమైన చంచలత్వము గలవారయి, గరుడులు ధ్వజముల కొనల సందడియందుఁ గూటములు పొంది, విలాసముతో, అమితమైన శృంగారరసాతిరేకము గలవారయి రతిసౌఖ్యముల నందిరి

**విశేషములు** . ఉరగులు - ఉరగీ - ఉరగ ఏకశేషవృత్తి ఖేచరులు - ఖేచరీ - ఖేచర అట్లే గరుడీ - గరుడ - గరుడులు అయి యుండునా ? గరుళులు - గరుడి+లు 'ఇత్తునకు బహువచనంబు పరంబగునపు డుత్వంబగు' బాల తత్సమ 45 గరుడు+లు 'బహువచనము పరంబగునపు డసంయుక్తంబు లయి యుదంతంబులయిన డ ల ర ల కలఘులకారంబు బహుళంబుగా నగు' బాల ఆచ్ఛిక 13

**వ మఱియుం గులశిఖరి శిఖరాగ్రతల ఘనాఘనపట లాంతర సుర తరంగిణీ పులినప్రదేశంబుల ననేకు లనేకప్రకారంబుల విహరించుచు 35**

**అర్థము** . మఱియున్, కుల-శిఖరి - శిఖర + అగ్ర-తల-ఘనా-ఘన-పటల + అంతర-సుర-తరంగిణీ-పులిన ప్రదేశంబులన్ = కుల పర్వతములయొక్క, శిఖరములయొక్క పలు ప్రదేశములందలి, వర్షాకాలపు మేఘముల సమూహములోపలను, ఆకాశగంగాసైకత స్థలములందును, అనేకులు = పెక్కండ్రు, అనేక-ప్రకారంబులన్ = పెక్కు రీతుల, విహరించుచున్ = క్రీడించుచు

**తాత్పర్యము :** మఱియును గులపర్వతశిఖరముల పలుప్రదేశములందలి వర్షాకాలపు మేఘముల సమూహములోపలను, ఆకాశగంగా సైకత స్థలములందును పెక్కండ్రు పెక్కువిధములఁ గ్రీడించుచు తరువాతి పద్యముతో నన్వయము

సీ. ముదితల కుచకుంభముల ప్రతిబింబము
లనఁ గుంభికుంభంబు లొనరి తనర
కాంతల సితదంత కాంతి పైఁ బర్వె నా
మణిహేమదండచామరలు పొలయ
సుదతుల వాలారుచూడ్కుల మెఱుఁగులు
నెరసె నా నిశితాస్త్రనికర మెసఁగ
సతుల నీలాలకద్యుతి దొంగలించె నాఁ
గప్పారి జల్లితొంగళ్లు గ్రాల

తే. నమరరమణీసమేతులై యమరముఖ్యు
లమరి తమతమ రాజ్యచిహ్నములతోడ
నెలసి కర మర్థితోఁ దన్ను బలసి కొలిచి
నడవ శీతాద్రి కభవుండు నడచెఁ బేర్మి 36

**అర్థము .** ముదితల - స్త్రీలయొక్క, కుచ-కుంభముల = కుండలవంటి స్తనముల యొక్క, ప్రతిబింబములు + అనన్, కుంభికుంభములు = ఏనుఁగుల కుంభస్థలములు, ఒనరి = కలిగి, తనరన్ = ఒప్పఁగా,

కాంతల = స్త్రీలయొక్క, సిత-దంత-కాంతి = తెల్లని దంతముల ప్రకాశము, పైన్ = పైని, పర్వెన్ + నాన్ = వ్యాపించెనన, మణి-హేమ-దండ-చామరలు = మణులతోను, బంగారముతోను నిర్మింపఁబడిన దండములుగల వింజామరలు, పొలయన్ = ప్రకాశింపఁగా,

సుదతుల = స్త్రీలయొక్క, వాలారు-చూడ్కుల-మెఱుఁగులు = నిడుదలయిన చూపుల కాంతులు, నెరసెన్ + నాన్ = వ్యాపించెనా యన, నిశిత + అస్త్ర-నికరము = వాఁడియైన బాణముల సమూహము, ఎసఁగన్ = అతిశయింపఁగా,

సతుల = స్త్రీలయొక్క, నీల + అలక-ద్యుతి = నల్లని ముంగురుల కాంతి, తొంగలించెన్ + నాన్ = ప్రసరించెనా యన, కప్పారి = నల్లనయి, జల్లి-తొంగళ్లు= జాలరుగల గొడుగులు, క్రాలన్ = ఒప్పఁగా,

అమర-ముఖ్యులు = దేవతాశ్రేష్ఠులు, అమర-రమణీసమేతులు + ఐ = దేవతాస్త్రీలతోఁ గూడినవారయి, అమరి = ఒప్పి, తమ-తమ-రాజ్య-

అంతముల -క్రందునన్ = ధ్వజముల కొనల సందడియందును, పొందులు + కాంచి = కూటములు పొంది, లీలతోన్ = విలాసముతో, అతి-శూర్పకవైరి-రస + అతిరేకులు + ఐ = అమితమైన మన్మధరసా (శృంగారరసా) పరిమితత్వము గలవారయి, సురత-సుఖంబులు = రతిసౌఖ్యములు, అందిరి

**తాత్పర్యము** .నాగులు టెక్కెపు దండముల మఱుఁగులందు అనురాగమును బొందియు, గగనచారులు గొడుగుల మాటున దుర్భరమైన చంచలత్వము గలవారయి, గరుడులు ధ్వజముల కొనల సందడియందుఁ గూటములు పొంది, విలాసముతో, అమితమైన శృంగారరసాతిరేకము గలవారయి రతిసౌఖ్యముల నందిరి

**విశేషములు** . ఉరగులు - ఉరగీ - ఉరగ ఏకశేషవృత్తి ఖేచరులు - ఖేచరీ - ఖేచర అట్లే గరుడీ - గరుడ - గరుడులు అయి యుండునా ? గరుళులు - గరుడి+లు 'ఇత్తునకు బహువచనంబు పరంబగునపు డుత్వంబగు' బాల తత్సమ 45 గరుడు+లు 'బహువచనము పరంబగునపు డసంయుక్తంబు లయి యుదంతంబులయిన డ ల ర ల కలఘులకారంబు బహుళంబుగా నగు' బాల ఆచ్ఛిక 13

**వ మఱియుం గులశిఖరి శిఖరాగ్రతల ఘనాఘనపట లాంతర సుర తరంగిణీ పులినప్రదేశంబుల ననేకు లనేకప్రకారంబుల విహరించుచు. 35**

**అర్థము** . మఱియున్, కుల-శిఖరి - శిఖర + అగ్ర-తల-ఘనా-ఘన-పటల + అంతర-సుర-తరంగిణీ-పులిన ప్రదేశంబులన్ = కుల పర్వతములయొక్క, శిఖరములయొక్క పలు ప్రదేశములందలి, వర్షాకాలపు మేఘముల సమూహములోపలను, ఆకాశగంగాసైకత స్థలములందును, అనేకులు = పెక్కండ్రు, అనేక-ప్రకారంబులన్ = పెక్కు రీతుల, విహరించుచున్ = క్రీడించుచు

**తాత్పర్యము** : మఱియును గులపర్వతశిఖరముల పలుప్రదేశములందలి వర్షాకాలపు మేఘముల సమూహములోపలను, ఆకాశగంగా సైకత స్థలములందును పెక్కండ్రు పెక్కువిధములఁ గ్రీడించుచు తరువాతి పద్యముతో నన్వయము

సీ. ముదితల కుచకుంభముల ప్రతిబింబము
లనఁ గుంభికుంభంబు లొనరి తనర
కాంతల సితదంత కాంతి పైఁ బర్వె నా
మణిహేమదండచామరలు పొలయ
సుదతుల వాలారుచూడ్కుల మెఱుఁగులు
నెరసె నా నిశితాస్త్రనికర మెసఁగ
సతుల నీలాలకద్యుతి దొంగలించె నాఁ
గప్పారి జల్లితొంగళ్లు గ్రాల

తే. నమరరమణీసమేతులై యమరముఖ్యు
లమరి తమతమ రాజ్యచిహ్నములతోడ
నెలసి కర మర్థితోఁ దన్ను బలసి కొలిచి
నడవ శీతాద్రి కభవుండు నడచెఁ బేర్మి 36

**అర్థము :** ముదితల - స్త్రీలయొక్క, కుచ-కుంభముల = కుండలవంటి స్తనముల యొక్క, ప్రతిబింబములు + అనన్, కుంభికుంభములు = ఏనుఁగుల కుంభస్థలములు, ఒనరి = కలిగి, తనరన్ = ఒప్పఁగా,

కాంతల = స్త్రీలయొక్క, సిత-దంత-కాంతి = తెల్లని దంతముల ప్రకాశము, పైన్ = పైని, పర్వెన్ + నాన్ = వ్యాపించెనన, మణి-హేమ-దండ-చామరలు = మణులతోను, బంగారముతోను నిర్మింపఁబడిన దండములుగల వింజామరలు, పొలయన్ = ప్రకాశింపఁగా,

సుదతుల = స్త్రీలయొక్క, వాలారు-చూడ్కుల-మెఱుఁగులు = నిడుదలయిన చూపుల కాంతులు, నెరసెన్ + నాన్ = వ్యాపించెనా యన, నిశిత + అస్త్ర-నికరము = వాఁడియైన బాణముల సమూహము, ఎసఁగన్ = అతిశయింపఁగా,

సతుల = స్త్రీలయొక్క, నీల + అలక-ద్యుతి = నల్లని ముంగురుల కాంతి, తొంగలించెన్ + నాన్ = ప్రసరించెనా యన, కప్పారి = నల్లనయి, జల్లి-తొంగళ్లు= జాలరుగల గొడుగులు, క్రాలన్ = ఒప్పఁగా,

అమర-ముఖ్యులు = దేవతాశ్రేష్ఠులు, అమర-రమణీసమేతులు + ఐ = దేవతాస్త్రీలతోఁ గూడినవారయి, అమరి = ఒప్పి, తమ-తమ-రాజ్య-

చిహ్నములతోడన్= తమతమ రాచటికపు(జిన్నెలతో, ఎలసి = కూడి, కరము = మిక్కిలి, అర్థితోన్ = కోరికతో, తన్నున్, బలసి = చుట్టి, కొలిచి = సేవించి, నడవన్, అభవుండు, పేర్మిన్ = గొప్పతనముతో, శీత + అద్రికిన్ = హిమపర్వతమునకు, నడచెన్

**తాత్పర్యము.** తమ యింతుల కుంభములవంటి కుచముల ప్రతిబింబము లన(గా నేను(గుల కుంభస్థలము లొప్పు(గను, తమ స్త్రీల తెల్లని దంతముల కాంతి పైని వ్యాపించెనా యన మణిహేమమయములైన దండములుగల వింజామరలు ప్రకాశింప(గను, తమ పడ(తుల నిడుపులైన చూపుల కాంతులు వ్యాపించెనా యన వా(డి బాణముల సమూహ మొప్పు(గను, తమ రమణుల నల్లని ముంగురుల కాంతి ప్రసరించెనా యన నల్లనై కుచ్చులు గల గొడుగు లొప్పు(గను, దేవతాశ్రేష్ఠులు దేవతాస్త్రీలతో(గూడి తమ తమ రాచటికపు( జిన్నెలతో మిక్కిలి కోరి తన్ను( జుట్టి కొలిచి నడవ(గా శివు(డు హిమపర్వతమునకు గొప్పతనముతో నడచెను

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష దేవతల రాజ్యచిహ్నములన్నియు( దమ ప్రియురాండ్ర అవయములవలెనే యున్నవని వర్ణించుట రమ్యము 'చామరా' అను ఆకారాంత స్త్రీలింగరూపముగూడ( గలదు 'చామర' దాని తత్సమ రూపము

వ అయ్యవసరంబున 37

**అర్థతాత్పర్యములు .** ఆ + అవసరంబునన్ = ఆ సమయమున - తరువాతి పద్యముతో నన్వయము

క. **సురవనితా కర చామీ**
**కర చామర పవన చలిత గంగాజల శీ**
**కర నికర మడరి విద్యా**
**ధర ఖేచర దివిజ గణ పథశ్రమ మార్చెన్.** 38

**అర్థము:**సుర నికరము సుర-వనితా = దేవతాస్త్రీల యొక్క, కర= చేతులందలి, చామీకర-చామర = బంగారు వింజామరల వలన, చలిత = కదలిన, గంగా-జల-శీకర-నికరము = గంగ నీటి తుంపరల సమూహము, అడరి = అతిశయించి, విద్యాధర-ఖేచర-దివిజ-గణ-పథ-శ్రమము = విద్యాధరులయు, గగనచరులయు, దేవతాసమూహములయు మార్గాయాసమును, ఆర్చెన్ = ఉపశమిల్ల(జేసెను

**తాత్పర్యము** దేవతాస్త్రీల చేతులందలి బంగారు వింజామరల గాలిచేఁ గదలిన గంగాజలముల తుంపరల గుంపు అతిశయించి విద్యాధరులయు, గగనచరులయు, దేవగణములయు మార్గాయాసము నపనయించెను

వ **మఱియు - తరువాతి పద్యముతో నన్వయము** 39

మహాస్రగ్ధర సితతుంగాంగప్రభాభాసిత సురగరుడశ్రేణి సంధిల్లఁ బూర్ణా
మృత వారాశి ప్రలీనామితజల బడబామేయ విభ్రాంతి విస్ప
ష్టత రారాజజ్జటాజూట సురుచుల నజాండంబు సంధ్యాభ సంఛా
దితలీలం గ్రాలఁ దేజోఽధికగతి నడచెన్ దేవదేవుండు పేర్మిన్ 40

**అర్థము.** సిత శ్రేణి సిత = తెల్లనిదియు, తుంగ = ఎత్తయినదియు (అగు) అంగ = శరీరము యొక్క, ప్రభా = కాంతిచేత, భాసిత = ప్రకాశించిన, సుర-గరుడ-శ్రేణి = దేవతలయు, గరుడులయు వరుస, సంధిల్లన్ = కలుగఁగా, పూర్ణ + అమృత-వారాశి-ప్రలీన + అమిత-జల-బడబా + అమేయ-విభ్రాంతిన్ = నిండిన అమృతసముద్రమునందు లీనమైన అమితజలముయొక్కయు బడబాగ్ని యొక్కయు, అపరిమితమైన విభ్రాంతితో, విస్పష్టతర + ఆరాజత్ + జటా-జూట-సురుచులన్ = మిక్కిలి స్పష్టముగా ప్రకాశించుచున్న జడముడియొక్క మంచి కాంతులతో, అజాండంబు = బ్రహ్మాండము, సంధ్యా + ఆభ-సంఛాదిత-లీలన్ = సంజకాంతితోఁ గప్పఁబడిన విధమున, క్రాలన్ = ఒప్పఁగా, దేవదేవుండు = శివుఁడు, పేర్మిన్ = గొప్పతనముతో, తేజస్ + అధిక-గతిన్ = తేజస్సుచే నధికమైన గమనముతో, నడచెన్

**తాత్పర్యము.** దేవదేవుఁడయిన శివుఁడు అధికమైనతేజస్సుతోడి గమనముతో నడచెను అతని తెల్లనిదియు, ఎత్తయినదియు అగు మేని కాంతిచే సురగరుడుల శ్రేణి ప్రకాశించుచుండెను అమృతసముద్రమందలి అపరిమిత జల బడబాగ్నుల భ్రాంతితో మిక్కిలి స్పష్టముగాఁ బ్రకాశించుచున్న జటాజూటపుఁగాంతులచే బ్రహ్మాండము సంజకాంతులతోఁ గప్పినట్లు ఒప్పెను

**విశేషములు:** అలంకారము త్ప్రేక్ష భ్రాంతిమంతము ఆరాజత్ + జటా= ఆరాజజ్జటా మహాస్రగ్ధరాలక్షణమునకుఁ బ్రథమాశ్వాసమునందలి 68వ పద్యమును జూచునది

వ ఇట్లు త్రినయనుండు దిన శుభ ప్రయాణంబుల హిమవంతంబునకుం జనుదెంచె నంతం దుహినాచలాధీశ్వరుం డీశ్వరురాక యెఱింగి యాక్షణంబ మహోత్సవంబు సేయించిన 41

**అర్థము.** ఇట్లు, త్రినయనుండు = ముక్కంటి, దిన-శుభ-ప్రయాణంబులన్= పగటి శుభప్రయాణములచే, హిమవంతంబునకున్, చనుదెంచెన్ = వచ్చెను, అంతన్, తుహిన + అచల + అధి + ఈశ్వరుండు = మంచుకొండఱేఁడు, ఈశ్వరు= శివునియొక్క, రాక, ఎఱింగి, ఆక్షణంబు + అ = ఆక్షణమే, మహత్ (మహా) + ఉత్సవంబు, చేయించినన్

**తాత్పర్యము** ఇట్లు ముక్కంటి పగటి శుభ ప్రయాణములచే హిమవంతమునకు వచ్చెను అంత హిమవంతుఁడు ఈశ్వరుని రాక ఎఱిఁగి ఆక్షణమే మహోత్సవము చేయింపఁగా - తరువాతి పద్యముతో నన్వయము

సీ మణి హేమ రచిత తోరణములుఁ బల్లవ
తోరణములు వస్త్రతోరణములు
మకరతోరణములు ముకురతోరణములు
వీధుల వీధుల వెలసి తనరె
వాతపూరణములుఁ గేతనానీకంబుఁ
గలు వడగలు నెల్లకడలఁ బొలసెఁ
గస్తూరి మ్రేఁకపైఁ గర్పూర మౌక్తిక
రంగవల్లులు నొప్పె నంగణములఁ

ఆ గనక వస్తు పూర్ణ కలశాలిపై మణి
దర్పణములు నిల్పి తద్ద పొల్చె
జగములందుఁ బేర్మి నెగడు పురంబుల
చెలువ మిప్పురమున వెలసె ననఁగ 42

**అర్థము :** జగముల + అందున్ = లోకములందు, పేర్మి = గొప్పతనము, నెగడు = ఒప్పునట్టి, పురంబులన్ = పురములందలి, చెలువము = అందము, ఇప్పురమునన్ (ఈ + పురమునన్) = ఈ నగరమున, వెలసెన్ + అనఁగన్ = ఒప్పె ననఁగా, మణి-హేమ-రచిత-తోరణములున్ = మణులతోను బంగారముతోను నిర్మింపఁబడిన తోరణములును, పల్లవ-తోరణములున్ = చివురుల తోరణములును, వస్త్ర-తోరణములున్ = గుడ్డల-తోరణములున,

మకర-తోరణములున్ = మొసలి యాకారపుఁదోరణములును, ముకుర-తోరణములున్ = అద్దాల (అరవిరి మొగ్గల) తోరణములును, వీథుల-వీథులన్ = వీథివీథిని, వెలసి = కలిగి, తనరెన్ = ఒప్పెను

వాత-పూరణములున్ = గాలితో నిండి తలగడలవలె సౌధాగ్రముల వ్రేలాడఁగట్టఁబడిన ధ్వజవిశేషములును, కేతన + అనీకంబున్ = ధ్వజముల సమూహమును, కలువడగలున్ = వీరధ్వజములును, ఎల్ల-కడలన్ = అన్ని దిక్కులందును, పొలసెన్ = వ్యాపించెను

కస్తూరి-ప్రేఁకపైన్ = కస్తూరి పూఁతపై, కర్పూర-మౌక్తిక - రంగవల్లులున్ = కప్పురపు, ముత్యాల ముగ్గులును, అంగణములన్ = ముంగిళ్లను, ఒప్పెన్

కనక-వస్తు-పూర్ణ-కలశ + ఆలిపైన్ = బంగారువస్తువులతో నిండిన కలశముల వరుసపై, మణి-దర్పణములు = మణిమయములైన అద్దములు, నిల్చి, తద్ద = మిక్కిలి, పొల్చెన్

**తాత్పర్యము .** లోకములందు గొప్పతనము ఒప్పు పురములందలి అంద మీ పురమున నొప్పెననఁగా, ఓషధిప్రస్థపురమున వీధి వీధిని మణిస్వర్ణమయ తోరణములును, చివురులతోరణములును, వస్త్రతోరణములును, మకరతోరణములును, ముకురతోరణములును ఒప్పెను వాతపూరణములును, ధ్వజసమూహమును, వీరధ్వజములును, అన్నిదిక్కులను వ్యాపించెను కస్తూరిపూఁతపై కర్పూరముతోను, ముత్యాలతోను ముగ్గులు ముంగిళ్లనొప్పెను బంగారువస్తువులతో నిండిన కలశముల వరుసపై మణిమయములైన అద్దములు నిలిచి మిక్కిలి ఒప్పెను

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష స్వభావోక్తి

క **కలధౌత హర్మ్యములపైఁ**
**గలివడగలు గలయ నెగసి క్రాలెం దద్దో**
**హలమునఁ బురసతి తన మన**
**మలరి మొగిం జేతులెత్తి యాడిన భంగిన్** 43

**అర్థము .** కలధౌత-హర్మ్యములపైన్ = వెండి (బంగారు) మేడలమీఁద, కలివడగలు = వీరధ్వజములు, కలయన్ = అంతటను, నెగసి = ఎగసి = ఎగిరి

తద్ + దోహలమునన్ = ఆ యుత్సాహముతో, పుర-సతి = పురమనెడు స్త్రీ, తన-మనము = తన మనస్సు, అలరి = సంతోషించి, మొగిన్ = ఉత్సాహముతో, చేతులు, ఎత్తి, ఆడిన-భంగిన్ = ఆడిన విధమున, క్రాలెన్ = ఒప్పెను

**తాత్పర్యము** వెండి (బంగారు) మేడలపై వీరధ్వజములు అంతట నెగిరి, పురమనెడి స్త్రీ ఆ యుత్సాహముతో మన మలరి పూనికమైఁ జేతులెత్తి నృత్యము చేసెనా యనునట్లు ఒప్పెను

**విశేషములు**. అలంకారము రూపకానుప్రాణితోత్ప్రేక్ష కలిపడగలు (రూపాం) కలువడగలు కలధౌత-వెండియు, బంగారమును 'కలధౌతం రూప్య హేమ్నోః' అమరము

తే అప్పురమున వణిగ్జను లాపణములఁ
గలయఁ బచరించియున్న నిర్మలినరత్న
రాశు లొప్పె నుమావరు రాక కర్థి
వెలయ నెత్తిన వలపుదీవియలు వోలె. 44

**అర్థము** . అప్పురమునన్ (ఆ + పురమునన్) = ఆ నగరమునందు, వణిజ్(క్) + జనులు = వర్తకజనులు, ఆపణములన్ = అంగడులందు, కలయన్ = అంతటను, పచరించి + ఉన్న = అమర్చియున్న, నిర్మలిన-రత్న-రాశులు = అమలములైన రత్నముల ప్రోవులు, ఉమా-వరు-రాకకున్ = ఉమ భర్త రాకకు, అర్థిన్ = కోరికతో, వెలయన్ = ప్రసిద్ధమగునట్లు ఎత్తిన, వలపు-దీవియలు + పోలెన్ = ప్రీతిసూచక దీపములవలె, ఒప్పెన్

**తాత్పర్యము** : ఆ ఓషధిప్రస్థపురమున వర్తకులు అంగళ్లలో నంతట, నమర్చియున్న నిర్మలములైన రత్నరాశులు శివునిరాకకై కోరికతోఁ బ్రసిద్ధముగా నెత్తిన ప్రీతిసూచకదీపములో యన నొప్పెను

**విశేషములు** . అలంకార ముత్ప్రేక్ష వలపుదీవియలు-రాగదీవియలు? తానదీవియలు అని సాహిత్య అకాడమీ ప్రతి

వ. అంత హిమవంతుం డనంత సామ్రాజ్యవిభవాన్వితుండై పరమేశ్వరునకు నెదురుసని సమ్మదరసపూరితుం డగుచు 45

**అర్థము** : అంతన్, హిమవంతుండు, అనంత-సామ్రాజ్య-విభవ + అన్వితుండు + ఐ = అంతులేని సామ్రాజ్యవైభవముతోఁ గూడినవాఁడయి,

పరమేశ్వరునకున్, ఎదురు + చని = ఎదురేఁగి, సమ్మదరస-పూరితుండు = ఆనంద రసముతో నిండినవాఁడు, అగుచున్

**తాత్పర్యము.** అంత హిమవంతుఁడు అనంతమైన సామ్రాజ్యవైభవముతోఁ గూడినవాఁడయి పరమేశ్వరున కెదురేఁగి ఆనందరసపూరితుఁడగుచు - తరువాతి పద్యముతో నన్వయము

**మహాస్రగ్ధర ఫణభృన్నాథోత్తమాంగప్రకర మణి విభాభాసితోత్తుంగజూటా
రుణ సద్ద్యోత ప్రసంగారుణిత బహుపదారూఢ దేవాహి దిక్చా
రణ సిద్ధాదిత్య యక్షోరగ దనుజ మునీంద్ర ప్రకాశాంగు ఫాలే
క్షణు వాణీంద్రాచ్యుతేంద్రాగణితనుతయశుం గాంచె నద్రీశుఁ డీశున్ 46**

**అర్థము.** ఫణ ప్రకాశాంగున్ ఫణభృత్ = పడగలను ధరించిన వానియొక్క-పాములయొక్క, నాథ = ప్రభువుయొక్క - వాసుకియొక్క, ఉత్తమాంగ = శిరస్సులయొక్క, ప్రకర = సమూహము నందలి, మణి = మణుల యొక్క విభా = కాంతులచే, భాసిత = ప్రకాశించిన, ఉత్తుంగ = మిక్కిలి యెత్తయిన, జూట = జడముడియొక్క, అరుణ = ఎఱ్ఱని, సత్ + ద్యోత = మంచి ప్రకాశముయొక్క, ప్రసంగ = ప్రసక్తిచే, అరుణిత = ఎఱ్ఱగాఁజేయఁబడిన, బహు = అనేకములయిన, పద = స్థానములను, ఆరూఢ = అధిరోహించిన, దేవ= దేవతలయు, అహి = నాగులయు, దిశ్ (క్) + చారణ = దిక్చారణులయు, సిద్ధ = సిద్ధులయు, ఆదిత్య = సూర్యులయు, యక్ష = యక్షులయు, ఉరగ = నాగులయు, దనుజ = రాక్షసులయు, ముని + ఇంద్ర = మునిశ్రేష్ఠులయు, ప్రకాశ = ప్రకాశముగల, అంగున్ = శరీరము గలవాఁడును, ఫాల + ఈక్షణున్ = నుదుటఁ గన్నుగలవాఁడును, వాణీం యశున్ - వాణీ + ఇంద్ర = సరస్వతీభర్తయగు బ్రహ్మచేతను, అచ్యుత = విష్ణువుచేతను, ఇంద్ర = ఇంద్రునిచేతను, అగణిత = అగణితముగా - లెక్కలేనివిధమున, నుత = పొగడఁబడిన, యశున్ = కీర్తిగలవాఁడును, అగు, ఈశున్ = ఈశ్వరుని, అద్రి + ఈశుఁడు = పర్వతరాజు - హిమవంతుడు, కాంచెన్ = చూచెను

**తాత్పర్యము.** ఈశ్వరుఁడు తన జటాజూటమును నాగరాజుచే బంధించుకొనెను నాగరాజు శిరస్సులందలి మణుల కాంతులచే నది యెఱ్ఱఁబడెను దాని యెఱుపుచే నెఱ్ఱనయిన పెక్కుస్థానముల నధిరోహించిన దేవాదుల

ప్రకాశవంతములగు శరీరములు గలవాఁడును, నుదుటఁ గన్నుగలవాఁడును, బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుఁడు అనువారిచేఁ బెక్కుమాఱులు నుతింపఁబడిన కీర్తిగలవాఁడును అగు ఈశ్వరుని హిమవంతుఁడు చూచెను

**విశేషములు .** ఫణభృన్నాథాది సుదీర్ఘసమాసముచే నీశ్వరుని మహిమాతిశయము ద్యోతకమగుచున్నది బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుఁడు అనువారే యతని కీర్తిని బెక్కుమాఱులు నుతించిరనఁగా నతని సర్వోత్తరత్వము తెలియుచున్నది 'అగణిత తనుయశున్' అను పాఠమును శ్రీ రా అ శర్మగారు అగణిత నుతయశున్‌గా సవరించిరి అది మేలుగాఁగనఁబడుటచే స్వీకృతము మహాస్రగ్ధరాలక్షణమునకు పూర్వవ్యాఖ్య (1 - 68) అరయునది

**వ కని గిరిపతి నిరతిశయభక్తిపూర్వకంబున సర్వాంగీణ ప్రణాముండై వరదకరుణాభిషిక్తుం డగుచు నిజపురంబునకుం దోడ్కొని చనుదేరం బరమేశ్వరుండు తత్పురప్రవేశంబు సేయు నవసరంబునం బౌరు లతిసంభ్రమంబునం బఱతెంచి 47**

**అర్థము .** కని, గిరి-పతి = కొండలఱేఁడు, హిమవంతుఁడు, నిరతిశయ-భక్తి-పూర్వకంబునన్ = అధికభక్తిపురస్సరముగా, సర్వాంగీణ-ప్రణాముండు + ఐ = సాష్టాంగనమస్కారము గలవాఁడయి, వరద-కరుణా + అభిషిక్తుండు = వరముల నిచ్చు శివునియొక్క, దయారసముచే నభిషేకింపఁబడినవాఁడు, అగుచున్, నిజ-పురంబునకున్ = తన నగరమునకు, తోడ్కొని-చనుదేరన్ = తీసికొనిరాఁగా, పరమేశ్వరుండు, తద్ + పుర-ప్రవేశంబు = ఆ నగర ప్రవేశము, చేయు + అవసరంబునన్ = చేయు సమయమున, పౌరులు = పుర ప్రజలు, అతి-సంభ్రమంబునన్ = మిక్కిలి వేగిరపాటుతో, పఱతెంచి = పరుగున వచ్చి

**తాత్పర్యము .** హిమవంతుఁడు చూచి అధికభక్తిపురస్సరముగా సాష్టాంగ నమస్కార మాచరించి వరదుఁడైన శివుని దయారసముచే నభిషేకింపఁబడినవాఁడగుచుఁ దనపురమునకుఁ దీసికొనిరాఁగాఁ బరమేశ్వరుఁడు ఆ నగరమును బ్రవేశించునప్పుడు పురప్రజలు అధికమైన వేగిరపాటుతోఁ బరుగునవచ్చి - తరువాతి పద్యముతో నన్వయము

మ అమృతాంభోనిధిలో సితాసిత సురక్తాంభోజముల్ పూచె నా
సమదాలాప విలాసవాస దరహాసద్యోతి తాత్మీయ దం
త మరీచి ప్రసరంబుతో వదనసందామేక్షణస్రగ్భరో
త్తమదీప్తుల్ దనరంగ నిల్చి రతివల్ తద్రాజమార్గంబులన్ 48

**అర్థము** . అమృత + అంభోనిధిలోన్ = అమృత సముద్రములో, సిత + అసిత-సురక్త + అంభోజముల్ = తెల్లని, నల్లని మిక్కిలి యెఱ్ఱని తామరలు, పూచెన్ + నాన్ = పుష్పించెనా యనునట్లు, సమదా ప్రసరంబులోన్, స-మద = పరమానందముతోఁగూడిన, ఆలాప = మాటలయొక్క, విలాస = లీలకు, వాస = స్థానమయి, దర-హాస = చిఱునవ్వుచే, ద్యోతిత = ప్రకాశించిన, ఆత్మీయ = తమవైన, దంత = పండ్ల యొక్క, మరీచి = కిరణములయొక్క, ప్రసరంబులోన్ = సమూహములో, వదన దీపుల్, వదన = ముఖమునందలి, సందామ = మేలయిన మాలవంటి, ఈక్షణ = చూపులనెడి, స్రజ్ (క్) + భర = మాలయొక్క బరువుయొక్క, ఉత్తమ = శ్రేష్ఠములయిన, దీప్తుల్ = కాంతులు, తనరంగన్ = ఒప్పఁగా, తద్ + రాజ-మార్గంబులన్ = ఆ పురమునందలి రాజవీధులలో, అతివల్ = స్త్రీలు, నిల్చిరి

**తాత్పర్యము** .అమృతసముద్రములోఁ దెల్లని, నల్లని, యెఱ్ఱని తామరలు పుష్పించెనా యనునట్లు, పరమానందముతోఁ గూడిన, వాగ్విలాసమునకు స్థానమయి, చిఱునవ్వుచేఁ బ్రకాశించిన తమ దంతకాంతులసమూహములో ముఖమునందలి చూపులనెడి మాల కాంతులు ఒప్పఁగా నా రాజవీధులందు స్త్రీలు నిల్చిరి

**విశేషములు** . అలంకార ముత్ప్రేక్ష రూపకము

## పుర స్త్రీలు శివుని వీక్షించుట

వ ఇట్లు పుర నారీ నికరంబు రథ్యానురథ్యాకీర్ణంబై నిలిచి 49

**అర్థము** : ఇట్లు, పుర-నారీ-నికరంబు = పురమునందలి స్త్రీల సమూహము, రథ్యా + అనురథ్యా + ఆకీర్ణంబు + ఐ = త్రోవత్రోవకు వ్యాపించినదయి, నిలిచి

**తాత్పర్యము** .ఇట్లు పురమునందలి స్త్రీలు త్రోవత్రోవను వ్యాపించి నిలిచి - తరువాతి పద్యముతో నన్వయము

క దరహాసామృతమున నా
స్మరహరు మును స్నపనమార్చి మఱి నయనేందీ
వరములఁ బూరణ సేసిరి
పురసతు లుల్లమున నింపు వొంపిరిపోవన్ 50

**అర్థము.** పుర-సతులు = నగరమందలి స్త్రీలు, ఉల్లమునన్ = మనసునందు, ఇంపు = ఆనందము, పొంపిరి + పోవన్ = అతిశయింపఁగా, ఆ-స్మర-హరున్ = ఆ మన్మథసంహారకుని - శివుని, మును = ముందు, దర-హాస + అమృతమునన్= చిఱునవ్వనెడు, అమృతమునందు, స్నపనము + ఆర్చి = స్నానమాడించి, మఱి = మఱియును, నయన ఇందీవరములన్ = కన్నులనెడి నల్లకలువలచే, పూరణ + చేసిరి = అలంకరించిరి

**తాత్పర్యము.** పురస్త్రీలు మనస్సులందు ఆనంద మతిశయింపఁగా ఆ శివుని ముందుగాఁ జిఱునవ్వనెడి యమృతముచే స్నానము చేయించి, పిమ్మట కన్నులనెడి నల్లకలువలచే నలంకరించిరి

**విశేషములు.** అలంకారము రూపకము

వ మఱియును - తరువాతి పద్యముతో నన్వయము 51

చ. దళితసరోరుహాస్యలు సుధామయహర్మ్యములెక్కి ప్రీతితోఁ
జెలువగు వల్దముత్యముల సేసలు సల్లిరి పాండురాంగుపై
నలి సతటిత్సితాంబుదగణంబు ఘనోపలవృష్టి రాజతా
చలము పయిన్ మొగిం గురియు చాడ్పున సద్రుచు లుల్లసిల్లగఁన్ 52

**అర్థము.** స-తటిత్ + సిత + అంబుద-గణంబు = మెఱపులతోఁ గూడిన తెల్లనైన, మేఘముల సమూహము, ఘన + ఉపల-వృష్టి= వడగండ్ల వర్షము, రాజత + అచలము పయిన్ = వెండికొండపై, మొగిన్ = పూనికతో, కురియు-చాడ్పునన్ = కురియు విధమున, దళిత-సరోరుహ + ఆస్యలు = వికసించిన పద్మములవంటి ముఖములు గలవారు - స్త్రీలు, సుధామయ-హర్మ్యములు = సున్నముతో నిండిన మేడలు, ఎక్కి, ప్రీతితోన్ = సంతోషముతో, చెలువు + అగు = అందమగు, వల్ద-ముత్యములన్ = స్థూలములైన ముత్యములతో, సత్ + రుచులు = మేలికాంతులు, ఉల్లసిల్లఁగన్ = ప్రకాశింపఁగా, పాండుర + అంగు-పైన్ = తెల్లని శరీరము గలవాఁడగు శివునిమీఁద, నలిన్ = ఉత్సాహముతో, సేసలు + చల్లిరి = అక్షతలు చల్లిరి

**తాత్పర్యము** మెఱపులతోఁగూడిన తెల్లనైన మేఘముల సమూహము వెండికొండపై వడగండ్లవాన కురియువిధమున, వికసించిన పద్మములవంటి ముఖములుగల పురస్త్రీలు సున్నముతో నిండిన మేడలెక్కి ప్రీతితో మేలికాంతులు ప్రకాశింపఁగాఁ దెల్లని శరీరముగల శివునిపై నుత్సాహముతో నందమైన పెద్ద ముత్యములను అక్షతలు చల్లిరి

**విశేషములు**. అలంకార ముపమ సద్రుచులు - సత్ + రుచులు

క చెలువలు సూచిరి శివు నిరు
వలఁకుల హర్మ్యంబు లెక్కి వడిఁ జూడ్కులు సూ
డ్కులతోడఁ బెనఁగి పొలుపుగఁ
గలువల తోరణము లోలిఁ గట్టిన భంగిన్ 53

**అర్థము** . చెలువలు = స్త్రీలు, ఇరు-వలఁకులన్ = రెండువైపులను, హర్మ్యంబులు + ఎక్కి = మేడలెక్కి, వడిన్ = వేగముగా, చూడ్కులు = చూపులు, చూడ్కులతోడన్ = చూపులతో, పెనఁగి = కూడి, పొలుపుగన్ అందముగా, కలువల-తోరణములు = కలువపూల తోరణములు, ఓలిన్ = వరుసగా, కట్టిన-భంగిన్ = కట్టినరీతిని, శివున్, చూచిరి

**తాత్పర్యము** . పురస్త్రీలు ఇరుపార్శ్వములను మేడలెక్కి ఒకవైపున్న స్త్రీలచూపులు రెండవ వైపున్న స్త్రీలచూపులతోఁగూడి అందముగాఁ గలువల తోరణములు వరుసగాఁ గట్టినట్లు శివునిఁ జూచిరి

**విశేషములు**.అలంకార ముత్ప్రేక్ష వలఁకులు - వలను + లు 'కలన్వాదుల నువర్ణంబు కుజ్జగు, బహువచనము పరంబగునపుడు నిత్యముగా నగు ' బాల ఆచ్ఛిక 18 వల + కుజీ + లు 'జీత్తు బిందుపూర్వంబగు ' బాల తత్సమ 19 వలఁకులు

క లోలమతి రెండు కన్నులుఁ
జాలవు శివుఁ జూడ నని విచారించియొ తా
జాలకము కన్ను లన్నిట
నోలిన చనఁ జూచుచుండె నొక్కతె ప్రీతిన్ 54.

**అర్థము** లోల-మతిన్ = ఆసక్తమైన బుద్ధితో, శివున్, చూడన్ = చూచుటకు, రెండు-కన్నులున్, చాలవు, అని, విచారించియొ = తలఁచియో, ఒక్కతె = ఒక స్త్రీ, ప్రీతిన్ = ఇష్టముతో, తాన్, జాలకము-కన్నులు + అన్నిటన్ = గవాక్షపుఁగన్ను లన్నిటినుండి, ఓలిన్ + అ = బాగుగనే, చనన్ = తగునట్లు, చూచుచున్ + ఉండెన్

**తాత్పర్యము** .శివునిఁ జూచుటకు రెండుకన్నులును సరిపోవని ఆసక్తమైన బుద్ధితోఁదలఁచి కాఁబోలు, ఒకామె ప్రీతితో గవాక్షపుఁ గన్నులన్నిటినుండి బాగుగాఁ జూచుచుండెను

**విశేషములు** .అలంకారము హేతూత్ప్రేక్ష తన కన్నులతోనేగాక జాలకమున కున్న కన్నులన్నిటితోను జూచుట ఆమె లోలమతిత్వమును శివుని సౌందర్యాతిశయమును దెలుపును

తే అడ్డగోడలపై వ్రాలి యభవుఁ జూచు
సతుల కుచములపై ముఖసరసిజములు
భాసురం బయ్యెఁ బూర్ణకుంభములమీఁదఁ
బడిఁడి యద్దముల్ నిలిపిన భంగిపోలె 55

**అర్థము** . అడ్డగోడలపైన్, వ్రాలి, అభవున్ = శివుని, చూచు, సతుల-కుచములపైన్ = స్త్రీల స్తనములమీఁద, ముఖ-సరసిజములు = ముఖ పద్మములు, పూర్ణ-కుంభములమీఁదన్ = నిండు కుండలమీఁద, పసిఁడి-అద్దముల్ = బంగరుటద్దములు, నిలిపిన-భంగి + పోలెన్ = నిలిపినట్లుగా, భాసురంబు + అయ్యెన్ = ప్రకాశించెను

**తాత్పర్యము :** అడ్డగోడలమీఁద వంగి, శివుని జూచునట్టి స్త్రీల స్తనముల మీఁద వారి ముఖపద్మములుండి, పూర్ణకుంభములపై బంగరుటద్దములను నిలిపిన విధమున నొప్పెను

**విశేషములు** . అలంకార ముత్ప్రేక్ష

చ నుతనవయౌవనద్యుతి తనుద్యుతికిన్ మెఱుఁగీఁగఁ దత్తనూ
ద్యుతి మణిభూషణద్యుతుల కొప్పముతో మెఱుఁగీఁగఁ దన్మణి
ద్యుతులు నభోమణిద్యుతులతో నెనయై తన వక్త్రపంకజ
ద్యుతులకు నీ మెఱుంగు లొక యుగ్మలి వచ్చెఁ బురారిఁ జూడఁగాన్ 56

**అర్థము.** నుత-నవ-యౌవన-ద్యుతి = పొగడఁబడిన క్రొత్త జవ్వనముయొక్క కాంతి, తను-ద్యుతికిన్ = శరీరకాంతికి, మెఱుఁగు + ఈఁగన్ = ప్రకాశము నొసఁగఁగా, తద్ + తనూ-ద్యుతి = ఆ శరీరకాంతి, మణి-భూషణ-ద్యుతులకున్ = మణిమయములైన నగల కాంతులకు, ఒప్పముతోన్ = ఒప్పుతో, మెఱుఁగు + ఈఁగన్, తద్ + మణి-ద్యుతులు = ఆ మణుల కాంతులు, నభోమణి-ద్యుతులతోన్ = సూర్యకాంతులతో, ఎన + ఐ = సాటి యయి, తన-వక్త్ర-పంకజ-ద్యుతులకున్ = తన ముఖపద్మ కాంతులకు, మెఱుంగులు + ఈన్ = కాంతు లొసఁగఁగా, ఒక-ఉగ్మలి = ఒక స్త్రీ, పుర + అరిన్ = ఈశ్వరుని, చూడఁగాన్ = చూచుటకు, వచ్చెన్

**తాత్పర్యము.** తన జవ్వనపుఁగాంతి శరీరకాంతికిఁ బ్రకాశమునొసఁగఁగా, నా శరీరకాంతి మణిభూషణముల కాంతులకు బాగుగాఁ బ్రకాశమునొసఁగఁగాఁ, ఆ మణిభూషణకాంతులు సూర్యునికాంతులకు సాటి యయినవయి, నిజముఖపద్మములకుఁ బ్రకాశము నిచ్చునట్లు ఒకామె శివునిఁ జూచుటకు వచ్చెను

**విశేషములు.** మణుల కాంతులు సూర్యకాంతితో సాటివచ్చునవి కావునను, ఆమె ముఖము పద్మము వంటిది కావునను, సూర్యపద్మములకుఁగల బంధుత్వముచే ముఖపద్మము వికాసము నొందుచున్నది

**వ మఱియును తరువాతి పద్యముతో నన్వయము** 57

**శా ఆలోలాలస కుంచి తాకులిత ముగ్ధా కీర్ణ విస్తీర్ణ లీ**
**లాలాస్య స్ఫురి తాయతోన్మద విశాల స్మేర విస్ఫార దృ**
**గ్జాలంబుల్ గలయంగ విచ్చి విటమత్స్యవ్రాతముం దివ్వుచున్**
**రోలంబాలక వచ్చి చూచె జితమారుం జంద్రచూడామణిన్** 58

**అర్థము.** ఆలోలాలస ... దృగ్జాలంబుల్ ఆలోల = చంచలములు, అలస = మందములు, కుంచిత = ముడిఁగినవి, ఆకులిత = కలఁతనొందినవి, ముగ్ధ = సుందరములు, ఆకీర్ణ = వ్యాపించినవి, విస్తీర్ణ = విరివియైనవి, లీలా = విలాసముతో, లాస్య = నాట్యముచే, స్ఫురిత = ప్రకాశించునవి, ఆయత = దీర్ఘములయినవి, ఉన్మద = మత్తెక్కించునవి, విశాల = విశాలములయినవి, స్మేర = వికసించునవి, విస్ఫార = విప్పారినవి, అగు, దృశ్ (క్) + జాలంబుల్ = చూపుల సమూహములు - చూపులనెడి వలలు, కలయంగన్ = అంతటను, విచ్చి, విట-

మత్స్య-వ్రాతమున్ = విటులనెడి చేఁపల సమూహమును, తివ్చుచున్ = ఆకర్షించుచు, రోలంబ + అలక = తుమ్మెదలవంటి ముంగురులు గలది - స్త్రీ, వచ్చి, జిత-మారున్ = జయింపఁబడిన మన్మథుఁడు గలవాఁడు, అగు, చంద్ర-చూడా-మణిన్ = చంద్రుఁడు శిరోభూషణముగాఁ గలవానిని - శివుని, చూచెన్

**తాత్పర్యము** చంచలములు, మందములు, ముడిఁగినవి, కలఁత నొందినవి, సుందరములు, వ్యాపించినవి, విరివియైనవి, విలాసముతోడి నాట్యముతోఁ బ్రకాశించునవి, దీర్ఘములు, మత్తుగలిగించునవి, విశాలములు, వికసించునవి, విప్పారినవి అగు దృష్టుల సమూహములు - దృష్టులనెడి వలలు బాగుగా విచ్చి విటులనెడి చేఁపల సమూహము నాకర్షించుచుఁ దుమ్మెదలవంటి ముంగురులు గల ఒక స్త్రీ మన్మథహరుఁడగు శివునిఁ జూచెను

**విశేషములు :**దృగ్జాలములు - శ్లిష్ట రూపకము విట మత్స్య - రూపకము దృగ్జాలంబుల్ - దృశ్ (క్) + జాలంబుల్ - తివ్చు - తివు (రూపాం )

చ **నునుపుగఁ జందనం బలఁది నూతన మౌక్తిక హారముల్ ఘన**
**స్తన యుగళంబుపైఁ బొలయ, జాదులు వేణిఁ బెనంగఁ దెల్పుతోఁ**
**గనుఁగవ గ్రాలఁ దువ్వలువుఁగట్టి, తదుజ్జ్వల కీర్తిమూర్తి సే**
**కొని చనుదెంచులీల నొక కోమలి వచ్చె గిరీశుఁ గన్గొనన్ 59**

**అర్థము :** నునుపుగన్ = నున్నగా, చందనంబు = మంచిగంధము, అలఁది= పూసి, నూతన-మౌక్తిక-హారముల్ = క్రొత్త ముత్యాల పేరులు, ఘన-స్తన-యుగళంబుపైన్ = గొప్పదియగు చనుఁగవమీఁద, పొలయన్ = వ్యాపింపఁగా, జాదులు = జాజిపూలు, వేణిన్ = జడయందు, పెనంగన్ = కూడఁగా, కనుఁగవ= కన్నులజంట, తెల్పుతోన్, క్రాలన్ = ఒప్పఁగా, దువ్వలువున్ = సన్నని వస్త్రమును, కట్టి = ధరించి, తద్ + ఉజ్జ్వల-కీర్తి-మూర్తి = వాని ప్రకాశించు కీర్తి యొక్క, ఆకారమును, చేకొని = స్వీకరించి, చనుదెంచు-లీలన్ = వచ్చురీతిని, ఒక-కోమలి= ఒక సుందరి, గిరీశున్ = శివుని, కన్గొనన్ = చూచుటకు, వచ్చెన్

**తాత్పర్యము .** ఒక సుందరాంగి నున్నగా మంచిగంధముఁ బూసి క్రొత్త ముత్యాలపేరులు గొప్ప చనుఁగవపై వ్యాపింపఁగా, జాజిపూలు జడలోఁ బెనఁగులాడఁ, గనుఁగవ తెల్పుగలిగి యొప్పు సన్నని వస్త్రమును దాల్చి వాని యుజ్జ్వలమైన కీర్త్యాకృతిని స్వీకరించి వచ్చునట్లు శివునిఁ జూడ వచ్చెను

**విశేషములు** అలంకారము స్వభావోక్తి ఉత్ప్రేక్ష వలుపు (రూపా ) వలువ దువ + వలువు

చ గురుకుచలిప్త సాంద్రతర కుంకుమ చందన ఘర్మబిందువుల్
దొరుఁగ రతిశ్రమాకులిత ధూర్జటి నొక్కతె సూచుచుండెఁ గే
సరి నఖరాగ్రనిర్దళిత సక్షతజాత విమిశ్ర మౌక్తికో
త్కర గళదుచ్చ కుంభ మదదంతియ పోలె నచేతనస్థితిన్ 60

**అర్థము** రతి-శ్రమ + ఆకులిత = సురతము వలని అలయికచేఁ గలఁగినది (అగు), ఒక్కతె = ఒకామె, కేసరి దంతియ-పోలెన్ = కేసరి = సింహముయొక్క నఖర = గోరుల, అగ్ర = కొనలచే, నిర్దళిత = చీల్పఁబడిన, సక్షత-జాత = రక్తముతో, విమిశ్ర = కలిసిన, మౌక్తిక + ఉత్కర = ముత్యముల సమూహము, గళత్ = జాఱుచున్న, ఉచ్చ = ఉన్నతమైన, కుంభ = కుంభస్థలములుగల, మద-దంతి + అ = మదగజమా, పోలెన్ = అనఁగా, అచేతన-స్థితిన్ = మైమఱచిన స్థితితో, గురు బిందువుల్ గురు-కుచ = పెద్దవియగు స్తనములందు, లిప్త = పూయఁబడిన, సాంద్రతర = మిక్కిలి దట్టమైన, కుంకుమ = కుంకుమము, చందన = మంచిగంధము అనువానితోడి, ఘర్మ-బిందువుల్ = చెమటబొట్లు, తొరుఁగన్ = రాలఁగా, ధూర్జటిన్ = శివుని, చూచుచున్ + ఉండెన్

**తాత్పర్యము**. సురతక్రీడవలని అలయికచేఁ గలఁగిన ఒకస్త్రీ గొప్పవియగు స్తనములందుఁ బూయఁబడిన దట్టమైన కుంకుమము, మంచిగంధము ననువానితోడి చెమటబొట్టులు రాలఁగా, సింహము గోరులకొనలచేఁ జీల్పఁబడి రక్తముతోఁ గలసిన ముత్యాల సమూహము రాలుచున్న ఉన్నతమైన కుంభస్థలములుగల మదగజమా యనునట్లు మైమఱచిన స్థితితో శివునిఁ జూచుచుండెను

**విశేషములు** . అలంకారము ఉత్ప్రేక్ష

చ కమలదళాక్షి సాలఁ దమకంబునఁ గూర్చు నిజేశుతోడఁ జి
త్తము దనివోవఁగా బహువిధంబులఁ గూడిన హృద్గతానురా
గము వెలిఁబేర్చెనో యన నఖక్షతచుంబనరంజితాంగవి
భ్రమగతి వచ్చి చూచె నొక భామిని జంగమమల్లికార్జునున్ 61

**అర్థము** . కమల-దళ + అక్షి = తామరరేకులవంటి కన్నులుగలది, (అగు), ఒక-భామిని = ఒకస్త్రీ, చాలన్ + తమకంబునన్ = మిక్కిలి మోహముతో, కూర్చు-

నిజ + ఈశుతోడన్ = ప్రియమైన తన భర్తతో, చిత్తము = మనస్సు, తనివోవఁగాన్= తృప్తిఁజెందఁగా, బహు-విధంబులన్ = అనేకరీతుల, కూడినన్, హృద్ + గత + అనురాగము = హృదయమును బొందిన ప్రేమము, వెలిన్ = వెలుపలికి, పేర్చెనో+ అనన్ = పొంగెనా యనునట్లు, నఖ-క్షత-చుంబన-రంజిత + అంగ-విభ్రమ-గతిన్= గోటి నొక్కులచేతను, ముద్దులచేతను, సంతోషపెట్టఁబడిన - రంగువేయఁబడిన, అవయవములయొక్క, విలాసముతోడి గమనముతో, వచ్చి, జంగమ-మల్లికార్జునున్= జంగమమల్లికార్జునుని- శివుని, చూచెన్

**తాత్పర్యము :** తామరరేకులవంటి కన్నులుగ్గల ఒక స్త్రీ మిక్కిలి మోహముతో స్వీయ ప్రియభర్తతో మనస్సు తృప్తిపడునట్లు పెక్కురీతులఁ గూడఁగా, హృదయస్థమైన రాగము వెలుపలికిఁ బొంగెనా యనునట్లు గోటినొక్కులు ముద్దులు అనువానిచే రంజితములైన అవయవముల విలాసముతోడి గమనముతో వచ్చి జంగమమల్లికార్జునునితో నభిన్నుఁడైన శివునిఁ జూచెను

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష రాగము, రంజిత అనుచో శ్లేషము కవి జంగమమల్లికార్జున శివుల కభేదము చెప్పుచుండును తని, తనివి, తనివు రూపాంతరములు

తే **మగువ జంగమమల్లయఁ దగిలి చూచి**
**యంద కన్నులు మనమును నంటియున్న**
**నచలభావన నిల్చెఁ దా నట్ల, పరము**
**నభవుఁ గని జను లచలాత్మ లగుట యరుదె?** 62

**అర్థము .** మగువ = స్త్రీ, జంగమ మల్లయన్ = జంగమ మల్లికార్జునునితో నభిన్నుఁడైన శివుని, తగిలి - చూచి = ఆసక్తితోఁజూచి, అందున్ + = అతనియందే, కన్నులున్ = కన్నులును, మనమును = మనస్సును, అంటి + ఉన్నన్ = తగిలియుండఁగా, తాను, అచల-భావనన్ = నిశ్చలత్వముతో, నిల్చెన్, అట్లు + అ = అది యట్లే, పరమున్ + అభవున్ = ఉత్కృష్టుఁడైన శివుని, కని = చూచి, జనులు, అచల + ఆత్ములు = నిశ్చలములైన ఆత్మ గలవారు, అగుట, అరుదె = ఆశ్చర్యమా?

**తాత్పర్యము .** ఒక యింతి జంగమమల్లికార్జునునితో నభిన్నుఁడైన శివుని ఆసక్తితోఁ జూచి అతనియందే కన్నులును, మనస్సును దగులుకొనఁగా

నిశ్చలత్వముతో నిలిచెను అదియట్లే కదా! గొప్పవాఁడైన శివునిఁ జూచి జనులు నిశ్చలాత్ములగుటలో నాశ్చర్యమేమున్నది?

**విశేషములు** అలంకారము అర్థాంతరన్యాసము అచలభావన - స్తంభమను సాత్త్వికభావము

తే. **ముడువ నెత్తిన పువ్వులు ముడిచికొనఁగ**
**మఱచి చేఁ బట్టికొనుచుఁ దన్నెఱుఁగ కర్థిఁ**
**బోలి చనుదెంచెఁ ద్రైలోక్యపూజ్యు నచల**
**భక్తిఁ బూజింపఁ జనుదెంచు భంగి వోలె** 63

**అర్థము** ఒక స్త్రీ అను కర్త అధ్యాహార్యము ముడువన్=తుఱుముకొనుటకు, ఎత్తిన = పట్టిన, పువ్వులు, ముడిచికొనఁగన్ = తుఱుముకొనుట, మఱచి, చేన్ = చేతితో, పట్టుకొనుచున్, తన్నున్ + ఎఱుఁగక = పరవశయయి, అర్థిన్ + పోలి, త్రైలోక్య-పూజ్యున్ = ముల్లోకములచేఁ బూజింపఁదగినవానిని, అచల-భక్తిన్ = నిశ్చలభక్తితో, పూజింపన్ = పూజించుటకు, చనుదెంచు-భంగి + పోలెన్ = వచ్చురీతిని, చనుదెంచెన్

**తాత్పర్యము** ఒక స్త్రీ తనతలలో ముడుచుకొనుటకుఁ బుచ్చుకొనిన పువ్వులు ముడుచుకొన మఱచి వానిని జేతఁబట్టుకొనుచు మైమఱచి, ముల్లోకములచేఁ బూజింపఁదగినవాఁడగు శివుని నిశ్చలభక్తితోఁ బూజింపవచ్చెనా యనునట్లు వచ్చెను

**విశేషములు :** అలంకార ముత్ప్రేక్ష

ఆ. **కొప్పు విచ్చి విచ్చి కట్టంగ మఱచి చేఁ**
**బొదివి పట్టికొనుచుఁ బొలఁతి వచ్చె**
**నెల్ల సమయములకు నీశుండు వేల్పని**
**ముడియనైన వచ్చు వడువు వోలె** 64

**అర్థము.** పొలఁతి - పొలఁతి = స్త్రీ, కొప్పున్ = కొసెను, విచ్చి, విచ్చి = మిక్కిలి విప్పి, కట్టంగన్ = కట్టుట, మఱచి, చేన్ = చేత, పొదివి-పట్టికొనుచున్ =

చుట్టఁబెట్టుకొనుచు, ఎల్ల-సమయములకున్ = అన్నివేళలకు, ఈశుండు, వేల్పు + అని = దేవుఁడని, ముడియవైవన్ = దానిని స్థిరీకరించుటకై వస్త్రమును ముడివేసి ప్రమాణము చేయుటకు, వచ్చు - వడువు + పోలెన్ = వచ్చువిధమున, వచ్చెన్

**తాత్పర్యము** . ఒక యింతి కోకను మిక్కిలి విప్పి శివునిఁ జూచు సంభ్రమమునఁ గట్టుట మఱచి చేతఁజుట్టఁబెట్టుకొనుచు, నన్నివేళలకును ఈశ్వరుఁడు దేవుఁడని - ఆ విషయమును స్థిరీకరించుటకై వస్త్రమును ముడివేసి ప్రమాణము చేయుటకు వచ్చుచున్నదా యనునట్లు వచ్చెను

**విశేషములు** అలంకార ముత్ప్రేక్ష కొపు = కాసె యని పూర్వటీక ఈ శబ్దము నిఘంటువులో లేదు

**తే చెలువ యొక్కర్తు గట్టిన చీర వీడి**
**పడఁగఁ జనుదెంచెఁ దద్ద సంభ్రమముతోడ**
**వరుఁడు చూచుచునుండ నిర్వాణ భీతి,**
**నట్ల, శివుఁగాంచి నిర్వాణ మగుట యరుదె ? 65**

**అర్థము** . నిర్వాణ-భీతిన్ = (వస్త్ర) మోక్షము (నగ్నత) వలని భయమున, వరుఁడు = భర్త, చూచుచున్ + ఉండన్ = చూచుచుండఁగా, చెలువ + ఒక్కర్తు = ఒక స్త్రీ, కట్టిన-చీర + ధరించినచీర, వీడిపడఁగన్ = ఊడిపోవుచుండఁగా, తద్ద-సంభ్రమముతోడన్ = మిక్కిలి వేగిరపాటుతో, చనుదెంచెన్ = వచ్చెను అట్లు + అ = అది యట్లే, శివున్, కాంచి, నిర్వాణము = మోక్షము, అగుట, అరుదె = ఆశ్చర్యమా?

**తాత్పర్యము** భర్త తనభార్యకు వస్త్రమోక్షమగునేమో యను భయమునఁ జూచుచుండఁగా, నొకస్త్రీ తానుగట్టిన చీర యూడిపోవుచుండఁగా మిక్కిలి వేగిరపాటుతో శివునిఁ జూడవచ్చెను అది యట్లే శివునిఁ జూచుచో మోక్షమగుటలో నాశ్చర్య మేమున్నది ?

**విశేషములు** . అలంకారము నిర్వాణశబ్దమున కర్థద్వయముచే శ్లేషము అర్థాంతరన్యాసము

సీ వెలిమిడి నలికంబు చెలువంగఁ బోవుచ
తెలుపార మైనిండ నలఁదికొనుచుఁ
బూవులు దుఱుమంగఁ బోవుచ వల గొంత
తోఁపంగ ముందలఁ దుఱిమికొనుచు
మోవి లత్తుక పూయఁబోవుచ లాలాట
పట్టికఁ దిలకంబుఁ బెట్టుకొనుచుఁ
గాటుక మొడుచుచ కన్నుల నిడఁబోయి
పొల్తుక గళమునఁ బూసికొనుచు

ఆ సితరుచీందుఖండ శిఖి నేత్ర గరళంబు
లొడల దలను నుదుట మెడను దాల్చి
పొల్చు శంభు నోర్తు పోలి చూపఱు దన
కెఱఁగుచుండ వచ్చె నీశుఁజూడ 66

**అర్థము** వెలిమిడిన్ = విభూతితో, అలికంబు = నుదురు, చెలువంగన్ + పోవుచున్ + అ = పూయఁబోవుచునే, తెలుపారన్ = తెలుపునిండునట్లు, మై-నిండన్ = శరీరము నిండుగా, అలఁదికొనుచున్ = పూసికొనుచు,

పూవులు, తుఱుమంగన్ + పోవుచున్ + అ = ముడిచికొనఁబోవుచునే, వల గొంత = కుడిభాగమునఁ గొంత, తోఁపంగన్ = తోఁచునట్లు, ముందలన్ = తలముందరి భాగమున, తుఱిమికొనుచున్

మోవిన్ = పెదవియందు, లత్తుక = లాక్షారసము, పూయన్ + పోవుచున్ + అ = పూయఁబోవుచునే, లాలాట-పట్టికన్ = పలకవంటి నుదుటియందు, తిలకంబున్ = బొట్టును, పెట్టుకొనుచున్

కాటుకన్, మొడుచుచున్ + అ = మెదుచుచునే, కన్నులన్, ఇడన్ + పోయి = పెట్టఁబోయి, పొల్తుక =స్త్రీ, గళమునన్ = కంఠమున, పూసికొనుచున్

సితరుచి + ఇందుఖండ-శిఖినేత్ర-గరళంబులు = తెల్లనికాంతి, చంద్రకళ, నిప్పుఁగన్ను, కాలకూటము అనునవి, క్రమముగా, ఒడలన్ = శరీరమునందు, తలను = తలయందు, నుదుటన్ = నుదుటియందు, మెడను, తాల్చి = ధరించి, పొల్చు = ఒప్పునట్టి, శంభున్ = శివుని, ఓర్తు = ఒక్క స్త్రీ, పోలి, చూపఱు = చూచువారు, తనకున్, ఎఱఁగుచున్ + ఉండన్ = నమస్కరించుచుండఁగా, ఈశున్ = ఈశ్వరుని, చూడన్ = చూచుటకు, వచ్చెన్

**తాత్పర్యము .** ఒకామె విభూతిని నుదుటఁ బూయఁబోవుచునే తెలుపు నిండునట్లు ఒడలినిండఁ బూసికొనుచు, పువ్వులు ముడిచికొనఁబోవుచునే కుడివైపునఁ గొంత తోఁచునట్లు తలముందరిభాగమునఁ దుఱిమికొనుచు, పెదవిని లత్తుక పూయఁబోవుచునే నుదుటఁ దిలకమును బెట్టుకొనుచు, కాటుకను బెట్టుకొనుచునే కన్నులందుఁ బెట్టుకొనఁబోయి కంఠమునఁ బూసికొనుచు, తెల్లని కాంతిని, చంద్రకళను, అగ్నినేత్రమును, కాలకూటమును క్రమముగా మేనను, దలను నుదుటను, మెడను దాల్చి యొప్పునట్టి శివునిఁబోలి, చూచువారు శివభ్రాంతితోఁ దనకు మ్రొక్కుచుండ నీశ్వరునిఁ జూడవచ్చెను

**విశేషములు.** సితరుచీందుఖండ దాల్చి' అనుచో యధా సంఖ్యము ఉపమ, భ్రాంతిమంతము

తరువద

**కడుఁ దోరమై పొల్చు కచకుచభరముఁ గటిచక్రభారము నగ్గలమైన వేగ**
**నడవంగ నేరక నయమున నంచనడలకు నందమై నడతెంచుచున్న**
**మడఁతి జూచిన విటమండలి యెల్ల మారారిఁ గనుంగొన మఱచెఁ దానట్ల**
**వడి నింద్రియంబుల వశగతులైనవారికి శివుఁ గానవచ్చునే జగతి? 67**

**అర్థము .** కడున్ = మిక్కిలి, తోరము + ఐ = స్థూలమయి,పొల్చు = ఒప్పునట్టి, కచ-కుచ-భారమున్ = కేశపాశము యొక్కయు, స్తనముల యొక్కయు బరువును, కటి-చక్ర-భరమున్ = వలయాకారపుఁ బిఱుఁదుల బరువును, అగ్గలము + ఐనన్ = అధికము కాఁగా, వేగన్ = వడిగా, నడవంగన్ + నేరక = నడవఁజాలక, నయమునన్ = అందమున, అంచ+నడలకున్ = హంస నడకల కంటెను, అందము + ఐ, నడతెంచుచున్ + ఉన్న = వచ్చుచున్న, మడఁతిన్ = స్త్రీని, చూచిన = చూచినట్టి, విట-మండలి + ఎల్లన్ = విటకాంద్ర సమూహమంతయు, మార + అరిన్ = మన్మధునకు శత్రువైన శివుని, కనుఁగొనన్ + మఱచెన్ = చూచుట మఱచెను, తాను + అట్లు + అ = అది యట్లే, వడిన్ = వేగముతో, ఇంద్రియంబుల-వశగతులు + ఐన-వారికిన్ = ఇంద్రియములకు వశపడినవారికి, జగతిన్ = లోకమున, శివున్ = శివుని, కానన్ + వచ్చునే = చూడ నలవియగునా?

**తాత్పర్యము :** మిక్కిలి స్థూలమయి యొప్పు కేశములయు స్తనములయు బరువును, పిఱుఁదుల బరువును అధికముకాఁగా వేగముగా నడవఁజాలక అందమున హంస నడకలకంటె నందమై, వచ్చుచున్న స్త్రీని జూచిన విటకాం ద్రందఱు శివునిఁ

జూడమఱచిరి అది యట్లే కదా! ఇంద్రియములకు వశపడినవారికి లోకమున శివునిఁజూడ నలవికాదు

**విశేషములు** అలంకారము అర్థాంతరన్యాసము అంచనడలకు నందమై- అంచ నడకల కంటె నందమై - ఇచట పంచమ్యర్థమున కువర్ణక మయినది 'షష్ఠీస్థానికంబగు కువర్ణకం బొకొక్కచో ద్వితీయాదివిభక్తులకు మాఱుగాఁ దత్తదర్థంబులం జూపట్టెడి ' ప్రౌఢ కారక 13 తరువద లక్షణమునకు 5 - 109 పద్యవ్యాఖ్య నరయునది

క **హరుఁ జూచు, మగుడఁ బ్రాణే**
**శ్వరుఁ జూచు, మహేశుఁ జూచు, వల్లభుఁ జూచున్**
**బొరిఁబొరిఁ జిత్తము నిల్వక**
**తరుణియ యొక్కర్తు వికటతాపసిపోలెన్** 68

**అర్థము.** తరుణియ + ఒక్కర్తు = ఒక యువతి, వికట-తాపసి + పోలెన్ = చంచలుఁడైన తపస్వివలె, పొరిన్ + పొరిన్ = మాటిమాటికి, చిత్తము = మనస్సు, నిల్వక, హరున్ = శివుని, చూచున్, మగుడన్ = మరల, ప్రాణ + ఈశ్వరున్ = భర్తను, చూచున్, మహేశున్ = పరమేశ్వరుని, చూచున్, మగుడన్, వల్లభున్ = మగనిని, చూచున్

**తాత్పర్యము** ఒక యువతి చంచలుఁడగు తపస్వివలె మాటిమాటికి మనస్సు నిలువక శివునిఁ జూచును, మరల భర్తను జూచును పరమేశ్వరునిఁ జూచును మరల మగనినిఁ జూచును

**విశేషములు.** అలంకారము ఉపమ

తే **ప్రియు నఖాంకముల్ గురుకుచద్వయముమీఁదఁ**
**గాంచి పేద నిధానముఁ గాంచినట్లు**
**విచ్చి చూచుచుఁ గప్పుచు వచ్చి చూచె**
**దేవతాధిపు నమ్మహాదేవు నోర్తు** 69.

**అర్థము.** ఓర్తు = ఒక స్త్రీ ప్రియు-నఖ + అంకముల్ = ప్రియుని గోటి గుఱుతులు, గురు-కుచ-ద్వయము మీఁదన్ = పెద్దదియగు చనుఁగవపై, కాంచి = చూచి, పేద = పేదవాఁడు, నిధానమున్ = నిధిని - ధనరాశిని, కాంచిన + అట్లు=

చూచినరీతిని, విచ్చి, చూచుచున్, కప్పుచున్, వచ్చి, దేవతా + అధిపున్ = దేవతలప్రభువును, ఆ + మహాదేవున్ = ఆ శివుని, చూచెన్

**తాత్పర్యము .** ఒక స్త్రీ పెద్దదియగు చనుఁగవమీఁదఁ దనప్రియుని గోటిగుఱుతులు చూచి, పేదవాఁడు నిధిని జూచురీతిని, విప్పిచూచుచు మరలఁ గప్పుచు వచ్చి దేవతలకుఁ బ్రభువైన ఆ మహేశ్వరునిఁ జూచెను

**విశేషములు .**పేదవాఁడు నిధిని జూచినప్పుడు దానిని సంతోషముతో విప్పి చూచును మరల నెవరైనఁ జూచుచున్నారేమో యను భయమున దానిని గప్పివైచును అట్లే ఆ యింతియుఁ గుచములపైఁ బ్రియుఁడుంచిన గోటిగుఱుతులను సంతోషమునఁ జూచుకొనుచు, మరల నెవరైనఁ జూచుచున్నారేమోయని కప్పికొనును అలంకార ముపమ

క. వనజంబులుఁ గలువలుఁ బూ
చిన కొలఁకుల మాడ్కిఁ బెనఁగి చెలు వడరెఁ బురిన్
జను పతులు సతులు నీశ్వరుఁ
గనుఁగొనుచో వీధివీధిఁ గనుఁగవ రుచులన్ 70

**అర్థము .** వీధి వీధిన్ = ప్రతి వీధియందును, చను-పతులున్ + సతులున్= పోవు మగలును వారియాండ్రును, ఈశ్వరున్ = శివుని, కనుఁగొనుచోన్= చూచునప్పుడు, కనుఁగవ-రుచులన్ = నేత్రద్వయకాంతులచే, వనజంబులున్= తామరలును, కలువలున్, పూచిన, కొలఁకుల-మాడ్కిన్ = సరస్సులవిధమున, పెనఁగి = కూడి, పురిన్ = పురమందు, చెలువు + అడరెన్ = అంద మతిశయించెను

**తాత్పర్యము :** ప్రతివీధియందును బురుషులును స్త్రీలును శివుని గనుఁగొనునప్పుడు వారి నేత్రద్వయకాంతులచేఁ దామరలును గలువలును బూచిన సరస్సుల విధమున పురమందు అందమతిశయించెను

**విశేషములు:** అలంకార ముత్ప్రేక్ష కొలఁకులు = కొలను + లు 'కలన్వాదుల నువర్ణంబు కుఙ్నగు, బహువచనము పరంబగునపుడు నిత్యముగా నగు' బాల ఆచ్చిక 18 కొల + కుఙ్ + లు 'ఙిత్తు బిందుపూర్వంబగు' బాల తత్సమ 19

చ స్ఫురదరుణాధరోరురుచిఁ బొంది కరంబును రక్తుఁడై సితే
తరనయనాతిభాతి నసితద్యుతిఁ జెల్వుగ నొంది నిర్మలో
త్కర దరహాసదీధితి సితప్రభఁదాల్చి, మహేశ్వరుండు త్రై
పురుషముఁ దాన యైనగతిఁ బొల్చెఁ బురాంగన లోలిఁ జూచుచోన్ 71

**అర్థము** పుర + అంగనలు = పురమునందలి స్త్రీలు, ఓలిన్ = బాగుగా, చూచుచోన్ = చూచునప్పుడు, మహేశ్వరుండు, స్ఫురత్ + అరుణ + అధర + ఉరు-రుచిన్ = ప్రకాశించుచున్న ఎఱ్ఱని క్రిందిపెదవి యొక్కగొప్పకాంతిని, పొంది, కరంబును = మిక్కిలి, రక్తుఁడు + ఐ = ఎఱ్ఱనివాఁడయి, సిత + ఇతర-నయన + అతి-భాతిన్ = నల్లని కన్నుల అధిక కాంతిచే, అసిత-ద్యుతిన్ = నల్లనికాంతిని, చెల్వుగన్ = అందముగా, ఒంది, నిర్మల + ఉత్కర-దర-హాస-దీధితిన్ = నిర్మలమైనరాశియగు చిఱునవ్వుకాంతిచే, సిత-ప్రభన్ = తెల్లనికాంతిని, తాల్చి త్రైపురుషమున్ = బ్రహ్మ విష్ణు మహేశ్వరుల భావమును - త్రిమూర్తిత్వమును, తాను + అ = తానే, ఐన-గతిన్ = అయినవిధమున, పొల్చెన్ = ప్రకాశించెను

**తాత్పర్యము .** పురస్త్రీలు శివుని బాగుగాఁ జూచునప్పుడు అతఁడు వారి యెఱ్ఱని క్రిందిపెదవుల గొప్పకాంతిని బొంది మిక్కిలి యెఱ్ఱనివాఁడయి బ్రహ్మయును, వారి నల్లని కన్నుల కాంతి నందముగాఁ బొంది విష్ణువును, వారి నిర్మలమైన చిఱునవ్వుకాంతిచేఁ దెల్లనికాంతిని బొంది మహేశ్వరుఁడును - ఈ రీతిగాఁ ద్రిమూర్తిత్వమును దానే యయినవిధమునఁ బ్రకాశించెను

**విశేషములు.** అలంకారము ఉత్ప్రేక్ష త్రైపురుషము - త్రయాణాం పురుషాణాం సమాహారః - త్రిపురుషమ్ త్రిపురుషస్య భావః త్రైపురుషమ్ - దాని తత్సమ రూపము - త్రైపురుషము

**వ** **మఱియును గొందఱు విదగ్ధాంగనలు సురవరులకుం బ్రతికరంబుఁ జూపుచు** 72

**అర్థము:** మఱియును, కొందఱు, విదగ్ధ + అంగనలు = ప్రౌఢస్త్రీలు, సుర-వరులకున్ = దేవతాశ్రేష్ఠులకు, ప్రతికరంబున్ = చేసినదానికి బదులు పారితోషికాదులు చేయుటను, చూపుచున్

**తాత్పర్యము .** మఱియును గొంతమంది ప్రౌఢస్త్రీలు దేవతాశ్రేష్ఠులకు బదులుపారితోషికాదులు చేయుచు - తరువాతి పద్యముతో నన్వయము

## పెండ్లివారిని జూచి పురస్త్రీలు వితర్కించుట.

**తే.** **వెలుఁగ సూరెలఁ దానదీవియలఁ బోలు**
**నిధులు భూరుహముల పయి నీడ గాఁగఁ**
**బుష్పకముమీఁదఁ గిన్నరుల్ బొగడ వచ్చు**
**ధనదు నల నలకూబరుతండ్రిఁ గంటె?** 73

**అర్థము .** తాన-దీవియలన్ = స్థానదీపములను, పోలు = పోలునట్టి, నిధులు = నవనిధులు, సూరెలన్ = పార్శ్వములందు, వెలుఁగన్ = ప్రకాశింపఁగా, భూరుహముల పయిన్ = చెట్లపై, నీడ + కాఁగన్ = నీడగా, పుష్పకముమీఁదన్ = పుష్పకవిమానము మీఁద, కిన్నరుల్, పొగడన్ = పొగడుచుండఁగా, వచ్చు, అల = ఆ, నలకూబరు-తండ్రిన్ = నలకూబరుని తండ్రియగు, ధనదున్ = కుబేరుని, కంటె- (కంటివి + ఎ) = చూచితివా?

**తాత్పర్యము .** వివిధస్థానములందుఁ బెట్టిన దీపములవలె నవనిధులు పార్శ్వములఁ బ్రకాశించుచుండ, చెట్లపై నీడలవలెఁ బుష్పకవిమానముమీఁదఁ గిన్నరులు పొగడుచుండ, వచ్చునట్టి ఆ నలకూబరుని తండ్రియగు కుబేరునిఁ జూచితివా?

**విశేషములు .** అలంకార ముపమ కంటె కంటివి + ఎ = లిడ్వకారమునకు లోపము - బాల క్రియ 24 అపదాది స్వరసంధి బాల సంధి 11, కంటె

తే. తన సహస్రాక్షదీధితుల్ దనరి యాత
పత్ర తతులెల్లఁ బింఛాతపత్రభాతిఁ
బడగ లెల్లను నేత్రంపుఁ బడగలట్ల
యెసఁగఁ జనుదెంచువాఁడు దేవేంద్రుఁ గంటె? 74

**అర్థము .** తన = తనయొక్క, సహస్ర + అక్ష-దీధితుల్ = వేయి కన్నులకాంతులు, తనరి = ఒప్పి, ఆతపత్ర-తతులు + ఎల్లన్ = గొడుగుల సమూహము లన్నియును, పింఛ + ఆతపత్ర-భాతిన్ = నెమలిపురితోఁ జేయఁబడిన గొడుగుల విధమునను, పడగలు + ఎల్లను = ధ్వజములన్నియును, నేత్రంపుఁబడగల + అట్లు + అ = (నేత్రము + పడగల) = వస్త్రపుఁడెక్కెములవలెనే, ఎసఁగన్ = ఒప్పఁగా, చనుదెంచువాఁడు = వచ్చువాఁడు, అగు, దేవేంద్రున్, కంటె (కంటివి + ఎ) = చూచితివా?

**తాత్పర్యము :** తన వేయికన్నుల కాంతులు ఒప్పుటచే గొడుగుల సమూహములన్నియును నెమలిపురితోఁ జేయఁబడిన గొడుగుల విధమునను, పడగలన్నియును వస్త్రపుఁబడగలవలెను ఒప్పఁగా వచ్చువాఁడగు దేవేంద్రునిఁ జూచితివా?

**విశేషములు .** బహువ్రీహి సమాసాంతముననే అకారాంతముగావలసిన

అక్షిన్ శబ్ద మిట బహువ్రీహి కాకున్నను అకారాంతముగాఁ బ్రయుక్తమగుట విశేషము 8 - 11లోని 'ఆ మీనాక్షి లోలాక్షముల్' ఇట్టిదే అలంకారము తద్గుణము- 'తద్గుణ స్స్వగుణత్యాగా దన్యదీయ గుణగ్రహః' - చంద్రా

ఉ వేదములాదిగా నఖిలవిద్యలు మూర్తులు దాల్చి కొల్వద
క్షాది నవప్రజాపతులు నాంగిరసాదిమునివ్రజంబు నా
హ్లాదముతో నుతింపఁ, గలహంసగతుల్ వొలుపొంద వచ్చువాఁ
డాదిజుఁ డాదికర్త చతురాననుఁ డాతఁడు వారిజాననా! 75

**అర్థము.** వారిజ + ఆననా = పద్మమువంటి ముఖముగలదానా! ఆతఁడు, వేదములు + ఆదిగాన్ = వేదములు మొదలుగా, అఖిల విద్యలున్ = ఎల్ల విద్యలును, మూర్తులు = రూపములు, తాల్చి = ధరించి, కొల్వన్ =సేవింపఁగా, దక్ష + ఆది-నవ-ప్రజాపతులున్ = దక్షుఁడు మున్నుగాఁగల తొమ్మండ్రు బ్రహ్మలు, ఆంగిరస + ఆది-ముని-వ్రజంబున్ = ఆంగిరసుఁడు మున్నుగాఁగల మునుల సమూహమును, ఆహ్లాదముతోన్ = సంతోషముతో, నుతింపన్ = పొగడఁగా, కలహంస-గతుల్ = రాయంచ నడకలు, పొలుపు + ఒందన్ = ఒప్పఁగా, వచ్చువాఁడు, ఆదిజుఁడు = మొదటఁబుట్టినవాఁడు, ఆది-కర్త = మొదటికర్త, అగు, చతురాననుఁడు (చతుర్ + ఆననుఁడు) = నాలుగు మోములు గలవాఁడు - బ్రహ్మ

**తాత్పర్యము.** పద్మముఖీ! ఆతఁడు వేదాదిసకలవిద్యలును సాకారములై కొలువఁగా, దక్షాదులైన తొమ్మండ్రు బ్రహ్మలును, ఆంగిరసుఁడు మున్నగు మునుల సమూహమును సంతోషముతో నుతింపఁగా వాహనమైన రాయంచ నడకలు ఒప్పఁగా వచ్చునట్టివాఁడు ఆదిజుఁడు, ఆదికర్తయైన బ్రహ్మ

**విశేషములు :** నవప్రజాపతులు - భృగువు, పులస్త్యుఁడు, పులహుఁడు, ఆంగిరసుఁడు, అత్రి, క్రతువు, దక్షుఁడు, వసిష్ఠుఁడు, మరీచి చతుర్+ ఆననుఁడు- చతుః + ఆననుఁడు - చతురాననుఁడు ఆంగిరసుఁడు = అంగిరుని పుత్త్రుఁడు - బృహస్పతి

క అరి శంఖ కౌస్తుభంబులు
గరముల నురమునను దాల్చి కమలాప్త సుధా
కర కుజ సంభృతి నవ జల
ధరమో నా వచ్చు ధరణిధరు హరిఁ గంటే? 76

**అర్థము .** అరి-శంఖ-కౌస్తుభంబులు = చక్రము, శంఖము, కౌస్తుభమణి అనువానిని, కరములన్ = చేతులందును, ఉరమునన్ = ఱొమ్మునను, తాల్చి = ధరించి, కమల + ఆప్త-సుధాకర-కుజ-సంభృత-నవ-జలధరమో-నాన్ = పద్మమిత్రుఁడు (సూర్యుఁడు), చంద్రుఁడు, కుజుఁడు అనువారితోఁగూడుకొనిన క్రొమ్మొయిలో యనఁగా, వచ్చు, ధరణిధరున్ = భూమిని ధరించువాఁడు-విష్ణువును-హరిన్ = విష్ణువును, కంటే (కంటివి + ఏ) = చూచితివా?

**తాత్పర్యము .** సుదర్శనచక్రమును, పాంచజన్యమను శంఖమును, కౌస్తుభమణిని చేతులందును, ఱొమ్మునను ధరించి, సూర్యచంద్ర కుజ సహితమైన క్రొత్తమేఘమో యనఁగా వచ్చు విష్ణువును జూచితివా?

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష చక్రము సూర్యునివలెను, శంఖము చంద్రునివలెను, కౌస్తుభము కుజునివలెను, విష్ణువు క్రొత్త మేఘమువలెను బోల్పఁబడుట చూడఁదగును అరి-(నానా) చక్రము, శత్రువు తెలుఁగుపదమగుచో కప్పము, నారి

చ తన రజతాద్రితోన విదితంబుగ నీశుఁడు వచ్చెఁ, బోల, దెం
దును గిరు లేఁగనేర, విది ధూర్జటి నందియ, కాదు నందికిన్
గనుఁగొన నిట్టి దీర్ఘతమగాత్రముఁ దెల్పును గల్గనే? యనన్
ఘనవిధమంది క్రాలు విషకంరు మహోక్షముపెంపుఁ జూచితే 77

**అర్థము .** తన-రజత + అద్రి-తోన్ + అ = తన వెండికొండతోనే ఈశుఁడు= శివుఁడు, విదితంబుగన్ = ప్రసిద్ధముగా, వచ్చెన్, పోలదు = అది సరికాదు, ఎందును = ఎచ్చటను, గిరులు = కొండలు, ఏఁగన్ + నేరవు = వెడలఁజాలవు, ఇది, ధూర్జటి = శివునియొక్క, నంది + అ = నందియే, కాదు, కనుఁగొనన్ = చూడఁగా, నందికిన్, ఇట్టి దీర్ఘ-తమ-గాత్రమున్ = మిక్కిలి పొడవైన శరీరమును, తెల్పును = తెలుపును, కల్గనే = ఉండునా? అనన్ = అనఁగా, ఘన-విధము = గొప్పదియగు రీతిని, అంది, క్రాలు = ఒప్పునట్టి, విష-కంఠు = విషము కంఠమందుఁగలవాని-శివునియొక్క మహోక్షము = మహత్ (మహా) + ఉక్షము = గొప్పయెద్దుయొక్క, పెంపున్ = అతిశయమును, చూచితే = చూచితివి + ఏ

**తాత్పర్యము .** శివుఁడు తన వెండికొండతోనే ప్రసిద్ధముగా వచ్చెను అది సరికాదు ఏలన ఎచ్చటను గొండలు నడవఁజాలవు ఇది శివుని నందియే కాదు

నందికి ఇట్టి మిక్కిలి పొడవైన శరీరమును, తెలుపును ఉండుట చూడము - అనునట్లు గొప్పగా నొప్పు శివుని పెద్దయెద్దు నతిశయమును జూచితివా?

**విశేషములు .** అలంకారము హేత్వపహ్నవము 'స ఏవ యుక్తిపూర్వ శ్చే దుచ్యతే హేత్వపహ్నుతిః' చంద్రా

చ వరవృషభేంద్ర చిత్రితరవం బెసఁగం దొలఁకాడు గంగ క్రొ
న్నురువులు మౌళిపైఁ జెదరి నూత్నలతాంతవిభాతిగా సుధా
కర కరజాలముల్ దిశలఁ గ్రాలెడు చామరపంక్తిగా సురే
శ్వర హరి పద్మజుల్ వొగడ వచ్చు నుమావరు శంభుఁ జూచితే 78

**అర్థము .** వర-వృషభ + ఇంద్ర-చిత్రిత-రవంబు = శ్రేష్ఠమయిన వృషభరాజముచేఁ గావింపఁబడిన ధ్వని, ఎసఁగన్ = అతిశయింపఁగా, తొలఁకాడు= కలఁగునట్టి-చలించునట్టి, గంగ = గంగయొక్క క్రొన్నురువులు (క్రొత్త + నురువులు), మౌళిపైన్ = శిరస్సుమీఁద, చెదరి, నూత్న-లతాంత-విభాతి + కాన్ = క్రొత్తపూవులయొక్క కాంతి కాఁగా, సుధాకర-కర-జాలముల్ = చంద్రుని కిరణముల సమూహములు, దిశల్ = దిక్కులందు, క్రాలెడు = ఒప్పునట్టి, చామర-పంక్తి + కాన్ = వింజామరముల వరుస కాఁగా, సుర + ఈశ్వర-హరి-పద్మజుల్ = ఇంద్రుఁడు, విష్ణువు, బ్రహ్మ, పొగడన్ = పొగడుచుండఁగా, వచ్చు = వచ్చునట్టి, ఉమా-వరున్ = పార్వతీనాధుని-శివుని, శంభున్, చూచితే

**తాత్పర్యము .** శ్రేష్ఠమైన వృషభరాజము గావించు ఱంకె అతిశయింపఁగాఁ జలించు గంగ క్రొత్తనురువులు శిరస్సుపైఁ జెదరి క్రొత్తపువ్వుల విశేషకాంతికాఁగా, చంద్రకిరణముల సమూహములు దిక్కులందు ఒప్పు వింజామరల వరుసకాఁగా ఇంద్ర విష్ణు బ్రహ్మలు పొగడుచుండఁగా వచ్చెడు శివునిఁ జూచితివా?

**విశేషములు .** శివుని వాహనమైన నంది ఱంకె వేయఁగా నతని శిరము నందలి గంగ క్రొత్తనురువులు శిరస్సుపైఁ జెదరి వింతపూవులవలె నుండెను అతని శిరస్సుననున్న చంద్రుని కిరణములు దిక్కులందు వ్యాపించి వింజామరలవలె నుండెను ఒక మహారాజు వచ్చుచున్నట్లు శివుని రాకను వర్ణించుట చూడనగును అలంకార ముపమ క్రొన్నురువులు - క్రొత్త + నురువులు 'సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చు మీఁదివర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగా నగు' బాల సంధి 36 క్రొ + నురువులు 'క్రొత్తశబ్దమున కాద్యక్షరశేషంబునకుం

గొన్నియెడల నుగాగమంబునుం గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు బాల సంధి 38 క్రొన్నురువులు

వ అనుచు మనోనురాగంబునం జూచుచుండి రంతఁ గొందఱు ప్రౌఢాంగన లీశ్వరు ననేకప్రకారంబుల నుపలక్షించుచు 79

**అర్థము.** అనుచున్, మనోనురాగంబునన్ (మనస్ + అనురాగంబునన్) = మనఃప్రీతితో, చూచుచున్ + ఉండిరి, అంతన్ కొందఱు, ప్రౌఢ + అంగనలు = ప్రౌఢలైన స్త్రీలు, ఈశ్వరున్, అనేక-ప్రకారంబులన్ = పెక్కు రీతుల, ఉపలక్షించుచున్= చూచుచు

**తాత్పర్యము.** అనుచు మనసునకు సంతోషము గలుగునట్లు చూచుచుండిరి అంతఁ గొందఱు ప్రౌఢలైన స్త్రీలు ఈశ్వరుని, బెక్కురీతులఁ జూచుచు - తరువాతి పద్యముతో నన్వయము

చ ఉరురజతాద్రిపైఁ బొగడ నుగ్రతరోన్నతిఁ బాండురాంగు న
త్యరుణజటాచయావృతసితాహిఫణామణు లొప్పు శీతభూ
ధరవరహేమశృంగసువృతంబగు నాకనదీజలంబు బం
ధుర బహువర్ణ విస్ఫురితతోయజకోరకరాజి పెంపునన్ 80

**అర్థము :** ఉరు - రజత + అద్రిపైన్ = గొప్పదియగు వెండికొండమీఁద, పొగడన్ = పొగడునట్లు, ఉగ్రతర + ఉన్నతిన్ = మిక్కిలి భయంకరమైన - అత్యంతమైన ఔన్నత్యముతో, పాండుర + అంగు = తెల్లని శరీరము గలవాని - శివునియొక్క, అతి + అరుణ-జటా-చయ + ఆవృత-సిత + అహి -ఫణా-మణులు = మిక్కిలి యెఱ్ఱనైన జడలసమూహముచే నావరింపఁబడిన తెల్లని పాము పడగలందలి మణులు, శీత-భూధర-వర-హేమ-శృంగ-సువృతంబు + అగు = మంచుకొండయొక్క శ్రేష్ఠమైన బంగరుశిఖరముచే నావరింపఁబడినది అగు, నాక-నదీ-జలంబు = ఆకాశగంగాజలముయొక్క, బంధుర-బహువర్ణ-విస్ఫురిత-తోయజ-కోరక-రాజి-పెంపునన్ = ఒప్పిదములైన పెక్కురంగులతోఁ బ్రకాశించు తామరమొగ్గల సమూహము విధమున, ఒప్పున్

**తాత్పర్యము :** పెద్ద వెండికొండ మీఁద మిక్కిలి ఉన్నతితోఁ దెల్లని శరీరముగల శివుఁ డున్నాఁడు అతని మిక్కిలి యెఱ్ఱనైన జటాసమూహముచే నావరింపఁబడిన

పాముపడగలందలి తెల్లని మణులు - హిమవత్పర్వతపు బంగారు శిఖరముచే నావరింపఁబడిన ఆకాశగంగానదీజలములందు ఒప్పెడు పలురంగుల తామరమొగ్గల వరుసవిధమున నొప్పును

**విశేషములు.** అలంకార ముపమ 'పెంపు' ఉపమావాచకము ఫణామణు లుపమేయము తోయజకోరకరాజి ఉపమానము ఒప్పుట సామాన్య ధర్మము పెంపు = విధము అనుటకు 'సంపాదించు పెంపున' వసు 4 23

చ **స్ఫురదురుఫాలనేత్రశిఖిఁ బూర్ణతరామలబింబ మొక్కపాల్**
**గరఁగె ననంగ నొప్పు శశిఖండము ముందఱఁ గాఁగి క్రమ్మ ను**
**త్కరవర తత్సుధారసము కల్లడి నాఁ దగి జూటపూరితా**
**మరనది పొల్చె నర్ధశశిమండలనిర్జరసింధుమౌళికిన్** 81

**అర్థము.** అర్ధ - శశి - మండల - నిర్జర - సింధు - మౌళికిన్ = సగము చంద్రబింబము, ఆకాశగంగ శిరమునందుఁ గలవానికి - శివునకు, జూట-పూరిత + అమర-నది = జడముడియందు నిండిన ఆకాశగంగ, స్ఫురత్ + ఉరు-ఫాల-నేత్ర-శిఖిన్ = ప్రకాశించుచున్న గొప్ప నుదుటికంటిమంటచే, పూర్ణతర + అమల-బింబము = సంపూర్ణ చంద్రబింబము, ఒక్క-పాల్ = ఒక కొంత భాగము, కరఁగెన్ + అనంగన్ + ఒప్పు = కరఁగెననఁగా నొప్పునట్టి, శశి-ఖండము = చంద్రకళ, ముందఱన్ = ముందుగా, కాఁగి = తప్తమై, క్రమ్మ = వ్యాపించు, ఉత్కరవర-తద్ + సుధా-రసము-కల్లడి = రాశిగల ఆ శశిఖండముయొక్క అమృతరసము యొక్క పొంగు, నాన్ = అనఁగా, తగి = ఒప్పి, పొల్చెన్

**తాత్పర్యము** శిరమున అర్ధచంద్రుడు, దేవనది గల శివునకు, - నొసటి కంటి మంటచే నిండుచంద్రుని బింబ మొకకొంత కరఁగె నన నొప్పు చంద్రకళ, ముందుగాఁ గాఁగి వ్యాపించు దాని అమృతరసము పొంగు అనఁదగి జటాజూటము నందు నిండిన ఆకాశగంగ యొప్పెను

**విశేషములు.** అలంకార ముత్ప్రేక్ష

వ **అని యి ట్లనేకవిధంబుల వితర్కించుచు వర్ణించుచుం జూచుచున్న యవసరంబునం బరమేశ్వరుండు పౌరజనంబుల నయనేందీవరంబుల నిజాననేందుచంద్రికాజాలంబుల నలంకరించుచుఁ దదీయావలోక నామృతనయనకలశంబు లాత్మీయ దయావలోకనామృతానందరసాపూర్ణంబులు**

సేయుచు విపణిమార్గంబు గడచి ప్రాలేయాచలచక్రవర్తి రాజమందిరంబుఁ బ్రవేశించి తదంతఃపురాంగనాదత్తపంచమణి శేషాక్షతాకలితోత్తమాంగుం డగుచుం జనుదెంచి కనకమయ రమ్యహర్మ్య మణిభద్రంబున రుద్రుండు వృషభేంద్రుం జేర్చి డిగ్గి నగపతిదత్తసముత్తుంగమణిసింహాసనాసీనుం డయ్యె నంత హిమవంతుండు మృడు నడుగులు గడిగి తదీయామలజలపవిత్రీకృతాత్మీయమందిరాభ్యంతరుండై పరమానందంబున 87

**అర్థము.** అని, ఇట్లు, అనేక-విధంబులన్, వితర్కించుచున్ = ఊహించుచు, వర్ణించుచున్, చూచుచున్ + ఉన్న, అవసరంబునన్ = సమయమునందు పరమేశ్వరుండు, పౌర-జనంబుల = పురజనులయొక్క, నయన + ఇందీవరంబులన్= కనుఁగలువలను, నిజ + ఆనన + ఇందు-చంద్రికా-జాలంబులన్= తనదైన ముఖచంద్రుని వెన్నెలల సమూహములచే, అలంకరించుచున్, తదీయ + అవలోకన + అమృత-నయన కలశంబులు = వారివైన చూపులనెడి అమృతముగల నేత్రములనెడి పాత్రములను, ఆత్మీయ-దయా-అవలోకన + అమృత + ఆనంద-రస-పూర్ణంబులు = తనదైన దయతోడి చూపులనెడి అమృతానందరసముచే నిండినవి, చేయుచున్, విపణి-మార్గంబు = అంగడివీధి, కడచి = దాఁటి, ప్రాలేయ + అచల-చక్రవర్తి-రాజ-మందిరంబున్ = హిమవత్పర్వతరాజుయొక్క రాజభవనమును, ప్రవేశించి, తద్ + అంతఃపుర + అంగనా-దత్త-పంచ-మణి-శేష + అక్షత + ఆకలిత + ఉత్తమాంగుండు = ఆతని అంతఃపురస్త్రీలచే నీఁబడిన అయిదుమణులు, సేసఁబ్రాలు అనువానిచేఁ గూర్పఁబడిన శిరస్సు గలవాఁడు, అగుచున్, చనుదెంచి, కనకమయ-రమ్య-హర్మ్య-మణి భద్రంబునన్ = బంగారుతో నిర్మింపఁబడిన సుందరమైన మేడయందలి మణిభద్రమునందు, రుద్రుండు = శివుఁడు వృషభ + ఇంద్రున్ = వృషభరాజమును - నందిని, చేర్చి, డిగ్గి = దిగి, నగ-పతి-దత్త-సముత్తుంగ-మణి-సింహాసన + ఆసీనుండు = కొండలఱేనిచే నీఁబడిన మిక్కిలి యెత్తయిన మణినిర్మితమైన సింహాసనమునందుఁ గూర్చున్నవాఁడు, అయ్యెన్, అంతన్, హిమవంతుండు, మృడు + అడుగులు = ఈశ్వరునియొక్క పాదములు, కడిగి, తదీయ + అమల-జల-పవిత్రీకృత + ఆత్మీయ-మందిర + అభ్యంతరుండు + ఐ = ఆ పవిత్రమైన నీటిచేఁ బావనము చేయఁబడిన తనదైన భవనముయొక్క లోపలిభాగము గలవాఁడయి, పరమ + ఆనందంబునన్ = గొప్ప ఆనందముతో

**తాత్పర్యము .** అని యిట్లు అనేకవిధముల భావించుచు, వర్ణించుచుఁ జూచుచున్న సమయమున నీశ్వరుఁడు పురజనుల కనుఁగల్వలను దనముఖచంద్రుని వెన్నెలల సమూహముచే నలంకరించుచు, వారి చూపులనెడి అమృతముగల నేత్రములనెడి పాత్రములను దన దయాదృష్టియనెడి అమృతరసముతో నిండినవిగాఁ జేయుచు అంగడి వీధిని దాఁటి, హిమవత్పర్వతచక్రవర్తి రాజభవనమును బ్రవేశించి, అందలి అంతఃపురస్త్రీలు తన శిరస్సున పంచమణులు సేసఁబ్రాలు చల్లఁగా వచ్చి సువర్ణమయమైన రమ్యహర్మ్యమునందలి మణిభద్రమునఁ దన వాహనమైన నందిని జేర్చి, దిగి, పర్వతరా జొసంఁగిన సమున్నతమణిమయసింహాసనమున నాసీనుఁ డయ్యెను అంత హిమవంతుఁడు శివుని పాదములు గడిగి యా పవిత్రజలములచే భవనాంతరమును బావనము చేసికొని పరమానందముతో - తరువాతి పద్యముతో నన్వయము

క "పరమేశ్వరు పాదోదక
పరివృతమై నేఁడు లగ్గఁ బావనమై సు
స్థిరమై మద్గృహమును మ
త్పురము శుభోన్నతిఁ ద్రిలోకపూజ్యం బయ్యెన్ 83

**అర్థము**:పరమేశ్వరు = మహేశ్వరుని యొక్క, పాద + ఉదక-పరివృతము+ ఐ = అడుగులు గడిగిన నీటిచేఁ జుట్టఁబడినదయి, నేఁడు = ఈదినము, మత్ + గృహమును = నా యిల్లును, మత్ + పురమున్ = నా నగరమును, లగ్గన్ = మిక్కిలి, పావనము + ఐ = పవిత్రమయి, సుస్థిరము + ఐ = నిలుకడగలదియై, శుభ + ఉన్నతిన్ శుభాధిక్యముచే, త్రిలోక-పూజ్యంబు = ముల్లోకములకుఁ బూజింపఁదగినది, అయ్యెన్

**తాత్పర్యము .** పరమేశ్వరుని పాదోదకముచేఁ బరివృతమయి, నేఁడు నా గృహమును, నా పురమును మిక్కిలి పావనమయి శుభాధిక్యముచే ముల్లోకములకుఁ బూజింపఁదగినది అయ్యెను

వ. **అనుచుండె నంతం దత్పురజనంబులు పరమానందరసప్రవాహమునం దేలుచు** 84

**అర్థము .** అనుచున్ + ఉండెన్, అంతన్, తద్ + పుర-జనంబులు = ఆ నగరమునందలి జనులు, పరమ + ఆనంద-రస-ప్రవాహమునన్ = గొప్ప ఆనందరసముయొక్క ప్రవాహమునందు, తేలుచున్ -

**తాత్పర్యము.** అని పలుకుచుండెను అంత, నా నగరవాసులు పరమానంద రసప్రవాహమునఁ దేలుచు - తరువాతి పద్యముతో నన్వయము

క గిరిసుత కారణమున నీ
శ్వరు నింటికిఁ దెచ్చుకొనియె శైలేంద్రుఁడు సుం
దర వర తనయలఁ బడసిన
పురుషులు దా రెందు రాజపూజ్యులు గారే? 85

**అర్థము.** శైల + ఇంద్రుఁడు = పర్వతరాజు, గిరి-సుత-కారణమునన్ = పార్వతికారణముగా, ఈశ్వరున్, ఇంటికిన్, తెచ్చుకొనియెన్, సుందర-వర-తనయలన్= అందమైన మేలికూఁతులను, పడసిన = పొందిన, పురుషులు-తారు = ఆ పురుషులు, ఎందున్ = ఎక్కడనైనను రాజ-పూజ్యులు = రాజులచేఁ బూజింపఁదగినవారు, కారే = కారా! అగుదు రనుట

**తాత్పర్యము :** పర్వతరాజు పార్వతి కారణమున నీశ్వరుని ఇంటికిఁ దెచ్చుకొనియెను అందమైన మేలికూఁతులు గల పురుషు లెందయినను రాజపూజ్యు లగుదురు కదా!

**విశేషములు** అలంకార మర్థాంతరన్యాసము

వ **అనుచు ననేక ప్రధాన సురపురుషులు దమతమ రమ్యహర్మ్యంబుల హరి పరమేష్ఠి పురందరాద్యమరవరుల విడియించి రంత నటఁ బురాభ్యంతర బాహ్యోద్యానవనంబులం దఖిలజనంబులుం గ్రిక్కిఱిసి విడిసి తత్పురజనాభ్యర్చితు లగుచుం బరమసుఖలీలం బ్రవర్తించుచుండి రంత** 86

**అర్థము:** అనుచున్, అనేక-ప్రధాన-సుర-పురుషులు = పెక్కండ్రు ముఖ్యులైన దివ్యపురుషులు, తమ-తమ, రమ్య-హర్మ్యంబులన్ = సుందరములయిన మేడలందు, హరి-పరమేష్ఠి - పురందర + ఆది + అమరవరులన్ = విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుఁడు మున్నగు దేవతాశ్రేష్ఠులను, విడియించిరి = బసచేయించిరి, అంతన్, అటన్, పుర + అభ్యంతర-బాహ్య + ఉద్యానవనంబులందున్ = నగరములోపలి, వెలుపలి ఉద్యానవనములందు, అఖిల-జనంబులున్ = ఎల్ల జనులును, క్రిక్కిఱిసి-విడిసి = క్రిక్కిఱియునట్లు బసచేసి, తద్ + పుర-జన + అభి + అర్చితులు = ఆ నగరమునందలి జనులచేఁ బూజింపఁబడినవారు, అగుచున్, పరమ-సుఖ-లీలన్= మిక్కిలి సౌఖ్యముతో, ప్రవర్తించుచున్ + ఉండిరి, అంతన్

**తాత్పర్యము .** అనుచుఁ బెక్కండ్రు ముఖ్య దివ్యపురుషులు తమతమ సుందరహర్మ్యములందు విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుఁడు మున్నగు దేవతాశ్రేష్ఠులను విడిదిచేయించిరి అంత నట నగరము లోపలి వెలుపలి ఉద్యానవనములందు జను లెల్లరును గ్రిక్కిఱియునట్లు బసచేసి యా యూరిజనులచేఁ బూజితులగుచు మిక్కిలి సౌఖ్యముతోఁ బ్రవర్తించుచుండిరి అంత-తరువాతి పద్యముతో నన్వయము

క మృడు బలము లుర్విఁ గ్రిక్కొన
విడిసిన దశశతకరుండు విడియఁగ దన కె
య్యెడ నెడ సాలక యరిగిన
వడువున నపరాద్రి నందవనమున కరిగెన్ 87

**అర్థము.** మృడు-బలములు = శివుని సైన్యములు, ఉర్విన్ = భూమియందు, క్రిక్కొనన్-విడిసినన్ = క్రిక్కిఱియునట్లు విడిదిచేయఁగా, దశ-శత-కరుండు = వేయి కిరణములవాఁడు - సూర్యుఁడు, విడియఁగన్ = బసచేయుటకు, తనకున్ ఎయ్యెడన్ (ఏ + ఎడన్) = ఎచ్చోటను, ఎడ = ఎడము, చాలక, అరిగిన-వడువునన్ = వెడలిపోయిన రీతిని, అపర +అద్రి-నంద-వనమునకున్ = పడమటి కొండయందలి ఉద్యానవనమునకు, అరిగెన్

**తాత్పర్యము**·శివుని సైన్యము భూమియందుఁ గ్రిక్కిఱియునట్లు విడియఁగా, సహస్రకిరణుఁడైన సూర్యుఁడు తన కెచ్చటను విడియుటకుఁ జోటు చాలక వెడలెనా యనునట్లు పడమటికొండయందలి యుద్యానవనమునకు వెడలెను

**విశేషములు.** అలంకర ముత్ప్రేక్ష సూర్యుఁడు సహస్రకిరణుఁ డగుటచేతనే వానికి నగరమునఁ జోటు చాలలేదనుట

## సూర్యాస్తమయ వర్ణనము

వ త దనంతరంబ 88

**అర్థతాత్పర్యములు :** ఆ వెంటనే, తరువాతి పద్యముతో నన్వయము

క పోంక నలినీ రజస్వల
సోంకిన దోషంబు వాయ సూర్యుఁడు కలితా
శంక నపరాంబునిధిలోఁ
గ్రుంకె నాకో యనఁగఁ బ్రొద్దు గ్రుంకుడు నంతన్ 89

**అర్థము** . పొంకన్-పోఁకన్ = వేఁగుఁబోఁకయందు - ఉదయసంధ్యా సమయమున, నలినీ-రజస్వలన్= తామరతీఁగ యనెడు ముట్టుతను, పుష్పవతిని, సోంకిన = సోఁకిన, దోషంబు = పాపము, పాయన్ = పోవుటకు, సూర్యుఁడు, కలిత+ ఆశంకన్ = కూడిన అనిష్ట శంకతో, అపర + అంబునిధిలోన్ = పడమటి సముద్రమునందు, క్రుంకెన్ + ఒకో = మునిఁగెనా, అనఁగన్, ప్రొద్దు-క్రుంకుడున్= సూర్యాస్తమయము కాఁగానే, అంతన్

**తాత్పర్యము.** తామరతీఁగ యనెడు రజస్వలను దాఁకిన పాపము పోవుటకు సూర్యుఁడు అనిష్టశంకతోఁ బడమటి సముద్రమున మునిఁగెనా యనునట్లు సూర్యాస్తమయము కాఁగా - అంత తరువాతి పద్యములో నన్వయము

**విశేషములు** . రజస్వల యనఁగా రజస్సుగలదియని యర్థము రజస్సు అనఁగా - పుప్పొడియనియు, ముట్టునెత్తురనియు, నర్థము నలిని = పద్మిని నలినీ పక్షమునఁ బుప్పొడి గలది యనియు, స్త్రీ పక్షమున ముట్టుతయనియుఁ జమత్కారము ముట్టుతను దాఁకుట దోషము స్నానము చేయుటయే తత్పరిహారము అలంకారము రూపకానుప్రాణితమైన హేతూత్ప్రేక్ష ప్రొద్దు - వికృతి - ప్రొద్దు - ప్రకృతి పొంక, సోంక అను పూర్ణబిందురూపముల ప్రయోగము నన్నెచోడని ప్రాచీనతకు నిదర్శనము

చ **ఇనుఁ డొడఁగూడి రాక కుదధీశుదిగంగన రాగ మొందెనో**
**యన నెఱసంజ పర్వె నమరాధిపదిక్సతి దానిఁజూచి వం**
**దినఁ దనుకంతి మాసె ననఁ దె ల్పుఱఁ జీఁకటి గప్పె; నంబుజా**
**సన హరి విశ్వరూపయుగసంగమలీల నభంబు పొల్పుగాన్** 90

**అర్థము** అంబుజ + అసన = పద్మము పీఠముగాఁగల వాఁడు - బ్రహ్మ, హరి = విష్ణువు, అనువారియొక్క, విశ్వ-రూప-యుగ-సంగమ-లీలన్ = విశ్వరూపముల జంటయొక్క కూడికవలె, నభంబు = ఆకాశము, పొల్పుగాన్ = ఒప్పుగా, ఇనుఁడు = సూర్యుఁడు - ప్రభువు-భర్త, ఒడఁగూడి = సమ్మతించి, రాకకున్= వచ్చుటకు, ఉదధి = ఈశు-దిశ్(క్) + అంగన = సముద్రాధిపతియగు వరుణుని దిక్కు అగు పడమర యను స్త్రీ, రాగము = ప్రేమ, ఎఱుపు, ఒందెనో = పొందెనా, అనన్, నెఱసంజ = నిండుసంధ్య, పర్వెన్ = వ్యాపించెను, అమర + అధిప-దిశ్(క్) + సతి = దేవతల ప్రభువైన ఇంద్రుని దిక్కు అగు తూర్పు అనెడి స్త్రీ, దానిన్ = పడమటి దిక్కనెడి స్త్రీ రాగమొందుటను, చూచి, వందినన్ =

దుఃఖింపఁగా, తను-కాంతి = శరీరకాంతి, మాసెన్ + అనన్ = నల్లఁబడె ననఁగా, తెల్పు + అటన్ = తెలుపు నశింపఁగా, చీఁకటి, కప్పెన్ = క్రమ్మెను

**తాత్పర్యము** బ్రహ్మ విష్ణువుల విశ్వరూపముల జంట కూడిన విధమున నాకాశమొప్పఁగాఁ బడమటి దిక్కున నెఱసంజయుఁ దూర్పుదిక్కునఁ జీఁకటియుఁ గ్రమ్మెను పడమట నెఱసంజ పర్వుట ప్రభువగు సూర్యుఁడు సమ్మిళించి వచ్చుటకు అపరదిక్సతి రాగమొందెనా యనున ట్లుండెను తూర్పునఁ జీఁకటిక్రమ్ముట అపర దిక్సతి తనకు లభించిన భర్తృసంగమసుఖముచే రాగమొందుటను జూచి ప్రాచీదిశాంగన అసూయపడి నల్లనయినట్లుండెను

**విశేషములు.** నెఱసంజయుఁ, జీఁకటియు వ్యాపించుట బ్రహ్మ విష్ణువుల విశ్వరూపద్వయమువలె నుండుటకు బ్రహ్మ రక్తవర్ణుఁడుగను, విష్ణువు నీలవర్ణుఁడుగను నుండుటయే కారణము ఇనుఁడు, రాగము అను శబ్దముల కర్థద్వయముండుటచే శ్లేషము తదనుప్రాణితమైన హేతూత్ప్రేక్ష ఉదధీశుదిగంగన, అమరాధిప దిక్సతి యనుచో రూపకమును, ఉత్ప్రేక్ష, తదుత్థాపితము విశ్వరూప మనుట యేలయన ఆ యెఱుపును నలుపును నభమంతయు వ్యాపించుటచే నెఱసంజ పర్వె - నెఱసంజ + పర్వె, నభంబు వొల్పుగాన్ - నభంబు + పొల్పుగాన్ - గసడదవాదేశము సంధ్య - ప్రకృతి - సంజ - వికృతి

ఆ **కువలయారి సనియెఁ గువలయహితుఁడగు**
**రాజు వచ్చె నని కరంబు నమ్మి**
**రమణ లోక మెల్ల రాగిల్లిన ట్లెఱ**
**సంజ గలయఁ బర్వె సకలదిశల** 91

**అర్థము .** కువలయ + అరి = కలువల శత్రువు (సూర్యుఁడు) భూవలయమునకు శత్రువు, చనియెన్ = పోయెను, కువలయహితుఁడు = కలువలకు మిత్రుఁడు - చంద్రుఁడు - భూవలయమునకు మిత్రుఁడు, అగు, రాజు = చంద్రుఁడు - ప్రభువు, వచ్చెన్, అని, కరంబున్ = మిక్కిలి, నమ్మి, రమణన్ = ప్రీతితో, లోకము + ఎల్లన్ = లోకమంతయు, రాగిల్లు + అట్లు = సంతోషించునట్లు ఎఱ్ఱనైన విధమున, ఎఱసంజ = ఎఱ్ఱని సంధ్య, సకల-దిశలన్ = ఎల్లదిక్కులను, కలయన్ = అంతటను, పర్వెన్ = వ్యాపించెను

**తాత్పర్యము.** కలువల శత్రువైన సూర్యుఁడు (భూవలయమునకు శత్రువని అర్థాంతరము) పోయెను, కలువలకు మిత్రుఁడైన రాజు - చంద్రుడు

(భూవలయమునకు మిత్రుఁడైన ప్రభువని అర్థాంతరము) వచ్చెను లని మిక్కిలి విశ్వసించి ప్రీతితో నానందించునట్లు ఎఱ్ఱని సాయంసంధ్య యెల్లదిక్కులందును అంతటను వ్యాపించెను

**విశేషములు .** కువలయ శబ్దమునకును, రాజ శబ్దమునకును అర్థద్వయముండుటచే అలంకారము శ్లేషము రాగిల్లు - సంతోషించు, ఎఱ్ఱనగు - అనుటచేతను శ్లేషము శ్లేషానుప్రాణితమగు హేతూత్ప్రేక్ష

తే చాలఁ బ్రియుఁడగు శశి నిశాసంగతాను
రాగ రసమున సంధ్యానురాగ మడరి
కవయ నా చంద్రరజనీముఖముల నడరు
ఘర్మబిందు లనంగఁ జుక్కలు వెలింగె 92

**అర్థము :** చాలన్ = మిక్కిలి, ప్రియుఁడు + అగు + ఇష్టుఁడగు, శశి = చంద్రుఁడు, నిశా-సంగత + అనురాగ - రసమునన్ = రాత్రియనెడు స్త్రీయందుఁగూడిన ప్రేమరసముచే, సంధ్యా + అనురాగము = సంజయనెడి యనురాగము, అడరి = విజృంభించి - అధికమయి, కవయన్ = కూడఁగా, ఆ-చంద్ర-రజనీ-ముఖములన్ = ఆ చంద్ర రాత్రి ముఖములందు, అడరు = వ్యాపించు, ఘర్మబిందులు = చెమట బొట్టులు, అనంగన్, చుక్కలు, వెలింగెన్

**తాత్పర్యము :** మిక్కిలి యిష్టుఁడగు చంద్రుఁడు అను నాయకుఁడు రాత్రియను నాయికయందుఁ గలిగిన ప్రేమరసముచే సంజయను ప్రేమ మధికమయి కూడఁగా, ఆ చంద్ర రాత్రి ముఖములందు వ్యాపించు స్వేదబిందువులా యనునట్లు నక్షత్రములు ప్రకాశించెను

**విశేషములు :** శశి యను పుంలింగశబ్దముచే నాయకప్రతీతియును, నిశా యను స్త్రీలింగశబ్దముచే నాయికా ప్రతీతియును గలుగుచున్నవి సంధ్యానురాగము - సంధ్యయనెడి అనురాగము - రూపకము తదనుప్రాణితమైన ఉత్ప్రేక్షాలంకారము

మణిగణనికరము సరసిజహితుఁ డటు సనఁ దరతర మ
త్యరుణరుచిని మెఱుఁ గడరుడు వడి నం
బరమున నడుతతి ప్రవిమల మయ్యెన్
నిరుపమ మణిగణ నికర విభాతిన్ 93

**అర్థము.** సరసిజ-హితుఁడు = పద్మమిత్రుఁడు - సూర్యుఁడు, అటు = ఆ విధముగా, చనన్ = పోవఁగా, తరతరము = క్రమక్రమముగా, అతి + అరుణ-రుచిని = మిక్కిలి ఎఱ్ఱనైన కాంతితో, మెఱుఁగు = ప్రకాశము, అడరుడున్ = వ్యాపించినంతనే, వడిన్ = వేగముగా, అంబరమునన్ = ఆకాశమున ఉడు-తతి = నక్షత్రముల సమూహము, నిరుపమ, మణి - గణ - నికర - విభాతిన్ = సాటిలేని, మణులయొక్క సమూహముయొక్క విశేషమైన కాంతితో, ప్రవిమలము + అయ్యెన్ = మిక్కిలి నిర్మల మయ్యెను

**తాత్పర్యము** ఆ రీతిగా సూర్యుఁడు అస్తమింపఁగాఁ గ్రమక్రమముగా మిక్కిలి ఎఱ్ఱనైన కాంతితోఁ గాంతి వ్యాపించినంతనే వేగముగా నాకాశమున నక్షత్రముల సమూహము మణిగణనికరవిశేషకాంతితో నిర్మల మయ్యెను

**విశేషములు.** మణిగణనికరము - ఛందస్సు నాలుగుపాదములుండును ప్రతిపాదమునను - న - న - న - న - స అనుగణము లుండును మొదటి యక్షరమునకును తొమ్మిదవ యక్షరమునకును యతిమైత్రి ప్రాసనియమము గలదు పద్యనామము పద్యమున నిబంధింపఁబడుట గమనింపఁదగినది

క **కోకనదంబులు మొగుడం**
**గోకంబులు విరిసి దిశలకుం జన మెఱుఁగై**
**ప్రోకలు గొని మౌక్తిక నిక**
**రాకర మనఁ దార లెసఁగె నంబరవీథిన్** 94

**అర్థము.** కోకనదంబులు = చెందమ్ములు, మొగుడన్ = ముడిచికొనఁగా, కోకంబులు = చక్రవాకములు, విరిసి = చెదరి, దిశలకున్ = దిక్కులకు, చనన్ = వెడలఁగా, తారలు = నక్షత్రములు, మెఱుఁగు + ఐ = ప్రకాశవంతములయి, ప్రోకలు + కొని = గుంపులయి, మౌక్తిక-నికర + ఆకరము + అనన్ = ముత్యాల గుంపులకు స్థానమనఁగా, అంబర-వీథిన్ = ఆకాశమార్గమున, ఎసఁగెన్ = ఒప్పెను

**తాత్పర్యము :** చెందమ్ములు ముకుళింపఁగా, చక్రవాకములు చెదరి దిక్కులకుఁ జనఁగా, ప్రకాశవంతములయి, గుంపులయి, నక్షత్రములు ముత్యాల సమూహమన, నాకాశమున నొప్పెను

**విశేషములు :** అలంకారము స్వభావోక్తి, ఉపమ

క **తఱిఁ దఱి నినుతో నడవక**
**పిఱు సిక్కిన రుచులు తమము బిట్టడరుడు ని**
**వ్వెఱ నిండ్లలోన డాఁగిన**
**తెఱఁగున నుద్దీపదీపదీప్తులు వెలిఁగెన్** 95

**అర్థము .** తటిన్ + తటిన్ = తోడ్తో, ఇనులోన్ = సూర్యునిలో, నడవక, పిఱు + చిక్కిన = వెనుకఁబడిన, రుచులు = కాంతులు, తమము = చీఁకటి, బిట్టు = శీఘ్రముగా, అడరుడున్ = వ్యాపించినంతనే, నివ్వెఱన్ (నిండు + వెఱ) = మిక్కిలి భయముతో, ఇండ్లలోనన్, డాఁగిన = దాఁగిన, తెఱంగునన్ = విధమున, ఉద్దీప-దీప-దీప్తులు = ప్రకాశవంతములైన దీపముల కాంతులు, వెలిఁగెన్= ప్రకాశించెను

**తాత్పర్యము ·** సూర్యునితో వెనువెంట నడవక వెనుకఁబడిన కాంతులు చీఁకటి శీఘ్రముగా వ్యాపించినంతనే మిక్కిలి భయపడి యిండ్లలో డాఁగినరీతిని ప్రకాశమానములగు దీపముల కాంతులు వెలుఁగొందెను

**విశేషములు .** అలంకారముత్ప్రేక్ష నివ్వెఱ - నిండు + వెఱ - 'అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి ' బాల సంధి 39

వ అయ్యవసరంబున 96

**అర్థతాత్పర్యములు .** ఆ + అవసరంబునన్ = ఆ సమయమున తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** ఆ + అవసరంబునన్ - యడాగమము - బాల సంధి 3 ఆ + యవసరంబునన్ త్రికసంధి బాల సమాస 14,13 అయ్యవసరంబునన్

**అందకార వర్ణనము**

**సీ హరి గడుఁబ్రీతిఁ గస్తురి పూసెనో? కాలుఁ**
**డర్థిఁ గాలాగరు వలఁదె నొక్కొ?**
**మహిషాసురుఁడు కర్దమం బాడెనో? మహా**
**కాళి నీలపటంబుఁ గప్పెనొక్కొ?**
**మదహస్తిపై నలిమండలి ముసరెనో?**
**బలి నీలభూషాలిఁ బొలిచెనొక్కొ?**

**ఆ. భైరవుండు కృష్ణఫణిమయాకల్పముల్**
**దాల్చెనో యనంగఁ దరతరంబ**
**దలిచి తూఱరాని తఱచుతో నభమున**
**భూరితరమహాంధకార మడరె** 97

**అర్థము** హరి = విష్ణువు, కడున్ + ప్రీతిన్ = మిక్కిలి సంతోషముతో, కస్తురి = కస్తూరి, పూసెనో, కాలుఁడు = యముఁడు అర్థిన్ = కోరికతో, కాల + అగరువు = నల్లని అగరు, అలఁదెన్ + ఒక్కొ = పూసెనో

మహిష + అసురుఁడు, కర్దమంబు + ఆడెనో = బురదయందు స్నానము చేసెనో, మహాకాళి, నీల-పటంబున్ = నల్లని వస్త్రమును, కప్పెన్ + ఒక్కో = కప్పెనా?

మద-హస్తిపైన్ = మదపుటేనుఁగుమీఁద, అలిమండలి = తుమ్మెదల గుంపు, ముసరెనో, బలి = బలరాముఁడు, నీల-భూషా + ఆలిన్ = నల్లని అలంకారముల వరుసతో, పొలిచెన్ + ఒక్కొ = ఒప్పెనా?

భైరవుండు = ఈ పేరుగల శివగణాధిపుఁడు, కృష్ణ-ఫణి-మయ + ఆకల్పముల్ = నల్లని పాఁపతొడవులు, తాల్చెనో = ధరించెనో; 'అనంగన్, తరతరంబు + అ = క్రమక్రమముగా, దలిచి = వ్యాపించి (?), తూఱన్ + రాని = చొరనలవికాని, తఱచుతోన్ = సాంద్రతతో, నభమునన్ = ఆకాశమున, భూరితర-మహత్ (మహా) +అంధకారము = మిక్కిలి ఎక్కువయైన గొప్పచీఁకటి, అడరెన్ = వ్యాపించెను

**తాత్పర్యము** · విష్ణువు మిక్కిలి ప్రీతితోఁ గస్తూరిని బూసికొనెనా? కాలుఁడు కోరికతోఁ గాలాగరువును అలఁదికొనెనా? మహిషాసురుఁడు బురదలో మునిఁగెనా? మహాకాళి నల్లనివస్త్రమును గప్పికొనెనా? మదగజముపైఁ దుమ్మెదల గుంపు వ్యాపించెనా? బలరాముఁడు నల్లనియలంకారములతో నొప్పెనా? భైరవుఁడు నల్లత్రాఁచు ఆభరణములను ధరించెనా? అనురీతిని గ్రమక్రమముగాఁ జొచ్చుటకు వీలులేని సాంద్రతతో నాకాశమున నధికమైన గాఢాంధకార మలముకొనెను

**విశేషములు.** అలంకారము ఉత్ప్రేక్ష నల్లనివారును, నల్లనివియును నల్లని వస్తువులను పూసికొనుటయో, కప్పికొనుటయో చేసినట్లు చెప్పుట నల్లని చీఁకటితోడి యుత్ప్రేక్షకు దలిచి - తెలియలేదు ప్రకరణానుగుణముగా నర్థము వ్రాయఁబడినది సీస పద్యమునందలి మూఁడవ పాదము లుప్తమయినది

క నుత వర్ణాంతర నిమ్నో
న్నత తల నిఖిలోచ్చ నీచ నానావస్తు
స్థితి సమము సేసె గత గౌ
రతఁ జీఁకటి దుర్వివేకి రాజ్యముపోలెన్. 98

**అర్థము :** చీఁకటి, గత-గౌరతన్ = పోయిన తెల్లఁదనముతో, దుర్వివేకి - రాజ్యము-పోలెన్ = మంచి వివేకము లేనివాని రాజ్యము వలె, నుత స్థితిన్ నుత = పొగడఁబడిన, వర్ణ + అంతర = రంగుల (కులముల) భేదము, నిమ్న + ఉన్నత తల = పల్లపు ఎత్తు ప్రదేశములు, నిఖిల + ఉచ్చ-నీచ = ఎల్ల ఎక్కువ తక్కువలుగల, నానా = అనేక, వస్తు = వస్తువులయొక్క, స్థితిన్ = ఉనికిని, సమము + చేసెన్ = సమానము చేసెను

**తాత్పర్యము .** చీఁకటి పోయినతెల్లఁదనముతో దుర్వివేకముగల రాజు రాజ్యమువలె వర్ణభేదములు, నిమ్నోన్నతములు, ఉచ్చనీచములు గల పెక్కువస్తువుల స్థితిని సమానము చేసెను

**విశేషములు .** చీఁకటిలో రంగుల పరస్పరభేదములు, ఎత్తు పల్లములు, ఉచ్చనీచములు తెలియవు దుర్వివేకియైనరాజు రాజ్యమునందును, కులభేదములు, ఎక్కువ తక్కువలు, మంచి చెడ్డలు నశించి యందఱును సమానముగా నుందురు అలంకార ముపమ

తే చీరి నేతితోఁ గాటుక చిక్క మెదిచి
నెఱయ బ్రహ్మాండకుహరంబు తెఱపిఁ గదియ
వరుసతో ముద్ద పరువడి వైచి కలయ
నీలి గుడిపిన క్రియఁ జీకువాలు గవిసె 99

**అర్థము :** చీరి-నేతితోన్ = ఇంచుక నేతితో, కాటుక, చిక్కన్ = చిక్కఁగా, మెదిచి = ఒకచేతివ్రేలిపైనుంచి వేఱొకవ్రేలితోరాచి, నెఱయన్ = నిండుగా, బ్రహ్మాండ-కుహరంబు + తెఱపిన్ = గుహవంటి బ్రహ్మాండముయొక్క తెఱపిని, కదియన్ = కూడునట్లు, వరుసతోన్, ముద్ద, పరువడిన్ = శీఘ్రముగా, వైచి, కలయన్=అంతటను, నీలి-కుడిపిన-క్రియన్=నైల్యమును వ్యాపింపఁజేసిన రీతిని, చీకువాలు = చీఁకటి, కవిసెన్ = క్రమ్మెను

**తాత్పర్యము :** ఇంచుక నేతితోఁ గాటుక చిక్కఁగా వ్రేలితో రాచి బ్రహ్మాండకుహరము తెఱపిని బూర్ణముగాఁ గూడునట్లు ముద్దను శీఘ్రముగా వైచి అంతటను నైల్యమును వ్యాపింపఁజేసినరీతిని చీఁకటి వ్యాపించెను

**విశేషములు .** అలంకారము ఉత్ప్రేక్ష

వ అంతం దెటపి గని జారచోరాది గూఢాచారు లత్యుత్సవంబునం బ్రచరింప నుద్యుక్తులై

**అర్థము** . అంతన్, తెటపి + కని = వీలుచూచి, జార-చోర + ఆది-గూఢ+ ఆచారులు = వ్యభిచారులు, దొంగలు, మున్నగు రహస్య వ్యాపారులు, ప్రచరింపన్ = సంచరించుటకు, ఉద్యుక్తులు + ఐ = ప్రయత్నించిన వారయి

**తాత్పర్యము** . అంత వీలుచూచుకొని జారులు, చోరులు మున్నగు రహస్యవ్యాపారులు సంచరించుటకుఁ బ్రయత్నించినవారయి - తరువాతి పద్యముతో నన్వయము

## జారచోరాది వర్ణనము

ఉ సన్నలువాఱఁ బల్కుచుఁ గుచంబులు సూపుచుఁ గెల్లగించి క్రేఁ
గన్నులఁ దూఱఁజూచుచు, మొగంబునకున్ మురిపెంబుఁ దెచ్చుచున్
బిన్నటినవ్వు నువ్విడుచుఁ బెన్నెఱివేణులు సప్పరించుచుం
జె న్నొదవించుచున్ జఱభిచెయ్వులు దాల్చిరి జారకామినుల్. 101

**అర్థము** : జార-కామినుల్ = వ్యభిచరించు స్త్రీలు, సన్నలు-వాఱన్ = భావము సూచితమగునట్లు, పల్కుచున్, కుచంబులు = స్తనములు, చూపుచున్, కెల్లగించి = పురికొల్పి, క్రేఁగన్నులన్ (క్రేవ + కన్నులన్) = క్రీఁగన్నులతో, తూఱన్ + చూచుచున్ = గాటముగాఁ జూచుచు, మొగంబునకున్ = ముఖమునకు, మురిపెంబున్ = చక్కఁదనమును, తెచ్చుచున్, పిన్నటి-నవ్వు = చిఱునవ్వు, నువ్విడుచున్ = మనోహరము చేయుచు, పెన్నెఱి-వేణులు (పెను+నెఱి) = పెద్ద వెంద్రుకలజడలు, చప్పఱించుచున్ = నిమురుచు, చెన్ను + ఒదవించుచున్ = అందమును గలిగించుచు, జఱభి-చెయ్వులు = వేశ్యల చేష్టలు, తాల్చిరి = పూనిరి

**తాత్పర్యము** . వ్యభిచారిణులు భావము సూచితమగునట్లు పల్కుచు, స్తనములు చూపుచు, పురికొల్పి క్రీఁగన్నులతో గాటముగాఁ జూచుచు, ముఖమునకుఁ జక్కఁదనమును దెచ్చుచు, చిఱునవ్వు మనోహరముగా నవ్వుచు, పెద్ద వెంద్రుకల జడలు నిమురుచు, అందమును గలిగించుచు వేశ్యలచేష్టలను జేసిరి

**విశేషములు :** అలంకారము స్వభావోక్తి సన్న (వికృతి) - సంజ్ఞ (ప్రకృతి) పెన్నెఱి - పెను + నెఱి

క  జారపతి రాగరుతిఁ గని
భోరన రాగంబుతోడఁ బొల్తుక సనియెన్
వారక ప్రియు పుత్తెంచిన
వారలతోఁ జనుట గూర్చువారికిఁ జనదే? 102

**అర్థము**. జార-పతి = ఉంకుమగనియొక్క, రాగ-రుతిన్ = అనురాగము తోడి ధ్వనిని, కని = చూచి, భోరన = శీఘ్రముగా, పొల్తుక = స్త్రీ, రాగంబుతోడన్ = అనురాగముతో, చనియెన్ = వెడలెను, వారక = తప్పక, ప్రియు-పుత్తెంచిన-వారలతోన్= ప్రియుఁడు పంపినవారితో, చనుట, కూర్చు-వారికిన్ = ప్రేమించువారికి, చనదే = తగదా?

**తాత్పర్యము** : ఉపపతి రాగమును జూచి ఇంతి రాగముతో శీఘ్రముగా వెడలెను ప్రియుఁడు పంపినవారితోఁ జనుట యిష్టులైనవారికిఁ దగునుగదా!

**విశేషములు** . అలంకార మర్థాంతరన్యాసము

క  ఆలోల దృష్టి సంజ్ఞల
బాలకి దగిలించి జారపతి రావించెన్
లీలానికేతనమునకు
నాలోకనవిద్య వడసినదియును బోలెన్ 103

**అర్థము** . బాలకి = తరుణి, ఆలోకన-విద్య = చూచుటయను విద్య, పడసిన + అదియును + పోలెన్ = పొందినదా యనునట్లు, ఆలోల-దృష్టి-సంజ్ఞలన్ = చంచలములయిన నేత్రసంజ్ఞలను, తగిలించి = తగులుకొనునట్లుచేసి, లీలా-నికేతనమునకున్ = విలాసగృహమునకు, జారపతిన్ = ఉపపతిని, రావించెన్ = రప్పించెను

**తాత్పర్యము** . తరుణి చూచుట యనుకళను బొందినదా యనునట్లు చంచలములయిన కనుసన్నలను దగులుకొనఁజేసి విలాసగృహమునకు ఉపపతిని రప్పించెను

**విశేషములు** . అలంకార ముత్ప్రేక్ష

వ ఇ ట్లనేకప్రకారంబులం గామకేళీలాలసు లగుచుండి రంత నక్కడ

**అర్థము** ఇట్లు, అనేక-ప్రకారంబులన్ = పెక్కువిధముల, కామ-కేళీ-లాలసులు = మన్మథక్రీడాసక్తులు, అగుచున్ + ఉండిరి, అంతన్, అక్కడన్

**తాత్పర్యము** ఈ రీతిగాఁ బెక్కువిధముల మన్మథక్రీడాసక్తు లగుచుండిరి అంత నక్కడ - తరువాతి పద్యముతో నన్వయము

## చంద్రోదయ వర్ణనము

చ తమమను నీలవర్ణపరిధానము వీడఁగఁ, బూర్వశైలశృం
గములనునున్నతస్తనయుగంబు దనర్పఁ జకోరబంధువ
ర్గము ముద మొందఁగా నిజముఖద్యుతి వెల్బుగ, నిండుగర్భచి
హ్నము లభిరామమయ్యె నమరాధిపదిక్సతికిం గ్రమంబునన్ 105

**అర్థము :** అమర + అధిప-దిశ్(క్) + సతికిన్ = దేవేంద్రుని దిక్కు (తూర్పు దిక్కు) అనెడి స్త్రీకి, క్రమంబునన్ = క్రమముగా, తమము + అను = చీఁకటి యనెడి, నీల-వర్ణ-పరిధానము = నల్లరంగు వస్త్రము, వీడఁగన్ = ఊడిపోఁగా, పూర్వ-శైల-శృంగములు = తూర్పుకొండ శిఖరములు, అను, ఉన్నత-స్తనయుగంబు = ఎత్తయిన చన్నులజంట, తనర్పన్ = ఒప్పఁగా, చకోర-బంధు-వర్గము = వెన్నెల పులుఁగులనెడి చుట్టముల సమూహము, ముదము + ఒందఁగాన్ = సంతోషపడఁగా, నిజ-ముఖ-ద్యుతి = తనదైన మొగము కాంతి, వెల్బుగన్ = తెల్లనకాఁగా, నిండు-గర్భ-చిహ్నములు = నిండుచూలు చిన్నెలు, అభిరామము + అయ్యెన్ = మనోహరమయ్యెను

**తాత్పర్యము :** తూర్పుదిక్కనెడు స్త్రీకిఁ జీఁకటియను నల్లరంగు వస్త్ర మూడిపోఁగా, తూర్పుకొండశిఖరములనెడి ఉన్నతములయిన చన్నుల కవ యొప్పఁగా, వెన్నెలపులుఁగు లనెడి బంధువుల సముదాయము సంతోషింపఁగా, తన ముఖకాంతి తెలుపుగా నిండుచూలుచిన్నెలు క్రమముగా మనోహరము లయ్యెను

**విశేషములు :** అలంకారము రూపకము వస్త్ర మూడిపోవుట, చనుఁగవ

పెరుఁగుట, ముఖము తెల్లనగుట అనునవి నిండు చూలి చిన్నెలు ఆ చిన్నెలను జూచి బంధుకోటి అలరును చకోరములకు ముదమేల యన అవి వెన్నెలపులుఁగులు గనుక వెన్నెల యన వాని కిష్టము ముఖము తెల్లనగుట వానికి సంతోషమును గూర్చును

వ తదనంతరంబ 106

**అర్థతాత్పర్యములు.** ఆ తరువాతనే తరువాతి పద్యముతో నన్వయము

శా పూర్వాంభోధిజలంబు లన్నియు వడిం బొ ల్పేదఁగాఁ ద్రాగి త
ద్గీర్వాణోరునదీజలౌఘముల నాక్షేపింప విన్వీధి న
య్యౌర్వోగ్రాగ్ని రయంబున న్నెగసె నా నత్యంతరాగద్యుతుల్
పర్వన్ బి ట్టుదయించెఁ జంద్రుఁ డెదలోఁ బాంథుల్ భయం బందఁగన్ 107

**అర్థము.** పూర్వ + అంభోధి-జలంబులు = తూర్పుసముద్రజలములు, అన్నియున్,వడిన్ = వేగముగా, పొల్పు + ఏదఁగాన్ = ఒప్పు నశింపఁగా, త్రాగి, తద్+ గీర్వాణ + ఉరు-నదీ-జల + ఓఘములన్ = ఆ దివ్యనదీ (గంగా) జలప్రవాహములను, ఆక్షేపింపన్= ఆకర్షించుటకు - పీల్చుటకు, విన్వీధిన్ (విను+ వీధిన్) = ఆకాశమార్గమున, అయ్యౌర్వోగ్రాగ్ని - (ఆ+ఔర్వ +ఉగ్ర + అగ్ని) = ఆ భయంకర బడబాగ్ని, రయంబునన్ = వేగముతో, నెగసెన్ + నాన్ = ఎగిరెనా యనునట్లు, అత్యంత-రాగ-ద్యుతుల్ = మిక్కిలి యెఱ్ఱని కాంతులు, పర్వన్ = వ్యాపింపఁగా, పాంథుల్= విరహులు, ఎదలోన్ = హృదయమునందు, భయంబు+ అందఁగన్ = భయపడఁగా, చంద్రుఁడు, బిట్టు + ఉదయించెన్ = శీఘ్రముగా ఉదయించెను

**తాత్పర్యము :** తూర్పుసంద్రమునందలి జలములనన్నిటిని వేగముగా దానియొప్పు నశింపఁగాఁ ద్రాగి ఇంకను ఆకాశగంగాజలములను ద్రావ నాకాశవీధికి ఆ బడబాగ్ని వడిగా నెగిరెనా యనునట్లు, మిక్కిలి యెఱ్ఱనికాంతులు వ్యాపింపఁగా విరహులు హృదయమున భయపడఁగాఁ జంద్రుఁడు శీఘ్రముగా నుదయించెను

**విశేషములు:** అలంకార ముత్ప్రేక్ష పాంథులు భయపడుటకుఁ గారణము చంద్రుఁడు వారికిఁ దాపకారణము గనుక

సీ సంధిల్లు పూర్వదిక్సతి కటి మణికాంచి
రంజిల్లు నాయకరత్న మొక్కొ?
విలసిల్లు నద్దేవి వృత్తస్తనాంతరా
పూరిత కాశ్మీరపుంజ మొక్కొ?
తనరారు నా హరిత్తరళాక్షి పరిపక్వ
బింబారుణాధరబింబ మొక్కొ?
మేలిల్లు నబ్బాల ఫాలతటంబున
విలసిల్లు రోచనతిలక మొక్కొ?

ఆ మవ్వ మొప్పఁ దన సమాగమంబునకు నా
రమణివలనఁ బర్వు రాగ మొక్కొ?
యనఁగ దరతరంబ తనరె నత్యరుణాంగ
భాతిఁ గువలయైకబాంధవుండు 108

**అర్థము.** సంధిల్లు = సమకూడునట్టి, పూర్వ-దిశ్ (క్) + సతి-కటి-మణి-కాంచిన్ = తూర్పుదిక్కనెడు స్త్రీయొక్క మొలయందలి మణిమయమైన మొలనూలియందు, రంజిల్లు = ప్రకాశించునట్టి, నాయకరత్నము + ఒక్కొ = మధ్యమణియా?

విలసిల్లు = ప్రకాశించునట్టి, అద్దేవి ( ఆ + దేవి) = ఆ పూర్వదిక్సతియొక్క, వృత్త-స్తన + అంతర + ఆపూరిత- కాశ్మీర-పుంజము + ఒక్కొ = వట్రువలైన చన్నుల నడుమ నిండింపఁబడిన కుంకుమపువ్వు రాశియా?

తనరారు = ఒప్పునట్టి, ఆ-హరి బింబమొక్కొ = ఆ-హరిత్ + తరళ + అక్షి = ఆ పూర్వదిక్సతియొక్క, పరిపక్వ = మిక్కిలి పండిన, బింబ = దొండపండువలె, అరుణ = ఎఱ్ఱనైన, అధర-బింబము + ఒక్కొ = దొండపండువంటి క్రింది పెదవియా?

మేలిల్లు = శ్రేష్ఠమగు, అబ్బాల ( ఆ + బాల) =ఆ పూర్వదిక్సతియొక్క ఫాల-తటంబునన్ = నొసటిప్రదేశమునందు, విలసిల్లు = ప్రకాశించునట్టి, రోచన-తిలకము + ఒక్కొ = గోరోచనపు బొట్టా,

మవ్వము = ఉత్సాహము, ఒప్పన్ = ఒప్పఁగా తన-సమాగమంబునకున్ = తన సంగమమునకు, ఆ-రమణి-వలనన్ = ఆ పూర్వదిక్సతి నుండి, పర్వు = వ్యాపించునట్టి, రాగము + ఒక్కొ = అనురాగమా? ఎఱుపా?

అనఁగన్, అతి + అరుణ + అంగ-భాతిన్ = మిక్కిలి యెఱ్ఱని మేనికాంతితో, కువలయ + ఏక-బాంధవుండు = కలువలయొక్క ముఖ్యమైన చుట్టము - చంద్రుఁడు, తరతరంబు + అ = అత్యంతము, తనరెన్ = ఒప్పెను

**తాత్పర్యము** . తూర్పుదిక్కనెడు స్త్రీ మొలయందలి మొలనూలియందుఁ బ్రకాశించు మధ్యమణియో, ఆ దేవి వర్తులస్తనముల నడుమ నిండారిన కుంకుమ పువ్వురాశియో, ఆమె పండినదొండపండువలె నెఱ్ఱనైన క్రిందిపెదవియో, ఆమె నుదుటఁ బ్రకాశించు గోరోచనపుఁదిలకమో, తన సంగమమున కామెనుండి వ్యాపించు రాగమో యన మిక్కిలి యెఱ్ఱనికాంతితో కలువలకుఁ జుట్టమైన చంద్రుఁడు మిక్కిలి యొప్పెను

**విశేషములు** . అలంకార ముత్ప్రేక్ష

క **తన రాగంబునఁద్రిజగము**
**ననురాగిల్లెనొ? జగంబు ననురాగముతో**
**ననురాగిల్లెనొ తా మఱి?**
**యన జగములతోన చంద్రుఁ డనురాగిల్లెన్** **109**

**అర్థము.** తన-రాగంబునన్ = తన యెఱుపుతో - ప్రేమముతో, త్రిజగమున్ = మూఁడు లోకములును, అనురాగిల్లెనొ = అనుసరించి యెఱ్ఱనయ్యెనో - ప్రేమమునొందెనో, జగంబు + అనురాగముతోన్ = జగముయొక్క ఎఱుపుతో - ప్రేమముతో, తాన్ = తాను, మఱి, అనురాగిల్లెనొ = ఎఱుపయ్యెనో - ప్రేమమునందెనో, అనన్, చంద్రుఁడు, జగములతోన్ + అ = లోకములతోపాటే, అనురాగిల్లెన్ = ఎఱుపయ్యెను - ప్రేమమునొందెను

**తాత్పర్యము** . తన రాగముచే ముల్లోకములును రాగమునొందెనో, లేక జగము రాగముతోఁ దాను రాగమునొందెనో యనునట్లు చంద్రుఁడు జగములతోపాటే రాగమునొందెను

**విశేషములు** . అలంకారము సహోక్తి సందేహము రాగశబ్దమున కర్థద్వయముచే శ్లేషమును

ఆ పద్మరాగ రాగభాతితో నాకాశ
జలధి జలములందు సంక్రమించి
చంద్రబింబకము నిశాముఖమున నొప్పె
విరహ విధుర కోక విహగ లీల 110

**అర్థము** . చంద్ర-బింబకము = చంద్రమండలము, పద్మ రాగ-రాగ-భాతితోన్= పద్మరాగ మణియొక్క ఎఱ్ఱని కాంతితో; ఆకాశ-జలధి-జలముల + అందున్ = ఆకాశమనెడి సముద్రము జలములందు, సంక్రమించి = చేరి, విరహ-విధుర-కోక-విహగ-లీలన్ = ఎడఁబాటుచే బాధింపఁబడిన చక్రవాకము విధమున, నిశా-ముఖమునన్ = రాత్రి ప్రారంభమున, ఒప్పెన్

**తాత్పర్యము**. చంద్రబింబము పద్మరాగమణి యెఱ్ఱనికాంతితో ఆకాశమనెడి సముద్రజలములలోఁ జేరి నిశారంభమున నెడఁబాటుచే బాధింపఁబడిన చక్రవాక పక్షి విధమున నొప్పెను

**విశేషములు** . అలంకారము రూపకానుప్రాణితమైన ఉపమ

తే తరుణతర శశిమండలాత్యరుణ రుచుల
గొడుగు లెదఁగ్రుచ్చి వడి నెత్తికొనిన సాంద్ర
తిమిరపటలంబు పొలుపారె దీపదీప్తి
పరివృతంబైన కజ్జలపాత్రపోలె 111

**అర్థము** . తరుణతర - శశి-మండల + అతి + అరుణ-రుచుల-కొడగులు= బాలచంద్రబింబముయొక్క మిక్కిలి ఎఱ్ఱనైన కాంతులనెడి గొడుగులు, ఎదన్ = హృదయమునందు, క్రుచ్చి, వడిన్ = వేగముగా, ఎత్తికొనిన, సాంద్ర-తిమిర-పటలంబు = దట్టమైన చీఁకటుల సమూహము, దీప-దీప్తి-పరివృతంబు = దివ్వెయొక్క కాంతిచేఁ జుట్టఁబడినది, ఐన, కజ్జల-పాత్ర + పోలెన్ = కాటుకబరణివలె, పొలుపారెన్ = ఒప్పెను

**తాత్పర్యము** . బాలచంద్రబింబము నెఱ్ఱనికాంతులనెడి గొడుగులు నడుమఁగ్రుచ్చి వడి నెత్తుకొనిన దట్టపుఁజీకటుల మొత్తము దీపకాంతిచేఁ బరివృతమైన కాటుకబరణివలె నొప్పెను

**విశేషములు** . అలంకారము రూపకానుప్రాణితమైన ఉత్ప్రేక్ష

తే **ఈశు నుద్వాహమున కమరేంద్రదిగ్వి**
**లాసవతి పైఁడి పాళియఁ బోసి తెచ్చు**
**జాదరలొ నాఁగ రాగపూర్ణోదయేందు**
**బింబమునఁ బాండుకిరణాంకురంబు లెసఁగె** 112

**అర్థము**. ఈశు + ఉద్వాహమునకున్ = ఈశ్వరుని పెండ్లికి, అమర + ఇంద్ర-దిశ్ (క్) + విలాసవతి = తూర్పుదిక్కనెడు నొయారి, పైఁడి-పాళియన్ = బంగారు పాత్రమ్మున, పోసి, తెచ్చు, జాదరలొ = గందవొడులో, నాఁగన్ = అనఁగా, రాగ-పూర్ణ + ఉదయ + ఇందు-బింబమునన్ = ఎఱుపుతో నిండిన ఉదయచంద్రబింబమునందు, పాండు-కిరణ + అంకురంబులు = తెల్లని కిరణముల మొలకలు, ఎసఁగెన్ = ఒప్పెను

**తాత్పర్యము :** ఈశ్వరుని వివాహమునకుఁ దూర్పుదిక్కనెడు నొయారి బంగరు పాత్రమునఁ బోసి తెచ్చు గందవొడులో యున నెఱ్ఱని ఉదయచంద్రబింబమునందుఁ దెల్లని కిరణముల మొలక లొప్పెను

**విశేషములు :** అలంకార ముత్ప్రేక్ష దిగ్విలాసవతి అనుచో రూపకము ఈశునియొక్క ఉద్వాహము = ఈశు + ఉద్వాహము - 'షష్ఠీ సమాసమునందుకార ఋకారముల కచ్చుపరమగునపుడు నుగాగమంబగు ' బాల సంధి 34

తే **కరము రాగియై రజనీముఖంబుఁ గాంచి**
**తమముఁ దత్కేశభరమని తాల్మి లేక**
**కముపఁ గరములు పైఁజాఁచి కామి యెఱిఁగి**
**వెల్లనైనట్లు శశి గడు విమల మయ్యె** 113

**అర్థము** . కరమున్ = మిక్కిలి, రాగి + ఐ = రాగము (ప్రేమము) గలవాఁడయి ఎఱుపు గలవాఁడయి, రజనీ-ముఖంబున్= రాత్రియొక్క మొగమును, కాంచి = చూచి, తమమున్ = చీఁకటిని, తద్ + కేశ-భరము + అని = ఆమె కొప్పు అని, తాల్మి-లేక = ఓర్పులేక, కముపన్ = పట్టుకొనుటకు, కరములు = చేతులు-కిరణములు, పైన్ = మీఁదికి, చాఁచి, కామి = (కేశభరము) కాకపోవుట, ఎఱిఁగి, వెల్లన + ఐన + అట్లు = తెల్లఁబోయిన విధమున, శశి = చంద్రుఁడు, కడున్ = మిక్కిలి, విమలము + అయ్యెన్ = తెల్లఁబడెను

**తాత్పర్యము :** మిక్కిలి రాగము (ప్రేమము, ఎఱుపు) గలవాఁడయి,

రాత్రియను స్త్రీ ముఖమును జూచి, చీఁకటిని ఆమె కొప్పు అని తలఁచి, ఓర్పులేక, పట్టుకొనుటకుఁ గరములు (చేతులు, కిరణములు) మీఁదికిఁ జాఁచి, అది కేశభరము కాదని యెఱిఁగి తెల్లఁబోయినట్లు చంద్రుఁడు మిక్కిలి తెల్లఁబడెను

**విశేషములు :** అలంకార ముత్ప్రేక్ష రాగి, కరములు అను శబ్దముల కర్థద్వయముచే శ్లేషము తమమును రజనీకేశభరముగా భ్రమించెననుటచే భ్రాంతిమంతమును 'శశి' అను పుంలింగశబ్దముచే నాయక ప్రతీతియు, 'రజని' యను స్త్రీలింగశబ్దముచే నాయికా ప్రతీతియుఁ గలుగుచున్నవి కముపన్-కముచు = (గ్రహించు) ధాతు తుమున్నంత రూపము

తే. ఉదయశైలంబుపై రాగ మొంది సకల
దిగ్వధూ దేహములయందుఁ దెలుపుమిగిలి
వేదనాచ్యుతిఁ గువలయామోదవృత్తిఁ
జందనముఁ బోలి చంద్రికాజాల మొప్పె 114

**అర్థము .** ఉదయ-శైలంబుపైన్ = పొడుపుఁగొండపై, రాగము = ఎఱుపు - అనురాగము, ఒంది, సకల దిశ్ (క్) + వధూ-దేహముల + అందున్ = ఎల్లదిక్కులనెడి స్త్రీల శరీరములందును, తెలుపు-మిగిలి = తెలుపు అతిశయించి, వేదనా-చ్యుతిన్ = (విరహ) బాధయొక్క జాఱుపాటుచే - విరహబాధపోవుటచే, కువలయ + ఆమోద-వృత్తిన్ = కలువలయొక్క సంతోషముచే - భూవలయము యొక్క సంతోషముచే, చందనమున్ + పోలి = మంచిగంధమునుబోలి, చంద్రికా-జాలము = వెన్నెలల సమూహము, ఒప్పెన్

**తాత్పర్యము:** వెన్నెలల సమూహము పొడుపుఁగొండపై నెఱుపును వహించి, అనురాగము వహించి, దిక్కులనెడు స్త్రీల మేనులందుఁ దెలు పతిశయించి, విరహబాధపోవుటచేఁ దాప ముడుగుటచేఁ గలువలకు సంతోషమొదవి చందనమువలె నొప్పెను.

**విశేషములు .** అలంకారము శ్లేషానుప్రాణితోపమ

క. మేలుగ నెలకొన్న తమో
జాలముఁ బోఁదోలి యెసఁగెఁ జంద్రాతప మ
క్కాళిందీపూరం బఱ
నోలిన గంగాప్రవాహ మొత్తిన భంగిన్ 115

**అర్థము** ఆక్కాళిందీ-పూరంబు (ఆ + కాళిందీ-పూరంబు) = ఆ యమునానదీప్రవాహము, అఱన్ = నశించునట్లు, ఓలిన్ + అ = క్రమముగా, గంగా-ప్రవాహము = గంగానదీ ప్రవాహము, ఒత్తిన-భంగిన్ = విజృంభించిన విధముగా, చంద్ర + ఆతపము = వెన్నెల, మేలుగన్ = బాగుగా, నెలకొన్న = ఉన్నట్టి, తమస్ (ః) + జాలమున్ = చీఁకట్ల సముదాయమును, పోన్ + తోలి = పోవునట్లు తోలి, ఎసఁగెన్ = ఒప్పెను

**తాత్పర్యము .** ఆ యమునా నదీ ప్రవాహము నశించునట్లు గంగా ప్రవాహము విజృంభించిన విధమున వెన్నెల చీఁకట్లసముదాయమును బోఁదోలి యొప్పెను

**విశేషములు** · అలంకార ముత్ప్రేక్ష కాళిందీపూరము నలుపు చీఁకట్లు నలుపు గంగాప్రవాహము తెలుపు వెన్నెల తెలుపు

క **తన సుతుఁడగు శశి మెయి కఱఁ**
**గని చెచ్చెరఁ గడిగి పుచ్చఁగా నని దుగ్ధాం**
**బునిధి నభంబున కెగసెనా**
**యనఁ జంద్రిక పర్వె సాంద్రమై విమలంబై** **116**

**అర్థము .** దుగ్ధ + అంబునిధి = క్షీరసముద్రము, తన-సుతుఁడు = తన కొడుకు, అగు, శశి = చంద్రునియొక్క, మెయి = శరీరముయొక్క, కఱన్ = నలుపును, కని = చూచి, చెచ్చెరన్ = శీఘ్రముగా, కడిగి-పుచ్చఁగాన్ + అని = కడిగివేయుటకయి, నభంబునకున్ = ఆకాశమునకు, ఎగసెనా = ఎగిరెనో, అనన్, చంద్రిక = వెన్నెల, సాంద్రము + ఐ = దట్టమయి, విమలంబు + ఐ = నిర్మలమయి, పర్వెన్ = వ్యాపించెను

**తాత్పర్యము :** క్షీరసముద్రము తన కుమారుఁడైన చంద్రుని మేని నలుపుఁజూచి వెంటనే కడిగివేయుటకు ఆకాశమున కెగిరెనా యనునట్లు వెన్నెల చిక్కనయి, నిర్మలమయి వ్యాపించెను

**విశేషములు .** అలంకారము హేతూత్ప్రేక్ష దేవదానవు లమృతము కొఱకు క్షీరసముద్రమును మథించినప్పు డందుండి చంద్రుఁడు పుట్టెను అందుచేఁ జంద్రుఁడు క్షీరసముద్రము కుమారుఁడు చంద్రుఁ డనక శశియనుట మచ్చను సూచించుటకు శశము (కుందేలు) గలవాఁడు శశి చంద్రునిలోని మచ్చ శశాకారమున

నుండును గనుక నతనికి శశి యనిపేరు దుగ్ధాంబునిధియనుట చంద్రికతోడి సామ్యమునకు

తే అష్టతనువృత్తి కెంతయు నలసి పరముఁ
డమృతకర మని సుఖకరమని సుధాంశు
తనువ తాల్చె నా వెన్నెల దరతరంబ
నిండి కడుఁ బిక్కటిల్లె బ్రహ్మాండ మెల్ల 117

**అర్థము** అష్ట-తను-వృత్తికిన్= ఎనిమిది శరీరముల ఉనికికి, ఎంతయున్= మిక్కిలి, అలసి = బడలి, పరముఁడు = ఉత్కృష్టుడు - శివుఁడు, అమృతకరము+ అని = సౌఖ్యమునుజేయునదియని, సుధా + అంశు-తనువు + అ = అమృతకిరణుని-చంద్రునియొక్క, మేనినే, తాల్చెన్ + నాన్ = ధరించె ననునట్లు, వెన్నెల, తరతరంబు + అ = మిక్కిలి, నిండి, బ్రహ్మాండము + ఎల్లన్= బ్రహ్మాండమంతయు, కడున్ = మిక్కిలి, పిక్కటిల్లెన్ = వ్యాపించెను

**తాత్పర్యము :**శివుఁడు ఎనిమిది మేనులను వహించుటకు మిక్కిలి బడలి అమృతమును జేయునది - సౌఖ్యమును గలిగించునది యని ఒక్క అమృతకిరణుని శరీరమునే తాల్చెనా యనునట్లు వెన్నెల మిక్కిలి నిండి బ్రహ్మాండమంతయు వ్యాపించెను

**విశేషములు .** అలంకారము హేతూత్ప్రేక్ష శివుఁ డష్టతనువు పంచ భూతములు (5), సూర్యచంద్రులు (2), యజమానుఁడు (1), ఇవి శివుని ఎనిమిది తనువులు శివుఁడు తెలుపుగావున, చంద్రుఁడును తెలుపుగావున అ ట్లనుట

సీ దుగ్ధాంబునిధి నిట్టఁ దోఁచెనో యని శేషు
    పాన్పుగా హరి నీటఁ బవ్వడింప
నాదవి సుధారస ముప్పొంగెనో యని
    దేవతల్ దనివోవఁ ద్రావఁదలఁపఁ
దొలఁకాడు మిన్నేఱు వెలివిరిసెనొ యని
    లీల సురాంగన లోలలాడఁ
బాదరసం బుర్విఁ బరగెనొ యని సిద్ధ
    నికరంబు గలశముల్ నించుకొనఁగఁ

తే బాండురాంగుండు విశ్వరూపంబుఁ దాల్చి
యెలసెనో యని సద్భక్తు లెలమిఁ గొలువ
నఖిలజీవుల కానంద మతిశయిల్ల
నచ్చవెన్నెల విమలమై యలరి కాసె 118

**అర్థము.** దుగ్ధ + అంబునిధి = క్షీరసముద్రము, నిట్టన్ + తోఁచెనో + అని = పొంగిపొరలెనో యని, శేషు-పాన్పు + కాన్ = శేషుఁడు పానుపుగా, హరి = విష్ణువు, నీటన్ = నీటియందు, పవ్వడింపన్ = పరుండఁగను

సుధారసము = అమృతరసము, ఒదవి = పుట్టి, ఉప్పొంగెనో = పెల్లుబికెనో, అని, దేవతల్, తని + పోవన్ = తృప్తిదీఱ, త్రావన్ = త్రాగుటకు, తలఁపన్ = ఎంచఁగను,

తొలఁకాడు (తొలఁకు + ఆడు) = చలించునట్టి, మిన్నేఱు (మిన్ను+ఏఱు)= ఆకాశగంగ, వెలివిరిసెనో = పొంగిపొరలెనో, అని, లీలన్ = విలాసముతో, సుర + అంగనలు = దేవతా స్త్రీలు, ఓలలాడన్ = స్నానముచేయఁగను

పాదరసంబు, ఉర్విన్ = భూమియందు, పరగెనో = ప్రవహించెనో, అని, సిద్ధ-నికరంబు = సిద్ధుల సమూహము, కలశముల్ = పాత్రములు, నించుకొనఁగన్ = నిండించుకొనఁగను,

పాండుర + అంగుండు = తెల్లని శరీరము గలవాఁడు, విశ్వరూపంబున్, తాల్చి, ఎలసెనో = వ్యాపించెనో, అని, సత్ + భక్తులు = మంచి భక్తులు, ఎలమిన్ = సంతోషముతో, కొలువన్ = సేవింపఁగను,

సకల-జీవులకున్ = ఎల్లప్రాణులకును, ఆనందము, అతిశయిల్లన్ = అధికముకాఁగా, అచ్ఛ-వెన్నెల = నిర్మలమైన వెన్నెల, విమలము + ఐ = స్వచ్ఛమయి, అలరి = ఒప్పి, కాసెన్

**తాత్పర్యము.** క్షీరసముద్రము పొంగిపొరలెనా యని శేషుఁడు పానుపుగా విష్ణువు నీటియందుఁ బరుండఁగను, అమృతరసము పుట్టి పెల్లుబికెనో యని దేవతలు తృప్తిదీఱఁ ద్రావనెంచఁగను, చలించు నాకాశగంగ పొంగిపొరలెనోయని విలాసముతో దేవతా స్త్రీలు స్నానమాడఁగను, పాదరసము భూమిపైఁ బ్రవహించెనా యని సిద్ధులు పాత్రములు నిండించుకొనఁగను, తెల్లనిమేనుగల శివుఁడు

విశ్వరూపమును దాల్చి వ్యాపించెనా యని భక్తవరులు ప్రీతితో సేవింపఁగను, ఎల్లప్రాణులకును సంతోష మతిశయింపఁగను, స్వచ్ఛమైన వెన్నెల నిర్మలమై యొప్పి కాసెను

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష పవ్వడించు (రూపాం ) పవడించు

వ తదవసరంబున 119

**అర్థతాత్పర్యములు .** ఆ సమయమున - తరువాతి పద్యముతో నన్వయము

<u>విటీ విటవర్ణనము</u>

క వలరాజు రతియుఁ దమతమ
బలముల రతికలహములకుఁ బన్నించిరో? నాఁ
గలయఁ గయిసేసి విటవిటి
యలు నిలిచిరి పురమువీథులం దభినవమై 120

**అర్థము :** వలరాజున్ = మన్మథుఁడును, రతియున్, తమ-తమ - బలములన్= తమ తమ సేనలను, రతి-కలహములకున్= మన్మథయుద్ధములకు, పన్నించిరో = సిద్ధ˘ఁచిరో, నాన్ = అనఁగా, విటవిటియలు = జారులును, జారిణులును, కలయన్ = అంతటను, కయి + చేసి = అలంకరించుకొని, పురము-వీథులందున్= నగరవీథులలో, అభినవము + ఐ = నూతనమై, నిలిచిరి

**తాత్పర్యము:** మన్మథుఁడును, రతియుఁ దమతమ సేనలను, మన్మథయుద్ధములకు సిద్ధపఱిచిరాయన జారులును, జారిణులును అంతట నలంకరించుకొని పురవీథులలోఁ గ్రొత్తగా నిలిచిరి

**విశేషములు :** అలంకార ముత్ప్రేక్ష విటియ = విటకత్తె?

వ మఱియును. తరువాతి పద్యముతో నన్వయము 121

తే. వీధి వీథులఁ బుష్పలావికలు గలయ
నెత్తి పట్టిన క్రొవ్విరి యెత్తు లొప్పె
సతులపై నెలయు నవ్విటసమితి నేయ
మదనుఁ డేర్చిన యలరంపపొదులవోలె 122

**అర్థము.** వీధి వీధులన్ = ప్రతివీధియందును, పుష్పలావికలు = పూవులమ్ము స్త్రీలు, కలయన్ = అంతటను, ఎత్తి-పట్టిన, క్రొవ్విరి (క్రొత్త + విరి) ఎత్తులు = క్రొంబూల దండలు, సతులపైన్ = స్త్రీలమీఁద, ఎలయు = అసక్తులగు, ఆ + విట-సమితిన్ = ఆ జారుల సమూహమును, ఏయన్ = కొట్టుటకు, మదనుఁడు = మన్మధుఁడు, ఏర్చిన = సంధించిన, అలరంపపాదుల + పోలెన్ (అలరు + అమ్ము + పాదుల + పోలెన్) = పూవుటమ్ముల పాదుల విధమున, ఒప్పెన్

**తాత్పర్యము.** ప్రతివీధియందును బూలమ్ము స్త్రీలు అంతటను ఎత్తి పట్టిన క్రొంబూల దండలు - స్త్రీలయం దాసక్తులగు విటకాండ్ర గుంపును గొట్టుటకు మన్మధుఁడు సంధించిన పూవుటమ్ముల పాదులా యన నొప్పెను

**విశేషములు** · అలంకార ముత్ప్రేక్ష అమ్ము + పాదులు - 'కొండొకచో సమాసంబులందు నామ్వాది కనుమ్వాదుల మువర్ణంబులు పఙ్పవర్ణంబు లగు' బాల సమాస 19 అ+పఙ్+పాదులు - 'జిత్తు బిందుపూర్వంబగు ' బాల తత్సమ 19 అంపపాదులు అలరు + అంప - 'అలరు' పేర్వాదులలోనిదని భావింపవలయును అప్పుడు టుగామము విభాష. టుగామము కానిచో అలరంప క్రొవ్విరి = క్రొత్త + విరి 'సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు ' బాల సంధి 36 క్రొ + విరి 'క్రొత్త శబ్దమున కాద్యక్షర శేషంబునకుం గొన్నియెడల నుగాగమంబునుం, గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు ' క్రొవ్విరి బాల సం 38

వ. అంత - తరువాతి పద్యముతో నన్వయము 123

చ. **అనుపమదివ్యమూర్తి, దరహాసవిలాసవిభాసి, నిండుజ**
**వ్వని, సుకుమారి దన్ను విటవర్గము నల్గడ వచ్చి ప్రీతితోఁ**
**గనుఁగొని మూరిఁ జూడ నెడగానక సూరెలు వాఱుచుండె మో**
**హినియును బోలె నొక్క శరదిందునిభానన నిల్చి ముంగిటన్** 124

**అర్థము :** అనుపమ - దివ్యమూర్తి = సాటిలేని దివ్యమైన ఆకారముగలది, దర-హాస-విలాస-విభాసి = చిఱునవ్వువలని ఒప్పుచేఁ బ్రకాశించునది, నిండు-జవ్వని = సంపూర్ణ యౌవనము గలది, సుకుమారి = అందగత్తె, అగు, ఒక్క-శరద్ +ఇందునిభ + ఆనన = శరత్కాలపుఁజంద్రునితో సమానమైన ముఖము గల ఒకతె, మోహినియును + పోలెన్ = అచ్చరవలె, ముంగిటన్ = ముంగిటియందు,

నిల్చి, తన్నున్, విట-వర్గము = విటకాంద్ర సమూహము, నల్గడన్ = నాలుగు దిక్కులనుండి, వచ్చి, ప్రీతితోన్ = ఇష్టముతో, కనుఁగొని, మూరిన్ =మోహముతో, చూడన్ = చూడఁగా ఎడ +కానక = తెఱపిగానక, సూరెలు + పొఱచున్ + ఉండెన్ = ప్రక్కల కొదుగుచుండెను

**తాత్పర్యము** . సాటిలేని ఆకారము గలదియుఁ, జిఱునవ్వుచేఁ బ్రకాశించునదియు, సంపూర్ణయౌవనవతియు, సుకుమారియు నగు నొక శరచ్చంద్రముఖి మోహినివలె ముంగిట నిల్చి, తన్ను విటకాంద్రు నాలుగు దిక్కులనుండి వచ్చి సంతసముతోఁ జిత్తవిభ్రమముతోఁ జూడఁగాఁ, దెఱపిగానక ప్రక్కల కొదుఁగుచుండెను

**విశేషములు** . అలంకార ముత్ప్రేక్ష

ఉ అంగజరాగ సంగత నిజాంగ విలిప్త నవాంగరాగ దీ
ప్తిం గొఱలంగ హారమణిదీధితు లత్యరుణప్రభాతిలో
నం గలయంగఁ దారక గణ స్ఫురితద్యుతిఁ దాల్చి పొల్చు సం
ధ్యాంగనవోలె నొక్క వనజానన భోరన వచ్చె రచ్చకున్ 125

**అర్థము.** అంగజ-రాగ దీప్తిన్ అంగజ = శరీరము నందుఁ బుట్టిన, రాగ = ఎఱుపుతో, సంగత = కూడుకొనిన, నిజ = తనవైన, అంగ = అవయవములందు, విలిప్త = విశేషముగాఁ బూయఁబడిన, నవ = క్రొత్తదైన, అంగరాగ = మై పూఁతయొక్క, దీప్తిన్ = కాంతితో, కొఱలంగన్ = నిండఁగా, హార-మణి-దీధితులు = హారమునందలి రత్నముల కాంతులు, అతి + అరుణ-ప్రభాతిలోనన్ = మిక్కిలి యెఱ్ఱనైన కాంతిలో, కలయంగన్ = కూడఁగా, ఒక్క-వనజ + ఆనన = ఒక పద్మముఖి, తారక-గణ-స్ఫురిత-ద్యుతిన్ = నక్షత్రముల సమూహముయొక్క ప్రకాశించు కాంతిని, తాల్చి, పొల్చు = ఒప్పునట్టి, సంధ్యా + అంగన + పోలెన్ = సంజయనెడి స్త్రీ విధమున, భోరనన్ = శీఘ్రముగా, రచ్చకున్ = రాజమార్గమునకు, వచ్చెన్

**తాత్పర్యము :** మేని యెఱుపుతోఁ గూడిన తన అవయవములందుఁ బూయఁబడిన మైపూఁత కాంతితో నిండఁగా హారమణికాంతులు మిక్కిలి యెఱ్ఱని కాంతితోఁ గూడఁగా నొక పద్మముఖి నక్షత్రముల సమూహము కాంతిని దాల్చి యొప్పు సంధ్యయను స్త్రీవలె శీఘ్రముగా రాజమార్గమునకు వచ్చెను

**విశేషములు.** అలంకారము రూపకానుప్రాణితోత్ప్రేక్ష సహజముగా నెఱ్ఱనైన ఆమె దేహావయవములందు వైపూఁత పూయఁబడినది ఆ కాంతితో హారమణికాంతులు కూడెను అప్పు డామె సహజముగానెఱ్ఱనైనసంధ్య తెల్లని నక్షత్రముల కాంతితోఁ గూడినట్లుండెను

ఉ కోమల సన్నతాంగి, మదకోకిల సుస్వన, భూషణోరుహా
రామల పుష్పజాల, సవిటాలిమదప్రచికిత్స, కేసరీ
యామిత చారుగంధి, తరుణారుణ పల్లవహస్త, రాజకీ
రామృతవాణి పుష్పితలతాకృతి నొక్కత నిల్చె ముంగిటన్ 126

**అర్థము.** కోమల-సన్నత + అంగి = మృదువైనది మిక్కిలి వంగినది అగు శరీరము గలది, మద-కోకిల-సుస్వన = మదించిన కోకిలయొక్క మంచి కంఠధ్వని గలది, భూషణ + ఉరు + హార + అమల-పుష్ప-జాల = అలంకారమైన గొప్ప హారమనెడి నిర్మలములైన పూవుల సమూహము గలది, స-విట + అలి-మద-ప్రచికిత్స= విటకాండ్రనెడి తుమ్మెదలయొక్క మదమునకు వైద్యముతోఁ గూడినది, కేసరీయ + అమిత + చారు-గంధి = కింజల్కములకు సంబంధించిన అధికమైన మనోహరమైన పరిమళము గలది, తరుణ + అరుణ-పల్లవ-హస్త = లేఁతవి, ఎఱ్ఱనివి అగు చివురులనెడి చేతులు గలది, రాజ-కీర + అమృతవాణి = రాచిలుకలయొక్క దివ్యమైన వాక్కులు గలది, అగు, ఒక్కత = ఒకస్త్రీ, పుష్పిత-లతా + ఆకృతిన్ = పూచిన తీఁగ ఆకారముతో, ముంగిటన్, నిల్చెన్

**తాత్పర్యము :** మృదువైనది మిక్కిలి వంగినదియైన శరీరము గలది, మత్తకోకిల కంఠధ్వనివంటి కంఠధ్వని గలది, అలంకారమైన గొప్ప హారమనెడి నిర్మలములైన పుష్పముల సమూహము గలది, విటకాండ్రనెడి తుమ్మెదల మదమునకు వైద్యముతోఁ గూడినది, కింజల్కముల అధికము మనోహరము నైన పరిమళమువంటి పరిమళము గలది, లేఁతవి, ఎఱ్ఱనివి యైన చివురులనెడి చేతులు గలది, రాచిలుకల అమృతవాణి వంటి అమృతవాణి గలది అగు నొక స్త్రీ పూచిన తీఁగ ఆకారముతో ముంగిట నిలిచెను

**విశేషములు :** అలంకారము ఉపమ రూపకానుప్రాణితము ఆమె పుష్పితలతాకృతితో వచ్చెననుటచే లతకుసంబంధించిన వన్నియు నామెకును గలవని చెప్పఁబడెను పుష్పితలత కోమలము సన్నతము అయినట్లు ఆమెయు అట్టి శరీరము గలది లతకు మదకోకిలముల స్వనమున్నట్లే ఆమెకును అట్టి

ప్వసమే కలదు లతకుఁ బుష్పజాలమువలె నామెకు హారము గలదు అలుల మదమునకుఁ జికిత్స గలది లత ఆమె విటుల మదమునకుఁ జికిత్స గలది లతకుఁ గేసరముల గంధముండునట్లు ఆమెయు మేనిగంధముగలది లతకుఁ దరుణములు, అరుణములునైన పల్లవములవలె నామెకును అట్టిహస్తములు గలవు రాచిలుకల వాణివంటివాణి ఆమెకును గలదు

తే సర్వలక్షణసంపూర్ణ చంద్రవదన
నిండువెన్నెలలో నోర్తు నిలిచి పొలిచె
నమృత మథనావసరమున నమరకాంత
పాలకడలిలో నిల్చిన భంగి వోలె 127

**అర్థము .** అమృత - మథన + అవసరమునన్ = అమృతముకొఱకు క్షీరసముద్రమును మథించు సమయమున, అమర-కాంత = దేవతా స్త్రీ, పాల-కడలిలోన్ = క్షీరసముద్రములో, నిల్చిన-భంగి + వోలెన్ = నిల్చినట్లు, సర్వ-లక్షణ-సంపూర్ణ = ఎల్ల శుభలక్షణములతో నిండినది, చంద్ర-వదన = చంద్రునివంటి ముఖము గలది, అగు, ఓర్తు = ఒకస్త్రీ, నిండు-వెన్నెలలోన్, నిలిచి, పొలిచెన్

**తాత్పర్యము** దేవదానవు లమృతముకొఱకు క్షీరసముద్రమును మథించునప్పు డందుఁ బొడమిన దేవతాస్త్రీవలె, సర్వలక్షణసంపూర్ణయగు నొక చంద్రముఖి నిండువెన్నెలలో నిలిచి యొప్పెను

**విశేషములు.** అలంకారముపమ ఆం ప్ర సా పరిషత్ప్రతిలోని 'అమరలేమ' యను పాఠము వైరిసమాసమగును అందుచే మా రా కవి ప్రతిలోని 'అమరకాంత' పాఠము స్వీకరింపఁబడినది

వ మఱియు తరువాతి పద్యముతో నన్వయము 128

## వేశ్యల వర్ణము

క జారపతి కడకు వెన్నెల
నారఁగ సితపుష్పలేపనాంబరయుతయై
మారుఁ డమృతాంశురుచిఁ బొయి
గారంబునఁ బోసి నడపుగతి నో ర్తరిగెన్ 129

**అర్థము :** ఓర్తు = ఒక స్త్రీ, జార-పతి-కడకున్ = ఉపపతియొద్దకు, వెన్నెలన్= వెన్నెలయందు, ఆరఁగన్ = నిండుగా, సిత-పుష్పలేపన + అంబర-

యుత + ఐ= తెల్లనిపూలు, మైపూఁత, వస్త్రములు అనువానితోఁగూడినదియై, మారుఁడు = మన్మధుఁడు, అమృతాంశు-రుచిన్ = చంద్రునికాంతిని పాయిగారంబునన్ = కరువున, పోసి, నడపు-గతిన్ = ప్రవర్తింపఁజేయు విధమున, అరిగెన్ = వెడలెను

**తాత్పర్యము .** ఒక స్త్రీ ఉపపతికడకు వెన్నెలలో నిండుగాఁ దెల్లని పూలు, మైపూఁత, వస్త్రములు తాల్చినదయి, మన్మధుఁడు వెన్నెలను గరువునఁబోసి ప్రవర్తింపఁజేసిన విధమున వెడలెను

**విశేషములు ·** అలంకార ముత్ప్రేక్ష అమృతాంశురుచిని గరువునఁ బోసె ననుటచేతనే పుష్పాదికమునకు 'సిత'యను విశేషణము

చ **తగులము సేసిచేసి యెడ దవ్వయి పోయిన డాసి క్రమ్మఱం**
**దిగిచి నయంబునం బెనఁగి తియ్యముఁబెంచి విటేంద్రసంఘమున్**
**మిగిలిచనంగనీక యొక మెల్తుక యాసయ చూపిచూపి ప్రీ**
**తిగ నెలయించుచుండె మరుదీమమ పోలె ననేకమాయలన్** 130

**అర్థము .** తగులము = వలపు, చేసిచేసి, ఎడ - దవ్వు + అయి-పోయినన్= మిక్కిలి దూరమునకుఁబోఁగా, ఒక మెల్తుక = ఒక మెలఁతుక, స్త్రీ - ఒక జారిణి డాసి= సమీపించి, క్రమ్మఱన్ = మరల, తిగిచి = ఆకర్షించి, నయంబునన్ = నేర్పుతో, పెనఁగి = కూడి, తియ్యమున్ = అనురాగమును, పెంచి, విట + ఇంద్ర-సంఘమున్= విటశ్రేష్ఠుల సమూహమును, మిగిలి-చనంగనీక = అతిశయించిపోనీక, ఆస + అ = ఆశయే, చూపి-చూపి, మరుదీమము + అ + పోలెన్ = మన్మధుఁ డేర్పఱిచిన యెఱవలె, అనేక-మాయలన్ = పెక్కుమాయలతో, ప్రీతిగన్, ఎలయించుచున్ + ఉండెన్ = వశపఱుచుకొనుచుండెను

**తాత్పర్యము :** వలపు చేసిచేసి, మిక్కిలి దూరమునకుఁ బోఁగా ఒక జారిణి సమీపించి మరల ఆకర్షించి నేర్పుతోఁ గలిసి, అనురాగమును బెంచి విటశేఖరుల సమూహమును అతిశయింపనీక ఆశ చూపిచూపి మన్మధుఁ డేర్పఱిచిన యెఱవలెఁ బెక్కుమాయలతోఁ బ్రీతిగా వశపఱుచుకొనుచుండెను

**విశేషములు :** అలంకారము స్వభావోక్తి మెల్తుక-మెలఁతుక మెలఁత + ఉక 'ఉకవర్ణకంబు చిఱుతాదులకు స్వార్థంబునందగు ' బాల తద్ధిత 10 అపదాది స్వరసంధి బాల సంధి 11 'లాఁతియచ్చునకు సహితమొకానొకచో నుడినడుమ లోపంబు గానంబడియెడి, బాల ప్రకీర్ణ 18

క లీలా లోలాలస దృ
గ్జాలంబులఁ దగిలి మిగిలి చనక డిగె విటేం
ద్రాలి వెలయాలి మ్రోలికి
జాలరివలఁ దగిలివచ్చు ఝషముల పోలెన్ 131

**అర్థము**· విట + ఇంద్ర + ఆలి = విటశ్రేష్ఠుల వరుస, లీలా-లోల + అలస-దృశ్(క్) + జాలంబులన్ = విలాసముచేఁ జంచలములు మందములునైన దృష్టుల సమూహములనెడి వలయందు, తగిలి = పడి, మిగిలి-చనక = అతిక్రమించిపోక, జాలరి-వలన్ = చేఁపలనుబట్టువాని వలయందు, తగిలివచ్చు, ఝషముల పోలెన్= చేఁపలవలె, వెలయాలి-మ్రోలికిన్ = వేశ్య సమీపమునకు, డిగెన్ = దిగెను

**తాత్పర్యము** . విటశేఖరుల సమూహము వెలయాలి విలాసముచేఁ జంచలములు, మందములునైన దృష్టిజాలములనెడి వలయందుఁ దగులుకొని దాఁటిపోక ఆమె సమీపమునకు జాలరివాని వలలోఁబడి వచ్చు చేఁపలవిధమున వచ్చెను

**విశేషములు** . అలంకార ముపమ 'దృగ్జాలంబులన్' అనుచో శ్లిష్ట రూపకము 'మ్రోలికిన్' అనికాక 'మ్రోలకున్' అనియుండుట లెస్స

వ అయ్యవసరంబున 132

**అర్థతాత్పర్యములు** . ఆ + అవసరంబునన్ = ఆ సమయమున తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు:** ఆ + అవసరము - యడాగమ (బాల సంధి 3), త్రికసంధులు (బాల సమాస 14, 13 )

ఉ రోయిడఁ బంచువారుఁ దగ రోసి లతాంగులఁ జూచి మెచ్చుచున్
రో యిడువారు, నగ్గలపు రోయిడ లంజల నప్పురంబులో
రోయుచు వచ్చువారుఁ గని రో యుచితంబుగ నిచ్చి క్రమ్మఱం
బోయెడువారు, రో యిడఁగ బొల్తులఁ గానఁగ రోయువారలున్. 133

**అర్థము :** రోయి + ఇడన్ = వేశ్యాశుల్కము నిచ్చుటకు, పంచువారున్ = పంపెడువారును, తగన్ = తగునట్లు, రోసి = వెదకి, లతా + అంగులన్ = తీఁగలవంటి శరీరములు గలవారిని - స్త్రీలను, చూచి, మెచ్చుచున్, రోయి - ఇడు-

వారున్ = శుల్కమునిచ్చువారును, అగ్గలపు-రోయి (అగ్గలము+రోయి) + ఇడన్= అధికమైన శుల్కము నిచ్చుటకు, లంజలన్ = వేశ్యలను, అప్పురంబులోన్ (ఆ + పురంబులోన్) = ఆ నగరములో, రోయుచున్ = వెదకుచు, వచ్చు-వారున్, కని= చూచి, రో = ధనము, ఉచితంబుగన్ = తగినట్లుగ, ఇచ్చి, క్రమ్మఱన్ = మరలపోయెడు-వారున్, రోయి + ఇడఁగన్ = శుల్కము నిచ్చుటకు, పొల్తులన్ = పొలఁతులను - స్త్రీలను, కానఁగన్= చూచుటకు, రోయువారలున్= వెదకువారును

**తాత్పర్యము .** వేశ్యలకు శుల్కము నిచ్చుటకుఁ బంపువారును వెదకి తీవబోఁడులను జూచి మెచ్చుచు శుల్కము నిచ్చువారును, అధికముగా శుల్కము నిచ్చుటకు ఆ నగరములో వేశ్యలను వెదకుచు వచ్చువారును, చూచి ధనము నుచితముగా నిచ్చి మరలఁ బోయెడువారును, శుల్కము నిచ్చుటకు స్త్రీలను జూడ నన్వేషించువారును - విటు లి ట్లనేకవిధములుగా నగుచుండిరి

**విశేషములు .** రోయుచితంబుగన్ అనుచో రోయి + ఉచితంబుగన్ అనియు, రో + ఉచితంబుగన్ అనియు ఛేదింపనగును రో = రై = ధనము, 'రై గ్లౌ శబ్దంబుల కోత్వంబు విభాష నగు ' బాల తత్సమ 64 ఇ గ్లౌ సూత్రముచేఁ బ్రథమైకవచన లోపము బాల తత్సమ 44

వ అగుచుండునంత 134

**అర్థతాత్పర్యములు .** అగుచున్ + ఉండు + అంతన్ = అగుచున్నంత - తరువాతి పద్యముతో నన్వయము.

సీ నేలయు నింగియుఁ దాళముల్ వాయింప,
నెండమావులఁబట్టి, బండతలయు
మ్రోఁకాలు ముడివెట్ట, టోఁకటఁ జిగుళులు
గోయఁ జక్రాతిపైఁ గ్రుంగ, నిడుపు
లేక చిత్రము వ్రాయ, నాకాశమునఁ దాప
రము లిడ, మంచుఁ గుంచమునఁ గొలువ,
నేనుంగు పురుడోమ, రానారఁ గొన, గాలి
గం టిడ, నినుమునఁ గట్టు దాల్ప,

ఆ	నీరి నడుముఁ దెంప, నెలను దే మొండిచే
వెల్పఁ, గలియుఁ ద్రచ్చి వెన్నఁ గొనఁగఁ
గడవ నేర్పు గలిగి కందువు మానెడ్డై
కత్తిగొంటు లయిన యత్తగంతు	135

**అర్థము.** నేలయున్, నింగియున్ = ఆకాశమును, తాళముల్, వాయింపన్ = వాయింపఁగను, ఎండమావులన్ = మృగతృష్ణలను, పట్టన్ = పట్టఁగను

బండతలయున్ = బట్టతలయు, మ్రోఁకాలును = మ్రోఁకాలును, ముడి + పెట్టన్ = ముడిపెట్టఁగను, టోఁకటన్ = టోఁకటియందు, చిగుళులు = చివుళులు = చివురులు, కోయన్ = కోయఁగను, చట్రాతిపైన్ = చాఁపఱాతిమీఁద, క్రుంగన్ = దిగఁబడఁగను,

ఇడుపు-లేక = గోడలేక, చిత్రము - వ్రాయన్ = చిత్తరువును వ్రాయఁగను, ఆకాశమునన్, తాపరములు + ఇడన్ = మెట్లు పెట్టఁగను, మంచున్ = మంచును, కుంచమునన్ = కుంచముతో, కొలువన్ = కొలుచుటకును,

ఏనుంగు - పురుడోమన్ = ఏనుఁగు పురుడు పోయఁగను, రా-నారన్ + కొనన్ = రాతిలో నారను దీయఁగను, గాలిన్ = గాలియందు, గంటు + ఇడన్ = గాయము చేయఁగను, ఇనుమునన్ = ఇనుముతో, కట్టు +తాల్పన్ = కట్టుత్రాడు పేనఁగను,

నీరి నడుము = నీటి నడిమి భాగమును, తెంపన్ = నఱకఁగను, నెలను = చంద్రుని, తేన్ = తెచ్చుటకు, మొండి-చే = మొండిచేతిని, వెల్పన్ = చాఁపఁగను కలియున్ = గంజిని, త్రచ్చి = చిలికి, వెన్నన్ + కొనఁగన్ = వెన్నతీయఁగను, కడవన్ = అతిక్రమించుటకు - అసాధ్యములను సాధ్యములు చేయ, నేర్పు + కలిగి, కందువు - మానెడ్డై, కత్తిగొంటులు + అయిన = కత్తివలెఁ గ్రూర స్వభావలైన, అత్త-గంతు = వేశ్యామాతల గుంపు

**తాత్పర్యము.** భూమ్యాకాశములను దాళములుగాఁ జేసి వాయింపఁగను, ఎండమావులను బట్టఁగను, బట్టతలకును, మోఁకాలికిని ముడిపెట్టఁగను, టోఁకటియందుఁ జివురులు కోయఁగను, చట్రాతిపై దిగఁబడఁగను, గోడలేకయే చిత్తరువును వ్రాయఁగను, ఆకాశమునకు మెట్లు పెట్టఁగను, మంచును గుంచముతోఁ

గొలువఁగను, ఏనుఁగు పురుడు పోయఁగను, ఱాతినుండి నారను దీయఁగను, గాలియందు గంటువెట్టఁగను, ఇనుముతోఁ గట్టుత్రాడు పేనఁగను, నీటి నడుమును నఱకఁగను, చంద్రునిఁ దెచ్చుటకు మొండిచేతిని జాఁపఁగను, గంజిని జిలికి వెన్న తీయఁగను - ఇట్టి యసాధ్యములను సాధ్యములు చేయు నేర్పు గలిగి కందువు మానెడ్డై కత్తివలెఁ గ్రూరస్వభావలైన వేశ్యామాతల సమూహము - తరువాతి వచనముతో నన్వయము

**విశేషములు .** ఏనుఁగు పురుడోము అననేమియో సరిగాఁ దెలియలేదు నిఘంటువులలో 'పురుడోము' కనఁబడలేదు 'పురులోము' కలదు దానికి 'క్షాత్రము మెఱయించు' అను నర్థమీఁబడినది అది యిచ్చట సరిపడునా యని సందియము గలిగినది అందుచే 'పురుడోము' = పురుడుపోయు అని యర్థము చెప్పఁబడినది ఏనుఁగునకుఁ బురుడు పోయుట యసాధ్యమా ? కందువు = మోసము అని వా ప్రతి వ్యాఖ్యానము దాని కీ యర్థమెచ్చటను గాన రాలేదు అందుచే దానిని స్వీకరింపలేదు ఇఁక నే యర్థమును దోఁచలేదు

**వ ఎడకాఱ కెడసొచ్చి చిల్లతర్కంబులాడుచు లోవెల లొడంబలికి తగ రోవెలలు గొన బాడతికాఱం బుజ్జగించుచు 136**

**అర్థము :** ఎడకాఱకున్ = తార్పుకాండ్రకు, ఎడ+చొచ్చి = అడ్డము వచ్చి చిల్లతర్కంబులు = పనికిమాలిన జగడములు, ఆడుచున్, లోవెల లొడవెడన్ + పలికి, తగన్, రో-వెలలు = శుల్కములు, కొనన్, బాడతికాఱన్ = విటులను, బుజ్జగించుచున్ = అనునయించుచు - బతిమాలుచు

**తాత్పర్యము:** తార్పుకాండ్ర కడ్డము వచ్చి పనికిమాలిన జగడములాడుచుఁ బలికి తగినరీతిని శుల్కములు గొన విటకాండ్రను బతిమాలుచు - తరువాతి పద్యముతో న్వయము

**విశేషములు :** 'లోవెల లొడవెడంబలికి' అర్థము కాలేదు అది 'లోవెలలు' గాక, 'రోవెలలు' అయియుండునా? వా ప్రతి లో 'ఒడవెడ' నని యుండఁగా, 'ఒడఁబడ'నని గ్రహించి 'సమ్మతించునట్లు' అని యర్థము వ్రాయఁబడినది ఎడకాఱు - ఎడకా + లు 'కా ప్రత్యయంబు మీఁది బహువచన లకారంబునకు లఘ్వలఘు రేఫంబులును లఘురేఫంబునకు ముందు పూర్ణబిందుపూర్వక డకారంబు నగు ' బాల ఆచ్ఛిక 7 ఎడకాఱు - ఎడకాండ్రు ఇట్లే బాడతికాఱు, బాడతికాండ్రు

'నేలయు నింగియుఁ దాలముల్ వాయింప' ననునది 'నేలయు నింగియుఁ దాళముల్ గాఁజేసి - యేపున రేఁగి వాయించియాడ' అను తిక్కన భారత విరాట పర్వ పద్యభాగమును దలఁపించుచున్నది

ఉ    వంచన లేదు బిడ్డగలవా రొరు లేగుడు తార నేఁటిరే
యించుకసేపు వోవుటయు నెల్లియ పిల్తుము తారు మమ్ము ర
క్షించుట గాదె యర్థ మొరుచేఁ గొననిచ్చుటఁ దమ్ము బల్మిఁ ద
క్కించినదాని కేమియును గింకపడం జన దల్లు రిత్తఱిన్ 137

**అర్థము .** వంచన లేదు = మోసము లేదు, బిడ్డ + కలవారు = సంతానవంతులు, ఒరులు = ఒకరు, ఏగుడు = ఏగుట, తార (తారు + అ) = తామే, నేఁటి - రే = ఈరాత్రి, ఇంచుకసేపు - కొంచెము సేపు, పోవుటయున్ = పోఁగా, ఎల్లియ - (ఎల్లి + అ) = మఱునాఁడే, పిల్తుము = పిలిచెదము, అర్థము = ధనము, ఒరుచేన్ = ఇతరునిచే, కొననిచ్చుటన్ = గ్రహింపనిచ్చుటచే, తారు = వారు, మమ్మున్, రక్షించుట + కాదె, తమ్మున్, బల్మిన్ = బలవంతముగా, తక్కించిన దానికిన్ = త్రోచిపుచ్చినందులకు, అల్లురు = కూఁతుప్రియులు - విటులు, ఇత్తఱిన్ (ఈ + తఱిన్) = ఈ సమయమున, ఏమియును = ఇంచుకయును, కింకపడన్ + చనదు = కోపగించుకొనరాదు

**తాత్పర్యము .** 'మా మోసము లేదు సంతానవంతు లొకరేఁగుట, తామే నేఁటి రాత్రి కొంచెము సేపు గడవఁగా, వారిని జేపే పిలిచెదము ఇతరునిచే ధనమును గొననిచ్చుటచే వారు మమ్ము రక్షించుట కాదా ? అల్లురు తమ్ము బలవంతముగా వెడలనడచినందులకీ సమయమున నించుకయు మాపైఁ గోపపడవలదు

**విశేషములు :** ఈ పద్యము భావ మస్పష్టముగా నున్నది వేశ్య యింటి నుండి యొకరు వెడలిపోఁగా నింకొకరు వత్తురు తాము వెడలి యింకొకరి నుండి ధనము గ్రహింపఁజేయుటచే, వారు మమ్ము రక్షించుటయే వారిని బలవంతముగా గెంటివేసినందుట కల్లు రా సమయమున మాపై నించుకయుఁ గోపపడరాదు ఇందు 'ఏగుడు' అనునది ఏగు ధాతువు నానంతర్యార్థక రూపమా ? లేక ఏగు ధాతువు భావార్థక రూపమా ? భావార్థకమునకు బదులుగా డువర్ణమును వాడుట యీ కవికిఁ బరిపాటి

వ    మఱియుం దక్కోపక పై నడుచు బొజుంగులం గనువలిలేక తూల నొదరుచు 138

**అర్థము**. మఱియున్, తక్కోపక = త్రోచిపుచ్చుట సహింపఁజాలక, పై నడుచు = మీఁదికి నడుచు, బొజుంగులన్ = విటులను, కనువలి = సంకోచము, లేక, తూలన్ + ఒదరుచున్ = నిందించుచు

**తాత్పర్యము**. మఱియును ద్రోచిపుచ్చుట సహింపఁజాలక మీఁదికి నడుచు విటులను సంకోచములేక తూలనాడుచు - తరువాతి పద్యములో నన్వయము

మ **భయమే పెట్టనివారిఁ బిల్వమనఁగాఁ బైవచ్చి మీ రిన్ని బూ**
**మియ లాడం బనిలేదు పాఱుఁడవుఁబో మేలయ్యె నొడ్డించి లం**
**జియతో నుండఁగ వచ్చె నెట్టిబొజుఁగో ఛీ కష్టమీకున్న రా**
**జయినం బిల్తుమె యెల్లప్రొద్దుఁ జనునే యాలంబులుం దొట్టులున్** 139

**అర్థము**. పెట్టని-వారిన్ = ఈనివారిని, పిల్వము + అనఁగాన్ = పిలువము అనఁగా, భయమే = మాకు భయమా?, మీరు, పైన్ + వచ్చి = మీఁదికి వచ్చి, ఇన్ని-బూమియలు = ఇన్ని మాయమాటలు, ఆడన్ = పలుకుటకు, పని-లేదు= ప్రయోజనము లేదు, పాఱుఁడవు + పో = బ్రాహ్మణుఁడవు, మేలు + అయ్యెన్ = మంచిదయ్యెను, ఒడ్డించి = ప్రయత్నించి, లంజియతోన్ = వేశ్యతో, ఉండఁగన్ + వచ్చెన్, ఎట్టి-బొజుఁగో = ఎట్టి విటుఁడో, ఛీ, కష్టము + ఈక + ఉన్నన్= శ్రమమునకు ఫలము నీకున్నచో, రాజు + అయినన్ = రా జయినను, పిల్తుమె = పిలిచెదమా? ఆలంబులున్ = యుద్ధములును, తొట్టులున్ = మల్లబంధ విశేషములును, ఎల్ల-ప్రొద్దున్ = సర్వకాలమును, చనునే = తగునా?

**తాత్పర్యము :** ఇవి వేశ్యామాత పలుకులు 'ఈయనివారిని బిలువమన్నచో మా కేమిభయమా? మీరు మీఁదికి వచ్చి యిన్నిమాయమాటలు పలుకవలసిన పనిలేదు బ్రాహ్మణుఁడవే మంచిదయ్యెను ప్రయత్నించి వేశ్యతో నుండుటకు వచ్చెను ఎట్టివిటుఁడో? ఛీ మేము పడిన శ్రమమునకు ఫలము నీకున్నచో రా జయినను బిలుతుమా? కలహములును, మల్లబంధ విశేషములును, సర్వకాలమును దగునా?

క **పురులు గలఁ డిచ్చునని తన**
**పురు లెఱుఁగక పిల్తు మేముఁ బుడుకక తానుం**
**బురులఁ బొడకట్టి మెఱయుచుఁ**
**బురు లీకయ తక్కిపోయెఁ బురినమ్మి క్రియన్** 140

**అర్థము** పురులు-కలఁడు = ధనమున్నవాఁడు, ఇచ్చును, అని, ఏమున్ = మేమును, తన+పురులు + ఎఱుఁగక = తన స్వభావము తెలియక, పిల్తుము, తానున్, పుడుకక = ఈయక, పురులన్ + పొడకట్టి = ధనవంతుఁడుగాఁ గనఁబడి, మెఱయుచున్ = ప్రకాశించుచు, పురి-నమ్మి-క్రియన్ = మగ నెమిలి వలె, పురులు + ఈక + అ = ధనమీయకయే - పింఛమునొసఁగకయే, తక్కి పోయెన్ = తొలఁగెను

**తాత్పర్యము .** 'ఇతఁడు ధనవంతుఁడు' ఇచ్చును అని మేమును దన స్వభావము తెలియక పిలువఁగా దానును ఈయక ధనవంతుఁడుగాఁ గనఁబడి ప్రకాశించుచు మగనెమిలివలె పురులు (ధనము - పింఛము) ఈయకయే తొలఁగిపోయెను

**విశేషములు** పురి - బహువచనము - పురులు పురులు అనుదానికిఁగల నానార్థములచే నలంకారము శ్లేషము

**వ** **అని తలవీండ్లన పాయంబలికి నిజనందనల బుజ్జగించి వెలయాలి కేనంబు లలవడ నోజ గొల్పుచు** 141

**అర్థము .** అని, తలవీండ్లన్ + అ = తలవాఁకిండ్ల నుండియే, పాయన్ = తొలఁగిపోవునట్లు, పలికి, నిజ-నందనలన్ = తమ కూఁతులను, బుజ్జగించి, వెలయాలి-కేనంబులు = వేశ్యావంచనలు, అలవడన్ = కలుగఁగా, ఓజగొల్పుచున్= పురికొల్పుచు

**తాత్పర్యము .** అని తలవాఁకిండ్లనుండియే తొలఁగిపోవునట్లు పలికి తమ కూఁతులను బుజ్జగించి వేశ్యామాయలు గలుగఁగాఁ బురికొల్పుచు - తరువాతి పద్యముతో నన్వయము

**చ** **కలువక కల్చినట్లుఁ దమకం బెద లేకయుఁ గల్గినట్లుఁ జేఁ**
**గల విటు నర్థమంతయును గైకొనునంతకుఁ బొచ్చవోక, చేఁ**
**గల పురు లెయ్యుడున్ విడిచి గ్రక్కున నెక్కడియేనివానిఁగాఁ**
**దలఁచి ధనేతరున్ మదనుఁ దా నొరుఁ గల్వమి నేర్పు వేశ్యకున్** 142

**అర్థము .** కలువక = వలవక, కల్చిన + అట్లున్ = వలచినట్లును, తమకంబు= మోహము, ఎదన్ = హృదయమునందు, లేకయున్ = లేకున్నను, కల్గిన + అట్లున్ = ఉన్నట్లును, చేన్ + కల = చేతనున్న, విటు + అర్థము +

అంతయును = విటుని ధనమంతయును, కైకొను + అంతకున్ = పుచ్చుకొనునంతవఱకును, పొచ్చుపోక = కొఱఁతవడక = హైన్యము పడక, చేన్ + కల-పురులు = చేతనున్న ధనము, ఎయ్యుడున్ = అయిపోవఁగనే, ఎక్కడి + ఏని-వానిన్ + కాన్ = ఎక్కడివాఁడో అనురీతిని-ఏమియు సంబంధములేనివానినిగా, తలఁచి, గ్రక్కునన్ = శీఘ్రముగా, విడిచి, తాను, ధన + ఇతరున్ = డబ్బులేనివానిని, మదనున్ = మన్మధుని, ఒరున్ = ఇతరుని, కల్వమి = ఒల్లకుండుట, వేశ్యకున్, నేర్పున్ = బోధించును

**తాత్పర్యము** వలవకయే వలచినట్లును, హృదయమున మోహములేకున్నను, ఉన్నట్లును విటునిచేతనున్న ధనమంతయును పుచ్చుకొనునంతవఱకును గొఱఁత వడక, చేతనున్న డబ్బు అయిపోవఁగనే, యెక్కడివాఁడో యనునట్లు తలఁచి వెంటనే విడిచి, డబ్బులేనివానిని ఇతరుని మన్మధునైనను ఒల్లకుండునట్లు వేశ్యకు నేర్పును

**విశేషములు .** కలుచు - కల్చు విటు + అర్థము - 'షష్ఠీ సమాసమునం దుకార ఋకారముల కచ్చు పరమగునపుడు నుగాగమంబగు ' విటునర్థము బాల సంధి 34 ఎయ్యు - ఎయిదు (రూపాం) ఎయ్యుడున్ - ఎయిదినంతనే - ఒక్కక్షణమైన ఆలస్యములేక అని ఆనంతార్యార్థకప్రయోజనము

చ **పలుచని పూఁతలున్, మెఱుఁగుఁబండ్లును, నున్ననికోరకొప్పులున్**
**బొలకువతీపుఁ, జెన్నుఁ, బొరపొచ్చెముఁ బొచ్చముకాఁగ మాయలన్**
**లలనలఁ దేర్పఁజూచు మగలంజియలం గని వారిపొంతఁ బో**
**వలవదు, రొక్క మీఁగలుగువాఁడ మనోజుఁడు గూలియాలికిన్ 143**

**అర్థము :** పలుచని-పూఁతలున్ = పలుచనిమైపూఁతలును, మెఱుఁగు + పండ్లును = తళతళలాడు దంతములును, నున్నని-కోర-కొప్పులున్ = నున్ననైన ప్రక్కకొప్పులును, పొలకువ తీపున్ = జాడయొక్క మాధుర్యమును, చెన్నున్ = అందమును, పొరపొచ్చెమున్ = కపటమును, పొచ్చము-కాఁగన్ = కాపట్యయుక్తము కాఁగా, మాయలన్ = మాయలచే, లలనలన్ = స్త్రీలను, తేర్పన్ + చూచు = తేఱుకొనఁజేయఁజూచు, మగలంజియలన్ = లంజలవలె మాయాయౌవన చిహ్నములను ధరించిన మగవారిని, కని, వారి-పొంతన్ = వారిదగ్గఱకు, పోన్ + వలవదు = పోవలదు, కూలి + ఆలికిన్ = వేశ్యకు, రొక్కము = ధనము, ఈన్ + కలుగువాఁడు + అ = ఈయఁగలవాఁడే, మనోజుఁడు = మన్మధుడు

**తాత్పర్యము** పలుచని మైపూఁతలును, తళతళలాడు దంతములును, నున్నని ప్రక్క కొప్పులును, అందమును, కపటమును మోసముతోఁ గూడినదికాఁగా మాయలచే స్త్రీలను దేటుకొనునట్లు చేయఁజూచు మాయాయౌవనచిహ్నములను ధరించు మగవారిని జూచి, వారి దగ్గఱకుఁ బోవలదు వేశ్యకు ధనమీఁగలవాఁడే మన్మథుఁడు

**విశేషములు** పలుకులతీపు అని మా రా ప్రతిపాఠము కాని 'పలుకులతీపుఁజెన్నుఁ బొరపొచ్చెము' - అనుచో యతిమైత్రి తప్పినది అందుచే నది 'పొలకువ తీపు'గా మార్పఁబడియుండవచ్చును పలుకులతీపు పొరపచ్చెము - పొర - పరవలె, పొచ్చెము - పచ్చెము ని వేం రా లంజియ - లంజె (రూపాం)

**వ** అని లంజకాని రీతి నూల్కొలుపుచు నుండి రంత నందుల నాయక స్త్రీలమర కటక సమూహంబు లందుఁ దమ వయోరూపగుణంబుల కనురూపంబులైన బొజుంగుల రోసి రోలుగొనం దొడంగి రంత 144

**అర్థము.** అని, లంజకాని రీతిన్ = వేశ్యకాని విధమున, నూల్కొలుపుచున్ + ఉండిరి = పురికొల్పుచుండిరి, అంతన్, అందుల = అందలి, నాయకస్త్రీలు = నాయకురాండ్రు, అమర-కటక-సమూహంబుల + అందున్ = దేవతల శిబిరముల సమూహములందు, తమ-వయస్(ః) + రూప-గుణంబులకున్ = తమవైన వయస్సు, రూపము, గుణములు ననువానికి, అనురూపంబులు + ఐన = తగినవారైన, బొజుంగులన్ = విటులను, రోసి = వెదకి, రోలుకొనన్ + తొడంగిరి = జల్పములాడఁజొచ్చిరి, అంతన్

**తాత్పర్యము .** అని వేశ్యకానిదానివలెఁ బురికొల్పుచు నుండిరి అంత వారిలో నాయకురాండ్రు తమ వయోరూపగుణములకుఁ దగిన విటులను వెదకి జల్పములాడఁ జొచ్చిరి అంత - తరువాతి పద్యముతో నన్వయము

**సీ** కమియ నీలేక శృంగారాతిచేష్టలఁ
బచరించుచుండు నా భద్రు నొల్ల
మృదురేఖ ననురక్తిఁ బొదలించి రసమెల్ల
గాలించికొనునా పాంచాలు నొల్ల
ధనమెక్క నీగియ తగులుగా రతి బెట్టి
దము సేయునట్టి దత్తకుని నొల్ల
మనసీక మందుల మాయల మరగించి
కారించు నా కూచిమారు నొల్లఁ

ఆ గలిచి తాల్మి గల్గఁ గలిపించి బేటంబు
సలుపు నెదురు తన్నుఁ గలిచెనేనిఁ
దానుఁ గలిచె నేనిఁ దగ నిచ్చు నయవిదుఁ
డని మనోజ్ఞు నొక్క వనిత గలిచె 145

**అర్థము** కమియన్ + ఈన్ + లేక = బాగుగా నీయలేక, శృంగార + అతి-చేష్టలన్ = శృంగారము మితిమీఱిన పనులను, పచరించుచున్ + ఉండు = చేయుచుండునట్టి, ఆ-భద్రున్ = ఆ భద్రనామక నాయకుని, ఒల్లన్ = వలవను

మృదు-రేఖన్ = మృదువుగా, అనురక్తిన్ = వలపును, పొదలించి = వర్ధిల్లఁజేసి, రసము = ఎల్లన్ = శృంగారమునంతను, గాలించికొనునో = వెదకుకొనునేమో, పాంచాలున్ = పాంచాలదేశపుఁబురుషుని, ఒల్లన్

ధనము + ఎక్కన్ + ఈగి + అ = ధనము నధికముగా నిచ్చుటయే, తగులు + కాన్ = సంబంధముగా, రతిన్ = సంభోగమును, బెట్టిదము + చేయు + అట్టి = అధికముచేయునట్టి, దత్తకునిన్ = కేరళదేశపు విటుని, ఒల్లన్

మనసు + ఈక = వలపులేక, మందులన్ = మందులతోను, మాయలన్ = మాయలతోను, మరగించి = ఆసఁగొలిపి, కారించు = బాధించునట్టి, ఆ-కూచిమారున్ = కూచిమారుఁడను ఆ జాతిపురుషుని, ఒల్లన్

కలిచి = వలచి, తాల్మి + కల్గన్ = ఓర్పుగలుగునట్లు, కలిపించి = వలపించి, ఎదురు, తన్నున్, కలిచెన్ = ఏనిన్ = వలచినచో, బేటంబు + చలుపున్ = సంభోగించును, తానున్, కలిచెన్ + ఏనిన్, తగన్, ఇచ్చు, నయ-విదుఁడు = నీతితెలిసినవాఁడు, అని, మనోజ్ఞున్ = అందమైనవానిని, వనిత = స్త్రీ, కలిచెన్ = వలచెను

**తాత్పర్యము.** బాగుగా నీఁజాలక మితిమీఱిన శృంగారచేష్టలను జేయు ఆ భద్రనామకపురుషు నొల్లను వలపును మృదువుగా వర్ధిల్లఁజేసి శృంగారమునంతను వెదకుకొనునేమో ఆ పాంచాలదేశపుఁబురుషు నొల్లను ధన మధికముగా నిచ్చి దానికిఁ దగినట్లు సంభోగము నధికముచేయునట్టి దత్తకనామక కేరళదేశవిటు నొల్లను వలపులేక మందులతోను, మాయలతోను ఆశచూపి బాధించునట్టి ఆ కూచిమారు నొల్లను తాను వలచి, ఓర్పుతోఁ దన్ను వలపించి, వలచినచో సంభోగించును తాను వలచినచోఁ దగునట్లు ధనమిచ్చు నయవిదుఁడని ఒక యింతి సుందరాంగుని వలచెను

వ అనుచుఁ గొంద ఱమరస్త్రీలు వంచనలేక పల్కుచు మనఃప్రియులు వాలయలుకఁ గట్టలుక సేసి పోయిన విరహపరితాపంబునం దురపిల్లి నిజాంతర్గతఖేదంబులు ప్రియవయస్యలచే నెఱింగించుచు 146

**అర్థము.** అనుచున్, కొందఱు, అమర-స్త్రీలు = దేవతాస్త్రీలు (?) వంచన-లేక = మోసములేక, పల్కుచున్, మనస్ (ః) + ప్రియులు = మనోవల్లభులు, పొలయలుకన్ = ప్రణయకలహమును, కట్టలుక (కడు + అలుక) = అధికమైన కోపము,చేసి, పోయినన్ = పోఁగా, విరహ-పరితాపంబునన్ = ఎడఁబాటువలని దుఃఖముచే, దురపిల్లి = దుఃఖించి, నిజ + అంతర్గత-ఖేదంబులు = తమ మనస్సునందలి దుఃఖములు, ప్రియ-వయస్యలచేన్= ఇష్టసఖులచే, ఎఱింగించుచున్ = తెలియఁజేయుచు

**తాత్పర్యము.** అనుచుఁ గొందఱు దేవతాస్త్రీలు (?) మోసములేక పలుకుచు మనోవల్లభులు ప్రణయకలహమును బెనుగోపముగాఁ జేసిపోఁగా విరహతాపముచే దుఃఖించి తమ మనోదుఃఖములను ఇష్టసఖులచేఁ దెలియఁజేయుచు - తరువాతి పద్యముతో నన్వయము

క తన హృదయమునం దెన్నఁడు
నను నించుక వొందనీఁడు నా యెదలోఁ దా
ననిశము నుండు ని దేమిటఁ
జనునని మదినున్న విభుని సతి సెగ్గించెన్ 147

**అర్థము.** తన-హృదయమునందున్ = తన మనసునందు, ఎన్నఁడున్ = ఎప్పుడును, ననున్ = నన్ను, ఇంచుక = కొంచెము, పొందన్ + ఈఁడు = కలుగనీఁడు, నా + ఎదలోన్ = నా హృదయమునందు, తాను, అనిశమున్ = ఎల్లప్పుడును, ఉండున్, ఇది, ఏమిటన్ = ఏ విధముగా, చనున్ = తగును, అని, సతి = స్త్రీ, మదిన్ + ఉన్న-విభునిన్ = మనసునందలి నాథుని, సెగ్గించెన్ = నిందించెను - రోఁతపడెను

**తాత్పర్యము.** 'తన హృదయమునం దెప్పుడును న న్నించుకైనను ఉండనీఁడు కాని నా హృదయమునం దెల్లప్పుడును దా నుండును ఇది యేమి న్యాయము?' అని యింతి మనోనాథుని నిందించెను

క కని కొంత దవ్వ వెంద్రుక
కొన నేయం దాన నేర్చుఁ గుసుమాస్త్రుఁడు నా
మననమునఁ బాయని పతి నురి
యును దాఁకక, నన్న తాఁక నుఱియుచు నునికిన్ 148

**అర్థము** కుసుమ + అస్త్రుఁడు = పువ్వులు బాణములుగాఁ గలవాఁడు - మన్మథుఁడు, కని = చూచి, కొంత-దవ్వు + అ = ఇంచుక దూరముననే, వెంద్రుక-కొనన్ = వెంద్రుకకొనతో, ఏయన్ = కొట్టుటకు, తాను + అ = తానే, నేర్పున్ = సమర్థుఁడగును, నన్నున్ + అ = నన్నే, తాఁకన్ = స్పృశించునట్లు, ఉటియుచున్ + ఉనికిన్= (అంపవాన) కురియుచుండుటచే, నా-మనమునన్= నా మనస్సునందు, పాయని = ఎడువని, పతిన్ = భర్తను, తాఁకక = స్పృశింపక, ఉరియును = చలించును

**తాత్పర్యము** . మన్మథుఁడు ఇంచుకదూరమునుండియే వెంద్రుక కొనతోనైనను గొట్ట సమర్థుఁడు అతఁడు నా మీఁదనే యంపవానఁ గుఠియుచుండుటచే, నా మనసును విడువకున్న నా పతిని దాఁకక చలించును మన్మథుడు నన్నే కొట్టుచున్నాఁడుగాని, నా మనసులోనున్న నా భర్తను గొట్టలేక చలించుచున్నాఁడని భావము

విశేషములు ఈ పద్యము భావము అస్పష్టముగా నున్నది

చ **స్ఫురదురుకాంతి నీ మొగముఁ బోలఁగ నోపక వందుచున్న చం**
**దురుఁ డెదఁబోలఁగంటి నని త్రుళ్లెడు నిప్పుడు నీదు వక్త్రపం**
**కరుహ మవారితాశ్రుజలకజ్జలసంగతమైనఁ జూచి సుం**
**దరి! వల దేలయేడ్చె? దని తత్సతి నొక్కతె పల్కెఁ బెల్కుఁ బన్** 149

**అర్థము** :స్ఫురత్ + ఉరు + కాంతిన్= ప్రకాశించుచున్న గొప్ప కాంతియందు, నీ-మొగమున్ = నీ ముఖమును, పోలఁగన్ + ఓపక = పోలఁజాలక, వందుచున్+ ఉన్న = దుఃఖించుచున్న, చందురుఁడు = చంద్రుఁడు, నీదు-వక్త్ర-పంకరుహము= నీయొక్క ముఖపద్మము, అవారిత + అశ్రు-జల-కజ్జల-సంగతము + ఐనన్ = అడ్డగింపఁబడని కన్నీటితోఁగూడిన కాటుకతోఁ గూడినది కాఁగా, చూచి, ఎదన్ = హృదయమునందు, పోలన్ + కంటిన్ = సరిపోలఁగలిగితిని, అని, ఇప్పుడు, త్రుళ్లెడున్ = సంతోషించుచున్నాఁడు, సుందరి = ఓ సుందరీ, వలదు, ఏల + ఏడ్చెదు = ఎందుల కేడ్తువు? అని, ఒక్కతె = ఒక స్త్రీ, తద్ + సతిన్= ఆ యింతిని, పెల్కుఁబన్ = భయపడఁగా, పల్కెన్

**తాత్పర్యము**.ఆమె ముఖము నిష్కళంకమైనది చంద్రుఁడు సకలంకుఁడు అందుచే అధికమైన కాంతియందు ఆమె ముఖమును బోలలేక పోవుచున్నానే యని చంద్రుఁడు దు.ఖించుచుండెను ఇప్పు డామె యేడ్చుచుండుటచే నామె ముఖపద్మము కన్నీటితోఁ గూడిన కాటుక గలది యగుటచే సకళంక మయినది

అదిచూచి చంద్రుఁ డామె ముఖమును బోలఁగలిగితినని ఇప్పుడు ఉప్పొంగుచున్నాఁడు 'సుందరి! ఏడువవలదు' అని - ఒక యింతి యామె భయపడునట్లు పల్కెను

**విశేషములు** అలంకార ముత్ప్రేక్ష వక్త్రపంకరుహ మనుచో నుపమ తన ముఖము చంద్రునికంటెఁ గాంతిమత్తరముగా నుండవలయునని యామె తలఁపు (చంద్రుఁడు తన ముఖము నెక్కడఁబోలునో యని యామె భయము) ఆ భయముచే నామె యేడ్చుచుండెను నిజమున కామె యేడ్చుటచేతనే ముఖము కాటుకకన్నీటిచేఁ గళంకితమయి, చంద్రుఁడు దానిని బోలుటకు వీలయ్యెను అందుచే నింకొకతె ఆమె నేడువవలదని వారించుచుండెను స్ఫురత్ + ఉరు = స్ఫురదురు చందురుఁడు (వికృతి) = చంద్రుఁడు (ప్రకృతి) ఏడ్చెదని - ఏడ్చెదవు + అని లాట్టు వకారమునకు లోపము - బాల క్రి 24 ఏడ్చెద + ఉ + అని అపదాది స్వరసంధి - బాల సంధి 11 ఏడ్చెదు + అని ఉత్వసంధి బాల సంధి 1 ఏడ్చెదని పెల్కుఁలు - పెలుకులు (రూపా)

**వ మఱియు నంద కొందఱు దమవలచు చెలికత్తెల వలచు బొజుంగులం దెలిచి, తెలియనివారి ననునయరీతి నాక్షేపించుచు 150**

**అర్థము :** మఱియున్, అందున్ + అ = అంద = అందే, కొందఱు, తమ-వలచు = తాము ప్రేమించునట్టి, చెలికత్తెలన్, వలచు, బొజుంగులన్ = విటులను, తెలిచి = తేర్చి, తెలియనివారిన్, అనునయ-రీతిన్ = బుజ్జగించు విధమున, ఆక్షేపించుచున్ = బెదరించుచు

**తాత్పర్యము :** మఱియు నందే కొందఱు తాము వలచు చెలికత్తెలను వలచునట్టి విటులను దేర్చి, తెలియనివారిని బుజ్జగించు విధమున బెదరించుచు - తరువాతి పద్యముతో నన్వయము

**చ కలుచుట దోసమే? మగలఁ గల్వక యాండురు దొల్లి యాండురం**
**గలుతురె? తక్కు లేక నినుఁ గల్చుడు నేరమిగాఁ దలంచియే**
**యలుగుదు, మ్రొక్కినం దెలవ దాఁటది గీడ్పడ మ్రొక్కుఁగాక నిం**
**గొలుచునె? కల్చువారియెడఁ గోఱడ మెప్పుడుఁ జేయు దొప్పునే? 151**

**అర్థము .** కలుచుట = వలచుట, దోసమే = తప్పా, ఆండురు = ఆంద్రు-స్త్రీలు, మగలన్ = పురుషులను, కల్వక = ఒల్లక, తొల్లి = పూర్వము, ఆండురన్=

స్త్రీలను, కలుతురె = వలతురా? తక్కు-లేక = వంచన లేక, నినున్ = నిన్ను, కల్చుడు = వలచుట, నేరమి + కాన్ = తప్పుగా, తలంచియే = భావించియే, అలుగుదు = కోపింతువు, మ్రొక్కినన్, తెలవదు = తేఱదు, ఆఁటది = స్త్రీ, కీడ్పడన్ = దైన్యమునొందఁగా, మ్రొక్కన్ + కాక, నిన్ = నిన్ను, కొలుచునె = సేవించుచున్నదే! కల్చువారి + ఎడన్ = వలచువారియెడల, కోఱడము = క్రోధము, ఎప్పుడున్ = ఎల్లప్పుడును, చేయుడు = చేయుట, ఒప్పునే = తగునా?

**తాత్పర్యము :** వలచుట తప్పా? స్త్రీలు పురుషులను వలవక మునుపు స్త్రీలను వలచిరా? వంచనలేక నిన్ను వలచుటయే తప్పుగా భావించి కోపింతువు స్త్రీ నాయకుఁడు మ్రొక్కినను దేఱదు అట్టి ఆమె దైన్యముతో మ్రొక్కుటయేకాక నిన్ను బతిమాలి సేవించుచుండఁగాఁ బ్రియపై నిట్లు వక్రత్వముఁ జూపుట నీకుఁ దగునా? వలచువారియెడల నెల్లప్పుడును గోపముచేయుట తగునా?

**విశేషములు.** ఆండురు ఆంఁడ్రు - ఆలు + లు - 'ఆల్వాదుల బహువచన లకారంబునకు రేఫంబును ముందఱి లువర్ణంబునకు బిందుపూర్వక డకారంబు నగు ' బాల ఆచ్చిక 11 ఆంఁడ్రు - ఆండురు అనుటకుఁ బ్రయోగాంతరము - 'మలయాచలంబుపైఁ జిలువయిల్లాండుర ఫణరత్నములయందుఁ బ్రతిఫలించి ' కాశీ ఆ 1 'ఆ సమయంబునన్ మగని యాండురు గన్యలు ' నిర్వ ఆ 5

క **ధృతి దక్కి మ్రొక్కి పైఁబడి**
**మతిఁ గీడ్పడి తెలుప నలుక మానక సౌభా**
**గ్యత మెఱయుచునికి నీ వా**
**సతికిం బ్రాణేశుఁ డగుట సార్థక మయ్యెన్** 152

**అర్థము :** ధృతి = ధైర్యము, తక్కి = విడిచి, మ్రొక్కి, పైన్ + పడి = మీఁదఁబడి, మతిన్ + కీడ్పడి = తెలివి కోలుపోయి, తెలుపన్ = తేర్పఁగా, అలుక = కోపము, మానక = వీడక, సౌభాగ్యతన్ = సుభగత్వముతో, మెఱయుచున్ + ఉనికి = ప్రకాశించుచుండుట, నీవు, ఆ-సతికిన్ = ఆ స్త్రీకి, ప్రాణ + ఈశుఁడు = ప్రాణేశ్వరుఁడు, అగుట, సార్థకము + అయ్యెన్ = నిజమయ్యెను

**తాత్పర్యము.** ధైర్యము కోలుపోయి మ్రొక్కి, పైఁబడి, తెలివి దక్కి తేర్పఁగాఁ, గోపము విడువక సౌభాగ్యముతో నొప్పుచుండుటచే నీవు ఆ స్త్రీకిఁ బ్రాణేశ్వరుఁడ వగుట సార్ధకమయ్యెను ఆమె నిన్నుఁ బ్రాణేశ్వరునిగా భావించుటచేతనే, నీ వన్ని చేసినను ఆమె నీపైఁ గోపము విడువకుండె నని భావము

చ కనుకని( దొల్లి దానిదెస( గన్నుల( జూచినవాని నేయు నా
మనసిజు( డణ్చు( గోయిలలు మట్టు నళుల్, నవయించు( దెమ్మెరల్
గనుకని నిన్ను నిప్పు డిది గన్నుల( జూచిన దాని నేసె నా
మనసిజు(, డణ్చె( గోయిలలు, మట్టె నళుల్, నవయించె( దెమ్మెరల్ 153

**అర్థము** కనుకనిన్ = సంభ్రమముతో, తొల్లి = పూర్వము, దాని-దెసన్ = ఆమెవైపు, కన్నులన్ = కన్నులతో, చూచిన-వానిన్, ఆ-మనసిజు(డు = ఆ మన్మథు(డు, ఏయున్ = కొట్టును, కోయిలలు = కోకిలములు, అణ్చున్ = అణ(చును, అళుల్ = తుమ్మెదలు, మట్టున్ = బాధించును, తెమ్మెరల్ = గాలి, నవయించున్ = బాధించును, ఇప్పుడు, నిన్నున్, ఇది = ఈమె, కనుకనిన్ = సంభ్రమముతో, కన్నులన్, చూచినన్, దానిన్ = ఆమెను, ఆ-మనసిజు(డు, ఏసెన్ = కొట్టెను, కోయిలలు, అణ్చెన్, అళుల్, మట్టెన్, తెమ్మెరల్, నవయించెన్

**తాత్పర్యము** పూర్వము దానివైపు సంభ్రమముతో( గన్నుల(జూచినవాని నా మన్మథు(డు కొట్టును కోకిలములు అణ(గ(ద్రొక్కును తుమ్మెదలు బాధించును గాలి బాధించును ఇప్పుడు ఈమె నిన్ను సంభ్రమముతో( గంట(జూచినచో, నామె నా మన్మథు(డు కొట్టెను కోకిలము లణ(గ(ద్రొక్కెను తుమ్మెదలు బాధించెను గాలి బాధించెను

**విశేషములు:** అణ్చు - అణ(చు 'లా(తి యచ్చునకు సహిత మొకానొకచో నుడినడుమ లోపంబు గానంబడియెడి' బాల ప్రకీర్ణక 18 'అణ్చు' అనుదానికి 'అంచు' అను పాఠాంతరము గలదు అంచు = అణ(గ(జేయు తెమ్మెరల్ = ఏకవచనమే 'తెమ్మెర' ఉండదు

చ అమర(గ నీ వనంతవిరహానలపూరిత మైనదాని చి
త్తమున రమింతు ప్రీతి, నవదాహకరంబగు నీ మనంబులో
నిమిషము( బొందెదట్టె యిది నీ కలుగం జను, నైన( జాల నే
రమి యొకచో సహించియును రమ్ము దయన్ సుభగైకభూషణా ! 154

**అర్థము** . అమర(గన్ = ఒప్పునట్లుగా, నీవు, అనంత-విరహ + అనల-పూరితము = అంతులేని యెడ(బాటు అనెడి అగ్నితో నిండినది, ఐన, దాని-చిత్తమునన్ = ఆమె మనస్సునందు, ప్రీతిన్ = ప్రీతితో, రమింతు = క్రీడింతువు, ఆనందింతువు, అవదాహకరంబు = తాపశాంతినిజేయునట్టిది, అగు, నీ-

మనంబులోన్ = నీ మనస్సులో, నిమిషమున్ + పొందదు + అట్టె = ఱెప్పపాటు కాలముగూడ నుండదఁట, ఇది = ఈ విషయము, నీకున్, అలుగన్ + చనున్ = కోపింపఁదగినది, ఐనన్ = అయినను, సుభగ + ఏక-భూషణా = సుభగత్వము ప్రధానమైన అలంకారముగాఁ గలవాఁడా! చాల-నేరమి = గొప్పతప్పు, ఒకచోన్ = ఒకచోట, సహించియును = ఓర్చియును, దయన్ = దయతో రమ్ము

**తాత్పర్యము** నీవు అంతులేని విరహాగ్నితో నిండిన ఆమె మనస్సునందుఁ బ్రీతితో రమింతువు కాని తాపోపశమనముఁజేయు నీ మనస్సులో నామె ఒక నిమిషముగూడ నుండదటే ఈ విషయము నీకుఁ గోపమువహింపఁదగినది అయినను ఓయి సుభగత్వము ముఖ్యాలంకారముగాఁ గలవాఁడా! గొప్పతప్పు నొకచో సహించి దయతో రమ్ము

**విశేషములు .** రమింతు - రమింతువు 'లాద్వకారమునకు లోపము - బాల క్రియ 24 రమింతు + ఉ అపదాదిస్వరసంధి బాల సంధి 11 రమింతు అవదాహ-కరంబు - అవదాహము = తాపమును బోఁగొట్టునది - వట్టివేరు - 'అవదా హేష్టకాపథే' అమరము తాపశాంతిని జేయునది అవనశ్యతి దాహోఽనే నే త్యవదాహమ్ - దీనిచేత దాహ మణఁగును

**తే నీవు దక్కినఁ దక్కదు జీవ, మీవు**
**దక్కకున్నను దక్కు, నిత్యంబుఁ బురుడు**
**వారి కెడయైన, మట్టి జీవంబుతోడ**
**నునికి సతి తప్పు, నీ వల్గియుంట దప్పె? 155**

**అర్థము .** నీవు, తక్కినన్ = వదలిన యెడల, జీవము = నా ప్రాణము తక్కదు = మిగులదు, ఈవు = నీవు, తక్కక + ఉన్నను = వదలక పోయినచో, తక్కున్ = (ప్రాణము) మిగులును, నిత్యంబున్ = ఎల్లప్పుడును, పురుడు వారికిన్ = సమప్రేమము గలవారికి, ఎడ + ఐనన్ = ఎడఁబాటు గలిగినపుడు, మట్టి = మందమయి, జీవంబుతోడన్ = ప్రాణముతో, ఉనికి = ఉండుట, సతి-తప్పు = ఇంతి తప్పు, నీవు అల్గి + ఉంట = కోపించుట, తప్పె = తప్పా?

**తాత్పర్యము .** నీవు వీడుచో నా ప్రాణము మిగులదు విడువకున్నచో మిగులును ఎల్లప్పుడును సమప్రేమము గలవారికి ఎడఁబాటు గలిగినపుడు మందమయి ప్రాణముతో నుండుట యింతి తప్పు నీవు కోపించుట తప్పా? కాదనుట

వ అని యనేకప్రకారంబుల ఋజువక్రోక్తిభేదంబుల ననునయించి విటవిటీజనంబులం గూర్చుచుండి రంత నట విటగోష్ఠియందు విట విదూషక నాగరక పీరమర్దకులు చతురోక్తి పరిహాసోక్తి వక్రోక్తి గ్రామ్యోక్తులం దగిలి సంభాషించుచుఁ దమతమ మనోవ్యాపారంబు లెఱింగించుచు నొండొరుల సంతరించుచు 156

**అర్థము** అని, అనేక ప్రకారంబులన్ = పెక్కు రీతుల, ఋజు-వక్ర + ఉక్తి-భేదంబులన్ = ఋజూక్తి, వక్రోక్తి అనుభేదములచే, అనునయించి = బుజ్జగించి, విట-విటీ-జనంబులన్ = విటజనములను, విటీజనములను, కూర్చుచున్ + ఉండిరి, అంతన్, నట-విట-గోష్ఠి + అందున్ = నటులయు విటులయు సభయందు, విట-విదూషక-నాగరక-పీరమర్దకులు = విటులు, విదూషకులు, నాగరకులు, పీరమర్దులు అను శృంగారనాయకానుచరులు (క్రమముగా) చతురోక్తి - పరిహాసోక్తి - వక్రోక్తి- గ్రామ్యోక్తులన్ = చతురము, పరిహాసము, వక్రము, గ్రామ్యము నైన మాటలందు, తగిలి = ఆసక్తివహించి, సంభాషించుచున్ = మాటలాడుచు, తమతమ - మనస్ (ః) + వ్యాపారంబులు = తమతమ మనస్సుల వర్తనములు, ఎఱింగించుచున్ = తెలియఁజేయుచు, ఒండొరులన్ = ఒకరినొకరు, సంతరించుచున్ = ఆదరించుచు

**తాత్పర్యము** . అని పెక్కు రీతుల ఋజూక్తి వక్రోక్తి అను భేదములచే బుజ్జగించి విటజనములను, విటీజనములను గూర్చుచుండిరి అంత నటులయు విటులయు సభయందు విటులు, విదూషకులు, నాగరకులు, పీరమర్దులు అనెడి శృంగారనాయకానుచరులు క్రమముగా చతురోక్తి పరిహాసోక్తి వక్రోక్తి గ్రామ్యోక్తులతో సంభాషించుచుఁ దమతమ మనస్స్థితులను ఎఱిఁగించుకొనుచు ఒకరినొకరు ఆదరించుచు - తరువాతి పద్యముతో నన్వయము

**విట విదూషకాదుల చతుర సంభాషణములు**

క వెలయఁగ సుజనుల మనమును
వెలయాండుర జవ్వనంబు, వెన్నెల తెలుపుం
జలిగాలి తనుపు, నిర్ఝర
జలములు, నివియెల్ల సర్వసామాన్యంబుల్ 157

**అర్థము** . వెలయఁగన్ = ఒప్పుగా, సుజనుల = మంచివారియొక్క మనమును = మనస్సును, వెలయాండుర = వేశ్యలయొక్క జవ్వనంబున్ =

యౌవనమును, వెన్నెల - తెలుపున్ = వెన్నెలయొక్క స్వచ్ఛతయును, చలిగాలి తనుపున్ = చలిగాలియొక్క చల్లఁదనమును, నిర్ఝర-జలములున్ = ఏఱుల నీరును - ఇవి ఎల్లన్, సర్వసామాన్యంబుల్ = సర్వసాధారణములు

**తాత్పర్యము .** సజ్జనుల మనస్సును, వేశ్యల యౌవనమును, వెన్నెల స్వచ్ఛతయును, చలిగాలి చల్లనయును, సెలయేఱుల నీరును - ఇవి యన్నియును సర్వసాధారణములు

**ఉ భావజుకేళి నచ్చుపడి పైఁబడి తద్విటు నిచ్చఁగూడి రాఁ**
**గా వివిధోపచారములఁ గామసుఖంబులు సల్పిపుచ్చి తా**
**రోవెల నీఁగి వెండొకని రోయుఁ దగన్, వెలయాలికూటముం,**
**బూవుల మేలికంపుఁ దమ పొందున కా కటమీఁద నిల్చునే? 158**

**అర్థము .** భావజు - కేళిన్ = మన్మథక్రీడయందు, అచ్చుపడి = ఏర్పడి, పైఁబడి, తద్ +విటున్ = ఆ విటుని, ఇచ్చన్ + కూడి-రాఁగాన్ = కోరికతోఁ గూడివచ్చుటకు, వివిధ + ఉపచారములన్ = పలురీతులయిన సేవలతో, కామ - సుఖంబులు = మన్మధసౌఖ్యములు, సల్పిపుచ్చి = చేసివైచి, తాన్, రో-వెలన్ + ఈఁగి = ఇచ్చిన శుల్కమును నివర్తించి, వెండొకనిన్ (వెండి + ఒకనిన్) = మఱియొకనిని, తగన్= తగునట్లు, రోయున్ = వెదకును, వెలయాలి - కూటమున్ = వేశ్యా సంగమమును, పూవుల - మేలి - కంపున్ = పువ్వుల మంచి వాసనయును, తమ - పొందున్ + అ - కాక = తమ పొందునే కాని, - అట - మీఁదన్ = ఆపైని, నిల్చునే = నిలుచునా ?

**తాత్పర్యము .** మన్మథక్రీడ కిష్టపడి పైఁబడి విటునిగూడిరాఁగా వివిధోపచారములతో మన్మధసుఖములనుజేసి పంపి తాను గైకొన్న శుల్కమును నివర్తించి వేశ్య మఱియొకనిని వెదకును వేశ్యాసంగమమును, పూవుల సువాసనయును దమ అనుభవమువఱకే కాని ఆపైని నిలువవు

**విశేషములు:**వెండొకని - వెండి + ఒకని - ఇక్కడ ఇత్వసంధి చేయఁబడినది కనుక 'వెండి'ని ఏమ్యాదులలోఁ జేర్చుకొననగును 'ఏమ్యాదుల యిత్తునకు సంధి వైకల్పికముగా నగును ' బాల సంధి 5 వేఱొకని అని పాఠాంతరము కూటము - కూటమి (రూపాం ) తమ పొందున' కా కటమీఁదనిల్చునే - ఒక్కపొందునకేకాని తరువాత నిలువవనుట ఇందు విశేషము సామాన్యముచే సమర్థింపఁబడినది కావున అలంకారము అర్థాంతరన్యాసము

క చెఱ కీనపుచ్చ కఱిముఱిఁ
గఱచిన రస మానరానిగతిఁ దరుణులఁ జే
వెఱ వాపక సంగతి కే
డ్తెఱ సేసి మనోరథములు దీఱునె పడయన్ ? 159

**అర్థము .** చెఱకు + ఈనపుచ్చక = చెఱకుగడ నీననీక- ముదురనీక, అఱిముఱిన్ = శీఘ్రముగా, కఱచినన్ = కొఱికినచో,రసము, ఆనన్ + రాని - గతిన్ = త్రావ శక్యముగాని విధమున, తరుణులన్ = యువతులను, చేవెఱ = లజ్జ (?), పాపక = పోఁగొట్టక, సంగతికిన్ = సంగమమునకు, ఏడ్తెఱ + చేసి = వేగపడి, మనోరథములు = కోరికలు, పడయన్ + తీఱునె = పొందనగునా ?

**తాత్పర్యము** చెఱకుగడను ముదురనీక తొందరపడి కొఱికి చెఱకు రసమును బొందరాని విధమున యువతుల సిగ్గును బోఁగొట్టక సంగమమునకు వేగపడినచోఁ గోరికలు పొందనగునా ?కా దనుట

**విశేషములు.** అలంకారముపమ ఈ పద్యము శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి సంస్కరణముల ననుసరించి వ్యాఖ్యానింపఁబడినది

క వరసతి సురతకళాగమ
పరిణతుఁ డగువిటునిఁగూడి పాయదు, మఱి డె
ప్పరమునఁ బాసియు నెన్నఁడు
నొరుఁ గవయదు జున్నుఁదిన్న యొట్టియపోలెన్ 160

**అర్థము .** వర - సతి = శ్రేష్ఠురాలయిన స్త్రీ, సురత - కళా + ఆగమ - పరిణతుఁడు = రతిశాస్త్రపారంగతుఁడు, అగు, విటునిన్, కూడి, పాయదు = విడువదు, మఱి, డెప్పరమునన్ = అనివార్యముగా, పాసియున్ = విడిచియు, ఎన్నఁడున్ = ఎప్పుడును, జున్నున్, తిన్న, ఒట్టియ + పోలెన్ = ఒంటె విధమున (?) ఒరున్ = ఇతరుని, కవయదు = కూడదు

**తాత్పర్యము .** శ్రేష్ఠురాలయిన స్త్రీ రతిశాస్త్రపారంగతుఁడగు విటునిఁగూడి విడిచిపెట్టదు అనివార్యముగా విడిచిపెట్టినను జున్నును దినిన యొంటెవలె, నెన్నఁడును ఇతరునిఁ గూడదు

**విశేషములు** అలంకార ముపమ ఒట్టియ = ఒంటె (?) - నిఘంటువులఁ గానరాదు

క తన మతి సతిరతి పతిమతి
కనుకూలముగా నిరీక్షణాలాపాలిం
గన చుంబన వరకరణా
సనవిద్యలఁ గూడునేని సమరతిఁ బడయున్ 161

**అర్థము.** తన - మతిన్ = తన తలఁపునందు, సతి - రతి = సతియొక్క రతి, పతి - మతికిన్ = భర్త తలఁపునకు, అనుకూలముగాన్ = తగినవిధముగా, నిరీక్ష విద్యలన్, నిరీక్షణ = చూచుట, ఆలాప = మాటలాడుట, ఆలింగన = కౌఁగిలించుకొనుట, చుంబన = ముద్దుపెట్టుకొనుట, వర - కరణ + ఆసన - విద్యలన్ = శ్రేష్ఠమయిన రతిబంధము, ఆసనము అనువిద్యలతో, కూడున్ + ఏనిన్, సమరతిన్, పడయున్ = పొందును

**తాత్పర్యము .** సతి రతి పతితలఁపున కనుకూలముగాఁ జూచుట, మాటలాడుట, కౌఁగిలించుకొనుట, ముద్దిడుకొనుట, రతిబంధము, ఆసనము అనువిద్యలతోఁ గూడినచో సమరతిని బొందును

ఆ మరణకాలమైన మఱి జన్మదేశంబుఁ
దలఁచు నుష్ట్ర మట్టి తలఁపుఁ దలఁపె ?
యధిపుఁ బాసినపుడ యలఁదుర వలవదె ?
మెలుఁత మెట్టఁబడినమీనువోలె. 162

**అర్థము :** ఉష్ట్రము = ఒంటె, మరణ - కాలము + ఐనన్ = మరణ సమయము కాఁగా, మఱి, జన్మ - దేశంబున్ = పుట్టిన దేశమును, తలఁచున్, అట్టి -తలఁపున్, తలఁపె ?, మెలుఁత = మెలఁత - స్త్రీ, మెట్టన్ = మెఱక ప్రదేశమునందు, పడిన, మీను + పోలెన్ = చేఁపవిధమున, అధిపున్ = భర్తను, పాసిన + అపుడు + అ = విడిచినప్పుడే, అలఁదురన్ + వలవదె = దుఃఖింపవలదా ?

**తాత్పర్యము .** ఒంటె మరణ సమయమున జన్మదేశమును దలఁచును అట్టి తలఁపును ఒక తలఁపా ? స్త్రీ మెఱకపైఁబడిన మీనువిధమున భర్తను వీడినప్పుడే దు ఖింపవలదా ?

క ఈఁగికిఁ గలుచు హరిద్రా
రాగం బది నిల్వ దెయిది రతి మేడ్పడి సం
భోగ గతిఁ గలుచు విటుని వి
రాగం బది నిల్చు భావరసజననంబై. 163

**అర్థము** ఈఁగికెన్ = ఈవికి, కలుచు = వలచు, హరిద్రారాగంబు + అది= ప్రేమవిషయమునఁ జంచలమైనది, నిల్వదు, ఎయిది = చేరి, రతిన్ = రతియందు, మేడ్పడి = మేడు + పడి = అజ్ఞతనొంది, సంభోగ - గతిన్ = సంభోగరీతిని, కలుచు= వలచునట్టి, విటుని - విరాగంబు + అది = విటుని విరక్తి, భావ - రస-జననంబు + ఐ = భావము, రసము అనివాని ఆవిర్భావము గలదయి, నిల్చున్

**తాత్పర్యము .** "ధనాసక్తిచే వలచుట హరిద్రారాగమువలెఁ ద్వరలో మాసిపోవును విటుఁడు విరాగియైనను నిర్వ్యాజరతసంపదగలదేని రసభావము లుద్దీపించుచుండును

**విశేషములు.** హరిద్రారాగము = పసుపురంగు గలది - ప్రేమ విషయమునఁ జంచల మయినది 'క్షణమాత్రానురాగశ్చ హరిద్రారాగ ఉచ్యతే'

క విరహమునకంటె దుఃఖముఁ
గర మిష్టముఁ గవయఁగాన్పుకంటె సుఖంబున్
బరికింప నొండు లే దిది
పరమార్థ మమర్త్య మర్త్య ఫణిలోకములన్ 164

**అర్థము .** విరహమున కంటెన్ = ఎడఁబాటుకంటెను, దుఃఖమున్ = కష్టమును, కరము + ఇష్టమున్ + మిక్కిలి ప్రియమైన దానిని, కవయన్ + కాన్పు - కంటెన్ = పొందఁగనుటకంటెను, సుఖంబున్ = సుఖమును, పరికింపన్ = ఆలోచింపఁగా, ఒండు= ఒకటి, లేదు, ఇది, అమర్త్య - మర్త్య - ఫణి - లోకములన్ = దేవతల, మనుజుల, నాగముల లోకములందు, పరమార్థము = యథార్థము

తాత్పర్యము ఎడఁబాటుకంటె దుఃఖమును, మిక్కిలి యిష్టమైన దానిని బొందఁగలుగుటకంటె సుఖమును ఆలోచింపఁగా నింకొకటి లేదు ఇది దేవతల, మనుష్యుల, నాగుల విషయమున యథార్థము

క ఇలఁ బుట్టదు, పుట్టియుఁ దా
నిలువదు, నిలిచియును నొక్కనిజమునఁ దిరమై
కలదాఁక నెయిద నేరదు,
వెలయాండుర కలుపు మగల విడుపును సతులన్ 165

**అర్థము** వెలయాండుర - కలుపున్ = వేశ్యలయొక్క వలపును, సతులన్ = స్త్రీలను, మగల - విడుపును = పురుషులత్యాగమును, ఇలన్ = భూమియందు, పుట్టదు, పుట్టియున్ = పుట్టినను, తాన్, నిలువదు, నిలిచియును, ఒక్క - నిజమునన్ = ఒకే స్థితితో,తిరము + ఐ = స్థిరమయి, కలదాఁకన్ = సర్వకాలమును, ఎయిదన్ + నేరదు = సాగఁజాలదు

**తాత్పర్యము** . వేశ్యల వలపును, పురుషులు స్త్రీలను ద్యజించుటయును, భూమిలోఁ బుట్టదు పుట్టినను నిలువదు, నిలిచియును ఒకేస్థితితో స్థిరముగా సర్వకాలమును సాగఁజాలదు

తే వలను లేదేని రూపేల ? వలనుగొలుపు
రూపు లేదేని వలనేల ? రూపు వలనుఁ
గల కళావతిఁ గలిపించి కలిచియుండె
నేని కామసుఖంబెల్ల వానియదియు 166

**అర్థము** . వలను = చాతుర్యము, లేదు+ ఏనిన్ = లేకున్నచో, రూపు = అందము, ఏల ?, వలను, కొలుపు = కలిగించు, రూపు, లేదు + ఏనిన్, వలను, ఏల ? రూపున్, వలనున్, కల, కళావతిన్ = స్త్రీని, కలిపించి = వలచునట్లు చేసి, కలిచి + ఉండెన్ + ఏనిన్ = ప్రేమించియున్నచో, కామ - సుఖంబు + ఎల్లన్ = మన్మధసౌఖ్యమంతయును, వాని + అది + అ = వానిదే

**తాత్పర్యము** . "చతురత్వమును, రూపమును, విద్యయుఁ గలస్త్రీని పురుషుఁడు తన్నుఁబ్రేమించునట్లు నడచుకొనుచుఁ దానును ప్రేమించెనేని, వానికి మన్మధసౌఖ్యము సంపూర్ణమగును "

చ కరమభిలాషులై బహుముఖంబులఁ గూర్చినఁ బెద్దగాదు దా
రరగొన కిచ్చినం దఱుగ దన్యభవార్జితవిత్తసంఖ్య, సా
గరము నదీప్రవాహములఁ గప్పిన నెక్కదు మేర, కా పయో
ధర బడబానలార్కతతి ద్రావినఁ దక్కువ గాని మాడ్కియై 167

**అర్థము** సాగరము = సముద్రము, నదీ - ప్రవాహములన్ - నదుల ప్రవాహములతో, కప్పినన్ = కప్పినప్పటికిని, మేరకున్ + ఎక్కదు = హద్దు మీఱదు, ఆ -పయోధర - బడబా + ఆసల +ఆర్క-తతి = ఆ మేఘముల సమూహము, బడబాగ్ని, సూర్యుఁడు, త్రావినన్= త్రాగినప్పటికిని, తక్కువ + కాని - మాడ్కి + ఐ = తగ్గిపోవని విధముగా, అన్య-భవ + ఆర్జిత - విత్త - సంఖ్య = పెఱపుట్టువులందు సంపాదింపఁబడిన సొమ్ముల సంఖ్య, కరము = మిక్కిలి, అభిలాషులు + ఐ = కోరికగలవారయి,బహు-ముఖంబులన్ = అనేకవిధముల, కూర్చినన్= ప్రోగుచేసినప్పటికిని, పెద్ద + కాదు = అధికముగాదు, తారు = వారు, అర + కొనక = సందేహింపక, ఇచ్చినన్= దానము చేసినను, తఱుగదు = తగ్గదు

**అర్థము**.నదీ ప్రవాహములు చేరినను సముద్రము మర్యాద నతిక్రమింపదు మేఘములు, బడబాగ్ని, సూర్యుఁడు త్రాగినను తఱుగదు అట్లే పెఱపుట్టువులం దార్జించిన ధనము కోరికతో నెన్నోవిధములఁ గూర్చినను పెరుఁగదు వెనుదీయక దానముచేసినను దఱుగదు

**విశేషములు** . అలంకారము ఉపమ

క. ప్రాలు గలనాఁడు ధాన్యము
వోలె సుసేవ్యుఁడగు నరుఁడు వొలుపుగ, మేనం
బ్రాలు దొలంగుడు నుముకయుఁ
బోలె నసేవ్యుఁడగు నెట్టి పురుషుండైనన్ 168

**అర్థము** . ప్రాలు = బియ్యము, సామర్థ్యము, కల - నాఁడు = ఉన్నప్పుడు, ధాన్యము + పోలెన్ = ధాన్మము వలె, నయఁడు = మనుష్యుఁడు, పొలుపుగన్ = ఒప్పుగ, సుసేవ్యుఁడు = బాగుగా సేవింపఁదగినవాఁడు - మిక్కిలి గౌరవింపఁదగినవాఁడు, అగున్, మేనన్ = శరీరమున - లోపల అని భావము, ప్రాలు = బియ్యము, సామర్థ్యము, తొలంగుడున్ = పోయినంతనే, ఎట్టి - పురుషుండు + ఐనన్ = ఎటువంటి పురుషుఁడయినను, ఉముకయున్ + పోలెన్ = పొట్టువలె, అసేవ్యుఁడు + అగున్= సేవింపఁదగనివాఁడు - గౌరవంపఁదగనివాఁడు అగును

**తాత్పర్యము** . బియ్యముతోఁ గూడినప్పుడు వడ్లవలె, మనుష్యుఁడు సామర్థ్యమున్నప్పుడు గౌరవింపఁదగినవాఁడుగను బియ్యము తొలఁగినప్పుడు పొట్టువలె, ఎట్టివాఁడయినను సామర్థ్య ముడిగినప్పుడు గౌరవహీనుఁ డగును

**విశేషములు.** అలంకార ముపమ - శ్లేషానుప్రాణితము ప్రాలు (బహువ )- ప్రాయి (ఏకవ ), ప్రాయి = బియ్యము, శక్తి, సామర్థ్యము బియ్య మను నర్థమున ప్రాయిశబ్దము బహువచనాంతముగానే ప్రయోగింపఁబడుచున్నది సమాసములలో నేకవచనాంతముగాఁ బ్రయుక్తమగుచున్నది ఉదా నను(బ్రాయి ఉముక - ఊఁక (రూపాం )

**ఉ వాలిక లంబుజాక్షములు, వంకలు భ్రూలత, లంద డెందముల్**
**సాలఁగ నున్ను, లంద వలిసన్నులు సిక్కనిఱాలు సూడఁగా**
**బాలసమంద చిత్రరతిఁ బ్రౌఢలు గావున నొక్కభంగిఁ బాం**
**చాలున కైనఁ గాంతల నిజం బిది యిట్టిది నాఁగఁజాలునే ? 169**

**అర్థము.** చూడఁగాన్, అంబుజ + అక్షములు = పద్మములవంటి కన్నులు, వాలికలు = దీర్ఘములు, భ్రూ-లతలు = బొమతీవలు, వంకలు = వక్రములు, అందున్ + అ = అంద = అందే, డెందముల్ = హృదయములు, చాలఁగన్ = మిక్కిలి, నున్నులు = నున్ననివి, అంద, వలి-చన్నులు = గుండ్రని స్తనములు, చిక్కని = కఠినములైన, ఱాలు, బాలసము = బాలిశము - మౌర్ఖ్యము, అంద, చిత్ర - రతి = వింత సురతమునందు, ప్రౌఢలు = నేర్పుగలవారు, కావునన్, ఒక్క - భంగిన్ = ఒక్కరీతిగా, పాంచాలునకున్ + ఐనన్ = పాంచాల జాతిపురుషునకైనను, కాంతల = స్త్రీల, నిజంబు = స్వరూపము, ఇట్టిది, నాఁగన్ + చాలునే = అనుటకు శక్తియున్నదా ?

**తాత్పర్యము .** నేత్రపద్మములు దీర్ఘములు, బొమతీవలు వక్రములు, హృదయములు నున్ననివి, వలుదకుచములు కఠినశిలలు, గుణము బాలిశము - మౌర్ఖ్యము, చిత్రమైన సురతమునందుఁ బ్రౌఢిగలవారు కావున స్త్రీజనముల స్వరూపమిట్టిదని రసతత్త్వజ్ఞుఁడగు పాంచాలజాతి పురుషుఁడైన నెఱుఁగఁజాలఁడు

**విశేషములు :** అక్షము = కన్ను - ఇంద్రియార్థకమైనను లక్షణచేఁ గంటియందు వర్తించుచున్నది అంబుజాక్షములు - అక్ష్యంబుజములు అని ఉపమానోత్తరపదముగా నుండవలయును బాలసము (వికృతి) - బాలిశము (ప్రకృతి), 'చిత్తరతి'యను పాఠముకంటెఁ 'జిత్రరతి' యనుపాఠము మేలయినదిగా స్వీకరింపఁబడినది పాంచాలుఁడు - కామశాస్త్రమున నొకజాతి పురుషుండు

**వ అని యి ట్లనేకప్రకారమంబులం గామతత్త్వమతభేదంబులఁ గొన్ని వాదంబులు సేయుచుం దమతమవలఁకు లెన్నుచుండి రంత విటవిటీజనంబులు రతికేళీ రతికలహానునయాద్యనేకవిధ నిధువన క్రియలం బ్రవర్తింపఁదొడంగిన 170**

**అర్థము** అని, ఇట్లు, అనేకప్రకారంబులన్, కామ - తత్త్వ - మత-భేదంబులన్= మన్మథశాస్త్ర మత భేదములందు, కొన్ని - వాదంబులు, చేయుచున్, తమతమ - వలఁకులు = నేర్పులు, ఎన్నుచున్ + ఉండిరి, అంతన్, విట - విటీ - జనంబులు, రతి - కేళీ = రతిక్రీడలు, రతి - కలహ, అనునయ + ఆది + అనేక - విధ = అనునయించుట మున్నగు పెక్కురీతులయిన, నిధువన - క్రియలన్ సంభోగక్రియలయందు, ప్రవర్తింపన్ + తొడంగినన్ = ప్రవర్తింపఁబూనిన

**తాత్పర్యము .** అని యిట్లు పెక్కురీతుల మన్మథశాస్త్ర భేదములందుఁ గొన్ని వాదములు చేయుచుఁ దమతమ నేర్పులు గణించుచుండిరి అంత విటవిటీజనులు రతిక్రీడ, రతికలహము, అనునయము మున్నగు పలువిధములయిన సంభోగ క్రియలయందుఁ బ్రవర్తింపఁబూనిన తరువాతి పద్యముతో నన్వయము

క రాగరసాంబుధిఁ గామ ర
సాగణితామృతము వడయునని మధియింపం
గా గర్జిల్లురవం బనఁ
గా గళరుతు లెసఁగె లంజికావాటికలన్ 171

**అర్థము .** రాగ - రస + అంబుధిన్ = ప్రేమరసమనెడి సముద్రమును, కామ- రస + అగణిత + అమృతము = మన్మథరసము అనెడి అధికమైన అమృతము, పడయున్ + అని = లభించునని, మధియింపంగాన్ = త్రచ్చఁగా, గర్జిల్లు - రవంబు + అనఁగాన్ = ఉఱిమెడుధ్వని యనునట్లు, లంజికా - వాటికలన్= వేశ్యాగృహములందు, గళ-రుతులు = కంఠధ్వనులు, ఎసఁగెన్ = అతిశయించెను

**తాత్పర్యము.** ప్రేమరసమనెడి సముద్రమును మన్మథరసమనెడి అధికమైన అమృతము లభించునని మధింపఁగా, ఉఱుములచప్పు డనెడి కంఠధ్వనులు వేశ్యల గృహములం దతిశయించెను

**విశేషములు .** అలంకారము రూపకము

మ గళనాదంబులు, శుష్కరోదనముఁ, జీత్కారంబు, హుంకారసం
కలితాహాసముఁ, దాడనప్రహరణోగ్రధ్వానముం, జంచల
ద్వలయారావము, భూషణస్వనము, నా వారాంగనామందిరా
వలి నొక్కుమ్మడి మ్రోసెఁ గామకలహోద్యాద్యారవాభంబులై 172

**అర్థము.** ఆ - వార + అంగనా - మందిర + ఆవలిన్ = ఆ వేశ్యాగృహముల వరుసయందు, గళ - నాదంబులున్ = కంఠధ్వనులును, శుష్క - రోదనమున్ = కఠోరమైన యేడ్పును, చీత్కారంబున్ = గాడిదమున్నగు వానివంటి ధ్వనియును, హుంకార - సంకలిత + ఆహాసమున్ + హుంకార ధ్వనితోఁ గూడిన అట్టహాసమును, తాడన - ప్రహరణ + ఉగ్ర - ధ్వానమున్ = కొట్టుటవలని భయంకరధ్వనియును, చంచలత్ + వలయ + ఆరావమున్ = మిక్కిలి చలించుచున్న హస్తపాదాభరణముల ధ్వనియును, భూషణ - స్వనమున్ = అలంకారముల చప్పుడును, కామ - కలహ + ఉత్ + వాద్య + ఆరవ + ఆభంబులు + ఐ = మన్మథయుద్ధమునందలి గొప్ప వాద్యములయొక్క ధ్వనులతో సమానము లయి, ఒక్క + ఉమ్మడిన్ = ఒక్కపెట్టున మ్రోసెన్ = ధ్వనించెను

**తాత్పర్యము :** ఆ వేశ్యాగృహముల వరుసయందుఁ గంఠధ్వనులును, కఠోరములయిన యేడ్పులును, గాడిదమున్నగువాని ధ్వనులవంటి ధ్వనులును, హుంకారముతోఁ గూడ అట్టహాసమును, కొట్టుటవలని భయంకరధ్వనియును, మిక్కిలి చలించు హస్తపాదాభరణముల ధ్వనియును, అలంకారముల ధ్వనియును, మన్మథయుద్ధమునందలి పెద్దవాద్యముల చప్పుడుతో సమానమయి ఒక్కపెట్టున మ్రోసెను

**తే** నెగడు పేర్బిందు లను విడినీరఁ బ్రియుఁడు
**కరజ హలముల మైపూఁతఁ గలయఁ గలఁచి**
**కామబీజంబు లలుక వేగమున మొలచు**
**మొలక లన మేన నిండ ముత్పులక లెసఁగె** **173**

**అర్థము .** నెగడు = నిండు, పేర్బిందులు + అను - విడినీరవ్ చెమరుబిందువులనెడి కట్టిననీటియందు, ప్రియుఁడు, కరజ - హలములన్ = గోరులనెడి నాగండ్లచే, మై-పూఁతన్ = కలపమును, కలయన్ = బాగుగా, కలఁచి, కామ - బీజంబులు = వలపు అనెడి విత్తనములు, అలుకన్ = చల్లఁగా, వేగమునన్ = శీఘ్రముగా, మొలచు = మొలచునట్టి, మొలకలు + అనన్ = మొక్కలనఁగా, మేనన్ = శరీరమున, నిండన్ = నిండుగా, ముత్పులకలు (ముద్ + పులకలు) = సంతోషమువలని గగుర్పాటులు, ఎసఁగెన్ = అతిశయించెను

**తాత్పర్యము .** నిండిన చెమట బిందువులనెడి కట్టిననీటఁ బ్రియుఁడు గోరులనెడి నాగండ్లచే మైపూఁతను బాగుగాఁ గలఁచి వలపనెడి విత్తనములను

చల్లఁగా శీఘ్రముగా మొలచు మొక్కలా యనునట్లు సంతోషమువలని గగుర్పాటు శరీరమునిండ నతిశయించెను

**విశేషములు** అలంకారము రూపకానుప్రాణితోత్ప్రేక్ష

క **తరుణి పదాహతిఁ బతి మై**
**నురుతర పులకాంకురంబు లొగి నెగసెను ద**
**చ్చరణ స్పర్శన సుఖ వి**
**స్ఫురణ నశోకాత్ముఁడగుట సూచించు క్రియన్** 174

**అర్థము .** తరుణి = యువతియొక్క, పద + ఆహతిన్ = పాదముల దెబ్బచే, పతి = ప్రియునియొక్క, మైన్ = శరీరమునందు, ఉరుతర - పులక + అంకురంబులు = అధికమైన గగుర్పాటు అనెడి మొలకలు, తద్ + చరణ - స్పర్శన- సుఖవిస్ఫురణన్ = ఆమె పాదముల తాఁకిడివలని సుఖముయొక్క విస్ఫూర్తిచే, అశోక + ఆత్ముఁడు = అశోకస్వరూపుఁడు - శోకములేనివాని స్వరూపము గలవాఁడు - అశోకవృక్షస్వరూపమైనవాఁడు, అగుటన్ = అగుటను, సూచించు - క్రియన్ = సూచించు విధమున, ఒగిన్= బాగుగా, ఎగసెను = లేచెను

**తాత్పర్యము.** యువతి పాదతాడనముచేఁ బ్రియుని శరీరమున నధికముగా గగుర్పాటనెడి మొలకలు, ఆమె పాదస్పర్శసౌఖ్యముచే అశోకాత్ముఁడగుటను సూచించునట్లు బాగుగా లేచెను

**విశేషములు .** అలంకారము ఉత్ప్రేక్ష అది శ్లేషానుప్రాణితము రూపకోత్థాపితము - అశోకాత్ముఁడనుచో శ్లేషము పులకాంకురంబు లనుచో రూపకము స్త్రీచరణాహతిచే నశోకవృక్షము చిగుర్చును 'పాదాహతః ప్రమదయా వికస త్యశోకః '

తే **ఒక్క నెపమును లేక న న్నున్నయట్టె**
**పాసిపోయెదు, పోయిన బాస సూడ**
**నలుకతెలుఁగు గా దిది యేమి' యనుచు నధిపు**
**చేయు విడుచుచుఁ గోమలి జీవి విడిచె.** 175

**అర్థము :** ఒక్క - నెపమును = ఒక్క సాకయినను, లేక, నన్నున్, ఉన్నయట్టె= ఉన్నట్లుగనే, పాసిపోయెదు = విడిచి వెడలెదవు, పోయిన - బాస+

చూడన్ = పోయిన నిమిత్తము చూడఁగా, అలుక - తెలఁగు + కాదు = కోపించిన చందము గాదు, ఇది + ఏమి, అనుచున్, అధిపు - చేయు = భర్త చేయి, విడుచుచున్, కోమలి = స్త్రీ, జీవిన్ = జీవమును - ప్రాణమును, విడిచెన్

**తాత్పర్యము.** ఒక్క సాకయినను లేకయే నన్ను ఉన్నట్లుగనే విడిచిపోయెదవు నీవు పోయిన నిమిత్తము చూడఁగా నీవు కోపించి పోయినట్లు కనఁబడదు ఇది యేమి ?' యనుచుఁ గోమలి భర్త చేయి విడుచుచుఁ బ్రాణము విడిచెను

శా    **భ్రూలాస్యం, బధరోష్ఠకంపము, ముఖాంభోజాతసంరంభ, మా**
**లోలాలోకనవక్త్ర మొక్కొకఁడ చాలున్ నొంప, నీ యల్క వోఁ**
**గా లీలావతి ! దీనిపై మగుడ నీ కన్నీరు లింకేల ? న**
**న్నేలా యొల్లక పుష్పబాణునకుఁ బట్టీఁజూచితే నిర్దయన్**    176

**అర్థము.** లీలావతి = విలాసినీ ! భ్రూ-లాస్యంబు = కనుబొమల నాట్యము, అధర + ఓష్ఠ - కంపము = క్రింది పెదవి అదరు, ముఖ + అంభోజాత - సంరంభము= పద్మమువంటి ముఖముయొక్క సంక్షోభము, ఆ - లోల+ ఆలోకన వక్త్రము = చలించు చూపులు గల ఆ ముఖము, ఒక్కొకఁడు + అ (ఒక్క + ఒకఁడు + అ) = ఒక్కొక్కటే, నొంపన్ = బాధించుటకు, చాలున్ = సమర్థము, నీ + అల్క + పోఁగాన్ = నీ కోపమునకుఁ బైపెచ్చు, దీనిపైన్ = కోపమునకుఁబైఁగా, మగుడన్ = మరల, నీ - కన్నీరులు (కను+నీరులు) + ఇంకన్ + ఏల = ఇంకను నీవు కన్నీరు నింపవేల ? నన్నున్, ఏలా = ఏల = ఎందులకు, ఒల్లక = వలవక, పుష్పబాణునకున్ = పూవులు బాణములుగాఁ గలవానికి - మన్మథునకు, నిర్దయన్- దయలేకుండ, పట్టు + ఈన్ = పట్టి యిచ్చుటకు, చూచితే = చూచితివా !

**తాత్పర్యము :** ఓ విలాసినీ ! నీవు నాపైఁ గోపము నూనితివి ఆ స్థితిలో నీ కనుబొమలు నాట్యము చేయుచున్నవి నీ క్రిఁబెదవి కంపించుచున్నది నీ ముఖ పద్మము సంక్షోభము చెందినది నీ ముఖమునఁ జూపులు చలించుచున్నవి అవి ఒక్కొక్కటే నన్ను బాధింపసమర్థమగును అట్టి కోపమునకుఁదోడు నీవు కన్నీరు గూడ నింపనేల ? న న్నొల్లక దయారహితవై మన్మథునకుఁ బట్టి యీ నెంచితివా?

**విశేషములు .** అలంకారము స్వభావోక్తి

మ    **'ఒక యన్యాయము లేదె యెవ్వరికి నే నోటంబుతో మ్రొక్క, నో**
**డక లె, మ్మిప్పటి కింతపైఁ(పు, మిటు కష్టంబే మనంబింక నా**
**లికిఁ గట్టాయము సేయుచుండు డిది మేలే నీ ? కనుం బుష్పసా**
**యకతాపంబు సహింప కోర్తు సురతైకాసక్తి దీనాస్యయై**    177

**అర్థము .** ఓర్తు = ఒకామె, పుష్ప - సాయక - తాపంబు = పువ్వులు బాణములుగాఁగలవాని - మన్మథుని - తాపము, సహింపక = ఓర్వక, సురత + ఏక + ఆసక్తిన్ = రతియందే కల కోరికతో, దీన + ఆస్య + ఐ = విచారముతోడి ముఖము గలదయి, ఒక - అన్యాయము - లేదె = ఒక దోషము లేదా ? ఎవ్వరికిన్, ఏను = నేను, ఓటంబుతోన్ = ఓడుటతో, మ్రొక్కన్ = మ్రొక్కను, ఓడక = సందేహింపక, లెమ్ము, ఇప్పటికిన్, ఇంత-సైఁపుము = ఈపాటి సైరింపుము, ఇటు = ఈ విధముగా, ఇంకన్, మనంబు = మనస్సు, కష్టంబే = కష్టమా ? ఆలికిన్ = భార్యకు, కట్టాయము =నిర్బంధము, చేయుదున్ + ఉండుడు = చేయుచుండుట, ఇది, నీకున్, మేలే = మంచిదా, అనున్

**తాత్పర్యము .** ఒక యింతి మన్మథబాధ సహింపలేక రతిక్రియయందే కోరిక గలదయి, దీనవదనయై 'నీ కొక తప్పులేదా ? నే నెవ్వరికిని ఓడిపోయి మ్రొక్కను నీవు జంకక లెమ్ము ఇప్పటి కీపాటి సహింపుము ఇట్లేఁక మనస్సునకుఁ గష్టమా ? భార్యకు నిర్బంధము గలిగించుట నీకు మంచిదా ?' యని పలుకును

తే విరహకాలంబు మరుబాణవితతిఁ గొన్న
గంటు లన్నియుఁ బ్రియుఁగూడి కైపు మిగిలి
పెనఁగునెడ నిట్టు లవిసె నా వనిత మేనఁ
గలయ నవనఖదంతవిక్షతము లడరె 178

**అర్థము** విరహ - కాలంబు = ప్రియునెడఁబాసిన కాలమున, మరు-బాణ-వితతిన్ = మన్మథుని బాణముల సమూహముచే, కొన్న = పొందిన, గంటులు + అన్నియున్ = గాయములన్నియు, ప్రియున్ + కూడి = ప్రియుని గూడి, కైపు-మిగిలి = ఉద్రేక మతిశయించి, పెనఁగు + ఎడన్ = రతిక్రియ సలుపు సమయమున, ఇటులు, అవిసెన్ + నాన్ = పగిలె ననునట్లు, వనిత - మేనన్ = స్త్రీ శరీరమున, కలయన్ = అంతటను, నవ - నఖ - దంత - విక్షతములు = క్రొత్త గోటి పంటి నొక్కులు, అడరెన్ = అతిశయించెను

**తాత్పర్యము .** ప్రియు నెడఁబాసిన సమయమున మన్మథబాణ సమూహముచే నైన గాయములన్నియును బ్రియుని గూడి ఉద్రేకమతిశయించి రతిక్రియ జరపునప్పు డీ రీతిగాఁ బగిలెనా యనునట్లు ఇంతి శరీరమున నంతటను గ్రొత్త గోటి పంటి గంటు లతిశయించెను

**విశేషములు :** అలంకార ముత్ప్రేక్ష 'విరహతాపంబు' అను సా అ ప్రతి పారముకంటె, విరహ కాలంబు' అను మా రా ప్రతి పారము మే లపించుటచే నది స్వీకరింపఁబడినది

సీ అలక లన్ తరుణుల నార్చుచుఁ దా రాడి
చూపు నర్తకు లన సుడిసె బొమలు
గళనాద మను ఘనగాయని సాహ్యాళు
లనఁ గ్రమ్మ నూర్పు లందంద చెలఁగె
వలిసన్ను లను కోకముల నూఁచి యాడు లేఁ
దరఁగలు నాఁగ ముత్తరఁగ లెసఁగె
వర లంబనము లనువాద్యంబులకు నొత్తు
వెట్టు తాళములనఁ బేర్ల తోడ

తే మొనసి మొలనూలి మువ్వల మొరప మమరె
మసఁగు విపరీతరతి యను మలయపవన
వేగమున సోలియాడు లేఁదీఁగ యనఁగ
నమరి కౌఁదీఁగ వెస నసియాడుచుండె 17

**అర్థము**. అలకలు = ముంగురులు, అన్ = అను, తరుణులన్ = యువతులను, ఆర్చుచున్ = ఆడించుచు, తారు = తాము, ఆడి - చూపు, నర్తకులు = నట్టువరాండ్రు, అనన్, బొమలు, సుడిసెన్ = చలించెను

గళ - నాదము = కంఠధ్వని, అను, ఘన - గాయని = గొప్ప పాటకత్తె యొక్క, సాహ్య + ఆళులు = తోడి చెలికత్తెలు, అనన్, క్రమ్మ = ఆక్రమించు, ఊర్పులు = నిశ్వాసములు, అందంద + మఱిమఱి, చెలఁగెన్ = ఒప్పెను

వలి + చన్నులు = గుండ్రని స్తనములు, అను = అనెడి, కోకములన్ = చక్రవాకములను, ఊఁచి+ఆడు = ఊఁగించి ఆడునట్టి, లేఁదరఁగలు (లేఁత + తరఁగలు) = చిన్న అలలు, నాఁగన్ = అనునట్లు, ముత్తరఁగలు (మూఁడు + తరఁగలు) = మూఁడు వళులు, ఎసఁగెన్ = ఒప్పెను

వర - లంబనములు = శ్రేష్ఠములైన కంఠహారములు, అను, వాద్యంబులకున్, ఒత్తు +పెట్టు = రంజనమిచ్చెడు, తాళములు + అనన్ = తాళము లనఁగా, పేర్ల తోడన్ = హారములతో, మొనసి = ఒప్పి, మొలనూలి = కటి సూత్రమునందలి, మువ్వల = కింకిణుల, మొరపము = ధ్వని, అమరెన్ = ఒప్పెను

మసఁగు = విజృంభించు, విపరీత - రతి = పురుషాయితము, అను, మలయ - పవన - వేగమునన్ = మలయపర్వతమునుండి వచ్చు గాలియొక్క

వేగముచే, సోలి + ఆడు = పరవశమయి, ఆడునట్టి, లేఁదీఁగ (లేఁత + తీఁగ), అనఁగన్, అమరి = ఒప్పి, కౌఁదీఁగ (కౌను + తీఁగ) = తీఁగవంటి నడుము, వెసన్ = శీఘ్రముగా, అసియాడుచున్ + ఉండెన్ = కదలుచుండెను

**తాత్పర్యము** ముంగురులనెడి యువతులను ఆడించుచుఁ దాము ఆడిచూపెడి నట్టువరాండ్రన బొమలు చలించెను కంఠధ్వని యనెడు గొప్ప పాటకత్తె తోడిచెలికత్తెలన వ్యాపించు శ్వాసములు మఱిమఱి యొప్పెను గుండ్రని స్తనములనెడి చక్రవాకములను ఊఁగించి ఆడు చిన్నఅలలన మూఁడు వళు లొప్పెను మేలి కంఠహారములనెడి వాద్యములకు రంజన మిచ్చెడు తాళములన హారములతో నొప్పి మొలనూలి మువ్వల ధ్వని యొప్పెను చెలరేఁగు పురుషాయిత మనెడి మలయవాయువు వేగముచే సోలియాడు లేఁదీఁగ యన నొప్పి తీఁగవంటి నడుము వేగముగాఁ గదలుచుండెను

**విశేషములు .** అలంకారము రూపకానుప్రాణితోత్ప్రేక్ష

లేఁదీఁగ = లేఁత + తీఁగ, కౌఁదీఁగ = కౌను + తీఁగ - ప్రాఁతాది సంధి (బాల సంధి 36) ద్రుతకార్యము (బాల సంధి 16, 17)

మ **గళనాదంబులు మంజుగానములుగాఁ గాంచీలసత్కింకిణీ**
**కలనాదంబులు హృద్యవాద్యములుగాఁ గాంతోరుపీఠోన్నత**
**స్థలరంగమ్ములఁ గాముఁ డన్నటకుఁ డోజంగూడ నాడింపఁగా**
**లలనాపాత్రము లాడి రొప్ప రతిలీలాలాస్యలోలాస్యలై.** 180

**అర్థము .** గళ - నాదంబులు = కంఠధ్వనులు, మంజు - గానములు + కాన్= మనోహరములైన గానములు కాఁగా, కాంచీ - లసత్ - కింకిణీ - కల - నాదంబులు = మొలనూలియందుఁ బ్రకాశించుచున్న, మువ్వల, అవ్యక్త మధురములయిన ధ్వనులు, హృద్యవాద్యములు + కాన్ = మనోహరములైన వాద్యములు కాఁగా, కాంతా + ఊరు - పీఠ + ఉన్నత - స్థల - రంగమ్ములన్ = కాంతలయొక్క - కటిస్థలములనెడి యెత్తయిన రంగస్థలములందు, కాముఁడు= మన్మథుఁడు, అన్ = అను, నటకుఁడు = నటుఁడు, ఓజన్ = నేర్పుతో, కూడన్=కూడునట్లు, ఆడింపఁగాన్, లలనా - పాత్రములు = స్త్రీలనెడు నటులు, రతి -లీలా - లాస్య - లోల + ఆస్యలు + ఐ = సంభోగక్రీడ యనెడు నాట్యముచేఁ జలించు ముఖములు గలవారయి, ఒప్పన్ = ఒప్పఁగా, ఆడిరి = నాట్యము చేసిరి

**తాత్పర్యము.** కంఠధ్వనులు మనోహరగానములుగను, మొలనూలి మువ్వల అవ్యక్త మధురధ్వనులు హృద్యములైన వాద్యములుగను, స్త్రీల ఊరుపీఠములనెడి ఉన్నతరంగస్థలములందు మన్మథుఁడనెడి నటుఁడు నేర్పుతోఁ గూడున ట్లాడింపఁగా స్త్రీలనెడు నటులు రతిక్రీడయను నాట్యముచేఁ జలించు ముఖములు గలవారయి ఆడిరి

**విశేషములు .** అలంకారము రూపకము

వ **ఇట్లు కాముకకామినీజనంబు లనవరత సుఖసుధారస ప్లవ ప్లావితులగుచుండి రంత** 181

**అర్థము .** ఇట్లు, కాముక - కామినీ - జనంబులు = విటులును, విటురాండ్రును, అనవరత - సుఖ - సుధా - రస - ప్లవ - ప్లావితులు = ఎడతెగని రతిసౌఖ్యమనెడి అమృతరసముయొక్క వెల్లువయందుఁ దేలింపఁబడినవారు, అగుచున్ + ఉండిరి, అంతన్

**తాత్పర్యము:** ఇట్లు విటీవిటజనములు ఎడతెగని రతి సౌఖ్యమనెడి అమృతరస ప్రవాహమునందుఁ దేలినవారగుచుండిరి పిమ్మట - తరువాతి పద్యముతో నన్వయము

చ **అరుణకరోత్కరాభిహతి నన్కనుకయ్యెడు సాంద్రచంద్రికాం**
**తరమునఁ దూఱితూఱి నవతామరసోత్థసుగంధసద్రజః**
**పరివృతమై నయంబునఁ బ్రభాతసమీరణ మంత వీచెఁ ద**
**త్పురి సురతశ్రమాకులవధూతనుఘర్మకణాపనోదియై** 182

**అర్థము .** అంతన్ = పిమ్మట, ప్రభాత - సమీరణము = ఉదయ కాలపు వాయువు, అరుణ - కర + ఉత్కర + అభిహతిన్ = సూర్యుని కిరణముల సమూహముయొక్క దెబ్బచే, అన్కనుకు + అయ్యెడు = పల్చనగాక, గట్టిగాక, జాఱు పదనగు, సాంద్ర - చంద్రికా + అంతరమునన్ = దట్టమైన వెన్నెల నడుమ, తూఱి - తూఱి = చొచ్చి చొచ్చి, నవ - తామరస + ఉత్థ - సుగంధ - సత్ + రజస్(ః) + పరివృతము + ఐ = అప్పుడే వికసించిన తామరలనుండి లేచిన పరిమళముతోడి మేలిపుప్పొడులచే ఆవరింపఁబడినదయి, తద్ + పురి నోదియై, తద్ + పురి = ఆ నగరమునందలి, సురత - శ్రమ = సంభోగము వలని అలయికచే, ఆకుల = కలఁతఁజెందిన, వధూ = స్త్రీలయొక్క, తను = శరీరములందలి, ఘర్మ - కణ + అపనోది + ఐ = చెమరుబిందువులయొక్క (ను) తొలఁగించునదియై, నయంబునన్ - మృదువుగా, వీచెన్

**తాత్పర్యము** అంత నుదయకాలపువాయువు సూర్యకిరణముల దెబ్బచే బలుచనగాక గట్టిగాక జాఱుపదనైనవెన్నెల నడుమఁ జొచ్చిచొచ్చి అప్పుడే వికసించిన తామరలనుండి లేచిన పరిమళముతోడి పుప్పొడులచే నావరింపఁబడినదయి, ఆ యూరి సంభోగశ్రమాకులలైన స్త్రీల మేనుల చెమరు బిందువులను దొలఁగించునదియై మృదువుగా వీచెను

**విశేషములు** మంచిగాలి మాంద్యము, సౌరభ్యము, శైత్యము అను మూఁడు గుణములతోఁ గూడియుండును ఇటఁ బ్రభాత వాయువునకు సాంద్రచంద్రికాంతరమునఁ దూఱుటచే మాంద్యమును, నవతామరసోత్థసద్రజః పరివృతమగుటచే సౌరభ్యమును, వధూతనుఘర్మకణాపనోది యగుటచేశైత్యమును గలిగెను

క ఈ హరుఁ డగసుత నేఁడు వి
వాహంబై పడయు మాకు వల్లభు నని యు
త్సాహమునఁ జెలఁగుగతిఁ బురి
గేహంబులఁ జెలఁగెఁ గలయఁ గృకవాకంబుల్ 183

**అర్థము** ఈ - హరుఁడు = ఈ శివుఁడు, నేఁడు = ఈ దినము, అగసుతన్= కొండకూఁతును - పార్వతిని, వివాహంబు + ఐ = పెండ్లియై, మాకున్, వల్లభున్ = నాయకుని, (కుమారస్వామిని), పడయున్ + అని = సంపాదించునని, ఉత్సాహమునన్, చెలఁగు - గతిన్ = విజృంభించువిధమున, పురి-గేహంబులన్ = నగరి యిండ్లయందు, కృకవాకంబుల్ = కోళ్ళు - నెమళ్ళు, కలయన్ = అంతటను, చెలఁగెన్ = మ్రోసెను

**తాత్పర్యము** . ఈ యీశ్వరుఁడు నేఁడు పార్వతిని బెండ్లియై మాకు నాయకుని సంపాదించునని యుత్సాహముతో విజృంభించెనా యనునట్లు, ఆ యూరి యిండ్లలోని కోళ్ళు - నెమళ్ళు అంతటను మ్రోసెను

**విశేషములు** .పార్వతీశ్వరుల కొడుకగు కుమారస్వామి కృకవాకుధ్వజుఁడు శిఖి వాహనుఁడు, కావుననే వాని కంత యుత్సాహ మనుట అలంకార ముత్ప్రేక్ష కృకవాకు వని ఉకారాంత శబ్దమేకాని కృకవాకమని అకారాంత శబ్దము గానరాదు

క తొలుకొని కుక్కుట రవములు
సెలఁగుడుఁ దదనంతరంబ చెఱువుల నడులం
గొలఁకుల వనముల నత్యవి
రలమై బహువిహగనివహరవములు సెలఁగెన్ 184

**అర్థము**. కుక్కుట - రవములు = కోళ్ళ ధ్వనులు, తొలుకొని = ప్రారంభమయి, చెలఁగుడున్ = ధ్వనించినంతనే, తద్ + అనంతరంబు + అ = వెంటనే, చెఱువులన్ నదులన్, కొలఁకులన్, వనములన్ = తోఁటలందును, బహు - విహగ- నివహ - రవములు = పెక్కు పక్షుల సమూహముల ధ్వనులు, అతి + అవిరలము + ఐ = మిక్కిలి అధికమయి, చెలఁగెన్ = మ్రోసెను

**తాత్పర్యము**. కోళ్ల ధ్వనులు మొదట మ్రోసినంతనే చెఱువులందును, నదులయందును, కొలఁకులందును, తోఁటలందును పెక్కుపక్షులగుంపుల ధ్వనులు మిక్కిలి అధికమయి మ్రోసెను

**విశేషములు:**కొలఁకులు - కొలను + లు 'కలన్వాదుల నువర్ణంబు కుజ్ఞగు బహువచనము పరంబగునపుడు నిత్యముగా నగు ' బాల ఆచ్చిక 18 అత్యవిరల= అతి + అవిరల - యణాదేశసంధి

క **మెలఁతుకకు ముదంబున జే**
**కులపైఁ బడియుండి మాపు కుముదంబుల, రే**
**పలరుడు నలి తామరలను**
**నలుగడఁ బఱతెంచి మూఁగు నలిఁ దామరలన్** 185

**అర్థము**. మెలఁతుకకున్ = స్త్రీకి - ఆఁడు తుమ్మెదకు, ముదంబునన్ = సంతోషముతో, మాపు = రాత్రి, కుముదంబులన్ = కలువలందు, జేకులపైన్ = జేకులమీఁద, పడియుండి, అలి = తుమ్మెద, రేపు = ప్రాతఃకాలము, అలరుడున్ = ఒప్పినంతనే, తాన్ = తాను, మరలను = తిరిగి, నలిన్ = ఉత్సాహముతో నలుగడన్ = నాలుగు దిక్కులను, పఱతెంచి = వచ్చి, తామరలన్ = పద్మములను, మూఁగున్

**తాత్పర్యము :** కలువలు రాత్రి వికసించును పద్మములు ప్రొద్దున వికసించును తుమ్మెద తన పెంటికి సంతోషమగునట్లు రాత్రి కలువలందు జేకులపైఁ బడియుండి తెల్లవాఱఁగనే మరల నాలుగు దిక్కులనుండి యుత్సాహముతో వచ్చి తామరలపై మూఁగును

**విశేషములు :** మగతుమ్మెద రాత్రి కలువరేకులపైఁ బడియుండుటయుఁ బ్రొద్దునఁ దామరలను జేరుటయుఁ దన పెంటి సంతోషముకొఱకే మెలఁతుకకు- ముదంబున - అని విభాగము అలరుడున్ + అలి = అలరుడు నలి,

మూఁగున్+నలిన్= మూఁగు నలిన్, స్థిరపరకత్వమున ద్రుతలోపము - తాన్ + మరలను = తామరలను (స్థిరపరకత్వమున ద్రుతలోపము,) తామరలన్ - అనుచోట్లఁగల సభంగశ్లేషమును గమనించునది

తే ఇనుఁడు దనదీప్తిఁ దనచేత నిచ్చిపోయి
మఱవ కేతెంచి నిజరుచి మగుడఁ గొనినఁ
'దెలివి చెడి తెల్లనై' రను పలుకు జగతి
నిలుపు గతి దీపకలికలు వెలరువాఱె 186

**అర్థము .** ఇనుఁడు = సూర్యుఁడు, తన - దీప్తిన్ = తన కాంతిని, తన చేతన్= తన చేతితో - తనంత ననుట, ఇచ్చి, పోయి, మఱవక = మఱచి పోవక, ఏతెంచి= వచ్చి, నిజ - రుచిన్ = తనదైన కాంతిని, మగుడన్ = మరల, కొనినన్= తీసికొనఁగా, తెలివి - చెడి, తెల్లన + ఐరి' అను, పలుకున్ - మాటను, జగతిన్ = లోకమున, నిలుపు - గతిన్ = స్థాపించువిధమున, దీప - కలికలు = మొగ్గలవంటి దివ్వెలు, వెలరువాఱెన్ = తెల్లనయ్యెను

**తాత్పర్యము** సూర్యుఁడు తన కాంతిని చేతితో - తాను స్వయముగా మఱవక వచ్చి తనకాంతిని మరల స్వీకరింపఁగా 'తెలివిచెడి తెల్లనైరి' అనుమాట లోకమున నిలుపువిధమున దివ్వెలు తెల్లనయ్యెను

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష దీపకలికలు - కలికలవంటి దీపములు - ఉపమిత సమాసము 'తెలివి తెల్లవాఱిన' ట్లున్నదని లోకోక్తి సూర్యుఁడస్తమించుచుఁ దన కాంతిని అగ్నియందును, చంద్రునియందును, నక్షత్రములందును, దీపములందును, ఓషధులందును నిక్షేపించునని శాస్త్రము 'సౌరం తేజః సాయ మగ్నిం సంక్రమతే అని శ్రుతి 'దినాన్తే నిహితం తేజ స్సవిత్రేవ హుతాశనః' అని రఘువంశమునఁ గాళిదాసు

తే రవి పదాహతిఁ జెడి యుడురాజు వోయె
నని సరోజములొద్దఁ జక్రాహ్వయములు
చెట్ట లాడుట కవి వికసిల్లుటకును
వెల్లనైనట్లు చుక్కలు వెలరువాఱె 187

**అర్థము:** ఉడు - రాజు = నక్షత్రాధిపతి, - చంద్రుఁడు, రవి - పద+ఆహతిన్= సూర్యునియొక్క కిరణముల దెబ్బచే - సూర్యుని పాదముల దెబ్బచే, చెడి =

నశించి, పోయెన్, అని, చక్రాహ్వాయములు = చక్రవాకపక్షులు, సరోజముల + ఒద్దన్ = తామరల దగ్గఱ, చెట్టలు + ఆడుటకున్ = పడిపోయిన చంద్రుని నిందించుటకును, ఉత్సాహముతో ఱెక్కలల్లాడు (ర్చు) టకు, ననియు, అవి = ఆ మిత్రములయిన సరోజములు, వికసిల్లుటకును = వాని చెట్టలాడుట కుప్పొంగుటకును, వెల్లవ + ఐన + అట్లు = అవమానము నొంది తెల్లవోయినట్లు, చుక్కలు = చంద్రుని మిత్రములైన నక్షత్రములు, వెలరువాఱెన్ = కాంతివిహీనములై వెలవెలఁబోయినవి

**తాత్పర్యము .** చంద్రుఁడు చక్రవాకములకును తామరలకును విరోధి రవిపదాహతిచేఁ జంద్రుఁడు నశించిపోయె ననుసంతోషవార్తను చక్రవాకములు తమ మిత్రములైన పద్మములకడకు వచ్చి చెప్పి చంద్రుని నిందింపఁగా - ఉత్సాహముతో ఱెక్క లల్లార్పఁగా, నా పద్మములు వికసించెను అది చూచి అవమానముచెంది తెల్లనయినట్లు చంద్రుని మిత్రములైన నక్షత్రములు కాంతి విహీనములయి వెలవెలఁబోయినవి

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష - శ్లేషానుప్రాణితము

తే **రాజరుచి వాయఁ గువలయరమణ దఱఁకెఁ**
**గలయఁ దమ్ముల మొగముల నెలమి మిగిలె**
**శీతకరుఁడైన రాజు వాసిన ధరిత్రి**
**వందుఁ గా కెందు దాయలు వగతు రెట్లు** **188**

**అర్థము .** రాజ - రుచి = చంద్రకాంతి, ప్రభువు కాంతి, పాయన్ = పోఁగా, కువలయ - రమణ = కలువ యను స్త్రీ - భూవలయమను స్త్రీ, తఱఁకెన్ = క్షీణించెను, తమ్ముల - మొగములన్ = పద్మముల ముఖములందు, తమ్ముల ముఖములందు, కలయన్ = బాగుగా, ఎలమి = సంతోషము, మిగిలెన్ = అతిశయించెను శీత - కరుఁడు = చల్లని కిరణములు గలవాఁడు - చల్లన చేయు వాఁడు - చల్లఁగా నేలువాఁడు, ఐన, రాజు = చంద్రుఁడు, ప్రభువు, పాసినన్ = పోయినచో, ధరిత్రి = భూమి, వందున్ + కాక = దుఃఖించును గాని, దాయలు = శత్రువులు, జ్ఞాతులు, వగతురు + ఎట్లు = దుఃఖింతురా ?

**తాత్పర్యము .** చంద్రుని కాంతి పోఁగాఁ గలువ యను స్త్రీ క్షీణించెను ప్రభువు కాంతి పోఁగా భూమండలమను స్త్రీ క్షీణించెను పద్మముల ముఖములందు

(అనుజుల ముఖములందు) సంతోషము బాగుగా నతిశయించెను అది యట్లే కదా ! చల్లనఁ గలిగించు - చల్లఁగానేలు ప్రభువు పోయినచో, భూమి దుఃఖించును గాని, జ్ఞాతులైనవారు శత్రువులు దుఃఖింతురా ? దుఃఖింపరని భావము

**విశేషములు .** రాజ, కువలయ, తమ్ములు, దాయలు - అను శబ్దముల కర్థద్వయసిద్ధిచే నలంకారము శ్లేషము విశేషాంశము సామాన్యాంశముచే సమర్థింపఁబడుటచే అర్థాంతరన్యాసాలంకారమును గలదు అది శ్లేషోత్థాపితము తమ్మి - బహువ తమ్ములు - పద్మములు, తమ్ముఁడు - బహువ తమ్ములు = అనుజులు, కువలయరమణ అనుచో రూపకాలంకారము

**చ కుముదముతో నలందురఁ జకోరము, లబ్జినితోన పొంగఁ గో**
**కములు, హిమంబుతోన చనఁ గౌముది, గానముతోఁ జెలంగ వా**
**ద్యము, లమృతాంశుతో నడఁగఁ దారకముల్, నిశితోన పాయఁగా**
**దమ, ముదయాద్రి నెక్కెఁ బటుధాముఁడు రాగముతో వెలుంగుచున్ 189**

**అర్థము .** చకోరములు = వెన్నెల పులుఁగులు, కుముదముతోన్ = తెల్ల కలువతో, అలందురన్ = దుఃఖింపఁగను, కోకములు = చక్రవాకములు, అబ్జినితోన్+అ = తామరతీఁగతోనే, పొంగన్ = ఉబ్బఁగను, కౌముది = వెన్నెల, హిమంబుతోన్+అ=మంచుతోనే, చనన్ = పోఁగా, వాద్యములు = సంగీత సాధనములు, గానముతోన్ = పాటతో, చెలంగన్ = మ్రోయఁగా, తారకముల్ = నక్షత్రములు, అమృతాంశుతోన్ = చంద్రునితో, అడఁగన్ = నశింపఁగను, తమము =చీఁకటి, నిశితోన్ + అ = రాత్రితోనే, పాయఁగాన్ = తొలఁగఁగా, పటు-ధాముఁడు=తీక్ష్ణములయిన కిరణములు గలవాఁడు - సూర్యుఁడు, రాగముతోన్= ఎఱుపుతో, ప్రీతితో, వెలుంగుచున్ = ప్రకాశించుచు, ఉదయ + అద్రిన్ = తూర్పుకొండను, ఎక్కెన్

**తాత్పర్యము ·** వెన్నెలపులుఁగులు తెల్లకలువతోపాటు దుఃఖింపఁగను, చక్రవాకములు తామరతీఁగ (కమలిని)తోపాటు సంతోషింవఁగను, వెన్నెల మంచుతోపాటే పోవఁగను, వాద్యములు గానముతోపాటు మ్రోయఁగను, నక్షత్రములు చంద్రునితోపాటు నశింపఁగను, చీఁకటి రాత్రితోపాటే నశింపఁగను, సూర్యుఁడు ఎఱ్ఱనై ప్రకాశించుచుఁ దూర్పుకొండ నెక్కెను

**విశేషములు** అలంకారము సహోక్తి

తే అస్తగిరిఁ బొందె రా, జుదయాద్రి నెక్కె
నినుఁడు, తేజస్వులగు వారి కెల్లప్రొద్దు
మానితంబగునిల నొక్కమాట పొందు
హానివృద్ధులు సూచించునట్ల పోలె 190

**అర్థము** తేజస్వులు + అగు - వారికిన్ = తేజస్సుగలవారికి, ఎల్లప్రొద్దున్= ఎల్లప్పుడును, మానితంబు + అగు + ఇలన్ = మన్నింపఁబడినది యగు భూమియందు, ఒక్క - మాటు + అ = ఒక్కమాటే, పొందు, హాని-వృద్ధులు = హానియును, వృద్ధియును, సూచించు + అట్లు + ఆ-పోలెన్ = సూచించు విధము వలెనే, రాజు = చంద్రుఁడు - ప్రభువు, అస్త-గిరిన్ = అస్తపర్వతమును - హానిని, పొందెన్, ఇనుఁడు = సూర్యుడు (ప్రభువు), ఉదయ + ఆద్రిన్ = పొడుపుఁగొండను - వృద్ధిని, ఎక్కెన్

**తాత్పర్యము** తేజస్వులగువారి కెల్లప్పుడును మన్నింపఁబడినదియగు భూమియందు ఒక్కమాటే పొందు హానిని వృద్ధిని సూచించునట్లే, రాజు (చంద్రుఁడు) అస్తగిరిని బొందెను ప్రభు వస్తమించెను ఇనుఁడు (సూర్యుఁడు) ఉదయగిరిని అధిరోహించెను ప్రభు వభ్యుదయమును బొందెను

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష ఈ పద్యము కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలమునందలి -

యా త్యేకతో ऽ స్తశిఖరం పతి రోషధీనా
మావిష్కృతారుణ పురస్సర ఏకతో ऽ ర్కః
తేజోద్వయస్య యుగపద్వ్యసనోదయాభ్యాం
లోకో నియమ్యత ఇ వాత్మదశాన్తరేషు
(అభి శాకు) అను శ్లోకమున కనువాదము

ఆ హరు వివాహమునకుఁ గర మనురక్తుఁడై
వరుస జగములెల్ల వసుమయంబు
సేసెనో రయమునఁ జిత్రభానుఁ డనఁగ
వసుసమూహిఁ గప్పె వసుధ యెల్ల 191

**అర్థము** చిత్రభానుఁడు = సూర్యుఁడు, హరు - వివాహమునకున్ = ఈశ్వరుని పెండ్లికి, కరము = మిక్కిలి, అనురక్తుఁడు + ఐ = ఇష్టము గలవాఁడయి, వరుసన్ = క్రమముగా, జగములు + ఎల్లన్ = లోకములన్నియు, రయమునన్ = శీఘ్రముగా, వసుమయంబు = కిరణములతో నిండినది - రత్నములతో నిండినది (గా) చేసెనో, అనఁగన్, వసుధ + ఎల్లన్ = భూమినంతను, వసు - సమూహిన్ = కిరణముల సమూహముతో - రత్నముల సమూహముతో, కప్పెన్

**తాత్పర్యము .** ఈశ్వరుని వివాహమునకు సూర్యుఁడు మిక్కిలి యిష్టము గలవాఁడయి క్రమముగా లోకములనన్నిటిని వసుమయము చేసెనో యన వసుధనంతను వసుసమూహముతోఁ గప్పెను

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష 'వసుమయము' అనుచో శ్లేషము వసుధా శబ్దము గూడ సాభిప్రాయప్రయుక్తము వసు దధాతీతి వసుధా - వసువును ( ధనమును) ధరించునది

క మునిజనదత్తార్ఘ్య కుచం
దన రసముల జగములెల్లఁ దడిసెనొ ? లోకం
బినుఁ డుదయింపఁగ రాగము
దనరెనొ ? నా నరుణకిరణధామము పర్వెన్ 192

**అర్థము.** ముని - జన - దత్త + అర్ఘ్య - కుచందన - రసములన్ = మునుల సమూహముచేత ఒసఁగఁబడిన అర్ఘ్యమనెడి రక్తచందన రసములచే, జగములు + ఎల్లన్ = జగములన్నియు, తడిసెనొ = తడిసెనా, ఇనుఁడు = సూర్యుఁడు, ఉదయింపఁగన్ = ఉదయించుటకు, లోకంబు, రాగము + తనరెనొ = ఇష్టపడెనో, ఎఱ్ఱపడెనో, నాన్ = అనఁగా, అరుణ - కిరణ - ధామము = సూర్యకిరణముల కాంతి, పర్వెన్ = వ్యాపించెను

**తాత్పర్యము .** మునిజను లిచ్చు నర్ఘ్యమనెడి రక్తచందనరసముచే లోకములన్నియుఁ దడిసెనో, లేక సూర్యుఁ డుదయించుటకు లోకము అనురాగము చెందెనో - ఎఱ్ఱనయ్యెనో అనఁగా సూర్యకిరణ=ముల కాంతి వ్యాపించెను

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష అర్ఘ్య కుచందన అనుచో రూపకము 'రాగము' అనుచో శ్లేషము

క సరసిజరాగావహమై
సరసిజ రాగాత్మకప్రచరశోభితమై
యరుణద్యుతి భాసురమై
యరుణద్యుతి భాతిఁ బ్రకటిమై భువిఁ బర్వెన్ 193

**అర్థము.** అరుణద్యుతి = సూర్యకాంతి, సరసిజ - రాగ + అవహము + ఐ= పద్మములకు అనురాగము (ఎఱుపు) గలిగించునదియై, సరసిజ - రాగ + ఆత్మక- ప్రచార - శోభితము + ఐ = పద్మరాగమణిస్వరూపమైన మార్గములచేఁ బ్రకాశించునదియై, భాసురము + ఐ = ప్రకాశించునదియై, అరుణద్యుతి - భాతిన్= ఎఱ్ఱనికాంతితో, ప్రకటము + ఐ = ప్రసిద్ధమయి, భువిన్ = భూమియందు, పర్వెన్ = వ్యాపించెను

**తాత్పర్యము .** సూర్యకాంతి పద్మములకు రాగమును గలిగించునదియై, పద్మరాగమణి స్వరూపమైన మార్గములచేఁ బ్రకాశించునదియై, భాసురమయి, యెఱ్ఱనికాంతితోఁ బ్రసిద్ధమై భూమియందు వ్యాపించెను

వ త దవసరంబున 194

**అర్థతాత్పర్యములు** తద్ + అవసరంబునన్ = ఆ సమయమున - తరువాతి నవమాశ్వాసమునందలి 2వ వచనముతో నన్వయము

### ఆశ్వాసాంతము

మ. భవరౌద్రాశనిపాత భీత సుమహద్భక్తాచలేంద్రాశ్రయా
ర్ణవు గంభీరు నుదారు ధీరుఁ బరమానందాత్ము సంకల్పసం
భవ బాణేంధన దావపావకు జగత్ప్రఖ్యాత కీర్త్యంగనా
ధవు నజ్ఞానతమఃపతంగు శివతత్త్వ జ్ఞాన సన్మానసున్ 195

**అర్థము .** భవ ర్ణవు, భవ = సంసారమనెడి, రౌద్ర + అశని పాత = భయంకరమైన పిడుగుపాటు వలన, భీత = భయపడిన, సు-మహత్ + భక్త = గొప్ప భక్తులనెడు, అచల + ఇంద్ర = పర్వత శ్రేష్ఠములకు, ఆశ్రయ = ప్రాపయిన, అర్ణవున్ = సముద్రుఁడైనవాఁడును, గంభీరున్ = లోఁతయినవాఁడును, ఉదారున్= ఉదారుఁడైనవాఁడును, ధీరున్ = ధైర్యముగలవాఁడును, పరమ + ఆనంద + ఆత్మన్ = పరమానంద స్వరూపుఁడైనవాఁడును, సంకల్పసంభవ - బాణ + ఇంధన - దావ- పావకున్ = మన్మధుని బాణములనెడి కట్టెలకుఁ గార్చిచ్చు

అయినవాఁడును, జగత్ + ప్రఖ్యాత, - కీర్తి, + అంగనా - ధవున్ = లోకప్రసిద్ధమైన కీర్తి అనెడి స్త్రీకి భర్తయైనవాఁడును, అజ్ఞాన-తమస్ ( ) + పతంగున్ = అజ్ఞానమనెడి చీఁకటికి సూర్యుఁడైనవాఁడును, శివ-తత్త్వ - జ్ఞాన - సత్ + మానసున్ = ఈశ్వర తత్త్వ జ్ఞానమునకు మంచి మనసు గలవాఁడును (అగు) కృతి భర్తయైన శ్రీ జంగమ మల్లికార్జునదేవుని

**తాత్పర్యము.** సంసారమనెడి భయంకరమైన పిడుగుపాటువలన భయపడిన మిక్కిలి గొప్ప భక్తులనెడి పర్వతశ్రేష్ఠులకుఁ బ్రాపయిన సముద్రము అయినవాఁడును, గంభీరుఁడును, ఉదారుఁడును, ధీరుఁడును, పరమానంద స్వరూపుఁడును, మన్మధుని బాణములనెడి కట్టెలకుఁ గార్చిచ్చు అయినవాఁడును, జగత్ప్రసిద్ధమైన కీర్తియనెడి స్త్రీకి భర్తయైనవాఁడును, అజ్ఞానమనెడి చీఁకటికి సూర్యుఁడైనవాఁడును, శివతత్త్వ జ్ఞానముగల మంచి మనస్సు గలవాఁడును అగు కృతిభర్తను శ్రీ జంగమ మల్లికార్జునస్వామిని

**విశేషములు.** భవరౌద్రాశనిపాత, భక్తాచలేంద్ర, ఆశ్రయార్ణవు, బాణేంధన దావపావకు, కీర్త్యంగనాధవు, అజ్ఞానతమఃపతంగు - అనుచోట్ల రూపకాలంకారము గలదు

**క** **జనవినుతు, సితయశోనిధి,**
**ననుపమ శుభమూర్తి, మల్లికార్జునమునినా**
**ధు నపార ఘోర భవ దుః**
**ఖ నివృత్తుఁ గళానిధానుఁ గైవల్యరతున్** **196**

**అర్థము.** జన - వినుతున్ = జనులచే విశేషముగాఁ బొగడఁబడువాఁడును, సిత - యశస్ (ః) + నిధిన్ = తెల్లని కీర్తికి నిధానమయినవాఁడును, అనుపమ - శుభ - మూర్తిన్ = సాటిలేని మంగళకరమైన ఆకారము గలవాఁడును, మల్లికార్జున-ముని - నాధున్ = మల్లికార్జునుఁడనెడి మునిశ్రేష్ఠుని, అపార - ఘోర - భవ - దుఃఖ-నివృత్తున్ = పారము లేని భయంకరమైన సంసార దుఃఖమునుండి మరలిన వాఁడును, కళానిధానున్ = విద్యలకు నిధియైనవాఁడును, కైవల్య-రతున్ = మోక్షమునం దాసక్తి గలవాఁడును అగు జంగమమల్లికార్జునుని

**తాత్పర్యము .** జనులచే విశేషముగాఁ బొగడఁబడువాఁడును, తెల్లనికీర్తికి నిధియైనవాఁడును, సాటిలేని శుభాకృతిగలవాఁడును, మల్లికార్జునమునిశ్రేష్ఠుఁడును,

పారములేని, భయంకర సంసార దుఃఖమునుండి మరలినవాఁడును, విద్యలకు నిధియైనవాఁడును, మోక్షమునం దాసక్తి గలవాఁడును అగు జంగమ మల్లికార్జునుని

**మ పరవాదీంద్రఘనాఘనానిలు, జగద్భ్రాజిష్ణు, నర్ధేందుశే**
**ఖరు, ధర్మజ్ఞు, మహీసురేంద్రు, బుధలోక స్తోత్రపాత్రున్, మనో**
**హరు, సద్బ్రహ్మతపోధనాదినిధి, నార్యశ్రేణివర్యున్, మహా**
**పురుషున్, జంగమమల్లికార్జును, జగత్పూజ్యప్రభాభాసితున్ 197**

**అర్థము .** పర నానిలు పర = శత్రువైన, వాది + ఇంద్ర = వాదము చేయువారిలో శ్రేష్ఠులనెడి, ఘనా -ఘన + అనిలున్ = వర్షాకాలపు మేఘములకు వాయువైన వాఁడును, జగత్ + భ్రాజిష్ణున్ = లోకములందుఁ బ్రకాశించు శీలము గలవాఁడును, అర్ధ + ఇందు - శేఖరున్ = సగము చంద్రుఁడు శిరోభూషణముగాఁ గలవాఁడును, ధర్మజ్ఞున్ = ధర్మము తెలిసినవాఁడును, మహీసుర + ఇంద్రున్ = బ్రాహ్మణశ్రేష్ఠుఁడును, బుధ-లోక-స్తోత్ర-పాత్రున్ = పండితుల సమూహము యొక్క స్తుతులకు అర్హుఁడైనవాఁడును, మనోహరున్ = అందమైనవాఁడును, సత్ + బ్రహ్మ - తపస్ (ః) + ధన + ఆది -నిధిన్ = సద్బ్రాహ్మణులైన తపోధనులకు, మునులకు మూలమైన నిధియైనవాఁడును, ఆర్య-శ్రేణి-వర్యున్ = పెద్దల వరుసలో శ్రేష్ఠుఁడును, మహాపురుషున్ = గొప్పవాఁడును, జగత్ + పూజ్య - ప్రభా-భాసితున్ - లోకములందుఁ బూజింపఁదగిన ప్రభచేఁ బ్రకాశించువాఁడును అగు, జంగమమల్లికార్జునున్

**తాత్పర్యము .** శత్రువులైన వాదిశ్రేష్ఠులనెడి వర్షాకాలపు మేఘములకు వాయువైన వాఁడును, లోకములందుఁ బ్రకాశించువాఁడును, చంద్రకళ శిరోభూషణముగాఁ గలవాఁడును, ధర్మవేత్తయును, బ్రాహ్మణశ్రేష్ఠుఁడును, పండితజనస్తుతిపాత్రుఁడును, మనోహరుఁడును, సద్బ్రాహ్మణులైన మునులకు మూలనిధియైనవాఁడును, ఆర్యులలో శ్రేష్ఠుఁడును, పండితజనస్తుతిపాత్రుఁడును, మనోహరుఁడును, సద్బ్రాహ్మణులైన మునులకు మూలనిధియైన వాఁడును, ఆర్యులలో శ్రేష్ఠుఁడును, మహాపురుషుఁడును, లోకపూజ్యమైన ప్రభచేఁ బ్రకాశించువాఁడును అగు జంగమమల్లికార్జునుని

**క. సజ్జననిధాను, విబుధా**
**పజ్జలనిధికుంభజప్రభావు, శిశిరభూ**
**భృజ్జాతాధిపసన్నిభు**
**హృజ్జన్మాస్త్రానభిజ్ఞు, నీప్సితఫలదున్ 198**

**అర్థము** సత్ + జన - నిధానున్ = మంచి జనులకు నిధియైనవాఁడును, విబుధ + ఆపద్ + జలనిధి - కుంభజ - ప్రభావున్ = పండితుల ఆపదలనెడి సముద్రమునకు అగస్త్యుని మహిమ వంటి మహిమ గలవాఁడును, శిశిర - భూభృత్+ జాతా + అధిప - సన్నిభున్= హిమవత్పర్వతపుత్రియగు పార్వతియొక్క భర్తయైన శివునితో సమానుఁడును, హృద్ + జన్మ + అస్త్ర + అనభిజ్ఞున్ = మన్మథాస్త్రములు తెలియనివాఁడును, ఈప్సిత= ఫలదున్ = కోరిన ఫలముల నిచ్చువాఁడును అగు జంగమమల్లికార్జునదేవుని

**తాత్పర్యము** సుజనులకు నిధియైనవాఁడును, పండితుల ఆపదలనెడి సముద్రములకు అగస్త్యుఁడైనవాఁడును, పార్వతీభర్తతో (శివునితో) సమానమైనవాఁడును, మన్మథాస్త్రముల నెఱుఁగనివాఁడును అగు జంగమమల్లికార్జునదేవుని

**విశేషములు** . సత్ + జన = సద్ + జన - సజ్జన ఆపద్ + జలనిధి = ఆపజ్జలనిధి, భూభృత్ + జాతా = భూభృజ్జాతా ఆపజ్జలనిధి - రూపక సమాసము

వసంతతిలకము **కారుణ్యమూర్తి, నవికారు, నగేంద్రధీరున్,**
**మారారి, సర్వజనమాన్య, సదా వదాన్యున్**
**నీరేజపత్రనిభనేత్రు, జగత్పవిత్రున్,**
**ప్రారబ్ధపుణ్యమితభాషు, గుణాభిలాషున్** 199

**అర్థము** . కారుణ్య - మూర్తిన్ = దయా స్వరూపుఁడును, అవికారున్ = మార్పునొందనివాఁడును, నగ + ఇంద్ర - ధీరున్ = పర్వతశ్రేష్ఠునివలె ధైర్యముగలవాఁడును, మార + అరిన్ = మన్మథునకు శత్రువైనవాఁడును, సర్వ - జన- మాన్యున్ = జనులందఱిచేతను మన్నింపఁదగినవాఁడును, సదా - వదాన్యున్ = ఎల్లప్పుడును దాతయైనవాఁడును, నీరేజ - పత్ర - నిభ -నేత్రున్ = తామరరేకులతో సమానమైన కన్నులుగలవాఁడును, జగత్ + పవిత్రున్ = లోకములోఁ బావనుఁడైనవాఁడును, ప్రారబ్ధ - పుణ్య = ప్రారంభింపఁబడిన పుణ్యము గలవారితో, మిత - భాషున్ = తక్కువ మాటలాడువాఁడును, గుణ + అభిలాషున్ = మంచి గుణములందుఁ గోరిక గలవాఁడును అగు జంగమ మల్లికార్జునుని

**తాత్పర్యము .** దయాస్వరూపుఁడు, అవికారుఁడును, పర్వతశ్రేష్ఠునివలె ధైర్యవంతుఁడును, మన్మథునకు శత్రువైనవాఁడును, ఎల్లజనులకు మాన్యుఁడైనవాఁడును, నిరంతరమును దాతయైనవాఁడును, తామరరేకులవంటి కన్నులు గలవాఁడును, జగత్తులోఁ బవిత్రుఁడైనవాఁడును, పుణ్యాత్ములతో మితముగా మాటలాడువాఁడును, సుగుణములందుఁ గోరిక గలవాఁడును అగు జంగమ మల్లికార్జునదేవుని

**విశేషములు** 'వసంత తిలక' వృత్తమునకు నాలుగు పాదములుండును ప్రతిపాదమునను త, భ, జ, జ, గగ అనుగణము లుండును మొదటి యక్షరమునకును ఎనిమిదవ యక్షరమునకును యతిమైత్రి ప్రాసనియమము గలదు కారు - ధీరు, మాన్య - వదాన్య అనురీతిగా నంత్యానుప్రాసమను శబ్దాలంకారము గలదు

## గద్యము

ఇది శ్రీమజ్జంగమమల్లికార్జునదేవ దివ్య శ్రీ పాద పంకజభ్రమరాయమాణ కవిరాజశిఖామణి నన్నెచోడదేవప్రణీతంబైన కుమారసంభవం బనుకథయం దష్టమాశ్వాసము

దీనికి వ్యాఖ్య పూర్వాశ్వాసాంతగద్యలకు వలెనే

అష్టమాశ్వాసము చివర తంజావూరి ప్రతిలో 'శ్రీమద్రాజాధిరాజ రాజమహారాజ శహాజీ రాజభూపాలక సార్వభౌమస్య యిష్టార్థా ః, భవానీశంక్కర కృపయా సఫలాః సంత్తు ఉమామహేశ్వరో రక్షతు శివాయ నమః' అని కలదు

శహజీ మహారాజు క్రీ శ 1684 - 1712 వఱకుఁ బాలించినవాఁడు ఈ గ్రంథ మాకాలమున నుల్లేఖింపఁబడినది ' శ్రీ ని వేం రావు

**మ ఇది శ్రీ జొన్నలగడ్డ వంశమణియౌ మృత్యుంజయాఖ్యుండు స**
**మ్మద మొప్పారఁ గుమారసంభవము శ్రీమన్నన్నెచోడాఖ్య వి**
**ద్వదధీశోత్తము శాబ్దికార్థ వివిధస్వారస్య తాత్పర్యముల్**
**చదురొప్పన్ వచియించి మన్చు విలసత్ సంజీవనీవ్యాఖ్య యౌ**

# కుమార సంభవము

## నవమాశ్వాసము

క శ్రీ రామా సంచిత విపు
లోరస్థలు, నిర్మలాత్మయోగ సుధాకూ
పార సుధాకరుఁ, గవి నీ
రేరుహ రవి, దివ్యమునివరేణ్యు, నగణ్యున్ 1

**అర్థము** శ్రీ - రామా - సంచిత - విపుల + ఉరస్ + స్థలున్ = లక్ష్మి యను స్త్రీతోఁగూడుకొనిన విశాలమయిన వక్షస్థలము గలవాఁడును, నిర్మ కరున్, నిర్మల = స్వచ్ఛమయిన, ఆత్మ - యోగ = పరమాత్మధ్యానమనెడి, సుధా + అకూపార = అమృతసముద్రమునకు, సుధాకరున్ = చంద్రుఁడైనవాఁడును, కవి-నీరేరుహ - రవిన్ = కవులనెడి పద్మములకు సూర్యుఁడైనవాఁడును, దివ్య - ముని-వరేణ్యున్ = దివ్యుఁడైన మునిశ్రేష్ఠుఁడును, అగణ్యున్ = గణింప శక్యముగాని వాఁడును, అగు జంగమ మల్లికార్జునుని

**తాత్పర్యము** లక్ష్మీ దేవితోఁ గూడిన విశాలమైన వక్షస్థలము గలవాఁడును, నిర్మలమైన పరమాత్మధ్యానమనెడి అమృత సముద్రమునకుఁ జంద్రుఁడైనవాఁడును, కవులనెడి పద్మములకు సూర్యుఁడైనవాఁడును, దివ్యమునిశ్రేష్ఠుఁడును, ఇట్టి వాఁడని గణింప శక్యముగానివాఁడును అగు జంగమమల్లికార్జునుని

**విశేషములు .** ఆత్మయోగ సుధాకూపార సుధాకరు - రూపకము, కవి నీరేరుహ రవి - రూపకము వీరశైవుఁడయిన జంగమమల్లికార్జునుని విష్ణువుగ వర్ణించుట విశేషము వరేణ్యు - గణ్యు - అంత్యానుప్రాసము

వ హరి పరమేష్ఠి పురందరాద్యమరవరసహితుండైన యీశ్వరునకు హిమవంతుండు సుప్రభాతార్చనావిధి నభ్యర్చితుంజేసి వివాహమండపంబు నిర్మింప నుద్యుక్తుండగుడు నాక్షణంబ 2

**అర్థము.** హరి - విష్ణువు, పరమేష్ఠి = బ్రహ్మ, పురందర = ఇంద్రుఁడు, ఆది = మొదలగు, అమర - వర = దేవతా శ్రేష్ఠులతో, సహితుండు = కూడినవాఁడు, ఐన, ఈశ్వరుననకున్, హిమవంతుండు, సుప్రభాత + అర్చనా - విధిన్ = ఉదయకాలపు పూజా విధానముతో, అభ్యర్చితున్ (అభి + అర్చితున్) = పూజింపఁబడినవానిని, చేసి, వివాహమండపంబున్, నిర్మింపన్, ఉద్యుక్తుండు = పూనినవాఁడు, అగుడున్ = అయినంతనే, ఆ-క్షణంబు + అ = ఆ క్షణమే

**తాత్పర్యము.** విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుఁడు మున్నగు దేవతాశ్రేష్ఠులతోఁగూడి యీశ్వరునకు హిమవంతుఁడు ఉదయకాల పూజా విధానమునఁ బూజించి కల్యాణమండపమును నిర్మింపఁబూనినంతనే, ఆ క్షణమే - తరువాతి పద్యముతో నన్వయము

**సీ.** **కనకాచలము నెలకట్టయ్యె, నవరత్న**
**వర్గంబు నవరంగవల్లు లయ్యెఁ ,**
**గల్పకుజంబులుఁ గంబంబులుగ మీఁదఁ**
**గల్పలతాతతి గలయఁబర్వి**
**సుందరంబగు పచ్చపందిరియును దోర**
**ణంబులు నయ్యె దివ్యాంబరములు**
**గంబకట్టులు మేలుకట్లును నయ్యెఁ దా**
**రకములు మణివిలంబకము లయ్యె**

**గీ** **నమృత రస రసాయనాబ్ధులు పూర్ణ కుం**
**భంబు లయ్యె, నిందు భాను మండ**
**లాలి దర్పణంబు లయ్యె, సర్వేశు ను**
**ద్వాహ మండపమునఁ దమకుఁ దార** 3

**అర్థము :** సర్వ + ఈశు + ఉద్వాహ - మండపమునన్ = సర్వేశ్వరుని వివాహమండపమునందు, తమకున్ + తారు + అ = తమకుఁదామే,

కనక + అచలము = మేరుపర్వతము, నెలకట్టు + అయ్యెన్ = కుట్టిమస్థలము అయ్యెను, నవ-రత్న-వర్గంబులు = తొమ్మిది రత్నముల సమూహములును, నవ-రంగవల్లులు = క్రొత్త ముగ్గులు, అయ్యెన్

కల్ప - కుజంబులున్ = కల్పవృక్షములును, కంబంబులుగన్ =

స్తంభములుగను, మీఁదన్ = వానిపై, కల్ప - లతా - తతి = కల్పవృక్షపుఁదీవెల సమూహము, కలయన్ = అంతటను, పర్వి = వ్యాపించి, సుందరంబు + అగు = అందమయిన, పచ్చ - పందిరియును, తోరణంబులున్, అయ్యెన్

దివ్య + అంబరములు = దివ్యములయిన వస్త్రములు, కంబ - కట్టులు= స్తంభముల కట్టులును, మేలుకట్లును = వితానములును, అయ్యెన్

తారకములు = నక్షత్రములు, మణి - విలంబకములు = మణులతో వ్రేలాడఁగట్టిన గుత్తులు, అయ్యెన్

అమృతరస - రసాయన + అబ్ధులు = అమృతసముద్రములు, పూర్ణ - కుంభంబులు, అయ్యెన్,

ఇందు - భాను - మండల + ఆలి = చంద్రసూర్యబింబముల వరుస, దర్పణంబులు = అద్దములు, అయ్యెన్

**తాత్పర్యము** . పరమేశ్వరుని వివాహమండపమున వివిధవస్తువులు తమకుఁదామే వివిధవస్తువులుగా నయ్యెను మేరుపర్వతము కుట్టిమ మయ్యెను నవరత్నములు ముగ్గులయ్యెను కల్పవృక్షములు స్తంభములుగను, వానిపైఁ గల్పవృక్షపుఁదీవెలు వ్యాపించి సుందరమైన పచ్చని పందిరియును, తోరణములును అయ్యెను దివ్యములయినవస్త్రములు స్తంభపుఁగట్టులును, వితానములు నయ్యెను నక్షత్రములు వ్రేలాడు మణుల గుత్తులయ్యెను అమృత సముద్రములు పూర్ణకుంభము లయ్యెను చంద్ర సూర్యబింబములు దర్పణములయ్యెను

గీ. **విష్టరం బయ్యెను బరుసవేది, వేది**
**యయ్యెఁ జింతామణులు, వెలయంగ మీఁద**
**నౌషధులు నిధుల్ దీపము లయ్యె, ననలుఁ**
**డొలసి వరహోమకుండమై వెలుఁగుచుండె** 4

**అర్థము** . పరుసవేది = స్పర్శవేధి (ఇనుమును బంగారముగాఁ జేయు రసశిలా విశేషము), విష్టరంబు + అయ్యెను = ఆసన మయ్యెను, చింతామణులు, వేది + అయ్యెన్ = అరఁగు అయ్యెను, వెలయంగన్ = ఒప్పునట్లు, మీఁదన్ = పైని, ఔషధుల్ = ఓషధులు, నిధుల్, దీపములు, అయ్యెన్, అనలుఁడు = అగ్ని, ఒలసి= కూడి, వర - హోమ - కుండము + ఐ = మేలయిన హోమకుండమయి, వెలుఁగుచున్ + ఉండెన్

**తాత్పర్యము .** స్పర్శవేధి ఆసనము అయ్యెను చింతామణులు అరఁగు అయ్యెను దానిపై నోషధులును నిధులును దీపములయ్యెను అగ్ని హోమకుండమై వెలుఁగుచుండెను

**వ తదనంతరంబున హిమవంతుండు దైవజ్ఞనియుక్తుండై హైమవతిం గైసేయుండని విదగ్ధాంగనల నియమించిన నక్షణంబ వారు నవరత్నరంగాతి సుందరంబగు చంద్రకాంతమణిమయమజ్జనవేదికాతలంబున నగజ నునిచి హంసోదకంబులను దీర్ఘ సుగంధోదకంబులను మజ్జనంబార్చి నైపథ్యనికేతనంబునకుం దెచ్చి దివ్యాంబరాలంకృతం జేసిన 5**

**అర్థము.** తద్ + అనంతరంబునన్, హిమవంతుండు, దైవజ్ఞ-నియుక్తుండు+ ఐ = జ్యోతిష్కులచే నియోగింపఁబడినవాఁడయి, హైమవతిన్ = పార్వతిని, కైసేయుండు + అని = అలంకరింపుఁడని, విదగ్ధ + అంగనలన్ = నేర్పరులైనస్త్రీలను, నియమించినన్, అక్షణంబు + అ = వెంటనే, వారు, నవ - రత్న- రంగ + అతి - సుందరంబు + అగు = తొమ్మిది రత్నముల రంగస్థలముచే మిక్కిలి అందమయినది యగు, చంద్రకాంత - మణి - మయ- మజ్జన - వేదికా - తలంబునన్ = చంద్రకాంతమణులతో నిర్మింపఁబడిన స్నానపుటరఁగుపై, అగజన్= పార్వతిని, ఉనిచి = ఉంచి, హంస + ఉదకంబులను =ఎండకు వేఁడిమి చెంది, వెన్నెలకు జల్లనగు జలములచేతను, తీర్థ - సుగంధ + ఉదకంబులను పరిమళితములగు తీర్థజలములచేతను, మజ్జనంబు = స్నానము, ఆర్చి = ఆడించి, నైపథ్య - నికేతనంబునకున్ = వేష గృహమునకు, తెచ్చి = తీసికొనివచ్చి, దివ్య + అంబర + అలంకృతన్ = దివ్యములయిన వస్త్రములచే నలంకరింపఁబడినదిగా, చేసినన్

**తాత్పర్యము .** వెంటనే హిమవంతుఁడు దైవజ్ఞులచే నియోగింపఁ బడినవాఁడయి పార్వతి నలంకరింపుఁడని నేర్పరులైన స్త్రీలను నియమింపఁగా, వారు నవరత్నమయ రంగముచే మిక్కిలి సుందరమైన చంద్రకాంతమణిమయమైన స్నానపుటరంగుపైఁ బార్వతి నుంచి హంసోదకముల చేతను, పరిమళభరితములైన తీర్థోదకములచేతను స్నానమాడించి వేషగృహమునకుఁ దీసికొనివచ్చి దివ్యవస్త్రములచే నలంకరింపఁజేసిన - తరువాతి పద్యముతో నన్వయము

## పెండ్లి కూఁతురగు పార్వతి వర్ణన

గీ   మజ్జనం బొప్ప నాడి నిర్మలిన మగు దు
కూలములు గట్టి పొల్చెఁ గుత్కీలతనయ
వర్షసమయము సన శరద్వ్యాప్తి వెలుఁగు
కాశ సంకాశ మగు మహీకాంతవోలె   6

**అర్థము** కుత్కీల - తనయ = కొండకూఁతురు - పార్వతి, మజ్జనంబు+ ఒప్పన్ + ఆడి = ఒప్పుగా స్నానముచేసి, నిర్మలినము + అగు = నిర్మలము అయిన, దుకూలములు = సన్నని వస్త్రములు (తెల్లనివస్త్రములు) కట్టి, వర్ష - సమయము = వాన కాలము, చనన్ = పోఁగా, శరద్ + వ్యాప్తిన్ = శరత్కాలము వ్యాపించుటచే, వెలుఁగు = ప్రకాశించు, కాశ - సంకాశము = తెల్లు సమీపమున నున్నది, అగు, మహీ - కాంత + పోలెన్ = భూమియను స్త్రీ విధమున, పొల్చెన్ = ఒప్పెను

**తాత్పర్యము** పార్వతి స్నానము చేసి నిర్మలములైన తెల్లని వస్త్రములు ధరించి, వర్షకాలముపోయి శరత్తు వచ్చుటచే నొప్పు తెల్లుతోఁగూడిన భూమియను స్త్రీవలె నొప్పెను

**విశేషములు .** అలంకార ముపమ రూపకానుప్రాణితము

ఈ పద్యము కాళిదాసు శ్లోకమున కనుకరణము

సా మజ్జలస్నానవిశుద్ధగాత్రీ
గృహీతవ త్యుద్గమనీయ వస్త్రా
నిర్వృత్తపర్జన్యజలాభిషేకా
ప్రఫుల్లకాశా వసుధేవ రేజే   కుమార సం 7-11

వ   మఱియును తరువాతి పద్యముతో నన్వయము   7

గీ   అలికులాన్వితమగు వికచాంబుజంబొ ?
జలధరంబులో వెలువడు చంద్రమండ
లంబొ ? నా నొప్పెఁ గుటిలాలకంబు లోలిఁ
దీర్చి సఖు లర్థిఁజూడ నద్రిజ మొగంబు   8

**అర్థము .** కుటిల + అలకంబులు = వంకరలైన ముంగురులు, ఓలిన్ = క్రమముగా, తీర్చి, సఖులు = చెలికత్తెలు, అర్థిన్ = కోరికతో, చూడన్, అద్రిజ =

పార్వతియొక్క, మొగంబు = ముఖము, అలి - కుల + అన్వితము = తుమ్మెదల గుంపుతోఁ గూడినది, అగు, వికచ + అంబుజంబో = వికసించిన పద్మమో, జలధరంబులోన్ - వెలువడు = మేఘములోనుండి పైకి వచ్చునట్టి, చంద్ర - మండలంబో = చంద్రబింబమో, నాన్ = అనఁగా, ఒప్పెన్

**తాత్పర్యము.** వంకరలైన ముంగురులను గ్రమముగాఁ దీర్చి సఖులు కోరి చూడఁ బార్వతి ముఖము తుమ్మెదల గుంపుతోఁ గూడిన విరిదామరయో, మేఘములోనుండి వెలువడిన చంద్రబింబమో యన నొప్పెను

**విశేషములు .** అలంకారము సందేహము ఈ పద్యము కాళిదాసు కుమారసంభవశ్లోకమున కించుక యనుకరణము

**లగద్విరేఫం పరిభూయ పద్మం**
**సమేఘలేఖం శశినశ్చ బిమ్బమ్,**
**త దాననశ్రీ రలకైః ప్రసిద్ధి**
**శ్చిచ్ఛేద సాదృశ్యకథాప్రసఙ్గమ్** కుమార సం 7-16

జలధరంబులో వెలువడు - జలధరంబువలన వెలువడు 'ఉండి పదం బొకానొకచో వలనవర్ణకంబున కనుప్రయుక్తం బగు ' బాల కారక 10 జలధరంబు వలన నుండి వెలువడు 'ఉండి శబ్దము పరంబగునపుడు వలనకు ద్వితీయా సప్తములు ప్రాయికంబుగ నగు ' బాల కారక 11 జలధరంబులోనుండి వెలువడు 'వలన కాదేశంబగు ద్వితీయాసప్తముల మీఁది యుండికి లోపంబు బహుళంబుగా నగు ' ప్రౌఢ కారక 11 జలధరంబులో వెలువడు 'నూతిలో వెలువడఁ గోమలిం దిగిచె' నని నన్నయ ప్రయోగము భార ఆది 3 ఆ

**వ అయ్యవసరంబునం దత్సతు లగజ సర్వాంగకానూనప్రభావప్రసరంబు దమచూడ్కుల కక్కజంబై వెక్కసంబందుచు 9**

**అర్థము .** ఆ + అవసరంబునన్ = ఆ సమయమున, తద్ + సతులు = ఆ యింతులు, అగజ = పార్వతియొక్క, సర్వ + అంగక + అనూన - ప్రభావ - ప్రసరంబు = ఎల్ల అవయవముల తక్కువకాని కాంతియొక్క వ్యాప్తి, తమ - చూడ్కులకున్ = తమ చూపులకు, అక్కజంబు + ఐ = అశక్యమయి, వెక్కసంబు= దుస్సహము, అందుచున్

**తాత్పర్యము** ఆ సమయమున నా చెలికత్తెల చూపులకు పార్వతి సర్వావయవముల అధికమైన కాంతి వ్యాప్తి అశక్యమయి వారు దుస్సహత్వ మందుచు - తరువాతి పద్యముతో నన్వయము

సీ. **మణిభూషణప్రభఁ దనుకాంతి వెలయనీ**
**దను లీల మేనఁ జందన మలంది**
**కచనీలభాతి చీఁకటి గొల్పు దెస లను**
**కరణి వేసవి జాదివిరు లమర్చి**
**యాననద్యుతిఁ గప్పు నమలాక్షదీప్తు ల**
**న్గతి నంజనము గన్నుఁగవ నమర్చి**
**దరహాసరుచి వరాధరకాంతి మాన్పు న**
**న్వడువునఁ గెమ్మోవి వన్ను పూన్చి**

గీ. **పొలఁతు లన్నింటికినిఁ బోలుపొందు గాఁగ**
**నెరయఁ గైసేయు నెపమున మఱువుసేసి**
**మేర కగ్గలమై పర్వు మెఱుఁగు లెల్ల**
**వరుస నలఁతికిఁ దెచ్చిరి వెరవు మెఱసి** 10

**అర్థము.** మణి - భూషణ - ప్రభన్ = రత్నాలంకారముల కాంతిని, తను-కాంతి = శరీర కాంతి, వెలయనీదు = ప్రకాశింపనీదు, అను - లీలన్ = అనురీతిని, మేనన్ = శరీరమునందు, చందనము = మంచిగంధము, అలంది = పూసి,

కచ - నీల - భాతి = వెండ్రుకల నల్లనికాంతి, దెసలు = దిక్కులు, చీఁకటి+ కొల్పున్ = చీఁకటిగాఁ జేయును, అనుకరణిన్ = అను విధమున, వేనలిన్= కొప్పునందు, జాది - విరులు = జాజిపూలు, అమర్చి = పెట్టి

అమల + అక్ష - దీప్తులు = నిర్మలములయిన కన్నుల కాంతులు, ఆనన-ద్యుతిన్ = ముఖకాంతిని, కప్పున్, అన్ + గతిన్ = అనువిధమున, కన్నుఁగవన్ (కన్ను + కవన్) = కన్నుల జంటయందు, అంజనమున్ = కాటుకను, అమర్చి,

దర - హాస - రుచి = చిఱునగవు కాంతి, వర + అధర - కాంతిన్ = మేలయిన క్రిందిపెదవికాంతిని, మాన్పున్ = పోఁగొట్టును, అన్ + వడువునన్ = అనువిధమున, కెమ్మోవిన్ (కెంపు + మోవి) = ఎఱ్ఱని పెదవియందు, వన్ను - పూన్చి= రంగుపూసి

పొలఁతులు = స్త్రీలు - చెలులు, వెరవు - మెఱపి = ఉపాయమొప్ప, అన్నింటికినిన్, పొలుపొందు + కాఁగన్ = సంబంధసామరస్యముండునట్లు, నెఱయన్ = పూర్తిగా, క్రైసేయు - నెపమునన్ = అలంకరించు వ్యాజమున, మఱువు + చేసి = దాఁచి, మేరకున్ + అగ్గలము + ఐ = హద్దును మించి, పర్వు = వ్యాపించు, మెఱుఁగులు + ఎల్లన్ = కాంతులన్నియును, వరుసన్ = క్రమముగా, అలతికిన్ = హద్దునకు, తెచ్చిరి

**తాత్పర్యము.** రత్నాలంకారముల కాంతిని శరీరకాంతి ప్రకాశింపనీదు అని శరీరమునఁ జందన మలఁది, శిరోజముల నల్లనికాంతి దెసలను జీఁకటిగాఁ జేయునని కొప్పున జాదిపూలు పెట్టి, నిర్మలములయిన కన్నులకాంతులు ముఖకాంతిని గప్పివేయునని కనుఁగవయందుఁ గాటుక పెట్టి, చిఱునగవు కాంతి క్రిఁబెదవి కాంతిని బోఁగొట్టునని కెమ్మోవిని రంగుపూసి, చెలికత్తెలు ఉపాయ మొప్పఁగా అన్నిటికిని సంబంధ సామరస్య ముండునట్లు పూర్తిగా నలంకరించు వ్యాజమున దాఁచి మితిమీఱి వ్యాపించు కాంతులనన్నిటిని హద్దులోనుంచిరి

**విశేషములు.** కన్ను అనునర్థమున అక్షిన్ శబ్దమునకు బదులుగా అక్ష శబ్దమును బ్రయోగించుట విశేషము కెమ్మోవి - కెంపు + మోవి 'అన్యంబులకు సహిత మిక్కార్యంబులు గొండొకచోఁ గానంబడియెడి' బాల సంధి 39

**చ** **అలకల కాంతిఁ గప్పె లలితాక్షవిభాతి, నిజాలకాక్షసం**
**చలతరదీప్తిఁ గప్పె విలసత్స్మితదీధితి పర్వి, లీలతో**
**నలికతలాలకాక్ష దరహాస గభస్తి నుతాధరారుణో**
**జ్జ్వల రుచి గప్పె, నన్నిటికి వన్నువు వెట్టినమాడ్కిఁ బొల్పుగాన్** 11

**అర్థము.** లలిత + అక్ష - విభాతి = మనోహరములయిన కన్నుల కాంతి, అలకల - కాంతిన్ = ముంగురుల కాంతిని, కప్పెన్, నిజ = తనదైన, అలక + అక్ష= సంచలతర - దీప్తిన్ = ముంగురులయుఁ, గన్నులయు మిక్కిలి చలించు కాంతిని, విలసత్ - స్మిత - దీధితి = ప్రకాశించుచున్న నవ్వుయొక్క కాంతి, పర్వి, కప్పెన్, లీలతోన్ - విలాసముతో, అలిక గభస్తిన్, అలిక - తల = ఫాల ప్రదేశమునందలి, అలక = ముంగురులు, అక్ష = కన్నులు, దరహాస = చిఱునవ్వు (అనువాని), గభస్తిన్ = కాంతిని, నుత + అధర + అరుణ + ఉజ్జ్వల - రుచి = పొగడఁబడిన క్రిఁబెదవి యొక్క ఎఱ్ఱని ప్రకాశవంతమైన కాంతి, అన్నిటికిన్, వన్నువు = వర్ణము, పెట్టిన - మాడ్కిన్ = పెట్టిన విధమున, పొల్పుగాన్ = ఒప్పుగా, కప్పెన్

**తాత్పర్యము** పార్వతి సుందరములయిన కన్నుల కాంతి ముంగురుల కాంతిని గప్పెను ముంగురులయుఁ గన్నులయుఁ గాంతిని చిఱునవ్వు కాంతి వ్యాపించి కప్పెను ఫాలమునందలి అలకలు, అక్షులు, చిఱునవ్వు అనువాని కాంతిని గ్రీఁబెదవిదైన అరుణకాంతి అన్నిటికిని రంగుపూసిన విధమున, ఒప్పుగాఁ గప్పెను

**విశేషములు** అలంకార ముత్ప్రేక్ష

వ అయ్యవసరంబున 12

**అర్థతాత్పర్యములు.** ఆ + అవసరంబునన్ = ఆ సమయమున, తరువాతి పద్యముతో నన్వయము

సీ **శృంగారరాజ్యలక్ష్మికి ముడిఁ గలిపిన**
**గతి హంసతిలకంబుఁ గబరిఁ బూన్చి**
**మరు రాజధానికి మణివప్ర మిడుగతిఁ**
**గటి నూత్నరత్నమేఖల యొనర్చి**
**యెలదూఁడు చక్రవాకులకు మేపించిన**
**గతి హారలత సన్నుఁగవ నమర్చి**
**సౌభాగ్యలావణ్యసతులఁ దూన్చియచూచు**
**గతిఁ గర్ణముల వస్తుఖచితకర్ణ**

తే **పూరములు వెట్టి తూఁగాడఁ బొలుఁతు లొండ్లు**
**నవయవంబుల కన్నింటి కవయమైన**
**పసదనంబులు నూల్కొల్పి భావమెసఁగఁ**
**జేసి రుమకు శృంగారంబు చెలువుమిగుల** 13

**అర్థము** పొలుఁతులు = పొలఁతులు = స్త్రీలు - చెలికత్తెలు, శృంగార - రాజ్య - లక్ష్మికిన్ = శృంగార రాజ్యమనెడు లక్ష్మికి, ముడిన్ = కిరీటమును, కలిపిన- గతిన్ = పెట్టిన విధమున, కబరిన్ = కొప్పునందు, హంసతిలకంబున్ = రాగిడిబిళ్లను, పూన్చి = అమర్చి,

మరు - రాజధానికిన్ = మన్మధుని ముఖ్యపత్తనమునకు, మణి - వప్రము= రత్నమయమైన ప్రాకారము, ఇడు - గతిన్ = ఇచ్చురీతిని, కటిన్ = మొలయందు, నూత్న - రత్న - మేఖల = క్రొత్తదియగు రత్నమయమైన మొలనూలు, ఒనర్చి = అమర్చి

చక్రవాకులన్ = ఆఁడుఁజక్కవలకు, ఎలతూఁడు = లేఁదూఁడు, మేపించిన గతిన్ = తినిపించిన విధమున, చన్ను + కవన్ = చన్నులజంటయందు, హారలతన్= తీఁగవంటి పేరును, అమర్చి

సౌభాగ్య - లావణ్య - సతులన్ = సౌభాగ్యము, లావణ్యముగల స్త్రీలను, తూన్చి + అ - చూచు - గతిన్ = తూనిక వేసియే చూచు విధమున, కర్ణములన్= చెవులందు, వస్తు - ఖచిత - కర్ణపూరరములు = బంగారముతోఁ జెక్కఁబడిన కర్ణాభరణములు, తూఁగాడన్=చలించునట్లు పెట్టి, ఒండ్లు + అవయవంబులకున్+ అన్నిటికిన్ = ఇతరాంగముల కన్నిటికిని, అవయము + ఐన = రంజకములయిన, పసదనంబులు = అలంకారములు, నూల్కొల్పి × నెలకొలిపి, భావము + ఎసఁగన్= శృంగారభావ మతిశయించునట్లు, చెలువు-మిగులన్ = అంద మతిశయించునట్లు, ఉమకున్ = పార్వతికి, శృంగారంబు = అలంకారము, చేసిరి

**తాత్పర్యము .** చెలికత్తెలు శృంగార మనెడు రాజ్యలక్ష్మికిఁ గిరీటమును బెట్టినట్లు కొప్పున రాగిడిబిళ్లను అమర్చి, మన్మథుని రాజధానికి మణిమయ ప్రాకారమును నిర్మించువిధమున మొలయందు, నూత్నరత్నముల మొలనూలు నమర్చి, ఆఁడుజక్కవలకు లేఁదూఁడు మేపిన విధమునఁ జనుఁగవయందుఁ దీఁగవంటి హారము నమర్చి, సౌభాగ్యము, లావణ్యముగల సతులను దూనికవేసి చూచులాగునఁ జెవులందుఁ గర్ణాభరణములను బెట్టి, ఇతరావయవముల కన్నిటికిని రంజకమైన అలంకారములు అంద మతిశయింప, శృంగారభావము మిగులఁ బార్వతికిఁ బెట్టిరి

**విశేషములు :** అలంకార ముత్ప్రేక్ష

**క తొడవులు తదవయవములకుఁ**
**దొడవులొ ? సతి యవయములు తొడవుల కమరం**
**దొడవులొ ? యని తర్కించుచుఁ**
**బడఁతులు గైసేసి రచలపతిసుత కెలమిన్ 14**

**అర్థము :** తొడవులు = ఆభరణములు, తద్ + అవయవములకున్ = ఆమె అవయవములకు, తొడవులొ = ఆభరణములో, సతి = పార్వతియొక్క, అవయవములు, తోడవులకున్, అమరన్ = ఒప్పునట్లు, తొడవులొ, అని,

తర్కించుచున్ = ఆలోచించుచు, పడఁతులు = స్త్రీలు - చెలులు, అచల - పతి-సుతకున్ = కొండఱేని కూఁతునకు - పార్వతికి, ఎలమిన్ = ప్రీతితో, కైసేసిరి = అలంకరించిరి

**తాత్పర్యము .** పార్వతి అవయవముల కాభరణము లాభరణములో, ఆభరణముల కామె అవయవములే ఆభరణములో యని తర్కించుచుఁ జెలికత్తెలు పార్వతిని బ్రీతితో నలంకరించిరి

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష

క **మలయజపంకము ననువుగ**
**నలఁదిన మైఁదీఁగ వెలిఁగె నంబుజరాగా**
**మలమణిశలాకపయి వె**
**న్నెల పర్విన కరణి ధారుణీధరసుతకున్** 15

**అర్థము .** ధారుణీధర - సుతకున్ = కొండ కూఁతునకు - పార్వతికి, మలయజ - పంకమున్ = మంచి గంధపు బురదను, అనువుగన్ = బాగుగా, అలఁదిన = పూసిన, మైఁదీఁగ = తీఁగవంటి శరీరము, అంబుజరాగ + అమల - మణి - శలాకపయిన్ = పద్మరాగ మనెడి మణితోఁ జేయఁబడిన కమ్మిపయిని, వెన్నెల, పర్విన = వ్యాపించిన, కరణిన్ = విధమున, వెలిఁగెన్ = ప్రకాశించెను

**తాత్పర్యము :** మంచిగంధపుఁబంకము బాగుగా నలఁది పార్వతి మైఁదీఁగ పద్మరాగమణిశలాకపై వెన్నెల వ్యాపించినట్లు వెలిఁగెను

**విశేషములు .** అలంకార ముపమ

క **లలితాంగంబుల నన్నిటఁ**
**గలయన్ మణిభూషణములు గదిసి బెడంగై**
**వెలిఁగె నగరాజనందన**
**పొలుపుగ నవకల్పలతిక పూచిన భంగిన్** 16

**అర్థము .** లలిత + అంగంబులన్ + అన్నిటన్ = మనోహరములయిన అవయవముల నన్నిటియందును, కలయన్ = బాగుగా, మణి- భూషణములు = రత్నాలంకారములు, కదిసి = కూడి, బెడంగు + ఐ = అందమై, నగ - రాజ - నందన = కొండఱేని కూఁతురు - పార్వతి, పొలుపుగన్ = ఒప్పుగా, నవ - కల్ప-

లతిక = క్రొత్త కల్పలత, పూచిన - భంగిన్ = పుష్పించిన విధమున, వెలిఁగెన్ = ప్రకాశించెను

**తాత్పర్యము** మనోహరములయిన అవయువముల నన్నిటను రత్నాలంకారములు గూడి చక్కనయి పార్వతి నవకల్పలత పుష్పించిన విధమున నుండెను

**విశేషములు** అలంకార ముపమ

వ అట్లు గైసేసి సతు లగజకు నిలువుటద్దంబు సూపిన 17

**అర్థము** అట్లు, కైసేసి = అలంకరించి, సతులు = స్త్రీలు - సఖులు, అగజకున్ = పార్వతికి, నిలువుటద్దంబు (నిలువు + అద్దంబు) చూపినన్

**తాత్పర్యము .** ఆ రీతిగా నలంకరించి సఖులు పార్వతికి నిలువుటద్దము చూపఁగా - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** నిలువుటద్దము - నిలువు + అద్దము 'కర్మధారయంబులం దుత్తున కచ్చు పరంబగునపుడు టుగాగమంబగు ' బాల సంధి 28

క ఆ రమణి సుందరాకృతి
గారవమునఁ దగులు మిగిలి కనుఁగొన నా శృం
గారాధిదేవతాకృతి
నారయఁ బ్రతిబింబ మెనఁగె నద్దములోనన్ 18

**అర్థము .** ఆ - రమణి - సుందర + ఆకృతిన్ = ఆ యింతి (పార్వతి) యొక్క, అందమైన ఆకారమును, గారవమునన్ = ఆదరముతో, తగులు - మిగిలి= ఆసక్తి అతిశయించి, కనుఁగొనన్ = చూడఁగా, ఆ - శృంగార + అధిదేవతా+ ఆకృతిన్ = ఆ శృంగారరసాధిదేవత ఆకారమును, అద్దములోనన్, ఆరయన్ = చూడఁగా, ప్రతిబింబము, ఎసఁగెన్

**తాత్పర్యము.** ఆ పార్వతి సుందరాకారమును మిక్కిలి ఆసక్తితో నద్దములోఁ జూడఁగా నా శృంగారరసాధిదేవత ప్రతిబింబ మన నొప్పెను

వ అంత హిమవంతుఁడు గౌరీదేవి నుద్వాహమండపంబునకు రావించిన ననేకమణిభూషణప్రభాభాసిత యగుచు 19

**అర్థము** అంతన్ హిమవంతుఁడు, గౌరీదేవిన్, ఉద్వాహమండపంబునకున్ = వివాహమండపమునకు, రావించినన్ = రప్పింపఁగా, అనేక - మణి - భూషణ - ప్రభా - భాసిత = పెక్కు రత్నాలంకారముల కాంతిచేఁ బ్రకాశించినది, అగుచున్

**తాత్పర్యము** అంత హిమవంతుఁడు గౌరీదేవిని వివాహమండపమునకు రావింపఁగా నామె పెక్కు రత్నాలంకారముల కాంతితోఁ బ్రకాశించుచు - తరువాతి పద్యముతో నన్వయము

చ నవిచిన కల్పవల్లి మదనాగగతిన్ నడపాడఁ జొచ్చెనో
యనఁ జనుదెంచెఁ గండవడ మల్లన వెల్వడి బాలికాలితో
ఘనపటలంబువెల్వడు వికాసితతారకసంభృతేందులే
ఖ నయముఁ గ్రేణిసేయుచు నగప్రియనందన చెన్నువింతగాన్ 20

**అర్థము** ననిచిన = పూచిన, కల్పవల్లి = కల్పలత, మద - నాగ - గతిన్= మదించిన యేనుఁగు గమనముతో, నడపాడన్ + చొచ్చెనో + అనన్ = సంచరింపఁజొచ్చెనో యనఁగా, నగ-ప్రియ-నందన = పర్వత ప్రియ పుత్రిక - పార్వతి, చెన్ను = అందము, వింత + కాన్ = ఆశ్చర్యముగా, బాలికా = ఆలితోన్=బాలికల వరుసతో - చెలికత్తెల వరుసతో, కండవడము =తెరలోనుండి, అల్లనన్= మెల్లఁగా, వెల్వడి, ఘన - పటలంబున్= మేఘముల గుంపును,వెల్వడు= వెలువడునట్టి, వికాసిత - తారక - సంభృత + ఇందు - లేఖ - నయమున్ = ప్రకాశించిన నక్షత్రములతోఁ గూడిన చంద్రలేఖయొక్క విధమును, క్రేణి + చేయుచున్ = తిరస్కరించుచు, చనుదెంచెన్ = వచ్చెను

**తాత్పర్యము.** పూచిన కల్పలత మత్తేభగమనముతో సంచరింపఁజొచ్చెనా యనునట్లు పార్వతి అందము వింతగొలుపఁగాఁ, జెలికత్తెలతోఁ దెరలోనుండి వెలువడి, మేఘబృందమునుండి వెలువడు ప్రకాశించు నక్షత్రములతోడి చంద్రరేఖ విధమును దిరస్కరించుచు వచ్చెను

**విశేషములు.** అలంకార ముత్ప్రేక్ష కండవడము వెల్వడి, ఘనపటలంబు వెల్వడు - కండవడము వలన నుండి వెల్వడి - ఘనపటలంబు వలన నుండి వెల్వడు - ఉండిశబ్దము పరమగుచుండఁగా వలనకు ద్వితీయాసప్తములు బాల కారక 11 వలన కాదేశంబగు ద్వితీయా సప్తములమీఁది యుండికి లోపము ప్రౌ కారక 11

సీ. శ్రీ భారతీ సతుల్ చేరి కెలంకుల
మణి హేమదండ చామరలు వెట్ట
శచి యాదిగా సురసతు లెల్ల దర్పణాం
బర భూషణాదులు వట్టి రాఁగ
ధర్మచారిణి యరుంధతి యాదిగాఁ బేరఁ
టాండ్రయి మునిపత్ను లడరి నడవ
సురవరకిన్నర గరుడాసురోరగ
స్త్రీ లర్థితోఁ గొల్చి మ్రోల రాఁగ

ఆ. శారదేందురుచులు సౌదామనులు మృదు
లతలు మణిగణములు సతుల రూపుఁ
దాల్చి వచ్చిరనఁగఁ, ద్రైలోక్య లావణ్య
రసముఁ గామరసము రాగరసము 21

ఆ. పొంగి మేర దప్పి శృంగారవార్ధియై
కువలయమున వెల్లిగొనియె ననఁగ
వచ్చె నర్థితో వివాహమండపమున
వలయ నచలచక్రవర్తి తనయ 22

**అర్థము.** శ్రీ - భారతీ - సతుల్ = లక్ష్మి సరస్వతీ దేవులు, కెలంకులన్= పార్శ్వములందు, చేరి, మణి - హేమ - దండ - చామరలు = మణిమయములు, స్వర్ణమయములునైన దండములుగల వింజామరములు, పెట్టన్ = వీవఁగా,

శచి - ఆదిగాన్ = శచీదేవి మొదలుగా, సుర -సతులు + ఎల్లన్ = దేవతాస్త్రీలందఱును, దర్పణ + అంబర - భూషణ + ఆదులు = అద్దము, వస్త్రములు, అలంకారములు మున్నగునవి, పట్టి - రాఁగన్ = తీసికొని రాఁగా,

ధర్మచారిణి = ధర్మము నాచరించునది అగు, అరుంధతి, ఆదిగాన్, ముని-పత్నులు = మునుల భార్యలు, పేరఁటాండ్రు + అయి = ముత్తయిదువలయి, అడరి = ఒప్పి, నడవన్ = నడవఁగా,

సుర - వర - కిన్నర - గరుడ + అసుర + ఉరగ - స్త్రీలు = దేవతాస్త్రీలు, కిన్నరాంగనలు, గరుడభామినులు, రాక్షసస్త్రీలు, నాగభామలు, అర్థితోన్ = కోరికతో, కొల్చి = సేవించి, మ్రోలన్ - రాఁగన్ = సమీపమున రాఁగా,

శారద + ఇందు - రుచులున్= శరచ్చంద్రకాంతులును, సౌదామనులున్= మెఱపులును, మృదు - లతలున్ = కోమలములైన తీఁగలును, మణి - గణములున్= మణుల సమూహములును, సతుల - రూపున్= స్త్రీల యాకారమును, తాల్చి = ధరించి, వచ్చిరి, అనఁగన్, త్రైలోక్య - లావణ్య - రసమున్ = ముల్లోకములందలి లావణ్య రసమును, కామరసమున్= శృంగారరసమును, రాగ - రసమున్ = ప్రేమరసమును, పొంగి, మేరన్ + తప్పి = హద్దునుదాఁటి, శృంగార - వార్ధి + ఐ = శృంగార సముద్రమయి, కువలయమునన్= భూమండలమున, వెల్లి+ కొనియెన్ = ప్రవాహము కట్టెనో, అనఁగన్, అచల - చక్రవర్తి - తనయ = కొండలటేని కూఁతురు - పార్వతి, అర్థితోన్= కోరికతో, వివాహ - మండపమునన్ = పెండ్లి మండపమునందు, వలయన్ = సువాసన కలుగఁగా (?), వచ్చెన్

**తాత్పర్యము .** లక్ష్మీ సరస్వతీ దేవులు పార్శ్వములందు మణిమయస్వర్ణమయదండములుగల వింజామరములు వీవఁగా, శచి మొదలుగా దేవతాస్త్రీలందఱును అద్దము, వస్త్రములు ఆభరణములు మున్నగునవి పట్టుకొని రాఁగా, ధర్మచారిణియగు అరుంధతి మున్నుగా మునిపత్నులు ముత్తయిదువలఱు నడవఁగా, దేవతాస్త్రీలు, కిన్నరాంగనలు, గరుడభామినులు, నాగభామలు కోరి కొలిచి రాఁగా, శరచ్చంద్రకాంతులు, విద్యుత్తులు మృదులతలు, మణులు, స్త్రీ రూపములు ధరించి వచ్చిరనఁగా, ముల్లోకములందలి లావణ్యరసము, కామరసము, అనురాగరసము పొంగి హద్దుదాఁటి శృంగారసముద్రమై భూమండలమునఁ బ్రవాహముకట్టె ననఁగా, పార్వతి కోరికతో వివాహమండపమున సువాసన కలుగఁగా వచ్చెను

**విశేషములు .** 22 వ పద్యమునఁ జివరి పాదము 'అర్తి నచల చక్రవర్తి తనయ' అని సాహిత్య అకాడమీ ప్రతిలోఁ గలదు అర్తి అనఁగా ఆర్తి పార్వతి ఆర్తితో వచ్చెనన నర్థము లేదు మానవల్లివారి ప్రతిలో 'వలయ నచల చక్రవర్తి'తనయ' అను పాఠము గలదు వలయన్ అనఁగా సువాసన కలుగఁగా అను నర్థమును వారే యిచ్చిరి అందుచే నదియే స్వీకరింపఁబడినది అలంకార ముత్ప్రేక్ష

**వ ఇట్లు చనుదెంచి వివాహమందిరానూనమణికనకాంబరోద్గతానేక వర్ణంబుల కాత్మీయాంగప్రభ వన్నె వెక్కించుచును నుచితాస్థానంబగు నిజజనకు నూరుపీఠంబున నుండె నంత నిటలతటాంబకు నభ్యంజనోద్వర్తన స్నానానంతరంబున** 23

**అర్థము** ఇట్లు, చనుదెంచి = వచ్చి, వివాహ వర్ణంబులకున్, వివాహ-మందిర = పెండ్లియింటియందలి, అనూన = తక్కువకాని, మణి - కనక + అంబర = మణులనుండి, బంగారమునుండి వస్త్రములనుండి, ఉద్గత = బయలువెడలిన, అనేక - వర్ణంబులకున్ = పెక్కు రంగులకు, ఆత్మీయ + అంగ-ప్రభ = తనదైన అవయవముల కాంతి, వన్నువు = వర్ణము, ఎక్కించుచును = అతిశయింపఁజేయుచును, ఉచిత + ఆస్థానంబు + అగు = తగిన స్థానమైన, నిజ-జనకు + ఊరు - పీఠంబునన్ - తన తండ్రి ఒడిలో, ఉండెన్, అంతన్, నిటల - తట + అంబకు + అభ్యంజన + ఉద్వర్తన - స్నాన + అనంతరంబునన్ = ఫాలాక్షుని తలంటు, నలుగువెట్టుటలతోఁ గూడిన స్నానమునకుఁ బిమ్మట

**తాత్పర్యము .** ఇట్లు వచ్చి పెండ్లి యింటి అనల్ప మణి కనక వస్త్రముల నుండి వెలువడు పెక్కు వర్ణములకుఁ దన యవయవములనుండి వెలువడు పెక్కు వర్ణములకుఁ దన యవయవముల కాంతివర్ణమతిశయింపఁజేయుచు, ఉచితాస్థానమైన తన తండ్రి యొడిలో నుండెను అంత నిటలాక్షుని తలంటు నలుగువెట్టుటలతోఁ గూడిన స్నానమునకుఁ బిమ్మట తరువాతి పద్యముతో నన్వయము

## పెండ్లి కొడుకగు నీశ్వరుని వర్ణన

సీ. స్ఫటికాద్రిమీఁద విభ్రాజిల్లు వస్తు శృం
        గంబు నా రత్నజూటంబు పూన్చి
    శారదాభ్రంబుపైఁ జంద్రిక పర్వె నా
        నునుపారు మేనఁ జందన మలంది
    హైమాద్రితటమున నౌషధీలతికలు
        ననిచె నా మణిభూషణములు దొడిపి
    రజతాద్రి కెలఁకుల రాజార్కబింబంబు
        లెలసె నా వజ్రకుండలయుగంబు

గీ. చెవుల నిడి శీతనగమున శిశిరపటల
    మావహిల్లె నా విమలదివ్యాంబరములు
    భావముగఁ గట్టి పెండిలి పసదనంబు
    సేసె నమరేంద్రుఁ డా చంద్రశేఖరునకు 24

**అర్థము .** స్ఫటిక + అద్రి - మీఁదన్ = మేరుపర్వతముమీఁద, విభ్రాజిల్లు = ప్రకాశించునట్టి, వస్తు - శృంగంబు - నాన్ = బంగారు శిఖరమనఁగా, రత్న - జూటంబు = మణిమయమైన జడముడిని, పూన్చి = తాల్పఁజేసి,

శారద + అభ్రంబుపైన్ = శరత్కాలమేఘముపై, చంద్రిక = వెన్నెల, పర్వెన్ + నాన్ = వ్యాపించెననఁగా, నునుపారు = నున్ననైన, మేనన్ = శరీరమునందు, చందనము = మంచి గంధము, అలంది = పూసి,

హైమ + అద్రి - తటమునన్ = హిమవత్పర్వతపుఁజఱియయందు, ఔషధీ - లతికలు = ఓషధులతీవలు, ననిచెన్ + నాన్ = పూచెననఁగా, మణి - భూషణములు = రత్నాలంకారములు, తొడిపి = ధరింపఁజేసి,

రజత + అద్రి - కెలఁకులన్ = వెండికొండ పార్శ్వములందు, రాజ + అర్క - బింబంబులు = చంద్రసూర్యమండలములు, ఎలసెన్ + నాన్ = ఉండెననఁగా, వజ్ర - కుండల - యుగంబు = వజ్రమయములైన కుండలముల జంట, చెవులన్, ఇడి = పెట్టి

శీత - నగమునన్ = మంచుకొండపై, శిశిర - పటలము = మంచు సమూహము, ఆవహిల్లెన్ + నాన్ = కలిగెననఁగా, విమల - దివ్య + అంబరములు = నిర్మలములు, దివ్యములునైన వస్త్రములు, భావముగన్ = అందముగా, కట్టి, అమర + ఇంద్రుఁడు = దేవేంద్రుఁడు, ఆ - చంద్రశేఖరునకున్ = చంద్రుఁడు శిరోభూషణముగాఁ గలవానికి - శివునకు, పెండిలి - పసదనంబు = వివాహాలంకారము, చేసెన్

**తాత్పర్యము :** మేరుపర్వతముపైఁ బ్రకాశించు బంగరుశిఖరమనఁగా మణిమయమైన జడముడిని ధరింపఁజేసి, శరత్కాలమేఘముపై వెన్నెల వ్యాపించెననఁగా నున్ననైన శరీరమున మంచిగంధమును బూసి, హిమవత్పర్వతపుఁజఱియయందు ఓషధుల తీవలు పూచెననఁగా రత్నాలంకారములు ధరింపఁజేసి, కైలాసము పార్శ్వములఁ జంద్రసూర్యమండలము లుండెననఁగా వజ్రమయకుండలద్వయమును జెవులఁ బెట్టి, మంచుకొండపై హిమసమూహము కలిగె ననఁగా నిర్మలములు, దివ్యములు నైన వస్త్రము లందముగఁ గట్టి దేవేంద్రుఁడు ఆ చంద్రశేఖరునకు వివాహాలంకారము చేసెను

**విశేషములు :** అలంకార ముత్ప్రేక్ష

వ **మఱియు ననేక సర త్రిసరపద కరాంగుళీయ కోదరబంధక కటిసూత్ర శింజినికాద్యనేకాలంకారాలంకృతుఁజేసి పసిండి యాయగంబున సురియ సురంగంబుగాఁ దొంగలిపట్టియం గట్టి చెన్నుమిగులం గ్రాసేసిన** 25

**అర్థము.** మఱియున్, అనేక సర - త్రిసర = ఆ పేర్లుగల హార విశేషములు, ఉదర బంధక = ఉదరమును బంధించు ఆభరణ విశేషము (ఒడ్డాణము), కటి - సూత్ర = మొలత్రాడు, శింజినికా = అందె, ఆది = మొదలగు, అనేక =పెక్కు, అలంకార = భూషణములచే, అలంకృతున్ = అలంకరించఁబడినవానినిగా, చేసి, పసిండి-ఆయగంబునన్= బంగారు చిత్రకంబళమునందు, సురియ = చురకత్తి, సురంగంబు + కాన్ = ప్రకాశముగా, తొంగలి -। పట్టియన్ = వ్రేలాడుడాలున, కట్టి,, చెన్ను = అందము, మిగులన్ = అతిశయింపఁగా, కైనేసినన్ = అలంకరింపఁగా

**తాత్పర్యము :** మఱియు అనేక సరములు, త్రిసరములు అనుహార విశేషములు, పదములయు, హస్తములయు అంగుళీయకములు, ఉదరబంధకము, కటిసూత్రము, అందెయు మున్నగు పెక్కుభూషణములచే భూషితునిఁగావించి, బంగారుచిత్రకంబళమునందు చురకత్తి ప్రకాశమగునట్లు వ్రేలాడుడాలునఁగట్టి అంద మతిశయించునట్లు అలంకరింపఁగా - తరువాతి పద్యముతో నన్వయము

క మేరకు నగ్గల మగు శృం
గారానూనానురాగకామరసంబుల్
చారుతరలీలఁ బురుషా
కారముఁ దాల్చె నన నీలకంఠుం డొప్పెన్ 26

**అర్థము.** మేరకున్ + అగ్గలము + అగు = మితిమీఱినట్టి, శృంగార + అనూన + అనురాగ - కామరసంబుల్ - శృంగారరసము, తక్కువకాని ప్రేమరసము, కామరసము, చారుతరలీలన్= మిక్కిలి చక్కనైన విధమున, పురుష + ఆకారమున్= పురుషరూపమును, తాల్చెన్ + అనన్ = ధరించె ననఁగా, నీలకంఠుండు = నల్లని కంఠముగలవాఁడు - శివుఁడు, ఒప్పెన్

**తాత్పర్యము :** హద్దుమీఱిన శృంగార ప్రేమ కామరసములు మిక్కిలి చక్కనైన విధమునఁ బురుషరూపమును ధరించెనా యనునట్లు శివుఁ డొప్పెను

**విశేషములు :** అలంకార ముత్ప్రేక్ష

**వ అంత బృహస్పతి ముకుళితకరకమలుం డగుచు దేవా ! లగ్నం బాసన్నం బయ్యె విజయంచేయు మనిన సురగురుం గారుణ్యదృష్టి వలోకించుచు.**

**అర్థము .** అంతన్, బృహస్పతి, ముకుళిత - కర - కమలుండు = ముడువఁబడిన హస్త పద్మములు గలవాఁడు - హస్తపద్మములు జోడించిన వాఁడు, అగుచున్, దేవా !, లగ్నంబు = ముహూర్తము, ఆసన్నంబు + అయ్యెన్= సమీపించెను, విజయంచేయుము = రమ్ము, అనినన్, సుర - గురున్ = దేవగురుని - బృహస్పతిని, కారుణ్య - దృష్టిన్ = దయతోఁడి చూపుతో, అవలోకించుచున్ = చూచుచు

**తాత్పర్యము** అంత బృహస్పతి హస్తపద్మములు జోడించుచు 'దేవా ! ముహూర్తము సమీపించినది రమ్ము' అనఁగా బృహస్పతిని శివుఁడు దయాదృష్టితోఁ జూచుచు - తరువాతి పద్యముతో నన్వయము

సీ మానితంబైన హోమద్రవ్యములు గొని
　　వేలిమియొజ్జయై వేధ రాఁగ
హరి సురవల్లభు లిరుగెలంకుల డాసి
　　మణిహేమదండచామరలు వెట్ట
దిగధీశు లున్నతస్థిరభక్తియుక్తి నా
　　తత మౌక్తికాతపత్రంబు లూఁద
వాతపూరణములుఁ గేతనంబులుఁ బట్టి
　　సురవర కిన్నరుల్ వరుస రాఁగ

ఆ గణపుఁ డాదిగాఁగ గణముఖ్యు లందఱుఁ
గలసి బలసి వరుసఁ గొలిచి రాఁగ
మహిమతో వివాహమంటపమునకు స
ర్వేశ్వరుండు వచ్చె నిచ్చ మెచ్చి 28

**అర్థము .** వేధ = బ్రహ్మ, మానితంబు + ఐన = గౌరవింపఁబడిన, హోమ-ద్రవ్యములు = హోమార్థమైన వస్తువులు, కొని, వేలిమి + ఒజ్జ + ఐ = పురోహితుఁడయి, రాఁగన్,

హరి - సురవల్లభులు = విష్ణువు, ఇంద్రుఁడు, ఇరు + కెలంకులన్ = రెండు ప్రక్కలను, డాసి = సమీపించి, మణి - హేమ - దండ - చామరలు + పెట్టన్ = మణిమయ, స్వర్ణమయ దండములు గల వింజామరములు వీవఁగా,

దిశ్(క్) + అధి + ఈశులు = దిక్పాలకులు, ఉన్నత - స్థిర - భక్తి - యుక్తిన్ = గొప్పది, స్థిరమైనది అగు భక్తితో, ఆతత - మౌక్తిక + ఆతపత్రంబులు = విశాలమైన ముత్యాల గొడుగులు, ఊఁదన్ = పట్టుకొనఁగా,

సురవర - కిన్నరుల్ = దేవతా(శ్రేష్ఠులును, కిన్నరులును, వాత పూరణములున్ = ధ్వజవిశేషములును, కేతనంబులున్ = ధ్వజములును, పట్టి, వరుసన్, రాఁగన్, పేరు గణపుఁడు, ఆది + కాఁగన్ = మొదలుగా, గణ-ముఖ్యులు = గణ (ప్రధానులు, అందఱున్, కలసి, బలసి = చుట్టుఁజేరి, వరుసన్, కొలిచి, రాఁగన్,

సర్వ + ఈశ్వరుండు, ఇచ్చన్ = మనసునందు, మెచ్చి, మహిమతోన్ = గొప్పతనముతో,వివాహ - మంటపమునకున్ = పెండ్లిమండపమునకు, వచ్చెన్

**తాత్పర్యము .** బ్రహ్మ మేలయిన హోమార్థవస్తువులు తీసికొని పురోహితుఁడయి రాఁగా, విష్ణువు, ఇంద్రుఁడు రెండుపార్శ్వములను జేరి మణి హేమ మయదండములు గల వింజామరలు వీవఁగా, దిక్పతులు అధికభక్తియుక్తులై ఆతతములైన ముత్యాలగొడుగులు పట్టుకొనఁగా, సురవరులును, కిన్నరులును వాతపూరణములును, ధ్వజములును బట్టుకొని వరుసగా రాఁగా, గణపుఁడు మున్నుగా గణప్రధాను లందఱును గలిసి చుట్టి వరుసగా సేవించుచు రాఁగా సర్వేశ్వరుఁడు మనస్సున మెచ్చి పెండ్లిమండపమునకు గొప్పతనముతో వచ్చెను

**వ ఇట్లు చనుదెంచి తదీయవివాహవేదికాతలోపరి దుకూలాంబరాలంకృత మణిపీఠాసనాసీనుండై యున్నంత హైమవతి దేహార్ధంబు గైకొనం బ్రతినవట్టునట్లు తత్పీఠార్ధంబు నలంకరించుచు మరు నారాధనరత్న పాంచాలికయుంబోలె వెలుంగుచు** 29

**అర్థము .** ఇట్లు, చనుదెంచి, తదీయ సీనుండై, తదీయ = ఆ, వివాహ-వేదికా - తల + ఉపరి = పెండ్లి యరంగుపై, దుకూల + అంబర + అలంకృత= సన్నని వస్త్రముచే నలంకరింపఁబడిన, మణి - పీఠ + ఆసన + ఆసీనుండు + ఐ= రత్నమయమైన పీఠముపైఁ గూర్చున్నవాఁడయి, ఉన్నంతన్ (ఉన్న + అంతన్) = ఉండఁగా, హైమవతి = పార్వతి, దేహ + అర్థంబు = సగము శరీరమును, కైకొనన్= తీసికొనుటకు, ప్రతిన + పట్టునట్లు = ప్రతిజ్ఞ చేసిన విధమున, తద్ + పీఠ + అర్ధంబున్ = ఆ పీఠమునందలి సగమును, అలంకరించుచున్, మరు + ఆరాధన-రత్న - పాంచాలికయున్ + పోలెన్ = మన్మథుని ఆరాధించు రత్నాల బొమ్మవలె, వెలుంగుచున్ = ప్రకాశించుచు

**తాత్పర్యము .** ఇట్లు వచ్చి ఆ పెండ్లియరఁగుపైఁ గూర్చున్నయంతఁ బార్వతి శరీరార్ధభాగమును గైకొనఁ బ్రతిజ్ఞ చేసినట్లు ఆ పీఠమునందు సాఁబాలు నలంకరించుచు మన్మథుని సేవించు రత్నపాంచాలికవలెఁ బ్రకాశించుచు - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష

### పార్వతీశ్వరుల వివాహవర్ణన

చ **లలితముఖాబ్జసౌరభవిలంపటషట్పదలీలఁగ్రాలఁ గుం**
**తలములు వానిఁ జోఁప నని తందడి నల్లిన లీల భాసురో**
**త్పలదలదామకం బనఁగ భాస్వదపాంగవిలోలదృగ్రుచుల్**
**పొలయఁగఁ జూచెఁ బార్వతి విభుం బ్రణయాతిరసావహంబుగన్** 30

**అర్థము .** కుంతలములు = శిరోజములు, లలిత లీలన్ లలిత = మనోహరమైన, ముఖ + అబ్జ = తామరవంటి ముఖముయొక్క సౌరభ - పరిమళమునందు, విలంపట = విశేషమైన ఆశగల, షట్పద - లీలన్ = తుమ్మెదల విధమున, క్రాలన్ = ఒప్పఁగా, వానిన్, చోఁపన్ + అని = త్రోలుటకని, తందడిన్= తత్క్షణమే, అల్లిన, నీల - భాసుర + ఉత్పల - దల - దామకంబు = నల్లనిది ప్రకాశించునది అగు కలువరేకుల దండ, అనఁగన్, పార్వతి, భాస్వత్ + అపాంగ- విలోల - దృశ్ (క్) + రుచుల్ + ప్రకాశించుచున్న క్రీఁగన్నుల చంచలములైన చూపులకాంతులు, పొలయఁగన్, వ్యాపించినట్లు, ప్రణయ + అతి - రస + ఆవహంబుగన్ = ప్రేమరసముగలుగునట్లు, విభున్ = భర్తను, చూచెన్

**తాత్పర్యము .** పార్వతి కుంతలములు ఆమె మనోహరమైన ముఖపద్మ పరిమళమునందు విశేషమయిన ఆశగల తుమ్మెదల విధమున నొప్పఁగా, వానిని ద్రోలుటకయి తత్క్షణమే అల్లిన నల్లనివి, ప్రకాశించెడివి అగు కలువరేకుల దండయనఁ బ్రకాశించు క్రీఁగన్నుల చంచలములైన చూపుల కాంతులు ప్రసరించునట్లు అనురాగరసముగలుగ నామె భర్తను జూచెను

**విశేషములు .** కుంతలములు షట్పదలీలఁగ్రాల -అలంకార ముపమ అల్లిన నీలభాసురోత్పలదలదామకం బనఁగ భాస్వదపాంగవిలోలదృగ్రుచుల్ పొలయఁగఁ జూచె - అలంకార ముత్ప్రేక్ష తందడి = తత్క్షణము - మా రా కవి యిచ్చిన అర్థము దృశ్ (క్) + రుచుల్ = దృగ్రుచుల్ దృక్కులను నల్లగను, తెల్లగను గూడ వర్ణించుట గలదు

వ **అంత బృహస్పతిదత్త సుముహూర్తంబునం బరమేష్ఠి హోమపురస్సరంబుగా విధివిహితవిధానంబున గిరీశుండు గిరిజం బరిణయం బయ్యె నయ్యవసరంబున.**

**అర్థము.** అంతన్, బృహస్పతి - దత్త - సుముహూర్తంబునన్ - బృహస్పతిచేత నీఁబడిన (పెట్టఁబడిన) మంచి ముహూర్తమునందు, పరమేష్ఠి హోమ -

పురస్సరంబుగాన్ = బ్రహ్మ (విహిత) హోమము ముందు నడుచునట్లుగా, విధి - విహిత - విధానంబునన్ = శాస్త్రముచే విధింపఁబడిన విధమున, గిరీశుండు = శివుఁడు, గిరిజన్ = పార్వతిని, పరిణయంబు + అయ్యెన్ = వివాహమాడెను ఆ + అవసరంబునన్ = ఆ సమయమున

**తాత్పర్యము** అంత బృహస్పతి పెట్టిన సుముహూర్తమున బ్రహ్మకృత హోమపురస్సరముగా శాస్త్రవిహితవిధానమున శివుఁడు పార్వతిని బెండ్లియాడెను ఆ సమయమున - తరువాతి పద్యముతో నన్వయము

**సీ** సప్తమునీంద్ర ప్రజాపతి ముని విప్ర
గణముల వేదఘోషణము లెసఁగె
బోరనఁ దుంబురు నారద కిన్నర
గంధర్వమంగళగాన మెసఁగె
సురవాద్య నందికేశ్వర వాద్యములు సమ
స్తంబులై పొలుపారి తద్దయడరె
జయఘంట కాహళ శంఖ కాంస్యక వేణు
వీణా వినాదముల్ విస్తరిల్లె

**ఆ** సంతతమును భక్తజన జయజయ శబ్ద
ములు దిగంత మడరి చెలఁగుచుండె
జలధు లేడుఁ గూడి చంద్రోదయంబున
ముదముతోడఁ బెరిఁగి మ్రోయునట్లు 32

**అర్థము :** జలధులు = సముద్రములు, ఏడున్ = ఏడును, కూడి, చంద్ర+ ఉదయంబునన్ = చంద్రుని పొడుపువేళ, ముదముతోడ్ = సంతోషముతో, పెరిఁగి = పొంగి, మ్రోయు + అట్లు = ధ్వనించు విధమున,

సప్త - ముని + ఇంద్ర - ప్రజాపతి - ముని - విప్ర - గణముల = ఏడ్వురు మునిశ్రేష్ఠులయు, బ్రహ్మలయు, మునులయు, బ్రాహ్మణులయు సమూహముల యొక్క, వేద - ఘోషణములు = వేదనాదములు, ఎసఁగెన్ = అతిశయించెను

బోరనన్ = అధికముగా, తుంబురు - నారద - కిన్నర - గంధర్వ = తుంబురుని, నారదుని, కిన్నరుల, గంధర్వుల, మంగళ - గానము = శుభమైన గానము, ఎసఁగెన్

సుర - వాద్య - నందికేశ్వర - వాద్యములు = దేవతల వాద్యములు, నందికేశ్వరుని వాద్యములు, సమస్తంబులు + ఐ = మొత్తములయి, పొలుపారి = ఒప్పి, తద్ద = మిక్కిలి, అడరెన్ = అతిశయించెను

జయ - ఘంట - కాహళ - శంఖ - కాంస్యక - వేణు - వీణా - వినాదముల్= జయఘంటలు, పెద్ద ఢక్కల, శంఖముల, కంచు వాద్యముల, పిల్లనగ్రోవుల, వీణియల ధ్వనులు, విస్తరిల్లెన్ = వ్యాపించెను

సంతతమును = ఎల్లప్పుడును, భక్త - జన - జయ జయ- శబ్దములు= భక్తులైన జనుల యొక్క జయజయ అను ధ్వనులు, దిశ్ (క్)+ అంతము = దిక్కులకొన, అడరి = అలముకొని, చెలఁగుచున్ + ఉండెన్ = మ్రోయుచుండెను

**తాత్పర్యము .** సప్తసముద్రములును బొంగి చంద్రోదయసమయమున సంతోషమున నుప్పొంగి మ్రోయువిధమున సప్తమునీశ్వరులయు, ప్రజాపతులయు, మునులయు, బ్రాహ్మణులయు వేదధ్వను లతిశయించెను తుంబురు నారద కిన్నర గంధర్వుల మంగళ గాన మధికముగా నతిశయించెను దేవతల వాద్యములు, నందికేశ్వరుని వాద్యములు మొత్తములై ఒప్పి మిక్కిలి విజృంభించెను జయ ఘంటల, పెద్ద ఢక్కల, శంఖముల, కాంస్య వాద్యముల వేణువుల వీణల నాదములు వ్యాపించెను నిరంతరమును భక్తజనుల జయజయ శబ్దములు దిక్కుల కొనలవఱకు వ్యాపించెను

**చ వరదు వివాహవేళ నభివాంఛితవస్తువు లెల్లవారికిన్**
**సురభులు బోరనం గురిసె, సూరెలఁ బర్వె రసప్రవాహముల్,**
**సురతరులిచ్చెఁ గోరికలు, సూచినచోటనె తోఁచెఁ బెన్నిధుల్,**
**విరిసె మణుల్, మొగిం బరుసవేదులు నిండె జగ్రత్తయంబునన్ 33**

**అర్థము.** వరదు - వివాహ - వేళన్ = వర ప్రదాతయైన ఈశ్వరుని యొక్క, వివాహ - వేళన్ = పెండ్లి సమయమున, ఎల్లవారికిన్ = అందఱకును, అభివాంఛిత - వస్తువులు = కోరిన వస్తువులు, సురభులు = కామధేనువులు, బోరనన్ = శీఘ్రముగా, కురిసెన్, రస - ప్రవాహముల్ = రసముల ప్రవాహములు, సూరెలన్ = ప్రక్కలందు, పర్వెన్ = వ్యాపించెను, సుర-తరులు = దేవతావృక్షములు, కోరికలు, ఇచ్చెన్, పెన్నిధుల్ (పెను + నిధుల్) చూచిన - చోటన్ + అ = చూచిన చోటనే, తోఁచెన్, మణుల్, విరిసెన్ = వ్యాపించెను, మొగిన్ = పూనికతో,

పరుసవేదులు= స్పర్శవేధులు - ఇనుమును బంగారముగాఁ జేయునట్టివి, జగత్+ త్రయంబునన్ = మూఁడు లోకములందును, నిండెన్

**తాత్పర్యము.** వరప్రదాతయైన యీశ్వరుని వివాహసమయమున నెల్లరకుఁ గోరినవస్తువులను గామధేనువులు శీఘ్రముగాఁ గురిసెను రస ప్రవాహములు పార్శ్వములఁ బ్రవహించెను కల్ప వృక్షములు కోరికల నిచ్చెను పెన్నిధులు చూచినచోటనే తోఁచెను మణులు వ్యాపించెను పరుసవేదులు ముల్లోకములందును నిండెను

వ తదవసరంబున 34

**అర్థతాత్పర్యములు** తద్ + అవసరంబునన్ = ఆ సమయమున - తరువాతి పద్యముతో నన్వయము

క సురనది దొలఁకాడ, సుధా
కరరేఖ చలింప, నమరకాంతల కర చా
మరపవన మభవు జూటాం
తరమున విహరింపఁ దొడఁగెఁ దగు సుఖలీలన్ 35

**అర్థము.** అమర - కాంతల - కర - చామర - పవనము = దేవతా స్త్రీల చేతులందలి వింజామరల గాలి, సుర - నది - ఆకాశగంగ, తొలఁకాడన్ (తొలఁకు+ ఆడన్) తొనఁకఁగను, సుధాకర - రేఖ = చంద్రకళ, చలింపన్ అభవు జూట + అంతరమునన్ = శివుని జడముడి లోపల, తగు సుఖ-లీలన్ = తగిన సుఖము గలగునట్లు, విహరింపన్ + తొడఁగెన్ = వీవ నారంభించెను

**తాత్పర్యము.** దేవతాస్త్రీల చేతులందలి వింజామరల గాలి శివుని శిరస్సుపైఁ గల ఆకాశగంగ తొనఁకఁగను, చంద్రకళ చలింపఁగను, సుఖమగునట్లు అతని జడముడిలో వీవఁ దొడఁగెను

క తేనియ ముసురో ? యమృతపు
వానయొ ? పుండ్రేక్షురసము వట్టొడి పెల్లో ?
నా నలిఁ దుంబురు నారద
గానరసం బభవు నోలగంబునఁ బర్వెన్ 36

**అర్థము** తేనియ - ముసురో = తేనె వానయో, అమృతపు వానయొ (అమృతము + వానయొ), పుండ్రేక్షు రసము = నలుపు గలసిన యెఱ్ఱ చెఱకు యొక్క, వఱ్ఱోడి = ప్రవాహముయొక్క పెల్లో = ఆధిక్యమో, నాన్ = అనఁగా, నలిన్= ఒప్పుగా, తుంబురు - నారద - గాన - రసంబు = తుంబురు నారదుల గానమనెడి రసము, అభవు + ఓలగంబునన్ = శివుని కొలువుకూటమున, పర్వెన్ = ప్రవహించెను

**తాత్పర్యము** . తేనెవానయో, అమృతవర్షమో, నలుపు గలసిన యెఱ్ఱ చెఱకురసము ప్రవాహము నాధిక్యమో అనఁగాఁ దుంబురునారదుల గానరసము శివుని కొలువుకూటమున నొప్పుగాఁ బ్రవహించెను

**విశేషములు** . అలంకార ముత్ప్రేక్ష సందేహానుప్రాణితము అభవు + ఓలగంబునన్ 'షష్ఠీ సమాసమునం దుకార ఋకారముల కచ్చు పరమగునపుడు నుగాగమం బగు ' బాల సంధి 34

**వ అంతం దత వితత ఘన సుషిరాత్మకంబులై మృదు స్ఫుటాది లక్షణ లక్షితంబులై భరత నందికేశ్వరాది వాద్యనికరాతోద్యంబులు హృద్యంబులై చెలంగ నాస్థానంబు సురంగంబుగా రంభ నాట్యారంభంబున 37**

**అర్థము** . అంతన్, తత -వితత - ఘన - సుషిర + ఆత్మకంబులు + ఐ = వీణలోనగువాద్యము, వీణ తంబురా మున్నగు తంత్రీవాద్యములు కంచుతాళము లోనగు వాద్యములు, పిల్లనగ్రోవిలోనగు వాద్యములు అనువానితోఁ గూడినవయి, మృదు-స్ఫుట + ఆది - లక్షణ - లక్షితంబులు + ఐ = మృదువు, స్ఫుటము మున్నగు లక్షణములు గలదయి, భరత - నందికేశ్వర + అది - వాద్య- నికర + ఆతోద్యంబులు = భరతుఁడు, నందికేశ్వరుఁడు మున్నగువారి వాద్యముల సమూహము, తతము, ఆనద్ధము, సుషిరము, ఘనము అనెడి వాద్య చతుష్టయము, హృద్యంబులు + ఐ = హృదయంగమములయి, చెలంగన్ = ధ్వనింపఁగా, ఆస్థానంబు = కొలువు, సురంగంబుగాన్ = మంచి రంగస్థలముగా, రంభ, నాట్య+ ఆరంభంబునన్ = నాట్యము మొదట

**తాత్పర్యము:** అంత తతము, వితతము, ఘనము, సుషిరము అనువానితోఁ గూడినవయి, మృదువు, స్ఫుటము మున్నగు లక్షణములు గలదయి, భరతుఁడు, నందికేశ్వరుఁడు మున్నగువారి వాద్యచతుష్టయము హృదయంగమమయి

ధ్వనింపఁగా ఆస్థానము మంచిరంగస్థలముగా రంభ నాట్య ప్రారంభమున - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు** . వాద్యములు చతుర్విధములు

**తతములు** . 20 పరివాదిని, చతుర్దశి, ఏకాదశి, త్రయోదశి, మహతి, బృహతి, కళావతి, కచ్ఛపి, వితతము, పినాకిని, పౌర్ణము, రావణహస్తము, ఉదుంబరము, షట్కర్ణము, హస్తభము, సారంగి, ఆలాపిని, రుద్రవీణ, వ్యాళీముఖము, బల- ఇవి కొడుపుతో వాయింపఁబడును

**వితతములు** . 18 ఝుల్లరి, మురజము, భేరి, పటహము, కరక, కుడుక్క, హుడుక్క, ఢక్క, డమరుకము, నిస్సాణము, సోల్లుక, బాణము, తంబురి, దుందుభి, మడ్డువు, డిండిమము, ఝర్ఝరము, పణవము - ఇవి కొట్టి వాయింపఁబడును

**సుషిరములు** : 10 పాలిక, కాహలి, వాసము, ముసలి, మధుకరి, వంశము, శంఖము, శుకి, శృంగము, సుదుర్లపి ఇవి శ్వాసముతోఁ బూరింపఁబడును

**ఘనములు** . 6 కాంస్యము, తాళము, ఘంటిక, జయఘంట, కర్మ

చ **అలఁతులు నిల్వ హస్తమున, హస్త విలాసముతోఁ బెనంగఁ జూ**
**డ్కులు, దెలిచూడ్కులం దెలమిఁగూడి రమింప మనంబు తన్మనో**
**బలమున నుల్లసిల్ల నిజభావము, భావ విశేష సంపదల్**
**వెలయ రసంబులం దభినవించె రసంబులు సాంగకంబుగన్** 38

**అర్థము** అలఁతులు = ముఖవీణ, తాళము మొదలగు నుపాంగంబులు, హస్తమునన్= చేతియందు, నిల్వన్ = ఉండఁగా, హస్త - విలాసముతోన్ = హస్తములలీలతో, చూడ్కులు = చూపులు, పెనంగన్ = కూడఁగా, మనంబు = మనస్సు, తెలి - చూడ్కులందున్ = తెల్లని చూపులందు, ఎలమిన్ = ప్రీతితో, కూడి రమింపన్= క్రీడింపఁగా, తద్ + మనస్ (ః) + బలమునన్= ఆ మనశ్శక్తితో, నిజ - భావము = తనదైన భావము, ఉల్లసిల్లన్ = ప్రకాశింపఁగా, భావ - విశేష - సంపదల్= విశిష్టములైన భావసంపదలు, రసంబులన్= శృంగారాది రసములందు, వెలయన్ = ప్రకాశింపఁగా, రసంబులు, సాంగకంబుగాన్ = సావయవముగా, అభినవించెన్ = క్రొత్తగాఁ గలిగెను

**తాత్పర్యము** హస్తమునందుఁ దాళాద్యుపాంగము లుండఁగా, హస్త విలాసముతోఁ జూపులు పెనఁగఁగా, తెలిచూడ్కులతో మనస్సు ప్రీతితోఁ గూడి రమింపఁగా, ఆ మనోబలమున స్వీయభావ ముల్లసిల్లఁగా, భావవిశేషసంపదలు రసములందుఁ బ్రకాశింపఁగా, శృంగారాదిరసములు సావయవములై క్రొత్తగాఁ గలిగెను

## మన్మథుఁడు పునర్జీవితుఁ డగుట

వ **అయ్యవసరంబున సర్వేశ్వరుండు పార్వతీసమేతుండై పరమసుఖలీలఁ దగిలి ప్రసన్నుండై యున్నకన్నెఱింగి సురవరులు కామోత్పత్తి కిదియ యవసరంబని త్రినయను కరుణ వడసి మనసిజుం బడయ నుద్యుక్తులై భక్తి పూర్వకంబున** 39

**అర్థము** . ఆ + అవసరంబునన్ = ఆ సమయమున, సర్వేశ్వరుండు, పార్వతీ - సమేతుండు + ఐ = పార్వతితోఁగూడినవాఁడయి, పరమ - సుఖ - లీలన్ = మిక్కిలి సుఖమునందు, తగిలి = ఆసక్తి గలవాఁడై, ప్రసన్నుండు + ఐ = అనుగ్రహము గలవాఁడయి, ఉన్న కన్నెఱింగి = ఉన్న జాడ తెలిసి, సురవరులు = దేవతాశ్రేష్ఠులు, కామ + ఉత్పత్తికిన్ = మన్మథోదయమునకు, ఇది + అ = ఇదియే, అవసరంబు + అని = సమయమని, త్రినయను - కరుణ = ముక్కంటి దయ, పడయన్ = పొందుటకు, ఉద్యుక్తులు + ఐ = ప్రయత్నించినవారయి, భక్తి + పూర్వకంబునన్

**తాత్పర్యము** . ఆ సమయమున సర్వేశ్వరుఁడు పార్వతీసహితుఁడయి మిక్కిలి సుఖమునందాసక్తి గలిగి ప్రసన్నుఁడైయున్న జాడ తెలిసి దేవతలు మన్మథోదయమునకు ఇదియే అదనని ముక్కంటి దయ పొంద నుద్యమించినవారయి, సభక్తికముగా - తరువాతి పద్యముతో నన్వయము

క **తనువుల ముత్పులకావలి**
**దనరఁగ శివుపాదయుగముఁ దల నిడికొని యా**
**వనజభవాచ్యుతు లొప్పిరి**
**కనుఁగొనఁ జెందమ్మివిరుల కామల పోలెన్** 40

**అర్థము**. ఆ - వనజభవ + అచ్యుతులు= ఆ బ్రహ్మ విష్ణువులు, తనువులన్= శరీరములందు, ముద్ + పులక + ఆవలి = సంతోషమువలని గగుర్పాటుల

వరుస, తనరఁగన్ = ఒప్పఁగా, శివు - పాద - యుగమున్ = శివుని అడుగులజంటను,తలన్ = శిరస్సున, ఇడికొని = పెట్టుకొని, కనుఁగొనన్ = చూడఁగా, చెందమ్మి (చెన్ను + తమ్మి) విరుల = ఎఱ్ఱ తామర పువ్వులయొక్క, కామలపోలెన్ = కాడల విధమున, ఒప్పిరి

**తాత్పర్యము** ఆ బ్రహ్మ విష్ణువులు తమ శరీరములందు సంతోషమువలని గగుర్పాటులు కలుగఁగా శివుని పాదముల జంటను శిరస్సులపైఁ బెట్టుకొని యెఱ్ఱతామరపూల కాడల వలె నొప్పిరి

**విశేషములు** అలంకారము ఉత్ప్రేక్ష శివుని పాదములను బ్రహ్మ విష్ణువులు శిరములఁ బెట్టుకొని యెఱ్ఱ తామరకాడలవలె నొప్పిరనుటచే, శివుని పాదము లెఱ్ఱతామరలవలె నున్న వను విషయము భంగ్యంతరమున గమ్యమానమగుచున్నది కావున పర్యాయోక్తాలంకారమును గలదు "పర్యాయోక్తం తు గమ్యస్య వచో భఙ్గ్యన్తరాశ్రయమ్'- చంద్రా

**వ అంత సురగురుండు కరకమలంబులు మొగిడ్చి సంస్తుతి పూర్వకంబుగ నభవు నభిముఖుం జేసికొని 41**

**అర్థము** · అంతన్, సుర-గురుండు = దేవతల గురువు - బృహస్పతి, కర-కమలంబులు = హస్తపద్మములు, మొగిడ్చి = ముడిచి (నమస్కరించి), సంస్తుతి - పూర్వకంబుగన్ = స్తోత్రపురస్సరముగా, అభవున్ = శివుని, అభిముఖున్= సుముఖుని, చేసికొని

**తాత్పర్యము .** అంత దేవగురుఁడైన బృహస్పతి హస్తపద్మములు జోడించి స్తోత్రపూర్వకముగా శివుని సుముఖునిఁజేసికొని - తరువాతి పద్యముతో నన్వయము

**గీ దేవకార్యంబుగా మహాదేవితోడ**
**మీకు సంగతి గావించి మెచ్చువడయ**
**వచ్చెఁగా కంగభవుఁడు ని న్నిచ్చ నెఱిఁగి**
**యెఱిఁగి పైనెత్తి రా నెన్ని యెడలు గలవు ? 42**

**అర్థము .** అంగిభవుఁడు = అంగజుఁడు - మన్మథుఁడు, దేవ-కార్యంబు+ కాన్ = దేవతల ప్రయోజనమగునట్లు, మహాదేవితోడన్ = పార్వతితో, మీకున్,

సంగతి = కలయిక, కావించి, మెచ్చు + పడయన్ = మెప్పు పొందుటకు, వచ్చెన్+ కాక = వచ్చెనుగాని, నిన్నున్ + ఇచ్చన్= నిన్ను మనస్సునందు, ఎఱిఁగి+ఎఱిఁగి = తెలిసితెలిసి, పైన్ + ఎత్తి - రాన్ = పైకి దండెత్తివచ్చుటకు, ఎన్ని + ఎడలు + కలవు = ఎన్ని గుండెలు గలవు ?

**తాత్పర్యము.** మన్మధుఁడు దేవతల కార్యమునకయి మహాదేవి(పార్వతి)తో నిన్నుఁగూర్చి మెప్పు పొందుటకు వచ్చెనుగాని నిన్నుఁ గూర్చి మనసునఁ దెలిసితెలిసి నీపైకి దండెత్తి వచ్చుట కతని కెన్ని గుండెలు గలవు ?

**విశేషములు .** నిన్నిచ్చన్ = అనుచో 'నిన్ + ఇచ్చన్' అనిగాక నిన్నున్ + ఇచ్చన్ అని విభజించుట = 'జడ్డక్కరంబుతోఁ బదాదిస్వరంబు గూడుచో జడ్డకు లోపంబు లేదు ' బాల ప్రకీర్ణ 9 అనుటచే నిన్నున్ + ఇచ్చన్ = నిన్నిచ్చన్ 'ప్రథమేతరవిభక్తి శత్రర్థచువర్ణకంబులందున్న యుకారంబునకు సంధి వైకల్పికముగా నగును ' బాల సంధి 2

వ ఆదియునుంగాక - తరువాతి పద్యముతో నన్వయము 43

క కడుకొనక తప్పఁజూచినఁ
జెడు లోకము లనుట యిది ప్రసిద్ధము జగతిన్
మృడ ! నీవు చక్కఁజూచినఁ
జెడియె మనోభవుఁ డిదియు విచిత్రము గాదే ?" 44

**అర్థము :** కడుకొనక = ఉత్సహింపక, తప్పన్ + చూచినన్ = కోపముతోఁ జూడఁగా, లోకములు, చెడున్, అనుట, ఇది, జగతిన్, ప్రసిద్ధము, మృడ = ఓయి శివా ! నీవు, చక్కన్ + చూచినన్ = మంచి చూపుతోఁ జూడఁగా - ఋజువుగాఁ జూడఁగా, మనోభవుఁడు = మన్మధుఁడు, చెడియెన్, ఇదియున్, విచిత్రము + కాదే = వింతకాదా ?

**తాత్పర్యము.** క్రోధముతోఁ జూచినచో లోకములు చెడుననుట లోకమునఁ బ్రసిద్ధము కాని ఓయి శివా ! నీవు మంచిగాఁ జూచినను మన్మధుఁడు చెడెను ఇది వింతకదా !

వ. అని వెండియు నిరతిశయతపఃక్లేశం బెఱింగించి మదను దయ సేయవలయునని మ్రొక్కియున్న సురగురు ప్రముఖాఖిల సురవరులకు వరదుండు కరుణించి యంగజుండు జగంబుల కనంగుఁడై రతికిం బ్రాక్తన

స్వరూపుండై ప్రవర్తించునని వరంబిచ్చి యతని పూర్వనియోగంబును దయసేసిన నక్షణంబ

**అర్థము** అని, వెండియున్ = మరల, నిరతిశయ - తపస్ (ః) + క్లేశంబు = అత్యధికమైన తపస్సు యొక్క కష్టము, ఎఱింగించి,మదనున్= మన్మథుని, దయ + చేయవలయున్ = కరుణింపవలయును, అని, మ్రొక్కి + ఉన్నన్ = నమస్కరించి యుండఁగా, సుర-గురు-ప్రముఖ + అఖిల - సురవరులకున్= బృహస్పతిమున్నగు నెల్లదేవతాశ్రేష్ఠులకును, వరదుండు = ఈశ్వరుఁడు, కరుణించి= దయఁజూచి, అంగజుండు = మన్మథుఁడు, జగంబులకున్, అనంగుండు + ఐ = అంగము లేనివాఁడయి, రతికిన్, ప్రాక్తన - స్వరూపుండు + ఐ = పూర్వస్వరూపము గలవాఁడయి, ప్రవర్తించున్, అని, వరంబు, ఇచ్చి అతని - పూర్వ - నియోగంబును= అతనియొక్క పూర్వపుటధికారమును, దయ + చేసినన్ = అనుగ్రహింపఁగా, అక్షణంబ = వెంటనే

**తాత్పర్యము** అని మఱియును అత్యధికమైన తపఃకష్టము నెఱింగించి, మన్మథుని దయఁజూడవలయునని నమస్కరించియున్న బృహస్పతి మున్నగు నెల్ల దేవతాశ్రేష్ఠులను శివుఁడనుగ్రహించి "మన్మథుఁడు లోకముల కనంగుఁడై, రతికిఁ బూర్వస్వరూపుఁడై యుండు" నని వరమిచ్చి యతని పూర్వాధికారమును అనుగ్రహింపఁగా, వెంటనే - తరువాతి పద్యముతో నన్వయము

సీ మలయుచుఁ బొలుపారు మకరకేతనముతో
నెలరారు గెందలిరెల్లి గ్రాలఁ
దళుకొత్తు నెత్తావి యలరంపపొదులతో
మేలిల్లు నించువి ల్లేల నమరఁ
జెలరేఁగు నలిపిక కుల నినాదములతో
రాజకీరాలాపరవము లులియ
వేచి సమ్మదలీల వీచు తెమ్మెరలతో
నలి వసంతుఁడు గూడి నడవ నొండ

గీ కామసుఖములతోఁ బూర్వకామకేళి
కామచిహ్నాలు మెయి సురంగంబు గాఁగ
నెఱయఁ గైసేసి జవనిక దెఱచి వచ్చు
చెలువుతో వచ్చి రతిమ్రోల నిలిచె మరుఁడు 46

**అర్థము**. మలయుచున్ = చలించుచు, పొలుపారు = ఒప్పునట్టి, మకర-కేతనముతోన్ = మొసలి ధ్వజముతో, ఎలరారు = ప్రకాశించు, కెందలిరు (కెంపు+ తలిరు) + ఎల్లి = ఎఱ్ఱని చివురుగొడుగు, క్రాలన్ = ఒప్పఁగా

తళుకొత్తు = మిక్కిలి ప్రకాశించు, నెత్తావి (నెఱ + తావి) = నిండు పరిమళము గల, అలరంపపొదులతోన్ = అలరు + అమ్ము + పొదులతోన్ = చివురుటమ్ముల పొదులతో, మేలిల్లు = శ్రేష్ఠమైన, ఇంచువిల్ = చెఱకువిల్లు, కేలన్= చేతియందు, అమరన్= ఒప్పఁగా

చెలరేఁగు = విజృంభించు, అలి - పిక - కుల - నినాదములతోన్ = తుమ్మెదల, కోకిలముల సమూహముల ధ్వనులతో, రాజకీర + ఆలాప - రవములు = రాచిలుకల మాటల ధ్వనులు, ఉలియన్ = మ్రోయఁగా,

వేచి = ప్రతీక్షించి, సమ్మద - లీలన్ = సంతోషపురీతితో, వీచు = వీచునట్టి, తెమ్మెరలతోన్ = మందమారుతముతో, నలిన్ = ఉత్సాహముతో, వసంతుఁడు, కూడి, ఒండ (ఒండు + అ) = ఒక్కడే, నడవన్

కామ సుఖములతోన్ = మన్మధసౌఖ్యములతో, పూర్వకామకేళి = పూర్వపు మన్మధక్రీడ, కామచిహ్నలు = వలపు గుఱుతులు, మెయిన్ = శరీరమునందు, సురంగంబు + కాఁగన్ = ప్రకాశముగా

నెఱయన్ = వెలయునట్లు, కైసేసి = అలంకరించి, జవనిక = తెర, తెఱచి, వచ్చు, చెలువుతోన్ = అందముతో, వచ్చి, రతి, మ్రోలన్ = రతియెదుట, మరుఁడు = మన్మధుఁడు, నిలిచెన్

**తాత్పర్యము**. చలించుచు ఒప్పునట్టి మకరధ్వజముతోఁ బ్రకాశించు కెంజివురుగొడుగు ఒప్పఁగా, మిక్కిలి ప్రకాశించు నిండు పరిమళముగల చివురుటమ్ములపొదులతో శ్రేష్ఠమైన చెఱకువిల్లు చేత నొప్పఁగా, విజృంభించు తుమ్మెదల, కోకిలముల సమూహముల ధ్వనులతో రాచిలుకల మాటల ధ్వనులు మ్రోయఁగా, లేచి సంతోషముగునట్లు వీచు మందమారుతముతో వసంతుఁడు కూడి నడవఁగా, మన్మధ సౌఖ్యములతోఁ బూర్వపు మన్మధక్రీడ, వలపుగుఱుతులు శరీరమునఁ బ్రకాశముగా వెలయునట్లు అలంకరించి తెర తెఱచుకొని వచ్చునందముతో వచ్చి మన్మధుఁడు రతియెదుట నిలిచెను.

**విశేషములు** అలంకారము సహోక్తి

మ తళుకొత్తెం దరహాస మాననమునం, దట్టూర్చిపో మేన ము
త్పులకల్ గ్రక్కునఁ బర్వె, లోలనయనాంభోజాతపత్రంబులన్
వెలరెన్ బోరన సమ్మదాశ్రుజల, ముద్వేగంబు రాగంబుగా
నెలమెం జిత్తము, తత్క్షణంబ రతి కాత్మేశావతారంబునన్ 48

**అర్థము.** తత్ + క్షణంబు + అ = ఆ క్షణమే, రతికిన్ = రతిదేవికి, ఆత్మ+ ఈశ + అవతారంబునన్ = తన భర్త ఆగమనముతో, ఆననమునన్ = ముఖమునందు, దరహాసమ = చిఱునవ్వు, తళుకొత్తెన్ = మిక్కిలి ప్రకాశించెను, మేనన్ = శరీరమునందు, తట్టూర్చిపోన్ = నిండుకొనునట్లు, ముద్ + పులకల్ = సంతోషమువలని గగుర్పాటు, క్రక్కునన్ = వెంటనే, పర్వెన్ = వ్యాపించెను, లోల-నయన + అంభోజాత - పత్రంబులన్ = చలించు కనుదమ్ముల రేకులందు, సమ్మద +అశ్రు - జలము = సంతోష బాష్పజలము, బోరన = శీఘ్రముగా, వెలరెన్= వెడలెను, ఉద్వేగంబు = వ్యాకులత, రాగంబుగాన్ = అనురాగముగా, చిత్తము = మనస్సు, ఎలమెన్ = సంతోషించెను - వికాసమునొందెను

**తాత్పర్యము .** ఆ క్షణమే రతిదేవికి భర్త్రాగమనముతో ముఖమునఁ జిఱునగవు మిక్కిలి ప్రకాశించెను శరీరమున నిండుగా సంతోషమువలని గగుర్పాటు వెంటనే వ్యాపించెను చలించు కనుదమ్ముల రేకులందు ఆనందబాష్పములు శీఘ్రముగా వెడలెను వ్యాకులత అనురాగమయి మనస్సు వికాసము నొందెను

సీ ఎలమిఁ బ్రాణేశున కెదురేఁగె నుగ్మలి
ప్రాణంబు లన మేను బ్రాఁనువడియెఁ
దనరు శోకాబ్ధిలో మునిఁగి లేచిన భంగి
నొడలఁ బేర్చిందు లొండొండ పర్వెఁ
బ్రియుఁ బాసి కంటకశయనవ్రతము దన
సలుపుటఁ దెలిపె నాఁ బులక లడరెఁ
బతిఁ గాంచి కన్నుల పాప లుత్సవమున
నాడెనో నలి నాఁగ హర్షవారి

గీ గ్రమ్మెఁ గనుఁగవ నంత నక్కొమ్మ దేవ
దేవు నుగ్రాక్ష శిఖి విజజీవితేశుఁ
డతనుఁడైన విధమ్మును నాత్మ విరహ
భరముఁ గల కన్న కరణి విస్మరణఁ బొందె. 49

**అర్థము.** ఉగ్మలి - ప్రాణంబులు = ఇంతి (రతి) ప్రాణములు, ఎలమిన్= సంతోషముతో, ప్రాణ + ఈశునకున్ = ప్రాణనాధునకు - మన్మధునకు,

ఎదురేఁగెన్ + అనన్ = ఎదురువెడలెనా యన, మేను = శరీరము, ప్రాను + పడియెన్ = కొయ్యఁబాఱెను

తనరు - శోక + అబ్ధిలోన్ = పొంగెడి దుఃఖసముద్రములో, మునిఁగి, లేచిన - భంగిన్ = లేచిన విధమున, ఒడలన్ = మేన, పేర్చిందులు = చెమటబొట్టులు, ఒండొండ = క్రమక్రమముగా, పర్వెన్ = వ్యాపించెను

ప్రియున్ = భర్తను, పాసి = విడిచి, కంటక - శయన-వ్రతమున్ = ముండ్ల పాన్పుపైఁ బరుండు వ్రతమును, తన - సలుపుటన్ = తాను జేయుటను, తెలిపెన్ + నాన్ = తెలిపెనా యనునట్లు, పులకలు = గగుర్పాటు, అడరెన్ = అతిశయించెను

పతిన్ = భర్తను, కాంచి, కన్నుల - పాపలు, ఉత్సవమునన్ = వేడుకతో, నలిన్ = ఉత్సాహముతో, ఆడెనో - నాఁగన్ = ఆడెనా యనునట్లు, హర్ష - వారి= ఆనందాశ్రుజలము, కనుఁగవన్ = కనుదోయియందు, క్రమ్మెన్

అంతన్ = తరువాత, అక్కొమ్మ (ఆ + కొమ్మ) = ఆయింతి - రతి, దేవ-దేవు + ఉగ్ర + అక్ష - శిఖిన్ = దేవతలకు దేవుఁడైన శివునియొక్క, భయంకరమైన, కంటి మంటచే, నిజజీవిత + ఈశుఁడు = తన ప్రాణేశ్వరుఁడు - మన్మథుఁడు, అతనుఁడు = అనంగుఁడు, ఐన - విధమ్మునున్, ఆత్మ - విరహ - భరమున్ = తనదైన యెడఁబాటుయొక్క అతిశయమును, కలన్ + కన్న - కరణిన్ = కలఁగనిన విధమున, విస్మరణన్ + పొందెన్ = మఱచెను

**తాత్పర్యము** · ఇంతి ప్రాణములు సంతోషముతోఁ బ్రాణేశ్వరున కెదురేఁగె ననునట్లు శరీరము కొయ్యఁబాఱెను పొంగెడి దుఃఖసముద్రమున మునిఁగి లేచినరీతిని మేనఁ జెమరుబిందువులు క్రమముగా వ్యాపించెను భర్తను విడిచి ముండ్లపానుపుపైఁ బరుండు వ్రతమును దానుజేయుటను దెలిపెనా యనునట్లు గగుర్పాటతిశయించెను భర్తను జూచి కంటిపాప లుత్సవముతో, నుత్సాహముతో నాడెనా యనునట్లు ఆనందాశ్రుజలము కనుదోయిఁ గ్రమ్మెను అంత నాయింతి దేవదేవుని భయంకరమైన కంటిమంటచేఁ దన ప్రాణేశ్వరుఁడు అనంగుఁడైన విధమును, దనయెడఁబాటుభరమును ఒక స్వప్న వృత్తాంతమువలె మఱచిపోయెను

**విశేషములు :** అలంకార ముత్ప్రేక్ష - శోకాబ్ధి - రూపకము

కంటక శయన వ్రతము - 'రోమాఞ్చ నికుచ యుగళే శ్వాస గళిత మఞ్జుకశం నిదధానా త్వత్పాణిగ్రహణతృష్ణయా కణ్టకశయనవ్రతలీలా మివ దక్షిణం కరకమల మనుభావయతి' కాదంబరి

వ తదవసరంబున నుమామహేశ్వర వివాహంబుతోడ మనసిజు పునరవతరణోత్సవం బగుట నఖిలజనంబులు నానందంబున నగరు మృగమద కాశ్మీర ఘనసార హరిద్రాచందన కర్దమ జలకలశానేక పుష్పపల్లవాదులు తత్పురి రథ్యా కురథ్యా పూర్ణంబులు సేసినం దదుత్సవాలోకనపరులై హరగిరిజ లఖిలామరపరివృతులై చనుదెంచి రంత 50

**అర్థము:** తద్ + అవసరంబునన్ = ఆ సమయమున, ఉమా - మహేశ్వర- వివాహంబుతోడన్ = పార్వతీపరమేశ్వరుల పెండ్లితో, మనసిజు - పునరవతరణ + ఉత్సవము + అగుటన్ = మన్మథుని పునర్జన్మోత్సమగుటచే, అఖిల - జనంబులున్ = ఎల్లజనులును, ఆనందంబునన్, అగరు - మృగమద - కాశ్మీర- ఘనసార - హరిద్రా - చందన - కర్దమ - జలకలశ + అనేక + పుష్ప - పల్లవ + ఆదులు = అగురును, కస్తూరియును, కుంకుమమును, కర్పూరమును, పసుపును, మంచిగంధపుఁబంకమును, జలకుంభములు, పెక్కుపూలును, చివురులు మున్నగునవి, తద్ + పురి - రథ్యా - కురథ్యా + ఆపూర్ణంబులు = ఆ నగర వీధుల ఉపవీధుల నిండినవిగా, చేసినన్ = చేయఁగా, తద్ + ఉత్సవ + ఆలోకనపరులు+ ఐ = ఆ వేడుకను జూచుటయం దాసక్తి గలవారయి, హర - గిరిజలు = శివుఁడును, పార్వతియు, అఖిల + అమర - పరివృతులు + ఐ = ఎల్లదేవతలతోఁ జుట్టఁబడిన వారయి, చనుదెంచిరి = వచ్చిరి, అంతన్

**తాత్పర్యము.** ఆ సమయమున పార్వతీపరమేశ్వరుల వివాహముతో పాటు మన్మథుని పునర్జన్మోత్సవ మగుటచే నెల్లజనులును ఆనందముతో అగురు, కస్తూరి, కుంకుమము, పసుపు, మంచిగంధపుఁబంకము, పెక్కు పూలు, చివురులు మున్నగునవి ఆ నగర వీధులందును, సందులందును నింపఁగా, నా యుత్సవమును జూచుటయం దాసక్తిగలవారయి శివుఁడును పార్వతియును ఎల్లదేవతలతోఁ గూడి వచ్చిరి అంత - తరువాతి పద్యముతో నన్వయము

**పార్వతీశ్వరుల వివాహోత్సవమును జూచిన పౌరుల వేడుకలు**

సీ. కనకంపుఁగ్రోవులు గొని ముంచి కాశ్మీర
 జలము లొండొరులపైఁ జల్లువారుఁ
గరయంత్రమాదిగాఁగల జలయంత్రాలి
 నోలి నొండొరులపై నొత్తువారు
మెలుపారు తలిరులఁ గల కంపుఁబువ్వుల
 వలగొని యొండొరు వైచువారుఁ
గర్పూర చందన కస్తూరి మృగపంక
 ములు గొని యొండొరుఁ బూయువారుఁ

ఆ బట్టి పెనఁగువారుఁ బట్టీక రయమునఁ
బాఱువారు నెగిచి పట్టువారుఁ
బ్రణయభావ మెసఁగఁ బౌరు లుత్సవమునఁ
గూడి నీరుపోఁత లాడి రొప్ప 51

**అర్థము .** కనకంపుఁగ్రోళులు (కనకము + క్రోళులు) బంగారుక్రోవులు, కొని = తీసికొని, ముంచి, కాశ్మీర - జలములు = కుంకుమపూవుతోడి నీరు (వసంతము), ఒండొరులపైన్ = ఒకరిపై నొకరు, చల్లువారున్

కరయంత్రము = నీటిని జిమ్ము చేతియంత్రము, ఆదిగాన్ = మొదలుగా, కల, జలయంత్ర + ఆలిన్ = నీటిని జిమ్ము యంత్రముల వరుసను, ఓలిన్ = క్రమముగా, ఒండొరులపైన్ = ఒకరిపై నొకరు, ఒత్తువారున్ = చిమ్మువారును,

మెలుపారు = మృదువులైన, తలిరులన్ = చివురులను, కల = ఉన్న, కంపు + పువ్వులన్ = పరిమళవంతములైన పువ్వులతో, వలగొని = చుట్టి, ఒండొరున్ = ఒకరినొకరు, వైచువారున్ = కొట్టువారును,

కర్పూర - చందన - కస్తూరి మృగపంకములు = కర్పూరము, మంచిగంధము, కస్తూరి మృగమునుండి వచ్చు మృగమదమును, కొని, ఒండొరున్ = ఒకరినొకరు, పూయువారున్,

పట్టి - పెనఁగువారున్ = ఒకరినొకరు పట్టుకొని లాగువారును, పట్టు + ఈక = పట్టునకు దొరకక, రయమునన్ = వేగముగా, పాఱువారున్ = పరువెత్తువారును, ఎగిచి - పట్టువారున్ = తఱిమి పౌరులు పట్టువారును, పురజనులు, ప్రణయ - భావము = ప్రేమభావము, ఎసఁగన్ = అతిశయింపఁగా, ఉత్సవమునన్ = వేడుకతో, కూడి, ఒప్పన్ = ఒప్పునట్లు, నీరు - పోఁతలు = ఒకరిపైనొకరు నీరుచిమ్ముకొనుటలు ఆడిరి

**తాత్పర్యము :** బంగరుచిమ్మనగ్రోవులు కొని ముంచి ఒకరిపై నొకరు వసంతము చల్లువారును, కరయంత్రము మొదలగు జలయంత్రముల నొకరి మీఁద నొకరు ప్రయోగించువారును, మృదువైన చివురులను సువాసనగల పూవులతోఁ జుట్టి ఒకరినొకరు కొట్టువారును, కర్పూరము, చందనము, కస్తూరి ఒకరికొకరు పూయువారును, ఒకరినొకరు పట్టుకొని పెనఁగువారును, పట్టునకు దొరకక వేగముగాఁ బరువులిడువారును, ఒకరినొకరు తఱిమి పట్టువారును అయి

పురజనులు ప్రేమభావ మతిశయింప నుత్సవమునందుఁగూడి యొప్పునట్లు నీరు చిమ్ములాట లాడిరి

**విశేషములు** అలంకారము స్వభావోక్తి

చ విరినెఱివేనలుల్ తడిసి వ్రేలఁ, గచాంతరపుష్పమాలికల్
దొరఁగఁగ, వల్వ లంగములతోఁ గదియన్, నునుఁబూఁత లిమ్ముగాఁ
దెరల, విభూషణౌఘమణిదీప్తులు గ్రాల మహోత్సవంబునం
బురజను లర్థిమైఁ జెలఁగి బోరన ముట్టటలాడి రెల్లెడన్ 52

**అర్థము** పుర-జనులు = పౌరులు, విరి- నెఱి - వేనలుల్ = చెదరిన, వెంట్రుకలు గల కొప్పులు, తడిసి, వ్రేలన్ = వ్రేలాడఁగా, కచ + అంతర + పుష్ప - మాలికల్ = శిరోజములలోని పూలదండలు, తొరఁగఁగన్ = రాలఁగా, వల్వలు = వస్త్రములు, అంగములతోన్ = అవయవములతో, కదియన్ =అంటుకొనఁగా, నునుఁబూఁతలు = నున్నని పూఁతలు, ఇమ్ముగాన్ = బాగుగా, తెరలన్ = కలిసిపోఁగా, విభూషణ + ఓఘ - మణి - దీప్తులు = అలంకారముల సమూహముయొక్క రత్నముల కాంతులు, క్రాలన్ = ప్రకాశింపఁగా, మహా (మహత్) + ఉత్సవంబునన్ = గొప్ప వేడుకతో, అర్థిమైన్ = కోరికతో, చెలఁగి = ఉత్సహించి, బోరనన్ = శీఘ్రముగా, ఎల్ల + ఎడన్ = అంతటను, ముట్టటలు + ఆడిరి = చిమ్మన గొట్టముతో నీరు చల్లుకొనుటలు ఆడిరి

**తాత్పర్యము .** పురజనులు గొప్ప వేడుకలతో, కోరి ఉత్సహించి చెదరిన వెంట్రుకలు గల కొప్పులు తడిసి వ్రేలుచుండఁగా, శిరోజములలోని పూలదండలు రాలఁగా, వలువలు శరీరావయములకు అంటుకొనఁగా, శరీరపు నున్నని పూఁతలు బాగుగా గలిసిపోఁగా, అలంకారములైన మణుల కాంతులు ప్రకాశింపఁగా శీఘ్రముగాఁ జిమ్మన గొట్టముతో నీరు చల్లుకొనునాటల నాడిరి

**విశేషములు :** అలంకారము స్వభావోక్తి ముట్టట - (రూపాం ) ముట్టాట వలువు - (రూపాం) వలువ

వ అయ్యవసరంబున బాలసఖు లగజతోఁ గూడి యాడందలంచి నెమ్మనంబున నుసురుకొనుచు 53

**అర్థము :** ఆ + అవసరంబునన్ = ఆ సమయమున, బాలసఖులు, అగజతోన్ = పార్వతితో, కూడి, ఆడన్ + తలంచి = క్రీడింపనెంచి, నెమ్మనంబునన్ (నెఱ + మనంబునన్) = నిండుమనసునందు, ఉసురుకొనుచున్ = ఉత్సహించుచు

**తాత్పర్యము.** ఆ సమయమున చిన్ననాఁటి చెలులు పార్వతితోఁ గలిసియాడ నెంచి నెమ్మనమున నుత్సహించుచు - తరువాతి పద్యముతో నన్వయము

శా దేవేశుండు పరిగ్రహించుట నుమాదేవిన్ సఖుల్ దగ్గఱం
బోవంజూడఁగ నోడి రోట దగదే పొల్పొందఁగాఁ బుత్రికల్
దేవార్థంబుగఁ జేసియున్నఁ గని బుద్దిందేక నా వేల్పునం
దావాహించిన మీఁద నెవ్వరికి డాయన్ ముట్టఁగా వచ్చునే ? 54

**అర్థము.** దేవేశుండు (దేవ + ఈశుండు) = దేవతల ప్రభువైన ఈశ్వరుఁడు, పరిగ్రహించుటన్ = స్వీకరించుటచేత - పెండ్లియాడుటచేత, ఉమా- దేవిన్ = పార్వతీదేవిని, సఖుల్ = చెలికత్తెలు, దగ్గఱన్ - పోవన్ + చూడఁగన్ = దగ్గఱకుఁబోవుటకును, చూచుటకును, ఓడిరి = జంకిరి, ఓట = జంకు, తగదే = తగదా ? తగు ననుట, పొల్పు + ఒందఁగాన్ = ఒప్పుగా, పుత్రికల్= బొమ్మలు, దేవ + అర్థంబుగన్ =దేవతనిమిత్తము, చేసి + ఉన్నన్ = నిర్మించియుండఁగా, కని = చూచి, బుద్దిన్ + తేక = (ఆ మాట) మనస్సునకుఁదేక - మఱచి యనుట, ఆ - వేల్పునందున్ = ఆ దేవతయందు, ఆవాహించిన - మీఁదన్= ఆవాహనచేసిన పిమ్మట, ఎవ్వరికిన్ = ఎవరికైనను, డాయన్ = సమీపించుటకును, ముట్టఁగాన్ = తాఁకుటకును, వచ్చునే = సాధ్యపడునా ? - సాధ్యపడ దనుట

**తాత్పర్యము .** పరమేశ్వరుఁడు పరిగ్రహించుటచే నుమాదేవిని జెలికత్తెలు సమీపించుటకును, జూచుటకును జంకిరి అట్లు జంకుట తగును. దేవతా నిమిత్తముగా బ్రతిమలను జేయుట చూచి, అది మఱచి, యా దేవతయం దావాహన చేసినపిమ్మట నెవ్వరికైనను, సమీపించుటకును, దాఁకుటకును సాధ్యమా?

**విశేషములు .** ఈ పద్యభావ మస్పష్టముగా నున్నది బుద్దిం దేక నా వేల్పునం దావాహించినమీఁద 'తేక అనువ్యతిరేకక్త్వార్థము కళ గదా ! దానిపై 'నా వేల్పు' అనురీతిని నుగాగమ మెట్లు వచ్చెనో ! అలంకార మర్థాంతరన్యాసము తేక - తెచ్చు ధాతువు 'కజీ వ్యతిరేకక్త్వార్థమునందగు ' బాల క్రి 39 తెచ్చు + కజీ 'ముజ్జీత్తులు ముత్తు నాఁబడు ' బాల క్రి 86 'తే తేరులు తెచ్చున కగు ' బాల క్రియ 93 - తేక

వ అంత నట సలిలక్రీడ నంగలిగొనక నీరుపోఁత లాడుచున్న యవసరంబున. 55

**అర్థము** అంతన్, అటన్, సలిలక్రీడన్ = జలక్రీడయందు, అంగలి + కొనక = తృప్తిపడక, నీరుపోఁతలు + ఆడుచున్ + ఉన్న - అవసరంబునన్ = ఒకరిపై నొకరు నీరుచల్లుకొనుటలాడుచున్నసమయమున

**తాత్పర్యము .** అంత నచ్చట జలక్రీడయందుఁ దృప్తిఁగాంచక ఒకరిపై నొకరు నీరుచల్లుకొనునాట లాడుచున్న సమయమున - తరువాతి పద్యముతో నన్వయము

క హర గిరిజల మనమున న
త్యురురాగరసంబు నిండి యుత్కటమై త
త్పురిమీఁద వెల్లిసూపిన
పరుసునఁ గాశ్మీరవారి పౌరులఁ గప్పెన్ 56

**అర్థము :** హర - గిరిజల - మనమునన్ = శివపార్వతుల మనస్సునందు, అతి + ఉరు - రాగరసంబు = మిక్కిలి యధికమైన ప్రేమరసము, నిండి, ఉత్కటము + ఐ = అధికమయి, తద్ + పురిమీఁదన్ = ఆ నగరము మీఁద, వెల్లి+ చూపిన - పరుసునన్ = వఱదయై ప్రవహించెనా యనువిధమున, కాశ్మీర - వారి కుంకుమపూవు నీరు, పౌరులన్ = పురజనులను, కప్పెన్ = ముంచెను

**తాత్పర్యము .** శివపార్వతుల మనస్సునందు మిక్కిలి యధికమైన ప్రేమరసము నిండి అధికమయి ఆ నగరమున వఱదలై ప్రవహించెనా యను విధమునఁ గుంకుమపూల జలము పౌరులను గప్పెను

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష

వ తదవసరంబున 57

**అర్థతాత్పర్యములు :** తద్ + అవసరంబునన్ = ఆ సమయమున - తరువాతి పద్యముతో నన్వయము

ఆ రాజితముగ విటవిటీజన వదనాంబు
జంబు లలరు ఘుసృణజలములాడి
తరుణ తరణి కిరణతతి రాగభాతిపై
నొనరి పొల్చు వనజ వనము పోలె 58

**అర్థము .** రాజితముగన్ = ప్రకాశించునట్లు, విట - విటీ - జన - వదన+ అంబుజంబులు = విటుల (స్త్రీ పురుషుల) ముఖపద్మములు, ఘుసృణ -

జలములు = కుంకుమపువ్వు నీరులు, ఆడి, తరుణ - తరణి - కిరణ - తతి - రాగ-భాతి = బాలభానుని కిరణ సమూహముయొక్క యెఱ్ఱనికాంతి, పైన్ = మీఁద ఒనరి = కలిగి, పొల్చు = ప్రకాశించునట్టి, వనజ - వనము + అ + పోలెన్ = తామరతోఁపువలెనే, అలరున్ = ఒప్పును

**తాత్పర్యము .** విటుల ముఖపద్మములు కుంకుమపువ్వు జలము లాడి, బాలభానుని కిరణముల యెఱ్ఱని కాంతి పైని బ్రసరించి, ప్రకాశించు తామరతోఁపువలె నొప్పెను

**విశేషములు .** అలంకార ముపమ

తే. **ఓలిఁ దనరారు క్రోళ్లను నొత్తు కుంకు**
**మారుణాకీర్ణజలధార లమరెఁ జూడ**
**వీఁక నతనుండు విటవిటీ వితతి నేయు**
**విపులతపనీయనారాచవృష్టి వోలె.** 59

**అర్థము .** ఓలిన్ = క్రమముగా, తనరారు = ఒప్పునట్టి, క్రోళ్ళను = క్రోవులతో, ఒత్తు = కొట్టునట్టి - చల్లునట్టి, కుంకుమ + ఆకీర్ణ - జల - ధారలు= కుంకుమములతోఁ గూడిన నీటిధారలు, చూడన్ = చూడఁగా, అతనుండు = మన్మధుఁడు, వీఁకన్ = పరాక్రమముతో, విట - విటీ- వితతిన్ = విటులసమూహమును, ఏయు = కొట్టునట్టి, విపుల - తపనీయ - నారాచ - వృష్టి+ పోలెన్ = విరివియైన బంగారు బాణముల వర్షమువలె, అమరెన్ =, ఒప్పెను

**తాత్పర్యము.** క్రోవ్వులతో నొకరిపై నొకరు చల్లుకొనునట్టి కుంకుమముతోఁ గూడిన జలధారలు చూడఁగా, మన్మధుఁడు పరాక్రమముతో విటులను గొట్టు విపులమైన బంగరుటంపవానవలె నొప్పెను

**విశేషములు :** అలంకార ముపమ

క **వరచందనపంకంబులఁ**
**దిరముగ ముఝ్ఝాటలాడి తెలుపెసఁగిరి త**
**త్పుర జను లీశ్వరుతో సహ**
**చరులై విమలాత్ములైన చాడ్పును బోలెన్** 60

**అర్థము .** తద్ + పుర - జనులు = ఆ నగరమునందలి జనులు, వర - చందన - పంకంబులన్ = మేలయిన గంధపుబురదలతో, తిరముగన్ =

స్థిరముగా, మురువాటలు + ఆడి = జలక్రీడలాడి, ఈశ్వరుతోన్ = శివునితో, సహచరులు + ఐ = కూడి తిరుగువారయి, విమల - ఆత్ములు + ఐన = నిర్మల స్వరూపులయిన, చాడ్పును + పోలెన్ = విధమువలె, తెలుపు + ఎసఁగిరి = తెల్లనై యొప్పిరి

**తాత్పర్యము:** ఆ నగరమునందలి జనులు మేలయిన చందన పంకములతో జలక్రీడలాడి, యీశ్వరునితోఁ గూడఁ దిరిగినవారయి నిర్మలాత్ములైన విధమునఁ దెల్లనైరి

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష

క మడఁది ముఖ మండలముఁ బ్రియుఁ
డడరఁగఁ గస్తూరిపంక మలఁదిన, శశిపై
వెడసీరమొయిలు గప్పిన
విడువక లో వెలుఁగుచున్నవిధమున నొప్పెన్ 61

**అర్థము .** మడఁది = స్త్రీ (పార్వతియొక్క), ముఖ - మండలమున్ = ముఖబింబమును, ప్రియుఁడు = భర్త(శివుఁడు), అడరఁగన్ = అతిశయించునట్లు, కస్తూరి - పంకము = కస్తురి బురద, అలఁదినన్ = పూయఁగా, శశిపైన్ = చంద్రుని మీఁద, వెడసీర - మొయిలు = తెరవైన మేఘము, కప్పినన్ = కప్పినను, విడువక= మానక, లోన్ = లోపల, వెలుఁగుచున్ + ఉన్న = ప్రకాశించుచున్న, విధమునన్ = విధమున, ఒప్పెన్

**తాత్పర్యము** పార్వతి ముఖబింబమునకు శివుఁడు అధికముగాఁగస్తురి పంకమును బూయఁగాఁ, నది తెరవలె మబ్బు కప్పినను జంద్రబింబము మానక లోపలఁ బ్రకాశించుచుండువిధమున నొప్పెను

**విశేషములు .** అలంకార ముపమ మడఁది = మడఁతి (రూపాం)

తే ప్రియుఁడు రాగోత్కటంబునఁ బెరిఁగి పూయ
మెలుఁత ముఖమండలమునఁ గాశ్మీరరాగ
మెలసి కరమొప్పె వినుతోదయేందుబింబ
మరుణదీధితులం బొలుపారునట్లు 62

**అర్థము .** ప్రియుఁడు = భర్త (శివుఁడు), రాగ + ఉత్కటంబునన్ = అనురాగాతిశయమున, పెరిఁగి = పూని, పూయన్ = అలఁదఁగా, మెలుఁత = ఇంతి (పార్వతి) యొక్క, ముఖ - మండలమునన్ = ముఖబింబమునందు, కాశ్మీర - రాగము = కుంకుమపుటెఱుపు, ఎలసి = వ్యాపించి, వినుత + ఉదయ + ఇందు

- బింబము = పొగడఁబడిన ఉదయించు చంద్రబింబము, అరుణ -దీధితులన్ = ఎఱ్ఱని కాంతులతో, పొలుపారు + అట్లు = ఒప్పారు విధమున, కరము = మిక్కిలి, ఒప్పెన్

**తాత్పర్యము.** శివుఁడు అనురాగాతిశయమునఁ బూయఁగా, పార్వతి వదన బింబమునందుఁ గుంకుమపుటెఱుపు వ్యాపించి ఉదయించు చంద్రబింబము ఎఱ్ఱనికాంతులతో నొప్పువిధమున మిక్కిలి ఒప్పెను

**విశేషములు.** అలంకార ముపమ మెఱుఁత = మెలఁత (రూపాం)

ఆ **మృగమదంబుఁ దరుణి మొగమునఁ బ్రియుఁ డర్థిఁ**
**బూయఁబూయఁ ద్రోచిపోవనేర**
**కొక్క వలన యైన నువిద మో మర్ధోప**
**రాగచంద్రబింబరమణ నొప్పె** 63

**అర్థము.** ప్రియుఁడు = భర్త (శివుఁడు) అర్థిన్ = కోరికతో, తరుణి - మొగమునన్ = భార్య (పార్వతి) ముఖమున, మృగమదంబున్ = కస్తూరి, పూయన్ + పూయన్ = పూయఁగాఁ బూయఁగా, త్రోచి పోవన్ +నేరక = తొలఁగిపోఁజాలక, ఒక్క - వలను + అ + ఐనన్ = ఒకదిక్కే కాఁగా, ఉవిద - మోము = స్త్రీ (పార్వతి) ముఖము, అర్ధ + ఉపరాగ - చంద్రబింబ - రమణన్ = సగము గ్రహణము పట్టిన చంద్రబింబము విధమున, ఒప్పెన్

**తాత్పర్యము.** శివుఁడు పార్వతి ముఖమునఁ గస్తూరిని గోరికతోఁ బూయఁగా బూఁయఁగా నామె తొలఁగిపోవఁజాలక ఒక్క దిక్కే కాఁగా, నామె ముఖము సగము మాత్రమే గ్రహణముపట్టిన చంద్రబింబము వలె నొప్పెను

**విశేషములు.** అలంకార ముపమ

ఆ **చందనంబుఁ గలయ సఖి బల్మిఁ బూసిన**
**పొలఁతి వదనలీల పొలిచెఁ దెరలు**
**వుచ్చి బెరయఁ గల్లు పూసిన యద్దంబు**
**భంగివోలె నిజవిభాతిఁ దఱఁకి** 64

**అర్థము.** సఖి = చెలికత్తె, చందనంబున్ = మంచిగంధమును, కలయన్= అంతటను, బల్మిన్ = అధికముగా, పూసిన = అలఁదినట్టి, పొలఁతి - వదన - లీల = ఇంతి (పార్వతి) ముఖ విలాసము, తెరలు + పుచ్చి = కలఁచి, బెరయన్ =

వ్యాపించునట్లు, కల్లు, పూసిన, అద్దంబు - భంగి - పోలెన్ = అద్దము విధముగ, నిజ - విభాతిన్ = తనదైన కాంతిని, తఱఁకి = వదలి, పొలిచెన్ = ఒప్పెను

**తాత్పర్యము .** చెలికత్తె చందనము నంతటను అధికముగాఁ బూయఁగాఁ బార్వతి ముఖవిలాసము అంతటను వ్యాపించునట్లు కల్లుపూసిన అద్దమువలె నిజకాంతిని విడిచి యొప్పెను

**విశేషములు .** అలంకార ముపమ

క **నీరేరుహోదరుఁడు కా**
**శ్మీరోదక కనకరుచి విమిశ్రితుఁడై పా**
**ల్పారె నసితాంబుదము సం**
**ధ్యా రాగము గలయఁ గప్పినట్టుల పోలెన్** 65

**అర్థము .** నీరేరుహ + ఉదరుఁడు - పద్మనాభుఁడు - విష్ణువు, కాశ్మీర+ ఉదక - కనక - రుచి - విమిశ్రితుఁడు + ఐ = కుంకుమపూవునీటి యొక్క బంగారు కాంతితోఁ గలిసినవాఁడయి, అసిత + అంబుదమున్ = నీలమేఘమును, సంధ్యా - రాగము = సంజయెఱుపు, కలయన్ = అంతటను, కప్పిన + అట్టుల - పోలెన్ = కప్పిన విధమున, పొల్పారెన్ ( పొల్పు +ఆరెన్ + ప్రకాశించెను

**తాత్పర్యము .** విష్ణువు కంకుమ పువ్వునీటి బంగరుకాంతితోఁ గూడిన వాఁడయి, నీలమేఘమును,సంజయెఱు పంతటను గప్పినవిధమునఁ బ్రకాశించెను

**విశేషములు .** అలంకార ముపమ

క **అన్నువలు పితామహుఁ డని**
**మన్నింపక పట్టి పూయ మలయజమున సు**
**చ్ఛన్నుఁడయి కనకగిరిపై**
**వెన్నెల తెలు పడరినట్లు వేధ వెలింగెన్** 66

**అర్థము .** అన్నువలు = స్త్రీలు, పితామహుఁడు + అని = తాత యని, మన్నింపక = గౌరవింపక, పట్టి, పూయన్ = పూయఁగా, మలయజమునన్ = చందనముచే, సుచ్ఛన్నుఁడు (సు+ఛన్నుఁడు) + అయి = బాగుగాఁ గప్పఁబడినవాఁడయి, వేధ = బ్రహ్మ, కనక - గిరిపైన్ = మేరుపర్వతముపై, వెన్నెల - తెలుపు = వెన్నెలయొక్క తెలుపు, అడరిన + అట్లు = అలముకొనునట్లు, వెలింగెన్ = ప్రకాశించెను

**తాత్పర్యము .** స్త్రీలు తాతయని గౌరవింపక పట్టుకొని పూయఁగాఁ జందనముచే మిక్కిలి కప్పఁబడినవాఁడయి, బ్రహ్మ మేరుపర్వతముపై వెన్నెల తెలు పలముకొనునట్లు ప్రకాశించెను

**విశేషములు .** అలంకార ముపమ, అన్నువ = అన్ను (రూపాం ) సు + ఛన్నుఁడు - హ్రస్వమునకు పరమైన ఛకారమునకు ద్విత్వము వేధ - వేధ శ్శబ్ద తత్సమరూపము - 'వేధ పురోధ పురోధసుఁడు ' బాల తత్సమ 82

తే హరుఁడు గనుగీట సురసతు లావనీరు
లప్పు డింద్రుపైఁ జల్లిన ఱెప్ప లెల్ల
వ్రాల విడిచి సురేంద్రుఁడు వానఁ బురులు
వొదియఁబడియున్న పురినమ్మిఁ బోలియుండె 67

**అర్థము .** హరుఁడు = ఈశ్వరుఁడు, కనుగీటన్ = కనుసన్నచేయఁగా, సుర - సతులు = దేవతాస్త్రీలు, అప్పుడు, ఇంద్రుపైన్, ఆవనీరులు, చల్లినన్ = చల్లఁగా, సుర + ఇంద్రుఁడు = దేవేంద్రుఁడు, ఱెప్పలు + ఎల్లన్ = కన్నుల ఱెప్పలన్నియు, వ్రాలన్ = వ్రాలునట్లు, విడిచి, వానన్ = వానచేత, పురులు = ఈకలు, పొదియఁబడి + ఉన్న = మూయఁబడియున్న, పురి - నమ్మిన్ = మగనెమిలిని, పోలి + ఉండెన్

**తాత్పర్యము .** ఈశ్వరుఁడు కనుసన్న చేయఁగా దేవతాస్త్రీలు దేవేంద్రునిపై ఆవనీరు చల్లిరి అప్పు డింద్రుఁడు వేయికన్నుల ఱెప్పలును వ్రాల్చి, వానచే నీకలు మూయఁబడియున్న మగనెమిలిని బోలియుండెను

**విశేషములు :** అలంకార ముపమ

తే కీలు ప్రిదిలినఁ బడి మొలనూలు గాలఁ
దగిలి రా వచ్చె నోర్తు సుందరుల కెల్ల
రూపసౌభాగ్యసంపద రూఢిఁ దాన
మిగిలి నిగళంబు లెట్టిన పగిది వోలె 68

**అర్థము:** కీలు= సీల, ప్రిదిలినన్ = ఊడిపోవఁగా, పడి = జాతి, మొలనూలు = మొలత్రాడు, కాలన్ = కాలియందు, తగిలి = తగులుకొని, రాన్ = రాఁగా, ఓర్తు = ఒకతె, సుందరులకున్ + ఎల్లన్ = సౌందర్యవతులకెల్లను, రూప- సౌభాగ్య -

సంపదన్ = ఆకారసుభగత్వసంపదయందు, రూఢిన్ = నిశ్చయముగా, తాను + అ = తాన = తానే, మిగిలి = అతిశయించి, నిగళంబు + పెట్టిన - పగిది + పోలెన్ = సంకెలవైచినరీతివలె వచ్చెన్

**తాత్పర్యము.** సీల ఊడిపోఁగా జాతి మొలనూలు కాలియందుఁ దగులుకొని రాఁగా, ఒకతె సౌందర్యవతుల కెల్ల ఆకారసంపదయందు రూఢిగాఁ దానే అతిశయించినట్లు సంకెలవైచెనా యన వచ్చెను

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష

## స్త్రీల జలక్రీడావర్ణన

క. నుత విట ఘన కరయంత్ర
చ్యుత ధారాపాతసిక్త సుందర తను ని
ర్గత నవ ముత్పులకాంకుర
తతిఁ దాల్చి వరాంగనాకదంబము లొప్పెన్ 69

**అర్థము .** నుత తతిన్, నుత = పొగడఁబడిన, విట = విటులనెడి, ఘన = మేఘములయొక్క, కర - యంత్ర = చేతియంత్రములనుండి, చ్యుత = జాఱిన, ధారా - పాత = జలధారలయొక్క పాటుచే, సిక్త = తడిసిన, సుందర = అందమయిన, తను = శరీరములందు, నిర్గత = బయల్పువెడలిన, నవ = క్రొత్త, ముద్ + పులక + అంకుర - తతిన్ = ఆనందమువలని గగుర్పాటు మొలకల సమూహమును, తాల్చి = ధరించి, వర + అంగనా - కదంబములు = మేలిజాతి స్త్రీల సమూహములు అనెడి కడిమిచెట్లు, ఒప్పెన్

**తాత్పర్యము .** విటులనెడి మేఘములయొక్క చేతులందలి జలయంత్రములనుండి జాఱిన జలధారాపాతములచేఁ దడిసిన అందమైన శరీరములందుఁ బొడమిన క్రొత్త గగుర్పాటు అనెడి మొలకలను దాల్చి మేలిజాతి స్త్రీల సమూహములనెడి కడిమిచెట్లు ఒప్పెను

**విశేషములు .** అలంకారము రూపకము అంగనా కదంబము లనుచో శ్లిష్ట రూపకము విట ఘన = విటులనెడి మేఘ, పులకాంకుర - పులకలనెడి అంకుర అంగనా - కదంబములు = అంగనల సమూహములనెడి కడిమిచెట్లు, శ్లిష్టరూపకము మేఘము ధ్వనింపఁగనే కడిమిచెట్లు పూయును

ఉ నీరదముల్ కచాతిరుచి, నెమ్మెఱుఁగుల్ నవకంపుమేను లా
సారము లోలిఁ జల్లు జలసంకులమై తగ సద్విటేంద్ర కే
దారములందుఁ జాలుకొన దర్పకబీజము లంకురింపఁ గ్రొ
క్కారునుబోలెఁ గ్రమ్మి వరకాంతలు ముజ్జుటలాడి రిమ్ములన్ 70

**అర్థము** కచ + అతి -రుచి = శిరోజములయొక్క అధికమైన కాంతి, నీరదముల్ = మేఘములు నవకంపుమేనులు (నవకము + మేనులు) = మృదువులైన శరీరములు, నెమ్మెఱుఁగుల్ (నెఱి + మెఱుఁగుల్) = రమ్యములైన మెఱుపులు, ఓలిన్ = క్రమముగా, చల్లు = చల్లునట్టి, జల - సంకులముల్ = నీరుల సమూహములు, ఆసారములు = జడివానలుగా, తగన్ = ఒప్పుఁగా, సత్ + విట + ఇంద్ర - కేదారముల + అందున్ = మంచి విటశేఖరులనెడి వరిమడులలో, చాలుకొనన్ వరుసగట్టునట్లు, దర్పక - బీజములు = మన్మధుఁడనెడి విత్తులు, అంకురింపన్ = మొలకెత్తఁగా, క్రొక్కారును + పోలెన్ (క్రొత్త + కారు) = తొలకరియో యన, క్రమ్మి = వ్యాపించి, వర - కాంతలు - శ్రేష్ఠురాండ్రయిన స్త్రీలు, ఇమ్ములన్ = ప్రీతితో, ముజ్జుటలు + ఆడిరి = జలక్రీడలాడిరి

**తాత్పర్యము** . శ్రేష్ఠురాండ్రయిన స్త్రీలు శిరోజముల అధికమైన నల్లని కాంతి వర్షామేఘములును, మృదువులైన శరీరములు రమ్యములయిన మెఱుఁగులును, ఒండొరులపైఁ జల్లుకొను నీరుల సమూహములు జడివానలును అయి యొప్పుఁగా విటశేఖరులనెడి వరిమడులలో మన్మధు డనెడి విత్తులు మొలకెత్తఁగాఁ దొలకరియో యన వ్యాపించి సంతోషముతో జలక్రీడలాడిరి

**విశేషములు** . అలంకారము రూపకానుప్రాణితోత్ప్రేక్ష నీరదముల్ - నీటినిచ్చునవి కనుకనే నైల్యమునఁ గచములతోఁ బోలిక, నెమ్మెఱుఁగుల్ = నెఱి + మెఱుఁగుల్ 'నెన్నడాదులన్ నెఱి దగు ' ప్రౌఢ సంధి 14 నవకంపుమేనులు = నవకము + మేనులు = 'కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బుంపులగు ' బాల సంధి 32 క్రొక్కారు - క్రొత్త + కారు ప్రాఁతాది సంధి - బాల సంది 36 క్రొ + కారు 'క్రొత్త శబ్దమున కాద్యక్షర శేషంబునకుం గొన్నియెడల నుగాగమంబునుం గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు ' బాల సంధి 38

వ. ఇట్లు పెద్దయుంబ్రొద్దు నీరుపోఁతలాడి విటవిటీజనంబు లలసిన ఘనసమయాసారధారాపాతంబున కలసి మానససరోవరకేళీలాల సులై చను మరాళంబులుం బోలె హరగిరిజ లమరపరివృతులై యనేకవర్ణాకీర్ణ కమలాకరంబున కరుగుదెంచు నవసరంబున 71

**అర్థము.** ఇట్లు, పెద్దయున్ + ప్రొద్దు = చాలసేపు, నీరుపోఁతలు + ఆడి= జలక్రీడలాడి, విట - విటీ - జనంబులు = విటుల సమూహములు, అలసినన్ = బడలువడఁగా, ఘన - సమయ + ఆసార -ధారా - పాతంబునకున్ = వర్షాకాలమునందలి జడివానల జలధారలపాటునకు, అలసి, మానస - సరోవర - కేళీ - లాలసులు + ఐ = మానససరోవరములోఁ గ్రీడలందు ఆసక్తిగొన్నవయి, చను = పోవునట్టి, మరాళంబులున్ + పోలెన్ = హంసల విధమున, హర - గిరిజలు = శివపార్వతులు, అమర - పరివృతులు + ఐ = దేవతలతోఁ జుట్టఁబడినవారయి, అనేక - వర్ణ + ఆకీర్ణ - కమల + ఆకరంబునకున్ = పెక్కు రంగులతో నిండిన తామర కొలనికి, అరుగుదెంచు + అవసరంబునన్ = వచ్చు సమయమున

**తాత్పర్యము .** ఈ రీతిగాఁ జాలసేపు జలక్రీడలాడి విటజనులును, విటీజనులును బడలి మానస సరస్సునఁ గ్రీడింపఁగోరిచను హంసలవలె శివపార్వతులు దేవతలతోఁగూడి పలురంగులతో సంకీర్ణమైన తామరకొలనికి వచ్చు సమయమున - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** అలంకార ముపమ అరుగుదెంచు 'తెంచుధాతు వగ్వాదుల కనుప్రయుక్తంబగు నగుచో నుత్వంబుపయిని దాని తకారంబు దకారం బగు ' బాల క్రి 110 'అభ్యాగతి నరుగ్వాదుల కయ్యది యనుప్రయుక్తంబగు నగుచో గువర్ణంబు విభాషను లోపించు ' బాల క్రి 111 అరుగుదెంచు - రూపాం అరుదెంచు, అరుగుదెంచు + అవసరంబునన్ - 'ఉదంతమగు తద్ధరార్థ విశేషణమున కచ్చు పరమగునపుడు నుగాగమంబగు ' బాల సంధి 33 అరుగుదెంచు నవసరంబునన్ హరిగిరిజ లమరపరివృతులై - 'నలదమయంతు లిద్దఱు , దహ్యమానులై' నన్నయ - వంటిది

సీ॥ చెదరి తోఁ బఱతెంచు చెందమ్మి రేకులు
　　కెడగొని మొగుపుఁగెంగేలు గాఁగ
నెలమి లేఁదరఁగల నెలయు తుంతుర్వని
　　సదమలమౌక్తికాక్షతలు గాఁగ
నులియు నానావిధజలపక్షి కుల కల
　　రవ మించు సంస్తుతిరవము గాఁగ
జలజాత కౌరవోత్పల కలహారాది
　　గంధంబు లోలి సద్గంధములుగ

తే. నర్థిఁ దన యాదిమూర్తికి ననిలుఁ డర్చ
లీ ముదంబున వచ్చున ట్లీశ్వరునకు
నెదురువచ్చి పథిశ్రమమెల్లఁ బాచె
గారవమున సరోవరమారుతంబు 72

**అర్థము** సరోవర - మారుతంబు = సరస్సుపైనుండి వీచు గాలి, చెదరి, తోన్ + పఱతెంచు = కూడవచ్చునట్టి, చెందమ్మి (చెన్ను + తమ్మి) రేకులు= ఎఱ్ఱ తామర దళములు కెడగొని = జోడుఁగూడి, మొగుపుఁగెంగేలు (మొగుపు + కెంపు + కేలు) = ముడిచిన యెఱ్ఱని చేతులు, కాఁగన్ = కాఁగా

ఎలమిన్ = అతిశయముతో, లేఁదరఁగలన్ (లేఁత + తరఁగలన్) = చిన్న యలలయందు, ఎలయు = పుట్టు, తుంతుర్వని = తుంపర, సదమల (సత్ + అమల) - మౌక్తిక + అక్షతలు = మిక్కిలి నిర్మలములయిన ముత్యాల అక్షతలు, కాఁగన్

ఉలియు - ధ్వనిచేయు, నానా - విధ - జల - పక్షి - కుల - కల - రవము = అనేకరీతులైన నీటిపక్షుల సమూహముయొక్క అవ్యక్తమధురధ్వని, ఇంచు = ఇంపయిన, సంస్తుతి - రవము = స్తోత్రధ్వని, కాఁగన్

జలజాత - కైరవ + ఉత్పల - కలహార + ఆది - గంధంబులు = పద్మములు, తెల్లగలువలు, కలువలు, సౌగంధికములు, మున్నగువాని వాసనలు, ఓలిన్ = బాగుగా, సత్ + గంధములు + కన్ = మేలి గంధములు కాఁగా,

అనిలుఁడు = వాయువు, అర్థిన్ = కోరికతో, తన + ఆదిమూర్తికిన్ = తమ మూల స్వరూపమైన శివునకు, అర్చలు = పూజలు, ఈన్ = ఇచ్చుటకు, ముదంబునన్ = సంతోషముతో, వచ్చు + అట్లు = వచ్చురీతిని, ఈశ్వరునకున్, ఎదురువచ్చి, పథి - శ్రమము + ఎల్లన్ = మార్గాయాసమంతయు, గారవమునన్ = ఆదరముతో, పాచెన్ = పోఁగొట్టెను

**తాత్పర్యము :** చెదరి కూడవచ్చునట్టి యెఱ్ఱదామరరేకులు జతఁగూడి ముడిచిన యెఱ్ఱనిచేతులు కాఁగా, చిన్నయలలందుఁబుట్టు - శీకరములు నిర్మలములయిన ముత్యాలసేసలు కాఁగా, రొదచేయు పలురీతులయిన నీటి పక్షుల గుంపుల అవ్యక్త మధుర ధ్వని ఇంపయిన స్తోత్ర ధ్వని కాఁగా, పద్మములు, తెల్లఁగలువలు, కలువలు, సౌగంధికములు మున్నగువాని పరిమళములు మంచి

గంధములు కాఁగా, వాయువు తన మూలస్వరూపమైన ఈశ్వరునకుఁ గోరికతో నర్చలిచ్చుటకు సంతోషముతో వచ్చునట్లు సరస్సునుండి వీతెంచు గాలి ఆదరముతో నెదురువచ్చి శివుని మార్గాయాసమునెల్ల అపనయించెను

**విశేషములు :** అలంకారము రూపకము కలహార - కల్హార చెందమ్మి రేకులు, లేఁదరఁగల తుంతుర్వని, జలపక్షులు, జలజాతాదులు - అన్నియు సరోవరములోనివే అందుచేతనే సరోవరమారుత మర్చించె ననుట నమస్కారము సేసలు చల్లుట, స్తుతించుట, గంధము లిచ్చుట -ఇవి అర్చాభాగములు వాయువు శివుని అష్టమూర్తులలో నొకటి కావున వాయువున కాదిమూర్తి ఈశ్వరుఁడు పాచెన్ - పాయుధాతు ప్రేరణార్థక రూపము 'అట్లు చుక్కుగాగమంబు లడంగ్వాది మాయ్వాదుల కగు నగుచో వాని కడప్రాలు లోపించు ' బాల క్రి 76 పాచు రూపాం పాపు లేఁదరఁగలు - లేఁత + తరఁగలు - చెందమ్మి - చెన్ను + తమ్మి ప్రాఁతాది సంధి బాల సంధి 36, 37, ద్రుతకార్యము - బాల సంధి 16 17

వ. **తదనంతరంబ వారిజాకర తీరంబు చేరంజనుదెంచిన.** 73

**అర్థము:** తద్ + అనంతరంబు + అ = ఆ పిమ్మట, వారిజాకర - తీరంబు = తామరకొలని యొడ్డు, చేరన్ + చనుదెంచినన్ = పమీపింపఁగా

**తాత్పర్యము .** ఆ పిమ్మటనే పద్మాకరతీరము చేరఁగనే - తరువాతి పద్యముతో నన్వయము

మ. **మతి నీశుండు తలంచి వచ్చెనట చూ మమ్మంచు నాహ్లాద సం**
**యుతమై తజ్జలదేవతల్ శివున కభ్యుత్థానలైనట్టు లా**
**శతపత్రాకరకేళిలాలస వధూ సంభూసితాంగోల్లస**
**త్ప్రతిబింబంబులు తోఁచె రత్నమయసోపానంబు లం దందమై.74.**

**అర్థము:** ఈశుండు = ఈశ్వరుఁడు, మమ్మున్, మతిన్ - మనస్సునందు, తలంచి, వచ్చెన్ + అట + చూ = వచ్చెనట సుమా, అంచున్, తద్ + జల - దేవతల్ = ఆ జలదేవతలు, ఆహ్లాద - సంయుతము + ఐ - సంతోషముతోఁ గూడుకొని, శివునకున్, అభ్యుత్థానలు + ఐన + అట్టులు + ఎదురేఁగిన వారయిన విధముగా, ఆ - శత ప్రతిబింబంబులు ఆ - శతపత్ర + ఆకర = ఆ తామరకొలనిలోని, కేళి= క్రీడయందు, లాలస = ఆసక్తి గలిగిన, వధూ = స్త్రీల యొక్క, సంభూషిత = బాగుగా అలంకరింపఁబడిన, అంగ = శరీరములయొక్క, ఉల్లసత్ =

ప్రకాశించుచున్న, ప్రతిబింబంబులు, రత్నమయ - సోపానంబులందున్ = రత్నములతో నిర్మింపఁబడిన మెట్లయందు, అందము + ఐ, తోఁచెన్ - కననయ్యెను

**తాత్పర్యము .** ఈశ్వరుఁడు మమ్ము మనస్సునందుఁ దలఁచి వచ్చెనట సుమా యని సంతోషముతో నా జలదేవత లతనికి ఎదురేఁగిన విధమున ఆ తామరకొలనియందుఁ గ్రీడించుట యం దాసక్తిగల స్త్రీల అలంకృతములైన శరీరముల ప్రకాశించు ప్రతిబింబములు మణినిర్మితములై సోపానములందు సుందరములయి కననయ్యెను

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష తజ్జల తద్ + జల 'సకార తవర్గములకు శవర్ణ చవర్గములతో పూర్వమందైనను పరమందైనను కూడిక గలుగునపుడు క్రమముగా శవర్ణ చవర్గ వర్ణము లాదేశమగును

వ **మఱియును - తరువాతి పద్యముతో నన్వయము** 75

క **కొలని దరిఁ దన్ని చెలువలు**
**నిలిచిన నా వారి వారినీడలు తోఁచెన్**
**బొలు పెసఁగఁ గ్రొవ్వి సుదతులు**
**తలకెడవైనట్లు మదన దర్పోన్నతలై.** 76

**అర్థము .** చెలువలు = స్త్రీలు, కొలని - దరిన్ = కొలని తీరమున, తన్ని = ఊఁదుకొని, నిలిచినన్, ఆ - వారిన్ = ఆ నీటియందు, వారి - నీడలు = వారి ప్రతిబింబములు, సుదతులు = స్త్రీలు, మదన - దర్ప + ఉన్నతలు + ఐ = మన్మథగర్వముచే ఉన్నతలయి, పొలుపు + ఎసఁగన్ = ఒప్పు అతిశయించునట్లు, క్రొవ్వి = మదించి, తలకెడవు + ఐన + అట్లు = తలక్రిందులయిన విధమున, తోఁచెన్ = కనఁబడెను

**తాత్పర్యము .** కొలని తీరమున నూఁదుకొని స్త్రీలు నిలఁబడఁగా, ఆ కొలని నీటియందు వారి ప్రతిబింబములు, ఆ స్త్రీలు మదనగర్వాతిశయమున మిక్కిలి క్రొవ్వి తలక్రిందులయిరా యనువిధమునఁ గననయ్యెను

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష వస్తువు ప్రతిబింబము నీటఁ దలక్రిందులుగా నగపడును నీటి దరి నిలిచిన స్త్రీల ప్రతిబింబములు నీటఁ దలక్రిందులుగాఁ గననగుట, వారు మన్మథగర్వమునఁ గ్రొవ్వి తలక్రిందు లయినట్లు ఉత్ప్రేక్షింపఁబడెను

వ అయ్యవసరంబున హరగిరిజలు తత్సరోజాకర తీర పారిజాత లతా మంటపాంతర మణివేదికాసీనులై జలక్రీడావలోకన తత్పరు లగుచుండి రంత విటవిటీజనంబు లొండొరుఁ గడవ ననురాగిల్లుచు 77

**అర్థము :** ఆ + అవసరంబునన్ = ఆ సమయమున, హరగిరిజలు, తద్+ సరోజ + ఆకర - తీర - పారిజాత - లతా - మంటప + అంతర + మణివేదికా+ ఆసీనులు + ఐ = తామరకొలని దరియందలి పారిజాతలతల మంటపములోని, మణిమయ వేదికయందుఁ గూర్చున్నవారయి, జల-క్రీడా + అవలోకన - తత్పరులు= జలక్రీడలను జూచుటయం దాసక్తిగలవారు, అగుచున్ + ఉండిరి, అంతన్, విట-విటీ - జనంబులు, ఒండొరున్ = ఒకరినొకరు, కడవన్ = అతిశయించునట్లు, అనురాగిల్లుచున్ = ప్రేమించుచు

**తాత్పర్యము :** ఆ సమయమున శివపార్వతులు ఆ తామరకొలని తీరమునందలి పారిజాతపుఁదీవల మండపములోని మణిమయవేదికయందుఁ గూర్చుండి జలక్రీడలను జూచు నాసక్తిగలవా రగుచుండిరి అంత విటులు ఒకరినొకరు అతిక్రమించి ప్రేమించుచు - తరువాతి పద్యముతో నన్వయము

తే లీల నొక్కటఁ జని జలకేళి సలుపఁ
గొలనిఁ జొచ్చుడు వీరిపైఁ గలయ నెగసెఁ
దరఁగ లోలిన జలదేవతలును నెదిరి
చల్లుఁబోరాడఁ జేతులు సాఁచినట్లు 78

**అర్థము :** లీలన్ = విలాసముతో, ఒక్కటన్ = ఒక్కమాఱుగా, చని, జల-కేళి = జలక్రీడ, సలుపన్ = చేయుటకు, కొలనిన్ = సరస్సును, చొచ్చుడున్ = ప్రవేశించినంతనే, వీరిపైన్ = ఈ స్త్రీలపై, జలదేవతలును = జలదేవతలుగూడ, ఎదిరి, చల్లు + పోరు + ఆడన్ = మాఱు నీరిచల్లులాట నాడుటకు, చేతులు, చాఁచిన + అట్లు = చాఁచిన విధముగా, తరఁగలు = అలలు, ఓలిన్ + అ = క్రమముగా, కలయన్ = అంతటను, ఎగసెన్ = లేచెను

**తాత్పర్యము:** స్త్రీలు విలాసముతో నొక్కమాఱుగా వెడలి జలక్రీడలాడుటకు సరస్సును బ్రవేశింపఁగనే వారిపై జలదేవతలుగూడ మాఱునీరిచల్లులాట నాడుటకుఁ జేతులు చాఁచిరా యనునట్లు అలలు క్రమముగా అంతటను లేచెను

**విశేషములు :** అలంకార ముత్ప్రేక్ష

వ తదవసరంబున 79

**అర్థతాత్పర్యములు.** ఆ సమయమున -తరువాతి పద్యముతో నన్వయము

సీ కర మొప్పఁ గాముకకామినీతతి ప్రీతిఁ
గూడి జలక్రీడలాడఁ దొడఁగి
పంకజాకరములోఁ గ్రుంకి యాడెడువారు
వేడుకఁ జల్లుఁబోరాడువారు
ననురాగమున నీఁది యాడెడు వారు నా
హ్లాదంబుతో నోలలాడువారుఁ
బెనఁగి యొండొరుఁ బట్టుకొని ముంచువారు నొం
డొరులపై జలధార లొత్తువారుఁ

ఆ గమల మృదుబిసములు కల్హారకుముదోత్ప
లములుఁ బెటికికొని నయమునఁ బ్రణయ
మొదవ సంకులముగ నొండొరుతో వాదు
లాడువారుఁ దన్నులాడువారు 80

**అర్థము .** కాముక - కామినీ - తతి = ప్రేమికులైన పురుషుల స్త్రీల సమూహము, కరము + ఒప్పన్ = మిక్కిలి ఒప్పునట్లు, ప్రీతితోన్ = సంతోషముతో, కూడి, జల-క్రీడలు + ఆడన్, తొడఁగి = పూని,

పంకజ + ఆకరములోన్ = తామరకొలనిలో, క్రుంకి = మునిఁగి, ఆడెడువారున్, వేడుకన్ = వేడుకతో, చల్లు + పోరు + ఆడువారున్ = ఒకరిపై నొకరు నీరుచల్లుకొనునాట ఆడువారును

అనురాగమునన్ = ఇష్టముతో, ఈఁది, ఆడెడువారున్, ఆహ్లాదంబుతోన్= సంతోషముతో, ఓలలాడువారున్ = జలక్రీడలాడువారును,

పెనఁగి = పోరి, ఒండొరున్ = ఒకరినొకరు, పట్టుకొని, ముంచు - వారున్, ఒండొరులపైన్ = ఒకరి మీఁద నింకొకరు, జల-ధారలు = నీటిధారలు, ఒత్తువారున్= కొట్టువారును

కమల - మృదు - బిసములు = తామరల మెత్తని తూఁడులు, కల్హార - కుముద - ఉత్పలములున్ = సౌగంధికములు, తెల్లకలువలు, కలువలును, పెటికికొని = పెల్లగించి, నయమునన్ = బాగుగా, ప్రణయము = ప్రేమము,

ఒదవన్ = కలుగఁగా, సంకులముగన్ = క్రమములేకుండ, ఒండొరులతోన్ = ఒకరితో నొకరు, వాదులు + ఆడువారున్ = వాదించుకొనువారును, తన్నులు + ఆడువారున్ తన్నుకొనువారును

**తాత్పర్యము .** విటవిటీజనులు ప్రీతితోఁగూడి జలక్రీడలాడఁ బూని పద్మాకరములో మునిఁగి ఆడువారును, వేడుకతో నీరు చల్లుకొను ఆటలాడువారును, ఇష్టముతో నీఁదియాడువారును, ఆహ్లాదముతో ఓలలాడువారును, పోరి ఒకరి నొకరు పట్టుకొని ముంచువారును, ఒకరిపై నొకరు జలధారలు పోసికొనువారును, తామరతూండ్లు, సౌగంధికములు, తెల్లకలువలు, కలువలు పీఁకి ప్రేమము కలుగునట్లు ఒకరితో నొకరు బాగుగా వాదించుకొనువారును, ఒకరినొకరు తన్నుకొనువారును

**విశేసములు :** అలంకారము స్వభావోక్తి

**క     వరసతులుఁ బతులుఁ గడలడి**
**పురుడునఁ దమలోనఁ జల్లుఁబోరాడ సరో**
**వరజలము లోడి దివి కు**
**ప్పర మెగసిన కరణిఁ గొలను బయలుగ నెగసెన్     81**

**అర్థము.** వరసతులన్ - శ్రేష్ఠురాండ్రయిన స్త్రీలును, పతులున్ = భర్తలును, కడలడి = అలల సమూహము, పురుడునన్ = సమముగా, తమలోనన్ = చల్లుఁబోరాడన్ = నీరుచల్లుకొను ఆటలాడఁగా, సరోవర - జలములు = కొలని నీరములు, ఓడి, దివికిన్ = ఆకాశమునకు, ఉప్పరము + ఎగసిన - కరణిన్ = మీఁది కెగిరిన విధమున, కొలను = సరస్సు, బయలుగన్ = శూన్యప్రదేశము అగునట్లు, ఎగసెన్ = ఎగిరెను

**తాత్పర్యము :** స్త్రీలును దత్పతులును, అలల సమూహమును దమలోఁ దాము సమముగా ఒకరిపై నొకరు నీరుచల్లుకొను ఆటలాడఁగా, సరస్సు జలములు ఓడి ఆకాశముమీఁది కెగిరెనా యన సరస్సు శూన్యప్రదేశమగునట్లు, ఎగిరెను

**విశేషములు :** అలంకార ముత్ప్రేక్ష

చ గురుకుచ వక్త్ర నేత్ర గతి కుంతల బాహులతాధరంబులన్
బరువడిఁ బోలియున్కిఁ గని బాలిక లల్గి యడంచి రొక్కొ నా
నురుతర చక్రవాక జలజోత్పల మత్తమరాళి కాలి భా
సుర బిస బంధుజీవ తతి చూడ నదృశ్యము లయ్యె నయ్యెడన్ 82

**అర్థము :** బాలికలు = స్త్రీలు, (తమ) గురు = పెద్దవియగు, కుచ = స్తనములను, వక్త్ర = ముఖమును, నేత్ర = కన్నులను, గతి = నడకను, కుంతల = శిరోజములను, బాహు - లతా = తీవలవంటి చేతులను, అధరంబులన్= క్రింది పెదవులను, పరువడిన్ = క్రమముగా, పోలి + ఉన్కిన్ = పోలియుండుటను, కని = చూచి, అల్గి = కోపించి, అడంచిరి + ఒక్కొ - నాన్ = అణఁచివైచిరా యనునట్లు, ఉరుతర = పెద్దవియగు, చక్రవాక = జక్కవల, జలజ = పద్మముల, ఉత్పల = కలువల, మత్త - మరాళికా= మదించిన హంసంల, అలి = తుమ్మెదల, భాసుర = ప్రకాశించు, బిస = తామర తూండ్ల, బంధుజీవ = మంకెన పూవుల, తతి = సమూహము, చూడన్ = చూడఁగా, అయ్యెడన్ (ఆ + ఎడన్) = ఆ సమయమున, అచ్చట, అదృశ్యములు = మాయమైనవి, అయ్యెన్

**తాత్పర్యము .** కొలనిలో జలక్రీడలాడు బాలికలు తమ పెద్ద స్తనములను, కేలుఁదీవలను, క్రింది పెదవులను, క్రమముగాఁ బోలి యుండుటఁ జూచి, కోపించి, అణఁచివైచిరా యన, పెద్దవియగు చక్రవాకములు, పద్మములు, కలువలు, మదించిన అంచలు, తుమ్మెదలు, తామరతూండ్లు, మంకెన పూలు అనువాని సమూహము అచ్చో మాయమయ్యెను

**విశేషములు :** అలంకారము యథాసంఖ్యము, ఉత్ప్రేక్ష బంధుజీవము జలపుష్పమని దీనివలనఁ దెలియుచున్నది

చ. నెలఁతలు కొంద ఱక్కొలని నీరులలోపలఁ గ్రుంకి పోయి మై
బలసిన భూషణద్యుతులు పర్వఁగ నొక్కట లేచి రక్కడన్
వెలుఁగుచు నాగకన్యకలు వేడుకతో జలకేళి సల్పఁగా
నొలసి రయంబున న్నెగసిరో యని చూపఱు మెచ్చి చూడఁగన్ 83

**అర్థము :** నెలఁతలు - కొందఱు స్త్రీలు కొంతమంది, అక్కొలని (ఆ + కొలని) - నీరుల - లోపలన్ = ఆ సరస్సు నీరములలో, క్రుంకి - పోయి = మునిఁగిపోయి, మైన్ = శరీరమున, బలసిన = చుట్టుకొన్న, భూషణ- ద్యుతులు

అలంకారముల కాంతులు, పర్వఁగన్ = వ్యాపింపఁగా, అక్కడన్, వెలుఁగుచున్ = ప్రకాశించుచు, నాగ-కన్యకలు = పాఁపపడుచులు, వేడుకతోన్, జల - కేళి = జలక్రీడ, సల్పఁగాన్ = చేయుటకు, ఒలసి = ప్రవేశించి, రయంబునన్ = శీఘ్రముగా, నెగసిరో + అని = లేచిరోయని, చూపఱు = చూచువారు, మెచ్చి చూడఁగన్, ఒక్కటన్ = ఒక్కమాఱుగా, లేచిరి

**తాత్పర్యము .** కొంతమంది స్త్రీలు ఆ కొలని నీరములలో మునిఁగి శరీరములందుఁ జుట్టుకొన్న అలంకారముల కాంతులు వ్యాపింపఁగా నచ్చటఁ బ్రకాశించుచు, పాఁపపడుచులు వేడుకతో జలక్రీడలాడఁజొచ్చి వెంటనే లేచిరో యని చూచువారు మెచ్చి చూడఁగా, నొక్కమాఱుగా లేచిరి

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష

**క** **స్తనములు సకుంతలాస్యము**
**వనములపైఁ దోఁప వికచవనజంబును మూఁ**
**గు నళులఁ గవచక్కవ తో**
**కొనుక్రియ వెల్లిఁత యీఁదెఁ గోమలి కొలనన్** 84

**అర్థము :** స్తనములున్ = చన్నులును, సకుంతల + ఆస్యమున్ = శిరోజములతోఁగూడిన ముఖమును, వనములపైన్ = నీరులపై, తోఁపన్ = కనఁబడఁగా, వికచ - వనజంబును = వికసించిన పద్మమును, మూఁగు + అళులన్ = మూఁగు తుమ్మెదలను, కవ - చక్కవ = (కవ జక్కవ ?) = చక్రవాకముల జంట, తోకొను - క్రియన్ = తోడుకొను విధమున, కోమలి = స్త్రీ, కొలనన్ = సరస్సునందు, వెల్లిఁత = వెల్లికిలఁబరుండి యీఁదుట, ఈఁదెన్

**తాత్పర్యము .** స్తనములను, శిరోజములతోఁ గూడిన ముఖమును నీటిపైఁ గనఁబడఁగా, వికసించిన పద్మమును మూఁగెడి తుమ్మెదలను జక్కవ కవ తోడుకొనులాగున నొక కోమలి కొలనియందు వెల్లకిలఁబరుండి యీఁదెను

**విశేషములు .** ఈ పద్యమున 'మూఁగు నళులఁగవ చక్కవ చేకొను క్రియ' ననుభాగము వావిళ్లవారి ప్రతిలోఁ గుండలీకరణములలో నున్నది మా రా ప్రతిలో మొదలే లేదు చక్కవ శబ్దము నిఘంటువుల లేదు అది జక్కవ యయి యుండునని వ్యాఖ్యానింపఁబడినది అలంకారము ఉత్ప్రేక్ష వనము = (నానా) నీరు, తోఁట, మూఁగునళులన్ = మూఁగు + అళులన్ 'ఉదంతమగు తద్ధర్మార్థ విశేషణమున కచ్చు పరమగునపుడు నుగాగమం బగు ' బాల సంధి 33

క అలి రణితాబ్జముఁ గని చెలి
పిలిచెనొ యని దాసి యెఱిఁగి, పిఱుసని, చెలి తన్
బిలిచిన నెఱుఁగుదు నప్పటి
జలజమ వని యీఁది ముగ్ధ చని దరి యెక్కెన్ 85

**అర్థము** ముగ్ధర్థ = ఒక గోల - అమాయకురాలు, అలి - రణిత + అబ్జమున్ = తుమ్మెదల రొదతోఁగూడిన పద్మమును, కని = చూచి, చెలి = సఖి, పిలిచెనొ + అని = పిలిచెనేమోయని, దాసి = డాసి = సమీపించి, ఎఱిఁగి = అది చెలి పిలుచుట కాదు, తుమ్మెదల రొదతోడి పద్మము అని తెలిసి, పిఱు + చని = వెనుకకుఁబోయి, చెలి = సఖి, తన్ = తన్ను, పిలిచినన్ = పిలువఁగా, ఎఱుఁగుదున్, అప్పటి - జలజమవు = మునుపటి తామరవు, అని, ఈఁది, చని, దరి = ఒడ్డు, ఎక్కెన్

**తాత్పర్యము .** ఒక ముద్దరాలు తుమ్మెదలరొదతోడి పద్మమును జూచి తన్నుఁ జెలి పిలిచినదా యని, సమీపించి, అది చెలి పిలుచుట కాదు, తుమ్మెదల రొదతోడిపద్మమనునిజమునెఱిఁగి వెనుకకుఁ బోయి, చెలి తన్ను నిజముగాఁ బిలిచినప్పుడు నాకుఁ దెలియునులే నీవు మునుపటి పద్మమవే' అని వెడలి ఒడ్డునెక్కెను

**విశేషములు .** అలంకారము భ్రాంతిమంతము ఆమె ముగ్ధ కావుననే అట్టి భ్రాంతికి లోనయినది ముగ్ధా శబ్దము (విశేష్యము - సాభిప్రాయము గావున నలంకారము పరికరాంకురము

క జలజంబులలో నీలో
త్పలములు పూచె నని ముగ్ధభావన దృగ్దీ
ప్తులు గల యొండొరులు మొగం
బులు కౌతుకలీలఁ బుడుకఁబోదురు తమలోన్ 86

**అర్థము .** దృశ్ (క్) + దీప్తులు = చూపుల కాంతులు, కల = ఉన్న, ఒండొరులు = ఒకరొకరు, ముగ్ధ - భావనన్ = అమాయకత్వముతో, జలజంబులలోన్= పద్మములలో, నీల + ఉత్పలములు = నల్ల కలువలు, పూచెన్, అని, తమలోన్ = పరస్పరము, కౌతుక - లీలన్ = వేడుకతో, మొగంబులు = ముఖములు, పుడుకన్ + పోదురు = పట్టకొనఁబోవుదురు

**తాత్పర్యము.** కన్నుల కాంతులు గల ఒక్కరొకరు అమాయకపు టూహతోఁ బద్మములలో నల్లకలువలు పూచెనని పరస్పరము కుతూహలముతో తమతమ ముఖములను పట్టుకొనఁబోవుదురు

**విశేషములు .** ఆ స్త్రీల ముఖములు పద్మములవలెను, వారి కన్నులు (చూపులు) నల్ల కలువల వలెను నున్నవని భావము అలంకారము భ్రాంతిమంతము వారికి ముఖమ్ములందుఁ బద్మభ్రాంతి, దృక్కులయందు నీలోత్పలభ్రాంతి, ఒండొరుల మొగంబులు' అను వావిళ్ల, మా రా ప్రతులలోని పాఠమును వీడి, సాహిత్య అకా ప్రతిలోని 'ఒండొరులు' అనుపాఠమును గ్రహించుట 'పుడుకఁబోదురు' అనుక్రియకుఁ గర్త సిద్ధించుటకు

'బాలే తమ ముఖామ్భోజే దృష్ట కాళిన్దీవరద్వయమ్ ' కాళి

తే
**తమ ముఖంబులు దళితాంబుజములు సావి**
**మూవు తేఁటులఁ గని నవ్వు నా విలాస**
**వతుల దరహాసరుచి మధువ్రతము లెఱిఁగి**
**వెల్లనై పద్మషండంబు వెలరి చనియె. 87**

**అర్థము .** తమ - ముఖంబులు, దళిత + అంబుజములు సావి = వికసించిన పద్మములు అను భ్రాంతితో, మూవు = మూఁగునట్టి, తేఁటులన్ = తుమ్మెదలను, కని = చూచి, నవ్వు, ఆ - విలాసవతుల = ఆ యొయ్యారుల యొక్క, దర -హాస '- రుచిన్ = చిఱునవ్వు కాంతిని, మధువ్రతములు= తుమ్మెదలు, ఎఱిఁగి = తెలిసి, వెల్లనై (వెల్లన + ఐ) = వెలవెలఁబాఱి, వెలరి = వెలువడి, చనియెన్ = పోయెను

**తాత్పర్యము .** కమలసమూహములోనున్న తుమ్మెదలు ఆ యింతుల ముఖములను జూచి వికసించిన పద్మములని భ్రాంతిఁజెంది మూఁగినవి వానిని జూచి ఆ విలాసవతులు చిన్నగా నవ్విరి అప్పుడు తుమ్మెదలు అది పద్మవికాసము కాదు చిఱునగవుకాంతియని తెలిసికొని వెలవెలఁబాఱి తామరతోఁపునుండి వెలువడి యేఁగెను

**విశేషములు :** అలంకారము భ్రాంతిమంతము దరహాసరుచితోఁ గూడిన ఆ స్త్రీల ముఖములందుఁ దుమ్మెదలకు దళితాంబుజభ్రాంతి ముఖములు పద్మములవలెను, చిఱునవ్వు తద్వికాసము వలెను ఉన్నవని భావము 'వెల్లనై' =

తెల్లనై పద్మషండములో నున్న తుమ్మెదలకుఁ దద్రజస్సు అంటుకొని తెల్లనగుటను దాము తలఁచినట్లుకామికి వెలవెలఁబోవుటగాఁ గవి చమత్కరించినాఁడు

చ తన ముఖ మంబుజాత మని తందడి మూవు నలివ్రజంబుతోఁ
బెనఁగు విదగ్ధ మ్రోల నొక బేలుసతిం గని యోలఁబెట్టి పి
ల్చిన నది తన్నుఁ బట్టనని చేరినఁ దేఁటులదాని మూవి కొం
డనుచును గ్రుంకి పోయి చదురాలయి నవ్వుచు లేచె నొక్కెడన్ 88

**అర్థము**. ఒక్కెడన్ = ఒక్క+ ఎడన్ = ఒక చోట, తన - ముఖము, అంబుజాతము + అని = పద్మమని, తందడిన్ = దందడిన్ (?) = తఱుచుగా, మూవు = మూఁగునట్టి, అలి-వ్రజంబుతోన్ = తుమ్మెదల గుంపుతో, పెనఁగు = పోరునట్టి, విదగ్ధ = నేర్పరి, మ్రోలన్ = చేరువను, ఒక, బేలు - సతిన్ =ముగ్ధయైన స్త్రీని, కని, ఓలన్ + పెట్టి = కేకవైచి, పిల్చినన్ = పిలువఁగా, అది = ఆ ముగ్ధ, తన్నున్ = ఆ పిలిచిన యామెను, పట్టన్ + అని = పట్టుకొనుటకని, చేరినన్ = చేరఁగా, తేఁటులన్ = తుమ్మెదలను, దానిన్ = ఆ వచ్చిన యామెను, మూవికొండు = మూఁగికొనుఁడు, అనుచును, క్రుంకి = మునిఁగి, పోయి, చదురాలు + అయి (చదురు + ఆలు + అయి) = నేర్పు గలది యయి, గడుసుదయి, నవ్వుచున్, లేచెన్

**తాత్పర్యము**. ఆ కొలనిలో నొకచోటఁ దన ముఖము పద్మమని భ్రాంతిపడి తఱుచుగా మూఁగెడి తుమ్మెదల గుంపుతోఁ బోరాడు నొక నేర్పరియైన యింతి తనకుఁ జేరువనున్న మఱియొక ముగ్ధను జూచి ఓలయని పిలిచెను ఆ ముగ్ధ ఆమెను రక్షించుటకుఁ జేరెను అప్పు డావిదగ్ధ తేఁటులతో 'దానిని మూఁగికొనుఁ' డని తాను నీట మునిఁగి నేర్పుగలదయి నవ్వుచు లేచెను

**విశేషములు**. తుమ్మెదలకు విదగ్ధ ముఖమునందుఁ బద్మభ్రాంతి కావున నలంకారము భ్రాంతిమంతము మోసగించుటకే మఱియొకతెను బిలుచుటయే ఆమె విదగ్ధత పిలువఁగనే చేరి మోసగింపఁబడుటయే మఱియొకతె బేలుతనము మూఁగు - మూవు 'అపదాద్యంబయి యసంయుక్తంబయిన గకారంబునకు వకారంబు విభాష నగు' బాల అచ్చిక 27 చదురాలు - చదురు + ఆలు పేదాదులలో వలె రుగాగమము కాకుండుట విశేషము

చ అలికలితాంబుజంబు ప్రియునానన మన్వగ హస్తయంత్రధా
రలు మొగిఁబేర్చు ముగ్ధఁగని రాగమునం బతి నవ్వుడుం దదు
జ్జ్వలతర దంత దీధితులు వచ్చుటఁ గాంచి నిజేశుపేర్చుని
ర్మల జలధార లొక్కొయని మానిని త్రిప్పె ముఖాబ్జ మక్కడన్ 89

**అర్థము** అక్కడన్ = ఆ కొలనిలో, అలి - కలిత + అంబుజంబు = తుమ్మెదలతోఁగూడిన పద్మము, ప్రియు + ఆననము = తన ప్రియుని యొక్క ముఖము, అన్వగన్ (అను+వగన్) = అనెడి తలఁపుతో, హస్త - యంత్ర - ధారలు = చేతి చిమ్మన గ్రోవిజలధారలు, మొగిన్ = పూనికతో, పేర్చు = వ్యాపింపఁజేయు, ముగ్దన్ = అమాయకురాలిని, కని, పతి = భర్త, రాగమునన్ = ప్రేమముతో, నవ్వుడున్ = నవ్వినంతనే, తద్ + ఉజ్వలతర - దంత-దీధితులు= అతని మిక్కిలి ప్రకాశవంతములయిన పలు కాంతులు, వచ్చుటన్, కాంచి, నిజ + ఈశు = తన భర్తయొక్క, పేర్చు = విజృంభించు, నిర్మల - జల - ధారలు + ఒక్కొ + అని, = నిర్మలములయిన నీటిధారలా యని, మానిని = స్త్రీ, ముఖాబ్జము (ముఖ + అబ్జము) = తామరవంటి మోము, త్రిప్పెన్

**తాత్పర్యము.** ఆ కొలనిలోఁ దుమ్మెదలతోఁ గూడిన పద్మమును జూచి తన ప్రియుని ముఖ మను భ్రాంతితోఁ జేతి చిమ్మన గ్రోవితో జలధారలను జిమ్ము ముగ్ధను జూచి 'తత్పతి ప్రేమముతో నవ్వినంతనే, అతని ఉజ్జ్వలతరములయిన దంతకాంతులు ప్రసరించుటఁ జూచి అవి తన భర్త తనపైఁ జిమ్ము నిర్మలజలధారలా యని భ్రాంతిపడి, ఒక స్త్రీ తన మోముఁదమ్మిని ద్రిప్పుకొనెను

**విశేషములు** ఆమె ముగ్ధ కావుననే అలికతాంబుజమునందు ఆమెకుఁ బ్రియాననభ్రాంతి మఱియు నతని దంతకాంతులందు నిర్మల జలధారా భ్రాంతి ప్రియునాననము - ప్రియు + ఆననము - 'షష్ఠీసమాసమునం దుకార ఋకారముల కచ్చు పరమగునపుడు నుగాగమంబగు ' బాల సంధి 34 అన్వగ + అను + వగ 'అను కొను లోనగు ధాతుజవిశేషణముల యంత్యోకారమునకు హల్లు పరంబగునపుడు లోపంబు వైకల్పికంబు ' ప్రౌఢ సంధి 13

వ ఇ ట్లనేకు లనేకప్రకారంబులం గ్రీడాసక్తులై విహరించుచుండి రంత 90

**అర్థము** ఇట్లు అనేకులు = పెక్కండ్రు, అనేక - ప్రకారంబులన్ = పెక్కు రీతుల, క్రీడా + ఆసక్తులు + ఐ = జలక్రీడలందుఁ గోరిక గలవారయి, విహరించుచున్ + ఉండిరి = క్రీడించు చుండిరి, అంతన్

**తాత్పర్యము** ఈ విధముగాఁ బెక్కురు పెక్కురీతుల జలక్రీడలయందుఁ గోరిక గలవారయి క్రీడించుచుండిరి అంత - తరువాతి పద్యముతో నన్వయము

సీ. సంధిల్లి మేనుల బంధూక దళములు
పద్మరాగాకల్పభాతి గాఁగ
మెఱుఁగారు తనువులఁ దఱఁకిన జలబిందు
లమల ముక్తాభూషణములు గాఁగఁ
బొలయు లేఁదరఁగల జలజపరాగంబు
గురుకుచాగ్రముల కుంకుమము గాఁగ
సహజాంగపరిమళసక్తాలిమాలిక
లమరేంద్రనీలహారములు గాఁగఁ

తే. బడఁతు లేపునఁ బద్మిని యొడమి యెల్లఁ
జూఱఁగొని పేర్చి మనమునఁ జొక్కు మిగిలి
విటజనంబులపైఁ బరి వెడలునట్లు
కొలను వెడలిరి జలకేళివలనఁ దనిసి 91

**అర్థము**. బంధూక - దళములు = మంకెనపూలరేకులు, మేనులన్= శరీరములందు, సంధిల్లి = కూడి, పద్మరాగ + ఆకల్ప - భాతి = పద్మరాగమణుల ఆభరణముల విధము, కాఁగన్

మెఱుఁగారు = ప్రకాశించు, తనువులన్= శరీరములందు, తఱఁకిన = వ్యాపించిన, జల - బిందులు=నీటిబిందువులు, అమల - ముక్తా - భూషణములు = నిర్మలములయిన ముత్యాల ఆభరణములు, కాఁగన్

పొలయు = ఒప్పునట్టి, లేఁదరఁగలన్ (లేఁత + తరఁగలన్) = చిఱుత అలలందలి, జలజ - పరాగంబు = పద్మముల రజస్సు, గురు - కుచ + అగ్రముల కుంకుమము = పెద్దవియగు స్తనముల కొనలందలి కుంకుమము, కాఁగన్

సహజ + అంగ - పరిమళ - సక్త +అలి - మాలికలు = స్వాభావికమైన శరీర సువాసనయందుఁ గోరిక గల తుమ్మెదల బారులు, అమర + ఇంద్రనీల హారములు = ఇంద్రనీలమణుల హారములు, కాఁగన్

పడఁతులు = ఇంతులు, ఏపునన్ = విజృంభణముతో, పద్మిని + ఒడమి + ఎల్లన్ = పద్మలత సంపద యంతయు, చూఱగొని = కొల్లగొట్టి, పేర్చి = విజృంభించి, మనమునన్ = మనసునందు, చొక్కు = పారవశ్యము, మిగిలి = అధికమయి, విట - జనంబులపైన్ = విటకాండ్రపై, పరివెడలు + అట్లు =

దండువెడలిన విధమున, జల-కేళి-వలనన్ = జలక్రీడయందు, తనిసి = తృప్తిచెంది, కొలను - వెడలిరి = కొలని నుండి వెలువడిరి

**తాత్పర్యము.** మంకెనపూల రేకులు శరీరములందు అంటి పద్మరాగమణుల ఆభరణముల రీతి కాఁగా, ప్రకాశించు శరీరముల వ్యాపించిన జలకణములు నిర్మలములైన ముత్యాల అలంకారములుగాఁగా, లేయలలందలి పద్మముల పుప్పొడి పెద్ద స్తనముల కొనలందలి కుంకుమము కాఁగా, స్వాభావికమైన శరీరపరిమళమునందుఁ గోరిక గల తుమ్మెదల బారులు ఇంద్రనీల మణుల హారములు కాఁగా, స్త్రీలు పద్మలత సంపదయంతయును గొల్లగొట్టి విజృంభించి మనస్సునఁ బారవశ్య మతిశయింప విటులపై దండువెడలునట్లు జలక్రీడయెడఁ దృప్తినొంది కొలను వెలువడిరి

**విశేషములు :** అలంకారము రూపకము, ఉత్ప్రేక్ష కొలను వెడలిరి 'అపాయ భయ జుగుప్సా పరాజయ ప్రమాద గ్రహణ భవన త్రాణ విరామాంతర్ధి వారణంబు లెద్దాననగు దానికి వలన వర్ణకంబగు ' బాల కారక 9 కొలను వలన వెడలిరి 'ఉండి పదం బొకానొకచో వలనవర్ణకంబున కనుప్రయుక్తంబగు' బాల కారక 10 కొలను వలన నుండి వెడలిరి ఉండి శబ్దము పరంబగునపుడు వలనకు ద్వితీయాసప్తములు ప్రాయికంబుగ నగు ' బాల కారక 11 కొలని నుండి వెడలిరి 'వలన కాదేశంబగు ద్వితీయాసప్తముల మీఁది యండికి లోపంబు బహుళంబుగా నగు ' ప్రౌఢ కారక 11 కొలను వెడలిరి జలకేళి వలనఁ దనిసి - జలకేళి వలనఁ దగిలి యను పాఠముకంటె నీ పాఠము మేలుగాఁ గనిపించుటచే నది స్వీకరింపఁబడినది తనిసిన పిమ్మటనే గదా కొలను వెలువడుట !

**వ తదవసరంబున 92**

**అర్థతాత్పర్యములు :** తద్ + అవసరంబునన్ = ఆ సమయమున - తరువాతి పద్యముతో నన్వయము

**ఉ అంబర నామధేయ ముచితార్థముగా జలసిక్తమై దుకూ**
**లంబు లదృశ్య మయ్యెఁ గడు లజ్జఁ జలింప, సతుల్ విటాలి మో**
**హంబునఁ జూడ, గాలిఁ దడియాఱి త దంబరముల్ కటి ప్రదే**
**శంబునఁ బొల్చెఁ దత్సతులు సంతసమందఁ విటాలి వందఁగన్ 93**

**అర్థము** అంబర - నామ ధేయము = వస్త్రమునకు అంబరము (ఆకాశము) అనుపేరు, ఉచిత + అర్థము + కాన్ = తగిన అర్థమగునట్లు - సార్థకమగునట్లు, దుకూలంబులు = సన్నని వస్త్రములు, జల-సిక్తము + ఐ = నీటఁదడిసినవయి, సతుల్ = స్త్రీలు, కడున్ = మిక్కిలి, లజ్జన్ = సిగ్గుతో, చలింపన్ = కదలఁగా, విట + ఆలి = విటుల సమూహము, మోహంబునన్ = వలపుతో, చూడన్ = చూడఁగా, అదృశ్యము + అయ్యెన్ = కనఁబడకపోయెను సన్ననివి కావునఁ దడిసి వస్త్రములు లేనియట్లే యుండెను గాలిన్ = గాలిచే, తడి + అఱి =తడి ఆఱిపోయి - పొడివి అయి, తద్ + అంబరముల్ = ఆ వస్త్రములు, తద్ + సతులు = ఆ స్త్రీలు, సంతసము + అందన్ - సంతోషింపఁగా, విట + ఆలి = విటుల సమూహము, వందఁగన్ = దుఃఖింపఁగా, కటి - ప్రదేశంబులన్ = జఘన స్థలములందు, పొల్చెన్ = ఒప్పెను

**తాత్పర్యము :** స్త్రీలు కొలనిలో స్నానము చేసినప్పుడు వారు ధరించిన సన్నని వస్త్రములు శరీరమున కంటుకొనిపోయి లోపలి అవయవములు పైకిఁ గనఁబడుచు వస్త్రములు లేని యట్లే యుండెను అందుచే అంబరమునకు (వస్త్రమునకు) ఆకాశము (శూన్యము) అను మఱియొక అర్థము సార్థకమయినది లోపలి యవయవములు కనవచ్చుటచే స్త్రీలు సిగ్గుతోఁ జలించిరి విటులు కామముచే సంతోషించిరి ఆ వస్త్రములు గాలికాఱి వారి జఘనప్రదేశముల నొప్పఁగనే, తమ కవయవ గోపనము జరుగుచున్నది గదా యని స్త్రీలు సంతోషించిరి అవయవదర్శనలాభము పోయెనే యని విటులు దుఃఖించిరి

**విశేషములు .** అలంకారము శ్లేషము - స్వభావోక్తి

**వ. అంతం బరమేశ్వరావలోకనాజ్ఞాప్రేరితుండై ధనేశ్వరుండు త దఖిల జనాభిమతాంబరానులేపనాభరణాదు లొసఁగె నయ్యవసరంబున నుమామహేశ్వరు లారామక్రీడావలోకనాసక్తులై లీలోద్యానంబున కరుగుదెంచి రంతకుమున్న వసంతసమయంబున 94**

**అర్థము :** అంతన్, పరమేశ్వర + అవలోకన + ఆజ్ఞా - ప్రేరితుండు + ఐ = ఈశ్వరునియొక్క చూపుఅనెడి ఆజ్ఞచేఁ బ్రేరేపింపఁబడినవాఁడయి, ధన + ఈశ్వరుండు = ధనపతి - కుబేరుఁడు, తద్ + అఖిల - జన + అభిమత + అంబర + అనులేపన + ఆభరణ + ఆదులు = ఆ యెల్ల జనుల కిష్టములైన వస్త్రములు, పూఁతలు, అలంకారములు మున్నగునవి, ఒసఁగెన్ = ఇచ్చెను, అయ్యవసరంబునన్

(ఆ+అవసరంబునన్) ఆ సమయమున, ఉమా - మహేశ్వరులు = పార్వతీ పరమేశ్వరులు ఆరామ - క్రీడా + అవలోకన + ఆసక్తులు + ఐ = వన విహార దర్శనమునందుఁ గోరిక గలవారయి, లీలా + ఉద్యానంబునకున్ = విలాసవనమునకు, అరుగుదెంచిరి = వచ్చిరి, అంతకున్ -మున్ను + అ = అంతకు మునుపే, వసంత - సమయంబునన్

**తాత్పర్యము.** అంత నీశ్వరుని చూపనెడి ఆనచేఁ బ్రేరితుఁడయి కుబేరుఁడు అచ్చటి జనులకు వలయు వస్త్రములు, అనులేపనములు, ఆభరణములు మున్నగునవి యిచ్చెను అప్పుడు పార్వతీపరమేశ్వరులు వనవిహారదర్శనమునం దాసక్తి గలవారయి విలాసవనమునకు విచ్చేసిరి అంతకుమునుపే వసంత సమయమున - తరువాతి పద్యముతో నన్వయము

## పార్వతీశ్వరుల వనవిహారము

క మలయానిలంబు సోఁకినఁ
జలిమిరి సొగయించి భూమిజంబుల యొడళుల్
పులకించినట్లు విడి గుము
రులు గొని యీరికలు గడు మురువుగా నెగసెన్ 95

**అర్థము.** మలయ + అనిలంబు = దక్షిణపు గాలి, సోఁకినన్ = తగులఁగా, చలిమిరిన్ = చల్లఁదనముచే, సొగయించి = సుఖించి - పారవశ్యము చెంది, భూమి జంబుల + ఒడళుల్ = చెట్ల మేనులు, పులకించిన + అట్లు = గగుర్పాటు చెందినవిధమున, విడి = ఎట్టనయి, గుమురులు + కొని = గుంపులు కట్టి, ఈరికలు = అంకురములు, కడున్ = మిక్కిలి, మురువుగాన్ = చక్కఁగా, ఎగసెన్ = లేచెను - పొటమరించెను

**తాత్పర్యము** దక్షిణపు గాలి సోఁకఁగాఁ జల్లఁదనము గలిగి పారవశ్యము చెంది చెట్ల మేనులు గగుర్పొడిచెనా యనునట్లు, అంకురములు ఎట్టనివయి, గుంపులు గట్టి మిక్కిలి చక్కఁగాఁ బొటమరించెను

**విశేషములు.** అలంకార ముత్ప్రేక్ష

క వలరాజున కెత్తిన కెం
దలిరుగొడుగులనఁ దనర్చెఁ దరు లతఁడు వియో
గుల నేయ నమర్చినశర
ముల పాదులన ముకులగుచ్ఛములు పొలు పెసఁగెన్ 96

**అర్థము** తరులు = చెట్లు, వలరాజునకున్ = మన్మధునకు, ఎత్తిన = పట్టిన, కెందలిరుగొడుగులు (కెంపు + తలిరు) + గొడుగులు = ఎఱ్ఱని చివురు గొడుగులు, అనన్, తనర్చెన్ = ఒప్పెను అతఁడు = మన్మధుఁడు, వియోగులన్ = విరహులను, ఏయన్ = కొట్టుటకు, అమర్చిన = ఏర్పఱిచిన,, శరముల - పొదులు = అంపపొదులు, అనన్, ముకుల - గుచ్ఛములు = మొగ్గల గుత్తులు, పొలుపు + ఎసఁగెన్ = ఒప్పు అతిశయించెను - మిక్కిలి యొప్పెను

**తాత్పర్యము .** చెట్లు మన్మధునకుఁ బట్టిన కెంజివురుగొడుగులోయన నొప్పెను అతఁడు వియోగులను గొట్టుట కమర్చిన యంపపొదులో యన మొగ్గల గుత్తులు మిక్కిలి యొప్పెను

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష

ఉ **ఆ వనిమధ్యసంస్థితకుజావలిలో నొకపిన్నపొన్న తొ**
**ల్పూవులు పుట్టి యక్షణమ భూరుహసంతతి మీఁద నెల్ల నె**
**త్తావి రయంబునన్ నెగసి తందడిఁ గప్పిన మ్రానుమ్రానికిం**
**బూవులు లేకయున్ సుడిసెఁ బుష్పలిహాలి సుగంధలుబ్ధమై** 97

**అర్థము .** ఆ - వని - మధ్య - సంస్థిత - కుజ + ఆవలిలోన్ = ఆ వనము నడుమనున్న చెట్లవరుసలో, ఒక - పిన్న - పొన్న = ఒక చిన్న పొన్నచెట్టు, తొల్ + పూవులు = మొదటిపూఁత, పుట్టి, అక్షణము + అ = వెంటనే, భూరుహ - సంతతి= మీఁదన్ = చెట్ల సమూహముపై, ఎల్లన్ = అంతటను, నెత్తావి (నెఱ + తావి) = నిండు పరిమళము, రయంబునన్ = వేగముగా, నెగసి = లేచి, తందడిన్ = దందడిన్ = అధికముగా, కప్పినన్ = క్రమ్మఁగా, మ్రానుమ్రానికిన్ = చెట్టు చెట్టునకు, పూవులు - లేకయున్ = పూవులు లేకున్నను, పుష్పవిహాలి (పుష్పలిహ + ఆలి) = తుమ్మెదలవరుస) సుగంధ - లుబ్ధము + ఐ = పరిమళమునందు లోభము గలదియై, సుడిసెన్ = తిరిగెను

**తాత్పర్యము .** ఆ వనమునడుమనున్న చెట్ల వరుసలో నొకచిన్న పొన్నచెట్టు మొదటిసారిగాఁ బూసి వెంటనే పరిమళము పుట్టి చెట్ల సమూహముపై నెల్ల అధికముగాఁ గ్రమ్ముకొనఁగాఁ దుమ్మెదలగుంపు పరిమళమునందు లోభము గలదయి చెట్టు చెట్టునకును బూవులు లేకున్నను భ్రమించెను

**విశేషములు** అలంకారము విభావన 'విభావనా వినాపి స్యాత్ కారణం కార్యజన్మచేత్' చంద్రా కారణములేకుండఁగనే కార్యము గలిగినట్లు చెప్పుదుమేని విభావనాలంకార మగును ఇచ్చటఁ బూవు లను కారణములేకున్నను తుమ్మెదలు భ్రమించుట అనుకార్యము జరిగెను నెత్తావి - నెఱ + తావి 'అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి' బాల సంధి 39 ప్రామన్రమానికిన్ - 'వీప్సయందును గాలపరిమితియందును నామంబులకుఁ గువర్ణకం బగు' ప్రౌఢ కారక 14 'పుష్పలిట్' శబ్దము హకారాంతముగానే కాక, అకారాంతముగాఁ గూడఁ గలదని సూ ని హకారాంత మయినచో - పుష్పలిట్ + ఆలి = పుష్పలిడాలి యనియు, అకారాంత మయినచో పుష్పలిహాలియనియు నగును

**వ** **అంత ననంత తరు గుల్మ లతానీకంబు లొండొంటికి మీఱిన ట్లనూన ప్రసూనవికాసప్రసవాభిరామంబులైన** **98**

**అర్థము .** అంతన్, అనంత - తరు - గుల్మ - లతా + అనీకంబులు = అంతములేని చెట్ల, పొదల, తీఁగల సమూహములు, ఒండొంటికిన్ = ఒకదానినొకటి, మీఱిన + అట్లు = మించిన విధమున, అనూన - ప్రసూన - వికాస - ప్రసవ + అభిరామంబులు + ఐనన్ = తక్కువకాని (అధికమైన), ప్రసూన = పూలయొక్క, వికాస = వికసించుటచేతను, ప్రసవ = పండ్లచేతను, అభిరామంబులు = మనోహరములు, ఐనన్ = కాఁగా

**తాత్పర్యము :** అంత అంతులేని చెట్ల, పొదల, తీవల సమూహములు ఒకదాని నొకటిమించినవిధమున నధికమైన పూల వికాసముచేతను, పండ్ల చేతను మనోహరములు కాఁగా - తరువాతి పద్యముతో నన్వయము

**ఉ.** **ఆ యవనీరుహోద్గత లతాంత వినిర్గత సౌరభ ప్రవా**
**హాయతి సాంద్రమై ఫలితమై మొగిఁ బర్వెన డాయఁబోవనుం**
**బాయను రాక చుట్టి మధుపవ్రజమాలిక లుండె నొప్పి పు**
**ష్పాయుధశాల చుట్టు మధుఁ డాయసవప్రము వెట్టినట్టిదై** **99**

**అర్థము :** ఆ హాయతి ఆ, అవనీరుహ + ఉద్గత = చెట్లనుండి పుట్టిన,లతాంత = పూవులనుండి, వినిర్గత = బయలువెడలిన, సౌరభ = పరిమళముయొక్క, ప్రవాహ = వెల్లువయొక్క, ఆయతి =నిడుపు, సాంద్రము + ఐ = దట్టమయి, ఫలితము +ఐ = ఫలించినదయి, మొగిన్ = ఎదుట, పర్వినన్ =

వ్యాపింపఁగా, మధుప - వ్రజ - మాలికలు = తుమ్మెదల గుంపుల బారులు, డాయన్+ పోవనున్= సమీపింపఁబోవుటకును, పాయనున్= తొలఁగిపోవుటకును, రాక = అలవికాక, చుట్టి, మధుఁడు = వసంతుఁడు, పుష్ప + ఆయుధ - శాల - చుట్టున్ = పూవుటమ్ముల శాల చుట్టును, ఆయస - వప్రము = ఇనుపకోటగోడ, పెట్టిన + అట్టిది + ఐ = నిర్మించినదానివంటిదయి, ఒప్పి, ఉండెన్

**తాత్పర్యము** ఆ చెట్ల పూలనుండి బయలువెడలిన పరిమళ ప్రవాహము దట్టమయి, ఫలించినదయి యెదుట వ్యాపింపఁగాఁ దుమ్మెదల బారులు సమీపింపలేక, తొలఁగిపోవలేక, చుట్టి, వసంతుఁడు తన పూవుటమ్ముల శాల చుట్టును ఇనుపకోటగోడను పెట్టెనా యనునట్లు ఒప్పియుండెను

**విశేషములు** అలంకార ముత్ప్రేక్ష తుమ్మెదలు సమీపింపఁజాలమికిఁ గారణము అది పరిమళపువెల్లువ చాల నిడుపుగలది పువ్వు లెచ్చుటనో యున్నవి పాయఁజాలమికిఁ గారణము పువ్వులు ఎప్పటికైన లభింపకుండునా యను నాశ తుమ్మెదలు నలుపుగావుననే వప్రము ఆయస మనుట చెట్లు మన్మధుని పుష్పాయుధశాల పుష్పములు మన్మధుని ఆయుధములు గదా ! ఆ శాల కధిపతి వసంతుఁడు దానిలోని కితరులు రాకుండునట్లు వసంతుఁడు దానిచుట్టును ఇనుపకోట పెట్టినట్లు తుమ్మెదలు పూలచెట్టును జుట్టియుండెను

వ మఱియు తరువాతి పద్యముతో నన్వయము 100

సీ అగరు లలాట కాలాగరు తిలకంబు
 కోమల మల్లికా రోమరాజి
మాధవీ హరినీలమణి హారయష్టిక
 పాటలీ మృగమద పత్రరేఖ
పున్నాగ వల్లరీ భ్రూలతా నటనంబు
 నవమాలికాలోల నయన భాతి
సహకారమంజరీ చామరాటోపంబు
 కేసర వల్లీ సుకేశ పాశ

తే. మనఁ గుజము లెన్ని యన్నింట ననలు నెలపి
పాలిచె, నట కొన్నిపైఁ దూలు నళికులముల
నొప్పె, వనదేవతలు వసంతోత్సవమునఁ
దనర నెత్తిన మేచకధ్వజము లనఁగ 101

**అర్థము** అగరు  తిలకంబు అగరు = అగరు వృక్షమనెడు, లలాట = నుదుటి యందలి, కాల + అగరు - తిలకంబు = నల్ల అగులు బొట్టు, కోమల రాజి, కోమల = సుందరమైన, మల్లికా = మల్లెలనెడి, రోమ - రాజి = వెంట్రుకల వరుస,

మాధవీ  యష్టిక మాధవీ = బండిగురివెంద యనెడు, హరి నీల - మణి - హార - యష్టిక = ఇంద్రనీలమణుల పేరు పేట, పాటలీ  రేఖ , పాటలీ = కలిగొట్టు అనెడి, మృగమద - పత్ర -రేఖ = కస్తూరి మకరికాపత్రము,

పున్నాగ  నటనంబు, పున్నాగ - వల్లరీ = సురపొన్న తీఁగయనెడు, భ్రూ - లతా - నటనంబు = బొమతీవ నాట్యము, నవ  భాతి, నవమాలికా = నవమల్లిక యనెడు, లోల = చలించు, నయన = కన్నుల, భాతి = కాంతి

సహకార  పంబు, సహకార - మంజరీ = తీయ మామిడి పూలగుత్తి యనెడు, చామర = వింజామరల యొక్క, ఆటోపంబు = సంరంభము, కేసర పాశము, కేసర - వల్లీ = పొగడతీఁగ యనెడు, సుకేశ - పాశము =మంచి కేశ సమూహము,

అనన్ = అనునట్లు, కుజములు = చెట్లు, ఎన్ని = ఎన్నికలవో, అన్నింటన్ = అన్నిటియందును, ననలు = పువ్వులు, నెలసి = ఉండి, పొలిచెన్ = ప్రకాశించెను, అట - కొన్ని = అక్కడ, కొన్నిపూలు, పైన్ + తూలు = మీఁదఁ జలించు, అలి - కులములన్ = తుమ్మెదల గుంపులతో, వన - దేవతలు, వసంత + ఉత్సవమునన్, తనరన్ = ఒప్పునట్లు, ఎత్తిన, మేచక - ధ్వజములు + అనఁగన్ = నల్లని జెండాలో యనునట్లు, ఒప్పెన్

**తాత్పర్యము .** అగరువృక్షమనెడు నుదుటి నల్లని అగులు బొట్టు, కోమలములైన మల్లికలనెడు రోమావళి, బండి గురివెందయనెడి ఇంద్రనీలమణుల పేరు పేట, కలిగొట్టు అనెడు కస్తూరీ పత్రభంగము, నవమల్లికయనెడు చలించు కన్నుల కాంతి, తీయమామిడి గుత్తులనెడు వింజామరల సంరంభము, పొగడతీఁగ యనెడు కేశపాశము అనురీతిగా నెన్ని చెట్లు గలవో అన్ని చెట్లను పూవులు ప్రకాశించెను అక్కడ కొన్ని పూలు పైనిఁ జలించు తుమ్మెదగుంపులతో వన దేవతలు వసంతోత్సవమున నెత్తిన నల్లనిపతాకలో యనునట్లు ఒప్పెను

**విశేషములు :** అలంకారము రూపకము, ఎత్తుగీతిలో ఉత్ప్రేక్ష

ఉ ఆడుచు, మీఁదఁ బిండుగొని యాదటఁ గ్రొవ్విరు లెక్కి చిట్టుము
ల్వాడుచు, వంత పోవఁ గుసుమాసవ మానుచుఁ గమ్ము తావి నో
లాడుచుఁ బుప్పొడిం బొదలి యాడుచు, గుత్తుల మూవి మట్టిమ
ల్లాడుచు నన్ని యాడె సమదాలికులం బెలమావి మోఁకలన్ 102

**అర్థము.** స - మద + అలి - కులంబు = మదముతోఁ గూడిన తుమ్మెదల సమూహము, ఎల - మావి - మోఁకలన్ = లేఁత మామిడి మొక్కలందు, ఆడుచున్, మీఁదన్ = పైని, పిండు + కొని, గుమిగూడి, ఆదటన్ = ఆసక్తితో, క్రొవ్విరులు (క్రొత్త + విరులు) = క్రొంబూలు, ఎక్కి, చిట్టుముల్వాడుచున్ = దొమ్ములాడుచు, వంత = దుఃఖము, పోవన్ = పోవునట్లు, కుసుమ + ఆసవము = పూఁదేనె, ఆనుచున్ = త్రాగుచు, క్రమ్ము = వ్యాపించు, తావిన్ = పరిమళమునందు, ఓలాడుచున్ = విహరించుచు, పుప్పొడిన్, పొదలి= ఒప్పి, ఆడుచున్, గుత్తులన్ = పూలగుత్తులను, మూవి = మూఁగి, మట్టి మల్లాడుచున్ = త్రొక్కి పెనఁగులాడుచు, అన్ని = మదించి, ఆడెన్

**తాత్పర్యము .** మదించిన తుమ్మెదల సమూహము లేఁతమామిడి మొక్కలందు ఆడుచు, పైని గుంపుగట్టి ఆసక్తితోఁ గ్రొవ్విరు లెక్కి దొమ్ములాడుచు, దుఃఖ ముపశమించునట్లు పూఁదేనె త్రావుచు, వ్యాపించు పరిమళమునందు విహరించుచు, పుప్పొడియందు విహరించుచు, పూలగుత్తులపై మూఁగి త్రొక్కి పెనఁగులాడుచు, మదించి విహరించెను

**విశేషములు .** అలంకారము స్వభావోక్తి క్రొవ్విరులు = క్రొత్త+ విరులు 'సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగా నగు ' బాల సంధి 36 'క్రొ + విరులు. 'క్రొత్త శబ్దమున కాద్యక్షర శేషంబునకుం గొన్ని యెడల నుగాగమంబునుం గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు ' బాల సంధి 38

క మదనోత్సవ మద్రువ మని
సదమలమతి బంధుజీవసంఘం బచిరా
స్పదమని యన్నిటి నొక యలి
వదలి జపాసక్తి నిలిచె వర మునిపోలెన్ 103

**అర్థము .** ఒక + అలి = ఒక తుమ్మెద, మదన + ఉత్సవము = పొగడచెట్టునందలి వేడుక - వసంతోత్సవము, అధ్రువము + అని = అనిశ్చయమని, సత్ + అమల - మతిన్ = నిర్మలమైన మనస్సుతో, బంధుజీవ - సంఘంబు = మంకెనపూల సమూహము - బంధువుల సమూహము, అచిర + ఆస్పదము + అని = చిరకాల ముండునది కాదని, అన్నిటిన్, వదలి, వర - ముని + పోలెన్ = శ్రేష్ఠుఁడయిన మునివలె, జపా + ఆసక్తినన్ = దాసన పుష్పము నందలి - కోరికతో, జప + ఆసక్తిన్ = జపమునందలి కోరికతో, నిలిచెన్

**తాత్పర్యము.** ఒక తుమ్మెద పొగడచెట్టు నందలి వేడుక - వసంతోత్సవము- అనిశ్చయమని, మంకెన పూలగుంపు - బంధు సమూహము - అస్థిరమని, వానినన్నిటిని విడిచి శ్రేష్ఠుఁడైన ముని విధమున దాసన పుష్పమునందలి కోరికతో- జపము నందలి కోరికతో - నిలిచెను

**విశేషములు .** అలంకారము శ్లేషానుప్రాణితోపమ

క నెఱి నలి గోరక మదిలోఁ
గొఱ యగు రస మానలేమిఁ గోరక మదిలోఁ
గఱచుచు వావిరి యైనను
వఱలఁగఁ దమకించు రసము వావిరి యైనన్ 104

**అర్థము :** అలి = తుమ్మెద, కొఱ + అగు = తక్కువగు, రసము = మకరందరసమును, ఆనన్ - లేమిన్ = త్రాగలేకపోవుటచే, నెఱిన్ = పూర్ణముగా, మదిలోన్ = మనస్సునందు, కోరక =వాంఛింపక, కోరకము + అది = ఆ మొగ్గను, లోన్ = లోపల, కఱచుచున్ = కొఱుకుచు, వావిరి + ఐనను = వికసించినది కాగాఁ రసము, వావిరి + ఐనన్ = అధికము కాఁగా, వఱలఁగన్ = ఒప్పుటకు, తమకించున్ = యత్నించును

**తాత్పర్యము:** తుమ్మెద మొగ్గయందలి మకరందమును ద్రావలేకపోవుటచే దానిని బూర్ణముగాఁ గోరక, లోనుండి దానిని గఱచుచు నది వికసించిన పిమ్మట నందు మకరందరస మధికము కాఁగా నొప్పుటకుఁ దొందరపడును

**విశేషములు .** ఇది యింకను విచార్యము ఇందుఁ 'గోరక మదిలో' 'వావిరియైనను' అనువాని యందలి సభంగశ్లేషము గమనింపఁదగినది

వ. తదవసరంబున - తరువాతి పద్యముతో నన్వయము 105

క వనమాలాలంకృతి నురు
మనసిజభవహేతు వగుట మనమునఁ గమలా
త్యనురక్తి సుపర్ణాసన
మున హరినీలరుచి నలులు మురహరుఁ బోలెన్ 106

**అర్థము** . అలులు = తుమ్మెదలు, వన + మాలా + అలంకృతిన్ = తోఁటలయొక్క వరుస అనెడి అలంకారముచేతను - వనమాలా + అలంకృతిన్ = తోమాలె అనెడి అలంకారముచేతను, ఉరు - మనసిజ - భవ - హేతువు + అగుటన్ = అధికమైన మన్మథోద్రేకము యొక్క పుట్టుకకుఁ గారణమగుటచేతను, గొప్పవాఁడైన మన్మథునియొక్క పుట్టుటకుఁగారణ మగుటచేతను, మనమునన్ = మనస్సునందు, కమల + అతి + అనురక్తిన్ = పద్మమునందు మిక్కిలిప్రీతిచేతను - కమలా + అతి + అనురక్తిన్ = లక్ష్మి దేవియందు మిక్కిలి అనురాగముచేతను, సుపర్ణ + ఆసనమునన్ = మంచి ఆకులనెడి ఆసనముచేతను, గరుత్మంతుఁడనెడి ఆసనము చేతను, హరినీల - రుచిన్ = ఇంద్రనీల కాంతిచేతను, మురహరున్ = మురుఁడను రాక్షసునిఁ జంపిన వానిని - విష్ణువును, పోలెన్

**తాత్పర్యము** . తుమ్మెదలు వనమాల (వనముల యొక్క మాల - వరుస) అలంకారముగాఁ గలవి యగుటచేతను, - వనమాల (తో మాలె) అలంకారముగాఁ గలవి యగుటచేతను, అధికమైన మన్మథోద్రేకమునకుఁ గారణ మగుటచేతను - గొప్పవాఁడైన మన్మథుని పుట్టుటకుఁ గారణమగుట చేతను, మనసునఁ బద్మముల యెడఁ బ్రీతి చేతను - లక్ష్మిదేవి యందలి అధికమైన అనురాగము చేతను, మంచిపర్ణము అనెడి ఆసనముచేతను - గరుత్మంతుఁడనెడి ఆసనము చేతను, ఇంద్రనీలమణుల కాంతివంటి దేహకాంతిచేతను విష్ణువును బోలెను

**విశేషములు** . వనమాలాలంకారము, మనసిజభవహేతుత్వము, కమలానురక్తి సుపర్ణాసనత్వము, హరినీలరుచిత్వము అనునవి మురహరుని లక్షణములు కావుననే యివి గల అలులు మురహరుని బోలె ననుట అలంకారము శ్లేషాను ప్రాణితోపమ

**వ ఇ ట్లనూనప్రసూనాభిరామంబై మధుకర నికర క్రీడాకరంబగు నారామంబునం దా రామాసమూహం బభిరామకేళీలాలసలై విహరింపం దొడంగి** 107

**అర్థము .** ఇట్లు, ఆ - రామా - సమూహంబు = ఆ స్త్రీల సమూహము, అనూన - ప్రసూన+ అభిరామంబు + ఐ = తక్కువకాని పూలచే మనోహరమయి, మధుకర - నికర - క్రీడా -ఆకరంబు = తుమ్మెదల సమూహము యొక్క విహారమునకు స్థానము, అగు, ఆరామంబునందున్= ఉద్యానమునందు, అభిరామ - కేళీ - లాలసలు + ఐ = మనోహరములైన క్రీడలయందు ఆసక్తి గలవారయి, విహరింపన్ + తొడంగి = క్రీడింప నారంభించి

**తాత్పర్యము .** ఇట్లు ఎక్కువ పూలచే మనోహరమయి, తుమ్మెదల గుంపుల క్రీడలకు స్థానమయిన ఉద్యానమునందు మనోహరక్రీడలయందాసక్తి గలవారయి ఆ స్త్రీల సమూహము విహరింపనారంభించి - తరువాతి పద్యముతో నన్వయము

**చ. మెలు పొదలించి తీవలకు మేనులఁ, గెం పొదవించి మోవులం**
**దలిరుల, కోలి మొగ్గలకు దంతరుచి న్మెఱుఁగూన్చి, నవ్వులన్**
**మలరుల కిచ్చి హాస్యరస, మన్నుల చె న్నమరంగఁ బెక్కు రే**
**ఖలఁ దమతోడ నాడు గెడకత్తియ కాఁ గయిసేసి రామనిన్ 108**

**అర్థము :** అన్నులు = స్త్రీలు, మేనులన్ = శరీరములతో, తీవలకున్, మెలుపు = సౌకుమార్యము, ఒదవించి = కలుగఁజేసి, మోవులన్ = పెదవులతో, తలిరులకున్ = చివురులకు,కెంపు = ఎఱుపు, ఒదవించి, ఓలిన్ = క్రమముగా, దంత - రుచిన్ = పండ్ల కాంతితో, మొగ్గలకున్, మెఱుఁగు = ప్రకాశము, ఊన్చి = కలిగించి, నవ్వులన్ = నవ్వులతో, మలరులకున్ = పువ్వులకు, హాస్య -రసము, ఇచ్చి, చెన్ను + అమరంగన్ + అందము కలుగునట్లు, పెక్కు - రేఖలన్ = పలురీతుల, తమతోడన్, ఆడు = విహరించు, గెడకత్తియ + కాన్ = చెలికత్తెగా, ఆమనిన్ = వసంతమును, కయిసేసిరి = అలంకరించిరి

**తాత్పర్యము :** స్త్రీలు తమ శరీరములచేఁ దీవలకు సౌకుమార్యమును గలిగించి, తమ పెదవులచేఁ జివురులకు నెఱుపు గలిగించి, తమ దంతకాంతిచే మొగ్గలకు మెఱుఁగు గలిగించి, తమ నవ్వులతోఁ బూవులకు హాస్యరసము నిచ్చి అందము గలుగునట్లు పలురీతుల వసంతమును దమతో నాడు చెలికత్తెగా నలంకరించిరి

**విశేషములు .** తీవలకంటె స్త్రీల మేనులే సుకుమారము లైనవనియు, తలిరులకంటె వారి మోవులే యెఱ్ఱనివనియు, మొగ్గలకంటె వారి దంతములే మెఱుపు గలవనియు, పువ్వులకంటె వారి నవ్వులే హాస్యరసవంతములనియు గ్రహింపనగును

వ తదనంతరంబ 109

**అర్థతాత్పర్యములు.** తద్ + అనంతరంబు + అ - తరువాతనే - తరువాతి పద్యముతో నన్వయము

చ **అలరులతోడ నవ్వుచు నయంబున మొగ్గలతోడ నాడుచున్**
**దలిరులతోడ సోలుచు మదభ్రమరంబులతోడఁ బాడుచున్**
**నెలమిఁ బికాలితోడ నెలుఁగించుచుఁ జిల్కలతోడఁ బల్కుచున్**
**నలి వనకేళి సల్పి రెలనాఁగలు తీఁగలతోఁ బెనంగుచున్** 110

**అర్థము :** ఎలనాఁగలు = యువతులు, అలరులతోడన్ = పూవులతో, నవ్వుచున్, మొగ్గలతోడన్, నయంబునన్ = అందముతో, ఆడుచున్, తలిరులతోడన్ = చిగురులతో, సోలుచున్ = పారవశ్యముచెందుచు, మద - భ్రమరంబుల తోడన్, = మదించిన తుమ్మెదలతో, పాడుచున్, ఎలమిన్ = ప్రీతితో, పిక + ఆలితోడన్ = కోకిలముల వరుసతో, ఎలుఁగించుచున్ = కూయుచు, చిల్కలతోడన్, పల్కుచున్, తీఁగలతోన్, పెనంగుచున్ = కూడుచు, నలిన్ = ఉత్సాహముతో, వనకేళి = ఉద్యానవిహారము, సల్పిరి

**తాత్పర్యము.** స్త్రీలు పువ్వులతో నవ్వుచు, మొగ్గలతో అందముగా నాడుచు, చివురులతోఁ బరవశించుచు, మించిన తుమ్మెదలతో పాడుచు, కోకిలలతోఁ ప్రీతితోఁ గూయుచు, చిల్కలతోఁ బల్కుచు, తీఁగలతోఁ గూడుచు నుత్సాహముతో వనవిహారము చేసిరి

**విశేషములు:** అలంకారము స్వభావోక్తి పాడుచు న్నెలమి - 'కొన్ని యెడలఁ బ్రామాణిక ప్రయోగంబులం ద్రుతంబున కచ్చు పరంబగునచో ద్విత్వంబు చూపట్టెడి' ప్రౌఢ సంధి 3 ఎలమిఁ బికాలితోడ నెలుఁగించుచు - అప్పకవి ఈ యతి నొప్పుకొనలేదు ' ఎలుఁగిచ్చుచు' అను పాఠమున యతిమైత్రి కుదురును

వ తదవసరంబున 111

**అర్థ తాత్పర్యములు .** తద్ + అవసరంబునన్ = ఆ సమయమున - తరువాతి పద్యముతో నన్వయము

ఉ భావజు పంచసాయక విభాతి మనోహరలీలఁ గ్రాలు తొ
ల్పూవుల పొల్పుఁగాంచి తనివోవక కోసిరి కొంద ఱంగనల్
గ్రోవులు, బొండుమల్లియలు, గోఁగులుఁ బొన్నలుఁ, జంపకంబులున్
దావియుఁ,.దెల్పు, వన్నువునుఁ, దన్పు మెఱుంగు సముల్లసిల్లఁగాన్ 112

**అర్థము .** కొందఱు + అంగనల్ = కొంతమంది స్త్రీలు, భావజు = మన్మధునియొక్క, పంచ - సాయక - విభాతి = అయిదుబాణముల విశేషకాంతి, మనోహర- లీలన్ = హృద్యమైన రీతిగా, క్రాలు = ఒప్పునట్టి, తొల్ + పూవుల - పొల్పున్ = మొదటి పూవుల ఒప్పును, కాంచి = చూచి, తనివోవక = తృప్తి పడక, క్రోవులున్ = ఎఱ్ఱ గోరంటలును, బొండుమల్లియలున్, గోఁగులున్, పొన్నలున్, చంపకంబులున్ - సంపెఁగలును, (క్రమముగా), తావియున్ = పరిమళమును, తెల్పున్ = తెల్లఁదనమును, వన్నువునున్ = వన్నెయును, తన్పున్ = శైత్యమును, మెఱుంగున్ = కాంతియును, సముల్లసిల్లఁగాన్ = మిక్కిలి ప్రకాశింపఁగా, కోసిరి

**తాత్పర్యము .** కొందఱు స్త్రీలు మన్మధుని బాణ పంచక కాంతి రమ్యముగా నొప్పు తొలి పూవుల అందమును జూచి తృప్తిపడక ఎఱ్ఱ గోరంటలు పరిమళమును, బొండు మల్లెలు తెలుపును, గోఁగులు వన్నెయును, పొన్నలు శైత్యమును, సంపెఁగలు మెఱుఁగును మిక్కిలి ప్రకాశింపఁగాఁ గోసిరి

**విశేషములు :** అలంకారము యధాసంఖ్యము అరవిందము, అశోకము, చూతము, నవమల్లిక, నీలోత్పలము అనునవి మన్మధుని అయిదు బాణములును

క నెవ్వలి చన్నుల వ్రేఁగునఁ
జివ్వంకలు వంగఁ గౌను సే సాఁపుచు లే
మవ్వంపుఁ బొఱల మామిడి
క్రొవ్విరులం దొక్క కుసుమకోమలి కోసెన్ 113

**అర్థము :** అందున్ = వారిలో, ఒక్క - కుసుమ కోమలి - ఒక పూబోఁడి, నెవ్వలి ( నెఱ + వలి) చన్నుల - వ్రేఁగునన్ = మిక్కిలి చల్లనివైన చన్నుల బరువుచే, కౌను = నడుము, చివ్వంకలు = చిఱు + వంకలు = కొంచెపాటి వంకరలు, వంగన్, చే + చాఁపుచున్ = చేయి చాఁపుచు, లేమవ్వంపుఁబొఱల మామిడి క్రొవ్విరులు - (లేఁత + మవ్వము - పొఱల) మామిడి - క్రొత్త - విరులు= లేఁతవియు, మృదువయినవియు నగు చివురులుగల మామిడి క్రొంబూలు, కోసెన్

**తాత్పర్యము.** వారిలో నొక పూఁబోఁడి మిక్కిలి చల్లనైన చన్నుల బరువుచే నడుమించుక వంగఁగాఁ జేయి చాఁపుచు లేఁతవియు, మృదువయినవియు నగు చిగురులు గల మామిడిక్రొవ్విరులు కోసెను

**విశేషములు.** అలంకారము స్వభావోక్తి నెవ్వలి - నెఱ + వలి, క్రొవ్విరులు - క్రొత్త + విరులు మవ్వంపుఁబొఱలు - మవ్వము + పొఱలు మువర్ణకమునకుఁ బుంప్వాదేశము - బాల సంధి 32, పిమ్మట నుగాగమము - బాల సంధి 25 పిమ్మట ద్రుతకార్యము - బాల సంధి 16,17

క నలికపు మేనులు తిగిచిన
యెలదీఁగలు నమరఁ బెనఁగి రింతులు తుది పు
వ్వులకును మృదులతతోఁ దమ
బలములు తలపోయఁ బెనఁగు పగిది నయమునన్ 114

**అర్థము.** నలికపు మేనులు - (నలికము + మేనులు) = సన్నని శరీరములు, తిగిచిన = లాగిన, ఎల - తీఁగలున్ = లేఁదీవలును, అమరన్ = ఒప్పఁగా, ఇంతులు = స్త్రీలు, తుది - పువ్వులకును = చివరిపూలకు, మృదు-లతతోన్ = సుకుమారమైన తీవతో, తమ - బలములు, తలపోయన్ = చింతింపఁగా, పెనఁగు - పగిదిన్ = పెనఁగులాడు విధమున, నయమునన్ = బాగుగా, పెనఁగిరి = పెనఁగులాడిరి

**తాత్పర్యము.** స్త్రీలు చిటారుకొమ్మల పూలకై లేఁదీవలను లాగుచుండిరి అది సన్ననిశరీరములనెడి తమ బలములు కొసనున్న పూవులకొఱకు మృదువైన లతతోఁ బెనఁగులాడు చున్నవా యనునట్లు ఒప్పెను

**విశేషములు.** అలంకార ముత్ప్రేక్ష స్త్రీల నలికపు మేనులు మృదులతలవలె నున్నవని భావము నలికపుమేనులు= నలికము + మేనులు 'కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బు ంపులగు ' బాల సంధి 32

క కరశాఖలఁ దరుశాఖలు
పరువడి నూదికొని నిలిచి పడఁతులు శోభా
కర మైరి తత్కుజంబుల
భరితంబై యున్న ప్రూనఁ బండుల పోలెన్. 115

**అర్థము.** పడఁతులు - స్త్రీలు, కర-శాఖలన్ = శాఖలవంటి కరములతో, పరువడిన్ = క్రమముగా, తరు - శాఖలు = చెట్ల శాఖలు, ఊదికొని = ఆనుకొని,

నిలిచి, తద్ +- కుజంబులన్ = ఆ చెట్ల యందు, భరితంబు + ఐ = నిండినదయి, ఉన్న, మ్రానన్ = చెట్టునందు, పండుల - పోలెన్ = పండ్లవలె, శోభా + ఆకరము = చక్క(దనమునకు స్థానము, ఐరి = అయిరి

**తాత్పర్యము.** శాఖలవంటి కరములతో స్త్రీలు చెట్ల శాఖలు ఆనుకొని నిలిచి ఆ చెట్లయందు నిండియున్న చెట్టునందు( బండ్లవలె( జక్క(దనమునకు స్థానమై యొప్పిరి

**విశేషములు** ఇందు 'తత్కుజంబుల' అనుదానిబదులు 'తత్కుచంబుల' అని యుండునా ? అప్పుడు 'పడ(తులు తత్కుచములతో కరశాఖల( దరుశాఖ లూదికొని నిలిచి భరితంబైయున్న మ్రాన( బండుల పోలె శోభాకరమైరి' అని యన్వయింపనగును ఆ పక్షమున వారి కుచములు మ్రాని పండుల వలె నుండెననుసొగసు పొస(గును అలంకార ముపమ

క ఎనసి నిజాసిత దృగ్రుచి(
గను(గొన( గప్పైన మల్లికా ప్రసవంబుల్
తనరారు నల్లమల్లియ
లని కోసిరి కొంద ఱుత్పలాక్షులు ప్రీతిన్. 116

**అర్థము :** కొందఱు + ఉత్పల + అక్షులు = కొందఱు కలువకంటులు, ఎనసి = కూడి, నిజ + అసిత - దృశ్ (క్) + రుచిన్ = తమదైన నల్లని చూపు కాంతితో, కను(గొనన్ = చూడ(గా, కప్పు + ఐన = నల్లనైన, మల్లికా - ప్రసవంబుల్ = మల్లెపూలు, తనరారు = ఒప్పునట్టి, నల్ల - మల్లియలు + అని = నల్లని మల్లెపూలని, ప్రీతిన్ = సంతోషముతో, కోసిరి

**తాత్పర్యము :** కొందఱు కలువకంటులు కూడుకొని తమనల్లని చూపుల కాంతితో( జూచుటచే నల్లనైన మల్లెపూలను అవి యేవో నల్లని మల్లెపూవులని ప్రీతితో( గోసిరి

**విశేషములు .** అలంకారము భ్రాంతిమంతము ఉత్పలమ్ = నల్లకలువ A blue lotus (Apte) ఇచ్చట స్త్రీల కుత్పలాక్షు లను విశేషణము సాభిప్రాయ మగుటచే( బరికరాలంకారమును

చ చెలువలు మట్టిమ్రానిపయిఁ జిల్కలు మూవి రమింప వాని ము
క్కులు గని మట్టిపండు లని కోయఁగఁ బోయిన వారిహస్తముల్
దలిరులు సావి కీరములు దందడిఁ గుట్టిన ముగ్ధ లందఱున్
గలగొనఁ బాఱి రోరి యిది గాటులమ్రా ననుచున్ భయంబునన్ 117

**అర్థము :** మట్టి - మ్రాని పయిన్ = మట్టిచెట్టు మీఁద, చిల్కలు, మూవి = మూఁగి, రమింపన్ = క్రీడించుచుండఁగా, చెలువలు = స్త్రీలు, వాని- ముక్కులు + కని= ఎఱ్ఱనైన వానిముక్కులు చూచి, మట్టి - పండులు + అని, కోయఁగన్ + పోయినన్= కోయఁబోఁగా, వారి - హస్తముల్ = వారి చేతులు, తలిరులు - సావి చిగురులని, కీరములు = చిలుకలు, దందడిన్ =అధికముగా, కుట్టినన్ = కుట్టఁగా, ముగ్ధలు+ అందఱున్ = ఆ ముద్దరాం డ్రందఱును - ఆ అమాయిక లందఱును, ఓరి = ఆశ్చర్య సూచకము - ఔరవంటిది, ఇది, కాటుల - మ్రాను = కాట్ల చెట్టు, అనుచున్, భయంబునన్, కలగొనన్ = నలుదెసలకు, పాఱిరి = పరువెత్తిరి

**తాత్పర్యము :** మట్టిచెట్టుమీఁదఁ జిలుకలు మూఁగి క్రీడించుచుండఁగా స్త్రీలు వాని యెఱ్ఱని ముక్కులను జూచి మట్టిపండ్లని కోయఁబోఁగా, చిలుకలు వారి చేతులు చివురులని మిక్కిలి కుట్టెను అంత నా ముద్దరాండ్రు ఇది యేదో కాట్ల చెట్టు బాబో యని భయముతో నలుదెసలకుఁ బరువెత్తుకొనిపోయిరి

**విశేషములు .** అలంకారము భ్రాంతిమంతము చెలువలకు చిలుక ముక్కులందు ఫలభ్రాంతి చిలుకలకు స్త్రీ హస్తములందుఁ బల్లవభ్రాంతి స్త్రీలకు ముగ్ధా విశేషణము సాభిప్రాయ మగుటచేఁ బరికరాలంకారమును పాఱిరోరి యిది - పాఱితోయిదియ - అని మా రా ప్రతి పాఠము

చ. **తమకు వియోగవేళఁ బరితాపముగా మరుఁ డల్క నేయు బా**
**ణము లని ముట్టిపట్టి మృదునారులు పువ్వులు గోయుచో మద**
**భ్రమరము లంగజాధిపతి పంచిన దండులపోలె వచ్చి సం**
**భ్రమమున మూవెఁ దద్వదనపంకరుహాసవగంధలుబ్ధలై** 118

**అర్థము :** తమకున్, వియోగ - వేళన్ = విరహసమయమున, పరితాపము+ కాన్ = బాధగలుగునట్లు, మరుఁడు = మన్మధుఁడు, అల్కన్ = కోపముతో, ఏయు = ప్రయోగించు, బాణములు + అని = అమ్ములని, మృదు - నారులు = సుకుమారలయిన స్త్రీలు, ముట్టి - పట్టి = చుట్టుకొని పట్టుకొని - గట్టిగాఁ బట్టుకొని,

పువ్వులు, కోయుచోన్ = కోయునప్పుడు, మద - భ్రమరములు = మదించిన తుమ్మెదలు, అంగజ + అధిపతి = మన్మధుఁ డనురాజు, పంచిన = పంపిన, దండుల + పోలెన్ = సైన్యములవలె, తద్ + వదన - పంకరుహ + ఆసవ - గంధ - లుబ్ధులు + ఐ = వారి (స్త్రీల) ముఖ పద్మముల తేనెయందును, పరిమళమునందును లోభముగలవై, వచ్చి, సంభ్రమమునన్ = వేగిరపాటుతో, మూవెన్ = మూఁగెను

**తాత్పర్యము**. తమకు విరహము గలిగినప్పుడు పరితాపము గలుగునట్లు మన్మధుఁడు కోపముతోఁ బ్రయోగించు బాణములని సుకుమారలైనస్త్రీలు గట్టిగాఁబట్టుకొని పూలు గోయునప్పుడు మదించిన తుమ్మెదలు మన్మధుఁ డను రాజు పంపిన సైన్యములో యన, ఆ స్త్రీల ముఖపద్మముల తేనెయందును, పరిమళమునందును లోభము గలవయి, వచ్చి సంభ్రమముతో మూఁగెను

**విశేషములు**. అంగజాధిపతి - రూపకము తదనుప్రాణితమైన ఉత్ప్రేక్ష

**తే** వాసితాననరుచిరనిశ్వాసములకు
ముసరి కారించు నెలదేఁటిముసురఁ జోపి
చోపి పోఁజోపనోపక సుదతి పదువ
లలసి వెలిపుచ్చనోడి యూర్పాఁగుచుండె 119

**అర్థము**. వాసిత + ఆనన- రుచిర - నిశ్వాసములకున్ = పరిమళితమైన ముఖముల యొక్క మనోహరములయిన - మధురములయిన, నిశ్వాసములకున్= నిట్టూర్పులకు, ముసరి = మూఁగి, కారించు = బాధించునట్టి, ఎలదేఁటి - ముసురన్ = కొదమతుమ్మెదల నిరంతరవృష్టిని - తుమ్మెదల సమూహమును, చోపి - చోపి = త్రోలి త్రోలి, పోన్ + చోపన్ + ఓపక = వెడలఁగొట్టఁజాలక, సుదతి - పదువలు = స్త్రీల వరుసలు ( పదువులు), అలసి = బడలి, వెలు-పుచ్చన్, ఓడి = బయటికి విడువ జంకి - (వెలికూర్చనోడి యని పాఠాంతరము - బయటికి నిట్టూర్చుటకు జంకి), ఊర్పు + ఆఁగుచున్ + ఉండెన్ = ఊపిరి ఆఁపుచుండెను

**తాత్పర్యము**. పరిమళితమైన ముఖములనుండి వచ్చునిట్టూర్పులకు మూఁగి బాధపెట్టు కొదమతుమ్మెదల సమూహమును ద్రోలిత్రోలి వెడలఁగొట్టలేక స్త్రీల సమూహము బడలి బయటికి శ్వాసమును విడుచుటకు జంకి ఆఁపుచుండెను

**విశేషములు**. అలంకార మతిశయోక్తి

క ఆ వనితలు చంపక పు
ష్పావలి చేఁ బట్టుకొనుచు నతిరయమునఁ గై
దీవియలు పట్టికొని చను
భావనఁ జని రుద్గతాలిపటలములోనన్ 120

**అర్థము .** ఆ - వనితలు = ఆ స్త్రీలు, ఉద్గత + అలి - పటలము లోనన్= బయలువెడలిన తుమ్మెదలయొక్క సమూహములో, అతి - రయమునన్ = మిక్కిలి వేగముతో, కై- దీవియలు = చేతి దివ్వెలు, పట్టికొని, చను - భావనన్ = వెడలు భావముతో, చంపక - పుష్ప + ఆవలి = సంపెఁగపూల సమూహము, చేన్= చేతితో, పట్టుకొనుచున్, చనిరి

**తాత్పర్యము .** ఆ స్త్రీలు బయలు వెడలిన తుమ్మెదల గుంపులోనుండి చేదివ్వెలు పట్టుకొని వెడలునట్లు సంపెఁగపూలను జేతఁబట్టుకొని మిక్కిలి వేగముతోఁ జనిరి

**విశేషములు :** అలంకార ముపమ

వ మఱియుం గొన్ని మహీరుహంబుల నాత్మీయ క్రియా విశేషంబులం బుష్పోద్గమంబు లొనరించుచు 121

**అర్థము .** మఱియున్, కొన్ని - మహీరుహంబులన్ = కొన్ని చెట్లను, ఆత్మీయ - క్రియా - విశేషంబులన్ = తమవైన ప్రత్యేకములయిన పనులచే, పుష్ప ఉద్గమంబులు + ఒనరించుచున్ = పూచునట్లు చేయుచు

**తాత్పర్యము** మఱియును గొన్నిచెట్లను దమవిశిష్టక్రియలచేఁ బూచునట్లు చేయుచు తరువాతి పద్యముతో నన్వయము

ఉ తన్నినఁ బూచె నెందుఁ గడుదైన్య మశోకము బాహుపీడనం
గ్రన్ననఁబూచె నీ కురువకంబును, నెంగిలికల్లు సల్లినన్
మన్ననతప్పి పూచె దొర మాయఁగఁ గేసర, మేము సూచుడుం
గన్నుల సన్నఁ బూచెఁ దిలకం బని దానికి మెచ్చి రంగనల్ 122

**అర్థము :** అశోకము = అశోక వృక్షము, తన్నినన్ = తన్నఁగనే, పూచెన్ = పుష్పించెను, ఎందున్ = ఎందయినను, కడున్ = మిక్కిలి, దైన్యము = దయనీయ స్థితి, ఈ - కురువకంబునున్ = ఈ యెఱ్ఱగోరంటయును, బాహు - పీడనన్ =

చేతి చఱపుచే, క్రన్ననన్ = శీఘ్రముగా, పూచెన్, కేసరము = పొగడచెట్టు, ఎంగిలి - కల్లు = ముఖమద్యము, చల్లినన్, మన్నన - తప్పి = గౌరవము తప్పి, దొర - మాయఁగన్ = విధము చెడఁగా, పూచెన్, తిలకంబు = బొట్టుగు చెట్టు, ఏము = మేము చూచుడున్ =చూచినంతనే, కన్నుల - సన్నన్ = కంటిసంజ్ఞ చేతనే, పూచెన్, అని అంగనల్ = స్త్రీలు, దానికిన్ = ఆ బొట్టుగునకు, మెచ్చిరి

**తాత్పర్యము** . 'అశోకము తన్నినంతనే పూచెను ఎంత దైన్యము ! ఈ యెఱ్ఱగోరంటయును జేతిచఱపుచే శీఘ్రముగాఁ బూచెను పొగడచెట్టు ముఖ సీధువుచే గౌరవము తప్పి - విధముచెడి పూచెను కాని తిలకవృక్షము మేము చూచినంతనే కనుసంజ్ఞచేఁ బూచెను ' అని ఆ స్త్రీలు తిలకమును మెచ్చుకొనిరి

**విశేషములు** వృక్షముల దోహదవిధులు

"స్త్రీణాం స్పర్శా త్ప్రియఙ్గు ర్వికసతి వకుళః సీధుగణ్డూషసేకా
త్పాదాఘాతా దశోక స్తిలకకురవకౌ వీక్షణాలిఙ్గనాభ్యామ్,
మన్దారో నర్మవాక్యా త్పటుమృదుహసనా చ్చమ్పకో వక్త్రవాతా
చ్చూతో గీతా న్నమేరు ర్వికసతి చ పురోనర్తనా త్కర్ణికారః"

కురువక - (రూపాం ) కురవక 'ఆలిఙ్గనా త్కురవకః' అనియున్నను ఇట బాహుపీడన మనుట తన్న్యూనతార్థము

వ **మఱియుం గొందఱు చతురసతులు చూతపోతకవ్రాతకంబుఁగని హర్షించి రోమాంచకంచుకితశరీరలై మెచ్చి శిరఃకంపంబు సేయుచు** 123

**అర్థము** . మఱియున్, కొందఱు, చతుర - సతులు = నేర్పరులైన స్త్రీలు, చూత - పోతక - వ్రాతకంబున్ = గున్నమామిడుల సమూహమును, కని = చూచి, హర్షించి = సంతోషించి, రోమాంచకంచుకిత - శరీరలు + ఐ = గగుర్పాటుచే అవిక గలవిగాఁ జేయఁబడిన మేనులు గలవారయి, మెచ్చి, శిరఃకంపంబు - శిరస్ + కంపంబు = తలయూఁచుట, చేయుచున్

**తాత్పర్యము** . మఱియును గొందఱు ప్రౌఢాంగనలు గున్నమామిడుల సమూహమును జూచి సంతోషించి మేనులు గగుర్పొడువ మెచ్చి తలలూఁచుచు- తరువాతి పద్యముతో నన్వయము

తే	అలిగి విరహుల నలరమ్ము లాడనేసి
	కాక కను చూడ్కిఁ దన పొడగన్న ఱెప్ప
	వెట్టకుండంగ ముందఱ బిట్టు నొంప
	మదనుఁ డోపున తలిరాకుమావిఁ బోలె 124

**అర్థము.** మదనుఁడు = మన్మధుఁడు, అలిగి = కోపించి, విరహులన్ = వియోగులను, అలరమ్ములు = (అలరు + అమ్ములు) = పుష్పబాణములు, ఆడన్ = గ్రుచ్చుకొనునట్లు, ఏసికాక = ప్రయోగించికాకుండ, తలిరాకు - మావిన్ + పోలెన్ = తలిరు + ఆకు - మావిన్ + పోలెన్ = చిగురుటాకుల మామిడివలె, కనుచూడ్కిన్ = కంటిచూపుతో, ఱెప్ప + పెట్టక + ఉండంగన్ = ఱెప్పపాటు లేకుండ - తదేక దృష్టితో ననుట, తన - పొడగన్నన్ = తన్నుఁజూచినచో, ముందఱన్ = ఎదుట, బిట్టు = అధికముగా, నొంపన్ = బాధించుటకు, ఓపున + ఓపున్ + అ = సమర్థుఁడగునా ? కాఁడనుట

**తాత్పర్యము.** మన్మధుఁడు కోపించి వియుక్తులపైఁ బుష్పబాణములను గ్రుచ్చుకొనునట్లు ప్రయోగించి బాధించును అంతేకాని చివురుటాకుల మామిడివలెఁదన్ను ఱెప్పపాటు లేకుండఁ జూచిన వారిని మిక్కిలి బాధింపఁజాలఁడు విరహులను బాధించుటలో మన్మధునికంటెఁ జివురించిన మామిడిదే పైచేయి యని భావము

**విశేషములు.** పూవుటమ్ములు ప్రయోగించికాని మన్మధుఁడు చేయఁజాలని విరహతాపనకార్యమును జిగిర్చిన మామిడి తన్నుఁజూచినంత మాత్రముననే చేయఁగలుగుటచే మన్మధుని కంటె మామిడియే మిన్నయని సహేతుకముగా సమర్థించుటచే నలంకారము కావ్యలింగము 'సమర్థనీయ స్యార్థస్య కావ్యలిఙ్గం సమర్థనమ్' చంద్రా

వ	అని యనేకప్రకారంబుల వర్ణించుచుం గామరసావేశంబునం గాముక కామినీజనంబులు తగిలి హిందోళాందోళితలతాందోళంబులం బరిమళాక్రాంతానందలతాంతమందిరాంతరంబుల జలవిహంగారవాఘూర్ణిత సరోవరంబులఁ జంద్రకాంతమణిసోపానదీర్ఘికాతటంబులం గనకవాలుకాభిరామ నిర్ఝరపులినతటంబులఁ గాంచనమణిగణాలంకృతవిచిత్రకృత్రిమాచల గుహాగహ్వరంబుల నాదిగా ననేకవిధవినోదస్థానంబుల నభిరామక్రీడానిరతులై విహరించి తదనంతరంబ 125

**అర్థము** అని, అనేక - ప్రకారంబులన్ = పెక్కు విధముల, వర్ణించుచున్, కామ - రస + ఆవేశంబునన్ = ప్రేమరసమావేశించుటచే, కాముక - కామినీ - జనంబులు = వలపు కాండ్రును, వలపుకత్తెలును, తగిలి = ఆసక్తి గలిగి, హిందోళ + ఆందోళిత - లతా + ఆందోళంబులన్ = హిందోళరాగముతో నూపఁబడిన తీవె యూయలలందు, పరిమళ + ఆక్రాంత + ఆనంద - లతాంత - మందిర + అంతరంబులన్ = సువాసనచే నాక్రమింపఁబడిన ఆనందముతోడి పూవుటిండ్లలోపలను, జల - విహంగ + ఆరవ - ఆఘూర్ణిత - సరోవరంబులన్ = నీటిపక్షులకూఁతలచేఁ గలగుండుపడిన సరస్సులందును, చంద్రకాంత - మణి - సోపాన - దీర్ఘికా - తలంబులన్ = చంద్రకాంతమణిమయములైన మెట్లుగల దిగుడుబావుల ప్రదేశములందును, కనక - వాలుకా + అభిరామ - నిర్ఝర - పులిన - తటంబులన్ = బంగరుటిసుకచే మనోహరములైన సెలయేటుల ఇసుకతిన్నెలందును, కాంచన - మణి - గణ + అలంకృత - విచిత్ర - కృత్రిమ + అచల - గుహా - గహ్వరంబులన్ = బంగారము చేతను, మణుల సమూహముచేతను అలంకరింపఁబడి నానావర్ణములు గల క్రీడాపర్వతపు గుహలయందును పొదరిండ్లయందును, ఆదిగా = మున్నుగా, అనేక - విధ - వినోద - స్థానంబులన్ = పలురీతులైన వేడుకచోటులందు, అభిరామ - క్రీడా - నిరతలు + ఐ = మనోహరములైన ఆటలయందు ఆసక్తిగలవారయి, విహరించి = క్రీడించి, తద్ + అనంతరంబ = ఆ పిమ్మట

**తాత్పర్యము :** అని పెక్కురీతుల వర్ణించుచుఁ బ్రేమావేశమున వలపు కాండ్రును, వలపుకత్తెలును ఆసక్తి గలిగి హిందోళ రాగముతో నూపఁబడిన తీవ యుయ్యాలలందును, సువాసనతోఁ గూడిన ఆనందమును గూర్చు పూవుటిండ్లలోను, జలపక్షుల కూఁతలచేఁ గలగుండు పడిన సరస్సులందును, జంద్రకాంతమణిమయములయిన సోపానములు గల దిగుడుబావులందును, బంగరు టిసుకచే మనోహరములైన సెలయేటుల యిసుకతిన్నెలందును, బంగారు చేతను, మణుల సమూహముచేతను అలంకరింపఁబడి నానావర్ణములు గల క్రీడా పర్వతముల గుహలందును, పొదరిండ్లయందును, ఇంకను అనేకవిధములయిన వినోదస్థానములందును మనోహరములయిన క్రీడలయందు ఆసక్తిగలవారయి విహరించిన పిమ్మట - తరువాతి పద్యముతో నన్వయము

సీ అలి కలభములు పైఁ దులతెంచు తనిరేకు
లలకలఁ జిన్నిపు వ్వై వెలుంగ
నలిఁ గోయిలలు రాల్చు నెలమావితలిరులు
వీనుల కవతంసవిభవ మొసఁగ
మలయానిలాహతి వెలడిన పుప్పొడి
పాదివి మేనుల వింతపూఁత గాఁగఁ
దొడిరారఁ జిలుకల త్రొక్కున డుల్లు కా
రాకులు విరియువేనలులఁ దగిలి

తే పుష్పమాలావిభూతిగాఁ బుష్పహరణ
కేలిఁ దొంటిశృంగారముల్ దూలియుండ
మగువలకు వనదేవత మగుడ నొప్పు
చేసెనో యన వేఱొండు చెన్ను మిగిలె 126

**అర్థము .** అలి - కలభములు = కొదమతుమ్మెదలు, పైన్ = మీఁద, తులతెంచు = రాల్చు, తనిరేకులు = చిన్నరేకులు, అలకలన్ = ముంగురులందు, చిన్ని - పువ్వు + ఐ, వెలుంగన్ = ప్రకాశింపఁగను,

నలిన్ = వేడుకతో, కోయిలలు = కోకిలములు, రాల్చు ఎలమావి తలిరులు = లేఁతమామిడి చివురులు, వీనులకున్ = చెవులకు, అవతంస విభవము = ఆభరణసంపద, ఒసఁగన్,

మలయ + అనిల + ఆహతిన్ = దక్షిణపుగాలిదెబ్బచే, వెలడిన = వెడలిన, పుప్పొడి, పాదివి = క్రమ్మి, మేనులన్ = శరీరములందు, వింత - పూఁత, కాఁగన్

తొడిరారన్ = తాఁకునట్లు, చిలుకల - త్రొక్కునన్ = చిలుకల త్రొక్కుడుచేత, డుల్లు = రాలుచున్న, కారాకులు = పండుటాకులు, విరియు = చెదరిన, వేనలులన్ = కొప్పులందు, తగిలి = అంటుకొని,

పుష్ప - మాలా - విభూతి + కాన్ = పూలదండల సంపద అగుటకు, పుష్ప-హరణ - కేలిన్ = పూలుగోయు క్రీడచే, తొంటి - శృంగారముల్ = మునుపటి అలంకారములు, తూలి + ఉండన్ = తొలఁగఁగా, మగువలకున్ = స్త్రీలకు, వనదేవత, మగుడన్ = మరల, ఒప్పు = శృంగారము, చేసెనో, అనన్, వేఱు + ఒండు = మఱియొక, చెన్ను = అందము, మిగిలెన్ = అతిశయించెను

**తాత్పర్యము** పిల్లతుమ్మెదలు మీఁదరాల్చు చిన్నరేకులు ముంగురులందుఁ జిన్నిపువ్వయి యొప్పఁగను, కోకిలములు వేడుకతో రాల్చు లేఁత మావిచివురులు

చెవులకు ఆభరణసంపదఁ గూర్పఁగను, మలయవాయుహతిచేత వెడలిన పుప్పొడి క్రమ్మి శరీరములందు వింతపూఁతకాఁగా, చిలుకల త్రొక్కుడుచేత రాలు పండుటాకులు విచ్చిన కొప్పులపై నంటుకొని, పుష్పమాలాసంపద గలుగఁ బూలుగోయుక్రీడచే మునుపటి యలంకారములు తొలఁగఁగా, స్త్రీలకు వనదేవత మరల నలంకారముచేసెనో యనఁ గ్రొత్తయంద మతిశయించెను

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష సీసపద్య చతుర్థపాదమున - 'కా - రాకులు విరియు వేనలులఁదగిలి' అనుచో యతిమైత్రి కుదురలేదు నేను జూచిన ప్రతుల నన్నిట నిట్లేయున్నది

## మధుపానగోష్ఠి

**వ అంత వనకేళి సాలించి హరగిరిజల నపరిమితవాసంతికానంత లతాంతాలంకారాలంకృతులం జేయుచుండి రంత నంద కొందఱు మధుపానగోష్ఠికిం జొచ్చి మండలార్చనఁ దీర్చి మూలజవృక్షజ గుడ మధుపిష్ట కుసుమవికారంబులగు సుగంధాసవంబులు కనకమణిమయానేక కరక చషకాదుల న్నించి హర్షించి.** 127

**అర్థము :** అంతన్, వన - కేళి = వన విహారము, చాలించి = మాని, హర - గిరిజలన్, అపరిమిత - వాసంతికా + అనంత - లతాంత + అలంకార + అలంకృతులన్ = అధికమైన వసంత ఋతూద్భూత పుష్పాలంకారములచే అలంకరింపఁబడినవారిని, చేయుచున్ + ఉండిరి, అంతన్, అందున్ + అ = అందే, కొందఱు, మధు - పాన - గోష్ఠికిన్ + చొచ్చి = మద్యపానమునకుఁబూని, మండల + అర్చనన్ = శ్రీచక్రపూజను, తీర్చి, మూలజ - వృక్షజ - గుడ - మధుపిష్ట - కుసుమ- వికారంబులు + అగు = వేరుల నుండి పుట్టిన చెట్లనుండి పుట్టిన బెల్లము, తేనెపట్టు (?) పూలు అనువాని రూపములు, అగు, సుగంధ + ఆసవంబులు = పరిమళముగల మద్యములు, కనక - మణిమయ + అనేక - కరక - చషక + ఆదులన్ = బంగారు, రత్నాల పెక్కు కమండలువులు, పానపాత్రములు మున్నగువానియందు, నించి = నింపి, హర్షించి = సంతోషించి

**తాత్పర్యము:** అంత వనవిహారము చాలించి పార్వతీశ్వరులను వసంతకాలపు పెక్కు పుష్పాలంకారములచే నలంకృతులను జేయుచుండిరి అంత అందే కొందఱు మద్యపానమునకుఁ బూని శ్రీచక్రపూజ గావించి వేరుల నుండి చెట్ల నుండి, బెల్లము మధుపిష్టము అనువానినుండి పుట్టిన పరిమళవంతము లయిన మద్యములను బంగారపు, రత్నాల కమండలువులవంటి పానపాత్రములందు నింపి సంతోషించి - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** మధుషిష్ట - శబ్దము నిఘంటువులఁ గానరాదు మద్యపానమునకుఁ బూని మండలార్చనఁ దీర్పుటేమో ?

మ శివు గౌరీసహితంబు సన్మనములం జింతించి, మ్రైతెంచి, భై
రవు యోగీంద్రులఁ గొల్చి, యోగినుల వీరవ్రాతముం దన్పి, యా
నవనాథాదుల కాదిసిద్ధులకు నానందించి, విం దిచ్చి, యా
సవపాత్రల్ సతు లర్థి నెత్తికొని యాస్వాదించి మోదించుచున్ 128

**అర్థము .** సతులు = స్త్రీలు, శివున్ = శివుని, గౌరీ - సహితంబు = పార్వతీదేవితోఁగూడ, సత్ + మనములన్ = మంచి మనస్సులతో, చింతించి = ధ్యానించి, మ్రైతెంచి = సమ్మతించి, భైరవున్ = కాలభైరవుని,యోగి + ఇంద్రులన్ = యోగిశ్రేష్ఠులను, కొల్చి = సేవించి, యోగినులన్ = శివపరిచారికలను, వీర - వ్రాతమున్ = వీరుల సమూహమును, తన్పి = తృప్తిపఱిచి, సిద్ధులకున్ = మొదటి సిద్ధులగు, ఆ - నవనాథ + ఆదులకున్ = ఆ నవనాథులు మున్నగువారికి, ఆనందించి = సంతోషించి, విందు + ఇచ్చి = విందుచేసి, ఆసవ - పాత్రల్ = పానపాత్రములు, అర్థిన్= కోరికతో, ఎత్తికొని, ఆస్వాదించి = త్రావి, మోదించుచున్= సంతోషించుచు

**తాత్పర్యము .** స్త్రీలు, గౌరీ సమేతుఁడగు శివునిఁ దమ మంచిమనస్సులతో ధ్యానించి, సమ్మతించి, భైరవుని, యోగిశ్రేష్ఠులను సేవించి శివపరిచారికలను వీరశ్రేష్ఠులను దృప్తిపఱిచి, ఆదిసిద్ధులైన ఆ నవనాథులు మున్నగువారికి ఆనందమును గూర్చి, విందుచేసి, పానపాత్రముల నెత్తికొని త్రావి సంతోషించుచు - తరువాతి పద్యముతో నన్వయము

క ముంచినఁ జప్పుడు విని కం
పించు శరీరములు దీనిఁ బ్రీతిగఁ బైఁ జి
ల్కించినఁ జొక్కగు నటు సే
వించిన సంభ్రమము గాదె వేల్పులకైనన్ ? 129

**అర్థము .** ముంచినన్= ముంపఁగా, చప్పుడు, విని, శరీరములు, కంపించున్ = చలించును, దీనిన్ = ఈ మద్యమును, ప్రీతిగన్ = సంతోషముగునట్లు, పైన్ = మీఁద, చిల్కించినన్ = చల్లినచో, చొక్కు + అగున్ = పారవశ్య మగును, అటు = ఆ విధముగా, సేవించినన్= త్రావినచో, వేల్పులకున్ + ఐనన్ = దేవతలకయినను, సంభ్రమము + కాదె = వేగిరపాటు - సంక్షోభము, కాదె

**తాత్పర్యము .** పానపాత్రమును మద్యమున ముంచిన చప్పుడు వినుట తోడనే మేనులు కంపించును దీనిని సంతోషమగునట్లు మీఁదఁ జిలికినచోఁ బారవశ్యము గలుగును ఇఁక సేవించినచో దేవతలకైనను సంక్షోభము కాదా ? అగు ననుట

చ అమరులు త్రావుచో నమృతమందురు దీని, నహివ్రజం బజ
స్రముఁ గొని యానుచో నిది రసాయనమందురు, భూసురౌఘ మా
గమవిధి సోమపాన మని గైకొని యానుదు, రెందుఁ జక్రయా
గమునెడ వస్తు వందు రిది కౌళికు, లీ సుర పేర్మి వింతయే ? 130

**అర్థము** దీనిన్ = ఈ మద్యమును, అమరులు = దేవతలు, త్రావుచోన్, అమృతము + అందురు, అహి - వ్రజంబు = నాగుల సమూహము, అజస్రమున్ = ఎల్లప్పుడును, కొని, అనుచోన్ = త్రావుచో, ఇది, రసాయనము = జీవనౌషధము, అందురు, భూసుర + ఓఘము = బ్రాహ్మణుల సమూహము, ఆగమ - విధిన్ = శాస్త్రవిధిని, సోమ - పానము = యజ్ఞమునందలి సోమరసపానము, అని, కైకొని = సమ్మతించి, ఆనుదురు = త్రావుదురు, ఎందున్, చక్రయాగము + ఎడన్ = చక్రయాగవిషయమున - శ్రీ చక్రార్చనమునందు, కౌళికులు = శాక్తేయులు - రసవాదులు, ఇది = ఈ సురసు, వస్తువు + అందురు, ఈ - సుర - పేర్మి = ఈ మద్యము గొప్పతనము, వింతయే = ఆశ్చర్యకరమా ?

**తాత్పర్యము.** ఈ మద్యమును దేవతలు త్రావుచో నమృత మందురు నాగసమూహము త్రావుచో దీనిని రసాయనమందురు బ్రాహ్మణులు శాస్త్ర విధానమున దీనిని సోమరసమని సమ్మతించి త్రావుదురు శాక్తేయులు - రసవాదులు దీనిని శ్రీ చక్రార్చనమునందు వస్తువందురు ఈ సుర గొప్పతన మాశ్చర్యకరము

**విశేషములు .** రసాయనము- దేహము నజరామరముగాఁ జేయఁజాలిన దివ్యౌషధము, ఇది సిద్ధౌషధుల రసము, లేక అష్టాదశ సంస్కార పూతమగు పాదరసము

అహివ్రజంబు అందురు, భూసురౌఘము ఆనుదురు - 'మహత్స మూహార్థకశబ్దం బమహత్కార్యయుక్తంబయ్యుఁ దద్విశేషణ క్రియలు మహత్కార్య యోగ్యంబులు విభాష నగు ' ప్రౌఢ శబ్ద పరి 17

క సురలకు దీనన యజరా
మర మయ్యెంగాక యమృతమథనమునకు ము
న్నెరియరె తెరలరె మృతిఁబొం
దరె యని సుర వొగడిపొగడి తరుణులు ప్రీతిన్ 131

**అర్థము .** సురలకున్ = దేవతలకు, దీనన్ + అ = దీనన = దీని చేతనే, అజరా + అమరము = ముసలితనము, మరణము లేకపోవుట, అయ్యెన్ + కాక= అయ్యెను గాని, అమృత - మథనమునకున్ + మున్ను = అమృతముకొఱకుఁ జిలుకుటకు ముసుపు, ఎరియరె = కాలిపోవరా ?, తెరలరె = వేఁగరా ? మృతిన్= పొందరె, అని, తరుణులు = యువతులు (యువకులును ?), ప్రీతిన్ = సంతోషముతో, సుర = కల్లు, పొగడి - పొగడి = మిక్కిలి పొగడి

**తాత్పర్యము.** 'దేవతలకు దీనిచేతనే ముసలితనము, మరణము లేకపోవుట జరగెను అట్లుకానిచో నమృతమథనమునకు ముందు వారు కాలిపోవరా ? వేఁగరా? మరణింపరా ?' అని యువతీయువకులు ప్రీతితో కల్లును మిక్కిలిపొగడి - తరువాతి పద్యముతో నన్వయము

వ. అని యనేకవిధమాంసోపదంశకంబు లాస్వాదించుచు మనోహృద్యంబు లగు మద్యరసంబులు సద్యంబ సిద్ధరసంబునుం బోలె. శరీరంబులం గలయ వేధించిన 132

**అర్థము .** అని, అనేక - విధ - మాంస + ఉపదంశకంబులు = పెక్కురీతులయిన మాంసము,ఊరుఁగాయలు, ఆస్వాదించుచున్= రుచి చూచుచు- తినుచు, మనస్ (:) + హృద్యంబులు = మనసునకు సంతోషమును గూర్చునవి, అగు, మద్యరసంబులు = కల్లు, సద్యంబ = వెంటనే, సిద్ధ - రసంబునున్ + పోలెన్= పాదరసము వలె, శరీరంబులన్, కలయన్ = అంతటను, వేధించినన్ = బాధింపఁగా

**తాత్పర్యము .** అని పెక్కురీతు లయిన మాంసము, ఊరుఁగాయలు తినుచు, మనస్సునకు సంతోషమును, గూర్చు కల్లు - వెంటనే పాదరసమువలె శరీరములను అంతటను బాధింపఁగా తరువాతి పద్యముతో నన్వయము

విశేషములు సిద్ధరసము - సిద్ధౌషధుల రసము ఇది దేహమునఁ బ్రవేశించినంతఁ జొక్కును, మనోదేహభ్రమములును, జర్మస్ఫోటనమును, నఖకేశపతనమును గలిగించి పద్యోజాతత్వమును దయసేయును

సీ. అసితోత్పలములపై నరుణేందుదీధితు
లెలసె నాఁ గనుఁగవ లెఱ్ఱనయ్యెఁ
దొవలపైఁ బ్రాలేయలవములు తనరె నా
మొగములఁ బేర్చిందు లెగయుఁదెంచెఁ
గలహంస పదువులు గాళ్ళందుఁ దొడరె నా
మట్టంపు నడపులు మందటిల్లెఁ
దరుణవల్లరులపైఁ బురినమ్మ లూఁగె నా
వెన్నులఁ గ్రొవ్వెదల్ విరిసి వ్రేలెఁ

తే. బరభృతావలి దొలుమొల్ల పండ్లరసముఁ
ద్రావె నన ముద్దుఁబలుకులు తడుమనయ్యె
మధుమదాసక్తి నిజరూప మహిమ లెడసి
యభినవాంగప్రభాసిత లైరి సతులు 133

**అర్థము .** అసిత + ఉత్పలములపైన్ =నల్లని కలువలమీఁద, అరుణ + ఇందు - దీధితులు = సూర్యచంద్రకాంతులు, ఎలసెన్ = వ్యాపించెను, నాన్ = అనఁగా, కనుఁగవలు (కను +కవలు) = కన్నులజంటలు, ఎఱ్ఱన + అయ్యెన్ = ఎఱుపెక్కెను

తొవలపైన్ = కలువలపై, ప్రాలేయ - లవములు = మంచుబొట్టులు, తనరెన్ = ఒప్పెను, నాన్, మొగములన్ = ముఖములందు, పేర్చిందులు = చెమట బొట్టులు, ఎగయుఁదెంచెన్ = ఏర్పడెను

కలహంస -పదువులు = రాయంచల గుంపులు, కాళ్ళందున్ (కాళ్ళ + అందున్), తొడరెన్ + నాన్ = తగులుకొనెనా యన, మట్టంపునడపులు (మట్టము+ నడపులు) = సమానమునైన నడకలు, మందటిల్లెన్ = మందగించెను

తరుణ వల్లరులపైన్ = లేఁదీవలపై, పురి - నమ్మలు = మగనెమలులు, ఊఁగెన్ + నాన్, వెన్నులన్ = వెన్నులందు, క్రొవ్వెదల్ = కొప్పులు, విరిసి = విడిపోయి, వ్రేలెన్

పరభృత + ఆవలి = కోకిలముల వరుస, తొలు - మొల్ల - పండ్ల - రసమున్

= మొదటి మొల్ల పండ్లరసమును, (త్రావెన్ + ఆనన్, ముద్దుఁబలుకులు= ముద్దులుగులుకు మాటలు, తడుమన్ + అయ్యెన్ + తడవుకొననయ్యెను

మధు - మద + ఆసక్తికిన్ = కల్లు మత్తు గలుగుటచే, నిజ - రూప - మహిమలు = తమవైన ఆకార (ప్రభావములు, ఎడసి = కోల్పోయి, సతులు, అభినవ + అంగ - (ప్రభాసితలు = క్రొత్త శరీరములచేఁ (బకాశించువారు, ఐరి

**తాత్పర్యము .** నల్లకలువలపై సూర్యచంద్రకాంతులు వ్యాపించెనా యన సతులకుఁ గనుఁగవ లెఱుపెక్కెను కలువలపై మంచుబిందువు లొప్పెనా యన ముఖములందుఁ జెమటబొట్టు లేర్పడెను రాయంచల గుంపులు కాళ్ళ కడ్డపడెనా యన సమానములైన గమనములు మందగించెను లేఁదీఁగెలపైఁ బురిగలనెమలు లూఁగెనా యన వెన్నులపైఁ గొప్పులు వీడి (వేలెను కోకిలముల సమూహము తొలుతటి మొల్లపండ్లరసముఁ(దావెనాయన ముద్దుఁబలుకులు తడఁబాటు నందెను కల్లుకైపుచేఁ దమ యాకారములు పోయి వారు క్రొత్త మేనులతో నొప్పిరి

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష నమ్మి - నమలి - నెమలి, నమిలి, నెమిలి, నెమ్మి, నెమ్మలి, నమ్మలి (రూపాం ) క్రొవ్వెద - కబరికిఁ దుఱుము, గీ కొప్పు క్రొవ్వెద మూల నా నొప్పుఁ బేళ్లు ఆం భా 2 14 5

**క ముదితలు తొల్లియ యౌవన**
**మదమున మే యెఱుఁగ రింత మఱి దానిపయిన్**
**మదిరోన్మాదిత లై రఁట**
**యెదురన తా రెఱుఁగ రేమి యెఱుఁగుదు రింకన్ ? 134**

**అర్థము :** ముదితలు - స్త్రీలు, తొల్లి + అ = మొదటనే, యౌవన - మదమునన్ - పడుచుఁదనమువలని గర్వమున, మే = శరీరము, ఇంత - ఎఱుఁగరు = కొంచెముగూడ నెఱుఁగరు, మఱి, దాని పయిన్= యౌవనమదముపై, మదిరా + ఉన్మాదితలు = కల్లుచే మత్తెక్కినవారు, ఐరి + అఁట, ఎదురన్ + అ = ఎదురనే, తారు= వారు, ఎఱుఁగరు, ఇంకన్, ఏమి + ఎఱుఁగుదురు ?

**తాత్పర్యము .** ఆ స్త్రీలు మొదటనే పడుచుఁదనమువలని గర్వమున దమ మేను లింతయే నెఱుఁగరు ఇఁక దానిపైఁ గల్లుకైపు గలవారయిరఁట వారు ఎదుటనున్న వానినే యెఱుఁగరు ఇఁక నేమి యెఱుఁగుదురు ?

**విశేషములు** అలంకారము కావ్యార్థాపత్తి మే - (రూపాం) మెయి, మై

తరువోజ అన నక్కజంబుగా నన్ని మే యెఱుఁగ
కాడుచు శంకరు నంకమాలికలు
పనిగొన సాహురి ఫలమంజరులను
బౌరాలి నాందోలి భైరవి నాట
నునుపార నాలతుల్ నూల్కొనఁ జేసి
విన నింపుగాఁ బెక్కువిధములఁ బాడి
వినుతించి రింతు లా విశ్వేశు నీశు 135

**అర్థము** . అనన్ = అనుటకు, అక్కజంబుగాన్ = ఆశ్చర్యముగా, అన్ని = మదించి, మే + ఎఱుఁగక = ఒడలు తెలియక, శంకరు + అంకమాలికలు = ఈశ్వరుని బిరుదులు చెప్పి స్తుతిచేయుగానములు, ఆడుచున్, పనిగొనన్ = యత్నింపఁగా, సాహురిన్ - ఫలమంజరులను - పౌరాలిన్ + ఆందోలిన్ - భైరవిన్ - నాటన్ = సాహురి మున్నగు రాగభేదములను, నునుపారన్ = మృదువుగా, ఆలతుల్ = ఆలాపములు, నూల్కొనన్ + చేసి = చక్కఁబఱిచి, నును - రీతితోడన్ = మృదువుగా, మనోరాగలీలన్ = మనస్సునందలి అనురాగముతో, వినన్ = వినుటకు, ఇంపుగాన్ = మధురముగా, పెక్కు - విధములన్, పాడి, ఇంతులు = స్త్రీలు, ఆ - విశ్వ + ఈశున్ - ఈశున్ = ఆ లోకేశ్వరుఁడైన ఈశ్వరుని, వినుతించిరి = స్తుతించిరి

**తాత్పర్యము :** స్త్రీలు ఆశ్చర్యకరముగా మదించి ఒడలు తెలియక ఆడుచు ఈశ్వరుని బిరుదులు చెప్పి స్తుతించుచు, సాహురి, ఫలమంజరి, పౌరాలి ఆందోలి, భైరవి, నాట అనెడి రాగభేదములతో మృదువుగా నాలాపములు చేయుచు, మనోనురాగముతో వినుట కింపుగాఁ బెక్కురీతుల ఆ విశ్వేశ్వరుఁడైన యీశ్వరుని స్తుతించుచు గానము చేసిరి

వ. అంతం బరమేశ్వరుండు తద్వినోద ప్రవర్తకాద్యఖిల జనంబుల కనేక విధాంబరాభరణాది విశేషవస్తువు లొసఁగి మహానురాగంబున 136

**అర్థము** . అంతన్, పరమేశ్వరుండు, తద్ + వినోద - ప్రవర్తక + ఆది + అఖిల - జనంబులకున్ = ఆ వేడుకలందుఁ బ్రవర్తించువారు మున్నగు నెల్లజనులకు, అనేక -విధ + అంబర + ఆభరణ + ఆది - విశేష - వస్తువులు =

పెక్కురీతులయిన వస్త్రములు, అలంకారములు మున్నగు ప్రత్యేకవస్తువులు, ఒసఁగి = ఇచ్చి, మహత్ (మహా) + అనురాగంబునన్ = గొప్ప ఇష్టముతో -

**తాత్పర్యము** అంతఁ బరమేశ్వరుఁడు ఆ వేడుకలందుఁ బాల్గొనిన ఎల్లజనులకుఁ బలురీతులైన వస్త్రములు, అలంకారములు మున్నగు విశేషవస్తువుల నొసఁగి మహానురాగమతో - తరువాతి పద్యముతో నన్వయము

మ **కమలాధీశ్వరభారతీశ్వరులు దిక్పాలాదిగీర్వాణ వ**
**ర్గములన్ సూరెలఁ గొల్చిరాఁగ మునిసంఘం బర్థిఁ గీర్తింపఁ బం**
**చ మహాశబ్దములుం జెలంగ ధవళచ్ఛత్రాది సామ్రాజ్య చి**
**హ్నములన్ వచ్చి రుమామహేశులు మహోక్షారూఢులై పేర్మితోన్ 137**

**అర్థము** ఉమా - మహేశులు = పార్వతీపరమేశ్వరులు, మహోక్ష + ఆరూఢులు + ఐ = ఎద్దునెక్కినవారయి, కమలా +అధి + ఈశ్వర - భారతీ + ఈశ్వరులు = లక్ష్మీపతియగు విష్ణువును, సరస్వతీభర్తయగు బ్రహ్మయును, దిశ్(క్) + పాల + ఆది - గీర్వాణ - వర్గములన్ = దిక్పాలకులు మున్నగు దేవతల సమూహములును, సూరెలన్ = పార్శ్వములందు, కొల్చి = సేవించి, రాఁగన్ = రాఁగా, ముని - సంఘంబు = మునుల సమూహము, అర్థిన్ = కోరికతో, కీర్తింపన్ = స్తుతింపఁగా, పంచ - మహా - శబ్దములున్ = అయిదు విధములైన ధ్వనులును, చెలంగన్ = ధ్వనింపఁగా ధవళ+ ఛత్ర + ఆది - సామ్రాజ్య - చిహ్నములన్ = వెల్లగొడుగు మున్నగు సామ్రాజ్యపు గుఱుతులతో, పేర్మితోన్ = గొప్పతనముతో, వచ్చిరి

**తాత్పర్యము** ఇట్లు సర్వలోకచక్రవర్తి యగు నీశ్వరుఁడు నగరమునకు వచ్చి పరమైశ్వర్యాది సంపదలతో నొప్పుచు పార్వతీ సమేతుఁడై, పరమసౌఖ్యముతోఁ బ్రవర్తిల్లు చుండెను అంత - తరువాతి పద్యముతో నన్వయము

క **కతిపయ దినముల కా నగ**
**పతి సకళత్రాప్తమిత్రబాంధవరాజ్యో**
**న్నత నుత విభవైశ్వర్యా**
**న్వితముఁ ద న్నరణమిచ్చె విశ్వేశునకున్ 139**

**అర్థము**. కతిపయ - దినములకున్ = కొన్ని దినములకు, ఆ - నగ - పతి = ఆ కొండలఱేఁడు - హిమవంతుఁడు, స-కళత్ర + అప్త - మిత్ర - బాంధవ -

రాజ్య + ఉన్నత - నుత - విభవ + ఐశ్వర్య + అన్వితముగన్ = భార్యతో, ప్రియమిత్రులు, బంధువులు, రాజ్యము, ఉన్నతమైన, పొగడఁబడిన, సంపద, ఐశ్వర్యము అనువానితోఁ గూడుకొనునట్లుగా, తన్నున్, విశ్వ + ఈశునకున్ =జగత్పతియైన ఈశ్వరునకు, అరణము + ఇచ్చెన్ = సమర్పించుకొనెను

**తాత్పర్యము.** కొన్ని దినములకుఁ బర్వతరాజగు హిమవంతుఁడు భార్యతో, ఆప్తమిత్రులతో, బంధువులతో, రాజ్యముతో, ఉన్నతము, సన్నుతము అయిన విభవైశ్వర్యముతో విశ్వేశ్వరునకుఁ దన్ను సమర్పించుకొనెను

వ ఇట్లు గిరిశుండు గిరిపతి నరణంబు గొని హరి పరమేష్ఠి పురందరాద్యఖిల సురవరోరగాధీశ్వర పరివృతుండై. 140

**అర్థము.** ఇట్లు, గిరిశుండు = ఈశ్వరుఁడు, గిరి-పతిన్ = కొండలఱేనిని-హిమవంతుని, అరణంబు + కొని = కానుకగాఁ బరిగ్రహించి, హరి - పరమేష్ఠి - పురందర + ఆది + అఖిల - సుర - వర + అధి + ఈశ్వర - పరివృతుండు + ఐ = విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుఁడు మున్నగు నెల్లదేవతాశ్రేష్ఠుల ప్రభువులతోఁ జుట్టఁబడినవాఁడయి

**తాత్పర్యము .** ఇట్లు పరమేశ్వరుఁడు హిమవంతుని గానుకగాఁగొని, విష్ణుబ్రహ్మేంద్రాది సకలదేవతాప్రభువులతోఁ గూడినవాఁడయి - తరువాతి పద్యముతో నన్వయము

సీ పింఛాతపత్రమల్ పెనఁగి మరుద్వీధిఁ
గార్కొను నీలమేఘములు గాఁగ
వివిధభూషారత్నవివిధాంశుజాలముల్
సదమ లాఖండల చాపములుగ
ఘనవీధిఁ బొలసాడు ఖచరాంగనాపాంగ
తరళాక్షరుచులు సౌదామనులుగ
సింధురోన్నత కర శీకరాసారముల్
ధారుణిఁ గురియు నాసారములుగ

ఆ. సంచితంబు లైన పంచమహాశబ్ద
రవము లులియు మేఘరవము లనఁగ
హరుఁడు వచ్చె రజతగిరి కుమాన్వితము క్రొ
క్కారులీలఁ గరము గౌరవమున 141

**అర్థము** పింఛ + ఆతపత్రముల్ = నెమలిపురుల గొడుగులు, పెనఁగి= కూడి, మరుత్ + వీధిన్ = ఆకాశమున, కార్కొను = క్రమ్ముకొను, నీల - మేఘములు = నల్లని మేఘములు, కాఁగన్

వివిధ - భూషా - రత్న - వివిధ + అంశు - జాలముల్ = పెక్కురీతులైన ఆభరణములందలి మణుల పలురీతులైన కిరణముల సమూహములు, సత్ + అమల + ఆఖండల - చాపములుగన్ = మిక్కిలి నిర్మలములయిన ఇంద్రధనుస్సులుగను,

ఘన వీధిన్ = ఆకాశమున, పొలసాడు = పొలసి + ఆడు = సంచరించు, ఖచర + అంగనా + అపాంగ - తరళ - అక్ష - రుచులు = దేవతాస్త్రీల క్రీఁగన్నుల చంచలములయిన కన్నుల కాంతులు, సౌదామనులుగన్ = మెఱపులుగను,

సింధుర + ఉన్నత - కర - శీకర + ఆసారముల్ = ఏనుఁగుల ఎత్తయిన తొండముల తుంపరల జల్లులు, ధారుణిన్ = భూమియందు, కురియు = వర్షించునట్టి, ఆసారములుగన్ = జడివానలుగను

సంచితంబులు + ఐన = కూర్పఁబడిన, పంచ మహాశబ్ద - రవములు = భేరికాహళాదులైన అయిదు విధములగు ధ్వనులు ఉలియు = మ్రోయునట్టి, మేఘరవములు = ఉఱుములు, అనఁగన్ = అనఁగను

హరుఁడు = శివుఁడు, ఉమా + అన్వితముగన్ = పార్వతీ సమేతముగా, క్రొక్కారు (క్రొత్త + కారు) లీలన్ = తొలకరివలె, రజత - గిరికిన్ = వెండికొండకు - కైలాసమునకు, కరమున్ = మిక్కిలి, గారవమునన్ = గౌరవముతో, వచ్చెన్

**తాత్పర్యము.** నెమలి పురుల గొడుగులు కూడి ఆకాశమునఁ గ్రమ్ముకొను నల్లని మేఘములు కాఁగా, వివిధాభరణములందలి రత్నముల వివిధ కిరణముల సమూహములు నిర్మలములయిన ఇంద్రచాపములు కాఁగా, ఆకాశమున సంచరించు దేవతా స్త్రీల క్రీఁగన్నుల చంచలములయిన కన్నుల కాంతులు మెఱపులు గాఁగా, ఏనుఁగు ఎత్తయిన తొండముల నుండి వచ్చు తుంపరల జల్లులు భూమియందు వర్షించు జడివానలు కాఁగా, భేరీకాహళాదుల పంచమహాశబ్దరవములు మ్రోయునట్టి ఉఱుములు అనఁగను శివుఁడు పార్వతీసమేతముగాఁ దొలకరివలె వెండికొండకు మిక్కిలి గౌరవముతో వచ్చెను

**విశేషములు .** రూపకానుప్రాణితోత్ప్రేక్ష క్రొక్కారు = క్రొత్త + కారు, పంచమహాశబ్దములు - భేరి, కాహళము, పటహము, శంఖము, జయఘంట - తత, ఆనద్ధ, సుషిర, ఘన ఆతోద్యముల ధ్వనులు అక్ష - ఈ కవి అక్షిన్ శబ్దమునకు బదులుగా అక్ష శబ్దమును వాడుట పెక్కుచోట్లఁ గలదు గారవము (వి) - గౌరవము(ప్ర )

**వ ఇ ట్లనంతవిభవైశ్వర్యాబ్ధిఁ దనరుచు గౌరీసమన్వితుండై చనుదెంచి హరిపరమేష్ఠిపురందరాద్యఖిలభువన భవనాధీశ్వర మునీశ్వరాదుల కభిమతంబు లొసంగి హిమవంతున కజరామరత్వాఖిలనగచక్రవర్తిత్వానంత విభవైశ్వర్యంబులు తోన దయచేసి వీడుకొలిపె నట మేనకయు నుమా దేవియును**

**అర్థము .** ఇట్లు, అనంత - విభవ + ఐశ్వర్య + అబ్ధిన్ = అంతులేని సంపద ఐశ్వర్యము అనెడి సముద్రమునందు, తనరుచున్ = ఒప్పుచు, గౌరీ - సమన్వితుండు + ఐ = పార్వతీసహితుఁడై, చనుదెంచి = వచ్చి, హరి - పరమేష్ఠి - పురందర + ఆది + అఖిల - భువన - భవన + అధి + ఈశ్వర -ముని + ఈశ్వర + ఆదులకున్ = విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుఁడు మున్నుగాఁ గల యెల్లలోకము లనెడి భవనముల ప్రభువులు, మునిశ్రేష్ఠులు మున్నగు వారికి, అభిమతంబులు= కోరిన కోరికలు, ఒసంగి = ఇచ్చి, హిమవంతునకున్, అజర + అమరత్వ + అఖిల - నగ - చక్రవర్తిత్వ + అనంత - విభవ + ఐశ్వర్యంబులు = ముసలితనములేమి, మరణము లేమి, సకలపర్వతచక్రవర్తిత్వము, అంతులేని సంపద, ఐశ్వర్యములు, తోన్ + అ = వెంటనే, దయ + చేసి = ప్రసాదించి, వీడుకొలిపెన్ = పంపెను, అటన్, మేనకయున్, ఉమాదేవియును

**తాత్పర్యము :** ఇట్లు అంతులేని సంపదైశ్వర్యములనెడి సముద్రమునందు ఓలలాడుచు, పార్వతీసహితుఁడై వచ్చి విష్ణువు, బ్రహ్మ,ఇంద్రుఁడు మున్నుగాఁగల సకల భువన భవన ప్రభువులు, మునీశ్వరులు మున్నగువారికి వరములొసఁగి హిమవంతునకు ముసలితనము లేమి, మరణము లేమి, సకలపర్వతచక్రవర్తిత్వము, అంతులేని సంపద, ఐశ్వర్యము వెంటనే ప్రసాదించి పంపెను అట మేనకయును, పార్వతియును -తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** అనంత విభవైశ్వర్యాబ్ధి - రూపకము విభవైశ్వర్య - విభవ + ఐశ్వర్య - వృద్ధిసంధి

తే ఉరు కుచాగ్రంబు లొండొంటి నొత్తుదేర
నెదురు కౌఁగిలింపఁగ నను వెట్లుఁగాక
కెలని కొఱఁగుచుఁ గుచతటుల్ బలిమి నొత్త
నదిమి కేలెటకేనియు నందికొనిరి 143

**అర్థము .** ఉరు - కుచ + అగ్రంబులు = పెద్దవియగు స్తనముల కొనలు, ఒండొంటిన్ = ఒకదాని నొకటి, ఒత్తుదేరన్ = ఒత్తుకొనఁగా, ఎదురు = ఎదురుగా, కౌఁగిలింపఁగన్ = కౌఁగిలించుకొనుటకు, ఎట్లున్ = ఏవిధముగను, అనువు - కాక = వీలుగాక, కెలనికిన్ = ప్రక్కకు, ఒఱఁగుచున్, కుచ- తటుల్ = స్తన ప్రదేశములు, బలిమిన్ = అధికముగా, ఒత్తన్, అదిమి = నొక్కి, ఎటకేనియున్ = ఎట్టకేలకు, కేలు = చేయి, అందుకొనిరి

**తాత్పర్యము .** మేనకాపార్వతులు తమ గొప్పవియగు స్తనముల కొనలు పరస్పరము ఒత్తుకొనుటచే ఎదురుగాఁ గౌఁగిలించుకొనుట కెట్లును వీలుగాక ప్రక్కకొదుగుచు స్తనప్రదేశములు బలముగా నొత్తుకొనుట్లు నొక్కి ఎట్టకేలకు చేతుల నందిపుచ్చుకొనిరి

**విశేషములు .** అలంకారము స్వభావోక్తి

వ ఇట్లు పుష్ప స్తబక భరానమ్ర కల్పలతిక లొండొంటిఁ బెనంగు న ట్లన్నువ కౌఁదీఁగలు సోపులాడ నొండొరుల నందంద కౌఁగిలించుకొని మేనక మనో రాగంబున నిజతనయ వీడుకొని చనియె నంత నక్కడ 144

**అర్థము :** ఇట్లు, పుష్ప - స్తబక - భర + ఆనమ్ర - కల్ప - లతికలు = పూలగుత్తుల బరువుచే మిక్కిలి వంగిన కల్పలతలు, ఒండొంటిన్ = ఒకదాని నొకటి, పెనంగు + అట్లు = కూడునట్లు, అన్నువ - కౌఁదీఁగలు (కౌను + తీఁగ) = సన్నని తీఁగలవంటి నడుములు, చోపులు + ఆడన్ = త్రోపాడుచుండఁగా, ఒండొరులన్ = ఒకరి నొకరు, అందంద = మఱిమఱి, కౌఁగిలించుకొని, మేనక, మనస్ (ః) + రాగంబునన్ = హృదయానురాగముతో, నిజ - తనయన్ = తన కూఁతును, వీడుకొని - చనియెన్ = విడిచివెడలెను అంతన్, అక్కడన్

**తాత్పర్యము .** ఇట్లు పూలగుత్తుల బరువుచే మిక్కిలి వంగిన కల్పలతలు ఒకదాని నొకటి పెనఁగునట్లు సన్నని తీఁగల వంటి నడుములు త్రోపాడుచుండఁగా

ఒకరి నొకరు మఱిమఱి కౌఁగిలించుకొని మేనక హృదయానురాగమునఁ దనకూఁతును విడిచి వెడలెను అంత నక్కడ - తరువాతి పద్యముతో నన్వయము

## పార్వతీశ్వరుల రతివర్ణన

క **లీలోద్యాన వనంబులఁ**
**గేలీ సదనములఁ, బుష్పగేహముల లతాం**
**దోలముల, సరోవర తీ**
**రాలి నిజేచ్ఛావిహారులై హరగిరిజల్** **145**

**అర్థము** హర - గిరిజల్, లీలా + ఉద్యాన -వనంబులన్ = క్రీడోద్యానవనములందును, కేలీ - సదనములన్ = క్రీడా భవనములందును, పుష్ప - గేహములన్ = పూవుటిండ్లయందును, లతా + ఆందోలములన్ = తీవెయూయలలందును, సరోవర - తీర + ఆలిన్ = సరస్తీరముల వరుసయందును, నిజ + ఇచ్ఛా - విహారులు + ఐ = తమ యిచ్చవచ్చునట్లు విహరించువారయి

**తాత్పర్యము** . పార్వతీ పరమేశ్వరులు క్రీడోద్యానవనములందును, క్రీడాభవనములందును, పూవుటిండ్లయందును, తీవెయూయలల యందును, సరస్తీరములందును దమయిచ్చవచ్చినట్లు విహరించుచు - తరువాతి పద్యముతో నన్వయము

చ **నయమున భీతి వాపి, మది నన్నునఁ దేఁకువ వాపి, మాటలం**
**బ్రియ మొనరించి, పొంతనల బేటము పెంచుచు, సమ్మదంబునం**
**బయిపడి గుహ్యముల్ బయలు పర్చుచుఁ జెయ్యుల లజ్జ వాపుచున్,**
**మెయివడి గౌరి నీశ్వరుఁడు మేకొలిపెన్ రతికిం గ్రమంబునన్** **146**

**అర్థము :** ఈశ్వరుఁడు, నయమునన్ = నేర్పుతో, భీతి = భయము, పాపి= పోఁగొట్టి, మది - నన్నునన్ = మనసునందలి ప్రేమముతో, తేఁకువ + పాపి= బింకము - బెట్టు, పోఁగొట్టి, మాటలన్ = మాటలతో, ప్రియము = ప్రీతి, ఒనరించి= చేసి, పొంతనలన్ = లాలనములతో, బేటము = అనురాగము, పెంచుచున్ = వృద్ధిపఱుచుచు, సమ్మదంబునన్ = సంతోషముతో, పయిపడి = రతియందుఁగూడి, గుహ్యముల్ = రహస్యావయవములు, బయలుపర్చుచున్ = బహిరంగపఱుచుచు, చెయ్యులన్ = చేష్టలతో, లజ్జ = సిగ్గు, పాపుచున్ = పోఁగొట్టుచు, మెయివడిన్ = సమ్మతితో, గౌరిన్ = పార్వతిని, క్రమంబునన్, రతికిన్ = సంభోగమునకు, మేకొలిపెన్ = అంగీకరింపఁజేసెను

**తాత్పర్యము .** ఈశ్వరుఁడు నేర్పుతో భయమును బోఁగొట్టి, మాటలతో సంతోషముఁ గలిగించి, బుజ్జగింపులతో వలపుఁ బెంచుచు, సంతోషముతో రతియందుఁ గూడి రహస్యాంగములను బహిరంగపఱుచుచుఁ, జేష్టలతో సిగ్గుపోఁగొట్టుచు, సమ్మతితో గౌరిని క్రమముగా సంభోగమునకు సమ్మతింపఁజేసెను

సీ నిడువాలుఁజూడ్కులు నిగిడించు మగిడించుఁ
బతి కన్నుఁగవ పాలపంబు తెఱపిఁ
బొరిఁబొరి మైఁదీఁగ పొందించు నెడలించుఁ
జోఁకాసఁ బ్రియు మేను సుడియునెడల
వెడఁదొక్కుఁబలుకుల వినుపించుఁ గొదవించుఁ
గలయ వల్లభు పల్కుపలుకు పొంత
దరహాసరుచి మోవి దళుకించుఁ దఱకించు
విభుపరిహాసోక్తి వెరవుఁ గఱవ

ఆ సెరవు సేయ కధిపు చెయువల మెయివడి
నడరుఁ దాను గానియదియ పోలెఁ
దరుణి నెమ్మనమునఁ దమకంబు లజ్జయు
నలఁతి కగ్గలింప నాఁకగొనక 147

**అర్థము .** తరుణి = యువతి - పార్వతి, నెమ్మనమునన్ = (నెఱ + మనమునన్) నిండు మనసున, తమకంబున్ = వేగిరపాటును, లజ్జయున్ = సిగ్గును, అలఁతికిన్ + అగ్గలింపన్ = మితిమీఱఁగా, ఆఁక + కొనక = అడ్డగింపక,

పతి = భర్తయైన ఈశ్వరునియొక్క, కన్నుఁగవ (కన్ను + కవ) = కనుదోయి యొక్క, పాలపంబు - తెఱపిన్ = ప్రసారముయొక్క వ్యవధిలో, నిడు - వాలు + చూడ్కులు = నిడుదలైన ఓరచూపులు, నిగిడించున్ = వ్యాపింపఁజేయును, మగిడించున్ = మరలునట్లుచేయును

చోఁకు + ఆసన్ = తాఁకు నాశతో, ప్రియు - మేను = పతిశరీరము, సుడియు + ఎడలన్ = డాయుసమయములందు, పొరిఁబొరిన్ = క్రమముగా, మైఁదీఁగ = తీఁగవంటి మేను, పొందించున్ = కూర్చును, ఎడలించున్ = తొలఁగించును

కలయన్ = బాగుగా, వల్లభు - పల్కు - పలుకు - పొంతన్ = ప్రియుఁడు

పలుకు పలుకుచెంత, వెడన్ = అల్పముగా, లొక్కు(బలుకులన్ (లొక్కు + పలుకులన్) = అవ్యక్తమధురములయిన మాటలను, వినుపించున్, కొదవించున్ = తగ్గించును

విభు = భర్తయొక్క,పరిహాస + ఉక్తిన్ = పరియాచకపు మాటచే, వెరవున్ = నేర్పును, కలవన్ = నేర్వ(గా, దర- హాస- రుచిన్ = చిఱునవ్వుకాంతితో, మోవిన్ = పెదవిని, తళుకించున్ = ప్రకాశింప(జేయును, తఱకించున్ = తొలగించును

సెరవు + చేయక = హానిచేయక, అధిపు - చెయ్వులన్ = ప్రియుని చేష్టలను, మెయివడిన్ = సమ్మతితో, తాను, కాని + అది + అ + పోలెన్ = సమ్మతింపనిస్త్రీ వలె , అడరున్ = పూనును

**తాత్పర్యము.** పార్వతి నెమ్మనమున వేగిరపాటును, సిగ్గును మితిమీఱ(గా నడ్డపెట్టక భర్త చూపుల వ్యవధిలో( దననిడుదలైన ఓరచూపులను బ్రసరింప(జేయును, మరలించును తా(కవలయుననుకోరికతో భర్త శరీరము డాయు సమయమున ఆమె క్రమముగా( దన మై(దీవను దగ్గఱకు( జేర్చును, తొల(గించును ప్రియుని మాటలకు ఆమె స్వల్పముగా( దన అవ్యక్త మధురములయిన మాటలను వినిపించును, తగ్గించును భర్త పరిహాసోక్తిచే నేర్పుగలుగ(గా( జిఱునవ్వుకాంతితో( బెదవిని బ్రకాశింప( జేయును, తొల(గించును హాని చేయక భర్త చేష్టలను సమ్మతితో( దాను సమ్మతింపని స్త్రీ వలె( బూనును

**విశేషములు :** అలంకారము స్వభావోక్తి ఇందు బార్వతిని కవి లజ్జా మన్మథమధ్యస్థయు, ఉదితయౌవనయునైన నాయికనుగా వర్ణించెను

క **తరతర మంజిక దఱక(గ(**
**బరువడి మృదుతరరతముల( బరిణతులై యా**
**హర గిరితనయలు సురతా**
**తురు లగుచుం గాయ్వు మిగిలి తోడ్తోన మదిన్.** 148

**అర్థము.** ఆ - హర - గిరి - తనయలు = ఆ శివు(డును బార్వతియును, తరతరము = క్రమముగా, అంజిక = భయము, తఱ(కగన్ = తొల(గ(గా, పరువడిన్ = శీఘ్రముగా, మృదుతర - రతములన్ = మిక్కిలి మృదువులైన సంభోగములందు, పరిణతులు +ఐ = పండినవారయి, సురత + ఆతురులు =

సంభోగమునందు, వేగిరపాటు గలవారు, అగుచున్, మదిన్ = మనస్సునందు తోడ్తోన్ + అ = వెంటనే, కాయ్పు = అనురాగము, మిగిలి = అధికమయి

**తాత్పర్యము** ఆ పార్వతీశ్వరులు క్రమముగా భయము తొలఁగఁగా, శీఘ్రముగా మిక్కిలి మృదువైన సంభోగములందు పరిణతిఁజెంది, సంభోగమునకుఁ ద్వరపడుచు మదిలో ననురాగమధికమయి - తరువాతి పద్యముతో నన్వయము

సీ **కరలత లందంద కామపాశంబుల**
**నదిమి బంధించుచున్నట్లు బిగియ**
**నొదవుఁబేర్బిందులఁ బదనైనపూఁత లం**
**గమునకు వజ్రలేపములు గాఁగఁ**
**బులక లొండొరుల మేనుల నుచ్చిపోయి ద**
**గ్గఱ మొలలిచ్చిన కరణి గాఁగఁ**
**గనకంపుఁబ్రతిమలు గాఁచి యంటించిన**
**ట్లొడఁగూడి తనువు లొండొంటిఁ గదియఁ**

ఆ **దగఁగ నొక్కతలకు మొగములు రెండైన**
**పగిదిఁ దలలు మాఱుమొగము వడఁగ**
**గీఱి మేను మేనఁ దూఱ గాఢాలింగ**
**నంబు సేసి రంగనయుఁ బ్రియుండు** 149

**అర్థము** . కామ - పాశంబులన్ = మన్మథపాశములతో, అందంద = మిక్కిలి, అదిమి = నొక్కి, బంధించుచున్ + ఉన్న + అట్లు = కట్టివైచుచున్న విధమున, కర-లతలు = తీఁగలవంటి చేతులు, బిగియన్ = బిగిసికొనఁగా,

ఒదవు + పేర్ + బిందులన్ = కలిగెడు చెమటబొట్టులచే, పదను + ఐన = తడియైన, పూఁతలు = అంగలేపములు, అంగమునకున్ = శరీరమునకు, వజ్ర-లేపములు = వజ్రపుఁబూఁతలు, కాఁగన్

పులకలు = గగుర్పాటులు, ఒండొరుల = ఒకరొకరి, మేనులన్ = శరీరములందు, ఉచ్చిపోయి = భేదించి, డగ్గఱన్ = చేరువను, మొలలు + ఇచ్చిన కరణి + కాఁగన్ = చీలలు బిగించిన విధము కాఁగా,

కనకంపుఁ బ్రతిమలు (కనకము + ప్రతిమలు) = బంగారు బొమ్మలు,

కాఁచి = కాల్చి, అంటించిన + అట్లు = అంటించిన విధమున, తనువులు = శరీరములు, ఒడఁగూడి = జతఁగూడి, ఒండొంటిన్ = ఒకదాని నొకటి, కదియన్ = కూడఁగా,

తగఁగన్ = ఒప్పునట్లు, ఒక్క తలకున్, మొగములు = ముఖములు, రెండు + ఐన - పగిదిన్ = రెండయిన విధమున, తలలు, మాఱుమొగము + పడఁగన్,

గీఱి = భేదించి, మేను = ఒకరి శరీరము, మేనన్ = ఇంకొకరి శరీరమున, తూఱన్ = ప్రవేశింపఁగా, అంగనయున్ = స్త్రీయు (పార్వతియు), ప్రియుండున్ = భర్తయును ( శివుఁడును), గాఢ + ఆలింగనంబు -ు చేసిరి = ధృఢముగా గౌఁగిలించుకొనిరి

**తాత్పర్యము:** మన్మధపాశములతో మిక్కిలి నొక్కి కట్టివైచుచున్న విధమునఁ దీఁగలవంటి చేతులు బిగియఁగను, చెమటబొట్టులచేఁ దడియైన అంగలేపములు శరీరమునకు వజ్రపుఁబూఁతలు కా గా, గగుర్పాటులు ఒకరొకరి శరీరములను భేదించి చేతువను చీలల బిగించిన విధము కాఁగా, బంగారు బొమ్మలను గాల్చి అంటించినట్లు శరీరములు జతగూడి ఒకదానినొకటి కూడఁగను, ఒక్కతలకు ముఖములు రెం డయినట్లు తలలు మార్మొగము పడఁగను, ఒకరి శరీరము మఱియొకరి శరీరమును భేదించి ప్రవేశింపఁగను పార్వతీపరమేశ్వరులు గాఢాలింగనము చేసికొనిరి

**విశేషములు :** అలంకారము రూపకానుప్రాణితోత్ప్రేక్ష స్వభావోక్తి కనకంపుఁబ్రతిమలు - కనకము + ప్రతిమలు మువర్ణకమునకుఁ బుంప్వాదేశము బాల సంధి 32 నుగాగమము బాల సంధి 25 ద్రుతకార్యము - బాల సంధి 16,17

**క.** **అనవరతము నవకరణా**
**సన చుంబన భూషణాదిసంగమ గతు లో**
**లిన నూల్కొనఁ బెనఁగిరి కా**
**యువ్వన బహుతరగతుల నింపు సొంపిరివోవన్** **150**

**అర్థము:** అనవరతమున్ = ఎల్లప్పుడును, నవకరణ + ఆసన - చుంబన+ భూషణ + ఆది - సంగమ - గతులు = నవకరణము, ఆసనము, చుంబనము, భూషణము మున్నగు సంభోగరీతులు, ఓలిన్ + అ = క్రమముగానే, నూల్కొనన్

= కలుగఁగా, కాయ్యునన్ = ప్రేమముతో, బహుతర - గతులన్ = అనేక విధముల, ఇంపు = ఆనందము, పొంపిరి + పోవన్ = అతిశయింపఁగా, పెనఁగిరి= కూడిరి

**తాత్పర్యము** నిరంతరమును నవకర ణాసన చుంబనభూషణాదులైన సంభోగరీతులు క్రమముగాఁగలుగ వారు అనురాగముతో ననేకవిధముల ఆనంద మతిశయింపఁ గూడిరి

వ తదవసరంబున 151

**అర్థతాత్పర్యములు** . తద్ + అవసరంబునన్ = ఆ సమయమున - తరువాతి పద్యముతో నన్వయము

సీ **రతిలోలురై బాహ్యరతియు నాభ్యంతర**
**రతియు నుత్తమ సమరతియు నీచ**
**రతియు సలలితోచ్చరతియుఁ బొల్పగు చిత్ర**
**రతియు సన్నుత మూలరతియు నుపరి**
**రతియు నింపగు మృదురతియుఁ బ్రచండోరు**
**రతియు నెంతయు గూఢరతియుఁ బ్రకట**
**రతియును నాఁ బెక్కురతములు పరువడి**
**రతిపతిశాస్త్రచోదితము గాఁగ**

ఆ. **సతికిఁ దెలియఁ జూపెఁ బతి వాని నన్నియు**
**మగువ వరుసఁ బతికి మగుడఁజూపె**
**సతియుఁ బతియు నేర్పు రతి భక్తిఁ దలపోయ**
**రతులు నవములయ్యెఁ బ్రతిదినంబు** 152

**అర్థము :** రతి - లోలురు + ఐ = సంభోగమునం దాసక్తి గలవారయి, బాహ్య - రతియున్, ఆభ్యంతర - రతియున్, ఉత్తమ - సమ -రతియున్ = శ్రేష్ఠమయిన సమరతియును,

నీచ - రతియున్, సలలిత + ఉచ్చ - రతియున్, పొల్పు + అగు = ఒప్పయిన, చిత్ర రతియున్, సన్నుత - మూల - రతియున్, ప్రంచడ + ఉరు - రతియున్, ఎంతయున్, గూఢ - రతియున్, ఉపరి - రతియున్, ఇంపు + అగు, మృదు - రతియున్, ప్రచండ + ఉరు - రతియున్, ఎంతయున్, గూఢ రతియున్,

ప్రకట - రతియును, నాన్ = అన, పెక్కు రతములు, పరువడిన్ = క్రమముగా, రతి - పతి - శాస్త్రచోదితము = కామశాస్త్ర ప్రేరితము, కాఁగన్,

పతి = భర్త (శివుఁడు), సతికిన్ = స్త్రీ (పార్వతి)కి తెలియన్ + చూపెన్, వానిన్, అన్నియున్, మగువ = స్త్రీ వరుసన్ = వరుసతో, పతికిన్ = భర్తకు, మగుడన్ = మరల, చూపెన్

ప్రతిదినంబున్, సతియున్, పతియున్, నేర్పు, రతి, భక్తిన్, తలపోయన్, రతులు, నవములు = క్రొత్తవి, అయ్యెన్

**తాత్పర్యము** సంభోగమునం దాసక్తి గలవారయి, బాహ్యరతియు, ఆభ్యంతర రతియు, ఉత్తమమైన సమరతియు, నీచరతియు, సలలితమైన ఉచ్చరతియు, ఒప్పయిన చిత్రరతియు, సన్నుతమైన మూలరతియు, ఉపరిరతియు, ఇంపయిన మృదురతియు, ప్రచండరతియు, ఎంతయును గూఢరతియు, ప్రకటరతియును అనఁగాఁ బెక్కురతులు క్రమముగాఁ గామశాస్త్రప్రేరితములు కాఁగా, పతియగు నీశ్వరుఁడు సతియైన పార్వతికిఁ దెలియఁజూపెను పార్వతి వానినన్నిటిని వరుసగా భర్తకు మరలఁ జూపెను సతీపతులు నేర్పురతిని భక్తితోఁ దలపోయఁగాఁ బ్రతిదినమును రతులు క్రొత్తవి యయ్యెను

**ఉ. కోరికపొం దెఱింగి రతి గూఢపు నిక్క మెఱింగి చెయ్వులన్**
**వారణలేక చిత్తముల వంచన లేక రమించె నీశుఁ డిం**
**పార ననేకకాలముల నప్పటికప్పటి కొక్కభంగి నా**
**గౌరియుఁదాను నొండొరులకంటె మనోభవకేళిలోలురై 153**

**అర్థము :** ఈశుఁడు, ఆ - గౌరియున్, తానున్, ఒండొరుల కంటెన్ = ఒకరికంటె నొకరు, మనోభవ - కేళి -లోలురు + ఐ = మన్మథక్రీడయం దాసక్తిగలవారయి, కోరిక - పొందు + ఎఱింగి, రతి - గూఢపు - నిక్కము = రతియొక్క గూఢమైన వాస్తవము, ఎఱింగి, చెయ్వులన్ = చేష్టలందు, వారణ - లేక = అడ్డు లేక, చిత్తములన్ = మనస్సులందు, వంచన = మోసము, లేక, ఇంపు + ఆరన్ = ఆనందము గలుగఁగా, అనేక - కాలములన్ = పెక్కుసమయములందు, అప్పటికిన్ + అప్పటికిన్ = ఆయా సమయమునకు, ఒక్క - భంగిన్ = ఒక విధముగా, రమించెన్ = సంభోగించెను

**తాత్పర్యము:** పార్వతియును దానును ఒకరికంటెనొకరు మన్మథక్రీడయం దాసక్తిగలవారయి, ఈశ్వరుఁడు కోరిక తెలిసికొని రతిలో గూఢమైన, నిజము

తెలిసి, చేష్టలలో అడ్డులేక, చిత్తములందు మోసములేక, ఇంపుగలుగ, పెక్కుసమయములం దాయాకాలమున కొక్కరీతిగా రమించెను

**వ ఇ ట్లయ్యుమామహేశ్వరులు మదనసుఖపరవశు లగుచు ననవరత నిరతులై రమియించు నవసరంబున 154**

**అర్థము.** ఇట్లు, ఆ + ఉమా - మహేశ్వరులు, మదన - సుఖ - పరవశులు = మన్మధసౌఖ్యముచే నొడలు తెలియనివారు, అగుచున్, అనవరత - నిరతులు + ఐ = ఎల్లప్పుడును ఆసక్తిగలవారయి, రమియించు + అవసరంబునన్ = సంభోగించునప్పుడు

**తాత్పర్యము.** ఇట్లు ఆ పార్వతీపరమేశ్వరులు మన్మధసౌఖ్యపరవశులగుచు ఎల్లప్పుడు ఆసక్తిగలవారయి సంభోగించు సమయమున -తరువాతి పద్యముతో నన్వయము

**చ అమితసువీర్యవార్ధు లిల నప్పటికప్పటి కుద్భవించుడుం**
**గ్రమమున నుర్విలోఁ గులనగంబులు దెప్పలుపోలె నుండి మే**
**ఘము లనయంబుఁ దెట్టువులు కట్టి కెలంకులఁ జేరెఁ బై విమా**
**నములు వహిత్రసంఘమున నల్లగ నోలిన తేలి పాఱఁగన్ 155**

**అర్థము .** అమిత - సువీర్య - వార్ధులు = మిక్కిలి పరాక్రమముగల సముద్రములు, ఇలన్ = భూమియందు, అప్పటికిన్ + అప్పటికిన్ = అప్పటికప్పుడు, ఉద్భవించుడున్ = పుట్టినంతనే, పై - విమానములు = ఆకాశమునందలి విమానములు, వహిత్ర - సంఘము = ఓడల సమూహము, అనన్, నల్గడన్ = నాలుగువైపులను, ఓలిన్ + ఆ = క్రమముగనే, తేలి - పాఱఁగన్ - తేలిపోవుచుండఁగా, క్రమమునన్, ఉర్విలోన్ = భూమిలో, కుల - నగంబులు = కులపర్వతములు, తెప్పలు + పోలెన్ = తెప్పల విధమున, ఉండెన్, మేఘములు, అనయంబున్ = మిక్కిలి, తెట్టువులు + కట్టి = తెట్టెలుకట్టి, కెలంకులన్ = పార్శ్వములందు, చేరెన్

**తాత్పర్యము .** మిక్కిలి వీర్యవంతములైన సముద్రములు భూమిపై అప్పటికప్పటికిఁ బుట్టినంతనే ఆశాశమునందలి విమానములు ఓడలసమూహ మమున నాలుగువైపులను దేలిపోవఁగాఁ గ్రమమున భూమిలోఁ గులపర్వతములు తెప్పల విధమున నుండెను మేఘములు మిక్కిలి తెట్టెలు కట్టి పార్శ్వములందుఁ జేరెను

**విశేషములు .** అలంకార మతిశయోక్తి, ఉత్ప్రేక్ష

వ ఇ ట్లఖిలభువనభవనాధీశ్వరుండగు పరమేశ్వరుం డనవరత రత నిరతుండై జగద్వ్యాపారం బారయమికి నింద్రాదిదేవత లుద్వేగించి విరించి పాలికిం జని 156

**అర్థము** ఇట్లు, అఖిల - భువన - భవన + అధి + ఈశ్వరుండు = సకలలోకములనెడి భవనములకుఁ బ్రభువు, అగు, పరమేశ్వరుండు, అనవరత - రత - నిరతుండు + ఐ = నిరంతరము సంభోగమునం దాసక్తి గలవాఁడయి, జగత్ + వ్యాపారంబు = లోక వ్యవహారము, ఆరయమికిన్ = చూడకుండుటకు, ఇంద్ర + ఆది - దేవతలు = ఇంద్రుఁడు మొదలైన వేల్పులు, ఉద్వేగించి = కలఁత జెంది, విరించి - పాలికిన్ = బ్రహ్మకడకు, చని = వెడలి

**తాత్పర్యము .** ఇట్లు ఎల్లలోకములనెడి భవనములకుఁ బ్రభువైన పరమేశ్వరుఁడు నిరంతరసంభోగమునం దాసక్తి గలవాఁడయి లోకవ్యవహారము చూడకుండుటకు ఇంద్రుఁడు మున్నుగాఁగల వేలుపులు కలఁగి బ్రహ్మకడకు వెడలి- తరువాతి పద్యముతో నన్వయము

ఉ క్రొవ్విరితమ్మి తావిఁ గొని క్రోలి మదంబునఁ దేలు తేఁటి కొం
డెవ్విరి పువ్వుకంపు సొగయింపని భంగి మహేశుఁ డయ్యుమా
యవ్వన వారి పూర్ణ సురతాబ్ధి వివర్ధితుఁడై మదించి మైఁ
దివ్వఁడ లోకవర్తనకు దేవత లెంత విహీనభాగ్యులో 157

**అర్థము :** క్రొవ్విరి (క్రొత్త + విరి) - తమ్మి - తావిన్ = క్రొత్తగా వికసించిన తామర పూవుపరిమళమును, కొని, క్రోలి = త్రావి - (ఆఘ్రాణించి) = మదంబునన్ = క్రొవ్వుతో, తేలు = ఆనందించు, తేఁటికిన్ = తుమ్మెదకు, ఒండు = మఱియొక్క, ఎవ్విరి (ఏ + విరి) + పువ్వు - కంపున్ = ఏ వికసించిన పూవు పరిమళమును, సొగయింపని - భంగిన్ = చొక్కు సేయని - ఆసక్తి పుట్టింపని విధమున, మహేశుఁడు = పరమేశ్వరుఁడు, ఆ + ఉమా - యవ్వన - వారి - పూర్ణ - సురత + అబ్ధి - వివర్ధితుఁడు + ఐ = ఆ పార్వతియొక్క - జవ్వనమనెడి - నీటితో - నిండిన సంభోగమనెడి సముద్రముచేత, వివర్ధితుఁడు + ఐ = విశేషముగా వృద్ధి పొందింపఁబడినవాడయి, మదించి = క్రొవ్వి, లోక - వర్తనకున్ = లోక వృత్తికి, మైన్ = శరీరమును, తివ్వఁడు + అ = లాగికొనఁడు (త్రిప్పఁడు), దేవతలు, ఎంత విహీన - భాగ్యులు + ఓ = దురదృష్టవంతులో !

**తాత్పర్యము.** క్రొత్తగా వికసించిన తామర పరిమళమును ఆఘ్రాణించి మదమున నానందించు తుమ్మెదకు మఱి యే వికసిత పుష్ప పరిమళమును ఆసక్తి పుట్టింపని విధమునఁ, బరమేశ్వరుఁడు ఆ పార్వతీ యౌవనమనెడు నీటితో నిండిన సంభోగ మనుసముద్రముచే విజృంభించినవాఁడయి మదించి లోక వ్యవహారమునకు శరీరమును ద్రిప్పనే త్రిప్పకుండెను దేవతలు ఎంత దురదృష్టవంతులో కదా !

**విశేషములు.** అలంకారము రూపకానుప్రాణితోపమ అర్థాంతరన్యాసము ఇందు 'యౌవన' అనుటకు బదులు 'యవ్వన' అను అపరూపము ప్రయుక్తమయినది ప్రాచీనకవితలో నిది సాధువేమో! అనంతుఁడును తన భోజరాజీయమున - 'నవ్వుచుఁ జెక్కు మీటి నలినస్ఫుటలోచన మాటవేల నీ యవ్వన లక్ష్మికిన్ భటుఁడ నైతి' నని ప్రయోగించెను 'మహేశ్వరుండు నా- జవ్వని యౌవనంబనెడు చంద్రికఁ గ్రోలు చకోరభంగిమైఁ - దివ్వఁడ' అని దీనికి మా రా ప్రతిలోఁ బాఠాంతరము గలదు 'మహేశ్వరుఁడును ఆ జవరాలి యౌవనమనెడు వెన్నెలను గ్రోలు వెన్నెలపులుఁగు విధమున' నని దాని తాత్పర్యము 'మహేశ్వరుండు మా - యవ్వనవారిపూర్ణసురతాభివివర్ధితుఁడై' యను పాఠము వావిళ్ళ వారి ప్రతిలోఁ గలదు 'మహేశ్వరుండు మా అవ్వన్ = మా తల్లిని, అవారి = అడ్డులేని, పూర్ణమైన సురతముచే, అభివివర్ధితుఁడై' యని విభజింపనగునా ?

**వ అని నిర్వేదించి విన్నవించు సురవరులకు విరించి కరుణించి త దుపాయంబు విచారించి యనలాంబకుపాలికి ననలుం బంచినంతన భవదీయకార్యసిద్ధియగుం బనుపుండని హితోపదేశంబుసేసినం గైకొని చనుదెంచి సురపతి పరమాత్మమాహాత్మ్యంబుఁ దలంచి చంచలించుచు 158**

**అర్థము.** అని, నిర్వేదించి = దు:ఖించి, విన్నవించు = మనవి చేయు, సుర-వరులకున్ = దేవతాశ్రేష్ఠులకు, విరించి - బ్రహ్మ, కరుణించి = దయఁజూపి, తద్+ ఉపాయంబున్ = దాని యుపాయమును, విచారించి = ఆలోచించి, అనల + అంబకు - పాలికిన్ = అగ్నినేత్రుని ( శివుని) కడకు, అనలున్ = అగ్నిని, పంచిన+ అంతన్ + అ = పంపిన వెంటనే, భవదీయ- కార్య - సిద్ధి = మీదయిన పని నెఱవేఱుట, అగున్, పనుపుండు = పంపుఁడు, అని, హిత + ఉపదేశంబు = మేలు నుపదేశించుట, చేసినన్, కైకొని = స్వీకరించి, చనుదెంచి = వచ్చి, సుర -

పతి = దేవతల ప్రభువు - ఇంద్రుఁడు, పరమాత్మ - మాహాత్మ్యంబు = పరమాత్ముఁడైన శివుని గొప్పతనమును, తలంచి, చంచలించుచున్ = మిక్కిలి చలించుచు

**తాత్పర్యము .** అని దుఃఖించి విన్నపముచేయు దేవతాశ్రేష్ఠులను బ్రహ్మ దయఁజూచి దాని కుపాయము నాలోచించి శివునికడకు నగ్నిని బంపినంతనే మీ కార్యము సిద్ధించును పంపుఁడని హితము నుపదేశింపఁగా దానిని జేకొని వచ్చి ఇంద్రుఁడు ఈశ్వరుని మాహాత్మ్యమును దలఁచి మిక్కిలి చలించుచు - తరువాతి పద్యముతో నన్వయము

**ఆ రతి యొనర్పఁబోయి రతిపతి పడ్డ పా**
**టెఱిఁగియెఱిఁగి వారి కింక విరతి**
**సేయఁ బూని విలయశిఖినేత్రుకడ కగ్ని**
**యేల పోవుఁ బంపు డేమి తగవు ? 159**

**అర్థము :** రతి = (పార్వతీశ్వరులకు) సంగమము, ఒనర్పన్ + పోయి = చేయఁబూని, రతి - పతి = రతిభర్తయైన మన్మథుఁడు, పడ్డ - పాటు = పడిన కష్టము, ఎఱిఁగి + ఎఱిఁగి = తెలిసి తెలిసి, వారికిన్ = ఆ పార్వతీపరమేశ్వరులకు, ఇంకన్ = ఇటుపై, విరతి = ఎడఁబాటు, చేయన్ + పూని, విలయ - శిఖి - నేత్రు - కడకున్ = ప్రళయాగ్ని కన్నుగాఁ గలవాని (శివుని) యొద్దకు, అగ్ని, ఏల-పోవున్, పంపుడు = పంపుట, ఏమి, తగవు = న్యాయము ?

**తాత్పర్యము .** పార్వతీశ్వరులకు సంగమము చేయఁబోయి మన్మథుఁడు పడినపాటు తెలిసితెలిసి, ఇప్పు డిఁక వారికి ఎడఁబాటు చేయఁబూని ప్రళయాగ్ని నయనుఁడైన శివుని కడకు అగ్ని యేలపోవును ? అగ్నిని బంపుట యేమి న్యాయము?

**వ అనిన సురపతిని బృహస్పతి కనుంగొని 160**

**అర్థము .** అనినన్, సుర - పతిన్ - ఇంద్రుని, బృహస్పతి, కనుంగొని

**తాత్పర్యము :** ఇంద్రుఁ డట్లనఁగనే బృహస్పతి యతనిని జూచి - తరువాతి పద్యముతో నన్వయము

## దేవతలు పార్వతీశ్వరుల కడ కగ్నినిఁబంపుట

సీ హేమాబ్జినీ కేళి కెలసి మరాళంబు
మానససరసి నెమ్మనమునందు
మఱచి క్రొక్కారు బిట్టఱగని చుడుమఱఁ
దెలిసి వచ్చిన తావు దలఁచు పగిదిఁ
బార్వతీ రతికేళి పరవశుఁడై జగ
ద్వ్యాపార మంతయు వదలియున్న
ధూర్జటి నిజమూర్తి ధూమధ్వజుం గని
తన కాచు లోకవర్తనయ తలఁచుఁ

ఆ గాన వహ్ని కలుగఁగా నేరఁ డనలాక్షుఁ
డలిగె నేని ననలుఁ డనలుఁ గలిసి
వెలసి వెలుఁగుఁగాని మలుగఁ డీశ్వరు పాలి
కనలుఁ బంచు డుచిత మగు సురేంద్ర ! 161

**అర్థము.** హేమ + అబ్జినీ - కేళికిన్ = బంగారు పద్మిని తోడి క్రీడకు, ఎలసి = ఇచ్ఛగించి, మరాళంబు= హంస, మానస - సరసిన్ = మానసమనెడు సరసిని, నెమ్మనము + అందున్ (నెఱ + మనము) = నిండుమనసులో, మఱచి, క్రొక్కారున్ (క్రొత్త + కారున్) తొలకరిని, బిట్టఱగని = శీఘ్రముగఁ జూచి (?) చుడుము + అఱన్ = మాంద్యము నశింపఁగా (?), తెలిసి, వచ్చిన - తావున్ = వచ్చినచోటిని, తలఁచు - పగిదిన్ = తలంచు విధమున,

పార్వతీ - రతి - కేళి - పరవశుఁడు + ఐ = పార్వతీ సంభోగక్రీడయందు ఒడలుమఱచినవాఁడయి, జగత్ + వ్యాపారము + అంతయున్ = లోకవ్యవహార మంతయు, వదలి + ఉన్న = విడిచియున్న, ధూర్జటి = శివుఁడు - (బరువైన జడలు గలవాఁడు), నిజ- మూర్తిన్ = తనవి యగునెవనిమిది మూర్తులలో నొకటి యగు మూర్తిని, ధూమ - ధ్వజున్ = అగ్నిని (ధూమము ధ్వజముగాఁ గలవానిని), కని, తన - కాచు = తాను రక్షించు, లోక - వర్తన + అ = లోకవ్యాపారమే, తలఁచున్

కానన్, అనల + అక్షుఁడు + అగ్ని నయనుఁడు - శివుఁడు, వహ్నికిన్ = అగ్నికి, అలుగఁగాన్ - నేరఁడు = కోపింపఁ జాలఁడు, అలిగెన్ + ఏనిన్ = కోపించినను, అనలుఁడు = అగ్ని, అనలున్ = శివుని నిటలాగ్నిని, కలిసి = కూడి, వెలసి - వెలుఁగున్ + కాని =అతిశయించి ప్రకాశించును గాని, మలుగఁడు = నశింపఁడు

(కావున), సుర+ఇంద్ర = దేవేంద్రా ! ఈశ్వరు - పాలికిన్ = ఈశ్వరుని యొద్దకు, అనలున్ = అగ్నిని, పంచుడు = పంపుట, ఉచితము + అగున్ = తగును

**తాత్పర్యము .** బంగరు పద్మినితోడి క్రీడకు ఇచ్ఛగించి హంసము మానససరసిని నెమ్మనమున, మఱచి తొలకరిని శీఘ్రముగాఁ జూచి మాంద్యము నశింపఁ దెలిసి తాను వచ్చిన చోటిని దలఁచు విధమునఁ, బార్వతితోడి సంభోగక్రీడచేఁ బరవశుఁడై లోకవ్యాపారమునంతను మఱచియున్న ఈశ్వరుఁడు తన యెనిమిది మూర్తులలో నొక మూర్తియైన అగ్నిని గని తాను రక్షించులోకముల వ్యవహారము తలఁచును కావున అగ్నినయనుఁడైన శివుఁడు అగ్నియెడఁ గోపము వహింపఁజాలఁడు అలిగినను అగ్ని శివుని నిటలాగ్నిని గూడి అతిశయించి ప్రకాశించును గాని నశింపఁడు అందుచే నో దేవేంద్రా ! ఈశ్వరుని యొద్ద కగ్నిని బంపుట ఉచితమగును

**విశేషములు :** అలంకార ముపమ అబ్జిని = ఒకనాయిక సరసి = మొదటినాయిక మరాళము - నాయకుఁడు నెమ్మనము - నెఱ + మనము క్రొక్కారు - క్రొత్త + కారు బిట్టుఅగని చుడుమఱ - అనునది దుర్బోధముగా నున్నది అయినను ప్రకరణమును బట్టియు, పూర్వటీకను బట్టియు వ్యాఖ్యానింపఁబడినది జగద్వ్యాపారము - జగత్ + వ్యాపారము, హశ్శు పరమగుచుండఁగా తకారమునకు దకారము అనలాక్షుఁడు - బహువ్రీహి సమాసాంతమున అక్షిన్ శబ్దమునకు అకారంతత పంచుడు = పంచుట ఈ కవి భావార్థక ట వర్ణకమునకు బదులగా డువర్ణకమును బ్రయోగించుట పెక్కుచోట్లఁగలదు తన కాచు - తాను గాచు 'ధాతుజవిశేషణ భావార్థక పూర్వవ్యవహితావ్యహిత కర్తృపద ప్రథమకుఁ దఱచుగ యొక్కషష్ఠి యగు ' ప్రౌఢ - కారక 15 తనయొక్కకాచు 'యొక్కకు లోపంబు బహుళంబు' ప్రౌఢ కారక 16 తన కాచు వహ్ని కలుగఁగా నేరఁడు 'షష్ఠీ స్థానికంబగు కువర్ణకం బొక్కొకచో, ద్వితీయాదివిభక్తులకు మాఱుగాఁ దత్తదర్థంబులం జూపట్టెడి ' 'ప్రౌఢ కారక 13 ఇచ్చుటఁ జతుర్థ్యర్థమునఁ గువర్ణకము వహ్నాయే న కుప్యతి' అని యర్థము ఇది సంస్కృతకారక విధానము తెలుఁగున వహ్నిపై నలుగఁగా నేరఁడు అనియుండును

**వ అనిన నొడంబడి కార్యనిశ్చయంబుసేసి దేవేంద్రుండు పావకు రావించి తద్వృత్తాంతం బెఱిఁగించి నియమించినం గైకొని మహాప్రసాదంబని వీడుకొని నిజాంతర్గతంబున 162**

**అర్థము :** అనినన్, ఒడంబడి = అంగీకరించి, కార్య - నిశ్చయంబు + చేసి= చేయఁదగిన దానిని నిశ్చయించి, దేవ + ఇంద్రుండు, పావకున్ = అగ్నిని, రావించి

= రప్పించి, తద్ + వృత్తాంతంబు, ఎఱిఁగించి, నియమించినన్ = ఆజ్ఞాపింపఁగా, కైకొని = స్వీకరించి, మహాప్రసాదంబు + అని, వీడుకొని = సెలవు పుచ్చుకొని, నిజ +అంతర్గతంబునన్ = తన మనస్సునందు - తరువాతి ఆశ్వాసము నందలి 2 వ వచనముతో నన్వయము

## ఆశ్వాసాంతము

చ పురహరమూర్తిఁ గీర్తిపరు బుణ్యు నగణ్యు నసేవ్యు భవ్యుఁ బం
కరుహజగోత్రుఁ బాత్రు నవికారు గభీరు ముముక్షు దక్షు నీ
శ్వరపదభక్తు ముక్తు గుణవంతు ననంతు వదాన్యు మాన్యు వా
గ్వరకృతకృత్యు నిత్యు మునివంద్యు ననింద్యు విచారపారగున్ 163

**అర్థము .** పురహర - మూర్తిన్ = ఈశ్వరుని మూర్తివంటి మూర్తి గలవాఁడును, కీర్తి పరున్ = కీర్తియం దాసక్తి గలవాఁడును, పుణ్యున్ = పవిత్రుఁడును, అగణ్యున్ = గణించుటకు శక్యముగానివాఁడును, అసేవ్యున్ = సేవింపఁదగినవారు లేనివాఁడును, భవ్యున్ = శుభుఁడును, పంకరుహజ - గోత్రున్ = బ్రహ్మవంశము వాఁడును - బ్రాహ్మణుఁడును, పాత్రున్ = అర్హుఁడును, అవికారున్ = వికృతిలేనివాఁడును, గభీరున్ = గంభీరుఁడైనవాఁడును, ముముక్షున్, = మోక్షమును గోరువాఁడును, దక్షున్ =సమర్థుడైనవాఁడును, ఈశ్వర పదభక్తున్ = ఈశ్వరుని పాదములందు భక్తిగలవాఁడును, ముక్తున్ = మోక్షమునొందినవాఁడును, గుణవంతున్, అనంతున్ = అంతములేనివాఁడును, వదాన్యున్ = ఉదారుఁడును,మాన్యున్ = గౌరవింపఁదగినవాఁడును, వాచ్ (క్) + వర + కృతకృత్యు = విద్వాంసులలోఁ గృతార్థుఁడును, నిత్యున్ = శాశ్వతుఁడును, ముని-వంద్యున్ = మునులచే నమస్కరింపఁదగినవాఁడును, అనింద్యున్ = నిందింపఁదగనివాఁడును, విచార - పారగున్ = ఆలోచనమందుఁ బారమును ముట్టినవాఁడును - అగు కృతిభర్తను జంగమమల్లికార్జునదేవుని

**తాత్పర్యము .** శివుని మూర్తివంటె మూర్తిగలవాఁడును, కీర్తియం దాసక్తి గలవాఁడును, పుణ్యుఁడును, గణింపశక్యముగాని వాఁడును, సేవింపఁదగినవారు లేనివాఁడును, భవ్యుఁడును, బ్రాహ్మణవంశుఁడును, పాత్రుఁడును, అవికారుఁడును, గంభీరుఁడును, ముముక్షువును, దక్షుఁడును, ఈశ్వర పదభక్తుఁడును, ముక్తుఁడును, గుణ-వంతుఁడును, అనంతుఁడును, వదాన్యుఁడును, మాన్యుఁడును, విద్వద్వరులలోఁగృతార్థుఁడును, నిత్యుఁడును, మునివంద్యుఁడును, అనింద్యుఁడును, ఆలోచనమునఁ బారమును ముట్టినవాఁడును - అగు కృతిభర్తను శ్రీ జంగమ మల్లికార్జునదేవుని

**విశేషములు .** అలంకార మంత్యాను ప్రాసము

క పరమపరుఁ బరమ దురితే
తరు గురుఁ గరుణామృతాంబుధారావర్షో
త్కర తర్పిత భక్తాంతః
కరణోర్వరు దివ్యమునిశిఖామణి ననఘున్ 164

**అర్థము**.పరమ - పరున్ = మిక్కిలి యుత్కృష్టుని, పరమ - దురిత + ఇతరున్ = గొప్ప పాపములకు వేఱయినవానిని, గురున్, కరుణా ణోర్వరున్, కరుణా = దయయనెడి, అమృత + అంబు - ధారా = అమృతజలధారలయొక్క, వర్ష = వానలయొక్క, ఉత్కర = సమూహముచేత, తర్పిత = తృప్తిపఱుపఁబడిన, భక్త = భక్తులయొక్క, అంతఃకరణ + ఉర్వరున్ = మనస్సులనెడు భూమి గలవానిని, దివ్య - ముని - శిఖామణిన్ = దివ్యులయిన మునులలోఁ దలమానికమైనవానిని, అనఘున్ = పాపరహితుని - శ్రీజంగమ మల్లికార్జునుని

**తాత్పర్యము :** మిక్కిలి యుత్కృష్టుఁడును, పరమ పుణ్యుఁడును, గురుఁడును, దయయనెడు అమృతధారల వర్షముచేఁ దృప్తిపఱుపఁబడిన భక్త జనమనస్సులనెడి కేదారములు గలవాఁడును, దివ్యమునులలోఁ దలమానికమయినవాఁడును, పాపరహితుఁడును అగు శ్రీ జంగమ మల్లికార్జునదేవుని

**విశేషములు :** అలంకారము రూపకము

చ అనఘచరిత్రుఁ బాత్రు నియతాత్ము మహాత్ము ననింద్యు వంద్యు స
జ్జన హిత కాంతుఁ గాంతు మితజల్పు ననల్పుఁ గవీంద్రు రుంద్రుభూ
వినుతు నపారు ధీరుఁ గృతవేది ననాది ననంతుఁ గంతు బా
ణనికరముక్తు సుక్తు మునినాథు ననాథు వరేణ్యుఁ బుణ్యునిన్.165

**అర్థము :** అనఘ - చరిత్రున్ = పాపరహితమైన చరిత్రము గలవాఁడును, పాత్రున్ = తగినవాఁడును, నియత + ఆత్మన్= నియమములతోఁ గూడిన మనస్సుగలవాఁడును, మహాత్మన్ = గొప్పవాఁడును, అనింద్యున్ = నిందింపఁదగనివాఁడును, వంద్యున్= నమస్కరింపఁదగినవాఁడును, సత్ + జన+ హిత - కాంతున్ = మంచివారి మేలు గోరువాఁడును, కాంతున్ = ఇష్టుఁడును, మిత - జల్పున్ = తక్కువగా మాటలాడువాఁడును, అనల్పున్ = అల్పుఁడు గానివాఁడును, కవి + ఇంద్రున్= కవిశ్రేష్ఠుఁడును, రుంద్రున్ - విరివియైనవాఁడును, భూ- వినుతున్ = భూమి (జనులు) చేఁ బొగడఁబడువాఁడును, అపారున్ = ఆవలిదరి లేనివాఁడును, ధీరున్= ధైర్యవంతుఁడును, కృత -వేదిన్= కృతజ్ఞుఁడును,

అనాదిన్ = ఆది లేనివాఁడును, అనంతున్ = అంతములేనివాఁడును, కంతు - బాణ - నికర - ముక్తున్ = మన్మథబాణసమూహముచే విడువఁబడినవాఁడును, ఉక్తున్ = చెప్పఁబడినవాఁడును, ముని - నాథున్ = మునిపతియును, అనాథున్= నాథుఁడు (ప్రభువు) లేనివాఁడును - తా నెల్లవారికిఁ బ్రభుఁడుగాని తనకెవ్వరును బ్రభువనువాఁడు లేఁడనుట, వరేణ్యున్ = శ్రేష్ఠుఁడును, పుణ్యునిన్ = పుణ్యుఁడైనవాఁడును - అగు శ్రీ జంగమ మల్లికార్జున దేవుని

**తాత్పర్యము .** పుణ్యచరిత్రుఁడును, పాత్రుఁడును, నియతాత్ముఁడును, మహాత్ముఁడును, అనింద్యుఁడును, వంద్యుఁడును, అనల్పుఁడును, కవీంద్రుఁడును, విరివియైనవాఁడును, భూజనసన్నుతుఁడును, పారము లేనివాఁడును, ధీరుఁడును, కృతజ్ఞుఁడును, అనాదియును, అనంతుఁడును, మన్మథబాణజాలముచే ముక్తుఁడును, ఉక్తుఁడును, మునిప్రభువును, అనాథుఁడును, శ్రేష్ఠుఁడును, పుణ్యాత్ముఁడును అగు శ్రీ జంగమ మల్లికార్జునదేవుని

**విశేషములు .** అలంకారము అంత్యానుప్రాసము

క  **మానమహార్ణవు సంతత**
**దాని శివజ్ఞాని రాజధరమూర్తి సుధీ**
**దీనజనాభీష్టద క**
**ల్పానోకహ సదృశు మల్లికార్జునదేవున్** 166

**అర్థము :** మాన - మహత్ (మహా) + అర్ణవున్ = గౌరవమునకు సముద్రమైనవాఁడును, సంతత - దానిన్ = ఎడతెగని దానముగలవాఁడును, శివ - జ్ఞానిన్ = శివునిగూర్చిన జ్ఞానము గలవాఁడును, రాజ - ధర - మూర్తిన్ = చంద్రుని దాల్చినవాని (శివుని) మూర్తివంటి మూర్తిగలవాఁడును, సుధీ సదృశున్, సుధీ = పండితులును, దీన = దీనులును, అగు, జన = జనులయొక్క, అభీష్టద = కోరికలనిచ్చు, కల్ప + అనోకహ = కల్పవృక్షముతో, సదృశున్ = సమానుఁడైనవాఁడును, మల్లికార్జునదేవున్

**తాత్పర్యము.** మానమునందు మహాసముద్రుఁడును, ఎల్లప్పుడును దానము చేయువాఁడును, శివసంబంధిజ్ఞానము గలవాఁడును, శివమూర్తియు, విద్వాంసులు, దీనులునైన జనుల కోరికలను దీర్చు కల్పవృక్షముతో సమానుఁడును అగు శ్రీ జంగమ మల్లికార్జునదేవుని

**విశేషములు :** అలంకారము రూపకము, ఉపమ

లలితగతి
పరమపరు లోకగురుఁ బాత్రు సుచరిత్రున్
దురితహరు దుర్జనవిదూరు సువిచారున్
వరదు శుభమూర్తి మునివర్యు జగదార్యున్
ధరణిధరధీరు గుణధాము జితకామున్ 167

**అర్థము .** పరమ - పరున్ = మిక్కిలి యుత్కృష్టుఁడైనవాఁడును, లోక - గురున్ = జగద్గురుఁడును, పాత్రున్ = తగినవాఁడును, సుచరిత్రున్ = మంచిచరిత్ర గలవాఁడును, దురిత - హరున్ = పాపములను హరించువాఁడును, దుర్జన - విదూరున్ = చెడ్డవారికి మిక్కిలి దూరమైనవాఁడును, సువిచారున్ = మంచి ఆలోచనలు గలవాఁడును, వరదున్ = వరముల నిచ్చువాఁడును, శుభ - మూర్తిన్ = మంగళకరమైన ఆకారము గలవాఁడును, మునివర్యున్ = మునిశ్రేష్ఠుఁడును, జగత్ + ఆర్యున్ = జగత్పూజ్యుఁడును, ధరణిధర - ధీరున్ = పర్వతమువలె ధైర్యము గలవాఁడును, గుణ-ధామున్ = సుగుణములకు నివాసమయిన వాఁడును, జిత - కామున్ = జయింపఁబడిన మన్మధుఁడు గలవాఁడును, అగు, శ్రీ జంగమమల్లికార్జునదేవుని

**తాత్పర్యము .** మిక్కిలి యత్కృష్టుఁడైనవాఁడును, జగద్గురుఁడును, పాత్రుఁడును, సుచరిత్రుఁడును, పాపహరుఁడును, దుర్జన విదూరుఁడును, సువిచారుఁడును, శుభమూర్తియును, మునిశ్రేష్ఠుఁడును, జగత్పూజ్యుఁడును, పర్వతధీరుఁడును, సుగుణధాముఁడును, కాముని జయించినవాఁడును అగు శ్రీ జంగమ మల్లికార్జున దేవుని

## గద్యము .

ఇది శ్రీమజ్జంగమ మల్లికార్జున దేవ దివ్య శ్రీ పాద పంకజ
భ్రమరాయమాణ కవిరాజశిఖామణి నన్నె
చోడదేవ ప్రణీతంబైన కుమారసంభవం
బను కథయందు నవమాశ్వాసము

**అర్థతాత్పర్యములు :** పూర్వాశ్వాసాంత గద్య వ్యాఖ్యలకు వలెనే

మ
ఇది శ్రీ జొన్నలగడ్డవంశమణియౌ మృత్యుంజయాఖ్యుండు స
మ్మద మొప్పారఁ గుమారసంభవము శ్రీమన్నన్నెచోడాఖ్య వి
ద్వ దధీశోత్తము శాబ్దికార్థ వివిధ స్వారస్య తాత్పర్యముల్
చదురొప్పన్ వచియించి మన్ను విలసత్ సంజీవనీవ్యాఖ్య యౌ

# కుమార సంభవము

## దశమాశ్వాసము

క శ్రీ రమణీ రమణీయ త
రోరస్థ్సలు ననఘు ననుదినోదయవిద్యా
పారగు మునిముఖముకురు ద
యారససంపూర్ణు మల్లికార్జునదేవున్ 1

**అర్థము .** శ్రీ స్థలున్ శ్రీ - రమణీ = లక్ష్మియను స్త్రీ చేత, రమణీయతర = మిక్కిలి సుందరమయిన, ఉరస్ + స్థలున్ = వక్షస్స్థలము గలవాఁడును, అనఘున్ = పాపరహితుఁడును, అనుదిన + ఉదయ - విద్యా - పారగున్ = ప్రతిదినము వృద్ధిపొందు విద్యయొక్క పారమును బొందినవాఁడును, ముని - ముఖ - ముకురున్ = మునులముఖములకు అద్దమైనవాఁడును, దయా - రస - సంపూర్ణున్ = దయారసముచేత సంపూర్ణుఁడైనవాఁడును, మల్లికార్జునదేవున్

**తాత్పర్యము .** శ్రీ దేవిచే సుందరతరమైన వక్షఃప్రదేశము గలవాఁడును - విష్ణుస్వరూపుఁడు ననుట, పాపరహితుఁడును, ప్రతిదినాభ్యుదయవిద్యయందు పారమును ముట్టినవాఁడును, మునుల ముఖములకు అద్దమైనవాఁడును, దయారసముతో నిండినవాఁడును అగు శ్రీ మల్లికార్జునదేవుని

**విశేషములు .** అలంకారము రూపకము

**అగ్ని రతిక్రీడాపరులైయున్న పార్వతీశ్వరుల కడకు వచ్చుట**

వ దహనాంబకుం దలంచి దహనుండు సంచలించుచుఁ గైలాసపర్వతంబునకుం జనుదెంచి 2

**అర్థము :** దహన+ అంబకున్ = అగ్నినేత్రుని (శివుని), తలంచి, దహనుండు= అగ్ని, సంచలించుచున్ = కలఁగుచు,. కైలాసపర్వతంబునకున్, చనుదెంచి

**తాత్పర్యము:** శివునిఁ దలఁచి అగ్ని కలఁతచెందుచుఁ గైలాసపర్వతమునకు వచ్చి - తరువాతి పద్యముతో నన్వయము

క ఉరునేత్రవహ్ని దనికిన
నెరియుచు మార్కొనఁగఁబోలునేనియు మీఁదన్
సురనదిజలములు చల్లును
హరుఁ డని పావకుఁడు మది భయాతురుఁ డగుచున్ 3

**అర్థము.** ఉరు - నేత్ర - వహ్ని = గొప్పదియగు కంటి మంట, తనికినన్= తాఁకినచో, ఎరియుచున్ = మండుచు, మార్కొనఁగన్ + పోలున్ + ఏనియున్ = ఎదురుకొనఁగలిగినప్పటికిని, హరుఁడు = శివుఁడు, సుర-నది- జలములు = గంగానదినీరులు, మీఁదన్ + చల్లును = మీఁదఁజల్లి ఆర్పివేయును, అని, పావకుఁడు = అగ్ని, మదిన్ = మనస్సునందు, భయ + ఆతురుఁడు = వెఱపుచే బాధింపఁబడినవాఁడు,అగుచున్

**తాత్పర్యము :** 'తీక్ష్ణమైన కంటిమంట తాఁకినచో మండుచు నెదిరింపఁగలిగినప్పటికిని శివుఁడు ఆకాశగంగానదీజలములు నా మీఁదఁ జల్లి నన్ను శాంతింపఁజేయు' నని అగ్ని భయముచే బాధనొందినవాఁడగుచు - తరువాతి వచనముతో నన్వయము

**వ. పరమేశ్వరు రతిక్రీడాప్రదేశంబునకుం జనుదెంచి నిజ రూపంబుఁ జూపిన నయ్యుమామహేశ్వరులు కని లజ్జాకలిత సంచలిత హృదయులై పరిధానంబులు సవరించుచు రతి విఘ్నం బగుటకు విరూపాక్షుండు కోపించి చూచుడు.** 4

**అర్థము :** పరమేశ్వరు - రతి - క్రీడా - ప్రదేశంబునకున్ = ఈశ్వరుని సంభోగక్రీడాస్థలమునకు, చనుదెంచి = వచ్చి, నిజ - రూపంబున్= స్వస్వరూపమును, చూపినన్= చూపఁగా, ఆ + ఉమా - మహేశ్వరులు, కని, లజ్జా + కలిత - సంచలిత- హృదయులు + ఐ = సిగ్గుతోఁగూడిన, కలఁతఁజెందిన మనస్సులు గలవారయి, పరిధానంబులు = వస్త్రములు, సవరించుచున్ = సరిచేసికొనుచు, రతి = సంభోగము, విఘ్నంబు = చెడినది, అగుటకున్, విరూపాక్షుండు = శివుఁడు, కోపించి, చూచుడున్ = చూచినంతనే

**తాత్పర్యము .** పరమేశ్వరుఁడు క్రీడించుచున్న చోటికి వచ్చి యగ్ని స్వస్వరూపమును జూపఁగా, నా పార్వతీపరమేశ్వరులు చూచి సిగ్గుపడి హృదయములు

సంచలింప వస్త్రములు సరిచేసికొనుచు సంభోగక్రియ విఘ్నమగుటకు ముక్కంటి కోపించి చూచినంతనే - తరువాతి పద్యముతో నన్వయము

**ఆ నుదుటి కంటి మంట చదలంటి పర్వుచుఁ**
**గవిసి తరతరంబ కప్పికొనఁగ**
**బెదర కెదిరి నిల్చి పేర్చి రవిప్రభ**
**మాన కగ్ని మాఱు మండుచుండె** 5

**అర్థము** నుదుటి - కంటి - మంట, చదలు + అంటి = ఆకాశమంటి, పర్వుచున్ = వ్యాపించుచు, కవిసి = ఆక్రమించి, తరతరంబ = క్రమక్రమముగా కప్పికొనఁగన్ = క్రమ్ముకొనఁగా, బెదరక = భయపడక, ఎదిరి = ఎదురుకొని, నిల్చి, రవి - ప్రభన్ = సూర్యునికాంతివంటి కాంతితో, పేర్చి = విజృంభించి, మానక = వదలక, మాఱు మండుచున్ + ఉండెన్ - దానికిఁ బ్రతిగా మండుచుండెను

**తాత్పర్యము.** నొసటి కంటి మంట ఆకాశమంటి వ్యాపించుచు ఆక్రమించి క్రమక్రమముగాఁ గ్రమ్ముకొనఁగా, అగ్ని భయపడక ఎదురుకొని నిలిచి సూర్యకాంతివంటి కాంతితో విజృంభించి వదలక దానికిఁ బ్రతిగా మండుచుండెను

**వ అంత నీశ్వరుండు వైశ్వానరుండగుట యెఱింగి కోపావేశంబున ననివార్యంబగు నిజవీర్యం బెత్తికొని పైఁ జల్లిన** 6

**అర్థము:** అంతన్, ఈశ్వరుండు, వైశ్వానరుండు = అగ్ని, అగుట, ఎఱింగి, కోప + ఆవేశంబునన్ = కోపోద్రేకముతో, అనివార్యంబు = నివారింపరానిది, అగు, నిజ - వీర్యంబు = తనదైన వీర్యము, ఎత్తికొని, పైన్ = మీఁద, చల్లినన్ = చల్లఁగా

**తాత్పర్యము** అంత నీశ్వరుఁడు అతఁడగ్నియగుట తెలిసి క్రోధోద్రేకముతో నివారింపరాని తన వీర్యమును ఎత్తికొని మీఁదఁజల్లఁగా - తరువాతి పద్యముతో నన్వయము

**చ కలుషముతోడ లోకములు గాల్చు మహాప్రళయానలంబుపైఁ**
**గలగొని సప్తవారిధులు కప్పినభంగి మహేశువీర్య మ**
**గ్గలముగ నమ్మహోదధిని గ్రక్కున ముంచిన నాఱె నాఱుచోఁ**
**గొలఁదికి మీఱి, నేయి పయిఁగూర్చిన నాఱిన దీపికాకృతిన్** 7

**అర్థము .** కలుషముతోడన్ = కోపముతో, లోకములు, కాల్చు, మహత్ (మహా) + ప్రళయ + అనలంబుపైన్ = గొప్ప ప్రళయాగ్ని మీఁద, కలగొని = క్షోభించి, సప్త- వారిధులు = ఏడుసముద్రములు, కప్పిన - భంగిన్ = కప్పిన విధమున మహా + ఈశు - వీర్యము = పరమేశ్వరుని వీర్యము, అగ్గలముగన్ = అధికముగా, ఆ + మహత్(మహా) + ఉదయునిన్ = ఆ మహానుభావుఁడైన అగ్నిని, గ్రక్కునన్ = శీఘ్రముగా, ముంచినన్, మీఱి = మితిమీఱి, నేయి, పయిన్+ కూర్చినన్ = మీఁదఁబోయఁగా, ఆఱిన, దీపికా + ఆకృతిన్ = దివ్వెవిధమున, ఆఱెన్ = ఆఱిపోయెను

**తాత్పర్యము .** కోపముతో లోకములను గాల్చు మహాప్రళయాగ్నిపైఁ గలఁతనొంది యేడు సముద్రములు కప్పిన విధమునఁ బరమేశ్వరుని వీర్యము అధికముగ ఆ మహానుభావుఁడైన అగ్నిని శీఘ్రముగా ముంపఁగా, ఆఱిపోవునప్పుడు మితిమీఱి నేయి పయిని బోయఁగా ఆఱిపోవు దీపము విధమున, ఆఱిపోయెను

**విశేషములు .** అలంకార ముపమ

వ **మఱియును - తరువాతి పద్యముతో నన్వయము** 8

క **శివు వీర్యము పెలుకుఱఁ బైఁ**
**గవిసిన నిజశిఖ లడంగి గ్రక్కున నా హ**
**వ్యవహుఁడు హోమానలమున**
**నవతారం బైనపురుషునాకృతి నొందెన్** 9

**అర్థము:** శివు - వీర్యము = శివుని వీర్యము, పెలుకుఱన్ = భయమగునట్లు, పైన్ = మీఁద, కవిసినన్ = ఆక్రమింపఁగా, నిజ - శిఖలు = తనవైన జ్వాలలు, అడంగి = అణఁగిపోయి, గ్రక్కునన్ = శీఘ్రముగా, ఆ - హవ్యవహుఁడు = ఆ హోమద్రవ్యమును మోయువాఁడు - అగ్ని, హోమ + అనలమునన్ = హోమాగ్నిలో, అవతారంబు + ఐన = ప్రత్యక్షమైన, పురుష + ఆకృతిన్= పురుషుని ఆకారమును, ఒందెన్

**తాత్పర్యము** శివుని వీర్యము భయమగునట్లు మీఁద నాక్రమింపఁగా, తన జ్వాల లడఁగి, శీఘ్రముగా నా అగ్ని హోమాగ్నిలో నవతరించుపురుషుని ఆకారము నొందెను

**విశేషములు** . పురుషునాకృతి - పురుషునియొక్క + ఆకృతి షష్ఠీ సమాసమునం దుకార ఋకారముల కచ్చు పరమగునపుడు నుగాగమంబగు ' బాల సంధి 34

**వ** ఇట్లనలుం డీశ్వరవీర్యాపహృతతేజస్కుండై తత్ప్రతిహతజీవుండై మూర్ఛిల్లి పడి పెద్దయుంబ్రొద్దున కెట్టకేనియుం దెప్పిఱి తదీయాతిభరంబుఁ దాల్పనోపక పితామహుపాలికిం జని తద్వృత్తాంతం బెఱింగించిన వరదుండు కుమారోత్పత్తికిం బ్రసాదించెనని విధి ముదితహృదయుం డగుచు 10

**అర్థము** ఇట్లు, అనలుండు = అగ్ని, ఈశ్వర - వీర్య + అపహృత - తేజస్కుండు + ఐ = ఈశ్వరునియొక్క వీర్యముచే నపహరింపఁబడిన తేజస్సు గలవాఁడయి, తద్ + ప్రతిహత - జీవుండు + ఐ = దానిచేఁ గొట్టఁబడిన ప్రాణము గలవాఁడయి, మూర్ఛిల్లి - పడి, పెద్దయున్ + ప్రొద్దునకున్ = చాలసేపటికి, ఎట్టకేనియున్ = ఎట్లో, తెప్పిఱి = తేఱి, తదీయ + అతి - భరంబున్ = ఆ యధికమైన బరువును, తాల్పన్ + ఓపక = మోయలేక, పితామహు - పాలికిన్ = బ్రహ్మకడకు, చని, తద్ + వృత్తాంతంబు, ఎఱింగించినన్ = తెలుపఁగా, వరదుండు = వరముల నిచ్చువాఁడు - శివుఁడు, కుమార + ఉత్పత్తికిన్ = కుమారస్వామి పుట్టుకకు, ప్రసాదించెన్ + అని = అనుగ్రహించెనని, విధి = బ్రహ్మ, ముదిత - హృదయుండు = సంతోషించిన హృదయము గలవాఁడు, అగుచున్

**తాత్పర్యము :** ఇట్లు అగ్ని యీశ్వరుని వీర్యముచే నపహరింపఁబడిన తేజస్సు గలవాఁడయి, దానిచేఁ గొట్టఁబడిన ప్రాణము గలవాఁడయి, సొమ్మసిలిపడి, చాల సేపటికి ఎట్లో తేఱుకొని ఆ యధికభారమును మోయలేక బ్రహ్మకడకు వెడలి ఆ వృత్తాంతముఁ దెలుప 'నీశ్వరుఁడు కుమారస్వామి జననమున కనుగ్రహించె' నని బ్రహ్మ సంతోషించి, - తరువాతి పద్యముతో నన్వయము

**క** పురహరు నమోఘ వీర్యము
సురనది గొని తాల్చు నాశుశుక్షణి వడి నీ
భరమందుఁ బెట్టు మనఁ జని
హరవీర్యం బనలుఁ డా సురాపగఁ గలపెన్. 11

**అర్థము :** ఆశుశుక్షణి =ఓ అగ్నీ, పురహరు + అమోఘ - వీర్యమున్ = ఈశ్వరుని వ్యర్థముగాని వీర్యమును, సుర - నది = ఆకాశగంఁగ, కొని, తాల్చున్

= భరించును, వడిన్ = వేగముగా, ఈ - భరము = ఈ బరువు, అందున్ = గంగానదియందు, పెట్టుము + అనన్, చని, అనలుఁడు = అగ్ని, ఆ - హర - వీర్యంబు = ఆ శివుని వీర్యము, ఆ - సుర + ఆపగన్ = ఆ ఆకాశగంగయందు, కలపెన్

**తాత్పర్యము .** 'అగ్నీ ! శివుని వ్యర్థముకాని వీర్యమును ఆకాశగంగ భరించును కావున నీవు వేగముగా ఈ బరువు అందుఁ బెట్టు' మనఁగా, అగ్ని వెడలి హరుని వీర్యము నాకాశగంగయందుఁ గలిపెను

**విశేషములు.** ఆశుశుక్షణి 'లోహితాశ్వో వాయుసఖ శ్శిఖావా నాశుశుక్షణిః' - అమరము 'ఆ సమన్తాత్ శోషయితు మిచ్ఛ తీత్యాశుశుక్షణిః' అంతట శోషింపఁజేయ నిచ్ఛగలవాఁడు - అగ్ని

వ  అంత - తరువాతి పద్యముతో నన్వయము  12

క  హరువీర్యముఁ దాల్పఁగఁ గడు
భరమై వడి నడుమ దిగ్గఁబడి కడప ళ్లం
బరముదెస నిల్చి పొల్చెను
సురవాహిని బాలుఁడున్న జోలియ వోలెన్  13

**అర్థము .** హరు - వీర్యమున్ = శివుని వీర్యమును, తాల్పఁగన్, కడున్ = మిక్కిలి, భరము + ఐ = బరువయి, వడిన్ = వేగముగా, నడుమన్ = మధ్యభాగమున, డిగ్గఁబడి = పల్లమయి, కడపళ్ళు = చివరిభాగములు, అంబరము - దెసన్ = ఆకాశమువైపు, నిల్చి, సుర-వాహిని = ఆకాశగంగ, బాలుఁడు, ఉన్న, జోలియ + పోలెన్ = ఊయలవలె, పొల్చెను = ఒప్పెను

**తాత్పర్యము:** శివుని వీర్యమును దాల్చుటకు మిక్కిలి బరువయి వేగముగా నడిమిభాగము దిగఁబడి చివరి భాగములు ఆకాశమువైపు నిలిచి, ఆకాశగంగ బాలుఁడున్న తొట్టెవలె నొప్పెను

**విశేషములు .** అలంకార ముపమ

వ.  ఇట్లీశ్వర వీర్యం బనిమిషాపగయోని డిగ్గంబడిన నగ్గంగలగ్గ బెగ్గలించి నిజభరంబు తనపైఁ బెట్టిపోవు ననలున కడ్డంబు వచ్చి 'యిది యేమి మాయ వన్ని' తని తత్రపంచం బనలువలన నెఱింగి  14

**అర్థము** ఇట్లు, ఈశ్వర వీర్యంబు, అనిమిష + ఆపగ - యోనిన్ = గంగానది యోనియందు, డిగ్గంబడినన్ = దిగఁబడఁగా, ఆ + గంగ, లగ్గన్ = అధికముగా, బెగ్గలించి = భయపడి, నిజ-భరంబున్ = స్వభారమును, తనపైన్, పెట్టి, పోవు, అనలునకున్ = అగ్నికి, అడ్డంబు - వచ్చి, ఇది, ఏమి, మాయ, పన్నితి (వి) + అని, తద్ + ప్రపంచంబు = ఆ వృత్తాంతము, అనలువలనన్ = అగ్నివలన, ఎఱింగి

**తాత్పర్యము .** ఇట్లు ఈశ్వరుని వీర్యము గంగానదియోనియందు, దిగఁబడఁగా, ఆ గంగ మిక్కిలి భయపడి, స్వభారమును దనపైఁ బెట్టిపోవుచున్న అగ్ని కడ్డము వచ్చి, 'ఇది యేమి మాయ పన్నితి ?' వని ఆ వృత్తాంత మగ్నివలన నెఱిఁగి - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .**పోవు ననలునకున్ - పోవు + అనలు నకున్ 'ఉదంతమగు తద్ధర్మార్థవిశేషణమున కచ్చు పరమగునపుడు నుగాగమం బగు' బాల సంధి 33 అనలు వలనన్ - గ్రహణార్థమునఁ బంచమి బాల కారక 9

ఉ **'నీ వఖిలామరేంద్రమహనీయుఁడ వోపనిదానిఁ దాల్పఁగా**
**నా వశమయ్య్య భూరిభువనత్రయ దుర్వహభార మమ్మహా**
**దేవు నవార్యవీర్యమని దివ్యతరంగిణి తెచ్చి క్రమ్మఱం**
**బావకు మ్రోల నిల్పెఁ గని ప్రాణము ఝల్లని తల్లడిల్లఁగాన్. 15**

**అర్థము .** అఖిల + అమర + ఇంద్ర - మహనీయుఁడవు = ఎల్ల దేవతాశ్రేష్ఠులలో ఘనుఁడవు, (అగు), నీవు ఓపనిదానిన్ = మోయలేని దానిని, తాల్పఁగాన్, నా - వశమయ్య ? = నా తరమా ? ఆ + మహాదేవు + అవార్య - వీర్యము = ఆ మహాదేవుని వారింపరాని వీర్యము, భూరి - భువన - త్రయ - దుర్వహ - భారము = ముల్లోకములకు మోయరాని పెద్దబరువు, అని, దివ్య - తరంగిణి = గంగానది, తెచ్చి, క్రమ్మఱన్ = మరల, కని = చూచి, ప్రాణము, ఝల్లు + అని, తల్లడిల్లఁగాన్ కలఁతఁజెందఁగా, పావకు - మ్రోలన్ = అగ్ని యెదుట, నిల్పెన్

**తాత్పర్యము.**దేవతాశ్రేష్ఠులందఱిలో ఘనుఁడవైన నీవు మోయలేనిదానిని దాల్ప నా తరమా ? ఆ మహాదేవుని వీర్యము ముల్లోకములకును దుర్వహము ' అని గంగానది అగ్ని ప్రాణము ఝల్లుమని కలఁతఁజెంద దానిని మరల నతని మ్రోలఁ బెట్టెను

వ  అంత నద్దివ్యవీర్యంబు  16

**అర్థము.** అంత నా గొప్ప వీర్యము - తరువాతి పద్యముతో నన్వయము

క  పఱతెంచి మగుడఁ బెట్టిన
నఱిముఱి వలిగ్రాము వట్టిన ట్లనలుఁడు మై
మఱచి పడియున్న సఖుఁ దె
ప్పఱ నొయ్యన వీచె నపుడు పవనుఁడు నెమ్మిన్.  17

**అర్థము.** పఱతెంచి = వచ్చి, మగుడన్ = మరల, పెట్టినన్ = పెట్టఁగా, అనలుఁడు = అగ్ని, అఱిముఱిన్ = సంభ్రమముతో, వలి - గ్రాము + పట్టిన + అట్లు = చలిగ్రహము సోఁకినట్లు, మైన్ + మఱచి = ఒడలు మఱచి, పడి + ఉన్న= పడియుండఁగా, సఖున్ = మిత్రుని, తెప్పఱన్ = తేఱునట్లు, పవనుఁడు = వాయువు, అపుడు , నెమ్మిన్ = ప్రీతితో, ఒయ్యనన్ = మెల్లఁగా, వీచెన్

**తాత్పర్యము :** వచ్చి మరలఁ బెట్టఁగా నగ్ని కలఁగి చలిగ్రహము సోఁకిన విధమున నొడలు మఱచి పడియుండఁగా నపుడు వాయువు మిత్రుఁడు తేఱుకొనునట్లు ప్రీతితో మెల్లఁగా వీచెను

**విశేషములు :** అలంకార ముత్ప్రేక్ష

**శివుని వీర్యముం దాల్చిన యగ్ని శరవణసరసి కరుగుట.**

వ  ఇ ట్లెట్టకేనియు సచేతనుండై మగుడం బరమేష్ఠి పాలికిం జనుదెంచి తద్వృత్తాంతం బెఱింగించి వీర్యభరంబున నిశ్చేష్టితుండై యున్నదహనుంగని విరించి కరుణించి తన్నుం జొచ్చిన సకలపదార్థంబుల నశ్రమంబున ధరియించునట్టిశక్తి వరంబునం బడసె శరవణం బందుల కరుగు' మనిన మహాప్రసాదం బని ధూమధ్వజుండు శరవణసరసి కరుదెంచె, నది యనిమిషాస్పదం బగుట నమృతాన్వితం బగుచు ఖరదండసహితంబగుటం గుముదాన్వితం బగుచు సద్విజావాసం బగుటం గుశాన్వితంబగుచు హంసాశ్రయం బగుటం గూర్మాసనాన్వితం బగుచు

**అర్థము .** ఇట్లు, ఎట్టకేనియున్ = ఎట్లో, సచేతనుండు + ఐ = స్పృహ వచ్చినవాఁడయి, మగుడన్ = మరల, పరమేష్ఠి - పాలికిన్ = బ్రహ్మకడకు, చనుదెంచి = వచ్చి , తద్ + వృత్తాంతంబు = ఆ వృత్తాంతము, ఎఱింగించి =

తెలిపి, వీర్య - భరంబునన్ = వీర్యము బరువుచే, నిశ్చేష్టితుండు + ఐ = చేష్టలు దక్కి, ఉన్న, దహనున్ = అగ్నిని, కని, విరించి = బ్రహ్మ, కరుణించి = దయదలఁచి, శరవణంబు = తెల్లువనము, తన్నున్, చొచ్చిన = ప్రవేశించిన, సకల - పదార్థములన్= ఎల్లవస్తువులను, అశ్రమంబునన్ = శ్రమములేకుండ, ధరియించు + అట్టి = తాల్చునట్టి, శక్తి, వరంబునన్ = వరముచే, పడసెన్, పొందెను, అందులకున్ = అక్కడకు, అరుగుము = పొమ్ము, అనినన్, మహాప్రసాదంబు + అని, ధూమధ్వజుండు= పొగ కేతనముగాఁ గలవాఁడు - అగ్ని, శరవణ - సరసికిన్ = టెల్లువనముగల సరస్సునకు, అరుదెంచెన్ = వచ్చెను, అది, అనిమిష + ఆస్పదంబు + అగుటన్ = చేఁపలకు (నిమిషము = టెప్పపాటు లేనివానికి) చోటు అగుటచే, దేవతలకు ఆవాసమగుటచే అని అర్థాంతరము, అమృత + అన్వితంబు= నీటితోఁగూడినది, అమృతముతోఁగూడినది - అని అర్థాంతరము, అగుచున్, ఖర- దండ - సహితంబు = పరుసని కాము గలవి, పద్మములతోఁగూడినది, క్రూరదండనముతోఁ గూడినదని అర్థాంతరము, అగుటన్, కుముద + అన్వితంబు= కలువలతోఁ గూడినది, కుముద + అన్వితంబు = సంతోషహీనులతోఁ గూడినదియని యర్థాంతరము, సత్ + ద్విజ + ఆవాసంబు = మంచి పక్షులకుఁ జోటయినది, - సద్బ్రాహ్మణులకుఁ జోటయినది, అని అర్థాంతరము, అగుటన్, కుశ + అన్వితంబు = జలముతోఁగూడినది - దర్భలతోఁ గూడినది అని అర్థాంతరము, అగుచున్, హంస + ఆశ్రయంబు = అంచల కాశ్రయ మయినది -యోగుల కాశ్రయమయినదని అర్థాంతరము, అగుటన్, కూర్మ + అసన + అన్వితంబు= తాఁబేళ్ళు, వేఁగిసపూలు అనువానితోఁ గూడినది, కూర్మాసనము అను ఆసనభేదముతోఁ గూడినది యని అర్థాంతరము, అగుచున్,

**తాత్పర్యము .** ఇట్లు ఎట్లో స్పృహ వచ్చినవాఁడయి మరల బ్రహ్మ కడకు వచ్చి ఆ వృత్తాంత మెఱిఁగించి, వీర్యము బరువుచేఁ జేష్టలుడిగియున్న అగ్నిని జూచి బ్రహ్మదయఁబూని శరవణము తన్నుఁజొచ్చిన యెల్ల పదార్థములను అనాయాసముగా ధరించు శక్తిని వరముచేఁ బొందెను 'నీ వచ్చటి కరుగు'మన 'మహాప్రసాద' మని అగ్ని శరవణసరసికి వచ్చెను అది అనిమిషములకు (చేఁపలకు) ఆవాసమగుటచే అమృతముతోఁ (జలముతో) గూడినది యగుచు,, అనిమిషులకు (దేవతలకు) ఆవాసమగుటచే అమృతముతోఁ గూడినది యగుచు, ఖర దండ సహితము (కఱకు కాఁడగలవి = పద్మములు - వానితోఁగూడినది) అగుటచే కుముదములతోఁ (తెల్లకలువలతోఁ) గూడినది యగుచు, ఖర - దండ (క్రూర దండనము)తోఁ గూడినది అనుటచే కుముద + అన్వితము = సంతోషహీనులతోఁ

గూడినది, అగుచు, అంచలకు ఆశ్రయమైనది అగుటచే (కూర్మ + అసన+ అన్వితంబు) కూర్మములు, అసన పుష్పములు అను వానితోఁగూడినది అగుచు, హంస + ఆశ్రయంబు = యోగులకు ఆశ్రయము అగుటచే, కూర్మ + ఆసన + అన్వితంబు = కూర్మాసనముతోఁ గూడినది అగుచు తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు** · అలంకారము శ్లేషము

క **కమలాభిశోభితము హరి**
**రమణీయము విద్రుమాభిరామము శుకర**
**మ్యమునై గగనాబ్ధులతో**
**సమమై వనమధ్యజలజషండం బొప్పెన్** 19

**అర్థము** వన - మధ్య - జలజ - షండంబు = నీటి నడిమి తామరల సమూహము, (ఇది గగనాబ్ధులతో సమమయినది అనుచున్నాఁడు గావున దీనిని ఒక్కొక్క విశేషణమునకు గగనపరముగను, అబ్ధిపరముగను అర్థద్వయము చెప్పవలయును కమల + అభిశోభితము = సారసపక్షులచేఁ బ్రకాశించునది - గగనపరము, కమలా + అభిశోభితము = లక్ష్మితోఁ బ్రకాశించునది - అబ్ధిపరము, హరి - రమణీయము = సూర్యచంద్రులతో మనోహరమయినది - (గగనపరము) విష్ణువుచే సుందరమయినది - (అబ్ధి పరము), వి-ద్రుమ + అభిరామము = చెట్ల అభావముచే సుందరము అయినది - (గగనపరము), పగడపుఁజెట్లచే మనోహరమయినది - (అబ్ధిపరము), శుక - రమ్యమున్ = చిలుకలచే రమణీయమయినదియు - (గగనపరము) దిరిసెనపుఁజెట్టుచే రమ్యమయినదియు, (అబ్ధిపరము), అయి, గగన + అబ్ధులతోన్, = ఆకాశము, సముద్రము అనువానితో, సమము + ఐ = సమానమయి, ఒప్పెన్

**తాత్పర్యము .** ఆ శరవణసరసి నడిమి పద్మములసమూహము గగనాబ్ధులతో సమానమయి యొప్పెను ఎట్లన - కమలములచే = సారసపక్షులచేఁ బ్రకాశించి గగనముతోను, కమలా = లక్ష్మిచేఁ బ్రకాశించి అబ్ధితోను సమానమయినది హరిచే - సూర్యుఁడు, చంద్రుఁడు అనువారిచే రమణీయమై గగనముతోను, విష్ణువుచే రమణీయమై అబ్ధితోను సమానమయినది విద్రుమమగుటచే = విగతద్రుమమగుటచే అభిరామమయి గగనముతోను, పగడపుఁజెట్లచే అభిరామమయి అబ్ధితోను సమానమయినది శుకములచే (చిలుకలచే

రమ్యమయి గగనముతోను, శుకములచే (దిరిసెనపుఁజెట్లచే) రమ్యమయి అబ్ధితోను సమానమయినది

**విశేషములు** అలంకారము శ్లేషము

క వారక కలహంసావలి
బోరన నక్కొలని కెఱఁగి పాలు పమరె మహాం
భోరాశి కెలమి నెఱఁగెడు
శారదనీరదసమూహి చాడ్పునఁ బోలెన్ 20

**అర్థము** వారక = తప్పక, కలహంస + ఆవలి = రాయంచలవరుస, బోరనన్ = శీఘ్రముగా, ఆ + కొలనికిన్ = ఆ శరవణ సరస్సునకు, ఎఱఁగి - = వ్రాలి, మహత్ (మహా) అంభస్ (ః) + రాశికిన్ = మహాసముద్రమునకు, ఎలమిన్ = ప్రీతితో, ఎఱఁగెడు = దిగునట్టి, శారద = శరత్సంబంధమయిన, నీరద = మేఘములయొక్క, సమూహి - చాడ్పునన్ + పోలెన్ = గుంపువలె, పాలు పమరెన్ (పొలుపు + అమరెన్) = ఒప్పారెను

**తాత్పర్యము .** రాజహంసముల సమూహము తప్పక శీఘ్రముగా ఆ శరవణసరస్సునకు వ్రాలి, మహాసముద్రమునకుఁ బ్రీతితో దిగునట్టి శరత్కాల మేఘముల సమూహమువలె నొప్పారెను

**విశేషములు.** అలంకారముపమ కలహంసములు తెలుపు, అందుచేతనే 'శారద' అని నీరదములకు విశేషణము శరత్కాల మేఘములు తెలుపు

క బిట్టెగసి మీఁదఁ గెలఁకులఁ
జుట్టి సితచ్ఛదసమూహి సుడియుట కడుఁ గ
న్పట్టు సరోవరలక్ష్మికిఁ
గట్టిన వెంబట్టు మేలుకట్టుంబోలెన్ 21

**అర్థము :** సితచ్ఛద (సిత + ఛద) - సమూహి = తెల్లని ఱెక్కలుగలవాని (హంసములయొక్కగుంపు మీఁదన్ = పైని, బిట్టు = వేగముగా, ఎగసి = ఎగిరి, కెలఁకులన్ = పార్శ్వములందు, చుట్టి, సుడియుట = తిరుగుట, సరోవర - లక్ష్మికిన్= సరసియనెడు లక్ష్మికి, కట్టిన, వెంబట్టు (వెల్ల+పట్టు) = తెల్లపట్టు, మేలుకట్టున్ + పోలెన్ = చాందిని వలె, కడున్ = మిక్కిలి, కన్పట్టున్ = చూపట్టును

**తాత్పర్యము .** రాయంచల సమూహము పైని వేగముగా నెగిరి, పార్శ్వములందుఁ జుట్టి తిరుగుట, సరసియనెడు లక్ష్మికిఁ గట్టిన తెల్లపట్టు చాందినియో యనఁ జూపట్టును

**విశేషములు.** అలంకారము రూపకానుప్రాణితోత్ప్రేక్ష కెలఁకులన్ (కెలను + లన్) 'కలన్వాదుల నువర్ణంబు కుజ్జగు, బహువచనము పరంబగునపుడు నిత్యముగా నగు' బాల ఆచ్ఛిక 18 కెలను + కుజ్ + లన్, 'జిత్తు బిందు పూర్వంబగు' బాల తత్సమ 19 కెలఁకులన్ వెంబట్టు - వెల్ల + పట్టు 'సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగా నగు' బాల సంధి 36 వె + పట్టు 'లుప్తశేషంబునకుం బరుషములు పరములగునపుడు నుగాగమం బగు' బాల సంధి 37 వె + ను + పట్టు ద్రుతకార్యము బాల సంధి 16,17 వెంబట్టు సితచ్ఛద - సిత + ఛద - హ్రస్వమునకుఁ బరమైన ఛకారమునకు ద్విత్వము

**తరువోజ (తరువద)**

**జలనిధి దమకెల్లఁజాలదు త్రావం**
**జాలిన నదియేల చవిగాని లవణ**
**జలమని మెచ్చక సంవర్తకాది**
**జలదముల్ ప్రీతి నజ్జలజాకరంబు**
**జలము లక్షయములు చని సుధారసము**
**చవియని మెచ్చి నిచ్చలు నీరి కేఁగు**
**పొలుపున నెప్పుడుఁ బురి మదహస్తి**
**పులు సొచ్చుచుండు నాపోవక కొలన** **22**

**అర్థము.** సంవర్తక + ఆది + జలదముల్ = సంవర్తకములు మున్నగు మేఘములు, జలనిధి = సముద్రము, తమకున్ + ఎల్లన్ = తమకంతకును, త్రావన్ = త్రాగుటకు, చాలదు = సరిపోదు, చాలినన్ = ఒకవేళ చాలినప్పటికిని, చవి + కాని = రుచి కాని, లవణ జలము = ఉప్పునీరు, అది, ఏల, అని మెచ్చక, ప్రీతిన్ = సంతోషముతో, ఆ + జలజ + ఆకరంబు - జలములు = ఆ తామరకొలని నీరులు, అక్షయములు = క్షీణింపనివి, చని, సుధారసము - చవి అమృతపు రుచి, అని, మెచ్చి, నిచ్చలున్ = ఎల్లప్పుడును పురిన్ = పురమునందు, మద -హస్తిపులు = మత్తగజరాజములు, ఆపోవక = తృప్తినొందక, కొలనన్ = కొలనియందు, చొచ్చుచున్ + ఉండున్= ప్రవేశించుచుండును

**తాత్పర్యము.** సంవర్తకములు మున్నగు మేఘములు 'సముద్రము తమకంతకును ద్రావుటకు సరిపోవదు - ఒక వేళ సరిపోయినను రుచింపని ఉప్పునీరు అది యెందుల ? కని మెచ్చక, ప్రీతితో, 'ఆ శరవణ సరస్సు జలములు

అక్షయములు' అని వెడలి అందలి నీరు అమృతపు రుచి గలది యని మెచ్చి, యెల్లప్పుడును నీటికై వెడలు విధమున నెప్పుడును మదగజరాజములు తనివిసనక కొలనియందుఁ జొచ్చుచుండును

**విశేషములు .** అలంకార ముపమ

తరువోజ తరువద - నాలుగుపాదము లుండును ప్రతిపాదమునను మూఁడింద్రగణములు, ఒక సూర్యగణము ఉండును మొదటి గణము మొదటి యక్షరమునకు, మూఁడవ గణము మొదటి యక్షరమునకు, అయిదవ గణము మొదటి యక్షరమునకు, ఏడవ గణము మొదటి యక్షరమునకు యతిమైత్రి ప్రాసనియమము గలదు

క   **భంగిగఁ దనపైఁ దేరు మ**
**తంగజ కర శీకరముల దానజలములన్**
**గంగాయమునా తత జల**
**సంగమదేశంబు వోలె శరవణ మొప్పెన్**   23

**అర్థము .** భంగిగన్ = తీరుగా - అందముగా, తనపైన్ = తనమీఁద, తేరు= కలుగునట్టి, మతంగజ - కర - శీకరములన్ = ఏనుఁగులయొక్క తొండముల తుంపరలచేతను, దాన - జలములన్ = మదజలములచేతను, శరవణము, గంగా - యమునా - తత - జలసంగమ - దేశంబు + పోలెన్ = గంగా యమునా నదుల విరివియైన జలముల కూటమి స్థలమువలె, ఒప్పెన్

**తాత్పర్యము .** తనపైఁ గలుగు మదగజముల తొండముల తుంపరల చేతను, మదజలములచేతను, శరవణము గంగాయమునానదుల సంగమ ప్రదేశమువలె నొప్పెను

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష గంగానదీ జలములు తెలుపు మతంగజ కరశీకరములును దెలుపు యమునానదీజలములు నలుపు దానజలములును నలుపు

సీ.   **ఖచరాంగనల కుచ కాశ్మీర పంకంబు**
   **వనజ పరాగంబు నొనరి తనర**
**సురకన్యకల కచ సురదారు కుసుమముల్**
   **రమణీయ హేమాంబుజములుఁ బెనఁగ**

నపరకామినుల ముఖ పరిమళశ్వాసంబు
మెలుపారు కొలనితెమ్మెరలు నెనయ
నహిసుందరుల కంఠహారముల్ కరయంత్ర
గళితాంబుధారలుఁ గలసి వెలుఁగఁ

తే. తమ విలాసముల్ జలదేవతా విలాస
భాతితోఁ గూడి పరభాగపదవిఁ గ్రాల
నర్థి జలకేళి సలుపుదు రఖిల భువన
వర నితంబిను లా సరోవరములందు 24

**అర్థము .** ఖచర + అంగనల = గగనచరలైన స్త్రీలయొక్క, కుచ = స్తనములయందలి, కాశ్మీర - పంకంబున్ = కుంకుమపు బురదయును, వనజ - పరాగంబున్ = పద్మముల పుప్పొడియును, ఒనరి = కూడి, తనరన్ = ఒప్పఁగా,

సుర - కన్యకల = దేవతా స్త్రీలయొక్క కచ = శిరోజములయందలి, సురదారు - కుసుమముల్ = దేవదారు పుష్పములును, రమణీయ = సుందరములయిన, హేమ + అంబుజములున్ = బంగారుఁదామరలును, పెనఁగన్ = కూడఁగను,

నర - కామినుల= మానవస్త్రీలయొక్క, ముఖ - పరిమళ - శ్వాసంబు= ముఖమునందలి సువాసనగల ఊర్పును, మెలుపారు = సుందరములయిన, కొలని - తెమ్మెరలున్ = సరోవర వాయువును, ఎనయన్ = కూడఁగా,

అహి - సుందరుల = నాగ సుందరాంగుల, కంఠ - హారముల్ = కంఠములందలి ముత్యాలపేరులును, కర -యంత్ర - గళిత + అంబుధారలున్ = చేతి యంత్రములనుండి జాఱిన జలధారలును, కలసి = కూడి, వెలుఁగన్ = ప్రకాశింపఁగను,

అఖిల - భువన - వర - నితంబినులు = ఎల్లలోకములందలి శ్రేష్ఠురాండ్రయిన స్త్రీలు, తమ- విలాస - భాతితోన్ = జలదేవతల సౌందర్యపుఁగాంతితో, కూడి,పరభాగ -పదవిన్= అతిశయమైనమార్గమున, క్రాలన్ = ప్రకాశింపఁగా, అర్థిన్= కోరికతో, ఆ - సరోవరము నందున్ = ఆ సరస్సునందు, జల - కేళి + చలుపుదురు= జలక్రీడలాడుదురు

**తాత్పర్యము.** గగనచరస్త్రీల స్తనములందలి కుంకుమ పంకమును పద్మ పరాగమును గూడి యొప్పఁగా, దేవతాస్త్రీల శిరోజములందలి దేవదారు పుష్పములును, సుందరములయిన బంగారుఁదామరలును గూడఁగా, మానవాంగనల ముఖ పరిమళ శ్వాసమును అందమయిన సరోవరవాయువులును గూడఁగా, నాగ సుందరాంగుల కంఠములందలి ముత్యాల పేరులును జేతియంత్రముల నుండి చిమ్మఁబడిన జలధారలును గలిసి వెలుఁగఁగా ఇట్లు ఎల్ల భువనములందలి స్త్రీలును దమ సౌందర్యములు జలదేవతసౌందర్యముతోఁ గూడి యతిశయించి ప్రకాశింపఁగా నా కొలనియందుఁ గోరికతో జలక్రీడలాడుదురు

**విశేషములు.** స్వర్గమర్త్యపాతాళములందలి స్త్రీలు చెప్పఁబడిరి కావుననే 'అఖిల భువన వరనితంబినులనుట ఉపమాధ్వని ఖచరాంగనల కుచకాశ్మీరపంకము వనపరాగమువలె నున్నదని ధ్వని ఇట్లు నాలుగు పాదములందును గ్రహింపవలయును

**మహాస్రగ్ధర** **అరుణాంభోజాతవర్గం బతిలసితవిభాసాబ్జరాగాలి, నీలాం**
**బురుహవ్రాతంబు నీలంబులు, విమలనవాంభోజముల్ శంఖముల్, శీ**
**కరముల్ ముక్తాఫలానీకములుగఁ దగ విఖ్యాతమై భూరిరత్నా**
**కరమో నా నొప్పు నబ్జాకర మధికజలౌఘప్రపూర్ణాభివృద్ధిన్** 25

**అర్థము** అరుణ + అంభోజాత -వర్గంబు = ఎఱ్ఱతామరల సమూహము, అతి - లసిత - విభాస + అబ్జరాగ + ఆలి = మిక్కిలి ప్రకాశించిన కాంతితోడి పద్మరాగమణుల వరుసయును, నీల + అంబురుహ - వ్రాతంబు = నల్లని పద్మముల సమూహము, నీలంబులు = నీలమణులు, విమల - నవ + అంభోజముల్ = తెల్లని క్రొత్త తామరలు, శంఖముల్, శీకరముల్ = నీటిబిందువులు, ముక్తా ఫల + అనీకములు = ముత్యాల సమూహములు, కన్ = అగునట్లు, తగన్ = ఒప్పఁగా, విఖ్యాతము + ఐ = ప్రసిద్ధమయి అబ్జాకరము = తామరకొలను, అధిక - జల + ఓఘ - ప్రపూర్ణ + అభివృద్ధిన్ = ఎక్కువనీటిప్రవాహములచే మిక్కిలి నిండిన అభివృద్ధిచేత, భూరి + రత్నాకరమో = గొప్ప సముద్రమో (రత్నములకు ఆకరమో) నాన్ = అనఁగా, ఒప్పున్

**తాత్పర్యము .** ఎఱ్ఱని పద్మముల సమూహము మిక్కిలి ప్రకాశించు పద్మరాగములును, నల్లని పద్మములు నీలమణులును, తెల్లని పద్మములు శంఖములును, నీటి బిందువులు ముత్యాలును అగునట్లు ఒప్పఁగాఁ బ్రసిద్ధిఁ జెంది తామరకొలను అధికమైన జలసమృద్ధిచే మహారత్నాకరమో యన నొప్పును

**విశేషములు .** అలంకారము కావ్యలింగము, ఉత్ప్రేక్ష సముద్రమునకు రత్నాకర శబ్దమును సాభిప్రాయముగాఁ బ్రయోగించుటచే పరికరాంకురమును మహాస్రగ్ధరాలక్షణమునకు పూర్వవ్యాఖ్య నరయునది 1-68, 1-115

క. ఎలమెడు జలజాతంబులు
మెలరారెడు జలచరములు మేలిల్లెడు ని
క్కొల నుండ నెందుఁ బోయెనొ
జల మను నాశంకఁ జేయు జల మమలరుచిన్ 26

**అర్థము .** ఎలమెడు = చూపట్టు, జలజాతంబులున్ = పద్మములును, మెలరారెడు = త్రుళ్లు, జలచరములున్ = నీట సంచరించు చేపలు మున్నగునవియు, మేలిల్లెడు = శ్రేష్ఠమగు, ఈ + కొలను = ఈ సరస్సు, ఉండన్ = ఉండఁగా, జలము = నీరు, అమల - రుచిన్ = స్వచ్ఛమైన కాంతితో, జలము = నీరు, ఎందున్ + పోయెనొ = ఎచ్చటికిఁ బోయెనో, అను, ఆశంకన్ = సందేహమును, చేయున్ = కలిగించును

**తాత్పర్యము .** ఇందు జలము అతి నిర్మలమైయుండి ఉన్నట్లు కనుపట్టక, పద్మములును, త్రుళ్ళెడి జలచరములును, శ్రేష్ఠమైన ఈ కొలనును ఉండఁగా జల మెచ్చటికిఁబోయెనో యను సందియమును గలిగించును

**విశేషములు** ఆ కొలనియందు జలము లేదేమో అనిపించునంత నిర్మలముగా నుండె ననుట అలంకార ముత్ప్రేక్ష

చ జలనిధు లేడు నీక్కొలని జా లవుఁ గా వది యేటి మాట యీ
జల మగునేని మున్ జవియుఁ జాయయు వానికి నేల వేఱుగా
వలసె నెఱుంగరే నెలవు వన్నువనీ, రని వాదుసేయుపే
రులి వనఁ బెల్లునం జెలఁగుచుండు మదాళివిహంగసంఘముల్ 27

**అర్థము .** జలనిధులు + ఏడున్ = సముద్రము లేడును, ఈ - కొలని - జాలు = ఈ సరస్సు ప్రవాహము, అవున్ = అగును, కావు, అది, ఏటి మాట = ఏమిమాట, ఈ - జలము + అగున్ + ఏనిన్ = సప్తసముద్రములందలి జలము ఈ సరస్సునందలి జలము అగుచో, మున్ = ముందు, చవియున్ = రుచియును, చాయయున్ = రంగును, వానికిన్ = ఆ సముద్రజలములకు, ఏల = ఎందులకు, వేఱు + కావలసెన్ = భిన్నము కావలసివచ్చెను ? నెలవు = స్థానము, వన్నువ -

నీరు = రంగు నీరు, ఎఱుంగరే = తెలియరా ?, అని, వాదు + చేయు = వాదములాడు, పేరు + ఉలివు = పెద్దధ్వని, అనన్, మద + అళి - విహంగము - సంఘముల్ = మదించిన తుమ్మెదల పక్షుల గుంపులు, పెల్లునన్ = అధికముగా, చెలఁగుచున్ + ఉండున్ = రొదచేయుచుండును

**తాత్పర్యము** 'ఏడు సముద్రముల జలములును ఈ కొలని ప్రవాహమగును - గావు అనునది యేమి మాట ? అవి యిందలి జలమే యగుచో, వానికి రుచియు, వర్ణము నెందులకు భిన్నము గావలసివచ్చెను? (సముద్రజలము లుప్పగను, నీలముగను ఉండును ఈ కొలని జలములు మధురములుగను, వర్ణరహితముగను నుండును అవియే యివి యనుచో వానికిఁ బరస్పర మిట్టి భేదమేలయుండును?) జలముల స్థానమును, వర్ణము నెఱుఁగరా ?' యని వాదములాడునప్పటి పెద్దధ్వనియా యన మదించిన తుమ్మెదలయుఁ, బక్షులయు గుంపులు అందు రొదచేయుచుండును

**విశేషములు .** అలంకారము ఉత్ప్రేక్ష సందేహానుప్రాణితము

వ అని వర్ణింపందగిన వర్ణనలకుంజాలి మేలిల్లుచు 28

**అర్థము .** అని, వర్ణింపన్ + తగిన, వర్ణనలకున్, చాలి = సరిపడి, మేలిల్లుచున్ = శ్రేష్ఠమగుచు

**తాత్పర్యము .** అని వర్ణింపఁదగిన వర్ణనలకు సరిపడి బాగుగా నొప్పుచు- తరువాతి పద్యముతో నన్వయము

సీ లోలాంబుజాలముల్ నీలాలకములుగా
బాలమృణాలముల్ కేలు గాఁగ
దళితాంబుజాతంబు తెలిమోముగా నుత్ప
లములు విశాలనేత్రములు గాఁగ
జక్కవ కవ నిండు చనుఁగవ గాఁ బులి
నస్థల మురుజఘనంబు గాఁగ
మొలచు లేఁదరఁగలు ముత్తరంగలు గాఁగ
శోభిల్లు సుడి నిమ్ననాభి గాఁగ

తే. నబ్జవనలక్ష్మి శంభువీర్యమునఁ గొడుకుఁ
బడసి దివిజుల కీఁబూని పావకునకు
నొలసి తనరూపు చూపున ట్లొప్పుదోఁచె
శ్రీకరంబగు నా కమలాకరంబు 29

**అర్థము.** శ్రీకరంబు = శోభాకరము, అగు, ఆ - కమల + ఆకరంబు = ఆ తామర కొలను,

లోల + అంబు - జాలముల్ = చంచలములయిన నీటి సమూహములు, నీల + అలకములు + కాన్ = నల్లని శిరోజములు కాఁగా, బాల - మృణాలముల్ = లేఁదామరతూండ్లు, కేలు = చేతులు, కాఁగన్

దళిత + అంబుజాతంబు = వికసించిన తామర, తెలి - మోము + కాన్ = నిర్మలమైన ముఖము కాఁగా, ఉత్పలములు = కలువలు, విశాల - నేత్రములు = పెద్దకన్నులు, కాఁగన్,

జక్కవ - కవ = చక్రవాకముల జంట, నిండు - చనుఁగవ + కాన్ = నిండైన స్తనముల జంట కాఁగా, పులిన - స్థలము = ఇసుక తిన్నె, ఉరు - జఘనంబు = పెద్ద కటిప్రదేశము, కాఁగన్,

మొలచు - లేఁదరఁగలు (లేఁత + తరఁగలు) = పుట్టు లేఁత అలలు, ముత్తరంగలు (మూఁడు + తరంగలు), పొట్టమీఁది మూడు ముడుతలు (త్రివళులు) కాఁగన్, శోభిల్లు = ప్రకాశించు, సుడి, నిమ్న - నాభి = లోఁతయిన నాభి, కాఁగన్ అబ్జ - వన - లక్ష్మి = తామరతోఁపు అనెడు లక్ష్మి, శంభు - వీర్యమునన్ = శివుని వీర్యముచే, కొడుకున్, పడసి = పొంది, దివిజులకున్ = దేవతలకు, ఈన్ + పూని = ఇచ్చుటకుఁబూని, పావకునకున్ = అగ్నికి, ఒలసి = సమీపించి, తన - రూపున్ = తన రూపమును, చూపు + అట్లు + ఒప్పు + తోఁచెన్ = చూపునట్లు ఒప్పెను

**తాత్పర్యము:** శోభాకరమగు ఆ పద్మాకరము చంచలములయిన నీరుల సమూహములు నల్లని కురులుగను, లేఁదూండ్లు చేతులుగను, వికసితపద్మము నిర్మలమయిన ముఖముగను, కలువలు విశాలనయనములుగను, చక్రవాకద్వయము నిండుస్తనద్వయముగను, ఇసుకతిన్నె గొప్ప కటిస్థలముగను,

లేయలలు త్రివళులుగను, సుడి లోఁతయిన నాభిగను గాఁగా, అబ్జవనమనెడు లక్ష్మి శివుని వీర్యమునఁ గొడుకును బడసి దేవతల కొసఁగఁబూని అగ్నికిఁ దన రూపమును జూపుచున్నదా యన నొప్పెను

**విశేషములు .** అలంకారము రూపకానుప్రాణితోత్ప్రేక్ష లేఁదరఁగలు = లేఁత + తరఁగలు ప్రాఁతాది సంధి - బాల సంధి 36, నుగాగమము - బాల సంధి 37 ద్రుతకార్యము - బాల సంధి 16,17 ముత్తరంగలు - మూఁడు + తరంగలు, 'సమనాధికరణంబగు నుత్తరపదంబు పరంబగునపుడు మూఁడు శబ్దము డువర్ణంబునకు లోపంబును మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు ' బాల సమాస 17 మూ + త్తరంగలు - 'ద్విరుక్తంబగు హల్లు పరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు ' బాల సమాస 13 ముత్తరంగలు

క్రౌంచపదము చంచుల నాస్వాదించుచు లేఁదూం
డ్లకరువు ప్రియులకు నలఁదుచు మై రో
మాంచము లోలిం గంచుకితంబై
పొడమఁగ నడరుచుఁ బులినములం గ్రీ
డించుచు సంభాషించుచుఁ బ్రీతిం
బొలుచుచుఁ జెలఁగుచుఁ బొలయు సముద్య
త్క్రౌంచగతుల్ వీక్షించుచు భాస్వ
జ్జ్వలనుఁడు శరవణసరసికి వచ్చెన్ 30

**అర్థము .** చంచులన్ = ముక్కులతో, లేఁదూండ్లు (లేఁత + తూఁడు + లు) ఆస్వాదించుచున్ = తినుచు, అకరువు = కేసరము(లు), ప్రియులకున్ = తమ ప్రియురాండ్రకు, అలఁదుచున్ = పూయుచు, మైన్ = శరీరమున, రోమాంచములు = గగుర్పాటులు, ఓలిన్ = బాగుగా, కంచుకితంబు + ఐ = అవికెగా - కవచముగా నయి, పొడమఁగన్ = పుట్టఁగా, అడరుచున్ = విజృంభించుచు, పులినములన్ = ఇసుకతిన్నెలందు, క్రీడించుచున్ = ఆడుచు, సంభాషించుచున్ = మాటలాడుచు, ప్రీతిన్ = సంతోషముతో, పొలుచుచున్ = ఒప్పుచు, చెలఁగుచున్ = ధ్వనిచేయుచు, పొలయు = తిరుగు, సముద్యత్ + క్రౌంచ - గతుల్ = పూనుకొన్న క్రౌంచపక్షుల గమనములు, వీక్షించుచున్ = చూచుచు, భాస్వత్ + జ్వలనుఁడు = ప్రకాశించుచున్న అగ్ని, శరవణ - సరసికిన్= శరవణసరస్సునకు, వచ్చెను

**తాత్పర్యము.** లేఁదామరతూండ్లను ముక్కులతోఁ గొఱుకుచు, తామరల కేసరములను పెంటులకుఁ బూయుచు, శరీరమున గగుర్పాటు కంచుకమయి యేర్పడఁగా విజృంభించుచు, సైకతములఁ గ్రీడించుచు, సంభాషించుచు, ప్రేమముతో నొప్పుచు, ధ్వనిచేయుచు, సంచరించు క్రౌంచముల గమనములను జూచుచు అగ్ని శరవణసరసి తెంచెను

**విశేషములు** . అలంకారము స్వభావోక్తి క్రౌంచగతులను, క్రౌంచపదవృత్తముననే వర్ణించుట గమనింపఁదగినది లేఁదూండ్లు - పూర్వ పద్యమునందలి లేఁదఁగల వలెనే తూండ్లు - తూఁడు + లు 'బహువచనంబు పరంబగునపుడు డ ల ట ర ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు ' బాల ఆచ్చిక 12 తూఁడ్+లు 'సమానపదంబునందు సంయోగంబు పరంబగునపు డెల్లచో ఖండబిందునకుం బూర్ణంబగు ' బాల ఆచ్చిక 15 తూండ్లు భాస్వజ్జ్వలనుఁడు = భాస్వత్ + జ్వలనుఁడు అనునాసికాంతస్థవర్ణములు తప్ప మిగిలిన పదాంతగతహల్లులకు (ఝుల్లులకు) మృదుహల్లులు (హశ్శులు) కాని అచ్చులుకాని పరమగునపుడు ఆ హల్లుల వర్ణమునకుఁ జెందిన తృతీయవర్ణ మాదేశముగా వచ్చును 'భాస్వద్ + జ్వలనుఁడు 'సకార తవర్గములకు శవర్ణ చవర్గములతో పూర్వమందైనను పరమందైనను కూడిక గలుగునపుడు క్రమముగా శవర్ణచవర్గ వర్ణము లాదేశమగును' భాస్వజ్జ్వలనుఁడు

పంచ శరాభా ! సంచితపుణ్యా ! భ మ స భ న న న య పరిమితమైనన్
గ్రౌంచపదాఖ్యం బంచితమయ్యెన్ గ్రమయతి దశవసు కలితముగాన్

క్రౌంచపదము నాలుగు పాదము లుండును ప్రతిపాదమునను భ, మ, స, భ, న, న, న, య అనుగణములుండును మొదటియక్షరమునకును పదునొకండవ యక్షరమునకును, పందొమ్మిదవ యక్షరమునకును యతిమైత్రి ప్రాసనియమము గలదు లక్షణ మిట్లుండఁగా, నన్నెచోడుఁడు క్రౌంచపదమును దద్భిన్నముగా రచించినాఁడు ఇతఁడు కందమును వలె దీనిని రెండు భాగములుగా విభజించి మొదటి భాగమునఁ బ్రాసయతిని, రెండవ భాగమున యతి మైత్రిని బాటించినాఁడు

## అగ్ని సప్తర్షుల భార్యలతోఁ గ్రీడించుట

**వ** **తదవసరంబున సప్తర్షుల ధర్మపత్ను లరుంధతీసహితంబు నిరంబరలై జలక్రీడలాడుచున్న వారి నక్కడం గని** **31**

**అర్థము :** తద్ + అవసరంబునన్ = ఆ సమయమున, సప్తర్షుల = సప్త+ ఋషుల = ఏడుగురు ఋషులయొక్క, ధర్మపత్నులు = భార్యలు, అరుంధతీ -

సహితంబు = అరుంధతితోఁగూడి, నిరంబరలు + ఐ = వస్త్రవిహీనలయి, జలక్రీడలు, ఆడుచున్ + ఉన్న - వారిన్, అక్కడన్, కని

**తాత్పర్యము.** ఆ సమయమున సప్తర్షుల భార్యలను అరుంధతితోఁ గూడి వస్త్రవిహీనలయి జలక్రీడలాడుచున్నవారిని అచ్చటఁజూచి - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు** సప్తర్షులు - సప్త + ఋషులు - గుణసంధి

మ **తన భండారువుఁ జూఱపుచ్చెనొకొ కందర్పుండు నేఁడంచుఁ గ**
**న్గొనియెం బావకుఁ డర్థి నూరుయుగముల్, గుహ్యప్రదేశమ్ములున్**
**దనుమధ్యంబులు ముత్తరంగలు సముద్యత్పూర్ణవృత్తోన్నత**
**స్తనకుంభంబులు వక్త్రపంకజములున్ ధమ్మిల్లభారంబులున్. 32**

**అర్థము.** నేఁడు, కందర్పుండు = మన్మధుఁడు, తన - భండారువున్ = తన భండారమును - తన బొక్కసమును, చూఱపుచ్చెన్ + ఒకొ = కొల్లపెట్టెనా, అంచున్, పావకుఁడు = అగ్ని, అర్థిన్ = కోరికతో, ఊరు - యుగముల్ = తొడలజంటలు, గుహ్య - ప్రదేశమ్ములున్ = రహస్యావయవముల చోటులును, తను - మధ్యంబులున్ = సన్నని నడుములును ముత్తరంగలున్ - మూఁడు తరంగలున్ = వళిత్రయమును, సముద్యత్ + పూర్ణ - వృత్త + ఉన్నత - స్తన - కుంభంబులున్ = మిక్కిలి విజృంభించుచున్న, నిండైన, గుండ్రని, ఎత్తయిన కుండలవంటి చన్నులును, వక్త్ర - పంకజములున్ = పద్మములవంటి ముఖములును, ధమ్మిల్ల - భారంబులున్ = కొప్పుల బరువులును, కన్గొనియెన్ = చూచెను

**తాత్పర్యము.** నేఁడు మన్మధుఁడు తన బొక్కసమును గొల్లపెట్టెనా ? యనుచు నగ్ని సప్తర్షుల భార్యల తొడల జంటలను, రహస్యావయవములను, సన్నని నడుములను, ముఖపద్మములను, కొప్పులను గోరికతోఁ జూచెను

**విశేషములు.** అలంకార ముత్ప్రేక్ష వారియవయవములను అగ్ని ఊరువులనుండి క్రమముగాఁ బైవఱకుఁ జూచినట్లు వర్ణించుట గమనింపఁదగినది భండారువు - భండార శబ్దమునకు వికృతియగునా ? లేక అర్వాదులలోఁ జేర్చి అర్వువు వలెఁ దత్సమముగా సాధింపనగునా ? ప్రౌఢ శబ్ద - 21

వ ఇట్లు కనుంగొని కనుబేటం బేటంబైన ననలుండు తన డెందంబునం దనరు మనసిజానలంబు వెలిపేర్చి వెలుంగునట్లు తత్ప్రదేశంబునం బొలయుచున్న నరుంధతి గని వహ్నిఁ బరపురుషుండని రయంబున నిజవస్త్రావకుంఠితయై తొలంగి నిలిచెం దక్కిన యార్వురు నెఱుంగక నిక్కము వనవహ్ని కాఁదలంచి శీతాతురలై చనుదెంచి ముగ్ధభావంబున వివృత జఘనలై యున్నభంగిన తన్ను బలసినం గని యనలుం డనురాగంబున 33

**అర్థము** ఇట్లు, కనుంగొని = చూచి, కనుబేటంబేటంబు + ఐనన్ = చూడ్కివలన ననురాగాతిశయము గలుగఁగా, అనలుండు = అగ్ని, తన - డెందంబునన్ = తన హృదయమున, తనరు = ఒప్పు, మనసిజ + అనలంబు = మన్మథాగ్ని, వెలి-పేర్చి = పైకి వచ్చి, వెలుంగు + అట్లు = వెలుఁగువిధమున, తద్+ ప్రదేశంబునన్ = ఆ చోట, పొలయుచున్ + ఉన్నన్ = వర్తిలుచుండఁగా, అరుంధతి= వసిష్ఠునిభార్య, కని, వహ్నిన్ = అగ్నిని, పర - పురుషుండు + అని, రయంబునన్ = శీఘ్రముగా, నిజ - వస్త్ర + అవకుంఠిత + ఐ = తనదైన వస్త్రముతోఁ గప్పుకొన్నదయి, తొలంగి, నిలిచెన్, తక్కిన + ఆర్వురున్, ఎఱుంగక, నిక్కము + అ = నిజముగనే, వన-వహ్ని = అడవినిప్పు, కాన్ + తలంచి = అని యెంచి, శీత + ఆతురలు + ఐ = చలిచే బాధపడువారయి, చనుదెంచి = వచ్చి, ముగ్ధ - భావంబునన్= అమాయకతచే, వివృత + జఘనలు + ఐ = తెఱవఁబడిన కటి ప్రదేశములు గలవారయి, ఉన్న - భంగిన్ + అ = ఉన్నవిధముగనే, తన్నున్, బలసినన్ = చుట్టఁగా, కని, అనలుండు, అనురాగంబునన్ = ప్రేమముతో

**తాత్పర్యము .** ఇట్లు చూచి, చూడ్కివలనఁగలిగిన యనురాగ మతిశయింపఁగా, అగ్ని తన హృదయమున నొప్పు మన్మథాగ్ని బయటికి వచ్చి వెలుఁగునట్లు ఆ చోట వర్తిలుచుండఁగా, అరుంధతి చూచి అగ్నిని పరపురుషుడని తలఁచి వెంటనే బట్ట చుట్టఁబెట్టుకొని తొలఁగి నిలిచెను తక్కిన ఆర్వురు మునిపత్నులును అతఁడు అగ్నియని తెలియక, నిజముగనే అడవినిప్పునియెంచి, చలిచే బాధపడువారై వచ్చి అమాయకముగా కటిప్రదేశములు కప్పక ఉన్నట్లుగనే తన్నుఁజుట్టఁగాఁ జూచి అగ్ని అనురాగముతో - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష

క కరలతలఁ బెనఁగి మైవడి
గురుకుచములమీఁద వ్రాలి కోర్కులు ముట్టన్
వర జఘనంబులఁ బొందుచు
సురతసుఖం బందె నాశుశుక్షణి ప్రీతిన్ 34

**అర్థము** . ఆశుశుక్షణి = అగ్ని, కర-లతలన్ = తీవలవంటి చేతులతో, పెనఁగి = పట్టుకొని, మైవడిన్ = సమ్మతితో, గురు-కుచముల మీఁదన్ = గొప్పవియగు స్తనములపై, వ్రాలి, కోర్కులు, ముట్టన్ = నిండఁగా, వర - జఘనంబులన్ = మేలయిన కటిస్థలములను, పొందుచున్, ప్రీతిన్ = సంతోషముతో, సురత -సుఖంబు = సంభోగసౌఖ్యము, అందెన్ = పొందెను

**తాత్పర్యము** . అగ్ని సమ్మతితో లతలవంటికరములతోఁ బెనంగి గొప్పవియగు స్తనముల మీఁద వ్రాలి కోర్కులు ఫలింపఁగా, మేలైన కటి ప్రదేశములను బొందుచుఁ బ్రీతితో సంభోగసౌఖ్యము నందెను

**విశేషములు** . అలంకారము స్వభావోక్తి

వ తదనంతరంబున వహ్నియం దంతర్హితంబైన హరువీర్యంబు మానవతుల యోనిముఖంబు ప్రవేశించిన నెఱనుముట్టిన సరసభావంబున మే యలరుచు 35

**అర్థము** తద్ + అనంతరంబునన్ = ఆ పిమ్మట, వహ్ని + అందున్ = అగ్నియందు, అంతర్హితంబు + ఐన = మఱుఁగుపడినది అయిన, హరు - వీర్యంబు = శివుని శుక్లము, మానవతుల = మునిపత్నులయొక్క, యోని-ముఖంబు = భగద్వారము, ప్రవేశించినన్, నెఱను - ముట్టిన = మర్మమును దాఁకిన, సరస - భావంబునన్ = శృంగారప్రభావమున, మే = మేను, అలరుచున్ = సంతోషించుచు

**తాత్పర్యము** .ఆ పిమ్మట అగ్నియందు మఱుఁగుపడిన శివుని శుక్లము మునిపత్నుల భగద్వారమును బ్రవేశింపఁగా మర్మమును దాఁకిన శృంగారభావమున మేను పొంగుచు - తరువాతి పద్యముతో నన్వయము

ఉ అక్కొలి మూయఁ గన్నుఁగవ, లాననముల్ విలసిల్లఁ బెంజెమర్
గ్రెక్కొని పర్వ, మానములు కీడ్పడఁ జెయ్వుల కుచ్చలించి, క
ర్క్కొక్కఁ దనూలతల్, ధృతికి నేడ్తెఱ లల్కఁ, శిఖిప్రసంగతిం
జొక్కి మహీసురాంగనలు సోలి రపూర్వరతిప్రమత్తలై 36

**అర్థము** మహీసుర + అంగనలు = బ్రాహ్మణస్త్రీలు - మునిపత్నులు, శిఖి - ప్రసంగతిన్ = అగ్నితోడి సంగమముచేత, అపూర్వ - రతి - ప్రమత్తలు + ఐ = అపురూపమైన సంభోగముచే మిక్కిలి మదించినవారయి, అక్కొలిన్ = కలఁతచే, కన్నుఁగవలు = కన్నులజంటలు, మూయన్ = మూయఁగను, ఆననముల్ = ముఖములు, విలసిల్లన్ = ప్రకాశింపఁగను, పెంజెమర్ - పెను + చెమర్ = అధికమయిన చెమట, క్రెక్కొని = దట్టమయి (?), పర్వన్ = వ్యాపింపఁగను, మానములు = (ప్రణయ) కోపములు, కీడ్పడన్ = చెడఁగా, చెయ్వులకున్ = చేష్టలకు, ఉచ్చలించి = మిక్కిలి చలించి, తనూ-లతల్ = మైఁదీవలు, కర్క్కొక్కన్ = పులకరింపఁగా, ధృతికిన్ = ధరించుటకు, ఏడ్తెఱలు = సామర్థ్యములు, అల్కన్ = వెనుదీయఁగా, చొక్కి = పారవశ్యముచెంది, సోలిరి = వ్రాలిరి

**తాత్పర్యము** . మునిపత్నులు అగ్నితోడి సంగమముచే అపూర్వమైన సురతక్రీడచే మిక్కిలి మదించినవారయి, కలఁతచేఁ గన్నులజంటలు మూయఁగా, ముఖములు ప్రకాశింపఁగా, అధికమైన చెమట దట్టముగా వ్యాపింపఁగా, కోపములు పోఁగా, చేష్టలకు మిక్కిలి చలించి, మైఁదీవలు పులకింపఁగా, ధరించుటకు శక్తి చాలకపోఁగా, పారవశ్యముఁజెంది మైమఱచిరి

**విశేషములు :** మొదటి పాదమున 'అక్కొలిమాయ' అనుపాఠము గలదు దానికి అక్కొలి = కలఁత, మాయన్ = నశింపఁగను, కన్నుఁగవలు + ఆననముల్ = కనులజంటలు, ముఖములు, విలసిల్లన్ = ప్రకాశింపఁగా - అని అర్థము చెప్పవలయును ధృతికి నేడ్తెఱ లల్కన్ = అగ్నిని పైని దాల్చుటకు శక్తి చాలక అలంకారము స్వభావోక్తి

వ అంత ననలుం డీశ్వరవీర్యంబుతోన నిజభరంబునుం బాసి రతిపరితోషితుండై స్వేచ్ఛావిహారియయ్యె నిట మునిపత్నులల్లన పరిధానావృతలై రంతకుమున్న 37

**అర్థము** . అంతన్, అనలుండు, ఈశ్వర - వీర్యంబుతోన్ + అ = ఈశ్వరుని వీర్యముతోపాటే, నిజ-భరంబునున్ = తనదైన బరువును గూడ, పాసి=

విడిచి, రతి - పరితోషితుండు + ఐ = సంభోగముచేఁ దృప్తినొందినవాఁడయి, స్వేచ్ఛా - విహారి = స్వేచ్ఛగా విహరించువాఁడు, అయ్యెన్, ఇటన్, ముని-పత్నులు = మునుల భార్యలు, అల్లనన్ = మెల్లఁగా, పరిధాన + ఆవృతలు + ఐరి = బట్టలు కప్పుకొన్నవారయిరి - ధరించినవారయిరి, అంతకున్ + మున్ను + అ = అంతకుమునుపే

**తాత్పర్యము** అంత అగ్ని ఈశ్వరుని వీర్యముతోపాటే తనదైన వీర్యభారమును గూడ విడిచి రతిక్రీడచేఁ దృప్తినొందినవాఁడయి స్వేచ్ఛగా విహరించుచుండెను ఇక్కడ ముని భార్యలు మెల్లఁగా వస్త్రములు ధరించిరి అంతకుమునుపే - తరువాతి పద్యముతో నన్వయము

**అగ్నిసాంగత్యమున సప్తర్షుల బార్యలు గర్బవతులగుట**

సీ పరమేశు వీర్యంబు భరియింప వ్రేఁగైన
విధమునఁ దనులతల్ వ్రేఁకనయ్యె
నన్యు లెఱుఁగఁ గష్ట మని వెల్లఁబాఱిన
పగిది మేతీఁగలు పలఁకఁబాఱెఁ
దనుమధ్య లోప రీ స్తనభారమని విధి
దల మిచ్చె నాఁ గృశోదరము లెసఁగె
వరపుత్త్రలాభోత్సవంబు పర్వినభంగి
మనములఁ దనరె సమ్మదరసంబు

తే గురుకుచంబులపైఁ బచ్చసెరలు వాఱి
తుదలఁ గప్పిరి పాలుపారఁ గదిసి వలిసెఁ
దనరె నాభులు విరిసె ముత్తరఁగ లారు
లొనరి గర్భంబు లడరె నక్షణములోన 38

**అర్థము** పరమేశు - వీర్యంబు = ఈశ్వరుని వీర్యము, భరియింపన్ = వహించుటకు, వ్రేఁగు + ఐన - పగిదిన్ = బరుయిన విధమున, తను-లతల్ = మైఁదీవలు, వ్రేఁకన + అయ్యెన్ = బరువెక్కెను

అన్యులు = ఇతరులు, ఎఱుఁగన్ = తెలియఁగా - ఇతరులకుఁదెలియుచో, కష్టము + అని, వెల్లఁబాఱిన - పగిదిన్ = తెల్లఁబోయిన విధమున, మే-తీఁగలు = తీఁగలవంటి మేనులు, పలఁకఁబాఱెన్ = తెల్లనయ్యెను

తను - మధ్యలు = సన్నని నడుములు గలవారు, - స్త్రీలు, ఈ - స్తన - భారము = ఈ కుచముల బరువు, ఓపరు = చాలరు - మోయఁజాలరు, అని, విధి = బ్రహ్మ, దలము = గొప్పతనము, అధిక్యము, లావు, ఇచ్చెన్ + నాన్ = ఇచ్చెనోయన, కృశ + ఉదరములు = కృశించిన నడుములు, ఎసఁగెన్ = అతిశయించెను

వర - పుత్ర - లాభ + ఉత్సవంబు = మంచి కొడుకు గలుగుటవలని వేడుక, పర్విన - భంగిన్ - వ్యాపించిన విధమున, మనములన్ = మనసులందు, సమ్మదరసంబు = సంతోషరసము, తనరెన్ = ఒప్పెను

గురు - కుచంబులపైన్ = గొప్పవియగుస్తనములమీఁద, పచ్చసెరలు = పచ్చని రేఖలు, పాఱి = ఏర్పడి, తుదలన్ = చివరలందు, కప్పిరి = నలుపు, పొలుపారన్ = ఒప్పఁగా, కదిసి = కూడి, వలిసెన్ = సుడిసెను - చుట్టుకొనెను

నాభులు = బొడ్డులు, తనరెన్ = ఎత్తయ్యెను, ముత్తరఁగలు - మూఁడు+ తరఁగలు =వళిత్రయము, విరిసెన్ = అదృశ్య మయ్యెను, ఆరులు = రోమావళి - నూఁగారు, ఒనరి = కలిగి, అక్షణములోన్ + అ = వెంటనే, గర్భంబులు = చూలులు, అడరెన్ = అతిశయించెను

**తాత్పర్యము.** పరమేశ్వరుని వీర్యమును వహించుటకు బరువైన విధమున ఆ మునిపత్నులకు మైఁదీవలు బరువెక్కెను ఇతరులకుఁ దెలిసినచోఁ గష్టమని తెల్లఁబోయిన విధమున మేతీవలు తెల్లనయ్యెను సన్నని నడుములుగలవారు ఈ చన్నుల బరువును మోయఁజాలరని బ్రహ్మ లావుఇచ్చెనా యనఁ జిక్కిన నడుము లతిశయించెను మంచికొడుకు గలుగునను వేడుక వ్యాపించెనా యన వారి మనస్సులలో సంతోషరసము నిండెను గొప్పవియగు కుచములమీఁదఁ బచ్చని రేఖలు గలిగి కొనలందు నలుపు ఒప్పి సుడిసెను బొడ్లు ఎత్తయ్యెను వళిత్రయము అదృశ్యమయ్యెను నూఁగారు ఏర్పడి ఆ క్షణములోనే వారికిఁ జూలు లతిశయించెను

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష స్వభావోక్తి

**వ ఇ ట్లీశ్వరవీర్యంబున సద్యోగ్భంబులైనం గని వెలవెలఁబాఱుచు నొండొరుల మొగంబులు సూచుచు నందఱు నరుంధతిం గనుంగొని నీ వెఱుంగుదు మా చేసిన దోషంబు లేదు నిర్నిమిత్తంబు గర్భంబులయ్యె నిదియేమి మాయ' యనిన 'మీరు యౌవనమదంబున నతిక్రమించి యగ్నిఁ బరపురుషుం డనక నగ్నంబుతోడం జేరితి రిది తన్నిమిత్తం' బని వారలఁ బదరుచు**

**అర్థము** ఇట్లు, ఈశ్వర - వీర్యంబునన్ = ఈశ్వరుని వీర్యముచే, సద్యస్ (ః) + గర్భంబులు + ఐనన్ = తత్క్షణ గర్భములు కాఁగా, కని = చూచి, వెలవెలన్+ పాఱుచున్ = తెల్లఁబోవుచు, ఒండొరుల = మొగంబులు = ఒకరొకరి ముఖములు, చూచుచున్, అందఱున్, అరుంధతిన్, కనుంగొని, నీవు + ఎఱుంగుదు (వు), మా- చేసిన = మేము చేసిన, దోషంబు, లేదు, నిర్నిమిత్తంబు = కారణము లేకయే, గర్భంబులు + అయ్యెన్, ఇది, ఏమి, మాయ, అనినన్, మీరు, యౌవన - మదంబునన్ = పడుచుఁదనపుఁగ్రొవ్వున, అతిక్రమించి, అగ్నిన్, పర-పురుషుండు, అనక, నగ్నంబు-తోడన్ = వస్త్రవిహీనతతో, చేరితిరి, ఇది, తద్ + నిమిత్తంబు = అది కారణముగాఁగలది, అని, వారలన్, పదరుచున్ = ఆక్షేపించుచు

**తాత్పర్యము :** ఇట్లు ఈశ్వరుని వీర్యముచేఁ దత్క్షణ గర్భములుకాఁగాఁ జూచి తెల్లఁబోవుచు ఒకరొకరి ముఖములు చూచుకొనుచు అందఱును అరుంధతిని జూచి 'నీ వెఱుఁగుదువు గదా ! మేము చేసిన దోషము లేదు, నిష్కారణముగా గర్భము లాయెను ఇది యేమి మాయయో,' అనిన 'మీరు పడుచుఁదనపుగర్వముచే నతిక్రమించి అగ్నిని బరపురుషుఁడనక దిగంబరలయి చేరితిరి దీనికి హేతు వదియే' యని వారిని నిందించుచు - తరువాతి పద్యముతో నన్వయము

క దోషుల సంగతి నగుదురు
దోషాత్మకు, లిదియ సంగదోషము, మీతో
భాషింపఁగ నగునే యని
రోషించుచుఁ గింకతో నరుంధతి యరిగెన్ 40

**అర్థము .** దోషుల - సంగతిన్ = దుష్టుల సాంగత్యముతో, దోష + ఆత్మకులు = దుష్టస్వభావులు, అగుదురు, ఇదియ = ఇదియే, సంగ - దోషము= సాంగత్యమువలని దోషము, మీతోన్, భాషింపఁగన్ + అగునే = మాటలాడవచ్చునా, అని, రోషించుచున్ = కోపపడుచు, కింకతోన్ = కోపముతో, అరిగెన్ = వెడలెను

**తాత్పర్యము.** 'దుష్టసాంగత్యముచే దుష్టాత్ములగుదురు ఇదే సాంగత్యము వలనఁ గలుగు దోషము మీతో మాటలాడరాదు ' అని అరుంధతి కోపించుచుఁ గోపముతో నరిగెను

**విశేషములు .** కింక, కినుక, కిన్క, కింక (రూపాం )

వ అంత మునికాంత లనంతచింతాక్రాంతలై యరుంధతిఁ బాసి యలసి కౌముదిఁ బాసిన కుముదవనంబునుంబోలె లగ్గ విన్నంబారి 41

**అర్థము** . అంతన్, ముని - కాంతలు = మునిపత్నులు, అనంత - చింతా+ ఆక్రాంతలు + ఐ = అంతులేని దుఃఖముతో ఆక్రమింపఁబడినవారయి, అరుంధతిన్, పాసి = విడిచి, అలసి = బడలి, కౌముదిన్ = వెన్నెలను, పాసిన = విడిచిన, కుముద - వనంబునున్ + పోలెన్ = కలువతోఁపు విధమున, లగ్గన్ = మిక్కిలి, విన్నంబారి = చిన్నఁబుచ్చుకొని

**తాత్పర్యము** . అంత మునిపత్నులు అంతులేని దుఃఖముచే నాక్రమింపఁబడినవారయి అరుంధతినివిడిచి, బడలి వెన్నెలను విడిచిన కలువతోఁపు విధమున మిక్కిలి చిన్నఁబోయి - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు** అలంకార ముపమ

**మ** **గళితోచ్ఛ్వాసము, శోకపావకశిఖాక్రాంతాంతరంగంబు, ని**
**ర్గళితాశ్రుప్రచయోదకాంకితలసద్గండప్రదేశంబు, సం**
**చలితాంగప్రకరం, బరాలవదనాబ్జం బా మునీంద్రాంగనా**
**కుల మత్యాకులవృత్తి నుండె వనటం గుందిల్లి చింతించుచున్ 42**

**అర్థము** . గళిత + ఉచ్ఛ్వాసము = జాఱిన నిట్టూర్పులు గలది, శోక - పావక - శిఖా + ఆక్రాంత + అంతరంగంబు= దుఃఖాగ్నిజ్వాలలచే నాక్రమింపఁబడిన మనస్సులు గలది, నిర్గళిత + అశ్రు - ప్రచయ + ఉదక + అంకిత - లసత్ + గండ- ప్రదేశంబు = జాఱిన బాష్పముల సమూహమునందలి నీటిచే గుఱుతులు గలదిగాఁ జేయఁబడిన ప్రకాశించుచున్న చెక్కిళ్ళు గలది, సంచలిత + అంగ - ప్రకరంబు = మిక్కిలి చలించిన అవయవముల సమూహము గలది, అరాల - వదన + అబ్జంబు = కుటిలములైన ముఖపద్మములు గలది, (అగు) ఆ - ముని+ ఇంద్ర + అంగనా - కులము = ఆ మునిశ్రేష్ఠుల భార్యల సమూహము, వనటన్= దుఃఖముతో, కుందిల్లి = క్రుంగిపోయి, చింతించుచున్ = విచారించుచు, అతి + ఆకుల - వృత్తిన్ = మిక్కిలి కలఁగిన వర్తనముతో, ఉండెన్

**తాత్పర్యము** . ఆ మునిపత్నుల సమూహము నిట్టూర్పులువుచ్చుచు, దుఃఖాగ్నిజ్వాలలచే నాక్రాంతమైన అంతరంగములు గలదయి, జాఱిన బాష్పజలములచేఁ జిహ్నితములైన చెక్కిళ్లు గలదయి, మిక్కిలి చలించిన అవయవముల సమూహము గలదయి, కుటిలములైన ముఖపద్మములతో శోకమునఁ గ్రుంగి మిక్కిలి కలఁతఁజెంధియుండెను

**విశేషములు** అలంకారము స్వభావోక్తి

వ ఇట్లు దలంబగు నడలడింబడి కదలుచు 'నింకం దడయు డుచితంబు గాదు మునివరు లెఱుంగకుండ నిజగర్భపిండంబులం బుచ్చి నివాసంబుల కరుగవలయు' నని విచారించి యక్షణంబ 43

**అర్థము** ఇట్లు, దలంబు + అగు = అధికమగు, అడలడిన్ = దుఃఖమున, పడి, కదలుచున్, ఇంకన్, తడయుడు = ఆలస్యము చేయుట, ఉచితంబు + కాదు = మంచిది కాదు, మునివరులు = మునిశ్రేష్ఠులు, ఎఱుంగక + ఉండన్, నిజ - గర్భ - పిండంబులన్ = మనవైన కడుపులలోని పిండములను, పుచ్చి = తీసివైచి, నివాసంబులకున్ = ఇండ్లకు, అరుగన్ + వలయును, అని, విచారించి, అక్షణంబు + అ = వెంటనే

**తాత్పర్యము.** ఇట్లు అధికమైన దుఃఖమునొంది చలించుచు 'ఇఁక నాలస్యము చేయఁదగదు మునిపతు లెఱుఁగకుండ మన కడుపులందలి పిండములను దీపివైచి యిండ్లకుఁబోవలయునని ఆలోచించి వెంటనే - తరువాతి పద్యముతో నన్వయము

క సాహసులై మునిపత్నులు
మోహం బఱి గర్భపిండములు వుచ్చి గతో
త్సాహమునఁ బద్మపత్ర స
మూహంబునఁ బొదిగి సేమమునఁ బెట్టి రొగిన్ 44

**అర్థము** ముని - పత్నులు = మునులభార్యలు, సాహసులు + ఐ = తెంపరులయి, మోహంబు + అఱి = ప్రేమముపోయి, గర్భ-పిండములు = కడుపులందలి పిండములు, పుచ్చి = తీసి, గత + ఉత్సాహమునన్ = పోయిన ఉత్సాహముతో, పద్మ - పత్ర- సమూహంబునన్ = తామరపాకుల సమూహముచే, పొదిగి = కప్పి, సేమమునన్ = క్షేమముతో, ఒగిన్ = చక్కఁగా, పెట్టిరి

**తాత్పర్యము .** మునుల భార్యలు తెగువరులయి మోహము విడిచి గర్భస్థపిండములను దీసి ఉత్సాహములేక పద్మపత్రసమూహముచేఁ గప్పి క్షేమముగాఁ జక్కఁగాఁ బెట్టిరి

**విశేషములు .** సాహసీ శబ్ద తత్సమరూపము సాహసి

వ ఇట్లు నిజగర్భంబులు పుచ్చి సరోవరలక్ష్మీగర్భంబునం బెట్టిన మనసుపట్టక నిర్దోషలుంబోలె నిజేశ్వరులకుం బరిచర్యసేయ నుపక్రమింపుడు 45

**అర్థము .** ఇట్లు, నిజ - గర్భంబులు = తమవైన చూలులు, పుచ్చి = తీసివైచి, సరోవర - లక్ష్మి - గర్భంబునన్ = సరస్సనెడి లక్ష్మియొక్క కడుపులో, పెట్టినన్, మనసు పట్టక = మిన్నకుండక, నిర్దోషలున్ + పోలెన్ = నిరపరాధినులవలె, నిజ + ఈశ్వరులకున్ = తమ భర్తలకు, పరిచర్య + చేయన్ = సేవలు చేయుటకు, ఉపక్రమింపుడున్ = ప్రారంభించినంతనే

**తాత్పర్యము.** ఇట్లు తమ చూలు తీసివైచి సరస్సనెడి లక్ష్మి గర్భమునఁబెట్టి, ఊరకుండక, నిరపరాధినులవలెఁ దమ భర్తలకు సేవలుచేయఁ బ్రారంభించినంతనే- తరువాతి పద్యముతో నన్వయము

క ఆ రమణుల దోషయుతా
కార వికారములుగాంచి కలుషించి మునుల్
వారి విసర్జించిరి దో
షారంభులు వర్జనీయులగు డది యరుదే ? 46

**అర్థము .** మునుల్, ఆ - రమణుల = ఆ స్త్రీలయొక్క, దోష + యుత+ ఆకార - వికారములు = అపరాధముతోఁ గూడిన రూపముల మార్పులు, కాంచి= చూచి, కలుషించి = కోపించి, వారిన్, విసర్జించిరి = విడిచిరి, దోష + ఆరంభులు= దోషముల ప్రయత్నముగలవారు - దోషు లనుట, వర్జనీయులు = విడువఁదగినవారు, అగుడు = అగుట, అది, అరుదే = ఆశ్చర్యమా ?

**తాత్పర్యము :** మునులు ఆ స్త్రీల అపరాధముతోఁ గూడిన ఆకారముల వికారములను జూచి కోపించి వారిని విడిచిరి దోషులు త్యాజ్యులగుట ఆశ్చర్యమా? - కా దనుట

**విశేషములు .** అలంకారము అర్థాంతరన్యాసము

వ ఇట్లు ధర్మచారిణులు నిజాధీశ్వరులచేతం బరివర్జితలై మాఱువలుక నోడి పరమేష్ఠిపాలికింజని 'యకామ కృత దోషంబులం బతులచేతం బరిభవింపఁబడితి' మని విజ్ఞాపించినం జతురాననుండు తద్వృత్తాంతం బెఱింగి 'పతివ్రతావృత్తియందు వ్రతభ్రష్టలైనను నీశ్వరవీర్యంబు

ధరియించిన పుణ్యఫలంబున జ్యోతిర్లోకంబునం గృత్తిక లనం బ్రవర్తింపుం' డని వరంబుగా విరించి కరుణించి నియమించిన మహాప్రసాదంబని పుణ్యగతికి నరిగి రటఁ గమలలక్ష్మీగర్భంబునందున్న పిండంబులన్నియు నొక్కండై యక్షణంబ పక్వంబునకు వచ్చి

**అర్థము** . ఇట్లు, ధర్మచారిణులు = ధర్మపత్నులు, నిజ + అధి = ఈశ్వరులచేతన్ = తమపతులచే, పరివర్జితలు + ఐ = విడిచిపెట్టఁబడినవారయి, మాఱు + పలుకన్ + ఓడి= మాఱుమాటాడ జంకి, పరమేష్ఠి - పాలికిన్ = బ్రహ్మయొద్దకు, చని, అకామ - కృత - దోషంబులన్= కోరి చేయని అపరాధములచే, పతుల చేతన్ = భర్తలచే, పరభవింపఁబడితిమి = తిరస్కరింపఁబడితిమి, అని, విజ్ఞాపించినన్ = విన్నవింపఁగా, చతురాననుండు = నలువ - బ్రహ్మ, తద్ + వృత్తాంతంబు = వారి వృత్తాంతము ఎఱింగి, పతివ్రతా - వృత్తి - అందున్ = పాతివ్రత్యమునందు, , వ్రత - భ్రష్టలు = నియమమునుండి జాఱినవారు, ఐనను, ఈశ్వర - వీర్యంబున్, ధరియించిన - పుణ్య - ఫలంబునన్ = తాల్చిన పున్నెమునకు ఫలముగా, జ్యోతిస్ (ః) + లోకంబునన్ = నక్షత్రలోకమునందు, కృత్తికలు = అనన్, ప్రవర్తింపుండు, అని, వరంబుగాన్, విరించి = బ్రహ్మ, కరుణించి = దయఁదలఁచి, నియమించినన్ = నియోగింపఁగా, మహాప్రసాదంబు+ అని, పుణ్య - గతికిన్, అరిగిరి, అటన్, కమల - లక్ష్మి - గర్భంబునందున్ = తామరతోఁపు అనెడి లక్ష్మి యొక్క కడుపునందు, ఉన్న, పిండంబులు + అన్నియున్, ఒక్కండు + ఐ = ఒక్కటయి, అక్షణంబు + అ = వెంటనే పక్వంబునకున్ - వచ్చి = పరిణతమయి - పండి

**తాత్పర్యము** . ఇట్లు ధర్మపత్నులు తమ భర్తలచే విడువఁబడిన వారయి మారుపలుక జంకి బ్రహ్మయొద్ద కరిగి 'కోరిచేయని దోషములకు మేము భర్తలచేఁ దిరస్కృతలమైతి' మని విన్నవింపఁగా, బ్రహ్మ వారి వృత్తాంతమెఱిఁగి 'పాతివ్రత్యమున నియమ భ్రష్టలైనను ఈశ్వరుని వీర్యమును దాల్చిన పుణ్యమునకు ఫలముగా జ్యోతిర్లోకమునందుఁ గృత్తికలను పేరఁ బ్రవర్తింపుఁడని వరమిచ్చి దయతో నియమింపఁగా, వారు మహాప్రసాదమని పుణ్యగతికిఁబోయిరి అక్కడఁ గమలవనలక్ష్మి గర్భమునందున్న పిండములు అన్నియు నేకమయి వెంటనే పండి - తరువాతి పద్యముతో నన్వయము

## కుమారోత్పత్తి

సీ. ఎలుఁగెత్త నోడి ము న్నెందేని డాఁగిన
వేదనాదంబులు విస్తరిల్ల
వాయెత్తనోడి పర్వతములు సొచ్చిన
కిన్నర గంధర్వ గీతు లెసఁగఁ
దలలెత్త నోడి భూతలమునం దడఁగిన
నిధు లడుగడుగున నెఱయఁ దెఱవ
మొగమెత్తనోడి దిఙ్మూఢంబులైయున్న
యాశాననాబ్జంబు లలరి పొలయ,

ఆ. బలిమి మిన్ను ముట్టి వెలిఁగెడి తారక
ప్రభ యడంగఁ, బొందు వాసి నవయు
దివిజచక్ర మెల్లఁ గవగూడి చన, నిన
పదవితోఁ గుమారుఁ డుదయమయ్యె. 48

**అర్థము.** ఎలుఁగు + ఎత్తన్ + ఓడి = (తారకాసురుని విజృంభణముచే) కంఠమెత్తుటకు జంకి, మున్ను + పూర్వము, ఎందున్ + ఏనిన్ = ఎచ్చటనో ఒకచోట, డాఁగిన = దాఁగుకొనిన, వేద - నాదంబులు = వేదధ్వనులు, విస్తరిల్లన్= వ్యాపింపఁగను,

వా + ఎత్తన్ + ఓడి = నోరెత్తుటకు వెనుకాడి, పర్వతములు + చొచ్చిన, కిన్నర - గంధర్వ - గీతులు = కిన్నరులయు, గంధర్వులయు గీతులు, ఎసఁగన్= అతిశయింపఁగను

తలలు + ఎత్తన్ + ఓడి = తలలుపయికెత్త వెనుదీసి, భూతలమునందున్, అడఁగిన = దిగిన, నిధులు, అడుగు + అడుగునన్ = మాటిమాటికి, నెఱయన్ = సంపూర్ణముగా, తెఱవన్ = తెఱచుకొనఁగా,

మొగము + ఎత్తన్ + ఓడి = ముఖము పయికెత్తుటకు సంకోచించి, దిశ్ (క్) + మూఢంబులు + ఐ = దిక్కుతోఁచని వయి, ఉన్న, ఆశా + ఆనన + అబ్జంబులు= దిక్కులు (అనెడి స్త్రీల), ముఖపద్మములు, అలరి = వికసించి, పొలయన్ = ప్రకాశింపఁగా,

బలిమిన్ = బలముతో, మిన్ను - ముట్టి = ఆకాశమునంటి, వెలిఁగెడి = ప్రకాశించు, తారక - ప్రభ = తారకాసురుని ఉద్ధతి - నక్షత్రముల కాంతి, అడంగన్= నశింపఁగా

పొందు + పాసి = కలయిక విడిచి - విడిపోయి, నవయు = బాధపడు, దివిజ - చక్రము = దేవతల సమూహము అనెడి చక్రవాకములు, ఎల్లన్, కవఁగూడి= జతఁగూడి, చనన్ = ఒప్పఁగా,

ఇన - పదవితోన్ = ప్రభుత్వముతో, సూర్యుని విధముతో, కుమారుఁడు = కుమారస్వామి, ఉదయము + అయ్యెన్ = పుట్టెను

**తాత్పర్యము .** తారకాసురుని ఔద్ధత్యముచేఁ గంఠమెత్తుటకు జంకి మును పెచ్చుటనో యొకచో డాఁగికొన్న వేదధ్వనులు వ్యాపించినట్లును, నోరెత్తుటకు వెనుకాడి కొండలలోఁ బ్రవేశించిన కిన్నరులయు, గంధర్వులయు గీతులు అతిశయింపఁగను తలలు పైకెత్తుటకు వెనుదీసి భూతలమునం దడఁగిన నిధులు అడుగడుగునను పూర్తిగాఁదెలచుకొనునట్లును, ముఖ మెత్తుటకు ఓడి దిక్కుతోఁచకున్న దిగంగనల ముఖపద్మములు వికసించి ప్రకాశించునట్లును, శక్తితోనాకాశమునంటి ప్రకాశించు తారక ప్రభ (తారకుని ఔద్ధత్యము - నక్షత్రముల కాంతి) అడఁగునట్లును, ఎడఁబాసి బాధపడు దివిజులనెడి చక్రవాకములు సర్వమును జతఁగూడి చనునట్లును ఇనపదవితో (రాజాధికారముతో - సూర్యుని విధమున కుమారస్వామి ఉదయించెను

**విశేషములు .** అలంకారము రూపకము, శ్లేషము

**వ ఇ ట్లీశ్వరు నురులింగాకారంబు పురుషాకారంబుఁ దాల్చినట్లు, నిజజనకుండగు పంచవక్త్రు నగ్గలింప నెత్తునట్లు, షడ్వక్త్రుండై ద్వాదశ రవి ప్రకరంబున నవయువంబులు సేకొని నిజావయువంబు దాల్చినట్లు, ద్వాదశకరపంకజశోభితుండై కమలగర్భునొత్తరించి కమలాసనంబు గైకొనినయట్లు కమలనిలయుఁడై వెలుంగుచుండె నంత 49**

**అర్థము .** ఇట్లు, ఈశ్వరు + ఉరులింగాకారంబు = ఈశ్వరుని యొక్క గొప్ప లింగము యొక్క ఆకారము, పురుష + ఆకారంబు = పురుషుని ఆకృతిని, తాల్చిన + అట్లు = ధరించిన విధమున, నిజ - జనకుండు + అగు = తన తండ్రియైన, పంచ-వక్త్రున్ = అయిదు ముఖములు గలవానిని - శివుని, అగ్గలింపన్ = మించుటక్కు, ఎత్తు + అట్లు = పూనునట్లు, షష్ (ట్) + వక్త్రుండు+ ఐ = ఆఱుముఖములు గలవాఁడయి, ద్వాదశ - రవి - ప్రకరంబునన్ = పండ్రెండుగురు సూర్యుల సమూహమున, అవయవంబులు, చేకొని = గ్రహించి, నిజ + అవయవంబు = తన అంగము, తాల్చిన + అట్లు, ద్వాదశ - కర - పంకజ-

శోభితుండు + ఐ = పం(డెండు హస్తపద్మములతోఁ (బకాశించినవాఁడయి, కమలగర్భున్ = తమ్మిచూలిని - (బహ్మను, ఒత్తరించి = మించి, కమల + ఆసనంబు = పద్మాసనము, కైకొనిన + అట్లు = (గహించిన విధమున, కమల - నిలయుఁడు + ఐ = పద్మము స్థానముగాఁ గలవాఁడయి, వెలుంగుచున్ + ఉండెన్= (పకాశించుచుండెను అంతన్

**తాత్పర్యము** ఇట్లు శివుని గొప్పలింగముయొక్క ఆకారము పురుషుని ఆకృతి ధరించినట్లు, తన తం(డియైన పంచముఖు నతి(కమింపఁబూనునట్లు ఆఱుముఖములు గలవాఁడయి, పం(డెండుగురు సూర్యులందలి యంగములు స్వీకరించి తన శరీరమును దాల్చినట్లు, పం(డెండుకేలుఁదమ్ములచేఁ (బకాశించువాఁడయి, పద్మగర్భునతిశయించి పద్మాసనమును స్వీకరించునట్లు పద్మనిలయుఁడయి (ప్రకాశించుచుండెను అంత - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** అలంకార ము(త్ప్రేక్ష

**ఉత్సాహ -ఆ హరా(దిసుతల కతులహర్ష మెసఁగె, దేవ సం**
**దోహమునకు వీరలక్ష్మితోడ వేడ్కలొందెఁ, బు**
**ణ్యాహఘోష మెసఁగె, మునిజనాశయమ్ముల న్మహో**
**త్సాహమయ్యె నక్కుమారసంభవంబునం దిలన్** 50

**అర్థము .** ఆ + కుమార - సంభవంబునందున్ = ఆ కుమారస్వామి పుట్టుకయందు, ఆ - హర - అ(దిసుతలకున్ = ఆ శివునకును, పార్వతికిని, అతుల- హర్షము = సాటిలేని సంతోషము, ఎసఁగెన్ = అతిశయించెను దేవ - సందోహమునకున్= దేవతలసమూహమునకు, వీర-లక్ష్మితోడన్=పరా(కమశ్రీతో, వేడ్కలు + ఒందెన్ = వేడుకలయ్యెను, ముని - జన + ఆశయమ్ములన్ = మునిజనముల ఆ(శమములందు, పుణ్య + అహ - ఘోషము = పుణ్యాదినమునఁజేయు మంగళధ్వని, ఎసఁగెన్=ఒప్పెను, ఇలన్=భూమియందు, మహత్ (మహో) + ఉత్సాహము = గొప్పవేడుక, అయ్యెన్

**తాత్పర్యము .** ఆ కుమారస్వామి జననమున ఆ పార్వతీశ్వరులకు సాటిలేనిసంతోష మతిశయించెను దేవతలకుఁ బరా(కమశ్రీతో వేడుకలయ్యెను మునుల యా(శమములందు పుణ్యాహమంగళధ్వను లొప్పెను భూమియందు గొప్ప వేడుక గలిగెను

**విశేషములు** కుమారస్వామి పుట్టుకవలనఁ గలుగు నుత్సాహమునకు సూచకముగా ఉత్సాహవృత్తమును ప్రయోగించుట గమనింపఁ దగినది గ్రంథనామమైన కుమారసంభవమును పద్యమున నిక్షేపించుటయు గమనార్హము ఉత్సాహ వృత్తమున - నాలుగు పాదములుండును ప్రతిపాదమునను ఏడు సూర్యగణములు, ఒక గురువు ఉండును మొదటి గణము మొదటి యక్షరమునకును, అయిదవగణముమొదటి యక్షరమునకును యతిమైత్రి ప్రాసనియమము గలదు

**ఉత్సాహ సురమహీరుహాలి పండె, సురభు లోలిఁ జేపె నా**
**సురగజంబు మదముసేసె, సురసమూహి కెద భయా**
**తురత వాసెఁ, బెరిఁగె దేవదుందుభుల్, సెలంగె నీ**
**ధరణి సస్యవృద్ధిఁ బొందె ధర్మచరిత మిగులఁగాన్ 51**

**అర్థము.** సుర - మహీరుహ + ఆలి = దేవతావృక్షముల వరుస, పండెన్= ఫలించెను, సురభులు = కామధేనువులు, ఓలిన్ = బాగుగా, చేపెన్ = పాలు స్రావోన్ముఖముగఁజేసెను ఆ - సుర - గజంబు = ఆ దేవతలయేనుఁగు, మదము+ చేసెన్ = మదించెను, సుర - సమూహికిన్ = దేవతల సమూహమునకు, ఎదన్ = హృదయమునందు, భయ + ఆతురత = భయమువలని బాధ, పాసెన్= పోయెను, దేవ - దుందుభుల్ = దేవతల భేరులు, పెరిఁగెన్ = వృద్ధిపొందెను, ఈ - ధరణి = ఈ భూమి, సస్యవృద్ధిన్ = పంటల పెంపుచే, చెలఁగెన్ = అతిశయించెను, ధర్మ - చరిత = ధర్మయుక్తమైన నడవడి, మిగులఁగాన్ = అధికముగా, పొందెన్

**తాత్పర్యము.** కల్పవృక్షములు ఫలించెను కామధేనువులు పాలుచేపెను ఆ దేవగజము మదించెను దేవతలకు హృదయముల భయము తొలఁగెను దేవతల భేరులు వృద్ధిపొందెను ఈ భూమి పంటల పెంపుతో నొప్పెను ధర్మయుక్తమైన నడవడి మిక్కిలి కలిగెను

## నారదాగమనము

**వ తదవసరంబునం గలహభోజనుండైన నారదమహాముని కలహావలో కనార్థంబు లోకంబులఁ బరిభ్రమించువాఁడు తత్కాంతారాంతరంబునం జని చని 52**

**అర్థము .** తద్ + అవసరంబునన్ = ఆ సమయమున, కలహ - భోజనుండు + ఐన = కయ్యములు ఆహారముగాఁగలవాఁడైన, నారద - మహత్ (మహా) - ముని = నారదుఁడను పేరుగల గొప్పముని, కలహ + అవలోకన + అర్థంబు = కయ్యములను జూచు నిమిత్తము, లోకంబులన్, పరిభ్రమించువాఁడు=

సంచరించువాఁడు, తద్ + కాంతార + అంతరంబునన్ = ఆ వనములోపలచని = పోయి పోయి

**తాత్పర్యము.** ఆ సమయమునఁ గలహాశనుఁడైన నారదుఁడను మహాముని కలహమెక్కడ లభించునా యని లోకమునందుఁ దిరుగుచు నా వనములోపలఁ బోయిపోయి - తరువాతి పద్యముతో నన్వయము

**తే** అరుణ కిరణ సహస్రోదయంబు కంటె
మిగిలి గుహు తేజ మడర సమీప మెల్ల
సలలితద్యుతిఁ గాంచనాచలమ పోలె
సురుచిరంబగు నా సరోవరముఁ గనియె 53

**అర్థము .** గుహు - తేజము = కుమారస్వామి తేజస్సు, అరుణ - కిరణ-సహస్ర + ఉదయంబుకంటెన్ = వేయి వేవెలుఁగుల పుట్టుకకంటెను, మిగిలి = అతిశయించి, సమీపము + ఎల్లన్ = దగ్గఱి ప్రదేశమంతయు, అడరన్ = వ్యాపింపఁగా, స-లలితద్యుతిన్= మనోహరమైన కాంతితో, కాంచన + ఆచలము+ అ = మేరుపర్వతమే, పోలెన్ = అనులాగున, సురుచిరంబు + అగు = మిక్కిలి సుందరమగు, ఆ - సరోవరమున్ = ఆ సరస్సును, కనియెన్ = చూచెను

**తాత్పర్యము.** కుమారస్వామితేజస్సు వేయి వేవెలుఁగుల కంటెను అధికమై దగ్గఱి ప్రదేశమంతయు వ్యాపింపఁగా మనోహరమైన కాంతితో మేరుపర్వతమేయన సుందరమైన ఆ సరస్సును నారదుఁడు చూచెను

**విశేషములు :** అలంకార ముపమ

**వ.** **కని యిది యేమి తేజోవిశేసం బని కొలనుగలయం బరికించి చూచునప్పుడు.**

**అర్థము :** కని = చూచి, ఇది, ఏమి, తేజస్ (3) + విశేషంబు = కాంతి విశేషము, అని, కొలను = సరస్సు, కలయన్= అంతయును, పరికించి = పరీక్షించి, చూచు + అప్పుడు = చూచు సమయమున

**తాత్పర్యము :** చూచి ఇదియేమి కాంతి విశేషమని కొలనంతయును పరీక్షించి చూచు సమయమున - తరువాతి పద్యముతో నన్వయము

**క.** నలినాకరంబులోఁ దను
విలసితరుచు లలర గుహుఁడు వెలుఁగుచునుండెన్
జలరాశిలోన నెలకొని
వెలిఁగెడు నౌర్వాగ్రజాతవేదుఁడ పోలెన్ 55

**అర్థము** జలరాశిలోనన్= సముద్రములో, నెలకొని = ఉండి, వెలిఁగెడు= ప్రకాశించెడి, ఔర్వ + ఉగ్ర - జాత వేదుఁడు + అ + పోలెన్ = బడబాగ్నియనెడి భయంకరమైన అగ్నియే యనునట్లు, నలిన + ఆకరంబులోన్ =తామరకొలనిలో, తను - విలసిత - రుచులు = దేహముయొక్క ప్రకాశించుకాంతులు, అలరన్ = ఒప్పఁగా, గుహుఁడు = కుమారస్వామి, వెలుఁగుచున్ + ఉండెన్ = ప్రకాశించుచుండెను

**తాత్పర్యము** సముద్రములోనుండి ప్రకాశించు బడబాగ్నియను భయంకరాగ్నివలె, తామరకొలనిలో శరీరకాంతులొప్పఁగా గుహుఁడు ప్రకాశించుచుండెను

**విశేషములు .** అలంకార ముపమ

సీ వినువీధి నడయాడి విసివి తా నిచ్చలో
  నిలఁ దావగొనియున్న వెలుఁగుతేఁడొ
లవణాబ్ధి వెలడు మైచవుడు పోఁ దియ్య నీ
  రాడంగఁ జొచ్చిన యమృతకరుఁడొ
ముదిమివో నిందుల యుదకంబు సేవించి
  యెలఁబ్రాయమై యున్న నలువ యొక్కొ
ఊ నేల గిరిమీఁద మే నొత్తునని తమ్మి
  విరులపై నెనసిన గిరిశుఁడొక్కొ

ఆ యబ్జనిలయమైన యమ్మతో నరిమిలిఁ
దగిలియున్న తమ్మి దాల్పుఁడొక్కొ
యనుచు నుత్తరోత్తరైశ్వర్యుఁడగు బాలు
గారవించి చూచె నారదుండు 56

**అర్థము .** విను - వీధిన్ = ఆకాశవీధిలో, నడయాడి = సంచరించి, తాను ఇచ్చలోన్ = మనసులో, విసివి = విసువు చెంది, ఇలన్ = భూమిలో, తావగొని + ఉన్న = నెలకొనియున్న, వెలుఁగుతేఁడొ = సూర్యుఁడో,

లవణ + అబ్ధిన్ + ఉప్పుసంద్రమునుండి, వెలడు = వెలువడునట్టి, మై - చవుడు = ఒడలియుప్పుమట్టి, పోన్ = పోవునట్టు, తియ్య - నీరు + ఆడంగన్ = తియ్యని నీట స్నానమాడ, చొచ్చిన= ప్రవేశించిన, అమృతకరుఁడొ = చంద్రుఁడో

ముదిమి + పోన్ = ముసలితనము పోవుటకు, ఇందుల + ఉదకంబున్= ఇందలి నీటిని, సేవించి = త్రాగి, ఎలఁ బ్రాయము + ఐ + ఉన్న = లేఁతవయస్సుగలిగియున్న, నలువ - ఒక్కొ - బ్రహ్మయో,

జూ - నేలన్ = జూతినేల మీఁద, గిరిమీఁదన్ = (కైలాస) పర్వతముపై, మేను = శరీరము, ఒత్తున్ + అని = గ్రుచ్చుకొనునని, తమ్మి - విరులపైన్ = తామరపూలపై, ఎనసిన = కూడిన, గిరిశుఁడు + ఒక్కొ = శివుఁడో

అబ్జ - నిలయ = తామరపూవు స్థానముగాఁ గలది, ఐన, అమ్మతోన్ = స్త్రీ (లక్ష్మి)తో, అరిమిలిన్ = ప్రేమముతో, తగిలి+ ఉన్న = కూడియున్న, తమ్మిదాల్పుఁడు + ఒక్కొ = పద్మనాభుఁడో - విష్ణువో,

అనుచున్, ఉత్తర + ఉత్తర + ఐశ్వర్యుఁడు = పోనుపోను ఐశ్వర్యవంతుఁడు, అగు, బాలున్ = పిల్లవానిని - కుమారస్వామిని, నారదుండు, గారవించి = ఆదరించి, చూచెన్

**తాత్పర్యము.** ఆకాశమున సంచరించి మనస్సున విసువుఁజెంది భూమిలో నెలకొనియున్న సూర్యుఁడో, ఉప్పునీటి సముద్రమునుండి వెలువడు ఒడలియుప్పు మట్టి పోవఁ దియ్యని నీట స్నానమాడుటకుఁ బ్రవేశించిన చంద్రుఁడో, ముసలితనము పోవ నీ సరస్సులోని జలమును ద్రావఁగా లేఁతవయసువాఁడైన బ్రహ్మయో, జూతినేలపైఁ కొండమీఁద మేను ఒత్తునని తామరపూలపైఁ గూడిన శివుఁడో, తామరపూవు నివాసస్థానముగాఁగల లక్ష్మితోఁ బ్రేమమునఁ గూడియున్న విష్ణువో అనుచు ఉత్తరోత్తరముగా నైశ్వర్యముగల బాలుని నారదుఁ డాదరముతోఁ జూచెను

**విశేషములు** . అలంకార ముత్ప్రేక్ష పర్యాయోక్తము గిరిశుఁడు = గిరిపైఁబరుండువాఁడు - శివుఁడు అరిమిలి - అర్మిలి (రూపాం) ఉత్తరైశ్వర్యుఁడు - ఉత్తర + ఐశ్వర్యుఁడు వృద్ధి సంధి జూ నేల జూయి + నేల - సమాసమున జూయిశబ్దము నంత్యాక్షరమునకు లోపము బాల ఆచ్చిక 21

**వ మఱియునుం గమలబంధుండు బంధుభావంబునం గమలలక్ష్మి యింటికి విందు వచ్చినట్లు తేజోవిరాజితుండై సరోవరంబు నలంకరించుచున్న బాలకుం గని విస్మితుండై 'వీఁడు ప్రకృతిపురుషుం డన్యుల కజేయుం డమరేంద్రుం దెచ్చి పోరించి నేఁటి యాహారంబు గాననగు నేనిం జూతు' నని యక్షణంబ సురపతిపాలికింజని తద్వృత్తాంతం బద్భుతంబుగా విశేషించి యెఱింగించి వెండియు** 57

**అర్థము.** మఱియునున్, కమలబంధుండు = తమ్మిచుట్టము - సూర్యుఁడు, బంధు - భావంబునన్ = చుట్టఱికముతో, కమల - లక్ష్మి + ఇంటికిన్= తామరయనెడి లక్ష్మి యింటికి, వచ్చిన + అట్లు, తేజస్ (ః)+ విరాజితుండు + ఐ = తేజస్సుతోఁ బ్రకాశించువాఁడయి, సరోవరంబున్ = సరస్సును, అలంకరించుచున్ + ఉన్న, బాలకున్, కని, విస్మితుండు + ఐ = ఆశ్చర్యపడినవాఁడయి, వీఁడు, ప్రకృతి - పురుషుండు = సహజపురుషుఁడు, అన్యులకున్ = ఇతరులకు, అజేయుండు = గెలువరానివాఁడు, అమర + ఇంద్రున్= దేవేంద్రుని, తెచ్చి, పోరించి = పోరునట్లు చేసి, నేఁటి + ఆహారంబు = ఈనాఁటి భోజనము, కానన్ + అగున్ + ఏనిన్ + చూతున్ = పొందవచ్చునేమో చూచెదను, అని, అక్షణంబు + అ = వెంటనే, సురపతి - పాలికిన్ = దేవేంద్రుని యొద్దకు, చని, తద్+ వృత్తాంతంబు, అద్భుతంబుగాన్ = ఆశ్చర్యకరముగా, విశేషించి = వివరించి, ఎఱింగించి= తెలిపి, వెండియున్ = మఱియును

**తాత్పర్యము** మఱియును సూర్యుఁడు బంధుత్వముతోఁ దామరయనెడి లక్ష్మి యింటికి వచ్చిన విధమునఁ దేజస్సుచేఁ బ్రకాశించువాఁడయి సరస్సు నలంకరించుచున్న బాలునిఁ జూచి ఆశ్చర్యపడి, 'వీఁడు సహజపురుషుఁడు ఇతరులకు గెలువరానివాఁడు దేవేంద్రునిఁ దెచ్చి వీనితోఁ బోరునట్లు, చేసి యీనాఁటి భోజనమును పొందవచ్చునేమో చూచెద' నని వెంటనే దేవేంద్రునికడకు వెడలి, యా వృత్తాంత మాశ్చర్యకరముగా వివరించి చెప్పి మఱియును - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష

క **దనుజారికంటె వీరుఁడు**
**దినవల్లభుకంటె నధికతేజుఁడు, పద్మా**
**సనుకంటె మహాత్ముఁడు, త్రిన**
**యనుకంటె విశేషుఁ డురుతరైశ్వర్యమునన్.** 58

**అర్థము.** దనుజ + అరి - కంటెన్ = రాక్షసుల శత్రువగు విష్ణువు కంటెను, వీరుఁడు= పరాక్రమవంతుఁడు, దిన- వల్లభుకంటెన్ = దినపతియైన సూర్యుని కంటెను, అధిక - తేజుఁడు = ఎక్కువ తేజస్సుగలవాఁడు, పద్మ + ఆసనుకంటెన్= పద్మము పీఠముగాఁ గల బ్రహ్మకంటెను, మహాత్ముఁడు= గొప్పవాఁడు, ఉరుతర+ ఐశ్వర్యమునన్= మిక్కిలి గొప్ప ఐశ్వర్యమునందు, త్రినయనుకంటెన్= ముక్కంటి కంటెను, విశేషుఁడు = అధికుఁడు

**తాత్పర్యము.** ఆ బాలుఁడు విష్ణువుకంటెను వీరుఁడు సూర్యుని కంటెను అధికమైన తేజస్సుగలవాఁడు బ్రహ్మకంటెను మహాత్ముఁడు మిక్కిలి గొప్పయైశ్వర్యమునందు శివునికంటెను అధికుఁడు

**వ మఱియును - తరువాతి పద్యముతో నన్వయము 59**

**చ హరునకు నెద్ది పేర్మి, దనుజారికి నెద్ది రమావిభూతి, భా**
**స్కరునకు నెద్ది తేజము దిశాపతి సంహతి కెద్ది నిల్వు, చం**
**దురునకు నెద్ది కాంతియుఁ, జతుర్దశలోకవిభుత్వ మెద్ది నీ**
**కిరవుగ నా కుమారుఁ డిల నింకొక యించుక సేపు నిల్చినన్? 60**

**అర్థము.** ఆ - కుమారుఁడు = ఆ బాలుఁడు, ఇరవుగన్ = స్థిరముగా, ఇలన్ = భూమియందు, ఇంకన్ + ఒక + ఇంచుక - సేపు = ఇఁక నొకింత సేపు, నిల్చినన్ = నిలిచినచో, హరునకున్ = ఈశ్వరునకు, పేర్మి = గొప్పతనము, ఎద్ది= ఏది ? లేదనుట, దనుజ + అరికిన్ = రాక్షసశత్రువగు విష్ణువునకు, రమా - విభూతి= లక్ష్మి - సంపద, - ఎద్ది ? భాస్కరునకున్ = సూర్యునకు, తేజము, ఎద్ది, దిశా - పతి - సంహతికిన్ = దిక్పతుల సమూహమునకు, నిల్వు = నిలుకడ, ఎద్ది? చందురునకున్ = చంద్రునకు, కాంతియున్, ఎద్ది, నీకున్, చతుర్ + దశ - లోక- విభుత్వము = పదునాలుగు లోకముల ప్రభుత్వము ఎద్ది ?

**తాత్పర్యము.** 'ఆ బాలుఁడు స్థిరమ్ముగ భూమియందు ఇంకొక యించుకసేపు నిలిచినచో ఈశ్వరునకు గొప్పతనమేది ? విష్ణువునకు లక్ష్మి సంపద యేది ? సూర్యునకుఁ దేజ మెక్కడ ? దిక్పాలకులకు నిలుకడ యెక్కడ ? చంద్రునకుఁ గాంతి యెక్కడ ? నీకుఁ బదునాలుగుభువనముల ప్రభుత్వము ఎక్కడ ?

## సురపతి కుమారునిపై నెత్తివచ్చుట

**వ అని యమ్మునిపతి సురపతికి నేలతలఁ గాలు నిలువకుండునట్టి భయంపువార్త చెప్పిన విని యదరిపడి యక్షణంబ వజ్రి వజ్రాయుధాద్యనేక దివ్యాయుధంబులు గొని యైరావతగజేంద్రారూఢుఁడై యతిరయంబునఁ దత్సరోవరంబునకుఁ జనుదెంచి యబ్బాలకుం గనుంగొని మేను కఱకెక్కి వెక్కసం పడి శిరఃకంపంబు సేయుచు 61**

**అర్థము** అని, ఆ + ముని - పతి = ఆ మునీశ్వరుఁడు - నారదుఁడు, సుర - పతికిన్ = దేవేంద్రునకు, నేలతలన్ = నేలమీఁద, కాలు - నిలువక + ఉండు + అట్టి, భయంపు - వార్త (భయము + వార్త) = భయంకరమైన వార్త, చెప్పినన్, విని, అదరిపడి, అక్షణంబు = వెంటనే, వజ్రి = ఇంద్రుఁడు (వజ్రాయుధము గలవాఁడు, వజ్ర + ఆయుధ + ఆది + అనేక - దివ్య + ఆయుధంబులు = వజ్రాయుధము మున్నగు పెక్కు దివ్యములైన ఆయుధములు, కొని, ఐరావత - గజ+ఇంద్ర + ఆరూఢుండు + ఐ = ఐరావత మనెడి గజశ్రేష్ఠమును ఎక్కినవాఁడయి, అతి - రయంబునన్ = మిక్కిలి వేగముతో, తద్ + సరోవరంబునకున్ = ఆ సరస్సునకు, చనుదెంచి = వచ్చి, ఆ + బాలకున్, కనుంగొని, మేను = శరీరము, కఱుకు + ఎక్కి = గగురుపొడిచి, వెక్కసంపడి - (వెక్కసము + పడి) = ఆశ్చర్యపడి శిరస్ (ం) + కంపంబు +చేయుచున్ = తల యూఁచుచు

**తాత్పర్యము** అని ఆ మునిశ్రేష్ఠుఁడైన నారదుఁడు దేవేంద్రునకు నేలపైఁ గాలు నిలువకుండునట్టి భయంకరవార్తను జెప్పఁగా విని అదరిపడి వెంటనే ఇంద్రుఁడు వజ్రాయుధము మున్నగు పె క్కాయుధములు గొని యైరావతమునెక్కి మిక్కిలివేగమున నా సరస్సునకు వచ్చి ఆ బాలునిఁ జూచి మేను గగుర్పొడువ ఆశ్చర్యపడి తల యూఁచుచు - తరువాతి పద్యముతో నన్వయము

చ **వెలుఁగు కుమారతేజమున వేఁడిమి తాఁకినయంత వేయుఁగ**
**న్నులు మిఱుమిట్లువోయినఁ గనుంగొన నేరక మూసికొన్న ఱె**
**ప్పలు కమరంగవిచ్చె నురుభాస్కరతీవ్రకరప్రభాతికి**
**న్నులికి రయంబున న్మొగిడియున్న కుముద్వతివోలె భీతితోన్ 62**

**అర్థము .** పూర్వవచనము నందలి వజ్రి ఇందుఁ గర్త

ఉరు - భాస్కర - తీవ్ర - కర - ప్రభాతికిన్ = గొప్ప సూర్యుని తీక్ష్ణమైన కిరణములయొక్క అధికకాంతికి, ఉలికి = భయపడి, రయంబునన్ = శీఘ్రముగా, మొగిడి+ ఉన్న = ముడుచుకొనియున్న, కుముద్వతి + పోలెన్ = తెల్లకలువలుగల సరస్సువలె, వెలుఁగు = ప్రకాశించునట్టి, కుమార - తేజమున - వేఁడిమి = బాలుని తేజస్సు నందలి వేఁడి, తాఁకిన + అంతన్ = తగులఁగానే, వేయున్ + కన్నులున్ = వేయి కన్నులును, మిఱుమిట్లు + పోయినన్, భీతితోన్ = భయముతో, కనుంగొనన్ + నేరక = చూడఁజాలక, మూసికొన్న = మూసికొన్నట్టి, ఱెప్పలు, కమరంగన్ = కాలఁగా, విచ్చెన్ = విప్పెను

**తాత్పర్యము .** అధికమైన సూర్యతీక్ష్ణ కిరణముల ప్రకృష్ణమైనకాంతికి భయపడి శీఘ్రముగా ముడుచుకొనియున్న తెల్లకలువలకొలని విధమునఁబ్రకాశించు బాలుని తేజస్సునందలి వేఁడిమి తగులఁగనే తనవేయికన్నులును మిఱుమిట్లు గొలుపఁగా నింద్రుఁడు భయమునఁ జూడఁజాలక మూసికొనిన ఱెప్పలు కాలఁగా విప్పెను

**విశేషములు .** అలంకార ముపమ స్వభావోక్తి 'ఉరు భాస్కర తీవ్రకర ప్రభాతిఁ గన్నులికి' అని పారము గలదు దానికి ఉరు భాస్కరతీవ్ర కర ప్రభాతిచే, కన్ను + ఉలికి = కన్నుచెదరి - యని యర్థము చెప్పవలసియుండును ' ప్రభాతికి న్నులికి = ప్రభాతికిన్ + ఉలికి -'కొన్నియెడలఁ బ్రామాణికప్రయోగంబులం ద్రుతంబున కచ్చు పరంబగుచో ద్విత్వంబు చూపట్టెడి ' ప్రౌఢ సంధి 3 కుముద్వతి - తెల్లకలువల తీఁగ, తెల్ల కలువల సరస్సు - అను రెండర్థములలో ఇంద్రుని కుపమానముగా రెండవయర్థమే గ్రహింపఁబడినది

**వ ఇట్లనిమిషేశ్వరుండు వెక్కసంపడి యుక్కుడించి తన వచ్చినతప్పునకు దూరభీతుండై పోవనేరక కుమారుమీఁద నభ్రగజంబుం గొలిపినఁ దెరలం బఱతెంచు వెల్లేనుఁగుం గని హరుపట్టి పట్టి యాడ నగునని పట్టికొనం బఱతెంచుటం గని పర్జన్యుండు ప్రళయ కాల పర్జన్యుండునుంబోలె నబ్బాలకుపై ననేకాస్త్రవర్షంబులు గురిసిన 63**

**అర్థము :** ఇట్లు, అనిమిష + ఈశ్వరుండు = దేవాధిపతి, వెక్కసంపడి - వెక్కసము + పడి = దుస్సహత్వమునంది, ఉక్కుడించి = బలము తగ్గి, తన - వచ్చిన - తప్పునకున్ = తాను వచ్చిన తప్పునకు, దూర - భీతుండు + ఐ = దవ్వులనుండియే భయపడినవాఁడయి, పోవన్ + నేరక = పోఁజాలక, కుమారుమీఁదన్, అభ్రగజంబున్ = ఐరావతమును, కొలిపినన్ = పురికొలుపఁగా, తెరలన్ + పఱతెంచు = బయలుదేఱివచ్చు, వెల్లేనుఁగున్ (వెల్ల+ ఏనుఁగున్) = తెల్ల యేనుఁగును - ఐరావతమును, కని, హరు - పట్టి = శివుని కుమారుఁడు - కుమారస్వామి, పట్టి + ఆడన్ + అగును + అని = పట్టుకొని ఆడుకొనవచ్చునని, పట్టుకొనన్ + పఱతెంచుటన్ + కని = పట్టుకొనుటకు వచ్చుటను జూచి, పర్జన్యుండు = ఇంద్రుఁడు, ప్రళయ - కాల - పర్జన్యుండునున్ + పోలెన్ = ప్రళయసమయమునందలి మేఘమువలె, ఆ + బాలకుపైన్ = ఆ బాలుని మీఁద, అనేక + అస్త్ర - వర్షంబులు = పెక్కు అస్త్రముల వానలు, కురిసినన్ = కురియఁగా

**తాత్పర్యము.** ఇట్లు దేవేంద్రుఁడు దుస్స్వహత్వమును బొంది బలము తగ్గి, తాను వచ్చిన తప్పునకు దూరమునుండియే భయపడినవాఁడయి, పోఁజాలక, కుమారుని మీఁది కైరావతమును బురి కొల్పఁగా బయలుదేటివచ్చు నైరావతమును జూచి కుమారస్వామి దానిని బట్టుకొని ఆడుకొనవచ్చునని పట్టుకొనవచ్చుట చూచి ఇంద్రుఁడు ప్రళయకాలమేఘమువలె ఆ బాలునిపైఁ బెక్కు అంపవానలు గురియఁగా - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు** అలంకార ముత్ప్రేక్ష

తే అలిగి దేవేంద్రుఁ డేయు నుగ్రాస్త్రములు కు
మారు భేదింపనోపక మగిడె వీత
రాగియైయున్న నిర్వాణయోగిఁ దూఱఁ
గొనక క్రమ్మఱు సతుల చూడ్కులును బోలె 64

**అర్థము** అలిగి = కోపించి, దేవ + ఇంద్రుఁడు, ఏయు = ప్రయోగించు, ఉగ్ర + అస్త్రములు = భయంకరములయిన బాణములు, కుమారున్ = కుమారస్వామిని, భేదింపన్ + ఓపక = భేదింపలేక, వీత- రాగి + ఐ = పోయిన అనురాగము గలవాఁడు - అనురాగము లేనివాఁడు, అయి, ఉన్న, నిర్వాణ - యోగిన్= మోక్షము కొఱకు యోగియైన వానిని, తూఱఁగొనక = తూఱుకొనక = ప్రవేశింపక, క్రమ్మఱు = మరలిపోవునట్టి, సతుల = స్త్రీలయొక్క, చూడ్కులును + పోలెన్ = చూపులవలె, మగిడెన్ = మరలెను

**తాత్పర్యము.** కోపముతో దేవేంద్రుఁడు ప్రయోగించు భయంకరాస్త్రములు కుమారుని భేదింపఁజాలక, అనురాగవిహీనుఁడైన మోక్షయోగిని జేరలేక మరలిపోవు స్త్రీల చూపులవలె మరలెను

**విశేషములు :** అలంకార ముపమ వీతరాగి - బహువ్రీహి సమాసము నంతమున 'ఇన్' ప్రత్యయము వచ్చుట విశేషము - వీతరాగుఁడై అని యుండనగును

వ ఇట్లు నిజాస్త్రహతి నక్షతదేహుండును ననివార్యశౌర్యుండును నై పఱతెంచు బాలకుం గని హరి కరి నలిగించి కొలిపిన 65

**అర్థము:** ఇట్లు, నిజ + అస్త్ర - హతిన్ = తనవైన అస్త్రముల దెబ్బచే, అక్షత - దేహుండును = గాయపడని శరీరముగలవాఁడును, అనివార్య - శౌర్యుండునున్

+ ఐ - అడ్డగింపరాని పరాక్రమముగలవాఁడును నయి, పఱతెంచు = వచ్చు, బాలకున్ = బాలుని, కని, హరి = ఇంద్రుఁడు,కరిన్ = ఏనుఁగును, అలిగించి = కోపగింపఁజేసి, కొలిపినన్ = పురికొలుపఁగా

**తాత్పర్యము** . ఇట్లు తన యస్త్రములదెబ్బచే గాయపడని శరీరముగలవాఁడును, నివారింపరాని శౌర్యము గలవాఁడును అయి వచ్చు బాలుని జూచి ఇంద్రుఁడు ఐరావతమును గోపింపఁజేసి పురికొల్పఁగా - తరువాతి పద్యముతో నన్వయము

సీ. బలభేదికరి దొడ్కిపట్టఁ జేసాఁచుడు
శివసూతి పెనఁచి చేసేతఁబట్టి
కుదిసి రాఁ దిగుచుడు మదమఱి కాల్కొన
కొఱలుచు నేలఁ గొమ్మూఁది మ్రొగ్గె
నంత దృఢాసీనుఁడై వజ్రి నిజకరిఁ
దడయ కంకుశమునఁ బొడిచి యెత్తి
కోపించి గుహుమీఁదఁ గొలిపినఁ బైఁబెట్ట
కది మొగతిరుగుడు నమరనాథుఁ

ఆ. డంకుశమున మడమనార మంగుటమున
నాఁక గొనుచుఁ గొలుప నరుగ నెదుర
నలవి గాక కరి రయంబున జిట్టన
సారివోలె నొక్క గోరఁ దిరిగె 66

**అర్థము** . బలభేది -కరి= బలుఁడనువానిని జంపిన వాని (ఇంద్రుని) 'యేనుఁగు -ఐరావతము, తొడ్కి -పట్టన్= ఒడిసిపట్టుకొనుటకు, చే + చాఁచుడున్= చేయి (తొండము) చాఁచినంతనే, శివ -, సూతి = శివుని కొడుకు - కుమారస్వామి, పెనఁచి = మెలిపెట్టి, చేసేతన్ + పట్టి = స్వయముగాఁ బట్టి, కుదిసి - రాన్ = క్రుంగి వచ్చునట్లు, తిగుచుడున్ = లాగినంతనే, మదము + అఱి = క్రొవ్వు అడఁగి, కాల్కొనక ( కాలు + కొనక) = కాలూనక,, ఒఱలుచున్ = అఱచుచు, నేలన్, కొమ్ము + ఊఁది = దంతమును ఆన్చి, మ్రొగ్గెన్ = మోఁకరిల్లెను

అంతన్, వజ్రి = ఇంద్రుఁడు, దృఢ + ఆసీనుఁడు + ఐ = గట్టిగా గూర్చున్నవాఁడయి, నిజ - కరిన్ = తనయేనుఁగును,తడయక = ఆలస్యముచేయక,

అంకుశమునన్ = అంకుశముతో, పొడిచి, ఎత్తి, కోపించి, గుహు - మీఁదన్ = కుమారస్వామి మీఁద, కొలిపినన్ = పురికొల్పఁగా, అది = ఆ యేనుఁగు, పైన్ + పెట్టక = మీఁదఁబడక, మొగతిరుగుడున్ = పెడమొగము పెట్టినంతనే, అమర - నాథుఁడు = దేవేంద్రుఁడు అంకుశమునన్, మడమనారన్, అంగుటమునన్ = అంగుష్ఠముతో, ఆఁక + కొనుచున్ + ఆఁగుచు, కొలుపన్ + అరుగన్ = పురికొల్పవెడలఁగా, ఎదురన్ + అలవి - కాక = ఎదిరింపశక్తి లేక, కరి = ఏనుఁగు, రయంబునన్ = వేగముతో, జిఱ్ఱునన్ = జిఱ్ఱుయను ధ్వని కలుగునట్లుగా, సారి + పోలెన్ = కుమ్మరి చక్రము వలె, ఒక్క - గోరన్ = ఒక్కగోరిపై, తిరిగెన్

**తాత్పర్యము .** ఐరావతము కుమారుని ఒడిసిపట్టుటకుఁ దొండమును ఊఁచినంతనే, కుమారస్వామి మెలిపెట్టి స్వయముగాఁ బట్టి క్రుంగివచ్చునట్లు లాగెను అంత నది మదమును గోలుపోయి నిలువలేక అఱచుచు నేలపై దంతమునాని మోఁకరిల్లెను అంత నింద్రుఁడు బాగుగాఁ గూర్చున్నవాఁడయి తన యేనుఁగును ఆలసింపక అంకుశముతోఁ బొడిచి యెత్తి కుమారస్వామి పైకిఁ బురికొల్పెను అప్పు డది వీనిపైఁ బడక పెడమొగముపెట్టఁగా నింద్రుఁ డంకుశమున బొటనవ్రేలితో నాఁగుచుఁ బురికొలుపఁగా నేనుఁగు ఎదురఁజాలక వేగముతో జిఱ్ఱుయనుధ్వని కలుగునట్లు కుమ్మరిసారివలె ఒక్కగోరిపైఁ దిరిగెను

**విశేషములు** అలంకారము స్వభావోక్తి ఉపమ

**వ త దవసరంబున ఆ సమయమున - తరువాతి పద్యముతో నన్వయము** **67**

**క సురపతి కోపించి భయం**
**కరముగ వజ్రమున వైచెఁ గని గుహుఁడు బిసాం**
**కురమునఁ దట్టుడు నది గత**
**సరభసగతిఁ దూలిపాఱి శరనిధిఁ బడియెన్** **68**

**అర్థము :** సురపతి = ఇంద్రుఁడు, కోపించి, భయంకరముగన్ = వెఱపుగొలుపునట్లు, వజ్రమునన్, వైచెన్ = కొట్టెను, గుహుఁడు = కుమారస్వామి, కని, బిస + అంకురమునన్ = తామరతూఁటి మొలకతో, తట్టుడున్ = తాఁకినంతనే, అది = వజ్రము, గత - సరభస - గతిన్ = వేగ గమనముపోయి, తూలి = చలించి, పాఱి, శరనిధిన్ = సముద్రమున, పడియెన్

**తాత్పర్యము .** ఇంద్రుఁడు కోపముతో భయంకరముగా వజ్రముతోఁ గొట్టెను అది చూచి కుమారస్వామి తామరతూఁటిమొలకతో దానిని దాఁకెను అంత నా వజ్రము మెల్లఁగాఁ జలించి పాటి సముద్రమునఁ బడెను

**క నుత బిందుబిసము లీశ్వర**
**సుతు చేతిని నిల్చి బలిమి సురవల్లభు నా**
**శతధార నోర్చె నల్పులు**
**నతిసత్త్వులఁ గూడి బలియు లగు డది యరుదే ? 69**

**అర్థము .** నుత - బిందు - బిసములు = పొగడఁబడిన లవము లైన తామరతూండ్లు - తామరతూండ్ల లేశములు, ఈశ్వర - సుతు - చేతినిన్ = ఈశ్వరుని కొడుకైన కుమారస్వామి చేత, నిల్చి, బలిమిన్ = బలముతో, సుర - వల్లభు + ఆ - శతధారన్ = దేవేంద్రుని ఆ వజ్రాయుధమును, ఓర్చెన్ = ఓడించెను, అల్పులున్ = హీనులు సైతము, అతి - సత్త్వులన్ = మహాబలవంతులను, కూడి, బలియులు = బలవంతులు, అగుడు = అగుట, అది, అరుదే = ఆశ్చర్యమా?

**తాత్పర్యము .** తామరతూండ్ల లేశములు కుమారస్వామి చేత నిలిచి బలముతో నింద్రుని వజ్రాయుధము నోడించెను అల్పులు సైతము మహాబలవంతులను గూడుచో బలవంతులగుట ఆశ్చర్యమా ? కా దనుట

**విశేషములు :** అలంకార మర్థాంతరన్యాసము ఓర్చు ఓడు ధాతువు 'చుగాగమం బాచ్ఛికంబున కసంయుక్త న ల డ రాంతంబునకుం బ్రేరణంబున బహుళంబుగా నగు ' బాల క్రియ 73 ఓడు + చు 'ఆ డోడు కూడుల డకారంబునకుం జుక్కు పరంబగునపుడు రేఫంబగు ' బాల క్రియ 80 ఓరుచు 'ఆచ్ఛికంబులం బదమధ్యంబుల న ల డ ర ల యత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు ' బాల ప్రకీర్ణ 17 ఓర్చు

**వ ఇట్లు వజ్రి దివ్యాయుధంబైన యవ్వజ్రాయుధంబు తప్పిన నెవ్వెఱఁగు వడి యున్నంతఁ గుమారుచేతి బిసప్రహతి కబ్బగింపక 70**

**అర్థము :** ఇట్లు, వజ్రి = ఇంద్రుఁడు, దివ్య + ఆయుధంబు + ఐన, ఆ+ వజ్ర + ఆయుధంబు, తప్పినన్, నెవ్వెఱఁగు + పడి +ఉన్న + అంతన్ = మిక్కిలి ఆశ్చర్యపడియున్నంత, కుమారుచేతి = కుమారునిచేతనున్న, బిస - ప్రహతికిన్ = తామరతూఁటి దెబ్బకు, అబ్బగింపక = ఓర్వక

**తాత్పర్యము .** ఇట్లు ఇంద్రుఁడు దివ్యాయుధమైన ఆ వజ్రాయుధము తప్పిపోవుటకు మిక్కిలి అచ్చెరువందియున్నంతఁ గుమారునిచేతి తామరతూఁటి దెబ్బ కోర్వక - తరువాతి పద్యముతో నన్వయము

క ఆ నాకపతిగజంబు ష
డాననుఁ గని వెఱచి పఱచె నది చోద్యమె పం
చాననున కోడు కరులు ష
డానన విపరీత గతి భయంపడకున్నే ? 71

**అర్థము .** ఆ - నాక - పతి - గజంబు = ఆ స్వర్గాధిపతియగునింద్రుని యేనుఁగు- ఐరావతము, షష్ (ట్) + అననున్ = ఆఱుమొగముల వానిని (కుమారస్వామిని), కని, వెఱచి = భయపడి, పఱచెన్ = పాఱిపోయెను అది = అట్లుపాఱిపోవుట, చోద్యమె = వింతయా ? పంచ + ఆననునకున్ = విస్తృతమైన ముఖము గలదానికి- సింహమునకు - అయిదు ముఖములు గలదానికని అర్థాంతరము, ఓడు = భయపడు, కరులు = ఏనుఁగులు, షష్ (ట్) + ఆనను - విపరీత -గతిన్= ఆఱుమొగములు గలవాని (కుమారస్వామియొక్క) ప్రతికూలమైన గతిచేత, భయంపడక (భయము + పడక)+ ఉన్నే = భయపడకుండునా ?

**తాత్పర్యము .** ఆ యింద్రుని యేనుఁగగునైరావతము ఆఱుమొగములవానిని జూచి వెఱచి పాఱిపోయెను అది ఏమి వింత ? పంచాననమును (విస్తృతమైన ముఖముగలదానికి - సింహమునకు) అయిదు ముఖములు గలదాని కని అర్థాంతరము భయపడు నేనుఁగులు ఆఱుమొగములు గలవాని ప్రతికూలఁగతికి భయపడకుండునా ?

**విశేషములు** అయిదు మొగముల గలదానికే భయపడు నేనుఁగు ఆఱుమొగములవానికి భయపడుననుటలో ఆశ్చర్యమేమున్నదని స్వారస్యము అలంకార మర్థాంతరన్యాసము శ్లేషము కావ్యార్థాపత్తి భయంపడు - భయము + పడు - పద్వాదులు పరంబులగునుపుడు ముువర్ణకంబునకు లోపపూర్ణబిందులు విభాష నగు బాలసంధి 46 ఉన్నే ఉండును + ఏ - 'ఒకానొకచోఁ దద్దర్మార్థకంబులగు నుండు, చను, చేరుకొనులు ప్రశ్నార్థకై కారపరకంబులగునపుడు వానికడయచ్చులకు లోపంబు విభాష నగు అగుచో నుండు డకారంబునకు నకారంబగు ' ప్రౌఢ క్రియ 2

చ హరికరి యోడి పాఱెడు రయంబున ఘంటలు రెండు ప్రక్కలం
దరమునఁ జాగఁ గట్టిన విధంబున వారక మ్రోయకుండెఁ ద
త్పురవరపార్శ్వదృష్ట హరపుత్త్రక తీవ్రతరప్రభాతి భీ
కరశిఖిఁ గ్రాఁగి పేరఁబడు ఘంటలొకో యనఁ దద్ద పొల్పుగాన్ 72

**అర్థము.** హరి - కరి = ఇంద్రుని యేనుఁగు - ఐరావతము, ఓడి, పాఱెడు- రయంబునన్ = పరువెత్తిపోవు వేగమున, ఘంటలు = గంటలు, రెండు ప్రక్కలన్, తరమునన్ = క్రమముగా, చాగన్ = సాగునట్లు, కట్టిన విధంబునన్ = కట్టినరీతిగా, తద్ + పుర - వర = ఆ పురశ్రేష్ఠముయొక్క, పార్శ్వ = ప్రక్కలందు, దృష్ట = చూడఁబడిన,హర - పుత్త్రక = శివుని కొడుకు (కుమారస్వామి) యొక్క, తీవ్ర- తర = మిక్కిలి తీక్ష్ణమైన, ప్రభాతి = కాంతియనెడు, భీకర - శిఖిన్ = భయంకరమైన అగ్నిచేత, క్రాఁగి = తపించి, పేరఁబడు = ముద్దయైన, ఘంటలు+ ఒకో = గంటలా, అనన్, తద్ద - పొల్పుగాన్ = మిక్కిలి యొప్పుగా, వారక = తప్పక, మ్రోయక + ఉండెన్

**తాత్పర్యము .** ఐరావతము ఓడిపోయి పాఱిపోవువేగమున, గ్రమముగా రెండు ప్రక్కలను గంటలు సాగునట్లు కట్టిన రీతిగా, ఆ పురము పార్శ్వములఁ జూడనగు కుమారస్వామి తీక్ష్ణమయిన తేజస్సనెడు భయంకరాగ్నిచేఁ గ్రాఁగి కరఁగి ముద్దయైన గంటలా యన మిక్కిలి యొప్పుగా తప్పక మ్రోయకుండెను

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష

క. త్రినయనపుత్త్రకుఁ డట వెను
కొన సురపతి పఱచె మఱువుకొన నజుని హరిం
గని యెందు శరణు గానక
చనియె మహాదేవ నీవ శరణను భాతిన్ 73

**అర్థము:** త్రినయన - పుత్త్రకుఁడు = ముక్కంటి కొడుకు - కుమారస్వామి, అటన్ = అక్కడ, వెనుకొనన్ = వెంబడింపఁగా, సుర - పతి = దేవేంద్రుఁడు, మఱువుకొనన్ = దాఁగుకొనుటకు, పఱచెన్ = పరువెత్తెను, అజునిన్ = బ్రహ్మను, హరిన్ = విష్ణువును, కని = చూచి ఎందున్, శరణు, కానక, మహాదేవ = ఓయి శివా, నీవు + అ = నీవే, శరణు + అను - భాతిన్ = శరణనువిధమున, చనియెన్

**తాత్పర్యము.** కుమారస్వామి వెంబడింపఁగా నింద్రుఁడు దాఁగికొనుటకుఁ బరువెత్తెను అతఁడు బ్రహ్మను విష్ణువును జూచి యెందును శరణుగానక ఓయి మహాదేవా! నీవే శరణనువిధమునఁ జనెను

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష

వ ఇ ట్లనిమిషపతి నిమిషార్ధంబునకుం జతుర్దశభువనంబులకుం గుమారుం డెయిది వెనుకొన మనోవేగంబునం బఱచి యెందును శరణుగానక శరణాగతవజ్రప్రాకారుండైన పరమేశ్వరు మఱువు సొరం బఱతెంచు నప్పుడు 74

**అర్థము.** ఇట్లు, అనిమిష - పతి = దేవేంద్రుఁడు, నిమిష + అర్ధంబునకున్= ఱెప్పపాటు కాలములో సగమునకు, చతుర్దశ - భువనంబులకున్ = పదునాలుగులోకములకును, కుమారుండు, ఎయిది = సాగి, వెనుకొనన్ = వెంబడింపఁగా, మనస్ (ః) + వేగంబునన్, పఱచి, ఎందును, శరణు + కానక, శరణ + ఆగత - వజ్ర - ప్రాకారుండు = శరణుకొఱకు వచ్చిన వారికి వజ్ర నిర్మిత ప్రాకారమైన వాఁడు, ఐన, పరమేశ్వరు - మఱువు = ఈశ్వరుని మఱుఁగు, చొరన్= చొచ్చుటకు, పఱతెంచు + అప్పుడు = వచ్చుసమయమున

**తాత్పర్యము** ఇట్లు దేవేంద్రుఁడు అర్ధ నిమిషములోఁ బదునాలుగు లోకములకును గుమారస్వామి వెంబడింపఁగా మనోవేగమునఁ బరువెత్తి యెచ్చటను శరణుగానక శరణాగతులకు వజ్రమయప్రాకారమయిన పరమేశ్వరుని మఱుఁగుచొచ్చుటకు వచ్చు సమయమున - తరువాతి పద్యముతో నన్వయము

తే బలసి తేజంబు దిక్కులఁ బ్రజర్విల్ల
దిగ్గజేంద్రంబు వెనుదెంచెఁ దెరలి గుహుఁడు
శరధిఁ జొరఁబాఱు ధారుణీధరము పిఱుఁద
నంటఁదగులు మహాశనియట్లు వోలె 75

**అర్థము** గుహుఁడు = కుమారస్వామి, బలసి = చుట్టుకొని, తేజంబు = తేజస్సు, దిక్కులన్, ప్రజ్వరిల్లన్ = వెలుఁగఁగా, దిశ్ (క్) + గజ + ఇంద్రంబున్ = దిగ్గజశ్రేష్ఠమును - ఐరావతమును, శరధిన్ = సముద్రమును, చొరఁబాఱు = ప్రవేశించు, ధారుణీధరము - పిఱుఁదన్ = కొండవెంట, అంటన్ + తగులు =

తఱుము నట్టి, మహత్ (మహా) + అశని + అట్లు + పోలెన్ = గొప్ప వజ్రాయుధమువలె, తెరలి = బయలుదేఱి, వెనుదెంచెన్ = వెంబడించెను

**తాత్పర్యము.** కుమారస్వామి తేజస్సు చుట్టుకొని దిక్కులందు వెలుఁగఁగా నైరావతమును, సముద్రమునఁ జొచ్చుటకుఁ బరువెత్తు కొండవెనుకఁ దఱుమునట్టి వజ్రాయుధము విధమున వెంబడించెను

**విశేషములు .** అలంకార ముపమ

**వ** ఇట్లు శరణు వేఁడుచు నైరావతగజారూఢుండై పఱతెంచు సురేంద్రు వెనుదెంచు కుమారుం జితమారుండు కని గిరిసుతకు నీ సుతుండని తద్వృత్తాంతం బెఱింగించునంతన వచ్చి తన మఱువు సొచ్చిన సురేశ్వరున కభయహస్తం బిచ్చి కుమారుం గనుంగొని కరతలాస్ఫాలనంబు చేసి చేతులు పచరించుచున్న జననీజనకులం గని 76

**అర్థము :** ఇట్లు, శరణు - వేఁడుచున్, ఐరావత - గజ + ఆరూఢుండు + ఐ = ఐరావతమను ఏనుఁగు నెక్కినవాఁడయి, పఱతెంచు = వచ్చు, సుర + ఇంద్రున్= దేవేంద్రుని, వెనుదెంచు = వెంబడించు, కుమారున్= కుమారస్వామిని, జిత-మారుండు = జయింపఁబడిన మన్మధుఁడు గలవాఁడు - శివుఁడు, కని, గిరి-సుతకున్ = కొండకూఁతునకు - పార్వతికి, నీ - సుతుండు + అని = నీ కొడుకని, తద్ + వృత్తాంతంబు, ఎఱింగించు + అంతన్ + అ = తెలిపినంతనే, వచ్చి, తన-మఱువు + చొచ్చిన, సుర + ఈశ్వరునకున్, అభయ - హస్తంబు + ఇచ్చి = భయము లేదని చెప్పి, కుమారున్, కనుంగొని, కర - తల + ఆస్ఫాలనంబు + చేసి= చేతితోఁదట్టి, చేతులు, పచరించుచున్ + ఉన్న = చాఁచుచున్న, జననీ - జనకులన్ = తల్లిదండ్రులను, కని

**తాత్పర్యము:** ఇట్లు శరణువేఁడుచు నైరావతగజము నెక్కి వచ్చు నింద్రుని వెంబడించు కుమారుని శివుఁడు చూచి పార్వతికి నీ కొడుకని ఆ వృత్తాంతమును దెలిపినంతనే వచ్చి తన మఱుఁగు చొచ్చిన యింద్రున కభయహస్తమిచ్చి కుమారుని జూచి చేతితోఁ దట్టి చేతులు చాఁచు తల్లిదండ్రులను జూచి - తరువాతి పద్యముతో నన్వయము

క ఆ హరి విడిచి నిసర్గ
స్నేహంబునఁ బాఱుదెంచెఁ జెచ్చెర సుమనో
దోహలమున వరపుత్రో
త్సాహంబున గుహుఁడు తల్లిదండ్రుల కడకున్ 77

**అర్థము :** గుహుఁడు = కుమారస్వామి, ఆ - హరిన్ = ఆ ఇంద్రుని, విడిచి, నిసర్గ - స్నేహంబునన్ = సహజమైన ప్రేమముతో, చెచ్చెరన్ = శీఘ్రముగా, సుమనస్ (ః) + దోహలమునన్ = మంచి మనస్సునందలి ఉత్సాహముతో, వర - పుత్ర + ఉత్సాహంబునన్ = సత్పుత్రుని ఉత్సాహముతో, తల్లి + తండ్రుల - కడకున్,పాఱుదెంచెన్ = పరువెత్తి వచ్చెను

**తాత్పర్యము .** కుమారస్వామి ఆ యింద్రుని విడిచి సహజప్రేమముతో సన్మానమునందలి ఉత్సాహముతో సత్ పుత్రోత్సాహముతోఁ దల్లిదండ్రుల కడకుఁ బరువెత్తి వచ్చెను

వ ఇట్లు పఱతెంచు కొడుకు నెత్తికొని త్రినయనుం డందంద డెందంబున నదిమికొని మూర్ధాఘ్రాణంబు సేయుడు 78

**అర్థము** ఇట్లు, పఱతెంచు = వచ్చు, కొడుకున్, ఎత్తికొని, త్రినయనుండు= ముక్కంటి, అందంద = మఱీ మఱీ, డెందంబునన్ = హృదయమున, అదిమికొని = హత్తుకొని, మూర్ధ + ఆఘ్రాణంబు + చేయుడున్ = శిరస్సు మూర్కొనినంతనే

**తాత్పర్యము** ఇట్లు వచ్చు కొడుకు నెత్తుకొని ముక్కంటి మఱిమఱి గుండె కత్తుకొని శిరస్సు మూర్కొనినంతనే - తరువాతి పద్యముతో నన్వయము

చ పులకలు పొడ్మె నంగమున, బోరన సమ్మదవారి కన్నుల
న్నలిఁ దలఁకాడె శంభునకు, నాఁటె ముదంబు మనంబునందు, మో
మలరెఁ దదుత్సవంబు గని యంబిక కర్మిలి పాలు సేఁపెఁ జ
న్నులు, పిఱునవ్వు మోవినిఁ, దనూలతికం జెమరుం గడల్కొనన్ 79

**అర్థము .** శంభునకున్ = శివునకు, అంగమునన్ = శరీరమున, పులకలు= గగుర్పాటు, పొడ్మెన్ = పొడమెన్ = పుట్టెను, కన్నులన్, సమ్మదవారి = సంతోషబాష్పములు, బోరనన్ = శీఘ్రముగా, నలిన్ = ప్రేమముతో, తలఁకాడెన్ = కాఱెను, మనంబునందున్ = మనస్సునందు, ముదంబు = సంతోషము,

నాఁటెన్ = నెలవుకొనెను, మోము = ముఖము, అలరెన్ = వికసించెను అంబికకున్ = పార్వతికి, తద్ + ఉత్సవంబు = ఆ వేడుక, కని, మోవినిన్ = పెదవిపై, చిఱు - నవ్వున్, తనూ-లతికన్ = తీవవంటి మేన, చెమరున్ = చెమటయు, కడల్ + కొనన్= అతిశయింపఁగా, అర్మిలిన్ = ప్రీతితో, చన్నులు, పాలు + చేఁపెన్

**తాత్పర్యము .** శివునకు మేనఁబులకలు పొడమెను కన్నులలో సంతోషబాష్పములు వెంటనే తొలఁకాడెను మనస్సులో సంతోషము గలిగెను ముఖము వికసించెను పార్వతికి ఆ వేడుకను జూడఁ బెదవిపైఁ జిఱునవ్వును, మైఁదీవయందుఁ జెమటయు నతిశయింపఁ బ్రీతితోఁ జన్నులు చేఁపెను

**వివేషములు** అలంకారము స్వభావోక్తి

**వ అంత గిరిసుత పతిచేత నున్న సుతు నందికొని ముఖావలోకనంబు సేయుచు మెత్తమెత్తనఁ గౌఁగిలించుచు మెయ్యలరి వృద్ధాంగనాప్రబోధిత క్రమంబునం జన్నిచ్చుచు 80**

**అర్థము .** అంతన్, గిరి - సుత = కొండ కూఁతురు - పార్వతి, పతి - చేతన్= భర్తచేతియందు, ఉన్న, సుతున్ = కొడుకును, అందికొని = పుచ్చుకొని, ముఖ + అవలోకనంబు + చేయుచున్ = మొగముఁజూచుచు, మెత్తమెత్తనన్ = మృదువుగా, కౌఁగిలించుచున్, మెయ్యలరి = మేనుప్పొంగి, వృద్ధ + అంగనా - ప్రబోధిత - క్రమంబునన్ = ముదుసలిస్త్రీలచేఁ బ్రబోధింపఁబడిన విధమున, చన్ను+ ఇచ్చుచున్ = చన్నులు గుడుపుచు

**తాత్పర్యము .** అంతఁ బార్వతి పతిచేతనున్న కొడుకునందికొని మొగము చూచుచు, మృదువుగాఁ గౌఁగిలించుచు మే నుప్పొంగి ముదుసలి స్త్రీలు చెప్పిన విధమునఁ జన్నులు గుడుపుచు - తరువాతి పద్యముతో నన్వయము

**చ తరమునఁ గన్గవల్ పొలయఁ దల్లి ముఖాబ్జము సూచు, నెమ్మనం**
**బరలఁ గుచాగ్ర మొయ్యన ముఖాబ్జమునం గబళించి పీల్చు, మై**
**గురువులువాఱఁ గేలఁ బుడుకుం, బెరమోవుల నవ్వు నింపుఁ బొం**
**పిరిగొనఁ గార్తికేయుఁడు కుభృత్సుత కుల్లము పల్లవింపఁగన్ 81**

**అర్థము .** కార్తికేయుఁడు = కుమారస్వామి, కుభృత్ + సుతకున్ = కొండకూఁతునకు - పార్వతికి, ఉల్లము = మనస్సు, పల్లవింపఁగన్ = చిగురింపఁగా-సంతోషము గలుగఁగా, తరమునన్ - క్రమముగా, కన్గవల్ = (కన్ను + కవల్) =

కన్నుల జంటలు, పొలయన్ = ప్రసరింపఁగా, తల్లి - ముఖ + అబ్జము = తల్లియొక్క ముఖపద్మము, చూచున్ నెమ్మనంబు (నెఱ - మనంబు) = నిండుమనస్సు, అరలన్ = వ్యాపింపఁగా, కుచ + అగ్రము = చనుమొన, ఒయ్యనన్= మెల్లఁగా, ముఖ + అబ్జమునన్ = ముఖపద్మముతో, కబళించి - పీల్చున్ = గ్రహించి పీల్చును, మై = శరీరము, గురువులు వాఱన్ = హర్షముచే నుప్పొంగఁగా, కేలన్ = చేతితో, పుడుకున్ = నిమురును, పెరమోవులన్ = తీయని పెదవులందు, పొంపిరిగొనన్ = అతిశయింపఁగా, నవ్వు, నింపున్ = నిండించును

**తాత్పర్యము** కుమారస్వామి తల్లియైన పార్వతికి హృదయమానందింపఁగా జూపులు ప్రసరింపఁజేసి యామె ముఖపద్మమును జూచుచు నెమ్మనము వ్యాపించునట్లు ఆమె చనుమొనను దన ముఖాబ్జముతో గ్రహించి పీల్చును ఆమె శరీరము హర్షముచే నుప్పొంగఁగాఁ జేతితో నిమురును తీయని పెదవులందు మిక్కిలిగా నవ్వు నింపును

**విశేషములు** అలంకారము స్వభావోక్తి

గీ **అగ్నిగర్భుఁడై కృత్తికలందుఁ బుట్టి**
**కొలన విడువఁబడి మగిడి గుహుఁడు వచ్చి**
**పార్వతీదేవి చన్నుల పాలు గుడిచెఁ**
**బాలు గల వారి నెమ్మెయిఁ బాపనగునె ?** **82**

**అర్థము .** గుహుఁడు = కుమారస్వామి, అగ్ని - గర్భుండు + ఐ = అగ్ని యొక్క గర్భము కలవాఁడై - అగ్ని గర్భమునందుఁ గలవాఁడయి, కృత్తికల + అందున్ = కృత్తికలయందు, పుట్టి, కొలనన్ = కొలనియందు, విడువఁబడి, మగిడి- వచ్చి = మరలివచ్చి, పార్వతీ - దేవి, చన్నుల-పాలు, కుడిచెన్ = త్రావెను పాలు - కలవారిన్ = భాగ్యము గలవారిని - అదృష్టవంతులను, ఎమ్మెయిన్ (ఏ + మెయిన్) = ఏ విధముగానైనను, పాపన్ + అగునె = నశియింపఁజేయశక్యమా ?

**తాత్పర్యము .** కుమారస్వామి అగ్నిగర్భుడయి, కృత్తికలందు జననమంది, కొలనిలో విడువఁబడి, మరల వచ్చి పార్వతీదేవి చనుఁబాలు త్రావెను ఇన్ని కష్టములు పడినను అతని కేమియుఁగాలేదు అదృష్టవంతులను ఏ విదముగను జెఱుప శక్యముగాదు

**విశేషములు .** అలంకార మర్థాంతరన్యాసము

వ అంత నంత వృత్తాంతంబునుం గని సురేశ్వరుండు పరమేశ్వరునకు దండప్రణామంబు సేసి 83

**అర్థము .** అంతన్, అంత - వృత్తాంతబునున్, కని, సుర + ఈశ్వరుండు= దేవేంద్రుఁడు, పరమేశ్వరునకున్, దండ - ప్రణామంబు + చేసి = సాష్టాంగ నమస్కారము చేసి

**తాత్పర్యము** అంత నంతవృత్తాంతమును గని దేవేంద్రుఁడు పరమేశ్వరునకు సాష్టాంగ నమస్కారము చేసి - తరువాతి పద్యముతో నన్వయము

చ **శరణు ! మహేశ ! భూరితర సార సుఖప్రద ! కామ కాల సం**
**హర ! భవరోగదారణ ! సురాసురవంద్య ! శరీర దుఃఖ దు**
**స్తర కమలాపహార హిమధామ ! సమస్తగ ! సోమదేవ ! వి**
**స్తరిత రమాదయారసయుతా యురులబ్ధవిభావనామయా !** 84

**అర్థము .** మహేశ, భూరితర = మిక్కిలి అధికము, చారు = మనోహరము అగు, సుఖ - ప్రద = సౌఖ్యము నిచ్చువాఁడా !, కామ - కాల - సంహర = మన్మథుని, యముని, సంహరించినవాఁడా !, భవ - రోగ - దారణ = సంసారమనెడి వ్యాధిని జీల్చువాఁడా !, సుర + అసుర - వంద్య = దేవతలచేతను, రాక్షసులచేతను నమస్కరింపఁదగినవాఁడా !, శరీర - దుఃఖ - దుస్తర - కమల + అపహార - హిమధామ = శరీరదుఃఖములనెడు దాఁటశక్యముకాని పద్మములను నశింపఁజేయు చంద్రుఁడా !, సమస్తగ = అన్నిటిని బొందువాఁడా !, సోమదేవ = ఈశ్వరదేవా !, విస్తరిత - రమా - దయా - రస - యుతా = అధికమైన సంపదతో, దయారసముతోఁ గూడినవాఁడా, ఉరు - లబ్ధ - విభావనా - మయా = అధికముగా పొందఁబడిన స్పష్టజ్ఞానముతో నిండినవాఁడా ! శరణు

**తాత్పర్యము .** మహేశ్వరా ! మిక్కిలి అధికము శ్రేష్ఠమునైన సౌఖ్యము నిచ్చువాఁడా ! మన్మథుని, యముని సంహరించినవాఁడా ! సంసారమనెడి రోగమును నశింపఁజేయువాఁడా ! దేవతలచేతను, రాక్షసులచేతను నమస్కరింపఁబడువాఁడా ! శరీరదుఃఖములనెడు పద్మములను నశింపఁజేయు చంద్రుఁడా !, అన్నిటిని బొందువాఁడా !, సోమదేవా ! విస్తృతమైన సంపదతో,

దయారసముతోఁగూడినవాఁడా! బాగుగాఁ బొందఁబడిన స్పష్ట జ్ఞానము గలవాఁడా! శరణు

**విశేషములు** ఈ పద్యమున నాగాదిబంధములలో నొకచిత్రము గలదని తోఁచుచున్నది 86 వ వచనములో 'నాగబంధ మురజబంధంబులం బ్రస్తుతించి' - యని కవియే చెప్పియున్నాఁడు కమలా విహార - లక్ష్మీదేవి విహరించునవి - పద్మములు

**నాగ మురజబందములు**

**క స్థిరమతి ! శుభసితమూర్తీ !**
**వర సుర నర దనుజ దురిత వనధి సుకీర్తీ !**
**హరదతి శుభయుతమూర్తీ !**
**స్మర పురహర తను భిదురిత జవన సుకీర్తీ ! 85**

**అర్థము .** స్థిర - మతి = స్థిరమైన మతిగలవాఁడా , శుభ - సిత - మూర్తీ = మంగళకరమైన తెల్లని ఆకారము గలవాఁడా ! వర - సుర - నర - దనుజ - దురిత - వనధి - సుకీర్తీ = శ్రేష్ఠులయిన దేవతలయు, నరులయు, రాక్షసులయు, పాపములనెడు సముద్రమునకు మంచి బురదయైనవాఁడా ! అనఁగా వారి పాపసముద్రమును ఇంకింపఁజేయువాఁడా ! అనుట, హరత్ + అతి - శుభ - యుత - మూర్తీ = హరించుచున్న = గ్రహించుచున్న, మిక్కిలి శుభములతోఁ గూడిన ఆకారముగలవాఁడా !, స్మర - పుర - హర - తను - భిదురిత - జవన - సుకీర్తీ = మన్మధుని, త్రిపురములను హరించునట్టి (నశింపఁజేయునట్టి), శరీరముచే వజ్రముగాఁ జేయఁబడిన వేగము సత్కీర్తిగలవాఁడా !

**తాత్పర్యము .** స్థిరమయిన మతిగలవాఁడా ! మంగళకరమైన తెల్లని ఆకారము గలవాఁడా ! దేవతలయు, మానవులయు, దానవులయు పాపములనెడి సముద్రమును ఇంకింపఁజేయువాఁడా ! మిక్కిలి శుభములతోఁగూడిన ఆకారము గలవాఁడా ! మన్మధుని, త్రిపురములను హరించునట్టి శరీరముచే వజ్రముగాఁజేయఁబడిన వేగము, సత్కీర్తి గలవాఁడా !

**విశేషములు :** దురిత వనధి సుకీర్తి - అలంకారము రూపకము

**వ అని నాగాభరణు నాగబంధ మురజబంధంబులం బ్రస్తుతించి యక్కుమారుండు తన్నేలినవాఁడని యెఱుంగక యజ్ఞానభావంబున నా**

చేసిన యపరాధంబు సహింపవలయునని భయస్థుండై వడవడ వడఁకుచున్న
సురపతికి నుమాపతి కరుణించి యభయహస్తం బిచ్చినంత నంత వృత్తాంతంబు
నెఱింగి 86

**అర్థము .** అని, నాగ + ఆభరణున్ = పాములు అలంకారములుగాఁ గలవానిని - శివుని, నాగబంధ - మురజ బంధంబులన్ = నాగబంధము, మురజబంధము అను చిత్రకవితావిశేషములచే, ప్రస్తుతించి = పొగడి, ఆ + కుమారుండు, తన్నున్ + ఏలినవాఁడు + అని = తన్ను రక్షించువాఁడని, ఎఱుఁగక, అజ్ఞాన - భావంబునన్ = తెలివిలేమిచే, నా - చేసిన - అపరాధంబున్ = నేనుజేసిన తప్పును, సహింపవలయును + అని, భయస్థుండు + ఐ, వడవడ, వడఁకుచున్ = ఉన్న - సురపతికిన్, ఉమా - పతి = పార్వతీభర్త = శివుఁడు, కరుణించి, అభయ-హస్తంబు + ఇచ్చెన్, అంతన్, అంత - వృత్తాంతంబున్, ఎఱింగి

**తాత్పర్యము .** అని శివుని నాగబంధ మురజబంధములచేఁ బ్రస్తుతిచేసి, 'ఆ కుమారుఁడు 'నన్ను రక్షించువాఁడని యెఱుఁగక అజ్ఞానముచే నేను జేసిన తప్పును సైఁపవలయు' నని భయముతో వడవడ పడఁకుచున్న దేవేంద్రున కీశ్వరుఁడు కరుణించి అభయహస్త మొసఁగెను అంత అంత వృత్తాంతము నెఱిఁగి - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** నా చేసిన - నేను జేసిన - నా యొక్క చేసిన - ప్రౌఢ కారక 15 నా చేసిన - ప్రౌఢ కారక 16

మ గరుడాండస్ఫురితేంద్రచాప, మతి చక్రద్యోతి విద్యుద్గణం,
బురుశంఖారవ గర్జనం బులియ, వాయుప్రేరితం బొప్పుతో
హరి నీలాభ్రము వచ్చి నిల్చె రజతోద్యత్పర్వతోత్తుంగశృం
దర, భాగంబునఁదత్తటస్థమదవేదండంబొ నా నందమై 87

**అర్థము :** గరుడాండ - స్ఫురిత + ఇంద్రచాపము = గరుత్మంతుఁడనెడి ప్రకాశించు ఇంద్రధనుస్సు గలది, అతి - చక్ర - ద్యోతి - విద్యుత్ + గణంబు = అధికమయిన సుదర్శనచక్రాయుధకాంతులనెడి మెఱపుల గుంపు గలది, ఉరు-శంఖ + ఆరవ - గర్జనంబు = గొప్ప పాంచజన్య శంఖ ధ్వనియనెడి ఉఱుము గలది, వాయు - ప్రేరితంబు = గాలిచేఁ బురికొల్పఁబడినది (అగు), హరి - నీల + అభ్రము= విష్ణువనెడి నల్లని మేఘము, ఒప్పుతోన్, ఉలియన్ = ధ్వనింపఁగా,

రజత+ ఉద్యత్ + పర్వత + ఉత్తుంగ - కందర - భాగంబునన్ = వెండికొండ (కైలాసము) యొక్క ఎత్తయిన కనుమ ప్రదేశమునందు, తద్ + తటస్థ - మద - వేదండంబో = ఆ కొండచఱియయందున్న మత్తేభమా, నాన్ = అనఁగా, అందము+ ఐ = సుందరమయి, వచ్చి, నిల్చెన్

**తాత్పర్యము** గరుత్మంతుఁడనెడి ఇంద్రధనుస్సు గలది, అధికమగు సుదర్శనచక్రకాంతియనెడు మెఱపుల గుంపు గలది, గొప్ప పాంచజన్యశంఖధ్వని యనెడు ఉఱుముగలది అగు విష్ణువనెడి నల్లనిమేఘము కైలాసపర్వతమునందలి ఎత్తయిన గుహాప్రదేశమున ఆ కొండచఱియయందుండు మదగజమా యన వాయుప్రేరితమై ధ్వనింపఁగా వచ్చి నిలిచెను

**విశేషములు.** అలంకారము రూపకానుప్రాణితోత్ప్రేక్ష వేదండ - వేద + అండ - పరరూపసంధి శకంధ్వాది గణములోనిది పూర్వపదాంతస్వరమునకు లోపము వచ్చినది

**మ శతపత్రోత్థ విమానవేగ కలహంసవ్రాత వాగ్వల్లకీ**
**శ్రుతిగేయాది సమస్తవేదవిధి సంస్తోత్రాదిరాగంబుతో**
**నతిరాగాత్మ తనుప్రభాసమున బ్రహ్మాండోదరంబెల్లఁ బూ**
**రితమై మ్రోసి వెలుంగ వచ్చె నుతనీరేజాసనుం డర్థితోన్. 88**

**అర్థము** నుత - నీరేజాసనుండు = పొగడఁబడిన పద్మాసనుఁడు (బ్రహ్మ), శత రాగంబుతోన్, శతపత్ర = తామరపూలనుండి, ఉత్థ = లేచినట్టియు, విమాన - వేగ = విమానముయొక్క వేగము గలట్టియు, కలహంస - వ్రాత = రాయంచల సమూహము యొక్కయు, వాచ్ (క్) = సరస్వతీదేవి యొక్క, వల్లకీ = వీణయొక్కయు, శ్రుతి = సుతియొక్కయు, గేయ + ఆది = గేయములు మున్నగు వానియొక్కయు, సమస్త= ఎల్ల, వేద - విధి = వేదవిధానము, సంస్తోత్ర + ఆది = సంస్తుతులు మున్నగువానియొక్క, రాగంబుతోన్ = సంగీతముతో, అతి - రాగ + ఆత్మ - తను - ప్రభాసమునన్ = అధికమైన యెఱుపుగల తనయొక్క శరీరముయొక్కకాంతితోను, బ్రహ్మాండ + ఉదరంబు + ఎల్లన్ = బ్రహ్మాండ గర్భమంతయు, పూరితము + ఐ = నిండినదయి, మ్రోసి = ధ్వనించి, వెలుంగన్= ప్రకాశింపఁగా, అర్థితోన్ = కోరికతో, వచ్చెన్

**తాత్పర్యము.** తామరపూలనుండి లేచినట్టియు, విమానవేగము గలట్టియు రాజహంసముల సమూహముయొక్కయు, సరస్వతి వీణయొక్క సుతి, గేయములు

మున్నగువానియొక్కయు, ఎల్లవేదవిహితములయిన సంస్తుతులు మున్నగువానియొక్కయు రాగముతోను, మిక్కిలి యెట్టిదైన తన శరీరకాంతితోను బ్రహ్మాండగర్భమెల్లనిండి ప్రకాశింపఁగాఁ గోరికతో బ్రహ్మ వచ్చెను

**వ ఇ ట్లంబుజనాభాంబుజాసనప్రముఖాఖిలభువనభవనాధీశ్వరులు పరమేశ్వరాచలంబునకుం జనుదెంచి మహోత్సాహంబునఁ బుత్త్రోత్సవంబు సేసి రంతం బరమేశ్వరుం డనురాగంబునం దనకుఁ బ్రత్యక్షంబైయున్న కన్నెఱింగి హరి పరమేష్ఠి పురందర ప్రబోధితుండై సురగురుం డఖిలజగద్గురునకుం గృతాంజలియై 89**

**అర్థము.** ఇట్లు, అంబుజ - నాభ ---ధీశ్వరులు అంబుజ - నాభ = తామరపూవు నాభియందుఁగలవాఁడు - విష్ణువు, అంబుజ + ఆసన = తామరపువ్వు పీఠముగాఁగలవాఁడు - బ్రహ్మ ప్రముఖ = మున్నగు, అఖిల = ఎల్ల, భువన - భవన= లోకములనెడి భవనములకు, అధి + ఈశ్వరులు = అధిపతులు, పరమేశ్వర + అచలంబునకున్= ఈశ్వరుని కొండకు - కైలాసమునకు, చనుదెంచి= వచ్చి, మహత్ (మహా) + ఉత్సాహంబునన్ = మిక్కిలి ఉత్సాహముతో, పుత్త్ర = ఉత్సవంబు = కొడుకుపుట్టినప్పటి పండువు, చేసిరి అంతన్, పరమేశ్వరుండు అనురాగంబునన్ = ప్రేమముతో, తనకున్, ప్రత్యక్షంబు + ఐ, ఉన్న, కన్నెఱింగి = జాడతెలిసి, హరి - పరమేష్ఠి - పురందర - ప్రబోధితుండు + ఐ = విష్ణు బ్రహ్మేంద్రులచే మేలుకొలుపఁబడినవాఁడయి (పురికొలుపఁబడినవాఁడయి), సుర - గురుండు = దేవతల గురువు (బృహస్పతి), అఖిల - జగత్ + గురునకున్= ఎల్లలోకముల గురువు అగు శివునకు, కృత + అంజలి + ఐ = నమస్కరించినవాఁడయి

**తాత్పర్యము.** ఇట్లు విష్ణువు, బ్రహ్మ మున్నగు నెల్లలోకముల ప్రభువులు కైలాసమునకు వచ్చి మహోత్సాహముతోఁ బుత్త్రోత్సవము చేసిరి అంత నీశ్వరుఁ డనురాగముతోఁ దనకుఁ బ్రత్యక్షమయియున్న జాడతెలిసి విష్ణు బ్రహ్మేంద్రులచేఁ బురికొలుపఁబడిన వాఁడయి బృహస్పతి సకలలోకగురు వగుశివునకు నమస్కరించి - తరువాతి పద్యముతో నన్వయము

## బృహస్పతికృత దారిద్ర్యవిద్రావణ స్తవము

**శా శ్రీరామేశ కవీశ్వరాదు లెద నీ శ్రీపాదముల్ భక్తితో
నారాధించి సమస్తలోకసముదాయాధీశులైరన్న సం
సారుల్ దుఃఖనివారణార్థ మభవున్ సర్వేశు లోకత్రయా
ధారున్ నిన్ మదిఁ గొల్వకున్కి యుఱవే దారిద్ర్యవిద్రావణా ! 90**

**అర్థము** దారిద్ర్య - విద్రావణా + = లేమిని దఱిమివేయువాఁడా ! శ్రీ - రామా + ఈశ - కవి + ఈశ్వర + ఆదులు = లక్ష్మీదేవి భర్తయగు విష్ణువు, ప్రభువైన బ్రహ్మ మున్నగువారు - శ్రీరామేశుఁ డనుకవీశ్వరుఁడు సూచింపఁబడియెనా?, ఎదన్ = హృదయమునందు, నీ - శ్రీ - పాదముల్ = నీ దివ్యములైన పాదములు, భక్తితోన్, ఆరాధించి = పూజించి, సమస్త - లోక సముదాయ + అధి + ఈశులు = సకలలోకముల సమూహమునకుఁ బ్రభువులు, ఐరి, అన్నన్ = అనఁగా, సంసారుల్ = గృహస్థులు, దుఃఖ -నివారణ + అర్థము = దుఃఖము పోవుటకొఱకు, అభవున్ = పుట్టుకలేనివాఁడును, సర్వ + ఈశున్ = సర్వేశ్వరుఁడును, లోక - త్రయ + ఆధారున్ = ముల్లోకములకు ఆధారమయినవాఁడును, అగు, నిన్ = నిన్ను, మదిన్ = మనస్సునందు, కొల్వక+ ఉన్కి = కొలువకుండుట, ఉఱవే = ఉచితమా ?

**తాత్పర్యము .** దారిద్ర్యమును దఱిమివేయువాఁడా ! ఈశ్వరా ! విష్ణువు, బ్రహ్మ మున్నగువారు హృదయమున నీ దివ్యపాదములను భక్తితో ఆరాధించి యెల్ల లోకముల సమూహమునకును బ్రభువులయి రనఁగా, సంసారులు తమ దుఃఖములు పోఁగొట్టుకొనుటకు అభవుఁడవును, సర్వేశ్వరుఁడవును, ముల్లోకములకు ఆధారభూతుఁడవును అగు నిన్ను మనసులో సేవింపకుండుట యుచితమా ?

మ    **మలినుండై కడు డస్సి క్రుస్సి మది నున్మత్తాకృతిం దేజముం**<br>
**దలయుం జీరయుఁ దోడు వీడ జడుఁడై దైన్యంబునంబొంది దు**<br>
**ర్బలుఁడై మెచ్చనివారి వేఁడఁజను దుర్భాగ్యాత్ముఁడున్ ని న్నెదం**<br>
**దలఁపంగాంచి సురేంద్రుఁడై వెలయఁడే దారిద్ర్యవిద్రావణా ! 91**

**అర్థము .** దారిద్ర్యవిద్రావణా ! మలినుండు + ఐ = పాపుఁడయి, కడున్ = మిక్కిలి, డస్సి = అలసి, క్రుస్సి = కృశించి, మదిన్ = మనస్సునందు, ఉన్మత్త+ ఆకృతిన్ = గర్వించినవానివిధమున, తేజమున్, తలయున్ = ధైర్యమును, చీరయున్ = వస్త్రమును, తోడున్ = సహాయుఁడును, వీడన్ = విడువఁగా, జడుఁడు+ ఐ = మంధుఁడయి, దైన్యంబునన్ + పొంది = దుఃఖమును బొంది, దుర్బలుఁడు +ఐ = బలహీనుఁడయి, మెచ్చని - వారిన్ = ఇష్టములేనివారిని, వేఁడన్ + చను = వేఁడుటకుఁబోవు, దుర్భాగ్యాత్ముఁడున్ = దౌర్భాగ్యుఁడును, నిన్నున్, ఎదన్ = హృదయమునందు, తలఁపన్ + కాంచి = తలఁపఁగని, సుర + ఇంద్రుఁడు+ ఐ= దేవపతియై, వెలయఁడే = ప్రకాశింపఁడా !

**తాత్పర్యము .** దారిద్ర్యవిద్రావణా - శివా ! పాపాత్ముఁడయి, మిక్కిలి బడలి, కృశించి, గర్వితుఁడై, దైన్యమును బొంది, బలహీనుఁడై, ఇష్టములేనివారిని

వేఁడఁబోవు దౌర్భాగ్యుఁడు కూడ నిన్ను హృదయమునఁ దలఁపఁగని దేవేంద్రుఁడై ప్రకాశింపఁడా ?

మ భయరోగార్తిమహాతురౌఘచయమున్ బాయున్ ముదంబొందు ని
ర్భయకల్యాణసుశాంతి సంపద సుఖప్రాప్తుండగున్ దుఃఖసం
క్షయమై కర్మనిబంధనాపహరమై సౌఖ్యాత్ముఁడై ముక్తుఁడౌ
దయ నీవెవ్వనిఁజూతు వాఁడు భువిలో దారిద్ర్యవిద్రావణా ! 92

**అర్థము .** దారిద్ర్యవిద్రావణా ! నీవు, దయన్ = దయతో, ఎవ్వనిన్ = ఎవనిని, చూతు = చూతువు, వాఁడు, భువిలోన్ = భూమియందు, భయ - రోగ+ ఆర్తి - మహత్ (మహా) + ఆతుర + ఓఘ - చయమున్ = భయము, వ్యాధి, బాధ, గొప్ప పీడల సమూహమును, పాయున్ = వీడును, ముదంబు + ఒందున్ = సంతోషమును బొందును, నిర్భయ - కళ్యాణ - సుశాంతి - సంపదన్ = భయములేమి, శుభములు, మంచిశాంతి అను సంపదచే, సుఖ - ప్రాప్తుండు = సౌఖ్యమునందినవాఁడు, అగున్ = అగును, దుఃఖ-సంక్షయము + ఐ = దుఃఖనాశనమయి, కర్మ - నిబంధన + అపహరము + ఐ = కర్మబంధనములు నాశనమయి, సౌఖ్య + ఆత్ముఁడు + ఐ = సుఖియై, ముక్తుఁడు = మోక్షమునందినవాఁడు, ఔన్ = అగును

**తాత్పర్యము :** దారిద్ర్యవిద్రావణా ! ఈశ్వరా !, నీవు దయతో నెవ్వనిని జూతువో వాఁడు భువిలో భయము, రోగము, బాధ, పీడ అనువాని సమూహమును వీడును దుఃఖనాశనమయి కర్మబంధములు నశించి సుఖియై మోక్షమును బొందును

మ వరదుం డీశుఁడు భక్తవత్సలుఁడు దేవవ్రాతసేవ్యుండు శం
కరుఁ డానందుఁ డనాథనాథుఁడని లోకంబెల్ల సద్భక్తిత
త్పరులై సార్థకనామధేయ మహిమోద్దామస్థితున్ నిన్ను దు
స్తరదుఃఖాపనయార్థ మర్థిఁ గొలుతుర్ దారిద్ర్యవిద్రావణా ! 93

**అర్థము :** దారిద్ర్యవిద్రావణుఁడవగు నో శివా !, వరదుండు = వరముల నొసఁగువాఁడు, ఈశుఁడు = ప్రభువు, భక్త - వత్సలుఁడు = భక్తులయెడ వాత్సల్యము గల్గవాఁడు, దేవ - వ్రాత - సేవ్యుండు = దేవతల సమూహముచే సేవింపఁదగినవాఁడు, శంకరుఁడు = శుభములను జేయువాఁడు, ఆనందుఁడు = ఆనందము గలవాఁడు, ఆనాథ - నాథుఁడు = దిక్కులేనివారికి దిక్కు, అని, లోకంబు + ఎల్లన్ = జను లందఱును సత్ + భక్తి - తత్పరులు + ఐ = మంచి

భక్తి పరులయి, సార్ధక - నామధేయ - మహిమ + ఉద్దామ - స్థితున్ = శంకర - శివ అను అర్ధవంతములైన పేరులు గలిగి మహిమముచే ఉత్తమస్థితియందున్న వానిని, నిన్నున్, దుస్తర - దుఃఖ + అపనయ + అర్థము = దాఁటరాని దుఃఖములు పోవు నిమిత్తము, అర్థిన్ = కోరికతో, కొలుతుర్ = సేవింతురు

**తాత్పర్యము** . దారిద్ర్యవిద్రావణుఁడవైన శివా ! వరదాయి, ఈశుఁడు, భక్తవత్సలుఁడు, దేవతాసేవ్యుఁడు, శంకరుఁడు, ఆనందుఁడు, అనాథనాథుఁడు అని జనులందఱు సద్భక్తిపరులయి సార్ధకనాముఁడవును, మహిమముచే నుద్దాముఁడవును, అగు నిన్ను దుస్తరదుఃఖములు పోవుకొఱకుఁగోరి కొలుతురు

**విశేషములు** . కొలుతుర్ - కొలుతురు - 'పదాంతంబులయి యసంయుక్తంబులయిన ను లు రు ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు ' బాల ప్రకీర్ణక 16

మ మనమారంగఁ ద్రుటిక్షణంబయిన నిన్ మర్త్యుండు భావించి దు
ర్జనుఁడున్ సజ్జనుఁ డౌను, దుఃఖపరుఁడున్ సౌఖ్యాత్ముఁడై
ఘనుఁడౌ, మూర్ఖును బండితుం డగు, మహాకష్టుండు శిష్టుం డగున్,
ధనహీనుండు ధనేశుఁడౌ జగమునం దారిద్ర్యవిద్రావణా ! 94

**అర్థము** · దారిద్ర్యవిద్రావణా!, ఓ శివా ! జగమునన్ = లోకమున, మనము+ ఆరంగన్ = మనఃపూర్తిగా, త్రుటి - క్షణంబు + అయినన్ = అత్యల్పకాలమయినను, నిన్ = నిన్ను, మర్త్యుండు = మనుష్యుఁడు, భావించి = తలఁచి, (తలఁచినచో), దుర్జనుఁడున్ = దుష్టుఁడును, సత్ + జనుఁడు + ఔను= మంచివాఁడగును, దుఃఖ - పరుఁడున్ = శోకాత్ముఁడును, సౌఖ్య + ఆత్ముఁడు + ఔన్ = సుఖవంతుఁ డగును, అల్పుఁడును = హీనుఁడును, ఘనుఁడు + ఔన్ = అధికుఁ డగును, మూర్ఖును = మూర్ఖుఁడును, పండితుండు + అగున్ = విద్వాంసుఁ డగును, మహత్ (మహా) + కష్టుండున్ = గొప్ప పాపియును, శిష్టుండు+ అగున్= పుణ్యాత్ముఁ డగును, ధనహీనుండున్ = డబ్బులేనివాఁడును, ధన + ఈశుఁడు + ఔన్= కుబేరుఁ డగును

**తాత్పర్యము:** దారిద్ర్యవిద్రావణుఁడవయిన ఓ శివా ! జగమున మనఃపూర్తిగా అత్యల్పకాలమయినను నిన్ను మనుష్యుఁడు భావించినచో, దుర్జనుఁడైనను సజ్జనుఁ డగును దుఃఖితుఁడును సుఖితుఁ డగును, అల్పుఁడును ఘనుఁ డగును

మూర్ఖుఁడును విద్వాంసుఁడగును, మహాపాపియును పుణ్యాత్ముఁడగును, ధనహీనుఁడును గుబేరుఁడగును

**విశేషములు .** మూర్ఖ (రూపాం ) మూర్ఖుఁడు 'వృద్ధాదుల డుజ్జునకు లోపము విభాషనగు ' బాల తత్సమ 56 అగును - అవును - ఔను 'పదాద్యంబయి యసంయుక్తంబయిన గకారంబునకు వకారంబు విభాష నగు ' బాల ఆచ్ఛిక 27 అవును 'ఆచ్ఛికంబులం దయి యవులకు వక్రతమంబులు బహుళంబుగా నగు ' బాల క్రియ 103 ఔను త్రుటిక్షణంబయిన - ఇది మా రా ప్రతిపారము తక్కిన ప్రతులలో 'ఒక్క క్షణంబయిన' అని కలదు అందు 'క్ష' పూర్వాక్షరమును గురువెట్లు చేయునో తెలియదు అందుచే 'త్రుటిక్షణంబయిన' అనుపారమే స్వీకరింపఁబడినది కాని త్రుటి - క్షణము ఇంచుమించు సమానార్థకములే సజ్జన - సత్ + జన

**మ నిధిసంఘంబు నిధానముల్ మణిగణానీకంబు మంత్రంబు లౌ**
**షధముల్ భూరిరసాయనంబు రస మా స్పర్శాదివేధుల్ సకా**
**మధుగోఘంబులు కల్పవృక్షములు తన్మాహాత్మ్య మూహింపఁ జం**
**ద్రధరా ! మీ కరుణాబ్ధిఫేనలవముల్ దారిద్ర్యవిద్రావణా ! 95**

**అర్థము :** దారిద్ర్య విద్రావణా ! చంద్ర - ధరా = చంద్రుని దాల్చినవాఁడా, శివా ! నిధి - సంఘంబు= నిధుల సమూహము, నిధానముల్ = బొక్కసములు, మణి - గణ + అనీకంబు = మణుల సమూహముల గుంపులు, మంత్రంబులు, ఔషధముల్, భూరి - రసాయనంబు = అధికమయిన జీవనౌషధములు, రసము, ఆ - స్పర్శ + ఆది - వేధుల్ = ఇనుమును బంగారము చేయు రసశిలా విశేషములు, స- కామధుక్ + ఓఘంబులు = కామధేనువుల సమూహముతోఁ గూడిన, కల్పవృక్షములు, తద్ + మాహాత్మ్యము = వానిగొప్పతనము, ఊహింపన్ = తలఁపఁగా, మీ - కరుణా + అబ్ధి - ఫేన - లవముల్ = మీ దయ యనెడి సముద్రమునందలి నురుఁగు లేశములు

**తాత్పర్యము .** దారిద్ర్యవిద్రావణా ! శివా! నిధుల సమూహము, కోశాగారములు, మణుల సమూహము, మంత్రములు, ఔషధములు, గొప్ప జీవనౌషధము, రసము, పరుసవేదులు, కామధేనువుల సమూహములు, కల్పవృక్షములు - అనువాని మాహాత్మ్యమూహింపఁగా మీ దయా సముద్రమునందలి నురువులేశములు

**విశేషములు .** అలంకారము రూపకము

మ నలి నాత్మవ్యవ సాయవాదులును, గన్యావాదులున్, మంత్రవా
దులు, దివ్యౌషధవశ్యధాతు రసవాదుల్ మోహులై తద్దయా
కులతం బొందుదు రెల్ల, నె ట్లివియ కోర్కుల్ కూర్చు మున్ భక్తవ
త్సల ! సర్వేశ్వర! నిన్నుఁ గొల్వ కెదలో దారిద్ర్యవిద్రావణా ! 96

**అర్థము .** దారిద్ర్యవిద్రావణా !, భక్త వత్సల = భక్తులయెడ వాత్సల్యము గలవాఁడా !, సర్వేశ్వర ! నలిన్ = ఉత్సాహముతో, ఆత్మ - వ్యవసాయ - వాదులును = తామే ముఖ్యమనువారును - కపట వేదాంతులును, వ్యవసాయమున నపూర్వమార్గముల నుపదేశించి ఫలాధిక్యముఁ జూపుదుమనెడు కపటదేశికులును, కన్యావాదులున్ = కన్యలఁదెచ్చి వివాహము చేయించి ద్రవ్యమునుగొనువారును మంత్రవాదులున్ = మంత్రములచే నన్నిటిని సాధింతుమనువారును, దివ్య + ఔషధ - వాదులు = రసాయనౌషధములచేఁ జిరంజీవులుగాఁ జేయుదు మనువారును, వశ్యవాదులు = ఇతరులను వశీకరింతుమనువారును, ధాతు వాదులున్ = తాళక హింగుళాది ధాతువుల రూపాంతరములఁ గల్పించువారును, రసవాదుల్ = పాదరసమును కట్టి బంగారమును జేయుదుమనువారును, ఎల్లన్ = అందఱును, మోహులు + ఐ = అజ్ఞానులయి, తద్ద = మిక్కిలి, ఆకులతన్ = కలఁతను, పొందుదురు, మున్ = ముందు, నిన్నున్, ఎదలోన్ = హృదయమున, కొల్వక = సేవింపక, ఇవి + అ = ఇవియ = ఇవియే, ఎట్లు, కోర్కుల్, కూర్చున్

**తాత్పర్యము .** దారిద్ర్యవిద్రావణా ! భక్తవత్సలా, సర్వేశ్వరా ! ఆత్మవాదులును, వ్యవసాయవాదులును, కన్యావాదులును, మంత్రవాదులును, దివ్యౌషధవాదులును, వశ్యవాదులును, ధాతువాదులును, రసవాదులును అందఱును అజ్ఞానులయి మిక్కిలి కలఁతఁజెందెదరు ముందు నిన్ను హృదయమున సేవింపక ఇవియే యెట్లు కోరికలు దీర్చును ? తీర్చ వనుట

శా **కారుణ్యాత్మకు నిన్ను మానవుఁ డెదం గామించి సేవించి దు**
**ర్వారాపారసుఖంబు, నుత్తమగుణవ్రాతంబు సత్కీర్తియుం**
**బారావార పరీత భూతలము నిర్బాధంబుగా నేలు వి**
**స్తారైశ్వర్యముఁ బొందు నీ దయ మహిన్ దారిద్ర్యవిద్రావణా! 97**

**అర్థము.** దారిద్ర్య విద్రావణా !, కారుణ్య + ఆత్మకున్ = దయాస్వరూపుని, నిన్నున్, మానవుఁడు, ఎదన్ = హృదయమున, కామించి = కోరి, సేవించి,

దుర్వార+ అపార - సుఖంబున్ = అడ్డగింపరాని, అధికసుఖమును, ఉత్తమ - గుణ - వ్రాతంబున్ = శ్రేష్ఠములయిన సద్గుణముల సమూహమును, సత్ + కీర్తియున్ = మంచి కీర్తియును, పారావార - పరీత - భూతలమున్ = సముద్రము చేఁ జుట్టఁబడిన భూతలమును, నిర్బాధంబుగాన్ = బాధలేకుండ, ఏలున్ = పాలించును, నీ - దయన్ = నీ దయచే, మహిన్ = భూమియందు, విస్తార + ఐశ్వర్యమున్ = అధికమయిన సంపదను, పొందున్

**తాత్పర్యము .** దారిద్ర్యవిద్రావణా ! దయామయుఁడవయిన నిన్ను మనుష్యుఁడు హృదయములోఁ గోరి సేవించి అడ్డగింపరాని అధికసుఖమును, శ్రేష్ఠములయిన సద్గుణముల సమూహమును, సద్యశమును, సముద్రముచేఁ జుట్టఁబడిన భూతలమును, నిర్బాధముగా నేలును నీ దయచేత భూమియందు అధికైశ్వర్యము నందును

**శా సారాచారవిచారదక్షు లమలజ్ఞానక్షణోద్వీక్షణ**
**ప్రారంభాత్మకు లాత్మ నిన్ను నెనయన్ భావించి దుర్వారసం**
**సారాంభోనిధి పారమెయ్ది సుమహత్సౌఖ్యాత్ములై మర్త్యు లా**
**ధారాధేయ విముక్తియుక్తు లగుదుర్ దారిద్ర్యవిద్రావణా ! 98**

**అర్థము .** దారిద్ర్యవిద్రావణా !, సార + ఆచార - విచార - దక్షులు = శ్రేష్ఠములయిన నడవడులను గూర్చిన ఆలోచనమందు సమర్థులును, అమల - జ్ఞాన - క్షణ + ఉత్ + వీక్షణ - ప్రారంభ + ఆత్మకులు = నిర్మలమైన జ్ఞానముతో క్షణములో విమర్శించి చూచు ప్రయత్నము గలవారు, ఆత్మన్ = మనసునందు, నిన్నున్, ఎనయన్ = పొందుటకు, భావించి = తలఁచి, దుర్వార - సంసార + అంభోనిధి - పారము = అడ్డులేని సంసారసముద్రము నావలియొడ్డును, ఎయ్ది = పొంది, మర్త్యులు = మనుష్యులు, సుమహత్ + సౌఖ్య + ఆత్ములు + ఐ = మిక్కిలి గొప్ప సౌఖ్యమునందువారయి, ఆధార + ఆధేయ - విముక్తి - యుక్తులు = దేహజీవాత్మరూపసంబంధము వదలి, పరమాత్మను బొందుదురు

**తాత్పర్యము .** దారిద్ర్యవిద్రావణా !, సారములైన ఆచారములను గూర్చి ఆలోచించుటలో సమర్థులైనవారును, నిర్మలజ్ఞానముచే క్షణములో విమర్శించి చూచు ప్రయత్నము చేయువారును, నిన్నుఁబొందుటకు ఆత్మలో భావించి దుర్వారమైన సంసారసముద్రము నావలియొడ్డును బొంది, మిక్కిలి గొప్ప సౌఖ్యమునంది, దేహాత్మ రూప సంబంధమును వదలి, పరమాత్మను బొందుదురు

**విశేషములు** అలంకారము రూపకము

మ భువి నీ రాజ్యవిభూతు లున్నతులు సద్భోగోపభోగావళుల్
శివలోకాది విశేషలోక సుఖముల్ సేవ్యంబుగాఁ బార్వతీ
ధవ కారుణ్యము సేయు భక్తిపరులై దారిద్ర్యవిద్రావణ
స్తవ మర్థిం బఠియించు మానవులకున్ దారిద్ర్యవిద్రావణా ! 99

**అర్థము .** దారిద్ర్యవిద్రావణా ! పార్వతీ - ధవ = పార్వతీపతి యగు శివునియొక్క, కారుణ్యము = దయ భక్తి - పరులు + ఐ = భక్తియం దాసక్తి గలవారయి, దారిద్ర్య - విద్రావణ - స్తవము = దారిద్ర్యవిద్రావణస్తోత్రము, అర్థిన్= కోరికతో, పఠియించు = చదువునట్టి, మానవులకున్ = మనుష్యులకు, భువిన్ = భూమియందు, ఈ - రాజ్య - విభూతులు = ఈ రాచఱికపు సంపదలు, ఉన్నతులు= ఔన్నత్యములు, సత్ + భోగ + ఉపభోగ + అవళుల్ = ఉత్తమ భోగములు ఉపభోగములు అనువాని సమూహములు, శివ - లోక + ఆది - విశేష-లోక - సుఖముల్ = శివునిలోకము మున్నగు విశిష్టలోకముల సౌఖ్యములు, సేవ్యంబుగాన్ = సేవింపఁదగినట్లుగా, చేయున్

**తాత్పర్యము .** దారిద్ర్యవిద్రావణా ! శివా ! భక్తితో దారిద్ర్యవిద్రావణ స్తవమును గోరి పఠించు మానవులకు నీ యనుగ్రహము భూలోకమున నీ రాచఱికపు సంపదలు, ఔన్నత్యములు, సద్భోగములు ఉపభోగములును శివలోకము మున్నగు విశేషలోకముల సౌఖ్యములును సేవింపఁదగినవిగాఁ జేయును

వ అని స్తుతియించిన నమరేంద్రునకుం గరుణించి వరదుండు నీ కోరిన వరంబ యిచ్చెద వేఁడికొమ్మనిన మహాప్రసాదంబని 100

**అర్థము .** అని, స్తుతియించినన్ = స్తోత్రముచేయఁగా, అమర + ఇంద్రునకున్ = దేవేంద్రునకు, కరుణించి = దయఁజూపి, వరదుండు = వరదాత - శివుఁడు, నీ - కోరిన - వరంబు + అ = నీవు కోరిన వరమే, ఇచ్చెదన్, వేఁడికొమ్ము, అనినన్, మహాప్రసాదంబు + అని

**తాత్పర్యము.** అని స్తోత్రము చేయఁగా నీశ్వరుఁడు దేవేంద్రుని అనుగ్రహించి 'నీవు కోరిన వరము నొసఁగెదను కోరుకొను' మనిన నింద్రుఁడు 'మహాప్రసాద' మని తరువాతి పద్యముతో నన్వయము

క కలహమున సురలు తారకు
ప్రళయానలరూప ముదరిపడి యొక్కొ కమా
ర్దలఁచిన మీసలు గడ్డము
నులివాళులు వాడుచుండు నొందిన భీతిన్ 101

**అర్థము** కలహమునన్ = యుద్ధమునందు, సురలు = దేవతలు తారకు- ప్రళయ + అనల - రూపము = తారకాసురునియొక్క ప్రళయకాలపు అగ్నివంటి రూపు, ఉదరిపడి = భయపడి, ఒక్క + ఒక - మాటే = ఒక్కొక్కసారి, తలంచినన్ = తలంపఁగా, ఒందిన - భీతిన్ = కలిగిన భయముచే, మీసలున్ = మీసములును, గడ్డమున్, ఉలివాళులు - వాడుచున్ + ఉండున్ = ఇంచుక వాడుచుండును

**తాత్పర్యము .** యుద్ధమున దేవతలు తారకాసురుని ప్రళయ సమయానలమువంటి ఆకారమును ఒక్కొక్కమాఱు తలఁప నులికిపడి భయమునొందఁగా మీసములును గడ్డమును ఇంచుకవాడుచుండును

**విశేషములు.** మీసలు - మీసము + లు 'బహువచనంబు పరంబగునపు డావు ప్రభృతుల తుది యక్షరంబునకు లోపంబు విభాష నగు బాల ఆచ్ఛిక 22 (రూ ) మీసములు

**వ అని యనేకప్రకారంబులం దారకాపరాధంబు విజ్ఞాపించి తన్నిమిత్తంబు మాచేసిన యత్నంబుగా నిక్కుమారుం డుదయించె నింక మీ రిక్కుమారు నమరసేనాధీశ్వరుంజేసి తారకు నిర్జింపం బంపవలయునని పరమేష్ఠి పురందరసహితంబుగా సాష్టాంగంబెఱఁగియున్నం గని కరుణించి గిరిజానుమతంబునం బరమేశ్వరుండు వారికోరినవరంబు దయచేసిన మహాప్రసాదంబని. 102**

**అర్థము .** అని, అనేక - ప్రకారంబులన్ = పెక్కు విధముల, తారక + అపరాధంబు = తారకాసురుని నేరము, విజ్ఞాపించి = విన్నవించి, తద్ + నిమిత్తంబు = దాని కొఱకు, మా - చేసిన = మే మొనర్చిన, యత్నంబుగాన్, ఇక్కుమారుండు (ఈ + కుమారుండు), ఉదయించెన్ = పుట్టెను, ఇంకన్, మీరు, ఇక్కుమారున్, అమర - సేనా + అధి + ఈశ్వరున్ = దేవతల సేన యొక్క నాయకునిగా, చేసి, తారకున్ = తారకుని, నిర్జింపన్ = ఓడించుటకు, పంపవలయున్, అని, పరమేష్ఠి - పురందర - సహితంబుగాన్ = బ్రహ్మేంద్రులతోఁగూడ, సాష్టాంగంబు + ఎఱఁగి + ఉన్నన్ = సాష్టాంగనమస్కారము చేసియుండఁగా, కని, కరుణించి = దయఁజూచి, గిరిజా + అనుమతంబునన్ = పార్వతీ దేవి సమ్మతితో, పరమేశ్వరుండు, వారి - కోరిన - వరంబు = వారు కోరిన వరంబు, దయచేసినన్= అనుగ్రహింపఁగా, మహాప్రసాదంబు + అని

**తాత్పర్యము .** అని పెక్కు విధములఁ దారకుని నేరమును విన్నవించి, 'అందుకొఱకు మేము చేసిన యత్నముగా నీ కుమారుఁ డుదయించెను ఇంక మీరు ఈ కుమారుని దేవసేనానాయకునిగాఁ జేసి తా నోడించుటకుఁ బంపవలయు' నని బ్రహ్మేంద్రులతోఁ గూడ సాష్టాంగనమస్కారము చేసియుండఁగాఁ జూచి దయఁబూని పార్వతీదేవి సమ్మతితోఁ బరమేశ్వరుఁడు,వారు కోరిన వర మనుగ్రహింప మహాప్రసాదమని - తరువాతి పద్యముతో నన్వయము

## కుమారుని యువరాజ పట్టాభిషేకము

తే కామధు క్కల్పవృక్ష చింతామణులును
వగవఁగా నిచ్చుఁ దముఁ బొందువారి కెల్ల
నొనరఁ దన్నాశ్రయించిన జనులకెల్ల
వగవఁగా నిచ్చునే భక్తవత్సలుండు 103

**అర్థము** కామధుహ్ (క్) + కల్పవృక్ష - చింతామణులును = కామధేనువును, కల్పవృక్షమును, చింతామణియును, తమున్ + పొందువారికిన్ + ఎల్లన్ = త మ్మాశ్రయించినవారి కందఱకును, వగవఁగాన్ = దుఃఖింపఁగా, ఇచ్చున్, భక్త - వత్సలుండు = భక్తులయెడ వాత్సల్యము గలవాఁడు - శివుఁడు, ఒనరన్ = ఒప్పుగా, తన్నున్ + ఆశ్రయించిన, జనులకున్ + ఎల్లన్ = జనుల కందఱకును, వగవఁగాన్ + ఇచ్చునే = దుఃఖింపనిచ్చునా ?

**తాత్పర్యము.** కామధేనువు, కల్పవృక్షము, చింతామణి త మ్మాశ్రయించిన వారి కందఱకును వేఁడికొనఁగా - దుఃఖింపఁగా నిచ్చును భక్తవత్సలుఁడైన శివుఁడు తన్నాశ్రయించిన జనుల నందఱను దుఃఖింపనీఁడు

**విశేషములు** అలంకారము శ్లేషము

తే అనుచు రాగిల్లి జయజయధ్వనులు చెలఁగఁ
బొంగి ముట్టట లాడిరి, పుష్పవృష్టి
కురిసె, సురపురముల నెల్ల గుఱ్ఱుగట్టి
యొనర వాయించి రమరు లత్యుత్సవమున 104

**అర్థము .** అనుచున్, అమరులు = దేవతలు, అతి + ఉత్సవమునన్ = మిక్కిలి వేడుకతో, రాగిల్లి = ఆనందించి, జయజయధ్వనులు, చెలఁగన్ =

మ్రోయఁగా, పొంగి, ముల్టులు + ఆడిరి = జల్లులాడిరి, పుష్ప - వృష్టి= పూలవాన, కురిసెన్, సుర - పురములన్ + ఎల్లన్ = దేవతల నగరములందంతటను, గుళ్ళు+ కట్టి = శిబిరములు కట్టి, గుంపులుకట్టి, ఒనరన్ = ఒప్పుగా, వాయించిరి = వాద్యములు మ్రోయించిరి

**తాత్పర్యము .** అని పలుకుచు దేవతలు మిక్కిలి వేడుకతో నానందించి జయజయధ్వనులు మ్రోయఁగాఁ బొంగి జల్లులాడిరి పూలవాన కురిసెను దేవతల పత్తనములందంతటను శిబిరములు వేసికొని వాద్యములు మ్రోయించిరి

వ తదవసరంబున విష్ణుప్రముఖాఖిలసురు లీశ్వరానుమతంబున 105

**అర్థము .** తద్ + అవసరంబునన్ = ఆ సమయమున, విష్ణు - ప్రముఖ + అఖిల సురులు = విష్ణువు మున్నగు నెల్ల సురలును, ఈశ్వరు + అనుమతంబునన్ ఈశ్వరుని సమ్మతితో

**తాత్పర్యము** ఆ సమయమున విష్ణువు మున్నగు దేవతలందఱును ఈశ్వరుని సమ్మతితో - తరువాతి పద్యముతో నన్వయము

సీ మణికుట్టిమ ప్రభామంజరు లెలరారు
పల్లవతోరణప్రతతిఁజెనయ
శశికాంతవేదికాసద్రుచు లవదాత
వప్రవితానకావలిఁ బెనంగ
వరశాలి రోపితాంకుర పాలికలు వాత
పూరణ నికర విస్ఫురణఁ దనరఁ
గర్వూర పాళీ ప్రకర రంగవల్లీ వి
లాసముల్ మౌక్తిక లంబనములఁ

ఆ బొనరఁ దనరి భూనభోభాగ మంబర
భాగలీల నొలసి బలసి వెలుఁగ
రత్నదీపికాదిరమణీయ మగుచున్న
మానితాభిహేమమంటపంబు 106

**అర్థము .** మణి - కుట్టిమ - ప్రభా - మంజరులు = రత్నమయములైన నెలకట్టుల కాంతుల సమూహములు, ఎలరారు = వికసించు, పల్లవ - తోరణ -

ప్రతతిన్ = చివురుల తోరణముల సమూహమును, చెనయన్ = ప్రతిఘటింపఁగను,

శశికాంత - వేదికా - సత్ + రుచులు = చంద్రకాంతమణిమయములైన అరఁగుల మేలికాంతులు, అవదాత - వప్ర - వితానక + ఆవలిన్ = తెల్లని కోటల యందలి చాందినుల యొక్క వరుసతో, పెనఁగన్ = కూడఁగను,

వర- శాలి - రోపిత + అంకుర - పాలికలు = శ్రేష్ఠములైన వరుల మొలకెత్తిన మొలకల మట్టిపాత్రములు, వాత - పూరణ - నికర - విస్ఫురణన్ = గాలిబుట్టల సమూహముయొక్క ప్రకాశముతో, తనరన్ = ఒప్పఁగను,

కర్పూర - పాళీ - ప్రకర - రంగవల్లీ - విలాసముల్ = కప్పురముల సమూహముతోడి ముగ్గుల అందములు, మౌక్తిక - లంబనములన్ = ముత్యాలకోవలను, పొనరన్ = పొందఁగా, తనరి = ఒప్పి,

భూ - నభస్ (౦) + భాగము = భూమ్యాకాశ మధ్య ప్రదేశము, అంబర - భాగ - లీలన్ = వస్త్రభాగముల విలాసమును, ఒలసి = వ్యాపించి, బలసి = చుట్టి, వెలుఁగన్ = ప్రకాశింపఁగా,

రత్న - దీపికా + ఆది - రమణీయము = రత్న దీపములు మున్నగువానిచే సుందరము, అగుచున్ + ఉన్న, మానిత + అభి - హేమ - మంటపంబు = పొగడఁబడిన బంగారు మండపము

**తాత్పర్యము .** రత్నమయములైన నెలకట్టుల కాంతుల సమూహములు వికసించు చివురుల తోరణముల సమూహమును బ్రతిఘటింపఁగను, చంద్రకాంత మణిమయములైన అరఁగుల మేలికాంతులు తెల్లని కోటలచాందినుల వరుసతోఁ గూడఁగను, వరి మొలకల పాత్రములు గాలిబుట్టల విధమున నొప్పఁగను, కప్పురపు ముగ్గుల యందములు ముత్యాల కోవలను బొందియొప్పి, భూమ్యాకాశమధ్యప్రదేశము వస్త్రముల విలాసమును బొంది ప్రకాశింపఁగా రత్న దీపములు మున్నగువానిచే సుందరమగుచున్న బంగారు మండపము

**వ మఱియుం జిత్రితానేక సువర్ణ కుంభ మణిప్రకర ముకుర కస్తూరీ మలయజాగరుసుగంధద్రవ్య గంధతైలామల కోద్వర్తన కషాయాది సముచితద్రవ్య హంసోదక తీర్థోదక పుణ్యోదకాది సమస్తపరిశోభితంబగు నభిషేకమంటపంబునకుం దోడ్కొని చనుదెంచి కార్తికేయు విధిచోదిత**

న్యాయంబునం గనకద్రోణజలావగాహనానంతరంబునం జంద్రకాంత మణి
పీఠాసనాసీనుం జేసి 107

**అర్థము.** మఱియున్, చిత్రిత = చిత్రింపఁబడిన, అనేక = పెక్కు, సువర్ణ-కుంభ = బంగారు ఘటములు, మణి - ప్రకర - ముకుర = మణుల సమూహము అనెడి అద్దములు, కస్తూరీ - మలయజ + అగరు - సుగంధ - ద్రవ్య = చందనము, అగరు, అనెడి పరిమళ ద్రవ్యములు, గంధ - తైల + అమలక + ఉద్వర్తన - కషాయ+ ఆది - సముచిత - ద్రవ్య = వాసనగల నూనెలు, ఉసిరికపొడి, కషాయ+ ఆది = ఎఱుపు గలిసిన పసుపు మున్నగు సముచిత - ద్రవ్య = తగిన వస్తువులు, హంసోదక - తీర్థ + ఉదక - పుణ్య + ఉదక + ఆది - సమస్త - పరిశోభితంబు= హంసోదకము (ఎండకు వేఁడెక్కి, వెన్నెలకుఁ జల్లనగుజలము), తీర్థోదకము, పుణ్యోదకము మున్నగు నెల్లవానిచేఁ బ్రకాశించినది, అగు, అభిషేక - మంటపంబునకున్, తోడ్కొని - చనుదెంచి = తీసికొనివచ్చి, కార్తికేయున్ = కుమారస్వామిని, విధి - చోదిత - న్యాయంబునన్ = శాస్త్రోక్త ప్రకారమున, కనక-ద్రోణ - జల + అవగాహన + అనంతరంబునన్ = బంగరు పాత్రములందలి నీటిచే స్నానమునకుఁ బిమ్మట, చంద్రకాంత - మణి - పీఠ + ఆసన + ఆసనున్ + చేసి = చంద్రకాంతమణియమైన పీఠమునందుఁ గూర్చుండఁజేసి

**తాత్పర్యము .** మఱియును జిత్రితములైన పెక్కు రంగుల బంగరు కుండలు, మణిసమూహములనెడి అద్దములు, కస్తూరి, చందనము, అగరు అను పరిమళద్రవ్యములు, పరిమళతైలములు ఉసిరికపొడి, కషాయము మున్నగు తగిన ద్రవ్యములు, హంసోదకము, తీర్థోదకము, పుణ్యోదకము మున్నగు నెల్లవానిచేఁ బ్రకాశించినది యగు అభిషేకమంటపమునకుఁ దీసికొనివచ్చి కుమారస్వామిని శాస్త్రోక్తపద్ధతిని బంగరుపాత్రములందలి జలముచే స్నానము చేయించిన పిమ్మటఁ జంద్రకాంత = మణిపీఠమునందుఁ గూర్చుండఁజేసి - తరువాతి పద్యముతో నన్వయము

క. జలదములఁ బాసి మెఱుఁగులు
జలధారలు గురియునట్లు శైలాగ్రములన్
నలి నమరసతులు నిర్మల
జలధారలు గురిసి రోలి షణ్ముఖుమీఁదన్ 108

**అర్థము .** మెఱుఁగులు = మెఱుపులు, జలదములన్ = మేఘములను, పాసి = విడిచి, శైల + అగ్రములన్ = కొండకొనలందు, జల - ధారలు = నీటి

ధారలు, కురియు + అట్లు = కురియు విధమున, అమర - సతులు = దేవతాస్త్రీలు, నలిన్ = ఉత్సాహముతో, షణ్ముఖు - మీఁదన్ (షష్ (ట్) + ముఖు) = ఆఱుమొగములవాని (కుమారస్వామి) మీఁద, ఓలిన్ = బాగుగా, జలధారలు, కురిసిరి = వర్షించిరి

**తాత్పర్యము** మెఱుఁగులు మేఘములను విడిచి కొండల కొనల మీఁద జలధారలు వర్షించునట్లు, దేవతాస్త్రీలు ఉత్సాహముతోఁ గుమారస్వామిపై బాగుగా జలధారలు వర్షించిరి

**విశేషములు :** అలంకార ముపమ

**మ** **స్తనకుంభంబులు పూర్ణకుంభములు, ముక్తాహారవిస్తారలం**
**బనహారమ్ములు వారిధారలు, రుచిప్రౌఢంబుగాఁ బేర్మిఁ బూ**
**నిన భూషామణిదీప్తులున్ వెలుఁగు తన్నీరాజనద్యోతు, లం**
**గన లోలిం గవగూడి సేసి రభిషేకం బంబికానందనున్** **109**

**అర్థము .** అంగనలు = స్త్రీలు, స్తన - కుంభంబులు = కుండలవంటి కుచములు, పూర్ణ - కుంభములు = నిండుకుండలు, ముక్తా - హార - విస్తార - లంబన - హారమ్ములు = ముత్యాలపేరులనెడి అధికముగా వ్రేలాడు హారములు, వారి - ధారలు = జలధారలు, రుచి - ప్రౌఢంబుగాన్ = కాంతిచేత గొప్పదిగా, పేర్మిన్ = ప్రీతితో, పూనిన = ధరించిన, భూషా - మణి - దీప్తులున్ = అలంకారములందలి మణుల కాంతులును, వెలుఁగు = ప్రకాశించునట్టి, తద్ + నీరాజన - ద్యోతులు = ఆ హారతుల కాంతులు, ఓలిన్ = క్రమముగా, కవ + కూడి= జతగూడి, అంబికా - నందనున్ = పార్వతి కుమారుని - కుమారస్వామిని, అభిషేకంబు + చేసిరి = అభిషేకించిరి

**తాత్పర్యము** స్త్రీలు కుంభముల వంటిస్తనములు పూర్ణ కుంభములును, ముత్యాల పేరులు జలధారలును, అలంకారములందలి మణుల కాంతులు ప్రకాశించు నారతుల కాంతులును గాఁగా జత గూడి కుమారస్వామి నభిషేకించిరి

**విశేషములు .** అలంకాము రూపకము తన్నీరాజన = తద్ + నీరాజన - అనునాసిక సంధి

వ  తదవసరంబున సముచితాసనతాంబూలానులేపనాంబర మాల్యాలంకృతుంజేసి కుమారు మణిమయవేదికాసీనుం జేసి మంగళ పాఠక పఠన గీతాతోద్యంబులు దిగ్బధిరీకృతంబై జెలంగ హరి పురాణముని పురందర ప్రముఖాఖిల సురవరు లాగమ ప్రచోదితక్రమంబున సేనాధిపాభిషేకంబు సేసి యువరాజపట్టంబుఁగట్టిన 110

**అర్థము.** తద్ + అవసరంబునన్ = ఆ సమయమున, సముచిత + ఆసన - తాంబూల + అనులేపన + అంబర - మాల్య + అలంకృతున్ + చేసి = తగిన పీఠము, తాంబూలము, మైపూఁత, వస్త్రములు మాలలు అనువానిచే నలంకరింపఁబడినవానినిగాఁ జేసి, మంగళ - పాఠక - పఠన - గీత + ఆతోద్యంబులు= మంగళపాఠమునుజదువువారి పఠనము, సంగీతము, తతము, ఆనద్ధము, సుషిరము, ఘనము అను వాద్యచతుష్టయము, దిశ్ (క్) + బధిరీకృతంబు + ఐ= దిక్కులు చెవుడుపడినవిగాఁ జేయఁబడినవయి, చెలంగన్ = ధ్వనింపఁగా, హరి - పురాణముని - పురందర - ప్రముఖ + అఖిల - సురవరులు = విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుఁడు మున్నగు నెల్ల దేవతాశ్రేష్ఠులు, ఆగమ - ప్రచోదిత - క్రమంబునన్ = శాస్త్రములచేఁ బురికొల్పఁబడిన విధమున, సేనా + అధిప + అభిషేకంబు + చేసి= సేనా నాయకాభిషేకము చేసి, యువరాజ - పట్టంబున్ + కట్టినన్ = యువరాజ పట్టాభిషిక్తునిఁ జేయఁగా

**తాత్పర్యము .** ఆ సమయమున సముచితములయిన ఆసనము, తాంబూలము, మైపూఁత, వస్త్రములు, మాల్యములు అనువానిచే నలంకరించి కుమారస్వామిని మణిమయమైన వేదికయందు ఆసీనుని గావించి మంగళపాఠకుల పఠనము, గీతము, వాద్యములు అనువానిచే దిశలు చెవుడుపడునట్లు మ్రోయఁగా, విష్ణు బ్రహ్మేంద్రాది సకలదేవతా శ్రేష్ఠులు, శాస్త్రోక్తప్రకారమున సైన్యాధిపతి పట్టాభిషేకము చేసి యువరాజపట్టమును గట్టిన - యువరాజపట్టాభిషిక్తుని గావించిన - తరువాతి పద్యముతో నన్వయము

## మహాస్రగ్ధర

అభిషేకానంతరం బా హరసుతుఁ డురుసింహాసనాసీనుఁడై య
త్యభిరామంబయ్యె నారాయణకమలభవేంద్రాది దేవార్చితుండై
ప్రభతోఁ బూర్వాబ్ధిలో వెల్వడి రవి మణిరుగ్వ్యాసమానోదయాద్రి
ప్రభు శృంగం బెక్కున ట్లప్రతిహతవిభవాపారతేజోమయుండై 111

**అర్థము** ఆ - హర - సుతుండు = ఆ శివకుమారుఁడు - కుమారస్వామి, అభిషేక + అనంతరంబు = అభిషేకమయిన పిమ్మట, ఉరు-సింహాసన + ఆసీనుఁడు+ ఐ = గొప్ప సింహాసనమునందుఁగూరుచున్నవాఁడయి, నారాయణ - కమలభవ + ఇంద్ర + ఆది - దేవ + అర్చితుండు + ఐ = విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుఁడు మున్నగు దేవతలచేఁబూజింపఁబడినవాఁడయి, రవి = సూర్యుఁడు, ప్రభతోన్= కాంతితో, పూర్వ + అబ్ధిలోన్ = తూర్పు సముద్రములోనుండి, వెల్వడి = బయలుదేఱి, మణి- రుచ్ (క్) + భాసమాన + ఉదయ + అద్రి - ప్రభు - శృంగంబు = మణుల యొక్క కాంతులలోఁ బ్రకాశించుచున్న తూర్పు కొండవేని శిఖరము, ఎక్కు + అట్లు = ఎక్కు విధమున, అప్రతిహత - విభవ + అపార - తేజస్ (ం) + మయుండు + ఐ= అడ్డులేని సంపదతో అధికమైన తేజస్సుతో నిండినవాఁడయి, అతి + అభిరామంబు+ అయ్యెన్ = మిక్కిలి మనోహరుఁడయ్యెను

**తాత్పర్యము :** ఆ కుమారస్వామి అభిషేకమైన పిమ్మట గొప్ప సింహాసన మధిరోహించినవాఁడయి, విష్ణుబ్రహ్మేంద్రాది దేవతల చేఁ బూజితుఁడై, సూర్యుఁడు కాంతితో మణుల కాంతులతోఁ బ్రకాశించుచున్న తూర్పుకొండవేని శిఖరము నధిరోహించునట్లు అడ్డులేని విభవముతో అపారమైన తేజస్సుతో నిండినవాఁడయి మిక్కిలి మనోహరుఁడయ్యెను

**విశేషములు** అత్యభిరామంబయ్యె - అత్యభిరాముం డయ్యెనని యుండనగునా ? అలంకారము ఉపమ మహాస్రగ్ధర లక్షణమునకు పూర్వవ్యాఖ్య (1-68) నరయునది

**వ ఇ ట్లతిరమణీయమణిమయోత్తుంగసింహాసనాసీనుండై నిజజననీజనకులగు నుమామహేశ్వరుల పురోభాగంబునం బరభాగిల్లుచు నఖిలామరపరివృతుండై పేరోలగంబుండి మహానురాగంబున. 112**

**అర్థము.** ఇట్లు, అతి - రమణీయ - మణిమయ + ఉత్తుంగ - సింహాసన+ ఆసీనుండు + ఐ = మిక్కిలి రమ్యము, మణిమయము, ఎత్తయినది అయిన సింహాసనమునందుఁ గూరుచున్నవాఁడయి, నిజ - జననీ జనకులు = తన తల్లి దండ్రులు, అగు, ఉమా - మహేశ్వరుల - పురస్ (ః) + భాగంబునన్ = పార్వతీ పరమేశ్వరుల ఎదుట, పరభాగిల్లుచున్ = అతిశయిల్లుచు, అఖిల + అమర - పరివృతుండు + ఐ = సకల దేవతలచేఁ జుట్టఁబడిన వాఁడయి - కూడిన వాఁడయి, పేరోలగంబు + ఉండి (పేరు + ఓలగంబు) నిండు సభలో నుండి, మహత్ (మహా) అనురాగంబునన్ = అధికమైన ప్రీతితో -

**తాత్పర్యము** ఇట్లు మిక్కిలి రమ్యము, మణిమయము, ఉత్తుంగమునైన సింహాసనమునందుఁ గూరుచున్నవాఁడయి తనతల్లిదండ్రులగు పార్వతీ పరమేశ్వరుల యెదుట నతియిల్లుచు, సమస్తదేవతలతోఁ గూడిన వాఁడయి నిండుసభఁదీర్చి మిక్కిలి ప్రీతితో - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు.** పేరోలగము - పేరు + ఓలగము 'కర్మధారయంబునందుఁ బేర్వాదిశబ్దముల కచ్చు పరంబగునపుడు టుగాగమంబు విభాషనగు ' బాల సంధి 29 ఇది టుగాగమము రాని రూపము 'ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధి యగు ' బాల సంధి 1

మ **జయఘంటారవ, రాజవక్త్ర, లసితాబ్జగ్రీవఁ, దూణీరక**
**ద్వయ జంఘం, గరికుంభపూర్ణకుచఁ, దోర్దండోచ్చలద్భ్రూలతన్,**
**హయవర్మాంబర, వజ్రదంత, గుహుఁ డీశాజ్ఞన్ శితాస్త్రోల్లస**
**న్నయనం, బ్రీతిఁ బరిగ్రహించె సురసేనాకన్య నత్యున్నతిన్ 113**

**అర్థము .** గుహుఁడు = కుమారస్వామి జయ -ఘంటా + ఆరవన్ = జయఘంటల ధ్వని యనెడు ధ్వని గలది, రాజ - వక్త్రన్ = ప్రభువు (సేనా) ముఖమందుఁ గలది - చంద్రుఁడు ముఖముగాఁ గలది, లసిత + అబ్జ - గ్రీవన్ = ప్రకాశించు శంఖము కంఠముగాఁగలది, తూణీరక - ద్వయ - జంఘన్ = అమ్ములపొదుల జంటయనెడు పిక్కలు గలది, కరి - కుంభ - పూర్ణ - కుచన్ = ఏనుఁగుల కుంభస్థలములనెడు నిండుచన్నులు గలది, కోదండ + ఉత్ + చలత్+ భ్రూలతన్ = ధనుస్సులవంటి పైకిఁ జలించు బొమతీవలు గలది, హయ - వర్మ + అంబరన్ = గుఱ్ఱముల కవచములనెడు వస్త్రము గలది, వజ్ర - దంతన్ = వజ్రములనెడు దంతములు గలది, శిత + అస్త్ర + ఉల్లసత్ + నయనన్ = వాఁడిబాణములనెడు మిక్కిలి ప్రకాశించు కన్నులు (చూపులు) గలది, అగు, సుర- సేనా - కన్యన్ = దేవసేన యనెడు కన్యను, ఈశాజ్ఞన్ = ఈశ + ఆజ్ఞన్= ఈశుని ఆనతిచే, అతి + ఉన్నతిన్ = మిక్కిలి ఔన్నత్యముతో, పరిగ్రహించెన్= స్వీకరించెను

**తాత్పర్యము .** కుమారస్వామి జయఘంటల ధ్వనియనెడు ధ్వని కలది, రాజు (చంద్రుఁడు) ముఖముగాఁ గలది, ప్రకాశించు శంఖము కంఠముగాఁ గలది, తూణీరక - ద్వయ - జంఘన్ = అమ్ములపొదుల జంటయనెడు పిక్కలు గలది, కరి- కుంభ - పూర్ణ - కుచన్ - ఏనుఁగుల కుంభస్థలము లనెడు నిండుచన్నులు గలది, హయ -వర్మ + అంబరన్ = గుఱ్ఱముల కవచములనెడు వస్త్రముగలది,

వజ్ర - దంతన్ = వజ్రములనెడు దంతములు గలది, శివ + అస్త్ర + ఉల్లసత్ + నయనన్ = వాఁడి బాణములనెడు మిక్కిలి ప్రకాశించు కన్నులు (చూపులు) గలది, అగు, సుర - సేనా - కన్యన్ = దేవసేన యనెడు కన్యను, ఈశాజ్ఞన్ = ఈశ + ఆజ్ఞన్ = ఈశ్వరుని ఆనతిచే, అతి + ఉన్నతిన్ = మిక్కిలి ఔన్నత్యముతో, పరిగ్రహించెన్ = స్వీకరించెను

**తాత్పర్యము .** కుమారస్వామి జయఘంటల ధ్వని యనెడు ధ్వని కలది, రాజు (ప్రభువు) సేనాముఖముగాఁ గలది, ప్రకాశించు శంఖము కంఠముగాఁ గలది, అమ్ముల పొదుల జంట యనెడు పిక్కలు గలది, ఏనుఁగుల కుంభస్థలము లనెడు పూర్ణ స్తనములు గలది, ధనుస్సులనెడు పైకిఁ జలించు బొమతీవలు గలది, గుఱ్ఱముల కవచము లనెడు వస్త్రములు గలది, వజ్రములనెడు దంతములు గలది, వాఁడిబాణములనెడు మిక్కిలి ప్రకాశించు చూపులు గలది అగు సురసేన యనెడు కన్యను శివుని యానచే మిక్కిలి ఉన్నతితో స్వీకరించెను

**విశేషములు:** అలంకారము రూపకము రాజ వక్త్ర అనుచో శ్లిష్టరూపకము ఉల్లసన్నయన - ఉల్లసత్ + నయన - అనునాసిక సంధి అత్యున్నతి - అతి + ఉన్నతి - యణాదేశ సంధి

**వ ఇ ట్లవయవంబునం దారకు నిర్జించి తమ్ము నిఖిలభువనసామ్రాజ్య పదవియందు సుప్రతిష్ఠులం జేయంబూని మహేశ్వరానుమతంబున మహాసేనుండు సేనాధిపత్యంబు సేకొనుడు నత్యుత్సవంబున 11**

**అర్థము** ఇట్లు, అవయవంబునన్ = జయఘంటాదిసేనాంగములతో, తారకున్, నిర్జించి = జయించి, తమ్మున్, నిఖిల - భువన - సామ్రాజ్య - పదవియందున్ = ఎల్లలోకముల సామ్రాజ్యపుటధికారమునందు, సుప్రతిష్ఠులన్ = బాగుగా స్థిరపడినవారిని, చేయన్ + పూని, మహేశ్వర + అనుమతంబునన్ = పరమేశ్వరుని ఆజ్ఞచే, మహాసేనుండు = కుమారస్వామి, సేనా + ఆధిపత్యంబు = సేనా నాయకత్వము, చేకొనుడున్ = స్వీకరించినంతనే, అతి + ఉత్సవంబునన్ = మిక్కిలి వేడ్కతో

**తాత్పర్యము .** ఇట్లు జయఘంటాదిసేనాం గములచేఁ దారకాసురు నోడించి తమ్ము సకల భువన సామ్రాజ్యాధిపత్యమునందు బాగుగా స్థిరపడిన వారినిగాఁ జేయఁబూని పరమేశ్వరుని ఆజ్ఞచేఁ గుమారస్వామి సేనానాయకత్వమును స్వీకరించినంతనే, మిక్కిలి వేడుకతో - తరువాతి పద్యముతో నన్వయము

సీ కులజుఁడై విక్రమబలవంతుఁడగు రాజుఁ
బడసిన దేశంబు ప్రజయుఁబోలె
సదమల సంపూర్ణ చంద్రోదయంబున
రమణీయమగుచున్న రాత్రివోలె
నురుసత్త్వుఁడగు మహాయూథాధిపతిఁ గూడి
తనరు వన్యేభబృందంబు వోలె
నాయకద్యుతిఁగ్రాలు నాయకమణితోడ
నొడఁగూడి పొలుపారు తొడవపోలె

తే నా మహేశ్వరనందను ననుపమాన
శక్తిసంపన్ను ననివార్యశౌర్యుఁ దనకుఁ
దగిన సేనానిఁగని పేర్మి మిగిలి వెలిఁగె
నమరవల్లభుఁ డాదిగా నమరగణము 115

**అర్థము** అమర - వల్లభుఁడు = దేవేంద్రుఁడు, ఆదిగాన్ = మొదలుగా, అమర - గణము = దేవతల సమూహము

కులజుఁడు + ఐ = ఉత్తమకులమునందుఁబుట్టినవాఁడయి, విక్రమ - బలవంతుఁడు = పరాక్రమము, బలముగలవాఁడు, అగు, రాజున్ = నృపుని, పడసిన = పొందిన, దేశంబున్ = దేశమును, ప్రజయున్ = ప్రజలును, పోలెన్ = వలెను

సత్ + అమల - సంపూర్ణ - చంద్ర + ఉదయంబునన్ = మిక్కిలి నిర్మలము, సంపూర్ణము అయిన చంద్రుని పుట్టుకచే, రమణీయము = సుందరము, అగుచున్ + ఉన్న, రాత్రి + పోలెన్ = రాత్రి వలెను

ఉరు - సత్త్వుఁడు = గొప్ప బలము గలవాఁడు, అగు, మహత్ (మహా) + యూథ + అధిపతిన్ = గొప్ప గజసమూహపు నాయకుని, కూడి, తనరు = ఒప్పునట్టి, వన్య + ఇభ - బృందంబు + పోలెన్ = అడవి యేనుఁగుల సమూహమువలెను

నాయక -ద్యుతిన్ = శ్రేష్ఠమైన కాంతితో, క్రాలు = ప్రకాశించు, నాయక - మణితోడన్ - హారమధ్యమణితో, ఒడఁగూడి = కలిసి, పొలుపారు - సుందరమగు, తొడవు + అ + పోలెన్ = ఆభరణమువలెనే

అనుపమాన - శక్తి - సంపన్నున్ = సాటిలేని బలముతోఁ గూడినవాఁడును, అనివార్య - శౌర్యున్ = అడ్డగింపరాని పరాక్రమము గలవాఁడును, అగు, ఆ - మహేశ్వర - నందనున్ = ఆ పరమేశ్వరుని కొడుకును - కుమారస్వామిని, తనకున్, తగిన, సేనానిన్ = సేనానాయకునిగా, కని = పొంది, పేర్మి = గొప్పతనము, మిగిలి = అతిశయించి, వెలిఁగెన్ = ప్రకాశించెను

**తాత్పర్యము** దేవేంద్రుఁడు మొదలుగాఁ గల దేవతల సమూహము - కులీనుఁడయి బలపరాక్రమములు గలవాఁడగు రాజును బొందిన దేశము, ప్రజలు వలెను, నిర్మలము, సంపూర్ణము అయిన చంద్రుని ఉదయముచే సుందరమయిన రాత్రివలెను, గొప్పబలము గల గజరాజుతోఁగూడి ఒప్పు వనగజసమూహము వలెను, శ్రేష్ఠమయిన కాంతితోఁ బ్రకాశించు హారమధ్యమణితోఁ గూడి అందమగు ఆభరణము వలెను, నిరుపమానశక్తిసంపన్నుఁడును, అనివార్యశౌర్యుఁడును అగు ఆ పరమేశ్వరనందనుఁడైన కుమారస్వామిని బొంది గొప్పతన మతిశయింపఁ బ్రకాశించెను

**విశేషములు** అలంకారము మాలోపమ

**వ తదవసరంబునం బరమేశ్వరుండు శక్త్యాద్యనేకరాజచిహ్నంబులు, దివ్యశస్త్రాస్త్రంబులు, హస్త్యశ్వరథపదాతిచతుర్బలంబులు దయసేసె మఱియుం బార్వతి వజ్రమయవర్మ భర్మమయమయూరవాహకుక్కుటధ్వజ ధవళాతపత్ర పంచమహాశబ్దాద్యనేకరాజచిహ్నంబులు దయసేసె నంతం బరమేశ్వరుండు లక్ష్మీశ్వరగణేశ్వరుల సహాయులుంగా నియమించి తారకు నిర్జించి సురల రక్షించునది యని యనేకప్రకారంబులం గుమారు వీడుకొలిపిన మహాప్రసాదం బని హరగిరిజల వీడ్కొని సురసేనలం గైకొని 116**

**అర్థము :** తద్ + అవసరంబునన్ = ఆ సమయమున, పరమేశ్వరుండు, శక్తి + ఆది + అనేక - రాజ - చిహ్నంబులు = శక్తిమున్నగు పెక్కు రాచటీకపు గుఱుతులు, దివ్య - శస్త్ర - అస్త్రంబులు = దేవతాసంబంధములైన శస్త్రములు, అస్త్రములు, హస్తి, అశ్వ - రథ - పదాతి - చతుర్ + బలంబులు = ఏనుఁగులు, గుఱ్ఱములు, రథములు, కాల్బంటులు అను నాలుగు విధములైన సేనలు, దయ+ చేసెన్ = ఇచ్చెను, మఱియున్, పార్వతి, వజ్రమయ = వజ్రముతో నిర్మింపఁబడిన, వర్మ = కవచము, భర్మమయ = బంగారుతో నిర్మింపఁబడిన, మయూరవాహ- = నెమలి వాహనము, కుక్కుట - ధ్వజ = కోడి పడగ, ధవళ + ఆతపత్ర =

వెల్లగొడుగు, పంచ - మహా - శబ్ద + ఆది + అనేక - రాజ - చిహ్నంబులు = అయిదు విధములైన శబ్దములు మున్నగు పెక్కు రాచఱికపు గుఱుతులు, దయచేసెన్ = అనుగ్రహించెను అంతన్, పరమేశ్వరుండు లక్ష్మీ + ఈశ్వర - గణ+ ఈశ్వరులన్ = విష్ణువును, ప్రమథగణాధిపతులను, సహాయులన్ + కాన్= తోడుగా, నియమించి తారకున్ నిర్జించి = జయించి, సురలన్ = దేవతలను రక్షించునది= రక్షింపుము, అని, అనేక - ప్రకారంబులన్, కుమారున్, వీడుకొలిపినన్= పంపఁగా, మహాప్రసాదంబు + అని, హర - గిరిజలన్ = శివుని, పార్వతిని, వీడ్కొని= వీడి, సుర - సేనలన్ = దేవసేనలను, కైకొని = స్వీకరించి

**తాత్పర్యము** ఆ సమయమునఁ బరమేశ్వరుఁడు శక్తి మున్నగు పెక్కు రాచఱికపుగుఱుతులు, దివ్యములయిన శస్త్రములు, అస్త్రములు, ఏనుఁగులు, గుఱ్ఱములు, రథములు, కాలిబంటులు అను నాలుగు విధములైన సేనలు దయచేసెను మఱియును పార్వతి వజ్రమయకవచము, సువర్ణమయమయూర వాహనము, కోడి పడగ, వెల్ల గొడుగు, పంచ మహాశబ్దములు మున్నగు పెక్కు రాచఱికపు గుర్తుల దయచేసెను అంతఁ బరమేశ్వరుఁడు విష్ణువును, ప్రమథ గణ నాయకులను సహాయులనుగా నియమించి, తారకునోడించి దేవతలను రక్షింపుమని పెక్కు విధములఁ గుమారస్వామిని పంపఁగా మహాప్రసాదమని పార్వతీపరమేశ్వరులను వీడుకొని దేవసేనలను గైకొని - తరువాతి పద్యముతో నన్వయము

చ **హరి సురవల్లభాది దివిజావలి సూరెలఁ గొల్చిరా వియ**
**చ్చర వరకామినుల్ కనకచామర లోలిన పట్టుచుండఁ గి**
**న్నరతతి పాడఁ బారకులు నల్గడఁ బేర్కొనఁ దద్ద పేర్మితో**
**సురపురి కేఁగుదెంచె శివసూతి మహావిభవాభియుక్తుఁడై** 117

**అర్థము .** శివ - సూతి = శివుని కొడుకగు కుమారస్వామి, హరి - సుర - వల్లభ + ఆది - దివిజ + ఆవలి = విష్ణువు, ఇంద్రుఁడు మొదలగు దేవతల వరుస, సూరెలన్= ప్రక్కలందు, కొల్చి - రాన్ = సేవించి వచ్చుచుండఁగా, వియత్ + చర - వర - కామినుల్, గగనచరలైన స్త్రీలు, కనక - చామరలు = బంగరు వింజామరలు, ఓలిన్ + అ = బాగుగా, పట్టుచున్ + ఉండన్, కిన్నర - తతి = కిన్నరుల సమూహము, పాడన్ = పాడుచుండఁగా, పారకులు = స్తోత్రములను బఠించువారు, నల్గడన్ = నాలుగు దిక్కులను, పేర్కొనన్ = స్తుతింపఁగా, తద్ద -

పేర్మితోన్= మిక్కిలి గొప్పతనముతో, మహత్(మహా) + విభవ + అభియుక్తుఁడు + ఐ = గొప్ప సంపదతోఁ గూడినవాఁడయి, సుర - పురికిన్ = దేవతల నగరమునకు - అమరావతికి, ఏఁగుదెంచెన్ = వచ్చెను

**తాత్పర్యము** కుమారస్వామి విష్ణువు, దేవేంద్రుఁడు మున్నగు దేవతలు పార్శ్వముల సేవించిరాఁగా, గగనచరస్త్రీలు బంగరు వింజామరలు పట్టుచుండఁగా, కిన్నరులు పాడుచుండఁగా, స్తోత్రపాఠకులు స్తుతింపఁగా మిక్కిలి గొప్పతనముతో మహాసంపదతోఁ గూడినవాఁడయి అమరావతి కరుదెంచెను

**వ ఇట్లు చనుదెంచి చతుర్దశభువనాధీశ్వరుండు భువనంబులవారికిం బడినేసి కూర్చుకొనుచుం గతిపయదినంబులు సుఖ సంకథావినోదంబులం బ్రవర్తించుచుండె నంత నొక్కనాఁడు క్రౌంచాసురు మాహాత్మ్యంబు సురగురుండు కుమారునకు విశేషించి విజ్ఞాపించి 118**

**అర్థము .** ఇట్లు, చనుదెంచి =వచ్చి, చతుర్ + దశ - భువన + అధి + ఈశ్వరుండు = పదునాలుగులోకముల యధిపతి - కుమారస్వామి, భువనంబుల - వారికిన్ = లోకములందలివారికి, పడినేసి = ఆజ్ఞచేసి, కూర్చుకొనుచున్, కతిపయ - దినంబులు = కొన్ని దినములు, సుఖ - సం - కథా - వినోదంబులన్ = సుఖముతోఁగూడిన కథల వేడుకలతో, ప్రవర్తించుచున్ + ఉండెన్, అంతన్, ఒక్కనాఁడు, క్రౌంచ + అసురు - మాహాత్మ్యంబు = క్రౌంచాసురుని గొప్పతనము, సుర - గురుండు = దేవగురువైన బృహస్పతి, కుమారునకున్, విశేషించి = అధికముగా, విజ్ఞాపించి = విన్నవించి

**తాత్పర్యము .** ఇట్లు వచ్చి పదునాలుగు లోకముల ప్రభువయిన కుమారస్వామి లోకములందలివారికి ఆనపెట్టి సమకూర్చుకొనుచుఁ గొన్ని దినములు సుఖముగాఁ గథావినోదములతో బ్రవర్తించుచుండెను అంత నొకనాఁడు క్రౌంచాసురుని మాహాత్మ్యమును బృహస్పతి కుమారస్వామికి విశేషముగా విన్నవించి - తరువాతి పద్యముతో నన్వయము

## కుమారస్వామి కృత క్రౌంచభేదనము

**క గిరుల నటె గెల్చునని నా**
**సురమునఁ బవిధారగెల్పు సూతంబని తా**
**గిరియై వజ్రము నోర్చిన**
**బిరు దీతఁడు క్రౌంచుఁడన నభేద్యుఁడు పోరన్ 119**

**అర్థము** అనిన్ = యుద్ధమున, గిరులన్ + అటె = కొండలనా, గెల్చున్ = గెలుచును, ఆసురమునన్ = రాక్షసమున, పవి - ధార - గెల్పు = వజ్రాయుధము నంచు గెలుపు, చూతంబు + అని = చూచెదము గాక యని, తాన్ = తాను, గిరి + ఐ= కొండయయి, ఈతఁడు, వజ్రమున్ = వజ్రాయుధమును, ఓర్చిన = ఓడించిన, బిరుదు = సమర్థుఁడగు, క్రౌంచుఁడు + అనన్, పోరన్ = యుద్ధమున, అభేద్యుఁడు= భేదింపరానివాఁడు

**తాత్పర్యము** యుద్ధమున వజ్రాయుధము కొండలనా గెలుచును! రాక్షసమున దాని గెలుపు చూచెదముగాక యని తాను గొండయై వజ్రాయుధము నోడించిన సమర్థు డీతఁడు యుద్ధమునఁ గ్రౌంచుఁడన నభేద్యుఁడు

**విశేషములు** చూతంబని - చూతంబు + అని చూతంబు = చూతము, ఇది చూచు ధాతువు నుభయ ప్రార్థన రూపము చూచుదము - చూతము ఇందలి ముపర్ణకము తిఙ్తు సుప్పు అగు ముపర్ణకమునకు విధింపఁబడిన పూర్ణబిందుపూర్వక బువర్ణము దీనికెట్లు వచ్చునో ! 'చూచెదమని' యన్నచో నిర్బాధము

**వ అని హంసగతినిరోధంబై రోదసీకుహరాంతరాపూరితంబై తనరు క్రౌంచపర్వతంబు చూపి వీని జయించినం దారకు నశ్రమంబున జయింపనగు నని సిద్ధాదేశంబునుం గల దనినం గుమారుండు కోపించి తన దివ్యశక్తి యెత్తికొని**

**అర్థము** అని, హంస - గతి - నిరోధంబు + ఐ = అంచల గమనమునకు అడ్డు అయి, రోదసీ - కుహర + అంతర + ఆపూరితంబు + ఐ = గుహవంటి భూమ్యాకాశమధ్యప్రదేశము లోపలి విభాగము నిండినదయి, తనరు = ఒప్పునట్టి, క్రౌంచపర్వతంబు, చూపి, వీనిన్ = ఈ క్రౌంచుని, జయించినన్ = గెలుచుచో, తారకున్, అశ్రమంబునన్ = అనాయాసముగా, జయింపన్ + అగున్ + అని = గెలువవచ్చునని, సిద్ధ + ఆదేశంబునున్ = సిద్ధుల ఆజ్ఞయు, కలదు, అనినన్, కుమారుండు, కోపించి, తన - దివ్య శక్తి = తన దివ్యమైన శక్త్యాయుధమును, ఎత్తికొని

**తాత్పర్యము** . అని, అంచల గమనమును నిరోధించునదియై భూమ్యాకాశముల మధ్య ప్రదేశము నిండినదయి యొప్పు క్రౌంచపర్వతమును జూపి, వీనిని జయించినచోఁ దారకాసురుని అనాయాసముగా జయింపనగు నని సిద్ధుని ఆదేశము కూడఁ గల దనఁ గుమార స్వామి కోపించి తన దివ్యమైన శక్త్యాయుధము నెత్తికొని - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** హంసములు వర్షపునీటి కోర్వఁజాలక వర్షర్తువున భూమి నుండి మానసమునకుఁ బోవునప్పుడు క్రౌంచపర్వత మడ్డుపడి మార్గనిరోధ మొనరించెను

చ ఉరుతరశౌర్యముం బృథుబలోన్నతి యుండగఁ బట్టి వైచుడున్
హరసుతుశక్తి ఘోరదహనార్చులు పర్వఁగఁ బోరి తాఁకి పె
ట్టిరు మెయి నుచ్చి క్రౌంచు నొకయించుక సేపున గెల్చె వేల్పు ల
చ్చరువడి పిచ్చలింప భుజశక్తియు షణ్ముఖునుగ్రశక్తియున్ 121

**అర్థము .** ఉరుతర - శౌర్యమున్ = మిక్కిలి గొప్ప పరాక్రమమును, పృథు- బల + ఉన్నతియున్ = అధికమైనబలముయొక్క ఔన్నత్యమును, తగన్ = ఒప్పునట్లు, పట్టివైచుడున్ = పట్టివైచినంతనే, హర - సుతు - శక్తి = కుమారస్వామి శక్త్యాయుధము, ఘోర - దహన = అర్చులు = భయంకరములయిన అగ్నిజ్వాలలు, పర్వఁగన్ = వ్యాపింపఁగా, పోరి, తాఁకి, పెట్టు = ఆహతి, ఇరు - మెయిన్ = రెండు ప్రక్కలను, ఉచ్చి = భేదించి, క్రౌంచున్, వేల్పులు = దేవతలు, అచ్చరువడి = ఆశ్చర్యపడి, భుజ - శక్తియున్ = భుజపరాక్రమమును, షణ్ముఖు+ ఉగ్ర - శక్తియున్= కుమారస్వామి యొక్క భయంకరమైన శక్తియను నాయుధమును, పిచ్చలింపన్ = ప్రశంసింపఁగా, ఒక + ఇంచుక - సేపునన్ = ఒకింత కాలమున, గెల్చెన్

**తాత్పర్యము:** మిక్కిలి గొప్ప పరాక్రమమును, అధికమైన బలౌన్నత్యమును దగునట్లు పట్టివైచినంతనే కుమారస్వామి శక్త్యాయుధము భయంకరాగ్నిజ్వాలలు వ్యాపించునట్లు పోరి, తాఁకి ఆహతి రెండు ప్రక్కలను భేదించి క్రౌంచుని ఒకింత కాలముననే దేవత లాశ్చర్యపడి కుమారస్వామి భుజశక్తిని, శక్త్యాయుధమును బ్రశంసింపఁగా గెలిచెను

**విశేషములు :** అచ్చెరువు, అచ్చరువు (వికృతి) - ఆశ్చర్యము, షష్ + ముఖు - షట్ + ముఖు = షణ్ముఖు షణ్ముఖునుగ్రశక్తి - షణ్ముఖు + ఉగ్రశక్తి - 'షష్ఠీసమాసముం దుకార ఋకారంబుల కచ్చు పరమగునపుడు నుగాగమంబగు ' బాల సంధి 34

వ ఇ ట్లభేద్యంబైన క్రౌంచపర్వతంబుం గుమారుం డక్రమంబున నిజభుజశక్తిచేతం జెటిచి సురవరుల మెచ్చించి యక్షణంబు తారకాసురుపై

నెత్త నిశ్చయించినం జక్రపాణి వాని నెఱింగించి పంపక పైఁ జను దనుచితంబనిన దాని కొడంబడి 122

**అర్థము.** ఇట్లు, అభేద్యంబు + ఐన= భేదింపశక్యముగానిదయిన, క్రౌంచ పర్వతంబున్, కుమారుండు, అశ్రమంబునన్ = అనాయాసముగా, నిజ - భుజ - శక్తి చేతన్ = తనదైన భుజబలముచే, చెఱిచి = నశింపఁజేసి, సుర -వరులన్ = దేవతాశ్రేష్ఠులను, మెచ్చించి = మెప్పించి, అక్షణంబు + అ = వెంటనే, తారక + అసురుపైన్, ఎత్తన్ = దండెత్తుటకు, నిశ్చయించినన్, చక్రపాణి = సుదర్శన మనుచక్రము చేతియందుఁ గలవాఁడు - విష్ణువు, వానిన్ = కుమారస్వామిని, ఎఱింగించి = తెలిపి, పంపక, పైన్ + చనుడు = దండెత్తుట, అనుచితంబు = తగనిది, అనినన్, దానికిన్ = ఆ మాటకు, ఒడంబడి = అంగీకరించి

**తాత్పర్యము.** ఇట్లు భేదింప నశక్యమగు కౌంచపర్వతమును గుమారస్వామి అనాయాసముగాఁ దన భుజశక్తిచేత భేదించి, దేవతలను మెప్పించి, వెంటనే తారకాసురునిపై దండెత్త నిశ్చయింపఁగా, విష్ణువు ముందుగాఁ గుమారస్వామి, నెఱిఁగించి పంపక పై నెత్తుట ఉచితముగాదని పలుకఁగా, దాని కంగీకరించి తరువాతి పద్యముతో నన్వయము

క. పతిహితుఁ గుల విప్రోత్తముఁ
జతురు, సదాశుద్ధుఁ గార్యసంవేదిఁ, బరేం
గిత విదు, ధైర్యాన్వితు, ని
ర్గతమతియుతు, రాయబారిగాఁ బంపనగున్. 123

**అర్థము :** పతి - హితున్ = రాజుమేలుగోరువానిని, కుల -విప్ర + ఉత్తమున్= కుల బ్రాహ్మణ శ్రేష్ఠుని, చతురున్= నేర్పరిని, సదా - శుద్ధున్= నిత్య పరిశుద్ధుఁడైనవానిని, కార్య - సంవేదిన్= కర్తవ్యము నెఱిఁగిన వానిని, పర + ఇంగిత -విదున్ = ఇతరుల అభిప్రాయము నెఱిఁగినవానిని, ధైర్య + అన్వితున్ = ధైర్యముతోఁగూడినవానిని, నిర్గత - మతి - యుతున్ = ఉద్గతమైన తెలివితోఁ గూడినవానిని, రాయబారిగాన్ = దూతగా, పంపన్ + అగున్ = పంపుటొప్పును

**తాత్పర్యము :** రాజుమేలు గోరువాఁడును కులబ్రాహ్మణోత్తముఁడును, నేర్పరియైనవాఁడును, నిత్యపరిశుద్ధుఁడైనవాఁడును, కర్తవ్య మెఱిఁగినవాఁడును, ఇతరుల యభిప్రాయము నెఱిఁగినవాఁడును, ధైర్యముతోఁ గూడినవాఁడును, బయల్పడిన తెలివిగలవాఁడును అగు వానిని రాయబారిగాఁ బంపుటొప్పును

**విశేషములు .** కులవిప్రోత్తమున్ -తన కులబ్రాహ్మణు -నన్నయ ఈ రెండును నొక్కటియా ?

**కుమారుఁడు సుమతిని దారకునికడకు రాయబారిగాఁబంపుట**

వ   అని విచారించి బృహస్పతిపౌత్రు సుమతి యనువాని రావించి తత్కార్య ప్రయోజనం బెఱింగించి ప్రార్థించి తన్నియోగంబునకు నియోగించి 124

**అర్థము .** అని, విచారించి = ఆలోచించి, బృహస్పతి - పౌత్రున్ = బృహస్పతి మనుమని, సుమతి - అను - వానిన్ = సుమతియను పేరుగలవానిని, రావించి, తద్ + కార్య -ప్రయోజనంబు = ఆ దూత కార్యమువలని ఫలమును, ఎఱింగించి = తెలిపి, ప్రార్థించి, తద్ + నియోగంబునకున్ = ఆ దూత కార్యమునకు, నియోగించి = నియమించి

**తాత్పర్యము.** అని ఆలోచించి బృహస్పతి పౌత్రుఁడైన సుమతి యనువానిని రప్పించి ఆ దౌత్యమువలని ఉపయోగము నెఱిఁగించి, ప్రార్థించి, ఆ పనికి నియమించి - తరువాతి పద్యముతో నన్వయము

క   తొల్లిటి దోషములైనవి
    యెల్లను సైరించితిమి మాకు నిం కిటఁ దానే
    వల్లె యని నడచి మదిఁ దన
    వాల్లభ్యముఁదక్కి చూడవచ్చినఁ జాలున్ 125

**అర్థము.** తొల్లిటి -దోషములు = తాను బూర్వము చేసిన అపరాధములు, ఐనవి = అయినవేవోఅయినవి, ఎల్లను = వాని నన్నిటిని, సైరించితిమి = సైఁచితిమి, మాకున్, ఇంకన్, ఇటన్, తానే, వల్లె + అని = సమ్మతించి, నడచి, మదిన్, తన - వాల్లభ్యమున్ + తక్కి = తన ప్రభుత్వమును విడిచి, చూడన్ + వచ్చినన్ = చూడవచ్చుచో, చాలున్

**తాత్పర్యము :** పూర్వము తాను జేసిన అపరాధములైనవేవో అయినవి వాని నన్నిటిని సైఁచితిమి ఇఁకఁ దానే యంగీకరించి వచ్చి మనసులోఁ దన ప్రభుత్వమును విడిచి మమ్ముఁ జూడవచ్చినఁ జాలును

క   అఱకొనక కొన్న వృత్తులుఁ
    జెఱలఁ గలర్థములు నశ్వసింధురములుఁ గ్ర
    మ్మఱ నిచ్చి మాకుఁ దనయం
    దురు సెఱలును నిచ్చి మనుట యుఱ వను తనకున్ 126

**అర్థము .** అఱ - కొనక = ధర్మమును గైకొనక, కొన్న = తీసికొనిన, వృత్తులున్ = మాన్యములును, చెఱలన్ = కారాగారములందు, కల + అర్థములున్ = ఉన్న వస్తువులును, అశ్వ - సింధురములున్ = గుఱ్ఱములును, ఏనుఁగులును, క్రమ్మఱన్ = మరల, ఇచ్చి, మాకున్, తనయందున్ - ఉరుసెఱలును = తనయధీనముననున్న బందీలను, ఇచ్చి మనుట = బ్రదుకుట, తనకున్, ఉఱవు = ఉచితము, అను (ము)

**తాత్పర్యము .** ధర్మమును గైకొనక తీసికొనిన మాన్యములును చెఱసాలలందున్న అర్థములు, గుఱ్ఱములును, ఏనుఁగులును మరల నిచ్చి మాకుఁ దన యధీనము నున్న బందీలను ఇచ్చి బ్రదుకుట తన కుచితమని పలుకుము

క దాని కొడఁబడక మనమున
దానవుఁ డేమేని బెట్టిదము లాడిన సే
నానిభుజశక్తిహతుఁడవు
గా నని కేతెమ్ము లెమ్ము ! కల నను మతనిన్ 127

**అర్థము :** దానికిన్ = ఆ మాటకు, మనమునన్ = మనస్సునందు, ఒడఁబడక - అంగీకరింపక, దానవుఁడు =రాక్షసుఁడు - తారకుఁడు, ఏమి + ఏనిన్ = ఏమయనను, బెట్టిదములు = పరుషములు, ఆడినన్ = పలికినచో, అతనిన్ = అతనితో, సేనాని - భుజ - శక్తి - హతుఁడవు = కుమారస్వామియొక్క భుజపరాక్రమముచే - భుజమునందలి శక్త్యాయుధముచేఁ గొట్టఁబడినవాఁడవు, కాన్ = అగునట్లు, అనికిన్ = యుద్ధమునకు, ఏతెమ్ము = రమ్ము, కలను = యుద్ధము, లెమ్ము, అనుము

**తాత్పర్యము .** ఆ మాట మనసునందు అంగీకరింపక తారకుఁడేమయిన బరుషవాక్యము లాడినచో నీవు కుమారస్వామి భుజమునందలి శక్త్యాయుధముచే హతుఁడవగునట్లు యుద్ధమునకు రమ్ము లెమ్ము అని అతనితోఁ బలుకుము

**విశేషములు :** బెట్టిదములాడి - 'విశేషణంబులు కొన్నియెడల విశేష్యలక్ష్యకంబులగు (ప్రౌఢ శబ్ద 12 బెట్టిదములు =బెట్టిదపు మాటలు

వ. అని యనేకప్రకారంబుల సంధివిగ్రహోక్తుల లతివ్యక్తంబుగా శిక్షించి పంచిన మహాప్రసాదంబని వీడుకొని తారకాసురుపురంబునకుం జని

నిజాగమనం బెఱింగించి పంచి తత్ప్రతిహారిపురస్కృతుండై దానవాధీశ్వరాస్థాన
రంగంబు దయం జొత్తించి 128

**అర్థము.** అని, అనేక - ప్రకారంబులన్ = పెక్కురీతుల, సంధి - విగ్రహ+ ఉక్తులు = సంధికి, యుద్ధమునకు సంబంధించిన మాటలు, అతి-వ్యక్తంబుగాన్ = మిక్కిలి స్పష్టముగా, శిక్షించి = బోధించి, పంచినన్ = పంపఁగా, మహాప్రసాదంబు + అని, వీడుకొని = సెలవుపుచ్చుకొని, తారక + అసురు - పురంబునకున్ = తారకాసురుని నగరమునకు, చని, నిజ + ఆగమనంబు = తనదైన రాకను, ఎఱింగించి, పంచి, తద్ + ప్రతిహారి - పురస్కృతుండు + ఐ = ఆతని ద్వారపాలకునిచే ముం దిడఁబడినవాఁడయి, దానవ + అధి + ఈశ్వర + ఆస్థాన - రంగంబు = రాక్షస రాజు (తారకు) నాస్థాన ప్రదేశము, తఱియన్ + చొత్తెంచి = సమీపింపఁజొచ్చి

**తాత్పర్యము:** అని పెక్కు విధముల సంధిని, విగ్రహమును గూర్చిన పలుకులు మిక్కిలి స్పష్టముగా బోధించి పంపఁగా మహా ప్రసాదమని సెలవుపుచ్చుకొని తారకాసురుని పురమునకు వెడలి తన రాక యెఱిఁగించి ద్వారపాలకుఁడు ముందు నడవ రాక్షసరాజు నాస్థానప్రదేశమును సమీపింపఁజొచ్చి-తరువాతి పద్యముతో నన్వయము

మ **స్ఫురితాంగాసితదీప్తు లోలిన తమః పుంజంబు నాఁ బర్వ, న**
**త్యురుదంష్ట్రామలరోచు లంబుధర విద్యుల్లేఖలో నాఁ దగన్**
**సరసాకల్పమణుల్ మహారజని నక్షత్రౌఘమో నాఁ జనం-**
**గర మొప్పం గొలువున్నధన్యుఁ గనియెం గాలోపముం దారకున్** 129

**అర్థము .** కుమారస్వామి దూతయగు సుమతి కర్త స్ఫురిత + అంగ + అసిత - దీప్తులు = ప్రకాశించిన అవయవములయొక్క నల్లని కాంతులు, ఓలిన్+ అ = బాగుగా, తమస్ (ః) + పుంజంబు - నాన్ = చీఁకటులగుంపో యన, పర్వన్= వ్యాపింపఁగా, అతి + ఉరు - దంష్ట్రా + అమల - రోచులు = మిక్కిలి అధికమైన కోఱలయొక్క నిర్మలములయిన కాంతులు, అంబుధర - విద్యుత్ + లేఖలో - నాన్ + తనర్పన్ = మేఘమునందలి మెఱపులో యన నొప్పఁగా, సరస + ఆకల్ప- మణుల్ = అందమయిన ఆభరణములందలి మాణిక్యములు, మహారజని - నక్షత్ర + ఓఘమో - నాన్ + చనన్ = అర్ధరాత్రి నక్షత్రముల గుంపో యన నొప్పఁగా, కరము + ఒప్పన్ = మిక్కిలి యొప్పునట్లు, కొలువు + ఉన్న = సభదీర్చియున్న,

ధన్యున్ = అదృష్టవంతుని, కాల + ఉపమున్ = యముని వంటివానిని, తారకున్, కనియెన్

**తాత్పర్యము .** అవయవముల నల్లని కాంతులు చీఁకటుల గుంపులా యన వ్యాపింపఁగా, మిక్కిలి పెద్దవియగు కోఱల నిర్మలములయిన కాంతులు మేఘమునందలి మెఱుఁ లోయన నొప్పఁగా, సుందరములయిన ఆభరణములందలి మణులు అర్ధరాత్రి యందలి నక్షత్రములగుంపో యన మిక్కిలి యొప్పి సభ దీర్చిన ధన్యుని, యమునితో సమానుఁడగు తారకాసురుని సుమతి చూచెను

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష ఉపమ అత్యురు - అతి + ఉరు - యణాదేశసంధి నక్షత్రౌఘము - నక్షత్ర + ఓఘము - వృద్ధి సంధి విద్యుల్లేఖ - విద్యుత్ + లేఖ 'తవర్గ వర్ణములకు లకారము పరమగుచో పరసవర్ణము ఆదేశమగును ' విద్యుల్లేఖ కాలోపము - కాల + ఉపము - గుణసంధి

**వ కని తదీయ విభవంబున కాశ్చర్యహృదయుండగుచుఁ బ్రతిహారి నియమితస్థానంబునందున్నట్టి దేవదూతం గనుంగొని తారకానుమతంబున దనుజకులవర్ధిష్ణుం డగుధిష్ణ్యుండు 'నీ వెవ్వరిపని కెందుండి వచ్చితి ? నిజాగమన ప్రయోజనం బేమి ?' యని యడిగిన నమరదూత భార్గవున కభిముఖుండై 130**

**అర్థము :** కని, తదీయ - విభవంబునకున్ = ఆతని దైవ సంపదకు, ఆశ్చర్య - హృదయుండు + అగుచున్ = అచ్చెరువొందిన హృదయము గలవాఁడగుచు, ప్రతిహారి - నియమిత - స్థానంబునందున్ = ద్వారపాలకునిచే నేర్పఱుపఁబడిన స్థానమునందు, ఉన్న + అట్టి, దేవ - దూతన్ = దేవతల రాయబారియగు సుమతిని, కనుంగొని = చూచి, తారక + అనుమతంబునన్ = తారకుని అనుమతితో, దనుజ - కుల వర్ధిష్ణుండు - రాక్షసవంశమును వృద్ధిపొందించువాఁడు, అగు, ధిష్ణ్యుండు = శుక్రాచార్యుఁడు, నీవు, ఎవ్వరిపనికిన్, ఎందున్ + ఉండి, వచ్చితి(వి), నిజ + ఆగమన - ప్రయోజనంబు = నీ రాక ప్రయోజనము ఏమి ? అని అడిగినన్, అమర - దూత = దేవతల రాయబారి, భార్గవునకున్ = శుక్రునకు, అభిముఖుండు + ఐ = ఎదురయినవాఁడయి

**తాత్పర్యము :** చూచియాతని సంపద కచ్చెరువొందుచు ద్వారపాలకుఁడు చూపిన స్థానమున నున్న దేవదూతను సుమతిని జూచి తారకుని అనుమతితో రాక్షసవంశవర్ధకుఁడగు శుక్రాచార్యుఁడు 'నీ వెవరి పనికయి, ఎచ్చటి నుండి వచ్చితివి ? నీ రాకకుఁ బ్రయోజనమేమి ?' యని యడిగిన సుమతి శుక్రునివైపు తిరిగి తరువాతి పద్యముతో నన్వయము

క "ఏ నమరదూత హరిసే
నానియు సురపతియు దనుజనాయకుతో సం
ధానమునకుఁ బుత్తెంచిన
దానికిఁ జనుదెంచితిం బ్రధానుఁడ నెందున్" 131

**అర్థము** ఏను, అమర - దూతన్ = దేవదూతను హరి - సేనానియున్ = ఇంద్రుని సైన్యాధిపతియును, కుమారస్వామియు, సుర - పతియున్ = దేవేంద్రుఁడును, దనుజ - నాయకుతోన్ = రాక్షసరాజగు తారకునితో, సంధానమునకున్ = సంధికి, పుత్తెంచిన - దానికిన్ = పంపినందులకు, చనుదెంచితిన్ = వచ్చితిని, ఎందున్, ప్రధానుఁడన్ = ముఖ్యుఁడను

**తాత్పర్యము:** "నేను దేవతల రాయబారిని ఇంద్రుని సేనానాయకుఁడగు కుమారస్వామియును, దేవేంద్రుఁడును, రాక్షసరాజగు తారకునితో సంధి చేయఁ బంపఁగా వచ్చితిని అన్నిటను నేను ముఖ్యుఁడను"

వ అనిన విని హరిసురేశ్వరులతోడం గూడ నీ యెన్నుచున్న సేనాని యనువాఁ డెవ్వండు మి మ్మెవ్విధంబునంగూడె ననిన నుమామహేశ్వరుల వీర్యంబున నగ్ని గంగా కృత్తికా శరవణంబులయందు షడానన ద్వాదశభుజంబులతో నుదయించెం గుమారుం డక్కుమారకు నమరవరప్రార్థితుండై 132

**అర్థము** . అనినన్, విని, హరి - సుర + ఈశ్వరులతోడన్ = విష్ణు దేవేంద్రులతో, కూడి, నీ + ఎన్నుచున్ + ఉన్న = నీవు పరిగణించుచున్న, సేనాని, అనువాఁడు, ఎవ్వండు, మిమ్మున్, ఏ + విధంబునన్, కూడెన్, అనినన్, ఉమా మహేశ్వరుల - వీర్యంబునన్ = పార్వతీపరమేశ్వరుల వీర్యముచే, అగ్ని - గంగా- కృత్తికా - శరవణంబుల + అందున్ = అగ్ని, గంగ, కృత్తికలు, తెల్లువనము అనువానియందు, షష్ (ట్) + ఆనన - ద్వాదశ - భుజంబులతోన్ = ఆఱుమొగములతో, పండ్రెండు భుజములతో, కుమారుండు = కుమారస్వామి, ఉదయించెన్ = పుట్టెను ఆ + కుమారకున్ = ఆ కొమరుని, అమర - వర - ప్రార్థితుండు + ఐ = దేవతాశ్రేష్ఠులచేఁ గోరఁబడినవాఁడయి,

**తాత్పర్యము:** అనిన విని విష్ణు దేవేంద్రులతో నీవు గణించుచున్న సేనాని యనువాఁడెవ్వఁడు ? మిమ్ము ఏ రీతిగాఁ గూడెను ' అనిన, 'పార్వతీపరమేశ్వరుల వీర్యముచే అగ్ని, గంగ, కృత్తికలు, శరవణము, అనువానియందు ఆఱుమొగములు

పం(డ్రెండు భుజములు గలిగి కుమారస్వామి పుట్టెను ఆ కొమరుని దేవతలు (ప్రార్థింపఁగా - తరువాతి పద్యముతో నన్వయము

ఉ ఆ పరమేశ్వరుండు దివిజావలికిం గరుణించి పంచె సే
నాపతిగాఁగఁ బూన్చి నిజనందను, నాతనితోడఁగూడ ల
క్ష్మీపతిఁ బంచె, వా రనుపమేయపరాక్రమశక్తియుక్తులై
మా పగఁ దీర్పఁబూని రహిమండను పంపునఁ దద్దఁ బెంపునన్ 133

**అర్థము.** ఆ - పరమ + ఈశ్వరుండు, దివిజ + ఆవలికిన్ = దేవతల వరుసకు, కరుణించి = దయఁదలఁచి, నిజ - నందనున్ = తన కుమారుని, సేనా - పతి + కాఁగన్ = సేనా నాయకునిగా, పూన్చి = నియమించి,పంచెన్ = పంపెను, అతనితోడన్ = ఆ కుమారునితో,లక్ష్మీ - పతిన్ = లక్ష్మి భర్తను - విష్ణుని, పంచెన్, వారు, అనుపమేయ పరాక్రమ - శక్తి - యుక్తులు + ఐ = సాటిలేని పరాక్రమము, బలము అనువానితోఁ గూడినవారయి, అహి-మండను - పంపునన్ = భుజగభూషణుని ఆజ్ఞచే, తద్ద(యు)న్ = మిక్కిలి, పెంపునన్ గొప్పతనముతో, మా-పగన్ = మా వైరమును, తీర్పన్ = తీర్చుకొనుటకు, పూనిరి = ఉద్యమించిరి

**తాత్పర్యము :** 'ఆ పరమేశ్వరుఁడు దేవతలపైఁ దయఁబూని తన కుమారుఁడైన కుమారస్వామిని వారికి సేనానాయకునిగా నియమించి పంపెను ఆతనితో విష్ణువును పంపెను వారు సాటిలేని పరాక్రమ శక్తియుక్తులయి శివుని యాజ్ఞచొప్పున మిక్కిలి గొప్పతనముతో మా పగను దీర్పఁబూనిరి

క అన విని కావ్యుఁడు తన మన
మునఁ గడు భయ మంది కలహమున నీశ్వరనం
దనుచేత నిలుగుఁ దారకుఁ
డను నాదేశంబు నిక్క మగునొకొ యనుచున్ 134

**అర్థము :** అనన్ = రాయబారియగు సుమతి చెప్పఁగా, విని, కావ్యుఁడు=శుక్రుఁడు, తన - మనమునన్ = తన మనస్సునందు, కడున్ = మిక్కిలి , భయము + అంది = భయపడి, కలహమునన్ = యుద్ధమున, ఈశ్వర - నందనుచేతన్ = ఈశ్వరుని కుమారుఁడైన కుమారస్వామిచేత, తారకుఁడు,

నిలుగున్ = చచ్చును, అను, ఆదేశంబు = ఆజ్ఞ, నిక్కము, అగున్ + ఒకొ = అగునా, అనుచున్

**తాత్పర్యము** అని రాయబారి యగు సుమతి చెప్పఁగా విని శుక్రుఁడు తన మనస్సునందు మిక్కిలి భయమంది 'యుద్ధమునఁ గుమారస్వామి చేతఁ దారకుఁడు చచ్చునను మాట నిజమగునా ? యనుచు - తరువాతి పద్యముతో నన్వయము

**వ అని చింతించుచుండె నంత హరిసేనానీ సహితులై సురవరు లుద్దవడి నెత్తుదెంచుటయు, నెఱింగించుచున్న దేవదూతం గని తారకుండు కోపోద్దీపితాంతరంగుండై 135**

**అర్థము .** అని, చింతించుచున్ + ఉండెన్ = విచారించుచుండెను అంతన్, హరి - సేనానీ - సహితులు + ఐ = విష్ణుకుమారస్వాములతోఁ గూడినవారయి, సుర -వరులు = దేవతాశ్రేష్ఠులు, ఉద్దవడిన్ = శీఘ్రముగా, ఎత్తుదెంచుటయున్ = దండెత్తి వచ్చుటయు, ఎఱింగించుచున్ + ఉన్న = తెలుపుచున్న, దేవదూతన్ + కని, తారకాసురుఁడు, కోప + ఉద్దీపిత + అంతరంగుండు + ఐ = క్రోధముచేత మిక్కిలి ప్రకాశించిన - మండిన, అంతరంగము గలవాఁడయి

**తాత్పర్యము :** అని విచారించుచుండెను అంత విష్ణు కుమారస్వాములతోఁగూడినవారయి దేవతలు శీఘ్రముగా దండెత్తి వచ్చుట తెలుపుచున్న దేవతల రాయబారిని జూచి తారకుఁడు కోపముతో నెరియుచున్న మనస్సుగలవాఁడయి - తరువాతి పద్యముతో నన్వయము

**మ పని యేమేనియుఁ గల్గెనేని సుమనఃపాలుండు తా వచ్చి యొ**
**య్యన నా ముందట నిల్చి విన్నపము చేయంబోయి కంపించు ని**
**న్న, నిలింపాధిపుఁ డింతవేళక సమానస్కంధుఁడుంబోలె నై**
**తన కార్యస్థితి చెప్పి నా కడకు దూతం బూన్చి పుత్తెంచెనే ? 136**

**అర్థము .** నిన్న = నిన్నటి వఱకు, పని - ఏమి + ఏనియున్ + కల్గెన్ + ఏనిన్= పనియేమయిన నున్నచో, సుమనస్ (ః) పాలుండు = దేవతల రాజు - ఇంద్రుఁడు, తాన్, వచ్చి, ఒయ్యనన్ = మెల్లఁగా, నా - ముందటన్, నిల్చి + చేయన్

+ పోయి= మనవిచేయఁబోయి, కంపించున్ = వడఁకును, నిలింప + అధిపుఁడు = దేవతల రాజు - ఇంద్రుఁడు, ఇంత - వేళకున్ + అ = ఇంత స్వల్పకాలములోనే, సమాన - స్కంధుఁడున్ + పోలెన్ + ఐ = సమానమైన భుజపరాక్రమము గలవాని విధమునయి, తన - కార్య - స్థితి = తన పని ఉండుట, చెప్పి, నా - కడకున్ = నా యొద్దకు, దూతన్ = పూన్చి = దూతను బంపి, పుత్తెంచెనే ? = పంపెనా ?

**తాత్పర్యము :** నిన్నటివఱకు దేవేంద్రుఁడు పని యేమయిన నున్నచో తాను వచ్చి మెల్లఁగా నా యెదుట నిలిచి విన్నవింపఁబోయి వడఁకెను ఇంతలోనే నాతో సాటివానివలె నింద్రుఁడు తన కార్యస్థితి చెప్ప నా కడకు దూతను నియమించి పంపెనా ?

వ అని కోపరసాపూరితాంతఃస్మేరవదనారవిందుం డగుచును 137

**అర్థము :** అని, కోప - రస + ఆపూరిత + అంతః + స్మేర - వదన + అరవిందుండు + అగుచును = కోపరసముతో మిక్కిలి నిండిన మనస్సు, నవ్వుతోడి ముఖపద్మము గలవాఁడు అగుచును

**తాత్పర్యము:** అని కోపరసముతో మిక్కిలి నిండిన మనస్సును, నవ్వుతోడి ముఖపద్మమును గలవాఁ డగుచును - తరువాతి పద్యముతో నన్వయము

శా **ఏమేమీ మది నోటఁకండ సెడి దేవేంద్రాదు లుద్వృత్తులై**
**నామీఁదం జనుదెంచిరే, నిఁక మెయిన్ నాకేశబృందారక**
**స్తోమం బెన్నఁడు దొల్లి మార్బలసి? రెచ్చోఁ దొల్లి పోటొగ్గి సం**
**గ్రామోద్యోగము చేసి ? రిప్పు డెదురంగాఁ గారణం బేమియో! 138**

**అర్థము :** ఏమీ + ఏమీ, దేవ + ఇంద్ర + ఆదులు = దేవేంద్రుఁడు మున్నగువారు, మదిన్ = మనస్సునందు, ఓటకండ = భయము, చెడి = నశించి, ఉద్వృత్తులు + ఐ = గర్వించినవారయి, నా మీఁదన్ = నా పైకి, చనుదెంచిరేన్ = దండెత్తి వచ్చిరేని, ఇఁకన్ = ఇంక, మెయిన్ = భూమియందు, నాక + ఈశ, బృందారక - స్తోమంబు = దేవేంద్రుఁడు, దేవతల సమూహము, తొల్లి = పూర్వము, ఎన్నఁడు = ఎప్పుడు, మార్బలసిరి = శత్రువులై చుట్టుముట్టిరి ? ఏచ్చోన్ (ఏ + చోటన్) ఎచ్చట, తొల్లి = పూర్వము, పోటొగ్గి = యుద్ధమునకు సిద్ధపడి, సంగ్రామ + ఉద్యోగము = యుద్ధప్రయత్నము, చేసిరి ? ఇప్పుడు, ఎదురంగాన్ = ఎదిరించుటకు, కారణంబు + ఏమియో ? = ఏమి కారణమో ?

**తాత్పర్యము** ఏమేమి! మనసున భయపడక దేవేంద్రుఁడు మున్నగువారు గర్వితులై నాపై దండెత్తి వచ్చిరా ? ఇఁక భూమిలో ఇంద్రుఁడు, దేవతలు ఎన్నఁడైనను బూర్వము శత్రువులయి చుట్టిముట్టిరా ? పూర్వము ఎచ్చట యుద్ధసన్నద్ధులై యుద్ధమునకుఁ బూనుకొనిరి ? ఇప్పుడు ఎదిరించుటకుఁ గారణమేమో ?

చ దురమున నోడి దానవులతోడి విరోధము వీడి భక్తితో
సురపతి వచ్చి నా శరణు చొచ్చి తగం జెఱ లిచ్చియున్న నేఁ
గరుణయ పుట్టి తమ్ముఁ బొడఁగట్టి శమించితి, నట్టి నాకుఁ దా
. నిరవుగఁ బూని మార్కొనియెనేని సహింతునె వాని నెల్లెడన్ 139

**అర్థము :** సుర - పతి = ఇంద్రుఁడు, దురమునన్ = యుద్ధమున, ఓడి, దానవులతోడి - విరోధము - వీడి = రాక్షసులతోడి శత్రుత్వమును విడిచి, భక్తితోన్, వచ్చి, నా - శరణు - చొచ్చి, తగన్, చెఱలు + ఇచ్చి + ఉన్నన్ = దాస్యము ఒసఁగియున్నచో, నేన్ = నేను, కరుణ + అ = దయయే, పుట్టి, తమ్మున్, పొడఁగట్టి = చూచి, శమించితిన్ = శాంతము వహించితిని, అట్టి నాకున్, తాను, ఇరవుగన్ = అనుకూలముగా, పూని, మార్కొనియెన్ + ఏనిన్ = ఎదుర్కొనెనేని, వానిన్, ఎల్ల + ఎడన్ = అంతటను, సహింతునె = సైఁతునా ?

**తాత్పర్యము.** 'ఇంద్రుఁడు యుద్ధమున నోడి రాక్షసులతోడి శత్రుత్వమును విడిచి భక్తితో వచ్చి నన్ను శరణుచొచ్చి తగునట్లు దాస్యము నెఱపియుండ నేను కరుణతోఁ దమ్ముఁజూచి శాంతించితిని అట్టినాతోఁ దాను మార్కొనినచో వానిని సైఁతువా?

వ అనిన విని దేవతాదూత తారకాసురుం గనుంగొని. 140

**అర్థము.** అనినన్, విని, దేవతా - దూత = దేవతల రాయబారి -సుమతి, తారక + అసురున్, కనుంగొని = చూచి

**తాత్పర్యము.** తారకుఁ డట్లనఁగా విని దేవతల రాయబారియగు సుమతి తారకునిఁజూచి - తరువాతి పద్యముతో నన్వయము

మ త్రిదశేంద్రాదులు స్రుక్క కాజి కెదు రేతే నెంత నీ కోడరే ?
యది లే దంటిమె ? తొంటివేల్పులని నీ కా దర్పముల్ పల్కఁ బ
ట్టదుసు మ్మింకఁ, బురారినందనుఁడు షడ్వక్త్రుండు తోతెంచి బ
ల్లిదుఁడై ని న్నని నోర్చి దేవతల నేలించున్ త్రిలోకంబులన్ 141

**అర్థము**. త్రిదశ + ఇంద్ర + ఆదులు = దేవేంద్రుఁడు మున్నగువారు, స్రుక్కక= వెనుదీయక, ఆజికిన్= యుద్ధమునకు, ఎదురు + ఏతేన్= దండెత్తిరాఁగా, ఎంత, నీకున్, ఓడరే = నీచేత నోడిపోరా ? అది - లేదు + అంటిమె ? తొంటి వేల్పులు = పూర్వదేవతలు, రాక్షసులు, అని, నీకున్, ఇంకన్ = ఇఁకమీఁదట, ఆ-దర్పముల్=ఆ గర్వోక్తులు, పల్కన్, పట్టదుసుమ్ము = సాగదు సుమా, పుర + అరి - నందనుఁడు = ఈశ్వరుని కొడుకు అగు, షష్ (ట్) వక్త్రుండు = ఆఱుమొగముల వాఁడు - కుమారస్వామి, తోఁతెంచి = వచ్చి, బల్లిదుఁడు + ఐ = శూరుఁడయి, నిన్నున్, అనిన్ = యుద్ధమునందు, ఓర్చి = ఓడించి, దేవతలన్ = దేవతలను, త్రిలోకంబులన్ = ముల్లోకములను, ఏలించున్ = ఏలునట్లు చేయును

**తాత్పర్యము :** దేవేంద్రుఁడు మున్నగువారు వెనుదీయక యుద్ధమునకు దండెత్తి రాగా నీచే నోడిపోవరా ? ఆ మాట కాదంటిమా ? పూర్వదేవతలని నీకు ఇంక ఆ గర్వోక్తులాడ సాగదు సుమా ! ఈశ్వరసుతుఁడగు కుమారస్వామి వచ్చి శూరుఁడయి నిన్ను యుద్ధమున నోడించి దేవతలచే ముల్లోకములను ఏలించును

**విశేషములు**. తొంటి దేవతలు - పూర్వదేవతలు - రాక్షసులు షడ్వక్త్రుఁడు - షష్ (ట్) + వక్త్రుఁడు తోఁతెంచు - తోఁచు + తెంచు - 'తెంచు ధాతు వగ్వాదుల కనుప్రయుక్తం బగు, బాల క్రి 110 తోఁచు + తెంచు, 'అయ్యాది పరంబగునపుడు చువర్ణంబు లోపించు ' బాల క్రి 112 తోఁతెంచు పురారినందనుఁడు, షడ్వక్త్రుఁడు, అను శబ్దములు సాభిప్రాయములు కుమారస్వామిపరాక్రమసూచకములు

తే 'భక్తిఁ గీడ్పడి సేనాని పనుపు సేసి
నడవు మొండేనిఁ, గలనికి నడువు మొండె
పెరవు సేయక దివిజుల చెఱలు లేక
విడువు మొండేని మన్నాస విడువు మొండె.' 142

**అర్థము :** భక్తిన్ = భక్తితో, కీడ్పడి = వశమయి, సేనాని = కుమారస్వామి యొక్క, పనుపు+చేసి = ఆజ్ఞ చేసి, నడవుము = నడచుకొనుము, ఒండేనిన్ =

ఒండెన్ + ఏనిన్ = లేదా, కలనికిన్ = యుద్ధమునకు, నడవుము + ఒండెన్ = నడవనైన నడువుము, సెరవు + చేయక = సెరగు = ఆపద, చేయక, దివిజుల = దేవతలయొక్క, చెఱలు - లేక = నిర్బంధములు లేక, విడువుము + ఒండేనిన్ = విడువనైన విడువుము, మన్ను + ఆస = భూమిపై ఆశ, బ్రదుకుపైఁ గోరిక విడువుము + ఒండెన్ = విడువనైన విడువుము

**తాత్పర్యము** 'భక్తితో వశమయి కుమారస్వామి ఆజ్ఞ నిర్వర్తించి నడుచుకొనుము లేదా యుద్ధమునకు బయలుదేరుము దేవతలకు ఆపదగలిగింపక వారి నిర్బంధములు తొలఁగించి విడిచిపెట్టుము లేదా భూమిపై నాశ బ్రదుకుపైఁ గోరిక విడిచిపెట్టుము '

వ అనిన విని తారకాసురుండు కోపించి 143

**అర్థతాత్పర్యములు** అనిన విని తారకుఁడు కోపించి - తరువాతి పద్యముతో నన్వయము

క చెఱలు విడు మనిన పలు కెడఁ
గొఱవింగొని చూఁడినట్లు గొని కాలఁగ బి
ట్టఱఁ గోపవహ్నిఁ జూచెం
జుఱచుఱ మదకరికి సిళ్లు చూపిన భంగిన్ 144

**అర్థము :** చెఱలు - విడుము = నిర్బంధములు తొలఁగింపుము, అనిన-పలుకు = అనుమాట, ఎడన్ = హృదయమున, కొఱవిన్ + కొని, చూఁడిన + అట్లు = కాల్చిన విధమున కొని కాలఁగన్, బిట్టఱన్ - బిట్టు + అఱన్ = ధైర్యము నశింపఁగా, మద-కరికిన్ = మదించిన యేనుఁగునకు, సిళ్లు = అంకుశములు, చూపిన - భంగిన్ = చూపినట్లు, కోప - వహ్నిన్ = కోపాగ్నితో, చుఱచుఱ + చూచెన్

**తాత్పర్యము .** నిర్బంధములు తొలగింపు మనిన పలుకునకు మనసు కొఱవితోఁ గాల్చినట్లు మండుచుండఁగా ధైర్యమును గోలుపోయి, మత్తేభమునకు అంకుశములు చూపిన విధమునఁ గోపాగ్నితోఁ జుఱచుఱఁజూచెను

**విశేషములు .** అలంకారము ఉపమ, రూపకము సిళ్లు - సిడి + లు 'ఇత్తునకు బహువచనంబు పరంబగునపు డుత్వంబగు' బాల తత్సమ 45 సిడులు 'బహువచనము పరంబగునపుడు డ - ల -ట - ర ల యుత్వంబునకు

లోపంబు బహుళంబుగా నగు 'బాల ఆచ్చిక 12 సిడ్ + లు'బహువచన శ్లిష్టంబులయి యద్విరుక్తంబు లయిన డకారలకారంబుల కలఘులకారంబు బహుళంబుగ నగు ' బాల ఆచ్చిక 14 సిళ్లు

ఉ 'న న్నుఱ కేపునం జెఱల నాకిపకాంతలఁ దేరఁబంచెనే ?
పన్నగ యక్ష సిద్ధ సురపాలకు లాదిగ వేల్పులెల్ల నే
నన్న భయంబుఁనొంది కలహంబున కెక్కరు, నిన్నఁబుట్టి తా
నెన్నఁడు ప్రాతియయ్యె ? మఱి యెన్నఁడు నేర్చెను వెక్కిరింపఁగా 145

**అర్థము** నన్నున్, ఉఱక = లక్ష్యపెట్టక, ఏవునన్ = అతిశయముతో, చెఱలన్ = కారాగృహములనుండి, నాకిప - కాంతలన్ =దేవేంద్రుని స్త్రీలను, తేరన్+ పంచెనే = తెచ్చుట కాజ్ఞాపించెనా ?, పన్నగ - యక్ష - సిద్ధ - సుర-పాలకులు= నాగులు, యక్షులు, సిద్ధులు, దేవతల ప్రభువులు ఆదిగన్ = మొదలుగా, వేల్పులు + ఎల్లన్ = దేవతలందఱును, నేను + అన్నన్, భయంబున్ + పొంది, కలహంబునకున్ + ఎక్కరు = యుద్ధమున కుత్సహింపరు, నిన్నఁబుట్టి = నిన్న పుట్టి,, తాను, ఎన్నఁడు = ఎప్పుడు, ప్రాతి + అయ్యెన్ = గొప్పవాఁడయ్యెను?, మఱి, వెక్కిరింపఁగాన్ = అపహాస్యము చేయఁగా, ఎన్నఁడు, నేర్చెను ?

**తాత్పర్యము.** 'నన్ను లక్ష్యపెట్టక అతిశయముతోఁ గారాగృహములనున్న దేవేంద్రునిస్త్రీలను దీసికొనిరమ్మని పంపెనా ? పన్నగ యక్ష సిద్ధ దేవతా ప్రభువులు మున్నుగా దేవత లందఱును నే ననిన భయపడి నాతో యుద్ధమున కుత్సహింపరు నిన్న పుట్టి తా నెప్పుడు ఇంతగొప్పవాఁడయ్యెను ? మఱి యెప్పుడు మమ్ము వెక్కిరింపనేర్చెను?'

ఆ. చెనసి కలహభీతి చేతుల తీఁట వోఁ
బొడువఁజాలునేని మృడుఁడ కాక
నిరత మిగురుగుట్టి నెత్తురు త్రాగిన
భంగి కాక నాకు బాలుఁ డెదురె ? 146

**అర్థము :** కలహ - భీతి = యుద్ధమువలని భయము(ను), చెనసి = ప్రతిఘటించి, అనఁగా యుద్ధభయములేక యని భావము, చేతుల - తీఁట + పోన్= చేతుల దురదపోవునట్లు, పొడువన్ + చాలున్ + ఏనిన్ = పొడువ సమర్థుఁడేని, మృడుఁడు + అ - కాక = శివుఁడే తప్ప, నిరతము = ఎల్లప్పుడును, ఇగురు + కుట్టి = దంతముల చిగురును గుట్టి, నెత్తురు - త్రాగిన - భంగి - కాక= రక్తమును ద్రాగిన విధముగాక, నాకున్, బాలుఁడు, ఎదురె ? = ప్రతియా ?

**తాత్పర్యము**. యుద్ధభయములేక చేతుల దురద పోవునట్లు పొడువ సమర్థుఁడేని శివుఁడే తప్ప, ఎల్లప్పుడును పండ్ల చిగురును గుట్టి నెత్తురు త్రాగినట్లు నాకుఁ గుట్టువాఁడు ప్రతియా ?

**విశేషములు**. పండ్ల చిగురును గుట్టి నెత్తురు త్రాగు టెంత సులభమో, బాలు నెదిరించుట తన కంత సులభ మనుట చేతుల తీఁట పోవునట్లు యుద్ధమున శివుఁడే నన్ను మార్కొనవలయును గాని, బాలుఁడు నాకేపాటి ? యనుట అలంకార ముపమ

క **బహుముఖ మటె తన రాజ్యము**
**బహుదోషాఢ్యుఁ డటె తాను బాలుండటె వాఁ**
**డు హరుండైనను నీతి వి**
**రహితం బిది యిట్టి పతికి రణజయమగునే ?** 147

**అర్థము**. తన - రాజ్యము, బహు - ముఖము + అటె = ఒక్కనికిఁ గాక అనేకులకు సంబంధించిన దఁట, తాను = ఇంద్రుఁడు, బహు - దోష + ఆఢ్యుఁడు+ అటె = పెక్కు దోషములుగల వాఁడఁట, వాఁడు = సేనాధిపతి, బాలుండు + అటె = పిల్లవాఁడఁట, హరుండు + ఐనన్ = ఈశ్వరుఁడయినను, ఇది, నీతి - విరహితంబు = నీతిమాలినది, ఇట్టి - పతికిన్ = ఇట్టి రాజునకు, రణ-జయము = యుద్ధమున గెలుపు, అగునే = అగునా ?

**తాత్పర్యము** · 'తన (ఇంద్రుని) రాజ్యము పెక్కురకు సంబంధించిన దఁట, తాను పెక్కు దోషములు గలవాఁడఁట వాఁడు ఆ సేనాధిపతి కుఱ్ఱవాఁడఁట హరుఁడే యగుఁగాక ఇది నీతిమాలినది ఇటువంటి రాజునకు యుద్ధమున జయము గలుగదు '

చ **విడుమని వేఁడ నావలన వేల్పులు ముందఱ వీరిఁదెచ్చి యి**
**ల్లడ యిడిపోయిరే ? భుజబలంబున నెమ్మెయి నాఁచికొంటినే**
**నడరఁగఁ దారు నమ్మెయి రయంబునఁ గ్రమ్మఱఁ గొంట యొప్పుఁగా**
**కడుగుట యొప్పునే ? యడిగినంతన యిచ్చుట నాకు నొప్పునే ?** 148

**అర్థము**. విడుము + అని - వేఁడన్ = బంధితులను విడువు మని ప్రార్థించుటకు, వేల్పులు = దేవతలు, ముందఱన్ = పూర్వము, వీరిన్ = ఈ

బంధితులను, తెచ్చి, నావలనన్ = నా దగ్గఱ, ఇల్లడ + ఇడి + పోయిరే ? = న్యాసముగా నుంచి పోయిరా ?, నేను, అడరఁగన్ = అతిశయించునట్లు, భుజ - బలంబునన్ = బాహు పరాక్రమముచే, ఎమ్మెయిన్ - ఏ + మెయిన్ = ఏ విధముగ, నాఁచికొంటిన్ = అపహరించితినో, తారున్ = వారును, అమ్మెయిన్ - ఆ + మెయిన్ = ఆ విధముగనే, రయంబునన్ = శీఘ్రముగా, కొంట = కొనుట, ఒప్పున్ + కాక = తగును గాని, అడుగుట, ఒప్పునే ? అడిగిన + అంతన్ + అ=అడిగిన వెంటనే, ఇచ్చుట, నాకున్, ఒప్పునే

**తాత్పర్యము** . నా దగ్గఱ బంధితులై యున్నవారిని విడిచిపెట్టుమని వేల్పులు వేఁడుటకు వారు మునుపు వారిని దెచ్చినా కడ ఇల్లడపెట్టి పోయిరాయేమి? నేను విజృంభించి నా బాహుపరాక్రమమున వారి నెట్లు అపహరించితెచ్చితినో, వారును అట్లే వీరిని శీఘ్రముగా గ్రహించుట యొప్పును అంతేగాని వా రడుగుట యొప్పుగాదు అడిగిన వెంటనే యిచ్చుట నాకును ఒప్పుగాదు

ఉ **బాలకుఁబట్టియే సురలు బల్విడి నాపయి నెత్తి రింత యే**
**నేలిదమైతినే తమకు నెన్నఁడు మద్భుజవిక్రమక్రమా**
**భీల కరాళ ఖడ్గవరభీషణవేషము చూచి నేలపైఁ**
**గాలిడి నిల్తురే యనికిఁ గ్రమ్మఱ వత్తురె ? వృత్తి సొత్తురే ? 149**

**అర్థము** . సురలు = దేవతలు, బాలకున్ + పట్టియే = బాలకుని కారణముననే, బల్విడి =బలవంతముగా, నా - పయిన్ = నాపై, ఎత్తిరి = దండెత్తిరి ఏను = నేను, తమకున్, ఇంత - ఏలిదము + ఐతినే = ఇంత చులుకన ఐతినా ?, ఎన్నఁడు = ఎప్పుడు, మత్ + భుజ - విక్రమ - క్రమ + ఆభీల = కరాళ - ఖడ్గ - వర - భీషణ - వేషము = నాయొక్క బాహుపరాక్రమము యొక్క క్రమముచే భయంకరమయిన శ్రేష్ఠమైన కత్తిచే వెఱపుగొలుపు వేసము (రూపము), చూచి, నేలపైన్, కాలు + ఇడి = కాలు పెట్టి, నిల్తురే, అనికిన్ = యుద్ధమునకు, క్రమ్మఱన్ = మరల, వత్తురె, వృత్తి + చొత్తురే = జీవింతురా ?

**తాత్పర్యము** . బాలుని కారణముననే దేవతలు బలవంతముగా నాపై దండెత్తి వచ్చుటకు వారికి నేనంత చులుకన అయితినా ? ఎప్పుడైనను నా బాహు పరాక్రమముచే భయంకరమై, శ్రేష్ఠమైన కత్తిచే భయంకరమైన రూపమును జూచి నేలమీఁదఁ గాలుమోపి నిలుతురా ? మరల యుద్ధమునకు వత్తురా ? బ్రదుక నేర్తురా ?

**విశేషములు.** నిల్తురే, వత్తురె, చొత్తురే - నిలుచు + దు + రు + ఏ, వచ్చుదురు + ఏ, చొచ్చుదురు + ఏ - 'చువర్ణంబుతోడ దుగ్ధకారంబు', తకారంబగు ' బాల క్రి 108

వ అనిన సుమతి కుమతి యగుతారకాసురు దురాలాపంబులు విని కోపించి 150

**అర్థము.** అనినన్, సుమతి, కుమతి = దుర్బుద్ధి, అగు, తారక + అసురు = తారకుఁడను రాక్షసుని యొక్క, దురాలాపంబులు = దుర్భాషలు, విని, కోపించి

**తాత్పర్యము .** అని తారకుఁడనఁగా, సుమతి దుర్బుద్ధియగు వాని దుర్భాషలు విని కోపించి - తరువాతి పద్యముతో నన్వయము

చ వడిఁ ద్రిదశాలి నోర్చు డొక వావిరి బీరము కాఁగ రజ్జ దె
ప్పుడు, నది నీవు చేసిన తపోవిభవంబున నబ్జగర్భుచేఁ
బడసిన విద్య గాక నిజబాహుబలంబని చూతె ? పుట్టిన
ప్పుడు భుజశక్తి మా గుహుఁడువోలె సురాధిపుఁ బోరనేర్చితే? 151

**అర్థము** వడిన్ = వేగముతో, - శౌర్యముతో, త్రిదశ + ఆలిన్ = దేవతల వరుసను - సమూహమును, ఓర్చుట = ఓడించుట, ఒక - వావిరి = గొప్ప, బీరము - కాఁగన్= పరాక్రమముగా, ఎప్పుడున్, రజ్జదు (వు) = ఆత్మస్తుతి చేసికొందువు, అది = ఆ ఓడించుట, నీవు - చేసిన, తపస్ (ః) + విభవంబునన్ = తపస్సంపదచే, అబ్జ - గర్భుచేన్ = బ్రహ్మవలన, పడసిన = పొందిన, విద్య + కాక = నేర్పు గాక, నిజ - బాహు - బలంబు + అని = స్వీయభుజపరాక్రమమని, చూతె = చూతువా, పుట్టిన + అప్పుడు, భుజ-శక్తిన్ = బాహుబలముతో, మా - గుహుఁడు + పోలెన్ = మా కుమారస్వామి వలె, సుర + అధిపున్ = దేవేంద్రునితో, పోరన్ + నేర్చితే = యుద్ధముచేయఁగలిగితివా ?

**తాత్పర్యము.** శౌర్యముతో దేవతల నోడించు టొక గొప్పపరాక్రమముగా నాత్మస్తుతి చేసికొందువు అది నీవు చేసిన తపస్సంపదకు బ్రహ్మవలనఁ బొందిన నేర్పుగాక స్వీయబాహుబలమని తలంతువా ? పుట్టఁగనే బాహుపరాక్రమముతో మా కుమారస్వామివలె దేవేంద్రునితోఁ బోరఁగలిగితివా ?'

**విశేషములు.** తపోవిభవము - తపస్ + విభవము - తపః + విభవము- తపోవిభవము రజ్జుదువు= 'లిడ్లొట్టుల వకారంబునకు లోపంబు విభాషనగు' బాల క్రియ 24 రజ్జుదు + ఉ 'అంద్వవగాగమంబులం దప్ప నపదాదిస్వరంబు పరంబగునపు డచ్చునకు సంధియగు ' బాల సంధి 11 రజ్జుదు చూతె- చూచుదువు+ ఎ, 'చువర్ణంబుతోడ దుగ్దకారంబు తకారంబగు ' బాల క్రియ 108 చూతువు + ఎ 'లాద్వకారలోపము - బాల క్రియి 24 చూతు + ఎ అపదాదిస్వర సంధి బాల సం 11 చూతె ఇట్లే నేర్చితే - నేర్చితివి + ఏ - లిద్వకారలోపము బాల క్రి 24 నేర్చితి + ఇ+ ఏ - అపదాదిస్వర సంధి బాల సం 11

క. ఇనుఁ డుదయింపక ముందఱ
ఘనముగ వర్తించుఁ దారకప్రభ గా క
య్యినుఁ డుదయించిన పిమ్మటఁ
గనుఁగొన లోకమునఁ దారకప్రభ కలదే 152

**అర్థము.** ఇనుఁడు = సూర్యుఁడు = ప్రభువు, ఉదయింపక - ముందఱన్ = ఉదయించుటకు ముందు, తారక - ప్రభ = నక్షత్రముల కాంతి - తారకాసురుని దీప్తి, ఘనముగన్ = అధికముగా, వర్తించున్ + కాక = ఉండునుగాని, అయ్యినుఁడు = ఆ + ఇనుఁడు = ఆ సూర్యుఁడు - ఆ ప్రభువు, ఉదయించిన - పిమ్మటన్ = ఉదయించిన తరువాత, కనుఁగొనన్ = చూడఁగా, లోకమునన్, తారక - ప్రభ = నక్షత్రముల కాంతి, తారకాసురుని దీప్తి, కలదే = ఉండునా ?

**తాత్పర్యము.** 'ఇనుఁడు '(సూర్యుఁడు, రాజు) ఉదయించుటకుముందు తారకముల (నక్షత్రముల) కాంతి - తారకాసురుని దీప్తి అధికముగా నుండును గాని, ఆ ఇనుఁడు (సూర్యుఁడు, రాజు) ఉదయించిన తరువాత లోకమునఁ దారక ప్రభ - నక్షత్రములకాంతి, తారకుని దీప్తి ఉండదు '

**విశేషములు.** అలంకారము అర్థాంతరన్యాసము - శ్లేషానుప్రాణితము

క తారకవిరచితకృతియుం
దారక విరచిత సుకృతియుఁ దా నడఁగు సదా
చారక విబుధాళికి సువి
చారక విబుధాధినాథు షణ్ముఖుఁ గనినన్ 153

**అర్థము** సువిచారక - విబుధ + అధినాథున్ = మంచి ఆలోచనగల దేవతానాయకుని, షణ్ముఖున్ - షష్ (ట్) + ముఖున్ = ఆఱుమొగముల వానిని- కుమారస్వామిని - సువిచార - కవి - బుధ + అధినాథున్ = మంచి ఆలోచన గల కవులకుఁ, బండితులకుఁ బ్రభువైనవానిని, షణ్ముఖున్ = షణ్ముఖుఁ డనువానిని, కనినన్ = చూచినచో, సత్ + ఆచారక - విబుధ + ఆళికిన్ = సత్ప్రవర్తనముగల దేవతల సమూహమునకు, సత్ + ఆచార - కవి - బుధ + ఆళికిన్ = మంచి ఆచారము - సంప్రదాయముగల కవులయుఁ బండితులయు సమూహమునకు, తారక - విరచిత - కృతియున్ = తారకాసురునిచేఁ జేయఁబడిన పనియును, తార - కవి - రచిత - సుకృతియున్ = తారుఁడను కవిచే రచింపఁబడిన సత్కావ్యమును, తాను, అడఁగున్ = నశించును

**తాత్పర్యము .** సత్ప్రవర్తనము గల దేవతలసమూహమునకు మంచి ఆలోచనము గల దేవతానాయకుఁడైన షణ్ముఖుని - కుమారస్వామిని జూచినచో, తారకాసురుఁడు గావించిన పని యడఁగును సత్సంప్రదాయముగల కవులయుఁ, బండితులయు సమూహమునకు మంచియాలోచనగల కవిపండితులలో శ్రేష్ఠుఁడగు షణ్ముఖుఁ డను కవిని జూచినచో తారుఁడను కవిచే రచింపఁబడిన సత్కావ్యమును అడఁగును

**విశేషములు .** అలంకారము శ్లేషము 'నన్నెచోడుని కాలమునఁ బ్రఖ్యాతులగు తార కవియు, షణ్ముఖ కవియు నుండిరని తోఁచుచున్నది ' మా రా కవి

**వ** అని యనేకప్రకారంబులం గుమారకు విశేషించి తారకు నిరాకరించి పలుకుచున్న దేవదూతంగని కోపించి వీని వధియింపుఁడనుడు దనుజనాయకు లొండొరులం గడవ సంక్షోభించిన. శుక్రుండు వక్రంబై యందఱ కెడసొచ్చి **154**

**అర్థము .** అని, అనేక - ప్రకారంబులన్ = పెక్కు విధముల, కుమారకున్= కుమారస్వామిని, విశేషించి = అధికము చేసి, తారకున్ = తారకాసురుని, నిరాకరించి = త్రోసిపుచ్చి, పలుకుచున్ + ఉన్న, దేవ - దూతన్ = దేవతల రాయబారియగు సుమతిని, కని, కోపించి, వీనిన్ = దూతను, వధియింపుఁడు = చంపుఁడు, అనుడున్ = అనినంతనే, దనుజ - నాయకులు = రాక్షస శ్రేష్ఠులు, ఒండొరులన్ = ఒకరినొకరు, కడవన్ = అతిక్రమించుటకు, సంక్షోభించినన్ =

తొట్రుపడఁగా, శుక్రుండు, వక్రంబు + ఐ = అడ్డమయి, శుక్రగ్రహము వక్రించి అందఱకున్, ఎడ + చొచ్చి = నడుమవచ్చి

**తాత్పర్యము** అని పెక్కురీతులఁ గుమారస్వామిని గొప్పచేసి, తారకాసురుని ద్రోసిపుచ్చి పలుకుచున్న దేవతల రాయబారియగు సుమతిని జూచి కోపమూని వీనిని జంపుఁ డనినంతనే రాక్షసశ్రేష్ఠు లొకరినొక రతిక్రమింపఁ దొట్రువడఁగా శుక్రాచార్యుఁడు నడుమ వచ్చి - శుక్రగ్రహము వక్రించి - తరువాతి పద్యముతో నన్వయము

క **వీం డేమిసేయుఁ బంచిన**
**వాం డుండంగ ? నిక్కమునకు వధ్యుఁడుగా నా**
**ఖండలుఁడు గాక, యేసిన**
**వాం డుండఁగ నేమిసేయు వరశర మనిలోన్** 155

**అర్థము .** పంచినవాండు + ఉండఁగన్ = పంపినవాఁడు ఉండఁగా, నిక్కమునకున్ = నిజమునకు, వధ్యుడు + కాన్ = వధింపఁదగినవాఁడుగా, ఆఖండలుఁడు + కాక = ఇంద్రుఁడు కాక, వీండు = వీఁడు = ఈ రాయబారి, ఏమి + చేయున్ ? ఏలిన - వాండు = ప్రయోగించినవాఁడు, ఉండఁగన్, వర - శరము = మేలయిన బాణము, అనిలోన్ = యుద్ధములో, ఏమి + చేయున్ ?

**తాత్పర్యము .** ఈ రాయబారిని బంపినవాఁ డుండఁగా నితఁడేమి చేయును? నిజమున కీతనిని బంపిన యింద్రుఁడు వధార్హుఁడు గాని యితఁడు వధ్యుఁడా ? యుద్ధములోఁ బ్రయోగించినవాఁ డుండఁగా బాణమేమి చేయును ?

**విశేషములు.** అలంకారము దృష్టాంతము వీఁడు, వాఁడు అను శబ్దములు పూర్ణానుస్వారయుక్తములుగాఁ బ్రయుక్తములగుట నన్నెచోడని ప్రాచీనతకు నిదర్శనము

క **గురులను, మునులను, సుకవుల,**
**నరిదూతలఁ బూతలగు వరాంగనల, మహీ**
**సురులను, మిత్రుల, బాలుర**
**నిరతముఁ జంపఁదగ దెంతనేరకయున్నన్** 156

**అర్థము .** గురులను, మునులను, సుకవులన్, అరి - దూతలన్ = శత్రువుల రాయబారులను, పూతలు + అగు = పవిత్రురాండ్రయిన, వర + అంగనలన్ = శ్రేష్ఠురాండ్రయిన స్త్రీలను, = పతివ్రతలను, మహీసురులను = బ్రాహ్మణులను, మిత్రులన్ = స్నేహితులను, బాలురన్ = పిల్లలను, ఎంత - నేరక+ ఉన్నన్ = ఎంత తప్పు చేసిన వారయినను, నిరతమున్ = ఎప్పుడును, చంపన్ + తగదు = చంపరాదు

**తాత్పర్యము** గురువులను, మునులను, సత్కవులను, శత్రుదూతలను, పవిత్రులగు స్త్రీలను బ్రాహ్మణులను, మిత్రులను, బాలురను - వారెంత తప్పు చేసినను ఎప్పుడును జంపరాదు '

**విశేషములు .** ఈ పద్యము మా రా కవి ప్రతిలో లేదు

**వ** అనిన దనుజగురు వచనంబుల దనుజవరులు మన్నించి వానిం బరిభవింపక వెలువడఁ ద్రోపించి రంతఁ దారకాసురుండు నిజాప్తచరు నస్మదీయ భుజావష్టంభా విక్రయంబులు శక్ర చక్రధర కుమారాద్యమర చక్రంబునకు విశేషించి వర్ణించి హిమవంతంబు నుత్తరదిగ్భాగంబునం గలను సెప్పి రమ్మనిన వాఁడును మహాప్రసాదంబని వీడుకొని చనియె నంత నక్కడ 157

**అర్థము .** అనినన్, దనుజ - గురు - వచనంబులన్ = రాక్షసగురువగు శుక్రుని మాటలను, దనుజ - వరులు = రాక్షస శ్రేష్ఠులు, మన్నించి = ఆదరించి, వానిన్ = ఆ దూతను, పరిభవింపక = అవమానింపక, వెలువడన్ = ఆవలికిఁ బోవునట్లు, త్రోపించిరి = గెంటించిరి, అంతన్, తారక + అసురుండు, నిజ + ఆప్త - చరున్ = తన ఇష్టుఁడగు చారుని, అస్మదీయ - భుజ + అవష్టంభ +అవక్ర - విక్రమంబులు = నావయిన బాహులు గర్వమును, వంకరలేని - సరియైన పరాక్రమమును, శక్ర - చక్రధర - కుమార +ఆది + అమర - చక్రంబునకున్ = ఇంద్రుఁడు, విష్ణువు, కుమారస్వామి మున్నగు దేవతల సమూహమునకు, విశేషించి= అధికముగా, వర్ణించి, హిమవంతంబు + ఉత్తర - దిశ్ (క్) + భాగంబునన్ = హిమవత్పర్వతమునకు ఉత్తర దిశాభాగమందు, కలను = యుద్ధము, చెప్పి, రమ్ము అనినన్, వాఁడును, మహత్ (మహా) ప్రసాదంబు + అని, వీడుకొని = సెలవు పుచ్చుకొని, చనియెన్, అంతన్, అక్కడన్

**తాత్పర్యము .** అనిన శుక్రుని పలుకులను రాక్షసశ్రేష్ఠులు ఆదరించి వానిని అవమానింపక బయటికి గెంటించిరి అంతఁ దారకుఁడు తన హితుఁడగు చారునితో నా బాహుగర్వమును అవక్రపరాక్రమమును అధికముగా వర్ణించి హిమవత్పర్వతమున కుత్తర = భాగమున యుద్ధమని చెప్పి రమ్మన వాఁడును మహాప్రసాదమని సెలవు పుచ్చుకొని యేఁగెను అంతనక్కడ - తరువాతి పద్యముతో నన్వయము

క సురదూత మగుడఁ జని సుర
వరపరివృతుఁడగు మయూరవాహనునకుఁ దా
నరిగిన దెస కార్యము వి
స్తరముగ నెఱిఁగించుచున్న తదవసరమునన్ 158

**అర్థము** సుర - దూత = దేవతల రాయబారి - సుమతి, మగుడన్ = మరల, చని, సుర - వర - పరివృతుఁడు + అగు = దేవశ్రేష్ఠులచేఁ గూడికొన్నవాఁడగు, మయూర - వాహనునకున్ = నెమలి వాహనముగాఁ గలవానికి - కుమారస్వామికి, తాను, అరిగిన - దెస = వెడలిన చోటి, కార్యము = పని, విస్తరముగన్ = విపులముగ, ఎఱిఁగించుచున్ + ఉన్న - తద్ + అవసరమునన్ = తెలుపుచున్న ఆ సమయమున

**తాత్పర్యము .** దేవతల రాయబారియగు సుమతి మరలిచని దేవతలతోఁ బరివేష్టితుఁడైన కుమారస్వామికిఁ దానువెడలిన చోటి పనిని విపులముగఁ జెప్పుచున్న ఆ సమయమున - తరువాతి పద్యముతో నన్వయము

### తారకుని దూత కుమారస్వామి కడకు వచ్చుట

**వ పడిహారి చనుదెంచి దానవదూత శివద్వారంబున నున్నవాఁడని విన్నపంబుచేసి కుమారానుమతంబునం దోడ్కొని రాఁ జనుదెంచి హరి పురందర ప్రముఖాఖిల సురవర దిగధీశ్వర పరిశోభితంబై నవరత్న నికర మేఖలా కలాపంబు చేసినట్లనేకపురుషరత్నాకీర్ణంబై వెలుంగుచున్న 159**

**అర్థము .** పడిహారి = పణిహారి - ద్వారపాలకుఁడు, చనుదెంచి, దానవ - దూత = రాక్షసుల రాయబారి, శివ - ద్వారంబునన్, ఉన్నవాఁడు, అని, విన్నపంబు + చేసి, కుమార + అనుమతంబునన్ = కుమారస్వామి సమ్మతితో, తోడ్కొని - రాన్ = తీసికొని రాఁగా, చనుదెంచి, హరి - పురందర - ప్రముఖ + అఖిల - సురవరదిశ్ (క్) + అధి + ఈశ్వర - పరిశోభితంబు + ఐ = విష్ణువు, ఇంద్రుఁడు

మున్నగు నెల్ల దేవశ్రేష్ఠులతోను, దిక్పాలకులతోను ప్రకాశించినదయి, నవరత్న నికర - మేఖలా - కలాపంబు = తొమ్మిది రత్నముల సమూహము గల మొలనూలి ఆభరణము, చేసిన + అట్లు, అనేక - పురుష - రత్న + ఆకీర్ణంబు + ఐ = శ్రేష్ఠులగు పురుషులతోఁ గూడినదయి, వెలుఁగుచున్ + ఉన్న = ప్రకాశించుచున్న

**తాత్పర్యము .** ద్వారపాలకుఁడు వచ్చి తారకుని రాయబారి శివద్వారము కడ నున్నవాఁడని విన్నవించి కుమారస్వామి అనుమతితోఁ దీసికొని రాఁగా వచ్చి విష్ణువు, ఇంద్రుఁడు మున్నగు నెల్లదేవశ్రేష్ఠులతోను, దికాల్పకులతోను ప్రకాశించినదయి, నవరత్న స్థగితమైన మొలనూలి ఆభరణము చేసినట్లు పెక్కంద్రు పురుషశ్రేష్ఠలతో - పెక్కు మగఱాలతో - వ్యాప్తమయి ప్రకాశించుచున్న - తరువాతి పద్యములోని సభలో అనుదానితో నన్వయము

**మ సభలో దానవదూత గాంచె విలసజ్జాజ్వల్యమానంబులై**
**యభిరామాంగరుచుల్ సురప్రకర వక్త్రాబ్జాలి కుజ్జృంభ సౌ**
**రభముల్ దిక్కుల గ్రిక్కొనంగ నెలమిన్ రంజించు బాలార్కస**
**న్నిభుఁ గాంతాకరచామరానిలచలన్నీలాలకున్ బాలకున్ 169**

**అర్థము :** సభలోన్, దానవ - దూత = రాక్షసుఁడగు తారకుని రాయబారి, అభిరామ + అంగ - రుచుల్ = మనోహరములయిన దేహకాంతులు, విలసత్ + జాజ్వల్యమానంబులు + ఐ = మిక్కిలి ప్రకాశించుచున్నవియి, సుర - ప్రకర - వక్త్ర+ అబ్జ + ఆలికిన్ = దేవతల సమూహము యొక్క ముఖ పద్మముల వరుసకు, ఉత్ + జృంభ - సౌరభముల్ = సంపూర్ణ వికాసము, పరిమళము, దిక్కులన్ = దిశలందు, గ్రిక్కొనంగన్ = గిరికొనఁగా - వ్యాపింపఁగా, ఎలమిన్ = ప్రీతితో, రంజించు = రంజిల్లునట్లు చేయు, బాల + అర్క - సన్నిభున్ = లేఁత సూర్యునితో సమానుఁడును, కాంతా - కర - చామర + అనిల - చలత్ + నీల + అలకున్ = స్త్రీల చేతులందలి వింజామరలగాలిచేఁ జలించుచున్న నల్లని ముంగురులు గలవాఁడును, అగు బాలకున్ = పిల్లవానిని - కుమారస్వామిని, కాంచెన్ = చూచెను

**తాత్పర్యము .** సభలో తారకాసురుని రాయబారి మనోహరములయిన దేహకాంతులు మిక్కిలి ప్రకాశించుచున్నవయి, దేవతల ముఖపద్మములను వికాస పరిమళములు దిక్కులందు వ్యాపించునట్లు ప్రీతితో రంజిల్లఁజేయు లేఁత

సూర్యునితో సమానుఁడును, స్త్రీల చేతుల వింజామరల గాలికిఁ జలించు ముంగురులు గలవాఁడును అగు బాలుని - కుమారస్వామినిఁ జూచెను

**విశేషములు** అలంకారము ఉపమ అనుప్రాసము చలన్నీల = చలత్ + నీల - అనునాసిక సంధి

**వ ఇ ట్లఖిల సురావళి విభూతియుం గుమారు నైశ్వర్యావష్టంభ తేజోభివృద్ధియుంగని విస్మితుండగుచుం గుమారు నాస్థానరంగంబు దఱియంజొత్తెంచి త్రినయనతనయు సభావిభవంబు తృణంబకాఁ గైకొని సురవరులం గనుంగొని**

**అర్థము :** ఇట్లు, అఖిల - సుర + ఆవలి = సకల దేవతల సమూహాము యొక్క, విభూతియున్ సంపదయును, కుమారు + ఐశ్వర్య = అవష్టంభ - తేజస్ (ః) + అభివృద్ధియున్ = కుమారస్వామియొక్క, ఐశ్వర్యగర్వముతేజస్సుయొక్క పెంపును, కని, విస్మితుండు + అగుచున్ = ఆశ్చర్యపడినవాఁడగుచు, కుమారు+ ఆస్థాన - రంగంబు = కుమారస్వామియొక్క సభాప్రదేశమును, తఱియన్ + చొత్తెంచి = ప్రవేశించి, త్రినయన - తనయు = ముక్కంటి కుమారుఁడైన కుమారస్వామియొక్క, సభా - విభవంబు = సభా సంపద, తృణంబు + అ = గడ్డిపోచయే, కాన్ = అగునట్లు, కైకొని = తలఁచి, సురవరులన్ = దేవతా శ్రేష్ఠులను, కనుంగొని

**తాత్పర్యము :** ఇట్లు ఎల్ల సురల సంపదయును, కుమారస్వామి యైశ్వర్యగర్వమును తేజోవృద్ధిని జూచి ఆశ్చర్యపడుచుఁ గుమారుని ఆస్థాన ప్రదేశమును బ్రవేశించి, కుమారస్వామి సభాభవనమును దృణప్రాయముగా నెంచి దేవతలను జూచి - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** తేజోభివృద్ధి - తేజస్ + అభివృద్ధి = పదాంతసకారమునకు విసర్గాదేశము - తేజః + అభివృద్ధి - హ్రస్వ ఆకారము తరువాత వచ్చు విసర్గమునకు హ్రస్వ ఆకారము పరమగుచుండఁగా విసర్గమునకు ఉకార మాదేశమయి తత్పూర్వ అకారముతో గుణసంధి యగును తేజోభివృద్ధి కుమారు + ఆస్థాన - 'షష్ఠీ సమాసమునం దుకార ఋకారముల కచ్చు పరమగునపుడు నుగాగమంబగు ' బాల సంధి 34

సీ కాలంబు కూడ జగంబు లేర్చుట యెంత
యల యని హరులోచనాగ్ని నుఱఁడు
వనరాశిదగు మెత్తఁదన మెర్గి యేచుటే
బలమని బాడబానలముఁ దెగడు
మార్పెట్ట నోపని మ్రాఁకు లేర్చుట యెంత
వాలగు నని వనవహ్ని నవ్వుఁ
గలితనం బెఱుఁగని కులగిరు లేర్చు టే
వాఁడిమి యని పవిజ్వలనుఁ బలుకు

తే నెలమిఁ గోమల మగు తావ లేర్చుడెంత
తనదు తీవ్రత్వమని తీవ్రధాము నొత్తుఁ
దనకుఁ బ్రతిలేక దిక్కులు దాఁకి వెలుఁగు
తారకాసురు ఘోరప్రతాపవహ్ని 162

**అర్థము** తనకున్, ప్రతి - లేక = మాఱులేక, దిక్కులు, తాఁకి, వెలుఁగు= ప్రకాశించునట్టి తారక + అసురు = తారకాసురునియొక్క, ఘోర - ప్రతాప - వహ్ని = భయంకరమైన పరాక్రమ మనెడి అగ్ని

కాలంబు - కూడన్ = కాలము కూడఁగా, జగంబులు = లోకములు, ఏర్చుట = దహించుట, ఎంత + అలవు + అని = ఏపాటి సామర్థ్యమని, హరు - లోచన + అగ్నిన్ = ఈశ్వరుని కంటి మంటను, ఉఱఁడు = సరకుసేయఁడు

వన - రాశిది + అగు = సముద్రముయొక్క, మెత్తఁదనము = మృదుత్వము, ఎర్గి = తెలిసి, ఏచుట = విజృంభించుట, ఏ - బలము + అని = ఏమిశక్తియని, బాడబ + అనలమున్ = బడబాగ్నిని, తెగడున్ = తిరస్కరించును

మార్పెట్టన్ + ఓపని = మాఱు + పెట్టన్ + ఓపని = ఎదురు తిరుగ లేని, మ్రాఁకులు = చెట్లు (చెట్లను), ఏర్చుట = దహించుట, ఎంత - వాలు + అగున్ + అని = ఎంత తీక్ష్ణత అగునని, వన - వహ్నిన్ = అడవినిప్పును - దావాగ్నిని, నవ్వున్ = పరిహాసించును

కలితనంబు = శౌర్యము, ఎఱుఁగని, కుల - గిరులు = కులపర్వతములు (లను), ఏర్చుట= కాల్చుట, ఏమి - వాఁడిమి + అని = ఏమి పరాక్రమ మని, పవి-జ్వలనున్ = వజ్రాయుధపుటగ్నిని, పలుకున్ = ఆక్షేపించును

ఎలమిన్ = వికాసమున, కోమలము + అగు = మృదువులగు, తొవలు= కలువలు (లను), ఏర్చుడు = కాల్చుట, ఎంత - తనదు - తీవ్రత్వము + అని = తన తీక్ష్ణతయని, తీవ్ర -ధామున్ = సూర్యుని, ఒత్తున్ = నిందించును

**తాత్పర్యము .** తనకు మాఱులేక దిక్కులు ముట్టి వెలుఁగునట్టి తారకాసురుని భయంకరమైన ప్రతాపమనెడి అగ్ని కాలముకూడఁగా లోకములను గాల్చుట యేపాటి సామర్థ్యమని ముక్కంటి కంటిమంటను సరకుసేయఁడు సముద్రము మృదుత్వ మెఱిఁగి దహించుట ఏమి బలమని బడబాగ్నిని దిరస్కరించును ఎదిరింపఁజాలని చెట్లను దహించుట యెంత తీక్ష్ణతయని దావాగ్నిని బరిహసించును శౌర్యము నెఱుఁగని కులపర్వతములను దహించుట ఏమి పరాక్రమమని వజ్రాయుధపుటగ్నిని ఆక్షేపించును వికాసమున మృదువులగు కలువలను దహించుట ఎంతటి తీక్ష్ణతయని సూర్యుని నిందించును

**విశేషములు .** అలంకారము కావ్యలింగము ఇందలి యెత్తుగీతిలోని 'వెలుఁగు అనుదానిని క్రియగాఁగాక, అన్వయసౌలభ్యమునకయి చివరి అరసున్నను దీసివైచి క్రియావిశేషణముగాఁ జేయునది అన్ని పాదములందును 'నేర్చు' ధాతువుండఁగా, రెండవ పాదమున మాత్రము 'ఏచు' ధాతువుండుట విచారణీయము అది కూడ 'ఏర్చు' అనియే యుండనోపును మ్రాఁకులు = మ్రాను + లు 'కలన్వాదుల సువర్ణంబు కుజ్జగు బహువచనము పరంబగునపుడు నిత్యముగా నగును ' బాల తత్సమ 19 మ్రాఁకులు తనదు- తీవ్రత్వము - 'యుష్మదస్మదాత్మార్థకంబుల కుత్తరపదంబు పరంబగునపుడు దుగాగమంబు విభాషనగు ' వనరాశిఁ దగు మెత్తఁదనము అనియుండుటకంటె వనరాశి దగు (వనరాశిది + అగు) మెత్తఁదన మనియుండుట లెస్సయని అరసున్నను దొలఁగించుటయైనది వనరాశి + అది 'అది యవి శబ్దంబుల యత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగ నగు' మార్పెట్టు - మాఱు + పెట్టు - 'అలఘురేఫము లుప్తాచ్కమగుచో లఘురేఫం బగు ' ప్రౌఢ ము ల వి ప్రతాపవహ్ని - అనుచో నలంకారము రూపకము

**వ అట్టి దనుజాధీశ్వరు నెఱింగి యెఱింగి యుక్కడింపక పై నెత్తి వత్తుమను నింత సాహసం బున్నయునికిన మీ కెందుండి వచ్చె. 163**

**అర్థము** · అట్టి, దనుజ + అధి + ఈశ్వరున్ = రాక్షస శ్రేష్ఠుఁడగు తారకుని, ఎఱింగి + ఎఱింగి = తెలిసి తెలిసి, ఉక్కడింపక = పొగరు విడువక,

పైన్ + ఎత్తి - వత్తుము = పైకి దండెత్తి వత్తుము, అను, ఇంత - సాహసంబు = ఇంతటి తెగువ, ఉన్న + ఉనికిన్ + అ = ఉన్నట్లుండి - ఆకస్మికముగా, మీకున్, ఎందున్ + ఉండి = ఎచ్చటినుండి, వచ్చెన్

**తాత్పర్యము .** అట్టి తారకుని దెలిసితెలిసి పొగరు విడువక పై దండెత్తి వత్తమను నింతటి తెగువ ఉన్నటులుండి మీ కెచ్చటినుండి వచ్చెను ?

ఉ **దండుగులిచ్చి వేలగొని దానిపయిం జెఱలిచ్చి కన్న నిం**
**దుండఁగ నిచ్చెఁగాక దనుజోత్తముఁ డల్గినఁ జంపఁ బెద్దయే ?**
**యుండితిరే సహింపఁ గని యున్నవిధంబున నుండ కిప్పు డీ**
**కొండికవాని నమ్మి పగగో లిది కార్యమె ? మీకు శౌర్యమే ? 164**

**అర్థము** చండుగులు + ఇచ్చి = నష్టపరిహారము లిచ్చి, వేల + కొని = దాస్యముచేసి, దాని పయిన్ = ఆ పయి, చెఱలు + ఇచ్చి - కన్నన్ = బందెల నీఁగాంచఁగా, ఇందున్ = ఈ స్వర్గమున, ఉండఁగన్ + ఇచ్చెన్ + కాక = ఉండనిచ్చెను గాని, దనుజ + ఉత్తముఁడు = రాక్షస శ్రేష్ఠుఁడు = తారకుఁడు, అల్గినన్ = కోపించినచో, చంపన్ + పెద్దయే = చంపుట కష్టమా ? సహింపన్ + కని= అతఁ డోర్చుకొనఁగాఁ జూచి, ఉండితిరే + మీరు ఉంటిరా ? ఉన్న - విధంబునన్+ఉండక = ఉన్నరీతి నుండక, ఇప్పుడు, ఈ - కొండిక వానిన్ = ఈ చిఱుతవానిని, నమ్మి, పగ + కోలు = పగఁగొనుట, ఇది,' కార్యమె = చేయఁదగినదియా? మీకున్, శౌర్యమే = శూరత్వమా ?

**తాత్పర్యము .** 'తారకునకు మీరు నష్టపరిహారములు చెల్లించి దాస్యము నొనరించి, ఆ పై బందెల నీఁగాంచఁగా అతఁడు మిమ్ము ఈ స్వర్గమున నుండనిచ్చెను గాని యతఁ డలిగినచో మిమ్ముఁ జంపు టొక కష్టమా ? అతఁ డిటులోర్చుకొనఁగా మీరు చూచియుంటిరా ? ఉన్నటులుండక మీరు ఇప్పుడు ఈ చిఱుతవానిని నమ్ముకొని వైరమును వహించుట మీకుఁ జేయఁదగినదా ? ఇది శౌర్యమగునా ?

**విశేషములు .** పగగోలు - అనుప్రయుక్తమైన కొనుధాతువునకు భావార్థక రూపము కోలు 'భావంబునం దనుప్రయుక్తంబగు కొనుటకుం గోలు విభాష నగు ' ప్రౌఢ క్రి 13

చ మరుఁ బరిమార్చి శంభునభిమాన మడంచి గృహస్థుఁజేసి యా
తరుణుల యీలువుల్ చెఱిచి తాపసులం బెడఁబాచి యింత దు
ర్భరమున నీతనిం బడసెఁ బాఱుఁడు బుద్ధుల ప్రోఁగ నాఁగ నీ
సురగురుఁ డింతచేసె నిది చూచినఁ గ్రాఁగఁడె తారకుం డనిన్ 165

**అర్థము.** పాఱుఁడు = బ్రాహ్మణుఁడు (బృహస్పతి), మరున్ = మన్మథుని, పరిమార్చి = చంపి, శంభు + అభిమానము = శివుని గర్వము, అడంచి = అణఁచి, గృహస్థున్ + చేసి = సంసారిగాఁజేసి, ఆ - తరుణల = ఆ యువతులైన మునిపత్నులయొక్క, ఈలువుల్ =పాతివ్రత్యములు, చెఱిచి = పాడుచేసి, తాపసులన్ = సప్తమహర్షులను, పెడఁబాచి = విడువఁజేసి, ఇంత - దుర్భరమునన్= ఇంత కష్టముతో, ఈతనిన్ = ఈ కుమారస్వామిని, పడసెన్ = పొందెను బుద్ధుల- ప్రోఁగ - నాఁగన్ = బుద్ధుల రాశియే యనునట్లు, ఈ - సుర - గురుఁడు= ఈ దేవ గురువు - బృహస్పతి, ఇంత - చేసెన్, ఇది - చూచినన్, తారకుఁడు, అనిన్ =యుద్ధమునందు క్రాఁగఁడె = మండిపడఁడా ?

**తాత్పర్యము .** 'బ్రాహ్మణుఁడైన బృహస్పతి మన్మథునిఁ జంపి శివుని యాత్మగౌరవమును అణఁచి, సంసారిని జేసి, ఆ ముని పత్నుల పాతివ్రత్యములను జెఱిచి, సప్తమహర్షులను విడువఁజేసి - ఇంత శ్రమపడి యీ కుమారస్వామిని బడసెను ఈ బృహస్పతి బుద్ధులరాశియే యన నింతచేసెను ఇది చూచినచోఁ దారకుఁడు యుద్ధమున మండిపడఁడా ?

క చా నెత్తికొంటి రక్కట
నేనియుఁ దలమాసుపోని నెత్తురు కుదుమున్
సేనానిఁ జేసి రజ్జున
దానవపతిమీఁద నడవఁ దగునే మీకున్ 166

**అర్థము .** అక్కట = అయ్యో, తలమాసు నేనియున్ + పోని = తలమావియైనను పోవని, నెత్తురు - కుదుమున్ = నెత్తురు ముద్దను, సేనానిన్ + చేసి = సేనాధిపతిని గావించి, చాన్ + ఎత్తికొంటిరి = చావఁబూనుకొంటిరి, రజ్జునన్ = దురభిమానమున, మీకున్, దానవ - పతి- మీఁదన్ = రాక్షసరాజు మీఁదికి, నడవన్ + తగునే = దండెత్తనగునా ?

**తాత్పర్యము .** అయ్యో ! తలమావియైనను ఫీడని నెత్తురుముద్దను సేనాపతినిగాఁ జేసి చావఁబూనుకొంటిరి దురభిమానమున మీకు రాక్షసరాజగు తారకునిపై దండెత్తనగునా ?

**విశేషములు** తలమాసువోని నెత్తురు కుదుము అప్పుడు పుట్టినవాఁడు తానెత్తికొంటిరి అను మా రా కవి ప్రతిలోని పారము కంటె, 'చానెత్తి కొంటిరి ' అను సా అ వా ప్రతులలోని పారము మేలు చాన్ = చచ్చు + నుజీ 'చావు నోవులు చచ్చు నొచ్చుల కగు ' బాల క్రి 94 చావు + నుజీ 'జీత్తు పరంబగునపుడు వాని వువర్ణంబువిభాషను లోపించు ' బాల క్రి 95 చా + నుజీ = చాను(న్) + చావు + నుజీ 'జీత్తుపరంబగునపు డుత్వంబున కత్వంబగు ' బాల క్రి 20 చావను - (చావన్), నేని - హలాది నెత్తురు అనుదానిలోని 'నె'తో యతిమైత్రి 'నీవును జూచి తట్టి సభనేని ఎనంబడ దేయుగంబులన్ నన్నయ భా౦ సభా ద్వి 'నీకున్' అనుదానికంటె 'మీకున్' అను బహువచనరూపమే లెస్స 'చానెత్తి కొంటిరి' అనుదాన బహువచనక్రియయే కలదు గదా

ఆ **పాలపాపనోటు బంటుగా సేనానిఁ**
**జేసి యతని మీరు సేతఁబట్టి**
**యసురనాథుఁ జెనయు డామును గొలపట్టు**
**కాఁగ గజముఁ జెనయు కరణి గాదె !** **167**

**అర్థము** పాలపాపన్ + ఓటు = చంటి పిల్లవానినా, బంటు + కాన్ = వీరుఁడుగా, సేనానిన్ = సేనాపతిని, చేసి, అతనిన్, మీరు, చేతన్ + పట్టి = నమ్ముకొని, అసుర - నాథున్ = రాక్షసరాజును - తారకుని, చెనయుడు = ఎదిరించుట, ఆమును = మదమును, కొలపట్టు - కాఁగన్ = కొలమానముగా, గజమున్ = ఏనుఁగును, చెనయు - కరణి - కాదె = ఎదిరించు విధము గాదా ?

**తాత్పర్యము :** పాలుత్రాగు చంటిపాపనినా వీరునిగా నెంచి సేనాధిపతిని జేయుట, అతనిని మీరు నమ్ముకొని రాక్షసరాజును ఎదిరించుట, మదము ప్రమాణమును బట్టి యేనుఁగు నెదిరించు విధము కాదా ?

**విశేషములు :** అలంకారము ఉపమ

వ **అని యనేక ప్రకారంబుల సురలను నురలంబలికి దనుజదూత త్రినయనతనయుం గనుంగొని** **168**

**అర్థము .** అని, అనేక - ప్రకారంబులన్, సురలను = దేవతలను, ఉరలన్ + పలికి= నశింపఁబలికి, దనుజ - దూత = రాక్షసుల రాయబారి, త్రినయన - తనయున్ = ముక్కంటి కొడుకును - కుమారస్వామిని, కనుంగొని

**తాత్పర్యము .** అని పెక్కు విధముల దేవతలను పడఁబలికి తారకుని రాయబారి కుమారస్వామిని జూచి - తరువాతి పద్యముతో నన్వయము

క ఈ యింద్రుఁ డీ కృశానుం
డీ యముఁ డీ దనుజనాథుఁ డీ వరుణేశుం
డీ యనిలుఁ డీ కుబేరుం
డీ యీశానుండు నీవు నెదిరెడి వారే ? 169

**అర్థము .** ఈ + ఇంద్రుఁడు, ఈ - కృశానుండు = ఈ అగ్ని, ఈ - యముఁడు, ఈ - దనుజనాథుఁడు = ఈ రాక్షసప్రభువు - నిర్పతి, ఈ - వరుణ + ఈశుండు = ఈ వరుణదేవుఁడు, ఈ + అనిలుఁడు = ఈ వాయువు, ఈ - కుబేరుండు, ఈ + ఈశానుఁడు, నీవున్, ఎదిరెడివారే = ప్రతిఘటించువారా ?

**తాత్పర్యము .** 'ఈ యింద్రుఁడు, ఈ యగ్ని, ఈ యముఁడు, ఈ నిర్పతి, ఈ వరుణుఁడు, ఈ వాయువు, ఈ కుబేరుఁడు, ఈ యీశానుఁడు నీవు తారకుని బ్రతిఘటింపఁగలవారా ?'

చ తమతమ వృత్తు లొత్తికొని దైత్యుల నిల్పినఁ దూలియాడు నే
మములఁ బయోధికిం జనియె మాధవుఁ డద్రికిఁ జేరె నీశుఁ డ
బ్జమునకుఁ బోయె వాక్పతి, దిశాపతు లేఁగిరి భీతులై దిగం
తములకు నీవ గెల్చె దనిఁ దారకు వైరిబలప్రహారకున్ 170

**అర్థము .** తమ తమ వృత్తులు = తమతమ పదవులు, ఒత్తి = తప్పించి, కొని = (వానిని) గ్రహించి, దైత్యులన్ = రాక్షసులను, నిల్పినన్ = నిల్పఁగా, తూలియాడు - నేమములన్ = చలించునట్టి విధులతో, మాధవుఁడు = విష్ణువు, పయోధికిన్ = సముద్రమునకు, చనియెన్, ఈశుఁడు, అద్రికిన్ = పర్వతమునకు - కైలాసమునకు, చేరెన్, వాచ్ (క్() + పతి = సరస్వతి, భర్త - బ్రహ్మ, అబ్జమునకున్ = తామరపువ్వునకు, పోయెన్, దిశా-పతులు = దిక్పాలకులు, భీతులు + ఐ = భయపడినవారయి, దిశ్ (క్) + అంతములకున్ = దిక్కుల కొనలకు, ఏఁగిరి, నీవు + అ = నీవ = నీవే, వైరి - బల - ప్రహారకున్ = శత్రుబలమును హరించువాఁడు, అగు, తారకున్, అనిన్ = యుద్ధమునందు, గెల్చెదు = జయింతువు

**తాత్పర్యము :** తమ తమ పదవులను లాగివైచి వానియందు రాక్షసులను నిలుపఁగాఁ జలించు విధులతో విష్ణువు సముద్రమునకుఁ జనెను శివుఁడు కొండను జేరెను బ్రహ్మ తామరను బ్రవేశించెను దిక్పాలకులు భయపడి దిక్కుల కొనకుఁ బోయిరి శత్రుబలములను హరించు తారకుని యుద్ధమున నీవే జయింతువు

సీ కమలజు పాశంబు గాలాపుఁద్రాడుగాఁ
గాలోగ్రదండంబు గడయుఁగాఁగ
దనుజారి చక్రంబు గొనివచ్చి గాలంబు
గాఁ బవమాను మృగంబు కొమ్ము
బలుబడిఁగొని ధాత్రి పాతాళమునఁ బడఁ
గ్రొచ్చి నాగేంద్రునిఁ దెచ్చి తలలు
చిదిమి యం దెఱ గ్రుచ్చి యుదధిలోపలవైచి
మహదాదిమత్స్యకూర్మములఁ దిగిచి

తే హరు లలాటాగ్ని లోపల నెరియఁబెట్టి
నమలు నిజభుజభూరివిక్రమము మెఱయ
వాని బలువిడి యెఱుఁగవయేని నీవు,
తారకాసురు నెఱుఁగరె వీరు తొల్లి 171

**అర్థము** తారకుఁడు - కర్త నిజ - భుజ - భూరి - విక్రమము = తనదైన బాహువులయొక్క అధికమైన పరాక్రమము, మెఱయన్ = ప్రకాశింపఁగా, కమలజు - పాశంబు = బ్రహ్మ యొక్క (వరుణుని యొక్క?) పాశము, గాలాపుఁద్రాడు + కాన్ (గాలాము+త్రాడు + కాన్) = గాలమునకుఁ గట్టు త్రాడుకాఁగా, కాల + ఉగ్ర - దండంబు = యమునియొక్క భయంకరమైన దండము, గడయున్ + కాఁగన్ = గాలపుఁగఱ్ఱ కాఁగా,

దనుజ + అరి - చక్రంబు = రాక్షసవైరియగు విష్ణునియొక్క చక్రము, కొని - వచ్చి, గాలంబు + కాన్ = చేఁపలను బట్టు సాధనముగా -బడిశముగా, పవమాను - మృగంబు - కొమ్ము = వాయువుయొక్క జింకయొక్క కొమ్ము, బలువిడిన్ = బలాత్కారముగా, కొని, ధాత్రి = భూమి (ని), పాతా ˘మునన్, పడన్ + గ్రొచ్చి = పడునట్లు త్రవ్వి, నాగ + ఇంద్రుని = భుజగశ్రేష్ఠుని - శేషుని, తెచ్చి, తలలు, చిదిమి = నలఁగఁగొట్టి, అందున్ = ఆ గాలమునందు, ఎఱ= ఆహారము, గ్రుచ్చి, ఉదధి లోపలన్ = సముద్రములో, వైచి, మహత్ + ఆది - మత్స్య - కూర్మములన్ = గొప్పవియగు ఆదిమత్స్యమును, ఆదికూర్మమును, తిగిచి = ఆకర్షించి, పట్టి

హరు - లలాట + అగ్నిలోపలన్ = ఈశ్వరుని నొసటి (కంటి) మంటలో, ఎరియన్ + పెట్టి = మండఁబెట్టి - కాల్చి, నమలున్

నీవు, వాని, బలువిడి = శౌర్యము, ఎఱుఁగవు + అ+ ఏనిన్ = ఎఱుఁగనిచో, వీరు, తొల్లి = పూర్వము, తారక + అసురున్, = ఎఱుఁగరె ?

**తాత్పర్యము.** తారకుఁడు తనబాహుపరాక్రమము మెఱయునట్లు బ్రహ్మ (వరుణుని?) పాశమును గాలపుఁద్రాడుగను, యముని భయంకరమైన దండము గాలపు గడగను, విష్ణుని సుదర్శనము గాలముగా, వాయువు వాహనమైనజింక కొమ్ము బలాత్కారముగాఁ గొని భూమిని పాతాళమునఁబడఁద్రవ్వి నాగరాజయిన శేషునిఁ దెచ్చి తలలు చిదుకఁగొట్టి ఆ గాలమునకు ఎఱగా గ్రుచ్చి సముద్రములోఁబడవైచి గొప్పవియగు ఆదిమత్స్యమును ఆదికూర్మమును బట్టి, శివుని నొసటి కంటిమంటలోఁ గాల్చి నమలును వాని పరాక్రమమును బాలుఁడవైన నీ వెఱుఁగకున్నను, ఈ విష్ణ్వాది దేవతలు పూర్వము తారకాసురు నెఱుఁగరా ?

క. దనుజేంద్రుఁ జెఱలు విడుమని
పెనఁగెదు పులిగొన్న మృగము పెట్టునఁబడునే ?
చనుఁద్రావు బాలుఁడవు నీ
వని కలవడి చక్కఁద్రోవ నలవియె నీకున్ ? 172

**అర్థము** దనుజ + ఇంద్రున్ = రాక్షసశ్రేష్ఠుని - తారకుని, చెఱలు - విడుము + అని = బంధితులను విడిచిపెట్టుమని, పెనఁగెదు = పట్టుఁబట్టెదవు, పులి+ కొన్న = పులి పట్టుకొనిన, మృగము = లేడి, పెట్టునన్ + పడునే = దెబ్బకుఁబడునా ? నీవు, చనున్ + త్రావు - బాలుఁడవు = చనుఁబాలు గుడుచు చంటివాఁడవు, అనికిన్ = యుద్ధమునకు, అలవడి = అలవాటుపడి, చక్కన్ + త్రోవన్ = బాగుగా మించుటకు, నీకున్, అలవియె = శక్యమా ?

**తాత్పర్యము .** తారకుని బంధితులను విడువుమని పట్టుఁబట్టెదవు పులివాతఁబడిన లేడి దెబ్బకుఁ గ్రిందఁబడునా ? నీవు చనుఁబాలు గుడుచు పిల్లవాఁడవు యుద్ధమున కలవాటుపడి బాగుగా మించుటకు నీకు శక్యమగునా ?

**విశేషములు .** అలంకారము దృష్టాంతము

సీ. భూరితరోగ్ర గంభీరాబ్ధు లడఁగించు
బౌర్వాగ్ని కెంత నీహారకణము ?
ఘోరకాంతార సంహారకారణ మగు
కార్చిచ్చునకు నెంత గడ్డిపఱక ?

గురుతరోన్నతధరాధర భేదియగు శత
ధార కేటిది సికతాకణంబు
సురనర గరుడ కిన్నర వరదర్పాప
హారకుం డనఁజను తారకునకు

ఆ నమలి మ్రింగఁ గేలఁ జమరి మొగంబునఁ
బూసికొనఁగ రాచి బొట్టు వెట్టఁ
బట్టి పిసుకలేని పసుఁబాప వతనికి
నలిగి చూడనైనఁ దలమె తలఁప 173

**అర్థము.** భూరితర + ఉగ్ర - గంభీర + అబ్ధులు = మిక్కిలి పెద్దవియు, భయంకరమయినవియు, లోఁతయినవియు అగు సముద్రములు, అడఁగించు = నశింపఁజేయు, ఔర్వ + అగ్నికిన్= బడబాగ్నికి, నీహార -కణము = మంచుబిందువు, ఎంత ?

ఘోర - కాంతార - సంహార - కారణము = భయంకరమైన అడవియొక్క నాశమునకుఁ గారణము, అగు, కార్చిచ్చునకున్ = దావాగ్నికి, గడ్డిపఱక, ఎంత ?

గురుతర + ఉన్నత - ధరాధర - భేది = మిక్కిలి గొప్పవియు, ఎత్తయినవియు అగు కొండలను భేదించునది, అగు, శత - ధారకున్ = నూఱంచులు గల కత్తికి - వజ్రాయుధమునకు, సికతా - కణంబు = ఇసుక రేణువు, ఏటిది = ఏ పాటిది ?

సుర - నర - గరుడ - కిన్నర - వర - దర్ప + అపహారకుండు = దేవతల, మనుష్యుల, గరుడుల, కిన్నరుల, శ్రేష్ఠమయిన గర్వమును అపహరించువాఁడు, అనన్ + చను = అనఁనొప్పు, తారకునకున్, నమలి - మ్రింగన్ = నమలిమ్రింగుటకును, కేలన్ = చేతితో, చమరి = నలఁచి, మొగంబునన్, పూసికొనఁగన్, రాచి, బొట్టు + పెట్టన్, పట్టి - పిసుకన్, లేని = చాలని, పసుఁబాపవు = పసిపిల్లవాఁడవు, తలఁపన్, అతనికిన్ = తారకునకు, అలిగి - చూడన్ + ఐనన్ + తలమె కోపముతోఁ జూచుటకైన సాధ్యమా ?

**తాత్పర్యము.** మిక్కిలి గొప్పవియు, భయంకరములు, లోఁతయినవియు నైన సముద్రముల నడఁచు బడబాగ్నికి మంచుబిందు వెంత ? భయంకరములైన అడవుల నాశనమునకుఁ గారణమయిన దావాగ్నికి గడ్డిపఱక యేపాటి ? గురుతరము, ఉన్నతమునైన పర్వతమును భేదించు వజ్రాయుధమునకు ఇసుకరేణువెంత ?

సురల, నరుల, గరుడుల, కిన్నరవరుల గర్వము నడఁగించు తారకునకు, నమలి మ్రింగుటకుఁగాని, చేతితో రాచి మొగమునఁబూసికొనుటకుఁగాని, రాచి బొట్టు పెట్టుకొనుటకుఁ గాని, పట్టి పిసుకుటకుఁగాని చాలని పసిపాపఁడవు తలఁపఁగా నా తారకుఁ డలిగి చూచుటకైనను నీవు చాలవు

**విశేషములు .** అలంకారము దృష్టాంతము

మ **ఘనసంఘంబు ప్రభంజనున్, శశికళాఖండంబు రాహుం, బయో**
**జిని హస్తిం, దిమిరంబు భానుఁగని యాక్షేపించి నిర్జింప నొ**
**య్యన పైనెత్తినభంగి నర్భకుఁడ వీ వల్పుండ వీ రూపునం**
**జనుదెంతే చెనయంగఁ బోరఁ ద్రిజగత్సంహారకుం దారకున్ 174**

**అర్థము** ఘన-సంఘంబు = మేఘముల సమూహము, ప్రభంజనున్ = వాయువును, శశి - కళా - ఖండంబు = చంద్రకళముక్క, రాహున్ = రాహువును, పయోజిని = పద్మలత, హస్తిన్ = ఏనుఁగును, తిమిరంబు = చీఁకటి, భానున్ = సూర్యుని, కని = చూచి, ఆక్షేపించి = తిరస్కరించి, నిర్జింపన్ = జయించుటకు, ఒయ్యనన్ = బాగుగా, పైన్ + ఎత్తిన - భంగిన్ = మీఁద దండెత్తిన విధమున, అర్భకుఁడవు = బాలుఁడవు, ఈవు, అల్పుండవు = చిన్నవాఁడవు, ఈ - రూపునన్ = ఈ యాకారముతో, త్రి - జగత్ + సంహారకున్ = ముల్లోకములను సంహరించువాఁడగు, తారకున్, పోరన్ = యుద్ధమున, చెనయంగన్ = ఎదిరించుటకు, చనుదెంతే = చనుదెంచు + దు+వు+ఏ = వత్తువా ?

**తాత్పర్యము :** మేఘముల గుంపు వాయువును, చంద్రకళాశకలము రాహువును, పద్మలత ఏనుఁగును, చీఁకటి సూర్యునిఁ జూచి తిరస్కరించి జయింప దండెత్తిన విధమున, అర్భకుఁడవు, చిన్నవాఁడవు అయిన నీవు ఈ ఆకారమున ముల్లోకములను సంహరించువాఁడైన తారకుని యుద్ధమున నెదిరింపవత్తువా ?

**విశేషములు :** అలంకారము మాలోపమ రాహు - 'రాహు బాహు శబ్దంబుల కంతట వువర్ణక లోపంబు వైకల్పికంబు ' ప్రౌఢ శబ్ద 26 శశికళాఖండంబు- శశికళయనఁజాలియుండఁగా ఖండమనుట తదల్పిష్ఠతను సూచించుటకు, చనుదెంతే - చను ధాతువు 'అభ్యాగతి నరుగ్వాదుల కయ్యాది (తెంచు) యను ప్రయుక్తం బగు ' బాల క్రి 111 'ఉత్వంబు పయిని, దాని తకారంబు దకారం బగు.' 'బాల క్రి 110 చనుదెంచు 'తద్ధర్మాదులందు లాట్టగు' చనుదెంచు + లాట్టు బాల క్రి 5 'లకారంబునకు డుఁ్రజువురునుముఙ్ఞగు ' బాల క్రియ 8

చనుదెంచు + వు 'లాట్టు రుఘ్లుపరంబగునపుడు దుగాగమంబగు ' బాల క్రి 22 చనుదెంచు + దు+ వు 'దువర్ణంబుతోడ దుగ్దకారంబు తకారంబగు ' బాల క్రి 108 చనుదెంతువు 'తద్ధర్మభూతక్రియ లాద్యాద్యర్థపరకంబులయి ప్రశ్నార్థకంబులగు ' ప్రౌఢ క్రి 3 చనుదెంతువు + ఏ 'లిడ్లాట్టుల వకారంబునకు లోపంబు విభాషనగు ' - 'బాల క్రి 24 చనుదెంతు + ఉ + ఏ 'అంద్వవగాగమంబులందప్ప నపదాదిస్వరంబు పరంబగునపు డచ్చునకు సంధియగు ' బాల సంధి 11 చనుదెంతే

**వ అని యనేకప్రకారంబులం దన్నుఁ దృణీకరించి నిజాధీశ్వరుండును దనుజేశ్వరుండునగు తారకు వర్ణించుచున్న విని కోపించి 175**

**అర్థము** అని, అనేక - ప్రకారంబులన్, తన్నున్, తృణీకరించి = నిరాకరించి, నిజ + అధి + ఈశ్వరుండును = తన ప్రభువును, దనుజ + ఈశ్వరుండును = రాక్షసశ్రేష్ఠుఁడును, అగు, తారకున్, వర్ణించుచున్ + ఉన్నన్, విని, కోపించి

**తాత్పర్యము .** అని పెక్కురీతులఁ దన్ను నిరాకరించి, తన ప్రభువును రాక్షసరాజును అగు తారకాసురుని బ్రశంసించుచుండఁగా విని కోపించి - తరువాతి పద్యముతో నన్వయము

**క అనలసుతుఁ డనలకణములు**
**పెనఁగొన నమరారిదూత ప్రిదిలిపడంగాఁ**
**గనుఁగొని 'పొగడెదె వా దై**
**త్యుని మమ్ము నెఱుఁగ నగు మహోగ్రాజి మొనన్ 176**

**అర్థము.** అనల - సుతుఁడు = అగ్ని కుమారుఁడు - కుమారస్వామి, అనల - కణములు = అగ్ని కణములు, పెనఁగొనన్ = కలుగఁగా, అమర + అరి - దూత = రాక్షసుల రాయబారి, ప్రిదిలిపడంగాన్ = వెనుదీయఁగా, కనుఁగొని = చూచి, ఆ దైత్యునిన్ = ఆ రాక్షసుని - తారకుని, పొగడెదవా ? మమ్మున్, మహత్ (మహా) + ఉగ్ర + ఆజి - మొనన్ = గొప్పదియు, భయంకరమయినదియునగు యుద్ధముఖమున, ఎఱుంగన్ + అగున్

**తాత్పర్యము .** అగ్నికుమారుఁడగు కుమారస్వామి అగ్నికణము లురుల రాక్షసదూత వెనుదీయఁగాఁ గనుఁగొని 'ఆ దైత్యుని బ్రశంసింతువా ? భయంకరమైన యుద్ధముఖమున మా సంగతి తెలియనగును '

**విశేషములు .** అనలసుతుఁడు గనుకనే అవలకణములు పెనఁగొనఁ గనుఁగొనఁ గలుగుట 'అనల సుతుఁ డను విశేష్యము సాభిప్రాయముగాన నలంకారము పరికరాంకురము

వ 'మా యెత్తివచ్చునంతకుం జిక్కనై నిలు మను మంతియ చాలు' నని వానిం బరిభవింప నెత్తిన గణముఖ్యుల నచ్యుతప్రార్థితుండై వారించి సత్కృతుంజేసి వీడుకొలిపిన దనుజదూతయు హిమవంతంబు నుత్తరంబునం గలను సెప్పి చని దనుజాధీశ్వరుంగని వినయావనతాననుండై మహాదేవు నియోగంబున మహాసేనుండు సేనానియై సురవరులం గైకొని నెత్తుదెంచుచున్న వాఁ డనిన విని కోపాగ్రహావేశంబునం దావగొనక 177

**అర్థము .** మా + ఎత్తి వచ్చు + అంతకున్ = మేము దండెత్తి వచ్చు వఱకును, చిక్కన + ఐ = స్థైర్యముతో, నిలుము, అనుము, అంతియ, చాలును, అని, వానిన్ = ఆ రాక్షస దూతను, పరిభవింపన్ + ఎత్తిన = పరాభవింపఁబూనిన, గణ - ముఖ్యులన్ = గణాధిపులను, అచ్యుత - ప్రార్థితుండు + ఐ = విష్ణువుచేఁ బ్రార్థింపఁబడినవాఁడయి, వారించి = అడ్డగించి, సత్కృతున్ + చేసి = సమ్మానించి, వీడుకొలిపినన్ = పంపఁగా, దనుజ - దూతయున్ = రాక్షసుల రాయబారియు, హిమవంతంబు + ఉత్తరంబునన్ = హిమవత్పర్వతముయొక్క ఉత్తర దిక్కున, కలను = యుద్ధము, చెప్పి, చని, దనుజ + అధి + ఈశ్వరున్ = రాక్షస ప్రభువును - తారకుని, కని, వినయ + అవనత + ఆననుండు + ఐ = అడఁకువచే వంపఁబడిన ముఖము గలవాఁడై, మహాదేవు - నియోగంబునన్ = ఈశ్వరుని ఆదేశముచే, మహాసేనుండు = కుమారస్వామి, సేనాని + ఐ = సేనానాయకుఁడయి, సుర-వరులన్ = దేవతాశ్రేష్ఠులను, కైకొని = గ్రహించి, తెరలన్ + ఎత్తుదెంచుచున్ + ఉన్నవాఁడు = దండెత్తి రాఁబూనుచున్నవాఁడు, అనినన్, విని, కోప + ఆగ్రహ + ఆవేశంబునన్ = క్రోధము, పట్టుదల ఆవేశింపఁగా, తావగొనక = నిలువక

**తాత్పర్యము:** మేము దండెత్తి వచ్చువఱకును స్థైర్యముతో నిలువుమనుము అంతే చాలును' అని వానిని అవమానింపఁబూనిన గణనాయకులను విష్ణువుచేఁ బ్రార్థింపఁబడినవాఁడయి వారించి సమ్మానించి పంపెను రాక్షసదూతయు హిమవత్పర్వతోత్తరదిక్కున యుద్ధమని చెప్పి వెడలి రాక్షసరాజగు తారకునిఁ జూచి వినయమున ముఖము వంచి 'మహాదేవునాదేశమున మహాసేనుఁడు సేనాధిపతియై దేవతలను దీసికొని దండెత్తనున్నవాఁడనిన విని కోపావేశముతో నిలువక - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు** మాయెత్తి వచ్చునంతకు - మేమెత్తి వచ్చునంతకు - దాతుజ విశేషణ భావార్థక పూర్వవ్యవహితావ్యవహిత కర్తృపదప్రథమకుఁ దఱచుగ యొక్క షష్ఠియగు ' ప్రౌఢ కారక 15 మాయొక్క ఎత్తివచ్చునంతకు 'యొక్కకు లోపంబు బహుళంబు' ప్రౌఢ కారక 16 యడాగమము బాల సంధి 3 మా యెత్తి వచ్చునంతకు

క రయమున దానవపతి దు
ర్ణయమున వినయములు లంఘనము సేయు మదో
దయమున కెత్తుగతిని సుర
చయముపయిం దెరలనెత్త సమకట్టుటయున్ 178

**అర్థము** దానవ - పతి = రాక్షసరాజు - తారకుఁడు, రయమునన్ = శీఘ్రముగా, దుర్ణయమునన్ = దుర్నీతితో, వినయములు = అడఁకువలు, లంఘనము + చేయు = అతిక్రమించు, మద + ఉదయమునకున్ = మదముయొక్క ఉదయమునకు, ఎత్తు - గతిని = పూనువిధమున, సుర - చయముపయిన్ = దేవతలసమూహముమీఁద, తెరలన్ + ఎత్తన్ + సమకట్టుటయున్ = దండెత్తఁబూనుటయును

**తాత్పర్యము** . రాక్షసరాజగు తారకుఁడు శీఘ్రముగా దుర్నీతితో అణఁకువ నతిక్రమించు మదోదయమునకు దండెత్తు విధమున దేవతలపై దండెత్తఁబూనుటయును - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు** . అలంకార ముపమ

క కరి మదగర్వంబునఁ గే
సరిపై నుఱ కురవడింప సమకట్టుటయున్
బొరిఁబొరి నంకుశఘట్టన
నరుదుగఁ గుది యించు నమ్మహామాత్రు క్రియన్ 179

**అర్థము** . కరి = ఏనుఁగు, మద - గర్వంబునన్ = మదము వలని గర్వముతో, కేసరిపైన్ = సింహముమీఁద, ఉఱక = లక్ష్యపెట్టక, ఉరవడింపన్ = విజృంభించుటకు, సమకట్టుటయున్ = పూనుటయును, పొరిఁబొరిన్ = మాటిమాటికి, అంకుశ - ఘట్టనన్ = అంకుశముతోఁ బొడుచుటచే, అరుదుగన్ = ఆశ్చర్యముగా, కుదియించు = క్రుంగఁజేయు, ఆ + మహామాత్రు - క్రియన్ = ప్రధానుఁడైన మావటివాని విధమున

**తాత్పర్యము .** ఏనుఁగు మదగర్వముతో సింహముపై లక్ష్యపెట్టక విజృంభింపఁబూనఁగా, మాటిమాటికి అంకుశముతోఁ బొడిచి ఆశ్చర్యకరముగాఁ గ్రుంగఁజేయు నా మావటివాని విధమున - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** అలంకార ముపమ

## తారకునకు శుక్రుఁడు రాజనీతి నుపదేశించుట

వ శుక్రుండు వక్రంబై తత్కాలోచిత నయాలాపంబుల ననునయించి మెల్లన కార్యధారకు నూలుకొలిపి 180

**అర్థము .** శుక్రుండు, వక్రంబు + ఐ = అడ్డుపడి, తద్ + కాల + ఉచిత- నయ + ఆలాపంబులన్ = ఆ సమయమునకుఁ దగిన నీతి భాషణములతో, అనునయించి = బతిమాలి, మెల్లన, కార్యధారకున్ = కార్యపరంపరకు, నూలుకొలిపి = ప్రోత్సహించి

**తాత్పర్యము .** శుక్రుఁడు అడ్డమయి ఆ కాలమున కుచితమైన నీతి వాక్యములతో బతిమాలి మెల్లఁగాఁ గార్యపరంపరకుఁ బ్రోత్సహించి - తరువాతి పద్యముతో నన్వయము

క తానేల వచ్చు భూసతి
మానవపతి చరిత నీతిమార్గం బైనన్
తానేల వచ్చు భూసతి
మానవపతి చరిత నీతిమార్గంబైనన్ 181

**అర్థము .** మానవ - పతి - చరిత = రాజు నడవడి, నీతి - మార్గంబు + ఐనన్ = నీతికి మార్గమయినది అయినచో, తాను, భూసతిన్ = భూమియను స్త్రీని, ఏలన్ + వచ్చున్ = పరిపాలింపవచ్చును మానవపతి - చరితన్ = రాజు నడవడియందు, ఈతి = బాధ, మార్గంబు + ఐనన్ = పద్ధతియైనచో, భూసతి, తాను, ఏల - వచ్చున్ = ఎందులకు వచ్చును ?

**తాత్పర్యము** రాజు నడవడి నీతికిఁ ద్రోవయైనది అయినచో నతఁడు భూసతిని బాలింపవచ్చును రాజు నడవడి ఈతికి (బాధకు) మార్గమయిన దయినచో, భూసతి యెందులకు వచ్చును ?

**విశేషములు :** అలంకారము శ్లేషము - రూపకము

క ఆయతమతి నుత సప్తో
పాయంబులు నెఱుఁగవలయుఁ బతి సామము భే
దాయతి దానము దండము
మాయోపేక్షేంద్రజాలమార్గము లోలిన్ 182

**అర్థము.** పతి = రాజు, ఆయత - మతిన్ = అధికమయిన తెలివితో, ఓలిన్ = క్రమముగా, సామము, భేద + ఆయతి = భేదమను ఉపాయముయొక్క ప్రాప్తి, దానము, దండము, మాయ, ఉపేక్షా + ఇంద్రజాల - మార్గములు = ఉపేక్ష, ఇంద్రజాలము అనుమార్గములు - ఇట్లు, నుత - సప్త + ఉపాయంబులున్ = పొగడఁబడిన ఏడు ఉపాయములును, ఎఱుఁగవలయున్

**తాత్పర్యము :** రాజు మంచి తెలివిగలిగి సామ దాన భేద దండ మాయోపేక్షేంద్రజాలములు అను ఏడు ఉపాయములను గ్రమముగాఁ దెలియవలయును

క చన వెఱిఁగి నడవవలయును
వినయోచితవృత్తి సంధి విగ్రహ యానా
సన సంశ్రయణ ద్వైధము
లను నీ షాడ్గుణ్యములు నిజామాత్యులతోన్ 183

**అర్థము** రాజు - కర్త చనవు + ఎఱిఁగి = ఔచిత్యము తెలిసి, వినయ + ఉచిత - వృత్తిన్ = విశిష్టమైన నీతికిఁదగిన వర్తనముతో, సంధి, విగ్రహ, యాన, ఆసన - సంశ్రయణ - ద్వైధములు, అను, ఈ, షాడుణ్యములున్ = ఆఱుగుణములును, నిజ + అమాత్యులతోన్ = తన మంత్రులతో, నడవవలయున్

**తాత్పర్యము.** రాజు ఔచిత్యము తెలిసి వినయమున కుచితమైన వర్తనము ఎఱిఁగి, సంధి, విగ్రహ, యాన, ఆసన, సంశ్రయణ, ద్వైధములు, అను ఈ ఆఱుగుణములును దన మంత్రులతో నడవవలయును

క స్త్రీ పా నాక్ష మృగవ్య ధ
నాపహ పరదండ నిష్ఠురాలాపము లన్
పాపగ సప్త వ్యసన
వ్యాపారము లుడుగవలయు వసుధేశునకున్ 184

**అర్థము.** వసుధా + ఈశునకున్ = భూనాధునకు - రాజునకు, స్త్రీ, పాన = త్రాగుడు, అక్ష = జూదము, మృగవ్య = వేఁట, ధన + అపహ = అర్థ దూషణము,

పరదండ = దండపారుష్యము, నిష్ఠుర + ఆలాపములు = పరుషభాషణములు - వాక్పారుష్యము, అన్ = అను, పాపగ = పాపమును బొందించు, సప్త - వ్యసన - వ్యాపారములు = ఏడు వ్యసనములైన పనులు, ఉడుగన్ + వలయున్ = మానవలయును

**తాత్పర్యము .** రాజు స్త్రీ, పానము, జూదము, వేఁట,అర్థపారుష్యము, దండపారుష్యము, వాక్పారుష్యము అను పాపకారణములయిన యేడు వ్యసనములను విడువలయును

క సప్తవ్యసనేతరుఁడై
సప్తోపాయజ్ఞుఁడైన జనపతి పేర్మిన్
సప్తాంగరాజ్యవృద్ధిగ
సప్తాబ్ధి పరీత ధాత్రి సకలము నేలున్ 185

**అర్థము .** సప్త - వ్యసన + ఇతరుఁడు + ఐ = ఏడు వ్యసనములకు వేఱయినవాఁడయి - సప్త వ్యసనములు లేనివాఁడయి, సప్త + ఉపాయజ్ఞుఁడు = ఏడు ఉపాయములు తెలిసినవాఁడయి, జన - పతి = రాజు, పేర్మిన్ = గొప్పతనముతో, సప్త + అంగ - రాజ్య - వృద్ధిగన్ = సప్తాంగములతోడిరాజ్యము అభివృద్ధి యగునట్లు, సప్త + అబ్ధి - పరీత - ధాత్రిన్ = ఏడు సముద్రములచేఁ జుట్టఁబడిన భూమిని, సకలమున్ = అంతను, ఏలున్ = పాలించును

**తాత్పర్యము .** రాజు సప్తవ్యసనరహితుఁడై సప్తోపాయములను దెలిసినవాఁడయి గొప్పతనముతో సప్తాంగములతో రాజ్య మభివృద్ధిచెందునట్లు ఏడు సముద్రములచేఁ జుట్టఁబడినభూమినంతను ఏలును

**విశేషములు .** సప్తోపాయములు - సామ, దాన,భేద, దండ, మాయోపేక్షేంద్రజాలములు సప్తాంగములు - స్వామి, అమాత్యుఁడు, సుహృత్తు, కోశము, రాష్ట్రము, దుర్గము, బలము - అను ఏడు రాజతంత్రములు సప్తాబ్ధులు - లవణ, ఇక్షు, సురా, సర్పిస్ (నేయి), దధి ( పెరుఁగు) క్షీర, జల సముద్రములు

క అరిషడ్వర్గజయిత నన
వరత శమావాప్తి లోకవంద్యత విషయో
త్కర రక్ష సక్షమాగమ
పరిపాలన సదృశు లవనిపతులును వ్రతులున్. 186

**అర్థము.** అవని - పతులును = రాజులును, వ్రతులున్ = మునులును, అరి - షష్ (ట్) + వర్గ - జయితన్ = ఆఱుగురు శత్రువుల సమూహమును జయించుటయందును, అనవరత - శమ + అవాప్తిన్ = నిరంతరమైన శాంతి ప్రాప్తియందును, లోక - వంద్యతన్ = లోకముచే నమస్కరింపఁదగియుండుటయందును, విషయ + ఉత్కర - రక్షన్ = (రాజ ప) దేశముల సమూహముయొక్క రక్షణము నందును, (వ్రతి ప)విషయముల (ఇంద్రియముల) సమూహముయొక్క రక్షణమునందును, సక్షమా + ఆగమ - పరిపాలనన్ = (రాజ ప )భూమియొక్క ఆదాయముతోడి పాలనమునందును, (వ్రతి ప)ఓరిమితో శాస్త్రములను రక్షించుటయందును, సదృశులు = సమానులు

**తాత్పర్యము** రాజులును మునులును అరిషడ్వర్గజయమునందును, నిరంతర శాంతి గుణ ప్రాప్తియందును, లోకవంద్యతయందును, విషయ (ధేశ)ముల రక్షణమునందును విషయములనుండి రక్షణము నందును, భూమి ఆదాయముతోడి పాలనమునందును, సహనముతో నాగమములను బాలించుటయందును సమానులు

**విశేషములు** అరిషడ్వర్గము - కామ, క్రోధ, లోభ, మోహ, మద మాత్సర్యములు అలంకారము శ్లేషము

క **తగుఁదగదని మనమున మును**
**వగవఁగ నొడఁబడఁగ వగవ వగవఁగఁబడయున్**
**దగుఁ దగ దని వగ వని వగ**
**వగవఁగఁ బని గలదె తనకు వగ మఱి జగతిన్** 187

**అర్థము.** తగున్ = ఇది చేయఁదగును, తగదు = ఇది చేయఁదగదు, అని, మనమునన్ = మనస్సునందు, మును = ముందుగా, వగవఁగన్ = విచారింపఁగా, వగవన్ + వగవఁగన్ = మఱి మఱి ఆలోచింపఁగా, ఒడఁబడఁగన్ = అంగీకరించుటకు, పడయున్ = (చేయఁదగినదానిని) పొందును, తగున్, తగదు + అని, వగవని - వగ = (ముందుగా) ఆలోచింపని విధము, తనకున్, జగతిన్ = లోకమునందు, మఱి = అత్యంతము, వగ = దుఃఖము, వగవఁగన్ = (పిమ్మట) విచారించుటకు, పని + కలదె = ప్రయోజనముండునా ? - ఉండదనుట

**తాత్పర్యము .** 'ఈ పని చేయఁదగును, ఈ పని చేయఁదగదు' అని మనస్సునందు ముందుగా విచారింపవలయును అట్లు ఆలోచింపఁగా ఆలోచింపఁగా కర్తవ్యమును బొందును 'ఇది తగును, ఇది తగదు' అని ముందుగా ఆలోచింపని విధము తనకు లోకమున మిక్కిలి దుఃఖమును గలిగించును - పిమ్మట విచారించి ప్రయోజనము లేదు

క **తన కధికుల కతిభక్తియు**
**మనమున నెయ్యంబుఁ దన సమానులకును, హీ**
**నునియందుఁ గృపయుఁ, జేకొని**
**మను జనునకు వగయుఁ గలదె మదిఁబరికింపన్** 188

**అర్థము .** తనకున్ + అధికులకున్ = తనకంటె గొప్పవారికి, అతి - భక్తియున్ = మిక్కిలి భక్తియును, తన - సమానులకును = తనతో సమానమైనవారికి, మనమునన్ = మనస్సునందు, నెయ్యంబున్ = స్నేహమును, హీనునియందున్ = తనకంటెఁ దక్కువ వానియందు, కృపయున్ = దయయును, చేకొని = స్వీకరించి - చూపి, మను= జీవించు, జనునకున్ = మనుష్యునకు, మదిన్ + పరికింపన్ = మనస్సునందు ఆలోచింపఁగా, వగయున్ = దుఃఖము, కలదె = ఉన్నదా ?

**తాత్పర్యము.** తనకంటె గొప్పవారియెడ అధికభక్తియు, తనతో సమానులైన వారియెడ స్నేహమును, తనకంటె హీనులగు వారియెడ దయయుఁ బూని బ్రదుకుజనునకు మనసున నాలోచింపఁగా దుఃఖముండునా ?

చ **మునుకొని దేశకాలబలముం, దగు దైవబలంబుఁ గల్గఁగా**
**మొనసి విశేషమూలబలమున్ నిజబాహుబలంబుఁ దీర్చి పైఁ**
**జని రిపులన్ జయింతు రని శత్రుల కిన్నియుఁ గల్గియున్నచోఁ**
**జెనయక సామదానములఁజేసి జయింతురు నీతివిత్తముల్** 189

**అర్థము .** నీతి - విద్ + తముల్ = రాజనీతిజ్ఞులలో గొప్పవారు, మునుకొని= పూని, దేశ - కాల - బలమున్ = దేశకాలముల బలమును, తగు = ఒప్పునట్టి, దైవ - బలంబున్, కల్గఁగాన్, మొనసి = మార్కొని, విశేష-మూల-బలమున్ = అధికమైన ప్రధానసేనయును, నిజ-బాహు-బలంబున్ = తనదైనభుజబలమును, తీర్చి, పైన్ + చని = దండెత్తి, అనిన్ = యుద్ధమునందు,

రిపులన్ = శత్రువులను, జయింతురు, శత్రులకున్, ఇన్నియున్ = ఇవియన్నియును - దేశకాలబలములు, దైవబలము, మూలబలము, బాహుబలము అనునవి, కల్గి + ఉన్నచోన్, చెనయక = ఎదిరింపక, సామ - దానములన్ + చేసి = సామదానములచేత జయింతురు

**తాత్పర్యము** రాజనీతివేత్తలలో శ్రేష్ఠులు దేశకాలముల బలము, దైవ బలము, అధిక మూలబలము, భుజబలమును దీర్చి దండెత్తి శత్రువులను యుద్ధములో జయింతురు ఈ బలములన్నియును శత్రువులకున్నచో వారిని బ్రతిఘటింపక సామదానములతో జయింతురు

ఉ **దారుణకార్యవృత్తిఁ దుదిఁదాఁకినవారును దొల్లి దుర్దశల్**
**చేరినచో నొకం డొకనిచేఁ జెడరైరె ? కుమారుతో నహం**
**కారము దక్కి కూడి మనఁగాదె ? దురాగ్రహమేటి ? కెల్లచో**
**బీరము సన్నె పెద్దలకుఁ? బెద్దలు లేరె ధరాతలంబునన్** 190

**అర్థము** దారుణ - కార్య -వృత్తిన్ = దారుణమైన కార్యమునందు వర్తిలుటయందు - యుద్ధము చేయుటయందు, తుదిన్ + తాఁకిన వారును = పారము ముట్టినవారును - గొప్పవారును, తొల్లి = పూర్వము, దుర్దశల్ = దుస్స్థితులు = కష్టములు, చేరినచోన్ = వచ్చినచో, ఒకండు + ఒకనిచేన్ = ఒకఁడింకొకనిచే, చెడరు + ఐరె = నశింపలేదా ? కుమారుతోన్ = కుమారస్వామితో, అహంకారము + తక్కి = గర్వము విడిచి, కూడి = కలిసి, మనన్ + కాదె = బ్రదుకుట ఒప్పదా ? దురాగ్రహము = దుష్టమైన పట్టుదల, ఏటికి = ఎందులకు? పెద్దలకున్ = గొప్పవారికి, ఎల్లచోన్ = అన్ని చోటులను, బీరము - చన్నె = పరాక్రమము తగునా ? ధరా - తలంబునన్ = భూతలము నందు, పెద్దలు, లేరె?

**తాత్పర్యము** దారుణకార్యమైన యుద్ధమునందుఁ బారముముట్టిన వారు సైతమును బూర్వము కష్టములు సంభవించినప్పుడు ఒక రొకరిచేఁ జెడలేదా? గర్వమును విడిచి కుమారస్వామితో కలిసి బ్రదుకుట యొప్పదా ? దురాగ్రహ మెందులకు ? పెద్దలకు పరాక్రమ మన్నిచోట్లను దగునా ? భూమియందు మనకంటెఁ బెద్దలు లేరా ?

**విశేషములు .** చన్నె - చనునె - 'ఒకానొకచోఁ దద్ధర్మార్థకంబులగు నుండు, చను, చేరుకొనులు ప్రశ్నార్థకైకారపరంబు లగునపుడు వానికడ యచ్చులకు లోపంబు విభాష నగు అగుచో నుండు డకారంబునకు నకారం బగు ' ప్రౌఢ క్రియ 2

సీ శివుఁ డాత్మసుతు నభిషేకంబు సేయుడు
దిగధీశు లుండిరి ధిక్కరించి
పను లడ్గ రాఁడ జంభారి, బానసమున
కనలుండు రాఁడ, కృతాంతకుండు
నరమాంసములు దేఁడ, నైఋతి తళియకు,
జలధీశ్వరుఁడు రాఁడ జలక మార్ప
మలయానిలుండు పువ్వులు దేఁడ, ధనదుండు
తొడవులు గొనిరాఁడ, మృడుఁడు రక్ష

తే పెట్టరాఁడయ్యె , వీ రెల్ల బిట్టు నీకు
మరలి రిది మున్ను, సాధ్యమె పరిభవములు
పడి భయార్తులై కూడిన పగఱఁ దమకుఁ
దోడుగని పగ సాధింపఁదొడరు డరుదె ? 191

**అర్థము .** శివుఁడు, ఆత్మ - సుతున్ = తన కొడుకును, అభిషేకంబు + చేయుడున్ = అభికింపఁగనే, దిశ్ (క్) + అధి + ఈశులు = దిక్పతులు, ధిక్కరించి=ఎదిరించి, ఉండిరి

జంభ + అరి = జంభ రాక్షసునకు శత్రువు - ఇంద్రుఁడు, పనులు + అడ్గన్ (అడుగన్) = ఏమి చేయవలయునని యడుగుటకు, రాఁడు + అ = రానేరాఁడు, అనలుండు = అగ్ని, బానసమునకున్ = వంటయింటికి, రాఁడు + అ,

కృత + అంతకుండు = యముఁడు, నైఋతి - తళియకున్ =నిర్వృతిచేయువంటకు, నర-మాంసములు = మనుష్యులమాసంములు, తేఁడు + అ = తేనేతేఁడు.

జలధి + ఈశ్వరుఁడు = సముద్రములకుఁ బ్రభువు - వరుణుఁడు, జలకము + ఆర్పన్ = స్నానమాడించుటకు, రాఁడ,

మలయ + అనిలుండు = దక్షిణవాయువు, పువ్వులు, తేఁడు + అ, ధనదుండు = కుబేరుఁడు, తొడవులు = ఆభరణములు, కొనిరాఁడు + అ, మృడుఁడు = ఈశానుఁడు, రక్ష - పెట్టన్ + రాఁడు + అయ్యెన్

వీరు + ఎల్లన్ = ఈ దిక్పాలకులందఱును, బిట్టు = శీఘ్రముగా, నీకున్ = నీ పక్షమునకు, మరలిరి = తిరిగిరి, ఇది = ఈ వ్యవహారము, మున్ను = పూర్వము, సాధ్యమె = సాధ్యమే అయ్యెను

పరిభవములు - పడి = అవమానములు అనుభవించి, భయ + ఆర్తులు + ఐ = వెఱపుచేఁ బీడితులయి, కూడిన - పగఱన్ = కూడిన శత్రువులను, తమకున్, తోడు = సాయము, కని, పగన్, సాధింపన్ = తీర్చుటకు, తొడరుడు= పూనుట, అరుదె = ఆశ్చర్యమా ?

**తాత్పర్యము** శివుఁడు తన కొడుకైన కుమారస్వామి ని అభిషేకించినంతనే దిక్పాలకులు వాని నెదిరించి యుండిరి ఇంద్రుఁడు ఏమి పని యున్నదని యడుగుటకు రానేరాఁడు అగ్ని వంటయింటికి రాఁడు, యముఁడు నిర్వృతి చేయు వంటకు నరమాంసములు తేనే తేఁడు వరుణుఁడు స్నానమాడింప రాఁడు మలయవాయువు పువ్వులు తేఁడు కుబేరుఁడు ఆభరణములు తీసికొని రానేరాఁడు ఈశానుఁడు రక్షపెట్టుటకు రాఁడయ్యెను ఈ దిక్పాలకులందఱును శీఘ్రముగా నీ వైపు తిరిగిరి ఇది మునుపు సాధ్యమే అయ్యెను ఇట్లు పరిభవము లనుభవించి భయపీడితులయి శత్రువులను గూడి, తమకు సాహాయ్యమును గాంచి వారిపైఁ బగసాధింపఁబూనుట ఆశ్చర్యమా ? అప్పుడు వానిని ధిక్కరించి నిన్నుఁజేరిన దిక్పాలకులందఱును, ఇప్పుడు తమకుఁ గుమారునితోడు గలుగుటచే నీపయిఁ బగ సాధింపఁబూనుదురని భావము

**విశేషములు:** అలంకారము అర్థాంతరన్యాసము 'పనులడ్గరాఁడ జంభారి' ఇచ్చట యతిమైత్రి చింత్యము జంభారి శబ్దమును అఖండముగా భావించుచో అఖండయతి యనవచ్చును

క **బలహీనులయ్యు నేమగుఁ**
**బలువురు తమలోనఁగూడి బలియుని నైనన్**
**గెలుతురు చూడఁగ నీహా**
**రలవంబులు గూడి తీవ్రరశ్మిన్ గప్పున్** 192

**అర్థము.** బల-హీనులు + అయ్యున్ = దుర్బలులైనను, ఏమి + అగున్ = ఏమగును ? ఏమి నష్టము ? పలువురు = అనేకులు, తమలోనన్ + కూడి =

తమలోఁదాము కూడి, బలియునిన్ + ఐనన్ = బలవంతునైనను, గెలుతురు, చూడఁగన్, నీహార - లవంబులు + కూడి = మంచు బిందువులు కూడి, తీవ్ర - రశ్మిన్ = సూర్యుని, కప్పున్

**తాత్పర్యము** . బలములేని వారయిన నేమి ? అట్టివారు పెక్కండ్రు తమలోఁదాము కూడి బలవంతునైనను గెలుతురు చూడఁగా మంచుబొట్టులు పెక్కు కలిసి సూర్యుని గప్పును గదా !

**విశేషములు**. అలంకారము అర్థాంతరన్యాసము సామాన్యము విశేషముచే సమర్థింపఁబడుచున్నది

క ఇమ్మెడపున నిజసర్వ
స్వమ్ముఁ గళత్రంబు నైనఁ జను నీఁగఁ బర
స్వమ్ముఁ గళత్రముఁ బరులకుఁ
గ్రమ్మఱ నొప్పించి మనుట కార్యము గాదే ! 193

**అర్థము** . ఇమ్ము + ఎడపునన్ = అనుకూల్యములేని యప్పుడు, నిజ - సర్వస్వమ్మున్ = తనదైన యెల్లధనమును, కళత్రంబున్ + ఐనన్ = (స్వ) భార్యనైనను, ఈఁగన్ +చనున్ = ఈ నొప్పును, (అట్టిచో) పర - స్వమ్మున్ = ఇతరుల ధనమును, కళత్రమున్ = (పర) భార్యను, పరులకున్ = ఇతరులకు, క్రమ్మఱన్ = మరల, ఒప్పించి = అర్పించి, మనుట = జీవించుట, కార్యము + కాదే = చేయఁదగినపని కదా !

**తాత్పర్యము** . ఆనుకూల్యము లేనప్పుడు స్వధనమును, స్వభార్యను అయినను ఈ నొప్పును అట్టిచోఁ బరధనమును, పరభార్యను పరులకు మరల నర్పించి బ్రదుకుట చేయఁదగినది కదా !

**విశేషములు** . అలంకారము కావ్యార్థాపత్తి

వ అని యనేకప్రకారంబుల రాజనీతి రహస్యంబు లుపదేశించి 'పరుల చెఱలు వృత్తులు నర్థంబులు మగుడ నిచ్చి నిజవృత్తియందు వర్తింపు, పరమేశ్వరనందనుంగని విధేయుండవై నిర్వహించు డుచితం, బది యెట్లనిన నీశ్వరవీర్యసంభవుండైన కుమారుచేతం దారకుండు పరాజితుండగునని పురాణముని యాదేశంబు గల, దని యెఱింగించి వీక్షించుచున్న దనుజ గురుం గనుంగొని దనుజవరుం డిట్లనియె 194

**అర్థము** అని, అనేక - ప్రకారంబులన్, రాజ - నీతి - రహస్యంబులు ఉపదేశించి, పరుల = ఇతరులయొక్క, చెఱలు = బందెలు, వృత్తులున్ = జీవనోపాయములు, అర్థంబులున్ = ధనములును, మగుడన్ = మరల, ఇచ్చి, నిజ - వృత్తి + అందున్ + అ = నీదయిన వృత్తియందే, వర్తింపు(ము) = నడవుము, పరమేశ్వర - నందనున్ = ఈశ్వరుని కొడుకగు కుమారస్వామిని, కని, విధేయుండవు + ఐ, నిర్వహించుడు = నిర్వహించుట, ఉచితంబు = తగినది, అది, ఎట్లు + అనినన్, ఈశ్వర - వీర్య - సంభవుండు + ఐన = ఈశ్వరుని వీర్యమువలనఁ బుట్టినవాఁడగు, కుమారుచేతన్ = కుమారస్వామి చేత, తారకుండు, పరాజితుండు = ఓడింపఁబడినవాఁడు, అగున్, అని, పురాణ-ముని = నారదునియొక్క, ఆదేశంబు = ఆజ్ఞ, కలదు, అని, ఎఱింగించి, వీక్షించుచున్ + ఉన్న = చూచుచున్న, దనుజ - గురున్ = రాక్షసగురువైన శుక్రుని, దనుజ - వరుండు = రాక్షసరాజు - తారకుఁడు, ఇట్లు + అనియెన్

**తాత్పర్యము** . అని పెక్కువిధముల రాజనీతిరహస్యము లుపదేశించి 'శత్రువుల బందెలను, వృత్తులను, సొమ్ములను దిరిగి యిచ్చి నీ వృత్తియందు నీవు వర్తింపుము పరమేశ్వరునికుమారునిఁజూచి విధేయుఁడవయి వ్యవహరించుట మంచిది ఏలన ఈశ్వరవీర్యసంభవుఁడగు కుమారస్వామిచేఁ దారకుఁడు జయింపఁబడునని నారదుని ఆదేశము గలదు ' అని చెప్పి చూచుచున్న శుక్రునిఁ జూచి తారకుఁ డిట్లు పలికెను

### శుక్రుని వాక్యములకుఁ దారకుని ప్రత్యాఖ్యానము

**క** **కరదండాహత పరనృప**
**ధరణీతలవిషయభోగి దగు నధిపతి గాఁ,**
**బరదండాహత నిజభుజ**
**పరిపాలిత విషయ భోగపరుఁ డధిపతియే** **195**

**అర్థము** కర - దండ = దండమువంటి కరముచే, ఆహత = కొట్టఁబడిన, పర-నృప = శత్రురాజులయొక్క, ధరణీ - తల = భూతలమునందలి, విషయ = దేశమును, భోగి = అనుభవించువాఁడు, అధిపతి = ప్రభువు, కాన్ + అగుటకు, తగున్, పర = శత్రువులయొక్క దండ = దండముచే - శిక్షచే, ఆహత = కొట్టఁబడిన, నిజభుజ = బాహుపరాక్రమముచే, పరిపాలిత = పరిపాలింపఁబడిన, విషయ = దేశముయొక్క, భోగ-పరుఁడు = సుఖమునందాసక్తి గలవాఁడు, అధిపతియే = ప్రభువా ?

**తాత్పర్యము** తన బాహుదండముచే శత్రురాజుల భూభాగమును గొట్టి అనుభవించువాఁడు రాజుగాని, శత్రువుల దండముచేఁ దన రాజ్యభోగమును గోల్పోయినవాఁడు ప్రభువా ?

వ అదియునుంగాక తరువాతి పద్యముతో నన్వయము 196

క పురుషుఁడు పురుషున కని న
స్థిర జీవిత లోభయుత మతిని వినమితుఁడై,
స్మరకలహకుపితఁ బ్రాణే
శ్వరి నాయుధసమితిఁ దెలచువాఁ డటమీఁదన్ 197

**అర్థము** పురుషుఁడు= మగవాఁడు (శూరుఁడు), పురుషునకున్, అనిన్ = యుద్ధమున, అస్థిర - జీవిత - లోభ-యుత - మతినిన్ = అశాశ్వతమైన జీవితమునందలి ఆశతోఁ గూడిన బుద్ధితో, వినమితుఁడు + ఐ = మిక్కిలి <sup></sup>ంగినవాఁడయి = మిక్కిలి లొంగిపోయినవాఁడయి, అట-మీఁదన్ = ఆపైని, స్మర - కలహ - కుపితన్ = మన్మధయుద్ధమునందుఁ గోపించినది - ప్రణయకలహమునఁ గోపించినది, అగు, ప్రాణ + ఈశ్వరిన్ = ప్రియురాలిని, ఆయుధ - సమితిన్= ఆయుధముల సమూహముచే, తెలచువాఁడు = కోపమును దేర్చువాఁడు

**తాత్పర్యము .** పురుషుఁడు (శూరుఁడు) యుద్ధమున మఱియొక పురుషునకు అశాశ్వతమైన జీవితమునందలి ఆశతో లొంగిపోయి, ప్రణయకలహమునఁ గుపితయైన ప్రాణేశ్వరిని ఆయుధములతోఁ దేర్చువాఁడగును

**విశేషములు :** యుద్ధమున వీరు నెదిరింపలేక జీవితమునందలి యాశచే నతనికి లొంగిపోవు వీరుఁడు ప్రణయకుపితయగు ప్రియురాలిపైఁ దన ప్రతాపమును జూపి ఆయుధములతో నామెను దేర్చువాఁడగును అలంకారము రూపకము ?

ఉ మంచిగఁ బ్రీతిఁబాయక సమస్తజనంబులుఁ దన్నుఁ గొల్వ జీ
వించిన ధన్యుఁ డా మహిమ వీడిన జీవము మేన నిల్వ నా
సించి విభుండు తానొకట సేవకుఁడై మనుకంటె ముంద ఱా
ర్జించిన కీర్తి నిల్వ గతి సేకుఱఁగా నని౯ జావు సేగియే ? 198

**అర్థము.** విభుండు = ప్రభువు, మంచిగన్, ప్రీతిన్= ఇష్టమును, పాయక= విడువక, సమస్త - జనంబులున్ = ఎల్ల జనులును, తన్నున్, కొల్వన్ = సేవింపఁగా,

జీవించిన - ధన్యుఁడు = బ్రదికిన కృతార్థుఁడు, - అదృష్టవంతుఁడు, ఆ - మహిమ= ఆ గొప్పతనము, వీడినన్ = పోఁగా, జీవము = ప్రాణము, మేనన్ = శరీరమున, నిల్పన్= నిలుపుటకు, ఆసించి, తాను, ఒకటన్ = ఒకచోట, సేవకుఁడు + ఐ = దాసుఁడయి, మను-కంటెన్ = బ్రదుకుటకంటె, ముందఱ = పూర్వకాలము, ఆర్జించిన = సంపాదించిన, కీర్తి = మంచిపేరు, నిల్పన్ = నిలుచుటకు, గతి = మార్గము, చేకుఱఁగాన్ = లభింపఁగా, అనిన్ = యుద్ధమునందు, చావు, సేగియే= కీడా ?

**తాత్పర్యము** మంచిగాఁ బ్రీతితోఁ ద న్నెల్ల జనులును గొలువఁగా జీవించిన ధన్యుఁడైన ప్రభువు, ఆ మహిమ నశింపఁగా, మేనఁ బ్రాణములు నిలుపుట కాసించి, వేఱుప్రభువుకడ సేవకుఁడై జీవించుటకంటెఁ బూర్వ మార్జించినకీర్తి నిల్పుమార్గము లభింప, యుద్ధమునఁ జచ్చుట నష్టమా ?

**విశేషములు** మనుట కంటె - మను + కంటె = 'కొఱకు కంటె పొంటెలు పరంబులగునపుడు భావార్థక టవర్ణకంబునకు లోపంబు విభాషనగు ' ప్రౌఢ క్రి 14

**వ** అని మంత్రనిశ్చయంబు సేసి సమరోద్యుక్తుండయ్యె నంత నక్కడ మృగవైరింజొచ్చు మృగవ్యుండునుంబోలెఁ దారకుపైఁబెట్ట నబ్బకింపక చలించుచున్న సురేశ్వరుం బరమేశ్వరనందనుండు గనుంగొని 199

**అర్థము** అని, మంత్ర - నిశ్చయంబు + చేసి = అని ఆలోచనము నిశ్చయించి, సమర + ఉద్యుక్తుండు + అయ్యెన్= యుద్ధమునకు సన్నద్ధుఁడయ్యెను, అంతన్, అక్కడన్= సురలోకమున, మృగ-వైరిన్ + చొచ్చు = సింహమును గూర్చి వచ్చు, మృగవ్యుండునున్ + పోలెన్ = వేఁటకాని విధమున, తారకుపైన్ = తారకుని మీఁదికి, పెట్టన్ = దండెత్తుటకు, అబ్బగింపక = సహింపక, చలించుచున్ + ఉన్న = వడఁకుచున్న, సుర + ఈశ్వరున్ = ఇంద్రుని, పరమేశ్వర - నందనుండు= పరమేశ్వరుని కొడుకు - కుమారస్వామి, కనుంగొని

**తాత్పర్యము .** అని మంత్రమును నిశ్చయించి యుద్ధసన్నద్ధుఁడయ్యెను అంత సురలోకమున సింహముమీఁదికిఁబోవు వేఁటకానివిధమున, తారకునిపైకి దండెత్తుటకు సహింపక వడఁకుచున్న(భయపడుచున్న) ఇంద్రునిఁ గుమారస్వామి కనుఁగొని - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** అలంకార ముపమ

చ సుజనజనైకభూషణము శూరత, దుర్జనదూషణంబు, స
ద్ద్విజవిబుధాశ్రితప్రతతి వేడుకఁ బ్రోపును రాజ్యచిహ్న గా
క జలమహాభిషేకమునఁ గట్టిన పట్టము వీజనంబు భూ
భుజులక కాక యన్నియును బుంటికి నైనను లేవె చూడఁగాన్ ? 200

**అర్థము .** చూడఁగాన్, సుజన - జన + ఏక - భూషణము = సజ్జనుల సమూహామునకు ముఖ్యమైన అలంకారము, అగు, శూరత = శౌర్యము, దుర్జన - దూషణంబున్ = దుష్టులను నిందించుటయును, సత్ – ద్విజ - విబుధ + ఆశ్రిత- ప్రతతిన్ = మంచివారయినబ్రాహ్మణులును, పండితులునైన ఆశ్రితుల సమూహమును, వేడుకన్ = వేడుకతో, ప్రోపును = రక్షించుటయును, రాజ్య - చిహ్న - కాక = రాజ్యమునకు గుఱుతు గాక, జల - మహాభిషేకమునన్ = నీట నభిషేకించుటయందు, కట్టిన - పట్టమున్ = పట్టెయును, (పుండనునర్థమున) నీటఁగడిగికట్టు కట్టుటయు, వీజనంబున్ = వింజామరయును - విసరుటయును, భూ - భుజులకున్ + అ = రాజులకే, కాక, అన్నియును = పైనిఁజెప్పిన - నీటఁగడుగుట, కట్టుగట్టుట, విసరుట అనునవి యన్నియును, పుంటికిన్ + ఐనను = వ్రణమునకైనను, లేవె = లేవా ? - ఉన్నవి యనుట

**తాత్పర్యము .** చూడఁగా మంచివారికిఁ బ్రధానమైన అలంకారము అగు శౌర్యమును దుష్టశిక్షణము, సద్బ్రాహ్మణులు, పండితులునైన ఆశ్రితుల సమూహమును రక్షించుటయును, రాజ్యలాంఛనముగాని, జలాభిషేకము, పట్టము గట్టుట, వింజామరము అనునవి యన్నియును రాజులకే కాక వ్రణమునకు సైతముఁ గలవు గదా !

**విశేషములు** సుజనరక్షణ దుర్జనశిక్షణములు రాజ్యచిహ్నములు గాని జలాభిషేకము, పట్టము గట్టుట, వింజామరము అనునవి యన్నియును రాజచిహ్నములే కాక వ్రణమునకు సైత ముండును వ్రణమును గూడ నీటఁగడిగి, కట్టు కట్టి, మంటపోవుటకు విసనకఱ్ఱతో విసరుదురు

వ. కావున నఖిలకంటకుండైన తారకు నిర్జింపక మనచేయు రాజ్యం బేమి యొప్పు నదియునుంగాక 201

**అర్థము .** కావునన్, అఖిల - కంటకుండు + ఐన = ఎల్లజనులకుఁ గీడొనరించువాఁడయిన, తారకున్, నిర్జింపక = జయింపక, మన - చేయు -

రాజ్యంబు = మనము పరిపాలించు రాజ్యము, ఏమి + ఒప్పును, అదియునున్ + కాక

**తాత్పర్యము.** కావున నెల్ల జనులకు బాధకుఁడైన తారకాసురుని జయింపక మనము పాలించు రాజ్యమేమి యొప్పును ? అదియును గాక - తరువాతి యేకాదశాశ్వాసమునందలి 2 వ గద్యముతో నన్వయము

**ఆశ్వాసాంతము**

**మ పరమానందుఁ డమందుఁ, డక్షజయుఁ, డభ్రాంతుండు, శాంతుండు, స**
**ద్గురుఁ, డాత్మజ్ఞుఁడు, ప్రజ్ఞుఁ, డస్ఖలితుఁ, డక్రూరుం, డుదారుండు, వి**
**స్తరిత శ్లోకుఁ, డశోకుఁ, డాగమ చయాచార్యుం, డవార్యుండు, సా**
**గరగంభీరుఁ డభీరుఁ డక్షయశుభాకారుండు, ధీరుం డెడన్ 202**

**అర్థము :** పరమ + ఆనందుఁడు - మిక్కిలి ఆనందము గలవాఁడు, అమందుఁడు = మందుఁడు గాని వాఁడు, అక్ష - జయుఁడు = ఇంద్రియములను జయించినవాఁడు, అభ్రాంతుండు = భ్రాంతి నొందని వాఁడు, శాంతుండు = శమము గలవాఁడు, సత్ + గురుఁడు = మంచి గురువయినవాఁడు, ఆత్మజ్ఞుఁడు = ఆత్మజ్ఞానము గలవాఁడు, ప్రజ్ఞుఁడు = ప్రకృష్టమయిన జ్ఞానము గలవాఁడు, అస్ఖలితుఁడు = చలింపనివాఁడు, అక్రూరుండు = క్రూరుఁడు గానివాఁడు, ఉదారుండు = వదాన్యుఁడు, విస్తరిత - శ్లోకుఁడు = విస్తరించిన కీర్తి గలవాఁడు, అశోకుఁడు = శోకము లేనివాఁడు, ఆగమ - చయ + ఆచార్యుండు = శాస్త్రముల సమూహమునందు ఆచార్యుఁడైనవాఁడు, అవార్యుండు = అడ్డగింపరానివాఁడు, సాగర - గంభీరుఁడు = సముద్రమువలె గంభీరుఁడైనవాఁడు, అభీరుఁడు = పిఱికి వాఁడు గానివాఁడు, అక్షయ - శుభ + ఆకారుండు = నశింపని శుభకరమైన ఆకారము గలవాఁడు, ఎడన్ = హృదయమునందు, ధీరుండు = ధైర్యము గలవాఁడు - అగు శ్రీ జంగమ మల్లికార్జునుఁడు

**తాత్పర్యము.** పరమమైన ఆనందము గలవాఁడు, అమందుఁడు, ఇంద్రియ జయుఁడు, భ్రాంతిలేనివాఁడు, శమము గలవాఁడు, సద్గురుఁడు, ఆత్మజ్ఞానము గలవాఁడు, ప్రకృష్ట జ్ఞానముగలవాఁడు, చలింపనివాఁడు, క్రూరుఁడు గానివాఁడు, ఉదారుఁడు, విస్తరించిన కీర్తి గలవాఁడు, శోకములేనివాఁడు, శాస్త్ర సమూహమునందాచార్యుఁడు, వారింపరానివాఁడు, సముద్రమువలె గంభీరుఁడు, భీరుఁడు గానివాఁడు, అక్షయములైన శుభములు గల ఆకారము గలవాఁడు, ఎడఁదలో ధైర్యము గలవాఁడు అగు శ్రీ జంగమ మల్లికార్జునుఁడు

క మదన మదనాస్త్ర నిభ శుభ
మదనవతీ లోల దృష్టి మార్గణ నికరా
భిదురిత హృదయాంభోజుఁడు
మదనారిపదాబ్జమత్తమధుకరుఁ డెలమిన్ 203

**అర్థము .** మదన ... భోజుఁడు మదన = మన్మధుని యొక్క, మదన + అస్త్ర = మదము గలిగించు బాణములతో, నిభ = సమానమయిన, శుభ = శుభమైన, మదనవతీ = స్త్రీలయొక్క, లోల = చలించునట్టి, దృష్టి - మార్గణ = చూపులనెడి బాణముల యొక్క, నికర = సమూహముచేత, అభిదురిత = పగులఁగొట్టఁబడని, హృదయ + అంభోజుఁడు = పద్మమువంటి హృదయము గలవాఁడు, ఎలమిన్ = ప్రీతితో, మదనారి ... మధుకరుండు మదన + అరి = మన్మధశత్రువైన శివునియొక్క, పద + అబ్జ = పాదపద్మములకు, మత్త = మదించిన, మధుకరుఁడు = తుమ్మెదయైనవాఁడు

**తాత్పర్యము .** మన్మధుని మత్తు గలిగించు అస్త్రముల వంటి స్త్రీల చలించు దృగ్బాణములచేఁ బగులఁగొట్టఁబడని హృదయపద్మము గలవాఁడు, ఈశ్వరుని పాదపద్మములకుఁ దుమ్మెదయైనవాఁడు - అగు శ్రీ జంగమ మల్లికార్జునుఁడు

మ సకలాధారుఁడు ధీరుఁ డుత్తమగుణాసక్తుండు ముక్తుండు రా
జకళాకల్పుఁ డనల్పుఁ డర్థిసురభూజాతుం డజాతుండు బ్ర
హ్మకులాధీశుఁ డుమేశుఁ డూర్జితుఁడు ధీమంతుం డనంతుండు సూ
రి కవిస్తుత్యుఁడు నిత్యుఁ డాదిమునిచారిత్రుండు పాత్రుం డిలన్ 204

**అర్థము :** సకల + ఆధారుఁడు = అన్నిటికి ఆధారమయిన వాఁడు, ధీరుఁడు, ఉత్తమ - గుణ + ఆసక్తుండు = మంచి గుణములందు ఆసక్తి గలవాఁడు, ముక్తుండు = విడువఁబడినవాఁడు, రాజ - కళా + కల్పుఁడు = చంద్రకళ ఆభరణముగాఁ గలవాఁడు, అనల్పుఁడు = అల్పుఁడు గానివాఁడు, అర్థి - సుర- భూజాతుండు = యాచకులకుఁ గల్పవృక్షమయినవాఁడు, అజాతుండు = అభవుఁడు, బ్రహ్మ - కుల + అధి + ఈశుండు = బ్రాహ్మణవంశమునకు అధిపతియైనవాఁడును, ఉమా + ఈశుఁడు = పార్వతికి భర్తయైనవాఁడును, ఊర్జితుఁడు = గొప్పవాఁడును, ధీమంతుండు = బుద్ధిమంతుఁడును, అనంతుండు = అంతములేనివాఁడును, సూరి - కవి - స్తుత్యుఁడు = పండిత కవులచే

స్తుతింపఁదగినవాఁడును, నిత్యుఁడు = శాశ్వతుఁడును, ఆది - ముని - చారిత్రుండు = ఆదిముని చరిత్రము వంటి చరిత్రము గలవాఁడును, ఇలన్ = భూమియందు, పాత్రుండు = తగినవాఁడును అగు శ్రీ జంగమ మల్లికార్జునుఁడు

**తాత్పర్యము** అన్నిటికి నాధారమయిన వాఁడును, దీరుఁడును, ఉత్తమ గుణములందాసక్తి గలవాఁడును, ముక్తుఁడును, చంద్రకళావతంసుఁడును, అనల్పుఁడును, అర్థిజనకల్పవృక్షుఁడును, అభవుఁడును, బ్రాహ్మణ వంశశ్రేష్ఠుఁడును, ఉమాపతియును, ఊర్జితుఁడును, ధీమంతుఁడును, అనంతుఁడును, పండిత కవిస్తుత్యుఁడును, నిత్యుఁడును, ఆదిమునిచరిత్రమువంటి చరిత్రము గలవాఁడును, భూమిలోఁ బాత్రుఁడును అగు శ్రీ జంగమ మల్లికార్జునుఁడు

క **తరుణతర తరణి కిరణో**
**త్కర సంస్పర్శ ప్రభానికర వికసిత వా**
**రిరుహ దళ కలిత శోభా**
**హర దవదాతాక్షుఁ డూర్జితైశ్వర్యుఁ డొగిన్** 205

**అర్థము.** తరుణ - తర మిక్కిలి లేఁతయైన, తరణి = సూర్యుని యొక్క, కిరణ +ఉత్కర = బాణ సమూహముయొక్క, సంస్పర్శ = సంబంధమైన, ప్రభా = కాంతులయొక్క, నికర = సమూహముచేత, వికసిత = వికసింపఁ జేయఁబడిన, వారిరుహ - దళ = పద్మదళములందు, కలిత = కూడిన, శోభా = సౌందర్యమును, హరత్ = హరించుచున్న, అవదాత + అక్షుఁడు = మనోజ్ఞమ్ము లయిన కన్నులు గలవాఁడు, ఊర్జిత + ఐశ్వర్యుఁడు = గొప్ప ఐశ్వర్యము గలవాఁడు, ఒగిన్ - ఇది వాక్యాలంకారముగాఁ బ్రయుక్తమయినది

**తాత్పర్యము.** బాలభానుని కిరణముల కాంతిచే వికసించిన పద్మదళముల శోభను హరించు మనోజ్ఞములయిన కన్నులు గలవాఁడును, గొప్ప యైశ్వర్యము గలవాఁడును అగు శ్రీ జంగమ మల్లికార్జునుఁడు

భుజంగ **మహాయోగిముఖ్యుండు మాన్యుండు ధన్యుం**
**డహర్నాథతేజుం డనంతుండు శాంతుం**
**డహింసారతుం డంబుజాక్షుండు దక్షుం**
**డిహాముత్రభోగాద్యనిష్టుండు సృష్టిన్** 206

**అర్థము .** మహాయోగి ముఖ్యుండు = గొప్ప యోగులలో శ్రేష్ఠుఁడు, మాన్యుఁడు = మన్నింపఁదగినవాఁడు, ధన్యుండు, అహస్ (ః) (ర్) + నాథ - తేజుండు = సూర్యుని తేజస్సువంటి తేజస్సు గలవాఁడును, అనంతుండు = అంతము లేనివాఁడును, శాంతుండు, అహింసా - రతుండు = అహింసయం దాసక్తి గలవాఁడును, అంబుజ + అక్షుండు = పద్మములవంటి కన్నులు గలవాఁడును, దక్షుండు = సమర్థుఁడును, సృష్టిన్ = సృష్టియందు, ఇహ + అముత్ర - భోగ + ఆది + అనిష్టుండు = ఇహలోకమునందలి, పరలోకము నందలి సౌఖ్యములు మున్నగువాని యం దిష్టము లేనివాఁడును - అగు శ్రీ జంగమ మల్లికార్జునుఁడు

**తాత్పర్యము .** గొప్ప యోగులలోఁ బ్రధానుఁడును, మాన్యుఁడును, ధన్యుఁడును, సూర్యుని తేజస్సు వంటి తేజస్సు గలవాఁడును, అనంతుఁడును, శాంతుఁడును, అహింసయం దాసక్తి గలవాఁడును, పద్మనేత్రుఁడును, దక్షుఁడును, సృష్టిలో ఇహపరలోకసౌఖ్యములం దిష్టము లేనివాఁడును అగు శ్రీ జంగమ మల్లికార్జునుఁడు

**విశేషములు .** భుజంగ ప్రయాత వృత్త లక్షణము నాలుగు పాదములుండును ప్రతిపాదమునను నాలుగు యగణములుండును మొదటి యక్షరమునకు నెనిమిదవ యక్షరమునకును యతిమైత్రి ప్రాసనియమము గలదు

## గద్యము

ఇది శ్రీ మజ్జంగమ మల్లికార్జునదేవ దివ్య శ్రీ పాద
పంకజ భ్రమరాయమాణ కవిరాజశిఖామణి
నన్నెచోడదేవ ప్రణీతంబైన
కుమారసంభవంబను కథయందు దశమాశ్వాసము
దీని వ్యాఖ్యకుఁ బూర్వాశ్వాసాంత గద్యల వ్యాఖ్యల వరయునది

మ ఇది శ్రీ జొన్నలగడ్డ వంశమణియౌ మృత్యుంజయాఖ్యుండు స
మ్మద మొప్పారఁ గుమారసంభవము శ్రీ మన్నన్నెచోడాఖ్య వి
ద్వదధీశోక్తము శాబ్దికార్థ వివిధ స్వారస్య తాత్పర్యముల్
చదురొప్పన్ వచియించి మన్చు విలసత్ సంజీవనీవ్యాఖ్య యౌ

# కుమార సంభవము

## ఏకాదశాశ్వాసము

క   శ్రీ రమణుఁ, డఖిల సుజనా
ధారుండు, కవి గమకి బుధ నిధానుఁడు, భవకాం
తార దవానలుఁ, డఘ సం
హారుఁ, డుదారుండు, మల్లికార్జునుఁ డెలమిన్   1

**అర్థము** శ్రీ రమణుఁడు = లక్ష్మీదేవి భర్తయును, అఖిల- సుజన + ఆధారుండు = ఎల్లమంచిజనుల కాధారమయినవాఁడును, కవి - గమకి - బుధ - నిధానుఁడు = కవులకు, గాయకులకు, బుధులకు నిధియైనవాఁడును, భవ - కాంతార-దవ + అనలుఁడు = సంసారమనెడి అడవికిఁ గార్చిచ్చు అయిన వాఁడును, అఘ - సంహారుఁడు = పాపములను బోకార్చువాఁడును,ఉదారుండున్ = గొప్పవాఁడును, అగు, మల్లికార్జునుఁడు, ఎలమిన్

**తాత్పర్యము .** లక్ష్మీదేవి భర్తయును, - విష్ణువును, ఎల్ల సజ్జనులకు ఆధారభూతుఁడైనవాఁడును, కవులకు, గాయకులకు, బుధులకు నిధియైనవాఁడును, సంసారమనెడి అడవికిఁ గార్చిచ్చు అయినవాఁడును, పాపములను నశింపఁజేయువాఁడును, ఉదారుఁడును అగు జంగమమల్లికార్జునుఁడు

వ   సర్వేశ్వరుండు శర్వాణీసహితుండై నన్ను వీరాభిషేకంబు సేసి సేనాని పట్టంబు గట్టి తారకాద్యఖిల కంటక లుంటాక నికరంబు నిర్జించి సురవరుల నిఖిలభువనసామ్రాజ్యపదవియందు సుప్రతిష్ఠులం జేయుమని నియమించినం గైకొని వచ్చి వచ్చిన ముష్టి నా పూనికి నెఱపకుండు డేమి పురుషార్థంబని విజృంభించి కోపావేశంబునం దావగొనక ప్రస్థానభేరి సఱవంబంచిన   2

**అర్థము .** సర్వేశ్వరుండు = శివుఁడు, శర్వాణీ - సహితుండు + ఐ = పార్వతితోఁగూడినవాఁడయి, నన్నున్, వీర + అభిషేకంబు + చేసి = వీరునిగా నభిషేకించి, సేనాని - పట్టంబు + కట్టి = సేనాధిపతిపట్టమును గట్టి, తారక +

ఆది+ అఖిల - కంటక - లుంటాక - నికరంబున్=తారకుఁడు మున్నగు నెల్లపాపుల చోరుల సమూహమును, నిర్జించి = జయించి, సుర-వరులన్ = దేవతాశ్రేష్ఠులను, నిఖిల - భువన - సామ్రాజ్య - పదవి + అందున్ = సకలలోకముల సామ్రాజ్య స్థానమందు, సుప్రతిష్ఠులన్ = నెలకొలుపఁబడినవారిని, చేయుము, అని, నియమించినన్ = ఆజ్ఞాపింపఁగా, కైకొని వచ్చి = సమ్మతించి వచ్చి, వచ్చిన - ముష్టిన్= వచ్చిన వెంబడి, నా - పూన్కి = నా ప్రయత్నము, నెఱవేఱక + ఉండుడు = ఫలింపకుండుట, ఏమి - పురుష + అర్థంబు = ఏమి పౌరుషము ?, అని, విజృంభించి, కోప + ఆవేశంబునన్, తావకొనక = నిలువక, ప్రస్థాన - భేరి = ప్రయాణభేరి, చఱవన్ + పంచినన్ = మ్రోయింప నాజ్ఞాపింపఁగా

**తాత్పర్యము .** పరమేశ్వరుఁడు పార్వతీసమేతుఁడై నన్ను వీరునిగా నభిషేకించి, సేనాపతిపట్టము గట్టి, 'తారకుఁడు మున్నగు నెల్లకంటకులను జోరులను జయించి దేవతలను సకలలోకసామ్రాజ్యపదవియందు సుప్రతిష్ఠితులను జేయు' మని యాజ్ఞాపింపఁగా నంగీకరించి వచ్చి, వచ్చిన వెంబడి నా ప్రయత్నము ఫలింపకుండుట యేమిపౌరుషమని విజృంభించి కోపావేశమున నిలువక ప్రయాణభేరి మ్రోయింపఁబంపఁగా - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు** ముష్టి = వెంబడి - అని మా రా కవి వ్యాఖ్య

## కుమారస్వామి సేన యుద్ధ ప్రస్థానము

సీ. అమృతాబ్ధి సొచ్చు యాదము నిద్రవోయిన
పీతాంబరుఁడు బిట్టు బెదరి లేవఁ
దలకొన్న ధారుణీస్థలి మెడవంపులఁ
బడ నుల్కిపడి మ్రొగ్గిపడ నహీంద్రుఁ
డహిమాంశురథ మిక్కడక్కడ వడ మావు
లుప్పర మెగసి క్రేళ్లుఱికి పాఱఁ,
జీఁదఱ రేఁగి గర్జించి గోపతి మేను
వెంచి చుట్టు నుఱుమకించి చూడ,

తే దిగ్గజేంద్రంబు లుక్కఱి మ్రొగ్గఁ, దార
కములు డుల్లంగ, బ్రహ్మాండ ఖండ మద్రువ,
భీషణధ్వనిఁ బ్రస్థానభేరి చెలఁగె
మాన కందంద దిక్కులు మాఱుచెలఁగ 3

**అర్థము** అమృత + అబ్ధి = అమృత సముద్రము - క్షీరసముద్రము, చొచ్చి= ప్రవేశించి, యాదము = గాఢముగా, నిద్ర + పోయిన, పీత + అంబరుఁడు - పచ్చని వస్త్రముగలవాఁడు - విష్ణువు, బిట్టు = శీఘ్రముగా, బెదరి = భయపడి, లేవన్ = లేవఁగను,

తలకొన్న = తలయందు ఉన్న, ధారుణీ - స్థలి = భూమిస్థలి, మెడ - వంపులన్ = మెడవంపులందు, పడన్, అహి + ఇంద్రుఁడు = నాగరాజు - శేషుఁడు, ఉల్కిపడి, మ్రొగ్గిపడన్ = వ్రాలిపడఁగను

అహిమ + అంశు - రథము = సూర్యుని రథము, ఇక్కడ + అక్కడ, పడన్, మావులు = గుఱ్ఱములు, ఉప్పరము+ ఎగసి = మింటి కెగిరి, క్రేళ్ళుఱికి - పాఱన్ = పర్వులువాఱఁగను,

గో - పతి = వృషభరాజము - నంది, చీఁదఱన్ - రేఁగి = రెచ్చిపోయి, గర్జించి = ఱంకెపెట్టి, మేను + పెంచి = శరీరమును, బెంచి, చుట్టున్, ఉఱుమకించి - చూడన్ = ఉఱిమి చూడఁగను

దిశ్(క్) + గజ + ఇంద్రంబులు = దిక్కులందలి శ్రేష్ఠములైన యేనుఁగులు, ఉక్కు + అఱి = బలము చెడి, మ్రొగ్గన్ = వ్రాలఁగను, తారకములు = నక్షత్రములు డుల్లంగన్ = రాలఁగను, బ్రహ్మాండ - ఖండము = బ్రహ్మాండ భాగము, అద్రువన్ = అదరఁగను, దిక్కులు, మానక = ఉడుగక, అందంద = మిక్కిలి, మాఱు - చెలఁగన్ = ప్రతిధ్వనింపఁగా, ప్రస్థాన - భేరి = ప్రయాణపుభేరి, భీషణ - ధ్వనిన్ = భయంకరమయిన చప్పుడుతో, చెలఁగెన్ = మ్రోసెను

**తాత్పర్యము** క్షీరసముద్రమునఁ బ్రవేశించి గాఢముగా నిద్రవోయిన విష్ణువు శీఘ్రముగా బెదరి లేవఁగను, తలయందలి భూస్థలి మెడవంపులలోఁ బడఁగా శేషుఁ డులికిపడి వ్రాలి పడఁగను, సూర్యుని రథము ఇక్కడక్కడ పడఁగా, గుఱ్ఱములు మింటి కెగిరి పర్వులువాఱఁగను, నంది రెచ్చిపోయి ఱంకెవైచి మేను పెంచి చుట్టును ఉఱిమి చూడఁగను, దిగ్గజరాజములు బలముచెడి వ్రాలఁగను, చుక్కలు రాలిపడఁగను, బ్రహ్మాండభాగము అదరఁగను, దిక్కులు ఉడుగక మిక్కిలి ప్రతిధ్వనింపఁగను, యుద్ధప్రయాణభేరి భయంకరధ్వనితో మ్రోసెను

**విశేషములు :** ఇది సామాన్యముగా నైనచో అతిశయోక్తి యనఁదగును గాని కుమారస్వామి యుద్ధభేరి ధ్వని గావున స్వభావోక్తియే యన నొప్పును

యాదము = గాఢముగా (సూ ని ). అ(్రువ - అ(్రుచు + నుజి 'చుక్పరక రువర్ణంబునకు ముందటి దువర్ణంబు నుత్వంబునకు లోపంబు విభాషనగు నగుచో( దత్పూర్వంబు గురువు గాదు' బాల ప్ర 20 'తుమర్థ భావలక్షణంబులందు నుజి యగు', బాల క్రియ 40 'ముజ్జీత్తులు ముత్తు నా(బడు ' బాల క్రి 86 'ఆగమాన్యవకారంబుల కద్విరుక్తంబులకు ముత్తుపరంబగునపుడు ప వ లగు ' బాల క్రి 88 అ(్రువు + నుజి 'జీత్తు పరంబగునపు డుత్వంబున కత్వంబగు ' బాల క్రి 20 అ(్రువను

**వ అమ్మహాధ్వని విని నవఘనాఘనధ్వని విని విజృంభించు మయూర సంఘంబునుంబోలె( జెలంగి కల(గొనంబాఱు నమరకటకంబు చంద్రోదయంబునం దనరి మ్రోయు మహాసముద్రంబునుంబోలె( బెరి(గి ఘూర్ణిల్లుచు 4**

**అర్థము .** ఆ + మహత్ (మహా) + ధ్వని = ఆ గొప్ప చప్పుడు, విని, నవ - ఘనా - ఘన - ధ్వని = క్రొత్త వర్షాకాలపు మేఘముల ధ్వని, విని, విజృంభించు = చెలరే(గునట్టి, మయూర - సంఘంబునున్ + పోలెన్ = నెమళ్ళగుంపువలె, చెలంగి = కే(కలు వేసి, కల(గొన్ + పాఱు = కల(గిపాఱునట్టి, అమర - కటకంబు = దేవతల సైన్యము, చంద్ర + ఉదయంబునన్, చంద్రోదయమందు, తనరి = ఒప్పి, మ్రోయు, మహత్ (మహా) + సముద్రంబునున్ + పోలెన్, పెరి(గి = ఉప్పొంగి, ఘూర్ణిల్లుచున్ =ధ్వనించుచు

**తాత్పర్యము .** ఆ మహాధ్వనిని విని క్రొక్కారు మొయిళ్ల ధ్వని విని విజృంభించు నెమళ్లగుంపువలె మ్రోసి కల(గి పాఱునట్టి దేవతల సైన్యము చంద్రోదయమున నొప్పి ధ్వనించు మహాసముద్రమువలె నుప్పొంగి ధ్వనించుచు - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** అలంకార ముపమ

**ఉ ధారలు వట్టి(బంపు, తలతంత్రము( దా వడి నంపు,రత్నభాం**
**డారముతోడ గుట్టుపుదడంబులు ముంగలివంపు, సందడిం**
**జేర(గనీకు మేను(గుల(, జిందములన్ మొరయింపు, మొక్క(డే**
**వారువ మందు వంపు సహవాసుల నంతిపురంబు కాపుగాన్ 5**

**అర్థము** ధారలు = సైన్యపు మొనలో ముందటి భాగములు, పట్టన్ = పట్టునట్లు, పంపు = పంపుము, తలతంత్రమున్ = యుద్ధభూమిలో మొదట సవరణఁజేయఁదగిన నాయకుల సమూహమును, తాన్, వడిన్ = వేగముగా, అంపు పంపుము, రత్న - భండారముతోడన్ = రత్నాల బొక్కసముతో, గుఱ్ఱపు - దడంబులు (గుఱ్ఱము + దడంబులు) అశ్వసైన్యములు, ముంగలి + పంపు = ముందు పంపుము ఏనుఁగులన్, సందడిన్ = గుంపుగా, చేరఁగన్ + ఈకుము = కూడనీకుము, చిందములన్ = శంఖములను, మొరయింపుము = ఒత్తింపుము, ఒక్కఁడే - వారువమందున్ = ఒకె గుఱ్ఱమునందు, సహవాసులన్ = కుబ్జక్లీబాద్యంతఃపురరక్షకులను, అంతిపురంబు - కావఁగాన్ = అంతఃపురరక్షణమగునట్లు, పంపు = పంపుము

**తాత్పర్యము .** సైన్యపు మొనలో ముందటి భాగములు పట్టునట్లు పంపుము యుద్ధభూమిలో మొదట సవరణఁ జేయఁదగిన నాయకుల సమూహమును వేగముగాఁ బంపుము రత్నముల బొక్కసముతో అశ్వసైన్యములు ముందు పంపుము ఏనుఁగులను గుంపుగాఁ జేరనీకుము శంఖముల నొత్తింపుము ఒకే గుఱ్ఱమునందు అంటిపురపుఁగావలివాండ్రను అంతఃపురరక్షణమునకుఁ బంపుము

**విశేషములు .** ఒక్కఁడే వారువమందు వంపు - ద్రుతప్రకృతికమయిన 'అందు' పయి పకారమునకు వకార మె ట్లాదేశమైనది? ఒక్కఁడే వారువ మందుఁబంపు' అని యుండవలయును గదా !

ఉ **ఏనుఁగుఁ బంపు, వారువము లీఁదగు, నిందుల సేన వేసరెన్,**
**గానవె ? సోవతంబునకుఁ గందల మెత్తు, రథంబు పూన్చు, పం**
**చాననుపుత్త్రుఁ డెత్తికొను డత్తల మందవు ముట్టు దారికిన్**
**రా నవు వచ్చినన్ సడగరం బవులె మ్మొగి వీఁటు లెత్తఁగాన్** 6

**అర్థము .** ఏనుఁగున్ = ఏనుఁగును, పంపు = పంపుము, వారువములు, ఈన్+తగున్ = గుఱ్ఱముల నీఁదగును, ఇందుల - సేన = ఇచ్చటి సేన, వేసరెన్ = అలసెను కానవె = చూడవా ?, సోవతంబునకున్ = గుఱ్ఱమునకు (?), కందలము = జీను, ఎత్తు = పెట్టుము, రథంబు, పూన్చు = సిద్ధము చేయుము, పంచానను - పుత్త్రుఁడు = శివకుమారుఁడు - కుమారస్వామి, ఎత్తికొనుడు = దండెత్తుట, అత్తలము + అందున్ + అవు = ఆ స్థలమునందగు, ముట్టువారికిన్ = ఎదిరించువారలకు, రాన్ + అవున్ = వచ్చుటకగును, వచ్చినన్ = వచ్చినచో,

ఒగిన్=క్రమముగా, వీళులు+ ఎత్తఁగాన్=శిబిరములు నిర్మించుటకు, సడగరంబు= సంభ్రమము, అవున్ + లెమ్ము = అగునులెమ్ము

**తాత్పర్యము** ఏనుఁగులను బంపుము గుఱ్ఱముల నీఁదగును ఇచ్చటిసేన బడలెను చూడవా ? గుఱ్ఱమునకు జీను గట్టుము రథమును సిద్ధపఱుపుము కుమారస్వామి దండెత్తుటచే ఆ స్థలమునను్న ఎదిరించువారలు వచ్చుటకగును వారు వచ్చుచో శిబిరములు నిర్మించుటకు సంభ్రమమగును

**విశేషములు.** ఇందలి 'సోవత' మను శబ్దము నిఘంటువులఁ గానరాలేదు వావిళ్లవారి ప్రతిలోని లఘుటీకననుసరించి వ్యాఖ్యానింపఁబడినది వీళులు - వీడు + లు - 'బహువచనముపరంబగునపు డసంయుక్తబులయి యుదంతంబులయిన డ ల ర ల కలఘులకారంబు బహుళంబుగా నగు ' బాల ఆచ్చిక 13 పంపు, ఎత్తు, పూన్పు - అనువానిలో ముపర్ణక లోపమునకు - 'మద్యమ పురుషముపర్ణకంబునకు హలవసానంబులు పంరబులగునపుడు లోపము విభాషనగు' బాల సంధి 47

**వ ఇట్టి సంక్షోభంబునం బ్రయాణోన్ముఖుండై** 7

**అర్థము .** ఇట్టి, సంక్షోభంబునన్ = సంచలనముతో, ప్రయాణ + ఉన్ముఖుండు + ఐ = పయనమునకు ఉద్యుక్తుఁడయి

**తాత్పర్యము.** ఇటువంటి సందడిలో యుద్ధప్రయాణమున కుద్యుక్తుఁడయి - తరువాతి పద్యముతో నన్వయము

**మ చెలఁగన్ నిర్జరదుందుభుల్ మునిగణాశీర్వాదనాదంబుతోఁ,**
**జెలువొందన్ సురపుష్పవృష్టి గురియన్ శేషాక్షతౌఘంబుతో,**
**నలి నీశాత్మజుఁ డెక్కె బృంహిత రవానందాశ్రు దానంబు స**
**ల్లలి తేభంబు దినేశ్వరుండుదయశైలం బెక్కునట్లున్నతిన్** 8

**అర్థము.** ముని - గణ + ఆశీర్వాద నాదంబుతోన్ = మునుల సమూహము యొక్క దీవెనల ధ్వనితో, నిర్జర - దుందుభుల్ = దేవతల భేరులు, చెలఁగన్ = ధ్వనింపఁగను, చెలువు + ఒందన్ = మనోహరముగా, శేష + అక్షత + ఓఘంబుతోన్ = సేసఁబ్రాలసమూహముతో, సుర - పుష్ప - వృష్టి = దేవతల పూలవాన, కురియన్ = కురియఁగను, ఈశ + ఆత్మజుఁడు = ఈశ్వరుని కొడుకైన కుమారస్వామి, దిన + ఈశ్వరుండు = దిననాథుఁడు = సూర్యుఁడు,

ఉదయ - శైలంబు = తూర్పుఁగొండను, ఎక్కు + అట్లు = ఎక్కు విధమున, బృంహిత - రవ + ఆనంద + అశ్రు - దానంబు = ఘీంకారధ్వనితోడి సంతోషబాష్పములనెడి మదజలము గలది, అగు, సత్ + లలిత + ఇభంబున్ = మిక్కిలి మనోహరమయిన యేనుఁగును, ఉన్నతిన్ = గొప్పతనముతోను, ఉల్సాహములోను, ఎక్కెను

**విశేషములు** అలంకార ముపమ

వ తదవసరంబున 9

**అర్థతాత్పర్యములు .** తద్ + అవసరంబునన్ = ఆ సమయమున - తరువాతి పద్యముతో నన్వయము

క గరుడేభాజ మహిష నర
వర ఝష మృగ తురగ వృషభవాహనులై శ్రీ
ధర సుర పాగ్ని యమాసుర
వరుణానిల ధనద హరులు వచ్చిరి నెమ్మిన్ 10

**అర్థము .** శ్రీధర = విష్ణువు, సురప = ఇంద్రుఁడు, అగ్ని, యమ, అసుర = నిర్‌ృతి, వరుణ = వరుణుఁడు, అనిల = వాయువు, ధనద = కుబేరుఁడు, హరులు = ఈశానుఁడు అనువారు, (క్రమముగా), గరుడ = గరుత్మంతుఁడు, ఇభ = ఏనుఁగు - ఐరావతము, అజ = మేఁక పోతు, మహిష = దున్న, నర - వర = మనుజ శ్రేష్ఠుఁడు, ఝష = చేఁప, మృగ = లేడి, తురగ = గుఱ్ఱము, వృషభ - వాహనులు + ఐ = ఎద్దు వాహనములుగాఁ గలవారయి, నెమ్మిన్ =ప్రీతితో, వచ్చిరి

**తాత్పర్యము:** విష్ణువు, ఇంద్రుఁడు, అగ్ని, యముఁడు, నిర్‌ృతి, వరుణుఁడు, వాయువు, కుబేరుఁడు, ఈశానుఁడు అనువారు క్రమముగా గరుత్మంతుఁడు, ఐరావతము, మేఁకపోతు, దున్న, నరవరుఁడు, చేఁప, లేడి, గుఱ్ఱము, ఎద్దు అనునవి వాహనములుగాఁ గలవారయి ప్రీతితో వచ్చిరి

**విశేషములు .** అలంకారము యథాసంఖ్యము ఇందు అగ్నికి అజము అసురునకు నరుఁడు, ధనదునకుఁ దురగము వాహనములుగాఁ జెప్పుట విశేషము ధనదుఁడు నరవాహనుఁడు

వ మఱియును - తరువాతి పద్యముతో నన్వయము 11

సీ అశ్వాశ్వతర శిబికాందోళ కరి కరి
ణీకర భార దానీక వాహ
నంబులు నిజవిభవంబులు వెలయంగఁ
గర మర్థి నెక్కి భూచరులు నడవ
మానితానేక విమాన సహస్రముల్
పరువడి నెక్కి ఖేచరులు నడవ
నాతపత్ర ధ్వజ వాతపూరణములుఁ
దనరి బ్రహ్మాండంబు దాఁకి తూల

ఆ భూనభోంతరప్రపూరితంబై దశ
దిశల నడుమ నెఱయ దీఁటు కట్టి
జగము లెల్ల నిమ్ము సాలక మల్లడి
గొనియె గుహు బలంబు కొలఁదిమిగిలి 12

**అర్థము** అశ్వ నంబులు అశ్వ = గుఱ్ఱములు, అశ్వతర = కంచర గాడిదలు, శిబికా = పల్లకీలు, ఆందోళ = అందలములు, కరి = ఏనుఁగులు, కరిణీ = పిడియేనుఁగులు, కరభ = ఒంటెలు, అరద = రథముల, అనీక = సమూహములు, వాహనంబులు, నిజ - విభవంబులు = తమ వైభవములు, వెలయంగన్ = ఒప్పఁగా, కరము = మిక్కిలి, అర్థిన్ = కోరికతో, ఎక్కి, భూచరులు = కాల్బలములు, నడవన్ = నడవఁగా,

మానిత + అనేక - విమాన - సహస్రముల్ = గొప్పవియగు పెక్కు విమానముల సహస్రములు, పరువడిన్ = క్రమముగా, ఎక్కి, ఖేచరులు = గగనచరులు, నడవన్,

ఆతపత్ర = గొడుగు, ధ్వజ = కేతనములు, వాత - పూరణములున్ = గాలిబుడగలును, తనరి = ఒప్పి, బ్రహ్మాండంబు, తాఁకి = ముట్టి, తూలన్ = చలింపఁగను,

భూ -నభస్(ః) + అంతర - ప్రపూరితంబు + ఐ = భూమ్యాకాశముల నడిమి ప్రదేశము నిండినదయి, దశ - దిశల - నడుమన్ = పదిదిక్కుల నడుమను, నెఱయన్ = నిండుగా, దీటు - కట్టి = నిండి, జగములు + ఎల్లన్, గుహు - బలంబు

= కుమారస్వామి సైన్యము కొలఁది - మిగిలి = పరిమితి నతిక్రమించి, మల్లడి + కొనియెన్ = అతిశయించెను

**తాత్పర్యము** గుఱ్ఱములు, కంచర గాడిదలు,పల్లకీలు, లందలములు, ఏనుఁగులు ఆఁడేనుఁగులు, ఒంటెలు, రథములు అనువాని సమూహము, వాహనములు తమ వైభవము లొప్పఁగా మిక్కిలి కోరికతో నెక్కి కాలిబంటులు నడవఁగను, గొప్పవియగు పెక్కువేల విమానములు ఎక్కి గగనచరులు నడవఁగను, గొడుగులు, కేతనములు, వాయుపూరణములును ఒప్పి బ్రహ్మాండము ముట్టి చలింపఁగను, భూమ్యాకాశముల నడిమి ప్రదేశము నిండినదయి పదిదిక్కుల నడుమను మిక్కిలి నిండి జగములన్నియుఁ జోటుచాలక గుహుని సైన్యము మితిమీఱి అతిశయించెను

**విశేషములు** . రథ శబ్దభవమ్మైన'అరద' మిందుఁ దత్సమపదముగాఁ బ్రయుక్తమైనది

చ **నలుగడ నింత యంత యని నాలుకఁజెప్పఁగఁ బెద్ద, యమ్మెయిం**
**గల నిజ మింత యంత యని కన్నులఁ జూడఁగఁ బెద్ద, తద్దయుం**
**జెలువుఁగ నింత యంత యని చిత్తమునం దలపోయఁ బెద్ద నాఁ**
**బొలిచె మహేశుపేర్మియునుబోలెఁ గుమారుబలం బనంతమై** 13

**అర్థము** . కుమారు - బలంబు = కుమారస్వామి సైన్యము, నలుగడన్ = నాలుగు దిక్కులందును, ఇంత + అంత + అని, నాలుకన్ = నాలుకతో, చెప్పఁగన్ = చెప్పుటకు, పెద్ద = ఎక్కువ, అమ్మెయిన్ = (ఆ + మెయిన్) = ఆ విధముగా, కల - నిజము = ఉన్న నిజము, ఇంత + అంత + అని, కన్నులన్ + చూడఁగన్, పెద్ద, తద్దయున్, చిత్తమునన్ = మనసునందు, చెలువుగన్ = అందముగా, తలపోయన్= భావింపఁగా, పెద్ద, నాన్ = అనునట్లు, మహేశు - పేర్మియును + పోలెన్ = మహేశ్వరుని గొప్పతనమువలె, అనంతము + ఐ = అంతులేనిదయి, పొలిచెన్ = ఒప్పెను

**తాత్పర్యము** . కుమారస్వామి సైన్యము నాలుగుదిక్కులను ఇంత అంత అని నోటితోఁ జెప్పుట కెక్కువ ఇంతయని చెప్పలేమనుట ఆ రీతిగనే ఉన్ననిజ మింత యంత యని కన్నులతోఁ జూడ నలవి కాదు దాని యందము నింత యంత యని మనసుతో నూహించుటకును బెద్ద అట్లు అది మహేశ్వరుని గొప్పతనమువలె అంతులేనిదయి ఒప్పెను

**విశేషములు.** అలంకార ముపమ చెప్పుటకు అలవి కానిది ఒకపాటిదయి యుండును చూచుటకు వీలుకానిది మఱి కొంచెము పెద్దదయియుండును మనసులో నూహించుటకుఁ గూడ నలవికానిది యెంత పెద్దదో చెప్పుట కష్టమని ఉత్తరోత్తరముగా దాని అభివృద్ధి సూచింపఁబడియెను

క. ధరణీధరశోభితమై
నిరుపమమై, యమరవాహినీసంయుతమై,
హరిభూషితమై పరమే
శ్వరు, నంబుధిఁబోలి గుహుని వాహిని నడచెన్ 14

**అర్థము.** గుహుని - వాహిని = కుమారస్వామి సేన, ధరణీధర - శోభితము + ఐ = విష్ణువుచేఁ బ్రకాశించినదయి - నాగములతోఁ బ్రకాశించునదయి, పరమేశ్వరున్ = శివుని, పోలి, పర్వతములతోఁ బ్రకాశించి, అంబుధిన్ = సముద్రమును, పోలి, నిరుపమము + ఐ = సాటిలేనిదయి, నడచెన్, అమర - వాహినీ - సంయుతము + ఐ = దేవతల సేనతోఁ గూడినదయి - ఆకాశగంగానదితోఁ గూడినదయి, పరమేశ్వరున్, పోలి, గంగానదితోఁ గూడినదయి, అంబుధిన్, పోలి, హరి - భూషితము + ఐ = ఇంద్రునిచే నలంకరింపఁబడినదయి చంద్రునిచే నలంకరింపఁబడినదయి, పరమేశ్వరున్, పోలి, విష్ణువుచే నలంకరింపఁబడినదయి, అంబుధిన్, పోలి, నడచెన్

**తాత్పర్యము.** కుమారస్వామి సైన్యము ధరణీధర శోభితమై - విష్ణువుచేఁ బ్రకాశించినదయి -నాగములతోఁ బ్రకాశించినదయి పరమేశ్వరుని, పర్వతములతోఁ బ్రకాశించి సముద్రమును బోలి నడచెను అది సాటిలేనిదయి యుండెను అది అమరవాహినీసంయుతమయి = దేవసేనతోఁ గూడినదయి - ఆకాశగంగతోఁ గూడినదయి పరమేశ్వరుని, గంగానదితోఁ గూడి సముద్రమును బోలి నడచెను అది హరిభూషితమై - ఇంద్రునిచే నలంకరింపఁబడినదయి, చంద్రునిచే నలంకరింపఁబడినదై పరమేశ్వరుని, విష్ణువుచే నలంకరింపఁబడినదయి సముద్రమును బోలి నడచెను

**విశేషములు.** అలంకారము శ్లేషానుప్రాణితోపమ

క. భూరితరవారి వారిరు
హారావానంత నాగ హరి భూధర ల
క్ష్మీ రమణీ శోభితుఁడై
నీరధిపతిఁబోలె వాహినీవిభుఁ డచటన్ 15

**అర్థము** అచటన్ = అచ్చట, వాహినీ - విభుఁడు = సేనానాయకుఁడు - కుమారస్వామి, భూరి శోభితుఁడై, భూరి = మిక్కిలి యెక్కువయిన, తరవారి = కత్తుల యొక్కయు, వారిరుహ = శంఖముల యొక్కయు, ఆరావ = ధ్వనులచేతను, అనంత-నాగ = అనంతములయిన ఏనుఁగుల చేతను, హరి = గుఱ్ఱముల చేతను, భూధర = రాజుల చేతను, లక్ష్మి - రమణీ = సంపదధిష్ఠానదేవతచేతను, శోభితుఁడు + ఐ = ప్రకాశించినవాఁడయి

భూరితర = మిక్కిలి అధికమయిన, వారి = నీటి యొక్కయు, వారిరుహ = శంఖములయొక్కయు, ఆరావ = ధ్వనులతోను, అనంత-నాగ = అనంతుఁడను సర్పముతోను, హరి = విష్ణువుతోను, భూధర = కొండలతోను, లక్ష్మి - రమణీ = లక్ష్మీదేవితోను, శోభితుఁడై = ప్రకాశించినవాఁడయి, నీరధి-పతిన్ = సముద్రుని, పోలెన్

**తాత్పర్యము** కుమారస్వామి అధికములయిన కత్తులయు, శంఖములయు ధ్వనులతోను, అనంతములయిన ఏనుఁగులతోను, గుఱ్ఱములతోను, రాజులతోను, సంపదధిష్ఠాన దేవతతోను బ్రకాశించినవాఁడయి, అధికమైన నీటి యొక్కయు శంఖముల యొక్కయు ధ్వనిచేతను, అనంతుఁడను సర్పముతోను విష్ణువుతోను, పర్వతములతోను, లక్ష్మీదేవితోను బ్రకాశించినవాఁడగు సముద్రుని బోలెను

**విశేషములు** అలంకారము శ్లేషానుప్రాణితోపమ

వ తత్ప్రస్తవంబున 16

**అర్థతాత్పర్యములు .**తద్ + ప్రస్తవంబునన్ = ఆ సందర్భమునందు - తరువాతి పద్యముతో నన్వయము

చ **ఎలమిఁ గుమారు ముంగలి సురేంద్రుఁడు రా, నుదధీశ్వరుండు పిం**
**గలి నడవం, గుబేరుఁడును గాలుఁడు నేర్పడఁ బన్ని ప్రీతితోఁ**
**గెలఁకుల రాఁగ, మీఁదఁ దగు ఖేచరనాథులు రా, నహీంద్రు ల**
**గ్గల గతిఁ గ్రింద రాఁగఁ ద్రిజగద్భరితంబయి త్రోచె వాహినుల్** 17

**అర్థము .** సుర + ఇంద్రుఁడు = దేవేంద్రుఁడు, ఎలమిన్ = ప్రీతితో, కుమారు - ముంగలిన్ = కుమారస్వామి ముందు, రాన్ = రాఁగా, ఉదధి + ఈశ్వరుండు = సముద్రాధిపతి - వరుణుఁడు, పింగలిన్ = వెనుక, నడవన్ =

నడవఁగా, కుబేరుఁడును, కాలుఁడున్ = యముఁడును, ఏర్పడన్ = స్పష్టముగా, పన్ని = సిద్ధపడి, ప్రీతితోన్ = సంతోషముతో, కెలఁకులన్ = పార్శ్వములందు, రాఁగన్, తగు = ఒప్పినట్టి, ఖేచర - నాథులు = గగనచర శ్రేష్ఠులు, మీఁదన్ = పైని - ఆకాశమున, రాన్ = రాఁగా, అహి + ఇంద్రులు = నాగశ్రేష్ఠులు, అర్గల - గతిన్ = పెద్ద అలలవలె, క్రిందన్ = దిగువను, రాఁగన్, వాహినుల్ = సేనలు, త్రి - జగత్ + భరితంబు + అయి = ముల్లోకములు నిండినవయి, త్రోచెన్ = నడచెను

**తాత్పర్యము .** దేవేంద్రుఁడు ప్రీతితోఁ గుమారస్వామిముందు రాఁగా, వరుణుఁడు వెనుక నడవఁగా, కుబేరుఁడును, యముఁడును సిద్ధపడి సంతోషముతో పార్శ్వముల రాఁగా, గగనచరులు ఆకాశమున రాఁగా, నాగశ్రేష్ఠులు పెద్దయలలవలెఁ గ్రింద రాఁగాఁ గుమారస్వామిసేనలు నడచెను

సీ గంధసింధురములు కందంబులుగ మహా
వ్యాళ సమూహముల్ మూలములుగ
నస్త్రశస్త్రానీక మంకురోద్గమముగా
వరకేతుతతి పల్లవములు కాఁగ
చదలంది క్రాలెడు చామరచ్ఛత్రదం
డమ్ములు శాఖాచయమ్ము కాఁగ
మణిభూషణతతి కుట్మలగుచ్ఛములు కాఁగ
వివిధాతపత్రముల్ విరులు కాఁగ

ఆ మానితాప్సరో విమానమాలిక లోలిఁ
బొలయ ఫ్రూనఁ బండుఁగొలలు కాఁగ
బలసి త్రిభువనములుఁ బందిరిగా దేవ
దేవ తనయు వాఁగుఁదీవ వఱచె 18

**అర్థము :** దేవ దేవు - తనయు - వాఁగుఁదీవ = పరమేశ్వరుని కుమారుఁడగు కుమారస్వామి సేన యనుతీఁగ,

గంధ - సింధురములు = మదపుటేనుఁగులు, కందంబులుగన్ = దుంపలుగను, మహత్ (మహా) + వ్యాళ - సమూహముల్ = గొప్పపాముల గుంపులు, మూలములుగన్ = వేరులుగను,

అస్త్ర - శస్త్ర + అనీకము = అస్త్రములయు, శస్త్రములయు సమూహము, అంకుర + ఉద్గమము + కాన్ = మొలకల ఉదయముకాఁగా, వర - కేతు - తతి = మేలయిన టెక్కెముల సమూహము, పల్లవములు - కాఁగన్ = చివురులు కాఁగా,

చదలు + అంది = ఆకాశము నంటి క్రాలెడు = చలించెడు, చామర + ఛత్ర - దండమ్ములు = వింజామరములయు, గొడుగులయు దండములు, శాఖా - చయమ్ము + కాఁగన్ = కొమ్మల సమూహము కాఁగా,

మణి - భూషణ - తతి = రత్నాలంకారముల సమూహము, కుట్మల - గుచ్ఛములు + కాఁగన్ = మొగ్గల గుత్తులు కాఁగా, వివిధ + ఆతపత్రముల్ = వివిధములైన గొడుగులు, విరులు = పువ్వులు, కాఁగన్

మానిత + అప్సరస్ (ః) + విమాన - మాలికలు = గొప్పవియగు అచ్చరల విమానముల వరుసలు, ఓలిన్ = బాగుగా, పొలయన్ = ఒప్పఁగా, భ్రూనన్ = చెట్టునందు, పండుఁగొలలు + కాఁగన్ = పండ్ల గుత్తులు కాఁగా,

బలసి = చుట్టి, త్రిభువనములు = ముల్లోకములు, పందిరి + కాన్, పఱచెన్ = వ్యాపించెను

**తాత్పర్యము** సర్వేశ్వరతనయుఁడగు కుమారస్వామిసేన యను తీఁగ మదపుటేనుఁగులు దుంపలుకాఁగా, గొప్పపాముల గుంపులు వేరులు కాఁగా, అస్త్రశస్త్రముల సమూహము అంకురోదయము కాఁగా, మేలయిన టెక్కెముల సమూహము చివురులు కాఁగా, ఆకాశమంటి చలించు చామరములయు, ఛత్రములయు దండములు కొమ్మల సమూహము కాఁగా, రత్నాలంకారముల సమూహము మొగ్గల గుత్తులు కాఁగా, పలురీతులయిన గొడుగులు పువ్వులు కాఁగా, అప్సరసల విమానమాలికలు చెట్టునందలి పండ్లగుత్తులు కాఁగా చుట్టుకొని ముల్లోకములు పందిరిగా వ్యాపించెను

**విశేషములు .** అలంకారము రూపకము వ్యాళమునకు మూలముతోఁడి సామ్యము కొఱకు పాము అని అర్థము చెప్పఁబడినది చామరచ్ఛత్ర - చామర + ఛత్ర హ్రస్వమునకుఁబరమైన ఛకారమునకు ద్విత్వము వాఁగుఁదీవ - వాఁగు + తీవ 'సమాసంబుల నుదంతంబులగు స్త్రీ సమంబులకుం, బు ంపులకుం బరుష సరళంబులు పరంబులగునపుడు నుగాగమంబగు ' బాల సం 25 వాఁగు + ను + తీవ' ద్రుతకార్యము - బాల సంధి 16,17 వాఁగుఁదీవ

మ ఉరుహేతిప్రకరోల్లసద్ద్యుతులు విద్యుల్లేఖ, లుత్తుంగ సిం
ధురముల్ నీలఘనాఘనంబులు, మహాతూర్యధ్వనుల్ గర్జన
స్వరముల్, భూషణరత్నదీప్తులు మరుచ్చాపంబులై క్రాల భీ
కరమై నిర్జరవాహినుల్ నడచెఁ గ్రొక్కారో యనం బేర్మితోన్ 19

**అర్థము .** ఉరు- హేతి - ప్రకర + ఉల్లసత్ + ద్యుతులు = పెద్దకత్తుల సమూహముయొక్క మిక్కిలి ప్రకాశించుకాంతులు, విద్యుత్ + లేఖలు = మెఱపుఁదీఁగలు, ఉత్తుంగ - సింధురముల్= ఎత్తయిన ఏనుఁగులు, నీల - ఘనా - ఘనంబులు = నల్లని వర్షాకాలపు మేఘములు, మహత్ (మహా) + తూర్య-ధ్వనుల్ = గొప్పపటహాది వాద్యముల ధ్వనులు, గర్జన - స్వరముల్ = ఉఱుముల చప్పుడులు, భూషణ - రత్న - దీప్తులు = అలంకారములందలి మణుల కాంతులు, మరుత్ + చాపంబులు = ఇంద్రధనుస్సులు, ఐ క్రాలన్ = ఒప్పఁగా, భీకరము + ఐ = భయంకరమయి, నిర్జర - వాహినుల్ = దేవతల సేనలు, క్రొక్కారో + అనన్ = (క్రొత్త + కారో ) అనన్ = వర్షాకాలమో యనఁగా, పేర్మితోన్ = గొప్పతనముతో, నడచెన్

**తాత్పర్యము.** పెద్ద ఖడ్గముల ప్రకాశించు కాంతులు మెఱపుఁ దీఁగలును, ఎత్తయిన యేనుఁగులు నల్లని వర్షాకాలపు మేఘములును, గొప్ప పటహాది వాద్యముల ధ్వనులు ఉఱుముల చప్పుడులును, అలంకారములందలి మణుల కాంతులు ఇంద్రధనుస్సులును అయి ఒప్పఁగా భయంకరములయి దేవతల సేనలు వర్షాకాలమో యనఁగా గొప్పతనముతో నడచెను

**విశేషములు .** అలంకారము రూపకానుప్రాణితోత్ప్రేక్ష క్రొక్కారు - క్రొత్త+కారు 'సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు 'బాల సం 36 క్రొ + కారు 'క్రొత్త శబ్దమున కాద్యక్షరశేషంబునకుం గొన్నియెడల నుగాగమంబునుం గొన్నియెడల మీఁది హల్లునకు ద్విత్వంబు నగు ' బాల సం 38 క్రొక్కారు మరుచ్చాపము- మరుత్ + చాపము - సకార తవర్గములకు శవర్ణ చవర్గములతో పూర్వమందైనను పరమందైనను కూడిక గలుగునపుడు క్రమముగా శవర్ణ చవర్గవర్ణము లాదేశమగును

మ తరుగుల్మాదులు పిండి పించుగ, మహాధాత్రీధరిత్రీధరో
త్కరముల్ పెంపఱి నుగ్గునూఁచముగ, నుద్యద్వాహినీ వాహినీ
శ్వర వర్గంబులు దుమ్ముధూళిగఁ, దదాశానాగనాగాళి జ
ర్జరితంబై పడ, దేవసేన నడచెన్ సర్వంసహాసహ్యమై 20

**అర్థము** తరు - గుల్మ + ఆదులు = చెట్లు పొదలు మున్నగునవి, పిండి పించుగన్ = మిక్కిలి నలఁగఁగొట్టఁబడినవిగా, మహత్ (మహా) +ధాత్రీ - ధరిత్రీ ధర + ఉత్కరముల్ = గొప్పభూమియు, పర్వతముల సమూహములును, పెంపు + అటి = గొప్పతనమును గోలుపోయి, నుగ్గునూఁచముగన్ = పొడిపొడిగా, ఉద్యత్ + వాహినీ - వాహినీ + ఈశ్వర - వర్గంబులు = గొప్పనదులయు, సముద్రములయు సమూహములు, దుమ్ము - ధూళిగన్, తద్ + అశా - నాగ - నాగ + ఆళి = ఆ దిగ్గజములయు, పాములయు వరుస, జర్జరితంబు + ఐ = తూఁటులు పడినవయి, పడన్ = పడఁగా, దేవ - సేన = దేవతల సేన, సర్వంసహా + అసహ్యము + ఐ = భూమికి భరింపరానిదయి, నడచెన్

**తాత్పర్యము.** చెట్లు పొదలు మున్నగునవి మిక్కిలి నలఁగఁగొట్టఁబడినవిగా, గొప్ప భూమియు, పర్వతముల సమూహములును పొడిపొడిగా, గొప్ప నదులును, సముద్రముల సమూహములును దుమ్ముదుమ్ముగా, ఆ దిగ్గజములయు, పాములయు వరుస తూఁటులుపడి పడిపోఁగా దేవతల సేన భూమికి దుర్భరమయి నడచెను

చ **బలపదఘట్టనం దెరలి పాంసుమయంబయి భూమి యవ్వియ**
**త్తలమునకోడి పాఱిన విధంబున ధూళి దివంబు నిండె, దో**
**ర్బలమునఁ దత్పతాకిని నభంబునఁ బాఱెడు ధాత్రిఁబట్టి తేఁ**
**గలయఁగఁ జేతులెత్తె ననఁ గప్పె మరుద్గతిఁ గేతనావలుల్** 21

**అర్థము** బల -పద - ఘట్టనన్ = సైనికుల పాదముల త్రొక్కిడిచే, తెరలి = పైకివచ్చి, పాంసు - మయంబు + అయి = దుమ్ముతో నిండినదయి, భూమి, ఆ + వియత్ + తలమునకున్ = ఆ ఆకాశప్రదేశమునకు, ఓడి, పాఱిన - విధంబునన్ = పాఱిపోయిన రీతిగా, ధూళి = దుమ్ము, దివంబు = ఆకాశము, నిండెన్, తద్ + పతాకిని = ఆ సేన, నభంబునన్ = ఆకాశమునందు, పాఱెడు = పరువెత్తునట్టి, ధాత్రిన్ = భూమిని, దోస్ (ః) + బలమునన్ = భుజశక్తిచే, పట్టి, తేన్ = తెచ్చుటకు, కలయఁగన్ = కలయునట్లు, చేతులు, ఎత్తెన్, అనన్, కేతన + ఆవలుల్ = ధ్వజముల వరుసలు,మరుద్గతిన్ = మరుత్ + గతిన్ = వాయుమార్గమును = ఆకాశమును, కప్పెన్

**తాత్పర్యము** సైనికుల పాదముల త్రొక్కిడిచేఁ బైకి లేచిన దుమ్ముతో నిండినదయి భూమి ఆకాశమునకోడిపోయి పాఱిపోయిన విధమున దుమ్ము

ఆకాశమున నిండెను ఆ సేన ఆకాశమునఁ బరువెత్తునట్టి భూమిని దన భుజబలమునఁబట్టి తెచ్చుటకుఁ జేతు లెత్తెనాయనునట్లు ధ్వజసమూహము లాకాశమును గప్పెను

**విశేషములు** అలంకారము ఉత్ప్రేక్ష

క ఉరుబల పదహతి నెగసిన
ధరణీతలభవరజోవితానముపై సు
స్థిరగతి నడచుచుఁ దత్తే
చరులును భూచరులతోడి సరియై రచ్చోన్ 22

**అర్థము** ఉరు - బల - పద - హతిన్ = గొప్పదియగు సేనయొక్క పాదముల దెబ్బచే, ఎగసిన = లేచిన, ధరణీ - తల - భవ - రజస్ (ః) + వితానముపైన్ = భూమినుండి పుట్టిన ధూళి సమూహము మీఁద, తద్ + ఖేచరులును = ఆ గగనచరులును, సుస్థిర - గతిన్ = మంచి నిలుకడగల గమనముతో, నడచుచున్, అచ్చోన్ (ఆ + చోటన్) = అచ్చట, భూచరులతోడి = భూమియందుఁ జరించువారితోడి - మానవులతోడి, సరి + ఐరి = సాటిగలవారయిరి

**తాత్పర్యము** గొప్పదియగు సేన పాదముల త్రొక్కిడిచే లేచిన భూమియందలి ధూళి సమూహముమీఁద ఆ గగనచరులు మంచి నిలుకడగల గమనముతో నడచుచు అచ్చట భూచరులతో - మానవులతో సమానమైరి

**విశేషములు .** అలంకారము అతిశయోక్తి

తే పుడమి నిజసేన కొక్కట నడవ నిమ్మ
చాలదని గుహుఁ డబ్ధులు సమతలముగఁ
గప్పఁబంచె నా బలపదఘట్టనముల
నెగయు కెంధూళి వారాసులేడుఁ గప్పె 23

**అర్థము .** పుడమి = భూమి, నిజ - సేనకున్ = తనసైన్యమునకు, ఒక్కటన్ = ఒక్కసారిగా, నడవన్ = నడచుటకు, ఇమ్ము - చాలదు + అని = చోటు సరిపోదని, గుహుఁడు = కుమారస్వామి, అబ్ధులు = సముద్రములు, సమతలముగన్ = సమప్రదేశముగా - భూతలముగా, కప్పన్ = కప్పునట్లు, పంచెన్ + నాన్ = పంపెనను నట్లు, బల - పద - ఘట్టనములన్ = సైనికుల పాదముల త్రొక్కిడిచే,

ఎగయు = లేచునట్టి, కెంధూళి (కెంపు + ధూళి) = ఎఱ్ఱని దుమ్ము, వారాసులు = సముద్రములు, ఏడున్ = ఏడును, కప్పెన్

**తాత్పర్యము** తన సేన ఒక్కసారిగా నడచుటకు భూమిఁజోటుసరిపోవదని కుమారస్వామి సముద్రములను భూతలమగునట్లు పంపెనాయన సైనికుల పాదముల త్రొక్కిడిచేఁ బైకి లేచిన యెఱ్ఱని దుమ్ము ఏడు సముద్రములను గప్పెను

**విశేషములు.** అలంకారము ఉత్ప్రేక్ష - అతిశయోక్తి కెంధూళి - కెంపు + ధూళి 'సమాసంబునం బ్రాఁతాదుల తొలి యచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగానగు ' బాల సం 36 కె + ధూళి ఇట లుప్తవేషమునకుఁ బరుషముగాక స్థిరము పరమగుచున్నను నుగాగమమగుట విశేషము కె + ను + ధూళి 'వర్గయుక్పరళములు పరములగునపు డొకానొకచో ద్రుతమునకుఁ బూర్ణబిందువును గానంబడియెడి ' బాల సం 19 కెంధూళి

క కరిమద హయ లాలాజల
పరిపూర్ణంబగు పదాతి పద హతి నొగిఁ జె
చ్చెర ధూళి నెగయు భువిఁ బొరిఁ
బొరిఁగొనియెడు ఘర్మయుగము పోరాడు క్రియన్ 24

**అర్థము** భువిన్ = భూమియందు, పొరిఁబొరిన్ = మాటిమాటికి, కొనియెడు = కొనునట్టి, ఘర్మ - యుగము = ఉక్కల జంట - మద స్రావముల జంట, పోరాడు - క్రియన్ = కలహించు విధమున, కరిమద = ఏనుఁగుల మదజలము, హయ - లాలాజల = గుఱ్ఱముల చొంగనీరు - అనువానితో, పరిపూర్ణంబు + అగు = నిండినదగు, పదాతి - పద - హతిన్ = కాల్బంటుల అడుగుల దెబ్బచే, ధూళి = దుమ్ము, ఒగిన్ = లెస్సగా, చెచ్చెరన్ = శీఘ్రముగా, నెగయున్ = ఎగురును

**తాత్పర్యము.** భూమియందు మదస్రావముల జంట ఒకదానితో నొకటి పోరాడుచున్నదా యనునట్లు ఏనుగుల మదజలము, గుఱ్ఱముల లాలాజలము అనువానితో నిండిన కాల్బంటుల పాదముల దెబ్బచే దుమ్ము పైకి లేచును

**విశేషములు.** అలంకార ముత్ప్రేక్ష

చ పుడమి పదాతి వాజి గజ పూరితమై తనరంగ, వానిపై
గొడుగులుఁ బీలి తొంగళులఁ గుంచెలుఁ గ్రిక్కిఱియంగ, వానిపైఁ
బడగలు నోజ రాజిలఁగఁ, బద్మభవాండము నిండి క్రాలఁగా
నడచెఁ గుమారు వాఁగు భువనంబు సమస్తము నొక్కపాయగాన్ 25

**అర్థము** పుడమి = భూమి, పదాతి - వాజి - గజ - పూరితము + ఐ = కాల్బంటులు, గుఱ్ఱములు, ఏనుఁగులు అనువానితో, నిండినదయి, తనరంగన్ = ఒప్పఁగా, వానిపైన్ = ఆ పదాతివాజిగజములమీఁదఁ గ్రమముగా, గొడుగులున్, పీలితొంగళులున్ = నెమలి యీఁకల కుచ్చులును, కుంచెలున్ = కుచ్చెలును, క్రిక్కిఱియంగన్ = నిండఁగా, వానిపైన్ = ఆ గొడుగులు మున్నగువానిమీఁద, పడగలున్ = పతాకములును, ఓజన్ = క్రమముగా, రాజిలఁగన్ = ప్రకాశింపఁగా, పద్మభవ + అండము = బ్రహ్మాండము, నిండి, క్రాలఁగాన్ = ఒప్పఁగా, కుమారు - వాఁగు = కుమారస్వామి సేన,భువనంబు- సమస్తమున్ = లోకమెల్ల, ఒక్కపాయ + కాన్ = ఒకే ఖండముగా నడచెన్

**తాత్పర్యము.** భూమి కాల్బంటులు, గుఱ్ఱములు ఏనుఁగులు అనువానితో నిండి యొప్పఁగా, ఆ పదాత్యాదులపై గొడుగులును, నెమలి యీఁకల కుచ్చులును, నిండఁగను, వానిపైఁ బతాకములును ప్రకాశింపఁగను, బ్రహ్మాండము నిండి ఒప్పఁగాఁ గుమారస్వామి సేన లోకమంతయు నొక్క ఖండముగా నడచెను

**విశేషములు.** అలంకారము అతిశయోక్తి, ఉత్ప్రేక్ష

క అన్నుల తిన్నని నవ్వులఁ
బ్రన్నిన ముఖచంద్రరుచులు పర్వఁగఁ దమపై
వెన్నెలఁ బయనము నడచిన
చెన్నున సుఖలీల నమరసేనలు నడచెన్ 26

**అర్థము .** అన్నుల = స్త్రీలయొక్క, తిన్నని = మనోజ్ఞములైన, నవ్వులన్ =నవ్వులచేత, ప్రన్నిన =ప్రన్నని? = అందమైన, ముఖ - చంద్ర - రుచులు = చంద్రునివంటి ముఖములయొక్క కాంతులు, తమపైన్, పర్వఁగన్ = వ్యాపింపఁగా, అమర - సేనలు = దేవతల సైన్యములు, వెన్నెలన్ = వెన్నెలయందు, పయనము - నడచిన - చెన్నునన్ = ప్రయాణమై నడచిన విధమున, సుఖ -లీలన్ = సుఖముగా, నడచెన్

**తాత్పర్యము** స్త్రీల మనోజ్ఞములైన నవ్వులచే సుందరములయిన ముఖ చంద్రకాంతులు తమపైఁ బ్రసరింపఁగా, దేవతల సైన్యములు వెన్నెలయందుఁ బయనించుచు నడచిన విధమున సుఖముగా నడచెను

**విశేషములు** అలంకారము ఉత్ప్రేక్ష

సీ **భాషామృతంబులఁ బతుల చేతోభూమి**
**ననురాగబీజంబు లంకురింప**
**వదనేందుదీప్తుల వరుల మనోగత**
**స్నేహరసాబ్ధులు నిట్టగ్రమ్మ**
**రుచిరారుణాధరరుచుల నాత్మేశుల**
**హృత్ప్రణయాబ్జంబు లెలమి నమర**
**నిశ్వాసదక్షిణానిలములఁ బ్రియచిత్త**
**గత మోహలత తిలకితము గాఁగ**

ఆ **ఘనపథశ్రమాంబుకణతతి రెట్టించె**
**ననఁగ భావసురతజనితఘర్మ**
**జలము వల్లభాంగముల నొప్ప నమరీ స**
**మేత మమరసేన ప్రీతి నడచె** 27

**అర్థము** · భాషా + అమృతంబులన్ = వాక్కులనెడి అమృతములతో, పతుల = భర్తలయొక్క, చేతస్(ః) +భూమిన్ = మనస్సనెడి భూమియందు, అనురాగ - బీజంబులు = ప్రేమమనెడి విత్తనములు, అంకురింపన్ = మొలకలెత్తఁగను,

వదన + ఇందు - దీప్తులన్ = ముఖములనెడు చంద్రుల కాంతులచే,వరుల = భర్తలయొక్క మనస్(ః) + గత - స్నేహ - రస + అబ్ధులు = మనస్సునందలి ప్రేమరసమనెడి సముద్రములు, నిట్ట + క్రమ్మన్ = ఉప్పొంగఁగను

రుచిర + అరుణ + అధర - రుచులన్ = మనోహరములయిన ఎఱ్ఱని పెదవుల కాంతులచే, ఆత్మ + ఈశుల = తమ భర్తల, హృద్ + ప్రణయ + అబ్జంబులు = హృదయములందలి ప్రేమములనెడి తామరలు, ఎలమిన్ = వికాసముతో, అమరన్ = ఒప్పఁగను

నిశ్వాస - దక్షిణ + అనిలములన్ - ఊర్పులనెడి దక్షిణపు గాలులచే, ప్రియ - చిత్త - గత - మోహ - లత = భర్తలయొక్క మనస్సులను బొందిన వలపనెడి తీఁగ, తిలకితము + కాఁగన్= పుష్పింపఁగను

ఘన - పథశ్రమ + అంబు -కణ - తతి = గొప్పదియగు మార్గాయాసము వలని చెమటబిందువుల సమూహము, రెట్టించెన్ + అనఁగన్ = రెట్టింపాయెననఁగా, భావ - సురత - జనిత - ఘర్మ - జలము = మానసికమైన రతివలనఁబుట్టిన చెమటనీరు, వల్లభ + అంగములన్ = భర్తల శరీరములందు, ఒప్పన్ = ఒప్పఁగా, అమరీ - సమేతము = దేవతాస్త్రీలతోఁ గూడినది అగు, అమర - సేన = దేవసేన, ప్రీతితోన్ = సంతోషముతో, నడచెన్

**తాత్పర్యము** వాక్కులనెడి అమృతములచే భర్తల మనస్సులనెడి భూమియందు ప్రేమబీజములు మొలకలెత్తఁగను, ముఖములనెడి చంద్రుల కాంతులచే భర్తల మనస్సులందలి ప్రేమరసమనెడి సముద్రము లుప్పొంగఁగను మనోహరములయిన యెఱ్ఱనిపెదవుల కాంతులచేఁ దమ భర్తల హృదయములందలి ప్రేమములనెడి తామరలు వికాసముతో నొప్పఁగను, ఊర్పులనెడి దక్షిణపు గాలులచే భర్తల మనోగతమైన వలపుఁదీఁగ తిలకితము కాఁగను, అధిక మార్గాయాసము వలని చెమటబిందువుల సమూహము రెట్టింపాయెననఁగా మానసికమైన రతి వలనఁ బుట్టిన చెమటనీరు భర్తల శరీరములందు ఒప్పఁగా దేవతాస్త్రీలతోఁగూడిన దేవసేన ప్రీతితో నడచెను

**విశేషములు** అలంకారము రూపకము, ఉత్ప్రేక్ష

**క** **ఈ విధమున నుత్సాహము**
**తో వచ్చి సురారిదూత తొలి చెప్పిన యు**
**ద్ధావనిఁ గైకొని విడిసెను**
**దేవపతాకిని మహానదీతీరమునన్** **28**

**అర్థము.** ఈ - విధమునన్, దేవ - పతాకిని = దేవసేన, ఉత్సాహముతోన్, వచ్చి, సుర+ అరి - దూత = రాక్షసుల రాయబారి, తొలి - చెప్పిన = మునుపుచెప్పిన, యుద్ధ + అవనిన్ = యుద్ధభూమిని, కైకొని = అంగీకరించి, మహానదీ - తీరమునన్ = గొప్పనదియొడ్డున, విడిసెను

**తాత్పర్యము** ఈ రీతిగా దేవసేన ఉత్సాహముతో వచ్చి రాక్షసదూత పూర్వము చెప్పిన యుద్ధభూమి నంగీకరించి మహానది తీరమున విడిసెను

వ తదవసరంబున - తరువాతి పద్యముతో నన్వయము 29

సీ వాహనంబులు డిగ్గువారును, బన్నులు
విడుచువారును, దమ వీళు లెఱుఁగఁ
దమతమ చిహ్నముల్ దనరఁగఁ బట్టించు
వారు, నొండొరుఁ బిల్చువారుఁ, జెలఁగి
గుళ్ల మండియలును గూడారములును బం
దిళ్లను గలయ నెత్తించువారు,
మడుగుల పొందుల మ్రాఁకుల నీడల
వెరవులఁ గనికని విడియువారుఁ,

తే బిఱుఁదఁ జిక్కినవారలఁ బిలువఁబోవు
వారు, నెడఁగని తోడ్కొని వచ్చువారు
వీళు లెఱుఁగక దెస దప్పి వెదకువారు,
నెఱిఁగి తమతమ వీళ్లకు నేఁగువారు 30

**అర్థము** వాహనంబులు, డిగ్గు - వారును = దిగువారును, పన్నులు = ఎక్కుటకు సిద్ధము చేయునప్పటి రథాశ్వాదుల సవరణలు, విడుచువారును, తమ - వీళులు = తమ విడుదులు, ఎఱుఁగన్ = ఎఱుఁగుటకు, తమ - తమ, చిహ్నముల్ = గుఱుతులు, తనరఁగన్ = ఒప్పునట్లు, పట్టించువారున్

ఒండొరున్ = ఒకరి నొకరు, పిల్చువారున్, చెలఁగి= ఒప్పి, గుళ్ళు = ఒక విధమైన గుడారములు, మండియలును = దుకాణమునకై వేసిన పాకలును, గూడారములును = గుడారములును, పందిళ్లను, కలయన్ = అంతటను, ఎత్తించువారున్ = వేయించువారును

మడుఁగుల - పొందులన్ = చెఱువులుండుచోట్లను, మ్రాఁకుల - నీడలన్ = చెట్ల నీడలందును, వెరవులన్ = అనుకూల్యములను, కనికని, విడియువారున్

పిఱుఁదన్ = వెనుక, చిక్కినవారలన్ = ఉండిపోయిన వారిని, పిలువన్ + పోవు - వారున్ = పిలుచుటకుఁ బోవువారును, ఎడన్ + కని = సమయము చూచి,

తోడ్కొని - వచ్చువారున్ = తీసికొని వచ్చువారును, వీళులు = శిబిరములు, ఎఱుఁగక = తెలియక, దెస + తప్పి = తప్పిపోయి, వెదకువారున్, ఎఱిఁగి, తమతమ వీళ్లకున్, ఏఁగువారున్ = పోవువారును

**తాత్పర్యము** . ఆ సైనికులలోఁ గొంతమంది వాహనములనుండి దిగుచుండిరి కొందఱు ఏధాశ్వాదుల పవరణలు విడుచుచుండిరి తమ శిబిరములను గుఱుతించుటకై కొందఱు తమ తమ చిహ్నములను ఒట్టించుచుండిరి కొందఱు ఒకరి నొకరు పిలుచుచుండిరి గుడులు, మండియలు, గుడారములు, పందిరులు అంతటను వేయించువారు కొందఱు చెఱువులుండుచోటులను చెట్ల నీడలను వీలు చూచుకొని కొందఱు విడియుచుండిరి వెనుకఁబడినవారిని బిలుచుటకుఁ బోవువారు కొందఱు సమయము చూచి తీసికొని వచ్చువారు కొందఱు తమ శిబిరములు తెలియక తప్పిపోయి వెదకువారు కొందఱు ఎఱిఁగి తమతమ శిబిరముల కరుగువారు కొందఱును - తరువాతి వచనముతో నన్వయము

**వ అగుచు నవనీతలంబున నాకంబుఁ గట్టినట్లు నెరసి గ్రిక్కిఱిసి విడిసి నిజేచ్ఛావిహారు లగుచుండి రట్టి యవసరంబున 31**

**అర్థము** అగుచున్, అవనీ - తలంబునన్ = భూతలమునందు, నాకంబున్ = స్వర్గమును, కట్టిన + అట్లు = నిర్మించిన విధమున, నెరసి = వ్యాపించి, క్రిక్కిఱిసి, విడిసి, నిజ + ఇచ్ఛా - విహారులు = తమ యిష్టము వచ్చినట్లు విహరించువారు, అగుచున్ + ఉండిరి, అట్టి + అవసరంబునన్ = అట్టి సమయమున

**తాత్పర్యము**. అగుచు భూతలమునందు స్వర్గమును నిర్మించిన విధమున వ్యాపించి, క్రిక్కిఱిసి, విడిసి, స్వేచ్ఛగా విహరించుచుండిరి ఆ సమయమునందు - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు :** అలంకార ముత్ప్రేక్ష

## సూర్యాస్తమయము

**క శివుతనయు బల పదాహతిఁ**
**గవిసిన మెయి ధూళి పోవఁగడిగికొనంగాఁ**
**దివిరిచను కరణి నిజమతి**
**రవి రయమునఁ బశ్చిమాంబురాశికిఁ జనియెన్ 32**

**అర్థము**. శివు - తనయు - బల - పద + ఆహతిన్ = ఈశ్వరుని కొడుకగు కుమారస్వామి యొక్క సైన్యముయొక్క పాదముల త్రొక్కిడిచే, కవిసిన =

క్రమ్మిన, మెయి - ధూళి = మేని దుమ్ము, పోవన్ = పోవునట్లు, కడిగికొనంగాన్ = కడిగికొనుటకై, నిజ-మతిన్ = తన మనస్సుతో, తివిరి = పూని, చను - కరణిన్ = పోవు విధమున, రవి = సూర్యుఁడు, రయమునన్ = శీఘ్రముగా, పశ్చిమ + అంబురాశికిన్ =పడమటి సముద్రమునకు, చనియెన్ = ఏఁగెను

**తాత్పర్యము** కుమారస్వామి సైన్యమునందలి సైనికుల కాలి త్రొక్కిడిచేఁ గ్రమ్మిన మేనిదుమ్మును బోవఁగడిగికొనుతలఁపుతో పూనిపోవు విధమున సూర్యుఁడు శీఘ్రముగాఁబడమటి సంద్రమున కేఁగెను

**విశేషములు .** మా రా కవి గారి ప్రతిలోను, వావిళ్ల వారి ప్రతిలోను గల 'నిజమతి' అను పాఠము సా అ ప్రతిలోని 'నిజగతి' అను పాఠముకంటె అన్వయయోగ్యముగా నుండుటచే నది గ్రహింపఁబడినది అలంకార ముత్ప్రేక్ష

**వ అంత ననంతశయన సురాధీశ్వర దిగధీశ్వరాది భువనభవనాధీశ్వరులు తారకప్రభ నగ్గలించి వెలుంగు చంద్రప్రభాపటలంబులుం బోలెఁ గరదీపికా సహస్రంబుల నగ్గలించి మణిగణ భూషణ భూషితాంగప్రభా పటలంబులు వెలుంగు ననంత మండలిక మహాసామంత దండనాయకామాత్య భృత్యాద్యఖిజన పరివృతులై రత్నాభరణంబుల మధ్యస్థితనాయకరత్నంబులునుం బోలె నిజైశ్వర్యప్రభావంబులం దేజరిలి తమ వేలంబులం బేరోలగంబుండి రట్టియవసరంబున సుభట కటకంబులం దంత వీర పురుషులు నిజాధీశ్వరులకు నుత్సాహంబుగా మహోత్సాహంబులు పలుక నభిముఖులై సభాక్షోభంబు వారించి 33**

**అర్థము .** అంతన్, అనంతశయన - సుర + అధి + ఈశ్వర - దిశ్ (క్) అధి + ఈశ్వర + ఆది - భువన - భవన + అధి + ఈశ్వరులు = విష్ణువు, దేవేంద్రుఁడు, దిక్పాలురు మున్నగు లోకములనెడి యిండ్ల అధిపతులు, తారక - ప్రభన్ = నక్షత్రముల కాంతిచే, అగ్గలించి = అతిశయించి, వెలుంగు = ప్రకాశించునట్టి, చంద్ర - ప్రభా - పటలంబులన్ + పోలెన్ = చంద్రకాంతుల సమూహములవలె, కర - దీపికా - సహస్రంబులన్ = చేతి దివ్వెల వేలచే, అగ్గలించి = అధికమయి, మణి - గణ - భూషిత + అంగ - ప్రభా - పటలంబులు = రత్నముల సమూహముచే నలంకరింపఁబడిన మేని కాంతులు ప్రకాశించు, అనంత - మండలిక - మహాసామంత - దండనాయక + అమాత్య - భృత్య + ఆది - అఖిల - జన - పరివృతులు + ఐ = పెక్కండ్రు మండలాధీశులు, మహాసామంతులు,

సేనాధిపతులు, మంత్రులు, సేవకులు మున్నగునెల్లజనులచేఁ జుట్టఁబడినవారయి, రత్న + ఆభరణంబులన్ = రత్నాలంకారములందు, మధ్య - స్థిత - నాయక రత్నంబులునున్ + పోలెన్ = నడుమనున్న నాయకమణుల విధమున, నిజ + ఐశ్వర్య - ప్రభావంబులన్ = తమ సంపదల గొప్పతనములచే తేజరిల్లి = ప్రకాశించి, తమ - వేలంబులన్ = తమ శిబిరములందు, పేరు + ఓలగంబు + ఉండిరి = నిండుసభఁదీర్చిరి, అట్టి + అవసరంబునన్ = ఆ సమయమునందు, సుభట - కటకంబులందున్ = మంచి వీరుల శిబిరములందు, అంతన్, వీర - పురుషులు, నిజ + అధి + ఈశ్వరులకున్ = తమ నాయకులకు, ఉత్సాహంబు + కాన్ = ఉత్సాహము గలుగునట్లు, మహత్ (మహో) + ఉత్సాహంబులు = గొప్పఉత్సాహవాక్యములు, పలుకన్ = పలుకుటకు, అభిముఖులు + ఐ = అభిముఖులయి, సభాక్షోభంబు = సభయందలి కలకలమును, వారించి = ఆఁపి

**తాత్పర్యము** అంత విష్ణువు, దేవేంద్రుఁడు దిక్పాలురు మున్నగు జగత్ప్రభువులు నక్షత్రముల కాంతి నతిశయించిరి ప్రకాశించు చంద్రకాంతుల సమూహములవలె వేలకొలఁది చేతిదివ్వెలచే నధికమయి రత్నసముదాయము తోడి అలంకారములచేత నంకరింపఁబడిన శరీరముల కాంతిపుంజములు వెలుఁగు పెక్కుఁరు మండలాధిపతులు, మహాసామంతులు, సేనాధిపతులు మంత్రులు, సేవకులు మున్నగు నెల్లవారిచేఁ జుట్టఁబడినవారయి మణిమయ భూషణముల నడుమనున్న నాయకమణులవలెఁ దమమైశ్వర్యమహిమలతోఁ బ్రకాశించి, తమ శిబిరములందు నిండుసభ దీర్చిరి అట్టి సమయమున సద్భటుల శిబిరములందు వీరపురుషులు తమ ప్రభువులకు ఉత్సాహము అగునట్లు మహోత్సాహవాక్యములు పలుకుట కున్ముఖులై సభ కలకలమును ఆఁపి - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** అలంకార ముపమ

**కుమారస్వామి సేనయందలి వీరుల యుత్సాహవాక్యములు**

భర్గుం డంతక వాహినుల్ శరహతిన్ భంజించునే ట్లమ్మెయిన్
దర్గంగా రథపత్రముల్, విఱుగ వేదండాంకురానీకముల్,
నుర్గాడన్ భట కోరకంబు, లలరన్ నూత్నాశ్వపుష్పౌఘముల్
మర్గింతున్ బరసైన్యపద్మవనముల్ మద్బాణవర్షంబునన్ 34

**అర్థము .** భర్గుండు - శివుఁడు, అంతక - వాహినుల్ = యముని సేనలను, శర - హతిన్ = బాణముల దెబ్బచే, భంజించు + అట్లు = సంహరించు

విధమున, - వాహిని యనఁగా నది, శర = జలముల, హతిచే = నాశనముచే, ఖండింపఁబడు నను స్వారస్యమును గ్రహించునది అమ్మెయిన్ = ఆ + మెయిన్ = ఆ రీతిగా, రథ - పత్రముల్ = రథము లనెడి ఆకులు, తర్గంగాన్ = తఱుఁగఁగా, వేదండ + అంకుర + అనీకముల్ = ఏనుఁగులనెడి మొలకల సమూహములు, విఱుగన్ =విఱుగఁగా, భట - కోరకంబులు = భటులనెడి మొగ్గలు, నుర్గాడన్ = నుగ్గాడఁగా - నుగ్గుకాఁగా, నూత్న + అశ్వ - పుష్ప + ఓఘముల్ = క్రొత్తవియగు గుఱ్ఱములనెడి పూల సమూహములు, అలరన్, విరియఁగా, - విచ్చిపోఁగా, మత్ + బాణ - వర్షంబునన్ = నా బాణములనెడి వర్షముచే, పర - సైన్య - పద్మ - వనముల్ = శత్రువుల సైన్యములనెడి తామరతోఁపులను, మర్గింతున్ = మ్రగ్గింతును - నశింపఁజేయుదును

**తాత్పర్యము** శివుఁడు యముని సైన్యములను బాణముల దెబ్బచే నశింపఁజేయునట్లు రథములనెడి ఆకులను దఱుగఁగా, ఏనుఁగులనెడి మొక్కల గుంపులు విఱుగఁగా, భటులనెడి మొగ్గలు నూగు కాఁగా, నూత్నాశ్వము లనెడి పూలు విరియఁగా నా బాణము లనెడి వర్షముచే శత్రుసైన్యములనెడి తామరతోఁపులను మ్రగ్గింతును

**విశేషములు** అలంకారము రూపకము వేదండ - వేద +అండ - సామవేదమునుండి పుట్టినది - ఏనుఁగు ఇది శకంధ్వాదుల లోనిది పరరూపసంధి 'వేద' లోని చివరియచ్చు లోపించును తర్గు - తఱుగు, - నుర్గు - నుగ్గు మర్గింతున్ - మ్రగ్గింతున్ - వర్ణవ్యత్యయము వలపలగిలకవ్రాఁత సంప్రదాయముచే భర్గుండు - భగ్గుండు, తర్గంగా - తగ్గంగా మాఱి కేవల ద్విత్వ గకారముతోఁగూడిన 'నుగ్గాడన్', మ్రగ్గింతు' అనువానితోఁ బ్రాసమైతి కుదిరినది ఇట్టి ప్రాసము శివకవి సాంప్రదాయికము పాల్కుఱికి సోమనాథాదులు దీనిని బ్రయోగించిరి పుష్పౌఘ - పుష్ప + ఓఘ - వృద్ధి సంధి

మ మదనాగంబులు చేతులెత్తి పఱవన్, మార్వెట్టి కాపన్నులై
యెదురం గాల్కొని నిల్వ కుక్కడఁగి వెన్నీఁ గాల్వు రుగ్రాశ్వికుల్
బెదరంగా, రథికుల్ విభిన్నమతి మద్భీతాత్ములై క్రమ్మఱన్
గుదియింతుం బరసేన నొక్కమెయి మత్కుంతాహతిం బోరిలోన్ 35

**అర్థము.** మద - నాగంబులు = మదించిన యేనుఁగులు, చేతులు + ఎత్తి, తొండములు పయికెత్తి, పఱవన్ = పరువులెత్తఁగా, కాల్వురు = కాలిబంటులు,

మార్కొట్టక = ప్రతిఘటించక, ఆపన్నులు + ఐ = ఆపద నొందినవారయి, కాల్కోని = కాలు + కొని = కాలూని, ఎదురన్ = మార్కొనుటకు, నిల్వక = నిలువక, ఉక్కు + అడఁగి = బలము నశించి, వెన్నిన్ - వెన్ను+ ఈన్ = వెన్నీఁగా - వెన్ను చూపఁగా, ఉగ్ర + ఆశ్వికుల్ = భయంకరులైన రౌతులు, బెదరంగాన్ = భయపడఁగా, రధికుల్ = రధమునందుండి యుద్ధము చేయువారు, విభిన్నమతిన్ = విఱిగిన మనస్సుతో - ధైర్యమును గోలుపోయి, మత్ + భీత + ఆత్ములు + ఐ = నావలన భయపడినవారయి, క్రమ్మఱన్ = మరలిపోఁగా, పర - సేనన్ = శత్రుసేనను, పోరిలోన్ = యుద్ధములో, మత్ + కుంత + ఆహతిన్ = నా బల్లెపు దెబ్బచే, ఒక్క మెయిన్ = ఒక్క విధముగా, ఒక్కమాఱుగా, కుదియింతున్ = అణఁచివైతును

**తాత్పర్యము** మదగజములు తొండములెత్తుకొని పరువులిడఁగా కాల్బంటులు ప్రతిఘటింపక ఆపదనొందినవారయి కాలూని యెదిరింప నిలువక బలముచెడి వెన్నుచూపఁగా భయంకరులైన ఆశ్వికులు బెదరఁగా, రధికులు ధైర్యమును గోలుపోయి నా వలన భయపడినవారయి మరలిపోఁగా, నేను యుద్ధములో నా కుంతాయుధపు దెబ్బచే నొక్కపెట్టున శత్రుసేనను అణఁచివైతును

క తల లెన్ని యరయుచుం బ్రతి
బల మంతయు మగ్గి బయలుపడఁ బొలికల న
గ్గలముగ జీరము నుఱిపిన
కల మున్నట్లుండఁ బొడుతుఁ గడికండలుగాన్ 36

**అర్థము :** తలలు, ఎన్ని =లెక్కించి, అరయుచున్ = చూచుచు, ప్రతి - బలము + అంతయున్ = శత్రుసేన యంతయును, మగ్గి = మ్రగ్గి, పొలికలను = యుద్ధబూమి, అగ్గలముగన్ = అధికముగా, జీరమున్ + ఉఱిపిన -కలన్ =కత్తితో ఖండించిన విధమున, బయలు + పడన్ = కనఁబడఁగా, ఉన్న + అట్లు + ఉండన్ = ఒక్కసారిగా, కడికండలు + కాన్ = ముక్కలు ముక్కలుగా, పొడుతున్

**తాత్పర్యము.** శత్రుసైన్యమున నున్న వీరులను లెక్కించి వా రందఱును మ్రగ్గి యుద్ధభూమి కత్తితో ఖండించిన విధమునఁ గనఁబడ నున్నటులుండఁగా ముక్కలుముక్కలుగాఁ బొడుతును

**విశేషములు :** జీరము నుఱిపిన కలన్ = కత్తితో ఖండించిన విధమున - 'జడంబు తృతీయాసప్తములకు ద్వితీయ బహుళంబుగానగు ' బాల కార్గక 22 కాని జీరము ఉదంతమగుటచే దాని తృతీయకు ద్వితీయ బహుత్వమందె

కావలయును 'బాహుళకముచే నిక్కార్యం బుదంతంబునకు బహుత్వమందె యగు కాని యిట ఏకవచనముననే యగుట విశేషము ఉఋపు ధాతువుగూడ సూనిలో లేదు కల = విధము?

తే పోరఁ బాఁ కుదల్చి నీరు గొన్నట్లు ప్రతి
బలము నెల్లఁ బాయవడఁగఁ దోలి
గొడుగు క్రింది రూపుఁ బొడిచి జయంబు నీ
కిత్తు నధిప! నన్ను నింత నమ్ము 37

**అర్థము** .అధిప = ప్రభూ! పోరన్ = యుద్ధమునందు, పాఁకున్ = నాఁచును, ఉదల్చి = విడిచి, నీరు + కొన్న + అటు = నీటిని గ్రహించినట్లు, ప్రతి - బలమున్ + ఎల్లన్ = శత్రుసైన్యమునంతను, పాయ + పడఁగన్ = విచ్చిపోవునట్లు, తోలి, గొడుగు - క్రింది - రూపున్ = గొడుగు క్రింద నున్నవానిని - సేనాపతిని, పొడిచి, జయంబున్ = గెలుపును, నీకున్, ఇత్తున్, నన్నున్, ఇంత, నమ్ము = నమ్ముము

**తాత్పర్యము** ప్రభూ! యుద్ధమున నాఁచును వదలి నీటిని గొనిన విధమున శత్రుసైన్యమంతయు విచ్చిపోవునట్లు తోలి, సేనాపతిని వధించి నీకు జయమును గూర్తును నన్ను ఇంత నమ్ముము

**విశేషములు** గొడుగు క్రింది రూపు - గొడుగును ధరించుట జయ చిహ్నము గొడుగు క్రింది వాఁడు - సేనాపతి నమ్ము - నమ్ముము - 'మధ్యమపురుష మువర్ణకంబునకు హలవపానంబులు పరంబులగునపుడు లోపము విభాష నగు ' బాల సంధి 47

ఈ పద్యము శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి సంస్కరణము ననుసరించి వ్యాఖ్యానింపఁబడినది 'శైవలం కిల విహాయ నిర్మలం కేవలం కిల జలం ను పీయతే' అను యోగవాసిష్ఠశ్లోకము ననుసరించినది

చ అలఘువిరోధిసైన్యవిపులాబ్ధి మహత్పరిఘాగ్రమందరా
చలవృతమద్భుజాహిపతి సంతతనిర్మథనప్రభూత స
ల్లలిత విభాతి నాజి జయలక్ష్మి నిజంబుగ నీకు నిత్తు దో
ర్బలమున నింత నమ్ముమని వల్కె భటుం డొకరుండు దండియై 38

**అర్థము.** అలఘు - విరోధి - సైన్య - విపుల + అబ్ధిన్ = తక్కువ కాని, శత్రుసైన్యమనెడి మహా సముద్రమును, మహత్ + పరిఘా + అగ్ర - మందర + అచల - వృత - మత్ + భుజ + అహి-పతిన్ = గొప్పదియగు, ఇనుపగుదియ యొక్క కొన అనెడి మందరపర్వతమును జుట్టుకొన్న నా భుజ మనెడి సర్పరాజుతో - వాసుకితో, సంతత - నిర్మథన - ప్రభూత - పల్లలిత - విభాతిన్= ఎడతెగని త్రచ్చుట వలనఁ బుట్టిన మనోహరమైన విశేషకాంతి గలదానిని, ఆజి - జయ - లక్ష్మిన్ = యుద్ధజయమనెడి లక్ష్మిని, దోస్ (:) + బలమునన్ = భుజశక్తిచే, నిజంబుగన్, నీకున్, ఇత్తున్, ఇంత, నమ్ముము, అని, భటుండు, ఒకరుండు, దండి+ఐ = శూరుఁడయి, పల్కెన్

**తాత్పర్యము.** 'అధికమైన శత్రుసైన్యమనెడి మహాసముద్రమును గొప్ప పరిఘాయుధపుఁగొన యనుమందరపర్వతమును జుట్టుకొన్న నా భుజమనెడి వాసుకితో నిరంతరము మథించుటవలనఁ బుట్టిన విశేషకాంతిగల యుద్ధజయమనెడి లక్ష్మిని నిజముగా నా భుజశక్తిచే నీకుఁ గూర్తును నమ్ము' మని యొక భటుఁడు శూరుఁడయి పలికెను

**విశేషములు.** అలంకారము రూపకము దోర్బలము - దోస్ + బలము - పదాంత సకారమునకు విసర్గము దోః + బలము - అ, ఆలు తప్ప మిగిలిన అచ్చుల తరువాత వచ్చు విసర్గమునకు అచ్చులుగాని మృదుహల్లులుగాని పరములగునపుడు రేఫ మాదేశమగును అమృతముకొఱకు దేవదానవులు క్షీరసముద్రమును మందరపర్వతమును గవ్వముగాఁజేసికొని మథింపఁగా నందుండి లక్ష్మి యుద్భవించిన వృత్తాంత మిట అనుసంధేయము

**క.** **మాటల యట్టిది యగునే**
**పో టను లోకంబు పలుకు బొంకించెద నే**
**మాటలకంటెను నని నా**
**పో టగ్గల మింత నమ్ము భూభుజ నన్నున్** **39**

**అర్థము.** భూ - భుజ = ఓ రాజా!, పోటు = దెబ్బ, మాటల + అట్టి + అది + అగునే = మాటలవంటిది యగునా? అను, లోకంబు - పలుకు = లోకోక్తిని, ఏన్ = నేను, బొంకించెదన్ = అసత్యము గావింతును, అనిన్ = యుద్ధమునందు, మాటలకంటెను, నా -పోటు, అగ్గలము = అధికము, నన్నున్ , ఇంత, నమ్ము(ము)

**తాత్పర్యము** ఓ రాజా ! పోటు మాటలవంటిది కాదు అను లోకములోని మాటను నే నసత్యము గావింతును యుద్ధమున నా పోటు మాటలకంటెను అధికము నన్ను ఇంత నమ్ముము

**విశేషములు.** అట్టిది - అట్టి + అది = 'అది యవి' శబ్దంబుల యత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగ నగు బాలసం 45 నమ్ము భూభుజ - హల్లుపరమగుచుండఁగా మధ్యమపురుష మువర్ణకమునకు లోపము బాల సంధి 47

సీ కనుచూడ్కిఁ దునియలుగా నేయు విలుకానిఁ
గవిదలఁ బడవైచు సవడికానిఁ
గొని మిట్టిపడవైచు కొంతంబుకాని బి
ట్టెడ లుచ్చిపోవైచు నీఁటెకానిఁ
గడిఖండముగఁ జేయు గడితలవాని జ
ర్జరితంబుగాఁ బొడ్చు చురియవాని
నెంప నుర్వుడుసేయు నేనికకాని ము
క్కోయ్యలు వడ వ్రయ్యుగుంటుకాని

ఆ మిగుల నిన్ను నన్ను మిగులుదు మనువారి
మిగిలి మాఱు వీట మిగిలి వచ్చు
మగల నెల్ల నేను మగిడింతు నెక్కటి
వీరుఁ డనఁగ రెండు వీళ్లయందు 40

**అర్థము.** కనుచూడ్కిన్ = కంటిచూపుతో, తునియలు + కాన్ = ముక్కలుగా, ఏయు = కొట్టునట్టి, విలుకానిన్, కవిదలన్ = తాఁకుచే, పడన్ + వైచు = పడవేయునట్టి, సవడి - కానిన్ = సవడి అను ఆయుధవిశేషముగలవానిని

కొని = పట్టుకొని, మిట్టిపడన్+ వైచు = ఎగిరిపడఁగొట్టునట్టి, కొంతంబుకానిన్ = కుంతమనెడి ఆయుధముగలవానిని, బిట్టు = శీఘ్రముగా, ఎడలు + ఉచ్చి - పోన్ + వైచు = గుండెలు దూసికొనిపోవఁగొట్టు, ఈఁటెకానిన్ = ఈఁటెగలవానిని,

కడిఖండముగన్ = ముక్కలు ముక్కలుగాఁ జేయు, గడితలవానిన్ = పొడిచెడు నాయుధవిశేషముగలవానిని, జర్జరితంబు + కాన్ = తూఁటులు పడునట్టులుగా, పొడ్చు = పొడుచునట్టి, చురియకానిన్ = చురకత్తి గలవానిని

ఎంపన్ + ఉర్పుడు + చేయు = ఎముకను పిండిగొట్టునట్టి, ఏనిక కానిన్= ఏనిక అనునాయుధవిశేషముగలవానిని, ముక్కోయ్యలు + పడన్ = మూఁడుముక్కలగునట్లు, వ్రయ్యు = చీల్చునట్టి, గుంటుకానిన్ = గుంటు అనునాయుధమును దాల్చిన వానిని

మిగులన్ = అతిశయించునట్లు నిన్నున్, నన్నున్, మిగులుదుము = అతిశయింతుము, అనువారిన్, మిగిలి = అతిశయించి, మాఱు - వీటన్ =శత్రు శిబిరమునందు, మిగిలి - వచ్చు = అతిశయించివచ్చునట్టి, మగలన్ + ఎల్లన్ = శూరులనందఱను, నేను, రెండు - వీళ్లయందున్ = రెండు శిబిరములందును, ఎక్కటి వీరుఁడు + అనఁగన్ = అసహాయశూరుఁడనునట్లు, మగిడింతున్ = మరలింతును

**తాత్పర్యము.** కంటిచూపుతోనే ముక్కలుగా నేయు విలుకానిని, తాఁకుచేఁ బడఁగొట్టు సవడి అను ఆయుధము గలవానిని, పట్టుకొని యెగిరిపడవైచు కుంతాయుధము గలవానిని, శీఘ్రముగా గుండెలు దూసికొని పోవునట్లు కొట్టు ఈఁటె గలవానిని, ముక్కలు ముక్కలుగాఁ జేయు గడితల అను నాయుధభేదము గలవానిని, తూఁటులుపడునట్లు పొడుచు చురకత్తి గలవానిని, ఎముకలను బిండిగొట్టు ఏనిక అను ఆయుధవిశేషము గలవానిని, మూఁడుముక్కలగునట్లు చీల్చు గుంటు అను ఆయుధము గలవానిని, అతిశయింప నిన్నును నన్నును అతిశయింతు మనువారి నతిశయించి, శత్రుశిబిరమున నతిశయించి వచ్చు శూరుల నందఱను రెండు శిబిరములందును అసహాయశూరుఁడనునట్లు నేను మరలింతును

**వ అని యనేకప్రకారంబులం బలుకుచుండి రంత నందుఁ గొందఱు వీరభటోత్తము లాత్మీయాంతరంగాపూరితాపారవీరరసంబు వెల్లిగొలుపునట్లు వీరఘోషంబునఁ దమతమ నిశ్చయించిన వీరవృత్తిఁ బ్రకటించుచు 41**

**అర్థము :** అని, అనేక -ప్రకారంబులన్, పలుకుచున్ + ఉండిరి, అంతన్, అందున్, కొందఱు, వీర - భట +ఉత్తములు = వీరులైన భటశ్రేష్ఠులు, ఆత్మీయ + అంతరంగ + ఆపూరిత + అపార వీరరసంబు = తమవైన మనస్సులందు నిండిన అధికమైన వీరరసము, వెల్లి + కొలుపు +అట్లు = ప్రవాహము కట్టించునట్లు, వీర - ఘోషంబునన్ = వీర ప్రకటనమున్, తమ - తమ - నిశ్చయించిన = తాము తాము నిశ్చయించిన, వీర - వృత్తిన్ = వీర వర్తనమును, ప్రకటించుచున్

**తాత్పర్యము** అని పెక్కురీతులఁ బలుకుచుండిరి అంత అందుఁ గొందఱు వీరభటశ్రేష్ఠులు తమ అంతరంగములందు నిండిన అపారమైన వీరరసమును ప్రవాహము కట్టించునట్లు వీరఘోషమునఁ దాము నిశ్చయించి వీర వర్తనమును బ్రకటించుచు - తరువాతి పద్యముతో నన్వయము

చ మునుమిడి వైరివాహినుల ముట్టి విడల్వడ వ్రేసినట్టి క్రైఁ
పునఁ బయికెత్తు వాహకుల పొంక మఱం దల కొంత గోసి ము
న్కొని వడిఁ బాఱు పందలను గోవెల సూరెలఁ దోలి నూర్చుపే
ర్చునఁ బతికెత్తి కేల్గలన జొన్నలు గొన్న ఋణంబు నీఁగుదున్ 42

**అర్థము** మునుమిడి = మాఱ్కొని, వైరి - వాహినులన్ = శత్రుసేనలను, ముట్టి = పట్టుకొని, విడల్వడన్ = విడిచిపోవునట్లు, వ్రేసిన + అట్టి - క్రైఁపునన్ = కొట్టినయుద్రేకమున, పయికిన్ + ఎత్తు = మీఁదికి దండెత్తునట్టి, వాహకుల - పొంకము = వాహనములపైనుండువారి గర్వము, అఱన్ = నశించునట్లు, తల, కొంత, కోసి, మున్కొని (మును + కొని) = ముందయి, వడిన్ = వేగముగా, పాఱు = పాఱిపోవు, పందలను = పిఱికివారిని, కోవెల - సూరెలన్ = గుడిప్రక్కలను, తోలి, నూర్చు = నలఁగఁగొట్టు, పేర్చునన్ = అతిశయమున, పతికిన్, యజమానుని కొఱకు - రాజుకొఱకు, ఎత్తి = దండెత్తిపోయి, కేల్గలనన్ (కేలు + కలనన్) =చేతియుద్ధమున, జొన్నలు, కొన్న ఋణంబున్, ఈఁగుదున్ = తీర్చెదను

**తాత్పర్యము** రాజుకొఱకు శత్రుసేనలను జేతియుద్ధమున మాఱ్కొని పట్టుకొని విడిచిపోవునట్లు కొట్టిన కోపమునఁ బైపైకి వచ్చు వాహకుల గర్వము నశింపఁ దలను గొంత కోసి ముందుగా వేగముగాఁ బాఱిపోవు పిఱికిపందలను గుడి ప్రక్కలకుఁ దోలి నలఁగఁగొట్టి జొన్నలుగొన్న అప్పును దీర్తును

**విశేషములు .** ఈ పద్యభావ మంత సుగమముగా లేదు రాజులు సైనికులకు జొన్నలను ఋణముగా నిచ్చుట యానాఁటి యాచార మయియుండవచ్చును

క ఒడ లోమి పెద్దకాలం
బడవులఁబడి కాయగూర లాహారముగా
నడిపిన తపఃఫలం బొక
గడియం గొందు రదె యెదిరికదనములోనన్ 43

**అర్థము.** ఒడలు = శరీరము, ఓమి = రక్షించి, పెద్ద - కాలంబు = ఎంతో కాలము, అడవులన్ + పడి, కాయ + కూరలు, ఆహారము + కాన్, నడపిన, తపస్ (ః) + ఫలంబు, అదె, ఎదిరి - కదనములోనన్ = శత్రువులతోడి యుద్ధమున, ఒక - గడియన్, కొందురు

**తాత్పర్యము .** శరీరమును రక్షించుకొనుచు ఎంతో కాలము అడవులందుండి కూరగాయలు ఆహారముగాఁ జేసిన తపస్సువలని ఫలమును శత్రువులతోడి యుద్ధమున నొక గడియలోఁ గొందురు

చ **పుడమిపుఁడున్, ధనాఢ్యుఁడును, భూరిబలుండును, శౌర్యవంతుఁడన్**
**గడు దృఢపాణియు న్నయినఁగాని యొడంబడఁ డశ్వమేధ మెం**
**దడరఁగఁజేయఁ దన్మఖమునందుల పుణ్య ఫలంబులందఁగా**
**నడుగడు గశ్వమేధ మగు నాజిమొనం జని చావుసేగియే? 44**

**అర్థము.** పుడమిపుఁడున్ = భూపుఁడును - రాజును, ధన + ఆఢ్యుఁడును, ధన సమృద్ధుఁడును, భూరి - బలుండును = అధికమయిన బలము గలవాఁడును, శౌర్యవంతుఁడున్ = పరాక్రమవంతుఁడును, కడున్ - దృఢపాణియున్ = మిక్కిలి దృఢమైన చేతులు గలవాఁడును - మిక్కిలి భుజబలము గలవాఁడును, అయినన్ + కాని = అయిననే తప్ప, ఎందున్ = ఎక్కడనైనను, అడరఁగన్ = అతిశయించునట్లు, అశ్వమేధము = అశ్వమేధయాగము, చేయన్ = చేయుటకు, ఒడఁబడఁడు = అంగీకరింపఁడు, తద్ + మఖమునందుల = ఆ అశ్వమేధ యాగము నందలి, పుణ్య-ఫలబులు, అందఁగాన్ = అందుటకు, అడుగడుగు = మాటిమాటికి, అశ్వమేధము, అగు + అజి - మొనన్ + చని - చావు = అశ్వమేధమగునట్టి యుద్ధముఖమున మరణించుట, సేగియే = నష్టియా ?

**తాత్పర్యము .** రాజును, ధనసమృద్ధుఁడును మిక్కిలి బలవంతుఁడును, పరాక్రమవంతుఁడును బాహుబలసంపన్నుఁడును అయిననే కాని ఎచ్చట నైనను అశ్వమేధయాగము చేయుటకు సమ్మతింపఁడు యుద్ధమరణము ఆ అశ్వమేధ యాగ పుణ్యఫలము నడుగడుగునను ఇచ్చును అందుచే దానివలన నష్టమా? లేదనుట

**విశేషములు .** పుడమిపుఁడు - శైవకవులు ఇట్టి వైరిపదములను వాడిరి దృఢపాణియున్ + అయిన - 'కొన్నియెడలఁ బ్రామాణికప్రయోగంబులం ద్రుతంబునకచ్చు పరంబగుచో ద్విత్వంబు చూపట్టెడి' ప్రౌఢ సంధి 3 తన్మఖము - తద్ + మఖము - అనునాసిక సంధి అందుల = అందున్న, అందుఁగల

క ఈ వలయు నర్థ మిచ్చియు
సేవకు మన్నింపవలయు జితమతి విభుఁ డా
యీవికి మన్ననకుం దగఁ
జావలయు భటుండు పతికి జయముగఁ బోరన్ 45

**అర్థము .** జితమతి - విభుఁడు = జయింపఁబడిన [illegible] వాఁడు అగు రాజు, ఈ - వలయు + అర్థము = ఒసఁగవలసిన ధన[illegible]యున్ = ఇచ్చియున్, సేవకున్ = సేవకుని, మన్నింపవలయున్ = ఆదరింపవలయును, ఆ + ఈవికిన్ = ఆ ఔదార్యమునకును, మన్ననకున్ = ఆదరమునకును, తగన్ = తగునట్లు, భటుండు = సేవకుఁడు, పతికిన్ = రాజునకు, జయముగన్ = జయమగునట్లు, పోరన్ = యుద్ధమునందు, చావలయున్ = మరణింపవలయును

**తాత్పర్యము .** మెప్పింపఁబడిన మనస్సు గలరాజు తా నీ వలసిన ధనమునిచ్చి సేవకు నాదరింపవలయును సేవకుఁడును ఆ యౌదార్యమునకు, ఆదరమునకుఁ దగినట్లు ప్రభువునకు జయము అగునట్లు యుద్ధమునఁ జావవలయును

**విశేషములు** చావలయు - చాన్ + వలయు' - చచ్చు + నుఙ్ +వలయు (ముత్తు పరంబగునపుడు) 'చావు నోవులు చచ్చు నొచ్చులెకగు ' బాల క్రి 94 చావు + నుఙ్ - వలయు 'ఙీత్తు పరంబగునపుడు వాని వువర్ణంబు విభాషను లోపించు' బాల క్రి 95 చావలయు, చావ వలయు

ఆ పాడవు చూడ మగల పొల్లలు నాళుల
పొల్లలును నిజంబుపోలె నుండుఁ
గలనఁ దూఱ నెత్తఁగాఁ బోరు నప్పుడ
కాని చూచి యెఱుఁగఁ గాదు మున్ను 46

**అర్థము .** పాడవు - చూడన్ = స్వరూపము చూడఁగా, మగల - పొల్లలున్= శూరులలోఁ బనికిమాలినవారును, ఆళుల - పొల్లలును = సేవకులలోఁబనికి మాలినవారును, నిజంబు +అ + పోలెన్ = నిజమయిన వారే అనునట్లు, ఉండున్= ఉందురు, కలనన్ = యుద్ధమునందు, తూఱన్ + ఎత్తఁగాన్ = మిక్కిలి ఎత్తఁగా, శత్రువులు దండెత్తఁగా, పోరు + అప్పుడు + అ + కాని = యుద్ధము చేయునప్పుడే కాని, మున్ను = ముందు, చూచి, ఎఱుఁగన్ + రాదు = తెలియరాదు

**తాత్పర్యము** శూరులలోఁ బనికిరానివారును, సేవకులలోఁ బనికి రానివారును స్వరూపమును జూడఁగా నిజమైన వారుగానే కనఁబడుదురు యుద్ధమున శత్రువులు దండెత్తి రాఁ బోరునపుడేకాని ముందుగాఁ జూచి తెలియరాదు

**విశేషములు .** పెల్ల - పెల్లు (రూ ) కలనన్ -కలను+అందున్ 'ఔప విభక్తికముల తృతీయాసప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు 'బాల ఆచ్ఛిక 38 కలను + అన్ - అంద్వవవగాగమ సంధి (బాల సం 11 ) చే కలనన్

**చ తన కని దాఁప కర్థికి సుధామయపక్వఫలంబు లిచ్చు, నో**
**లిన( కొను దావవహ్నికి జలింపక మార్కొని నిల్చి కాలు, నీ**
**మనుజులు కొంద ఱా యడవిమ్రాఁకులకంటెను గష్ట, మర్థి వేఁ**
**డిన ఫలమీయఁజాల, రరి డీకొని తాఁకిన నిల్వఁజాలరున్ 47**

**అర్థము .** అడవి మ్రాను - కర్త అధ్యాహార్యము తనకున్ + అని = తన కొఱకని, దాఁపక = దాఁచుకొనక, అర్థికిన్ = యాచకునకు, సుధా - మయ - పక్వ-ఫలంబులు = అమృతమయములయిన పండిన పండ్లు, ఇచ్చున్, ఓలిన్ + అ - కొను = క్రమముగా నాక్రమించు, దావ -వహ్నికిన్ = కార్చిచ్చునకు, చలింపక = కదలక, మార్కొని = ఎదురుకొన, నిల్చి కాలున్, ఈ - మనుజులు - కొందఱు, ఆ + అడవి - మ్రాఁకులకంటెను = ఆ అడవి చెట్ల కంటెను, కష్టము = నికృష్టులు, అర్థి = యాచకుఁడు, వేఁడినన్ = వేఁడుకొన్నను, ఫలము, ఈయన్ + చాలరు = ఈ లేరు, అరి = శత్రువు, డీకొని = తాఁకినన్ ఎదిరించి దండెత్తినను, నిల్వన్ + చాలరున్ = నిలువఁజాలరు కూడ

**తాత్పర్యము .** అడవిలోని చెట్లు తమ కొఱకని దాఁచికొనక యాచకునకు అమృతమయములైన పక్వఫలము లిచ్చును క్రమముగా నాక్రమించు కార్చిచ్చునకుఁ జలింపక ఎదుర్కొని నిలిచి కాలును కొందఱు మనుష్యులు ఆ అడవిచెట్ల కంటెను నికృష్టులు వారు యాచకుఁడు వేఁడినను ఫలము నొసఁగఁజాలరు యుద్ధమున శత్రువు దండెత్తి నప్పుడు నిలువఁజాలరును

**విశేషములు .** అలంకారము కావ్యలింగము ఉపమేయమైన మనుజులకంటెను, ఉపమానమైన అడవిమ్రాఁకుల కాధిక్యము చెప్పఁబడినది కావున వ్యతిరేకమును మ్రాను + లు = మ్రాఁకులు 'కలన్వాదుల ను వర్ణంబు కుజ్జగు బహువచనము పరంబగునపుడు నిత్యముగా నగు ' బాల ఆచ్ఛిక 18 మ్రా + కుజ్ + లు 'జిత్తు బిందు పూర్వంబగు ' మ్రాఁకులు బాల తత్సమ 19

క ఈ ననియె తలఁచుఁ జాగియు
నీన నియ తలంచు లోభి యెప్పుడు ననికిన్
జా ననియ తలఁచు వీరుఁడు
జా ననియ తలంచుఁ బంద సరి యెట్లగునో ? 48

**అర్థము.** ఎప్పుడున్ = ఎప్పుడును, చాగియున్ = త్యాగియును, ఈన్ + అనియె = ఇచ్చుటకొఱకు అనియే, తలఁచున్, లోభి, ఈను + అనియ = నేను ఈను (ఒసఁగను), అనియ = అని + అ = అనియె, తలంచున్, వీరుఁడు, అనికిన్ = యుద్ధమునకు, చాన్ + అని + అ = చచ్చుట కొఱకనియే, తలఁచున్, పంద = పిఱికివాఁడు, చాను + అని + అ = చావను అనియే, తలంచున్, సరి= సమానము, ఎట్లు + అగునో = ఏ విధముగా నగునో!

**తాత్పర్యము.** ఎప్పుడును త్యాగి ఇచ్చుటకొఱకే తలఁచును లోభి నేను ఈను అనియే తలఁచును వీరుఁడు యుద్ధమునఁ జచ్చుటకనియే తలఁచును పిఱికివాఁడు 'నేను చావను' అనియే తలఁచును అట్టిచో వారు ఒకరొకరికి సరియెట్లగుదురు?

**విశేషములు** ఇచ్చు ధాతువు 'తుమర్థ భావలక్షణంబులందు నుజీ యగు ' బాల క్రి 40 ఇచ్చు + నుజీ 'ఇచ్చునకు సర్వంబున కీ యగు ' బాల క్రి 92 ఈను = ఇచ్చుట కొఱకు ఇచ్చు ధాతువు 'వ్యతిరేకంబున లజీ యగు' బాల క్రి 7 ఇచ్చు + లజీ 'లకారంబునకు డుఁబువురును ముజ్ఞగు ' బాల క్రి 8 ఇచ్చు + ను 'ఇచ్చునకు సర్వంబున కీ యగు ' బాల క్రి 92 ఈను = ఈయను (నేను ఒసఁగను) ఇట్లే 'చచ్చు' నకు 'నుజీ' పరముచేసియు, లజీ పరము చేసియు రూపములను సాధింపనగును

చ అరిబల మంటఁదాఁకిన రయంబున నాత్మబలంబు వీఁగుచోఁ
దెరలఁగనీక త్రోచి పయిఁ దేఁకువ వచ్చు విరోధిసేనలన్
మరలఁగఁ దోలుచో నిలిచి మార్కొను వీరులఁదాఁకి వీఁక జ
ర్జరితముగాఁ బడంబొడిచి చంపక చిత్తముకైపు పోవునే ? 49

**అర్థము** అరి - బలము = శత్రుసేన, అంటన్ + తాఁకినన్ = ముట్టి నెదిర్చినచో, రయంబునన్ = శీఘ్రముగా, ఆత్మ - బలంబు = మనోబలము -

ధైర్యము, వీఁగుచోన్ = చలించినచో, తెరలఁగన్ + ఈక = చెదరనీక, త్రోచి = ప్రోత్సహించి, పయిన్ = మీఁద, తేఁకువన్ = సాహసముతో, వచ్చు, విరోధిసేనలన్ = శత్రు సేనలను, మరలఁగన్ + తోలుచోన్ = మరలిపోవునట్లు తోలునప్పుడు, నిలిచి, మార్కొను - వీరులన్ = ఎదుర్కొను వీరులను, తాఁకి = ముట్టి, వీఁకన్ = పరాక్రమముతో, జర్జరితము + కాన్ = తూఁటులుపడునట్లు, పడన్ = పడునట్లు, పొడిచి, చంపక, చిత్తము - క్రైఁపు =కోపోద్రేకము పోవునే?

**తాత్పర్యము :** శత్రుబలము దండెత్తి వచ్చినప్పుడు మనోధైర్యము చలించుచోఁ జెదరనీక, మీఁదికి సాహసముతో వచ్చు శత్రుసేనలను మరలిపోవఁదోల నిలిచి, ఎదిరించు వీరులను దాఁకి పరాక్రమముతోఁ దూఁటులుపడునట్లు పొడిచి చంపకున్నచో కోపోద్రేకము ఆఁగునా?

వ అని యనేకప్రకారంబుల శౌర్యాటోపంబులు సేసి వితర్కించుచుండి రట్టి యవసరంబున 50

**అర్థము .** అని, అనేక - ప్రకారంబులన్, శౌర్య + ఆటోపంబులు = పరాక్రమ విజృంభణములు, చేసి, వితర్కించుచున్ + ఉండిరి, = ఊహించుచుండిరి, అట్టి + అవసరంబునన్ = అట్టి సమయమున

**తాత్పర్యము .** అని పెక్కురీతుల పరాక్రమముచే విజృంభించి వితర్కించుచుండిరి అట్టి సమయమున - తరువాతి పద్యముతో నన్వయము

సీ సన్నుతత్యాగధ్వజంబులతోడన
 సంధిల్లి వీరధ్వజములు క్రాలెఁ
బటుగతిఁ జను గాలిపడగలతోడన
 కడు వేగమునను బెండడిగ లెగసెఁ
జిఱుతమెఱుంగుల కొఱవివాటులతోన
 నీరాజనద్యోతినికర మడరె
వఱడియల్ వెలువడు వరభటావలితోన
 వీరసన్న్యాసులున్ వెడలి రుగ్ర

తే భటుల మంగళపాఠకపఠనరవము
తోన వీణాంకమాలికాగానరవము
సమర సంగీత వివిధ వాద్యములతోన
కలయ విడిదిలో వీరమద్దెలలు మలిసె 51

**అర్థము** సన్నుత - త్యాగ - ధ్వజంబులతోడన్ + అ = పొగడఁబడిన త్యాగచిహ్నములతోనే, సంధిల్లి = కూడి, వీర - ధ్వజములు = వీరుల పతాకలు క్రాలెన్ = ఒప్పెను

పటు - గతిన్ = మిక్కిలి వేగముతో, చను, గాలి - పడగల తోడన్ + అ = వీరధ్వజములతోనే, కడు వేగమునన్ = మిక్కిలి వేగముతో, పెందడిగలు = పెను + దడిగలు = పెద్దడాలులు, ఎగసెన్ = ఎగిరెను

చిఱుత - మెఱుంగుల - కొఱవి - వాటులతోన్ + అ = అల్పకాంతుల కొఱకచ్చులతోపాటే, నీరాజన - ద్యోతి - నికరము = యుద్ధమునకుఁ బోవుటకు ముందు వీరులకిచ్చు హారతుల కాంతుల సమూహము, అడరెన్ = అతిశయించెను

వఱడియల్ = కరదీపికలు, వెలువడు, వర - భట + ఆవలితోన్ + అ = శ్రేష్ఠులయిన భటుల వరుసతోపాటే, వీర - సన్న్యాసులున్, వెడలిరి

ఉగ్ర - భటుల = భయంకరులైన భటులయొక్క, మంగళ - పాఠక - పఠన - రవము - తోన్ + అ = శుభములను పఠించువారి పఠనధ్వనితోపాటే, వీణాంకమాలికా - గాన - రవమున్ = వీణలపైఁబాడు స్తోత్రముల సంగీత ధ్వనియు, సమర - సంగీత - వివిధ - వాద్యములతోన్ + అ = యుద్ధ సంగీతము నందలి వివిధవాద్యములు అనువానితోపాటే, విడిదిలోన్, కలయన్ = అంతటను, వీర మద్దెలలున్ = బిరుదందెలును, ఉలిసెన్ = ధ్వనించెను

**తాత్పర్యము .** త్యాగధ్వజములతోపాటే వీరధ్వజము లొప్పెను అమిత వేగముతోఁ జను గాలిపడగలతోనే పెద్దడాలులు ఎగిరెను అల్పకాంతుల కొఱకచ్చులతోపాటే నీరాజనములకాంతులును అతిశయించెను కరదీపికలతోడి భటుల సమూహముతోనే వీరసన్న్యాసులును వెడలిరి భటులను స్తోత్రము చేయువారి పఠనధ్వనితోపాటే వీణలపైఁ బాడు స్తోత్రముల సంగీత ధ్వనియు, యుద్ధ సంగీతములోని వివిధవాద్యములు అనువానితోపాటే విడిదిలో నంతటను బిరుదందెలును ధ్వనించెను

**విశేషములు .** అలంకారము సహోక్తి

**వ ఇట్లు సమరాంగణ నర్తకీనర్తనస్థానంబునుంబోలె నతిమనోహరం బైన స్కందు స్కందావారంబునందు 52**

**అర్థము.** ఇట్లు, సమర + అంగణ - నర్తకీ - నర్తన స్థానంబునున్ + పోలెన్ = యుద్ధరంగమనెడి నట్టువరాలి నాట్యరంగమువలె, అతి - మనోహరంబు = మిక్కిలి సుందరమయినది, ఐన, స్కందు = కుమారస్వామియొక్క, స్కంధావారంబునందున్ = సేనా నివేశమునందు

**తాత్పర్యము.** ఇట్లు నట్టువకత్తె నాట్య రంగమువలె మిక్కిలి సుందరమైన కుమారస్వామి సేనా నివేశమునందు - తరువాతి పద్యముతో నన్వయము

ఉ ఆయము లిచ్చు, టాజిమొన కాయము పెంచుట, పెక్కు మన్ననల్
సేయుట, పోరికిన్ మొనసి చేయుటగా మది నిశ్చయించుచున్,
నాయకు కోర్కెఁ దీర్తునని నా యెద నూఁటడినట్లు టొమ్మ్మనం
జేయిడి నిద్రవోయిరి నిశిన్ సుభటుల్ సమరంబ కోరుచున్ 53

**అర్థము:** ఆయములు + ఇచ్చుట = రాబడు లిచ్చుట, అజి - మొనకున్ = యుద్ధ సైన్యమునకు, ఆయము = ఆదాయము, పెంచుట, పెక్కు - మన్ననల్, చేయుట, పోరికిన్ = యుద్ధమునకు, మొనసి = పూని, చేయుట + కాన్, మదిన్, నిశ్చయించుచున్, నాయకు - కోర్కిన్, తీర్తున్, అని, నా + ఎదన్ = నా హృదయమున, ఊఁటడిన + అట్లు = ఊఁటడిల్లిన విధమున, టొమ్మ్మనన్, చేయి + ఇడి = చేయిపెట్టుకొని, సుభటుల్ = సద్వీరులు, సమరంబు + అ = యుద్ధమునే, కోరుచున్, నిశిన్ = రేయి, నిద్ర + పోయిరి = నిదురించిరి

**తాత్పర్యము:** రాబడు లిచ్చుట, యుద్ధ సైన్యమున కాదాయము పెంచుట, పెక్కు మన్ననలు చేయుట, యుద్ధమునకుఁ బూనుటగా మనస్సునందు నిశ్చయించుచు యజమానుని కోరికను దీర్తునని మానసమున నూఁటడిల్లిన విధమున సుభటులు యుద్ధమునే కోరుచు రేయి టొమ్మ్మనఁ జేయిడుకొని నిదురించిరి

## యుద్ధ వీరుల బార్యల పరితాపము

తే పాలునేయును గూడిన భంగి వోలె
నొనరి వియ్యంబుతోఁ గూడియున్న భటుఁడు
వీరసన్న్యాసవిధిఁ దన్ను విడుచు టెఱిఁగి
వనిత నిట్టూర్పుతోన జీవంబు విడిచె 54

**అర్థము.** పాలున్, నేయునున్ = నేయియును, కూడిన - భంగి - పోలెన్= కూడిన విధమున, ఒనరి = ఒప్పి, వియ్యంబుతోన్ = ఐక్యముతో, కూడి + ఉన్న=

కలిసియున్న, భటుఁడు, వీర - సన్న్యాస-ఎధిన్ = వీరుని సన్న్యాసక్రమమున, తన్నున్, ఎడుచుట, ఎఱిఁగి, వనిత = స్త్రీ, నెట్టూర్పు (నిడు + ఊర్పు) + తోన్ + ఎ = నిశ్శ్వాసముతోనే, జీవంబు = ప్రాణము, విడిచెన్

**తాత్పర్యము.** పాలును నేయియును గూడిన విధమునఁ దనతో నైక్యమునఁ గూడియున్న భటుఁడు వీరుని సన్న్యాసక్రమమునఁ దన్ను ఎడుచుట యెఱిఁగి వనిత నిశ్శ్వాసముతోనే ప్రాణము విడిచెను

ఉ **ఓలము లేదు కూర్చునని యూఱడియుండితిఁ గూర్మియెల్ల నేఁ**
**డాలము నేసి నన్నుఁ బెడయాకులఁబెట్టి మనఃప్రియుండు త**
**న్నాలములోనఁ బెట్టి దివిజాంగనలం గలయంగ నెత్తె నే**
**నాలనె బేలఁగాక చెలియా యని యల్లన వ్రాలె సోలుచున్ 55**

**అర్థము .** ఓలము - లేదు = దాఁపఱికము లేదు, కూర్చును + అని = ఇష్టపడునని, ఊఱడి + ఉండితిన్ = ఊఱటఁజెందియుంటిని, కూర్మి + ఎల్లన్ = ప్రేమమంతయును, నేఁడు, ఆలము + చేసి = ఉపేక్షించి, నన్నున్, పెడ + ఆకులన్ + పెట్టి = విడిచిపెట్టి (?), మనస్(ః) + ప్రియుండు = మనోనాథుఁడు, తన్నున్, ఆలములోనన్ + పెట్టి = యుద్ధమునందుఁబెట్టి, దివిజ + అంగనలన్ = దేవతాస్త్రీలను, కలయంగన్ = కూడుటకు, ఎత్తెన్ = దండెత్తెను, చెలియా! నేను, బేలన్ + కాక = తెలివితక్కువదానను గాక, ఆలనె = స్త్రీనా? అని, సోలుచున్ = మూర్ఛిల్లుచు, అల్లనన్ = మెల్లఁగా, వ్రాలెన్ = ఒఱిగెను

**తాత్పర్యము .** 'దాఁపఱికము లేదు న న్నిష్టపడునని యూఱట చెందియుంటిని, నేఁడు న న్నుపేక్షించి విడిచిపెట్టి నా మనోవిభుఁడు తాను యుద్ధమున కేఁగి దేవతాస్త్రీలను గూడుటకు దండెత్తెను చెలీ! నేను తెలివిమాలిన దానను గాక స్త్రీనా?'' అని మూర్ఛిల్లుచు మెల్లఁగా నొఱిగెను

చ **అనిమొన నిల్చి వీరగతి నందు ఫలం బిదియెల్ల దేవతాం**
**గనల ముదంబునన్ గవయుఁగాన్ప నిజం బిది నన్ను దేవకా**
**మిని ననురక్తిఁగైకొని రమించుచునుండియు నింక నాజి నే**
**మని యొకొ త్రెవ్వఁజూచెఁ బ్రియుఁ డంచుఁ జలించె లతాంగి నెమ్మదిన్ 56**

**అర్థము:** అని - మొనన్ = యుద్ధముఖమున, నిల్చి, వీర - గతిన్ = వీరుని విధమున, అందు = పొందెడు, ఫలంబు, ఇది + ఎల్లన్ = ఇది యంతయు, దేవతా + అంగనలన్ = దేవతా స్త్రీలను, ముదంబునన్ = సంతోషముతో, కవయన్ +

కాన్పు + అ = పొందఁజూచుటయే, ఇది, నిజంబు, దేవ - కామినిన్ = దివ్యాంగనను, నన్నున్, అనురక్తిన్ = అనురాగముతో, కైకొని = స్వీకరించి, రమించుచున్ + ఉండియున్ = సంభోగించుచుండియు, ప్రియుఁడు, ఇంకన్, ఆజిన్ = యుద్ధమున, ఏమి + అని + ఒకొ = ఏ కారణముననో, త్రెవ్వన్ + చూచెన్ = నశింపఁజూచెను, అంచున్, లతా + అంగి = తీవబోఁడి - స్త్రీ, నెమ్మదిన్ (నెఱ + మదిన్) = మనస్సునందు, చలించెన్ = దుఃఖించెను

**తాత్పర్యము .** 'యుద్ధరంగమున నిల్చి వీరుఁడుగా నుండుటకు ఫల మంతయు దేవతాస్త్రీలను సంతోషముతోఁ గూడఁగలుగుటయే ఇది నిజము దివ్యాంగననైన నన్ను అనురాగముతో స్వీకరించి సంభోగించుచుండియు నా ప్రియుఁ డింకను యుద్ధమున నశింపఁజూచుట కేమి కారణము?' అని యొక తీవబోఁడి మనసులో దుఃఖించెను

ఉ **వాడిన వక్త్రపంకజము, వందిన హృద్దళితాంబుజాతమున్,**
**గాడిన కన్ను నీరుఁ, దనుకంపమునం బ్రభవించి మైవడిన్**
**వీడిన వేణియుం, దగఁగ, వీరసతిం బతి గూడియున్నఁ,దా**
**మాఁడిన జీవితాశ నొక మానిని యుండె నచేతనస్థితిన్** 57

**అర్థము .** వీర - సతిన్ = వీరమనెడి స్త్రీని, పతి = భర్త, కూడి + ఉన్నన్= కూడియుండఁగా, ఒక - మానిని = ఒక మానవతి - స్త్రీ, వాడిన - వక్త్ర - పంకజమున్ = వాడిపోయిన ముఖపద్మమును, వందిన = దుఃఖించిన, హృద్ + దళిత + అంబుజాతమున్ = వికసించిన పద్మమువంటి హృదయమును కాడిన = కాఱిన (?), కన్ను - నీరున్, తను - కంపమునన్ = శరీరపువణఁకుచే, ప్రభవించి = పుట్టి, మైవడిన్ = ఆనుకూల్యముతో, వీడిన = విరిసిన, వేణియున్ = జడయును, తగఁగన్ = ఒప్పఁగా, తాన్ = తాను, మాఁడిన - జీవిత + ఆశన్ = మాఁడిపోయిన బ్రదుకు మీఁది కోరికతో, అచేతన - స్థితిన్ = చైతన్యరహితమైన స్థితితో, ఉండెన్

**తాత్పర్యము .** తన భర్త వీర మనెడి స్త్రీని గూడియుండఁగా, నొక మానవతి వాడువాఱిన ముఖపద్మమును, దుఃఖించిన హృదయకమలమును, కాఱిన కన్నీరును, శరీరకంపముచే విరిసిన వేణియును ఒప్పఁగా జీవితాశ మాఁడిపోయి చైతన్యరహితయై యుండెను

**విశేషములు :** అలంకారము రూపకము

మ అనయంబై కొని వీచు తెమ్మెరలచే నల్లాడు లేఁదీఁగ క్రొ
న్నన లల్లల్లన డుల్లు భంగిఁ గడగానన్ రాని దుఃఖాబ్ధి నం
గన డిందంబడి వంది నెవ్వగపుతోఁ గంపించు మేఁదీఁగ నో
లిన పేర్బిందులు రాలఁ జూచె రణకేళీలోలు నాత్మేశ్వరున్ 58

**అర్థము** అనయంబు + ఐ = అధికమయి, కొని - వీచు, తెమ్మెరలచే = వాయువుచే, అల్లాడు = చలించునట్టి, లెఁదీఁగ (లేఁత + తీఁగ) యొక్క, క్రొన్ననలు (క్రొత్త + ననలు) = క్రొత్తవియగు పూలు, అల్లల్లనన్ = మెల్లమెల్లఁగా, డుల్లు - భంగిన్ = రాలువిధమున, కడ + కానన్ - రాని = అంతము గానరాని, దుఃఖ + అబ్ధిన్ = దుఃఖమనెడి సముద్రమునందు, డిందన్ + పడి = మునిఁగి, వంది = దుఃఖించి, నెవ్వగపుతోన్ (నెఱ + వగపుతోన్) = మిక్కిలి విచారముతో, కంపించు = వణఁకు, మేఁదీఁగన్ (మే + తీఁగన్) = తీఁగవంటి మేనినుండి,ఓలిన్ = బాగుగా, పేర్బిందులు = చెమటబిందువులు, రాలన్ = రాలుచుండఁగా, అంగన, రణ - కేళీలోలున్ = యుద్ధక్రీడయందాసక్తి గలవానిని, ఆత్మ + ఈశ్వరున్ = తన భర్తను, చూచెన్

**తాత్పర్యము** అధికముగా వీచు గాలిచేఁ జలించు లేఁదీఁగ నుండి క్రొంబూలు రాలు విధమున, అంతము గనరాని దుఃఖసముద్రమున మునిఁగి, దుఃఖాతిశయముచేఁ గంపించు మేఁదీఁగనుండి చెమటబిందువులు రాలుచుండఁగా ఒక యుద్ధక్రీడాపరుఁడైన తన భర్తను జూచెను ,

**విశేషములు .** అలంకారము రూపకానుప్రాణితోపమ లేఁదీఁగ - లేఁత - తీఁగ ప్రాఁతాది సంధి బాల సంధి 36 లే + తీఁగ నుగాగమము-బాల సంధి 37 లే + ను + తీఁగ ద్రుతకార్యము - బాల సంధి 16,17 లేఁదీఁగ నెవ్వగపు - నెఱ + వగపు 'అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి ' బాల సంధి 39

వ ఇట్లు పుణ్యసతులు రణమరణపరిచ్ఛేదు లైన పతులతోడన మరణ పరిచ్ఛేదలగుచు నుండి రంత విరాగాన్వితులైన సుభటోత్తములు "కః కేనార్థ కోదరిద్ర"యని గోసనంబులు పుచ్చి సర్వస్వదాను లగుచుండి రట్టి యవసరంబున 59

**అర్థము :** ఇట్లు, పుణ్య - సతులు = పతివ్రతలయిన స్త్రీలు, రణ - మరణ - పరిచ్ఛేదులు = యుద్ధమృతియందు నిశ్చయము గలవారైన, పతుల తోడన్ +

అ = భర్తలతోపాటే, మరణ - పరిచ్ఛేదలు - మరణ నిశ్చయముగలవారు, అగుచున్, ఉండిరి, అంతన్, విరాగ + అన్వితులు = విరక్తితోఁగూడినవారు, ఐన, సుభట + ఉత్తములు = భటశ్రేష్ఠులు, కః = ఎవఁడు, కేన = దేనిచేత, అర్థీ = కోరువాఁడు = ఎవఁడు దేనిని గోరును ? కః + దరిద్రః = ఎవఁడు దేనిచే దరిద్రుఁడు - ఎవని కేది లేదు? అని, గోసనంబులు + పుచ్చి = చాటించి, సర్వస్వ - దానులు= ఎల్లసొమ్మును దానము చేసినవారు, అగుచున్ + ఉండిరి, అట్టి - అవసరంబునన్

**తాత్పర్యము .** ఇట్లు పతివ్రతలైన స్త్రీలు రణమరణనిశ్చయులైన భర్తలతోపాటే తామును మరణనిశ్చయ లగుచుండిరి అంత విరక్తులైన వీరశ్రేష్ఠులు 'ఎవనికేది కావలయును? ఎవని కేది లేదు ' అని ప్రకటించి తమకున్న సొమ్మంతయు దానము చేయుచుండిరి అట్టి సమయమున - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** కో దరిద్ర యని - కః + దరిద్ర ః + అని 'విసర్గరంబున కనుకరణంబున లోపంబగు ' బాల సంధి 50 కో దరిద్ర + అని - యడాగమము - బాల సంధి 3

**చ 'బలువిడిఁ దాఁకి వైరిజనపాలుర కండలు గోసి పేర్చుతోఁ**
**దలరక భూతకోటులను దన్పుదు మెమ్మెయి నాజి నంచు దో**
**హలమతు లిచ్చి రుత్తమభటావలి కుంకుమ కింకిరాతకో**
**జ్జ్వల శిఖి బంధుజీవ సమవర్ణ సువర్ణము లర్థికోటికిన్ 60**

**అర్థము .** దోహల - మతులు = ఉత్సాహముతోఁ గూడిన మనస్సులు గలవారు, అగు, ఉత్తమ - భట + ఆవలి = శ్రేష్ఠులయిన వీరుల సమూహము, బలువిడిన్ = పరాక్రమముతో, తాఁకి = ముట్టి, వైరి - జనపాలుర = శత్రురాజులయొక్క, కండలు, కోసి, పేర్చుతోన్ = విజృంభణముతో, తలరక = చలింపక, భూత - కోటులను = ప్రాణి సమూహములను, ఆజిన్ = యుద్ధమునందు, ఎమ్మెయిన్ (ఏ + మెయిన్) = ఏ విధముగానైనను, తన్పుదుము = తృప్తిపఱుతుము, అంచున్, అర్థి - కోటికిన్ = యాచకుల సమూహమునకు, కుంకుమ 'సువర్ణములు కుంకుమ = కుంకుమముతోను, కింకిరాతక = రక్తాశోకముతోను, ఉజ్జ్వల - శిఖి = ప్రకాశించునగ్నితోను, బంధుజీవ = మంకెనపువ్వుతోను, సమ = సమానమయిన, వర్ణ = రంగుగల, సువర్ణములు = బంగారములు, ఇచ్చెన్

**తాత్పర్యము :** ఉత్సాహవంతులైన వీరశ్రేష్ఠులు 'పరాక్రమముతోఁ దాఁకి శత్రురాజుల కండలు గోసి విజృంభించి, చలింపక, యుద్ధమున నెట్లయినను

బ్రాణుల సమూహమును దృప్తిపఱుతు' మనుచు, కుంకుమము, రక్తాశోకము, ఉజ్జ్వలాగ్ని, మంకెన అనువానితో సమానమయిన సువర్ణములు యాచకుల సమూహమునకు ఇచ్చిరి

**విశేషములు .** ఉత్తమ భటాలికి అనుపారము కంటె ఉత్తమ భటావలి అను రా అ కృ.శర్మ గారి పారము మేలుగానుండుటచే నది స్వీకరింపఁబడినది అప్పుడు ఉత్తమ భటావలి ఇచ్చిరి అని యేర్పడును 'మహత్సమూహార్థకశబ్దం బమహత్కార్య యుక్తంబయ్యుఁ దద్విశేషణక్రియలు మహత్కార్యయోగ్యంబులు విభాష నగు ' ప్రౌఢ శబ్ద 17

**వ ఇట్లనేకు లనేకప్రకారంబుల దీనానాథవిద్వజ్జనంబుల నపారవసుధారా సారంబులం దేల్చుచుండి రంతఁ గుమార హరి పురందరాది ప్రముఖ నిఖిల సురవరోత్తములు సమస్త భువన భవనాధీశ్వరులు నిజవాహనాయుధాదులకు నీరాజనాదిక్రియావిధు లొనర్చుచుం బరమేశ్వరారాధనతత్పరు లగుచుండి రట్టి యవసరంబున 61**

**అర్థము :** ఇట్లు, అనేకులు = పెక్కురు వీరులు, అనేక - ప్రకారంబులన్= పెక్కు విధముల, దీన + అనాథ - విద్వత్ + జనంబులన్ = దీనులను, దిక్కులేనివారిని, పండితులను, అపార - వసు - ధారా + ఆసారంబులన్ = పారము లేని ధనముల (రత్నముల) యొక్క, ప్రవాహములయొక్క జడులచే, తేల్చుచున్ + ఉండిరి = సంతోషపెట్టుచుండిరి, అంతన్, కుమార - హరి - పురందర + ఆది - ప్రముఖ - నిఖిల - సుర - వర + ఉత్తములు = కుమారస్వామి, విష్ణువు, ఇంద్రుఁడు మున్నగు ముఖ్యులైన ఎల్లదేవతాశ్రేష్ఠులు, సమస్త - భువన - భవన + అధి + ఈశ్వరులు = ఎల్లలోకములనెడి యిండ్ల ప్రభువులు, నిజ - వాహన + ఆయుధ + ఆదులకున్= తమ వాహనములు, ఆయుధములు, మున్నగువానికి, నీరాజన + ఆది - క్రియా - విధులు = హారతులు మున్నగు క్రియావిధానములు, ఒనర్చుచున్= చేయుచు, పరమేశ్వర + ఆరాధన - తత్పరులు = ఈశ్వరునియొక్క పూజయందు ఆసక్తి గలవారు, అగుచున్ + ఉండిరి అట్టి - అవసరంబునన్

**తాత్పర్యము .** ఇట్లు పెక్కండ్రు వీరులు పెక్కురీతుల దీనులను, అనాథులను, పండితులను అపారములైన ధనముల వర్షములచేఁ దృప్తిపఱుచుచుండిరి అంతఁ గుమారుఁడు, విష్ణువు, ఇంద్రుఁడు మున్నగు ముఖ్యులైన దేవతాశ్రేష్ఠులెల్లరును ఎల్ల లోకపాలకులును దమ వాహనములు, ఆయుధములు

మున్నగువానికి హారతులు మున్నగు విధానములు చేయుచు నీశ్వరునారాధించుటయం దాసక్తిగలవారగుచుండిరి అట్టి సమయమున - తరువాతి పద్యముతో నన్వయము

## సూర్యోదయము

క 'తారక తేజం బడఁపఁ గు
మారక! నీ వేల? పంపు మహిఁ దారక సం
హారకు న' న్నను గతిఁ దిమి
రారాతి ప్రతాపయుక్తుఁడై యుదయించెన్ 62

**అర్థము .** కుమారక = ఓయి కుమారస్వామీ! తారక - తేజంబు = తారకాసురుని తేజస్సును, అడఁపన్ = అణఁచుటకు, నీవు, ఏల, తారక - సంహారకున్ = నక్షత్రముల సంహారకుని, నన్నున్, మహిన్ = భూమిని (గూర్చి), పంపు = పంపుము, అను - గతిన్ = అనువిధమున, తిమిర + అరాతి = చీఁకటి యొక్క శత్రువు - సూర్యుఁడు, ప్రతాప - యుక్తుఁడు + ఐ = తేజస్సుతోఁ గూడినవాఁడయి, ఉదయించెన్

**తాత్పర్యము .** 'కుమారస్వామీ! 'తారకాసురుని అడఁచుటకు నీవు పోవలయునా? తారక సంహారకుఁడనైన - (నక్షత్రముల నుడుపువాఁడనైన) నన్ను భూమికిఁ బంపుము ' అను విధమున సూర్యుఁడు తేజోయుక్తుఁడై యుదయించెను

**విశేషములు :** అలంకార ముత్ప్రేక్ష - శ్లేషము

**వ. త దవసరంబునం గుమారుండు సుప్రభాతోచితక్రియలు నిర్వర్తించి సమరోద్యుక్తుండై సన్నాహభేరి చఱవంబంచిన 63**

**అర్థము :** తద్ + అవసరంబునన్ = ఆ సమయమున, కుమారుండు, సుప్రభాత + ఉచిత - క్రియలు = ఉదయకాలమునకుఁ దగిన పనులు, నిర్వర్తించి = చేసి, సమర + ఉద్యుక్తుండు + ఐ = యుద్ధమునకుఁ బూనినవాఁడయి, సన్నాహ - భేరి = సంసిద్ధతను దెలుపు వాద్యము, చఱవన్ + పంచినన్ = మ్రోయింప నాజ్ఞాపింపఁగా -

**తాత్పర్యము .** ఆ సమయమునఁ గుమారస్వామి ప్రాంతఃకాలమునకుఁ దగిన పనులు చేసి యుద్ధమునకుఁ బూనినవాఁడయి సన్నాహభేరిని మ్రోయింప నాజ్ఞాపింపఁగా - తరువాతి పద్యముతో నన్వయము

స్రగ్ధర భువనీచక్రాచలేంద్రాంబుధికుహరదిశాపూర్ణమై, దేవసేనో
త్సవమై, బ్రహ్మాండభాండోదర ఘనపద పాతాళముల్ పెల్లగిల్లన్,
దివిజావాసంబు లోలిం దిరుగ దినకరాదిత్యు లుల్కన్, మహా భై
రవమై, సన్నాహభేరీరవ మహితకులత్రాసకంబై చెలంగెన్ 64

**అర్థము.** సన్నాహ -భేరీ - రవము = యుద్ధసన్నద్ధతను దెలుపు భేరుల ధ్వని, భువనీ పూర్ణమై, భువనీ -చక్ర = లోకముల సమూహము, అచల + ఇంద్ర = పర్వతశ్రేష్ఠములు, అంబుధి - కుహర = సముద్రాంతర్భాగము, దిశా + దిక్కులు, ఆపూర్ణము + ఐ = అంతటను నిండినదయి, దేవ - సేనా + ఉత్సవము + ఐ = దేవతలసేనకుఁ బండువయి, బ్రహ్మాండ పెల్లగిల్లన్ = బ్రహ్మాండ - భాండ + ఉదర = భాండమువంటి బ్రహ్మాండముయొక్క గర్భము, ఘనపద = ఆకాశము, పాతాళముల్, పెల్లగిల్లన్ = కలఁగఁగా, దివిజ + ఆవాసంబులు = దేవతల నివాసస్థానములు, ఓలిన్= క్రమముగా, తిరుగన్, దినకర = సూర్యుఁడు, ఆదిత్యులు = దేవతలు, ఉల్కన్= భయపడఁగను, మహాభైరవము + ఐ = మిక్కిలి భయంకరమయినదయి, అహిత - కుల - త్రాసకంబు + ఐ = శత్రువుల సమూహమునకు భయము గలిగించునదయి, చెలంగెన్ = మ్రోసెను

**తాత్పర్యము.** లోకములు, పర్వతరాజములు, సముద్రములు, దిక్కులు అంతటను నిండినదయి, దేవతల సేనకుఁబండువయి, బ్రహ్మాండభాండగర్భము, ఆకాశము, పాతాళము కలఁగఁగను, దేవతల నివాస స్థానములు క్రమముగాఁదిరుగఁగను, సూర్యుఁడు దేవతలు భయపడఁగను, మిక్కిలి భయంకరమయినదయి, యుద్ధసన్నద్ధతను దెలుపు భేరుల ధ్వని శత్రు సమూహమునకు వెఱపుగొలుపునదయి మ్రోసెను

వ అంతం గుమారప్రేరితులై యక్షణంబ. 65

**అర్థము** అంతన్, కుమార - ప్రేరితులు + ఐ = కుమారస్వామి చేతఁబురికొల్పఁబడినవారయి, అక్షణంబు + అ = వెంటనే

**తాత్పర్యము.** అంతఁ గుమారస్వామిచేఁ బురికొల్పఁబడినవారయి వెంటనే తరువాతి పద్యముతో నన్వయము

ఉ 'బలముల వేగమై కదలఁబంపుఁడు పన్నుఁడు పన్నుఁ' డంచు న
ల్వలఁకులఁ బాటిపాటి పడవాళులు సిద్ధులలోనఁ జాటు పే
రులి వాగిఁ బర్వఁ దత్ప్రుథుతరోరుతరాహతి సేన మారుతా
కుల చలదంబురాశిపటుఘోషము వోలెఁ జెలంగెఁ బెల్లుతోన్ 66

**అర్థము .** బలములన్ = సైన్యములను, వేగమై = వేగముతో, కదలన్ = కదలునట్లు, పంపు(డు, పన్ను(డు = మిక్కిలి సిద్ధపటుపు(డు, అంచున్, నల్వల(కులన్ (నలు + వల(కులన్) = నాలుగు దిక్కులందును, పాటి - పాటి, పడవాళులు = సేనాధిపతులు, సిద్ధులలోనన్, చాటు, పేరులివు (పేరు + ఉలివు) = పెద్ద ధ్వని, ఒగిన్ = క్రమముగా, పర్వన్ = వ్యాపింప(గా, తద్ + పృధుతర + ఉరుతర +ఆహతిన్= దాని మిక్కిలి పెద్ద, మిక్కిలి గొప్ప దెబ్బచే, సేన = సైన్యము,మారుత + ఆకుల - చలత్ + అంబురాశి - పటు -ఘోషము + పోలెన్ = గాలిచే( గల(గి చలించు సముద్రముయొక్క తీవ్రమైన ధ్వని విధమున, పెల్లులోన్= ఆధిక్యముతో, చెలంగెన్ = మ్రోసెను

**తాత్పర్యము .** 'సేనలను వేగముగా( గదల(బంపు(డు, మిక్కిలి సిద్ధపటుపు(డు' అనుచు నాలుగుదిక్కులకును బరువెత్తి పరువెత్తి సేనాధిపతులు సిద్ధులలో( జాటు పెద్దధ్వని క్రమముగా వ్యాపింప(గా దాని గొప్పదెబ్బచే సైన్యము గాలిచే( గల(గి చలించు సముద్రముఘోషము విధమున మ్రోసెను

**విశేషములు.** అలంకార ముపమ వల(కులు - వలను + లు 'కలన్వాదుల నువర్ణంబు కుజ్జగు బహువచనము పరంబగునపుడు నిత్యముగా నగు ' బాల ఆచ్ఛిక 18 వల + కుజ్ + లు 'జిత్తు బిందుపూర్వంబగు' బాల తత్సమ 19

వ. తదవసరంబున 67

**అర్థతాత్పర్యములు .** ఆ సమయమున - తరువాతి పద్యముతో నన్వయము

### కుమారస్వామి సేనలో( జతురంగబలముల యుద్ధసన్నాహము

**చ కమలజు నీవి( బక్షములు క్రమ్మఱ నద్రులు గాంచి వజ్రితో**
**సమరము సేయ నెత్తుగతి సంభృతహేమకుధావిభాసితాం**
**గముల వరాస్పదం బడర గంధగజంబులు పన్నివచ్చె వే**
**గమున( గడంగుచున్ బ్రళయకాల సముద్ధ ఘనాఘనాకృతిన్ 68.**

**అర్థము .** అద్రులు = కొండలు, కమలజు నీవిన్ (కమలజు + ఈవిన్) = బ్రహ్మ ఔదార్యముతో, క్రమ్మఱన్ = మరల, పక్షములు = ఱెక్కలు, కాంచి = ఒంది, వజ్రితోన్= వజ్రముగలవానితో - ఇంద్రునితో, సమరము + చేయన్ = యుద్ధము చేయుటకు, ఎత్తు - గతిన్ = దండెత్తు విధమున, సంభృత - హేమ - కుధా - విభాసిత + అంగములన్ =కూర్ప(బడిన, బంగారు, చిత్రకంబళములచే(

ప్రకాశించిన శరీరములతో, వర + ఆస్పదంబు = శ్రేష్ఠమైన స్థానము, అడరన్ = అతిశయింపఁగా, గంధ - గజంబులు = మదపుటేనుఁగులు, ప్రళయ - కాల - సముత్థ - ఘనా - ఘన + ఆకృతిన్ = ప్రళయసమయమునందు లేచిన వర్షాకాలపు మేఘముల ఆకారముతో, వేగమునన్ = శీఘ్రముగా, కడంగుచున్ = పూనుచు, పన్నివచ్చెన్ = వ్యూహమయి వచ్చెను

**తాత్పర్యము :** కొండలు బ్రహ్మ ఔదార్యముచే మరల ఱెక్కలు పొంది యింద్రునితో యుద్ధముచేయుటకు దండెత్తు విధమున బంగారు చిత్ర కంబళములతోఁ బ్రకాశించు మేనులతో నా స్థాన మతిశయింప మదపుటేనుఁగులు ప్రళయసమయవర్షాకాలమేఘముల ఆకారముతో శీఘ్రముగా వ్యూహమయి వచ్చెను

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష ఉపమ

చ **అవి వివిధాస్త్రశస్త్రనికరాన్వితులై తనరంగ సారథుల్**
**పవనజవంబునం బొలయు భద్రహయంబులఁ బన్ని తేర నా**
**హవజయకాంక్షతో రథికు లంగతలత్రసమేతులై మహో**
**త్సవగతి నెక్కి రా నమితజైత్రరథంబులు వచ్చెఁ బెల్లుతోన్** 69

**అర్థము :** సారథుల్ = రథము నడపువారు, అవిన్ = కాంతితో (?), వివిధ + అస్త్ర - శస్త్ర - నికర + అన్వితులు + ఐ = పలురీతుల్లయిన అస్త్రములు శస్త్రములు అనువానితోఁగూడినవారయి, తనరంగన్ = ఒప్పఁగా, పవన - జవంబునన్ = వాయువేగముతో, పొలయు = ఒప్పునట్టి, భద్ర - హయంబులన్ = మేలుజాతి గుఱ్ఱములను, పన్నితేరన్ = కట్టి తీసికొనిరాఁగా, రథికులు = రథములపై నుండి యుద్ధము చేయువారు, ఆహవ - జయ - కాంక్షతోన్ = యుద్ధవిజయమునందుఁ గోరిక గలవారయి, అంగతలత్ర - సమేతులు + ఐ = కవచములతోఁ గూడినవారయి, మహత్ (మహా) + ఉత్సవ - గతిన్ = గొప్పవేడుకతో, ఎక్కిరాన్, అమిత - జైత్ర - రథంబులు = మితిలేని జయశీలములైన రథములు, పెల్లుతోన్ = ఆధిక్యముతో, వచ్చెన్

**తాత్పర్యము .** సారథులు వివిధాస్త్రశస్త్రముల సమూహముతోఁ గూడి వాయువేగముతో నొప్పు మేలుజాతిగుఱ్ఱములను గట్టి తేఁగా, రథికులు యుద్ధ విజయమునందలి కోరికతోఁ గవచధారులయి గొప్పవేడుకతో నెక్కిరాఁగాఁ బెక్కు జయశీలములగు రథము లధికముగా వచ్చెను

**విశేషములు .** పద్యారంభమున మా రా కవి ప్రతిలో 'అని' అని కలదు అనిన్ = యుద్ధమునందు అని అర్థము చెప్పవచ్చును కాని తక్కిన మూఁడు పాదములందును ప్రాసస్థానముల వకారము గలదు కావునఁ బ్రాసమైత్రి చెడును వావిళ్ల ప్రతిలోను, సాఅ ప్రతిలోను 'అవి' యని కలదు అవి యను పదమునకు అర్థములు పెక్కు గలవు కాని ఒక్కటియు ప్రకరణోపయోగిగాఁగనవచ్చుట లేదు ఏదో కొంత మేలని 'కాంతి' యనునర్థము గ్రహింపఁబడినది

చ కరువలి రూపు చేకొనియెఁ గంధి తరంగలు మూర్తిఁ దాల్చె నా
వరుస జవాతిరేకముల వల్గన ధావన లంఘనంబులన్
దరణి రథాశ్వసంహతికిఁ దా రధికం బనఁ జాలి చాల భీ
కరగతిఁ బన్ని వచ్చెఁ దురగంబులు నల్దెస లేఁగి మెట్టుచున్ 70

**అర్థము .** తురగంబులు = గుఱ్ఱములు, కరువలి = గాలి, రూపు - చేకొనియెన్ = ఆకారముఁదాల్చెను కంధి - తరంగలు = సముద్రపుటలలు, మూర్తిన్ = రూపమును, తాల్చెన్ = ధరించెను, నాన్ = అనఁగా, వరుసన్ = క్రమముతో, జవ + అతిరేకములన్ = వేగాతిశయములందును, వల్గన - ధావన - లంఘనంబులన్= దౌడుతీయుట, పరువెత్తుట, దుముకుట అనువానియందును, తరణి - రథ + అశ్వ - సంహతికిన్ = సూర్యుని రథము యొక్క గుఱ్ఱముల సమూహము కంటె, తారు = తాము, అధికంబు + అనన్ + చాలి = ఎక్కువ యనఁ జాలి, నల్దెసలు = నాలుగు దిక్కులును, ఏఁగి, మెట్టుచున్ = తిరుగుచు, చాలన్ - భీకర - గతిన్ = మిక్కిలి భయంకరమగు విధమున, పన్ని - వచ్చెన్ =సిద్ధపడివచ్చెను

**తాత్పర్యము .** వాయువు రూపుఁదాల్చెనా, సముద్రపుటలలు ఆకారము ధరించెనా యన వేగాతిశయమునను, వల్గనము, ధావనము, లంఘనము అనువానియందును సూర్యరథాశ్వములను మించెననఁజాలి గుఱ్ఱములు మిక్కిలి భయంకరముగ నాలుగు దిక్కులను సంచరించుచు సిద్ధపడివచ్చెను

**విశేషములు:** అలంకారము ఉత్ప్రేక్ష అతిశయోక్తి నల్దెసలు -ద్విగుసమాసము 'ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుగ నగు మిశ్రంబునకుఁగాదు' బాల సమాస 18 అయినను ఇట బహువచనమగుట విశేషము

క పలకలు నొడ్డనములుఁ, గ
త్తలములు నసి శక్తి కుంతతతియుంగొని భూ
తల మెల్లఁ గప్పికొని కా
ల్బలములు చనుదెంచెఁ గాలు బలముల పోలెన్ 71

**అర్థము :** పలకలున్ = డాలులును, ఒడ్డనములున్ = కేడెములును, కత్తలములున్ = కవచములును, అసి - శక్తి - కుంత -- తతియున్ = కత్తులయు, శక్త్యాయుధములయు, ఈఁటెలయు సమూహమును, కొని, భూతలము + ఎల్లన్ = భూమి యంతయును, కప్పికొని = ఆక్రమించుకొని, కాల్బలము = కాలి బంటులసేన - పదాతి సైన్యము, కాలు - బలములు + అ - పోలెన్ = యముని సైన్యములే యను విధమున, చనుదెంచెన్

**తాత్పర్యము.** పదాతి సైన్యము పలకలును, కేడెములును, కవచములును, కత్తులు, శక్తులు, ఈఁటెలు ధరించి భూమియంతయు నాక్రమించుకొని కాలుని బలములవలె వచ్చెను

**విశేషములు :** అలంకార ముత్ప్రేక్ష

## కుమారుఁడు గజము నారోహించుట

వ ఇ ట్లమరశిబిరంబులం గల చతురంగబలంబులు రణరంగ జయోద్యుక్తులై పన్ని నడచి రంతం గుమారుం డుమామహేశ్వర చరణ స్మరణ పరిణతాంతఃకరణుండై యుద్ధసన్నద్ధుం డగుటయు మున్ను సన్నాహంబు సేసి మహామాత్రపుత్త్రు లతిశుభలక్షణలక్షితులై రణ జయా భీష్ట చేష్టలం దనరు భద్రగజంబుఁ దెచ్చి నిలిపిన 72

**అర్థము .** ఇట్లు, అమర - శిబిరంబులన్ = దేవతల గుడారములలో, కల= ఉన్న, చతురంగ బలంబులు = రథములు, ఏనుఁగులు, గుఱ్ఱములు, కాల్బంటులు అను నాలుగువిధములయిన సేనలును, రణ - రంగ - జయ + ఉద్యుక్తులు + ఐ = యుద్ధరంగవిజయమునకుఁ బూనినవారయి, పన్ని = సిద్ధపడి, నడచిరి, అంతన్, కుమారుండు, ఉమా - మహేశ్వర - చరణ - స్మరణ - పరిణత + అంతః కరణుండు + ఐ = పార్వతీశ్వరుల పాదముల స్మరణముచేఁ బండిన మనస్సుగలవాఁడయి, యుద్ధసన్నద్ధుండు + అగుటయున్ = యుద్ధ సంసిద్ధుఁడగుటయును, మున్ను = ముందు, సన్నాహము + చేసి = సిద్ధము చేసి, మహామాత్ర - పుత్త్రులు = ప్రధానులైన మావటివారి పుత్త్రులు, అతి - శుభ - లక్షణ - లక్షితులు + ఐ = మిక్కిలి మంగళకరములయిన లక్షణములచేఁ జూడఁబడినవారయి, రణ - జయ + అభీష్ట - చేష్టలన్ = యుద్ధవిజయముచేఁ గోరఁబడిన పనులతో - యుద్ధమున గెలుచుటకు వలయు పనులతో, తనరు = ఒప్పునట్టి, భద్ర - గజంబున్ = మదపుటేనుఁగును, తెచ్చి, నిలిపినన్ = నిలుపఁగా

**తాత్పర్యము .** ఇట్లు దేవతల స్కంధావారములందుఁ గల చతురంగ బలములు యుద్ధమున గెలుపుసాధింపఁబూని సిద్ధపడి నడచెను అంతఁ గుమారస్వామి పార్వతీశ్వరుల పాదధ్యానముచేఁ బండిన మనస్సు గలవాఁడయి యుద్ధసంసిద్ధుఁ డగుటయును, మున్ను సిద్ధపఱిచి ప్రధానులైనమావటివారి పుత్త్రులు మిక్కిలి శుభలక్షణములచే నొప్పినవారయి యుద్ధజయమునకు వలయు చేష్టలతో నొప్పు భద్రగజమును దెచ్చి నిలుపఁగా - తరువాతి పద్యముతో నన్వయము

క  **వికసితపుష్కరయుతమై**
**ప్రకటితవంశాఢ్యమై విభాసితశృంగా**
**ధికమై విలసితమునఁ దఱు**
**గక షణ్ముఖుమ్రోల నిలిచెఁ గరి గిరివోలెన్** 73

**అర్థము** వికసిత - పుష్కర - యుతము + ఐ = వికసించిన తుండాగ్రముతోఁ గూడినదయి (కరి), వికసించిన పద్మములతోఁ గూడినదయి (గిరి), ప్రకటిత - వంశ + ఆఢ్యము + ఐ = ప్రసిద్ధమయిన జాతితో (కరి) వెదురులతో సంపన్నమయి (గిరి), విభాసిత - శృంగ + అధికము + ఐ = కొమ్ములతో (దంతములతో) గొప్పదయి (కరి), ప్రకాశించిన శిఖరముతో గొప్పదయి (గిరి), విలసితమునన్ = ప్రకాశమున, తఱుగక = తగ్గక, కరి = ఏనుఁగు, గిరి + పోలెన్ = కొండ విధమున, షణ్ముఖు (షష్ + ట్ + ముఖు) - మ్రోలన్ = కుమారస్వామి యెదుట, నిలిచెన్

**తాత్పర్యము:** వికసించిన పుష్కరముతోఁ (తుండాగ్రముతో) గూడినదయి ప్రసిద్ధమయిన వంశముచే (జాతిచే) సంపన్నమయి, విభాసితములయిన శృంగములతో (దంతములతో) గొప్పదయి, (కరి) వికసించిన పుష్కరములతోఁ (తామరపూలతో) గూడినదయి, ప్రసిద్ధమయిన వంశముచే (వెదురుచే) సంపన్నమయి, విభాసితములయిన శృంగములతో (శిఖరములతో) గొప్పదయి, ప్రకాశమున క్షీణింపక గిరి వలె కుమారస్వామి యెదుర నిలిచెను

**విశేషములు .** అలంకారము శ్లేషమూలకోపమ

వ  **త దవసరంబునం గుమారుం డనేకమునిగణాశీర్వాద వేదనాద జయజయధ్వనులతో రణజయాతోద్యంబులు చెలంగ జయావిజయాది సురాంగనా దత్త పంచమణి శేషాక్షతాకలిత లలితోత్తమాంగుం డగుచుం జనుదెంచి.** 74

**అర్థము** తద్ + అవసరంబునన్, కుమారుండు, అనేక ముని - గణ + ఆశీర్వాద - వేద - నాద - జయజయ -ధ్వనులతోన్ = పెక్కురు మునుల సమూహముయొక్క దీవెనలయు, వేదనాదములయు, జయజయ అనువాని యొక్కయు ధ్వనులతో, రణ - జయ + ఆతోద్యంబులు = యుద్ధవిజయమునకైన వాద్యములు, చెలంగన్ = ధ్వనింపఁగా, జయా - విజయా + ఆది - సుర + అంగనా - దత్త - పంచ - మణి - శేష + అక్షత + ఆకలిత - లలిత + ఉత్తమాంగుండు = జయ, విజయ మున్నగు దేవతాస్త్రీలచే నీఁబడిన నీల, వజ్ర, పద్మరాగ, మౌక్తిక ప్రవాళము లనెడి అయిదుమణులతోడి సేసఁబ్రాలతోఁ గూడి మనోహరమైన శిరస్సు గలవాఁడు, అగుచున్, చనుదెంచి = వచ్చి

**తాత్పర్యము .** ఆ సమయమునఁ గుమారస్వామి పెక్కండ్రు మునుల ఆశీర్వాదనాదములు, వేదనాదములు, జయజయనాదములు అనువానితో యుద్ధ విజయవాద్యములు మ్రోయఁగా, జయ, విజయ యనెడి దేవతా స్త్రీ లొసఁగిన నీలాది పంచమణుల సేసఁబ్రాలతోఁ గూడిన శిరస్సు గలవాఁడగుచు వచ్చి- తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** 'జయ, విజయ' అంగనలు గావున 'జయా విజయాది' అని యుండవలయునని తోఁచెడిని కాని యెల్ల ప్రతులలోను 'జయవిజయాది' అనియే యున్నది

చ గళితమదప్రవాహములు క్రమ్మెడు నిర్ఝరవాఃప్రవాహసం
కులముగ, భూషణోరుమణికోటినిజాంగమణిప్రభాతిగా,
నలి గజరూపకామగమనంబులు గైకొని క్రాలు రోహణా
చల గతిఁ బొల్చు భద్రకరి షణ్ముఖుఁ డెక్కె మహోత్సవంబునన్ 75

**అర్థము .** గళిత - మద - ప్రవాహములు = కాఱిన మదజల ప్రవాహములు, క్రమ్మెడు = వ్యాపించునట్టి, నిర్ఝర - వార్ (ః) + ప్రవాహ - సంకులము + కన్ = సెలయేఱుల నీటిప్రవాహముల సమూహము కాఁగా, భూషణ + ఉరు - మణి - కోటి = అలంకారములందలి పెద్దమణుల సమూహము, నిజ + అంగ - మణి - ప్రభాతి + కాన్ = తన శరీరమునందలి మణుల విశేషకాంతి కాఁగా, నలిన్ = ఉత్సాహముతో, గజ - రూప - కామ - గమనంబులు = గజముయొక్క ఆకారముతో నిచ్చవచ్చినపోకడలు, కైకొని = స్వీకరించి, క్రాలు = ఒప్పునట్టి, రోహణ + అచల - గతిన్ = రోహణమనెడి కొండ విధమున, పొల్చు = ఒప్పునట్టి,

భద్ర-కరిన్ = మదగజమును, షణ్ముఖుఁడు (షష్ + ట్ + ముఖుఁడు)= కుమారస్వామి, మహత్ (మహో) + ఉత్సవంబునన్ = గొప్ప వేడుకతో, ఎక్కెన్

**తాత్పర్యము** కాఱిన మదజలప్రవాహములు వ్యాపించు సెలయేఱుల జలప్రవాహ సమూహములు కాఁగా, అలంకారములందలి గొప్ప మణుల సమూహము తనమేనియందలి మణుల విశేషకాంతి కాఁగా, నుత్సాహముతో గజాకార కామగమనములను గైకొనిన రోహణాచలమువలె నొప్పు మదగజమును గుమారస్వామి మహోత్సవముతో నధిరోహించెను

**విశేషములు.** అలంకారము ఉపమ రూపకానుప్రాణితము

**వ త దవసరంబున హరి పురందర దిగధీశ్వరాది సురవరులు నఖిల భువనభవనాధీశ్వరులు సమరసన్నద్ధులై తమతమ వాహనంబు లెక్కి కుమారు ముందఱు గడచి జయచూళిం జేకొని యొడ్డనంబులం దీర్చుచుండి రంత నంతకమున్న తద్వృత్తాంతం బంతయు నెఱింగి యుగాంత కృతాంతకుండునుం బోలెం గోపానలోద్దీపితాంతరంగుండై తారకాసురుం డనంత దానవ సామంతాన్వితాహవసన్నద్ధుండై సురవరులపైఁ దెరలనెత్త నుద్యుక్తుండగుడు నక్షణంబ** **76**

**అర్థము.** తద్ + అవసరంబునన్ = ఆ సమయమునహరి - పురందర - దిశ్ (క్) + అధి + ఈశ్వర + ఆది - సుర - వరుల = విష్ణువు, ఇంద్రుఁడు, దిక్పాలురు మున్నగు దేవతాశ్రేష్ఠులు, అఖిల - భువన - భవన + అధి + ఈశ్వరులు = ఎల్ల లోకముల ప్రభువులు, సమర - సన్నద్ధులు + ఐ = యుద్ధమునకు సిద్ధపడినవారయి, తమ తమ వాహనంబులు + ఎక్కి, కుమారు - ముందఱు, కడచి = అతిక్రమించి, జయచూళిన్ = జయచూళియను పేరుగల వ్యూహమును జయము గలిగించు చాపాగ్రమును (?), కైకొని = స్వీకరించి, ఒడ్డనంబులన్ = వ్యూహములను, తీర్చుచున్ + ఉండిరి, అంతన్, అంతకున్ + అ - మున్ను+ అ = అంతకు మునుపే, తద్ + వృత్తాంతంబు + అంతయున్, ఎఱింగి, యుగ + అంత - కృతాంతకుండునున్ + పోలెన్ = ప్రళయకాలయముని విధమున, కోప + అనల + ఉత్ + దీపిత + అంతరంగుండు + ఐ = కోపమనెడి అగ్నిచేత, మిక్కిలి ప్రకాశింపఁజేయఁబడిన మనస్సుగలవాఁడయి, తారక + అసురుండు, అనంత - దానవ - సామంత + అన్విత + ఆహవ - సన్నద్ధుండు + ఐ = అంతులేని రాక్షస సామంతరాజులతోఁ గూడిన యుద్ధమునకు సిద్ధపడినవాఁడయి, సుర -వరుల

పైన్ = దేవతాశ్రేష్ఠులపై, తెరలన్ + ఎత్తన్ = దండెత్తుటకు, ఉద్యుక్తుండు = పూనినవాఁడు, అగుడున్ = అయినంతనే, అక్షణంబు + అ = వెంటనే

**తాత్పర్యము** ఆ సమయమున విష్ణువు, ఇంద్రుఁడు దిక్పాలురు మున్నగు దేవశ్రేష్ఠులును, ఎల్ల లోకముల ప్రభువులును యుద్ధ సంసిద్ధులయి తమతమ వాహనము లెక్కి కుమారస్వామి ముందటిభాగ మతిక్రమించి, జయచూళిని స్వీకరించి వ్యూహములు తీర్చుచుండిరి అంత అంతకుమునుపే, ఆ వృత్తాంతమంతయు నెఱిఁగి ప్రళయకాలయముని విధమునఁ గ్రోధమనెడి అగ్నిచే వెలిఁగిన మనస్సు గలవాఁడయి, తారకాసురుఁడు పెక్కంద్రు రాక్షస సామంత రాజులతోఁగూడి యుద్ధసంసిద్ధుఁడై దేవతాశ్రేష్ఠులపయి దండెత్త నుద్యమించి నంతనే - తరువాతి పద్యముతో నన్వయము

**తారకుని యుద్ధ సన్నాహము**

**సీ కరులపై మేఘడంబరములో? సంధ్యాను**
**రాగ మేఘాడంబరమ్ము లొక్కొ?**
**కరులపైఁ గేతనోత్కరములో? సాద్భుతో**
**ద్భూతోగ్ర కేతు సంఘాత మొక్కొ?**
**కరులపై వరధరాధర ధర ముకుటాగ్ర**
**మణిగణములో? యుడుగణములొక్కొ?**
**కరికరముక్తశీకరములో? ఘనవీధి**
**వాహినీ విమల ప్రవాహ మొక్కొ?**

**ఆ యనఁగఁ గరులు నభము నరదాశ్వ భట తతి**
**ధరణీతలముఁ గప్పి సురవిరోధి**
**బలము లిట్లు పన్ని వచ్చెనా పటురజ**
**స్తమయుతప్రదోషతా విభాతి** 77

**అర్థము .** కరులపైన్ = ఏనుఁగుల మీఁద, మేఘడంబరములో = గొడుగులో, సంధ్యా + అనురాగ - మేఘ - ఆడంబరములు + ఒక్కొ = సంధ్యననుసరించి ఎఱ్ఱనైన మేఘముల విజృంభణములో

కరులపైన్, వర - ధరాధర - ధర - ముకుట + అగ్ర - మణి - గణములో = శ్రేష్ఠులైన రాజులు ధరించు కిరీటముల కొనలందలి రత్నముల సమూహములో,

కరి - కర - ముక్త - శీకరములో = ఏనుఁగుల తొండములచే, విడువఁబడిన తుంపరలో, ఘనవీధి- వాహినీ = ఆకాశగంగయందలి, విమల - ప్రవాహము + ఒక్కో = స్వచ్ఛమైన ప్రవాహమో,

అనఁగన్, కరులున్ = ఏనుఁగులును, నభమున్ = ఆకాశమును, అరద + అశ్వ - భట - తతిన్= రథములయు, గుఱ్ఱములయు, భటులయు, సమూహమును, ధరణి - తలమున్ = భూతలమును, కప్పి, పటురజస్ + తమ + యుత - ప్రదోషతా -విభాతిన్= తీవ్రమైన, ధూళివలని, చీఁకటితోఁ గూడిన మునిమాపుయొక్క కాంతితో (విధమున) - తీవ్రమైన రజోగుణ తమోగుణములతోఁ గూడిన గొప్ప తప్పు విధమున అని యర్థాంతరము, సుర - విరోధి - బలములు = రాక్షసుని (తారకుని) సేనలు, ఇట్లు, పన్ని = యుద్ధ సన్నద్ధములయి, వచ్చెనో

**తాత్పర్యము** ఏనుఁగులపై ఛత్రములా? సంజచే నెఱ్ఱనైన మేఘములా? ఏనుఁగులపైఁ బతాకములా? ఆశ్చర్యకరముగాఁ బొడిచిన తోఁకచుక్కలా? ఏనుఁగులపై రాజశ్రేష్ఠులు ధరించిన కిరీటముల కొనలందలి రత్నములా? చుక్కల గుంపులా? ఏనుఁగుల తొండములు చిమ్మిన తుంపరలా? ఆకాశగంగ నిర్మల ప్రవాహమా? అనునట్లు ఏనుఁగులును, ఆకాశమును రథతురగభటుల సమూహమును, భూతలమును గప్పి అధికమైన ధూళివలని చీఁకటితోడి మునిమాపు విధమున అధికమైన రజస్తమోగుణములతోడి గొప్ప తప్పు విధమున - తారకుని సేనలు యుద్ధసన్నద్ధములయి వచ్చెను

**విశేషములు .** అలంకారము సందేహము, ఉపమ, శ్లేషము, అరద, శబ్దము తద్భవమయ్యు నీకవిచేఁ దత్సమముగాఁ బలుచోట్లఁ బ్రయుక్తమయినది నీకవిచేఁ దత్సమ తమ యుత - 'తమః' అను అకారాంతశబ్దముగూడఁ గలదు చూడు సూ ని

క  నయమున నల వలవులతో
రయమునఁ దెగ రాసి క్రింద రాఁబొడి రాలం
బయి నదరు లెగయఁ ద్రిజగ
ద్భయదములై దానవేంద్రుబలములు నడచెన్  78

**అర్థము .** నయమునన్ = బాగుగా, అలవు + అలవులతోన్ = బలములు బలములతో, రయమునన్ = శీఘ్రముగా, తెగన్ + రాసి = మిక్కిలి ఒరసికొని, క్రిందన్, రాఁబొడి = రాతిపొడి, రాలన్ = రాలఁగా, పయిన్ = మీఁద, అదరులు

= మిడుఁగుఱులు - నిప్పుకణములు, ఎగయన్ = ఎగురఁగా, దానవ + ఇంద్రు - బలములు = రాక్షసరాజయిన తారకాసురుని సేనలు, త్రిజగత్ + భయదములు + ఐ = ముల్లోకములకును వెఱపు గలిగించునవియై, నడచెన్

**తాత్పర్యము.** రాక్షసరాజగు తారకుని సేనలు ఒకదానితో నొకటి బాగుగా వేగముతో రాసికొని క్రింద ఆయుధాదుల టాతిపడి రాలఁగా, మీఁదికి మిడుఁగుఱు లెగురఁగా మూఁడులోకములకును వెఱపు గలిగించునవియై నడచెను

**వ ఇట్లు తారకాసురుం డపార చతురంగ బల సమన్వితుండై యాసుర భావంబునం దెరల నెత్తివచ్చి సంగరంబునం బ్రతిఘటించి యొడ్డణంబులు దీర్చినం దత్‌క్షణంబ 79**

**అర్థము.** ఇట్లు, తారక + అసురుండు, అపార - చతురంగ - బల - సమన్వితుండు + ఐ = అధికములయిన, రథగజతురగపదాతులనెడి నాలుగు విధములయిన సేనలతోఁ, గూడినవాఁడయి, ఆసుర - భావంబునన్ = రాక్షసత్వముతో, తెరలన్ + ఎత్తి వచ్చి = అతిశయింప దండెత్తివచ్చి, సంగర - రంగంబునన్ = యుద్ధరంగమునందు, ప్రతిఘటించి = ఎదిర్చి, ఒడ్డణంబులు = వ్యూహములు, తీర్చినన్ = తీర్పఁగా, తత్ + క్షణంబు + అ = ఆ క్షణమే

**తాత్పర్యము :** ఇట్లు తారకాసురుఁడు అపారము లయిన చతురంగ బలములతోఁ గూడినవాఁడయి రాక్షసత్వముతో దండెత్తి వచ్చి యుద్ధరంగమున నెదిర్చి వ్యూహములు పన్నఁగా నాక్షణమే - తరువాతి పద్యముతో నన్వయము

**సీ భువనంబు లన్నియుఁ బొలియింప హరుచేతఁ**
**బనివడి గర్జిల్లు ప్రమథగణమొ**
**జగమెల్ల నొక్కట సమయింప నెత్తెడు**
**సంవర్తసమవర్తి సంకులంబొ**
**నిఖిల విష్టపములు నిమిషార్ధమున మ్రింగఁ**
**గవియు సంహారభైరవ చయంబొ**
**యఖిలలోకముల నేకాహుతిఁ గొన నెత్తు**
**కాలాగ్ని రుద్ర సంఘాత మొక్కొ**

**ఆ యనఁగ నతిభయంకరాకారమై కనుఁ**
**గొనఁగ దృష్టి కధికగోచరంబు**
**కాఁగఁ బన్ని నిలిచెఁ గాయ్యుతో దానవ**
**కులబలంబు నేల కొడివడంగ 80**

**అర్థము** భువనంబులు + అన్నియున్ = లోకములన్నియును, పొలియింపన్ = సంహరించుటకు, హరుచేతన్ = హరునిచే, పనివడి = నియమింపఁబడి, గర్జిల్లు = ఉఱుమునట్టి, ప్రమథగణమొ = ప్రమథుల సమూహమో

జగము + ఎల్లన్ = లోకమంతయు, ఒక్కటన్ = ఒక్కసారిగా, సమయింపన్ = నశింపఁజేయుటకు, ఎత్తెడు = పూనెడు, సంవర్త - సమవర్తి - సంకులంబొ = ప్రళయసమయ యముల సమూహమో

నిఖిల - విష్టపములు = ఎల్లలోకములు, నిమిష + అర్ధమునన్ = అర నిముసములో, మ్రింగన్ = మ్రింగుటకు, కవియు = ఆక్రమించు, సంహార - భైరవ - చయంబొ = సంహరించు భైరవుల (శివగణాధిపుల) సమూహమో

అఖిల -లోకములన్ = ఎల్లలోకములను, ఏక + ఆహుతిన్ = ఒక్క వేలిమితో, కొనన్ = గ్రహించుటకు, ఎత్తు = పూను, కాల + అగ్ని - రుద్ర - సంఘాతము + ఒక్కొ = ప్రళయకాలమునందలి అగ్నులవంటి రుద్రుల సమూహమో

అనఁగన్, దానవ - కుల - బలంబు = రాక్షసవంశుఁడైన తారకు సేన, అతి - భయంకర + ఆకారము + ఐ = మిక్కిలి వెఱపుగొలుపు రూపుగలదయి, కనుఁగొనఁగన్ = చూచుటకు, దృష్టికిన్ = కంటికి, అధిక - గోచరంబు + కాఁగన్ = దుర్భరమయిన కాన్పు (చూపు) కాఁగా, కాయ్వుతోన్ = ఇచ్ఛతో, నేల = భూమి, కొడివడంగన్ = క్రుంగఁగా, పన్ని = యుద్ధమునకు సిద్ధపడి, నిలిచెన్

**తాత్పర్యము.** లోకముల నన్నిటిని సంహరింప హరునిచే నియమింపఁబడి యుఱుము ప్రమథగణమో, లోకమంతయు నొక్కసారిగా సంహరింపఁబూను ప్రళయకాలయముల సమూహమో, ఎల్ల లోకములను అరనిముసములో మ్రింగుట కాక్రమించు సంహారకులైన శివగణాధిపుల సమూహమో, అన్ని లోకములను ఒకే వేలిమిని గొనుటకుఁబూను ప్రళయాగ్నులవంటి రుద్రుల సమూహమో అనఁగా మిక్కిలి వెఱపుగొలుపు రూపు గలదయి, చూడ దుర్భరమయి దానవకులుఁడైన తారకుని సైన్యము నేల క్రుంగిపోవఁగా యుద్ధసన్నద్ధమయి కోరికతో నిలిచెను

**విశేషములు :** అలంకారము సందేహము

స్రగ్ధర కరు లా గోత్రాచలేంద్రౌఘములుగ, హయసంఘాతముల్ భూరి నీరా
కరసందోహంబుగా, భీకర రథతతి వృక్షప్రకీర్ణాటవుల్ గా
వరుసన్ వీరాగ్రగణ్యావలి దనరు మహావాహినుల్ కాఁగ, విశ్వం
భరయెల్లం దానయై తద్బల మిరుగడలన్ బన్ని ఘూర్ణిల్లుచుండెన్ 82

**అర్థము .** కరులు = ఏనుఁగులు, ఆ - గోత్ర + అచల + ఇంద్ర + ఓఘములు + కన్ = ఆ కులపర్వతరాజముల సమూహములు కాఁగా, హయ - సంఘాతముల్ = గుఱ్ఱముల సమూహములు, భూరి - నీర + ఆకర - సందోహంబు + కాన్ = మహా సముద్రముల సమూహము కాఁగా, భీకర - రథ-తతి = భయంకరములయిన రథముల సమూహము, వృక్ష - ప్రకీర్ణ + అటవుల్+ కాన్ = చెట్లచే విరివియైన అడవులు కాఁగా, వరుసన్ = క్రమముగా, వీర + అగ్ర-గణ్య + ఆవలి = వీరశ్రేష్ఠుల సమూహము, తనరు = ఒప్పునట్టి, మహత్ (మహా) వాహినుల్ + కాఁగన్ = గొప్పనదులు కాఁగా, తద్ + బలము = వారి సైన్యము, విశ్వంభర + ఎల్లన్ = భూమియంతయును, తాను + అ + ఐ = తానే యయి, ఇరు+ కడలన్ = రెండు పక్షములను, పన్ని = యుద్ధసన్నద్ధమయి, ఘూర్ణిల్లుచున్ + ఉండెన్ = తిరుగుడుపడుచుండెను

**తాత్పర్యము .** ఏనుఁగులు ఆ కులపర్వతముల సమూహములు కాఁగా, గుఱ్ఱముల సమూహములు మహాసముద్రముల సమూహము కాఁగా, భయంకరములయిన రథముల సమూహము చెట్లచే విరివియైన అడవులు కాఁగా, వీరశ్రేష్ఠుల సమూహము గొప్ప నదులు కాఁగా భూమియంతయు దానేయయి నిండి ఆ కుమారతారకుల సైన్యములు రెండు పక్షములందును యుద్ధ సన్నద్ధమయి తిరుగుడుపడుచుండెను

**విశేషములు :** అలంకారము రూపకము

వ. మఱియును - తరువాతి పద్యముతో నన్వయము 83

శా ఆ తుంగద్విరదారదాశ్వభట దేహత్రాణ భూషామణీ
శాతాస్త్రప్రకరాతిభీషణరుచుల్ జాజ్వల్యమానంబుగా
జ్యోతిర్లోకము కాఁపువచ్చెనొకొ నా శోభిల్లుఁ గాదేని వి
ఖ్యాతిం దద్బలభాతి వొల్చె నసుహృత్కాలాగ్నిపుంజంబొ నాన్ 84

**అర్థము.** ఆ రుచుల్ ఆ, తుంగ = ఎత్తయిన, ద్విరద = ఏనుఁగుల యొక్క, అరద = రథములయొక్క, అశ్వ = గుఱ్ఱములయొక్క, భట = భటుల యొక్క, దేహ - త్రాణ = కవచములయొక్క, భూషా = అలంకారములందలి, మణీ = మణులయొక్కయు, శాత + అస్త్ర - ప్రకర = వాఁడియైన బాణములయొక్క, సమూహముయొక్కయు, అతి - భీషణ - రుచుల్ = మిక్కిలి భయంకరములయిన కాంతులు, జ్యోతిస్ (ః) + లోకము = నక్షత్రముల సమూహము, కాఁపువచ్చెన్ + ఒకొ = నివసింపవచ్చెనా? నాన్ = అనునట్లు, జాజ్వల్యమానంబు + కాన్ = ప్రకాశమానముగా, శోభిల్లున్ = ప్రకాశించును కాదు + ఏనిన్ = లేదా, తద్ + బల - భాతి = వారి బలముల కాంతి, అసు - హృత్ + కాల + అగ్ని - పుంజంబొ - నాన్ = ప్రాణములను హరించు ప్రళయసమయాగ్నుల సమూహమో అనఁగా, విఖ్యాతిన్ = ప్రసిద్ధితో, పొల్చెన్ = ప్రకాశించెను

**తాత్పర్యము.** ఆ ఎత్తయిన ఏనుఁగులయు, రథములయు, గుఱ్ఱములయు, భటులయు కవచములయు, అలంకారములందలి మణులయు, వాఁడియైన బాణ సమూహములయు మిక్కిలి భయంకరములయిన కాంతులు నక్షత్రలోకము భూమికిఁ గాఁపురమువచ్చెనా యనునట్లు ప్రకాశమానముగా శోభిల్లును లేదా వారి సైన్యముల కాంతి ప్రాణహరమైన ప్రళయకాలాగ్నిపుంజమా యనఁ బ్రసిద్ధితోఁ బ్రకాశించెను

**విశేషములు.** అలంకార ముత్ప్రేక్ష 'అరద' అను రథ తద్భవరూపమును ఈ కవి తత్సమముగాఁ బ్రయోగించుచున్నాఁడు అసుహృత్కాలాగ్ని పుంజంబొ - నాన్ - శత్రువులకుఁ బ్రళయసమయాగ్ని సమూహమోయనఁగా - అనియును నర్థము చెప్పవచ్చును

**వ** ఇట్లఖిల భువన సామ్రాజ్య విభవైశ్వర్య శౌర్యాధిదేవతా కేళీరత్న కుట్టిమంబులుం బోలెఁ దేజరిల్లుచు నుభయబలంబులుం బన్ని ఘూర్ణిల్లుచుండె నట్టి యవసరంబునం దారకాసురుండు సురవరోరగ గరుడ గంధర్వ సిద్ధ విద్యాధరాద్యఖిల భువన భవనాధీశ్వరులు పూర్వ పరిచయంబులైనం దదీయానంతైశ్వర్య ప్రభావిభవాతిశయంబుల భేదింప నేరక, విభ్రాంతాంతరంగుం డగుచు నీ పన్నినిలిచిన గీర్వాణానంతసామంతు లెవ్వరెవ్వ రిందుధరనందనుండగు కుమారుం డెవ్వండని దనుజగురు నడిగినం గని వారి భావించి చూచి

**అర్థము** ఇట్లు, అఖిల కుత్కీలంబులున్ + పోలెన్, అఖిల + ఎల్ల , భువన =లోకములయొక్క, సామ్రాజ్య - విభవ + ఐశ్వర్య - శౌర్య + అధిదేవతా= సామ్రాజ్యవైభవము, ఐశ్వర్యము, శౌర్యము అనువానియొక్క, అధిదేవతా = అధిష్ఠానదేవతయొక్క, కేళీ - రత్న - కుత్కీలంబులున్ + పోలెన్= రత్నమయమైన క్రీడాపర్వతముల విధమున, తేజరిల్లుచున్= ప్రకాశించుచు, ఉభయ - బలంబులున్ = ఇరువురి సైన్యములును, పన్ని = యుద్ధసన్నద్ధములయి, ఘూర్ణిల్లుచున్ + ఉండెన్= తిరుగుడువడుచుండెను, అట్టి + అవసరంబునన్= అట్టి సమయమున, తారక + అసురుండు, సుర - వర - ఉరగ - గరుడ - గంధర్వ - సిద్ధ - విద్యాధర + ఆది + అఖిల - భువన - భవన + అధి + ఈశ్వరులు = దేవతాశ్రేష్ఠులు, నాగులు, గరుడులు, గంధర్వులు, సిద్ధులు, విద్యాధరులు మున్నగు నెల్లలోకముల ప్రభువులు, పూర్వపరిచయంబులు + ఐనన్ = ముందు తెలిసిన వారయినను, తదీయ + అనంత + ఐశ్వర్య - ప్రభా - విభవ + అతిశయంబులన్ = వారి అంతులేని ఐశ్వర్యముయొక్కయు, కాంతుల యొక్కయు, వైభవముల యొక్కయు ఆధిక్యములను, భేదింపన్+నేరక=వేర్పఱుపఁజాలక, విభ్రాంత+అంతరంగుండు + అగుచున్ = విశేషముగా భ్రాంతి నొందిన మనస్సు గలవాఁడు అగుచు, ఈ - పన్ని - నిలిచిన = ఈ యుద్ధసన్నద్ధమయి నిలిచిన, గీర్వాణ + అనంత - సామంతులు = దేవతల అంతులేని సామంతులు, ఎవ్వరు + ఎవ్వరు ? ఇందు ధర - నందనుండు = ఈశ్వరుని కుమారుఁడు అగు, కుమారుండు = కుమారస్వామి, ఎవ్వండు ? అని దనుజ - గురున్ = రాక్షస గురువైన శుక్రుని, అడిగినన్, కని, వారిన్, భావించి - చూచి = పరిశీలించి చూచి

**తాత్పర్యము** . ఇట్లు ఎల్లభువనముల సామ్రాజ్యవైభవములయు, ఐశ్వర్యములయు, శౌర్యములయు అధిష్ఠానదేవత రత్నమయక్రీడా పర్వతములోయనఁ బ్రకాశించుచు నిరువురి సైన్యములును యుద్ధసన్నద్ధములయి తిరుగుడువడుచుండెను అట్టి సమయమునఁ దారకాసురుఁడు దేవతాశ్రేష్ఠులు, నాగులు, గరుడులు, గంధర్వులు, సిద్ధులు, విద్యాధరులు మున్నగు నెల్లలోక ప్రభువులు మునుపు తెలిసినవారయినను వారి అంతులేని యైశ్వర్యములయుఁ దేజస్సులయు, విభవములయు నతిశయములచే వేర్పఱుపఁజాలక, విశేషభ్రాంతి నొందినవాఁడగుచు, ' ఈ యుద్ధసంసిద్ధులయి నిలిచిన దేవతల అసంఖ్యాక సామంతు లెవరెవరు? ఈశ్వరుని కొడుకగు కుమారస్వామి యెవఁడు?' అని రాక్షసగురువగు శుక్రు నడుగఁగా అతఁడు వారిని బరిశీలించి చూచి - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు** · అలంకార ముత్ప్రేక్ష

## శుక్రుఁడు తారకునకు అమరవీరులను నిరూపించుట

శా. **వీ రేకాదశరుద్రు, లష్టవసువుల్ వీ, రాదిశౌర్యోన్నతుల్**
**వీ, రయ్యిద్దఱు నశ్వినుల్, దినకరుల్ వీ రెన్నఁ బన్నిద్దఱున్,**
**ధీరుల్ సన్మఖహవ్యముఖ్యులు త్రయస్త్రింశాదిదేవాలి నా**
**వీరుల్ సు, మ్మమరేంద్రవైరి! సుమహద్విఖ్యాతకీర్తీశ్వరా? 86**

**అర్థము** అమర + ఇంద్ర - వైరి = దేవేంద్రునకు శత్రువయినవాఁడా! సుమహత్ + విఖ్యాత - కీర్తి + ఈశ్వరా = మిక్కిలి గొప్పదియు, ప్రసిద్ధమయినదియునైన కీర్తికి ప్రభువైనవాఁడా - తారకుఁడా!, వీరు, ఏకాదశ - రుద్రులు = పదునొకండ్రు రుద్రులు, వీరు, అష్ట - వసువుల్ = ఎనమండ్రు వసువులు, వీరు, ఆదిశౌర్య + ఉన్నతుల్ = ప్రమాణమయిన శౌర్యముచే నధికులు, అయ్యిద్దఱున్ (ఆ + ఇద్దఱున్), అశ్వినుల్, ఎన్నన్ = గణింపఁగా, వీరు, పన్నిద్దఱున్ = పండ్రెండుగురును, దినకరుల్ = సూర్యులు, ధీరుల్ = ధైర్యవంతులు, సత్ + మఖ - హవ్య - ముఖ్యులు = ఉత్తమ యాగ హవిస్సునకుఁ బ్రధానమైనవారు, త్రయస్త్రింశ + ఆది - దేవ + ఆలి - నాన్ = ముప్పదిమువ్వురు ముఖ్యదేవతల వరుస అనఁగా, వీరుల్ సుమ్ము

**తాత్పర్యము .** ఓయి దేవేంద్రవిరోధీ! మిక్కిలి గొప్పదియు, ప్రసిద్ధమయినదియు నగు కీర్తికి ప్రభువైన వాఁడా! తారకుఁడా!, వీరు పదునొకండ్రు రుద్రులు, వీరు ఎనమండ్రు వసువులు, వీరు ప్రామాణికమైన శౌర్యముచే నున్నతులు, ఆ యిరువురును అశ్వినీదేవతలు వీరు పండ్రెండుగురు సూర్యులు, వీరు ధీరులు, యజ్ఞహవిస్సునకు ముఖ్యులు అగు ముప్పదిమూవురుదేవతలును వీరులు సుమీ!

క **ఉద్యోగనిరతు లాయుధ**
**విద్యాగమకోవిదులు సవిస్తరకీర్తుల్**
**ప్రద్యోతనోరుతేజులు**
**విద్యాధరు లతులబలులు వీరులు ధీరుల్ 87**

**అర్థము .**(వీరు), ఉద్యోగ - నిరతులు = పూనికయందు ఆసక్తి గలవారు, ఆయుధ - విద్యా + ఆగమ - కోవిదులు = అస్త్రవిద్యయను శాస్త్రమునందు పండితులు, సవిస్తర - కీర్తుల్ = బాగుగా వ్యాపించిన కీర్తిగలవారు, ప్రద్యోతన +

ఉరు - తేజులు = సూర్యుని అధికమయిన తేజస్సు గలవారు, అతుల - బలులు = సాటిలేని పరాక్రమము గలవారు, వీరులు, ధీరుల్, అగు విద్యాధరులు

**తాత్పర్యము .** పూనికియందు ఆసక్తి గలవారు, అస్త్రవిద్యయందారితేఱినవారు, బాగుగా వ్యాపించిన కీర్తిగలవారు, సూర్యుని అధికమైన తేజస్సుగలవారు, సాటిలేని బలముగలవారు, వీరులు, ధీరులు అగు విద్యాధరులు వీరు

**క ఈతఁడు నైఋతి, దహనుం**
**డాతఁడు, వనధీశుఁ డీతఁ, డాతఁడు పవనుం,**
**డీతండు కిన్నరేశ్వరుఁ,**
**డాతం డురగాధినాథుఁ డమరవిరోధీ! 88**

**అర్థము** అమర - విరోధీ = దేవవైరీ - తారకా! ఈతఁడు, నైఋతి, ఆతఁడు, దహనుండు = అగ్ని, ఈతఁడు, వనధి + ఈశుఁడు = సముద్రాధిపతియగు వరుణుఁడు, ఆతఁడు, పవనుండు = వాయువు, ఈతఁడు, కిన్నర + ఈశ్వరుఁడు = యక్షరాజు అగు కుబేరుఁడు, ఆతండు, ఉరగ + అధినాథుఁడు = సర్పరాజు.

**తాత్పర్యము .** తారకాసురా ! ఇతఁడు నైఋతి అతఁడు అగ్ని, ఇతఁడు వరుణుఁడు, అతఁడు వాయువు, ఇతఁడు కుబేరుఁడు, అతఁడు సర్పరాజు

**క. అంతకు మును నినుఁ దలపడు**
**నంతకుఁ గ్రూరోగ్రదండ మంకించుచుఁ జీ**
**మంతకుఁ గైకొనఁ డసుర భ**
**టాంతక విక్రాంతి దేవతాంతక కంటే! 89**

**అర్థము .** దేవతా + అంతక = దేవాంతకా! తారకా! మును = ముందు, నినున్ = నిన్ను, తలపడు + అంతకున్ = ఎదిరించువఱకును, క్రూర + ఉగ్ర - దండము = క్రూరము, భయంకరమునైన దండము, అంకించుచున్ = త్రిప్పుచు, చీమ + అంతకున్ + కైకొనఁడు = ఇంచుకైనను లక్ష్యపెట్టఁడు, (అట్టి), అసుర-భట + అంతక - విక్రాంతిన్ = రాక్షస వీర నాశకమైన పరాక్రమము గలవానిని, అంతకున్ = యముని, కంటే = కంటివి + ఏ = చూచితివా?

**తాత్పర్యము .** ఓయి దేవాంతకా! తారకా! పూర్వము నిన్ను మార్కొనునంతవఱకును గ్రూరము, ఉగ్రమునైన దండమును ద్రిప్పుచు నించుకైనను గణింపఁడు అట్టి రాక్షస వీరనాశక పరాక్రముని యమునిఁ జూచితివా?

**విశేషములు** అలంకార మనుప్రాసము

క గోపతి కారుణ్యంబున
గోపతి సారూప్యవృత్తిఁగొని సురతతిలో
గోపతిపైఁ బొలు పమరిన
గోపతి నీశానుఁ గంటె గోపతివైరీ! 90

**అర్థము :** గోపతి - వైరీ = ఇంద్ర విరోధీ - తారకా!, గోపతి = పశుపతియైన ఈశ్వరుని యొక్క, కారుణ్యంబునన్ = దయచేత, గోపతి - సారూప్య - వృత్తిన్ = ఈశ్వరునితో సమానమగు రూపముయొక్క వర్తనమును, కొని = స్వీకరించి, సుర - తతిలోన్ = దేవతా సమూహములో, గోపతిపైన్ = వృషభముపై, పొలుపు + అమరిన = చక్కఁగా నొప్పిన, గోపతిన్ = దిక్పాలకుని, ఈశానున్ = ఈశాన్యదిగధిపతియగు ఈశానుని, కంటె? = చూచితివా?

**తాత్పర్యము.** ఓయి యింద్రవిరోధీ! తారకా! పశుపతి దయచే నీశ్వరునితో సదృశమైన రూపమును బొంది, దేవతలలో వృషభముపైఁ జక్కఁగా నొప్పిన దిక్పాలకుఁడగు ఈశానునిఁ జూచితివా?

**విశేషములు :** అలంకారము శ్లేషము, అనుప్రాసము

సీ. జంగమనగముల భంగి నత్యున్నతి
నింగితో రాయు మాతంగఘటలు
ధరణీతలం బొక్క పరువడి నెగసె నా
రమణఁ గ్రిక్కిఱిసిన రథచయంబుఁ
దనరారు వారాశి తరఁగల ఘటన నాఁ
గర మొప్పఁ బొలయు నత్తురగదళముఁ
బొలుపొందఁగా రెల్లు పూచిన విధమున
మునుకొను కొంతంపు మొగ్గరంబుఁ

తే దవర ముప్పొంగు గతిఁ గడితలల పిండుఁ
బొలయు దుప్పుల కదుపులు విలుబలంబుఁ
గలిగి సురలకై తొల్లి ఎన్నఁగ ఎఁగముల
నీకు మార్కొన్న వీరుఁ డిక్ష్వాకుఁడితఁడు 91

**అర్థము.** జంగమ - నగముల - భంగిన్ = నడగొండలవిధమున, అతి + ఉన్నతిన్ = మిక్కిలి ఎత్తుచే, నింగితోన్ = ఆకాశముతో, రాయు = ఒరయునట్టి, మాతంగ - ఘటలున్ = ఏనుఁగులగుంపులును,

ధరణీ -తలంబు = భూతలము, ఒక్క - పరువడిన్ = ఒక్క వరుసను, ఎగసెన్ + నాన్ = ఎగిరెనా యనునట్లు, రమణన్ = ఒప్పుగా, క్రిక్కిఱిసిన = ఎడములేకయున్న, రథ - చయంబున్ = రథముల సమూహమును,

తనరారు = ఒప్పునట్టి, వారాశి (వార్ + రాశి) = సముద్రముయొక్క, తరఁగల = అలలయొక్క, ఘటన - నాన్ = కూర్పు అనునట్లు, కరము + ఒప్పన్ = మిక్కిలి ఒప్పునట్లు, పొలయు = సంచరించు, ఆ + తురగ - దళమున్ = ఆ గుఱ్ఱముల దండును,

పొలుపు + ఒందఁగాన్ = చక్కఁగా, రెల్లు, పూచిన - విధమునన్, మునుకొను = అతిశయించు, కొంతంపు మొగ్గరంబున్ (కొంతము + మొగ్గరంబున్) = కుంతాకారముగా నుండు వ్యూహమును,

తవరము = లక్క, ఉప్పొంగు - గతిన్= ఉప్పొంగు విధమున, కడితలల - పిండున్ = ఆయుధవిశేషముల గుంపును, పొలయు - దుప్పుల - కదుపులున్ = సంచరించు దుప్పుల గుంపులును, విలు-బలంబున్ = ధనుర్బలమును, కలిగి, సురలకై = దేవతలకై, తొల్లి = పూర్వము, పెక్కులు - రణములన్ = పలు యుద్ధములందు, నీకున్ = నీతో, మార్కొన్న = ఎదురుకొన్న, వీరుఁడు, ఇతఁడు, ఇక్ష్వాకుఁడు

**తాత్పర్యము :** నడగొండల విధమున మిక్కిలి ఎత్తయి ఆకాశముతో రాయు నేనుఁగుల గుంపులును, భూతల మొక్కపెట్ట నెగసె ననువిధమునఁ గ్రిక్కిఱిసిన రథసమూహమును, ఒప్పెడు సముద్రపుటలల కూర్పు అనునట్లు మిక్కిలి ఒప్పు గలిగి సంచరించు గుఱ్ఱముల దండును, అందముగా రెల్లు పూచిన విధమున నతిశయించు కుంతాకారవ్యూహమును, లక్క ఉప్పొంగు విధమున ఆయుధవిశేషములగుంపును, సంచరించు దుప్పుల గుంపులును, ధనుర్బలమును గలిగి దేవతలకొఱకు పలుయుద్ధముల నీతో మార్కొనిన ఇక్ష్వాకుఁడనెడి వీరుఁ డితఁడు

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష తవర ముప్పొంగుగతిన్ - ఉపమ నీకు మార్కొ-న-నీతో మార్కొ-న 'షష్ఠీస్థానికంబగు కువర్ణకం బొక్కొకచో ద్వితీయాది విభక్తులకు మాఱుగాఁ దత్తదర్థంబులం జూపట్టెడి' ప్రౌఢ కారక 13 కడితలల పిండుఁ బోలయు దుష్టుల కదుపుల విలుబలంబు తృప్తికరముగా అర్థము కాలేదు

ఉ. వాలిన దాయవారిదొరవారి ననేకులఁ గూర్చుకొన్నఁ గా
కేల జయింపవచ్చునని యేర్పడనీ కని మాఱువన్నెనో
నా లలితామితోరునయనవ్రజతారకసంయుతాంగుఁడై
క్రాలు సహస్రలోచనుఁడు కౌశికుఁ డీతఁడు తారకాహ్వయా! 92

**అర్థము .** తారక + ఆహ్వయా = తారకుఁడను పేరుగలవాఁడా ! వాలిన = అతిశయించిన, దాయవారి - దొరవారిన్ = శత్రుపక్షపుఁబ్రభువులను, అనేకులన్ = పెక్కంద్రను, కూర్చుకొన్నన్ + కాక = కూర్చుకొనిననే కాని, ఏల - జయింపన్ - వచ్చున్ + అని =ఎట్లు గెలువవచ్చునని, ఏర్పడన్ = స్పష్టముగా, నీకున్, అనిన్ = య్ద్ధమునందు, మాఱు + పన్నెనో - నాన్ = ప్రతివ్యూహమును పన్నెనా అనునట్లు, లలిత + అమిత + ఉరు - నయన - వ్రజ - తారక - సంయుత + అంగుఁడు + ఐ = మనోహరములైన, అపరిమితములైన, గొప్ప కన్నుల సమూహముయొక్క, నల్లగ్రుడ్డులతోఁగూడిన శరీరముగలవాఁడయి, క్రాలు = ఒప్పునట్టి, సహస్రలోచనుఁడు = వేయి కన్నులు గలవాఁడు, కౌశికుఁడు = ఇంద్రుఁడు, ఈతఁడు

**తాత్పర్యము .** ఓయి తారకనామకుఁడా ! అతిశయించిన శత్రు పక్షపుఁబ్రభువుల ననేకులను గూర్చుకొననిదే యెట్లు గెలువవచ్చునని నీకు యుద్ధమునఁ బ్రతివ్యూహమును బన్నెనా యనునట్లు, లలితములయిన పెక్కు కన్నుల తారకములతోఁ గంటినల్లగ్రుడ్డులతోఁగూడిన శరీరముగలవాఁడయి యొప్పు వేయికన్నులు గల ఇంద్రుఁ డీతఁడు

**విశేషములు.** ప్రతిపక్షరాజవైన నీవు తారకుఁడవు గావున నట్టి పేరుగలవారిని బెక్కంద్రను అలంకారము శ్లేషోత్థాపితోత్ప్రేక్ష తారకాహ్వయా యను సంబుద్ధి యిట సార్థకము

మ. హరభాలాంబకజాతకోపశిఖి ధూమానీకసంభూత 'భీ
కర శూలాసి విలగ్న హస్త, సుమహత్కంకాళి'హుంకార ని
ష్ఠురదంష్ట్రాగ్రవిభాసితాస్య, విలయాటోపోగ్ర పూర్వామరే
శ్వర రక్తాసవపానమత్త యిది తచ్చాముండి దైత్యేశ్వరా ! 93

**అర్థము .** దైత్య + ఈశ్వరా = రాక్షసప్రభూ - తారకా! ఇది = ఈమె, హర హస్త, హర = ఈశ్వరునియొక్క, భాల = నొసటియందలి,అంబక = కంటినుండి, జాత = పుట్టిన, కోప = కోపమనెడి, శిఖి =అగ్నియొక్క, ధూమ + అనీక = పొగల గుంపునుండి, సంభూత = పుట్టిన, భీకర = భయంకరమయిన , శూల + అసి = శూల ఖడ్గములతో, విలగ్న= అనుసంధింపఁబడిన, హస్త = చేతులు గలది, సుమహత్ = మిక్కిలి గొప్పదియగు, కంకాళి = అస్థిపంజరము, గలది, హుంకార - నిష్ఠుర - దంష్ట్రా + అగ్ర = హుమ్మను ధ్వనిచే, పరుషమైన కోఱల కొనలచే, విభాసిత = ప్రకాశించిన,ఆస్య=ముఖముగలది, విలయ + ఆటోప + ఉగ్ర = ప్రళయసమయమునందలి విజృంభణముచే భయంకరమయినది, పూర్వామర + ఈశ్వర - రక్త + ఆసవ - పాన - మత్త = రాక్షసరాజుల రక్తమనెడి మద్యముయొక్క త్రావుటచే మదించినది, తత్ + చాముండి + ఆ చాముండి

**తాత్పర్యము:** ఓ రాక్షస ప్రభూ! తారకా! ఈశ్వరుని ఫాలలోచనమునుండి పుట్టిన క్రోధాగ్నిధూమసమూహమువలనఁ బుట్టిన భయంకర శూలఖడ్గములతోఁగూడిన చేతులు గలది, మిక్కిలి పెద్ద అస్థిపంజరము గలది, హుంకారముచే నిష్ఠురమైన కోఱలకొనలచేఁ బ్రకాశించు ముఖము గలది, ప్రళయ సమయమునందలి విజృంభణముచే భయకంరమైనది, రాక్షసరాజుల రక్తమనెడి మద్యమును ద్రావుటచే మదించినది అగు నీమె ఆ చాముండి

**విశేషములు .** అలంకారము - కోపశిఖి, రక్తాసవ -రూపకములు తచ్చాముండి - తద్ + చాముండి

శా **భాలాభీలవిలోచనానలరుచిభ్రాజిష్ణు, లుగ్రాహికా**
**పాలాకల్పు, లనల్పు, లుజ్జ్వల జటా భస్మాజినేందూద్వహుల్,**
**శూలాసిప్రముఖాఖిలాయుధధరుల్, శూరుల్, మహావిగ్రహుల్,**
**నీలగ్రీవులు, వీరు, రుద్రు, లనిలో నిర్భేద్యు, లాద్యుల్ మహిన్. 94**

**అర్థము.**వీరు, భాలా జిష్ణులు, భాల= నొసటి, ఆభీల = భయంకరమైన విలోచన= కంటి, అనల= మంటల యొక్క, రుచి = కాంతిచే, భ్రాజిష్ణులు = ప్రకాశించువారు, ఉగ్ర + అహి - కాపాల + ఆకల్పులు = భయంకరములయిన, పాములు, పుఱ్ఱెలు అలంకారములుగాఁగలవారు, అనల్పులు = అల్పులు గానివారు - అధికులు, ఉజ్జ్వల - జటా - భస్మ + అజిన + ఇందు + ఉద్వహుల్ = ప్రకాశించు జడలను, బూదిని, చర్మమును, చంద్రుని ధరించినవారు, శూల +అసి - ప్రముఖ

+ అఖిల + ఆయుధ - ధరుల్ = శూలము, ఖడ్గమమున్నగునెల్ల ఆయుధములను దాల్చినవారు, శూరుల్, మహత్ (మహా)- విగ్రహుల్ + గొప్ప శరీరములు గలవారు, నీల-గ్రీవులు = కాలకంఠములు గలవారు, అజిలోన్ = యుద్ధములో, నిర్భేద్యులు = భేదింపశక్యము గానివారు, మహిన్ = భూమియందు, ఆద్యుల్ = మొదటివారు

**తాత్పర్యము** . నొసటికంటిమంటల కాంతిచేఁ బ్రకాశించువారు, భయంకరములైన పాములు, పుఱ్ఱెలు ఆభరణములుగాఁ గలవారు, అనల్పులు, ఉజ్జ్వలములయిన జడలు, భస్మము, చర్మము, చంద్రుఁడు అనువానిని ధరించిన వారు, శూలము కత్తి మున్నగు ఆయుధములను దాల్చినవారు, శూరులు గొప్ప శరీరము గలవారు, కాలకంఠులు, యుద్ధమున భేదింపరానివారు, మహిలో ఆద్యులు అగు వీరు రుద్రులు

సీ హరుఁడు లోకములు సంహారంబు చేయఁగఁ
దలఁచుటకంటె ముందఱఁ గడంగి
బ్రహ్మాండములు మ్రోల వ్రాలి మ్రక్కఁడు భంగి
మొగిఁ జెఱలందుల మ్రుక్కువారు
విన్నను వులు చూపు వేడుక నట కొంద
ఱణిమాదిగుణముల నలవరించి
బ్రహ్మాండములు కొన్ని పట్టి గ్రక్కున మ్రింగి
కొనియుండు బ్రహ్మాండకుహరములకు

ఆ ననువు చేసి యవియును నవియకుం
డంగ దొంతి వెట్టి మ్రింగునట్టి
గణములోన నగ్రగణ్యుండు కాలాగ్ని
రుద్రమూర్తి వీరభద్రుఁ డితఁడ 95

**అర్థము:** హరుఁడు = ఈశ్వరుఁడు, లోకములు, సంహారంబు, చేయంగన్, తలఁచుటకంటెన్, ముందఱన్, కడంగి = పూని,

బ్రహ్మాండములు, మ్రోలన్ = ఎదుర, వ్రాలన్, మ్రక్కఁడు - భంగిన్ = బాధపెట్టు విధమున, మొగిన్ = పూనికతో, చెఱలందులన్ = చెఱసాలలలో, మ్రుక్కువారు = తోయువారు

విన్నను వులు - చూపు - వేడుకన్ = నేర్పులు చూపు వేడ్కతో, అట కొందఱు, అణిమ + ఆది - గుణములన్ = అణిమమున్నగు గుణములను, అలవరించి = చేసి

బ్రహ్మాండములు, కొన్ని, పట్టి, గ్రక్కునన్ = శీఘ్రముగా, మ్రింగికొని + ఉండు, బ్రహ్మాండ - కుహరములకున్ = గుహలవంటి బ్రహ్మాండములకు, అనువు చేసి = వీలుచేసి, అవియున్ = అవియును, అవియక + ఉండంగన్ పగులకుండులాగున, దొంతి - పెట్టి = వరుసగాఁబెట్టి, మ్రింగు +అట్టి, గణములోనన్ = ప్రమథుల గణములో, అగ్రణ్యుండు = మొదట లెక్క పెట్టఁదగినవాఁడు, కాల + అగ్ని - రుద్ర - మూర్తి = ప్రళయసమయమునందలి అగ్నివలె భయంకరమైన ఆకారము గలవాఁడు, (అగు), వీరభద్రుఁడు, ఇతఁడు + ఎ = ఇతఁడే

**తాత్పర్యము** ఈశ్వరుఁడు లోకములను సంహరింపనెంచుటకు ముందే పూని బ్రహ్మాండములు ఎదుర వ్రాలఁగా బాధపెట్టు విధమునఁ జెలసాలలలోఁ దోయువాడు, నేర్పులు ప్రదర్శించు వేడుకతోఁ గొందలు అణిమము మున్నగు గుణములను జేసి, బ్రహ్మాండములు కొన్నిటిని పట్టి వెంటనే మ్రింగ బ్రహ్మాండ కుహరముల ననుకూలపఱిచి, అవి యన్నియుఁ బగులకుండులాగున వరుసగాఁ బెట్టి మ్రింగునట్టి గణములలో మొదట లెక్కిడఁదగినవాఁడు, ప్రళయసమయాగ్ని భయంకరాకారము గలవాఁడు అగు వీరభద్రుఁ డితఁడే

**చ బలిఁ జెఱఁబెట్టి, రాహుతల పందల యెత్తి, సుధారసంబు వే**
**ల్పుల కశనంబుగా నొసఁగి, పూర్వసురావళి నొంపకుండఁగాఁ**
**గలహములోన నోర్చి, త్రిజగంబు సుఖస్థితిఁ గాచుచుండు న**
**త్యలఘుపరాక్రముండు దనుజాంతకుఁ డాతఁడు దేవతాంతకా! 96**

**అర్థము.** దేవతా + అంతకా = దేవతలను నాశనముచేయు తారకుఁడా!, ఆతఁడు, బలిన్ = బలిచక్రవర్తిని, చెఱన్ + పెట్టి = బంధించి, రాహు-తల -పందల + ఎత్తి = రాహువు తల పుట్టె ఎత్తి, సుధా - రసంబున్ = అమృతరసమును, వేల్పులకున్ = దేవతలకు, అశనంబుగాన్ = ఆహారముగా, ఒసఁగి = ఇచ్చి, పూర్వ - సుర + ఆవళి = రాక్షసుల వరుస, నొంపక + ఉండఁగాన్ = బాధింపకుండునట్లు, కలహములోనన్ = యుద్ధములో, ఓర్చి = ఓడించి, త్రిజగంబున్ = ముల్లోకములను, సుఖ -స్థితిన్ = సుఖముగా, కాచుచున్ + ఉండు = రక్షించుచుండు, అతి + అలఘు - పరాక్రముండు = మిక్కిలి అధికమైన పరాక్రమము గలవాఁడు (అగు) దనుజ + అంతకుఁడు = రాక్షసనాశకుఁడు - విష్ణువు

**తాత్పర్యము.** ఓయి దేవాంతకా! తారకా! అతఁడు బలిచక్రవర్తిని బంధించి, రాహువు తల పుట్టినెత్తి సుధారసమును దేవతల కాహారముగా నిచ్చి, రాక్షసులు బాధింపకుండునట్లు వారిని యుద్ధమున నోడించి ముల్లోకములను సుఖముగా రక్షించుచుండు మహాపరాక్రమవంతుఁడగు రాక్షసాంతకుఁడు విష్ణువు

సీ  నీలాద్రిపై నీలనీరదం బొఱఁగిన
        కరణి మహామూషకంబు నెక్కి
    తన మదగంధంబు తాఁకినఁ బెలుకుటి
        మన వీటి గజములు మదము డింపఁ
    దన కర్ణచలనాభిజనితానిలాహతి
        నోలి రాక్షససేన తూలుచుండఁ
    దన రౌద్రవేషంబుఁగని భీతి నసురలు
        వడి నిల్చునిల్వ జీవములు వోవఁ

ఆ  గింకఁ బరశుఖండ మంకించి రిపువంశ
    ఖండనంబు సేయఁ గడఁగు చున్న
    షణ్ముఖాగ్రజన్మ సామజముఖు గణ
    నాథు నఖిలదనుజనాథ! కంటె? 97

**అర్థము :** అఖిల - దనుజ - నాథ = ఎల్ల రాక్షసులకుఁ బ్రభువైన వాఁడా! తారకా!, నీల + అద్రిపైన్ = కాటుక కొండపై, నీల - నీరదంబు = నల్లని మేఘము, ఒఱఁగిన - కరణిన్ = వ్రాలిన విధమున, మహత్ (మహా) + మూషకంబున్ = పెద్దయెలుకను, ఎక్కి,

తన - మద - గంధంబు = తన మదపువాసన, తాఁకినన్ = వేయఁగా, పెలుకుటి = భయపడి, మన - వీటి - గజములు =మన నగరమునందలి యేనుఁగులు, మదము డింపన్ = మత్తు వీడఁగా

తన - కర్ణ - చలన + అభిజనిత + అనిల + ఆహతిన్ = తన చెవుల కదలికవలనఁ బుట్టిన గాలిదెబ్బచే, రాక్షస - సేన, ఓలిన్ = బాగుగా, తూలుచున్ + ఉండన్ = చలించుచుండఁగా

తన - రౌద్ర - వేషంబున్ = తన భయంకరాకారమును, కని, భీతిన్ = భయముతో, అసురలు = రాక్షసుల్కు, వడిన్ = వేగముగా, నిల్చు - నిల్వన్ = నిట్టనిలువునను, జీవములు + పోవన్ = ప్రాణములు పోఁగా - కోలుపోఁగా

కింకన్ = కోపముతో, పరశు - ఖండము = పరశువు (గండ్రగొడ్డలి) అనునాయుధశకలమును, అంకించి, = జళిపించి, రిపు - వంశ - ఖండనంబు = శత్రువంశముయొక్క నఱకుట, చేయన్ = చేయుటకు, కడఁగుచున్ + ఉన్న = పూనుచున్న, షష్(ట్) ముఖ + అగ్రజన్మున్ = కుమారస్వామి అన్నను, సామజ - ముఖున్ = గజముఖుని, గణ - నాథున్ = ప్రమథగణనాయకుని, కంటె (కంటివి +ఎ) = చూచితివా !

**తాత్పర్యము .** ఓయి, సర్వరాక్షసరాజా! తారకా! కాటుక కొండపై నల్లని మేఘము వ్రాలిన విధమున మహామూషికమునెక్కి, తన మదపువాసన వేయఁగా భయపడి మన నగరమునందలి యేనుఁగులు మదము వీడఁగా, తనచెవుల కదలికవలనఁబుట్టిన గాలిదెబ్బకు రాక్షససేన చలింపఁగా, తన భయంకర రూపమును జూచి భయముతో వేగముగా రాక్షసుల ప్రాణములు నిట్టనిలువునను పోఁగా, కోపముతో పరశుఖండమును జళిపించి శత్రుఖండనమును జేయుటకుఁ బూనుచున్న కుమారస్వామిఅన్నయు, గజముఖుఁడును, ప్రమథ గణ నాయకుఁడును అగు వినాయకునిఁ జూచితివా?

**విశేషములు** నీలాద్రిపై నీలనీరదం బొఱఁగిన కరణి - అలంకార ముపమ

మ. **ఉదయోత్తుంగనగంబుపై వెలుఁగు నత్యుగ్రాంశుఁడుం బోలె నై**
**మదనాగేంద్రముపై నిజోరుతనుధామస్ఫూర్తిఁ బొల్పొందుచున్**
**త్రిదశాచార్యుఁడు చూప నిన్నుఁ గలుషోద్రేకంబుతోఁ జూచు ష**
**ద్వదనుం గంటె కుమారు వీరు నతదేవవ్రాతరక్షామణిన్ 98**

**అర్థము.** ఉదయ + ఉత్తుంగ - నగంబుపైన్ = ఉదయమనెడి యెత్తయిన పర్వతముమీఁద, వెలుఁగు = ప్రకాశించు, అతి + ఉగ్ర+అంశుఁడున్ + పోలెన్ + ఐ = సూర్యునివలె నయి, మద- నాగ + ఇంద్రము + పైన్ = మత్తేభరాజముమీఁద నిజ + ఉరు - తను - ధామ - స్ఫూర్తిన్ = తనదైన గొప్ప శరీరకాంతియొక్క ప్రకాశముతో, పొల్పు + ఒందుచున్ = అందము నందుచు, త్రిదశ + ఆచార్యుఁడు = దేవగురుఁడు - బృహస్పతి, చూపన్ = చూపఁగా, నిన్నున్, కలుష + ఉద్రేకంబుతోన్ = కోపావేశముతో, చూచు , షష్ (ట్) + వదనున్ = ఆఱుమొగముల వానిని, వీరున్ = వీరుఁడైనవానిని, నత - దేవ - వ్రాత - రక్షా - మణిన్ = నమస్కరించిన దేవతల సమూహముయొక్క రక్షణము నందు శ్రేష్ఠుని, కుమారున్ = కుమారస్వామిని, కంటె = కంటివి +ఎ = చూచితివా?

**తాత్పర్యము.** ఎత్తయిన ఉదయ పర్వతముపై వెలుఁగు సూర్యునివలెనయి మత్తేభరాజముపైఁ దన గొప్ప శరీరకాంతిచే నందగించుచు, దేవగురుఁడైన బృహస్పతి చూపఁగా నిన్నుఁ గోపావేశమునఁ జూచు నాఱుమొగములవాఁడను, వీరుఁడును, నమస్కరించిన దేవతలను రక్షించువాఁడును అగు కుమారస్వామిని జూచితివా?

**విశేషములు.** అలంకారము ఉపమ

క రయమునఁ జని షణ్ముఖునకుఁ
బ్రియమునఁ జామరలు డాసి పెట్టుచు నిన్నుం
గయికొనక పాసిపోయిన
జయ విజయులఁ జూచితే నిశాచరనాథా! 99

**అర్థము.** నిశాచర- నాథా = రాక్షసరాజా! తారకా! రయమునన్ = వేగముగా, చని, షణ్ముఖునకున్ = కుమారస్వామికి, ప్రియమునన్ = ప్రీతితో, చామరలు = వింజామరలు, డాసి = సమీపించి, పెట్టుచున్, నిన్నున్, కయికొనక = లెక్క చేయక, పాసిపోయిన = విడిచిపెట్టిపోయిన, జయవిజయులన్ = జయుని, విజయుని, చూచితే? = చూచితివి + ఏ

**తాత్పర్యము.** ఓయి రాక్షసరాజా, తారకా!, వేగముగా వెడలి కుమారస్వామికిఁ బ్రీతితో వింజామరలు వీచుచు నిన్ను లెక్కచేయక విడిచిపెట్టిపోయిన జయుని, విజయునిఁ జూచితివా?

వ అని యనేకామరవరులం బ్రత్యేకంబు చూపుచుండె నిటఁ గుమారుండు నమరగురుం గనుంగొనిన 'యీ పన్ని నిల్చిన దనుజసామంతవరు లెవ్వ రెవ్వ రిందుం దారకాసురుం డెవ్వ డెఱిఁగింపు' మనిన మహాప్రసాదంబని 100

**అర్థము.** అని, అనేక - అమర - వరులన్ = పెక్కండ్రు దేవశ్రేష్ఠులను, ప్రత్యేకంబు + అ = ఒక్కొక్కరినే, చూపుచున్ + ఉండెన్, ఇటన్ = ఇక్కడ, కుమారుండున్, అమర - గురున్ = దేవగురుఁడైన బృహస్పతిని, కనుంగొని, ఈ, పన్నినిల్చిన = ఈ యుద్ధసన్నద్ధులయి నిలిచిన, దనుజ - సామంతవరులు = రాక్షస సామంతరాజ శ్రేష్ఠులు, ఎవ్వరు + ఎవ్వరు, ఇందున్ = వీరిలో, తారక+ అసురుండు, ఎవ్వండు, ఎఱింగింపుము అనినన్, మహాప్రసాదంబు + అని

**తాత్పర్యము:** అని పెక్కురు దేవశ్రేష్ఠుల వేఱువేఱుగాఁ జూపుచుండెను ఇక్కడఁ గుమారస్వామి, బృహస్పతిని జూచి, ఈ యుద్ధసన్నద్ధులయి నిల్చిన

రాక్షసుని సామంతరాజశ్రేష్ఠులెవరెవరు? వీరిలోఁ దారకాసురుఁ డెవ్వఁడు? తెలుపు మనఁగా, 'మహాప్రసాద' మని - తరువాతి పద్యముతో నన్వయము

**బృహస్పతి కుమారస్వామికి రాక్షసవీరులను నిరూపించుట**

సీ దేవాసురోగ్రాజిఁ ద్రిదశులఁ బలుమాఱు
    నిర్జించె నను కాలనేమి యితఁడు
దనుజారి నెక్కటిఁ దలపడి దిక్కులు
    దురములఁ జేకొను మరులఁ డితఁడు
వరుణు చేఁ గల మేలివస్తువు లెల్లను
    బలువిడిఁ గొను మహాబాహుఁ డీతఁ
డుగ్రుఁడై జమునికి నొరగట్టి తనకెందు
    మాఱులేదను కేతుమాలి యితఁడు

ఆ కులధనంబులెల్లఁ గొని ధననాథు ని
ర్ధనునిఁజేయు నుగ్రదంష్ట్రు డితఁడు
తారకునకుఁ దానె ఘోరాజిలో వజ్ర
కవచుఁడగు సహస్రకవచుఁ డితఁడు 101

**అర్థము.** ఇతఁడు, దేవ + అసుర + ఉగ్ర + ఆజిన్ = దేవతల రాక్షసుల భయంకరమైన యుద్ధమునందు, త్రిదశులన్ = దేవతలను, పలుమాఱు = పెక్కు పర్యాయములు, నిర్జించెన్ = ఓడించెను, అను = అనునట్టి, కాలనేమి,

ఇతఁడు, దనుజ + అరిన్ = రాక్షసులవైరియగు ఇంద్రుని, ఎక్కటిన్ = ఒంటరిగా, తలపడి = ఎదురుకొని, దురములన్ = యుద్ధములందు, దిక్కులు, చేకొను = ఆక్రమించు, మరులఁడు = పిశాచము (?)

ఈతఁడు, వరుణు - చేన్ + కల = వరుణుని చేతనున్న, మేలి - వస్తువులు + ఎల్లను = మంచి వస్తువుల నన్నిటిని, బలువిడిన్ = బలాత్కారముగా, కొను, మహాబాహుఁడు,

ఇతఁడు, ఉగ్రుఁడు +ఐ = భయంకరుఁడయి, జమునికిన్ = యమునకు, ఒరగట్టి = అడ్డుకట్టి, తనకున్, ఎందున్, మాఱు = ఎదురు, లేదు + అను కేతుమాలి

**తాత్పర్యము** ఎత్తయిన ఉదయ పర్వతముపై వెలుఁగు సూర్యునివలెనయి, మత్తేభరాజముపైఁ దన గొప్ప శరీరకాంతిచే నందగించుచు, దేవగురుఁడైన బృహస్పతి చూపఁగా నిన్నుఁ గోపావేశమునఁ జూచు నాఱుమొగములవాఁడను, వీరుఁడును, నమస్కరించిన దేవతలను రక్షించువాఁడును అగు కుమారస్వామిని జూచితివా?

**విశేషములు** అలంకారము ఉపమ

**క** రయమునఁ జని షణ్ముఖునకుఁ
ప్రియమునఁ జామరలు డాసి పెట్టుచు నిన్నుం
గయికొనక పాసిపోయిన
జయ విజయులఁ జూచితే నిశాచరనాథా! 99

**అర్థము .** నిశాచర- నాథా = రాక్షసరాజా! తారకా! రయమునన్ = వేగముగా, చని, షణ్ముఖునకున్ = కుమారస్వామికి, ప్రియమునన్ = ప్రీతితో, చామరలు = వింజామరలు, డాసి = సమీపించి, పెట్టుచున్, నిన్నున్, కయికొనక = లెక్క చేయక, పాసిపోయిన = విడిచిపెట్టిపోయిన, జయవిజయులన్ = జయుని, విజయుని, చూచితే? = చూచితివి + ఏ

**తాత్పర్యము .** ఓయి రాక్షసరాజా, తారకా!, వేగముగా వెడలి కుమారస్వామికిఁ బ్రీతితో వింజామరలు వీచుచు నిన్ను లెక్కచేయక విడిచిపెట్టిపోయిన జయుని, విజయునిఁ జూచితివా?

**వ** అని యనేకామరవరులం బ్రత్యేకంబు చూపుచుండె నిటఁ గుమారుండు నమరగురుం గనుంగొనిన 'యీ పన్ని నిల్చిన దనుజసామంతవరు లెవ్వ రెవ్వ రిందుం దారకాసురుం డెవ్వ డెఱిఁగింపు' మనిన మహాప్రసాదంబని 100

**అర్థము .** అని, అనేక - అమర - వరులన్ = పెక్కండ్రు దేవశ్రేష్ఠులను, ప్రత్యేకంబు + అ = ఒక్కొక్కరినే, చూపుచున్ + ఉండెన్, ఇటన్ = ఇక్కడ, కుమారుండున్, అమర - గురున్ = దేవగురుఁడైన బృహస్పతిని, కనుంగొని, ఈ, పన్నినిల్చిన = ఈ యుద్ధసన్నద్ధులయి నిలిచిన, దనుజ - సామంతవరులు = రాక్షస సామంతరాజ శ్రేష్ఠులు, ఎవ్వరు + ఎవ్వరు, ఇందున్ = వీరిలో, తారక+ అసురుండు, ఎవ్వండు, ఎఱింగింపుము అనినన్, మహాప్రసాదంబు + అని

**తాత్పర్యము .** అని పెక్కురు దేవశ్రేష్ఠుల వేఱువేఱుగాఁ జూపుచుండెను ఇక్కడఁ గుమారస్వామి, బృహస్పతిని జూచి, ఈ యుద్ధసన్నద్ధులయి నిల్చిన

రాక్షసుని సామంతరాజశ్రేష్ఠులెవరెవరు? వీరిలోఁ దారకాసురుఁ డెవ్వఁడు? తెలుపు మనఁగా, 'మహాప్రసాద' మని - తరువాతి పద్యముతో నన్వయము

## బృహస్పతి కుమారస్వామికి రాక్షసవీరులను నిరూపించుట

సీ. దేవాసురోగ్రాజిఁ ద్రిదశులఁ బలుమాఱు
 నిర్జించె నను కాలనేమి యితఁడు
దనుజారి నెక్కటిఁ దలపడి దిక్కులు
 దురములఁ జేకొను మరులఁ డితఁడు
వరుణు చేఁ గల మేలివస్తువు లెల్లను
 బలువిడిఁ గొను మహాబాహుఁ డీతఁ
డుగ్రుఁడై జమునికి నొరగట్టి తనకెందు
 మాఱులేదను కేతుమాలి యితఁడు

ఆ. కులధనంబులెల్లఁ గొని ధననాథు ని
ర్ధనునిఁజేయు నుగ్రదంష్ట్రుఁ డితఁడు
తారకునకుఁ దానె ఘోరాజిలో వజ్ర
కవచుఁడగు సహస్రకవచుఁ డితఁడు 101

**అర్థము.** ఇతఁడు, దేవ + అసుర + ఉగ్ర + ఆజిన్ = దేవతల రాక్షసుల భయంకరమైన యుద్ధమునందు, త్రిదశులన్ = దేవతలను, పలుమాఱు = పెక్కు పర్యాయములు, నిర్జించెన్ = ఓడించెను, అను = అనునట్టి, కాలనేమి,

ఇతఁడు, దనుజ + అరిన్ = రాక్షసులవైరియగు ఇంద్రుని, ఎక్కటిన్ = ఒంటరిగా, తలపడి = ఎదురుకొని, దురములన్ = యుద్ధములందు, దిక్కులు, చేకొను = ఆక్రమించు, మరులఁడు = పిశాచము (?)

ఈతఁడు, వరుణు - చేన్ + కల = వరుణుని చేతనున్న, మేలి - వస్తువులు + ఎల్లను = మంచి వస్తువుల నన్నిటిని, బలువిడిన్ = బలాత్కారముగా, కొను, మహాబాహుఁడు,

ఇతఁడు, ఉగ్రుఁడు +ఐ = భయంకరుఁడయి, జమునికిన్ = యమునకు, ఒరగట్టి = అడ్డుకట్టి, తనకున్, ఎందున్, మాఱు = ఎదురు, లేదు + అను కేతుమాలి

ఇతఁడు, కుల - ధనంబులు + ఎల్లన్ = ఇంటిసొమ్ములన్నియును, కొని, ధననాథున్ = కుబేరుని, నిర్ధనునిన్ = ధనహీనుని చేయు నుగ్రదంష్ట్రుఁడు

ఇతఁడు, తారకునకున్, ఘోర + ఆజిలోన్ = భీకరయుద్ధములో, వజ్ర - కవచుఁడు = వజ్రమయకవచమైనవాఁడు, అగు, సహస్రకవచుఁడు

**తాత్పర్యము .** ఇతఁడు దేవాసురుల భయంకరయుద్ధములో దేవతలను బెక్కుమాఱు లోడించెననెడి కాలనేమి ఇతఁడు ఇంద్రుని ఒంటరిగా నెదురుకొని యుద్ధములందు దిక్కు లాక్రమించు మరులఁడు ఇతఁడు వరుణుని చేతనున్న ఎల్ల మంచివస్తువులను బలాత్కారముగాఁగొనిన మహాబాహుఁడు ఇతఁడు భయంకరుఁడయి యము నడ్డగించి తనకెందును ఎదురులేదనిపించుకొన్న కేతుమాలి ఇతఁడు ఇంటనున్న ధనముల నన్నిటిని గొని కుబేరుని ధనహీనునిగాఁ జేయు ఉగ్రదంష్ట్రుఁడు ఇతఁడు తారకాసురునకు భీకరయుద్ధములో వజ్రమయకవచుఁడయిన సహస్రకవచుఁడు

**విశేషములు** కాలనేమి , కేతుమాలి రాక్షసుల పేరులయినట్లే మహాబాహుఁడు, ఉగ్రదంష్ట్రుఁడు కూడ పేరులయి యుండును మరులఁడుకూడ నొక రాక్షసుని నామమయి యుండవచ్చును

**ఉ. వారణ దానవాహినుల వఱ్ఱొడిఁ దేలుచునున్నవాఁడు మం**
**దారుఁడు; వాని దాపలి రథంబుల ధారుణిఁ గప్పుచున్నవాఁ**
**డారణి, వాని తూర్పున హయప్రకరాయుతకోటిహాఁడు దు**
**ర్వారుఁ, డపార పాదచరవర్గుఁడు వాఁడు చిరుండు షణ్ముఖా! 102**

**అర్థము :** షణ్ముఖా = కుమారస్వామీ!, వారణ - దాన - వాహినుల - వఱ్ఱొడిన్ = ఏనుఁగుల మదజలనదీప్రవాహమునందు, తేలుచున్ + ఉన్నవాఁడు, మందారుఁడు, వాని- దాపలి - రథంబులన్ = వానియెడమవైపు ఉన్న రథములచే, ధారుణిన్ = భూమిని, కప్పుచున్ + ఉన్నవాఁడు, ఆరణి, వాని - తూర్పునన్, హయ - ప్రకర + అయుత - కోటివాఁడు = గుఱ్ఱములయొక్క సమూహములయొక్క పదివేలకోట్లు గలవాఁడు, దుర్వారుఁడు, అపార - పాద-చర-వర్గుఁడు = అధికమైన కాల్బంటుల సమూహము గలవాఁడు, వాఁడు, చిరుండు

**తాత్పర్యము** ఓ కుమారస్వామి!, ఏనుఁగుల మదజల నదీ ప్రవాహమునందుఁ దేలుచున్నవాఁడు మందారుఁడు వాని యెడమవైపున నున్న రథములతో భూమిని గప్పుచున్నవాఁడు ఆరణి వానికిఁ దూర్పువైపునఁ బదివేలకోట్ల గుఱ్ఱములవాఁడు దుర్వారుఁడు అపార పదాతి సైన్యము గల యాతఁడు చిరుఁడు

సీ అంధకాసురవైరి యని తన కల్గునో
యని రుద్రుఁ డోడి మహాద్రి యెక్కెఁ
దనుజారియన విని తనఁ మీఁద బరిగొను
నోయని హరి భీతి నుదధిఁజొచ్చెఁ
బాడ నేర్తని తన్నుఁ బట్టి తేఁబనుచునో
యని వేధ బ్రహ్మాండమునకుఁ జనియె
నమరులు తత్ప్రతాపానల హతి కోడి
పోయిరి తమ పుట్టుఁబొడవు లేక

ఆ కానఁ బోర నెదురుగానక చేతుల
తీఁట నిలుపరాక త్రిభువనముల
రేవుచున్నవాఁడు సూవె వీఁ డురు శౌర్య
భాసురుండు తారకాసురుండు 103

**అర్థము :** అంధక+ అసుర - వైరి = అంధకుఁడను రాక్షసునకుశత్రువు, అని, తనకున్ + అల్గునో + అని = తనపైఁ గోపించునేమోయున, రుద్రుఁడు =శివుఁడు, ఓడి = భయపడి, మహత్ (మహా) + అద్రి = పెద్దకొండ, ఎక్కెన్

దనుజ + అరి = రాక్షసులకు శత్రువు, అనన్, విని, తనమీఁదన్, పరిగొనునో + అని= దండెత్తునేమోయని, హరి = విష్ణువు, భీతిన్ = భయముతో, ఉదధిన్ =సముద్రమును, చొచ్చెన్ = ప్రవేశించెను

పాడన్ + నేర్తు (వు) + అని = పాడఁగలవని, తన్నున్, పట్టి - తేన్ = పట్టి తెచ్చుటకు, పనుచునో + అని = ఆజ్ఞాపించునోయని, వేధ = బ్రహ్మ, బ్రహ్మాండమునకున్, చనియెన్

అమరులు = దేవతలు, తద్ + ప్రతాప + అనల - హతికిన్ = ఆతని పరాక్రమమనెడి అగ్నియొక్క దెబ్బకు, తమ -పుట్టు + పాడవు -లేక = తమ నామరూపములు లేక, ఓడిపోయిరి

కానన్ = కావున, పోరన్ = యుద్ధమునందు, ఎదురు - కానక = ప్రతిఘటించువాఁడు లేక, చేతుల - తీఁట = చేతుల దురద, నిలుపన్ + రాక, త్రిభువనములన్ = ముల్లోకములందును, రేవుచున్ + ఉన్న-వాఁడు = విజృంభించుచున్నవాఁడు, వీఁడు, ఉరు - శౌర్య - భాసురుండు =గొప్పదియగు పరాక్రమముచేఁ బ్రకాశించువాఁడు, అగు, తారక + అసురుండు + చూవె = తారకుఁడను రాక్షసుఁడు సుమీ

**తాత్పర్యము** . తాను అంధకాసురునకు శత్రువుగదాయని తనపైఁ గోపించునేమో యని శివుఁడు భయపడి కైలాసము నెక్కెను తాను రాక్షసులకు శత్రువని విని తనపై దండెత్తునేమోయని విష్ణువు భయముతో సముద్రమును జొచ్చెను పొడఁగలవాఁడవని తన్నుఁబట్టి తెమ్మని పంచునోయని బ్రహ్మ బ్రహ్మాండమున కరిగెను దేవతలు వాని పరాక్రమమనెడి అగ్ని దెబ్బకు నామ రూపములు లేక ఓడిపోయిరి కావున యుద్ధమునఁ దనకెదురులేక, చేతుల దురద తీఱక, ముల్లోకములందును విజృంభించుచున్న యీతఁడు గొప్పశౌర్యముచేఁ బ్రకాశించు తారకాసురుఁడు సుమా!

**విశేషములు** . పొడనేర్తని - పొడనేర్తువు + అని = లాట్టు వకారమునకు లోపము - బాల క్రి 24 పిమ్మట సంధి బాల సం 11, 1 బ్రహ్మ వేదములను గానము చేయును

**వ అని చూపినం దారక కుమారు లొండొరులంగని కోపరసాపూరితాంతరంగులై విజృంభించి** **104**

**అర్థము** . అని, చూపినన్, తారక - కుమారులు, ఒండొరులన్ = ఒకరినొకరు, కని, కోప -రస + ఆపూరిత + అంతరంగులు + ఐ = కోపరసముతో బాగుగా నిండిన మనస్సులు గలవారయి, విజృంభించి

**తాత్పర్యము** . అని చూపఁగాఁ దారక కుమారు లొకరినొకరు చూచి కోపరసముచే నిండిన మనస్సులు గలవారయి విజృంభించి - తరువాతి పద్యముతో నన్వయము

## యుద్ధారంభము

క జలధులపై వీచు లయా
నిలములగతి షణ్ముఖుఁడు ననిమిషారియుఁ జే
తులు వీచిరి తమతమ బల
జలధుల కొండొండ పెరిఁగి సంక్షోభింపన్ 105

**అర్థము.** జలధులపైన్ = సముద్రములమీఁద, వీచు, లయ + అనిలముల - గతిన్ = ప్రళయసమయవాయువుల విధమున, షణ్ముఖుఁడున్ = కుమారస్వామియును, అనిమిష + అరియున్ = దేవతల శత్రువగు తారకుఁడును, తమ తమ, బల - జలధులకున్ = సైన్యములనెడి సముద్రములకు, ఒండొండ = క్రమక్రమముగా, పెరిఁగి, సంక్షోభింపన్ = కలఁగునట్లు, చేతులు - వీచిరి

**తాత్పర్యము .** సముద్రములపైకి వీచు ప్రళయసమయవాయువులట్లు కుమారుఁడును, తారకుఁడును తమతమ సైన్యములకు - అవి క్రమక్రమముగాఁ బొంగి కలఁగునట్లు చేతులు వీచిరి

**విశేషములు .** అలంకార ముపమ రూపకానుప్రాణితము

క కరిఁ గరి, భటు భటుఁ, డరదం
బరదంబు, హయంబు హయము, నని మొత్తములై
గిరి గిరి, జము జముఁ, డిల నిల
శరనిధి శరనిధియుఁ దాఁకు చాడ్పునఁ దాఁకెన్ 106

**అర్థము .** అనిన్ = యుద్ధమునందు, మొత్తములు + ఐ = గుంపులయి, కరిన్ - కరి = ఏనుఁగును ఏనుఁగు, భటున్ - భటుఁడు, అరదంబు - అరదంబు = రథమును, రథము, హయంబున్ - హయమున్ = గుఱ్ఱమును గుఱ్ఱము, గిరిన్ - గిరి = కొండను కొండ, జమున్ - జముఁడు = యముని యముఁడును, ఇలన్ - ఇల = భూమిని భూమి, శరనిధిన్ = సముద్రమును, శరనిధియున్ = సముద్రమును, తాఁకు - చాడ్పునన్ = ఎదిరించు విధమున, తాఁకెన్ = ఎదిరించెను

**తాత్పర్యము :** యుద్ధమున గుంపులయి ఏనుఁగును ఏనుఁగు, భటుని భటుఁడు, రథమును రథము, గుఱ్ఱమును గుఱ్ఱము - కొండను కొండ, యముని యముఁడు, భూమిని భూమి, సముద్రుని సముద్రము తాఁకువిధమునఁ దాఁకెను

**విశేషములు.**అలంకార ముత్ప్రేక్ష ఉపమానుప్రాణితము అతిశయోక్తి, యధాసంఖ్యము

మ రణతూర్యంబులు బోరనం దివిరెఁ, దద్రావంబుతోడన్ ధను
ర్గుణ ఘోషంబులు వెల్లునం జెలఁగెఁ, దద్ఘోషంబుతో సద్భటా
గ్రణి హుంకారనినాదముల్ దనరెఁ, దద్గంభీరనాదంబుతోఁ
బ్రణుతాస్త్రాహతి భీషణధ్వను లనిం బర్వెన్ దిశాఘూటమై 107

**అర్థము:**అనిన్= యుద్ధమునందు, రణ - తూర్యంబులు = యుద్ధభేరులు, బోరనన్ = అధికముగా, తివిరెన్ = మ్రోసెను, తద్ + రావంబుతోడన్ = ఆ ధ్వనితో, ధనుస్ (:) + గుణ - ఘోషంబులు = విండ్ల త్రాళ్ల ధ్వనులు, పెల్లునన్ = అధికముగా, చెలఁగెన్= ధ్వనించెను, తద్ + ఘోషంబుతోన్= ఆ ధ్వనితో, సత్ + భట + అగ్రణి - హుంకార - నినాదముల్= సద్వీరశ్రేష్ఠుల హుంకృతి ధ్వనులు, తనరెన్= అతిశయించెను, తద్ + గంభీర - నాదంబుతోన్= ఆ పెను చప్పుడుతో, ప్రణుత + అస్త్ర + ఆహతి - భీషణ - ధ్వనులు = మిక్కిలి నుతింపఁబడిన బాణముల దెబ్బల భయంకరములైన ధ్వనులు, దిశా + ఆఘూటము + ఐ = దిక్కులు సరిహద్దులుగాఁ గలవయి, పర్వెన్ = వ్యాపించెను

**తాత్పర్యము :** యుద్ధమున యుద్ధభేరు లధికముగా మ్రోసెను ఆ ధ్వనితో విండ్ల త్రాళ్ల ధ్వనులుమిక్కిలి మ్రోసెను ఆ ధ్వనితో సద్భటశ్రేష్ఠుల హుంకారధ్వనులు అతిశయించెను ఆ గంభీరధ్వనితో బాణముల దెబ్బల భయంకరధ్వనులు దిక్కులే సరిహద్దులుగా వ్యాపించెను

మ. నలి ఘూర్ణిల్లె గుణధ్వనిస్తనితముల్ నానాప్రకారంబులన్,
వెలిఁగెన్ సన్మణిబద్ధ కార్ముక లస ద్విత్రాసకృద్బాణముల్,
జలజాప్తద్యుతిరోధమై మహిఁ దమిస్రం బొందెఁ గోదండభృ
జ్జలదంబుల్ కురిసెన్ విశాతవిశిఖాసారంబు ఘోరంబుగాన్ 108

**అర్థము .** గుణ - ధ్వని - స్తనితముల్ = వింటి నారుల ధ్వనియనెడు ఉఱుములు, నానా - ప్రకారంబులన్= అనేక విధముల, నలిన్= ఉత్సాహముతో, ఘూర్ణిల్లెన్ = మ్రోఁగెను సత్ + మణి - బద్ధ - కార్ముక - లసత్ + విత్రాసకృత్ + బాణముల్ = మంచి మణులతోఁ గట్టఁబడిన విండ్ల ప్రకాశించు, విశేష

భయమును గలిగించు బాణములు, వెలిఁగెన్ = ప్రకాశించెను, మహిన్ = భూమియందు, తమిస్రంబు = చీఁకటి, జలజ + ఆప్త - ద్యుతి - రోధము + ఐ =సూర్యుని కాంతిని అడ్డునదియై, ఒందెన్ = కలిగెను, కోదండ - భృత్ + జలదంబుల్= విండ్ల తాల్పులు - ధానుష్కులు అనెడి మేఘములు, నిశాత - విశిఖ + ఆసారంబున్= వాఁడి బాణములనెడి జడిని, ఘోరంబుగాన్= భయంకరముగా, కురిసెన్

**తాత్పర్యము .** వింటినారుల ధ్వనులనెడి యుఱుము లనేకరీతులుగా ఉత్సాహముతో మ్రోఁగెను మణులు కట్టిన విండ్ల భయంకరబాణములు ప్రకాశించెను భూమియందుఁ జీఁకటి సూర్యకాంతి నడ్డునదియై వ్యాపించెను ధానుష్కులనెడి మేఘములు వాఁడి బాణములనెడి జడివానను భయంకరముగాఁ గురిసెను

**విశేషములు** అలంకారము రూపకము

వ **మఱియును - తరువాతి పద్యముతో నన్వయము.** 109

చ **సవళులు భిండివాలములు శక్తులు శంఖులుఁ దోమరంబులున్**
**బవినివహంబుఁ జక్రములు బాణసమూహముతోన పెల్లునం**
**గవిసి రణాంధకార మిలఁగ్రక్కునఁ గ్రిక్కొనఁ బర్వె రోదసీ**
**వివరము నిండ దీఁటుకొని విశ్వలయానలధూమధూమ్రమై** 110

**అర్థము :** సవళులున్(సవడి + ళు), భిండివాలములున్, శక్తులున్, శంఖులున్, తోమరంబులున్, పవి - నివహంబున్ = వజ్రాయుధముల సమూహమ్మును, చక్రములున్, బాణ - సమూహముతోన్ + అ = బాణములసమూహముతోనే, పెల్లునన్ = అధికముగా, కవిసి = క్రమ్మి, రణ + అంధకారము= యుద్ధపుఁజీఁకటి, ఇలన్ = భూమియందు, రోదసీ - వివరము = భూమ్యాకాశమధ్యభాగము, నిండన్ = నిండునట్లు, దీటుకొని = వ్యాపించి, విశ్వలయ - అనల - ధూమ - ధూమ్రము + ఐ = జగత్ప్రళయాగ్ని ధూమముచేవలె ధూమ్రవర్ణముగలదయి, గ్రక్కునన్= శీఘ్రముగా, గ్రిక్కొనన్= చుట్టుకొనునట్లు, పర్వెన్ = వ్యాపించెను

**తాత్పర్యము .** సవడులు, భిండివాలములు, శక్తులు, శంఖులు, తోమరములు, వజ్రాయుధములు, చక్రములు అను ఆయుధవిశేషములు బాణ నవమూహముతోనే అధికవముగా వ్యాపించి యుద్ధాంధకారవము భూమ్యాకాశమధ్యభాగమునిండి జగత్ప్రళయాగ్ని ధూమముచే వలె ధూమ్రవర్ణమగల దయి శీఘ్రముగాఁ జుట్టుకొని వ్యాపించెను

**విశేషములు .** అలంకార ముపమ సవళులు - సవడి + లు 'ఇత్తునకు బహువచనంబు పరంబగునపు డుత్వంబగు ' బాల తత్సమ 45 సవడు + లు 'బహువచనము పరంబగునపు డసంయుక్తంబులయి యుదంతంబులయిన డల రల కలఘులకారంబు బహుళంబుగా నగు ' బాల ఆచ్ఛిక 13 సవళులు

**వ ఇట్లు దృష్టిరోధంబగు సమరతిమిరంబున నొండొరుల రూపులు గానరాకయుం గోపోద్రేకంబునం దావగొనక 111**

**అర్థము .** ఇట్లు, దృష్టి - రోధంబు = చూపునడ్డగించునది, అగు, సమర - తిమిరంబునన్ = యుద్ధాంధకారముచే, ఒండొరుల - రూపులు = ఒకరొకరి యాకారములు, కానన్ + రాకయున్ = చూడవీలుగాకయును, కోప+ ఉద్రేకంబునన్ = క్రోపావేశముచే, తావగొనక = నిలువక

**తాత్పర్యము :** ఇట్లు చూపు నడ్డగించు యుద్ధాంధకారముచే ఒకరినొకరి ఆకారములు చూడవీలుగాకయును క్రోధావేశముచే నిలువక - తరువాతి పద్యముతో నన్వయము

**క. కరిబృంహిత రధభీత్కృత**
**హరిహేషిత వీరహుంకృతారవముల నా**
**సుర వృత్తి ముట్టి పొడిచిరి**
**హరకోపులు శబ్దభేదులై సుభటు లనిన్ 112**

**అర్థము.** అనిన్ = యుద్ధమునందు, హర-కోపులు = హరుని కోపమువంటి కోపము గలవారు, (అగు) సుభటులు = మంచి వీరులు, శబ్ద - భేదులు +ఐ = ధ్వని ననుసరించి శత్రువులను భేదించువారయి, కరి - బృంహిత రవములన్, కరి - బృంహిత = ఏనుఁగుల ఘీంకృతులయు, రధ - భీత్కృత = రథముల భీకరములయు, హరి - హేషిత = గుఱ్ఱముల సకిలింతలయు, వీర - హుంకృత = వీరుల హుంకారములయు, ఆరవములన్ = ధ్వనులతో, ఆసుర - వృత్తిన్ = రాక్షస వర్తనముతో, ముట్టి = తాఁకి, పొడిచిరి

**తాత్పర్యము.** యుద్ధమునందు హరుని కోపమువంటి కోపముగలవారగు సుభటులు, శబ్దముననుసరించి శత్రువులను భేదించు వారయి, ఏనుఁగుల ఘీంకారధ్వనులచేతను, రథముల భీకర ధ్వనులచేతను, గుఱ్ఱముల హేషిత ధ్వనులచేతను, వీరుల హుంకారధ్వనులచేతను రాక్షసముగఁ దాఁకి పొడిచిరి

వ అట్టియెడ 113

**అర్థతాత్పర్యములు** అట్టి సమయమునందు - తరువాతి పద్యముతో నన్వయము

తే ఉగ్రశస్త్రాస్త్రనికర మొండొంటిఁ దాఁకి
పాఱి చెదర నట్లొండొండఁ బర్వుఁ జదల
నమితవిలయాగ్నివిస్ఫులింగములు వోలె
రవినిఁ గప్పు మహాంధకారంబుఁ బాచి 114

**అర్థము :** ఉగ్ర - శస్త్ర + అస్త్ర - నికరము = భయంకరములైన శస్త్రములయు, అస్త్రములయు సమూహము, అమిత - విలయ + అగ్ని - విస్ఫులింగములు + పోలెన్ = అధికమైన ప్రళయాగ్నియొక్క మిడుఁగుఱులవలె, రవినిన్ = సూర్యుని, కప్పు = కప్పునట్టి, మహత్ (మహా) + అంధకారంబున్= గొప్పచీఁకటిని, పాచి = తొలఁగించి, ఒండొంటిన్ = ఒకదానినొకటి, తాఁకి, పాఱి, చెదరన్ = చెదరఁగా, అట్లు = ఆ రీతిగా, ఒండొండ = క్రమక్రమముగా, చదలన్ = ఆకాశమునందు, పర్వున్ = వ్యాపించును

**తాత్పర్యము .** భయంకరములయిన శస్త్రాస్త్రముల సమూహము ఒకదానినొకటిఁదాఁకి, అధికమైన ప్రళయసమయాగ్ని మిడుఁగుఱుల విధమున, సూర్యుని గప్పు మహాంధకారమును దొలఁగించి, పాఱి చెదరునట్లు క్రమక్రమముగా నాకాశమున వ్యాపించును

**విశేషములు .** ఈ పద్యమున కెన్నియో పాఠాంతరములు గలవు 'పాఱి సేరద రొండొండఁ బర్వి జలద' అనుపాఠము సా అ ప్రతిలోనిది అర్థముగాలేదు 'ఒండొండఁబర్వుఁజదల' అను పాఠము రా అ శర్మగారిది అది యించుక అర్థవంతముగా నుండుటచే స్వీకరింపఁబడినది అలంకార ముపమ

వ అంత నొండొంటిఁ గను సూర్యుండు సూర్యకాంతాచలంబులుంబోలె సురాసురవీరు లొండొరులం గని కైపు మిగిలి మహాఘోరయుద్ధంబు చేయందొడంగిన 115

**అర్థము .** అంతన్, ఒండొంటిన్ = ఒకదాని నొకటి, కను= చూచు, సూర్యుండున్ సూర్యకాంత పర్వతములును, పోలెన్= వలె, సుర + అసుర - ఎులు = దేవరాక్షసవీరులు, ఒండొరులన్ = ఒకరినొకరు, కని, కైపు - మిగిలి = ఉద్రేక మతిశయించి, మహత్ (మహా) + ఘోర - యుద్ధంబు = మిక్కిలి భయంకరమైన యుద్ధము, చేయన్ + తొడంగినన్ = చేయనారంభింపఁగా

**తాత్పర్యము** అంతఁ బరస్పరము చూచు సూర్య సూర్యకాంత పర్వతముల వలె దేవరాక్షసవీరులు ఒకరినొకరు చూచి ఉద్రేకము మతిశయించి మహా భయంకర యుద్ధము చేయనారంభింపఁగా - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు :** దేవ వీరులు సూర్యునివలెను, అసురవీరులు సూర్యకాంతశిలలవలెను ఉన్నారనుట సూర్యరశ్మి సోఁకగనే సూర్యకాంతములు కరఁగిపోవునట్లు దేవవీరులు తాఁకఁగనే రాక్షసవీరులు రూపుమాయుచున్నారని భావము అలంకార ముపమ

తే **ఉభయబలభటకోపోజ్జ్వలోగ్రవహ్నిఁ**
**బొగలు మునుముట్టి మఱి మంట లెగయునట్లు**
**పాదఘట్టనమున ధూళి పర్వి చదల**
**నస్త్రఘట్టన మఱి లోహితాగ్ను లెగసె** 116

**అర్థము .** ఉభయ వహ్ని ఉభయ - బల = రెండు సైన్యములందలి, భట = వీరులయొక్క, కోప = కోపమనెడి ఉజ్వల = ప్రకాశించు, ఉగ్ర = భయంకరమైన, వహ్నిన్ = అగ్నిచే, పొగలు, మునుముట్టి = ముందు వ్యాపించి, మఱి = పిమ్మట, మంటలు, ఎగయు + అట్లు = లేచువిధమున, పాద - ఘట్టనమునన్ = కాళ్ల త్రొక్కిడిచే, ధూళి = దుమ్ము, పర్వి = వ్యాపించి, చదలన్ = ఆకాశమున, అస్త్ర - ఘట్టనన్ = అస్త్రముల రాయిడిచే, మఱి = పిమ్మట, లోహిత + అగ్నులు = ఎఱ్ఱని నిప్పులు, ఎగసెన్ = లేచెను

**తాత్పర్యము :** రెండుసైన్యములందలి వీరుల కోపమనెడి ప్రకాశించు భయంకరమైన అగ్నిచేఁ బొగలు ముందు వ్యాపించి, తరువాత మంటలు లేచునట్లు,

వీరుల పాదముల త్రొక్కిడిచే ఆకాశమున దుమ్ము వ్యాపించి, పిమ్మట వారి అస్త్రముల ఒరయికచే నెట్టునిమంటలు లేచెను

**విశేషములు**. అలంకారము రూపకానుప్రాణితోపమ

వ  ఇ ట్లతిభయంకరంబైన సంకులయుద్ధంబున  117

**అర్థము**. ఇట్లు, అతి - భయంకరంబు + ఐన, సంకుల - యుద్ధంబునన్ = దొమ్మి యుద్ధమునందు

**తాత్పర్యము:** ఇట్లు మిక్కిలి భయము గలిగించు దొమ్మి యుద్ధమునందు తరువాతి పద్యముతో నన్వయము

క  ముంచిరి శరవర్షంబులఁ
జించిరి దృఢకవచసమితిఁ, జేద్వడ రిపులం
ద్రుంచిరి నిజతరవారుల,
నించిరి తమకీర్తి దిశల నెఱయఁగ సుభటుల్  118.

**అర్థము:** సుభటుల్ = మంచి వీరులు, శర - వర్షంబులన్ = అంపవానలచే, ముంచిరి, దృఢ - కవచ - సమితిన్ = గట్టి కవచముల సమూహమును, చించిరి, చేద్వడన్ (చేటు + పడన్) = నశించునట్లు, రిపులన్ = శత్రువులను, నిజ - తరవారులన్ = తమ ఖడ్గములచే, త్రుంచిరి = వధించిరి, తమ - కీర్తి, దిశలన్ = దిక్కులందు, నెఱయఁగన్ = పూర్ణముగా, నించిరి = నింపిరి

**తాత్పర్యము**. సుభటులు అంపవానలచే ముంచిరి దృఢములయిన కవచముల సమూహమును జించిరి తమ ఖడ్గములచే శత్రువులను నశించునట్లు వధించిరి తమ కీర్తి దిక్కులందు సంపూర్ణముగా నింపిరి

క  అడిచిరి ముద్గరముల వడిఁ
బొడిచిరి కొంతములఁ దూఁటి బోరన గాఁడన్
విడిచిరి వాహకు లాజిన్,
మడిసిరి రిపుబలములకును మార్కొని వీరుల్.  119

**అర్థము** : వీరుల్ = వీరులు , ముద్గరములన్ = ముద్గరములనెడి అస్త్రములతో, వడిన్ = వేగముగా, అడిచిరి = కొట్టిరి, కొంతములన్ = కుంతములతో,

తూఁటి = రంధ్రములుచేసి, బోరన = అధికముగా, కాఁడన్ = గ్రుచ్చుకొనునట్లు, పొడిచిరి వాహకులు = సారథులు, ఆజిన్ = యుద్ధమును, విడిచిరి మార్కొని = ఎదురుకొని, రిపు - బలములకును = శత్రుబలములకు, మడిసిరి = చచ్చిరి

**తాత్పర్యము .** వీరులు ముద్గరములనెడి అస్త్రములతో వేగముగాఁ గొట్టిరి కుంతములతో రంధ్రమయి మిక్కిలి గ్రుచ్చుకొనునట్లు పొడిచిరి సారథులు యుద్ధరంగమును విడిచిరి ఎదురుకొని శత్రుబలములచేఁ జచ్చిరి

క **త్రోచిరి కరిఘట లాజిని,**
**వీచిరి వివిధాయుధములు వెలుఁగఁగ, రధికుల్**
**కాచిరి నిజసారధులను**
**బాచిరి నోఁ బోట్లు వడు సుభటహరికరులన్** 120

**అర్థము .** ఆజిని = యుద్ధమునందు కరి - ఘటలు = ఏనుఁగుల గుంపులను, త్రోచిరి = పడవైచిరి, వివిధ + ఆయుధములు = పలురీతులయిన ఆయుధములు, వెలుఁగన్ = ప్రకాశించునట్లు వీచిరి = విసరిరి, రధికుల్ = రథమున నుండు వీరులు, నిజ - సారథులను = తమ సారథులను, కాచిరి =రక్షించిరి, నోన్= నొచ్చునట్లు, పోట్లు + పడు - పోటులు పడునట్టి ,సుభట - హరి - కరులన్= మంచి వీరులను, గుఱ్ఱములను, ఏనుఁగులను, పాచిరి = తొలఁగించిరి

**తాత్పర్యము :** యుద్ధమునందు ఏనుఁగుల గుంపులను బడవైచిరి పలురీతుల ఆయుధములు ప్రకాశించునట్లు విసరిరి రధికులు తమ సారథులను రక్షించిరి నొవ్వఁ బోటులుపడు సుభటులను గుఱ్ఱములను, ఏనుఁగులను తొలఁగించిరి

**విశేషములు .** నోన్ - నొచ్చు ధాతువు 'తుమర్థ భావలక్షణంబులందు నుజీ యగు ' బాల క్రి 40 నొచ్చు + నుజీ 'ముజ్జీత్తులు ముత్తు నాఁబడు' బాల క్రి 86 'చావు నోవులు చచ్చునొచ్చుల కగు ' బాల క్రి 94 నోవు + నుజీ 'జీత్తు పరంబగునపుడు వాని వువర్ణంబు విభాషను లోపించు,' బాల క్రి 95 నోను - నోన్

సీ **శరహతిఁ దెగి నేలఁ దొరుఁగ శిరంబులు**
**శక్తిపాతముల వక్షములు వ్రయ్యఁ**
**జక్రఘట్టనఁ గటిచక్రముల్ మురియఁ దో**
**మర బర్హణంబున బరులు విఱుగ**

బాణాసిఘాతన బాహులు ద్రెవ్వ ము
　　ద్గర తాడనముల మొగమ్ము లవియఁ
గుంత భేదన నెఱఁకులు దూఱఁ బరశుప్ర
　　హరణ నంగములు జర్జరితములుగ

తే　మఱియు నిఖిలాస్త్రశస్త్రాభిమారణముల
నవయవములెల్లఁ గడికండ లగుచునుండ
నుభయ బలములుఁ గడిమి నొండొంటిఁ దాఁకి
పెరిఁగి పోరాడె నతిభయంకరము గాఁగ　121

**అర్థము.** శిరంబులు = తలలు, శర - హతిన్ = బాణముల దెబ్బచే, తెగి, నేలన్, తొరుఁగన్ = పడఁగా, వక్షములు = ఱొమ్ములు, శక్తి - పాతములన్ = శక్తియను నాయుధములపాటులచే, వ్రయ్యన్ = బ్రద్దలు కాఁగా,

చక్ర - ఘట్టనన్ = చక్రాయుధముల రాపుచే, కటిచక్రముల్ = చక్రముల వంటి పిఱుఁదులు, మురియన్ = తెగఁగా, తోమర - బర్హణంబునన్ = తోమరముల ప్రహారముచే, బరులు = ప్రక్కలు విఱుగన్

బాణ + అసి = ఘాతనన్ = బాణములయు, కత్తులయు దెబ్బచే, బాహులు = చేతులు, త్రెవ్వన్ = త్రెగిపోఁగా, ముద్గర - తాడనములన్ = ముద్గరముల దెబ్బలచే, మొగమ్ములు = ముఖములు, అవియన్ = పగులఁగా,

కుంత - భేదనన్ = బల్లెముల పోటుచే, నెఱఁకులు = మర్మస్థానములు, తూఱన్ = ప్రవేశింపఁగా, పరశు - ప్రహరణ = గండగొడ్డళ్ల దెబ్బచే, అంగములు = శరీరములు, జర్జరితములు + కన్ = తూంట్లు పడఁగా,

మఱియున్, నఖిల + అస్త్ర + శస్త్ర + అభిమారణములన్ = ఎల్ల అస్త్రములయు శస్త్రములయు దెబ్బలచే, అవయవములు + ఎల్లన్, కడికండలు + అగుచున్ + ఉండన్ = ముక్కలు ముక్కలగుచుండఁగా, ఉభయ - బలంబులున్ రెండు సైన్యములు, కడిమిన్ =× పరాక్రమముతో, ఒండొంటిన్ = ఒకదానినొకటి, తాఁకి, పెరిఁగి = ఉత్సహించి, అతి - భయంకరము + కాఁగన్ = మిక్కిలి వెఱపు గలుగునట్లుగా, పోరాడెన్

**తాత్పర్యము :** బాణముల దెబ్బచే శిరస్సులు నేలపైఁబడఁగా, శక్త్యాయుధముల పాటులచే ఱొమ్ములు బ్రద్దలు కాఁగా, చక్రముల రాయిడిచే

చక్రములవంటి పిఱుఁదులు తెగఁగా, తోమరముల రాపుచేఁ బ్రక్కలు విఱుగఁగా, బాణములయు, కత్తులయు దెబ్బచేఁ జేతులు తెగఁగా, ముద్గరముల దెబ్బచే ముఖములు పగులఁగా, బల్లెముల దెబ్బచే మర్మములు విరియఁగా, పరశువుల దెబ్బచే అవయవములు తూంట్లుపడఁగా, మఱియును ఎల్ల అస్త్రములయు శస్త్రములయు చావు దెబ్బలచే అవయవములన్నియు ముక్కలు ముక్కలగు చుండఁగా రెండు బలములును పరాక్రమముతో నొకదాని నొకటి తాఁకి ఉత్సహించి మిక్కిలి భయము గలుగునట్లు యుద్ధము చేసెను

వ తదవసరంబున 122

**అర్థతాత్పర్యము** . తద్ + అవసరంబునన్ = ఆ సమయమున - తరువాతి పద్యముతో నన్వయము

క తలలు తెగిపడిన నట్టులు
సలమున మును నడచుచున్న చక్కటిఁ జని మా
ర్బల మడలఁగఁబడిన తలల
సలరేవం బొడిచె నుగ్రసమరాగ్రమునన్ 123

**అర్థము** : తలలు, తెగిపడినన్, అట్టలు = మొండెములు, చలమునన్ = పట్టుదలతో, మును = ముందు, నడచుచున్ + ఉన్న -చక్కటిన్ = నడచుచున్న విధమున, చని, మార్బలము = శత్రుసైన్యము, అడలఁగన్ = భయపడఁగా, పడిన - తలలన్ = పడిపోయిన తలలను, ఉగ్ర - సమర + అగ్రమునన్ = భయంకరయుద్ధ ప్రదేశమునందు, సలరేవన్ = చెలరేఁగునట్లు, పొడిచెన్

**తాత్పర్యము** · తలలు తెగిపడఁగా మొండెములు పట్టుదలతో ముందు నడచుచున్న విధమునఁ జని, శత్రుసైన్యము భయపడఁగాఁ బడిన తలలను భయంకరయుద్ధమునఁ జెలరేఁగునట్లు పొడిచెను

**విశేషములు** . అలంకార ముత్ప్రేక్ష

క తమ చేతుల యాయుధములు
సమసిన మై నాటియున్న శస్త్రాస్త్ర సమూ
హముఁ బెరికి పట్టుకొని యు
ద్ధము చేసిరి భటులు శౌర్యదర్పోన్నతికిన్ 124

**అర్థము** తమ - చేతుల + ఆయుధములు = తమ చేతులందలి ఆయుధములు, సమసినన్ =నశింపఁగా, మైన్ = శరీరమునందు, నాటి + ఉన్న= గ్రుచ్చుకొనియున్న, శస్త్ర + అస్త్ర - సమూహమున్= శస్త్రములయు, అస్త్రములయు సమూహమును, పెరికి = ఊడఁదీసి, పట్టుకొని, భటులు, శౌర్య - దర్ప + ఉన్నతికిన్ = శౌర్యమువలని గర్వాధిక్యముతో, యుద్ధము చేసిరి

**తాత్పర్యము .** తమ చేతులందలి ఆయుధములు నశింపఁగా, దమ శరీరములందు గ్రుచ్చికొనియున్న శస్త్రాస్త్రముల సమూహమును ఊడఁదీసి పట్టుకొని భటులు శౌర్యగర్వాధిక్యముతో యుద్ధము చేసిరి

**విశేషములు** శౌర్యదర్పోన్నతికిన్ అను షష్ఠ్యంతమున కన్వయమెట్లు పొసఁగునో!

సీ గఱిగాన నొడళుల విఱిగెడు నస్త్రముల్
    దొలఁగు సంధుల కిచ్చు మొలలు గాఁగ
బలువిడిమైఁ గట్టు పాశముల్ దెగిపాయు
    నంగములకుఁ గట్టులై పెనంగ
నెసకంబుతోఁ దాఁకు నీఁటెలు గుమిసిన
    పలువోటులకుఁ జల్వ సలలు గాఁగఁ
బెడులు గంటులఁ దూఱు భిండివాలంబులు
    క్రమమున నిడు నౌషధములు గాఁగ

ఆ నలువు లెన్ని గొనిన నప్పటికప్పటి
కలవు బలముఁ జలము నగ్గలింప
నుభయబలములందు సుభటోత్తములు పోరి
రాహవమున విజయదోహలమున 125

**అర్థము.** గఱి = బాణపుంఖములకుఁగట్టుఱెక్క, కానన్ = కనఁబడునట్లు, ఒడళులన్ = శరీరములందు, విఱిగెడు + అస్త్రముల్ = విఱుగునట్టి అస్త్రములు, తొలఁగు - సంధులకున్ = సడలు కీళ్లకు, ఇచ్చు, మొలలు + కాఁగన్ = చీలలు కాఁగా,

బలువిడిన్ =బలాత్కారముగా, మైన్ = శరీరమునందు, కట్టు, పాశముల్ = త్రాళ్లు, తెగి, పాయు + అంగములకున్ = తొలఁగునవయవములకు, కట్టులు + ఐ = కట్లయి, పెనంగన్ = కూడఁగా

ఎసకంబుతోన్ = అతిశయముతో, తాఁకు, ఈఁటెలు = బల్లెములు, గుమిసిన = గుమికట్టిన(?), పలు + పోటులకున్ = పెక్కు గాయములకు, చల్పు = చేయునట్టి, సలలు + కాఁగన్ = వత్తులుకాఁగా,

పెడులు = పెట్టునట్టి, గంటులన్ = గాయములందు, తూఁటు = ప్రవేశించు, భిండివాలంబులు = అస్త్రవిశేషములు, క్రమమునన్, ఇడు = ఇచ్చునట్టి, ఔషధములు, కాఁగన్,

అలువులు = బాణములు, ఎన్ని - కొనినన్ = ఎన్ని గ్రహించినను, అప్పటికిన్ + అప్పటికిన్ = నానాఁటికి, అలవున్ = సామర్థ్యమును, బలమున్, చలమున్ = పట్టుదలయు, అగ్గలింపన్ = అధికము కాఁగా, ఉభయ - బలము లందున్ = రెండు సైన్యములందును (గల)

సుభట + ఉత్తములు = వీరశ్రేష్ఠులు, విజయదోహాలమునన్ = విజయోత్సాహముతో, ఆహవమునన్ = యుద్ధమునందు, పోరిరి

**తాత్పర్యము.** లెక్క గనవచ్చునట్లు మేనుల విఱుగు నస్త్రములు సడలిన కీళ్లయందుఁ బెట్టు చీలలు కాఁగను, బలాత్కారముగా మేనఁ గట్టు పాశములు ఖండితమై వీడు నవయవములకుఁ గట్లుకాఁ గను, అతిశయముతోఁదాఁకు బల్లెములు గుమికూడిన పలుపోటులకుఁబెట్టు వత్తులు కాఁగను, పెట్టునట్టి గాయములందుఁ బ్రవేశించు భిండివాలములనెడి అస్త్రములు క్రమముగా నిచ్చు నౌషధములు కాఁగను, బాణములెన్ని గ్రహించినను నానాఁటికి సామర్థ్యము, బలము, పట్టుదల అధికముకాఁగా రెండు సైన్యములందును సుభటశ్రేష్ఠులు గెలుపునందలి యుత్సాహముతో యుద్ధమొనర్చిరి

**విశేషములు.** అలంకారము రూపకము

వ **ఇ ట్లతిభీమంబగు సంగ్రామంబున** **126**

**అర్థము.** ఇట్లు, అతి - భీషణంబు + అగు = మిక్కిలి భయంకరమైన, సంగ్రామంబునన్ = యుద్ధమునందు

**తాత్పర్యము:** ఇట్లు మిక్కిలి భయంకరమైన యుద్ధమునందు - తరువాతి పద్యముతో నన్వయము

క సురబలము నసురబలముం
బొరిఁబొరి వడిఁ దటిమి పెనఁగి పొడువ రయమునన్
నెరసి యెడఁ దొట్రుకొని కె
డ్బెరసై పీనుఁగులు పడువుఁబేకయుఁబడియెన్ 127

**అర్థము.** సుర-బలమున్ = దేవతల సైన్యమును, అసుర - బలమున్ = రాక్షసుల సైన్యమును, పొరిఁబొరిన్ = మాటిమాటికి, వడిన్ = వేగముగా, తటిమి, పెనఁగి, పొడువన్ = పొడువఁగా, రయమునన్ = శీఘ్రముగా, నెరసి = వ్యాపించి, ఎడన్ = నడిమి ప్రదేశమున, తొట్రుకొని = తడఁబడి, కెడ్బెరసు + ఐ = కలిసినదయి, పీనుఁగులు, పడువున్ + పేకయున్ + పడియెన్ = నిలువుగను, అడ్డముగను పడెను

**తాత్పర్యము :** దేవతల బలమును, రాక్షసుల బలమును మాటిమాటికి వడిగాఁ దటిమి పెనఁగి పొడువఁగా, పీనుఁగులు శీఘ్రముగా వ్యాపించి నడిమి ప్రదేశమునఁ బడుగుపేకలుగాఁ బడెను

**విశేషములు :** కెడ్బెరసు - కెడ + బెరసు - బెరసు = కూడిక (కన్న) పడువు - పడుగు (రూపాం) పడుగు - నేఁతలో నిలువునూలు, పేక - నేఁతలో అడ్డనూలు

క స్రుక్కిరి కరములు త్రెస్సినఁ,
గ్రక్కిరి రుధిరములు కలయఁ గదనములోనన్,
నెక్కిరి శవ సంకులమున,
వెక్కిరి కొఱ ప్రాణులైన వీరులు కలనన్. 128

**అర్థము :** కదనములోనన్ = యుద్ధములో, కలయన్ = అంతటను, కరములు = చేతులు, త్రెస్సినన్ = తెగఁగా, స్రుక్కిరి = దుఃఖించిరి, రుధిరములు = నెత్తురులు, క్రక్కిరి, శవ - సంకులమునన్ = పీనుఁగుల సమూహమునందు, నెక్కిరి = క్రిక్కిఱిసిరి, కొఱ - ప్రాణులు + ఐన - వీరులు = కొనయూపిరితోనున్నవీరులు, కలనన్ = యుద్ధమున, వెక్కిరి = దుఃఖించిరి

**తాత్పర్యము :** యుద్ధములో నంతటను చేతులు తెగిపోఁగా దుఃఖించిరి నెత్తురులు గ్రక్కిరి పీనుఁగుల సమూహములోఁ గ్రిక్కిఱిసిరి యుద్ధమునఁ గొనయూపిరి గలవీరులు దుఃఖించిరి

క ప్రేలిరి కడగొంతంబులఁ,
గూలిరి గడిదలల దాఁకి కుంభిని మీఁదన్,
దేలి రసృగ్జలరాశిన్
వాలిరి శరఘట్టనముల వడి నిరువాగున్ 129

**అర్థము.** ఇరు - వాగున్ = రెండు సైన్యములును, కడ - కొంతంబులన్ = బల్లెముల చివర, ప్రేలిరి = వ్రేలాడిరి, గడి - తలలు + తాఁకి = గడిదల లనెడి ఆయుధములు, తగిలి, కుంభిని మీఁదన్ = నేలపై, కూలిరి, అసృజ్ (క్) + జలరాశిన్ = నెత్తుటి సంద్రములో, తేలిరి, వడిన్ = వేగముగా, శర - ఘట్టనములన్ = బాణముల దెబ్బలచే, వాలిరి = పడిపోయిరి.

**తాత్పర్యము.** రెండు సైన్యములును బల్లెముల చివర వ్రేలాడిరి గడిదల లనెడి ఆయుధములు తాఁకి నేలపైఁ గూలిరి నెత్తుటిసంద్రమునందుఁ దేలిరి బాణముల దెబ్బలచే వేగముగాఁ బడిపోయిరి

క ముక్తాముక్తాయుధములు
ముక్తాముక్తాయుధౌఘములుఁ దగు సుభటుల్
ముక్తాముక్తాసులుఁ బర
ముక్తాముక్తాసుబంధములు నగుచు ననిన్ 130

**అర్థము.** అనిన్ = యుద్ధమునందు, ముక్త + అముక్త + ఆయుధములున్ = ముక్తములును, అముక్తాయుధములును, ముక్తాముక్తాయుధ + ఓఘములున్ = ముక్తాముక్తాయుధముల, సమూహములును, తగు = ఒప్పునట్టి, సుభటుల్ = వీరవరులు, ముక్త + అముక్త + అసులున్ = విడిచిపెట్టఁబడిన, విడిచిపెట్టఁబడని ప్రాణములు గలవారును, పర - ముక్త + అముక్త + అసుబంధములున్ = శత్రువులచే విడిచిపెట్టఁబడిన, విడిచిపెట్టఁబడని ప్రాణసంబంధములు గలవారు, అగుచున్

**తాత్పర్యము .** యుద్ధమునందు ముక్తములును, అముక్తములును, ముక్తాముక్తాయుధముల సమూహములును ఒప్పునట్టి వీరవరులు ప్రాణములు విడిచిన, విడువని వారును, శత్రువుల ప్రాణములు తీసిన తీయనివారు నగుచు - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు :** ఆయుధములు ముక్తకములు, అముక్తాయుధములు, ముక్తాముక్తాయుధములు యంత్రముక్తములు అని నాలుగు విధములు ముక్తము

లనఁగా చక్ర, వజ్ర, వలయ, శక్తి, తోమర, కుంత, పాషాణాదికములు 2 అముక్తము లనఁగా - అంకుశ, పాశ, క్షురికా, అసి, గదా, ముసల, దండాధికములు, 3 ముక్తాముక్తములనఁగా - పాశ, వాగురా, రజ్జు, వలయాదికములు 4 యంత్రముక్తములు - చాప, శతఘ్ని, శల్యక, మంజూషార్కవర్ణాదికము

చ **మురిసెడి రూపులున్, మురిసి మ్రొగ్గెడి రూపులు, మ్రొగ్గి జిఱ్ఱనం**
**దిరిగెడి రూపులుం, దిరిగి త్రెళ్లెడు రూపులుఁ, ద్రెళ్లి నేలపైఁ**
**బొరలెడు రూపులుం, బొరలి పోయెడి రూపులుఁ బోయి క్రమ్మఱన్**
**మరలెడు రూపులుం, మరలి మ్రగ్గెడి రూపులు నయ్యె నయ్యనిన్ 131**

**అర్థము** అయ్యనిన్ (ఆ + అనిన్) = ఆ యుద్ధమున, మురిసెడి - రూపులున్ = తెగిన దేహములును, మురిసి = తెగి, మ్రొగ్గెడి = మోఁకరిలఁబడు, రూపులున్, మ్రొగ్గి, జిఱ్ఱనన్ = జిఱ్ఱయనుధ్వనితో, తిరిగెడి - రూపులున్, తిరిగి, త్రెళ్లెడు = కూలు, రూపులున్, త్రెళ్లి, నేలపైన్, పొరలెడు = దొరలు, రూపులున్, పొరలి, పోయెడి, రూపులున్, పోయి, క్రమ్మఱన్ = మరల, మరలెడు రూపులున్, మరలి, మ్రగ్గెడి = చచ్చెడు, రూపులున్, అయ్యెన్

**తాత్పర్యము:** ఆ యుద్ధమునఁ దెగిన దేహములును, తెగి మోఁకరిలఁబడు దేహములును, మోఁకరిలఁబడి జిఱ్ఱయను ధ్వనితోఁ దిరుగు దేహములును, కూలి నేలపైఁ బొరలు దేహములును, పొరలి పోవు దేహములును, పోయి తిరిగి మరలు దేహములును, మరలి చచ్చు దేహములును అయ్యెను

**విశేషములు .** ముక్తపదగ్రస్త చ్ఛాయ

ఉ. **వెక్కెడి రూపులున్, విఱిగి వెండిక వెండిక వ్రాలు రూపులున్**
**నిక్కెడి రూపులున్, మురిసి నీల్గెడు రూపులు, ఱోలి నెత్తురుల్**
**గ్రక్కెడి రూపులుం, దలరి కాళులు కొట్టెడు రూపులుం, గడున్**
**స్రుక్కెడి రూపులుం గలనఁ జూడ భయంకర మయ్యె నయ్యెడన్ 132**

**అర్థము :** అయ్యెడన్ (ఆ + ఎడన్) = ఆ ప్రదేశమున, వెక్కెడి - రూపులున్= వెక్కిళ్లు విడిచిన దేహములును, విఱిగి, వెండికవెండిక = మఱి మఱి, వ్రాలు - రూపులున్, నిక్కెడి - రూపులున్ = లేచెడి దేహములును, మురిసి = తెగి, నీల్గెడు = చచ్చు దేహములును, ఱోలి = బాధచే నఱచి, నెత్తురుల్, క్రక్కెడి - రూపులున్, తలరి = చలించి, కాళులు - కొట్టెడు - రూపులున్ = కాళ్లు కొట్టుకొను దేహములును, కడున్ = మిక్కిలి, స్రుక్కెడి - రూపులున్ = మూర్ఛిల్లెడి దేహములును, కలనన్ = యుద్ధమునందు, చూడన్, భయంకరము + అయ్యెన్

**తాత్పర్యము .** ఆ యుద్ధరంగమున వెక్కిళ్లు విడిచిన దేహములును, విఱిగి మాటిమాటికి వ్రాలు దేహములును, లేచెడి దేహములును, తెగి చచ్చు దేహములును, బాధచే నఱచుచు నెత్తురు గ్రక్కు దేహములును, చలించి కాళ్లు కొట్టుకొను దేహములును, మిక్కిలి మూర్ఛిల్లు దేహములును, జాడ భయంకరముగా నుండెను

చ  **విఱిగెడు రూపులున్, విఱిగి వ్రేలెడు రూపులు(, దల్లడిల్లి వా**
**చఱచెడు రూపులుం, గలయ(జాల్పడు రూపులు, నొచ్చి నేలపై**
**నొఱగెడు రూపులుఁ, జెల(గ నూర్పెడు రూపులు, నస్త్రఘట్టనన్**
**నఱుమగు రూపులుం, బృథురణంబున నగ్గల మయ్యె నయ్యెడన్** 133

**అర్థము :** విఱిగెడు - రూపులున్ = విఱిగి పోవు మేనులను, విఱిగి, వ్రేలెడు= వ్రేలాడు, రూపులున్, తల్లడిల్లి = చలించి, వా- చఱచెడు - రూపులున్ = మొఱపెట్టుకొనుమేనులును, కలయన్ = అంతటను, చాల్పడు - రూపులున్ = ప్రోగుపడు దేహములును, నొచ్చి = బాధపడి, నేలపైన్, ఒఱగెడు - రూపులున్, చెల(గన్ = ధ్వనించునట్లు, ఊర్పెడు = ఊర్పులుపుచ్చు, రూపులున్, అస్త్ర-ఘట్టనన్ = బాణముల దెబ్బచే, నఱుము + అగు - రూపులున్ = పొడియగు మేనులును, అయ్యెడన్ (ఆ + ఎడన్) = ఆ సమయమున, పృథు - రణంబునన్= మహాయుద్ధములో, అగ్గలము + అయ్యెన్ = అధికమయ్యెను

**తాత్పర్యము :** విఱిగిపోవు శరీరములును, విఱిగి వ్రేలాడు శరీరములును, చలించి మొఱపెట్టుకొను రూపులును, అంతటను ప్రోగుపడు మేనులును, నొచ్చి నేలమీ(ద నొఱగు మేనులును, ధ్వనించునట్లు ఊర్పులు పుచ్చు మేనులును, అస్త్రముల దెబ్బచే పొడియగు మేనులును అప్పుడు మహాయుద్ధమున నధికమయ్యెను

వ  **ఇ ట్లతిదారుణంబగు నపారఘోరయుద్ధంబున** 134

**అర్థము :** ఇట్లు, అతి - దారుణంబు + అగు = మిక్కిలి ఘోరమైన, అపార - ఘోర - యుద్ధంబునన్ = అంతులేని భయంకర యుద్ధమునందు

**తాత్పర్యము .** ఇట్లు మిక్కిలి ఘోరమైనదియు, అపారము భయంకరము నైనదియు అగు యుద్ధమున తరువాతి పద్యముతో నన్వయము

సీ కడుఁబెక్కు పోటులఁబడి రక్త మిమ్ముగా
వడిసి సొమ్మలువోయి వ్రాలు చోట
బరులపైఁ గ్రమ్మెడు నరుణధారలు తమ
మేని క్రొంగంటులలోనఁజొచ్చి
తెప్పిటి లా వెక్కి యప్పటికంటెను
గాయ్యునఁ బోరాడఁ గడఁగి యీడఁ
బోవక నెత్తురు పొత్తెంత గలిగిన
వారెంత ప్రాణోపకారులైనఁ,

ఆ బతుల ప్రస్తవంబు బంట్లకుఁ దీర్పంగ
వలయు ననుటఁ దెలుపువారపోలె
నిరు బలంబులందుఁ బెరిఁగి పోరాడిరి
విజయదోహలమున వీరభటులు 135

**అర్థము:** కడున్ = మిక్కిలి, పెక్కు - పోటులన్ + పడి = పలుపోటులుపొంది, రక్తము, ఇమ్ముగాన్ = ఎక్కువగా, వడిసి = కాఱి, సొమ్మలు + పోయి = మూర్ఛపోయి, వ్రాలు చోటన్

బరులపైన్ = ప్రక్కలపై, క్రమ్మెడు = ఆక్రమించు, అరుణ - ధారలు = రక్తప్రవాహములు, తమ - మేని- క్రొంగంటులలోనన్ (క్రొత్త + గంటులలోనన్) = తమ దేహమునందలి క్రొత్తగాయములలో, చొచ్చి = ప్రవేశించి, (ప్రవేశించుటచే)

తెప్పిటి = తేఱుక్కొని, లావు + ఎక్కి = బలము గలిగి, అప్పటికంటెను, కాయ్యునన్ = ఇచ్ఛతో, పోరాడన్ + కడఁగి = యుద్ధముచేయఁబూని, ఈడఁబోవక = వెనుదీయక, నెత్తురు - పొత్తు = రక్తసంబంధము, ఎంత + కలిగినన్ = ఎంతయున్నను, వారు, ఎంత - ప్రాణ + ఉపకారులు + ఐనన్ = ఎంతటి మహోపకారము చేసినవారయినను,

పతుల - ప్రస్తవంబు = ప్రభువుల విషయము, బంట్లకున్ = భటులకు, తీర్పంగన్+వలయున్, అనుటన్, తెలుపువారు + అ, పోలెన్, ఇరు - బలంబులందున్= రెండు సైన్యము లందును, పెరిఁగి = విజృంభించి, వీర - భటులు, విజయ - దోహలమునన్ = విజయోత్సాహముతో, పోరాడిరి

**తాత్పర్యము** మిక్కిలి యెక్కువ పోట్లు పడి రక్త మధికముగాఁ గాఱి మూర్ఛపోయి వ్రాలుచోట, ప్రక్కలపై వ్యాపించు రక్తప్రవాహములు తమ దేహమునందలి క్రొత్త గాయములలోఁ జొచ్చి, తేఱుకొని, బలము గలిగి, అప్పటికంటెను గోరికతో యుద్ధముఁ జేయఁబూని, వెనుదీయక, వారితో నెంత రక్త సంబంధము గలిగినను, వారెంత మహోపకారము చేసినవారయినను ప్రభువుల విషయము భటులు తీర్పవలయుననుటను దెలుపుచున్నారా యను విధమున రెండు సైన్యములందలి వీరభటులును విజృంభించి విజయోత్సాహముతోఁ బోరిరి

మ ఇరువా గున్నతి నార్చియార్చి వడిఁ బై నెత్తుండు గొం డంచు నొం
డొరుకంటెన్ బలముం జలంబు మదదర్పోత్సాహముల్ శౌర్యభీ
కర భావంబులు నగ్గలంబగుచు వీఁకం దాఁకి పోరాడి రా
సురలీలన్ ధర పెల్లగిల్ల దిగధీశుల్ భీతిఁ గంపింపఁగన్ 136

**అర్థము .** ఇరువాగు = రెండు సైన్యములును, ఉన్నతిన్ = అధికముగా, ఆర్చి - ఆర్చి = మిక్కిలి ఆర్చి, వడిన్ = వేగముతో, పైన్ = మీఁదికి, ఎత్తుండు= దండెత్తుఁడు, కొండు = పట్టుకొనుఁడు, అంచున్, ఒండొరుకంటెన్ = ఒకరికంటెనొకరు, బలమున్, చలంబున్ = పట్టుదలయు, మద - దర్ప + ఉత్సాహముల్ = మదము, గర్వము, ఉత్సాహము, శౌర్య - భీకర - భావంబులున్= పరాక్రమభయంకరత్వములును, అగ్గలంబు + అగుచున్ = అధికమగుచు, వీఁకన్ = పరాక్రమముతో, తాఁకి, ఆసుర- లీలన్ = రాక్షసముగ, ధర = భూమి, పెల్లగిల్లన్ = పెకలఁగా, దిశ్(క్) + అధి + ఈశుల్ = దిక్పాలకులు, భీతిన్ = భయముతో, కంపింపఁగన్ = వడఁకఁగా, పోరాడిరి

**తాత్పర్యము :** రెండు సైన్యములును మిక్కిలి ఆర్చి వేగముతో మీఁదికి దండెత్తుఁడు పట్టుకొనుఁడు అనుచు ఒకరికంటె నొకరు బలము, చలము, మదము, దర్పము, ఉత్సాహము, అధికముగా పరాక్రమముతోఁ దాఁకి రాక్షసముగా, భూమి పగులఁగా, దిక్పాలురు భయమునఁ గంపింపఁగాఁ బోరాడెను

వ తదవసరంబున సంయోగాది పంచవిధాంతర్మదంబుల, సంజాత తిలకాది సప్తవిధ బాహ్యమదంబులఁ, ద్రిగండ గళితంబులైన మదాంధగంధ సింధురంబుల నారోహణవిధిజ్ఞులైన యారోహకు లెక్కి మృగ మంద భద్ర సంకీర్ణజాతుల నప్రకృష్టోత్కృష్ట మధ్యమ స్వేచ్ఛాసనంబులం జొచ్చి యెక్కి తలభ్రమణాది చతుర్విధచారణల నంకుశంబులు పాలయించుచు వాగాది

త్రివిధ ప్రణిధులం బ్రబోధించుచుం గార్ముకాది త్రిస్రాయుధంబులం బ్రవీణులైన యోధవీరులెక్కి యుద్ధసన్నద్ధులై గజంబుల మొగవడంబు లెత్తించి ప్రతిబలంబునకుం జూపి యిచ్చి మహారభసంబున 137

**అర్థము.** తద్ + అవసరంబునన్ = ఆ సమయమున, సంయ + ఆది-పంచ - విధ + అంతః + మదంబులన్ = సంయముమున్నగు అయిదు విధములైన లోపలి మదములుగలట్టియు, సంజాత - తిలక + ఆది -సప్త - విధ + బాహ్యమదంబులన్ = పుట్టిన తిలకము మున్నగు ఏడు రీతులైన వెలుపలి మదములు గలట్టియు త్రిగండ - గళితంబులు + ఐన = మూఁడు గండముల (ఏనుఁగు చెక్కిళ్లు) నుండి జాఱినవి యైన, మద + అంధ - గంధ - సింధురంబులన్ = మదముచే గ్రుడ్డివియైన మదగజములను, ఆరోహణ - విధిజ్ఞులు + ఐన = ఎక్కు విధమును దెలిసిన వారయిన, ఆరోహకులు = ఎక్కువారు, ఎక్కి, మృగ - మంద - భద్ర సంకీర్ణజాతులన్ = మృగము, మందము, భద్రము, వీని మిశ్రము అను నాలుగు విధములైన జాతులైన ఏనుఁగులను, అప్రకృష్ట + ఉత్కృష్ట - మధ్యమ - స్వేచ్ఛా + ఆసనంబులన్ = అప్రకృష్టము, ఉత్కృష్టము, మధ్యమము, అను మూఁడు విధములైన తమ యిచ్చవచ్చిన ఆసనములను, చొచ్చి, ఎక్కి, తలభ్రమణ + ఆది - చతుర్విధ - చారణలన్ = తలభ్రమణము మున్నగు నాలుగు విధములయిన అంకుశచారణలతో, అంకుశంబులు, పాలయించుచున్ = కదల్పుచు, వాచ్ (క్) + ఆది - త్రివిధ - ప్రణిధులన్ = వాక్కు మున్నగు మావటీని ఆజ్ఞఁ దెలుపు మార్గములచేతను, ప్రబోధించుచున్ = తోలుచు, కార్ముక + ఆది - త్రిస్ర + ఆయుధంబులన్ = కార్ముకముమున్నగు మూఁడు విధములయిన ఆయుధములందును, ప్రవీణులు + ఐన = నేర్పరులయిన, యోధ - వీరులు, ఎక్కి, యుద్ధ - సన్నద్ధులు + ఐ = యుద్ధమునకు సిద్ధపడినవారయి, గజంబులన్ = ఏనుఁగులందు, మొగ వడంబులు = ముఖ కవచములు, ఎత్తించి, ప్రతి - బలంబునకున్ = శత్రు సైన్యమునకు, చూపి, ఇచ్చి, మహత్ (మహా) + రభసంబునన్ = గొప్పవేగముతో

**తాత్పర్యము :** ఆ సమయమున సంయము మున్నగు అయిదు విధములయిన అంతర్మదములుగలట్టియు, తిలకము మున్నగు నేడువిధములయిన బాహ్య మదములు గలట్టియు మూఁడు గండములనుండి జాఱు మదముచేనంధము లైనట్టియు గంధగజములను ఎక్కువిధమునెఱిఁగిన ఆరోహకులు ఎక్కి, మృగము, మందము, భద్రము, సంకీర్ణము అను నాలుగు విధములైన జాతుల ఏనుఁగులను,

అప్రకృష్టము, ఉత్కృష్టము, మధ్యమము అను మువ్విధములైన తమ యిచ్చవచ్చిన ఆసనములను జొచ్చి, ఎక్కి, తలభ్రమణాదులైన నాలుగు విధములయిన అంకుశ చారణలతో అంకుశములు కదల్పుచు, వాక్కు మున్నగు మూఁడు విధములైన ప్రణిధుల చేతను దోలుచు, కార్ముకము మున్నగు మూఁడు విధములైన ప్రణిధులచేతను దోలుచు, కార్ముకము మున్నగు మువ్విధములయిన ఆయుధములందును నేర్పరులయిన యోధవీరులెక్కి, యుద్ధసన్నద్ధులై యేనుఁగుల ముఖకవచము లెత్తించి శత్రుసైన్యమునకుఁ జూపి గొప్పవేగముతో - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు** గజజాతులు మూఁడు - 'భద్రమంద మృగ భేదత స్త్రిధా జాతి రత్ర కరిణాం పురోదితా 'వీని మిశ్రము సంకీర్ణజాతి ఆసనములు మూఁడు 'క్రమా త్రీ ణ్యాసనాని స్యు ర్ముఖమధ్యాధమాని హి ఏకఃప్రసారితః పాద స్తదన్యో నత జానుకః పాశ్చాత్య మాసనం జ్ఞేయ మేకం జానుగతం బుధైః' అంకుశ చారణలు నాలుగు విధములు ప్రణిధులు మూఁడు 'వాక్పాదాంఙ్ఘుశచోదనాప్రణిధి రిత్యుక్తా

మ **మణి కోదండము లింద్రచాపములుగా, మత్తిల్లి గర్జిల్లు వా**
**రణముల్ లీల ఘనాఘనంబులుగ, వీరవ్రాతముల్ గార్చు మా**
**ర్గణవర్షం బతివర్షమై కురియ, నాకాశాంతరాళంబు ధా**
**రుణియుం** గప్పుచుఁద్రోచి రోలిఁ దొలుకారుంబోలె నాధోరణుల్ 138

**అర్థము :** మణి - కోదండములు = మణిమయములైన విండ్లు, ఇంద్రచాపములు + కాన్ = ఇంద్రధనుస్సులుగా, మత్తిల్లి = - గర్జిల్లు - వారణముల్= మదించి ఘీంకరించు ఏనుఁగులు, లీలన్ = విలాసముతో, ఘనా - ఘనంబులు+ కన్ = వర్షాకాలపు మేఘములుగను, వీర - వ్రాతముల్ = వీరుల సమూహములు, కార్చు, మార్గణ - వర్షంబు = బాణముల వాన, అతి - వర్షము + ఐ = పెనువానయై, కురియన్, ఆధోరణుల్ = మావటీంద్రు, తొలుకారున్ + పోలెన్ = తొలుకారువలె, ఓలిన్ = క్రమముగా, ఆకాశ + అంతరాళంబున్ - ధారుణియున్ = మింటినడిమి ప్రదేశమును, భూమియును, కప్పుచున్, త్రోచిరి

**తాత్పర్యము :** మణిమయధనుస్సులు ఇంద్రచాపములుగను, మదించి గర్జిలునేనుఁగులు వర్షాకాలపు మేఘములుగను, వీరుల సమూహములు విడుచు అంపవాన అధికవర్షమయి కురియఁగను, మావటివాండ్రు తొలుకారువిధమున ఆకాశమధ్యప్రదేశమును భూమియుఁ గప్పుచుఁ ద్రోచిరి

**విశేషములు** అలంకారము రూపకానుప్రాణితోపమ

వ అంత - తరువాతి పద్యముతో నన్వయము 139

సీ కరిఘట లొండొంటిఁ గని కొండ కొండతోఁ
దాఁకిన గతి మిన్నుఁదాఁకి పోరి,
రవి బింబములు గప్పు రాహు మండలములో
యన హేమరథసమూహములు గప్పి
జలధి లేఁదరఁగలు జలములఁ గబళించు
కరణి నశ్వంబులఁ గమిచి చమరి,
వన లులాయము లిక్షువనము నుగ్గాడిన
పగిదిఁ గాల్బ్వర నేలపాలు చేసి,

ఆ మాఱు లేక మదము మీఱి మదాంధ సిం
ధురము లొక్కమొగిఁ జతుర్బలముల
బారిసమరి రుధిరవారిధి నోలాడు
చుండె ధాతునగములొక్కొ యనఁగ 140

**అర్థము :** కరి - ఘటలు = ఏనుఁగుల గుంపులు, ఒండొంటిన్ = ఒకదాని నొకటి, కని = చూచి, కొండ, కొండతోన్, తాఁకిన-గతిన్ = తాఁకిన విధమున, మిన్నున్ = ఆకాశమును, తాఁకి, పోరి

రవి - బింబములు = సూర్యమండలములు, కప్పు, రాహు - మండలములో + అనన్, హేమ - రథ - సమూహములు = బంగారు రథముల సమూహములను, కప్పి

జలధి - లేఁదరఁగలు (లేఁత + తరఁగలు) = సముద్రమునందలి లేఁత యలలు, జలములన్ = నీరును, కబళించు - కరణిన్ = మ్రింగు విధమున, అశ్వంబులన్ = గుఱ్ఱములను, కమిచి = ఆక్రమించి, చమరి = కొట్టి,

వన - లులాయములు = అడవిదున్నలు, ఇక్షువనమున్ = చెఱకు తోఁటను, నుగ్గాడిన - పగిదిన్ = పొడిగాఁజేసిన విధమున, కాల్బ్వరన్ = కాల్బంటులను, నేలపాలు చేసి,

మాఱులేక = ఎదురులేక, మదము -మీఱి = మద మతిశయించి, మద + అంధ - సింధురములు= మదముచేఁగన్నులుగానని ఏనుఁగులు, ఒక్క-మొగిన్ = ఒక్కపెట్టున, చతుః(ర్) + బలములన్ = నాలుగు విధములైన సైన్యములను, బారిసమరి = హింసించి, ధాతు - నగములు + ఒక్కో + అనఁగన్ = గైరికాది ధాతువులతోడి కొండలా యనునట్లు, రుధిర - వారిధిన్ = రక్త సముద్రమున, ఓలాడుచున్ + ఉండెన్ = విహరించుచుండెను

**తాత్పర్యము**. ఏనుఁగులగుంపు లొకదానినొకటి చూచి కొండ కొండతో ఢీకొనునట్లు మిన్నంటి పోరి, సూర్యబింబములను గప్పు రాహుమండలములో యనునట్లు బంగరురథముల సమూహములను కప్పి, సముద్రపు లేయలలు జలములను మ్రింగులాగున గుఱ్ఱముల నాక్రమించి కొట్టి, అడవిదున్నలు చెఱకుతోఁటను బోడిచేసిన విధమునఁ గాలిబంటులను నేలపాలు చేసి, ఎదురులేక మద మతిశయించి మదాంధములైన యేనుఁగులు ఒక్కపెట్టునఁ జతుర్విధబలములను హింసించి గైరికాదిదాతువులతోడి యెఱ్ఱనికొండలా యనునట్లు రక్తసముద్రమున విహరించుచుండెను

**విశేషములు**. అలంకార ముత్ప్రేక్ష

వ మఱియు భ్రమ్యాది నవవిధ దంతవధలనుం, బ్రహ్వాతాద్యష్టవిధ
**హస్తవధలను, బ్రోక్తాది పంచవిధ గాత్రవధలను, బృహదాది చతుర్వి ధరాతాది
వధలను, సంయోగాద్యనేకాశీతివధలను, వైహాయసాద్యనేకవిధఘాత వధలను
జతుర్బలంబు నిట్లు వ్రచ్చి వధావధసేయుచుండె నట్టి యవసరంబునం
బ్రళయానలంబులం గప్పునట్లు రథసమూహంబు లొండొంటిం గప్పుకొనుచు 141**

**అర్థము**.మఱియున్, భ్రమ్య + ఆది - నవ - విధ - దంత - వధలనున్= భ్రమ్యము మున్నగు తొమ్మిది విధములైన దంత వధలచేతను, ప్రహ్వాత + ఆది + అష్ట - విధ - హస్త - వధలను = ప్రహ్వాతము మున్నగు ఎనిమిది విధములైన హస్తవధల చేతను ప్రోక్త + ఆది - పంచ - విధ - గాత్ర - వధలను = ప్రోక్తము మున్నగు అయిదువిధములైన గాత్రవధలచేతను, బృహత్ + ఆది - చతుర్విధ-రాత + ఆది - వధలను = బృహత్తుమున్నగు నాలుగు విధములైన రాతాదివధలచేతను, సంయోగ + ఆది + ఏక + ఆశీతి + వధలను = సంయోగము మున్నగు ఎనుబది యొక్క వధలచేతను, వైహాయస + ఆది + అనేక - విధ = ఘాత + ఆది - వధలను= వైహాయసము మున్నగు పలువిధములైన ఘాతాదివధలచేతను, చతుః + బలంబున్ = నాలుగువిధములైన సైన్యమును, ఇట్లు, వ్రచ్చి = వధించి,

వధావధ + చేయుచున్ + ఉండెన్ = చిత్రవధచేయుచుండెను, అట్టి + అవసరంబునన్= అట్టి సమయమున, ప్రళయ + అనలంబులన్ = ప్రళయ సమయమునందలి అగ్నులను, కప్పు + అట్లు, రథ - సమూహంబులు, ఒండొంటిన్, కప్పుకొనుచున్

**తాత్పర్యము** మఱియును భ్రమ్యము మున్నగు తొమ్మిదివిధములైన దంత వధలచేతను, ప్రభృతము మున్నగు నెనిమిది విధములైన హస్తవధలచేతను ప్రోక్తము మున్నగు నైదువిధములైన గాత్రవధలచేతను, బృహత్తు మున్నగు నాలుగువిధములైన రాతాది వధలచేతను, సంయోగము మున్నగు ఎనుబది యొక్క విధములయిన వధలచేతను, వైహాయసము మున్నగు పలువిధములయిన ఘాతాదివధలను, నాలుగువిధములైన బలమును ఇట్లు వధించి చిత్రవధ చేయుచుండెను అట్టిసమయమునఁ బ్రళయాగ్నులను గప్పునట్లు రథసమూహము లొకదాని నొకటి కప్పుకొనుచు - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** ఈ గద్యము నందలి వధల విధములు మహావీరైకవేద్యములు రాజగు నన్నెచోడుని యుద్ధక్రీడావిజ్ఞానము గొప్పది

**చ పృధుభుజశక్తి సారథులఁ బెట్టి శరాహతిఁ దార సారథుల్**
**రధికులునై పెనంగి మఱి రథ్యములం బడనేసి, కాయ్పుతో**
**రథముల డించి, వాలుల దురంబు రయంబునఁజేసి, వాలులున్**
**వృథ యగుడున్ భటాగ్రణులు వీఁగక చేసిరి ముష్టియుద్ధముల్ 142**

**అర్థము .** పృథు - భుజ - శక్తిన్ = గొప్ప బాహుపరాక్రమముతో, సారథులన్, పెట్టి = విడిచిపెట్టి, శర + ఆహతిన్ = బాణముల దెబ్బతో, తారు + అ = తార = తామే, సారథుల్ - రథికులున్ + ఐ = సారథులును రథికులునయి, పెనంగి = పోరి, మఱి, రథ్యములన్ = గుఱ్ఱములను, పడన్ + ఏసి = పడఁగొట్టి, కాయ్పుతోన్ = కోరికతో , రథములన్, డించి = విడిచి, వాలులన్ = కత్తులతో, రయంబునన్ = వేగముతో, దురంబు + చేసి = యుద్ధముచేసి, వాలులున్ = కత్తులుగూడ, వృథ + అగుడున్ = వ్యర్థమయినంతనే, భట + అగ్రణులు = భటశ్రేష్ఠులు, వీఁగక = వెనుదీయక, ముష్టి - యుద్ధముల్ = పిడికిలులతోడి యుద్ధములు, చేసిరి

**తాత్పర్యము.** వీరశ్రేష్ఠులు గొప్ప బాహుబలముతో సారథులను, విడిచిపెట్టి తామే సారథులును రథికులునయి బాణహతితోఁ బోరి గుఱ్ఱములను గూల్చి,

కోరికతో రథములను విడిచి, కత్తులతో శీఘ్రముగా యుద్ధము చేసి, కత్తులు గూడ వ్యర్థము కాఁగా వెనుదీయక ముష్టియుద్ధములు చేసిరి

క త్రిభువనములపైఁ బెల్లున
గభీరవిలయాబ్ధు లోలిఁ గప్పినగతి న
య్యిభ రథ పదాతితతిపై
రభసంబునఁ గప్పె బహు తురంగ దళంబుల్ 143

**అర్థము**.గభీర - విలయ + అబ్ధులు = గంభీరములయిన ప్రళయకాలపు సముద్రములు, పెల్లునన్ = ఆధిక్యముతో, త్రిభువనముల పైన్ = ముల్లోకముల మీఁదను, ఓలిన్ = బాగుగా - నిండుగా, కప్పిన - గతిన్ = కప్పిన విధమున, బహు - తురంగ - దళంబుల్ = పెక్కు గుఱ్ఱముల దండులు, ఆ + ఇభ - రథ - పదాతి - తతిపైన్ = ఆ యేనుఁగుల, రథముల, కాలిబంటుల సమూహముపై, రభసంబునన్ = వేగముగా, కప్పెన్

**తాత్పర్యము**.గంభీరములయిన ప్రళయకాల సముద్రములు ఆధిక్యముతో ముల్లోకములపై నిండుగాఁ గప్పిన విధమున, పలు గుఱ్ఱముల దండులు ఆ గజరథపదాతి సమూహముపై వేగముగాఁ గప్పెను

**విశేషములు** : అలంకార ముపమ

వ. ఇట్లపార తౌరంగికవీరు లొండొరులం దాఁకి మహాఘోరయుద్ధంబు చేయుచు. 144

**అర్థము** . ఇట్లు, అపార - తౌరంగిక - వీరులు = పారములేని రౌతులైన వీరులు, ఒండొరులన్ = ఒకరినొకరు, తాఁకి, మహత్ (మహా) - ఘోర - యుద్ధంబు = మిక్కిలి భయంకరమైన యుద్ధము, చేయుచు

**తాత్పర్యము** .ఇట్లు అసంఖ్యాకులైన రౌతువీరులు ఒకరి నొకరు తాఁకి మిక్కిలి భయంకరమైన యుద్ధము చేయుచు - తరువాతి పద్యముతో నన్వయము

చ కరులు కరంబులున్ రదనగాత్రములుం దెగి తొల్లి తూలఁగాఁ
నరదము లశ్వసూతరథికాన్విత ముక్కఱి నుగ్గునూఁచగాఁ,
దురగ రథంబు లాశ్వికులతోడన - నడ్మలు త్రెవ్వి ధారుణిం
దొరుఁగఁ, బదాతి వర్మములతోఁ గడిఖండములై బడల్వడన్ 145

**అర్థము.** కరులు = ఏనుఁగులు, కరంబులున్ = తొండములును, రదన - గాత్రములున్ = దంతములును శరీరములును, తెగి, తొల్లి = మొదట, తూలఁగాన్ = కూలఁగా, అరదములు = రథములు, అశ్వ - సూత - రథిక + అన్వితము = గుఱ్ఱములు, సారథులు, రథికులు అనువారితోఁగూడి, ఉక్కఱి (ఉక్కు = అఱి) = బలము నశించి, నుగ్గునూఁచ + కాన్ = పిండిపిండి కాఁగా, తురగ - రథంబులు = గుఱ్ఱములును, రథములును, ఆశ్వికులతోడన్ + ఆ = రౌతులతోపాటే, నడుమ్ములు = నడుములు, త్రెవ్వి = తెగి, ధారుణిన్ = నేలపై, తొరుఁగన్ = పడఁగా, పదాతి = కాల్బంటులు, వర్మములతోన్ = కవచములతో, కడిఖండములు + ఐ = ముక్కలు ముక్కలయి, బడల్పడన్ (బడలు + పడన్) = చావఁగా,

**తాత్పర్యము.** ఏనుఁగులు తొండములును, దంతములును, శరీరములును దెగి మొదటఁగూలఁగా, రథములు గుఱ్ఱములతోను, సారథులతోను, రథికులతోను గూడి బలము నశించి పిండిపిండి కాఁగా, గుఱ్ఱములును, రథములును రౌతులతోపాటే నడుములు తెగి నేలఁగూలఁగా, కాల్బంటులు కవచములతో ముక్కలుముక్కలయి చావఁగా - తరువాతి పద్యముతో నన్వయము

క **ఆసురముగ నాశ్వికుల న**
**రాసులు మునుమిడి భయంకరాకారముతో**
**వ్రేసి రవి నాకు లురిపము**
**చేసిన క్రియ నొడ్డనముల శిరములు డొల్లెన్** 146

**అర్థము .** అనిన్= యుద్ధమున, నరాసులు (నర + అశి + లు) మనుష్యులను దినువారు - రాక్షసులు, ఆసురముగన్= రాక్షసముగ= క్రూరముగా, మునుమిడి (మునుము + ఇడి) = వరుసపెట్టి, భయంకర + ఆకారముతోన్ = భీకర రూపముతో, ఆశ్వికులన్ = రౌతులను, వ్రేసిరి = కొట్టిరి, నాకులు (నాకి + లు) = నాకముగలవారు - దేవతలు, ఉరిపము - చేసిన - క్రియన్ = కోఁతకోసిన విధమున, ఒడ్డనములన్ = (శత్రు) వ్యూహములందు, శిరములు = తలలు, డొల్లెన్= రాలెను

**తాత్పర్యము :** యుద్ధమున రాక్షసులు క్రూరముగా వరుసపెట్టి భయంకరాకారముతో ఆశ్వికులను గొట్టిరి దేవతలు కోఁతకోసిన విధమున శత్రు వ్యూహములందుఁ దలలు రాలెను

వ అంత ననంత పదాతి బలంబులు పరమసంరభంబునం బేర్చి యుగాంతాంతకసంతానంబునుం బోలెఁ గోపోద్రేకంబునం గోలుమసంగి 147

**అర్థము** · అంతన్, అనంత - పదాతి - బలంబులు = అంతులేని కాల్బంటుల సైన్యములు, పరమ- సంరంభంబునన్ = మిక్కిలి కోపముతో, పేర్చి = విజృంభించి, యుగ + అంత + అంతక - సంతానంబునున్ + పోలెన్ = ప్రళయ సమయమునందలి యముల సమూహమువలె, కోప + ఉద్రేకంబునన్ = కోపాతిశయముచే, కోలుమసంగి = అతిశయించి

**తాత్పర్యము:** అంత అనంతములయిన కాల్బంటుల సైన్యములు మిక్కిలి కోపముతో విజృంభించి ప్రళయసమయ యమ సమూహమువలెఁ గోపాతిశయముచే నతిశయించి - తరువాతి పద్యముతో నన్వయము

చ **తురగదళంబు లొండవిసి తూల, రథంబులు పెల్లగిల్ల, సిం**
**ధురఘట లోడఁ, గాల్బలముఁ ద్రోచి చలింపక మార్బలంబు ల**
**త్తురగదళంబు లొండవిసి తూల, రథంబులు పెల్లగిల్ల, సిం**
**ధురఘట లోడిపాఱ ననిఁ దోలుచుఁ గాల్వురు దాఁకి రత్తలన్** 148

**అర్థము.** తురగ - దళంబులు = గుఱ్ఱముల దండులు, ఒండు = ఒకటి, అవిసి = చెదరి, తూలన్ = చలింపఁగా, రథంబులు, పెల్లగిల్లన్ = పగులఁగా, సింధుర - ఘటలు = ఏనుఁగుల గుంపులు, ఓడన్ = పాఱిపోఁగా, కాల్బలమున్ = కాల్బంటులను, త్రోచి = పడవైచి, మార్బలంబులు = శత్రుసేనలు, చలింపక, అత్తలన్ (ఆ + తలన్) = ఆ వైపున, ఆ + తురగ - దళంబులు = ఆ గుఱ్ఱముల సేనలు, ఒండు, అవిసి, తూలన్ = చలించునట్లు, రథంబులు, పెల్లగిల్లన్ = పగులునట్లు, సింధుర - ఘటలు, ఓడి, పాఱన్ = పాఱిపోవునట్లు, అనిన్ = యుద్ధమునందు, తోలుచున్, కాల్వురు = కాల్బంటులు, తాఁకిరి = మార్కొనిరి

**తాత్పర్యము.** శత్రుసేనలు గుఱ్ఱముల దండు చెదరిపోఁగా, రథములు పగులఁగా, ఏనుఁగుల గుంపులు పాఱిపోఁగా, కాల్బంటులను ద్రోచి చలింపకుండఁగా, రెండవ పక్షమునఁ గాల్బంటులు గుఱ్ఱముల సేనలు చెదరి చలించునట్లును రథములు పెల్లగిల్లునట్లును, ఏనుఁగుల గుంపులు పాఱిపోవునట్లును, యుద్ధమునఁ దోలుచు మార్కొనిరి

**విశేషములు .** రెండుపక్షములవారును ఒకరి కొకరు తీసిపోకుండునట్లు యుద్ధముచేసిరని భావము

వ అంత - తరువాతి పద్యముతో నన్వయము 149

మత్తకోకిల ఒండొరుం గడవంగ నార్చుచు నుగ్రబాణసమూహ మొ
క్కండుఁ దప్పక గెల్వ నెమ్మెయిఁ గోలగోలకుఁజొచ్చి కో
దండకౌశల మేర్పడన్ రథ దంతి వాజి భటావళిన్
బుండుమాఁగుడుగాఁగ నేసిరి భూరివీరధనుర్ధరుల్ 150

**అర్థము** భూరి - వీర - ధనుర్ధరుల్ = మిక్కిలి వీరులైన విలుకాండ్రు, ఒండొరున్ = ఒకరినొకరు, కడవంగన్ = మించుటకు, ఆర్చుచున్, ఉగ్ర-బాణ - సమూహము= భయంకరబాణసమూహము, ఒక్కండున్ = ఒక్కటియు, తప్పక, ఎమ్మెయిన్ (ఏ+మెయిన్) = ఏ విధముగా నయినను, గెల్వన్ = గెలుచుటకు, కోల - కోలకున్= బాణబాణమునకు, చొచ్చి = పూని, కోదండ - కౌశలము = వింటి నేర్పు, ఏర్పడన్= స్పష్టపడునట్లు, రథ - దంతి - వాజి - భట + ఆవలిన్ = రథములయు, ఏనుఁగులయు, గుఱ్ఱములయు వరుసను, పుండు-మాఁగుడు + కాఁగన్ = పుండు మిగుల నలఁగునట్లు, ఏసిరి = కొట్టిరి

**తాత్పర్యము** మిక్కిలి వీరులైన విలుకాండ్రు ఒకరినొకరు మించ నార్చుచు ఉగ్రబాణ సమూహ మొక్కటియుఁదప్పక, ఏ విధముగానైనను గెలుచుటకు బాణబాణమునకుఁ బూని వింటినే ర్పేర్పడ రథగజతురగపదాతివర్గమును పుండుమిగులనలఁగునట్లు కొట్టిరి

**విశేషములు** మత్తకోకిలకు నాలుగు పాదములుండును ప్రతి పాదమునను ర,స,జ,జ,భ,ర అను గణములుండును మొదటి యక్షరమునకును పదునొకండవ అక్షరమునకును యతిమైత్రి ప్రాసనియమము గలదు

ఉ బిట్టఱ నెమ్మెయిం గెలువఁ బెల్కుఱ లేచియు, మెట్టిలేచినం
బట్టియు, నడ్డనంబుల నపారభుజాబలగర్వ మేర్పడన్
గిట్టిన బల్విడిన్ బొడిచి గీటడఁగించియుఁ బేర్చియార్చుచున్
జెట్టిగ వీరులై దురముసేసిరి కైపున నీఁటెకా ఱనిన్ 151

**అర్థము .** అనిన్ = యుద్ధమునందు, ఈఁటెకాఱు = బల్లెముల వారు, బిట్టఱన్ (బిట్టు + అఱన్) = ఔద్ధత్యము నశించునట్లు, ఎమ్మెయిన్ (ఏ +

మెయిన్) = ఏ విధముగానైనను, గెలువన్ = గెలుచుటకు, పెల్కుటన్ = భయపడునట్లు, లేచియున్, మెట్టి - లేచినన్ = వచ్చిలేచినచో, పట్టియున్, అడ్డనంబులన్ = డాలులతో, అపార - భుజా - బల గర్వము = అధికమైన బాహుపరాక్రమమువలని గర్వము, ఏర్పడన్ = స్పష్టపడునట్లు, కిట్టినన్ = సమీపించినచో, బల్విడిన్ = బలాత్కారముగా, పొడిచి, గీటడఁగించియున్ = చంపియు, పేర్చి= అతిశయించి, ఆర్చుచున్ = బొబ్బలువెట్టుచు, జెట్టిగ వీరులు + ఐ = మల్లయుద్ధవీరులయి, కైపువన్ = కోపముతో, దురము + చేసిరి = యుద్ధ మొనరించిరి

**తాత్పర్యము** యుద్ధమునందు బల్లెములవారు ఔద్ధత్యము నశించునట్లు ఏ విధముగానైనను గెలుచుటకు భయపడునట్లు లేచియును, వచ్చి లేచినచో బంధించియు, డాలులతో అధికబాహుపరాక్రమగర్వము స్పష్టపడునట్లు సమీపింపఁగా బలాత్కారముగాఁ బొడిచి చంపియు అతిశయించి ఆర్చుచు మల్లయుద్ధవీరులయి కోపముతో యుద్ధ మొనరించిరి

**విశేషములు.** ఈఁటెకాఱు ఈఁటెకా + లు 'కాప్రత్యయంబు మీఁది బహువచనలకారంబునకు లఘ్వలఘురేఫంబులును లఘురేఫంబునకు ముందు పూర్ణబిందుపూర్వకడకారంబు నగు ' బాల ఆచ్చిక 7 ఈఁటెకాఱు ఈఁటెకాండ్రు (రూపాం )

క **కడకొంతంబులఁ గొని వడిఁ**
**బొడిచిరి కుంతధరు లుగ్ర భూరిబలం బే**
**ర్పడ హయగజభటతతి సా**
**ల్వడి పడి మ్రొగ్గఁబడి మిట్టిపడ రభసమునన్** **152**

**అర్థము.** కుంత - ధరులు = బల్లెములను ధరించువారు, ఉగ్ర - భూరి - బలంబు= భయంకరమైన అధికబలము, ఏర్పడన్ = స్పష్టపడఁగా, హయ-గజ-భట-తతి = గుఱ్ఱములయు, ఏనుఁగులయు, భటులయు సమూహము, చాల్వడి = ప్రోగుపడి, పడి, మ్రొగ్గఁబడి = ముందునకుఁబడి, రభసమునన్ = కోపముతో, మిట్టిపడన్ = ఎగిరిపడఁగా, కడ - కొంతంబులన్ = కొనబల్లెములను, కొని, వడిన్ = వేగముగా, పొడిచిరి

**తాత్పర్యము:** బల్లెములను దాల్చువారు భయంకరమైన అధికపరాక్రమము స్పష్టపడ గుఱ్ఱములయు, ఏనుఁగులయు, భటులయు సమూహము ప్రోగుపడి

ముందునకుఁబడి కోపముతో నెగిరిపడునట్లు కొనబల్లెములను దీసికొని వేగముగాఁ బొడిచిరి

క కడితల యుద్ధంబులు నెర
విడి నొండొరు నంటఁదాఁకి వ్రేసిరి పెలుచన్
గడికండము లడగొని చ
క్కడఁచిన క్రియ నుర్గునూచమై పడఁ బోరన్ 153

**అర్థము .** పోరన్ = యుద్ధమునందు, కడికండములు = ముక్కలు, ముక్కలు, అడగొని = అట్టకట్టి, చక్కఁడచిన - క్రియన్ = ముక్కలు చేసిన విధమున, నుర్గునూచము + ఐ= పిండిపిండియై, పడన్ = పడునట్లు, కడితల - యుద్ధంబులు = కడితల అను ఆయుధములతోడి యుద్ధములు, నెరవిడిన్ = వ్యాపించునట్లుగా, ఒండొరున్= ఒకరినొకరిని, అంటన్ + తాఁకి = మిక్కిలి తాఁకి, పెలుచన్ = అధికముగా, వ్రేసిరి = కొట్టిరి

**తాత్పర్యము :** యుద్ధమునందు ముక్కలుముక్కలు అట్టకట్టి ముక్కలు చేసిన విధమునఁ బొడిపొడియై పడునట్లు కడితల (గడిదల - సూని ) అను ఆయుధములతోడి యుద్ధములు వ్యాపించునట్లు ఒకరినొకరు మిక్కిలి తాఁకి అధికముగాఁ గొట్టిరి

వ. ఇ ట్లతిభయంకరమైన దేవాసురయుద్ధంబున. 154

**అర్థము :** ఇట్లు, అతి - భయంకరము + ఐన, దేవ + అసుర-యుద్ధంబునన్

**తాత్పర్యము.** ఇట్లు మిక్కిలి భయంకరమైన సురరాక్షస యుద్ధమునందు - తరువాతి పద్యముతో నన్వయము

చ. అనయముఁ జక్కుచక్కనఁగ నాడెడు రూపులు, నోలి ఝుమ్ము ఝు
మ్మని కలయంగఁబాఱు వివిధారుణధారలు పాఱ, గుప్పుగు
ప్పనఁ బడు మస్తకంబులును, నక్కడ నిక్కడ మ్రోసి డిబ్బుడి
బ్బనఁ బడు నట్టలున్, గడుభయావహమయ్యె మహాహవంబునన్ 155

**అర్థము .** అనయమున్ = మిక్కిలి, చక్కు చక్కనఁగన్ = ముక్కలు ముక్కలుగా, ఆడెడు, రూపులున్, ఓలిన్ = బాగుగా, ఝుమ్ము ఝుమ్ము + అని,

కలయఁగన్ = అంతటను, పాఱు = ప్రవహించు, వివిధ+ అరుణ - ధారలు = వివిధములైన రక్తప్రవాహములు, పాఱన్ = ప్రవహింపఁగను, గుప్పు గుప్పు + అనన్, పడు, మస్తకంబులును = తలలును, అక్కడన్ - ఇక్కడన్, మ్రోసి, డిబ్బుడిబ్బు+ అనన్, పడు, అట్టలున్ = మొండెములును, మహత్ (మహా) + ఆహవంబునన్ = గొప్పయుద్ధమున, కడున్ = మిక్కిలి, భయ + ఆవహము + అయ్యెన్ = భయంకర మయ్యెను

**తాత్పర్యము** మిక్కిలి ముక్కలై ఆడెడు రూపులును, బాగుగా ఝుమ్మ ఝుమ్మని అంతటను పాఱు వివిధ రక్త ప్రవాహములు ప్రవహింపఁగను, గుప్పుగుప్పనఁ బడు తలలును, అక్కడను ఇక్కడను ధ్వనించుచు డిబ్బుడిబ్బనఁ బడు మొండెములును మహాసంగ్రామమున మిక్కిలి భయంకరమయ్యెను

వ **అట్టి తుములయుద్ధంబున** **156**

**అర్థతాత్పర్యములు** . అట్టి తుముల - యుద్ధంబునన్ = దొమ్మియుద్ధమునందు - తరువాతి పద్యముతో నన్వయము

చ. **శరహతి బాహుమూలములు చక్కనఁ ద్రెవ్విన మాన కాదిసూ**
**కరముల పోలెఁ గోల్మసఁగి కైపునఁ గొన్ని మదాంధగంధసిం**
**ధురములు తీవ్రదంతములు దూఱ రయంబున నొత్తియెత్తి జ**
**ర్జరితముగా వడిం బొడిచి చంపె మహాజి భయంకరాకృతిన్** **157**

**అర్థము** . శరహతిన్ = బాణముల దెబ్బచే, బాహు మూలములు = (శత్రువీరుల) చంకలు,చక్కనన్ = ముక్కలుగా, త్రెవ్వినన్ = తెగఁగా, మానక = వదలక, ఆది - సూకరముల-పోలెన్ = ఆదివరాహములవలె, కోల్మసఁగి = మిక్కిలి విజృంభించి, కైపునన్ = కోపముతో, కొన్ని, మద + అంధ - గంధ - సింధురములు = మదముచేఁ గన్నులుగానని గంధగజములు, మహత్ (మహా) + ఆజిన్ = మహాయుద్ధమున, భయంకర + ఆకృతిన్ = భయంకరాకారముతో, తీవ్ర - దంతములు = తీక్ష్ణములైన దంతములు, తూఱన్ = చొరఁగా, రయంబునన్ వేగముగా, ఒత్తి = గ్రుచ్చి, ఎత్తి, జర్జరితము + కాన్ = తూఁటులుపడునట్లు, వడిన్ = వేగముగా, పొడిచి, చంపెన్,

**తాత్పర్యము :** బాణముల దెబ్బచే శత్రువీరుల చంకలు ముక్కలుగాఁ దెగఁగా, మదముచేఁ గన్నులుగానని కొన్ని మత్తేభములు మహాయుద్ధమున

భయంకరాకారముతో వదలక ఆదివరాహములవలె మిక్కిలి విజృంభించి కోపముతోఁ దీక్ష్ణములైన దంతములు చొచ్చునట్లు వేగముగా గ్రుచ్చియెత్తి తూంట్లుపడునట్లు వడిగాఁ బొడిచి చంపెను

**విశేషములు** అలంకారము ఉపమ

క వడినెయిది యిభము ప్రతిముఖ
మడరఁగ నొకఁ డాడ నేయ నది మొగఁదిరుగం
బడుటయుఁ బెడకమునన వెలు
వడి శర మొగి నేసి యార్చువానిన తాఁకెన్ 158

**అర్థము.** ఒకఁడు = ఒక వీరుఁడు, వడిన్ = వేగముగా, ఎయిది = చేరి, ఇభము = ఏనుఁగు, ప్రతిముఖము + అడరఁగన్ = అభిముఖమై విజృంభించునట్లు, ఆడన్ = గ్రుచ్చుకొనునట్లు, ఏయన్ = బాణముతోఁ గొట్టఁగా, అది = ఆ యేనుఁగు, మొగఁదిరుగన్ + పడుటయున్ = పెడమొగము పెట్టునట్లు పడఁగా, పెడకమునన్+ అ = పృష్ఠభాగముననుండియే, వెలువడి, శరము = బాణము, ఒగిన్ = లెస్సగా, ఏసి = ప్రయోగించి, ఆర్చువానిన్ + అ = ఆర్చువానినే, తాఁకెన్

**తాత్పర్యము.** ఒక వీరుఁడు వేగముగాఁ జేరి ఒక యేనుఁగును అభిముఖమై విజృంభించునట్లు బాణముతో గ్రుచ్చుకొనునట్లు కొట్టెను ఆ యేనుఁగు పెడమొగము పెట్టునట్లు పడఁగా నా బాణము దాని పృష్ఠభాగమునుండియే వెలువడి ప్రయోగించి ఆర్చువానినే తాఁకెను

క. కోలగతి నడచి యెత్తిన
కే లొగిఁ దెగి యలుగుతోన కే లెగసి వడిన్
దూలె జలవాయసం బా
వాలువుఁ గఱచికొని దివికి వడి నెగయు క్రియన్ 159

**అర్థము:** కోల - గతిన్ = బాణ మార్గమున, నడచి, ఎత్తిన - కేలు = ఎత్తినచేయి, ఒగిన్ = బాగుగా, తెగి, అలుగుతోన్ + అ = బాణముతోనే, కేలు, ఎగసి = ఎగిరి, జల-వాయసంబు = నీటి కాకి, ఆ -వాలువున్ = ఆ చేఁపను, కఱచికొని, దివికిన్ = ఆకాశమునకు, వడిన్ = వేగముగా, ఎగయు - క్రియన్ = ఎగురు విధమున, వడిన్ = వేగముగా, తూలెన్ = చలించెను

**తాత్పర్యము .** బాణము పోవు మార్గమున నడచి ఎత్తినచేయి బాగుగాఁ దెగి, బాణముతోనే చేయి ఎగిరి నీటికాకి వాలుగును నోటఁ గఱచికొని ఆకాశమునకు వేగముగా నెగురువిధమున వడిగాఁ జలించెను

**విశేషములు .** అలంకార ముపమ

క కరములు ద్రెవ్వినఁ బండులఁ
గరాసిఁ గఱచుకొని రౌద్రగతి ననిమేషో
త్కరము దెగఁబఱచె నొక్కఁడు
సురవాహిని దఱియు కొమ్ముచోఱయుఁ బోలెన్ 160

**అర్థము .** ఒక్కఁడు = ఒక రాక్షసవీరుఁడు, కరములు = చేతులు, త్రెవ్వినన్ = తెగఁగా, పండులన్= పండ్లతో - దంతములతో, కర + అసిన్ = చేతి కత్తిని, కఱచుకొని, రౌద్ర - గతిన్ = భయంకరమైన రీతిని,అనిమేష + ఉత్కరము = దేవతల సమూహము - చేఁపల సమూహము, తెగన్ = తెగునట్లు, సుర - వాహినిన్ = దేవతల సేనను - ఆకాశగంగను, తఱియు = దాఁటు, కొమ్ము - చోఱయున్ + పోలెన్ = ముఖభాగమున అంపము వంటి అవయవముగల చొఱచేఁపవలె, పఱచెన్ = పరువెత్తెను

**తాత్పర్యము** ఒక రాక్షసవీరుఁడు చేతులు తెగిపోఁగా, చేతికత్తిని దంతములతోఁ గఱచుకొని, భయంకరమైన రీతిని దేవతాసమూహము తెగునట్లు దేవతలసేనను - చేఁపల సమూహము తెగునట్లు ఆకాశగంగను దాఁటు కొమ్ము చొఱచేఁపవలె దాఁటి పరుగెత్తెను

**విశేషములు :** అలంకారము శ్లేషానుప్రాణితోపమ

ఆ **అమ్ముఁ దిగిచి యేసి యది ప్రతివీరు మై**
**తాఁకకుండ మున్న వీఁకఁ జూరియ**
**వెఱికికొని రయమునఁ బఱచి రిపుఁ బొడిచె**
**నమ్ముకంటె మున్నయలువు దాఁక** 161

**అర్థము :** అమ్మున్ = బాణమును, తిగిచి = లాగి, ఏసి = ప్రయోగించి, అది, ప్రతివీరు - మై = శత్రువీరుని శరీరమును, తాఁకక + ఉండన్ - మున్ను +

అ = తాఁకక మునుపే, వీఁకన్ = ఉత్సాహముతో, చురియ = చురకత్తి, పెఱికికొని= లాగికొని, రయమునన్=వేగముగా, పఱచి = పరువెత్తి, అమ్ముకంటెన్ - మున్ను+ అ = బాణముకంటె ముందే, అలువు + తాఁకన్= కత్తి తాఁకఁగా, రిపున్ = శత్రువును, పొడిచెన్

**తాత్పర్యము.** ఒకఁడు బాణము నాకర్షించి ప్రయోగించి, అది శత్రువీరుని శరీరమును దాఁకుటకు మునుపే ఉత్సాహముతోఁ జురకత్తి పెఱికికొని వేగముగాఁ బరువెత్తి, అమ్ముకంటె ముందే కత్తి తాఁకునట్లు, శత్రువును బొడిచెను

**విశేషములు.** చురి - చురియు - (రూపాం)

తే కడఁగి - కోదండధరుఁ డేయఁ గదనభూమిఁ
గరిహయానీకభటకోటి తరతరంబ
నెఱయ సాయకములు దాఁకి గఱులు దోఁచె
మద్దికాయలు మాఁటిడ్డ మాడ్కిఁ బోలె 162

**అర్థము :** కడఁగి= పూని, కోదండ - ధరుఁడు = విలుకాఁడు, ఏయన్ = కొట్టఁగా, కదన - భూమిన్ = యుద్ధభూమియందు, కరి - హయ + అనీక - భట - కోటి = ఏనుఁగులయు, గుఱ్ఱములయు సమూహము, భటుల సమూహము, తరతరంబ = క్రమక్రమముగా, నెఱయన్ = నిండుగా, సాయకములు = బాణములు, తాఁకి = తగిలి, మద్దికాయలు = చెవితమ్మినగలు, మాఁటు + ఇడ్డ - మాడ్కి + పోలెన్ - తగిలించిన విధమువలె, గఱులు = బాణముల ఱెక్కలు, తోఁచెన్

**తాత్పర్యము.** విలుకాడు పూని బాణములు ప్రయోగింపఁగా యుద్ధభూమిలో నేనుఁగుల, గుఱ్ఱముల సమూహము, భటుల సమూహము క్రమక్రమముగా నిండుగా బాణములు తగిలి మద్దికాయలు తగిలించిన విధమున బాణముల ఱెక్కలు తోఁచెను

**విశేషములు :** అలంకార ముత్ప్రేక్ష

క కరిఘటలమీఁద నలుగడ
వరుసన వడిఁదాఁకి భిండివాలము లొప్పెన్
గిరివరతటముల నోలిన
పురినెమళులు గలయ నెఱఁగు పోలుపును బోలెన్. 163

**అర్థము :** భిండివాలములు = వడిసెల వలెనుండు నస్త్రవిశేషములు - భిందిపాలములు, కరి - ఘటలమీఁదన్ = ఏనుఁగుల గుంపులపై, నలుగడన్ = నాలుగు దిక్కుల నుండి, వరుసన్ + అ = వరుసగా, వడిన్ = వేగముగా, తాఁకి= గ్రుచ్చుకొని, గిరి - వర - తటములన్ = శ్రేష్ఠములయిన కొండలచఱియలందు, ఓలిన్ + అ = క్రమముగా, పురి - నమళులు = పురివిప్పిన నెమళ్లు, కలయన్ = అంతటను, ఎఱఁగు, పొలుపును + పోలెన్ = ఎగయు విధమున, ఒప్పెన్

**తాత్పర్యము :** భిండివాలములనెడు అస్త్రవిశేషములు ఏనుఁగుల గుంపులపై నాలుగుదిక్కులనుండి వరుసగా వేగముగాఁదాఁకి కొండచఱియలందుఁ గ్రమముగా పురివిప్పిన నెమళ్లు అంతటను నెగయు విధమును బోలి యొప్పెను

**విశేషములు :** అలంకార ముత్ప్రేక్ష

**తే.** **కుంతములు బిట్టు నెఱఁకులు గొన్నఁ గొంద**
**ఱొదరి బిట్టేసి రుడుగణపదవి దాఁక**
**సెరవు లే కని నఱిమి చచ్చిన ఫలమున**
**బొంది తోడన దివికేఁగు పొలుపు వోలె.** 164

**అర్థము :** కుంతములు = బల్లెములు, బిట్టు = గాఢముగా, నెఱఁకులు=మర్మములు, కొన్నన్ = కనఁగా - తాఁకఁగా, కొందఱు, ఒదరి = విజృంభించి, సెరవు - లేక = ఆపదలేక, అనిన్ = యుద్ధమున, అఱిమి = ఎదురుకొని, చచ్చిన - ఫలమునన్ = చచ్చిన ఫలముగా, బొంది - తోడన్ + ఆ = శరీరముతోనే, దివికిన్ = స్వర్గమునకు, ఏఁగు - పొలుపు + పోలెన్ = వెడలు విధమువలె, ఉడు - గణ - పదవి - తాఁకన్ = నక్షత్రరాశిమార్గమును - ఆకాశమును, తాఁకునట్లు, ఏఁగు = వెడలు, పొలుపు + పోలెన్ = విధమువలె, బిట్టు + ఏసిరి = మిక్కిలి ప్రయోగించిరి

**తాత్పర్యము :** కుంతములు గాఢముగా మర్మస్థానములు తాఁకఁగాఁ గొందఱు విజృంభించి, ఆపదలేక, యుద్ధమున నెదురుకొని చచ్చినదానికి ఫలముగా బొందితోనే స్వర్గమునకేఁగు విధమును బోలి, ఆకాశమును దాఁకునట్లు మిక్కిలి యేసిరి

**విశేషములు :** అలంకార ముత్ప్రేక్ష

క  తాలగతిఁ బొడిచి యిరువురు
నోలములే కలువు లుచ్చి యురమునఁ గదియం
గీలించి యున్న భంగిన
వ్రాలిరి మును పెక్కులెంచి వచ్చిన వీరుల్ 165

**అర్థము.** మును = ముందు, పెక్కులు = అనేకములు, ఎంచి = ఎన్ని - పెక్కు బీరములు పలికి, వచ్చిన, వీరుల్, ఇరువురున్, తాల - గతిన్ = తాళమనెడి మల్లబంధవిశేషముతో, పొడిచి, ఓలము - లేక = మఱుఁగు లేక, అలువులు + ఉచ్చి బాణములు భేదించి, ఉరమునన్ = ఱొమ్మున, కదియన్ = కూడునట్లు, కీలించి = తగిలించి, ఉన్న - భంగిన్ + అ = ఉన్నవిధముగనే, వ్రాలిరి = ఒఱఁగిరి

**తాత్పర్యము :** ముందు పెక్కుమాటలు పలికి వచ్చిన వీరు లిరువురును తాళమనెడి మల్లబంధవిశేషముతోఁ బొడిచి మఱుఁగులేక బాణములు భేదించి ఱొమ్మునఁ గూడునట్లు తగిలించి ఉన్నవా రున్నట్లుగనే నేలవ్రాలిరి

తే  గ్రుయిలతోడన పొదినట్లు గూడినట్లు
పొడిచి కడకొంతములతోన పడిరి భటులు
పక్షములతోన గిరు లుర్విఁ బడిన కరణిఁ
గరులు ఘోరాజిఁ బడియెఁ బక్కెరల తోన 166

**అర్థము.** ఘోర + ఆజిన్ = భయంకరమయిన యుద్ధమున, గ్రుయిలతోడన్ + అ = గ్రుచ్చు సాధనములతోనే, పొదినట్లు = పొది స్థానములు, కూడిన + అట్లు = కూడిన విధమున, పొడిచి, భటులు = వీరులు, కడకొంతములతోన్ + అ = కొనబల్లెములతోనే, పడిరి, గిరులు = కొండలు, పక్షములతోన్ + అ = ఱెక్కలతోనే, ఉర్విన్ = నేలపై, పడిన - కరణిన్ = పడిన విధమున, కరులు = ఏనుఁగులు, పక్కెరలతోన్ + అ = తొడుగులతోనే, పడియెన్

**తాత్పర్యము :** ఆ భయంకరయుద్ధమున గ్రుచ్చు సాధనములతోనే పొదులును గూడిన విధమునఁ బొడిచి భటులు కొనబల్లములతోనే పడిరి ఱెక్కలతోనే కొండలు నేలపైఁబడిన విధమున నేనుఁగులు తొడుగులతోనే నేలఁబడెను

**విశేషములు :** అలంకారములు - ఉపమలు

క భోరనఁగ నెగయు నిభ కుం
భారుణధారాలి మౌక్తికావలితోడన్
దారక గణ యుత సంధ్యా
ధారాధర భాతి గగనతలమునఁ బర్వెన్ 167

**అర్థము.** భోరనఁగన్ = భోరుమను ధ్వనితో, నెగయు = పైకి లేచునట్టి, ఇభ - కుంభ + అరుణ - ధారా + ఆలి = ఏనుఁగుల కుంభస్థలములందలి రక్తధారల వరుస, మౌక్తిక + ఆవలితోడన్ = ముత్యముల వరుసతో, తారక-గణ-యుత - సంధ్యా -ధారాధర - భాతిన్ = నక్షత్రముల సమూహముతోఁ గూడిన సంధ్యాకాలపు మేఘమువిధమున, గగన - తలమునన్ = ఆకాశ ప్రదేశమున, పర్వెన్ = వ్యాపించెను

**తాత్పర్యము.** భోరుమని పైకి లేచు ఏనుఁగుల కుంభస్థలములందలి రక్త ప్రవాహముల వరుస ముత్యముల వరుసతోఁ గూడి, నక్షత్రముల సమూహముతోఁ గూడిన సంధ్యాకాలపు మేఘము విధమున ఆకాశమందు వ్యాపించెను

**విశేషములు.** అలంకార ముపమ

క దురమునఁ బటు చక్రాహతిఁ
గర సహితము శిరము ద్రెవ్వి గ్రక్కున నెగసెన్
గరములను రాహువు దివా
కరుఁ బట్టఁగ నభము కెగయుగతిఁ బొలు పెసఁగెన్ 168

**అర్థము.** దురమునన్ = యుద్ధమునందు, పటు - చక్ర + ఆహతిన్ = తీవ్రమయిన చక్రముయొక్క దెబ్బచే, కర - సహితము = చేతులతోఁగూడ, శిరము = తల, త్రెవ్వి = తెగి, గ్రక్కునన్ = శీఘ్రముగా, నెగసెన్ = ఎగిరెను, కరములను = చేతులతో, రాహువు, దివాకరున్ = సూర్యుని, పట్టఁగన్ = పట్టుటకు, నభముకున్ = ఆకాశమునకు, ఎగయు - గతిన్ = ఎగురువిధమున, పొలుపు + ఎసఁగెన్ = ఒప్పు మిగిలెను

**తాత్పర్యము.** యుద్ధమునఁ దీవ్రమైన చక్రాహతిచేఁ జేతులతోఁ గూడ శిరస్సు తెగి శీఘ్రముగా నెగురుట, చేతులతో రాహువు సూర్యునిఁ బట్టుకొనుట కాకాశమున కెగురునట్లు ఒప్పెను

**విశేషములు .** అలంకార ముపమ నభము కెగయు - నభముకున్ + ఎగయు 'కువర్ణకంబు పరంబగునపు డుకారబుకారంబులకు నగాగమం బగు' బాల తత్సమ 28 అను సూత్రముచే నగాగమము రావలసియుండఁగా - 'కువర్ణకంబు పరంబగునపుడు కవిత్రయము వారి ప్రయోగంబులం దక్కఁదక్కిన మహాకవి ప్రయోగంబులందునుం గొన్నియెడల నుగాగమంబు చూపట్టదు ' అని ప్రౌఢ శబ్ద 19

క శరహతి శిరములు తెగితెగి
పొరిఁబొరి దివి కెగసియెగసి భువిఁదొరఁగె భయం
కరలీల డాకినులు నృ
త్య రతిం దలలూఁచ నట్ట లాడిన భంగిన్ 169

**అర్థము** డాకినులు = పిశాచులు, నృత్య-రతిన్ = నాట్యమునందలి ఆసక్తితో, తలలు + ఊఁచన్ = తలలు ఊఁగఁజేయఁగా, అట్టలు = మొండెములు, ఆడిన - భంగిన్ = ఆడిన విధమున, శర-హతిన్ = బాణముల దెబ్బచే, శిరములు = తలలు, తెగి-తెగి = మిక్కిలి తెగి, పొరిఁబొరిన్ = మాటిమాటికి, దివికిన్ = ఆకాశమునకు, ఎగసి + ఎగసి = మిక్కిలి యెగిరి, భయంకర - లీలన్ = భయము గలిగించు విధమున, భువిన్ = భూమియందు, తొరఁగెన్ = పడెను

**తాత్పర్యము .** పిశాచస్త్రీలు నృత్యమునందలి ఆసక్తితోఁతల లూఁచఁగా మొండెములాడిన విధమున, బాణముల దెబ్బచే శిరస్సులు తెగితెగి మాటిమాటికి ఆకాశమున కెగిరియెగిరి భూమిపైఁ బడెను

**విశేషములు .** అలంకార ముపమ

క శరహతిఁ దల తెగి పడి యం
బరమున కెగయుటయుఁ దత్కబంధము నెగసెన్
శిరము తెగిపోక కోపక
బరవసమునఁ బట్టుకొనఁగఁ బాటిన భంగిన్ 170

**అర్థము :** శర - హతిన్ = బాణము దెబ్బచే, తల, తెగి - పడి, అంబరమునకున్ = ఆకాశమునకు, ఎగయుటయున్ = ఎగురుటయును, తద్ + కబంధమున్=ఆ మొండెముకూడ, శిరము, తెగిపోకకున్ = తెగిపోవుటకు, ఓపక = సహింపక, బరవసమునన్ = పట్టుదలతో, పట్టుకొనఁగన్ = పట్టుకొనుటకు, పాటిన = పరువెత్తిన, భంగిన్ = విధమున, ఎగసెన్ = ఎగిరెను

**తాత్పర్యము :** బాణము దెబ్బచేఁ దలతెగిపోయి ఆకాశమున కెగురఁగా, ఆ మొండెము కూడ - శిరస్సు తెగిపోవుటకు సహింపక పట్టుదలతో దానిని బట్టు కొనుటకుఁ బరువెత్తిన విధమున నెగిరెను

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష

క **ఎగయు శిరంబులు నభమున**
**కొగిఁ గ్రమ్మెడు రక్తజలము లొలుకుచు భువిపై**
**మగుడఁబడుఁ జూడఁ గడు రం**
**గుగ ఓలిన రాటనమున గుండ్రల పోలెన్** 171

**అర్థము .** ఎగయు - శిరంబులు = ఎగురునట్టి తలలు, నభమునకున్ = ఆకాశమునకు, ఒగిన్ = బాగుగా, క్రమ్మెడు = వ్యాపించు, రక్త - జలములు = రక్తపు నీరులు, ఒలుకుచున్ = కార్చుచు, ఓలిన్ + అ = బాగుగా, రాటనమునన్ = రాట్నమునందు - గానుఁగ యందు, గుండ్రల - పోలెన్ = రాట్నము కోలలవలె (సూ ని.) రాట్నమును ద్రిప్పెడు గుండువలె, చూడన్ = చూడఁగా, కడున్ = మిక్కిలి, రంగునన్= సొంపుగా, భువిపైన్ = భూమిమీఁద, మగుడన్ = మరల, పడన్

**తాత్పర్యము :** తెగిపోయి యెగురు తలలు ఆకాశమునకు బాగుగా వ్యాపించు రక్తపు నీరులు కార్చుచు, బాగుగా రాట్నమునందలి రాట్నపు గుండుల వలెఁ జూడ మిక్కిలి సొంపుగా భూమిపై మరలఁబడును

**విశేషములు :** అలంకార ముపమ

క. **విఱిగిన యలువుల తునియలు**
**మెఱచుచు దివి కెగయఁదొడఁగె మింటికి వడిఁ బొం**
**గెఱఁగెడు వీరుల వెనుచని**
**యెఱకలు గొని క్రమ్మఱింప నెగయు విధమ్మునన్** 172

**అర్థము :** విఱిగిన - అలువుల - తునియలు = విఱిగిపోయిన బాణముల ముక్కలు, మెఱచుచున్ = మెఱయుచు, మింటికిన్ = ఆకాశమునకు, వడిన్ = వేగముగా, పొంగి + ఎఱఁగెడు = పొంగి ఎగయునట్టి, వీరులన్, వెనుచని = వెంబడించి, ఎఱకలు + కొని = ఱెక్కలు పట్టుకొని, క్రమ్మఱింపన్ = మరలించుటకు, ఎగయు - విధమునన్ = ఎగురు విధమున, దివికిన్ = ఆకాశమునకు, ఎగయన్ + తొడఁగెన్ = ఎగురనారంభించెను

**తాత్పర్యము .** విఱిగిపోయిన బాణముల ముక్కలు మెఱయుచు ఆకాశమునకు వేగముగాఁ బొంగి యెగసెడు వీరులను వెన్నాడి ఱెక్కలు పట్టుకొని మరలింప నెగురు విధమున ఆకాశమున కెగురఁదొడఁగెను

**విశేషములు** అలంకార ముత్ప్రేక్ష పొంగెఱఁగెడు -। పొంగి + ఎఱఁగెడు - 'క్త్వార్థంబైన యిత్తునకు సంధి లేదు ' బాల సంధి 8 ఇట సంధియైనది 'ఇప్రత్యయాంతావ్యయవంబునకు సంధియుఁ జూపట్టెడు ' ప్రౌఢ సంధి 2 అలుగు - అలువు (రూపాం) 'అపదాద్యంబయి యసంయుక్తంబయిన గకారంబునకు వకారంబు విభాష నగు ' బాల ఆచ్ఛిక 27

ఆ బరులు రెండు త్రెవ్వి పార్శ్వంబులకుఁ దీరఁ
బాఱి చూడ నొప్పె భటుఁడు దివికి
నింద్రసతులఁ గూడ నెఱకలతోడన
యెఱఁగిపోవ నున్న తెఱఁగ పోలె 173

**అర్థము .** భటుఁడు = వీరుఁడు, బరులు - రెండు = రెండు ప్రక్కలును, త్రెవ్వి = తెగి, పార్శ్వంబులకున్ = ప్రక్కలకు, తీరఁబాఱి = నిలిచి పోయి, ఇంద్ర - సతులన్ = ఇంద్రుని స్త్రీలను, కూడన్ = పొందుటకు, ఎఱకల తోడన్ + అ = ఱెక్కలతోనే, దివికిన్ = స్వర్గమునకు, ఎఱఁగిపోవన్ + ఉన్న - తెఱఁగు + అ + పోలెన్ = ఎగిరిపోవుచున్న విధమున, చూడన్ + ఒప్పెన్ = చూడఁగా నొప్పెను

తాత్పర్యము ఒక భటుఁడు రెండు ప్రక్కలును దెగి, అవి రెండు వైపులను నిలిచిపోయి, యింద్రుని స్త్రీలను బొందుటకు ఱెక్కలతోనే స్వర్గమునకు ఎగిరి పోవనున్న విధమునఁ జూడ నొప్పెను

**విశేషములు :** తీరు = నిలుచు. ఆం, ననఁగను సల్పనం చని పల్కఁగాఁదగు .' ఆం భా 3 58 అలంకార ముత్ప్రేక్ష

ఉ. తోలును నెత్తురు న్నెఱచితోన శరాహతిఁబోయి మేను గం
కాలమ త్రిక్కి చేత నసిఖండమ కత్తిగఁ బట్టి నల్గడన్
వ్రేలెడు ప్రేవులెత్తి పయి వ్రేలుట దా నటు వ్రాలవైచి వే
తాలుఁడు వోలె నిల్చె నొక దండి మహాజి భయంకారకృతిన్. 174

**అర్థము :** ఒక - దండి = ఒక గొప్ప వీరుఁడు, మహాత్ (మహా) + ఆజిన్= గొప్పయుద్ధమున, తోలును, నెత్తురున్ = రక్తమును, ఎఱచి - తోన్ + అ =

మాంసముతోనే, శర + ఆహతిన్ = బాణముల దెబ్బచే, పోయి = నశించి, మేను= శరీరము, కంకాలము + అ = అస్థి పంజరము మాత్రమే, త్రిక్కి = మిగిలి, చేతన్- చేతియందు, అసి - ఖండము = కత్తి ముక్క, కత్తిగన్ = కత్తిగా, పట్టి = పట్టుకొని నల్గడన్ =(నలు + కడన్) = నాలుగు దిక్కులను, వ్రేలెడు = వ్రేలాడునట్టి, ప్రేవులు = ప్రేగులు, ఎత్తి, పయిన్, వ్రేలుట, తాన్, అటు, వ్రాలన్ + వైచి = వ్రాలునట్లుచేసి, వేతాలుఁడు + పోలెన్ = పిశాచమువలె, భయంకర + ఆకృతిన్ = వెఱపుగొలుపు నాకారముతో, నిల్చెన్

**తాత్పర్యము.** ఒక గొప్పవీరుఁడు మహాయుద్ధమున బాణముల దెబ్బచేఁ దోలును, నెత్తురును మాంసముతోపాటే నశించి, శరీరము, అస్థిపంజరము మాత్రమే మిగిలి కత్తిముక్కను జేతఁ గత్తిగాఁ బట్టి, నాలుగు దిక్కులను వ్రేలాడు ప్రేవుల నెత్తి వ్రాలవైచి పిశాచము వలె భయంకరాకారముతో నిలిచెను

**విశేషములు :** అలంకార ముపమ వేతాలుఁడు = ఒకజాతి పిశాచము, శవము నాశ్రయించి యుండు భూతము - సూ ని

తే. **తఱిమి పెనఁచిన నిడుదకొంతముల మీఁధ**
**శర విఖండిత యోధమాంసములు నిండి**
**యొప్పెఁ బందిరిపైఁబచ్చి యుప్పుఁగండ**
**లెండఁబెట్టిన విధమున భండనమున** 175

**అర్థము:** భండనమునన్= యుద్ధమున, తఱిమి (తఱిమి) = శత్రువులపైఁ బడి, పెనఁచిన = మెలివేసిపట్టుకొనిన, నిడుద = కొంతముల మీఁధన్ = పొడవైన బల్లెముల మీఁద, శర - విఖండిత - యోధ - మాంసములు = బాణములచే ముక్కలు చేయఁబడిన వీరుల మాంసములు, నిండి, పందిరిపైన్, పచ్చి = ఆర్ద్రమైన, ఉప్పుగండలు - ఉప్పు + కండలు = ఉప్పులో ఊరవేసిన మాంసపు ముక్కలు, ఎండన్ + పెట్టిన - విధమునన్, ఒప్పెన్

**తాత్పర్యము :** యుద్ధములో శత్రువులపైఁబడి మెలివేసి పట్టుకొనిన పొడవైన బల్లెముల మీఁద అమ్ములచే ముక్కలు చేయఁబడిన వీరుల మాంసములు నిండి, ఉప్పులో నూరవేసిన పచ్చిమాంసపుముక్కలు పందిరిపై నెండబెట్టిన విధమున నొప్పెను

**విశేషములు :** అలంకార ముపమ

తే నెగసియాడు - కబంధముల్ నింగిఁ గప్పఁ
బడిన కుణపంబు లోలిన పుడమిఁగప్ప
నెఱయ నిరువాఁగుఁ బొరిఁబొరి నఱిమి పొడువ
దివియు భువియును శవముల తిట్టలయ్యె 176

**అర్థము**. ఇరు - వాఁగున్ = రెండుపక్షములవారును, నెఱయన్ = నిండునట్లు, పొరిఁబొరిన్ = మాటిమాటికిని, అఱిమి = విజృంభించి, పొడువన్ = పొడువఁగా, నెగసి + ఆడు = ఎగిరియాడెడి, కబంధముల్ = మొండెములు, నింగిన్ = ఆకాశమును, కప్పన్ = కప్పఁగను, పడిన = క్రిందఁబడిన, కుణపంబులు = శవములు, ఓలిన్ + అ = బాగుగా, పుడమిన్ = భూమిని, కప్పన్ = కప్పఁగను, దివియున్ = ఆకాశమును, భువియును = భూమియును, శవముల - తిట్టలు = శవముల ప్రోగులు, అయ్యెన్

**తాత్పర్యము** రెండు పక్షముల వారును నిండుగా మాటిమాటికిని విజృంభించి పొడుచుకొనఁగా - నెగిరియాడు మొండెములు ఆకాశమును గప్పఁగను, క్రిందఁబడిన శవములు భూమిని గప్పఁగను, ఆకాశమును, నేలయును శవముల ప్రోవులయ్యెను

క క్రిక్కిఱిసిన శవములలో
నొక్కెడ నడియఁబడియుండ నోపక వడిఁ బ
ల్దిక్కులకు నెగసెనో యన
నక్కజమున నెగసి యట్ట లాడుచునుండెన్ 177

**అర్థము** : క్రిక్కిఱిసిన - శవములలోన్, ఒక్క + ఎడన్ = ఒకచోట, నడియఁబడి + ఉండన్ + ఓపక = నడుమఁబడియుండఁజాలక (?), వడిన్ = వేగముగా, పల్దిక్కులకున్ (పలు + దిక్కులకున్) = పలు దెసలకు, ఎగసెనో + అనన్ = ఎగిరెనా యనునట్లు, అట్టలు = మొండెములు, అక్కజమునన్ = ఆశ్చర్యకరముగా, ఎగసి = ఎగిరి, ఆడుచున్ + ఉండెన్

**తాత్పర్యము** : క్రిక్కిఱిసిన శవములలో నొకచోట నడుమఁబడి యుండఁజాలక వేగముగాఁ బెక్కుదిక్కులకు ఎగిరెనో యనునట్లు మొండెములు ఆశ్చర్యకరముగా నెగిరి ఆడుచుండెను

**విశేషములు**. అలంకార ముత్ప్రేక్ష

ఆ సిరము త్రెస్సిపడిన సురియ మార్చిన ముష్టి
విడువ కాడె నొక్క వీరభటుఁడు
ఈల గ్రద్ద నోర నోలగాలు విఱిగి
యంబరమున కెఱఁగి యాడినట్లు 17

**అర్థము.** ఈలగ్రద్ద - నోరన్ = ఒకవిధమైన గ్రద్ద నోటియందు, ఓలగాలు = కాలు, విఱిగి, అంబరమునకున్ = ఆకాశమునకు ఎఱఁగి = ఎగిరి, ఆడిన + అట్లు = ఆడిన విధమున, ఒక్క - వీర - భటుఁడు = వీరుఁడైన ఒక సైనికుఁడు, సిరము = శిరస్సు, త్రెస్సి - పడినన్ = త్రెగిపడినను, సురియన్ = చుఱకత్తితో, మార్చిన = ప్రతిఘటించిన, ముష్టి = పిడికిలి, విడువక = విడిచిపెట్టక, ఆడెన్

**తాత్పర్యము .** నోటఁ గాలు విఱిగిన యీలగ్రద్ద ఆకాశమున కెగిరి యాడిన విధమున వీరుఁడైన యొక సైనికుఁడు శిరస్సు త్రెగిపడినను జుఱకత్తితోఁ బ్రతిఘటించిన పిడికిలి విడిచిపెట్టక యాడెను

**విశేషములు .** అలంకార ముపమ ఈ పద్యము నందలి సురియ మార్చిన ముష్టి 'ఓలగాలు' అనునవి యింకను విచార్యము ముష్టి = తత్క్షణము అను మానవల్లివారి ప్రతిలోని యర్థ మెట్లు సుసంగతమో!

క ఉరుతరతనుఁడగు సద్భట
వరునట్ట నిభంబు శిరము వడి నదికి బలో
త్కరమునఁ బ్రతివీరభయం
కరుఁడై యుద్ధంబు చేసె గణపతి పోలెన్ 179

**అర్థము :** ఉరుతర - తనుఁడు = మిక్కిలి పెద్ద శరీరముగలవాఁడు, అగు, సత్+భట - వరు+ అట్టన్ = మంచివీరశ్రేష్ఠుని మొండెమునందు, ఇభంబు - శిరము = ఏనుఁగు తల, వడిన్ = వేగముగా, అదికి = అతుకుకొని, బల + ఉత్కరమునన్ = బల సమూహముచే - బలాధిక్యముచే, గణపతి + పోలెన్ = గజాననునివలె, ప్రతి-వీర -భయంకరుఁడు + ఐ = శత్రువీరులకు వెఱపు గలిగించువాఁడయి, యుద్ధంబు - చేసెన్

**తాత్పర్యము :** మిక్కిలి పెద్ద శరీరముగలవాఁడగు నొక వీరశ్రేష్ఠుని మొండెముపై నేనుఁగు తల వెంటనే అదుకుకొని బలాధిక్యముచే గజాననుని వలె శత్రువీరభయంకరుఁడై యుద్ధముచేసెను •

**విశేషములు .** అలంకార ముపమ

క  తురగంబు నట్టపై నరు
శిరమును, నరునట్టఁ దురగశిర మదికె వడిన్
బురుషమృగంబులతోఁ గి
న్నరు లొగిఁ బోరాడు క్రియ రణంబున నొప్పెన్  180

**అర్థము .** తురగంబు + అట్టపైన్ = గుఱ్ఱము మొండెము మీఁద, నరు -శిరమును = మనుష్యుని తలయు, నరు+అట్టన్ =మనుష్యుని మొండెముపై, తురగ - శిరము = గుఱ్ఱముతల, వడిన్ = వేగముగా అదకెన్ = అదుకుకొనెను, కిన్నరులు = నరముఖమును అశ్వశరీరమును గల దేవయోని విశేషములు అట్లే అశ్వముఖమును, నర శరీరమును గల దేవయోని విశేషములు, పురుష - మృగంబులతోన్ = పురుషులతోను, గజతురగాది మృగములతోను, పోరాడు - క్రియన్ = పోరాడు విధమున, రణంబునన్ = యుద్ధమునందు, ఒప్పెన్

**తాత్పర్యము :** గుఱ్ఱము మొండెముపై నరుని శిరమును, నరుని మొండెముపై గుఱ్ఱము తలయు వెంటనే అదికికొని అశ్వముఖము నరశరీరము, నరముఖము అశ్వశరీరము గల కిన్నరులనెడి దేవయోనివిశేషములవలె పురుషుల తోను, గజతురగాది మృగముల తోను బోరాడు విధమున యుద్ధమునం దొప్పెను

**విశేషములు :** అలంకార ముపమ

క.  ముక్తక బంధములగు భూ
ముక్త కబంధములవలన మొగిఁ గ్రమ్మ్రె మహా
రక్తార్ద్రాంబరతలమున
రక్తాఆర్ద్రాంబరతనుండు రణరతుఁ డాడెన్  181

**అర్థము :** ముక్తక - బంధములు = విడువఁబడిన సంసారాది బంధములు గలవి, అగు, భూ-ముక్త - కబంధముల వలనన్ = భూమియందు విడువఁబడిన మొండెములనుండి, మొగిన్= అధికముగా, క్రమ్మ్రె = వ్యాపించు, మహత్ (మహా) + రక్త + ఆర్ద్ర + అంబర - తలమునన్ = అధికమైన రక్తముచేఁ దడిసిన ఆకాశ ప్రదేశమున, రక్త+ ఆర్ద్ర + అంబర - తనుండు = రక్తముచేఁ దడిసిన వస్త్రములు శరీరము గలవాఁడు, అగు, రణ - రతుఁడు = యుద్ధమునం దాసక్తిగలవాఁడు, ఆడెన్

**తాత్పర్యము.** విడిచిపెట్టఁబడిన సంసారాదిబంధములు గల నేలఁబడిన మొండెములనుండి అధికముగాఁ గాఱిన రక్తముచేఁ దడిసిన ఆకాశప్రదేశమున రక్తముచేఁ దడిసిన వస్త్రములు దేహము గల యుద్ధప్రియుఁ డాడెను

వ తత్ప్రస్తవంబున 182

**అర్థతాత్పర్యములు.** తద్ + ప్రస్తవంబునన్ = ఆ సమయమున - తరువాతి పద్యముతో నన్వయము

సీ ఉరు పాశములు మృదు కర పాశములు కాఁగఁ
జక్రముల్ పృథుకటిచక్రములుగ,
బాణముల్ నుత దృష్టిబాణంబులుగఁ, గార్ము
కమ్ములు భ్రూకార్ముకములు కాఁగ,
మండలాగ్రము లాస్యమండలమ్ముగఁ, గుంభి
కుంభముల్ గురుకుచకుంభములుగ
వజ్రముల్ సితదంతవజ్రములుగఁ, దత్ప్ర
ఘట్టన పటురతిఘట్టనముగ

ఆ విక్షతములు బహునఖక్షతములు కాఁగ,
రక్తరసము పాదము రాగరసము
కాఁగ, సుభటవరులఁ గలిసి రణాంగన
ప్రౌఢి మెఱసి చేసెఁ బరవశులుగ 183

**అర్థము.** ఉరు - పాశములు = గొప్ప పాశములు (పాశములనెడి ఆయుధములు), మృదు-కర-పాశములు - కాఁగన్ = మృదువులైన పాశముల వంటి కరములుకాఁగా, చక్రముల్ = చక్రాకారాయుధములు, పృథు-కటి-చక్రములుగన్ = పెద్ద మండలములవంటి పిఱుఁదులు కాఁగా,

బాణముల్, నుత - దృష్టి - బాణములుగన్ = పొగడఁబడిన బాణముల వంటి చూపులు కాఁగా, కార్ముకమ్ములు = విండ్లు, భ్రూ-కార్ముకములు - కాఁగన్ = విండ్లవంటి కనుబొమలు కాఁగా,

మండలాగ్రములు = కత్తులు, ఆస్యమండలమ్ముగన్ = మండలాకారముఖము కాఁగా, కుంభి - కుంభముల్= ఏనుఁగుల కుంభస్థలములు, గురు - కుచ - కుంభములుగన్ = పెద్ద కుండలవంటి స్తనములు కాఁగా,

వ్రజముల్ = వ్రజాయుధములు, సిత-దంత-వ్రజములుగన్ = తెల్లని వ్రజముల వంటి దంతములు కాఁగా, తద్ + ప్రఘట్టన = వాని అధికమగు త్రొక్కిడి, పటు - రతి - ఘట్టనముగన్ = తీవ్రమయిన సంభోగపు రాయిడికాఁగా,

విక్షతములు = గాయములు, బహు -నఖ-క్షతములు - కాఁగన్ = అనేకములయిన గోటినొక్కులు కాఁగా, రక్త - రసము = రక్తమనెడి రసము, పొడము = పుట్టునట్టి, రాగ - రసము - కాఁగన్ = ప్రేమరసము కాఁగా,

రణ + అంగన = యుద్ధమనెడి స్త్రీ, సుభట - వరులన్ = భటశ్రేష్ఠులను, కలిసి = కూడి, ప్రౌఢి = నేర్పు, మెఱసి = ప్రకాశించి, పరవశులుగన్ = ఒడలు తెలియని వారినిగా, చేసెన్

**తాత్పర్యము** . పెద్ద పాశాయుధములు మృదువులయిన పాశాకార హస్తములు కాఁగా, చక్రాయుధములు పెద్దకటిమండలములు కాఁగా, బాణములు పొగడఁబడిన దృగ్బాణములు కాఁగా, విండ్లు బొమవిండ్లు కాఁగా, కత్తులు ముఖ మండలము కాఁగా, ఏనుఁగుల కుంభస్థలములు గురుకుచకుంభములు కాఁగా, వ్రజాయుధములు తెల్లని వ్రజములవంటి దంతములు కాఁగా, వాని అధికమగు త్రొక్కిడి తీవ్రమైన సంభోగపు రాయిడికాఁగా, గాయములు పెక్కు గోటి నొక్కులు కాఁగా, రక్త రసము ప్రేమరసముకాఁగా యుద్ధమనెడి స్త్రీ సుభటశ్రేష్ఠులను గూడి నేర్పుమెఱసి మైమఱచినవారినిగాఁ జేసెను

**విశేషములు** . అలంకారము రూపకము

**క** **మృతులైన వీరులందఱు**
**నతివీరులు వీరికెల్ల నడుగిడ నమరా**
**వతిఁ బట్టులేదు వర సుర**
**సతులందఱుఁ జిదిమిపెట్టఁజాలరు వరుసన్** **184**

**అర్థము** . మృతులు + ఐన - వీరులు + అందఱున్ = చచ్చిన వీరులందఱును, అతి - వీరులు = గొప్పవీరులు, వీరికిన్ + ఎల్లన్ = వీరికందఱకును, అడుగు + ఇడన్ = అడుగుపెట్టుటకు, అమరావతిన్ = అమరావతియందు, పట్టు = స్థానము - చోటు, లేదు, వర - సుర - సతులు = శ్రేష్ఠురాండ్రయిన దేవతాస్త్రీలు, వరుసన్ = వరుసగా, అందఱన్ = అందఱను, చిదిమిపెట్టన్ + చాలరు = పంచుకొనుటకుఁ జాలరు

**తాత్పర్యము .** చచ్చిన వీరులందఱును గొప్పవారు వీరులందఱును అమరావతిలో అడుగుపెట్టుటకుఁ జోటు చాలదు దేవతాస్త్రీలు వరుసగా వీరినందఱను పంచుకొనుటకుఁ జాలరు

**విశేషములు :** యుద్ధమరణము నొందిన వీరులు వీరస్వర్గము నొంది అమరావతి కరుగుదు రనుట వీరి సంఖ్య అధికము దేవవేశ్యలసంఖ్య అల్పమగుటచే దేవవేశ్యలు వీరిని బంచుకొనుట కష్టమనుట అలంకార మతిశయోక్తి

వ. **అట్టి కదనంబున** **185**

**అర్థతాత్పర్యములు :** అట్టి - కదనంబునన్ = అట్టి యుద్ధమునందు - తరువాతి పద్యముతో నన్వయము

మ **'అది నా వల్లభు నుత్తమాంగ, మిది నా యాత్మేశు వక్షస్స్థలం**
**బది నా నాథు పదద్వయం, బది మదీయాధీశు బాహుద్వయం,**
**బది నా జేని కటిప్రదేశ మని తా రంతంత నొక్కొక్కెడన్**
**గదనాగ్రంబున నేఱి తెచ్చి పొడవుల్ గావింతు రోలిన్ సతుల్.186**

**అర్థము .** అది, నా - వల్లభు + ఉత్తమాంగము = నా భర్త శిరస్సు, ఇది, నా + ఆత్మ + ఈశు - వక్షస్ + స్థలంబు = నా ప్రాణేశ్వరుని ఱొమ్ము, అది, నా - నాథు-పద-ద్వయంబు = నా భర్త అడుగుదోయి, అది, మదీయ + అధి + ఈశు-బాహు-ద్వయంబు = నా హృదయేశ్వరుని కేలుదోయి, అది, నా - జేని - కటి - ప్రదేశము = నా ప్రభువు మొలప్రదేశము, అని, తారు = తాము, అంతంతన్ = అక్కడక్కడ, ఒక్క + ఒక్క + ఎడన్ = ఒక్కొక్కచోట, సతుల్ = స్త్రీలు, ఓలిన్ = క్రమముగా, కదన = అగ్రంబునన్ = అనిమొనయందు, ఏఱి-తెచ్చి, పొడవుల్ = రూపములు, కావింతురు = చేయుదురు

**తాత్పర్యము .** 'అది నా భర్త శిరస్సు ఇది నా ప్రాణేశ్వరుని వక్షస్స్థలము, అది నా భర్త అడుగుదోయి, అది నా జీవితేశ్వరుని బాహుయుగము, అది నా ప్రభువు కటి ప్రదేశము, అని అక్కడక్కడ నొక్కొక్కచోట యుద్ధభూమిలో స్త్రీలు వరుసగా నేఱి తెచ్చి రూపముల నేర్పఱుతురు

**విశేషములు :** వల్లభునుత్తమాంగము - వల్లభు + ఉత్తమాంగము 'షష్ఠీ సమాసమునం దుకార ఋకారముల కచ్చుపరమగునపుడు నుగాగమంబగు' బాల సం 34, 'పొడవుల్గాఁ జేతు రోలిన్' అని సా అ ప్రతి పాఠము అది

'పొడవుల్గాఁ జూతు రోలిన్' అయియుండునని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారి యభిప్రాయము చూడు వా ప్రతి పీఠిక

వ **మఱియుం గొందఱు డెందంబులం దఱలేని తియ్యంబుల పెక్కువ నిక్కువంబు చేయుచు** 187

**అర్థము** . మఱియున్, కొందఱు, డెందంబుల + అందున్ = హృదయములందు, అఱలేని = కపటములేని, తియ్యంబుల - పెక్కువ = అనురాగముల ఆధిక్యమును, నిక్కువంబు = చేయుచున్ = నిజము చేయుచు

**తాత్పర్యము** . మఱియును గొందఱు స్త్రీలు హృదయములందలి నిష్కపటములైన అనురాగముల ఆధిక్యమును నిజము చేయుచు - తరువాతి పద్యముతో నన్వయము

క **దురమున నిశితాస్త్రహతిం**
**బురుషులు హతులైన మదనపుష్పాస్త్రహతిం**
**దరుణులు మృతలై తమతమ**
**పురుషులతో నరిగి రమరపురి కనురక్తిన్** 188

**అర్థము :** పురుషులు = మగలు, దురమునన్ = యుద్ధమున, నిశిత + అస్త్ర - హతిన్ = వాఁడియైన బాణముల దెబ్బచే, హతులు + ఐనన్ = చంపఁబడినవారు కాఁగా, మదన - పుష్ప + అస్త్ర - హతిన్ = మన్మధుని పూవుటమ్ముల దెబ్బచే, తరుణులున్ = వారి భార్యలును, మృతలు + ఐ = మరణించినవారయి, తమ - తమ - పురుషులతోన్ = తమతమ భర్తలతో, అమర - పురికిన్ = అమరావతికి, అనురక్తిన్ = అనురాగముతో, అరిగిరి

**తాత్పర్యము:** భర్తలు యుద్ధమున వాఁడిబాణముల దెబ్బచే మరణింపఁగా, వారి భార్యలును మన్మధుని పూవుటమ్ముల దెబ్బలచే మరణించి తమతమ భర్తలతో ననురాగముతో నమరావతి కరిగిరి

వ **తదవసరంబున.** 189

**అర్థతాత్పర్యములు :** ఆ సమయమున - తరువాతి పద్యముతో నన్వయము

చ. **అరగొన కాజి నీల్గి సుభటాలి విమానము లెక్కి దేవతా**
**వరపురి కేఁగుచో నిజకబంధము లభ్రపథంబు ముట్టి భీ**
**కరగతి నాడు లీలఁ దమకంబునఁ గన్గొనుచున్ సురాంగనా**
**స్ఫురదురునృత్యవిభ్రమము చూడరు వీరరసప్రమత్తులై.** 190

**అర్థము .** అర-కొనక = వెనుదీయక, ఆజిన్ = యుద్ధమునందు, ఈల్గి = చచ్చి, సు-భట + ఆలి = సద్వీరుల వరుస, విమానములు, ఎక్కి, దేవతా - వర - పురికిన్ = దేవతాశ్రేష్ఠుల పురమునకు - అమరావతికి, ఏఁగుచోన్ = పోవునప్పుడు, నిజ - కబంధములు = తమవైన మొండెములు, అభ్ర - పథంబు = ఆకాశ మార్గమును, ముట్టి = చేరి, భీకర - గతిన్ = భయంకరమైన విధమున, ఆడు-లీలన్ = ఆడు రీతిని, తమకంబునన్ = ఆసక్తితో, కన్గొనుచున్ = చూచుచు, వీర - రస - ప్రమత్తులు + ఐ = వీరరసముచే మిక్కిలి మదించిన వారయి, సుర + అంగనా - స్ఫురత్ + ఉరు - నృత్య - విభ్రమము = దేవతాస్త్రీల ప్రకాశించుచున్న గొప్ప నృత్యము యొక్క విలాసమును, చూడరు

**తాత్పర్యము.** సుభటులు వెనుదీయక యుద్ధమునఁ జచ్చి విమానములెక్కి అమరావతికిఁ బోవునప్పుడు, తమ మొండెములు ఆకాశమును జేరి భయంకరముగా ఆడురీతిని ఆసక్తితోఁ జూచుచు వీరరసముచే మిక్కిలి మదించినవారయి దేవతాస్త్రీల గొప్ప నృత్యవిలాసమును జూడరు

**విశేషములు .** అన్ని ప్రతులలోను 'స్ఫురదురు నిత్య విభ్రమము' అని యుండగా రా అ శర్మగారు దీనిని 'నృత్య'గా మార్చిరి అది సమంజసముగా నున్నదని తోఁచుటచే స్వీకృతమయినది సుభటాలి చూడరు 'మహత్సమూర్థకశబ్దం బమహత్కార్యయుక్తంబయ్యుఁ దద్విశేషణక్రియలు మహత్కార్యయోగ్యంబులు విభాషనగు ' ప్రౌఢ సం 17

వ ఇట్టి సాంపరాయరభసంబున 191

**అర్థము.** ఇట్టి, సాంపరాయ - రభసంబునన్ = యుద్ధసంరంభమునందు

**తాత్పర్యము :** ఇట్టి యుద్ధసంరంభమునందు - తరువాతి పద్యముతో నన్వయము

**ఉ ఆడెడి రూపులున్, గలయ నాడెడి గ్రద్దలుఁ జప్పలించి పో**
**రాడు పిశాచముల్, నెగసి యాడెడు నట్టలు, వానిఁ జిట్టుము**
**ట్టాడెడు భూతసంకులము, నంగద నిల్వక చుట్టుముట్టుగా**
**నాడెడు జంబుకాలిఁ గలహోవని భీకరమయ్యెఁ జూడఁగాన్. 192**

**అర్థము .** ఆడెడి - రూపులన్ = ఆడునట్టి రూపములును, కలయన్ = అంతటను, ఆడెడి, గ్రద్దలున్, చప్పలించి = చప్పరించి, పోరు + ఆడు = కలహించు, పిశాచముల్, నెగసి = ఎగిరి, ఆడెడు, అట్టలున్ = మొండెములును వానిన్= ఆ అట్టలను, చిల్చు-ముల్చు + ఆడెడు = చీల్చెడు, భూత - సంకులమున్ = భూతముల సమూహమును, అంగదన్ + ఆఁకటిని, నిల్పక = ఆఁపుకొనలేక, చుట్టు-ముట్టుగాన్, ఆడెడు, జంబుక + ఆలి(యు)న్ = నక్కల సమూహమును, కలహ+అవనిన్ = యుద్ధభూమియందు, చూడఁగాన్, భీకరము + అయ్యెన్ = భయంకర మయ్యెను

**తాత్పర్యము.** ఆడునట్టి రూపములును, అంతటను జరించు గ్రద్దలును, చప్పరించి కలహించు పిశాచములును, ఎగిరియాడుమొండెములున్న, వానిని జీల్చు భూతసమూహమును ఆఁకలి నిలుపక చుట్టును ఆడెడు నక్కల గుంపును యుద్ధభూమిలోఁ జూడ భయంకరమయ్యెను

**విశేషములు :** జంబుకాలిన్ - 'నామపదమునకుఁ గడపల సముచ్చయార్థమునందు యువర్ణవిరహితముగా నుశబ్ద మయ్యెను ' ప్రౌఢ శబ్ద 116

చ **కడితలకాఱు వ్రేయఁ గడికండములై పడి వండఁదర్గిన**
**ట్లడగొనియుండె, ముత్తునియలై పడ నల్గడలందుఁ గాలఁ గో**
**ల్మొడిచినయట్ల యుండె, నడుముల్ తెగిపోయినఁ బన్నిదం బొగిం**
**బొడిచినయట్ల యుండె, రణభూమి కృతాంతకు బానసంబొ నాన్ 193**

**అర్థము.** రణ - భూమి = యుద్ధభూమి, కృతాంతకు - బానసంబొ-నాన్-యముని వంటయిల్లో యనునట్లు, కడితలకాఱు = డాలుగలవారు, వ్రేయన్ = కొట్టఁగా, కడికండములు + ఐ = ముక్కలుముక్కలయి, పడి, వండన్ = వండుటకు, తర్గిన + అట్లు = తఱిగిన విధమున, అడగొని + ఉండెన్ = అట్టకట్టియుండెను, ముత్తునియలు (మూఁడు + తునియలు) + ఐ = మూఁడుముక్కలయి, పడన్ = పడఁగా, నల్గడల + అందున్ = నాలుగువైపులను, కాలన్ = కాలుటకు, కోల్మొడిచిన + అట్లు+ అ = విజృంభించిన విధముననే, ఉండెన్, నడుముల్, త్రెగిపోయినన్ = ముక్కలు కాఁగా, ఒగిన్ = క్రమముగా, పన్నిదంబు = పందెము, పొడిచిన + అట్లు + అ = ఒడ్డినట్లే, ఉండెన్

**తాత్పర్యము .** యుద్ధభూమి యముని వంటయిల్లా యనినట్లు డాలుగలవారు కొట్టఁగా ముక్కలుముక్కలయిపడి వండుటకుఁదఱిగిన విధమున నట్టకట్టియుండెను మూఁడు ముక్కలయి పడఁగా నాల్గువైపులను గాలుటకు విజృంభించినట్లే యుండెను నడుములు తెగి పోఁగాఁ బందెము నొడ్డినట్లే యుండెను

**విశేషములు .** 'నడుముల్ తెగిపోయినఁ బన్నిదం బొగిన్ బొడిచిన యట్ల యుండె' ననునది కృతాంతుని బానసమా యన నున్నదనుట కె ట్లుపకకరించునో విచార్యము అలంకార ముత్ప్రేక్ష

క దురమున మెడ తొడ తల మొల
బరి శిర మురు మక్కు ప్రక్క బడుమములుం గె
డ్బెరసై యేర్పడ కతి భీ
రమయ్యె జముండు కుడిచి క్రక్కిన భంగిన్ 194

**అర్థము .** దురమునన్ = యుద్ధమునందు, మెడ, తొడ, తల, మొల, బరి = పార్శ్వము, శిరము, ఉరము = ఱొమ్ము,, అక్కు = గుండె, ప్రక్క = ప్రక్క, బడుమములున్ = కెడ్బెరసు + ఐ = కలిసిపోయి, ఏర్పడక = వేఱుగాక, జముండు = యముఁడు, కుడిచి = తిని, క్రక్కిన - భంగిన్ = క్రక్కినవిధమున, అతి-భీకరము = మిక్కిలి భయంకరము, అయ్యెన్

**తాత్పర్యము .** యుద్ధమునందు మెడ, తొడ, తల, మొల, బరి, శిరస్సు, ఉరస్సు,అక్కు, ప్రక్క, బడుమములు - కలిసిపోయి విభజింపఁబడక, యముఁడు తిని క్రక్కిన విధమున మిక్కిలి భయంకరమయ్యెను

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష బడుమములు - తెలియలేదు కెడ + బెరసు = కెడ్బెరసు (కన్న) = కలిసినది

సీ. గర్జిల్లి తోఁతెంచు కరిఘటాభ్రావలి
వెలిఁగెడు శాతాసి విద్యుదాళిఁ
దివిరెడు రణతూర్యరవగర్జనంబునఁ
బైఁగ్రమ్మి కురిసెడు బాణవృష్టి
నిండి బోరనఁ బాఱు నెత్తురుటేఱులఁ
గరఁగి పేరిమాంసకర్దమమున
వడిఁదాఁకు నానాస్త్రవజ్రసంఘట్టనఁ
బైఁదూలు కేతన బక సమూహి

ఆ బలసియాడు నురు కబంధ బర్హిణములఁ
బ్రీతిఁ బొలయు భూత చాతకముల
నులియు జంబుకోత్కరోరుభేకములఁ గ్రొ
క్కారుఁ బోలి తనరెఁ బోరుభూమి 195

**అర్థము.** గర్జిల్లి = ఘీంకరించి - ఉఱిమి, తోఁతెంచు = వచ్చు, కరి -ఘటా + అభ్ర + ఆవలిన్ = ఏనుఁగుల గుంపు అనెడి మేఘముల వరుసచేతను, వెలిఁగెడు = ప్రకాశించునట్టి, శాత + అసి - విద్యుత్ + ఆలిన్ = వాఁడియైన కత్తులనెడి మెఱపుల వరుసచేతను,

తివిరెడు = మ్రోసెడు, రణ - తూర్య - రవ - గర్జనంబునన్ = యుద్ధభేరుల ధ్వనియనెడు మేఘధ్వనిచేతను, పైన్ + క్రమ్మి = పైని వ్యాపించి, కురిసెడు = వర్షించు, బాణ - వృష్టిన్ = బాణములనెడు వర్షముచేతను,

నిండి, బోరనన్ = అధికముగా, పాఱు = ప్రవహించు, నెత్తురు + ఏఱులన్ = రక్తమనెడి నదులచేతను, కరఁగి, పేరిన = పేరుకొన్న, మాంస - కర్దమమునన్ = మాంసమనెడు బురదచేతను,

వడిన్ = వేగముగా, తాఁకు = తగులునట్టి, నానా + అస్త్ర - వజ్ర - సంఘట్టనన్ = అనేకబాణములనెడి పిడుగుల రాపిడిచేతను, పైన్ + తూలు = మీఁదఁజలించు, కేతన - బక - సమూహిన్ = ధ్వజములనెడు కొంగలగుంపుచేతను,

బలసి + ఆడు = చుట్టి ఆడునట్టి, ఉరు - కబంధ - బర్హిణములన్ = పెద్ద మొండెములనెడి నెమళ్ళచేతను, ప్రీతిన్ = సంతోషముతో, పొలయు = సంచరించు, భూత - చాతకములన్ = భూతములనెడు వానకోయిలలచేతను,

ఉలియు = అఱచునట్టి, జంబుక + ఉత్కర + ఉరు - భేకములన్ = నక్కల సమూహమనెడి పెద్దకప్పలచేతను,

పోరు - భూమి = యుద్ధభూమి, క్రొక్కారున్ (క్రొత్త + కారున్) = వర్షాకాలమును పోలి, తనరెన్ = ఒప్పెను

**తాత్పర్యము:** గర్జిల్లి వచ్చు ఏనుఁగుల గుంపనెడు మేఘసమూహముచేతను, ధ్వనించు యుద్ధభేరుల ధ్వనియనెడు మేఘధ్వనిచేతను, పైని వ్యాపించి వర్షించు బాణవర్షముచేతను, నిండి అధికముగాఁబాఱు రక్తప్రవాహములచేతను, కరఁగి

పేరుకొన్న మాంసమనెడి బురదచేతను, వడిగాఁ దగులునట్టి అనేకబాణములనెడి పిడుగుల రాపిడిచేతను, పైని జలించు ధ్వజములనెడి కొంగల గుంపుచేతను, చుట్టుకొని ఆడు పెద్ద మొండెములనెడి నెమళ్లచేతను, ప్రీతితో సంచరించు భూతములనెడు వానకోయిలలచేతను అఱచు నక్కల గుంపనెడు పెద్దకప్పలచేతను, యుద్ధభూమి వర్షాకాలమును బోలియొప్పెను

**విశేషములు .** అలంకారము రూపకానుప్రాణితోపమ

చ **ఉరు తరవారి చక్రకుముదోత్పల భూరిశిలీముఖౌఘ భీ**
**కర ఖర దండ రక్త రుచి కంజదళోత్కర పుండరీక వి**
**స్తరిత హరీశ్వర ప్రకర సద్గుణ కేతన భాతితో సరో**
**వరమును బోలియొప్పె శిఖివాహను సంగరరంగ మున్నతిన్ 196**

**అర్థము** శిఖి - వాహను = నెమలి వాహనముగాఁ గలవాని - కుమారస్వామి యొక్క, సంగర - రంగము = యుద్ధభూమి, ఉన్నతిన్ = అతిశయముతో, ఉరు-తరవారి = పెద్దకత్తియనెడు, ఉరుతర - వారి = మిక్కిలి అధికమైన నీటితోను, చక్ర = చక్రాయుధములనెడు చక్రవాకములతోను, కుముద = శంఖములనెడు తెల్ల కలువలతోను, ఉత్పల = ఒక శస్త్ర(?) మనెడు కలువలతోను, భూరి - శిలీముఖ + ఓఘ = అధికమైన బాణముల సమూహమనెడు తుమ్మెదల గుంపుతోను, భీకర - ఖర - దండ = భయంకరమయిన తీక్ష్ణదండమనెడు పద్మముతోను, రక్తరుచి = రక్తము యొక్క కాంతియనెడు ఎఱ్ఱని కాంతితోను, కంజ = బ్రహ్మయనెడు పద్మముతోను, దళ +ఉత్కర = సైన్యముల సమూహమనెడు పూలరేకుల సమూహముతోను, పుండరీక = వెల్లగొడుగులనెడి తెల్లదామరలతోను, విస్తరిత = వ్యాప్తమైన, హరి + ఈశ్వర = విష్ణుశంకరులనెడి నాగరాజుల యొక్క (శ్రేష్ఠములైన కప్పలయొక్క), ప్రకర= సమూహముతోను, సత్ + గుణ - కేతన - భాతితోన్ = మంచి అల్లెత్రాటితోడి విం డ్లనెడు మంచి గుణముల ఇంటియొక్క కాంతితో, సరోవరమును = సరస్సును, పోలి, ఒప్పెన్

**తాత్పర్యము:**కుమారస్వామి యుద్ధభూమి ఉన్నతితో - గొప్ప ఖడ్గములనెడి మిక్కిలి అధికమైన నీటితోను, చక్రాయుధములనెడి చక్రవాకములతోను, శంఖములనెడు తెల్లకలువలతోను, ఉత్పలశస్త్రమనెడు కలువలతోను అధికమైన బాణముల సమూహమనెడు తుమ్మెద గుంపుతోను భయంకరమైన తీక్ష్ణదండమనెడు పద్మములతోను, రక్తకాంతియనెడు ఎఱ్ఱనికాంతితోను,

బ్రహ్మయనెడు పద్మములతోను, సైన్యముల సమూహమనెడు పూలరేకులతోను, వెల్ల గొడుగులనెడి తెల్లదామరలతోను, హరిహరులనెడి నాగ (భేక) రాజులతోను, మంచి అల్లె త్రాడులతోడి నిండ్లనెడు మంచి గుణముల ఆకరము యొక్క కాంతితోను సరస్సును బోలియొప్పెను

**విశేషములు .** అలంకారము శ్లేషానుప్రాణితోపమ శ్లిష్టరూపకము

**మహాస్రగ్ధర** **క్షతజాతాపాతతోయోత్కరముఁ, గరికులక్ష్మాధరాకీర్ణ, మశ్వో**
**ద్గత కల్లోలాకులం, బస్ఖలితవరభటగ్రాహ సందోహ, మస్త్రా**
**యత పారీనాతిభీమం, బరదకమర, మీశాత్మజేందూదయక్షో**
**భితమై, సంగ్రామరంగోత్పృథుజలధి మహాభీకరం బయ్యెఁ జూడన్ 197**

**అర్థము .** క్షతజాత + ఆ పాత - తోయ + ఉత్కరమున్ = రక్తపాతమనెడి జలసమూహము గలదియు, కరి - కుల-క్ష్మాధర + ఆకీర్ణము = ఏనుఁగుల గుంపనెడు పర్వతములచే వ్యాప్తమయినదియు, అశ్వ+ఉద్గత - కల్లోల +ఆకులంబు= గుఱ్ఱములనెడు పైకి లేచిన తరంగములచేఁ గలఁగినదియు, అస్ఖలిత - వర - భట - గ్రాహ -సందోహము = జాతిపోవని - వెనుదిరుగని శ్రేష్ఠులయిన భటులనెడు మొసళ్ల సమూహము గలదియు, అస్త్ర + ఆయత - పారీన + అతి - భీమంబు = అస్త్రములనెడు - పొడవయిన గొప్పచేఁపలచే మిక్కిలి భయంకరమయినదియు, అరద - కమఠము = రథములనెడు తాఁబేళ్లుగలదియు, ఈశ + ఆత్మజ + ఇందు + ఉదయ - క్షోభితము = ఈశ్వరుని కొడుకగు కుమారస్వామియనెడు చంద్రునియొక్క ఉదయముచేఁ గలఁతపెట్టఁబడినది, ఐ, సంగ్రామ - రంగ + ఉత్ + పృథు - జలధి = యుద్ధభూమియనెడి మిక్కిలి పెద్ద సముద్రము, చూడన్ = చూచుటకు, మహత్ (మహా) - భీకరంబు = మిక్కిలి భయము గలిగించునది, అయ్యెన్

**తాత్పర్యము .** రక్తపాతమనెడి జలసమూహము గలదియు, ఏనుఁగుల గుంపనెడు కొండలచే వ్యాప్తమయినదియు, గుఱ్ఱములనెడు పైకెగురు తరంగములచేఁ గలఁగినదియు, వెనుదిరుగని భటశ్రేష్ఠులనెడు మొసళ్లసమూహము గలదియు, అస్త్రములనెడు పెద్ద చేఁపలచే మిక్కిలి భయంకరమయినదియు, రథములనెడు తాఁబేళ్లు గలదియు, కుమారస్వామియనెడు చంద్రుని ఉదయముచేఁ గలఁతపెట్టఁబడినదియు నయి యుద్ధరంగమనెడి మిక్కిలి పెద్దసముద్రము చూడ మిక్కిలి భయంకరమయ్యెను

**విశేషములు.** అలంకారము రూపకము ఛందస్సునకు 1-68, పద్యావాఖ్య నరయునది

తే మండనానీక విగళిత మణిగణములఁ
గలను సంఛన్నమై నిండి వెలుఁగుచుండెఁ
గలయ జగములు ప్రళయాగ్నిఁ గాలి మండి
యుడిగి యంగారశేషమై యున్న భంగి 198

**అర్థము .** మండన + అనీక - విగళిత - మణి - గణములన్ = అలంకారముల సమూహమునుండి విశేషముగా జాఱిన మణుల సమూహములచే, కలను = యుద్ధభూమి, సంఛన్నము + ఐ = బాగుగాఁ గప్పఁబడినదయి, నిండి, కలయన్= అంతటను, జగములు, ప్రళయ + అగ్నిన్= ప్రళయసమయమునందలి అగ్నిచే, కాలి, మండి, ఉడిగి = ఆఱిపోయి, అంగార - శేషము+ఐ = బొగ్గులు మిగిలినవయి, ఉన్న - భంగిన్= ఉన్నవిధమున వెలుఁగుచున్ + ఉండెన్ = ప్రకాశించుచుండెను

**తాత్పర్యము .** వీరుల ఆభరణముల సమూహమునుండి బాఱిపడిన మణుల సమూహములచే యుద్ధభూమి కప్పఁబడినదయి, నిండి, లోకములు అంతటను ప్రళయాగ్నిచేఁ గాలి మండి ఆఱిపోయి బొగ్గులు మిగిలినవయి ఉన్నరీతిని వెలుఁగుచుండెను

**విశేషములు :** అలంకార ముపమ

వ అని యనేకప్రకారంబులం దగిన వర్ణనలకు నెక్కి సురంగంబగు సంగరరంగంబు సొత్తెంచి భూత వేతాళ యాతుధాన దానవ శాకినీ ఢాకినీ పిశాచ నిశాచ రాద్యనేకవిధాపారగణంబులు రోదసీకుహరాంత రాపూరితంబగుచు నానావిధ పిశితాద్యనేక పుంజంబులు నిశ్శేషంబుగా భక్షించి విలయార్ణవపూరితంబునుంబోలె నిఖిలజలంబులు నేకోదకంబై పర్వు కీలాలజలంబులు తనియంద్రావి పరమానందంబునం గార్తికేయుం గీర్తించుచు మహోత్సాహంబున 199

**అర్థము :** అని, అనేక - ప్రకారంబులన్, తగిన - వర్ణనలకున్, ఎక్కి, సురంగంబు + అగు = ప్రకాశించునది యగు, సంగర - రంగంబు = యుద్ధరంగము, చొత్తెంచి (చొచ్చు + తెంచి) = ప్రవేశించి, భూత వేతాళ =

యాతుధాన - దానవ - శాకినీ - ఢాకినీ - పిశాచ - నిశాచర + ఆది + అనేక - విధ + అపార - గణంబులు = భూతములు, బేతాళములు రాక్షసులు దానవులు, శాకినులు, ఢాకినులు, పిశాచములు, నిశాచరులు మున్నగు పెక్కు విధములైనవారి అంతులేని సమూహములు, రోదసీ - కుహర + అంతర + ఆపూరితంబు= గుహవంటి భూమ్యాకాశ మధ్యభాగములోపలి ప్రదేశము నిండినది, అగుచున్, నానా - విధ - పిశిత + ఆది + అనేక - పుంజంబులు = అనేక రీతులయిన మాంసము మున్నగు పెక్కింటి సమూహములు, నిశ్శేషంబుగాన్= మిగులులేకుండ, భక్షించి = తిని, విలయ + అర్ణవ - పూరితంబునున్ + పోలెన్ = ప్రళయమునందలి సముద్రపు నింపు వలె, నిఖిల - జలంబులన్ = ఎల్ల జలములచే, ఏక + ఉదకంబు + ఐ = ఒకే నీరయి, పర్వ = ప్రవహించు, కీలాల - జలంబులు = రక్తమనెడి నీరులు, తనియన్ + త్రావి = తృప్తిగాఁ ద్రాగి, పరమ + ఆనందంబునన్ = మిక్కిలి సంతోషముతో, కార్తికేయున్ = కుమారస్వామిని, కీర్తించుచున్ = ప్రశంసించుచు, మహత్ (మహా) + ఉత్సాహంబునన్ = గొప్ప ఉత్సాహముతో

**తాత్పర్యము** . అని పెక్కు రీతుల సముచిత వర్ణనలకుఁదగి ప్రకాశించునదియగు యుద్ధభూమిని బ్రవేశించి భూతములు, బేతాళములు, రాక్షసులు, దానవులు, శాకినులు, ఢాకినులు, పిశాచులు, నిశాచరులు మున్నగు పెక్కు విధములైనవారి అంతములేని సమూహములు భూమ్యాకాశమధ్య భాగములోపలిప్రదేశము నిండి, పెక్కువిధములైన మాంసములు మున్నగు పెక్కింటి సమూహములు మిగులులేకుండఁదిని, ప్రళయసముద్రపు నింపువలె ఎల్లజలములచే నొకే నీరయి ప్రవహించు రక్తజలములు తృప్తితీఱఁద్రావి పరమానందముతోఁ గుమారస్వామిని బ్రశంసించుచు మహోత్సాహముతో - తరువాతి పద్యముతో నన్వయము

**చ సరసకరోటి తామ్రకళశంబుల, వారణ లూనహస్త భీ**
**కర జలయంత్ర పంక్తి, మద కస్తురి లోహిత కుంకుమాంబువుల్**
**పొరిఁబొరి ముంచుకొంచు, వలి భోరన ముట్టటలాడె నాహవా**
**జిరమున భూతకోటి సురసింధుతనూజ జయోత్సవంబునన్ 200.**

**అర్థము** . భూతకోటి = దయ్యముల సమూహము, సుర -సింధు - తనూజ - జయ + ఉత్సవంబునన్ = గంగాకుమారుఁడైన కుమారస్వామి యొక్క గెలుపు వేడుకయందు, ఆహవ + అజిరమునన్ = యుద్ధరంగపుముంగిట, సరస - కరోటి - తామ్ర - కలశంబులన్ = తడిగల పుఱ్ఱెలనెడి రాగిపాత్రములతో, వారణ

- లూన - హస్త - భీకర - జల - యంత్ర - పంక్తిన్ = ఏనుఁగుల తెగిన తొండములనెడి భయంకరములయిన చిమ్మన గొట్టములవరుసతో, మద-కస్తురి - లోహిత - కుంకుమ + అంబువుల్ = ఏనుఁగుల మదజలముతోడి కస్తూరి అనెడి ఎఱ్ఱని కుంకుమ జలములు, పొరిఁబొరిన్ = మాటిమాటికిని, ముంచుకొంచున్ = ముంచుకొనుచు, నలిన్ = ఉత్సాహముతో, భోరనన్ = శీఘ్రముగా, ముఱ్ఱటలు + ఆడెన్ = చిమ్మన గొట్టములతో జలక్రీడలాడెను

**తాత్పర్యము.** దయ్యముల సమూహము గంగాపుత్త్రుఁడైన కుమారస్వామి విజయోత్సవమునందు యుద్ధరంగపు ముంగిట క్రొత్త పుట్టెలనెడి రాగి పాత్రములతో, ఏనుఁగుల తెగిన తొండములనెడి భయంకరములయిన చిమ్మటగొట్టముల పంక్తితో, మదజలముతోడి కస్తూరి అనెడి ఎఱ్ఱని కుంకుమ జలములను మాటిమాటికి ముంచుకొనుచు ఉత్సాహముతో శీఘ్రముగా జలక్రీడలాడెను

**విశేషములు .** అలంకారము రూపకము ఇందలి మూఁడవ పాదమున మదకస్తురి లోహిత  అను సిద్దసమాసములో 'కస్తురి' యను వికృతి పదమును వాడుట విశేషము

**వ మఱియు నరుణ జల పూర్ణ సరోవరంబుల జలక్రీడయుం గరివర కళేబరాగ్రంబులఁ గృత్రి మాచల క్రీడయుఁ బ్రఖండ చండ ధ్వజ పతాకానేక దండంబుల వనక్రీడయుం జలుపుచు ననురాగరసపూరితహృదయులై మదనరసోద్రేకంబున 201**

**అర్థము .** మఱియున్, అరుణ - జల - పూర్ణ - సరోవరంబులన్ = రక్తమనెడి జలముతో నిండిన సరస్సులందు, జలక్రీడయున్ = జలవిహారమును, కరి - వర - కళేబర + అగ్రంబులన్ = శ్రేష్ఠములయిన యేనుఁగుల శవములపైని, కృత్రిమ + అచల - క్రీడయున్= క్రీడా పర్వత విహారమును, ప్రఖండ - చండ - ధ్వజ - పతాకా + అనేక - దండంబులన్ = మిక్కిలి ముక్కలైన తీక్ష్ణమైన ధ్వజములయు, పతాకలయు పెక్కు కఱ్ఱలందు, వన - క్రీడయున్ = వనవిహారమును, చలుపుచున్ = చేయుచు, అనురాగ - రస - పూరిత - హృదయులు + ఐ = ప్రేమరసముతో నిండిన హృదయములు గలవారయి, మదన - రస + ఉద్రేకంబునన్ = శృంగారరసావేశముతో

**తాత్పర్యము :** మఱియును భూతములు రక్తమనెడి జలముతో నిండిన సరస్సులందు జలక్రీడయును, ఏనుఁగుల శవములపైఁ గ్రీడాపర్వత విహారమును,

ముక్కలైన ధ్వజముల పతాకల దండములపై వనవిహారమును జేయుచు ప్రేమరసముతో నిండిన హృదయములు గలవారయి (గలవియై) శృంగార రసావేశముతో - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** అలంకారము రూపకము

చ **అరుణజలంబు లాడి, తురగాజినవస్త్రము లర్థిఁ గట్టి, భీ**
**కర కరి దాన కర్దమము కస్తురిగాఁగ నలంది, వీర హృ**
**త్సరసిరుహంబు లోలి నవతంసవిభూతిగఁ దాల్చి, చాల న**
**చ్చరువుఁ బిశాచకాంతలు పిశాచములం దవిలించి రొప్పులన్ 202**

**అర్థము.** పిశాచ - కాంతలు = పిశాచ స్త్రీలు, అరుణ - జలంబులు + ఆడి = రక్తమనెడి నీరులతో జలకమాడి, తురగ + అజిన - వస్త్రములు = గుఱ్ఱపు చర్మములనెడి వస్త్రములు, అర్థిన్ = కోరికతో, కట్టి, భీకర - కరి - దాన - కర్దమము = భయంకరమైన యేనుఁగుల మదమనెడి బురద, కస్తురి - కాఁగన్ = కస్తూరిగా, అలంది = పూసి, వీర - హృద్ + సరసిరుహంబులు = వీరుల హృదయములనెడి పద్మములు, ఓలిన్ = బాగుగా, అవతంస - విభూతిగన్ =శిరోభూషణ - సంపదగా, తాల్చి = ధరించి, పిశాచములన్ = మగపిశాచములందు, చాలన్ + అచ్చరువున్ = మిక్కిలి ఆశ్చర్యమును, ఒప్పులన్, తవిలించిరి = కలిగించిరి

**తాత్పర్యము :** పిశాచములు రక్తమనెడి జలములందు జలక్రీడలాడి గుఱ్ఱపు చర్మములనెడి వస్త్రములు కట్టి భయంకరములయిన యేనుఁగుల మదమనెడి బురద కస్తూరిగాఁ బూసి, వీరుల హృదయములనెడి పద్మములు శిరోలంకారములుగా ధరించి మగపిశాచముల కాశ్చర్యమును గలిగించిరి

**విశేషములు :** అలంకారము రూపకము అచ్చరువు - అచ్చెరువు (వి) - ఆశ్చర్యము (ప్ర)

వ **త దవసరంబున నఖిల భూత గణ పరివృతయైన మహాకాళి పేరోలగంబున. 203**

**అర్థము :** తద్ + అవసరంబునన్ =ఆ సమయమునందు, అఖిల - భూత - గణ - పరివృత = ఎల్ల దయ్యముల సమూహముతోఁ జుట్టఁబడినది, ఐన = అయిన, మహాకాళి, పేరు+ ఓలగంబునన్ = నిండుసభయందు

**తాత్పర్యము** ఆ సమయమున ఎల్లదయ్యముల సమూహముతోఁ జుట్టఁబడిన మహాకాళి నిండుసభయందు - తరువాతి పద్యముతో నన్వయము

సీ భటవాజిరుండముల్ పటహముల్గాఁ దీర్చి
రమణ వేతాళ వాద్యములు చెలఁగ
దళిత కపాలముల్ తాలముల్గా జంబు
కముల 'సంకీర్ణరాగములు మొరయ
సరసాజినంబులు సల్లడంబులు గట్టి
నెనకుల కంచెల లొనరఁబెట్టి
హాస్య బీభత్స భయానకరసము లా
యత్తంబుగా నోలి నభినయించి

ఆ సంగరాంగణంబు రంగంబుగా భూత
గణము పిచ్చలింపఁగాఁ బిశాచ
నర్తకీ చయంబు నర్తించెఁ గంకాళి
చిత్త మలరి యంగచిత్ర మెసఁగ 204

**అర్థము :** పిశాచ - నర్తకీ - చయంబు = నట్టువకత్తెలయిన పిశాచస్త్రీల సమూహము

భట - వాజి -రుండముల్ = భటులయు, గుఱ్ఱములయు కపాలములు, పటహముల్ + కాన్ = తప్పెటలుగా, తీర్చి = చేసి, రమణన్ = ఒప్పుగా, వేతాళ - వాద్యములు =బేతాళుర వాద్యములు, చెలఁగన్ = మ్రోయఁగా,

దలిత - కపాలముల్ = చీల్పఁబడిన పుఱ్ఱెలు, తాలముల్ + కాన్ = తాళములుగా, జంబుకముల = నక్కల, సంకీర్ణ - రాగములు = మిశ్రరాగములు, మొరయన్ = మ్రోయఁగా

సరస + అజినంబులు = పచ్చితోళ్లు, చల్లడంబులు - కట్టి = సగము తొడవఱకునుండు లాఁగులుగాఁ గట్టి, నెనకుల - కంచెలలు = ఱవికెలు, ఒనరన్ + పెట్టి = ఒప్పుగా ధరించి,

హాస్య - బీభత్స - భయానక - రసములు = హాస్యము, బీభత్సము, భయానకము అను రసములు, ఆయత్తంబుగాన్ = జాగరూకముగా, అభినయించి,

సంగర + అంగణంబు = యుద్ధభూమి, రంగంబు + కాన్ = రంగస్థలముగా, భూత - గణము = భూతముల సమూహము, పిచ్చలింపఁగాన్ = ఆనందింపఁగా, కంక + ఆలి = రాపులుఁగుల సమూహము యొక్క, చిత్తము = మనస్సు, అలరి = సంతోషించి, అంగ -చిత్రము + ఎసఁగన్ = శారీరకమైన చిత్తరువు(?) అతిశయింపఁగా , నర్తించెన్ = నాట్యము చేసెను

**తాత్పర్యము.** నట్టువరాండ్రయిన పిశాచస్త్రీల సమూహము, భటులయు, గుఱ్ఱములయు కపాలములు తప్పెటలుగాఁ దీర్చి, బేతాళుర వాద్యములు మ్రోయఁగను, చీల్పఁబడిన పుట్టెలు తాళములుగా, నక్కల మిశ్రరాగములు ధ్వనింపఁగా, పచ్చితోళ్లు సగముతొడవఱకునుండు లాఁగులుగాఁ గట్టి, అవికె లొప్పుగా ధరించి, హాస్యము, బీభత్సము, భయానకము అనురసములను జాగరూకముగా అభినయించి, యుద్ధరంగము రంగస్థలముగా, భూతగణము ఆనందింపఁగా, రాపులుఁగుల చిత్త మలరి శారీరకమైన చిత్తరు వతిశయింపఁగా నాట్యము చేసిరి

**విశేషములు.** అలంకారము స్వభావోక్తి 'నెనకుల' శబ్దము నిఘంటువులలోఁ గానరాలేదు

వ తత్ప్రస్తవంబున 205

**అర్థతాత్పర్యములు.** తద్ + ప్రస్తవంబునన్ = ఆ సందర్భమునందు - తరువాతి పద్యముతో నన్వయము

## సూర్యాస్తమయము

క. తనరు నరుణాంబుధారల
నవవరతముఁ దొప్పఁదోఁగి యరుణాంగుండై
తన మేను గడిగికొన నని
చనుగతి దిననాథుఁ డపరజలధికిఁ జనియెన్ 206

**అర్థము.** దిన - నాథుఁడు = సూర్యుఁడు, తనరు +అరుణ + అంబు - ధారలన్ = ఒప్పునట్టి రక్త జల ప్రవాహములందు, తొప్పఁదోఁగి = మిగుల మునిఁగి, అరుణ + అంగుండు + ఐ = ఎఱ్ఱని శరీరము గలవాఁడయి, తన - మేను = తన శరీరము, కడిగికొనన్ + అని = కడిగికొనుట కని, చను-గతిన్ = వెడలు విధమున,అపర - జలధికిన్ = పడమటి సముద్రమునకు, చనియెన్

**తాత్పర్యము** సూర్యుఁడు రక్తమనెడి జలప్రవాహములందు మిగుల మునిఁగి యెఱ్ఱనైన శరీరముగలవాఁడయి తన మేనుకడుగుకొనుటకుఁ బోవుచున్నాఁడోయనఁ బడమటిసంద్రమున కరిగెను సూర్యాస్తమయ మయ్యెనని భావము

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష

**వ అంత నుభయుబలంబులుం గైనీఁగి నిజశిబిరంబుల కరుగునవసరంబునఁ దమతమ నెమ్మనంబుల భృత్యబంధువర్గంబులం దడవు నతిసంభ్రమంబున 207**

**అర్థము .** అంతన్, ఉభయ - బలంబులున్ = రెండు సైన్యములును, కైనీఁగి= విరమించి (?), నిజ - శిబిరంబులకున్ = తమ గుడారములకు, అరుగు+ అవసరంబునన్ = పోవు సమయమున, తమ - తమ - నెమ్మనంబులన్ (నెఱ + మనంబులన్) = తమతమ మనస్సులదు, భృత్య - బంధు - వర్గంబులన్ = సేవకులయు, చుట్టములయు సమూహములను, తడవు + అతి సంభ్రమంబునన్= తలఁచు గొప్ప వేగిరపాటునందు

**తాత్పర్యము .** అంత రెండు సైన్యములును విరమించి తమ గుడారములకుఁ బోవు సమయమునఁ దమతమ మనస్సులందు భృత్యులయు, బంధువులయు సమూహములను స్మరించు గొప్ప వేగిరపాటులో - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** కైనీఁగి - నిఘంటువులందు లేదు ప్రకరణానుగుణముగా నర్థము చెప్పఁబడినది

**చ పాలికల నెల్ల రోసి కొనిపోయెడు వారును, బోయి పోటులన్**
**సల లిడువారు, మందులు భృశంబుగఁ బెట్టెడువారుఁ, గొంద ఱి**
**ట్టలముగ మంత్రతంత్రము లెడన్ సవరించుచు నుండువారునై**
**కలయఁగ వీరు వారు నిటుగైకొని యుత్సవ మందుచుండఁగాన్ 208**

**అర్థము :** పాలికలను + ఎల్లన్ = యుద్ధభూమియంతయును, రోసి = వెదకి, కొనిపోయెడు వారును = తీసికొని పోవువారును, పోయి, పోటులన్ = గాయములందు, సలలు + ఇడువారున్ = వత్తులు పెట్టువారును, మందులు,

భృశంబుగన్ = అధికముగా, మంత్రతంత్రములు, ఎడన్ = సమయమున, సవరించుచున్ + ఉండు - వారున్ + ఐ = కూర్చువారును అయి, కలయఁగన్ = బాగుగా, వీరున్ - వారున్, ఇటు = ఈ విధముగా, గైకొని = ఆచరించి, ఉత్సవము + అందుచున్ + ఉండఁగాన్ = వేడుక నొందుచుండఁగా

**తాత్పర్యము** యుద్ధరంగమంతయు వెదకి తీసికొని పోవువారును,పోయి గాయములందు వత్తు లిడువారును, మందు లధికముగాఁ బెట్టువారును, గొందఱు మిక్కిలిగా మంత్రతంత్రములను సమయమున కాచరించువారును అయి ఇరువాఁగువారును బాగుగాఁ గైకొని వేడ్కనందుచుండఁగా - తరువాతి వచనముతో నన్వయము

**వ ఇ ట్లుభయబలంబులందు ననేకు లనేకప్రకారంబుల దివ్యౌషధ ప్రకారంబుల నా రాత్రియంద విక్షత వేదనా విముక్తులగుచుండి రంత సమర సన్నాహంబు చేయింపం జనుదెంచునట్లు కమలవనంబుతోన సురాసుర చిత్తకమలనయనప్రబోధకుండగుచు నినుం డుదయశిఖరిశిఖరారూఢుం డగుడుం గుమారుండు తత్కాలోచితక్రియాప్రవర్తనుం డగుచు 209**

**అర్థము .** ఇట్లు, ఉభయ -బలంబుల + అందున్, అనేకులు, అనేక - ప్రకారంబులన్, దివ్య + ఔషధ - ప్రకారంబులన్ = దివ్యములయిన ఔషధరీతులచే, ఆ - రాత్రి + అందున్ + అ, విక్షత - వేదనా - విముక్తులు = గాయముల వలని బాధనుండి విడువఁబడినవారు, అగుచున్ + ఉండిరి, అంతన్, సమర - సన్నాహంబు= యుద్ధసంసిద్ధత,చేయింపన్ + చనుదెంచు + అట్లు =చేయించుటకు, వచ్చుచున్నాఁడా యనునట్లు, కమల - వనంబుతోన్ + అ = తామరతోఁపుతోపాటే, సుర + అసుర - చిత్త + కమల - నయన - ప్రబోధకుండు = దేవతలయు, రాక్షసులయు, రాక్షసులయు పద్మములవంటి మనస్సులను, కన్నులను మేలుకొలుపువాఁడు, అగుచున్, ఇనుండు = సూర్యుఁడు,ఉదయ - శిఖరి - శిఖర + ఆరూఢుండు = పొడుపుఁగొండ కొమ్ము నెక్కినవాఁడు, అగుడున్, కుమారుండు, తద్ + కాల + ఉచిత - క్రియా - ప్రవర్తనుండు = ఆ సమయమునకుఁ దగిన పనులయందు ప్రవర్తించినవాఁడు, అగుచున్

**తాత్పర్యము .** ఇట్లు రెండు సైన్యములందును పెక్కండ్రు పెక్కురీతుల దివ్యౌషధములచే ఆ రాత్రియందే గాయములవలని బాధతగ్గినవా రగుచుండిరి అంత యుద్ధసన్నద్ధులుగాఁ జేయింప వచ్చుచున్నాఁడా యనునట్లు పద్మవనముతో

పాటే దేవరాక్షసులమనఃపద్మములను కన్నులను మేలుకొలుపుచు సూర్యుఁడు పొడుపుఁగొండ కొమ్మెక్కినంతనే కుమారస్వామి ఆ సమయమునకుఁ దగిన పనులందుఁ బ్రవర్తించుచు - తరువాతి యాశ్వాసమునందలి మొదటి గద్యముతో నన్వయము

## ఆశ్వాసాంతము

చ సరసిరుహాక్షు మోక్షు మితజల్పు ననల్పు వరున్ వరేణ్యు స
ద్గురుఁ గృతకృత్యు నిత్యు గతదోషు నరోషు ననంతు శాంతు వా
గ్వరజనసేవ్యు భవ్యు మునివంద్యు ననింద్యు వదాన్యు మాన్యు శం
కర పద భక్తియుక్తు నవికారి నఘారి విచారపారగున్ 210

**అర్థము** నరసిరుహ + అక్షున్ = పద్మములవంటి కన్నులు గలవాఁడును, మోక్షున్ = మోక్ష స్వరూపుఁడును, మిత - జల్పున్ = తక్కువగా మాటలాడువాఁడును, అనల్పున్ = అల్పుఁడు కానివాఁడును, వరున్ = ప్రభుఁడును, వరేణ్యున్ = శ్రేష్ఠుఁడును, సత్ + గురున్ = మంచి గురువును, కృత - కృత్యున్ = కృతార్థుఁడును, నిత్యున్ = శాశ్వతుఁడును, గత - దోషున్ = పోయిన దోషములు గలవాఁడును, అరోషున్ = రోషములేనివాఁడును,అనంతున్ = అంతము లేనివాఁడును, శాంతున్ = శాంతము గలవాఁడును, వాగ్వర -జన - సేవ్యున్ = బ్రాహ్మణ జనులచే సేవింపఁదగినవాఁడును, భవ్యున్ = యోగ్యుఁడును, ముని-వంద్యున్ = మునులచే నమస్కరింపఁదగినవాఁడును, అనింద్యున్ = నిందింపఁదగనివాఁడును, వదాన్యున్ = ఉదారుఁడును, మాన్యున్ = మన్నింపఁదగినవాఁడును, శంకర - పద - భక్తి - యుక్తున్ = శంకరుని పదములందలి భక్తితోఁగూడినవాఁడును, అవికారిన్ = నిర్వికారుఁడును, అఘ + అరిన్ = పాపములకు శత్రువైనవాఁడును, విచార - పారగున్ = ఆలోచనయొక్క పారమును బొందినవాఁడును అగు జంగమమల్లికార్జునదేవుని -

**తాత్పర్యము:**పద్మాక్షుఁడును, మోక్షస్వరూపుఁడును, మితభాషణుఁడును, అనల్పుఁడును, వరుఁడును, వరేణ్యుఁడును, సద్గురుఁడును, కృతార్థుఁడును, నిత్యుఁడును, దోషరహితుఁడును, రోషరహితుఁడును, అనంతుఁడును, శాంతుఁడును, బ్రాహ్మణ జన సేవ్యుఁడును, భవ్యుఁడును, మునివంద్యుఁడును, అనింద్యుఁడును, వదాన్యుఁడును, మాన్యుఁడును, శివపదభక్తియుక్తుఁడును,

నిర్వికారుఁడును, అఘనాశకుఁడును, విచార పారంగతుఁడును అగు కృతిభర్తను - శ్రీ జంగమమల్లికార్జున దేవుని

**విశేషములు :** అలంకార మనుప్రాసము

క **ప్రణుతామలసద్గుణగణ**
**మణిభూషణభూషితాంగు మారామితమా**
**ర్గణ తాపరహిత హృదయాం**
**గణు సజ్జనకల్పవృక్షకల్పు ననల్పున్** 211

**అర్థము** ప్రణుతా తాంగున్ ప్రణుత = మిక్కిలి నుతింపఁబడిన, అమల = నిర్మలములైన, సత్ + గుణ = మంచిగుణములయొక్క, గణ = సమూహము అనెడి, మణి = మణిమయములైన, భూషణ = అలంకారములచే, భూషిత + అంగున్ = అలంకరింపఁబడిన శరీరము గలవాఁడును, మారా గణున్ మార = మన్మధుని యొక్క, అమిత = అధికములయిన, మార్గణ = బాణములవలని, తాప - రహిత = తాపములేని, హృదయ + అంగణున్ = హృదయ ప్రదేశము గలవాఁడును, సత్ + జన - కల్పవృక్ష - కల్పున్ = మంచి జనులకు కల్పవృక్షముతో సమానుఁడును, అనల్పున్ - అగు శ్రీ జంగమమల్లికార్జున దేవుని

**తాత్పర్యము .** నుతింపఁబడిన నిర్మలములయిన సద్గుణగణములనెడి రత్నాలంకారములచే నలంకరింపఁబడిన శరీరముగలవాఁడును, మన్మధుని అధిక బాణముల తాపములేని హృదయాబ్జము గలవాఁడును, సజ్జనులకుఁ గల్పవృక్షప్రాయుఁడును, అనల్పుఁడును అగు శ్రీ జంగమ మల్లికార్జున దేవుని

**విశేషములు ·** అలంకారము రూపకము, అనుప్రాసము

చ **కలిమల దూరు, ధీరు, నవికారు, నుదారు, నముహ్యు, సహ్యు, ని**
**శ్చల మతి, దివ్యు, భవ్యు, నభిజాతు, నజాతు, నమూఢు, గూఢు, ని**
**ష్కలు, నభిమాని, దాని, మునిశక్రు, నవక్రు, నభేద్యు, నాద్యు, ని**
**ర్మల సుచరిత్రుఁ, బాత్రు, జితమారు, నభీరు, సుమేరుసారునిన్** 212

**అర్థము :** కలి - మల - దూరున్ = కలియుగపాపములకు దూరమైనవాఁడును, ధీరున్, అవికారున్ = నిర్వికారుఁడును, ఉదారున్, అముహ్యున్ = మోహములేనివాఁడును, సహ్యున్ = శక్తిమంతుఁడును, నిశ్చల - మతిన్ =

చలింపని బుద్ధిగలవాఁడును, దివ్యున్, భవ్యున్ = యోగ్యుఁడును, అభిజాతున్ = సద్వంశమునఁ బుట్టినవాఁడును, అజాతున్ = పుట్టనివాఁడును, అమూఢున్ = మూఢుఁడుగానివాఁడును, గూఢున్ = రహస్యమైనవాఁడును, నిష్కలున్ = కలహరహితుఁడును, అభిమానిన్= అభిమానవంతుఁడును, దానిన్= దాతయును, ముని - శక్రున్ = మునీంద్రుఁడును, అవక్రున్ = వక్రుఁడు గానివాఁడును, అభేద్యున్ = భేదింపరానివాఁడును, ఆద్యున్ = మొదటివాఁడును, నిర్మల - సుచరిత్రున్= స్వచ్ఛమైన మంచి చరిత్ర గలవాఁడును, పాత్రున్= తగినవాఁడును, జిత - మారున్ = మన్మథుని జయించినవాఁడును, అభీరున్ = భీరువు కానివాఁడును, సుమేరు - సారునిన్= మేరువుసారమువంటి సారము గలవాఁడును - అగు శ్రీ జంగమ మల్లికార్జునదేవుని

**తాత్పర్యము.** కలియుగ పాపములకు దూరమైనవాఁడును, ధీరుఁడును, నిర్వికారుఁడును, ఉదారుఁడును, నిర్మోహుఁడును, సహ్యుఁడును, నిశ్చల మనస్కుఁడును, దివ్యుఁడును, భవ్యుఁడును, సద్వంశజాతుఁడును, అభవుఁడును, అమూఢుఁడును, గూఢుఁడును, కలహరహితుఁడును, అభిమానవంతుఁడును, దాతయును, మునీంద్రుఁడును, అవక్రుఁడును, అభేద్యుఁడును, ఆద్యుఁడును, నిర్మల సచ్చరిత్రుఁడును, పాత్రుఁడును, జితమన్మథుఁడును, అభీరుఁడును మేరు సమాన సారుఁడును - అగు శ్రీ జంగమ మల్లికార్జున దేవుని

**విశేషములు.** అలంకార మనుప్రాసము

**క. పరపరివాద పరాఙ్ముఖుఁ,**
**బరహితరతుఁ బరమ ముని, నపరిమిత విద్యా**
**పరిణతుఁ, బరిజన సజ్జన**
**పరిపాలనపరు, విచారపరుఁ, బరమపరున్ 213**

**అర్థము :** పర - పరివాద - పరాఙ్ముఖున్ = పరనిందకుఁ బెడ మొగమైనవాఁడును, పర - హిత - రతున్ = ఇతరులకు మేలు సేఁతయం దాసక్తి గలవాఁడును, పరమ - మునిన్ = గొప్పమునియు, అపరిమిత - విద్యా - పరిణతున్= అధికమైన విద్యయందుఁబండినవాఁడును, పరిజన - సత్ + జన - పరిపాలన - పరున్= పరిజనుల, సుజనుల పరిపాలనమందు ఆసక్తిగలవాఁడును, విచార-పరున్ = ఆత్మ విచారమునం దాసక్తి గలవాఁడును, పరమ - పరున్ = పరాత్పరుఁడును - అగు శ్రీ జంగమ మల్లికార్జున దేవుని

**తాత్పర్యము** అన్యనిందాపరాఙ్ముఖుఁడును, పరిహితపరుఁడును, పరమ మునియు, అపరిమిత విద్యా పరిణతుఁడును, పరిజన సజ్జన రక్షణ పరాయణుఁడును, విచారపరుఁడును, పరాత్పరుఁడును అగు శ్రీ జంగమ మల్లికార్జున దేవుని

**విశేషములు .** అలంకార మనుప్రాసము

**కవిరాజవిరాజితము**

**మను నిభ చారు చరిత్రుఁ, బవిత్రు, నమానుష పౌరుషవర్తి, జగ**
**జ్జన నుత నిర్మల కీర్తి, రమావిభు, శాశ్వత యోగ పద స్థిరు, స**
**న్ముని జన ముఖ్యు, శివాగమవేది, నమోఘవచో నిధి, ధీనిధిఁ బా**
**వనతరమూర్తి, సమస్త జగద్గురు వంద్యు, ననింద్యు, సదాత్మవిదున్ 214**

**అర్థము :** మను - నిభ - చారు - చరిత్రున్ = మనువుతో సమానమైన మనోహర చరిత్రము గలవాఁడును, పవిత్రున్, అమానుష-పౌరుష-వర్తిన్ = మానవాతీతమైన పౌరుషమునందు వర్తించువాఁడును, జగత్ + జన - నుత - నిర్మల - కీర్తి - రమా - విభున్ = లోకజనులచేఁ బొగడఁబడిన నిర్మలమైన కీర్తియనెడు లక్ష్మికి భర్తయైనవాఁడును, శాశ్వత - యోగ - పద - స్థిరున్ = శాశ్వతమైన యోగమనెడి పదమునందు నిశ్చలుఁడైనవాఁడును, సత్ + ముని - జన - ముఖ్యున్ = మంచి మునులలోఁ బ్రధానుఁడును, శివ + ఆగమ - వేదిన్= శివాగమములు తెలిసినవాఁడును, అమోఘవచస్ (ః) + నిధిన్ = వ్యర్థము కాని మాటలకు నిధియైనవాఁడును, ధీనిధిన్ = బుద్ధికి నిధియైనవాఁడును, పావనతర= మూర్తిన్ = మిక్కిలి పవిత్రమైన ఆకారము గలవాఁడును, సమస్త - జగత్ + గురు- వంద్యున్ = ఎల్లలోకగురువులచే నమస్కరింపఁదగినవాఁడును, అనింద్యున్ = నిందింపఁదగనివాఁడును, సత్ + ఆత్మ - విదున్ = సద్బ్రహ్మజ్ఞానము గలవాఁడును అగు శ్రీ జంగమ మల్లికార్జున దేవుని

**తాత్పర్యము :** మనువుతో సమానమైన సచ్చరిత్రము గలవాఁడును పవిత్రుఁడును, మానవాతీతపౌరుషమందు వర్తిల్లువాఁడును, జగజ్జనులచే నుతింపఁబడిన నిర్మలకీర్తియందు విష్ణువైనవాఁడును, శాశ్వత యోగ పదమునందు నిశ్చలుఁడును, సన్మునిజనులలోఁ బ్రధానుఁడును, శివాగమము లెఱిఁగినవాఁడును, అమోఘంబులైన వచస్సులకు నిధియైనవాఁడును, ధీనిధియును, పావనతరమూర్తియును, సమస్తజగద్గురువులచే నమస్కరింపఁదగినవాఁడును,

అనింద్యుఁడును, మంచి ఆత్మ జ్ఞానముగలవాఁడును - అగు శ్రీ జంగమ మల్లికార్జున దేవుని

**విశేషములు** ఛందస్సు కవిరాజవిరాజితమునందు నాలుగు పాదములుండును ప్రతి పాదమునను న, జ, జ, జ, జ, జ, జ, వ అనుగణములుండును మొదటి యక్షరమునకు, ఎనిమిదవ అక్షరమునకును, పదునాల్గవ అక్షరమునకును, ఇరువదియవ అక్షరమునకును యతిమైత్రి ప్రాస నియమము గలదు కాని యీ పద్యమున మూఁడుయతులు గాక, మొదటి అక్షరమునకును, పదునాల్గవ అక్షరమునకును మాత్రమే యతిమైత్రి చెల్లించుట విశేషము

గద్యము

**ఇది శ్రీ మజ్జంగమమల్లికార్జునదేవ దివ్య శ్రీ పాద పంకజ**
**భ్రమరాయమాణ కవిరాజశిఖామణి నన్నెచోడదేవ**
**ప్రణీతంబైన కుమారసంభవంబను కథయందు**
**ఏకాదశాశ్వాసము**
**సమాప్తము.**

**దీని వ్యాఖ్యకుఁ బూర్వాశ్వాసాంత గద్యముల వ్యాఖ్యల నరయునది**

**మ** **ఇది శ్రీ జొన్నలగడ్డ వంశమణియౌ మృత్యుంజయాఖ్యుండు స**
**మ్మద మొప్పారఁ గుమారసంభవము శ్రీమన్నన్నెచోడాఖ్య వి**
**ద్వదధీ శోక్తము శాబ్దికార్థ వివిధ స్వారస్య తాత్పర్యముల్**
**చదురొప్పన్ వచియించి మన్చు విలసత్ సంజీవనీవ్యాఖ్య యౌ.**

# కుమార సంభవము

## ద్వాదశాశ్వాసము

క     శ్రీ రామా కేళీ నీ
రేరుహ పరిగళిత లలిత రేణు ప్రకరా
సారాపూరిత భూరిత
రోరస్స్థల మందరాచలోరుప్రస్థన్     1

**అర్థము.** శ్రీ ... ప్రస్థున్! శ్రీ - రామా = లక్ష్మీదేవి యొక్క, కేళీ - నీరేరుహ = లీలాపద్మమునుండి, పరిగళిత = జాఱిన, లలిత = మనోహరములైన, రేణు - ప్రకర = పుష్పొడి రేణువుల సమూహమనెడి, ఆసార = జడిచేత, ఆపూరిత = నింపఁబడిన, భూరితర + ఉరస్ + స్థల - మందర + అచల + ఉరు - ప్రస్థన్ = మందరపర్వతముయొక్క గొప్పనెత్తమువంటి మిక్కిలి విశాలమైన వక్షస్స్థలము గలవాఁడు - అగు శ్రీ జంగమ మల్లికార్జున దేవుని

**తాత్పర్యము .** లక్ష్మీదేవి లీలాపద్మము నుండి జాఱిన లలితములైన పుప్పొడిరేణువుల సమూహమనెడి జడివానచే నింపఁబడిన మందరాచలప్రస్థము వంటి విశాలవక్షస్స్థలముగలవాఁడు అగు శ్రీ జంగమమల్లికార్జున దేవుని

**విశేషములు** అలంకార ముపమ

వ     పరమేశ్వరుఁ నతులభక్తియుక్తి నారాధించి క్రౌంచారి సమరోద్యుక్తుండై సన్నాహభేరి చఱువంబంచె నంత సురాసుర బలజలధు లొండొండ పెరిఁగి సంక్షోభించుచు     2

**అర్థము:** పరమేశ్వరున్, అతుల - భక్తి - యుక్తిన్ = సాటిలేని భక్తి యొక్క కూడికతో, ఆరాధించి = పూజించి, క్రౌంచ + అరి = క్రౌంచ శత్రువు - కుమారస్వామి, సమర + ఉద్యుక్తుండు + ఐ = యుద్ధమునకుఁ బూనినవాఁడయి,

సన్నాహ-భేరి = సంసిద్ధతను దెలుపుభేరి, చఱువన్ + పంచెన్ = మ్రోయింప నాజ్ఞాపించెను అంతన్, సుర - అసుర - బల - జలధులు = దేవతల రాక్షసుల సైన్యములనెడి సముద్రములు, ఒండొండ = క్రమక్రమముగా, పెరిఁగి, సంక్షోభించుచున్ = కలఁతఁజెందుచు

**తాత్పర్యము** పరమేశ్వరుని సాటిలేని భక్తితోఁ బూజించి కుమారస్వామి యుద్ధమునకుఁ బూనినవాఁడయి సన్నాహభేరిని మ్రోయింప నాజ్ఞాపించెను అంత దేవాసుర సైన్యములనెడి సముద్రములు క్రమక్రమముగాఁ బెరిఁగి కలఁత చెందుచు - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు**. అలంకారము రూపకము

సీ **పసిఁడి యాయగములు పన్ని యాయితముగా**
**గజవాజితతికిఁ బక్కరలు నెరయఁ**
**బెట్టి, రథంబులు మెట్టి కందియనలు**
**పూసి గుఱ్ఱంబులు పూన్చి మీఁద**
**నాయుధంబులు నించి యాధోరణాశ్వికుల్**
**రథికులు నెక్కి సారథులతోడఁ**
**గవదొనల్ విండ్లను గత్తులంబులుఁ గుంత**
**ములుఁ గరవాలముల్ పలక లీఁటె**

ఆ **లడ్డనములుఁగొని రయంబునఁ గాల్వురు**
**పన్ని నిలిచి రుభయబలములందుఁ**
**బర్వె నొక్కపెట్టఁ బంచ మహాశబ్ద**
**రవము ప్రళయజలధిరవము పోలె** 3

**అర్థము:** పసిఁడి + ఆయగములు = బంగారు చిత్రకంబళములు, పన్ని = వైచి, ఆయితముగాన్ = సిద్ధముగా, గజ - వాజి - తతికిన్ = ఏనుఁగుల, గుఱ్ఱముల సమూహమునకు, పక్కరలు = పక్కెరలు - ఏనుఁగులు, గుఱ్ఱములు మొదలుగువానికిఁ దొడుగు కవచములు, నెరయన్ = నిండుగా, పెట్టి,

రథంబులు, మెట్టి, కందియనలు = కందెనలు, పూసి, గుఱ్ఱంబులు, పూన్చి = రథములకుఁగట్టి మీఁదన్ = పైని, ఆయుధంబులు, నించి, ఆధోరణ + ఆశ్వికుల్ = మావటీంద్రుడు, రౌతులు, రథికులున్, సారథులతోడన్, ఎక్కి,

కవచౌనల్= అంపపొదులును, విండ్లును, కత్తలంబులున్= కవచములును, కుంతములున్= బల్లెములును, కరవాలముల్= కత్తులు, పలకలున్= డాలులును, ఈఁటెలు = బల్లెములు, అడ్డనములున్= వేత్రాదికృతములగు డాలులును, కొని, కాల్బ్వరు = కాలిబంటులు, రయంబునన్= శీఘ్రముగా, పన్ని =సిద్ధపడి, నిలిచిరి

ఉభయ - బలముల + అందున్ = రెండు సైన్యములందును, పంచ - మహత్ (మహా) - శబ్ద - రవము = అయిదు విధములయిన వాద్యముల ధ్వని, ప్రళయ - జలధి - రవము + అ - పోలెన్ = ప్రళయ కాల సముద్రఘోషమే యనునట్లు, ఒక్క - పెట్టన్ = ఒక్కమాఱుగా, పర్వెన్ = వ్యాపించెను

**తాత్పర్యము** ఏనుఁగుల, గుఱ్ఱముల సమూహామునకు బంగారు చిత్రకంబళములువైచి సిద్ధముగాఁ బక్కెరలు నిండుగాఁ బెట్టి, రథములు చొచ్చి, కందెనలు పూసి, గుఱ్ఱములు పూన్చి, పైని ఆయుధములు నించి మావటీంద్రును, రౌతులును సారథులతో నెక్కి అంపపొదులును, విండ్లును, కవచములును, కుంతములును, కరవాలములును, పలకలును, ఈఁటెలును, అడ్డనములును గొని కాల్బంటులు శీఘ్రముగా సిద్ధపడి నిలిచిరి రెండు సైన్యములందును పంచవిధవాద్యముల ధ్వని ప్రళయకాల సముద్రఘోషమేయన నొక్కపెట్ట వ్యాపించెను

**విశేషములు .** అలంకారము ఉపమ

**వ అంతకు మున్న యుద్ధసన్నద్ధులై పట్టవర్ధనగజంబుల నెక్కి చనుదెంచి కుమారతారకులు తమతమ బలంబులకుం జేయు వీచినం బ్రళయానిలంబు వీచినం దనరి సుడివడు కాలానల శిఖా కలాపంబులుం బోలెం గోపానలోద్దీపితాంతరంగులై సురాసురవీరు లొండొరులఁ దాఁకి మహాఘోరయుద్ధంబు సేయునవసరంబున** 4

**అర్థము .** అంతకున్ + మున్ను + అ = అంతకు మునుపే, కుమార - తారకులు, యుద్ధసన్నద్ధులు + ఐ = యుద్ధమునకు సిద్ధపడినవారయి, పట్టవర్ధన- గజంబులన్ = పట్టపుటేనుఁగులను, ఎక్కి, చనుదెంచి = వచ్చి, తమ - తమ - బలంబులకున్, చేయు - వీచినన్ = చేయి ఊఁపఁగా, ప్రళయ + అనిలంబు = ప్రళయకాల వాయువు, వీచినన్, తనరి = విజృంభించి, సుడివడు = గిరగిరఁదిరుగు, కాల + అనల - శిఖా - కలాపంబులున్ + పోలెన్ = ప్రళయసమయాగ్నిజ్వాలల సమూహములవలె, కోప + అనల + ఉద్దీపిత + అంతరంగులు + ఐ = కోపమనెడి అగ్నిచే మిక్కిలి వెలిఁగింపఁబడిన మనస్సులు గలవారయి, సుర + అసుర - వీరులు

= దేవరాక్షసవీరులు, ఒండొరులన్ = ఒకరినొకరు, తాఁకి, మహత్ (మహా) - ఘోర-యుద్ధంబు = మిక్కిలి భయంకరమైన యుద్ధము, చేయు + అవసరంబునన్ = చేయు సమయమున

**తాత్పర్యము.** అంతకు మునుపే కుమారస్వామియు, తారకాసురుఁడును యుద్ధసంసిద్ధులయి పట్టపుటేనుఁగుల నెక్కి వచ్చి తమ తమ సైన్యములకుఁ జేయివీవఁగా, ప్రళయసమయవాయువు వీవఁగా విజృంభించి గిరగిరఁదిరుగు ప్రళయకాలాగ్నిజ్వాలల సమూహములవలెఁ గోపాగ్నిచే వెలిఁగింపఁబడిన మనస్సులు గలవారయి దేవరాక్షసవీరులు ఒకరినొకరు తాఁకి మిక్కిలి భయంకరమైన యుద్ధమొనరించు సమయమునందు - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** అలంకారము ఉపమ చేయు నవసరము - చేయు + అవసరము - 'ఉదంతమగు తద్ధర్మార్థవిశేషణమున కచ్చు పరమగునపుడు నుగాగమంబగు ' బాల సంధి 33

చ **పరశులు, కొంతముల్, గదలు, భల్లము, లమ్ములు, విండ్లు, కంకటుల్,**
**సురియలు, వజ్రముష్టులుఁ, ద్రిశూలము, లీఁటెలు, మండలాగ్రముల్,**
**పరిఘలు, చక్రముల్, పవులు, పాశము, లంకుశముల్, సబళ్లు, ము**
**ద్గరములు, తోమరంబు, లెడగత్తులు, శంఖులు, భిండివాలముల్ 5**

**అర్థము :** పరశులు = గండగొడ్డళ్లు, కొంతముల్ = కుంతములు, గదలు, భల్లములు, అమ్ములు, విండ్లు, కంకటుల్ = ఆయుధ విశేషములు, సురియలు = చురకత్తులు, వజ్రముష్టులున్, త్రిశూలములు, ఈఁటెలు, మండలాగ్రముల్ = ఖడ్గములు, పరిఘలు = ఇనుపకట్ల గుదియలు, చక్రముల్, పవులు = వజ్రాయుధములు, పాశములు, అంకుశముల్, సబళ్లు = (సబడి + లు) = ఆయుధవిశేషములు, ముద్గరములు = అస్త్రవిశేషములు, తోమరంబులు = చిల్లకోలలు, ఎడగత్తులు = ఆయుధవిశేషములు, శంఖులు = ఆయుధవిశేషములు, భిండివాలముల్ = భింది పాలములు - వడిసెల వలె నుండు ఆయుధ విశేషములు

**తాత్పర్యము :** పరశులు, కుంతములు, గదలు, భల్లములు, అమ్ములు, విండ్లు, కంకటులు, సురియలు, వజ్రముష్టులు, త్రిశూలములు, ఈఁటెలు, మండలాగ్రములు, పరిఘలు, చక్రములు, పవులు, పాశములు, అంకుశములు, సబడులు, ముద్గరములు, తోమరములు, పడగత్తులు, శంఖులు, భిండివాలములు - అను వివిధాయుధవిశేషములు - తరువాతి పద్యముతో నన్వయము

వ అను ననేకాయుధవర్షంబు ప్రళయకాలఘనాఘనవర్షంబునుంబోలె నొక్కపెట్ట భోరనఁ గురియం దొడంగినం దత్ప్రతిహతి నుభయబలంబులును మదకరిభగ్నసల్లకీవనంబునుం బోలె విక్షతిమయంబై మహాభయంకరంబయ్యె నయ్యవసరంబున 6

**అర్థము** అను, అనేక + ఆయుధ - వర్షంబు = పెక్కు ఆయుధము లనెడి వర్షము, ప్రళయ - కాల - ఘనా - ఘన - వర్షంబునున్ + పోలెన్ = ప్రళయ సమయ వర్షాకాలపు మేఘములు కురియువానవలె, ఒక్క - పెట్టన్ = ఒక్కమాఱుగా, భోరనన్ = అధికముగా, కురియన్ + తొడంగినన్ = కురియ మొదలిడఁగా, తద్ + ప్రతిహతిన్ = ఆ దెబ్బచే, ఉభయ - బలంబులును = రెండు సైన్యములును, మద - కరి - భగ్న - పల్లకీ - వనంబునున్ + పోలెన్ = మదగజముచే విఱుగఁగొట్టఁబడిన అందుగుచెట్లతోఁటవలె, విక్షతి - మయంబు + ఐ = గాయములతో నిండినదయి, మహత్ (మహా) - భయంకరంబు + అయ్యెన్, అయ్యవసరంబునన్ (ఆ + అవసరంబునన్) = ఆ సమయమున

**తాత్పర్యము .** పయి పరశ్వాదు లనెడి పెక్కు ఆయుధముల వర్షము ప్రళయ కాల వర్షాకాల మేఘములు కురియు వర్షమువలె, ఒక్కమాఱుగా అధికముగాఁ గురియ నారంభింపఁగా, ఆ దెబ్బచే రెండు సైన్యములును మత్తేభభగ్నమైన అందుగుచెట్లతోఁటవలె గాయములతో నిండినదయి మిక్కిలి భయంకరముగా నుండెను ఆ సమయమున - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు :** అలంకార ముపమ

చ ఉదుట రణోత్సవం బొదవ నూఱట నార్వఁగ నొక్కనోరు చా
లదు తమకంచు సద్భటకులంబు రయంబున దేహమంతయున్
వదనము లోలిఁ దెచ్చికొని వారక భోరన నార్వఁజొచ్చె నా
వదలక ఱొమ్ము పొట్టల రవం బనయంబుఁ జెలంగెఁ బెల్లుతోన్ 7

**అర్థము .** ఉదుటన్ = ఉద్ధతితో, రణ + ఉత్సవంబు = యుద్ధపు వేడుక, ఒదవన్ = కలుగఁగా, ఊఱటన్ = స్వాస్థ్యముతో, ఆర్వఁగన్ = ఆర్చుటకు, తమకున్, ఒక్క - నోరు, చాలదు, అంచున్, సత్ + భట - కులంబు = ఉత్తమ వీరుల సమూహము, రయంబునన్ =వేగముగా, దేహము + అంతయున్ = శరీరమంతయు, వదనములు = నోరులు, ఓలిన్ = బాగుగా, తెచ్చికొని, వారక =

ఉడుగక, భోరనన్= అధికముగా, ఆర్వన్ + చొచ్చెన్ + నాన్ = ఆర్వఁజొచ్చెనా యనునట్లు, వదలక = మానక, తొమ్ము - పొట్టల - రవంబు = తొమ్ముయొక్కయు, పొట్టల యొక్కయు ధ్వని, అనయంబున్ = మిక్కిలి, పెల్లుతోన్ = ఆధిక్యముతో, చెలంగెన్ = మ్రోసెను

**తాత్పర్యము.** ఉద్దతితో యుద్ధోత్సవము కలుగఁగా ఆర్పుటకుఁదమకొక్క నోరు చాలదని సద్వీరుల సమూహము వేగముగా దేహమంతయును నోర్లు తెచ్చికొని ఉడుగక ఆర్వఁజొచ్చెనా యనునట్లు మానక తొమ్ము పొట్టల ధ్వని మిక్కిలి అధికముగా మ్రోసెను

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష

## విరూపాక్ష కుంజరాక్షుల యుద్ధము

**వ** **త దవసరంబున నమర వీర కరయంత్ర ముక్తాముక్తాద్యాయుధ ప్రహతి కసురబలంబు లబ్బగింపక** 8

**అర్థము** తద్ + అవసరంబునన్ = ఆ సమయమున, అమర - వీర - కరయంత్ర - ముక్త + అముక్త + ఆది - ఆయుధ - ప్రహతికిన్ = దేవవీరుల కరయంత్రముల నుండి, ముక్త = విడువఁబడిన, అముక్త + ఆది - ఆయుధ - ప్రహతికిన్ = అముక్తము మున్నగు ఆయుధముల యొక్క దెబ్బకు, అసుర - బలంబులు = రాక్షససైన్యములు, అబ్బగింపక = సహింపక

**తాత్పర్యము .** ఆ సమయమున దేవవీరుల కరయంత్రముల నుండి విడువఁబడిన అముక్తము మున్నగు ఆయుధముల దెబ్బకు రాక్షససైన్యములు సహింపక - తరువాతి పద్యముతో నన్వయము

**క** **విఱిగె నరదంబు, లలుగులు**
**విఱిగె, మదేభంబు లొఱఁగె, వెస నాశ్వికులుం**
**దొరఁగిరి, శూన్యాసనములఁ**
**బఱచెఁ దురంగమము, లోడి పఱచిరి దనుజుల్.** 9

**అర్థము .** అరదంబులు = రథములు, విఱిగెన్, అలుగులు = బాణములు,విఱిగెన్, మద + ఇభంబులు = మద గజములు, ఒఱఁగెన్ = వ్రాలెను వెసన్ = శీఘ్రముగా, ఆశ్వికులున్ = గుఱ్ఱపురౌతులును, తొఱఁగిరి = విడిచిరి, తురంగమములు = గుఱ్ఱములు, శూన్య + ఆసనములన్ = ఆశ్విక

రహితాసనములతో, పఱచెన్ = పరువెత్తెను, దనుజుల్ = రాక్షసులు, ఓడి, పఱచిరి = పరువెత్తిరి

**తాత్పర్యము** రథములు విఱిగెను, బాణములు ముక్కలయ్యెను మత్తేభములు వ్రాలెను, గుఱ్ఱపురౌతులును శీఘ్రముగా విడిచిరి గుఱ్ఱములు అశ్వికశూన్యములైన ఆసనములతోఁబరువెత్తెను రాక్షసులు ఓడిపోయి పరువెత్తిరి

**వ** ఇట్లు మహాసముద్రంబులు కట్టవిసిన ట్లొక్కపెట్ట సురవరులకు వెన్నిచ్చి తెరలం బఱతెంచు నసురవాహినీప్రవాహంబునకు వజ్రసేతుబంధనంబుగ నాఁకఁగొని కుంజరాక్షుండు కుంజరారిభీతాతురకుంజరపోతయూథంబులం గైకొని సవరించు మహాయూథాధిపతియునుంబోలె నిజబలంబుం గనుంగొని 10

**అర్థము.** ఇట్లు, మహత్ (మహా) + సముద్రంబులు, కట్టవిసినట్లు (కట్ట + అవిసిన+ అట్లు) = గట్టు తెగిన విధమున, ఒక్కపెట్టన్ = ఒక్కమాఱుగా, సుర- వరులకున్ = దేవతా శ్రేష్ఠులకు, వెన్నిచ్చి (వెన్ను + ఇచ్చి) = ఓడిపోయి, తెరలన్+ పఱతెంచు = ఉప్పొంగివచ్చు, అసుర - వాహినీ - ప్రవాహంబునకున్ = రాక్షససేనయనెడునదియొక్కప్రవాహమునకు, వజ్ర - సేతు - బంధనంబుగన్ = వజ్రనిర్మితమైన ఆనకట్టగా, ఆఁకన్ + కొని = అడ్డగించి, కుంజరాక్షుండు = కుంజరాక్షుఁడను పేరుగల రాక్షసుఁడు, కుంజర + అరి - భీత + ఆతుర - కుంజర - పోత = యూథంబులన్ = గజవిరోధి (సింహము) వలన భయపడి బాధపడిన గున్నయేనుఁగుల గుంపులను, కైకొని = గ్రహించి, సవరించు = చక్కఁబఱుచు, మహత్ (మహా) + యూథ + అధిపతియునున్ + పోలెన్ = గొప్ప గజసమూహనాయకునివలె, నిజ -బలంబున్ = తన సైన్యమును, కనుంగొని = చూచి

**తాత్పర్యము.** ఇట్లు మహాసముద్రములు గట్టుతెగినట్లు ఒక్కపెట్టున దేవతాశ్రేష్ఠులకు వెన్నిచ్చి పాఱిపోయివచ్చు రాక్షస సేనయనెడు నదీ ప్రవాహమునకు వజ్రనిర్మితసేతుబంధనముగ అడ్డగించి కుంజరాక్షుఁడను రాక్షసవీరుఁడు సింహమునకు భయపడిన ఏనుఁగుగున్నలను స్వీకరించి చక్కఁబఱుచు గజ సమూహ నాయకుని వలెఁ దన బలమును జూచి - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు** అలంకారము శ్లిష్టరూపకము, ఉపమ

క ప్రళయాభ్రరసము నా సుర
బలములనన్నింటి నుగ్రబాణాసారం
బుల ముంచికొంచు వచ్చెం
దలర సురాధీశుఁ డార్వఁ దారకుఁ డెలమిన్ 11

**అర్థము** సుర + అధి + ఈశుఁడు = దేవాధిపతి - ఇంద్రుఁడు, తలరన్= కంపింపఁగా, తారకుడు, ఎలమిన్ = సంతోషముతో, ఆర్వన్, ప్రళయ + అభ్ర-రసము - నాన్ = ప్రళయకాలమేఘముల జలమో యనునట్లు, సుర - బలములన్+ అన్నింటిన్ = దేవ సైన్యములనన్నింటిని, ఉగ్ర - బాణ + ఆసారంబులన్ = భయంకరములయిన బాణములనెడి జడివానలందు, ముంచికొంచున్, వచ్చెన్, పై గద్యమునందలి కుంజరాక్షుఁడు కర్త

**తాత్పర్యము .** కుంజరాక్షుఁడు - ఇంద్రుఁడు చలింపఁగను, తారకుఁడు సంతోషముతో నార్వఁగను దేవసైన్యములనన్నింటిని జడివానలందు ముంచికొనుచు వచ్చెను

**విశేషములు :** అలంకారము రూపకానుప్రాణితోత్ప్రేక్ష

వ తదవసరంబున నీశానుండు విలయకాలస్వరూపుండగు నీశానుండు నుంబోలెఁ గోపానలోద్దీపితాంతరంగుండై విజృంభించి 12

**అర్థము :** తద్ + అవసరంబునన్, ఈశానుండు = ఈశాన్యదిక్పాలకుఁడు, విలయకాలస్వరూపుండు + అగు + ఈశానుండునున్ + పోలెన్ =ప్రళయకాలస్వరూపుఁడైన యీశ్వరునివలె, కోప + అనల + ఉత్ + దీపిత + అంతరంగుండు + ఐ = కోపమనెడి అగ్నిచేత మిక్కిలి మండింపఁబడిన మనస్సుగలవాఁడయి, విజృంభించి

**తాత్పర్యము .** ఆ సమయమున ఈశాన్యదిగధిపతియగు ఈశానుఁడు ప్రళయకాలస్వరూపుఁడగు ఈశ్వరునివలెఁ గోపమనెడి అగ్నిచే మిక్కిలి మండింపఁబడిన మనస్సుగలవాఁడై విజృంభించి - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు :** అలంకార ముత్ప్రేక్ష - రూపకము

క రాక్షసబలములకెల్ల మ
హాక్షోభముగా భయంకరాకారుండై
యాక్షేపముతోడ విరూ
పాక్షుఁడు కోపించి కుంజరాక్షునిఁ దాఁకెన్ 13

**అర్థము** విరూప + అక్షుఁడు = ముక్కంటి - ఈశానుఁడు, రాక్షస - బలములకున్ + ఎల్లన్, మహత్ (మహా) + క్షోభము + కాన్ = గొప్పకలఁతకాఁగా, భయంకర + ఆకారుండు + ఐ = భయము గలిగించు రూపము గలవాఁడయి, ఆక్షేపముతోడన్ = ఆదల్పుతో, కోపించి, కుంజరాక్షునిన్, తాఁకెన్

**తాత్పర్యము** విరూపాక్షుఁడు - ముక్కంటి - ఈశానుఁడు రాక్షసబలములకెల్ల మహాక్షోభము గలుగునట్లు భయంకరాకారుఁడై అదల్పుతోఁ గోపించి కుంజరాక్షునిఁ దాఁకెను

**వ** ఇ ట్లతిభయంకరాకారంబునం బఱతెంచు కులాచలంబునకు మార్కొను దంభోలియుంబోలెఁ గుంజరాక్షునకు ననలాక్షుండు మార్కొని 14

**అర్థము.** ఇట్లు, అతి -భయంకర + ఆకారంబునన్ = భయము గలిగించు రూపముతో, పఱతెంచు = పాటివచ్చు, కుల + అచలంబునకున్ = కులపర్వతమునకు, మార్కొను = ఎదురుకొను, దంభోలియున్ + పోలెన్ = వజ్రాయుధమువలె, కుంజరాక్షునకున్, అనల + అక్షుండు = ఈశానుఁడు, మార్కొని

**తాత్పర్యము .** ఇట్లు మిక్కిలి భయంకరమైన రూపముతోఁబాటివచ్చు కులపర్వతముతో మార్కొను వజ్రాయుధమువలెఁ గుంజరాక్షునితో నీశానుఁడు మార్కొని - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు** అలంకారము ఉపమ కులాచలంబునకు మార్కొను 'షష్ఠీ స్థానికంబగు కువర్ణకం బొక్కొకచో ద్వితీయాదివిభక్తులకు మాఱుగాఁ దత్తదర్థంబులం జూపట్టెడి ' ప్రౌఢ కారక 13 ఇచ్చటఁ దృతీయార్థమునఁ గువర్ణకమయినది

**ఉ** **ఏసిన బాణముల్ విఱుగ నేసియు, వైచిన శక్తులన్నియుం**
**బాసిచనంగఁ దప్పియును, బాహుబలోన్నతి వచ్చి బల్విడిన్**
**వ్రేసియు, మండలాగ్రములు, పీకునఁ దాఁకియుఁ బోరి రాజి దే**
**వాసురవీరు లార్వ సమమై విషమాక్షుఁడుఁ గుంజరాక్షుఁడున్.** 15

**అర్థము .** ఏసిన - బాణముల్ = ప్రయోగించిన బాణములు, విఱుగన్ + ఏసియున్ = విఱుగునట్లు ప్రయోగించియును, వైచిన = ప్రయోగించిన, శక్తులు + అన్నియున్, పాసి - చనంగన్ + తప్పియును = వీడిపోయి వ్యర్థమయియును,

బాహు - బల + ఉన్నతిన్ = భుజబలముయొక్క ఔన్నత్యముతో, వచ్చి, బల్మిడిన్ = శౌర్యముతో, మండలాగ్రములు = ఖడ్గములు, వ్రేసియున్ = ప్రయోగించియును, వీకునన్ = పరాక్రమముతో, తాఁకియున్, ఆజిన్ = యుద్ధమునందు, దేవ + అసుర - వీరులు = దేవ రాక్షసవీరులు, ఆర్వన్ = ఆర్వఁగా, విషమాక్షుఁడును = ఈశానుఁడును, కుంజరాక్షుఁడున్, సమము + ఐ = సమానమయి

**తాత్పర్యము** ఒకఁడు ప్రయోగించిన బాణములు ఇంకొకఁడు విఱుగఁగొట్టియు, ప్రయోగించిన శక్తులన్నియును వొలఁగి వ్యర్థమయియును, భుజ పరాక్రమౌన్నత్యముతో వచ్చి శౌర్యముతో ఖడ్గములు ప్రయోగించియును, పరాక్రమముతోఁ దాఁకియు, దేవరాక్షసవీరులు ఆర్వఁగా, ఈశానకుంజరాక్షులు సమానముగా యుద్ధమునఁ బోరిరి

**వ ఇట్లు సమ బలపరాక్రమాయుధవిద్యాపరిణతులై పెద్ద ప్రొద్దు మహాయుద్ధంబు సేసి కోపావేశంబునం గుంజరాక్షుండు దావగొనక విరూపాక్షుం బట్టుకొనఁదలంచి పయికి లంఘించినం గని యీశానుం డీశానదత్త మహాత్రిశూలాయుధంబెత్తి మీఁదికి మీఁదఁ గుంజరాక్షుబంధురకంధరం బిరుమై నుచ్చిపోవం బొడిచి యెత్తిన.** **16**

**అర్థము :** ఇట్లు, సమ - బల - పరాక్రమ -+ ఆయుధ - విద్యా - పరిణతులు + ఐ = సమానమయిన బలపరాక్రమములు, ఆయుధవిద్యా పరిపాకములు గలవారయి, పెద్ద - ప్రొద్దు = చాలసేపు, మహత్ (మహా) + యుద్ధంబు, చేసి, కోప + ఆవేశంబునన్ = కోపోద్రేకముతో, కుంజరాక్షుండు, తావగొనక = నిలువక, విరూపాక్షున్ = ఈశానుని, పట్టుకొనన్ + తలంచి, పయికిన్, లంఘించినన్ = దూఁకఁగా, కని, ఈశానుండు, ఈశాన - దత్త - మహత్ (మహా) + త్రిశూల + ఆయుధంబు = ఈశ్వరునిచే నీఁబడిన మహా త్రిశూలాయుధమును, ఎత్తి, మీఁదికిన్ - మీఁదన్ = పై పయికి, కుంజరాక్షు - బంధుర - కంధరంబు = కుంజరాక్షుని యొక్క విషమమైన మెడ, ఇరుమైన్ = రెండు ప్రక్కలను, ఉచ్చిపోవన్ = దూసికొనిపోవునట్లు, పొడిచి, ఎత్తినన్

**తాత్పర్యము :** ఇట్లు సమానమైన బలపరాక్రమములు, ఆయుధ విద్యా పరిపాకములు గలవారయి చాలసేపు మహాయుద్ధము చేసి కోపావేశముతోఁ గుంజరాక్షుఁడు నిలువక ఈశానునిఁ బట్టుకొననెంచి మీఁదికి దుముకఁగాఁ జూచి ఈశానుఁడు ఈశ్వరదత్తమైన మహాత్రిశూలాయధమునెత్తి పయిపయికిఁ

గుంజరాక్షుని విషమమైన కంఠమును రెండువైపుల దూసికొనిపోవునట్లు పొడిచి ఎత్తఁగా - తరువాతి పద్యముతో నన్వయము

క **వినుతారుణ జల విగళిత**
**ఘన మనఁ గ్రొన్నెత్తు రొలుకఁగా శూలాగ్రం**
**బునఁ దగిలి తూలుచుండెను**
**దనుజుం డీశాను జయపతాకయుఁబోలెన్** 17

**అర్థము** వినుత + అరుణ - జల - విగళిత - ఘనము = పొగడఁబడిన ఎఱ్ఱని నీరు కార్చిన మేఘము, అనన్ = అనఁగా, క్రొన్నెత్తురు (క్రొత్త + నెత్తురు) ఒలుకఁగాన్ = కాఱుచుండఁగా, దనుజుండు = రాక్షసుఁడు - కుంజరాక్షుఁడు, శూల + అగ్రంబునన్ = శూలముకొనను, తగిలి = తగులుకొని, ఈశాను - జయపతాకయున్ + పోలెన్ = ఈశానుని విజయధ్వజమువలె, తూలుచున్ + ఉండెను = చలించుచుండెను

**తాత్పర్యము .** ఎఱ్ఱనినీటిని గార్చు మేఘమోయనఁ గ్రొన్నెత్తురు కాఱుచుండఁగా రాక్షసుఁడు - కుంజరాక్షుఁడు శూలముకొనను దగులుకొని ఈశానుని విజయధ్వజమోయనఁ జలించుచుండెను

**విశేషములు** అలంకారము ఉత్ప్రేక్ష క్రొన్నెత్తురు (క్రొత్త + నెత్తురు) ప్రాఁతాది సూత్రము(బాల సంధి 36) చే క్రొ + నెత్తురు (బాల సంధి 38)చే క్రొన్నెత్తురు

చ **అనిమొనఁ గుంజరాక్షుఁ డసమాక్షు నమర్షరసాంబురాశిలో**
**మునుఁగుట చూచి దైత్యబలముల్ తమ కెందును బొందులేక క**
**న్కనిఁ జనమన్నచో సమరఘస్మరుఁ డోడకుఁడంచు వచ్చి కై**
**కొనియె మహోగ్రదంష్ట్రుఁ డతికోపనుఁ డాహవదోహలంబునన్** 18

**అర్థము .** అని - మొనన్ = యుద్ధాగ్రమునందు, కుంజరాక్షుఁడు, అసమ + అక్ష = ఈశానుని యొక్క, అమర్ష - రస + అంబు రాశిలోన్ = కోపరసమనెడి సముద్రమునందు, మునుఁగుట, చూచి, దైత్యబలమున్= రాక్షససేనలు, తమకున్, ఎందును, పొందు - లేక = ఆశ్రయములేక, కన్కనిన్ = సంభ్రమముతో, చనన్+ ఉన్నచోన్ = పోవనుండఁగా, అమర - ఘస్మరుఁడు = దేవతలను దినువాఁడు - రాక్షసుఁడు - అతి - కోపనుఁడు = మిక్కిలి కోపముగలవాఁడు - అగు - మహత్

(మహా) + ఉగ్ర - దంష్ట్రుఁడు = ఉగ్రదంష్ట్రుఁడు, ఆహవ-దోహాలంబునన్ = యుద్ధోత్సాహముతో, ఓడకుఁడు + అంచున్ = భయపడకుఁడు, అనుచు, వచ్చి, కైకొనియెన్ = స్వీకరించెను

**తాత్పర్యము :** యుద్ధమునందుఁ గుంజరాక్షుఁడు ఈశానుని కోపరససముద్రములో మునుగుఁట చూచి రాక్షససైన్యములు తమ కెందును ఆశ్రయములేక సంభ్రమముతోఁ బోవనుండఁగా, అమరఘస్మరుఁడును, అతి కోపనుఁడును అగు ఉగ్రదంష్ట్రుఁడు యుద్ధోత్సాహముతో భయపడకుఁడనుచు వచ్చి స్వీకరించెను

**విశేషములు** అలంకారము రూపకము

**వ ఇ ట్లసురబలంబులంగైకొని సురబలంబులం బడల్పడ నెగుచుచు నీశానుపై నురలం బఱతెంచు నుగ్రదంష్ట్రుంగని 'పగ చొప్పడియె' ననుచు నెడసొచ్చి ధననాథుండు దనుజనాథునకుం బ్రతిఘటించి నిలిచినం గుబేరారి కోపహాసవిలసితాననుండగుచు 19**

**అర్థము .** ఇట్లు, అసుర - బలంబులన్ = రాక్షససేనలను, కైకొని = స్వీకరించి, సుర - బలంబులన్ = దైవసైన్యములను, బడల్పడన్ = బడలుపడునట్లు - శ్రమము పొందునట్లు, ఎగుచుచున్ = తఱుముచు, ఈశానుపైన్, ఉరలన్ + పఱతెంచు = దండెత్తవచ్చు, ఉగ్రదంష్ట్రున్ = ఉగ్రదంష్ట్రుఁ డను రాక్షసవీరుని, కని, పగ - చొప్పడియెన్ = విరోధి చిక్కెను, అనుచున్, ఎడ+చొచ్చి = నడుమవచ్చి, ధననాథుండు = కుబేరుఁడు, దనుజ - నాథునకున్ = రాక్షసరాజునకు - ఉగ్రదంష్ట్రునకు, ప్రతిఘటించి = ఎదిరి, నిలిచినన్, కుబేర + అరి = కుబేర శత్రువు - ఉగ్రదంష్ట్రుఁడు, కోప - హాస - విలసిత + ఆననుండు + అగుచున్ = కోపముచేతను, నవ్వుచేతను బ్రకాశించు ముఖము గలవాఁడు అగుచు

**తాత్పర్యము :** ఇట్లు రాక్షససైన్యములను స్వీకరించి దేవసైన్యములను శ్రమపడునట్లు తఱుముచు, ఈశానుపై నెత్తివచ్చు ఉగ్రదంష్ట్రునిం జూచి 'విరోధి చిక్కె' ననుచు నడుమవచ్చి కుబేరుఁడు, రాక్షసరాజయిన ఉగ్రదంష్ట్రు నెదిరించి నిలువఁగాఁ గుబేరశత్రువగు నుగ్రదంష్ట్రుఁడు కోపహాసములచేఁ బ్రకాశించు ముఖము గలవాఁడగుచు - తరువాతి పద్యముతో నన్వయము

## కుబేరోగ్రదంష్ట్రులు యుద్ధము

క కనువడి నీవును బోటరి
వనియే దానవులఁ జెనసె దౌనౌ నీ పో
టును జూతము రమ్మా యని
ధననాథు నదల్చి యుగ్రదంష్ట్రుఁడు తాఁకెన్ 20

**అర్థము** కనువడి = ఎదుటఁబడి, నీవును, పోటరివి = వీరుఁడవు, అనియే, దానవులన్ = రాక్షసులను, చెనసెదు = మార్కొందువు, ఔన్ + ఔన్ = అవునవును, నీ - పోటును, చూతము, రమ్మా, అని ఉగ్రదంష్ట్రుఁడు, ధననాథున్ = కుబేరుని, అదల్చి = బెదరించి, తాఁకెన్

**తాత్పర్యము** ఎదుటఁబడి 'నీవును ఒక పోటరిననియే రాక్షసుల నెదిరించెదవు ఔనౌను ! ఏదీ నీ పోటును జూతమురమ్మా' యని యుగ్రదంష్ట్రుఁడు కుబేరుని బెదరించి ఎదిరించెను

**విశేషములు** చూతము - చూచు ధాతువు 'తద్ధర్మాదులందు లాట్టగు' బాల క్రి 5 చూచు + లాట్ 'లకారంబునకు డుఁబువురునుము ఙ్గగు' బాల క్రి 8 చూచు + ము 'లాట్టు రుఙ్ణ పరంబగునపుడు దుగాగమంబగు' బాల క్రి 22 చూచు + దు + ము 'ఉభయప్రార్థనంబున దుగాగమంబున కత్వంబగు' బాల క్రి 30 చూచు + ద + ము 'చువర్ణంబుతోడ దుగ్దకారంబు తకారంబగు' బాల క్రి 108 చూతము

వ ఇట్లు ముట్ట మూదలించి తాఁకిన ముష్టిన నిలింపబలజలధి నిజాయుధానేకజలచరాకీర్ణంబు సేయుచుఁ దన్నుఁ గైకొనక బాహుబల గర్వంబున నురవడించి 21.

**అర్థము.** ఇట్లు, ముట్ట మూదలించి = తాఁకునట్లు ఎత్తిపొడుపు మాటలాడి, తాఁకిన -ముష్టిన్ + అ = తాఁకిన వెంబడి, నిలింప - బల - జలధి = దేవతల సైన్యమనెడి సముద్రము, నిజ + ఆయుధ + అనేక - జలచర + ఆకీర్ణంబు = తమ ఆయుధములనెడి జలచరములచే వ్యాప్తమయినది, చేయుచున్, తన్నున్, కైకొనక = లక్ష్యపెట్టక, బాహు-బల-గర్వంబునన్ = భుజపరాక్రమము వలని గర్వముచే, ఉరవడించి = రేఁగి

**తాత్పర్యము.** ఇట్లు తాఁకునట్లు ఎత్తిపొడుపుమాటలాడి తాఁకిన వెంబడి దేవతల సేన యను సముద్రము తమ ఆయుధములనెడి పెక్కు జలచరములచే

వ్యాపించినదిగాఁ జేయుచుఁ దన్ను లక్ష్యపెట్టక బాహుబలగర్వమున విజృంభించి - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** అలంకారము రూపకము

తే బలిమిఁ దోతెంచు దానవబలముతోన
రాజరా జొక్క ముష్టిన రథము విఱుగ
నేసి రయమున వెండియు నేసె వాని
వింటి తోడన తారకు వెన్ను విఱుగ 22

**అర్థము .** రాజరాజు = కుబేరుఁడు, బలిమిన్ = బలముతో, తోతెంచు = వచ్చు, దానవ - బలముతోన్ + అ = దానవుని సైన్యముతోనే, ఒక్కముష్టిన్ + అ = వెంటనే, రథమున్, విఱుగన్ + ఏసి = విఱుగఁగొట్టి, రయమునన్ = శీఘ్రముగా, వాని - వింటి - తోడన్ + అ = వాని వింటితోపాటే, తారకు - వెన్ను, విఱుగన్, వెండియున్ = మరల, ఏసెన్

**తాత్పర్యము .** కుబేరుఁడు పరాక్రమముతో వచ్చు రాక్షససైన్యముతోనే వెంటనే రథమును విఱుగఁగొట్టి వేగముగా వానివింటితోపాటే తారకుని వెన్ను విఱుగఁగొట్టెను

క ధనదుండు విల్లు దెగ నే
సిన గదగొని వ్రేయ నసుర చెచ్చెర వచ్చెం
జనునెడ ధర్మవిహీనుఁడు
ధనపతి దండహతుఁజేయఁదలఁపకయున్నే ? 23

**అర్థము :** ధనదుండు = కుబేరుఁడు, విల్లు, తెగన్ + ఏసినన్ = తెగఁగొట్టఁగా, అసుర = రాక్షసుఁడు, గద + కొని = గదను దీసికొని, వ్రేయన్ = కొట్టుటకు, చెచ్చెరన్ = శీఘ్రముగా, వచ్చెన్, చను + ఎడన్ = పోవునప్పుడు, (?), ధర్మ-విహీనుఁడు = విల్లులేనివాఁడు, ధర్మములేనివాఁడు - అధర్మపరుఁడు, ధనపతిన్ = కుబేరుని, కోశాధ్యక్షుని, దండ-హతున్ = కఱ్ఱచేఁగొట్టఁబడిన వానినిగా, చేయన్ + తలఁపక + ఉన్నే ? = చేయనెంచకుండునా?

**తాత్పర్యము .** కుబేరుఁడు విల్లు తెగఁగొట్టఁగా, రాక్షసుఁడు గదను గైకొని శీఘ్రముగా వచ్చెను ధర్మవిహీనుఁడు - విల్లు లేనివాఁడు, అధర్మపరుఁడు, ధనపతిని - కుబేరుని, కోశాధ్యక్షుని దండముతోఁ గొట్ట నెంచకుండునా?

**విశేషములు .** అలంకారము అర్థాంతరన్యాసము, శ్లేషానుప్రాణితము

వ ఇ ట్లకాండ బ్రహ్మాండ ఖండలయ దండంబునుం బోలె రోదసీ కుహరాంతరాపూరితోన్నతశరీరుండై ప్రళయ నిర్ఘాతంబునుం బోలె దిగంతరాళంబు చెలంగ నదల్చుచు 24

**అర్థము** ఇట్లు, అకాండ - బ్రహ్మాండ - ఖండ - లయ - దండంబునున్+ పోలెన్ = ఆకస్మికమైన బ్రహ్మాండభాగనాశనమునకైన దండమువలె, రోదసీ-కుహర + అంతర + ఆపూరిత + ఉన్నత - శరీరుండు + ఐ = గుహవంటి భూమ్యాకాశమధ్యభాగమునం దంతట నింపఁబడిన ఎత్తయిన శరీరముగల వాఁడయి, ప్రళయ - నిర్ఘాతంబునున్ + పోలెన్ = ప్రళయ సమయమునందలి పిడుగువలె, దిశ్(క్) + అంతరాళంబు = దిక్కుల నడిమిభాగము, చెలంగన్= ప్రతిధ్వనింపఁగా, అదల్చుచున్ = భయపెట్టుచు

**తాత్పర్యము** ఇట్లు, ఆకస్మికమైన బ్రహ్మాండనాశకదండమువలె భూమ్యాకాశమధ్య ప్రదేశమంతయు నిండిన శరీరము గలవాఁడయి ప్రళయకాలపుఁ బిడుగువలె దిఙ్మధ్యభాగము మాఱుమ్రోయ నదలించుచు - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు** అలంకార ముత్ప్రేక్ష, ఉపమ

క గదగొని పోరికి మది నం
గద గొని చనుదెంచువానిఁగని ధనపతి బి
ట్టదరిపడ వేసె దానవుఁ
డుదరిపడన్ ధాత్రి దనుజు లుల్లల నుడుకన్ 25

**అర్థము.** గద + కొని, పోరికిన్ = యుద్ధమునకు, మదిన్ = మనస్సునందు, అంగద + కొని = ఆఁకలిగొని, చనుదెంచువానిన్ = వచ్చువానిని, కని, ధనపతి = కుబేరుఁడు, బిట్టు = మిక్కిలి, అదరిపడన్ = ఎగిరిపడఁగా, దానవుఁడు = రాక్షసుఁడు, ఉదరిపడన్ = భయపడఁగా, ధాత్రిన్ = భూమియందు, దనుజులు = రాక్షసులు, ఉల్లలన్ + ఉడుకన్ = ఉల్లలమని పరితపింపఁగా, ఏసెన్ = కొట్టెను

**తాత్పర్యము** గదనుగైకొని యుద్ధమునకు ఆఁకటితోవచ్చు రాక్షసునిఁ జూచి కుబేరుఁడు మిక్కిలి ఎగిరిపడఁగా, రాక్షసుఁ డదరిపడఁగా, భూమిని రాక్షసులు ఉల్లలమని పరితపింపఁగాఁ గొట్టెను .

వ ఇ ట్లయ్యుగ్రదంష్ట్రు నంగవల్లి సంగరరంగాంగణంబునకు రంగవల్లియైన నాక్షణంబ 26

**అర్థము :** ఇట్లు, ఆ + ఉగ్రదంష్ట్రు + అంగ-వల్లి = ఆ ఉగ్రదంష్ట్రుని తీఁగవంటి శరీరము, సంగర - రంగ + అంగణంబునకున్ = యుద్ధభూమి ముంగిటికి, రంగ-వల్లి = ముగ్గు, ఐనన్ = కాఁగా, ఆ - క్షణంబు + అ = వెంటనే

**తాత్పర్యము .** ఇట్లు ఆ ఉగ్రదంష్ట్రుని మైఁదీఁగ యుద్ధభూమి ముంగిటికి ముగ్గుకాఁగా ఆక్షణమే - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** అలంకారము రూపకము

**పవన సందారకుల యుద్ధము**

సీ తారకసుతుఁడు మందారకుండను మహా
వీరుఁడు గసి వెస వేయుఁగోటు
లుత్తుంగ మాతంగ యూధాలితో సుర
వాహినిలో నవగాహమనుపఁ
జనుదెంచుగతి నిజసామజవ్రజపాద
తలహతి ధారుణీతలము గోడి
వడ నెత్తివచ్చి మార్బలముల నురువడి
ముప్పిరివడఁదోలి కప్పికొనుచు

ఆ గాత్ర వాల దంత చిత్రాదివధల సం
యోగవధలఁ జంపుచుండె నుగ్ర
యోధవరులు కురిసి రురువడి శస్త్రాస్త్ర
వృష్టి నమరవరులు వీకు దలఁక 27

**అర్థము:**తారక - సుతుఁడు = తారకుని కొడుకు, (అగు) మందారకుండు, అను, మహత్ (మహా) + వీరుఁడు = గొప్పవీరుఁడు, కసిన్ = పగతో, వెసన్ = శీఘ్రముగా, వేయు + కోటులు = వేయి కోటులు, ఉత్తుంగ = మిక్కిలి యెత్తయిన, మాతంగ - యూధ + ఆలితోన్ = ఏనుఁగుల గుంపుల వరుసతో, సుర - వాహినిలోన్ = దేవసేనలో - గంగానదిలో, అవగాహము + అనుపన్ = ప్రవేశపెట్టింప స్నానము చేయింప - చనుదెంచు - గతిన్ = వచ్చు విధమున

నిజ - సామజ - వ్రజ - పాద - తల - హతిన్ = తన ఏనుఁగుల గుంపుయొక్క అడుగుల దెబ్బచే, ధారుణీ - తలము = భూతలము, గోడి + పడన్ = ఒకప్రక్క క్రిందికొఱగి రెండవ ప్రక్క పైకి లేచునట్లు, ఎత్తి-వచ్చి = దండెత్తివచ్చి,

మార్బలములన్ = శత్రుసైన్యములను, ఉరువడిన్ = మిక్కిలి వేగముతో, ముప్పిరి + పడన్ = మూఁడు పిరులుగాఁ బెనఁగొనునట్లు, తోలి, కప్పికొనుచున్ = ఆక్రమించుచు,

గాత్ర - వాల - దంత - చిత్ర + ఆది - వధలన్ = గాత్ర వధ, వాలవధ, దంతవధ, చిత్రవధ మున్నగు వధల చేతను, సంయోగ - వధలన్ = అన్నియుఁ గూడిన వధలతోను, చంపుచున్ + ఉండెన్, అమర - వరులు = దేవతాశ్రేష్ఠులు, వీకు = ఔద్ధత్యము, తఱఁకన్ = నశింపఁగా, ఉగ్ర - యోధ - వరులు = భయంకరులైన యోధశ్రేష్ఠులు, ఉరువడిన్ = మిక్కిలి వేగముతో, శస్త్ర + అస్త్ర - వృష్టిన్ = శస్త్రములయు అస్త్రములయు వర్షమును, కురిసిరి = కురియించిరి

**తాత్పర్యము** తారకుని కొడుకగు మందారకుఁడను మహావీరుఁడు కసితో శీఘ్రముగా వేయికోటుల మిక్కిలి యెత్తయిన ఏనుఁగుల గుంపులతో సురవాహినియందు - దేవసేనలో - గంగానదిలో స్నానము చేయింప వచ్చు విధమునఁ దన యేనుఁగుల అడుగుల త్రొక్కిడిచే భూతలము ఒక్కప్రక్క కొఱగఁగా, దండెత్తివచ్చి, శత్రుసైన్యమును మిక్కిలి వేగముతో ముప్పిరివడునట్లు తోలి ఆక్రమించుచు గాత్ర వాల దంత చిత్రాది వధలతోను, సంయోగవధలతోను జంపుచుండెను దేవశ్రేష్ఠులు ఔద్ధత్యము గోలుపోవ భయంకరయోధశ్రేష్ఠులు మిక్కిలి వేగముతో శస్త్రాస్త్రవర్షము కురియించిరి

**విశేషములు**: సురవాహినిలో - శ్లిష్ట రూపకము, అతిశయోక్తి ఉత్ప్రేక్ష

**వ ఇట్లు దేవబలంబు హల్లకల్లోలంబుగాఁ జంపుచు వచ్చుచున్నంగని కోపించి 28**

**అర్థము:** ఇట్లు, దేవ - బలంబున్ = దేవ సైన్యమును, హల్లకల్లోలంబుగాన్ = సంక్షుభితమగునట్లు, చంపుచున్, వచ్చుచున్ + ఉన్నన్, కని, కోపించి

**తాత్పర్యము** . ఇట్లు దేవసేనను సంక్షుభితమగునట్లు చంపుచు వచ్చుచుండఁగాఁ జూచి కోపించి - తరువాతి పద్యముతో నన్వయము

క అతివేగంబున నరికరి
తతి నెక్కటిఁ దాఁకె భూరి దారుణ బల ద
ర్పితుఁడై పవనుఁడు లయ మా
రుతము కులాచలములం దిరుగవీచు క్రియన్ 29

**అర్థము** పవనుఁడు = వాయువు, లయ - మారుతము = ప్రళయ సమయవాయువు,కుల + అచలములన్ = కులపర్వతములను, తిరుగన్ = తిరుగునట్లు, వీచు -క్రియన్ = వీచు విధమున, భూరి - దారుణ - బల - దర్పితుఁడు + ఐ = అధికము, భయంకరమునైన పరాక్రమముచే గర్వించినవాఁడయి, అతి-వేగంబునన్= మిక్కిలి వేగముతో, అరి-కరి-తతిన్= శత్రుగజసమూహమును, ఎక్కటిన్ = ఒంటరిగా, తాఁకెన్

**తాత్పర్యము .** వాయువు - ప్రళయానిలము కులపర్వతములను దిరుగునట్లు వీచు విధమున మిక్కిలి భయంకరమైన బలముచే గర్వించినవాఁడయి మిక్కిలి వేగముతో శత్రుగజసమూహమును ఒంటరిగాఁ దాఁకెను

**విశేషములు .** అలంకార ముపమ

క వీచియు నొత్తియు నెత్తియుఁ
ద్రోచియుఁ జఱచియును ద్రిప్పి తూలిపడంగా
వైచియు గజయూథంబులఁ
బాచియుఁ బవనుండు చంపెఁ బ్రతిగజబలమున్ 30

**అర్థము :** పవనుండు = వాయువు, వీచియున్, ఒత్తియున్, ఎత్తియున్, త్రోచియున్, చఱచియును, త్రిప్పి, తూలిపడంగాన్= కదలిపడునట్లు, వైచియున్, గజ - యూథంబులన్= ఏనుఁగుల గుంపులను పాచియున్, = తొలఁగించియు, ప్రతి - గజ - బలమున్ = శత్రు గజసైన్యమును, చంపెన్

**తాత్పర్యము.** వాయుదేవుఁడు వీచియు, ఒత్తియు, ఎత్తియుఁ, ద్రోచియుఁ, జఱచియును, ద్రిప్పి, తూలిపడునట్లు వైచియు, ఏనుఁగుల గుంపులను దొలఁగించియు శత్రువుల గజసైన్యమును జంపెను

వ ఇట్లనేకప్రకారంబుల భంజించు మహాప్రభంజనహతికిఁ గుంజరఘట లబ్బగింపక 31

అర్థము ఇట్లు, అనేక - ప్రకారంబులన్, భంజించు = సంహరించు, మహత్ (మహా) + ప్రభంజన - హతికిన్ = పెద్దగాలిదెబ్బకు, కుంజర - ఘటలు = ఏనుఁగుల గుంపులు, అబ్బగింపక = తాళలేక

**తాత్పర్యము** ఇట్లు పెక్కురీతుల భంగపఱుచు పెనుగాలిదెబ్బకు ఏనుఁగుల గుంపు తాళలెక - తరువాతి పద్యముతో నన్వయము

**తే** ధార కులికెడు మదజలధార లుడిగి
**గర్జ**సెడి పుట్టుఁబొడ వెందుఁ గానకుండ
**మారుతాహతి నిలువక పోర నభ్ర**
**పటలి గతిఁ దూలి మదకరిఘటలు పాఱె** 32

**అర్థము** ధార = ప్రవాహము, కులికెడు = ఒప్పునట్టి, మద - జల - ధారలు = మదజల ప్రవాహములు, ఉడిగి = పోయి, గర్జ = ఘీంకృతి, చెడి = నశించి, పుట్టున్ + పొడవు = పుట్టుకయు, రూపు, ఎందున్, కానక +ఉండన్ = కనరాకుండ, మద - కరి-ఘటలు = మదగజసమూహములు, మారుత + ఆహతిన్ = వాయువు దెబ్బచే, పోరన్ = యుద్ధమునందు, నిలువక, అభ్ర-పటలి - గతిన్ = మేఘముల గుంపు విధమున, తూలి = చలించి, పాఱెన్ = పరువెత్తెను

**తాత్పర్యము.** ధార ఒప్పునట్టి మదజల ప్రవాహములు పోయి, ఘీంకారము నశించి పుట్టుక, రూపము ఎందును గనరాకుండ మత్తేభసమూహములు వాయు దేవుని దెబ్బచే యుద్ధరంగమున నిలువక మేఘసమూహమువలెఁ బరువెత్తెను

**విశేషములు .** అలంకార ముపమ

**వ** **అంత మందారుండు కోమల మందార మహీరుహంబునుంబోలెం బ్రచండానిలాహతి నిహతుండైనం గని కోపించి.** 33

**అర్థము.** అంతన్, మందారుండు, కోమల - మందార - మహీరుహంబునున్ + పోలెన్ = లేఁత మందార వృక్షమువలె, ప్రచండ + అనిల + ఆహతిన్ = తీవ్రమయిన వాయువు దెబ్బచే, నిహతుండు = చచ్చినవాఁడు, ఐనన్, కని, కోపించి

**తాత్పర్యము .** అంత మందారుఁడు లేఁత మందార వృక్షము విధమునఁ దీవ్ర వాయు హతిచేఁ జచ్చినం జూచి కోపించి - తరువాతిపద్యముతో నన్వయము

**విశేషములు** .అలంకార ముపమ

ఉ ఆహవదోహలుండు సుభటాగ్రణి దానవసేన కెల్ల ను
త్సాహము కాఁగఁ బేర్చి నిజ సామజ వాజి వరూధ పత్తి సం
దోహముతో నవార్యరణతూర్యము లొక్కట మ్రోయఁగా మహా
బాహుఁడు వచ్చి తాఁకె సురపాలవరూధిని పల్లటిల్లఁగాన్ 34

**అర్థము** . ఆహవ - దోహలుండు = యుద్ధోత్సాహము గలవాఁడు, సుభట + అగ్రణి = వీరాగ్రేసరుఁడు (అగు), మహాబాహుఁడు = మహాబాహుఁ డను పేరుగలవాఁడు, దానవ - సేనకున్ + ఎల్లన్ = రాక్షససేన కంతకును, ఉత్సాహము, కాఁగన్ = అగునట్లు, పేర్చి = విజృంభించి, నిజ - సామజ - వాజి - వరూధ - పత్తి - సందోహముతోన్ = తనవైన ఏనుఁగుల, గుఱ్ఱముల, రధముల, కాల్బంటుల సమూహముతో, అవార్య - రణ - తూర్యములు = వారింపరాని యుద్ధ వాద్యములు, మ్రోయన్ = ధ్వనింపఁగా, సుర - పాల - వరూధిని - ఇంద్రుని సేన, పల్లటిల్లఁగాన్ = చలింపఁగా, వచ్చి, తాఁకెన్

**తాత్పర్యము** . యుద్ధోత్సాహము గలవాఁడును, వీరాగ్రేసరుఁడును అగు మహాబాహుఁడు రాక్షససేనకంతకును ఉత్సాహము గలుగ విజృంభించి తన గజతురగరధపదాతి వర్గముతో యుద్ధవాద్యములు మ్రోయుచుండ, ఇంద్రుని సేన చలింపఁగా వచ్చి తాఁకెను

**విశేషములు** :పంక్తికి బదులుగా పత్తియనునది రా అ శర్మగారి పాఠము

### వరుణ మహాబాహుల యుద్ధము

**వ ఇ ట్లమరపతాకినీకాంతారాంతరంబునం బర్వు మహాబాహు చతురంగబలదావానలంబుఁగని వరుణుం డపార వరుణాస్త్రాసారంబున నశ్రమంబున నుపశాంతింబొందించి విజృంభించి మహాబాహుం దాఁకిన 35**

**అర్థము** . ఇట్లు, అమర - పతాకినీ - కాంతార + అంతరంబునన్ = దేవసేనయను అడవిలోపల, పర్వు = వ్యాపించు, మహాబాహు = మహాబాహుని యొక్క, చతురంగ - బల - దావ + అనలంబున్ = రథ గజ తురగ పదాతి సైన్యమనెడి కార్చిచ్చును, కని, వరుణుండు, అపార - వరుణ + అస్త్ర + ఆసారంబునన్ = పారములేని వారుణాస్త్రములనెడి జడివానచే, అశ్రమంబునన్ = అనాయాసముగా, ఉపశాంతిన్ = ఉపశమమును - ఆఱుటను, పొందించి, విజృంభించి, మహాబాహున్, తాఁకినన్

**తాత్పర్యము.** ఇట్లు దేవసేనయనెడి అడవిలోపల వ్యాపించు మహాబాహుని చతురంగబలమనెడి కార్చిచ్చును జూచి వరుణుఁడు అపారవారుణాస్త్రములనెడు జడివానచే అనాయాసముగా ఆర్పివైచి విజృంభించి మహాబాహుని దాఁకఁగా - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** అలంకారము రూపకము

క **ఆహవభూమి సురాసుర**
**వాహిను లొగిఁ దగిలి పొగడ వరుణుండు మహా**
**బాహుఁడుఁ దాఁకిరి పటు సమ**
**బాహుపరాక్రములు విశ్వభయజనకముగాన్** 36

**అర్థము** ఆహవ - భూమిన్ = యుద్ధభూమియందు, సుర + అసుర - వాహినులు = దేవతల రాక్షసుల సేనలు, ఒగిన్ = క్రమముగా, తగిలి = ఆసక్తి వహించి, పొగడన్ = పొగడఁగా, పటు -సమ - బాహు - పరాక్రములు = తీవ్రమయిన సమానమైన భుజపరాక్రమము గలవారు, (అగు), వరుణుండున్, మహాబాహుఁడున్ = వరుణ మహాబాహులు, విశ్వ - భయ - జనకము + కాన్ = లోకభీకరముగా, తాఁకిరి

**తాత్పర్యము .** యుద్ధభూమిలో దేవరాక్షససేనలు క్రమముగా నాసక్తి వహించి పొగడఁగా, సమానమైన తీవ్ర భుజ పరాక్రమము గలవారు అగు వరుణమహాబాహులు లోకభీకరముగాఁ దాఁకిరి

వ **త దనంతరంబ = ఆ పిమ్మటనే - తరువాతి పద్యముతో నన్వయము 37**

ఆ **అలిగి వరుణుపై మహాబాహుఁడేసిన**
**యమ్ము లెల్లఁ దప్పి వమ్ములయ్యె**
**నట్ల పసిఁడియమ్ము లని నీర నేసిన**
**వారి తప్పుగాక వారి తప్పె** 38

**అర్థము :** మహాబాహుఁడు, అలిగి = కోపించి, వరుణుపైన్, ఏసిన = ప్రయోగించిన, అమ్ములు + ఎల్లన్ = బాణములన్నియు, వమ్ములు+ అయ్యెన్ = వ్యర్థములయ్యెను అట్లు + అ = అది అట్లే, పసిఁడి + అమ్ములు + అని = బంగారు

బాణములని, నీరన్ + ఏసినన్ = నీటిలోఁ బ్రయోగించినచో, వారి తప్పు + కాక = ఏసినవారి తప్పుగాక, వారి - తప్పె = నీటి తప్పా? నారి - తప్పె అనుపార మున్నది అప్పుడు - నారి - తప్పె = వింటిఅల్లె త్రాటి తప్పా?

**తాత్పర్యము** మహాబాహుఁడు కోపముతో వరుణునిపైఁ బ్రయోగించిన బాణములన్నియు వ్యర్థము లయ్యెను అది యట్లే బంగారు బాణములని నీటఁ బ్రయోగించినచో ప్రయోక్తల తప్పుగాని, నీటి తప్పా? లేక వింటిత్రాటి తప్పా?

**విశేషములు .** అలంకారము దృష్టాంతము

వ **ఇట్లు మహాబాహుండు తారకాసుర బలంబు విలయంబైనట్ల కాలాలయ నిలయుండ య్యె నంత** 39

**అర్థము .** ఇట్లు, మహాబాహుండు, తారక + అసుర - బలంబు = తారకాసురుని సైన్యము, విలయంబు + ఐన + అట్లు + అ = నాశమునొందినట్లే, కాల + ఆలయ - నిలయుడు = యముని ఆలయము నిలయముగాఁగలవాఁడు, చచ్చినవాఁడు, అయ్యెన్, అంతన్

**తాత్పర్యము .** ఇట్లు మహాబాహుఁడు తారకాసురుని సైన్యము నాశనమొందినట్లే, యముని ఆలయము నిలయముగాఁ గలవాఁడు - చచ్చినవాఁడు అయ్యెను అంత - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు** 'కలహాలయ నిలయుండు' - అను దానికి 'కాలాలయ నిలయుండు' అని రా అ కృ శర్మ గారి పాఠము

## నిర్ఋతి ఆరణి దుర్వారులతో యుద్ధము చేయుట

క **ఆరణిదుర్వారులు దు**
**ర్వార పరాక్రములు దివిజవర వారణ కం**
**ఠీరవులు వచ్చి తాఁకి ర**
**పారబలుల్ చాతురంగబలసంయుతులై.** 40

**అర్థము.** దుర్వార - పరాక్రమములు = వారింపశక్యముగాని పరాక్రమము గలవారు, దివిజ - వర - వారణ - కంఠీరవులు = దేవతాశ్రేష్ఠులనెడి ఏనుఁగులకు సింహములైనవారు, అపార - బలుల్ = పారములేని బలము గలవారు అగు, ఆరణి - దుర్వారులు = ఆరణియును, దుర్వారుఁడును, అనువారు, చాతురంగ - బల - సంయుతులు + ఐ = చతురంగబలముతోఁ గూడినవారయి, వచ్చి, తాఁకిరి

**తాత్పర్యము.** దుర్వార పరాక్రములును, దేవతాశ్రేష్ఠులనెడి ఏనుఁగులకు సింహములైనవారును, అపారబలులును, అగు ఆరణి, దుర్వారుఁడు అనువారు, చతురంగబలములతోఁ గూడి వచ్చి తాఁకిరి

**విశేషములు :** అలంకారము రూపకము

క ఆ యిరువురు బహు రాక్షస
మాయా విదులగు టెఱింగి మార్కొనుమని నా
రాయణుఁడు పంచె నిర్పతి ను
పాయజ్ఞు ననేక సమర పరిణతు నజితున్ 41

**అర్థము** ఆ + ఇరువురున్ = ఆ యిద్దఱును = ఆరణి దుర్వారులు, బహు - రాక్షస - మాయా - విదులు = పెక్కు రాక్షసమాయలు తెలిసినవారు, అగుట, ఎఱింగి, మార్కొనుము = వారి నెదురుకొనుము, అని నారాయణుఁడు = విష్ణువు, ఉపాయజ్ఞున్ = ఉపాయము తెలిసివాఁడును, అనేక - సమర - పరిణతున్= పలుయుద్ధములచే పరిపక్వత నొందిన వాఁడును, అజితున్ = జయింపఁబడనివాఁడును అగు, నిర్పతిన్, పంచెన్ = పంపెను

**తాత్పర్యము** ఆ ఆరణిదుర్వారు లను వీరు లిరువురును పలు రాక్షస మాయ లెఱిఁగిన వారగుట యెఱిఁగి వారి నెదుర్కొనుమని నారాయణుఁడు ఉపాయజ్ఞుఁడును, పెక్కుయుద్ధములందు పరిపక్వత నందినవాఁడును, ఓర్వరానివాఁడును అగు నిర్పతిని బంపెను

చ నిర్పతియు వారిమాయల కనిం బ్రతిమాయ లొనర్చిపేర్చి సం
గర మొనరింపఁబూని కడుఁగ్రైపున మార్కొని తాఁకి వీఁక నా
యిరువుర మీఁద నొక్కట ననేక శిలీముఖ వృష్టి భోరనం
గురిసె సురారివాహినులకున్ లయకాలఘనాఘనాభమై 42

**అర్థము.** నిర్పతియున్, వారి - మాయలకున్, అనిన్ =యుద్ధమునందు, ప్రతిమాయలు = మాఱుమాయలు, ఒనర్చి = చేసి, పేర్చి = విజృంభించి, సంగరము = యుద్ధము, ఒనరింపన్ + ఊని = చేయఁబూని, కడున్ = మిక్కిలి, క్రైపునన్ = కోపముతో, మార్కొని = ఎదురుకొని, వీఁకన్ = పరాక్రమముతో, ఆ + ఇరువుర - మీఁదన్ = ఆ యిద్దఱమీఁదను, ఒక్కటన్ = ఒక్కసారిగా, సుర + అరి -వాహినులకున్= రాక్షససేనలనెడి నదులకు, లయ - కాల - ఘనా + ఘన

+ ఆభము + ఐ = ప్రళయసమయమునందలి వర్షాకాలపు మేఘముతో సమానమయి, అనేక - శిలీముఖ - వృష్టిన్ = పెక్కు బాణములనెడి వర్షమును, భోరనన్ = శీఘ్రముగా, కురిసెన్ = కురియించెను

**తాత్పర్యము:** నిర్భతియును వారి మాయలకు యుద్ధమునఁ బ్రతిమాయలు చేసి విజృంభించి యుద్ధమొనరింపఁబూని మిక్కిలి కోపమున ఎదురుకొని తాఁకి పరాక్రమముతో ఆ యిరువురిమీఁదను ఒక్కసారిగా రాక్షససేనలనెడి నదులకుఁ బ్రళయసమయవర్షామేఘసమానమయి పెక్కుబాణములనెడి వర్షమును బోరనఁ గురిసెను

**విశేషములు .** అలంకారము శ్లిష్టరూపకము, ఉపమ ఇందు మొదటి పాదమున 'నిరుబుతి' యనుపాఠముండెననియు, నది నన్నెచోడుని ప్రాచీనతకు నిదర్శనమనియు వీరరాజపంతులుగారి వాదము కాని 'నిర్భతియు' ననునదియే సరియైన పాఠమని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రులవారి నిర్ణయము

**వ అంత నారణిదుర్వారులు నిర్భతితో ననేకాయుధయుద్ధంబు చేసి జయింపనోపక రాక్షసవిద్యాబలంబున నితరజనసాధారణుండు కాఁడుగాఁ దలంచి మాయాయుద్ధంబు చేయ నుపక్రమించి 43**

**అర్థము .** అంతన్, ఆరణిదుర్వారులు, నిర్భతితోన్, అనేక + ఆయుధ-యుద్ధంబు = పెక్కాయుధములతోడి యుద్ధము, చేసి, జయింపన్ + ఓపక = గెలువఁజాలక, రాక్షస - విద్యా - బలంబునన్, ఇతర - జన - సాధారణుండు - కాఁడు+ కాన్ + తలంచి = అన్యజనులవంటివాఁడుకాఁడని, యెంచి, మాయా - యుద్ధంబు, చేయన్, ఉపక్రమించి = ఆరంభించి

**తాత్పర్యము:** అంత నారణిదుర్వారులు నిర్భతితో పెక్కాయుధములతోడి యుద్ధమొనరించి, గెలువఁజాలక, రాక్షసవిద్యాబలమునందు ఇతరజనులవంటి వాఁడుకాఁడని యెంచి మాయాయుద్ధ మొనరింపఁబూని - తరువాతి పద్యముతో నన్వయము

**క గిరులైన వజ్రమై, జల**
**ధరపటలములైన మారుతంబై, వడిఁ గే**
**సరులైనను శరభమ్మై**
**యురగము లగుటయు విహంగమోత్తముఁ డగుచున్ 44**

**అర్థము .** గిరులు = కొండలు, ఐనన్ = అయినచో, వజ్రము + ఐ = వజ్రాయుధమయి, జలధర - పటలములు + ఐనన్ = మేఘముల గుంపయినచో, మారుతంబు + ఐ = వాయువయి, జలధర - పటలములు + ఐనన్ = మేఘముల గుంపయినచో మారుతంబు + ఐ = వాయువయి, వడిన్ = వేగముగా, కేసరులు + ఐనన్ = సింహములయినచో, శరభమ్ము + ఐ = శరభమ్ృగమయి, ఉరగములు = పాములు, అగుటయున్, విహంగమ + ఉత్తముఁడు = పక్షిశ్రేష్ఠుఁడు - గరుత్మంతుఁడు, అగుచున్

**తాత్పర్యము .** అరణిదుర్వారులు కొండలైనచో నిర్బతి వజ్రమయి, వారు మేఘముల గుంపులయినచోఁ దాను వాయువయి, వారు సింహములయినచోఁ దాను శరభమ్ృగమయి, వారు పాములయినచోఁ దాను గరుత్మంతుఁ డగుచు - తరువాతి గద్యముతో నన్వయము

**వ ఇట్లు తమ మాయోపాయంబుల కగ్గలించుచున్న నిర్బతి నద్దనుజులు జయింపనోపక నిజస్వరూపంబులు గైకొని ఖడ్గ చర్మ ధరులై యొక్కుటఁ బైకి లంఘించి సమకట్టివచ్చిన 45**

**అర్థము .** ఇట్లు, తమ, మాయా + ఉపాయంబులకున్, అగ్గలించుచున్ + ఉన్న = విజృంభించుచున్న, నిర్బతిన్, ఆ + దనుజులు = ఆ రాక్షసులు, జయింపన్ + ఓపక = గెలువలేక, నిజ - స్వరూపంబులు, కైకొని, ఖడ్గ - చర్మ - ధరులు + ఐ = కత్తి, ఢాలు ధరించినవారయి, ఒక్కటన్ = ఒక్కమాఱుగా, పైకిన్, లంఘించి = దూఁకి, సమకట్టి - వచ్చినన్ = పూనిరాఁగా

**తాత్పర్యము .** ఇట్లు తమ మాయోపాయములకు విజృంభించుచున్న నిర్బతిని ఆ రాక్షసులు గెలువఁజాలక స్వస్వరూపములు గైకొని కత్తులను డాలులను ధరించి, ఒక్కమాఱుగాఁ బైకి దూఁకి సిద్ధపడిరాఁగా - తరువాతి పద్యముతో నన్వయము

**క అరుదుగ రెండమ్ములు దొడి**
**యిరువుర వక్షములు వ్రయ్యనేసిన నార్చెన్**
**సురబలము లసురపుత్త్రులు**
**నిర్బతికి వెన్నిచ్చి రెదిరి నిల్వక భీతిన్ 46**

**అర్థము .** అరుదుగన్ =ఆశ్చర్యముగా, రెండు + అమ్ములు = రెండు బాణములు, తొడి = తొడిగి, ఇరువుర - వక్షములున్ = ఇద్దఱ ఱొమ్ములును, వ్రయ్యన్ + ఏసినన్ = ముక్కలగునట్లు కొట్టఁగా, సుర - బలములు = దేవతల

సైన్యములు, ఆర్చెన్, అసుర - పుత్త్రులు = రాక్షసుని కుమారులు, భీతిన్ = భయముతో ఎదిరి = మార్కొని, నిల్వక, నిర్పతికిన్, వెన్నిచ్చిరి (వెన్ను + ఇచ్చిరి) = వెన్ను చూపిరి - పాటిపోయిరి

**తాత్పర్యము** నిర్పతి రెండుబాణములు తొడిగి ఇరువురు రాక్షసుల వక్షములను బ్రద్దలుగొట్టఁగా దేవసైన్యము లార్చెను రాక్షసపుత్త్రులు భయముతో మార్కొని నిలువక నిర్పతికి వెన్నుచూపిరి

## యదు కేతుమాలుల యుద్ధము

**వ ఇ ట్లారణిదుర్వారు లొక్కట నిర్పతి కోపాగ్నికిం బూర్ణాహుతు లగుటంగని కోపించి కేతుమాలి విలయకేతుమాలావలియుంబోలె దనుజ బలంబుతో నురుల కెత్తి ప్రళయ జలధర పటలంబు జలధిఁగప్పిన ట్లమరజలధిఁ గప్పిన నంతకుండు గని యుగాంత్యకాలాంతకుండునుంబోలెఁ గోపానలోద్దీపితాంతరంగుండై విజృంభించిన** 47

**అర్థము** ఇట్లు, ఆరణిదుర్వారులు, ఒక్కటన్, నిర్పతి - కోప + అగ్నికిన్ = నిర్పతియొక్క కోపమనెడి అగ్నికి, పూర్ణ + ఆహుతులు = సంపూర్ణహోమములు = పూర్తిగా నశించినవారు, అగుటన్, కని, కోపించి, కేతుమాలి, విలయ - కేతు - మాలా + ఆవలియున్ + పోలెన్ = ప్రళయసమయధూమకేతువుల వరుసవలె, దనుజ - బలంబుతోన్ = రాక్షససేనతో, ఉరులన్ + ఎత్తి = పైనెత్తి, ప్రళయ - జలధర - పటలంబు = ప్రళయ కాలమేఘ సమూహము, జలధిన్ = సముద్రమును, కప్పిన + అట్లు, అమర - జలధిన్ = దేవతలనెడి సముద్రమును, కప్పినన్, అంతకుండు = యముఁడు, కని, యుగ + అంత్య - కాల + అంతకుండునున్ + పోలెన్ = ప్రళయసమయమునందలి యమునివలె, కోప + అనల + ఉత్ + దీపిత + అంతరంగుండు + ఐ = కోపమనెడి అగ్నిచే మిక్కిలి మండింపఁబడిన మనస్సుగలవాఁడయి, విజృంభించి

**తాత్పర్యము** . ఇట్లు, ఆరణియును దుర్వారుఁడును ఒక్కమాఱుగా నిర్పతి కోపాగ్నికి నశించుటఁజూచి కోపించి కేతుమాలి ప్రళయసమయమునందలి ధూమకేతుసమూహమువలె రాక్షస సైన్యముతోఁ బైనెత్తి ప్రళయమేఘసమూహము సముద్రమును గప్పిన విధమున దేవతలనెడి సముద్రమును గప్పఁగా, యముఁడు చూచి ప్రళయ కాలయమునివలె కోపమనెడి అగ్నిచే మండింపఁబడిన మనస్సు గలవాఁడయి విజృంభించి - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు** . అలంకారము రూపకము, ఉత్ప్రేక్ష

చ దనుజబలంబుఁ దాఁకి, నిజదారుణభూరితరాస్త్రఘట్టనం
దునియలువాఱ నేసి, పటుదోర్బలగర్వవిగుర్వణంబులం
దనరి, వెలుంగుచుండె, నురుధామ బలంబున లోకమెల్లఁ గ
ప్పిన తిమిరంబు బిట్టడఁచి పేర్చి వెలుంగునినుండుపోలెనై 48

**అర్థము.** ఇందలి వెలుంగుచుండె నను క్రియకు పయి పద్యమునందలి అంతకుఁడు కర్త దనుజ - బలంబున్ = రాక్షస సైన్యమును, తాఁకి, నిజ - దారుణ - భూరి తర + అస్త్ర - ఘట్టనన్ = తనదైన భయంకరమైన మిక్కిలి గొప్ప అస్త్రహతిచే, తునియలు + పారన్ + ఏసి = ముక్కలగునట్లు కొట్టి, పటు - దోస్(ః) బల - గర్వ -విగుర్వణంబులన్ = తీవ్రమయిన భుజబలము వలని గర్వముయొక్క విజృంభణములచే, తనరి = ఒప్పి, ఉరు-ధామ - బలంబునన్ = గొప్ప తేజస్సు యొక్క బలముచే - ఉరు - దామ - బలంబునన్ అయి యుండునేమో -అప్పుడు ఉరు = గొప్పదియగు త్రాటి-పాశము యొక్క బలముచే నని అర్థము చెప్పవచ్చును లోకము + ఎల్లన్ = లోకమునంతను, కప్పిన, తిమిరంబున్ =చీఁకటిని, బిట్టు + అడఁచి = మిక్కిలి అణఁచివైచి, పేర్చి = విజృంభించి, వెలుంగు, ఇనుండు - పోలెన్ + ఐ = సూర్యునివలెనయి, వెలుంగుచున్ + ఉండెన్ = ప్రకాశించుచుండెను

**తాత్పర్యము.**(అంతకుఁడు) రాక్షస సైన్యమును దాఁకి, తన భయంకరము, భూరితరమునైన అస్త్రహతిచే ముక్కలుగా నేసి తీవ్రమయిన భుజబల గర్వవిజృంభణములచే నొప్పి గొప్ప తేజోబలమున - గొప్ప పాశబలమున లోక మంతయుఁ గప్పిన చీఁకటిని మిక్కిలి అణఁచివైచి విజృంభించి సూర్యుని వలె నయి, ప్రకాశించుచుండెను

**విశేషములు.** అలంకార ముపమ

వ ఇట్లు కేతుమాలి బలంబు మహేంద్రజాలమాయాబలంబునుంబోలెఁ జూడఁజూడ నదృశ్యంబైనఁ గని నిజబాహుబలసహాయుండై 49.

**అర్థము.** ఇట్లు, కేతుమాలి- బలంబు, మహేంద్రజాల మాయాబలంబునున్ + పోలెన్ = మహేంద్రజాలమునందలి మాయాబలము వలె, చూడన్ + చూడన్, అదృశ్యంబు +ఐనన్ + కని= మాయముకాఁగాఁ జూచి, నిజ-బాహు-బల-సహాయుండు + ఐ = తన భుజబలము సహాయముగాఁగలవాఁడై

**తాత్పర్యము** ఇట్లు కేతుమాలి బలము మహేంద్రజాలమునందలి మాయాబలమువలె చూడ(గా( జూడ(గా మాయము కా(గా( జూచి తన భుజబలము సహాయముగా( గలవా( డయి

**విశేషములు.** అలంకారము ఉపమ - తరువాతి పద్యముతో నన్వయము

క అయుతాశ్వవాహ్యము, మనో
రయ రవినిభ రుచిర రమణరథ మెక్కి జగ
ద్భయదాకారుండై యుగ
లయ భైరవ సదృశ విలయ లాలస బుద్ధిన్ 50

**అర్థము .** అయుత + అశ్వ - వాహ్యము = పదివేల గుఱ్ఱములచే లాగ(దగినది, మనస్(ః) + రయ - రవి - నిభ -రుచిర - రమణ - రథము = మనోవేగము, సూర్యసదృశము, మనోహరము, ఒప్పినది అగు రథము, ఎక్కి జగత్ + భయద + ఆకారుండు = లోకములకు భయము గలిగించు రూపము గలవా(డు, ఐ, యుగ-లయ-భైరవ-సదృశ - విలయ - లాలస - బుద్ధిన్= యుగాంతకాల భైరవునితో సమానమైన నాశనమునందు ఆసక్తిగల బుద్ధితో

**తాత్పర్యము :** పదివేల గుఱ్ఱములచే లాగ(దగినది, మనోవేగముగలది, సూర్యసదృశమయినది, రుచిరము, రమణము అగు రథమునెక్కి లోకభీకర రూపు(డై ప్రళయ కాల భైరవ సదృశమైన - వినాశకరబుద్ధితో - తరువాతి పద్యముతో నన్వయము

**వ తెరల నెత్తివచ్చి దండధరునిం దా(కిన ముష్టిన కణయ కంపన ముసుంరి భిండివాల తోమర శూల చక్ర శక్తి ప్రముఖాఖిలాయుధవర్షంబు గురియుచున్న కేతుమాలింగని మహిషకేతుండు రౌద్ర వృషభకేతుండునుంబోలె నా దర్పించి** 51

**అర్థము .** తెరలన్ + ఎత్తి - వచ్చి = పైకి దండెత్తివచ్చి, దండధరునిన్ = యముని, తా(కిన - ముష్టిన్ + అ = తా(కిన వెంటనే, కణయ - కంపన - ముసుంరి - భిండివాల - తోమర - శూల - చక్ర - శక్తి - ప్రముఖ + అఖిల + ఆయుధ - వర్షంబు = కణయము, కంపనము, ముసుంరి, భిండివాలము, తోమరము, శూలము, చక్రము, శక్తి మున్నగు నెల్ల ఆయుధముల వర్షము, కురియుచున్ + ఉన్న కేతుమాలిన్ + కని, మహిషకేతుండు = మహిషము (దున్న) ధ్వజముగా(

గలవాఁడు - యముఁడు, రౌద్ర - వృషభ-కేతుండునున్ + పోలెన్ = భయంకరుఁడైన వృషభధ్వజుని (శివుని) వలె, నాన్ = అనఁగా, దర్పించి = గర్వించి

**తాత్పర్యము** పైనెత్తివచ్చి యమునిఁ దాఁకినవెంటనే కణయము, కంపనము, ముసుంఠి, భిండివాలము, తోమరము, శూలము, చక్రము శక్తి మున్నగు నెల్ల ఆయుధముల వాన కురియుచున్న కేతుమాలినిఁజూచి యముఁడు రుద్రు నివలె గర్వించి - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** అలంకార ముపమ

తే **వాని కురియు ననేకాస్త్రవర్షమెల్ల**
**నశ్రమమున విఖండించి యరద సూత**
**రథ్య కోదండ కేతన రాజితోన**
**వర కిరీటంబు దెగి నేల నురల నేసె** 52

**అర్థము .** వాని - కురియు = అతఁడు కురియించునట్టి, అనేక + అస్త్ర - వర్షము + ఎల్లన్ = పెక్కు బాణముల వానయెల్ల, అశ్రమమునన్ = అనాయాసముగా, విఖండించి = ముక్కలు చేసి, అరద - సూత - రథ్య - కోదండ - కేతన - రాజి-తోన్ + అ = రథముల, సారథుల ,గుఱ్ఱముల విండ్ల, ధ్వజముల వరుసతోపాటే, వర-కిరీటంబు = శ్రేష్ఠమైన కిరీటము, తెగి, నేలన్ = భూమిమీఁద, ఉరలన్ + ఏసెన్ = పడఁగొట్టెను

**తాత్పర్యము .** కేతుమాలి కురియించుచున్న పెక్కు బాణముల వర్షమంతయు అనాయాసముగా ముక్కలు చేసి రథముల, సారథుల, అశ్వముల, ధనుస్సుల, ధ్వజముల సమూహముతోపాటే వానిశ్రేష్ఠమైన కిరీటమును ఖండించి నేలఁబడవైచెను

**విశేషములు .** వాని - కురియు - వాఁడు కురియు 'ధాతుజవిశేషణ భావార్థక పూర్వ వ్యహహితావ్యవహిత కర్తృపద ప్రథమకుఁ దఱచుగ యొక్క షష్ఠియగు ' ప్రౌఢ కారక 15 వానియొక్క కురియు 'యొక్కకు లోపంబు బహుళంబు' ప్రౌఢ కారక 16

వ **ఇట్లు మనోరథారూఢుండై కేతుమాలి విరథుండయ్యును విజయమనోరథారూఢుండై ఖడ్గవర్మంబులు గైకొని మహోరభసంబున** 53

**అర్థము**. ఇట్లు, మనోరథ + ఆరూఢుండు + ఐ = మనస్సనెడి రథమునెక్కినవాఁడయి, కేతుమాలి, విరథుండు + అయ్యెను = రథవిహీనుఁడయ్యెను, విజయ - మనస్(ః) - రథ + ఆరూఢుండు + ఐ = విజయమునందలి కోరిక గలవాఁడయి, ఖడ్గ - వర్మంబులు = కత్తి, కవచము, గైకొని,మహత్ (మహా) - రభసంబునన్ = మిక్కిలి వేగముతో

**తాత్పర్యము** ఇట్లు మనస్సనెడి రథము నెక్కినవాఁడయి కేతుమాలి రథవిహీనుఁడయ్యెను, గెలువవలయునను కోరికగలవాఁడయి, ఖడ్గము, కవచము గైకొని మిక్కిలి వేగముతో - తరువాతి పద్యముతో నన్వయము

క. ఎయ్యని తనపై కుటికిన
వ్రయ్యఁగ గద వ్రేసి దనుజు వధియించె జముం
డయ్యెడ దోషాచరుఁ డిల
నయ్యమదండాభినిహతుఁ డగు డది యరుదే? 54

**అర్థము** ఎయ్యని = ఏయని - బాణ ప్రయోగము చేయని (?) తనపైకిన్, ఉటికినన్, వ్రయ్యఁగన్ = వ్రయ్యునట్లు, గద - వ్రేసి, జముండు = యముఁడు, దనుజన్ = రాక్షసుని, వధియించెన్ = చంపెను ఎయ్యెడన్ (ఏ+ఎడన్) = ఎందయినను, దోషా-చరుఁడు = రాత్రి సంచరించువాఁడు - రాక్షసుఁడు, దోష + ఆచరుఁడు = పాపముచేయువాఁడు, ఇలన్ = భూమియందు, ఆ + యమ - దండ + అభిహతుఁడు = ఆ యముని దండముచేఁ గొట్టఁబడినవాఁడు, అగుడు = అగుట, అది, అరుదే = ఆశ్చర్యమా?

**తాత్పర్యము**. బాణప్రయోగము చేయని తనపై కుఱుకఁగా నతఁడు వ్రయ్యునట్లు గదను బ్రయోగించి యముఁడు రాక్షసుని వధించెను ఎక్కడనైనను దోషా చరుఁడు - రాక్షసుఁడు - దోషము నాచరించువాఁడు యమదండహతుఁడగుట ఆశ్చర్యమా? కాదనుట

**విశేషములు**. అలంకారము అర్థాంతరన్యాసము - శ్లేషానుప్రాణితము

**వ. ఇట్లు కేతుమాలి సమరకేతనాలంకృతకేతనంబైన నమరులకు వెన్నిచ్చి తెరలంబాఱుచున్న పూర్వామరబలంబులం గనుంగొని 55**

**అర్థము**. ఇట్లు, కేతుమాలి, సమర - కేతన + అలంకృత - కేతనంబు + ఐనన్ = యుద్ధరంగమునం దలంకరింపఁబడిన ధ్వజము కాఁగా, (?) అమరులకున్ = దేవతలకు, వెన్నిచ్చి, పూర్వామర - బలంబులన్ = రాక్షససేనలను, కనుంగొని

**తాత్పర్యము .** ఇట్లు కేతుమాలి యుద్ధరంగమున నలంకరింపఁబడిన ధ్వజము కాఁగా, అమరులకు వెన్నిచ్చి పాఱిపోవుచున్న రాక్షసులను జూచి - తరువాతి పద్యముతో నన్వయము

క **ఆయత భుజ విక్రముఁడు గ**
**జాయుత బల సులభుఁ డూర్జితైశ్వర్యుఁడు నా**
**నాయుధకోవిదుఁడు మహా**
**కాయుఁడు చనుదెంచి సురనికాయముఁ దాఁకెన్** 56

**అర్థము** ఆయత - భుజ - విక్రముఁడు = గొప్ప భుజపరాక్రమము గలవాఁడు, గజ + అయుత - బల - సులభుఁడు = పదివేల యేనుఁగుల సేనచే సులభుఁడు, ఊర్జిత + ఐశ్వర్యుఁడు = అధికమైన యైశ్వర్యము గలవాఁడు, నానా + ఆయుధ - కోవిదుఁడు = పెక్కు ఆయుధములందుఁ బండితుఁడుః(అగు), మహాకాయుఁడు = మహాకాయుఁడను పేరుగల రాక్షసుఁడు, చనుదెంచి = వచ్చి, సుర - నికాయమున్ = దేవతల సమూహమును, తాఁకెన్

**తాత్పర్యము** గొప్ప భుజపరాక్రమము గలవాఁడును, పదివేల గజముల సేన గలవాఁడును, అధికమైన ఐశ్వర్యము గలవాఁడును అనేకాయుధములందుఁ బండితుఁడును అగు మహాకాయుఁడను రాక్షసుఁడు వచ్చి దేవతలను దాఁకెను

అగ్ని మహాకాయుల యుద్ధము

వ **ఇట్లు తాఁకి సురబలంబును విహతకోలాహలంబుగాఁ జేయుచున్న మహాకాయుంగని యగ్నిదేవుండు కాలాగ్నిరుద్రుండునుంబోలె నమర్షాన లోద్దీపితాంతరంగుండై తెరలనెత్తివచ్చి మహాకాయుందాఁకి మహాయుద్ధంబు చేసి వాని రథసారథులతోన కేతుదండకోదండంబు లొక్కట విఱుగనేసినం గోపించి** 57

**అర్థము .** ఇట్లు, తాఁకి, సుర-బలంబును = దేవసేనను, విహత - కోలాహలంబుగాన్ = కొట్టఁబడిన కలకలము గలదానినిగా - కలకలము లేనిదానినిగా, చేయుచున్ + ఉన్న, మహాకాయున్, కని, అగ్నిదేవుండు, కాల + అగ్ని - రుద్రుండునున్ + పోలెన్ = ప్రళయాగ్నివలె భయంకరుఁడైన విధమున, అమర్ష + అనల + ఉత్ + దీపిత + అంతరంగుండు + ఐ= కోపమనెడి అగ్నిచే మిక్కిలి ప్రకాశింపఁజేయఁబడిన మనస్సు గలవాఁడయి, తెరలన్ + ఎత్తి - వచ్చి = వండెత్తివచ్చి, మహాకాయున్, తాఁకి, మహత్(మహా) = యుద్ధంబు, చేసి, వాని -

రథ -సారథులతోన్ + అ = వానియొక్క రథసూతులతోపాటే, కేతు - దండ - కోదండంబులు = ధ్వజదండము, విల్లు, ఒక్కటన్, విఱుగన్ + ఏసినన్ = విఱుగఁగొట్టఁగా, కోపించి

**తాత్పర్యము** ఇట్లు తాఁకి దేవతల సైన్యమును సందడి లేనిదానినిగాఁ జేయుచున్న మహాకాయునిఁ జూచి అగ్నిదేవుఁడు ప్రళయసమయాగ్నివలె భయంకరుఁడైన విధమునఁ గోపాగ్నిచే మండింపఁబడిన మనస్సు గలవాఁడయి దండెత్తివచ్చి మహాకాయునిఁ దాఁకి మహాయుద్ధమొనరించి వాని రథసారథులతోనే కేతుదండమును వింటిని ఒక్కమాఱుగా విఱుగఁగొట్టఁగా, కోపించి - తరువాతి పద్యముతో నన్వయము

చ **దురమున నా సురారి విరథుండయి వేగమ పాఱుదెంచి దు**
**ర్భరమున వహ్నిపై కుఱికి పట్టుడు వహ్ని నిజస్వరూప మ**
**చ్చెరువుగఁ దాల్చి యద్దనుజుఁ జెచ్చెర భస్మముసేసె నెంత భీ**
**కరబలులయ్యు వహ్నిఁబడి కాలక మైమెయిఁ బోవనేర్తురే? 58**

**అర్థము .** దురమునన్ = యుద్ధమునందు, ఆ - సుర + అరి = ఆ దేవ వైరి - రాక్షసుఁడు - మహాకాయుఁడు, విరథుండు + అయి = రథ విహీనుఁడయి, వేగము + అ = వేగమే, పాఱుదెంచి = పరువెత్తుకొనివచ్చి, దుర్భరమునన్ = దుస్సహముగా, వహ్నిపైకిన్ = అగ్నిమీఁదికి, ఉఱికి - పట్టుడున్ = ఉఱికి పట్టినంతనే, వహ్ని = అగ్ని, నిజ = స్వరూపము- స్వస్వరూపము, అచ్చెరువుగన్ = ఆశ్చర్యముగా, తాల్చి, ఆ + దనుజున్ = ఆ రాక్షసుని, చెచ్చెరన్ = శీఘ్రముగా, భస్మము చేసెన్ = బూడిద చేసెను ఎంత - భీకర - బలులు + అయ్యున్ = ఎంత భయంకరమయిన బలముగలవారైనను, వహ్నిన్ + పడి = అగ్నియందుఁబడి, కాలక, మైమెయిన్ = అనాయాసముగా, పోవన్ + నేర్తురే = పోవఁగలరా ?

**తాత్పర్యము :** యుద్ధమునందు ఆ రాక్షసుఁడు - మహాకాయుఁడు రథ విహీనుఁడయి వేగమే పరువెత్తుకొనివచ్చి దుస్సహముగా నగ్నిదేవునిపై కుఱికి పట్టుకొనినంతనే, అగ్ని స్వస్వరూపము నాశ్చర్యకరముగాఁ దాల్చి ఆ రాక్షసుని శీఘ్రముగా భస్మీకరించెను ఎంత భయంకరపరాక్రములైనను అగ్నియందుఁబడి కాలక అనాయాసముగాఁ బోఁగలరా?

**విశేషములు .** అలంకార మర్థాంతరన్యాసము

వ ఇట్లు మహాకాయుండు మహానలంబున కెఱఁగిన శలభంబునుంబోలె ననలు కోపానలాహతి భస్మసాత్కృతుండైనం గోపించి తనముందటం బన్ని నిలిచి సురవరుల కేమేమ చాలుదు మనుచున్న దంభకుంభోదరాది రాక్షసాధీశ్వర శుకచరాది దైత్యవరోత్కర భీకర దుష్కర ముష్కరాది నిశాచరాధినాయకానంత సామంతవరుల నమరవరులపై నొక్కట నెత్తుండని చేయి వీచుచు జంభాసురేంద్రుండు సురేంద్రుపై నురవడించి నడచుటఁ గని సురేంద్రుం డయ్యసురేంద్రునకుం బ్రతిఘటించి నిలిచి మహాఘోరయుద్ధంబు చేయందొడంగినట్టి యవసరంబున 59

**అర్థము** ఇట్లు మహాకాయుండు, మహత్ (మహా) + అనలంబునకున్ = గొప్ప అగ్నికి, ఎఱఁగిన = దూఁకిన, శలభంబునున్ + పోలెన్ = మిడుతవలె, అనలు - కోప + అనల - ఆహతిన్ = అగ్నిదేవుని కోపమనెడి అగ్నిదెబ్బకు, భస్మసాత్కృతుండు + ఐనన్= భస్మముతోఁ దాద్రూప్యమునొందింపఁబడినవాఁడు కాఁగా, కోపించి, తన ముందటన్, పన్ని = సిద్ధపడి, నిలిచి, సుర - వరులకున్ = దేవతాశ్రేష్ఠులకు, ఏము + ఏము + అ = మేము మేమే, చాలుదుము, అనుచున్ = ఉన్న, దంభ - కుంభోదర + ఆది - రాక్షస + అధి + ఈశ్వర = దంభుఁడు, కుంభోదరుఁడు మున్నగు రాక్షసరాజుల, శుకచర + ఆది - దైత్యవర + ఉత్కర = శుకచరుఁడు మున్నగు దైత్య శ్రేష్ఠుల సమూహము, భీకర - దుష్కర-ముష్కర + ఆది - నిశాచర + అధినాయక = భీకరుఁడు, దుష్కరుఁడు, ముష్కరుఁడు, మున్నగు రాక్షసప్రభువుల, అనంత సామంత వరులన్ = పెక్కండ్రు సామంతరాజులను అమర - వరులపైన్ = దేవతాశ్రేష్ఠులపై, ఒక్కటన్ = ఒక్కమాఱుగా, ఎత్తుండు + అని = దండెత్తుఁడని, చేయి - వీచుచున్ = ఉత్సాహపఱచుచు, జంభ + అసుర + ఇంద్రుండు = జంభుఁడను రాక్షసశ్రేష్ఠుఁడు, సుర + ఇంద్రుపైన్ = దేవేంద్రుని మీఁద,ఉరవడించి = విజృంభించి, నడచుటన్, కని, సుర + ఇంద్రుండు, ఆ + అసుర + ఇంద్రునకున్ = ఆ రాక్షసశ్రేష్ఠునకు, ప్రతిఘటించి = ఎదిరి, నిలిచి, మహత్ (మహా) + ఘోర -యుద్ధంబు = మిక్కిలి భయంకరమైన యుద్ధము, చేయన్ + తొడంగిన + అట్టి + అవసరంబునన్ = చేయఁబూనినట్టి సమయమున-

**తాత్పర్యము** ఇట్లు మహాకాయుఁడు మహాగ్నియందు దూఁకిన మిడుతవలె అగ్నిదేవుని కోపాగ్నిహతిచే భస్మీకృతుఁడు కాఁగాఁ గోపించి, తన ముందు, సిద్ధపడి నిలిచి, 'దేవతలకు మేమే మేమే చాలుదు' మనుచున్న దంభుఁడు, కుంభోదరుఁడు

మున్నగు రాక్షసప్రభువులను, శుకచరుఁడు మున్నగు దైత్యవరుల సమూహమును, భీకరుఁడు, దుష్కరుఁడు, ముష్కరుఁడు మున్నగు రాక్షసరాజుల పెక్కండ్ర సామంత రాజులను దేవతలపై నొక్కమాఱుగా దెండెత్తుఁడని యుత్సాహపఱుచుచు జంభుఁడను రాక్షసరాజు దేవేంద్రునిపై విజృంభించి నడచుటఁ జూచి దేవేంద్రుఁడు ఆ రాక్షసరాజును మార్కొని నిలిచి మిక్కిలి భయంకరమైన యుద్ధము చేయఁబూనిన సమయమున - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు**. అలంకార ముపమ

సీ. అసదృశులై యష్టవసువులు దంభ కుం
భోదర ప్రముఖుల నోర్చి రాజి
నత్యుగ్రులై ద్వాదశాదిత్యు లురు శుక
చర ముఖ్యరిపుల మస్తములు గొనిరి
కైపునఁ దాఁకి యేకాదశరుద్రు లు
త్కల భీకరాఖ్యుల గెలిచి రెదిరి
విశ్వైకహితమూర్తు లశ్వును లిరువురు
ముష్కర దుష్కరుల్ మొదలు గాఁగ

తే. బహువిధాసురనాథుల బలిమి మెఱసి
వారి బలములు లోనుగ వాసవునకు
నడ్డమై పోరి నిర్జించి రాసురమున
సురలు ముప్పది ముువ్వురుం దెరల నెత్తి. 60

**అర్థము**. అష్ట - వసువులు = ఎనమండ్రు వసువులు, అసదృశులు + ఐ = సాటిలేనివారయి, దంభ - కుంభోదర - ప్రముఖులన్ = దంభుఁడు కుంభోదరుఁడు మున్నగువారిని, ఆజిన్ = యుద్ధమున, ఓర్చిరి = ఓడించిరి

ద్వాదశ + ఆదిత్యులు = పండ్రెండుగురు సూర్యులు, అతి + ఉగ్రులు + ఐ = మిక్కిలి భయంకరులయి, ఉరు - శుకచర - ముఖ్య - రిపుల = గొప్పవారైన శుకచరుఁడు మున్నగు శత్రువుల యొక్క, మస్తములన్ = శిరస్సులను, కొనిరి = వధించిరి

ఏకాదశ - రుద్రులు = పదునొకండ్రురుద్రులు, కైపునన్ = కోపముతో, తాఁకి, ఉత్కల - భీకర + ఆఖ్యులన్ = ఉత్కలుఁడు, భీకరుఁడు అను పేరులుగల వారిని, ఎదిరి, గెలిచిరి

విశ్వ + ఏక - హిత - మూర్తులు = లోకమునకు ముఖ్యమైన శ్రేయస్సు రూపుగాఁ గలవారు, అశ్వినులు = అశ్వినీదేవతలు, ఇరువురున్ = ఇద్దఱును, సురలు = దేవతలు, ముప్పది మువ్వురున్, తెరలన్ - రాఁగా, ఎత్తి = దండెత్తి, ముష్కర - దుష్కరుల్ = ముష్కరుఁడును, దుష్కరుఁడును, మొదలు + కాఁగన్ = మున్నుగా, బహు - విధ + అసుర - నాథులన్ = పెక్కురీతులయిన రాక్షసరాజులను, బలిమి - మెఱసి = పరాక్రమము ప్రకాశించి, వారి - బలములు = వారి సేనలు, లోనుగన్ = వశపడఁగా, వాసవునకున్ = ఇంద్రునకు, అడ్డము + ఐ = పోరి, ఆసురమునన్ = రాక్షసముగా, నిర్జించిరి = జయించిరి

**తాత్పర్యము** అష్టవసువులు సాటిలేని వారయి దంభుఁడు, కుంభోదరుఁడు మున్నగువారిని యుద్ధమున నోడించిరి ద్వాదశాదిత్యులు మిక్కిలి భయంకరులయి శుకచరుఁడు మున్నగు శత్రువుల శిరస్సులను వధించిరి ఏకాదశరుద్రులు కోపమునఁదాఁకి ఉత్కలుఁడు, భీకరుఁడు అనువారి నెదిరించి గెలిచిరి విశ్వహిత మూర్తులైన అశ్వినీదేవత లిరువురును ముష్కరుఁడు, దుష్కరుఁడు మున్నుగాఁ బెక్కు రీతులయిన రాక్షసరాజులను పరాక్రమము మెఱసి వారి సైన్యములు వశపడఁగా, దేవతలు ముప్పది మువ్వురును దండెత్తిరా, నింద్రునకు అడ్డమయి యుద్ధముచేసి, రాక్షసమున జయించిరి

**వ ఇట్లు నిజానంతసామంతసంతానంబంతయు నొక్కటఁ గృతాంత నికేత నాంతర్గతు లగుటం గని కోపించి జంభాసురుం డపారచతురంగబల సమన్వితుండై సురవీరులపై నురులనెత్తి లయకాల నీల ఘనాఘనంబునుంబోలె ననేకాస్త్రవర్షంబులు కురిసినఁ దదీయాతిహేతిప్రహతి కబ్బగిపక వెన్నిచ్చి 61**

**అర్థము.** ఇట్లు, నిజ + అనంత - సామంత - సంతానంబు + అంతయున్ = తనదైన అంతులేని సామంతుల సమూహమంతయును, ఒక్కటన్ = ఒక్కమాటుగా, కృతాంత - నికేతన + అంతర్గతులు = యముని గృహము లోపలికిఁబోయినవారు - చచ్చినవారు, అగుటన్ + కని, కోపించి, జంభ + అసురుండు, అపార -చతురంగ - బల - సమన్వితుండు + ఐ = పారములేని చతురంగబలముతోఁ గూడినవాఁడయి, సుర-వీరులపైన్ = దేవవీరులపై, ఉరులన్ + ఎత్తి = దండెత్తి, లయ-కాల -నీల ఘనా - ఘనంబునున్ + పోలెన్ = ప్రళయసమయమునందలి నల్లని వర్షాకాలపు మేఘమువలె, అనేక + అస్త్ర - వర్షంబులు = పెక్కు అస్త్రములనెడి వానలు, కురిసినన్, తదీయ + అతి - హేతి - ప్రహతికిన్ = వారి మిక్కిలియైన కత్తుల దెబ్బకు, అబ్బగింపక = తాళలేక, వెన్నిచ్చి = పాఱిపోయి

**తాత్పర్యము** ఇట్లు, తన అంతులేని సామంతుల సమూహమంతయు ఒక్కమాటే చచ్చుటఁ జూచి కోపించి జంభాసురుండు అపారములైన చతురంగ బలములతోఁ గూడినవాఁడయి దేవవీరులపై దండెత్తి ప్రళయసమయమునందలి నల్లనివర్షాకాలమేఘమువలె పెక్కుబాణములనెడి వర్షములు కురియఁగా వారి అమితమైన కత్తుల దెబ్బకుఁ దాళలేక వెనుదిరిగి - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు.**లయకాల పోలె అలంకార ముపమ అనే కాస్త్రవర్షంబులు - అలంకారము రూపకము

ఉ ఆకుల మంది నిర్జరచయంబు భయంబునఁ దల్లడిల్ల నీ
రాకర మెల్లఁగట్టవిసిన ట్లురులం బఱతెంచుచున్నచోఁ
జేకొని నిల్చె సూర్యకులశేఖరుఁ డాదినరేంద్రవర్యుఁ డి
క్ష్వాకుఁడు వీఁకఁదాఁకె సురవైరిబలంబుల లీలఁ దోలుచున్ 62

**అర్థము .** నిర్జర - చయంబు = దేవతల సమూహము, ఆకులము + అంది= కలఁతఁజెంది, భయంబుననన్, తల్లడిల్లన్ = సంచలింపఁగా, నీరాకరము + ఎల్లన్ = సముద్రమంతయు, కట్ట + అవిసిన + అట్లు = గట్టు తెగిన విధమున, ఉరులన్ + పఱతెంచుచున్ + ఉన్నచోన్ = పరువెత్తివచ్చుచుండఁగా, సూర్య-కుల-శేఖరుఁడు = సూర్యవంశశ్రేష్ఠుఁడు, ఆది-నర+ఇంద్ర-వర్యుఁడు = పూర్వరాజులలో శ్రేష్ఠుఁడు, అగు, ఇక్ష్వాకుఁడు, చేకొని - స్వీకరించి, నిల్చెన్, సుర-వైరి-బలంబులన్=రాక్షససైన్యములను, లీలన్= విలాసముగా, తోలుచున్ = తఱుముచు, వీఁకన్ = పరాక్రమముతో, తాఁకెన్,

**తాత్పర్యము .** దేవతల సమూహము భయమునఁ గలఁగి తల్లడిల్లి సముద్రమంతయు గట్టు తెగిన విధమునఁ బరువెత్తి వచ్చుచుండఁగా, సూర్యవంశ శ్రేష్ఠుఁడును, ఆదిరాజశ్రేష్ఠుఁడును అగు ఇక్ష్వాకుఁడు వారిని స్వీకరించి నిలిచెను రాక్షససైన్యములను విలాసముగాఁ దఱుముచుఁ బరాక్రమముతోఁ దాఁకెను

**విశేషములు :** అలంకార ముపమ

### ఇక్ష్వాకుఁడు పెక్కండ్రు రాక్షసులను జంపుట

క నరభోజను లి ట్లోటమి
నరునకు వెన్నిచ్చి తూలినం గని కోపా
తురులగుచు ధూమ్రధుర్ధరు
లరగొన కిక్ష్వాకుఁ దాఁకి రతిరభసముననన్. 63

**అర్థము** నర-భోజనులు = రాక్షసులు, ఇట్లు, ఓటమి = ఓడిపోయి, నరునకున్ = మానవునకు, వెన్నిచ్చి = వెనుదిరిగి, తూలినన్ = చలింపఁగా, కని, ధూమ్ర - ధుర్ధరులు = ధూమ్రుఁడు, ధుర్ధరుఁడు అనువారు, కోప + ఆతురులు + అగుచున్ = కోపముచే బాధనొందినవారు అగుచు, అరగొనక = జంకక, అతి - రభసమునన్ = మిక్కిలి వేగముతో, ఇక్ష్వాకున్, తాఁకిరి

**తాత్పర్యము** రాక్షసు లీ విధముగా నోడిపోయి మానవునకు వెన్నిచ్చి పాఱిపోఁగాఁ జూచి, ధూమ్రుఁడు, ధుర్ధరుఁడు అనువారు కోపపీడితులగుచు జంకక మిక్కిలి వేగముతో నిక్ష్వాకునిఁ దాఁకిరి

క ఆ యిరువుర రెండమ్ముల
నాయతభుజుఁడేసి పేర్చి యార్చినఁ గని కో
పాయత్తచిత్తుఁడై నర
నాయకుఁ ద్రిశిరుఁ డను దనుజ నాథుఁడు తాఁకెన్. 64

**అర్థము** ఆయత - భుజుఁడు = అమితమైన భుజబలము గలవాఁడు - అగు ఇక్ష్వాకుఁడు, ఆ + ఇరువురన్ = ఆ ఇద్దఱను - ధూమ్రధుర్ధరులను,రెండు + అమ్ములన్= రెండు బాణములతో, ఏసి =కొట్టి, పేర్చి = విజృంభించి, ఆర్చినన్ = ఆర్వఁగా, కని, త్రిశిరుఁడు, అను, దనుజ - నాథుఁడు = రాక్షసరాజు, కోప + ఆయత్త - చిత్తుఁడు + ఐ = కోపమునకు వశమైన మనస్సు గలవాఁడయి, నర-నాయకున్ = మనుష్యనాథుని, ఇక్ష్వాకున్ = ఇక్ష్వాకుని, తాఁకెన్

**తాత్పర్యము** . అమితభుజబలముగల ఇక్ష్వాకుఁడు ఆ యిద్దఱను - ధూమ్రధుర్ధరులను రెండు బాణములచేఁ గొట్టి విజృంభించి ఆర్వఁగాఁ జూచి త్రిశిరుఁడనెడి రాక్షసరాజు కోపమునకు వశమైన చిత్తముగలవాఁడయి ఇక్ష్వాకు రాజును దాఁకెను

వ ఇట్లు తాఁకి మహాఘోరయుద్ధంబు చేయుచున్న త్రిశిరాసురేంద్రు నిక్ష్వాకునరేంద్రుఁడు కని కోపించి వాని కరచరణశిరంబు లొక్క పెట్టఁదెగనేసి మేలువాడి జంభాసురేంద్రుం గిట్టి ముట్టి మూదలించిన నతని కవిదల కబ్బగింపక గుంద్రించి జంభాసురేంద్రుం డమరేంద్రుపైఁ దెరలనెత్తి తన కెదురెత్తు సిద్ధుల నప్రసిద్ధులంజేసి, సాధ్యుల హేలాసాధ్యులం జేసి, విద్యాధరులఁ దృణధరులం జేసి, వియచ్చరుల వియచ్చరులం జేయుచుఁ జనుదెంచి, నానా విధ ప్రహరణ ప్రహతిం గప్పుచున్న తన్నుఁ దృణీకరించి, ప్రతిఘటించి నిల్చిన సురేంద్రు నసురేంద్రుండు కని కోపహాసవిలసనాననుం డగుచు 65

**అర్థము.** ఇట్లు, తాఁకి, మహత్(మహా) + ఘోరయుద్ధంబు, చేయుచున్+ ఉన్న, త్రిశిర + అసుర + ఇంద్రున్ = త్రిశిరుఁడను రాక్షసశ్రేష్ఠుని, ఇక్ష్వాకు - నర+ ఇంద్రుఁడు = ఇక్ష్వాకు రాజు, కని, కోపించి, వారి - కర - చరణ - శిరంబులు = వానిచేతులు పాదములు, శిరస్సులు, ఒక్క - పెట్టన్ = ఒక్కమాఱుగా, తెగన్ + ఏసి = తెగఁగొట్టి, మేలువాడి = విజృంభించి (?) జంభ + అసుర + ఇంద్రున్ = జంభరాక్షసశ్రేష్ఠుని, కిట్టి = సమీపించి, ముట్టి - మూదలించినన్ = హెచ్చరింపఁగా, అతని - కవిదలకున్ = అతని ఆక్రమణమునకు, అబ్బగింపక = సహింపక, గుండ్రించి = తిరుగాడి, జంభ + అసుర + ఇంద్రుండు, అమర + ఇంద్రుపైన్ = దేవేంద్రునిమీఁద తెరలన్ + ఎత్తి = దండెత్తి, తనకున్ + ఎదురు + ఒత్తు - సిద్ధులన్ = మార్కొను సిద్ధులను, అప్రసిద్ధులన్ + చేసి = పేరులేనివారినిగాఁ జేసి, సాధ్యులన్, హేలా - సాధ్యులన్ + చేసి, సులభసాధ్యులనుగాఁ జేసి, విద్యాధరులన్, తృణ-ధరులన్ + చేసి = గడ్డికఱచినవారినిగాఁ జేసి, వియచ్చరులన్, వియత్ + చరులన్ = ఆకాశమునందు సంచరించువారినిగా, చేయుచున్, చనుదెంచి = వచ్చి, నానావిధ - ప్రహరణ - హతిన్ = పెక్కు రీతులైన ఆయుధముల దెబ్బచే, కప్పుచున్ + ఉన్న = ఆక్రమించుచున్న, తన్నున్, తృణీకరించి = తిరస్కరించి, ప్రతిఘటించి = ఎదిరించి, నిల్చిన, సురేంద్రున్ = దేవేంద్రుని, అసుర + ఇంద్రుండు = రాక్షసశ్రేష్ఠుఁడు, కని,కోప - హాస - విలసన + ఆననుండు = కోపము నవ్వు అనువానిచేఁ బ్రకాశముగల ముఖముగలవాఁడు, అగుచున్

**తాత్పర్యము.** ఇట్లు తాఁకి మిక్కిలి భయంకరమైన యుద్ధము చేయుచున్న త్రిశిరుఁడను రాక్షసశ్రేష్ఠుని ఇక్ష్వాకురాజుచూచి, కోపించి, వాని చేతులను గాళ్లను, శిరస్సులను ఒక్కమాఱుగా ఖండించి విజృంభించి, జంభరాక్షసుని సమీపించి హెచ్చరింపఁగా, అతని ఆక్రమణమునకు సహింపక, తిరుగాడి జంభాసురుఁడు దేవేంద్రునిపై దండెత్తి, తన్ను ఎదిరించిన సిద్ధులను ఓడించి, సాధ్యులను సులభముగా సాధించి, విద్యాధరులను గడ్డికఱపించి, వియచ్చరులను ఆకాశమున కెగురఁగొట్టి, వచ్చి అనేకవిధములైన బాణములదెబ్బచేఁ గప్పుచున్న తన్నుఁదిరస్కరించి ప్రతిఘటించి నిలిచిన దేవేంద్రుని రాక్షసరాజు చూచి కోపహాసములచే విలసిల్లు ముఖము గలవాఁడగుచు - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు.** వియచ్చరులు - వియత్ + చరులు - సకారత వర్గములకు శవర్ణ చవర్గములతో పూర్వమందైనను పరమందైనను కూడిక గలుగునపుడు క్రమముగా శవర్ణ చవర్గవర్ణము లాదేశ మగును

## ఇంద్ర జంబాసురల యుద్ధము

ఉ ‘ఈ సురరాజు నేఁడు తన కెక్కుడి బీరము వచ్చెఁ బేర్చుతో
నీసున నాకుఁ జక్కనెదురెత్తి నిజంబున నున్నవాఁ డనిం
జా సమకట్టె నింకఁ దను షణ్ముఖుకాచుట సూతమంచు జం
భాసురుఁ డింద్రుఁ దాఁకెఁ ద్రిదశాలి కరంబు భయంబు పొందగాన్ 66

**అర్థము** ఈ - సుర - రాజు = ఈ దేవేంద్రుఁడు, నేఁడు, తనకున్, ఎక్కుడి - బీరము - పరాక్రమము, వచ్చెన్,పేర్చుతోన్ = అతిశయముతో, ఈసునన్ = కోపముతో, నాకున్, చక్కన్, తిన్నఁగా, ఎదురు + ఎత్తి, నిజంబునన్ + ఉన్నవాఁడు = నిశ్చయముగా నున్నాఁడు, అనిన్ = యుద్ధమునందు, చాన్ = చావన్ = చచ్చుటకు, సమకట్టెన్ = పూనెను, ఇంకన్, తనున్ = తన్ను, షష్(ట్) + ముఖు-కాచుట = కుమారస్వామి కాచుట, చూతము, అంచున్, జంభ + అసురుఁడు, త్రిదశ + అలి = దేవతల సమూహము, కరంబు = మిక్కిలి, భయంబు +పొందఁగాన్ = భయపడఁగా, ఇంద్రున్, తాఁకెన్

**తాత్పర్యము .** ‘ఈ దేవేంద్రుఁడు - నేఁ డీతని కెక్కుడి పరాక్రమము వచ్చెను! - అతిశయించి కోపముతో నా కెదురుగా నిల్చియున్నాఁడు ఇతఁడు యుద్ధమునఁ జావ సమకట్టెను ఇంకఁ దన్నుఁ గుమారస్వామి రక్షించుట చూత మనుచు జంభాసురుఁడు దేవతలుమిక్కిలి భయపడఁగా నింద్రునిఁ దాఁకెను

**విశేషములు .** ఈ సురరాజు నేఁడు తన కెక్కుడి బీరము వచ్చె - ‘కొన్ని యెడల వాక్యంబు వాక్యాంతర గర్భంబు నగు ’ ప్రౌఢ వాక్య 21 షణ్ముఖుకాచుట - షణ్ముఖుఁడు కాచుట - షణ్ముఖుని యొక్క కాచుట - షణ్ముఖు కాచుట - ప్రౌఢ కారక 15, 16

ఉ **చండతరప్రతాపబలసంయుతు, లూర్జితశక్తియుక్తు, లా**
**ఖండల జంభు లొండొరులకంటె బలంబుఁ జలంబుఁ గాయ్వు నొం**
**డొండ మనంబులోఁ దనర నూఁడ కేసిరి బాణసంహతిన్**
**రెండు బలంబులం బొరిఁబొరిం గడికండలుగా దురంబునన్ 67**

**అర్థము .** చండతర - ప్రతాప - బల - సంయుతులు = తీవ్రతరమైన ప్రతాపము, పరాక్రమము అనువానితోఁగూడుకొన్నవారు, ఊర్జిత - శక్తి - యుక్తులు గొప్పశక్తితోఁగూడినవారు, (అగు) ఆఖండల - జంభులు = ఇంద్రుఁడును, జంభుఁడును, ఒండొరులకంటెన్ = ఒకరికంటె నొకరు, బలంబున్, చలంబున్ =

పట్టుదలయు, కాయ్పున్ = కోరికయు, ఒండొండ = క్రమక్రమముగా, మనంబులోన్= మనస్సులో, తనరన్ = ఒప్పఁగా, ఊఱడక = శాంతింపక, రెండు - బలంబులన్ = రెండు సైన్యములను, పొరిఁబొరిన్ = మాటిమాటికి, దురంబునన్ = యుద్ధములో, కడికండలు + కాన్ = ముక్కలగునట్లు, బాణ - సంహతిన్ = బాణముల సమూహమును, ఏసిరి = ప్రయోగించిరి

**తాత్పర్యము** తీవ్రతరమైన ప్రతాపపరాక్రమములు గలవారును, గొప్ప శక్తి గలవారును అగు ఇంద్రజంభులు, ఒకరికంటె నొకరికి మనస్సులోఁ గ్రమముగా బలము,చలము, కోరిక ఒప్పఁగా, యుద్ధములో రెండుసైన్యములను మాటిమాటికి ముక్కలుగా బాణసమూహమును శాంతింపక ప్రయోగించిరి

వ **ఇట్లు ధనుర్విద్యానేకాయుధకౌశలంబులు మెఱసి గజారోహణపరిణతి మెఱయ నుద్యుక్తులై నిజగజంబుల మొగవడంబులెత్తి యొండొంటిం జూపిన** 68

**అర్థము** ఇట్లు ధనుస్ (.) + విద్యా + అనేక + ఆయుధ - కౌశలంబులు = విలువిద్యయందు, పె క్కాయుధములందు నేర్పులు, మెఱసి = మెఱయించి, గజ + ఆరోహణ - పరిణతి = ఏనుఁగు నెక్కుటయందు పరిపక్వత, మెఱయన్ = మెఱయించుటకు, ఉద్యుక్తులు + ఐ = పూనినవారయి, నిజ - గజంబుల - మొగవడంబుల = తమయేనుఁగుల ముఖకవచములు, ఎత్తి, ఒండొంటన్ = ఒకదానినొకటి, చూపినన్

**తాత్పర్యము.** ఇట్లు విలువిద్యయందలి, పెక్కాయుధములందలి నేర్పులు మెఱయించి గజారోహణపాండిత్యము మెఱయింప నుద్యమించినవారయి తమ యేనుఁగుల ముఖకవచము లెత్తి ఒకదానికొకటి చూపఁగా - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు:** మెఱసి - మెఱయించి - 'కరుఁగు తలఁగు మెఱ య్యాదు లంతర్భావితప్రేరణంబులు ' ప్రౌఢ క్రియ 34

క **ఆంక గొన నుభయబలములుఁ**
**బొంకం బఱి తలరి పెలర భువి గ్రక్కదలన్**
**వీంక మదకరులు రెండుం**
**దాంకె వడిం గొండఁ గొండ తాఁకిన భంగిన్** 69

**అర్థము .** ఉభయ-బలములున్ = రెండు సైన్యములును, ఆంక - ఆఁక + కొనక = అడ్డులేక, పొంకంబు + అటి = గర్వము నశించి, తలరి = చలించి, పెలరన్ = తొలఁగఁగా, భువి = భూమి, గ్రక్కదలన్ = కంపింపఁగా, వీంకన్ = పరాక్రమముతో, మద - కరులు - రెండున్ = మదపుటేనుఁగులు, రెండును, కొండన్ - కొండను, కొండ, తాఁకిన - భంగిన్ = తాఁకిన విధమున, వడిన్ = వేగముగా, తాంకెన్ = తాఁకెను

**అర్థము** రెండ సేనలును అడ్డులేక గర్వము నశించి చలించి తొలఁగఁగా, భూమి కంపింపఁగా, మదగజములు రెండును, పరాక్రమముతో కొండను గొండ తాఁకిన విధమున వడిగాఁ దాఁకెను

**విశేషములు .** అలంకార ముపమ - అర్ధానుస్వారయుక్తరూపములను పూర్ణానుస్వారయుక్తములుగాఁ బ్రయోగించుట నన్నెచోడని ప్రాచీనతకు నిదర్శనము

**వ అట్లు కోపావేశంబునం దలపడి 70**

**అర్థము .** అట్లు, కోప + ఆవేశంబునన్ = కోపోద్రేకముతో, తలపడి = ఎదుర్కొని

**తాత్పర్యము .** అట్లు కోపోద్రేకముతో నెదుర్కొని - తరువాతి పద్యముతో నన్వయము

**చ ఘనతరదీర్ఘ దంతములు కైపున నూటియుఁ, గేలు గేలుతోఁ**
**బెనఁచియుఁ, బట్టి రాఁదిగిచి పెల్కుటఁ ద్రోచియు, నెత్తి ద్రోచినన్**
**వెనుకన నిల్చియుం, గదియ వీఁకున జంగమపర్వతంబులో**
**యన దివిజేంద్రుదంతి దివిజాహితదంతులు పొల్చెఁ బోరిలోన్ 71**

**అర్థము.** ఘనతర - దీర్ఘ - దంతములు = మిక్కిలి పొడవైన దంతములు, కైపునన్ = కోపముతో, నూటియున్, కేలు = తొండము, కేలుతోన్ = తొండముతో, పెనఁచియున్ = పెనవైచియు, పట్టి = పట్టుకొని, రాన్ = వచ్చునట్లు, తిగిచి = లాగి, పెల్కుటన్ = భయపడునట్లు, త్రోచియున్, ఎత్తి, త్రోచినన్ = త్రోయఁగా, వెనుకన్ + అ =వెనుకనే, నిల్చియున్, వీఁకునన్ = పరాక్రమముతో, కదియన్ = సమీపింపఁగా, జంగమ - పర్వతంబులో + అనన్ = చలించు కొండలో యనునట్లు, దివిజ + ఇంద్రు - దంతి - దివిజ + అహిత-దంతులు= దేవేంద్రుని ఏనుఁగు, రాక్షసుని యేనుఁగు, పోరిలోన్ = యుద్ధములో, పొల్చెన్ = ఒప్పెను

**తాత్పర్యము :** యుద్ధములో దేవేంద్రుని, రాక్షసుని యేనుఁగులు మిక్కిలి పొడవైన దంతములు కోపముతో రాచియు, తొండమును తొండముతోఁ బెనవైచియు ఒకదానినొకటి పట్టివచ్చునట్లు లాగి భయంకరముగాఁ ద్రోచియు, పైకెత్తి త్రోయుఁగా వెనుకనే నిలిచియు, పరాక్రమముతోఁ గదియఁగాఁ జలించు పర్వతములో యనఁ బొలిచెను

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష, స్వభావోక్తి

**వ ఇ ట్లనేక ప్రకారంబులం బెద్దప్రొద్దు మహాఘోరయుద్ధంబు సేసి జంభాసురేంద్రుఁ డయ్యమరేంద్రుపై లంఘించి పట్టికొన నను వు సేయుట గని వజ్రి వజ్రాయుధం బెత్తికొని మెట్టివైచిన 72**

**అర్థము .** ఇట్లు, అనేక - ప్రకారంబులన్, పెద్ద- ప్రొద్దు = చాల సేపు, మహత్ (మహా) + ఘోర - యుద్ధంబులు = మిక్కిలి భయంకరములైన యుద్ధములు, చేసి, జంభ + అసుర + ఇంద్రుండు, ఆ + అమర + ఇంద్రుపైన్ = ఆ దేవేంద్రుని మీఁద, లంఘించి = దుమికి, పట్టికొనన్ = పట్టుకొనుటకు, అనువు + చేయుట = సిద్ధపఱుచుట, కని, వజ్రి = ఇంద్రుఁడు, వజ్ర + ఆయుధంబు, ఎత్తికొని, మెట్టివైచినన్ = పూని ప్రయోగింపఁగా

**తాత్పర్యము** · ఇట్లు పెక్కు రీతులఁ జాలసేపు మిక్కిలి భయంకరములైన యుద్ధములు చేసి జంభరాక్షసుఁడు ఆ దేవేంద్రునిపై దుమికి పట్టుకొనుటకు సిద్ధపడుట చూచి ఇంద్రుఁడు వజ్రాయుధమునెత్తి ప్రయోగింపఁగా - తరువాతి పద్యముతో నన్వయము

**చ బలువిడిఁ దాఁకి వీఁకఁ గులపర్వతసంహతి పక్షమూలముల్**
**కలుషముతోఁ దగం దునుము గాయమునం బటుజృంభణంబుతో**
**బలు తల ద్రెవ్వఁబాఱియు నుపాయమునన్ సురశత్రు వృత్రు ద్ర**
**య్యలు వడఁ దాఁకు కైవున మహాశని జంభునురంబు దాఁకినన్ 73**

**అర్థము .** బలువిడిన్ = బలాత్కారముగా, తాఁకి, వీఁకన్ = పరాక్రమముతో, కుల - పర్వత - సంహతి - పక్ష - మూలముల్ = కుల పర్వతముల సమూహముయొక్క ఱెక్కల మొదళ్లు, కలుషముతోన్ = కోపముతో, తెగన్ = తెగునట్లు, తునుము =ఖండించు, కాయమునన్ = లక్ష్యముతో (?), పటు - జృంభణంబుతోన్ = తీవ్రమైన విజృంభణముతో, బలు - తల = గొప్ప శిరస్సు,

ద్రెవ్వన్ = తెగునట్లు, పాటియున్ = పరువిడియు, ఉపాయమునన్ = ఉపాయముతో, సుర - శత్రున్ - వృత్రున్ = రాక్షసుఁడైన వృత్రుని, వ్రయ్యలు + పడన్= ముక్కలగునట్లు, తాఁకు - కైవునన్ = తాఁకు నుద్రేకముతో, మహత్ (మహా) + అశని = గొప్ప వజ్రాయుధము, జంభు + ఉరంబు = జంభాసురుని ఱొమ్ము, తాఁకినన్ = తాఁకఁగా

**తాత్పర్యము** పరాక్రమముతోఁ గులపర్వతముల ఱెక్కల మొదళ్లు తెగునట్లు నఱకు లక్ష్యముతో, గొప్ప శిరస్సు తెగునట్లు పరువెత్తియు, ఉపాయముతో ముక్కలగునట్లు వృత్రాసురుని తాఁకు గర్వమున వజ్రాయుధము జంభుని ఱొమ్ముతాఁకఁగా - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** అలంకార ముపమ కైవు = కైపు 'కైవెక్కిన'

-ఉ హరి 2-150

క కరిమీఁదనుండి జంభా
సురుఁ డుక్కటి నేలఁగూలె సురవల్లభు ను
ద్దుర వజ్రాహత గతి సురు
చిర మగు నీలాచలోరుశిఖరము పోలెన్ 74

**అర్థము** సుర - వల్లభు + ఉద్దుర - వజ్ర + ఆహత - గతిన్ = దేవేంద్రుని యొక్క, దృఢమైన, వజ్ర = వజ్రాయుధముయొక్క, ఆహత-గతిన్ = దెబ్బచే, సురుచిరము + అగు = మిక్కిలి మనోహరమైన, నీల + అచల + ఉరు - శిఖరము - పోలెన్ = నల్లని కొండయొక్క గొప్ప శిఖరము వలె, కరి-మీఁదనుండి = ఏనుఁగుపై నుండి, జంభ + అసురుఁడు, ఉక్కు + అటి = బలము నశించి, నేలన్, కూలెన్

**తాత్పర్యము :** దేవేంద్రుని వజ్రాయుధముదెబ్బచే నీలాద్రి మహాశిఖరమువలె నేనుఁగుపై నుండి జంభాసురుఁడు బలము చెడి నేలఁగూలెను

**విశేషములు .** అలంకార ముపమ

వ ఇట్లు జంభాసురేంద్రు వధియించి సురేంద్రుండు సంగరరంగ జయాంగనాసంగతుం డయ్యె నంత 75

**అర్థము .** ఇట్లు, జంభ + అసుర + ఇంద్రున్, వధియించి, సుర + ఇంద్రుండు, సంగర - రంగ - జయ + అంగనా - సంగతుండు = యుద్ధవిజయమనెడి స్త్రీతోఁ గూడినవాఁడు, అయ్యెన్ అంతన్

**తాత్పర్యము .** ఇట్లు జంభాసురుని వధించి దేవేంద్రుఁడు యుద్ధ విజయమనెడి స్త్రీతోఁగూడినవాఁడయ్యెను అంత - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** సంగరరంగజయాంగనా - అలంకారము రూపకము

గీ **తెరలి పరచక్రములు పొది విరిసి పఱవ**
**దనుజవాహినిలోఁ గుముదములు పెరుఁగఁ**
**దారకప్రభ కధికమై తనరి వెలిఁగె**
**నాజినభమందు సురరాజు తేజ మడరి** 76

**అర్థము** ఆజి - నభము + అందున్ = యుద్ధరంగమనెడి ఆకాశమందు, సుర - రాజు - తేజము = దేవేంద్రుని తేజస్సు, అడరి = అతిశయించి, పర - చక్రములు = శత్రుసమూహములు, శత్రువులనెడు చక్రవాకములు, తెరలి = కలఁగి, పొది విరిసి = విడిపోయి, పఱవన్ = పరువెత్తఁగా, దనుజ - వాహినిలోన్ - రాక్షససేనయనెడినదిలో, కుముదములు = కు + ముదములు = విచారములు అనెడి కలువలు, పెరుఁగన్ = వృద్ధిపొందఁగా, తారక - ప్రభకున్ - అధికము + ఐ = తారకాసురుని తేజస్సుకంటె గొప్పదయి - నక్షత్రముల కాంతికంటె నెక్కువయి తనరి = ఒప్పి, వెలిఁగెన్ = ప్రకాశించెను

**తాత్పర్యము .** యుద్ధభూమియనెడు ఆకాశమున దేవేంద్రుని తేజస్సు అతిశయించి, శత్రుసమూహములనెడు చక్రవాకములు కలఁగి విడిపోయి పరువెత్తఁగా, రాక్షససేనయనెడు నదిలోఁ గుముదములనెడి కలువలు వృద్ధిపొందఁగా, తారకాసురుని తేజస్సుకంటె - నక్షత్రములకాంతికంటె మిన్నయై యొప్పి ప్రకాశించెను

**విశేషములు .** అలంకారము శ్లిష్టరూపకము

వ **ఇట్లు జంభాసురుండు తారకాసురేంద్రు నఖిలభువనరాజ్యమూల స్తంభంబు విఱిగిపడినట్లు పడినం దారకుండు వెన్ను విఱిగి పడి నిశ్చేష్టితుండై యున్న నిజేశ్వరునకు నుత్సాహముగాఁ బలికె నరకాసురుం డాసురభావంబున** 77

**అర్థము :** ఇట్లు, జంభ + అసురుండు, తారక + అసుర + ఇంద్రు = తారక రాక్షసశ్రేష్ఠుని యొక్క, అఖిల - భువన - రాజ్య - మూల - స్తంభంబు =

ఎల్లలోకముల రాజ్యముయొక్క ప్రధాన స్తంభము, విఱిగి - పడిన + అట్లు, పడినన్, తారకుండు, వెన్ను -విఱిగిపడి = వెన్ను విఱిగిపోయి, నిశ్చేష్టితుండు + ఐ = చేష్టలు దక్కినవాఁడు అయి, ఉన్నన్, నిజ + ఈశ్వరునకున్ = తన ప్రభువునకు, ఉత్సాహంబు + కాన్, పలికి, నరక + అసురుండు, ఆసుర - భావంబునన్ = రాక్షసత్వముతో

**తాత్పర్యము** ఇట్లు జంభాసురుఁడు తారకుని ఎల్లలోకములనెడి రాజ్యము ప్రధానస్తంభము విఱిగిపడినట్లు పడఁగాఁ, దారకుఁడు వెన్నువిఱిగిపడి చేష్టలు దక్కియుండఁ, దన ప్రభువుననకు ఉత్సాహమగునట్లు పలికి నరకాసురుఁడు రాక్షసభావమున - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష

క **ధరణీచక్రము దిద్దిరఁ**
**దిరుగఁ, బయోనిధులు గలఁగ, దెసదప్పి భయా**
**తురులై సుర కిన్నర ఫణి**
**నరవరు లనిఁ దూలిపాఱ నరకుఁడు తాఁకెన్** 78

**అర్థము .** ధరణీ - చక్రము = భూవలయుము, దిద్దిరన్, తిరుగన్, పయోనిధులు = సముద్రములు, కలఁగన్ = కలఁతచెందఁగా, సుర - కిన్నర - ఫణి - నర - వరులు = దేవతలు, కిన్నరులు, నాగులు, మనుష్యశ్రేష్ఠులు, దెస + తప్పి = దిక్కుమాలి, భయ +ఆతురులు + ఐ = భయముచేఁ బీడింపఁబడినవారయి, అనిన్ = యుద్ధమునందు, తూలి - పాఱన్ = చలించిపరువిడఁగా, నరకుఁడు, తాఁకెన్

**తాత్పర్యము .** భూవలయము గిరగిరమని తిరుగఁగా, సముద్రములు కలఁతచెందఁగా, దేవతలు, కిన్నరులు, నాగులు, మనుజులు, దిక్కుతోఁచక, భయముచేఁ బీడితులై యుద్ధమునఁజలించి పాఱఁగా నరకుఁడు తాఁకెను

వ **ఇట్లు విలయకాలరుద్రోద్రేకంబున నఖిలజగజ్జనభయజననంబుగా నరకాసురుఁ డదల్చి తాఁకినం బుణ్యపరులగు సాధుజనంబులు బోలె** 79

**అర్థము.** ఇట్లు, విలయ - కాల - రుద్ర + ఉద్రేకంబునన్ = ప్రళయ సమయమునందలి రుద్రుని ఆవేశమువంటి ఆవేశముతో, అఖిల - జగత్ + జన - భయ - జననంబు + కాన్ = ఎల్లజగములందలి జనులకు వెఱపుపుట్టునట్లుగా,

నరక + అసురుఁడు, అదల్చి = గద్దించి, తాఁకినన్, పుణ్యపరులు + అగు = పుణ్యాత్ములయిన, సాధు - జనంబులున్ + పోలెన్ = సత్పురుషులవలె

**తాత్పర్యము.** ఇట్లు ప్రళయసమయరుద్రుని ఆవేశము వంటి ఆవేశముతో ఎల్లలోకములందలి జనులకు భయము గలుగునట్లు నరకాసురుఁడు గద్దించి తాఁకఁగాఁ బుణ్యాత్ములగు సజ్జనులవలె - తరువాతి పద్యముతో నన్వయము

## విష్ణు నరకాసురుల యుద్ధము

క నరకోగ్రభయాతురులై
సుర లనిఁ దన శరణు వచ్చిచొచ్చిన వారిం
గరుణించి కాచె నా హరి ,
హరి నరకభయాపహారి యగు డది యరుదే ? 80

**అర్థము** సురలు = దేవతలు, నరక + ఉగ్ర - భయ + ఆతురులు + ఐ = నరకుఁడనెడు ఉగ్రుని వలని భయముచేఁ బీడితులయి, అనిన్ = యుద్ధమున, తన - శరణు - వచ్చి - చొచ్చినన్ = తన్ను శరణుచొరఁగా, ఆ - హరి = ఆ విష్ణువు, వారిన్, కరుణించి = దయఁజూపి, కాచెన్ = రక్షించెను, హరి = విష్ణువు, నరక, భయ + అపహారి = నరకుని వలని భయమును బోఁగొట్టువాఁడు - నరకము వలని భయమును బోఁగొట్టువాఁడు, అగుడు = అగుట, అది , అరుదే = ఆశ్చర్యమా?

**తాత్పర్యము** నరకుఁడనెడు ఉగ్రునివలని భయముచేఁ బీడితులయి, దేవతలు యుద్ధమునఁ దన్ను శరణు చొరఁగా ఆ విష్ణువు వారిని దయతో రక్షించెను విష్ణువు నరకభయమును బోఁగొట్టువాఁడగుట యేమి ఆశ్చర్యము ?

**విశేషములు .** అలంకార ముపమ, అర్థాంతరన్యాసము, శ్లేషము

వ **ఇట్లయ్యమరవరులం గైకొని తన్నుం గైకొనక ప్రతిఘటించి నిలిచిన శార్ఙ్గధరునిం గైకొన కని నరకాసురుం డుగ్ర భావంబున నిలిచి నీలాచలంబుపైఁ గురియు లయకాలనీలమేఘంబునుంబోలె నపారబాణాసారంబునం దేల్చుచున్న దనుజుదెసఁ గని దనుజారి కోపహాసవిలసి తాన నుండగుచు 81**

**అర్థము :** ఇట్లు, ఆ + అమరవరులన్ = ఆ దేవతాశ్రేష్ఠులను, కైకొని = స్వీకరించి, తన్నున్, కైకొనక = లెక్కచేయక, ప్రతిఘటించి = ఎదిరించి, నిలిచిన = నిలిచినట్టి, శార్ఙ్గ ధరునిన్ = శార్ఙ్గమనెడివింటిని దాల్చినవానిని - విష్ణువును, కైకొనక = లక్ష్యపెట్టక, అనిన్ = యుద్ధమున, నరక + అసురుండు, ఉగ్ర- భావంబునన్ = భయంకరత్వముతో, నిలిచి, నీల + అచలంబుపైన్ = నల్లని

కొండపై, కురియు, లయ - కాల - నీల - మేఘంబునున్ + పోలెన్ = ప్రళయ సమయమందలి నల్లని మేఘమువలె, అపార - బాణ + ఆసారంబునన్ = అధికమైన అంపవానయందు, తేల్చుచున్ + ఉన్నన్, దనుజు - దెసన్ + కని = రాక్షసునివైపుచూచి, దనుజ + అరి = రాక్షసవైరి -విష్ణువు, కోప - హాస - విలసిత + ఆననుండు + అగుచున్ = కోపముచేతను, నవ్వుచేతను బ్రకాశించిన ముఖము గలవాఁడగుచు

**తాత్పర్యము .** ఇట్లు ఆ దేవతాశ్రేష్ఠులను స్వీకరించి తన్ను లక్ష్యపెట్టక ఎదిరించి నిలిచినట్టి విష్ణువును లెక్కచేయక యుద్ధమున నరకాసురుఁడు భయంకరుఁడై నిల్చి నీలాద్రిపైఁ గురియు ప్రళయసమయనీలమేఘమువలె అధికమైన అంపవానయందుఁ దేల్చుచుండఁగా, ఆ రాక్షసుని వైపు చూచి విష్ణువు కోపహాసములచే నొప్పు ముఖముగలవాఁడగుచు తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** అలంకార ముపమ

క వడి నరకుఁడేయు నమ్ములు
నడుమనె తెగనేసి మార్గణము లొం డ్లొగి (వీ
డ్వడకుండఁ బఱపఁదొడఁగెను
బిడుగులపిండువలె శార్ఙ్గి పెనుగోపమునన్ ) 82

**అర్థము.** నరకుఁడు, ఏయు + అమ్ములు = ప్రయోగించుబా శార్ఙ్గిములు, వడిన్ - వేగముగా, నడుమన్ + ఎ = నడుమనే, తెగన్ + ఏసి = ముక్కలుచేసి, శార్ఙ్గి- విష్ణువు, మార్గణములు + ఒండ్లు = వేఱుబాణములు, ఒగిన్ = క్రమముగా, వీడ్వడక + ఉండన్ = తడఁబడకుండునట్లు - పిడుగుల - పిండు - వలెన్ = పిడుగుల సమూహమువలె, పెను + కోపమునన్ = మహాక్రోధముతో, పఱపన్ + తొడఁగెను = ప్రయోగింప నారంభించెను

**తాత్పర్యము :** విష్ణువు నరకుఁడు బ్రయోగించు బాణములను నడుమనే ఖండించి వేఱుబాణములను దడఁబడకుండునట్లు మహాకోపముతోఁ బిడుగుల సమూహమువలెఁ బ్రయోగింప నారంభించెను

*(ఈ పద్య మసమగ్రముగా నున్నది కుండలీకరణములలోనున్నది శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి పూరణము)*

## విష్ణు మురాసురల యుద్ధము

క (క్రందుకొని ప్రబలసురబల)
మందఱఁ గ్రక్కింతు నొంతునచ్యుతు నంచున్
బృందారకతతి బెదర ము
కుందునిఁ దలపడియె నొదరికొని మురుఁ డలుకన్ 83

**అర్థము.** (ఈ పద్యమునందలి మొదటి మూఁడు గణములు వ్యాఖ్యములు కుండలీకరణములలోనిది శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారి పూరణము ) క్రందుకొని = అతిశయించి, ప్రబల -సుర-బలము + అందఱన్ = మిక్కిలి బలవంతులైన దేవతావీరులనందఱను, క్రక్కింతున్ = క్రక్కుకొనునట్లు చేయుదును, అచ్యుతున్ = విష్ణువును, నొంతున్ = బాధింతును, అంచున్, బృందారక - తతి = దేవతా సమూహము, బెదరన్ = భయపడఁగా, మురుఁడు = మురుఁడను రాక్షసుఁడు, అలుకన్ = కోపముతో, ఒదరికొని = విజృంభించి, ముకుందునిన్ = విష్ణువును, తలపడియెన్ = ఎదుర్కొనెను

**తాత్పర్యము.** దేవతావీరుల నందఱను అతిశయముతోఁ గ్రక్కింతును విష్ణువును బాధింతుననుచు దేవతలు భయపడఁగా మురాసురుఁడు కోపమున విజృంభించి కోపముతో విష్ణువును మార్కొనెను

వ ఇట్లు తన్ను ముట్టిమూఁదలించుచు నురులంబఱతెంచు మురుం గని చక్రపాణి కోపించి చక్రంబున వైచుడు 84

**అర్థము:** ఇట్లు, తన్నున్, ముట్టి మూదలించుచున్ = తాఁకుచు, ఉరులన్+ పఱతెంచు = మీఁదికి వచ్చు, మురున్, కని, చక్రపాణి = చక్రము చేతియందుఁగలవాఁడు - విష్ణువు, కోపించి చక్రంబునన్ = చక్రాయుధముతో (సుదర్శనముతో), వైచుడున్ = కొట్టినంతనే

**తాత్పర్యము.** ఇట్లు, తన్నుఁదాఁకుచు మీఁదికి వచ్చు మురాసురునిఁజూచి విష్ణువు కోపించి సుదర్శనముతోఁగొట్టినంతనే - తరువాతి పద్యముతో నన్వయము

క మురువక్షము నో వ్రచ్చుచు
హరిచక్రము పిఱుఁద వెడలె నరుణద్యుతితోఁ
దరుణార్కబింబ మసితా
విరాళాబ్దమునందు వెడలి వెలుఁగువిధమునన్. 85

**అర్థము** తరుణ + అర్క - బింబము = బాల సూర్య బింబము, అసిత + అవిరళ + అబ్దమునందున్ = నల్లని దట్టమైన మేఘమునందుండి, వెడలి = వెలికివచ్చి, అరుణ - ద్యుతితోన్ = ఎఱ్ఱని కాంతితో, వెలుఁగు - విధమునన్ = ప్రకాశించువిధమున, హరి - చక్రము = విష్ణుచక్రము - సుదర్శనము, మురు - వక్షమున్ = మురాసురుని ఱొమ్మును, నోన్ + వ్రచ్చుచున్ = నొచ్చునట్లు చీల్చుచు, అరుణ-ద్యుతితోన్ = రక్తకాంతితో, పిఱుఁదన్ = వెనుకనుండి, వెడలెన్ = వెలికివచ్చెను

**తాత్పర్యము** బాలసూర్యబింబము నల్లని, దట్టమైన మేఘమునందుండి వెలికివచ్చి ఎఱ్ఱనికాంతితోఁ బ్రకాశించు విధమున విష్ణుచక్రము మురాసురుని ఱొమ్మను నొచ్చునట్లు భాధించుచు రక్తకాంతితో వెనుకనుండి వెలికివచ్చెను

**విశేషములు.** అలంకార ముపమ 'అరుణ ద్యుతితోన్' అనుచో శ్లేషము అసితావిరళాబ్దము నందు వెడలి - అసితావిరళాబ్దము వలన వెడలి అపాయార్థమునందు వలనవర్ణకము బాల కారక 9 'ఉండిపదం బొకానొకచో వలన వర్ణకంబున కనుప్రయుక్తంబగు' బాల కారక 10 అసితావిరళాబ్దమ్ము వలననుండి వెడలి, 'ఉండి శబ్దము పరంబగునపుడు వలనకు ద్వితీయాసప్తములు ప్రాయికంబుగ నగు ' బాల కారక 11 అసితావిరళాబ్దమునందుండి వెడలి 'వలన కాదేశంబగు ద్వితీయాసప్తముల మీఁదియుండికి లోపంబు బహుళంబుగా నగు ' ప్రౌఢ కారక 11 అసితావిరళాబ్దమునందు వెడలి ఇట్లే పిఱుఁద వలన నుండి వెడలె - పిఱుఁద నుండి వెడలె వలనకు ద్వితీయ పిఱుఁద వెడలె - ద్వితీయమీఁది ఉండికి లోపము ప్రౌఢ కారక 11

## నర సహస్రకవచాసురుల యుద్ధము

**వ ఇట్లు మురాసురుండు కోమలమృణాలంబునుంబోలె రథాంగ పాణిరథాంగంబునకుం గబళంబైనం గోపించి సహస్రకవచుండు సహస్రముఖుండునుంబోలె మరుత్సమూహంబుం ద్రోవ నప్పళించుచు హరిపై నురులం బఱతెంచుటఁగని నరుండు నారాయణునకు నెడసొచ్చి మార్కొని నిలిచినం గని దనుజుండు విస్మితుండై మందస్మితాననుం డగుచు 86**

**అర్థము.** ఇట్లు, మురు + అసురుండు = మురరాక్షసుఁడు, కోమల = మృణాలంబునున్ + పోలెన్ = మృదువైన తామరతూఁడు విధమున, రథాంగ - పాణి - రథాంగంబునకున్ = విష్ణుచక్రమునకు, కబళంబు + ఐనన్ = ముద్ద (ఆహారము) కాఁగా, సహస్రకవచుండు = సహస్రకవచుఁడను పేరుగల రాక్షసుఁడు, సహస్ర ముఖుండునున్ + పోలెన్ = వేయి ముఖములుగలవాని విధమున, మరుత్

+ సమూహంబున్ = దేవతల సమూహమును, త్రోవన్ = పాఱఁద్రోలుటకు, అప్పళించుచున్ = ఉత్సహించుచు, హరిపైన్ = విష్ణునిమీఁద, ఉరులన్ + పఱతెంచుటన్ = దండెత్తివచ్చుటను, కని, నరుండు, నారాయణునకున్ = విష్ణునకు, ఎడ + చొచ్చి = నడుమవచ్చి, మార్కొని = ఎదురుకొని, నిలిచినన్ = నిలువఁగా, దనుజుండు = రాక్షసుఁడు (సహస్రకవచుఁడు), విస్మితుండు + ఐ = ఆశ్చర్యపడినవాఁడయి, మంద - సిత్మ +ఆననుండు= చిఱునవ్వుతోడి ముఖము గలవాఁడు, అగుచున్

**తాత్పర్యము.** ఇట్లు మురాసురుఁడు మృదువైన తామరతూఁడు విధమున విష్ణుచక్రమున కాహారముకాఁగా సహస్రకవచుఁ డను రాక్షసుఁడు కోపించి సహస్రముఖుని విధమున దేవతల సమూహమును బాఱఁద్రోల నుత్సహించుచు, విష్ణునిపై దండెత్తవచ్చుట చూచి నరుఁడు నారాయణునకు నడుమవచ్చి మార్కొని నిలువఁగాఁ, జూచి రాక్షసుఁ డాశ్చర్యమునొంది చిఱునవ్వుతోడి ముఖము గలవాఁడగుచు - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు :** అలంకార ముపమ

ఆ నరుఁడ వీవు, నేను నరభోజనుండ, న
న్నెఱిఁగి యెఱిఁగి యిట్టు లీవు రాక
వేఁటకాని యిల్లు వెఱవక కుందెలు
సొచ్చినట్టు లెదిరి వచ్చితీవు 87

**అర్థము .** ఈవు, నరుఁడవు, నేను, నర - భోజనుండన్ = నరులు ఆహారముగాఁ గలవాఁడను, నన్నున్, ఎఱిఁగి, ఎఱిఁగి, ఇట్టులు, ఈవు, రాక =వచ్చుట, వేఁటకాని - ఇల్లు, వెఱవక = భయపడక, కుందెలు, చొచ్చిన + అట్టులు = ప్రవేశించిన విధముగా, ఈవు, ఎదిరి, వచ్చితి (వి)

**తాత్పర్యము .** 'నీవు నరుఁడవు నేను నరులను దినువాఁడను, నేను అట్టివాఁడనని తెలిసి తెలిసి, వేఁటకాని యిల్లు భయములేక కుందేలు ప్రవేశించు విధమున నీవు దండెత్తి వచ్చితివి

**విశేషములు :** అలంకార ముపమ

వ 'చక్కనై నిలువు' మనుచు నపారశరాసారంబు గురియుచున్నంగని కోపించి నరుం డన్నరభోజను శరనికరంబులతోన సహస్రకవచంబులు నొక్కట తెగనేసిన 88

**అర్థము** చక్కన + ఐ, నిలుము, అనుచున్, అపార - శర + ఆసారంబు = అధికమయిన బాణవర్షము, కురియుచున్ + ఉన్నన్, కని, కోపించి, నరుండు, ఆ + నర - భోజనున్ = ఆ రాక్షసుని, శర - నికరంబులతోన్ + ఎ = బాణ సమూహములతోనే, సహస్ర - కవచంబులున్ = వేయి కవచములును, ఒక్కట = ఒక్కమాఱుగా, తెగన్ + ఏసినన్ = ఖండింపఁగా

**తాత్పర్యము** 'చక్కఁగా నిలువుము' అనుచు అధికమైన అంపవాన కురియుచుండఁగాఁ జూచి నరుఁడు ఆ రాక్షసుని వేయికవచములును బాణ సమూహములతోనే ఒక్కమాఱుగా ఖండింపఁగా - తరువాతి పద్యముతోనన్వయము

**చ నరుని నిశాతసాయకగణప్రతతిం దెగి చూడఁజూడ జ**
**ర్జరితములై సహస్రకవచంబులుఁ బోయిన నిల్చె దానవుం**
**డురుతరభాతితోఁ బృథు పయోద సమూహము లొక్కపెట్ట దు**
**ర్భరతరచండవాతహతిఁ బాసిన నీలనగంబుఁ బోలెనై 89**

**అర్థము .** నరుని = నరునియొక్క, నిశాత - సాయక - గణ - ప్రతతిన్ = వాఁడియైన బాణముల సమూహముచే, తెగి, చూడన్ + చూడన్, సహస్ర కవచంబులున్ = వేయి కవచములును, జర్జరితములు + ఐ = తూంట్లుపడినవయి, పోయినన్ = పోఁగా, దానవుండు = రాక్షసుఁడు, ఉరుతర -భాతితోన్ = మిక్కిలి గొప్ప కాంతితో, పృథు - పయోద - సమూహములు = పెద్ద మేఘములగుంపులు, ఒక్కపెట్టన్ = ఒక్కమాఱుగా, దుర్భర - తర - చండ - వాత -హతిన్ = మిక్కిలి భరింపరాని తీవ్రమైన గాలిదెబ్బచే, పాసిన = పోయినట్టి, నీల - నగంబున్ + పోలెన్ +ఐ = నల్లని కొండవలెనయి, నిల్చెన్

**తాత్పర్యము :** నరుని వాఁడి బాణముల సమూహముచేఁదెగి తూంట్లుపడి వేయి కవచములును బోఁగా నా సహస్రకవచుఁడనెడి రాక్షసుఁడు మిక్కిలి కాంతితో మేఘముల సమూహము లొక్కమాఱుగా దుర్భరము, చండమునైన గాలి దెబ్బచేఁ బోయిన నీలాద్రివలె నయి నిలిచెను

**విశేషములు :** అలంకార ముపమ గణ - ప్రతతి శబ్దములు సమానార్థకములు ఈ కవి యిట్లు పెక్కుచోట్లఁ బ్రయోగించెను

**వ ఇట్లు సహస్రకవచుండు విగతకవచుండై నరశరప్రహతి కబ్బగింపక పలాయనపరాయణుండై చండాశుగప్రహతిం దూలు జలధరంబునుంబోలె వియత్తలంబున నదృశ్యుండయ్యె నంత 90**

**అర్థము.** ఇట్లు, సహస్రకవచుండు, విగత - కవచుండు + ఐ = పోయిన కవచము గలవాఁడయి, నర - శర - ప్రహతికిన్ = నరుని బాణముల దెబ్బకు, అబ్బగింపక = ఓర్వలేక, పలాయన-పరాయణుండు + ఐ = పాఱిపోవుటయం దాసక్తి గలవాఁడై చండ + ఆశుగ - ప్రహతిన్ = తీవ్రములయిన బాణముల దెబ్బచే, తూలు = చలించు, జలధరంబునున్ + పోలెన్ = మేఘమువలె, వియత్ + తలంబునన్ = ఆకాశప్రదేశమున, అదృశ్యుండు = కానరానివాఁడు, అయ్యెన్, అంతన్

**తాత్పర్యము.** ఇట్లు సహస్రకవచుఁడు కవచరహితుఁడై నరుని బాణముల దెబ్బ కోర్వక పాఱిపోవఁగోరువాఁడయి తీవ్రములయిన బాణముల దెబ్బచేఁ జలించు మేఘమువలె ఆకాశమునఁ గానరాకుండెను అంత - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు.** అలంకార ముపమ

## విష్ణు కాలనేముల యుద్ధము

ఆ హరి నదల్చి తాఁకె ధరణీతలమ్ము గ్ర
క్కదల, గిరులు పాఁతు గదలి కూలఁ,
ద్రిదశు లుదిలగొనఁగ, దేవేంద్రుఁ డల్లాడఁ
గాలఁ గరువ పోలెఁ గాలనేమి 91

**అర్థము.** కాలనేమి = కాలనేమియను రాక్షసుఁడు, ధరణీ - తలమ్ము = భూతలము, గ్రక్కదలన్ = మిక్కిలి కదలఁగా, గిరులు = కొండలు, పాఁతు + కదలి - కూలన్ = మొదలు చలించి కూలఁగా, త్రిదశులు = దేవతలు, ఉదిలగొనఁగన్ = చలింపఁగా, దేవేంద్రుఁడు, కాలన్ - అల్లాడన్ = కాలిచేఁజలింపఁగా (?), కరువ + పోలెన్ = కొండవలె, హరిన్ = విష్ణువును, అదల్చి = గద్దించి, తాఁకెను

**తాత్పర్యము.** కాలనేమి యను రాక్షసుఁడు భూమి మిక్కిలి చలింపఁగా, కొండలు మొదలు చలించి కూలఁగా, దేవతలు సంచలింపఁగా, దేవేంద్రుఁడు కాలనల్లాడఁగా (?) కొండవలె విష్ణువును గద్దించి తాఁకెను

**విశేషములు:** అలంకారము ఉపమ

వ ఇట్లు - శతముఖ దశశతకర పరిశోభితుండై యనేక విధాయుధవర్షంబులు గురియుచుం దెరలనెత్తివచ్చుటఁ గని శార్ఙ్గపాణియు వానికిం బ్రతిఘటించి నిలిచిన 92

**అర్థము** ఇట్లు శత - ముఖ - దశ-శత -కర - పరిశోభితుండు + ఐ = నూఱు మొగములతో, వేయి చేతులతో నొప్పినవాఁడయి, అనేక - విధ + ఆయుధ - వర్షంబులు = పలురీతులయిన ఆయుధముల వానలు, కురియుచున్, తెరలన్ + ఎత్తివచ్చుటన్ + కని = దండెత్తివచ్చుట చూచి, శార్ఙపాణియున్ = విష్ణువును, వానికిన్, ప్రతిఘటించి = ఎదిరి, నిలిచినన్

**తాత్పర్యము .** ఇట్లు నూఱుముఖములు, వేయిచేతులు గలిగి యొప్పుచున్నవాఁడయి పలురీతులయిన ఆయుధముల వానలు కురియుచు దండెత్తివచ్చుటఁ జూచి విష్ణువు వాని నెదిరి నిలువఁగా - తరువాతి పద్యముతో నన్వయము

ఉ **ఆ హరికాలనేములు శరాసనకౌశల మొప్ప నేసి రు**
**గ్రాహవభూమి బాణనికరాగ్ర విఖండిత వారణాశ్వ దే**
**వాహిత దేవ సద్భటమయంబుగ భిన్నతరాస్త్రశస్త్రసం**
**దోహముగా నవారుణనదుల్ కుణపాద్రులు ముంచి పాఱఁగాన్** 93

**అర్థము** ఆ - హరి - కాలనేములు = ఆ విష్ణువును, కాలనేమియు, ఉగ్ర + ఆహవ - భూమి = భయంకరమయిన యుద్ధభూమి, బాణ - నికర + అగ్ర - విఖండిత - వారణ + అశ్వ - దేవ + అహిత - దేవ - సత్ + భట - మయంబుగన్ = బాణముల సమూహముయొక్క కొనలచే ముక్కలు చేయఁబడిన ఏనుఁగులు, గుఱ్ఱములు, రాక్షసులు, దేవతలు, సద్వీరులు అనువారితో నిండినదిగా, భిన్నతర +అస్త్ర - శస్త్ర - సందోహము + కాన్ = భేదింపఁబడిన అస్త్రములయు శస్త్రములయు సమూహము గలదిగా, నవ + అరుణ - నదుల్ = క్రొన్నెత్తుటి నదులు, కుణప + అద్రులు = పీనుఁగులనెడి కొండలు, ముంచి, పాఱఁగాన్ = ప్రవహింపఁగను, శరాసన - కౌశలము = వింటి నేర్పు, ఒప్పన్, ఏసిరి = కొట్టిరి

**తాత్పర్యము.** ఆ విష్ణువును గాలనేమియును భయంకరమైన యుద్ధభూమి బాణసమూహముచే ముక్కలు చేయఁబడిన ఏనుఁగులతో, గుఱ్ఱములతో, రాక్షసులతో, దేవతలతో, సద్భటులతో నిండినదియగునట్లును, విఱుగఁగొట్టఁబడిన అస్త్ర శస్త్ర సమూహముగలది కాఁగా, క్రొన్నెత్తుటి నదులు శవములనెడి కొండలను ముంచి ప్రవహింపఁగా వింటినేర్పుమెఱయఁ బ్రయోగించిరి

**విశేషములు** అలంకారము రూపకము

వ ఇట్లిరువురుం బెద్దప్రొద్దు మహాశరాసనకౌశలంబు మెఱయ నసమ సమరంబునం గాలనేమి లయకాల మహాకాలుండునుం బోలెం గోపించి రథాంగపాణి రథ రథ్య సారథుల నొక్కట విఖండించి పేర్చి యార్చినం గని విహగేంద్రవాహనుం డక్షణంబ విహగేంద్రారూఢుండై పాంచజన్యధ్వనితోన శార్ఙగుణధ్వని సెలంగుచుండం దెరలనెత్తి 94

**అర్థము**. ఇట్లు, ఇరువురన్, పెద్ద - ప్రొద్దు = చాలకాలము, మహత్ (మహా) - శరాసన - కౌశలంబు = గొప్పవింటినేర్పు, మెఱయన్, అసమ - సమరంబునన్ = అసమయుద్ధమునందు, కాలనేమి, లయ- కాల - మహాకాలుండునున్ + పోలెన్ = ప్రళయ సమయమునందలి శివుని విధమున, కోపించి, రథాంగపాణి -రథ - రథ్య - సారథులన్ = విష్ణుని రథమును, గుఱ్ఱములను, సారథులను, ఒక్కటన్ = ఒక్కమాఱుగా, విఖండించి = ముక్కలు చేసి, పేర్చి = విజృంభించి, ఆర్చినన్, కని, విహగ + ఇంద్ర - వాహనుండు = గరుడవాహనుఁడు, అక్షణంబు + అ = వెంటనే, విహగ + ఇంద్ర + ఆరూఢుండు + ఐ = గరుత్మంతునెక్కినవాఁడయి, పాంచజన్య - ధ్వని - తోన్ + అ = పాంచజన్యమనెడి శంఖనాదముతోనే, శార - గుణ - ధ్వని = శార్ఙమను వింటిఅల్లెవప్పుడు, చెలంగుచున్ + ఉండన్ = మ్రోయుచుండఁగా, తెరలన్ + ఎత్తి = దండెత్తి

**తాత్పర్యము**. ఇట్లు విష్ణుకాలనేము లిద్దఱును వింటినేర్పు మెఱయ నసమయుద్ధమునఁ గాలనేమి ప్రళయసమయమునందలి శివుని విధమునఁ గోపించి విష్ణుని రథమును, గుఱ్ఱములను, సారధిని ఒక్కమాఱుగా ముక్కలు చేసి విజృంభించి ఆర్వఁగాఁ జూచి విష్ణుఁడు వెంటనే గరుడు నారోహించి పాంచజన్యధ్వనితోపాటే శార్ఙ్గ గుణధ్వని మ్రోయుచుండఁగా దండెత్తి - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు**. అలంకార ముపమ

చ ఉరుభుజసత్ప్రతాపమున నొంది వెలుంగు నిశాచరేంద్రుపై
హరి శరవృష్టి గ్రచ్చఱ రయంబునఁ గప్పె రణాంతరంబునన్
దరగొని పర్వి కాలు నతిదావహుతాశనుపై మహాపయో
ధర గళితోరు భూరి జలధారలు గప్పినభంగిఁ బెల్కుఱన్ 95

**అర్థము**. హరి = విష్ణువు, ఉరు - భుజ - సత్ + ప్రతాపమునన్ = గొప్ప భజబలమును, ఒంది = పొంది, వెలుంగు = ప్రకాశించు, నిశాచర + ఇంద్రుపైన్ = రాక్షస శ్రేష్ఠునిపై, తరగొని (తరము +కొని) = క్రమముగా, పర్వి = వ్యాపించి, కాలు = కాలునట్టి, అతి - దావ - హుతాశనుపైన్ = గొప్ప కార్చిచ్చుపై, మహత్

(మహా) + పయోధర - గళిత + ఉరు - భూరి - జల - ధారలు = పెద్ద మేఘముల నుండి జాఱిన పెను నీటి ధారలు, కప్పిన - భంగిన్ = కప్పిన విధమున, పెల్కుఱన్ = భయపడఁగా, రణ + అంతరంబునన్ = యుద్ధభూమిలో, శర - వృష్టి = అంపవాన, క్రచ్చుఱన్ = శీఘ్రముగా, రయంబునన్ = వేగముగా, క్రప్పెన్

**తాత్పర్యము** గొప్ప భుజబలముతో నొప్పు రాక్షసునిపై విష్ణువు - క్రమముగా వ్యాపించి దహించు గొప్పకార్చిచ్చుపై మేఘములనుండి జాఱు నీటి ప్రవాహములు కప్పిన విధమున భయపడునట్లు యుద్ధభూమిలో అంపవాన శీఘ్రముగాఁ గప్పెను

**విశేషములు** అలంకార ముపమ

**వ ఇట్లు దృష్టి శీఘ్ర శర సంధాన దూరాపాత లక్ష్యభేదాద్యనేక ధనుర్విద్యారహస్యంబులు మెఱయం బ్రయోగించు మహారభసంబున 96**

**అర్థము .** ఇట్లు, దృష్టి - శీఘ్ర - శర - సంధాన - దూర + ఆపాత - లక్ష్య - భేద + ఆది + అనేక - ధనుస్ (ః) + విద్యా - రహస్యంబులు = దృష్టి శీఘ్ర శర సంధానము, దూరాపాత లక్ష్యభేదము మున్నగు పెక్కు ధనుర్విద్యయందలి రహస్యములు, మెఱయన్ = ప్రకాశింపఁగా, ప్రయోగించు, మహత్ (మహా) - రభసంబునన్ = మిక్కిలి వేగమున -

**తాత్పర్యము .** ఇట్లు దృష్టి శీఘ్రశరసంధానము, దూరపాత లక్ష్యభేదము మున్నగు పెక్కు ధనుర్విద్యారహస్యములు మెఱయునట్లు ప్రయోగించు గొప్ప వేగముతో - తరువాతి పద్యముతో నన్వయము

**గీ ఒక్కవింటన శార్ఙ్గిపై నొత్తి యేయు**
**నమ్ము లేనూఱు విండ్లను నాఁకగొనమిఁ**
**గలసి యూధంబు బలవంత మను జగంబు**
**పలుకు బొంకయ్యెనని దైత్యపతి చలించె 97**

**అర్థము** ఒక్క - వింటన్ + అ ఒక్కవింటితోడనే, శార్ఙ్గిపైన్ = శార్ఙ్గమనువిల్లు గలవాఁడు - విష్ణుఁడు, పైన్ + ఒత్తి = పైని గ్రుచ్చి, ఏయు = ప్రయోగించు, అమ్ములు = బాణములు,ఏ నూఱు - విండ్లను = అయిదు నూర్ల

విండ్లను, ఆఁక + కొనమిన్ = అడ్డగింపలేకపోవుటచే, కలసి = కూడి, యూధంబు = సమూహము, బలవంతము = బలము గలది, అను, జగంబు - పలుకు = లోకము మాట, బొంకు + అయ్యెన్ = అసత్యమయ్యెను, అని, దైత్య - పతి =రాక్షసరాజు, చలించెన్

**తాత్పర్యము.** శార్ఙి (విష్ణువు) శార్ఙమను తన ఒక్కవింటితోడనే మీఁదికి గ్రుచ్చి ప్రయోగించు బాణములు తన అయిదువందలవిండ్లు కూడ అడ్డగింపలేకపోవుటచే, 'కూడి సమూహము బలవంతమయిన దనులోకము మాట అసత్యమయ్యె' నని రాక్షసరాజు చలించెను

**క హర్షము చెడి శతముఖములు**
**ధర్షితరుచి నొంది వందఁ దద్బాణ మహో**
**వర్షమున నుడిగె నురుతర**
**వర్షాహతి నుడుగు వనజ వనమును బోలెన్ 98**

**అర్థము**· శత - ముఖములున్ = నూఱు మొగములును, హర్షము - చెడి = సంతోషము నశించి, ధర్షిత - రుచిన్ = దూషితమైన - స్పష్టమగు కాంతిని, ఒంది = పొంది, వందన్ = దుఃఖింపఁగా, ఉరుతర - వర్ష + ఆహతిన్ = గొప్పవానదెబ్బచే, ఉడుగు = నశించు, వనజ - వనమును + పోలెన్ = తామరలతోఁపువలె, తద్ + బాణ - మహత్ (మహో) - వర్షమునన్ = ఆ విష్ణువుయొక్క బాణములనెడి గొప్పవానచే, ఉడిగెన్ = నశించెను

**తాత్పర్యము :** కాలనేమి నూఱుమొగములును సంతోషములేక కాంతి నశించినవయి దుఃఖించి మిక్కిలి గొప్ప వానదెబ్బచే నశించు తామరతోఁపువలె, విష్ణుని పెన్నంపవానచే నశించెను

**విశేషములు .** అలంకార ముపమ రూపకానుప్రాణితము

**వ ఇట్లు నిజశరఘట్టనం దలరి నిశ్చేష్టితుండైయున్న కన్నెఱింగి నారాయణుండు నారాయణాస్త్రంబు దొడిగి రాక్షసేశ్వరు వక్షస్థలంబు వ్రయ్యనేసిన 99**

**అర్థము.** ఇట్లు, నిజ - శర - ఘట్టనన్ = తన బాణముల రాయిడిచే, తలరి = చలించి, నిశ్చేష్టుఁడు + ఐ + ఉన్న - కన్నెఱింగి = చేష్టలు దక్కియున్న జాడ తెలిసి, నారాయణుండు, నారాయణ + అస్త్రంబు, తొడిగి, రాక్షస + ఈశ్వరు-

వక్షస్+స్థలంబున్ = రాక్షసరాజు ఱొమ్మును, వ్రయ్యన్ + ఏసినన్ = బ్రద్దలగునట్లు కొట్టఁగా

**తాత్పర్యము** ఇట్లు తన బాణముల రాయిడిచేఁ జలించి చేష్టలుడిగియున్న జాడతెలిసి నారాయణుఁడు నారాయణాస్త్రము తొడిగి రాక్షసరాజు ఱొమ్ము బ్రద్దలగునట్లు కొట్టఁగా - తరువాతి పద్యముతో నన్వయము

తే కాలుఁడాదిగ దేవసంఘంబు నెల్లఁ
గాలుకొనకుండ నెగుచు విక్రమధనుండు
కాలవశమున నిజబాహుగర్వ ముడిగి
కాలగోచరుఁడయ్యె నా కాలనేమి 100

**అర్థము** కాలుఁడు = యముఁడు, ఆదిగన్ = మొదలుగా, దేవ - సంఘంబున్ + ఎల్లన్ = దేవతా సమూహమునంతను, కాలుకొనక + ఉండన్ = నిలువలేకుండునట్లు, ఎగుచు = తఱుమునట్టి, విక్రమ - ధనుండు = పరాక్రమము ధనముగాఁ గలవాఁడు, ఆ+ కాలనేమి = ఆ కాలనేమి, కాల - వశమునన్, నిజ - బాహు-గర్వము + ఉడిగి = తనదైన భుజబలగర్వము కోలుపోయి, కాల - గోచరుఁడు + అయ్యెన్ = మరణించెను

**తాత్పర్యము** . యముఁడు మున్నగు దేవతల సమూహమునంతను నిలువనీక తఱుము పరాక్రమధనుఁడు అగు ఆ కాలనేమి కాలవశముచేఁ దన భుజ పరాక్రమ గర్వము నశించి మృతిఁజెందెను

వ ఇట్లు కాలనేమి దుర్వారాక్షీణప్రాణసమీరణంబు దుర్వార నారాయణాస్త్రాపార ఘోర మహోరగంబున కాహారంబైనం దారకబలంబు చంద్రమండలంబు రాహుగ్రస్తంబైనం జలించు తారకబలంబునుం బోలెం జలాచల హృదయులగుచుండె నిట్లసురసామంతవర్గం బంతయు నిజబలపరివార సహితం బయ్యమరజలనిధి నిర్మగ్నంబైనం గని దాని కించుకయుఁ జలింపక తారకాసురేంద్రుండు నిజమూలబలంబునకుం జేయి వీచి సురవరులపై నురవడిం దెరలనెత్తుదెంచె నట్టి సమయంబున 101

**అర్థము** . ఇట్లు, కాలనేమి యొక్క, దుర్వార + అక్షీణ -ప్రాణ - సమీరణంబు = వారింపశక్యముకాని, తక్కువకాని ప్రాణమనెడి వాయువు, దుర్వార - నారాయణ + అస్త్ర + అపార - ఘోర - మహత్ (మహో) +

ఉరగంబునకున్ = వారింపరాని నారాయణాస్త్ర-మనెడి మిక్కిలి భయంకరమైన పెను పామునకు, ఆహారంబు + ఐనన్ = ఆహారము కాఁగా - నారాయణాస్త్రముచేఁ గాలనేమి చావఁగా ననుట, తారక-బలంబు = తారకాసురుని సైన్యము, చంద్ర - మండలంబు, రాహు - గ్రస్తంబు + ఐనన్ = రాహువుచే - గ్రసింపఁబడినది కాఁగా, చలించు, తారక - బలంబునున్ + పోలెన్ - నక్షత్రసమూహమువలె, చల + అచల - హృదయులు = చలించునట్టియు, చలింపనట్టియు, హృదయములు గలవారు, అగుచున్ + ఉండెన్, ఇట్లు, అసుర - సామంత - వర్గంబు + అంతయున్ = రాక్షస సామంతుల సమూహమంతయు, నిజ - బల - పరివార - సహితంబు = తమ సైన్య సమూహముతోఁ గూడి, ఆ + అమర - జలనిధి - నిర్మగ్నంబు = ఆ దేవతలనెడి సముద్రమునందు మునిఁగినది, ఐనన్ = కాఁగా, కని, దానికిన్, ఇంచుకయున్ = కొంచెమయినను, చలింపక, తారక + అసుర + ఇంద్రుండు = తారక రాక్షస శ్రేష్ఠుఁడు, నిజ మూల - లంబునకుబన్ = తన మూల బలమునకు, చేయి - వీచి = ఉత్సాహపఱిచి, సుర - వరులపైన్ = దేవతాశ్రేష్ఠులపై, ఉరవడిన్ = మిక్కిలి వేగముతో, తెరలన్ + ఎత్తుదెంచెన్ = దండెత్తెను, అట్టి సమయంబునన్

**తాత్పర్యము .** ఇట్లు కాలనేమి వారింపరాని(ప్రాణవాయువు వారింపరాని నారాయణాస్త్రమనెడి పెనుపామున కాహారము కాఁగా, తారకాసురుని సైన్యము చంద్రమండలము రాహుగ్రస్తము కాఁగాఁ జలించు చుక్కల గుంపువలెఁ జలాచల హృదయములు గలది అగుచుండెను ఇట్లు రాక్షసుని సామంతుల సమూహమంతయుఁ దన బలపరివారముతోఁగూడ ఆ దేవతలబలమనెడి సముద్రమునందు మునిఁగినది కాఁగాఁ జూచి దాని కొకింతేనిఁ జలింపక తారకాసురుఁడు తన మూలబలమున కుత్సాహము గలిగించి దేవతలపై వేగముతో దండెత్తెను అట్టి సమయమున - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** అలంకారము రూపకము

క **తారక కింకరు లుగ్రా**
**కారులు శతకోటు లొక్కకవిఁ గవిసిరి దు**
**ర్వారబలోపేతులు నర**
**నారాయణ దివిజ దివిజనాథులు వెఱవన్** 102

**అర్థము :** ఉగ్ర + ఆకారులు = భయంకరములయిన ఆకారములు గలవారు, శత-కోటులు = నూఱుకోటుల సంఖ్య గలవారు, (అగు), తారక -

కింకరులు = తారకాసురుని భటులు, దుర్వార-బల + ఉపేతులు = వారింపరాని బలములోఁగూడినవారు, (అగు) నర - నారాయణ - దివిజ - దివిజ - నాధులు = నరుఁడు, నారాయణుఁడు, దేవతలు, దేవేంద్రుఁడు (అనువారు), వెఱవన్ = భయపడఁగా ఒక్క - కవిన్ = ఒక్కపెట్టున, కవిసిరి = ఆక్రమించిరి

**తాత్పర్యము** భయంకరాకారులు అగు నూఱుకోటుల సంఖ్యగలవారు, (అగు), తారక - కింకరులు = తారకాసురుని భటులు, దుర్వార-బల +ఉపేతులు = వారింపరాని బలములోఁ గూడినవారు, (అగు), నర -నారాయణ - దివిజ - దివిజనాధులు = నరుఁడు, నారాయణుఁడు, దేవతలు, దేవేంద్రుఁడు (అనువారు), వెలవన్ = భయపడఁగా, ఒక్క - కవిన్ = ఒక్కపెట్టున, కవిసిరి = ఆక్రమించిరి

**తాత్పర్యము .** భయంకరాకారులు అగు నూఱుకోటుల తారకభటులు వారింపరానిబలముగల నరనారాయణులును దేవతలును, దేవేంద్రుఁడును భయపడఁగా నొక్కపెట్టున నాక్రమించిరి

## ప్రమథులు రాక్షసులను దాఁకుట

**వ ఇట్లాదిత్యమండలంబుపై నవయవంబునం గవియు రాహుమండలంబునుంబోలె నాదిత్యమండలంబుపై నురవడిం గవియు నసురకింకరగణంబు గని గణనాధుం డమరగణంబుం గనుంగొని వీరభద్రాది రుద్రగణంబులకుం జేయివీచినం గని హరిణపోతవ్రాతంబుపై లంఘించు కిశోరకేసరియుంబోలెఁ బ్రమథగణం బా యసుర కింకర గణంబులం జుట్టుముట్టుకొని మహారభసంబున**

**అర్థము .** ఇట్లు, ఆదిత్య - మండలంబుపైన్ = సూర్యబింబముపై, అవయవంబునన్=అంగముతో, కవియు =ఆక్రమించు రాహు - మండలంబునున్ + పోలెన్ = రాహుబింబమువలె, ఆదిత్య - మండలంబు - పైన్ = దేవతల సమూహముపై, ఉరవడిన్ = మిక్కిలివేగముతో, కవియు, అసుర - కింకర - గణంబున్ + కని= రాక్షసభటుల సమూహమును జూచి, గణనాధుండు = ప్రమథ గణనాయకుఁడు, అమర - గణంబున్ = దేవతల సమూహమును, కనుంగొని, వీరభద్ర + ఆది - రుద్ర - గణంబులకున్ = వీరభద్రుఁడు మున్నగు రుద్రుని గణములకు, చేయి - వీచినన్ = ఉత్సాహము గలిగింపఁగా, కని, హరిణ - పోత - వ్రాతంబుపైన్ = లేడిపిల్లల సమూహముపై, లంఘించు = దూఁకు, కిశోర - కేసరియున్ + పోలెన్ = బాల సింహమువలె, ప్రమథ -గణంబు, ఆ +అసుర - కింకర - గణంబులన్= ఆ రాక్షసుని భటుల సమూహములను, చుట్టుముట్టుకొని, మహత్ (మహా) - రభసంబునన్= గొప్పవేగముతో

**తాత్పర్యము** · ఇట్లు సూర్యమండలముపై సొంగముగాఁ గవియు రాహు బింబమువలె దేవతాసమూహముపై మిక్కిలి వేగముతోఁ గవియు రాక్షసభటుల సమూహమును గని గణనాయకుఁడు దేవతల సమూహమును జూచి వీరభద్రుఁడు మున్నగు రుద్రగణములకు ఉత్సాహము గలిగింపఁగాఁ గని జింకపిల్లల సమూహముపై దూఁకు బాలసింహమువలెఁ బ్రమథగణము ఆ రాక్షస భటులను జుట్టుముట్టికొని మిక్కిలి వేగముతో - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** అలంకార ముపమ

సీ వీ రొరుచేఁ దాఁకనీరని పో టుడ్గి
సుర నర కిన్నర వరులు సూడ,
నఱిముఱిఁ జంపెడుఁ గళకంరుగణ మని
యాతుధానావలి భీతి పొందఁ,
దనిపోవ శవములఁ దినఁగంటి మని భూత
గణ పిశాచాదులు రణము చేర
వేడుకతోఁ బోరు చూడంగఁగంటి నే
నని నారదుఁడు పొంగి గునిసియాడ

ఆ గగనవీథినుండి జగతిపైఁ జుక్కలు
డుల్లఁ, గుల నగములు పెల్లగిల్లఁ
బ్రళయ కాల భాతి నలిరేఁగి చంపెఁ ద
త్సమరభూమి నలిగి ప్రమథగణము 104

**అర్థము .** వీరు = ఈ ప్రమథులు, ఒరుచేన్ = ఇతరునిచేత, తాఁకన్ + ఈరు + అని = మార్కొననీరని, సుర - నర - కిన్నర -వరులు = దేవతలు, మనుష్యులు, కిన్నరులు అనువారిలో శ్రేష్ఠులు, పోటు + ఉడ్గి = యుద్ధము మాని, చూడన్,

కళకంరు - గణము = శివుని ప్రమథగణము, అఱిముఱిన్ = వేగముగా, చంపెడున్ + అని, యాతుధాన + ఆవలి = రాక్షసుల సమూహము, భీతి = భయము, పొందన్

తని + పోవన్ = తృప్తి తీఱునట్లు, శవములన్, తినన్, కంటిమి, అని, భూత - గణ - పిశాచ + ఆదులు = భూతలముల సమూహము, పిశాచములు మున్నగునవి, రణము = యుద్ధభూమి, చేరన్,

వేడుకతోన్, పోరు = యుద్ధము, నేను - చూడంగన్ + కంటిన్ + అని = నేను జూడఁగలిగితి నని, నారదుఁడు, పొంగి, గునిసి + ఆడన్ = కులికియాడఁగా,

చుక్కలు = నక్షత్రములు, గగన - వీధి నుండి = ఆకాశవీధి నుండి, జగతిపైన్ = భూమిమీఁద, డుల్లన్ = రాలఁగా, కుల - నగములు = కుల పర్వతములు, పెల్లగిల్లన్, ప్రమథ - గణము = ప్రమథుల సమూహము, అలిగి కోపించి, ప్రళయ-కాల-భాతిన్ = ప్రళయ సమయమువలె, నలిరేఁగి = విజృంభించి, తద్ + సమర - భూమిన్ = ఆ యుద్ధభూమిలో, చంపెన్

**తాత్పర్యము .** ప్రమథు లితరులను మార్కొనసీరని సురలు, నరులు, కిన్నరులు యుద్ధము మాని చూచుచుండఁగా, శివుని ప్రమథుల సమూహము వేగముతో చంపునని, రాక్షస సమూహము భయపడఁగా, తృప్తి దీఱునట్లు శవములను దినఁగలిగితిమని భూతపిశాచాదులు యుద్ధభూమిని జేరఁగా, వేడుకతోఁ బోరు చూడఁగలిగితినని నారదుఁడు సంతోషముతో నాట్యము చేయఁగా,ఆకాశవీధి నుండి చుక్కలు భూమిపై రాలఁగా, కులపర్వతములు పెల్లగిల్లఁగా, ప్రమథులు కోపించి ఆ యుద్ధభూమిలోఁ బ్రళయసమయమువలెఁ జెలరేఁగి చంపిరి

**విశేషములు** అలంకారము ఉపమ

**తోటకము** **నలి నార్చుచు రుద్రుగణంబు లొగిం**
**గలహంబున వాహిని గల్లవడన్**
**నలుకం బొరిపుచ్చక యచ్చరుగాఁ**
**దల పుచ్చక ప్రింగిరి దానవులన్** 105

**అర్థము .** రుద్ర - గణంబులు = శివుని ప్రమథగణములు, నలిన్ = ఉత్సాహముతో, ఆర్చుచున్ = అఱచుచు, ఒగిన్ = క్రమముగా, వాహిని = సేన, కలహంబునన్ = యుద్ధమునందు, కల్లవడన్ (కల్ల+పడన్) = కలఁతఁ జెందఁగా, అలుకన్ = కోపముతో, దానవులన్ = రాక్షసులను, పొరిపుచ్చక = చంపక, తలపుచ్చక = తలతీసివేయక, అచ్చరుగాన్ = ఆశ్చర్యకరముగా, ప్రింగిరి

**విశేషములు:**ఛందస్సు తోటక వృత్తమునకు నాలుగు పాదములుండును ప్రతి పాదమునను నాలుగు సగణములుండును మొదటి యక్షరమునకును, తొమ్మిదవ యక్షరమునకును యతిమైత్రి ప్రాస నియమము గలదు

సీ. గజయూథముల నోలిఁ గబళించి నయగతి
నంగద మునుమిడి మ్రింగువారు
రథ్య సారథి హేతి రథికాలితో నశ్ర
మమున రథంబుల నమలువారు
తురగదళంబులఁ గరతలంబుల నొత్తి
పిడిచి క్రొన్నెత్తురు పీల్చువారు
దనుజులఁ బృథు పాదతలహతి వడిఁజంపి
సారుగా నేలపైఁ జమరువారు

తే. నగుచు గణనాథు లసురల కాసురముగ
భూనభోవివరాంతరాపూరితోరు
భీషణాకారములు దాల్చి పెచ్చుపెరిఁగి
చంపి పసియాడి రొకనిమిషమున సమయ 106

**అర్థము**. గణ - నాథులు = ప్రమథ నాయకులు, గజ - యూథములన్= ఏనుఁగుల గుంపులను, ఓలిన్ = వరుసగా, కబళించి = పట్టుకొని, నయ-గతిన్ = బాగుగా, అంగదన్ = ఆఁకటితో, మునుమిడి (మునుము+ఇడి) = వరుసపెట్టి, మ్రింగువారున్

రథ్య -సారథి - హేతి - రథిక + ఆలితోన్ = గుఱ్ఱముల, సారథుల, కత్తుల రథికుల వరుసతో, అశ్రమమునన్ = అనాయాసముగా, రథంబులన్, నమలువారున్,

తురగ - దళంబులన్ = గుఱ్ఱముల దండులను, కర-తలంబులన్ = అరచేతులతో, ఒత్తి = కొట్టి, పిడిచి. క్రొన్నెత్తురు (క్రొత్త + నెత్తురు), పీల్చువారున్

దనుజులన్ = రాక్షసులను, పృథు - పాద - తల - హతిన్ = పెద్ద పాదతలముల దెబ్బచే, వడిన్ = వేగముగా, చంపి, సారుగాన్ = నాట్యభేదముతో, నేలపైన్, చమరువారున్ రాచువారును

అగుచున్, అసురలకున్ = రాక్షసులకు, ఆసురముగన్ = రాక్షసముగా, భూ - నభస్ (ః) + వివర + అంతర + ఆపూరిత + ఉరు - భీషణ + ఆకారములు = భూమ్యాకాశముల లోపల నంతటను నిండిన పెద్ద భయంకరములయిన రూపములు, తాల్చి, పెచ్చుపెరిఁగి = మిక్కిలి అతిశయించి, ఒక - నిమిషమునన్, సమయన్ = చచ్చునట్లు, చంపి, పసియాడిరి = చెల్లాచెదరుగా విసరివేసిరి

**తాత్పర్యము** ప్రమధనాయకులు ఏనుఁగుల గుంపులను బట్టుకొని ఆఁకటితో వరుసగా మ్రింగువారును, గుఱ్ఱముల, సారధుల, ఖడ్గముల, రధికుల సమూహముతో అనాయాసముగా రధములను నమలువారును, గుఱ్ఱముల దండులను అరచేతులతోనొత్తి పిడిచి క్రొన్నెత్తురు పీల్చువారును, రాక్షసులను పెద్ద పాదముల దెబ్బచే వడిగాఁ జంపి నాట్యముతో నేలరాచువారును అగుచు రాక్షసులకు రాక్షసముగా రోదసియంతయు నిండిన మిక్కిలి భయంకరములయిన ఆకారములు దాల్చి మిక్కిలి అతిశయించి ఒక నిమిషమునఁ జచ్చునట్లు చంపి విసరివేసిరి

వ త దవసరంబున - తరువాతి పద్యముతో నన్వయము 107

క అతివేగంబునఁ బవి ప
ర్వతములు వ్రచ్చు గతి నొక్కవడి భీకరుఁడై
శతకోటికింకరాసుర
పతుల మహోగ్రాజి వీరభద్రుఁడు చంపెన్ 108

**అర్థము** అతి - వేగంబునన్ = మిక్కిలి వడిగా, పవి = వజ్రాయుధము పర్వతములు, వ్రచ్చు - గతిన్ = చీల్చువిధమున, వీరభద్రుఁడు, ఒక్కవడిన్ = ఒక్కమాఱుగా, భీకరుఁడు + ఐ = భయంకరుఁడయి, శత - కోటి - కింకర + అసుర - పతులన్ = నూఱుకోట్ల భటులను, రాక్షస రాజులను, మహత్ (మహా) + ఉగ్ర + ఆజిన్ = మిక్కిలి భయంకరమైన యద్ధమున, చంపెన్

**తాత్పర్యము .** వజ్రాయుధము మిక్కిలి వేగమున పర్వతములను జీల్చు విధమున నొక్కమాఱుగా భయంకరుఁడయి వీరభద్రుఁడు శతకోటిభటులను, రాక్షసనాయకులను గొప్పయుద్ధమునఁ జంపెను

**విశేషములు .** అలంకార ముపమ

## మహామాయ రక్తబీజునిఁ దాఁకులు

వ ఇ ట్లమరభయంకరాసురకింకరగణంబులు శంకరకింకర గణంబులకుం గంకాళాస్థి కపాలాద్యలంకారంబైనం గొప్పించి తారకాసురేంద్రు సేనాపతి రక్తబీజుం డుద్దవడిం దెరల నెత్తి కమలవనంబుం గప్పు నీహార పటలంబునుం బోలెం బ్రమధగణంబు బెగడుకొన నిశితాస్త్రవర్షంబునం దేల్చుచున్నం గని మహాకాలాగ్ని రుద్రోద్రేకంబునం బెరిఁగి తదీయాస్త్రజాలంబులతోడ వాని సర్వాంగంబులు జర్జరితంబులుగా నేసినం దదంగసంగతానేకవిక్షతక్షతజాతబిందుసందోహం బవనిపైఁ దొరిఁగి తద్రూపబల

పరాక్రమానేక రక్తబీజ సమూహంబులై నెగసినం గని మహామాయ తదీయ రూక్ష రాక్షస మాయాక్షోభంబు నిరీక్షించి మందస్మితాననారవింద యగుచు నాక్షేపంబున నాక్షణంబ 109

**అర్థము.** ఇట్లు, అమర - భయంకర - అసుర - కింకర - గణంబులు = దేవతలకు వెఱపు పుట్టించు రాక్షసభటుల సమూహములు, శంకర - కింకర - గణంబులకున్ = శివుని భటులైన ప్రమథగణములకు, కంకాళ + అస్థి - కపాల + ఆది + అలంకారంబు + ఐనన్ = అస్థిపంజరము, ఎముకలు, పుఱ్ఱెలు మున్నగు భూషణములు కాఁగా, కోపించి, తారక + అసుర + ఇంద్రు - సేనాపతి = రాక్షసశ్రేష్ఠుఁడైన తారకుని సేనానాయకుఁడు, (అగు), రక్తబీజుండు, ఉద్దవడిన్ = మిక్కిలి వేగముగా, తెరలన్ + ఎత్తి = దండెత్తి, కమల - వనంబున్ = తామరతోఁపును, కప్పు, నీహార - పటలంబునున్ + పోలెన్ = మంచు సమూహమువలె, ప్రమథగణంబు = ప్రమథుల సమూహము, బెగడుకొనన్ = భయపడఁగా, నిశిత + అస్త్ర - వర్షంబునన్ = వాఁడిబాణములవానయందు, తేల్చుచున్ + ఉన్నన్, కని, మహత్ (మహా) +కాల + అగ్ని రుద్ర + ఉద్రేకలంబునన్ = గొప్ప ప్రళయాగ్ని రుద్రుల ఆవేశముతో, పెరిఁగి, తదీయ+అస్త్ర - జాలంబులతోడన్ = వారి బాణ సమూహములతో, వాని - సర్వ + అంగంబులున్ = వానియెల్ల అవయవములును, జర్జరితంబులు + కాన్ = తూంట్లు పడినవిగా, ఏసినన్ = కొట్టఁగా, తద్ + అంగ - సంగత + అనేక - విక్షత - క్షతజాత - బిందు - సందోహంబు = వాని శరీరమునందుఁగూడుకొన్న పెక్కు గాయముల రక్తబిందువుల సమూహము, అవనిపైన్ = భూమిమీఁద, తొరిఁగి = కాఱి, తద్ + రూప - బల - పరాక్రమ + అనేక - రక్త బీజ - సమూహంబులు + ఐ = ఆ రూప బలపరాక్రమములతోడి పెక్కండ్రు రక్తబీజుల సమూహములయి, నెగసినన్ - లేవఁగా, కని, మహామాయ, తదీయ - రూక్ష - రాక్షస - మాయా - క్షోభంబు = ఆ కఠినమైన రాక్షసుల మాయవలని కలఁత, నిరీక్షించి = చూచి, మంద- స్మిత + ఆనన + అరవింద = చిఱునవ్వుతోడి ముఖ పద్మముగలది, అగుచున్, ఆక్షేపంబునన్ = తిరస్కారముతో, ఆక్షణంబు + ఆ = వెంటనే

**తాత్పర్యము.** ఇట్లు దేవతలకు భయంకరులైన రాక్షస భటసమూహములు శివుని భటులైన ప్రమథులకు అస్థిరపంజరము, ఎమ్ములు, పుఱ్ఱెలు మున్నగు నలంకారములు కాఁగా గోపించి, తారకాసురుని సేనానాయకుఁడగు రక్తబీజుఁడు మిక్కిలి వేగముగా దండెత్తి తామరతోఁపును గప్పు మంచురాశివలెఁ బ్రమథ

గణము భయపడునట్లు వాఁడి యమ్ముల వానలోఁ దేల్చుచుండఁగాఁ జూచి మహాకాలాగ్నిరుద్రుల ఉద్రేకముతోఁ బెరిఁగి వారి అస్త్ర సమూహముతో వాని యెల్ల యవయవములును దూంట్లుపడఁ గొట్టఁగా, ఆతని అవయవములందలి గాయములందలి రక్తబిందువుల సమూహము భూమిపైఁ గాఱి అతని రూపబలపరాక్రమములతోడి పెక్కండ్రు రక్తబీజుల సమూహములై లేచినఁ జూచి మహామాయ ఆతని పరుషమైన రాక్షస మాయా క్షోభముఁ జూచి చిఱునవ్వుతోడి ముఖపద్మము గలదయి తిరస్కారముతో వెంటనే-తరువాతి పద్యముతో నన్వయము

**మ అలుకం జండిక పేర్చి యేయు నశితోగ్రాస్త్రాహతిన్ రక్తబీ**
**జుల దేహౌఘము లోలి వ్రస్సి మహి నెచ్చో నింకెఁ గ్రొన్నెత్తు ర**
**గ్గలమై యచ్చటఁ బుట్టి భూతలము నాకాశాంతరాళంబు ది**
**క్కులు బ్రహ్మాండము నిండి రొక్కమొగి రక్షోనాథు లుగ్రాకృతిన్ 110**

**అర్థము .** చండిక, అలుకన్ = కోపముతో, పేర్చి = విజృంభించి, ఏయు = ప్రయోగించునట్టి, నిశిత + ఉగ్ర + అస్త్ర + ఆహతిన్ = వాఁడియైనవి భయంకరములయినవి అగు బాణముల దెబ్బచే, రక్తబీజుల, దేహ + ఓఘములు = శరీర సమూహములు, ఓలిన్ = వరుసగా, వ్రస్సి = చీలి, క్రొన్నెత్తురు (క్రొత్త + నెత్తురు), అగ్గలము + ఐ = అధికమయి, మహిన్ = భూమియందు, ఎచ్చోన్ (ఏ + చోటన్) = ఎచ్చట, ఇంకెన్ = ఇంకెనో,అచ్చటన్, రక్షస్ + నాథులు = రాక్షసనాయకులు, ఉగ్ర + ఆకృతిన్ = భయంకరాకారముతో, పుట్టి, భూతలమున్, ఆకాశ + అంతరాళంబున్ = ఆకాశములోపలి భాగమును, దిక్కులును, బ్రహ్మాండమున్, ఒక్కమొగిన్ = ఒక్కపెట్టున, నిండిరి

**తాత్పర్యము:** చండిక కోపముతో విజృంభించి ప్రయోగించు వాఁడివియు, ఉగ్రములునైన అస్త్రముల దెబ్బచే రక్తబీజుల శరీరసమూహములు బాగుగాఁజీలి క్రొత్త నెత్తురు అధికమయి భూమియం దెచ్చట నింకెనో, అచ్చట రాక్షసనాథులు భయంకరాకారములతోఁ బుట్టి భూమ్యాకాశముల నడిమిభాగము, దిక్కులు, బ్రహ్మాండము ఒక్కపెట్టున నిండిరి

**విశేషములు .** క్రొన్నెత్తురు = క్రొత్త + నెత్తురు, దేహౌఘములు = దేహ + ఓఘములు - వృద్ధి సంధి, ఎచ్చోన్ - ఏ + చోటన్ - త్రికసంధిచే - ఎచ్చోటన్ 'ఉత్తరపదంబగు చోట శబ్దము టాక్షరమునకు లోపంబు విభాషనగు ' బాల సమాస 16 ఎచ్చో రక్షోనాథులు = రక్షస్ + నాథులు

వ ఇట్లు చండిక వెంగిమసంగినట్లు కడిమి నయ్యసురవరుల నెంతెంత వధించె నంతంత కగ్గలంబైనంగని మహామాయ తదీయమాయకుం బ్రతికారంబు విచారించి యక్షణంబ 111

**అర్థము.** ఇట్లు చండిక, వెంగి-మసంగిన + అట్లు= వ్యాఘ్రము విజృంభించిన విధమున (?) కడియన్ = పరాక్రమముతో, ఆ + అసుర-వరులన్ = ఆ రాక్షస శ్రేష్ఠులను, ఎంత + ఎంత - వధించెన్ = ఎంతెంతచంపెనో, అంత + అంతకున్, అగ్గలంబు + ఐనన్ = అధికము కాఁగా, కని, మహామాయ, తదీయ - మాయకున్ = వారి మాయకు, ప్రతికారము = ప్రతిక్రియ = ఆలోచించి, అక్షణంబు + ల = వెంటనే

**తాత్పర్యము** ఇట్లు చండిక వ్యాఘ్రము విజృంభించిన విధమున పరాక్రమముతో ఆ రాక్షసశ్రేష్ఠులను ఎంతెంత చంపెనో వారు అంతంతకు అధికము కాఁగాఁ జూచి మహామాయ వాని మాయకుఁ బ్రతిక్రియ ఆలోచించి వెంటనే - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు.** వెంగిమసంగు = వ్యాఘ్రము విజృంభించు - ఈ యర్థము నిఘంటువులఁ గానరాలేదు వావిళ్లవారి లఘుటీకనుండి గ్రహింపఁబడినది అలంకార ముపమ

గీ **కలహభూమిలో నాలుక కలయఁ బఱపి**
**తావికొని త్రిప్పి చాముండి దేవి కరము**
**కడఁకఁ బోసిపోవకుండ రాక్షసుల నెల్ల**
**మ్రింగె వడి నెల్వు చీమల మ్రింగినట్లు** 112

**అర్థము .** చాముండీ దేవి, కలహ - భూమిలోన్ = యుద్ధభూమిలో, నాలుక, కలయన్ = అంతటను, పఱపి = వ్యాపింపఁజేసి, తావికొని = రుచిచూచి, త్రిప్పి, కరము - కడఁకన్ = మిక్కిలి ఉద్ధతితో, పోసి + పోవక + ఉండన్ = తప్పిపోకుండునట్లు, ఎల్వు = ఎలుఁగు - భల్లూకము, చీమలన్, మ్రింగిన + అట్లు, రాక్షసులన్ + ఎల్లన్, వడిన్, మ్రింగెన్

**తాత్పర్యము .** చాముండీదేవి యుద్ధభూమిలో నాలుకనంతటను వ్యాపింపఁజేసి రుచిచూచి త్రిప్పి మిక్కిలి గర్వముతో తప్పిపోకుండ నెలుఁగుబంటి చీమలను మ్రింగినట్లు రాక్షసులనందఱను మ్రింగెను

**విశేషములు:** అలంకార ముపమ ఎలుఁగు - ఎలువు- ఎల్వు - రూపాం

వ ఇట్లు తిగ్మకరకరప్రహతి దిఙ్ముఖంబునం దడంగు తమఃపటలంబునుం బోలెఁ జండిక మండలాగ్రాభిహతిని రక్తబీజసమూహంబు మహాకాళి ముఖ గహ్వరంబునం దడంగినం గోపానలోద్దీపితహృదయులై యశిత దుర్మద మంజీర కుంభోదర వికటాక్ష విద్యున్ముఖప్రముఖు లొక్కపెట్ట విజృంభించి 113

**అర్థము** ఇట్లు, తిగ్మకర-కర-ప్రహతిన్ = సూర్యుని కిరణముల దెబ్బచే, దిశ్(క్) + ముఖంబునందున్ = ఉదయసమయమునందు, అడంగు = నశించు, తమస్( ) + పటలంబును + పోలెన్ = చీఁకటుల సమూహమువలె, చండిక (యొక్క), మండలాగ్ర + అభిహతిని = ఖడ్గముయొక్క దెబ్బచే, రక్తబీజ - సమూహంబు = రక్తబీజుల యొక్క గుంపు, మహాకాళి - ముఖ - గహ్వరంబునందున్ = గుహవంటి మహాకాళి ముఖమునందు, అడంగినన్ = నశింపఁగా, కోప + అనల +ఉద్దీపిత - హృదయులు + ఐ = కోపమనెడి అగ్నిచే మిక్కిలి మండింపఁబడిన హృదయములు గలవారయి, అశిత - దుర్మద - మంజీర - కుంభోదర - వికటాక్ష - విద్యున్ముఖ - ప్రముఖులు= అశితుఁడు, దుర్మదుఁడు, మంజీరుఁడు, కుంభోదరుఁడు, వికటాక్షుఁడు, విద్యున్ముఖుఁడు మున్నగువారు, ఒక్కపెట్టన్ = ఒక్కమాటుగా, విజృంభించి = చెలరేఁగి

**తాత్పర్యము.** ఇట్లు సూర్యకిరణముల దెబ్బచే నుదయకాలమున నశించు చీఁకటుల సమూహమువలెఁ జండిక కత్తి వ్రేటుచే రక్తబీజుల సమూహము మహాకాళి ముఖగుహయందు నశింపఁగా, కోపాగ్నిచే నుద్దీపితములైన హృదయములుగల అశితుఁడు, దుర్మదుఁడు, మంజీరుఁడు, కుంభోదరుఁడు, వికటాక్షుఁడు, విద్యున్ముఖుఁడు మున్నగువారు ఒక్కమాటుగా చెలరేఁగి - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** అలంకార ముపమ

క **తారకు ననుజులు ఘోరా**
**కారులు పదివేవు రొక్కకవిఁ గవిసిరి, జం**
**భారి మురారాతులుఁ గ్రౌం**
**చారియు బడలువడఁ గవిసి రతిరభసమునన్** 114

**అర్థము .** ఘోర + ఆకారులు = భయంకరములైన ఆకారములు గలవారు, అగు, తారకు + అనుజులు = తారకాసురుని తమ్ములు, పదివేవురు, ఒక్క - కవిన్ = ఒక్కపెట్టున, కవిసిరి = మార్కొనిరి, జంభ + అరి = ఇంద్రుఁడు, ముర + అరాతులున్ = విష్ణువును, క్రౌంచ + అరియున్ = కుమారస్వామియు, బడలు + పడన్ = శ్రమము నొందఁగా, అతి - రభసమునన్ = మిక్కిలి వేగముతో, కవిసిరి = మార్కొనిరి

**తాత్పర్యము .** భయంకరాకారులైన తారకాసురుని తమ్ములు పదివేవు రొక్క పెట్టున మార్కొనిరి ఇంద్ర విష్ణు కుమారస్వాములును శ్రమమునొందఁగా మిక్కిలి వేగమున వారిని మార్కొనిరి

## విఘ్నేశ్వరుఁడు రాక్షసవీరులపై దండెత్తుట

**వ ఇట్లు సుతాయుతం బయుతానుజదనుజ వరు లొక్కండై తెరల నెత్తినం గని దంతిముఖుం డంతకు నభిముఖుండై యుగాంత కృతాంతుండునుం బోలెం గోలుమసంగి కరాసిధార నసురుల సిరంబు లురుల సేయుచు 115**

**అర్థము** ఇట్లు, సుత + అయుతంబు = పదివేవురు సుతులు, అయుత + అనుజ - దనుజవరులు = పదివేలమంది తమ్ములు, రాక్షసశ్రేష్ఠులు, ఒక్కండు + ఐ = ఒక్కటయి, తెరలన్ + ఎత్తినన్ = దండెత్తఁగా, కని, దంతి - ముఖుండు = ఏనుఁగు ముఖమువంటి ముఖము గలవాఁడు - వినాయకుఁడు, అంతకున్ = ఆ సేనకంతకును, అభిముఖుండు + ఐ = ఎదురయినవాఁడయి, యుగ + అంత - కృతాంతుండునున్ + పోలెన్ = ప్రళయసమయమునందలి యముని వలె, కోలు మసంగి = మిక్కిలి విజృంభించి, కర + అసి- ధారన్ = చేతికత్తి యంచుతో, అసురుల - సిరంబులు = రాక్షసుల శిరస్సులు, ఉరులన్ + ఏయుచున్ = రాలఁగొట్టుచు

**తాత్పర్యము .** ఇట్లు పదివేవురు సుతులు పదివేవురు తమ్ములు రాక్షసవర్యులు ఒక్కటయి దండెత్తఁగాఁ, జూచి, విఘ్నేశ్వరుఁడు ఆ సేన కంతకును ఎదురు నిలిచి ప్రళయ సమయ యమునివలె మిక్కిలి విజృంభించి చేతి కత్తి యంచుతో రాక్షసుల శిరస్సులను రాలఁగొట్టుచు - తరువాతి పద్యముతో నన్వయము

**చ కరిముఖుఁ డల్గి పట్టుకొని కైపున జిట్టునఁ ద్రిప్పివేయఁగా
హరికులిశాతిభీతిఁ జను నద్రులపోలెఁ బయోధిఁగూలె స
త్వరగతిఁ గొన్ని, కొన్ని లయవాతవిధూతఘనాలివోలె నం
బరమునఁ దూలుచుండెఁ బృథు బంధుర దైత్య కబంధ సంఘముల్ 116**

**అర్థము :** కరిముఖుఁడు = గజాననుఁడు, అల్గి = కోపించి, పట్టుకొని, కైపునన్ = విజృంభణముతో, జిట్టునన్ = జిట్టుయను ధ్వనిగలుగులాగున, త్రిప్పి -

వేయఁగాన్, హరి - కులిశ + అతి - భీతిన్ = ఇంద్రుని వజ్రాయుధమువలని మిక్కిలి వెలపుతో, చను = పోవు, అద్రుల - పోలెన్ = కొండలవలె, కొన్ని = కొన్ని కబంధములు సత్వర -గతిన్ = త్వరతో, పయోధిన్ = సముద్రమునందు, కూలెన్, కొన్ని - పృథు - బంధుర - దైత్య - కబంధ - సంఘముల్= మిక్కిలి పెద్దవి ఒప్పిదములైనవి అగు రాక్షసుల మొండెముల గుంపులు కొన్ని, లయ - వాత - విధూత - ఘన + ఆలి + పోలెన్ = ప్రళయసమయవాయువుచే విశేషముగా నెగురఁగొట్టఁబడిన మేఘముల వరుసవలె, అంబరమునన్= ఆకాశమున, తూలుచున్ + ఉఁడెన్ = ఎగురుచుండెను

**తాత్పర్యము .** గజాననుఁడు కోపమునఁ ఒట్టుకొని విజృంభణముతో జిట్టిలఁ ద్రిప్పివేయఁగా, మిక్కిలి పెద్దవి, ఒప్పిదములయినవి అగు రాక్షసుల మొఁడెముల సమూహములు కొన్ని ఇంద్రుని వజ్రాయుధమువలని అమిత భీతితోఁ బోవు కొండలవలె సత్వరముగా సముద్రమునఁ గూలెను కొన్ని ప్రళయ సమయవాయువుచే నెగురఁగొట్టఁబడిన మేఘములవరుసవలె నాకాశమున నెగురుచుండెను

**విశేషములు** అలంకార ముపమ

వ ఇట్లు మదగజంబు కొఱలి మదంబున నంగదగొని పెఱికిపెట్టినట్లు గజవదనుండు దనుజవరుల హల్లకల్లోలంబుగాఁ దాఁకి చిత్రవధ సేయుచు 117

**అర్థము ·** ఇట్లు, మద - గజంబు = మత్తేభము, కొఱలి = కోపించి, మదంబునన్ = మదముతో, అంగద + కొని = ఆఁకలిగొని, పెఱికి పెట్టిన + అట్లు =పెల్లగించిపెట్టిన విధమున, గజ - వదనుండు = కరిముఖుఁడు, దనుజ - వరులన్ = రాక్షసశ్రేష్ఠులను, హల్లకల్లోలంబుగాన్ = అల్లకల్లోలమగునట్లు తాఁకి, చిత్ర-వధ + చేయుచున్

**తాత్పర్యము .** ఇట్లు మదపుటేనుఁగు కోపించి మదముతో నాఁకలిగొని పెల్లగించిపెట్టిన విధమున గజాననుఁడు రాక్షసశ్రేష్ఠులను అల్లకల్లోలముగాఁ దాఁకి చిత్రవధచేయుచు - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు** అలంకార ముపమ

మ పదసంఘట్టనఁ బెట్టి మట్టె నశితున్, బాహాసి నుగ్గాడె దు
ర్మదు, నత్యుగ్రుఁ గుఠారధారఁ దునిమెన్, మంజీరుఁ గుంభోదరున్
గద వ్రేసెన్, వికటాక్షు శక్తినిహతుం గావించె, విద్యున్ముఖున్
రదనాగ్రంబునఁ జీరె దట్టముగ హేరంబుండు సంరంభణన్ 118

**అర్థము.** హేరంబుండు = వినాయకుఁడు, సంరంభణన్ = కోపముతో, అశితున్ = అశితుఁడను రాక్షసుని, పద - సంఘట్టనన్ = కాళ్ళత్రొక్కిడితో, పెట్టి, మట్టెన్ = నేలరాచెను, దుర్మదున్, బాహా + అసిన్ = చేతికత్తితో, నుగ్గాడెన్ = పొడిచేసెను, అత్యుగ్రున్, కురార - ధారన్ = గండ్రగొడ్డటిఅంచుతో, తునిమెన్ = ఖండించెను, మంజీరున్, కుంభోదరున్, గదన్ = గదతో, వ్రేసెన్ = కొట్టెను, వికటాక్షున్, శక్తి - నిహితున్ = శక్తి అను ఆయుధముతోఁ గొట్టఁబడినవానిని, కావించెన్ విద్యున్ముఖున్, రదన + అగ్రంబునన్ = దంతపుఁగొనతో, దట్టముగన్, చీరెన్ = చీర్చెను

**తాత్పర్యము** వినాయకుఁడు కోపముతో నశితునిఁ గాళ్ల త్రొక్కిడిచే నేలరాచెను దుర్మదునిఁ జేతికత్తితోఁ బొడిచేసెను అత్యుగ్రుని పరశువునంచుతో ఖండించెను మంజీరుని, కుంభోదరుని గదతోఁ గొట్టెను వికటాక్షుని శక్తిచే నిహతుని గావించెను విద్యున్ముఖుని దంతాగ్రముతో గట్టిగాఁ జీల్చెను

**విశేషములు .** వికటోగ్రశక్తి నిహతుం గావించె - అను పాఠమునకు బదులుగా - వికటాక్షు శక్తి నిహతుంగావించె - అను పాఠము స్వీకరింపఁబడినది 113 వచనములోఁ బేర్కొనఁబడిన రాక్షసులలో వికటాక్షుఁ డొకఁడని కలదు హేరంబ-హే - రుద్రసమీపేరంబతే తిష్ఠతీతి హేరమ్బః - రుద్రుని యొద్ద నుండువాఁడు - అమరము వినాయకుఁడు

**వ ఇట్లు దనుజేంద్రుం డయుతతనూజాయుతానుజవరు లొక్కట భూరజఃపటలంబునుం బోలె గజవదను మదజలాసారంబున మ్రగ్గినం గని మహామనస్వి గావున దానికి గహనంబైన మనోబలంబున భుజబలంబ నిజబలంబుగాఁ గైకొని యక్షణంబ 119**

**అర్థము :** ఇట్లు, దనుజ + ఇంద్రుండు = రాక్షసశ్రేష్ఠుఁడు, అయుత - తనూజ +అయుత + అనుజవరులు = పదివేవురు కొడుకులు, పదివేవురు తమ్ములు, ఒక్కటన్ = ఒక్కమాఱుగా, భూ - రజస్ (ః) + పటలంబునున్ + పోలెన్ = నేలయందలి ధూళి సమూహమువలె, గజ - వదను = వినాయకుని యొక్క, మద - జల + ఆసారంబునన్ = మదజలమనెడి జడివానయందు, మ్రగ్గినన్ = అడఁగఁగా, కని, మహత్ (మహా) + మనస్వి = గొప్ప మనస్సు దిటవుగలవాఁడు, కావునన్, దానికిన్ = ఆ మ్రగ్గుటకు, గహనంబు + ఐనన్ = దుఃఖము అయినను, మనస్(ః) + బలంబునన్ = మనశ్శక్తిచే, భుజ - బలంబు + అ = బాహుబలమే, నిజ - బలంబు + కాన్ = తన బలముగా, కైకొని, అక్షణంబు + అ = వెంటనే

**తాత్పర్యము** ఇట్లు రాక్షసరాజు పదివేవురు సుతులు, పదివేవురు తమ్ములు ఒక్కమాటుగా భూధరాలిరాశివలె గజాననుని దానజలమనెడి జడివానయందు అడఁగఁగాఁ గని గొప్ప ధైర్యశాలి కావున, దానికి వగచియు, మనశ్శక్తిచే బాహుపరాక్రమమే తన బలముగా భావించి వెంటనే - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** అలంకారము రూపకానుప్రాణితోపమ

**తారకుఁడు దేవసనఁదాఁకుట**

మ అది కాలాగ్ని శిఖాకలాప, మది కల్పాంతాంతకాస్ఫోటకం,
బది లోకత్రయభక్షణక్షమసముద్యద్భైరవాడంబరం
బది సంహారహరోగ్రనేత్రశిఖి, శౌర్యాటోపవీరగ్రహం
బది నాఁ దారకుఁ డెత్తుదెంచె నతిరౌద్రాకారుఁడై పోరికిన్ 120

**అర్థము** అది, కాల + అగ్ని - శిఖా - కలాపము = ప్రళయ సమయాగ్ని జ్వాలల సమూహము, అది, కల్ప + అంత + అంతక + ఆస్ఫోటకంబు= ప్రళయ సమయమునందలి యముని చఱపు, అది, లోక - త్రయ - భక్షణ - క్షమ - సముద్యత్ + భైరవ + ఆడంబరంబు = ముల్లోకములను దినుటకు సమర్థుఁడై యుద్యమించుచున్న భైరవుని యొక్క విజృంభణము, అది, సంహార - హర + ఉగ్ర - నేత్ర - శిఖి = లయకారుఁడగు శివుని భయంకరమైన కంటిమంట, అది, శౌర్య + ఆటోప - వీర -గ్రహంబు = పరాక్రమము యొక్క విజృంభణము గల వీరగ్రహము, నాన్ = అనఁగా,తారకుఁడు, అతి -రౌద్ర + ఆకారుఁడు + ఐ = మిక్కిలి భయంకరమైన ఆకారముగలవాఁడయి, పోరికిన్ = యుద్ధమునకు, ఎత్తుదెంచెన్ = దండెత్తివచ్చెను

**తాత్పర్యము .** అది ప్రళయానలజ్వాలాసమూహము, అది యుగాంత సమయయముని చఱపు, అది ముల్లోకములను మ్రింగ సమర్థుఁడైన భైరవుని ఆడంబరము, అది లయకారుఁడైన హరుని భయంకరనేత్రాగ్ని, అది పరాక్రమాటోపముగల వీరగ్రహము అనునట్లు తారకాసురుఁడు మిక్కిలి భయంకరమైన ఆకారముగలవాఁడయి యుద్ధమునకు దండెత్తివచ్చెను

**విశేషములు .** అలంకార ముత్ప్రేక్ష

వ ఇట్లు జగద్భయంకరాకారుండై తెరలనెత్తి యెత్తిన ముష్టిన మహారభసంబున 121

**అర్థము** ఇట్లు, జగత్ + భయంకర + ఆకారుండు + ఐ = లోకములకు వెఱపు పుట్టించు రూపము గలవాఁడయి, తెరలన్ + ఎత్తి = దండెత్తి, ఎత్తిన - ముష్టిన్ + అ = దండెత్తిన వెంటనే, మహత్ (మహా) - రభసంబునన్ = గొప్పవేగముతో

**తాత్పర్యము** ఇట్లు లోకభీకరాకారుఁడై దండెత్తి, దండెత్తిన వెంటనే గొప్ప వేగముతో - తరువాతి పద్యముతో నన్వయము

తే కరులు గాఁచిన మద్దులుగా, హయంబు
లొదరు నేదుల కదుపుగా, నుగ్రభటులు
సిట్టవెదుళుల కదుపుగా శీఘ్రమేసె
నమరబలము నమోఘబాణములు నాట 122

**అర్థము :** కరులు = ఏనుఁగులు కాఁచిన - మద్దులు + కాన్ = కొంచెము కాల్చిన నల్లమద్దుల మ్రాఁకులు కాఁగా, హయంబులు = గుఱ్ఱములు, ఒదరు + ఏదుల - కదుపుగా = విజృంభించు ముండ్ల పందుల గుంపుకాఁగా, ఉగ్ర - భటులు = భయంకరులైన వీరులు, చిట్ట - వెదుళుల - కదుపు + కాన్ = చిన్న వెదురుల గుబురుగా, అమర - బలమ్మున్ = దేవతల సేనను, అమోఘ - బాణములు = వ్యర్థముకాని బాణములు, నాటన్ = నాటుకొనునట్లు, శీఘ్రము + ఏసెన్ = వెంటనే ప్రయోగించెను

**తాత్పర్యము.** (తారకుఁడు) ఏనుఁగులు ఇంచుక కాల్చిన మద్ది మ్రాఁకులు కాఁగను, గుఱ్ఱములు విజృంభించు ముండ్ల పందుల మందగాను, భయంకరులైన భటులు పొట్టి వెదురుల గుబురుకాఁగను దేవతల సేవను వ్యర్థము కాని బాణములు నాటుకొనునట్లు వెంటనే ప్రయోగించెను

**విశేషములు :** అలంకారము రూపకము

ఉ తారకుఁ డల్క నేయు నతి దారుణ ఘోర శరాలి బల్విడిం
బోరు నమర్త్యమర్త్యబలముం గొని వెల్వడిపోయి యొక్కెడన్
ధారుణిఁ గాడిపోవుఁ గలదాయలఁ జంపి రసాతలంబునం
దారసి నాగసంఘము రయంబునఁ జంపఁగఁ జొచ్చు నట్టిదై 123

**అర్థము** తారకుఁడు, అల్కన్ = కోపముతో, ఏయు = ప్రయోగించు, అతి - దారుణ - ఘోర - శర + ఆలి = మిక్కిలి క్రూరములు, భయంకరములునైన బాణముల వరుస బల్విడిన్ = పరాక్రమముతో, పోరు = యుద్ధము చేయు, అమర్త్య - మర్త్య - ఒలమున్ = దేవతల, మనుష్యుల సేనను, కొని - వెల్వడి - పోయి = దూసికొని వెలువడిపోయి, కల - దాయలన్ = నేలపై ఉన్న శత్రువులను, చంపి, రసాతలంబునన్ = పాతాళమునందు, ఆరసి = చూచి, నాగ - సంఘమున్ = పాముల సమూహమును, రయంబునన్ = శీఘ్రముగా చంపఁగన్ = చంపుటకు, చొచ్చు + అట్టిది + ఐ = ప్రవేశించునట్టిదయి, ఒక్క + ఎడన్ = ఒకచోట, ధారుణిన్ = భూమిని, కాడిపోవున్ = చీల్చుకొనిపోవును

**తాత్పర్యము** తారకాసురుఁడు కోపముతోఁ బ్రయోగించు మిక్కిలి క్రూరములు, భయంకరములునైన బాణముల సముదాయము పరాక్రమముతోఁ బోరు దేవతల మనుష్యుల సేనను గొట్టి అటనుండి వెలువడి పోయి ఒకచో - నేలపై నున్న శత్రవులను జంపి పాతాళముననున్న నాగుల సంఘమును శీఘ్రముగాఁ జంపుటకుఁ జొచ్చునదియై, నేలను చీల్చుకొని పోవును

**విశేషములు** · అలంకార ముత్ప్రేక్ష

వ ఇట్లు విలయకాలనీలఘనాఘనంబునుంబోలె నిరతిశయాతినిశిత శరవర్షంబు గురియందొడంగిన 124

**అర్థము .** ఇట్లు, విలయ - కాల - నీల - ఘనా - ఘనంబునున్ + పోలెన్ = ప్రళయసమయమునందలి నల్లని వర్షాకాలపు మేఘమువలె, నిరతిశయ - అతి - నిశిత - శర - వర్షంబు = మిక్కిలి వాఁడియైన బాణముల వాన, కురియన్ = తొడంగినన్ = కురియ నారంభింపఁగా -

**తాత్పర్యము** · ఇట్లు ప్రళయసమయమునందలి నల్లని వర్షాకాలపు మేఘమువలె మిక్కిలి వాఁడి బాణముల వర్షము కురియ నారంభింపఁగా - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు** · అలంకార ముపమ

క అమరారిశిలీముఖహతి
సుమనోగణదర్ప మడఁగె సొలవక కడు వే
గమున శిలీముఖహతిచే
సుమనోదర్పంబు చెడుట చోద్యమె యెందున్? 125

**అర్థము** అమర + అరి - శిలీముఖ - హతిన్ = రాక్షసుని (తారకుని) బాణముల దెబ్బచే, సుమనస్(ం) + గణ - దర్పము = దేవతాగణముల గర్వము, సొలవక = విజృంభింపక, కడు - వేగమునన్ = మిక్కిలి వేగముగా, అడఁగెన్ = నశించెను, శిలీముఖ - హతిచేన్ = బాణముల దెబ్బచే - తుమ్మెదల దెబ్బచే, సుమనస్ ( ) + దర్పంబు = దేవతల గర్వము, పువ్వుల శోభ, చెడుట = నశించుట, ఎందున్ = ఎక్కడనైనను, చోద్యమె = వింతయా ?

**తాత్పర్యము** తారకాసురుని బాణముల దెబ్బచే సుమనోగణముల (దేవగణముల) దర్పము విజృంభింపక మిక్కిలి వేగముగా నడఁగెను శిలీముఖ - హతిచే (బాణముల హతిచే) (తుమ్మెదల హతిచే), సుమనోదర్పము (దేవతల దర్పము - పూలశోభ) ఎక్కడనైనను నశించుట వింతయా ? కా దనుట

**విశేషములు :** అలంకారము శ్లేషానుప్రాణితార్థాంతరన్యాసము

వ **ఇ ట్లతిదారుణంబగు తారకాసురేంద్రు నంపఱ కబ్బగింపక** 126

**అర్థము.** ఇట్లు, అతి - దారుణంబు + అగు = మిక్కిలి భయంకరమైన, తారక + అసుర + ఇంద్రు + రాక్షసరాజయిన తారకుని యొక్క, అంపఱకున్ = బాణ సమూహమునకు, అబ్బగింపక = ఓర్వలేక

**తాత్పర్యము** . ఇట్లు మిక్కిలి భయంకరమైన తారకాసురుని బాణ సమూహమునకు నిలువలేక - తరువాతి పద్యముతో నన్వయము

క **అని నఱిమి చచ్చిరేనియు**
**ననిమిషపురి కరుగఁగాంతు రంతియ జను, లో**
**డిన మాకు దివిక పోనగు**
**ననుగతిఁ జెడ నోడి పాఱె నమరగణంబుల్** 127

**అర్థము** జనులు = మనుష్యులు, అనిన్ = యుద్ధమునందు, అఱిమి = ఎదుర్కొని, చచ్చిరి + ఏనియున్ = చచ్చినచో, అనిమిష -పురికిన్ = దేవతల పురమునకు - అమరావతికి, అరుగన్ + కాంతురు = పోవఁగలుగుదురు, అంతియ = అంతే, ఓడినన్ = ఓడిపోయినను, మాకున్ = మాకు, దివికిన్ + అ = స్వర్గమునకే, పోన్ + అగున్ = పోవనగును, అను - గతిన్ = అనువిధమున, అమర - గణంబుల్ = దేవతల సమూహములు, చెడన్ = చెడునట్లు, ఓడి, పాఱెన్ పాఱిపోయెను

**తాత్పర్యము** 'మనుష్యులు యుద్ధమున విజృంభించి చచ్చినచో స్వర్గపురమున కరుగఁగలుగుదురు అంతే ఓడిపోయినను మేము స్వర్గమునకే పోవగుదు' అను విధమున వెడునట్లు ఓడి దేవతలు పాటిపోవుదురు

**విశేషములు** అలంకార ముత్ప్రేక్ష

చ సుర లని నోడి దిక్పతులఁ జొచ్చిరి, దిక్పతులున్ సురాలియున్,
సురపతిఁజొచ్చి, రింద్రుఁడును, జుట్టిన దిక్పతులున్, సురౌఘమున్,
సరసిజనాభుఁ జొచ్చి, రట చక్రియు, నా సురరాజు, దిక్పతుల్,
సురలుఁ గుమారకున్ శరణు సొచ్చిరి తారకుఁ డంటఁ దాఁకినన్ 128

**అర్థము** తారకుఁడు, అంటన్ + తాఁకినన్ = ముట్టనెదురుకొనఁగా, సురలు = దేవతలు, అనిన్ = యుద్ధమున, ఓడి, దిశ్(క్) + పతులన్ = దిక్పాలకులను, చొచ్చిరి = కూడిరి, దిశ్(క్) + పతులున్ = దిక్పాలకులును, సుర + ఆలియున్ = దేవతల సమూహమును, సుర - పతిన్ = దేవేంద్రుని, చొచ్చిరి, ఇంద్రుఁడు, చుట్టిన - దిశ్(క్) + పతులున్ = చుట్టుఁజేరిన దిక్పాలకులును, సుర + ఓఘమున్ = దేవతల సమూహమును, సరసిజనాభున్ = పద్మనాభుని - విష్ణుని, చొచ్చిరి, అట, చక్రియున్ = విష్ణువును, ఆ - సుర - రాజున్ = ఆ యింద్రుఁడును, దిశ్(క్) + పతుల్ = దిక్పాలకులును, సురలున్ = దేవతలును, కుమారకున్ = కుమారస్వామిని, శరణు + చొచ్చిరి

**తాత్పర్యము .** తారకాసురుఁడు అంటఁదాఁకఁగా దేవతలు యుద్ధమున నోడి దిక్పాలకులను గూడిరి దిక్పాలకులును, దేవతలును ఇంద్రునిఁ గూడిరి ఇంద్రుఁడును, దిక్పాలకులును, దేవతలును విష్ణునిఁగూడిరి ఇంద్రుఁడును, దిక్పాలకులును, దేవతలును విష్ణునిఁ జేరిరి విష్ణువును, ఇంద్రుఁడును, దిక్పాలకులును, దేవతలును గుమారస్వామిని శరణుచొచ్చిరి

**విశేషములు:** అలంకారము ఏకావళి 'గృహీతముక్తరీ త్యార్థశ్రేణి రేకావళీ మతా' చన్ద్రా

వ ఇట్లు బృందారకబృందంబుఁ గాందిశీకులం జేసి సంక్రందను నాక్రందనుం జేసి నారాయణుం బలాయనపరాయణుం జేసి కరిముఖు సమరవిముఖుం జేసి విజృంభించి 129

**అర్థము .** ఇట్లు, బృందారక - బృందంబున్ = దేవతల సమూహమును, కాందిశీకులన్ + చేసి = దిక్కు తెలియనివారిని జేసి, సంక్రందనున్ = ఇంద్రుని,

ఆక్రందనున్ = దుఃఖితుని, చేసి, నారాయణున్ = విష్ణుని, పలాయన - పరాయణున్ = పాఱిపోవుటయం దాసక్తి గలవానిని, చేసి, కరి-ముఖున్ = గజాననుని, సమర-విముఖున్ = యుద్ధవిముఖుని జేసి, విజృంభించి

**తాత్పర్యము** ఇట్లు దేవతలను గాందిశీకులనుగాఁ జేసి, ఇంద్రుని దుఃఖితునిగాఁ జేసి, విష్ణుని పలాయనపరునిగాఁ జేసి, వినాయకుని యుద్ధవిముఖునిగాఁజేసి విజృంభించి - తరువాతి పద్యముతో నన్వయము

మ అతులోత్సాహముతోడ దానవబలం బార్వంగ దోర్వీర్యద
ర్పితుఁడై బోరన వచ్చి తాఁకె నమరుల్ భేదిల్లి భీతిన్ హతా
హతి మార్కొట్టక పాఱఁ దారకుఁడు కోపాసక్తి వీరాసురా
న్వితుఁడై యెక్కడ నంచు రోయుచు మహావీరుం గుమారున్ వడిన్ 130

**అర్థము** . అతుల + ఉత్సాహముతోడన్ = మిక్కిలి యుత్సాహముతో, దానవ - బలంబు = రాక్షస సేన, ఆర్వంగన్ = అఱవఁగా, అమరుల్ = దేవతలు, భేదిల్లి = ఓడిపోయి, భీతిన్ = భయముతో, హతా-హతిన్ =అతిత్వరతో, మార్కొట్టక = ఎదిరింపక, పాఱన్ = పరువెత్తఁగా, తారకుఁడు, దోస్(ః) +వీర్య - దర్పితుఁడు + ఐ = భుజపరాక్రమగర్వితుఁడయి, కోప + ఆసక్తిన్ = కోపమునందలి ఆసక్తితో, వీర + అసుర + అన్వితుఁడు + ఐ = వీరులైన రాక్షసులతోఁ గూడినవాఁడయి, ఎక్కడన్ = కుమారుఁ డెక్కడ నున్నాఁడు, అంచున్, రోయుచున్ = వెదకుచు, మహత్ (మహా) - వీరున్ = గొప్పవీరుఁడగు, కుమారున్, వడిన్ = వేగముగా, బోరన = శీఘ్రముగా, వచ్చి, తాఁకెన్

**తాత్పర్యము**. మిక్కిలి యుత్సాహముతో రాక్షససేన ఆర్వఁగను, దేవతలు ఓడిపోయి భయముతో అతిత్వరతో నెదిరింపక పాఱిపోఁగా, తారకుఁడు కోపముతో వీరులైన రాక్షసులతోఁ గూడి 'కుమారుఁ డెక్కడనున్నాఁ?' డనుచు వెదకుచు వేగముగా శీఘ్రముగా వచ్చి మహావీరుఁడగు కుమారుని మార్కొనెను

## కుమార తారకుల యుద్ధము

వ అంత నంతకాంతకసుతుం డంతకువమున్న యుగాంత కృతాంతుండునుంబోలె నత్యంతకోపరసాపూరితాంతరంగుండై ద్వాదశ కర సంభృత ఖర ప్రహరణం బసురవరులకు విలయకాలోదిత ద్వాదశ ఖరకరోగ్రకరప్రకరంబునుంబోలె జాజ్వల్యమానంబై వెలుంగ నంగాం గుళీతలత్రాణబాణపూర్ణతూణీరపరిశోభితుండై మణికనకఖచితవిచిత్ర రథారూఢుండై నిలిచి విజయకోదండం బెత్తికొని గుణాస్ఫాలనంబు సేసిన 131

**అర్థము** అంతన్, అంతక + అంతక - సుతుండు =యమాంతకుఁడైన శివుని కుమారుఁడు, - కుమారస్వామి, అంతకున్ - మున్ను + అ = అంతకుమునుపే, యుగ + అంత - కృతాంతుండునున్ + పోలెన్ = ప్రళయకాల యముని విధమున, అత్యంత - కోప - రస + ఆపూరిత + అంతరంగుండు + ఐ = మిక్కిలి కోపరసముచే నింపఁబడిన మనస్సు గలవాఁడయి, ద్వాదశ - కర - సంభృత - ఖర-ప్రహరణంబు = పండ్రెండు చేతులందుఁ దాల్పఁబడిన వాఁడిబాణము, అమర - వరులకున్ = దేవతా శ్రేష్ఠులకు, విలయ - కాల + ఉదిత - ద్వాదశ - ఖరకర - ఉగ్ర - కర - ప్రకరంబునున్ + పోలెన్ = ప్రళయసమయమందుఁబుట్టిన పండ్రెండుగురు సూర్యుల భయంకరములైన కిరణముల సమూహామువలె, జాజ్వల్యమానంబు + ఐ = మిక్కిలి ప్రకాశించుచున్నదయి, వెలుంగన్ = ప్రకాశింపఁగా, అంగ + అంగుళీ - తల - త్రాణ - బాణ - పూర్ణ - తూణీర - పరిశోభితుండు + ఐ = శరీర కవచము, వ్రేళ్ల కవచము, బాణములతోనిండిన అమ్ములపొది - అనువానిచే నొప్పినవాఁడు అయి, మణి - కనక - ఖచిత - విచిత్ర - రథ - ఆరూఢుండు + ఐ = రత్నముల చేతను, బంగారముచేతను బొదుగఁబడిన విచిత్రమయిన రథము నెక్కినవాఁడయి, నిలిచి, విజయ - కోదండంబు = జయధనుస్సు, ఎత్తికొని, గుణ + ఆస్ఫాలనంబు + చేసినన్ = వింటినారి మ్రోయింపఁగా

**తాత్పర్యము .** అంతఁ గుమారస్వామి అంతకుమునుపే ప్రళయకాల యమునివలె మిక్కిలికోపముతోనిండినమనస్సు గలవాఁడయి, పండ్రెండు చేతులందు ధరించిన వాఁడిఆయుధము రాక్షసులకు ప్రళయసమయమందుదయించిన పండ్రెండుగురుసూర్యుల భయంకరకిరణముల సమూహామువలె మిక్కిలి ప్రకాశింపఁగా, శరీరాంగుళుల కవచములు, అమ్ములతోనిండినపొదులు అనువానిచేఁ బ్రకాశించినవాఁడయి, రత్నసువర్ణఖచితమై విచిత్రమైన రథము నెక్కి నిలిచి విజయధనువు నెత్తికొని అల్లెత్రాటిని మ్రోయింపఁగా - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు** · అలంకార ముపమ

మ **ధర కంపింపఁ, బయోనిధుల్ కలఁగ, దిగ్దంతుల్ భయంబంద, భూ**
**ధరముల్ డొల్ల, వియత్తలం బద్రువ, దైత్యశ్రేణి భీతిల్ల, భా**
**స్కర రథ్యంబులు మ్రొగ్గి మగ్గఁబడ, నాశాచక్రముల్ మ్రోయ, భీ**
**కరమై, దారుణమై గుణధ్వని మహోగ్రంబై చెలంగన్ వడిన్** 132

**అర్థము** ధర = భూమి, కంపింపన్ = వడఁకఁగా, పయోనిధుల్ = సముద్రములు, కలఁగన్ = కలఁతచెందఁగా, దిశ్(క్) + దంతుల్ = దిగ్గజములు, భయంబు + అందన్ = భీతిల్లఁగా, భూధరముల్ = కొండలు, డొల్లన్ = ఊడిపడఁగా, వియత్ + తలంబు = ఆకాశ ప్రదేశము, అద్రువన్ = అదరఁగా, దైత్య - శ్రేణి = రాక్షసుల పంక్తి, భీతిల్లన్ = భయపడఁగా, భాస్కర - రథ్యంబులు = సూర్యుని గుఱ్ఱములు, మ్రొగ్గి - మగ్గఁబడన్ =వ్రాలి కూలఁగా, ఆశా - చక్రముల్ = దిగ్వలయములు, మ్రోయన్ = ధ్వనింపఁగా, భీకరము + ఐ = భయంకరమయి, దారుణము + అయి = ఘోరమయి, మహత్ (మహా) + ఉగ్రంబు + ఐ = మిక్కిలి భయంకరమయి, గుణ + ధ్వని = అల్లెత్రాటి చప్పుడు, వడిన్ = వేగముగా, చెలంగెన్ = మ్రోసెను

**తాత్పర్యము .** అల్లెత్రాటిధ్వని భూమి వడఁకఁగను, సముద్రములు కలఁగఁగను, దిగ్గజములు భయమందఁగను, కొండలు ఊడిపడఁగను, ఆకాశ మదరఁగను, రాక్షసపంక్తి భయపడఁగను, సూర్యరథాశ్వములు వ్రాలికూలఁగను, దిక్చక్రములు ప్రతిధ్వనింపఁగను, భీకరము, దారుణము, మహోగ్రము నయి వేగముగా మ్రోసెను

**విశేషములు.** అద్రుచు - తుమున్నంత రూపము అద్రువన్ అద్రుచు లో 'అ' లఘువు 'చుక్పరక రువర్ణంబునకు ముందటి దువర్ణంబు నుత్వంబునకు లోపంబు విభాష నగు నగుచోఁ దత్పూర్వంబు గురువు గాదు ' బాల ప్ర 20

వ **ఇ ట్లఖిలజగద్భయంకరంబై చెలంగ నొక్కట విజృంభించి** 133

**అర్థము.** ఇట్లు, అఖిల - జగత్ + భయంకరంబు + ఐ = ఎల్ల లోకములకు వెఱపు పుట్టించునదియై, చెలంగన్ = మ్రోయఁగా, ఒక్కటన్ = ఒక్కమాఱుగా, విజృంభించి = చేలరేఁగి

**తాత్పర్యము.** ఇట్లు ఎల్ల లోకములకు వెఱపు పుట్టించునదియై మ్రోయఁగా ఒక్కమాఱుగాఁ జెలరేఁగి - తరువాతి పద్యముతో నన్వయము

క **కాలాగ్నిరుద్రుఁడును లయ**
**కాలుఁడు నొండొరులఁ దాఁకుగతిఁ బేర్చి మహా**
**కాళసుత దితిసుతాగ్రణు**
**లోలములే కొదరి తాఁకి రొండొరుఁ గడిమిన్.** 134

**అర్థము** కాల + అగ్ని - రుద్రుఁడును = ప్రళయసమయాగ్నివంటి రుద్రుఁడును, లయ - కాలుఁడున్ = ప్రళయసమయ యముఁడును, ఒండొరులన్ = ఒకరినొకరు, తాఁకు - గతిన్ = మార్కొను విధమున, పేర్చి = విజృంభించి, మహాకాళ - సుత - దితి - సుత + అగ్రణులు = కుమారస్వామియు, రాక్షస శ్రేష్ఠుఁడైన తారకుఁడును, ఓలము - లేక - చాటు లేక - బాహాటముగా, ఒదరి= విజృంభించి, కడిమిన్ = పరాక్రమముతో, ఒండొరున్ = ఒకరినొకరు తాఁకిరి

**తాత్పర్యము** ప్రళయాగ్నివంటి రుద్రుఁడును, ప్రళయసమయ యముఁడును ఒకరినొకరు మార్కొనురీతిని అతిశయించి కుమారతారకులు బాహాటముగా విజృంభించి పరాక్రమముతో నొకరితోనొకరు మార్కొనిరి

**విశేషములు** అలంకార ముపమ

ఉ **తారకుమీఁద షణ్ముఖుఁడు తాఁకినముష్టిన ఘోరసాయకా**
**సారము పెల్లునం గురిసె, సైఁపక దానికి మున్న బల్విడిం**
**దారకుఁడున్, భుజాబలమదంబున షణ్ముఖుమీఁద నేసె నా**
**నా రుచిరాస్త్రసంహతి రణంబునఁ గ్రిక్కొని క్రుక్కిదంబుగాన్** 135

**అర్థము** షష్(ట్) + ముఖుఁడు = ఆఱుమొగములవాఁడు - కుమారస్వామి, తారకుమీఁదన్ = తారకాసురునిపై, తాఁకిన - ముష్టిన్ + అ = మార్కొనిన వెంటనే, ఘోర - సాయక +ఆసారము = భయంకరమైన అంపవాన, పెల్లునన్ = అధికముగా, కురిసెన్ = కురియించెను, తారకుఁడున్ = తారకాసురుఁడును, సైఁపక = సహింపక, దానికిన్ + మున్ను + అ = దానికిముందే, బల్విడిన్ = పరాక్రమముతో, భుజా - బల - మదంబునన్ = భుజపరాక్రమమువలని గర్వమున, రణంబునన్ = యుద్ధమునందు, క్రిక్కొని = నిండి, క్రుక్కిదంబుగాన్ = పూడునట్లుగా, నానా - రుచిర + అస్త్ర - సంహతిన్ = అనేకములయిన మనోహరములయిన బాణముల సమూహమును, షష్(ట్) + ముఖుమీఁదన్ = కుమారస్వామిపై, ఏసెన్ = ప్రయోగించెను

**తాత్పర్యము** . కుమారస్వామి తారకునితో మార్కొనిన తత్క్షణమే భయంకరమైన అంపవాన అధికముగాఁ గురిసెను తారకుఁడును సహింపక దానికి ముందే భుజబలగర్వమున యుద్ధమున నిండునట్లుగా కుమారస్వామిపైఁ బెక్కుబాణములను బ్రయోగించెను

చ **పరువడిఁ బైపయిన్ వివిధబాణచయంబులు గప్పినన్ దినే**
**శ్వరకరభాతి దూఱ కెడ సంగరభూమి మహాంధకారమై**
**యురుతరవృత్తిఁ బర్వుటయు నుగ్రశిలీముఖఘట్టనోత్థ భీ**
**కర వరవిస్ఫులింగరుచి గ్రక్కునఁ బాచెఁ దదంధకారమున్** **136**

**అర్థము .** వివిధ - బాణ - చయంబులు = వివిధములైన బాణముల సమూహములు, పరువడిన్ = క్రమముగా, పైపయి = అధికముగా, కప్పినన్, దిన + ఈశ్వర - కర - భాతి = సూర్యకిరణకాంతి, ఎడన్ = నడుమ, దూఱక = చొరక, సంగర - భూమి = యుద్ధభూమి, మహత్ (మహా) + అంధకారము + ఐ = గొప్ప చీఁకటియై, ఉరుతర - వృత్తిన్ = మిక్కిలి యెక్కువగా, పర్వుటయున్ = వ్యాపించుటయును, ఉగ్ర - శిలీముఖ - ఘట్టన + ఉత్థ - భీకర - వర - విస్ఫులింగ - రుచి = భయంకరములయిన బాణముల రాయిడిచే లేచిన భీకరము, శ్రేష్ఠమునైన మిడుఁగుఱుల కాంతి, తద్ + అంధకారమున్ = ఆ చీఁకటిని, గ్రక్కునన్ = శీఘ్రముగా, పాచెన్ = తొలఁగించెను

**తాత్పర్యము .** వివిధాస్త్రసమూహములు క్రమముగా అధికముగా వ్యాపింపఁగా సూర్యకిరణములకాంతి నడుమఁ జొరక యుద్ధభూమి మిక్కిలి చీఁకటియై ఎక్కువగా వ్యాపింపఁగా, భయంకరములయిన బాణముల రాయిడిచే లేచిన మిడుఁగుఱుల కాంతి ఆ చీఁకటిని వెంటనే తొలఁగించెను

**విశేషములు :** అలంకార మతిశయోక్తి

క **ఆతతముగ శుక్రుఁడు త**
**త్స్వాతిగతుండయినఁ గురియు సంతతధారా**
**పాతమును బోలె దనుజ**
**వ్రాతముపై గుహుఁడు బాణవర్షముఁ గురిసెన్** **137**

**అర్థము :** శుక్రుఁడు, ఆతతముగన్ = అధికముగా, తద్ + స్వాతి - గతుండు = ఆ స్వాతీనక్షత్రమును బొందినవాఁడు, అయినన్ = కాఁగా, కురియు, సంతత - ధారా - పాతమును + పోలెన్ = ఎడతెగని వర్షపాతమువలె, గుహుఁడు = కుమారస్వామి, దనుజ - వ్రాతముపైన్ = రాక్షసుల సమూహముపై, బాణ - వర్షమున్ = అంపవానను, కురిసెన్

**తాత్పర్యము** శుక్రుఁడు స్వాతీనక్షత్రగతుఁడు కాఁగాఁ గురియు ఎడతెగని వర్షపాతమువలెఁ గుమారస్వామి రాక్షససమూహముపై అంపవానను గురిసెను

**విశేషములు** అలంకారము ఉపమ

క హరతనయుఁ డల్గి చూచిన
నరిబలములు రక్తమయములై వడిఁ దోఁచెం
బొరిఁబొరిఁ దత్కోపారుణ
భరితేక్షణరుచులు కలనఁ బట్టిన భంగిన్ 138

**అర్థము.** హర - తనయుఁడు = శివుని కుమారుఁడు - కుమారస్వామి, అల్గి - చూచినన్ = కోపముతోఁ జూడఁగా, అరి - బలములు = శత్రుసేనలు, పొరిన్ + పొరిన్ = మాటిమాటికి, తద్ + కోప + అరుణ - భరిత + ఈక్షణ - రుచులు - వాని కోపముచే నెఱ్ఱనై నిండిన చూపుల కాంతులు, కలనన్ = యుద్ధమునందు, పట్టిన - భంగిన్ = అలముకొనిన విధమున, వడిన్ = వేగముగా, రక్తమయములు + ఐ = ఎఱ్ఱనివయి, తోఁచెన్ = కనఁబడెను

**తాత్పర్యము .** కుమారస్వామి కోపముతోఁ జూడఁగా శత్రుసేనలు మాటిమాటికి ఆతని కోపముచే నెఱ్ఱనైన చూపులకాంతులు యుద్ధభూమియందలముకొనెనా యనునట్లు వేగముగా నెఱ్ఱనివయి తోఁచెను

**విశేషములు** అలంకార ముత్ప్రేక్ష

క బాహుబలంబున నాహవ
దోహలుఁడై యధిపుఁ డేయు దుర్ధర శర సం
దోహాతివర్షమునఁ బర
వాహిని రక్తోదకప్రవాహము నెగసెన్ 139

**అర్థము.** అధిపుఁడు = రాజు - కుమారస్వామి, బాహు - బలంబునన్ = భుజపరాక్రమముతో, ఆహవ - దోహలుఁడు + ఐ = యుద్ధోత్సాహము గలవాఁడయి, ఏయు = ప్రయోగించు, దుర్ధర - శర - సందోహ + అతి - వర్షమునన్ = ధరింపశక్యముగాని బాణసమూహముయొక్క అధికమైన వర్షముచే, పర - వాహినిన్ = శత్రుసేనయనెడినదియందు, రక్త + ఉదక - ప్రవాహము = రక్తమనెడి ఎఱ్ఱని నీటి ప్రవాహము, నెగసెన్ = ఏర్పడెను

**తాత్పర్యము** కుమారస్వామి భుజపరాక్రమముతో యుద్ధోత్సాహము గలవాఁడయి, ప్రయోగించు ధరింపశక్యముగాని బాణముల అధికవర్షముచే శత్రుసేన యనెడినదిలో రక్తమనెడి యెఱ్ఱని నీటిప్రవాహము ఏర్పడెను

**విశేషములు .** శ్లిష్ట రూపకము

క **గుహునిపై నట్ల యత్యుగ్రకోపభాతిఁ**
**దారకాసురుఁ డేసినఁ దత్క్షణంబ**
**నెఱయ బ్రహ్మాండకుహరంబు దెఱపి యెల్ల**
**దొన విధంబున నమ్ముల తూఁటు కట్టె** 140

**అర్థము .** అట్లు + అ = ఆ విధముగనే, అతి + ఉగ్ర - కోప - భాతిన్ = మిక్కిలి భయంకరమయిన కోపప్రకారముచే, తారక + అసురుఁడు, గుహునిపైన్ = కుమారస్వామి మీఁద, ఏసినన్ = ప్రయోగింపఁగా, తద్ + క్షణంబు + అ = వెంటనే, బ్రహ్మాండ - కుహరంబు + తెఱపి + ఎల్లన్ = గుహవంటి బ్రహ్మాండము యొక్క సందెల్ల, దొన - విధంబునన్ = అమ్ములపొదివలె, అమ్ముల - తూఁటు - కట్టెన్ = బాణముల రంధ్రము పడెను

**తాత్పర్యము** ఆ విధముగనే తారకాసురుఁడు మిక్కిలి కోపముతోఁ గుమారస్వామిపై బాణములు ప్రయోగింపఁగా వెంటనే బ్రహ్మాండకుహరము సందెల్ల నమ్ములపొది విధమున బాణముల చిల్లివడెను

**విశేషములు .** అలంకార మతిశయోక్తి, ఉత్ప్రేక్ష

క **ఒండొరు నేయు శరంబు ల**
**ఖండితభుజశక్తి మెఱసి ఖండింపం ద**
**త్కాండంబులు నడుమనఁ గడి**
**ఖండము లగుచున్ సహస్రఖండము లయ్యెన్** 141

**అర్థము :** ఒండొరున్ = ఒకరినొకరు, ఏయు = కొట్టు, శరంబులు = బాణములు, అఖండిత - భుజ - శక్తిన్ = గొప్ప భుజబలమును, మెఱసి = మెఱయించి, ఖండింపన్ = తెగఁగొట్టఁగా, తద్ + కాండంబులు = ఆ బాణములు, నడుమన్ + అ = నడుమనే, కడిఖండములు = ముక్కలు ముక్కలు, అగుచున్, సహస్ర - ఖండములు + అయ్యెన్ = వేయిముక్కలు అయ్యెను

**తాత్పర్యము** ఒకరిపై నొకరు ప్రయోగించు బాణములను అధికమయిన భుజబలము మెఱయించి తెగఁగొట్టఁగా, ఆ బాణములు నడుమనే ముక్కలు ముక్కలయి వేయిశకలము లయ్యెను

చ హరతనయాసురేంద్రుల శరాహతిఁ గూలెడు దానవామరో
త్కర శవరాసు లంబరముఁ దాఁకి తనర్చుచు మాటిమాటి క
క్షరగతిఁ బర్వులోహితరసప్రకరంబునఁ దేలి పాఱె సా
గరములు సొచ్చి మెట్టుకొనఁగా నెడద్రెవ్వ కహర్నిశంబులున్ 142

**అర్థము** హర - తనయ + అసుర + ఇంద్రుల = కుమారస్వామి తారకుల, శర + ఆహతిన్ = బాణముల దెబ్బచే, కూలెడు = పడిపోవు, దానవ + అమర + ఉత్కర - శవ - రాసులు = రాక్షసులయు, దేవతలయు గుంపుల పీనుఁగుల ప్రోవులు, అంబరమున్ = ఆకాశమును, తాఁకి = ముట్టి, తనర్చుచున్ = ఒప్పుచు, మాటిమాటికిన్, అక్షర - గతిన్ = నాశనములేని విధమున, పర్వు = ప్రవహించు, లోహిత - రస - ప్రకరంబునన్ = రక్త సమూహమునందు, తేలి, సాగరములు + చొచ్చి = సముద్రములు ప్రవేశించి, మెట్టుకొనఁగాన్ = సోపానములుగా ఏర్పడునట్లు, ఎడ + త్రెవ్వక = ఎడతెగక, అహర్నిశంబులున్ = పవళ్లును, రేలును, పాఱెన్ = ప్రవహించెను

**తాత్పర్యము .** కుమార తారకుల బాణముల దెబ్బచేఁ గూలు రాక్షస దేవతల గుంపుల పీనుఁగుల ప్రోవులు ఆకాశమంటి యొప్పుచు, మాటిమాటికి నాశనములేని విధమునఁ బ్రవహించు రక్తసమూహమునఁ దేలి సముద్రములు ప్రవేశించి మెట్లుగా నేర్పడునట్లు ఎడతెగక రెయుంబవళ్లు ప్రవహించెను

**విశేషములు .** అలంకారము అతిశయోక్తి హరతనయుని శరాహతిని గూలు దానవశవరాసులు, అసురేంద్రుని శరాహతిచేఁ గూలు అమరశవరాసులు అని అన్వయము యధాసంఖ్యము

క ఇరుగడలఁ గలసి క్రమ్మెడు
నరుణాంబుధి మీఁదఁ దేలు హయ నృ గజ కళే
బరతలము మీఁద నెలకొని
చెరలాడిరి కడిమి నుభయ శేష బలంబుల్ 143

**అర్థము** ఇరు + కడలన్ = రెండు పక్షములందును, కలసి = కూడి, క్రమ్మెడు = వ్యాపించునట్టి, అరుణ + అంబుధిమీఁదన్ = రక్తసముద్రముపై, తేలు, హయ - నృ - గజ -కళేబరతలము మీఁదన్ = గుఱ్ఱముల, నరుల, ఏనుఁగుల శవములపై, నెలకొని = ఉండి, ఉభయ - శేష - బలంబుల్ = రెండు పక్షములందలి మిగులు సేనలు, కడిమిన్ = పరాక్రమముతో, చెరలాడిరి = అధికముగాఁ గ్రీడించిరి

**తాత్పర్యము .** రెండు పక్షములందును వ్యాపించు రక్తసముద్రముపైఁ దేలు గుఱ్ఱముల, నరుల, ఏనుఁగుల శవములపైఁ గాలూని రెండుపక్షములలోఁ జావఁగా మిగిలిన సేనలు పరాక్రమముతోఁ గ్రీడించిరి

**విశేషములు .** అలంకారము రూపకము

వ **అంతం దారక కుమారు లొండొరు నగ్గలించుచు** **144**

**అర్థము .** అంతన్, తారక కుమారులు, ఒండొరున్ = ఒకరినొకరు, అగ్గలించుచున్ = మించుచు

**తాత్పర్యము :** అంత తారకుఁడును, కుమారుఁడును ఒకరి నొకరు మించుచు - తరువాతి పద్యముతో నన్వయము

ఉ. **ఆయతబాహువీర్యము సురాసురముఖ్యులు పిచ్చలింప నా**
**నాయుధకౌశలంబు వెలయం బటువిక్రమ మొప్ప భౌమవై**
**హాయస చిత్రయుద్ధవిషయజ్ఞ తదజ్ఞులు చూచి మెచ్చ గాం**
**గేయుఁడుఁ దారకాసురుఁడుఁ గేనము లే కని సేసి రీసునన్** **145**

**అర్థము :** ఆయత - బాహు - వీర్యమున్ = అధికమైన భుజ పరాక్రమును, సుర + అసుర - ముఖ్యులు = దేవతల రాక్షసుల శ్రేష్ఠులు, పిచ్చలింపన్ = ప్రశంసింపఁగా, నానా + ఆయుధ - కౌశలంబు = అనేకాయుధముల నేర్పు, వెలయన్ = ఒప్పఁగా, పటు - విక్రమము = తీవ్రమైన పరాక్రమము, హోమ - వైహాయస - చిత్ర - యుద్ధ - విషయజ్ఞ - తద్ + అజ్ఞులు = భూసంబంధమైన, ఆకాశసంబంధమైన యుద్ధవిషయము నెఱిఁగినవారు, ఎఱుఁగనివారు, చూచి, మెచ్చన్, గాంగేయుఁడున్ = కుమారస్వామియును, తారక + అసురుఁడున్, కేనము - లేక = కొఱఁత లేక, ఈసునన్ = కోపముతో, అని + చేసిరి = యుద్ధమొనరించిరి

**తాత్పర్యము** అధికమైన భుజబలమును సురలలోను, అసురలలోను ముఖ్యులైనవారు ప్రశంసింపఁగా, వివిధాయుధముల నేర్పు ఒప్పఁగాఁ దీవ్ర పరాక్రమ మొప్పఁగా, భూ సబంధమైన ఆకాశ సంబంధమైన చిత్రయుద్ధవిషయము నెఱిఁగినవారు, ఎఱుఁగనివారు చూచి మెచ్చఁ గాఁ గుమారస్వామియుఁ, దారకాసురుఁడును గొఱఁతలేక కోపముతో యుద్ధము చేసిరి

వ అట్టి విషమసమరంబు సమయంబు గనుంగొని తనివిసనక కలహభోజనుండు మహోత్సాహంబున 146

**అర్థము .** అట్టి, విషమ - సమరంబు - సమయంబు = విషమ యుద్ధ సమయమును, కనుంగొని = చూచి, తనివి + చనక = తృప్తి తీఱక, కలహ - భోజనుండు = కయ్య మాహారముగాఁ గలవాఁడు - నారదుఁడు, మహత్ (మహో) + ఉత్సాహంబునన్ = గొప్ప ఉత్సాహముతో

**తాత్పర్యము :** అట్టి విషమయుద్ధమును జూచి తృప్తితీఱక నారదుఁడు మహోత్సాహముతో తరువాతి పద్యముతో నన్వయము

సీ గుణతాడనధ్వని ఘూర్ణిల్లి తన వీణె
వాయింపకయుఁ బ్రతిధ్వనులు మ్రోయఁ
దూఱఁ గోలలు నాఁటి తుటిగొని తన కుంచి
పొది నమర్చిన కోలపురులు గాఁగ
నస్త్రసంఘట్టన నదరు మెఱుంగులు
తన మణిజపమాల నెనసి వెలుఁగఁ
దనరు క్రొన్నెత్తురు ధారల జొత్తిల్లి
తన కుఱుజడలకెం పినుమడింప

ఆ సంగరాంగణంబు రంగంబుగాఁ దన్ను
బలసియాడు నురు కబంధములకుఁ
దాన మొదలిసూత్రధారుఁడై నాట్యాభి
నయము లెసఁగ నాడె నారదుండు 147

**అర్థము.** గుణ - తాడన - ధ్వనిన్ = అల్లెత్రాటిని లాగుటచే నేర్పడు ధ్వనిచే, ఘూర్ణిల్లి = తిరుగుడువడి, తన - వీణె, వాయింపకయున్ = వాయింపకపోయినను, ప్రతిధ్వనులు - మ్రోయన్ = మాఱుమ్రోగఁగా,

కోలలు = అమ్ములు, తూఱన్ - నాఁటి =మిక్కిలి గ్రుచ్చుకొని, తుటి + కొని = గుంపు గూడి, తన - కుంచి - పొదిన్ = గుత్తిగాఁ గట్టిన నెమిలిపురి పొదియందు, అమర్చిన, కోల-పురులు + కాఁగన్ = బాణపు టెక్కలు కాఁగా,

అస్త్ర - సంఘట్టనన్ = బాణముల రాయిడిచే, అదరు - మెఱుంగులు = చలించు కాంతులు, తన - మణి - జప - మాలన్ = తన మణిమయమైన జపమాలను, ఎనసి = పొంది, వెలుఁగన్ = ప్రకాశింపఁగా,

తనరు - క్రొన్నెత్తురు (క్రొత్త + నెత్తురు) - ధారలన్ = ఒప్పునట్టి క్రొన్నెత్తుటి ప్రవాహములచే, జొత్తిల్లి = ఎఱ్ఱనయి, తన - కుఱు - జడల -కెంపు = తన జడల కొంచెమైన యెఱుపు, ఇనుమడింపన్ = రెట్టింపుకాఁగా,

సంగర + అంగణంబు = యుద్ధభూమి, రంగంబు + కాన్ = నాట్యస్థలముగా, తన్నున్, బలసి + ఆడు= చుట్టియాడునట్టి, ఉరు - కబంధములకున్ = పెద్ద మొండెములకు, తాను +అ = తానే, మొదలి - సూత్రధారుఁడు + ఐ = ప్రధమసూత్రధారుఁడయి, నారదుండు, నాట్య + అభినయములు = నాట్యమును, అభినయమ్మును, ఎసఁగన్ = అతిశయింపఁగా, ఆడెన్ = నాట్యము చేసెను

**తాత్పర్యము** . అల్లెత్రాడుల మ్రోఁతచేఁ దిరుగుడువడి తన వీణె వాయింపకయే ప్రతిధ్వనింపఁగను, అమ్ములు నాఁటుకొని గుమిగూడి తన కుంచి పొదియం దమర్చిన బాణపుటెక్కలు కాఁగా, బాణముల రాయిడిచేఁ జలించు కాంతులు తన మణిమయమైన జపమాలను బొంది ప్రకాశింపఁగను, ఒప్పునట్టి క్రొన్నెత్తుటిధారలచే నెఱ్ఱనయి తన జడల యించుక యెఱుపు రెట్టింపు కాఁగను, యుద్ధభూమి రంగస్థలముగా, దన్నుఁ జుట్టి యాడెడు పెద్ద మొండెములకుఁ దానే ప్రధమసూత్రధారుఁడయి నారదుఁడు నాట్యాభినయము లొప్పఁగా నాట్యము చేసెను

**విశేషములు :** అలంకారము స్వభావోక్తి

వ తత్ప్రస్తవంబున 148

**అర్థతాత్పర్యములు** . తద్ + ప్రస్తవంబునన్ = ఆ సందర్భమునందు- తరువాతి పద్యముతో నన్వయము

క ఉరగాభ్రానలతామస
గిరిశరములు దనుజుఁ డేసెఁ గినిసి రయమునన్,
గరుడానిలాంబు రవి పవి
శరములు గుహుఁ డేసె నుగ్రసమరాగ్రమునన్ 149

**అర్థము** ఉగ్ర - సమర + అగ్రమునన్ = భయంకరమైన అని మొనయందు, దనుజుఁడు = రాక్షసుఁడు - తారకుఁడు, ఉరగ + అభ్ర + అనల - తామస - గిరి - శరములు = నాగ, మేఘ, ఆగ్నేయ తామస (తమస్సంబంధమైన) పర్వతాస్త్రములు, ఏసెన్ = ప్రయోగించెను, గుహుఁడు = కుమారస్వామి, కినిసి = కోపించి, రయమునన్ = శీఘ్రముగా, గరుడ + అనిల + అంబు - రవి - పవి - శరములు = గారుడ, వాయవ్య, జల, సూర్య, వజ్రాస్త్రములు, ఏసెన్ = ప్రయోగించెను

**తాత్పర్యము** భయంకరమయిన అనిమొనయందుఁ దారకుఁడు నాగ, మేఘ, ఆగ్నేయ, తామస, పర్వతాస్త్రములు ప్రయోగింపఁగాఁ, గుమారస్వామి కోపించి వెంటనే గారుడ,వాయవ్య, వారుణ, సూర్య, వజ్ర శరములు ప్రయోగించెను

**విశేషములు .** అలంకారము క్రమము

ఆ అసుర యేయు నమ్ము లాఁక సేయున కాని
యతని మగుడ నేయ నవసరంబు
కానఁగాక గుహుఁడు దానవు బలిమియు
విల్లు నేర్పుఁ జూచి వీనిచేత 150

**అర్థము .** అసుర = రాక్షసుఁడు - తారకుఁడు, ఏయు = ప్రయోగించు, అమ్ములు = బాణములు, గుహుఁడు = కుమారస్వామి, ఆఁక + చేయున్ + అ - కాని = అడ్డుకొనునే కాని, అతనిన్ = వానిని - తారకుని, మగుడన్ = తిరిగి, ఏయన్ + అవసరంబు - కానన్ + కాక = ప్రయోగించు సమయము కానరాక, దానవు - బలిమియున్ = తారకుని పరాక్రమమును, విల్లు-నేర్పున్ = చూచి, వీనిచేతన్ = వీనిచే

**తాత్పర్యము** తారకుఁడు తనపైఁ బ్రయోగించు బాణములను గుమారస్వామి యడ్డుకొనునే కాని యతనిని మరలఁగొట్టు సమయము కానరాక,

రాక్షసుని పరాక్రమమును వింటినేర్పును జూచి వీనిచే - తరువాతి పద్యముతో నన్వయము

క సురవరులు పెక్కు మాఱులు
పరిభవపడి రనిన నేల పడకుండుదు రీ
శరవరఘట్టన కెదురఁగ
హరిహరులకుఁ'బోల దనిన నమరుల వశమే ? 151

**అర్థము** సుర-వరులు = దేవతాశ్రేష్ఠులు, పెక్కు - మాఱులు, పరిభవపడిరి + అనినన్ = అవమానపడిరనఁగా, ఏల, పడక + ఉండుదురు ? ఈ -శర - వర - ఘట్టనకున్ = ఈ గొప్ప అమ్ములరాయిడిని మార్కొనుటకు, హరి -హరులకున్ = విష్ణువునకును, ఈశ్వరునకును, పోలదు + అనినన్ = శక్యముగాదు అనఁగా, అమరుల - వశము + ఏ = దేవతల తరమా ?

**తాత్పర్యము .** దేవతలు పలుమాఱులు అవమానితులయి రనిన ఏలకాకుందురు ? ఈ అమ్ముల రాయిడిని మార్కొన హరిహరులకైనను శక్యము గాదనిన, దేవతల తరమగునా ?

**విశేషములు .** అలంకారము కావ్యార్థాపత్తి పరిభవపడిరి - పరిభవము + పడిరి 'పద్వాదులు పరంబులగునపుడు మువర్ణకంబునకు లోపపూర్ణబిందులు విభాష నగు ' బాల సం 46

వ అని దనుజేంద్రు ధనుర్విద్యా విశేషంబు విశేషించుచుం దదీయ దివ్య శరంబులకుం బ్రతిశరంబులు ప్రయోగించుచున్న కుమారుం గని తావగొనక 152

**అర్థము .** అని, దనుజ + ఇంద్రు = రాక్షసశ్రేష్ఠుఁడైన తారకుని యొక్క, ధనుస్ (ః) + విద్యా - విశేషంబు = విలువిద్యయొక్క ఆధిక్యము, విశేషించుచున్ = కొనియాడుచు, తదీయ - దివ్యశరంబులకున్ = ఆతని గొప్ప బాణములకు, ప్రతిశరంబులు = మాఱు బాణములు, ప్రయోగించుచున్ + ఉన్న, కుమారున్, కని, తావగొనక = ఓర్వక

**తాత్పర్యము :** అని తారకుని ధనుర్విద్యాపాటవమును గొనియాడుచు, వాని దివ్యశరములకు మాఱుశరములు ప్రయోగించుచున్న కుమారస్వామినిఁ జూచి నిలువక - తరువాతి పద్యముతో నన్వయము

క దానవపతి మది నతికో
పానలశిఖ లెగయు నంతకాంతకసుతుపై
మానక పుంఖాపుంఖము
గా నేసె నపార ఘోర ఖరవర శరముల్ 153

**అర్థము .** దానవ - పతి = రాక్షసరాజు - తారకుఁడు, మదిన్ = మనస్సునందు, అతి - కోప +అనల - శిఖలు = అధికమైన కోపాగ్ని - జ్వాలలు, ఎగయు = లేచునట్టి, అంతక + అంతకు-సుతుపైన్ = యమనాశకుని (శివుని) కొడుకు - కుమారస్వామి - మీఁద, మానక = ఉడుగక, అపార - ఘోర - ఖర - వర - శరముల్= అంతులేనివి, భయంకరములు, మిక్కిలితీక్ష్ణములునైన బాణములు, పుంఖాపుంఖముగాన్ = బాణము వెంబడి బాణముగా, ఏసెన్ = ప్రయోగించెను

**తాత్పర్యము .** తారకుఁడు మనస్సునందు అధికకోపాగ్నిజ్వాల లెగయు కుమారస్వామిపై ఉడుగక అంతులేనివి, భయంకరములు, తీక్ష్ణతరములు అగు శరములను ఒకదాని వెంబడి నొకటిగాఁ బ్రయోగించెను

క దనుజుల శరవర్షము కవి
సిన యెడఁ దనుఁగానరాక చేద్పడి గుహుఁ డొ
ప్పె నవాభ్రాచ్ఛాదితుఁడై
తనప్రభ చెడియున్న తీవ్రధాముఁడు వోలెన్ 154

**అర్థము .** దనుజులు = రాక్షసులు, శర-వర్షము = అంపవాన, తన్నున్ = తన్ను, కవిసిన + ఎడన్= ఆక్రమించినప్పుడు, గుహుఁడు = కుమారస్వామి, కానన్ + రాక = కనఁబడక, చేద్పడి = బాధనొంది, నవ + అభ్ర + ఆచ్ఛాదితుఁడు + ఐ = క్రొమ్మొయిళ్లచేఁ గప్పఁబడినవాఁడయి, తన - ప్రభ = ఆత్మకాంతి, చెడి + ఉన్న = నశించియున్న, తీవ్ర-ధాముఁడు + పోలెన్ = సూర్యునివలె, ఒప్పెన్

**తాత్పర్యము:** రాక్షసుల అంపవాన తన్ను ఆక్రమించినప్పుడు కుమారస్వామి కానరాక బాధనొంది క్రొమ్మొయిళ్లచేఁ గప్పఁబడిన సూర్యుని విధమున నొప్పెను

**విశేషములు .** అలంకార ముపమ

వ. ఇ ట్లత్యాసురంబగు తారకాసురాడంబరంబు గని దనుజబలంబు లొక్కపెట్ట వచ్చి చెలంగి యార్చిన. 155

**అర్థము** ఇట్లు, అతి + ఆసురంబు + అగు = మిక్కిలి క్రూరమైన, తారక + అసుర + ఆడంబరంబు = తారకాసురుని విజృంభణమును, కని = చూచి, దనుజ - బలంబులు = రాక్షససేనలు, ఒక్క-పెట్టన్ = ఒక్కుమ్మడిగా, వచ్చి, చెలంగి = మ్రోసి, ఆర్చినన్ = అఱవఁగా

**తాత్పర్యము** ఇట్లు మిక్కిలి క్రూరమగు తారకాసురుని విజృంభణమును జూచి రాక్షససేనలు ఒక్కమాఱుగా వచ్చి మ్రోసి అఱవఁగా - తరువాతి పద్యముతో నన్వయము

చ **ఉరగులు స్రుక్కి మ్రక్కఁబడి, యుర్వి వడంకెఁ, బయోధు లింకె, భూ**
**ధరములు డొల్లె, దిక్కరులు తల్లడమై మదమెత్తి కట్టె, భా**
**స్కర రుచి మాసె, దిక్పతులు సంచలులై, రమరేంద్రుఁ డుల్కెఁ, బం**
**కరుహజుఁ డిచ్చ నొచ్చె, హరి కంపముఁ బొందె మహాభయంబునన్ 156**

**అర్థము .** ఉరగులు = నాగులు, స్రుక్కి = భయపడి, మ్రక్కఁబడిరి = బాధపడిరి, ఉర్వి =భూమి, వడఁకెన్ = కంపించెను, పయోధులు = సముద్రములు ఇంకెన్, భూధరములు = కొండలు, డుల్లెన్ = పడెను, దిశ్ (క్) + కరులు = దిగ్గజములు, తల్లడము + ఐ = కలఁతఁజెంది, మదము, ఎత్తికట్టెన్ = నిలుపుకొనెను భాస్కర - రుచి = సూర్యుని కాంతి, మాసెన్ = నశించెను, దిశ్(క్) + పతులు = దిక్పాలకులు, సంచలులు + ఐరి = చలించిపోయిరి, అమర + ఇంద్రుఁడు = దేవేంద్రుఁడు, ఉల్కెన్= భయమందెను, పంకరుహజుఁడు = పద్మజుఁడు - బ్రహ్మ, ఇచ్చన్ = మనసునందు, నొచ్చెన్ = బాధపడెను, హరి = విష్ణువు, మహత్ (మహా) + భయంబునన్ = గొప్ప భీతితో, కంపమున్ + పొందెన్ = వడఁకెను

**తాత్పర్యము.** నాగులు భయపడి బాధపడిరి భూమి క్రుంగెను సముద్రము లింకిపోయెను పర్వతములు పడిపోయెను దిగ్గజములు కలఁగి మదము నిలుపుకొనెను సూర్యుని కాంతి నశించెను దిక్పాలకులు చలించిరి దేవేంద్రుఁడు భయపడెను బ్రహ్మ మనసునందు నొచ్చుకొనెను విష్ణువు అధికభీతితోఁ గంపించెను

వ **ఇట్లు తదీయాస్త్రజాలం బశ్రమంబున విఖండించి దృష్టి ముష్టి శీఘ్ర సంధాన దూరాపాత లక్ష్యభేదా ద్యనేకవిధ ధనుర్విద్యాకౌశలంబు మెఱయం దొడంగిన 157**

**అర్థము** ఇట్లు, తదీయ + అస్త్ర - జాలంబు = వాని బాణముల సమూహమును, అ(శ్రమంబునన్ = అనాయాసముగా, ఖండించి = ముక్కలు చేసి, దృష్టి - ముష్టి - శీఘ్రసంధాన-దూరాపాత - లక్ష్యభేద + ఆది + అనేక విధ - ధను(స్) ( ) + విద్యా - కౌశలంబు = దృష్టి ముష్టి శీఘ్ర సంధానము, దూరాపాతము లక్ష్యభేదము మున్నగు పెక్కురీతులైన, ధనుర్విద్యానైపుణ్యము, మెఱయన్ + తొడంగినన్ = ప్రకాశింపఁజేయఁబూనఁగా - తరువాతి పద్యముతో నన్వయము

క దొనఁ గోలఁ గోల వేగం
బున నరిగొల్పుటయుఁ దిగువుఁ బొరిఁబొరి విడుపుం
జనుటయు దనుజులఁ గొనుటయు
ననిమిషులకు నైనఁగాంచు డరుదయ్యె ననిన్ 158

**అర్థము .** దొనన్ = అమ్ముల పొదియందు, కోలన్ + కోలన్ = ప్రతి బాణమును, వేగంబునన్ = వేగముతో, అరిగొల్పుటయున్ = సంధానము చేయుటయును, తిగువున్ = లాగుటయు, పొరిన్ + పొరిన్ = మాటిమాటికి, విడుపున్ = విడుచుటయు, చనుటయున్ = పోవుటయును, దనుజులన్ = రాక్షసులను, కొనుటయున్ = సంహరించుటయును, అనిమిషులకున్ + ఐనన్ = రెప్పపాటులేనివారి (దేవతల)కైనను, కాంచుడు = చూచుట, అనిన్ = యుద్ధమునందు, అరుదు + అయ్యెన్ = ఆశ్చర్యమయ్యెను

**తాత్పర్యము.** యుద్ధమున అమ్ములపొదినుండి ప్రతిబాణమును వేగముగా వింట సంధించుటయును, లాగుటయును, మాటిమాటికిని విడుచుటయును, పోవుటయు, రాక్షసులను సంహరించుటయు రెప్పపాటులేని దేవతలకుఁ గూడఁ జూచు టరుదయ్యెను

**విశేషములు .** అలంకారము పరికరాంకురము

క. దొనపై గొనయముపై నో
లిన వడి నెడతెగక యంగుళీయక ఖచితో
ర్వనుపమ నవరత్నోజ్జ్వల
వినుతద్యుతు లెసఁగెఁ గొఱవి వీచిన భంగిన్ 159

**అర్థము** · దొనపైన్ = అమ్ములపొది మీఁదను, గొనయముపైన్ = వింటినారిపై, ఓలిన్ + అ = క్రమముగా, వడిన్ = వేగముగా, ఎడతెగక = అ(పులేక,

అంగుళీయక - ఖచిత + ఉరు + అనుపమ - నవ - రత్న + ఉజ్జ్వల - వినుత - ద్యుతులు = ఉంగరమునందుఁ బొదుగఁబడిన, గొప్ప, సాటిలేని, క్రొత్త రత్నములయొక్క ప్రకాశించు పొగడఁబడు కాంతులు, కొఱవి - వీచిన -భంగిన్= కొఱకచ్చును ద్రిప్పిన విధమున, ఎసఁగెన్ = అతిశయించెను

**తాత్పర్యము .** అమ్ములపొది మీఁదను, వింటినారిపైని, క్రమముగా వేగముగా విరామములేక వ్రేలియుంగరమునందుఁ బొదుగఁబడిన పెద్ద, సాటిలేని, క్రొత్త రత్నముల ప్రకాశించు కాంతులు కొఱవిని ద్రిప్పిన విధమున నతిశయించెను

**విశేషములు** అలంకార ముపమ

**వ ఇ ట్లనంతశరసంధానవేగంబునం దారకాసురుని కరి రథ రథ్య సారథుల నొక్కటఁదెగనేసి రయంబున నర్ధచంద్రాస్త్రంబుఁ దొడిగి యేసిన 160**

**అర్థము .** ఇట్లు, అనంత - శర - నికర - రథ - రథ్య - సారథులన్ = అంతులేని బాణ సమూహమును,రథమును, గుఱ్ఱములను, సారథిని, ఒక్కటన్= ఒక్కమాఱుగా, తెగన్ + ఏసి = ఖండించి, రయంబునన్ = వేగముగా, అర్ధచంద్ర + అస్త్రంబున్ = అర్ధచంద్రాస్త్రమును, తొడిగి = సంధించి, ఏయుటయున్ = ప్రయోగింపఁగా

**తాత్పర్యము.** ఇట్లు అంతులేని అమ్ముతొడుగు వేగముచే తారకాసురుని బాణములను, రథమును, గుఱ్ఱములను సారథిని ఒక్కమాఱుగా ఖండించి శీఘ్రముగా అర్ధచంద్రాస్త్రమును సంధించి ప్రయోగింపఁగా - తరువాతి పద్యముతో నన్వయము

**క. పురహరసుత శరహతి న**
**చ్చెరువుగఁ దారకునివింటిశింజిని తెగియెన్**
**దురమున, నట్టిద దోషా**
**చరుపట్టిన ధర్మగుణము సనఁ దెగు డరుదే ? 161**

**అర్థము :** దురమునన్ = యుద్ధమునందు, పురహర - సుత - శరహతిన్ = శివుని కుమారుని బాణముల దెబ్బచే అచ్చెరువుగన్ = ఆశ్చర్యముగా, తారకుని, వింటి - శింజిని = వింటినారి, తెగియెన్, అట్టిది +అ = అది అట్లే, దోషాచరు -

పట్టిన - దోషా - చరు - పట్టిన, దోష + ఆచరు - పట్టిన = రాత్రించరుఁడు - రాక్షసుఁడు - తారకుఁడు - తప్పుచేసినవాఁడు పట్టిన, ధర్మ - గుణము = వింటిత్రాడు - ధర్మమనెడి గుణము, చనన్ = పోవునట్లు, తెగుడు = తెగుట, అరుదే = ఆశ్చర్యమా ?

**తాత్పర్యము** యుద్ధమునందుఁ గుమారస్వామి బాణముల దెబ్బచే నాశ్చర్యముగాఁ దారకుని వింటిత్రాడు తెగిపోయెను అది యట్లే దోషాచరుఁడు (రాక్షసుఁడు - తప్పుచేసినవాఁడు) పట్టుకొనిన ధర్మగుణము (వింటిత్రాడు - ధర్మమనెడి గుణము) నశించిపోవుట ఆశ్చర్యమా ? - కా దనుట

**విశేషములు** శ్లేషానుప్రాణితమైన అర్థాంతరన్యాసము

తే **సురలు గని యార్వఁ దారకాసురుని విల్లు**
**వితిగె, దానవసేనలు వితిగె నంత,**
**మగిడి తాఁకిన కడిఁది సామంతు లెల్ల**
**నస్తమించిరి, రవియును నస్తమించె** 162

**అర్థము.** సురలు = దేవతలు, కని = చూచి, ఆర్వన్ = అఱవఁగా, తారక + అసురుని - విల్లు, వితిగెన్, అంతన్, దానవ - సేనలున్ = రాక్షససైన్యములును, వితిగెన్ = పాఱిపోయెను, మగిడి = మరలి, తాఁకిన - కడిఁది - సామంతులు + ఎల్లన్ = మార్కొనిన శౌర్యవంతులైన సామంతులందఱును, అస్తమించిరి = నశించిరి, రవియును = సూర్యుఁడును, అస్తమించెన్

**తాత్పర్యము.** దేవతలు చూచి ఉత్సాహముతో నఱవఁగాఁ దారకుని విల్లు వితిగెను అంత రాక్షససేనలును వితిగెను - పాఱిపోయెను మరలి తాఁకిన శౌర్యవంతులగు సామంతులందఱును అస్తమించిరి సూర్యుఁడును అస్తమించెను

**విశేషములు .** అలంకారము సహోక్తి

వ **అంత మహాసేనుండు సంగ్రామవిరామంబు సేసి నిఖిలామర పరివృతుండై నిజశిబిరంబున కరిగి బృందారకబృందనయనేందీవరానంద కరుం డగుచుండె నిటఁ దారకాసురుండు నిజస్వజనసామంతాద్యనంత చతురంగబలంబు సమరజలధినిర్మగ్ను లగుటం జేసి నోసి పరిమితపరివార వృతుండై** 163

**అర్థము** అంతన్, మహాసేనుండు = కుమారస్వామి, సంగ్రామ - విరామంబు +చేసి = యుద్ధవిరమణము చేసి, నిఖిల + అమర - పరివృతుండు + ఐ =ఎల్ల దేవతలతోడను గూడినవాఁడయి, నిజ - శిబిరంబునకున్ = తన గుడారమునకు - విడిఁదికి, అరిగి, బృందారక - బృంద - నయన +ఇందివర + ఆనంద - కరుండు = దేవతల సమూహముయొక్క నల్లకలువల వంటి కన్నులకు ఆనందమును గలుగఁజేయువాఁడు, అగుచున్ + ఉండెన్, ఇటన్, తారక + అసురుండు, నిజ - స్వజన - సామంత + ఆది + అనంత - చతురంగ - బలంబు = తన వారైన సామంతులు మున్నగు అంతులేని చతురంగబలము, సమర - జలధి - నిర్మగ్నులు = యుద్ధమనెడి సముద్రమునందు మునిఁగినవారు, అగుటన్ + చేసి =అగుటచేత, నొచ్చి = నొచ్చి, పరిమిత - పరివార - వృతుండు + ఐ = తక్కువ పరివారముతోఁ గూడినవాఁడయి

**తాత్పర్యము** అంతఁ గుమారస్వామి యుద్ధవిరమణముచేసి ఎల్లదేవతలతోఁ గూడి తన విడిఁది కేఁగి దేవతల నల్లకలువలవంటి కన్నుల కానందమును కలిగించువాఁడగుచుండెను ఇచ్చటఁ దారకుఁడు తన సామంతులు మున్నగు అంతులేని చతురంగబలము యుద్ధమనెడి సముద్రమున మునుఁగుటచే బాధపడి పరిమితమైన పరివారముతోఁ గూడినవాఁడయి - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు** అలంకారము రూపకము

సీ తరల ముక్తాహారతతి వీడి కుచములఁ
 గన్నీరు ధారలు కడలుకొనఁగఁ
దాంబూలరాగంబు దఱఁకి కెమ్మోవుల
 నురువులు గొని లాల లురులుదేరఁ
బుష్పావతంసముల్ పొలుపఱి కరతలా
 బ్జములు శిరోవతంసములు కాఁగఁ
బత్రభంగంబులఁ బాసి కపోలస్థ
 లములపై నీలాలకములు చెదర

తే మంజులంబగు తూర్యసమ్మర్ద ముడిగి
తమ మొగంబుల నార్తరావములు చెలఁగ
శోకమగ్నలై సతు లుద్దఁ జూచుచుండఁ
బురము సొత్తెంచెఁ దారకాసురుఁడు మగిడి 164

**అర్థము** తరల - ముక్తా - హార - తతిన్ = చంచలమైన ముత్యాల పేరుల సమూహమును, వీడి, కుచములన్ = స్తనములందు, కన్నీరు - ధారలు, కడలు కొనఁగన్ = అతిశయింపఁగను,

తాంబూల - రాగంబు = తమ్మలపు టెఱుపు, తఱఁకి = తొలఁగి, కెమ్మోవులన్ = ఎఱ్ఱని పెదవులందు, లాలలు = లాలా జలములు, నురువులు + కొని = నురుఁగులు గట్టి, ఉరులుదేరన్ =బయల్వెడలఁగను

పుష్ప + అవతంసముల్ = శిరోభూషణములయిన పూలు,పొలుపు + అఱి = ఒప్పు నశించి, కరతల - అబ్జములు= తామరల వంటి కరతలములు, శిరస్( ) + అవతంసములు = శిరోభూషణములు, కాఁగన్,

పత్ర - భంగంబులన్ = మకరికాపత్రరచనలను, పాసి = విడిచి, కపోల - స్థలములపైన్ = చెక్కిళ్లమీఁద, నీల + అలకములు = నల్లని ముంగురులు, చెదరన్,

మంజులంబు + అగు = మనోహరమయిన,తూర్య - సమ్మర్దము + ఉడిగి = వాద్యముల సందడిపోయి, తమ - మొగంబులన్= తమ ముఖములందు, ఆర్త-రావములు = దీనధ్వనులు, చెలఁగన్ = మ్రోయఁగను,

శోక - మగ్నలు + ఐ = దుఃఖమునందు మునిఁగినవారయి, సతులు = స్త్రీలు, ఉద్దన్ = ఊరక, చూచుచున్ + ఉండన్ = చూచుచుండఁగా,

తారక + అసురుఁడు, మగిడి = మరలి, పురము + చొత్తెంచెన్ = పురము ప్రవేశించెను

**తాత్పర్యము.** చంచలములయిన ముత్యాలపేరులు వీడి స్తనములందుఁ గన్నీటిధారలు అతిశయింపఁగను, తమ్మలపుటెఱుపు తొలఁగి కెమ్మోవులందు లాలలు నురుఁగులుగట్టి బయలువెడలఁగను, శిరోభూషణము లైనపూలు ఒప్పుచెడి, తామరల వంటి కరతలములు శిరోఽలంకారములు కాఁగను, మకరికాపత్రరచనలు పోయి చెక్కిళ్లపై నల్లని ముంగురులు చెదరఁగను, మనోహరమయిన వాద్యముల ధ్వని పోయి తమ ముఖములందు ఆర్తారావములు మ్రోయఁగను దుఃఖమునందు మునిఁగినవారయి స్త్రీలు ఊరక చూచుచుండఁగాఁ దారకాసురుఁడు మరలఁ బురప్రవేశము చేసెను

**విశేషములు:** అలంకారము స్వభావోక్తి

వ ఇట్లు నిర్గతైశ్వర్యప్రభవుండై పురాంగనాంతస్సంతాపానలవివర్ధనానిలుం డగుచు

**అర్థము :** ఇట్లు, నిర్గత + ఐశ్వర్య - ప్రభావుండు + ఐ = పోయిన ఐశ్వర్యము యొక్క మహిమగలవాఁడయి, పుర + అంగనా + అంతః + సంతాప + అనల - వివర్ధన + అనిలుండు = ఊరి స్త్రీల యొక్క మనోదుఃఖమనెడి అగ్ని యొక్క పెంపునకు వాయువయిన వాఁడు, అగుచున్

**తాత్పర్యము.** ఇట్లు ఐశ్వర్యమహిమ గోలుపోయి ఊరి స్త్రీల మనస్సంతాప మనెడి అగ్ని పెంపునకు వాయువు అగుచు - అనఁగాఁ బురస్త్రీల దుఃఖమును బెంపొందింపఁజేయుచు ననుట - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** అలంకారము రూపకము

మ ఉపరాగాకులచంద్రమండలము నా నొప్పేద వక్త్రాంబుజం
బపమానానలధూమధూసరితమై యంగంబు దావాగ్ని ధూ
మ పరీతాసిత భూధరాభముగ, నిర్మంత్రస్థితిం, దారకుం
డపనీతాఖిలలోకరాజ్యవిభవుండై యుండెఁ జింతించుచున్ 166

**అర్థము .** వక్త్ర + అంబుజంబు = ముఖపద్మము, ఉపరాగ + ఆకుల - చంద్ర - మండలము - నాన్ =గ్రహణముచేఁ గలఁతనొందిన చంద్రబింబ మనఁగా, ఒప్పు + ఏదన్ = అందము చెడఁగా, అంగంబు = శరీరము, అపమాన + అనల - ధూమ - ధూసరితము + ఐ = అవమానములనెడి అగ్నియొక్క పొగచే బూడిదవర్ణము గలదియై, దావ + అగ్ని - ధూమ - పరీత + అసిత - భూధర + ఆభముగన్ = కార్చిచ్చుయొక్క పొగచేఁ జుట్టఁబడి నల్లనైన కొండతో సమానముకాఁగా, తారకుండు = తారకాసురుఁడు, నిర్మంత్ర -స్థితిన్ = ఎట్టి యాలోచనమును లేని స్థితితో, అపనీత + అఖిల - లోక - రాజ్య - విభవుండు + ఐ = పోఁగొట్టఁబడిన ఎల్లలోకముల రాజ్యవైభవము గలవాఁడయి, చింతించుచున్ = దుఃఖించుచు, ఉండెన్

**తాత్పర్యము:** ముఖపద్మము గ్రహణముచేఁ గలఁగిన చంద్రబింబమువలె ఒప్పుచెడఁగా, శరీరము అవమానములనెడి అగ్ని పొగచే బూడిదవర్ణము గలదయి, కార్చిచ్చు పొగచే నావరింపఁబడి నల్లనైన కొండతో సమానము కాఁగాఁ,

దారకాసురుఁడు ఎట్టి ఆలోచనమును లేనివాఁడయి, ఎల్లలోకముల రాజ్యవైభవమును గోలుపోయి దుఃఖించుచునుండెను

**విశేషములు .** అలంకారము రూపకానుప్రాణితోపమ

గీ **తారకప్రభ తోడ్తోన తఱుగుచుండఁ**
**బేర్మి నాదిత్యతేజంబు పెరిఁగి వెలిఁగె ,**
**వేగ దైత్యుల కింతన వేవె నను వి**
**ధమునఁ గ్రౌంచారి కుక్కుటధ్వజము వెలిఁగె** 167

**అర్థము .** తారక - ప్రభ = తారకాసురుని తేజస్సు - నక్షత్రముల కాంతి, తోడ్తోన్ + అ = క్రమక్రమముగా, తఱుగుచున్ + ఉండన్ = తగ్గిపోవుచుండఁగా, పేర్మిన్ = అతిశయముతో, ఆదిత్య - తేజంబు = దేవతల తేజస్సు, సూర్యుని తేజస్సు, పెరిఁగి = వృద్ధిపొంది, వెలిఁగెన్ = ప్రకాశించెను, వేగన్ = తెల్లవాఱఁగా, దైత్యులకున్ = రాక్షసులకు, ఇంతన్ + అ = ఇంతలోనే, వేవెన్ = తెల్లవాఱెను - చేడ్పాటు అయ్యెను, అను - విధమునన్ = అనురీతిని, క్రౌంచ + అరి = క్రౌంచుని శత్రువు - కుమారస్వామియొక్క, కుక్కుట - ధ్వజము =కోడియనెడి పతాక, వెలిఁగెన్ = ప్రకాశించెను

**తాత్పర్యము .** తారకాసురుని తేజస్సు క్రమక్రమముగాఁ దఱిగిపోవుచుండఁగా దేవతల తేజస్సు అధికమై ప్రకాశించెను నక్షత్రముల కాంతి క్రమక్రమముగాఁ దఱిగిపోవుచుండఁగా సూర్యుని తేజస్సు అధికమై ప్రకాశించెను తెల్లవాఱఁగా రాక్షసుల కింతలోనే తెల్లవాఱె నను విధమున నశించె నను విధమునఁ గుమారస్వామి కుక్కుటపతాక ప్రకాశించెను

**విశేషములు :** అలంకారము శ్లేషము, ఉత్ప్రేక్ష తెల్లవాఱుజామునఁ గుక్కుటములు విజృంభించును

వ **అంత నాదిత్యోదయంబైనం దారకకుమారులు సమర సన్నాహంబుతోఁ బట్టవర్ధనగజేంద్రంబుల నెక్కి సంగరంబునకుం దెరలనెత్తి వచ్చి నిజబలంబులకుం జేయువీచిన.** 168

**అర్థము .** అంతన్, ఆదిత్య + ఉదయంబు + ఐనన్ = ప్రొద్దుపొడుపు కాఁగా, తారక కుమారులు = తారకాసురుఁడును, కుమారస్వామియు, సమర - సన్నాహంబుతోన్ = యుద్ధప్రయత్నముతో, పట్టవర్ధన - గజ + ఇంద్రంబులన్ =

పట్టపుటేనుఁగులను, ఎక్కి, సంగరంబునకున్ = యుద్ధమునకు, తెరలన్ + ఎత్తి - వచ్చి = దండెత్తి వచ్చి, నిజ - బలంబులకున్ = తమతమ సేనలకు, చేయు- వీచినన్ = ఉత్సాహము గలిగింపఁగా

**తాత్పర్యము .** అంత సూర్యోదయము కాఁగాఁ దారకాసుర కుమారస్వాములు యుద్ధ ప్రయత్నముతోఁ బట్టపుటేనుఁగుల నెక్కి యుద్ధమునకు దండెత్తి వచ్చి తమ తమ సేనలకు ఉత్సాహము గలిగింపఁగా - తరువాతి పద్యముతో నన్వయము

క **ఏసియు వైచియుఁ బొడిచియు**
**వేసర కొండొరులఁ బట్టి విడువక కేశా**
**కేశిఁ బెనంగుచుఁ బోర మ**
**హాసురముగఁ బోరి రా సురాసురవీరుల్** 169

**అర్థము .** ఏసియున్, వైచియున్, పొడిచియున్, వేసరక = విసువుఁజెందక, ఒండొరులన్ = ఒకరినొకరు, పట్టి, విడువక, కేశాకేశిన్ = ఒకరిజుత్తు ఇంకొకరుపట్టుకొని, పెనంగుచున్ = కలియఁబడుచు, పోరన్ = యుద్ధమున, మహత్ (మహా) + ఆసురముగన్ = మిక్కిలి క్రూరముగా, ఆ - సుర + అసుర- వీరుల్ = ఆ దేవ రాక్షస వీరులు, పోరిరి

**తాత్పర్యము :** ఆ దేవ దానవ వీరులు, ఒకరినొకరు వేసియు, వైచియుఁ బొడిచియు, విసువుఁజెందక, ఒకరినొకరు పట్టుకొని విడువక జుత్తు జుత్తు పట్టుకొని కలియఁబడుచు యుద్ధమున మహాక్రూరముగాఁ బోరిరి

**విశేషములు :** కేశాకేశి - కేశేషు కేశేషు గృహీత్వా ఇదం యుద్ధం ప్రవృత్తమ్ - కేశాకేశి - వ్యతిహార లక్షణ బహువ్రీహి సమాసము ఇందు శ సలకుఁ బ్రాసమైత్రి పాటించుట గమనింపఁదగినది

చ **దనుజున కొక్కయమ్ము, మదదంతికి నెన్మిది, వాజి కేను గా**
**ననిఁ బరసేన యెంతగల దంతయు నొక్కట మ్రొగ్గనేసి, నే**
**ర్పునఁ బ్రతిలేక క్రచ్చు నతిశూరుఁ గుమారు నదల్చి తాఁకె న**
**త్యనుపమశక్తియుక్తి నసురాగ్రణి తారకుఁ డాసురంబునన్** 170

**అర్థము .** దనుజునకున్ = రాక్షసునకు, ఒక్క, అమ్మున్, మద - దంతికిన్ = మత్తగజమునకు, ఎన్మిది = ఎనిమిది అమ్ములును, వాజికిన్ = గుఱ్ఱమునకు,

ఏను + కాన్ = అయిదు అమ్ములును అగునట్లు, అనిన్ = యుద్ధమునందు, పర - సేన = శత్రు సైన్యము ఎంత - కలదు + అంతయున్, ఒక్కటన్ = ఒక్కమాటుగా, మ్రొగ్గన్+ ఏసి = కూలనేసి, నేర్పునన్ = నేర్పుతో, ప్రతి-లేక = ఎదురులేక, క్రచ్చు = కదియునట్టి, అతి-శూరున్ = గొప్పశూరుఁడగు, కుమారున్ = కుమారస్వామిని, అసుర + అగ్రణి = రాక్షసశ్రేష్ఠుఁడగు తారకుఁడు, అతి + అనుపమ - శక్తి - యుక్తిన్ = మిక్కిలి సాటిలేని శక్తితో, ఆసురంబునన్ = రాక్షసముగా, అదల్చి = గద్దించి, తాఁకెన్

**తాత్పర్యము** రాక్షసున కొకయమ్ము, మదేభమునకు ఎనిమిది అమ్ములు, గుఱ్ఱమున కైదు అమ్ములునుగా యుద్ధమున శత్రు సైన్యము ఎంత గలదో అంతయు నొక్కమాటుగాఁ గూలనేసి నేర్పుతో నెదురులేక కదియు మహాశూరుఁడగు కుమారస్వామిని రాక్షసశ్రేష్ఠుఁడయిన తారకుఁడు రాక్షసత్వముతో గద్దించి మిక్కిలి సాటిలేని శక్తితోఁ దాఁకెను

**విశేషములు** గర్జ = గర్జిలు ? 'గర్జ'ను 'క్రచ్చు'గా శ్రీ వే ప్ర శాస్త్రి గారు సవరించిరి

లయగ్రాహి

ఆ హరతనూజుఁడు సురాహితుఁడు నొండొరుల
బాహుబలముం జలము సాహసము దర్పో
త్సాహమును నొప్ప నిజ వాహనమున్ దనుజ
వాహినులు నిర్జర సమూహములు పెక్కుల్
వ్యూహములు బయల్పడి హతాహతిఁ జనం బఱపి
రాహవములోనఁ బటుకాహళతతుల్ కో
లాహలముగాఁ జెలఁగఁగా హరియు భార్గవుఁడు
మోహరముఁ జేరి కడు మోహమునఁ జూడన్ 171

**అర్థము** . ఆ - హర - తనూజుఁడున్ = ఆ శివుని కొడుకును-కుమారస్వామియు, సుర + అహితుఁడున్ = దేవతల శత్రువును, - రాక్షసుఁడును - తారకుఁడును, ఆహవములోనన్ = యుద్ధములో, పటు - కాహళ - తతుల్ = పెద్దబాకాల సమూహములు, కోలాహలముగాన్ = సందడిగా, చెలఁగఁగాన్ = మ్రోయఁగా, హరియున్ = ఇంద్రుఁడును, భార్గవుఁడున్ = శుక్రుఁడును, మోహరమున్ = యుద్ధమును, చేరి, కడున్ + మోహమునన్ = మిక్కిలి కోరికతో, చూడన్ =

చూడఁగా, ఒండొరుల = ఒక్కొక్కరి, బాహు - బలమున్ = భుజబలమును, చలమున్ = పట్టుదలయు, సాహసమున్, దర్ప + ఉత్సాహమును = గర్వము వలని ఉత్సాహమును, ఒప్పన్ = ఒప్పఁగా, నిజ - వాహనములన్ = తమ తమ వాహనములందు, దనుజ - వాహినులున్ = రాక్షససేనలును, నిర్జర - సమూహములున్ = దేవతల సమూహములును, పెక్కుల్ - వ్యూహులున్ = పలు వ్యూహములును, బయల్పడి, హతాహతిన్ = హళాహళితో = అతిత్వరతో, చనన్ = పోవునట్లు, పఱపిరి = తోలిరి

**తాత్పర్యము.** ఆ కుమారస్వామియును, తారకాసురుఁడును యుద్ధములో గొప్ప బాకాలు సందడిగా మ్రోయఁగా, ఇంద్రుఁడును, శుక్రుఁడును యుద్ధమును జేరి మిక్కిలి కోరికతోఁ జూడఁగా ఒక్కొక్కరి భుజబలమును, పట్టుదలయు, సాహసమును, గర్వమువలని యుత్సాహమును ఒప్పఁగాఁ, దమ వాహనములందు రాక్షససేనలును, దేవతల సేనలును, పలు వ్యూహములును బయలుపడి హళాహళితో వెడలునట్లు తోలిరి

**విశేషములు** లయగ్రాహి - నాలుగుపాదము లుండును ఒక్కొక్క పాదమున ముప్పదితొమ్మిది మాత్రలుగల ముప్పది యక్షరములుండును ఒక్కొక్క పాదమున భ, జ, స,న, భ, జ, స,న, భ, య అనుగణములుండవలయును 1-9-17-25 అక్షరములకుఁ బ్రాసయతి చెల్లవలయును ప్రాసనియమము గలదు

చ **కరులఁ దెమల్చి పట్టికొని కైపున జిట్టనఁ ద్రిప్పి నుగ్గుగా**
**నరద సమూహిఁ వైచి తగ నశ్వదళంబులు పట్టి వీచి భీ**
**కర భట కోటి వైచి తలఁకంగ సురారి చతుర్బలంబులన్**
**వరుసన ముట్టి చంపెఁ బురవైరితనూజుగజంబు పోరిలోన్** 172

**అర్థము :** పోరిలోన్ = యుద్ధములో, పుర - వైరి - తనూజు - గజంబు = శివుని కొడుకగు కుమారస్వామియేనుఁగు, కరులన్ = ఏనుఁగులను, తెమల్చి = లాగి, పట్టికొని, కైపునన్ = ఉద్రేకముతో, జిట్టనన్, త్రిప్పి, అరద - సమూహిన్ = రథసమూహమును, నుగ్గు + కాన్ =పిండియగునట్లు, వైచి, తగన్ = తగునట్లు, అశ్వ - దళంబులు = గుఱ్ఱముల దండులు, పట్టి, వీచి = విసరి, భీకర - భట - కోటిన్ = భయంకరమైన పదాతి సమూహమును, వైచి, తలఁకంగన్ = చలించునట్లు, సుర + అరి - చతుర్ + బలంబులన్ = తారకుని నాలుగు విధములయిన సేనలను, వరుసన్ + అ = క్రమముగానే, ముట్టి = తాఁకి, చంపెన్

**తాత్పర్యము** కుమారస్వామి యేనుఁగు - ఏనుఁగులను లాగి పట్టుకొని జిట్టునఁ ద్రిప్పి, రథ సమూహమును పిండియగునట్లు వైచి, గుఱ్ఱపు దండులను పట్టుకొని విసరి భయంకరమైన పదాతివర్గమును చలించునట్లు వైచి రాక్షసుని చతుర్విధబలములను క్రమముగాఁ దాఁకి చంపెను

**విశేషములు** 'అరద' శబ్దమును దత్సమముగా నీ కవి పెక్కుచోట్ల వాడెను

లయగ్రాహి

ముట్టి గజయూథములఁ బట్టి రదనాగ్రములఁ
గుట్టి తెగఁజీరి పలుదట్టములు వెట్టుం
గట్టెదురఁ దాఁకి పడఁ జెట్ట మొగపెట్టుఁ బెద
ముట్టుచని వాలములఁ బెట్టికొని వీడున్
బిట్టడరి కేల మెడ సుట్టి తెగ నెత్తువడు
నట్టలు శిరంబులును మెట్టులుగొనం బ్రో
పెట్టుఁ జనఁదట్టుఁ జెడమెట్టు నలి గొట్టుఁ గని
కట్టలుకఁ దారక సురేట్టుకరి పోరన్ 173

**అర్థము.** పోరన్ = యుద్ధమునందు, సుర + ఈట్టు - కరి = దేవేంద్రుని ఏనుఁగు, తారక = తొలఁగక, కని, కట్టలుకన్ (కడు + అలుకన్) = మిక్కిలి కోపముతో, గజ - యూథములన్ = ఏనుఁగుల గుంపులను, ముట్టి = తాఁకి, పట్టి = పట్టుకొని, రదన + అగ్రములన్ = దంతములకొనలతో, కుట్టి = పొడిచి, తెగన్ = తెగునట్లు, చీరి = చీల్చి, పలు - తట్టములు + పెట్టున్ = పెక్కుబాధలు పెట్టును, కట్టెదురన్ (కడు + ఎదురన్) = ఎట్ట యెదురుగా, తాఁకి, పడన్ = పడునట్లు, చెట్టన్ = దుష్టత్వముతో, మొగపెట్టున్ = ఎదురుకొనును, పెదముట్టు + చని = అత్యంతాక్రమణముతోఁబోయి, వాలములన్ = తోఁకలందు, పెట్టికొని = పట్టుకొని, వీడున్ = విసరివేయును, బిట్టు + అడరి = మిక్కిలి విజృంభించి, కేలన్ = తొండముతో, మెడ + చుట్టి, తెగన్ = తెగఁగా, ఎత్తు + పడు = పడిపోవు, అట్టలున్ = మొండెములును, శిరంబులును = తలలును, మెట్టులు + కొనన్ = మెట్లు ఏర్పడునట్లు, ప్రోపెట్టున్ = ప్రోవుపెట్టును, చవన్ = పోవునట్లు, తట్టున్ - చఱచును, చెడన్ = నశించునట్లు, మెట్టున్ = త్రొక్కును, నలి + కొట్టున్ = పిండిగాఁ గొట్టును

**తాత్పర్యము.** దేవేంద్రుని యేనుఁగు యుద్ధమునందు మిక్కిలి కోపముతోఁ జూచి యేనుఁగుల గుంపులను దాఁకి పట్టుకొని దంతముల కొనలతోఁ బొడిచి, తెగునట్లు చీల్చి పెక్కు బాధలు పెట్టును ఎట్టయెదురుగాఁ దాఁకి పడఁగొట్టును అత్యంత మాక్రమించుకొని తోఁకలను పట్టుకొని విసరివేయును మిక్కిలి విజృంభించి తొండముతో మెడను జుట్టి తెగఁగాఁ బడిపోవు మొండెములును దలలును మెట్లుగా నగునట్లు ప్రోవుపెట్టును చచ్చిపోవునట్లు చఱచును నశించునట్లు త్రొక్కును పిండియగునట్లు కొట్టును

**విశేషములు** అలంకారము స్వభావోక్తి ఛందస్సునకు 171 వ పద్యమును జూచునది ద్వి త్వటకార పునఃపునరావృత్తిచే వృత్త్యనుప్రాసము

**క 'హరి యగుఁ గరులం జంపెడు ,**
**హరి కెందును నిట్టి దీర్ఘహస్తము గలదే ?**
**కరియగుఁ గరిచేఁ జచ్చునె**
**కరు లి ?' ట్లనఁ జంపె గుహునికరి కరిఘటలన్ 174**

**అర్థము.** కరులన్ = ఏనుఁగులను, చంపెడున్ = చంపుచున్నది, హరి + అగున్ = సింహ మగును, హరికిన్ = సింహమునకు, ఎందును, ఇట్టి, దీర్ఘ - హస్తము = పొడవైన తొండము, కలదే ?, కరి + అగున్ =ఏనుఁ గగును, కరిచేన్ = ఏనుఁగుచే, కరులు = ఏనుఁగులు, ఇట్లు, చచ్చునె ?, అనన్, గుహుని - కరి = కుమారస్వామి యేనుఁగు, కరి - ఘటలన్ = ఏనుఁగుల గుంపులను, చంపెన్

**తాత్పర్యము .** ఇది ఏనుఁగులను జంపుచున్నది కావున సింహ మగును కాని సింహమున కెందైన నిట్టి పొడవైన తొండముండునా ? కాదు - ఇది ఏనుఁ గగును కాని ఏనుఁగుచే ఇట్లు ఏనుఁగులు చచ్చునా ?' అనునట్లు కుమారస్వామి ఏనుఁగు ఏనుఁగుల గుంపులను జంపెను

**విశేషములు .** అలంకారము హేత్వపహ్నవాలంకారము, ఆక్షేపము

**వ. ఇట్లు దనుజానంత దంతి సంతానంబుం జిత్రవధ సేయు నవసరంబున 175**

**అర్థము .** ఇట్లు, దనుజ + అనంత - దంతి - సంతానంబున్ = రాక్షసుని (తారకుని) అంతులేని ఏనుఁగుల సమూహమును, చిత్రవధ + చేయు + అవసరంబునన్ = చిత్రవధ చేయు సమయమున

**తాత్పర్యము** ఇట్లు తారకుని అంతులేని యేనుఁగుల సమూహమును చిత్రవధ చేయునప్పుడు - తరువాతి పద్యముతో నన్వయము

చ కరములు ద్రెవ్వి, పాదములు గాఁడి, శిరంబులు వ్రస్సి, చర్మముల్
సిరిగి, కటంబు లుచ్చి, చెవిచేట లురమ్ము్మలు గూల్చి, దంతముల్
మురిసి పడం కుమారకు నమోఘ శరాహతి మేనులెల్ల జ
ర్జరితములై మహిం దొరిఁగె సామజముల్ గడికండలై వడిన్ 176

**అర్థము.** కరములు = తొండములు, త్రెవ్వి = తెగి, పాదములు = కాళ్ళు, కాఁడి = గ్రుచ్చుకొని, శిరంబులు = తలలు, వ్రస్సి = బ్రద్దలయి, చర్మముల్ = తోళ్లు, చిరిగి = చినిఁగి, చెవి - చేటలు - చేటలవంటి చెవులు, ఉరమ్మ్ములు = బొమ్ము్మలు, కూలి, దంతముల్, మురిసి = విఱిగి, పడన్ = పడఁగా, కుమారకు + అమోఘ - శర + ఆహతిన్ = కుమారస్వామి - వ్యర్థముకాని బాణముల దెబ్బచే, మేనులు + ఎల్లన్ = శరీరములన్నియు, జర్జరితములు + ఐ = తూంట్లుపడినవయి, సామజముల్ = ఏనుఁగులు, కడికండలు + ఐ = ముక్కలుముక్కలయి, వడిన్ = వేగముగా, మహిన్ = నేలపై, తొరిఁగెన్ = వ్రాలెను

**తాత్పర్యము** తొండములు తెగి, కాళ్ళు గ్రుచ్చుకొని, శిరస్సులు బ్రద్దలయి, చర్మములు చినిఁగి, గండస్థలములు దూసికొని, చేటలవంటి చెవులును, బొమ్ము్మలును గూలి, దంతములు విఱిగి పడఁగా, కుమారస్వామి అవ్యర్థములైన బాణముల దెబ్బచే శరీరములన్నియుఁ దూంట్లుపడి యేనుఁగులు ముక్కలుముక్కలై వడిగా నేలఁగూలెను

వ ఇట్లప్రతిహతప్రతాపోన్నతుండై దనుజబలంబు నిశ్శేషంబుగాఁ జిత్రవధ సేయుచున్న కుమారుంగని కోపావేశంబునం దావగొనక 177

**అర్థము** ఇట్లు, అప్రతిహత - ప్రతాప + ఉన్నతుండు + ఐ = అడ్డులేని పరాక్రమముచే అధికుఁడయి, దనుజ - బలంబున్ = రాక్షససేనను, నిశ్శేషంబు + కాన్ = మిగులు లేకుండ, చిత్రవధ + చేయుచున్ + ఉన్న, కుమారున్, కని, కోప + ఆవేశంబునన్ = కోపోద్రేకముచే, తావగొనక = నిలువక

**తాత్పర్యము** ఇట్లు అడ్డులేని పరాక్రమముచే నధికుఁడయి, రాక్షస సైన్యమును మిగులు లేకుండునట్లు చిత్రవధచేయుచున్న కుమారస్వామిని జూచి కోపోద్రేకముతో నిలువక - తరువాతి పద్యముతో నన్వయము

మ కర ముద్రేకముతోడఁ దారకుఁడు నిర్ఘాతంబుపైఁ బేర్చి భూ
ధర ముగ్రాకృతిఁ బాఱునట్లు సుమహద్దర్పోరుబాహాబలో
ద్ధురుఁడై షణ్ముఖుమీఁద లీలఁ గురిసెన్ దుర్వార శస్త్రాస్త్ర భీ
కర వర్షంబు కులాద్రిపైఁ గురియు విక్రాంతాసితాబ్దప్రభన్ 178

**అర్థము.** తారకుఁడు, కరము + ఉద్రేకము తోడన్ = మిక్కిలి ఆవేశముతో, భూధరము = పర్వతము, ఉగ్ర + ఆకృతిన్ = భయంకరమైన ఆకారముతో, నిర్ఘాతంబుపైన్ = వజ్రముమీఁదపేర్చి = విజృంభించి, పాఱు + అట్లు = పరువెత్తు విధమున, సు - మహత్ + దర్ప + ఉరు - బాహా - బల + ఉద్ధురుఁడు + ఐ = మిక్కిలి గొప్పదియగు గర్వముతోడి గొప్ప భుజబలముచే దృఢమైనవాఁడయి, షష్(ట్) + ముఖు-మీఁదన్ = కుమారస్వామిపై, కుల + అద్రిపైన్ = కులపర్వతముమీఁద, కురియు = వర్షించునట్టి, విక్రాంత + అసిత + అబ్ద - ప్రభన్= దట్టమైన నల్లనిమేఘముయొక్క కాంతితో, దుర్వార - శస్త్ర + అస్త్ర - భీకర - వర్షంబు= వారింపరాని శస్త్రములయు అస్త్రములయు భయంకరమైన వాన, లీలన్ = విలాసముగా, కురిసెన్ = కురియించెను

**తాత్పర్యము .** తారకుఁడు మిక్కిలి ఆవేశముతో, వజ్రాయుధముపై విజృంభించి పర్వతము భయంకరాకారముతోఁ బరువెత్తునట్లు మిక్కిలి గొప్ప గర్వముతోడి అధిక భుజబలముచే దృఢమైనవాఁడయి, కులపర్వతముపైఁ గురియు దట్టమైన నల్లని మేఘము కాంతితోఁ, గుమారస్వామిపై అడ్డులేని శస్త్రాస్త్రములచే భయంకరమయిన వర్షమును విలాసముగాఁ గురియించెను

**విశేషములు .** అలంకార ముపమ

వ ఇట్లు తారకాసురుండు తన సర్వశక్తియు నెరపి సమస్తాయుధ పరిణతి మెఱసి తన్నుం గిట్టి మహాయుద్ధంబు చేయుచున్నం గని వాని గుంపెఱింగి నగుచుం దదీయాయుధజాలం బశ్రమంబున ఖండించి కోపించి 179

**అర్థము .** ఇట్లు, తారక + అసురుండు, తన సర్వ - శక్తియున్, నెరపి = చూపి, సమస్త + ఆయుధ - పరిణతి = ఎల్ల ఆయుధముల పాండిత్యము, మెఱసి= మెఱయించి, తన్నున్, (కుమారుని), కిట్టి = సమీపించి, మహత్ (మహా) + యుద్ధంబు, చేయుచున్ +ఉన్నన్, కని, వాని, గుంపు = అతిక్రమణము (?),

ఎఱింగి, నగుచున్ = నవ్వుచు, తదీయ + ఆయుధ + జాలంబున్ = వాని ఆయుధముల సమూహమును, అశ్రమంబునన్ = అనాయాసముగా, ఖండించి = ముక్కలు చేసి, కోపించి

**తాత్పర్యము .** ఇట్లు తారకాసురుఁడు తన శక్తి యెల్లఁ జూపి సర్వాయుధ పాండిత్యమును మెఱయించి, తన్ను సమీపించి మహాయుద్ధ మొనరించుచుండఁగాఁ జూచి వాని యతిక్రమణము నెఱిఁగి నవ్వుచు వాని ఆయుధసమూహమును అనాయాసముగా ఖండించి కోపించి - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** గుంపించు = అతిక్రమించు అని సూ ని అందుచే గుంపు= అతిక్రమణము అని యర్థము చెప్పఁబడినది

కం **హరసుతుఁ డతులద్వాదశ**
**కరములఁ జక్రములు దనుజుకరిపైఁ బఱపన్,**
**దరుణరవిమండలోత్కర**
**పరివేష్టిత ధాతునగము పరుసున నొప్పెన్** 180

**అర్థము :** హర-సుతుఁడు = శివుని కొడుకు - కుమారస్వామి, అతుల - ద్వాదశ - కరములన్ = సాటిలేని పండ్రెండు చేతులతో, దనుజు - కరిపైన్ = రాక్షసుని యేనుఁగు మీఁద, చక్రములు = చక్రాయుధములు, పఱపన్ = వ్యాపింపఁజేయఁగా, (అది), తరుణ - రవి - మండల + ఉత్కర - పరివేష్టిత - ధాతు - నగము - పరుసునన్ = బాలసూర్యబింబముల సమూహముచేఁ జుట్టఁబడిన గైరికాదిధాతువులతోడి కొండ విధమున, ఒప్పెన్

**తాత్పర్యము .** కుమారస్వామి తన సాటిలేని పండ్రెండు చేతులతో రాక్షసుని (తారకుని) ఏనుఁగుపైఁ జక్రాయుధములు వ్యాపింపఁజేయఁగా, ఆ యేనుఁగు బాలసూర్యుల బింబముల సమూహముచేఁ జుట్టుకొనఁబడిన గైరికాది ధాతువులతోడి కొండ విధమున నొప్పెను

**విశేషములు :** అలంకార ముపమ

గీ **రెండురెం డుగ్రశరముల రెండు రెండు**
**గొమ్ములును ద్రెవ్వ నేసిన గుహునిచేతఁ**
**దారకునకుఁ గోదండంబు దండ మయ్యె**
**నద్భుతంబుగ ద్విరదంబు నరద మయ్యె** 181

**అర్థము .** రెండు - రెండు - ఉగ్ర - శరములన్ = రెండేసి భయంకర బాణములచే, రెండు - రెండు + కొమ్ములును = వింటి రెండు కొనలును, ఏనుఁగు రెండు దంతములును, త్రెవ్వన్ + ఏసిన = తెగఁగొట్టిన, గుహుని చేతన్ = కుమారస్వామిచే, తారకునకున్, అద్భుతముగన్ = ఆశ్చర్యముగా, కోదండంబు = విల్లు, దండము + అయ్యెన్ = వట్టికఱ్ఱ యయ్యెను. ద్విరదంబున్ = ఏనుఁగును (రెండు దంతములు గలది), అరదము = దంతములు లేనిది - రథము, అయ్యెన్

**తాత్పర్యము .** రెండేసి భయంకరములయిన బాణములచే వింటి రెండు కొనలును, ఏనుఁగు రెండు దంతములును దెగఁగొట్టిన కుమారస్వామిచే నాశ్చర్యకరముగాఁ దారకునకు విల్లు వట్టి దండమయ్యెను ఏనుఁగును దంతములు లేనిది - రథము అయ్యెను

**విశేషములు :** లంకారము శ్లేషము చిత్రము ?

చ కరిశిరమాడ షణ్ముఖుఁడు కైపున వ్రేయుడుఁ గుంభమౌక్తికో
త్కర మసిధారఁ బొల్పెసఁగెఁ దారకు భంగము సూచి నవ్వు సం
గరజయకాంత కాంతరదకాంతియొ కాదన నాఁటుదీటి వి
స్ఫురదవదాతఖడ్గలత పూచెనొ నా జయచైత్రసంపదన్ 182

**అర్థము .** షష్ (ట్) + ముఖుఁడు = కుమారస్వామి, కరి - శిరము + ఆడన్= ఏనుఁగు తల కాఁడునట్లు (గ్రుచ్చుకొనునట్లు), కైపునన్ = కైపుతో, వ్రేయుడున్ = వ్రేసినంతనే, అసి - ధారన్ = కత్తివాదరయందు, కుంభ - మౌక్తిక + ఉత్కరము = కుంభస్థలమునందలి ముత్యముల సమూహము, తారకు - భంగము + చూచి = తారకాసురుని భంగపాటు చూచి, నవ్వు =నవ్వునట్టి - సంగర - జయ - కాంత = యుద్ధజయమనెడి స్త్రీ - జయలక్ష్మి, కాంత = మనోహరమైన, రద - కాంతియొ = దంతముల కాంతియో, కాదు + అనన్ = కాదనుచో, విస్ఫురత్ + అవదాత - ఖడ్గ - లత = ప్రకాశించుచున్న నిర్మలమయిన ఖడ్గమనెడి తీఁగ,, జయ - చైత్ర - సంపదన్ = జయమనెడు వసంతర్తుసంపదచే, నాఁటు - తీటి= బాగుగా నాఁటుకొని, పూచెనొ - నాన్ = పుష్పించెనా యన, పొల్పు + ఎసఁగెన్ = మిక్కిలి అందగించెను

**తాత్పర్యము .** కుమారస్వామి ఏనుఁగుతల కాఁడునట్లు కోపముతో వ్రేసినంతనే, కత్తివాదరయందు ఏనుఁగు కుంభస్థలమునందలి ముత్యముల సమూహము అంటుకొని తారకాసురుని భంగపాటు చూచి నవ్వునట్టి యుద్ధ

జయలక్ష్మి మనోహరమైన దంతముల కాంతియో, కాదనుచో - ప్రకాశించుచున్న నిర్మలమైన ఖడ్గమనెడు తీఁగ జయమనెడు వసంతర్తు శోభచే బాగుగా నాఁటుకొని పుష్పించెనో యన మిక్కిలి అందగించెను

**విశేషములు** అలంకార ముత్ప్రేక్ష - రూపకానుప్రాణితము సందేహము ఆదు = కాఁడు - సూరి కాదని - కాదన - రాఘవ కృష్ణ శర్మగారి పాఠము

**వ. ఇట్లఖిలామరవరమదవారణుండగు తారకాసురమదవారణుండై తదీయ మద వారణ వారణుండై వెలుంగు కుమారుం గని దనుజేంద్రుండు నిజభుజబలాయుధాఖిలవిద్యాబలంబుల నిర్జింపనేరక తన యాపద్ధనం బగు రూక్ష రాక్షస మాయా బలంబుల నిర్జింప నుద్యుక్తుండై యక్షణంబ 182**

**అర్థము** ఇట్లు, అఖిల + అమర - వర - మద - వారణుండు = ఎల్ల దేవతాశ్రేష్ఠుల మదమును వారించువాఁడు, అగు, తారక + అసుర - మద - వారణుండు + ఐ = తారకాసురుని మదమును వారించు వాఁడయి, తదీయ - మద - వారణ - వారణుండు + ఐ= ఆతని మదగజమును వారించువాఁడయి వెలుంగు = ప్రకాశించుచున్న, కుమారున్, కని, దనుజ + ఇంద్రుండు = రాక్షసశ్రేష్ఠుఁడు, నిజ - భుజ - బల + ఆయుధ + అఖిల - విద్యా - బలంబులన్ = తన భుజబలము చేతను, ఆయుధములు ఎల్ల విద్యాబలముల చేతను, నిర్జింపన్ + నేరక = జయింపఁజాలక = తన ఆపదకైన ధనమగు, రూక్ష - రాక్షస - మాయా - బలంబుల్ = తీక్ష్ణమైన రాక్షసమాయాబలములచే, నిర్జింపన్ = జయించుటకు, ఉద్యుక్తుండు + ఐ = యత్నించినవాఁడయి, అక్షణంబు + అ = వెంటనే

**తాత్పర్యము .** ఇట్లు ఎల్లదేవతాశ్రేష్ఠుల మదము నణఁచువాఁడగు తారకాసురుని మదము వారించువాఁడయి, వాని మదగజము నణఁచువాఁడయి ప్రకాశించు కుమారస్వామిని జూచి రాక్షసశ్రేష్ఠుఁడగు తారకుఁడు తన భుజబలము చేతను, ఆయుధవిద్యాబలముల చేతను జయింపఁజాలక తన యాపదకైన ధనమగు కఠిన రాక్షస మాయాబలములచే జయింపయత్నించువాఁడయి, వెంటనే- తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు** అఖిలామర వర మద వారణుండగు తారకాసుర మదవారణుండై - 'కొన్నియెడల సిద్ధసమాస మధ్యగతపదంబులతోఁ దద్భిన్న పదంబుల కన్వయంబు చూపట్టెడి ' ప్రౌఢ సమాస 35 ఇట 'అఖిలా వారణుండు' అనునది 'తారకాసుర వారణుండై' అను సిద్ధసమాసమందలి 'తారకాసుర' అను నేకదేశముతో నన్వయించుచున్నది

క పిడుగులయి తాఁకు, నలుగడ
జడనిధులై ముంచు, గోత్రశైలములై పైఁ
బడుఁ జదియఁ, గారుమొగుళుల
గడనములై కప్పుఁ, బన్నగములై చుట్టున్ 184

**అర్థము .** పూర్వ పద్యము నందలి 'దనుజేంద్రుండు' కర్త పిడుగులు + అయి, తాఁకున్, నలుగడన్ = నాలుగు దిక్కులను, జడనిధులు + ఐ = సముద్రములయి, ముంచున్, గోత్ర - శైలములు + ఐ = కులపర్వతములయి, చదియన్ = నలఁగిపోవునట్లు, పైన్ + పడున్ = మీఁదఁబడును, కారు మొగుళుల - గడనములు + ఐ = కారుమబ్బుల గుంపులయి, కప్పున్, పన్నగములు + ఐ = పాములయి, చుట్టున్

**తాత్పర్యము :** తారకుఁడు పిడుగులయి తాఁకును సముద్రములయి నాలుగు దిక్కులను ముంచును కులపర్వతములయి నలఁగునట్లు పైఁబడును కారుమబ్బుల సమూహములయి కప్పును పాములయి చుట్టును

వ ఇట్లు మాయావి నానావిధోపాయ మాయాప్రయోగంబులు ప్రయోగించుచు నలక్ష్యభావంబున దుర్నిరీక్షితుండై యనివారితోపద్రవకరుండగుచున్నం గని కుమారుండు హరచరణస్మరణ పరిణతాంతఃకరణుండై వానికిఁ బ్రతికారంబు గని పరమేశ్వరప్రదత్తంబైన దివ్యశక్తి నభిమంత్రించి యెత్తికొనుడు నక్షణంబ 185

**అర్థము .** ఇట్లు, మాయావి = మాయలుగలవాఁడు, నానా - విధ + ఉపాయ - మాయా - ప్రయోగంబులు = అనేకరీతులయిన ఉపాయముల, మాయల ప్రయోగములు, ప్రయోగించుచున్, అలక్ష్యభావంబునన్ = లక్ష్యము లేకపోవుటచే, దుర్నిరీక్షితుండు + ఐ = చూడఁబడనివాఁడయి, అనివారిత + ఉపద్రవ - కరుండు = అడ్డగింపఁబడని ఆపద గలిగించువాఁడు, అగుచున్ + ఉన్నన్, కని, కుమారుండు, హర - చరణ - స్మరణ -పరిణత + అంతఃకరణుండు+ ఐ = ఈశ్వరుని పాదముల ధ్యానముచేఁ బండిన మనస్సు గలవాఁడయి, వానికిన్= తారకునకు, ప్రతికారంబు = మాఱుసేఁత, కని, పరమేశ్వర - ప్రదత్తంబు + ఐన= ఈశ్వరునిచే నీఁబడిన, దివ్యశక్తిన్, అభిమంత్రించి, ఎత్తికొనుడున్= పట్టుకొనినంతనే, అక్షణంబ

**తాత్పర్యము** . ఇట్లు వంచకుఁడైన తారకుఁడు అనేకవిధములయిన ఉపాయములను, మాయలను బ్రయోగించుచు లక్ష్యములేకపోవుటచేఁ జూడఁబడని వాఁడయి, అడ్డులేక ఆపదగలిగించువాఁడగుచుండఁగాఁ జూచి కుమారుఁడు ఈశ్వరుని పాదధ్యానముచేఁ బండిన మనస్సు గలవాఁడయి తారకునకుఁ బ్రతికారమును గని ఈశ్వరుఁడిచ్చిన దివ్యశక్తి నభిమంత్రించి యెత్తికొనిన వెంటనే - తరువాతి పద్యముతో నన్వయము

క దనుజేంద్రు మాయలన్నియుఁ
త్రినయనసుతు శక్తిఁ గని యదృశ్యం బయ్యెన్,
వినుతాత్మజ్ఞానంబునఁ
దనరు మహామాయ చెడు విధంబునఁ బోలెన్ 186

**అర్థము** దనుజ + ఇంద్రు - మాయలు + అన్నియున్ = రాక్షసశ్రేష్ఠుఁడగు తారకుని మాయలన్నియును, త్రినయన - సుతు - శక్తిన్ = ముక్కంటి కొడుకు అగు కుమారస్వామి శక్త్యాయుధమును, కని, వినుత + ఆత్మ - జ్ఞానంబునన్ = పొగడఁబడిన ఆత్మజ్ఞానముచే, తనరు = ఒప్పునట్టి, మహత్ (మహా) + మాయ = గొప్పదియగు అజ్ఞానము, చెడు - విధంబునన్ + పోలెన్ = నశించురీతిగా, అదృశ్యంబు + అయ్యెన్ = మాయమయ్యెను

**తాత్పర్యము** తారకుని మాయలన్నియును కుమారస్వామి శక్త్యాయుధమును జూచి, ఆత్మజ్ఞానముచే మహామాయ నశించునట్లు, మాయమయ్యెను

**విశేషములు** . అలంకార ముపమ

వ **ఇట్లు తారకాసురేంద్రుండు నిజమాయాప్రభావంబు ప్రద్యోతన ప్రభావ ప్రతిహతం బైన ఖద్యోతంబునుం బోలెఁ దనయంద లీనంబైన నవసానావసరోద్దీపితప్రదీపంబునుం బోలెం గోపానలోద్రేకంబునం బెరిఁగి రోదసీకుహరాంతరాపూరితోన్నతశరీరుండై ఖడ్గచర్మంబులు గొని ప్రళయ నిర్ఘాతంబునుంబోలె నఖిల దిగ్వివరంబులం బ్రతిధ్వను లెసఁగం బ్రేలిపడ నదల్చి తాఁకిన.** 187

**అర్థము** . ఇట్లు, తారక + అసుర + ఇంద్రుండు = రాక్షసశ్రేష్ఠుఁడగు తారకుఁడు, నిజ - మాయా - ప్రభావంబు = తనదైన మాయ యొక్క ప్రభావము,

ప్రద్యోతన - ప్రభావ - ప్రతిహతంబు + ఐన = సూర్యుని తేజస్సుచేఁ గొట్టఁబడిన దగు, ఖద్యోతంబునున్ + పోలెన్ = మిడుఁగుఱుఁబురువు వలె, తనయందున్ + అ = తనయందే, లీనంబు + ఐనన్ = లయము కాఁగా, అవసాన + ఉపసర + ఉద్దీపిత - ప్రదీపంబునున్ + పోలెన్ = ఆఱిపోవు సమయమున మిక్కిలి ప్రకాశించు దీపము విధమున, కోప + అనల + ఉద్రేకంబునన్ = కోపమనెడి అగ్ని యొక్క విజృంభణముతో, పెరిఁగి, రోదసీ - కుహర + అంతర + ఆపూరిత + ఉన్నత - శరీరుండు + ఐ = గుహవంటి భూమ్యాకాశమధ్యప్రదేశములో అంతటను నిండిన ఎత్తయిన శరీరముగలవాఁడయి, ఖడ్గ - చర్మంబులు = ఖడ్గమును, డాలునుకొని, ప్రలయ - నిర్ఘాతంబునున్ + పోలెన్ = ప్రళయసమయమునందలి పిడుగువలె, అఖిల - దిశ్(క్) + వివరంబులన్ = ఎల్ల దిక్కుల నడిమి భాగమునందును, ప్రతిధ్వనులు = మాఱుమ్రోఁతలు, ఎసఁగన్ = అతిశయింపఁగా, వ్రేలిపడన్ = వ్రేలిపడునట్లు, అదల్చి = గద్దించి, తాఁకినన్

**తాత్పర్యము.** ఇట్లు రాక్షసశ్రేష్ఠుఁడగు తారకుఁడు తన మాయా ప్రభావము సూర్యతేజస్సుచే నడ్డగింపఁబడిన మిడుఁగుఱుఁబురువు వలెఁ దనయందే లయించి పోఁగా, ఆఱిపోవు సమయమునఁ బ్రకాశించు దీపము విధమునఁ గోపాగ్ని విజృంభణముచేఁ బెరిఁగి, గుహవంటి భూమ్యాకాశమధ్యప్రదేశములోపల నిండిన పెద్ద శరీరముగలవాఁడయి, కత్తిని, డాలును దీసికొని ప్రళయసమయమునందలి పిడుగు విధమున నెల్ల దిక్కుల లోపలి ప్రదేశములందును మాఱుమ్రోఁత లతిశయింపఁబ్రేలి పడునట్లు గద్దించి యెదిరింపఁగా - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** అలంకార ముపమ

## తారకాసుర వధ

చ కని త్రిపురారినందనుఁడు కైపున మార్కొని నిల్చి శక్తి వై
చిన వడిఁ బాఱి వజ్రధరుచేతి మహాశని శైలపక్షముల్
తునియఁగఁబాఱునట్లు, హరు దోర్గతశూలము వారణాసురేం
ద్రునిఁ దెగఁబాఱున ట్లఖిలదుస్సహతేజముతో వెలుంగుచున్ 183

**అర్థము .** కని - చూచి, త్రిపుర + అరి - నందనుఁడు = ఈశ్వరుని కొడుకు - కుమారస్వామి, కైపునన్ = కోపముతో, మార్కొని = ఎదిరి, నిల్చి, శక్తిన్=శక్తి అను ఆయుధమును, వైచినన్ = వేయఁగా, వడిన్ = వేగముగా, పాఱి = పరువెత్తి, వజ్ర - ధరు - చేతి = ఇంద్రుని చేతియందలి, మహత్ (మహా) + అశని

= గొప్ప వజ్రాయుధము, శైల - పక్షముల్ = కొండల ఱెక్కలు, తునియఁగన్ + పాఱు +అట్లు = ముక్కలుగాఁ బరువెత్తు విధమునను, హర = ఈశ్వరుని యొక్క, దోస్ (ః) + గత - శూలము = చేతియందలి శూలము, వారణ + అసుర + ఇంద్రునిన్ = గజ రాక్షస శ్రేష్ఠుని, తెగన్ + పాఱు + అట్లు = వధించుటకుఁ బరువెత్తు విధమునను, అఖిల - దుస్సహ - తేజముతోన్ = ఓర్వరాని ఎల్ల తేజస్సుతో, వెలుంగుచున్ = ప్రకాశించుచు

**తాత్పర్యము** చూచి కుమారస్వామి మదముతో నెదిరి నిల్చి శక్త్యాయుధమును బ్రయోగింపఁగా నది వడిగాఁ బాటి, ఇంద్రునిచేతి గొప్ప వజ్రాయుధము కొండల ఱెక్కలను ముక్కలు చేయఁ బాఱు విధమునను, ఈశ్వరుని చేతిశూలము గజాసురుని వధింపఁ బాఱు విధమునను సహింపశక్యముగాని యెల్లతేజస్సుతోఁ బ్రకాశించుచు - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** అలంకార ముపమ

క హర తనయు శక్తి దోషా
చర హృదయము వ్రచ్చి మగుడఁ జనియె రయమునన్,
గురుభక్తి లేని ఖలు మెయిఁ
బొరయక వరశక్తి మగుడఁబోవు విధమునన్. 189

**అర్థము .** హర - తనయు - శక్తి = ఈశ్వరుని కొడుకగు కుమారస్వామి శక్త్యాయుధము, దోషా - చర - హృదయమున్ = రాక్షసుని - తారకుని హృదయమును, వ్రచ్చి = బ్రద్దలు చేసి, గురు - భక్తి - లేని, ఖలు = దుష్టుని, మెయిన్ = శరీరమున, పొరయక = పొందక, వర - శక్తి = శ్రేష్ఠమైన శక్తి, మగుడన్ = మరల, పోవు - విధమునన్, రయమునన్ - వేగముగా, మగుడన్ = మరల, చనియెన్ = పోయెను

**తాత్పర్యము :** కుమారస్వామి శక్త్యాయుధము తారకాసురుని హృదయమును జీల్చి, గురుభక్తి లేని దుష్టుని శరీరమునఁ బొందక గొప్ప మహిమ మరలఁబోవు విధమున, వేగముగా మరలఁబోయెను

**విశేషములు .** అలంకార ముపమ

మహాస్రగ్ధర

జిత దేవాధీశదర్పోర్జితబలుఁడు మహాసేను శక్త్యాహతుండై
దితిజానీకంబు భీతిన్ ధృతిసెడి పఱవన్, దేవతల్ పొంగి యార్వన్,
కుతలం బల్లాడఁగా, దిక్కులు చెలఁగ, వడింగూలె నుగ్రాజిలోనన్
శతధారాపాతపక్షక్షతవిపులకులక్ష్మాధరాపాతభాతిన్ 190

**అర్థము** జిత - దేవ + అధి + ఈశ - దర్ప + ఊర్జిత - బలుఁడు = జయింపఁబడిన దేవేంద్రుని గర్వముచే అధికమైన బలము గలవాఁడు - దేవేంద్రుని దర్పాధిక బలమును జయించినవాఁడు - తారకుఁడు - అనుట, మహాసేను = కుమారస్వామి యొక్క, శక్తి + ఆహతుండు + ఐ= శక్త్యాయుధముచేఁ గొట్టఁబడినవాఁడయి, దితిజ + అనీకంబు = రాక్షసుల సమూహము, భీతిన్ = భయముతో, ధృతి + చెడి = ధైర్యము నశించి, పఱవన్ = పాఱిపోఁగా, దేవతల్, పొంగి, ఆర్వన్ = అఱవఁగా, కుతలంబు = భూతలము, అల్లాడఁగాన్ = చలింపఁగా, దిక్కులు, చెలఁగన్ = మ్రోయఁగా, శతధారా + పాత - పక్ష - క్షత - విపుల - కుల - క్ష్మాధర + ఆపాత - భాతిన్ = వజ్రాయుధముయొక్క పాటుచే, గాయపడిన, పెద్దదియైన, కులపర్వతముయొక్క పాటు విధమున, ఉగ్ర + అజి - లోనన్ = భయంకరమైన యుద్ధమున, వడిన్ = వేగముగా, కూలెన్

**తాత్పర్యము .** దేవేంద్రుని దర్పముతోడి అధికబలమును జయించిన వాఁడగు తారకుఁడు కుమారస్వామి శక్త్యాయుధముచేఁ గొట్టఁబడినవాఁడయి, రాక్షసుల సమూహము భయముతో ధైర్యము నశించి పాఱఁగా, దేవతలు సంతోషముతోనుప్పొంగి యఱవఁగా, భూతలము, చలింపఁగా, దిక్కులు మ్రోయఁగా, వజ్రాయుధము పడుటచే గాయపడిన పెద్ద కులపర్వతము పతనము విధమున భయంకరయుద్ధమున వేగముగాఁ గూలెను

**విశేషములు :** అలంకార ముపమ

వ ఇ ట్లప్రతిహతశౌర్యుండును, ననివార్యవీర్యుండును, నఖిలభువన భవనాధీశ్వరుండును, సకలజగద్భయదానియు, నామరణాంతాపరిత్యక్తాభిమానియు నగు తారకాసురునామాక్షరంబులు సకల దిక్తట శిలా పట్టంబుల శక్తిధరుముఖవిజయప్రశస్తి శాసన లిఖితాక్షరంబులయ్యెనంత. 191

**అర్థము** ఇట్లు, అప్రతిహత - శౌర్యుండును = అడ్డగింపఁబడని శౌర్యము గలవాఁడును, అనివార్య - వీర్యుండును = వారింపరాని వీర్యము గలవాఁడును, అఖిల - భువన - భవన + అధి + ఈశ్వరుండును = ఎల్లలోకములనెడి గృహముల కధిపతియును, సకల - జగత్ + భయ - దానియున్ = ఎల్లలోకములకు భయంకరుఁడును, ఆమరణ + అంత + అపరిత్యక్త + అభిమానియున్ = మరణాంతము వఱకును విడువఁబడని అభిమానము గలవాఁడును, అగు, తారక + అసుర - నామ + అక్షరంబులు = తారక దైత్యుని పేరిలోని వర్ణములు, సకల - దిక్ (క్) + తట - శిలా - పట్టంబులన్ = ఎల్ల దిక్ప్రదేశములనెడు ఱాతి పలకలందు, శక్తిధరు = కుమారస్వామి యొక్క, ముఖ - విజయ - ప్రశస్తి = ప్రధానమయిన విజయ ప్రశంసతోడి, శాసన - లిఖిత + అక్షరంబులు = శాసనమునందు వ్రాయఁబడిన వర్ణములు, అయ్యెన్ అంతన్

**తాత్పర్యము .** ఇట్లు అడ్డులేని శౌర్యము గలవాఁడును, వారింపరాని వీర్యము గలవాఁడును, ఎల్లలోకములనెడి భవనముల కధిపతియును, ఎల్లలోకములకు భయంకరుఁడును, చచ్చిపోవువఱకును అభిమానమును విడువని వాఁడును అగు తారకాసురుని పేరి యక్షరములు ఎల్లదిక్ప్రదేశములనెడి శిలాఫలకములందును కుమారస్వామి ప్రధాన విజయ ప్రశంసగల శాసనములందు లిఖింపఁబడిన వర్ణములు అయ్యెను అంత - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు .** అలంకారము రూపకము

**తారక సంహారకుఁడగు కుమారుని దేవత లభినందించుట**

సీ	సిద్ధాంగనలు చల్లు శేషాక్షతలతోన
	మెలుపారు కమ్మఁదెమ్మెరలు వీచె
సకలజగజ్జన జయ శబ్దములతోన
	తొడరాడ దేవదుందుభులు తివిరె
భూదేవ మునిగణ వేదరావములతోఁ
	గిన్నర గంధర్వ గీతు లులిసెఁ
ద్రేతాగ్ను లొక్కటఁ దేజరిల్లుట తోన
	విమలమై దిఙ్ముఖాబ్జములు వెలిఁగెఁ

తే	గల్పకుజములు పండె, దిగ్గజము లోలి
మదము పేసెఁ, బయోనిధుల్ నదులు నిండె,
నఖిలలోకైకకంటకుఁడై రమించు
తారకాసురుఁ డీల్గుడుఁ దత్ క్షణంబ.

**అర్థము.** అఖిల - లోక + ఏక - కంటకుఁడు + ఐ = ఎల్లలోకములకుఁ బ్రధాన బాధకుఁడయి, రమించు = ఆనందించు, తారక + అసురుఁడు, ఈల్గుడున్ = చావఁగా, తత్ + క్షణంబు + అ = వెంటనే

సిద్ధ + అంగనలు = సిద్ధస్త్రీలు, చల్లు, శేష + అక్షతలతోన్ + అ = సేసఁబ్రాలతోపాటే, మెలుపారు = మృదువులైన, కమ్మఁదెమ్మెరలు = పరమళించువాయువులు, వీచెన్

సకల - జగత్ +జన+ జయశబ్దములతోన్ + అ = ఎల్లలోకములందలి జనులయొక్క జయశబ్దములతోపాటే, తొడరాడన్ = అతిశయించునట్లు, దేవదుందుభులు = దేవతల ఢక్కా వాద్యములు, తివిరెన్ = మ్రోసెను

భూదేవ - ముని - గణ - వేద - నాదములతోన్ = బ్రాహ్మణులయు, మునులయు సమూహములయొక్క వేద ధ్వనులతో, కిన్నర - గంధర్వ - గీతులు = కిన్నరులయు, గంధర్వులయు, గీతులు = గీతములు, ఉలిసెన్ = ధ్వనించెను

త్రేతాగ్నులు = గార్హపత్యము, దక్షిణాగ్ని, ఆహవనీయము అను మూఁడగ్నులు, ఒక్కటన్ = ఒక్కమాఱుగా, తేజరిల్లుటతోన్ + అ = వెలుఁగుటతోపాటే, దిశ్(క్) + ముఖ + అబ్జములు = పద్మములవంటి దిక్కుల మొగములు, వెలిఁగెన్ = ప్రకాశించెను

కల్ప- కుజములు = కల్ప వృక్షములు, పండెన్, దిశ్ (క్) + గజములు = దిక్కులందలి యేనుఁగులు, ఓలిన్ = మిక్కిలి, మదము + చేసెన్ = మదించెను, పయోనిధుల్ = సముద్రములు, నదులు, నిండెన్

**తాత్పర్యము :** అన్ని లోకములకు బాధకుఁడై ఆనందించు తారకాసురుఁడు చచ్చినంతనే సిద్ధవనితలు చల్లెడు సేసఁబ్రాలతోపాటే మృదువులయిన పరిమళముతోడి వాయువులు వీచెను ఎల్లలోకములందలి జనుల జయ జయ ధ్వనులతోపాటే అతిశయించునట్లు దేవదుందుభులు మ్రోఁగెను బ్రాహ్మణులయు, మునులయు సమూహముల వేదనాదములతోపాటే కిన్నరులయు గంధర్వులయు గీతములు మ్రోసెను త్రేతాగ్ను లొక్కమాఱుగా వెలుఁగుటతోనే అబ్జముల వంటి దిఙ్ముఖములు నిర్మలములయి వికసించెను కల్పవక్షములు ఫలించెను దిగ్గజములు మిక్కిలి మదించెను సముద్రములు, నదులును నిండెను

**విశేషములు :** అలంకారము సహోక్తి

చ అరుణపరాగ మంబరమునందుఁ గడల్కొనఁ బుష్పవృష్టి పైఁ
గురిసెఁ బురారిసూతికి నగుర్వుగఁ దారకు నోర్చి మాకుఁ దా
నిరతముఁ దారకాహ్వయము నిల్పినవాఁడని రాగభాతి వి
స్తరముగఁ బెల్లుతో నెఱఁగు తారకపంక్తియొ నా వెలుంగుచున్ 193

**అర్థము** . తారకున్ + ఓర్చి = తారకాసురునోడించి, మాకున్ = తారకములకు, తాన్ = తాను (కుమారస్వామి), నిరతమున్ = ఎల్లప్పుడును, తారక + ఆహ్వయము = తారకుఁడు - తరింపఁజేయువాఁడు - అనుపేరు - తారక నామము, నిల్పిన వాఁడు + అని, రాగి - భాతి = ఎఱ్ఱని కాంతి, విస్తరముగన్ = అధికముగా, పెల్లుతోన్ = ఎక్కువగా, ఎఱఁగు = వ్రాలునట్టి, తారక - పంక్తియొ - నాన్ = నక్షత్రముల వరుసయో యనునట్లు, వెలుంగుచున్ = ప్రకాశించుచు, అరుణ - పరాగము = ఎఱ్ఱని పుప్పొడి, అంబరమునందున్ = ఆకాశమునందు, కడల్కొనన్ = వ్యాపింపఁగా, పుర + అరి - సూతికిన్ = ఈశ్వరుని కొడుకునకు - కుమారస్వామికి, అ గుర్వుగన్ = అధికముగా, పుష్ప - వృష్టి = పూలవాన, పైన్ = మీఁద, కురిసెన్

**తాత్పర్యము** 'తారకాసురునోడించి మాకుఁ దాను నిరతమును దారకనామము నిలిపినాఁ' డని యెఱ్ఱని కాంతి విస్తరించునట్లు అధికముగా వ్రాలునట్టి తారకపంక్తియో యనఁ బ్రకాశించుచు, నెఱ్ఱని పుప్పొడి ఆకాశమున వ్యాపింపఁగాఁ గుమారస్వామిపైఁ బూలవాన అధికముగాఁ గురిసెను

**విశేషములు** . అలంకార ముత్ప్రేక్ష శ్లేషానుప్రాణితము

వ తదవసరంబున 194

**అర్థతాత్పర్యములు** . తద్ + అవసరంబునన్ = ఆ సమయమున - తరువాతి పద్యముతో నన్వయము

సీ బాహుబలోన్నతిఁ బాటించి రాక్షసా
 ధీశు పట్టిన చెఱలెల్ల విడిచి
షణ్ముఖు నురుభుజాస్తంభాగ్రమున జయ
 శ్రీ పొందె సాలభంజిక విధమున
సురరాజు వేష్టించె సురభూరుహములు కెం
 పెలరారు చెందమ్మితలిరు లనఁగ
నవనిధానములుఁ గిన్నరనాథు సూరెల
 వెలుఁగొందెఁ దార దీవియల కరణి

తే నమరరమణీ విమానధామములు చదలఁ
గ్రాలె, సౌదామనీలత లోలి వెలిఁగెఁ,
బద్దవనములు దివిరె దిక్పతి పురముల
శక్తిధరు నాజివిజయ ఘోషణముతోన 195

**అర్థము .** బాహు - బల + ఉన్నతిన్ = భుజపరాక్రమాతిశయమును, పాటించి = చూపి, రాక్షస + అధి + ఈశు - పట్టిన = రాక్షసరాజు అగు తారకుఁడు పెట్టిన, చెఱలు + ఎల్లన్ = బందీలనందఱను, విడిచి = వదలి ('విడిచె' నని యుండనోపును )

షష్(ట్) + ముఖు + ఉరు - భుజా - స్తంభ + అగ్రమునన్ = కుమారస్వామి యొక్క గొప్పదియగు భుజమనెడి కంబము కొనను, జయ - శ్రీ = జయలక్ష్మి, సాలభంజిక - విధమునన్ = ప్రతిమవలె, పొందెన్

సుర - భూరుహములు = దేవతావృక్షములు - కల్ప వృక్షములు, కెంపు+ ఎలరారు = ఎఱుపు అతిశయించునట్టి, చెందమ్మి (చెన్ను + తమ్మి) - తలిరులు+ అనఁగన్ = ఎఱ్ఱతామర చివురులనునట్లు, సుర - రాజున్ = దేవేంద్రుని, వేష్టించెన్ = చుట్టుకొనెను

నవ - నిధానములును = తొమ్మిది నిధులును, కిన్నర - నాధు - సూరెలన్ = కుబేరుని పార్శ్వములందు, తారు + అ = తామే, దీవియల - కరణిన్ = దీపముల విధమున, వెలుఁగొందెన్ = ప్రకాశించెను

అమర - రమణీ - విమాన - ధామములు = దేవతాస్త్రీల విమానముల కాంతులు, చదలన్ = ఆకాశమునందు, క్రాలెన్ = ప్రకాశించెను, సౌదామనీ - లతలు = మెఱపుఁదీఁగలు, ఓలిన్ = బాగుగా, వెలిఁగెన్

దిశ్ (క్) + పతి - పురములన్ = దిక్పాలకుల పత్తనములందు, శక్తిధరు + ఆజి - విజయ - ఘోషణముతోన్ + అ = కుమారస్వామి యుద్ధవిజయ ధ్వనితోపాటే, పద్దవనములు = వాద్య విశేషములు (?), తివిరెన్ = మ్రోసెను

**తాత్పర్యము.** భుజపరాక్రమాతిశయమును జూపి తారకుఁడు చెఱఁబెట్టిన బందీల నందఱను వదలివైచెను కుమారస్వామి గొప్ప భుజమనెడి కంబము కొనను జయలక్ష్మి ప్రతిమ విధమును బొందెను

కల్పవృక్షములు ఎలు పతిశయించు ఎట్టదామర చివురులనునట్లు దేవేంద్రుని జుట్టుకొనెను తొమ్మిదినిధులును గుబేరుని పార్శ్వములందుఁ దామె దివ్వెలవలెఁ బ్రకాశించెను మెఱపుఁదీఁగలు బాగుగాఁ బ్రకాశించెను దిక్పాలకుల పురములందుఁ గుమారస్వామి విజయధ్వానముతోపాటే పద్దవనములనెడి వాద్యవిశేషములు మ్రోసెను

**విశేషములు** అన్ని పాదములందును పొందె, వేష్టించె, వెలుఁగొందె అని భూతకాలసమాపకక్రియలుండుటచే మొదటి పాదమునందును 'విడిచి' అని కాక, 'పిడిచె' నని యుండుట లెస్స రాక్షసాధిశుపట్టిన - ప్రథమకు షష్ఠి - ప్రౌఢ కారక 15, 16 షణ్ముఖు నురుభుజా స్తంభాగ్రమున జయశ్రీ పొందె సాలభంజిక విధమున - శ్రీ రాస్తాం మనుమక్షితీశ్వర భుజాస్తమ్భే జగన్మణ్డల - ప్రాసాద స్థిర భారభాజి దధతీ సా సాల భఞ్జీశ్రియమ్' - తిక్కన నిర్వచనోత్తర రామాయమణము 'తన భుజాస్తంభంబు ధరణీవిలాసినీ సాలభంజికకు నాస్పదము గాఁగ' విక్రమార్కచరిత్ర 1 ఆ షణ్ముఖు + ఉరు - షణ్ముఖు నురు, శక్తిధరు + అజి = శక్తిధరునాజి 'షష్ఠీసమాసమునం దుకారమున కచ్చుపరముగా నుగాగమము బాల సంధి 34 పద్దవనములు వాద్యవిశేషములు కానోపును చెందమ్మి - చెన్ను + తమ్మి (ప్రాఁతాది సూత్రములు బాల సంధి 36,37 ) ద్రుతకార్యము - బాల సంధి 16, 17 నవనిధానములు = మహాపద్మము, పద్మము, శంఖము, మకరము, కచ్ఛపము, ముకుందము, కుందము, నీలము, ఖర్వము (వరము)

తే **అమరధేనువుల్ సురపురి కరిగి తమకుఁ**
**దార యరిమిలితోఁ జేపి తనుపు మిగుల**
**నభిమతార్థముల్ గురిసె దేవాలిమీఁద**
**నెలమి నొదకలి యాడెడు చెలువవోలె** 196

**అర్థము :** అమర - ధేనువుల్ = కామధేనువులు, సుర - పురికిన్ = అమరావతికి, అరిగి = వెడలి, తమకున్ + తారు + అ = తమంతఁదామే, అరిమిలితోన్= ప్రీతితో, చేపి, తనుపు - మిగులన్= తృప్తి అతిశయించునట్లు, దేవ + ఆలి - మీఁదన్ = దేవతల సమూహముపై, ఎలమిన్ = సంతోషముతో, ఒదకలియాడెడు - చెలువు + అ + పోలెన్= అతిశయించువిధమున (?) అభిమత + అర్థముల్= కోరిన అర్థములు, కురిసెన్

**తాత్పర్యము:** కామధేనువులు అమరావతి కేఁగి తమంతఁదామే ప్రీతిఁజేపి, తృప్తి అతిశయించునట్లు దేవతలపై సంతోషముతో నభిమతార్థముల నతిశయముగాఁ గురిసెను

**విశేషములు**. ఒదకలి యాడెడు చెలువవోలె అనునది అర్థము కాలేదు వా ప్రతి లఘు వ్యాఖ్య ననుసరించి వ్రాయఁబడినది

వ అట్టి మహోత్సాహంబున 196

**అర్థతాత్పర్యములు:** అట్టి, మహత్ (మహో) + ఉత్సాహంబునన్ = గొప్ప ఉత్సాహమునందు - తరువాతి పద్యముతో నన్వయము

చ మురహర పద్మజాదులకు ముక్కున బంటిగఁ బోరు లోక భీ
కరు నజితప్రతాపు సురకంటకు నేఁడొక బాలుఁడట్టె సం
గరమున నోర్చె నంచుఁ ద్రిజగజ్జనులుం జనుదెంచి చూచి రా
దరమున మెచ్చి పేర్కొనుచుఁ దారకమారకు నా కుమారకున్ 198

**అర్థము**. మురహర - పద్మజ + ఆదులకున్ = విష్ణువు, బ్రహ్మ మున్నగు వారికి, ముక్కున బంటిగన్ = దుస్సహముగా (?), పోరు = యుద్ధము చేయునట్టి, లోక - భీకరున్ = లోకములకు భయము గలిగించువాఁడును, అజిత - ప్రతాపున్ = జయింపఁబడని పరాక్రమము గలవాఁడును (అగు), సుర - కంటకున్ = రాక్షసుని - తారకుని, నేఁడు, ఒక - బాలుఁడు + అట్టె = ఒక పిల్లవాఁడఁట, సంగరమునన్ = యుద్ధమునందు, ఓర్చెన్ = ఓడించెను, అంచున్, త్రి - జగత్ + జనులున్ = ముల్లోకములవారును, చనుదెంచి = వచ్చి, తారక - మారకున్ = తారక సంహారకుని, ఆ - కుమారకున్ = ఆ కుమారస్వామిని, ఆదరమునన్ = ప్రీతితో, మెచ్చి, పేర్కొనుచున్, చూచిరి

**తాత్పర్యము** విష్ణుబ్రహ్మలకు సైతము దుస్సహముగాఁబోరు జగద్భయంకరుఁడును, అజేయపరాక్రముఁడును అగు తారకాసురుని నేఁడొక బాలుఁడఁట యుద్ధమున నోడించెననుచు ముల్లోకములవారును వచ్చి తారకసంహారకుఁడగు ఆ కుమారస్వామిని ఆదరముతో మెచ్చి పేర్కొనుచుఁ జూచిరి

గీ ఇంత బాహుబలోత్సాహవంతుఁడగుటఁ
గొడుకుఁ దన డెందమార నూఱడినవాఁడు
కాన దనుజుల నోర్చి లోకములఁ గావ
రాజధరుఁ డర్భకుని యువరాజుఁ జేసె 199

**అర్థము**. ఇంత - బాహు - బల + ఉత్సాహవంతుఁడు + అగుటన్ = ఇంతటి భుజబలము, ఉత్సాహము గలవాఁడగుటచేత, కొడుకున్, తన - డెందమారన్

= మనసార, ఊటఁడిన - వాఁడు-కానన్ = ఊటట చెందినవాఁడు కావున, దనుజులన్= రాక్షసుల నోడించి లోకములన్, కావన్= రక్షించుటకు, రాజధరుఁడు = చంద్రునిధరించినవాఁడు - శివుఁడు, అర్భకునిన్ = బాలుని, యువరాజున్, చేసెన్

**తాత్పర్యము** తన కొడుకు ఇంతటి భుజబలోత్సాహములు గలవాఁడగుట చేత శివుఁడు మనసార ఊటట చెందెను కావున రాక్షసుల నోడించి లోకములను రక్షించుటకు అతఁడు కుమారుని యువరాజుగాఁ జేసెను

వ **అని యనేకప్రకారంబుల మెచ్చి పిచ్చలించుచుండి రంత** 200

**అర్థము** అని, అనేక - ప్రకారంబులన్ = పెక్కువిధముల, మెచ్చి, పిచ్చలించుచున్ + ఉండిరి = ఆనందించుచుండిరి, అంతన్

**తాత్పర్యము** . అని పెక్కువిధముల మెచ్చి ఆనందించుచుండిరి అంత- తరువాతి పద్యముతో నన్వయము

శా **ముక్తా ముక్త ఘనానురాగ, మద సమ్మోదైక సంసేవ్య, సం**
**త్యక్తా కర్మపద ప్రభేద మతి విద్యా, దేహ శోషైకహా,**
**భక్తాలంబక, మంత్రతంత్ర మయ, సద్భావ స్థితైకస్పృశా,**
**శాక్తేయా, మునిచింత్యమాన, భరతా సంతాపహా సద్యశా** 201

**అర్థము** . ముక్త రాగ ముక్త = ముక్తులైన వారియందును, అముక్త = ముక్తులుగానివారియందును, ఘన = గొప్పదైన, అనురాగ = ప్రేమము (ఇష్టము) గలవాఁడా, మద సంసేవ్య మద = పరమానందము చేతను, సమ్మోద = మిక్కిలి సంతోషముతోను, ఏక = ప్రధానముగా, సంసేవ్య = బాగుగా సేవింపఁదగినవాఁడా, సం విద్యా సంత్యక్త = విడిచిపెట్టఁబడిన, అకర్మ = కర్మములు లేనివారియొక్క, పద = స్థానమునుండి, ప్రభేద = మిక్కిలి భేదముగల, మతి - విద్యా = బుద్ధి జ్ఞానములు గలవాఁడా - విడువఁబడిన, నిష్కర్ముల స్థానముకంటె మిక్కిలి భిన్నములైన బుద్ధియు, జ్ఞానము గలవాఁడా !, దేహ - శోష + ఏక + హా = శరీర శోషమును - మరణమును బ్రధానముగాఁ బోఁగొట్టువాఁడా - మృత్యుంజయత్వము నిచ్చువాఁడా, భక్తాలంబక-భక్త+ఆలంబక = భక్తుల కాధారమయిన వాఁడా, మంత్ర - తంత్ర - మయ = మంత్ర తంత్రములతో నిండినవాఁడా, సద్భావ - స్థిత + ఏక - స్పృశా = మంచి భావమునందుండువారి

ముఖ్యమైన స్పర్శము గలవాఁడా మంచి భావము గలవారిని మాత్రమే స్పృశించువాఁడా, శాక్తేయా = శక్తి పుత్త్రుఁడా - కుమారస్వామీ, ముని - చింత్యమాన = మునులచేఁ జింతింపఁదగినవాఁడా, భరతా - సంతాప - హా = అతిశయత్వముతోడి సంతాపమును నశింపఁజేయువాఁడా సద్యశా - సత్ + యశా = మంచి కీర్తిగలవాఁడా

**తాత్పర్యము** ముక్తుల యెడను, అముక్తుల యెడను గొప్ప అనురాగము గలవాఁడా, పరమానందముతో సంసేవింపఁదగినవాఁడా, నిష్కర్ములను విడిచి వారి స్థానముతో మిక్కిలి భేదము గల బుద్ధి జ్ఞానములు గలవాఁడా, దేహ శోషమును - మృత్యువును - బోఁగొట్టువాఁడా, భక్తుల కాధారభూతుఁడైన వాఁడా మంత్ర తంత్రములతో నిండిన వాఁడా, సద్భావములో నుండు వారి స్పర్శము గలవాఁడా, కుమారస్వామీ, మునులచేఁ జింతింపఁ దగినవాఁడా, అతిశయత్వముతోడి సంతాపమును నశింపఁజేయువాడా, సత్కీర్తి గలవాఁడా

వ **అని చక్రిశక్రాద్యమరచక్రంబు చక్రవిద్యాద్యనేకస్తుతిశతంబులం బ్రస్తుతించుచుండి రి ట్లఖిలభువనకంటకుఁడైన తారకాసురు నశ్రమంబున నిర్జించి సకలామరవరుల సామ్రాజ్యపదవి నిష్కంటకంబు చేసి మహాసేనుండు రాకాసుధాకరుండునుంబోలె నిఖిలజనానందకరుండై వెలుంగుచు** 202

**అర్థము** అని, చక్రీ -శక్ర + ఆది + అమర - చక్రంబు = విష్ణువు, ఇంద్రుఁడు మున్నగు దేవతల సమూహము,చక్ర - విద్యా + ఆది + అనేక -స్తుతి -శతంబులన్ = చక్రవిద్య (?) మున్నగు పెక్కునూర్ల స్తోత్రములచే, ప్రస్తుతించుచున్ + ఉండిరి, ఇట్లు, అఖిల - భువన-కంటకుఁడు = ఎల్లలోకములకు శత్రువు, ఐన, తారక + అసురున్, అశ్రమంబునన్ = అనాయాసముగా, నిర్జించి = జయించి, సకల + అమర - వరుల = ఎల్ల దేవతాశ్రేష్ఠుల, సామ్రాజ్య - పదవి, నిష్కంటకంబు - చేసి = శత్రువులు లేకుండఁ జేసి, మహాసేనుండు = కుమారస్వామి, రాకా - సుధాకరుండునున్ + పోలెన్ = పున్నమి చంద్రుని విధమున, నిఖిల - జన + ఆనందకరుండు + ఐ = ఎల్ల జనులకు ఆనందమును గలిగించువాఁడయి, వెలుంగుచున్ = ప్రకాశించుచు

**తాత్పర్యము .** అని విష్ణువు, ఇంద్రుఁడు మున్నగు దేవతల సమూహము చక్రవిద్య మున్నగు పెక్కు నూర్ల స్తోత్రములచేఁ బొగడుచుండిరి ఇట్లు ఎల్ల లోకములకు శత్రువయిన తారకాసురుని అనాయాసముగా జయించి ఎల్ల దేవతాశ్రేష్ఠుల సామ్రాజ్య పదవిని శత్రురహితముగాఁ జేసి కుమారస్వామి పున్నమి

నాఁటి చంద్రుని విధమున జనులకందఱకు ఆనందమును గలిగించువాఁడయి, ప్రకాశించుచు - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు** అలంకార ముపమ

## కుమారుని శివ పుర ప్రవేశము

సీ అందంబులై వేల్పుఁజిందముల్ మొరయ న
  ప్సరసల విమలచామరము లొలయఁ
జక్రి శక్రామరచక్రముల్ గొలిచి రా
  ముని గణాశీర్వాదములు చెలంగఁ
గిన్నర గంధర్వ గేయంబు లింపార
  సిద్ధ విద్యాధర స్త్రీలు లీల
నర్తింపఁగాఁ జండి కీర్తులు కీర్తింప
  మణిభూషణద్యుతుల్ మలసి వెలుఁగ

ఆ సకల భువన భవన సామ్రాజ్యలక్ష్మి ని
వాస మనఁగఁ దగు విలాస మెసఁగ
హరతనూజుఁ డురుతరైశ్వర్యలీలతో
నరుగుదెంచె రజతగిరికిఁ బేర్మి 203

**అర్థము** అందంబులు + ఐ = ఒప్పుగలిగినవయి, వేల్పు + చిందముల్ = దేవతాశంఖములు, మొరయన్ = ధ్వనింపఁగా, అప్సరసల = దేవవేశ్యల, విమల - చామరములు = నిర్మలములయిన వింజామరలు, ఒలయన్ = వ్యాపింపఁగను

చక్రి - శక్ర + అమర - చక్రముల్ = విష్ణువు,ఇంద్రుఁడు, దేవతా సమూహములు, కొలిచి-రాన్ = సేవించిరాఁగా, ముని - గణ + ఆశీర్వాదములు = మునుల సమూహముల దీవెనలు, చెలంగన్ = ఒప్పఁగా

కిన్నర - గంధర్వ - గెయంబులు = కిన్నరులయు, గంధర్వులయు గీతములు, ఇంపారన్ = (ఇంపు + ఆరన్) = మాధుర్య మతిశయింపఁగా, సిద్ధ - విద్యాధర - స్త్రీలు = సిద్ధాంగనలు, విద్యాధరాంగనలు, లీలన్ = విలాసముగా, నర్తింపఁగాన్ = నృత్యము చేయఁగా,

చండి, కీర్తులు, కీర్తింపన్ = పొగడఁగా, మణి-భూషణ-ద్యుతుల్ = రత్నాలంకారముల కాంతులు, మలసి = వ్యాపించి, వెలుఁగన్ = ప్రకాశింపఁగా,

సకల - భువన - భవన - సామ్రాజ్య - లక్ష్మీ - నివాసము + అనఁగన్ + తగు = ఎల్లలోకముల సామ్రాజ్యలక్ష్మి యొక్క నివాసము అనఁదగు, విలాసము, ఎసఁగన్ = అతిశయింపఁగా,

హర - తనూజుఁడు = శివునికొడుకు - కుమారస్వామి, ఉరుతర + ఐశ్వర్య - లీలతోన్ = మిక్కిలి గొప్ప వైభవము యొక్క విలాసముతో, రజత - గిరికిన్ = వెండికొండకు - కైలాసమునకు, పేర్మిన్ = ప్రీతితో, అరుగుదెంచెన్ = వచ్చెను

**తాత్పర్యము** దేవతా శంఖములు ఒప్పుగా ధ్వనింపఁగా, అప్సరసల నిర్మలములయిన వింజామరలు వీవఁగను, విష్ణువు, ఇంద్రుఁడు, దేవతల సమూహములు సేవించుచురాఁగా, మునుల ఆశీస్సులు ఒప్పఁగా, కిన్నరులయు గంధర్వులయు గీతములు మధురముగా, సిద్ధవిద్యాధరస్త్రీలు బాగుగా నృత్యము చేయఁగా, చండి కీర్తులు కీర్తింపఁగా, రత్నాలంకారముల కాంతులు వ్యాపించి ప్రకాశింపఁగా, ఎల్లలోకముల సామ్రాజ్య లక్ష్మి నివాసమనఁదగు విలాస మతిశయింపఁగా, కుమారస్వామి మిక్కిలి గొప్ప వైభవముతో వెండికొండకుఁ బ్రీతితో వచ్చెను

**చ**
**నిజవదనామితాసితమణీకచనీలవిభాతి వాహన**
**ద్విజవరబర్హిబర్హ వితతిం దొడరాడి సముల్లసిల్ల న**
**త్యజిత విలాసలీల విజయధ్వజ మంబరవీథిఁ గుక్కుట**
**ధ్వజముఁ బెనంగఁ బొల్పెసఁగి వచ్చె మహేశ్వరసూతి ప్రీతితోన్ 204**

**అర్థము.** నిజ - వదన విభాతి నిజ = తనదైన, వదన = ముఖమునందలి, అమిత = అధికమయిన, అసిత - మణి = నీలమణి యొక్కయు, కచ = వెంట్రుకల యొక్కయు, నీల - విభాతి = నల్లని కాంతి, వాహన - ద్విజ - వర = వాహనమైన పక్షిశ్రేష్ఠమగు, బర్హి-బర్హ - వితతిన్ = నెమలియొక్క పింఛముల యొక్క సమూహమును, తొడరాడి = మించి, సముల్లసిల్లన్ = మిక్కిలి ప్రకాశింపఁగా, అతి + అజిత - విలాస - లీలన్ = మిక్కిలి జయింపఁబడని విలాసము యొక్క లీలతో, అంబర - వీథిన్ = ఆకాశవీథియందు, విజయ - ధ్వజము = విజయపతాక, కుక్కుట - ధ్వజమున్ = కోడిటెక్కెమును, పెనంగన్ = కూడఁగా, పొల్పు + ఎసఁగి = అంద మతిశయించి, మహేశ్వర - సూతి = ఈశ్వరుని కొడుకగు కుమారస్వామి, ప్రీతితోన్ = సంతోషముతో, వచ్చెన్

**తాత్పర్యము** తన ముఖము నందలి మిక్కిలి నల్లనైన నిలమణి యొక్కయు, ముంగురుల యొక్కయు నల్లనికాంతి తన వాహనమైన నెమలి పురులయొక్క సమూహమును మించి ప్రకాశింపఁగా, జయింపఁబడని విలాసముతో ఆకాశమున గెలుపుటెక్కెమును, కోడి టెక్కెమును బెనఁగులాడఁగా కుమారస్వామి ప్రీతితో ఒప్పు అతిశయింప వచ్చెను

వ　శివపురంబు ప్రవేశంబు చేయు నవసరంబున　205

**అర్థము.** శివ - పురంబు = శివుని పురమైన కైలాసమును, ప్రవేశంబు - చేయు + అవసరంబునన్ = ప్రవేశించు సమయమున

**తాత్పర్యము.** శివుని పురమైన కైలాసమును ప్రవేశించు సమయమునందు - తరువాతి పద్యముతో నన్వయము

సీ　దరహాసదీధితుల్ దళుకొత్తి హర్మ్య మా
　　లికలు సుధాధవళితలు కాఁగ
నధరారుణద్యుతు లడరి నవాశోక
　　పల్లవ తోరణ ప్రతతి కాఁగ
సితలోచనద్యుతుల్ చెదరి దిక్కులయందుఁ
　　బొలయు కల్వడగల పొలుపు కాఁగఁ
బసని మొగంబులు పసిఁడి యద్దములు గా
　　గురుకుచమ్ములు పూర్ణకుంభములుగ

తే　మెఱుఁగుఁదీఁగలు నడపాడఁ గఱచినట్టి
చెన్ను వర్ణన కెక్కంగ శివపురం బ
లంకరించుచు వచ్చి విలాసవతులు
తగిలి చూచిరి తారకాంతకుఁ గుమారు　206

**అర్థము .** విలాసవతులు = ఒయారులు, దర - హాస - దీధితుల్ = చిఱునవ్వుల కాంతులు, తళుకొత్తి = మెఱసి, హర్మ్య - మాలికలు = మేడల వరుసలు, సుధా - ధవళితలు = సున్నముచేఁ దెల్లనైనవి, కాఁగన్,

అధర + అరుణ - ద్యుతులు = పెదవుల యెఱ్ఱని కాంతులు, అడరి = అతిశయించి, నవ + అశోక - పల్లవ - తోరణ - ప్రతతి = క్రొత్త అశోకపుఁ జివురులతోరణముల సమూహము, కాఁగన్

సిత - లోచన-ద్యుతుల్ = తెల్లని కన్నుల కాంతులు, చెదరి, దిక్కులయందున్, పొలయు = వ్యాపించునట్టి, కల్వడగల - పొలుపు = ఉత్సవాదులందు ధ్వజస్తంభాదులకు వ్రేలఁగట్టెడు కలువపూదండలు, కాఁగన్

పసని - మొగంబులు = ఎఱుపు మించిన పసుపు వర్ణముగల ముఖములు, పసిఁడి + అద్దములు + కాన్ = బంగారుటద్దములుకాఁగా,

గురు - కుచమ్ములు = పెద్దవియగు స్తనములు, పూర్ణ - కుంభములు గన్ = నిండు కుండలు కాఁగా,

మెఱుఁగు + తీఁగలు = విద్యుల్లతలు, నడపాడన్ = సంచరింపఁగా, కఱచిన + అట్టి = అభ్యసించినట్టి, చెన్ను + అందము, వర్ణనకున్ + ఎక్కంగన్ = వర్ణింపఁదగియుండఁగా, శివపురంబు = శివుని నగరమును - కైలాసమును, అలంకరించుచున్, వచ్చి, తారక + అంతకున్ = తారక సంహారకుఁడగు కుమారున్, తగిలి - చూచిరి = ఆసక్తితోఁ జూచిరి

**తాత్పర్యము .** ఆ యూరియందలి ఒయారుల చిఱునవ్వుల కాంతులు మెఱసి మేడల వరుసలు సున్నముచేఁదెల్లనయినవి కాఁగా, పెదవుల యెఱ్ఱని కాంతు లతిశయించి క్రొత్త అశోకపుఁ జివురుల తోరణముల సమూహము కాఁగా, తెల్లని కన్నుల కాంతులు చెదరి దిక్కులందు వ్యాపించు కలువపూలదండలు కాఁగా, ఎఱుపు మించిన పసుపు వర్ణముగల ముఖములు బంగరుటద్దములు కాఁగా, పెద్దవియగు స్తనములు పూర్ణకుంభములు కాఁగా, మెఱుఁగుఁ దీఁగలు సంచరింపఁగా నేర్చినట్టి అందము వర్ణనీయము కాఁగా శివపురము నలంకరించుచుఁ దారకసంహారకుఁడగు కుమారస్వామిని ఆసక్తితోఁ జూచిరి

**విశేషములు .** అలంకారము రూపకము

వ అంత - తరువాతి పద్యముతో నన్వయము 207

**దేవత లర్ధనారీశ్వరునిఁ జూచుట**

క మనసు లొడఁగూడి కడసనఁ
దనువులు నెఱయంగ వేడ్క దంపతులకు వా
రని సంయోగము గలిగిన
ననిశము నది యర్ధవిరహ మనఁదగు జగతిన్ 208

**అర్థము.** మనసులు, ఒడఁగూడి = కలిసి, కడ - చనన్ = కొనసాగినను, తనువులు = శరీరములు నెఱయంగన్ = నిండఁగా, వేడ్కన్ = వేడుకతో, దంపతులకున్, వారిసి = ఉడుగని, సంయోగము = కలయిక, కలిగినన్ = కలిగినను, అది = ఆ సంయోగము, జగతిన్ = లోకమునందు, అనిశమున్ = ఎల్లప్పుడును, అర్ధ - విరహము = సగము వియోగము, అనన్ + తగున్

**తాత్పర్యము** దంపతులకు మనసు లెంత కలిసినను, దేహము లెంత యైక్యభావము నందినను, వేఱయై యుండుటచే వారికి లోకమున సగము వియోగ మున్నది అనఁదగును కావుననే పరిపూర్ణానందమునకు మనస్సులేకాక దేహములును ఏకము కావలయుటచే అర్ధనారీశ్వరత్వము కావలసివచ్చె ననుట

వ అని నిశ్చయించి శివ భక్తు లత్యంతానురక్తచిత్తులై నిరంతర సుఖంబునం దనివిసనక 209

**అర్థము** అని, నిశ్చయించి, శివ - శక్తులు = శివుఁడును, పార్వతియు, అత్యంత + అనురక్త - చిత్తులు + ఐ = మిక్కిలి అనురాగము నందిన మనస్సులు గలవారయి, నిరంతర - సుఖంబునన్ = ఎడతెగని సౌఖ్యమునందు, తనివి + చనక= తృప్తిపడక

**తాత్పర్యము** అని నిశ్చయించి శివుఁడును శక్తియును, మిక్కిలి అనురాగము నొందిన మనస్సులు గలవారయి, ఎడతెగని సౌఖ్యమునందుఁ దృప్తిపడక - తరువాతి పద్యముతో నన్వయము

**సీ పృథుజటాబంధంబుఁ బెన్నెఱివేణియుఁ**
**గపిలాంబకముఁ గల్కి క్రాలు కన్ను**
**ఫణి కుండలంబును మణికర్ణపూరంబు**
**గడ్డంబు జిగిఁ దొలఁకాడు చెక్కు**
**గురు భుజా దండంబుఁ గోమల హస్తంబుఁ**
**దనరారు నురమును ఘనకుచంబుఁ**
**బులితోలు మేలి దువ్వలువు నంచిత పుష్ప**
**చయ పరాగంబు లాక్షారసంబు**

కే మానితముగ నిరంతరమదనసుఖము
పొడవు దాల్చెనో యనఁ బొలుపొందు గాఁగ
నర్ధనారియై యున్న సర్వాత్ముఁ గనిరి
తారకారియు నఖిలబృందారకులును 210

**అర్థము.** పృథు - జటా - బంధంబున్ = పెద్ద జడముడియును, పెన్నెటి పెను + నెఱి) - వేణియున్ = పెద్దవెంద్రుకల జడయు, కపిల + అంబకమున్ = కపిల వర్ణపుఁగన్నును - అగ్ని నేత్రమును, కల్కి - క్రాలు - కన్నన్ = మనోజ్ఞమైన చంచలేక్షణమును,

ఫణి - కుండలంబును =నాగకర్ణాభరణమును, మణి - కర్ణ పూరంబున్= మణిమయమైన కర్ణ భూషణమును, గడ్డంబు - జిగిన్ = గడ్డముయొక్క కాంతియును, తొలఁకాడు - చెక్కున్ = ప్రకాశించు ఎక్కిలియును,

గురు - భుజా - దండంబున్ = గొప్ప దండము వంటి వాహువును, కోమల - హస్తంబున్ = మృదువైన చేయియు, తనరారు = ఒప్పునట్టి, ఉరమును= వక్షమును, ఘన-కుచంబున్ = గొప్ప స్తనమును,

పులితోలున్, మేలి - దువ్వలువున్ = మేలయిన సన్నని వస్త్రమును, అంచిత - పుష్ప - చయ - పరాగంబున్ = ఒప్పిన పూల గంపుయొక్క పుప్పొడియును, లక్షారసంబున్ లత్తుకయును,

మానితముగన్ = ఒప్పుఁగా, నిరంతర - మదన - సుఖము = ఎడతెగని మన్మధసౌఖ్యము, పొడవు + తాల్చెనో + అనన్ = రూపము ధరించెనో యనునట్లు, పొలుపొందు + కాఁగన్ = ఒప్పుఁగా, అర్ధ - నారి + ఐ = సగము స్త్రీయైన వాఁడయి, ఉన్న, సర్వ + ఆత్మున్ = శివుని, తారక + అరియన్ = తారక శత్రువును - కుమారస్వామియును, అఖిల - బృందారకులును = ఎల్ల దేవతలును, కనిరి = చూచిరి

**తాత్పర్యము** పెద్దదియగు జటాజూటమును, పెద్ద వెంద్రుకల జడయును, అగ్ని నేత్రమును, మనోజ్ఞమైన చంచలేక్షణమును, నాగ కుండలమును, మణిమయ కర్ణ భూషణమును, గడ్డపుఁ గాంతియును, ప్రకాశించు చెక్కిలియును, గొప్ప బాహుదండమును, మృదుకరమును, ఒప్పెడు వక్షమును, గొప్ప స్తనమును, పులితోలును, మేలి సన్న వస్త్రమును, అంచితమైన పూలపుప్పొడియును,

లత్తుకయును, ఒప్పఁగా నిరంతర మన్మధసౌఖ్యము రూపుఁదాల్చెనా యనునట్లు ఒప్పఁగా అర్ధనారియై యున్న శివునిఁ గుమారస్వామియును, ఎల్ల దేవతలును జూచిరి

**విశేషములు .** గడ్డంబు జిగిన్ - గడ్డంబు జిగియున్ - 'నామ సర్వనామంబులకును గళలగు నవ్యయంబులకును గడపల సముచ్చయార్ధవిశేష పాదపూరణంబులయందు ను శబ్దంబు తఱచుగా నగు కళలగు ననుదంత శబ్దంబులమీఁద నయ్యాది యువర్ణపూర్వకంబుగ విభాష నగు ' ప్రౌఢ శబ్ద 116

వ కని పరమానందంబున 211

**అర్ధతాత్పర్యములు** చూచి మిక్కిలి ఆనందముతో - తరువాతి పద్యముతో నన్వయము

క హరి పరమేష్ఠి పురందర
సుర నర ఫణి సహిత మగజసుతుఁ డపు డత్యా
దరమున నీశ్వర పద పం
కరుహంబుల కెఱఁగియున్నఁ గని హర్షముతోన్ 212

**అర్ధము** హరి - పరమేష్ఠి - పురందర - సుర - నర - ఫణి - సహితము = విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుఁడు, దేవతలు, నరులు, నాగులు అనువారితోఁ గూడుకొని, అగజ - సుతుఁడు = పార్వతి కొడుకు - కుమారస్వామి, అపుడు, అతి + ఆదరమునన్ = మిక్కిలి ప్రీతితో, ఈశ్వర - పద - పంకరుహంబులకున్ = శివుని పాదపద్మములకు, ఎఱఁగి + ఉన్నన్ = నమస్కరించి యుండఁగా, కని = చూచి, హర్షముతోన్ = సంతోషముతో-

**తాత్పర్యము .** విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుఁడు, దేవతలు, నరులు, నాగులు అనువారితోఁ గూడుకొని కుమారస్వామి అప్పుడు మిక్కిలి ఆదరముతో శివుని పాదపద్మములకు నమస్కరించి యుండఁగాఁజూచి సంతోషముతో - తరువాతి గద్యముతో నన్వయము

వ అర్ధనారీశ్వరుండై యున్న యీశ్వరుం డమరులఁగని కరుణామృతరసంబున నోలలార్చుచు మహాసేనుం బుచ్చి యెత్తుకొని 213

**అర్థము** అర్ధనారీశ్వరుండు + ఐ, ఉన్న, ఈశ్వరుండు, అమరులన్ = దేవతలను, కని, కరుణా + అమృత - రసంబునన్ = దయయనెడి అమృతరసముతో, ఓలలార్చుచున్ = స్నానమాడించుచు, మహాసేనున్ = కుమారస్వామిని, గ్రుచ్చి + ఎత్తుకొని

**తాత్పర్యము.** అర్ధనారీశ్వరుఁడయి యున్న ఈశ్వరుఁడు దేవతలఁ జూచి దయామృతరసమున స్నానమాడించుచుఁ గుమారస్వామిని గ్రుచ్చియెత్తుకొని-తరువాతి పద్యముతో నన్వయము

చ **ననిచిన కల్పవల్లికలు నల్గడఁ గల్పకుజంబుఁ జుట్టిన**
**ట్లనుపమ రత్న భూషణ చయాంచిత బాహులతాలి షణ్ముఖం**
**బెనఁచి కవుంగిలించుకొని పేర్చు రణశ్రమ మెల్లఁ బాయ నా**
**త్రినయనుఁ డుల్ల మి ట్లొనరఁ దేల్చె వడిన్ హరుషాశ్రుధారలన్** 214

**అర్థము.** ననిచిన - కల్ప - వల్లికలు = పూచిన కల్పలతలు, నల్గడన్ = నాలుగు దిక్కులను, కల్ప - కుజంబున్ = కల్పవృక్షమును, చుట్టిన + అట్లు, అనుపమ -రత్న - భూషణ + చయ + అంచిత - బాహు - లతా + ఆలిన్ = సాటిలేని మణి మయాలంకారముల సమూహముతో నొప్పిన భుజలతల వరుసతో, షష్(ణ్) + ముఖున్ = కుమారస్వామిని, పెనఁచి = పెనవైచుకొని, కవుంగిలించుకొని = ఆలింగనము చేసికొని, పేర్చు = అతిశయించు, రణ-శ్రమము + ఎల్లన్ = యుద్ధశ్రమ మంతయును, పాయన్ = పోవునట్లు, ఆ - త్రినయనుఁడు = ఆ ముక్కంటి, ఉల్లము = మనస్సు, ఇట్లు, ఒనరన్ = ఒప్పుఁగా, హరుష + అశ్రు - ధారలన్ = ఆనందబాష్పప్రవాహములందు, వడిన్ = వేగముగా, తేల్చెన్

**తాత్పర్యము:** పూచిన కల్పలతలు నాలుగుదిక్కులందును గల్పవృక్షమును జుట్టిన విధమున, సాటిలేని రత్నాలంకారసమూహముతో నొప్పిన భుజలతలతో కుమారస్వామిని బెనవైచికొని కౌఁగిలించుకొని, అతిశయించు యుద్ధశ్రమము పోవ నా ముక్కంటి మన సిట్లు ఒప్పుఁగా, సంతోష బాష్ప ప్రవాహములందు వడిగాఁ దేల్చెను

**విశేషములు:** అలంకార ముపమ బాహులతాలి అనుపమరత్నభూషణ చయాంచిత మగుటచే ననిచిన కల్పలతతోఁ బోలిక 'హరుషము' హర్ష శబ్ద వికృతియైనను అశ్రుబ్దముతో సవర్ణదీర్ఘసంధియై సమసించుట విశేషము

గీ ద్వాదశార్ధార్ధనయను నా ద్వాదశార్ధ
వదనుఁ డొగిఁ జుట్టె నిజభుజద్వాదశమున
నుదయ దశశతకిరణుఁ డయ్యుదయనగముఁ
గిట్టి దశశతకరములఁ జుట్టినట్లు 215

**అర్థము** ఉదయ - దశ - శత - కిరణుఁడు = ఉదయభానుఁడు, ఆ + ఉదయ - నగమున్ = ఆ పొడుపు కొండను, కిట్టి = సమీపించి, దశ - శత - కరములన్ = సహస్రకిరణములతో - వేయి చేతులతో, చుట్టిన + అట్లు= చుట్టిన విధమున ఆ - ద్వాదశ + అర్ధ వదనుఁడు = ఆ షణ్ముఖుఁడు = కుమారస్వామి, నిజ - భుజ - ద్వాదశమునన్ = తనవైన పండ్రెండు బాహువులతో, ద్వాదశ + అర్ధ - అర్ధ - నయనున్ = ముక్కంటిని, ఒగిన్ = బాగుగా, చుట్టెన్

**తాత్పర్యము** ఉదయభానుఁడు ఆ ఉదయపర్వతమును సమీపించి సహస్రకరములతోఁ జుట్టిన విధమున ఆ షణ్ముఖుఁడు తన పండ్రెండు బాహువులతో ముక్కంటిని బాగుగాఁ జుట్టెను

**విశేషములు .** అలంకార ముపమ

## శివుఁడు కుమారునకు జ్ఞానోపదేశంబు చేయుట

వ ఇ ట్లఖిలభువనస్వామి కుమారు లన్యోన్యదివ్యాంగంబు లాలింగన సుధామృతాంబుధి నుడుపంబుగాఁ బట్టి విహరించిన తదనంతరంబ హరి పరమేష్ఠి పురందరాద్యఖిల సుర నర ఫణి ముని గణంబులకు వరదుం డనేక వరంబు లొసంగి నిష్కంటకంబైన సకల భువన భవన సామ్రాజ్య పదవులందు సుప్రతిష్ఠులంజేసి యుమామహేశ్వరులు కుమారు ననేకవేదశాస్త్రాగమ పురాణేతిహాస కథా బృహత్కథాద్యఖిల విద్యావేదికలయందుఁ బారంగతుం జేసి పరమాత్మజ్ఞానధ్యానవిధానంబు లుపదేశించుచు 216

**అర్థము :** ఇట్లు, అఖిల - భువన - స్వామి - కుమారులు = ఎల్ల లోకముల ప్రభువు - శివుఁడును, కుమారస్వామియు, అన్యోన్య - దివ్య + అంగంబులు = పరస్పర దివ్యశరీరములు, ఆలింగన - సుధా + అమృత + అంబుధిన్ = కౌఁగిలింత అనెడు క్షీరసముద్రమునందు,ఉడుపంబుగాన్ = తెప్పగా, పట్టి, విహరించిన - తద్ + అనంతరంబు + అ = క్రీడించిన వెంటనే, హరి - పరమేష్ఠి - పురందర + ఆది + అఖిల - సుర - నర - ఫణి - ముని - గణంబులకున్ = విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుఁడు, మున్నగు నెల్ల దేవతలకు, నరుల, నాగుల, మునుల సమూహములకు,

వరదుండు = వరములనిచ్చువాఁడు - శివుఁడు, అనేక - వరంబులు, ఒసంగి, నిష్కంటకంబు + ఐన = శత్రురహితమైన, సకల - భువన - భవన - సామ్రాజ్య - పదవుల + అందున్ = ఎల్లలోకముల సామ్రాజ్య పదవులందు, సుప్రతిష్ఠులన్ = స్థిరపడినవారిని, చేసి, ఉమా - మహేశ్వరులు = పార్వతీశ్వరులు, కుమారున్, అనేక - వేద - శాస్త్ర + ఆగమ - పురాణ + ఇతిహాస - కథా - బృహత్కథా + ఆది + అఖిల - విద్యా - వేదికల + అందున్ = పెక్కు వేదములు, శాస్త్రములు, ఆగమములు, పురాణములు, ఇతిహాసములు, కథలు, బృహత్కథమున్నగు సర్వవిద్యాపీఠములందును, పారంగతున్ + చేసి, పరమాత్మ - జ్ఞాన - ధ్యాన - విధానంబులు = పరమాత్మను గూర్చిన జ్ఞాన ధ్యానముల పద్ధతులు, ఉపదేశించుచున్

**తాత్పర్యము.** ఇట్లు సర్వలోక ప్రభువైన ఈశ్వరుఁడును, కుమారస్వామియు, పరస్పర దివ్య శరీరములు ఆలింగనమనెడి క్షీరసముద్రమునందుఁ దెప్పగాఁ బట్టుకొని విహరించినంతనే విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుఁడు మున్నగు సకలదేవతల నరుల, నాగుల, మునుల సమూహములకు శివుఁడు పెక్కువరములిచ్చి, శత్రురహితమైన సకల భువన సామ్రాజ్య పదవులందును సుప్రతిష్ఠితులను జేసి పార్వతీశ్వరులు కుమారస్వామిని అనేక వేద శాస్త్రా గమ పురాణేతిహాస కథలు బృహత్కథ మున్నగు నెల్ల విద్యా పీఠములందును పండితుని గావించి పరమాత్మను గూర్చిన జ్ఞానధ్యానపద్ధతు లుపదేశించుచు - తరువాతి పద్యముతో నన్వయము

**విశేషములు** · అలంకారము రూపకము

**చతుర్విధ కందము .**

**సుజ్ఞాన యోగతత్త్వ వి**
**ధిజ్ఞుల్ భవబంధనములఁ ద్రెంచుచు భువిలో**
**నజ్ఞానపదముఁ బొందక**
**ప్రాజ్ఞుల్ శివుఁగొల్తు రచలభావన దవులన్** 217

**అర్థము .** సుజ్ఞాన - యోగ - తత్త్వ - విధిజ్ఞుల్ - సుజ్ఞానము, యోగము, తత్త్వము అనువాని విధులు తెలిసినవారు, భవ - బంధనములన్ = సంసారబంధనములను, త్రెంచుచున్, భువిలోన్ = భూమియందు, అజ్ఞాన - పదమున్, పొందక, ప్రాజ్ఞుల్ = పండితులు, అచల - భావన + తవులన్ = స్థిరబుద్ధి తగులఁగా, శివున్, కొల్తురు

**తాత్పర్యము .** సుజ్ఞానము, యోగము, తత్త్వము అనువాని విధులు తెలిసిన ప్రాజ్ఞులు సంసారబంధములను ద్రెంచుచు, భువిలో అజ్ఞానపదమును పొందక స్థిరబుద్ధితో శివునిఁ గొల్తురు

**విశేషములు** చతుర్విధకంద లక్షణము

క రెండవ చరణంబునకున్
రెండవ గణ మాది గాఁగ నిర్మించినచో
దండిఁ జతుర్విధకందము
పాండవపక్షా ! మెలంగుఁ బ్రాజ్ఞుల సభలన్ అప్పక 4-621

**గర్భద్వితీయ కందము**

క భవ బంధనములఁ ద్రెంచుచు
భువిలో నజ్ఞానపదముఁ బొందక ప్రాజ్ఞుల్
శివుఁగొల్తు రచలభావన
దవులన్ సుజ్ఞాన యోగ తత్త్వ విధిజ్ఞుల్

**గర్భ తృతీయ కందము**

క అజ్ఞాన పదముఁ బొందక
ప్రాజ్ఞుల్ శివుఁగొల్తు రచలభావన దవులన్
సుజ్ఞాన యోగ తత్త్వ వి
ధిజ్ఞుల్ భవబంధనములఁ ద్రెంచుచు భువిలో

**గర్భ చతుర్థకందము**

క శివుఁ గొల్తు రచలభావన
దవులన్ సుజ్ఞానయోగతత్త్వవిధిజ్ఞుల్
భవ బంధనములఁ ద్రెంచుచు
భువిలో నజ్ఞానపదముఁ బొందక ప్రాజ్ఞుల్

క సారమతిఁ బాండురాంగు న
వారిత శుభమూర్తిఁ దలఁచువారి శరీరా
ధారమున నుండుఁ గరువునఁ
బూరితమై యుండు రజతపుత్త్రిక వోలెన్ 218

**అర్థము.** సార - మతిన్ - మంచి మనసుతో, పాండుర + అంగు = తెల్లని శరీరము గలవాని (శివుని) యొక్క, అవారిత - శుభ - మూర్తిన్ = వారింపఁబడని శుభాకారమును, తలఁచు - వారి = స్మరించు వారియొక్క, శరీర + ఆధారమునన్ = దేహమనెడి ఆధారమున, కరువునన్ = అచ్చునందు, పూరితము + ఐ =

నిండినదయి, ఉండు = ఉండునట్టి, రజత - పుత్త్రిక + పోలెన్ = వెండిబొమ్మ విధమున, ఉండున్

**తాత్పర్యము .** మంచి మనసుతో శివుని శుభాకారమును స్మరించువారి శరీరము ఆధారముగా శివుఁడు అచ్చునందు నిండినదయియుండు వెండిపోఁత బొమ్మ విధమున నుండును

**విశేషములు '** అలంకార ముపమ

**కంద గర్భ వృత్తము**

ච **హరు మనమారఁ గొల్చు దరు, దాతనిఁ గొల్చియు నాదిబోడఁ దాఁ**
**బొరయునె ? భూరి భోగపుర భూతి విభుత్వముఁ బొంది పేర్మితోన్**
**బరజనదారుణోక్తి శరపాత నియుక్త పదంబునందుఁ దాఁ**
**బొరయుఁడు వార కోర్చి పారి భూతగణేశ్వరుఁ బొందు నాత్మలోన్ 219**

**అర్థము .** హరున్ = శివుని, మనమారన్ = మనస్ఫూర్తిగా, కొల్చుడు = కొలుచుట, అరుదు = అశక్యము, ఆతనిన్ = శివుని, కొల్చినన్ = సేవించియును, ఆది - బోడన్ = తొలి సన్న్యాసిని - శివుని, తాన్ = తాను, పొరయునె = పొందునా? భూరి - భోగ - పుర - భూతి - విభుత్వమున్ = అధిక సౌఖ్యము యొక్కయు, సంపూర్ణైశ్వర్యముయొక్కయు ప్రభుత్వమును, పొంది, పేర్మితోన్ = గొప్పతనముతో, పర - జన - దారుణ + ఉక్తి - శర - పాత - నియుక్త - పదంబునందున్ = ఇతర జనుల భయంకరోక్తులనెడి బాణముల పాటుగల స్థానమునందు, తాన్, పొరయుఁడు = పొందఁడు, వారక = తప్పక, ఓర్చి = జయించి, - సహించి, పారిన్ = క్రమముగా, భూత - గణ + ఈశ్వరున్ = ప్రమధగణముల ప్రభువును - ఈశ్వరుని, ఆత్మలోన్ = మనస్సులో, పొందున్

**తాత్పర్యము .** శివుని మనస్ఫూర్తిగాఁ గొలుచుట అశక్యము కొలిచియును ఆ యాది సన్న్యాసిని దాను బొందఁజాలఁడు అధిక సౌఖ్యముల సంపూర్ణైశ్వర్యముల విభుత్వమును బొంది, యితర జనుల దారుణములయిన వాక్యములనెడి బాణముల పాతమును బొందఁడు తప్పక జయించి క్రమముగా మనస్సులో నీశ్వరుని బొందును

**ఉద్ధృతకందము**

మనమారఁ గొల్చు డరు దా
తనిఁ గొల్చియు నాది బోడఁ దాఁ బొరయునె భూ
జన దారుణోగ్ర శర పా
తనియుక్తపదంబునందుఁ దాఁ బొరయుఁడు పో

మ సరసాహారము రాగహేతు వను టజ్ఞానంబు, పారావతో
త్కరముల్ చిక్కని రాలు మ్రింగియు సదా కామార్తులై యుండుఁ, గే
సరి సాంద్రామిషభుక్తి యైనను సకృత్సంభోగమందున్, మనో
హర విజ్ఞానమ కాక రాగరసమం దాహార నిర్వృత్తియే ? 220

**అర్థము** సరస + ఆహారము = సరసమైన ఆహారము - రసవంతమైన ఆహారము, రాగ - హేతువు = రాగమునకు (రజోగుణమునకు) కారణము, అనుట, అజ్ఞానంబు = తెలివిలేమి, పారావత + ఉత్కరముల్ = పావురముల సమూహములు, చిక్కనిరాలు మ్రింగియున్, సదా = ఎల్లప్పుడును, కామ + ఆర్తులు + ఐ - ఉండున్ = కామముచేఁ బీడితములయి యుండును, కేసరి = సింహము, సాంద్ర + ఆమిష - భుక్తి = అధికమైన మాంసభోజనము గలది, ఐనను = అయినప్పటికిని, సకృత్ + సంభోగము = ఒక్కమాఱుపొందును - అరుదైన పొందును, అందున్ = పొందును, రాగ - రసమందున్ = అనురాగరసమునందు, మనోహర - విజ్ఞానము + అ = సుందరమైన (గొప్పదియగు) విజ్ఞానమే, కాక, ఆహార - నిర్వృత్తియే = ఆహార సిద్ధియా ?

**తాత్పర్యము** · రసవంతమైన ఆహారము రాగమునకుఁ గారణమనుట తెలివిలేమి పావురముల సమూహములు చిక్కని ఱాలు మ్రింగియును ఎల్లప్పుడును కామపీడితములయి యుండును సింహము సాంద్రమయిన మాంసభోజనము గలది యయ్యును అరుదుగా సంభోగించును రాగరసమునందుటకు మనోహర విజ్ఞానముగాక, ఆహారసిద్ధి కారణముగాదు

**విశేషములు** అలంకారము అర్థాంతరన్యాసము దీనికర్థము

**'సింహో మదద్విరదమస్తక మాంసభోజీ**
**సంవత్సరేణ కురుతే రతి మేకవారమ్,**
**పారావతః ఖలు శిలాకణ మాత్రభోజీ**
**కామీ భవ త్యనుదినం వద కోఽత హేతుః**

సీ బుద్ధీంద్రియంబుల పొలుఁతులు నాఁ జాలు
కర్మేంద్రియంబుల గర్వముఱిచి
విషయాలి నడపాడు వీధిక లనఁజాలు
బుద్ధీంద్రియంబుల పొంక మడఁచి
యంతఃకరణతతి కాటప ట్టనఁజాలు
విషయసమూహంబు వీకు దఱిచి
యాజవంజవమున కనుచారియై పర్వు
నంతఃకరణతతి యలవు మడఁచి

తే సురుచిర స్థూలముల్ బాహ్యకరణ సమితి
సూక్ష్మ మంతఃకరణతతిఁ జొచ్చి కూడ
నాత్మ నాత్మైకదృష్టి సర్వాత్ముఁ బరమ
పరుని శివుఁ గాంచు టది పరపదవి సుమ్ము 221

**అర్థము** బుద్ధి + ఇంద్రియంబుల - పొలుఁతులు = బుద్ధియొక్కయు, ఇంద్రియముల యొక్కయు స్త్రీలు, నాన్ + చాలు = అనఁదగు, కర్మ + ఇంద్రియంబుల = కర్మేంద్రియముల యొక్క, గర్వము, ఉఱిచి = ఉడిచి (?) = మాన్చి,

విషయ + ఆలి = ఇంద్రియముల సమూహము, నడపాడు = సంచరించునట్టి, వీధికలు = వీధులు, అనన్ + చాలు = అనఁదగు, బుద్ధి + ఇంద్రియంబుల - పొంకము = బుద్ధియొక్కయు, ఇంద్రియముల యొక్కయు, పొంకము = గర్వము, అడఁచి = నశింపఁజేసి,

అంతఃకరణ - తతికిన్ =అంతఃకరణముల సమూహమునకు, ఆటపట్టు = స్థానము, అనన్ + చాలు, విషయ - సమూహంబు - వీకు = ఇంద్రియముల సమూహముయొక్క గర్వము, తఱిచి = తఱుగునట్లు చేసి

ఆజవంజవమునకున్ = సంసారమునకు, అనుచారి + ఐ = అనుసరణమైనదయి, పర్వు, అంతఃకరణ - తతి = అంతఃకరణముల యొక్క సమూహము యొక్క, అలవు = శక్తి, మడఁచి = నశింపఁజేసి

సురుచిర - స్థూలముల్ = మనోహరములయిన స్థూలములు, అగు, బాహ్య -కరణ - సమితి = బాహ్యకర్మముల సమూహము, సూక్ష్మము +

అంతఃకరణ - తతిన్ = సూక్ష్మములయిన అంతఃకరణముల సమూహమును, చొచ్చి = ప్రవేశించి, కూడన్ = కూడఁగా, ఆత్మన్ = మనసునందు, ఆత్మ + ఏక - దృష్టిన్ = ఆత్మప్రధానమైన దృష్టితో, సర్వ + ఆత్మున్ = శివుని, పరమ - పరునిన్ = పరాత్పరుని, శివున్ = శివుని, కాంచుట = చూచుట, అది, పర - పదవి - సుమ్ము = ఉత్కృష్ట స్థానము సుమా

**తాత్పర్యము** బుద్ధీంద్రియముల స్త్రీలు అనఁదగు కర్మేంద్రియముల గర్వము నడఁచి, ఇంద్రియములు సంచరించు వీధు లనఁదగు బుద్ధీంద్రియముల గర్వము నడఁచి అంతఃకరణసమూహమునకు నిలయ మనఁదగిన విషయ సమూహము సామర్థ్యమును తగ్గించి, సంసారమునకు అనుసరణమైనదయి సర్వ అంతఃకరణముల సమూహము శక్తి నడఁచి, స్థూలములైన బాహ్యకర్మములు సూక్ష్మములయిన అంతఃకరణములను జొచ్చి కూడఁగా ఆత్మయందు ఆత్మ ప్రధానమైన దృష్టితో సర్వాత్ముఁడును, పరాత్పరుఁడును, అగు శివునిఁజూచుట యుత్కృష్టమైన స్థానము సుమా !

'ఈ పద్యమున క్షేత్రక్షేత్రజ్ఞ సాయుజ్య స్వరూపమును గవి వర్ణించుచున్నాఁడు క్షేత్ర మనఁగాఁ బంచవింశతితత్త్వములు

'బుద్ధీన్ద్రియాణి సార్థాని మనః కర్మేన్ద్రియాణి చ !
అహంకారశ్చ బుద్ధిశ్చ పృథివ్యాదీని చైవ హి !
అవ్యక్త మాత్మా క్షేత్రజ్ఞః క్షేత్రస్యాస్య నిగద్యతే ' మా రా కవి

వ అని యనేకప్రకారంబులఁ బరమేశ్వర తత్త్వ రహస్యంబు లుపదేశించి, శివలోకోపకారియైన కుమారునవలోకనంబునం గుమారుఁ గుమార పదవీసుప్రతిష్ఠుం జేసి, పరమేశ్వరుం డాశ్రిత జనాధార ధారుణీయు, నణిమాది గుణరత్న రత్నాకరుండును, భక్తజనవృజినేంధనపావకుండును, విపశ్చిజ్జనవిపద్ఘనానిలుండును, ముని జన మనోవిహంగమ విహరణ వైహాయసుండును, సంయమిజనహృత్కమల కమలబాంధవుండు, నుపాసకజన నయనేందీవర సుధాకిరణుండును, బరమయోగిజనాంతర్లీనాభేద వేదస్వరూప పరమాత్ముండును, సకల నిష్కల స్వరూప సదాశివుండును, స్వయం ప్రకాశ ప్రభావుండును నై తేజరిల్లుచుం బరమసుఖలీలం బ్రవర్తిల్లుచుండె

**అర్థము** అని, అనేక - ప్రకారంబులన్, పరమేశ్వర - తత్త్వ - రహస్యంబులు ఉపదేశించి, శివ-లోక + ఉపకారి + ఐన = శివలోకమునకు ఉపకరించునది యగు, కుమారు+అవలోకనంబునన్ = కుమారుని అవలోకనముచే, కుమారున్ = కుమారస్వామిని, కుమార - పదవీ - సుప్రతిష్ఠున్ = యౌవరాజ్యమునందుఁ బ్రతిష్ఠింపఁబడినవానిని, చేసి, పరమేశ్వరుండు, ఆశ్రిత - జన + ఆధార - ధారుణియున్= ఆశ్రితులైన జనులకు ఆధారమైన భూమియైనవాఁడును, అణిమ + ఆది - గుణ - రత్న - రత్నాకరుండును + అణిమము మున్నగు గుణములనెడి రత్నములకు సముద్రమయినవాఁడును, భక్త - జన - వృజిన + ఇంధన - పావకుండును = భక్తులైనజనుల యొక్క పాపములనెడి కట్టెలకు అగ్నియైనవాఁడును, విపశ్చిత్ + జన - విపద్ + ఘన + అనిలుండును = పండితులైన జనులయొక్క ఆపదలనెడి మేఘములకు వాయువైనవాఁడును, ముని - జన - మనస్ + విహంగమ - విహరణ - వైహాయసుండును = మునిజనులయొక్క మనస్సులనెడి పక్షులయొక్క విహారమునకు ఆకాశమైనవాఁడును, సంయమి - జన - హృద్ + కమల - కమలబాంధవుండును = మునులైనజనులయొక్క హృదయములనెడి పద్మములకు సూర్యుఁడైన వాఁడును, ఉపాసక - జన - నయన + ఇందీవర - సుధాకిరణుండును = ఉపాసించు జనులయొక్క కనుఁగలువలకుఁ జంద్రుఁడైనవాఁడును, పరమ - యోగి - జన + అంతర్లీన + అభేద - వేద - స్వరూప - పరమాత్ముండును = గొప్ప యోగిజనులకు అంతర్లీనము, అభేదము, వేద స్వరూపము అయిన పరమాత్ముఁడును, సకల - నిష్కల - స్వరూప - సదాశివుండును - కళాసహితము, కళారహితమునైన స్వరూపముగల సదాశివుఁడును, స్వయం ప్రకాశ - ప్రభావుండును = తనంతఁదాను ప్రకాశించు ప్రభావము గలవాఁడును, ఐ, తేజరిల్లుచున్ = ప్రకాశించుచు, పరమ - సుఖ - లీలన్ = గొప్ప సుఖముతోడి విలాసముతో, ప్రవర్తిల్లుచున్ + ఉండెను

**తాత్పర్యము:** అని పెక్కురీతులఁ బరమేశ్వరతత్త్వమునందలి రహస్యములు ఉపదేశించి శివలోకమున కుపకరించు కుమారావలోకనముతోఁ గుమారస్వామిని యౌవరాజ్యమునందుఁ బ్రతిష్ఠించి, పరమేశ్వరుఁడు, ఆశ్రితజనుల కాధారభూమియైనవాఁడును, అణిమము మున్నగు గుణరత్నములకు సముద్రమైనవాఁడును, భక్త జనుల పాపములనెడి కట్టెలకు అగ్నియైనవాఁడును, పండిత జనుల ఆపదలనెడి మేఘములకు వాయువైనవాఁడును, మునిజనుల మనస్సులనెడి పక్షుల విహారమునకు ఆకాశమైనవాఁడును, మునులైనజనుల హృదయపద్మములకు సూర్యుఁడైనవాఁడును, పరమయోగి జనులకు అంతర్లీనము,

అభేదము, వేద స్వరూపమునైన పరమాత్ముఁడును, కళాసహితము, కళారహితమునైన స్వరూపముగల పరమాత్ముఁడును, తనంతఁదాను ప్రకాశించు ప్రభావము గలవాఁడును, అయి ప్రకాశించు పరమసుఖమైన విలాసముతోఁ బ్రవర్తిల్లుచుండెను

**విశేషములు** అలంకారము రూపకము

మ క్షితి సర్వేశ్వరపాదభక్తుల మహాకీర్తిప్రభానూనసం
హతి సూర్యద్యుతి కగ్గలంబగుచు లోకాలోకశైలావలీ
ప్రతిలోకాఖ్య మహీధర స్ఫురిత కుంభ స్తంభ దీపోజ్జ్వలా
యత తేజస్స్థితిఁ బర్వు నొక్కమొగిఁ బ్రహ్మాండంబులోనన్ వెలిన్ 223

**అర్థము.** క్షితిన్ = భూమియందు, సర్వేశ్వర - పాద - భక్తుల = పరమేశ్వర పాదభక్తుల యొక్క, మహత్ (మహా) - కీర్తి - ప్రభా + అనూన - సంహతి = గొప్ప కీర్తియనెడు కాంతులయొక్క తక్కువకాని సమూహము, సూర్య-ద్యుతికిన్ = సూర్యకాంతికంటె, అగ్గలంబు + అగుచున్ = అధికమగుచు, లోకాలోక - శైల + ఆవలీ = చక్రవాళపర్వతముల వరుసయనెడు, ప్రతిలోక + ఆఖ్య - మహీధర - స్ఫురిత = ప్రతిలోకమనెడు పేరుగల పర్వతమునందు, స్ఫురిత = తోఁచిన, కుంభ స్తంభ - దీప + ఉజ్జ్వల + ఆయత - తేజస్ + స్థితిన్ = కుంభాకార స్తంభమునందలి దీపము యొక్క ప్రకాశవంతము, విపులమునైన కాంతి విధమున, బ్రహ్మాండంబులోనన్ - వెలిన్ = బ్రహ్మాండములోపలను, బయటను, ఒక్క - మొగిన్ = మొత్తముగా, పర్వున్ = వ్యాపించును

**తాత్పర్యము.** భూమిలో పరమేశ్వరపాదభక్తుల మహాకీర్తియనెడు కాంతుల సమూహము సూర్యకాంతిని మించి చక్రవాళపర్వతములనెడు ప్రతిలోక పర్వతమునందు స్ఫురించిన కుంభాకారస్తంభమునందలి దీపము యొక్క ప్రకాశవంతము విపులమునైన కాంతి విధమున బ్రహ్మాండములోపలను బయటను మొత్తముగా వ్యాపించును

**విశేషములు** అలంకార ముపమ

మానిని ధీరత భూమి, గభీరత వారిధి, తేజము వహ్ని, బలం బనిలం,
బారయఁ బెంపు నభంబు, ప్రతాప మహర్పతి, కాంతి విధుండు, మహో
దారత యజ్యజమానులుఁ బేర్మి సదాశివునెన్మిదిమూర్తులుఁ జె
ల్వారఁగ నిచ్చుచునుండెడు నర్థి నహర్నిశమున్ శివభక్తులకున్ 224

**అర్థము .** ఆరయన్ = చూడఁగా, ధీరతన్ = ధైర్యమును, భూమి = భూరూపమూర్తియును, గభీరతన్ = గాంభీర్యమును, వారిధి = సముద్రరూపమూర్తియును, తేజమున్ = తేజస్సును, వహ్ని = అగ్నిరూపమూర్తియును, బలంబు, అనిలంబు = వాయు రూపమూర్తియును, పెంపున్ = ఆధిక్యమును, నభంబు = ఆకాశరూపమూర్తియును, ప్రతాపము = గొప్ప తాపము - పరాక్రమము, అహర్పతి = సూర్యరూపమూర్తియును, కాంతిన్ = కాంతిని, విధుండు = చంద్రుఁడు, మహత్ (మహా) + ఉదారతన్ = గొప్ప ఔదార్యమును, అయ్యుజమానులున్ (ఆ + యుజమానులున్) = ఆ యుజమానరూపమూర్తియును, పేర్మిన్ = గొప్పతనముతో, సదాశివు + ఎన్మిది మూర్తులున్ = పరమేశ్వరుని అష్టమూర్తులు, అర్థిన్ = కోరికతో, అహర్నిశమున్ = పగలును రాత్రులును -ఎల్లప్పుడును, శివ - భక్తులకున్, చెల్వారఁగన్ (చెల్వు + ఆరఁగన్) = అందముగా, ఇచ్చుచున్ + ఉండెడున్

**తాత్పర్యము :** ఆరయఁగా భూమూర్తి ధైర్యమును, సముద్రమూర్తి (అమ్మూర్తి) గాంభీర్యమును, వహ్నిమూర్తి తేజస్సును, అనిలమూర్తి బలమును, నభోమూర్తి పెంపును, సూర్యమూర్తి పరాక్రమమును, చంద్రమూర్తి కాంతిని, యజమానమూర్తి మహౌదార్యమును ఇట్లు పేర్మితో సదాశివుని అష్టమూర్తులును కోరికతో అహర్నిశమును శివభక్తులకు అందముగా నిచ్చుచుండును

**విశేషములు .** పంచభూతములు (పృథివ్యప్తేజోవాయురాకాశములు), సూర్యచంద్రులు, యుజమానుఁడు అనునవి శివుని అష్టమూర్తులును మానినీవృత్తలక్షణము - నాలుగు పాదములుండును ప్రతిపాదమునను ఏడు భగణములపై నొక గురువుండును, మొదటి యక్షరమునకును పదుమూఁడవ యక్షరమునకును యతిమైత్రి ప్రాసనియమము గలదు

మ ధ్రువమై జంగమమల్లికార్జున మునీంద్రుం బేర్మిఁ బేర్కొన్న స
త్కవిరాజోక్త కుమారసంభవ మహాకావ్యంబు భూభూధరా
ర్ణవ వేదానిలతారకాంబర సదానందాత్మ దిక్కాలముల్
సవిలాసస్థితి నుండునంత కిల నాచంద్రార్కమై యుండెడున్ 225

**అర్థము :** జంగమ మల్లికార్జున - ముని + ఇంద్రున్ = జంగమ మల్లికార్జునుఁడనెడు మునిశ్రేష్ఠుని, పేర్మిన్ = ప్రీతితో, పేర్కొన్న = పేర్కొనిన, సత్ + కవి - రాజ + ఉక్త = సుకవిశ్రేష్ఠుఁడైన నన్నెచోడనిచేఁ జెప్పఁబడిన, కుమారసంభవ

- మహత్ (మహా) + కావ్యంబు = కుమారసంభవమనెడి గొప్ప కావ్యము,భూ - భూధర + అర్ణవ, వేద + అనిల - తారక + అంబర - సదానంద + ఆత్మ - దిశ్ (క్) + కాలముల్ = భూమి, పర్వతములు, సముద్రములు, వేదములు, వాయువు, నక్షత్రములు, ఆకాశము, సదానందముగల ఆత్మ, దిక్కులు, కాలము, సవిలాస- స్థితిన్ = విలాసముతోఁ గూడిన ఉనికితో, ఉండు + అంతకున్ = ఉండునంత వఱకును, ఇలన్ = భూమియందు, ఆ + చంద్ర + అర్కము + ఐ = చంద్రసూర్యు లుండునంతవఱకును, ధ్రువము + ఐ = స్థిరమయి, ఉండెడున్ = ఉండును

**తాత్పర్యము** మునిశ్రేష్ఠుఁడైన జంగమ మల్లికార్జునుని ప్రీతితోఁ బేర్కొనినట్టియు, సుకవిశ్రేష్ఠుఁడైన నన్నెచోడనిచేఁ జెప్పఁబడినట్టియుఁ గుమారసంభవ మహాకావ్యము భూమి, పర్వతములు, సముద్రములు, వేదములు, వాయువు, నక్షత్రములు, ఆకాశము సదానందమైన ఆత్మ, దిక్కులు, కాలములు విలాస స్థితితో నుండునంతవఱకును భూమిలో ఆచంద్రార్కముగా స్థిరమైయుండును

సీ. జ్ఞానదీపంబు హృత్సదనంబులోఁ దాన
  దీవియగా నెత్తఁ దివురువారు
వలచేత వసుమతీవలయంబు నవరత్న
  వలయంబుగా నిడవలచువారు
భారతిఁ దమమోముఁబసిఁడిమాడువులోన
  నిలువేల్పుగా నిల్పఁదలఁచువారు
నణిమాది గుణ మణి హారమ్ము లురమున
  హారంబుగా నిడఁ గోరువారు

తే. వెలయ మత్కృతి చదువుఁడు వినుఁడు వ్రాయుఁ
డీశ్వరాంబికాగుహు లిత్తు రీప్సితములు
వారి నేమెయిఁ గొనియాడువారి కోర్కు
లొనర జంగమ మల్లికార్జునుఁడు నొసఁగు. 226

**అర్థము:** జ్ఞాన - దీపంబున్ = జ్ఞానమనెడి దివ్వెను, హృద్ + సదనంబులోన్= హృదయమనెడి గృహములో, తాన - దీవియ + కాన్ = స్థానదీపముగా, ఎత్తన్ = ఎత్తుటకు - పెట్టుటకు, తివురువారున్ = యత్నించువారును,

వలచేతన్ = కుడిచేతియందు, వసుమతీ - వలయంబున్ = భూవలయమును,నవ - రత్న - వలయంబు + కాన్ = నవరత్నమయమైన హస్తాభరణముగా, ఇడన్ = ఇచ్చుటకు - ధరించుటకు, వలచువారున్ = కోరువారును

భారతిన్ = సరస్వతిని, తమ మోము + పసిఁడి । మాడువులోనన్ = తమ ముఖమనెడి బంగరు మేడయందు, ఇలువేల్పు + కాన్ = గృహదేవతగా, నిల్పన్= నిల్పుటకు, తలఁచు వారున్ =కోరువారును,

అణిమ + ఆది - గుణ - మణి - హారమ్ములు = అణిమము మున్నగు గుణములనెడి మణిమయ హారములు, ఉరమునన్ = వక్షమునందు, హారంబు + కాన్, ఇడన్ = ధరించుటకు, కోరువారున్,

వెలయన్ = ప్రసిద్ధముగా, మత్ + కృతి =నా కావ్యమును, చదువుఁడు, వినుఁడు, వ్రాయుఁడు, ఈశ్వర + అంబికా - గుహులు = ఈశ్వరుఁడు, పార్వతి, కుమారస్వామి, ఈప్సితములు = కోరికలు, ఇత్తురు, వారిన్ = ఆ ఈశ్వరాంబికాగుహులను, ఏ - మెయిన్ = ఏ రీతిగానైనను, కొనియాడువారి - కోర్కులు = నుతించువారి కోరికలు, ఒనరన్= ఒప్పుగా, జంగమ మల్లికార్జునుఁడున్, ఒసఁగున్ = ఇచ్చును

**తాత్పర్యము.** జ్ఞానమనెడి దీపమును హృదయ భవనములో స్థానదీపముగా నెత్తుటకు యత్నించువారును, కుడిచేత భూవలయమును నవరత్నమయ హస్తాభరణముగా ధరింపఁగోరువారును, సరస్వతిని దమ ముఖమనెడి మేడలో గృహదేవతగా నిల్పుటకుఁ గోరువారును, అణిమము మున్నగు గుణములనెడి మణిహారములు వక్షమున హారముగాఁ దాల్పఁగోరువారును, నా కావ్యమును జదువుఁడు, వినుఁడు, వ్రాయుఁడు అట్టిచో నీశ్వర పార్వతీ కుమారస్వాములు మీకుఁ గోరికల నిత్తురు వారి నే రీతిగా నైనఁ గొనియాడు వారి కోరుకులను జంగమ మల్లికార్జునుఁడు తీర్చును

**విశేషములు** అలంకారము రూపకము

## ఆశ్వాసాంతము

**మ** **త్రిజగద్వంద్యుఁ డనింద్యుఁ డిష్టజనవర్ధిష్ణుండు విష్ణుండు వా**
**రిజపత్రాక్షుఁడు దక్షుఁ డాదిమునిచారిత్రుండు పాత్రుండు కం**
**జజతత్త్వజ్ఞుఁడు ప్రజ్ఞుఁ డీశ్వరపదాసక్తుండు ముక్తుండు జ**
**న్మ జరా దూరుఁడు ధీరుఁ డాత్మవిదుఁ డానందుం డమందుం డెదన్** 227

**అర్థము .** త్రి - జగత్ + వంద్యుఁడు = ముల్లోకముల (వారి) చే నమస్కరింపఁదగినవాఁడు, అనింద్యుఁడు = నిందింపఁదగనివాఁడు, ఇష్ట - జన - వర్ధిష్ణుండు = ఇష్టులైన జనులను వృద్ధి పొందించు శీలము గలవాఁడు, విష్ణుండు = వ్యాపనశీలుఁడు, వారిజ - పత్ర + అక్షుఁడు = తామర రేకుల వంటి కన్నులు గలవాఁడు, దక్షుఁడు = సమర్థుఁడు, ఆది - ముని - చారిత్రుండు = ఆదిముని (వ్యాసుని ?) చరిత్రము వంటి చరిత్రము గలవాఁడు, పాత్రుండు = అర్హుఁడు, కంజజ - తత్త్వజ్ఞుఁడు = బ్రహ్మతత్త్వము తెలిసినవాఁడు, ప్రాజ్ఞుఁడు = పండితుఁడు, ఈశ్వర - పద + ఆసక్తుండు = ఈశ్వరుని పాదములయం దాసక్తిగలవాఁడు, ముక్తుండు = సంసారబంధములనుండి విడువఁబడినవాఁడు, జన్మ-జరా-దూరుఁడు = పుట్టుకకు, ముసలితనమునకు దూరమైనవాఁడు, ధీరుఁడు, ఆత్మ - విదుఁడు = ఆత్మజ్ఞానము గలవాఁడు, ఆనందుండు = సంతోషించువాఁడు, ఎదన్ = మనస్సునందు, అమందుండు = మందుఁడుగానివాఁడు - ఇవి యన్నియుఁ గృతిభర్త యగు శ్రీ జంగమ మల్లికార్జునుని విశేషణములు

**తాత్పర్యము :** ముల్లోకములవారిచే నమస్కరింపఁదగినవాఁడు, నిందింపఁదగనివాఁడు, ఇష్టులైన జనులను వృద్ధిపొందించు శీలముగలవాఁడు, వ్యాపనశీలుఁడు, పద్మపత్రముల వంటి కన్నులు గలవాఁడు, సమర్థుఁడు, ఆదిముని చరిత్రమువంటి చరిత్రము గలవాఁడు, తగినవాఁడు, బ్రహ్మతత్త్వము నెఱిఁగినవాఁడు, పండితుఁడు, శివుని పదములఁ దగులు గలవాఁడు, సంసారబంధమునుండి విడువఁబడినవాఁడు, పుట్టుక ముసలితనము అనువానికి దూరమైనవాఁడు, ధీరుఁడు, ఆత్మజ్ఞానము గలవాఁడు, ఆనందము గలవాఁడు, మనస్సునందు అమందుఁడును అగు కృతిభర్త శ్రీ జంగమమల్లికార్జునుఁడు

**విశేషములు :** అలంకారము అనుప్రాసము

క **అమిత సుగుణ మణి రచితా**
**ద్యమల విభూషణ విభూషి తావయవుఁడు జం**
**గమ మల్లికార్జునుఁడు వా**
**గ్రమణీ రమణుండు మునిశిఖామణి పేర్మిన్** 228

**అర్థము .** అమిత తావయవుఁడు, అమిత - సుగుణ - మణి - అధికమైన మంచి గుణములనెడి మణులచే, రచిత = రచింపఁబడిన, ఆది + అమల = ప్రమాణములు, నిర్మలములు అయిన, విభూషణ = అలంకారములచే,

విభూషిత = అలంకరింపఁబడిన, అవయవుఁడు = అవయవములు గలవాఁడు, వాచ్ (క్) + రమణీ - రమణుండు = వాగ్దేవికిఁ బ్రియుఁడైన వాఁడు, పేర్మిన్ = గొప్పతనమునందు, ముని - శిఖా మణి = మునులకుఁదలమానికమైనవాఁడు, అగు, జంగమమల్లికార్జునుఁడు

**తాత్పర్యము.** అధికములయిన సుగుణములనెడి మణులచే రచింపఁబడిన ప్రమాణములు, నిర్మలములునైన అలంకారములచే నలంకరింపఁబడిన అవయవములు గలవాఁడును, వాగ్దేవికిఁ బ్రియుఁడైనవాఁడును గొప్పతనమున మునులకుఁ దలమానికమయినవాఁడును అగు శ్రీ జంగమమల్లికార్జునుఁడు

మ **సుకవిస్తుత్యుఁడు నిత్యుఁ డూర్జితుఁడు సుశ్లోకుం డశోకుండు స**
**ర్వకళాధారుఁడు ధీరుఁ డార్యజనతావర్యుం డవార్యుండు ధ**
**ర్మ కథాసంగుఁ డసంగుఁ డాద్యుఁడు జగన్మాన్యుండు ధన్యుండు బ్ర**
**హ్మకులోత్తంసుఁడు హంసుఁ డుత్తమగుణాయత్తుం డమత్తుండెదన్ 229**

**అర్థము .** సుకవి - స్తుత్యుఁడు = సత్కవులచే,స్తుతింపఁదగినవాఁడును, నిత్యుఁడు = శాశ్వతుఁడును, ఊర్జితుఁడు = గొప్పవాఁడును, సుశ్లోకుండు = మంచికీర్తి గలవాఁడు, అశోకుండు = శోకములేనివాఁడు సర్వ - కళా + ఆధారుఁడు = సమస్త కళలకు ఆధారమైనవాఁడును, ధీరుఁడు, ఆర్య - జనతా - వర్యుండు = పూజ్యులైన జనములలో శ్రేష్ఠుఁడును, అవార్యుండు = వారింపరానివాఁడు, ధర్మ - కథా - సంగుఁడు = ధర్మకథలయందు ఇష్టముగలవాఁడు, అసంగుఁడు = సంగము లేనివాఁడు, ఆద్యుఁడు = మొదటివాఁడు, జగత్ + మాన్యుండు = జగత్తులకు మన్నింపఁదగినవాఁడు, ధన్యుండు, బ్రహ్మ - కుల + ఉత్తంసుఁడు = బ్రాహ్మణ వంశ శ్రేష్ఠుఁడు, హంసుఁడు = పరమాత్ముఁడు, ఉత్తమ - గుణ + ఆయత్తుండు = శ్రేష్ఠములయిన గుణములకు వశమయినవాఁడు, ఎదన్ = హృదయమునందు, అమత్తుండు = మత్తుఁడు గానివాఁడు

**తాత్పర్యము.** సత్కవులచే స్తుతింపఁ దగినవాఁడు, శాశ్వతుఁడు, అధికుఁడు, మంచి కీర్తి గలవాఁడు, శోక రహితుఁడు, సమస్త కళలకు ఆధారమైనవాఁడు, ధీరుఁడు, ఆర్యులైన జనులలో శ్రేష్ఠుఁడు, వారింపరానివాఁడు, ధార్మిక కథలయం దిష్టము గలవాఁడు, సంగ రహితుఁడు, ఆద్యుఁడు, జగములకు మాన్యుఁడు, ధన్యుఁడు, బ్రాహ్మణ వంశ శ్రేష్ఠుఁడు, పరమాత్ముఁడు, ఉత్తమ గుణముల కధీనుఁడు, హృదయములో మత్తుఁడు గానివాఁడు అగు శ్రీ జంగమ మల్లికార్జునుఁడు

క  ముక్తుఁడు కృత్యాకృత్యవి
రక్తుఁడు యోగీశ్వరానురక్తుఁడు తత్త్వా
సక్తుండు నియమ పద సం
యుక్తుఁడు సంసార పద వియుక్తుండు మదిన్ 230

**అర్థము** . ముక్తుఁడు = సంసారమునుండి విడివడినవాఁడు, కృత్య + అకృత్య - విరక్తుఁడు = చేయఁదగిన, చేయఁదగని వానియందు రక్తిలేనివాఁడు, యోగి + ఈశ్వర + అనురక్తుఁడు = యోగిశ్రేష్ఠులయం దనురాగము గలవాఁడు, తత్త్వ + ఆసక్తుండు = వేదాంతమునందుఁ దగులు గలవాఁడు, నియమ - పద - సంయుక్తుఁడు = నియమమనెడి పదముతోఁ గూడుకొన్నవాఁడు, మదిన్ = మనసునందు, సంసార - పద - వియుక్తుండు = సంసారమనెడి పదము నుండి ఎడఁబాసినవాఁడు

**తాత్పర్యము** . సంసారబందమునుండి విడివడినవాఁడును, కృత్యములందును, అకృత్యములందును రక్తిలేనివాఁడు, యోగిశ్రేష్ఠులయం దనురాగము గలవాఁడు, వేదాంతమునందుఁ దగులు గలవాఁడు, నియమమను పదముతోఁ గూడినవాఁడు, మనసునందు సంసారమను పదము నెడఁబాసినవాఁడు అగు శ్రీ జంగమ మల్లికార్జునుఁడు

## మంగళ మహాశ్రీ వృత్తము

**భూవినుతుఁ డార్యజనపూజితుఁడు సద్గుణ విభూషితుఁడు, సర్వా**
**శా వివర పూరిత విశాల శర నిర్మలయశః ప్రసర శోభితుఁడు, సద్భూ**
**దేవకులశేఖరుఁడు దేవమునిముఖ్యుఁడు, సుధీజనవరేణ్యుఁడు, ప్రియుండై**
**యీ వసుధ శిష్టతతి కిష్టఫలయుక్తముగ నిచ్చు దయ మంగళమహాశ్రీ** 231

**అర్థము** . భూ - వినుతుఁడు = భూలోకము (వారి) చే విశేషముగా నుతింపఁబడినవాఁడు, ఆర్య - జన - పూజితుఁడు = పూజ్యులైన జనులచేఁ బూజింపఁబడినవాఁడు, సత్ + గుణ - విభూషితుఁడు = మంచి గుణములచే నలంకరింపఁబడినవాఁడు, సర్వ + ఆశా - వివర - పూరిత - విశాల - శర - నిర్మల - యశః - ప్రసర - శోభితుఁడు = ఎల్లదిక్కుల నడిమి అవకాశములందు నిండింపబడిన విస్తృతము, తెల్లువలె స్వచ్ఛము అయిన యశస్సుయొక్క వ్యాప్తిచేఁ బ్రకాశించు వాఁడు, సత్ + భూదేవ - కులశేఖరుఁడు = ఉత్తమ బ్రాహ్మణ సమూహమునకు శిరోభూషణమైన వాఁడు, దేవ - ముని - ముఖ్యుఁడు = దేవతలలో, మునులలోఁ బ్రధానుఁడు, సుధీ - జన - వరేణ్యుఁడు = పండితులైన జనులలో శ్రేష్ఠుఁడు, - అగు శ్రీ జంగమ మల్లికార్జునుఁడు, ప్రియుఁడు + ఐ =

ఇష్టుఁడయి, ఈ - వసుధన్ = ఈ భూమియందు, శిష్ట - తతికిన్ = మంచివారి సమూహమునకు, దయన్ = దయతో, ఇష్ట - ఫల - యుక్తముగన్ = కోరిన ఫలములతోఁ గూడ, మంగళ - మహా - శ్రీన్ = మంగళముతోడి గొప్పదియగు సంపదను, ఇచ్చున్

**తాత్పర్యము.** భూజనులచే విశేషముగాఁ బొగడఁబడువాఁడును, ఆర్యులైన జనులచేఁ బూజితుఁడును, సద్గుణములచే నలంకరింపఁబడినవాఁడును, ఎల్ల దిక్కుల నడిమి అవకాశములందును బూరింపఁబడిన విస్తృతము, తెల్లువలె నిర్మలమునైన కీర్తి వ్యాప్తిచేఁ బ్రకాశించువాఁడు, ఉత్తమ బ్రాహ్మణ వంశ శ్రేష్ఠుఁడును, దేవ మునులందుఁ బ్రధానుఁడును, పండిత జన శ్రేష్ఠుఁడును, అగు శ్రీ జంగమ మల్లికార్జునుఁడు ఇష్టుఁడై యీ భూమియందలి సజ్జనులకు ఇష్టఫలములతో మంగళ యుక్త మహా సంపదను దయతో నిచ్చుఁగాక !

**విశేషములు .** మంగళ మహాశ్రీ వృత్త లక్షణము  నాలుగు పాదము లుండును ప్రతి పాదమునను భ, జ, స,న, భ, జ, స, న, గగ ము లను గణములుండును మొదటి యక్షరమునకుఁ దొమ్మిదవ యక్షరమునకుఁ బదునేడవ యక్షరమునకు యతిమైత్రి ప్రాసనియమము గలదు  ఈ పద్యమున మొదటి పాదమున గణభంగ మయినది నాలుగక్షరములు తక్కువయినవి  I I I U / x x x x

| భ | జ | న | న | భ | జ | స | గ |
|---|---|---|---|---|---|---|---|
| U I I | I U I | I I U | I I I | U I I | I U I | I I U | U |
| **భూవిను** | **తుఁడార్య** | **జన పూ** | **జితుఁడు** | **సద్గుణ** | **విభూషి** | **తుఁడుస** | **గర్వా** |

గద్యము

**ఇది శ్రీమజ్జంగమ మల్లికార్జునదేవ దివ్య శ్రీపాద పంకజ భ్రమరాయమాణ కవిరాజశిఖామణి నన్నెచోడదేవ ప్రణీతంబైన కుమారసంభవంబను కథయందు ద్వాదశాశ్వాసము సంపూర్ణము**

ఈ గద్యము నర్థతాత్పర్యములకుఁ బూర్వాశ్వాసాంతగద్యముల అర్థతాత్పర్యముల నరయునది

మ **ఇది శ్రీ జొన్నలగడ్డవంశమణి యౌ మృత్యుంజయాఖ్యుండు స**
**మ్మద మొప్పారఁ గుమారసంభవము శ్రీమన్నన్నెచోడాఖ్య వి**
**ద్వదధీశోక్తము శాబ్దికార్థ వివిధస్వారస్య తాత్పర్యముల్**
**చదురొప్పన్ వచియించి మన్చు విలసత్ సంజీవనీ వ్యాఖ్య యౌ**

## వ్యాఖ్యానమున దొరలిన కతిపయ భ్రమప్రమాదములు - వాని సవరింతలు

సీ  పద్మాసనస్థుఁడై  నుండె  3-193

మనుజునకుఁ బదునాఱు సంస్కారముల మాదిరిగా మంత్రమునకును సంస్కారముల యావశ్యకత కలదు దాహన, ప్లావన, తర్పణాదు లట్టివి

ప్రత్యాహారగతి - ఇంద్రియములను విషయములనుండి మరల్చు విధము

సీ  మొనలావులించి  వరదు  3-108

ఇందు ఎత్తుగీతిలోని మూఁడవ పాదమున 'మున్న కొసివచ్చి గణికాసమూహితోడ - అనుదాన - గణికా సమూహితోడ అనుదానికి గణికల = అడవి మొల్లల మొత్తముతో అని యర్థము చెప్పనొప్పును

సీ  అనిమిషపతి పుర మనిమిషాస్పదమయ్యె,
నవలు ప్రో లెల్లను ననలమయము
ప్రేతాధిపతి వీడు ప్రేత సంగతము  4-28

ఇందుఁ బ్రథమపాద ద్వితీయార్థమున - అనలమయము = అగ్నితో నిండినది యని యర్థము చెప్పుచో శ్లేషము లేక వక్రోక్తి కాదు అందుచే అనలు ప్రోలెల్లను ననలమయము - అనలు ప్రోలు + ఎల్లను = అగ్నిపురమంతయు. ననలమయము = పుష్పమయము అని యర్థము చెప్పనొప్పును

అట్లే- ప్రేతాధిపతి వీడు ప్రేత సంగతము = ప్రేతములకు (పీనుఁగులకు) ప్రభువు అగు యమునియొక్క పట్టణము, ప్రేత - సంగతము = పిశాచభేదములతోఁ గూడినది అని అర్థము చెప్పుచో, శ్లేషము గలిగి, వక్రోక్తి యగును

క  చెఱకునఁ బుచ్చక రిమ్మలఁ
గఱచిన రసమానని గతిఁ దరుణుల నెటు చే
వెఱ వాపక సంగతి కే
డ్తెఱసేసి మనోరథములు దీరునిఁ బడయున్  8-159

ఇది మానవల్లి వారి పాఠము ఇందు మొదటి పాదమున యతిభంగ మయినది

ఈ పద్యమునకు వావిళ్ళవారి ప్రతిలోఁ బాఠాంతరము గలదు

క  చెఱ కీనఁ బుచ్చ కతిముటిఁ
గఱచిన రసమానరాని గతిఁ దరుణుల చీఁ
దఱ వాపక సంగతి కే
డ్తెఱసేసి మనోరథములు దీరుఁడు పడయున్

ఈ పాఠమున 'రిమ్మ' గానరాదు

# నాగబంధము



చ శరణు మహేశ భూరితరసార సుఖప్రదకామకాలసం
హరభవరోగదారణ సురాసురవన్ద్య శరీరదుఃఖ దు
స్తరకమలా విహార హిమధామ సమస్తగ సోమదేవ వి
స్తరిత రమాదయారసయుతా యురులబ్ద విభావనామయా

10-ఆ 84 పద్యము



క. స్థిరమతి ! శుభసితమూర్తీ !
వర సుర నర దనుజదురిత వనధి సుకీర్తీ !
హరదతి శుభ సితమూర్తీ !
స్మరపురహర తను భిదురిత జవన సుకీర్తీ 10 ఆ 85 పద్యము

# చక్రబంధము



శా
ముక్తాముక్త ఘనానురాగమద సమ్మోద్రైక సంసేవ్య సం
త్యక్తా కర్మ పదప్రభేదమతి విద్యాదేహ శోష్మైకహో
భక్తాలంబక మంత్రతంత్రమయ సద్భావస్థితైకస్పృశా
శాక్తేయా మునిచింత్యమాన భరతా సంతాపహా సద్యశా

**12** ఆ **201** పద్యము

నన్నెచోడదేవకృత

# కుమార సంభవము

(సంజీవనీ వ్యాఖ్యాసమేతము)

## అకారాది పద్యానుక్రమణిక

(సప్తమాశ్వాసము నుండి ద్వాదశాశ్వాసాంతము వఱకు)

### అ

## ద

## హ